

డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

ం : 14 ఏప్రిల్, 1891

పరినిర్వాణం : 6 డిసెంబర్, 1956

# బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు – ప్రసంగాలు

## సంపుటం. 2



ప్రధాన సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

ఆచార్య కె. సర్వోత్తమ రావు

ఆచార్య పి. నరసింహారెడ్డి

ఆచార్య యస్.జి.డి. చంద్రశేఖర్

అనువాదం

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

మరియు

శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం

సారథ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1995

DR. BABASAHEB AMBEDKAR

RACHANALU - PRASANGALU VOL. - II



Compiled in English : **Vasant Moon**

*First Print*
April, 1995



Copies : 2,000
Library Edition Rs. **100/-**
Popular Edition Rs. **60/-**

General Editor
**Prof. Pervaram Jagannadham**

Editors :
**Prof. K. Sarvothama Rao**
**Prof. P. Narashimha Reddy**
**Prof. S.G.D. Chandrasekhar**

Copies can be had from
**Registrar**
**Telugu University**
**Lalitha Kala Kshetram,**
**Public Gardens**
**Hyderabad - 500 004**

*Printed at*
**Planographers**, Hyderabad.

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళిత వర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనిషి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. కుల వ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా॥ అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజంచేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దానితో చిన్నతనంలోనే ఆయన సంఘసంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్య సాధన కోసం కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥ అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోక విదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శృతి, స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు, తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తివంతంగా నడిపించినారు.

డా॥ అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయం, ఆర్థిక ధార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటుచేసింది.

ఫలితంగా డా॥ అంబేద్కర్ గ్రంథావళి మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబా సాహెబ్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శత జయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదించాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర

ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

**అనంతరకాలంలో** ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయ భాస్కరెడ్డిగారు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు .

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ శ్రీ నందమూరి తారక రామారావుగారు మమ్మల్ని అనేక విధాలుగా ప్రోత్సహిస్తున్నారు. ముఖ్యంగా ఈ అనువాద కార్యక్రమాలు విజయవంతం కావడానికి వారు ప్రధాన కారకులు. అందుకు వారికి కృతజ్ఞతలు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని విశ్వవిద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలను ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతాయుతంగా స్వీకరించినాయి. అంతేకాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు కూడా నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొంత భిన్నత, అనువాద శైలీ భేదాలు చోటుచేసుకోక తప్పలేదు.

డా॥ అంబేద్కర్ రచనల్లో చేసిన ప్రసంగాల్లో వాడిన పదాలకి ఆయా సందర్భాల ననుసరించి కనిపించే కొన్ని అర్థాలు నేడు వాడుకలో కనిపించడం లేదు. ఆ విధంగా డా॥ అంబేద్కర్ ఉపయోగించిన పదాలకు వివిధ శాస్త్రాలకు సంబంధించి రకరకాల అర్థచ్ఛాయలు కనిపిస్తాయి. ఆంగ్ల పదాలకు సరిసమానమైన ఒకే పారిభాషిక పదం అన్ని సందర్భాల్లో అన్వయించక పోవడం మరో ఇబ్బంది. అందుకే సందర్భాన్ని అనుసరించి అర్థం చెడకుండా తెలుగులో వివిధ పదాలను వాడడం తప్పని సరి అయింది.

డా॥ అంబేద్కంర్ రచనలు ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటయింది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥ టి.వి. నారాయణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారథ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥ అంబేద్కర్ రచనలు ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ

సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు హాజరయి తెలుగు విశ్వవిద్యాలయం అప్పటి రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు. ప్రస్తుత రిజిస్ట్రార్ శ్రీ డి.వి. సుబ్బారావు ఈ కార్యక్రమాన్ని చురుగ్గా కొనసాగిస్తున్నారు.

డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింపచేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4.1992 నాడు ఆవిష్కృతమైంది.

డా॥ అంబేద్కర్ జయంతిని పురస్కరించుకొని డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14.4.1993 నాడు ఆవిష్కృతమైంది.

డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు అనవదించిన నాల్గవ సంపుటం, డా॥ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు అనువదించిన ఎనిమిదో సంపుటం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వారు అనువదించిన తొమ్మిదో సంపుటం మరియు తెలుగు విశ్వవిద్యాలయం వారు అనువదించిన పదకొండవ సంపుటం, హైదరాబాదులో తేది 25.1.1994 నాడు ఆవిష్కృతమైనది.

కాకతీయ విశ్వవిద్యాలయం వారు అనువదించిన 5వ సంపుటం ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు అనువదించిన 3వ సంపుటం హైదరాబాదులో తేది 14.4.1994 నాడు ఆవిష్కృతమైనది.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో 2వది. దీని అనువాదం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం మరియు శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం వారు సంయుక్తంగా నిర్వహించారు. ఈ గ్రంథం మూడు విభాగాలుగా ఉంది. బొంబాయి శాసన సభలో డా॥ అంబేద్కర్ ప్రసంగాలు, సైమన్ కమీషన్ – డా. అంబేద్కర్, రౌండ్ టేబుల్ సమావేశంలో డా. అంబేద్కర్ అనే మూడు విభాగాలలో బొంబాయి ప్రాథమిక విద్యా చట్ట సవరణ బిల్లు, వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణ బిల్లు, ఖోటీ విధానం రద్దు బిల్లు, చిన్న రైతుల సహాయ బిల్లు యుద్ధంలో భారతదేశం పాల్గొనే విషయం గురించీ, పారిశ్రామిక వివాదాల బిల్లు, భారత రాజ్యాంగ కమీషన్ ముందు డా. అంబేద్కర్ ఇచ్చిన సాక్ష్యం ఇత్యాది ప్రాముఖ్యత గల అంశాలెన్నో ఈ సంపుటిలో ఉన్నాయి.

ఈ 2వ సంపుటం అనువాదాన్ని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం వారు తెలుగు శాఖలో ప్రముఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది. అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన ఆచార్య కె. సర్వోత్తమరావు, ఆచార్య పి. నరసింహారెడ్డి, ఆచార్య యస్.జి.డి. చంద్రశేఖర్, డా. పి. కుసుమ కుమారి, డా. వి. జయసలోమి, డా. కె. మునిరత్నం, డా. కె. ఆనందన్, డా. వి. చంద్రశేఖర్ రెడ్డి, డా. జి. చలపతి, డా. జి. దామోదరనాయుడు, ఆచార్య యస్. రామచంద్ర మూర్తి, శ్రీ భూమన్, డా. యస్. హెచ్. సీతారామశర్మ, డా. పి.యానాది రాజు, శ్రీ జె. రఘుపతిరావు మరియు శ్రీ యం. నరేంద్రగారికి ధన్యవాదాలు.

ఈ సంపుటం అనువాదం ఆంగ్ల మూలంతో సరిచూసి, కొన్ని పేజీలు అనువదించి, ప్రూఫ్‌లు చూసి శ్రమించిన శ్రీ జి. శ్రీనివాస్ గారికి (ఆంధ్రప్రభ దినపత్రిక, హైదరాబాదు) ప్రత్యేక ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదం చేసిన రచయితలకూ, అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు ఆచార్య కె. సర్వోత్తమరావు, ఆచార్య పి. నరసింహారెడ్డి మరియు ఆచార్య యస్.జి.డి. చంద్రశేఖర్ గార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా. అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన ప్లానోగ్రాఫర్స్ ప్రెస్, హైదరాబాదువారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

6.4.1995,
హైదరాబాదు.

# పరిచయం

డాక్టర్ అంబేద్కర్ రచనలలో రెండవది అయిన ఈ సంపుటిలో ఆయన రచనలు, ఉపన్యాసాలు ఉన్నాయి. అంబేద్కర్ రచనలు చాలావరకు ఇప్పుడు అందుబాటులో లేవు. అయితే గ్రంథాలయాలలో ఉన్న కొన్ని పుస్తకాలను మాత్రం ఉత్సాహవంతులైన కొందరు చదువుకోవచ్చు. కాని శాసనసభలలోను, పార్లమెంట్‌లోనూ ఆయన చేసిన ప్రసంగాలు అంత సులభంగా దొరకవు. ఫలితంగా భారత రాజ్యాంగ చట్టాన్ని వృద్ధి చేయడంలో ఆయన పాత్రను సమగ్రంగా గుర్తించడం జరగలేదు.

డాక్టర్ అంబేద్కర్ 1927లో బొంబాయి శాసనమండలి సభ్యులయ్యారు. ఆయన మళ్ళీ 1937లో ఈ శాసనమండలికి ఎంపికయ్యారు. 1937లో జరిగిన సాధారణ ఎన్నికలలో ఆయన బొంబాయి శాసనసభకు ఎన్నికయ్యారు. 1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో ఈ శాసనసభ 'ప్రొరోగ్' అయింది.

ఈ 12 సంవత్సరాల కాలంలో డాక్టర్ అంబేద్కర్ భారత ప్రజా జీవితంలో బహుముఖ పాత్ర వహించారు. బహిరంగ ప్రదేశాలలో బడుగువర్గాల ప్రజలకు ప్రవేశించే హక్కు కల్పించాలని 1927లో ఆయన 'మహద్' దగ్గర సత్యాగ్రహం నిర్వహించారు. అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశం కల్పించాలని 1929లో నాసిక్ దగ్గర జరిగిన సత్యాగ్రహానికి సారధ్య వహించారు. ఈ విషయాలపై ప్రజలను చైతన్యవతులను చేసేందుకు ఆయన 1927లో మరాఠిభాషలో 'బహిష్కృత భారతి' అనే పక్షపత్రికను ప్రారంభించారు. వివిధ రకాల సామాజిక, రాజకీయ, మతపరమైన విషయాలమీద మరాఠీలో తనదైన వినూత్న పద్ధతిలో ఆయన ఆ పత్రికలో రచనలు చేశారు. ఈ వ్యాసాలు నేడు మరాఠీ జర్నలిజంలో ఉత్తమ నమూనాలుగా ఉన్నాయి. సైమన్ కమీషన్‌కు సహకరించడానికి 1928-29లో ఏర్పాటయిన కమిటీలో ఆయన సభ్యుడిగా ఎన్నికయ్యారు. బొంబాయి ప్రెసిడెన్సీలో బడుగువర్గాల, ఆదివాసుల విద్య, రాజకీయ, ఆర్థిక పరిస్థితులపై విచారణ జరిపేందుకు ఏర్పడిన 'స్టార్టె కమిటి' సభ్యుడిగా కూడా ఆయన ఎన్నికయ్యారు. ఆ తర్వాత 1930లో లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశానికి 'బ్రిటిష్ ఇండియా ప్రతినిధి'గా ఎంపికయ్యారు. అనంతర 'కమ్యూనల్ అవార్డ్' ప్రకటన, మహాత్మాగాంధీ ఆమరణ నిరాహారదీక్ష జరిగాయి. 'పూనా ఒప్పందం'తో డాక్టర్ అంబేద్కర్ తిరుగులేని భారత బడుగు వర్గాల నాయకుడిగా ఎదిగారు. రౌండ్ టేబుల్ సమావేశాల తర్వాత ఆయన కులం, హిందూ మతంపై యుద్ధం ప్రకటించారు. "నేను హిందువుగా పుట్టాను. కాని నేను హిందువుగా చావను" అని అంబేద్కర్ 1936లో స్పష్టం చేశారు. ఆ తర్వాత కొద్దిరోజులకే ఆయన భూస్వాములైన ఖోటీల యాజమాన్యపు హక్కు రద్దు కోసం, మహారాష్ట్రలో 'మహర్'ల 'వతన్'ల రద్దు కోసం కార్మిక ఉద్యమాలను నిర్మించడంలో ఆయన నిమగ్నమయ్యారు. ఆయన ఇండియన్

లేబర్ పార్టీని కూడా స్థాపించి కార్మికుల హక్కుల కోసం అసెంబ్లీ లోపల, బయట పోరాటం సాగించారు. అవి ఆయన కార్యక్రమాల లక్షణాలు.

విశ్వవిద్యాలయ విద్య, ప్రాథమికవిద్య, ఖోటి విధానం, పారిశ్రామిక వివాదాలు, మద్య నిషేధం, మంత్రులకు పరిహారం, మహిళా ఉద్యోగులకు ప్రసూతి సదుపాయాలు, భాషా రాష్ట్రాలు, రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొనడం వంటి పలు అంశాలపై బొంబాయి చట్ట సభలో డాక్టర్ అంబేద్కర్ చేసిన ప్రసంగాలు ఈ సంపుటంలోని మొదటి భాగంలో పొందు పరచటం జరిగింది. బడ్జెట్‌పై ఆయన అమూల్య అభిప్రాయాలు కూడా ఇదే భాగంలో చోటు చేసుకున్నాయి. బొంబాయి చట్టసభలో ఆయన వేసిన ప్రశ్నలు, వాటికి సంబంధిత మంత్రులు ఇచ్చిన సమాధానాలు కూడా ఇదే భాగంలో ఉన్నాయి. బ్రిటిష్ ఆధిపత్యంపై అంబేద్కర్ అభిప్రాయాలు శ్రీ పి.జె. రోహమ్ ప్రసంగంలో ప్రతిబింబించాయి. ఈ ఉపన్యాసాన్ని, 1924లో విశ్వవిద్యాలయాల సంస్కరణల సంఘం ముందు అంబేద్కర్ ఇచ్చిన సాక్ష్యాలను ఈ భాగానికి అనుబంధంగా చేర్చడం జరిగింది. డాక్టర్ అంబేద్కర్ బొంబాయి చట్టసభలో 'ఖోటి', 'మహర్', 'వతన్'లపై ప్రవేశపెట్టిన ముసాయిదా బిల్లులను, సన్నకారు రైతుల సహాయ బిల్లుపై ఆయన అసమ్మతి పాఠాన్ని కూడా ఇదే భాగంలో చేర్చాము.

సైమన్ కమీషన్‌గా పిలువబడే భారత రాజ్యాంగ సంఘంతో ఆయన సాగించిన కృషిని ఈ సంపుటం రెండవ భాగంలో చేర్చాము. బొంబాయి ప్రెసిడెన్సీ రాజ్యాంగలో మార్పులపై ఆయన అభిప్రాయాలతో కూడిన నివేదిక, 'బహిష్కృత హితకారిణి సభ' తరపున సైమన్ కమీషన్‌కు సమర్పించిన రెండు వినతిపత్రాలు, కమీషన్ ముందు ఆయన ఇచ్చిన మౌఖిక సాక్ష్యాలు ఇందులో ఉన్నాయి. ఓటుహక్కుపై లోథియా కమిటీకి అందజేసిన పత్రాన్ని కూడా ఇదే భాగంలో చేర్చాము.

మొదటి రౌండ్ టేబుల్ ప్లీనరీ సమావేశాలలో ఆయన ప్రసంగాలు, మైనారిటీల సబ్ కమిటీలో ఆయన వాదనలు, భవిష్యత్తు భారత రాజ్యాంగంలో అస్పృశ్యుల హక్కుల సంరక్షణకు చేసిన కృషిని మూడవ భాగలో చేర్చాం. మైనారిటీల కమిటీలో అస్పృశ్యుల హక్కులకు సంబంధించిన సమస్యపై రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో మహాత్మా గాంధీతో అంబేద్కర్ కత్తి దుయ్యటాన్ని కూడా ఇదే భాగంలో చూస్తాం. భారత రాజ్యాంగ సవరణపై ఏర్పాటైన సంయుక్త సంఘం సభ్యుడిగా పలువురు సాక్షులకు ఆయన వేసిన ప్రశ్నలను కూడా సాధ్యమైనంత వరకు ఇక్కడ ఉంచాము.

ఈ సంపుటాన్ని విశ్లేషించాలని కాని, ఇందులోని విషయాలను వివరించాలని గాని మేము అనుకోవడలేదు. 1930-40ల మధ్య కాలంలో వివిధ అంశాల మీద డాక్టర్ అంబేద్కర్ అభిప్రాయాలను ఈ పుస్తకం వ్యక్తం చేస్తుంది. ఆ అభిప్రాయాలు ఇప్పటికీ ఎంతో ఉపయోగకరంగా ఉన్నాయి. ఈ పుస్తకం విద్యావంతులకే కాక సాధారణ పాఠకులకు కూడా ఉపయోగకరంగా ఉంటుంది. రాజనీతి శాస్త్రం, తత్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం, అర్థశాస్త్రం ముఖ్యంగా భారత రాజ్యాంగ సంస్కరణలకు

సంబంధించిన విద్యార్థులకు ఈ పుస్తకంలో కావలసినంత సమాచారం దొరుకుతుంది.

రౌండ్ టేబుల్ సమావేశాలప్పుడు సంయుక్త సంఘం సమావేశానికి సంబంధించిన 'మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్'లో నుంచి కొన్ని భాగాలు ఈ గ్రంథంలో పొందుపరచడానికి అనుమతి ఇచ్చిన యునైటెడ్ కింగ్‌డమ్ ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము. మూడవ రౌండ్ టేబుల్ సమావేశం సందర్భంగా సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్‌తో కలిసి అంబేద్కర్ దిగిన అరుదైన ఫోటోను ఉపయోగించుకునే అవకాశం ఇచ్చిన లండన్‌లోని 'ఇండియన్ ఆఫీస్ లైబ్రరీ'కి కూడా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము. బొంబాయి విశ్వవిద్యాలయ గ్రంథాలయం, బొంబాయి శాసనమండలి గ్రంథాలయం గ్రంథ పాలకులకు, పూనాలోని గోఖలే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాలిటిక్స్ అండ్ ఎకనామిక్స్‌కు, నాగపూర్‌లోని డాక్టర్ అంబేద్కర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కు, మహారాష్ట్ర ప్రభుత్వ ఆర్కైవ్స్ సంచాలకులకు ఎంతో రుణపడి ఉన్నాము. వారి సహాయ సహకారాలు లేకుండా ఈ గ్రంథం వెలుగు చూసేది కాదు. ఈ పుస్తకం ఇంత త్వరగా వెలువడటానికి కృషి చేసిన ప్రభుత్వ ముద్రణాశాఖ సంచాలకులకు, ఉప సంచాలకులకు, బొంబాయిలోని కేంద్ర ముద్రణాలయ మేనేజర్‌కు, సిబ్బందికి కృతజ్ఞతలు తెలుపడానికి మాకు మాటలు చాలడం లేదు.

మేము ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంత జాగ్రత్త తీసుకున్నప్పటికీ ఈ గ్రంథంలో తప్పులు దొర్లే అవకాశం లేకపోలేదు. ఈ గ్రంథంపై పాఠకులు తమ అమూల్యమైన అభిప్రాయాలు తెలియజేస్తే, గ్రంథం పునర్ముద్రణ సమయంలో పరిశీలించగలమని విజ్ఞప్తి చేస్తున్నాము.

సంపాదక మండలి సభ్యులు
(ఆంగ్ల సంపుటాలు)

# విషయసూచిక

## భాగం – 1

### బొంబాయి చట్టసభలో అంబేద్కర్ ప్రసంగాలు

## భాగం – 2

## సైమన్ కమీషన్‌తో డా॥ అంబేద్కర్

# భాగం – 3

## రౌండ్ టేబుల్ సమావేశాలలో డా॥ అంబేద్కర్

# 1

# *బడ్జెట్ పై ప్రసంగం – 1

**+డా. బి.ఆర్. అంబేద్కర్ :** అధ్యక్షా, బడ్జెట్‌పై సుదీర్ఘమైన చర్చ జరిగింది. బడ్జెట్ గురించి చెప్పవలసినదంతా ఇప్పటికే చెప్పడం జరిగిందని నేను భావిస్తున్నాను. అందువల్ల నా లాంటి కొత్త సభ్యుడు మౌనంగా ఉండటం ఉత్తమం. అయితే, బడ్జెట్‌కు సంబంధించి ఇంతవరకూ సభ ముందుంచని అభిప్రాయం ఒకటి ఉందని నేను భావిస్తున్నాను. నేను కూడా అదే అభిప్రాయాన్ని కలిగి ఉన్నందువల్ల, దానిని వ్యక్తం చేయడం నా విధి అని నేను భావిస్తున్నాను.

అధ్యక్షా, బడ్జెట్‌ను విమర్శించేందుకు ఉపక్రమించగానే ఎవరైనా ముందుగా నిస్సహాయతా భావనకు లోనవుతారు. ఎందుకంటే, నిశితమైన విమర్శకున్న పరిధి చాలా తక్కువ. ఈ బడ్జెట్‌లో పేర్కొన్న మొత్తం అంచనా వ్యయం సుమారు 36 శాతంగా వుంది. ఈ రాష్ట్రపు మొత్తం అంచనా ఆదాయం 15.5 కోట్లు. అందులో దాదాపు 9.5 కోట్లను ఈ సభ అనుమతి లేకుండానే కార్యనిర్వాహక వర్గం వసూలు చేస్తోంది. నేను ప్రస్తావిస్తోంది భూమి శిస్తు, ఎక్సైజ్ రాబడి గురించి. అందుచేతే ఆదాయ, వ్యయాలు రెండిటినీ పరిగణనలోకి తీసుకుంటూ చేసే విమర్శ చాలా పరిమితంగానే ఉంటుందని చెప్పడం సమంజమని నేను భావిస్తున్నాను. ఎందువల్ల అంటే ఈ సభ కేవలం 64 శాతం వ్యయం, 40 శాతం ఆదాయం గురించి మాత్రమే చర్చించగలుగుతుంది. అయినా, వాటిని అట్లాగే పరిగణనలోకి తీసుకుంటూ నేను చెప్పగలిగిన అంశాలను చెప్పేందుకు ఉపక్రమిస్తున్నాను.

ముందుగా, బడ్జెట్‌లోని ఆదాయ భాగం గురించి ప్రారంభిస్తాను. ఇందులో మొదట గౌరవనీయ ఆర్థిక మంత్రి దృక్పథం గురించి, ఆ తరువాత పన్ను చెల్లింపుదారుని దృక్పథం గురించి మాట్లాడదలుచుకున్నాను. ఏ మంచి ఆదాయ వ్యవస్థకైనా విశ్వసనీయతే మౌలికము, అత్యంత ఆవశ్యకమూ అయిన లక్షణమని నేను చెబితే అందుకు గౌరవనీయ ఆర్థిక మంత్రి నాతో ఏకీభవిస్తారనుకుంటున్నాను. ఆదాయ వ్యవస్థ ఎక్కువ ఆదాయాన్ని తెస్తోందా లేక తక్కువ ఆదాయాన్ని తెస్తోందా అన్నది ముఖ్యం కాదు. కాని అది తెచ్చే ఆదాయం మాత్రం నిలకడగా ఉండి తీరాలి. ఈ దృక్కోణం నుంచి ఆదాయ భాగాన్ని పరిశీలించినప్పుడు, బడ్జెట్‌లో అతి పెద్ద అంశమైన భూమిశిస్తులో హెచ్చుతగ్గులు సుమారు 50 లక్షలుగా ఉంది. ఇక, బడ్జెట్‌లో రెండవ పెద్ద ఆదాయ

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి XIX, పే. 164-68, 1927 ఫిబ్రవరి 24.

\+ 1927 ఫిబ్రవరి 18వ తేదీ శుక్రవారం నాడు బొంబాయి శాసన మండలి నామినేటెడ్ సభ్యునిగా డా.బి.ఆర్. అంబేద్కర్ ప్రమాణ స్వీకారం చేశారు.

అంశమైన ఎక్సైజ్‌ను తీసుకుంటే, సంస్కరణలు ప్రవేశపెట్టినప్పటి నుంచి అందులో వ్యత్యాసం 73 లక్షలు వరకూ ఉంటోంది. ఆదాయ వ్యవస్థలోని ఈ రెండు అంశాలు ఒకే దిశలో ఒకే విధంగా వ్యత్యాసానికి గురి అయితే దాని వల్ల కలిగే పరిణామాలను పరిశీలించవల్సిందిగా నా మిత్రుడు, గౌరవనీయ ఆర్థికమంత్రిని కోరుతున్నాను. ఆ రెండు అంశాలు ఒకే దిశలో హెచ్చుతగ్గులకు గురి అయితే కోటి రూపాయిలకు మించిన లోటులో మంత్రి కూరుకుపోతారు. ఇటువంటి ఆదాయ వ్యవస్థ ఆధారపడదగిందా కాదా అన్న విషయం నాకు తెలియదు. ఆ విషయాన్ని చూసుకోవాల్సింది ఆర్థికమంత్రే కాని నేను కాదు. ఎందు కంటే ఆర్థిక శాఖ అధిపతిగా ఉన్నది ఆయనే కనుక.

అధ్యక్షా, ఇప్పుడు ఆ రెండు ఆదాయ అంశాలనే పన్ను చెల్లింపుదారుని దృక్కోణం నుంచి పరిశీలిద్దాం. ఈ రాష్ట్రపు ఆదాయ వ్యవస్థ అసమానతతో నిండి, సమర్థింపజాలనిదిగా ఉందని నేను అనుకొంటున్నాను. ముందుగా భూమి శిస్తును తీసుకుందాం. అది పన్ను కానివ్వండి, లేదా కౌలు కానివ్వండి. ఎంత డొంకతిరుగుడుగా చెప్పినా భూమి శిస్తు అనేది నిస్సందేహంగా వ్యాపారవేత్త లాభాలపై వేస్తున్న పన్ను అని నేను చెప్పదలచుకున్నాను. ఈ రెండు పన్నులు ఒక్కటే అయితే, ఈ రెండు పన్నులు విధించే పద్ధతిలో తేడా ఎందు కుండాలో నేను గౌరవనీయ ఆర్థిక మంత్రి నుంచి తెలుసుకోవాలనుకొంటున్నాను. ఆదాయ మెంత ఉన్నప్పటికీ ప్రతి రైతూ భూమి శిస్తును చెల్లిస్తున్నాడు. కాని, ఎవరైనా ఒక వ్యక్తికి సంవత్సరంలో ఆదాయం లేనప్పుడు అతనిని ఆదాయపు పన్ను చెల్లించమని కోరడం లేదు. భూమిశిస్తుకు సంబంధించి మాత్రం ఇటువంటి పద్ధతి అమలులో లేదు. పంట పండకపోయినా, ఇబ్బడి ముబ్బడిగా పండినా పేద రైతును శిస్తు చెల్లించమని అడుగుతున్నారు. చెల్లించగల సామర్థ్యాన్ని బట్టి కాక గుర్తింపు పొందిన సూత్రం ఆధారంగా ఆదాయపు పన్నును విధిస్తున్నాం. కాని భూమిశిస్తు విషయంలో మాత్రం, రైతు ఒక ఎకరానికి యజమాని అయినా లేక జాగీర్దారైనా లేక ఈనాందారైనా అతనికి ఒకే రేటున పన్ను విధిస్తున్నారు. ఇది దామాషా పన్నే కాని ప్రగతిశీలమైన పన్నుకాదు. అయితే అది ఉండాల్సింది ప్రగతి శీలంగానే. ఆదాయపు పన్ను విధానంలో ఒక పరిమితి కంటే తక్కువ ఆదాయం ఉన్నవారిని ఆదాయపు పన్ను నుంచి మినహాయిస్తున్నారు. కాని భూమి శిస్తు విషయంలో మాత్రం రైతు పేదవాడైనా, ధనవంతుడైనా ప్రతి ఒక్కరి నుంచి నిర్దాక్షిణ్యంగా శిస్తు వసూలు చేస్తున్నారు.

మరొకమారు ఎక్సైజ్ అంశాన్ని పరిశీలిద్దాం. పెద్ద మొత్తంలో దాయం వస్తున్న రంగం ఇది. ఇది చట్టపరంగా ప్రభుత్వానికి గుత్తాధిపత్యమున్న రంగమనడంలో మరో అభిప్రాయానికి తావులేదు. ఈ గుత్తాధిపత్య ఉద్దేశ్యం ఆదాయాన్ని పెంపొందించుకునే వీలు ప్రభుత్వానికి కల్పిం చడం కాదు. మద్యపానం అలవాటుతో ప్రజలు నైతికంగా పతనమవ్వడాన్ని నిరోధించడంలో ప్రభుత్వానికి పట్టు ఉండేందుకు ఈ గుత్తాధిపత్యాన్ని ఉద్దేశించారు. ఆదాయాన్ని వసూలు చేసుకోవడమే ఏకైక లక్ష్యమైనట్లయితే, ప్రభుత్వ గుత్తాధిపత్యం అవసరం లేదు. ఈ గుత్తాధి పత్యాన్ని ప్రభుత్వం ఏ విధంగా వినియోగిస్తోంది? ప్రతి రాష్ట్రంలోను ప్రజలు మద్యపానానికి ఎంత ఖర్చు చేస్తున్నారు? అన్న

లెక్కలను గనుక మనం తీసుకున్నట్లయితే, మద్యపానం అలవాటుకు సంబంధించి బొంబాయి రాష్ట్రం ప్రథమ స్థానంలో ఉంది అన్న విషయం మీకు అవగతమవుతుంది. మద్రాసులో ప్రతి వ్యక్తి మద్యపానం పై రూ. 1-3-7 (రూ.1.22), బెంగాల్‌లో రూ. 0-7-1 (0.45), యునైటెడ్ ప్రావిన్సెస్‌లో రూ. 0-4-7 (0.28), పంజాబ్‌లో రూ. 1-7-8 (1.48), బర్మాలో రూ. 1-4-0 (1.25), బీహార్, ఒరిస్సాలలో రూ. 0-8-7 (0.58), సెంట్రల్ ప్రావిన్సెస్, బీహారుల్లో రూ. 0-15-0 (0.94), అస్సాంలో రూ. 0-13-3 (0.83) ఖర్చు చేస్తున్నారు. కాని బొంబాయిలో అతి భయంకరంగా ప్రతి వ్యక్తి మద్యపానంపై రూ. 2-2-9 (2.18) ఖర్చుచేస్తున్నాడు. ఇది సమర్థించదగ్గ వ్యవస్థా అని నేను నా గౌరవనీయ మిత్రుడు, ఆర్థిక శాఖ మంత్రిని అడుగుతున్నాను. అధ్యక్షా, మద్యపాన నిషేధ విధానాన్ని ప్రభుత్వం ఆమోదించింది. ఆ విధానం విజయవంతమయ్యేందుకు ప్రభుత్వం కొన్ని చర్యలు కూడా తీసుకుంది. కాని అవి ఫలితాన్నివ్వలేదు. అటువంటి చర్యలో మొదటిది రేషనింగ్. అధ్యక్షా, 18,83,804 గాలన్లకు మించి సారాను అమ్మకూడదని ప్రభుత్వం రేషన్ విధించింది. ఈ పరిమితి సారా వినియోగాన్ని అదుపు చేసేందుకనే పేరుతో పెట్టిన ఓ వృధా సాకు మాత్రమే. ఎందుకంటే, సారా వాస్తవ వినియోగం 1,405,437 గాలన్లు. అంటే సారా వాస్తవ వినియోగం కంటే రేషన్ 4,78,367 గాలన్లు అధికంగా ఉంది. సలహా సంఘాన్ని నియమించడం, మద్య నిషేధాన్ని సత్ఫలితమిచ్చేలా అమలు చేసేందుకు తీసుకున్న రెండవ చర్యగా నేను అర్థం చేసుకున్నాను. కాని, ఈ సలహా సంఘంలో 40 శాతం మంది మద్యపాన నిషేధ వ్యతిరేకులే ఉండటం నేను గమనించాను. అధ్యక్షా, ఈ సభను గౌరవించడమన్నది అధికార పక్షం వారి విధి. కాని వారు ఈ సభకు ఇవ్వ వల్సినంత మర్యాద ఇస్తున్నారని నేను అనుకోవడం లేదు. అధ్యక్షా, ఈ దేశ ఆర్థిక వ్యవస్థ గురించి మాట్లాడే సందర్భంలో నా గౌరవనీయ మిత్రుడు ఆర్థిక మంత్రి ఒక సూచన చేయడం సముచితమని నేను భావిస్తున్నాను. ప్రజల సౌభాగ్యమే దేశ సంపద. ఆర్థిక మంత్రి ప్రజలను నైతికంగా పతనం చేయకూడదు. వారిని యాచకులుగా చేయనూకూడదు. ప్రజలను యాచకులుగా చేసే దేశం చివరకు యాచక దేశంగా మారుతుంది. అధ్యక్షా, నేను ప్రస్తావించదలచుకున్న అంశం - నాకున్న సమయం చాలా తక్కువ అని తెలుసు. మీకు వీలుంటే, మరికొంత సమయం తీసుకునేందుకు నన్ను అనుమతిస్తారని కూడా నేను ఆశిస్తున్నాను.

***గౌరవనీయులైన సభాపతి :*** కుదరదు. కుదరదు.

***డా॥ అంబేద్కర్ :*** మరో ఇతర ఆదాయ మార్గం విషయాని కొస్తే, ఈ రాష్ట్రపు వనరులను వీలైనంత ఎక్కువ ప్రయోజనం కలిగే విధంగా సంరక్షించి గౌరవనీయ ఆర్థిక మంత్రి వినియోగిస్తున్నారని నేను అనుకోవడం లేదు. ఉదాహరణకు, అడవులనే ఒక ఆదాయ మార్గంగా తీసుకుంటే 1921-22 లో అటవీ ఆదాయం 74.9 లక్షల రూపాయలు. 1927-28లో అటవీ ఆదాయం కేవలం 74 లక్షలు మాత్రమే. ఆదాయం ఎదుగుబొదుగూ లేకుండా ఉందన్న విషయం మీరు గమనించగలరు. కాని అడవులపై వెచ్చిస్తున్న వ్యయాన్ని లెక్కలోకి తీసుకుంటే వ్యయం 40 లక్షల నుంచి 48 లక్షలకు

పెరగడాన్ని మీరు గమనించగలరు. అడవుల నుంచి వచ్చే నికర రాబడి గురించి మాట్లాడవల్సి వచ్చినప్పుడు మనకు సుమారు 4 లక్షల నష్టం రావడాన్ని గమనించవచ్చు.

అధ్యక్షా, తరువాత నేను మాట్లాడదలచుకున్నది నీటి పారుదల, ప్రజా పనుల గురించి. వివరాలు ఇవ్వడం ద్వారా నేను నా సమయాన్ని వృధా చేసుకుంటున్నానని భావిస్తున్నాను. కాని నేనొక విషయం చెప్పదలచుకున్నాను. అధ్యక్షా, ప్రభుత్వం ఏదైనా ఒక పనిని లేదా పరిశ్రమను చేపట్టినప్పుడు, మౌలికంగా ఆదాయం కోసమే చేపడుతుంది. లేదా ప్రజాసేవ కోసం చేపట్టి అందులో యాధృచ్ఛికంగా ఆదాయాన్ని సంపాదిస్తుంది. లేదా ప్రధానంగా ప్రజాసేవ కోసమే ప్రభుత్వం ఆ పనిని చేపట్టవచ్చు. ప్రభుత్వం చేపట్టిన సేవలకు సంబంధించి ఒక నిర్దుష్టమైన లేక స్పష్టమైన విధానం ప్రభుత్వానికి ఉందని నేను అనుకోవడం లేదు. ఉదాహరణకు నీటి పారుదల శాఖ మనకు ఇవ్వవల్సినంత ఆదాయాన్ని ఇవ్వడం లేదని నేను భావిస్తున్నాను. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం మాత్రమే. ఈ విషయంలో సభలోని ఇతర గౌరవనీయ సభ్యుల అభిప్రాయానికి నా అభిప్రాయం భిన్నం కావచ్చు. శిస్తు విచారణ సంఘం నివేదికను గనుక నా గౌరవనీయ మిత్రుడు పరికించినట్లయితే, నీటి తీరువా చాలా తక్కువగా ఉందన్న విషయాన్ని గమనించగలరని నేను భావిస్తున్నాను. ఈ రాష్ట్రపు వనరులను సమర్ధవంతంగా ఆయన నిర్వహించాలని ఆశించేందుకు సభలో ప్రతిపక్షంలో ఉన్న మాకు హక్కు ఉందని నేను భావిస్తున్నాను.

అధ్యక్షా, ఇప్పుడు నేను ఈ బడ్జెట్‌లోని వ్యయ భాగం గురించి మాట్లాడతాను. ఈ సభా సభ్యులలో పెక్కు మంది లోటు గురించి కలవరపడుతున్నారని నాకు తెలుసు. నేను మాత్రం లోటు గురించి కలవర పడటం లేదు. గౌరవనీయ సభ్యులు కలవరపడి తీరాల్సింది లోటు గురించి కాదు. నన్ను కలవరపెట్టిన అంశమేమిటంటే, ఈ బడ్జెట్ లోటు సామాజిక పురోభి వృద్ధికి దోహదపడే ఒక గొప్ప విధానాన్ని చేపట్టడం వల్ల ఏర్పడింది కాదు. పాలనా యంత్రాంగపు అనుత్పాదక వ్యయం పెరిగినందువల్లనే ఈ లోటు ఏర్పడింది.

అధ్యక్షా, ఈ సభను సముచితంగా వ్యవహరించమని అంటూ గౌరవనీయ సభ్యులు, ఆర్థిక శాఖ కార్యదర్శి నిన్న చాలా తెలివిగా మాట్లాడారని నేను చెప్పదలుచుకున్నాను. అధికార పక్షం తమను తీవ్రంగా పట్టించుకోవాలని గౌరవనీయ సభా సభ్యులు కోరుకుంటున్నట్లయితే వారు సముచితంగా వ్యవహరించాలని ఆయన చెప్పారు. అధ్యక్షా, ఆ వాదనలోని అర్థాన్ని నేను అంగీకరిస్తున్నాను. అయితే ఆ వాదననే ఆయనకు తిప్పికొడుతూ, ఈ రాష్ట్రపు వ్యయంలో చోటు చేసుకొన్న పెరుగుదల సముచితమైనదేనా, పాలనా నాణ్యత పెరిగిన కారణంగానే వ్యయం పెరిగిందని సమర్థించుకోవచ్చునా అని నేను ఆయనను అడుగుతున్నాను.

అధ్యక్షా, 1910 నాటి ఈ రాష్ట్రపు పాలనా వ్యయాన్ని 1927–28 నాటి పాలనా వ్యయంతో పరిపోల్చినప్పుడు, 1910–11లో ప్రధాన పాలనా వ్యయం కేవలం 17 లక్షల రూపాయిలు

మాత్రమే ఉండగా, నేడు ఆ వ్యయం 126 లక్షల రూపాయిలుగా వుంది. ఇది సముచితమా అని నేను నా గౌరవనీయ మిత్రుడు ఆర్థిక శాఖ కార్యదర్శిని అడుగుతున్నాను. సరిపోల్చడం కోసం అప్పుడు, ఇప్పుడు మొత్తం రాష్ట్రానికి వర్తించే శాఖలకు సంబంధించిన అంకెలను మాత్రమే నేను తీసుకున్నాను.

***జి. విల్స్ :*** గౌరవనీయ సభ్యుడు నన్ను అనుమతించినట్లయితే నేనొక విషయాన్ని ఆయనకు చెప్పదల్చుకున్నాను. బడ్జెట్‌లో ఇచ్చిన అంకెలను బహుజాగ్రత్తగా వాడాలని గౌరవనీయ సభ్యుడు రావుసాహెబ్ దాదూభాయి దేశాయికి నిన్ననే వివరించాను. ఇప్పుడున్న ప్రధాన పాలనా వర్గీకరణ, సంస్కరణలకు ముందున్న ప్రధాన పాలనా వర్గీకరణ కాదు. అన్యాక్రాంత భూముల ఖాతా పేరుతో ఒక వ్యయాంశం ఉండేది. అప్పట్లో దానిని వేరొక పద్దు కింద చూపేవారు. ఇప్పడది ప్రధాన పాలనా పద్దు కింద ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** కావచ్చు. నా గౌరవనీయ మిత్రుడు చెప్పినట్లుగా సవరింపులకు లోబడే, మనం ఎలా ఉన్న ప్రకటనలను అలాగే తీసుకోక తప్పదనుకోండి. కాని, ఈ రాష్ట్రంలో ప్రధాన పాలనా వ్యయం చాలా హెచ్చుగా ఉందని నేను అనుకుంటున్నాను. వాస్తవానికి, ఈ రాష్ట్రపు గత చరిత్ర దృష్ట్యా చూసినా అది సమర్థనీయంగా లేదు. నేడు మనకు నలుగురు కార్య నిర్వాహక మండలి సభ్యులు, ముగ్గురు మంత్రులు, వారి క్రింద దాదాపు 25 మంది కార్య దర్శులు, సహాయ కార్యదర్శులు ఉన్నారు. ఇది సముచితమని నా గౌరవనీయ మిత్రుడు, ఆర్థిక శాఖ కార్యదర్శి అంటారని నేను అనుకోవడం లేదు. ఈ రాష్ట్రంలో పాలనా వ్యయంలో జరుగుతున్న దుబారా గురించి వివరించకుండా ఉండేందుకు గౌరవనీయ ఆర్థిక శాఖ కార్యదర్శి ప్రయత్నించారు. అధ్యక్షా, నాకు మరి కొంత సమయమివ్వగలరని నేను ఆశిస్తున్నాను.

***గౌరవనీయ సభాపతి :*** కుదరదు. ఉన్న సమయం చాలా తక్కువ. గౌరవనీయ సభ్యుడు అర్థం చేసుకోగలరు. ఆయనకు మరో రెండు నిమిషాల సమయం మాత్రమే ఉంది.

***డా.బి .ఆర్. అంబేద్కర్ :*** అధ్యక్షా, ఇక నేను చెప్పదలచుకున్న విషయాన్ని మానుకుని ముగింపుకొస్తాను. నా ఈ ఉపన్యాసంలో నా అభిప్రాయాన్ని చాలా స్పష్టంగా చెప్పదలచు కున్నాను. కేటాయింపులలో తీవ్రమైన కోత ఉంటుందని గౌరవనీయ సభ్యుల నుంచి మనం వింటున్నాం. కోత విధించే అవకాశం ఉందని నేను కూడా నమ్ముతున్నాను కాబట్టి, వారి ఆందోళనతో నేను చిత్తశుద్ధితో ఏకీభవిస్తున్నాను.

కాని, అధ్యక్షా,ఈ కోత వల్ల మనకు ప్రయోజనం లేదనే వాస్తవం నుంచి నన్ను నేను వంచించుకోలేను. పెద్ద ఎత్తున కోత విధిస్తే బహుశా ఒకటో రెండో కోట్ల రూపాయిల ఉపశమనం మాత్రమే కలుగుతుందని నేను భావిస్తున్నాను. కాని అది ఎంత వరకు ఉపయోగ పడుతుంది? ఆ వనరులతో బహుశా మనం బడ్జెట్‌లో లోటు లేకుండా చేయగలమన్న విషయం నాకు తెలుసు. కాని, బడ్జెట్‌లో లోటు లేకుండా చేయడమొక్కటే ఈ సభ లక్ష్యమా? నిర్బంధ విద్య, వైద్య సదుపాయం,

మద్యపాన దురలవాటు నుంచి ప్రజలకు విముక్తి కలిగించడం, జీవితావసర సదుపాయాలను సమకూర్చడం పట్ల ఈ సభకు చిత్త శుద్ధి వుందనే నేను మరీ మరీ ఆశిస్తున్నాను. మంచి అనేది స్వర్గం నుంచి జారి పడదని నేనీ సభకు గుర్తు చేయదలచుకున్నాను. ప్రతి అభివృద్ధికీ కొంత ఖర్చు ఉంటుంది. ఆ ఖర్చు పెట్టగలిగిన వాళ్ళకు మాత్రమే ఆ అభివృద్ధి దక్కుతుంది.

# 2

# *బడ్జెట్‌పై ప్రసంగం – 2

**డా.బి.ఆర్.అంబేద్కర్ :** అధ్యక్షా, ఇది నిజంగా లోటు బడ్జెట్టే. ఆ మేరకు ఇది నిస్సందేహంగా అసంతృప్తి కరమైన బడ్జెట్టే. అయితే లోటు చూపుతుండటమే అసంతృప్తికి కారణమైతే, దీని గురించి పెద్దగా పట్టించుకోవాల్సిన అవసరం ఉందని నేను అనుకోవడం లేదు. ఇది అసంతృప్తికరమైన బడ్జెట్టు మాత్రమే కాదు. అధ్యక్షా అధ్వాన్నమైన బడ్జెట్టుకూడా. వ్యవహారాల తీరుతెన్నులు నిజంగా చాలా విషమ స్థితిలో ఉన్నాయి.

అధ్యక్షా, అప్పుడే మనం మాంటేగు – ఛేమ్స్ ఫర్డ్ సంస్కరణలు అమలు చేయడం ప్రారంభించి ఒక దశాబ్ద కాలం పూర్తవుతోందన్న విషయం మీకు తెలుసు. అందువల్ల, 1921 నుంచి ఇప్పటి వరకు పరిస్థితులను ఒక సారి సమీక్షించడం ఎంతైనా సమంజసంగా ఉంటుంది. "రిజర్వు" అంశాలుగా పిలవబడుతున్న అంశాల కంటే బదలా అంశాలు ప్రభుత్వ శ్రద్ధకు ఎక్కువగా నోచుకుంటాయన్న ఉద్దేశంతో ఈ సంస్కరణలను ప్రవేశ పెట్టారు. కాని అధ్యక్షా, 1921 నుంచి ఇప్పటి వరకూ ఈ రాష్ట్రపు వ్యయాన్ని విశ్లేషిస్తే మనకు అవగతమవుతున్నదేమిటి? కేవలం శాంతి భద్రతల నిర్వహణకు మాత్రమే సహాయపడే అంశాలకన్నా పురోభివృద్ధికి దోహదపడే అంశాల వ్యయానికి కొత్త వ్యవస్థలో ప్రాధాన్య ముంటుందని పెట్టుకున్న ఆశలు వమ్మయ్యాయి.

అది ఎలా జరిగిందో నేను తెలియచేస్తాను. "బదలా", "రిజర్వు" శాఖల పై వివిధ రాష్ట్రాలలో జరిగిన వ్యయానికి సంబంధించిన లెక్కలను నేను సేకరించాను. అధ్యక్షా, మీ అనుమతితో వాటిని సభ ముందుంచదలిచాను. వాటిని బట్టి పరిస్థితి ఎంత అధ్వాన్నంగా ఉందో సభ తెలుసు కోవచ్చు. నేనిచ్చే లెక్కలు వివిధ రాష్ట్రాలలో 'బదలా', 'రిజర్వు' శాఖలపై 1925–26 సంవత్సరం నాటి వ్యయాన్ని 1921–22 సంవత్సరం నాటి వ్యయంతో సరిపోల్చి అందులోగల పెరుగుదలను లేదా తరుగుదలను చూపుతాయి. అందుకు సంబంధించిన అంకెలు ఈ దిగువ విధంగా ఉన్నాయి : –

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 22, పేజీలు 167–70, ఫిబ్రవరి 21, 1928.

| | రిజర్వు శాఖ | | బదలా శాఖ | |
|---|---|---|---|---|
| | పెరుగుదల శాతం | తరుగుదల శాతం | పెరుగుదల శాతం | తరుగుదల శాతం |
| మద్రాసు | 1.21 | -- | 14.26 | -- |
| బొంబాయి | 6.33 | -- | 5.82 | -- |
| బెంగాల్ + | -- | -- | 6.11 | -- |
| యునైటెడ్ ప్రావిన్సెస్ * | | -- | 12.57 | -- |
| పంజాబ్ | 10.40 | -- | 29.41 | -- |
| బర్మా | 34.36 | -- | 6.44 | -- |
| బీహార్, ఒరిస్సా | 5.89 | -- | 44.66 | -- |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 6.24 | -- | 18.15 | -- |
| అస్సాం | 8.24 | -- | 12.75 | -- |

అధ్యక్షా, ఈ అంకెలను పరిశీలిస్తే మనకు విశదమవుతున్నదేమిటి? బొంబాయి వంటి ముఖ్యమైన రాష్ట్రం రిజర్వు, బదలా అంశాలపై ఖర్చుచేసే విషయంలో అంత దిగువ స్థానంలో ఉన్నందుకు నేను విచారిస్తున్నాను. నేనే కాదు, ఈ సభలో ఉన్న ప్రతి ఒక్కరు ఇందుకు విచారిస్తారని నేను ఖచ్చితంగా భావిస్తున్నాను. అతి అధ్వాన్నంగా నిర్వహింపబడుతున్న బర్మా కూడా ఈ విషయంలో బొంబాయి కంటే పై స్థానంలో ఉంది. అందువల్ల అధ్యక్షా, ఇదొక పెద్ద అజ్ఞాకరమైన విషయమని నేను మీకు విన్నవిస్తున్నాను.

బొంబాయి వంటి ప్రధానమైన రాష్ట్రపు ఆర్థిక వ్యవహారాలను నిర్వహించాల్సిన పద్ధతి ఇది కానే కాదు. 'బదలా' శాఖలపై వాస్తవంలో చూపిన శ్రద్ధ కంటే మరింత ఎక్కువ శ్రద్ధ చూపినట్లుగా గౌరవనీయ ఆర్థికశాఖ మంత్రి కనపడుతున్నారని నేను భావిస్తున్నాను. ఒక పద్ధతి ప్రకారం రిజర్వు శాఖలను అధికంగా మేపుతూ, బదలా శాఖలను పస్తు పెట్టారని ఈ అంకెలను బట్టి విధితమౌతోంది. తన దేశ ప్రజల ఆశలకు అనుగుణంగా ప్రతిస్పందించనట్లయితే భారత ఆర్థిక మంత్రి ఎంత గొప్ప వాడైనా ప్రయోజనం ఏమిటి? సర్వతోముఖాభివృద్ధిని సాధించాలని అందరూ ఆకాంక్షిస్తున్నారు. ఆ ఆకాంక్ష ఎంత బలమైందో గౌరవనీయ ఆర్థిక మంత్రికి తెలుసు. కాని, దురదృష్టవశాత్తు, భవిష్యత్తులో ఆయన మనలను అభివృద్ధి వైపు నడిపించగలరని ఆశించేందుకు ఆయన ఇంతవరకు ఏమీ చేయలేదు.

అధ్యక్షా, ఈ రాష్ట్రపు వనరుల నిర్వహణ అధ్వాన్నంగా ఉండటమే కాదు. ఆర్థిక పరిస్థితి కూడా చాలా తీవ్రంగా ఉందని నేను విన్నవిస్తున్నాను. 1921 నుంచి నేటి వరకు సంవత్సరాల వారీగా ఆర్థిక

*, + రిజర్వు శాఖపై వ్యయం తగ్గుదల

పరిస్థితిని కనుక మీరు పరిశీలించినట్లయితే ప్రతి సంవత్సరం మిగులు తరుగుతోందన్న విషయాన్ని మీరు గమనించగలరు. ఆ తరుగుదల ఎంతగా ఉందంటే, మిగులు అంతా హరించుకుపోయి, మిగులు బడ్జెట్టుకు బదులుగా, లోటు ఉన్న బడ్జెట్టు ప్రవేశ పెట్టే స్థితికి చేరుకున్నాం. 1922-23 లో 64 లక్షల రూపాయిల మిగులు ఉంది. 1923-24లో మిగులు 29.38 లక్షల రూపాయిలకు తగ్గింది. 1925-26 సంవత్సరం 91 లక్షల రూపాయిల లోటుతో ముగిసింది. అప్పటి నుంచి పరిస్థితులు ఎలా ఉన్నాయో మనకందరికీ తెలుసు.

అధ్యక్షా, ఈ రాష్ట్రపు ఆర్థిక పరిస్థితి క్రమంగా దిగజారుతోందని అంకెలను బట్టి మీరు తెలుసుకోగలరు. ప్రభుత్వం చేసిన వాగ్దానాల దృష్ట్యా రానున్న కాలంలో పరిస్థితి మరింత విషమంగా ఉంటుందని నేను విన్నవిస్తున్నాను. అధ్యక్షా, రుణాలను త్వరలోనే తిరిగి చెల్లించాల్సి ఉందన్న విషయం మీకు తెలుసు. రుణాన్ని తిరిగి చెల్లించేందుకు ఏదో ఒక ఏర్పాటు చేసుకోవాలి. ఇప్పటికే హరించుకు పోయిన ఈ రాష్ట్రపు ఆర్థిక వనరులపై అది తప్పని సరిగా అధిక భారం మోపుతుంది. అధ్యక్షా, సార్వత్రిక నిర్బంధ ప్రాథమిక విద్యకు ఈ ప్రభుత్వం, ఈ సభ కట్టుబడి ఉన్నాయి. మద్య నిషేధాన్ని అమలు చేయడానికి కూడా ఈ ప్రభుత్వం, ఈ సభ కట్టుబడి ఉన్నాయి. ఈ మూడు అంశాలు ఈ రాష్ట్రపు వనరులను అత్యధికంగా హరించి వేస్తాయనే విషయాన్ని ప్రభుత్వంలోని గౌరవనీయ సభ్యులెవరూ తోసి పుచ్చలేరనే నేను భావిస్తున్నాను. ఈ మూడు అంశాలు లేనప్పుడే మన వనరులు సంవత్సరం, సంవత్సరానికి క్షీణించి పోతున్నాయి. అటువంటివి, ఈ మూడు అంశాలకు మనం ఆచరణ రూపం ఇవ్వడం ప్రారంభిస్తే ఇక అప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందో నేను ఊహించ లేక పోతున్నాను. నాకు ఆశ్చర్యం కలిగిస్తున్న దేమిటంటే, ఈ పరిస్థితులు గౌరవనీయ ఆర్థిక మంత్రికి కించిత్తు కూడా ఇబ్బంది కలిగించక పోవడమే. ఈ మూడు అంశాలకు కట్టుబడి ఉన్నామన్న విషయం తనకు తెలుసునని ఆయన బయట పెట్టలేదు. ఈ బాధ్యతలను తాను గుర్తెరిగే ఉన్నారన్న విషయాన్ని ఆయన తన బడ్జెట్ ప్రకటనలో పేర్కొనలేదు. రేపటి గురించి ఎటువంటి ఆలోచన లేకుండా ఆయన కేవలం తాత్కాలిక దృష్టి కలిగిన విధానాన్ని మాత్రమే అవలంబిస్తున్నారని నేను చెప్పదలచుకున్నాను. భవిష్యత్ అవసరాల దృష్ట్యా పరిస్థితిని మెరుగు పరిచే విధానపు ఛాయ కూడా కానరావడం లేదు. నా తరువాత ఇక అంతా ప్రళయమే అన్న ధోరణిలో ఆయన ఉన్నట్లు కనపడుతోంది. బడ్జెట్ లోటును పూడ్చుకునేందుకు మాత్రమే ఆయన ప్రయత్నిస్తున్నారు. క్షామ, బీమానిధి, మెస్టన్ సహాయాన్ని తగ్గించడం వల్ల వనగూరే లాభమెంతో ఆయన లెక్కలు వేస్తున్నారు. అయితే, ఈ రాష్ట్రపు ఆర్థిక సుస్థిరతకు ఈ చిన్న చిన్న లాభాలు ఎంత వరకు దోహదపడగలవు అని నేను ఆయనను అడుగుతున్నాను? ఆర్థిక సుస్థిరతకు అవి దోహదపడతాయనుకోవడం పొరపాటు అవుతుందని నేను భావిస్తున్నాను. మనం పురోగమించేందుకు ఈ రాష్ట్రపు పరిపాలనా వ్యవహారాలలో పొదుపు చేసేందుకు తగినన్ని మార్గాలు ఉన్నాయని గౌరవనీయ ఆర్థిక మంత్రి హామీ అయినా ఇచ్చి తీరాలి. లేదా, పన్నులు వేస్తేనే తప్ప మనకు కావాల్సిన

వనరులను మనం సమకూర్చుకోలేమని అయినా ఆయన చెప్పాలి. గౌరవనీయ గవర్నర్ నిన్న చేసిన ప్రసంగాన్ని నేను అత్యంత వినమ్రతతో ప్రస్తావిస్తాను. పన్నులకు పూర్తి బాధ్యత శాసనమండలిదేనని, అవసరమైనప్పుడు పన్నులు విధించడం శాసన మండలి అధికారాల పరిధిలోకే వస్తుందని గౌరవనీయ గవర్నర్ తన ప్రసంగం లో తెలిపారు. పన్నులు విధించే అధికారం శాసనమండలికుందనే విషయాన్ని నేను అంగీకరిస్తాను.

అయితే, ఈ విషయంలో చొరవ చూపాల్సింది ప్రభుత్వమేనని నేను విన్నవిస్తున్నాను. తాను ఎటువంటి పన్నులను విధించాలని కోరుకుంటుందో సూచించాల్సింది ప్రభుత్వమే. కానీ ప్రభుత్వం ఆ పని చేసిందా? ఆ పని చేయకుండా, ప్రభుత్వం నిమ్మకునీరెత్తినట్లు మౌనంగా కూర్చుంది. తాను ఏం చేయదల్చుకున్నదీ ప్రభుత్వం ఇంత వరకు మనకు ప్రతి పాదించనేలేదు. ఒక పథకం రూపొందించుకునేందుకు వీలైన సమాచారం ప్రభుత్వం వద్ద లేదని అనుకునేందుకు కూడా లేదు. తగిన నూతన ఆర్థిక విధానాన్ని ప్రతిపాదించేందుకు అవసరమైనన్ని సిఫారసులతో కూడిన వివరణాత్మకమైన విస్తృత నివేదికను పన్నుల విచారణా సంఘం సమర్పించిందన్న విషయం మనకందరికీ తెలుసు. ఈ సిఫారసులన్నీ గౌరవనీయ ఆర్థిక మంత్రి బల్లపై పడి ఉన్నాయని, ఈ విషయంలో ఇంతవరకూ ఎటువంటి చర్య తీసుకోలేదని నేను ఖచ్చితంగా చెప్పగలను. అధ్యక్షా, పరిస్థితి చాలా విషయమంగా ఉందని, ఈ పరిస్థితిని దూరదృష్టితో ఎదుర్కునేందుకు గౌరవనీయ ఆర్థిక మంత్రి సంసిద్ధం కావల్సిన సమయం ఆసన్నమైందని నేను చెప్పదల్చుకున్నాను.



# 3

# *బడ్జెట్ పై ప్రసంగం – 3

**+డా. బి.ఆర్. అంబేద్కర్ (బొంబాయి నగరం) :** అధ్యక్షా, నా గౌరవనీయ మిత్రుడు ఆర్థిక మంత్రి ప్రవేశ పెట్టిన రెండవ బడ్జెట్ ఇది. అందువల్ల, ఈ బడ్జెట్‌ను క్షుణ్ణంగా, నిశితంగా పరిశీలించి ఉండి ఉంటారనుకోవడం సహజం. ఈ బడ్జెట్ గురించి నేనే మనుకుంటున్నానో చెప్పే ముందు, నేనొక వాస్తవాన్ని మాత్రం మరచిపోను. అదేమంటే, ఇంతవరకూ ఈ బడ్జెట్ చర్చలో పాల్గొన్న ఈ సభా సభ్యులంతా ఈ బడ్జెట్‌ను ప్రశంసించారు. తన కృషి మాట్లాడిన వారందరి మెప్పును పొందడం పట్ల గౌరవనీయ ఆర్థిక మంత్రి కొంత మేరకు సంతృప్తి చెంది ఉండవచ్చు. నా ముందు ప్రసంగించిన వారంతా బడ్జెట్‌ను ఆ విధంగా నిజంగా ప్రశంసించడం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆయన ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను పరిశీలించేందుకు నేను కొంత సమయం కేటాయించాను. నేనింతవరకూ ఇటువంటి అత్యంత నికృష్టమైన, నిస్సారమైన, వాస్తవ దూరమైన బడ్జెట్‌ను చూడలేదు అని చెప్పేందుకు నేనే మాత్రం వెనుకాడటం లేదు. ఇది పరిమితులు దాటి అతిగా చేసిన వ్యాఖ్యలా ధ్వనించవచ్చు. కాని, నేను చేసిన ఈ వ్యాఖ్యను ఇప్పుడు వివరించబోతున్నాను. అయితే అధ్యక్షా, బహుశా ఒకే ఒక్క అంశానికి మాత్రం ప్రభుత్వాన్ని ప్రశంసించాల్సి ఉంటుంది. కాని దురదృష్టవశాత్తు, ఆ ప్రశంస నా గౌరవనీయ మిత్రుడు ఆర్థిక మంత్రికి కాకుండా, గౌరవనీయ హెూంశాఖ మంత్రికి చెందుతుంది. కొత్త పథకం లోని 45వ అంశం గురించి నేను ప్రస్తావిస్తున్నాను. పోలీసు బలగాన్ని పెంచడానికి 45వ అంశం 36,217 రూపాయిలు సమకూరుస్తోంది. అధ్యక్షా, ప్రస్తుతం అధికార పక్షంలో కూర్చున్న వారు అధికారంలోకి రాక మునుపు, వారికి పోలీసు బలగానికి మధ్య ఉన్న సంబంధ మెటువంటిదో అందరికీ తెలిసిన విషయమే. తెల్లదుస్తులు వేసుకున్న పెక్కుమంది పోలీసులను 'పచ్చటోపీ హాయ్, హాయ్' అంటూ పలు ప్రక్కల నుంచి గేలిచేస్తున్న దృశ్యాలను చూడటం నాకు బాగా గుర్తుంది. ప్రజల అణచివేతకు, నియంతృత్వానికి ఒకప్పుడు ఒక సాధనంగా భావించబడిన పోలీసులకు, కాంగ్రెసు వారికి మధ్య ఇటువంటి సహజీవనం, సోదరభావం నెలకొనడం, పోలీసు బలగాల పెంపుదల కోసం గౌరవనీయ హెూంశాఖ మంత్రి ధనాన్ని కోరడం, గౌరవనీయ

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పే 168-79, 1938 మార్చి 2,1938.

\+ డా. బి.ఆర్. అంబేద్కర్ 1937లో బొంబాయి శాసనసభకు ఎన్నికై, 1937 జూలై 19వ ఎం.ఎల్.ఎ.గా ప్రమాణ స్వీకారం చేశారు.

ఆర్థిక శాఖ మంత్రి దానిని కేటాయించడం నిజంగా అభినందించాల్సిన విషయమేనని చెప్పవచ్చు. నా దృష్టిలో పోలీసుల అవసరం ఆయనకు ఎంతైనా వుంది. పోలీసుల విధేయత కూడా ఆయనకు అవసరం వుంది. పోలీసుల బలగాలను ఆయన ఏ విధంగా ఉపయోగించదలచారో మనకందరికీ తెలుసు. పోలీసు బలగాన్ని ఏ విధంగా ఉపయోగి స్తున్నారన్నదానికి ఇటీవల ఉదాహరణ ఒకటి మనకుంది. ధార్వీలో జరిగిన పోలీసు కాల్పుల గురించి నేను ప్రస్తావిస్తున్నాను. నాకు తెలుసున్నంత వరకూ ఇప్పటిదాకా కార్మికవర్గం పట్ల అంతంత మాత్రం సానుభూతి చూపుతున్న ప్రస్తుత ప్రభుత్వం ఇకముందు కార్మికవర్గానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున పోలీసు బలగాన్ని వినియోగిస్తుందని నేను ఖచ్చితంగా చెప్పగలను. కాంగ్రెస్ తన అసలు స్వరూపాన్ని బయట పెట్టుకొనడమన్నది అభినందించాల్సిన విషయం. ప్రభుత్వాన్ని ప్రశంసించడం ఇక ఇంతటితో నేను ముగించితీరాలి. ఎందుకంటే, ప్రభుత్వం మురిసిపోయేందుకు ఇక బడ్జెట్‌లో మరొక అంశమే లేదు.

అధ్యక్షా, మొట్టమొదటగా, ఆర్థిక అనౌచిత్యానికి కొన్ని ఉదాహరణలుగా నేను భావిస్తున్న అంశాలను ఈ సభ దృష్టికి తీసుకురాదల్చాను. గౌరవనీయ ఆర్థిక మంత్రి ప్రవేశ పెట్టిన బడ్జెట్‌లోంచి అటువంటి ఐదు అంశాలను నేను సేకరించాను. అవి ఏమిటంటే, విద్యకు 24 లక్షల రూపాయిలు సమకూరుస్తున్న 53 వ అంశం, స్వచ్ఛంద పోలీసు బలగానికి 25 వేల రూపాయిలు సమకూరుస్తున్న 46వ అంశం, గ్రామ పంచాయితీలకు 4 లక్షల రూపాయిలు సమకూరుస్తున్న 105వ అంశం, కార్మికుల సదుపాయాలకు ఒక లక్ష రూపాయిలు సమకూరుస్తున్న 100వ అంశం, యునానీ వైద్యుల శిక్షణకు 80 వేల రూపాయిలు సమకూరుస్తున్న 67వ అంశం. అధ్యక్షా, నిధుల కేటాయింపుకు ప్రతిపాదనలలో చేర్చబడిన ఈ అంశాలలో వేటికీ ప్రస్తుతం ఎటువంటి పథకం అమలులో లేదని ప్రభుత్వం అంగీకరిస్తున్నదనే విషయాన్ని శాసన సభలో పంచిపెట్టిన ప్రభుత్వ నివేదికను గమనిస్తే గ్రహించవచ్చు. నిధులను ఖర్చుచేయదల్చిన ఈ పద్దులన్నీ ఇంకా ఆలోచనా దశలోనే ఉన్నాయి. ఈ నిధులను ఖర్చుచేయదల్చిన అంశాల ప్రయోజనాలేమిటో వారికే తెలియదు. రెండవ అంశమేమంటే, ఈ వ్యయం ఏ విధంగా జరగాలి అన్న విషయానికి సంబంధించి ఈ సభ ఎటువంటి చట్టపరమైన నిబంధనలను రూపొందించలేదు. అధ్యక్షా, విద్య, పోలీసు వంటి ప్రధాన పద్దుల క్రింద తనకు ఇష్టమైన ఏ అంశంపైనైనా ఖర్చు పెట్టేందుకు ప్రభుత్వానికి పూర్తి స్వేచ్ఛనిచ్చే విధంగా ఒక ఖాళీ చెక్కును ఈ సభ నుంచి కోరుతున్నట్లుగా ఈ వ్యయం ఉంది. అలా కోరుతున్న ఈ వ్యయం మొత్తంగా చూస్తే 31 లక్షల రూపాయిలు. ప్రస్తుత బడ్జెట్‌కు గౌరవనీయ ఆర్థిక మంత్రి చేర్చిన కొత్త అంశాల విలువ దాదాపుగా 1.16 లక్షలు అన్న విషయాన్ని పరిగణనలోకి తీసుకుంటే, కేవలం సభ అనుమతి కోసం ప్రతిపాదనలు పెట్టి ఆ తరువాత ఈ ప్రభుత్వం తన కిష్టమొచ్చిన రీతిలో ఖర్చు చేయాలనుకుంటున్న మొత్తమెంతో సులభంగా గ్రహించవచ్చు. అధ్యక్షా,

ఈ ప్రభుత్వం నిరంతరంగా ఈ సభాహక్కులను హరించి వేస్తోందని నేను స్పష్టంగా చెప్పదలచుకున్నాను. దురదృష్టవశాత్తు, నా గౌరవనీయ మిత్రుడు హెూంశాఖ మంత్రి సభలో లేనందుకు నేను చింతిస్తున్నాను. ఎందుకంటే, సూత్రబద్ధంగా ఆయన బాధ్యత వహించే ఒకటి రెండు విషయాలను నేను ప్రస్తావించదలచాను. ఈ సభ ఆమోదించిన చట్టం కింద ప్రభుత్వం రూపొందించ దలచుకున్న నిబంధనలను ఆమోదించే హక్కు ఈ సభకు లేదని గౌరవనీయ హెూం మంత్రి కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన దగ్గర నుంచి నొక్కి చెబుతున్నారు. అధ్యక్షా, ఇది ఈ సభా హక్కును హరించడమేనని నేను అంటాను. నిబంధనలు అనేకం ఉన్నాయి. పాలనా పరమైన విధానాన్ని అమలుచేసే నిబంధనలు కొన్నయితే, చట్టంలో భాగంగా ఉండే నిబంధనలు మరికొన్ని. చట్టంలో భాగంగా ఉండే నిబంధనలకు సంబంధించి, అసలు చట్టంతో పాటుగా, ఆ నిబంధనలను ఆమోదించే హక్కు కూడా ఈ సభకు ఉందని నేను అంటాను, నొక్కి మరీ చెబుతాను. ఈ హక్కును ఏ కార్యనిర్వాహక ప్రభుత్వమైనా ఎలా భుక్తం చేసుకోగలదో నేను అర్థం చేసుకోలేక పోతున్నాను. కాని కాంగ్రెస్ ప్రభుత్వం ఆ విధంగా చేస్తోంది. సభకు గల ఈ హక్కును కాంగ్రెస్ ప్రభుత్వం పదే పదే హరించి వేస్తోంది. ఈ విధంగా ప్రతిపాదనల పేరుతో ధనాన్ని తీసుకోవడం, ఈ విధంగా ఖాళీ చెక్కును కోరడం కూడా ఈ సభకు గల హక్కును హరించి వేసే మరో మార్గమని నేను భావిస్తున్నాను. అధ్యక్షా, ప్రస్తుత పరిస్థితి ఏమిటో తెలియదు కాని, పాత భారత ప్రభుత్వ చట్టం కింద రూపొందించిన సంక్రమింపు నిబంధనల గురించి నాకు బాగా ఎరుకే. ఆ నిబంధనలలో ఒక భాగం ఆర్థిక శాఖ నిర్మాణానికి సంబంధించినదేనని నేనంటే గౌరవనీయ ఆర్థిక మంత్రి అంగీకరిస్తారని నేను అనుకుంటున్నాను. ఆర్థిక శాఖ అనేది ఒక బదలా శాఖగా ఉండకూడదనేది పాత భారత ప్రభుత్వ చట్టం క్రింద గుర్తించ బడిన ప్రధాన సూత్రాలలో ఒకటి. ఆర్థిక శాఖను బదలా శాఖగా పరిగణించ కూడదనడానికి చూపిన కారణం కూడా చాలా బలమైందే. సదా అప్రమత్తంగా పహారాకాసే శాఖగా ఆర్థిక శాఖను నిర్దేశించారు. ఏ శాఖకు బాధ్యత వహించే ఏ మంత్రయినా సరే ఆయన ప్రతిపాదించే మొత్తం వ్యయాన్ని క్షుణ్ణంగా పరిశీలించడం కోసం ఆర్థిక శాఖను నిర్దేశించారు. ఏదైనా ఒక ప్రయోజనం కోసం అడిగిన మొత్తం నిజంగా అవసరమేనా, అయితే, రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని బట్టి దానిని మంజూరు చేయవచ్చా అని పరిశీలించడంతో పాటుగా అడిగిన గ్రాంటు సక్రమమైన పద్దు కింద చేర్చబడిందా లేదా అన్న విషయాన్ని పరిశీలించడం కూడా ఆర్థిక శాఖ ప్రధాన విధులలో ఒకటిగా నిర్దేశించబడింది.

1919 భారత ప్రభుత్వ చట్టం ఇప్పుడు అమలులో లేకపోయినా, ఆ చట్టం కింద రూపొందించిన సంక్రమణ నిబంధనలు చట్టంగా బహుశా ఇప్పుడు ఉండకపోయినా, ఆ నిబంధనల్లోని సూత్రాలు శాశ్వతమైనవేనని, అన్ని కాలాలకు వర్తించేవేనని నేను గాఢంగా నమ్ముతున్నాను. కార్య

నిర్వాహక వర్గంపై ఉన్న నియంత్రణా యంత్రాంగంలో ఒక ప్రధాన భాగంగా ఆర్థిక శాఖను శాసన సభ సృష్టించినప్పటి నుంచి, తాను ప్రతిపాదింప తలపెట్టిన డిమాండ్‌లో ఫలానా సేవలకు, ఫలానా అంశాలకు ఇంత అని ప్రత్యేకించి చెప్పకుండా ఒక ఏక మొత్తాన్ని ఏ మంత్రి శాసన సభ ముందు డిమాండుగా పెట్టగూడదన్నది ఆనవాయితీగా అంగీకరించబడుతోంది. ఇందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి –

నిధులు వెచ్చింప తలపెట్టిన అంశాల వివరాలు సభకు తెలియాలి. రెండో కారణం –

సభ మంజూరు చేసిన నిధులు ఏ విధంగా ఖర్చయ్యాయో తెలుసుకుని తీరాల్సిన అవసరం ఆడిట్ మరియు అక్కౌంట్స్ శాఖకు ఉంది. అందువల్ల అధ్యక్షా, తాము ఏవో కొన్ని అంశాలపై ఖర్చు చేయదల్చుకున్నామని అందుకు 31 లక్షల రూపాయిలు కావాలని అంటూ ఈ ప్రభుత్వం సభ ముందుకు రావడం ఎంత మాత్రం క్షమించరాని విషయమని నేను అంటున్నాను.

అసలు అవి అవసరమో కాదో సభ నిర్ణయించనే లేదు. వాటికి సంబంధించిన వివరాల గురించి ప్రభుత్వం కూడా ఇప్పటి వరకు ఒక ఆలోచనకు రాలేదు. అటువంటి వాటికోసం 31 లక్షల రూపాయలు కావాలని ఈ ప్రభుత్వం కోరడం దుస్సాహసమేనని నేను అంటున్నాను.

ఇక బడ్జెట్ విషయానికి వచ్చినట్లయితే, బడ్జెట్‌లోని వివిధ అంశాల వివరాలలోకి నేను వెళ్ళదలచుకోలేదు. ఎంచేతంటే, అది ఎక్కువ సమయం తీసుకుంటుంది. అంతే కాకుండా, వ్యయాలకు సంబంధించిన వివరాలలోకి వెళ్ళేందుకు తగిన సందర్భం కాదని నేను భావిస్తున్నాను. బడ్జెట్‌లోని ప్రధాన అంశాలకు, మనం ఎదుర్కొంటున్న పెద్ద సమస్యలకు, వాటి పరిష్కారానికి ఆర్థిక మంత్రి అనుసరించిన పద్ధతులు, మార్గాలకు మాత్రమే నేను పరిమిత మవదలచుకున్నాను. ముందుగా గమనించాల్సిన విషయమేమంటే, ప్రస్తుతమున్న పాలనా యంత్రాంగపు చట్రానికి ఈ బడ్జెట్‌లో కొత్తగా చేర్చిన అంశాల మొత్తం విలువ 1,16,67,000 రూపాయిలు. ఇది నిజంగా మన కార్యకలాపాల విస్తరణను సూచిస్తోందా అన్నదే ప్రశ్న.

అధ్యక్షా, ఇప్పుడు ఇందులోంచి మనం కొంత మొత్తాన్ని మినహాయించాల్సి ఉంటుంది. అనావృత వ్యయంగా మంత్రి అంగీకరించిన 48,11,000 రూపాయిలను మనం మినహాయించాల్సి ఉంటుంది. అది నిత్యం అవసరమయ్యే తాత్కాలిక అంశాలకు ఉద్దేశించిన వ్యయం. ప్రభుత్వం విధిగా చక్కదిద్దవల్సిన సామాజిక సేవలలోని లోపాలను సరిదిద్దేందుకు శాశ్వతంగా ఉద్దేశించబడిన వ్యయం కాదది. అందువల్ల అదనంగా ఉద్దేశించిన అంశాలకయ్యే మొత్తం వ్యయం 1,16,00,000 రూపాయిల లోంచి 47 లక్షల రూపాయిలు మినహాయించగా వచ్చే 68,56,000 రూపాయిలు మాత్రమే. అంటే సరిగ్గా అంచనా వేస్తే, ఈ రాష్ట్రంలో సామాజిక సేవల నిమిత్తం ప్రభుత్వం శాశ్వత ప్రాతిపదికన

చేర్చదల్చిన వ్యయం మొత్తం ప్రభుత్వం చెప్పుకున్నట్లుగా 1,16,00,000 రూపాయిలు కాదని, అది 68,56,000 రూపాయిలు మాత్రమేనని నేను అంటున్నాను. నా లెక్క ప్రకారం అందులోంచి కూడా మరో మొత్తాన్ని మనం మినహాయించాల్సి ఉంటుంది. మద్య నిషేధం కారణంగా 31,45,000 రూపాయిలను మనం మినహాయించాల్సి ఉంటుంది. ఇది కేవలం ప్రతికూల అంశమేకాని, రాష్ట్ర అవసరాలకు ఉపయోగపడే సానుకూల అంశం కాదు. అందువల్ల, శాశ్వత వ్యయానికున్న వాస్తవ బడ్జెట్ చివరకు 37,11,000 రూపాయిలకు మించి లేదని గ్రహించవచ్చు. ఈ 37,11,000 రూపాయిలను ప్రభుత్వం ఏ విధంగా పంపకం చేసిందో ఈ సభా సభ్యులలో పెక్కుమందికి తెలుసు. విద్య ఒక ముఖ్యమైన అంశం. దీనికి 29 లక్షలు. ఇది ఆవృత వ్యయం. చిన్న నీటి పారుదలకు 3,50,000 రూపాయిలు. ఇది కూడా ఆవృత వ్యయమే. ఇక మిగిలినదంతా అనావృత వ్యయమే. గ్రామపంచాయితీలు, గ్రామ బంజరులు, మంచి నీటి సరఫరా, వైద్య సదుపాయం, క్వినైన్, ఆయుర్వేద విద్యా బోధన మొదలైనవి ఇతర వ్యయాంశాలు. ఇవన్నీ అనావృత వ్యయాంశాలే. అంటే ఇవి కేవలం ఈ సంవత్సరానికి తాత్కాలికంగా ఉద్దేశించబడినవే. అధ్యక్షా, నేను చెప్పిన రీతిలో బడ్జెట్‌ను పరిశీలించినట్లయితే, అలా పరిశీలించక తప్పదనుకోండి, కేవలం 37,11,000 రూపాయిల అల్ప మొత్తానికి మించని డిమాండ్లతో ఈ సభ ముందు కొచ్చిన ఈ ప్రభుత్వాన్ని అభినందించాలా? అన్న ప్రశ్నను అడగక తప్పదు. అధ్యక్షా, ఈ రాష్ట్రపు అవసరాల దృష్ట్యా, అనారోగ్య పరిస్థితుల దృష్ట్యా, మలేరియా, గనేరియా, సిఫిలిస్ వంటి ఇతర వ్యాధులు ఈ రాష్ట్రంలో ప్రబలంగా ఉన్న దృష్ట్యా, కేవలం 37,11,000 రూపాయిలకు మించనటువంటి అత్యల్ప బడ్జెట్‌తో ఈ ప్రభుత్వం సభ ముందుకు రావడం చూస్తుంటే ఈ ప్రభుత్వానికి ఏ మాత్రమైనా బాధ్యత ఉందా, అసలు బాధ్యత ఉన్నట్లు ఈ ప్రభుత్వం భావిస్తోందా లేదా అని అడిగేందుకు నేనే మాత్రం వెనుకాడటం లేదు. నా గౌరవనీయ మిత్రుడు.మంత్రి నవ్వుతుండటం నేను గమనించాను. ఆయన నవ్వడం మినహా మరింకేం చేయగలరు? నవ్వడం తప్ప మరింకేం చేయలేరు (నవ్వు) (ఆయన ఏడ్వాలా? – ఒక గౌరవనీయ సభ్యుడు) ఆయన రోదించాలనే నేను కోరుకుంటున్నాను. ఆయన రోదిస్తే చూడాలని నేను కోరుకుంటున్నాను. ఎందుకంటే, అలా రోదిస్తేనైనా కొంత సానుభూతి లభిస్తుంది. నవ్వడం వల్ల మనకేం ప్రయోజనం ఉండదు.

అధ్యక్షా, ఈ సమస్యకు సంబంధించిన మరొక అంశాన్ని నేనిప్పుడు ప్రస్తావిస్తున్నాను. అదేమంటే, ఈ బడ్జెట్‌లో ప్రభుత్వం ప్రతిపాదించిన వ్యయం శాశ్వతమయ్యే అవకాశం ఏమైనా ఉందా? విద్యపై ప్రభుత్వం ఖర్చు చేయతలపెట్టిన 29 లక్షల రూపాయిలు వచ్చే సంవత్సరం, ఆ మరు సంవత్సరం కూడా లభించే అవకాశమేదైనా ఉందా? చిన్నతరహా నీటి పారుదల పనులకు, అనేక ఇతర అంశాలకు ప్రభుత్వం వెచ్చింప తలపెట్టిన ధనం వచ్చే సంవత్సరం, ఆ మరు సంవత్సరం కూడా

లభించగలదని మనం ఆశించేందుకు అవకాశం ఉందా? ఈ అంశాలన్నీ శాశ్వతమైనవేనని మనం దీనిని బట్టి నమ్మవచ్చా? అధ్యక్షా, దీనికి సానుకూలమైన జవాబుంటుందని నేను అనుకోలేక పోతున్నాను. మనం కనుక నిజంగా ఒక ప్రశ్న వేసుకున్నట్లయితే దీనికి సంబంధించి మనకందరికీ స్పష్టమైన జవాబు దొరుకుతుంది. అదేమంటే, ఈ వ్యయానికి కావలసిన నిధులను ప్రభుత్వం ఎలా సమకూర్చుకుంటుంది? నిధులు సమకూర్చుకోవడం కోసం ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతులేమిటి?

ఆర్థిక మంత్రి తన బడ్జెట్‌ను రూపొందించడంలో మొట్టమొదటగా, ప్రస్తుత సంవత్సరపు బడ్జెట్‌లోని 10,50,000 రూపాయిల మిగులుపై ఆధారపడ్డారు. ఆ తరువాత ఈ సంవంత్సరపు బడ్జెట్ మిగులును 63 లక్షల రూపాయిల వరకూ చూపించారు. ఇక మూడవ చర్యగా ప్రస్తుతం విధించిన కొత్త పన్నుల నుంచి 8 లక్షల రూపాయిల ఆదాయం వస్తుందని ఆయన ఆశిస్తున్నారు. దీనినే ఆయన అదనపు రాబడి అని పిలుస్తున్నారు. బడ్జెట్‌లో తాను రూపొం దించిన కొత్త అంశాలకు నిధులను సమకూర్చుకునేందుకు నా గౌరవనీయ మిత్రుడు ఆధారపడిన వనరులు ఇవే. కాని, అధ్యక్షా, నేనొక ప్రశ్న అడగదలచుకున్నాను. అదేమంటే, నా గౌరవనీయ మిత్రుడు ఆర్థిక మంత్రి రూపకల్పన చేసిన ఈ పద్ధతులు, మార్గాలు, వనరులు శాశ్వతమైనవేనా, నిరంతరమూ కొనసాగేవేనా? రాబడి కోసం సంవత్సరం సంవత్సరం వాటి మీద ఆధారపడవచ్చా, ఇప్పుడు మనం వాటికి సంబంధించిన అంకెలను – అన్నిటికంటే ముందు ప్రస్తుత సంవత్సరపు ఆదాయ పెరుగుదలకు సంబంధించిన అంకెలను చూద్దాం. ప్రస్తుత సంవత్సర ఆదాయంలో ఆయనకు 10,50,000 రూపాయిల పెరుగుదల కనిపించింది. దీనికి ప్రధాన కారణం అదృష్టవశాత్తు ఎక్సైజ్, స్టాంపులు అనే రెండు వనరుల ద్వారా ఆయన అదనపు ఆదాయాన్ని పొందగలిగారు. ఆయన ఇచ్చిన లెక్కల ప్రకారమే, ఈ రెండు ఆదాయ మార్గాలు ఆయనకు 21,52,000 రూపాయిలు సమకూర్చి పెట్టాయి. మరో 27 లక్షల రూపాయిల ఆదాయాన్ని భారత ప్రభుత్వం ఆదాయపు పన్ను వాటాగా అందించింది. ఇకపోతే, ఎక్సైజ్ రాబడి అనేది ఆయన సిద్ధాంతం ప్రకారం అంటరానిది, దోషపూరితమైంది. ఆ మాటకొస్తే, ఆయన మొత్తం బడ్జెట్టే దోషపూరితమైందని చెప్పాలి. ఎందుకంటే, అది పూర్తిగా ఆ అంటరాని ధనంపైనే ఆధారపడివుంది. మన ముందున్నది వర్తమానమే కనుక గతం గురించి పోట్లాడటం మానేద్దాం. ఇప్పుడు ఎక్సైజ్ రాబడి అనేది ఆయనకు ఇక రాదు. మరింతగా వసూలు చేసుకోక పోగా, ఆయన ఉన్నది కూడా వదులు కుంటున్నారు. స్టాంపులు ఆయనకు ఎక్కువ రాబడిని అందిస్తాయని నేను అనుకోవడం లేదు. ఆయన స్టాంపుల నుంచి ఎక్కువ ఆశించడమూలేదు. అందువల్ల, ఆయనకు మిగులు వాపును చూపించిన ఈ రెండు అంశాలను రానున్న సంవత్సరాలకు సంబంధించిన లెక్కల లోంచి మినహాయించుకోవచ్చు. ఆదాయపు పన్ను వస్తే రావచ్చు లేదా రాకపోవచ్చు. అది కూడా తిరిగి అనిశ్చితమైన అంశమే. అందువల్ల భవిష్యత్తుకు సంబంధించినంత

వరకూ, బడ్జెట్‌లో నూతన వ్యయాంశాలకు ఆయన వాస్తవ ఆదాయ రూపంలో చూపింది కేవలం అల్పమైన 8 లక్షల రూపాయలే తప్ప మరింకేం చూపలేదని మనం గ్రహించవచ్చు. ఆ 8 లక్షలు రూపాయిలను కూడా ప్రస్తుతం రాష్ట్రంలో అమలులో ఉన్న పొగాకు పన్ను వ్యవస్థను సవరించడం ద్వారా పొందాలని ఆయన ప్రతిపాదించారు. అంటే, మొత్తంగా చూపిన ఈ 37 లక్షల రూపాయిల అదనపు వ్యయానికి మనం ఆధారపడగలిగేది ఈ 8 లక్షల రూపాయిల ఆదాయమేనన్నమాట. అందువల్ల, 37 లక్షల రూపాయిల బడ్జెట్ పేరుతో మనకు ప్రదర్శించబడిన ఈ ప్రహసనం కూడా వచ్చే సంవత్సరం ఉండక పోవచ్చు అని నేను చెప్పదలచుకున్నాను. అలా చెప్పడం సరైందేనని నేను భావిస్తున్నాను.

అధ్యక్షా, ఇప్పుడు మనం ఈ బడ్జెట్‌ను మరొక దృక్కోణం నుంచి పరిశీలిద్దాం. కాంగ్రెస్ ప్రభుత్వం తన భుజస్కంధాలపైకి ఎత్తుకోదలచిన బరువు, బాధ్యతలు ఏమిటి? అని నేను ప్రశ్నిస్తున్నాను. మొత్తంగా మన బాధ్యతలు ఏమిటో మనం తెలుసుకుందాం. రేపో, మాపో వీటిని నెరవేర్చగలమా లేక వీటిని నెరవేర్చేందుకు చాలా కాలం పడుతుందా అన్నది అతి చిన్న విషయం. అసలు అది వేరే సమస్య. ఈ రాష్ట్రప్రజల సంక్షేమం దృష్ట్యా మనం చేపట్టదలుస్తున్న కార్యక్రమాలేమిటి అన్న విషయాన్ని నికరంగా మనమందరము – అంటే సభలో అటువైపు కూర్చున్న అధికార పక్ష సభ్యులు, ఇటు వైపు కూర్చున్న ప్రతిపక్షసభ్యులు తెలుసుకోవాలి. ఇది అత్యావశ్యకమైన అతి ముఖ్యమైన విషయమని వాస్తవానికి ఇది మౌలికమైన విషయమని కూడా నేను భావిస్తున్నాను. అందువల్ల బాధ్యతలను ఏ విధంగా, ఎప్పటిలోగా నెరవేర్చగలం అన్న విషయంతో పాటుగా బాధ్యతలకు సంబంధించి అసలు పరిస్థితి ఏమిటి అన్న విషయాన్ని సమీక్షించడం అవసరం. రాష్ట్రంలో ఈనాటి వరకూ ఉన్న పరిస్థితులను, ఉన్నవి వున్నట్లుగా సంప్రదాయక పద్ధతిలోనే తీసుకుని పరిశీలిస్తే, విద్య, ప్రజారోగ్యం, వైద్య సదుపాయం, కొంత మేరకు మంచి నీటి సరఫరా వంటి రంగాలకు సంబంధించిన కార్యక్రమాలను ప్రభుత్వాలు చేపడుతూ వచ్చాయి. ఈ రంగాలకు సంబంధించి ప్రభుత్వాలు తమ విధులను, బాధ్యతలను ఎన్నడూ నెరవేర్చక పోయినప్పటికీ, ఈ రంగాలకు సంబంధించిన కార్యక్రమాలను ప్రభుత్వ విధులుగానే గుర్తిస్తూ వచ్చారు. 1937 ఆగస్టు 17న కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినపుడు "ప్రభుత్వ కార్మిక విధానమన్న" పేరిట ఒక ప్రకటనను విడుదల చేసింది. ఈ ప్రకటన గురించి నా గౌరవనీయ మిత్రుడికి గుర్తు చేయదలచాను. ఎందుకంటే, ప్రభుత్వం ఆ పత్రికా ప్రకటనలో ఏమి చెప్పింది అన్న విషయాన్ని ఆయన బొత్తిగా గమనించినట్లులేరు. ఈ రంగాలకు సంబంధించిన కార్యక్రమాలను మాత్రమే ప్రభుత్వం తన విధులుగా భావించడం లేదని ఆ ప్రకటనలో నిర్ద్వంద్వంగా అంగీకరించడం నేను గమనించాను. అత్యవసర సేవలైన విద్య, ప్రజారోగ్యం, వైద్య సదుపాయం, మంచినీటి సరఫరా వంటి విధులతో

పాటుగా, సగటు ప్రమాణాలుగా ప్రస్తుతం అన్ని ఆధునిక దేశాలలోనూ అమలు జరుపబడుతున్న ఇతర విధులను కూడా తప్పనిసరిగా చేపట్టాల్సి ఉందని కాంగ్రెస్ ప్రభుత్వం అంగీకరించింది. నిరుద్యోగ భృతి, అనారోగ్య బీమా, వృద్ధాప్య పించన్లు, ప్రసూతి సదుపాయాలు, అకాల మరణం సంభవించిన వ్యక్తిపై ఆధారపడిన వారికి సదుపాయాలు కల్పించడం మున్నగు వాటిని ఆ ఇతర విధులుగా నేను భావిస్తున్నాను. అధికార పగ్గాలను చేపట్టానని చెప్పుకుంటున్న ఈ ప్రభుత్వం ఈ విధులను తన కర్తవ్యాల్లో భాగంగా భావించాలి. ఈ బాధ్యతలను నెరవేర్చాలని ప్రభుత్వం నిర్ణయించుకున్నట్లయితే ప్రభుత్వంపై పడే మొత్తం భారమెంత? అన్నదే ప్రశ్న. నేనింతకుమునుపు చెప్పినట్లుగా ఈ విధులను రేపో, మాపో నెరవేర్చగలిగే స్థితిలో ఉన్నామా లేదా అన్నది ముఖ్యం కాదు. మన విధులు ఏమిటి? వాటిని నెరవేర్చడంలో అంతిమంగా మనపై పడే భార మెంత అన్న విషయాన్ని మనం తెలుసుకుని తీరాలి. అది అవసరం కూడా. అధ్యక్షా, ఈ అంశాలన్నిటినీ పరిగణనలో ఉంచుకుని ఈ విధులన్నిటినీ సంపూర్ణంగా నెరవేర్చేందుకు మనం పూనుకున్నట్లయితే ఈ రాష్ట్రపు ఆదాయంపై బడే ఖచ్చితమైన భారమెంతో, నా గౌరవనీయ మిత్రుడు తననై పుణ్యంతో, ఈ చర్చ ముగింపు సందర్భంలోనైనా, ఒక అంచనాను ఇవ్వాలని నేను కోరుకుంటున్నాను. ఈ అంచనాకు సంబంధించి నాకు సాధ్యమైనంత మేరకు ఒక లెక్క వేశాను. నా లెక్కలు నిక్కచ్చిగా ఉండక పోవచ్చు. నా వద్ద ఎటువంటి సమాచా రమూ లేదు. ఎటువంటి వివరాలు లేవు. నిపుణుల సహాయమూ లేదు. అయినా, ప్రభుత్వ ఆర్థిక బాధ్యతలు ఖచ్చితంగా ఎంత అని తెలుసుకునేందుకు ఒక అంచనా వేసే ప్రయత్నం చేశాను. బేషజాలకు పోకుండా చెప్పుకుంటే, ఈ రాష్ట్రపు బరువు బాధ్యతలు 24 కోట్ల రూపాయిల వరకూ ఉంటాయి. ఈ రాష్ట్ర ప్రభుత్వం దృష్టిలో ఉంచుకోవాల్సిన అంశమిది. ఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా, ఈ ప్రభుత్వమే ఈ రాష్ట్రపాలనను నిరంతరంగా కొనసాగించినా, అది తన బాధ్యతలను గుర్తెరిగి ఉన్నంత కాలం నాకెటువంటి అభ్యంతరమూ ఉండబోదు. అయితే ఈ 24 కోట్ల రూపాయిల మొత్తాన్ని ఎలా సేకరిస్తామన్నదే ప్రశ్న. అధ్యక్షా ఇంతమొత్తాన్ని సేకరించే సామర్థ్యం ఈ ప్రభుత్వానికుందా? ఆ మాటకొస్తే ఏ ప్రభుత్వమైనా సరే ఈ మొత్తాన్ని సేకరించగలదా? అని నేను అడుగుతున్నాను. ప్రపంచంలోని ఇతర దేశాల ఆదాయాలకు సంబంధించిన కొన్ని లెక్కలను మనమిప్పుడు చూద్దాం. మన రాష్ట్రంలో ఉన్న పరిస్థితిని ప్రపంచంలోని ఇతర దేశాల పరిస్థితితో పోల్చి చూద్దాం. కొన్ని దేశాలలోని తలసరి ఆదాయాలకు సంబంధించిన కొన్ని లెక్కలను నేను సేకరించాను. అవి ఇలా ఉన్నాయి–

| | £ | | $. | | d |
|---|---|---|---|---|---|
| కెనడా | 9 | – | 8 | – | 0 |
| దక్షిణ ఆస్ట్రేలియా | 19 | – | 0 | – | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| న్యూ సౌత్ వేల్స్ | 13 | - | 0 | - | 0 |
| న్యూజిలాండ్ | 22 | - | 0 | - | 0 |
| యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా | 4 | - | 0 | - | 0 |
| (రాష్ట్ర ప్రభుత్వాలు వసూలు చేసే ఆదాయాలను ఇందులో చేర్చలేదు.) | | | | | |
| ఆస్ట్రేలియా | 12 | - | 0 | - | 0 |
| ఐరిష్ ఈరీ స్టేట్ | 10 | - | 0 | - | 0 |
| బొంబాయి | 0 | - | 0 | - | 7 |

అధ్యక్షా, ఇది అత్యంత అధైర్యాన్ని కలిగించే విషయమని నేనంటున్నాను. ఈ రాష్ట్ర ప్రజల సంక్షేమ బాధ్యతను చేపట్టదల్చిన ఏ ఆర్థిక మంత్రినైనా ఈ అంకెలు, ఈ పోలిక నిలువెల్లా వణికించి తీరుతాయి.

ఈ రాష్ట్ర ఆర్థిక పరిస్థితికి సంబంధించి ఇక మనం గమనించాల్సిన మరొక అంశమేమంటే మన ఆదాయాలన్నీ ఇక ఎంత మాత్రం పెరగలేని దశకు చేరుకున్నాయి. మన ఆర్థిక మంత్రి స్వయంగా చెప్పిన విషయాన్నే నేను ఉటంకిస్తున్నాను. 1922-35 మధ్యకాలంలో భారత దేశపు వివిధ రాష్ట్రాల ఆదాయాల పెరుగుదలను పోల్చి చెపుతూ ఆయన మనకు చాలా ఉపయోగకరమైన అంకెలు అందించారు. ఆ పెరుగుదలలు ఇలా ఉన్నాయి :-

| | శాతం |
|---|---|
| మద్రాసు | 26.7 |
| పంజాబ్ | 28.6 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 16.7 |
| అస్సాం | 14.7 |
| బెంగాల్ | 11.9 |
| బొంబాయి | 3.0 |

ఈ మూడు శాతం పెరుగుదల నుంచి కూడా మనం మరికొంత శాతాన్ని మినహాయించాల్సి ఉంటుంది. 1922 నుంచి విధించిన అదనపు పన్నులనన్నిటినీ పరిగణనలోకి తీసుకుని లెక్కిస్తేనే ఈ పెరుగుదల వచ్చింది. 1922 నుంచి 1935 వరకూ విధించిన అదనపు పన్నులను తీసివేస్తే బొంబాయి రాష్ట్ర ఆదాయం ఐదున్నర శాతం తగ్గిపోతుంది. అందువల్ల మన ఆదాయాలు ఏ మాత్రం పెరగడం లేదని, అవి నిశ్చల దశకు చేరుకున్నాయనే విషయాన్ని మనం గమనించాలి. దీనికి

తోడుగా ఇప్పుడు మరో రెండు అంశాలను కూడా చేర్చుకోవాల్సి ఉంటుంది. మొదటిది, ఈ ప్రభుత్వం అమలు చేస్తున్న మద్యనిషేధం వల్ల పరిస్థితి మరింతగా దిగజారుతుంది. రెండవది, భూమిశిస్తు తగ్గిస్తూ ఈ ప్రభుత్వం విధాన ప్రకటన చేసింది. ఈ అంశాన్ని కూడా మనం దృష్టిలో ఉంచుకోవాలి. ఈ రెండు ఆదాయాంశాలు కలిసి దాదాపుగా 7 కోట్ల రూపాయిల వరకూ ఉంటాయన్నది వాస్తవం. ప్రభుత్వవిధానాన్ని బట్టి ఇక ఇప్పుడు 7 కోట్ల రూపాయిల ఆదాయాన్ని అంతర్థానమవుతున్న ఆదాయంగానే పరిగణించాలి. అందువల్ల మనం చేపట్టదలచిన శాశ్వత కార్యక్రమాలకు శాశ్వత ప్రాతిపదికన లెక్కలోకి తీసుకోగలిగిన ఆదాయం కేవలం 5 కోట్ల రూపాయిలు మాత్రమే. ఈ ఐదు కోట్ల రూపాయిలతోనే నేను ఇంతకు మునుపు చెప్పిన 24 కోట్ల రూపాయిల బాధ్యతలను నిర్వర్తించాల్సి ఉంటుంది.

అధ్యక్షా, ఈ రాష్ట్రపు ఆదాయ వనరులను మెరుగు పరుచుకునేందుకు ఉన్న మార్గాలేమిటి? అన్నదే ఇప్పుడు మన ముందున్న ప్రశ్న. నా గౌరవనీయ మిత్రుడు చేసిన బడ్జెట్ ప్రసంగాన్ని, బడ్జెట్ పత్రాన్ని చూస్తుంటే ఇది అత్యంత తిరోగమన బడ్జెట్ అని చెప్పవల్సి వస్తున్నందుకు నేను చాలా చింతిస్తున్నాను. కాని అలా చెప్పక తప్పడంలేదు. ప్రభుత్వం తన వాగ్దానాన్ని తానే నిలబెట్టుకోలేక పోయిందని తెలియ చెబుతున్న బడ్జెట్ ఇది. అధ్యక్షా, గౌరవనీయ ఆర్థిక మంత్రి చేసిన గత బడ్జెట్ ప్రసంగం సాహసోపేతమైనదిగాను, అతివాద భావాలతో కూడినదిగాను – పొగడాల్సిన సందర్భంలో పొగిడి తీరక తప్పదు మరి – ఉంది. ఆ ప్రసంగం సభలో అటువైపు కూర్చున్న అధికార పక్ష సభ్యుల హృదయాలను ఆనంద భరితం చేసింది. గత బడ్జెట్ సభలో ఆయన చేసిన ప్రసంగాన్ని నిన్నటి రోజు ఆయన చేసిన ప్రసంగాన్ని నేను పోల్చి చూశాను. ఆ రెండిటి మధ్య బాధాకరమైన వ్యత్యాసముండటం నేను గమనించాను.

అధ్యక్షా, మనమందరమూ ఎదుర్కొంటున్న అత్యంత క్లిష్టమూ, ముఖ్యమూ అయిన సమస్య గురించి, అంటే నిధులు సమకూర్చుకోవడం అన్న సమస్య గురించి తాను జాగరూకతతోనే ఉన్నానన్న అభిప్రాయాన్ని నా గౌరవనీయ మిత్రుడు గత సంవత్సరం నాకు కలిగించారు. నిధుల సమస్య మనకున్న అత్యంత తీవ్రమైన సమస్య అన్న వాస్తవం ఆయనకు బాగా తెలుసు. అంతేకాకుండా ఈ రాష్ట్రపు ప్రయోజనాల నిమిత్తం అధిక వనరులు లభించే విధంగా ఈ సమస్యను పరిష్కరిస్తానని కూడా ఆయన హామీ ఇచ్చారు. భారం మోయగలిగే వారికి పన్నులు వేసి, మోయలేని వారిని వదలివేసి వనరులను సమీకరించే విషయం పరిశీలించి భారం అందరికీ సమంగా పంపకమయ్యేలా చేస్తానని కూడా ఆయన హామీ ఇచ్చారు. గత సంవత్సరం ఆయన చేసిన ప్రసంగంలోని కొన్ని భాగాలను నేనిప్పుడు చదవబోతున్నాను. విద్యావంతుడైన నా మిత్రుడు 14వ పేరాలో ఇలా అన్నారు –

*ఒక గౌరవ సభ్యుడు :* "గౌరవనీయ మిత్రుడు".

*డా. బి.ఆర్. అంబేద్కర్ :* హైకోర్టులో మిత్రులను విద్యావంతులు అని పిలవడం అలవాటు. ఆ అలవాటు ప్రకారమే అలా అన్నాను. నా గౌరవనీయ మిత్రుడు ఇలా అన్నారు.

"చివరగా, మనకు అత్యవసరమైన అదనపు వనరులకు ఒక సాధనంగా కొత్తపన్నుల విషయానికొద్దాం. ఈ విషయంలో ప్రస్తుతం అమలులో ఉన్న పన్నులలో అవసరమైన మార్పు చేయడమే మన ప్రథమ లక్ష్యం. ముందుగా భూమిశిస్తు విషయాన్ని పరిశీలిద్దాం. ప్రస్తుతం మన వ్యవసాయ భూమి లాభసాటి కాని కమతాలుగా విభజింపబడి ఉంది. అటువంటి లాభసాటి కాని కమతాలపై పన్ను లేకుండా చేయడం మన అంతిమ లక్ష్యం. అయితే, పెద్ద మొత్తపు వ్యవసాయాదాలపై శ్రేణులు వారీగా పన్ను విధించే పద్ధతిని ప్రవేశ పెట్టడం అవసరమని మేం భావిస్తున్నాం. వాస్తవ సాగుదారులను క్రమంగా బేదాఖలు చేసే పద్ధతి వల్ల భూములలో గణనీయమైన భాగం వ్యవసాయం చేయనివారి, కౌలు తీసుకునేవారి, పరోక్ష భూస్వాముల చేతుల్లోకి వెళ్ళి పోయింది. పన్ను మినహాయింపు లేదా పన్ను తగ్గింపు విషయంలో వాస్తవ సాగుదారుల ఆదాయాలను పరిగణించిన పద్ధతిలోనే వీరి ఆదాయాలను – కూడా అవి అల్పమైనా లేదా అధికమైనా – పరిగణించాలా? ఇక అన్యాక్రాంత భూముల నుంచి పెద్ద మొత్తంలో ఆదాయాలు వస్తున్నాయి. ఈ ఆదాయాలు ఈ రాష్ట్రాన్ని సాలీనా దాదాపుగా 70 లక్షల రూపాయిల నష్టానికి గురి చేస్తున్నాయి. మన ధనిక భూస్వాములపై మనం పన్ను విధించాలని నిర్ణయించుకున్నప్పుడు ఈ ఆదాయాలను ఏ విధంగా పరిగణించాలి? ఇటువంటి సమస్యలపై ప్రభుత్వం నిర్దిష్ట విధానాలను రూపొందించడంలో సభలోని అన్ని పక్షాలకు చెందిన గౌరవనీయ సభ్యులు వ్యక్తంచేసే అభిప్రాయాలు ఎంతో ఉపయుక్తంగా ఉంటాయి. భూములు ఆదాయాలపై హెచ్చు పన్ను విధించే విధానాన్ని అమలు చేయడం ద్వారా లభించే ఆదాయాలను వాస్తవ సాగుదారులు భూమిశిస్తును సులభంగా భరించగలిగే విధంగాను, వారి జీవితాలను మెరుగుపరిచేందుకు వినియోగించాలని మేం భావిస్తున్నాం. అధికంగా ఉండే వ్యవసాయా దాయాలపై శ్రేణుల వారీగా పన్ను విధించే పద్ధతి వల్ల కలిగే ఫలితానికి సంబంధించిన పరిశీలనలు ఇప్పటికీ జరుగుతున్నాయి. ఇదే విధంగా, ప్రస్తుతం మనకి ఆదాయాలను తెచ్చిపెడుతున్న ఇతర పన్నులను, వాటి భారం, ప్రజాప్రయోజనాలపై వాటి ప్రభావం అనే రెండు అంశాల దృష్ట్యా జాగ్రత్తగా పునఃపరిశీలించి, తిరిగి సవరించాల్సిన అవసరం ఉంది. ఈ పనిని వీలైనంత త్వరగా పూర్తి చేయాలనుకుంటున్నాం. తదుపరి బడ్జెట్‌ను సభలో ప్రవేశపెట్టే సమయానికి ఈ విషయానికి సంబంధించిన నిర్దిష్ట నిర్ణయాలను సభ ముందుంచగలమని ప్రభుత్వం ఆశిస్తుంది.

" ఈ రోజు సాయంత్రం నేను చెప్పిన విషయం సామాజిక ప్రయోజన పథకాల కోసం కొత్త

పన్నులు విధించేందుకు ప్రభుత్వం సిద్ధంగా లేదనే నమ్మకం కలిగించే విధంగా లేదని నేను భావిస్తున్నాను. అటువంటి అభిప్రాయం సత్యదూరమని నేను చెప్పదలచుకున్నాను. ఈ రాష్ట్రంలో పన్నుల భారం అత్యధికమే అయినప్పటికీ, ఈ పన్నుల భారాన్ని అత్యధికంగా మోస్తోంది ఈ రాష్ట్రంలోని పేద ప్రజలేనన్న విషయం మనకందరికీ స్పష్టంగా తెలుసు. భూమిశిస్తు, స్టాంపులు, ఎక్సైజ్ పన్ను, కోర్టు ఫీజులు, ప్రజా రవాణా సౌకర్యాలపై పన్ను, దేశవాళీ పొగాకుపై పన్ను – అన్ని పన్నులను ఎక్కువగా చెల్లిస్తోంది పేదవర్గాలవారే. సంపన్నులు చెల్లిస్తోంది ఒక్క ఆదాయపు పన్ను మాత్రమే. ప్రస్తుతం అది రాష్ట్ర ప్రభుత్వానికి అందుబాటులో లేదు. ఈ రాష్ట్రపు పన్నులలో ఎక్కువ భాగం చెల్లించే పేదవారికి, కేంద్ర ప్రభుత్వానికి ఆదాయపు పన్ను చెల్లించే సంపన్నులకు మధ్య తమ రాష్ట్రపు ఆర్థిక బాధ్యతలను మోసి తీరాల్సిన ప్రజలు గణనీయమైన సంఖ్యలో ఉన్నారు. రాష్ట్ర ఆదాయాలకు తగినంతగా వనరులు సమకూర్చని సంపన్న వర్గాల వారు కూడా తమవంతు భారాన్ని మోసేందుకు ముందుకు రావాలి. మనకు అనేక అవరోధాలున్నందువల్ల పన్ను విధింపబడని వారి నుంచి·వసూలు చేయగలిగే పన్నులు విధించడం అంత సులభమైన విషయం కాదు. భవిష్యత్తు నిర్ణయాలను ఊహించి చెప్పగలిగే స్థితిలో నేడు నేను లేకపోయినప్పటికీ, మద్యనిషేధం వల్ల మనకు వచ్చే నష్టాన్ని పూడ్చుకోవడమే కాకుండా, విస్తృతార్థంలో అనేక సామాజిక సేవల రంగాలలో అన్నిటికీ కాక పోయినా మేం చేపట్టాలనుకుంటున్న కొన్ని విస్తరణ కార్యక్రమాలకయినా అవసరమైన నిధులను సమకూర్చగలిగే ప్రతిపాదనలను ఈ సభ ముందుంచేందుకు గల అవకాశాలను మేం అన్వేషిస్తున్నాం అని చెప్పదలచుకున్నాను."

అధ్యక్షా, ఆ తరువాత ఆయన ఈ మాట కూడా చెప్పారు.

"వనరులను పెంపొందించుకునే నిమిత్తం ప్రభుత్వం తన కార్యకలాపాలను విస్తరింప చేసుకోవాల్సిన రంగమింకొకటి ఉంది. ప్రజా వినియోగ సేవలనేకం ఉన్నాయి. ప్రస్తుతం ఇవి మొత్తం సమాజం ఖర్చుతో కొద్ది మంది ప్రయోజనం కోసం వినియోగింపబడుతున్నాయి. ప్రభుత్వం వీటిని జాతీయం చేసి వాటి లాభాలను మొత్తం సమాజానికి వినియోగపడేలా ఎందుకు చేయకూడదో తెలియడం లేదు. ఉదాహరణకు, ప్రభుత్వ రక్షణ కింద ప్రైవేటు సంస్థలు ప్రస్తుతం ప్రజలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నాయి. ఈ పనినే ప్రభుత్వం చేపట్టి ఆ ఆదాయాన్ని ప్రజల జేబుల్లోకి పంపక పోవడానికి గల సమర్థనీయమైన కారణం లేదు. ఈ దిశగా ఇంత వరకూ ఎటువంటి చర్య తీసుకోలేదు. ప్రభుత్వం సులభంగా చేపట్టగలిగే అనేక ఇతర ఆదాయ మార్గాలు అనుపయోగంగా ఉండటమో లేదా కొద్ది మంది ప్రయోజనాల కోసం వినియోగమవడానికి అనుమతించడమో జరుగుతోంది. ప్రభుత్వం తన కార్యకలాపాలను విస్తరింప చేసుకోగలిగిన విశాల రంగం ఉంది. దీనిని వినియోగించుకోవాలి. ప్రజా ప్రయోజనం కోసం వినియోగించ గలిగే ఆదాయ మార్గంగా

ఇటువంటి కార్యకలాపాలను ప్రభుత్వం గట్టి విశ్వాసంతో చేపట్టగలగాలి".

నా గౌరవనీయ మిత్రుడు చేసిన కొత్త బడ్జెట్ ప్రసంగంలో దీనికి సంబంధించిన అంశమేదైనా ఉందా? ఆయన తన మాటలను తానే మర్చిపోయారు. గత బడ్జెట్ ప్రసంగం సందర్భంగా ఆయన చేసిన ఏ ప్రకటన గురించీ ఈసారి కనీస ప్రస్తావన కూడా లేదు. ఆయన తన మాటలను తానే ఎందుకు మర్చిపోయారు? ఆ విధంగా ఆయన పై వత్తిడి తీసుకొచ్చిందెవరు? (గౌరవ సభ్యులు: "వల్లభాయ్!" "షేగాన్!") దాని వెనుక ఎవరో ఒకరు ఉండి ఉంటారు. ఆ వివరాల్లోకి నేను వెళ్ళను. అయితే నేనొక విషయం చెప్పదలచాను. పూర్తి చిత్తశుద్ధితో నేనా విషయం చెప్పదలచాను. కొత్త పన్నులేవీ లేని కారణంగా నా గౌరవనీయ మిత్రుడు అభినందిం పబడ్డారని నేను అనుకుంటున్నాను. కాని, కొత్త పన్నులను విధించనందుకు నేను మాత్రం ప్రభుత్వం పై తీవ్రంగా నిరసన వ్యక్తం చేస్తున్నాను. ఈ బడ్జెట్ సంపన్నుని బడ్జెట్ అని నేను అంటున్నాను. ఇది పేదవాడి బడ్జెట్ కాదు. పేదవాడికి ప్రభుత్వ సహాయం ఎక్కువగా, మరింత ఎక్కువగా కావాలి. ప్రభుత్వ సహాయం లేకుండానే సంపన్నుడు తన అవసరాలను తీర్చుకోగలడు. సంపన్నుడికి పాఠశాల అవసరం లేదు. తన పిల్లవాడిని పాఠశాలకు పంపకుండానే ఒక ఉపాధ్యా యుడిని నియమించుకుని తన పిల్లవాడికి బి.ఎ., ఎం.ఎ., వరకూ చదువు చెప్పించుకోగలడు. సంపన్నుడికి వైద్యశాల అవసరం లేదు. తన భార్యాపిల్లలు రోగపీడితులైతే వైద్యునికి 30 రూపా యిలు చెల్లించి అతనిని రప్పించుకుని పరీక్ష చేయించుకోగలడు. తన సహాయానికి ప్రభుత్వం కావాలని కోరుకునేది పేదవాడే. పన్నులు విధించే ధైర్యం తనకు లేని కారణంగా ఈ సదుపాయాలను తాను కల్పించలేనని ఏ ప్రభుత్వం పేదవర్గాలకు చెప్పజాలదు. చిత్తశుద్ధి ఉన్న ఏ ప్రభుత్వం ఆమాట అనలేదు. అలా చెప్పగలిగే ప్రభుత్వం ఎంత త్వరగా అధికారం లోంచి తప్పుకుంటే ప్రజలందరికీ అంత మంచిది.

*గౌరవనీయ మొరార్జీ ఆర్. దేశాయి :* అది సాధ్యం కాదు.

***డా॥ అంబేద్కర్ :*** నేను మరొక అంశాన్ని కూడా ప్రస్తావించదలచాను. నేను చెపుతున్న అంశంతో ఈ సభాసభ్యులలో ఎంత మంది ఏకీభవిస్తారో నాకు తెలియదు. అయినప్పటికీ నేనా అభిప్రాయాన్ని దృఢంగా చెప్పదల్చుకున్నాను. కేవలం ఐరోపా దేశాలలో సామాజిక సేవలుగా పిలవబడుతున్న అంశాలకు మాత్రమే భారత ప్రభుత్వం తన దృష్టిని పరిమితం చేసుకున్నట్లయితే, అది ఏ రాష్ట్రంలో నైనప్పటికీ, అది ప్రజలకు ఎటువంటి సంక్షేమాన్ని చేకూర్చలేదని నా అభిప్రాయం. దారిద్ర్య సమస్యను పరిష్కరించడమన్నది ప్రభుత్వ ప్రధాన బాధ్యతలలో ఒకటి అని నేనంటున్నాను. ఈ విషయాన్ని నేను నొక్కి మరీ చెపుతున్నాను. ఆధునిక, నాగరిక వ్యక్తులందరికీ ఉండి తీరాల్సిన సదుపాయాలన్నిటినీ అత్యధిక సంఖ్యాక ప్రజలు అనుభవించగలిగేటట్లుగా ఈ రాష్ట్రపు ఆదాయం

తగినంత స్థాయికి పెరిగేటందుకు అవసరమైన పద్ధతులు, మార్గాలు అనుసరించేటట్లు ఈ ప్రభుత్వం చూడాలి. నిరుద్యోగ భృతి, ప్రసూతి సదుపాయాలు, తదితర సేవలు లేదా ప్రభుత్వం అందించే ఉచిత సహాయాలుగా పిలవబడుతూ ఐరోపా దేశాలలో ఇప్పటి వరకూ అమలులో ఉన్న సామాజిక సేవల వ్యవస్థ ఒక అంశాన్ని సూచిస్తోంది. అత్యధిక సంఖ్యాక ప్రజలు ఏ సహాయమూ అవసరం లేనివారుగా, దారిద్ర్యరేఖకు ఎగువన ఉన్నవారిగా ఆ వ్యవస్థ భావిస్తుంది. ఆర్థిక వ్యవస్థలోని అనిశ్చితాల వల్ల లేదా దురదృష్టం వల్ల మాత్రమే అతి కొద్ది మంది దారిద్ర్యరేఖకు దిగువన ఉంటారని, వారికి ప్రభుత్వ సహాయం అవసరం ఉంటుందని ఆ వ్యవస్థ భావిస్తోంది. అందువల్ల, మొత్తంగా ప్రజలను ఆర్థికంగా పైకి తీసుకు రావలనే సాధారణ సమస్యల గురించి ఐరోపా దేశాలు చింతించక పోవడం పూర్తిగా న్యాయ సమ్మతంగాను, సాధ్యంగాను కనిపిస్తోంది. అయితే, ఈ దేశంలో మనం ఎదుర్కొంటున్న సమస్యలు పూర్తిగా భిన్నమైన స్వభావం కలిగినవి. మనది బిచ్చగాళ్ళు, కూలీల దేశమని అనేందుకు నేనే మాత్రం వెనుకాడడం లేదు. అలా అన్నందుకు నాతో పోట్లాడగలిగే సభ్యులు ఈ సభలో ఉన్నారని కూడా నేను అనుకోవడం లేదు. ఈ జన బాహుళ్యాన్ని ఇలా కాక మరోలా ఎవరు వర్ణించగలరు. అందువల్ల, ఏ ప్రభుత్వం కూడా అత్యంత తీవ్రమైన ఈ సమస్యను పట్టించుకోకుండా మౌనంగా ఉండజాలదు.

అధ్యక్షా, ఈ సమస్య గురించి ప్రభుత్వానికి తెలుసునని, దేశపు జాతీయాదాయం, సగటు ఆదాయం పెరిగేటట్లు చూడాలనే మహోన్నత లక్ష్యం గురించి ఈ ప్రభుత్వానికి ఒక అవగాహన ఉందని సూచించే అంశమేదైనా మన ముందున్న బడ్జెట్ ప్రతిపాదనలలో ఉందా? నా కటువంటి సూచనేమీ కనిపించడం లేదు. భూమిశిస్తు భారం అత్యధికంగా ఉండటమే వ్యవసాయదారుల పేదరికానికి ప్రధాన కారణమన్న అభిప్రాయం అందరికీ ఉన్నట్లు కనపడుతోంది. అందువల్ల ప్రజల ఆదాయాన్ని పెంపొందించేందుకు చేయవల్సిందల్లా ఈ భూమి శిస్తు భారాన్ని తగ్గించడమేనన్న అభిప్రాయం కలుగుతోంది. ఇది ఆర్థిక మంత్రి అభిప్రాయం అని అనడానికి నాకెటువంటి సందేహం లేదు. అధ్యక్షా ఇంత కన్నా తప్పుడు అభిప్రాయం మరొకటి ఉండదని అనేందుకు నేను కొంచెం స్వేచ్ఛ తీసుకుంటున్నాను. అంటే దానర్థం భూమిశిస్తు తగ్గింపునకు నేను వ్యతిరేకమని కాదు. భూమిశిస్తు తగ్గింపునకు నేను అనుకూలుడునే. భూమి శిస్తును తగ్గించాలని కూడా నేను గట్టిగా కోరతాను. ఎందుకంటే, భూమిని వినియోగించు కుంటున్నందుకు కేవలం శిస్తును వసూలు చేసుకోవడం మినహా, వ్యవసాయం నుంచి వచ్చే లాభాలను తీసుకునే హక్కు ఈ ప్రభుత్వానికి ఏ మాత్రం లేదనేది నా అభిప్రాయం. అయితే సాధారణ ప్రజల పేదరికాన్ని తొలగించేందుకు చేయవల్సిందల్లా భూమి శిస్తును మినహాయించడం, తగ్గించడమేనన్న సర్వవ్యాపిత భావనను, అదే దిశలో ముందుకెళ్ళాలనుకుంటున్న ప్రభుత్వ ఆలోచనను నేనిప్పుడు పరిశీలిస్తాను.

అధ్యక్షా, ఈ పద్ధతి ద్వారా మనం ఏ మేరకు ప్రజలకు ఊరట కలిగించగలమో ముందుగా పరిశీలించి చూద్దాం.

మనం వసూలు చేస్తున్న మొత్తం భూమిశిస్తు దాదాపుగా మూడున్నర కోట్ల రూపాయిలు. ఈ రాష్ట్రపు మొత్తం జనాభా సుమారు 2 కోట్లు. ఇప్పుడు, ఈ మొత్తం భూమి శిస్తును అంటే మూడున్నర కోట్ల రూపాయిలను ఎంతో ఉదారబుద్ధితో ప్రభుత్వం రద్దు చేసేసిందనుకుందాం. కేవలం అనుకోవడం కోసం అలా అనుకుందాం. ఈ విలువైన మూడున్నర కోట్ల రూపాయిలను రెండు కోట్ల జనాభాకు పంచుదాం. అప్పుడు ఒకో వ్యక్తికి వచ్చే అదనపు ఆదాయం ఒక రూపాయి ఎనిమిది అణాలుగా ఉంటుంది. ప్రస్తుత పరిస్థితిలో అదే అత్యధికం. దానిని నెల ఆదాయంగా మార్చి లెక్కగడితే ఒకో వ్యక్తికి అదనంగా వచ్చే ఆదాయం రెండున్నర అణాలు. మొత్తం భూమి శిస్తును రద్దు చేస్తే వచ్చే ఈ రెండున్నర అణాలతో ఎవరైనా నిజంగా సంతృప్తి పడగలరా? ఇది పేదరికాన్ని మన మధ్యనుంచి తొలగించే విధంగా మన ఆర్థిక సంక్షేమాన్ని పెంపొందించగలదా అని నేను అడగదలచుకున్నాను. అధ్యక్షా, ఈ సమస్యకు కావల్సింది ఇందుకు పూర్తిగా భిన్నమైన పరిష్కార మార్గాలే. వాటి జోలికి నేనిప్పుడు వెళ్ళదలచుకోలేదు. బహుశా నేనిప్పటికే సభను తగినంతగా అలసి పోయేటట్లు చేసి ఉంటాను. అయితే, నేనొక విషయం చెప్పదలచుకున్నాను. ఈ సమస్య గురించి ప్రభుత్వానికి తెలిసినట్లుగా కనిపించడం లేదు. ఈ సమస్య పట్ల ప్రభుత్వానికి ఒక అవగాహన ఉన్నట్లుగా కూడా కనిపించడం లేదు. ఈ సమస్య పరిష్కరించేందుకు కావల్సిన మార్గాలు పద్ధతులు తెలియని ప్రభుత్వం ప్రజలకు ఎటువంటి సహాయం చేయలేదు. అటువంటి ప్రభుత్వం ఈ రాష్ట్రపు ప్రజలకు ఆనందం కలిగించే ప్రభుత్వం కాజాలదని నేను చెప్పదలచుకున్నాను. అందువల్ల, ఇది అత్యంత నిరాశ కలిగించే బడ్జెట్ అని, సంపన్నులకు ఊరట కలిగించి, లక్షలాది మంది కడుపు మాడ్చేందుకు రూపొందించిన బడ్జెట్ అని చెప్పి నేను ముగిస్తున్నాను. (చప్పట్లు).

# 4
# *బడ్జెట్‌పై ప్రసంగం–4

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం):* అధ్యక్షా! ఈ సభకు గౌరవనీయ ఆర్థిక మంత్రి సమర్పించిన మూడో బడ్జెట్ ఇది. ఈ సభకు ఇంతకు మునుపు సమర్పించిన రెండు బడ్జెట్‌లూ ఏమంత సంతృప్తికరంగా లేవని నేనంటే అది అతిశయోక్తి కాదు. ఆ బడ్జెట్‌లు ఆ రకంగా అసంతృప్తికరంగా అనిపించడానికి తగినన్ని కారణాలున్నాయి. గౌరవనీయ ఆర్థిక మంత్రి సమర్పించిన మొదటి బడ్జెట్ నిజానికి ఆయన తయారు చేసినది కాదు. అది అప్పటి ఆపద్ధర్మ మంత్రి వర్గం తయారుచేసింది. అందులో ఏ రకమైన పొరపాట్లున్నా దానికి ఆర్థిక మంత్రిదే బాధ్యత అనడం సమంజసం కాదు. రెండవ బడ్జెట్ హడావుడిగా తయారుచేశామని, విషయాలను మొత్తంగా అవగాహన చేసుకొని తన పథకాలను రూపొందించడానికి ప్రభుత్వానికి తగిన సమయం లేదనీ సాకు ఉండనే ఉంది. కాని ప్రస్తుతం మనకు సమర్పించిన బడ్జెట్‌కు పైన పేర్కొన్న సాకులు గానీ మినహాయింపులుగానీ ఏ మాత్రం అన్వయించవు. బాగా లోతుగా ఆలోచించి పరిశీలనలు చేసిన పిమ్మట ఈ బడ్జెట్‌ను ప్రతిపాదించారని చెప్పితీరాలి. పన్ను విధింపునకు సంబంధించి మంత్రి వర్గానికి ఉన్న ఆలోచనలన్నిటినీ ఇందులో సంపూర్ణంగా పొందుపరిచారు. అందువల్ల ఈ బడ్జెట్‌ను మరింత జాగ్రత్తగా పరిశీలించాల్సిన అవసరముందని నేను భావిస్తున్నాను. ఇది చాలా ఆందోళన కలిగించిన బడ్జెట్ అన్న విషయం అందరికీ తెలుసు. బడ్జెట్ పట్ల ఆశలు పెట్టుకున్న వారు నిరుత్సాహానికి లోనయ్యారు. కాని లక్ష్యం సాధించామనుకున్న వారు దీన్ని ఎంతో విప్లవాత్మకమైన బడ్జెట్‌గా అభివర్ణించారు. ఈ బడ్జెట్‌ను ఆదాయ వ్యయ పక్షాల నుంచి పరిశీలిస్తే ఆదాయం వైపు నుంచి ఇది నిర్లక్ష్య పూరితమైన బడ్జెట్ అనీ, వ్యయం వైపు నుంచి ఇది అర్థం లేని బడ్జెట్ అని నేను అంటున్నాను. బడ్జెట్‌లో ఒక భాగమైన ఫైనాన్స్ బిల్లులోని ప్రతిపాదనల మంచి చెడులను చర్చించడానికి ఇది సందర్భం కాదు. ఫైనాన్స్ బిల్లును పరిశీలనకు సభ ముందుంచేంత వరకు అందులో ప్రతిపాదనలపై చేయదల్చుకున్న విపులమైన విమర్శను ఆపుకోవాల్సిందే. అయితే ఫైనాన్స్ బిల్లులో మంత్రి పొందుపరచిన పన్ను విధింపునకు సంబంధించిన ప్రతిపాదనల గురించిన సాధారణ అభిప్రాయమేమిటో వ్యక్తం చేయడం తప్పేమి కాదని నేను భావిస్తున్నాను.

ఫైనాన్ బిల్లులో ఆరు వేర్వేరు ప్రతిపాదనలున్నాయి. మొదటగా 1932లో బొంబాయి ఆర్థిక చట్టం ఆమోదించిన అదనపు కోర్టు ఫీజులు స్టాంపు డ్యూటీలు మరొక సంవత్సరం పాటు

---

* బి.ఎల్.ఎ చర్చలు, సంపుటి 5, భాగం 1, పే. 903 – 916, 1939 ఫిబ్రవరి 21

కొనసాగుతాయని ఈ బిల్లు ప్రతిపాదిస్తోంది. విద్యుచ్ఛక్తి వినియోగంపై పన్నును పెంచడమన్నది బిల్లులోని రెండవ ప్రతిపాదన. కొన్ని నగరాల్లోనూ, పట్టణ ప్రాంతాల్లోనూ స్థిరాస్తుల దస్తావేజుల పై స్టాంపు డ్యూటీని పెంచడం మూడవ ప్రతిపాదన. స్థిరాస్తులు కౌలుపై పన్ను విధించడం నాల్గవది. బొంబాయి, బొంబాయి సబర్బన్ జిల్లా అహమ్మదాబాద్ నగరాలలోని భవనాలు సాంవత్సరిక బాడుగ మొత్తంపై 10 శాతం పన్ను విధించడం ఐదవది. ఇంధనం లేదా చమురు, మిల్లు వస్త్రాలు, పట్టుదారాల పై 6 1/4 శాతానికి మించకుండా అమ్మకం పన్ను విధించడం ఆరవది. నేను ముందుగా చెప్పినట్లుగా పన్నుకు సంబంధించిన ప్రతి పాదనల వివరాల్లోకి వెళ్ళాలని నేను అనుకోవడం లేదు. సాధారణ సిద్ధాంతాలపై నాకు స్ఫురించిన కొన్ని విమర్శలను సంగ్రహంగా నేను మీ ముందుంచబోతున్నాను.

ప్రస్తుతం స్టాంపు, కోర్టు ఫీజుల కొనసాగింపు విషయంలో, నా జ్ఞాపకశక్తి సరిగా వుంటే, ఈ పన్నుల పట్ల వెనకటి శాసన మండలిలో కాంగ్రెస్ వారు అభ్యంతరం తెలిపే వారని మాత్రమే నా గౌరవమిత్రుడు ఆర్థిక మంత్రికి నేను గుర్తు చేయదలుచుకున్నాను. అధ్యక్షా! కాంగ్రెస్‌కు ఆర్థిక మంత్రికి మధ్య రగడ జరగని బడ్జెట్ సమావేశం ఒకటి కూడా లేదని నాకు గుర్తు. నాకు గుర్తున్నంత వరకూ ప్రతి బడ్జెట్ సమావేశంలోనూ కాంగ్రెస్ వారు బడ్జెట్‌పైన తెగ ఆందోళన చేసేవారు. ఏ పన్ను విషయంలో అయితే కాంగ్రెస్‌వారు ప్రతిసంవత్సరమూ ఎడతెగకుండా పోరాడుతూ వుండేవారో, ఏ పన్నుకైతే శాశ్వతత్వాన్నివ్వడానికి సంసిద్ధంగా లేరో, ఆ పన్నునే కాంగ్రెసు మంత్రులు ప్రస్తుతం నిరంతరంగా కొనసాగించాలనుకొంటున్నారు. అధికారంలోకి రాక మునుపు వారికి చెడ్డగా కనిపించిన విషయాలు అధికారంలోకి వచ్చేసరికి మంచివిగా మారాయి. ఈ విధంగా వారు తమ ఆలోచనలను మార్చుకున్న సందర్భాలనేకం. కార్యనిర్వాహక వర్గం న్యాయవ్యవస్థ నుంచి వేరుకాని కారణంగా కాంగ్రెస్ వారు భయంకరంగా పోరాడేవారు. ఏ వ్యవస్థనైతే కాంగ్రెస్‌వారు ఒకప్పుడు అణచివేత విధానమన్నారో అదే విధానాన్ని ఎంతో ఆదర్శవంతమైన విధానంగా ఇప్పుడు సమర్థిస్తున్నారు. ఇంతకంటే ఎక్కువగా నేనేమీ చెప్పను. కానీ, ఇది కాంగ్రెసు వారు వ్యక్తీకరించిన విశ్వాసానికి వ్యతిరేకంగా ఉందని మాత్రం నేను నొక్కి చెబుతున్నాను.

ఇక విద్యుచ్ఛక్తి పై పన్ను విషయానికొస్తే, నా దృష్టిలో సిద్ధాంతపరంగా ఇది మంచి విధానం కాదు. విద్యుచ్ఛక్తి వినియోగం అంతకంతకూ అధికం కావాలని ప్రోత్సహించే వారిలో నేనొకణ్ణి. ఎందుకంటే అది లేకపోతే, ప్రజలు కిరోసిన్ వాడి ఆ పొగ ద్వారా తమ ఆరోగ్యాలు పాడుచేసుకుంటారు. దాన్ని సాధ్యమైన రీతిలో ఆపాలి. కిరోసిన్ వాడకాన్ని తగ్గించాలంటే విద్యుచ్ఛక్తి సాధ్యమైనంత చౌకగా లభ్యమయ్యేటట్లు చూడాలి. అందుకే నా అభిప్రాయంలో విద్యుచ్ఛక్తిపై పన్ను విధించడం సరైన పద్ధతి కాదు. ఆ పన్ను విధానానికి సంబంధించిన ప్రతిపాదన పై నా రెండవ అభిప్రాయం ఏమిటంటే, చాలా అధ్వాన్నంగా పంపిణీ చేయబడుతున్న పన్నుల్లో అదొకటి. విద్యుచ్ఛక్తి పన్ను విషయంలో మనం గమనించే మరొక అసాధారణ విషయమేమిటంటే సినిమాల్లోనూ, థియేటర్లలోనూ వాడబడుతున్న విద్యుచ్ఛక్తిపై విధించే పన్నులో ఏ రకమైన పెరుగుదల లేకపోవడం. అధ్యక్షా!

వ్యక్తిగతమైన పన్ను ఏదైనా ఉందంటే, అది తప్పనిసరిగా సినిమా, థియేటర్లకు సంబంధించిందే. ఎందుకంటే ఒక సినిమా లేదా థియేటరు పైన పన్ను విధిస్తే అది తప్పనిసరిగా ఆ సినిమా లేదా థియేటరుకు వెళ్ళే ప్రజలమీదే పడుతుంది. కాబట్టి. ఇది విలాసాలపై విధించే పన్ను అని నేననుకుంటున్నాను. అయినప్పటికీ, నేను ఖచ్చితంగా చెప్పలేనుగానీ, గౌరవనీయులైన ఆర్థికమంత్రి చేసినట్లు గృహస్థులందరికీ పన్ను వర్తింపజేయడానికి బదులు సినిమాలు, థియేటర్ల రేటు పెంచి వుంటే, ఈ సుంకం ద్వారా రావాల్సిన మొత్తాన్నంతటినీ వారు పొందగలిగి వుండేవారు. కానీ, అసాధారణ విషయమని నేనింతకు ముందు చెప్పినట్లు, అటువంటి భారాన్ని మోయగల వారిని అందు నుండి మినహాయించడం జరిగింది. ఇకపోతే జరిగిందేమిటి? ఎవరైతే ఇంతవరకూ 12 యూనిట్ల కంటే తక్కువ విద్యుచ్ఛక్తిని వినియోగిస్తున్నారో వారిపై ప్రస్తుతం పన్ను వేయడం జరిగింది. 12 యూనిట్ల కంటే ఎక్కువ ఎవరు వాడుతున్నారో వారిపై పన్ను 9 పైసల నుండి 15 పైసల వరకు పెంచడం జరిగింది. అధ్యక్షా! ఈ పన్ను విధానంలోని న్యాయబద్ధత ఏమిటో నాకు అర్థం కావడం లేదు. ఇంతవరకూ 12 యూనిట్ల కంటే తక్కువ వినియోగిస్తున్న ప్రజలపై పన్ను విధించడం ఎందుకు? ఇంతవరకు 9 పైసలు (5 నయాపైసలు) చెల్లిస్తున్న వారిని 15 పైసలు (8 నయాపైసలు) చెల్లించమనడం ఎందుకు? అదే సమయంలో సినిమాలనూ, థియేటర్లనూ దీన్నుంచి మినహాయించడం ఎందుకు?

పన్ను విధింపునకు సంబంధించిన మూడవ అంశమైన దస్తావేజులపై స్టాంపు డ్యూటీ చాలా అక్రమమైనదని నాకనిపిస్తోంది. ఒక్క బొంబాయి నగరంలోనే ఈ పన్నును మూడున్నర శాతం నుండి 4 శాతానికి పెంచమని గౌరవనీయ ఆర్థిక మంత్రి ప్రతిపాదిస్తున్నారు. ప్రస్తుతమున్న పన్నుతో పోలిస్తే ఇది 20 శాతం పెరిగినట్లు లెక్క. అదే విధంగా పూనా, అహమ్మదాబాదు నగరాలలో కూడా రెండున్నర శాతం నుండి 3 శాతం వరకు పెంచాలని ప్రతిపాదన చేస్తున్నారు. ఆ పెరుగుదల కూడా 20 శాతంగా ఉంది. ప్రభుత్వం ప్రకటించవలసిన మరికొన్ని పట్టణాల్లో పన్ను ఒకటిన్నర శాతం నుండి 3 శాతం వరకు పెంచడం జరిగింది. అంటే 50 శాతం పెరుగుదల. ఇకపోతే మిగిలిన పట్టణాల్లో ఒకటిన్నర శాతం నుండి 2 శాతం వరకు పెంచుతున్నారు. అంటే 33.5 శాతం పెంచినట్లు. గౌరవనీయులైన ఆర్థిక మంత్రి పై నాన్సు బిల్లులో పొందుపరచిన లక్ష్యాలనూ, హేతువులనూ పరిశీలిస్తే ఈ రకమైన పన్ను పెరుగుదలకు ఏ విధమైన సంజాయిషీ కనిపించదు. గౌరవనీయమంత్రి చెప్పదలచుకున్నదంతా ఇది - అదేమంటే గ్రామీణ ప్రాంతాల కంటే పట్టణ ప్రాంతాల్లోని స్టాంపు సుంకం ఎక్కువగా వుండటం వాంఛనీయమేనని భావించడం. ఎందుకు వాంఛనీయం? పట్టణ ప్రాంతాలు ఎక్కువ అపవిత్రమైనవా? అందుకోసమే ఇంతవరకూ చెల్లిస్తున్న పన్ను కంటే వారు ఎక్కువ పన్ను చెల్లించాలా? దీనికి గౌరవనీయమైన మంత్రి నుండి సమాధానమే లేదు. ఒక క్రమమూ, పద్ధతీ లేకుండా పన్ను పెంచుతామని అనడం కేవలం నిర్హేతుక చర్యే.

ఇక మనం ఐదవ ప్రతిపాదన అయిన ఆస్తిపన్నుకు వద్దాం. ఇది మొత్తం పన్నుల ప్రతి

పాదనలోని కీలకమైన అంశం. ఈ ప్రతిపాదన నా దృష్టిలో ఎన్నో కోణాల నుండి ఆక్షేపించ దగింది. నా గౌరవనీయమిత్రుడు శ్రీ జమ్నాలాల్ మెహతా ఇప్పటికే ఒక ఆక్షేపణ లేవనెత్తారు. అది ఏమిటంటే ఈ ప్రభుత్వం ఇంతవరకు మునిసిపాలిటీలకు కేటాయించిన పన్ను వనరులపై దురాక్రమణ చేస్తూండటం. బొంబాయి నగర మునిసిపాలిటీ తన రాబడిలో ఎక్కువ భాగాన్ని ఆస్తిపన్ను ద్వారా పొందుతున్నది. ఒక్క బొంబాయి నగరం మాత్రమే ఆస్తి పన్ను నుండి ఆదాయాన్ని పొందడం లేదు. అదేవిధంగా అన్ని నగర మునిసిపాలిటీలకు కూడా ఆస్తిపై పన్ను విధించే అధికారమివ్వబడింది. ఈ రకంగా మునిసిపాలిటీలకు కేటాయించిన పన్ను విషయంలో ప్రభుత్వం పోటీపడటం స్థానిక సంస్థల ఎదుగుదలకు హానికరంగా పరిణమిస్తుందని నేను ధృఢంగా చెపుతున్నాను. ఆ విషయంలో నేను ఇంతకంటే ఎక్కువగా చెప్పను. కానీ, ఈ ప్రతిపాదనలకు సంబంధించిన ఇతర అంశాల గురించి మాట్లాడతాను. అందులో మొదటిది - బొంబాయి నగరంలోని అద్దెలు. నగరంలోని అద్దెలు చాలా అధికంగా వున్నాయనీ వాటిని తగ్గించాలనీ ఆందోళన చేస్తూ వచ్చారు. ఇప్పుడు, అధ్యక్షా! ఈ పన్ను విధానం వల్ల ఆస్తి విలువలో 10 శాతాన్ని ప్రభుత్వం తగ్గిస్తుంది. ఈ రకంగానే ఆందోళన చేస్తున్న అద్దెకుంటున్న వారికి ఇళ్ళ యజమానులు అద్దె తగ్గిస్తామని చెప్పవలసిన అవసరం లేదా? ప్రభుత్వం న్యాయబద్ధంగా రావలసిన వారి హక్కులను హరిస్తూ, బొంబాయి, అహమ్మదా బాదు, పూనా నగరాల్లోని అద్దెదారులను మోసం చేస్తున్నది. అందువల్ల ఈ రకమైన పన్ను విధానానికి అది ఒక తీవ్రమైన ఆక్షేపణగా నేను భావిస్తున్నాను.

ఇక రెండవ విషయం ప్రభుత్వ ప్రతిపాదనల్లో పన్ను విధించాల్సిన అంశంగా ఉన్న ఆస్తి ఇప్పుడు పన్ను విధించే అంశంగా లేదుకాని, దాని పన్ను చాలా తక్కువగా ఉంది కాబట్టి మరింత హెచ్చు పన్ను విధించవచ్చని అనుకోవడానికి లేదు. బొంబాయి నగరాన్నే ఉదాహరణగా తీసుకుందాం.

*గౌరవనీయులైన సభాపతి :* మీరు అపార్థం చేసుకున్నారని నేను అనుకుంటున్నాను. పన్ను విధింపు ప్రతిపాదనలో పూనాను చేర్చలేదు.

*డా॥ అంబేద్కర్ :* క్షమించండి. కేవలం బొంబాయి, అహమ్మదాబాదులు మాత్రమే. బొంబాయి విషయంలో మనం గమనించే పరిస్థితి ఇది. బొంబాయి మునిసిపాలిటీ అవసరాల కోసం ఆస్తి దామాషా విలువలపైన సుమారు 18.5 శాతం శిస్తు వసూలు చేస్తున్నది. ఇదికాక, ఇంటి యజమాని, ఒక వేళ, ఆస్తి కౌలుద్వారా హక్కు పొందినదైతే (lease hold ) ఇంటి స్థలానికి పన్ను చెల్లించవలసి వుంది. అందుకు అదనంగా తన వివిధ ఆస్తుల పై సంక్రమించే మొత్తం అద్దె సొమ్ము పై ప్రభుత్వానికి ఆదాయం పన్ను చెల్లించాలి. ఇవన్నీ పరిశీలిస్తే, మొత్తం పన్ను భారం 22 నుండి 23 శాతం వరకూ ఉంటుంది. (ఒక గౌరవనీయ సభ్యుడు : 50 శాతం) మంచిది. గౌరవనీయుడైన నా స్నేహితుడు మొత్తం 50 శాతానికి వస్తుందని అంటున్నారు. వారు తరువాత బహుశా దాన్ని వివరించవచ్చు. ఈ ఆస్తి తక్కువ పన్ను వేయబడుతున్న ఆస్తి అని చెప్పడం భావ్యం కాదని మాత్రమే నేను మీకు తేల్చి

చెపుతున్నాను. కాబట్టి, ఇప్పటికే అత్యధికంగా పన్ను వేయబడుతున్న ఈ ఆస్తిపై అదనంగా 10 శాతం భారం విధించడం న్యాయబద్ధం కాదు.

గౌరవనీయ ఆర్థిక మంత్రికి తరువాత నేను చెప్పదలచుకున్న విషయం ఇది. ఈ పన్నును వారు పన్నుగా కాకుండా కేవలం మూల్యంగా మాత్రమే భావిస్తున్నట్లుంది. ఈ విషయంలో వారితో నేను చర్చించవలసి వుంది. వారు వసూలు చేస్తున్నది మూల్యం కాదు. అది పన్ను. మూల్యానికీ పన్నుకూ వున్న వ్యత్యాసం ఇది – ఒక నిర్దిష్టమైన ప్రయోజనం పొందడానికి వీలైనది మూల్యం. మనం మునిసిపాలిటీకి మూల్యం చెల్లిస్తాం. ఎందుకంటే అందుకు బదులుగా వారి నుండి నీళ్ళు, సంరక్షణ, విద్యుచ్ఛక్తి వంటి ఎన్నో ప్రత్యక్ష సేవలను పొందుతున్నాం. అది వాళ్ళు అందించే సేవలకు ఒక విధమైన మూల్యం. కానీ గౌరవనీయ మంత్రి చేస్తున్నది చూస్తుంటే ఇటువంటి సేవలనేవి ఏవీ లేవని భావించాలి. కాబట్టి అది ఒక పన్ను. అందువల్ల మంత్రి దాన్ని ఆస్తిపై పన్ను అంటున్నా – అది ఆదాయం పన్ను అని నేనంటాను. ఎందుకంటే, ఎక్కడా వస్తువులు పన్ను చెల్లించడం జరగదు. అంతా విశ్లేషిస్తే మనిషి మాత్రమే పన్ను చెల్లిస్తాడు. వస్తువులు కాదు. ఒక వేళ మనుషులు చెల్లిస్తే, వారు వాళ్ళ ఆదాయాన్ని బట్టి చెల్లిస్తారు. కాబట్టి – ఇది ఆదాయపు పన్ను. ఆదాయపు పన్నుకు సంబంధించిన సాధారణ పథకంలో భాగమైన న్యాయ సూత్రాలను ఈ పన్నులో కూడా ఎందుకు చేర్చలేదు? అని గౌరవనీయ మంత్రిని అడుగుతున్నాను. ఇక్కడ రెండు విషయాలు చెప్పవచ్చు. ప్రతి ఆదాయపు పన్ను ప్రణాళికలో కూడ మినహాయింపునకు సంబంధించిన ప్రాతిపదిక ఏమిటో తెలియజేయబడి వుంటుందన్నది మొదటి విషయం. అతి తక్కువ పరిమితి లోపు పన్ను వేయడం వుండదు. ప్రస్తుతం కనిష్ఠ ఆదాయపు పన్ను సుమారు రెండు వేల రూపాయలు అని నేననుకుంటున్నాను. ఇది ఒక వేళ ఆదాయం పన్నయితే, మళ్ళీ నొక్కి చెపు తున్నాను. ఆదాయపు పన్ను మాత్రమే అయితే, ఎందుకు ఇందులో మినహాయింపు లేదు? భూస్వాములందరినీ ఒకే గాటన కట్టడం వల్ల ప్రయోజనం లేదు. నేను ఒక హిందూ కాలనీలో ఉంటున్నాను. అక్కడ ఎంతో మంది ప్రభుత్వం నుండి గ్రాట్యూటీ పొందిన వాళ్ళున్నారు. ప్రావిడెంట్ ఫండ్ మొత్తాలను కొంత వరకు పొందినవారున్నారు. వాళ్ళు చిన్న చిన్న ఇళ్ళు కట్టుకొన్నారు. ఇంటిలో కొంత భాగంలో వాళ్ళుంటూ, తక్కిన భాగాన్ని అద్దెకిస్తున్నారు. వాళ్ళు ఇంటి అద్దె చెల్లిస్తారు. స్వంతదారులు మునిసిపాలిటీకి పన్ను చెల్లిస్తారు. అలాంటి వారి పట్ల ఏరకమైన సానుభూతి లేదా? ఇకపోతే మరొకరకమైన వారు ఉన్నారు. వాళ్ళు లక్షలాది రూపాయలను భవనాలపై వెచ్చించి, ఆ ఆస్తుల నుండి లభిస్తున్న ఆదాయాన్ని అనుభవించడం తప్ప మరేమీ చెయ్యరు. ఈ రెండు రకాల భూస్వాముల మధ్య ఏదో ఒక రకమైన వ్యత్యాసం తప్పని సరిగా చూపించాలని నేనంటాను. ఇక్కడ అటువంటి వ్యత్యాసం ఎందుకు చూపలేదు?

మరొక అంశాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి. ఈ ఆస్తుల్లో ఎన్నో – ఇన్ని అని నేను ఖచ్చితంగా చెప్పలేను కానీ, అసంఖ్యాకమైన ఆస్తులెన్నో – ధర్మ సంస్థలకు సంబంధించినవి

వున్నాయి. ఉదాహరణ బొంబాయి నగరాన్నే తీసుకోండి. ఇక్కడ మనకు సాంఘిక సేవా సంఘాలు - సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ వంటి ఎన్నో సంస్థలు - ఉన్నాయి. అవీ, అటువంటి ఎన్నో సంస్థలూ తాము సంపాదిస్తున్న ఆదాయాన్ని పేద వితంతువులకూ, అనాద బాలలకూ, విద్యలేని వారికి విద్య నేర్పడానికీ, వైద్య సహాయానికీ ఉపయోగిస్తున్నాయి. అన్ని రకాల సాంఘిక సేవలకు సంబంధించిన బాధ్యతలను వదిలేసుకున్న ప్రభుత్వం - ఎందుకో తర్వాత చెప్తాను - ఆ భారాన్ని ధర్మ సంస్థలపై తోసివేసి, అటువంటి సంస్థల పట్ల ఎందుకు మినహాయింపు చూపడంలేదో నాకు అర్థం కావడం లేదు. ఆదాయం పన్ను 4వ సెక్షన్ కూడా దానధర్మాల ద్వారా లభించిన ఆదాయంపై పన్ను విధించరాదని చెపుతున్నది. గౌరవనీయ ఆర్థిక మంత్రి ఈ విషయాలలో ఏ ఒక్క దానిని కూడ ఎందుకు పరిశీలించ లేదో నాకు అర్థం కావడం లేదు. మనం ఆ బిల్లును పరిశీలించేటప్పుడు వారు ఏమైనా చెప్తారని నేను విశ్వసిస్తున్నాను.

ఇకపోతే అమ్మకపు పన్ను విషయానికొస్తే, వ్యక్తిగతంగా నాకు ఆ పన్ను అంటే ఇష్టం లేదు. ఆ పన్ను మంచిదే అనీ, తప్పని సరిగా విధించవలసిందేననీ విశ్వసించే వాళ్ళున్నారని నాకు తెలుసు. దీని పట్ల నాకు వేరొక రకమైన అభిప్రాయం ఉంది. 1894 నుండి భారత మిల్లుల పైన, పత్తి ఉత్పత్తిదారుల పైన మనం విధించిన ఎక్సైజ్ సుంకంపై ఇది దెబ్బ కొడుతుందని నా మనస్సుకు తోస్తున్నది. అది తప్ప వేరొకటి కావడానికి వీల్లేదు. అది ఉత్పత్తిదారుడికి సంబంధించినా, అమ్మకందారుకు సంబంధించినా దానివల్ల ప్రభావితుడయ్యేది వినియోగదారుడు మాత్రమే. అది తప్పనిసరిగా వినియోగదారుడి జీవన ప్రమాణంపై ప్రభావం చూపుతుంది. ఒక వేళ దాన్ని అమ్మకందారుకు అన్వయించకుండా, కేవలం ఉత్పత్తిదారుడే చెల్లిస్తే అందుకు ఆధారభూతమైన పరిశ్రమలపై అది ప్రభావాన్ని చూపుతుంది. ఎన్ని రకాలుగా ఆలోచించినా ఇది సంతృప్తికరమైన పన్ను విధానం కాదు.

జీవితంలో మంచి వస్తువులు అమృతంలాగా స్వర్గం నుంచి వూడి పడవని అభిప్రాయ పడే వాళ్ళలో నేనొకణ్ణి. ఆ విధంగా ఎక్కడా జరగడం లేదు. వాస్తవానికి జీవితంలో మంచి విషయాలు కావాలంటే అందుకు కొంత మూల్యం చెల్లించాలి. ఆవిధంగా మూల్యాన్ని చెల్లిస్తే తప్ప వాటిని పొందలేము. అందువల్ల న్యాయపూర్వకంగా పన్ను విధింపుపట్ల ఏరకమైన ఆక్షేపణలేని వారిలో నేనొకణ్ణి. ఎందుకంటే జీవితంలో మంచి విషయాలు కావాలనీ, అందుకు మూల్యం చెల్లించాలనీ తప్పనిసరిగా విశ్వసించే వారిలో నేను కూడా ఒకణ్ణి కాబట్టి. మనం ఆలోచించాల్సిన విషయం ప్రస్తుతం ఇది - ఈ పన్ను విధింపు అంతా ఎందుకోసం? దాని ప్రయోజనం ఏమిటి? ఈ రకమైన పన్ను విధింపు ద్వారా ప్రభుత్వం సాధించదలచిన ప్రయోజనం ఏమిటి? ఆర్థిక మంత్రి ఈ పథకం ద్వారా వసూలు చెయ్యదలచిన మొత్తం 169 లక్షలని మనం గుర్తుంచుకోవలసిన అవసరముంది. ఇక బడ్జెట్ విషయానికొస్తే ఎవరైనా బడ్జెట్ వ్యయంలో చేర్చబడిన కొత్త అంశాలేమిటి అని ప్రశ్నించాలి. ఇప్పుడు నేను కేవలం పరిపాలనా విభాగాలకు సంబంధించినవీ, ప్రజల సంక్షేమంతో

ఏ మాత్రం ప్రత్యక్ష సంబంధం లేనివీ అయిన కొన్ని ఖర్చుపద్దులను బడ్జెట్ నుండి మినహాయించాను. నా ఉద్దేశం ప్రకారం ప్రజాసంక్షేమాన్ని ప్రభావితం చేసే అంశాలేవై తే ఉన్నాయో అటువంటి కొత్త ఖర్చుపద్దులను బడ్జెట్ నుండి స్వీకరించాను. నీటి పారుదలకు బడ్జెట్‌లో ఏడున్నర లక్షలు కేటాయించడం జరిగిందని నాకు తోస్తున్నది. విద్యకు 16.5 లక్షలు. అందులో 5 లక్షలు ప్రాథమిక విద్య విస్తరణకు, భవనాలకు 5 లక్షలూ, 1.81 లక్షలు ప్రాథమిక వృత్తి విద్యలను ప్రవేశ పెట్టడానికి కేటాయించడం జరిగింది. ప్రజారోగ్యం విషయంలో గ్రామీణ నీటిపారుదలకు 5 లక్షలు కేటాయించడమనే అంశం తప్ప చెప్పుకోదగిన అంశం మరొకటి లేదు. వ్యవసాయానికి ఏమీలేదు. సహకార రంగానికి 7 లక్షలు కేటాయించడం జరిగింది. ఇక గ్రామీణాభివృద్ధి. అంటే – 7000 మంది కార్యకర్తలను వినియోగించి, వారు దేశమంతా తిరుగుతూ గౌరవనీయ మంత్రులు ఆలోచిస్తున్నట్లుగా ప్రజలకుపయోగపడే ఒక రకమైన ప్రచార కార్యక్రమం చేపట్టడం తప్ప మరొకటి కాదు.

రుణవిమోచనకు 2 లక్షలు కేటాయించడం రెండవది. ఇక్కడ నేను ఎత్తి చూపాలను కుంటున్న విషయం ఇది : మన దేశపు అవసరాలను దృష్టిలో వుంచుకొని బడ్జెట్‌లో కేటాయించిన వ్యయం సరిపోతుందా అన్న అంశం మాత్రమే కాక కొత్త రకమైన ఖర్చులకు ఈ కొత్త పన్ను విధింపులు ఏమాత్రం అవసరం లేదని కూడా ఈ సభ తెలుసుకోవాలి. గౌరవనీయ ఆర్థిక మంత్రి తమ బడ్జెట్ ప్రసంగంలో సెలవిచ్చినట్లుగా పన్ను విధింపులకు సంబంధించిన మొత్తం 169 లక్షలలో కేవలం 44 లక్షలు మాత్రమే రెండు పథకాలకు అవసరమవుతాయి. అవి – ఒకటి గ్రామీణ విద్యావిస్తరణ. రెండవది గ్రామీణ ఆర్థికాభివృద్ధి. ఇకపోతే మిగిలిన 125 లక్షలు వాస్తవంగా ఈ కొత్తరకమైన వ్యయానికి అవసరం లేదు. ఆ 125 లక్షలు తాము పేరు పెట్టుకున్న మద్యపాన నిషేధ విధానం కారణంగా తలెత్తిన లోటును పూడ్చడానికి తప్ప మరొక ప్రయోజనం కోసమని మంత్రి మండలి భావించడం లేదు. ఈ పరిస్థితుల్లో మన పరిశీలన కోసం ఒక చిన్న ప్రశ్న తలెత్తుతున్నది. మొత్తం విషయాన్నంతా సంగ్రహంగా చెప్తే ఆ విషయం ఇది. తాగుడు ఒక సమస్యా? తాగుడు ఒక సమస్యే అయితే అది తక్షణ సమస్యా? ఈ రెండు ప్రశ్నలకు ఈ సభ సంతృప్తికరమైన సమాధానామివ్వడానికి సంసిద్ధంగా లేకపోతే, ఆర్థిక మంత్రి ప్రవేశపెట్టిన పన్ను విధింపు పై ఓటు చెయ్యడంలో ఏ మాత్రం న్యాయబద్ధత ఉండదు. తాగుడు ఒక మహమ్మారి అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. దాని ఫలితాలు కూడా చాలా తీవ్రంగానే ఉంటాయి. తాగుడు ఒక మహమ్మారి అని అంగీకరించడమంటే, దాన్ని ఒక సమస్యగా అంగీకరించినట్లు కాదు. అంతకంటే ముఖ్యంగా, తక్షణ సమస్యగా అంగీకరించినట్లుగా ఏమాత్రం కాదు.

అధ్యక్షా! ఇప్పుడీ సమస్యను తులనాత్మక రీతిలో పరిశీలిద్దాం. బొంబాయి నగరంలోని పరిస్థితి ఏమిటి? ప్రస్తుతం బొంబాయి మంత్రిమండలికి సంబంధించిన బడ్జెట్ గురించి చర్చిస్తున్నాం. కాబట్టి దేశంలోని ఇతర ప్రాంతాలను పట్టించుకోవలసిన అవసరం లేదు. తాగుడు విషయానికి వస్తే బొంబాయి నగరంలోని పరిస్థితి ఏమిటి – ఇతర దేశాల్లోని పరిస్థితి ఏమిటి? మొట్టమొదటగా వివిధ

దేశాల ఎక్సైజు రాబడికి సంబంధించిన వివరాలను మీ ముందుంచనివ్వండి. ఎందుకంటే, ఎక్సైజు రాబడి ఒక దేశం ఎదుర్కోవలసిన సమస్య తీవ్రతను కొంత వరకు సూచిస్తుంది. కాబట్టి నానాజాతి సమితి ప్రచురించిన నివేదిక (బ్లూ బుక్) నుండి నేను కొన్ని వివరాలు స్వీకరించాను. ఈ వివరాలు 1931 మే నాటివి. మొదటిగా గ్రేట్ బ్రిటన్‌తో ప్రారంభిస్తే జనాభా 44,937,444 కాగా ఎక్సైజ్ రాబడి 1,504, 895,000. 1937 కాలంతో ఏ మాత్రం వ్యత్యాసం లేని ఇప్పటి ఆస్ట్రియాలో జనాభా 6,760,233 అయితే ఎక్సైజ్ ద్వారా లభించిన ఆదాయం 15.69 లక్షల చిల్లర. కెనడా జనాభా 1 కోటి కాగా ఎక్సైజ్ రాబడి 57.19 లక్షలు. ఐరిష్ మొత్తం జనాభా 2,965, 854 అయితే, ఎక్సైజ్ ఆదాయం 665 లక్షలు. ఇక డెన్మార్కును తీసుకుంటే దాని మొత్తం జనాభా 37 లక్షలు కాగా ఎక్సైజు రాబడి 5,341,80,000 గా ఉంది. ఫ్రాన్సు జనాభా 419 లక్షలయితే మొత్తం ఎక్సైజు ఆదాయం 207,079,650. ఇక నార్వే వివరాలు పరిశీలిద్దాం. నార్వే జనాభా మొత్తం 2,814,194 అయితే ఎక్సైజు రాబడి మొత్తం 1,66,72,600. అక్కడ స్థానిక ప్రజల ఇష్టానికి ప్రాధాన్యముంది. ఈ వివరాల నేపధ్యంలో మనదేశపు వివరాలను పోల్చండి. బొంబాయి నగర జనాభా 80 లక్షలు. ఎక్సైజు రాబడి మొత్తం 325 లక్షలు. బొంబాయి నగరంలోని మద్యపానం అన్నది దేశం ఎదుర్కోవాల్సిన తక్షణ సమస్యను సృష్టిస్తోందని ఎవరైనా అనగలుగుతారా? దీనికి 'అవున'ని చెప్పి సంతృప్తి కరమైన సమాధానమివ్వ గలిగిన వారెవరైనా వుంటే, వారు అన్నీ వదులుకొన్న వారుగా ఉండాలి. (నవ్వు) మరొక విషయం – మద్యం వినియోగానికి సంబంధించిన వివరాలు తీసుకోండి. ఈ వివరాలను నేను బొంబాయి ప్రభుత్వం సమర్పించిన నివేదిక నుండి తీసుకున్నాను. ప్రజల మొత్తం తాగుడు వినియోగం ఎంత? బొంబాయి ప్రభుత్వం ప్రచురించిన పరిపాలనా నివేదిక లేదా బ్లూబుక్ ద్వారా దేశంలోని ప్రజల సగటు తలసరి వినియోగం సుమారు 3 డ్రాములుగా వుందని తెలుస్తుంది. అది ఒక ఔన్సు కంటే, ఇంకా చెప్పాలంటే పావు ఔన్సు కంటే తక్కువని తెలిసింది. అయినా నా గౌరవనీయ మిత్రుడు ఇది ఒక సమస్యగా పేర్కొంటున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో వినియోగం 1.8 డ్రాములుగా వుంటే, పట్టణాలతో కలిపి కూడా మొత్తం 8.2 డ్రాములు. అంటే ఒక ఔన్సు కూడా వుండటం లేదు. బొంబాయి నగర రాబడి మార్గం గురించి ఆలోచిద్దాం. ప్రస్తుతం ఎక్కువగా ఉపయోగించబడుతున్నదీ, దేశంలో అధికమైన రాబడికి మార్గంగా ఉంటున్నదీ అయిన దేశవాళీ సారా గురించి నేను మాట్లాడుతున్నాను. ఈ దేశంలో దేశవాళీ సారా ద్వారా లభిస్తున్న ఆదాయం ఎంత? అది 1,54,43,750 రూపాయలని నివేదిక ద్వారా తెలుస్తున్నది. అది మొత్తం దేశానికి సంబంధించినది. ఇప్పుడు దీన్ని పట్టణ, గ్రామీణ ప్రాంతాలకు పంచుదాం. పరిపాలనా నివేదికను బట్టి బొంబాయి ప్రెసిడెన్సీలో 33 పట్టణాలున్నాయి. ఈ 33 పట్టణాల్లోని జనాభా 29,00,000. దేశవాళీ సారా ద్వారా ఈ 33 పట్టణాల్లో వస్తున్న ఆదాయమెంత? ఈ 33 పట్టణాల నుండి లభిస్తున్న రాబడి మొత్తం 1 కోటి రూపాయలు. అంటే, తక్కిన జనాభా పట్టణాల్లో కాకుండా పల్లెల్లో నివసించే వారు. నా లెక్కల ప్రకారం సుమారు 1,52,00,000 మంది 54 లక్షల విలువగల దేశవాళీ

సారా కన్నా ఎక్కువ వినియోగించడం లేదు. దీన్ని తలసరి వినియోగం కింద మారిస్తే సంవత్సరంలో ఒక వ్యక్తి ఉపయోగించే మద్యం 5 అణాల (31 నయాపైసలు) కంటే ఎక్కువ కాదు. పట్టణాల్లోని మొత్తం వివరాలను మరింత విశ్లేషించనివ్వండి. పట్టణాల్లో నేను చెప్పినట్లుగా 29,00,000 మంది ప్రజలు ఒక కోటి రూపాయల మద్యాన్ని సేవిస్తున్నారు. అది సరిగానే వుందా. ఈ దేశంలో స్త్రీలు తాగరని మనకు తెలుసు. తాగుడుకు బానిసైన వాడు కూడా తన భార్య ఒక డ్రాము మద్యం చప్పరించడాన్ని కూడా సహించలేడు. పిల్లలు కూడా తాగరు కాబట్టి, స్త్రీలనూ, పిల్లలనూ మినహాయిస్తే పట్టణాల్లో మొత్తం 75 శాతం తాగని వారిగా పరిగణించి మొత్తం జనాభా నుండి తీసివేయవచ్చు. ఆ విధంగా తీసివేస్తే ఆ వివరాలిలా ఉన్నాయి. సుమారు 10,00,000 జనాభా ఈ తాగుడు అనే మహమ్మారికి బలవుతున్నారు. అధ్యక్షా! ఈ వివరాలను ముందుంచుకొని వివేకమున్న వ్యక్తి ఎవ్వరైనా తాగుడు ఈ దేశానికి తక్షణం పరిష్కరించవలసిన ఒక సమస్య అని అనగలరా? అని అడుగుతున్నాను. అధ్యక్షా! అమెరికా సంయుక్త రాష్ట్రాలను ఆదర్శంగా తీసుకునే జనం ఉన్నారని నాకు తెలుసు. 1919లో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగాన్ని సవరించి అక్కడ మద్య నిషేధ విధానాన్ని అమలు పరచారనీ, ఆ పద్ధతిని మనమూ అవలంబించాలనీ వారు అనుకుంటారు. అధ్యక్షా, ఆ విధంగా గుడ్డిగా అనుసరించే ముందు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని పరిస్థితిని పరిశీలించవలసిన అవసరముందని నేనంటాను. 1919 లో రాజ్యాంగాన్ని సవరించక మునుపు, అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఉన్న సమస్య పరిస్థితి ఏమిటి. దాని తీవ్రత ఎంత వరకు ఉండేది? అన్న అంశాలకు సంబంధించిన కొన్ని వివరాలు నా దగ్గరున్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో మొత్తం మద్య వినియోగం ఎంత? ఫీల్డ్‌మన్ రచించిన 'ప్రొహిబిషన్' అన్న పుస్తకంలో వివరాలీ విధంగా వున్నాయి. 1910–1914 మధ్యకాలంలో డిస్టిల్డు స్పిరిట్, వైన్, బీరులకు సంబంధించిన తలసరి వినియోగం 22.43 గ్యాలన్లు. 1905 నుంచి 1910 మధ్యకాలంలో 21. 19 నుంచి 1904 వరకు 18.77. దీన్ని బట్టి చూస్తే తలసరి వినియోగం చాలా వేగంగా పెరిగిందని తెలుస్తున్నది. 1900 నుండి 1901 మధ్యకాలంలో 18 గాను, 1905–1909 మధ్యకాలంలో 19.46 గానూ, 1910–1914 మధ్య 22.43 గానూ వుంది. కాబట్టి మన పరిస్థితులు అమెరికా సంయుక్త రాష్ట్రాల పరిస్థితులతో సరిపోల్చదగినవిగా లేవనవచ్చు.

మళ్ళీ మరొక విషయం తీసుకుందాం. మనదేశంలో మద్యపాన వ్యసనం ఉందని మనం అనగలమా? కేవలం మద్యపాన వ్యసనం కారణంగా ప్రజలెవ్వరైనా మనదేశంలో చనిపోయారని మనం చెప్పగలమా? అధిక మద్య సేవనం కారణంగా కాలేయం చెడిపోయి మరణించిన వారున్నారా? ప్రజారోగ్య నివేదికలో ప్రచురించిన వివరాలు నేను పరిశీలించాను. అంతేకాదు, భారత ప్రభుత్వం నియమించిన కమీషనర్ ఆఫ్ హెల్త్ వారు ప్రచురించిన వివరాలను కూడా గాలించాను. వారిద్దరూ కూడా ఈ విషయాన్ని పరిశీలించడం అవసరమని భావించలేదని మాత్రమే నేను చెప్పదలచుకున్నాను. మద్యపాన వ్యసనం కారణంగానూ, కాలేయం చెడిపోవడం వల్లనూ మరణించిన వివరాలను వారు

ఎందుకు పరిగణనలోకి తీసుకోలేదంటే - అటువంటి పరిస్థితులు భారతదేశంలో లేవు కాబట్టే. ఇప్పుడు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో జరిగిందేమిటో చూడండి. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో 1917 లో ప్రతి 1000 మందికి 5 మంది కేవలం మద్యపాన వ్యసనం కారణంగా మరణించారు. 1916 లో 5.8 మంది; 1915లో 5.2 మంది; 1914లో 4.9 మంది; 1913 లో 5.10 మంది మరణించారు. ఇక లివర్ సిరోసిస్ కారణంగా చనిపోయిన వారి వివరాలీ విధంగా వున్నాయి. 1917లో ప్రతి వెయ్యి మందికి 11 మంది; 1916లో 12 మంది, 1915లో 12.6 మంది, 1914లో 13 మంది, 1913లో 13.4 మంది మరణించారు. అటువంటి పరిస్థితి మనదేశంలో ఏ మాత్రం లేదని నేను విన్నవించుకుంటున్నాను. కాబట్టి, మంత్రి మండలి దీన్ని పరిష్కరించవలసిన సమస్యగా పేర్కొనడం సమంజసం కాదని నా అభిప్రాయం. ఇది మనదేశంలో సమస్య కాదనేందుకు నా మట్టుకు రెండు సరైన కారణాలున్నాయి. ఒకటి, భారతదేశంలో అన్ని మతాల్లో తాగడం పాపమని - నిషేధించడం. మతం ఏవో కొన్ని తప్పుడు పనులు చేసి ఉండవచ్చు. కానీ హిందూ, మహమ్మదీయ, జొరాస్ట్రియన్‌లతో సహా అన్ని భారతదేశ మతాలు కూడా ఆ నిషేధం విధించడమే ఒక మంచి పని చేశాయనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఆ నిషేధాన్ని చాలా నియమబద్ధంగా అధిక సంఖ్యాకులైన మన ప్రజలు అనుసరిస్తున్నారు.

మన దేశానికీ ఇతర దేశాలకూ వ్యత్యాసమున్న మరో లక్షణం ఉంది. ఈ కారణంచేత కూడా తాగుడు ఒక సమస్యగా మారడం లేదు. అదేమంటే, మద్యం పంపిణీ ప్రభుత్వం అధీనంలో ఉండటం. అమెరికాలోనో, ఇతర యూరోపియన్ దేశాల్లో లాగానో అది ప్రైవేటు అక్రమ సంపాదనా పరుల అధీనంలోలేదు. ప్రభుత్వమనేది ఒక బాధ్యతాయుతమైన వ్యవస్థ. అది ప్రజాభిప్రాయానికీ, సభ అభిప్రాయానికీ లోబడి ఉంటుంది. ఆ కారణంచేత, ఒక ప్రైవేటు అక్రమ సంపాదనా పరుడిలాగా ప్రభుత్వం బాధ్యతారహితంగా ఎప్పుడూ ప్రవర్తించలేదు. ఇంతకు ముందు నేను చెప్పినట్లుగా సమస్యను అన్ని కోణాల నుంచి పరిశీలించి, తాగుడు తక్షణం పరిష్కరించదగిన సమస్యగా గుర్తించడానికి నేనంగీకరించను.

అధ్యక్షా! తరవాత నేనడగదల్చుకున్న ప్రశ్న ఇది: మనకున్న సమస్యలనన్నింటినీ పక్కన పెట్టి వెంటనే పరిశీలించవలసిన అత్యవసర సమస్యా ఇది? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పే ముందు ఈ దేశ ప్రజల వివిధ అవసరాలను దృష్టిలో వుంచుకోవాల్సిన అవసరముంది. తక్కిన అవసరాలన్నీ పూర్తిగా తీర్చగలిగామా? వాటిని కొంత వరకే తీర్చామా? అకారణంగా, వాటిని పక్కన పెట్టి ప్రస్తుతం ఈ సమస్యను, కేవలం ఈ సమస్యను పట్టించుకోవాలా? కొన్ని ఉదాహరణలు నేనిస్తాను. మొదటిదిగా, విద్యా విషయాల గురించి ఆలోచించండి. వయోజన విద్య పరిస్థితి ఏ విధంగా వుంది. పురుషుల విషయం తీసుకుంటే మొత్తం పురుష జనాభాలో కేవలం 14.3 శాతం మాత్రమే అక్షరాస్యులు. మొత్తం స్త్రీ జనాభాలో 2.4 శాతం మాత్రమే అక్షర జ్ఞానాన్ని పొంది ఉన్నారు. అంటే 86 శాతం పురుషులకు, 98 శాతం స్త్రీలకు ఓనమాలు నేర్పించవలసిన అవసరం ఇంకా వుంది.

అప్పుడే వారు ఇతర కులాల వారి కుట్రలకూ, కుతంత్రాలకూ బలి కాకుండా తమ జీవితాన్ని కొనసాగించగలుగుతారు. ఈ విషయానికి సంబంధించిన నివేదికను తయారుచెయ్యడానికి మనం ఒక కమిటీని కూడా నియమించడం జరిగింది. ఆ కమిటీ నివేదికను తయారుచేసింది. కానీ, ఆ కమిటీ చేసిన ప్రతిపాదనలు అమలు పరచడానికి ప్రస్తుత బడ్జెట్‌లో ఏ మాత్రం అవకాశం నాకు కనిపించడం లేదు. పిల్లల విద్య విషయానికొద్దాం. ఈ విషయంలో మన రాష్ట్రం పరిస్థితి ఏమిటి? ఈ రాష్ట్రంలో ప్రభుత్వం కళాశాల విద్య విషయంలో తన వంతు బాధ్యతను నిరాకరించింది అన్నది ఏ మాత్రం వ్యతిరేకించడానికి వీలుకాని విషయం. అందులో ఏ మాత్రం సందేహం లేదు. ఈ రాష్ట్రానికి సంబంధించిన పిల్లలకి ఉన్నత విద్య ఇవ్వడాన్ని ప్రభుత్వం తన కర్తవ్యంగా భావించడం లేదు. దీన్ని ప్రభుత్వం ప్రైవేట్ సంస్థలకు వదలివేసింది. సెకండరీ విద్య పరిస్థితి కూడా దాదాపు ఈ విధంగానే ఉంది. ప్రభుత్వం బాధ్యతను తమ భుజస్కంధాలపై స్వీకరించదు కానీ ప్రైవేటు సంస్థలు ప్రభుత్వ ఖజానా ద్వారా సేకరించిన చిన్న చిన్న మొత్తాలకు తన వంతు సహాయాన్ని మాత్రం ఇస్తుంది. కాబట్టి విద్యా విషయికంగా మన కార్యక్రమ పరిధి చాలా పరిమితంగా వుంది. ఇకపోతే ప్రాథమిక విద్య. ప్రాథమిక విద్య విషయంలో ప్రభుత్వం చేసిందేమిటి? నిన్న నేను సేకరించగలిగిన వివరాలను బట్టి ఈ విషయంలో ప్రస్తుత పరిస్థితి ఈ విధంగా ఉందని తెలియజేస్తున్నాను. ప్రాథమిక విద్యా చట్టం 6 నుండి 11 సంవత్సరాల వయస్సులోపు పిల్లలకు అన్వయిస్తుంది. 6 నుంచి 11 సంవత్సరాల వయస్సులోపు పిల్లల సంఖ్య 2,479,000. వీరిలో 754, 000 మంది పాఠశాలల్లో వున్నారనుకొంటున్నారు. తక్కిన వారు పాఠశాలల్లో లేరు. ఈ నిష్పత్తిని మరోరకంగా ఇలా చెప్పవచ్చు. ప్రతి ముగ్గురు పిల్లల్లో ఒకరు పాఠశాలలోనూ, ఇద్దరు బయటా వుంటున్నారు. ఈ విషయాన్ని మరో కోణం నుంచి అంటే, ప్రాథమిక విద్యకు ప్రభుత్వం కల్పిస్తున్న సౌకర్యాల దృష్టితో పరిశీలించండి. ప్రభుత్వ వివరాలను బట్టి ఈ రాష్ట్రం లోని పట్టణాల్లో 184 ప్రాథమిక పాఠశాలలున్నాయి. ఇది పట్టణాలకు సంబంధించి. పల్లెల పరిస్థితి ఏమిటి? ఈ రాష్ట్రంలోని మొత్తం పల్లెల సంఖ్య 21,484. అందులో కేవలం 8,599 పల్లెల్లో మాత్రమే పాఠశాలలున్నాయి. 12,885 గ్రామాల్లో పాఠశాలలే లేవు. ప్రాథమిక విద్యా చట్టంలో సూచించిన అంశాల్ని అమలు చేయడం మాట అటుంచి, ప్రభుత్వం కనీస సౌకర్యాలను సమకూర్చడానికి కూడా ప్రయత్నించడం లేదు. అధ్యక్షా! ఈ సందర్భంలో నాకొక్క విషయం స్ఫురిస్తోంది – గౌరవనీయ ఆర్థిక మంత్రిగారికిది తోచిందో లేదో కానీ – అదేమంటే, ప్రాథమిక విద్యను నిర్బంధం చేయడానికి ఎంత ఖర్చు పెట్టవలసివస్తోంది? బొంబాయి ప్రభుత్వం ప్రాథమిక విద్యను నిర్బంధం చెయ్యాలంటే, ప్రాథమిక విద్యా కమిటీ వారి లెక్కల ప్రకారం 1.30 లక్షలు కావలసి వస్తోంది. అధ్యక్షా! ఆ మొత్తాన్ని గౌరవనీయ ఆర్థిక మంత్రి తమ పన్నుల విధింపు ప్రతిపాదనల ద్వారా వసూలు చేస్తున్నారు. ఈ పన్ను విధింపు ప్రతిపాదనల్లోని మంచి చెడులను పక్క నుంచి, నా దృష్టిని ఆ డబ్బును ఖర్చు పెట్టవలసిన ప్రయోజనాల వైపు మాత్రమే పరిమితం చేసుకొని, గౌరవనీయ ఆర్థిక మంత్రిని ఒక ప్రశ్న

వేయదల్చుకొన్నారు. మీరు 1.30 లక్షల రూపాయలు వసూలు చేయబోతున్నారు. ఆ డబ్బులను తాగుబోతులను మెరుగుపరచడానికి ఖర్చుపెట్టాలా? లేక విద్యాగంధం లేని బాలలకు విద్య నేర్పడానికి ఖర్చుపెట్టాలా? ఈ రెంటిలో మీరు దేన్ని ఎన్నుకొంటారు? అదే నా ప్రశ్న. బాలల విద్య ముఖ్యం కాదా? తాగడానికి నిర్ణయించుకున్న 10 లక్షల మంది నగర ప్రజల కంటే, 17 నుంచి 18 లక్షల మంది పిల్లల విద్య తక్కువ ప్రాధాన్యం కలిగిన విషయమా? అధ్యక్షా! ఇందులో నాకు విశ్వాసం లేదు. నేను బొత్తిగా మద్యపానం మానుకోలేని వాణ్ణి – నేనే కాదు; ప్రతి ఒక్కరూ అంతే అనుకుంటాను. కానీ వాస్తవ సమస్య ఇది. విద్యావంతుడూ, నిదానస్తుడూ అయిన వ్యక్తిని మీరు నాకిస్తే నేను అతణ్ణి ఆహ్వానిస్తాను. అయితే ఏ మాత్రం అర్థం చేసుకోలేని మూర్ఖుడూ, అప్రయోజకుడూ అయిన వ్యక్తిని తీసుకోమని మీరు ఆదేశిస్తే, నేను మాత్రం అంతో ఇంతో జ్ఞానమున్న తాగుబోతునే ఎన్నుకుంటాను. అదీ నా పరిస్థితి. గౌరవనీయ ఆర్థిక మంత్రి బ్రహ్మాండమైన పన్ను విధింపును ఈ రాష్ట్రం మీద వదిలే ముందు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవలసి వుంది.

మరొక సంగతి తీసుకోండి. నేను ప్రజారోగ్యం గురించి చెపుతున్నాను. ప్రజారోగ్యం పై ఈ రాష్ట్రం చాలా తక్కువ సొమ్ము - అంటే 31,48,000 రూపాయలు ఖర్చు పెడుతున్నది. మన మొత్తం వ్యయంలో అది రెండున్నర శాతం అవుతుంది. అధ్యక్షా! గ్రామీణ నీటి వసతి కూడా ముఖ్యమైన అవసరం. నీటి సౌకర్యం ఏమాత్రం లేని పల్లెలు వందలకొద్దీ ఉన్నాయి. పల్లెలకు వెళ్ళిన వాళ్ళెవరైనా ఈ రాష్ట్రంలో పల్లె అంటే ఒక 'పెంటకుప్ప' తప్ప మరేమీ కాదని వ్యాఖ్యానిస్తారు. అది ఒక పల్లె అనీ, జనావాసయోగ్యమైన ప్రాంతమనీ అనడం ఒక నిరర్థకం అవుతుంది. పల్లెల్లోని దుర్గంధపూరితమైన వాతావరణాన్ని బాగుచేయడం, ప్రస్తుతమున్న అతిహేయమైన పరిస్థితిని చక్కదిద్దడం – ఈ రాష్ట్రంలో తక్షణ అవసరం. మలేరియా జబ్బు కారణంగా వందల కొద్దీ ప్రజలు చనిపోతున్నారు. అటువంటి జబ్బులెన్నో ప్రజలను బలి తీసుకుంటున్నాయి. వైద్యశాలల సంఖ్య అంతంత మాత్రమే. మందులు కానీ, వైద్య సౌకర్యం కానీ ప్రజలకు అందుబాటులో ఉంచడానికి ఏరకమైన సదుపాయాలూలేవు. నేను చెప్పినట్లుగా నీటి సౌకర్యం లేదు. పోయిన సంవత్సరం 10 లక్షలు కేటాయించడం జరిగింది. ఈ సంవత్సరం సుమారు 8,55,000 రూపాయలు కేటాయించినట్లు తెలుస్తున్నది. మనకున్న అవసరాల నేపథ్యంలో ఆలోచిస్తే ఇది ఏపాటి? వైద్య సదుపాయం లేక, తాగడానికి నీరు లేక వందల కొద్దీ ప్రజలు చనిపోతున్నారు. ఆర్థిక మంత్రిగా ఈ ధనాన్ని బైబిల్‌లో చెప్పినట్లు ఆత్మలను సంరక్షించడానికీ, ఆత్మలకు బాగుచేయడానికీ బొంబాయి, అహ్మదాబాదు నగరాల్లోని10 లక్షల మంది తాగుబోతులకు స్వస్థత కలిగించడానికీ ఖర్చు పెట్టాలని నిర్ణయించుకున్నారు.

అధ్యక్షా! ఇప్పుడు మరొక విషయం తీసుకుందాం. ఈ విషయం ఇంతకు మునుపే చెప్పాను. అదేమిటంటే, మనం నగర వాసులపై పన్ను విధిస్తున్నాం. నగర జనాభా పై పన్ను ఎందుకు విధిస్తున్నాం? మనం గ్రామీణ ప్రజల సదుపాయాలను అభివృద్ధి పరచాలనుకోవడమే ఇందుకు కారణం. దీనికి సంబంధించిన చర్యలేమైనా ఈ బడ్జెట్‌లో ఉన్నాయా? నా స్నేహితులు

కొందరు అధిక ప్రాధాన్యాన్నిచ్చిన ఈ విషయంలో గౌరవనీయ ఆర్థిక మంత్రి నిజంగా ఏమైనా చేస్తూ వుంటే నేను చాలా సంతోషిస్తాను. ఈ 169 లక్షల పన్ను ఎవరిపైన ఖర్చు పెడుతున్నారు? వారు ఈ మొత్తాన్ని పట్టణాల్లోని తాగుబోతులపై ఖర్చు పెడుతున్నారు. పల్లెల్లోని పేదవారు దీని నుండి ఏ ప్రయోజనమూ పొందడం లేదు. ఈ రాష్ట్రపు భూమి శిస్తు మొత్తం రూ. 3,38,63,000. పోయిన సంవత్సరం పది లక్షలు మాఫీ చేయడం జరిగింది. అయినా ఇది శాశ్వతమైన మినహాయింపు కాదు. బడ్జెట్ మొత్తం శాశ్వత మినహాయింపు సుమారుగా 40 లక్షలుండవచ్చునని సూచించడం జరిగింది. అంటే, గ్రామీణ ప్రజానీకంపై ఇంకా మూడు కోట్ల భూమిశిస్తు భారం పడుతుంది. గౌరవనీయ ఆర్థిక మంత్రిని నేనీ ప్రశ్న అడుగుతున్నాను. వారు పట్టణవాసుల నుండి 169 లక్షల పన్ను వసూలు చేసేటప్పుడు భూమిశిస్తును పూర్తిగా ఎందుకు మాఫీ చేయకూడదు? ఆ విధంగానే జరిగితే నేను వ్యక్తిగతంగా చాలా సంతోషిస్తాను. భూమిశిస్తును మాఫీ చేయడానికే ఈ ధనాన్నంతా వారు ఖర్చు పెట్ట గలిగితే, ఈ పన్ను విధింపు విధానాలపై నేను ప్రదర్శించిన వ్యతిరేకతనంతటినీ వెనక్కు తీసుకుంటాను. వారు ఆ విధంగా చేస్తున్నారా? ఎందుకు చేయడం లేదు?

అధ్యక్షా! నేను చెప్పదలచుకున్న అంశాలు ఒకటి రెండున్నాయి. ఈ బడ్జెట్ ద్వారా గౌరవనీయ ఆర్థిక మంత్రికి గొప్పదనం తెచ్చిన సందర్భాలు రెండున్నాయి. మొదటిది – వారీ పన్నులనన్నింటినీ పట్టణ ప్రాంతాల నుండి వసూలు చెయ్యడం. ఉన్న విషయాలనన్నింటినీ మొత్తంగా అంచనా వేస్తే, అదనపు పన్ను భారం విధించక పోవడం రెండవది. ఎందుకంటే కొత్త పన్నుల రూపంలో విధించినవి మద్యపాన నిషేధం ద్వారా మినహాయించడం జరిగింది కాబట్టి, ఈ మొత్తాలన్నీ సమానమయ్యాయి. ఇప్పుడు, మొదటి విషయానికి సంబంధించి కొన్ని ముఖ్య వివరాలపై మీ దృష్టిని కేంద్రీకరించవలసిందిగా కోరుతున్నాను. ఈ దేశ పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనం చేసి వ్యవసాయం మనదేశంలో చాలా విస్తృతమైన వృత్తి అని అభిప్రాయ పడుతున్నాను. ఈ ప్రతిపాదనను సమర్థించడానికి కొన్ని వివరాలివ్వబోతున్నాను. వైశాల్యం దృష్టితో పరిశీలిస్తే బొంబాయి చాలా చిన్న రాష్ట్రమని గుర్తుంచుకోవాలి. ఈ రాష్ట్రం మొత్తం విస్తీర్ణం 76,835 చదరపు మైళ్ళు. అంటే మద్రాసు ప్రెసిడెన్సీలో సగం; పంజాబ్, సంయుక్త రాష్ట్రాలు, కేంద్ర ప్రాంతాల్లో 2/3 వ వంతు; బీహార్, ఒరిస్సాల కంటే కొంచెం తక్కువ. ఈ విషయాలను గమనంలోవుంచుకొని, ఆహార పంటలు పండించడానికి నిజంగా సాగుచేస్తున్న భూమి ఎంతో పరిశీలించండి. ఇలా సాగుచేయబడుతున్న భూమి విస్తీర్ణం 32,801,971 ఎకరాలు. అంటే ఇంతకు ముందు నేను చెప్పినట్లుగా, మన రాష్ట్రం విస్తీర్ణంలో చిన్నదైనా సాగవుతున్న భూమి వైశాల్యం తీసుకుంటే మద్రాసులో సాగవుతున్న భూమి విస్తీర్ణంతో సమానంగా వుంది. అదీ సంయుక్త రాష్ట్రం – బొంబాయి కంటే దాదాపు రెండింతలు పెద్దది. బీహార్, ఒరిస్సాలలో, కేంద్ర ప్రాంతాల్లో సాగుచేయబడుతున్న

భూమి కంటే 8 మిలియన్ల ఎకరాలు, పంజాబ్‌తో పోలిస్తే 6 మిలియన్ల ఎకరాలు అధికంగా వుంది. దీన్ని బట్టి ఈ రాష్ట్రంలో వ్యవసాయం చాలా ఎక్కువ మంది చేపట్టిన వృత్తి అనీ, వీలైనంత భూమి నంతటినీ వ్యవసాయానికి ఉపయోగించడం జరిగిందనీ, ఇంకా ప్రజలను వ్యవసాయం చేపట్టమని అనడం లో ఏమాత్రం ప్రయోజనం లేదనీ నా అభిప్రాయం. మళ్ళీ దీన్ని వ్యవసాయయోగ్యమైన బంజరు భూములతో మరో రకంగా సరిపోల్చి పరిశీలిద్దాం. సంయుక్త పరగణాల్లో వ్యవసాయయోగ్యమైన బంజరుభూమి 10 మిలియన్ల ఎకరాలైతే, మద్రాసులో 13 మిలియన్ల ఎకరాలుగానూ, కేంద్రప్రాంతాల్లో 14 మిలియన్ల ఎకరాలుగానూ, పంజాబ్‌లో 14 మిలియన్ల ఎకరాలుగానూ ఉండగా బొంబాయిలో 6 మిలియన్ల ఎకరాలుగా మాత్రమే ఉంది. అధ్యక్షా! పరిస్థితి ఈ విధంగా ఉన్నప్పుడు ఈ రాష్ట్రానికి, అలా అంటే ఈ దేశానికి మోక్షం కేవలం నగరీకరణ ద్వారానే సాధ్యమౌతుందని నేను సంపూర్ణ విశ్వాసంతో చెపుతున్నాను. మన పట్టణాలను పునరుద్ధరిం చడంలో, మన పరిశ్రమలను నిర్మించుకోవడంలో మన పల్లెల నుండి సాధ్యమైనంత జనాభాను పట్టణాలకు తరలించడంతోనే సాధ్యమౌతుంది. పల్లెల్లో ఏముంది? పల్లెల్లో మన ప్రజలకు వ్యవసాయాన్ని చేయవలసిన రీతిలో చేయడానికి అవసరమైన పెట్టుబడిలేదు. ప్రతి దశాబ్దమూ జనాభా పెరిగిపోతున్నది. కుటుంబంలో వారసులు పెరిగే కొద్దీ భూమి ఎక్కడికక్కడ ముక్కలై పోతున్నది. పరిశీలిస్తే పరిస్థితి చాలా బాధాకరంగా ఉంటున్నది. వారి జీవన ప్రమాణాలను పెంచడానికి పాత కాలపునాటి చరఖా లాంటి ఒక యంత్రాన్ని చేతికిచ్చి, పోటీ ప్రపంచంగా వున్న బజారులో ఎవ్వరూ కొనడానికి ముందుకురాని వస్త్రాన్ని నేయమని బలవంత పెట్టడమే ఏకైక మార్గం కాదు. పట్టణాల్లోని పరిశ్రమలు తదితర ఆదాయలకు మూలమైన వాటిని ధ్వంసం చేసి వాళ్ళను పల్లెలకు తప్పనిసరిగా వెళ్ళమనడం వల్ల జీవన ప్రమాణాలు పెరగవు. దీనికి పరిష్కారం మరొక వైపు నుండి ప్రారంభించాలి. సాధ్యమైనంత మంది ప్రజలను పల్లెల నుండి మళ్ళించి పట్టణాలకు తీసుకురండి. పరిశ్రమల్లో వారికి ఉద్యోగాలివ్వండి. ఆ రకంగా ఆర్థికంగా వారి జీవితాలను బాగుచేయండి. ఇదీ మార్గం. అధ్యక్షా! ఎవరైతే మనకున్న చాలా కొద్ది పరిశ్రమ లను, నగరజీవితాన్నీ నాశనం చేయదలుచుకున్నారో వారు ప్రజలకే మాత్రం ఆత్మీయులుకారు. అటువంటి వారిని నేను ఇంకా చెప్పాలంటే ప్రజలకు శత్రువులుగా మాత్రమే పరిగణిస్తాను.

ఇక రెండోవిషయం. గౌరవనీయమిత్రుడీ విధంగా అంటున్నాడు "అయినా నేను చేస్తున్నదేమిటి? నేను మొత్తాన్ని ఏవిధంగా నైనా మారుస్తున్నానా? లేదా! నేను 169 లక్షలు పెంచుతున్నాను. కానీ మద్యపానానికి సంబంధించి 125 లక్షలు, భూమిశిస్తుకు సంబంధించి 40 లక్షలూ మాఫీ చేస్తున్నాను కదా!" వారు దీని ద్వారా మంచి గుర్తింపు పొందాలని అను కుంటున్నారేమో నాకు తెలియదు. బంకమన్ను తీసుకున్న ఒక కుమ్మరి ఉదంతాన్ని వారికి నేను గుర్తు చేస్తున్నాను.

అధ్యక్షా! కుమ్మరి వాడు తనకిచ్చిన బంకమన్నుతో గణపతిని చెయ్యకుండా కోతిని చేసినా, అందమైన ఏనుగును తయారు చెయ్యకుండా గాడిదను తయారుచేసినా ఇంకా అదనంగా బంక మన్ను కావాలని అడగలేదు కాబట్టి అతడు మంచి కుమ్మరి అని మనం అంటామా? జవాబు ఏమిటో అని నాకెంతో కుతూహలంగా ఉంది. ఇది కూడా ఎలాంటిదంటే మట్టి నుండి కోతిని తయారు చెయ్యడం తప్ప మరొకటి కాదు. కాబట్టి అధ్యక్షా! నా ఉపన్యాసం ప్రారంభంలోనే చెప్పినట్లు నా అభిప్రాయం ప్రకారం పన్ను విధింపు లకు సంబంధించి ఈ బడ్జెట్ చాలా నిర్లక్ష్యపూరితమైన బడ్జెట్. వ్యయం దృష్టితో పరిశీలిస్తే అర్థం లేని బడ్జెట్. అధ్యక్షా! ఈ రాష్ట్రం చాలా ఎక్కువ పన్ను విధింపునకు గురవుతున్న రాష్ట్ర మని మనమంతా గుర్తించి తీరాలి.

బ్రిటిష్ ఇండియా ప్రాంతంలో తలసరి పన్ను విధింపు ఈ విధంగా వుంది. ఇవి నా వివరాలు కాదు – ఈ వివరాలు నేను గత సంవత్సరం గౌరవనీయ ఆర్థిక మంత్రి ఇచ్చిన బడ్జెట్ ఉపన్యాసం నుంచి స్వీకరించాను :-

| | (రూపాయలలో) |
|---|---|
| బీహార్, ఒరిస్సా | 1.29 |
| బెంగాల్ | 1.78 |
| అస్సాం | 2.26 |
| కేంద్రప్రాంతాలు | 2.72 |
| సంయుక్త పరగణాలు | 2.29 |
| పంజాబ్ | 4.43 |
| మద్రాస్ | 3.26 |
| సింధ్ | 4.90 |
| బొంబాయి | 6.00 |

ఇదొక్కటే మనం చాలా అధికంగా పన్ను విధింపునకు లోనవుతున్నామని తెలియ జేస్తున్నది. వాస్తవానికి, మన వ్యయం కూడా ఎంతగా క్రమబద్ధం చేయబడిందంటే, మనం ఖర్చు పెట్టడానికి చాలా తక్కువ వీలుంది. మన వ్యయానికి సంబంధించిన ప్రయోజనాలకు చాలా తక్కువ అవకాశముంది. వాస్తవంగా, ఈ రాష్ట్రంలో వసూళ్ళకు అయిన ఖర్చు, మొత్తం ఆదాయంలో 15 వ శాతంగా వుంది. పదవీ విరమణ భత్యం 10 శాతం, వడ్డీకి పదిన్నర శాతం పోతుంది. శాంతి భద్రతలు, న్యాయం, పోలీసు, జైళ్ళు మొదలైన వాటికి మన ఆదాయంలో 18 శాతం ఖర్చవుతున్నది. ఏ

కొద్దిగానో మిగిలితే దాన్ని ప్రజాసంక్షేమానికి ఖర్చు పెట్టడం జరుగుతున్నది. అదీ పరిస్థితి. ఈ పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. ఆదాయం విషయానికొస్తే మన సామర్థ్యం చాలా తక్కువ. ఇక ఖర్చు విషయానికొస్తే ప్రజా సంక్షేమ దృష్టితో చూస్తే మనకే మాత్రం ఉపయోగపడటం లేదు. ఇటువంటి పరిస్థితుల్లో గౌరవనీయ ఆర్థికమంత్రి మరింత జాగ్రత్తపడి వుండాల్సిందని నేను అభిప్రాయ పడుతున్నాను. వారు జాగ్రత్త వహించలేదని చెప్పవలసి వచ్చినందుకు నేను చింతిస్తున్నాను. (చప్పట్లు).

  

# 5

# ఆర్థిక చట్టం సవరణ బిల్లు పై ప్రసంగం*

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అధ్యక్షా! గౌరవనీయ ఆర్థిక మంత్రి ప్రవేశపెట్టిన బిల్లును పరిశీలించగా అది మూడు నిబంధనలు విధించతలిచినట్లు నేను గమనించాను. బిల్లులోని మొదటి అంశం ఆస్తిపన్నుకు సంబంధించిది కాగా, రెండవది, పన్ను చెల్లించని పక్షంలో విధించే జరిమానాకు సంబంధించింది. మూడవది, బిల్లులోని జరిమానా నిబంధన. గతానికి కూడా వర్తించగల స్వభావానికి సంబంధించింది. జరిమానా గతానికి కూడా అమలుకాగల స్వభావాన్ని తొలగించే సవరణను అంగీకరించేందుకు తాను సిద్ధంగా ఉన్నానంటూ గౌరవనీయ ఆర్థిక మంత్రి తన ప్రసంగంలో ప్రకటించడం మనమిప్పుడు విన్నాం. అందుకు నేను ఆర్థిక మంత్రిని అభినందిస్తున్నాను. ముందుగా ఆర్థిక మంత్రిని ఇలా అభినందించాల్సిన సందర్భం వచ్చినందుకు సంతోషిస్తున్నాను. అంతవరకు బాగానేవుంది. అయితే, నిష్ణాతులైన ఐదుగురు న్యాయవాదులు ప్రభుత్వంలో ఉన్నప్పటికీ గతానికి కూడా జరిమానా అమలుకాగల స్వభావం ఉన్న బిల్లును మొదట ప్రతిపాదించ తలపెట్టడం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఇది దిగ్భ్రాంతిని కలిగించే విషయం. ఆ రూపంలో బిల్లును ప్రవేశపెట్టి ఉండి ఉండకూడదు. ఈ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయకుండా బిల్లులోని ఇతర అంశాలలోకి వెళ్ళడం నాకు సాధ్యం కాదు. ఇక ఆ విషయాన్ని పక్కన పెట్టి బిల్లులోని ఇతర అంశాలను పరిశీలిద్దాం. ఆస్తి పన్నును విధించవచ్చా? పన్ను చెల్లించని పక్షంలో జరిమానా విధించవచ్చా? అనే రెండు ప్రశ్నలు ముందుగా పరిగణించాల్సినవి.

అందులో జరిమానా సమస్యకు సంబంధించిన రెండో అంశాన్ని గురించి నేను ముందుగా మాట్లాడతాను. బిల్లులోని ఆ విషయానికి సంబంధించిన ఒకటి రెండు అంశాలను సభ దృష్టికి తీసుకురావడం సముచితమని నేను భావిస్తున్నాను. ఆస్తి పన్నులోని మున్సిపాలిటికి సంబంధించిన పన్నును చెల్లించని పక్షంలో జరిమానా విధించేందుకు మున్సిపల్ చట్టమే ఎటువంటి నిబంధన విధించలేదన్న విషయాన్ని విద్యావంతుడైన నా మిత్రుడు గమనించి ఉండాల్సింది. బహుశా ఆయన ఆ విషయం పట్ల అంత శ్రద్ధ చూపి ఉండరు. ఆస్తి పన్నుకు సంబంధించిన అంచనా పూర్తి కాగానే బిల్లును పన్ను చెల్లించాల్సిన నివాసితులకు పంపాలని బొంబాయి నగర మున్సిపల్ చట్టంలోని 200వ సెక్షన్ నిర్దేశిస్తోంది. బిల్లు ఇచ్చిన 15 రోజుల లోగా దానిని చెల్లించాలని 202 సెక్షన్ పేర్కొంటోంది. బిల్లు ఇచ్చిన 15 రోజులలోగా దానిని చెల్లించకపోయినట్లయితే, తదుపరి చర్యగా డిమాండ్ నోటీసు

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 4, పే. 1033-37, 1939 ఆగష్టు 28

పంపాలని 203వ సెక్షన్ నిర్దేశిస్తోంది. డిమాండ్ నోటీసులో పేర్కొన్న బకాయి మొత్తాన్ని 15 రోజులలోగా చెల్లించక పోయినట్లయితే, బకాయి మొత్తాన్ని వసూలు చేసుకోవడానికి మున్సిపాలిటీకి కొన్ని హక్కులున్నాయని 203 సెక్షన్ చెబుతోంది. ఆస్తిపన్ను చెల్లించకుంటే బకాయిపడిన వ్యక్తి నుంచి దానిని వసూలు చేసుకోవడానికి మునిసిపాలిటీ చట్టం క్రింద రెండే రెండు పద్ధతులున్నాయి. పన్ను చెల్లించని వ్యక్తి ఆస్తిని స్వాధీనపరచుకోవడం మొదటి పద్ధతి. సాధారణ పద్ధతిలో ఒక వ్యాజ్యం దాఖలు చేయడం ఆస్తిపన్ను బకాయిని వసూలు చేసుకోవడానికి మునిసిపాలిటీకి ఉన్న రెండవ మార్గం. కాని, జరిమానాకు సంబంధించినంత వరకు మునిసిపల్ చట్టంలోనే ఎటువంటి నిబంధన లేదు. ఇక ఇతర చట్టాలలో ఉన్న ఇటువంటి ఆర్థిక విషయాలకొద్దాం. ఆదాయపు పన్ను చట్టంలో ఇందుకు సంబంధించి ఉన్న నిబంధనలను నేను ప్రస్తావిస్తాను. పన్ను చెల్లించని వారిపై ఒక రకమైన జరిమానా విధించేందుకు ఆదాయపు పన్ను నిబంధనలలో అవకాశముండటాన్ని నా గౌరవనీయ మిత్రుడు గమనించే ఉంటారు. ఆ చట్టంలోని 45 వ సెక్షన్ క్రింద ఆ పని చేస్తారు. అది అతి పెద్ద సెక్షన్ అయినందువల్ల దాని వివరాలలోకి నేను వెళ్ళదలచుకోలేదు. అందులోని సారాంశాన్ని మాత్రం చెప్పదలచుకున్నాను. పన్ను చెల్లించ కుండా వాయిదావేసే వారికోసం 45వ సెక్షన్‌ను ఉద్దేశించారు. అంటే పన్ను చెల్లించడం ఒక రోజు ఆలస్యం చేస్తే జరిమానా చెల్లించాల్సి వస్తుంది. అదే రెండు రోజులు ఆలస్యం చేస్తే మరికొంత జరిమానా. ఆ విధంగా జరిమానా పెరుగుతూ పోయే పద్ధతిలో ఉంటుంది. ఈ పద్ధతిలో చెల్లించాల్సిన గరిష్ఠ జరిమానా మొత్తంగా చెల్లించాల్సిన పన్నుకు సమానంగా ఉంటుంది. ఇది నిరంతరంగా పన్ను ఎగవేసే వారికి నిరంతరంగా జరిమానా వేసే నిబంధన కాదు. ఇక బొంబాయి భూమి శిస్తు నిబంధనావళి విషయానికొస్తాను. అందులో 148 వ సెక్షన్‌లో జరిమానా విషయాన్ని ప్రస్తావించారు. ఎవరైనా ఒక వ్యక్తి తాను చెల్లించాల్సిన వాయిదా మొత్తాన్ని నిర్ణీత గడువులోపల చెల్లించలేక పోయినట్లయితే కలెక్టరు జరిమానా విధించవచ్చు లేదా బాకీ పడిన మొత్తం పై వడ్డీ విధించవచ్చు. జరిమానా విధించాలా, వడ్డీ విధించాలా అనే విషయమై నిర్ణయం తీసుకునేందుకు ప్రభుత్వానికి అధికారమిచ్చే నిబంధన ఒకటి ఆ నియమావళిలో ఉంది. భూమిశిస్తు నియమావళి క్రింద బొంబాయి ప్రభుత్వం రూపొందించిన నిబంధనలన్నిటినీ పరిశీలించిన పిమ్మట, జరిమానా విధింపునకు సంబంధించి కాని, వడ్డీ విధింపునకు సంబంధించి కాని ప్రభుత్వం ఎటువంటి నిబంధనలు ఏర్పాటు చేయకపోవడాన్ని నేను గమనించాను. బకాయిపడిన మొత్తంలో నాలుగవ వంతును గరిష్ఠ జరిమానాగా నిర్ణయిస్తూ డిమాండ్ నోటీసులో ఒక యధాలాప ప్రస్తావన ఉంది. అధ్యక్షా, జరిమానా సూత్రం కొత్త అంశమన్న విషయాన్ని అంగీకరిస్తాను. కాని అది అనేక ఇతర ఆర్థిక చట్ట నిబంధనలలో ఏదో ఒక రూపంలో నిస్సందేహంగా ఉంటూనే ఉంది. మనం ఇప్పుడు పరిశీలించాల్సిన ప్రశ్న లేమిటంటే, జరిమానాను ఏ పద్ధతిలో విధించాలి? గరిష్టంగా విధించాల్సిన జరిమానా ఎంత? అనే వాటి గురించే.

ఇక బిల్లులోని ఇతర నిబంధనల విషయానికొస్తే, అవన్నీ కేవలం పరిణామ పూర్వకమైనవేనని

గౌరవనీయ మంత్రి మనకు తెలిపారు. కాని బిల్లులో అత్యంత వివాదాస్పదమైన భాగంగా దానిని పరిగణించాల్సి ఉంటుందని నేను అనుకుంటున్నాను. ఈ బిల్లులో నేను వ్యతిరేకించాల్సిన అంశమేదైనా ఉందీ అంటే అది నిజంగా, నా గౌరవనీయ మిత్రుడు ప్రతిపాదింప చూస్తున్న 24 బి సెక్షనే. ఇది కేవలం పరిణామ పూర్వక నిబంధనే అన్న వాదన గురించి ముందు పరిశీలిద్దాం. అది పరిణామపూర్వకమైందా, లేక తీవ్రమైన నిబంధనా లేక దానిని నేను విప్లవాత్మకమైనదని కూడా అనవచ్చా-

*గౌరవనీయ ఎ.బి. లాథే :* అది పరిణామపూర్వకమని నేనెప్పుడూ అనలేదు.

*డా॥ అంబేద్కర్ :* నేను ఉపసంహరించుకుంటున్నాను.

*గౌరవనీయ లాథే :* ఆ నిబంధనను మరింత స్పష్టంగా చేసేందుకే నేనా మాట అన్నాను.

*డా॥ అంబేద్కర్ :* నిబంధనను స్పష్టంచేసే ప్రయత్నం ద్వారా నా గౌరవనీయ మిత్రుడు మంత్రి బొంబాయి నగర మునిసిపల్ కార్పోరేషన్‌ను వివాదంలోకి లాగారనడంతో నాకెటువంటి సందేహం లేదు. మనమిప్పుడు ఎటువంటి స్థితిలో ఉన్నాం? పట్టణ ఆస్తికి సంబంధించి బొంబాయి మునిసిపల్ కార్పోరేషన్‌కు చెల్లించాల్సి ఉన్న బకాయి మొత్తాన్ని మొదట లెక్కింప తగిన అంశంగా పరిగణించాలా వద్దా అన్న స్థితిలో మనమున్నట్లు కనపడు తోంది. ఫిబ్రవరిలో బిల్లును మొదటి సారిగా చర్చించినప్పుడు బిల్లుపై వచ్చిన విమర్శలలో ఒక విషయాన్ని మీరు గుర్తుకు తెచ్చుకోవాలి. రాష్ట్ర పన్నులకు పట్టణ ఆస్తిని ప్రాతిపదికగా తీసుకోవడం, సంప్రదాయ సిద్ధంగా, ఉమ్మడి అభిప్రాయంతో పన్నులు విధించేందుకు మునిసిపాలిటీకి ఉన్న వెసులుబాటులోకి ప్రభుత్వం చొచ్చుకు రావడమేనని అప్పుడు విమర్శ వచ్చింది. అధికార పక్షంలోని పెక్కు మంది సభ్యులు, ముఖ్యంగా నా గౌరవనీయ మిత్రుడు జమునాదాస్ మెహతా అప్పుడు వ్యక్తం చేసిన విమర్శలలో ఒకటేమిటంటే, పన్ను విధింపునకు సంబంధించి ప్రభుత్వం తమ పరిధిలోకి చొచ్చుకువచ్చి మునిసిపాలిటీని దుర్బలి పరిచిందని వారు విమర్శించారు. బిల్లుపై వచ్చిన మరొక విమర్శ ఏమిటంటే, అటువంటి పన్నులను వసూలు చేయడానికి బొంబాయి మునిసిపాలిటీని ఒక ఏజెంటుగా చేయడం ప్రభుత్వం చేసిన పెద్ద తప్పు అని. కేంద్ర ప్రభుత్వం తాను విధించే పన్నులను, ఉదాహరణకు, ఎక్సైజ్ పన్ను, ఆదాయపు పన్ను, ఉప్పు పన్ను మొదలగు వాటిని వసూలు చేసేందుకు తన సొంత యంత్రాంగాన్ని ఏ విధంగా వినియోగిస్తోందో, అదే విధంగా బొంబాయి ప్రభుత్వం కూడా తాను విధించే పన్నులను తన సొంత సంస్థల ద్వారానే వసూలు చేసుకోవాలని అప్పుడు సూచించారు. అప్పుడు సూచించిన అంశాలలో ఇది ఒకటి. చిరకాలంగా అమలులో ఉన్న అటువంటి సూత్రాన్ని, అటువంటి అత్యంత సమర్థవంతమైన పద్ధతిని విడనాడి ఆదాయాన్ని వసూలు చేసుకునేందుకు నా గౌరవనీయ మిత్రుడు మునిసిపాలిటీ సేవలను వినియోగించు కున్నారు. అదృష్టవశాత్తు, ఇప్పుడు చేస్తున్న మాదిరిగా ఆయన అప్పుడు మునిసిపాలిటీకి అదనపు సమస్యను తెచ్చిపెట్టలేదు. పట్టణ ఆస్తి కింద బొంబాయి ప్రభుత్వం

తరపున మునిసి పాలిటీ వసూలు చేసే పన్ను మొదట లెక్కించబడగిన అంశమని చెప్పే ధైర్యం ఆయనకు అప్పుడు లేకపోయింది. ఆ విషయాన్ని ఆయన చెప్పలేదు. బిల్లును నేను పరిశీలించాను. అటువంటి అంశానికి సంబంధించిన నిబంధనేదీ నాకు కనిపించలేదు. అందువల్ల మనమిప్పుడు ఒక కొత్త పథంలో పయనిస్తున్నామని నేను అంటున్నాను. ఈ బిల్లు రాక మునుపు ఉన్న పరిస్థితి ఏమిటి? బొంబాయి నగర మున్సిపల్ చట్టంలోని 212 సెక్షన్‌ను గమనిస్తే పరిస్థితి ఇలా ఉంది. ఆ సెక్షన్ ప్రకారం బొంబాయి నగర పరిధిలోని ఆస్తిపై భూమిశిస్తు అనేది ముందుగా పరిగణించాల్సిన అంశం. ఇది మునిసిపాలిటీ విధించే మునిసిపల్ పన్నుకు లోబడి ఉంటుంది. భూమిశిస్తు తరువాత ప్రాధాన్యతా క్రమంలో మొదట వచ్చే అంశం మునిసిపల్ హక్కు. అది అప్పటి పరిస్థితి. ఇప్పుడు ఉండబోయే పరిస్థితి ఏమిటి? ఇప్పుడు ఉండబోయే పరిస్థితి ఇలా ఉంటుంది. భూమిశిస్తు అనేది మొదట పరిగణించాల్సిన అంశంగా ఉంటుంది. ప్రభుత్వానికి చెల్లించాల్సి ఉన్న ఆస్తి పన్ను రెండవ అధికార అంశంగా ఉంటుంది. ఈ ఆస్తి పన్నులో ప్రధాన ఆసక్తి ఉన్న మునిసిపాలిటీ ఆఖరి అంశంగా మిగులుతుంది. వాస్తవంగా 13 లక్షల మంది ప్రజల సంక్షేమ బాధ్యతను తన భుజస్కంధాలపై మోయాల్సిన బొంబాయి మునిసిపాలిటీ పరిస్థితి అది. అది ఆచరణీయమా? మునిసిపాలిటీ హక్కును చివరి అంశంగా చేసే బిల్లుకు మనం ఆమోదం తెలపడం సమంజసమూ, సక్రమమూ అవుతుందా? ఈ పట్టణ పన్నుకు నా గౌరవ నీయ మిత్రుడే బాధ్యుఁడు. ఆయన తన ప్రసంగం ప్రారంభంలో చెప్పినట్లుగా ఈ చర్యను ప్రజలు వ్యతిరేకిస్తున్నారు.

*గౌరవనీయ లాథే :* ఒక వర్గం ప్రజలు అని నేను చెప్పాను.

***డా॥ అంబేద్కర్ :*** అది చాలు నాకు. (నవ్వు) ఈ చర్యకు వ్యతిరేకత ఉందని ఆయన అన్నారు. ఈ చర్యకు వ్యతిరేకత ఉన్నట్లయితే అది ఎటువంటి వ్యతిరేకత? అన్న విషయాన్ని మనం గ్రహించాలి. భూమి యజమానులలో కొన్ని వర్గాల వారితో పాటుగా మొత్తంగా ముస్లిం మతస్థులందరూ ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నారు అని నేను ప్రకటిస్తే నా గౌరవనీయ మిత్రుడు ప్రతిపక్ష నాయకుడు అంగీకరిస్తారని నేను అనుకుంటున్నాను. ఇది తప్పుడు ప్రకటన అని గాని, గౌరవనీయ రెవిన్యూ మంత్రి అవగాహనలో లేని విషయాన్ని చెబుతున్నానని గాని నేను అనుకోవడం లేదు. ఇందులో కించిత్తు అతిశయోక్తి కూడా లేదని నేను అనుకుంటున్నాను. మొత్తంగా ముస్లిం మతస్థులందరూ దీనిని వ్యతిరేకించడం తప్పా, ఒప్పా అనే అంశాన్ని నేనీ దశలో పరిశీలించదలచలేదు. అయిష్టతతో ఒక వ్యక్తి పన్ను చెల్లించడానికి సిద్ధంగా లేకపోవడం కాదు. మొత్తంగా ఒక మతానికి చెందిన వారంతా దీనిని వ్యతిరేకిస్తున్నారు. అధ్యక్షా! ఈ బిల్లు కారణంగా మనకు ఎదురయ్యే పరిస్థితి ఏమిటో ఇప్పుడు చూద్దాం. ఆస్తులపై మునిసిపాలిటీ తనంతట తానుగా విధించిన పన్నులతో పాటు, బొంబాయి ప్రభుత్వం విధించి, తన తరపున మునిసిపాలిటీని వసూలు చేయమనే పన్నును కూడా మునిసిపాలిటీ వసూలు చేయాల్సి ఉంటుంది. అప్పుడు, మునిసిపాలిటీ వసూలు చేసిన ధనాన్ని, అది మన తరపున మునిసి పాలిటీ వసూలు చేసిందా లేక మునిసిపాలిటీ తనకోసం తాను వసూలు చేసుకుందా అనే

వాస్తవంతో నిమిత్తం లేకుండా నా గౌరవనీయ మిత్రుడు ఒక బందిపోటు లాగా ముందుకు వచ్చి తన్నుకు పోతాడా అని నేను అంటే అది ఆయనకు ఆమోదయోగ్యంగా ఉండకపోవచ్చు. పెరిగిపోయి ఉన్న మునిసిపాలిటీ బ్యాంకు నిల్వను చూసిన మరుక్షణమే, మునిసిపాలిటీ చెల్లించాల్సిన బకాయిలను పరిశీలించకుండా, ఆ బ్యాంకు నిల్వను పట్టుకుపోవడానికి వారెంటును చల్లగా జారీచేస్తారు. మునిసిపాలిటీ వట్టి చేతులతో మిగిలి పోతుంది. అప్పుడు మునిసిపాలిటీ ఏం చేయాలి. బిల్లు ప్రకారం అప్పుడు మునిసిపాలిటీ, ప్రజలందరి అభీష్టానికి వ్యతిరేకంగా వారి నుంచి పన్ను వసూలు చేయాల్సి ఉంటుంది. నా గౌరవనీయ మిత్రునికి ఇప్పుడు నేను ప్రతిపాదించే విషయమేమంటే, ఆయనకు ధైర్యమే ఉంటే, ఆ పన్నును స్వయంగా వసూలు చేసుకోవాలి. సంఘటితమైన ప్రతిఘటనను ఎదుర్కోవాల్సి వచ్చినట్లయితే మునిసిపాలిటీ ఈ పన్నును ఎలా వసూలు చేయగలుగుతుంది? పరదా పాటించే ముస్లిం మతస్థుల నుంచి ఈ ప్రతిఘటన ఎదురవుతుందన్న విషయాన్ని మనమందరమూ గ్రహించాలి. వారి ఇళ్ళల్లోకి వెళ్ళగలిగే ధైర్యం ఎవరికి ఉంది? వారి ఇళ్లలోకి వెళ్లి వారికెటువంటి నగానట్రా ఉన్నాయో తెలుసుకునే ధైర్యం ఎవరికుంది? ఇటువంటి సమయంలో మునిసిపాలిటీ చేయగలిగేదే ముంటుంది? దానికి పోలీసు బలగాలు లేవు కదా? ప్రజలను వత్తిడి చేయగలిగే సాధన సంపత్తి దానికి లేదు. పన్ను విధించేది ఆయనే కాబట్టి, ఆయనే ధైర్యంగా ముందుకు వచ్చి పన్ను వసూలుకు ఒక సంస్థను ఏర్పాటు చేసి ఆ పన్నును చెల్లించకూడదనుకుంటున్న వారి నుండి వసూలు చేసుకోమనండి. మునిసిపాలిటీని ఇబ్బందులకు గురిచేయడమెందుకు? అనేదే నా అభిప్రాయం. ఇక మిగిలిన విషయాన్ని నేనసలు చర్చించ దలచుకోలేదు. దానిని నేను ఖాతరు కూడా చేయను. అయితే, తనకెంత మాత్రం సంబంధంలేని కారణాల వల్ల తలెత్తే అంతటి క్లిష్ట పరిస్థితిలోకి బొంబాయి మునిసిపాలిటీని నెట్టి వేయడానికి బొంబాయి ప్రభుత్వాన్ని అనుమ తించాలా? అన్నదే నా ప్రశ్న. మీ బాధ్యత నుండి మీరెందుకు తప్పించుకోవాలి? ఇది అత్యంత పిరికితనంతో కూడిన బిల్లు అని నేను అంటే అతిశయోక్తి కాదు. అలా అనడానికి నేనేమాత్రం వెనుకా డటం లేదు. మీరు విధించే పన్ను జనాదరణ ఉన్నదే అని మీరు అనేట్లయితే, దానిని వసూలు చేసే బాధ్యత నుంచి మీరెందుకు తప్పించుకుంటున్నారు? ఆ భారాన్ని మునిసిపాలిటీ పైకి ఎందుకు నెడుతున్నారు? వాళ్ళ వనరులను మీరెందుకు వినియోగించుకుంటున్నారు? ఈ దృష్ట్యా ఈ బిల్లు పిరికితనంతో కూడిన బిల్లు అని, సమర్థింపరాని బిల్లు అని నేను భావిస్తున్నాను.

☆ ☆ ☆

# 6

# *విద్యా రంగానికి నిధులు

**డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! నేను ఎక్కువ సమయం తీసుకోదలచలేదు. ఎందుకంటే, మనకున్న సమయం చాలా తక్కువ అన్న విషయం నాకు తెలుసు. ఆ తక్కువ సమయంలోనే, గౌరవనీయ విద్యామంత్రి పరిశీలనకు కొన్ని అంశాలను తీసుకురాదలచాను.

మన పిల్లల విద్య విషయంలో మనం సాధిస్తున్న ప్రగతి అతి నెమ్మదిగా ఉందన్న వాస్తవాన్ని నేను ఆయన దృష్టికి తీసుకురాదలచాను. విద్యాభివృద్ధిపై భారత ప్రభుత్వం ఇటీవల విడుదల చేసిన నివేదికలోని అంశాలు చాలా శోచనీయంగా ఉన్నాయి. నేడు సాగుతున్న రీతిలోనే విద్యా ప్రగతి కొనసాగితే పాఠశాలలకు వెళ్ళే వయసులో ఉన్న బాలురకు విద్య నేర్పటానికి 40 సంవత్సరాలు, బాలికలకు 300 సంవత్సరాలు పడుతుందని ఆ నివేదిక పేర్కొంటోంది. అధ్యక్షా! ఇది ఈ సభ ఆలోచించాల్సిన అత్యంత నిరాశాజనకమైన అంశమని నేను మీకు విన్నవిస్తున్నాను. 1921-22 సంవత్సరం నుంచి నేటి వరకు విద్యపై చేస్తున్న వ్యయం సుమారు 39 లక్షల రూపాయల మేరకు పెరిగిందని గౌరవనీయ ఆర్థిక మంత్రి తన బడ్జెట్‌ను సభ ముందుంచిన రోజున మనకు తెలిపారు. అధ్యక్షా! విద్యపై పెరిగిన వ్యయాన్ని, పాఠశాలల్లో పెరిగిన విద్యార్థుల సంఖ్యను పరిగణనలోకి తీసుకుని పరిశీలిస్తే విద్యపై పెరిగిన వ్యయానికి అనుగుణంగా పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య పెరగలేదని తెలుస్తోంది.

1916-17 నుంచి 1922-23 వరకు గల గణాంక వివరాలను మనం తీసుకుంటే విద్య పై వ్యయం పెరుగుదల దాదాపు 100 శాతం ఉంటే, అదే కాలంలో పాఠశాలల్లోని విద్యార్థుల సంఖ్యలోని పెరుగుదల కేవలం 29 శాతం మాత్రమేనని మనకు విశదమవుతుంది. అధ్యక్షా! ఈ రాష్ట్రంలో తీవ్ర ఆర్థిక సంక్షోభ పరిస్థితులున్నాయన్న విషయం నాకు తెలుసు. విద్య విషయంలో సత్వరాభివృద్ధి ఆశించే స్థితిలో ప్రస్తుతం మనం లేమన్న విషయం కూడా నాకు తెలుసు. కాని, ఒక విషయాన్ని మాత్రం మనం ఖచ్చితంగా ఆశించవచ్చు. ఈ రాష్ట్రంలో పరస్పర విరుద్ధ ప్రయోజనాలతో పనిచేస్తున్న రెండు శాఖలున్నాయని నాకు అనిపిస్తోంది. మనకు విద్యా శాఖ ఉంది. ప్రజలను నైతికంగా, సామాజికంగా అభివృద్ధి చేయడం దాని లక్ష్యం. మరొక వైపు మనకు ఎక్సైజ్ శాఖ ఉంది. ఇది విద్యా శాఖ లక్ష్యానికి వ్యతిరేక దిశలో పనిచేస్తున్నదని నాకు అనిపిస్తోంది. అధ్యక్షా! ప్రజల నుంచి ఎంత మొత్తాన్ని ఎక్సైజ్ ఆదాయం రూపంలో వసూలు చేస్తున్నామో, కనీసం అంత మొత్తాన్ని విద్య

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 9, పే. 971-76, 1927 మార్చి 12

అధ్యక్షా! గౌరవనీయ విద్యామంత్రి దృష్టికి నేను తీసుకురాదలచిన మూడవ విషయమేమిటంటే, ఈ రాష్ట్రంలో విద్యకు మనమే విధంగా నిధులు సమకూర్చుకుంటున్నాం అనే సమాచారాన్ని అందించే అంకెలను పరికించి చూసినప్పుడు, కళాశాలలపై మనం వెచ్చిస్తున్న దాంట్లో 36 శాతం వరకు, ఉన్నత విద్యా పాఠశాలలపై మనం ఖర్చు చేస్తున్న దాంట్లో 31 శాతం వరకు, మాధ్యమిక పాఠశాలలపై మనం ఖర్చుచేస్తున్న దాంట్లో 26 శాతం వరకూ ఫీజుల రూపంలో అందుతోంది. అధ్యక్షా! ఇది విద్యను వ్యాపారం చేయడమేనని మీకు మనవి చేసుకుంటున్నాను. విద్య, అనేది ప్రతి ఒక్కరి అందుబాటులోకి తప్పనిసరిగా తీసుకురావల్సిన అంశం. విద్యాశాఖ అనేది ప్రతిఫలం ఆశించాల్సిన శాఖ కాదు. వీలైనంత ఎక్కువ మేరకు, వీలున్నన్ని మార్గాల్లో విద్యను అతి తక్కువ మూల్యానికి అందించి తీరాలి. నేనీ విన్నపం ఎందుకు చేస్తున్నానంటే, సమాజంలోని అట్టడుగు వర్గాలు మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు, కళాశాలలకు వచ్చే దశకు మనం చేరుకుంటున్నాం. అందువల్ల విద్యాశాఖ అట్టడుగు వర్గాలకు ఉన్నత విద్యను ఎంత తక్కువ మూల్యానికి అందించగలుగుతుందో అంత తక్కువకు అందించాలి. ఈ కారణంగానే ఈ రాష్ట్రంలో విద్యాపాలనకు సంబంధించి అతి స్పష్టమైన ఈ వాస్తవాన్ని గౌరవనీయ విద్యామంత్రి దృష్టికి తీసుకురాదలచాను. నా గౌరవనీయ మిత్రుడు విద్యా మంత్రి దృష్టికి నేను తీసుకురాదలచిన నాలుగవ అంశమేమిటంటే, ఈ రాష్ట్రంలో వివిధ తరగతుల మధ్య విద్యా ప్రగతి విషయంలో ఉన్న విపరీత వ్యత్యాసం. అయితే, ఈ విషయం లోకి వెళ్ళే ముందు నేనొక వాస్తవాన్ని వివరించదలచాను. అదేమిటంటే, విద్యాభివృద్ధి విషయంలో వివిధ కులాలు సాధించిన ప్రగతిని సరిపోల్చేందుకు ఈ రాష్ట్రపు జన గణన నివేదిక మొత్తం జనాభాను నాలుగు వర్గాలుగా విభజించింది. అందులో మొదటి వర్గం "అభివృద్ధి చెందిన హిందువులు". రెండవ వర్గం "మధ్యస్థ హిందువులు". రాజకీయ ప్రయోజనాల కోసం బ్రాహ్మణేతరులు అని పిలువబడుతున్న వారు అంటే, మరాఠాలు, తత్సంబంధ కులాల వారు కూడా ఈ వర్గంలో ఉన్నారు. మూడవ వర్గంగా వెనుకబడిన తరగతుల వారు ఉన్నారు. ఇందులో దళితులు, గిరిజనులు, నేర ప్రవృత్తి గల జాతులవారు ఉన్నారు. ఇక, నాలుగవ వర్గంలో మహ్మదీయులున్నారు. ఈ విభజనలను దృష్టిలో ఉంచుకుని చూస్తే, తులనాత్మకంగా విద్యాభివృద్ధి విషయంలో వివిధ కులాల మధ్య విపరీతమైన వ్యత్యాస మున్నట్లు కనపడుతుంది. ఈ వర్గాలకు చెందిన ప్రజలను జనాభా ప్రాతిపదికన వారికున్న స్థానాన్ని, విద్యాభివృద్ధి విషయంలో వారికున్న స్థానాన్ని బట్టి పోల్చిచూస్తే మనకు విశదమయ్యే దేమిటి? జనాభా ప్రాతిపదికన మొదటి స్థానంలో ఉన్న మధ్యస్థ వర్గానికి చెందిన వారు అంటే బ్రాహ్మణేతరులు కళాశాల విద్య, మాధ్యమిక విద్య, ప్రాథమిక విద్య విషయంలో మూడవ స్థానంలో ఉన్నారు. జనాభా ప్రాతిపదికన రెండవ స్థానంలో ఉన్న వెనుకబడిన తరగతుల వారు నాలుగవ స్థానంలో, జనాభా ప్రాతిపదికన మూడవ స్థానంలో ఉన్న మహ్మదీయులు రెండవ స్థానంలో ఉన్నారు. జనాభా ప్రాతిపదికన నాలుగవ స్థానంలో ఉన్న అభివృద్ధి చెందిన హిందువులు కళాశాల విద్య, మాధ్యమిక విద్య, ప్రాథమిక విద్య విషయంలో మొదటి స్థానంలో

ఉన్నారు. అధ్యక్షా, వివిధ కులాల మధ్య విద్యాభివృద్ధిలో ఉన్న తులనాత్మక వ్యత్యాసం ఏ విధంగా ఉందో రేఖామాత్రంగా నేను మీ ముందుంచాను. అయితే ఈ అంకెలు మన రాష్ట్రంలో విద్యాభివృద్ధి విషయంలో వివిధ కులాల మధ్య ఉన్న వ్యత్యాస పరిధిని ఇవ్వజాలవు. అందువల్ల గౌరవనీయ విద్యామంత్రి నిశిత పరిశీలన కోసం ఈ క్రింది అంకెలను మీ ముందుంచుతున్నాను. ముందుగా ప్రాధమిక విద్యకు సంబంధించిన అంకెలు ఈ విధంగా ఉన్నాయి.

అభివృద్ధి చెందిన హిందువులు ........ ప్రతి 1000 మందికి 119 విద్యార్థులున్నారు.

మహ్మదీయులు ....... ప్రతి 1000 మందికి 92 మంది విద్యార్థులు.

మధ్యస్థ వర్గం......... ప్రతి 1000 మందికి 38 మంది విద్యార్థులు.

వెనుకబడిన తరగతి ...............ప్రతి 1000 మందికి 18 మంది విద్యార్థులు.

ఇక మాధ్యమిక విద్య పరిస్థితి చూస్తే --

| | |
|---|---|
| అభివృద్ధి చెందిన హిందువులు - | లక్ష మందికి 3000 మంది |
| మహ్మదీయులు - | లక్ష మందికి 500 మంది |
| మధ్యస్థ వర్గం - | లక్ష మందికి 140 మంది |
| వెనుకబడిన తరగతి - | లక్ష మందికి 14 మంది |

కళాశాల విద్య విషయానికి వస్తే -

| | |
|---|---|
| అభివృద్ధిచెందిన హిందువులు - | రెండు లక్షలకు 1000 మంది |
| మహ్మదీయులు - | రెండు లక్షలకు 52 మంది |
| మధ్యస్థ వర్గం - | రెండు లక్షలకు 14 మంది |
| వెనుకబడిన తరగతి - | అసలు లేరు (ఉన్నా ఏ ఒక్కరో) |

వెనుకబడిన కులాల మొత్తం జనాభా 37.5 లక్షలుండగా కళాశాల విద్య విషయంలో వారి స్థితి ఇది. ఈ అంకెలు రెండు విషయాలను స్పష్టంగా తెలుపుతున్నాయి. మొదటిది, విద్య విషయంలో వివిధ కులాలు సమాన స్థాయిలో లేవు. ఈ అంకెలు మరో విషయాన్ని కూడా తెలుపుతున్నాయి. ఈ విషయాన్ని గౌరవనీయ సభ దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. అదేమిటంటే విద్య విషయంలో మహ్మదీయులు గొప్ప ముందడుగు వేశారు. అధ్యక్షా! ఇది ఊహాజనిత ప్రకటన కాదు. ఈ గౌరవనీయ సభ ముందు నేనుంచిన గణాంక వివరాలు 1923-24 సంవత్సరానికి బొంబాయి ప్రభుత్వ డైరెక్టర్ ప్రచురించిన నివేదిక లోనివి. నా వాదనకు మద్దతుగా సర్ ఇబ్రహీం రహీమ్‌తుల్లా

అభిప్రాయాన్ని మీకు తెలపదలుచుకున్నాను. మహ్మదీయ కాన్ఫరెన్స్ అధ్యక్ష స్థానం నుంచి ఆయన కూడా ఇటువంటి వ్యాఖ్యే చేశారు. మహ్మదీయుల విద్యా విషయంలో ప్రభుత్వం చేస్తున్న కృషిని ఆక్షేపించడానికో, లేక ఆ కృషి పట్ల ఈర్ష్యతోనో నేనీ ప్రకటన చేయడం లేదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఈ దేశం వివిధ కులాల, మతాలతో కూడుకుని ఉన్నదనే విషయాన్ని నేనిక్కడ నొక్కి చెప్పదలచుకున్నాను. అంతస్తు, అభివృద్ధి విషయంలో అవి అసమానంగా ఉన్నాయి. వాటన్నిటినీ సమాన స్థాయికి తీసుకురావాలంటే, అసమాన సూత్రాన్ని అమలు చేసి తక్కువ స్థాయిలో ఉన్న వారికి అనుకూలమైన ఆదరణ చూపే పద్ధతిని అనుసరించడమొక్కటే మార్గం. సమాన ఆదరణ అన్న సూత్రానికి అంటిపెట్టుకుని, దీనికి అభ్యంతరం తెలిపేవారు కొంత మంది ఉన్నారన్న విషయం నాకు తెలుసు. అయితే మహ్మదీయుల విషయంలో ఈ అసమాన సూత్రాన్ని ప్రభుత్వం చక్కగా వర్తింపచేసింది. అసమానంగా ఉన్న ప్రజలకు సమాన ఆదరణ అన్న సూత్రాన్ని వర్తింపచేయడం అంటే అది నిర్లక్ష్యానికి, ఉదాసీనతకు మారుపేరేనని నేను నిజాయితీగా విశ్వసిస్తున్నాను. వెనుకబడిన తరగతులవారికి వర్తింపచేయటానికి ఈ అసమాన సూత్రం తగినదేనని ప్రభుత్వం ఇంకా అనుకోలేదనేది మాత్రమే నా ఫిర్యాదు. ఆర్థికంగా మాట్లాడినా లేదా సామాజికంగా మాట్లాడినా మరే ఇతర కులం వారూ ఎదుర్కొనని, ప్రతిబంధకాలను వెనుకబడిన కులాల వారు ఎదుర్కొంటున్నారు. అందువల్ల వారి విషయంలో ఈ అనుకూల ఆదరణ సూత్రాన్ని వర్తింపచేసి తీరాలని నేను అనుకుంటున్నాను. నేను చెప్పినట్లుగా, వెనుకబడిన తరగతుల వారి పరిస్థితి మహ్మదీయుల కంటే హీనంగా ఉంది. అర్హులైన వారికి, అత్యవసరమైన వారికి అత్యంత అనుకూల ఆదరణ చూపదల్చుకుంటే, మహ్మదీయుల కంటే వెనుకబడిన కులాల వారిపట్ల ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ చూపాలని, వారే అందుకు ఎక్కువ అర్హులనేదే నా విన్నపం. ఈ సభ ముందు నేను ప్రముఖంగా ఉంచాలనుకున్న సమస్య ఇదే. మహ్మదీయులను పైకి తీసుకురావడానికి ఏ పద్ధతులను సూత్రాలను అనుసరించారో, వెనుక బడిన తరగతులవారిని పైకి తీసుకురావడానికి కూడా వాటినే అనుసరించాలని గౌరవనీయ విద్యామంత్రిని నేను కోరుతున్నాను. అధ్యక్షా! 1882 విద్యా కమీషన్ నివేదిక పై 1885 లో భారత ప్రభుత్వం జారీ చేసిన ఆదేశాలను గౌరవనీయ మంత్రి దృష్టికి నేను తీసుకురాదలిచాను. మహమ్మదీయుల విద్యాభివృద్ధికి పలు ప్రతిపాదనలను భారత ప్రభుత్వం చేసింది. అయితే ఆ ప్రతిపాదనలన్నిటిలోకి మహమ్మదీయ విద్యావసరాలను తెలుసుకునేందుకు, విద్యావశ్యకతను వారికి తెలియచెప్పేందుకు ప్రత్యేక తనిఖీ సిబ్బందిని నియమించాలనే ప్రతిపాదనపై భారత ప్రభుత్వం గట్టి శ్రద్ధ చూపింది. దళితుల విద్య విషయంలో ప్రత్యేక తనిఖీ సిబ్బంది ఆవశ్యకత కూడా అంతగానే ఉందని నేను అనుకుంటున్నాను. అధ్యక్షా! ప్రాథమిక విద్యాచట్టం ఒక పెద్ద తప్పు అని నేను చెప్పదల్చుకున్నాను. గౌరవనీయ సభ్యులు బహుశా నాతో అంగీకరించకపోవచ్చు! కాని అది తప్పుడు చట్టమని, అంతేకాదు అందులో రెండు విధాలైన తప్పిదాలున్నాయని నేను అంటాను. అది ఎందుకు తప్పుడు చట్టం అంటే, విద్య ఎంతో అవసరం అని అవగాహన చేసుకునేంతటి వివేచన లేనటువంటి వారిచేతుల్లోకి

విద్యా బాధ్యతను అది బదలాయించింది. విద్య అవసరం తెలిసిన వారెవరూ ఈ సభలో కనపడటం లేదు. స్థానిక మండలి సభ్యులు విద్య అనేది అవసరం అని గ్రహించలేనంతటి అవిద్యావంతులు. అందువల్ల, విద్య అనేది అవసరం అని భావించని వ్యక్తుల చేతుల్లోకి విద్యా బాధ్యతను బదలాయించి ఈ సభ తప్పు చేసిందని అంటున్నాను. అంతే కాకుండా, స్థానిక సంస్థలకు విద్యను బదలాయించడం కూడా తప్పేనని అంటున్నాను. ఎందుకంటే, ఇలా బదలాయించి అవి మోయలేనంత భారాన్ని వాటి భుజస్కందాలపైకి ఎత్తారు. అధ్యక్షా! ప్రజలను విద్యావంతులను చేయడం అనేది పెద్ద ఖర్చుతో కూడుకున్న విషయం అన్న సంగతి మనకందరికీ తెలుసు. ఆ ఖర్చును భరించ గలిగే వారెవరైనా ఉంటే అది 15.5 కోట్ల రూపాయిల ఆదాయం కలిగిన ఈ సభే తప్ప, కొన్ని లక్షల రూపాయిల ఆదాయం మాత్రమే కలిగిన స్థానిక సంస్థలు కాదు. అధ్యక్షా! స్థానిక సంస్థలకు విద్యను బదలాయించి ఈ సభ ఆచరణలో ప్రజలలో విద్యా వ్యాప్తిని నిరవధికంగా వాయిదా వేసి గొప్పతప్పిదం చేసిందని నేను భావిస్తున్నాను. అధ్యక్షా! నేను చెప్పదలుచుకున్న విషయంలో అంటే, ఈ తప్పు వల్ల బాధితులైన వారు కేవలం దళిత వర్గాలు మాత్రమేనన్న విషయంలో ఇది ప్రాథమికమైన అంశం మాత్రమే. గౌరవనీయ స్థానిక స్వపరిపాలనా శాఖ మంత్రి పట్ల ఎంతో మర్యాదతో నేనొక విషయం చెప్పదలుచుకున్నాను. ఆయన శాఖకు చెందిన స్థానిక సంస్థలు తమను తాము మ్యూజియంల వలే భావించుకుంటున్నాయి. మ్యూజియంలో ప్రతి జాతికి సంబంధించిన ఒక్కొక్క వస్తువుకు స్థానం కల్పించడం తన లక్ష్యమని మ్యూజియం సంరక్షకుడు భావించినట్లుగా ప్రతి స్థానిక సంస్థలోను దళిత వర్గాలకు చెందిన ఒకే ఒక ప్రతినిధికి స్థానం కల్పించారు. దళిత వర్గాలకు ప్రయోజనం చేకూర్చే విధానాన్ని స్థానిక సంస్థ చేపట్టేట్లు చేయడం కోసమే దళిత వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించినట్లయితే, అది నిష్ఫలమే అవుతుంది. ఎందుకంటే, పది లేక పన్నెండు మంది సభ్యులుండే స్థానిక సంస్థలో ఒక వ్యక్తికి విలువేముంటుందో నాకు అర్థం కావడం లేదు. ప్రస్తుత ప్రభుత్వ హయాంలో దళిత వర్గాలు అత్యంత నిస్సహాయ స్థితిలో ఉన్నాయన్న ఫిర్యాదులను రాష్ట్రం నలుమూలల నుంచి వింటున్నాను.

పురోగమనం, అభివృద్ధుల గురించి దళిత వర్గాల వారికున్న ఆశలు, ఆకాంక్షలను ఏ రకంగాను పంచుకోని వ్యక్తులు వారి చుట్టూ ఉన్నారు. అందువల్ల, విద్య వంటి అత్యంత కీలకాంశానికి బాధ్యత వహిస్తున్న స్థానిక సంస్థలు దళిత వర్గాలను నిర్లక్ష్యం చేయకుండా ఉండే టట్లు చూసేందుకు తమ ప్రత్యక్ష నియంత్రణలో ఉండే ఒక తనిఖీ విభాగాన్ని ఈ ప్రభుత్వం ఏర్పాటు చేయాలని నేను కోరుతున్నాను. అటువంటి విభాగం ఎంతో అవసరమని భావిస్తున్నాను.

దళిత వర్గాలకు సంబంధించి నేను చెప్పదలుచుకున్న రెండో విషయమేమిటంటే, వెనుకబడిన తరగతులవారి ఉపకార వేతనాల కోసం బడ్జెట్‌లో కొంత మొత్తాన్ని కేటాయించారు. బడ్జెట్‌లో ఉపయోగించిన "వెనుకబడిన తరగతులు" అన్న పదాలకు అర్థమేమిటో నేను అర్థం చేసుకోలేకపోతున్నాను.

దళిత విద్యార్థిని చెడు పరిసరాల నుంచి దూరంగా ఉంచుతుంది. సమర్థమైన పర్యవేక్షణకు అవకాశం ఉంటుంది. వసతి గృహాన్ని ప్రైవేటు సంస్థే నిర్వహించినట్లయితే ప్రభుత్వానికి కొంత ధనం కూడా ఆదా అవుతుంది. అధ్యక్షా! నాకున్న అతి తక్కువ సమయంలో నేను చేయదలచుకున్న మూడు సూచనలు ఇవే. నా గౌరవనీయ మిత్రుడు, విద్యా మంత్రి వీటిని నిశితంగా పరిశీలించి అవసరమైన చర్యలు చేపట్టగలరని నేను ఆశిస్తున్నాను.

☆ ☆ ☆

# 7

# బొంబాయి విశ్వ విద్యాలయ చట్ట సవరణ బిల్లుపై ప్రసంగం – 1*

**డా॥ అంబేద్కర్ :** బొంబాయి విశ్వవిద్యాలయ సభ్యుడైన గౌరవమిత్రుడి ఉపన్యాసాన్ని శ్రద్ధతో విన్నాను. వారు ఒక గంటా ఇరవై నిముషాల పాటు ఎంతగా విషయాన్ని గురించి మాట్లాడారంటే, నాకు చెప్పటానికి ఏమీ మిగల్చలేదు. అయినా అదృష్టవశాత్తూ, బొంబాయి విశ్వవిద్యాలయ ప్రతినిధిగానీ, ఈ రోజు మనం చర్చిస్తున్న ఈ ముఖ్యమైన బిల్లు గురించి మనకు సలహాలనివ్వడానికి ప్రత్యేకంగా పిలిపించిన గౌరవమిత్రుడు ఆచార్య హామిత్ గానీ ఈ సభ ముందుంచని విషయం ఒకటుంది. అధ్యక్షా! గౌరవనీయ మిత్రులు శ్రీ మున్షీ బొంబాయి విశ్వవిద్యాలయానికి సంబంధించిన వ్యవస్థాగత విషయాల గురించి ఎక్కువగా మాట్లాడారు. బిల్లులో పొందుపరచిన సిండికేటు, సెనేట్, అకడమిక్‌కౌన్సిల్‌ల మధ్య ఉండవలసిన సంబంధాల గురించి సుదీర్ఘంగా చర్చించారు. విశ్వవిద్యాలయ సభ్యుడయ్యే సదవకాశం నాకు లభించలేదు. అందువల్ల ఆ బిల్లు కలిగించిన సదుపాయాలు మనం ఆశించిన ఫలితాలనిస్తాయా? అన్న విషయం గురించి నేను వారిలాగే అంతే అధికారంతో చెప్పలేను. కానీ, అధ్యక్షా! ఇక్కడ నేను గౌరవనీయులైన నా మిత్రుడికి చెప్పదల్చుకున్న అంశం ఒకటుంది.

అదేమంటే, పైన చెప్పిన మూడు విభాగాల మధ్య, గౌరవనీయ మిత్రులు చెప్పినట్లు, సంబంధాలను వ్యవస్థీకృతం చేయడంలో మనం ఎంత కృతకృత్యులమైనా, చివరికి మనకు మిగిలేది ప్రతిబింబం మాత్రమే – అసలైన రూపం కాదు. అధ్యక్షా! గౌరవనీయ విద్యామంత్రి వెలిబుచ్చిన అభిప్రాయాన్ని అర్థం చేసుకుంటే ఈ బిల్లు ప్రాథమికంగా బొంబాయి విశ్వ విద్యాలయాన్ని గొప్ప కేంద్రంగా రూపుదిద్దడానికి ఉద్దేశింపబడిందని తెలుస్తున్నది. అది ఈ బిల్లు ముఖ్య లక్ష్యాలలో ఒకటని నేను భావిస్తున్నాను. అధ్యక్షా! ఇక ఈ బిల్లులో పొందుపరచిన నిబంధనలను పరిశీలిస్తే మాత్రం ఈ విషయంలో మనం ఎంతో ఆశాభంగానికి గురికావల్సి వస్తుంది. స్థాపించిన నాటి నుంచి ఈ విశ్వవిద్యాలయంలో ఉన్న ముఖ్యమైన లోపం ఏమిటంటే – దీన్ని ప్రాథమికంగా కేవలం పరీక్ష సంస్థగా మాత్రమే తీర్చిదిద్దడం జరిగింది.

అధ్యక్షా! ఒక విశ్వవిద్యాలయం కేవలం పరీక్షలు నిర్వహించడం ద్వారా పరిశోధనను ప్రోత్సహించడం లోనూ, ఉన్నత విద్యలను అభివృద్ధి పరచడం లోనూ విజయవంతం కాలేదు. ఈ

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 20, పే. 825–33, 1927 జూలై 27

విషయాన్ని విశ్వవిద్యాలయ కమిషన్ 1902 లోనే గుర్తించి – ఆ తరువాత వచ్చిన కమిషన్ నివేదికలో విశ్వవిద్యాలయ స్థాపనకు మూలమైన శాసనాన్ని పరీక్షల నిర్వహణకు మాత్రమే పరిమితం కాకుండా, బోధనను కూడా ప్రారంభించేందుకు వీలుగా మార్చాలని గుర్తించడం జరిగింది. అయితే 1904 లో ఆ ప్రత్యేక చట్టం అమల్లోకి వచ్చినప్పుడు, అప్పటికే స్థిరపడి వున్న కొన్ని కళాశాలలు ఉన్నత విద్యా నిర్వహణ విషయంలో విశ్వవిద్యాలయాన్ని అడ్డుకోవడం జరిగింది. అందువల్లనే, అటువంటి పరిస్థితుల్లో విశ్వవిద్యాలయం చేయగలిగింది తన పరిధిని కేవలం స్నాతకోత్తర విద్యకు పరిమితం చేసుకోవడమే. అందుకే 1912 నుంచి ఆ మార్గంలోనే పయనిస్తూ బొంబాయి విశ్వవిద్యాలయం స్నాతకోత్తర విద్యార్థుల కోసం సామాజిక – ఆర్థిక శాస్త్ర విభాగాలను ప్రారంభించింది. 1904 చట్టం ద్వారా తన కప్పజెప్పబడిన బాధ్యతలను నిర్వర్తించడానికి విశ్వవిద్యాలయం మరికొన్ని ఇతర స్నాతకోత్తర విభాగాలను ప్రారంభించే ఉద్దేశ్యంతో ఉంది. అధ్యక్షా! ఈ బిల్లును తయారు చేసిన వారిపై గౌరవంతోనే నేనొక మాట చెప్పదలుచుకున్నాను. ఈ విధంగా పరీక్షల నిర్వహణ, బోధన అనే రెండు బాధ్యతలను వహించే విధానం ఫలితాల గురించి తగినంత శ్రద్ధ చూపలేదని మాత్రమే నేను చెబుతున్నాను. అధ్యక్షా! 1904 నాటి చట్టం ప్రకారం, విశ్వవిద్యాలయానికి సంక్రమించిన రెండు బాధ్యతల ద్వారా విశ్వవిద్యాలయం తనను తాను స్నాతకోత్తర రంగానికి పరిమితం చేసుకొని, పట్టభద్ర రంగాన్ని కళాశాలలకు కేటాయించడం కొంత వరకు ప్రతిస్పర్థకు కారణమయిందని నేనంటే గౌరవనీయ మిత్రులు ప్రొఫెసర్ హామిల్, శ్రీమున్షీ నన్ను క్షమిస్తారనుకుంటాను. ఇది ఈ రెండు రకాలైన విద్యా సంస్థల మధ్య ఒక విధమైన శత్రుత్వాన్ని ఏర్పరచిందని నేనంటాను. ఈ విషయంలో నా అనుభవం చాలా పరిమితమైనదే అయినా నేను కూడా కొంత కాలం వరకు ఒక కళాశాలలో ఆచార్యుడుగా పని చేశాను కాబట్టి, ప్రస్తుతం ఆ పదవిలో కొనసాగుతున్న నేను నా పాత మిత్రులను కలిసే అవకాశం ఉంది. వారి ద్వారా విశ్వవిద్యాలయాల్లోనూ, కళాశాలల్లోనూ పనిచేస్తున్న ఆచార్యుల మధ్య ఉండవలసినంత సుహృద్భావ వాతావరణం లేదని తెలిసింది. అధ్యక్షా! అది తప్పనిసరిగా నిజమే అయివుండాలి. విద్యావిషయికంగా విశ్వవిద్యాలయాలతో సమానమైన కృషి చేస్తున్న కళాశాలల కంటే విశ్వవిద్యాలయాలు తమకు తామే అధికం అని భావిస్తూ ఉంటే, అటువంటి విశ్వవిద్యాలయాల పట్ల కళాశాలలు ఈర్ష్య చూపడం సహజంగానే జరుగుతుంది. ధ్యక్షా! ఈ రకంగా విశ్వవిద్యాలయాల్లోనూ, కళాశాలల్లోనూ పనిచేసే ఆచార్య వర్గం మధ్య త్సంబంధాలు లేకపోతే వారు చేసే పరిశోధనకు గానీ, జ్ఞానాభివృద్ధికిగానీ, అటు కళాశాలలకు గానీ ,టు విశ్వవిద్యాలయాలకుగానీ, మొత్తం మీద ప్రజలకు గానీ ఏ మాత్రం ఉపయోగం ఉండదని నేను మనవి చేస్తున్నాను.

అధ్యక్షా! విశ్వవిద్యాలయానికి పట్టభద్రస్థాయి విద్యకి సంబంధించిన అనుభవం కొంతయినా ఉంటే తప్ప వారు చేస్తున్న స్నాతకోత్తర కృషి ఏ రకమైనదైనా వినియోగపడదు. ప్రస్తుతమున్న కళాశాలల పరిస్థితిని మనం ఏ విధంగా పరిగణించాలి? ప్రభుత్వ కళాశాలలు తప్ప తక్కిన కళాశాలల్లో

ఎక్కువ భాగం ప్రైవేటు వ్యక్తుల ప్రయత్న ఫలితంగా ఏర్పడ్డవే. అటువంటి కళాశాలల్లో పట్టభద్రులకు సంబంధించిన శిక్షణ సంతృప్తికరంగా లేదని నేనంటే అది ఆ కళాశాలల్లో పని చేస్తున్న వారిని నేను అగౌరవపరచినట్టుకాదు. మొదట – కళాశాలల్లో తగినంత సిబ్బంది లేరు. ఉదాహరణకు నాకు ప్రావీణ్యం గల చరిత్ర, రాజకీయ – ఆర్థిక శాస్త్రాలను తీసుకుందాం. ఈ విషయాలను బోధించడానికి సాధారణంగా ఇద్దరు ఆచార్యులుండటం నేను గమనించాను. ఎంతో విషయ విస్తృతి వున్న చరిత్ర, రాజకీయ ఆర్థిక శాస్త్రాన్ని ఇద్దరు ఆచార్యులు సంపూర్ణంగా బోధించగలరను కోవడం హాస్యాస్పదంగా వుంది. ప్రతి ఆచార్యుడు రోజుకు 13 గంటల పాటు బోధన చేయవలసి వుంటుందని నేనంటే గౌరవనీయ మిత్రులు ఆచార్య హామిల్ నన్ను క్షమిస్తారనుకుంటాను. ఆ రకంగా బానిసలాగా పనిచేసే ఆచార్యుడే ఏనాటికీ నిజమైన అధ్యాపకుడు కాలేడు. అతడు కేవలం తయారుచేసుకున్న నోట్సును మాత్రమే బోధించే ఒక అసమర్థుడైన ఉపాధ్యాయుడవుతాడు. అటువంటి వ్యక్తి నుండి మనం ఎటువంటి మౌలిక ప్రతిభనూ ఆశించలేము. అటువంటి వ్యక్తి తన బోధనను వినవలసిన దౌర్భాగ్య పరిస్థితిలో వున్న వారికి కూడా ఏ రకమైన ప్రోత్సాహాన్నీ ఇవ్వలేడు. వారి దృష్టిలో అధ్యయనం కేవలం ఒక యాంత్రిక తతంగం మాత్రమే. కళాశాలల్లో సిబ్బంది తక్కువ సంఖ్యలో వుండడం మాత్రమే కాదు, వారు కళాశాలకు ఏదో ఇవ్వగలిగే వారు కాకుండా, తక్కువ జీతాన్ని తీసుకోవడానికి సంసిద్ధులుగా ఉన్నవారు కూడా కావడం గమనించదగ్గది. పట్టభద్రులలో ఉత్సాహమున్న వారెవరైనా కళాశాల స్థాపించనూవచ్చు, వారిలో బోధన నడిపించనూ వచ్చు. అధ్యక్షా! ప్రస్తుత మున్న పట్టభద్ర స్థాయి పనితీరే ఇటువంటి దుస్థితిలో ఉంటే, దానిపైన స్నాతకోత్తర స్థాయి విద్యని కూడా విశ్వవిద్యాలయాల్లో కేవలం బలవంతంగా రుద్దడం ద్వారా నిజమైన జ్ఞానాన్ని గానీ, పరిశోధననిగానీ ఏమాత్రం ప్రోత్సహించలేము. ప్రస్తుత విద్యావ్యవస్థలో ఎంతో దుబారా కావడం మూడవ అంశం. విశ్వవిద్యాలయాలను, కళాశాలలను చక్కగా వ్యవస్థీకరించడం ద్వారా ఈ దుబారాను సునాయాసంగా అరికట్టవచ్చు. ఉదాహరణకు బొంబాయి నగరంలో రాజకీయ ఆర్థిక శాస్త్ర బోధనను తీసుకుందాం. అధ్యక్షా! సైడన్హాం కామర్స్ కాలేజిలో చరిత్ర, రాజకీయార్థిక శాస్త్రం, వాణిజ్య భూగోళ శాస్త్రాలను మాత్రమే బోధించడానికి నాకు తెలిసి సుమారు ఆరుగురు ఆచార్యులున్నారు. అదే విషయాలను బోధించడానికి విల్సన్ కళాశాలలో ఇద్దరు ఆచార్యులు ఉన్నారు. ఎల్ఫిన్ స్టోన్‌లో ఇద్దరున్నారు. సెయింట్ గ్జావియర్స్‌లో కూడా ఇద్దరే ఉన్నారు. మొత్తం మీద అధ్యక్షా! బొంబాయి నగరంలో చరిత్ర, రాజకీయార్థిక శాస్త్రాలను మాత్రమే బోధిస్తున్న అధ్యాపకులు మొత్తం పన్నెండు మంది ఉన్నారు. ఈ నాలుగు కళాశాలలో 12 మంది ఆచార్యుల బోధన నగరంలో వివిధ కళాశాలల విద్యార్థులందరూ ఒక కళాశాలలో వినగలిగేటట్లు ఏర్పాటు చేయగలిగితే తక్కిన కళాశాలల్లో అదే విషయాలను బోధిస్తున్న ఆచార్యులు సునాయాసంగా మరొక రకమైన సమాజ సేవను చేయగలుగుతారు. ఇదే గనుక సాధించగలిగితే వివిధ కళాశాలల్లో ఒకే అంశాన్ని బోధిస్తున్న ఈ 12 మంది అధ్యాపకులూ, పట్టభద్ర స్థాయి బోధన మాత్రమే కాక, స్నాతకోత్తర స్థాయి బోధనను కూడా ఎంతో సమర్థవంతంగా

నిర్వహించగలుగుతారని నేను నిస్సందేహంగా చెప్పగలను. అందువల్ల ఇప్పటివరకూ సమాజశాస్త్రం, ఆర్థికశాస్త్రాల విస్తరణ కోసం మనం చేస్తున్న ఖర్చును తప్పనిసరిగా ఇతర అవసరాలకు వాడుకోవచ్చు. అధ్యక్షా! ఈ రకమైన దుబారా స్నాతకోత్తర స్థాయిలో చరిత్ర, రాజకీయార్థిక శాస్త్రాలకు సంబంధించిన శాఖలలో మాత్రమే జరగడం లేదు. ఈ దుబారా విశ్వవిద్యాలయం తనకు తాను స్నాతకోత్తర స్థాయి పరిశోధనకు పరిమితం చేసుకొనే ఏ విషయంలోనైన జరిగే అవకాశం వుంది. ఎందుకంటే మన కళాశాలలు చిన్నపాటి విశ్వవిద్యాలయాల్లాగా ఉన్నాయి కాబట్టి. ప్రతి కళాశాల దాదాపు అన్ని శాస్త్రాలనూ బోధిస్తుంది. అందుకోసం విశ్వవిద్యాలయం నిర్దేశించిన పరీక్షల దృష్టితో ఆయా శాస్త్రాల్ని బోధించడానికవసరమైన ఆచార్యులతో కూడిన సిబ్బంది వుంది. ఈ పరిస్థితుల్లో విశ్వవిద్యాలయాలు స్నాతకోత్తర స్థాయికోసం ప్రత్యేకంగా ఆచార్యులను నియమించుకుంటూ పోతే, నేను ఇంతకు ముందు నా ప్రసంగంలో చెప్పిన దుష్ఫలితాలే కాకుండా, 'పాడిందేపాటరా' అన్నట్టుగా తయారై ఎంతో దుబారా జరుగుతుంది. అందువల్ల, అధ్యక్షా! బిల్లు లక్ష్యం ఉన్నత విద్యనూ, పరిశోధననూ అభివృద్ధి చేయడమే అయితే, అందుకు మంచి పద్ధతి ఇప్పటిలాగా కళాశాలలను విశ్వ విద్యాలయాల నుండి వేరు చేయడం కాదు. కళాశాలలకు, విశ్వవిద్యాలయాలకు మధ్య సమభావాన్ని పాదుగొలిపి అవి రెండూ పట్టభద్ర, స్నాతకోత్తర స్థాయి విద్యాభివృద్ధికి సమాన భాగస్వాములయ్యేట్లు సమన్వయ ధోరణిని ప్రోత్సహించడమే సరైన మార్గం. అధ్యక్షా! ఇప్పటివరకూ నేను చెప్పినవి నా మాటలు కావు. ఇవి కలకత్తా విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఇలాంటి సమస్యను విశ్లేషిస్తూ సాడ్లర్ కమిషన్ చేసిన ప్రతిపాదనలు. ఈ దేశంలో ఏర్పాటైన కమిషన్లలో సాడ్లర్ కమిషన్ ఒక గొప్ప కమిషన్ అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఈ ప్రభుత్వం తమ పనిలో ఏమాత్రం నైపుణ్యం లేని వ్యక్తులు తయారుచేసిన నివేదికను చూసి అతిగా గర్వపడుతూ, సాడ్లర్ కమిషన్‌లో నిపుణులు చేసిన సుదీర్ఘమైన, సమర్థమైన తీర్మానాలను దెబ్బకొట్టడానికి ఏరకంగా ప్రయత్నిస్తున్నదో నాకే మాత్రం అర్థం కావడం లేదు.

బొంబాయి విశ్వవిద్యాలయాన్ని పునర్వ్యవస్థీకరించేందుకు యూనివర్సిటీ కమిటీ వారు తయారుచేసిన నివేదికను అత్యంత శ్రద్ధతో చదివాను. బొంబాయి విశ్వవిద్యాలయం కమిషన్ వారి సూచనల కంటే సాడ్లర్ కమిషన్ వారు చేసిన ప్రతిపాదనలు ఎంతో సమర్థవంతంగానూ, ప్రయోజకరంగానూ ఉన్నాయనే నా అభిప్రాయాన్ని మార్చుకోడానికి అవసరమైన అంశమేదీ నాకు ఈ నివేదికలో కనపడలేదు.* గౌరవనీయ మిత్రుడు విద్యామంత్రి ఇప్పటికైనా ఏదో ఒక రీతిలో - అంటే ఈ బిల్లులోనే కొన్ని నిబంధనలను పొందుపరచడం ద్వారా గానీ, నియమాలను తయారుచేసే విషయంలో సెనేట్‌కు అధికారాలివ్వడం ద్వారా గానీ విశ్వవిద్యాలయాలకు భౌగోళికంగా చాలా దగ్గరగా ఉన్న అంతర్గత కళాశాలపై ఎక్కువ నియంత్రణ విధించే అవకాశం కల్పించడం సమంజసంగా వుంటుందని నేను భావిస్తున్నాను. పూనాను ఒక ప్రత్యేకమైన విశ్వవిద్యాలయ స్థాపన కనుగుణమైన

* అంబేద్కర్ రాసిన బొంబాయి విశ్వవిద్యాలయ సంస్కరణ కమిటీకి సంబంధించిన అభిప్రాయం - అనుబంధం - 3 లో వుంది.

స్థలంగా కమిటీ అంగీకరించింది. ఆ విధంగానే బొంబాయి కూడా అందుకు తగింది అనడంలో ఏ మాత్రం సందేహంలేదు. ఈ రెండు ప్రదేశాల్లోనూ ఉన్న కళాశాలలను వేరుచేసి, ఒక విశ్వవిద్యాలయంగా పరిగణిస్తే, ఉన్నత విద్యనూ, పరిశోధననూ ప్రోత్సహించాలన్న సమస్యకూడా పరిష్కరింపబడుతుంది. ఇకపోతే రాష్ట్ర మంతటా విస్తరించిన 'మొఫసిల్' కళాశాలల విషయానికొస్తే, ఆ సమస్యను సాడ్లర్ కమిషన్ ప్రతిపాదించినట్లుగా ఒక మొఫసిల్ బోర్డును స్థాపించడం ద్వారా సులభంగా పరిష్కరించవచ్చు. ఈ సంస్కరణల కమిటీ రెక్టర్‌ను నియమించమని చేసిన ప్రతిపాదన కంటే సాడ్లర్ కమిషన్ సూచన నూరు రెట్లు ప్రయోజనకారిగా వుందని నా అభిప్రాయం. అధ్యక్షా! విశ్వవిద్యాలయ వ్యవస్థాగత విషయాల గురించి మాత్రం ఈ మాటే నేను చెప్పదలుచుకున్నాను.

ఇక ప్రస్తుతం, సెనేట్ నిర్మాణం గురించి చెబుతాను. నిన్న గౌరవనీయులైన నా మిత్రుడు శ్రీ జాదవ్ తన ఉపన్యాసంలో విశ్వవిద్యాలయ స్థాపన లక్ష్యాలు, కారణాలకు సంబంధించిన ప్రకటన బొంబాయి విశ్వవిద్యాలయ సెనేట్‌లో వెనుకబడిన తరగతుల వారికి ప్రాతినిధ్యమివ్వాల్సిన అవసరాన్ని గుర్తించడం లేదన్న కారణంగా సభలో ఎంతో వాగ్యుద్ధం జరిగింది. గౌరవనీయ మిత్రుడు బొంబాయి విశ్వవిద్యాలయ సభ్యుడు ఒక్కసారిగా విరుచుకుపడటం నాకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. కానీ నేనొక విషయాన్ని చెప్పగోరుతున్నాను. అధ్యక్షా! మనం ఎటువంటి వాళ్ళమంటే, ఏరుదాటాక తెప్పతగలేసే రకం. గౌరవనీయ మిత్రుడు బొంబాయి విశ్వవిద్యాలయ సభ్యుడు తమలో ఏమాత్రం కుల తత్వం లేదని ఎంతో గట్టిగా వాదించినప్పటికీ అందుకు వారేమాత్రం భిన్నంగా లేరని నా అభిప్రాయం. అధ్యక్షా! వారు తమ ఎన్నికల ప్రణాళికలో – 'గుజరాత్ గుజరాతీయులదే' – అన్న ప్రాతిపదికతో తన్ను బలపరచమని పట్టభద్రులను కోరడాన్ని నేను వారికి గుర్తు చేస్తున్నాను. అది కులతత్వం కాకపోతే మరేమిటని వారిని ప్రశ్నిస్తున్నాను. వారునాకే విధంగా సమాధానం చెప్పాలని నేను కోరుతున్నానంటే........

**శ్రీ కె. ఎమ్. మున్షీ :** అధ్యక్షా! ఆ ప్రకటన పూర్తిగా తప్పు అని తెలియజేయడానికి నేను సంతోషిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అది పూర్తిగా తప్పుడు ప్రకటన కాదు. మీ ఎన్నికల ప్రణాళికను నేనే చదివాను. అయినా, రాజకీయ వేత్తలు చాలా తక్కువ జ్ఞాపకశక్తి వున్న పెద్ద మనుష్యులు.

ఈ సభలో నేను ముఖ్యంగా చెప్పదల్చుకున్నదిది. హిందువులైనా, మహమ్మదీయులైనా మనస్సాక్షిగా తాము కుల – మతతత్వ, భావాలు లేని వారమని చెప్పలేరు. ఈ సభలోని సభ్యుడెవరైనా తన భావాల్లో కులమత తత్వం లేదని చెప్పలేడు. దీన్ని వ్యతిరేకించే గౌరవ సభ్యుడెవరినైనా నేను సవాలు చేస్తున్నాను.

**రావ్‌బహదూర్ ఆర్.ఆర్. కాలే :** ఆ ప్రకటనను నేను సవాలు చేస్తున్నాను.

**గౌరవనీయ సభ్యులు :** ఆ ప్రకటనను మేము కూడా సవాలు చేస్తున్నాము.

**గౌరవనీయ సభాపతి :** నిశ్శబ్దం, నిశ్శబ్దం. దయచేసి మీలో మీరు మాట్లాడుకోకండి.

**రావ్ బహదూర్ ఆర్.ఆర్. కాలే :** కానీ, గౌరవనీయ సభ్యుడు డా॥ అంబేద్కర్ తన ప్రకటనను వ్యతిరేకించే వారినెవరినైనా సవాలు చేస్తున్నానని అన్నారు.

**డా॥ అంబేద్కర్ :** ప్రతి హిందువూ, ప్రతి మహ్మదీయుడు ఒక ప్రత్యేక కులంలోనో, మతంలోనో జన్మిస్తాడని నేనంటే అది కాదని వాదించే వారు ఎవరూ లేరనుకుంటాను. ఆ విధంగానే మనం ఒక ప్రత్యేకమైన కుల/మత వాతావరణంలో పెరిగి పెద్దవాళ్ళమవుతుండడాన్ని కూడా కాదని వాదించే వారెవరూ లేరు. ఆ కులం/మతం అభిలాషలనూ, కోరికలనూ మనం పంచుకొంటాం. ఆయా కుల/మత పరమైన అనర్హతలకూ, అశక్తతలకూ మనం స్పందిస్తాం. తత్ఫలితంగా, ఈ సభలోని ప్రతి ఒక్క సభ్యుడూ, ఆ విధంగానే బయటి వ్యక్తి కూడా ప్రతి విషయాన్ని చేతనంగానో, అచేతనంగానో ఒక కుల దృక్పథంతో తప్పనిసరిగా పరిశీలిస్తాడనడంలో నాకేమాత్రం సందేహం లేదు.

**గౌరవనీయ సభ్యులు :** లేదు – లేదు.

**డా॥ అంబేద్కర్ :** ఈ వ్యతిరేకతను నేను ఏమాత్రం విశ్వసించడానికి అంగీకరించడం లేదు. అది కేవలం 'ఆత్మవంచన' అని అంటాను. అలా లేదు – లేదని అరవడం కేవలం కపటంతో కూడిన నటన మాత్రమే. అధ్యక్షా! నేను మాత్రం ఈ సభ ముందుకొచ్చిన ప్రతి అంశాన్నీ కుల దృక్పథంతోనే పరిశీలిస్తానని మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను. అది దళితులకేమైనా మేలు చేయగలుగుతుందా – లేదా అని నన్ను నేను ప్రశ్నించుకుంటాను.

**గౌరవనీయ కె.పి. నారిమన్ :** క్షమించండి.

**డా॥ అంబేద్కర్ :** ఆ విధంగా క్షమించమని అడుగుతున్నవారే కులమత తత్వం నుండి బయటపడలేదు. ఎందుకంటే అది కేవలం మాటల్లో మాత్రమే. అధ్యక్షా! మేం ఎంతగా తయారయ్యామంటే సమానత్వం విషయంలో మేము ఇతరకులాలతో మమ్మల్ని సన్నిహితంగా భావించుకోలేము. ఎప్పుడైనా మేము మా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయవలసివస్తే పెళ్ళికొడుకు మా కులం వాడా కాదా అని అడగడం మొదలు పెడతాం (నవ్వులు). ఎవరినైనా అతిథులను భోజనానికి పిలవాలనుకుంటే కూడా వాళ్ళు మా కులం వాళ్ళా – కాదా? అని విచారణ ప్రారంభిస్తాం.

**శ్రీ బి.జె. వహలాజని :** దీన్ని నేను సవాలు చేస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అలా మనం చేయమని చెప్పుకుంటే అది కేవలం నటన మాత్రమే. ఈ రకమైన లోపానికి నేను ఏ కులాన్నీ నిందించడం లేదని మాత్రం గౌరవనీయ సభ్యులు గ్రహించాలని కోరుతున్నాను. అధ్యక్షా! మనం అందరం బాధపడుతున్న ఒక కళంకం అది. అది అలా వుంచితే,

మేధోపరంగా ఎంతగా పురోగమించిన ఏ ఒక్క కులమైనా ఇతర కులాలకు సంరక్షకులమని గుర్తించవలసిన అవసరముంది. సంస్కరణల చట్టాన్ని రూపొందించిన శాసన సభ్యులు కూడా ఈ విషయాన్ని గుర్తించడం జరిగింది. ఆ విధంగా కాకపోయి ఉంటే, ఈ కౌన్సిల్‌లో మహమ్మదీయులకు, వెనుకబడిన తరగతులకు, దళిత వర్గాల వారికీ ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని చూసి వుండేవారమే కాదు. అందుకే మనం సహజంగా పరిస్థితిని విశాల దృక్పథంతో పరిశీలించలేము కాబట్టే, కులధోరణులు ప్రబలకుండా వుండటానికి ఈ రకమైన పరిష్కారమార్గాలను ఎంతో ముందు చూపుతో శాసన సభ్యులు ఏర్పాటు చేశారు. నేను నిజాయితీగా వుండదలుచుకున్నాను. అధ్యక్షా! ఈ విషయంలో గౌరవనీయులైన సభ్యులు కూడా నిజాయితీగా ఉండాలని ఆశిస్తున్నాను. చెప్పేదొకటి, చేసే దొకటి అయితే ఏ మాత్రం ప్రయోజనం వుండదు. ఈ కారణంచేతనే, మేధోపరంగా పురోగమించని కులాలకు కూడా బొంబాయి విశ్వవిద్యాలయం సెనేట్‌లో ప్రాతినిధ్యముండాల్సిన అవసరముందని నేను మనవి చేస్తున్నాను. సెనేట్ తెలిసీ ఎంతో పక్షపాత దృక్పథంతో వ్యవహరిస్తోందని నేను నిందించడం లేదు. అయినప్పటికీ ఇప్పటివరకూ బొంబాయి విశ్వవిద్యాలయ విధానం వెనుకబడిన తరగతులకూ, దళిత వర్గాల వారికీ ఏ మాత్రం ప్రోత్సాహకరంగా లేదని నేను చెప్తున్నాను. ఒక ఉదాహరణ మాత్రం చెప్తాను. విశ్వవిద్యాలయం అవలంబించిన విద్యావిధానాన్ని తీసుకోండి. మన విద్యావిధానం భారత దేశంలోని విద్యావిధానాలన్నింటికంటే చాలా కఠినమైనదని నేనంటే ఈ సభలో ఎవ్వరైనా వ్యతిరేకిస్తారని అనుకోవడం లేదు. ఈ విషయంలో నా మనస్సులో ఎటువంటి సందేహమూ లేదు. కొందరు భారతీయ విద్యావేత్తలు పరీక్షా ప్రమాణాలను పెంచడం విద్యా ప్రమాణాలను పెంచడంతో సమానమని అభిప్రాయ పడడంలో అసహజత్వమేమీ లేదు. నేను వారిని గౌరవ ప్రదంగానే వ్యతిరేకిస్తున్నాను. పరీక్ష అనేది విద్య కంటే పూర్తిగా భిన్నమైన అంశం. విద్యా ప్రమాణాలు పెంచే పేరుతో వారు వెనుకబడిన తరగతులవారికి ఏ మాత్రం సాధ్యం కాని రీతిలో పరీక్షలను క్లిష్టంగా మారుస్తూ, ఇంత వరకూ విశ్వవిద్యాలయ ఆవరణలోనే అడుగుపెట్టే అవకాశం లభించని వెనుకబడిన తరగతులవారికి అందులో పూర్తిగా ప్రవేశం లేకుండానే చేస్తున్నారు. ఆ విషయం మాట్లాడాలని నేను కోరడం లేదు. ఎందుకంటే, ఆ పద్ధతి అన్ని కులాలవారికీ సమానంగా వర్తిస్తుంది కాబట్టి. కానీ, అధ్యక్షా! దాని గురించి ఒకసారి ఆలోచించండి. విశ్వవిద్యాలయం ఏనాడైనా వెనుకబడిన తరగతులవారి విద్యాభివృద్ధి మీద ఏకకాలిక పరీక్షల ప్రభావం గురించి ఆలోచించిందా? ఒకసారి ఒక పరీక్షకు కూర్చొన్న విద్యార్థి ఒకేసారి అన్ని పేపర్లలోనూ పాసు కావాలని కోరడంలో ఉండే ఔచిత్యమేమిటో నాకర్థం కావడం లేదు. ధనవంతులైన తల్లిదండ్రులున్నవారూ, రోజంతా కళాశాలలో గడిపి, తక్కిన సమయాన్ని చదవడానికి వినియోగించ గలిగిన వారూ అయిన విద్యార్థులపై ఇటువంటి నియమాలు ఏ ప్రభావం చూపకపోవచ్చు. కానీ బీదవాడూ, పేదరికపు కోరలలో నలుగుతున్న వాడూ, తన కుటుంబం పూట గడవడానికి పగటిపూట కొడుకు పని చేయాలని కోరుకునే తండ్రి మాటేమిటి? రోజులోని పన్నెండు గంటల్లో చదువుకోవటానికి చాలా

తక్కువ సమయం లభించే విద్యార్థి మాటేమిటి? తప్పనిసరిగా విశ్వవిద్యాలయం వెనుకబడిన తరగతుల వారి ఆర్థిక స్థితి గతులను దృష్టిలో వుంచుకున్నదే అయితే నా అభిప్రాయంలో పూర్తిగా అసమంజసమూ, అర్థరహితమూ అయిన ఏకకాలిక పరీక్షా విధానం విషయంలో అంత పట్టుదలగా ఉండేది కాదు. ఇప్పుడే నాకు స్ఫురించిన మరొక ఉదాహరణ మీకు తెలియజేస్తాను. ఎందుకంటే, గౌరవనీయ మిత్రుల శ్రీమున్షీ విశ్వవిద్యాలయం ఎవ్వరిపట్లా ఏరకమైన ప్రాధాన్యం చూపకుండా అన్నీ చేస్తూ వచ్చిందనే అభిప్రాయం వెలిబుచ్చారు. విశ్వవిద్యాలయం సెనేట్‌కు నామినేట్ చేయబడ్డ నా స్నేహితుడొకరు విశ్వవిద్యాలయ పరీక్షలకు కూర్చునే వెనుకబడిన తరగతి అభ్యర్థులకు ఫీజు విషయంలో కొంత రాయితీ ఇవ్వాలనే తీర్మానాన్ని సెనేట్ రెండు సార్లు ప్రతిపాదించినట్లు చెప్పడం జరిగింది. ఆ ప్రతిపాదనని సెనేట్ రెండు సార్లూ నిరాకరించిందని నాకు తెలిసింది.

***ఒక గౌరవనీయ సభ్యుడు :*** అన్ని కులాల్లోనూ పేదవారున్నారు.

***గౌరవనీయ అధ్యక్షుడు :*** ఇటువంటి అంతరాయాలను గౌరవనీయ సభ్యుడు పట్టించుకోకుండా కొనసాగాలి.

***డా॥ అంబేద్కర్ :*** ఆర్థికంగా వెనుకబడిన కులాలున్నాయనీ, ఇతర కులాల వారితో సమానస్థాయిని పొందాలంటే వారికి ప్రత్యేక రాయితీ లుండాలనీ అన్ని చోట్లా ప్రభుత్వం కూడా గుర్తించడం జరిగింది. అంతటి సముచితమైన సూత్రాన్ని సెనేట్ అర్థం చేసుకొని ఆదరించకపోతే, అటువంటి సెనేట్ వెనుకబడిన తరగతుల హితాన్ని ఏ మాత్రం సంరక్షించలేదని నేను మనవి చేస్తున్నాను.

గౌరవనీయ మిత్రుడు ఆచార్య హామిల్ తన ప్రసంగంలో కొన్ని వ్యాఖ్యలు చేశారు. ఈ సభ సమయాన్ని నేను ఎక్కువ తీసుకోదలుచుకోకున్నా, వారికి జవాబు చెప్పవలసిన అవసరముందని భావిస్తున్నాను. వెనుకబడిన తరగతులవారూ, దళిత వర్గాలవారూ విశ్వవిద్యాలయ సామర్థ్యాన్ని పెంచడంలో భాగస్వాములు కాగలిగితే, వారు తప్పనిసరిగా సెనేట్ సభ్యత్వాన్ని పొందుతారని వారన్నారు. వారు తమ వాదనలో ఎంచుకున్న అంశమిది. దళిత వర్గ సభ్యులు విద్యా సంబంధిత విషయాల్లో నిష్ణాతులైతే, వారికి తప్పనిసరిగా బొంబాయి విశ్వవిద్యాలయం సెనేట్‌లో ఒక స్థానం ఉంటుంది. గౌరవనీయ మిత్రులు ప్రొఫెసర్ హామిల్ ఆ రకమైన వ్యాఖ్య చేయడంలో, సెనేట్‌కున్న నిజమైన బాధ్యతనే పూర్తిగా మరిచిపోయారని మాత్రం నేను చెప్పదలుచుకున్నాను. సెనేట్ అన్నది విశ్వవిద్యాలయ కార్యనిర్వాహక సంఘం కాదు. వెనుక బడిన తరగతులకు సంబంధించిన ఏ సభ్యుడూ తనకు సిండికేట్‌లోగానీ, అకడమిక్ కౌన్సిల్‌లో గానీ ప్రత్యేక ప్రాతినిధ్యమివ్వాలని కోరలేదు. నా మిత్రుడు ఆచార్య హామిల్ గుర్తించినట్లుగా, ఈ రెండు విభాగాలూ నిపుణుల ఆధ్వర్యంలో నడవాలనీ, విశ్వవిద్యాలయ కార్యభారాన్ని వహించాలని కూడా నాకు తెలుసు. కానీ, సెనేట్ అన్నది కేవలం ఒక శాసనాధికార సంఘంగా ఉండాలని మాత్రమే ఉద్దేశించడం జరిగిందనీ, వెనుకబడిన తరగతులవారి అవసరాలను గుర్తించి అందుకు తగిన సదుపాయాలను కల్పించటమే దాని

కర్తవ్యమనీ వారికి నేను గుర్తుచెయ్యవలసి వుంటుంది. నా అభిప్రాయంలో సెనేట్ అన్నది మన శాసన మండలితో సరిపోలుతుంది. మన ఈ శాసన మండలిలో దళిత వర్గాలకు చెందిన సభ్యులున్నారు. ప్రభుత్వం వైపు కూర్చొన్న గౌరవసభ్యుల స్థానాలను ఆక్రమించడం కోసం కాకుండా, తమ తమ కులాల అశక్తతనూ, అవసరాలనూ తెలియజేయమనే ప్రయోజనం కోసమేవారిని నియమించడం జరిగింది. అదే మేం అడుగుతున్నాం. గౌరవనీయమిత్రుడు ఈ విషయాన్ని చర్చించేటప్పుడు సెనేట్ ఏర్పాటులోని ప్రాథమిక ఉద్దేశ్యాన్నే పూర్తిగా మరిచినట్లుగా నేను భావిస్తున్నాను.

అధ్యక్షా! ఇప్పుడు నా ప్రసంగం ముగిసే లోపల ఒక విషయాన్ని గురించి మాత్రం నేను గట్టిగా చెప్పదలచుకున్నాను. అధ్యక్షా!స్వరాజ్య పార్టీకి చెందిన గౌరవనీయ సభ్యులు మనకు తప్పని సరిగా ప్రాంతీయ స్వయం పాలనాధికారం ఉండాలని కోరుతున్నాను. అది సంతోషించదగిన కోరికే. అధ్యక్షా! ఎప్పుడైతే జనాభాలో 3/4 వ వంతు అజ్ఞానంలో మునుగుతూ, తమ హక్కులేవో, బాధ్యతలేవో ఏ మాత్రమూ తెలుసుకోలేని స్థితిలో వున్నారో – అప్పుడు ఈ రకమైన స్వయంపాలనాధికారం ఏ మాత్రమూ ఆశాజనకంగా వుండదని మాత్రం నేను మనవి చేస్తున్నాను. మన జనాభాలో మూడవ వంతు అజ్ఞానాంధకారంలో వుండగా మనకు స్వయం పాలనాధికారం లభిస్తే, ప్రస్తుతం మనకున్న ప్రాతినిధ్య వ్యవస్థ మాయగా మాత్రమే మిగులుతుంది. అప్పుడు సంపద పేదరికం మీద, బలవంతుడు బలహీనుడి మీదా అధికారం చెలాయించే పరిస్థితి ఏర్పడుతుంది. అది ఆ విధంగానే ఉండిపోతుంది. అందుకే అధ్యక్షా! మనకు స్వయంపాలనాధికారం కావాలని కోరితే అందుకు రెండు అంశాలు స్థిరంగా ఉండాలి. విద్యాపరంగా వెనుకబడిన వర్గాలు పౌరులుగా తమ హక్కులేమిటో, బాధ్యతలేమిటో తెలుసుకునేందుకు వీలుగా ఆధునిక విద్య అన్ని స్థాయిల్లోనూ వారికి అందుబాటులో వుంచటం మొదటిది. ఆ రకంగా ఆ కులాల వారికి విద్యనందుబాటులో వుంచటానికి ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడం రెండవది.

అధ్యక్షా! నేను కూర్చునే లోపల ఒక విషయాన్ని స్పష్టం చేయదలచుకున్నాను. అధ్యక్షా! నిన్న మీరిచ్చిన రూలింగ్ ప్రకారం కుల–మత ప్రాతినిధ్య సూత్రాన్ని నియమ విరుద్ధమని తోసివేయడం జరిగిందని నాకర్థమయ్యింది. దీనిని బట్టి కుల–మత ప్రాతినిధ్య సూత్రం సాధారణార్థంలో అంటే, ఒక ప్రత్యేక కులానికి సంబంధించిన ఓటర్లను ఒక సమూహంగా పరిగణించి అందులోనుండి ఒక సభ్యుణ్ణి ఎన్నుకోవడమన్న అర్థంలోనే నిరాకరించడం జరిగింది. ఇది మీ రూలింగ్‌కు నేనిచ్చే వివరణ. కాబట్టి, విశ్వవిద్యాలయంలో కుల–మత ప్రాతినిధ్యం ఉండాలని లేవనెత్తే ప్రశ్ననీ దానిపై చర్చనీ నిషేధించడం జరిగింది. నామినేషన్ కోసం కేటాయించిన నలభై స్థానాలనూ ఏ విధంగా విభజించాలి అన్న విషయంలో కుడా ఏవిధమైన చర్చచేసే అధికారం లేదని చెప్పేంత దూరం మీ రూలింగ్ వెళ్ళలేదని నేను భావిస్తున్నాను. ఆ ప్రత్యేక విషయాన్ని సెలెక్ట్ కమిటీలోనైనా, బిల్లును రెండో విడత చదివేటప్పుడైనా గౌరవనీయ సభ్యులు చర్చించవచ్చునని మాత్రం నేను మనవి చేస్తున్నాను. కాబట్టి గౌరవనీయ మిత్రుడు విద్యామంత్రి తమ ముగింపు ఉపన్యాసంలో ఆ

విషయానికి సంబంధించి తమ అభిప్రాయాన్ని స్పష్టంగా తెలియజెయ్యాలని కోరుతున్నాను. ఎందుకంటే, సెనేట్‌లో వెనుకబడిన తరగతులవారికి ప్రాతినిధ్యం కలిగిస్తే తప్ప మాకు ఈ బిల్లు ఏ మాత్రం ప్రయోజనకారి కాదనీ, ఆ బిల్లుకు వ్యతిరేకంగా ఓటు వేసే వారిలో నేనూ ఒకడినని నొక్కి చెప్పదలుచుకున్నాను.

**అనువాదం :**

**ప్రొ॥ పి. కుసుమ కుమారి**

# 8

# బొంబాయి విశ్వ విద్యాలయ చట్ట సవరణ బిల్లు పై ప్రసంగం – 2*

**డా॥ అంబేద్కర్:** అధ్యక్షా! మూడవ క్లాజుకు సవరణను ప్రవేశపెట్టే ముందు ఒక పొరపాటు సరిదిద్దాలనుకుంటున్నాను. టైపిస్టు పొరపాటు వల్ల సవరణలో ఒక తప్పు దొర్లింది. వాస్తవానికి సవరణ ఇలా ఉండాలి :

"విశ్వవిద్యాలయంలో చేర్చబడిన కళాశాల అంటే...., ఇతర కళాశాలల్లో తగినంత స్థానం లభించని ప్రత్యేక వర్గాల వారి విద్యకోసం విశ్వవిద్యాలయమే స్వయంగా నెలకొల్పి నిర్వహిస్తున్న సంస్థ. ఇంకా ఇలాంటి సంస్థలో"

అధ్యక్షా! బిల్లులోని 25వ క్లాజుకు నేను ప్రతిపాదించబోయే ప్రధాన సవరణపై ఈ సవరణ ఆధారపడి ఉంటుంది. ప్రధాన సవరణను ఆమోదించని పక్షంలో ఈ సవరణ తేవలసిన అవసరం ఉండదు. అందువల్ల, 25వ క్లాజుకు ప్రతిపాదించే ప్రధాన సవరణ ఆమోదం పొందిన తరువాత ఈ సవరణను ప్రవేశపెట్టడానికి నాకు అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను ఇప్పుడే గనుక ఈ సవరణను ప్రవేశపెడితే, తరువాత ఒకవేళ నా ప్రధాన సవరణ వీగిపోయిన పక్షంలో, సభాసమయాన్ని వృధా చేసిన వాడినవుతాను.

## విశ్వవిద్యాలయాలతో కళాశాలల సంబంధం

**డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** అధ్యక్షా! ఏడవ క్లాజుకు నేను ప్రతిపాదిస్తున్న సవరణలోని మొదటిభాగం 25వ క్లాజు సవరణపై ఆధారపడి ఉంది. అందువల్ల, 25వ క్లాజు సవరణ సంగతి తేలేంత వరకు ఈ సవరణను నిలిపి ఉంచవలసిందిగా మిమ్మలను కోరుతున్నాను.

**గౌరవనీయ సభాపతి :** సరే. ఆ సవరణను నిలిపి ఉంచుతాను.

**డా॥ అంబేద్కర్:** ఏడవ క్లాజుకు నేను ప్రతిపాదించిన రెండవ సవరణకు సంబంధించి ఒక మాట చెబుతాను. మా ఇద్దరికీ అంగీకార యోగ్యమయ్యే విధంగా, నా సవరణకు ఏదయినా సవరణ ప్రవేశపెట్టాలని గౌరవనీయ మంత్రిగారు భావిస్తున్నట్లు నాకు తెలిసింది.

**గౌరవనీయ అధ్యక్షుడు :** గౌరవనీయ సభ్యుడు తన సవరణ ప్రవేశపెట్టవచ్చు.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 21, పేజీలు 250-53, అక్టోబర్ 1, 1927

***డా॥ అంబేద్కర్:*** ఏడవ క్లాజుకు నేను ప్రతిపాదిస్తున్న రెండవ సవరణ ఇది. ఈ క్లాజును బిల్లుకు జోడించండి:-"7(బి) ప్రభుత్వ ఖజానా నుంచి మంజూరుచేసే 'గ్రాంటు-ఇన్-ఎయిడ్ నిమిత్తం, విశ్వవిద్యాలయాన్ని మాత్రమే ప్రభుత్వం గుర్తిస్తుంది. విశ్వవిద్యాలయం ద్వారా తప్ప, ఏ కళాశాలకు నేరుగా 'గ్రాంట్-ఇన్-ఎయిడ్ ఇవ్వడం జరుగదు."

నేను ప్రతిపాదించిన సవరణలో ' కళాశాలకు'అనే పదాల ముందు 'తప్ప' అనే పదాన్ని చేరుస్తున్నాను. టైపిస్టు పొరపాటు కారణంగా ఈ పదం సవరణలో లేదు.

అధ్యక్షా! ఈ సవరణ ప్రవేశపెట్టడానికి గల కారణాలు ఇవి : నూతన చట్టం కింద ఇంతకు ముందెన్నడూ లేనివిధంగా మరింత నేరుగా విద్యాబోధన బాధ్యత విశ్వవిద్యాలయంపై పడింది. చట్టంలోని నిబంధనల ప్రకారం విద్యాబోధన బాధ్యతను విశ్వవిద్యాలయంపై ఉంచినప్పటికీ, విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న కళాశాలలే ఆచరణాత్మకంగా విద్యాబోధనను చేపట్టవలసి ఉంటుందని, విద్యాబోధన చేసే ప్రాథమిక సంస్థలు అవేనని గుర్తించాలి. అధ్యక్షా! కళాశాలల్లో జరిగే విద్యాబోధనను నియంత్రించడానికి కళాశాలలపై విశ్వవిద్యాలయానికి కొంత అదుపు ఇవ్వకపోతే, విద్యాప్రమాణాలను కాపాడే బాధ్యతను విశ్వవిద్యాలయానికి అప్పగించడం న్యాయంగా ఉండదని నేను భావిస్తున్నాను. విద్యాప్రమాణాలను కాపాడే బాధ్యతను విశ్వవిద్యాలయం నిర్వర్తించాలంటే, కళాశాలలను, వాటి విద్యాబోధనను నియంత్రించే అధికారం విశ్వవిద్యాలయానికి ఇవ్వవలసి ఉంటుంది. అధ్యక్షా! ప్రస్తుతం చట్టం కింద ఈ కళాశాలలపై విశ్వవిద్యాలయానికి ఉన్న ఏకైక అదుపు ఏమిటంటే విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసే నిఘాసంఘమే. కొన్ని నిర్ణీత సమయాల్లో ఈ సంఘం కళాశాలలను సందర్శించి, అక్కడి లోపాలను కనుగొంటుంది. నాకు అర్థమైనదేమిటంటే.....

**శ్రీ పి.ఆర్.చికోరి:** నేను 'పాయింట్ ఆఫ్ ఆర్డర్' నులేవనెత్తుతున్నాను. గౌరవ నీయ సభ్యుడు ప్రతిపాదించిన సవరణలోని ఖచ్చితమైన పదాలు ఏమిటో నేను తెలుసుకోవాలనుకుంటున్నాను.

**గౌవనీయ సభాపతి :** సవరణను పైకే చదివారు కదా! 'తప్ప' అనే పదాన్ని ఇప్పుడు సవరణలో చేర్చారు.

***డా॥ అంబేద్కర్:*** నిఘాసంఘం ఇచ్చే నివేదిక ద్వారానే విశ్వవిద్యాలయం తన నిబంధనలను కళాశాలలలో అమలు చేయించగలదు. కళాశాలలపై విశ్వవిద్యాలయానికి ఉన్న అదుపు ఇది ఒక్కటే. నాకు తెలిసినది ఏమిటంటే, ఈ నిఘా సంఘం అప్పుడప్పుడు కళాశాలలను సందర్శించి, కళాశాలల నిర్వహణలోని లోపాలపై నివేదిక తయారుచేసి, విశ్వవిద్యాలయ స్థాయీ సంఘానికి సమర్పిస్తుంది నిఘా సంఘం సూచించిన లోపాలపై ఈ స్థాయీ సంఘం తన అభిప్రాయాన్ని 'సిండికేట్'కు నివేదిస్తుంది. కళాశాలలను నియంత్రించడానికి విశ్వవిద్యాలయం రూపొందించిన క్రమశిక్షణా నిబంధనలను అమలుపరచేందుకు ప్రస్తుతం జరుగుతున్నది ఇదే. అయితే, ఇది సరిపోదని నేను భావిస్తున్నాను. ఎందుకంటే, ఒకవేళ నిఘాసంఘం నివేదిక ప్రాతిపదికన విశ్వవిద్యాలయం

ఇచ్చిన ఆదేశాలను కళాశాలలు పాటించనట్లయితే, ఈ కళాశాలలపై విశ్వవిద్యాయానికి ఒకే ఒక అధికారం ఉంది. అది ఏమిటంటే తన ఆదేశాలను పాటించని కళాశాలలకు విశ్వవిద్యాలయంతో ఉన్న అనుబంధాన్ని రద్దు చేయడం. ఈ అధికారం చాలా తీవ్రమైనదని నేను భావిస్తున్నాను. ఈ అధికారం వినాశకరమైనది. కళాశాలల విధానాలను సరిదిద్దగలిగే అధికారం విశ్వ విద్యాలయానికి నిజంగా లేదని అంగీకరించాలి. మరోవిధంగా చెప్పాలంటే, ప్రస్తుత విధానంలో కళాశాలలపై విశ్వవిద్యాలయానికి ఉన్న అధికారం ఏమిటంటే, ఒక కళాశాలను విశ్వవిద్యాలయానికి అనుబంధంగా చేసుకోవడం ద్వారా దానికి ప్రాణం పోయడం లేదా అనుబంధాన్ని రద్దు చేయడం ద్వారా ఆ కళాశాలను రూపుమాపడం. కళాశాల అనుబంధాన్ని రద్దు చేసే తీవ్రమైన చర్యకు పాల్పడకుండా క్రమ శిక్షణా నిబంధనలను కళాశాలలు పాటించేలా చేయగలిగే అధికారం ప్రస్తుత విధానంలో విశ్వవిద్యాలయానికి లేదు. అధ్యక్షా! అనుబంధాన్ని రద్దుచేసే తీవ్రమైన చర్య చేపట్టకుండా తన ఆదేశాలను కళాశాలలో పాటించగలిగేలా చేయడానికి, వాటి విధానాలను సరిదిద్దడానికి విశ్వవిద్యాలయానికి తగిన అధికారం ఇచ్చేలా నేను సవరణ ప్రతిపాదించాను. అందువల్ల నేను చెప్పున్నదేమిటంటే విశ్వవిద్యాలయాన్ని ఒక సంస్థగా ప్రభుత్వం గుర్తిస్తున్నట్లయితే...., అసలు ఆ విధంగా గుర్తించవలసి ఉంది కూడా...., ప్రభుత్వం వివిధ కళాశాలలకు ఇచ్చే గ్రాంట్‌లు విశ్వవిద్యాలయంద్వారా లేక విశ్వవిద్యాలయ సిఫార్సుల ఆధారంగా పంపిణీ అవుతున్నట్లయితే, తన క్రమశిక్షణా నిబంధనలను కళాశాలలు పాటించేలా చేయగలిగే అధికారం విశ్వవిద్యాలయానికి ఉండాలి. ఆదేశాలు ఖాతరు చేయని కళాశాలతో క్రమశిక్షణా నిబంధనలను అమలుచేయించగలిగే అధికారం ఏదీ ప్రస్తుతం విశ్వవిద్యాలయానికి లేదు. అందువల్ల, ఈ కళాశాలలపై విశ్వవిద్యాలయానికి ఆర్థిక నియంత్రణ ఉండాలి. లండన్‌లో విశ్వవిద్యాలయ విద్యపై రాయల్ కమిషన్ రూపొందించిన నివేదికలో కూడా ఇదే అభిప్రాయం ఉంది. ఆ నివేదికలోని 41వ పేరాగ్రాఫ్‌లో ఈ విధంగా ఉంది:

"విద్యాబోధనను సరిగా నిర్వహించాలంటే విశ్వవిద్యాలయానికి ఆర్థిక నియంత్రణాధికారం ఉండాలి. అన్ని అధికారాలలో ఇది అత్యంత ముఖ్యమైనది. వేల్స్, స్కాట్‌లాండ్ విశ్వవిద్యాలయాలు మినహా మిగిలిన అన్ని ఆధునిక విశ్వవిద్యాలయాలకు ప్రభుత్వగ్రాంట్ల పంపిణీలో బలమైన అధికారం ఉంది. ఎందుకంటే, విశ్వవిద్యాలయం అంటే ఒక సంస్థ. అనేక సంస్థల సముదాయం కాదు."

లండన్ విశ్వవిద్యాలయానికి కూడా ఇదే సూత్రాన్ని వర్తింపజేయాలని రాయల్ కమిషన్ తన నివేదికలో సిఫార్సు చేసింది. అత్యంత ముఖ్యమైన ఈ సిఫార్సు ఆధారంగానే నేను కూడా నా సవరణను ప్రతిపాదించాను. ఈ సందర్భంగా మరొక విషయాన్ని చెప్పాలనుకుంటున్నాను. లండన్ విశ్వవిద్యాలయ వ్యవస్థ ప్రాతిపదికగానే బొంబాయి విశ్వవిద్యాలయస్థాపన జరిగింది. రాయల్ కమిషన్ నివేదిక ఆధారంగా ప్రవేశపెట్టిన సంస్కరణల కింద లండన్ విశ్వవిద్యాలయం ఆధీనంలోని కళాశాలల స్థితిలో తెచ్చిన మార్పులను బొంబాయి విశ్వవిద్యాలయం ఆధీనంలోని

కళాశాలల స్థితిలో కూడా తేవాలని ఈ బిల్లు ద్వారా మనం తలపెట్టామని నేను భావిస్తున్నాను. ఈ రెండు విశ్వవిద్యాలయాల పరిస్థితి ఒకటే. లండన్ విశ్వవిద్యాలయం ఆధీనంలోని కళాశాలలకు ఆ విశ్వవిద్యాలయంలో ఉన్న సంబంధాలను నియంత్రించడానికి సూచించిన నిబంధనను బొంబాయి విశ్వవిద్యాలయం ఆధీనంలోని కళాశాలకు కూడా వర్తింపజేయవచ్చునని నేను భావిస్తున్నాను. 'గ్రాంట్-ఇన్-ఎయిడ్'కు సంబంధించి సిఫార్సు చేసే విషయంలో విశ్వవిద్యాలయం అనుచితంగా ప్రవర్తించవచ్చు ననే ఉద్దేశంతో ఎవరైనా వ్యతిరేకించవచ్చునేమో. ఏదైనా ఒక కళాశాలపై విశ్వవిద్యాలయానికి ప్రత్యేకమైన ద్వేషం ఉంటుందని అనుకోవడంలో అర్థంలేదని నేను భావిస్తున్నాను. నూతన చట్టం కింద ఏర్పడే విశ్వవిద్యాలయంలో తమ సొంత ఇష్టానిష్టాలకు కళాశాలల ప్రయోజనాలను బలిపెట్టేటటువంటి బాధ్యతారహితమైన వ్యక్తులుంటారని నేను భావించడం లేదు. అందువల్ల, ఈ కారణాలపై నా సవరణను ఆమోదించవలసిందిగా కోరుతున్నాను.

## పునఃప్రారంభమైన చర్చ*

***డా॥ అంబేద్కర్:*** అధ్యక్షా! నా సవరణ ఏం కానున్నదో నాకు తెలియకున్నప్పటికీ, ఈ సవరణలో ఇమిడి ఉన్న సూత్రాన్ని గుర్తించిన గౌరవనీయ సభ్యులు చాలా మంది ఉన్నందుకు నేను ఆనందిస్తున్నాను. ఈ సవరణకు వ్యతిరేకంగా వచ్చే అభ్యంతరం గురించి మాట్లాడడం ద్వారా సభాసమయాన్ని వృధా పరచాలని నేను భావించడం లేదు. అయితే, నేను స్పష్టం చేయతలచుకున్నది ఏమిటంటే, గ్రాంట్ల పంపిణీ విషయంలో విశ్వవిద్యాలయాన్ని ఏకైక నిర్ణేతగా నా సవరణ మారుస్తుందని నేను అనుకోవడం లేదు. విశ్వవిద్యాలయాన్ని ఆ విధంగా ఏకైక నిర్ణేతగా చేయకుండా ఉండేలా నా సవరణను చాలా జాగ్రత్తగా రూపొందించగలిగానని అనుకొంటున్నాను.

నేను చెప్పాలనుకున్నది ఇది : విశ్వవిద్యాలయం ద్వారా గ్రాంట్ల పంపిణీ జరగాలి. అయితే, సంబంధిత మంత్రికి గ్రాంట్ల విషయంలో ఉన్న నియంత్రణాధికారం దీనివల్ల తొలగిపోదు. ఈ సవరణ ఆమోదించబడినప్పటికీ, గ్రాంట్ల విషయంలో తుది నిర్ణయాధికారం మంత్రిదే. గ్రాంట్ల విషయంలో విశ్వవిద్యాలయం వంటి ముఖ్యమైన సంస్థతో సంప్రదింపులు జరపడానికి విద్యామంత్రికి అభ్యంతరం ఉంటుందని నేను భావిచడం లేదు. గ్రామీణ ప్రాంతాల్లో కళాశాలల స్థాపన కోసం కృషి చేసిన సభ్యులు, గ్రామీణ కళాశాలల ప్రయోజనాలను కాలరాచే విధంగా విశ్వవిద్యాలయ అధికారులు ప్రవర్తించగలరేమోనని ఆందోళన చెందిన సభ్యులు సభలో ఉన్నారు. 'గ్రాంట్-ఇన్-ఎయిడ్' కింద ప్రభుత్వం ఇచ్చే డబ్బును కళాశాలలు సద్వినియోగ పరచేలా చూడడం ఈ సభలోని ప్రతి ఒక్కరి బాధ్యత అని నేను చెప్తే ఈ అభిప్రాయంతో వారంతా ఏకీభవిస్తారని నేను గట్టిగా నమ్ముతున్నాను. పన్నుల ద్వారా సేకరించి, గ్రామీణ కళాశాలలకు గ్రాంట్లుగా ఇచ్చిన డబ్బు సద్వినియోగం అయిందో, కాలేదో మంత్రికి తెలియజేయడంలో విశ్వవిద్యాలయం కంటే మంచి సంస్థ

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 21, పేజీలు – 264-65, తేదీ అక్టోబర్ 1, 1927.

ఉంటుందని నేను అనుకోవడం లేదు. ఈ బిల్లు ఆమోదం ద్వారా విశ్వవిద్యాలయానికి పితామహుడు కాగలిగిన గౌరవనీయ మంత్రికి ఆ సంస్థ అభిప్రాయాలపై తుది నిర్ణయాధికారం ఉండాలని నేను భావిస్తున్నాను.

గౌరవనీయ సభ్యుడు శ్రీ జైరామ్ దాస్ వ్యక్తపరిచిన అభిప్రాయం పట్ల అధికార పార్టీ సభ్యులు ఎంతో హర్షం ప్రకటించారు. ఈ సవరణ వల్ల మంత్రిపై సభానియంత్రణ తగ్గిపోతుందని సభ్యుడు పేర్కొన్నారు. నా సవరణ వల్ల అటువంటి పరిణామం ఏర్పడుతుందని నేను అనుకోవడం లేదు. మంత్రి అధికారాలను మరింత పటిష్ఠం చేయడమే నా సవరణ ఏకైక ధ్యేయమని నేను ఇప్పుడే చెప్పాను. ఒకవేళ నా సవరణలో అది స్పష్టంగా లేకపోతే, ఆ ధ్యేయాన్ని మరింత స్పష్టం చేయడానికి గౌరవనీయ మంత్రి ప్రతిపాదించే ఏ సవరణనైనా ఆమోదించడానికి నేను సిద్ధమే. అసలు నేను ప్రతిపాదించిన సవరణ వల్ల మంత్రి అధికారాలు కాని, మంత్రిపై ఈ సభానియంత్రణకాని ఏ విధంగానైనా తగ్గిపోతాయని నేను భావించడం లేదు. ఈ సవరణ ప్రకారం కూడా గ్రాంట్ల విషయంలో తుది నిర్ణయాధికారం మంత్రిదే. సంధాన సంస్థగా ఉన్న విశ్వవిద్యాలయాన్ని గ్రాంట్ల విషయంలో సంప్రదించేలా చేయడమే ఈ సవరణ వెనుకున్న ఏకైక ఉద్దేశం. మంత్రి అధికారాలు కాని,మంత్రిపై సభానియత్రణకాని ఈ సవరణ వల్ల ఏ మాత్రం తగ్గవు. వాస్తవానికి, మంత్రి మంజూరు చేసిన గ్రాంట్లు సద్వినియోగమయ్యాయో లేదో నిర్ణయించడానికి సభకు ఈ సవరణ వల్ల మరింత అధికారం లభిస్తుంది.ఈ మాటలతో నా సవరణను సభకు నివేదిస్తున్నాను.

# 9

# బొంబాయి విశ్వవిద్యాలయం చట్ట సవరణ బిల్లుపై ప్రసంగం – 3

## విశ్వవిద్యాలయానికి రెక్టార్ నియామకం

**డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ యాదవ ప్రతిపాదించిన సవరణకు నేను మద్దతు ప్రకటిస్తున్నాను. విశ్వవిద్యాలయ ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్లో, పరిమిత వనరులపై ఈ పదవి కూడా ఒక భారమేనని ఇంతకు ముందు మాట్లాడిన గౌరవనీయ సభ్యులు పేర్కొన్నారు. నాకు వారి వాదన సమంజసంగానే కన్పిస్తున్నది. పాలనాపరంగా చూసినా కూడా ఈ పదవి అనవసరమేనని నేను చెప్పదలచుకున్నాను. అయ్యా! 1914లో ఒక పరిశోధనా కార్యక్రమంపై సలహా ఇవ్వడానికి మాంచెస్టర్ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ సర్ అల్‌ఫ్రెడ్ హాప్‌కిన్‌సన్‌ను బొంబాయి విశ్వవిద్యాలయం ఆహ్వానించింది. 'రెక్టార్' పదవి అవసరం కాదని ఆయన తన నివేదికలో పేర్కొన్నారు. విశ్వవిద్యాలయ సంస్కరణల కమిటీ ఆయన పేర్కొన్న అంశాల గురించి ఇలా రాసింది. కమిటీ నివేదికలోని 9వ పేజీలో ఇలా ఉంది.

"విశ్వవిద్యాలయానికి వేతనం పొందే పరిపాలనాధ్యక్షుడు ఉండాలని ఆయన సూచించలేదు. పూర్తికాలం రిజిస్ట్రార్‌ను, జాయింటు మెట్రిక్యులేషన్ బోర్డుకు పూర్తికాలం కార్యదర్శిని నియమించడం ద్వారా, పరిపాలనా బాధ్యతలను విశ్వవిద్యాలయం, కళాశాలల ప్రొఫెసర్లకు కూడా అప్పగించడం ద్వారా పరిపాలనకు సంబంధించిన అన్ని పనులను చక్కబెట్టుకోవచ్చునని" ఆయన సూచించారు.

1914లోనే సర్ అల్‌ఫ్రెడ్ హాప్‌కిన్‌సన్ వంటి నిపుణుడు అటువంటి అభిప్రాయాన్ని వ్యక్తం చేశారంటే విశ్వవిద్యాలయానికి ఇప్పుడు 'రెక్టార్' ను నియమించవలసిన నూతన పరిణామాలు ఈ మధ్యకాలంలో ఏం సంభవించాయో నాకు అర్థం కావడంలేదు. అంతేకాక, రెక్టార్ నిర్వహించవలసిన బాధ్యతలు ఏవీ కచ్చితంగా లేవు. విశ్వవిద్యాలయ సంస్కరణల కమిటీ నివేదికలోని 162వ పేజీలో ఏం ఉన్నదంటే...., విశ్వవిద్యాలయం పై వైస్ చాన్సలర్‌కి పర్యవేక్షణాధికారం ఉంటుందని, చట్టాలు, ఉత్తర్వులు అమలు అయ్యేలా చూసే అధికారం కూడా ఆయనదేనని రాసి ఉంది. అయ్యా! అయితే అదే పేజీలో రెక్టార్ విధులకు సంబంధించినది కూడా ఉంది. రెక్టార్ పదవికాలం ఐదేళ్లు ఉంటుందని, పునర్‌నియామకం కూడా చేయవచ్చునని, విశ్వవిద్యాలయానికి ఆయనే ప్రధాన కార్యనిర్వహణాధికారి,

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 21, పేజీలు – 286-87, తేదీ – అక్టోబర్ 1, 1927.

పరిపాలనాధికారి అని, చట్టాలు, ఉత్తర్వులు అమలు జరిగేలా చేసే బాధ్యత ఆయనదేనని; ఈ విధుల నిర్వహణకు కావలసిన అన్ని అధికారాలు ఆయనకు ఉండాలని విశ్వవిద్యాలయ సంస్కరణల కమిటి పేర్కొన్నది. వైస్. చాన్సలర్ విధులకు, రెక్టార్ విధులకు మధ్యగల తేడా ఏమిటో నాకు అర్థం కావడంలేదు. విశ్వవిద్యాలయ సంస్కరణల కమిటీ తన నివేదికలో రెక్టార్ విధుల గురించి పేర్కొన్న విషయాలు నేను ఇప్పుడు చెప్పినవే అయినట్లయితే, వైస్. చాన్సలర్, రిజిస్ట్రార్ పదవులకు, రెక్టార్ పదవికి మధ్య తేడా ఏం ఉంటుందో నాకు తెలియడం లేదు. ఎందుకంటే, రెక్టార్ లేనప్పుడు ఆయన విధులను రిజిస్ట్రార్ నిర్వహిస్తారని అదే నివేదికలోని 163వ పేజీలో ఉంది. అందువల్ల వైస్ చాన్సలర్ పదవికి, రెక్టార్ పదవికి మధ్యకాని, రిజిస్ట్రార్ పదవికి, రెక్టార్ పదవికి మధ్యకానిఎటువంటి తేడా నాకు కన్పించడం లేదు. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ పదవి అనవసరమే కాక, ఆర్థికంగా భారం కూడా. ఈ కారణాలవల్ల నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ యాదవ్ ప్రవేశపెట్టిన సవరణకు నేను మద్దతు ప్రకటిస్తున్నాను.

## పునః ప్రారంభమైన చర్చ*

***డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** ఈ సవరణకు నేను మద్దతు ఇస్తున్నాను. విశ్వవిద్యాలయంలోకి వివిధ కళాశాలల ప్రిన్సిపాల్‌లు ప్రవేశించడానికి నేను వాస్తవానికి సుముఖంగా లేను. విశ్వవిద్యాలయం పురోగమించాలంటే, విద్యా విభాగాల వ్యవస్థకు కళాశాల వ్యవస్థ లోబడి ఉండాలని భావించేవారిలో నేనూ ఒకడిని. ఇది నా సొంత అభిప్రాయం. ఎంతమంది గౌరవనీయ సభ్యులు ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తారో నాకు తెలియదు. ప్రిన్సిపాల్‌లను అందరిని అనుమతించినట్లయితే, వారు విశ్వవిద్యాలయాన్ని సమైక్యంచేసే బదులు వేర్పాటువాదాన్ని తీసుకువచ్చి, విశ్వ విద్యాలయాన్ని విచ్ఛిన్నం చేస్తారు విశ్వవిద్యాలయం పనిచేయడానికి అవసరమైన కనీస బోధనా సిబ్బందిని విశ్వవిద్యాలయం సమకూర్చాలనే అభిప్రాయాన్ని నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ హామిల్ వ్యక్తం చేశారు. ప్రస్తుతం విశ్వవిద్యాలయం తగినంతగా బోధనా సిబ్బందిని అదుపు చేయడంలేదని కూడా ఆయన అభిప్రాయపడ్డారు. అధ్యక్షా! గౌరవనీయ సభ్యుడు శ్రీ హామిల్ వ్యక్తం చేసిన అభిప్రాయం పరిగణనలోకి తీసుకోదగినదని నేను భావిస్తున్నాను. ఎందుకంటే, ఈ ప్రెసిడెన్సీ విద్యావ్యవహారాల బాధ్యతను నెరవేర్చవలసిన విశ్వవిద్యాలయం తన విధులను నిర్వర్తించాలంటే, విశ్వవిద్యాలయానికి తగినంత బోధనాసిబ్బంది ఉండాలని మనం మర్చిపోకూడదు. విశ్వవిద్యాలయాన్ని ప్రజాస్వామికీకరణ చేయాలని మనం భావిస్తున్నాం కాబట్టి, ఇది అవసరం. విశ్వవిద్యాలయంలో బోధనా సిబ్బందిని ప్రవేశపెడుతూనే, ప్రిన్సిపాల్‌ల ప్రవేశాన్ని అరికట్టవలసి ఉంటుంది. ఇందుకు ముందే నేను కారణాలు వివరించాను. అయితే, అటువంటిది ఇప్పుడే సాధ్యం కాదని అనుకుంటున్నాను, ఎందుకంటే

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 21, పేజీలు – 326–27, తేదీ – అక్టోబర్ 31, 1927. విశ్వవిద్యాలయంలో బోధనా సిబ్బందిని ప్రవేశపెట్టడానికి శ్రీ హెూమిల్ ప్రతిపాదించిన సవరణకు మద్దతుగా చేసిన ప్రసంగం.

మూడవ క్లాజులోని నిర్వచనం ప్రకారం టీచర్లలో ప్రొఫెసర్లు కూడా భాగమే. ప్రిన్సిపాల్‌లు ప్రొఫెసర్లు అయిఉంటారు. గౌరవనీయ సభ్యుడు శ్రీ దస్తూర్ సవరణను ఆమోదించినా, ఆమోదించకపోయినా ప్రిన్సిపాల్‌లు విశ్వవిద్యాలయంలో ప్రవేశించగలరు. ఆయన సవరణ కేవలం వివరణాత్మకమైనది. దాని ద్వారా కలిగే మార్పులు ఏవీలేవు. అందువల్ల ఆ సవరణకు నేను మద్దతు ఇస్తున్నాను.

# 10

# బొంబాయి విశ్వవిద్యాలయ చట్ట సవరణ బిల్లుపై ప్రసంగం – 4*

**డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! సవరణకు నేను మద్దతు ఇస్తున్నాను. విశ్వవిద్యాలయ సంస్కరణలపై, విధులపై నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మున్షికి ఉన్న అభిప్రాయాలతో నేను ఏకీభవించినట్లైయితే, ఈ సవరణకు నేను ఎంత మాత్రం మద్దతు ప్రకటించి ఉండేవాడిని కాదు. అయితే, విశ్వవిద్యాలయ సంస్కరణల్లో ఆసక్తి ఉన్న వ్యక్తిగా, వెనుకబడిన వర్గాలకు చెందిన వ్యక్తిగా నేను నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మున్షితో పూర్తిగా విభేదిస్తున్నాను. అధ్యక్షా! విశ్వవిద్యాలయం అంటే కేవలం చట్టాలను, నిబంధనలను తయారు చేయడానికే ఉన్న సంస్థని; పరీక్షలను నిర్వహించడంతోను; ఈ బిల్లు కింద ప్రారంభించబోయే విద్యా విభాగాలలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను నిర్వహించడం తోను మాత్రమే ఈ సంస్థకు సంబంధం ఉంటుందని నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మున్షి భావిస్తున్నట్లున్నారు. విశ్వవిద్యాలయ విధులకు సంబంధించి నాకు అర్థమైనదేమిటంటే, ఉన్నత విద్యను అవసరమైనవారికి, పేదలకు అందుబాటులోకి తేవడానికి తగిన సౌకర్యాలను కల్పించడం కూడా విధుల్లో భాగమేనని.పరీక్షల నిర్వహణ, డిగ్రీల ప్రదానంతో మాత్రమే సంబంధం కలిగి ఉన్నట్లయితే ఏ నాగరిక దేశంలోని ఏ విశ్వవిద్యాలయమైనా తన ఉనికిని సమర్థించుకోగలదని నేను భావించడంలేదు. వెనకబడిన వర్గాలకు ఉన్నత విద్యను అందించడానికి తగిన సౌకర్యాలను కల్పించవలసిన బాధ్యత ఆధునిక విశ్వద్యాలయానికి ఉన్నదని అంగీకరించినట్లయితే, తదనుగుణంగా విశ్వవిద్యాలయ వ్యవహారాలపై వెనుకబడిన వర్గాలవారికి కొంత నియంత్రణ ఉండాలనే వాదనను కూడా అంగీకరించగలదని నేను భావిస్తున్నాను. అధ్యక్షా! విశ్వవిద్యాలయాన్ని నేను ఒక యంత్రాంగంగా భావిస్తాను. మేధోపరమైన సామర్థ్యం ఉండి, దానిని విద్యార్జన విషయంలో ప్రయోజనకరంగా ఉపయోగించుకునే వారందరికీ ఈ యంత్రాంగం విద్యాసౌకర్యాలను కలుగజేస్తుంది. అయితే, డబ్బు లేకనో, ఇతర ఇబ్బందులకారణం గానో ఈ విద్యాసౌకర్యాలను వినియోగించుకోలేని వారు కూడా ఉన్నారు. అయ్యా! విశ్వవిద్యాలయాన్ని ప్రధానంగా ఇప్పుడు మేధావుల సంస్థగానూ, విద్యావంతుల వర్గాల సంస్థగానూ చూస్తున్నారు. విశ్వవిద్యాలయం తగిన విధంగా పని చేయాలంటే విద్యావంతుల వర్గాలుగా వ్యవహరించబడేవారు దానిని నియంత్రించడం అవసరమని అంటున్నారు. విశ్వవిద్యాలయాన్ని నియంత్రించే వారికి సామాజిక విలువలు అంటూ ఉంటే, ఈ సూత్రాన్ని నేను

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 21, పేజీలు – 414-16, – అక్టోబర్ 5, 1927.నామినేటెడ్ సెనేటర్ల సంఖ్యను 40 నుంచి 50కి పెంచడానికి శ్రీ నూర్ మహమ్మద్ ప్రవేశపెట్టిన బొంబాయి విశ్వవిద్యాలయ చట్ట సవరణ బిల్లుకు మద్దతుగా ఈ ప్రసంగం చేశారు.

అంగీకరిస్తాను. దిగువ తరగతుల వారికి సానుభూతి ఉంటే, దిగువ తరగతుల వారికి కూడా హక్కులు ఉన్నాయని వారు గుర్తిస్తే, ఈ హక్కులను గౌరవించవలసి ఉంటుందని వారు భావిస్తే..., అప్పుడు... వెనుకబడిన తరగతులకు చెందిన వారిమైన మేము మా భవిష్యత్తును ఈ ఉన్నత వర్గాల వారి చేతుల్లో పెట్టగలమేమో! అయితే, శతాబ్దాల తరబడి ఈ ఉన్నత వర్గాలు, విద్యావంతుల వర్గాల వారి పాలనలో మేము అత్యంత చేదు అనుభవాలు పొందాము. అధ్యక్షా! జనాభాలో అనేకమంది నేరస్థుల తెగలుగా వ్యవహరించబడేవారు ఉండడం ఈ ఉన్నత ర్గాల వారికి ఎటువంటి గొప్పతనాన్ని ఇవ్వదు. అస్పృశ్యులుగా పరిగణించబడుతున్న ప్రజలు ఈ దేశంలో ఇంకా ఉండడం కూడా ఈ ఉన్నత వర్గాల వారికి ఎటువంటి ప్రతిష్ఠను తీసుకుని రాదు. పీడిత వర్గాల వారి స్థాయిని, నేరస్థుల తరగతుల వారి స్థాయిని వారు పెంచి ఉండవచ్చు. ఈ ఉన్నత వర్గాలవారికి అటువంటి ఆశయం ఉంటే, పీడిత వర్గాల వారి సంస్కృతిని వారి సంస్కృతిస్థాయికి తెచ్చి, రెండింటినీ సమానం చేసి ఉందురు. అయితే, గతంలో వారు అటువంటి పని ఎన్నడూ చేయలేదు. భవిష్యత్తులో ఆ విధంగా చేయాలని కూడా వారు అనుకోవడం లేదు.మమ్మల్ని ఘోరంగా నిర్లక్ష్యం చేయడం ద్వారా, మా అభివృద్ధిని తీవ్రంగా వ్యతిరేకించడం ద్వారా వారు నిజంగా మా శత్రువులని చాటి చెప్పారు. మేము ఎక్కడ ఉన్నామో మమ్మల్ని అక్కడే ఉంచడం వారి అభిమతమని అనుకోవడానికి ఏ మాత్రం సందేహించనక్కర లేదు. గత కొన్ని రోజులుగా జరిగిన చర్చలను ఉటంకించాలని నేను అనుకోవడం లేదు. అయితే, ప్రభుత్వాన్ని శత్రువుగా పరిగణించే ప్రతిపక్షాలవారు ఈ ప్రధాన సమస్యపై మమ్మల్ని ఓడించే ఏకైక లక్ష్యంతో ఇప్పుడు ఆ ప్రభుత్వానికే మద్దతు ఇస్తున్నారన్న దాంట్లో ఏ మాత్రం సందేహం లేదు. నామినేషన్ ద్వారా ప్రాతినిధ్యం కావాలని అడుగుతున్న వెనుకబడిన తరగతులవారి డిమాండ్లను ఓడించాలను కోవడమే తప్ప వారి ప్రవర్తనకు మరొక కారణం ఏదీ కన్పించడంలేదు. అందువల్లనే, తాము ఎప్పుడూ వ్యతిరేకించే ప్రభుత్వం పక్షాన ఎప్పుడో చేరిపోయారు. అధ్యక్షా! ఇంత సంకుచితమైన, ఇంత కఠినమైన అభిప్రాయాలు గల మేధావులపై మాకు ఎటువంటి విశ్వాసం అయినా ఉండగలదా?

ఇది భౌతిక ప్రయోజనాల పంపకానికి సంబంధించిన విషయం అయినట్లయితే, సెనేట్‌లో కులపరమైన ప్రాతినిధ్యాన్ని ప్రవేశ పెట్టడానికి తాను అంగీకారం తెలిపి ఉండే వాడినని నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మున్షి చెప్పారు. అయితే గొప్ప భౌతిక ప్రయోజనం విద్యేనని, ఆ ప్రయోజనం కోసం తాము పోరాటం చేయవచ్చునని వెనుకబడిన తరగతులవారు తెలుసుకున్నారని ఆయనకు నేను గుర్తుచేయదలచు కున్నాను. భౌతిక ప్రయోజనాలను మేం వదిలి వేసుకోగలం. నాగరికతా ప్రయోజనాలను కూడా వదిలివేసుకోగలం. కాని, ఉన్నత విద్యా ప్రయోజనాన్ని సంపూర్ణంగా పొందే అవకాశాన్ని కాని, అందుకు గల మా హక్కును కాని మేం వదులుకోము.విద్య లేకుండా తమ బతుకు సుక్షితంగా ఉండదని ఇప్పుడిప్పుడే గుర్తించిన వెనుకబడిన తరగతులవారి దృష్టితో చూసినప్పుడు ఈ విషయం చాలా ప్రాముఖ్యమైనదే. ఈ కారణంతోనే సీటుల సంఖ్య

పెంచాలని పోరాటం చేస్తున్నాం.

నేను చెప్పదలచుకున్న విషయం మరొకటి ఉంది. వివిధ కళాశాలలోని ప్రిన్సిపాల్‌లు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చినందువల్ల, నామినేటెడ్ సీట్ల సంఖ్య పెంచనవసరం లేదని చాలాసార్లు అన్నారు. ఎందుకంటే, విశ్వవిద్యాలయంలో ప్రిన్సిపాల్‌లకు ప్రత్యక్ష ప్రాతినిధ్యం ఇవ్వకపోయి నట్లయితే, కనీసం 10 సీట్లను ప్రభుత్వం వారికి కేటయించలసి వచ్చేది. ఇప్పుడు వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించినందువల్ల మొత్తం 40 సీట్లు వెనుకబడిన తరగతులవారికి చెందుతాయి. అయ్యా! అదే కారణం వల్ల ఇప్పుడు వెనుకబడిన తరగతుల వారికి తగిన ప్రాతినిధ్యం కల్పించడానికి నామినేటెడ్‌సీట్ల సంఖ్య పెంచాలని నేను కోరుతున్నాను. గౌరవనీయ సభ్యుడు శ్రీ హామిల్ సవరణ ఫలితంగా ప్రత్యక్ష ప్రాతినిధ్యం పొందిన వివిధ కళాశాలల ప్రిన్సిపాల్‌లు వెనుకబడిన కులాల వారికి స్నేహితులుగా ఉండగలరని నాకు ఎన్నడూ హామీ లభించలేదు. ఈ ప్రిన్సిపాల్‌ల విషయంలో నాకు తగినంత అనుభవం ఉంది. సెనేట్‌కి ఎన్నికయ్యే వారు కచ్చితంగా ఉన్నత వర్గాలకు చెందినవారే అవుతారని, విద్యకోసం అలమటిస్తున్న వెనుకబడిన తరగతుల ప్రజలకు వారెన్నడూ సహాయం చేయరని నాకు రూఢిగా తెలుసు. గౌరవనీయ మంత్రి సెనేట్‌లో మరో 10 సీట్లను ఉన్నత వర్గాలవారికి కేటాయించినట్లయితే, వెనుకబడిన తరగతులవారికి కూడా ఆయన అన్ని సీట్లను కేటాయించి సమస్థితిని నెలకొల్పాలి. బిల్లులో ఇప్పటికే కల్పించిన సీట్లకు మరో 10 సీట్లను జోడించటం ద్వారా మాత్రమే అది సాధ్యం అవుతుంది. అధ్యక్షా! మేం మా భయాలను సందేహాలను వ్యక్తం చేశాం. వెనుక బడిన తరగతులవారికి ఇన్ని భయాలుండి, సెనేట్‌లో తాము ప్రాతినిధ్యం పొందనిదే తమ ప్రయోజనాలకు రక్షణ లభించదని వారు అనుకుంటున్న ఇటువంటి విషయంలో ఉన్నత వర్గాలవారి దయాదాక్షిణ్యాల కింద వెనెకబడిన తరగతులవారిని ఉంచడానికి అధికార యంత్రాంగాన్ని ప్రయోగించడం సముచితమేనా అని ప్రభుత్వం ఆలోచించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ విషయాన్ని ఈ సభ వోటింగ్‌కే స్వేచ్ఛగా వదిలి పెట్టవలసిందిగా సభాపతికి నేను విజ్ఞప్తి చేస్తున్నాను. సముచిత మని భావించిన రీతిలో సభనే స్వయంగా నిర్ణయించనివ్వండి. ఈ వ్యాఖ్యలతో సవరణకు నేను మద్దతు ఇస్తున్నాను.

☆ ☆ ☆

# 11

# బొంబాయి ప్రాథమిక విద్యా చట్ట సవరణ బిల్లు - 1

**డా॥ అంబేద్కర్:** ఈ సెక్షన్‌ను అవగతం చేసుకోవడం నాకు కష్టంగానే ఉంది. సెక్షన్ (2ఎ) కింద తలపెట్టిన బోర్డును ప్రజాస్వామ్యయుతంగా ఏర్పాటుచేసే విషయం గురించి ఆలోచించకూడదని ఆయన అన్నారు. ఆ మాటలను నేను సరిగ్గానే విన్నట్లయితే, ఆ విషయంపై ఆయనతో ఏకీభవి స్తున్నాను. నిపుణులతో ఈ బోర్డును ఏర్పాటుచేయాలని తలపెట్టారు. ప్రావిన్షియల్ బోర్డుకు స్కూల్ బోర్డులు ఎన్నుకునే సభ్యులు సాధారణ ప్రజల అభిప్రాయాలను మాత్రమే వ్యక్తంచేసేవారు అయిఉండవచ్చు. బోర్డు విషయంలో వారు నిపుణుల అభిప్రాయాలకు స్థానం కల్పించకపోవచ్చు, వారి స్వభావం రీత్యా వారు ఆ పని చేయరనేది సుస్పష్టం. మిగిలిన ఆరుగురు సభ్యులను ప్రభుత్వం నియమిస్తుంది. విద్యారంగంలో నిపుణులైన వ్యక్తులను మాత్రమే ప్రభుత్వం నియమించాలనే నిబంధన ఈ సెక్షన్‌లో లేదు. ప్రావిన్షియల్ ప్రభుత్వం ముగ్గురిని నియమిస్తుందని మాత్రమే క్లాజు పేర్కొంటున్నది. విద్యారంగంలో నిపుణులైనవారికి బోర్డులో స్థానం ఉంటుందనే సూచన ఏదీ ఈ సెక్షన్‌లో లేదు. అందువల్ల ప్రావిన్షియల్ బోర్డు ఏర్పాటును పరిశీలిస్తే ప్రభుత్వ అధికారులు ముగ్గురు మినహా, బోర్డులో అత్యధికులు నిపుణులు అయి ఉంటారన్న నమ్మకం లేదు. అందువల్ల, ఈ బోర్డును ప్రజాస్వామిక సంస్థగా చూడవలసి ఉన్నదని నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ భోలె సూచించిన సూత్రాన్ని అంగీకరించి తీరాలి. ఈ దృష్ట్యా, నామినేషన్ కంటే ఎన్నిక విధానానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలి. దీనిని ప్రజాస్వామిక సంస్థగా చూడరాదని, సలహాలు ఇచ్చేందుకే దీనిని ఉద్దేశించామని నా గౌరవనీయ స్నేహితుడు చెప్పినట్లయితే, విద్యారంగంలో నిపుణులైన వారికే అధిక సంఖ్యలో బోర్డులో స్థానం కల్పిస్తామని కూడా ఆయన ప్రకటించాలి. "ప్రావిన్షియల్ ప్రభుత్వం నియమించే ముగ్గురు సభ్యులు విద్యారంగంలో నిపుణులై ఉండాలి" అనే సవరణను ఆయన అంగీకరించాలని సూచిస్తున్నాను.అంతేగాని, ఆయన పరిస్థితిని ఈ విధంగా అస్పష్టపరచ కూడదు. కొన్ని బలహీన పరిస్థితుల్లో నిపుణులుకాని వారిని కూడా ప్రభుత్వం నియమించవచ్చు. ప్రభుత్వాలకు కొన్ని బలహీన పరిస్థితులు ఉంటాయి. అలాగే మనకు కూడా కొన్ని బలహీన పరిస్థితులు ఉంటాయి. నిపుణులు కాని వారినే ప్రభుత్వం నియమిస్తే, ఈ క్లాజు వెనక ఉన్న అసలు ఉద్దేశ్యమే దెబ్బతింటుంది.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 3, పేజీలు - 2176-77, తేదీ - ఏప్రిల్ 21, 1938.

***గౌరవనీయ శ్రీ బి.జి. ఖేర్:*** తన సొంత పార్టీసభ్యుడు ప్రతిపాదించిన సవరణకు ఇంత సమర్థవంతంగా జవాబు ఇచ్చినందుకు గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్‌కు నేను ఎంతగానో రుణపడి ఉంటాను. సవరణకు వ్యతిరేకంగా నేను కూడా అంత చక్కని వాదనలు చేసి ఉండేవాడిని కాదని ఒప్పుకుంటున్నాను.



# 12

# బొంబాయి ప్రాథమిక విద్యా చట్ట సవరణ బిల్లు - 2*

## క్లాజుల వారీగా పఠనం

*గౌరవనీయ సభాపతిః* ప్రాథమిక విద్యాచట్ట సవరణ బిల్లు అనే 15వ నెంబరు బిల్లుపై ఇప్పుడు చర్చిద్దాం. గత మంగళవారం నాడు అనుకుంటాను ఈ బిల్లుపై సభ చర్చించింది. సభ వాయిదా పడినప్పుడు కన్సాలిడేటెడ్ జాబితాలోని సవరణల్లో 91వ నెంబర్ సవరణపై చర్చ జరుగుతూ ఉన్నది. గౌరవనీయ సభ్యుడు శ్రీ జమునాదాస్ మెహతా ఈ సవరణను ప్రతిపాదించారు. ఈ సవరణ ఇదిః

12వ క్లాజులోని (2)వ సబ్‌క్లాజులో ఉన్న "ఉద్యోగిగా ఉంటారు" అనే పదాలను తొలగించాలి.

ఈ విధంగా సవరించిన తరువాత క్లాజు ఇలా ఉంటుంది.

"(2) పరిపాలనాధికారిని ప్రావిన్షియల్ ప్రభుత్వం నియమిస్తుంది. ఆయన వేతనం, అధికారాలు, విధులు నిర్దేశించిన విధంగా ఉంటాయి."

*డాక్టర్.బి.ఆర్.అంబేద్కర్ః* అధ్యక్షా! నేను ఒకపాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తనా? సవరణను, దాని ఉద్దేశాన్ని నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. అందువల్ల, ఈ విషయంపై కొంత సమాచారం కావాలని అడుగుతున్నాను. 'ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటారు", అనే పదాలను సవరణలో తొలగించవలసి ఉంది. నేను చెప్పినది సరైనదేనా? అందువల్ల, సవరణ ఉద్దేశం ఏమై ఉండవచ్చునంటే...

*గౌరవనీయ సభాపతి :* "ఉద్యోగిగా ఉంటారు", అనే పదాలను మాత్రమే తొలగించాలని అడిగారు, "ప్రావిన్షియల్ ప్రభుత్వం", అనే పదాలను తొలగించవలసిందిగా సవరణలో కోరలేదు.

*డా॥ అంబేద్కర్ :* అందువల్ల నాకు అర్థమైనది ఏమిటంటే పరిపాలనాధికారిని ప్రావిన్షియల్ ప్రభుత్వం నియమిస్తుంది. కాని, ఆయన ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగా ఉండరు. ఒకవేళ "ఉద్యోగిగా ఉంటారు" అనే పదాలను తొలగించినప్పటికీ, చట్టప్రకారం ఆయన ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగానే ఉంటారని అంటున్నాను. ఎందుకంటే, ప్రావిన్షియల్ ప్రభుత్వమే ఆయనను నియమిస్తుంది కాబట్టి. అందువల్ల ఈ సవరణకు అనుకూలంగా వోటు చేయాలా, లేక వ్యతిరేకంగా

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు – 2647-49, ఏప్రిల్ 30, 1938.

వోటు చేయాలా అనేది తెల్సుకోవడం ఎవరికైనా కష్టమే. పరిపాలనాధికారిని ప్రావిన్షియల్ ప్రభుత్వమే నియమించాలని సవరణను ప్రతిపాదించిన గౌరవనీయ సభ్యులు కోరుకుంటున్నట్లయితే, ఆ అధికారి ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగా ఉండటం కూడా అత్యంత సహజమైన పర్యవసానమని చెప్పక తప్పదు. "ఉద్యోగిగా ఉంటారు'అనే పదాలను తొలగించినంత మాత్రాన ఆ అధికారి ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగి కాకపోరు. ఈ విషయంపై నాకు కొంత వివరణ కావాలి.

*గౌరవనీయ సభాపతి :* ఈ సవరణను ప్రవేశపెట్టినప్పుడు గౌరవనీయ సభ్యుడు సభలో ఉన్నారో, లేదో నాకు తెలియదు.

*డా॥ అంబేద్కర్ :* నేను సభలో ఉన్నాను.

*గౌరవనీయ సభాపతి :* చట్టపరమైన పర్యవసానాల గురించి నేను అర్థం చేసుకోలేకపోతున్నాను.

*డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* గౌరవనీయ హోం మంత్రి విషయాన్ని స్పష్టం చేయవచ్చు.

*గౌరవనీయ సభాపతి :* ఈ సవరణ వెనుక ఉన్న ఉద్దేశ్యం నాకు అర్థమైందని అనుకుంటున్నాను. పాఠశాల బోర్డులే అధికారులను నియమిస్తున్న విధానం సరియైనది కానట్లయితే, నియామకవిషయాన్ని ప్రభుత్వానికే వదిలివేయాలి. బొంబాయి మున్సిపల్ కమీషనర్‌ను నియమించిన పద్ధతిలోనే ప్రభుత్వం వీరిని కూడా నియమిస్తుంది. అయితే వారు సర్వీసులో ఉన్నంతవరకు పాఠశాల బోర్డు ఉద్యోగులుగానే కొనసాగుతారు. పాఠశాల బోర్డు నిర్ణయ పరిధిలోనే ఉంటారు. వారి సస్పెన్షన్ విషయంకాని, డిస్మిస్ విషయం కాని, ఇతర ఏ విషయాలు కాని పాఠశాల బోర్డులే చూస్తాయి. అంతేకాక అధికారులను ఎంపిక చేయడానికి పాఠశాల బోర్డులకు ప్రభుత్వం కొందరి పేర్ల జాబితాను ఇవ్వవచ్చునని కూడాసూచించారు. అధికారుల నియామకం జరిగే పద్ధతి ఇదేనని నాకు అనిపిస్తూ ఉంది. ఇందులో విరుద్ధ విషయాలు కాని, మారేవి కాని ఉన్నట్లు కన్పించడం లేదు.

*డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* అధికారులు పాఠశాల బోర్డుల ఉద్యోగులుగానే ఉండాలనేది లక్ష్యమయితే, "ఉద్యోగిగా ఉంటారు" అనే పదాలను తొలగించిన పక్షంలో ఆ లక్ష్యం నెరవేరదు. ఎందుకంటే, చట్టప్రకారం వారు ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగులుగా ఉంటారు. ప్రావిన్షియల్ ప్రభుత్వమేవారిని నియమిస్తుంది. కాబట్టి, ఇది అత్యంత సహజమైన విషయం. ఒక సంస్థ ఉద్యోగిగా ఉండడం, ఒక సంస్థ నియంత్రణ కింద ఉండడం వేరు వేరు విషయాలు. ఎవ్వరైన ఒక సంస్థ ఉద్యోగిగా ఉండవచ్చు. అయినప్పటికీ మరో సంస్థ నియంత్రణ కింద ఉండవచ్చు. ఈ రెండింటి మధ్య చాలా వ్యత్యాసం ఉన్నదని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

*గౌరవనీయ సభాపతి:* ఆ పద్ధతినే అనుసరించాలని ఏమీ లేదు. ఎందుకంటే, ఒక సంస్థ నియామకం జరిపినప్పుడు ఆ అధికారి మరొక సంస్థ ఉద్యోగిగా ఉండలేరు. గౌరవనీయ సభ్యుడు తన సమాధానంలో ఈ విషయాన్ని స్పష్టం చేస్తారనుకుంటున్నాను.

**శ్రీ జమునాదాస్ ఎం. మెహతా :** నాకు సంబంధించినంత వరకు ఇక్కడ 'పాయింట్ ఆఫ్ ఆర్డర్ నాకు ఏమీ కన్పించడం లేదు.

***డా॥ అంబేద్కర్ :*** ఇదిపాయింట్ ఆఫ్ ఆర్డర్ కాకపోయినా, 'పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ ఏ విధంగా వోటుచేయాలో నిర్ణయించుకోవడానికి విషయాన్ని పూర్తిగా తెలుసుకోవాలని నేను అనుకున్నాను.

***గౌరవనీయ సభాపతి*** 'పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్‌కు సంబంధించి జవాబు చెప్పే బాధ్యతను సవరణ ప్రతిపాదించిన గౌరవనీయ సభ్యుడికే వదిలి పెడుతున్నాను.



# 13

# బొంబాయి ప్రాథమిక విద్యా చట్ట సవరణ బిల్లు – 3*

**డా॥ అంబేద్కర్:** అధ్యక్షా! ఈ సవరణపై మాట్లాడే అవకాశాన్ని నేను కోల్పోయాను. అయితే, మీరు అనుమతిస్తే, కొంత సమాచారం కోసం ప్రధాన మంత్రిని అడగాలనుకుంటున్నాను.

**గౌరవనీయ స్పీకర్:** మరీ సుదీర్ఘంగా అడగవద్దు.

**డా॥ అంబేద్కర్** ఈ అంశంపై మాట్లాడాలని ఆయన అనుకున్నారు. అయితే,ఆయన మరచిపోయారని భావిస్తున్నాను. పాఠశాల బోర్డు పరిపాలనాధికారి పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కింద ఉంటారో, లేదో ప్రధాని నుంచి తెలుసుకోవాలనుకుంటున్నాను.పాలనాధికారి ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటారని క్లాజు ద్వారా అర్థమైంది. అయితే, ఆయన పాఠశాల బోర్డులో ఉన్నప్పుడు పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కింద ఉంటారా? లేదా?

**గౌరవనీయ శ్రీ బి.జి. ఖేర్:** మీరు అడుగుతున్నది ఏమిటి? పరిపాలనాధికారి వేతనం, అధికారాలు, విధులుమొదలైన అన్ని అంశాలను నిబంధనల ద్వారా నిర్దేశించడం జరుగుతుందని పేర్కొన్నాం కదా! పాఠశాల బోర్డు అధికారాలను ఇది వరకే నిర్వచించడం జరిగింది. పాఠశాల బోర్డుల అధికారాలు, విధులతో సహా మొత్తం విషయాలను నేను సభ ముందు వివరంగా ఉంచినప్పుడు గౌరవనీయ సభ్యుడు సభలో లేరు. పరిపాలనాధికారుల అధికారాలు, విధుల విషయంలో మాదిరిగానే ఈబోర్డుల విషయంలో కూడా నిబంధనల ద్వారా నిర్దేశిస్తారు. అందువల్ల, ముఖ్యమైన విషయాలలో పాఠశాల బోర్డుల అభీష్టాలను పరిపాలనాధికారులు ఖాతరు చేయని క్లిష్టపరిస్థితి తలెత్తుతుందని నేను అనుకోవడం లేదు.

**గౌరవనీయ సభాపతి :** ఇది క్లిష్ట పరిస్థితి గురించిన సమస్యకాదు. పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కింద పరిపాలనాధికారి ఉంటారా? అని గౌరవనీయ సభ్యుడు అడుగుతున్నారు.

**గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:** బాగుంది. పాఠశాల బోర్డులు పరిపాలనాధికారిని తొలగించలేవు.

**డా॥ అంబేద్కర్:** నేను ఒక ఉదాహరణ చెబుతాను. సచివాలయంలో ఒక అధికారి పనిచేస్తున్నారు. మంత్రి ఒక ఆదేశం జారీ చేస్తారు. అధికారి ఆ ఆదేశాన్ని ఖాతరు చేయరు. సివిల్ సర్వీసు

---

* బి.ఎల్. ఏ. చర్చలు, సంపుటి : 3, పేజీలు : 2672-72, తేదీ : ఏప్రిల్ 30, 1938.

నిబంధనలలో పొందు పరిచిన అంశాల ప్రకారం నాలుగైదు రకాలుగా ఆ అధికారిని శిక్షించే హక్కు మంత్రికి ఉంటుంది. అయితే, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో అప్పలు చేసుకునే హక్కు అధికారికి ఉంటుందనుకోండి. నేను తెలుసుకోవాలనుకుంటున్నది ఏమిటంటే, మంత్రి, ఆ అధికారి మధ్య ఉన్న సంబంధాలు మాదిరిగానే క్రమశిక్షణా నియంత్రణ విషయంలో పాఠశాల బోర్డు, పరిపాలనాధికారి మధ్య సంబంధాలు కూడా ఉంటాయా? లేదా? అని.

*గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్*: లేదు. అలా ఉండవని అనుకుంటున్నాను.

## పునః ప్రారంభమైన చర్చ*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం)*: అధ్యక్షా ! గౌరవనీయ సభ్యుడు శ్రీ మోరె సవరణను నేను ఒక సవరణకు ప్రతిపాదించాలని అనుకుంటున్నాను.

గౌరవనీయ స్పీకర్ : ఇది వేరే విధంగా ఉన్నదా?

*డా॥ అంబేద్కర్*: అవును. వేరే విధంగానే ఉంది. నా సవరణ ఇది :

"పరిపాలనాధికారి వంటి పదవి తొలగించదగినదే" అనే పదాలను తీసివేసి ఈ కింది భాగాన్ని చేర్చాలి :

"పాఠశాల బోర్డు క్రమశిక్షణ నియంత్రణ ఆధీనంలో ఉంటారు. క్రమశిక్షణ ఉల్లంఘిస్తే తగిన విధంగా తీర్మానాన్ని ఆమోదించటం ద్వారా పాఠశాల బోర్డు ఆయనను శిక్షించవచ్చు. అయితే, పరిపాలనాధికారికి నిబంధనలలో కల్పించిన విధంగా అప్పలు చేసుకునే హక్కు ఉంటుంది".

నేను ప్రతిపాదించిన సవరణతో సహా మొత్తం సవరణ ఈ కింది విధంగా ఉంటుంది –

"పరిపాలనాధికారి పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కింద ఉంటారు. క్రమశిక్షణ ఉల్లంఘిస్తే, తగిన విధంగా తీర్మానాన్ని ఆమోదించడం ద్వారా పాఠశాలబోర్డు ఆయనను శిక్షించవచ్చు. అయితే, పరిపాలనాధికారికి నిబంధనలలో కల్పించిన విధంగా అప్పలు చేసుకునే హక్కు ఉంటుంది."

*గౌరవనీయ సభాపతి*: "కల్పించిన విధంగా" అనే పదాల స్థానంలో 'నిర్దేశించిన విధంగా" అనే పదాలను చేర్చాలి. అప్పుడు సవరణ ఈ క్రింది విధంగా ఉంటుంది.

"పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కింద ఉంటారు. క్రమశిక్షణ ఉల్లంఘిస్తే, తగిన విధంగా తీర్మానాన్ని ఆమోదించడం ద్వారా పాఠశాల బోర్డు ఆయనను శిక్షించవచ్చు. అయితే, పరిపాలనాధికారికి నిబంధనలలో నిర్దేశించిన విధంగా అప్పలు చేసుకునే హక్కు ఉంటుంది."

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం)*:– అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మోరె ప్రతిపాదించిన

*ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు : 267–82, ఏప్రిల్ 30, 1938.

సవరణకు, నేను ప్రతిపాదిస్తున్న సవరణ పూర్తి భిన్నమైనది. ప్రభుత్వం నియమించిన పరిపాలనాధికారిని ఉద్యోగం నుంచి తొలగించే హక్కు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో పాఠశాల బోర్డుకు ఉంటుందని శ్రీ మోరె తన సవరణలో పేర్కొన్నారు. శ్రీ మోరె సవరణకు నా సవరణ పూర్తి భిన్నమైనది. ఒక పరిపాలనాధికారిని తొలగించే అధికారాన్ని కాని, డిస్మిస్‌చేసే అధికారాన్నికాని నా సవరణ పాఠశాల బోర్డులకు ఇవ్వదు. నా సవరణలో ఉన్నదేమిటంటే, ఒక పాఠశాల బోర్డు కింద పరిపాలనాధికారిగా పనిచేస్తున్న కాలంలో ఆయనపై పాఠశాలబోర్డుకు క్రమశిక్షణా నియంత్రణ ఉంటుంది. అధ్యక్షా! బిల్లులోని 12వ క్లాజు సూత్ర ప్రాయంగా విచిత్రమైనదని గుర్తించాలి. అధికారి ఏ సంస్థ ఉద్యోగిగా ఉంటాడో ఆ సంస్థకు లోబడి ఉండాలని అంగీకరించబడిన సూత్రమే. పరిపాలనాధికారిని ప్రావిన్షియల్ ప్రభుత్వమే నియమిస్తుందని, ఆయన ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగిగానే ఉంటాడని 12 వ క్లాజులో మనం పేర్కొన్నాం. గౌరవనీయ స్నేహితుడు శ్రీ జమునాదాస్ మెహతా ప్రవేశపెట్టిన సవరణపై ప్రసంగించిన అనేక మంది సభ్యులు కూడా ఈ విచిత్ర పరిస్థితి కారణంగా ఎదురయ్యే చిక్కులను చెప్పారు. చెప్పిన విషయాలనే పదేపదే చెబుతూ సమయాన్ని వృధా చేయాలని నేను అనుకోవడం లేదు. 12వ క్లాజును ఆమోదించడం ద్వారా కలిగే ఫలితం ఏమిటి? పరిపాలనాధికారులను ప్రావిన్షియల్ ప్రభుత్వమే నియమిస్తుందని, వారు ప్రావిన్షియల్ ప్రభుత్వ ఉద్యోగులుగానే ఉంటారని ప్రధానమంత్రి పేర్కొన్నారు. ఆయన ఈ పద్ధతి అవలంబించినందుకు రెండు కారణాలవల్ల ఆయన పట్ల సానుభూతి నేను చూపిస్తున్నాను. ఆయన అవలంబించిన వైఖరికి నేను సానుభూతి చూపించడానికి గల మొదటి కారణం ఇది.స్థానిక బోర్డులు కాని, పాఠశాల బోర్డులు కాని పరిపాలనాధికారులను నియమిస్తున్నట్లయితే , ఆ పరిపాలనాధికారులు తమ జీవిత కాలమంతా ఒకే ప్రదేశంలో గడపవలసి వస్తుంది. సూత్రప్రాయంగా ఇటువంటి పరిణామం ఎంతమాత్రం మంచిది కాదు. ఎందుకంటే, ఒక అధికారి తన జీవితకాలమంతా ఒకే ప్రదేశంలోనే ఉండేటట్లు అయితే ఆయన నిస్సందేహంగా తనకంటూ ఒక పక్షాన్ని సృష్టించుకుంటాడు. స్నేహితులను చేరదీస్తాడు. తన పరిపాలనాధికారాన్ని పక్షపాత ధోరణిలో ఉపయోగించుకోవడానికి అనేక సందర్భాలను కల్పించుకుంటాడు. అందువల్ల కలెక్టర్, జిల్లా జడ్జీలను ఒక జిల్లానుంచి మరొక జిల్లాకు మార్చే పద్ధతిలోనే పరిపాలనాధికారులను కూడా ఒక చోటు నుంచి మరొక చోటుకు మార్చడం చాలా అవసరం. గౌరవనీయ ప్రధాన మంత్రి అనుసరించిన పద్ధతి పట్ల నేను సానుభూతి కనబర్చడానికి గల రెండవ కారణం ఇది .పరిపాలనాధికారులను ప్రభుత్వం నియమించకపోయినట్లయితే, ప్రమోషన్, తదితర అవకాశాలు కలిగిన 'రెగ్యులర్' సర్వీసు కేడర్‌ను సృష్టించడం సాధ్యం కాని విషయం.ఆ అభిప్రాయం పట్ల నాకు పూర్తిగా సానుభూతి ఉంది. అయితే, అధ్యక్షా! కనీసం క్రమశిక్షణా నియంత్రణ కోసం అయినా ఈ అధికారులను పాఠశాల బోర్డుల ఆధీనంలో ఉంచితే ప్రభుత్వానికి ఏమి ఇబ్బందో నాకు అర్థం కావడం లేదు. నేను సూచించిన సవరణ అమలులోకి రాకపోతే, బిల్లు ద్వారా తలపెట్టిన స్థానిక బోర్డు యంత్రాంగం పనితీరు సాఫీగా ఎలా ఉంటుందో నాకు అర్థం కావడం లేదు.

భారత ప్రభుత్వ చట్టం కింద ఏం జరిగిందో చెప్పడం ద్వారా నా వైఖరిని వ్యక్తం జేయాలనుకుంటున్నాను. ఉదాహరణకు ఇండియన్‌సివిల్‌సర్వీస్ సభ్యుల పరిస్థితిని తీసుకుందాం. ఇండియన్ సివిల్ సర్వీసు సభ్యులను ప్రభుత్వ కార్యదర్శి నియమిస్తారు. మాంటేగ్ చెమ్స్‌ఫర్డ్ నివేదికను రూపొందించినప్పుడు అనేకమంది దాన్ని చదివారు. అసలైన నియంత్రణను మంత్రులకు బదలీ చేసే సమయంలో ఎదురయ్యే తీవ్ర ఇబ్బందులలో ఇండియన్ సివిల్ సర్వీస్ సభ్యుల వ్యతిరేకత కూడా ఒకటని వారు గుర్తించి ఉంటారు. తమను నియమించేది ప్రభుత్వ కార్యదర్శే తప్ప మంత్రులు కాదని, అందువల్ల మంత్రుల నియంత్రణకు తాము లోబడి ఉండబోమని ఇండియన్ సివిల్‌సర్వీస్ సభ్యులు వాదించారు. సంస్కరణల కింద భారతీయ మంత్రులకు అసలైన అధికారాన్ని బదలీ చేయాలని కోరుకుంటున్నవారు మరోరకమైన వాదనలు చేశారు. పరిపాలనలో కీలక పాత్ర వహించే ఇండియన్ సివిల్ సర్వీస్ సభ్యులను నియంత్రించే అధికారం భారతీయ మంత్రులకు లేకపోయినట్లయితే, అసలైన అధికారం బదలీ జరిగినట్లు కాదని వారు తేల్చివేశారు. చాలా కాలం పాటు ఈ గొడవ కొనసాగింది. అయితే, రాజీమార్గంగా కమిషన్ నివేదిక ఆధారంగా ఒక మధ్యే మార్గాన్ని అనుసరించాలని చివరకు నిర్ణయించారు. అటువంటి మధ్యేమార్గాన్నే నేను నా సవరణ ద్వారా సూచించాను. అధ్యక్షా! పరిపాలనాధికారులను నియమించడంలో ప్రావిన్షియల్ ప్రభుత్వానికి ఉన్న అధికారాన్ని నా సవరణ తొలగించదు. అలాగే, పరిపాలనాధికారులను తొలగించడంలో ప్రావిన్షియల్ ప్రభుత్వానికి ఉన్న అధికారాన్ని కూడా నా సవరణ తొలగించదు. పాఠశాల బోర్డు కింద పనిచేస్తున్న కాలంలో పరిపాలనాధికారిని పాఠశాల బోర్డు ఉద్యోగిగా పరిగణించబడాలని కూడా నా సవరణ పేర్కొనడం లేదు. నేను ప్రతిపాదించిన సవరణ చాలా పరిమితమైనది. పాఠశాల బోర్డులో పరిపాలనాధికారిగా పనిచేస్తున్న కాలంలో ఆయనపై పాఠశాల బోర్డు క్రమశిక్షణా నియంత్రణ కలిగి ఉంటుందని మాత్రమే నా సవరణ చెప్తున్నది. అంతేకాక, పాఠశాల బోర్డు పరిపాలనాధికారికి ఎటువంటి శిక్ష విధించాలో, ఆ పరిపాలనాధికారికి ఏ రకమైన అప్పీలు హక్కు ఉన్నదో... వీటన్నింటికీ ప్రభుత్వమే నిబంధనలను రూపొందించాలని నేను సూచిస్తున్నాను. పరిపాలనాధికారికి పాఠశాల బోర్డు ఈ రకమైన శిక్ష విధించాలి, ఆ రకమైన శిక్ష విధించాలి, అని నేను చెప్పడం లేదు. పరిపాలనాధికారికి అప్పీలు హక్కు ఇలా ఉండాలి, అలా ఉండాలి అని కూడా నేను చెప్పడం లేదు. ఆ అంశాలన్నిటినీ ప్రభుత్వానికే వదిలి పెడుతున్నాను. నా సవరణ పేర్కొంటున్నది ఏమిటంటే, పరిపాలనాధికారి పాఠశాల బోర్డు కింద పనిచేస్తున్న కాలంలో ఆయనపై బోర్డుకు కొంత నియంత్రణ ఉండాలని మాత్రమే. పాఠశాల బోర్డుకు మనం కనీసం ఈ కొద్దిపాటి అధికారాన్ని అయినా ఇవ్వకపోతే, తాను నిజంగా పాఠశాల బోర్డు ఉద్యోగినని పరిపాలనాధికారి ఏ విధంగా భావించగలడో నాకు అర్థం కావడం లేదు. గౌరవనీయ ప్రధాన మంత్రిని అడుగుతున్నాను. ఉదాహరణకు తన కింద పనిచేస్తున్న ఉద్యోగిపై ప్రధాన మంత్రికే అటువంటి అధికారం లేకపోతే, ఆ ఉద్యోగి అవిధేయత ప్రదర్శించినప్పుడు అతనిని ఆయన శిక్షించలేకపోతే, ఆయన సొంత విభాగం పనితీరు ఎలా ఉంటుందో ఆలోచించవలసిదిగా కోరుతున్నాను. పాఠశాల బోర్డు ఇచ్చే న్యాయమైన,

చట్టబద్ధమైన ఆదేశాలను తాను అమలు చేయవలసి ఉన్నదని పరిపాలనాధికారి భావించే విధంగా కనీస నియంత్రణాధికారాన్ని పాఠశాల బోర్డుకు ఇవ్వాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. పాఠశాల బోర్డు సాఫీగా పనిచేయాలంటే ఇటువంటి చర్య అవసరం. ఈ మాటలతో నేను నా సవరణను సభ ముందు పెడుతున్నాను.

  

# 14

# బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణకు ఉద్దేశించిన బిల్లు 12, 1928

ఈ కింద పేర్కొన్న బిల్లు*ను బొంబాయి శాసన మండలి నిబంధనలలోని 20వ నిబంధన కింద ప్రచురించడం జరుగుతున్నది. ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి 1928, మార్చి 19 నాటి శాసన మండలి సమావేశంలో ఎం.ఎల్.సి డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్‌కు బొంబాయి గవర్నర్ అనుమతి ఇచ్చారు.

## 12వ నెంబర్ బిల్లు, 1928

(1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణకు ఉద్దేశించిన బిల్లు)

బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టాన్ని సవరించడం అవసరమైనది కనుక, అందుకు భారత ప్రభుత్వ చట్టంలోని 80 సి.సెక్షన్ కింద గౌరవనీయ గవర్నర్ అందుకు ముందు గానే అనుమతి ఇచ్చారు. కనుక ఈ కింది విధంగా సవరించడం జరిగింది.

1. ఈ చట్టాన్ని బొంబాయి వారసత్వ ఉద్యోగాల (సవరణ) చట్టం, 1928గా వ్యవహరించడం జరుగుతుంది.

2. **1874 నాటి బొంబాయి వారసత్వ చట్టంలోని 9వ సెక్షన్ తరువాత ఈ కింది నూతన సెక్షన్ (9ఎ) ను చేర్చాలి.** "9-ఎ. (1) వతన్‌దారుకు ప్రతిఫలంగా కేటాయించిన వతన్‌భూమి 1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టం అమలులోకి రాక ముందు ఏదయినా బ్రిటిష్ కోర్టు ఆదేశం ప్రకారం కాక మరే విధంగాకాని, కలెక్టర్ అనుమతి లేకుండా కాని, రెవెన్యూ రికార్డులలో యాజమాన్య హక్కు బదలీ జరగకుండా కాని ఆ వతన్‌దార్ కాకుండా మరే వ్యక్తి స్వాధీనంలోకి అయినా వెళ్లినట్లయితే, ఆ భూమి బదలీ చెల్లదని కలెక్టర్ ప్రకటిస్తారు. ఆ వతన్ భూమి, దానినుంచి వచ్చిన ఏవయినా లాభాలు కాని ఆ రోజు నుంచి అసలు వతన్‌దార్‌కే చెందుతాయని కలెక్టర్ ప్రకటిస్తారు. ఆ భూమినుంచి వచ్చిన లాభాల మొత్తాన్ని ఆయన స్వాధీన పరచుకుని ఆ వతన్‌దార్‌కు చెల్లిస్తారు.

(2) ఆ వతన్ భూమి రూపంలో ఉన్నట్లయితే అది వతన్‌దార్‌కు బదలీ కావాలని కలెక్టర్ ఆదేశిస్తారు.

---

* 1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టాన్ని సవరించడానికి ప్రవేశపెట్టిన బిల్లు పాఠం ఇది. 1928, ఏప్రిల్ 16వ తేదీలో ప్రచురించిన బొంబాయి ప్రభుత్వ గెజిట్ ఐదవ భాగంలో ఈ బిల్లును ప్రచురించారు. ఈ బిల్లును ప్రవేశపెడుతూ డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ చేసిన ప్రసంగాన్ని తదుపరి పేజీలలో చూడవచ్చు.

**3.. 1874 నాటి చట్టంలోని 15వ సెక్షన్‌కు సవరణ :**

15వ సెక్షన్‌లోని 1వ క్లాజుకు ఈ కింది భాగాన్ని చేర్చాలి.

"వతన్ భూములపై పూర్తి శిస్తు చెల్లించడానికి అంగీకరిస్తూ వతన్‌దారుల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులు కాని తమ సేవలనుంచి తమను విముక్తం చేయవలసిందిగాను, తమ వతన్ భూములను తమ ఆధీనంలోనే ఉంచవలసిందిగాను కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా విజ్ఞప్తి చేసుకునే స్వేచ్ఛ వారికి కల్పించడం జరుగుతున్నది. సేవలు అందించడానికి, లేదా మానడానికి వారికి స్వేచ్ఛ ఉంటుంది"

**4. 1874 నాటి చట్టంలోని 19వ సెక్షన్‌కు సవరణ :**

19వ సెక్షన్ నుంచి ఈ భాగాన్ని తొలగించాలి. "చెల్లింపు నగదు రూపంలోకాని, వస్తు రూపంలోకాని చేయవచ్చునని నిర్ణయించే అధికారం"

**5.1874 నాటి చట్టంలో 19ఎ, 19బి, 19సి, 19డి అనే నూతన సెక్షన్‌లను చేర్చడం:**

19వ సెక్షన్ తరువాత ఈ కింది సెక్షన్‌లను చేర్చాలి:

19ఎ. ధాన్య రూపంలోనో, మరే వస్తు రూపంలోనో ప్రతిఫలం పొందుతున్న వతన్‌దార్‌లు తమ సంస్థ ద్వారా కాని, అధిక సంఖ్యలో తామే కాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేసుకుంటూ, ప్రతిఫలాన్ని వస్తు రూపంలో కాక ధన రూపంలో చెల్లించాలని కోరితే కలెక్టర్ ఆ విధంగా ఏర్పాటు చేస్తారు.

19బి. వస్తురూపంలో చెల్లించే ప్రతిఫలాన్ని ధన రూపంలోకి మార్చినట్లయితే, ఎవరైతే ఆ ప్రతిఫలాన్ని చెల్లించవలసి ఉందో వారి నుంచి దాన్ని వసూలు చేయవలసిందిగా వతన్‌దార్‌ల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులు కాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేయవచ్చు. అప్పుడు భూమి శిస్తుతో పాటు, భూమి శిస్తులో భాగంగా ఆ నగదు రూపంలోని ప్రతిఫలాన్ని కలెక్టర్ వసూలు చేయించి, అది అందవలసిన వతన్‌దారులకు ప్రభుత్వ ఖజానా నుంచి చెల్లించే ఏర్పాటు చేస్తారు.

19సి. రైతులకు ప్రభుత్వానికి చేస్తున్న సేవలకు వస్తురూపంలో సంయుక్తంగా చెల్లిస్తున్న ప్రతిఫలాన్ని నగదు-రూపంలోకి మార్చినట్లయితే, ప్రభుత్వానికి చేస్తున్న సేవలకు ఎంత భాగం తమకు ముడుతుందో, రైతులకు చేస్తున్న సేవలకు గాను ఎంత భాగం తమకు ముడుతుందో నిర్ణయించవలసిందిగా వతన్‌దార్‌ల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులు కాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేసుకోవచ్చు. అప్పుడు ఆ విషయాన్ని కలెక్టర్ నిర్ణయిస్తారు. కలెక్టర్ తీసుకునే నిర్ణయమే తుది నిర్ణయం.

19డి. 19సి, సెక్షన్‌లో పేర్కొన్న నిర్ణయం చేయవలసిందిగా కలెక్టర్‌ను కోరిన వతన్‌దార్‌ల సంస్థకు కాని, వారిలో అధిక సంఖ్యాకులకు కాని రైతులపనులు చేయడానికి నిరాకరించే హక్కు ఉంది. అయితే, వారు అదే విషయాన్ని కలెక్టర్‌కు లిఖిత పూర్వకంగా తెలియజేయవలసి

ఉంటుంది. వతన్‌దార్‌లు అటువంటి నిర్ణయం తీసుకున్నట్లయితే, రైతుల పనులకు గాను నగదు రూపంలో ముట్టవలసిన ప్రతిఫలాన్ని వారు కోల్పోతారు.

**6. 1874 నాటి చట్టంలోని 21వ సెక్షన్‌కు సవరణ :**

21వ సెక్షన్‌లోని "అటువంటి కాలవ్యవధి" అనే పదాల స్థానంలో ఈ కింది పదాలను చేర్చాలి. "10 సంవత్సరాలు దాటని కాలవ్యవధి".

**7. 1874 నాటి చట్టంలోని 83వ సెక్షన్‌కు సవరణ :**

83వ సెక్షన్ స్థానంలో ఈ కింద సెక్షన్‌ను చేర్చాలి 83 చట్టం ఆమోదింపబడిన తరువాత ఏ వారసత్వ ఉద్యోగానికైనా సంబంధించే విధంగా విధులను నిర్దేశిస్తూ ప్రభుత్వం నిబంధనలను రూపొందిస్తుంది. 18వ సెక్షన్‌లో పేర్కొన్నవి మినహా ఇతర విధులను ప్రభుత్వం నిర్ణయిస్తుంది.

బొంబాయి శాసనమండలి తదుపరి సమావేశాలకు ఒక నెల ముందు బొంబాయి ప్రభుత్వ గెజిట్‌లో ముందుగా ప్రచురించనిదే ఈ నిబంధనలు అమలులోకి రావు. తదుపరి సమావేశాలలో శాసన మండలి ఈ నిబంధనలను ఒక తీర్మానం ద్వారా రద్దు చేయవచ్చు లేదా సవరించవచ్చు.

## లక్ష్యాలు, కారణాల వివరణ

ఈ బిల్లు లక్ష్యాలు ఇవి:

1. వతన్‌దార్‌లకు సరిగ్గా ప్రతిఫలం అందేటట్లు చూడడం.
2. కిందిస్థాయి వారసత్వ గ్రామసేవకుల వతన్‌ల మార్పిడికి అవకాశం కల్పించడం.
3. 'బలూటా' ను నగదు రూపంలో మార్చడానికి అవకాశం కల్పించడం.
4. రైతులకు పనులు చేసి పెట్టే బాధ్యత నుంచి తనను తాను విముక్తం చేసుకునేందుకు వతన్‌దార్‌కు అవకాశం కల్పించడం.
5. వతన్‌దార్‌ల విధులను నిర్వచించడం.

(సంతకం)

బి.ఆర్.అంబేద్కర్

జి.ఎస్.రాజాధ్యక్ష,
శాసనమండలి తాత్కాలిక కార్యదర్శి
బొంబాయి

బొంబాయి,
1928, ఏప్రిల్ 13.

☆ ☆ ☆

# 15

# వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణ బిల్లు – 1

*డా॥ అంబేద్కర్:* అధ్యక్షా! 1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టాన్ని సవరించడానికి రూపొందించిన 1928 నాటి 12వ నెంబర్ బిల్లు,* ప్రవేశపెడుతున్నాను. పటేల్ లేదా కులకర్ణిలకు సంబంధించిన బిల్లు కాదు ఇది. ఈ బిల్లులో పేర్కొన్న వారసత్వ ఉద్యోగులను వారసత్వ ఉద్యోగాల చట్టంలో కింది స్థాయి ఉద్యోగులుగా పరిగణించారు. ప్రస్తుతం అటువంటి ఉద్యోగులను దక్కన్ ప్రాంతంలో 'మహర్'లుగాను, గుజరాత్‌లో 'వెధియా'లు లేదా 'వర్తనియా'లుగాను, కర్నాటకలో 'రమెషీ'లు లేదా 'జగ్లియా'లు, 'హోలియా' లుగాను వ్యవహరిస్తున్నారు. ఈ కింది స్థాయి ఉద్యోగులలో అత్యధికులు మహర్‌లు. అందువల్ల, సభలో జరిగిన చర్చలో ఈ ఉద్యోగుల గురించి మాట్లాడవలసి వచ్చినప్పుడు వారిని నేను 'మహర్'లుగా వ్యవహరిస్తాను.

అధ్యక్షా! ఈ బిల్లులోని అంశాలను అర్థం చేసుకోవాలంటే, ఈ బిల్లు ప్రవేశ పెట్టడానికి ఏ తప్పిదాలు, ఏ కడగండ్లు నన్ను పురిగొల్పాయో సభ తెలుసుకోవడం అవసరం. ఆ తప్పిదాలు చాలానే ఉన్నాయి. అయితే, వాటన్నిటి గురించి వివరంగా చెప్పడం ద్వారా సభా సమయాన్ని వృధా చేయాలని నేను అనుకోవడం లేదు. ఆ వ్యవస్థ గురించి, దానికి ఉన్న అణచివేత స్వభావం గురించి మాత్రం చెప్తాను. అధ్యక్షా! 'వతన్ చట్టం' ప్రకారం ఈ కిందిస్థాయి ఉద్యోగులు ప్రభుత్వ ఉద్యోగులేననే విషయాన్ని గుర్తుంచుకోవాలి. కాని, అధ్యక్షా! ఈ ప్రభుత్వ ఉద్యోగుల విధులను ఎక్కడా నిర్వచించలేదు. ఈ వతన్‌దార్ మహర్‌లు నిజానికి ఏ శాఖకు చెందినవారో ఎవరికీ తెలియదు, ఎవరూ చెప్పలేరు. నిజం చెప్పాలంటే, వీరి సేవలను ప్రతి శాఖ ఉపయోగించుకుంటుంది. నీటిపారుదల శాఖ పనులకు వారిని పిలుస్తారు. రెవెన్యూ శాఖ పనులకు వారిని పిలుస్తారు. ఆరోగ్యశాఖ పనులకూ వారిని పిలుస్తారు. విద్యాశాఖ పనులకూ వారిని పిలుస్తారు. స్థానిక స్వపరిపాలనా సంస్థలు కూడా వారి సేవలను ఉపయోగించుకుంటాయి. పోలీసు విభాగం కూడా వారి సేవలను ఉపయోగించుకుంటుందనే భావిస్తున్నాను. చివరికి ఎక్సైజ్ శాఖ పనులకు కూడా వారిని వాడుకొంటున్నారు. అందువల్ల, ఇది అసాధారణమైన వ్యవస్థ అని నేను భావిస్తున్నాను. తాను ఏ శాఖకు చెందిన ఉద్యోగో, తాను ఏ పనులు చేయవలసి ఉంటుందో ప్రతి ప్రభుత్వ ఉద్యోగికీ తెలుసు. అన్ని శాఖల పనులకూ వాడుకునే వీలు ఉండే ఉద్యోగులు ఏ శాఖ లోనూ లేరు. అయితే, మహర్‌లను మాత్రం అన్ని

---

* ఇ.ఎల్.సి. చర్చలు, సంపుటి 23, పేజీలు 708–21, ఆగస్టు 3, 1928

ప్రభుత్వ శాఖలు తమ పనులకు వాడుకుంటాయి. అంతేకాదు, పగలు కాని, రాత్రికాని ఏ వేళలోనయినా మహర్‌లను పనికి పిలవవచ్చు. ఇతర ప్రభుత్వ ఉద్యోగులలో ఎంతటి తక్కువ స్థాయి వారయినా కొన్ని నిర్ణీత వేళల్లోనే విధులను నిర్వర్తిస్తారు. కలెక్టర్ కార్యాలయం లేదా మరే కార్యాలయం లోని ప్యూనుకయినా తెలుసు తాను ఎప్పుడు విధి నిర్వహణకు వెళ్లాలో, ఎప్పుడు ఇంటికి తిరిగి రావాలో. కాని, మహర్‌ల విషయంలో మాత్రం అలా జరగదు. పగలేకాదు, సాయంత్రం, తెల్లవారుజామున, రాత్రి.... ఇలా ఎప్పుడు పడితే అప్పుడు వాళ్లని పనులకు పిలవవచ్చు. రాత్రివేళలో ఎప్పుడైనా ఒక అధికారి మహర్‌ను పిలిస్తే, అప్పుడు వర్షం పడుతున్నా, పిడుగులు పడుతున్నా తాను రాలేనని మహర్ చెప్పలేడు.

మరొక బాధ ఏమిటంటే, సర్వీసు రిజిస్టర్‌లో పేరు నమోదయి ఉండే మహర్ మాత్రమేకాక, ఆయన మొత్తం కుటుంబ సభ్యులను ప్రభుత్వ సేవలకు వినియోగించుకుంటున్నారు. సర్వీసు రిజిస్టర్‌లో నమోదయి ఉన్న మహర్ ఎప్పుడైనా విధులకు హాజరు కాకపోతే, లేదా అందుబాటులో లేక పోతే ఆయన తండ్రిని పిలిచి పనులు చేయిస్తారు. ఆయన తండ్రి కూడా లేకపోతే, ఆయన తాతను కూడా పిలిచి పనులు చేయించుకోవచ్చు. అయితే, ఆయన తండ్రిపేరు, తాత పేరు మాత్రం సర్వీసు రిజిస్టర్‌లో ఉండవు. కుటుంబంలోని మగవారినే కాదు. వారెవరూ లేకపోతే ఆఖరికి స్త్రీలను కూడా పిలిచి పనులు అప్పగిస్తున్నారు. మహర్ లేక పోతే ఆయన భార్యను పిలుస్తారు. ఆవిడ కూడా లేకపోతే ఆయన తల్లిని పిలుస్తారు. ఒక వేళ ఆయన తల్లి కూడా లేకపోతే, కుటుంబంలోని చిన్న పిల్లలను పిలిచి పనులు అప్పగిస్తారు. ఈ పరిస్థితిని ఊహించండి. మహర్ కుటుంబంలోకి ఒక 18 సంవత్సరాల యువతిని 18 సంవత్సరాల పోలీసు అధికారి పిలిచి అయిదారు మైళ్ల దూరం తన సామానును మోయిస్తాడనుకొండి. అప్పుడు ఆ అమ్మాయి ఎంత ప్రమాదానికి లోనయ్యే అవకాశం ఉంటుందో ఆలోచించండి. అధ్యక్షా! ఇప్పటికీ ఇదే విధంగా ఉన్న ఈ వ్యవస్థ నుంచి వారు తప్పించుకునే దారే లేదు. ఈ వ్యవస్థలో మహర్ మాత్రమే కాక, ఆయన మొత్తం కుటుంబసభ్యుల సేవలను కూడా అన్ని ప్రభుత్వ శాఖలు అన్ని వేళల్లో ఉపయోగించుకుంటాయి. మరే ప్రభుత్వ శాఖలోనూ ఇంతటి అణచివేత విధానం కన్పించదని మనవి చేస్తున్నాను.

ఇక వేతనం విషయానికి వద్దాం. 24 గంటల పాటు ఈ పేదలు చేసే బండ చాకిరీకి వారు పొందే వేతనం ఎంత? వీరి నుంచి పొందే సేవలకు ప్రభుత్వం తన ఖజానాలో నుంచి నేరుగా వీరికి దాదాపు ఏమీ చెల్లించదని చెపితే సభ ఆశ్చర్య పోవచ్చు. ప్రభుత్వమే స్వయంగా ఇచ్చిన వివరాలు నా దగ్గర ఉన్నాయి. థాణా జిల్లాలో ప్రభుత్వం నేరుగా మహర్ ఉద్యోగికి చెల్లించేది ఎంతో తెలుసా? నెలకు రూపాయి 80 పైసలు. అహమ్మద్‌నగర్ జిల్లాలో కూడా అంతే. తూర్పు ఖండేష్‌లో నెలకు రూపాయి 12 పైసలు చెల్లిస్తారు. పశ్చిమ ఖండేష్‌లో నెలకు నాలుగు విడతలుగా తొమ్మిది అణాలు ఇస్తారు. పూణే జిల్లాలో నెలకు రూపాయి ఒక పైస చెల్లిస్తారు. బెల్గాంలో అయితే ప్రభుత్వం తన ఖజానా నుంచి వారికి ఏమీ ఇవ్వదు. 1925 మార్చిలో జరిగిన సమావేశంలో ఈ వివరాలు అడిగాను.

రత్నగిరి, కొలాబాలకు సంబంధించిన సమాచారం ప్రభుత్వం ఇవ్వలేదు. మహార్ల నుంచి పొందుతున్న సేవలకు ప్రభుత్వం వారికి ఎంత ముష్టి రాలుస్తున్నదో చూడండి. వతన్‌దార్ మహార్‌లకు రెండు ఆదాయ వనరులు ఉన్నాయి. మొదటిది ఏమిటంటే, వీరికి ఇచ్చిన ఇనాం భూమి. రెండవది గ్రామస్థుల నుంచి వీరు అడిగి తీసుకునే ధాన్యం. ఇలా సేకరించుకునే ధాన్యాన్ని 'బలూటా' అని అంటారు. ఈ ఇనాం భూములను వీరికి బ్రిటిష్ ప్రభుత్వం ఇవ్వలేదు. ఈ దేశానికి చెందిన ప్రాచీన చక్రవర్తులే వాటిని ఇచ్చారు. అందువల్ల, ఈ మహార్ల 'వతన్'లు చాలా ప్రాచీనమైనవి. ఈ ఇనాం భూములు వారికి ప్రాచీన కాలంలో వచ్చినవే. వారికి ప్రాచీన కాలంలో దక్కిన ఈ ఇనాం భూముల విస్తీర్ణాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఎప్పుడైనా పెంచిందో, లేదో నాకు తెలియదు. ధరలు పెరిగాయి. జీవన ప్రమాణాలు పెరిగాయి. ప్రతి ప్రభుత్వ ఉద్యోగి వేతనం పెరిగింది. బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పడిన నాటినుంచి ఎన్నిసార్లు ప్రభుత్వ ఉద్యోగుల వేతనం పెరిగిందో నాకు తెలియదు. కాని, ఈ మహార్ ఉద్యోగుల వేతనం పట్ల బ్రిటిష్ ప్రభుత్వం ఒక్క క్షణమైనా శ్రద్ధ కనబరచిన పాపాన పోలేదు. ప్రాచీన రాజులు తమ సంతోషంతో ఇచ్చిన కొద్దిపాటి భూములలోనే ఈ పేద ప్రజలు నెట్టుకురావలసి వస్తున్నది. మహార్ల సంఖ్య బాగా పెరిగింది. మహార్‌లకు ఇచ్చిన ఇనాం భూములు ఎన్నోసార్లు విభజనకు లోనయ్యాయి. వాటి విస్తీర్ణం ఎంత తక్కువ అయిపోయిందంటే, మహార్‌లకు వాటి ద్వారా వస్తున్న ఆదాయాన్ని ఏ మాత్రం పరిగణన లోకి తీసుకోలేం. రెండవ ఆదాయ మార్గమైన 'బలూటా' ద్వారానే వీరికి ఇంతో అంతో ఆదాయం ముడుతోంది. అధ్యక్షా! ఇంత విచిత్రమైన వ్యవస్థపై ఈ గౌరవనీయ సభ తన దృష్టి సారించవలసిన అవసరం ఉంది. మహార్‌లు ప్రభుత్వ ఉద్యోగులేనని నేను మరొకసారి చెప్తున్నాను. అయితే, వారి సేవలను ఒకవైపు పొందుతూనే, వారికి వేతనం చెల్లించే బాధ్యతను ప్రభుత్వం తీసుకోవడం లేదు. ఇతర ఉద్యోగులైన ప్యూను, క్లర్కు, ఆఫీసర్ మొదలైన వారందరికీ ప్రభుత్వం వేతనం ఇస్తూ ఉంటుంది. కాని మహార్‌లకు వేతనం చెల్లించే బాధ్యత మాత్రం ప్రభుత్వం తీసుకోదు. దీనికి కారణం ఏమిటంటే వతన్ చట్టం కింద 'బలూటా' చెల్లింపునకు సంబంధించి మహార్‌లను రైతుల దయాదాక్షిణ్యాలకే వదిలివేశారు. రైతులు దయతలిస్తే మహార్‌లకు ఏమయినా ముడుతుంది. ఏడాది పాటు మహార్‌లతో చాకిరి చేయించుకున్న తరువాత రైతులు వారికి మొండి చెయ్యి చూపిస్తే, మహార్‌లు చేయగలిగినది ఏమీలేదు.

అధ్యక్షా! ఇది ఒక దారుణమైన వ్యవస్థ. ఎటువంటి న్యాయం లేని వ్యవస్థ. ఈ మహార్‌లు ప్రభుత్వానికి సేవలు అందించాలని ప్రభుత్వం భావిస్తున్నట్లయితే, వారికి తగిన వేతనం చెల్లించవలసిన బాధ్యతను కూడా ప్రభుత్వం తీసుకోవాలి. అంతేగాని, ఆ బాధ్యతను మూడవ పక్షం అయిన రైతులపై పెట్టకూడదు.

అధ్యక్షా! ఇటువంటి వ్యవస్థలో 'వతన్' కొనసాగింపునకు ఏదయినా భద్రత ఉంటుందా? మహార్ల 'వతన్'ను నిలిపివేయరని ఎలా నమ్మగలం? మహార్‌లకు సంబంధించి ఎటువంటి హామీ

లేదు. కారణం చాలా స్పష్టంగా కనబడుతూనే ఉంది. ఒక కిందిస్థాయి ఉద్యోగి ఉద్యోగ జీవితం అంతా పై అధికారి దయాదాక్షిణ్యాలపైనే ఆధారపడి ఉంటుంది. అధ్యక్షా! మహర్‌ల విషయంలోనయితే, అతని పై అధికారులు పటేల్, కులకర్ణి, మమ్‌లత్‌దార్‌లే. ప్రభుత్వానికి చేయవలసిన పనులు చేస్తూనే, తన పై అధికారులయిన పటేల్, కులకర్ణి, మమ్‌లత్‌దార్‌లకు ఎటువంటి ప్రతిఫలం ఆశించకుండా ఇంటి పనులు కూడా చేసి పెట్టవలసి ఉంటుంది. అలా చేయని పక్షంలో అతని 'వతన్' భద్రంగా ఉంటుందనే హామీ ఏదీ లేదు. ప్రతిఫలం ఆశించకుండా అడ్డమైన చాకిరీ చేసి వారి కరుణ సంపాదించకపోతే, మహర్ తన విధిని సరిగా నిర్వర్తించడం లేదంటూ పటేల్ కాని కులకర్ణికాని పైకి ఒక తప్పుడు రిపోర్టు పంపితే ఆ మహర్‌గతి అంతే. ఆ విధంగా పటేళ్లు, కులకర్ణిలు పైకి రిపోర్టులు పంపడం, మహర్‌లపై మమ్‌లత్‌దార్లు చర్యతీసుకోవడం వంటి సంఘటనలు చాలా జరిగాయి. మహర్‌ల 'వతన్'లకే ఎన్నోసార్లు ముప్పువచ్చింది. అటువంటి సంఘటనలు ఎన్నిటినో నేను స్వయంగా చూశాను. మమ్‌లత్‌దార్‌లు జారీచేసిన ఆదేశాలను రద్దుచేయించడానికి జిల్లా డిప్యూటీ కలెక్టర్, అసిస్టెంట్ కలెక్టర్, కలెక్టర్, కమిషనర్ వంటి ఉన్నతాధికారుల ద్వారా నేను ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని అధ్యక్షా! ఒక్కసారి కూడా నా ప్రయత్నాలు ఫలించలేదు. తమ నిర్ణయం మంచిదైనా, తప్పుడుదైనా ఉన్నతాధికారులు తమ నిర్ణయాన్ని బలపరుస్తారని దిగువ స్థాయి అధికారులకు ఖచ్చితంగా తెలుసు. అందువల్ల వీరు మహర్‌లను ఎంతగా అణచివేస్తారో చెప్పలేం. ఈ వ్యవస్థలో ఉన్న మరొక దుర్గుణం ఇదేనని విన్నవిస్తున్నాను.

అధ్యక్షా! ఈ వ్యవస్థలోని దుర్గుణాలు కేవలం మహర్‌కు మాత్రమే బాధ కలిగించేవి, మిగిలిన పీడిత ప్రజలకు హాని కలిగించనివి అయి ఉన్నట్లయితే, ఈ విషయంపై నేను ఇంత సేపు మాట్లాడి ఉండేవాడిని కాదు. ఈ వ్యవస్థలోని దుర్గుణాల పరిధి ఎంత పెద్దదంటే, అవి మహర్‌లనే కాక యావత్తు పీడిత ప్రజానీకానికి హాని కలిగిస్తున్నాయి. అధ్యక్షా! 'వతన్' పద్ధతి కారణంగా గ్రామాలలోని మహర్‌ల కుటుంబాలు డాక్టర్ పరంజపే సర్క్యులర్ ప్రయోజనాన్ని కూడా పొందలేని స్థితిలో ఉన్నాయి. ఇతర వర్గాల వారి పిల్లలతో కలిసి కూర్చునేందుకు మహర్‌ల పిల్లలను అనుమతించాలని ఈ సర్క్యులర్ ఆదేశిస్తున్నది. ధర్మశాలలు, ఇతర పబ్లిక్ ప్రదేశాలను ఉపయోగించుకునేందుకు పీడిత వర్గాలవారిని అనుమతించాలని ఈ సభ ఒక తీర్మానాన్ని ఆమోదించినప్పటికీ, పీడిత వర్గాల ప్రజలు వాటిని అడగలేని పరిస్థితిలో ఉన్నారు. ఇటువంటి పరిస్థితికి 'వతన్' పద్ధతే కారణమని చెప్తే ఈ సభ నమ్మలేక పోవచ్చు. కాని, అధ్యక్షా! మహర్‌ల కుటుంబాలు ఎందుకు అభివృద్ధి చెందలేక పోతున్నాయనే ప్రశ్నకు నేను ఇవ్వగలిగిన వివరణ ఇదొక్కటే. కారణం స్పష్టంగా కన్పిస్తూనే ఉంది. ఉదాహరణకు ఏదైనా ఒక గ్రామంలో మహర్‌ల కుటుంబాలు తమకు నచ్చిన విధంగా అభివృద్ధి చెందాలనుకుంటాయనుకోండి. ఆ విధానం రైతుకు నచ్చనిదయితే, అతను తక్షణమే తీసుకునే చర్యలు ఏమిటంటే, మహర్‌లకు ఇవ్వవలసిన 'బలూటా' నిలిపివేయడం......, వారిని సమాజం నుంచి వెలివేయించడం. నాకు తెలిసిన ఒక సంఘటన చెప్తాను. ఒక గ్రామంలో మహర్‌గా

పనిచేస్తున్న వ్యక్తి బంధువు ఒకరు కాళ్లకు బూట్లు, మేజోళ్లు వేసుకుని ఆ గ్రామంలోకి వెళ్లాడు. ఇది చూసి గ్రామస్థులు ఎంత మాత్రం ఓర్చుకోలేక పోయారు. వెంటనే ఆ గ్రామస్థులు మహర్‌లకు 'బలూటా' చెల్లించడం నిలిపివేసి వారిని వెలివేశారు. ఇటువంటిదే మరొక సంఘటన చెప్తాను. వేరే గ్రామంలో ఒక మహర్ తన ఇంటిపై పెంకులు కప్పుకున్నాడు. ఒక మహర్‌కు పెంకుటిల్లు కట్టుకునేంత ధైర్యమా అని ఆ గ్రామస్థులు మొత్తం మహర్‌ల కుటుంబాలనే వెలివేసి, 'బలూటా' చెల్లించడం నిలిపివేశారు. అధ్యక్షా! మొత్తం ప్రజలనే బానిసలుగా చేసే ఇటువంటి వ్యవస్థ, అభివృద్ధి గొంతునొక్కివేసే ఇటువంటి వ్యవస్థను సరైన భావాలు గల ఏవ్యక్తీ సమర్థించరని నేను భావిస్తున్నాను. అధ్యక్షా! ఈ 'వతన్' పద్ధతిలో యావత్తు మహర్‌ల జనాభా పూర్తిగా విసిగిపోయిందని చెప్తే ఆశ్చర్యం అక్కర్లేదు. సాధ్యమైనంత త్వరగా ఈ పద్ధతికి స్వస్తి చెప్పించాలనే కోర్కెతో వారున్నారని నేను చెప్పగలను. ఈ వ్యాఖ్యలతో ఇక నేను బిల్లు లోని అంశాల వివరణకు వెళ్తున్నాను.

అధ్యక్షా! వతన్‌దార్ మహర్‌ల జనాభాను రెండు వర్గాలుగా విభజించాలని నేను ప్రతిపాదిస్తున్నాను. నేను ప్రవేశపెట్టిన బిల్లును పరిగణనలోకి తీసుకునే సమయంలో ఈ అంశాన్ని గుర్తుంచుకోవడం అవసరం మొదటి వర్గం ఎవరంటే, వతన్ పద్ధతితో పూర్తిగా విసిగిపోయి ఉన్న వర్గం. వతన్ దార్‌లుగా సేవలను అందించే బాధ్యత నుంచి తమను తక్షణమే తప్పించాలని ఈ వర్గం కోరుకుంటున్నది. వారు పెడుతున్న ఒకే ఒక షరతు ఏమిటంటే, తమ వతన్‌ను వదిలివేయడానికి వారు సిద్ధపడినట్లయితే వంశ పారంపర్యంగా ప్రభుత్వానికి సేవలు చేసే హక్కునే వారు వదులుకొంటారని అర్థం. అంతేకాని, ఇప్పటికీ తమ ఆధీనంలో ఉన్న భూమిని వారి నుంచి తొలగించడానికి వీలు లేదు. ఈ ఉద్దేశంతోనే నేను ప్రస్తుతం అమలులో ఉన్న వతన్ చట్టం లోని 15 (1) వ సెక్షన్‌కు నా బిల్లు లోని 4వ క్లాజు ద్వారా ఒక అంశాన్ని జోడించాను. ఇక తాము సేవలను అందజేయబోమని, తమ భూములపై పూర్తి పన్ను చెల్లించడానికి తాము సిద్ధంగా ఉన్నామని వతన్‌దార్ మహర్‌లకు ప్రాతినిధ్యం వహిస్తున్న సంస్థగాని, వారిలో అత్యధికులు కాని కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా తెలియజేసుకున్నట్లయితే, వారిని మహర్ బాధ్యతల నుంచి కలెక్టర్ తొలగించాలని ఈ క్లాజు నిర్దేశిస్తున్నది. ఈ క్లాజులోని సూత్రం కొత్తది కాదని నేను చెప్పదలచుకున్నాను. ఇది చాలా పాత సూత్రం. వివిధ సందర్భాలలో ప్రభుత్వం దీనిని అంగీకరించి, అమలు చేసింది కూడా. అధ్యక్షా! ఈ దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పడే ముందు గ్రామాలలో 'బలూటేదార్' లుగా వ్యవహరించబడే 12 మంది గ్రామ సేవకులు ఉండేవారన్న విషయం ఈ సభకు తెలిసి ఉంటుందనుకుంటున్నాను. దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఈ 12 మంది గ్రామ సేవకులను మూడు గ్రూపులుగా విభజించారు. కేవలం ప్రభుత్వానికి ఎవరి సేవలు అవసరమో వారిని మొదటి గ్రూపుగాను, కేవలం రైతులకు ఎవరి సేవలు అవసరమో వారిని రెండవ గ్రూపుగాను, ప్రభుత్వానికి, రైతులకూ ఎవరి సేవలు అవసరమో వారిని మూడవ గ్రూపుగానూ విభజించారు. రైతులకు మాత్రమే ఎవరి సేవలు అవసరమో వారు తమ భూములపై పూర్తి స్వాధీనపు హక్కు కలిగి

ఉండడానికి ప్రభుత్వం 'గార్డన్ ఒప్పందాల' ద్వారా అనుమతి ఇచ్చింది. అయితే తమ భూములపై పూర్తి పన్ను చెల్లించగలమని వారు అంగీకరించిన తరువాత ప్రభుత్వం ఆ అనుమతి ఇచ్చింది.

అధ్యక్షా! నా బిల్లులోని 4వ క్లాజుకూ, 'గార్డన్ ఒప్పందం' లోని ఈ సూత్రానికి తేడా ఏమీ లేదు.

నా బిల్లులోని ఈ అంశం కొత్తదేమీ కాదని నేను చేసిన ప్రకటనకు మద్దతుగా మరొక ఉదాహరణ చెప్పదలచుకున్నాను. 'షెట్‌సనాది వతన్' లకు సంబంధించి 1923లో ప్రభుత్వం ఒక ఆదేశాన్ని జారీ చేసింది. సేవలు అందించడానికి సుముఖత చూపకుండా, పూర్తి ఆదాయం పన్ను చెల్లించడానికి సిద్ధంగా ఉన్న 'షెట్‌సనాది వతన్‌దార్'లను వారి బాధ్యతల నుంచి విముక్తం చేయవచ్చునని 1923 అక్టోబర్ 13న జారీచేసిన 9319వ నెంబర్ ఆదేశం ద్వారా ప్రభుత్వం స్పష్టం చేసింది.

అధ్యక్షా! మరొక తాజా ఉదాహరణను కూడా సభ దృష్టికి తీసుకుని వస్తున్నాను. సేవలు అందించడానికి ఇష్టపడని జోషీలకు తమ తమ భూములపై స్వాధీనపు హక్కును అప్పగించాలని 'జోషీబిల్లు' పై జరిగిన చర్చ సందర్భంగా ఈ సభ అభిప్రాయపడింది. భూములపై పూర్తి పన్ను చెల్లించడానికి జోషీలు సిద్ధంగా ఉంటే వారి భూములను పూర్తిగా వారికి వదిలి పెట్టడానికి అనుమతిస్తూ ప్రభుత్వం ఆ సందర్భంగా ఒక బిల్లును ప్రవేశపెట్టింది. జోషీ బిల్లులోని అంశానికి, నా బిల్లులోని అంశానికి మధ్య ఎటువంటి తేడా లేదు.

అధ్యక్షా! న్యాయశాస్త్ర దృక్కోణం నుంచి కూడా ఈ అంశాన్ని వివరించదలచుకున్నాను. ఉదాహరణకు, నా బిల్లులో ఉన్నటువంటి నిబంధన అమలులో లేదనుకోండి. తాను చేయవలసిన సేవల నుంచి తనను విముక్తం చేయవలసిందిగా ఒక వతన్‌దార్ మహర్ కోరుతున్నాడనుకోండి. వతన్‌ను స్వాధీనపరచుకోవడంలో తమ అధికారాలను ఉపయోగించాలని ప్రభుత్వం భావిస్తున్నదనుకోండి. అప్పుడు ప్రభుత్వం ఏం స్వాధీనపరచుకుంటుంది? భూమి శిస్తును వసూలు చేసుకోవడానికి మాత్రమే ప్రభుత్వానికి అధికారం ఉన్నదని నేను మనవి చేస్తున్నాను. అధ్యక్షా! బొంబాయి హైకోర్టు ఇచ్చిన అనేక తీర్పుల్లో ఇదే అంశాన్ని స్పష్టం చేసింది. 'స్వాధీనం' అంటే భూములు స్వాధీనం కాదు. భూమిశిస్తు వసూలు మాత్రమే.

***సర్దార్ జి.ఎస్. మజుందార్:*** మహర్‌ల విషయంలో కూడానా ....?

***డా॥ అంబేద్కర్ :*** అవును. మహర్‌ల విషయంలో కూడా.

అధ్యక్షా! ఈ నిబంధనకు ప్రభుత్వం బహుశా ఆర్థిక కారణాలపై అభ్యంతరం చెప్పవచ్చు. ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి ముందు జరిగిన చర్చలో ప్రభుత్వం తన అభిప్రాయాన్ని బయట పెట్టింది. భూమిశిస్తు చెల్లింపుపై వతన్ భూములను తమ ఆధీనంలో ఉంచుకోవడానికి మహర్‌లను

అధ్యక్షా! ఇప్పుడు, వతన్‌దార్ మహర్‌లలోని రెండవ గ్రూపు విషయానికి వస్తున్నాను. అధ్యక్షా! ఈ రెండవ గ్రూపువారు ఎవరంటే, తమ ఇబ్బందులను తొలగించినట్లయితే వతన్ పద్ధతి కింద తమ సేవలను అందించడానికి సిద్ధంగా ఉన్న మహర్‌లు. నా బిల్లులోని 6వ క్లాజులో వీరి విషయాన్ని పేర్కొన్నాను. ఈ మహర్‌ల ప్రయోజనాల కోసం 6వ క్లాజులో పేర్కొన్న అంశం పునర్ వ్యవస్థీకరణకు సంబంధించినది. అంటే, ప్రధానంగా 'బలూటా' విధాన పునర్వ్యవస్థీకరణ అన్నమాట. బిల్లులోని అన్ని అంశాలను గౌరవనీయ సభ్యులు పరిశీలించినట్లయితే, 'బలూటా' చెల్లింపును నగదు చెల్లింపు కింద మార్చాలనే నిబంధన కూడా వారికి కనబడుతుంది. రెండవ అంశం ఏమిటంటే, భూమిశిస్తుతో పాటు ఈ నగదును వసూలు చేయడానికి ఏర్పాటు చేయాలి. మూడవ అంశం ఏమిటంటే, మహర్‌లు రైతులకు అందించిన సేవలకు ఒక వంతు చొప్పున, ప్రభుత్వానికి అందించిన సేవలకు మరో వంతు చొప్పున డబ్బు వసూలు చేసి దాన్ని రెండు భాగాలుగా విభజించాలి. అప్పుడు ప్రభుత్వానికి అందించిన సేవలకు మహర్‌లకు చెల్లించవలసిన డబ్బు తప్పనిసరిగా ఇవ్వవలసిన భాగం అవుతుంది. రైతులకు అందించిన ప్రైవేటు సేవలకు చెల్లించవలసిన డబ్బును ఆ సేవలు పొందిన రైతులు ఇవ్వవలసి ఉంటుంది. మహర్‌ల సేవలు పొందని రైతులు ఆ డబ్బు చెల్లించనక్కర లేదు. అదేవిధంగా, రైతులకు సేవలు అందించకుండా, ప్రభుత్వానికి మాత్రమే సేవలు అందించాలనుకునే మహర్‌లు అదే విధంగా చేయవచ్చు. అప్పుడు, ప్రైవేటు సేవలకు గాను రైతులు ఇచ్చే డబ్బు వారికి అందదు.

అధ్యక్షా! నేను ఏవో కొన్ని నూతన ప్రతిపాదనలు చేస్తున్నానని సభ భావించవచ్చు. అయితే, వీటిలో ఏ ప్రతిపాదనలూ కొత్తవి కావని నేను చెప్తున్నాను. వతన్ చట్టంలో ఇవన్నీ వున్నవే. ప్రస్తుత విధానంలో ఒకే ఒక మార్పును మాత్రం నేను ప్రతిపాదిస్తున్నాను. 'బలూటా' చెల్లింపును నగదు చెల్లింపుగా మార్చాలనే నిబంధన ప్రస్తుత వతన్ చట్టంలోని 19వ సెక్షన్‌లో ఉన్నదే. అందువలన అది కొత్త విషయం ఏమీ కాదు. ప్రస్తుతం అమలులో ఉన్న వతన్ చట్టం ప్రకారం కలెక్టర్ సముచితమని భావించిన పక్షంలో 'బలూటా' చెల్లింపును నగదు చెల్లింపుగా మార్చే అధికారం ఆయనకు ఉంది. భూమిశిస్తుతో పాటే నగదును కూడా వసూలు చేయాలనే నిబంధన కూడా నూతన ప్రతిపాదన కాదని మరొకసారి విన్నవిస్తున్నాను. వతన్ చట్టంలో ఇది కూడా ఉంది. వతన్ చట్టంలోని 81 వ సెక్షన్‌ను పరిశీలిస్తే, భూమిశిస్తు బకాయిల మాదిరిగా అన్నిరకాల ప్రతిఫలాలను సేకరించే అధికారం కలెక్టర్‌కు ఉన్నదని తెలుస్తుంది. అందువలన అధ్యక్షా! బిల్లులోని 6వ సెక్షన్‌లో నూతన అంశాలు ఏవీ లేవని విన్నవిస్తున్నాను. నా బిల్లులోని 6వ సెక్షన్‌లో ఉన్న నూతన అంశం ఏమిటంటే, విచక్షణాధికారాన్ని కలెక్టర్‌కు బదులు ఆయా పక్షాలకే ఇవ్వడం జరిగింది. నా బిల్లులోని 6వ సెక్షన్‌లో పేర్కొన్న నిబంధనలు అవసరమయ్యే పరిస్థితులు ఏర్పడవచ్చని ప్రస్తుత చట్టం గుర్తిస్తున్నది. లేని పక్షంలో ప్రస్తుత చట్టంలో ఆ నిబంధనలు ఏమాత్రం చోటు చేసుకుని ఉండేవి కాదు. నేను భావిస్తున్నది ఏమిటంటే, కలెక్టర్‌కే విచక్షణాధికారం

ఉన్నప్పటికీ, ఆ విచక్షణాధికారాన్ని ఉపయోగించవలసిన పరిస్థితులు నెలకొన్న విషయం ఆయనకు తెలియకపోవచ్చు. ఆయన వాటిని గుర్తించలేకపోవచ్చు. నేను చెప్పదలచుకున్నది ఏమిటంటే, విచక్షణాధికారాన్ని వాడుకునే విషయంలో ఆయా పక్షాలు కలెక్టర్‌కు సలహా ఇవ్వాలి. అప్పుడు ఒకవేళ భూమిశిస్తుతో పాటే 'బలూటా' కూడా సేకరించాలని ఆయా పక్షాలు కోరుకుంటున్నట్లయితే, తన విచక్షణాధికారం ఉపయోగించవలసిన సమయం వచ్చిందని కలెక్టర్ తెలుసుకుంటారు. కలెక్టర్ నుంచి రైతులకు, మహర్‌లకు విచక్షణాధికారాన్ని బదలీ చేయడం మినహా ఇందులో మరో కొత్త ప్రతిపాదన ఏమీ లేదు.

అధ్యక్షా! 'బలూటా' ను ప్రైవేటు సేవలకు, ప్రభుత్వ సేవలకు విడిగా కేటాయించాలనే ప్రతిపాదన కూడా కొత్తది కాదు. అయితే, ఈ ప్రతిపాదన అమలు చేయటం కొన్ని పరిస్థితుల కారణంగా ఎంతో అవసరమని విన్నవించుకుంటున్నాను. ప్రభుత్వం దృష్టిలో 'బలూటా' అనేది రైతులకు, ప్రభుత్వానికి మహర్‌లు చేసిన సేవలకు సంయుక్తంగా చెల్లిస్తున్న ప్రతిఫలం. రైతులకు, ప్రభుత్వానికి మహర్‌లు చేస్తున్న సేవలకు సంయుక్తంగా చెల్లించే ప్రతిఫలమే 'బలూటా' అని స్పష్టంగా పేర్కొంటూ ప్రభుత్వం 1899, మే మూడవ తేదీన ఒక ఆదేశాన్ని జారీచేసింది. ఈ అభిప్రాయాన్ని సమర్థించడానికి నేను అంతదూరం వెళ్ళనక్కరలేదు. ఆఖరుకు, 1919 లో కూడా ఈ విషయంపై వచ్చిన ఒక ప్రశ్నకు జవాబు ఇస్తూ ప్రభుత్వం కొన్ని పత్రాలు సమర్పించింది. అసిస్టెంట్ సెక్రటరీ జారీచేసిన ఆదేశానికి అనుగుణంగా రూపొందించిన ఈ పత్రాలలో 'బలూటా' అనేది కేవలం రైతులకు చేసిన ప్రైవేటు సేవలకు చెల్లించే ప్రతిఫలమే కాదని, ప్రభుత్వానికి చేసిన సేవలకు చెల్లించే ప్రతిఫలం కూడానని పేర్కొన్నారు. అధ్యక్షా! ఇప్పుడు మహర్‌లలో కొంతమంది ప్రభుత్వానికి మాత్రమే సేవలు అందించాలనుకుంటున్నారు. కాని, రైతులకు సేవలు అందించడానికి సిద్ధంగా లేరు. మహర్‌లు చేసే పనులను నిర్వర్తించడానికి ప్రస్తుత చట్టం నియమించే సంస్థను ఇష్టపడని రైతులు కూడా ఉన్నారని నాకు తెలుసు. అధ్యక్షా! తమకు ఇష్టమైన వారిని తమంతట తాముగా నియమించుకోవడాన్ని వారు ఇష్టపడవచ్చు. అదేవిధంగా, రైతులకు సేవలు అందించడం ఇష్టం లేని మహర్‌లు కూడా కొంత మంది ఉన్నారు. సేవలు అందించాలా, వద్దా అనే విషయాన్ని నిర్ణయించుకోవడానికి తమకు స్వేచ్ఛ ఉండాలని వారు కోరుకుంటారు. అయితే, ప్రస్తుతం అమలులో ఉన్న చట్టంలో వారికి ఈ స్వేచ్ఛ లేదు. వారికి ఇష్టం ఉన్నా, లేకపోయినా సేవలు అందించవలసిందే. 'బలూటా' సంయుక్త పరిహారంగా ఉండడం వల్లనే ఈ పరిస్థితి ఏర్పడింది. 'బలూటా' లో ఎంత భాగాన్ని ప్రభుత్వానికి చేసిన సేవలకు ఇస్తున్నారో, ఎంత భాగాన్ని రైతులకు చేసిన సేవలకు ఇస్తున్నారో తెలుసుకునే మార్గమే లేదు. తమకు ఇష్టమైన వారిని నియమించుకునే స్వేచ్ఛ రైతులకు, తమకు ఇష్టమైన వారికి సేవలు అందించే స్వేచ్ఛ మహర్‌లకు ఇవ్వకపోతే, అసలే సామాజిక శత్రుత్వాలు అధికంగా ఉన్న ఈ కాలంలో రైతులకు, మహర్‌లకు మధ్య ఉద్రిక్తత బాగా పెరిగే ప్రమాదం ఉంది. అందువల్ల, రైతులకు అందించే సేవలకు 'బలూటా' లో ఎంతభాగమో,

తగిన ప్రతిపాదనలు చేయడానికి ప్రభుత్వం అప్పుడు ఒక కమిటీని నియమించింది. 1920 లో ఈ కమిటీ కొన్ని ప్రతిపాదనలు చేసింది. వాటికి అనుగుణంగా ప్రభుత్వం నూతన విధానాన్ని ప్రవేశపెట్టింది. ఇంచుమించు ఇదే విధానాన్ని నేను నా బిల్లులో ప్రతిపాదించాను. అందువల్ల బీదర్ కమిటీ సిఫార్సుల ఆధారంగా రూపొందిన ఈ బిల్లులోని ప్రతిపాదనలు అక్కడి వారికి ప్రయోజనం కలిగించేవే అయితే, బొంబాయి ప్రెసిడెన్సీకి కూడా అవి ప్రయోజనం కలిగిస్తాయని భావిస్తున్నాను. ఎందుకంటే బొంబాయి వ్యవస్థకు బీదర్ వ్యవస్థ మరొక ప్రతిరూపంలా ఉండేది. బొంబాయి ప్రభుత్వ తీర్మానాలకు అనుగుణంగా బీదర్ కమిటీ నివేదిక రూపొందింది.

నా బిల్లులోని ప్రధాన అంశాలు ఇవి :

బిల్లులోని ఒక అంశానికి కొంత వివరణ అవసరం. వతన్ చట్టంలోని 9వ సెక్షన్‌లో కొన్ని మార్పులను ప్రవేశపెట్టడానికి ఈ అంశాన్ని చేర్చాను. బిల్లులోని 2,3 క్లాజులలో ఈ అంశం ఇమిడి ఉంది. వతన్ చట్టం ప్రకారం, వతన్ భూములను వతన్ కుటుంబానికి చెందని వారికి స్వాధీనం చేయకూడదు. వతన్‌దార్ కాని వ్యక్తికి బదలీ చేసిన వతన్ భూమిని స్వాధీనం చేసుకునేందుకు వతన్ చట్టంలోని 9వ సెక్షన్ కలెక్టర్‌కు అధికారాలు ఇచ్చింది. అయితే, అటువంటి బదలీ చెల్లదని ప్రకటించడం, ఆ భూమిని స్వాధీన పరచుకోవడం పూర్తిగా కలెక్టర్ విచక్షణకే వదిలిపెట్టారు. 9వ సెక్షన్ తనకు అప్పగించిన విచక్షణాధికారాన్ని వతన్‌దార్‌కు ప్రయోజనం కలిగే విధంగా కలెక్టర్ ఉపయోగించుకోకపోవచ్చు. ఒక వతన్‌దార్ చేసే సేవలకు ప్రతిఫలంగా వతన్ భూమిని కేటాయించని పక్షంలో ఆ భూమి బదలీపై కలెక్టర్ తీసుకునే చర్య వల్ల కష్టనష్టాలు కలుగకపోవచ్చు. కాని అధ్యక్షా! తాను చేసే సేవలకు ప్రతిఫలంగా తనకు వతన్‌భూమిని కేటాయించారని, అది ఎప్పుడూ తన ఆధీనంలోనే ఉంటుందనే అవగాహనతో ఒక వతన్‌దార్ ప్రభుత్వానికి సేవలు అందిస్తున్నాడనుకోండి. ఆ భూమి బదలీ కాని పక్షంలో ప్రభుత్వం దానిని స్వాధీన పరచుకోవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను. ఒక వతన్‌దార్ సేవలకు ప్రతిఫలంగా కేటాయించిన భూమి బదలీ జరిగినట్లయితే ఆ బదలీ చెల్లదని కలెక్టర్ తప్పనిసరిగా ప్రకటించాలనే నిబంధనను నా బిల్లులో చేర్చాను. వతన్‌దార్‌లకు ప్రతిఫలంగా కేటాయించిన భూములు, ప్రతిఫలంగా కేటాయించని భూములు అనే విభజన అందరికీ తెలిసినదే. ఈ విభజననే నా బిల్లులోని ప్రతిపాదనలకు ప్రాతిపదికగా తీసుకున్నాను. వతన్‌దార్‌లకు ప్రతిఫలంగా కేటాయించని భూముల విషయంలో కలెక్టర్ తన విచక్షణాధి కారాన్ని ఉపయోగించుకోవచ్చు. ఎందుకంటే, వతన్‌దార్‌కు ప్రతిఫలంగా కేటాయించని ఆ భూమివల్ల తక్షణమే అతనికి కలిగే ప్రయోజనం ఏమీ లేదు. అటువంటి భూమి విషయంలో కలెక్టర్ తన విచక్షణాధికారాన్ని ఏ విధంగా ఉపయోగించుకున్నా పెద్దగా పట్టించుకోనవసరం లేదు. అయితే, వతన్‌దార్‌కు ప్రతిఫలంగా కేటాయించిన భూమి బదలీని మాత్రం కలెక్టర్ చెల్లదని ప్రకటించవలసిందే. ఇటువంటి భూమి విషయంలో ఆయనకు విచక్షణాధికారం ఉండడానికి వీలులేదు.

అధ్యక్షా! నేను తయారు చేసిన బిల్లులో రెండు లోపాలు ఉన్నాయని అంగీకరిస్తున్నాను.

నేను చాలా చాలా న్యాయంగా వ్యవహరించదలచుకున్నాను కనుక ఈ విధంగా అంగీకరిస్తున్నాను. మహర్‌లకు ప్రయోజనం కలిగించడానికని రైతులపై ఏ విధమైన అదనపు భారాన్ని మోపాలని నేను అనుకోవడం లేదు. దీని వెనుక ఉన్న కారణం ఏమిటంటే, నేను వతన్ పద్ధతికి వ్యతిరేకిని. ఈ పద్ధతిని రద్దు చేస్తే రానున్న కొద్దికాలంలో మహర్‌లు ఎంతో కష్టపడవలసిరావచ్చునని తెలిసినప్పటికీ, వతన్‌పద్ధతిని నాశనం చేయడానికే నేను ఎప్పుడూ కృషిచేశాను. అయితే, మహర్‌లు వెనుకబడినవారుగా ఉండడానికి ఈ వతన్ పద్ధతే కారణమని, ఇదే సంకెళ్లుగా వారిని అడ్డుకుంటున్నదని నేను ఒప్పుకుంటున్నాను. ఈ విషయాన్ని నేను విశాలదృష్టితో చూడడం వల్ల వతన్‌ల ద్వారా మహర్‌లకు కలిగే తక్షణ ప్రయోజనాల పట్ల నేను అంత శ్రద్ధ చూపించడం లేదు. అందువల్ల, రైతుల కంటే మహర్‌లు అధిక ప్రయోజనం పొందాలని నేను కృషి చేయడం లేదు. నేను నా బిల్లులో ప్రతిపాదించిన 'బలూటా' పద్ధతి రైతులపై అదనపు భారాన్ని మోపబోదని గౌరవనీయ సభ్యులు తెలుసుకోగలరు. మహర్‌లకు చెల్లించే ప్రతిఫలం కోసం రైతులపై అదనపు భారం విధించడం జరగదు. ఈ అంశాన్ని బట్టి నేను ఎంత న్యాయంగా ఉండదలచుకున్నానో తెలుసుకోవచ్చు. అందువల్లనే, బిల్లులో రెండు లోపాలు ఉన్నాయని కూడా నేను అంగీకరిస్తున్నాను. మొదటి లోపం ఏమిటంటే, వతన్‌భూముల బదలీ చెల్లదని కలెక్టర్ తప్పనిసరిగా ప్రకటించాలని పేర్కొంటున్న 2,3 క్లాజులలో భూమి కోల్పోయిన వతన్‌దార్‌కు నష్టపరిహారాన్ని చెల్లించడానికి కలెక్టర్‌కు అనుమతి ఇచ్చే అంశాన్ని చేర్చలేదు. అయితే, బిల్లును మొదటిసారి తయారు చేసినప్పుడు నేను ఆ అంశాన్ని చేర్చాను. కొందరు అధికార పక్ష సభ్యుల సలహాపై నేను ఆ అంశాన్ని ఉపసంహరించుకున్నాను. కాని, బిల్లు సెలక్ట్ కమిటీకి వెళ్లినప్పుడు సవరణ రూపంలో ఆ అంశాన్ని చేర్చడానికి సిద్ధంగా ఉన్నాను. రెండవ లోపం ఏమిటంటే, రైతులకు పనులు చేయాలా, వద్దా అని నిర్ణయించుకునే స్వేచ్ఛ మహర్‌లకు ఉన్నట్లే, మహర్‌లను నియమించుకోవాలా వద్దా అని నిర్ణయించుకునే స్వేచ్ఛ రైతులకు ఇచ్చే అంశం బిల్లులో లేదు. బిల్లును సెలక్ట్‌కమిటీకి పంపించినప్పుడు ఈ అంశాన్ని కూడా సవరణగా చేర్చడానికి నేను సిద్ధంగానే ఉన్నాను. బిల్లులో వివరణ ఇవ్వవలసిన అంశాలు ఇవేనని నేను భావిస్తున్నాను.

ముగించబోయే ముందు ఒక విషయాన్ని స్పష్టం చేయదలచుకున్నాను. ఈ బిల్లుకు యావత్తు మహర్‌ల మద్దతు ఉంది. బిల్లుపై మరో అభిప్రాయం ఎంత మాత్రం లేదు. ఎందుకంటే, ఈ బిల్లును మహర్‌లపై బలవంతంగా ఎవరూ రుద్దలేదు. బిల్లులోని అంశాలను ఆచరణలోకి తేవాలని వతన్‌దార్ మహర్‌లు కోరుకోని పక్షంలో, అవి ఆచరణలోకి రానే రావు. ప్రస్తుతం అమలులో ఉన్న విధానాలే కొనసాగుతాయి. ఇటువంటి బిల్లు అవసరమని మహర్‌లు భావించినప్పుడే మార్పు సాధ్యం. వారి ఇష్టానికి వ్యతిరేకంగా బిల్లును ఎవరూ వారిపై రుద్దడం లేదు.

**శ్రీ పి. ఆర్. చికోడి :** ఇది ఏకపక్ష ఏర్పాటు. ద్వైపాక్షికంగా ఉండాలి.

***డా! అంబేద్కర్ :*** బిల్లు సెలక్ట్ కమిటీ పరిశీలనలో ఉన్నప్పుడు కొన్ని సవరణలు చేర్చవలసి

ఉన్నదని నాకు తెలుసు. మహర్‌లు ఇష్టపడనిదే బిల్లు ఆచరణలోకి రాదు కనుక ఈ బిల్లు పట్ల మహర్‌లకు ఎటువంటి వ్యతిరేకత ఉండనవసరంలేదు. బిల్లులో వారికి ప్రయోజనం కలిగించే అంశాలు ఉన్నాయి. వారు వాటిని ఉపయోగించుకోవాలనుకుంటే ఉపయోగించుకోవచ్చు. అందువల్ల ఈ బిల్లుకు అభ్యంతరం చెప్పలేదు. వారు అభ్యంతరం చెప్పకపోవడమేకాదు. బిల్లు పట్ల హృదయపూర్వకంగా హర్షం వెలిబుచ్చారు కూడా. నేను ఈ బిల్లును రూపొందించడం ప్రారంభించిన నాటి నుంచి మహర్‌లకు తెలియకుండా ఏ విషయాన్ని దాచలేదు. బిల్లుపై మహర్‌ల అభిప్రాయాన్ని తెలుసుకోవడానికి గాను అనేక సమావేశాలలో బిల్లులోని మొత్తం అంశాలను వారి ముందు ఉంచాను. బిల్లులోని మొత్తం అంశాలను వారు ఏకగ్రీవంగా అంగీకరించారని చెప్పడానికి సంతోషిస్తున్నాను. బిల్లుకు మద్దతు సంపాదించడానికి వీలయ్యే విధంగా ఈ సమావేశాలను నిర్వహించానని ప్రభుత్వం అనడానికి అవకాశం ఇవ్వకూడదనే ఉద్దేశంతో సమావేశాలు జరిగేటప్పుడు నేను ఎక్కువసేపు దూరంగానే ఉన్నాను. ఇతర వర్గాల సభ్యుల అధ్యక్షతన ఈ సమావేశాలు జరిపించాను. బొంబాయి నగరంలో 5000 మందిపై గా వతన్‌దార్ మహర్‌లతో జరిగిన సమావేశానికి నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ బోలే అధ్యక్షత వహించారు. ప్రస్తుతం నా పక్కనే కూర్చున్న ఆయన ఈ విషయాన్ని ధృవీకరిస్తారు. అయితే, ఈ బిల్లు మీకు హాని కలిగిస్తుందంటూ కొందరు మహర్‌లను నమ్మించడానికి ప్రయత్నించారు. ఒక్క నిరసన గళం కూడా లేకుండా మహర్‌లు ఈ బిల్లును ఏకగ్రీవంగా ఆమోదించారు. ఇది నిజమో, కాదో గౌరవనీయ సభ్యుడు చెప్పవచ్చు. అదేవిధంగా జలగావ్‌లో నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ రాజ్‌మా లఖిచంద్ అధ్యక్షతన ఖందేష్‌లోని వతన్‌దార్ మహర్‌ల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో బిల్లులోని అంశాలను నేను వారికి వివరించి చెప్పాను. ఎంత తక్కువ అంచనాతో చెప్పినా, ఈ సమావేశానికి 3,000 మంది పై గా మహర్‌లు హాజరయ్యారు. హాలు మొత్తం నిండిపోయింది. బిల్లుపై తీర్మానాన్ని ప్రవేశపెట్టినప్పుడు ఒక్కరు కూడా వ్యతిరేకించలేదు. అహమద్‌నగర్ జిల్లాలో కూడా ఇదే విధమై న సమావేశం జరిగింది. అక్కడ కూడా బిల్లుకు ఏకగ్రీవంగా మద్దతు ఇచ్చారు. ఈ విషయాన్ని నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ తోరాత్ ధ్రువీకరిస్తారు. వివిధ చోట్ల జరిగిన ఇతర చిన్నచిన్న సమావేశాల గురించి ఇంక చెప్పనవసరం లేదనుకుంటున్నాను. ఈ బిల్లు కావాలని మహర్‌లు కృతనిశ్చయులై ఉన్నారని సభకు హామీ ఇవ్వగలను. ఈ మహర్‌లను విముక్తం చేయడానికి ఆర్థిక కారణాల సాకుతోనో, మరే సాకుతోనో ప్రభుత్వం నిరాకరించినట్లయితే, రెవెన్యూ విభాగానికి, మహర్‌లకు మధ్య పెద్ద పోరాటమే జరుగుతుందని నా గౌరవనీయ మిత్రులకు చెప్తున్నాను. ఒకవేళ ఈ బిల్లు ఆమోదం పొందక పోయినట్లయితే, ఈ సభలో నేను సభ్యుడిగా కొనసాగబోను. మహర్‌లతో సమ్మె చేయించి, తద్వారా మహర్‌ల సంక్షేమానికి ఈ బిల్లు చాలా అవసరమని గౌరవనీయ రెవెన్యూ మంత్రి భావించేలా నేను కృషి చేస్తాను. నా సమయం అంతా అందుకోసమే వెచ్చిస్తాను. నా హృదయపు లోతుల నుంచి నేను మాట్లాడుతున్నాను. ఏ విషయాన్నీ రహస్యంగా ఉంచాలని నేను అనుకోవడం లేదు. ఇదే మా లక్ష్యమని నేను గట్టిగా చెప్పదలచుకున్నాను.

అధ్యక్షా!

గత మూడు సంవత్సరాలుగా పీడిత వర్గాల ప్రయోజనాలకోసం నేను సాధ్యమైనంతగా కృషి చేస్తున్నాను. ఈ మార్గంలో నేను ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నాను. మహర్‌లు పురోగమించాలంటే వతన్ పద్ధతి అన్నింటి కంటే పెద్ద సమస్యగా ఉందని నేను తెలుసుకున్నాను. తమ అభివృద్ధికి ఈ వతన్‌లు ఆటంకంగా ఉన్నాయని మహర్‌లు కూడా తెలుసుకోవడం నాకు ఎంతో తృప్తి కలుగ జేస్తున్నది. అందువల్ల, ఈ బిల్లును సభ ఏకగ్రీవంగా ఆమోదిస్తుందని ఆశిస్తున్నాను. ఈ మాటలతో ఇక నేను బిల్లును చదవడం ప్రారంభిస్తున్నాను.

  

# 16

# వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణ బిల్లు – 2*

*(1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణకు ఉద్దేశించిన 12వ నెంబర్ బిల్లు (1928) పై పునః ప్రారంభమైన చర్చ)*

***డా॥ అంబేద్కర్ః*** అధ్యక్షా! ఈ బిల్లుకు సభ్యులు హృదయపూర్వకంగా ప్రకటించిన మద్ధతుకు గాను నేను వారికి ఎంతగానో కృతజ్ఞుడినై ఉంటాను. అధ్యక్షా! బిల్లును వ్యతిరేకిస్తున్న వారు ఆ వ్యతిరేకతకు సరైన కారణాలను చూపలేకపోయారని చర్చ స్పష్టం చేసింది. అందువల్ల వారు లేవనెత్తిన అభ్యంతరాలకు వివరమైన సమాధానాలు ఇవ్వడం అవసరమని నేను భావించడం లేదు. వారు చేసింది ఏమిటంటే, సభ ముందు కొన్ని అభిప్రాయాలు ఉంచారు. వాటిని మనం 'దురభిప్రాయాల'ని చెప్పవచ్చు. ఎందుకంటే బిల్లులోని మంచి విషయాలను అవి ఎంత మాత్రం పట్టించుకోలేదు. అధ్యక్షా! నేను నా ప్రసంగం ప్రారంభంలోనే బిల్లులో కొన్ని లోపాలు ఉన్నాయని అంగీకరించాను. కొంతమంది గౌరవనీయ సభ్యులు వాటిని ఎత్తి చూపించారు కూడా. బిల్లు సెలక్ట్ కమిటీ వద్ద ఉన్న సమయంలో వారు సూచించిన సవరణలు చేయడానికి కూడా నేను సిద్ధమేనని అప్పుడే చెప్పాను. అందుకు నాకు ఎటువంటి అభ్యంతరం లేదు..... C 81



***ఒక గౌరవనీయ సభ్యుడుః*** సూత్ర సంబంధమైన సవరణలు కూడానా.....

***డా॥ అంబేద్కర్ః*** సెలక్ట్ కమిటీ చేపట్టాలనుకున్న ఏ సవరణలు అయినా సరే. ఆఖరికి సూత్ర సంబంధమైన సవరణలు కూడా. నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. సెలక్ట్ కమిటీ చేయదలచుకున్న ఏ సవరణ అయినా సరే....



***సర్దార్ జి.ఎన్. మజుందార్ః*** సూత్ర సంబంధమైనవి కూడానా....?

***డా॥ అంబేద్కర్ః*** అవును. అధికారుల దయాదాక్షిణ్యాలకు ఈ బిల్లును వదిలిపెట్టే కంటే సభలోని ప్రతిపక్ష సభ్యులతో ఏర్పాటైన సెలక్ట్ కమిటీకి బిల్లును అప్పగించడాన్నే నేను ఇష్టపడతాను. అందుకే నేను సిద్ధంగా ఉన్నాను. బిల్లు భవిష్యత్తు ఏం కానున్నదో కానివ్వండి. అయితే, సెలక్ట్ కమిటీలోని ప్రతిపక్ష సభ్యులకే నేను దీనిని వదిలిపెడుతున్నాను. అధ్యక్షా! ఈ విధానం గౌరవనీయ రెవెన్యూ మంత్రికి అసౌకర్యం కలిగిస్తుందని నేను అనుకోవడం లేదు. అధ్యక్షా! అధికార సభ్యులకు

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 23, పేజీలు 791-93, ఆగష్టు 4, 1928

వ్యతిరేకంగా వచ్చిన ఏ ఆరోపణను ఈ బిల్లులో చేర్చాలని నేను కోరుకోవడం లేదు. అయితే, పీడిత వర్గాలు ఈ బిల్లును చూసినంత ప్రాముఖ్యంగా వారు చూడలేదని నేను చెప్పక తప్పడం లేదు. ఈ బిల్లులో నేను పొందుపరిచిన అంశాలనే చర్చిస్తూ 1923 ఫిబ్రవరిలో ఒక తీర్మానాన్ని సభ ముందు ఉంచినట్లు నాకు గుర్తుంది. సభలోని ప్రతిపక్ష సభ్యులు ఆ తీర్మానం పట్ల ఎంతో సుముఖత వ్యక్తం చేశారు. ఆ విషయంపై తక్షణమే విచారణ జరిపిస్తాననే హామీపై తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసిందిగా గౌరవనీయ రెవెన్యూ సభ్యుడు సంబంధిత సభ్యుడిని ఒప్పించారు. అధ్యక్షా! అప్పటినుంచి నాలుగైదు సంవత్సరాలు గడిచిపోయాయి. కాని ఇంత వరకు ఆ విషయంపై ఎటువంటి విచారణ జరపలేదు. అధ్యక్షా! 1925 లో మళ్లీ అదే అంశాన్ని ప్రస్తావిస్తూ మరొక సభ్యుడు ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. అయితే అప్పుడు కూడా ఆ విషయంపై విచారణ జరిపిస్తామనే హామీతో తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసిందిగా ప్రభుత్వం ఆ సభ్యునిపై ఒత్తిడి తెచ్చింది. కాని ఎటువంటి విచారణ జరిపించలేదు. అందువల్ల ఈ బిల్లులోని అంశాలు గౌరవనీయ రెవెన్యూ సభ్యుడికి కొత్త ఏమీ కాదు. వతన్‌కు సంబంధించి పీడిత వర్గాల వారు వ్యక్త పరుస్తున్న కోర్కెల గురించి కూడా ఆయనకు చాలా కాలం నుంచే తెలుసు. పూర్తి వివరాలు, వాస్తవాలు తెలుసుకోవాలని, బిల్లులో నేను చేసిన ప్రతిపాదనలకు బదులుగా సొంతంగా తాను కొన్ని ప్రతిపాదనలు చేయాలని ఆయన నిజంగా భావించినట్లయితే అందుకు ఆయనకు చాలా సమయం ఉన్నదని మనవి చేస్తున్నాను అధ్యక్షా!

ఆయన తనకు ఉన్న అవకాశాన్ని ఉపయోగించుకోలేదు. అయినప్పటికీ, ఆయనకు మరొక అవకాశాన్ని ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. బిల్లు ఒక వేళ సెలక్ట్ కమిటీకి వెళ్ళినట్లయితే, ఆ విషయంపై విచారణ జరపడానికి తాను నిపుణులుగా భావించిన వ్యక్తులతో విడిగా ఏదయినా కమిటీని నియమించడానికి తొమ్మిది, పది నెలల సమయం ఉంటుంది. అందువల్ల ఆయన తన సొంత ప్రతిపాదనలను రూపొందించుకుని, వాటిని సవరణల రూపంలో సెలక్ట్ కమిటీ ముందుకు తీసుకుని రావచ్చు. అందుకు నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. నా గౌరవనీయ స్నేహితుడు అందుకు అంగీకరిస్తే, నేను ఆ మార్గంలో వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. అవునో, కాదో ఆయన చెప్పాలి. ఈ బిల్లును సెలక్ట్‌కమిటీకి వదిలిపెట్టడానికి నేను సిద్ధంగా ఉన్నానని ముందే చెప్పాను. అయితే, కమిటీలోని అధికార పక్ష సభ్యులకు వదిలిపెట్టడానికి నేను సుముఖంగా లేను. చర్చకు జవాబుగా నేను చెప్పదలుచుకున్నది ఇదే అధ్యక్షా!

☆ ☆ ☆

# 17

# బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణకు ఉద్దేశించిన బిల్లు 23, 1937*

ఈ కింద పేర్కొన్న బిల్లును బొంబాయి శాసనసభ నిబంధనలలోని 20వ నిబంధన కింద ప్రచురించడం జరిగింది. ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి 1937, సెప్టెంబర్ 17వ తేదీన జరిగిన బొంబాయి శాసన సభా సమావేశంలో ఎం.ఎల్.ఎ. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్‌కు అనుమతి ఇచ్చారు.

## బిల్లు నెంబర్ 23, 1937

**(1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టం (3) సవరణకు ఉద్దేశించిన బిల్లు)**

1874 నాటి బొంబాయి వారసత్వ ఉద్యోగాల చట్టాన్ని సవరించడం అవసరం కనుక, ఈ కింద పేర్కొన్న విధంగా సవరించడం జరిగింది.

**1. పేరు :** ఈ చట్టాన్ని బొంబాయి వారసత్వ ఉద్యోగాల (సవరణ) చట్టం, 1937 గా పిలువవచ్చు.

**2. 1874 నాటి బొంబాయి వారసత్వ చట్టంలోని 15వ సెక్షన్‌కు సవరణ :** 15వ సెక్షన్‌లోని ఒకటవ క్లాజును తొలగించి ఈ కింది క్లాజులను చేర్చాలి.

**15. క్లాజు 1 :** ఒక వతన్‌దార్‌కాని, వతన్‌దార్ కుటుంబంలోని సభ్యుడు కాని కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా విజ్ఞప్తి చేస్తూ, తనను సేవల నుంచి విముక్తం చేయవలసిందిగా కోరితే, ఆ కోర్కె సమంజసమైనదని కలెక్టర్ సంతృప్తి చెందిన పక్షంలో ఆ వ్యక్తిని సేవల నుంచి విముక్తం చేయవచ్చు.

**క్లాజు 2 :** సేవల నుంచి విముక్తం అయిన రోజు నుంచి ఆ వ్యక్తి వతన్‌దార్ స్థానాన్ని వదులుకోవలసిందే. మూడవ క్లాజులో పేర్కొన్న ప్రయోజనాలు మినహా తన వతన్ ద్వారా లభించే మరే ప్రయోజనాలకు ఆ వ్యక్తి అర్హుడు కాడు.

**క్లాజు 3 :** ఈ సెక్షన్‌లోని మొదటి, రెండవ క్లాజుల కింద సేవల నుంచి విముక్తి పొందిన వతన్‌దార్ తన వతన్ భూమిపై పూర్తి భూమి శిస్తు చెల్లించడానికి అంగీకరించినట్లయితే, ఆ భూమిని అతని ఆధీనంలోనే ఉంచవచ్చు. అంతేగాక, బొంబాయి భూమిశిస్తు నిబంధనావళిలోని 3(16) వ సెక్షన్‌లో పేర్కొన్న ప్రకారం ఆ భూమి యజమానిగా అతనిని గుర్తించడం జరుగుతుంది.

---

* బొంబాయి ప్రభుత్వ గెజిట్, 5వ భాగం, పేజీలు 101-05, తేదీ అక్టోబర్ 21, 1937,.

క్లాజు 4 : సేవల నుంచి విముక్తి పొందిన వతన్‌దార్ భూమి ఒకరి కంటే ఎక్కువ మంది వతన్‌దార్‌ల ఆధీనంలో కాని, వతన్ కుటుంబాల ఆధీనంలో కాని ఉన్నట్లయితే, ఆ భూమిని కలెక్టర్ పంచడం చట్టబద్ధమే అవుతోంది.

క్లాజు 5 : సేవలనుంచి విముక్తి పొందిన మాజీ వతన్‌దార్ ఆధీనంలో ఉంచబడిన భూమిని వతన్ భూమిగా వ్యవహరించడం జరగదు.

3. రెండవ క్లాజును ఆరవ క్లాజుగా వ్యవహరించాలి.

4. మూడవ క్లాజును ఏడవ క్లాజుగా వ్యవహరించాలి.

5. నాలుగవ క్లాజులోని "సమిష్టి యజమానుల మొత్తం సంఖ్య" అనే పదాల తరువాత "లేదా ఒకరు లేదా అటువంటి సమిష్టి యజమానులలో కొందరు" అనే పదాలను చేర్చారు. నాలుగవ క్లాజును ఎనిమిదవ క్లాజుగా వ్యవహరించాలి.

6. **1874 నాటి చట్టంలోని 16వ సెక్షన్‌కు సవరణ :** 16వ సెక్షన్‌లోని 'అసలైన' అనే పదం స్థానంలో 'ప్రాథమికమైన' అనే పదాన్ని చేర్చాలి.

7. **1874 నాటి చట్టంలోని 16వ సెక్షన్‌కు సవరణ :** 19వ సెక్షన్‌లోని "ప్రతిఫలాన్ని వస్తురూపంలో ఇవ్వాలా, నగదు రూపంలో ఇవ్వాలా నిర్ణయించడం" అనే పదాలను తొలగించాలి.

8. **1874 నాటి చట్టంలోని 19వ సెక్షన్ తరువాత 19ఎ, 19బి, 19సి, 19డి అనే నూతన సెక్షన్‌లను చేర్చడం :** 19వ సెక్షన్ తరువాత ఈ కింది సెక్షన్లను చేర్చాలి :

"19ఎ. వస్తురూపంలో ప్రతిఫలం పొందే హక్కును అందుకు సమానమైన నగదు రూపంలో పొందే హక్కుగా కలెక్టర్ మార్చడం : వస్తురూపంలో ప్రతిఫలం పొందుతున్న వతన్‌దార్‌లు తమ సంస్థ ద్వారా కాని, తమలో అధిక సంఖ్యాకులు కాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేస్తూ, తమకు నగదు రూపంలో ప్రతిఫలాన్ని చెల్లించే ఏర్పాటు చేయవలసిందిగా కోరితే కలెక్టర్ ఆ విధమైన ఏర్పాటు చేస్తారు."

"19బి. నగదు రూపంలోని ప్రతిఫలాన్ని కలెక్టర్ వసూలు చేయించి వతన్‌దార్‌లకు చెల్లించడం : వస్తురూపంలో చెల్లించే ప్రతిఫలాన్ని నగదు రూపంలోకి మార్చినప్పుడు వతన్‌దార్‌ల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులుకాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేస్తూ, ప్రతిఫలం చెల్లించవలసిన వారివద్ద నుంచి దానిని వసూలు చేయించవలసిందిగా కోరవచ్చు. అప్పుడు కలెక్టర్ ఆ ప్రతిఫలాన్ని భూమిశిస్తుతో పాటుగాని, అందులో భాగంగా కాని వసూలు చేయించి, దానిని ప్రభుత్వ ఖజానా నుంచి వతన్‌దార్‌లకు చెల్లించే ఏర్పాటు చేస్తారు."

"19సి. ప్రభుత్వానికి చేసిన సేవలకు ఎంత ప్రతిఫలమో, రైతులకు చేసిన సేవలకు ఎంత ప్రతిఫలమో నిర్ణయించవలసిందిగా వతన్‌దార్‌లు కోరితే, ఆ విషయాన్ని కలెక్టర్ నిర్ణయించడం : రైతులకు, ప్రభుత్వానికి వతన్‌దార్‌లు చేసిన సేవలకు సంయుక్తంగా వారికి ప్రతిఫలం చెల్లిస్తున్నట్లయితే,

వతన్‌దార్‌ల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులు కాని కలెక్టర్‌కు విజ్ఞప్తి చేస్తూ, రైతుల పనులకు ఎంత ప్రతి ఫలమో, ప్రభుత్వ పనులకు ఎంత ప్రతిఫలమో నిర్ణయించవలసిందిగా కోరితే, కలెక్టర్ ఆ విషయాన్ని నిర్ణయించాలి. కలెక్టర్ నిర్ణయమే తుది నిర్ణయం."

"19డి. రైతులకు సేవలు చేయకుండా ఉండేందుకు వతన్‌దార్‌లకు స్వేచ్ఛ : 19సి సెక్షన్‌లో పేర్కొన్న విధంగా ప్రతిఫలాన్ని నిర్ణయించవలసిందిగా కలెక్టర్‌ను కోరిన వతన్‌దార్‌ల సంస్థకాని, వారిలో అధిక సంఖ్యాకులు కాని రైతులకు సేవలు అందించకూడదని నిర్ణయించుకుని ఆ విషయాన్ని కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా తెలియజేసినట్లయితే, రైతుల పనులు చేయకుండా తిరస్కరించే స్వేచ్ఛ వారికి ఉంటుంది. ఆ విధంగా నిర్ణయించుకున్న వతన్‌దార్‌లకు రైతులనుంచి ప్రతిఫలం అందదు.

9. 1874 నాటి చట్టంలోని 21వ సెక్షన్‌కు సవరణ : 21 వ సెక్షన్‌లోని 'అటువంటి కాలవ్యవధులు' అనే పదాల స్థానంలో '10 సంవత్సరాల కాలవ్యవధి' అనే పదాలు చేర్చాలి.

10. 1874 నాటి చట్టంలోని 83వ సెక్షన్‌కు సవరణ : 83వ సెక్షన్‌కు బదులు ఈ కింది భాగాన్ని చేర్చాలి :

"83. 18 వ సెక్షన్‌లో పేర్కొన్న విషయాలు మినహా, ఏ వారసత్వ ఉద్యోగి అయినా నిర్వర్తించవలసిన విధులు ఏమిటో వివరిస్తూ, నిబంధనలను రూపొందించే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది. ఈ సెక్షన్ కింద రూపొందించిన నిబంధనలను తదుపరి సమావేశాలకు కనీసం నెల రోజుల ముందు శాసన సభకు సమర్పించాలి. వాటిని రద్దు చేయడానికి కాని, సవరించడానికి కాని శాసనసభకు అధికారం ఉంటుంది. ఏదయినా నిబంధనను శాసనసభ రద్దుచేసినా సవరించినా ప్రభుత్వం దానిని అంగీకరించి తదనుగుణంగా నిబంధనలను పునఃప్రచురించాలి".

## లక్ష్యాలు, కారణాల వివరణ

ఈ బిల్లు లక్ష్యాలు మూడు. మొదటిది ఏమిటంటే, వతన్‌దార్ కోరుకున్న రూపంలో ప్రతిఫలం అందేలా చూడడం. రెండవది వతన్‌దార్‌లలోని కొన్ని వర్గాలకు ప్రతిఫలం సరిగ్గా అందేలా చూడడం. మూడవది వతన్‌దార్‌ల విధులను నిబంధనల ద్వారా నిర్ణయించడం.

వీటిలో మొదటి లక్ష్యం కోసం 2,3,4,5,6 సెక్షన్‌లను, రెండవ లక్ష్యం కోసం 7,8,9 సెక్షన్‌లను, మూడవ లక్ష్యం కోసం 10వ సెక్షన్‌ను రూపొందించడం జరిగింది.

(1) తన వతన్‌లో భాగంగా ఉన్న భూమిపై హక్కు వదులుకోకుండానే వతన్‌దార్ చేసే సేవలనుంచి విముక్తి పొందే అవకాశాన్ని రెండవ సెక్షన్ వతన్‌దార్‌లకు కల్పిస్తుంది. అలా అయినంత మాత్రాన ప్రభుత్వానికి ఎటువంటి నష్టం ఉండదు. ఎందుకంటే, ఆ వ్యక్తి నుంచి పూర్తి భూమి శిస్తు వసూలు చేసుకునే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది.

(2) మూడవ, నాలుగవ సెక్షన్‌లు లాంఛన ప్రాయమైనవి.

(3) సేవల నుంచి విముక్తం చేయవలసిందిగా కోరుకునే అవకాశాన్ని వతన్ సమిష్టి యజమానుల్లో ఒకరికి కాని, కొందరికి కాని ఐదవ సెక్షన్ కల్పిస్తుంది.

(4) 'ప్రాథమికమైన' అనే పదం ద్వారా సమాజ సేవలకు ఎవరు బాధ్యత వహించాలో ఆరవ సెక్షన్ మరింత స్పష్టంగా నిర్వచిస్తుంది.

(5) ప్రతిఫలాన్ని వస్తురూపంలో చెల్లించాలా, నగదురూపంలో చెల్లించాలా అనే విషయాలను నిర్ణయించడంలో కలెక్టర్‌కు ఎటువంటి విచక్షణాధికారాన్ని ఇవ్వకుండా ఉండేందుకు ఏడవ సెక్షన్‌ను చేర్చడం జరిగింది.

6.చట్టానికి అదనంగా మరో నాలుగు నూతన సెక్షన్లను ఎనిమిదవ సెక్షన్ చేరుస్తుంది :

వస్తురూపంలో చెల్లించే ప్రతిఫలాన్ని నగదు రూపంలోకి మార్చవలసిందిగా కోరే హక్కును 19ఎ సెక్షన్ వతన్‌దార్‌లకు ఇస్తున్నది. వతన్‌దార్‌ల కోరిక మేరకు భూమిశిస్తులో భాగంగా నగదు రూపంలోని ప్రతిఫలాన్ని వసూలు చేసే బాధ్యతను 19బి సెక్షన్ కలెక్టర్‌కు అప్పగిస్తున్నది.

వతన్‌దార్‌లకు చెల్లించే ప్రతిఫలం ప్రభుత్వానికి, రైతులకు వారు చేసే సేవలకు సంయుక్తంగా చెల్లిస్తున్నట్టయితే, ప్రభుత్వానికి చేసే సేవలకు ఎంత ప్రతిఫలమో, రైతులకు చేసే సేవలకు ఎంత ప్రతిఫలమో నిర్ణయించే అధికారాన్ని 19సి సెక్షన్ కలెక్టర్‌కు ఇస్తున్నది.

రైతులకు చేసే సేవలకు ఎంత ప్రతిఫలం చెల్లించాలో 10సి సెక్షన్ కింద కలెక్టర్ నిర్ణయించిన మొత్తాన్ని వతన్‌దార్‌లు వదులుకునేటట్లయితే, రైతులకు సేవలు అందించే బాధ్యత నుంచి విముక్తం అయ్యే అవకాశాన్ని 19డి సెక్షన్ వారికి కల్పిస్తుంది.

(7) వతన్ నుంచి వచ్చిన లాభాలకు సంబంధించి 21 వ సెక్షన్ కింద కలెక్టర్ చేసే ఏ ఒప్పందానికి అయినా గరిష్ట కాల పరిమితి 10 సంవత్సరాలు ఉండాలని 9వ సెక్షన్ నిర్దేశిస్తుంది.

(8) వతన్‌దార్‌ల విధులను నిబంధనల ద్వారా నిర్ణయించవలసి ఉంటుందని 10వ సెక్షన్ నిర్దేశిస్తున్నది.

(సంతకం) బి.ఆర్. అంబేద్కర్
హెచ్.కె. చయినాని
బొంబాయి శాసనసభ కార్యదర్శి

పూనా,
అక్టోబర్ 18, 1937.



# 18

# వారసత్వ ఉద్యోగాల చట్ట సవరణకు ఉద్దేశించిన బిల్లు 23 1937*

**డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :** అధ్యక్షా! ఉద్యోగాల చట్టం (3) సవరణకు బిల్లును ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.

ఈ బిల్లు లక్ష్యాలు మూడు. మొదటిది ఏమిటంటే, వతన్‌దార్ కోరుకున్న రూపంలో ప్రతిఫలం అందేలా చూడడం. రెండవది వతన్‌దార్‌లలోని కొన్ని వర్గాలకు ప్రతిఫలం సరిగ్గా అందేలా చూడడం. మూడవది వతన్‌దార్‌ల విధులను నిబంధనల ద్వారా నిర్ణయించడం.

వీటిలో మొదటి లక్ష్యం కోసం 2,3,4,5,6 సెక్షన్‌లను, రెండవ లక్ష్యం కోసం 7,8,9 సెక్షన్‌లను, మూడవ లక్ష్యం కోసం 10వ సెక్షన్‌ను రూపొందించడం జరిగింది.

తన వతన్‌లో భాగంగా ఉన్న భూమిపై హక్కు వదులుకోకుండానే వతన్‌దార్ చేసే సేవల నుంచి విముక్తి పొందే అవకాశాన్ని రెండవ సెక్షన్ వతన్‌దార్‌లకు కల్పిస్తుంది. అలా అయినంత మాత్రాన ప్రభుత్వానికి ఎటువంటి నష్టం ఉండదు. ఎందుకంటె, ఆ వ్యక్తి నుంచి పూర్తి భూమి శిస్తు వసూలు చేసుకునే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది.

మూడవ, నాలుగవ సెక్షన్‌లు లాంఛనప్రాయమైనవి.

సేవల నుంచి విముక్తం చేయవలసిందిగా కోరుకునే అవకాశాన్ని వతన్‌సమిష్టియజమానుల్లో ఒకరికి కాని, కొందరికి కాని ఐదవ సెక్షన్ కల్పిస్తుంది.

'ప్రాధమికమైన' అనే పదం ద్వారా సమాజ సేవలకు ఎవరు బాధ్యత వహించాలో ఆరవ సెక్షన్ మరింత స్పష్టంగా నిర్వచిస్తుంది.

ప్రతిఫలాన్ని వస్తురూపంలో చెల్లించాలా, నగదు రూపంలో చెల్లించాలా అనే విషయాలను నిర్ణయించడంలో కలెక్టర్‌కు ఎటువంటి విచక్షణాధికారాన్ని ఇవ్వకుండా ఉండేందుకు ఏడవ సెక్షన్‌ను చేర్చడం జరిగింది. చట్టానికి మరో నాలుగు నూతన సెక్షన్‌లను ఎనిమిదవ సెక్షన్ చేరుస్తుంది.

వస్తురూపంలో చెల్లించే ప్రతిఫలాన్ని నగదురూపంలోకి మార్చవలసిందిగా కోరే హక్కును

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 1, పేజీలు 1091-92, సెప్టెంబరు 17, 1937.
డాక్టర్ అంబేద్కర్ ప్రవేశపెట్టిన బిల్లును ముందు పేజీలలో ప్రచురించడం జరిగింది.

19ఎ సెక్షన్ వతన్‌దార్‌లకు ఇస్తున్నది.

వతన్‌దార్‌ల కోరిక మేరకు, భూమిశిస్తులో భాగంగా నగదు రూపంలోకి ప్రతిఫలాన్ని వసూలు చేసే బాధ్యతను 1బి సెక్షన్ కలెక్టర్‌కు అప్పగిస్తున్నది.

వతన్‌దార్‌లకు చెల్లించే ప్రతిఫలం ప్రభుత్వానికి, రైతులకు వారు చేసే సేవలకు సంయుక్తంగా చెల్లిస్తున్నదయితే, ప్రభుత్వానికి చేసే సేవలకు ఎంత ప్రతిఫలమో, రైతులకు చేసే సేవలకు ఎంత ప్రతిఫలమో నిర్ణయించే అధికారాన్ని 19 సి సెక్షన్ కలెక్టర్‌కు ఇస్తున్నది.

ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వడం జరిగింది.

అధ్యక్షా! బిల్లును ప్రవేశ పెడుతున్నాను.

గౌరవనీయ సభాపతి : బిల్లును ప్రవేశపెట్టారు.



# 19

# ఖోటీ విధానం రద్దుకు ఉద్దేశించిన బిల్లు 20, 1937*

1937, సెప్టెంబర్ 17న జరిగిన బొంబాయి శాసనసభ సమావేశంలో ఈ బిల్లును ప్రవేశ పెట్టడానికి ఎం.ఎల్.ఏ. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్‌కి అనుమతి లభించింది. బొంబాయి శాసనసభ నిబంధనలలోకి 20వ నిబంధన కింద ఈ బిల్లును ప్రచురించడం జరుగుతున్నది.

## బిల్లు నెంబర్ 20, 1937
## ఖోటీ విధానం రద్దుకు ఉద్దేశించిన బిల్లు

ఖోటీవిధానాన్ని రద్దుచేయడం, ఆ వ్యవస్థ అమలులో ఉన్నచోట అంతకు మించి ప్రయోజనకరమైన రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టడం అవసరం కనుక ఈ కింది విధంగా బిల్లును రూపొందించడం జరుగుతున్నది.

***1. పేరు, పరిధి:*** ఈ చట్టాన్ని 'ఖోటీ విధాన రద్దు చట్టం, 1937'గా వ్యవహరించవచ్చు. ఈ చట్టం మొత్తం బొంబాయి ప్రెసిడెన్సీకి వర్తిస్తుంది.

***2. ఖోటీ విధానం రద్దు:*** ఈ చట్టాన్ని సభ ఆమోదించిన తరువాత ప్రభుత్వం ఒక నోటిఫికేషన్ జారీ చేయవలసి ఉంటుంది. ఆ నోటిఫికేషన్‌ను ప్రభుత్వ గెజిట్‌లో ప్రచురించాలి. నోటిఫికేషన్‌లో పేర్కొన్న తేదీ నుంచి ఖోటీ విధానం రద్దు అయిందని ప్రభుత్వం ప్రకటిస్తుంది.

***3. నోటిఫికేషన్ తరువాత ఖోట్‌గా వ్యవహరించడానికి ఏ ఖోట్‌కీ అధికారం లేదు. అతన్ని ఖోట్‌గా నియమించడం కాని, గుర్తించడం కాని ప్రభుత్వం చేయదు:*** ఆ నోటిఫికేషన్ వెలువడిన నాటినుంచి ఖోట్‌గా వ్యవహరించడానికి ఎవరికీ హక్కులేదు. ఖోట్‌లను నియమించడానికి, గుర్తించడానికి ప్రస్తుతం ప్రభుత్వానికి అధికారం ఇస్తున్న ఏ చట్టం, ఏ సాంప్రదాయం, ఏ అలవాటు అయినా రద్దు అయిపోతాయి. ఆ చట్టాలు, సాంప్రదాయాలు కోర్టుల్లో కూడా చెల్లవు.

***4. నోటిఫికేషన్ తరువాత శిస్తుకి సంబంధించిన ఏ బాధ్యత ఖోట్‌లకు ఉండదు:*** ప్రభుత్వ నోటిఫికేషన్ వెలువడిన నాటినుంచి ప్రభుత్వానికి శిస్తు చెల్లించవలసిన బాధ్యత నుంచి ఖోట్‌లు విముక్తులు అవుతారు.

---

* బొంబాయి ప్రభుత్వ గెజిట్, 5వ భాగం, పేజీలు 88 – 94. తేదీ అక్టోబర్ 21, 1937.

**5. ఖోట్‌లకు నష్టపరిహారం:** (1) నోటిఫికేషన్ పర్యవసానంగా ఖోట్‌గా హక్కులు కోల్పోయిన వారికి తగిన నష్టపరిహారాన్ని ప్రభుత్వం చెల్లించవలసి ఉంటుంది. ఖోట్‌గా ఆయన పరిధిలో ఉన్న భూమిపై భూమిశిస్తు నిబంధనావళి ప్రకారం విధించే పన్నులో ఒక శాతానికి మించి నష్టపరిహారం ఉండకూడదు.

(2) నష్టపరిహారానికి సంబంధించి ప్రభుత్వం తీసుకునే నిర్ణయానికి తిరుగు ఉండదు. అదే తుది నిర్ణయం.

(3) ఖోట్‌లకు చెల్లించవలసిన నష్టపరిహారాన్ని నగదు రూపంలో లేక బాండ్ల రూపంలో లేక మరే రూపంలో చెల్లించాలనే విషయాన్ని ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ఈ విషయంలో ప్రభుత్వం తీసుకునే నిర్ణయమే తుది నిర్ణయం.

***6. భూముల యజమానులు:*** ఈ చట్టం ప్రకారం ఖోటీ విధానం రద్దయిన ప్రాంతంలో ఆ విధానం కింద భూములను కలిగి ఉన్న సన్నకారు రైతులను 1879 నాటి భూమిశిస్తు నిబంధనావళి ప్రకారం ఆయా భూముల యజమానులుగా గుర్తించడం జరుగుతుంది. ఈ నిబంధనావళి కింద ఇతర భూముల యజమానులకు ఏ హక్కులు, ఏ బాధ్యతలు ఉంటాయో అవన్నీ వీరికీ ఉంటాయి. ఈ నిబంధనావళిలోని అన్ని నిబంధనలు వారికి వర్తిస్తాయి.

***7.యాజమాన్య హక్కులకు సంబంధించిన వివాదాల పరిష్కారం:*** భూమి యజమానులు ఎవరనే వివాదం ఏర్పడినట్లయితే, నోటిఫికేషన్‌కు ముందు గడిచిన 12 సంవత్సరాలలో అత్యధిక కాలం ఆ భూమి ఎవరి ఆధీనంలో ఉంటే వారికి ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతుంది.

***8. ఏ అలజడి కారణంగానైనా యాజమాన్య హక్కులు చెక్కుచెదరవు:*** ఈ చట్టాన్ని ఆమోదించిన తరువాత దీనిలోని ఆరవ సెక్షన్ కింద సన్నకారు రైతులకు సంక్రమించిన భూమి యాజమాన్య హక్కులు ఏ అలజడి ఏర్పడినా చెక్కుచెదరవు.

**9. నష్టపరిహారం, భూమియాజమాన్య హక్కులకు సంబంధించిన వివాదాలపై విచారణ:** 1.ఖోటీ విధానం రద్దు అయిన ప్రాంతంలో ఈ చట్టం కింద భూమి యాజమాన్యానికి సంబంధించిన వివాదాలు తలెత్తితే వాటిపై విచారణ జరిపి, పరిష్కారానికి ప్రభుత్వం ఒక అధికారిని నియమించవలసి ఉంటుంది. ఈ చట్టం కింద నష్టపరిహారం చెల్లింపునకు సంబంధించిన వివాదాలపై విచారణకు కూడా ప్రభుత్వం ఒక అధికారిని నియమించవలసి ఉంటుంది.

2. ఈ చట్టం కింద విచారణ జరపడానికి అవసరమైన వ్యక్తులను, సాక్షులను పిలిపించే అధికారం, వారివద్ద నుంచి అవసరమైన పత్రాలను తెప్పించుకునే అధికారం విచారణాధికారికి ఉంటాయి. 1908 నాటి సివిల్ ప్రొసీజర్ కోడ్ కింద సివిల్ కోర్టుకు ఇటువంటి విషయాలలో ఏ అధికారాలు అయితే ఉంటాయో, అవన్నీ ఈ అధికారికి కూడా ఉంటాయి.

3. నష్టపరిహారాన్ని నిర్ణయించడానికి, భూమి యాజమాన్య హక్కులను గుర్తించడానికి ఈ చట్టం కింద నిర్వహించే విచారణకు 1894 నాటి భూమి స్వాధీన చట్టంలోని 9,10,11,12,13,14,15 సెక్షన్‌లలోగల నిబంధనలు వర్తిస్తాయి.

4. నష్టపరిహారాన్ని నిర్ణయించడానికి, భూమి యాజమాన్య హక్కులను గుర్తించడానికి అవసరమైన విచారణ జరిపే నిమిత్తం ఖోట్‌లు లేదా సన్నకారురైతుల వద్దనున్న అన్ని పత్రాలను, రికార్డులను, రిజిస్టర్‌లను తెప్పించుకునే అధికారం విచారణాధికారికి ఉంది.

5. విచారణాధికారి తన నిర్ణయాన్ని కలెక్టర్‌కు తెలియజేయాలి. నష్టపరిహారం, భూయాజమాన్య హక్కుల విషయంలో తీసుకున్న నిర్ణయాలను సంబంధిత వ్యక్తులకు కూడా లిఖితపూర్వకంగా తెలియజేయాలి.

6. నష్టపరిహారం ఏ వ్యక్తికి చెల్లించాలనే విషయాన్ని అధికారి సంతృప్తి కరంగా నిర్ణయించలేని పక్షంలో ఆ విషయాన్ని సివిల్ కోర్టు తేల్చేవరకు నష్టపరిహారం చెల్లింపును నిలిపివేయాలి.

*10 భూమి యాజమాన్యహక్కు కోరి సన్నకారురైతుల వాదనను తిరస్కరించిన పక్షంలో:* 1. తన ఆధీనంలోని భూమికి తనను యజమానిగా గుర్తించవలసిందిగా కోరిన వ్యక్తి వాదనను విచారణాధికారి తిరస్కరిస్తూ ఆదేశాలు జారీ చేసినట్లయితే, తన కేసును జిల్లాకోర్టుకు లేదా ప్రభుత్వం ప్రత్యేకంగా నియమించిన ట్రిబ్యునల్‌కు నివేదించవలసిందిగా ఆ వ్యక్తి కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా విజ్ఞప్తి చేసుకోవచ్చు.

2. విచారణాధికారి తీసుకున్న నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నందుకు గల కారణాలను ఆ విజ్ఞాపన పత్రంలో పేర్కొనవలసి ఉంటుంది. తమ వాదనను తిరస్కరిస్తూ విచారణాధికారి ఆదేశాలు జారీచేసిన తేదీకి 90 రోజులలోపు విజ్ఞాపన పత్రాన్ని సమర్పించవలసి ఉంటుంది.

3. కలెక్టర్ ఆ కేసును జిల్లా కోర్టుకు కాని, ట్రిబ్యునల్‌కు కాని నివేదిస్తారు. ఆ విజ్ఞాపనపత్రాన్ని కేసుగా నమోదు చేయడం జరుగుతుంది. దరఖాస్తుదారుడిని వాదిగాను, భూమి యజమానులుగా విచారణాధికారి ప్రకటించిన వ్యక్తిని లేదా వ్యక్తులను ప్రతి వాదులుగా ఆ కేసులో పేర్కొనడం జరుగుతుంది.

4. విజ్ఞాపన పత్రం కేసుగా నమోదుకాగానే జిల్లా కోర్టు లేదా ట్రిబ్యునల్ ప్రతివాదికి లేదా ప్రతివాదులకు నోటీసు జారీచేసి, నిర్దేశించిన తేదీలోగా కోర్టుకు హాజరై తమ వాదన వినిపించవలసిందిగా ఆదేశించాలి.

5. 1908 నాటి సివిల్ ప్రొసీజర్ కోడ్‌లోకి నిబంధనల ప్రకారం సాధారణమైన కేసుల విచారణ తరహాలోనే ఆ విజ్ఞాపన పత్రంపై కూడా విచారణ నిర్వహించాలి.

6. కోర్టు లేదా ట్రిబ్యునల్ ఆ కేసుపై తీసుకున్న నిర్ణయం లేదా జారీచేసిన ఆదేశంపై

అప్పులు చేసుకొనడానికి వీలు లేదు.

*11.* **ఖోట్‌లు దాఖలు చేయవలసినప్రకటనలు :** (1) ఈ చట్టాన్ని ఆమోదించిన మూడు నెలల లోపు కలెక్టర్ లిఖితపూర్వకంగా ఒక నోటీసు జారీచేస్తూ, తాను పేర్కొన్న తేదీన కాని, అంతకంటే ముందుకాని ప్రతి ఖోట్ ఒక ప్రకటన దాఖలు చేయవలసిందిగా ఆదేశించాలి. ఖోట్‌లు ప్రకటన దాఖలు చేయవలసిన తేదీ నోటీసు జారీ అయిన తేదీకి మూడు నెలలకు మించి ఉండకూడదు. ఖోట్‌లు దాఖలు చేయవలసిన ప్రకటనలో ఈ కింది విషయాలు ఉండాలి.

i) ఖోట్‌గా కాని, మరొక విధంగా కాని తమ ఆధిపత్యం కింద ఉన్న అన్ని భూముల సర్వేనెంబర్లు,

ii)1920 నుంచి ఈ చట్టం ఆమోదం పొందే రోజు వరకు ప్రతి సంవత్సరం ప్రతి సర్వే నెంబర్ భూమి ఎవరి ఆధీనంలో ఉందో ఆ వ్యక్తుల పేర్లు,

iii) ఆ సర్వేనెంబర్‌లలో ప్రతి సర్వే నెంబర్ భూమిపై ఆ ఖోట్‌కు ఉన్న హక్కుకు సంబంధించిన వివరాలు,

(2) (i) వ సబ్‌సెక్షన్ కింద దాఖలు చేసిన ప్రకటనలోని వివరాలలో ఏదయినా మార్పులు జరిగితే ఖోట్‌లు వాటి గురించి ఎప్పటి కప్పుడు కలెక్టర్‌కు లిఖితపూర్వకంగా తెలియజేయాలి.

(3) ముందు పేర్కొన్న సెక్షన్ కింద ప్రకటన దాఖలు చేయవలసిన ప్రతి ఖోట్ ఇండియన్ పీనల్‌కోడ్‌లోని 175,176 సెక్షన్‌ల ప్రకారం ప్రకటన దాఖలు చేయడం తప్పనిసరి.

*12.* **ప్రకటనే సాక్ష్యం:** 11వ సెక్షన్ కింద దాఖలు చేసిన ప్రకటనలలో ఖోట్‌లు పొందుపరచిన వివరాలనే సాక్ష్యంగా భావించడం జరుగుతుంది. ఆ ప్రకటన దాఖలు చేసిన ఖోట్‌కి సంబంధించిన కేసులోని వివరాలను కాక ప్రకటనలోని వివరాలనే సాక్ష్యాధారాలుగా భావించడం జరుగుతుంది.

*13.* **ప్రకటన దాఖలు చేయనందుకు జరిమానా:** 11 వ సెక్షన్‌లోని 1,2 సబ్ సెక్షన్‌లోగల నిబంధనలకు విరుద్ధంగా ఏ ఖోట్ అయినా ప్రకటన దాఖలు చేయకుండా ఉన్నట్లయితే, లేదా ప్రకటనలో పొందుపరిచిన వివరాలను ఎప్పటికప్పుడు కలెక్టర్‌కు తెలియ పరచకుండా ఉన్నట్లయితే, ఒక్కొక్క నేరానికి 100 రూపాయల వరకు ఆ వ్యక్తికి జరిమానా విధించవచ్చు.

11వ సెక్షన్‌లోని 1వ సబ్‌సెక్షన్ కింద నిర్దేశించిన కాలపరిమితిలోపు ఏ ఖోట్ అయినా ప్రకటన దాఖలు చేయకుండా ఉన్నట్లయితే, అటువంటి వారిపై కలెక్టర్ అపరాధ రుసుం విధించవచ్చు. నిర్దేశించిన తేదీ దాటిపోయిన తరువాత రోజుకి ఐదురూపాయలు మించకుండా రుసుం విధించి, భూమిశిస్తు బకాయిల కింద వసూలు చేయవచ్చు.

*14.* **అధికార ప్రతులను పొందడం:** విచారణ సందర్భంగా ప్రకటనలు దాఖలు చేసిన కేసులలోను, ఇతర కేసులలోను అధికార నిర్ణయాలకు సంబంధించిన పత్రాల ప్రతులను కావాలని సంబంధిత

వ్యక్తులు ఎవరైనా దరఖాస్తు చేసుకున్నట్లయితే, ఆయా వ్యక్తుల నుంచి ప్రభుత్వం నిర్దేశించిన చార్జీలను వసూలు చేసి వారికి ఆ అధికార ప్రతులను అందజేయవచ్చు.

***15. నిబంధనలను రూపొందించడానికి ప్రభుత్వానికి అధికారం:*** (1) ఈ చట్టాన్ని అమలు చేయడానికి అవసరమైన నిబంధనలను ప్రభుత్వం రూపొందిస్తుంది. ఈ కింది అంశాలు కూడా వాటిలో చోటు చేసుకోవాలి:

(i) నోటిఫికేషన్‌లోని అంశాలు, ప్రచురణ,

(ii) నష్టపరిహారం, దాని చెల్లింపుల నిర్ణయం,

(iii) వివాదాలపై విచారణ జరిపి నిర్ణయాలు తీసుకోవడానికి ట్రిబ్యునల్ నియామకం,

(iv) దరఖాస్తు, అధికార ప్రతులకు చెల్లించవలసిన రుసుం.

(v) సంబంధిత వ్యక్తుల నుంచి అవసరమైన పత్రాల స్వాధీనం, వాటిని భద్రపరచడానికి తగిన ఏర్పాటు

(2) ఈ సెక్షన్ కింద నిబంధనలను రూపొందించే అధికారం బొంబాయి ప్రభుత్వ గెజిట్‌లో ఇదివరకు ప్రచురించిన నిబంధనలకు లోబడి ఉంటుంది.

(3) ఈ సెక్షన్ కింద రూపొందించిన నిబంధనలను తదుపరి శాసనసభ సమావేశాలు జరగడానికి ముందు నెలరోజులకు తగ్గకుండా శాసనసభకు సమర్పించాలి. ఒక తీర్మానం ద్వారా వీటినిరద్దు చేయడానికి లేదా సవరించడానికి శాసనసభకు అధికారం ఉంది. ఏ నిబంధనయినా రద్దుచేసినా, సవరించినా ప్రభుత్వం శాసనసభ నిర్ణయాన్ని అంగీకరించి, తదనుగుణంగా నిబంధనలలో మార్పులు చేయాలి.

## లక్ష్యాలు, కారణాల వివరణ

1. బొంబాయి ప్రెసిడెన్సీలో అమలులో ఉన్న భూమికౌలు విధానాలలో ఖోటీ విధానం ఒకటి. రత్నగిరి జిల్లా, కొలాబా, థాణా జిల్లాలలో ఇది ఎక్కువగా అమలులో ఉంది.

2. ఖోటీ విధానంలోని కొన్ని అంశాలను చట్టం నిర్ణయిస్తుండగా, మరికొన్ని అంశాలు ఆచారాల ప్రకారం, అలవాటు ప్రకారం అమలులో ఉన్నాయి. రత్నగిరి జిల్లాలో 1880 నాటి బొంబాయి చట్టం (I) ఈ విధానాన్ని నిర్దేశిస్తుండగా, కొలాబా జిల్లాలో, థాణాలో ఆచారాలు, అలవాట్లు నిర్దేశిస్తున్నాయి.

(3) సాధారణ రైత్వారీ విధానానికి ఖోటీ విధానానికి మధ్య తేడా ఉంది. రైత్వారీ విధానంలో భూమి ఎవరి ఆధీనంలో ఉందో వారి నుంచి ప్రభుత్వమే నేరుగా శిస్తు వసూలు చేస్తుంది. ఖోటీ విధానంలో

శిస్తు వసూలుకు ప్రభుత్వం ఖోట్‌లను నియమిస్తుంది.

(4) ఖోటీ విధానంలో భూమి శిస్తు వసూలు చేసి, దానిని ప్రభుత్వానికి చెల్లించే బాధ్యత ఖోట్‌లకు ఉంటుంది. సన్నకారు రైతులతో తమకు ఇష్టమైన రీతిలో వ్యవహరించే స్వేచ్ఛ కూడా ఈ విధానం ఖోట్‌లకు ఇస్తున్నది. అయితే, ఖోట్‌లు తమ స్వేచ్ఛను ఎంతగానో దుర్వినియోగం చేశారు. సన్నకారు రైతులను వారు పీడించుకు తినడమే కాక వారిని దుర్భర దారిద్రంలోకి నెట్టివేశారు. ఇటీవలి సంవత్సరాలలో సన్నకారు రైతులు ఖోట్‌లకు వ్యతిరేకంగా అనేక ఆందోళనలను నిర్వహించారు. ఖోటీవిధానాన్ని రద్దుచేయాలని కూడా వారు ఎంతోకాలంగా కోరుతున్నారు. సన్నకారు రైతులకు ఖోట్‌లకు మధ్య సంబంధాలు ఎంతగా చెడిపోయాయంటే, ముగ్గురు ఖోట్‌లను రైతులు చంపివేశారు.

5. భూమి శిస్తు వసూలుకు ఖోటీ విధానం ఉపకరిస్తుందన్నమాట నిజమే. కాని దానివల్ల కలిగే దుష్ఫలితాలే ఎక్కువ. బొంబాయి ప్రెసిడెన్సీలో శాంతి ప్రశాంతతలకు తీవ్ర హాని జరగకముందే ఈ విధానాన్ని రద్దుచేయడం చాలా అవసరం. బిల్లు లక్ష్యాలు ఇవి. (1) ఖోటీ విధానాన్ని రద్దుచేసి, రైతులకు, ప్రభుత్వానికి మధ్య ప్రత్యక్ష సంబంధాలను నెలకొల్పడం (2), ఖోట్‌గా తమకు ఉన్న హక్కులను కోల్పోయిన వ్యక్తులకు తగిన నష్టపరిహారాన్ని చెల్లించే ఏర్పాటు చేయడం (3) భూమి ఏ సన్నకారు రైతుల ఆధీనంలో ఉందో, వారిని భూమి శిస్తు నిబంధనావళి ప్రకారం భూమి యజమానులుగా గుర్తించడం (4), సంబంధితమైన ఇతర ఏర్పాట్లు చేయడం.

(సంతకం)

పూనా, బి.ఆర్.అంబేద్కర్

అక్టోబర్ 18, 1937 హెచ్.కె.ఛెయినాని,

బొంబాయి శాసన సభ కార్యదర్శి

☆ ☆ ☆

# 20

# ఖోటీ విధానం రద్దుకోసం ప్రవేశపెట్టిన బిల్లు*

*డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ (బొంబాయి నగరం, బైకుల్లా, పరేల్)*: అధ్యక్షా! ఖోటి విధానాన్ని రద్దుచేయడానికి ఒక బిల్లును ప్రవేశపెట్టేందుకు నాకు అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. ఈ బిల్లుకు మద్దతుగా క్లుప్తంగా ప్రకటన చేయవలసిందిగా మీరు మమ్మలను ఆదేశించారు. నేను చేసే ప్రకటనలో బిల్లు వెనుక ఉన్న లక్ష్యాలు, కారణాలు తప్ప మరేం లేవు. ప్రకటన చేసేముందు ఒక మాట చెప్పాలనుకుంటున్నాను: అధ్యక్షా! ఖోటి విధానం రద్దు వంటి ముఖ్యమైన బిల్లుకు లక్ష్యాలు, కారణాలను ఇంత క్లుప్తంగా ఎప్పుడూ, ఎవరూ పేర్కొనలేదు.

బొంబాయి ప్రెసిడెన్సీలో అమలులో ఉన్న భూమి కౌలు విధానాలలో ఖోటి విధానం ఒకటి. రత్నగిరి జిల్లాలు, కొలాబా, ఠాణా జిల్లాల్లో ఇది ఎక్కువగా అమలులో ఉంది.

ఖోటి విధానంలోని కొన్ని అంశాలను చట్టం నిర్ణయిస్తుండగా, మరికొన్ని అంశాలు ఆచారాల ప్రకారం, అలవాటు ప్రకారం అమలులో ఉన్నాయి. రత్నగిరి జిల్లాలో 1880 నాటి బొంబాయి చట్టం (1) ఈ విధానాన్ని నిర్దేశిస్తుండగా, కొలాబా జిల్లాలో, ఠాణా జిల్లాలో ఆచారాలు, అలవాట్లు, నిర్దేశిస్తున్నాయి.

సాధారణ రైత్వారీ విధానానికి, ఖోటి విధానానికి మధ్య తేడా ఉంది. రైత్వారీ విధానంలో భూమి ఎవరి ఆధీనంలో ఉందో వారి వద్ద నుంచి ప్రభుత్వమే నేరుగా శిస్తు వసూలు చేస్తుంది. ఖోటి విధానంలో శిస్తు వసూలుకు ప్రభుత్వం ఖోట్‌లను నియమిస్తుంది.

ఖోటి విధానంలో భూమి శిస్తు వసూలు చేసి, దానిని ప్రభుత్వానికి చెల్లించే బాధ్యత ఖోట్‌లకు ఉంటుంది. సన్నకారు రైతులతో తమకు ఇష్టమైన రీతిలో వ్యవహరించే స్వేచ్ఛ కూడా ఈ విధానం ఖోట్‌లకు ఇస్తున్నది. అయితే, ఖోట్‌లు తమ స్వేచ్ఛను ఎంతగానో దుర్వినియోగం చేశారు. సన్నకారు రైతులను వారు పీడించుకు తినడమే కాక, వారిని దుర్భర దారిద్ర్యంలోకి నెట్టివేశారు. ఇటీవలి సంవత్సరాలలో సన్నకారు రైతులు ఖోట్‌లకు వ్యతిరేకంగా అనేక ఆందోళనలను నిర్వహించారు. ఖోటి విధానాన్ని రద్దుచేయాలని కూడా వారు ఎంతో కాలంగా కోరుతున్నారు. సన్నకారు రైతులకు, ఖోట్‌లకు మధ్య సంబంధాలు ఎంతగా చెడిపోయాయంటే, ముగ్గురు ఖోట్‌లను రైతులు చంపివేశారు.

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 1, పేజీలు 1087-89, సెప్టెంబర్ 17,1937.

భూమిశిస్తు వసూలుకు ఖోటీ విధానం ఉపకరిస్తుందన్న మాట నిజమే. కాని దానివల్ల కలిగే దుష్ఫలితాలే ఎక్కువ. బొంబాయి ప్రెసిడెన్సీలో శాంతి, ప్రశాంతితలకు తీవ్రహాని జరగకముందే ఈ విధానాన్ని రద్దుచేయడం చాలా అవసరం.

ఈ బిల్లు లక్ష్యాలు ఇవి (1) ఖోటీ విధానాన్ని రద్దుచేసి, రైతులకు ప్రభుత్వానికి మధ్య ప్రత్యక్ష సంబంధాలను నెలకొల్పడం, (2) ఖోట్‌గా తమకు ఉన్న హక్కులను కోల్పోయిన వ్యక్తులకు తగిన నష్టపరిహారాన్ని చెల్లించే ఏర్పాటు చేయడం, (3) భూమి ఏ సన్నకారు రైతుల ఆధీనంలో ఉందో, వారిని భూమి శిస్తు నిబంధనావళి ప్రకారం భూమి యజమానులుగా గుర్తించడం, (4) సంబంధిత ఇతర ఏర్పాట్లు చేయడం.

అధ్యక్షా! బిల్లును ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.

***శ్రీ ఎస్.ఎల్.కరండకర్ (ఉత్తర – రత్నగిరి):*** జోక్యం చేసుకుంటూ అధ్యక్షా! ఈ బిల్లును ప్రవేశపెట్టడాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. సాధారణంగా అయితే బిల్లును ప్రవేశపెట్టడానికి నేను అభ్యంతరం తెలిపి ఉండే వాడిని కాదు. ఎందుకంటే, బిల్లును ప్రవేశపెట్టేటప్పుడు ఏవిధంగాను అడ్డు తగల కుండా ఉండడం ఈ సభాసాంప్రదాయం అయితే, ఒకే ఒక కారణం వల్ల, ఈ బిల్లును ప్రవేశ పెట్టే సమయంలోనే అడ్డుకోవడం నేను నా విధిగా భావిస్తున్నాను.

గ్రాంట్లు మంజూరుపై ఇదివరకు సభలో చర్చజరుగుతున్న సమయంలో భూమిశిస్తు ప్రస్తావన కూడా వచ్చింది. వచ్చే ఫిబ్రవరిలో బొంబాయి ప్రెసిడెన్సీలోని భూమిశిస్తు విధానానికి సంబంధించిన మొత్తం అంశాలను చర్చించడం జరుగుతుందని గౌరవనీయ రెవెన్యూ మంత్రి స్పష్టంగా హామీ ఇచ్చారు. అందువల్ల ఈ విషయంలో మనం వేచిచూడడం మంచిది. భూమి శిస్తు విధానానికి సంబంధించిన ఏ అంశంపై నా విడివిడిగా శాసనాలు చేయడాన్ని మనం అంగీకరించకూడదు. అందువల్ల, సమగ్రత లేని ఈ బిల్లును సభలో ప్రవేశపెట్టడానికి అనుమతించరాదు. ఈ విషయంలో అధికార పక్ష సభ్యులు కూడా నాతో అంగీకరిస్తారనే నేను భావిస్తున్నాను.

బిల్లుకు ప్రారంభ పూర్వకమైన వ్యాఖ్యలను సభలో చదివారు. అందులో చాలా వాటిని నేను వ్యతిరేకిస్తున్నాను. అయితే, ఈ అంశాలన్నిటిపై చర్చించడానికి ముందు ముందు చాలా సమయం ఉంది. అందువల్ల, సభాసమయాన్ని వృథా పరచాలని నేను అనుకోవడం లేదు. అయితే, ఇది సూత్ర బద్ధతకు సంబంధించిన విషయమని నేను భావిస్తున్నాను. ప్రెసిడెన్సీలోని భూమి శిస్తు విధానానికి సంబంధించిన మొత్తం విషయాలను పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుందని, వచ్చే జనవరిలో, ఫిబ్రవరిలో సమగ్రమైన శాసనాన్ని ఈ సభలో ప్రవేశపెడతామని ప్రభుత్వం మనకు హామీ ఇచ్చింది. కొలాబా, రత్నగిరిలకు సంబంధించిన ఈ బిల్లుకు మాత్రం ఎందుకు మినహాయింపు ఇవ్వాలో నాకు అర్థం కావడం లేదు. ఈ వ్యాఖ్యలతో బిల్లు ప్రవేశపెట్టడాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను.

*గౌరవనీయ సభాపతి :* దీన్ని చర్చగా భావిస్తూ ఇందులో పాల్గొనే హక్కు మరే సభ్యుడికీ లేదు. బిల్లును ప్రవేశపెట్టడానికి అనుమతి కోరిన గౌరవనీయ సభ్యుడికి సమాధానం చెప్పే హక్కు ఉంది. సమాధానం చెప్పాలని ఆయన అనుకుంటున్నట్లయితే, అందుకు నేను అవకాశం ఇస్తున్నాను.

*డా॥ అంబేద్కర్:* అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ కరండికర్ వ్యక్తం చేసిన అభిప్రాయాలకు సవివరమైన సమాధానం అవసరమని నేను భావించడం లేదు. మొత్తం భూమి శిస్తు విధానాన్ని సమూలంగా పరిశీలిస్తామని, సమగ్రమైన శాసనాన్ని తెస్తామని గౌరవనీయ రెవెన్యూమంత్రి హామీ ఇచ్చారని ఆయన చెప్పారు. దురదృష్టకరమైన విషయం ఏమిటంటే, ఆ హామీ ఇచ్చిన సమయంలో నేను సభలోలేను. అందువల్ల, ఆయన ఇచ్చిన హామీ పరిధులు, పరిమితులు నాకు ఖచ్చితంగా తెలియవు. అయితే, అధ్యక్షా! సభకు నేను ఈ విషయం మాత్రం చెప్పదలచుకున్నాను. ఖోటీ విధానం భూమిశిస్తు నిబంధనావళి పరిధిలోకి రాదు. అందువల్ల, ఈ ప్రెసిడెన్సీలో అమలులో ఉన్న సాధారణ భూమి కౌలు విధానంలో ఖోటీ విధానం కూడా భాగమే. ఖోటీ విధానం వేరు. అందువల్ల, భూమి శిస్తు నిబంధనావళి కిందకు రాని విధానాన్ని విడిగా పరిశీలించడంలో నాకు ఎటువంటి అభ్యంతరం కనబడటం లేదు.

సభకు నేను విన్నవించదలచుకున్న రెండవ విషయం ఏమిటంటే, అధికార పక్ష సభ్యులు తాము సభకు హామీ ఇచ్చిన దాన్ని అమలు చేసేటట్లయితే, వారి చర్యలతో నేను సంతృప్తి చెందినట్లయితే, నా బిల్లుకంటే వారి శాసనం అన్నివిధాలా మంచిది అయితే, ఈ బిల్లును ఉపసంహరించుకోవడంలో నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. ఇంతకు మించి చెప్పడం అవసరం అని నేను భావించడం లేదు.

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అధ్యక్షా! ఇక ఈ బిల్లును ప్రవేశపెడుతున్నాను.

*గౌరవనీయ స్పీకర్ :* బిల్లును ప్రవేశపెడుతున్నారు.

అనువాదం :
డా॥ వి. జయసలోమి

☆ ☆ ☆

# 21

# గ్రామ పంచాయితీల బిల్లుపై ప్రసంగం – 1*

**డా॥ అంబేద్కర్:** అధ్యక్షా! ఈ బిల్లుకు బాధ్యత వహిస్తున్న గౌరవనీయ మంత్రి చేసిన ప్రసంగాన్ని నేను అమితమైన ఆసక్తితో విన్నాను. అయితే అధ్యక్షా! ఆ ప్రసంగాన్ని నేను ఎంతో ఆందోళనతో కూడా విన్నానని చెప్పితీరాలి. ఈ బిల్లు అత్యంత కీలకమైన అంశాలకు సంబంధించినదనే విషయంలో రెండు అభిప్రాయాలకు స్థానం లేదని నాకు తెలుసు. ప్రెసిడెన్సీలో గ్రామీణ ప్రజల కనీస సౌకర్యాలేకాక, వారి జీవనం, స్వేచ్ఛ, ఆస్తి కూడా ఈ బిల్లుతో ముడిపడి ఉన్నాయి. కీలకమైన ఇటువంటి విషయాలు ఇమిడి ఉన్నందున ఈ బిల్లు ద్వారా ఏర్పడే పర్యవసానాలను పరిగణనలోకి తీసుకోవడానికి గౌరవనీయ మంత్రి మరింత ఎక్కువ వ్యవధి ఇచ్చి ఉంటే బాగుండేదని నేను చెప్పవలసి వస్తున్నది. అధ్యక్షా! బిల్లును ప్రవేశపెట్టిన తరువాత ఏడు రోజుల తరువాత మాత్రమే దానిని సభ ఆమోదానికి పెట్టాలని చట్టం నిర్దేశిస్తున్నది. చట్టం నిర్దేశించిన దానికి మాత్రం కట్టుబడటం ద్వారా ఆయన తన మనసును సరిపెట్టుకోవాలనుకున్నారు. అయితే, బిల్లును సభామోదానికి పెట్టేముందు ఏడురోజుల వ్యవధి చాలదని, ఏడు నెలల వ్యవధి అవసరమని నా అభిప్రాయం. ఈ బిల్లులోని అంశాలపై సాధారణ ప్రజల అభిప్రాయాలు తెలుసుకోవడానికి దానిని అందరికీ పంపిణీ చేసేందుకు గౌరవనీయ మంత్రి ఏర్పాట్లు చేసినా తప్పేమీ లేదని నేను సూచిస్తున్నాను. ఆ మార్గాన్ని అనుసరించవలసిందిగా ఆయనకు సగౌరవంగా విజ్ఞప్తి చేస్తున్నాను. అందుకు ఆయన అంగీకరించక పోయినట్లయితే, మరో రెండు ముఖ్యమైన మార్గాలను ఆయనకు సూచిస్తాను. అధ్యక్షా! ఈ శాసనాన్ని చేపట్టే సామర్థ్యం ప్రస్తుత ప్రభుత్వానికి లేదని నేను అభిప్రాయపడుతున్నాను. ప్రస్తుత పాలనావ్యవస్థ అప్రతిష్టపాలయిన సంగతి ప్రభుత్వానికి తెలుసు. నేను అనవసరంగా నిందలు వేయడం లేదు. మనందరికీ తెలిసిన వాస్తవాలను వివరించడానికి ప్రయత్నిస్తున్నాను. అధ్యక్షా! పరిపాలనా వ్యవస్థ పట్ల, ఈ ప్రభుత్వం పనితీరు పట్ల దేశంలోని ఏ వర్గం ప్రజలు సంతృప్తిగా లేరు. వాస్తవాలను వివరించాలంటే, పాలించడానికి ఈ ప్రభుత్వానికి గల నైతిక హక్కును గుర్తించడానికి కాని, అంగీకరించడానికి ఏ మాత్రం సిద్ధంగా లేని శక్తివంతమైన వర్గం ఒకటి ఉంది. అధ్యక్షా! మనం నూతన రాజ్యాంగం ముంగిట్లో ఉన్నామని కూడా మనకు తెలుసు. ప్రజలకోసం, ప్రజలచేత నడిచే ప్రజల ప్రభుత్వం కోసం భారత రాజ్యాంగం రూపొందబోతున్నదని మనకు తెలుసు. ఏడాది, రెండేళ్లలోపు ఈ నూతన రాజ్యాంగం తయారవుతుందని, సమాజంలోని అన్ని వర్గాల ప్రజల మద్దతు పూర్తిగా పొందిన ప్రభుత్వం ఏర్పడబోతున్నదని మనందరికీ తెలుసు.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 35, పేజీలు 1128-36, అక్టోబర్ 6, 1922.

ఆ విధంగా ఆశించడం తప్పులేదని నేను భావిస్తున్నాను. అధ్యక్షా! ఆ ఉద్దేశంతోనే నేను ఒక విషయాన్ని స్పష్టం చేయదలచుకున్నాను. ప్రస్తుత ప్రభుత్వం ఆపద్ధర్మ ప్రభుత్వస్థాయికి మంచిది కాదని గౌరవనీయ మంత్రికి, అధికార పక్షంలో ఉన్న గౌరవనీయ సభ్యులకు స్పష్టం చేస్తున్నాను. అధ్యక్షా! ఆపద్ధర్మప్రభుత్వాధినేత గణనీయమార్పులు చేయకూడదని అందరూ అంగీకరిస్తారు. అంతగా అయితే, అసలు ప్రభుత్వాధి నేత వచ్చేలోపు ప్రభుత్వాన్ని నడిపించడానికి చిన్నపాటి మరమ్మతులు చేయగలరేమో.

పార్లమెంటరీ జీవితానికి సంబంధించిన విషయాలను గౌరవనీయ మంత్రికి వివరించదలచుకున్నాను. ఇంగ్లాండ్‌లో కొన్ని శతాబ్దాలుగా పార్లమెంటరీ వ్యవస్థ అమలులో ఉంది. ఏదయినా మంత్రి వర్గం ఓడిపోయినప్పుడు వెంటనే రాజీనామా చేసి, ప్రతిపక్షానికి అధికారం అప్పగించే బదులు వోటర్ల తీర్పు కోరాలని నిర్ణయించుకున్నదనుకోండి. అప్పుడు అలాంటి స్థితిలో ఆ మంత్రివర్గం ఎటువంటి ముఖ్యమైన శాసనాలను చేపట్టకూడదు. రాజ్యాంగం ప్రకారం అదే సాంప్రదాయం కొనసాగుతు వస్తున్నది. ప్రజల తీర్పు వచ్చేవరకు కేవలం పరిపాలన మాత్రం ఆ మంత్రివర్గం నిర్వహించవలసి ఉంటుంది. అందువల్ల, అటువంటి ఆపద్ధర్మ ప్రభుత్వం తీసుకునే నిర్ణయాల కారణంగా నూతన ప్రభుత్వం ఇబ్బందులకు గురికాకుండా ఉంటుంది. పార్లమెంటరీ రాజ్యాంగ సాంప్రదాయాలకు కట్టుబడి ఉండాలనుకోవడం లేదా? అని గౌరవనీయ మంత్రిని ప్రశ్నిస్తున్నాను. నిర్ణయం తీసుకునే బాధ్యతను ఆయనకే వదిలిపెడుతున్నాను.

అధ్యక్షా! ఇంత తొందరగా ఈ బిల్లును ఆమోదింపజేసుకోవాలని గౌరవనీయ మంత్రి ఎందుకు తొందర పడుతున్నారో నాకు అర్థం కావడం లేదు. అంటే కేవలం ఏడు రోజుల వ్యవధి మాత్రమే ఇచ్చారు. ఈ బిల్లును తక్షణమే చేపట్టవలసిందని ఈ ప్రెసిడెన్సీ ప్రజలు ఆయనను కోరలేదు. అందువల్ల ముంచుకువస్తున్న ఆవశ్యకత ఏమీ లేదు. నాకు తెలిసినంతవరకు ఈ దేశంలోని ఏ పార్టీకూడా ఈ బిల్లును తన నినాదంగా చేసుకోలేదు. గ్రామ పంచాయితీల ఏర్పాటు తమ ప్రాథమిక కార్యక్రమమని గత శాసన సభలో లిబరల్స్‌కాని, బ్రాహ్మణేతరులుకాని, కాంగ్రెస్ సభ్యులు కాని, మరెవరూ కాని ఎప్పుడూ పట్టుబట్టలేదు. అటువంటి విషయం నాకు తెలియదు. అంతేకాదు. ఈ బిల్లు కోసం ప్రజలు కూడా ఆరాటపడటం లేదు. 1920 నాటి గ్రామపంచాయతీల చట్టం పనితీరుపై నివేదిక సమర్పించడానికి 1925లో నియమించిన కమిటీ రూపొందించిన నివేదికను మీరు చదవలేదా! అందులో ఏం ఉంది! ఆ నివేదికలో ఈ విషయాలు ఉన్నాయి. ఈ ప్రెసిడెన్సీలో సుమారు 30,000 గ్రామాలు ఉన్నాయని, గ్రామపంచాయితీల చట్టాన్ని వర్తింపజేయవలసిందిగా స్వచ్ఛందంగా కోరుకోవడానికి అనుమతి ఇస్తూ 1920లో ఆ చట్టాన్ని ఆమోదించారని నివేదిక పేర్కొన్నది. ఆ చట్టం పర్యవసానం ఏమిటి? గ్రామపంచాయతీలను ప్రవేశపెట్టవద్దంటూ సింధ్ ప్రజలు గొడవ చేశారు. దాంతో, సింధ్ రాష్ట్రంలోని ఒక్క గ్రామంలో కూడా పంచాయతీ స్థాపన జరగలేదు. ప్రెసిడెన్సీలో మాత్రం కేవలం 323 పంచాయతీలను

ఏర్పాటు చేశారు. గ్రామపంచాయతీల కోసం ప్రజలు ఆరాటపడడం లేదనేదానికి ఇదే నిదర్శనం. అందుకు గల కారణాల గురించి ఈ దశలో నేను వివరించదలచుకోలేదు. అయితే, వాస్తవ పరిస్థితిపై ఇది సరైన విశ్లేషణ అని నా గౌరవనీయ స్నేహితుడు, స్థానిక స్వపరిపాలన శాఖ మంత్రి అంగీకరిస్తారని నాకు తెలుసు. అంతేకాదు గ్రామ పంచాయితీలకు న్యాయపాలన విధులను కూడా ఆయన అంటగట్టడానికి కారణం ఏమిటో నేను వివరిస్తాను. ఆ విధంగా చేయడం ద్వారా చేదుమాత్రకు కొంత తీయదనం తెస్తే అది సులభంగా గొంతులోకి వెళ్ళిపోతుందని ఆయన భావించారు. ఇన్ని లొసుగులు ఉన్న దృష్ట్యా, ఈ బిల్లును గౌరవనీయ మంత్రి నిరవధికంగా వాయిదా వేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. అప్పుడు ఈ ప్రెసిడెన్సీ ప్రజలకు పూర్తిగా ప్రాతినిధ్యం వహించే నూతన ప్రభుత్వం బిల్లును సమూలంగా పరిశీలించి ఒక నిర్ణయం తీసుకుంటుంది.

అధ్యక్షా! బిల్లులోని మంచి అంశాల విషయానికి వద్దాం. ఈ బిల్లులో రెండు భాగాలున్నాయి. స్థానిక స్వపరిపాలనా సంస్థగా పంచాయతీ విధులను మొదటి భాగం వివరిస్తుంది. అధికార వికేంద్రీకరణ విధానానికి సూత్ర బద్ధంగా నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. అయితే, ప్రెసిడెన్సీలోని స్థానిక బోర్డు చట్టం ద్వారా స్థానిక బోర్డులకు కేటాయించిన విధులు చాలా ఎక్కువగా ఉండి, వాటిని ఆ బోర్డులు సమర్థవంతంగా నిర్వర్తించలేని పరిస్థితి ఉంటే, అధికార వికేంద్రీకరణకు నేను అంగీకరిస్తాను. "స్థానిక బోర్డులపై పడిన అధిక భారాన్ని తొలగించడానికి ఏ విధంగానయినా సరే, గ్రామ పంచాయతీలను ఏర్పాటు చేయండి", అని పిలుపు ఇస్తాను. అధ్యక్షా! పంచాయతీల కోసం పంచాయతీలను ఏర్పాటు చేయడమే లక్ష్యం అయితే, అత్యంత ప్రమాదకరమైన ఆ వ్యవస్థను నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను. ప్రాచీనకాలంలో అమలులో ఉన్న గ్రామ పంచాయతీల వ్యవస్థను అనేక మంది ఆకాశానికి ఎత్తుతుంటారు. కొంత మంది వాటిని "గ్రామీణ రిపబ్లిక్‌లు"గా వర్ణించారు. ఈ గ్రామీణ రిపబ్లిక్‌ల వల్ల ఏ ప్రయోజనాలు ఉన్నప్పటికీ, అవి భారత దేశ ప్రజానీకానికి శాపంగా పరిణమించాయని చెప్పడంలో నేను ఎంత మాత్రం సందేహించను.

జాతీయ వాదాన్ని పాదుకొల్పడంలోను, జాతీయ స్ఫూర్తిని పెంపొందించడంలోను భారత దేశం విజయం సాధించలేక పోయిందంటే, అందుకు కారణం గ్రామ వ్యవస్థేనని నా అభిప్రాయం. గ్రామ వ్యవస్థ వల్ల ప్రజలంతా స్థానిక ప్రాంతంపై భక్తిలోనే మునిగిపోయారు. విశాలమైన దేశభక్తి భావనకు అసలు చోటు లేకుండా పోయింది. సమైక్య దేశంగా ఉండేబదులు, ప్రాచీన గ్రామ పంచాయతీల కారణంగా భారతదేశం విడివిడి గ్రామాలతో కూడిన సమాఖ్యగానే మిగిలిపోయింది. ఏదో ఒక రాజుపట్ల కనబరిచే విధేయత తప్ప ప్రజలను కట్టిపడవేసే బంధం ఏదీ లేకుండా పోయింది. అధ్యక్షా! ఇది కేవలం నా అభిప్రాయం మాత్రమే కాదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. 1925లో నియమించిన కమిటీలో సభ్యుడైన నా స్నేహితుడు శ్రీ ఆర్.జి.ప్రధాన్ కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఆయన ఇలా పేర్కొన్నారు: "ప్రాదేశిక సమగ్రత ప్రాతిపదికన బలమైన భారత జాతీయవాదం, జాతీయ స్ఫూర్తి ఏర్పడ కుండా ఉండడానికి గ్రామీణ ప్రజల్లో

మితిమీరిన గ్రామభక్తి, గ్రామీణ స్ఫూర్తి కారణం".

**శ్రీ పెస్టన్‌షా ఎన్. వకీల్:** శ్రీ ఆర్.జి.ప్రధాన్ చరిత్రకారుడా?

***డా॥ అంబేద్కర్:*** మనం ఇక్కడకు చరిత్రకారులను తేవలసిన అవసరం ఉన్నదని నేను అనుకోవడం లేదు. చరిత్రకారుల విషయంలో మనం జాగ్రత్తగా ఉండాలి. జాతీయ స్ఫూర్తిని, జాతీయ భావనను ప్రజల్లో కలిగించడానికి మనం పాటుపడుతున్న ఈ రోజుల్లో అందుకు అడ్డువచ్చే ఏ చర్యను తలపెట్టకూడదని నా అభిప్రాయం. నాకు సంబంధించినంత వరకు ఇంతటితో ఈ విషయం వదిలిపెట్టదలచుకున్నాను.

పంచాయతీలను ఏర్పాటుచేసే విధానంపై నే నా తదుపరి అభ్యంతరం. గౌరవనీయ మంత్రి చెప్పినట్లు స్త్రీ, పురుషవయోజనులు వోట్ల ద్వారా గ్రామ పంచాయతీలను ఎన్నుకొనే విధానాన్ని ఈ బిల్లు ప్రవేశపెడుతుంది. నాకు సంబంధించినంత వరకు ఈ విధానం మంచిదే. అయితే, పీడిత వర్గాల తరుపున మాట్లాడితే మాత్రం వయోజన వోటు హక్కు సరిపోదని గౌరవనీయ మంత్రికి నేను స్పష్టం చేస్తున్నాను. ప్రతి గ్రామంలో పీడిత వర్గాల ప్రజలు అల్పసంఖ్యాకులుగా, అత్యంత దయనీయమైన సంఖ్యలో మాత్రమే ఉన్నారని గౌరవనీయమంత్రి మరిచిపోయారు. వయోజన వోటు హక్కువల్ల అల్పసంఖ్యాక వర్గం అధిక సంఖ్యాక వర్గంగా మారిపోదని ఆయన కూడా అంగీకరిస్తారని నాకు ఖచ్చితంగా తెలుసు. గౌరవనీయ మంత్రి బిల్లులో ప్రతిపాదించిన ప్రకారం గ్రామ పంచాయతీల స్థాపన జరిగితే, అల్పసంఖ్యాక వర్గాల వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలని నేను పట్టుబట్టవలసి వస్తుంది. ఏదేమైనా కానీ, పీడిత వర్గాల వారికి మాత్రం ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలసిందే. మిగిలిన అల్పసంఖ్యాక వర్గాలవారు తమ సంగతి తాము చూసుకుంటారనుకోండి.

అధ్యక్షా! దీనికి 'కులవాదం' అనే వర్గం ఈ సభలో ఉందని నాకు తెలుసు. అవును ఇది కులవాదమేనని నేను అంగీకరిస్తున్నాను. కులవాదమే నా విధానంగా ఉండాలని నేను కూడా ఒక నిర్ణయానికి వచ్చాను. అందుకు నేను సిగ్గుపడటం లేదు.

***శ్రీ జె.బి.పేటిట్:*** జాతీయవాదంతో అది మనగలుగుతుందా?

***డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఓ తప్పకుండా, ఎందుకు మనగలగలేదు!

***శ్రీ జె .బి.పేటిట్ :*** ఆ సంగతి వింటున్నందుకు నాకు సంతోషంగా ఉంది.

***డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** కులవాదం లేకుండా భారతదేశం ఎంతమాత్రం ఏ రకంగానూ రాజకీయ ప్రగతి సాధించలేదని నా అభిప్రాయం. కులవాదం లేకుండా భారతదేశంలో స్వపరిపాలన ఏర్పడదు. ఈ అభిప్రాయానికి ఎటువంటి సవాలు ఎదురుకాదని నేను ఉద్ఘాటిస్తున్నాను.

పీడిత వర్గాల వారి హక్కులను రక్షించడానికి వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చే ఏర్పాటు ప్రతి

స్వపరిపాలనా సంస్థలోను ఉండాలి. అలాంటి ఏర్పాటు ఉందని నేను సంతృప్తి చెందేవరకు, అలాంటి ఏర్పాటు చేసేవరకూ భారతదేశంలో స్వపరిపాలనా సంస్థల స్థాపనను నేను అంగీకరించబోను. పీడిత వర్గాల వారి తరపున ఈ మాట చెప్తున్నాను. అందువల్ల, ఈ బిల్లులోని మొదటి భాగానికి ఆమోదం తెలపడం సాధ్యం కాదు.

అధ్యక్షా! ఈ విషయాన్ని చర్చించడానికి 1925లో నియమించిన కమిటీలోని ఇద్దరు సభ్యులు కూడా పీడితవర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండాలనే వాదనను సమర్థించినందుకు ఈ "గ్రామ పంచాయతీలలో నామినేషన్ ద్వారా పీడితవర్గాల వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలని నా అభిప్రాయం. కలెక్టర్ కాని, జిల్లా బోర్డు అధ్యక్షుడు కాని ఈ నామినేషన్ చేయాలి. జిల్లాబోర్డు అధ్యక్షుడు చేస్తేనే మంచిది. పీడితవర్గాల వారికి తగిన ప్రాతినిధ్యం ఇవ్వడానికి ఇది చాలా అవసరం. వారి సామాజిక స్థాయిని పెంచడానికి కూడా ఇది ఉపయోగపడుతుంది. ప్రతి గ్రామ పంచాయతీలో పీడిత వర్గాలకు చెందిన వారు కనీసం ఒకరయినా ఉంటే ఇతర వర్గాలవారు వారిని తమతో సమానంగా గుర్తిస్తారు. పీడిత వర్గాలకు చెందిన ఒక సభ్యుడు కూడా గ్రామపంచాయతీలకు ఎన్నిక కాలేకపోతే, నామినేషన్ ద్వారా నయినా వారికి స్థానం కల్పించాలి."

అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ పి.ఆర్.చికోరి మాటలను కూడా ఇక్కడ ఉదహరిస్తున్నాను:

"పీడిత వర్గాలకు చెందిన వయోజనులు కనీసం 50 మంది ఉన్న గ్రామాలలో నామినేషన్ ద్వారాకాని, రిజర్వుడు స్థానాల ద్వారా కాని ఆ వర్గాలవారికి పంచాయతీలలో ప్రాతినిధ్యం కల్పించడానికి ఏర్పాటు చేయడం అవసరమని నేను భావిస్తున్నాను. ప్రస్తుతం ఈ వర్గాలకు చెందిన ఏ అభ్యర్థీ ఎన్నికలలో పోటీచేసి గెలుపొందే అవకాశం లేదు. ఈ విషయాన్ని నేను చాలా ఆలస్యంగా గుర్తించాను."

ఇటీవల జరిగిన కొన్ని సంఘటనలను ఈ సందర్భంగా నేను ఈ గౌరవనీయ సభలోని హిందూసభ్యుల దృష్టికి తీసుకుని రాదలచుకున్నాను. గత నెల 24వ తేదీన అగ్రవర్ణాల హిందువులకూ, పీడిత వర్గాలకు మధ్య కుదిరిన పునా ఒప్పందాన్ని ఉదహరిస్తున్నాను. ఆ ఒప్పందాన్ని అనేక మంది సభ్యులు చదివి ఉంటారని నేను భావిస్తున్నాను. అయితే, అందులోని ఒక సెక్షన్‌ను ప్రత్యేకంగా ప్రస్తావించాలనుకుంటున్నాను. అన్ని స్థానిక సంస్థలలో ప్రాతినిధ్యం పొందడానికి పీడిత వర్గాలకు హక్కు ఉన్నదని, ఆ హక్కును ఆచరణ రూపంలోకి తీసుకుని రావడానికి కృషిచేయడం జరుగుతుందని ఆ సెక్షన్‌లో అంగీకరించారు. అధ్యక్షా! పునా ఒప్పందంలోని ఈ సెక్షన్‌ను హిందూ సభ్యుల దృష్టికి తెచ్చాను. గత నెల 24వ తేదీకి ముందు ఎటువంటి అభిప్రాయాలు ఉన్నప్పటికీ, ఒప్పందంలోని అంశాలకు వారు ఇప్పుడు పూర్తిగా కట్టుబడి ఉంటారని నేను ఆశిస్తున్నాను.

అధ్యక్షా! ఇప్పుడు బిల్లులోని రెండవ భాగానికి వస్తాను. బిల్లును మొదటిసారి చదివినప్పుడు

అందులో కొన్ని అంశాలు మాత్రమే లోపభూయిష్టమైనవని అనిపించింది. కాని, తరువాత బిల్లును సమూలంగా పరిశీలిస్తే, సుగుణాల కంటే లోపాలే ఎక్కువని అభిప్రాయపడవలసి వచ్చింది. బిల్లులో ఉన్నది కొన్ని లోపాలేకాదు. అనేక అంశాలు ఘోరాతి ఘోరంగా ఉన్నాయి. అధ్యక్షా! గ్రామ పంచాయతీల బిల్లులోని న్యాయపరమైన అంశాలను ఇప్పుడు ప్రస్తావిస్తున్నాను. సివిల్, క్రిమినల్ కేసులతో వ్యవహరించవలసిన న్యాయవ్యవస్థ ఏవిధంగా ఉండాలని స్థానిక స్వపరిపాలనా శాఖ గౌరవనీయ మంత్రి భావిస్తున్నారో నాకు తెలియదు. సభలో ప్రసంగిస్తున్నప్పుడు ఆయన ఈ విషయంపై వివరణ ఇస్తారని నేను ఆశించాను. అయితే, ఆయన ఆ అంశంపై మౌనం వహించారు. సివిల్, క్రిమినల్ కేసులతో వ్యవహరించవలసిన న్యాయ వ్యవస్థకు ఈ మూడు లక్షణాలు ఉండాలనే విషయాన్ని అందరూ అంగీకరిస్తారనే నేను భావిస్తున్నాను. న్యాయశాస్త్రంలో శిక్షణ, దృక్పథంలో నిష్పాక్షికత, హోదాలో స్వతంత్రత..... ఈ మూడు న్యాయవ్యవస్థకు ఉండాలి. ఇప్పుడు ఈ బిల్లులోని అంశాలకు ఈ మూడు లక్షణాలను వర్తింపజేద్దాం. గౌరవనీయ మంత్రి బిల్లులో ఈ విధంగా పేర్కొన్నారు.

"వయోజన వోటు హక్కు ప్రాతిపదికన పంచాయతీలను ఎన్నుకుంటాం. ఒక్కొక్క పంచాయతీలో అయిదుగురు కాని, ఏడుగురు కాని సభ్యులుంటారు. మూడేళ్లు వారు సభ్యులుగా ఉంటారు. ఈ మూడేళ్లకాలంలో వారు స్థానిక స్వపరిపాలనా సంస్థ విధులే కాకుండా, కొన్ని క్రిమినల్, సివిల్ కేసుల విచారణ కూడా చేపడతారు". ఇదీఆ బిల్లులోని అంశం.

ఇప్పుడు.... గౌరవనీయ మంత్రిని నేను అడగాలనుకుంటున్న మొదటి ప్రశ్న ఇది. న్యాయమూర్తులు నిర్వర్తించవలసిన విధులను నిర్వర్తించడానికి వయోజనుల వోట్లద్వారా ఎన్నికైన ఈ అయిదుగురికి తగిన న్యాయశిక్షణ ఉంటుందని ఆయన ఊహిస్తున్నారా? అధ్యక్షా! న్యాయ నిర్ణయాలు చేయడానికి న్యాయశాస్త్రంలో విస్తృతమైన పరిజ్ఞానం ఉండాలి. (సభలో నవ్వులు) నవ్వడానికి ఇది సమయం కాదు. ఇది చాలా తీవ్రమైన విషయం. నేను చెప్పేది పరిగణనలోకి తీసుకోండి. హైకోర్టులో, ఇతర న్యాయస్థానాలలో కొన్ని స్థానాలను తమకు కేటాయించాలని ఐ.సి.ఎస్. సభ్యులు కోరినప్పుడు మనం అంతా ఎంతగానో ఆందోళన చెందాం. మన అభ్యంతరానికి కారణం ఏమిటి? ఐ.సి.ఎస్. పరీక్ష పాసయిన వీరికి న్యాయశిక్షణ లేదనే కారణంతోనే మనం అభ్యంతరం చెప్పామని నేను భావిస్తున్నాను. న్యాయశిక్షణ పొందని వ్యక్తులకు మనం న్యాయ పరమైన విధులను, అధికారాలను అప్పగించలేం. మన అభ్యంతరానికి అదే కారణం. ప్రజలకు కావలసినది న్యాయమే కాదు..., న్యాయ విధులను నిర్వర్తించడానికి తగిన సామర్థ్యం ఉన్న న్యాయమూర్తులు కూడా వారికి కావాలి. నిరక్షరాస్యతతో, అజ్ఞానంలో, మూఢనమ్మకాలలో మునిగి తేలుతున్న ప్రజలు తమలోనుంచి న్యాయవిధులు నిర్వర్తించగలిగిన ఐదుగురు పెద్ద మనుషులను తయారు చేయగలరని గౌరవనీయ మంత్రి భావిస్తున్నారా? అని నేను ఆయనకు ప్రశ్నిస్తున్నాను.

**శ్రీ ఎం.ఎం.కర్బారి:** మన ప్రజలు అంతఘోర స్థితిలో ఉన్నారా?

***డా॥ అంబేద్కర్:*** ఆ విషయంలో మరొక అభిప్రాయం ఉంటుందని నేను అనుకోలేదు. అయితే, అదే నా దృఢమైన అభిప్రాయం. ఈ పెద్దమనుషులకు అవసరమైన న్యాయశిక్షణ ఇవ్వడం అవసరమని ఎవరూ భావించకపోయినా, హక్కులు, విధులు, సమానత్వం మొదలైన అంశాలపై వారికి కనీసం తగిన పరిజ్ఞానం ఉండాలని మనం ఆశించడం తప్పుకాదని భావిస్తున్నాను. కులం గోడల మధ్య కుదించుకుపోయిన ప్రజలకు, పాతకాలపు దురభిప్రాయాలనే ఇప్పటికీ పట్టుకుని వేలాడే ప్రజలకు, సమానహోదాను గౌరవించని ప్రజలకు, సమాజంలో కొందరు ఉన్నతమైన వారిని, కొందరు తక్కువ వారని భావించే ప్రజలకు న్యాయవిధులు నిర్వర్తించడానికి అవసరమైన మంచి భావాలు ఉంటాయని ఊహించగలమా? అధ్యక్షా! మా జీవితాలను, స్వేచ్ఛను, ఆస్తులను ఈ పంచాయతీల చేతులలో ఉంచాలని భావించడం భావ్యం కాదని నేను విన్నవిస్తున్నాను. గ్రామ పంచాయతీలకు న్యాయపరమైన విధులు ఉండాలనే ప్రతిపాదనను నేను తిరస్కరిస్తున్నాను.

ఈ సభ ముందు ఉంచాలనుకుంటున్న మరొక అభిప్రాయం ఇది. స్వతంత్ర న్యాయమూర్తులతో కూడిన న్యాయస్థానాలుగా ఈ పంచాయతీలు పనిచేయడం సాధ్యం అవుతుందా? ఉన్న వాస్తవాలను పరిశీలిద్దాం.ముఠా కక్షలు లేని గ్రామం ఒక్కటి కూడా లేదనే అభిప్రాయాన్ని ఈ సభలోని గౌరవనీయ సభ్యుడు ఎవరూ కాదనరని నాకు నమ్మకం ఉంది. బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు మధ్య తగాదాలు ఉన్నాయి.

***దీవాన్ బహదూర్ డి. ఆర్.పాటిల్:*** అవి ఎప్పటికీ ఉంటూనే ఉంటాయి.

***డా॥ అంబేద్కర్ :*** అవి అలాఉంటే, మీకే ఎంతో హాని జరుగుతుంది. అధ్యక్షా! బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులమధ్య ఘర్షణలు ఉన్నాయని విన్నవించుకుంటున్నాను. సతారా జిల్లాలో జరిగిన ఒక సంఘటనను వివరిస్తాను. ఆ జిల్లాలోని ఒక గ్రామంలో బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు మధ్య తగాదాలు ఎంత తీవ్రస్థాయికి చేరుకున్నాయంటే, గ్రామంలోని బ్రాహ్మణులను పూర్తిగా వెలివేస్తున్నట్లు బ్రాహ్మణేతరులు ప్రకటించారు. క్షవరం చేయించుకోవడానికి ఒక మంగలి కూడా ఆ బ్రాహ్మణులకు దొరకలేదు. సరుకులు కొనుక్కోవడానికి కూడా వారికి సాధ్యం కాలేదు. మరే పని చేయించుకోవడం వారికి వీలు కాలేదు. ఆ బ్రాహ్మణులకు క్షవరం చేయించుకోవడానికి ఏడుమైళ్లు నడిచి సతారాకు వెళ్లడం తప్ప మరొక మార్గం లేకపోయింది. ఆ విధంగానే పీడిత వర్గాలకు, బ్రాహ్మణేతరులకు మధ్య కూడా తగాదాలు ఉన్నాయి.

***ఒక గౌరవనీయ సభ్యుడు:*** తగాదాలు ముగిసిపోయాయి.

***డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** దురదృష్టకరమైన విషయం ఏమిటంటే, అవి ముగిసిపోవడానికి బదులు, నిత్యకృత్యం అయిపోయాయి. హిందువుల మధ్య తగాదాలేకాదు, హిందువులకు, మహమ్మదీయులకు మధ్య తగాదాలు జరుగుతున్నాయి. ఈ తగాదాలు మామూలువి కాదు. అవి చాలా తీవ్రమైనవి. ఈ

రకమైన వాతావరణంలో ఎన్నికైన పంచాయతీ వివిధ కులాలు, వివిధమతాల వ్యక్తులకు న్యాయాన్ని అందించగలిగేంత నిష్పాక్షికంగా ఉండగలదా? అనే విషయాన్ని పరిశీలించవలసిందిగా గౌరవనీయ మంత్రిని, సభను కోరుతున్నాను. ఈ విషయాన్ని తీవ్రంగా పరిశీలించవలసిందిగా కూడా విజ్ఞప్తి చేస్తున్నాను.

నేను అడగాలనుకుంటున్న మరొక ప్రశ్న ఇది: గౌరవనీయ మంత్రి ఏర్పాటుచేయతలపెట్టిన న్యాయవ్యవస్థ స్వతంత్ర న్యాయవ్యవస్థగా ఉండగలదా? అధ్యక్షా! ఆయన ప్రతిపాదన ఏమిటి? న్యాయవ్యవస్థను ప్రజలు ఎన్నుకుంటారని ఆయన ప్రతిపాదిస్తున్నారు. న్యాయాన్ని అందించవలసిన పంచాయతీని గ్రామంలోని వయోజనులు ఎన్నుకుంటారు. ప్రజలను వోట్లు అడగవలసిన అవసరం ఉండే న్యాయమూర్తి ఏ వోటరును అయినా బాధపెట్టే తీర్పు ఇవ్వగలుగుతారని గౌరవనీయ మంత్రి భావిస్తున్నారా? అటువంటి తీర్పు ఏదైనా ఇవ్వవలసి వస్తే, ఆ న్యాయమూర్తి ఒకటికి రెండు సార్లు ఆలోచించరా? ఉదాహరణకు, హిందువులకు, మహమ్మదీయులకు మధ్య ఘర్షణలు జరిగాయనుకోండి. ఈ ఘర్షణలకు సంబంధించి ఒక మహమ్మదీయుడిని పంచాయతీ ముందుకు తెచ్చారనుకోండి. ఆ కేసుపై తీర్పు ఇవ్వవలసిన పంచాయతీలోని హిందూసభ్యుడు ఒకరు మహమ్మదీయ వ్యక్తి చట్టబద్ధంగానే వ్యవహరించాడని, భావించాడనుకోండి. రానున్న కొద్దినెలలలోనో, ఏడాదిలోనో ఎన్నికలను ఎదుర్కోవలసిన ఈ సభ్యుడు తన స్థానాన్ని పదిలపరచుకోవడం కంటే, మహమ్మదీయ వ్యక్తికి న్యాయం చేకూర్చాలని నిర్ణయించుకుంటారని గౌరవనీయ మంత్రి, సభ ఊహిస్తున్నారా? ఆయన ఆ పరిస్థితిలో ఏం చేస్తారు?

***దీవాన్ బహదూర్ డి.ఆర్.పాటిల్:*** ఘర్షణలకు సంబంధించిన కేసులను పంచాయతీ విచారించలేదు.

***డా॥ అంబేద్కర్:*** నేను ఒక ఉదాహరణగా మాత్రం చెప్తున్నాను. మరొక కేసుకి సంబంధించి కూడా అలా జరగవచ్చు.

అధ్యక్షా! ఎన్నికల ద్వారా ఏర్పాటయ్యే న్యాయవ్యవస్థను నేను ఎక్కడా చూడలేదు. అమెరికాలో మాత్రం న్యాయమూర్తులను ఎన్నుకుంటారని మనందరకూ తెలుసు. అమెరికాలోని అన్ని రాష్ట్రాలలో న్యాయవ్యవస్థ అప్రతిష్ఠ పాలయిన సంగతి మీకు తెలుసు. న్యాయం అంటే అవినీతికి పర్యాయపదంగా తయారైంది. అందుకు కారణం అక్కడ న్యాయవ్యవస్థ ఏర్పాటయ్యే విధానమే. అటువంటి ప్రయోగం మనపై కూడా చేయాలని నా గౌరవనీయ స్నేహితుడు కోరుకోరని భావిస్తున్నాను. ఎన్నికల ద్వారా ఏర్పాటయ్యే పంచాయితీలకు సివిల్, క్రిమినల్ కేసులను విచారించే న్యాయపరమైన అధికారాలు ఇస్తున్న బిల్లులోని రెండవ భాగాన్ని నేను అంగీకరించలేనని స్పష్టం చేస్తున్నాను. అధ్యక్షా! ఈ ప్రెసిడెన్సీలో జరుగుతున్న సంఘటనలను, ప్రత్యేకించి పీడిత వర్గాలకు జరుగుతున్న అన్యాయాలను నేను గమనిస్తున్నాను. న్యాయవిధులను పంచాయతీలు నిర్వహించడానికి మేము ఎన్నడూ అనుమతించబోమని స్పష్టం చేస్తున్నాను. మాది

అత్యంత విచిత్రమైన పరిస్థితి. ఇంకా చెప్పాలంటే, అత్యంత దయనీయమైన స్థితి. గ్రామంలో ఒక మూలన పడి ఉండే అల్పసంఖ్యాక ప్రజలం మేము. గ్రామ ప్రజలలో భాగంగా మమ్మల్ని ఎన్నడూ పరిగణించలేదు. గ్రామంలోనే జీవిస్తున్నప్పటికీ, మేమంతా పరాయి వ్యక్తుల మాదిరిగానే బతుకుతున్నాం. మేం ఏమాత్రమైనా అభివృద్ధి చెందితే, మిగిలిన వారు ఏమాత్రం సహించరు. ఈ అభిప్రాయాలకు నా గౌరవనీయ స్నేహితుడు తిరస్కార సూచకంగా తల ఊపుతున్నందున స్టేట్‌కమిటీ నివేదికలోని కొన్ని అంశాలను ఆయనకు చదివి వినిపించాలనుకుంటున్నాను. ఆ కమిటీ నివేదికలోని 102వ పేరాలో గ్రామాలలోని పీడితవర్గాల పరిస్థితిని సవివరంగా పేర్కొన్నారు. చదువుతున్నాను వినండి.

"అన్ని ప్రభుత్వ సౌకర్యాలలో పీడిత వర్గాలకు హక్కులు కల్పించడానికి వివిధ చర్యలను మేం సిఫార్సు చేసినప్పటికీ ఆ హక్కులను పొందడంలో చాలాకాలంపాటు క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసి ఉంటుదని ఆందోళన చెందుతున్నాం. ఛాందస వర్గాలవారు వారిపై బహిరంగంగానే హింసకు పాల్పడతారనేది మొదటి మా భయం. ప్రతి గ్రామంలో పీడిత వర్గాలవారు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నారు. వీరిని వ్యతిరేకిస్తున్న ఛాందస వర్గాలవారు అధిక సంఖ్యలో ఉన్నారు. పీడిత వర్గాల నుంచి ఎదురయ్యే సవాళ్ల నుంచి ఏ విధంగానయినా తమ ప్రయోజనాలను, స్థాయిని కాపాడుకోవడానికి వారు ఏ పనయినా చేసేందుకు సిద్ధంగా ఉన్నారు. అయితే, పోలీసుల ప్రాసిక్యూషన్ భయం కారణంగా ఛాందస వర్గాలు హింసకు పాల్పడే అవకాశం కొంత తగ్గింది".

"పీడిత వర్గాలవారు ప్రస్తుతం దయనీయమైన ఆర్థిక దుస్థితిలో ఉన్నారు. మా రెండవ ఆందోళన దీనిగురించే. ప్రెసిడెన్సీలోని అనేక ప్రాంతాలలో పీడిత వర్గాలవారికి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. వీరిలో కొంత మంది ఛాందస వర్గాలవారి అభీష్టానుసారం వారి పొలాలలో సేద్యం చేస్తుంటారు. మరికొంత మంది ఛాందసవర్గాల వారి పొలాలలో కూలీలుగా పనిచేసి బతుకు నెట్టు కొస్తుంటారు. మిగిలిన వారు గ్రామసేవకులుగా ఛాందసవర్గాలకు సేవచేసి వారు ఇచ్చే తృణమో, పణమో తెచ్చుకుని కాలం గడుపుతుంటారు. పీడిత వర్గాలవారు తమ హక్కులను పొందడానికి ధైర్యం చేసినప్పుడు ఛాందసవర్గాలవారు తమ ఆర్థికశక్తిని వారిపై ఆయుధంగా ఉపయోగించిన సంఘటనలు చాలా ఉన్నాయి. వారిని పొలాలనుంచి గెంటివేయడం, పనిలో నుంచి తీసివేయడం, వారి సేవలకు ధాన్యం ముట్టజెప్పకపోవడం వంటి అకృత్యాలకు ఛాందసవర్గాలవారు పాల్పడుతుంటారు. కొన్ని సార్లు పీడిత వర్గాలవారిని వెలివేసి, ఆఖరికి వీధులలో కూడా నడవ నివ్వకపోవడం, సరకులు ఏవీ దొరకనీయకుండా చేయడం వంటి ఘోరాలు చేస్తుంటారు. కొన్నిసార్లు చిన్నచిన్న కారణాల పైనే పీడిత వర్గాలవారిని వెలివేస్తుంటారు. ఉమ్మడి బావి నుంచి నీళ్లు తోడుకున్న కారణంపైనే ఎక్కువ సందర్భాలలో అలా జరుగుతుంటుంది. పీడిత వర్గాలకు చెందిన వారు జంధ్యం ధరించా రనో, భూమి కొనుక్కున్నారనో, మంచి వస్త్రాలు, ఆభరణాలు ధరించారనో, లేక, వధువుతో సహా గుర్రం ఎక్కి పెళ్లి ఊరేగింపు తీశారనో వెలివేసే సంఘటనలు అరుదుగా జరుగుతాయి".

అధ్యక్షా! అదీ మా పరిస్థితి.మేము ముట్టడికి గురైన ప్రజలం. మా ఆశలు, ఆశయాలను తుంచివేయడానికి పథకం ప్రకారం కుట్రపన్నడంలోనే కాలం గడిపే వర్గాలకు అంత విస్తృతమైన న్యాయపరమైన అధికారాలను ఇవ్వడానికి నేను సమ్మతించను.

***ఒక గౌరవనీయ సభ్యుడు :*** వద్దు, వద్దు.

***డా॥ అంబేద్కర్ :*** ఈ బిల్లును ప్రతిపాదించడం వెనుక గౌరవనీయ మంత్రి ఉద్దేశాన్ని నేను పూర్తిగా అర్థం చేసుకోగలను. గ్రామీణ ప్రజలకు త్వరితగతిన న్యాయాన్ని అందించాలని, న్యాయవ్యవస్థను వారికి అందుబాటులో ఉంచాలని ఆయన కోరుకున్నారని అనుకుంటున్నాను. ఆయన ఉద్దేశం అదే అయితే, ఆ ఉద్దేశం నెరవేరే మంచి విధానం మరొకటి ఉంది. గ్రామ పంచాయతీలకు న్యాయాధికారాలు ఇవ్వనవసరం లేదు. పట్టణాల్లో ఇప్పటికే గౌరవ బెంచ్ మేజిస్ట్రేట్లు ఉన్నారు. ఆ వ్యవస్థనే విస్తరించుకుంటే సరిపోతుంది. అవసరాన్ని బట్టి ప్రతి జిల్లాను రెండు, మూడు మైళ్ల విస్తీర్ణంగల ప్రదేశాలుగా విభజించి, ఒక్కొక్క ప్రదేశంలో న్యాయ విధులను నిర్వర్తించడానికి ముగ్గురినో, అంత కంటే ఎక్కువ మందినో ప్రభుత్వం నామినేట్ చేస్తే బాగుంటుంది. క్రిమినల్ కేసులు ఉన్నరోజున ఈ ముగ్గురు పెద్దమనుషులు మేజిస్ట్రేట్లుగా విచారణ నిర్వహిస్తారు. సివిల్ కేసులు ఉన్నరోజున సివిల్ జడ్జీలుగా వ్యవహరిస్తారు. ఈ పద్ధతిలో న్యాయం చవకగా, తేలికగా ప్రజలకు అందుబాటులోకి వస్తుంది. అంతేకాకుండా స్థానిక ప్రభావాలు పడని స్వతంత్ర న్యాయవ్యవస్థను ఏర్పాటు చేసుకోవచ్చు. ఎన్నికల ద్వారా ఏర్పడే న్యాయవ్యవస్థలోని లోపాలు ఇందులో ఉండవు. అధ్యక్షా! ఇటువంటి వ్యవస్థ బిల్లు వెనక ఉన్న ఉద్దేశాలకు సరిపోతుందని భావిస్తున్నాను. బిల్లులోని ప్రస్తుతం ఉన్న మొత్తం అంశాలతో సహా యథాతథంగా బిల్లును ఎలాగైనా ఆమోదింపజేసుకోవాలని గౌరవనీయమంత్రి ఇంకా పట్టుబడుతున్నట్లయితే, ఈ బిల్లును నేను వ్యతిరేకిస్తానని స్పష్టం చేస్తున్నాను. (సభలో హర్షధ్వానాలు)

☆ ☆ ☆

# 22

# గ్రామ పంచాయితీల బిల్లుపై ప్రసంగం – 2*

## పంచాయితీలలో పీడిత వర్గాల నియామకం

***డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్*** **:** అధ్యక్షా! ఆలస్యం జరిగినా బిల్లుకు ఈ సవరణ ప్రతిపాదించినందుకు గౌరవనీయ మంత్రిని నేను అభినందించి తీరాలి. ఈ రాష్ట్రంలోని రెండు అత్యల్ప సంఖ్యాకవర్గాలకు కొంత న్యాయం చేకూర్చడానికి ఈ సవరణ ప్రయత్నిస్తున్నది. మంత్రికి అందుకు కృతజ్ఞుడినై ఉంటాను. నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మిత్తా సవరణకు మద్దతు ప్రకటిస్తున్నాను. నేను సభలోకి రాకముందు స్థానిక స్వపరిపాలనా శాఖ నిర్వహిస్తున్న గౌరవనీయ మంత్రికి, ప్రతిపక్షంలో కూర్చున్న నా గౌరవనీయ స్నేహితులకు మధ్య ఏం జరిగిందో నాకు తెలియదు. అయితే స్థానిక స్వపరిపాలనాశాఖను నిర్వహిస్తున్న గౌరవనీయ మంత్రి పేర్కొన్న విధంగా ఉన్నట్లయితే ఈ సవరణ పట్ల వారికి ఎటువంటి అభ్యంతరం ఉండదని నేను అర్థం చేసుకుంటున్నాను. ఆయన ప్రతిపాదించిన సవరణ అదే పదాలతో యథాతథంగా ఉన్నట్లయితే, ప్రతిపక్ష సభ్యులు పెద్దగా బాధపడకుండానే దాన్ని అంగీకరిస్తారని అనుకుంటున్నాను.

అధ్యక్షా! మరి అదే నిజమైతే, నా గౌరవనీయ స్నేహితుడు మిత్తా ప్రతిపాదించిన సవరణను అంగీకరించడంలో ప్రతిపక్షంలోని గౌరవనీయ సభ్యులకు ఇబ్బంది ఏమిటో నాకు అర్థం కావడం లేదు. అధ్యక్షా! గౌరవనీయ మంత్రి, నా స్నేహితుడు శ్రీ మిత్తా ప్రతిపాదనలను నేను అర్థం చేసుకున్నది ఏమిటంటే, రెండింటి మధ్య ఉన్న వ్యత్యాసం స్వల్పమైనదని, స్థానిక స్వపరిపాలనా శాఖను నిర్వహిస్తున్న గౌరవనీయమంత్రి తన సవరణను స్థూలంగా వివరించారు. గ్రామ పంచాయతీలకు అల్పసంఖ్యాక వర్గాల సభ్యులను నియమించడంలో విచక్షణాధికారాన్ని ఉపయోగించే బాధ్యతను కలెక్టర్‌పైనే ఉంచడానికి ఆయన ప్రయత్నించారు. అల్పసంఖ్యాకవర్గాలు ఏవో ఆయన ప్రత్యేకించి చెప్పకుండా సవరణను స్థూలంగానే పేర్కొన్నారు. నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మిత్తా మరొక

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 37 పేజీలు 323–24, తేదీ ఫిబ్రవరి 10,1933. గ్రామపంచాయతీల చట్టంలోని 37 (2)వ క్లాజుకు గౌరవనీయ సర్ రుస్తుం జె.వకీల్ ఒక సవరణ ప్రవేశపెట్టారు. గ్రామ పంచాయతీలో అల్పసంఖ్యాక వర్గాలవారికి న్యాయమైన ప్రాతినిధ్యం కల్పించడానికి ఈ సవరణను ఉద్దేశించారు. ఈ సవరణకు శ్రీ మహమ్మద్ సులేమాన్ కసమ్ మిత్తా మరొక సవరణను ప్రతిపాదించారు. ఆయన సవరణ ఇలా ఉంది: అటువంటి వర్గం మహమ్మదీయులతోనో, పీడిత వర్గాలవారితోనో కూడినదై ఉన్నప్పుడు కనీసం ఒక మహమ్మదీయుడిని కాని, పీడిత వర్గాలకు చెందిన ఒక సభ్యుడిని కాని కలెక్టర్ పంచాయతీకి నామినేట్ చేస్తారు." శ్రీ మిత్తా ప్రతిపాదించిన ఈ సవరణకు మద్దతు ప్రకటించడానికి డాక్టర్ అంబేద్కర్ లేచి నిలబడ్డారు.

అడుగు ముందుకు వేసి, మహమ్మదీయులను, పీడిత వర్గాలవారిని కలెక్టర్ తన దృష్టిలో ఉంచుకోవాలని ప్రత్యేకంగా పేర్కొన్నారు. అధ్యక్షా! స్థూలంగా ఉన్న సవరణను అంగీకరిస్తున్న గౌరవనీయ సభ్యులు సవివరంగా ఉన్న అదే సవరణకు ఎందుకు అభ్యంతరం చెప్తున్నారో నాకు అర్థం కావడం లేదు. ఈ రాష్ట్రంలో అల్పసంఖ్యాక వర్గాల వారు ఉన్నారని, ఈ అల్పసంఖ్యాక వర్గాల ప్రయోజనాలను పరిరక్షించడమే గౌరవనీయమంత్రి సవరణ ఉద్దేశమని వారు భావిస్తున్నారా? భావించడంలేదా? అల్పసంఖ్యా కవర్గాలవారు ఉన్నట్లయితే, ఏదైనా క్లాజులో వారిని ప్రత్యేకంగా పేర్కొంటే కలిగే హాని ఏముంది? అల్పసంఖ్యాక వర్గాలవారి ప్రయోజనాలను పరిరక్షించవలసి ఉన్నదంటున్న స్థూల సవరణను అంగీకరించినట్లయితే ప్రెసిడెన్సీలో పీడిత వర్గాలు, మహమ్మదీయులు మినహా మరే అల్పసంఖ్యాక వర్గాలవారు లేనట్లయితే, క్లాజులో వారి పేర్లను పేర్కొన్నంత మాత్రాన అభ్యంతరం ఎందుకో నాకు ఏమాత్రం అర్థం కావడం లేదు. మనం సూటిగా వ్యవహరించవలసి ఉంది. ప్రత్యేక హక్కులు, ప్రత్యేక రక్షణ ఇచ్చే క్లాజు అవసరం ఏదీ మాకు కన్పించడం లేదని అయినా చెప్పాలి. లేదా, ప్రత్యేక పరిరక్షణ అవసరమైన వర్గాలు ఉన్నాయని అంగీకరించనయినా అంగీకరించాలి. చర్చ ముందుకు జరగాలని మనం కోరుకుంటున్నట్లయితే, రక్షణ అవసరమైన వర్గాలు ఏవో స్పష్టంగా పేర్కొనవలసి ఉంది.

*రావు బహదూర్ జి.కె.చితాలె :* ఆ రక్షణ ఏమిటి?

*డా॥ అంబేద్కర్ :* ఇక్కడ అస్పష్టతకు ఎంతమాత్రం స్థానం ఇవ్వకూడదు.

అధ్యక్షా! ఆఖరున ప్రసంగించిన గౌరవనీయ సభ్యుడు రావు బహదూర్ చితాలె రెండు అంశాలను పేర్కొన్నారు. నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మిత్రా ప్రతిపాదించిన సవరణను అంగీకరిస్తే, చట్టాల రూపురేఖలనే చెడగొట్టినట్టవుతుందని ఆయన అన్నారు. బాగుంది అధ్యక్షా! ఈ మాట చాలా ఆలస్యంగా అన్నారని నా గౌరవనీయ స్నేహితుడికి గుర్తుచేయదలచుకున్నాను. ఈ రాష్ట్రానికో, ఆ రాష్ట్రానికో మనం రాజ్యాంగాన్ని రూపొందించు కోవడం లేదు. ప్రతి రాష్ట్రానికీ, మొత్తం భారత దేశానికి మనం రాజ్యాంగాన్ని తయారు చేసుకొంటాం. అటువంటి రాజ్యాంగం ఈ సూత్రాన్ని స్పష్టంగా గుర్తిస్తుంది.

*గౌరవనీయ సభ్యులు:* అవును!

*డా॥ అంబేద్కర్ :* ఈ వాదన చాలా పాతది. నా గౌరవనీయస్నేహితుడు ఈ సభలో చేసిన వాదన రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో అనేకమంది ప్రముఖులు చేసినదే. అధ్యక్షా! వారు తమ ప్రయత్నంలో విఫలమయ్యారని, అసలు రాజ్యాంగాన్ని భ్రష్టు పట్టించారని మనకు తెలుసు. నా వ్యక్తిగత అనుభవాల ప్రాతిపదికన చెప్పాలంటే, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌ని భ్రష్టుపట్టించినది ఈ ప్రముఖుల వైఖరే.

అధ్యక్షా! భారతదేశం యూరప్‌కాదు. ఇంగ్లాండ్ భారతదేశం కాదు. కులవ్యవస్థ ఇంగ్లాండ్‌కు

తెలియదు. మనకు తెలుసు. అందువల్ల ఇంగ్లాండ్‌కు పనికి వచ్చే రాజకీయ ఏర్పాటు మనకు ఎన్నటికీ పనికి రాదు. ఈ వాస్తవాన్ని మనం గుర్తించాలి. భారత రాజ్యాంగంలో మంచి అంటూ ఏదైనా ఉంటున్నట్లయితే అది కుల పరమైన ప్రాతినిధ్యాన్ని గుర్తించడమేనని కూడా నేను అంటున్నాను.

*గౌరవనీయసభ్యులు* : అవును! అవును!!

***డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్*** : నేను చెప్పున్న విషయాలకు నేనేమీ సిగ్గుపడటం లేదు. భారత రాజ్యాంగంలో ఇది ఒక మంచి అంశంగా ఉండబోతున్నదని నాకు తెలుసు. అదే విషయాన్ని చెప్పున్నాను. మా ప్రతినిధి ఎవరో, అసలు మాకు ప్రాతినిధ్యం వహించేందుకు ప్రతినిధి అంటూ ఉన్నారో లేదో తెలుసుకోకుండా కేవలం వోటు హక్కుతో సరిపెట్టుకోవాలని మేము భావించడం లేదు. నేను కూడా అనుకోవడం లేదు. నాకు వోటు హక్కు ఇచ్చే వ్యవస్థ మాత్రమే కాదు నాకు కావలసినది. సభలో సభ్యులుగా ఉండి, విషయాలను చర్చించడమే కాక, విషయాలను నిర్ణయించగలిగేలా నా సొంత వర్గానికి చెందిన ప్రతినిధులు ఉండాలి. వారిని ఎన్నుకునే హక్కును ఇచ్చే వ్యవస్థ నాకు కావాలి. అందువల్ల, కులపరమైన ప్రాతినిధ్యం దుష్టమైంది కాదని, విషం కాదని, ఈ దేశంలోని వివిధ వర్గాల వారి భద్రతకు, పరిరక్షణకు ఏర్పరచిన ఒక మంచి ఏర్పాటు అని నేను అంటున్నాను. రాజ్యాంగం రూపురేఖలు మార్చే అంశంగా నేను దీన్ని భావించను. నేను దీన్ని ఏమని భావిస్తానంటే.....

***డా। ఎం.కె. దీక్షిత్*** : వన్నె తెచ్చేదిగా.

***డా। అంబేద్కర్*** : అవును. రాజ్యాంగానికి వన్నెతెస్తుంది. ఈ సూత్రాన్ని న్యాయవ్యవస్థలో కూడా అంగీకరించాలా? అని కూడా నా గౌరవనీయ స్నేహితుడు అడిగారు. బాగుంది ప్రస్తుతం అమలులో ఉన్న న్యాయవ్యవస్థ కులపరమైన పక్షపాతానికి దూరంగా ఉన్నదని నా గౌరవనీయ స్నేహితుడు నాకు హామీ ఇచ్చినట్లయితే ఆయన సూచనను నేను సగౌరవంగా స్వీకరిస్తాను. అంటే ఒక బ్రాహ్మణ ప్రతివాదికి, ఒక బ్రాహ్మణేతర వాదికి మధ్య ఏర్పడిన వివాదంపై విచారణ జరుపుతున్న బ్రాహ్మణన్యాయమూర్తి కేవలం న్యాయమూర్తిగానే తీర్పు ఇస్తారా? అయితే, మనది ఎటువంటి న్యాయవ్యవస్థో తెలుసు. నా గౌరవనీయ స్నేహితుడికి, ఈ సభకు సహనం ఉన్నట్లయితే, నాకు తెలిసినంత వరకు న్యాయవ్యవస్థ తన అధికారాన్ని ఎలా దుర్వినియోగపరిచిందో లెక్కలేనన్ని సంఘటనలు వివరిస్తాను.

(గౌరవనీయ సభ్యుల హర్షధ్వానాలు)

ఎందుకంటే పల్లెటూరి జనంగా అభివర్ణించుకునే ప్రజలు, రక్తసంబంధాలు, బంధుత్వాలతో కొట్టుమిట్టాడే ప్రజలు ఇతర వర్గాల వారి అణచివేతకు తమ రాజకీయ, న్యాయ అధికారాలను ఉపయోగించడానికి కుట్ర పన్నరని మనం చెప్పలేం. అధ్యక్షా! రాజ్యాంగంలోని మంచి అంశాలలో

ఇది కూడా ఒకటి. అందువల్ల నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మిత్రా ప్రతిపాదించిన సవరణను నేను మనస్ఫూర్తిగా సమర్థిస్తున్నాను.

★ ★ ★

*రావు బహదూర్ ఆర్.ఆర్.కాలే :* .... అధ్యక్షా! ఈ ప్రెసిడెన్సీలోని న్యాయవ్యవస్థకు సంబంధించి నా గౌరవనీయ స్నేహితుడు డాక్టర్ అంబేద్కర్ చేసిన వ్యాఖ్యలకు నేను అభ్యంతరం తెలుపుతున్నాను: మన న్యాయవ్యవస్థ నిజాయితీనే ఆయన ప్రశ్నించడం నన్ను బాధపెట్టింది. మన న్యాయవ్యవస్థ మరే న్యాయవ్యవస్థకూ తీసిపోదని, ఆఖరికి ప్రివీకౌన్సిల్ కూడా ప్రశంసించింది. యావత్ ప్రపంచంలోనే మన న్యాయవ్యవస్థ ఉత్తమమైనదని అత్యున్నత ట్రిబ్యునల్ అయిన ప్రివీ కౌన్సిల్ అప్పుడప్పుడు ఇచ్చిన తీర్పులలో పేర్కొన్నది.

**ఒకగౌరవనీయ సభ్యుడు :** యావత్ ప్రపంచంలోనా?

**రావుబహదూర్ ఆర్.ఆర్.కాలే :** అవును. యావత్ ప్రపంచంలోనే. న్యాయవ్యవస్థ కుల పక్షపాతంతో వ్యవహరిస్తున్నదని చెప్పడం నిజంగా తీవ్రమైన నింద. "మన న్యాయవ్యవస్థ ఎటువంటిదో నాకు తెలుసు. కేసుల విచారణలో మన న్యాయమూర్తులు కులపరమైన పక్షపాతంలో వ్యవహరిస్తున్నారు" అని నా గౌరవనీయ స్నేహితుడు డాక్టర్ అంబేద్కర్ వ్యాఖ్యానించడం నన్ను బాధ పెట్టింది.

**మౌలవి సర్ రఫీయుద్దీన్ అహమ్మద్ :** ఆ విధంగా ఎవరు వ్యాఖ్యానించారు?

**రావుబహదూర్ ఆర్.ఆర్.కాలే :** గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్.

**మౌలవి సర్ రఫీయుద్దీన్ అహమ్మద్ :** మీ బావమరిది..... హిందువు,

**రావుబహదూర్ ఆర్.ఆర్.కాలే:** "బావమరిది" అంటే మీ ఉద్దేశం ఏమిటి? ఆఖరికి ఆయన నా తండ్రి అయి ఉండవచ్చు. లేదా కుమారుడు అయి ఉండవచ్చు. ఈ సభలోని ఏ ఒక్కరూ అటువంటి ఆరోపణ చేయడాన్ని సహించను. ఆయన నా బావమరిది అయి ఉండవచ్చు. లేదా తండ్రి అయి ఉండవచ్చు. లేదా నా కుమారుడు అయి ఉండవచ్చు. నేను లెక్కజేయను. న్యాయమూర్తులు తమను తాము సమర్థించుకోవడానికి ఇక్కడ లేని సమయంలో మొత్తం న్యాయవ్యవస్థపైనే అటువంటి సందేహాలు వ్యక్తం చేసినందుకు నేను నిజంగా బాధపడుతున్నాను. న్యాయవ్యవస్థకు సంబంధించిన నా గౌరవనీయ స్నేహితుడు డాక్టర్ అంబేద్కర్‌కి అనుభవం ఉందో లేదో నాకు తెలియదు. ఆయనకు కొంత అనుభవం ఉండి ఉండవచ్చు. అయితే, నాకు 40 సంవత్సరాలపైగా అనుభవం ఉంది. హైకోర్టు, సబ్‌కోర్టులతో సహా దిగువస్థాయి న్యాయస్థానం నుంచి అత్యున్నతమైన ట్రిబ్యునల్ వరకు ఏ న్యాయమూర్తి అయినా కుల పక్షపాతంతో తీర్పు ఇచ్చినట్లు నాకు ఎక్కడా

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 37, పేజీలు 326-27, ఫిబ్రవరి 10, 1933

కనపడలేదని చెప్పగలను. అందువల్ల, నా గౌరవనీయ స్నేహితుడు చేసిన ప్రతిపాదనను నేను వ్యతిరేకిస్తున్నాను. గ్రామ పంచాయతీలలో ఒక ప్రత్యేకమైన వర్గానికి ప్రాతినిధ్యం కల్పించాలని డాక్టర్ అంబేద్కర్ వంటి వారు ఎందుకు కోరుతున్నారో నేను అర్థం చేసుకోగలను. అది వారి మనస్తత్వాన్ని చూపిస్తున్నది.

*శ్రీ ఎల్.ఆర్.గోఖలే (పూనా నగరం)* : గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ ఇంతకు ముందు వరకు ఇక్కడ ఉన్నారు. ఆయన ఇప్పుడు లేనందుకు నేను విచారపడుతున్నాను.... ఈ గౌరవనీయ సభలో సబ్‌జడ్జిలపై నిందలు పడుతుంటే, న్యాయవ్యవస్థతో సంబంధం ఉండి, ప్రతిపక్షంలో ఉన్న గౌరవనీయ సభ్యులు ఎవరూ నిరసన వ్యక్తం చేయక పోవడం నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది.

*శ్రీ బి.ఎస్.కామత్:* అధ్యక్షా! ఆ విషయానికి వచ్చేముందు నేను ఒక విషయం చెప్పాలి. ఈ మధ్యాహ్నం ఆయన ఒక ప్రత్యేక ఉద్దేశంతోనే సభకు వచ్చారా? లేక కాకతాళీయంగా వచ్చారా? వీటిలో ఏది నిజమో నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. సభలో ఎదుటి పక్షం చెప్పేది వినకుండా ఆకాశం నుంచి తోకచుక్క అదృశ్యమయినట్లు సభనుంచి వెళ్ళిపోవడం పార్లమెంటరీ విధానంలో ఒక వక్త చేయవలసిన పనికాదని నేను భావిస్తున్నాను. పార్లమెంటరీ పద్ధతులకు ఇది పూర్తిగా విరుద్ధం....

## శనివారం, ఫిబ్రవరి 11, 1933

**రావు బహదూర్ జి.కె.చితాలె (అహ్మద్‌నగర్ జిల్లా)* : (పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవనెత్తుతూ) అధ్యక్షా!... బ్రాహ్మణ న్యాయవ్యవస్థ ఒక వర్గంగా వ్యవహరిస్తున్నదంటూ నా గౌరవనీయ స్నేహితుడు డాక్టర్ అంబేద్కర్ నిన్న విమర్శించారు. అటువంటి సంఘటన నాకు ఎప్పుడూ ఎదురుకాలేదు. ఒక వర్గంపై నిందలు వేయడం వీలు అయినట్లయితే, అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన అధికారులపై కూడా అవతలి పక్షం వారు అలాగే నిందలు వేస్తారు. అందువల్ల అధ్యక్షా! ఈ విషయంలో ఒక అధికార పూర్వకమైన రూలింగ్ ఇవ్వడం పూర్తిగా అవసరమని నేను భావిస్తున్నాను. ఎందుకంటే ప్రభుత్వ ఉద్యోగుల గౌరవాన్ని పరిరక్షించవలసిన అధికార పక్షసభ్యులు మూగ ప్రేక్షకులవలె మిగిలిపోవడం చూసి నేను కలత చెందాను.

*గౌరవనీయ శ్రీ ఆర్.డి.బెల్:* అధ్యక్షా .... చర్చ ఇంకా ముందుకు కొనసాగే ముందు సభ ఒక విషయం తెలుసుకోవాలని నేను అభిప్రాయపడుతున్నాను. గౌరవనీయ సభ్యుడు నిజంగా చేసిన ప్రసంగం ఏమిటో ఖచ్చితంగా తెలుసుకోవలసిఉంది.

*మౌలవి సర్ రఫీయుద్దీన్ అహ్మద్:* అధ్యక్షా! ఇది గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ సభకు హాజరు కావడంపై జరుగుతున్న చర్చ కనుక, ఆయన సభలో ఉన్నప్పుడు చర్చ జరిగితేనే సమంజసంగా ఉంటుంది.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 37, పేజీలు 339-40 ఫిబ్రవరి 11, 1933

**గౌరవనీయ సభాపతి :** ... గౌరవనీయ సభ్యుడు సర్ రఫీయుద్దీన్ అహ్మద్ చేసిన సూచనను అంగీకరించలేం. డాక్టర్ అంబేద్కర్ సభకు ఎప్పుడు హాజరవుతారనేది పూర్తిగా అనిశ్చితం కనుక సభ అప్పటి వరకు వేచి ఉండలేదు. అయితే, అంబేద్కర్ చేసిన ప్రసంగం ఏమిటో మనం ఖచ్చితంగా తెలుసుకోవడం మంచిది. అప్పుడు సరైన నిర్ణయం తీసుకోగలుగుతుంది. "నిన్న ఆయన చేసిన ప్రసంగం ఏమిటి?"

**గౌరవనీయ శ్రీ ఆర్.డి.బెల్ :** అధ్యక్షా! గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ కూడా ప్రచురితమైన తన ప్రసంగపాఠాన్ని ఇంకా చూసుకుని ఉండరని భావిస్తున్నాను. అందువల్లనే ఆయన తన వ్యాఖ్యలను వివరించడానికి నిన్న కానీ, ఈ ఉదయం కానీ సభకు హాజరు కాకపోయి ఉండవచ్చు.

**గౌరవనీయ సభాపతి :** గౌరవనీయ హోంమంత్రి ప్రకటన చేసినందుకు నాకు సంతోషంగా ఉంది. గౌరవనీయ హోంమంత్రి చేసిన ప్రకటన తరువాత సభ పరిగణన లోకి తీసుకోవలసినది ఏమీలేదు.

భాషా ప్రావీణ్యం ఉన్న గౌరవనీయ సభ్యులు లేదా తమకు ఉపన్యాస ప్రతిభ ఉందని నమ్మేసభ్యులు తాత్కాలిక ఆవేశంలో మాట్లాడవలసిన దాని కంటే ఎక్కువ మాట్లాడటం, ఆ తరువాత తీరికగా బాధపడటం చేస్తుంటారని నేను వ్యక్తిగతంగా భావిస్తున్నాను. అయితే ఇటువంటిది చాలా అభ్యంతరకరమైనదని, పార్లమెంటరీ సాంప్రదాయాలకు వ్యతిరేకమైనదని చెప్పక తప్పదు. గౌరవనీయ హోం మంత్రి చెప్పినట్లు, గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ తన ప్రసంగ పాఠాన్ని ఇంకా చూసుకుని ఉండరు. ఆయన చూసినట్లయితే, యావత్ సభ బాధపడినట్లుగా ఆయన కూడా బాధపడతారని నేను అనుకుంటున్నాను. న్యాయవ్యవస్థ వంటి అత్యున్నతమైన వ్యవస్థను మొత్తం నిందించడం పార్లమెంటరీ సాంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధమని ఈ సభలోని గౌరవనీయ సభ్యులను హెచ్చరిస్తున్నాను. గౌరవనీయ సభ్యుడు ఈ విషయంలో పొరపడ్డారని భావిస్తున్నాను. అయితే, భవిష్యత్తులో సభానిర్వహణకు ఈ విషయం ఉపయోగపడుతుందని అనుకుంటున్నాను. అధికార పక్షసభ్యులు, ప్రతిపక్ష సభ్యులు వ్యక్తపరచిన అభిప్రాయాలతో నేనూ ఏకీభవిస్తున్నాను. (హర్షధ్వానాలు)

☆ ☆ ☆

# 23

# గ్రామ పంచాయితీల బిల్లుపై ప్రసంగం - 3*

## అంబేద్కర్ తన ప్రసంగానికి సంబంధించి చేసిన ప్రకటన

**డా॥ అంబేద్కర్** అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ మిత్రా ప్రతిపాదించిన సవరణపై గత శుక్రవారం నేను ప్రసంగించినప్పుడు కొన్ని వ్యాఖ్యలు చేశానని, అవి అసమంజసమైనవని గత శనివారంనాడు నా గౌరవనీయ స్నేహితుడు రావు బహదూర్ చితాలె పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవనెత్తారు. దానిపై వివరణ ఇవ్వడానికి నాకు అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. అధ్యక్షా! ఈ పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తినప్పుడే, శనివారంనాడే ఈ వివరణ ఇవ్వాలని ఆత్రుత చెందాను. అయితే, నా ప్రసంగం ప్రతిని, పాయింట్ ఆఫ్ ఆర్డర్‌కు సంబంధించి గౌరవనీయ సభ్యులు చేసిన ప్రసంగం ప్రతులను నేను కార్యాలయం నుంచి పొందలేకపోయాను. సభ సమావేశం కాకముందే వాటిని ఇవ్వడం సాధ్యకాదని కార్యాలయం వారు తెలియజేశారు. అందువల్ల, నా వివరణను ఇప్పటి వరకు వాయిదా వేయవలసి వచ్చింది.

నా ప్రసంగం ప్రతి సరిగానే ఉందా? నేను మాట్లాడిన విషయాలే అందులో ఉన్నాయా? అనే అంశాలను నేను తెలుసుకోకుండానే ఈ పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తడం పట్ల నేను ఎంతగానో విచారపడుతున్నాను. అధ్యక్షా! విషయాలను నిర్ధారించుకోకుండానే వాటిపై నిర్ణయాలకు రావడం ప్రాథమిక న్యాయసూత్రాలను విరుద్ధమని సవినయంగా స్పష్టం చేస్తున్నాను. ఈ న్యాయం నాకు జరగలేదు. శుక్రవారంనాడు ప్రసంగం చేసిన తరువాత నేను ఆకస్మాత్తుగా సభనుంచి వెళ్లిపోవడం ద్వారా పార్లమెంటరీ సాంప్రదాయాలను ఉల్లంఘించానని, అందువల్ల నాకు ఈ మర్యాద ఇవ్వడం లేదని గౌరవనీయ సభ్యుడు శ్రీ కామత్ పేర్కొన్నారు. పార్లమెంటరీ సాంప్రదాయాలకు, విధానాలకు సంబంధించి గౌరవనీయ సభ్యుడు శ్రీ కామత్ నుంచి నేర్చుకోవడానికి ప్రతిఒక్కరూ సిద్ధంగా ఉండవలసిందే. పార్లమెంటరీ జీవితంలో తలపండిన ఆయన అత్యంత పాతతరానికి చెందిన గౌరవనీయ రాజకీయ వేత్తలలో ఒకరు. అయితే, ఆ సందర్భానికి మాత్రం ఆ నిబంధన వర్తించదు. దానిని నేను సరిగానే అర్ధంచేసుకున్నానని అనుకుంటున్నాను. ఒక సభ్యుడు సభలో ప్రసంగించిన తరువాత సభ నుంచి వెళ్లిపోకూడదని, ఇతరుల సమాధానాలు వినాలని ఆ నిబంధన పేర్కొంటున్న మాట నిజమే. అయితే ఆ సభ్యుడు తన ప్రసంగంలో మరొక సభ్యుడిపై వ్యక్తిగతంగా విమర్శలు చేసిన సందర్భంలో మాత్రమే ఆ నిబంధన వర్తిస్తుంది. అందరికీ తెలిసిన విషయాల ప్రాతిపదికన

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 37, పేజీలు 400 - 03, ఫిబ్రవరి 13, 1933

సాధారణ చర్చ జరగడానికి ఒక సభ్యుడు తన ప్రసంగం ద్వారా దోహదం చేసిన సందర్భానికి ఈ నిబంధన వర్తించదని నేను అభిప్రాయడుతున్నాను. అధ్యక్షా! అటువంటి సందర్భానికి కూడా ఈ నిబంధన వర్తించినట్లయితే, చర్చలో పాల్గొన్న ప్రతి సభ్యుడు సంబంధిత చర్చ పూర్తయ్యే వరకు ప్రతి ఒక్కరు చేసిన ప్రసంగం వింటూ అన్ని వేళల్లో సభలోనే ఉండవలసి ఉంటుంది. గౌరవనీయ సభ్యుడు శ్రీ కామత్‌ను కాని, లేదా మరొకరిని కాని నేను ఏ ప్రశ్న అడగలేదు. ఇతరుల సమాధానాలు వినవలసిన అవసరం నాకు లేనందువల్ల, నేను సభ నుంచి వెళ్లి పోయాను. అంతేకాక, నాకు ఈ సమయంలో మరొక ముఖ్యమైన బాధ్యత కూడా ఉండింది. ఒక సభ్యుడి ప్రసంగం ప్రతిలో ఉన్న విషయాలను ఆ సభ్యుడి నుంచి నిర్ధారణ చేసుకోకుండా ఆ ప్రసంగాన్ని ఖండించకూడదనే సూత్రాన్ని నాకు వర్తింపజేయకపోవడానికి మరొక కారణం కూడా ఉంది. అది ఏమిటంటే, నేను పూర్తి కాలం సభ్యుడిని కాను. అందువల్ల సభలో నేను ఎప్పుడు ఉంటానో ఎవరికీ తెలియదు. ఈ విషయంపై వ్యక్తమైన అభిప్రాయాలకు నేను తలవంచుతున్నాను. నేను సభకు హాజరవడం, హాజరుకాకపోవడం క్రమబద్ధంగానే జరుగుతున్నాయని స్పష్టం చేస్తున్నాను. అయితే, నేను క్రమబద్ధంగా హాజరవడం, హాజరు కాకపోవడం ఇక్కడ సమస్యకాదు. నా అభిప్రాయంలో అసలు విషయం ఏమిటంటే, నేను ప్రసంగిస్తున్న సమయంలోనే గౌరవనీయ సభ్యుడు ఆ అంశాన్ని ఎందుకు ప్రస్తావించలేదు? పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తడానికి అవలంబించవలసిన పద్ధతిని నేను సరిగా అర్ధం చేసుకున్నాననే అనుకుంటున్నాను. ఆర్డర్ ఉల్లంఘన జరిగిందని భావించిన క్షణంలోనే సభ్యుడు అధ్యక్షులవారి దృష్టికి ఆ విషయాన్ని తీసుకుని రావాలి. కాని ఈ సందర్భంలో మాత్రం పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవనెత్తిన సభ్యుడు ఆ క్షణంలో ఏమీ మాట్లాకుండా, రాత్రంతా నిద్రపోయి, మరోరోజు ఎటువంటి నోటీసు లేకుండా అకస్మాత్తుగా విరుచుకు పడ్డారు. పైగా నేను ఆ సమయంలో సభలో లేనని ఫిర్యాదు చేయడం చాలా విచిత్రంగా ఉంది. నేను ప్రసంగిస్తున్న సమయంలోనే పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తడం, లేదా తరువాత నోటీసు ఇచ్చి పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తడం సరైన పద్ధతి. గౌరవనీయ సభ్యుడు ఈ పద్ధతిని అనుసరించి ఉంటే బాగుండేది.

ఇక పాయింట్ ఆఫ్ ఆర్డర్‌లోని అంశాలకు వస్తే, కార్యాలయంలోని ప్రసంగం ప్రతిని నా ప్రసంగానికి సరైన రికార్డుగా నేను ఎంతమాత్రం అంగీకరించడం లేదు. నేను మొత్తం న్యాయ వ్యవస్థనే నిందించినట్టు ఆ ప్రతిలో ఉంది. మొత్తం న్యాయవ్యవస్థను నిందించడం నా ఉద్దేశం కానే కాదు. అసలు ప్రసంగంలోని అనేక పదాలు ప్రతిలో కన్పించడం లేదు. దాంతో, నేను మొత్తం న్యాయ వ్యవస్థనే నిందించినట్టు అర్థం వచ్చింది మొత్తం న్యాయవ్యవస్థనే నిందించాలనే ఉద్దేశంకాని, న్యాయవ్యవస్థలో పనిచేస్తున్న బ్రాహ్మణులపై తీవ్రమైన వ్యాఖ్యలు చేయాలనే ఉద్దేశంకాని నాకు లేవు. నేను బ్రాహ్మణ న్యాయ వ్యవస్థ గురించి ప్రస్తావించాను. అయితే, దాని అర్థం కేవలం బ్రాహ్మణులను మాత్రమే విమర్శించడం కాదు. కుల పక్షపాత ధోరణులను ఎత్తిచూపించడానికి బ్రాహ్మణులు అనే పదాన్ని కేవలం ఒక ఉదాహరణగా ఎంచుకున్నాను. నా ప్రసంగం చివరిలో న్యాయవ్యవస్థ గురించి స్థూలంగా మాట్లాడానే తప్ప, అందులోని ఏ ఒక్క కులాన్ని ప్రత్యేకించి పేర్కొనలేదు. అలా పేర్కొన్నందువల్ల నేను చేసిన వాదనకు కలిగే ప్రయోజనం కూడా ఏమీలేదు.

న్యాయవ్యవస్థకు కుల పక్షపాతం ఉందా, లేదా అని గౌరవనీయ సభ్యుడు రావు బహదూర్ చితాలే అడిగిన ప్రశ్నకు నేను జవాబిచ్చాను. సామాజిక వ్యవస్థ కారణంగా మనం తప్పనిసరిగా కుల పక్షపాతం కింద బతుకుతున్నామని ఆయనకు సమాధానం ఇచ్చాను. బ్రాహ్మణుడైన ప్రత్యర్థికి సమాధానం ఇస్తున్నందున ఆ సమయంలో బ్రాహ్మణ న్యాయ మూర్తిని ఉదాహరణగా తీసుకున్నాను. నా ప్రత్యర్థి బ్రాహ్మణేతరుడో లేక మహమ్మదీయుడో అయి ఉన్నట్లయితే ఆ వర్గాల న్యాయమూర్తులనే ఉదాహరణగా తీసుకుని ఉండే వాడిని. కుల పరమైన వివాదాలలో న్యాయవ్యవస్థ కులపక్షపాతంతో వ్యవహరిస్తుందని ఆరోపిస్తూ నేను చేసిన ప్రకటన అనుచితమైనదని మీరు భావిస్తున్నారేమో నాకు తెలియదు. అధ్యక్షా! ఈ విషయాన్ని మీకూ, ఈ సభకూ వదిలిపెడుతున్నాను. చివరికి క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ కూడా ఇలాంటి అవకాశం ఉందని గుర్తించిందని మాత్రం నేను చెప్పగలను. న్యాయమూర్తి పక్షపాతంతో వ్యవహరిస్తున్నట్లు భావిస్తే కేసు బదలీని కోరుకునేందుకు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని ఒక సెక్షన్ అనుమతి ఇస్తున్నది. తనకు సంబంధించిన లేదా ఆసక్తి ఉన్న కేసును ఏ న్యాయమూర్తీ విచారించకూడదని కూడా క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని ఒక సెక్షన్ నిర్దేశిస్తున్నది. మరొక విషయం ఏమిటంటే, కులపరమైన విషయాలలో న్యాయవ్యవస్థ కుల పక్షపాతం ప్రదర్శించవచ్చుననే అభిప్రాయాన్ని చివరికి ఈ బిల్లులోనే గుర్తించారు. న్యాయ విధులు నిర్వర్తించే గ్రామ పంచాయితీలను ఎన్నికల ద్వారానే ఏర్పాటుచేయాలని బిల్లులో తొలుత పేర్కొన్న విషయం అనేక మంది గౌరవనీయ సభ్యులకు గుర్తుండే ఉంటుంది. ఎన్నికల ప్రాతిపదికన న్యాయ వ్యవస్థను ఏర్పాటు చేయడం తగిన విధానం కాదని నేను స్పష్టం చేసిన తరువాత బహుశా నా సూచనకు అనుగుణంగా బిల్లులో న్యాయాధికారులకు మార్పుచేసి నామినేట్ చేయాలని పేర్కొన్నారు. అధ్యక్షా! కుల పక్షపాతం ఉన్నదనడానికి ఈ ఉదంతమే సాక్ష్యమని నేను భావిస్తున్నాను. చివరిగా నేను చెప్పేది ఏమిటంటే, గౌరవనీయ సభ్యుడిని బాధపెట్టిన అంశం నేను చెప్పిన విషయం కాదు. నేను ఉదాహరణగా పేర్కొన్న కులం ఒక ముస్లిం వ్యక్తినో, బ్రాహ్మణేతరవ్యక్తినో ఉదాహరణగా పేర్కొని ఉన్నట్లయితే, ఆ సభ్యుడు పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను లేవనెత్తి ఉండేవారుకాదు. బహుశ నన్ను అమితంగా ప్రశంసించి ఉండేవారు. నేను చెప్పగలిగినదంతా ఇదే.

ఫిబ్రవరి 13, 1933న డాక్టర్ అంబేద్కర్ ఈ ప్రకటన చేసిన తరువాత గౌరవనీయ స్పీకర్ మాట్లాడుతూ అంబేద్కర్ ప్రసంగంలోని విమర్శలను వివరించి, సభా సాంప్రదాయాలను చర్చించారు. తన ప్రసంగాన్ని ముగిస్తూ ఆయన ఇలా పేర్కొన్నారు.

"ఇంతకు మించి నేను చెప్పగలిగినది ఏమీ లేదు. గౌరవనీయ స్పీకర్ ఇచ్చిన వివరణను అంగీకరించవలసిందే. న్యాయ వ్యవస్థను మొత్తం నిందించడం తన ఉద్దేశం కాదని, న్యాయస్థానాలలో కూడా కుల పక్షపాతం ప్రదర్శితమైన సందర్భాలు ఉన్నాయని చెప్పడానికే తాను ప్రయత్నించానని ఆయన వివరణ ఇచ్చారు."

☆ ☆ ☆

# 24

# గ్రామ పంచాయితీల బిల్లుపై ప్రసంగం – 4*

**డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:** అధ్యక్షా! చిన్న వివరణ ఇవ్వగలరా? మీరు ఏం చెప్పారో నాకు పూర్తిగా అర్థం కాలేదు. బిల్లు రెండవ రీడింగ్ సమయంలో ఒక గౌరవనీయ సభ్యుడు లేవనెత్తిన అంశాన్ని పరిగణనలోకి తీసుకోకపోయినా లేక ఆ అంశంపై ఆయన ఓటమికి గురయినా మూడవ రీడింగ్ సమయంలో ఆ సభ్యుడు బిల్లును వ్యతిరేకించకూడదని మీరు చెప్పినట్లు నాకు అర్థమైంది. మీరు చెప్పినది అదేనా? రెండవ రీడింగ్ సమయంలో ఒక అంశాన్ని పరిగణనలోకి తీసుకోని పక్షంలో, లేక ఒక ప్రత్యేక విషయంపై ఒక సభ్యుడు కాని, ఒక అల్పసంఖ్యాక వర్గం కాని ఓడిపోయిన పక్షంలో మూడవ రీడింగ్ సమయంలో అదే విషయంపై అదే అల్పసంఖ్యాక వర్గం బిల్లును వ్యతిరేకించకూడదు. అవునా అధ్యక్షా?

**గౌరవనీయ సభాపతి:** లేదు, లేదు. నేను కొద్దిరోజుల క్రితం రూలింగ్ ఇచ్చినప్పుడు గౌరవనీయ సభ్యుడు సభలో లేరు. ఆయన కోసం రూలింగ్‌ను మరొకసారి చదువుతున్నాను. బిల్లుకు మూడుసార్లు రీడింగ్ ఇవ్వడం జరుగుతుందని రాజ్యాంగ న్యాయవాది కూడా అయిన గౌరవనీయ సభ్యుడికి బాగా తెలిసి ఉంటుందనే అనుకుంటున్నాను. బిల్లు మొదటి రీడింగ్ జరిగేది మొదటిదశ. బిల్లులోని సూత్రాలపై అప్పుడు చర్చ జరుగుతుంది. తరువాత రెండవదశలో బిల్లును ఒకవేళ సెలెక్ట్ కమిటీకి నివేదించినట్లయితే, అక్కడి నుంచి బిల్లు వచ్చినప్పుడు సభ దానిపై విమర్శలు చేయవచ్చు. రెండవ రీడింగ్ సమయంలో బిల్లును సెలెక్ట్ కమిటీకి నివేదించినట్లయితే, బిల్లుపై క్లాజుల వారీగా చర్చజరుగుతుంది. ఈ దశలోనే మార్పులు కూడా చేస్తారు. ఇవన్నీ రెండవ రీడింగ్ సమయంలోనే జరుగుతాయి. గ్రామ పంచాయతీల బిల్లు రెండవ రీడింగ్ సమయంలో గౌరవనీయ సభ్యుడు సభలో లేరు. బిల్లు మూడవ రీడింగ్ జరుగుతున్న ఈవేళ ఆయన సభకు హాజరయ్యారు. బిల్లు మొదటి రీడింగ్ నుంచి రెండవ రీడింగ్‌కు వచ్చినప్పుడు క్లాజుల వారీగా మార్పులు జరిగి ఉన్నట్లయితే, ఆయన బిల్లును ఇప్పుడు వ్యతిరేకించవచ్చు. రెండవ రీడింగ్ సమయంలో చేర్చిన మార్పులు తనకు అభ్యంతరకరంగా ఉన్నట్లయితే, ఆయన ఈ మూడవ రీడింగ్ సమయంలో వాటిని వ్యతిరేకించవచ్చు. అదీ సంగతి. మరో విధంగా అయితే, ఈ మూడు దశలకు ప్రాధాన్యం ఉండదు. మొదటి రీడింగ్ సమయంలో సూత్రాలపై చర్చకు, రెండవ రీడింగ్ సమయంలో క్లాజులవారీ చర్చకు, మూడవ రీడింగ్ సమయంలో మార్పులపై చర్చకు గౌరవనీయ సభ్యులు ఖచ్చితంగా కట్టుబడి ఉన్నట్లయితే, బిల్లును వ్యతిరేకించాలనుకున్నవారు ప్రతి దశ ముగిసే

సమయంలోను వ్యతిరేకించవచ్చు. నా రూలింగ్ అది. బిల్లు మూడవ రీడింగ్‌ను వ్యతిరేకించవద్దని నేను ఏ గౌరవనీయ సభ్యుడినీ ఆదేశించలేదు. ఉదాహరణకు గౌరవనీయ సభ్యుడు రావు సాహెబ్ కులకర్ణి ఉన్నారు. ఆయన అనేక సవరణలను ప్రవేశపెట్టారు. అవన్నీ వీగిపోయాయి. అయితే, అవే అంశాలపై ఆయన బిల్లు మూడవ రీడింగ్‌ను కూడా వ్యతిరేకించారు. అదే విధంగా, ఏ గౌరవనీయ సభ్యుడైనా తాను స్వయంగా సవరణలు ప్రతిపాదించినా, ప్రతిపాదించకపోయినా బిల్లు మూడవ రీడింగ్ సమయంలో వ్యతిరేకించవచ్చు. అయితే, రెండవ రీడింగ్ సమయంలో తాను చేసిన మార్పులకు, అవలంబించిన వైఖరికి ఆ సభ్యుడు కట్టుబడి ఉండాలి. అంతేతప్ప, మొదటి రీడింగ్ దశకు వెళ్లిపోయి, బిల్లులోని సాధారణ సూత్రాలపై జరిపిన చర్చే మళ్లీ జరపకూడదు. బిల్లులోని సాధారణ సూత్రాలను మొదటి రీడింగ్ సమయంలోనే చర్చించాలి.

***డా॥ అంబేద్కర్:*** అధ్యక్షా! మరికొంత వివరణ అవసరం. ఉదాహరణకు నా విషయాన్నే తీసుకుందాం. కొన్ని సూత్రాలపై నేను బిల్లును వ్యతిరేకిస్తున్నాను. ఏ సూత్రాల ప్రాతిపదికన బిల్లు రూపకల్పన జరిగిందో ఆ సూత్రాలు సరియైనవి కావని నేను అంటున్నాను. సభలో అధిక సంఖ్యాక సభ్యులు బిల్లును సమర్థించారు. నేను, నా అభిప్రాయాలు పంచుకునే గౌరవనీయ సభ్యులు కొందరు ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నాం. బిల్లు మొదటి రీడింగ్ సమయంలో నేను వ్యతిరేకించిన సూత్రాలే మూడవ రీడింగ్ సమయంలోనూ బిల్లులో ఉన్నాయి. అప్పుడు మూడవ రీడింగ్‌ను నేను వ్యతిరేకించకూడదా?

***గౌరవనీయ సభాపతి :*** లేదు. నేను ఇచ్చిన రూలింగ్ అదే. ఎందుకంటే మూడవ రీడింగ్‌కు ముందే అవకాశం లభించింది. కాబట్టి, గౌరవనీయ సభ్యుడికి ఈ దశలో ఆ విధమైన హక్కు ఉండదు.

***డా॥ అంబేద్కర్:*** ఉదాహరణకు బిల్లు రెండవ రీడింగ్ సమయంలో కూడా నేను ఓడిపోయాననుకోండి. బిల్లు మొదటి రీడింగ్ సమయంలో నేను వ్యతిరేకించిన సూత్రాలనే సభ ఆమోదించినట్లయితే, మూడవ రీడింగ్ సమయంలో నేను బిల్లును వ్యతిరేకించకూడదా?

***గౌరవనీయ సభాపతి :*** లేదు. నేను నా రూలింగ్‌కి కట్టుబడి ఉంటాను. గౌరవనీయ సభ్యుడు ఆ విధంగా చేయడానికి వీలు లేదు. ఎందుకంటే ఆయన అప్పటికే తన అభిప్రాయాలను సభ ముందు ఉంచారు. మెజారిటీ సభ్యులు ఆ అభిప్రాయాలను వ్యతిరేకించారు. ఇప్పుడు మూడవ రీడింగ్‌లో ఉన్న బిల్లును ఆయన వ్యతిరేకించకూడదు.

***డా॥ అంబేద్కర్:*** అధ్యక్షా! మీ రూలింగ్ తరువాత అల్పసంఖ్యాక వర్గాల వారికి ఉన్న ఒకే ఒక అవకాశం ఏమిటంటే, అన్ని దశలలో బిల్లును వ్యతిరేకిస్తూ వారు దానికి వ్యతిరేకంగా వోటు చేయడమే. అలాకాని పక్షంలో సభలో మెజారిటీ సభ్యులు బిల్లు పట్ల సుముఖత వ్యక్తం చేశారనుకోండి. కొంతమంది సభ్యులు దాన్ని వ్యతిరేకిస్తున్నారనుకోండి. అప్పుడు వారికి తమ వ్యతిరేకతను వ్యక్తం చేసే అవకాశం ఉండదు. అంతేనా?

***గౌరవనీయ సభాపతి :*** సరిగ్గా అంతే. బిల్లు మూడవ రీడింగ్‌కు వ్యతిరేకంగా మైనారిటీ సభ్యులు వోటు వేయవచ్చు. అయితే, మొదటి రీడింగ్‌లోనే నిర్ణయించిన విషయాలపై మళ్లీ చర్చ జరపడం మాత్రం సాధ్యం కాదు.

***డా॥ అంబేద్కర్:*** సంతోషం అధ్యక్షా! మా హక్కులకు హానికలుగుతున్నదనే అభిప్రాయాన్ని మీ ప్రతిపాదన కలిగించడం లేదు.

***గౌరవనీయ సభాపతి :*** అది నిజం



# 25

# స్థానిక సంస్థల చట్ట సవరణ బిల్లు – 1*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం):* అధ్యక్షా! పూనా ఒప్పందంపై సంతకం చేసిన తరువాత ప్రత్యేక నియోజకవర్గాల విషయంపై చర్చలు జరపడంతోనే నాకు సరిపోయింది. అందువల్ల, వివిధ అల్పసంఖ్యాక వర్గాల వారికోసం కల్పించవలసిన ప్రాతినిధ్యాల గురించి బిల్లులో పేర్కొన్న విషయాల జోలికి నేను వెళ్లడం లేదు. అయితే, సమిష్టి నియోజకవర్గాలు, ప్రత్యేక నియోజకవర్గాలు అనే క్లిష్టమైన విషయాన్ని నేను ఏ దృష్టితో చూస్తున్నానో వివరించడం సముచితమని భావిస్తున్నాను. అధ్యక్షా! వాటి పట్ల నా వైఖరి ఇది. వివిధ అల్పసంఖ్యాక వర్గాల వారికోసం ప్రవేశపెట్టే సమిష్టి నియోజకవర్గాల వల్ల కలిగే ప్రభావం ఏమిటి? అయిదు సంవత్సరాలకు ఒకసారి ఎన్నికలు వస్తాయి. అప్పుడు ఉమ్మడి పోలింగ్ బూత్‌కు ఒక హిందువు, ఒక మహమ్మదీయుడు కలిసి వెళతారేమో. సమిష్టి నియోజకవర్గాల వల్ల మరే ఫలితం ఉంటుందో నాకు తెలియడం లేదు. (సభలో జోక్యం) దయచేసి మిగిలిన అయిదు సంవత్సరాల గురించి చెప్పనివ్వండి. ఎన్నికలు లేవనుకోండి. మహమ్మదీయులు... ఒక ఉదాహరణగా మాత్రమే వారిని పేర్కొంటున్నాను. వారు విడిగా, వేరుగా జీవిస్తుంటారు. సమిష్టి నియోజకవర్గాలను ఏర్పాటు చేస్తే...., మహమ్మదీయులు, హిందువులు కలిసి ఒకే ఇంట్లో జీవిస్తారని నేను అనుకోవడం లేదు. సమిష్టి నియోజకవర్గాలను ఏర్పాటు చేస్తే..., హిందువులు, మహమ్మదీయులు వివాహాలు చేసుకుంటారని నేను భావిచడం లేదు. సమిష్టి నియోజకవర్గాలను ఏర్పాటుచేస్తే..., హిందువులు, మహమ్మదీయులు కలిసి భోజనం చేస్తారని కూడా నేను అనుకోవడం లేదు. అధ్యక్షా! హిందువులను, మహమ్మదీయులను ఉమ్మడి పోలింగ్ బూత్‌కు రప్పించడానికి ఒక రోజును నిర్ణయిచడం ద్వారా ఐక్యతా భావాన్ని పాదుకొల్పలేమని ఈ సందర్భంగా స్పష్టం చేస్తున్నాను. ఐక్యతను పెంపొందిచడానికి ఏదైనా చేయాలని మనం నిజంగా భావిస్తున్నట్లయితే, మనం చేయగలిగినది ఏమిటంటే సామాజిక అడ్డుగోడలను కూల్చడమే. ఈ విషయంలో హిందువులే చొరవ చూపవలసి ఉంటుంది. ఎందుకంటే హిందువులు తమకు తాము విడిగా జీవిస్తుంటారు. హిందువుల వైఖరి కారణంగానే ఇతర మతాల వారు కూడా విడిగా బతకడం అలవాటు చేసుకున్నారు. అందువల్ల ఈ పరిస్థితికి హిందువులే పూర్తిగా బాధ్యత వహించాలి. అందువల్ల, అయిదు సంవత్సరాలలో లేదా మూడు సంవత్సరాలలో ఒక రోజు మినహా మిగిలిన రోజుల్లో ఎటువంటి కార్యక్రమం లేని నిరుపయోగ పథకాన్ని రూపొందించడం ద్వారా ఈ సమస్య

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 2, పేజీలు 326–29, జనవరి 18, 1938

తొలగదని భావిస్తున్నాను. ఈ పథకం వల్ల ఏమీ ఉపయోగం లేదు. దీని ఫలితం ఏమీ ఉండదు. అయితే, మీరు ఒక ప్రయత్నం చేయవచ్చు. ఈ కార్యక్రమం అమలులో పెట్టడానికి ఒక అవకాశాన్ని ఇవ్వవలసిందిగా నా మహమ్మదీయ సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాను. రెండు మతాల వారు విడివిడిగా ఉండకుండా కలిసి జీవించే అవకాశాన్ని ఈ కార్యక్రమం ఇవ్వగలదేమో చూడమని కోరుతాను. పూనా ఒప్పందంపై సంతకం చేసిన నేను ప్రత్యేక నియోజకవర్గాలకు మద్దతు ఇవ్వలేను.

బిల్లులోని ఇతర అంశాలకు వద్దాం. మనం ఉన్న స్థితిని కొంత ముందుకు నడిపించడంలో బిల్లు దోహద పడుతుందని ఖచ్చితంగా చెప్పవచ్చు. అయితే, బిల్లులో నాకు ఏమీ కనపడటం లేదు. అది ఒక ఖాళీ డొప్పవంటిది. అందులో ఏమీ లేదు. స్థానిక సంస్థల పునర్వ్యవస్థీకరణకు సంబంధించి ఏం చేయాలనుకుంటున్నారో గౌరవనీయ మంత్రి తన ప్రసంగంలో పేర్కొన్న విషయాలు మినహా, మనం బిల్లు నుంచి తెలుసుకోగలిగినది ఏమీ లేదు. ఇందుకోసం, లేదా అందుకోసం నిబంధనలను రూపొందించే అధికారం ప్రభుత్వానికి ఇవ్వడం జరుగుతుందని మాత్రమే బిల్లు పేర్కొంటున్నది. అది మినహా, బిల్లులో ఏం ఉంది? లక్ష్యాలు, కారణాలను వివరించే ప్రకటనను బిల్లుతో జతపరచనట్లయితే, వివిధ అల్ప సంఖ్యాక వర్గాల వారికి ప్రాతినిధ్యాన్ని కల్పించడానికి ప్రభుత్వం ఏ సూత్రాన్ని అవలంబిస్తున్నదో తెలుసుకునే అవకాశం మనకు ఎప్పటికీ ఉండదు. ఈ అంశాలు రాజ్యాంగంలో ముడిపడి ఉన్న అంశాలు. సాధారణ శాసనాలను అమలులోకి తేవడానికి సంబంధించిన విషయం కాదు ఇది. అందువల్ల, రాజ్యాంగ సంబంధమైన ఈ అంశాలను ఈ సభలోనే పూర్తిగా నిర్ణయించాలి. కార్యనిర్వాహకవర్గం అయిన ప్రభుత్వ అభీష్టానికి వీటిని వదిలి పెట్టకూడదు. కాని మనం ఏం చేస్తున్నాం. ఎన్నికల్లో ప్రాతినిధ్యం కల్పించే విషయాన్ని నిర్ణయించే అధికారాన్ని ప్రభుత్వానికి బదలీ చేస్తున్నాం. భారత ప్రభుత్వ చట్టం విషయాన్ని తీసుకోండి. ఈ బిల్లులోని అంశాలు ఏమిటి? వోటు హక్కు, ప్రాతినిధ్యం కల్పించవలసిన వర్గాల వివరాలు, నియోజకవర్గాలు, వోటింగ్ విధానం. భారత ప్రభుత్వ చట్టాన్ని పరిశీలించండి. ఆ చట్టం ఏం చేసింది? అల్పసంఖ్యాక వర్గాల వారికి కేటాయించవలసిన స్థానాల విషయాన్ని ప్రభుత్వ అభీష్టానికి ఈ చట్టం వదిలి పెట్టిందా? నియోజకవర్గాల విభజన విషయాన్ని ప్రభుత్వానికి అప్పగించిందా? అటువంటివి ఏవీ జరగలేదు. భారత ప్రభుత్వ చట్టంలో భాగంగానే శాసనమండలి ఆదేశాల ద్వారా ఆ విషయాలను నిర్ణయించారు. రాజ్యాంగ విషయాలను ఏ పద్ధతిలో నిర్ణయిస్తారో అదే పద్ధతిని మనం కూడా అనుసరించడం మంచిది. ఈ బిల్లుకు సంబంధించి నేను చేస్తున్న మొదటి విజ్ఞప్తి ఇది.

ఇతర విషయాలకు వస్తే, ఈ బిల్లుకు ఇన్‌చార్జి అయిన గౌరవనీయమంత్రి నుంచి నేను తెలుసుకోవాలనుకొంటున్న మొదటి విషయం ఇది. వివిధ అల్ప సంఖ్యాక వర్గాల వారికి స్థానాల కేటాయింపులో తాను అనుసరించాలనుకుంటున్న ప్రాతిపదిక జనాభాయేనని లక్ష్యాలు, కారణాల ప్రకటనలో ఆయన స్పష్టంగా చెప్పారు. అందుకు గాను ఆయనకు నేను కృతజ్ఞుడినై ఉంటాను.

అయితే, ఆయనను ఒక విషయం అడగాలనుకుంటున్నాను. వివిధ అల్ప సంఖ్యాక వర్గాలవారికి స్థానాల కేటాయింపులో అవలంబించాలనుకుంటున్న ప్రాతిపదికను లక్ష్యాలు, కారణాల ప్రకటనలో పేర్కొన్న మంత్రి దానిని బిల్లులోనే ఎందుకు చేర్చలేదు? లక్ష్యాలు, కారణాలు ప్రకటనలో ఉన్న ప్రాతిపదిక వల్ల మాకు ఒరిగే ప్రయోజనం ఏం ఉంది? అదే ప్రాతిపదికను కచ్చితంగా అవలంబిస్తారని ఎలా నమ్మాలి? మాకు ఎవ్వరి దాక్షిణ్యాలు అక్కర్లేదు. మా హక్కులు మాకు కావాలి. వాటిని ప్రభుత్వ అభీష్టానికి వదిలి పెట్టే ప్రశ్నేలేదు. చట్టంలోనే వాటిని కచ్చితంగా పేర్కొనవలసి ఉంటుంది. మేం ఆందోళన చెందుతున్న రెండవ అంశం ఏమిటంటే, నియోజకవర్గాల వ్యవస్థ, ఈ స్థానిక బోర్డుల ఏర్పాటు విషయంలో నియోజక వర్గ వ్యవస్థ ఎలా ఉంటుందో నేను తెలుసుకోగోరుతున్నాను. ఏక సభ్యనియోజక వర్గం ఉంటుందా? బహుళసభ్య నియోజక వర్గం ఉంటుందా? లక్ష్యాలు, కారణాల ప్రకటనలో కూడా ఈ అంశం గురించి ఏమీ చెప్పలేదు. ఎందుకని ? ఇక నుంచి ఏక సభ్యనియోజకవర్గ విధానాన్ని అవలంబించాలని ప్రభుత్వం భావిస్తున్నట్లయితే,ఆ విషయాన్ని మేం తెలుసుకోవలసి ఉంది. ఎందుకంటే, ఈ బిల్లుకి అనుకూలంగా వోటు చేయాలా? లేక వ్యతిరేకంగా వోటు చేయాలా? అనే అంశాన్ని ఆ విషయమే నిర్ణయిస్తుంది. అయితే, ఆ విషయ ప్రస్తావన ఎక్కడా లేదు.

నేను ఆందోళన చెందుతున్న మూడవ అంశం వోటింగ్ విధానం. ఏ రకమైన వోటింగ్ విధానాన్ని అనుసరిస్తారో స్పష్టం చేయలేదు. సభలోనే ఈ అంశాలన్నిటినీ స్పష్టం చేయాలని నేను కోరుతున్నాను. నేను అడిగిన అన్ని ప్రశ్నలకు గౌరవనీయ మంత్రి సమాధానం ఇస్తారని, నేను పేర్కొన్న సూత్రాలను బిల్లులో చేరుస్తారని ఆశిస్తున్నాను. తద్వారా మాత్రమే మా హక్కులు ఏమిటో మేం తెలుసుకోగలం. ఈ బిల్లులోని ప్రతి అంశం నిబంధనల ద్వారానే అమలు అవుతుందని పేర్కొన్నారు. కాని, ఆ నిబంధనలు ఏమిటో ఈ సభ ముందు ఉంచడానికి గౌరవనీయమంత్రి ప్రయత్నించలేదు. ఈ బిల్లుకు సంబంధించి కనీసం చేయవలసిన పని అదే. ఇది వరకే చెప్పిన విషయాలను మళ్లీ మళ్లీ చెప్పాలని నేను అనుకోవడంలేదు. ఈ బిల్లును పూర్తిగా రాజ్యాంగపరమైన విషయంగా భావిస్తున్నాను. కొన్ని పనులు నిర్వర్తించడానికి ఆఖరికి ప్రజలపై పన్నుల రూపంలో జరిమానా విధించడానికి, స్థానిక సంస్థలకు చట్టబద్ధమైన అధికారాలు అప్పగించడానికి సంబంధించిన విషయం ఇది. ఈ అధికారాలను ప్రభుత్వ సంస్థలకు ఇచ్చేముందు ప్రభుత్వం ఒక పని చేయవలసి ఉంటుంది. ఈ అధికారాలను ఉపయోగించడం ద్వారా ఏం చేసిందో సభకు వివరించడానికి ప్రభుత్వం అంగీకరించాలి. ఈ దశలో ఈ వ్యాఖ్యలతో ఇక నేను ముగిస్తున్నాను.

☆ ☆ ☆

# 26

# స్థానిక సంస్థల చట్ట సవరణ బిల్లు – 2*

***డా। అంబేద్కర్:*** అధ్యక్షా! ఈ సవరణను ప్రవేశ పెట్టినవారు వోటు ఎటు వేశారో తెలుసుకోవాలనుకుంటున్నాను. మీకు సమర్పించిన నివేదికలో చూసి ఆ విషయం చెప్పగలరా?

***గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:*** ఒక వ్యక్తి వోటు ఎటువేశారో తెలుసుకోవడానికి ఏ గౌరవనీయ సభ్యుడికైనా హక్కు ఉందేమో నేను తెలుసుకోవచ్చా?

***డా। అంబేద్కర్:*** సభ్యులు ఏవిధంగా వోటు వేశారో సభమాత్రమే కాదు, ప్రజలు కూడా తెలుసుకోవాలనే ఉద్దేశంతోనే ఈ ప్రశ్న అడిగాను.

***గౌరవనీయ సభాపతి:*** కేవలం ఒక గౌరవనీయ సభ్యుడి సమాచారం కోసం వోటింగ్‌లో పాల్గొన్న సభ్యుల జాబితాను మొత్తం పరిశీలించడం సాధ్యపడదు.

***డా। అంబేద్కర్:*** సవరణ ప్రవేశపెట్టిన గౌరవనీయ సభ్యుడు వోటు ఎటువేశారో తెలుసుకునే హక్కు సభకు ఉంది. ఎందుకంటే ఏ సభ్యుడైనా ఈ సభా విధానాలను దుర్వినియోగపరిచారేమో తెలుసుకునే హక్కు సభకు ఉన్నదని నేను భావిస్తున్నాను.

***గౌరవనీయ సభాపతి:*** గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ చెప్పిన విషయాల దృష్ట్యా, పరిస్థితిని స్పష్టం చేయవలసి ఉన్నదని నేను భావిస్తున్నాను. మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గాలను రద్దు చేయాలనే దృష్టితో శ్రీ ఫడకే సవరణను ప్రవేశపెట్టారు. ప్రత్యేక నియోజకవర్గాలను చెక్కుచెదరకుండా నిలబెట్టుకునే హక్కును మహమ్మదీయులకు ఇవ్వాలని బిల్లు ప్రతిపాదిస్తున్నది. ఆ హక్కును తొలగించాలనే లక్ష్యంతో గౌరవనీయ సభ్యుడు శ్రీ చంద్రీగర్ కూడా అదే విధమైన సవరణను ప్రతిపాదించారు. కాబట్టి ఇక్కడ ఏం జరిగిందంటే, ఈ గౌరవనీయ సభ్యులు ప్రతిపాదించిన రెండు సవరణలలో ఉన్న పదాలు -- ఒక్కటే అయినప్పటికీ, ఆ రెండింటి వెనుక ఉన్న ఉద్దేశం, లక్ష్యం ఒకటి కావు. గౌరవనీయ సభ్యుడు శ్రీ ఫడకే సవరణపై తొలుత కాకతాళీయంగా చర్చ జరిగింది. దాంతో, గౌరవనీయ సభ్యుడు శ్రీ చంద్రీగర్ తన సవరణను ప్రవేశపెట్టలేక పోయారు. అలాకాకుండా, గౌరవనీయ సభ్యుడు శ్రీ చంద్రీగర్ సవరణపై తొలుత చర్చ జరిగి ఉన్నట్లయితే, శ్రీ ఫడకే సవరణను ప్రవేశపెట్టడం వీలుకాకపోయేది. అటువంటి పరిస్థితిలో

---

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి 2, పేజీలు 501–02, : జనవరి 22, 1938.

ప్రభుత్వం తన మెజారిటీని నియంతృత్వ పద్ధతిలో ఉపయోగించుకోవాలని భావిస్తున్న దృష్ట్యా, నేటి సభాకార్యక్రమాలలో ఇక పాల్గొనకుండా మనం అంతా 'వాకౌట్' చేయడం ద్వారా మన అసంతృప్తిని ప్రకటించాలని నేను అభిప్రాయపడుతున్నాను.

గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్: రెండు మాటలు చెప్పే అవకాశాన్ని గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ నాకు ఇస్తారని ఆశిస్తున్నాను.

ఈ దేశంలో కులానికి సంబంధించిన భావన కూడా అమితంగా బాధపెట్టేవిషయం కావడం అత్యంత విచారకరమైన విషయం. మన భాష నుంచి 'అస్పృశ్య' అనే పదాన్ని తొలగించడానికి చాలా కాలంగా ప్రయత్నాలు జరుగుతున్న విషయం ఇండిపెండెంట్ లేబర్ పార్టీ గౌరవనీయ నాయకుడికి తెలుసు. ఎందుకంటే అత్యంత బాధాకరమైన విషయాలను, హిందూ మతానికి మచ్చ వంటివని సర్వులూ అంగీకరించిన విషయాలను ఈ పదం జ్ఞప్తికి తెస్తుంది. కేవలం పేరు మార్చడం ద్వారా మనం ఈ లక్ష్యాన్ని సాధించలేమని గౌరవనీయ సభ్యుడు శ్రీ గైక్వాడ్ అభిప్రాయం. నేను కూడా ఆయన అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను.'అంటరానితనం' అనే భావనను తొలగించడమే మన లక్ష్యం. 'పరిశిష్ట వర్గం' అనే ప్రత్యామ్నాయ పదాలను ఉపయోగించవచ్చునని అన్పించింది. అయితే, ఇంగ్లీషులోని 'షెడ్యూల్డు క్లాస్' అనే పదానికి 'పరిశిష్టవర్గం' అనే పదాలు అనువాదం. అందువల్ల, మరాఠీ భాషకు 'పరిశిష్ట వర్గం' అనే పదాలు ఏ మాత్రం సరిపోవని భావించాం. ఇంగ్లీషులోని 'షెడ్యూల్డు క్లాసెస్' అనే పదాలను వాడే బదులు వాటికి సమానార్థకమైన పదాలు వాడాలని మనం భావిస్తే, 'పరిశిష్ట వర్గాలు' అనే పదాలను ప్రత్యామ్నాయంగా అంగీకరించక తప్పదు. మిగిలిన హిందువుల నుంచి తమను వేరు చేసే ప్రయత్నాన్ని వారు అంగీకరించరని నేను పూర్తిగా అర్థం చేసుకోగలను. అయితే ఆ వర్గం వారి స్థితిగతులను మెరుగుపరిచే నిమిత్తం శాసనాలు తేవడానికైనా ఇతర హిందువులనుంచి వారిని వేరు చేయవలసి ఉంటుంది. వారిని మనం 'అస్పృశ్యులు' అనో, మరొక పేరుతోనో వ్యవహరించవచ్చు అయితే మిగిలిన హిందువుల నుంచి విభజించడానికి, వేరుగా పేర్కొనడానికి ఎన్ని తక్కువ పదాలు ఉపయోగిస్తే అంత మంచిది. గత 4, 5 సంవత్సరాలుగా దేశంలోని మొత్తంగా కాకపోయినా, అనేక ప్రాంతాల్లో 'హరిజన్' అనే పదం బాగానే వాడుకలోకి వచ్చింది. 'షెడ్యూల్డు క్లాస్' అనే పదానికి 'హరిజన్'ను ప్రత్యామ్నాయ పదంగా భావించవచ్చు. అయితే, ఇండిపెండెంట్ లేబర్ పార్టీ నాయకుడు గౌరవనీయ సభ్యుడు ఈ పదాన్ని ఆమోదించవలసి ఉంటుంది. ఈ సమస్యను ఆయన ఈ దృష్టితో చూడకపోవడం అత్యంత దురదృష్టకరం. అయితే, 'షెడ్యూల్డు క్లాస్' అనే పదాలకు తగిన విధంగా ప్రత్యామ్నాయ పదాలను ఆయనే సూచిస్తే, ఆయన మనస్సు గాయపడకుండా ఉండగలదేమోనని భావిస్తున్నాను. దురదృష్టవశాత్తూ 'అస్పృశ్యులు'గా వ్యవహరించబడుతున్న అనేక మంది ప్రజల మనసులను గాయపరిచే ఉద్దేశం మాకు ఎంత మాత్రం లేదని ఆయనకు విన్నవించుకుంటున్నాను. చాలాకాలంగా వాడుకలోకి వచ్చిన 'హరిజన్' అనే పదాన్ని గుర్తించడానికి చేసిన ప్రయత్నమే తప్ప, ఆయన వర్గం

ప్రజలను ఏ విధంగానూ చులకన చేయడం మా ఉద్దేశం కాదని ఆయనకు విజ్ఞప్తి చేస్తున్నాను.

***డా॥ అంబేద్కర్:*** అధ్యక్షా! ఇది ప్రసంగాలు చేయవలసిన సందర్భం కాదని మీరు రూలింగ్ ఇచ్చినందువల్ల నేను ఎటువంటి ప్రసంగం చేయను. నేను చెప్పదలచుకున్నదంతా ఇది. ఏ మంచి పదాన్నీ సూచించే పరిస్థితిలో నేను లేను. అయితే వాడుకలో 'హరిజన్' అనే పదం ఇప్పుడు 'అస్పృశ్య' అనే పదానికి సమానార్థకం అయి కూర్చుంది. 'హరిజన' అనే పదంలో ఇప్పుడు 'అస్పృశ్య' అనే అర్థం తప్ప మరొక అర్థం లేదు. 'షెడ్యూల్డు క్లాస్' అనే పదాలకు సమానమైన అర్థాన్ని 'హరిజన్' అనే పదం కూడా సంతరించుకున్నదని మేం భావిస్తున్నట్లే. గౌరవనీయ ప్రధానమంత్రి కూడా భావించినట్లయితే, ఆయన ఆ పదాన్ని తక్షణమే ఉపసంహరించుకుని ఉండవలసిందని నేను అభిప్రాయపడుతున్నాను. అలా ఉపసంహరించుకోవడం ఆయన బాధ్యత. ఆ పదానికి మరొక ప్రత్యామ్నాయ పదాన్ని కనుగొనడానికి తరువాత ఆయన మాతో చర్చించి ఉండవలసింది. అయితే, ఆయన చేసిన వాదనలు మాకు అటువంటి నమ్మకాన్ని, విశ్వాసాన్ని కలిగించలేదు. అందువల్ల, నేను సభ నుంచి బయటకు వెళ్ళిపోతున్నాను.

(డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్, ఇండిపెండెంట్ లేబర్ పార్టీకి చెందిన ఇతర సభ్యులు సభ నుంచి వాకౌట్ చేశారు).



# 27

# చిన్న రైతుల సహాయ బిల్లు - 1 *

డా॥ అంబేద్కర్: అధ్యక్షా! మీరు నాకు ఇచ్చిన 10 నిముషాలలో ఈ బిల్లుపై నేను చెప్పదలచుకున్నదంతా చెప్పగలనా, లేదా అని ఆందోళన చెందుతున్నాను. ఏదేమైనప్పటికీ, నాకు కేటాయించిన వ్యవధిలో పూర్తిచేయడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను.

ఈ ప్రెసిడెన్సీలో వ్యవసాయదారులు ఎదుర్కొంటున్న రెండు సమస్యలను పరిష్కరించడానికి ఈ బిల్లును ప్రతిపాదించారు. చెల్లాచెదురుగా పడిఉన్న పొలాలకు సంబంధించినది ఒక సమస్య కాగా, చిన్న పొలాలకు సంబంధించినది మరొక సమస్య. నా గౌరవనీయ స్నేహితుడు సెటిల్‌మెంట్ కమిషనర్ ప్రసంగాన్ని విన్న ఏ గౌరవనీయసభ్యుడూ చెల్లాచెదురు పొలాలు సమస్య కాదని అనలేరు. ఈ సమస్యను వీలయినంత త్వరగా పరిష్కరించాలని అంగీకరించితీరుతారు. చెల్లాచెదురు పొలాల వల్ల చాలా నష్టాలు ఉన్నాయని గౌరవనీయ స్నేహితుడు సెటిల్‌మెంట్ కమిషనర్ చెప్పిన అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నాను. ఆ విషయానికి సంబంధించినంత వరకు చెల్లాచెదురు పొలాలను కలపాలనే ప్రతిపాదన వరకు నేను బిల్లుతో ఏకీభవిస్తున్నాను. అయితే చిన్న పొలాల విషయానికి వస్తే, బిల్లును ప్రతిపాదించిన గౌరవనీయ స్నేహితుడి అభిప్రాయంతో విభేదిస్తున్నాను. చిన్నపొలాలు లాభదాయకంకాదని ఆయన అన్నారు. అధ్యక్షా ప్రస్తుతం ఉన్న పొలాలు ఎంత చిన్నవో వాటివల్ల వచ్చే సమస్యలు ఏమిటో చెప్పడానికి గౌరవనీయ సభ్యుడు శ్రీ అండర్సన్ మనను గణాంక వివరాలతో ముంచెత్తారు . చిన్న పొలాలవల్ల సమస్యలు ఉంటాయని నేనూ అంగీకరిస్తున్నాను. అయితే, చిన్న పొలాలు లాభదాయకం కాదనే అభిప్రాయాన్ని నేను అంగీకరించను. ఒక పొలం లాభదాయంగా, లేదా నష్టదాయకంగా ఉండడానికి ఆ పొలం విస్తీర్ణానికి మధ్య సంబంధం లేదని భావిస్తున్నాను. ఒక పొలం వల్ల వచ్చే లాభాలు కాని, నష్టాలు కాని ఉత్పత్తికి సంబంధించిన అనేక అంశాలతో ముడిపడి ఉంటాయి. శ్రమ, పెట్టుబడి వంటి అంశాలకు, పొలం లాభదాయకతకు సంబంధం ఉంటుంది. అధ్యక్షా! ఈ బిల్లుపై ఇదీ నా అభిప్రాయం. మన దేశంలో వ్యవసాయ ఉత్పత్తిని పెద్ద ఎత్తున చేపట్టడానికి పెట్టుబడి కుప్పలు తెప్పలుగా ఉందని, వ్యవసాయ పరికరాలు కూడా విపరీతంగా ఉన్నాయని బిల్లును ప్రతిపాదించిన సెటిల్‌మెంట్ కమిషనర్ చెప్పి ఉన్నట్లయితే బిల్లు పట్ల నా అభిప్రాయం మరొక విధంగా ఉండి ఉండేది. చిన్న పొలాలలో వ్యవసాయ పరికరాలను సమర్థవంతంగా ఉపయోగించడం వీలు పడనందున ఆయన అభిప్రాయంతో నేనూ ఏకీభవించేవాడిని.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 1, పేజీలు 607-10, అక్టోబర్ 10, 1927

అయితే అధ్యక్షా! గౌరవనీయ సభ్యుడు, సెటిల్‌మెంట్ కమీషనర్ అసలు ఆ విషయాలనే ప్రస్తావించ లేదు. రైతుల వద్ద బోలెడంత పెట్టుబడి ఉన్నదని, నాగళ్లు, ఎద్దులు పెద్దసంఖ్యలో ఉన్నాయని అయితే, పొలాలు చిన్నవి అయినందువల్ల వారు వాటిని ఉపయోగించ లేకపోతున్నారని ఆయన చెప్పి ఉన్నట్లయితే నేను సంతోషించి ఉండేవాడిని. సమస్యను పరిశీలించగా నాకు తెలిసినది ఏమిటంటే, రైతుల వద్ద అపారమైన పెట్టుబడి ఉండి, పొలాలు చిన్నవి అయినందువల్ల ఆ పెట్టుబడి అంతా వృధా అయ్యే పరిస్థితి ఎక్కడా లేదు. గౌరవనీయ సెటిల్‌మెంట్ కమీషనర్ చెప్పిన దానికి పూర్తిగా భిన్నమైన పరిస్థితి కనపడింది. అధ్యక్షా! ఉదాహరణకు చెప్పాలంటే, మద్రాసు ప్రెసిడెన్సీలో మూడు ఎకరాలకు ఒక నాగలి ఉంది. మన బొంబాయి ప్రెసిడెన్సీలో ఆరు ఎకరాలకు ఒక నాగలి ఉంది. పంజాబ్‌లో ప్రతిరెండు ఎకరాలకు ఒక నాగలి ఉంది. అధికార గణాంక వివరాల ఆధారంగానే నేను ఇవి చెప్తున్నాను. ఒక పొలం లాభదాయకంగా ఉందా, లేదా అనే విషయం ఆ పొలం విస్తీర్ణం పై కాక, ఆ రైతువద్ద ఉన్న పెట్టుబడి, పరికరాలపై ఆధారపడి ఉంటుందని నేను భావిస్తు న్నాను. అందువల్ల, ప్రస్తుత పరిస్థితులలో పొలాల విస్తీర్ణాన్ని ఇంకా తగ్గించడమే మంచిదని నా అభి ప్రాయం. నాకు ఎటువంటి సంకోచం లేదు. రైతులవద్ద తగినంతగా పెట్టుబడి, పరికరాలే లేనప్పుడు పొలాలను విస్తరించడం వల్ల ఏం ఉపయోగం ఉంటుందో నాకు అర్థం కావడం లేదు. ఆ రకంగా ఉత్పత్తి ఎలా పెరుగుతుందో నాకు తెలియడం లేదు.

మనది వ్యవసాయిక దేశమని, మన పొలాలు చాలా వరకు సారం కోల్పోయాయని కూడా మనం గుర్తు పెట్టుకోవలసి ఉంది. వేలాది సంవత్సరాలుగా మనం ఈ పొలాలను సాగుచేస్తున్నాం. మనం ఏ ప్రయత్నాలు చేసినా, మన పొలాల ఉత్పాదకతను అమెరికాలోని పొలాల ఉత్పాదకత స్థాయికి తీసుకెళ్లలేం. అమెరికాలో వ్యవసాయం చరిత్ర చాలా తక్కువ. ఆ విషయాన్ని మనం పరిగణనలోకి తీసుకోవాలి. అందువల్ల పొలాల విస్తీర్ణం పెంచడంవల్ల మన సమస్యకు పరిష్కారం దొరకదు అధ్యక్షా! మనకు ప్రస్తుతం ఉన్న పొలాలలోనే ఎక్కువ శ్రమను, ఎక్కువ పెట్టుబడిని ఉపయోగించడం వల్ల ఫలితం ఉంటుంది. అందువల్ల, పొలాల విస్తీర్ణం పెంచడానికి ఉద్దేశించిన బిల్లులోని భాగాలు అనవసరమైనవని నేను అభిప్రాయపడుతున్నాను. అధ్యక్షా! ఒకవేళ, చెల్లాచెదురుగా ఉన్న పొలాలను కలపడం, పొలాల విస్తీర్ణాన్ని పెంచడం నిజంగా అవసరమేనని అనుకున్నప్పటికీ, వాటిని సాధించడానికి బిల్లులో ఏ పద్ధతులను ప్రతిపాదించారో జాగ్రత్తగా పరిశీలించడం అవసరం. అధ్యక్షా! బిల్లులో ప్రతిపాదించిన విధానాలలో మొదటిది స్థిరాస్తుల విభజనను నియంత్రించడం కాగా రెండవది చెల్లాచెదురు పొలాలను జతచేసి అమ్మడం. అధ్యక్షా! ఈ రెండు పద్ధతులను అవలంబిస్తే, మన రైతుల్లో అధికసంఖ్యాకులు భూమిలేని వారు అయిపోతారన్న వాదనను కాదంటారని నేను అనుకోవడం లేదు. పేద వర్గాలవారిని మరింత దరిద్రులుగా మార్చడం మన దేశానికి మంచిది కాదు. అధ్యక్షా! హిందూచట్టం అనేకరకాలుగా లోపభూయిష్టంగా ఉన్నప్పటికీ, హిందూ వారసత్వ చట్టం మన ప్రజలకు ఎంతో అండగా నిలబడిందని నేను అభిప్రాయపడుతున్నాను. అధ్యక్షా! హిందూ ధర్మం నెలకొల్పిన సామాజిక, మత వ్యవస్థ ప్రజలలో అధిక సంఖ్యాకులను ఎడతెగని బానిసత్వంలోకి నెట్టింది. అధ్యక్షా! ఈ సామాజిక బానిసత్వానికి ఆర్థిక బానిసత్వాన్ని

కూడా చేర్చాలని కోరుకోరాదు. ప్రజలు ఒకవేళ సామాజిక స్వేచ్ఛ పొందలేకపోయినప్పటికీ, వారిని కనీసం ఆర్థిక స్వేచ్ఛను అయినా పొందనివ్వండి. న్యాయమైన వారసత్వ వ్యవస్థను రద్దుచేసే ప్రతిపాదనను ఈ ఉద్దేశంతోనే నేను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను. ఈ బిల్లును ప్రతిపాదించిన గౌరవనీయ సభ్యుడికి నేను ఈ దశలో సవినయంగా ఒక సూచన చేయదలచుకున్నాను. చెల్లాచెదురు పొలాలను జతచేయడానికి, చిన్న పొలాలను విస్తరించడానికి బిల్లులో ప్రతిపాదించిన పద్ధతులకు స్పష్టి చెప్పడానికి ఆయన అంగీకరిస్తే, బిల్లు మొదటి రీడింగ్ సమయంలో మద్దతు ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అధ్యక్షా! ప్రామాణిక ప్రాంతాలలో సహకార వ్యవసాయాన్ని ప్రవేశపెట్టి, చిన్న పొలాల రైతులు తమ వ్యక్తిగత యాజమాన్య హక్కులు కోల్పోకుండానే సహకార వ్యవసాయంలో చేరే విధంగా వారిని ఒప్పించడం మంచి పద్ధతి అని నేను భావిస్తున్నాను. ఇందుకు అనుగుణంగా బిల్లులో మార్పులు చేస్తే తప్పకుండా బిల్లును సమర్థిస్తాను. ( శ్రీ ఎఫ్.జి.హెచ్. అండర్సన్ తిరస్కార  సూచకంగా తలూపారు.) గౌరవనీయ సభ్యుడు, సెటిల్‌మెంట్ కమీషనర్ అయిన శ్రీ అండర్సన్ తల ఊపుతున్నారు. అయితే, నేను చేసిన సూచన నా సొంతంది కాదని, ఇటలీ, ఫ్రాన్స్, ఇంగ్లాండ్‌లలో అత్యంత ప్రయోగాత్మకంగా ఈ పద్ధతి అమలు అవుతున్నదని గౌరవనీయ సభ్యుడికి స్పష్టం చేస్తున్నాను. అధ్యక్షా! "ఇంప్రెషన్స్ ఆఫ్ది కో-ఆపరేటివ్ మూవ్‌మెంట్ ఇన్ ఫ్రాన్స్ అండ్ ఇటలీ" అనే పుస్తకం లో శ్రీ అట్టా రోత్ ఫెల్డ్ పేర్కొన్న విషయాలను జాగ్రత్తగా పరిశీలించ వలసిందిగా ఈ సందర్భంగా గౌరవనీయ సభానాయకుడిని గట్టిగా కోరుతున్నాను. ఆ పుస్తకంలోని ఒక పేరాను ఇక్కడ ఉదహరిస్తున్నాను.

"మొత్తం మీద ఈ ఉద్యమానికి మంచి ప్రగతి ఉంది. యుద్ధానంతరం ఫ్రాన్స్‌లో ఈ పద్ధతిని అమలు చేసి సత్ఫలితాలను సాధించారు. రుమేనియాలో కూడా ఇదే విధమైన సహకార పద్ధతి మొత్తం వ్యవసాయరంగాన్నే సమూలంగా మార్చి వేసింది. "లాభదాయకం కాని" పొలాలు, "మితి మీరిన ఆస్తుల విభజన" వంటి వివాదాస్పద సమస్యలు చుట్టుముట్టి ఉండే వ్యవసాయాన్ని మెరుగు పరచడం సహకార పద్ధతి ద్వారా సాధ్యం అవుతుంది".

సాంప్రదాయకమైన వారసత్వహక్కుల విషయంలో జోక్యం చేసుకోకుండా ఉండేందుకు ఇటువంటి పద్ధతి సహాయపడుతుంది. అనేక మంది సంస్కరణవాదులు కూడా ఈ పద్ధతిని తరచూ సిఫార్సు చేస్తూనే ఉన్నారు. అధ్యక్షా! ఈ పద్ధతిని అనేక చోట్ల ప్రయోగించి, ఫలితాలు సాధించారు. గౌరవనీయ సభానాయకుడు ఈ సూచనలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించడానికో; సెలక్ట్ కమిటీలో చేసే సవరణలు సూత్రాలకు సంబంధించినవనే  కారణంతో వాటికి అభ్యంతరం చెప్పకుండా ఉండడానికో; బిల్లులో పేర్కొన్న విధానాలకు స్పష్టి చెప్పడానికో అంగీకరిస్తే, బిల్లు మొదటి రీడింగ్‌ను సమర్థించడానికి నాకు ఎటువంటి అభ్యంతరం లేదని స్పష్టం చేస్తున్నాను. ఇంతటితో నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను.

☆ ☆ ☆

# 28

# చిన్న రైతుల సహాయ బిల్లు – 2*

## (అసమ్మతి పత్రాలు)

### బొంబాయి శాసనమండలి సమావేశాలపై శాసనమండలికి కార్యదర్శి నివేదిక, శాసనమండలి కార్యాలయం, పూనా, జూలై 10, 1928

నెం. 894 : 1927 నాటి 26వ నెంబరు బిల్లు (వ్యవసాయ భూముల మితిమీరిన ఉప విభజనను నివారించి, చెల్లాచెదురు పొలాల విలీనాన్ని పెంపొందించడానికి ప్రవేశపెట్టిన చట్టం)పై సెలక్ట్ కమిటీ రూపొందించిన నివేదికపై[1] ఎం.ఎల్.సి. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ సంతకం చేస్తూ కొన్ని అసమ్మతి వ్యాఖ్యలను జోడించారు. జూన్ 30, 1928న వెలువడిన బొంబాయి ప్రభుత్వగెజెట్ 5వ భాగంలోని 34-49 పేజీలలో సెలక్ట్ కమిటీ నివేదికను ప్రచురించారు. ఆ నివేదికకు డాక్టర్ అంబేద్కర్ జోడించిన అసమ్మతి వ్యాఖ్యలు ఈ కింది విధంగా ఉన్నాయి.

(ఎం. ఎల్.సి. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ చేసిన అసమ్మతి వ్యాఖ్యలు)

1. లాభదాయకమైన వ్యవసాయంకోసం ప్రస్తుతం ఉన్న పొలాలకంటే మరింత పెద్ద పొలాలు ఉండటం అవసరమనే ఊహతో ఈ బిల్లులోని మొదటి భాగం ప్రారంభం అవుతుంది. ఈ ఊహ సరియైనదని నేను ఎంత మాత్రం భావించడం లేదు. ఒకవేళ ఈ ఊహ సరియైనదేనని అనుకున్నప్పటికీ, ఈ మొదటి భాగానికి ఆమోదం తెలిపే ముందు ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసిన ప్రధాన విషయం ఒకటి ఉంది. "చిన్న పొలాలను పెద్ద పొలాలుగా మార్చే సమస్యను ఎటువంటి తీవ్రమైన అభ్యంతరాలు రాని పద్ధతిలో ఈ బిల్లు పరిష్కరించగలదా?

2. ఒకసారి ప్రామాణిక యూనిట్‌గా నిర్ణయించిన పొలం విస్తీర్ణాన్ని పరిరక్షించడానికి బిల్లులో ప్రతిపాదించిన విధానం రెండు అంశాలతో కూడినది. ప్రామాణిక యూనిట్ కంటే తక్కువ విస్తీర్ణం గల చిన్న పొలాల రైతులపై పెద్ద మొత్తంలో జరిమానా విధించడం మొదటి అంశం. అంటే చిన్న పొలం ఉండటం అనేది ఇంతో అంతో ప్రయోజనం చేకూర్చేదిగా కాక, రైతుకి భారంగా తయారవుతుందన్నమాట. రెండవ అంశం ఏమిటంటే, చిన్న పొలాల యాజమాన్యాన్ని నిషేధించడం

---

* బొంబాయి ప్రభుత్వ గజిట్, 5వభాగం, పేజీలు 64-65, జూలై 12, 1928.

అంటే భవిష్యత్తులో అసలు చిన్న పొలాలను ఉనికిలోకి కూడా రాకుండా చేయడం అన్నమాట. పొలం పంపకంపై నిషేధంగా మనం దీనిని అర్థం చేసుకోవచ్చు. అందువల్ల, బిల్లులో ప్రతిపాదించిన విధానాలు ప్రజల యాజమాన్య హక్కులకే ప్రమాదకరంగా తయారవుతాయి..

3. ఈ విధానాలను నేను మూడు కారణాలపై వ్యతిరేకిస్తున్నాను. మొదటగా, ఇవి ఆస్తిహక్కును దెబ్బతీస్తున్నాయి. వ్యవసాయ భూములు ప్రభుత్వ యాజమాన్యంలో, ప్రభుత్వ నిర్వహణలో ఉన్నట్లయితే, ఆస్తిహక్కుకు విఘాతం వాటిల్లడం అనేది తీవ్ర సమస్యగా ఉండేదికాదు. అయితే, ఇక్కడ జరిగేది ఏమిటంటే, కొంతమంది భూస్వాములు మిగిలిన చిన్న రైతులు భూముల కాజేసి, ఇంకా ధనవంతులై పోవడం, భూమి కలిగిఉన్న రైతులను భూమిలేని కూలీలుగా మార్చడానికే ఈ విధానాలు దోహదపడతాయనే విషయంలో నాకు ఎటువంటి సందేహం లేదు. ఇలా ఎంతమంది రైతులు కూలీలుగా మారుతారో ఊహించడం చాలా కష్టం. 'ప్రామాణిక యూనిట్'గా ఎంత విస్తీర్ణాన్ని నిర్ణయిస్తారనే అంశంపై మిగిలిన ప్రతి అంశం ఆధారపడి ఉంటుంది. వాస్తవంగా ఉన్న పొలాల విస్తీర్ణం కంటే 'ప్రామాణిక యూనిట్' విస్తీర్ణం ఎక్కువగా ఉంటే అధిక సంఖ్యలో రైతులు నష్టపోతారు. ఎంత మంది రైతులు నిరాశ్రయులు అవుతారో ఎవరూ చెప్పలేం. 'ప్రామాణిక యూనిట్' ను నిర్ణయించిన తరువాతనే ఆ విషయం తెలుస్తుంది. రైతులలో అధిక సంఖ్యాకులు చిన్న పొలాల యజమానులనే వాస్తవంలో నుంచి భయం జనిస్తున్నది. బిల్లును వ్యతిరేకిస్తున్నది ఈ భయంతోనే. బిల్లును వ్యతిరేకించడానికి తగిన కారణం ఏదీ లేదని అంటే అంగీకరించడానికి నేను సిద్ధంగా లేను. సమాజ ఆర్థిక పునాదులలో అంత పెనుమార్పులు కలుగుతుంటే ప్రశాంతంగా చూస్తూ ఉండలేను.

4. బిల్లులోని విధానాలకు నేను వ్యతిరేకించడానికి గల రెండవ కారణం ఏమిటంటే, ఈ విధానాలను అమలు చేయడానికి ఏర్పాటు చేసే యంత్రాంగం తన కర్తవ్యాన్ని నెరవేర్చలేదు. అందువల్ల, ఎలా ఉన్న పరిస్థితులు అలాగే ఉంటాయి.

ఒక చిన్న పొలం పక్కన ఉన్న పొలాల యజమానులకు మాత్రమే ఆ పొలాన్ని కొనే హక్కు ఇవ్వబడుతోంది. అయితే, ఆ చిన్న పొలం యజమాని దాన్ని అమ్మాలనుకున్నప్పుడే, ఆ యజమాని చెప్పే ధరకు వారు అంగీకరించినప్పుడే ఈ హక్కు అమలులోకి వస్తుంది. అయితే, ఈ హక్కు అసలు అమలులోకి వచ్చే అవకాశమే ఉండకపోవచ్చు. ఎందుకంటే, చిన్న పొలం యజమాని తన పొలాన్ని అమ్మాలనుకోకపోవచ్చు. ఒక వేళ అమ్మదలచుకున్నా, ఇరుగుపొరుగు పొలాల యజమానులు ఆయన చెప్పే ధరను అంగీకరించలేకపోవచ్చు. ఈ రెండింటిలో ఏది జరిగినా చిన్న పొలాలు కొనసాగుతూనే ఉంటాయి. చిన్న పొలాలను వీలయినంత త్వరగా కలిపి పెద్ద పొలాలుగా చేయాలని ఎన్ని ప్రయత్నాలు చేసినా అది సాధ్యం కాకపోవచ్చు.

5. అంతేకాక, బిల్లులోని మొదటి భాగంలో పేర్కొన్న విధానాలు బిల్లు ఉద్దేశాలను నెరవేర్చలేవు.

ప్రస్తుతం మాదిరిగా కాకుండా, ఒకే రైతు యాజమాన్యం లోకి పెద్ద పొలాలను తీసుకుని రావడం బిల్లు ఉద్దేశం. వివిధ రైతుల ఆధీనంలోని చిన్న పొలాలను కలపడం సాధ్యమైనప్పటికీ మనం అక్కడే ఆగిపోవలసివస్తుంది. ఎందుకంటే, వాటి సమిష్టి సేద్యానికి ఒకే రైతు యాజమాన్యం అవసరమని నిరూపణ కాలేదు. ఆ విధంగా ఒకే రైతు యాజమాన్యం కింద వాటిని తీసుకుని రావడానికి ప్రయత్నించలేదు. ప్రామాణిక విస్తీర్ణంతో సహకార క్షేత్రాలను ఏర్పాటు చేస్తే బిల్లులోని ఉద్దేశాలు నెరవేరుతాయని గట్టిగా చెప్పగలను. ఆ విధానంలో అయితే చిన్న రైతులు కూడా నష్టపోరు. రైతుల యాజమాన్యం చెక్కు చెదర కుండా ఉంటుంది. అయితే, ప్రామాణిక విస్తీర్ణం కలిగిన సహకార క్షేత్రంలో తమ పొలాన్ని సేద్యం చేసుకునే అవకాశం రైతులకు ఉండదు. అంతేకాక, బదలీలపై, ఆస్తి పంపకాలపై బిల్లు విధింప చూస్తున్న నిషేధాలు, నిబంధనలతో కూడా అవసరం ఉంది. సహకారం క్షేత్రం వాటాదారులతో కంపెనీ తరహాలో ఉంటుంది. వాటాదారులుమారినా కంపెనీ కొనసాగినట్లు, సహకార క్షేత్రం కొనసాగుతుంది. ఈ విధానం చాలా సరళమైనది. ప్రస్తుతం ప్రతిపాదనలో ఉన్న బిల్లులోని లోపాలు అందులో ఉండవు.

6. అటువంటి పద్ధతికి ఏ విధమైన అభ్యంతరం ఉండనక్కర లేదు. వాస్తవానికి వస్తే, అటువంటి అనేక యూరప్ దేశాలలోను, ప్రత్యేకించి ఇటలీలోను అమల్లో ఉంది. అయితే, నేను పేర్కొన్న పథకానికి మద్దతు కోసం అంతదూరం వెళ్లడం కూడా అనవసరమే. నేను సూచించిన విధానాన్ని బిల్లు కూడా పాక్షికంగా అంగీకరిస్తున్నదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. సెలక్ట్ కమిటీ సవరించిన బిల్లులోని 21 వ క్లాజు అసలు బిల్లులోని 19వ క్లాజును సరిపోల్చవచ్చు. ఇందులో ఉన్న అంశాలు నేను సూచించిన సహకార విధానాన్ని పోలినవే. దానికి సంబంధించి నాకు సెలక్ట్ కమిటీకి మధ్య ఉన్న ఒకే ఒక విభేదం ఏమిటంటే, కొత్త పొలాలకు సహకార పథకం వర్తించదని సెలక్ట్ కమిటీ పేర్కొన్నది. అయితే, అన్ని పొలాలకు ఆ విధానం వర్తించాలని నేను ప్రతిపాదిస్తున్నాను. పాత, కొత్త పొలాల మధ్య ఇలాంటి తేడా చూపడం సమంజసంగా కనపడటం లేదు.

7. బిల్లు లక్ష్యాలకు నేను వ్యతిరేకం కాకపోయినప్పటికీ, పైన పేర్కొన్న కారణాలవల్ల బిల్లులోని మొదటి భాగాన్ని నేను సమర్థించలేను. బిల్లులోని రెండవ భాగం పట్ల నాకు ఎటువంటి అభ్యంతరం లేదు.

☆ ☆ ☆

# చిన్న రైతుల సహాయ బిల్లు – 3*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం)* : అధ్యక్షా! ఒక ప్రశ్న అడగాలను కుంటున్నాను. ఎందుకంటే, 19వ నిబంధన నాకు సరిగా అర్థం కాలేదు. ఒక సవరణకు కాని, బిల్లుకు కాని ముందుగా అనుమతి పొందడం అవసరమా, కాదా అనే విషయాన్ని స్పీకర్ నిర్ణయిస్తారు. ఈ బిల్లు కూడా అటువంటి విషయమే. "ముందుగా అనుమతి అవసరమని స్పీకర్ అభిప్రాయపడినట్లయితే, నోటీసు అందగానే బిల్లును కాని, సవరణనుకాని స్పీకర్ గవర్నర్‌కు నివేదిస్తారు. అనుమతి ఇచ్చినట్లు గవర్నర్ స్పీకర్‌కు తెలియజేయని పక్షంలో కార్యక్రమాల జాబితాలో ఆ బిల్లును కాని, సవరణను కాని ఉంచడం జరగదు" అని 19వ నిబంధనలోని రెండవ క్లాజు పేర్కొంటున్నది. మూడవ క్లాజు ఇలా నిర్దేశిస్తున్నది.

"ముందుగా అనుమతి లేనిదే ఒక బిల్లుని కాని, సవరణను కాని ప్రవేశపెట్టవచ్చా, లేదా అన్న సమస్య ఏర్పడితే, అవసరమైన సందర్భంలో ముందుగా అనుమతి ఇచ్చే అధికారం గల అధికారికి విషయాన్ని నివేదించాలి. ఆ విషయంలో ఈ అధికారి తీసుకునే నిర్ణయమే తుది నిర్ణయం."

ఒక సవరణకు కాని, బిల్లుకి కాని నోటీసు ఇచ్చిన సభ్యుడికి, స్పీకర్‌కు మధ్య తలెత్తే సమస్యను రెండవ క్లాజు పేర్కొంటున్నది. ఒక సవరణకు కాని, బిల్లుకి కాని నోటీసు ఇచ్చిన సభ్యుడు తన సవరణకు లేదా బిల్లుకు ముందుగా అనుమతి అవసరం లేదని భావించినట్లయితే, ఆ విషయాన్ని తుది అధికారి గవర్నర్‌కు నివేదించే హక్కును మూడవ క్లాజు ఇస్తున్నది. ఈ విషయం చాలా ముఖ్యమైనది అయినందువల్ల దానిపై ఈ సభలో చర్చ జరగాలని నేను కోరుకుంటున్నాను. అయితే, నేను ఇప్పుడు ఏ బిల్లుని కాని, ఏ సవరణను కాని ప్రతిపాదించనందున ఈ విషయంతో నాకు ప్రత్యక్ష సంబంధం ఏమీ లేదని నిర్మొహమాటంగా చెప్తున్నాను. బిల్లులను ప్రవేశ పెట్టేందుకు మాకు గల హక్కులను భారత ప్రభుత్వ చట్టం పరిమితం చేసింది. అందువల్ల 19వ నిబంధన ప్రకారం స్పీకర్‌దే అత్యున్నత అధికారమని, ముందుగా అనుమతి ఇచ్చే అధికారం కలిగిన అధికారికి అప్పీలు చేసుకునే హక్కు సభ్యులకు లేదని మీరు అభిప్రాయపడుతున్నారా? ఈ విషయాన్ని నేను తెలుసుకోవాలనుకుంటున్నాను.

నా గౌరవనీయ స్నేహితుడు ఈ బిల్లుకి అనుమతి కోరిన నేపథ్యంలో భారత ప్రభుత్వ

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 2, పేజీలు 617–19, జనవరి 24, 1938

చట్టంలో 299 వ సెక్షన్‌ను, మూడవ సబ్‌సెక్షన్‌ను ఇక్కడ ప్రస్తావించడానికి నాకు అనుమతి ఇవ్వండి.

**గౌరవనీయ సభాపతి:** ముందు రెండు విషయాలను స్పష్టం చేయాలి. ఒక సభ్యుడికి , స్పీకర్‌కి మధ్య సమస్య ఏర్పడితే, స్పీకర్‌దే తుది అధికారమని 19వ నిబంధనను విశ్లేషించుకోవడానికి సంబంధించి గౌరవనీయ సభ్యుడు శ్రీ పరులేకర్ సందేహాన్ని వ్యక్తం చేశారు. అది ఒక విషయం. 19వ నిబంధనపై నేను నా విశ్లేషణను స్పష్టం చేశాను. గౌరవనీయ సభ్యుడు శ్రీ పరులేకర్ ప్రవేశపెట్టిన ఒక సవరణకు 299 (3) సెక్షన్ కింద ముందుగా అనుమతి అవసరమా, కాదా అనేది విషయం.

ఆయన సవరణపై సభలో ఎటువంటి చర్చ జరగాలని నేను భావించడం లేదని గౌరవనీయ సభ్యుడికి నేను ఇది వరకే తెలియజేశాను. ఆ అంశంపై నేను ఇదివరకే ఒక అభిప్రాయానికి వచ్చాను. 19వ నిబంధనలోని 3వ ఉపనిబంధన విశ్లేషణపై గౌరవనీయ సభ్యుడు ఏదయినా వాదన చేస్తే, వినడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

భారత ప్రభుత్వ చట్టంలోని 299 (3) సెక్షన్ పరిధిలోకి ఈ బిల్లు రాదని చెప్పడానికి నాకు అనుమతి ఇవ్వనిదే, 19 (3) నిబంధన విశ్లేషణపై వాదించడం వృధా. ఒక సభ్యుడు ప్రవేశ పెట్టిన సవరణను తిరస్కరిస్తే, గవర్నర్‌కు అప్పీలు చేసుకునే హక్కును 19 (3) నిబంధన ఆ సభ్యుడికి ఇస్తుందని నేను మిమ్మలను ఒప్పించాలంటే, అప్పుడు 299 (3) సెక్షన్‌ను పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుందని కోరుతున్నాను. భారత ప్రభుత్వ చట్టంలోని 299 (3) సెక్షన్‌ను చదివితే నాకు కలిగిన అభిప్రాయం ఏమిటంటే, తిరస్కారానికి గురైన బిల్లును ప్రవేశపెట్టిన సభ్యుడు అత్యున్నత అధికారి నుంచి తుది అనుమతిని పొందే వరకు బిల్లును వాయిదా వేయవలసి ఉంటుంది. ఎందుకంటే, బిల్లులోని అతి ముఖ్యమైన అంశాలను సభ్యుడు చర్చించడాన్ని కూడా ఈ సెక్షన్ నిరోధిస్తుంది. మొత్తం విషయాన్నే ఇది పక్కకు పెడుతున్నది. మీరు నాకు అవకాశం ఇస్తే, ఆ విషయాన్ని నిరూపిస్తాను. ఈ సెక్షన్‌ను నేను పూర్తిగా పరిశీలించాను. 299(3)సెక్షన్ పరిధిలోకి ఈ బిల్లు కాని, గౌరవనీయ స్నేహితుడు శ్రీ పరులేకర్ లేదా పార్టీ సభ్యులు ప్రవేశ పెట్టిన సవరణలు కాని రావు. మీరు నాకు అనుమతి ఇస్తే, రెండు నిముషాల్లో మీకు చూపిస్తాను.

**గౌరవనీయ సభాపతి :** సభ్యులు విడివిడిగా ప్రవేశపెట్టిన సవరణలకు సంబంధించి నేను ఇప్పటికే ఒక నిర్ణయం తీసుకున్నాను. ఏదయినా ప్రత్యేక సవరణ జోలికి కాని, .నేను ఇదివరకు ఇచ్చిన రూలింగ్ జోలికి కాని వెళ్లకుండా ఈ బిల్లు 299 సెక్షన్ పరిధిలోకి ఏ విధంగా రాదో గౌరవనీయ సభ్యుడు చెప్పదలచుకుంటే అది వేరే విషయం. అయితే, ఆ విషయంపై నేను ఆయన వివరణను వినదలచుకున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! అందుకు మీకు కృతజ్ఞుడినై ఉంటాను.

అధ్యక్షా! నేను ఇదివరకే చెప్పినట్లు ఈ బిల్లు పూర్తిగా ఒక సహాయక చర్య వంటిది. ఒక వ్యక్తి కోర్టు నుంచి ఒక ఆదేశాన్ని పొందవచ్చు. అంటే మరొక వ్యక్తికి వ్యతిరేకంగా ఆయన ఈ ఆదేశం ద్వారా కొన్ని హక్కులు పొంది ఉండవచ్చు. ఒక రుణగ్రస్తుడికి కాని, మరొక వ్యక్తికి కాని వ్యతిరేకంగా కోర్టునుంచి ఆదేశం పొందిన ఫలితంగా ఒక వ్యక్తి ఏ హక్కులూ పొందినప్పటికీ, ఒక కచ్చితమైన తేదీ వరకు అంటే మార్చి 31, 1939 వరకు ఆ హక్కులను అమల్లో పెట్టరాదని ఈ బిల్లు చెప్తున్నది. ఈ బిల్లులోని సారాంశం అంతా ఇదేనని నా అభిప్రాయం. అందువల్ల, ఈ బిల్లు హక్కులను ఆచరణలో పెట్టడానికి సంబంధించినది. హక్కుల రద్దుతో కాని, హక్కుల సవరణతో కాని ఈ బిల్లుకి ఎటువంటి సంబంధం లేదు. నా మొదటి వివరణ ఇది. ఒక వ్యక్తి పొందిన హక్కును రద్దు చేయడం లేదా సవరించడానికి, ఆ హక్కు అమలును వాయిదా వేయడం లేదా కొంతకాలం నిలిపి వేయడానికి మధ్య ఉన్న తేడాను నేను చూపిస్తాను.

రెండవ విషయం ఏమిటంటే, భూమి హక్కులను రద్దు చేయడం లేదా సవరించడానికే 299(3)సెక్షన్ పరిమితమైంది. అయితే, ఇప్పుడు ఈ సెక్షన్ భూమి హక్కులకు మాత్రమే కాక, రుణాలు, కౌలుదారులను ఖాళీ చేయించడం వంటి అంశాలకు కూడా వర్తిస్తుంది.

నేను చూపాలనుకుంటున్న తేడా ఇది : ఒక హక్కు అమలును కొంతకాలం నిలిపి వేయడానికి, ఆ హక్కును రద్దు చేయడం లేదా సవరించడానికి మధ్య చాలా తేడా ఉంది. కోర్టులు ఇచ్చిన ఆదేశాల ద్వారా వ్యక్తులు పొందిన హక్కులను కొంతకాలం నిలిపి వేయడమే బిల్లు లక్ష్యం కాబట్టి, భూమికి సంబంధించిన హక్కులను రద్దు చేయడం లేదా సవరించడం ఈ బిల్లు పరిధిలోకి రాదని చెప్పవచ్చు. అందువల్ల, భూమి హక్కులను రద్దు చేయడం లేదా సవరించడం వంటి అంశాల జోలికి వెళ్లని ఈ బిల్లుకాని, సవరణలు కాని 299(3) సెక్షన్ పరిధిలోకి రావని నేను విన్నవించుకుంటున్నాను.

* ***డా॥ అంబేద్కర్ :*** గౌరవనీయ గవర్నర్ సమర్పించిన సవరణలకు ఇంకా అనుమతి ఇవ్వనందున, బిల్లుపై చర్చను మీరు వాయిదా వేస్తారా? బిల్లుకి అనుమతి ఇచ్చిన విధంగానే, సవరణలకు కూడా ఆయన అనుమతి ఇవ్వవచ్చు. అలాంటి పక్షంలో ఏం జరుగుతుంది?

***గౌరవనీయ సభాపతి :*** సభకు సమర్పించిన ప్రతి సవరణపై చర్చ జరిగేలా చూడటం నాకూ సంతోషకరమే. అనుమతి లేదనే కారణంపై ఏ సవరణపై చర్చ ఆపడం జరగదు. బిల్లు చాలా కాలంగా వారి ముందు ఉంటే! చివరికి ఈ రోజు 12 గంటల సమయంలోనో ఒంటి గంట సమయంలో సభ్యులు సవరణలు ప్రతిపాదించారు. అటువంటి పరిస్థితి వల్ల ఎదురయ్యే ఇబ్బందులు గురించి

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి 2, పేజీ : 621, జనవరి 24, 1938.

అందుకే నేను ప్రస్తావించాను. అందువల్లనే, సవరణలను వీలయినంత త్వరగా సమర్పించాలని నేను చెప్పాను. ఈ రోజు ముగ్గురు గౌరవనీయ సభ్యులు సవరణలు సమర్పించారు. వాటన్నిటిని పరిశీలించి, ముందుగా అనుమతి అవసరమైన సవరణలు ఏవయినా ఉన్నాయా లేదా అని నిర్ణయించడం కష్టమైన విషయం. అందువల్ల, ఈ రోజు సమర్పించిన సవరణలను ప్రవేశపెట్టడానికి ఆమోదం తెలపడం సాధ్యం అవుతుందో, కాదో నాకు తెలియదు. అయితే, ఇదివరకటి సవరణలకు సంబంధించినంత వరకు మాత్రం వాటిని ప్రవేశ పెట్టడానికి సభ్యులు అవకాశం పొందేలా చూడడానికి కచ్చితంగా ప్రయత్నిస్తాను.



# 30

# బొంబాయి పోలీసు చట్ట సవరణ బిల్లు – 1*

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :***

అధ్యక్షా! మన ముందు ఉంచిన బిల్లుకు ఈకిందిసవరణను ప్రవేశపెట్టడానికి అనుమతి కోరుతున్నాను.

(2బి) సబ్‌సెక్షన్ తరువాత ఈ కింది భాగాన్ని చేర్చాలి :

"(2సి) (i) వివిధ మతాలు లేదా వర్గాలు లేదా ముఠాల మధ్య ఘర్షణల కారణంగా బొంబాయి నగరంలో లేదా మరే ప్రాంతంలో కాని శాంతి, భద్రతలకు విఘాతం కలిగిందని లేదా కలగవచ్చని ప్రావిన్షియల్ ప్రభుత్వం అభిప్రాయపడినట్లయితే, అత్యవసర పరిస్థితి నెలకొన్నదని అధికార గెజిట్‌లో ప్రకటించవచ్చు.

(ii) అత్యవసర పరిస్థితిని విధించడం.

(a)ఏ సమయంలోనయినా మరొక ప్రకటన ద్వారా రద్దు చేయవచ్చు.

(b) నెలరోజులు గడవక ముందే పొడిగించని పక్షంలో నెల రోజులు పూర్తి అయ్యాక అత్యవసర పరిస్థితి రద్దు అయిపోతుంది.

(iii) పైన పేర్కొన్న (i)క్లాజు కింద ప్రావిన్షియల్ ప్రభుత్వం అత్యవసర పరిస్థితిని ప్రకటించిన తరువాత బొంబాయి నగరంలోని ఏ వ్యక్తి ఉనికికాని, కదలికలు కాని, చర్యలు కాని ప్రమాదానికి దారితీస్తున్నట్లయితే, లేదా ప్రమాదానికి దారితీస్తాయనే అభిప్రాయం కలిగితే, లేదా శాంతి భద్రతలకు భంగం కలిగించే కుట్రలను ఆ వ్యక్తి పన్నుతున్నాడని సహేతుకమైన సందేహం కలిగినప్పుడు కాని, మరొక విధంగా కాని ఆదేశించడానికి పోలీసు కమిషనర్‌కు అధికారం ఉంది. శాంతి భద్రతలకు భంగం వాటిల్లని రీతిలో వ్యవహరించవలసిందిగా లేదా ఫలానా సమయంలోపల ఫలానా మార్గాల గుండా ఫలానా ప్రదేశానికి వెళ్లిపోవలసిందిగా పోలీసు కమిషనర్ ఆ వ్యక్తిని ఆదేశించవచ్చు.

(iv) పైన పేర్కొన్న (iii) వ క్లాజు కింద పోలీసు కమిషనర్ ఇచ్చిన ఆదేశం వల్ల బాధితుడైన ఏ వ్యక్తి అయినా ఆ ఆదేశం జారీ చేసిన తేదీ నుంచి పది రోజులలోపు ప్రావిన్షియల్ ప్రభుత్వానికి

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2425, ఏప్రిల్ 27, 1938

అప్పీలు చేసుకోవచ్చు.

(V) పైన పేర్కొన్న (iv) క్లాజు కింద ఏ వ్యక్తి అయినా ప్రావిన్షియల్ ప్రభుత్వానికి అప్పీలు చేసుకుంటే తప్ప, (iii) క్లాజు కింద పోలీసు కమిషనర్ ఇచ్చిన ఆదేశమే తుది ఆదేశం.

(vi) తనకు సమాచారం అందించిన వర్గాల గురించి లేదా సమాచారం అందించిన ఏ వ్యక్తిని అయినా గుర్తుపట్టడానికి దోహదం చేసే సమాచారం గురించి కోర్టుకి కాని, (iii) క్లాజు కింద ఆదేశం అందుకున్న ఏ వ్యక్తికీ కాని ఏ పోలీసు అధికారి వెల్లడించనవసరం లేదు.

(vii) పైన పేర్కొన్న (iii) క్లాజు కింద పోలీసు కమిషనర్ జారీ చేసిన ఆదేశం కాని, (iv) క్లాజు కింద ప్రావిన్షియల్ ప్రభుత్వం జారీ చేసిన ఆదేశం కాని అత్యవసర పరిస్థితి కాలపరిమితి ముగిసిన తరువాత అమలులో ఉండవు."

(2) సబ్-క్లాజు తరువాత ఈ కింద పేర్కొన్న సబ్‌క్లాజును చేర్చాలి :

(3) సబ్ - సెక్షన్ (3) లోని "లేదా (2ఎ)" అనే పదాలకు బదులుగా ఈ కింది వాటిని చేర్చాలి: "(2ఎ) లేక (2సి)".

సవరణను ప్రతిపాదించాను.

★ ★ ★

* ***డా॥ అంబేద్కర్ :*** అధ్యక్షా! నేను ప్రవేశ పెట్టిన సవరణ వల్ల కలిగే ప్రయోజనాలను వివరించే ముందు అసలు ఈ సవరణ అవసరం ఏమిటో సభకు తెలియ జేయడం మంచిదని భావిస్తున్నాను. బిల్లును ప్రవేశ పెడుతూ గౌరవనీయ హోం మంత్రి ఇలా పేర్కొన్నారు. సమాజంలోని బలహీన వర్గాలపై ఆధిపత్యం చెలాయించి అణచి వేసే కొంతమంది అవాంఛనీయ వ్యక్తుల బారిన పడి బొంబాయినగరం, నగర ప్రజలు బాధితులుగా మారారని; అటువంటి ప్రమాదకరమైన వ్యక్తులను పట్టించి శిక్ష పడేలా చూసేందుకు తగిన కృతనిశ్చయం కాని, కోర్టుకు వెళ్లాలనే కోర్కెకాని సమాజంలోని బలహీనవర్గాల ప్రజలకు లేదని; అందువల్ల ఈ ప్రజల ప్రయోజనార్థం పోలీసు కమిషనర్‌కు తగిన అధికారం ఇస్తే, ఆయన ఇటువంటి వ్యక్తులపై చర్య తీసుకోగలుగుతారని గౌరవనీయ హోం మంత్రి చెప్పారు. అధ్యక్షా! ఆయన చెప్పిన విషయాలతో నేనూ ఏకీభవిస్తున్నాను. ఆయన పేర్కొన్నటువంటి ప్రమాదకరమైన పరిస్థితులు నిజంగానే ఉన్నాయి.

ఆయన వివరించినటువంటి ప్రమాదకరమైన పరిస్థితి నాకు బాగా తెలుసు. బొంబాయి నగరం ... ్రడుగు ప్రపంచంగా పిలువదగిన చోట నా జీవితంలో అధిక భాగం గడిపాను. 1911 నుంచి 1933 వరకు కూలీలు, దిగువ తరగతుల ప్రజలలో కలిసి 'ఇంప్రూవ్ మెంట్ ట్రస్టు' సత్రాలలో

* ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2430-33, ఏప్రిల్ 27, 1938.

బతికాను. మావళీలు; దాదాలు ఈ పేద ప్రజలను ఎలా వేధిస్తారో, పోలీసు కమిషనర్ కంటే, గౌరవనీయ హెూంమంత్రి కంటే నాకు బాగా తెలుసు..ఈ బాధితులు న్యాయస్థానాన్ని ఆశ్రయించి న్యాయం పొందడం ఎంత అసాధ్యమో నాకు తెలుసు. ఎందుకంటే, ఆ విధంగా చేస్తే మళ్లీ వేధింపులు ఉంటాయని వారికే భయం. అందువల్ల, సభ ముందు ఉంచిన బిల్లు సమంజసమైనదనే నేను భావిస్తున్నాను. అయితే, ఈ నగర ప్రజలకు మరొక ముప్పు వాటిల్లే అవకాశం ఉన్నదని నేను అభిప్రాయపడుతున్నాను. ఎందుకంటే, ఆ ముప్పు వాటిల్లకుండా ఉండడానికి గౌరవనీయ మంత్రి ఈ బిల్లులో ఏ అంశాన్ని చేర్చలేదు. అధ్యక్షా! మత ఘర్షణల వల్ల ఏర్పడే అవసరమే నా సవరణకు కారణం బొంబాయి నగరంలో జరిగిన మత ఘర్షణల వివరాలు నా దగ్గర ఉన్నాయి. అక్టోబర్ 17, 1851 న మొదటి సారి మత ఘర్షణలు జరిగాయి. ఆ ఘర్షణలు ముస్లింలు, పార్సీల మధ్య జరిగాయి. 1874 లో రెండవ సారి ఘర్షణలు జరిగాయి. ఈ ఘర్షణలు కూడా ముస్లింలు, పార్సీల మధ్యనే జరిగాయి. 1893లో మూడవ సారి మత ఘర్షణలు జరిగాయి. ఈ ఘర్షణలు హిందువులు, ముస్లింల మధ్య జరిగాయి. 1932లో ఐదవసారి, 1933లో ఆరవ సారి, 1936లో ఏడవసారి, 1937లో ఎనిమిదవ సారి, ఏప్రిల్ 17, 1938న తొమ్మిదవసారి ఘర్షణలు జరిగాయి. ఇవన్నీ హిందువులు, ముస్లింల మధ్య జరిగినవే. 1893లో జరిగిన ఘర్షణల్లో 80 మంది మరణించగా, 60 దేవాలయాలు, ఏడు మసీదులు, 27 దర్గాలు ధ్వంసమయ్యాయి. తదుపరి ఘర్షణల గురించిన వివరాలు నా దగ్గర లేవు. 1929 ఘర్షణల్లో 51 మంది మరణించగా, 1932 ఘర్షణల్లో 300 మంది మరణించారు. మరో 300 మంది పైగా గాయపడ్డారు. 1936 ఘర్షణల్లో 61 మంది మరణించగా, 550 మంది గాయపడ్డారు. 1938లో 12 మంది మరణించగా, 120 మందికి పైగా గాయపడ్డారు. ఎంత తేడాతో ఈ ఘర్షణలు జరిగాయో సభ గుర్తుంచుకోవడం ముఖ్యం. ఇదివరకే చెప్పినట్లు, 1852 లో మొదటి సారి ఘర్షణలు జరగగా, 23 సంవత్సరాలలోకూడా రెండవసారి ఘర్షణలు జరిగాయి. ఆ తరువాత 19 సంవత్సరాలకే మూడవ సారి ఘర్షణలు జరిగాయి. తరువాత 36 సంవత్సరాలకు నాలుగవ సారి ఘర్షణలు జరగగా, తదుపరి మూడు సంవత్సరాలకే ఐదవ సారి ఘర్షణలు జరిగాయి. మళ్లీ ఏడాదిలోపే ఆరవ సారి ఘర్షణలు జరగగా, ఆ తరువాత మూడు సంవత్సరాలలోపు ఏడవసారి ఘర్షణలు, ఏడాదిలోపు ఎనిమిదవసారి ఘర్షణలు, ఏడాది కంటే తక్కువ కాలానికే తొమ్మిదవసారి ఘర్షణలు జరిగాయి. అధ్యక్షా! నాగరికత ఇలా తరచూ విచ్ఛిన్నం కావడం, ఈ రెండు మతాల వారు ప్రతి ఏటా రక్తపాతంలో మునిగి తేలడం వంటివి జరగకుండా ఏదయినా పరిష్కారాన్ని కనుగొనవలసి ఉందని మనలో బాధ్యత తెలిసిన వారందరూ అంగీకరిస్తారు. ఈ ఘర్షణలు జరగడానికి గల కారణాలలోకి నేను వెళ్ల దలచుకోలేదు. అవి రాజకీయ సంబంధమైనవి అయినా, మత సంబంధమైనవి అయినా, ఆర్థిక సంబంధమైనవి అయినా మనకు అనవసరం. చేదు నిజాలు ఏమిటంటే, ఒక ముస్లిం మరే విషయాన్నీ లెక్క చేయకుండా వెళ్లి ఒక హిందువును పొడిచి చంపేస్తాడు. మరొక హిందువు మరే విషయాన్నీ లెక్క చేయకుండా వెళ్లి ఒక ముస్లింను పొడిచి చంపేస్తాడు. ఈ పరిస్థితి నిజంగా ఒక వైపరీత్యం. దీనిని మనం ఎప్పటికీ సహించలేం. ఈ మత ఘర్షణల బెడదను అధికారులు

సమర్థవంతంగా పరిష్కరించగలిగే విధంగా ఏదయినా ఏర్పాటు చేయవలసిన సమయం వచ్చిందని నేను భావిస్తున్నాను.

ఇక నా సవరణ వల్ల కలిగే ప్రయోజనాల విషయానికి వస్తాను. మొదటిగా, సవరణలోని మూడవ క్లాజు లోని ప్రయోజనాన్ని సభ దృష్టికి తీసుకుని వస్తాను. ఏ వ్యక్తి ఉనికి లేదా కదలికలు, లేదా పనులు ఘర్షణలకు దారి తీసే విధంగా ఉన్నాయని పోలీసు కమిషనర్ సహేతుకంగా భావించినట్లయితే, అటువంటి వ్యక్తిని బొంబాయి ప్రెసిడెన్సీ సరిహద్దుల నుంచి పంపించే అధికారాన్ని ఈ క్లాజు పోలీసుకమిషనర్‌కు ఇస్తుంది. బిల్లు ప్రధాన లక్ష్యం అదే. బిల్లులోని ఈ క్లాజు వ్యక్తులపై ఆంక్షలు విధిస్తుందని నేను పూర్తిగా అంగీకరిస్తున్నాను. అయితే, అధ్యక్షా! నేను ఒకమాట మాత్రం చెప్పగలను. సమాజంలో స్వేచ్ఛ అవసరం ఉన్న వర్గం నుంచి నేను వచ్చాను. వృత్తిరీత్యా నేను న్యాయవాదిని. స్వేచ్ఛ ప్రాధాన్యం నాకు తెలుసు. నేను ఏ వర్గానికి చెందుతానో ఆ వర్గం ప్రయోజనాల దృష్ట్యా, వృత్తి రీత్యా నేను న్యాయవాదిని అయిన దృష్ట్యా స్వేచ్ఛ కోసం నాలో ఎంతో తపన ఉంది. అయితే, ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల స్వేచ్ఛను రక్షించాలంటే, గూండాల స్వేచ్ఛను, సమాజంలోని నేరవర్గాల స్వేచ్ఛను రద్దు చేయవలసి వచ్చే సందర్భాలు కూడా ఉంటాయని చెప్పకుండా ఉండలేక పోతున్నాను. ఈ విషయంపై నాకు ఎటువంటి సందేహం లేదు. నన్ను ఆందోళన పరిచే విషయం ఒకే ఒకటి ఉంది. ఇది ఈ సభలోని సభ్యులను కూడా ఆందోళనకు గురిచేయవచ్చు. అది ఏమిటంటే, పోలీసు కమిషనర్‌కు మనం ఇస్తున్న నిరంకుశ అధికారం దుర్వినియోగం కాకుండా ఉండేందుకు ఏవయినా రక్షణలు ఉన్నాయా? పరిస్థితి అవసరం దృష్ట్యా, ఈ అంశానికి సభ ప్రాధాన్యం ఇవ్వవలసి ఉన్నదని నేను మనవి చేస్తున్నాను.

అధ్యక్షా! నా సవరణలో ఇటువంటి రక్షణలు అనేకం ఉన్నాయని సభకు విన్నవిస్తున్నాను. అవి ఏమిటో క్లుప్తంగా వివరిస్తాను. మొదటి రక్షణ ఇది: ఈ సవరణ వల్ల శాసన సభకు లేదా ప్రజలకు తెలియకుండా తన నిరంకుశ అధికారాన్ని ఉపయోగించడం పోలీసుకమిషనర్‌కు ఆచరణలో ఎప్పటికీ సాధ్యంకాదు. అత్యవసర పరిస్థితి విధించిన తరువాతనే పోలీసు కమిషనర్‌కు ఈ అధికారం లభిస్తుందనే విషయాన్ని గౌరవనీయ సభ్యులు గుర్తుంచుకోవాలి. అత్యవసర పరిస్థితి విధించక ముందు ఈ అధికారాన్ని ఉపయోగించుకోవడం పోలీసు కమిషనర్‌కు సాధ్యపడదు. అత్యవసర పరిస్థితి విధించిన తరువాతనే ఈ అధికారం ఆయనకు లభిస్తుంది. ఈ రకమైన ఏర్పాటు వల్ల ప్రయోజనం ఉంది. అది ఏమిటంటే, ఎటువంటి సహేతుకమైన కారణాలు లేకుండానే ప్రభుత్వం అత్యవసర పరిస్థితిని విధించినట్లయితే, దానిపై వాయిదా తీర్మానాన్ని ప్రవేశ పెట్టి ప్రభుత్వ చర్యను ఖండించే అవకాశం ఈ సభకు ఉంటుంది. పోలీసు కమిషనర్ అధికారం దుర్వినియోగం కాకుండా ఉండేందుకు నా సవరణ శాసన సభకు ఇటువంటి నియంత్రణాధికారాన్ని కల్పిస్తుందని మనవి చేస్తున్నాను. నా సవరణ వల్ల కలిగే రెండవ ప్రయోజనం ఇది: అత్యవసర పరిస్థితిని విధించిన ప్రభుత్వం దానిని రద్దు చేయడానికి తిరస్కరించవచ్చు. అప్పుడు పోలీసు కమిషనర్ తన నిరంకుశ

అధికారాన్ని ఉపయోగించడం కొనసాగిస్తూనే ఉండే ప్రమాదం ఉంది. అందువల్లనే నా సవరణలో ఒక అంశాన్ని చేర్చాను. సభ దానిపై దృష్టి సారించాలని కోరుతున్నాను. ప్రభుత్వం పొడిగించని పక్షంలో, అత్యవసర పరిస్థితి నెలరోజులకు దానంతట అదే రద్దయిపోతుందని నా సవరణ నిర్దేశిస్తున్నది. అంటే, నెల తరువాత పోలీసు కమిషనర్ అధికారం కూడా రద్దు అయిపోయేలా ఇక్కడ తగిన రక్షణ కల్పించడం జరిగింది.

నేను సభ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్న మరొక రక్షణ సబ్‌క్లాజు (vi) లో ఉంది. ఇది చాలా ముఖ్యమైనది. మత ఘర్షణలకు కారణమవుతున్నాడని తాను భావించిన వ్యక్తిని ఆ స్థలం నుంచి పంపించివేసే అధికారాన్ని ఈ సవరణ పోలీసుకమిషనర్‌కు ఇస్తున్నప్పటికీ, ఆ అధికారానికి కూడా ఒక హద్దు విధించడం జరిగింది. అది ఏమిటంటే, అత్యవసర పరిస్థితి రద్దు అయిపోగానే, పోలీసు కమిషనర్ అధికారంతో పాటు, ఆయన ఇచ్చిన ఆదేశం కూడా రద్దు అయిపోతుంది. పోలీసు కమిషనర్ ఆదేశం కారణంగా బొంబాయి నుంచి వెళ్లిపోయిన ఆ వ్యక్తి అప్పుడు తిరిగి బొంబాయికి రాగలుగుతాడు. పోలీసు కమిషనర్ అధికారానికి వ్యతిరేకంగా ఇది కూడా ఒక రక్షణేనని విన్నవిస్తున్నాను.

పోలీసు కమిషనర్ ఆదేశానికి వ్యతిరేకంగా నా సవరణలో కల్పించిన మరొక రక్షణను కూడా సభ దృష్టికి తసుకుని వస్తున్నాను. పోలీసు కమిషనర్ జారీచేసిన ఆదేశానికి వ్యతిరేకంగా ప్రావిన్షియల్ ప్రభుత్వానికి అప్పీలు చేసుకోవడానికి అవకాశం ఉంది.

బిల్లుపై ప్రతిపాదించిన ఇతర సవరణల గురించి కేవలం ఒకటి రెండు విషయాలు చెప్పాలనుకుంటున్నాను. భిన్న మతాల ప్రజల కారణంగా లేదా మత విభేదాల కారణంగా ఏర్పడే కల్లోల పరిస్థితులలో మినహా, కార్మిక సమస్యల కారణంగా తలెత్తే అల్లర్లలో కాని, మరే విధమైన అల్లర్లలో కాని ఈ సవరణలోని క్లాజు (i) ని ఉపయోగించరాదని నిన్న సవరణను తయారు చేస్తున్నప్పుడే అన్ని పక్షాల వారు అంగీకరించారు. ఈ విషయాన్ని నా గౌరవనీయ స్నేహితుడు హోంమంత్రి కాదనరని భావిస్తున్నాను. ఈ సవరణ మొత్తం పూర్తిగా మత ఘర్షణలకే వర్తిస్తుంది. ఈ సవరణను మరే అల్లర్లకు వర్తింపజేయాలని అనుకోవడం లేదని గౌరవనీయ హోంమంత్రి ఇచ్చిన హామీతో సంతృప్తి చెందడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఉద్దేశించిన పరిస్థితులలో తప్ప మరే పరిస్థితులలోను ఈ సెక్షన్ లోని నిబంధనలను ప్రభుత్వం ఉపయోగించేందుకు ఎటువంటి అవకాశం ఉండరాదని ఈ సభలోని పెద్ద మనుషులు భావిస్తున్నట్లయితే, అందులోని అంశాలను వివరించడానికి సిద్ధంగా ఉన్నాను.

'ఉనికి' అనే పదాన్ని తొలగించాలనే సవరణకు నేను మద్దతు ఇవ్వలేను. 'ఉనికి' అనే పదం ఉండితీరవలసిందే. ఒక ఉదాహరణ చెప్తాను. బొంబాయికి ఒక సాధువు వచ్చాడు. ఆయన ఒక వర్గానికి ఇష్టుడు, మరొక వర్గానికి అయిష్టుడు. మరొక ఫకీరు బొంబాయికి వచ్చాడు. ఒక వర్గం ఆయనను ఆకాశానికి ఎత్తుతోంది. మరొక వర్గం కాదు పొమ్మంటోంది. ఈ కారణాలతో మత

ఘర్షణలు ప్రారంభం అవుతాయి. మత ఘర్షణలు ఆగేలా చేయడానికి బొంబాయి నగరంలో ఈ వ్యక్తుల ఉనికి కూడా లేకుండా చూడడం అవసరం కాదా? అధ్యక్షా! అందువలన 'ఉనికి' అనే పదం అవసరమని, దానిని బిల్లులో ఉంచాలని నేను కోరుతున్నాను.

ఇక ఇతర సవరణలకు సంబంధించి నాకు ఎటువంటి సంకోచాలు లేవు. ఎందుకంటే, మత ఘర్షణలు మినహా, మరే ఘర్షణలకు బిల్లును వర్తింపజేయరాదన్నదే మన ఉద్దేశం. ఈ వ్యాఖ్యలతో నేను నా సవరణను ప్రతిపాదిస్తున్నాను. సభ దీనిని అంగీకరిస్తుందనే నేను భావిస్తున్నాను.

★ ★ ★

*** డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం):** అధ్యక్షా! నేను ప్రవేశపెట్టిన సవరణకు బిల్లు మొదటి రీడింగ్ సమయంలో మాట్లాడిన గౌరవనీయ సభ్యులలో అనేక మంది నుంచి మద్దతు లభించినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను. బిల్లుపై ఎన్నో అభిప్రాయాలు వ్యక్తపరచినప్పటికీ గౌరవనీయ ప్రతిపక్షనాయకుడు నా సవరణను వ్యతిరేకించారని నేను అనుకోవడంలేదు. నా గౌరవనీయ స్నేహితుడు రావు బహదూర్ చితాలే ఈ సవరణను సమర్థించారు. ఈ స్నేహితుడు శ్రీ జమ్నాదాస్ మెహతా సవరణపట్ల కనపరచిన వ్యతిరేకత మౌలికమైనది కాదు. వ్యూహాత్మకమైనది మాత్రమే. ఈ దృష్ట్యా, సవరణపై వచ్చిన వ్యాఖ్యలకు సుదీర్ఘమైన జవాబు చెప్పవలసిన అవసరం లేదు. అయితే, నేను పేర్కొనాలనుకుంటున్న విషయాలు రెండు మాత్రం ఉన్నాయి. ఈ బిల్లు అత్యవసరమైనదని ఒప్పుకుని తీరాలి. అందువల్ల వ్యక్తి స్వేచ్ఛపై గణనీయమైన స్థాయిలో పరిమితి కూడా విధించవలసి ఉంటుంది.

**సర్ అలీ మహమ్మద్ దహ్లావి:** గౌరవనీయ సభ్యుడు చెప్పిన విషయాన్ని సరిదిద్దాలనుకుంటున్నాను. ఇది అత్యవసరమైనదని చెప్పడానికి గౌరవనీయ సభ్యుడికి ఏం అధికారం ఉందో నాకు తెలియడం లేదు. బిల్లును ప్రతిపాదించిన గౌరవనీయులు ఈ విషయాన్ని పేర్కొనలేదు.

**డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:** నా సవరణకు సంబంధించి మాత్రమే నేను జవాబు ఇస్తున్నాను. నా ప్రసంగంలో ఒప్పుకున్నట్టు నాది అత్యవసర సవరణ. అందువల్ల వ్యక్తి స్వేచ్ఛపై ఇది నియంత్రణ విధిస్తుంది. నా సవరణపై మాట్లాడిన గౌరవనీయులు ఇదే అంశంపై నొక్కినొక్కి మాట్లాడారు. యుద్ధ సమయంలో ఇంగ్లాండ్‌లో ఆమోదించిన డిఫెన్స్ ఆఫ్ రెల్మ్‌యాక్ట్‌ను, భారతదేశంలో ఆమోదించిన డిఫెన్స్ ఆఫ్ ఇండియా యాక్ట్‌ను సవినయంగా వారి దృష్టికి తీసుకుని వస్తున్నాను. ఈ రెండు చట్టాలు అత్యవసరమైనవి. ఆ చట్టాలలోని అంశాలను గమనిస్తే, నా సవరణ చాలా సరళమైనదని తెలుసుకుంటారు. పైగా ఆ రెండు చట్టాలు నాలుగు సంవత్సరాలకు పైగా అమలులో ఉన్నాయి. డిఫెన్స్ ఆఫ్ రెల్మ్ యాక్ట్‌ని ఇంగ్లాండ్‌లో 1914లో ఆమోదించారు. 1919 వరకు దానిని

* బి.ఎల్.ఏ. చర్చలు, వాల్యూమ్ 3, పేజీలు 2471–73, తేదీ: ఏప్రిల్ 27, 1938

రద్దు చేయనేలేదు. అప్పుడు నేను విద్యార్థిగా అక్కడే ఉన్నాను. నా సవరణ పోలీసు అధికారులకు ఇస్తున్న అధికారాల కంటే ఆ చట్టం ఇచ్చిన అధికారాలు చాలా విస్తృతమైనవి. అందువల్ల, అత్యవసర పరిస్థితికి సంబంధించి పోలీసు కమీషనర్‌కు ఇస్తున్న అధికారాలు విస్తృతమైనవి కావని విన్నవిస్తున్నాను.

ఇక ఇతర విషయాలకు వస్తే, భారత ప్రభుత్వ చట్టంలోని 102 సెక్షన్‌లో గల నిబంధనలను సభ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్నాను. అధ్యక్షా! ఈ సవరణలో ఉన్న విషయాలే భారత ప్రభుత్వ చట్టంలోని 102 సెక్షన్‌లో కూడా ఉన్నాయి. అత్యవసర పరిస్థితి విధించడంలో విచక్షణను ఉపయోగించే అధికారాన్ని ఆ సెక్షన్ కూడా గవర్నర్-జనరల్‌కు ఇచ్చింది. అత్యవసర పరిస్థితి అమలులో ఉన్నకాలంలో శాంతి భద్రతల పరిరక్షణకు అవసరమని భావించిన ఏ చట్టాన్ని అయినా ఆర్డినెన్స్ ద్వారా ఆమోదించడానికి గవర్నర్-జనరల్‌కు అధికారం ఇచ్చారు.

**సర్ అలీ మహమ్మద్ ఖాన్ దెహ్లవి:** ఆ అధికారాన్ని దేశం అంగీకరించదు.

**డా॥ అంబేద్కర్:** భారత ప్రభుత్వ చట్టంలోనే అది ఉంది. అదే విధంగా అత్యవసర పరిస్థితి ఆరు నెలలపాటు అమలులో ఉంటుందని అదే సెక్షన్ పేర్కొంటున్నది. అందులోని సంబంధిత నిబంధనలను చదివి విన్పిస్తాను.

"ఈ అధ్యాయంలోని ఇతర సెక్షన్లలో ఏం ఉన్నప్పటికీ, యుద్ధం ద్వారా కాని, అంతర్గత కల్లోల పరిస్థితుల ద్వారా కాని భారతదేశ భద్రతకు భంగం కలిగించే పరిస్థితి ఉన్నదని గవర్నర్ జనరల్ భావించి, తన విచక్షణాధికారం ద్వారా అత్యవసర పరిస్థితిని విధించినట్లయితే, ప్రావిన్షియల్ లెజిస్లేటివ్ జాబితాలో పేర్కొన్న ఏ అంశానికి సంబంధించి అయినా, ఏ రాష్ట్రానికి కాని, ఏ రాష్ట్రంలోని ఏ ప్రాంతానికి కాని చట్టాలు చేసే అధికారం ఫెడరల్ లెజిస్లేచర్‌కు ఉంది."

సబ్‌క్లాజు(4)ఇలా పేర్కొంటున్నది: "అత్యవసర పరిస్థితికి సంబంధించి ఫెడరల్ లెజిస్లేచర్ చేసిన చట్టం అత్యవసర పరిస్థితి రద్దు అయిన తరువాత కూడా ఆరు నెలల వరకు అమలులో ఉండి అప్పుడు రద్దు అయి పోతుంది".

అందువల్ల, డిఫెన్స్ ఆఫ్ రెల్మ్ యాక్ట్‌ను, డిఫెన్స్ ఆఫ్ ఇండియా యాక్ట్‌ను అందులోని 102 సెక్షన్‌ను దృష్టిలో పెట్టుకుంటే, మనం అసాధారణమైన పని చేస్తున్నట్లు అవదని సభకు మనవి చేస్తున్నాను.

ఈ అత్యవసర అధికారాలను వివిధ వర్గాల మధ్య జరిగే ఘర్షణలకు పరిమితం చేయడమే నా అభిమతం అయినప్పటికీ, నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ జమ్నాదాస్ మెహతా ఒక వ్యాఖ్య చేశారు.'కమ్యూనిటీ' అంటే మతవర్గాన్నే సూచించదని, వాణిజ్యవర్గం, పారిశ్రామికవర్గం, శ్రామికవర్గం మొదలైన వాటిల్లో కూడా ఆ పదాన్ని ఉపయోగిస్తారని ఆయన వాదించారు. చివరకి కార్మిక వివాదాలలో కూడా ప్రభుత్వం ఈ అధికారాలను ఉయోగించుకుంటుందని ఆయన అన్నారు.

'కమ్యూనిటీ' అనే పదాన్ని విస్తృతమైన అర్థంలో ఉపయోగిస్తుంటారని నేను అంగీకరిస్తున్నాను. అయితే, ఇక్కడికి రాకముందు నేను ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ చూశాను. ఎందుకంటే, ఈ నిబంధనలను కార్మిక వివాదాలకు వర్తింప చేయకుండా చూడాలని శ్రీ జమ్నాదాస్ మెహతా కంటే ఎక్కువగా నేను ఆందోళన చెందుతున్నాను.

**శ్రీ జమ్నాదాస్ ఎం.మెహతా:** నాకంటే ఎక్కువగా ఆందోళన చెందడం లేదు.

***డా॥ అంబేద్కర్:*** మీరు అనుమతిస్తే నేను ఎక్కువగా ఆందోళన చెందుతున్నానని చెప్పాలనుకుంటున్నాను. అందువల్ల, మీరు ఏదయినా మెరుగైన పదాన్ని సూచిస్తే, మీరు సూచించే మార్పును అంగీకరించడానికి నేను పూర్తిగా సిద్ధంగా ఉన్నాను. అయితే, ఈ పదం నాకు అర్థమైనంత వరకు, ప్రామాణిక డిక్షనరీ ద్వారా అర్థం చేసుకున్నంత వరకు 'కమ్యూనిటీ' అనే పదాన్ని మతవర్గాన్ని సూచించడానికే ప్రధానంగా ఉపయోగిస్తారని నిస్సందేహంగా చెప్పగలను అయితే, ఇతర అర్థాలకు కూడా ఈ పదాన్ని విస్తరించినమాట నిజమే. కార్మిక వివాదాలకు ఇతర వివాదాలకు 'కమ్యూనల్ కాన్‌ఫ్లిక్ట్', అనే పదాలను వాడడం కుదరదని నేను గట్టిగా భావిస్తున్నాను. ఇది సరిపోదని, మరొక పదం అవసరమని నా గౌరవనీయ స్నేహితుడు భావిస్తే, ఆ విషయంలో ఆయనకు సహాయం అందించడానికి నేను పూర్తిగా సిద్ధంగా ఉన్నాను.

ఈ వ్యాఖ్యలతో నేను ఇక కూర్చుంటున్నాను.

★ ★ ★

***డా॥ అంబేద్కర్** అధ్యక్షా! నేను ఆశించిన విధంగా నా సవరణలో కొన్ని అంశాలను పొందుపరచలేకపోయాను. కాన్ఫరెన్స్ సమయంలో మాకు ఇచ్చిన ముసాయిదా పనిలో మునిగి ఉన్నందున ఆ పని చేయలేకపోయాను. నా సవరణలో కొన్ని అంశాలు చేర్చడానికి మీరు అనుమతి ఇస్తే, సవరణ సమగ్రంగా ఉంటుంది. ఈ కింద పేర్కొన్న విధంగా సవరణ ఉండాలి.

క్లాజు(2)లోని సబ్-క్లాజు (1)(i) లో గల సబ్-క్లాజు(ఎ)ను తొలగించి ఈ కింది భాగాన్ని చేర్చాలి:

(ఎ) బొంబాయి నగరం సరిహద్దుల లోపల ఏ వ్యక్తి అయినా నగర ప్రజలకు ముప్పు కలిగించే చట్టవ్యతిరేక కార్యకలాపాలకు అలవాటు ప్రకారం పాల్పడుతున్నట్లయితే, నగరంలో అతని ఉనికే అత్యంత ప్రమాదానికి దారితీసేది అయినట్లయితే, అతను అన్నిటికీ తెగించిన వ్యక్తి అయినట్లయితే భారత శిక్షాస్మృతిలోని 12, 16, 17 విభాగాల కింద శిక్షించదగిన నేరాలకు కాని, హింసాకాండకు కాని అలవాటుగా పాల్పడుతున్నట్లయితే, ఆ వ్యక్తికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2497, ఏప్రిల్ 27, 1938

** బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2499–2501, ఏప్రిల్ 27, 1938

సాక్షులు ఎవరూ ముందుకు వచ్చే పరిస్థితి లేదని కమిషనర్ అభిప్రాయపడుతున్నట్లయితే, లేక."

★ ★ ★

**డా॥ అంబేద్కర్:** అధ్యక్షా! నేను ప్రతిపాదించిన సవరణకు మద్దతుగా నేను చెప్పదలచుకున్నది చెప్పేముందు రెండు ప్రాథమిక విషయాలను వివరించాలనుకుంటున్నాను. నా గౌరవనీయ స్నేహితుడు హోంమంత్రి తెచ్చిన బిల్లుకు నేను ఎందుకు మద్దతు ఇస్తున్నాననేది మొదటి విషయం. బొంబాయి పోలీసు చట్టంలోని 27వ సెక్షన్‌ను సవరించడానికి ఆయన ఈ సవరణ బిల్లును ప్రవేశ పెట్టారు. అసలు చట్టంలోని 27వ సెక్షన్ కంటే ఈ సవరణ బిల్లులోని 27వ సెక్షన్ పోలీసు కమిషనర్‌కు ఎక్కువ అధికారాలను ఇస్తున్నదని నిన్న చర్చల సందర్భంగా చాలా మంది అన్నారు. అయితే, బిల్లును మొత్తంగా పరిశీలిస్తే, అసలు సెక్షన్ కంటే ఈ బిల్లులోని సెక్షన్ సరళమైనదని నిస్సందేహంగా చెప్పగలను. అందువల్లనే ఈ బిల్లుకు సభ ఆమోదం పొందడంలో గౌరవనీయ హోంమంత్రికి సహాయం చేయడానికి నేను అంగీకరించాను.

నేను చెప్పాలనుకుంటున్న రెండవ విషయం ఇది. పార్టీల సమావేశంలో ఈ సవరణకు సంబంధించి చర్చ జరిగింది. వివిధ ప్రతిపాదనలను చర్చించినప్పుడు ఈ సవరణపై అంగీకారం కుదిరింది. సవరణ బిల్లును సమర్థిస్తానని నేను అప్పుడే చెప్పాను. సమావేశంలో ఆ విధంగా మద్దతు ప్రకటించి, ఇప్పుడు ఆ సవరణ బిల్లుకు నేను మరొక సవరణను ప్రతిపాదించకూడదని నా గౌరవనీయ స్నేహితుడు హోంమంత్రి అంటారేమో. నేను వివరించాలనుకుంటున్నది ఈ విషయం గురించే. అధ్యక్షా! సవరణ బిల్లుకు మద్దతు ఇస్తానని గౌరవనీయ హోం మంత్రితో నేను చెప్పిన సమయంలో బిల్లులో ఇమిడిఉన్న సూత్రానికి సవరణ పరిమితమైనది. బిల్లులో ఇమిడి ఉన్న సూత్రం ఇది. బొంబాయి నగరంలో నేరాలకు పాల్పడే వ్యక్తులు కొందరున్నారు. వారి స్వభావం ఎటువంటిదంటే, వారి చర్యల కారణంగా బాధితులైన ప్రజలు కూడా న్యాయస్థానాలలో వారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి ముందుకు రారు. అందువల్ల, సాధారణ విచారణ జరపడం సాధ్యం కాదు. బిల్లులో ఇమిడి ఉన్న సూత్రం ఇది. అదే సూత్రానికి నేను కట్టుబడి ఉంటాను. ఆ సూత్రం నుంచి నేను పక్కకు తొలగడం లేదు. సాక్ష్యులు న్యాయస్థానానికి వచ్చి సాక్ష్యం చెప్పడానికి కూడా భయపడే పరిస్థితి ఉంటే, సాధారణ విచారణ జరిపే పని లేకుండానే ఏ వ్యక్తులపై పోలీసుకమిషనర్ చర్య తీసుకోవచ్చో ఆ వ్యక్తుల కేటగిరీని వివరించడానికి మాత్రమే నేను పరిమితం అవుతున్నాను. అందువల్ల, నా సవరణ వివరాలకు సంబంధించినదే తప్ప, సూత్రానికి సంబంధించినది కాదు.

అధ్యక్షా! సవరణ విషయానికి వస్తే, అందులోని ఈ అంశాన్ని సభ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్నాను. అందులోని భాగం ఇది :

"బొంబాయి నగరంలోని ఏ వ్యక్తి ఉనికి కాని, కదలికలు కాని, చర్యలు కాని ప్రమాదానికి దారి

తీస్తున్నట్లయితే లేదా ప్రమాదానికి దారితీస్తాయనే అభిప్రాయం కలిగితే లేదా శాంతి భద్రతలకు భంగం కలిగించే కుట్రలను ఆ వ్యక్తి పన్నుతున్నాడని సహేతుకమైన సందేహం కలిగినప్పుడు....."

ఇందులోని భాష చాలా సరళంగా ఉందని గమనించవచ్చు. మరొక విషయం ఏమిటంటే, ప్రమాదానికి దారితీసే ఒక చట్ట విరుద్ధమైన చర్యకు పాల్పడిన వ్యక్తిని కూడా మనం ఇస్తున్న అధికారాలతో పోలీసు కమిషనర్ పట్టుకుని, బొంబాయినగరం నుంచి పంపివేసే అవకాశం ఉన్నదని నాకు అన్పిస్తున్నది. అయితే, గౌరవనీయ హెూం మంత్రికి కాని, నాకు కాని అటువంటి ఉద్దేశం ఎన్నడూ లేదని నేను చెప్పగలను. 'పక్కా మావళి'లను పట్టుకునేలా చేయడమే తన ప్రధాన లక్ష్యమని, అందుకే ఈ సవరణ బిల్లును ప్రతిపాదించానని గౌరవనీయ హెూం మంత్రి తన ప్రసంగంలో చెప్పారు. ఆయన అభిప్రాయాన్ని నేను సరిగ్గానే అర్థం చేసుకుంటున్నానని భావిస్తున్నాను. 'పక్కా మావళి' అనే పదాలను నేను సరిగ్గా అర్థం చేసుకున్నట్లయితే, ఏ వ్యక్తి అయితే అలవాటుగా చట్ట విరుద్ధమైన కార్యకలాపాలకు పాల్పడుతుంటాడో, ఏ వ్యక్తి అయితే అలవాటుగా ప్రమాదకరమైన పనులు చేస్తుంటాడో ఆ వ్యక్తిని 'పక్కా మావళి' అని అనవచ్చు. గౌరవనీయ హెూం మంత్రి ఉద్దేశం అదే అయినట్లయితే, సభలో తాను ప్రకటించిన తన ఉద్దేశాన్ని కచ్చితమైన పదాలలో బిల్లులోనే చేర్చడానికి ఆయన అభ్యంతరం చెప్పకూడదు. అందువల్లనే, ఆ దృష్టితోనే నేను ఆయన భాషను సవరించడానికి నా సవరణ ద్వారా ప్రయత్నించాను. 'అలవాటుగా ఈ పనులన్నీ చేస్తున్న వ్యక్తి' అని స్పష్టంగా పేర్కొన్నాను. ఆ భాగం ఇలా ఉంది. గమనించండి :

"బొంబాయి నగరంలోని ఏ వ్యక్తి అయినా అలవాటు ప్రకారం నగర ప్రజలకు ముప్పుకలిగించే చట్ట విరుద్ధమైన చర్యలకు పాల్పడుతున్నట్లయితే , ఆ వ్యక్తి నగరంలో ఉండటమే ప్రమాదకరం అయినట్లయితే....."

సవరణలోని మిగిలిన భాగం అంతా గౌరవనీయ సభ్యుడు శ్రీ పటస్కర్ సవరణ మాదిరిగానే ఉంది. అది అధికారికమైనది అయినందువల్ల ఆ సవరణకు గౌరవనీయ మంత్రి ఎటువంటి అభ్యంతరం చెప్పరని భావిస్తున్నాను.

నేను తలపెట్టింది కొత్తది ఏమీ కాదు. శిక్షాస్మృతిలోని 110వ సెక్షన్‌లో వాక్యాలనే తీసుకున్నాను. అలవాటుగా దొంగతనాలు చేసే వ్యక్తిని ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ సమక్షంలోకాని, జిల్లా మేజిస్ట్రేటు సమక్షంలోకాని విచారించేందుకు శిక్షాస్మృతిలోని 110 వ సెక్షన్ పోలీసులకు అధికారం ఇస్తున్నది. 110 వ సెక్షన్‌లోని సబ్-సెక్షన్(ఎ), సబ్-సెక్షన్(ఎఫ్) లలోని వాక్యాలనే నేను తీసుకున్నాను. ఒక వ్యక్తి అలవాటుగా దొంగతనాలు చేస్తున్నప్పటికీ, అతను అత్యంత ప్రమాదకరమైన వ్యక్తి అయినప్పటికీ శిక్షాస్మృతిలోని 110వ సెక్షన్ కింద కూడా అతనిపై విచారణ జరపకుండా చర్య తీసుకోవడం సాధ్యం కాదని వాదించవచ్చు. అతను బొంబాయి నగరంలో ఉన్నందువల్లనే అతనిపై చర్యతీసుకోవాలని మీరు భావిస్తున్నారా? ఈ రకమైన వాదన విన్పించవచ్చు. సాక్ష్యం చెప్పేందుకు

న్యాయస్థానాలకు రావడానికి కూడా భయపడే సాక్షులు ఉన్న సందర్భాలలో మనం వ్యవహరిస్తున్నా మనేదే నా సమర్థన. అందువల్లనే పోలీసు కమిషనర్‌కు అదనపు అధికారాలను ఇవ్వడానికి నేను అంగీకరించాను. అటువంటి అధికారాలను ఇస్తున్నప్పుడు, ఏ వ్యక్తులపై చర్యతీసుకోవాలో ఆ వ్యక్తుల కేటగరీని నిర్ణయించడం అవసరం. అనుకోకుండా కాక అలవాటుగా చట్టవిరుద్ధ కార్యకలాపాలకు పాల్పడే వ్యక్తి అయిఉండాలని చెప్పడం ద్వారా సభ ఆ వ్యక్తుల కేటగరీని నిర్వచిస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. ఈ వ్యాఖ్యలతో నా సవరణను సభకు సమర్పిస్తున్నాను.

☆ ☆ ☆

# 31

# బొంబాయి పోలీసు చట్ట సవరణ బిల్లు – 2*

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అధ్యక్షా! నా సవరణ పూర్తిగా పొరపాటు అభిప్రాయాన్ని కలిగించిందని తెలిసి నేను విచారపడుతున్నాను. ఈ దశలో ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను. మనలో ఏ ఒక్కరైనా తమ గొప్పతనాన్ని కాపాడుకోవలసిన సందర్భంగా నేను దీనిని భావించడం లేదు. ఈ సందర్భం చాలా ముఖ్యమైనదని నేను భావిస్తున్నందువల్ల, ఇదే విషయాన్ని మళ్లీ చెప్తున్నాను. అధ్యక్షా! అత్యవసర కేసులతో వ్యవహరించడానికి తగిన అధికారాలను మనం ఇప్పటికే ఇచ్చిన విషయాన్ని గౌరవనీయ హోం మంత్రి పరిగణనలోకి తీసుకోలేదని ఆయన సమాధానంలో స్పష్టమైంది. కేవలం తమ మనస్సులలో కుట్రలు పన్నిన వ్యక్తులతో కూడా వ్యవహరించగలిగే అధికారాలను విస్తృత స్వభావం కలిగిన నా సవరణ ద్వారా ఆయనకు ఇచ్చాం. ఈ విషయాన్ని ఆయన గుర్తుంచుకోవలసిందిగా కోరుతున్నాను. అధ్యక్షా! అత్యవసర పరిస్థితిలో వ్యవహరించడానికి సాధ్యమైన అత్యంత విస్తృత అధికారాలను ఆయనకు అప్పగించిన తరువాత సాధారణ సందర్భాలలో వ్యవహరించడానికి అధికారాలను ఇచ్చేటప్పుడు కొంత విమర్శనాత్మకమైన వైఖరిని అవలంబించడం ఈ వైపు సభ్యులకు సముచితమేనని భావిస్తున్నాను. మనం ఇప్పుడు ప్రస్తావిస్తున్న సవరణ సాధారణ సందర్భాలకు సంబంధించి కూడా అధికారాలను ఇస్తుందనే విషయాన్ని ఆయన పూర్తిగా మరిచిపోయారు. అందువల్ల, నా సవరణ ద్వారా పోలీసు కమిషనర్‌కు లభిస్తున్న అధికారాలతో ఎదుర్కోలేని పరిస్థితి, సందర్భాలు నాకు కన్పించడం లేదు. అందువల్ల, ప్రజల ప్రయోజనం దృష్ట్యా నా సవరణను ఆమోదించాలని నేను కోరుతున్నాను. అధ్యక్షా! ఇది చాలా ముఖ్యమైన సందర్భం. బిల్లు పౌరుల స్వేచ్ఛకు సంబంధించిన అత్యంత ముఖ్యమైనది . అందువల్ల ఇది చాలా ప్రాధాన్యం కలిగిన సందర్భం. ఆ దృష్ట్యా, సాధ్యమైనంత వరకు అన్ని పక్షాల మధ్య ఏకాభిప్రాయం ఉండాలని నేను భావిస్తున్నాను. నేను నా ఘనత కోసం పాకులాడటం లేదు. అందువల్ల, గౌరవనీయ హోంమంత్రి కూడా అదే విధంగా వ్యవహరించాలని, ఈ సవరణను అంగీకరించాలని ఆయనకు విజ్ఞప్తి చేస్తున్నాను.

అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ చంద్రీగర్ సవరణను, మరొక గౌరవనీయ స్నేహితుడు శ్రీ భోలె సవరణను నేను అంగీకరిస్తున్నాను.

***గౌరవనీయ శ్రీ కె. ఎం. మున్షీ:*** ఇది గొప్పతనాన్ని కాపాడుకునే సమస్య కాదు. మేం ప్రతి పదాన్ని

---

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2509–12, ఏప్రిల్ 28, 1938.

విన్నాం. ప్రతి సూచన వల్ల కలిగే పర్యవసానాలను పరిగణనలోకి తీసుకున్నాం.

**డా॥ అంబేద్కర్ :** కొన్నిసార్లు మెరుగైన ఆలోచనలు మళ్లీ వస్తుంటాయి.

**గౌరవనీయ శ్రీ కె. ఎం. మున్షీ :** అధ్యక్షా! నేను ఇదివరకే చెప్పినట్లు ఇది ఎవరి గొప్ప తనాన్ని కాపాడుకునే సందర్భంకాదు. ఇక్కడ సమస్య అంతా అభిప్రాయ విభేదాలకు సంబంధించినదే. ఎందుకంటే, ప్రతి కేసులో ఆ వ్యక్తి అలవాటుగా నేరాలు చేస్తున్నాడా? అనే విషయాన్ని కనుగొనవలసి ఉంటుంది. మొదటి సారి నేరానికి పాల్పడే వ్యక్తిని మనం కనుగొన్నా, ఆ వ్యక్తి చట్టం నుంచి తప్పించుకుంటాడు. ఈ పరిస్థితి చట్టాన్ని నిరర్థకం చేస్తుంది. ప్రస్తుత నిబంధనల కింద ఉన్న పరిస్థితి కంటే అధ్వాన్నమైన పరిస్థితిలో పోలీసు కమిషనర్ పడిపోతారు.

**డా॥ అంబేద్కర్ :** ముఠాలతో వ్యవహరించడానికి అధికారాలను ఇచ్చేందుకు ఈ వైపున గల ఏ సభ్యుడు వ్యతిరేకంగా లేరని నా గౌరవనీయ స్నేహితుడు అర్థం చేసుకోవాలి. ముఠాలతో వ్యవహరించే సవరణను మీరు తేవాలనుకుంటే, దానికి మద్దతు ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అందుకు నాకు ఎంత మాత్రం అభ్యంతరం లేదు. ముఠాలతో వ్యవహరించడానికి అధికారం ఇవ్వాలని ప్రతిపక్ష నాయకుడు చెప్పడం నాకు గుర్తుంది. అయితే, వ్యక్తులతో వ్యవహరించడానికి మీరు అధికారాలను కోరుకుంటున్నారు. అందువల్లనే, మేం వ్యక్తుల స్వేచ్ఛపై ఈ ఆంక్షలను విధిస్తున్నాం. ముఠాలతో మనం వ్యవహరించవలసి వస్తే, అందుకోసం ఎవరైనా సవరణ తెమ్మనండి. అది సహేతుకమైనది అయితే, నేనే స్వయంగా దానిని సమర్థిస్తాను. ఇక్కడ మీరు వ్యక్తులతో వ్యవహరిస్తున్నారు.

అధ్యక్షా! మీరు ఇష్టపడినట్లయితే సభను కొద్దిసేపు వాయిదా వేయండి. తరువాత చర్చను కొనసాగిస్తాం.

**శ్రీ ఎస్. హెచ్. జబ్వాలా :** అధ్యక్షా! నేను ప్రతిపాదించిన సెలక్ట్ కమిటీ అవసరాన్ని ఇది సూచిస్తున్నది.

**గౌరవనీయ శ్రీ కె. ఎం. మున్షీ :** అధ్యక్షా! సభ వాయిదా నాకు ఇష్టమే. అయితే, అటువంటి విషయానికి వాయిదా వేయడంలో ఉపయోగం లేదు. 'అలవాటుగా' అనే పదాన్ని తన సవరణలో చేర్చడం ద్వారా ఈ సెక్షన్‌ను గౌరవనీయ సభ్యుడు నిరర్థకం చేశారని ఒప్పించడానికి నేను ప్రయత్నిస్తున్నాను. 'అలవాటుగా' అనే పదాన్ని తొలగించడానికి ఆయన అంగీకరించని పక్షంలో, నేను ఇక ఏ మాత్రం ఈ సవరణను పరిగణనలోకి తీసుకోను. 'అలవాటుగా' అనే పదాన్ని ఉంచాలనే ఆయన భావిస్తున్నట్లయితే, ఆ సెక్షన్ నిరుపయోగమవుతుంది. అందువల్లనే, వాయిదా వేయడం వల్ల ఉపయోగం లేదని నేను అంటున్నాను.

**సర్ అలీ మహమ్మద్ ఖాన్ దహ్లవి :** ఆ పదం పక్కా మావళిని సూచిస్తుంది.

*గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:* 'పక్కా మావళి' అంటే, అలవాటుగా చట్టవిరుద్ధమైన కార్యకలాపాలకు పాల్పడుతున్న వ్యక్తి అయిఉండనక్కరలేదు. దాదా అనే అర్థంలో కూడా అతను మావళి అయి ఉండవచ్చు. నేను ఎప్పుడూ చెప్పని విషయాలను నేను చెప్పినట్లు సభ్యులు అంటున్నారు. 'పక్కా మావళి' అని నేను చెప్పినప్పుడు, అలవాటుగా చట్టవ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొనే వ్యక్తిని సూచించలేదు. ఆ విషయాన్ని మీరు నాకు ఆపాదిస్తున్నారు.

*సర్ అలీ మహమ్మద్ ఖాన్ దహ్లరి :* అధ్యక్షా! 'పక్కా మావళి' అని గౌరవనీయ మంత్రి పేర్కొన్నప్పుడు, ఆయన మనస్సులో అనేక తరహాల మావళీలు ఉన్నారని మేం అర్థం చేసుకున్నాం.

*గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:* ఆ విషయాన్ని నేనూ అంగీకరిస్తాను. చాలా రకాల మావళీలు ఉండి ఉండవచ్చు.

*డా॥ అంబేద్కర్:* ఒకసారి ఒక నేరానికి పాల్పడిన వ్యక్తి కేసుతో వ్యవహరించాలని గౌరవనీయ మంత్రి కోరుకోవడం లేదు.

*గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:* కలకత్తా నుంచి వచ్చిపడిన ముఠా ఉదంతాన్ని గౌరవనీయ సభ్యుడికి చెప్పాను. అందులో 11 మంది ఉన్నారు. వారు ఏ నేరానికి పాల్పడలేదు. అయితే, కొన్ని చట్టవిరుద్ధమైన కార్యకలాపాలకు పాల్పడడానికి వారు సిద్ధంగా ఉన్నారు. పోలీసుల నిఘా ఉన్నప్పటికీ కలకత్తాలో వారిని శిక్షించ లేకపోయారు. వారిలో కొందరు ఎవరంటే.....

*డా॥ అంబేద్కర్ :* వారు కలకత్తాలో పదేపదే నేరాలకు పాల్పడుతున్నవారు అయితే, వారు అలవాటుగా ఆ పనులు చేస్తున్నట్లే. ఇది బొంబాయిలో అలవాటుగా నేరాలకు పాల్పడినట్లుకాదు.

*గౌరవనీయ శ్రీ కె. ఎం. మున్షీ :* చట్టవిరుద్ధమైన కార్యకలాపాలకు పాల్పడినందుకు వారిని శిక్షించలేదు.

*డా॥ అంబేద్కర్ :* నా సవరణలోని పదాలను గౌరవనీయ మంత్రి దృష్టికి తీసుకుని రానా? "నగరంలో అతని ఉనికే అత్యంత ప్రమాదానికి దారి తీసేది అయినట్లయితే, అతను అన్నిటికీ తెగించిన వ్యక్తి అయితే...." ముఠాలోని సభ్యుడు ఈ నిర్వచనం పరిధిలోకి వస్తాడు.

*గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:* గౌరవనీయ సభ్యుడికి ఓర్పు ఉన్నట్లయితే, నేను ఆయనకు చెప్తాను. నేను పేర్కొన్న ముఠా నాయకుడి మాదిరిగా అతను అన్నిటికీ తెగించిన వ్యక్తి కాకపోవచ్చు. అతను కలకత్తాలో ఒక మోటారుకారులో తిరుగుతుండేవాడు. అతను యూరోపియన్. బొంబాయిలోని ఉన్నతవర్గాల వారు అతనిని తమలో ఒకరుగా భావిస్తారు. అయితే, ఒక లాఠీ తీసుకుని వీధుల్లో పరుగులు పెట్టిన అర్థంలో అతను అన్నిటికీ తెగించిన వ్యక్తి కాదు.

*డా॥ అంబేద్కర్:* కాని ప్రమాదకరమైన అనే పదం సవరణలో ఉంది.

*గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:* అధ్యక్షా! "ప్రమాదకరమైన" అంటే అర్థం ఏమిటి?

***డా। అంబేద్కర్:*** సెక్షన్‌లో ఉపయోగించిన పదాలనే నేను తీసుకున్నాను. అవి పూర్తిగా అవగతం అయ్యే పదాలేనని నేను కచ్చితంగా చెప్పగలను.

***గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:*** అధ్యక్షా! పిచ్చిగా పరుగులు పెడుతూ, ప్రజలను బెదిరిస్తూ తిరిగే వారికి లేదా ఆ పదం భౌతిక అర్థంలో ప్రమాదకరంగా వ్యవహరించే దాదాలకు 'ప్రమాద కరమైన', 'అన్నిటికీ తెగించిన' అనే పదాలు వర్తిస్తాయి. మోసగాళ్ల ముఠా నాయకుడికి ఆ పదాలు వర్తించవు.

***డా। అంబేద్కర్:*** అటువంటి వారితో వ్యవహరించడానికి విడిగా మరొక అధ్యాయం ఉంది. భారత శిక్షాస్మృతిలోని 16వ అధ్యాయం అటువంటి సందర్భాలను వివరిస్తుంది. అందువల్ల, నేను ఆ అంశాన్ని నా సవరణలో వదిలివేశాను.

***గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:*** కాని మీరు "అలవాటుగా నేరాలకు పాల్పడుతున్నా" అని పేర్కొన్నారు.

***డా। అంబేద్కర్:*** అధ్యక్షా! నేను ప్రతిపాదించిన పదాలు సెక్షన్ పరిధిని ఒక తరహా వ్యక్తులకే పరిమితం చేస్తున్నాయి. ప్రస్తుత సెక్షన్ పరిధి కిందకు కూడా వచ్చే అనేక తరహా వ్యక్తులను అందులో చేర్చలేదు.

***గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:*** అధ్యక్షా! ఈ పదాలు బిల్లు పరిధికి పరిమితం చేస్తున్నాయని గౌరవనీయ సభ్యుడే స్వయంగా అంగీకరించారు. అదే నిజమైతే, ఈ బిల్లు తేవడంలో అర్థం లేదు. సెక్షన్ ప్రభావాన్ని ఆ మేరకు తగ్గిస్తున్నట్లయితే, ఈ బిల్లు నిరుపయోగ ఆయుధమే అవుతుంది. అందువల్ల, ఈ సవరణను నేను అంగీకరించడం సాధ్యపడదు.

***గౌరవనీయ స్పీకర్:*** సవరణను, సవరణకు సవరణలను నేను ఇప్పుడు సభకు సమర్పిస్తున్నాను. మొదట సవరణకు సవరణలను స్వీకరిస్తున్నాను. డాక్టర్ అంబేద్కర్ సవరణకు శ్రీ భోలె ప్రతిపాదించిన సవరణను మొదట సమర్పిస్తున్నాను. దీనిని నేను చదవవలసిన అవసరం ఉందా? (గౌరవనీయ సభ్యులు : లేదు) సరే, సవరణను వోటింగ్‌కు పెడుతున్నాను.

సవరణను సభ తిరస్కరించింది.

***డా। అంబేద్కర్:*** అధ్యక్షా! నాఉద్దేశాన్ని వ్యక్తం చేయడమే ఈ సవరణ వెనుక ఉన్న ఉద్దేశం. ఇది అసలైన సవరణ ఎంత మాత్రం కాదు.

గౌరవనీయ సభాపతి : అవును. గౌరవనీయ సభ్యుడు డాక్టర్ అంబేద్కర్ సవరణను వోటింగ్‌కు పెడుతున్నాను.

ఈ సవరణకు సభ అంగీకారం తెలిపింది.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం):*** అధ్యక్షా! నా గౌరవనీయ స్నేహితుడు శ్రీ చంద్రీగర్ ప్రవేశ పెట్టిన సవరణకు నేను మద్దతు ప్రకటిస్తున్నాను. తన ఆధీనంలో ఉన్న ఏ పత్రాలపై అయినా చర్య తీసుకునే ముందు, లేదా తాను బహిష్కరించాలనుకుంటున్న ఏ వ్యక్తిని అయినా బహిష్కరించే ముందు పోలీసు కమిషనర్ ఆ పత్రాలను, ఆ వ్యక్తిని మేజిస్ట్రేటు ముందు ఉంచాలని, మేజిస్ట్రేట్ అంగీకరించనిదే ఈ విషయాలపై ఏ చర్య తీసుకోకూడదని ఈ సవరణ నిర్దేశిస్తున్నది. పోలీసు కమిషనర్ ఎటువంటి నిరంకుశ చర్య తీసుకోకుండా ఉండేందుకు మరొక రక్షణ కల్పించడానికి ఈ సవరణను ఉద్దేశించారన్నది సుస్పష్టం. ఆ వ్యక్తులకు కల్పించవలసిన ప్రయోజనం కంటే ఎక్కువ ప్రయోజనాన్ని ఈ సవరణ కల్పిస్తున్నదా? లేక ఈ సవరణ అనవసరమైనదా అనే విషయాలను పోలిక ద్వారానే సరిగ్గా అర్థం చేసుకోగలం. విప్లవ సంబంధమైన హింసకు పాల్పడే విప్లవకారుడి కేసును తీసుకుంటున్నాను. బిల్లుకు ప్రతిపాదించిన ప్రస్తుత సవరణను ఏ వ్యక్తులకోసం ఉద్దేశించామో ఆ వ్యక్తులు విప్లవకారులంత ప్రమాదకరమైన వారు కాదని కచ్చితంగా చెప్పవచ్చు. అందువల్ల, విప్లకారుల కంటే ఎక్కువగా వారికి రక్షణలు కల్పించాలి. ఇప్పుడు మనం ఒక క్షణం ఆగి, విప్లవసంబంధమైన నేరస్థులకు భారత చట్టాలలో ఏ రక్షణలను కల్పించారో చూద్దాం. ఈ విషయానికి సంబంధించి పాత చరిత్రలోకి వెళ్లాలని నేను అనుకోవడం లేదు.

అయితే, 1913లో భారత ప్రభుత్వం నియమించిన సెడిషన్ కమిటి నివేదిక నా దగ్గర ఉంది. " దేశంలోని విప్లవోద్యమం స్థితిని వివరించడానికి, నేరపూరిత కుట్రలతో వ్యవహరించేటప్పుడు వచ్చే ఇబ్బందులను పరిశీలించడానికి, అటువంటి నేరస్థులను శిక్షించడానికి తగిన చర్యలను సూచించడానికి ఈ కమిటీని నియమించారు. విప్లవ సంబంధమైన హింసజోలికి నేను వెళ్లడం అనవసరమని నేను భావిస్తున్నాను. ఎందుకంటే, ఆ విషయం గురించి సెడిషన్ కమిటీ సవివరంగా పేర్కొంది. ఈ కమిటీ సూచించిన రక్షణలతోనే మనకు ఇప్పుడు అవసరం.

ఈ కమిటీలో ఉన్న వారి గురించి తెలుసుకోవాలని సభకు ఆసక్తి ఉండవచ్చు. అందువల్ల, కమిటీలో సభ్యులుగా ఉన్న గౌరవనీయులను పేర్కొంటాను. కింగ్స్ బెంచ్ డివిజన్ న్యాయమూర్తి జస్టిస్ రౌలట్, బొంబాయి ప్రధాన న్యాయమూర్తి సర్ బాజిల్ స్కాట్, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి దివాన్ బహదూర్ సి.వి. కుమార్‌స్వామి శాస్త్రి, యునైటెడ్ ప్రావిన్సెస్ రెవెన్యూ బోర్డు సభ్యుడు సర్ వెర్నీ లవెట్, శ్రీ సిపి. మిట్టర్ మొదలైన వారు కమిటీలో సభ్యులుగా ఉన్నారు. న్యాయ శాస్త్రంలో ప్రవేశం కలిగిన అనేకమంది ఈ కమిటీలో సభ్యులుగా ఉన్నారు. విప్లవ సంబంధమైన హింసతో వ్యవహరించాలనుకున్నంత కాలం భారత ప్రభుత్వం ఒక సూత్రాన్ని అంగీకరించిందన్నది వాస్తవం. ఆ సూత్రం ఏమిటంటే, విప్లవకారులను శిక్షించే ముందు వారిని ట్రిబ్యునల్ ద్వారా విచారించాలి. న్యాయస్థానాల ద్వారా వాగని ఎప్పుడూ విచారించలేదు. భారత ప్రభుత్వంలోని

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి 3, పేజీలు : 2533–34, తేదీ : ఏప్రిల్ 28, 1938.

అధికారులే ఈ ట్రిబ్యునల్‌లో సభ్యులుగా ఉండేవారు. 182 వ పేరాలో సెడిషన్ కమిటీ ఇలా పేర్కొన్నది. :

"డిఫెన్స్ ఆఫ్ ఇండియా యాక్ట్ కింద నిర్దేశించిన పద్ధతిని మార్చాలని సిఫార్సు చేస్తున్న మేము ఈ చట్టం ప్రకారం జరుగుతున్న ట్రిబ్యునల్ నిర్మాణాన్ని కూడా మార్చాలని భావిస్తున్నాం. న్యాయ వ్యవస్థలో సభ్యులు కాకుండా ఉన్న వ్యక్తులను, ప్రభుత్వ అధికారులను ట్రిబ్యునల్‌లో నియమించడం మంచిది కాదు. ఇప్పటివరకు నియమించిన ప్రత్యేక ట్రిబ్యునళ్ళు ఏవీ నిందితుల పట్ల అన్యాయంగా ప్రవర్తించాయని చెప్పగలిగే ఆధారం ఏదీ మాకు కన్పించలేదు. అయితే, సూత్రాలకు సంబంధించిన అభ్యంతరాలను నిర్లక్ష్యం చేయకూడదని మేం భావిస్తున్నాం. అంతేకాక, అప్పీలు హక్కును కూడా తిరస్కరించినందున, ట్రిబ్యునళ్లను తగిన వ్యక్తులతో ఏర్పాటు చేయాలి."

విప్లవకారులకు అన్యాయం జరగకుండా, వారిపట్ల క్రూరత్వం ప్రదర్శించ కుండా చూడడానికి ఈ రక్షణ అవసరమైనట్లయితే, ఈ బిల్లులో పేర్కొన్న వ్యక్తులతో వ్యవహరించడానికి మరింత రక్షణ చర్య అవసరమని వివేకం కలిగిన ప్రతి ఒక్కరూ భావిస్తారని విన్నవిస్తున్నాను. మొత్తం మీద, ఈ సవరణ కోరుతున్నదేమిటి? నగరం నుంచి తాను పంపించివేయదలచుకున్న వ్యక్తిపై పోలీసు కమిషనర్ చేసిన ఆరోపణలపై దర్యాప్తు చేయడానికి మేజిస్ట్రేట్లతో కూడిన ట్రిబ్యునల్‌ను నియమించాలని ఈ సవరణ కోరడం లేదు. మేజిస్ట్రేట్ ముందు ఉంచిన పత్రాలపై విచారణలో మాదిరిగా దర్యాప్తు చేయాలని కూడా ఈ సవరణ కోరడం లేదు. మేజిస్ట్రేటు ముందు పోలీసు కమిషనర్ ఆ పత్రాలను ఉంచినప్పుడు, సమాచారం అందించిన వారి పేరును ఆయన వెల్లడించాలని కూడా సవరణ నిర్దేశించడం లేదు. సవరణ చాలా సరళమైనది. పోలీసు కమిషనర్ సమర్పించిన పత్రాలపై మేజిస్ట్రేటు విచారణ జరిపి తీర్పు ఇవ్వాలని కూడా ఈ సవరణ నిర్దేశించడం లేదు. ఇది నిర్దేశిస్తున్నదంతా ఏమిటంటే, మేజిస్ట్రేటు కేసును పరిశీలించి, పోలీసు కమిషనర్ చర్య తీసుకోవలసిన కేసేనని ఒక సర్టిఫికెట్ ఇస్తే, పోలీసు కమిషనర్ తదనుగుణంగా చర్య తీసుకుంటారు. అధ్యక్షా! ఏ ప్రమాణాలతో చూసినా ఇది సరళ స్వభావం కలిగిన రక్షణ అని, దీనిని కల్పించవచ్చని, కల్పించవలసిఉన్నదని చెప్పడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అధ్యక్షా! నా సవరణను ఆమోదిస్తే, పోలీసు కమిషనర్ అధికారాలు మరింత విస్తృతమవుతాయి కాబట్టి, ఈ చిన్న రక్షణను బిల్లులో చేర్చేలా చూసే బాధ్యత ప్రతిపక్షంపైనే కాక మొత్తం సభపైనే ఉందని నేను విన్నవిస్తున్నాను. ఈ సవరణను బిల్లులో చేరిస్తే, పోలీసు కమిషనర్ నిరంకుశంగా వ్యవహరించకుండా ఉంటారు.

అనువాదం :

డా॥ కె. మునిరత్నం

☆ ☆ ☆

# 32

# బొంబాయి పోలీసు చట్ట సవరణ బిల్లు – 3*

**డా॥ అంబేద్కర్ :** నేను చెప్పదలచుకున్నది ఇది – గౌరవనీయ సభ్యుడు శ్రీ పటాస్కర్ సూచించిన సవరణను అంగీకరించడం ద్వారా మనం చేసింది ఏమిటంటే పోలీసు కమీషనర్ తన అధికారాలను ఏయే కేసుల్లో ఉపయోగించవచ్చో స్పష్టంగా నిర్దేశించాం. ఒక వ్యక్తికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి సాక్షులెవరూ బహిరంగంగా ముందుకు రారని అనిపించిన కేసుల్లో మాత్రమే ఆయన తన అధికారాలను ఉపయోగించాలని చెప్పాం. అంటే భద్రతా కారణాల వల్ల సాక్షులు సాక్ష్యం ఇవ్వడానికి ముందుకు రావడం లేదని భావించిన కేసుల్లో కమీషనర్ ఈ అధికారాలు ఉపయోగించాలని చెప్పాం. ఇదీ ఆయనకు మనం ఇచ్చిన ఆదేశం. సబ్‌క్లాజు(2)లో ఈ బిల్లు ఇందుకు కమీషనర్ అనుసరించాల్సిన పద్ధతిని కూడా నిర్దేశించింది. అదేమిటంటే – మొదట కమీషనర్ నేరారోపణకు సంబంధించిన వివరాలు నిందితుడికి తెలియజేయాలి. తర్వాత ఆ వ్యక్తికి వివరణ ఇచ్చుకునే అవకాశం ఇవ్వాలి. మూడోది తన సాక్షులను తెచ్చుకునే అవకాశం కూడా ఆ వ్యక్తికి కల్పించాలి. సబ్‌క్లాజు(6) పోలీసు కమీషనర్ ఉత్తర్వును ప్రశ్నించే క్రిమినల్ కోర్టు అధికారానికి సంబంధించినది. ఈ సెక్షన్ ఏం చేస్తుంది? అదేం చెపుతుందంటే – ఆ బిల్లు నిర్దేశించిన పద్ధతిని కమీషనర్ అనుసరించిందీ లేనిదీ నిర్ణయించే అధికారం కోర్టుకు ఉంటుంది, కమిషనర్ మొదట చేయాల్సిన పని నిందితుడికి అభియోగానికి సంబంధించిన వివరాలు తెలియజేయడం. రెండోది దానికి వివరణ ఇచ్చుకునే అవకాశం ఆ వ్యక్తికి ఇవ్వడం. మూడోది – చట్టంలో లేనిది, హైకోర్టు తీర్పులో వున్నదీ– కమీషనర్‌కు తగినంత ఆధారం వుండాలనేది. గౌరవనీయ సభ్యుడు శ్రీ పటాస్కర్ ప్రవేశపెట్టిన సవరణ వల్ల ఇది యిప్పుడు చేర్చబడింది. మనం ఆమోదించిన ఈ క్లాజు ద్వారా భద్రతా కారణాల వల్ల సాక్ష్యం చెప్పడానికి ఇష్టపడని సాక్షుల కేసుల్లో మాత్రమే కమీషనర్ ఈ అధికారాన్ని ఉపయోగించాలనేది కూడా అందులోనే చేర్చామని నేను విన్నవిస్తున్నాను. గౌరవనీయ సభ్యుడు శ్రీ భోలే సూచిస్తున్న సవరణ కమీషనర్ ఉత్తర్వును హైకోర్టు కొట్టేయడానికి మరో కారణాన్ని చేరుస్తోంది. ఇప్పుడున్న సబ్‌క్లాజు ప్రకారం సంబంధిత వ్యక్తికి నేర వివరాలు తెలియపరచకపోయినా, వాటిని వివరించడానికి ఆ వ్యక్తికి అవకాశం ఇవ్వకపోయినా, అతని సాక్షులను పరిరక్షించకపోయినా హైకోర్టు కమీషనర్ ఉత్తర్వును కొట్టేయవచ్చు. ఇప్పుడు శ్రీ పటాస్కర్ సవరణ ప్రకారం కమీషనర్ తగినంత సమాచారం లేకుండా ఆ ఉత్తర్వు ఇచ్చారని భావించిన పక్షంలో కూడా హైకోర్టు దానిని కొట్టేయవచ్చు. దీనికి శ్రీ భోలే చేరుస్తున్నదేమిటంటే శ్రీ పటాస్కర్ సవరణలోని మొదటి భాగం

---

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి3, పే. 2586–87, 29 ఏప్రిల్ 1938

పెట్టిన షరతు – సాక్షులు సాక్ష్యం చెప్పడానికి ముందుకు రావడం లేదనే కారణం–మీద కూడా కమీషనర్ ఉత్తర్వును కొట్టేయడానికి మెజిస్ట్రేటుకు అధికారం ఉండాలని. కాబట్టి ఇది మెజిస్ట్రేటు అధికారంపై పరిమితి విధించడం కాదు. ఒక నియమావళిని నిర్దేశించారు కనుక, ఈ క్లాజు చెప్పేదల్లా పోలీసు కమీషనర్ ఆ పద్ధతుల్ని పాటించాడా లేదా అనేది హైకోర్టు లేక మెజిస్ట్రేటు కోర్టు చూడాలని. కమీషనర్‌కున్న ఆధారాలు నమ్మదగినవా కావా అని హైకోర్టో మేజిస్ట్రేట్ కోర్టో విచారణ జరిపి తీర్పు చెప్పాలని గౌరవనీయ సభ్యుడు శ్రీ పటాస్కర్‌గాని, ఇక్కడి మిగతా సభ్యులు ఎవరూ గాని కోరడం లేదు. కమీషనర్‌కు ఆధారాలు ఉన్నాయా లేవా అనేదొక్కటే కోర్టు చూడాల్సింది. అలాగే గౌరవనీయ సభ్యుడు శ్రీ భోలే కోరుతున్నదేమిటంటే సాక్షులు రావడానికి సిద్ధంగా వున్నారా లేదా అన్న వాస్తవాన్ని కమీషనర్ నిజంగా పరిగణనలోకి తీసుకున్నాడా లేదా అనేది కూడా కోర్టు పరిశీలించాలని. హైకోర్టుగానీ మేజిస్ట్రేటు కోర్టుగాని సాక్షులు రావడానికి ఎందుకు సిద్ధంగా లేరనే విషయంలో తీర్పు చెప్పే అధికారం కలిగి వుండాలని శ్రీ భోలే కోరడం లేదు. "ఎవరూ సంతృప్తి చెందకూడని ఆధారాలు ఇవి" అని ఆ కోర్టులు తీర్పు చెప్పాలని ఆయన ఉద్దేశం కాదు. ఈ విషయంలో పోలీసు కమీషనర్ అభిప్రాయమే అంతిమమైనది. శ్రీ పటాస్కర్ సవరణను ఆమోదించడం ద్వారా మనం నియమావళికి సంబంధించి నిర్దేశించిన ఒక షరతును ఈ క్లాజులో చేర్చాలనేదే శ్రీ భోలే ప్రయత్నం. ఆయన సవరణ ఈ బిల్లును పరిపూర్ణం చేయడానికి ఉద్దేశించిందే. మనం ఆమోదించిన సవరణకూ, గౌరవనీయ సభ్యుడైన శ్రీ భోలే సవరణకూ మధ్య ఘర్షణ ఏమీ లేదు. చేయాల్సిందల్లా "కమీషనర్ అభిప్రాయంలో" అనే పదాల్ని చేర్చడమే. నేను దాన్ని ప్రవేశపెడుతున్నాను.

★ ★ ★

***డా॥ అంబేద్కర్:** అయ్యా, నేను వివరించవచ్చా? క్లుప్తంగా దాని పరిస్థితి ఇది. తిరిగి నెంబర్లు వేయబడ్డ సబ్ సెక్షన్ (7) కింద కోర్టుకు కొన్ని అధికారాలిచ్చాము. కమీషనరు ఉత్తర్వును ఉల్లంఘించినందుకు గాను ఎవరినైనా ఒక మనిషిని మెజిస్ట్రేటు ముందుకు తీసుకొచ్చినప్పుడు సరైన పద్ధతి అనుసరించిందీ లేనిదీ చూసే అధికారం మెజిస్ట్రేటుకు వుంది. జిల్లా న్యాయాధ్యక్షులు (ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు) పరిశీలించాల్సిన వాటిలో ఒకటి ఏమిటంటే కమీషనరు వద్ద ఆధారాలు వున్నాయా లేవా? అనేది జిల్లా న్యాయాధ్యక్షుల ముందు ఈ విషయం వచ్చినపుడు, పోలీసు కమీషనరుగానీ మరొకరు గానీ చర్య తీసుకోటానికి తమవద్ద సమాచారం వుందని బోనెక్కి చెప్పాలని ఈ క్లాజు నిర్దేశిస్తున్నది. ఈ సాక్ష్యం ఇచ్చేటప్పుడు పోలీసు కమీషనరుగానీ, అతని తరపు అధికారి గానీ ఆ వ్యక్తిని లేదా ఆస్తిని గుర్తించేలా చేయాలి. ఉపనిబంధన (8) యొక్క స్థానం గురించి చేను వివరిస్తున్నాను ఉపనిబంధన (8) స్థానం ఏమంటే – న్యాయాధ్యక్షులు కమీషనరు ఉత్తర్వును విచారిస్తున్నపుడు అది సరిగా వుందా లేదా–అంటే పద్ధతిని అనుసరించి ఇచ్చారా లేదా అని చూస్తున్నపుడు ఇది అమలులోకి వస్తుంది. కమీషనరు ముందు సమాచారం వుందా లేదా అనేది

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2598-99, ఏప్రిల్ 29, 1938

చూడడం న్యాయాధ్యక్షులు చేయాల్సిన పనులలో ఒకటి. ఎందుకంటే నియమాల్లో అదొకటి కదా! సమాచారం వుందని రుజువు చేసేటప్పుడు రాగల ఒక ప్రశ్నేమిటంటే ఒక వ్యక్తి లేదా ఆస్తి గుర్తింపునకు దారితీసే సమాచారంతో సహా మొత్తం సమాచారం బయట పెట్టమని కమీషనరును వత్తిడి చేసే అధికారం న్యాయాధ్యక్షులకు వుంటుందా వుండదా అనేది. సాక్ష్యం ఇచ్చేటప్పుడు, వ్యక్తినిగానీ ఆస్తిని గానీ గుర్తించడానికి దారితీసే సమాచారాన్ని కమీషనరు ఇవ్వకుండా ఉండొచ్చని ఈ నిబంధన చెప్తున్నది. అది ఉపనిబంధన (8)కి ఉన్న స్థానం.

★ ★ ★

***డా॥ అంబేద్కర్:** అయ్యా, నేను ఈ సవరణను ప్రవేశ పెట్టదలిచాను. అదేమిటంటే "ఇందులో కనబడే" అనే మాటలకు బదులు ఈ క్రింది పదాల్ని చేర్చాలి :

"అలవాటుగా నేరాలు చేసే ప్రమాదకరమైన వ్యక్తులతో వ్యవహరించేటప్పుడు, మతకల్లోల సమయంలో శాంతి భద్రతల పరిరక్షణ నిమిత్తము" నేను ప్రవేశపెట్టదలచుకున్న సవరణ ఇదే.

**గౌరవనీయ సభావతి:** గౌరవనీయసభ్యుడు, విద్యావంతుడైన డాక్టరు ప్రతిపాదించిన సవరణ గురించి మాట్లాడుతున్నాను. అలవాటుగా నేరం చేసేవారికి ఈ చట్టాన్ని వర్తింపచేయాలని ఆయన సూచించారు. సభ తీసుకున్న నిర్ణయాల దృష్ట్యా ఈ సవరణ భాగం కూడా సక్రమంగా లేదని నా అభిప్రాయం.

**డా॥ అంబేద్కర్:** అయ్యా సభముందున్న ఈ బిల్లుకు రెండు వుద్దేశాలున్నాయి: మొదటిది కుల కలహాలను అదుపుచేయడం. దానికి సంబంధించిన నా సవరణ పూర్తిగా సక్రమంగానే వుందని నా మనవి. గౌరవనీయ హోంమంత్రిగారు 'మవాళీలు' అని పేర్కొన్నవారితో వ్యవహరించడానికి ఈ బిల్లులోని కొన్ని నిబంధనలు ఉపకరిస్తాయి. ఈ పదాన్నే "అలవాటుగా నేరం చేసే ప్రమాదకర వ్యక్తులని" నేను అనువాదం చేశాను.

ఈ చట్టం దృష్టిలోవున్న రెండు రకాల ఉద్దేశాలను స్పష్టం చేయడానికి నేను నా సవరణను ప్రతిపాదించాను. ఒక ఉద్దేశం కుల కలహాలతో వ్యవహరించడానికైతే, రెండో ఉద్దేశం 'మవాళీలు' అనబడే వారితో వ్యవహరించడానికి. కాబట్టి నా సవరణ సక్రమంగానే వుందని మనవి. అయినా, అది అభ్యంతరకరమనిపిస్తే, "మవాళీల చర్యలు అదుపుచేసే నిమిత్తం" అని మార్చడానికి సిద్ధంగా వున్నాను.

**గౌరవనీయ సభావతి:** "మవాళీ" అనే పదం చట్టంలో నిర్వచింపబడక పోవడం దీనిలో వున్న ఇబ్బంది. ఏ చట్టం కూడా ఆ పదాన్ని ఇంతవరకు నిర్వచించలేదు.

**డా॥ అంబేద్కర్:** అయ్యా, నా మనవి ఏమిటంటే ఉపోద్ఘాతానికి న్యాయపరమైన భాష్యాలు

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2598-99, తా ఏప్రిల్ 291938

చెప్పాల్సిన అవసరం ఉండదు. ఈ చట్టాన్ని దేనికోసం వాడబోతున్నామో దానికి మార్గదర్శక సూత్రం ఉపోద్ఘాతంలో వుంటుంది. కాబట్టి 'మవాళీ' అనే పదం న్యాయ శాస్త్రరీత్యా నిర్వచించబడకపోయినా, అది గౌరవనీయులైన హోంమంత్రికీ పోలీసు కమీషనరుకు బాగా తెలిసిన పదమని మనవి చేస్తున్నాను, కనుక దాన్ని గురించి ఎలాంటి ఇబ్బంది లేదని భావిస్తున్నాను.

***గౌరవనీయ సభాపతి:*** సవరణను రెండు భాగాలు చేయాలి – ఒకటి, గౌరవనీయ సభ్యుడు చెప్పినట్లు, అలవాటుగా నేరాలు చేసేవారికి సంబంధించింది. నాకు అర్థమయినంతవరకు ఆయన దాన్ని వదులుకోవటానికి సిద్ధపడుతున్నారు.

***డా॥ అంబేద్కర్:*** కాదు, నేను దీన్ని విడగొట్టడానికి సిద్ధంగా వున్నాను. ఒకటి ప్రమాదకర వ్యక్తులతో లేక 'మవాళీల' తో వ్యవహరించేదిగా, రెండోది అత్యవసర అధికారాల్ని ఇచ్చే సవరణకు ప్రత్యక్ష సంబంధమైనదిగా.

***గౌరవనీయ సభాపతి:*** రెండోది నాకు అర్థమైంది. రెండు భాగాలుగా విడగొడితే, మొదటి దాన్ని గురించి 'మవాళీలు' అనే పదవ్యక్తీకరణ కూడా ఏమీ...

***డా॥ అంబేద్కర్ :*** ఐతే నా సవరణ ఇలా వుంటుంది: "ప్రమాదకర ప్రవర్తనగల వ్యక్తులతో వ్యవహరించడానికి". "అలవాటుగా" అనే పదం తీసివేయడానికి నేను సిద్ధమే. మన ఉద్దేశాలు స్పష్టంగా వుండడానికే ఉపోద్ఘాతం రాసుకునేది.

***శ్రీ జమ్నాదాస్ ఎం. మెహతా:*** విద్యావంతుడైన డాక్టరు చేసిన ఈ సవరణ మిక్కిలి సక్రమంగా వుందని మనవి చేస్తున్నాను. ఎందుకంటే మొత్తం బిల్లుకు రెండు ఉద్దేశాలున్నాయని ఇప్పుడు అర్థమైంది. ఒకటి అత్యవసర పరిస్థితిలో, రెండోది చట్టంలో వర్ణించిన వ్యక్తులతో ఎలా వ్యవహరించాలో ఇది చెపుతుంది. సభ చేసిన చట్టాన్ని ఉపోద్ఘాతం అభివ్యక్తీకరించాలి. లేకపోతే ఉపోద్ఘాతం అసంపూర్ణంగా వుండి బిల్లు ఉద్దేశాన్ని వ్యక్తపరచలేదు.

***గౌరవనీయ సభాపతి:*** సాంకేతికపరమైన అభ్యంతరం ఏదీ నేను చెప్పడం లేదు. బిల్లులో చెప్పిందాన్నీ, సభ తీర్మానించినదాన్నీ ఈ పదజాలం ఎలా వ్యక్తపరచగలదా అని చూస్తున్నాను.

***గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:*** 'ప్రమాదకరం' అనే పదం అస్పష్టంగా వుందని గౌరవనీయ సభ్యునికి నేను సూచించవచ్చా! 'సమాజానికి ప్రమాదకరం అనో నగరానికి ప్రమాదకరం అనో లేక అలాంటిది అర్థం వచ్చే పదం' మరొకటి ఏదైనా వుండాలి. "ఫలానా ఫలానా వారి పరిస్థితి ప్రమాదకరంగా ఉంది తక్షణమే బయలుదేరండి" అనే తంతి వార్తలకు మనం అలవాటు పడి వున్నాం కాబట్టి కేవలం 'ప్రమాదకరం' అనే పదం వాడడం అస్పష్టంగా వుంటుంది.

***డా॥ అంబేద్కర్:*** అలా అయిన పక్షంలో "బొంబాయి నగర వాసులకు ప్రమాదకరంగా వున్న

వ్యక్తులతో వ్యవహరించే నిమిత్తం, అల్లర్ల సమయంలో శాంతి భద్రతలు కాపాడే నిమిత్తం" అని సూచిస్తాను.

**గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:** అల్లర్ల సమయంలో విజృంభించే "ముఠాలు, గ్యాంగులను మీరు వదిలి పెట్టారు. ఈ సెక్షన్‌లోని పదాలు, "కులాలు, ముఠాలు, గ్యాంగులు మధ్య".

**డా॥ అంబేద్కర్:** ఐతే మనం ఈ విధంగా అనవచ్చు. "కులాలు దాని విభాగాలు, గ్యాంగులు, ముఠాల మధ్య ఘర్షణల కారణంగా ప్రజల శాంతి భద్రతలకు విఘాతం కలగకుండా నివారించడానికి" అనొచ్చు.

**గౌరవనీయ సభాపతి:** నేను రాసుకుంది ఇదే: "బొంబాయి నగరవాసులకు ప్రమాదకరమైన వ్యక్తులతో వ్యవహరించే నిమిత్తమున్నూ కులాలు దాని, విభాగాలు, గ్యాంగులు, ముఠాల మధ్య ఘర్షణల కారణంగా ప్రజల శాంతి భద్రతలకు విఘాతం కలగకుండా నివారించడానికిన్నీ"

**గౌరవనీయ కె.ఎం.మున్షీ:** "మరియు ఇందులోని పేర్కొన్న ఇతర ఉద్దేశాల నిమిత్తం"

**డా॥ అంబేద్కర్:** ఇతర ఉద్దేశాలేమిటి?

**గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:** నియమావళికి సంబంధించిన ఉద్దేశాలు చాలా ఉన్నాయి.

**డా॥ అంబేద్కర్:** అయితే నేను ఈ విధంగా దాన్ని స్పష్టం చేస్తాను. "మరియు అలాంటి కేసులతో వ్యవహరించడానికి నియమావళిని నిర్దేశించే నిమిత్తం"

**గౌరవనీయ సభాపతి:** ఉపోద్ఘాతంలో అదంతా అవసరమా! మనం దాన్ని జటిలం చేయకూడదు.

**గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:** చట్టంలో వలసదారుల విషయం కూడా వుంది. "కాబట్టి ఇందులో పేర్కొన్న ఇతర ఉద్దేశాల నిమిత్తం" అని చేర్చడం అవసరం.

**శ్రీ జమ్నాదాస్ ఎం. మెహతా:** "ఇందులో" అనేది అవసరం లేదు.

**శ్రీ ఎస్. వి. పరులేకర్:** సభను రేపటి వరకు వాయిదా వేద్దాం. అంగీకారమైన పదజాలం తోచవచ్చు.

**గౌరవనీయ సభాపతి:** సారాంశం గురించి అంగీకారం కుదిరినట్టేవుంది. మిగిలింది పదాల సమస్య ఇప్పుడు ప్రవేశపెట్టిన సవరణపై విషయరీత్యా అంగీకారం కుదిరింది కాబట్టి ఈ దశలోనే దాన్ని బిల్లులో పొందుపరచవచ్చు. తరువాత మూడవ పరిశీలనలో అవసరమైతే పదాల సవరణ చేయవచ్చు.

**గౌరవనీయ శ్రీ కె.ఎం. మున్షీ:** అయ్యా, చివరికి ఒక మాట చెప్పవచ్చునా? వలసదారుల్ని నేను

మరచిపోదలచలేదు.

*గౌరవనీయ సభాపతి:* గౌరవనీయ సభ్యుడు డా. అంబేద్కర్ ప్రతిపాదించింది ఇది:

"ఇందులో కనపడే" పదాల బదులుగా చేర్చవలసింది:

"బొంబాయి నగరానికి ప్రమాదకరంగా వుండే వ్యక్తులతో వ్యవహరించే నిమిత్తమూ, కులాలు దాని విభాగాలు, గ్యాంగులు, మతాలు మధ్య ఘర్షణల కారణంగా ప్రజల శాంతి భద్రతలకు విఘాతం కలగకుండా నివారించే నిమిత్తమూ, ఇందులో కనపడే కొన్ని ఇతర ఉద్దేశాల నిమిత్తమూ".

*గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:* సవరణను అంగీకరిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్:*** ఇతర ఉద్దేశాలేమిటో తెలుసుకోవచ్చా?

*గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:* వలసదారులతో వ్యవహరించడానికి.

***డా॥ అంబేద్కర్:*** వలసదారుడు ఒక మనిషే గాని ఒక ఉద్దేశం కాదు.

***గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:*** సమస్య ఏమంటే – కొన్ని జబ్బులతో నగరానికి వచ్చిన వలసదారులతో వ్యవహరించాల్సిన అవసరం వుంది. ఉద్దేశాలన్నిటినీ వరుస క్రమంలో చెప్పుకుంటూ పోవడం ఉపోద్ఘాతం ఉద్దేశంకాదు. "ఇందులో కనిపించే కొన్ని ఇతర ఉద్దేశాలు" అనడమంటే బిల్లులో పొందుపరబడ్డ ఉద్దేశాలే అని అర్థం. బిల్లులోకి ఏ ఇతర ఉద్దేశాల్ని తీసుకొని రాలేము.

***గౌరవనీయ సభాపతి:*** "కొన్ని ఇతర ఉద్దేశాల నిమిత్తం" అనే పదాలు తీసివేయాలా?

***సర్ అలీ మహమ్మద్ ఖాన్ దెహ్లావి:*** అవి పోవాల్సిందే. ఎందుకంటే, మనం సెక్షన్ 27ను మాత్రం పరిశీలిస్తున్నాం గాని చట్టం మొత్తాన్ని కాదు.

***గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:*** మీరు అవసరం లేదంటే తీసివేయడానికి మేము సిద్ధమే.

***గౌరవనీయ సభాపతి:*** "ఇందులో" అనే పదం వుండాలనేదే ఏకాభిప్రాయంగా కనబడుతున్నది. అప్పుడు సవరణ ఎలావుంటుందంటే "ఇందులో కనపడే" అనే పదాల బదులుగా ఈ క్రిందిది చేర్చండి:

"బొంబాయి నగరానికి ప్రమాదం కలగజేసే వారితో వ్యవహరించడానికి కులాల మధ్య ఘర్షణల కారణంగా ప్రజల శాంతి భద్రతలకు భంగం కలగకుండా నివారించడానికి ".......

***గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:*** పదాల్లో చిన్న మార్పును సూచించవచ్చా! "ప్రజల శాంతి లేక భద్రత" అని వుండాలి. "ప్రజల శాంతి భద్రతలు" అని కాదు. అలాగే "కులాలు లేక విభాగాల మధ్య సంఘర్షణ కారణంగా" అని వుండాలి.

**గౌరవనీయ సభాపతి:** "......కులాలు లేక, విభాగాలు లేక గ్యాంగులు లేక ముఠాల మధ్య ఘర్షణల కారణంగా ప్రజల శాంతి లేక భద్రతకు భంగం కలగకుండాను మరియు కొన్ని ఇతర ఉద్దేశాల నిమిత్తమూ....."

**సర్ అలీ మహమ్మద్ ఖాన్ దెహ్లావి:** "లేక కొన్ని ఇతర ఉద్దేశాల నిమిత్తం". దీనికి మనం ఒప్పుకున్నట్టున్నాం?

**గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ:** నేను దేనికైనా అంగీకరిస్తా.

**శ్రీ ఆర్.ఎ.ఖేడ్కర్:** ఈ పదాల్ని పరిశీలించే అవకాశం మాకు ఇవ్వరా? వాటిని మేము పూర్తిగా అర్థం చేసుకోలేదు.

**గౌరవనీయ సభాపతి:** తుది ముసాయిదా ఇప్పుడు చదువుతున్నాను. నేనేదయినా పొరపాటు చేస్తే మీరు సరిచేయవచ్చు.

**శ్రీ యస్.వి. పరులేకర్:** దాని మీద ఒక నిర్ణయానికి వచ్చే ముందు, సవరణను అధ్యయనం చేయడానికి మాకు అవకాశం ఇస్తారా? సవరణ చాలా దీర్ఘంగా వుంది. దానిలో లోటుపాటులేమిటో మనకు ఇప్పుడే తెలియవు కాబట్టి అధ్యయనం చేయడానికి మాకు అవకాశం ఇవ్వాలి. ప్రస్తుతానికి చర్చకు మాత్రమే స్వీకరిద్దాం.

**గౌరవనీయ సభాపతి:** నేనిదివరకే చెప్పినట్టు ఉపోద్ఘాతం తర్వాత వచ్చే విషయాలకు సారాంశం మాత్రమే.

**డా॥ అంబేద్కర్:** నిర్వహణాధికారులకు అది మార్గ నిర్దేశకం.

**గౌరవనీయ శ్రీ బి.జి.ఖేర్:** మీరు ఏది ప్రతిపాదించినా అంగీకరించడానికి మేము సిద్ధంగా వున్నాము.

**శ్రీ జమ్నాదాస్ ఎం.మెహతా:** ఈ చర్చను కుదించే దేనినైనా మేము ఆహ్వానిస్తాం. (నవ్వు)

**గౌరవనీయ సభాపతి:** కాబట్టి నేను చివరి ముసాయిదా సూచిస్తున్నాను. అది అందరికీ అంగీకారమైందనిపిస్తోంది. మొత్తం సవరణను మళ్లీ చదువుతున్నాను, గౌరవనీయ సభ్యులు దయచేసి ఓపిగ్గా వినండి:

"ఇందులో కనిపించే" పదాలకు బదులు ఈ క్రింద వాటిని చేర్చండి:

'బొంబాయి నగరంలో ప్రమాదకరమైన వ్యక్తులతో వ్యవహరించడానికి, కులాలు లేక విభాగాలూ లేక గ్యాంగులు లేక ముఠాల మధ్య ఘర్షణల కారణంగా ప్రజలశాంతి లేక భద్రతలకు విఘాతం కలగకుండా నివారించడానికి మరియు ఇందులో కనిపించే ఉద్దేశాలకూ"

**శ్రీ జమ్నాదాస్ ఎం. మెహతా:** "ఇతర" అనేది వుండాలి.

***గౌరవనీయ సభాపతి:*** "మరియు ఇతర ఉద్దేశాలకు"

***డా॥ అంబేద్కర్ :*** "వలసదారులతో వ్యవహరించడం లాంటిది"

***గౌరవనీయ సభాపతి:*** ఏమైనా ఉపోద్ఘాతం ఎలా వుండాలో న్యాయవాదులకు బాగా తెలుస్తుంది. సెక్షన్లు తయారు చేయడానికి వున్న ప్రాధాన్యం వాళ్లకు తెలుసు. ఐనా మీరు సమ్మతిస్తే ఒక్కమాట. ఈ అంశం ఇంతగా చర్చనీయాంశం కానక్కరలేదని నేననుకుంటున్నాను.

***శ్రీ జమ్నాదాస్ ఎం. మెహతా:*** "ఇతర" అనేది వుండాలి. ఎందు కంటే ముందు ఉదహరించినవి కూడా ఉద్దేశాలే.

***గౌరవనీయ సభాపతి:*** "మరియు ఇందులో కనిపించే ఇతర ఉద్దేశాలకు"

***శ్రీ జమ్నాదాస్ ఎం. మెహతా:*** అది చాలు.

***గౌరవనీయ శ్రీ కె.ఎం.మున్షీ*** సవరణను అంగీకరిస్తున్నాను.

***గౌరవనీయ సభాపతి:*** కాబట్టి దీని పదనిర్మాణం ఇదేనని భావిస్తున్నాను. (అంతరాయం)

***డా॥ అంబేద్కర్:*** నేను అంగీకరిస్తున్నాను.



# 33

# బొంబాయి నగర మునిసిపల్ చట్ట సవరణ బిల్లు*

**డా। అంబేద్కర్: (బొంబాయి నగరం బైకుల్లా, పరేల్):** గౌరవనీయ సభ్యులు శ్రీ ఎ.వి.చిత్రే ప్రవేశపెట్టిన సవరణను బలపర్చడానికి నేను లేచి నిలబడ్డాను. అయ్యా, కార్మిక ప్రతినిధులు ఎన్నుకునే నలుగురు కౌన్సిలర్‌లతో పాటు, మున్సిపాలిటీ కార్మికులు ఇద్దరు కౌన్సిలర్‌లను ఎన్నుకోవాలని ప్రతిపాదిస్తూ ఆయన ఈ సవరణ ప్రతిపాదించారు. దీనిని నేను బలపరచాలనుకోవడానికి కారణం ఇది. మున్సిపాలిటీ కార్మికులకు మున్సిపల్ కార్పొరేషన్ పరిపాలనలో ప్రత్యక్ష ఆసక్తి వుంటుందనడంలో ఎలాంటి సందేహంలేదు. వాళ్లు మున్సిపల్ కమిషనర్ క్రింద, మునిసిపాలిటీ నియమించిన ఇతర అధికారుల కింద పని చేస్తున్నారు. అయ్యా మున్సిపాలిటీ నిర్మాణం వ్యవస్థ గౌరవముంచుతూ నేను ఒక విషయం చెప్తాను. పై అధికారులు జారీ చేసే తాఖీదుల వల్ల ఏమైనా ఇబ్బందులు కలిగితే వాటిని సరిచేయించే అవకాశం మునిసిపాలిటీ సిబ్బందికి కొంచెం కూడా లేదనేది అందరికీ స్పష్టంగా తెలిసిన విషయమే. బొంబాయి ప్రభుత్వంలో పనిచేస్తున్న సాధారణ సివిల్ ఉద్యోగి స్థితికీ, ఈ కార్మికుల స్థితికీ చాలా తేడా వుంది. ఉదాహరణకు ప్రాంతీయ ఉద్యోగాల్లో గానీ సబార్డినేట్ సర్వీస్‌లోగాని పనిచేసే సివిల్ ఉద్యోగులు, తమకు నష్టదాయకంగా వుండే ఏ ఉత్తర్వుమీదనైనా అప్పీల్ దాఖలు చేసుకోవచ్చు. ఆ హక్కును వాళ్ళకు యిచ్చారు. బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్‌లో అలాంటి అవకాశం లేదు. ఏ మున్సిపల్ కార్మికునికి వ్యతిరేకంగా ఏ అధికారి, ఎలాంటి ఉత్తర్వు జారీ చేసినా ఆ కార్మికునికి అప్పీలు చేసుకునే హక్కు లేదు. మునిసిపల్ కార్మికులకు ఈ సవరణ కలిగించే ఒక ప్రయోజన మేమంటే బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్ అధికారులు, జారీ చేసే ఉత్తర్వుల గురించి కార్మిక ప్రతినిధులు అవసరమైతే కార్పొరేషన్ సమావేశంలో తమ బాధను వ్యక్తం చేసుకోవచ్చు. పరిష్కారం పొందడానికి కూడా ఈ సవరణ ఎంతో కొంత వారికి ఉపయోగపడుతుంది. ప్రస్తుత చట్టంలో ఈ ప్రయోజనం లేదు.

ఇన్‌ఛార్జి గౌరవనీయ మంత్రి వయోజన ఓటు హక్కును ప్రవేశ పెడుతున్నాం కాబట్టి, సంఘటిత కార్మికులకు విడిగా ప్రాతినిధ్యం ఇవ్వనవసరం లేదు అంటున్నారు. మన ముందున్న బిల్లులో ఆయన ఏయే ప్రతిపాదనలు చేశారో అవి ఆయనకే సరిగా తెలియవని నేను గట్టిగా భావిస్తున్నాను. గౌరవనీయులైన మంత్రిని నేను అడగదలచింది ఒక్కటే. వారి అభిప్రాయంలో

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 2807–08, మే 3, 1938

వయోజన ఓటు హక్కు సర్వరోగ సంపూర్ణ నివారణియా? తగు ప్రాతినిధ్యం పొందడానికి మున్సిపల్ కార్మికులు దాని మీద ఆధారపడితే చాలునా? వయోజన ఓటు హక్కు అందరి సమస్యలనూ పరిష్కరిస్తుందనుకుంటే కార్మికుల కోసం నలుగురు కౌన్సిలర్లకు ప్రాతినిధ్యం కల్పించాల్సిన అవసరం లేదు. అలాగే బొంబాయి వాణిజ్య మండలికి, భారతీయ వర్తక మండలికి మిల్లు యజమానుల సంఘానికి కూడా ప్రాతినిధ్యం ఇవ్వనవసరం లేదు. ఎందుకంటే వాళ్ళు సాధారణ ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యం పొందగలరు గనక. ప్రాతినిధ్యం పొందడానికి కార్మికులకు వయోజన ఓటు హక్కు సరిపోతే ప్రతినిధుల ద్వారా నలుగురు కౌన్సిలర్లను ఎన్నుకొనే ప్రతిపాదన పూర్తిగా అనవసరం. దీన్ని బట్టి అర్థమవుతున్నదేమిటంటే వయోజన ఓటు హక్కు వున్న సాధారణ ఎన్నికల ద్వారా కార్మికులు ప్రాతినిధ్యం పొందలేరనే వాస్తవం మంత్రిగారికి బాగానే తెలుసని. కార్మికులకు కార్మిక నియోజక వర్గాలద్వారా ప్రాతినిధ్యం ఇవ్వాల్సిన అవసరం వుందని భావించి నపుడు మున్సిపాలిటీ వ్యవస్థలోను, దాని పని తీరులోను ఇంకా ఎక్కువ శ్రద్ధ ఉండడానికి అవకాశం వుండే మున్సిపల్ కార్మికులకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడం మరింత అవసరమైన విషయమని నేను మనవి చేస్తున్నాను. ఈ కారణం మీద ఈ సవరణను సభ బలపరచాలని కూడా మనవి చేస్తున్నాను.



# 34

# మద్యపాన నిషేధం[1]

***డా॥ అంబేద్కర్:*** అయ్యా, మద్యపాన నిషేధంపై సభ అభిప్రాయాలు చాలా వేడి వేడిగా వున్నాయని అర్థమవుతోంది. వారి అభిప్రాయాలను నేను పంచుకోవడంలేదని కాదు గానీ, వేరే కారణాల వల్ల నేను గౌరవనీయులైన ఎక్సైజు మంత్రిగారి పట్ల పరుషంగా ఉండదలుచుకోలేదు.ఆ పదవికి ఆయన కొత్త వారని తెలుస్తోంది. ఏ వ్యక్తికైనా ఈ పదవి సరైనది కాదని కూడా నాకు తెలుసు. ఈ పదవిని అంగీకరించడంలో ఆయన చూపిన ధైర్యానికి అభినందిస్తున్నాను. మరొక గౌరవనీయ సభ్యుడు ఈ పదవిని వదిలి వేయడమే మేలని భావించిన విషయం నాకు గుర్తుంది.

నేను ఈ విషయంపై మాట్లాడడానికి ఎందుకని సంసిద్ధమయ్యానంటే గత రెండు మూడు రోజుల్లో గౌరవనీయులైన ఎక్సైజ్ మంత్రిగారి నుండి వెలువడిన మాటల్ని బట్టి ఆయన గతంలోని చెడు మార్గాల్లోనే వెళ్ళి పోతారనే అభిప్రాయం నాకు కలిగింది. ఆ మార్గాలన్నీ ఆ శాఖకి చిరకాలంగా అలవాటయినవే. ఒక రోజున మామధ్య సంభాషణ జరుగుతున్న సమయంలో వారు ఒక విధమైన అసాధారణ ప్రకటన చేసినట్లు నా మనసుకు అనిపించింది. నిజాం రాజు మన ప్రదేశంలో ఒక దుకాణం తెరిచారు కాబట్టి, తానూ నైజాం సరిహద్దుల్లో మరో దుకాణాన్ని ప్రారంభించినట్లు చెప్పారు. అయ్యా, మద్యపాన నిషేధాన్ని అంగీకరించిన ఒక మంత్రి అలాంటి వాదాన్ని సభలో వినిపించడం సబబని నేను భావించడం లేదు. ఈ వాదం ఎలా ఉందంటే ఒక బందిపోటు దొంగ దొంగతనం చేసి, సొమ్ము తీసుకుని పారిపోతే గౌరవనీయులైన ఎక్సైజు మంత్రి ఆ పని తానైనా చేయొచ్చు కాబట్టి దొంగతనం చేసే హక్కు తనకు ఉందని భావించడం లాగా వుంది.

అయ్యా, ఒకరు తప్పు చేశారని అలాంటి తప్పునే నేనూ చేస్తాననడం సమర్థనీయం కాదు. గౌరవనీయులైన నా మిత్రుడు ఎక్సైజు మంత్రి అవలంబించవలసిన ఉత్తమ మార్గం ఏమంటే మన ప్రాంతాల దగ్గర్లో దుకాణాలు తెరచి నందుకు గాను మహారాజశ్రీ నిజాం నవాబుకి ఆక్షేపణ తెలియచేయవలసింది. అలా చేసే బదులు, ఈ రాష్ట్ర ప్రజల ప్రయోజనాల కంటే రెవిన్యూ ప్రయోజనాల పట్ల ఎక్కువ శ్రద్ధ చూపించారు.

గౌరవనీయులైన నా మిత్రులు, ఎక్సైజ్ మంత్రి ఇతర అంశాలన్నీ ప్రక్కన పెట్టి ఆదాయం మీద మాత్రమే దృష్టి సారించినట్లు నాకు కన్పిస్తోంది. బడ్జెట్టు మీద చర్చ జరుగుతుండగా ఆయన ఒక ప్రకటన చేశారు. దాన్ని తీవ్రంగా పరిగణనలోనికి తీసుకోవలసి వుంటుందని నేననుకుంటున్నాను.

---

1 బి.యల్.సి. చర్చలు, సంపుటి 19, పేజీలు 838-40 మార్చి 10, 1927

సభలో నేను కొన్ని విమర్శలు చేసినపుడు వాటికి సమాధానంగా, ఎక్సైజు విధానం బేరీజు వేసేటప్పుడు, మనం మన రాష్ట్రంలో ఎంత సారా వినియోగమవుతుందో పరిగణనలోకి తీసుకోవాలి గాని, ఎక్సైజు శాఖ ద్వారా ఎంత డబ్బు రాబడుతున్నామనేది కాదని చెప్పారు. ఇతర రాష్ట్రాల ప్రజలు తాగినంతగా బొంబాయి ప్రజలు తాగడం లేదని చెప్పడానికి ఆయన కొన్ని గణాంక వివరాలు ఇచ్చారు. ఆ అంకెల్ని పరిశీలించడానికి నాకు సమయం లేకపోయింది. కాని అవి గౌరవనీయులైన ఎక్సైజు మంత్రిగారిచ్చిన అంకెలు కాబట్టి వాటిని మనం అంగీకరించవచ్చు. కాని అయ్యా, ప్రభుత్వ సారాని తక్కువ మంది తాగుతున్న మాట నిజమే కావచ్చు కాని ఈ రాష్ట్రంలో అక్రమసారా ఉత్పత్తి బాగా పెరిగిందని గౌరవనీయులైన మంత్రి కూడా అంగీకరిస్తాననుకుంటాను. కాబట్టి ప్రభుత్వం సారా సేవనం తగ్గినా అక్రమ సారా తాగడం పెరిగి పోయింది. ఫలితంగా సారా వినియోగం తక్కువేమీ కాలేదు. అయితే అక్రమ సారా ఎంత ఉత్పత్తి అవుతోందో మనకు ఖచ్చితంగా తెలియదు. అక్రమసారా పెరుగుతున్నదన్న వాస్తవం మాత్రం అందరూ అంగీకరించారని నమ్ముతున్నాను. దీని గురించి ఆందోళన చెందుతున్నవారిలో గౌరవనీయులైన ఎక్సైజు మంత్రి మొట్టమొదటి వారు అయ్యుండొచ్చు. మొత్తం మీద మనం ఏ ప్రయోజనాన్నీ పొందటం లేదు. ఎందుకంటే ప్రజలు ప్రభుత్వ సారాని తక్కువగా తాగినా అక్రమ సారాని ఎక్కువగానే తాగుతున్నారు. ప్రశ్నేమంటే - ఈ రాష్ట్రంలో అక్రమసారా వుత్పత్తి ఎందుకు పెరిగిపోతోంది? నాకు తెలిసిన వరకు దీనికి ఇంత వరకు అధికారికమైన సమాధానం ఏదీ లేదు. అయినా దీనికి సమాధానం ఇవ్వడానికి నేను సాహసిస్తున్నాను. దీనికేపాటి విలువ ఉంటుందో తెలీదుకాని అయ్యా, రాష్ట్రంలో అక్రమ సారా ఉత్పత్తి పెరుగుదలకు నాటు సారాపై అధిక సుంకం వేయడమే అసలు కారణం. ఒక సరుకు ధర పెరిగితే దానికి ప్రత్యామ్నాయంగా తక్కువ ధరకు దొరికే సరుకుని కొనడం ప్రజల స్వభావం - రాజకీయ ఆర్థిక శాస్త్రంలో అంగీకరించబడ్డ సూత్రం. ఇది పాఠ్యపుస్తకాలలో ఉన్న విషయమే కాదు. ప్రతి గృహిణికీ తెలిసిన ఆచరించే విషయమని నేను నమ్ముతున్నాను. ఉదాహరణకు పంచదార ధర పెరిగినపుడు, ప్రజలు పంచదారకు బదులు బెల్లం వాడడం, కాఫీ ధర పెరిగితే దానికి బదులు టీ ఎక్కువ తాగడం మనకు తెలిసిందే. ఈ విషయంలో కూడ అయ్యా, అదే సూత్రాన్ని అనువర్తిస్తూ నేను మనవి చేసేదేమంటే- ఈ రాష్ట్రంలో అక్రమ సారా పెరగడానికి పూర్తి కారణం నాటు సారాపై హెచ్చు సుంకం విధించడమే. గౌరవనీయులైన నా మిత్రులు, ఎక్సైజు మంత్రి ఈ అంశాల పట్ల మరి కాస్త శ్రద్ధ చూపిస్తారని ఆశిస్తున్నాను. మద్యపాన నిషేధం పట్ల ఆయనకు నిజంగా నిజాయితీ వుంటే సుంకాలను క్రమబద్ధం చేయాలి. ఆయన ఈ పని చేయకపోతే ప్రభుత్వ సారా సేవనాన్ని అదుపు చేయడంలో విజయం సాధించవచ్చుగాని అక్రమసారా పెరుగుదలను ప్రత్యక్షంగా ప్రోత్సహించిన వారవుతారు. నేను మాట్లాడదలచిన రెండో అంశం ప్రభుత్వ మద్యపాన నిషేధ విధానం మీద గౌరవనీయులైన నా మిత్రులు శ్రీ ముర్ధబాన్ చేసిన కొన్ని వాదనలకు సమాధానంగా, మద్యపాన నిషేధం అమలుపట్ల ప్రభుత్వం కృతనిశ్చయంతో వుందని గౌరవనీయులైన నా మిత్రులు, సభానాయకులు చెప్పడం చాలా నాకు సంతోషదాయకంగా ఉంది. విధానమండలి తీర్మానించిన ఈ

విధానం నుండి ఏ పరిస్థితిలోనూ వెనక్కి పోమని కూడా చెప్పారు. కాని అయ్యా, ఆయన మనల్ని మన ముందున్న సమస్య నుండి కొంచెం పక్కకు తప్పించడం గమనించి నేను కొంచెం నిరుత్సాహ పడ్డాను. మద్యపాన నిషేధాన్ని అమలు పరచడంలో రేషనింగ్ పద్ధతి పెట్టాలా లేక దాన్ని స్థానికుల ఇచ్చకు వదలాలా అనేది సభ ముందున్న సమస్య అని చెప్పారు. అయ్యా, నా దృష్టిలో చిన్న చిన్న వివరాలను పక్కనపెడితే రెండు పద్ధతులూ ఇంచుమించు సమాన సామర్థ్యం గలవే. రేషను పద్ధతి అనుసరించినా సరే, ఐచ్ఛిక విధానం అనుసరించినా సరే, పరిస్థితిలో ఏమాత్రం తేడా రాదు. ఎందుకంటే మార్కెట్టులోకి పంపే సారాని మాత్రమే అవి అదుపులో పెట్టగలవు. అంగడి వాళ్లకు ఎక్కువ సరఫరా చేయకుండా వున్నా, అసలు అంగళ్లు తెరవకుండా వున్నా ఫలితం మాత్రం ఒకటే. కాని అయ్యా, మద్య నిషేధ విధానాన్ని ఎంతవరకు మనం ముందుకు తీసి కెళ్లగలమో గౌరవనీయులైన నా మిత్రులు సభా నాయకులు ఆలోచించినట్టులేరు. అయ్యా, మద్య నిషేధాన్ని విజయవంతం చేయగలిగిందీ లేనిదీ పూర్తిగా దాని ఆర్థిక పరిష్కారం మీద ఆధారపడి వుంది. మన కొత్త ఎక్సైజు విధానం ఫలితంగా కలగబోయే నష్టాలను ఎలా భర్తీ చేసుకోగలమనే దాని మీద దాని విజయం ఆధారపడి ఉంటుంది. గౌరవనీయులైన సభానాయకులు ఏ పద్ధతిలో ఎలాంటి పన్నుల్ని విధించబోయేదీ ఆ వివరాలు పూర్తిగా తెలుసుకోవాలని ఇవతలి పక్షంలో వున్న మాకు ఆసక్తిగా వుంది. సభలో మనకు అభిప్రాయ భేదాలు ఉన్నా మా పక్షం మాత్రం అదనపు పన్నుకు వ్యతిరేకంగా లేదని ప్రకటిస్తున్నాను. అయితే ఈ పన్నులను ప్రభుత్వం జాతీయ నిర్మాణ కార్యక్రమాలకు వినియోగించాలి. పన్నులను కేవలం ప్రభుత్వ నిర్వహణకు, ప్రభుత్వ పాలనకు ఉపయోగించేటట్లయితే మేము ఈ అదనపు పన్నులను తప్పనిసరిగా వ్యతిరేకిస్తాము. వాళ్ల జీవితాన్ని సుఖవంత చేసేటట్లయితే, మేము మా పక్షాన ఏ పన్నునైనా బలపరచడానికి సిద్ధంగా వున్నాము. మద్యపాన నిషేధం విషయంలో ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదన్న అభియోగాన్ని ఖండించడానికి గౌరవనీయ సభా నాయకుడు ప్రయత్నించారు. రెవిన్యూ నష్టాన్ని ఎలా భర్తీ చేసేది ముందుగా నిర్ణయించుకోకుండా, మద్యనిషేధ విధానాన్ని కొనసాగించడం గురించి ప్రభుత్వం, ఎలాంటి వాగ్దానం చేయకూడదని నా వుద్దేశం. ఇప్పటి వరకు పన్ను చెల్లించని ప్రజల మీద, ఈ భారం మోయగలిగే సామర్థ్యం ఎక్కువగా ఉన్న ప్రజల మీద పన్నులు విధించాలి. ప్రతిసారీ వాగ్దానం చేయడం దాన్ని నిలుపుకోకపోవడం నిరర్థకమనుకుంటున్నాను. కొత్త పన్నుల ప్రతిపాదనతో సభ ముందుకు వచ్చి, ఇప్పటిదాకా ఏ విధానం అనుసరించమని సభ కోరుతున్నదో ఆ సభ నిజాయితీని పరీక్షించి చూడడం గౌరవనీయ సభా నాయకుడు చేయాల్సిన పని. ఈ సభకు గానీ, ఎవరికైనాగానీ ఈ విధానం చాలా ఖర్చుతో కూడిందని తెలుసు. సభ పట్టుపట్టి అమలు చేయిస్తున్న ఈ విధానం ప్రభుత్వ ఖజానాకు ఏ మేరకు ండి కొడుతుందో దానిని భర్తీ చేయడానికి ఈ సభ సిద్ధంగా వుందో లేదో గౌరవనీయులైన సభా నాయకులు సభ నుంచి హామీ తీసుకుని వుండాల్సింది. అది ఆయన విధి, బాధ్యత. ఈ మాటలతో ముగించి కూర్చుంటున్నాను.

☆ ☆ ☆

# 35

# ప్రసూతి ప్రయోజన బిల్లు*

**డా॥అంబేద్కర్:** అయ్యా, ఈ బిల్లు మొదటి పఠనాన్ని బలపరచడానికి నిలబడ్డాను. ఈ సందర్భంగా ఈ బిల్లుకు వ్యతిరేకంగా లేవనెత్త బడిన కొన్ని అంశాలకు సమాధానం చెప్పదలచాను. గౌరవనీయులైన సాధారణ సభ్యుడు బిల్లుకు వ్యతిరేకంగా మాట్లాడుతూ ఇది ప్రమాదం లాంటిది కాదని చెప్పారు. అంటే కార్మికుల నష్టపరిహార చట్టం కింద 'ప్రమాదం' అనే దాన్ని మనం ఎలా అర్థం చేసుకుంటామో ఇది అలాంటిది కాదన్నారు. కాబట్టి ఆ చట్టంలోని సూత్రాన్ని ఈ బిల్లు కింద ప్రయోజనం పొందబోయే స్త్రీలకు వర్తింపచేయరాదన్నారు. అయ్యా, ఇది ప్రమాదం కాదని నేనూ అంగీకరిస్తున్నాను. అంతమాత్రాన ఈ బిల్లు కలిగించాలనుకునే ప్రయోజనానికి వాళ్లు అర్హులు కారని అర్థం కాదు. ఈ బిల్లుకు గల ప్రాతిపదిక సూత్రమే పూర్తిగా పక్షపాతమైనది. తల్లిపై ప్రభావంచూపే ప్రసూతి పూర్వ పరిస్థితులు, తర్వాత బిడ్డను పెంచడం అనేవి ఈ బిల్లులో చాలా ముఖ్యమైన విషయాలు. వీటిపై పూర్తి ఏకాభిప్రాయం ఉందని నమ్ముతున్నాను. కాబట్టి అయ్యా, జాతీయ ప్రయోజనాల దృష్ట్యా కాన్పుకు ముందూ తరువాత కూడ తల్లికి కొంత విశ్రాంతి వుండాలి. ఆ సూత్రం పైనే ఈ బిల్లు ఆధారపడింది. అలాంటప్పుడు దాని బాధ్యత హెచ్చుగా ప్రభుత్వంపైనే ఉంటుందని ఒప్పుకోక ప్పదు. ప్రజా సంక్షేమం బాధ్యత ప్రధానంగా ప్రభుత్వానిదే. ఈ వాస్తవం అంగీకరించడానికి నేను స్వంగా వున్నాను. ప్రసూతి సౌకర్యాన్ని ప్రవేశ పెట్టిన అన్ని దేశాలలోనూ దానికి సంబంధించి ప్రభుత్వం కొంత బాధ్యత భరించడం చూస్తున్నాము. అయితే స్త్రీని పనిలో పెట్టుకునే ఏ యజమాని అయినా ప్రసూతి సదుపాయాల బాధ్యత నుండి పూర్తిగా విముక్తుడని అంగీకరించడానికి నేను సిద్ధంగా లేను. దానికి కారణం ఇది. కొన్ని పరిశ్రమల్లో పురుషులను పెట్టుకోవడం కన్నా స్త్రీలను నియమించడం ఎక్కువ లాభదాయకమని యజమాని స్త్రీలను ఉద్యోగంలో చేర్చుకుంటాడు. అందులో సందేహం లేదు. పురుషుల్ని నియమించడం కన్నా స్త్రీలను పెట్టుకోవడం వల్ల దామాషా రీత్యా హెచ్చు లాభం పొంద కలుగుతున్నాడు. పురుషుల బదులు స్త్రీలను పెట్టుకోవడం వల్ల ప్రత్యేక లాభం వస్తున్నపుడు కొంతవరకన్నా యజమాని ప్రసూతి వేతన బాధ్యత వహించాలని చెప్పడం పూర్తిగా సమంజసం. కాబట్టి ప్రసూతి బత్తెం విషయంలో ప్రభుత్వం పై కొంత బాధ్యత వేయవలసి ఉన్నప్పటికీ, ఇప్పుడున్న పరిస్థితుల్లో యజమానిపై కూడా బాధ్యత పెట్టడం సక్రమమేనని భావిస్తున్నాను. ఈ కారణం మీద నేను ఈ బిల్లును బలపరుస్తున్నాను.

---

* బి.ఎల్.సి. చర్చలు, సంపుటి 23, పేజీలు 381-82, జూలై 28, 1928

ఈ బిల్లు ఫ్యాక్టరీలకు మాత్రమే వర్తిస్తుందని, ఇతర పరిశ్రమలకు, వ్యవసాయ వృత్తులకు వర్తించదని చెప్పారు. దానికి సమాధానం చెప్పటం సులభం. ఒక స్త్రీ ఆరోగ్యానికి భంగకరమైన నటువంటి పరిస్థితులు ఉండే పరిశ్రమలకు మాత్రమే ఈ సూత్రం వర్తిస్తుంది. ఫ్యాక్టరీలలో స్త్రీ ఆరోగ్యానికి హాని కలిగించే ప్రమాదాలు లేక పరిస్థితులు ఉంటాయి కాని వ్యవసాయ తదితర వృత్తులలో ఆ పరిస్థితులు లేవు. ఈ కారణం వలన ఆ చట్టాన్ని సామాన్యంగా ఫ్యాక్టరీలకు మాత్రమే పరిమితం చేస్తారు. ఉదాహరణకు కార్మికుల నష్టపరిహార చట్టం విషయంలో కూడ ఇదే చెప్పొచ్చు. ఫ్యాక్టరీలలో సంభవించే ప్రమాదాలకు మాత్రమే ఈ చట్టం వర్తిస్తుంది. కనుక ఆ శాసనం ఫ్యాక్టరీలకే పరిమితమైంది. ఇతర వృత్తులకు కాదు.

దీనివల్ల పరిశ్రమలపై పడే భారం వేతనాలు తగ్గడానికి కారణమవుతుందని గౌరవనీయులైన సాధారణ సభ్యుడు చెప్పారు. అది వేతనాలు తగ్గడానికి కారణం అవుతుందని నేను అనుకోవడం లేదు. ఒకవేళ అలా జరిగినా పరిశ్రమల మీద పడే ఈ అదనపు భారం కొంత వరకైనా వేరే చోటికి బదిలీ అవుతుంది. కాబట్టి గౌరవనీయులైన సాధారణ సభ్యునికి అభ్యంతరం ఉండాల్సిన అవసరం లేదు. ఇది శాసన రూపం పొందగానే ఈ భారం బహుశ వినియోగదార్ల మీద పడుతుంది. ఉత్పత్తి దారులైన స్త్రీలకు లాభదాయకమైనపుడు వారు తయారుచేసే వస్తువుకు ఎక్కువ ధర చెల్లించడానికి సమాజానికి అభ్యంతరం ఉండ రాదు.

ఈ శాసనం బొంబాయి రాష్ట్రానికే వర్తింపజేయటం న్యాయం కాదని భారతదేశంలోని ఇతర రాష్ట్రాలకు కూడా దీన్ని వర్తింపచేయాలని అన్నారు. అయ్యా! నామనవి ఏమంటే ఈ శాసనం బ్రిటీష్ ఇండియా మొత్తానికి వర్తింపజేశారనుకోండి. ఎవరో లేచి " ఈ బిల్లును ఇండియాకే ఎందుకు పరిమితం చేయాలి? మిగతా దేశాలతో పోల్చినపుడు ఇండియాకు నష్టం కలుగుతుంది కాబట్టి ఈ బిల్లులోని సూత్రాన్ని మొత్తం ప్రపంచం ఆమోదించే దాకా ఆగుదాం. అప్పుడు అందరం సమానమవుతాం" అని అనకూడదని ఏముంది? కాబట్టి ఈ వాదనల్లో సత్తా ఏమీలేదు. ఈ బిల్లు వల్ల వచ్చే ప్రయోజనాలను బొంబాయి రాష్ట్రంలోని ఫ్యాక్టరీల్లో శ్రమించే పేద స్త్రీలకు వర్తింప జేయాలని నా మనవి.

☆ ☆ ☆

# 36

# కొరడాదెబ్బల శిక్ష

***డా॥ అంబేద్కర్*** అయ్యా, ఈ బిల్లుకు బాధ్యత వహిస్తున్న నా గౌరవనీయ మిత్రుడు న్యాయవ్యవహారాల ఆద్యుడు గౌరవనీయ సభ్యుడు అయిన శ్రీ బెల్ వాదన విన్న తర్వాత దీని అవసరం గురించి వివరించాల్సిన అవసరం నాకేమీ కనిపించడం లేదు.కొరడాదెబ్బలు సరైన శిక్షా కాదా అనే విషయాన్ని గురించి వాదించాల్సిన అవసరం కూడ లేదు. బొంబాయిలోనూ, పొరుగు గ్రామాల్లోనూ భారతీయ సమాజాన్నీ భారతీయ నాగరికతనూ అప్రతిష్టపాలు చేసే భయంకరమైన అల్లర్లు చాలా జరిగాయి. గౌరవనీయ సభ్యులు ఎవరూ దీన్ని కాదనరని గట్టిగా భావిస్తున్నాను. భారతీయ చట్టాలలో కొరడాదెబ్బలు ఒక శిక్షా విధానంగా వుంది. మనం కొత్తదారి తొక్కుతున్నామని విమర్శించే వారికి ఈ సమాధానం చాలనుకుంటాను. కాబట్టి ఆయన ఉద్దేశంలో ఒకే ఒక అంశం ఉంది చర్చించడానికి. ఈ బిల్లులో పొందుపరిచిన నిబంధనలు సందర్భావసరాన్ని మించిపోతాయా అనేదొక్కటే నా ఆలోచన. చర్చ జరగాల్సింది దాని మీదే. అయ్యా, నేను బిల్లును ముఖ్యంగా, బిల్లులోని రెండవ క్లాజును శ్రద్ధగా చదివిన మీదట ఈ బిల్లు సారమంతా దానిలోనేవుందని గ్రహించాను. దాని నిబంధనలను ఇప్పుడున్న రూపంలో అంగీకరించడానికి నాకు కొంత ఇబ్బందిగా వుంది. ఇప్పుడున్న రూపంలో ఆ క్లాజు ఏం చెపుతుందంటే కొరడాదెబ్బల చట్టంలోని 4వ సెక్షనులో ఉన్న నిబంధనలు నేర శిక్షాస్మృతిలోని 146,148 సెక్షన్ల పరిధిలోకి వచ్చే అన్ని అల్లర్లకూ వర్తిస్తాయి. కాని అయ్యా, ఈ బిల్లు మతకలహాలతో వ్యవహరించడానికి ప్రత్యేకంగా రూపొందించ బడిందనే అభిప్రాయంలో నేను ఉన్నాను. అయ్యా, అల్లర్లు అనేక రకాలు. ఉద్దేశం కారణం, సందర్భం వేరు కావొచ్చు. బొంబాయి నగరంలో పారిశ్రామిక సమ్మె వల్ల అల్లర్లు చెల రేగవచ్చు, పేదల మధ్య పోట్లాట అల్లర్లకు దారి తీయొచ్చు, ఆ పోట్లాట తమది కాని ఆస్తి మీద హక్కు ఉందని వాళ్లు నమ్మడం వల్ల జరగొచ్చు. అయ్యా, ఈ సభలో ఒక విషయం స్పష్టం కావాలి. చట్ట విరుద్ధంగా గుమికూడడమనే నేరం నుంచి అల్లర్లు పుడతాయి. చట్ట విరుద్ధంగా గుమికూడిన గుంపు బలప్రయోగానికి పాల్పడినపుడు అది అల్లరి అవుతుంది. 146వ సెక్షనులో అల్లర్లకు ఇచ్చిన నిర్వచనం చట్ట విరుద్ధంగా గుమికూడడం అనేది ఉదాసీనంగా తీసుకోవాల్సిన విషయం కాదు కాని భయంకరమైన కొరడా దెబ్బలకు గురికావలసినంత తీవ్రమైన నేరం కూడా కాదు. దాన్ని బట్టి నా అభిప్రాయం ఇది. కొరడా దెబ్బల శిక్షను ప్రవేశపెట్టాలంటే రెండవ క్లాజును మార్చాలి. ఇది మత పరమైన కొట్లాటల వల్ల వచ్చే అల్లర్లకు మాత్రమే వర్తించేటట్లు, ఇతర అల్లర్లకు వర్తించకుండేటట్లు

---

* బి.యల్.సి. చర్చలు, సంపుటి 37 పేజీలు 652-53, ఫిబ్రవరి 18,1933

మనం దాన్ని మార్పు చేయాలి. ఇప్పుడున్న క్లాజులో ఉపయోగించిన పదాలు ఎలాంటి అల్లరికైనా వర్తించేటట్లు ఉన్నాయి. నిత్య జీవితంలో అనుకోకుండా సందర్భపడే అల్లర్లకు కూడా కొరడాదెబ్బల శిక్ష విధించడానికి ఈ బిల్లు అవకాశం కల్పిస్తోంది. భారతీయ నేరశిక్షాస్మృతి ఎంతో విజ్ఞతతో అల్లర్లలోని సామాన్య తప్పిదాలకు సామాన్య శిక్షను నిర్దేశించింది. ఈ బిల్లు ఇపుడు మతకలహాల దృష్ట్యా ప్రత్యేకంగా అవసరమయిందేగాని, ఇతర కారణాల కోసం మతపరమైన అల్లర్లకు ప్రత్యేకంగా ఇది వర్తించేటట్లు పదజాలాన్ని మార్పు చేయడానికి గౌరవనీయ మిత్రులైన సభ్యులు అంగీకరిస్తే ఆయనకు నా మద్దతు వుంటుంది. ఈ సందర్భంలో నేను చెప్పదలచింది ఇదే.

  

# 37

# మంత్రుల వేతనాల బిల్లు*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం, బైకుల్లా, పరేల్):* అధ్యక్షా! ఒక ప్రకటన చేయడానికి లేచాను. చాలా ఆలోచించే "ప్రకటన" అనే పదం వాడుతున్నాను. గౌరవనీయ మిత్రులైన ప్రధాన మంత్రి ప్రతిపాదించిన బిల్లుకు నేను సవరణ ఏదీ ప్రవేశపెట్టడం లేదు. దీని మీద ఓటింగ్ జరిపించా లన్న ఆలోచన కూడా నాకేమీ లేదు. మంత్రుల జీతాల బిల్లు అందరికీ ఆమోదయోగ్యమైన చర్య అయివుండాల్సింది. మంత్రివర్గం ప్రతిపాదించినట్లుగా (ఇదికేవలం) పార్టీ వోట్లతో నెగ్గనవసరం లేదు. అయినా మంత్రివర్గం అందర్నీ కలుపుకుపోవాలని చూడలేదు. కాబట్టి నేను ఈ ప్రకటన చేయవలసి వస్తోంది. ఈ బిల్లు వెనుకనున్న సూత్రం పట్ల అభ్యంతరం తెలియజేయడానికే నేను ఈ ప్రకటన చేస్తున్నాను. ప్రధానమంత్రి మాటల్లోని నిజాయితీని, మంత్రుల ప్రవర్తనలో ఆయన ఆశిస్తున్న ఉన్నత ప్రమాణాలని విన్న సభ్యులందరికీ ఆయన పట్ల గౌరవం పెరుగుతుందనడంలో సందేహం లేదు. ఈ బిల్లును ప్రవేశపెడుతూ ఆయన ఇవన్నీ చెప్పినప్పటికీ ఒక కార్యశీలునిగా కార్యనిర్వాహణ దృష్టితో విషయాలను చూస్తూ ఈ బిల్లులో పొందుపరిచిన ప్రామాణిక వేతనం అనే దాన్ని అంగీకరించగలననుకోవడం లేదు.

ఇది మంత్రులకు ప్రామాణిక వేతనం కాకూడదు అని నేను అనుకోవడానికి తగిన కారణాలు వివరించే ముందు, ఇండియాలోనూ, ఇండియా వెలుపలా మంత్రులకిచ్చే జీతాలు వివరాలను సభ ముందు ఉంచదలచాను. వాటిని బట్టి ఈరోజు ఉన్న ప్రమాణాలకు మనం ఎలా దూరమవుతున్నామో చూడగానే సభకు విదితమవుతుంది. నేను సేకరించిన అంకెలు కొన్నిటిని చెపుతాను. స్వతంత్ర ఐరిష్ దేశంలో 11 మంది మంత్రులున్నారు, ప్రతి ఒక్కరికీ సాలుసరి 1700 పౌండ్ల జీతం ఇస్తారు. నా లెక్క ప్రకారం ఇది నెలకు సుమారు రూ. 2000|- . దక్షిణాఫ్రికాలో 13 మంది మంత్రులున్నారు. ఇద్దరు పోర్టుఫోలియో లేనివారు. ప్రధానమంత్రికి సంవత్సరానికి 3500 పౌండ్లు ఇంతర మంత్రులకు సంవత్సరానికి 2500 పౌండ్లు ఇస్తారు. నా లెక్క ప్రకారం ఇది నెలకు రూ. 2900|- ఆస్ట్రేలియా నుండి సమాచారం సేకరించలేకపోయాను. కెనడా వివరాలు ఇవి. ప్రధాన మంత్రికి సంవత్సరానికి 19,000 డాలర్ల జీతం. 16మంది మంత్రులు వున్నారు. ఒక్కొక్కరికీ సంవత్సరానికి 14000 డాలర్లు దాంట్లో 4000 డాలర్లు సభాభత్యం. న్యూజిలాండ్‌లో 12 మంది మంత్రులున్నారు. అక్కడ ప్రధానమంత్రికి 1800 పౌండ్లు, నివాసగృహం, మంత్రికి సంవత్సరానికి 1370 పౌండ్లు

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి, పేజీలు 247-54, ఆగస్టు 23, 1937

దాంట్లో 200 పౌండ్లు ఇంటి భత్యం. కాబట్టి మంత్రికి వచ్చే జీతం నెలకు రూ 1500.

ఇండియా విషయానికి వస్తే భారత ప్రభుత్వ కొత్త చట్టం అమలులోనికి వచ్చే ముందు ఇచ్చిన జీతాలు ప్రస్తుతానికి పక్కన పెడితే, తాత్కాలిక మంత్రులకు నిర్ణయించిన జీతాలు ఇవీ. తాత్కాలిక మంత్రులే అయినా కొంత వరకయినా, ప్రజాభిప్రాయానికి బాధ్యులు గనుక వారిని ఎవరూ మంత్రులు కాదనలేరు. పార్లమెంటుకు సమర్పించిన జాబితాలోనుంచే నేను ఈ అంకెలు చెపుతున్నాను. మద్రాసులో ప్రధానమంత్రికి రూ 3000, మంత్రికి రూ 2500, నివాసం ఇచ్చారు. బొంబాయిలో ప్రధానమంత్రి జీతం రూ 4000, మంత్రులకు ఒక్కొక్కరికీ 3500, సంయుక్త రాష్ట్రాల్లో ప్రధాన మంత్రితో సహా మంత్రులందరికీ రూ 2500 జీతం. కేంద్ర రాష్ట్రాలలో ప్రధాన మంద్రికి రూ 3000, మంత్రికి రూ 2250 చెల్లించారు. బీహారులో ప్రధానమంత్రికి రూ 2500, మంత్రికి రూ 2000 ఇచ్చారు ఒరిస్సాలో ఒక్కొక్కమంత్రికీ రూ 1000 చొప్పున చెల్లించారు.

అయ్యా, ఈ అంకెలను మంత్రుల వేతనాల బిల్లులో ప్రతిపాదించిన అంకెలతో పోల్చండి. ప్రస్తుత ప్రమాణం నుండి, చాలా దూరం వెళ్ళామనడంలో మనకు అనుమానం వుండదు. అంకెల్లోనే కాకుండా, విధానంలో కూడా వ్యత్యాసం వుందని నాకు అనిపిస్తోంది. విధానంలో వ్యత్యాసం వుందంటే, సూత్రంలోనే వ్యత్యాసం వున్నదని అర్థం. మంత్రి జీతాన్ని నిర్ణయించడంలో ఏవేవి పరిగణనలోకి తీసుకోవాలి? నా ఉద్దేశంలో ఇందుకు పరిగణించాల్సిన అంశాలు నాలుగున్నాయి. ఒకటి, ప్రజా సమూహానికి మంత్రులు సామాజిక నాయకులు గనుక వారి సామాజిక స్థాయి. రెండు, వారి సామర్థ్యం. మూడు, ప్రజాస్వామ్య సూత్రాలు. నాలుగు, పరిపాలనలో నీతి నిజాయితీ. మొదటి అంశాన్ని మరీ అతిగా సాగదియ్యాలని లేదు. అయినా దేశానికి మంత్రులు మొదటి పౌరులు కాబట్టి, వాళ్లు సంస్కారంతో కూడిన కళలపట్ల, విద్యపట్ల ఆసక్తిగల జీవితం గడపాలని, వారి జీవితం ఇతరులకు ఆదర్శవంతంగా వుండాలని వ్యక్తిగతంగా నేను అభిప్రాయపడుతాను. దీని గురించి మిగతా మిత్రులకు పట్టింపు లేకపోతే దానిని ఇక్కడితో వదిలేయడానికి నేను సిద్ధమే. కాని సామర్థ్యం ప్రజాస్వామ్యం, నిజాయితీ అంశాలు మాత్రం జీతాలు నిర్ణయించడంలో వదిలివేయవలసిన విషయాలు కాదు. మంత్రుల విధులు, పనితీరు ఎలావుండాలని గౌరవనీయులైన ప్రధానమంత్రి అభిప్రాయపడుతున్నారో నాకు తెలియదు. మంత్రులు ఏమీ చెయ్యనవసరం లేదు. జండా ఎగరవేస్తే చాలు, కెంపువన్నె దుస్తులు ధరించిన వనితల నుండి గౌరవవందనం స్వీకరిస్తే చాలు అని భావిస్తుంటే అది వేరే విషయం. మంత్రుల నుండి మనం ఏమైనా కోరుతున్నామంటే, అది సామర్థ్యం ఒక్కటే అని నేను మరీ మరీ నొక్కి చెపుతున్నాను.మూడు అంగాలలో శాసనసభ, కార్యనిర్వహక వర్గం, న్యాయవ్యవస్థలలో కార్యనిర్వహక వర్గం అనేది క్రియకు ప్రధాన భూమిక. దేశం ఎదుర్కొనే సమస్యలను అధ్యయనం చేయాల్సింది కార్యనిర్వాహక సిబ్బందే. ఆ సమస్యల పరిష్కారానికి ప్రతిపాదనలను చూపించవలసిందీ కార్యనిర్వాహక సిబ్బందే. అయ్యా, క్లుప్తంగా చెప్పాలంటే కార్యనిర్వహక వర్గమే మన మేధోనిధి. మనం ఎదుర్కొనే అనేక సమస్యలను

పరిష్కరించడానికి రాజ్యాంగం నుంచి సత్ఫలితాలను పొందడానికి వీరే మన సాధనాలు.

నా మనసులో తలెత్తిన ప్రశ్న ఇదీ. సామర్థ్యం ఉన్నవారినీ, సమస్యలను ఎదుర్కొని, పరిష్కారాలు సూచించగల నైపుణ్యం వున్నవారినీ ఆకర్షించగల వేతనం మనం ప్రతిపాదిస్తున్నామా?

ఈ దేశంలోని పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని నేను ఈ విషయాన్ని నిష్పక్షపాతంగా పరిశీలించి చూసినా అవుననే సమాధానం చెప్పలేను. ముందు ఒక వాస్తవం చూడాలి. అదేమంటే, మంత్రి వర్గానికి మనం ఇచ్చే వేతనం కంటే, ఇతర జీవిత రంగాలలో వచ్చే వేతనాలు చాలా హెచ్చు. సామర్థ్యం సాధించాలన్న పట్టుదల వున్న చాలా మంది ఇతర జీవిత రంగాల వైపు వెళ్లారు. మంత్రి పదవి చేపట్టి బాధ్యత వహించే కన్నా అవే మేలు అనుకుంటారు. ఏ జీవన రంగంలోనైనా నెలకు అయిదు వందలకు మించి జీతం తీసుకోకూడదని మంత్రివర్గం శాసనం చేస్తున్నట్లయితే దాన్ని నేను అర్థం చేసుకోగలను. అలా చేసివుంటే, విషయాలు మరోలా వుండేవి. కాని వాళ్లు అలా చేయడం లేదు. సమర్థులను ఇతర జీవన రంగాల్లోకి తరిమేస్తున్నారు. ఇది ఒక అంశమైతే రెండో విషయం ఏమంటే, ఇండియాలో ఉన్న పరిస్థితిని బట్టి బాధ్యత తీసుకోడానికి సమర్థులైన మేధావి వర్గం చాలా స్వల్పంగా వుందని చెప్పక తప్పదు. అయ్యా, ఈ దేశంలోని సామాజిక వ్యవస్థ విద్యను ఒక చిన్న వర్గానికి మాత్రమే పరిమితం చేసింది. బ్రిటిషు ప్రభుత్వం కూడా ఈ వ్యవస్థను పెద్దగా దెబ్బ తీయలేక పోయింది. మెజారిటీ ప్రజలకు చదువుకునే హక్కు, అవకాశం ఈ దేశంలో ఎప్పుడూ లేదు. నిజానికి చాతుర్వర్ణ వ్యవస్థ ప్రకారం చదువుకోవాల్సింది ఒకే వర్గం. మిగతా వారికి విద్యను నిషేధించారు. తత్ఫలితంగా విస్తృత జనసమూహం పరిపాలన చేయగల నాయకులను తమ నుండి మంత్రి పదవుల్లోకి పంపలేదు. కాబట్టి, నామనవి ఏమంటే, ఈ వేతనం పరిపాలనా సామర్థ్యం గల వారిని ఆహ్వానించే వేతనం కాదు.

అయ్యా, ప్రజాస్వామ్యం విషయానికి వస్తే, ఈ వేతనం ప్రభావమేమిటో ఆలోచించారా? నేను మొహమాట పడకుండా చెపుతున్నాను. ఈ వేతనం పర్యవసానం ఇలా వుంటుందని నేను సూటిగానే చెప్తాను. ఈ జీతానికి సిద్ధపడేవాళ్లు డబ్బు అంటే లెక్కలేని మనుషులైనా అయివుంటారు. అంటే వ్యక్తిగత సంపాదన వుండి, రాజకీయ అధికారం కోసం, ఆ రాజకీయ అధికారాన్ని తమ వర్గం లేదా కులం ప్రయోజనానికి ఉపయోగించడం కోసం ఈ పదవుల్ని చేపట్టే వాళ్ళయి వుంటారు. అది ఒక పర్యవసానం. మరో పర్యవసానం, ఏ విధంగానూ డబ్బు గడించలేని వాళ్లు మంత్రి వర్గంలో చేరే అవకాశం వుంది. ఇంత కంటే వేరే పర్యవసానం ఏదీ లేదు. (నవ్వులు) నా మిత్రులు నవ్వొచ్చు. కాని ఈ బిల్లు పర్యావసానాలు ఇలా ఉంటాయనడానికి నాకేం సందేహం లేదు. నేను భయపడేది వాస్తవంగా జరిగితే మాత్రం అంతకన్నా మించిన వినాశనం లేదు. భారత ప్రభుత్వ చట్టం క్రింద మనకు లభించిన రాజకీయాధికారాన్ని డబ్బువుండి జీతం గురించి లెక్క చేయని కొద్దిమంది హస్తగతం చేసుకోకూడదని నా కోరిక. అలాగే ప్రయోజనాల దృష్ట్యా అధికారం అసమర్థుల చేతుల్లోకి వెళ్లడాన్ని కూడా అంగీకరించలేం.

నాలుగో విషయానికి వద్దాం, అది పరిపాలనలో ఉండాల్సిన నీతి నిజాయతీ. ఒక కాంగ్రేసు మిత్రుడు అన్న దాన్ని సభలో చెప్పాలని వుంది. మంత్రులను సరఫరా చేసే కాంట్రాక్టు గవర్నరు తనకు ఇస్తే దాన్ని వెంటనే తీసుకుని ఆ కాంట్రాక్టు తనకు ఇచ్చినందుకు బొంబాయి రాష్ట్రానికి ఏదో ఒకటి ఇచ్చుకుంటానన్నాడు. ఇది భావగర్భితమైన మాట. మేనేజర్లు ఎదురు చూస్తూ నిలబడినందుకు డబ్బు చెల్లించే హొటళ్ళు ఐరోపాలో ఉన్నాయి. ప్రలోభానికి గురి అయ్యేవారికి అవకాశాలు అనేకం ఉన్నాయని దీన్ని మరో విధంగా సంపాదించుకోగలరు. ప్రస్తుత మంత్రి వర్గం గురించి నేనేమీ చెప్పడంలేదు. ఈ బిల్లులోని సూత్రాన్ని గురించి మనం చర్చిస్తున్నామేకాని దీనిలో వున్న వ్యక్తుల గురించి కాదు. హెచ్చుజీతాలు ఇచ్చికూడా నిజాయితీ లేని మనిషి నుండి నిజాయితీ లేని తనాన్ని తీసి వెయ్యలేరు. ఈ విషయం నేను ముమ్మాటికీ అంగీకరిస్తున్నాను. మీ ఇష్టం వచ్చి నంత జీతం ఇచ్చినా అవినీతిపరుడైనవాడు అవినీతిపరుడుగానే వుంటాడు. కాబట్టి మనం చూడా ల్సింది దాన్ని కాదు. ప్రలోభానికి గురికాకుండేంతటి జీతాన్ని మీరు మంత్రికి నిర్ణయించలేరా అనేది మనం చూడవలసింది. అయ్యా, ఈ రాష్ట్రంలో 3 లేదా 4 వేల రూపాయల జీతం చెల్లించినా పరిపా లనకు సంబంధించి అపవాదులున్నాయి. 3,4 వేల రూపాయల జీతం ఉన్న రోజుల్లోనే కుంభ కోణాలు జరిగినపుడు రూ. 500 జీతం గతంలో కన్నా పెద్ద కుంభకోణాలను సృష్టిస్తుందేమోనని నా భయం. అయినా జీతం సరిపడా వుందా లేదా అనేదొక్కటే కాదు సమస్య. దాన్ని కూడా పరిగ ణనలోకి తీసుకోవాలి. జీతం సమస్యను రెండు కోణాల నుంచి చూడాలి. వ్యక్తుల దృష్టి నుంచి చూసినపుడు జీతం సరిపోయినంత వుందా లేదా అని చూడాలి. ప్రభుత్వం నుంచి చూసినపుడు దాని భద్రత, పరిపాలనలో నిజాయతీ చూడాలి. ఒక వ్యక్తి కొంత జీతం తనకి సరిపోయిందన వచ్చును. అంత మాత్రాన అది ప్రజల దృష్టిలో మంచి జీతమా కాదా అని మనం చూడనవసరంలేదని కాదు. కనీస జీతం తప్పనిసరిగా మంచి జీతం అయిఉండాలని లేదు. కనిష్ట టెండరు వేసినంత మాత్రాన వాళ్లకు కాంట్రాక్టులు ఇవ్వమనే క్లాజు అన్ని కాంట్రాక్టుల్లో ఉంటుందని ఎదురుగా వుండే మిత్రులకు తెలిసే వుంటుంది. తక్కువ రేట్లు వేసినంత మాత్రాన కాంట్రాక్టులు ఇవ్వాలని లేనట్లే తక్కువ జీతానికి సిద్ధపడినంతమాత్రాన వాళ్లకు మంత్రి పదవులు ఇవ్వాలని లేదు. తక్కువ రేట్లకు ఒప్పుకున్నా కాంట్రాక్టరు ఆ పని సక్రమంగా నెరవేర్చగల సమర్థుడో కాదో అనేది కూడా చూడాలి. కాబట్టి గౌరవనీయులైన మంత్రిగారు రూ 500 ల జీతం సరిపోతుందని అన్నా ఆవాదం అక్కడితో ముగుస్తుందని నేను అనుకోవడం లేదు. జీతాల మీద జరిగే పరిపాలన అవినీతికి దూరంగా వుంటుం దని ఆశించవచ్చా అని సభ పరిశీలించాల్సి వుంటుంది. ఆ అంశం మీద చర్చ జరగాల్సి రావచ్చు.

అయ్యా, ఇక్కడ ఒక రిపోర్టులోని చిన్నభాగం చదువుతాను. మంత్రుల జీతాలు నిర్ణయించడానికి కొన్ని సూత్రాలు సూచించమని బ్రిటిష్ పార్లమెంట్ 1920లో నియమించిన ఒక కమిటీ నివేదిక నుంచి దీన్ని ఉదహరిస్తున్నాను.

ప్రభుత్వంలో ఏ పదవికైనా ఇది తగిన జీతం అని నిక్కచ్చిగా చెప్పడం కంటె ఎక్కువ

అభిప్రాయ భేదాలుండే విషయాలు చాలా తక్కువగా వుంటాయి. ఇంతటి అస్పష్టమైన విషయం మీద లోపరహితమైన సూత్రాలు ఏవీ ఈ కమిటీ రూపొందించలేదని ఒప్పుకుంటూనే విధినిర్వహణలో భాగంగా కొన్ని ప్రాథమిక సూచనలను మాత్రం సమర్పిస్తున్నాను.

"ఎంత తక్కువ ఖర్చుతో సమర్థవంతమయిన సేవలు పొందడం సాధ్యమవుతుందో అంత తక్కువ ఖర్చుతో పొందే హక్కు ప్రజలకు ఉందన్న సాధారణ సూత్రాన్ని సంపూర్ణంగా గుర్తించక తప్పదు. ఆ సేవలు అందించే వారు పార్లమెంటులో కూర్చునే వారయినా ఇతర ప్రభుత్వ ఉద్యోగులయినా అదే సూత్రం వర్తిస్తుంది. ఏ రకమైన పన్నులకయినా అవసరం కాకపోతే ప్రజాపయోగం తప్ప వేరే సమర్థనీయమయిన కారణం ఏదీ ఉండజాలదు. వివిధ సభాకమిటీలు ఏరివేయగా ఇంకా మిగిలి పోయిన పారితోషికాలేవయినా ఉంటే ఇంక ఆలస్యం చేయకుండా వాటిని రద్దు చేయాలి. ఈ కోవకు చెందిన అనేక కేసుల్లో ప్రస్తుత కమిటీ తన ధర్మాన్ని నిర్వర్తించిందన్న సంగతి ఈ నివేదిక తెలియజేస్తుంది".

"ఏ పదవికయినా వేతనం మరీ ఎక్కువగా ఉన్నట్టయితే దానిని సంస్కరించాలి. ప్రజల ప్రయోజనం కోసం రెండు మూడు పదవులను కలపగలిగేటట్లయితే ఆ రకమైన పొదుపు చర్యను నిర్లక్ష్యం చేయకూడదు. అటువంటి కొన్ని సూచనలు ప్రస్తుత కమిటీ ముందుకు వచ్చాయి. అయితే వాటికి కార్యరూపం ఇవ్వటం ఈ కమిటీ పరిధిలోని విషయం కాదు. క్లుప్తంగా చెప్పాలంటే ప్రతి వ్యక్తీ తన వ్యక్తిగత వ్యవహారాలను ఏ రకమయిన పొదుపు దృష్టితో చూస్తారో ప్రభుత్వ శాఖలన్నిటినీ కూడ అదే రకమైన దృష్టితో చూడాలి".

"ఈ సాధారణ సూత్రాల నుండి ఒక్కొకసారి ఒక అసంబద్ధమయిన నిర్ధారణ చేయటం జరుగుతుంది. తక్కువ వేతనం తీసుకోవడానికి సిద్ధంగా ఉండడాన్ని ఒక ఉద్యోగ అర్హతగా భావించడం జరుగుతుంది. అది భావ్యం కాదని వేరే చెప్పనవసరం లేదు. పొదుపు అనేది హేతుబద్ధంగా ఉండాలి. అప్పుడే దానికి అర్థం ఉంటుంది. అత్యంత విశ్వాసం, బాధ్యత ప్రధాన విషయాలయిన పదవులకు ఉన్నత స్థాయి తెలివి తేటలు, వ్యక్తిత్వం అవసరం. దీనికి డబ్బుతో పోటీ పెట్టడానికి వీలు లేదు. స్వతంత్ర దేశంలో పదవులు సాధారణ ఆస్తిపరులకు అందుబాట్లో లేకుండ పోయే పరిస్థితి ఉండకూడదనే అభిప్రాయం వాస్తవికమైనది, హేతుబద్ధమైనది. జీతాలు మరీ తక్కువయితే ధనవంతుల గుత్తాధిపత్యం పదవుల పైన ఏర్పడుతుంది. పదవులకు బాధ్యులను ఎంపిక చేయడంలో ప్రభుత్వానికి వెసులుబాటు తగ్గిపోతుంది. అది హానికరం. తక్కువ ఆదాయం ఉన్న వర్గానికి చెందిన వారి సేవలు ప్రజలకు అందకుండా పోతాయి. ఈ వర్గానికి చెందిన వారికి, ప్రభుత్వోద్యోగులకు తగిన చదువు ఉంటుంది. దానికి తగిన సామర్థ్యం, పరిశ్రమ ఇతరుల కంటె ఎక్కువగా ఉంటాయి".

"మరొక విషయం కూడ పరిగణించాలి. ప్రభుత్వ రంగంలో ఉన్నత బాధ్యతలు నిర్వర్తించేవారు తమ పూర్తి సమయాన్ని, నిమగ్నతనూ కేటాయించవలసి ఉంటుంది. వాళ్ల వ్యక్తిగత వ్యవహారాలను

వారు నిర్లక్ష్యం చేయవలసి ఉంటుంది. ప్రజాధనం దుర్వినియోగం చేసి వ్యక్తిగత ఆస్తులు పెంచుకునే కుంభకోణాలను నివారించటం ఎంత అవసరమో, ప్రజాసేవలో వ్యక్తిగత ఆస్తులు కరిగిపోవడం అంతే అవసరం. అది దేశానికి అవసరమూ కాదు, గౌరవమూ కాదు."

అయ్యా, నీతినిజాయతీలతో కూడిన పరిపాలననీ, దేశసేవకోరే ఏ మంత్రి వర్గమైనా తప్పనిసరిగా పరిగణించాల్సిన సూత్రాలు ఇవేనని మనవి చేస్తున్నాను. రూ. 500/-ల జీతాన్ని నిర్ణయించడంలో ప్రస్తుత మంత్రి వర్గం నేనిపుడు చదివిన సూత్రాలను పరిగణనలోకి తీసుకుందని నేననుకోవడం లేదు.

అయ్యా, ఇపుడు ఈ బిల్లులో జీతాలు నిర్ణయించడానికి పాటించిన సూత్రాలు ఏమిటి? ప్రజల ఆదాయాన్నిబట్టి వేతనాలు వుండాలనేది తరచుగా నేను వింటున్నాను. అలా అయితే నేను ఒక ప్రశ్న అడుగుతాను. ఈ రూ. 500/-ల జీతం అనేది ప్రజల ఆదాయాన్ని బట్టే వుందా? ప్రజల ఆదాయం ఎంత? "హరిజన్"లో ఇచ్చిన అంకెలు నావద్ద వున్నాయి - అది సాధికారికమనుకుంటున్నాను. దాని నుండి నేను ఉదహరిస్తున్నాను.

***గౌరవనీయులు శ్రీ బి.జి.ఖేర్:*** మీరు దాన్ని చదివినందుకు చాలా సంతోషం.

***డా॥ అంబేద్కర్:*** నేను ఎప్పుడూ చదువుతూనే వున్నాను. ఇక్కడ ఇచ్చిన అంకెల ప్రకారం బ్రిటిష్ ప్రజల తలసరి సంవత్సర ఆదాయం 50 పౌండ్లు; ఫ్రాన్సులో 40 పౌండ్లు; ఆస్ట్రేలియాలో 70 పౌండ్లు; కెనడాలో 75 పౌండ్లు; ఇండియాలో 4 పౌండ్సు (గౌరవనీయులు శ్రీ బి.జి.ఖేర్: వినండి, వినండి) అయ్యా, ఇపుడు, ప్రజాల ఆదాయం అనుసరించి వేతనాలు ఉండాలనే సూత్రం మీద ఆధారపడి ఇదంతా చేసివుంటే, ఈ దేశంలో ప్రజల తలసరి వార్షిక ఆదాయం 4 పౌండ్లే కాబట్టి మంత్రులకు నెలకు రూ. 500/- ల వేతనం ఎలా సూచించారో నాకు అర్ధం కావడం లేదు. ఈ సూత్రం మీద అనగా, ప్రజల ఆదాయాన్ని బట్టి మంత్రుల జీతం వుండాలి అనే సూత్రం మీద ఆధారపడి గౌరవనీయులైన మిత్రులు ఈ బిల్లును మన ముందుకు తెచ్చి వుంటే మంత్రులకు రూ. 500/-ల వేతనం అనేది చాలా పెద్ద మొత్తమని మనవి చేస్తున్నాను; అది రూ. 100/-లకు తక్కువగా వుండాలి; సూత్రప్రకారం అయితే రూ. 75/- లే వుండాలి. వాళ్లు నిజాయితే పరులైతే, ప్రజలను బుజ్జగించే వుద్దేశంతో కాకుండా న్యాయసమ్మతంగా జీతాన్ని నిర్ణయించాలనుకుంటే, వాళ్ల నిజాయతీలో హేతుబద్ధత ఎందుకు వుండదు? ప్రజల ఆదాయానికి తగిన దామాషాలో లేని మొత్తాన్ని ఎందుకు నిర్ణయించాలి?

తక్కువ వేతనాన్ని సమర్ధించడానికి చెప్పిన రెండో విషయమేమంటే - మంత్రులు ప్రజా ప్రతినిధులనిపించేటట్లు జీవించాలనీ, మంత్రులకూ జనానికీ మధ్యభేదం ఉండగూడదనీ చెప్పారు. అయ్యా, మంత్రుల ఉద్దేశం ఇదే అయితే, అన్ని అంతరాలనూ తుడిచెయ్యాలనుకుంటే, మంత్రులు ప్రజలకు సంబంధించిన వారుగా కనపడాలనైతే, తమ పట్ల ప్రజలకు పరిపూర్ణ విశ్వాసం

వుండాలని భావిస్తుంటే, అయ్యా, నా ఉద్దేశంలో ప్రజల విశ్వాసం చూరగొనే విధానం ఇదికాదు ప్రపంచంలో ఎక్కడాలేనన్ని సామాజిక, మతపరమైన చీలికలు ఈ దేశంలో వున్నాయి. మనకు ఇక్కడ ప్రస్తుతానికి నేను ఈ రాష్ట్రం గురించి మాట్లాడుతున్నాను – బ్రాహ్మణ అబ్రాహ్మణ విభజన వుంది; స్పృశ్యులూ అస్పృశ్యులూ అనే విభజన వుంది. నేను హిందువుల వరకే. పరిమితమై మాట్లాడుతున్నాను. మహారాష్ట్రులూ, గుజరాతీలూ అనే అంతరం వుంది. గుజరాతీలకూ, కన్నడలకూ మధ్య విభజన వుంది. వీటన్నిటితో పాటు హిందువులూ మహమ్మదీయులూ అనే తేడా ఎలాగూ వుంది. ప్రభుత్వంలో ప్రజలకు విశ్వాసం కలగాలంటే అది మంత్రులు వీధులలో చాలీచాలని బట్టలతో అర్ధనగ్నంగా తిరగడం వల్లరాదు; సిగరెట్లు బదులు బీడీలు తాగడం వల్లరాదు; లేక మూడో తరగతిలోనో, ఎడ్లబండిమీదో తిరగడం వల్ల కలగదు. వీటిని చూసి ఎవరూ మోసపోరు. ప్రజల విశ్వాసం పొందాలంటే ఒకే మార్గం వుందని విన్నవిస్తున్నాను. మీ ప్రభుత్వాన్ని, మీ మంత్రి వర్గాన్ని, మీ అధికారులను ఒక వర్గానికో, ఒక కులానికో పరిమితం కాకుండా చూసుకోవాలి. వాటి మీద ఏ ఒక్కరి గుత్తాధిపత్యం ఉండకూడదు (హర్షధ్వానాలు). ఈ విషయంలో మంత్రి మండలి ఏం చేయబోతున్నదో గమనిస్తాం. కాని ఇలాంటివి చేస్తూ ప్రజల్లో విశ్వాసం కల్గిస్తామని నటించదలిస్తే – వాటిని పిల్ల చేష్టలని అంటాను – అది తప్పకుండా విఫలమవుతుందని మనవి చేస్తున్నాను.

మంత్రివర్గం త్యాగమని పిలవదగ్గ ఒక చర్యతో ముందుకు రావడం చూసి నాకు ఒక విషయం గుర్తుకొచ్చింది. మధ్య యుగాల్లో సన్యాసుల ప్రవర్తన, జీవిత విధానం ఇలాగే వుండేది. వాళ్లు సన్యాసం స్వీకరించినపుడు మూడు ప్రతిజ్ఞలు చేయవలసి వచ్చేది అవి– బ్రహ్మచర్య ప్రతిజ్ఞ, పవిత్ర జీవిత ప్రతిజ్ఞ, పేదరికపు ప్రతిజ్ఞ.

గౌరవనీయ మిత్రులు బ్రహ్మచర్య దీక్ష తీసుకున్నారేమో నాకు తెలియదు. (నవ్వులు). దాన్ని తీసుకోవడానికి బహుశ కాలంమించి పోయిందని అనుకుంటున్నా. పవిత్ర జీవిత వ్రతం పూనారేమో కూడా నాకు తెలియదు. వారు దాన్ని చేపట్టి, మళ్లీ భంగం చేసుకునివుంటే మాత్రం అది సభ విచారపడాల్సిన విషయం కానేకాదు. ఈ బిల్లును బట్టి చూస్తే వాళ్లు ఖాయంగా పేదరికం పాటించేదీక్షను పూనారని భావించాల్సి వస్తోంది. మరి ఈ ప్రతిజ్ఞను వాళ్లు నిలుపుకోగలరా? మధ్య యుగపు సన్యాసులు పవిత్రతకు సంబంధించిన ప్రతిజ్ఞను చాలా అరుదుగా నిలుపుకోగలిగారు. కాని పేదరికానికి సంబంధించిన ప్రతిజ్ఞను నిలుపుకోవడంలో మాత్రం విజయం సాధించారు. ఎందువల్ల అయ్యుంటుంది? ఎందువల్లనంటే సన్యాసులకు కుటుంబాలు లేవుకనుక; వాళ్లు ఒంటరి వ్యక్తులుగా ఎవరిపట్లా బాధ్యత వహించకుండా బతికారు కనుక. ఈ విషయంలో మంత్రుల పరిస్థితి పూర్తిగా వేరు. కుటుంబాలు, పిల్లల విషయంలో వాళ్లకు నిస్సందేహంగా చాలా పెద్ద బాధ్యతలు వున్నాయి ఈ పేదరికపు వ్రతంలో వాళ్లెలా కృతకృత్యులు కాగలరో నాకు తెలియడం లేదు. వారికి జయంకల్గుగాక! కాని వారి విజయం మీద నాకు అనుమానమే.

శ్రీ ఎ.వి.చిత్రే : వాళ్లు తమ సొంత పెట్టుబడుల మీద లాభాలు పొందుతారుగా!

***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, నేను చెప్పదలచిన విషయం మరొకటి వుంది. ఈ బిల్లు ఇప్పుడు అవసరమా? వ్యక్తిగతంగా నేను ఈ బిల్లు అవసరమైందని అనుకోవడం లేదు. వాళ్లు కోరిందాని కన్నా ఎక్కువ తీసుకోమని గౌరవనీయులైన మంత్రులను ఎవరూ వత్తిడి చేయలేరు. ఈ బిల్లు ప్రవేశ పెట్టకుండా, గవర్నరు నిర్ణయించిన వేతనాలని యథాతథంగా వుంచి కూడా వాళ్లు 500 రూపాయలే తీసుకుని వుండొచ్చు. ఆ పైది రాష్ట్రానికో, వాళ్ల పార్టీ నిధికో వాళ్లకు నచ్చిన రీతిలో, ఇచ్చివేసి వుండొచ్చు. వాళ్లు ఆపని ఎందుకు చేయడం లేదు? ఈ బిల్లును ఎందుకు ప్రవేశ పెడుతున్నారు? అక్కడే వుంది కిటుకంతా. ఈ బిల్లును వాళ్లు పవిత్రోద్దేశంతో తీసుకునిరావడం లేదని చెప్పడానికి నేను సాహిసిస్తున్నాను. దీనివెనుక ఒక వ్యూహం వుంది. ఆ వ్యూహం ఇది : వాళ్లెప్పుడూ ఆ స్థానాలను అంటిపెట్టుకుని వుండాలి, వేరే వాళ్లెపరూస్థానాల్లోకి రానేకూడదు.

***గౌరవనీయులు శ్రీ కె. యం. మున్షీ :*** మీ సూచన బాగుంది.

***డా॥ అంబేద్కర్ :*** ఇది రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సును గుర్తుకు తెస్తోంది; అప్పట్లో కన్సర్వేటివ్ పార్టీ తాను బలపడడానికి ఇండియా ప్రభుత్వ బిల్లులో కొన్ని నిబంధనలను చేర్చింది. వాటి ఉద్దేశం లేబర్ పార్టీ కార్యక్రమాలను పరిమితం చేయడమే తప్ప, ఇంకేమీ కాదు. ఏ కారణమూ లేకుండా క్లాజుల్ని ఎందుకు ప్రవేశ పెడుతున్నారని మేము చాలామందిమి ప్రశ్నించాము. వాళ్లేమీ సమాధానం ఇవ్వలేక పోయారు. లేబరు పార్టీ ప్రభుత్వం ఎప్పుడైనా అధికారంలోకి వస్తే, వాళ్లు తాము చేసినదాన్ని మార్చకుండా ఉండడానికి కన్సర్వేటివ్ పార్టీ వాటిని ప్రవేశ పెట్టిందని అందరికీ అర్థమైంది. నా గౌరవనీయ మిత్రులు అదే విధానాన్ని అమలు పరచాలని భావిస్తే, అలాగే చేయమని ఆహ్వానిస్తున్నాను. వాళ్లను మేము ఆపలేము. ఇది అధికార దుర్వినియోగమని మాత్రం చెప్పగలము.

అపార్థం చేసుకునే అవకాశం వుంది కాబట్టి ఈ సందర్భంలోనే నేను ఒక విషయం స్పష్టం చేయడం మంచిది. చాలా తక్కువని చెప్పి నేను రూ. 500/- ను వ్యతిరేకిస్తున్నానంటే దాని అర్థం, నాలుగువేలో, మూడు వేలో జీతం ఇవ్వమని నేను సూచించడం కాదు. తాత్కాలిక మంత్రివర్గం సూచించిన రూ. 4000/- లు లేక రూ. 3000/- లు ప్రామాణిక వేతనంగా నేను భావించడం లేదు. రూ. 4000/- లేక రూ. 3000/- సరైన జీతమని నేను అనుకోవడం లేదు కాబట్టి ఎవరూ అలా పొరపాటు పడనక్కరలేదు. ఏ అంకెకూ నేను కట్టుబడను. ఒక మంత్రికి రూ. 500/- ల జీతం సరైంది కాదని మాత్రమే నేను చెపుతున్నానండి. నా ప్రకటనను బట్టి దుబారా చేయమంటున్నాని విమర్శించడానికి ఆస్కారం వుంది. ఐతే బిల్లులో నిర్ణయించిన దానికన్నా ఎక్కువ జీతం వుండాలని సూచించడానికి నేనేమీ ఇబ్బంది పడను. దాన్ని పెంచినా, నేను ఆ జీతం తీసుకునే వాళ్లలో ఒకణ్ని కాను. భవిష్యత్ గురించి నేను చెప్పగలిగినంతవరకూ, నేను ఆ జీతం స్వీకరించే వాళ్లలో ఒకడ్ని అవుతానని నేను ఎంత మాత్రం అనుకోవడం లేదు.

***గౌరవనీయులు శ్రీ బి.జి. ఖేర్ :*** నిరుత్సాహపడకండి.

**డా॥ బిఆంబేద్కర్ :** అన్నీ తెలిసిన మిత్రునికి సమాధానం చెప్పనవసరం లేదు. ఆయన సిద్ధాంతం మారకుండా అలాగే వుంది; కాబినెట్‌లో ఆయన కావాలనే దళితుల్ని తీసుకోలేదు.

**గౌరవనీయులు శ్రీ కె. యం. మున్షీ :** వాళ్లకు రూ. 500/-లు ఇష్టం లేక పోవచ్చు.

**గౌరవనీయులైన సభాపతి :** ఆర్డర్, ఆర్డర్.

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రతిపాదన చేయడానికి నేను ఏమీ ఇబ్బందిపడడం లేదు. ఎందు కంటే, నేను ఈ జీతం పుచ్చుకోబోయే మనిషిని కాబోవడం లేదు. కాబట్టి నా ఉద్దేశాలు ఒక ప్రజా విధానానికి ఉండాల్సిన ఉద్దేశాలు మాత్రమే. దుర్మార్గులు చిట్టచివరన ఆశ్రయించేది దేశ భక్తినని డా. జాన్సన్ అన్నాడు. రాజకీయాలు కూడా దుర్మార్గుల చివరి ఆశ్రయమని కూడా ఆయన అని ఉండ వచ్చు. ఇండియాలో రాజకీయం దుష్టుల కడపటి ఆశ్రయం కాకూడదనే నేను మాట్లాడడానికి లేచాను.



**డా॥ అంబేద్కర్ ( బొంబాయి నగరం)* :** అయ్యా, నా మిత్రులు, గౌరవనీయులైన ప్రధాన మంత్రిగారికి ఒక మాట చెప్పాలనుకుంటున్నాను – వివిధ పద్దులుగా పెట్టేదానికన్నా మొత్తం ఒకే అంకెగా పెడితే ఈ సమస్య తీరుతుంది కదా అని. మొత్తం కలిపి మంత్రికి నెలకు రూ. 750/- లు చెల్లిస్తామని చెప్పకూడదా అని కేవలం సూచన చేస్తున్నాను. దాంతో ఈ ఇబ్బంది తీరుతుందేమో పరిశీలించమని సూచిస్తున్నాను.

**గౌరవనీయులు శ్రీ బి.జి. ఖేర్ :** అయ్యా, మేము పూనాలో ఏం చేసిందీ స్పష్టం చేశానను కుంటున్నాను. అక్కడ నాలుగు ప్రభుత్వ నివాసాలు వున్నాయి. బొంబాయిలో కూడా కొన్ని ప్రభుత్వ నివాసాలు వున్నాయి. ప్రభుత్వ బంగళాలలో నివాసం లభించే మంత్రులకూ, సభాపతికే అధ్యక్షునికీ ఏ భత్యాలూ చెల్లించనవసరం లేదు. భత్యాలు జీతంతో కలిపే ప్రసక్తి లేదు. ప్రభుత్వ నివాసాలు వుండి, వాటిల్లో చేరితే మాత్రం వాళ్లకు భత్యాలు వుండవు. వాళ్లకు సొంత ఇళ్లు వుండీ, ప్రభుత్వ నివాసాలలో చేరేదీ లేందీ పూర్తిగా వాళ్లకే వదిలివేస్తున్నాం. ఇంటి భత్యం నిమిత్తం నెలకు వందరూపాయలు యివ్వడమనేది సహేతుక ప్రతిపాదనని అనుకుంటున్నాము. ఈ పరిస్థితిలో జీతాన్ని భత్యాన్ని కలిపి ఒకే మొత్తాన్ని నిర్ణయించే అవకాశం లేదనుకుంటున్నాను. మేము పూనాలో చేసిన ఏర్పాటు బాగానే పనిచేసినట్టనిపించింది; అక్కడ ఉన్న ప్రభుత్వ నివాసాలను అందరం కలిసే పంచుకున్నాము. ఇదివరకు అవుట్ హౌస్‌తో కలిపి ఒక బంగళాను ఒక మంత్రికి యిస్తే యిప్పుడు ఇద్దరు ముగ్గురు మంత్రులకు కలిపి ఒక బంగళాను యిచ్చామని గౌరవనీయ సభ్యులు డాక్టర్ అంబేద్కర్‌కు తెలియజేస్తున్నాను.

* బి.యల్. ఎ. చర్చలు, సంపుటి I, పేజీలు 279 – 80, తా. 23 ఆగస్టు 1937.

బొంబాయిలో కూడా అదే ఏర్పాటు చేస్తే మంత్రులకూ; గౌరవనీయ సభాపతికీ, ప్రెసిడెంటుకూ నివాసాలు యిచ్చిన తరవాత బహుశ అద్దెకివ్వడానికి కొన్ని ప్రభుత్వ నివాసాలు యింకా మిగల వచ్చు.

***డా॥ అంబేద్కర్ :*** ఇండియా ప్రభుత్వ చట్టంలో మంత్రుల జీతాలకు సంబంధించిన సెక్షన్‌లో "భత్యం" అనే పదం లేదన్న ఇబ్బందిని తొలగించడానికి నేను మార్గం చూపించే ప్రయత్నంచేస్తున్నాను. జీతానికి అదనంగా భత్యం చేర్చారన్న అభిప్రాయానికి తావీయకుండా, అది చట్ట సమ్మతం కాకపోవచ్చు గనుక, నేను గౌరవనీయమిత్రునికి మొత్తాన్ని కలిపి జీతంగా యిస్తే "భత్యం" అనే మాటను పూర్తిగా వదిలి వేసి ఆ ఇబ్బంది నుండి బయటపడొచ్చని సూచిస్తున్నాను. ఈ అంశంలో ఏమైనా బలం వుందీ లేనిదీ అడ్వొకేట్ జనరల్ చెప్పాల్సి వుంటుంది.

  

# 38

# నిందితుల ప్రొబేషన్ బిల్లు*

**డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :** అయ్యా, సభాపతిగారూ, చూస్తుంటే ఈ బిల్లు మీద ఎవరికీ పెద్ద ఉత్సాహం ఉన్నట్లు కనిపించడం లేదు. సభలో ఇతర బిల్లులు ప్రవేశపెట్టినపుడు ఉన్నంత ఉత్సాహం ఈ బిల్లు మీద కనిపించడం లేదు. నేను ఒక వర్గం గురించే ఈ మాట చెప్పాలని లేచినా నాకు కూడా పెద్ద ఉత్సాహంగా అనిపించడం లేదని అంగీకరిస్తున్నాను. ఈ బిల్లు తక్షణ సమస్యలను గాని ముఖ్యమైన సమస్యలనుగాని స్పృశించక పోవడం వల్ల దీని పట్ల ఉత్సాహం లేకపోవడం సహజమే. అది ఒక చిన్న సమస్యకు సంబంధించింది. ఈ బిల్లు ఒక బ్రిటిష్ శాసనానికి దగ్గరగా ఉందని ఎవరో చెప్పారు.

బ్రిటిష్ వాళ్లు ఈ చట్టం వల్ల గణనీయమైన ప్రయోజనం ఏమైనా పొందారేమో నాకు తెలియదుగాని గౌరవనీయ హోంమంత్రి ఈ విషయాన్ని పరిశీలించే వుంటారని అనుకుంటు న్నాను. ప్రయోజనం ఉందనుకోవడం వల్లనే దీన్ని మన రాష్ట్రంలో ప్రవేశ పెడుతున్నారని నమ్ముతున్నాను.

అయ్యా, ఈ బిల్లులో సవివరంగా వున్న ప్రతిపాదనల గురించి నేను మళ్లీ ప్రత్యేకంగా చెప్పేదేమీ లేదు. ఈ బిల్లులో ఇమిడివున్న సూత్రాలను నేను బలపరుస్తున్నాను. ఒక్క నిబంధన విషయంలో కొంత అభ్యంతరం ఉందని భావిస్తున్నాను. గౌరవనీయులు హోంమంత్రి గారి పరిగణన నిమిత్తం దానిని ఆయన ముందు ఉంచుతాను. ఆ నిబంధన అమలు చేసే క్రమంలో అణచివేతకు దారి తీయగల సూత్రం ఒకటి ఆరవ క్లాజులో ఉంది. ఈ క్లాజు చివరి భాగంలో :

"మరియు నేరస్థుడు పదహారేళ్ళ లోపు ఉంటే, నేరస్థుని తండ్రి లేదా సంరక్షకుని నిర్లక్ష్యం వల్ల లేక ఇతర చర్యల వల్ల నేరానికిఅవకాశం కల్గిందని కోర్టుకు అనిపిస్తే, ఆ తండ్రి లేక సంరక్షకుడిని జరిగిన నష్టానికి నష్ట పరిహారం చెల్లించమని కోర్టు ఆదేశించవచ్చు."

ఇది తండ్రి లేక సంరక్షకుని మీద చాలా అణచివేతను తెస్తుందని నాకు అనిపిస్తోంది. "నిర్లక్ష్యం చేయడమూ," "నిర్లక్ష్యం" అనే పదాలు అస్పష్టమైన వాటిలో కెల్లా అస్పష్టమైనవని నా మిత్రులు గౌరవనీయ హోం మంత్రి కూడా అంగీకరిస్తారు. నిర్లక్ష్యం ఏమిటో, నిర్లక్ష్యం కానిదేమిటో స్పష్టంగా నిర్వచించడం చాలా కష్టం. నాకున్న అభ్యంతరాన్ని నా గౌరవనీయ మిత్రులు అర్థం చేసుకోడానికి

---

* బి.యస్. ఎ. చర్చలు, సంపుటి 2, పేజీలు 425-26, తా. జనవరి 20, 1938

ఒక ఉపమానం ఇస్తాను. శాసనోల్లంఘన ఉద్యమంలో జరిగిన ఒక విషయం చెపుతాను. అది నిజమనే నా నమ్మకం. నాది తప్పని ఎవరైనా చెపితే, సరిచేసు కుంటాను. శాసనోల్లంఘన ఉద్యమంలో అనేకమంది ప్రభుత్వోద్యోగుల పిల్లలు పాల్గొన్నారు.

ప్రభుత్వాన్ని కూల్చివేసే ఉద్దేశంతో నడిపిన ఈ ఉద్యమంలో తమ పిల్లలు పాల్గొనకుండా ఎందుకు జాగ్రత్త పడలేదని, తద్వారా వారు ప్రభుత్వం పట్ల తమ విధిని సక్రమంగా నిర్వర్తించలేదని ప్రభుత్వం ఆ పిల్లల తల్లిదండ్రులందరి మీద క్రమశిక్షణ చర్య తీసుకుంది. ఇప్పుడు నా ఎదురుగా కూర్చున్న సభ్యులంతా అప్పుడు ఈ చర్య పట్ల తీవ్ర అభ్యంతరం తెలియజేశారని నాకు గుర్తు. పిల్లల ప్రవర్తనకు తల్లిదండ్రులు బాధ్యులు కారని, ముఖ్యంగా అభిప్రాయాల విషయంలో వారి బాధ్యత ఉండదని ఆనాడు మీరు న్యాయంగానే వాదించారు.

తల్లిదండ్రులు ఎంత జాగ్రత్తగా, బాధ్యతగా పెంచినా పిల్లలు నేర ప్రవృత్తులలో పడిపోయే అవకాశం వుందని నా అభిప్రాయం. "నిర్లక్ష్యం" లేక "గూడుపుఠాణీ" లేక "పురికొల్పడం" పదాల్ని సరిగా నిర్వచించకపోతే ఈ బిల్లు వేరే పర్యవసానాలకు దారి తీస్తుందని నాకు అనిపిస్తున్నది. అవి గౌరవనీయులైన హోం మంత్రి ఊహించిన వాటికన్నా ఎక్కువగా ఉంటాయి.

గౌరవనీయులైన నా మిత్రులు శ్రీ బాంబుల్ ఈ సమస్యను అధ్యయనం చేయడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారని వారి ప్రసంగాన్ని బట్టి నాకు అర్థమైంది. బ్రిటిష్‌వారి చట్టంలో కొన్ని లోపాలున్నాయని ఆయన చెప్పారు. ఆ చట్టాన్నే మనం నమూనాగా తీసుకున్నాం కాబట్టి మన చట్టంలో ఆ లోపాలు లేకుండా ఈ సందర్భంలోనే జాగ్రత్త పడాలని ఆయన సూచించారు. అధ్యయనం చేసిన మీదటే ఆయన ఈ మాటలు చెప్పారని నేను నమ్ముతున్నాను. అలాంటపుడు ప్రభుత్వం ప్రతిష్టకు పోకుండా వుంటే, ఈ బిల్లును సెలెక్ట్ కమిటీకి పంపడం మంచిది. గౌరవనీయ సభ్యులు శ్రీ బాంబుల్ చేసిన ఈ సూచనతో నేను ఏకీభవిస్తున్నాను. అక్కడ అన్ని అంశాలనూ చర్చించి ఒక నిర్ణయానికి రావొచ్చు. అలా చేస్తే మనం ఈ బిల్లును సాధ్యమైనంత లోపరహితంగా చేయవచ్చు. ఈ మాటలతో ఈ బిల్లు మొదటి పాఠాన్ని నేను బలపరుస్తున్నాను.

# 39

# పొగాకు సుంకం చట్ట సవరణ బిల్లు*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం)* : అయ్యా, గౌరవనీయులైన సభాపతి సూచించిన దానికి సమాధానంగా ఓ మాట చెప్పాలనుకుంటున్నాను. అధికారాన్ని వదులుకోవడం గానీ నిలుపుచేయడం గాని వుందనే సూత్రాన్ని మీరు సమర్థిస్తే తప్ప, గౌరవనీయులైన నా మిత్రులు శ్రీ జమ్నాదాస్ మెహతా లేవనెత్తిన చర్చ ఈ సభా నియమాలకు తగినట్లుగానే వుందని మనవి చేస్తున్నాను. చాలినన్ని నిధులు మంజూరు చేశామనీ ఇక చేయమనీ ఈ సభ సులభంగానే ఒక నిర్ణయానికి రావొచ్చని భావిస్తున్నాను. సభా నాయకులు లేవనెత్తిన అంశానికి అది పూర్తి సమాధానమని కూడా మనవి చేస్తున్నాను. కాబట్టి ఇతర పన్నులు వేయడం ద్వారా ఈ సభ సరఫరాలు మంజూరు చేసిందన్న ప్రాతిపదిక మీద నిలుపుదలగానీ అధికార త్యాగం గానీ వుండ జాలదు. ఆ ఇతర పన్నుల గురించి 'బిల్లు' అనే శీర్షిక క్రింద ఇంతకు ముందే చర్చించాము.

అయ్యా, నేను పేర్కొన దలచిన విషయం ఇది : ఇది ఆర్థిక బిల్లా లేక పన్నులు వేసే పాలనా యంత్రాంగాన్ని అదుపు చేసేందుకు ఉద్దేశించిన వేరే బిల్లా అనేది తెలియడం లేదు. పన్నులు వేసే యంత్రాంగాన్ని రూపొందించడం కోసం, పన్నులు వేసే పద్ధతిని, విధానాన్ని తయారుచేయడం కోసం మాత్రమే ఈ బిల్లును ప్రవేశపెట్టి వుంటే మీరు ప్రస్తావించిన రూలింగ్ సామంజస్యాన్ని అర్థం చేసుకోగలను. కాని ఈ బిల్లుకు అనుబంధంగా ఉన్న విషయ పట్టికనూ, కారణాలనూ చూసినపుడు ప్రభుత్వం దీనిని మొదటి నుంచీ చివరిదాకా ఆర్థిక బిల్లుగా వ్యవహరిస్తున్నట్లు నాకు తోస్తున్నది. అదనపు ఆదాయాన్ని పొందడం ఈ బిల్లు ముఖ్యోద్దేశం. యంత్రాంగంలో మార్పు తీసుకురావడమనేది తర్వాతి కారణం. అదనపు ఆదాయం వసూలుకు అది ఒక పరికరం మాత్రమే. ప్రభుత్వం యొక్క మద్యపాన నిషేధ విధానం వల్ల ఏర్పడ్డ లోటును భర్తీ చేయడానికి అదనపు ఆదాయం సంపాదించడం ఈ బిల్లు ప్రధానోద్దేశ్యం. లక్ష్యాలు, కారణాల ప్రకటన నుండి ఒకటి రెండు పేరాలు మీకు చదివి వినిపిస్తాను.

"చాలా దేశాలలో ఎక్కువ పన్నులువేయడానికి పొగాకు సరైన సరుకు. మద్యపాన నిషేధం లేక త్రాగుడు వ్యతిరేక విధానం వల్ల వచ్చే నష్టంలో కొంత భాగాన్ని పూరించడానికి ఈ ఆదాయ మూలకాన్ని పెంచడం తప్పనిసరి. బొంబాయి నగరంలో పొగాకు సుంకం చట్టం, 1857

---

* బి.యస్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 336–37, మార్చి 5, 1938.

(బొంబాయి పట్టణం) క్రింద పొగాకు పన్ను వేస్తున్నారు. ఈ చట్టం కింద ఇప్పటికే మణుగు ఫీజు ఎక్కువగా వుంది. కాని లైసెన్సు ఫీజు నామమాత్రం. లైసెన్సులకు బాగా గిరాకీ ఉండడంతో వాటిని ఇతరులకు అద్దెకు ఇస్తున్నారు. ఈ బిల్లు బొంబాయిలో లైసెన్సు ఫీజును 1రూ. నుండి 25 రూపాలకు లేక రూ. 50/- లకు..... పెంచాలని ప్రతిపాదిస్తోంది."

దీన్ని బట్టి ఇది నిస్సంశయంగా ఆర్థిక బిల్లు; పన్ను పెంచే యంత్రాంగాన్ని రూపొందించడానికి ఉద్దేశించింది కాదని నా అభిప్రాయం. ఇది ఆర్థిక బిల్లే అయితే ప్రభుత్వానికి సరఫరాలు మంజూరు చేయాలా అక్కర లేదా అనేది చర్చించే హక్కు ఈ సభకు వుందని మనవి చేస్తున్నాను. గౌరవనీయులైన సభాపతి లేవనెత్తిన అంశం అనగా అధికార త్యాగం గురించి నేను చెప్పేదేమంటే, "కొంత సరఫరా మేము మంజూరు చేస్తాము, మిగతాది మేము చేయం" అని చెప్పడానికి సభకు పూర్తి స్వేచ్ఛ వుంది.



# 40

# న్యాయ వ్యవస్థ స్వేచ్ఛ*

**డా॥బి.ఆర్. అంబేద్కర్ (బొంబాయినగరం)**: అయ్యా, సభాపతి గారూ ఈ తీర్మానాన్ని బలపరచడానికి లేచాను. ఇంచుమించు చర్చ ముగిసే సమయానికి నేను మాట్లాడుతున్నాను. ఇంకా గౌరవనీయ హోంమంత్రికి సమాధానం చెప్పడానికి కొంత సమయం వదలాలని నాకు తెలుసు. కాబట్టి చాలా క్లుప్తంగానే చెపుతాను.

అయ్యా, నేను చెప్పదలచిన మొదటి విషయం ఏమంటే ఈ అభిశంసన తీర్మానానికి ఆధారమైన చర్చ నాకు అసలు ఎలాంటి ఆశ్చర్యాన్ని కలిగించలేదు. అధికారంలోకి వచ్చినప్పటి నుంచి ప్రభుత్వం వరసగా చేపట్టిన కార్యక్రమాలకు– వాటిని నిస్సంశయంగా చట్ట విరుద్ధమైనవని చెప్పొచ్చు. ఇది ఒక రకంగా ముగింపుగా నేను భావిస్తున్నాను.వరుస క్రమంలో ఇది ఒక భాగం అంతే. నడుస్తున్న నాటకంలో ఒక రంగం ఇది. ఎప్పుడు అంతమవుతుందో తెలియదు. నేను ప్రస్తావించదలచిన మొదటి చర్య ఒకటుంది. అది ప్రస్తుత ప్రభుత్వం చేపట్టిన పని; బర్డోలీ రైతుల నుండి స్వాధీనం చేసుకున్న భూములను సొంతదారులకు తిరిగి అప్పజెప్పడం. నాకున్న సమయం చాలా తక్కువ. కాబట్టి నన్ను కొనసాగనిస్తారని అనుకుంటున్నాను.

**గౌరవనీయ సభాపతి**: నిశ్శబ్దం, నిశ్శబ్దం. గౌరవనీయ సభ్యుడు దయచేసి తన స్థానంలో కూర్చుంటారా? ఈ మాదిరిగా చర్చ కొనసాగితే అది పొలిమేరల్లేని క్షేత్రానికి ద్వారాలు తెరవ డమే. గత కృత్యాలకు ప్రభుత్వం నింద్యార్హమా కాదా అన్నది ఇప్పటి సమస్య కాదు. నేటి తీర్మా నానికి ఆధారభూతమైన చర్య గర్హనీయమా కాదా అనేదే ఇప్పుడు చర్చించాల్సిన సమస్య. తక్షణ ప్రజా ప్రాధాన్యతగల ఒక ప్రత్యేక విషయానికి సంబంధించింది కాబట్టే ఈ తీర్మానాన్ని మనం చేపట్టాం. ఏ విషయస్పష్టత కోసం ఈ తీర్మానాన్ని అనుమతించామో ఆ స్పష్టతను చర్చ జరుగుతుండగా కూడా పాటించాలి. లేకపోతే చర్చ మౌలిక ఉద్దేమే దెబ్బతింటుంది. కాబట్టి గౌరవనీయసభ్యుడు సభముందున్న నిర్దుష్ట అంశానికి పరిమితమై మాట్లాడాలని కోరుతున్నాను.

**డా॥బి.ఆర్. అంబేద్కర్**: అయ్యా, నేనొక మనవి చెయ్యొచ్చా? వాదానికి ఉపమానంగా దేన్నయినా

---

* బి.యస్. ఎ. చర్చలు, సంపుటి 3, పే. 420–24, తా. మార్చి 7, 1938 రైల్వే యూనియన్లకు చెందిన శ్రీ జమ్నాదాస్ యం. మెహతా వాయిదా తీర్మానం పెట్టారు. బొంబాయి హైకోర్టు స్వేచ్ఛలో ప్రభుత్వ జోక్యంపై ప్రజాదృష్టిని ఆకర్షించడానికి ఆయన సభను వాయిదా వేయాలని కోరారు. జాధవ్‌జీ, ధీరజ్‌లాల్ అనే ఇద్దరు ఖైదీలు పెట్టుకున్న దరఖాస్తులను హైకోర్టు తిరస్కరించిన మీదట ప్రభుత్వం వారి శిక్షల అమలును నిలిపివేసింది.

ఉదహరించడానికీ, విషయం మంచి చెడ్డలలోకి పోవడానికీ ఒక వ్యత్యాసం ఉంది. బర్డోలీ భూములు తిరిగి స్వాధీనం చేసుకోవడానికి సంబంధించిన మంచి చెడ్డలలోకి వెళితే మీరు చెప్పిన అభ్యంతరం పూర్తిగా సక్రమమైందే అవుతుంది. మీ రూలింగ్‌కు కట్టుబడే నేను నా ప్రసంగాన్ని కొనసాగిస్తాను. కాని నా మాటలు అప్రస్తుతం కాదని నా అభిప్రాయం. ప్రభుత్వ కార్యక్రమాల పరంపరకు పర్యవసానంగా ఈ చర్య జరిగిందని చెప్పడం, మంచి చెడ్డల జోలికి పోకుండా ప్రభుత్వం గతంలో చేసిన ఒక పనిని ఉదహరించడం అప్రస్తుతం కాదని నేను అనుకుంటున్నాను. నా ప్రసంగాన్ని 5-30 గంటలకల్లా ముగించేస్తాను.

*గౌరవనీయ సభాపతి :* గౌరవనీయ సభ్యులు ఫలానా సమయంలోపల ముగించడమనేది ఇక్కడ విషయం కాదు. ఒక నిర్దిష్టమైన సమస్య ఉన్నపుడు, దాని గురించి చర్చించడానికే సభ గౌరవనీయ సభ్యునికి అనుమతి ఇచ్చినపుడు ఇతర విషయాలను వూరికే ప్రస్తావించినా వేరే సంగతులకు తావిచ్చినట్లవుతుంది. కాబట్టి ప్రసంగవశాత్తు కూడా ఇతర విషయాల జోలికి వెళ్లడాన్ని నేను అనుమతించలేను. ఏ సభ్యుని స్వేచ్ఛనూ హరించాలని నా కోరిక కాదు. ఈ విషయానికి సంబంధించిన అన్ని అంశాలూ వెలుగులోకి రావాలనే నా అభిమతం. కాని వేరే విషయాల ప్రస్తావనను మాత్రం మంచిగానైనా, చెడుగానైనా – అనుమతించడం నాకు యిష్టం లేదు.

ఈ చర్చను తొందరగా ముగించాలనే ఉద్దేశంతో ఇతర విషయాల ప్రస్తావన రాకూడదని నేను మాత్రం కోరడం లేదు. సభ ముందున్న అంశంపై గౌరవనీయ సభ్యులు సంపూర్తిగా మాట్లాడవచ్చును.

*డా॥ అంబేద్కర్ :* దీన్ని దృష్టిలో పెట్టుకుని నేను సభ ముందున్న అంశం మేరకే నా మాటల్ని పరిమితం చేయక తప్పదు.

అయ్యా, ఇప్పుడు సభ ముందున్న అంశం గురించి నే చెప్పదలిచినది ఇది : మొట్ట మొదటి విషయం, ఈ కేసుకు సంబంధించిన వాస్తవాలు మన వద్ద లేవు. వార్తా పత్రికల ద్వారా మాత్రమే మనకు దీని గురించి తెలుసు. వాస్తవాలు సభకు తెలియజేయమని గౌరవనీయులైన హోం మంత్రిని కోరినప్పటికీ ఆయన ఆపని చేయలేదని తెలిసింది. కాబట్టి, ఇతర సభ్యులతో పాటు నేనూ ఆ ఇబ్బందికి గురి అవుతున్నాను. చివరిలో, వాస్తవాలు తెలిసినపుడు ఈ చర్చ అనవసరమనో లేక సమయం రాకముందే తొందరపడి జరిపామనో అనిపించవచ్చు. చర్చ నిరుపయోగమో, అనవసరమో అయినపుడు, ఆ నింద తప్పకుండా గౌరవనీయులైన హోం మంత్రి గారి భుజాలపై పడుతుంది. ఎందుకంటే సభను విశ్వాసంతో తీసుకుని ఖచ్చితంగా ఏం జరిగిందో చెప్పడానికి నిరాకరించింది ఆయన కాబట్టి. ఆయన ఆ పని చేసి ఉన్నట్లయితే, బహుశ, దీన్ని ప్రవేశ పెట్టిన సభ్యులు దాన్ని వెనక్కి తీసుకొనేవారేమో. ఈ చర్చలో ఇతర సభ్యులు పాల్గొనేవారు కాదేమో. నేనన్నట్లు ఈ చర్చ చివరికి నిరుపయోగమైతే, ఆ దోషం హోంమంత్రిదే.

వార్తా పత్రికల ద్వారా తెలిసిన వాస్తవాలపై ఆధారపడి మనం చర్చిస్తున్న దాంట్లో అసలు అంశం ఏమిటి? ఇద్దరు ఖైదీల దరఖాస్తును హైకోర్టు కాదన్నదని తెలిసింది. అలాంటపుడు మంత్రి గారు ఆ దరఖాస్తును ఎందుకు అనుమతించారనేది సమస్య. ఈ ఇద్దరు నేరస్తులకు విధించిన శిక్షను ఆపడం సమంజసమేనని ఈ సభ భావించడానికి సరైన కారణాలున్నాయా లేవా అనేదొక్కటే మనం పరిగణించాల్సిన అంశం. శిక్ష అమలును నిలిపివేసే అధికారం హైకోర్టుకు లేదు. కాబట్టి హైకోర్టు తెలివిగానో లేక తెలివి తక్కువగానో సస్పెన్షన్‌కు నిరాకరించిందని అనడం పూర్తిగా అప్రస్తుతం. ప్రశ్న అదికాదు. చట్ట సమ్మతంగా శిక్షపొందిన ఖైదీల శిక్షను ఆపడం, పెంచడం లేదా తగ్గించడానికి విశేషాధికారంగా గల ప్రభుత్వం, తన అధికారాన్ని సరిగ్గా వినియోగించిందా లేదా అనేది ప్రశ్న. తనకున్న విచక్షణాధికారాన్ని అది సక్రమంగా ఉపయోగించిందా లేదా అనేది ప్రశ్న. గౌరవనీయులైన హోం మంత్రి ఈ అధికారాన్ని సరిగ్గా వినియోగించారని తెలుసుకోవడానికి కొన్ని సందేహాలను నివృత్తి చేసుకోవాలి. వార్తాపత్రికల్లో వచ్చిందాన్ని బట్టి, పెద్ద ఎత్తున జూదంలో పాల్గొన్న ఈ ఖైదీలు తిండికి జరగని బీద వాళ్లేం కాదు. కడుపు నింపుకోవడానికి వాళ్లు ఈ పనులు చేయలేదనేది స్పష్టంగా తెలుస్తోంది. పత్రికా రిపోర్టుల ప్రకారం వీళ్లు బాగా డబ్బున్న వ్యాపారస్థులు. వాళ్లకు అపరిమితమైన పెట్టుబడి వుంది. నగరం లోని వివిధ ప్రాంతాల్లో, దేశంలోని వివిధ ప్రాంతాల్లో వాళ్లకు అనేక కంపెనీలు, లేక హెడ్ ఆఫీసులు వున్నాయి. భారీ ఎత్తున వర్తకం చేస్తున్నారు. కాబట్టి వాళ్లు దురదృష్టవంతులనీ, పేదరికం వల్లా, ప్రతికూల పరిస్థితులవల్లా గత్యంతరం లేక జూదంలోకి దిగారని సమర్థించడానికి ఈ ప్రత్యేకమైన కేసులో వీల్లేదు. ఆ సాకు చెల్లదు. ఎందుకంటే వాస్తవాలు అందుకు పూర్తిగా విరుద్ధంగా వున్నాయి. రెండోది, శిక్షను నిలిపివేయడానికి వేరే కారణం వున్నట్లు పత్రికలలోగానీ, హైకోర్టులో దాఖలు చేసిన దరఖాస్తులో గానీ లేదు. ఈ ఇద్దరు నేరస్థులు అనారోగ్యపరులనిగానీ, ఏదో జబ్బుతో బాధపడుతున్నారనిగాని చెప్పలేదు. వీళ్ల విడుదల అవసరమయ్యేంత తీవ్ర విపత్తు ఏదీ వాళ్ల కుటుంబాలకు కలిగినట్లు ఎక్కడా ఏమీ చెప్పలేదు. మన ముందున్న వాస్తవాలను బట్టి అలాంటిదేమీ లేదనుకుంటున్నాం కాని ఆ అనుమానాన్ని కూడ మనం తొలిగించుకోవాల్సి ఉంటుంది. మూడోది, ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేసుకోవాలను కుంటున్నారని చెప్పే అవకాశం ఉంది. అయితే ఆ ఊహకు విరుద్ధంగా ప్రివీ కౌన్సిల్ ఇలాంటి కేసులు అంగీకరించదని హోంమంత్రిగారికి నాకంటే బాగా తెలుసు. నాకంటే ఆయన చాలా పెద్ద లాయరు. కేసు విచారించేటపుడు సి.ఆర్.పి.సి.లోని నిబంధనల్ని కాక సహజన్యాయ సూత్రాల్ని కోర్టు అతిక్రమించిందని భావించితే తప్ప భారతీయ క్రిమినల్ కోర్టుల నుండి ఏ అప్పీలునూ కౌన్సిల్ సమ్మ తించదని వందలాది కేసులలో వాళ్ళు తేల్చిచెప్పారు. వాళ్ళు తమ న్యాయవిధానంలో నేరస్థుల అప్పీళ్లను స్వీకరించే అవకాశాన్ని, అధికారాన్నీ బాగా పరిమితం చేసుకున్నారు. ఈ కేసులో విచారణ సల్పిన చీఫ్ మేజిస్ట్రేటుగానీ, అప్పీలును విచారించిన హైకోర్టుగానీ క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను లేదా సహజ న్యాయ సూత్రాలను అతిక్రమించినట్లు మాటమాత్రంగా కూడా ఎవరూ ఆరోపణ చేయ లేదు. శిక్షను ఆపడానికి యథాతథంగా చూస్తే, ఏ సహేతుకమైన కారణం నాకయితే కనపడడంలేదు.

ఇక, అయ్యా, సామాన్య నేరస్థులకు వేసే శిక్షను, హెూం మంత్రి గారు నిలుపుదల చేసిన ఉదంతాలు ముందెన్నడూ లేవు. ప్రస్తుత హెూం మంత్రిగారికి ముందు కూడా ఈ పని నాకు తెలిసిన వరకూ ఎవరూ చేయలేదు. రాష్ట్రంలోని అత్యున్నత న్యాయస్థానం వేసిన శిక్షను ఆపడానికి ఏ ప్రభుత్వమూ ఇంతవరకూ అనారోగ్యాన్ని గానీ వ్యక్తిగత ఇబ్బందినిగానీ సరైన కారణంగా అంగీకరించలేదని నాకు ఖచ్చితంగా తెలుసు. కాబట్టి ఒక హెూం మంత్రి హైకోర్టు తీర్పును అతిక్రమించి శిక్ష అమలును ఆపడానికి ఆయన సహేతుకమైన సంజాయిషీ ఇవ్వక పోతే మాత్రం పెద్ద అపవాదుగా మిగిలిపోతుందని మనవి చేస్తున్నాను. వార్తల్లో వచ్చిందాన్ని బట్టి మాకూ తెలుసు – నేరస్తుల తరఫున న్యాయవాది హైకోర్టులో ఒక దరఖాస్తు పెట్టాడు. నేరస్థులు జైలులో ఉండగా వాళ్ళను 'బి క్లాసు' ఖైదీలుగా పరిగణించి ప్రత్యేక సదుపాయాలు కల్పించాలని ఆయనే ఒక దరఖాస్తు పెట్టాడు. ప్రస్తుతానికి వాళ్లీ శిక్షను ఆపుచేయాలని కూడా ఆయన మరొక దరఖాస్తు పెట్టాడని తెలిసింది. ఈ రెండు దరఖాస్తులను హైకోర్టు నిరాకరించింది. అవే దరఖాస్తులను లేదా అందులో కనీసం ఒక దానిని హెూంమంత్రిగారు ఆమోదించారు. హెూం మంత్రి చేసిన ఈ పనిని మించి, శాంతి భద్రతలకు అపహాస్యం చేయగల పని మరొకటి ఏదీలేదు. ఈ అభిప్రాయం చెప్పడానికి నేను ఎంత మాత్రం వెనకాడడం లేదు. పైపైన చూసినా అసంబద్ధంగా కనిపించే ఇటువంటి చర్య రాష్ట్రప్రభుత్వం నీతి నిజాయితీలపై ప్రజలకు అనుమానం కలిగించదా అని గౌరవనీయ హెూం మంత్రిగారిని అడుగుతున్నాను.

అయ్యా, ఈ సందర్భంగా మరో ప్రశ్న వేయాలనుకుంటున్నా, అది గౌరవనీయులైన ప్రధాని మంత్రిగారినే అడగాలనుకుంటున్నాను. ఇదీ ఆ ప్రశ్న : ఈ ఉత్తర్వులను ప్రధాన మంత్రిగారి ఎరుకతోనే జారీ చేశారా? ఈ ఉత్తర్వుల గురించి మంత్రి వర్గానికి తెలుసా లేక గౌరవనీయులైన హెూం మంత్రిగారు మాత్రమే జారీ చేశారా? అయ్యా, ఈ ప్రశ్నల్ని నేను ఒక ముఖ్య కారణం వల్ల అడుగుతున్నాను. రూఢి అయిన ఆధారం లేకపోయినా కాంగ్రెసు-మంత్రి వర్గం కొత్త చట్టం క్రింద ఒక సమిష్టి సంస్థగా, సమిష్టి బాధ్యతతో పనిచేస్తుందని ఊహించడానికి మనకు ఆస్కారం వుంది. కాబట్టి ఈ విషయాన్ని మొత్తం మంత్రివర్గం ముందు, లేదా కనీసం ప్రధాన మంత్రి ముందైనా పెట్టి వుంటారని భావిస్తున్నాను. ఎందుకంటే ప్రజల దృష్టిలో, రాష్ట్ర పాలన బాధ్యత ప్రధానంగా ప్రధాన మంత్రిదే. దీన్ని చాలా తీవ్రమైన విషయంగా భావిస్తున్నాను కాబట్టే, నేను ప్రత్యేకంగా ఈ విషయాన్ని ప్రస్తావించి, ఈ ప్రశ్నలు అడుగుతున్నాను. ఒక నేరస్తునికి విధించిన శిక్ష అమలును ఆపడం తప్పనిసరిగా చట్టాన్ని ఉల్లంఘించడమే. న్యాయ పాలనకూ, రాష్ట్ర ప్రజల సంక్షేమానికి తీవ్ర పర్యవసానాలను తీసుకురాగల ఇలాంటి చర్యను ముఖ్యమంత్రికి తెలియకుండా నిర్ణయించి వుండరని నేను మనవిచేస్తున్నాను. ఇది నా అభిప్రాయం. ఆ అభిప్రాయం సరైందో కాదో నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. నా ప్రశ్నలకు సమాధానం వస్తుందని ఆశిస్తున్నాను. (చప్పట్లు).

**శ్రీ డబ్లు. యస్. ముకద్దం :** అయ్యా, ఈ సభలో ఏ పానీయాన్ని అయినా అనుమతిస్తారా? మీ

దృష్టికి ఒక వాస్తవం తీసుకొస్తున్నాను. ప్లానింగ్ చట్టం గూర్చి చర్చిస్తున్నపుడు నేను ఒక పాయింట్ ఆఫ్ ఆర్డరు లేవనెత్తాను. అప్పుడు శ్రీ మిరామ్ మాట్లాడుతున్నారు; సభలో ఏ పానీయాన్నీ అనుమతించనని సర్ ఇబ్రహీం రహంతుల్లా ఒక రూలింగ్ ఇచ్చారు. నీళ్లు త్రాగనిస్తారా అని శ్రీ మిరామ్ అడిగారు. నీళ్లను కూడా అనుమతించమని అధ్యక్షుల వారు చెప్పారు.

**గౌరవనీయులైన సభాపతి :** ఏ పానీయాన్నయినా సభలో తాగకుండా ఉండడమే మేలని అనుకుంటున్నాను; పానీయమంటే నా ఉద్దేశంలో పరిశుభ్రమైన నీరు, ఇంకేమీ కాదా (నవ్వులు).

**శ్రీ డబ్ల్యు. ఎస్. ముకద్దం :** సభలో నీళ్లు త్రాగడం అనుమతిస్తారా లేదా అని శ్రీ మిరామ్ అడిగారు. నీళ్లను కూడ అనుమతించమని అధ్యక్షులు సమాధానం చెప్పారు.

**గౌరవనీయులైన సభాపతి :** గౌరవనీయ సభ్యుడు శ్రీ ముకద్దం పానీయానికి సంబంధించి పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవనెత్తారు. దానికి అనేక అర్థాలు ఉండగల అవకాశం వుంది కాబట్టి 'పానీయమంటే' మంచినీళ్లన్న అర్థానికి పరిమితమై మాట్లాడుతున్నాను. డా॥ అంబేద్కర్ ఉపన్యాసానికి ముందు కాస్త ఓపిక కోసం కొంచెం మంచి నీళ్లు తాగారు. దాన్ని పురస్కరించుకొనే గౌరవనీయ సభ్యులు (శ్రీ ముకద్దం) ఈ పాయింట్‌ను లేవనెత్తారని నమ్ముతున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అయ్యా, నేను సమాధానం చెప్పవచ్చా? నేను అజీర్ణంతో బాధపడుతున్నాను. వైద్య సలహా ప్రకారం రెండు రోజులు నేను ఆహారం తీసుకోకూడదు. శనివారం, ఆదివారం ఈ రోజుల్లో నేను నీళ్లు కూడ తీసుకోకూడదు. కాబట్టి సోమవారం నాడు నాకు చాలా అలసటగా ఉంటుంది. ఆ గుక్కెడు నీళ్ళు తాగకపోయివుంటే నేను ఉపన్యసించగలిగే వాడినే కాదు. సభామర్యాదకు సంబంధించిన నిబంధనలను నేను భంగపరిచి వుంటే సభను మన్నించమని కోరుతున్నాను.

**గౌరవనీయులైన సభాపతి :** గౌరవ సభ్యులు డా॥ అంబేద్కర్ వివరణ ఇచ్చారు గనక, ఈ విషయంలో ఇక చేయాల్సింది ఏదీ లేదనుకుంటున్నాను. టేబుల్ మీది నుంచి గ్లాసు తీయడం తప్ప. (నవ్వులు).

# 41

# ప్రత్యేక కర్ణాటక రాష్ట్ర ఏర్పాటు*

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం, బైకుల్లా – పరేల్)***: అయ్యా, నా మిత్రులు, గౌరవనీయులు సర్ అలీ మహమ్మద్ ఖాన్ దెహ్లావి ప్రకటనతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఈ అంశం మీద మీరు వెలిబుచ్చిన అభిప్రాయం సరైందని సగౌరవంగా మనవి చేస్తున్నాను. మీరు రూలు 22లోని సబ్ రూలు (2) వైపు ఒకసారి దృష్టి నిలపాలని కోరుతున్నాను. అది ఈ విధంగా వుంది:

"ప్రాధమికంగా రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించని విషయం గూర్చి ఉన్నదన్న కారణం మీద సభాపతి ఏ తీర్మానాన్నయినా, ఏ తీర్మానంలో భాగాన్నయినా త్రోసిపుచ్చవచ్చును. వారలా చేస్తే ఆ తీర్మానాన్ని గానీ, ఆ తీర్మానంలోని భాగాన్నిగానీ సభా వ్యవహారాల జాబితాలో పెట్టకూడదు."

కాబట్టి ఈ తీర్మానం రాష్ట్ర ప్రభుత్వానికి ప్రాధమికంగా సంబంధంలేని విషయంతో నిండి వుందని మనవి చేస్తున్నాను. ప్రస్తుతం మద్రాసు రాష్ట్రంలో ఉన్న కొన్ని ప్రదేశాలను వేరుచేయాలని ఈ తీర్మానం చేస్తున్న సిఫార్సు ఒక రాష్ట్ర ప్రభుత్వపు పరిధిని మించి ఉందని కూడా మనవి చేస్తున్నాను. అయితే, అయ్యా, నా గౌరవనీయ మిత్రులు శ్రీ జోగ్ ఉదహరించిన 290 సెక్షను విషయానికి వస్తే, ప్రస్తుత ఇండియా ప్రభుత్వ చట్టంలోని ఈ 290 వ సెక్షను, 1919 నాటి ఇండియా ప్రభుత్వ చట్టంలోని 52 ఎ సెక్షనుకు విరుద్ధమైనదని గ్రహించవచ్చు. 1919నాటి ఇండియా ప్రభుత్వ చట్టం లోని 52 ఎ సెక్షన్‌ను 290 సెక్షన్‌తో పోల్చి చూస్తే చాలా మౌలికమైన, ఉద్దేశపూర్వకమైన మార్పును చేసినట్లు కనపడుతుంది. పాత చట్టంలోని 52 ఎ సెక్షను ప్రకారం, ఏదైనా కొత్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేయదలిస్తే స్థానిక శాసన సభ ఆ మేరకు తీర్మానం చేసి, గవర్నర్ – జనరల్‌కు తెలియపరచాలి. ఎందుకంటే, అప్పుడు కొత్త రాష్ట్రాలను ఏర్పాటుచేసే అధికారం వర్నర్ – జనరల్‌కి మాత్రమే వుండేదని మీకు గుర్తుకు వచ్చి ఉంటుంది. 52 ఎ సెక్షను క్రింద ర్నరు జనరల్ చొరవ తీసుకొనే ముందు రాష్ట్ర శాసన సభలు ఈ విషయంలో తమ ప్రాయాల్ని వ్యక్తం చేస్తూ తీర్మానాలు చెయ్యొచ్చు. 290 సెక్షన్‌లో నేను చెప్పిన మౌలిక ర్పు ఉంది. పాతదానిలో ఉన్న గవర్నరు జనరల్ అధికారాన్ని అది తొలగించి వేసింది. ఆ ధికారం రాజ్యకార్యదర్శికి ఇచ్చింది; అంటే రాజ్యమండలితో కూడిన రాజుకు ఇచ్చింది. నేను అర్థం చేసుకొన్న ప్రకారం చొరవతీసుకొనే అధికారం స్థానిక శాసనసభలకు లేకుండా రాజ్యకార్యదర్శికి ఇచ్చింది. రాజ్యకార్యదర్శి కొత్త రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని నిర్ణయించాక, ఆ మేరకు మండలి

---

* బి.యస్.ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 1692-93, ఏప్రిల్ 4, 1938.

సభలో తీర్మానం పెట్టే ముందు అతడు 290 సెక్షను ప్రకారం చేయవలసిందేమిటంటే ఆ తీర్మానం వల్ల మార్పులకు లోనయ్యే శాసన సభను సంప్రదించాలి. అప్పుడు మాత్రమే అలాంటి తీర్మానం చర్చించడానికి ఏ రాష్ట్ర శాసనసభకైనా అనుమతి లభిస్తుంది. ఆ రాష్ట్రంలో చేరివుండని ప్రాంతాలకు సంబంధించి ఈ తీర్మానాన్ని చేసినప్పటికీ వారు దాన్ని చర్చించవచ్చును. ఈ తీర్మానాన్ని రాజ్య కార్యదర్శి ఈ సభకు పంపించివుంటే అప్పుడు మాత్రమే ఈ సభ దాన్ని చర్చించడానికి వీలవుతుంది. అంటే కర్నాటకాన్ని వేరు చేయాలా, ఈ రాష్ట్రంలో భాగం కాని కొన్ని ప్రాంతా లను దానితో చేర్చాలా వద్దా అనేది అప్పుడు మాత్రమే మనం చర్చించాల్సి ఉంటుందని నా మనవి. ఆ చర్య తీసుకోకపోతే అంటే రాజ్యకార్యదర్శి ఈ విషయాన్ని తలపెట్టకపోతే, ఈ రాష్ట్ర ప్రభుత్వం, ఈ రాష్ట్ర శాసన సభ అలాంటి తీర్మానాన్ని చేపట్ట లేదు. ఎందుకంటే ఆ తీర్మానం ఈ శాసనసభ ఈ రాష్ట్ర ప్రభుత్వం పరిధికి, అధికారానికి మించిన సమస్యను చేపట్టినట్లవుతుందని నా మనవి. కాబట్టి మీరు సరైన అభిప్రాయాన్నే వెలిబుచ్చారని నా ఉద్దేశం. సభా నిబంధనలకూ, ఇండియా ప్రభుత్వ చట్టం 290 వ సెక్షన్‌కూ కూడా అది సరిపోయింది.

**గౌరవనీయులైన సభాపతి :** ఒక విషయం స్పష్టం చేయాలనుకుంటున్నాను : "మద్రాసు", "కూర్గ్" అనే పదాలను చేర్చే ప్రతిపాదనను మాత్రమే నేను అనుమతించలేదు. గౌరవనీయ సభ్యుడు డా॥ అంబేద్కర్ ప్రతిపాదించిన వాదన ఇంకా లోతుకు వెళ్లినట్లుంది. ఆ వాదన తెలిపేదేమంటే, ఏ కొత్త రాష్ట్రాన్ని సృష్టించాలన్నా, ఏ రాష్ట్రం సరిహద్దులు మార్చాలన్నా దానికి సంబంధించిన తీర్మానాన్ని ఏ రాష్ట్ర శాసనసభలోను చేయడానికి వీల్లేదు. ఎందుకంటే ఆ విషయంలో చొరవ తీసుకోవడానికి **శాసనసభకు అధికారంలేదు. ఆయన వాదన సారాంశం** అదేనని భావిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అవును.

**గౌరవనీయ సభాపతి :** అంటే తీర్మానంలో మద్రాసు, కూర్గ్‌లను చేర్చడం వల్ల వచ్చే తేడా ఏమీ ఉండదు. ఏదీ చర్చించడానికి వీలు లేనప్పుడు మద్రాసు లేక కూర్గ్‌లను చేర్చడం వల్ల ప్రయోజనం ఏముంటుంది? ఆయన వాదన ఈ విషయం మూలంలోకి వెళ్తుంది.ఈ విషయంలో ఒక ఇబ్బంది ఉంది : అదేమంటే కొన్ని పరిమితులకు లోబడి చొరవతీసుకొనే అధికారం మాత్రమే ఇవ్వబడింది. ఇంకా సరిగ్గా చెప్పాలంటే కొన్ని పరిమితులకు లోబడే ఈ అధికారాన్ని ఉపయోగించుకోవాల్సి వస్తోంది. చొరవ తీసుకునే అధికారమున్న ప్రభుత్వాన్ని కదిలించే ఉద్దేశంతో శాసనసభ తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయవచ్చు కదా! చొరవ తీసుకోమని శాసనసభ ప్రభుత్వాన్ని కోరడానికి 290 సెక్షనులో అభ్యంతరం ఏమైనా వుందా? నిజానికి వేరు చేసే భావంతో ఈ శాసనసభ ఒక తీర్మానం లేదా చర్య తీసుకుంటుందని కాదు. "చొరవ" అనే పదాన్ని ఇంకో అర్థంలో వాడితే విన్నపం ద్వారా శాసనసభ చొరవ తీసుకోవచ్చు.

ఆ విధంగా అభ్యర్థించడానికి కూడా 290 సెక్షను అడ్డు వస్తుందా? ఈ విషయం మీద మాత్రం

నేను వైదుష్యంగల డా॥ అంబేద్కర్ తో ఏకీభవించడానికి సిద్ధంగా లేను.

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** నా అభిప్రాయం మాత్రం అదే. ఈ సభకు ఆ అధికారం లేదు. ఈ విషయంలో చొరవ తీసుకొనే అధికారం రాజ్యకార్యదర్శికి పరోక్షంగా లేదా ప్రత్యక్షంగా ఇవ్వబడిందన్న వాస్తవం ఆ అధికారం శాసన సభనుండి తొలగించబడిందనే విషయాన్ని స్పష్టం చేస్తున్నది. పాత చట్టంలోని 52 ఎ సెక్షన్ను ప్రస్తుత చట్టంలోని 290 సెక్షన్తో పోల్చి చూసినపుడు ఈ విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఈ విషయాన్ని సైమన్ కమిషన్లోనూ, రౌండు టేబుల్ సమావేశంలోనూ పరిశీలించి వేరు పడడానికి కావలసిన నిబంధనలను సంతృప్తి పరచిన రాష్ట్రాలు ఒరిస్సా, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం మాత్రమేననే తీర్మానానికి వచ్చారు. ఆ చొరవను వాళ్ల రాష్ట్ర శాసనసభకు వదల లేదు.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అయ్యా, సభాపతిగారూ, గౌరవనీయ మిత్రులు శ్రీ జోగ్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని వ్యతిరేకించడానికి నేను లేస్తున్నాను. ఈ తీర్మానానికి సంబంధించిన విషయం ఈ క్షణంలో నిస్సందేహంగా గొప్పది. చర్చలోకి సెంటిమెంటు, సొంతభావన రాకుండా ఈ తీర్మానాన్ని పరిగణించడానికి ఎంత మంది సభాసభ్యులు సిద్ధంగా ఉన్నారో అని నా అనుమానం. షెడ్యూల్డు కులాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నందువల్ల నాకు ఇతర సభ్యుల కన్నా ప్రత్యేక సదుపాయం వుందని నేను తలుస్తున్నాను. ఏదో కాకుండా, నిజంగా మనస్ఫూర్తిగా చెపుతున్నాను. షెడ్యూల్డు కులాల ప్రతినిధులమైన మేము మహారాష్ట్రీయను లుగా వుండడంలో గానీ, గుజరాతీయులుగా ఉండడంలోగానీ, కర్ణాటకులుగా వుండడంలోగానీ ఎలాంటి గర్వకారణమూలేదని భావిస్తున్నాం. ఆ కారణాలలోకి ఈ సందర్భంగా నేను వెళ్లనక్కరలేదు. ఇది మా భూమి కాదని భావించడానికి మాకు అనేకానేక కారణాలున్నాయి. అయినా నేను నా పరిస్థితుల కారణంగా నిష్పక్షపాతమైన వైఖరి అవలంబించగలనని సభకు చూపడానికి ఈ వాదన చేస్తున్నాను. లేదా నిష్పక్షపాత వైఖరి తీసుకోవడానికి నేను తీవ్ర ప్రయత్నం చేసగా ఈ మాటలు మాట్లాడుతున్నాను.

అయ్యా, ఒక విషయం మనస్సులో ఉంచుకోవటం సభ్యులకు అవసరం, అభిలషణీయం అని భావిస్తున్నాను. దానికి చాలా ప్రాముఖ్యం వుందని నా అభిప్రాయం. చట్టం అమలులోకి వచ్చే ముందు ఈ బొంబాయి రాష్ట్రం నాలుగు భిన్నమైన ప్రాంతాల కలయికగా వుండేది. అవి గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక, సింధు. ఈ ఉమ్మడి కుటుంబం ఇటీవల ఏర్పడ్డది కాదు. కర్ణాటక, మహారాష్ట్ర గుజరాత్ 115 సంవత్సరాల నుండి కలిసి వున్నాయి. మనతో దాదాపు 90 ఏళ్లు కలిసి వున్న సింధు రాష్ట్రం ఆ తర్వాత వేరైంది. అది గతించిన విషయం కాబట్టి ఇప్పుడు తవ్వనక్కరలేదు. మనం 115 సంవత్సరాల నుండి కలిసి జీవిస్తున్నామని ఎందుకు నొక్కి చెపుతున్నానంటే ఈ ఐక్యతను వదులు

* బి.యస్. ఎ. చర్చలు, సంపుటి 3, పేజీలు 1717–23, ఏప్రిల్ 4, 1938

కోవాలనే వాళ్లు, ఈ మూడు ప్రాంతాలను వేరు చేయాలనే వాళ్లు ఈ విషయాన్ని కేవలం సెంటిమెంటు మీద ఆధారపడికాకుండా మరింత తీవ్రంగా పరిశీలించాలని చెప్పడానికి ఉదహరిస్తున్నాను.

నేను ప్రతిపాదిస్తున్న మొదటి విషయం ఇది. ఈ తీర్మానం ప్రవేశ పెట్టిన మన మిత్రుడు ఈ ప్రతిపాదన ఒక పెద్ద విషయంలో భాగం మాత్రమేనన్నారు. కర్ణాటక ప్రజల ఐక్యత దీని ఆదర్శం అన్నారు. ఆ మార్గంలో ఈ తీర్మానం ఒక మెట్టు మాత్రమేననే అభిప్రాయం ఇచ్చారు. అయ్యా, ఈ విషయంలో నేను అడగదలచిన ప్రశ్న ఇది. ఈ ఆదర్శం గౌరవనీయ మిత్రులు అనుమతిస్తే దీన్ని కల అంటాను. కన్నడం మాట్లాడే ప్రజలందరినీ ఐక్యం చేయగల ఈ కల ఎప్పటికైనా నెరవేరగలదా? ఇది ఎన్నటికీ నెరవేరదనడంలో నాకు ఏలాంటి అనుమానం లేదు. దానికి కారణం ఇదీ. అందరికీ పంచిపెట్టిన ఒక పుస్తకం – ఏమో పంచారో లేదో తెలియదు నాకు – అదృష్టవశాత్తూ దొరికిన ఆ పుస్తకం పేరు "కర్ణాటక ఏకీకరణకు భూమిక" ("A case for the unification of Karnataka"). ఈ తీర్మానానికి బాధ్యులైన సంఘమే దీన్ని ప్రచురించిందనుకుంటున్నాను. దీని 22 వ పేజీలో ఒక ప్రకటన ఉంది. భారతీయ రాష్ట్రాల సరిహద్దులలో కన్నడం మాట్లాడే ప్రజలు కొందరు వున్నారని దాన్ని బట్టి స్పష్టమవుతున్నది. ఈ వాస్తవాన్ని దృష్టిలో వుంచుకుని ఈ తీర్మానాన్ని బలపరుస్తున్న నా గౌరవనీయ మిత్రులను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. ఈ ప్రజలు భారతీయ రాష్ట్రాల ఆధీనం నుండీ, సార్వభౌమాధికారం నుండీ వేరై, మీరు ప్రతిపాదిస్తున్న స్వపరిపాలనతో కూడిన కన్నడ భాషా రాష్ట్రంలో భాగస్తులు కాగలరా? బ్రిటిషు ఇండియా అధికారులు మద్రాసు రాష్ట్రాన్ని లేక బ్రిటిషు చట్టం పరిధిలో వున్న ఇతర పాలనా యంత్రాంగాలను, కన్నడిగులు నివసించే ప్రాంతాలను వదులుకోమని నచ్చజెప్పే అవకాశం వుందని నేనూ ఒప్పుకుంటాను. దానివల్ల తామంతా ఒకే పాలన కింద కలిసి బతకొచ్చని వాళ్లు ఆశించవచ్చు. భారతీయ రాష్ట్రాలలో జీవిస్తున్న కన్నడ భాషా ప్రజల దేశభక్తిని అక్కడ నుండి బ్రిటిషు ఇండియా ప్రాంతానికి ఎలా బదలీ చేయించగలరు. అది ఎలా సాధ్యమో నాకు అర్థం కావడం లేదు. నాకు ఒకే ఒక మార్గం : కనిపిస్తున్నదంటే కన్నడ ప్రజలు నివసించే ప్రాంతాన్ని సంస్థానాధీశులు వదులుకోవడానికి వీలు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం దానికి సరిపడే ప్రాంతానికి వారికి బదిలీ చేయడం. అయితే ఇండియ ప్రభుత్వ చట్టం రాజ్యాంగం కింద నివసిస్తున్న ఎవరైనా సంస్థానాల పరిధిలోకి వెళ్లడానికి సిద్ధపడతారా? అని నా సందేహం. నాకు అలాంటి అవకాశం ఏమీ కనపడడం లేదు. నా మనవి సరైందో కాదో ఈ తీర్మానానికి బాధ్యులయిన గౌరవనీయ సభ్యులను చూడమంటున్నాను. అదేమంటే కన్నడ భాషా ప్రజలను ఒకే సామాన్య స్వపరిపాలనా ప్రభుత్వం కిందికి తీసుకొని రావడమనే ఆదర్శం పూర్తిగా నెరవేరగలదా? అని. బ్రిటీషు ఇండియాలోని కొన్ని జిల్లాలలో నివసిస్తున్న కన్నడ భాష ప్రజలను స్వపరిపాలనా రాష్ట్రం కోసం వేరుచేయడం అవసరమా? మనం తీసుకొనే చర్య అంతిమ ధ్యేయానికి దారితీయదని ముందుగానే తెలిసినపుడు ఆ చర్య తీసుకోవడం వల్ల ప్రయోజనమేమిటి? నేను రెండవ విషయం చెబుతాను. కన్నడ భాషప్రజలందర్నీ ఒకే స్వపరిపాలన క్రిందకు తీసుకొనిరాలేకపోతే,

వాళ్లను ఐక్య పరిచే ఆదర్శం నెరవేరక పోతే నేను వాళ్లను అడగదలచిన ప్రశ్న ఇది : బహుభాషా పాలన కింద కన్నడ భాష ప్రజలు న్యాయసమ్మతంగా తమకు రావలసిన ప్రయోజనాలు పొందడంలో ఏమైనా ఇబ్బంది పడుతున్నారా, సౌకర్యాలకు దూరమయ్యారా? అయితే బహుభాషా రాష్ట్రంలో కన్నడ భాష ప్రజలు పాలనావిషయాల్లో ఏవైనా ఇబ్బందులు పడుతున్నారని వ్యక్తిగతంగా నేనైతే అనుకోవడం లేదు.

అయ్యా, నేనీ విషయాన్ని రెండు భిన్న దృక్పథాలతో పరిశీలించాను. మొట్టమొదటగా కొత్త ప్రభుత్వం క్రింద పదవుల పంపకం ప్రశ్న తీసుకుంటాను. ఆ విషయంలో వాళ్లు నష్టపోయారా? తమకు రావలసిన దానికన్నా తక్కువ పొందారా? రెండో విషయం – ఒక పరీక్షలా నేను భావించేది ఏమిటంటే – ఈ సభలో వాళ్లు తమకు రావలసినదానికన్నా తక్కువ ప్రాతినిధ్యం పొందారా? అయ్యా, నేను కొన్ని లెక్కలు చూపిస్తాను. వీటిలో మిశ్రమ ప్రాంతాలను వదిలివేస్తాను. ఉదా: బొంబాయి నగరం – అందులో ఉండేది పూర్తిగా మరాఠీ మాట్లాడే వాళ్లు కాదు, గుజరాతీ మాట్లాడేవాళ్లు కాదు, కన్నడం మాట్లాడేవాళ్లూ కాదు. అలాంటి ప్రాంతాలను వదిలి వేస్తున్నాను. ప్రత్యేక ప్రయోజనాల కోసం కేటాయించిన స్థానాలను కూడ లెక్కలోకి తీసుకోవడం లేదు. మిగిలిన లెక్కలు ఇలా వున్నాయి : జనాభాలో మరాఠీ మాట్లాడేవాళ్లు 98.68,795 – మరాఠీ మాట్లాడే వాళ్లంటే హిందువులు, మహమ్మదీయులు, షెడ్యూల్డు కులాల వాళ్లందర్నీ కలిపే చెపుతున్నాను – భాషా ప్రాతిపదిక మీద మాత్రమే లెక్క చెపుతున్నాను; గుజరాతీ మాట్లాడే వాళ్ల సంఖ్య 34,22,139; కన్నడం మాట్లాడే వాళ్ల సంఖ్య 32,66,223. ఇక ఈ సభలో వున్న స్థానాల వివరం ఇదీ : కేవలం జనాభా ప్రాతిపదికపై మరాఠీ వాళ్లకు లభించిన 81 స్థానాలను ప్రమాణంగా గ్రహిద్దాం. దాన్ని బట్టి నిర్ణయిద్దాం. దీని ప్రకారం గుజరాతీ మాట్లాడేవాళ్లకు 27 సీట్లు వుండాలి. వారు పంచిపెట్టిన పుస్తకం ప్రకారం కన్నడం మాట్లాడే ప్రజలు 12 శాతం వున్నారు. ఆ ప్రాతిపదిక మీద వాళ్లకు 21 సీట్లు రావాలి. ఇప్పుడు వాస్తవంగా వాళ్లకు ఎన్ని సీట్లు వచ్చాయో చూద్దాం. గుజరాతీలకు 27 కంటే ఎక్కువ 31 సీట్లు వచ్చాయి. కన్నడులకు 21 బదులు 28 స్థానాలు లభించాయి.

పదవుల విషయం చూద్దాం. రెండు సభల్ని కలిపి తీసుకుంటే మొత్తం 6 స్థానాలున్నాయి. జనాభా ప్రాతిపదిక మీద ప్రతి విభాగానికీ రావలసిన స్థానాలు చూస్తే, మరాఠీ మాట్లాడే వారికి 19.6, గుజరాతీ మాట్లాడేవారికి 3.3, కన్నడం మాట్లాడేవారికి 3.1 రావాలి. వాస్తవంగా లభించిన సీట్లను బట్టి పదవుల పంపకం ఇలా వుండాలి – అది సరైన కోటా కానీ కాకపోనీ – మరాఠీ మాట్లాడేవారి కోటా 9.3, గుజరాతీ మాట్లాడేవారి కోటా 3.6, కన్నడం మాట్లాడేవారి కోటా 3.1, అయితే నిజానికి పదవుల పంపకం ఎలా జరిగింది? మరాఠీ మాట్లాడేవారికి 6, గుజరాతీ మాట్లాడేవారికి 6, కన్నడం మాట్లాడేవారికి 4 పదవులు దక్కాయి.

అయ్యా, నేను ఇంతకుముందే చెప్పినట్టు, మహారాష్ట్రుడుగా వుండడం నాకు గర్వకారణ మేమీ కాదు. ఈ మాటను నేను ఫిర్యాదుగా చెప్పడం లేదు. నా ఉద్దేశం అదికాదు. ఒక వాస్తవాన్ని

ముందుంచడానికి మాత్రమే ఉదహరిస్తున్నాను. అల్పసంఖ్యాకులైన గుజరాతీలుగానీ, కన్నడిగులుగానీ స్థానాల్లోనూ పదవుల్లోనూ ఎలాంటి అన్యాయానికీ గురికాలేదనేది వాస్తవం. ఈ విషయం ఈ సభలో చర్చించే ముందు, గౌరవనీయులైన నా మిత్రులు శ్రీ జోగ్‌తో స్పష్టంగా చెప్పాను- కన్నడిగులకు సభలోగానీ, మంత్రి వర్గంలో గాని తగినంత, న్యాయమైన ప్రాతినిధ్యం లభించలేదని ఆయన కనుక రుజువు చేస్తే, వాళ్లకు నా పూర్తి మద్ధతు వుంటుందని చెప్పాను. ఇది చేయడానికి నేనెప్పుడు సిద్ధమే. అయ్యా, ఈ లెక్కలు తీసుకొనేటప్పుడు నేను ఈ విషయాన్ని చాలా జాగ్రత్తగా అధ్యయనం చేశాను. ఈ అంకెలు అధికార సమాచారం నుంచే తీసుకున్నాను. నా వ్యక్తిగతాభిప్రాయం ఏమంటే - బొంబాయి రాష్ట్రంలో ఉన్నందుకు కర్నాటక ప్రజలు ఏ విధంగానూ నష్టపోయారని నాకు అన్పించడం లేదు.

అయ్యా, మరోవాదన విషయానికి వస్తే, అది ఆర్థిక సమస్య. అది చాలా ముఖ్యమని అనుకొంటున్నాను. నేనే కాదు, ఈ తీర్మానానికి కారకులైన వారు కూడా దీన్ని పరిగణించక తప్పదు. కొత్తగా ఏర్పడబోయే కన్నడ భాషా రాష్ట్రం నవీన కాలంలో ప్రతి నాగరిక ప్రభుత్వం సమ్మతించే ప్రామాణిక వ్యయాన్ని భరించగలదా? నా ఉద్దేశంలో అది చాలా ప్రధాన సమస్య. గతంలో కర్ణాటక ఈ రాష్ట్ర ప్రభుత్వపు నిర్లక్ష్యం వల్ల విపరీతంగా నష్టపోయిందనే ఫిర్యాదును ఈ తీర్మానానికి అనుకూలంగా మాట్లాడిన మిత్రులు ఇంతకు ముందు సభదృష్టికి తీసుకొచ్చారు.

***గౌరవనీయ సభాపతి :*** గౌరవనీయ సభ్యుని దృష్టిని కాలపరిమితి వైపునకు మరలుస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, నన్ను అడిగితే.........

***గౌరవనీయ సభాపతి :*** వాదన మధ్యలో గౌరవనీయ సభ్యునికి అడ్డుతగలడం నాకు ఇష్టం లేదు. కాని ఉపన్యాసాల కాలపరిమితిని మాత్రం గుర్తు చేస్తున్నాను. దాన్ని బట్టి వాదనను సంక్షిప్తంగా సభ ముందు పెట్టగలరు.

***డా॥ అంబేద్కర్ :*** ఆర్థికం విషయంలో నేను చెప్పదలచింది ఇదీ : వాళ్లు పంచిపెట్టిన పుస్తకంలో కొన్ని అంకెలున్నాయి. అనుబంధం 'బి'లో కన్నడ రాష్ట్రానికి ఖర్చు రెండు కోట్లనీ, మొత్తం ఆదాయం 257 లక్షలుంటుందనీ చూపారు. ఈ అంకెలలో రాష్ట్ర పరిపాలన నిమిత్తం ఖర్చయ్యే ఓవర్‌హెడ్ చార్జీలు చేరివున్నాయో లేదో నాకు తెలియదు. ఆదాయం, వ్యయం శీర్షికల కింద కొన్ని మొత్తాలు కనబడుతున్నాయి. గవర్నర్‌కు చెల్లించాల్సిన జీతం ఖర్చు గాని, ఆయన ప్రయివేటు సిబ్బందికీ, కార్యదర్శులకూ, మంత్రులకూ, విద్యాశాఖాధికారికీ, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్‌కూ, ఆరోగ్య శాఖాధికారికీ - పరిపాలన సాగేటట్లు చేయడానికి అవసరమైన ఈ పెద్ద ఆఫీసర్లకయ్యే ఖర్చు ఎక్కడా కనపడలేదు.

***శ్రీ వి.యస్.జోగ్ :*** ఈ అంకెలు వేరే పుస్తకం అనుబంధం 'బి' లో వున్నాయి.

**డా॥ అంబేద్కర్ :** కావచ్చు. అయ్యా, ఇదే కాబోయే బడ్జెట్ అనుకొంటే, 5 లక్షలలో ఎంత మిగులు ఉండాల్సి ఉంది. దీన్నిబట్టి ఇపుడు నేను అడగదలచిన ప్రశ్న ఏమంటే – ఆధునిక పరిపాలనకు కావలసినవన్నీ చేకూర్చడానికి ఈ ఆదాయం సరిపోతుందా? బొంబాయి మున్సిపాలిటీ ఆదాయం గురించి గౌరవనీయ మిత్రులకు తెలిసి వుంటే, కొత్త రాష్ట్ర ఆదాయం బొంబాయి మున్సిపాలిటీ ఆదాయంలో సగం కూడ ఉండదనే విషయం అర్థమై వుండేది. బొంబాయి మున్సిపాలిటీ ఆదాయం రూ. 4 కోట్లు. ఈ 4 కోట్లతో కూడ బొంబాయి మున్సిపాలిటీ ఆధునిక ప్రభుత్వం చేయవలసినవన్నీ చేయడం లేదు. నేను నిజంగా అడుగుతున్నాను – చాలా సీరియస్‌గా అడుగుతున్నాను. ఇది పరిశీలించాల్సిన విషయం కాదా? ఒరిస్సా ప్రధాన మంత్రి ప్రసంగాన్ని నా గౌరవనీయ మిత్రులు తన వాదనలో ఉదహరించారు. అన్ని అవయవాలను ఒక చోటికి చేర్చడం చాలా సంతోషంగా వుందని ఆయన ఉన్నట్టుగా మన మిత్రులు చెప్పారు. అవయవాలను దగ్గర చేర్చడం కంటే వాటికి ఆహారం సమకూర్చడం ముఖ్యమని నేనంటే గౌరవనీయ మిత్రులు ఏమంటారో! ఇది యోచించాల్సిన సమస్య. ఈ దేశంలో ప్రజలు స్థానిక సంస్థల కన్నా తక్కువ ఆదాయం లభించే రాష్ట్రాలుగా విడిపోవడమనేది నాకు చాలా హృదయవిదారకంగా ఉందని మరీమరీ చెబుతున్నాను. రాష్ట్రవేర్పాటు కొద్దిమందిని సంతృప్తి పరచవచ్చు. వాళ్లకు రాష్ట్రాధిపతులుగా చెలామణి కావాలని వుండొచ్చు. మిగతా జనాభా సంగతి ఏమిటి? వాళ్ల కూడు, గుడ్డ, నీడ సంగతేమిటి? అయ్యా, నిజం చెప్పాలంటే, ఇవి ఏం జిల్లాలు? ఇందులో రెండు జిల్లాలు కరువు పీడిత ప్రాంతాలు. బిజాపూర్ మొత్తం కరువు కోరల్లో చిక్కిన జిల్లా. మొత్తం బళ్లారి కూడ కరువుకు గురైన జిల్లా అనే చెపుతారు. కరువుకు గురైన ప్రాంతాల నుండి ఆదాయం ఏం వస్తుందని ఆయన ఆశిస్తున్నారు. కేవలం బొంబాయి రాష్ట్రం నుండి దాన్ని వేరు చేయడం వల్ల అది పాలిచ్చే గోవు అవుతుందా?

మరో ప్రశ్న వుంది. అదేమిటంటే : నేను మైనారిటీ సభ్యుణ్ణి గనుక మైనారిటీల దృక్పథం నుండీ నేను ఈ విషయాలను చూడాల్సి ఉంటుంది. తీర్మానానికి అనుకూలంగా మాట్లాడిన సభ్యులు మహమ్మదీయుల ప్రయోజనాలను, హరిజనుల ప్రయోజనాలను కాపాడుతామని హామీ ఇవ్వడం నాకు చాల సంతోషంగా వుంది. అయినా ప్రాంతాలను విభజించడమంటే మైనారిటీలను కూడా విభజించినట్లవుతుందనే విషయం నేను చెప్పదలచుకున్నాను. కర్ణాటకలో మాకు రెండు సీట్లు మాత్రమే వున్నాయని నేను మరచిపోలేను. కర్ణాటకకు చెందిన ఇద్దరు షెడ్యూల్డు కులాల సభ్యులకు, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుండి తమ కులాలకు చెందిన 13 మంది సభ్యులు శాసనసభలో వున్నారనే వాస్తవం ఎంతో బలం చేకూరుస్తుందని నా నమ్మకం. వాళ్లు తమను చూసుకుంటారని అనుకొంటారు. మరి వాళ్లకు ఏం జరుగబోతోంది? ఉదా : మహమ్మదీయులకు కర్ణాటకలో 8 సీట్లు వున్నాయి.

**సర్ అలీ మహమ్మద్ ఖాన్ దెహ్లావి :** నాలుగు మాత్రమే.

**డా॥ అంబేద్కర్ :** సరే. వ్యవధి లేదు కనుక నేను వాదించను. కాని ఈ రకంగా మైనారిటీలను

విడగొట్టడాన్ని మేము సమ్మతించలేము. దయగానూ, ఔదార్యంగానూ ఉంటామని మెజారిటీ వర్గాలవారు చెప్పడం వారికి చాలా బాగా ఉంటుంది. అయితే మనం వాళ్ల ఔదార్యం మీదా, వాళ్ల జాలి మీదా ఆధారపడలేము. మనకు హక్కులు కావాలి. హక్కులు ఉదారంగా ఇవ్వరు. జనాభా ప్రాతిపదికమీద చూస్తే అతిచిన్న మైనారిటీగా వుండే ప్రజలకు ప్రాముఖ్యం ఇవ్వడానికి వాళ్ళు సిద్ధమయినా కొద్ది లక్షలమంది మాత్రమే వున్న జనాభాకు ఎవరైనా ఏం ప్రాముఖ్యం ఇవ్వగలరు? నేను ఈ తీర్మానాన్ని వ్యతిరేకించడానికి ఇది ఒక కారణం. ఈ విభజనను అంగీకరించడానికి నేను సిద్ధంగా లేను. బహుభాషా పరిపాలనలోనే మన బలమున్నది అనాలని లేదుగాని నాకో భయమున్నది; కర్ణాటక వేరే రాష్ట్రంగా రూపొందితే, అది ఇతరులందరిని వ్యతిరేకించే లింగాయతుల రాష్ట్రం కావొచ్చు. 'చల్లకెళ్లి ముంతదాయడం' నాకు ఇష్టం లేదు. ఉదాహరణకు, వేర్పాటే జరుగుతుందనుకోండి. కన్నడిగులకు వ్యతిరేకంగా మరాఠాలు ఐక్యం అవుతారు. ఇలాంటివి మనకు అక్కరలేదు. మనం ఇపుడు అనుభవిస్తున్న ఉమ్మడి పనివిధానం అప్పుడు వుండదు.

మరొక విషయం వుంది. దీన్ని సభ దృష్టికి తీసుకువస్తాను. దీంతో నేను ముగిస్తాను. అదేమంటే – నాతో ఏకీభవించని వారు ఉన్నారని నాకు తెలుసు. కాని అది నా గట్టి నమ్మకం – బ్రిటిష్ వారు చరిత్రలో ఏం చేసినా, ఎందులో విఫలురైనా – అనేక విషయాల్లో వాళ్లు విఫలమైనారు కూడా. బహుశ వాళ్ల స్వార్థం వల్లనే అనుకోండి. వాళ్లు రెండు పనులు మాత్రం చేశారు. ఈ దేశంలో వాళ్ల పాత్రకు సంబంధించి అవి రెండూ చరితార్థమైనవని నేను సంతోషంగా అంగీకరిస్తున్నాను. వాళ్లు వెళ్లినాక కూడ అవి నిలుస్తాయి. వాళ్లు చేసిందాంట్లో ఒకటేమిటంటే ఉమ్మడి చట్ట విధానం. మీరు కాశ్మీరు నుండి దక్షిణ భారతదేశం వరకూ ప్రయాణించినా హత్య అనేది కాశ్మీరులో చేసినా, పంజాబులో, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో లేక మద్రాసు రాష్ట్రంలోని రాజమండ్రిలో చేసినా ఒకటేనని తెలుసుకోగలరు. ఆస్తి బదిలీ చేయడానికి అర్థం ఎక్కడైనా ఒకటే. ఎక్కడికి వెళ్లినా సాక్ష్యమంటే ఏమిటో మీకు తెలుసు. అయ్యా, అలాంటిది మనకు ఇంతవరకు లేదని అంటున్నాను. బ్రిటిషు ప్రభుత్వం చేసింది మరొకటి ఏమంటే, మనకు ఒక ఉమ్మడి కేంద్ర ప్రభుత్వాన్నిచ్చింది. అలాంటిది మనకు ఇంతకు ముందెప్పుడూ లేదు. ఉమ్మడి కేంద్ర ప్రభుత్వం కల్గివుండడమంటే ఏమిటో దాని ప్రాముఖ్యత ఏమిటో బహుశా అందరూ గ్రహించలేదు. కాని అది చాలా కీలకమైన అంశం. సమైక్యదేశాన్నీ, జాతీయతాభావాన్నీ, మనమందరం ఒకటేననే భావాన్నీ ప్రతిష్టించే దిశలో మనం ఇప్పుడు ఉన్నామంటే దానికి కారణం మనకు ఉమ్మడి ప్రభుత్వం ఉండడమే. మనం ఉమ్మడి ప్రభుత్వపు పౌరులమన్న గ్రహింపే దానికి కారణం.

అయ్యా, మనం పొందిన ప్రయోజనాలకు హాని కలిగించే పని ఏదీ చేయకూడదని ఈ సభా సభ్యులను నేను కోరుతున్నాను. ఈ దేశంలో ఏ ఒక్క ప్రత్యేక సంస్కృతికీ, అది హిందూ సంస్కృతి గానీ మహమ్మదీయ సంస్కృతిగానీ, లేక కన్నడ సంస్కృతిగానీ గుజరాతీ సంస్కృతిగానీ హాని కలిగించే దేనికీ స్థానమున్నదని నేను వ్యక్తిగతంగా నమ్మడం లేదు. ఇది బహిరంగంగానే చెపుతాను. కొన్ని

విషయాలు ఉన్నాయి, వాటిని కాదనలేము. కాని వాటిని ప్రయోజనకరమైనవిగా భావించకూడదు. వాటిని దుష్ప్రయోజనకరమైనవిగానే గ్రహించాలి. ఎందుకంటే అవి మన దేశభక్తిని విభజించి సమిష్టి ధ్యేయం నుండి మనల్ని తప్పిస్తాయి. ఆ సమిష్టి ధ్యేయమేమంటే మనమందరమూ భారతీయులం అనే భావనా నిర్మాణం. మనం మొదట భారతీయులం, తర్వాత హిందువులం లేక మహమ్మదీయులం అని కొందరు చెప్పడం నాకు నచ్చదు. దాంతో నాకు సంతృప్తిలేదు. నాకు దాంతో సంతృప్తిలేదని నిర్మొహమాటంగానే చెపుతాను. మనను భారతీయులమనే భావనకు ఎలాంటి పోటీ ఉండకూడదని నా ఉద్దేశం. మతం నుండి పుట్టనీ, సంస్కృతి నుండి పుట్టనీ, లేక భాష నుండి పుట్టనీ, ప్రజలందరూ మొదటా చివరా కూడా భారతీయులుగా వుండాలని నేను కోరుతున్నాను. భారతీయులు తప్ప ఇంక ఏమీ కాకూడదు. కాబట్టి ఈ తీర్మానం ఈ ఆదర్శానికి పూర్తిగా వ్యతిరేకమైనది. అయ్యా, ఈ ఆదర్శాన్ని మనం చాలా జాగ్రత్తగా కాపాడుకోవాలి. కాని ఎక్కడైతే మనందరమూ భారతీయులమనే భావన ఇంకా పిండరూపంలో వుందో, ఫలించడం ప్రారంభమైందో, అక్కడ ఇతర విధేయతలను – సంస్కృతీ భావనను, జాతీయ భావనను ఒకే కాలంలో వృద్ధికానివ్వడం మనం చేయగల నేరాలలో అతి పెద్ద నేరమని నొక్కి చెపుతున్నాను. దాంట్లో నేను భాగం పంచుకోలేను. నేను గట్టిగా చాలా తీవ్రంగా ఈ తీర్మానాన్ని వ్యతిరేకిస్తున్నాను. (చప్పట్లు).



## 42

# అసెంబ్లీ విధానం*

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అయ్యా, ఈ సవరణకు సంబంధించి మొదటగా మీ దృష్టిని భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 73, సబ్-క్లాసు (2) వైపునకు మరల్చాలని నాకు వుంది. సెక్షన్ 73, సబ్-క్లాజు (2) దృష్ట్యా ఈ నిబంధన ఈ సభా పరిధికి వెలుపల వుంది. సెక్షను 73లో ఈ విధంగా వుంది :

"(1) ఆర్థిక శాసనాలకు సంబంధించి ఈ చట్ట భాగంలో వున్న ప్రత్యేక ప్రతిపాదనలకు లోబడి శాసనమండలి ఉన్న రాష్ట్రాలలో ఉభయ సభలలో దేనిలోనైనా బిల్లును ప్రవేశ పెట్టవచ్చు. సభ లేదా సభల వాయిదా కారణంగా ఒక రాష్ట్ర శాసన సభలో పెండింగులో వున్న బిల్లుకు కాలదోషం పట్టదు." కాబట్టి సెక్షను 72, సబ్-క్లాజు (2)లో ఉన్న నియమం దృష్ట్యా ఒక బిల్లుకు రెండు సమావేశాల అనంతరం లేక ఒక సంవత్సరం కాగానే గడువుతీరుతుందనీ కొత్తగా ఒక నిబంధన చేయడానికి ఈ సభకు అధికారం లేదని మనవి చేస్తున్నాను. గౌరవనీయ మిత్రుడు శ్రీ గుప్తే సవరణకు సంబంధించి అది నా మొదటి విన్నపం.

ఈ నిబంధన ఇంతకు ముందే ఈ సభ అంగీకరించిన 19వ నిబంధనకు అనుగుణ్యామైంది కాదని నా రెండో విన్నపం. 19వ రూలు ఏం చెపుతుందంటే -

"ఒక శాసన సభా సమావేశం వాయిదా పడినపుడు ప్రశ్నలకు సంబంధించిన నోటీసులూ, చట్టబద్ధ తీర్మానాలూ, నిబంధనల సవరణకు సంబంధించిన తీర్మానాలూ, తరువాత సమావేశంలో పరిగణించడానికై వాయిదా వేయబడ్డ తీర్మానాలూ - రూలు 34 క్రింద, అలాగే కొత్తగా ప్రవేశపెట్టిన బిల్లులూ తప్ప మిగతా పెండింగ్ నోటీసులన్నీ గడువు తీరిపోతాయి."

కాబట్టి బిల్లులకు సంబంధించిన తీర్మానాలు రూలు 19 వల్ల రక్షణ పొందాయి. సభ 19వ రూలును ఇప్పటికే అంగీకరించిన దృష్ట్యా 103వ రూలును గానీ లేక ఇప్పుడు సూచించబడిన సవరణను గానీ ఆమోదించలేదు.

మూడో విన్నపం, ఏమిటంటే ఈ నిబంధననూ, ప్రతిపాదించిన సవరణనూ ఆమోదించడానికి ఈ సభకు అధికారం వుందని అనుకున్నా - భారతప్రభుత్వ చట్టంలో 73 సెక్షను, సబ్-క్లాజు (2)

---

* బి.ఎల్.ఏ. చర్చలు, సంపుటి 4, పేజీలు 1062-65, సెప్టెంబరు 10, 1938.

వుందనే వాస్తవంతోను, ఇప్పటికే ఈ సభ 19వ రూలును అంగీకరించి ఉందనే వాస్తవంతోను నిమిత్తం లేకుండా కొత్త నిబంధన అనవసరమని అనిపిస్తున్నది. ఈ రూలు "ఏ తీర్మానం చేయనపుడు " అంటున్నది; "తీర్మానం" అనే పదానికి ఎక్కడా నిర్వచనం లేదు. ఈ బిల్లును కార్యదర్శి ప్రవేశ పెడితే తప్ప, ఎవరూ కూడా మరో తీర్మానాన్ని ప్రవేశ పెట్టలేరు. అంటే ఆ బిల్లు మొదట ఎజెండాలో వుండాలి. రెండోది అది ఆర్డరు పేపరులో కూడ వుండాలి. మూడోది, దాన్ని కార్యదర్శి ప్రవేశపెట్టాలి. కార్యదర్శి బిల్లును రప్పించకపోతే, బిల్లుకు ఇన్‌చార్జిగావున్న సభ్యుడు ఈ తీర్మానం వల్ల శిక్షార్హుడవుతాడు. అలా కారాదనేది నా మనవి; దీనిలో తప్పు ఏమీలేదు.

***గౌరవనీయ సభాపతి :*** ఇది ఇంచుమించు రూలు యోగ్యతలకు సంబంధించిన వాదన.

***డా॥ అంబేద్కర్ :*** నేను చెప్పింది అదే. ఇది మూడో పరిగణన. మొదటి రెండూ.......

***గౌరవనీయులైన సభాపతి :*** మొదటి రెండింటిని పూర్తి చేయనివ్వండి, తర్వాత యోగ్యతల మీద గౌరవనీయ సభ్యుడు వాదించవచ్చు.

రెండు పాయింట్లు లేవనెత్తారు. భారత ప్రభుత్వ చట్టంలోని 73వ సెక్షను దృష్ట్యా ఇలాంటి నిబంధన తయారుచేయడానికి ఈ సభకు అధికారం లేదనేది మొదటిది. ఈ అంశం నేను ఇంతకుముందే పరిశీలించాను. గతంలో రూలు 103ను పరిశీలించినపుడు గౌరవనీయుడైన ప్రధాన మంత్రి ఈ అభ్యంతరాన్ని సూచించారు. 73 సెక్షను సబ్-క్లజు (2) లో వున్నదేమంటే – సభ లేదా సభల వాయిదా కారణంగా పెండింగులో వున్న బిల్లు గడువు తీరిపోదు. దాని అర్థం, వాయిదా కారణంగా బిల్లు గడువుతీరదు. కాని వాయిదా తప్ప మిగతా కారణాల వల్ల బిల్లుల గడువు తీరదని కాదు. కొంత కాలమైన పిదప వాయిదా వున్నా లేకపోయినా, ఒక బిల్లు గడువు తీరుతుంది అనేది పొందుపరచాలని ఈ రూలు ఉద్దేశం. ఇందులో బహుశ సందేహానికి ఆస్కారం వుండేది, "రెండు పూర్తి సమావేశాలు" అన్న పదజాలం గాని ఉన్న సందర్భంలో కావచ్చు. కాని ఒక సంవత్సర కాలం అనే నిర్దిష్ట సమయాన్ని పొందుపరిచినపుడు ఈ రూలు క్రింద, ఇపుడు ప్రతిపాదించినట్లు, సమావేశం జరుగుతున్నా ఒక బిల్లు గడువు తీరిపోవచ్చు. కాబట్టి ఈ రూలులో ప్రతిపాదించినట్లు సమావేశాల వాయిదా ఒక బిల్లు గడువు తీరడానికి కారణం కాదు. యోగ్యతల గురించి నేను మాట్లాడడం లేదు. రాజ్యాంగ బద్ధమైన విషయాల గూర్చి మాత్రమే మాట్లాడుతున్నాను. ప్రతిపాదించబడిన ఈ రూలు చెప్పేదేమంటే – ఒక బిల్లు ఎజెండాలో ఉన్నప్పటికీ, సభ సమావేశంలో వున్నప్పటికీ ఒక సంవత్సరకాలం పూర్తి అయితే సమావేశం వాయిదాల పడకపోయినా బిల్లు గడువు మాత్రం తీరిపోతుంది. కాబట్టి సవరణ ప్రతిపాదన ప్రకారం ఈ నిబంధన రూపొందించడానికి 73వ సెక్షను లోని సబ్-క్లాజు (2) అభ్యంతరకరం కాదు.

రెండో అభ్యంతరం దేన్నిగూర్చి లేవనెత్తారంటే –

*డా॥ అంబేద్కర్ :* అయ్యా, ఒక వాస్తవాన్ని మీ దృష్టికి తీసుకొనిరానా? "మాత్రమే" అనే పదం వుండి వుంటే, మీరు చేయాలనుకొన్న నిర్మాణం సరిగా వుంటుంది అనేది నామనవి.

అయ్యా, ప్రతిపాదించిన సవరణ గురించి నేను మనవి చేయదలచింది ఇది : ఈ 103 రూలు చేయవలసిన అవసరం గురించి ప్రత్యేక కారణం ఏదీ వున్నట్లు నేను వినలేదు. చర్చించకుండా ఒక బిల్లు ఎజెండాలో వుంటే ఏమి నష్టం వుంటుంది? చర్చించకుండా సభా పుస్తకాలలో ఒక బిల్లు నిలిచివుంటే ఏదైనా హాని లేక ఇబ్బందీ వుందని చూపించగలిగితే, 103 రూలులో వున్న ప్రతిపాదనకు ఒక అవసరం వుందని నేను అర్థం చేసుకోగలను. కాని ఎలాంటి నష్టాలు, ఇబ్బందులు గురించి నేను వినలేదు. రెండో మనవి, ఈ రూలూ, ఈ సవరణా, ఒక సభ్యునికి తన పొరపాటు లేకపోయినా – బిల్లును కొనసాగించే హక్కును తొలగించేస్తాయి. పదజాలం ఏమంటే, "తీర్మానం ఏమీ చెయ్యకపోతే". అదీ వాళ్ళు వ్రాసింది. ఒక సభ్యుడు తీర్మానం పెట్టలేని స్థితిలో వుండొచ్చు అనేది నా మనవి. ఎందుకంటే, బిల్లు రాలేదని ఎజెండాలో లేదని, లేక అనేక ఇతర కారణాల వల్ల ఒక సభ్యుడు శాసన సభలో ఏదైనా విషయం ప్రతిపాదించడానికి అవకాశం తొలగించడం చాలా అభ్యంతరకరమైందని అనుకొంటున్నాను – కేవలం ఇతర కారణాల వల్ల, ఇతర అక్కరలవల్ల – ఆ బిల్లు గురించి దరఖాస్తు పెట్టలేక పోయినందుకు అతనికి ఆ యిబ్బంది కలిగించకూడదు. కాబట్టి "కార్యదర్శి పిలిచినప్పటికీ" లాంటి మరో సవరణ చేరిస్తే తప్ప ఈ రూలు గొప్ప ఇబ్బంది తెచ్చి పెడ్తుందనుకొంటాను. కాబట్టి ప్రస్తుత రూపంలో నేను ఈ సవరణను వ్యతిరేకిస్తున్నాను.

*గౌరవనీయ శ్రీ బి.జి. ఖేర్ :* అయ్యా, పరిస్థితి సంక్లిష్టంగా తయారయింది. ఎందుకంటే రూలు ప్రవేశ పెట్టినపుడుగానీ లేక తానిప్పుడు ప్రవేశపెట్టదలచిన సవరణతో సహా సవరణలన్నీ కమిటీలో పూర్తిగా చర్చించినపుడుగానీ గౌరవనీయ సభ్యుడు ఇక్కడ లేరు. కాబట్టి ఈ అభ్యంతరాలకు నేను సమాధానం చెప్పడానికి ముందు నాతో దీని గురించి చర్చించిన వారు చెప్పదలచిందేమిటో వినాలనుకుంటున్నాను. గతరాత్రే అందరూ ఈ సవరణను అంగీకరించారు. గౌరవనీయ సభ్యులు శ్రీ ఆలీ బహద్దూర్‌ఖాను అప్పుడున్నారు; ఆయన సభలో ఇలాంటి సవరణే ప్రవేశ పెట్టారు. ఆయన "అలా చేయడానికి పిలువబడ్డ" అనే పదాలు చేర్చారు. అది గౌరవనీయ సభ్యులు ఆలీ బహద్దూర్ ఖాన్ సవరణ. దాన్ని, అనేక ప్రతిపాదనల యోగ్యతను చర్చించాక ఇదే మంచి పరిష్కారమని చివరికి నిర్ణయానికి వచ్చాము. గౌరవనీయ సభ్యులు చూపించిన రాజ్యాంగ బద్ధమైన అభ్యంతరం కూడ మా మనసుల్లో వుంది. మా దురదృష్టమేమంటే గౌరవనీయ సభ్యులు అపుడప్పుడు మాత్రమే సభకు వస్తారు. ఇపుడు పరిస్థితి తెలియకపోవడం వల్ల, జరిగిన సంఘటనల వరుసక్రమాన్ని పట్టుకొనే స్థితిలో లేరు.కాబట్టి, తీర్మానమైన సవరణకు జోడించమని చూపించిన దాని యోగ్యతలపై మాట్లాడాలని నేను అనుకోవడం లేదు. ప్రస్తుత నిబంధనలకు ఈ నిబంధన చేర్చవలసిన అవసరానికి సంబంధించిన సూత్రాలు మాత్రం చెపుతాను. పాత నిబంధనల్లో అలాంటి ప్రతిపాదన ఉందని కూడ చూపిస్తున్నాను. ఏమంటే :

బాధ్యత తీసుకున్న సభ్యుడు రెండు వరస సమావేశాల్లో తీర్మానం తీసుకురాకపోతే ఆ బిల్లు రద్దవుతుంది. అయితే అసెంబ్లీ ఆ బిల్లు రద్దు కాకుండా స్పెషల్ ఆర్డర్ వేయవచ్చు.

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** పాత ఇండియా ప్రభుత్వ చట్టంలో అలాంటి నిబంధన లేనందువల్ల, నేను చెప్పినమాటలు సరైనవేనని గౌరవనీయ ప్రధాన మంత్రికి గుర్తున్నదా?

**అనువాదం :**

**డా॥ కె. ఆనందన్**



# 43

# పారిశ్రామిక వివాదాల బిల్లు*

*డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :* అయ్యా, సభాపతిగారూ ఈబిల్లు మొదటి పాఠాన్ని వ్యతిరేకించడానికి లేచాను. మాట్లాడడానికి లేచినప్పుడు నాకు ఉన్న ప్రతిబంధకాలు నాకు బాగా తెలుసు. ఈ ప్రతిబంధకాల మధ్యనే మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాను. ఈ బిల్లుపై ముందుగా మాట్లాడిన వారి ప్రసంగాలు వినడానికి ఇక్కడ నేను లేనందుకు విచార పడుతున్నాను. దురదృష్టకరమైన విషయం ఏమంటే ఆ పరిస్థితి నుంచి తప్పించుకోలేకపోయాను. నేను ఇక్కడ ఉండి ముందు మాట్లాడిన వక్తలు ఏఏ విషయాలు చెప్పారో తెలుసుకోవటానికి బయట నాకున్న పని నన్ను అంగీకరించలేదు. నాకంటే ముందు చాలా మంది వక్తలు మాట్లాడటం వల్ల, చర్చ చాలాసేపు కొనసాగి ఉండటం వల్ల కూడా నేను ఇప్పుడు మాట్లాడటం కష్టంతో కూడుకున్న పనిలా వుంది. పైగా ఈ దశలో ఇంకా చెప్పడానికి విషయాలు ఏమైనా ఉన్నాయా అన్న ఆశ్చర్యం కూడా కలుగుతోంది. అంత విశాలమైన, అంత సుదీర్ఘమైన స్వభావం కల్గి 84 క్లాజులతో, బిల్లులో చివర్లో మాట్లాడడానికైనా, చెప్పడానికైనా ఏదో కొంత మిగిలి వుంటుంది. గౌరవనీయ మిత్రులు, శ్రీ జమ్నాదాస్ మెహత చాలాచక్కగా వివరించారు; ఈ భూతలాన్ని కాగితంగానూ, సముద్రాన్ని సిరాగానూ గ్రహించి, శేషాయి ఈ బిల్లు గూర్చి వ్రాయడానికి పూనుకున్నా, మొత్తం బిల్లును పూర్తిచేయడానికి బహుశ ఆ వస్తువులు సరిపోవేమో! ఈ పరిమితులు తెలిసి నేను చాల సంక్షిప్తంగా చెప్పదలిచాను.

ఈ బిల్లును అర్థం చేసుకోవడానికి క్రితం శాసనం దృష్టిలో పెట్టుకొని ఈ బిల్లు ప్రతిపాదనలు చదవడం అవసరమని అనుకుంటున్నాను. క్రితం శాసనం ప్రతిపాదనలతో ఈ బిల్లు ప్రతిపాదనలను పోల్చి చూస్తే తప్ప అవి సరిగా గమనంలోకి రావనేది అందరూ అంగీకరిస్తారని నమ్ముతున్నాను 1934 బాంబే ట్రేడు డిస్ప్యూట్సు కన్సిలియేషన్ చట్టానికి ప్రత్యామ్నాయంగా దీన్ని ప్రవేశ పెట్టాలనే ఉద్దేశమున్న సంగతిని ఈ బిల్లులోని చివరి క్లాజు తేటతెల్లం చేస్తున్నది. ఇలా మార్పు తేదలచినపుడు, దీనికి బాధ్యులై బిల్లు ప్రవేశ పెట్టదలచిన ముఖ్యమంత్రి ఒక్క కేసు అయినా ఉదాహరణకు తీసుకొచ్చారా అనేది మొట్టమొదట పుట్టే ప్రశ్న, ఆలోచన. సమాధాన పరిచే యంత్రాగ అందించడం 1934 చట్టం ఉద్దేశం. 1934 చట్టం యొక్క మాత్రం స్వచ్ఛంద ఒడంబడిక. ఈ బిల్లు మార్పును ప్రవేశపెడుతుంది. ఆ మార్పు ఏమంటే సమాధాన పరచటం తప్పనిసరి. కాబట్టి 193

---

* బి.ఎస్. ఎ. చర్చలు సంపుటి 4, పే. 1330-59, తేది సెప్టెంబరు 15, 1938

చట్టంలో ఉన్న స్వచ్ఛంద ప్రతిపాదనకు తప్పని సరి స్వభావం కల్పించడానికి ఆధారమేదైనా చూపిస్తున్నారా? ఈ ప్రశ్న సభా[illegible]కైతే ఏమి ఉందని నేను మనవి చేస్తున్నాను.

1934 సంవత్సరాన్ని, ఆ సంవత్సరంలోని పరిస్థితులను ప్రమాణంగా తీసుకొని, నేను కొన్ని ముఖ్యమైన వాస్తవాలను మీ ముందు పెట్టాలని కోరుతున్నాను. సభ దృష్టికి తీసుకొని రాదలచిన మొదటి అంశమేమంటే, 1934 లో గౌరవనీయులు సర్ రాబర్ట్ బెల్ ప్రవేశ పెట్టిన ప్రాథమిక బిల్లులో తప్పనిసరి సమాధానానికి అవకాశం కల్పించారు. ఆ శాసనం తర్వాత చట్టమైంది. శాసనం ప్రవేశ పెట్టిన సమయంలో, ప్రాథమిక దశలో 1934 సంవత్సరంలో ఉన్న పరిస్థితుల వల్ల సమాధాన పరచే విషయంలో ఒత్తిడి అక్కరలేదని బిల్లు ప్రవేశపెట్టిన వారు అభిప్రాయపడ్డారు. పర్యవసానంగా స్వచ్ఛందంగా ఆయనే, బిల్లు మొదటి పాఠంలో, తన ప్రారంభోపన్యాసం మొదట్లోనే సవరణ తీసుకొస్తున్నట్లు ఒక ప్రతిపాదన పెట్టారు – 'తప్పనిసరి' కి బదులు 'కావచ్చు' అనే పదం చేర్చడం. 1934లో గౌరవనీయులు సర్ రాబర్ట్ బెల్ సమాధానపరిచే విషయంలో ఒత్తిడి అవసరంలేదని భావించిన దానికి అది నిదర్శనం అని నేను మనవి చేస్తున్నాను. ఆ బిల్లు ప్రవేశ పెట్టిన సమయంలో గౌరవనీయులైన నా మిత్రులు శ్రీ సక్లత్‌వాలా సభలో ఉన్నారు. వారు బొంబాయి మిల్లు సొంతదార్ల ప్రతినిధి. 1934 లో వారు కూడ సమాధాన పరచే విషయంలో ఒత్తిడి అవసరమని కోరలేదు. పైగా ఈ బిల్లును బలపరచడంలో ఉదాసీనత వహించారు. బిల్లు మొదటి పాఠం సమయంలో తన ప్రసంగంలో అలా చెప్పారు. వారు తీసుకున్న దృక్పథం అది. ఇక సమాధానపరచే విషయంలో ఒత్తిడి ఉండాలని కోరడం గానీ నొక్కిచెప్పడం గానీ ఏ మాత్రం జరగలేదు. స్వచ్ఛందంగా సమాధాన పరచడాన్ని ఒత్తిడితో సమాధాన పరచడంగా మార్పు చేయవలసిన అగత్యం 1934, 1938 సంవత్సరాల మధ్య ఏం వచ్చింది?

ఫలానా కేసు వల్ల ఒత్తిడి రూపం తీసుకొని రావాలనడానికి ముఖ్యమంత్రి సమ్మెలకు సంబంధించిన కొన్ని గణాంక వివరాలు చూపారు. దేశంలో అలాంటివి తరచుగా జరిగాయి కాబట్టి, వాటి తీవ్రప్రభావం బట్టి స్వచ్ఛంద అవకాశాన్ని ఒత్తిడితో కూడిన అవకాశంగా ఏర్పడిందంటున్నారు. ఈ సమ్మెలకు సంబంధించిన వివరాలను నేను పరీక్షించాను. వాటితో ప్రమేయమున్న పనివాళ్ల సంఖ్యను, నష్టపోయిన పనిదినాలను పరీక్షించాను. సమ్మెలకు సంబంధించిన వివరాల ఫలితంగా గౌరవనీయ ముఖ్యమంత్రి చెప్పాలనుకున్నదానితో నేను సమ్మతించలేనని చెప్పడానికి వెనుకాడడం లేదు. బొంబాయి నగరంలో జరిగిన సమ్మెల పట్ల మన దృష్టి సారిస్తే – లేబరు ఆఫీసు వారు ప్రచురించిన మార్చ్ లేబరు గజెట్ నా వద్ద వుంది. 541 వ పేజిలో బొంబాయి రాష్ట్రంలో జరిగిన సమ్మెల సంఖ్య ఉంది. మొదటి కాలంలో 1921, 1937 మధ్య ఏర్పడ్డ పారిశ్రామిక వివాదాల సంఖ్య ఇచ్చారు. రెండో కాలంలో అందులో పాల్గొన్న పనివారి సంఖ్య వుంది. మూడో కాలంలో నష్టపోయిన పనిరోజులు సంఖ్య వుంది. ఈ అంకెలు చూస్తే పారిశ్రామిక వివాదాలు ప్రతి సంవత్సరం పెరిగే బదులు తగ్గాయని ఎవరైనా తమంతట తాము గ్రహించగలరు. ఉదాహరణకు, 1921

మార్పు చేశాడన్న కారణాన

(d) సెక్షను 34 లో ఉదహరించినట్లు కేసు స్టేట్‌మెంట్‌ని రిజిస్ట్రారు అందుకునే ముందు, 28 సెక్షను ప్రతిపాదనల ప్రకారం మార్పు నోటీసు ఇచ్చిన కేసులలోనూ, అలాంటి మార్పునకు సంబంధించి అంగీకారం కుదరనప్పుడూ

(e) సమ్మెకు సంబంధించిన పారిశ్రామిక వివాదాల విచారణ ప్రారంభించిన కేసులలో, ఆ విచారణ పూర్తి అయ్యేలోపున

(f) అలాంటి వివాదం లేక అలాంటి రకాల వివాదానికి సంబంధించిన వినతి సెక్షను 43 క్రింద నమోదయిన కేసుల్లో, ఆ వినతి చట్టరీత్యా ఎత్తివేయనంత వరకు; లేక

(g) నమోదయిన సెటిల్‌మెంటు లేక అవార్డు నిబంధనలకు ఉల్లంఘనగా వుంటే

(2) ఏ పారిశ్రామిక వివాదానికి సంబంధించి సమాధానపరిచే విచారణ పూర్తి అయిన కేసులలో, ఆ వివాదానికి సంబంధించిన సమ్మె చట్టవిరుద్ధం – అంటే అది, అలాంటి విచారణ పూర్తయి రెండు నెలలు గడిచాక, ఎప్పుడు ప్రారంభించినా సరే" అపుడు ఈ క్లాజును సఫలం చేసే నిమిత్తం, చట్టబద్ధంకాని సమ్మెలలో పాల్గొంటున్నందుకు ఈ బిల్లు కొన్ని జరిమానాలు విధిస్తున్నది. ఆ క్లాజులు 66, 67. 66వ క్లాజు ఈ విధంగా అంటున్నది :

"ఫలాన సమ్మె చట్ట విరుద్ధమని పారిశ్రామిక కోర్టు తీర్మానించిన తర్వాత ఏ ఉద్యోగి అయినా సమ్మె చేసినా, సమ్మెలో పాల్గొన్నా విచారణ మీదట శిక్షార్హుడు; ఆరునెలల దాక జైలులో పెట్టవచ్చును, లేక జరిమానా వేయవచ్చును, జైలు శిక్ష జరిమానా – రెండూ వేయవచ్చును."

67 వ సెక్షను ప్రకారం :

"పారిశ్రామిక న్యాయస్థానం ఒక సమ్మె లేక లాకౌట్ ను న్యాయబద్ధం కాదన్న తర్వాత అలాంటి సమ్మె, లేక లాకౌట్ మొదలయినా కాకపోయినా ఎవరయినా దానిలో పాల్గొనడానికి ప్రేరేపించినా లేక ప్రవేశించేటట్లు చేసినా, సమ్మె కొనసాగడానికి ఎలాంటి చర్యతీసుకున్నా అలాంటి వ్యక్తి ఏ రకం శిక్షకైనా అర్హుడు; ఆరునెలలదాకా జైలు శిక్ష లేక జరిమానా లేక రెండూ పడతాయి."

వివరణ : " ఈ సెక్షను నిమిత్తం, సమ్మెలేక లాకౌట్‌కోసం ఎవరైనా విరాళాలిచ్చినా, వసూలు చేసినా, లేక డబ్బుకోరినా అతడు సమ్మెను లేక లాకౌట్‌ను కొనసాగించే పని చేసిన వాడి క్రింద లెక్క".

అయ్యా, ఈ ప్రసంగంలో నా మొదటి పట్టుదల ఆ వాదాన్ని ఖండించడం, ఆ స్థితిని నిరాకరించడం గురించి. నా స్థితిని స్పష్టం చేయడానికి నేను అసలు ప్రాథమిక ప్రతిపాదన నుండి మొదలు పెడతాను. మొదటిగా, సమ్మె అంటే ఏమిటో స్పష్టం చేయనివ్వండి. దాని అర్థం ఏమిటి?

'సమ్మె' అనే పదం అర్థం చేసుకోవడం మేలనుకుంటున్నాను. సామాన్యమైన అర్థంలో సమ్మె అంటే పని ఒప్పందాన్ని భగ్నం చేయడం తప్ప ఏమీకాదు. ఒక శ్రామికుడు సమ్మెచేస్తే, దాని అర్థం అతడు పని ఒప్పందాన్ని భగ్నం చేశాడన్న మాట. అంతకంటే ఏమీ కాదు. నేను లేవదీసే తరువాతి ప్రశ్న ఇది: ఇండియా స్టాట్యూట్ పుస్తకంలో ఉన్నట్లు ఈ పని ఒప్పందం, చట్టప్రకారం ఎలా వ్యవహరిస్తారు. సమ్మెహక్కును ఇండియా చట్టం అంగీకరిస్తుందా లేదా? అంగీకరిస్తే ఏ విధంగా! శిక్షిస్తే ఏ విధంగా శిక్షిస్తుంది. ఇక్కడ కూడ ప్రాథమిక విషయంతో మొదలుపెడతాను. అదేమంటే : ఒకటి చేయడంగాని, ఒకటి చేయకపోవడంగానీ సాధారణ తప్పు కావచ్చు, నేరం కావచ్చు. నేను లేవనెత్తే మొదటి ప్రశ్న – ఈ విషయాన్ని సమగ్రంగా చూడాలనుకుంటున్నా. మొదటి ప్రశ్న ఇది: పని ఒప్పందం ఉల్లంఘించడం సాధారణ తప్పిదమా? చట్టం చెప్పే సమాధానం : అవును, సాధారణ తప్పిదం. సాధారణ తప్పిదం వల్ల నష్టపోయిన మనిషికి పరిహారం ఏమిటి? అది తర్వాత ప్రశ్న. దానికి కూడ ప్రస్తుత చట్టం రెండు పరిహారాలు సూచిస్తుంది. నష్టపోయిన మనిషికి నష్టం పూడ్చమనీ మరియు ప్రత్యేక సదుపాయము కల్పించడము. చట్టం నష్టం పూడ్చడమూ, ప్రత్యేక సదుపాయము కల్పించినా, సివిల్ తప్పిదం ఉన్నచోట కంట్రాక్టు పనికి సంబంధించిన ఒక ప్రొవిజను ఉంది. పనిఒప్పందం ఒక మనిషి భగ్నం చేసినపుడు నష్టపడ్డ పార్టీకి నష్టం పూడ్చడం వరకే ఉంది; అతను ప్రత్యేక సదుపాయం కోరలేడు. కోర్టు ప్రత్యేక సదుపాయం ఇవ్వలేదు. తాను అంగీకరించిన పనిని చేసిపెట్టమని బలవంతం చేయగలడు.నష్టపోయినివానికి నష్టపరిహారం పొందడం వరకే. సివిల్ తప్పిదానికి సంబంధించి కంట్రాక్టు చేసినపుడు ఉన్న ప్రొవిజన్ అది. ఈ సివిల్ తప్పిదానికి యజమాని ఈ నష్టపరిహారానికి మించి ఏమీ పొందలేడు.

పని ఒప్పందాన్ని ఇలా భగ్నం చెయ్యడం చూసినపుడు కలిగే ప్రశ్న ఏమంటే, ఇది శిక్షార్హమైన నేరమా? ఒప్పందం భగ్నం చేయడానికి సంబంధించి ఇండియా చట్టంలో ఉన్న ప్రొవిజన్ ఏమిటి? అయ్యా, విస్పష్టం చేయడానికిగాను, ఈ విషయాన్ని చట్టం ఎలా చూస్తుందో కాస్త చరిత్ర సభ దృష్టికి తీసుకురావడం అవసరం. పని ఒప్పందం భగ్నం కావడాన్ని మొట్టమొదట వ్యవహరించిన ఇండియా చట్టం, 1859వ సంవత్సరపు 13వ చట్టం దాన్ని వర్కుమన్స్ బ్రీచ్ ఆఫ్ కంట్రాక్టు యాక్టు అంటారు. మ్యూటినీ అయిన వెంటనే లేక మ్యూటినీ జరుగుతున్న రోజుల్లో 1859 లో పాసయింది. ఇది ఎందుకు శాసనమైందో ఇపుడు సభకు తెలియపరుస్తాను. పనిఒప్పందాన్ని భగ్న పరచడం నేరమని భావించి చేసిన ప్రొవిజన్లు ఇండియన్ పెనల్ కోడులో అప్పుడూ కొన్ని ఉన్నాయి. అవి 490, 491, 492 సెక్షన్లు. 1859 13వ చట్టానికి సంబంధించినంతవరకూ, దాని అమలు పరిమితం. అది శిల్పులకూ, చిత్ర కారులకూ సంబంధించింది. శిల్పులూ చిత్రకారులూ యజమానులనుండి ముందుగా రొఖ్ఖంతీసుకుని, తర్వాత వాళ్లు అంగీకరించిన కాంట్రాక్టులను నెరవేర్చని కేసుల్లో దాన్ని అమలుచేశారు. పరిస్థితుల అవసరాన్ని బట్టి దాన్ని పెట్టారు. బ్రిటీషు ప్రభుత్వం తిరుగుబాటు నెదుర్కోవలసివచ్చింది. తిరుగుబాటు జరుగుతున్న కాలంలో సైన్యం

చాలా మంది శిల్పులను, చిత్రకారులను నియమించింది. వాళ్లకు అడ్వాన్సులు ఇచ్చింది. ఒప్పుకున్న పనిచేస్తారని ఆశించారు. భయంవల్లో, మరో పరిస్థితులవల్లనో ఆ శిల్పులు – చిత్రకారులు తమ ఇళ్లకు వెళ్లి పోయారు. అడ్వాన్సులు తీసుకున్నా ఒప్పుకున్న పని చేసే స్థితిలో వాళ్లులేరు. ఆ కేసును పరిధిలోకి తీసుకోడానికి గాను 1859 చట్టం అమలుచేశారు. ఈ చట్టం పని ఒప్పందభంగాన్ని నేరంగా చేసింది. ఆ చట్టం ఉన్నా దాని అమలు మాత్రం చాలా అరుదుగా ఉన్నట్లు రికార్డు పూర్వకంగా వుంది. ఆ చట్టం క్రింద ప్రజలు బాధపడలేదు. ఆ లెక్కలో అది చట్టంకాదు. అయ్యా, దాని తర్వాత చరిత్ర కూడ ఆసక్తికరంగా వుంటుంది. 1859 నుండి అది సూత్రప్రాయంగా ఉంది. నేను చెప్పినట్లు దాన్ని అమలులో పెట్టలేదు. దాన్ని ఇండియా ప్రభుత్వం 1920 లో 12వ చట్టం ద్వారా సవరించింది. ఈ చట్టంలో సవరణ చట్టం రెండు ఆరోగ్యకరమైన సూత్రాల్ని ప్రవేశపెట్టింది. ఈ చట్టంలో ప్రవేశపెట్టిన ఒక ఆరోగ్యకరమైన సూత్రమేమంటే ఒప్పంద భగ్నం చేసిన చిత్రకారుని శిక్షించేముందు కాంట్రాక్టు యొక్క న్యాయస్థితిని పరిశీలించే అధికారం మేజిస్ట్రేటుకు ఇవ్వబడింది; ఎందుకంటే కాంట్రాక్టు న్యాయబద్ధంగా లేదని మేజిస్ట్రేటు నిర్ణయానికి వస్తే తిరుగుబాటు చేసిన పనివాణ్ణి శిక్షించే అధికారం మేజిస్ట్రేటుకు లేదు, యజమానినుండి అడ్వాన్సు తీసుకొనివున్నాసరే. 1920 చట్టంలో ప్రవేశ పెట్టిన మొదటి మార్పు ఇది. ఇక రెండో మంచి విషయమేమంటే తప్పుడు ఆరోపణ తెచ్చిన యజమానిని శిక్షించే అధికారం కూడ మేజిస్ట్రేటుకు ఇవ్వబడింది. ఇది మూల చట్టంలో లేదు.

ఇండియా పీనల్ కోడ్ సెక్షను విషయాలకు వస్తే, నేను ఉదహరించిన మూడు సెక్షన్ల చరిత్ర ఆసక్తి దాయకమైంది. 490వ సెక్షను ప్రయాణంలో గానీ నౌకాయనంలోగాని ఉండగా పనిఒప్పందాన్ని భగ్నం చేయడం గూర్చి చెపుతుంది. ఆ సెక్షను అమలుకు చాలా పరిమితులున్నాయి. ఈ చట్టం అన్ని పని ఒప్పందాలకు సంబంధించింది కాదు. అది సముద్ర యానంలో లేక ప్రయాణంలో ఉన్నవారికి సంబంధించింది. సముద్ర యానం చేసేవారి విషయంలో ఇలాంటి మినహాయింపుచాలా అవసరం. ప్రయాణం యొక్క భద్రత తీరు విజయం వాళ్ల పని మీద ఆధారపడి వుంటుంది. మరొకటి 491 సెక్షను; నిస్సహాయులైన మనుషులకు కావలసిన వాటిని అందించేపనికి సంబంధించిన అటెండెంట్ కంట్రాక్టును భగ్నం చేయడం గూర్చి ఇది వ్యవహరిస్తుంది. ఉదాహరణకు నిస్సహాయంగా ఉన్న ఒక బిడ్డ యొక్క జాగ్రత్తచూసే ఆయాకు వర్తిస్తుంది. కుంటివాడై తనకుతాను చూసుకోలేని మనిషికి కావలసినవి అందజేసే పనితీసుకున్న సేవకుడికి వర్తిస్తుంది. అదీ సెక్షను 491. దూరదేశంలో సేవ చేసే నిమిత్తం యజమాని తనఖర్చుల మీద సేవకుని పంపే కంట్రాక్టు భగ్నం చేయటాన్ని గూర్చి 492 సెక్షను వ్యవహరిస్తుంది. ఇండియన్ పీనల్ కోడ్ అమలులోకి వచ్చినపుడు శాసనం చేయబడ్డ మూడు ప్రొవిజన్లు ఇవి. అయ్యా, శాసనం చేయబడ్డప్పటినుంచి వాటి చరిత్ర ఏమిటి? ఆచరిత్ర ఇది : 1925 చట్టం III ద్వారా కేంద్ర శాసనసభ 490, 492 సెక్షన్లు కొట్టివేసింది. ఆ సెక్షన్లు ఇక అమలుకావు. వాటి క్రింద నేరంగా పరిగణింపబడ్డ ఒప్పందభగ్నం నేరాలు కానేకావు. ఇక

ఇండియన్ పీనల్ కోడులో మిగిలిన ఒకే ఒక సెక్షను 491. ఇండియాలో ఇప్పుడున్న చట్టం ప్రకారం, నష్టపరిహారం కాకుండ నేర పర్యవసానం కల్గించే ఒకే ఒకసేవా ఒప్పంద భగ్నం 491 వ సెక్షను. నిజానికి అది నిస్సహాయుడై తనను తాను చూసుకోలేని వ్యక్తి విషయంలో ఉద్దేశింపబడింది; అది తెలిస్తే ఏ సభ్యుడు కూడ దీన్ని దురాక్షేపణ చేస్తాడని నేననుకోను.

అయ్యా, ఇపుడు నేను చెప్పిందంతా. సేవా ఒప్పందం భగ్నం చేయడంలో ఇమిడివున్న న్యాయపరమైన స్థితిని దృష్టిలో ఉంచుకుని చెప్పాను, అదే "సమ్మె" అనే పదం యొక్క సర్వసామాన్య వివరణ అని నేను అంటున్నాను. ఇప్పుడు దాని స్థితిఏమిటి? ఇదీ – సేవా ఒప్పందం భగ్నం చేయడం నేరం కాదు. సెక్షను 491 క్రిందికి వస్తే తప్ప, ఇండియా చట్టం క్రింద అది శిక్షార్హం కాదు. అంటే అది కేవలం సివిల్ తప్పిదం; అది నేరం కాదు. పైగా దాని పరిహారం నష్టం భర్తీ చేయడమేగాని, ప్రత్యేక చర్య ఏమీలేదు. నేను నొక్కి చెప్పదలచుకొంది అది. తన చేతుల్లో ఉన్నంత వరకూ సభ తీవ్రంగా పరిగణించగలదని నేను గాఢంగా అనుకుంటున్నా. నా ప్రశ్న ఇది : సేవా ఒప్పంద భగ్నం నేరంగా ఇండియా చట్టం ఎందుకు పరిగణించలేదు? ఇండియా చట్టం ఎందుకు ప్రత్యేక చర్యను ప్రతిపాదించలేదు? సభలో ఇతర సభ్యులు ఏ సమాధానం చెప్పినా, నా సమాధానం చాలా సరళమైంది. నా సమాధానం ఇదీ. ఇండియా శాసన మండలి పని ఒప్పందం భగ్నం చేయడం నేరంగా ఎందుకు పరిగణించ లేదంటే, నేరంగా చూడటమంటే ఒక మనిషిని తన ఇచ్ఛకు విరుద్ధంగా పనిచేయమని ఒత్తిడి చేయడం అనేది అతణ్ణి బానిసగా చేయడమే. (వినండి, వినండి) కాబట్టి సమ్మెను శిక్షించడమంటే, పనివాణ్ణి బానిసగా చేయడం కన్నా ఏమీ తక్కువది కాదు. బానిసత్వం అంటే ఏమిటి? అమెరికా సంయుక్త రాష్ట్రాల చట్టంలో నిర్వచించినట్లు, బానిసత్వమనేది ఇష్టంలేని చాకిరీ కన్నా వేరే కాదు. ఇది ఇష్టంలేని పరిచర్య. ఇది నీతి విరుద్ధమైంది, ఇది న్యాయానికి విరుద్ధమైంది. అయ్యా, ఇండియన్ పీనల్ కోడ్ రూపొందించిన వారు నేను ఉదహరించిన సెక్షన్లు అనగా 490, 491, 492 పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపారు; ఆ విషయం ఈ ముఖ్యసూచిక (Head-Note) వల్ల గమనించాను. వాళ్ళు మనస్సాక్షిగా పరితాపం చెందారు. 19వ అధ్యాయం గురించిఇండియన్ పీనల్ కోడు కర్తలు చెప్పింది ఇది. ఆ అధ్యాయం శీర్షిక ఇది : "నేరపూర్వకంగా సేవా ఒప్పందం భగ్నం కావడం గూర్చి" :

"గొప్ప న్యాయవేత్తల సంస్థ ఆలోచనతో మేము అంగీకరిస్తున్నాము; సామాన్యంగా కేవలం ఒప్పంద భంగం నేరం కాజాలదు, పౌరసంబంధ చర్య క్రిందికి వస్తుంది. ఈ సామాన్య సూత్రానికి కొన్ని మినహాయింపులున్నాయి. కొన్ని ఒప్పంద భగ్నాలు చెడుగా వుండే వున్నాయి. అటువంటి సమయాల్లో సామాన్య నష్టపరిహారం పనిచేయదు, అధిక నష్టపరిహారం పనిచేయగలదు. అవి చేసే కొందరి వ్యక్తుల నుండి ఎలాంటి నష్టపరిహారం పొందడమూ చాలా అసాధ్యం. అలాంటి కంట్రాక్టు ఒప్పంద భగ్నాలు నేరశాసనం క్రిందికి వస్తాయని మేము అభిప్రాయపడుతున్నాము".

శిక్షార్హమైన తగిన వివిధ విధాలుగా పనిచేయకపోవడాలను విస్తృతంగా పరిశీలించిన మీదట,

శిక్షించడానికి వీలయినవి మూడు ప్రతిపాదనలు మాత్రమేనని కనుగొన్నారు. వాటిని నైతిక సూత్రాలకూ న్యాయసూత్రాలకూ బద్ధమైనవిగా కనుగొన్నారు. ఇంతకంటే ఏమీలేవు.

అయ్యా, సమ్మెహక్కు అంటూ ఏమీలేదని చెప్పి వున్నారు. సమ్మె అంటే ఏమిటో తెలియని మనిషినుండే ఇలాంటి ప్రకటన వస్తుందనేది నా సమాధానం. కంట్రాక్టు ఒప్పందం భగ్నం చేయడం తప్ప సమ్మె అంటే మరేమీ కాదు; ఈ నా యొక్క అర్థాన్ని సభ్యులు గ్రహించడానికి సిద్ధమయితే, స్వేచ్ఛకై వుండే హక్కే సమ్మెకు మరో పేరు. ఇదేదో చక్రవర్తుల దివ్య హక్కులాగా వుందని ఒకరకమైన హేళన కుమ్మరించడానికి చూశారు. అయ్యా, ఒక కవితా పదజాలమో లేక ఒక చిత్తరువు వర్ణనో ఒక వాదాన్ని కాదనలేదని మాత్రం నేను సమాధానం చెపుతాను. అలాంటి ఫలితం నేనెక్కడా చూడలేదు. – న్యాయస్థానాల్లో అసలే చూడలేదు. స్వేచ్ఛ హక్కు దైవికమైందని భావిస్తా. (వినండి, వినండి) నేను ఇంకా ముందు కెళ్లి చెప్పేదేమంటే – పదిమందిగానీ, ఇరవైమందిగానీ, రెండువందల మందిగానీ ఒకేసారిగా సమ్మె ప్రకటించారన్నంతమాత్రాన, చట్టానికి సంబంధించి నంతవరకు దానివల్ల పరిస్థితిలో ఎలాంటి మార్పు రాదు.

అయ్యా, కొందరు 120 ఎ సెక్షను, ఇండియన్ పీనల్ కోడ్‌ను చూపిస్తారని నాకు తెలుసు. ఈ విషయం చివర్లో దాన్ని కూడ నేను ప్రస్తావిస్తాను. అయ్యా ఇండియన్ పీనల్ కోడ్ 120 ఎ సెక్షను కుట్ర గురించి వ్యవహరిస్తోంది. పనివాళ్లముఠా చేసేసమ్మె ఒక కుట్ర కాబట్టి సమ్మెహక్కులేదని అవలి పక్షంవారు వాదించాలనుకుంటే, నాకది విచిత్రంగా వుంది. అలా అనుకునేట్లయితే, ఎదుటి పక్షంలో ఉన్న పెద్ద మనుషులను, సమ్మె అంటే కుట్ర అని రుజావు చెయ్యమంటున్నాను; ఎందుకంటే పనివాళ్ల ముఠాకు సమ్మెజేసే హక్కులేదని చెప్పడానికి 120 ఎ సెక్షను మీద ఆధారపడుతున్నారు. సమ్మె ఒక కుట్ర అని నిరూపిస్తేగాని సెక్షను 120ఎ వర్తించదు. సమ్మె కుట్ర కాదని నేను గట్టిగా భావిస్తున్నాను.

***ఒక గౌరవనీయ సభ్యుడు :*** అది వర్తిస్తుందని ఎవరన్నారు? ప్రజోపయోగమైన విషయం అది.

***డా॥ అంబేద్కర్ :*** ప్రజోపయోగం అనేవిషయానికి నేను వస్తున్నాను.

అయ్యా, దురదృష్టవశాత్తు ఇండియాలో నిర్ణయాత్మక కేసులు లేవు. సమ్మె ఒక కుట్ర అనే భూమికపై సమ్మెదారులను 120 ఎ సెక్షను క్రింద నిర్బంధించిన కేసు నాపరిశోధనలో ఒక్కటీ లభించలేదు. కాని ఆంగ్లేయుల చట్టంలో నాకు కొంత ఊతం లభించింది. సమ్మెను కుట్రలో భాగంగా వ్యవహరించిన ఉదంతం. స్లోసర్ రాసిన పుస్తకం "ట్రేడు యూనియన్ల చట్ట పరిస్థితి" నుండి సభవారికి ఒక చిన్న భాగం నుండి 76 వ పేజీ చదువుతున్నాను.

"శ్రామికుల పరిస్థితులు మెరుగు పరచడానికి గాను సమ్మెలు, అలాంటి అసమ్మతి ప్రకటనలు వాటంతటకి అవి సామాన్య చట్టరీత్యా అన్యాయాలు కావు. ఇంగ్లాండు చట్ట ప్రకారం సమ్మెలు కనపడేరూపంలో చట్ట విరుద్ధమైనవనిగానీ న్యాయసమ్మతం కాదని గానీ ఆధారం లేదు. అరుదైన

కేసులున్న మాట నిజం. అంటే కార్మికుల పరిస్థితులు మెరుగు పరచడానికి చేసే సమ్మేళనాలు సామాన్య చట్టం క్రింద చట్టవిరుద్ధంగా వున్నాయి. కాని కోర్టులు ఆ చట్టాన్ని అలా అంగీకరించలేదు. ప్రసిద్ధ న్యాయవాదులు తద్వ్యతిరేకంగా అభిప్రాయాలు వ్యక్తం చేశారు. 17,18 శతాబ్దాలలో మొత్తంగా కార్మికుల స్థితిగతులు పెంచే సమ్మేళనాలు సామాన్యచట్టానికి వ్యతిరేకమైనవిగా భావించలేదు. శాసనమండలి చట్టాలేవీ కూడా కార్మిక శ్రేయస్సును మెరుగు పరిచే ప్రయత్నాలను నిరోధిస్తూ ప్రకటించడం గానీ, సామాన్యచట్టం మీద ఆధారపడటంగాని చేయలేదు. రెక్స్ V మాబే లో గ్రోసె, జె. సూత్రం మనం అంగీకరిస్తే, 1925 కాంబినేషన్ యాక్టు ద్వారా శాసనసభ అన్ని చట్టాలు ఊడ్చేసి తర్వాత దాక ఆ సూచించిన ప్రతిపాదనను బలపరచే న్యాయపరమైనవి ఏవీలేవు. సామాన్య చట్టం గురించిన నిర్ణయాలు చాలా అనుమానాస్పదంగా చూడాల్సి వుంది. ఈ మధ్య కాలంలోనే అది కన్పించింది, ఆ నిర్ణయాలు పూర్వం అంగీకరింపబడ్డ సూత్రం మీద ఆధారపడ్డాయి. 1824 నుండి అధికార ప్రాబల్యం ఈ సూత్రానికి వ్యతిరేకంగా వుంది."

ఇది తీర్పులో చాలా ప్రధానమైంది :

"అన్యాయప్రదమైన మార్గం ద్వారా అన్యాయప్రదమైంది సాధించడానికిగానీ, న్యాయప్రదమైంది సాధించడానికి గానీ, కార్మికులు తమ రక్షణార్థం కలిసిఉండే హక్కు ఉందనేది స్పష్టం. అలాంటి కలిసి ఉండడం వల్లవచ్చే లాభం చట్టం ద్వారా పొందేటట్లుండాలి. శ్రమ, నిబంధనల విషయంలో ఎన్నుకొనే అధికారం మనిషి అమలు చేసుకునేటట్లు ఉండాలి."

నేను నొక్కి చెప్పాలనుకొనే అంశం ఇది :

"కావలసిన నిబంధనలు తక్షణ ఉద్దేశం పొందే నిమిత్తం ఒంటరిగా ప్రకటించవచ్చు, సంప్రదింపుల తర్వాత చాలా మంది కలిసికట్టుగా చేయవచ్చు, ఒకేసారిగా వాళ్లు కోరుకున్న తీరులో ప్రకటించుకోవచ్చు; అంతేగాక చట్టరీత్యా కార్యాచరణలో దిగవచ్చు.

సమ్మెనిర్వహణ తప్పనిసరిగా చట్టవిరుద్ధంగా ఉండనవసరంలేదు. సమ్మె జరిగితే, ఒప్పందభగ్నం అయితే, భగ్నమైన కాంట్రాక్టు వ్యవధి అయిపోయివుంటే, ప్రస్తుత కాంట్రాక్టు అయిపోగా కొత్త నిబంధనలలో కొత్త కాంట్రాక్టులో చేరడానికి ఇష్టపడక, కొత్త కాంట్రాక్టు అయిపోయాక కార్మికులను బలపరుస్తూ సమ్మె నిర్వహించిన వారు ఏమీ చట్ట విరుద్ధంగా చేసినట్లుకాదు.

కలిసి ఉండటాలు అంటే అవి."

సభాదృష్టికి తీసుకొని రావాలన్న అంశం ఇది. ఎందుకంటే దీనికి సెక్షను 120 A ఇండియన్ పీనల్ కోడు మీద ప్రత్యక్ష ఆధారం వుంది. "కలిసి ఉండే ఉద్దేశ్యం హాని కరమైనపుడు, దేనిఫలితం ఇతరులకు హాని అవుతుందో అది న్యాయవిరుద్ధం కావచ్చు." "హానికలిగించే ఉద్దేశ్యంతో కలిసిఉండటం" అనే పదాలు" :

"హాని జరిగితే, చర్య కుట్ర సంబంధమై ఉండొచ్చు. ప్రతివ్యక్తి విషయంలోనూ నిర్ణయించాల్సిన ప్రశ్న ఏమంటే – సిద్ధించిన హాని ఎంత వరకు న్యాయసమ్మతమైన కలయికకు తోడ్పడేదిగా వుందో, హాని నిమిత్తమై కలయిక ఎంతవరకు ఏర్పడిందో?"

సమ్మె ఉద్దేశం హానిచేయడమే అనేది రుజువు చేయడం విచారణలో చాలా అవసరం; అపుడుగాని సమ్మెను 120 A సెక్షను క్రిందికి తీసుకొని రాలేము అనేది నా మనవి. ఒకవేళ సమ్మెవల్ల కేవలం హానిజరిగివుంటే, అంతమాత్రాన అది 120 A సెక్షను క్రిందికి అన్యాయప్రదమైందిగా రాదు. కాబట్టి ఈ బిల్లు ద్వారా సమ్మెను శిక్షించడం శ్రామికుల్ని బానిసత్వస్థితికి దిగజార్చడం తప్ప మరొకటికాదు అనేది నా ఉద్దేశం.

నా నిర్ణయం ప్రకారమయితే, ఈ బిల్లును ఈ పేరుతో పిలవాలి; "కార్మికుల హక్కుల నిలిపివేత చట్టం ( The Workers' Civil Liberties Suspension Act)" అది దానికి సరైన శీర్షిక అవుతుంది. సస్పెన్షను (నిషేధం) రెండు నెలలు మాత్రమే కదా అనే అభిప్రాయం కొందరికి వుంది. వ్యవహారాలు సద్దుమణిగాక నిషేధ ఉత్తర్వులు రద్దవుతాయి. ఆ తర్వాత కావాలంటే పనివాళ్లకు సమ్మెచేసే స్వాతంత్ర్యం వస్తుంది. నా ఉద్దేశం ప్రకారం ఈ బిల్లులో ప్రతిపాదనలు అమలులోకి వచ్చినపుడు నిరంతర బానిసత్వం కలిగిస్తాయి. కార్మికులు సమ్మెచేయడం జరగదు. ప్రతి పాదనలు చూడండి. బిల్లు అమలుకు వచ్చాక, ఒక సంవత్సరంపాటు అసలు సమ్మెలు ఉండరాదని మొదటి ప్రతిపాదన. ఆ పరిస్థితుల్లో ఒక సహేతుక కార్మికుడు అంగీకరించవచ్చా, లేక ఒకలాంటి పరిస్థితుల్లో ఏ సహేతుక కార్మికుడూ అంగీకరించకపోవచ్చు. ఎందుకంటే ఒక సంవత్సరంపాటు పూర్తిగా బానిసత్వం వుంటుంది. శ్రామికులు రెండో షెడ్యూలులో ఉన్న నిబంధనలకు ఒప్పుకోవలసి వుంటుంది. తప్పుకోవడానికి వీల్లేదు, ఉండేప్రదేశం నుండి దూరం వెళ్లే వీలులేదు. మొదటి సంవత్సరం కాగానే ఏమౌతుంది? జరిగేది ఇదిః నోటీసు ఇవ్వాల్సివుంటుంది; దానికికొంత వ్యవధి పడుతుంది, ఆలోపుగా సమ్మె చేయడానికి లేదు. నోటీసు ఇచ్చాక, సమాధానం రావడానికి కొంత సమయం పడుతుంది. ఆ సమయంలో సమ్మెచేయడానికి లేదు. ఇక మధ్య వర్తిత్వ వ్యవహారాలు మొదలవుతాయి. అవి రెండు నెలలు పట్టవచ్చు. అదయినా పార్టీలు సమంజసంగా వుండి, అదృష్టవంతమైనవయితే బిల్లు ప్రకారం ఆ సమయం నాలుగు నెలలదాకా పెరగవచ్చు. కాబట్టి కార్మికునికి కష్టాలు మొదలయి సరిగ్గా 4 నెలల 25 రోజులు – నా లెక్కతప్పయితే సరిచేయండి. ఎందుకంటేనేను వివరాల్లోకి వెళ్లలేదు – కార్మికుడు ఏం చేయడానికి వీల్లేదు. అతడు మాట్లాడకూడదు, ప్రసంగం చేయరాదు, సమైక్యంకాకూడదు, ఏమీ చేయకూడదు. ఈ కాలంలో కూడగట్టుకోవడం, మాటగాని, ఉపన్యాసం గాని, క్రియగాని శిక్షార్హం. ఈ 4 నెలలు 25 రోజుల్లో సమాధాన పడటం కుదరలేదనుకో, – పరిణామవ్యవధి ఎక్కువగా ఉందని మనవి చేస్తున్నా – ఏం జరగనుంది? సమాధానపరచే ప్రయత్నం విఫలమయిన రెండు నెలలకు గాని కార్మికుడు సమ్మె చేయడానికి లేదు. ఈ బిల్లు ప్రవేశ పెట్టిన గౌరవనీయ మిత్రుడేమనుకుంటున్నారో, నాకు తెలియదు; రెండు

నెలలు చాలనుకుంటున్నారేమో, విడిపోయిన కార్మికులను కూడ గట్టుకోవడానికి! కార్మిక క్షేత్రంలో నేను చురుకైన శ్రామికుణ్ణి నేను క్షేత్రంలో పని చేసేవాడిని అనుకోవడంలేదు. సమ్మె నిమిత్తం పనివాళ్లను కూడగట్టుకొనేవానికి ఉండే ఇబ్బందులేమిటో నాకు తెలియవు కాని, బొంబాయి నగరంలో పరిశీలకునిగా నా అనుభవాన్ని బట్టి చూస్తే, రెండు నెలల కాలం ఏ మాత్రమూ చాలదు; అందులో సందేహం ఎంత మాత్రమూ లేదు; 4 నెలలు 25 రోజులు అలా దూరంగా ఆపబడ్డ కార్మికులు సమ్మెచేయడానికి శక్తులన్నీ కూడగట్టుకోడానికి సరిపోనే సరిపోదు. రెండు నెలల్లో సమ్మెచెయ్యకపోతే ఏమౌతుంది? జరిగేదేమంటే, చట్టప్రకారం పరిస్థితిని వాళ్లు అంగీకరించినట్లు చట్టం భావిస్తుంది. వాళ్లు మళ్లీ పైకిలేస్తే, కొత్త ఇబ్బందులు తలెత్తితే, మళ్లీ 4 నెలల 25 రోజులు ఆగవలసిందేనని చట్టం చెపుతుంది. మళ్లీ సంప్రదింపులు మొదలు పెట్టాల్సిందే అంటుంది. మేము ఏం చేస్తామో ఆగిచూడండి. 4 నెలలు 25 రోజులు ఆగిచూడండి. 4 నెలల 25 రోజులకు ఏమీ జరగకపోతే, మీకు సమ్మె చేయాలని వుంటే, రెండు నెలల లోపున చెయ్యండి. చెయ్యకపోతే రెండు నెలలతర్వాత బాధలు పుడితే, మళ్లీ 4 నెలల 25 రోజులు వేచి ఉండాలి. అయ్యా, అలాంటి అంతంలేని నిషేధాల చక్రం పూర్తి బానిసత్వాన్ని కల్గించదా, నిరంతర బానిసత్వాన్ని తెచ్చిపెట్టదా, అన్ని కులాలకు పనివాళ్లను బానిసత్వంలో వుంచదా? ఇది తెలుసుకోవాలని వుంది. బానిసత్వం కల్గించేది ఈబిల్లుగాకపోతే, ఇంక ఏ బిల్లు వుంటుంది? సమ్మెకు సంబంధించిన ప్రతిపాదనలను గూర్చి ఇంత వుంది.

అయ్యా, 1929 పారిశ్రామిక వివాదాల చట్టంలోని ప్రతిపాదనలతో ఈ బిల్లులో సమ్మెకు సంబంధించినవాటితో పోల్చడం అవసరంగా, అధ్యయనాత్మకంగా ఉంటుందని అనుకొంటున్నాను. అది కూడ సమ్మెహక్కు మీద కొన్ని అదుపులు పెట్టింది. కాబట్టి దానిలోని ప్రతిపాదనలతో ఈ బిల్లులోని ప్రతిపాదనలను పోల్చడం సమంజసం. దాన్ని బట్టి మనం ఏ వైపునకు పోతున్నామో సభకు తెలుస్తుంది, బానిసత్వం వైపునకు పోతున్నామో లేదో తెలుస్తుంది. 1929 చట్టం కార్మికుల సమ్మె హక్కుపై పరిమితులు విధించింది. రెండు సెక్షన్లు ఉదహరిస్తే చాలు. రాజకీయ ఉద్దేశానికి చేసే సార్వజనిక సమ్మెను 1929 చట్టం శిక్షార్హమైనదిగా పేర్కొన్నది. అది 16 వ సెక్షను. మరో సంబంధిత సెక్షను, నాకు కావాల్సింది 15. అదేనోటీను ఇవ్వకుండా శిక్షను విధిస్తుంది. ఈ బిల్లుకూడ నోటీను ఇవ్వకుండా శిక్షిస్తుంది. కనుక 1929 చట్టానికి ఈ బిల్లుకు పోలికలు ఉన్నాయనిపిస్తుంది. అయ్యా అంతకు తప్ప ఒకబిల్లు మరోదానితో వేరైనదే - సుద్దపాడి, గడ్డమీగడ వేరైనట్లు. ఒకదానికి మరో దాంతో పనిలేదు. ఇకపోల్చి మాట్లాడవలసివస్తే, ఈ బిల్లు ప్రతిక్రియాత్మకమైంది, తిరోగమనానికి చెందింది. ఈ బిల్లు సృష్టికర్త 1929 చట్టం రూపొందించినవారికన్నా పెద్ద టోరీ, అంటే రాజపక్షవాది.

అయ్యా, 1929 చట్టం 15 వసెక్షను ప్రతిపాదనలను పోలుద్దాం. ఈ విషయంతో పరిచయమున్న ప్రతివారికి తెలిసినట్లుగా 1929 చట్టం 15వసెక్షను ప్రజోపయోగాలకు పరిమితమైంది.

అది శిక్షించేది అన్ని సమ్మెలనూ కాదు, ప్రజోపయోగ సేవలనబడిన సమ్మెలను శిక్షిస్తుంది. ఇదీ ఈ బిల్లుకు 1929 చట్టానికి ఉన్న మౌలికమైన తేడా.

అయ్యా! నేనిపుడు అడగదలచిన ప్రశ్న – 1929 లో తీసుకున్నటువంటి పరిస్థితి నుండి వెనక్కు తొలగటం న్యాయసమ్మతమేనా? నేను మరో విధంగా గూడ మొదలుపెట్టడం మంచిదనుకొంటాను. కేంద్ర అసెంబ్లీలో ఈ బిల్లు ప్రవేశపెట్టినపుడు అంటే 1929లో కాంగ్రెస్ పార్టీ యొక్కస్థితి ఏమిటి? అయ్యా! సెలెక్టు కమిటీ రిపోర్టు వెదికి పట్టుకొని చదవటానికి నేను చాలా ప్రయాసపడ్డా. సెలెక్టుకమిటీని కేంద్ర అసెంబ్లీ నియమించింది. ఈ బిల్లులోని ప్రతిపాదనలు పరిశీలించమని. ఆ బిల్లే చివరికి 1929 చట్టమైంది. నా దృష్టిని ఇద్దరు పోటీదారులపై నిలుపుతున్నాను. అంతవరకే పరిమితం చేస్తున్నాను. అభ్యంతరం ఉండదనుకుంటాను. నేనలా అనవచ్చునను కుంటాను. ఇతరులకు బాగా పరిచయమైన పదాలు వాడుతున్నాను. ఆ ఇద్దరెవరంటే ఒకరు బ్యూరోక్రసి – రెండవవారు కాంగ్రెస్ పార్టీ. ఈ 1929 చట్టాన్ని పరీక్షకు పెట్టినపుడు అప్పుడున్న అభిప్రాయంలోని అంశాలేమిటి? తేడావచ్చిన అంశాలు రెండని నాకర్థం అయింది. అప్పుడొచ్చిన భేదాంశాలు రెండే. ప్రజోపయోగములైనటువంటి సేవలు నిర్వచించడం వారి విచక్షణకే వదిలిపెట్టారు. ప్రజోపయోగం అంటే ఏమిటో దానినిర్వచనం చట్టంలో చూపించదలచుకోలేదు. వాళ్ల దృష్టిలో ప్రజోపయోగ సేవలు 'ఫలాన' అని గణించడానికి గూడ వాళ్లు తయారుగా లేరు. ప్రజోపయోగం, దాని ప్రాముఖ్యత ఆ కేసు యొక్క పరిస్థితులపై ఆధారపడుతుందని మాత్రమే అన్నారు. కాల పరిస్థితులను బట్టి అది మార్పు చెందవచ్చు. ఒకప్పుడు ప్రజోపయోగమైనటువంటి సేవ మరొక్కప్పుడు ప్రజోపయోగం కాక పోవచ్చును. వాళ్లు గ్రహించి అవగాహన చేసుకున్న రీతిగా సాంఘిక సంక్షేమ దృష్టిలో పరిస్థితి యొక్క నిర్వచనం అనిర్దిష్టంగా వదలి ప్రభుత్వ విచక్షణారీత్యా నిర్వచించుకోవచ్చని వారు భావించారు. ఇప్పుడు కాంగ్రెసు రెండు విషయాలకు సంసిద్ధంగా వుంది. 1. బ్యూరోక్రసీ వదలరాదని, బ్యూరోక్రసి ప్రయోజనాలకై ప్రయత్నించరాదని, కాబట్టి దాని నిర్వచనం ప్రభుత్వం యొక్క విచక్షణకు వదలగూడదని కాంగ్రెస్ పార్టీ భావించింది. 15వ సెక్షన్ దృష్టిలోకి ఎలాంటి ప్రజోపయోగమైనదానిని తీసుకొని రావలెననుకున్నా దానిని చట్టంలోనే స్పష్టపరచాలని చెప్పబడాలనిఅనుకున్నది. రెండవ పరిస్థితి ఏమిటంటే బిల్లు ప్రవేశపెట్టిన 1929 వసంవత్సరంలో కాంగ్రెస్ దృష్టిలో ఉన్నది ఇది. ప్రజాప్రయోజనం అనేటటువంటి విభాగం చాల పెద్దది. ప్రజాప్రయోజనసేవ అన్నంతమాత్రాన సమ్మె న్యాయవిరుద్ధమైనదని అనరాదు. అంటే 'సాంఘిక భద్రతా సేవలు' అన్న దానిక్రిందికి తీసుకొని రావలెనని ఆ పరిస్థితులలో చూడాలని అనుకున్నారు. 1929 లో పరిస్థితి అది. ఈ సందర్భంలో ప్రభుత్వం ఒక అంశాన్ని వదలిపెట్టింది. ప్రజాప్రయోజనం అనేటటువంటిది చట్టంలో నిర్వర్తించాలనేది మాత్రం అంగీకరించారు. కాబట్టే వ్యాఖ్యాన రూపమైనటువంటి రెండవ సెక్షనులో అదివుంది. ప్రజాప్రయోజనం అంటే ఏమిటో నిర్వచించారు. అక్కడ జాబితా వేశారు. ప్రభుత్వానికి దాని నుండి ఏదీ తీసివేయడం గాని దానికేది

కలపటానికి గాని స్వేచ్ఛలేదు. ఇకపోతే 'సమ్మె' న్యాయవిరుద్ధమైనది' అనే క్యాటగిరీలోకి ఇరికించి నిర్వచించవలసివస్తే ప్రభుత్వం దానికి సమ్మతించలేదు. అది ప్రజాప్రయోజనసేవగా పొడిగించాలన్న వాళ్ల సూత్రం నిలబడాలని ప్రభుత్వం చెప్పింది. కాంగ్రెస్ పార్టీ విఫలమైంది. అది నిజంగా నావాదం గురించికాదు. ఎందుకంటే 1929లో సమ్మె యొక్క న్యాయవిరుద్ధతను సాంఘిక భద్రతాసేవలకు పరిమితం చేయాలనే కాంగ్రెస్పార్టీ దృఢంగా ఉందనేది నావాదం. అయ్యా, సెలెక్ట్‌కమిటీ రిపోర్టులోనుండి కొన్ని విషయాలు చదవాలనివుంది. "అవి కాంగ్రెస్ సభ్యులు వ్రాశారు. అప్పుడు గౌరవనీయ సభ్యులు శ్రీజమునాదాస్ మెహతా కాంగ్రెస్ సభ్యుడై ఉంటారని అనుకుంటున్నాను. కాని నిర్దిష్టంగా తెలియదు.

***శ్రీ జమునాదాస్ ఎమ్.మెహతా :*** ఈనాటికీ నాధోరణి అదే.

***డా॥ అంబేద్కర్:*** అయ్యా, ఇది శ్రీ జమునాదాస్ మెహతా, శ్రీ ఎమ్.ఎస్. శేషయ్యంగార్, శ్రీ ఎస్.సి. మిత్రా, శ్రీ వి.వి.జోగేష వ్రాసిన దానినుండి చదువుతున్నాను :

"సెలెక్టు కమిటీ నుండి వచ్చే బిల్లులో మౌలికమైన అభ్యంతరాలు అలాగే వున్నాయి. 15వ క్లాజు బదులు దాని పై క్లాజులో పారిశ్రామిక వివాదాలను తొలగించేకన్నా, పెంచేవిగా వున్నవని భావిస్తున్నాను. యజమానికి, సిబ్బందికి మధ్య ఉన్న సంబంధాలలో విషం కలిపేవిగా వున్నాయి. అలాంటి శాసనాల అనుభవరీత్యా వాటిని అధికారులు పరిపాలకులకు అసంతృప్తి కలిగేటట్లు రాజకీయ ప్రచారాన్ని అణచివేయడానికి ఉపయోగిస్తారు. దేశంలో నిజాయితీగల పారిశ్రామిక - సంఘాల ఉద్యమాన్ని నిజంగా అభివృద్ధి పరచి ఇతోధికం చేయాలనే ఉద్దేశం ఈ చట్టంలో వుంటే ఆ ఉద్దేశ్యాన్ని 15వ క్లాజు ఆమీదట ఉన్నవి చెడగొడతాయి."

ప్రజాప్రయోజన సేవలకు పొందుపరచినదైన ఏ సమ్మెను శిక్షార్హం చేయరాదనేది వాళ్లు తీసుకున్నారు. ఆ మినిట్స్‌లో నిరసన యిలా వుంది.

"........ఉద్దేశ్యం విఫలం కాగా అనంగీకార విషయాన్ని మేము ఇలా చేర్చాల్సి వచ్చింది. న్యాయస్థానాలవిచారణ ద్వారాను, సమాధానపరచే సంఘాల ద్వారాను పారిశ్రామిక వివాదాలను పరిష్కరించే క్రమంలో ఈ బిల్లులో 14వ క్లాజు వరకు నిజాయితీతో కూడిన సరైన ప్రయత్నం వుంది. బిల్లులో ఈ భాగానికి సంబంధించిన వరకు సెలెక్టు కమిటీలో బాగా వృద్ధి అయి బలపడి బయటపడింది. అంతవరకు చేసిన మార్పులు ఇంచుమించు దాని సమతుల్యంగా, న్యాయంగా చేయడానికి ఉపయోగపడ్డాయి. 'ప్రజాప్రయోజన సేవలు' అనేదాని నిర్వచనం గురించి 2 (g) క్లాజులో వదిలేస్తున్నాము. దాని నిర్వచనం 15వ క్లాజుననుసరిస్తుంది. కాబట్టి దాన్ని దాంతో పరిగణించాలి. యజమానికి, పనివారికి మధ్య ఉండే స్నేహసంబంధాలకు ఈ క్లాజు పెద్ద ప్రమాదకరమైందని మేము భావిస్తున్నాం. ప్రజాసేవ 'ప్రయోజనకరమైన సేవ' కావచ్చు. అంత మాత్రాన అలాంటి సేవలలో నోటీసు ఇవ్వకుండా చేసిన సమ్మెలను క్రిమినల్ నేరంగా

మానవ ఆరోగ్యానికి లేక జీవితానికి ప్రమాదం జరుగుతుంది కనుక హఠాత్తుగా చేసే సమ్మెనేరమని ప్రయత్నించడము, దానికి తీసుకొనే చర్య సిద్ధాంత రీత్యా చాల స్పష్టమైనది. కాని ఏసేవయినా ప్రజోపయోగ సేవ అయ్యేటట్లుగా ప్రభుత్వం తన విచక్షణలో ప్రకటించడానికి అనుమతి ఇచ్చేటట్లు సెలెక్టు కమిటీ ఆజ్ఞాజును తొలగించింది. అయినా ప్రజోపయోగ సేవా నిర్వచనంలో హఠాత్తుగా చేసే సమ్మెలు గూడా చేరిఉన్నాయి. అందులో అవి ఎలాంటి అసౌకర్యాన్ని కలుగజేసినా జీవితానికి ప్రమాదం తెచ్చిపెట్టవు. ఎందులోనయినా ఏ పనిలోనయినా హఠాత్తుగా చేసే సమ్మెలు ఎంతఅవాంఛనీయమైనా సమాజం భద్రతకు భంగం కలిగించని పక్షంలో దాన్ని నేరం కింద పరిగణించడానికి ఆధారం లేదు. మరొక్కటి గూడా స్పష్టమయింది. నమాజపు ఉనికినే భంగపరచే హఠాత్ సమ్మెలకు పరిహారం రాష్ట్రాల్లో వుంది. సమ్మెతోపాటు కాంట్రాక్టును (ఒప్పందాన్ని) భంగపరచే పరిస్థితి వుంటే ఇండియన్ పీనల్‌కోడ్ క్రింద దాన్ని తీవ్రంగా తీసుకొని రావచ్చు......"

శ్రీ కుంబ్రూ ధోరణి అది. ఆ ప్రతిపాదనతో నేను గూడ అంగీకరిస్తున్నాను. నోటీసు ఇవ్వకుండా చేసే సమ్మె హక్కును పరిమితం చేయాలి. అయితే ప్రజోపయోగ సేవల్లోకాక సమాజ భద్రతా సేవల్లో అలాంటిది చేయాలి. అయ్యా, ఇంగ్లీష్ శాసనంలో అది సమగ్రమైన సమాధానం. ఈ సందర్భంలో 1920 సంవత్సరం ఆత్యయిక అధికారాల చట్టం (Emergency Powers Act) పట్ల నేను ఈ సభాదృష్టిని మరల్చదలచాను. అది యుద్ధానంతరం ఒకటి రెండు సంవత్సరాలకు బ్రిటిష్ పార్లమెంటు అమలు చేసింది. అక్కడగూడ ఆత్యయిక పరిస్థితిలో వ్యవహరించడానికి నిబంధనలు చేసుకునే అధికారం ప్రభుత్వానికివ్వబడింది. ఆ చట్టం నుండి ఒకటి రెండు సెక్షన్లు నేను చదువుతాను. 1వ సెక్షను ఏమంటుందంటే :

"ఒక వ్యక్తిగాని అలాంటి స్వభావం కల్గిన సమూహంగాని సరఫరాకి, పంపిణీకి అభ్యంతరం కలిగించేటంత లెక్కలో భారీ ఎత్తున వెంటనే భయోత్పాతం కల్గిస్తున్నట్లు గాని, చర్య తీసుకున్నట్లుగాని ఎప్పుడైనా రాజరికానికి (His Majesty) అనిపిస్తే........"

ఈ ప్రత్యేక మైన పదాల పట్ల దృష్టి సారించమని సభను కోరుతున్నాను......

"ఒక కమ్యూనిటీకిగాని, అత్యవసరసేవలున్నకమ్యూనిటీలో ఒక భాగానిక్కాని ఆహారం, నీరు, వంట చెరకు, ఇంధనాలు లేక వెలుతురు లేక ప్రసార, ప్రయాణ సాధనాల సరఫరాగాని, పంపిణీగాని లేకుండా చేస్తే............

ప్రభువులవారు ఒక ప్రకటన ద్వారా 'ఆత్యయిక పరిస్థితి' వున్నదని ప్రకటింపవచ్చును".

ఇక రెండవ సెక్షను ఏంచెపుతుందంటే :

"ఆత్యయిక పరిస్థితి ప్రకటన వెలువడినపుడు ఆ ప్రకటన అమలులో ఉన్నంత కాలం కమ్యూనిటికి జీవితావసరవస్తువులను సమకూర్చడానికి నిబంధనలు చేయడం ప్రభుత్వ కోర్టుకు

న్యాయసమ్మతమైనది. ప్రభుత్వం వారు 'అవసరం' అనుకొన్న రీతిలో అధికారాలు – విధులు ప్రభుత్వం కలిగి ఉండేట్లు ఈ నిబంధనలు పనిచేస్తాయి......"

ఇదంతా కూడా ప్రజా భద్రతకు అవసరమైన, కమ్యూనిటీ జీవితానికి అవసరమైన కేసులకు పరిమితమైందనే అంశంలో ఎప్పుడూ ఇమిడిఉన్న దృక్పథం ఇదే! సమ్మె హక్కును పరిమితం చేయాలని, దానిని చట్ట విరుద్ధం చేయాలని అనుకుంటే కమ్యూనిటీ జీవితం నిలబడడానికి అవసరమైన సేవల సంబంధం మీద ఆధారపడి చెయ్యాలి. ఈ బిల్లు ప్రతివాణిజ్యానికి, ప్రతి పరిశ్రమకు సంబంధం వుంటుందనేది స్పష్టం. నేనేదీ కూడా తమాషా చేసే ఉద్దేశ్యంలో చెప్పను. నా పాయింటుని విశదీకరించాలని చెపుతున్నాను. ఉదాహరణకు రేపు భారతీయస్త్రీలు తమ పెదిమలకు ఫ్యాషనుగా రంగువేయాలనుకుంటారు – అలా చెయ్యరనుకుంటాననుకోండి. డబ్బు సంపాదన దృష్టిలో పెట్టుకున్నటువంటి ఒక ఉత్పత్తి దారుడు ఆ అవసరాలు తీర్చడానికి లిప్‌స్టిక్స్ పరిశ్రమ మొదలుపెడతాడు. ఈ చట్టం క్రింద సమ్మె చేస్తారు. అపుడు యీ చట్టంలోని నిబంధనలు ఖడ్గధారలాగా వాళ్లనెత్తిన నడతాయి. లిప్‌స్టిక్ పరిశ్రమ జీవితానికావశ్యకమైందని ఎవరైనా భావిస్తారా? కొందరు స్త్రీలు పెదాలకు రంగు వేసుకునే సంతోషం వైదొలగిందన్న కారణం చేత సమ్మెచేసే హక్కును తొలగిస్తారా? అయ్యా! ఈ ప్రభుత్వం 1929లో తీసుకున్న ధోరణికి తిలోదకాలిచ్చింది. అంటే సాంఘిక భద్రత సేవల కింద సమ్మెలకు దేశ ప్రణాళికలను మాత్రమే శిక్షల్ని అన్వయింపజేయకుండా. 1929 యాక్టులోని నిబంధనలను దాటిపోవడం ద్వారా బ్యూరోక్రసికే దెబ్బకొట్టింది. 'బ్యూరోక్రసికి.... చెప్పాలంటే కాస్త ఇంగిత జ్ఞానం ఉండాలి. బాధ్యత వుండాలి. ఏమంటే సమ్మెహక్కు చాలముఖ్యమైనదని, ప్రజా భద్రత అనేదాని క్రింద నాల్గుగోడల మధ్య, నాల్గు కోణాలు దాటి ఆహక్కును నేరంగా భావించగూడదు. ఇక్కడున్న బిల్లు నేను మళ్లీ చెప్పదలచాను. ఈ బిల్లు లిప్‌స్టిక్ పరిశ్రమలో సమ్మెను శిక్షార్హం చేస్తుంది.

ఇదంతా ఎందుకు? ఇదే విధంగా నెత్తినరుద్దటానికి నెత్తిన రుద్దే ప్రయత్నాలలో ఈ ప్రయత్నాల వల్ల అలజడులవలన ఈ సంకటాలవల్ల మనం పొందేదేమిటి? నాకు సంబంధించి నంతవరకు సమాధానపరచే వాడు ఈ బిల్లులో అనబడిన చాలా పెద్ద మనిషి టేబుల్ దగ్గర నాల్గు నెలల ఇరవైదు రోజులు వేచి వుండటమే ఫలితంగా కనబడుతుంది. దీనికి మించి నాకేమీ కనబడటం లేదు. ఈ బిల్లు ప్రవేశ పెట్టడానికి కారణం గౌరవనీయులయిన హెూంమంత్రి గారు చెప్పారు. ఏమనంటే రాష్ట్రం సామూహిక భారాన్ని తన భుజాలమీద వేసుకొన్నది. ఆవిధంగా ఆయన చెప్పారనుకుంటున్నాను. నేను పొరపాటు చెప్పి వుంటే ఆయన సరిచేస్తారని ఆశిస్తున్నాను.

***గౌరవనీయ శ్రీ మున్షీ:*** కాదు; తనభుజాలమీదికి సామూహిక భారాన్ని వేసుకోడం కాదు, సాముదాయిక బాధ్యతని క్రమబద్ధం చేయడం.

***డా॥ అంబేద్కర్ :*** సాముదాయిక బాధ్యత క్రమం చేయడం? నేను స్పష్టంగా చెప్తాను ఈ

నిబంధనలవలన ప్రయోజనం ఏమిటి? సివిల్ ప్రొసీజర్ కోడ్‌లో నిబంధనలు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. తగవులమారికి వాటిల్లో ఏం ఆసక్తి వుంటుంది? వ్యాజ్యమాడేవానికి అతని వాజ్యఫలితంలోనే ఆసక్తి ఉంటుంది. లాంఛనాలు, ప్రతిపాదనలు, పద్ధతులు, ఎవరు నోటీసు ఇవ్వాలనేది, నోటీసు తర్వాత ఏం జరగాల్సిందీ, వ్రాతప్రతి ఎవరు తయారు చేయాల్సిందీ, దానికి సంబంధించినమిగతావి ఈ గొడవలన్నీ ఆకలిలో వున్న పనివాళ్ల కేమి పట్టింది? వీనిలో అతని కేమాత్రం ఆసక్తి ఉండదు.

*గౌరవనీయ శ్రీ కె. ఎమ్. మున్షీ :* కాబట్టి సివిల్ ప్రొసీజర్ కోడ్‌ను కొట్టి పారేయండి?

***డా॥ అంబేద్కర్ :*** నేనలాంటిదేమీ అనడం లేదు. నేచెప్పేదేమంటే ఇన్నిన్ని ప్రొవిజనులు పెట్టుకొని తలనొక్కేసుకోవాలి. మేము బలవంతంగా మధ్యవర్తిత్వం చేస్తాం. మీరంగీకరించినా లేకపోయినా" అని వాళ్లు ధైర్యంగా చెప్పాల్సింది. (అభ్యంతరాలు) నేను అంగీకరించడం అంగీకరించకపోవడం వేరేసంగతి. మీరాధోరణి పూనినట్లయితే నేను తప్పనిసరిగా అర్థం చేసుకొనివుండేవాడ్ని. ఎందుకంటే అప్పటి పొజిషన్ ఇలా వుండేది. నాల్గు నెలల యిర్వై రోజుల తర్వాత ఏదో కొంత ఫలం తప్పనిసరిగా లభించేది.

***ఒక గౌరవనీయ సభ్యుడు :*** వేతనం సంపాదించేవానికి అది బానిసత్వం లా వుండేది.

***డా॥ అంబేద్కర్ :*** మీకు కావలసినంత ఉన్నది. ఈ బిల్లులో ఇంకాస్త ముందుకు వెళ్లడానికి సిగ్గుపడక్కర్లేదు. (అభ్యంతరాలు)

***గౌరవనీయ సభాపతి :*** శాంతం! శాంతం !

***డా॥ అంబేద్కర్ :*** కాబట్టి, అయ్యా, ఇదంతా ఎందుకు? మీరు చాల మెట్లు మారాలి. ఒక రిజిస్ట్రారు, ఒక కన్సీలియేటరు, ఒక కన్సీలియేటరు బోర్డు – ఇరుపక్షాలూ అంగీకరిస్తే – ఇదెలావున్నదంటే అనుకూలమైన పెద్ద మనుషులముందు ప్రదర్శన చేకూర్చినట్లుగా వుంటుంది. ఆ పెద్ద మనుషులు వివిధ రకాలయిన మనుష్యులతో తీయగామాట్లాడి మంచి నిమ్మళాన్ని తీసుకొస్తారు. ఏదో కావాల్సివుండి ఆకలిగొన్న వాడు మంచి ఓర్పుతో వున్నాడని చెప్పవచ్చు. దీనితో నాకేమీ అనిపించడంలేదు. నాలెక్క ప్రకారం ఇదంతా నిరుపయోగం, శుద్ధ దండగ, దీనివల్ల వచ్చే ప్రయోజనం శూన్యం. ఆ ఉన్న కాస్త ప్రయోజనం ఏమిటంటే నాలుగు నెలల ఇర్వై ఐదు రోజులు ఆలస్యంచేసిన ఈ ప్రక్రియ వల్ల పని వాడు పనిచేసే సామర్థ్యం గూడ కోల్పోతాడు. అదీ దీని ఫలితం. ఇక్కడ గూడ సభవారినొక విషయం చూడమని కోరుతున్నాను. అదే మంటే ఈ ప్రస్తుత బిల్లుకి 1934 బొంబాయి చట్టానికి మధ్యగల వ్యత్యాసాన్ని చూడండి. 1934 సంవత్సరం బిల్లు చర్చలో ఉన్నపుడు ఏం సలహా సూచించారంటే సమాధానపరచే సమయంలో సమ్మెను బహిష్కరించాలి. ఆ విధంగా ఒక ప్రతిపాదన వుంది. ఆ ప్రతిపాదనను గౌరవనీయులు సర్. రాబర్ట్ బెల్ నెట్టి వేశారు. సమ్మె బహిష్కరించకపోతే కనీసం పికెటింగునైనా బహిష్కరించాలి అని ఒత్తిడి తెచ్చారు. దానికూ్కడా ఆయన ఏమాత్రం అంగీకరించలేదు. (ఒక గౌరవనీయ సభ్యుడు : లేదు, లేదు!) సవాల్ వచ్చింది

కాబట్టి వారి ప్రసంగంలో కొంత భాగం చదువుతాను. బాంబే లెజిస్లేటివ్ కౌన్సిల్ డిబేట్సు పుట. 180 సంపుటి XL లో ఇలా ఉంది:

"పికిటింగ్ విషయం గురించి నేనొక విషయం చెప్పదలచాను. 15వ క్లాజులో సమాధాన పరచే వ్యవహారాలు జరుగుతుండగా పికిటింగు నిరోధించాలి. పికిటింగు నిరోధించడానికి గాను ఒక ప్రతిపాదన ఉంది.

తన పనినిగాని తన వ్యవహారాన్నిగాని అంటే సమాధానపరచే విషయానికి సంబంధించి నటువంటివి జరుపుకుంటూ పనిచేసుకుంటూ పోయేదానిని ఆపుచేయడానికి ఒక వ్యక్తిని శారీరకంగా బాధపెట్టే విషయం గూడ ఉంది. అంటే ప్రభుత్వ ఉద్దేశ్యం ఏమంటే సమాధాన పరిచే వ్యవహారాలు మొదలయిన తర్వాత మిల్లువద్ద పికిటింగు సమ్మతించరాదు. ఒక వేళ సమ్మె అప్పటికే జరుగుతూ వున్నా సరే! మిల్లు ప్రాంగణంలో పికిటింగు ఆపు చేయాలని దాని ఉద్దేశ్యం. ఇరుపక్షాలూ ఒక నిర్ణయానికి రావాలని ఉద్దేశ్యపడినపుడు ఇదికోరదగిన విషయమన్నట్లుగా పరిగణించారు. మరో పక్షంగా మిల్లు పనివారి మిల్లు చేతులు కట్టి వేయడానికి విరుద్ధంగా మనకు నిషేధం లేదు. కొందరేమనుకున్నారంటే పికిటింగు చేసే హక్కు పవిత్రమైనహక్కని భావించారు. సమగ్రంగా జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత మిల్లు గేటుదగ్గర పికిటింగును ఆపుచేయాలనే పదిహేనవ క్లాజుని మాటలను వదలిపెట్టాలని మేము సవరణకు తీర్మానించాము."

అది – ఆయన తీసుకున్నట్టి పొజిషను. అయ్యా! సమ్మెను అనుమతిస్తే సమాధాన పడటం అనేటటువంటిది ఎక్కువభాగం ఉంటుందని నేను గాఢంగా ఉద్దేశ్యపడుతున్నాను. ఈ అంశం పరిగణనలోకి తీసుకోలేదని నేను భావిస్తున్నాను. తన బలగాన్ని సమీకరించుకోడానికి నాలుగు నెలల ఇరవై ఐదు రోజుల సమయం ఉండగా ఒక యజమాని కార్మికులతో సమాధాన పడటానికి ఎందుకు తయారవుతాడు? నాలుగు నెలల ఇరవై ఐదు రోజుల్లో ఏ కార్మికుడూ తన శక్తులను సమీకరించుకోలేడనీ, ఏ కార్మికుడూ సిద్ధంకాలేడనీ తెలిసినపుడు, ఇంకా సమ్మెచేయాల్సిన సమయం రెండు నెలలకు మాత్రమే కుదించబడిందని తెలిసికూడ యజమాని కార్మికులను సమాధాన పరచడానికి ఎందుకు సిద్ధమౌతాడు? ఈ పరిస్థితుల్లో, ఒక ఒప్పందానికి రావడానికి యజమాని పక్షంగా ప్రేరణగానీ, ఒత్తిడిగానీ, ప్రోద్బలం గానీ ఉండదు. సమాధానపరచే యంత్రాంగం ఫలించి, ఇరుపక్షాలకూ అంగీకారమైన కొంత మంచి జరుగుతుందని ఈ బిల్లు ప్రవేశ పెట్టినట్లు సభ్యుడు భావిస్తే, అతని ఉద్దేశం అదే అయితే, దానికి అవలంబించాల్సింది సర్ రాబర్ట్ బెల్ పద్ధతి అని మనవి చేస్తున్నా; అంటే సమ్మెకొనసాగనివ్వడం, వేరే మాటల్లో చెప్పాలంటే, ప్రస్తుత చట్ట ప్రతిపాదనలను కొనసాగనివ్వడం. కాని, అయ్యా, ఇక్కడ ప్రభుత్వం కనీసం బ్యూరోక్రాట్ తీసుకున్న స్థితిని కూడ తీసుకోవడానికి సిద్ధంగా లేదు. ఇపుడు ప్రజాప్రభుత్వం బ్యూరోక్రాట్ తీసుకున్న స్థితిని అంగీకరించడంలేదు; పైగా అది శ్రామిక జనావళి ఓట్లతో ఎన్నుకోబడినట్లు చెప్పుకుంటుంది. శ్రామికులందునా, దేశక్షేమ మందునా శ్రద్ధ లేకుండా బ్యూరోక్రాట్‌కు భిన్నంగా వ్యవహరిస్తుంది. ఈ ప్రజాస్వామ్యం – కావచ్చు,

కాని నేను మాత్రం దీన్ని ప్రజాస్వామ్యం అనను - చదువు, జీవనాధారం, సంఘటిత శక్తి, తెలివి లేని శ్రామిక వర్గాన్ని బానిసలు చేసే ఈ ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యమే కాదంటాను. ఇది ప్రజాస్వామ్యం అపహాస్యం. బిల్లులో ముఖ్య ప్రతిపాదనల గురించి ఇది.

ఇక, అయ్యా, బిల్లులో ఇతర ప్రతిపాదనల గురించి ఉదహరించదలచాను. అవి 4 నుండి 20 క్లాజుల వరకు. చూస్తే అవి నాలుగు వేర్వేరు శీర్షికలకు సంబంధించినవి. అవి యూనియన్లకు సంబంధించిన వివిధ క్లాజులు - అర్హమైన యూనియన్లు, రిజిష్టర్డు యూనియన్లు, ప్రాతినిధ్య యూనియన్లు. అయ్యా, బిల్లు పూర్వపు వ్రాతప్రతిని చూసే అవకాశం నాకు కల్గింది. పూర్వపు వ్రాతప్రతిలో భిన్నమైన పదజాలం వుంది; ఎలాగంటే - సమాంతర యూనియన్లు, నిలువెత్తు యూనియన్లు, కర్ణరేఖ యూనియన్లు, వ్రేలాడే యూనియన్లు. ఆ పదజాలం వదిలేసినందుకు సంతోషంగా వుంది. నాకు గణితంలో బలంలేదు. జ్యామెట్రీ (రేఖాగణిత) చాలా తక్కువ తెలుసు. పదజాలం మార్పిడిద్వారా చూపిన ఆ మాత్రం దయకు బిల్లు ప్రవేశపెట్టిన గౌరవనీయులకు నేను కృతజ్ఞతలు చెల్లించడం సమంజసమనుకుంటా; అలాగే ప్రస్తుత బిల్లు తయారుచేసిన వారికి కూడ. యూనియన్ల నియమనిబంధనలు; వివిధ వర్గ యూనియన్ల రిజిస్ట్రేషను విధానం గూర్చి ఈ క్లాజులుండడం రెండో విషయం. రిజిష్టర్డు యూనియన్లు లేక గుర్తింపబడ్డ యూనియన్లు ప్రాతినిధ్యపు యూనియన్లుగా ప్రకటితం కావడానికి నియమ నిబంధనలూ, విధానాల గురించి, మూడో విషయం. యూనియన్ రిజిష్టరు చేయడానికీ, ప్రాతినిధ్యపు యూనియన్ల ప్రకటన రద్దు చేయడానికీ గూర్చినది నాల్గో నిబంధన, అయ్యా, ఈ ప్రతిపాదనలు బిల్లు ముఖ్యప్రతిపాదనల వ్యావహారికంగా ఏమిసంబంధమో నాకు అర్థం గాక ఇబ్బంది పడుతున్నాను. ముఖ్య ప్రతిపాదనలేవంటే మొదటిది బలవంతంగా సమాధాన పడటం. మధ్యవర్తిత్వం జరుగుతుండగా సమ్మెలు చేస్తే శిక్ష విధించడం. బిల్లుకు సంబంధించిన ఈ రెండు ముఖ్య శీర్షికలు వ్యవహరించడంలో ఈ క్లాజులకూ ఆ క్లాజులకు సహజ సంబంధం వుందో లేదో నా మనసుకు తోచడం లేదు. బిల్లు శీర్షిక చూస్తే ఉద్దేశాన్ని వ్యక్తం చేసే బదులు దాచేదిగా ఉంది. బిల్లు శీర్షిక ఏమంటే : "శాంతి యుతమైన, ఆమోదయోగ్యమైన పారిశ్రామిక వివాద పరిష్కారాలు సమాధానమూ, మధ్యస్థం ద్వారా పెంపొందించడానికీ కొన్ని ఇతర ఉద్దేశాలకు ప్రతిపాదనలు చేయడానికి బిల్లు". అయ్యా, ఇతర ఉద్దేశాలేమిటి? వాటిని బిల్లు శీర్షికలో ఎందుకు స్పష్టం చేయలేదు? అవేమైనా సిగ్గు పడాల్సిన విషయాలా? నాకు తెలియదు. ఆ రెండు విభాగాల మధ్య అభ్యాసంతో కూడిన ఉద్దేశాలేమైనా ఉన్నవా, లేకున్నవా? ఉంటే, వ్యక్తం చేసి ఉండాల్సింది, లేకపోతే తార్కికతీర్మానమేమంటే అవి బిల్లు నుండి తొలగించబడాలి. అయ్యా, నా అన్వేషణ వల్ల కలిగిన ఫలం ఏమంటే ఆ రెంటికి సహజ సంబంధం ఉండడం కనిపించింది. 75 వ క్లాజు ద్వారా ఆ అన్వయాత్మక సంబంధం ఇట్టే తెలుస్తుంది. బిల్లు 75 క్లాజు ఏమంటుందంటే :

"ఈ చట్టం క్రింద ఉద్యోగస్తుల ప్రతినిధుల ద్వారా తప్ప ఏ ఉద్యోగి కూడ ఏ ప్రొసీడింగ్సులోను కనబడడానికి వీల్లేదు".

అయ్యా, ఇది చాలా మౌలికమైన క్లాజు, ఇదే ఇండియాలో అన్ని ట్రేడు యూనియన్లకు వినాశకరమైంది. సమాధాన పరిచే ప్రొసీడింగ్సులో కార్మికులకు ప్రాతినిధ్యం వహించే కార్మిక ప్రతినిధి ఎవరు? ఇందువల్ల పారిశ్రామిక పరిష్కార వ్యవహారాలు జరపడానికి ఎవరికి నిర్దిష్ట స్థానం ఏర్పడిఉండదు, అతని యోగ్యతలు ఏవైనా సరే, బిల్లు ప్రకారం కార్మిక ప్రతినిధి కావడానికి నిర్వచనం ఉంటేతప్ప. ఆ ఉద్దేశంతోనే గౌరవనీయ మిత్రులు 4 నుండి 20 వరకు క్లాజులు ప్రవేశపెట్టరు. ఈ బిల్లుక్రింద ఉద్యోగుల ప్రతినిధి ఎవరు అనేది ముఖ్యమైన ప్రశ్న ?

అయ్యా, ఈ బిల్లు క్రింద రెండు రకాల యూనియన్లు ఉన్నాయి. వాటికి ప్రాతినిధ్యం వహించే హక్కు ఉంది. 20 శాతం సభ్యులు యూనియన్‌లో వుంటే లేక 20 శాతం తగ్గకుండా సభ్యులు ఉంటే, యజమాని గుర్తింపు పొంది ఉంటే ఆ యూనియన్ మొదటిది. రెండోది, 50 శాతం మించి సభ్యులు ఉంటే సమాధాన పరిచే ప్రొసీడింగ్స్‌లో కార్మిక ప్రాతినిధ్యం వహించవచ్చు. కాబట్టి ఈ రెండు రకాల యూనియన్లకు మాత్రమే ప్రాతినిధ్యం వహించే హక్కు వుంది. వాటిని మా గౌరవనీయ మిత్రులు, మంత్రి "ప్రాతినిధ్య యూనియన్లు" అని పిలవడానికి పూనుకొన్నారు. ఆయన పదజాలంతో నేను ఏకీభవించను. నీళ్లు నమలకూడదు. ఉన్నదున్నట్లు చెప్పడంలో నామనవి ఇది : ఈ బిల్లులో రెండు రకాల యూనియన్లు ఉన్నాయి. సందేహం లేదు. కాని ముఖ్యాంశమేమంటే ఒకటి బానిస యూనియను, రెండోది స్వతంత్ర యూనియన్. అయ్యా, ఒక యూనియన్‌కు విధాయక సాధనం ఉంది 'చట్ట పరమైన ఉనికి ఉండి, ప్రాతినిధ్యం వహించే హక్కు ఉండి, మాట్లాడే హక్కు ఉండి, కూడ ముందుగా యజమాని అనుమతి పొందితేనే తప్ప అని ఉంటే దాన్ని బానిస యూనియన్ అనడంలో భాషకు హానిచేసినట్లుగాని, అతిశయోక్తిగాని కాదనుకుంటా; అది స్వేచ్ఛాజీవుల యూనియన్ కాదు. "అనుమతి" అనే పదం వాడేరనుకుంటా. "గుర్తింపు" అనేది తగినపదం కాదు. సరైన నిర్వచనం "యజమాని అనుమతిచ్చిన యూనియనో" అని ఉండాల్సింది. ఎందుకంటే మనం దేనికనుమతి ఇవ్వాలనుకుంటున్నామో సరళమైన పదం వాడిన వాళ్లం అవుతాము.

అయ్యా, ఒక యూనియన్‌కు ప్రాతినిధ్య స్వభావం ముందుగా ఏర్పడిఉండాలనే నిబంధన ఈ బిల్లులో ఎందుకు పెట్టారో నాకు అర్థం కావడం లేదు – గౌరవనీయ మిత్రులు వివరిస్తారు. ఈ బిల్లులోని విషయాలు – అర్థం చేసుకోవటం చాల కష్టంగా వుంది. అయ్యా, ఈ వేళ ఉన్న ప్రొవిజన్ ఇది. 1926లో ఇండియా ప్రభుత్వం అమలు చేసిన ట్రేడ్ యూనియన్‌ల చట్టం ఉంది. దానిని ట్రేడ్‌యూనియన్‌లచట్టం' అని పిలిచారు. ఈ బిల్లు ఆ చట్టాన్ని కొట్టి వేయదు. ఆచట్టం అలాగే వుంటుంది. పైగా ఈ బిల్లు ప్రతిపాదనల క్రింద యూనియన్ రిజిస్టర్ అయ్యేముందు ఆచట్టం క్రింద నమోదు అయివుండాలని ఈ బిల్లు పట్టుపడుతోంది. ఈ బిల్లులో యిచ్చిన యూనియన్ నిర్వచనం వల్ల అది స్పష్టంగా వుంది. ఇది ఎందుకు జరిగిందో నేను సభకు ఇప్పుడు చెప్తాను. దీని వెనుక ఏదో వ్యూహం వున్నట్లు తెలుస్తుంది. కాబట్టి ఇప్పుడున్న పొజిషన్‌ను బట్టి యూనియన్‌కు

రెండు విధాల నమోదులుండాలి. ఈ చట్టం 1926 కింద ఒక నమోదు, కొత్త చట్టం కింద మరొక నమోదు 1926 చట్టం కింద రిజిస్ట్రేషను వల్ల లాభాలను గురించి ఉదహరిస్తే మేలనుకుంటున్నా. దాన్నిబట్టి ఈ బిల్లు అదనంగా ఇచ్చేదేమిటో ఈ బిల్లు నిరాకరించేదేమిటో మనకు తెలుస్తుంది. 1926 చట్టంక్రింద యూనియన్ నమోదు కావటం యొక్క ప్రభావం పట్ల మనసు పెట్టితే ఈ ఫలితాలు కనిపిస్తున్నాయి. దావావెయ్యడానికి, వెయ్యకపోవడానికి ఉండే హక్కుతో ఈ యూనియను ఒక కార్పోరేషను అవుతుంది. కార్పోరేషనుగా సభ్యులకు ప్రాతినిధ్యం లభించే హక్కు దానికి లభిస్తుంది. లేకపోతే కార్పోరేట్ అనడానికి అర్థం లేదు. రెండోది ఏమంటే 1935 ఇండియా చట్టం ప్రకారం 1926 చట్టం క్రింద, రిజిస్టరు అయిన యూనియన్‌కు 'రాజకీయ ప్రాతినిధ్య హక్కు' వస్తుంది. ఇది సభకు తెలుసు. అంటే 1926 చట్టం కింద నమోదయిన యూనియన్ సభ్యులను ఈ సభకు ఎన్నుకోవచ్చును. ఈ వాస్తవానికి పరీక్షగా ఈ సభలో గౌరవనీయ సభ్యులున్నారు. అలాగే 1926 చట్టం క్రింద నమోదయిన సభ్యులకు బొంబాయి మున్సిపల్ కార్పోరేషనుకు ప్రతినిధుల్ని పంపించే హక్కున్నది. అయ్యా! ఇప్పుడు తలెత్తే ప్రశ్న యిది. 1926 చట్టం క్రింద నమోదై ఉండటం ప్రాతినిధ్య హక్కు కలిగిస్తుంటే ఇంకా. ఈ బిల్లు క్రింద నమోదు చేసుకోవాల్సిన అవసరం ఏముంది? 1926 చట్టం క్రింద నమోదు కావటం వల్ల తన సభ్యులను ఈ సభలో మాట్లాడ్డానికి, ఓటు వెయ్యడానికి పంపించే అర్హత కల్గినపుడు ఈ బిల్లు క్రింద మళ్లీ నమోదు గావలసిన అగత్యం ఏముంది? దీనికి సమాధానం నేను తర్వాత కోర్తాను. ఈ బిల్లు చాల విచిత్రంగావుంది. నాకర్థం కావటంలేదు. 1926 చట్టం క్రింద నమోదయిన యూనియన్‌కి, సభలో తన స్థానానికి ఏర్పడ్డ వ్యత్యాసం తెలియదు. 1926 చట్టం క్రింద నమోదయిన యూనియన్‌కు శాసనసభలో ప్రాతినిధ్యం వహించే అర్హత వుండగా ఈ బిల్లు ప్రకారం కన్సీలియేటర్ (రాజీచేసే వ్యక్తి) ముందు ప్రాతినిధ్యం వహించే హక్కులేదా? ఈ వ్యత్యాసం ఎందుకు? బిల్లు వ్యత్యాసాన్ని వట్టినే సృష్టించదు. 1926 చట్టం క్రింద లభించిన సదుపాయాలను ఈ బిల్లు తొలగిస్తోంది.

ఈ సందర్భంగా 1934 బొంబాయి చట్టం క్రింద జరిగిన విషయాన్ని సభ్యులదృష్టికి తీసుకొని వెళ్తున్నా, సమాధాన ప్రొసీడింగ్స్ మొదలుకాగా సెక్షను క్రింద కార్మికులు డెలిగేట్ల్సుగా ప్రాతినిధ్యం చెందారన్నది ఆచట్టం ప్రతిపాదన విషయాలు తెలిసిన సభ్యులు గుర్తుంచుకుంటారు. అది ఆ చట్టంలో ఉన్నది. సెక్షను 9 లో పదజాలం ఇది :

"సెక్షను 8 క్రింద నోటీసు అందుకొని వాణిజ్య వివాదానికి సంబంధించిన పక్షాలు నోటీసులో ఉన్న కాలపరిమితి ప్రకారం లేక కన్సీలియేటరు నిర్ణయించిన సమయం ప్రకారం, కన్సీలియేటరు సూచించిన రీతిలో ప్రతినిధులను నియమించాలి."

కాబట్టి 1934 చట్టం క్రింద సమాధాన పరచే ప్రొసీడింగ్సులో కార్మికులు డెలిగేట్లు ద్వారా ప్రాతినిధ్యం వహిస్తారు. ఈ డెలిగేట్లను ఎలా ఎంపిక చేసుకుంటారు? 1934 చట్టం క్రింద కన్సీలియేటర్ ముందు కార్మికులకు ప్రాతినిధ్యం వహించే డెలిగేట్లను ఎన్నుకోవడానికి అర్హతగల

పక్షాలు ఏవి?

అయ్యా, ఈ చట్టం క్రింద చేసిన నియమాలు నేను చదివాను. వాటి ప్రకారం ప్రతినిధులను ఎన్నుకోదగ్గ పక్షాలు నమోదయిన ట్రేడు యూనియన్లు, 1926 పారిశ్రామిక వివాదాల చట్టం క్రింద నమోదయిన యూనియన్లు. ఇది 1934 బొంబాయి చట్టంలో 3వ రూలులో చూపించారు. కాబట్టి ఈ క్షణం వరకూ 1926 కేంద్ర శాసనసభ చట్టం క్రింద రిజిస్టరు అయిన యూనియను అది కార్పొరేషన్‌గా వుండడం వల్ల, అన్ని స్థలాలలోనూ, అన్ని సందర్భాలలోనూ కార్మికులకు ప్రాతినిధ్యం వహించే హక్కు కలిగి ఉందని ధ్రువీకరించబడింది. 1935 భారత ప్రభుత్వ చట్టం ద్వారా, చట్టరీత్యా శాసనసభల్లో కార్మికులకు ప్రాతినిధ్యం వహించే హక్కు ఉంది. 1934 బొంబాయి చట్టం, ఆ చట్టం క్రింద నమోదయిన యూనియన్లు మాత్రమే కన్సీలియేటరు వద్దకు ప్రతినిధులను పంపడానికి అర్హత కలిగి ఉన్నవి. అయ్యా, నా మొదటి ఆక్షేపణ, యూనియన్లకు ఉన్న విలువైన హక్కును ఈ బిల్లు తీసివేస్తోంది; తీసివేసి ఎవరికిస్తోంది? బానిసయూనియన్లకు ఇస్తోంది. దాన్ని ఇప్పుడే నిరూపించబోతున్నాను. దాన్ని స్వేచ్ఛాయూనియన్లకు ఇస్తే నేనేమీ పట్టించుకోను. అయ్యా, ఈ బిల్లు క్రింద నమోదయిన యూనియన్లు – అర్థం చేసుకోవడానికి ఇది చాలా ముఖ్యమయిన అంశం – మళ్లీ ఎందుకు 1926 కేంద్ర చట్టం క్రింద నమోదు కావాలి? అయ్యా, ఇది మసిపూసి మారేడుకాయ చేయటం. అంతకంటే ఏమీకాదు – అమెరికన్లు అన్నట్లుగా; ఈ బిల్లు క్రింద ఏర్పడే యూనియన్లు కన్సీలియేటరు ముందు ప్రాతినిధ్యం వహించే హక్కు కలిగిఉండడమేగాక 1926 చట్టం క్రింద యూనియన్లకు ఉన్న రాజకీయ ప్రాతినిధ్యాన్ని కూడ గుంజుకోవాలని గౌరవనీయులైన నా మిత్రుడు కోరుతున్నాడు.. అది చోరనేర విధానం.

ఈ రాజకీయ, ఆర్థిక శక్తుల దానం ఎవరి ప్రయోజనం నిమిత్తం? నేను మళ్లీ చెపుతున్నాను, ఇది బానిస యూనియన్ల ప్రయోజనార్థం. అయితే, యజమాని అనుమతివ్వాలన్న సూత్రంపై యూనియన్ తత్వం ఆధారపడడంలో తప్పులేదని గౌరవనీయులైన నా మిత్రుడు తలంచితే, నాకు తగాయిదా ఏమీలేదు. అది అతని జీవిత తత్వం. నాదికాదు. సంకెళ్లలో ఉన్నవాడు స్వేచ్ఛాజీవి అని ఆయనతలిస్తే, అది అతని సొంత అభిప్రాయం, పరిశ్రమల్లో శాంతి ఉండాలంటే, పనివాణ్ణి యజమానితో కట్టేయాలి అనితలస్తే, అతడనుకొన్న తీరుగా, అది అతని నిమిత్తం; నాకు తగాదా లేదు. కాని నా వరకైతే, ఆ స్థానం అంగీకరించడానికి సిద్ధంగాలేను. నాకు కేవలం శాంతి అక్కరలేదు, నేను దాన్ని కాదంటాను – మనకివ్వదలచిన రకమైన శాంతి అక్కరలేదు, నేనుదాన్ని కాదంటాను. (శ్రీ యస్.వి. పరులేకర్: వినండి, వినండి!) ఇది ఖాయంగా కడుపు నిండిన వానిశాంతి, పొట్టపట్టపగిలేట్టుగా తిన్న వాని శాంతి. ఆ రకం శాంతి నాకు అక్కరలేదు.

నాకు ఆసక్తి ఉన్న ప్రశ్న ఇది. ఈ విషయంలో ఔదార్యదృష్టి కలిగి వుండడానికి సిద్ధపడతా. ఈ ఉదారదృష్టి ఫలించి, ఏమైన ఫలితం కల్గిస్తుందా అని తెలుసుకోవాలని వుంది. గౌరవనీయ మిత్రుడన్నట్లు ఇండియాలో యూనియన్ తత్వంలేదు. యూనియన్ల అభివృద్ధిని పాడుచేసే

మనుషులు కూడ ఉండొచ్చు. గౌరవనీయ సభ్యుడు కమ్యూనిస్టు పార్టీ సభ్యుల పట్ల ఇంకా జంకుగా ఉండడం నాకు ఆశ్చర్యంగా వుంది; కమ్యూనిస్టులు ఇదివరకు కాంగ్రెసుకు ముల్లులాగ వుండేవారు. ఇపుడు వాళ్ళు ఈ దారికి వచ్చారు – వాళ్లు శాంతి ఒప్పుకుంటున్నారు. సత్యం ఒప్పుకుంటున్నారు, అహింస ఒప్పుకుంటున్నారు, పావలా వాటా కూడా తీసుకున్నారు, నాకు తెలిసినవరకు – ఎందుకని, నేనడుగుతున్నా, శ్రామికులు శాంతిగా వృద్ధిచెందే ఆటను ఎవరో ఇపుడు చెడగొడతారని ఆయనకు భయం ఉండాలా? ఉందనుకుందాం, ఇది ఏ విధంగా అంతమౌతుందో చూద్దాం. బానిస యూనియన్లని నేనువేటిని అంటున్నానో, అవి పండి, స్వేచ్ఛా యూనియన్లు అయ్యే సమయం వస్తుందని గౌరవనీయులు, నా మిత్రులు నాకు హామీ ఇవ్వగలిగితే, నాధోరణి గూర్చి మళ్లీ నేను బహుశా మార్చుకోగలను. కాని ఎన్నటికీ స్వేచ్ఛా యూనియన్లు ఉండవని చెప్పడానికి నేను ఏమాత్రం వెనుకాడడం లేదు. స్వేచ్ఛా యూనియన్లమీద ఆయన విధించిన నిబంధనలు అంతఅసాధ్యమైనవి; అవి ఎన్నటికి నెరవేరవు. స్వేచ్ఛా యూనియన్‌కు నిబంధన ఏమి? నీ రికార్డులో ఎప్పుడైనా 50.1 శాతం ఉన్నట్లు చూపించాలి : అదీ కండిషను. 20 శాతం, చాలదు; 25 శాతం, చాలదు; ఎప్పటికీ గణాంక నిష్పత్తి 50.1 శాతం ఉండాల్సిందే – స్వేచ్ఛగా వుండాలంటే. అయ్యా, నేను అడగదలచిన ప్రశ్న ఇది : ఇది సహేతుకమైన నిబంధనేనా? ఉపమానం చెప్పాల్సివస్తే, రోమనుల చట్టాలు బానిసత్వంతో మొదలయ్యాయి. బానిసత్వవిడుదల విధానం ఒకటుంది – అలా సాంకేతికంగా అంటారు. చివరికి బానిసబంధ విచ్ఛేదమై, స్వేచ్ఛా మానవుడు, పౌరుడు అవుతాడు. ఆ ఉదాహరణ రీత్యా మనం బానిసత్వంతో మొదలు పెడదాం. ఎందుకంటే అనుమతీ, గుర్తింపూ బానిసత్వానికి ఏమాత్రం తక్కువకావు. అయితే బానిసబంధ విముక్తికి ప్రతిపాదన ఏమైనా వుందా? ఒక వేళ ఉంటే, అది సహేతుకమూ, సాధ్యమైన నిబంధనేనా? పనివారు నెరవేర్చగలరా? కండిషనేమంటే – మొత్తం పనివారిలో నూటికి 50.1 మందిని ఎప్పటికప్పుడు సభ్యులుగా చూపాలి. అపుడు మాత్రమే సంకెళ్లనుంచీ, వేదనలనుంచి, యజమాని శిక్ష నుంచి తప్పించుకోగలవు. అది సాధ్యమయ్యే నిబంధనేనా?

అయ్యా, ఇపుడు మనం దారితప్పినవాళ్లం అని గౌరవనీయ మిత్రులు బహుశా పిలవాలను కుంటున్నారు. మనదృష్టిని అహమ్మదాబాదులోని ఆదర్శ పరిస్థితి పట్ల మరల్చమన్నారు. అహమ్మదాబాదు పుస్తకంలో ఒక పుట తీసుకొని, ఆ ఆదర్శం అనుసరించమన్నారు. అది చేయడానికి నేను సిద్ధం. ఆ ఆదర్శం అధ్యయనం చేయగా ఈ ప్రశ్న అడగాల్సిన అవసరం ఏర్పడింది. ఈ బిల్లు క్రింద అహమ్మదాబాద్ మజ్దూర్ మహాజన్ సహితం స్వేచ్ఛా యూనియన్ అయ్యే అవకాశం ఏమైనా వుందా? అది స్వేచ్ఛా కార్మికుల యూనియన్ అయ్యే ఆశనాకు కన్పించడం లేదు. అహమ్మదాబాదు నిజంగా ఆదర్శస్థలం; రాయల్ కమిషన్ సూచించినట్లు, ఇండియాలో అంతటి ఆదర్శ వంతమైన సంస్థ ఎక్కడా లేదు. కొద్దిమంది మహమ్మదీయులు తప్ప, అక్కడయజమానులు కార్మికుల మతానికి చెందినవారు; ఆ కొద్ది మంది మహమ్మదీయులు మగ్గాలునేసే వారు, వాళ్లవాళ్ల యూనియన్

వెలుపల వున్నారు. కార్మికులు యజమానులు మాట్లాడే భాషమాట్లాడతారు. వాళ్లలో సాంస్కృతిక ఐకమత్యం చాలా వుంది. ఇతర పరిస్థితుల్లో ఉండొచ్చుననుకునే విచ్ఛిన్నధోరణులూ, మాటవినని ధోరణులు అక్కడ ఉండవు. ఆపైన మహాత్ముని గొప్ప వ్యక్తిత్వ ప్రభావం ఉండనే వుంది. ఆయన పట్ల అసమ్మతివాది సైతం ఉదాహరణ చూపి, తలవంచి, లైనులో నిలబడతాడు, అతని వ్యక్తిగత ఇబ్బందులు ఏమైనాగానీ. ఇలాంటి నైష్ఠిక వాతావరణంలో అహమ్మదాబాదు మజ్దూర్ వృద్ధిఅయింది. దానికి రెండు దశాబ్దాలపై బడి చరిత్ర వుంది. పద్దెనిమిది సంవత్సరాల నుంచి అలా వుందని చెప్పారు. ఆ యూనియన్ స్థితి ఏమిటి? దానిగణాంకాలు నావద్ద పుస్తకంలో ఉన్నాయి, పుస్తకంపేరు 1938 మే లేబరు గజెట్. పరిశీలన మీదట ఇదీ పరిస్థితి అని గ్రహించాను. నేను వస్త్ర పరిశ్రమను మాత్రం తీసుకుంటున్నాను. అహమ్మదాబాదు వస్త్ర పరిశ్రమలో చేరిన వారి మొత్తం సంఖ్య 90,000. యూనియన్‌లో చేరిన వారి సంఖ్య ఎంత? అందరికీ తెలిసినట్లు మజ్దూర్ మహాజన్ అయిదు వేరువేరు యూనియన్ల సంఖ్య 90,000. యూనియన్ల సమాఖ్య; మొత్తం సభ్యుల సంఖ్య 2,20,000. అది 1938 మే 1 వ తేదీన ఉన్న సంఖ్య. అయ్యా, అది నా లెక్కల ప్రకారం మొత్తం మీద 21 శాతం మాత్రమే. నేను లెక్కల్లో గట్టివాడినికాను తప్పంటే సరిచేయండి. అంటే యూనియన్ సభ్యత్వం వస్త్ర పరిశ్రమలో 21 శాతం మాత్రం. ఆ పరీక్ష అహమ్మదాబాదుకు వర్తించినా, ఈ రోజున రిజిస్ట్రేషనుకు దరఖాస్తు పెట్టుకుంటే, అహమ్మదాబాద్ మజ్దూర్ మహాజన్ మాత్రం యజమానుల అనుమతి లేకుండా నమోదు అవుతుందని ఎవరైనా చెప్పగలరా? చెప్పలేరు.

(విశ్రాంతి తర్వాత మధ్యాహ్నం 2.30 గంILకు సభ మళ్లీ సమావేశం అయింది)

***డా|| అంబేద్కర్ :*** అయ్యా, సభాధ్యక్షా, ఈ బిల్లు ప్రకారం ఏ స్వేచ్ఛా యూనియనూ ఈ దేశంలో అభివృద్ధిచెందే అవకాశంలేదని నొక్కిచెప్పడానికి విశ్రాంతికి ముందు యత్నం చేశాను. నేను చెప్పదలచుకున్నది అహమ్మదాబాద్ మిల్లుకార్మికుల యూనియన్‌పరిస్థితిని ఉదహరించి, వివరించటం. అహమ్మదాబాద్‌లో నెలకొన్న అత్యంత అనుకూలమైన పరిస్థితులలో కూడా మజ్దూర్ మహాజన్ కూడ స్వేచ్ఛా యూనియన్ అయ్యే అవకాశం లేదు; అంటే ఈ చట్టం క్రింద యజమాని అనుమతి లేకుండా గుర్తింపుపొందే యోగ్యతలేదు. అయ్యా, అది అంత అసాధ్యమైన కండిషను. దానిని నెరవేర్చడం అసాధ్యం. ఇంగ్లాడులాంటి పారిశ్రామికంగా సంఘటితమైన దేశంలో కూడ దాన్ని నెరవేర్చడం అసాధ్యం. దురదృష్టవశాత్తు, నాకు లభించిన పుస్తకాలన్నింటిలో ఆదేశంలో ఉన్న వివిధ యూనియన్లలో వున్న సభ్యుల సంఖ్య లున్నాయి. కాని వాటితోపాటు ఎక్కడ కూడ ఆదేశ వివిధ పరిశ్రమల్లో ఉద్యోగం పొందిన పనివారి సంఖ్యలు లభించడం లేదు. దాని పర్యవసానం ఇంగ్లాండులో ఎంత శాతం కార్మికులు దేశంలోని యూనియన్ల సభ్యులో తెలియడం ఎన్నటికీ సులభం కాదు. కాని నా దగ్గర ఒక చిన్న పుస్తకం వుంది. శ్రీ వాల్టర్‌సిట్రిన్ వ్రాశారు, 1926లో అచ్చయింది. ఇంగ్లాండులో ట్రేడు యూనియన్ ఉద్యమంతో పరిచయమున్న ప్రతివారికి, ట్రేడు యూనియన్ ఉద్యమంలో ఆయనకు ప్రముఖస్థాన ముందనీ, మనకు సంబంధించిన సమస్యపై ఆయన పుస్తకం సాధికారిక

ప్రకటనగా తీసుకోవచ్చనీ తెలుసు. 1924 సంవత్సరం చివరిలో ఇంగ్లాండులో ఉన్న లెక్కలు కావు. వివిధ పరిశ్రమల్లో నియమితులైన మొత్తం మనుషుల సంఖ్య 18 మిలియన్లు. యూనియన్ సభ్యులైన, ఆడమగ మొత్తం సంఖ్య 5,531,000 మాత్రమే. అది 30 శాతానికి ఏ మాత్రం మించలేదు. బాగా సంఘటితమైన, పరిశ్రమలు బాగా వ్యాపించినట్టి. ఇంగ్లాండులాంటి దేశంలోనే పరిస్థితి అలా వుంటే, ఇండియాలాంటి దేశంలో మనం ఏం ఆశించగలం? కాబట్టి, అయ్యా, ఈ బిల్లు విధించిన నిబంధన అసాధ్యమైందని మనవి చేస్తున్నాను. పది లేక ఇరవై సంవత్సరాలవరకూ నేను చూడగలిగినంతవరకూ ఏరకమైన శ్రామిక సంఘం కూడ 51 శాతం సభ్యత్వం నిరంతరం నమోదు చేసుకోగలిగినంత బలంగా కృషిచేయలేదు. తత్ఫలితంగా, సమ్మెలో సమాధానపరచే ప్రొసీడింగ్స్‌లో కార్మిక ప్రాతినిధ్యం వహించగల తరవాత ఉండే యూనియన్ యజమానులచే గుర్తింపు పొందిన బానిసయూనియన్ తప్ప ఏదీకాదు. ఈ తీర్మానాన్ని మనం నిరోధించలేము.

అయ్యా, రెండు ఇతర సమస్యలున్నాయి. వాటినిచూడమని సభనుకోరదలిచాను. అవి కూడ ముఖ్యమైనవి. మొదటి ప్రశ్న ఇది : ఇండియాలో ట్రేడ్ యూనియన్ ఉద్యమ అభివృద్ధిపై ఈ బిల్లు ప్రభావం ఏమికానుంది? ఆ దృష్టితో ఈ బిల్లులో ప్రధానమైన సెక్షను 8వ క్లాజు సబ్-క్లాజు (a). ఆ క్లాజు ఒక అత్యంత అసామాన్య స్వభావం కలసూత్రాన్ని నిర్దేశిస్తోంది. దాన్ని యత్నించి చూపిస్తా. క్లాజు ఏమంటుందంటే – "ఒక పరిశ్రమ, లేక వృత్తి విషయంలో ఏ ప్రదేశంలోనూ రిజిస్ట్రారు ఒక యూనియన్‌కు మించి రిజిష్టరు చెయ్యరు." మరోవిధంగా చెప్పాలంటే, బిల్లు పొందుపరచింది ఇది: ఒక నిర్దేశిత ప్రదేశంలో ఒక పరిశ్రమలో లేక ఒక వృత్తిలో ఒక యూనియన్ మాత్రం ఉంటుంది అని సంఘం పెట్టుకోదలచిన కార్మికులకు బిల్లు చెపుతోంది. ఇపుడు, అయ్యా, నా ఉద్దేశం ఇది : ఈ బిల్లులో వున్న ప్రొవిజన్ ఈ దేశంలో యూనియన్ల పెరుగుదలను తప్పక నిరోధిస్తుంది, ఇది ఖాయం. మొట్టమొదటిగా, బిల్లు ప్రవేశపెట్టిన గౌరవనీయులను నేను తెలుసుకోమనేది ఇది : అసలు ఈ సూత్రం ప్రపంచంలో ఎక్కడైనా అమలులో వుందా? అయ్యా, ఇపుడు, నేను గ్రేటు బ్రిటనుకు సంబంధించిన ట్రేడు యూనియన్ ఆర్గనైజేషన్ కండిషన్లు అధ్యయనం చేశాను. నేను ఒక సాధికారికమైన వ్యక్తిని ఉదహరించడానికి సిద్ధంగా ఉన్నాను. గ్రేటు బ్రిటను చట్టంలో అలాంటి ప్రతిపాదనలు ఏవీలేవని చెప్పగల పండితుడు. వాస్తవానికి, కార్మికులను వాళ్ళు కోరుకున్నరీతిలో సంఘీకృతం కమ్మని ఇంగ్లీషు చట్టం వాళ్లకే వదిలింది. యూనియన్ ఒక పరిశ్రమకు బద్ధం కావాలనీ, యూనియన్ ఒకేవృత్తికి పరిమితం కావాలనీ ఎలాంటి రూలూలేదు. యూనియను ఒక ప్రత్యేక ప్రదేశంవరకే అనే రూలేమీలేదు. ఈ అంశం మీద సభాదృష్టిని ఒకపుస్తకం వైపుసారించమని కోరుతున్నాను. ఆ పుస్తకం ఇటీవలది; దానిపేరు 'ది ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి సర్వీస్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్'. అది వ్రాసిన వారుచెంగ్‌విడెన్, మైర్టిన్ యెవాన్స్, ఇది వారి తీర్మానం. పుట 30 నుండి చదువుతున్నా :

"ఒక పరిశ్రమలో ఉన్న కార్మికులందరూ ఒకే యూనియన్‌లో చేరవలసిన అవసరంలేదు,

అనేక విభిన్న యూనియన్‌లకు చెందవచ్చును. కొన్నికేసుల్లో సంఘం జిల్లా స్థాయిలో ఉంటుంది, కొన్ని ఇతర సందర్భాలలో వృత్తి ప్రాతిపదికగా వుంటుంది. ఒక పరిశ్రమలో ఉన్న కొందరు కార్మికులు, ఇతర పరిశ్రమలో ఉన్న కార్మికులకు సేవచేసే యూనియన్‌లో చేరవచ్చును. లేదా సార్వజనిక కార్మిక యూనియన్‌లో చేరవచ్చును. చాలా కేసుల్లో విభాగ యూనియన్ల సమాఖ్యగానో లేక ఒక సంబంధిత పరిశ్రమ యొక్క మొత్తంగానీ అధిక భాగం గానీ గల యూనియన్‌లోకో చేరిపోవచ్చును. లేక సమాఖ్యలోకో, లేక పరిశ్రమలో అలాంటివి తొలగిన యూనియన్‌లోకో అదే వృత్తులు లేక అలాంటి వృత్తులుగల యూనియన్‌లోకో లేక సామాన్య లేబరు యూనియన్ల సమాఖ్యలోకో చేరిపోవచ్చును."

ఇంగ్లాండులో జనరల్ లేబర్ యూనియన్లు ఉండవచ్చు. అనే విషయం దీన్నిబట్టి తెలుస్తోంది. అంటే వివిధ పరిశ్రమలలో పనిచేసే కార్మికులు ఒకరికొకరుకలిసి, యూనియను ఏర్పాటుచేసుకోవచ్చు. జనరల్ లేబర్ యూనియన్ అంటే అర్థం అది, పరిశ్రమ, లేక వృత్తికి సంబంధించినంత వరకు ఒక కార్మికునికి మరొక కార్మికునికి సంబంధం లేదు. ఒక జనరల్ యూనియన్ ఉండొచ్చు. వివిధ పరిశ్రమలకు చెందిన మనుషులు ఇంగ్లాండులో ఒక యూనియన్ ఏర్పాటు చేసుకోవచ్చని ఈ రచయిత కూడ చెప్తున్నాడు. ఒకతను గనికార్మికుడు కావచ్చు. కాని అతను గనులతో సంబంధంలేని వేరే యూనియన్‌లో చేరవచ్చు. కాబట్టి ఇంగ్లాండులో కార్మికులు ఏతీరులో ఏ పరిస్థితులలో ఎలా సంఘటితం కావాలో చట్టాలు వాళ్లకే వదిలివేశాయి. చట్టం తీసుకున్న జాగ్రత్త ఏమంటే యూనియన్ చట్ట విరుద్ధమైన సంస్థ కాకుండా చూడడం వరకే. యూనియన్ రిజిష్టరు అయ్యే ముందు న్యాయసమ్మతమైన కొన్ని ఆశయాలు చోటు చేసుకొనేటట్లు చట్టం జాగ్రత్త పడుతుంది. ఆశయాలు పరిశీలించడం మినహా యూనియన్ ఒక ప్రత్యేక పంథాలో తయారయిందో, తయారుకాలేదో ఇంగ్లీషు చట్టం పట్టించుకోదు. ఈ సూత్రం ఈ దేశానికి మనం ఎందుకు అమలుచేసుకోగూడదో నాకు అర్థం కావడం లేదు. ఈ బిల్లులో ప్రవేశపెట్టిన సూత్రానికి న్యాయం, హేతువు నాకు కనపడడంలేదు.

అయ్యా, ఒకే పరిశ్రమలో లేక ఒకే వృత్తిలో పనిచేసే కార్మికులందరూ ఒకే యూనియన్‌లో ఉండడం సాధ్యమా? ఈ కారణం వల్ల అదిసాధ్యం కాదు. ఒక ట్రేడు యూనియన్‌కు మూడు ఉద్దేశాలు లేక మూడు ఆశయాలు ఉండొచ్చు. ఇది అందరికీ తెలుసు. ఒకట్రేడు యూనియన్‌కు కేవలం ట్రేడు యూనియన్ ఉద్దేశాలు అనబడినవి మాత్రమే ఉండొచ్చు; అంటే, పనివారికి ప్రయోజనకరమైనవీ, జీతాలు, పనిగంటలు, పరిశ్రమలో ప్రమోషనులు మొదలైనవి వృద్ధిచేసుకోవడం దాని ఉద్దేశాలలో ఉండొచ్చు. అవి కేవలం ట్రేడు యూనియన్ కార్యకలాపాలు. అవి కాక సామాజికోద్దేశాలు కూడ ఉండొచ్చు; అంటే సభ్యులకు నిరుద్యోగభృతి, వాళ్లలో భర్తలు లేనివారికి పెన్షను ఇవ్వడం, వృద్ధాప్యపు పెన్షను ఇవ్వడ మొదలైన ప్రయోజనకరమైనవి పెట్టుకోవచ్చు. ఇవి ఇంగ్లాండులో సామాజిక ఉద్దేశాలుగా గుర్తించబడ్డాయి. వాటితో పాటు ట్రేడు యూనియన్‌కు

రాజకీయ ఉద్దేశాలు ఉండొచ్చు. ఒక ప్రత్యేక రాజకీయ విధానం వృద్ధిచేయడమంటే తన ఆర్థికసాంఘిక స్థితిని రక్షించడానికి అనువైన రాజకీయ ధోరణిని బలపరచడం. ఇపుడు, అయ్యా, నేను అడగదలచిన ప్రశ్న ఇది : ఒక ప్రత్యేక పరిశ్రమలో ఉన్న వ్యక్తులందరికి ఈ మూడు ఉద్దేశాలు అంగీకరించి ఉండడం సాధ్యమా? అవునని చెప్పే అవకాశం అన్ని సందర్భాలలో కనపడడంలేదు. అందుకు కారణం నేను వివరంగా చర్చించాలనుకుంటున్నా. ఇలాంటి కేసు ఒకటి తీసుకుంటా. బొంబాయిలో, వస్త్ర పరిశ్రమలో పనిచేస్తున్న ఒక కార్మిక సంస్థను తీసుకుందాం.నా అంశం నొక్కి చెప్పాలను కుంటున్నాను గనుక నేను ప్రత్యేకంగా ఈ విషయం తీసుకుంటాను. కొందరు మహమ్మదీయ సభ్యులు, పనివారు ఒక మిల్లు పరిశ్రమలో ఉన్నారు. వాళ్ళు ట్రేడు యూనియన్ సభ్యులు కావాలనుకున్నారు. ముస్లింలు కాని వాళ్లకు తమ సంఘ సభ్యులు కాంగ్రెసు ధోరణి రాజకీయం అనుసరించాలని ఉంటుంది. కాని ముస్లిం సభ్యులు ట్రేడ్ యూనియన్‌లో చేరాలని ఉంది. కాని ముస్లిం లీగు రాజకీయ విధానం అనుసరించాలని ఉంటుంది. ఎవరో ఒకరు తమ రాజకీయ కార్యక్రమం వదులుకుంటేతప్ప, ఇరువురు ఒక యూనియన్‌లో కలిసి ఉండడమెలా? మరో ఉదాహరణతీసుకోండి. అంటరాని కులానికి చెందిన కార్మికులున్నారు. వాళ్లకు యూనియన్‌లో చేరాలని ఉంది. వాళ్ల కమ్యూనిటీ ప్రయోజనార్థం యూనియన్ సాంఘిక ఉద్దేశాలను, ఆశయాలను, వృద్ధిచేయాలని వాళ్లకు ఉంటుంది. వాళ్లు కోరే ఇతర ప్రయోజనాలను, మిగతావారు అంగీకరించరు. అపుడు యూనియన్ ఏర్పాటు చేయడమెలా? నాకు తెలియదు. సాధించడానికి వీలులేని కండిషన్ ఎందుకు పెట్టాలో నాకు అర్థం కావడంలేదు. ఇందులో ప్రవేశపెట్టిన బిల్లులో పెట్టిన ప్రతిపాదన తెలివిగా లేక వివేచనతో ఉండేటట్లు ఆలోచించి ఉండాల్సింది. ఒక హెల్తు ఆఫీసరు ఇంటిని ఒకానొక విధంగా కట్టాలని ఆదేశించారనుకోండి. తలుపు అక్కడుండాలి ఉత్తరానికి, కిటికీ ఇక్కడుండాలి, ముఖద్వారం దక్షిణానికి ఉండాలి. ఫలానా ఎత్తు ఉండాలి, చూపుకు ఫలానా నమూనాలాగా ఉండాలి అంటాడు. ఈ నియమాలకు అనుగుణంగా ఇల్లైనా కట్టాలి లేదా వీధిలో వుండాలి. అలాంటి ప్రత్యామ్నాయం ఈ బిల్లు శ్రామికులకు చూపిస్తోంది. సంఘం పెట్టుకొనే విషయం, దాని విధానం ఈ శ్రామికులకు వదిలితే వచ్చేపాపం ఏమిటి? దాంతో మీరు ఎందుకు ఆదుర్దా పడతారు? నాకు అర్థంకాదు. ఒకపరిశ్రమలో పనిచేసే వారందర్నీ ఒకే యూనియన్‌లోకి తేవాలనేది మీరు ఎందుకు, దేనికి? ఎందుకో నాకర్థం కావటంలేదు. నా ఉద్దేశమేమంటే, ముందు చెప్పినట్లు, ఇలాంటి అసాధ్యమైన నిబంధనలు పెడితే, యూనియన్లు పెట్టాలన్న ఆసక్తే వుండదు. ముస్లింలీగు పాలిసీ తమ ట్రేడు యూనియన్ అనుసరించకపోతే దానిలో చేరడం నిరుపయోగమని మహమ్మదీయులనుకుంటే, వాళ్లకు యూనియన్ అక్కరలేదు – వాళ్ల రాజకీయాలు వాళ్లు ఏర్పాటు చేసుకొనే స్వేచ్ఛ వాళ్లకుండాలి అనుకుంటున్నాం. అలాగే అంటరానివారు, తమ పిల్లల చదువుకు, తమ వర్గం అభివృద్ధికి కొన్ని ప్రతిపాదనలు పెట్టుకోవాలనుకొంటే, దానికి అనుమతి ఇవ్వకపోతే, వాళ్లకు యూనియన్‌అక్కరలేదు. అలాంటప్పుడు మీరు సృష్టిస్తున్న పరిస్థితి ఏమిటి? ఏమిటంటే, యూనియను ఉండడానికే వీలులేకుండా ప్రజలమీద ఒత్తిడి తెస్తున్నారు. కాబట్టి ఇది చాలా

దురాలోచనతో నిండిన ప్రతిపాదన అని నేను మనవి చేస్తున్నాను.

ఇక అయ్యా, రెండో అంశం 4 నుండి 20 క్లాజులలో ఉండేది ఇది : ట్రేడు యూనియన్ ఉద్యమ స్థిరత్వంపై ఈ బిల్లు ప్రభావం ఏమిటి? సరే, యజమానుల అదుపునుండి ఎలాగో విడుదలయ్యే ఒక రకం ట్రేడు యూనియను వస్తుందనుకోండి, కాని ఈ బిల్లు ప్రతిపాదనల క్రింద అది పనిచేసే యూనియను అవుతుందా? నేను ఈ బిల్లు అధ్యయనం చేసినంత వరకూ ఒక యూనియన్ నమోదు అయ్యిందంటే, ఆ నమోదు అలాగే కొనసాగుతుంది. 10వ క్లాజు చాలా ప్రమాదకరమైంది. ఆ క్లాజు యూనియన్ మెడ మీద కత్తిలా వేలాడుతుంటుంది. రిజిష్టరు అయినా, దాని ఉనికి చెల్లా చెదురై పోతుంది. ఇవ్వాళ దానికి చట్టబద్ధమైన ఉనికి ఉన్నా రేపు దానికి చట్ట పరంగా ఉనికిలేదు. ఎందుకంటే కొన్ని పరిస్థితులు వచ్చినపుడు ఈ బిల్లు క్రింద దాని నమోదు ఎప్పుడైనా రద్దు చేయవచ్చును. ఒక సారి రద్దు అయిందంటే, ఇంతవరకూ ఎంతో కృషితో, ఎంతో ప్రణాళికతో నిర్మాణం చేసిన మొత్తం కట్టడం కొట్టుకు పోతుంది. అయ్యా, ఇంకా దౌష్ట్యం వుంది ఈ బిల్లులో – నేను అలా చెప్పాల్సివస్తే. ఒక యూనియను నమోదును రద్దు చేయడం విరోధియూనియన్ చేతుల్లోనో, యజమాని చేతుల్లోనో ఉంచడం. అంటే నిరంతరమూ పరస్పర విరోధమూ, పరస్పర ఈర్ష్య, గొంతులు కత్తిరించుకొనే పోటీసాగుతూ వుంటాయి. ఇదంతా విరోధియూనియన్‌ను ధ్వంసం చేయాలని వివిధ యూనియన్ మనుషుల మధ్యసాగుతూ వుంటుంది. ఈ బిల్లు క్రింద నమోదయిన ట్రేడు యూనియను నిరంతరం కొనసాగాలంటే, దానికి ఎప్పుడు 51 శాతం సభ్యత్వం ఉన్నట్లు చూపాలి. కాబట్టి మళ్లీ అతను తర్వాత ఏ యూనియన్‌కు అయినా 51 శాతం సభ్యత్వం ఉండడం సాధ్యమా? సంవత్సరం సంవత్సరం యూనియన్ సభ్యత్వం ఎలా మారుతూ వుంటుందో సభకు చూపిస్తే, ఆసక్తిగా ఉంటుందనుకుంటాను. గ్రేట్ బ్రిటన్ నుండి తీసుకున్న అంకెలు మీముందు ఉంచుతాను. 1892లో మొత్తం ట్రేడు యూనియన్ల సభ్యత్వం 1,576,000. 1910 లో 2,565,000, 1920లో 8,346,000, 1934 లో 4,441,000కి పడిపోయింది. పదిసంవత్సరాలలో 50 శాతం సభ్యత్వం పడిపోయింది. ఒక ప్రత్యేక పరిశ్రమలోని అంకెలు చూడండి. వ్యవసాయంలో 1920లో సభ్యత్వం 210,000. 1932 లో 33,000 మాత్రమే. 210,000 నుండి 33,000 కి పడిపోయింది. 1920 లో బొగ్గుగనిపరిశ్రమలో సభ్యత్వం 1,115,000. 1932 లో 554,000 కి పడిపోయింది. ఖనిజ పరిశ్రమలో 1920లో 1,172,000 1932లో 527,000. భవననిర్మాణ పరిశ్రమలో 1920లో 563,000 ఉండగా 1932లో 275,000 కి పడిపోయింది. ప్రయాణసదుపాయాలు, మరియు సామాన్య శ్రామికుల్లో మొత్తం సభ్యులు 1920లో ట్రేడు యూనియన్ కాంగ్రెసు సభ్యత్వం మొత్తం 6,505,000 కాని 1932 లో 3,613,000. అయ్యా, ఇంగ్లాండ్ లాంటి దేశంలోనే, ఎక్కడ ట్రేడ్ యూనియన్ తత్వం శ్రామికుని ఊపిరో, అక్కడ సభ్యత్వం పదేళ్లలో 50 శాతం తారుమారౌతుంది. ఇలాంటి మన దేశంలో ఏ సంఘం అయినా ఎప్పుడూ 51 శాతం సభ్యత్వం ఎలా ఉంచుకోగలదో నాకైతే అర్థం కావడం లేదు. ఒకశాతం

సభ్యత్వం తగ్గినా యూనియన్ రిజిస్ట్రేషను రద్దు అయిపోతుంది. మొత్తం దుకాణం ఎత్తి వేయాలి. ఇది సహేతుకమైనవిబంధనేనా? ఇది ట్రేడుయూనియన్ ఉద్యమ పెంపుదలను నికరం చేస్తుందా? నమోదు రద్దవుతుందనే భయం రోజు రోజుకూ ఉంటే, ఈ దేశంలో ట్రేడు యూనియనుతత్వం పెరుగుదలకు అవకాశం ఏం ఉంటుంది?

అయ్యా, చింతిల్ల వలసిన మరో విషయం ఉంది. తీవ్రంగా పరిగణించాల్సింది. ఈ బిల్లు క్రింద రిజిస్ట్రేషను రద్దు మళ్లీ తనయూనియను చేయించుకున్నా హక్కు దారుడు మళ్లీ తన యూనియన్ రిజిస్ట్రేషనుకు దరఖాస్తు పెట్టకూడదు. నమోదు రద్దుచేసుకొనే హక్కు నమోదయిన యూనియన్ కార్మికులకు ఉంటే, సభ్యత్వం పెరిగినపుడు మళ్లీ రిజిష్టరు చేసుకొనే అవకాశం వాళ్లకు కల్పిస్తే, అందులో సహేతుకత నేను అర్థం చేసుకోగలను. అది పూర్తిగా అర్థమవుతుంది. బిల్లు 10 వ క్లాజు తన యూనియన్ రిజిష్టరు చేసుకొనే స్థానంలో ఉండనవసరంలేదంటుంది. అంటే తన ఆధీనంలో 51 శాతం సభ్యత్వం లేకపోవడమే. ఈ చెడుపోకడకు కావలసిందేమిటంటే, యజమానినీ, యూనియనునూ దృష్టిలో పెట్టుకొని సభ్యత్వం 50 శాతానికి లోపుగా పడిపోవడమే. నేను చెప్పినట్లు పనీ, లేబరూ హెచ్చు తగ్గులయ్యే పారిశ్రామిక పరిస్థితుల్లో ఈ నిబంధన నిలుపుకోవడం అసాధ్యం.

ఇక, అయ్యా, మరో ప్రతిపాదనకు సభాదృష్టిని తీసుకొని రావలసి ఉంది. నమోదు రద్దయిన యూనియనుకు ఏం కావాలి. మళ్లీ నమోదుకు దరఖాస్తు పెట్టుకోగలదా! లేదు. బిల్లులో 54వ క్లాజు యూనియను కొన్ని పరిస్థితుల్లో రద్దు పోగొట్టుకున్నదని ప్రకటించే అధికారం పారిశ్రామిక న్యాయస్థానానికి ఇస్తున్నది. ఏమంటుందంటే.

"ఈ చట్టం క్రింద ఒక యూనియను యోగ్యమైనదిగానో, ప్రాతినిధ్యం గలది గానో పొరపాటున గానీ, తప్పుచెప్పిగానీ, మోసం వల్లగానీ నమోదయినట్లూ లేక ఈ చట్ట పరిధుల్ని ఉల్లంఘించినట్లూ పారిశ్రామిక న్యాయస్థానం కనుగొన్నదంటే, ఆ యూనియను యోగ్యమైనదిగా గానీ, ప్రాతినిధ్యం గలదిగా గానీ దాని నమోదు రద్దవుతున్నట్లు పారిశ్రామిక న్యాయస్థానం ప్రకటిస్తుంది."

ఇక 8వ క్లాజు చూడండి. నమోదు చేసే విషయంలో ఏ రూల్సూ పాటించాలో చెపుతుంది. నేను చెప్పున్నది చాలా కరెక్టు అని సభకు తెలుస్తుంది. క్లాజు 8 ఈ విధంగా ఉంది:

"7వ సెక్షను క్రింద ఒక యూనియను నమోదుకు దరఖాస్తు అందిన వెంటనే, నియమిత ఫీజు చెల్లించిన మీదట రిజిస్ట్రారు తగిన విచారణ చేస్తారు. అంటే సెక్షను 7లో చెప్పినట్లు నిబంధనలను తృప్తి పరిచిందనీ, ఈ చట్టం క్రింద నమోదుకు అర్హత కోల్పోలేదనీ రిజిస్ట్రారు సంతృప్తిపొందాలి."

క్లాజు 54 క్రింద యూనియన్ అర్హతను కోల్పోలేదనే నిబంధన 8వ క్లాజు నియమిస్తోంది. నేను అడగ దలచిన ప్రశ్న ఇది : ఈ నిరంతర అనర్హత ఎందుకుండాలి? తాత్కాలికంగా అనర్హత

సమ్మతం కావచ్చు. మోసం వల్లా, తప్పుడు సమాచారం వల్లా నమోదు పొందిన వ్యక్తులను కొంతకాలం ప్రొబేషనులో పెట్టాలని వాదించవచ్చును, అది సాధ్యం. అలాంటి ప్రతిపాదనలోని సహేతుకతను నేను అర్థం చేసుకోగలను. కాని మోసం వల్లనో, తప్పుడు సమాచారం వల్లనో నమోదు పొందాడన్న తప్పువల్ల శాశ్వతంగా రిజిస్ట్రారు ముందుకురావడం, తన యూనియన్ నమోదు చేసుకోవడం నిషేధం అని చెప్పే ప్రతిపాదనలోని సహేతుకత నేను అర్థం చేసుకోలేను. 1935 భారత ప్రభుత్వ చట్టంలో ఉన్న ప్రతిపాదనలను ఈ సందర్భంలో ఉదహరించనివ్వండి. భారత ప్రభుత్వచట్టంలో చేయబడిన కొన్ని అనర్హతలను మనం, ఈ సభాసభ్యులం ఎదుర్కోవలసి వుంది. అనర్హతకులోనైన వ్యక్తులు ఎలక్షనులో నిలబడలేరు. కొందరు వ్యక్తులు ఎన్నికైనా, శాసన సభకు సభ్యులుకాలేరు, ఎందుచేతనంటే వారు అనర్హులయ్యారు. అలా అనర్హంకానున్న వారిలో నేనొకణ్ణి, కాని ప్రభుత్వం కలుగజేసుకొని నా సీటు నాకుండేటట్లు రక్షించింది. అలానాకు చెప్పారు. లేకపోతే అనర్హుడనై పోయేవాడిని. భారత ప్రభుత్వ చట్టంలో ఉన్న అనర్హతలు శాశ్వతత్వం కల్గినవికావని చెప్పడానికి చూస్తున్నాను. ఆ అనర్హతలు తాత్కాలికం. కాలపుటలలో ఆ అనర్హతకొట్టుకు పోగానే, సభ్యుడు మళ్లీ అర్హుడవుతాడు. ఎన్నికకోరతాడు. ఈ సభకు సభ్యుడవుతాడు. భారత ప్రభుత్వ చట్టంలో పొందు పరచిన సూత్రం ఇది. అయినపుడు నైతికతకు మచ్చలేకుండా, దుష్టత్వం లేకుండా, ఉండవలసిన విధంగా ఉంటూ, వాళ్లహక్కులు సదుపాయాలు, నిధులు ఈ సభలో నిజాయితీగా అమలు పరచిన వాళ్లు ఎదుర్కొనే అనర్హతలు తాత్కాలికం అయినపుడు, శ్రామికులను వ్యవస్థీకరించే వ్యక్తుల అనర్హతలు శాశ్వతమెందుకు కావాలని నేనడుగుతున్నాను. దానికి సమాధానం లేదు. నిజానికి ఈ ప్రతిపాదన కలకత్తా హైకోర్టు ఫుల్‌బెంచి ఇచ్చిన తీర్పును విఫలం చేస్తోందని నేను చెప్పాల్సివస్తోంది. నేను హడావుడిగా వచ్చినందువల్ల ఆ రిపోర్టును సరిగా చూసే స్థితిలో లేనందుకు విచారిస్తున్నాను. ఒక కేసు ఉంది. అది సభ్యులకు తెలిసి ఉండొచ్చు. కలకత్తాలో అత్యయికాధికారాల చట్టం అమలులోకి వచ్చినపుడు ఒక యూనియన్‌ను, కమ్యూనిస్టులు నిర్వహిస్తున్నారన్న కారణాన అది చట్ట విరుద్ధమైందని రిజిస్ట్రారు రద్దు చేశారు; ఈ సంగతి కార్మిక రాజకీయాలతో కొట్టుమిట్టాడు తున్నవారికి తెలుసు. అత్యయికాధికారాల చట్టంకు సంబంధించిన వరకూ అది న్యాయబద్ధమే. కాని యూనియన్ బాధ్యత చేపట్టిన పెద్ద మనుషులను, కమ్యూనిస్టులను ఈ విధంగా ఓడించలేరు. వాళ్లు మరో పథకం వేశారు. కొత్త పేరుతో నమోదు చేయడానికి మరో దరఖాస్తు పెట్టాలనుకొన్నారు. ఇందులో ఏదో కుతంత్రం వుందని కనిపెట్టిన రిజిస్ట్రారు, ఈ కొత్త దరఖాస్తు తెచ్చిన వ్యక్తి యొక్క యూనియన్‌రద్దయినందున, ఇలా అన్నారు: "నేను ఆచితూచి విచారించాలి." అతను విచారణచేశాడు. మనుషుల్ని, కొత్త యూనియన్ నిర్వాహకమును పరీక్షించాడు. రద్దయిన యూనియన్ పెద్ద మనుషులే, కొత్త యూనియన్‌కు దరఖాస్తు తెచ్చారని కనిపెట్టాడు. "మీరు అదే మనుషులు, నమోదు చేయను" అన్నాడు. వాళ్లు కలకత్తా హైకోర్టుకు వెళ్లారు. యూనియన్ నిర్వాహక మనుషులను

విచారించే పని రిజిస్ట్రారుకు అనవసరమని హైకోర్టు భావించింది. యూనియన్ పెట్టుకొన్న ఉద్దేశాలూ, దరఖాస్తుపై ఏడుగురు సంతకం చేశారా లేదా అనేది మాత్రమే రిజిస్ట్రారు చూడవలసి ఉంది. అంతకు మించి తనకు సంబంధం లేదు. పాత చట్టం క్రింద అదీ పరిస్థితి. అంటే, ఒకసారి అనర్హులు కాబడిన వ్యక్తులు, వాళ్లదారికి చట్టం ఇబ్బంది పెట్టకుండా మళ్లీ నమోదు చేసుకోగలిగారు. ఈ బిల్లు ఆ సదుపాయానికి శాశ్వతంగా గండి కొట్టింది. ఏదోరకమైన తప్పుడుసమాచారమో, మోసమో కలిగిఉన్నారన్న కారణాన సంఘం నిర్మించుకొనే అర్హత లేకుండా చేశారు. ఈ బిల్లు విషయాలను గూర్చి నేను చెప్పదలచినది అంతే.

ఈ బిల్లు శ్రామికులకూ, యజమానులకు మధ్యవ్యవహరించడంలో సమానత ప్రవేశపెట్టిందని చెప్పాలి. కార్మికుల సమ్మెను శిక్షించినట్లే, యజమానుల లాకౌట్‌ను కూడ శిక్షిస్తోంది. ఈ స్థితి నిలబడుతుందనినేననుకోను. ఎంచేతనంటే యజమానికి పనివారికి మధ్య కొంత భేదం ఒకటి రెండు కేసుల్లో ఉంది. ఉదాహరణకు, 28 క్లాజు క్రింద నోటీసు చూద్దాం. యజమాని ఏ మార్పువచ్చినా నోటీసు ఇవ్వాలి (1) స్టాండింగు ఆర్డర్లలోనూ (2) షెడ్యూలు II లో ఉదహరించిన పారిశ్రామిక విషయాల్లోనూ, పనివారివరకు వచ్చేసరికి స్టాండింగు ఆర్డర్లలోనూ, పారిశ్రామిక విషయాల్లోనూ నోటీసు ఇవ్వాలికాని, తప్పనిసరిగా షెడ్యూలు II కి పరిమితంమైకాదు. అది సమానతా స్థితికాదు. హాజరు కావడంలో, యజమాని హాజరు కాకపోయినా శిక్షింపబడడు. యూనియన్ హాజరుగాకపోతే కార్మికుని ప్రాతినిధ్యం తప్పనిసరిగా ఉండాలి, ఎవరూ కాకపోతే కార్మికుల తరుపున లేబరు ఆఫీసరు హాజరవుతారు. సమాధానపడడం కాగానే అగ్రిమెంటుకు కార్మికుడు బద్ధుడుకావాలి. ఒకవేళ సమాధానపరిచే సమావేశాన్ని కార్మికుడు కాదన్నా, ఆఫీసరుద్వారా తన ఆసక్తిని తెలియ జేయడానికి అంగీకరించకపోయినా అగ్రిమెంటుకు అతనికి బద్ధుణ్ణిచేస్తారు. ఇవి స్వల్ప విషయాలు. అదిగాక, నేను కోరేది ఇది. అయ్యా, మనం కోరేది సమానత్వం కాదు, న్యాయం. ఈ సభముందు నేను కాంక్షించేది ఇది. సమానత్వం అనేది తప్పనిసరిగా న్యాయంకాదు. (అభ్యంతరం). నేను దాన్ని రుజువు చేయబోతున్నాను. సమాజంలో న్యాయం కలిగించే నిమిత్తం, సమాజంలో ధర్మంచేకూర్చే నిమిత్తం వివిధంగావున్న మనుషులను అసమానంగా చూడాలి. అంత దూరమెందుకు? ఆదాయం పన్ను విషయం తీసుకోండి. నేను ఆర్థికశాస్త్ర విద్యార్థిని. అందుకని ఈ ఉదాహరణ నామనసుకు వెంటనే తడ్తుంది. మనకు వృద్ధిచెందే ఆదాయంపన్ను ఎందుకుంది? అందరికీ ఒకేవిధంగా పన్ను ఎందుకు వేయడం లేదు? ధనవంతులకు పెద్ద రేటు తోనూ బీదలకు చిన్న రేటులోనూ ఎందుకు మనం పన్ను వేస్తున్నామంటే - పన్నుచెల్లించే సామర్థ్యం ఇద్దరికీ వేరువేరు. అలాంటికేసులో సమానత్వం చాలా అన్యాయం కలిగిస్తుంది. మామూలు కేసుతీసుకోండి. ఇంట్లో చాలా మంది వ్యక్తులున్నారు. అందులో ఒకరు జబ్బు పడ్డారు. అతడు జబ్బునుండి బయట పడడానికీ, నయం కావడానికి అతనికి కోడిచారు ఇస్తాము; అది ఇతరులకు ఇవ్వం. ఆరోగ్యవంతులైన ఇతరులకివ్వకుండా,

అనారోగ్యవంతునికి కోడిచారు ఇచ్చినందుకు తల్లిని ఎవరూ తప్పుపట్టుకోరు. మనకు కావలసింది న్యాయం. బలవంతునీ బలహీనునీ, ధనవంతునీ నిరుపేదనూ, అజ్ఞానినీ తెలివిగల వాణ్ణీ ఒకే విధంగా చూస్తే మనం న్యాయం చేయలేము. రెండు వర్గాలకూ న్యాయంగా చూడాలని గౌరవనీయ మిత్రుడు కోరితే, ఈ బిల్లు సరిపోదు. బిల్లులో ఇంకా కొన్ని విషయాలు ప్రవేశపెట్టాలి. అలాంటి ప్రతిపాదనలు బిల్లులో ప్రవేశపెట్టడానికి సిద్ధంగా వున్నారా అని అడగాలనుకొంటున్నాను.

మన పరిశ్రమల్లో ఈ రోజు ఏం జరుగుతున్నది? ఈ సందర్భంలో నేను భావించేది గుండెవిప్పి స్పష్టం చేయాల్సివచ్చినందుకు చింతిస్తున్నాను. బొంబాయి నగరంలో పార్శీలు నడుపుతున్న మిల్లులు మనకున్నాయి. గుజరాతీయులు నడుపుతున్న మిల్లులున్నాయి. బొంబాయిలో జ్యూసు (యూదులు), లేక ఐరోపావారు నడుపుతున్న మిల్లులున్నాయి. నేను చిన్నప్పుడు, మా కుటుంబసభ్యులు కొందరు పనిచేస్తున్న మిల్లులవద్దకు నేను బ్రెడ్‌తీసుకొని వెళ్లేవాడిని. తరచుగా కాకపోయినా ఈ మధ్య కూడ కొన్ని మిల్లులు చూశాను. ఈ మిల్లుల గురించి చాల ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఈ మిల్లులన్నీ యజమానుల బంధువర్గాల (కజిన్స్)కు స్వర్గసీమలయ్యాయి. వాళ్ల నిర్వాహకులకు ఏదో విధంగా బంధువులయిన కారణాన వందలాది మంది నిరుపయోగమైన వాళ్లను ఉన్నత స్థాయిల్లో నియమించారు. పార్శీ మిల్లుకు వెళ్లండి, అక్కడ అవసరమున్నా లేకపోయినా వందలాది పార్శీలు నియమితులైనారు. గుజరాతీయులు నిర్వహిస్తున్న మిల్లుకు వెళ్లండి. అవసరమున్నా లేకపోయినా వందలాది గుజరాతీయులు నియమితులై ఉండడం చూస్తారు. యూదుల మిల్లుకు వెళ్లండి. అవసరమున్నా లేకపోయినా వందలాది యూదులు నియమితులై ఉండడం చూస్తారు. శ్రామికులు సంపాదించిన పెద్ద మొత్తాలు మిల్లులో నియమితులైన ఈ జనాన్ని పోషించడానికి - వాళ్లు సమర్థులయినా కాకపోయినా వాళ్లు అవసరమున్నా లేకపోయినా - యజమానులు లాక్కొంటున్నారు. పరిశ్రమను అదుపుచేస్తున్నా ఈ జనం అంతా అన్నిరకాల కాగితం వ్యవహారాల ద్వారా పెట్టుబడులు తేల్చి, పొట్టలు పెంచుకొంటున్నారు. కార్మికుడు తనకు తక్కువ వేతనం వస్తుందంటే, పరిశ్రమను అదుపు చేస్తున్నమనిషి అంటాడు "ఇదినా సొమ్ము". ఇదంతా బూటకపు సొమ్ము, స్టాక్ ఎక్స్చేంజి సొమ్ము, స్పెక్యులేటర్స్ (సాహసిక వ్యాపారుల) ద్వారా పెచ్చుపెరిగిపోతోంది. పరిశ్రమల లాభంలో పెద్ద మొత్తం ఈ మనుషులు మింగేస్తున్నారు. మిగిలిన చిన్న మొత్తం నుండి కార్మికులను తమ జీవితాల్ని కొనసాగించుకోమంటున్నారు. గౌరవనీయులు ముఖ్యమంత్రి న్యాయం ప్రవేశపెట్టాలని కాంక్షిస్తే, పరిశ్రమలాభాల్లో మొదటి భాగం కార్మికుల వేతనాలకు పోనివ్వండి. మిల్లు యజమానులు, ఆ మాటకు వస్తే, ఏ పరిశ్రమ యజమానిగాని వార్షిక పద్దు (బడ్జెటు) యివ్వమని చట్టం ద్వారా ఎందుకు అడగరు? ప్రతి సంవత్సరం ప్రభుత్వాన్ని బడ్జెట్ ప్రవేశపెట్టుకుంటున్నారు. ఏటేట మనకు ప్రభుత్వ బడ్జెటు వుంది. దానిద్వారా ఇంతమంది మంత్రుల్ని వినియోగించిందీ, మంత్రులకు ఎంతమంది చప్రాసీలను ఇచ్చింది, డిపార్టుమెంట్లలో

ఎంత మంది సూపరింటెండెంట్లు ఉంది, ఎంతమంది గుమాస్తాలు, అదీ, ఇదీ, మిగతా వన్నీ ప్రభుత్వం తెలియపరుస్తుంది. సిబ్బంది ఎక్కువగా వుంది లేంది ఈ సభ అర్థంచేసుకొనే స్థితిలో వుంది. డబ్బును సద్వినియోగంచేసిందీ లేందీ సభకు తెలుస్తుంది. మిల్లు యజమాని, ఆమాటకువస్తే, ఏ పరిశ్రమ యజమానైనా సంపాయిస్తున్నా డంటే అదంతా తన సొమ్ముద్వారానేగాక ఇతరులు చెమట ఓడ్చడం వల్ల సంపాదిస్తున్నాడు. అలాంటి వారిని తమ నిర్వహణ వివరాలు ఇవ్వమని ఎందుకు ఒత్తిడి చెయ్యకూడదు? ఇది చాలా సమంజమైన కోరిక. దాని ప్రయోజనం ఇది. పరిశ్రమ యజమాని ఒకసారి అలాంటి బడ్జెటును ముందు పెడితే, కార్మికులు విభాగించుకోడానికి మిగిలినది సమంజసమైందో లేక యజమాని మొత్తంలాభంలో పరిమితికి మించిన భాగం తీసేసుకున్నాడో పరిశీలించడానికీ, పరీక్షించడానికి వీలయిన స్థితిలో ఉంటారు. కన్సీలియేషన్ బోర్డు ఉండడం వల్ల ఏం లాభం? యజమానిని ఎకౌంటు పుస్తకం తెమ్మంటే, నిజమైన వ్యవహారమేమిటో పరిశీలించే స్థానంలో కార్మికులను ఉంచనపుడు ఏమిలాభం? నేను సూచించిన విధానం అవలంబిస్తే, కార్మిక వివాదాలు తగ్గిపోతాయి, సఖ్యతగా ఉండటం తేలికవుతుంది, ఎక్కువ పారిశ్రామిక శాంతి ఉంటుంది. అలా నేను నొక్కి చెపుతున్నాను.

(మొదటిది) శ్రామికులను ధనికులను సమాన భూమికపై చూడాలని గౌరవనీయులు ముఖ్యమంత్రికి ఉంటే నేను సలహా ఇచ్చిన భావంలో న్యాయం ఉండేటట్లు చూడదలచితే ఇక ఈ బిల్లు విషయాల్లో మాత్రం న్యాయం వుండదు.

(రెండోది) ధనికులకు శ్రామికులకు మధ్య సమత్వానికి ప్రాతిపదికలేదు. ఎందుకంటే, ఏ వివాదంలోనైనా ప్రభుత్వం ఎప్పుడూ యజమానుల వైపునే వుంటుంది.

సమ్మెలలో పోలీసును ప్రభుత్వం ఉపయోగించడం బట్టి చూస్తే ఇది స్పష్టంగా తెలుస్తోంది. ప్రజాధనం వల్ల, మనం భరించే పన్నువల్ల పోలీసు బలగాన్ని నిలుపుతున్నాము. అది మనందరి ప్రయోజనార్థం ఉద్దేశింపబడింది. ఒక సమ్మెవల్ల శాంతికి భంగం కలిగిందన్నంత మాత్రాన ఏ ప్రభుత్వానికీ పోలీసు బలగాన్ని వాడే అర్హతలేదు. పరిశ్రమలో ఒక ప్రత్యేక విభాగం వల్ల శాంతి భగ్నమైందని చూపించడం అవసరం. శ్రామికుల అహేతుకమైన కోరిక ద్వారా శాంతికి భంగం కలిగితే, వాళ్లకు వ్యతిరిక్తంగా పోలీసు బలగాన్ని వాడడంలో న్యాయం ఉండొచ్చు. అలాగాక యజమాని ఏదో చేసిందాని వల్ల శాంతి భగ్నం అయితే, అది హేతుబద్ధంకాకపోతే, న్యాయానికీ, ధర్మానికి వ్యతిరిక్తమైతే అపుడు శ్రామికులపై పోలీసు బలగాన్ని వాడేహక్కు ప్రభుత్వానికి లేదు. యజమానులు కార్మికుల మధ్య నిజమైన సమత్వం ఈ రెండు ప్రాతిపదికలు చేర్చడం వల్ల కలుగుతుంది. తన బడ్జెట్టును బయట పెట్టమని యజమానిని ఒత్తిడి చేయాలి; కేవలం ఏదో శాంతి భగ్నం అయిందని ప్రభుత్వం శ్రామికులపై పోలీసు బలగాన్ని వాడడం మానాలి. ఇది లేకుండా

ధనికులకూ కార్మికులకూ మధ్య, అధికారం కోసం బేరాలాడే రీతిగా, సమత్వం ఉండజాలదు. మీరు అది చేస్తారా? ఇది మీరు చేస్తే యజమానులు చేజారిపోతారు. చెయ్యకపోతే మీరు శ్రామికులకు మిత్రులు కాలేరు. బిల్లు, ఉన్నదున్నట్లుగా, అనుమతించరాదు. అది కార్మికులకు హాని కలిగిస్తుంది. ఈ బిల్లు ఏం చేస్తుందో కార్మికులకు తెలియదు. కాని బిల్లు అమలులోనికి వచ్చినపుడు, కార్మికుడు బిల్లుతో ముఖాముఖి తటస్థపడినపుడు, ఈ బిల్లు చెడ్డది, రక్తసిక్తమైంది, క్రూరమైన బిల్లు అని అంటాడు. అయ్యా, దాంట్లో నేను పాలు పంచుకోలేను. (చప్పట్లు)



# 44

# విచారణ కమిటీ నివేదిక

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** నేను అయిదు నిమిషాల్లో ముగిస్తాను. ఎంచేతనంటే నేను చెప్పాల్సింది ఎక్కువేమీ లేదు. అయ్యా, అధ్యక్షా, కొత్త తీర్మానం మీద మాట్లాడడానికి లేచేనంటే కమిటీ నాగురించి, మంచి మాటలు చెప్పినదానికి బదులుగా చెప్పమని నన్ను పిలిచిన కారణం కాదని అనుకొంటున్నాను. సమయమూలేదు, నా నిర్ణయం ప్రకారం, ఈ సమ్మె విషయమై నేను తీసుకున్న స్థానం బలపరచడానికి వాదం పొడిగించాల్సిన అవసరమూ లేదు. కాబట్టి, ఆ విషయం, పక్కన పెడతాను. ఇకపోతే నేను మాట్లాడడానికి లేచే నంటే, నా ముందు మాట్లాడినవారి ప్రసంగాలు పక్కదారి పట్టించినవని అనుకోవడం వల్ల; నాముందు ఇద్దరు గౌరవనీయ సభాసభ్యులు మాట్లాడారు. వారి మాటలు ఈ రిపోర్టు ఫలితంగా వచ్చిన ముఖ్యసమస్యల నుండి ఆసక్తిని అపమార్గం పట్టిస్తున్నాయనే అభిప్రాయం కలిగింది. నా నిర్ణయం ప్రకారం మూడు ప్రశ్నలు మనం పరిగణించాల్సి వుంది – నికరంగా రెండు. హోమ్ మంత్రిని ఈ మూడు ప్రశ్నలు అడగడానికని నేను లేచాను. వాదం నిమిత్తం, కమిటీ కనిపెట్టిందానికి ఏ విలువున్నా అల్లర్లు జరిగాయి అని నేను ఒప్పుకుంటాను.

***శ్రీ జమ్నాదాస్ యం. మెహత :*** అవి ఫైండింగ్స్ కాదు, కమిటీ నిమిత్తం కనుగొబడ్డవి.

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అదేమైనాగాని, కమిటీ రిపోర్టు చేసింది ఇది. స్పష్టమైన మాటల్లో చెప్పారు. 84వ పేరా చెప్తుంది :–

"కేవలం సమూహం యొక్క ధోరణి, చర్యలు కాల్పులకు కారణం. ఎల్ఫిన్‌స్టోన్ మిల్లు వద్ద అల్లరికి తుదకు బాధ్యత కార్యాచరణ సమితి సభ్యుల మీద ఉందని మా అభిప్రాయం; దానివల్ల కాల్పులు జరిగాయి. పర్యవసానంగా చావులు తటస్థించాయి; కార్యాచరణ కమిటీ వారు తీవ్ర ప్రచారం ద్వారా సమ్మెను విజయవంతం చేయడానికి నిరక్షరాస్యులైన కార్మికులను హింసకు పాల్పడమని ఆహ్వానించారు."

నేను చెప్పినట్లు, వారి తీర్పు సరైందన్నది నేను పరిశీలించబోవడంలేదు. దాని నిజాయితీని పరీక్షించాలంటే, చాలా మాట్లాడవలసి ఉంటుంది. ఎంచేతనంటే ఈ ఫైండింగ్‌కు ఆధారమైన సాక్ష్యమూ, కార్యాచరణ సభ్యులు చేసేరని ఆరోపించిన ప్రసంగాల సంఖ్య, నా తీర్పు ప్రకారం, ఈ ఫైండింగును బలపరచదు; వాటన్నిటిని ఈ రిపోర్టులో 10వ పేజీ నుండి ఇచ్చారు. నేను చెప్పినట్లు

---

* బి.యల్.ఎ. చర్చలు, సంపుటి 5, పేజీలు 1724–27 తే. 17 మార్చి 1939

ఈ తీర్పును వాస్తవంగా, వాదం నిమిత్తం, అంగీకరిస్తున్నాను. గౌరవనీయులైన హోం మినిస్టర్‌ను నేను అడగదలచిన ప్రశ్న ఇది : ఈ రిపోర్టు నిజమని వారు నమ్ముతున్నారా? ఈ రిపోర్టు నిజమంటే హింసకు సాయపడిన, హింసను ప్రోత్సహించిన కార్యాచరణ సమితి సభ్యులపై వ్యాజ్యం నడిపించడానికి సిద్ధంగా వున్నారా? నాకై నేను మాట్లాడుతూ, కార్యాచరణ సమితితో నాకు సంబంధం ఉన్నంత వరకూ, నేను విచారణకు సిద్ధంగా వున్నాను. ధైర్యం, విశ్వాసం, ఈ సాక్ష్యంలో నమ్మకం ఉన్న ఏ మనిషైనా ముందుకొచ్చి, నాపై నేరం మోపవచ్చు. నా పై విచారణకు నేను సిద్ధం, చట్టం ఏ శిక్షవిధించినా గురికావడానికి తయారుగాఉన్నాను. అది నామొదటి ప్రశ్న. గౌరవనీయ హోంమంత్రిని అడగదలచిన రెండో ప్రశ్న ఇది : అది కూడ విచారణ కమిటీ కనుగొన్న దానిపై ఆధారపడ్డదే? ముందు చెప్పినట్లు, వాదంకోసం కమిటీ రిపోర్టు అంగీకరిస్తున్నాను. కమిటీకి సంబంధించిన ప్రధాన సమస్య ఫైరింగ్ సమర్థించే సమస్య. ఫైరింగ్ న్యాయసమ్మతమని కమిటీ చెప్తుంది. ఫైరింగ్‌కు కారణాలు న్యాయమంటుంది. ఫైరింగ్ న్యాయసమ్మతమని కమిటీ చెప్తుంది. ఫైరింగ్‌కు కారణాలున్నాయంటుంది. ఫైరింగ్ లేకుండా హింస ఆగేది కాదని కూడ అంటుందనుకుంటున్నాను. మరో విధంగా చెప్పాలంటే ఆ ఉద్దేశానికి ఫైరింగ్ సరిగ్గా సరిపోయింది. నా వాదం నిమిత్తం ఫైండింగ్ నిజమని తీసుకొంటున్నాను. గౌరవనీయులు హోం మంత్రిగారిని మరో ప్రశ్న అడుగుతున్నాను. కాల్పుల్లో – పాల్గొన్న పోలీసు ఆఫీసర్లను మామూలు న్యాయస్థానంలో విచారణ జరపడానికి సిద్ధంగా ఉన్నారా? జడ్జి, జూరీ ద్వారా కమిటీ తీర్పును నిలుపుకోగలరా? అయ్యా, చట్టానికి సంబంధించినంతవరకూ మామూలు పౌరునికీ, పోలీసు ఆఫీసరుకూ లేక మిలిటరీ ఆఫీసరుకు మధ్య వ్యత్యాసం ఏమీలేదు. సభా ప్రయోజనం నిమిత్తం ఒక పురాతన డాక్యుమెంటు నుండి ఒక చిన్నపేరా చదువుతాను. ఇది గౌరవనీయులు హోంమంత్రిగారికి తెలుసుననుకొంటాను. అదేమంటే ఫెథర్ స్టోన్ రైట్స్ కమిటీ రిపోర్టు. ఒకే పేరాలో ఇలా వుంది :

"అధికారులకూ, సైనికులకూ ప్రత్యేక సదుపాయాలులేవు, చట్టానికి సంబంధించినంత వరకూ ప్రత్యేక బాధ్యతలకు బద్ధులై లేరు. పౌర శిక్షణ వ్యవస్థీకరించే నిమిత్తం ఒకసైనికుడు కూడ మామూలు పౌరుడే, కాకపోతే ఒక పద్ధతి ప్రకారం ఆయుధాలు ధరించి ఉంటాడు. సైనికుడయి నంత మాత్రాన అనవసరంగా మానవ జీవితం హరిస్తే క్షమార్హుడు కాడు. సైనికుల సహాయం కోరడంలోనూ, కోరకుండా వుండడంలోనూ న్యాయధికారులవిధీ, పోలీసు అధికారుల విధీ ఈ కేసులో ఒకే మాదిరి. తన ఆయుధాల వాడకం ద్వారా సైనికుడు పనిచేస్తాడు. అతడు ధరించే ఆయుధాలు భయంకరమైనవి. జీవితానికీ, అవయవాలకూ భంగం కలగకుండా వాటిని వాడలేరు, శాస్త్ర విధుల అభివృద్ధీ, తుపాకీ మందుసామాగ్రి పరిపక్వతా జరిగిన ఈ రోజుల్లో దూరంగా, బహుశా అమాయకంగా నిల్చున్న వారికి ఏదో చిక్కు, ప్రమాదం లేకుండా, అల్లరిచేసేవారికి విరుద్ధంగా సహాయాన్ని రప్పించడం, ఉద్రిక్త పరిస్థితుల్లో వాళ్లు మధ్యమండడం, పౌరఅధికారానికి గత్యంతరం లేనిదిగా ఉంటుంది."

ఈ దేశపు చట్టం అది. సంక్షిప్తంగా, గొప్ప రాజ్యాంగ చట్ట రచయిత అయిన ప్రొఫెసరు డిస్సే

భాషలో చెప్పాలంటే న్యాయసూత్రం ఇది - పోలీసు అధికారిగాని సైనిక అధికారిగాని పై అధికారి కాల్చమని ఆదేశం ఇచ్చినపుడు వినకపోతే, అతణ్ణి మిలిటరీ కోర్టులో ఉరితీయవచ్చు. వింటే, అమాయకుణ్ణి చంపితే అతణ్ణి జడ్జి, జూరీ ఉరితీయవచ్చు. అతని కేసు పరిస్థితుల అవసరాన్ని బట్టి నిలబడుతుంది. అవసరానికి మించిన బలం వాడాడా అన్న దానిమీద ఆధారపడి ఉంటుంది. నేను వాదించదలచింది ఇది. పోలీసు ప్రవర్తనను సమర్థించిన కమిటీ ఇక్కడ వుంది. గౌరవనీయులు, నా మిత్రుని అడుగుతున్న ప్రశ్న ఇది :

ముగ్గురు సమర్థులూ, గౌరవనీయులూ వ్రాసిన పత్రం ఆయన నమ్మినట్లయితే, దానిలో విశ్వాసం ఉంటే, వాళ్ల మీద నేర విచారణ ఎందుకు జరిపించారు; అది నిజమయితేం? ఒక అవసరం ఉందని అంగీకరించే జూరీ (న్యాయ పంచాయితీ) ఉంటే, ఆధిక్యతలు లేవని అంగీకరించే న్యాయపంచాయితీవుంటే, సరేసరి. న్యాయాధిపతి యొక్క, న్యాయపంచాయితీ యొక్క తీర్పుకావాలి. ఈ విధంగా చెపుతూ, ఇది చేయక పోతే, కార్యాచరణ సమితిపై న్యాయవిచారణ జరుపకపోతే, పోలీసు పై న్యాయవిచారణ జరుపకపోతే, ఈ రిపోర్టుకు కల్పనకు మించిన విలువలేదు లేదా ట్రిబెయిలర్స్ ఆఫ్ టూలీ స్ట్రేట్ వ్రాసిన నవలకన్నా మించి విలువ లేదు (నవ్వులు).

అయ్యా, నేను అడగదలచిన మూడో ప్రశ్న ఉంది. అది సమాచారం నిమిత్తం. అయ్యా, నాకు చాలానమ్మకంగా చెప్పారు, ఈ సమాచారం గౌరవనీయ హోంమంత్రికి అందిస్తున్నారు. కాల్పులు జరిగిన స్థలం సమీపాన ఉన్న స్ప్రింగు మిల్లు మేనేజరు 6.30 ప్రాంతాల్లో ఆరోజున రూ. 200 లు పారితోషికంగా కాల్పుల్లో పాత్రవున్న పోలీసు అధికారులకు పంచిపెట్టారు. ఈ వాస్తవం గౌరవనీయ హోం మంత్రికి తెలిసిందోలేదో. కాని ఇది వాస్తవమని నాకుతెలుసు. తన డిపార్టుమెంటు నుంచి సమాచారం అడిగితే, ఇది వాస్తవమని తెలుస్తుంది. అయ్యా, మిల్లు దగ్గర జరిగిన కాల్పుల్లో పాత్ర వహించినందుకూ లేక అల్లర్లలో పాలు పంచుకొన్నందుకు పారితోషికంగా పోలీసుకు పంచమని స్ప్రింగుమిల్లు మేనేజరు గవర్నమెంటుకు రూ. 200లు పంపించింది వాస్తవమయితే, అయ్యా, అక్కడ హింసవుందని కాకుండా మిల్లు మేనేజరు పోలీసు అధికార్లను తమ పనితాము వెనకాముందుగా చూడకుండా చేయమని డబ్బుతో ప్రోత్సహించినందు వల్లనే కాల్పులకు పాల్పడ్డారని చెప్పడం న్యాయసమ్మతం కాదా? ఇది చాలా సిగ్గుచేటు వ్యవహారపరిస్థితి. ఈ వాస్తవాన్ని గౌరవనీయ హోం మంత్రి తీవ్రంగా తీసుకోవాలని కోరుతున్నాను. ఎందుకంటే, ఇదివాస్తవమైతే, ఈ పోలీసు బలగం వర్గాల మధ్యన్యాయం చేయడానికి రాష్ట్రంచే పోషించబడడం గాక, కార్మికుల ఆందోళనను అణచడానికి ధనిక వర్గం నియమించే బాడుగగూండాల యొక్క, హంతకులయొక్క పక్షాన పనిచేయడానికి పోషింపబడే పోలీసు బలగం అవుతుంది.

అయ్యా, ఈ వ్యవహారం నాకు భయంకరంగా ఉంది. జాయింటు పార్లమెంటు కమిటీ ముందు సాక్ష్యం ఇస్తూ ఒక సమర్థుడైన బ్రిటీష్ ఇండియా ఉద్యోగి చెప్పింది జ్ఞప్తికి వస్తోంది. లేటు సర్ ఎడ్వర్డు థాంప్సన్ సాక్ష్యాన్ని ఉదహరిస్తా. ఆయన కొంత కాలం పంజాబు గవర్నరుగా ఉన్నారు.

కొంత కాలం వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులుగా వున్నారు. రిటైరు అయినాక, ఆయన ఇంగ్లాండులో ఇండియా స్వపరిపాలనను సమర్థించడానికి ఒక సంస్థ మొదలు పెట్టారు. ఈ సభలో అందరికీ తెలుసు, రౌండు టేబుల్ సమావేశం జరిగినపుడు ఇక్కడనుంచి వెళ్లిన సివిలియన్లు రెండు గ్రూపులుగా చీలారు. ఒక గ్రూపు స్వదేశీ పరిపాలన సమర్థించి, మరొకటి వ్యతిరేకించింది. సర్ ఎడ్వర్డ్ థామ్సన్ స్వదేశీ పాలనకనుకూలంగా నాయకత్వం వహించాడు. తన అభిప్రాయానికి బలంగా, ఇండియాకు స్వదేశీ పాలన ఎందుకు కల్గించాలో సాక్ష్యం చెప్పడానికి జాయింటు పార్లమెంటు కమిటీ ముందు కొచ్చాడు. ఇండియా నిమిత్తం ఇండియాలో ఉద్యోగాలు చేసిన వారిలో ఒక భాగం నిజాయితీతో, హృదయ పూర్వకంగా ముందుకు వచ్చినందుకు మేమెంతో సంతోషించాము. కాని ఆయన ప్రవేశ పెట్టిన వాదం నాకు భీతిని అసహ్యాన్ని కల్గించింది. ఆయన ప్రవేశ పెట్టిన వాదం ఏమిటి? ఆయన వాదం ఇది : ఇలా అన్నాడు. "నేను ఐరిష్ మనిషిని. నేను దక్షిణ ఐర్లాండులో ఉంటాను. నేనూ దక్షిణ ఐర్లాండులో 1916, ఆ తర్వాత వచ్చిన తిరుగుబాటు చూశాను." ఐరిష్ స్వయంపాలన విషయంలో ఆయనకునచ్చింది ఇది అని చెప్పాడు : తిరుగుబాటు జరుగుతున్నంతకాలం ఒక ఐరిష్ మనిషిని ఏ ఇంగ్లీషువాడూ పేల్చేవాడు కాదు –



45

# యుద్ధంలో పాల్గొనడాన్ని గురించి –1*

**డా॥ అంబేద్కర్ :** అయ్యా, నేను అభ్యంతర పెడుతున్నాను. నా అభ్యంతరం తీర్మానం చివరి భాగం గూర్చి, అది ఇలా వుంది :–

"రాజ ప్రభుత్వం, భారతదేశం విషయంలో వాళ్ల తరుపున చేసిన ప్రకటనను ధృవీకరిస్తున్నపుడు, ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్ధం చేసుకోనందుకు ఈ శాసన సభ విచారిస్తోంది."

అయ్యా, నేను బాంబే లెజిస్లేటివ్ అసెంబ్లీ రూల్సులో 75వ రూలు మీద ఆధార పడుతున్నాను. తీర్మానాల రూపం, విషయం గురించి చెప్తాంది. ఆ నిబంధన ఇలా వుంది :

"ఈ రూల్సు పరిమితులకులోబడి, సామాన్యప్రజాక్షేమ విషయంలో తీర్మానం ప్రవేశపెట్టవచ్చు.

అయితే ఈ క్రింది నిబంధనలను తృప్తిపరిస్తే తప్ప ఏ తీర్మానమూ అంగీకరింపబడదు, అవి : –

(a) అది స్పష్టంగా ఖచ్చితంగాను వ్యక్తం కావాలి, ఒక నికరమైన సమస్యను తీసుకోవాలి...."

తీర్మానం చివరి భాగం ఖచ్చితంగాలేదు, చాలా సందేహాస్పదంగా వుందని మనవి చేస్తున్నాను. నేనుదహరిస్తున్న తీర్మానభాగం ఏమంటే "రాజప్రభుత్వం ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకోలేదు." ఏ అంశంలో బ్రిటీష్ ఇండియా ప్రభుత్వం ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకోలేదో ఈ సభ తెలుసు కొనే హక్కు వుందని నా మనవి. ఆ విషయంలో ఈ తీర్మాన భాగం సందిగ్ధార్థంతో వుంది. సభా నిర్ణయాలను పాలించే మౌలిక సూత్రాలలో ఒకటి ఏమంటే – సభ తీసుకునే ఏ నిర్ణయభాగం యొక్క వ్యాఖ్యానం కూడా ఇతరులకు వదలరాదు. సభ ఏమని నిర్ణయిస్తుందో దాన్ని ఖచ్చితంగా చెప్పాలి. ఆ అంశంపై నేను ముందు జరిగిన ఒక సంఘటన మీద ఆధారపడతాను. ఆ సంఘటన డైజెస్ట్ ఆఫ్ రూలింగ్స్ ఆఫ్ ది ప్రెసిడెంట్స్, బాంబే లెజిస్లేటివ్ కౌన్సిల్, పేజీ 148 లో పేర్కొనబడింది. రూలింగ్ నెం. 24 ఈ విధంగా చెప్తుంది :

"తీర్మానం ఖచ్చితంగా వుండాలి, సందేహాస్పదంగా కాదు. అర్థం స్పష్టం చేయని సందేహాస్పద తీర్మానానికి కౌన్సిల్‌గానీ ప్రభుత్వంగానీ భాగస్వామి కాకూడదు."

---

* బి.యల్.ఎ. చర్చలు, సంపుటి 7, పేజీలు 1968-69, తే. 25 అక్టోబరు 1939

ఈ రూలింగ్ సందర్భంగా నేను సంపుటి IV (1921) పేజి 772 ను ఉదహరించాను. ఈ రూలింగు ఒక సవరణను బట్టి వచ్చిందని తలుస్తున్నాను. గౌరవసభ్యులు సర్ ధంజిషాహ్ కుపర్ ఒక తీర్మానానికి సవరణగా దానిని ప్రవేశ పెట్టారు. అది సాగునీటి పంపిణీకి సంబంధించింది. "వ్యవహారానికి వీలయినంత వరకు " అమలుపరచవలసిన కొన్ని పరిహారాలు సూచించింది. ఆ సవరణ సందిగ్ధంగా ఉందని అభ్యంతరం వచ్చింది. అందువల్ల సవరణ అంగీకరించలేదు. ఈ తీర్మానానికి సంబంధించినంత వరకూ నేను మాట్లాడుతున్న విషయం ఈ రూలింగు పరిమితిలో ఉందని మనవి చేస్తున్నాను. కాబట్టి ఈ క్రమంలో లేదని ప్రకటించాలి.

***గౌరవనీయ శ్రీ బి.జి. ఖేర్ :*** గౌరవనీయ మిత్రులు మాట్లాడుతున్న నిబంధన ఇక్కడ ఏ మాత్రమూ వర్తించదు. అని మనవి చేస్తున్నాను. ఈ నిబంధన ఏమంటుందంటే తీర్మానం స్పష్టంగానూ, నిష్కర్షగాను ప్రకటితం కావాలి. నా తీర్మానం అంటుందీ : "రాజప్రభుత్వం, ఇండియా విషయంలో వాళ్ల తరుపున చేసిన ప్రకటనను ధృవీకరిస్తున్నపుడు, ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకోనందుకు ఈ శాసన సభ విచారిస్తోంది. కాబట్టి ప్రశ్న ఏమిటంటే, నికరమైన సమస్య ఏమంటే : రాజప్రభుత్వం తరుపున చేసిన ప్రకటనను ధృవీకరిస్తున్నపుడు, ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకోనందుకు ఈ శాసన సభ విచారిస్తోంది".

కాబట్టి ప్రశ్న ఏమిటంటే, నికరమైన సమస్య ఏమంటే : రాజ ప్రభుత్వం తరుపున చేసిన ప్రకటన ఇండియాలో పరిస్థితిని సక్రమంగా చూపిస్తున్నదా? అదీ నికరమైన, నిష్కర్షమైన సమస్య. అందులో అస్పష్టత ఏమీలేదు. అది రూలు 75 (a) ప్రకారం ఉన్న ఒక నికరమైన సమస్య. కాబట్టి గౌరవనీయ మిత్రులు లేవదీసిన అభ్యంతరం ఇక్కడ చెల్లదు. "వ్యవహరించడానికి వీలయినంత వరకు" అని ఇచ్చిన రూలింగ్‌ను నేను అర్థం చేసుకోగలను." ఎందుకంటే దాని అర్థం ఏమైనా కావచ్చు. మనం ఇక్కడ ఒక ప్రకటన తీసుకున్నాము – ఆ ప్రకటన తెలియని విషయం కాదు, ఆ ప్రకటన సభ ముందు ఉంది. ఇంకా.......

***డా॥ అంబేద్కర్ :*** నేను ముఖ్యమంత్రిని వాస్తవపదజాలం చూడమంటున్నా "ఇండియాలో పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకోలేదు"; ఏవిషయంలో బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం పరి స్థితిని సక్రమంగా అర్థం చేసుకోలేదో తెలుసుకొనే అర్హత ఈ సభకు ఉందని మనవి చేస్తున్నాను.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ (బొంబాయి నగరం) :*** అయ్యా, ఈ క్రింది మూడు సవరణలు ప్రవేశ పెట్టాలనుకుంటున్నా. నా మొదటి సవరణ ఇది :

***గౌరవనీయ సభాపతి :*** దాన్ని ఒకే సవరణగా తీసుకుంటున్నా.

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** అయ్యా, నమ్రతతో ప్రవేశపెడుతున్నా ఈ పదాలు తొలగించండి–

"మరియు, ఇంకా ఇండియా అభిప్రాయం పట్ల ఏమీ గౌరవం లేకుండా రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలు, కార్యకలాపాలూ తగ్గిస్తూ చట్టాలు చేశారు, చర్యలు తీసుకున్నారు."

**గౌరవనీయ శ్రీ కె. యం. మున్షీ :** అయ్యా, గౌరవనీయ సభ్యులు డా॥ అంబేద్కర్ నాలుగు సవరణలు ఒక సవరణగా తీసుకుంటామన్న మీ చివరి రూలింగు పట్ల ఒక అభ్యంతరం గురించి. సవరణలో ఒక భాగాన్ని ఈ సభ అంగీకరించడం సాధ్యంగాని మిగతా వాటినికాదు. ఒకటిగా తీసుకుంటే ఇబ్బంది వస్తుంది.

**గౌరవనీయ సభాపతి :** ఒక సవరణగా తీసుకున్న ఓటుకు పెట్టినపుడు రెండుగా విడదీయవచ్చు. సభ కోరిక అది అయితే తప్పకుండా అలాచేస్తా.

***డా॥ అంబేద్కర్ :*** ఇంకా –

"తన రాజ్యాంగాన్ని తయారుచేసుకొనే అర్హత వుంది." అనే పదాల తర్వాత ఈ క్రిందివి కలపండి : –

"అలాంటి రాజ్యాంగ చట్టం అల్పసంఖ్యాక వర్గాల జీవితాన్ని, స్వేచ్ఛను రక్షిస్తుందని ఆ వర్గాలు నియమించిన ప్రతినిధుల ద్వారా తృప్తి చెందిన మీదట ఆ రాజ్యాంగాన్ని అమలుపరచడానికి బ్రిటిషు ప్రభుత్వం అనుమతి ఇస్తుంది."

"ఇండియా పాలన" అనే పదాల తర్వాత, ఈ క్రిందివి కలపండి : –

"దేశ పాలనకు ప్రతిష్ఠితమైన యంత్రాంగంలో. సాధికారిక ప్రాతినిధ్యం ద్వారా తమ మాట చెల్లుబడి అయ్యేటట్లు ఉంగడానికి ప్రస్తావిత వర్గాల యొక్క మౌలిక హక్కును అలాంటి చర్య తగ్గించేదిగా వుండదని పూర్వసిద్ధాంతం చేస్తూ "ఏర్పాట్లతో సహా" ప్రారంభమై "ఇండియా సంబంధించినంతవరకు" అనే పదాలవరకూ ఉన్న మొత్తం భాగాన్ని తగ్గించండి.

ప్రశ్న ప్రతిపాదించబడింది.

**గౌరవనీయ సభాపతి :** సవరణ చేయబడాల్సిన తీరులో ఆ తీర్మానం ఇలా ఉంది : –

"భారతదేశ ప్రజల అనుమతిలేకుండా గ్రేటు బ్రిటన్‌కూ జర్మనీకి మధ్య వచ్చిన యుద్ధంలో బ్రిటిషు ప్రభుత్వం ఇండియాను భాగస్వామిని చేసినందుకు ఈ అసెంబ్లీ మనస్తాపం చెందుతూంది. ప్రస్తుత యుద్ధం తాలుకు నిర్ధారిత ఉద్దేశాలకు పొందికగా భారతదేశ ప్రజల సహకారం పొందేనిమిత్తం ప్రజాస్వామ్య సూత్రాలు ఇండియాకు వర్తింపజేయడమూ, తన ప్రజలచే తన విధానం నడిచేటట్లుచూడడం అవసరమని భారత ప్రభుత్వానికీ తద్వారా బ్రిటిషు ప్రభుత్వానికీ తెలియబరచుమని ఈ అసెంబ్లీ ప్రభుత్వానికి సిఫార్సు చేస్తోంది; ఇంకా– తన రాజ్యాంగాన్ని తాను రూపొందించుకోవడానికి

• బి.యల్.ఎ. సంపుటి 7, పే. 1972, తేది. 25 అక్టోబరు 1939

అర్హత కలిగిన దేశంగా ఇండియాను స్వతంత్ర దేశంగా గౌరవించాలనీ, ఆ రాజ్యాంగ చట్టం అల్పసంఖ్యాక వర్గాల జీవితాన్ని స్వేచ్ఛనూ రక్షిస్తుందని అల్పసంఖ్యాక వర్గాలు నియమించిన ప్రతినిధుల ద్వారా తృప్తి చెందిన మీదట ఆరాజ్యాంగాన్ని అమలుపరచడానికి బ్రిటిషు ప్రభుత్వం అనుమతి ఇస్తుందనీ, ఇంకా దేశపాలనకు ప్రతిష్ఠితమైన యంత్రాంగంలో సాధికారిక ప్రాతినిధ్యంద్వారా తమ మాట చెల్లుబడి కలిగి ఉండడానికి ప్రస్తావిత వర్గాల మౌలిక హక్కును అలాంటి చర్యతగ్గించేదిగా ఉండదని పూర్వసిద్ధాంతం చేస్తూ ప్రస్తుతం సాధ్యమైనంతవరకు. ప్రస్తుత ఇండియా ఏలుబడికి సంబంధించిన సూత్రాన్ని అమలు పరచడానికి తగిన చర్య తీసుకోవాలనీ తెలియపరచమని అసెంబ్లీ సిఫార్సు చేస్తోంది."

★ ★ ★

* ***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, పాయింట్ ఆఫ్ ఆర్డరుకు లేస్తున్నాను. ఈ సవరణ క్రమంగా లేదు. నేను మళ్లీ 75 నిబంధన సబ్–క్లాజు (a) మీద ఆధారపడుతున్నా. తీర్మానం స్పష్టంగానూ, నిష్కర్షగానూ వ్యక్తం కావాలనీ, ఒక నిర్దిష్టమైన సమస్యను తీసుకోవాలనీ సబ్–క్లాజు (a) చెప్తోంది. "ఒక నిర్దిష్టమైన" సమస్య అనే పదాలను నొక్కిచెప్తున్నాను. ఈ సవరణ తీర్మానంలో భాగం అయితే మొత్తం తీర్మానం 75 రూలు సబ్–క్లాజు ( a) ని భంగపరుస్తుంది. ఎందుకంటే ఆ సంఘటనలో తీర్మానం ఒక నిర్దిష్ట సమస్యకంటే ఎక్కువ వాటిని వర్తింపజేస్తోంది. నా ముందు మాట్లాడిన వారు నొక్కిచెప్పినట్లుగా, ఈ తీర్మానం, ఉన్నదున్నట్లుగా, నాలుగైదు వివిధ విషయాల వ్యవహారమైనప్పటికీ, ఈ నాలుగైదు విభిన్న విషయాలూ ఒకే సమస్యనుండి పుట్టాయని ఒప్పుకోవచ్చును. ఆ సమస్య యుద్ధ నీతి గురించి, ఈ దేశం కోరుతున్న ప్రకటన గురించి; మంత్రి వర్గంలో విశ్వాసానికి సంబంధించిన ఈ సవరణ ద్వారా పుట్టిన సమస్య ఒక నిర్దిష్టమైన, స్పష్టమైన, ప్రత్యేకమైన సమస్య. సబ్–క్లాజు (a), 75 నిబంధనలోని విషయాలకు అనుగుణంగా ఉండేటట్లు తీర్మానంలో ఒక భాగంగా విలువకలిగి ఉండజాలదు. అయ్యా, ఈ పాయింటు మీద ఇచ్చిన రూలింగును మీ దృష్టికి తీసుకొస్తున్నాను. అది పేజి 148 లో ఉంది. దాని నెంబరు 23. ఇలా ఉంటుంది :

"పూర్తిగా విభిన్నంగా, ఒకదాని నుండి ఒకటి వేరుగా వున్న రెండు నికరమైన సమస్యలను కలగలిపే దోషం నుండి ఒక తీర్మానం నష్టపోకూడదు."

ఈ రూలింగు సంపుటి II, 1921, పేజి 1425 లో చెప్పబడింది. అలాతీసుకొన్నపుడు స్త్రీ ఓటును గురించి తీర్మానం ప్రవేశ పెట్టబడింది. పాయింట్ ఆఫ్ ఆర్డరు వల్ల తీర్మానం ఒకటైనా రెండు నిర్దిష్టమైన సమస్యలను లేవనెత్తిందని భావించడం జరిగింది. ఒకటి స్త్రీ ఓటు వేసే హక్కు, రెండోది స్త్రీ సభలో కూర్చునే హక్కు. తీర్మానం రెండు నిర్దిష్ట సమస్యలను కల్గించింది గనుక అది క్రమంగా లేదని అప్పటి ప్రెసిడెంటు దాన్ని కాదన్నాడు. ఆకారణం వల్ల, ఈ సవరణను అంగీకరిస్తే,

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 7, పే. 1976, తే. 25 అక్టోబరు 1939.

తీర్మానం క్రమం తప్పుతుందని నా మనవి.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :*** లేదు. మంత్రివర్గం రాజీనామా పార్టీకి సంబంధించిన విషయం. సభకు సంబంధించింది కాదు. కార్యాలయం పట్టుకుకూర్చోవాలా లేదా అనేది కేవలం పార్టీ విషయం. ఈ దేశ ప్రజలు యుద్ధంలో పాల్గొన రాదు అని మంత్రి వర్గం అంటే అది వేరే విషయం. దాని మీద సభ తన అభిప్రాయం వ్యక్తం చేయవచ్చును.

నా గౌరవనీయ మిత్రులు చేసిన సూచన సభ ముందు లేదని నా మనవి – "మంత్రి వర్గంలో తన పూర్తి విశ్వాసాన్ని నమోదు చేస్తూ" అన్న పదాలను తొలగించడానికై సవరణ వస్తుందో లేదో నాకు తెలియదు. ఇప్పుడున్న సవరణపై నేను మాట్లాడుతున్నాను. ఇపుడు సవరణ ఉన్న తీరు రూ 75 లు సబ్ – క్లాజు (a) ను భంగపరుస్తోంది. ఇదీ నా మనవి. మరో తీర్మానం సభముందుంచినపుడు నా వినతి తెలియజేస్తా.

***గౌరవనీయ సభాపతి :*** ఈ సవరణ వల్ల, అది అసలు ఉన్న రీతిలో, తీర్మానంలో ఒకటి కన్నా ఎక్కువ సమస్యలను రేపే ఉద్దేశంలో ఉంది. కాబట్టి "మంత్రి వర్గంలో తనపూర్తి విశ్వాసాన్ని నమోదు చేస్తూ" అన్న పదాలకు మాత్రమే గౌరవనీయ సభ్యుని అభ్యంతరం పరిమితమై లేదు.

☆ ☆ ☆

**డా॥ అంబేద్కర్ (బొంబాయినగరం)** : అయ్యా, సభాధ్యక్షా, నాయక స్థానంలో ఉన్న ఏ ఒక్క సభ్యునికీ 45 నిమిషాలకు మించిన సమయం ఇవ్వనని తీసుకున్న నిర్ణయం నాకు నిరాశ కలిగించిందని ముందుగా చెప్పాల్సి వచ్చింది. ఆమాట మళ్లీ ఇప్పుడే అన్నారు. నా ముందున్న నోట్సు దృష్ట్యా కొంత సమయం పొడిగించమని మిమ్మల్ని అభ్యర్థిస్తూ మొదలుపెట్టాలి. నా ప్రార్థన అసంగతం కాదని నేను చెప్పాలి. ఇంతకు ముందు జరిగినది ఉంది. మహాభారతంలో యయాతికథ మనకు తెలుసు. అతడు ముసలితనంలో దేవయాని అనే యువతిని పెళ్లాడాడు, పెళ్లయిన తర్వాత అనిపించిందీ, ఇద్దరీ మధ్య వయసులో చాలా తేడా ఉందని. కాబట్టి తనకు కొంత యవ్వనం పొడిగిస్తే గాని పెళ్లికి ప్రయోజనముండదని గ్రహించాడు. అటూ ఇటూ చూసి ఎవరైనా ఉదారస్వభావులు తగ్గించుకొని, వారి వయసుని తనకు కలుపుతారేమోనని వెదకడం మొదలు పెట్టాడు. ఎవరూ దొరకలేదు. అదృష్టవశాత్తూ, యువకుడైన తనకుమారుడు పురూరవుడు ముందుకువచ్చాడు. తన యౌవ్వనం తనకే కావాలి. అయినా తండ్రికి కొంత జీవితం సమర్పిస్తానన్నాడు. అయ్యా, నాకూ నా వెనుక ఉన్నవారికీ తండ్రీ బిడ్డల సంబంధం ఉందని నేననుకోవచ్చు; వాళ్ల సమయం కొంత తగ్గించుకొని నా సమయానికి కలపడానికి సమ్మతిస్తారని మీకు హామీ ఇస్తున్నాను. ఈ బేరం మీరనుగ్రహిస్తేగాని, అనుమతిస్తేగాని అలా కలపడం కుదరదు. ఈ కలపడం అవసరం కాకపోవచ్చు, పరిస్థితులు మారి కలపడం ఆవశ్యకం కావచ్చు; చివరికి ఎలాగూ మీరు మంజూరు చేస్తారన్న ఆశతో నేను సాగిస్తున్నాను.

అయ్యా, గౌరవనీయులు ముఖ్యమంత్రి ప్రవేశ పెట్టిన తీర్మానం ప్రసావిస్తూ, ఈతీర్మానం, నా మనసుకు, అసమంజసంగా, అసందర్భంగా కనిపిస్తుందని చెప్పక ఉండలేకున్నాను. ఈ తీర్మానం ఒక ప్రకటన చేయమని సభను డిమాండు చేస్తోంది; ఆ కోరికలు నెరవేరనపుడు ఇంకా ముందుకు సాగి ఒక పద్ధతిని మంజూరు చేయమని ఈ సభను ఆహ్వానిస్తోంది. ఈ కోరికలు ఎవరు కోరారో ముందుగా నాకు తెలుసు కోవాలనివుంది. వైస్రాయివారి నడిగిన ఈ కోర్కెలు ఈ సభకోరినవికావు. వైస్రాయి వారికి డిమాండ్లు పంపించేముందు వాటిని దేశం పేరుతో, చర్చకై ముందుంచడానికి ఈ సభ తగిన స్థలమనీ, సభ సపోర్టు తీసుకోవాలనీ ముఖ్యమంత్రి అనుకోలేదు. మనకిప్పుడు తెలిసిన ఆ కోరికలు గౌరవనీయులైన ముఖ్యమంత్రి పేరుపెట్టిన తన "హైకమాండు" ప్రతిపాదించింది. అదేమీకాదు, మంత్రుల సాహసకార్యాలు తనిఖీ చేసే విజిలెన్సు కమిటీ అని నేనంటాను. (నవ్వులు).

ఆ కోరికలు ఉంచాల్సిన సరైన స్థలం ఇది అని నేను మనవి చేస్తున్నాను. వారది చేయాలనుకోలేదు. వాటిని ముందు పెట్టారంటే, ఈ చట్టానికి తెలియని ఎవరో, ఈ సభ గుర్తించని ఎవరో వాటికి ఆమోద ముద్ర వేశారు. అది జరిగాక, ఇప్పుడు మెల్లిగా సభకువచ్చి ఇలా అంటున్నారు : "సరే, ఆ విషయం తికమక అయింది, మమ్మల్ని ఆదుకోండి." అని ఇది చాలా అవమానకరమైన పద్ధతి అని మనవి చేస్తున్నాను.

ఈ తీర్మానం గురించి నేను చెప్పే రెండో విషయం :

ఈ తీర్మానం ఒక విధంగా ఒక ప్రకటన కోరుతున్నది.

అయ్యా, ఇపుడు వైస్రాయిగారు ఒకరకమైన ప్రకటన చేశారని నాకు అనిపిస్తోంది. ఆ ప్రకటన ఇండియా ప్రజలకు ఈ నెల 18న తెలిసింది. దాని తర్వాత ఏడు రోజులు గడిచాయి. ఇపుడు సభ చేయగలిగిందేమంటే ఆ ప్రకటన సంతృప్తికరమైంది కాదని. అభిప్రాయం వ్యక్తం చేయడమే, కాని తీర్మానం అలా చేయడం లేదు. ఒక ప్రకటన ఉన్నప్పటికీ ఆ ప్రకటన అంగీకారమైనదో కాదో చెప్పకుండా గౌరవనీయ ముఖ్యమంత్రి తన తీర్మానంలో తనకు తోచినట్లు పద ప్రయోగం చేశారు. మరో ప్రకటన ఇంకా చెయ్యాలా అక్కర లేదా అనీ కూడ చూడకుండా పదప్రయోగం చేశారు. ఇదంతా అల్ప విషయంగా తోస్తుంది. అయ్యా, నేను ఆ సందిగ్ధంలో ముందుకు సాగడం లేదు. ఎందుకంటే, గౌరవనీయ మిత్రులు ముఖ్యమంత్రిగారు ఈ తీర్మానం వివాదాస్పద విషయంగా భావించ వద్దని ప్రతిపక్ష సభ్యులను కోరిఉన్నారు. కాని ఒక కుక్క మరో కుక్కను తినే అవకాశం ఎప్పుడోకాని రాదు కదా! ఈ తీర్మానం ఒక కుక్క మరో కుక్కను తినగలదని చూపిస్తోంది. ఏమయినా గౌరవనీయ ముఖ్యమంత్రి గారి ఆహ్వానానికి స్పందించదలచాను. వివాదాస్పదం కాని విషయంగా టేబిల్ మీద ఉంచిన తీర్మానాన్నీ, దాని సవరణలను పరిగణించడానికి సిద్ధమయ్యాను.

అయ్యా, ఈ తీర్మానంపై ఉన్నదున్నట్లుగా కొన్ని వ్యాఖ్యానాలు చేయబోతున్నాను, అలాగే సవరణలపైన కూడా. ఏ అంశంలో తీర్మానంతో నేను ఏకీభవిస్తున్నానో సభకు ముందుగా తెల్పాలనుకుంటున్నాను. తీర్మానం ప్రకారం ఇండియా ప్రజల సమ్మతిలేకుండా గ్రేట్‌బ్రిటన్‌కూ జర్మనీకి మధ్యయుద్ధంలో ఇండియా పాల్గొనేటట్లు చేశారు. దీంతో నేను హృదయపూర్వకంగా ఏకీభవిస్తున్నాను. నేను మరో అడుగు ముందుకు వెళ్లే వాడిని. ఎందుకంటే పరిస్థితి నిజంగా చాలా అస్తవ్యస్తంగా ఉంది. ఇక్కడ మనం బ్రిటిషు మంత్రివర్గం యొక్క రథచక్రానికి కట్టుబడి వున్నాం. బ్రిటిషు మంత్రివర్గం తన మొత్తం మహారాజపు విదేశీ విధానాన్ని అదుపుచేస్తోంది. విదేశీ విధానం తయారు చేసేటపుడు ఈ దేశానికి మాట్లాడే అవకాశంలేదు. యుద్ధ ప్రకటనలో ఈ దేశానికి మాట్లాడే అవకాశం లేదు. శాంతి నిబంధనలు పరిష్కారంలో ఈ దేశానికి అవకాశం లేదు. బహుశా పబ్లిక్‌వ్యక్తులకు కొందరికి ఆహ్వానం అందించి వుంటారు. శాంతి ఒప్పందం సంతకం చేసిన వెర్సెయిల్స్‌కి లేక వేరే చోటికి వెళ్లి, పత్రాలమీద తమ సంతకాలు పెట్టడానికి. అంతకు మించి, ఈ దేశానికి, ఏ స్థానమూ లేదవేది

ఖాయం. అది నిజంగా అస్తవ్యస్త పరిస్థితి. గ్రేటు బ్రిటను విదేశీ విధానంలో పాలుపంచుకొనే హక్కు ఇండియాకు ఎక్కువగా ఉంది. రాచరిక వ్యవస్థల కన్నా చాల ఎక్కువగా వుంది. గౌరవనీయ ముఖ్యమంత్రి తన ప్రసంగంలో ప్రస్తావించినట్లు వెస్ట్‌మినిస్టర్ చట్టం క్రింద డొమీనియన్ మధ్యస్థంగా వుండేటట్లు తనకు తాను ప్రకటించుకొనే హక్కు ఉంది; యుద్ధ పర్యవసానాల నుండి తొలగించమని ప్రకటించుకోవచ్చు; ఎందుకంటే యుద్ధం జరగడానికి తాను కారణం కాదు కాబట్టి. దురదృష్టవశాత్తు మనకు ఇపుడు డొమీనియన్ స్థాయి లేదు. మధ్యస్థంగా వుండేటట్లు ప్రకటించుకొనే హక్కు మనకు లేదు. మన ఇచ్ఛ, మన సమ్మతి లేకుండా ఈ వధలోకి మనం లాగబడ్డాం; పరిస్థితి ఇది అయితే, మనల్ని నిరంతరం సంప్రదించాలని నొక్కి చెప్పడంలో డొమీనియన్‌కు ఉండే హక్కు కన్నా ఎక్కువ హక్కు ఉందని అంటున్నాను. కాబట్టి, తీర్మానం యొక్క ఈ భాగానికి సంబంధించినంత వరకూ నా పూర్తి సమ్మతిని తెలియజేస్తున్నాను.

నేను ప్రస్తావించదలచిన మరో విషయం ఉంది. తీర్మానం చెప్పున్నట్లుగా, తన సమ్మతి లేకుండా ఈ దేశం యుద్ధంలో చిక్కుకున్నా, తనను కాపాడుకొనే విషయంలో, ఏ మాత్రమూ ప్రతిఘటించుకొనే స్థితిలో లేదు. ఈ దేశ ప్రతఘటన సమస్యవచ్చినపుడు, సైన్యం ఏది? నౌకాదళమేది? ఈ దేశాన్ని రక్షించగల నమూనాలేవి? రౌండు టేబిల్ సభ్యునిగా నాకు గుర్తుంది; మేము ఒక సూత్రానికి పోరాడాము, ఇండియా సంరక్షణ గ్రేటు బ్రిటను బాధ్యతగా గుర్తించాలని పోరాడాము; తమను తాము కాపాడుకోవటం ఇండియా ప్రజలకు నేర్పాలని కోరాము. ఇండియా ప్రభుత్వ సంరక్షణ విధానం చూస్తే మేము సూచించిన మార్గంలో ఎలాంటి సంతృప్తికరమైన చర్యలు తీసుకోలేదు. నేనిది చెప్పడానికి విచారిస్తున్నాను. ఆ సూత్రం నెరవేర్చడానికి సంబంధించినంత వరకూ వాళ్ల విధానంలో ఏమీ కనపడడంలేదు. కాబట్టి అదికూడ ఇండియా చేయగల న్యాయ సమ్మతమైన ఆరోపణ అని అనుకుంటున్నాను. నేను ప్రభుత్వంతో ఏకీభవించే అంశాలు ఇవి; నా సమ్మతి అంతటితో ఆగిపోతుందని చెప్పడానికి విచారిస్తున్నాను.

అయ్యా, నేను నాలుగు సవరణలు సభముందు పెట్టాను. అవి మూడు, వాస్తవానికి నాలుగు. మైనారిటీ హక్కులకు సంబంధించిన రెండు సవరణలు కలిపి తీసుకుంటా. మిగతావి వేరుగా తీసుకుంటా. సభకు వాటిని మళ్లీ చదివి వినిపించాలని లేదు. ఎందుకంటే సమయం ఆదాచేయాలనుకొంటున్నా. సవరణలేమిటో సభకు బాగా తెలుసు. సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగ చట్టంలో ఇమిడి ఉన్న సూత్రాల పట్ల మన దృష్టిని నిలుపుతూ గౌరవనీయ ముఖ్యమంత్రి తన ప్రసంగం ముగించారు. సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగ చట్టం నుంచి ఒక పేరా చదివి వినిపించారు. అది ప్రజాస్వామ్యానికి, జీవితానికి, స్వేచ్ఛకూ, సుఖసాధనకూ సంబంధించింది. ప్రజాస్వామ్య సూత్రాలతో కూడి ఉన్న పురాతనమైన మానవతా విలువలుగల రాజ్యాంగం పట్ల గౌరవం చూపాలని ప్రతిపక్ష సభ్యులకు సిఫార్సు చేశారు. అయ్యా, దక్షిణ అమెరికాకు సంబంధించిన విషయాల పరిస్థితిని గౌరవనీయులు ముఖ్యమంత్రిగార్కి గుర్తుచేసే స్వేచ్ఛ నా వంతుగా నేను తీసుకోదలచాను. ఆయన

ఉత్తర అమెరికాను ఉదహరించారు. నేను దక్షిణ అమెరికాను ఉదహరించబోతున్నాను – అవి పరస్పరం సన్నిహితంగా ఉన్న దేశాలు. గౌరవనీయులు ముఖ్యమంత్రికి ఒక విషయం గుర్తుకు వస్తుందనుకుంటా. బ్రెజిల్ మరియు ఇతర స్పానిష్ అమెరికా కాలనీ రాజ్యాలు స్పానిష్ సామ్రాజ్యం నుండి వేరైనపుడు, వాళ్ల రాజ్యాంగం వాళ్లే వ్రాసుకోవాలని తలపోశారు. తమ రాజ్యాంగం ఎలా వ్రాసుకోవాలో వాళ్లకు తెలియలేదు. దాని ఫలితంగా వాళ్లు ఒక వ్యక్తి సహాయం కోరారు. ఆయనెవరో గౌరవనీయ ముఖ్యమంత్రి గారికి బాగా తెలిసే వుంటుందనుకుంటా. వాళ్లు చేసింది ఇది – జెరెమి బెంతన్ తో ప్రస్తావించారు. జెరెమి బెంతన్ ప్రతిలాయరుకు తెలిసి వుంటాడు. బయటివాళ్లకు తెలియక పోయినా. జెరెమి బెంతన్ గొప్ప శాసన సభ్యుడు. సూత్ర సముదాయాల రచనలో తలమునకలైనవాడు. వస్తుసమ వర్గీకరణ / లేక అవయవానురూప వర్గీకరణలో నిమగ్నమైన మనిషి. సంపూర్ణ సహేతుకతపై ఆధారపడి ఇంగ్లీషు చట్టాన్ని సంస్కరించాలనుకొన్నాడు. దేన్నీ నమ్మకుండా హేతువును అమలుపరిచే మనిషిని, పని చేయడమే ప్రధానమని నమ్మిన వాడిని తమ రాజ్యాంగం రూపొందించమని అడగడానికి అర్హుడని దక్షిణ అమెరికా కాలనీలు భావించాయి. సంక్షిప్త విషయాలతో వేగుల్ని పంపించారు. మామూలుగా రాజ్యాంగం వ్రాయడానికి సలహానిమిత్తం అలా గుర్తులు పెట్టి పంపిస్తారనుకుంటా. దక్షిణ అమెరికాలో లెక్కలేనన్ని కాలనీలున్నాయి. అన్నీకూడ పూర్వ స్పానిష్ సామ్రాజ్యం నుంచి చీలిపోయాయి. దక్షిణ అమెరికాలో ఈ కొత్త దేశాలకు రాజ్యాంగాలు రాసే అవకాశం పట్ల జెరెమి బెంతన్ ఉత్సాహపడ్డాడు. అతడు చాలా కష్టపడి, చాలా వివరమైన రాజ్యాంగ పత్రాలు రూపొందించాడు. ముఖ్యమంత్రి గారు చిరునవ్వులు చిందిస్తున్నారు. నేను గమనిస్తున్నాను, ఎందుకంటే వారికి వాస్తవాలు తెలుసు. అయ్యా, జెరెమి బెంతామ్ తయారుచేసిన రాజ్యాంగ పత్రాలన్నీ ఓడకు ఎక్కించారు. ప్రజల జీవితాన్ని స్వేచ్ఛనూ కాపాడే నిమిత్తమున్నూ, ప్రజాస్వామ్య సూత్ర గానం నిమిత్తమున్నూ వాటిని దక్షిణ అమెరికాకు ఎగుమతి చేశారు. అవి చేరాక, దక్షిణ అమెరికా ప్రజలు కొద్ది సంవత్సరాలు వాటిని ప్రయోగించారు. తర్వాత జెరెమి బెంతన్ చేసిన ప్రతి రాజ్యాంగం ముక్కచెక్కలై పోయింది. మిగిలిన ప్రతులతో ఏం చేయాలో వాళ్లకు తెలియలేదు; వాటన్నిటిని ప్రజాసమక్షంలో తగలేయాలని దక్షిణ అమెరికా ప్రజలందరు నిశ్చయించుకున్నారు.

అయ్యా, నేను నొక్కి చెప్పాలనుకున్న అంశం ఇది : ఈడుజోడుగ రాజ్యాంగం సరిపోయేదిగా వుండాలి. సరిపోని రాజ్యాంగం రాజ్యాంగమేకాదు – రాజ్యాంగం కానేరదు. ఉదాహరణకు, పల్చని శరీరంపై గౌరవనీయులు హోంమంత్రి ధరించిన కోటు స్థూలకాయం మోస్తున్న నాకు సరిపోదు(నవ్వులు). సరిపోతుందా? గూని వానికి కుట్టిన కోట్లు మామూలు మనిషికి సరిపోతుందా? (నవ్వులు). నేల మీద స్థిరంగా, తిన్నగా కాలు ఊనేవానికి సరిపోయే చెప్పు వంకర కాలువానికి సరిపోతుందా? సరిపోదు. కాబట్టి మనం ప్రజాస్వామ్యం గూర్చి మాట్లాడేటప్పుడు, వాస్తవాలకు సరిపోయిన సిద్ధాంతాల గురించి మాట్లాడాలి. నేను ఇపుడు వివరించబోయే అంశం ఇది : ప్రజాస్వామ్య సూత్రం ఇండియా ప్రజలకు సరిపోతుందా?

ప్రజాస్వామ్య సూత్రాలంటే వారేమనుకుంటున్నారో వివరిస్తూ గౌరవనీయ మిత్రులు ముఖ్యమంత్రి మనకు తెలపలేదు. ఆయన ఉద్దేశం ప్రజాస్వామ్యమంటే అధిక సంఖ్యాకుల పాలన అని నేను గ్రహిస్తున్నాను; ఎందుకంటే అధిక సంఖ్యాక పాలన ప్రాథమిక కార్యాచరణ సూత్రమని మనం అంగీకరిస్తే తప్ప, రాజకీయ ప్రజాస్వామ్యం ఉండజాలదు. విస్పష్టంగా అదీ మూలం, అదీ భూమిక, ఈ సమస్య చర్చించడానికి మనం ముందుకు సాగవలసిన మార్గం అది.

అయ్యా, ఒక పరిశీలనతో అందరూ అంగీకరిస్తారను కుంటాః అది ప్రతిపక్ష నాయకుడు చేసిన పరిశీలనాంశం; ఉన్న వాస్తవాల దృష్ట్యా, ఈ దేశంలో మార్పుచెందనిది ఒకటి వుంది; ఆ మార్పు లేనిదేమంటే, హిందువులు అధిక సంఖ్యాకులుగా వుంటారు, మహమ్మదీయులూ, దళితజాతులూ అల్ప సంఖ్యాకులుగా ఉంటారు. అది నిర్వివాదమైన వాస్తవమని నా మనవి; ఇష్టం ఉన్నా లేకపోయినా ఈ వాస్తవం మాత్రం మనం అందరమూ అంగీకరించాలి. ఇపుడు నా మనసులో ఉన్న సమస్య చాలా సామాన్యమైంది; దాన్ని నేను ఈ దేశంలో అస్పృశ్యులనబడిన వాళ్ల దృష్ట్యాంశం నుండి పరిశీలించబోతున్నాను. ఈ ప్రజాస్వామ్యంలో మనం ఆక్రమించే సంబంధిత స్థానమేమిటో నమోదు చేయమని ఈ సభను అడుగుతున్నాను. ముఖ్యమంత్రి ఈ దేశంలో స్థిరపడాలనుకునే ఈ ప్రజాస్వామ్యం క్రింద, ఒకటి మాత్రం మార్పు చెందనిది; హిందూ మెజారిటీ ఉంటుంది; ఈ నేలపై అంతటా చెల్లా చెదరై ప్రతిగ్రామంలో చెల్లా చెదరై, నేను చెప్పాల్సివస్తే, ఒక అనుబంధం ఉంటుంది – అంటే కొన్ని గుడిసెల గుంపులు/ గూడెంలూ అస్పృశ్యులనబడే ప్రజల మట్టి గుడిసెలూ ఉన్నాయి. ప్రతిగ్రామంలోనూ ఒకదాన్ని ఒకటి అంటిపెట్టుకొని కాలనీ ఉంటుంది. అందులో హిందువులు, ఒక మహర్వాడ, లేక ఒక చంభర్వాడ, లేక ఒక భంగీవాడ లేక ఏ పేరు పెట్టినా ఒకటి ఆకాలనీకి అంటిపెట్టుకొని వుంటుంది. అది మార్పులేని వాస్తవం.

నన్ను ఇపుడు గౌరవనీయ సభ్యుడు ప్రజాస్వామ్యానికి తలవొగ్గ మంటారు. ఈ మెజారిటీ నా పట్ల ఎలా ప్రవర్తిస్తుందో దాన్ని బట్టి నా సమాధానం ఉంటుంది; ఇలా చెప్పడానికి నా మిత్రుడు అనుమతిస్తాడనుకుంటా. ఇది సహించదగ్గ మెజారిటీనా? మెజారిటీ సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వాలను గుర్తిస్తుందా? ఈ మెజారిటీ నన్ను బ్రతకనిస్తుందా, ఊపిరి పీల్చుకోనిస్తుందా, పెరగనిస్తుందా?

**గౌరవనీయులు శ్రీ బి.జి. ఖేర్ః అవును, జరగనిస్తుంది.**

**డా॥ అంబేద్కర్ ః** ఈ మెజారిటీ వ్యక్తిత్వం ఏమిటి? పరిగణించవలసిన సమస్య అదొక్కటే. గౌరవనీయులు నా మిత్రుడు "అవును" అని చెప్పాడు. కాని వాస్తవాలు చూద్దాం. నేను గత, పురాతన చరిత్రలోకి ప్రయాణించేయ బోవడంలేదు; 1929 సంవత్సరంనుండి మొదలు పెట్టాలనుకుంటున్నా. 1929లో బొంబాయి శాసన మండలి ఒక తీర్మానం చేసి, దళిత వర్గాలు, ఆటవిక జాతులనబడిన వారి బాధలు పరిశీలించడానికి ఒక కమిటీని వేశారని ఈ సభకు తెలుసు. ఆ కమిటీకి ఒక ఆఫీసరు

అధ్యక్షత వహించారు. ఆయన పేరు శ్రీ స్టార్టే. నేరస్థజాతుల విషయం ఆయన అజమాయిషీలో ఉంచారు. ఆ కమిటీలో నేనొక సభ్యుణ్ణి, సహోదరుడు డా॥ సోలంకి ఒక సభ్యుడు, మిగతా వారు హిందువులు. ఒక వ్యక్తి గూర్చి ప్రత్యేకంగా ఉటంకిస్తాను. ఈ కమిటీకి అతడు సభ్యుడై ఉన్నాడు. ఎవరంటే శ్రీ ఠక్కర్. ఎందుకంటే గౌరవనీయులు నా మిత్రులు ముఖ్యమంత్రిగారు, నా సాక్ష్యం కన్నా, డా॥ ఠక్కర్ సాక్ష్యం ఎక్కువ మక్కువతో అంగీకరిస్తారని నాకు తెలుసు. అయ్యా, ఇపుడు, 1928లో దళితజాతుల వారి పట్ల హిందువుల్లో అత్యధికుల వైఖరి, ఏమిటి? ఆ రిపోర్టునుండి ఒక పేరా చదవడానికి మీ అనుమతి తీసుకుంటున్నా, రిపోర్టు 102 వ పేరా ఇలా చెపుతుంది :

"దళిత జాతులు ప్రజాసాధనల ద్వారా హక్కులు పొందడానికి అనేకరకాల పరిహారాలు సిఫార్సు చేసినప్పటికీ ఎక్కువ కాలంగా వాటిని అమలు పరచే మార్గంలో ఇబ్బందులున్నాయని భయపడుతున్నాము. దళితజాతులపై సనాతన వర్గాల ప్రత్యక్షహింస ఉంటుందనే భయం మొదటి ఇబ్బంది. ప్రతి గ్రామంలోనూ దళిత జాతులు చిన్న మైనారిటీగా ఏర్పడివున్నారనేది గుర్తుంచుకోవాలి; వాళ్లకు విరుద్ధంగా సనాతనులు గొప్ప మెజారిటీలో ఉన్నారు. ఎలాగయినా సరే దళితజాతుల వారు తమపై దాడిచేస్తున్నారన్న అపోహతో తమ ప్రయోజనాలనూ హోదానూ, కాపాడుకోవటానికి సిద్ధంగా వుంటారు. పోలీసుల విచారణకు లోబడాలనే ప్రమాదం సనాతనవర్గాల హింసను అదుపుచేస్తోంది. పర్యవసానం, అలాంటి కేసులు అరుదు.

"రెండో ఇబ్బంది ఏమంటే – అది దళిత జాతుల వారి ప్రస్తుత ఆర్థిక పరిస్థితి వలన కలుగుతోంది. రాష్ట్రంలో ఎక్కువ భాగంలో దళితజాతుల వారికి ఆర్థిక స్వాతంత్ర్యంలేదు. సనాతన వర్గాల భూములను, వారి దయాదాక్షిణ్యాలపై కొందరు దళితులు వ్యవసాయం చేస్తున్నారు, కమతాదారులుగా, ఇతరులు సనాతన వర్గాలచే నియమింపబడి రైతుకూలీలుగా తమ జీవనాధారం కోసం బతుకుతున్నారు. మిగతా వాళ్లు గ్రామ సేవకులుగా, సనాతనులకు సేవ చేసినందుకు వాళ్లు ఇచ్చే ఆహారంమీదా, లేక ధాన్యం మీదా బ్రతుకుతున్నారు. సనాతన వర్గాలవారు తమ ఆర్థిక ఆయుధాన్ని గ్రామాల్లో దళితుల మీద ప్రయోగించిన అనేక సందర్భాల గూర్చి విన్నాం; దళితులు తమ హక్కులు వినియోగించుకొనే సాహసం చేసినపుడు వాళ్లను భూముల నుండి వెళ్లగొట్టారు. నిషేధాలు విధించారు, సామాన్యంగా అందరూ నడిచే దారుల మీద నడవకుండా పెద్దఎత్తున అడ్డగించారు, ఊరి కోమటి నుండి జీవితావసరవస్తువులు కొనుక్కోవటం నుండి మొత్తంగా ఆపేశారు. సాక్ష్యాల ప్రకారం దళితుల్ని సాంఘిక బహిష్కరణ ప్రకటించడానికి కొన్ని సమయాల్లో స్వల్ప కారణాలు చాలు. దళితులు ఉమ్మడి బావిని వాడుకొనే హక్కు వినియోగించుకొనే సందర్భాలలో సాంఘిక బహిష్కరణ తరచుగా జరుగుతుండేవి. ఒకదళితుడు జందెం వేసుకున్నాడనో, ఒక చిన్న భూమి కొన్నాడనో, మంచి బట్టలు లేక ఆభరణాలు ధరించాడనో లేక పెళ్లికొడుకుతో గుర్రం మీద ప్రజావీధిలో పెళ్లి ఊరేగింపుచేశాడనో బహిష్కరణ విధించిన కేసులు ఏమీ తక్కువేమీ కాదు."

1928లో అదీ పరిస్థితి. నేను అడగదలచిన ప్రశ్న ఇది : 1928 నుండి ఇప్పటికి ఏమైనా మార్పు ఉందా? అయ్యా, ఇపుడు నాకు సాక్ష్యం లభించినంతవరకూ, పరిస్థితి మారలేదు సరికదా, హీనమైందని చెప్పడానికి నేను వెనుకాడడంలేదు. నా అభిప్రాయం బలపరచడానికి నేను కొన్ని ఉదాహరణలు ఇస్తారు.

1932 లో శాసనమండలికి జరిగిన ఎన్నికలను నేను మొదట ఉదహరిస్తా. 1932లో కాంగ్రెసు శాసనసభను నిషేధించింది; ఈ సంగతి గౌరవనీయ మిత్రులు ముఖ్యమంత్రిగారు గుర్తుకుతెచ్చుకుంటారు. ఎలెక్షనులో నిలబడడానికి వాళ్లు నిరాకరించారు. అయ్యా, 1932 కాంగ్రెసు – తారీకు తప్పయితే సరిచేయండి; జ్ఞాపకమున్న విషయంచెప్తున్నా –

*ఒక గౌరవనీయ సభ్యుడు :* అది 1930.

1930; 1930లో కాంగ్రెసు ప్రజల్ని భయపెట్టడానికీ, ఎలెక్షనులో పాల్గొనకుండా చేయడానికీ అనేక ఎత్తులు వేశారు. అయ్యా, అదేసంవత్సరం సహాయనిరాకరణ ఉద్యమం మొదలైందని సభకు గుర్తుచేస్తున్నా. అది కాంగ్రెసు వాళ్ల ప్రకారం, నేను పొరపాటుగా చెప్పకపోతే, అది అతి ముఖ్యమైన సంవత్సరం; ఎందుకంటే అదే సంవత్సరంలో దండి యాత్ర జరిగింది. ప్రజలను శాసనసభలో చేరకుండా చేయడానికి, 1930లో కాంగ్రెసు వారు వాడిన నినాదాలేమిటి? వాళ్లు వాడిన ఒక నినాదం ఇది – నాకు గుర్తున్నవరకు ... కౌన్సిల్ మే జనహరామ్‌హై. అయితే అది అంతటితోసరికాదు. మరో నినాదం ఇది : కౌన్సిల్ మే కోన్ జాయగా? ధేడ్ జాయగా; చమర్ జాయగా. ఇవి కాంగ్రెసు మనుషులు వాడిన నినాదాలు (అభ్యంతరం). దయచేసి, గౌరవనీయ మిత్రులు సాక్ష్యం కోరేటట్లయితే, కొట్టివేయడానికి వీలులేని సాక్ష్యం ముందుంచుతా. నినాదం చాలా అవమానకరంగావుండి, టైమ్స్ ఆఫ్ ఇండియా (పత్రిక) సంపాదకీయం వ్రాయడం అవసరమని భావించింది. అయ్యా, ఇపుడు నేను వివరిస్తున్న అంశం ఇది : కాంగ్రెసు పట్టుదలతో హిందువులు – కులాన్ని మరచిపోయామన్న వారు, మతాన్ని మరిచిపోయామన్నవారు, అస్పృశ్యత మరచిపోయామన్న వారు – హిందువులు అయ్యా, దేశంలో శ్రేష్టమైన వారు, నేనిక్కడ చూస్తున్నవారు, హిందూ మతంలో బాగా సమాచారమున్నవారు, బాగా జ్ఞానం పొందినవారు ఎంతో నిస్సహాయంగా, ఎంతగానో అణగదొక్కబడి, ఉన్న కమ్యూనిటీని ఇంతగా గర్హించడానికి సమర్థులయితే, గౌరవనీయ మిత్రులు ముఖ్యమంత్రి పాస్‌చేసిన చట్టం కన్నా మనువు చేసి ఇచ్చిన చట్టం చాలా గొప్పదనుకొన్న సనాతనుల నుండి మీరేం ఆశించగలరు?

అయ్యా, మరోకేసు తీసుకోనివ్వండి. నేను గుజరాత్‌నుండి కేసు లెక్కువగా తీసుకుంటున్నా, అందుకు చాలా ప్రత్యక్ష కారణముంది; ఎందుకంటే, ఇది ఈ రాష్ట్రంలో చాలా వికాసం చెందిన ప్రాంతమని చెప్పారు. అహమ్మదాబాద్ జిల్లా ధోల్కా తాలుకాలో కవిత అనే గ్రామం నుండి వచ్చిన కేసు గురించి నేను మాట్లాడుతున్నాను. మనందరం దీన్ని ప్రత్యేకంగా చూడాలి. ఈ కేసులో

వాస్తవాలివి. ఒక రోజున కవితలో ఉన్న అస్పృశ్యసభ్యులను కొందరిని ఆగ్రామం బ్రాహ్మణుడొకడు అవమానపరిచాడు. ఈ వాస్తవాలు "హరిజన్" పత్రికలో- నుండి తీసుకున్నానని గౌరవనీయ మిత్రులను గుర్తుంచుకోమని కోరుతున్నా.

గౌరవనీయ శ్రీ బి.జి. ఖేర్ : నేను ఆ స్థలానికి వెళ్లాను, నాకు ఆ సంఘటన తెలుసు. గౌరవనీయ సభ్యులు దాన్ని ఉదహరించనవసరంలేదు.

**డా॥ అంబేద్కర్ :** వాస్తవాలు ఇవి. ఆ గ్రామంలో ఒక బ్రాహ్మణుడు కొందరు అస్పృశ్యజాతివారిని కొట్టాడు. వాళ్లధోరణిలో, ఆ బ్రాహ్మణునిపై విచారణ జరిపించి, శిక్షింపజేయవచ్చునని, అది సాధ్యమని దళితులు భావించారు. జిల్లా పోలీసు అధికారి వద్దకు వెళ్లి తమపై దాడిజరిపిన వానిపై ఫిర్యాదు చేయాలని గట్టిగా అనుకొన్నారు. ఈ లోపల ఏం జరిగిందంటే : అస్పృశ్యుల్లో మగవాళ్లు, తమ ఇళ్లల్లోంచి బయటికి వెళ్లగానే, ఆ రోజున ఆ గ్రామ సవర్ణులు అస్పృశ్యుల ఇళ్లపై దాడిచేశారు. వాళ్ల ఇళ్లు పడగొట్టారు, ఇళ్ల కప్పులు కూల్చేశారు. దాడిచేయడానికి పగలు మగవాళ్లు దొరకనందున వాళ్లు రాత్రికైనా తిరిగి వస్తారని సవర్ణులు వేచిఉన్నారు. వీళ్ల పథకం తెలుసుకొని కొందరు ఆడవాళ్లు రాత్రికి రాత్రే గ్రామంనుండి బయటపడి మగవాళ్లకు చెప్పడానికి వెళ్తుంటే వాళ్ల మగవాళ్లు దారిలో ఎదురు పడ్డారు. గ్రామంలో పరిస్థితి చాలా దారుణంగా ఉందనీ, మగవాళ్లు వస్తే వాళ్ల ప్రాణాలకు రక్షణ ఉండదనీ చెప్పారు. వాళ్లు రాత్రంతా గ్రామం బయటే ఉండిపోయారు, లోపలికి తిరిగిరాలేదు. మరునాడు ఎవరికీ తెలియకుండా, చెల్లాచెదరై ఇళ్లకు చేరగలిగారు. వాళ్ల గుడిసెలన్నీ కూలిపోయి ఉండడం చూశారు. గ్రామస్థులు వాళ్లను బహిష్కరించారని తర్వాత తెలిసింది. గ్రామకోమటి నుండి వాళ్లు ఏమీ కొనుక్కోవడానికి అనుమతి లభించలేదు. అంతేకాదు, గ్రామస్థులు మరో అడుగు ముందుకు వేశారు. డబ్బాలలో కిరోసిన్ పోసుకొచ్చి, అస్పృశ్యులు త్రాగటానికి తీసికెళ్లేనీళ్లల్లో కిరోసిన్ పోశారు. ఏదోఒకటి చెయ్యాలని అపుడు అస్పృశ్యులు అనుకొన్నారు. వాళ్లకెవరో పొరపాటుగా సలహా ఇచ్చారు; చట్టాన్ని ఆశ్రయించాలని నిర్ణయించుకున్నారు. వాళ్లు వెళ్లి ఫిర్యాదు చేశారు. ఈలోపుగా కాంగ్రెస్ మిత్రులు కొందరు జోక్యం చేసుకున్నారు. ఏం చేశారు? హక్కుల ప్రకటన నిమిత్తం బీదదళితులకు సహాయపడ్డారా? లేదు. ఫిర్యాదు వెనక్కితీసుకొని, నిమ్మళంగా ఉండమని వెంటబడ్డారు. బాధించే వ్యవహారమంతా ఇక్కడుంది. కవితగ్రామం అస్పృశ్యులు ఏమి నేరం చేశారు? ఈ విధంగా వాళ్లను ఎందుకు వేధించారు? ఏదీకాదు, ఒకే ఒక కారణం. కవిత గ్రామంలో అస్పృశ్యులలో నల్గురు పిల్లలను ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం ఏ స్కూలులో చేర్చాలో ఆ స్కూలుకు పట్టుబట్టి పంపించారు.

ఇక నేను ఉదహరించబోయే రెండో కేసు, దురదృష్టవశాత్తు 'తలాతి'గా నియమితుడైన భంగా కుర్రాడికి సంబంధించింది. అతని పేరు పర్మార్ కాళిదాస్ శివరాం. మీ అనుమతిపై బొంబాయి బహిరంగ సభలో పర్మార్ కాళిదాస్ ఏం చెప్పాడో నేను చదువుతాను. ఆ సభకు, ఇందూలాల్ యాజ్ఞిక్ అధ్యక్షత వహించాడు. నేను కూడ అక్కడున్నాను. అతని కథవిని నేను విపరీతంగా

చలించిపోయాను. మొత్తం వ్రాసి ఇవ్వమని నేను అడిగాను. అతడు వ్రాసిఇచ్చింది నేను తర్జుమా మాత్రం చేశాను. ఇదీ కథ :

"1933లో నేను అంతిమ ప్రాంతీయ భాషా పరీక్ష పాసయినాను. నేను 4వ తరగతి వరకూ ఇంగ్లీషు చదివాను. బొంబాయి మున్సిపాలిటీ స్కూల్సు కమిటీ వారికి టీచరు పోస్టు కోసం దరఖాస్తు పెట్టుకున్నాను. ఖాళీలేక ఆఫీసరు గారికి 'తలాతి' ఉద్యోగం కొరకు దరఖాస్తు పెట్టుకొన్నాను. ఉద్యోగం లభించింది. 1938 ఫిబ్రవరి 19వ తేదీన కెయిరా జిల్లాలో బొర్సాద్ తాలూక మమ్లత్‌దారు ఆఫీసులో తలాతిగా నియమితుణ్ణి అయ్యాను.

మొదట్లో మాకుటుంబం గుజరాత్ నుంచి వచ్చినప్పటికీ నేనంతకు ముందెప్పుడూ గుజరాత్ వెళ్లలేదు. అక్కడికి నేను వెళ్లడం ఇదే మొదటి సారి. అలాగే ప్రభుత్వ కార్యాలయాల్లో అస్పృశ్యత పాటిస్తారని నాకు తెలియదు. పైగా నా దరఖాస్తులో నేను హరిజనుడననే వాస్తవం వ్రాయబడివుంది. కాబట్టి నేను వెళ్లక ముందే నాతోటి ఉద్యోగులు నేను ఎవరినో తెలుసుకొని ఉంటారని అనుకొన్నాను. అది అలాఉండగా, నేను తలాతి ఉద్యోగంలో చేరడానికి వెళ్లినపుడు, మమ్లత్‌దారు ఆఫీసులో గుమాస్తా ధోరణి చూసి చకితుణ్ణయిపోయాను.

'నీవెవరివి?' అని కర్కున్ చీత్కారంగా అడిగాడు. 'అయ్యా నేను హరిజనుణ్ణి' అని సమాధానం చెప్పాను. 'వెళ్లిపో, దూరంగా నిలబడు' అన్నాడయ్యా. 'నా దగ్గిరగా నిలబడడానికి నీకెంత సాహసం?' ఆఫీసులో ఉన్నావు, బయట ఉన్నట్లయితే కాలికొద్దీ తన్నేవాణ్ణి. ఉద్యోగం నిమిత్తం ఇక్కడికి రావడానికి నీకెంత ధైర్యం.". ఆ మీదట నాసర్టిఫికేట్లను, ఉద్యోగం ఉత్తరువును నేల మీద పడవెయ్యమన్నాడు. ఆ తర్వాత వాటి నతడు తీసుకున్నాడు.

నేను బొర్సాద్‌లో మమ్లత్‌దారు ఆఫీసులో పని చేస్తున్నపుడు తాగటానికి నీళ్ల విషయంలో నానా ఇబ్బంది పడ్డాను. ఆఫీసు వరండాలో నీళ్ల క్యానులు పెట్టారు. అవి చూసుకో డానికి నీళ్ల మనిషి ఉన్నాడు. అవసరమొచ్చినపుడు గుమాస్తాలకు నీళ్లు పోయడం అతని విధి. నీళ్ల మనిషిలేనపుడు గుమాస్తాలు ఎవరికి వాళ్లు క్యానులో నీళ్లు తీసుకొని తాగేవారు. నా విషయంలో అది అసాధ్యం. నేను క్యానులు ముట్టుకోవడానికి లేదు. ఎందుకంటే నేను ముట్టుకుంటే నీళ్లు మైలపడిపోతాయి. నేను మాత్రం నీళ్ల మనిషి దయా దాక్షిణ్యాల మీద ఆధారపడాల్సి వచ్చేది. నా ఉపయోగార్థం ఒక తుప్పుపట్టినకుండ పెట్టేరు. దాన్ని నేను తప్ప ఎవరూ ముట్టుకోరాదు, కడగరాదు. ఈ డబ్బానుంచి నీళ్లమనిషినాకు నీళ్లు పోస్తాడు. నీళ్లమనిషికి నాకు నీళ్లు ఇవ్వడం ఇష్టంలేదు. నేను నీళ్ల కోసం రావడం గ్రహించి అతడు మెల్లిగా ఎక్కడికో తప్పుకు పోతుంటాడు. పర్యవసానంగా ఆరోజుల్లో నాకు తాగటానికి నీళ్లే ఉండవు. నీళ్లు దొరకని అలాంటి రోజులు ఎన్నెన్నో!

నా నివాసం గురించి కూడ అలాంటి ఇబ్బందులే ఉండేవి. బొర్సాద్‌లో నేను కొత్తవాడిని. సవర్ణ హిందువు ఎవ్వరూ నాకు ఇల్లు ఇవ్వలేదు. నేను గుమాస్తాగా ఉండడానికి ఇష్టపడని హిందువులను

అసంతృప్తి పరచడానికి ఇష్టంలేక బొర్సాద్‌లోని అస్పృశ్యులు నాకు నివాసం ఇవ్వడానికి సిద్ధపడలేదు. తిండి గురించిన ఇబ్బందులు ఇంకా ఎక్కువ. అక్కడ నాకు అన్నం పెట్టే చోటు లేదు. మనిషీ లేడు. నేను 'భజియాస్' కొని ఉదయమూ సాయంత్రమూ గ్రామం వెలుపలికి పోయి, ఒంటరి ప్రదేశంలో తిని, తిరిగివచ్చి మమ్లత్ దార్ ఆఫీసు వరండా కాలిబాటలో పడుకొని నిద్రపోతూ ఉండేవాణ్ణి. ఈ విధంగా నాలుగు రోజులు గడిపాను. ఇవన్నీ నేను భరించలేక పోతుండేవాణ్ణి. నేనపుడు మాపూర్వీకుల గ్రామం అయిన జెన్‌త్రల్‌కు వెళ్లేను. అది బొర్సాద్‌కు ఆరుమైళ్లదూరం. రోజూ పన్నెండుమైళ్లు నడవాల్సి వచ్చేది. ఆపని నేను నెలా పదిహేను రోజులు చేశాను.

ఆతర్వాత మమ్లత్‌దార్ నన్ను పనినేర్చుకోడానికి ఒక తలాతి వద్దకు పంపాడు. అతడు జెంత్రల్, కాస్మార్, సయిజ్ పూర్ అనే మూడు గ్రామాలు చూస్తుండేవాడు. జెన్‌త్రల్ అతని హెడ్‌క్వార్టర్స్ (కేంద్ర కార్యాలయస్థానం). ఆ 'తలాతీ'తో రెండు నెలలు నేను జెన్‌త్రల్‌లో ఉన్నాను. ఆ గ్రామం హెడ్‌మాన్ ప్రత్యేకంగా నాకు విరోధంగా, పగగా వున్నాడు. అతడొకసారి ఇలా అన్నాడు. 'ఓరీ, నీ తండ్రి నీతోబుట్టువు గ్రామం ఆఫీసులో కసువూడ్చేవాళ్లు కదా, నీవేమో మాతో సమానంగా ఆఫీసులో కూర్చోవాలనుకొంటున్నావు! జాగ్రత్త, ఈ ఉద్యోగం వదిలి పెట్టేసుకో!

ఒకరోజున గ్రామ జనాభా పట్టిక తయారు చేసే నిమిత్తం తలాతి నన్ను సాయిజ్‌పూర్‌కు పిలిచాడు. జెంత్రల్ నుంచి సాయిజ్ పూరుకు వెళ్లాను. హెడ్‌మాన్, తలాతీ ఆగ్రామంలో ఏదోపని చేస్తున్నారు. నేను ఆఫీసు తలుపు వద్దకు వెళ్లి, 'గుడ్‌మార్నింగ్' అన్నాను. వాళ్లు నన్ను గమనించినట్లే లేరు. నేను 15 నిమిషాలు బయట నిలబడ్డాను. నేను అప్పటికే జీవితంలో డస్సిపోయాను. నన్ను లెక్కచేయనందుకూ, అవమానించినందుకూ నాకు ఉద్రేకం వచ్చేసింది. అక్కడున్న ఒక కుర్చీలో కూర్చున్నాను. నేను కుర్చీలో కూర్చోవడం చూసి, హెడ్‌మేన్, తలాతి ఏమీ అనకుండా మెల్లిగా బయటికి వెళ్లిపోయారు. కొంతసేపయ్యాక, కొందరు గ్రామ గ్రంధాలయానికి రావడం మొదలుపెట్టారు. ఆ గుంపుని ఒక చదువుకున్నవాడు ఎందుకు నడిపిస్తున్నాడో నాకు అర్థం కాలేదు. తర్వాత నాకు అర్థమయిందేమంటే – ఆ కుర్చీ అతనిది. అతడు చాలా నీచమైన పదజాలంతో నన్ను దూషించడం మొదలుపెట్టాడు. గ్రామసేవకుడు, రవానియాను ఉద్దేశించి అతడే మన్నాడంటే 'ఈ భంగీమురికి కుక్కను కుర్చీమీద కూర్చోనిచ్చింది ఎవరు?' రవానియా నన్ను కుర్చీనుండి నెట్టేసి, కుర్చీతీసుకొని వెళ్లిపోయాడు. నేను నేల మీద కూర్చున్నాను. అప్పుడు ఆఫీసు గదిలోకి గుంపు చేరింది, నన్ను చుట్టుముట్టింది. అది రెచ్చిపోయిన గుంపు, కోపంతో ఊగి పోతోంది, కొందరు తిడుతున్నారు, చురకత్తితో ముక్కలు చేస్తామని కొందరు బెదిరిస్తునారు. నన్ను క్షమించమనీ, నాపై దయచూడమని నేను అర్థించాను. ఆ గుంపు మీద నా అభ్యర్థన ఏమీ పనిచెయ్యలేదు. నన్ను నేను రక్షించుకోవడం ఎలాగో నాకు తెలియలేదు. నాపై వచ్చిపడ్డ దుస్థితిని మమ్లతారుకు వ్రాయాలని నాకు ఒక అభిప్రాయం కల్గింది; ఈ మూక నన్ను చంపేస్తే నా దేహాన్ని ఏంచేయాలో మమ్లత్‌దారుకు చెప్పాలనిపించింది. నేను మమ్లత్‌దారుకు బహిరంగంగా రిపోర్టు చేస్తున్నట్లు తెలిస్తే, వాళ్లు వెనక్కి

తగ్గుతారేమో నన్న ఆశ కూడ వుంది. రవానియాను ఒక తెల్లకాగితం ఇవ్వమని అడిగాను. ఇచ్చాడు. నా ఫౌంటెన్ కలంతో పెద్ద అక్షరాలతో, అందరూ చదవ కలిగేటట్లుగా ఈ విధంగా వ్రాశాను :

'మమ్లత్ దారుకు,
తాలూకా బొర్సాద్.'

అయ్యా,

పర్మార్ కాళిదాను శివరామ్ వినయ పూర్వక సమస్కారాలు దయతో అంగీకరించండి. అవమానకరమైన చావుచేతిలో పడ్తున్నాని మీకు వినయపూర్వకంగా విన్నవిస్తున్నాను. నా తలిదండ్రులమాట విన్నట్లయితే ఇలా జరిగేది కాదు. దయచేసి నా మరణం గూర్చి నా తలిదండ్రులకు తెలియపరచండి."

నిమ్న జాతుల పట్ల మెజారిటీ ప్రవర్తన ఎలా వుందో ఇపుడు నేను కొన్ని ఉదాహరణలిస్తాను. కేకత్నింభోర్ గ్రామం, జమ్నేర్ తాలుకా నుండి ఒక కేసు ఉంది. అది ఇలా ఉంది :

"గ్రామానికి చెందిన నిమ్న జాతులు హిందువుల పండుగలు పాటించడం మానివేసి, పరిశుద్ధజీవనం ప్రారంభించాయి. ఒక రోజున సవర్ణ హిందువులు హోలీ పండుగ నిమిత్తం పొలాలనుండి పేడ తెచ్చి పెట్టమని నిమ్న జాతుల వారిని అడిగారు. వాళ్లు తెచ్చి పెట్టారు. వాళ్లు హోలి పాటించడం లేదు కాబట్టి సవర్ణ హిందువుల నిమిత్తం నిప్పురాజెయ్యలేదు. వెంటనే హిందువులు వాళ్ల కాలనీకి వెళ్లి, ఇళ్లల్లో పట్టుకుని కొట్టారు. అంతేగాకుండ తీవ్రమైన బహిష్కరణ విధించి, వాళ్ల జీవితాలు దుర్భరమయ్యేటట్లు చేశారు."

జమ్నేర్తాలుకాలో వడలి గ్రామం నుండి మరో కేసు ఉంది. దళితుల ఒక పెళ్లి ఊరేగింపును ఉమ్మడి గ్రామం ద్వారం ద్వారా వెళ్లనీయలేదు. ఊరేగింపు చెదిరిపోయింది. సవర్ణ హిందువులు ఆరోజున ఆపెళ్లి జరగనీయలేదు. నిమ్న జాతుల వారిని సాంఘిక బహిష్కరణ చేశారు.

అమల్నేర్ తాలుకాలో మ్యాండెడ్ గ్రామంలో ఇంకోకేసు ఉంది. దురలవాట్లకు దూరమై, పరిశుద్ధ జీవనం గడపాలని మ్యాండెడ్ గ్రామంలో దళితులు సమావేశం జరిపి, తీర్మానించుకున్నారు. కొందరు సవర్ణ హిందువులకు అది నచ్చలేదు. వాళ్లు ఒక చిన్న పందిని చంపి దళితులు మంచినీళ్లు తాగే కుండలో పడవేశారు. ఇలా రెండు సార్లు చేశారు. అంతేగాకుండా వాళ్లను సాంఘికంగా బహిష్కరించారు, వేధించారు. ఈ వేదనతో చాలా మంది నిమ్న జాతీయులు గ్రామం ఖాళీ చేసి వెళ్లిపోయారు.

అయ్యా, దళితుల పట్ల సవర్ణ హిందువులు ఎంత అసహనంగా వుంటారోనని చూపించే అసంఖ్యాక కేసులను నేను పునరుద్ఘాటించదలచలేదు. ఈ సందర్భంగా దగ్గిర ఉన్న సమాచారం లెక్కచెప్పాలంటే ఒక రోజుగాదు. బహుశ నెల రోజులు పట్టొచ్చు.

ఇక, నేనిపుడు అడగదలచిన ప్రశ్న ఇది :

ఈ వేధింపుల నుండి నిమ్న జాతులకు ఇచ్చే రక్షణ ఏమిటి? ఆవిషయంలో నేను సభకు విన్నవించే ముందు, ఈ దేశ పాలనా నిర్వహణలోని నిర్మాణంవైపు సభాదృష్టిని మళ్ళించ దలచాను. బొంబాయి రాష్ట్రానికి సంబంధించిన అంకెలు నా వద్ద ఉన్నాయి. నా ఉద్దేశంలో అవి ఆదర్శ ప్రాయమైనవి. అవి ఈ రాష్ట్రానికి సరిపోవడమేగాక, మొత్తం దేశానికి సరిపోతాయి. ఈ రాష్ట్రం పరిపాలన ఎవరి చేతుల్లో వుంది? ఈ విధంగా ఉంది. ప్రభుత్వం వారిచ్చిన సమాచారమే తీసుకుంటున్నాను. అవి నా లెక్కలుగావు. రెవెన్యూ డిపార్టుమెంటులో ఉన్న నిమ్న జాతులను ముందుగా తీసుకొంటున్నాను. జిల్లా డిప్యూటీ కలెక్టరులు 33 మంది ఉన్నారు. అందులో నిమ్న జాతులకు సంబంధించిన వారు ఒక్కరు. రాష్ట్రంలో 100 మంది మమ్లత్ దారులున్నారు. అందులో నిమ్నజాతుల నుండి ఒక్కరు మాత్రమున్నారు. 34 మంది మహల్కారీలు ఉన్నారు. అందులో నిమ్నజాతుల వారు ఒక్కరూలేరు. 246 మంది హెడ్‌క్లర్కులు ఉన్నారు. అయితే నిమ్న జాతీయుడు ఒక్కడూ లేడు. గుమాస్తాలు మొత్తం 2444 మంది వుంటే అందులో నిమ్న జాతుల వారు 30 మంది మాత్రమున్నారు.

పబ్లిక్ వర్క్సు డిపార్టు మెంటు తీసుకుందాం. 829 మంది గుమాస్తాలు ఉంటే అందులో నిమ్నజాతుల వారు 7 గురు మాత్రమే.

ఎక్సైజు డిపార్టుమెంటులో 189 మంది గుమాస్తాల ఉంటే, నిమ్న జాతీయులు 3 గురు కంటే ఎక్కువలేరు.

పోలీసు డిపార్టుమెంటులో 538 మంది సబ్-ఇన్‌స్పెక్టర్లు ఉన్నారని చూపారు. అందులో నిమ్నజాతికి చెందినవారు ఇద్దరు మాత్రం. కాబట్టి పరిపాలన పూర్తిగా హిందువులతోనే కూడి ఉందనేది స్పష్టమౌతోంది. ఈ నిజాన్ని ఎవరూ ఖండించలేరు.

రాష్ట్రంలో నిమ్నజాతుల స్థానం ఇతర మైనారిటీలతో పోలిస్తే ఎలా వుంటుందో సభకు చూపించదలచాను. రెవెన్యూ డిపార్టుమెంటులో 33 మంది డిప్యూటీ కలెక్టర్లలో 8 మంది మహమ్మదీయులు, ముగ్గురు క్రైస్తవులుండగా నిమ్నజాతీయుడొక్కడే. 100 మంది మమ్లత్ దారులలో 30 మంది ముస్లిములు, 3గురు క్రైస్తవులు, నిమ్న జాతీయుడు మాత్రం ఒక్కడే. 34 మంది మహల్కారీలో 4 గురు మహమ్మదీయులు, 3 గురు క్రైస్తవులు – కాని నిమ్న జాతీయుడొక్కడూ లేడు. 246 మంది హెడ్‌క్లర్కులలో 17 మంది మహమ్మదీయులు, 7గురు క్రైస్తవులు, కాని నిమ్నజాతీయుడొక్కడూలేడు. 2444 మంది మొత్తం గుమాస్తాలలో 283 మంది మహమ్మదీయులు, 61 మంది క్రైస్తవులు, 58 మంది వెనుకబడినవాళ్లు, 30 మంది మాత్రం నిమ్నజాతుల వారున్నారు. పోలీసు డిపార్టుమెంటులో 538 మంది సబ్‌ఇన్స్పెక్టర్లలో 106 మంది మహమ్మదీయులూ, 17 గురు క్రైస్తవులూ, 6 గురు వెనుకబడిన తరగతుల మనుషులూ, ఇద్దరు మాత్రం అస్పృశ్యులూ ఉన్నారు.

పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటులో 829 మంది గుమాస్తాలలో 41 మంది మహమ్మదీయులూ, 28 మంది క్రైస్తవులూ, 7 గురు వెనుకబడినవర్గాలవారు, 7 గురు దళితులూ ఉన్నారు. ఎక్సైజు డిపార్టుమెంటులో 189 మందికి గాను, 13 గురు మహమ్మదీయులూ, 19 మంది క్రైస్తవులూ, 3 గురు అస్పృశ్యులూ ఉన్నారు.

కాబట్టి, అయ్యా, మనం మొత్తం మీద ఈ స్థాయి నుండి మొదలు పెట్టాలి; హిందువులు జనాభాలోనే గాకుండా పరిపాలనలో కూడ మెజారిటీలో ఉన్నారు. నేను గౌరవనీయులు ముఖ్యమంత్రి గారిని అడగదలచిన ప్రశ్న ఇది. వారి సంతృప్తి కొరకు హిందువుల మెజారిటీ నిస్సందేహంగా విరోధంగా వుండే మెజారిటీ అని చూపించాననుకుంటా. వారు తల ఊపుతున్నారు. వారి నిర్ణయాలు వారివి; వారితో నేను వివాదపడను. కాని వాస్తవం అది. రక్షణ విషయంలో వేధింపుల నుండి అస్పృశ్యులు ఎలా మసలుతారు? మొత్తం కార్యనిర్వాహక వర్గం, సవర్ణ హిందువులుతో కూడి ఉన్నట్టిది, అస్పృశ్యులకు తప్పనిసరిగా విరోధంగా ఉంటారనడానికి కొన్ని కేసులు మళ్లీ తీసుకోదలచాను. తగాదాలకు ఒక ప్రక్క సవర్ణ హిందువులూ మరో ప్రక్క అస్పృశ్యులు ఉన్నపుడు హిందువులు న్యాయం కోరరు. న్యాయం అభిలషించరు, న్యాయాన్ని లెక్కచేయరు.

నేను ఉదాహరించే మొదటి కేసు ఇది. నేను కేసునెంబరు ఇస్తున్నాను. గౌరవనీయ మిత్రులు విచారణ సల్పవచ్చు. 'సంగమ్నేర్ ఫస్టు క్లాసు మేజిస్ట్రేటు ఫైలులో 191 నెంబరు క్రిమినల్ కేసులో తీర్పు ఈ కేసులో 147 సెక్షను క్రింద, 323, 341, 452, 454, 149 ఇండియన్ పీనల్ కోడు దొమ్మి కేసులు. అందులో 7 గురు హిందువులు ఉన్నారు. వాస్తవాలు సంక్షిప్తంగా ఇవి : వడ్గాన్ వర్గాన్ లాంగడా గ్రామంలో ఒక అస్పృశ్యునిది. ఒక రోజు 200 మంది గ్రామస్థులు ఏకమై, అయుధాలు, కర్రలు, లాఠీలు, ఇతర పరికరాలు ధరించి మహర్ ఇళ్లపై దాడిచేశారు. మగవాళ్లనే గాక, స్త్రీలను కూడ గాయ పరిచారు. గాయాలు తీవ్రమైనవి. వాళ్లు చాలా రోజులు ఆసుపత్రిలో ఉన్నారు. వాళ్ల గాయాలు తీవ్రంగా ఉన్నవన్న వాస్తవం మీద ఆధారపడి అది గుర్తింపదగిన కేసుగా భావించి దానిని పోలీసులే తీసుకొన్నారు. ఈ తొమ్మిదిమందినీ సంగమ్నేర్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేట్ కోర్టులో విచారించారు. వీటికి సాక్ష్యాధారాలు పోలీసులే తీసుకొచ్చారు. గాయాలు తగిలాయని కావలసినంత వైద్య సాక్ష్యం లభించింది. అయినా ఏం జరిగింది? నేను చెప్పాల్సివస్తే, యీ తొమ్మిది మంది నేరస్థులూ తమ తప్పునంగీకరించి దెబ్బతిన్న మహర్ మగవాళ్లకి, ఆడవాళ్లకి మూడు వందలరూపాయలు చెల్లించి రాజీపడతామని నాకు కబురు పంపించారు. నేను పొరపాటున రాజీ పడవద్దని చట్టం ప్రకారం జరుగనివ్వమని మహర్లకు సలహా ఇచ్చాను. అయితే చట్టం ఏం చేసింది? మెజిస్ట్రేట్ ఏం చేసాడు? అందరూ ఆశ్చర్య పోయేట్లుగా మేజిస్ట్రేట్ నేరస్థులందర్నీ విడిచిపెట్టాడు.

***డా॥ కె.వి. అంత్రోలికర్ :*** అయ్యా! మేజిస్ట్రేట్ తీర్పుపై గౌరవనీయ సభ్యులు వ్యాఖ్యానించవచ్చా?

***డా॥ అంబేద్కర్ :*** తప్పకుండా నేను వాస్తవాలు చెపుతున్నాను.

**గౌరవనీయ సభాపతి :** నేనదే అంశం ఆలోచిస్తున్నాను. గౌరవనీయసభ్యులు చెప్పే వాస్తవాలను వినాలనుకుంటున్నాను. మేజిస్ట్రేటు తీర్పుని విమర్శించడం తగదనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అయ్యా! నేను విమర్శించడం లేదు. నేను వాస్తవాలు ప్రకటిస్తున్నాను. మాకు ఎంతరక్షణ ఉన్నదో తెలియజేస్తున్నాను. అస్పృశ్యులకు ఎంత రక్షణ ఉన్నదో ఒక అభిప్రాయం ఇవ్వడానికి గాను నేను సభకు విన్నవిస్తున్నాను. నేను తీర్పునే విధంగాను సవాల్ చేయడం లేదు. నేను చెప్పేది ఇది. తాము చేసింది తప్పని హృదయపూర్వకంగా తెలుసుకొని నష్టపరిహారమిచ్చి రాజీ పడ్డానికి సిద్ధమైన మనుషుల్ని మేజిస్ట్రేటు చివరికి వాళ్ళ నేరస్థులు గారని వదలేశారు. నేను నొక్కి వక్కాణించాలను కొన్న అంశం ఏమిటంటే ఈ దాడి ఎందుకు చేసారు? ఎందుకు? కారణం ఏమంటే : కేవలం అడవిభూమి తమకివ్వమని అస్పృశ్యులు దరఖాస్తు పెట్టుకొనే సాహసం చూపించినందుకు దాడి చేశారు. ఈ బీదలు చేసిన నేరమది. నేను మరో కేసును –

**గౌరవనీయ సభాపతి :** గౌరవనీయ సభ్యుని మాటల్లో చెప్పాలంటే ఆయన ఉత్సాహాన్ని నేను చల్లార్చ దలచుకోలేదు గాని ఇప్పటికే ఒక గంట సమయమైంది అని గుర్తుచేస్తున్నాను.

తప్పకుండా మరొక గంట తీసుకుంటారు. ఆయన ఉదాహరించే కేసుల చిన్నచిన్న వివరణల్లోకి గూడ వెళితే మరొక గంట గూడ చాలదనుకుంటున్నా. త్వరలో ఈ చర్చ ముగియాలని నేను తొందర పడుతున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అయ్యా! నా వాదం ముగియడానికి రెండు విషయాలు ప్రస్తావించదలచాను. అకూషి గ్రామం నుండి మరో కేసువుంది. అందులో తమకు దక్కవలసిన రక్షణ రాష్ట్రాధికారుల నుండి లభించలేదని అస్పృశ్యులు భావిస్తూన్నారు. ఈ గ్రామంలో జరిగింది ఇది. ఈ గ్రామం సతారాం జిల్లాలో వాయ్ తాలూకాలో వుంది. వాస్తవాలు చాలా సాధారణమైనవి. ఆగ్రామంలో అస్పృశ్యులకు, సవర్ణ హిందువులకు మధ్య కొంత తగాదాలుగా వుంది. ఇరు పక్షాలూ వైషమ్యంగా వున్నారు. ఏకాదశినాడు దైవదర్శనానికి వెళ్లాలని అస్పృశ్యులు నిర్ణయించుకున్నారు. అస్పృశ్యులను సాంఘికంగా బహిష్కరించిన సవర్ణ హిందువులు వారి దైవ దర్శనానికి యిష్టపడలేదు. అది పట్టించుకోకుండా అస్పృశ్యులు వెళ్లారు. దైవ దర్శనానికి వెళ్లిన అస్పృశ్యులను గ్రామ పటేలు ఇతర గ్రామస్థులను కలుపుకొని అస్పృశ్యులపై బడి కొట్టారు. అస్పృశ్యులు యధావిధిగా గ్రామ పటేల్ మీద కేసుపెట్టారు. దాని పరిస్థితి యిది. తాను తప్పు చేసినట్లు పటేలుకు తెలుసు. సమన్లిచ్చారు. పటేలు సమన్లు తీసుకోకుండా ఎక్కడికో పోయాడు. అతని యింటి తలుపులమీద అంటించారు. మూడు నెలలు అతడు తిరిగిరాలేదు. చివరకతడు తిరిగివచ్చాడు, చట్టం పనిసాగింది. ఈ కేసులో కూడ కేసు విచారించి తప్పుచేశానని తెలిసి మూడు నెలలు గైరుహాజరైన పటేలును మేజిస్ట్రేటు నిర్దోషిగా విడుదల చేశాడు.

మరో కేసు పూనా జిల్లాలో 'తట్వాడి' గ్రామంలో ముస్షీ పేటలో జరిగింది. క్లుప్తంగా

ఉదాహరిస్తున్నాను. ఆకేసులో జరిగిందది. అది ఈనాం గ్రామం. ఈనాందారు చెట్లను రెండు మూడింటిని ఎవరో కొట్టేశారు. ఈనాందారు మహర్లమీద కేసుపెట్టాడు. అయితే ఎవరిపేరూ ఉదహరించలేదు. చెట్లను కొట్టి కలప దొంగిలించారని ఫిర్యాదు చేశారు. కేసు దర్యాప్తు చేసిన పోలీసు అధికారి నలుగురి మీద మేజిస్ట్రేటు కోర్టులో కేసుపెట్టాడు. అసలేంజరిగిందంటే విచారణ జరిగే సమయంలో నిందితుల తరపున ఉన్న న్యాయవాది మొదటి రిపోర్టును తెప్పించి పరిశీలన చేయగా అందులో ఎవరిపేరూ లేదని తెలిసింది. అదృష్టవశాత్తు మహరులను విడిచిపెట్టారు. అయితే తేలిన వాస్తవమేమంటే అస్పృశ్యులకు రక్షణ ఇవ్వవలసిన పోలీసు అధికారి వాళ్లను ఇరికించడానికి దొంగ సాక్ష్యం కల్పించే టంతటి దూరం పోయాడు.

అయ్యా! ఇక నేనింకేమీ ఉదాహరణలివ్వను. ఈ కథంతా జ్వరం తెప్పించేటట్లుంది. నాకు మాత్రం నీరసంగానే ఉంది. మొత్తం మీద హిందువులకు లెక్క లేదు. వారు నవ్వుకుంటారు. ఈ దేశంలో సమస్యల్లా హిందువులకి ముస్లింలకు మధ్య ఉందనుకుంటారు. ఇది అంతకన్నా తీవ్రమైన సమస్య అని హిందువులే గాకుండా రాష్ట్రం గూడ వాళ్ల పట్ల ఏ మాత్రం జాగ్రత్త తీసుకోవడం లేదు. నేనిప్పుడు ప్రవేశపెట్టిన సవరణలపై ఇంకా ఏదయినా వాదం కావాల్సి వుంటే, అంటే భవిష్యత్తులో చేసే రాజ్యాంగంలో అస్పృశ్యులకు తగినన్ని రక్షణలుండాలనే వాదనను ఇంకా బలపరచాలని ఉంటే నేనిప్పుడు సభకు మనవిచేసిన వాదన ఎంతైనా సమంజసమనుకుంటాను. అటువైపునుండి ఒక విధమైన 'స్పందన' వుందని కూడ నేనుకుంటున్నాను. ఈ రెండు సవరణలను గౌరవనీయ 'హోంమంత్రి' ప్రవేశపెట్టారు. ఈ సవరణలు అంగీకరించడానికి నేను సిద్ధంగా లేనని నిర్మొహమాటంగా చెప్పదలచాను. నా సవరణలకు మించి వారి సవరణలను ఎందుకు అంగీకరించలేకున్నానో ఇప్పుడే సభకు తెలియజేస్తాను.

గౌరవనీయ హోం మంత్రి మొదటి సవరణ, రాజ్యాంగం మైనారిటీలకు తగినన్ని రక్షణలు కల్పించడానికి నేను గైకొనే స్థానం చాలా సామాన్యమైంది. అది ఇది : మాకు రక్షణలు ఉండడమేగాక, అవి మాకు సంతృప్తికరంగా వుండాలి. అది మౌలికమైన అంశం. గౌరవనీయ హోంమంత్రి, తాను అస్పృశ్యుల ధర్మకర్తగా ఏదో అస్పష్టమైన ఆధారంతో భావిస్తున్నారు. ధర్మకర్తగా తాను కొన్ని రక్షణలు కల్పించగలరు. అవి వారిదృష్టిలో అల్పసంఖ్యాకుల రక్షణకు సరిపోవాలి. ఆ వాదాన్ని నేను తక్షణమే నిరాకరిస్తున్నాను. ఎవ్వరూ నాకు ధర్మకర్తకాదు. నాకు నేనే ధర్మకర్తను. వాళ్లు వాళ్ల రాజ్యాంగం తయారు చేసుకోవచ్చు. కాని మేము మా హక్కును అడుగుతాము. మాకు సంబంధించిన రక్షణలకై వాళ్లు ఎలాంటి ప్రతిపాదనలైనా చేయవచ్చు. కాని అవి సరిపోయానవని మాకు నమ్మకమున్న ప్రతినిధులు ఆమోద ముద్ర వెయ్యాలి. తగుమాత్రమన్నా వారి నిర్వచనం నన్ను సంతృప్తి పరచలేదు. అందుచేత నా మేధావి మిత్రుడు ప్రవేశ పెట్టిన సవరణను నేను అంగీకరించే స్థితిలోలేను.

రెండో సవరణ విషయంలో గౌరవనీయ హోం మంత్రి మధ్యస్థంగా వ్యవహరించడానికి

సిద్ధమయ్యారు. అందులో సందేహంలేదు. అల్పసంఖ్యాకులకు పరిపాలనలో వారి మాట చెల్లుబడికావాలనేది గుర్తించడానికి ఆయన సిద్ధంగా ఉన్నాడు. అక్కడకూడ ఆయనకు నాకు మధ్య కొంత వ్యత్యాసం ఉంది. నా రెండో సవరణ ఏ అరమరికలూ లేకుండ చెప్తాంది. "మౌలికమైన హక్కు" అనే పదాలు వాడడానికి నేను ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నాను. "మౌలికమైన హక్కు" అని నేను ఎందుకువ్యక్తం చేశానో కొంతవరకు నేను నా స్థితి వివరించాలనుకుంటున్నాను. రాజ్యాంగం పనితీరులో నేను గ్రహించింది ఇది : మనం అంగీకరించినా, అంగీకరించక పోయినా ఈ దేశ రాజకీయ వ్యవస్థ చాతుర్వర్ణ్యం యొక్క ప్రతి బింబం. ఆ విధానంలో ఉన్న సిద్ధాంతం ఇది : క్షత్రియుడు పాలించాలి; బ్రాహ్మణుడు సలహాఇవ్వాలి; వైశ్యుడు వ్యాపారంచేయాలి; కాని శూద్రులు లేక ఆది శూద్రులు చాకిరీ చెయ్యాలి. పాతరోజుల్లో అదీ పరిస్థితి. రాజకీయంలో ఆ స్థితి కొంతవరకు మారింది. వైశ్యుడు వ్యాపారంలోనే ఉండడం లేదు. అతడు వ్యాపారం చేస్తే, రాజకీయంలో వ్యాపారంచేస్తున్నాడు (నవ్వులు). ఒక విషయంలో మాత్రం ఏమార్పూలేదు. అదేమంటే శూద్రులకు మాత్రం ఈ దేశ పాలనలో భాగస్వామ్యం లేదు. ఈ దేశ పరిస్థితుల్ని గమనించినంత వరకు, ఇండియాలో నిర్మాణమైన వివిధ మంత్రి వర్గాల రాజకీయ నిర్మాణం నేను గమనించినంత వరకు అస్పృశ్యులమైన మేము శూద్రులు గానూ లేక సాంఘికంగా ఆది శూద్రులు గానూ ఉన్నాము; పరిస్థితులెలా ఉన్నాయంటే కాంగ్రెసు ప్రభుత్వం గానీ, కాంగ్రెసు ప్రభుత్వం గాకపోతే, పరిస్థితుల ప్రభావంవల్ల గానీ మమ్మల్ని చివరికి రాజకీయ శూద్రులుగా కావడానికి దారి తీస్తుంది. నేనది సహించను. ఆ స్థితిని తొలగించడానికి నా చివరి రక్తం బొట్టును కూడ చిందిస్తాను. (పెద్దగావినండి, వినండి). హిందువులు నాపై అమలు పరచేటటువంటి సాంఘిక ఆధిక్యతకా ఆర్థిక ఆధిక్యతకా మతపరమైన ఆధిక్యతలకు రాజకీయ ఆధిక్యతకు జతపరచేటట్లయితే నేను ఏ మాత్రం సహించను. దానిని నేను ఏ మాత్రమూ సహించను. అని నేను పునరాద్ఘాటిస్తున్నాను, అది ఎన్నడూ చేయనివ్వను. పాలక వర్గంలో కొందరు పెద్దమనుషులు రాజ్యాధిపత్యం ప్రతిష్ఠించే ఉద్దేశంతో చేసే రాజకీయాన్ని యావచ్ఛక్తితో ఎదిరించి పోరాడతాం. వాళ్లకు స్వేచ్ఛ, నాపైన రాజ్యాధిపత్యం కల్పించే ఉద్దేశమున్న రాజ్యాంగాన్ని నేను ఒప్పుకోనని మళ్లీ మళ్లీ ఘంటాపథంగా చెప్తున్నాను. నేను స్వేచ్ఛాజీవిగానూ, సమభాగస్వామిగానూ లేని రాజ్యాంగాన్ని ఎంతమాత్రమూ అంగీకరించను. ఎన్నటికీ దాన్ని చెయ్యనివ్వను. అయ్యా, ఇవి కఠినమైన పదాలని నాకు తెలుసు. అయితే అవి ఐర్లాండు సందర్భంగా అల్‌స్టర్‌మెన్ వాడిన పదాలకన్నా పరుషమైనవి కావని గౌరవనీయ ముఖ్యమంత్రి గారూ నేను గుర్తుచేయదలిచాను. ఈ దేశంలో అల్పసంఖ్యాక వర్గానికి చెందిన ఒక మనిషి వర్గ హక్కులకై వేచి పోరాడుతుంటే మొత్తం జనసమూహం అతనిపై తిరగబడుతుంది; అతడు కుల–మత చాందసుడనీ, ముద్రవేస్తుంది, ఇండియా వ్యతిరేకని ముద్రవేస్తుంది, ఈ దేశం నాశనం చేయడానికి పనిచేసే రాచరిక పాలకుని చేతిలో కీలుబొమ్మనని ముద్రవేస్తుంది; అది నాకు తెలుసు. అయ్యా, ఈ ధోరణి వహించే మూకను నేను హెచ్చరించదలిచాను. అల్‌స్టర్‌మెన్ తీసుకున్న వైఖరి కన్నా ఈ దేశంలో అల్పసంఖ్యాకవర్గాలు తీసుకొనే వైఖరి చాలా మేలైంది. చాలా ఘనమైంది.

అల్‌స్టర్‌మెన్ వైఖరి ఏమిటి? దక్షిణ ఐర్లండు జాతీయవాదులకు అల్‌స్టర్‌మెన్‌కు మధ్య సామరస్యం కుదర్చడానికి బకింగ్‌హామ్ పాలెస్‌కు చెందిన క్రీ.శ. 7వ ఎడ్వర్డు రాజు ప్రమేయంతో జరిగిన సమావేశం ప్రొసీడింగ్స్ చదివిన గుర్తున్నది. దక్షిణ ఐరిష్ ప్రజల అధిక సంఖ్యాకుల పరిపాలన క్రిందికి అల్‌స్టర్‌మెన్‌ను తీసుకొని రావాలా లేదా అన్నది ప్రశ్న. దక్షిణ ఐర్లాండులో జాతీయ వాదులు అల్‌స్టర్‌మెన్‌కు చేసిన ప్రతిపాదనలు ఏమిటి? చాలా మందికి ఆ చరిత్ర తెలియకపోవచ్చు. ఐరిష్ నేషనలిస్టు పార్టీ నాయకుడైన శ్రీ జాన్ రెడ్మాండ్ కార్సన్‌నైట్స్‌ను చట్టం క్రిందికి వచ్చేటట్లు చేయడానికి తన శాయశక్తుల కృషి చేశాడని చరిత్ర తెలిసిన వారికి ఎరుకే. అతడేమన్నాడంటే : "మీకు ఎంత వెయిటేజ్ ప్రాతినిధ్యం కావాలన్నా తీసుకోండి, ఏం ఫరవాలేదు". వెయిటేజ్ గురించి ఇండియాలోనే మాట్లాడుతున్నారనే నమ్మకంలో మనం ఉండనక్కరలేదు. వెయిటేజ్ గురించి ఐర్లాండులో చాలా విస్తృతంగా మాట్లాడారు. అల్‌స్టర్‌మెన్‌కి వెయిటేజ్ ఇవ్వడానికి రెడ్మాండ్ సిద్ధంగా ఉన్నాడు. అల్‌స్టర్‌మెన్ పట్ల ఎలాంటి పక్షపాతం చూపకుండా నిరోధించడానికి ఒక ఆఫీసరుకు రాజ్యాంగంలో అధికారం ఇవ్వడానికి అతడు సిద్ధమయ్యాడు. ఐరిష్ నేషనిస్టులు మరో ప్రతిపాదన అల్‌స్టర్‌మెన్‌కు ఇవ్వసిద్ధమయ్యారు. అదేమంటే – మెజారిటీలో తప్పక వుండే దక్షిణ ఐర్లాండు ప్రజలు వాళ్ల అధికారాలు దుర్వినియోగం చేసి, అల్‌స్టర్‌దేశపు ప్రొటెస్టెంటులను అగౌరపరచి, వేధిస్తే, అల్‌స్టర్ ప్రజలు రాజ్యాంగాన్ని విడిచిపోయే హక్కు కలిగిఉంటారు. అయ్యా, అవి అద్భుతమైన ప్రావిజన్లు. ఈ ప్రతిపాదనలకు అల్‌స్టర్ ప్రజల సమాధానం ఏమిటి? రెడ్మాండ్‌కు అల్‌స్టర్ ప్రజలిచ్చిన సమాధానం ఇది : "మీ రక్షణలు గంగలో కలపండి. మీరు మమ్మల్ని పరిపాలించినక్కరలేదు". మేమది చెపుతున్నామా? నేను లెక్కచెప్పిన సంఘటనల దృష్ట్యా నేను అలా అంటానికి అర్హుణ్ణికాదా? "మీ రక్షణలు గంగలో కలపండి, నాకు మీచే పాలింపబడాలనిలేదు." అయితే నేనూ అనడం లేదు. నేనంటున్నది ఇది : "నా రక్షణలు నాకివ్వండి. అని నాకు అవసరం; ఇక మీ ప్రజాస్వామ్యం మీరుంచుకోండి." అదీ నాపొజిషన్. అందుకు నాతో ఎవరూ తగాదాపడరనుకుంటా.

చివరగా నేను ఒక మాట చెపుతాను. నా స్థావాన్ని ఈ దేశంలో ఎవరూ సరిగా అర్థం చేసుకోలేదనుకుంటున్నా.తరచు అపార్థం చేసుకున్నారు. కాబట్టి ఈ అవకాశం తీసుకొని నా స్థానాన్ని స్పష్టం చేయనివ్వండి. అయ్యా, ఒక్క విషయం చెపుతున్నా :

వ్యక్తిగత ప్రయోజనాలకూ, దేశ ప్రయోజనాలకూ మధ్య ఎలాంటి సంఘర్షణ వచ్చినా దేశ ప్రయోజనాలకే ప్రాధాన్యత ఇచ్చి, నా ప్రయోజనాలు వాటికి లోబడి ఉండేటట్లు చూశాను. (వినండి, వినండి). నేనెప్పుడూ ప్రయివేటు లాభం చూసుకోలేదు. ఇతరుల వలె చేసివుంటే నేను మరో స్థానంలో ఉండి ఉండేవాణ్ణి. దాన్ని గురించి నేనేమీ చెప్పదలచుకోలేదు. కాని నేనలా చేయలేదు. రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో నాతోపాటు పాల్గొన్న వారు కొందరు నేచెప్పే విషయాన్ని తప్పక బలపరుస్తారనుకుంటా; దేశం యొక్క ఆకాంక్షలకు సంబంధించిన వరకూ నేనెన్నడూ వెనుకబడి ఉండలేదు. ఆ సమావేశంలో ఒక బాలుడు బాలుడిలాగా నేను విచిత్రమైన ప్రశ్నలడుగుతూ

చెప్పిందే చెప్తుండే వాడినని నా ఐరోపామిత్రులు ఇబ్బంది పడ్డారు. కాని నాకు మరో భక్తివుందనీ, దానికి కట్టుబడి ఉన్నాననీ, దాన్ని ఎన్నటికీ వదలలేననీ ఈ దేశ ప్రజల మనస్సులలో ఎలాంటి సందేహం లేకుండ చేయదలచాను. ఆ భక్తి అస్పృశ్యజాతుల పట్ల; దానిలో నేను పుట్టాను, దానికి నేను చెందిఉన్నాను, దానినెన్నడూ నేను వదలలేననుకుంటున్నా. ఈ విషయం సభకు నేను చెప్పగలిగినంత గట్టిగా చెప్తాను; ఎప్పుడైె నా ప్రయోజనాలలో దేశానికీ అస్పృశ్యులకూ మధ్య ఘర్షణ పొడసూపితే, నావరకు నేను చెప్తున్నా అస్పృశ్యుల ప్రయోజనాలు దేశ ప్రయోజనాలకు అగ్రగామిగా వుంటాయి. దేశం పేరుతో మాట్లాడి నంతమాత్రాన ప్రజాపీడనం చేసే అధిక సంఖ్యాక వర్గాన్ని బలపరచబోవడం లేదు. దేశం పేరుతో మాట్లాడినంత మాత్రాన ఆపార్టీని నేను బలపరచబోవడం లేదు. నేనది చేయను. నాస్థానం అదీ అని ఇక్కడా, బయటా ప్రతివారూ అర్థం చేసుకుందురుగాక. నాకూ, దేశానికీ మధ్య, దేశానిదే పై చెయ్యి, దేశం ప్రయోజనం ముందుండదు. నా ఈ రెండు సవరణల గూర్చి నేచెప్పేది ఇంతే.

ఇపుడు, అయ్యా, ఇతర సవరణల గురించి ఈ సభను నేనెంత మాత్రమూ నిలుపుదల చేయదలచుకోలేదు. తీర్మానంలో ఒక భాగంపై గౌరవనీయ ముఖ్యమంత్రి వ్యాఖ్యానం పట్ల నాకు ఆశ్చర్యంగా వుంది. ఆ భాగం ఏమంటుందంటే ఏ ఏర్పాట్లు చేయవలసివచ్చినా, వాటిని రాష్ట్ర ప్రభుత్వాల అనుమతితో చెయ్యాలి. గౌరవనీయమిత్రుడు శ్రీ ముకుదం ప్రవేశపెడుతున్న సవరణ ముఖ్యమంత్రి ఎరుకలో ఉన్నట్లులేదు. ఎందుకంటే ఆభాగాలు తీసివేయవలసివుంటుంది. కనుక మాత్రప్రాయంగా ఆ భాగంతో నేను అంగీకరించక పోయినా, దానిపై నేను ఏమీ వ్యాఖ్యానం చెయ్యను.

అయ్యా, ఇపుడు, నేను కూర్చోబోయే ముందు సభ ముందున్న సవరణలపై ఒకటి, రెండు మాటలు చెప్పాలని వుంది.

అలా చేసేటప్పుడు ముందుగా ప్రతిపక్షనాయకుడు ప్రవేశపెట్టిన సవరణ ప్రస్తావిస్తాను. దాన్ని గురించి, ముఖ్యమంత్రి ఒక విషయం గుర్తించాలని కోరుతున్నా. దానిని ఆయన గుర్తించడంలో విఫలమయ్యారనుకుంటున్నా. ప్రజాస్వామ్యం విఫలమైందని ప్రతిపక్షనాయకుడు అనడం నిజం. దానిపై ముఖ్యమంత్రిని నేను గుర్తించమనే అంశం ఇది. ఆయన ప్రజాస్వామ్యానికి వ్యతిరేకి కారనుకుంటా. ప్రజాస్వామ్యం నిరంకుశం, ప్రజాప్రభుత్వ ధర్మం కేవలం ప్రభుత్వ రూపాలు. అవన్నీ స్వయం పాలన క్రింద వస్తాయి. ఈ దేశానికి స్వయంపాలన తగదు అని ప్రతిపక్ష నాయకుడు అభిప్రాయ పడకుండా వుండేటంత వరకూ, ఆయన వాడిన దురదృష్టకరమైన భాషపట్ల పెద్దగా నిందమోపనవసరం లేదనుకుంటున్నా. ఏమైనా ఆయన మనతో ఉన్నారు.

ప్రజాస్వామ్యం ఒక్కటే పరిష్కారమని పట్టుబట్టటంలో గౌరవనీయ ముఖ్యమంత్రిని నేను అర్థం చేసుకోలేకపోతున్నా. త్రిపుర కాంగ్రెసులో గౌరవనీయ ముఖ్యమంత్రి నాయకులిచ్చిన

ఉపన్యాసాలు చదివిన గుర్తుంది. దురదృష్టవశాత్తు నావద్ద ఉన్న సంపుటిని ఈ రోజు తీసుకొని రావడం మరిచిపోయాను. ఒకరకంగా అది మేలే, ఎందుకంటే సమయం ఆదా చేయగలిగేను. త్రిపుర కాంగ్రెసులో గౌరవనీయ ముఖ్యమంత్రి మిత్రులు, పండిట్ గోవింద వల్లభ పంత్, శ్రీ రాజగోపాలాచారి, పండిట్ జవహర్లాల్ నెహ్రూ, వాళ్లందరూ ముస్సోలినీ, హిట్లర్ల కీర్తిని గూర్చి గానం చేశారనుకుంటా –

**గౌ శ్రీ మొరార్జీ ఆర్. దేశాయ్ :** ఎప్పుడు ?

**డా॥ అంబేద్కర్ :** కోరితే అక్షరక్షరం చదువుతాను.వాస్తవంగా ఆపుస్తకం తేవాలనుకున్నా, కాని మరచిపోయాను.

**గౌ శ్రీ బి.జి.ఖేర్ :** నేను అక్కడున్నాను, ఉపన్యాసాలు విన్నాను. గౌరవనీయ సభ్యుడు చెప్పేది సరికాదు.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** విచారంగా వుంది. ఆ వాల్యూము నా వద్ద ఇపుడు లేదు. ఉన్నట్లయితే, ఆ సమస్య ఇప్పుడే నిర్ణయించే వాళ్లం.

**గౌ సభాపతి :** అందుకు సమయం లేదు.

**డా॥ అంబేద్కర్ :** నేను చెప్పేదంతా ఇది : ఇండియా ప్రజలకు స్వయంపాలన ఉన్నంతవరకూ, అది ప్రజాస్వామ్య రూపం తీసుకున్నా, నిరంకుశ పాలన రూపం తీసుకున్నా, మరో రూపం అవలంబించినా వివరాలు ముఖ్యం, వాటిపై మనకు ఎలాంటి తగాదాలు లేకుండడం ముఖ్యం.

కాబట్టి నామనవి ఇది : తీర్మానం పరికించి నిర్ణయించేటప్పుడు – నేనన్నట్లు దురదృష్టకరంగా పదాలుకూర్చబడ్డవి. కాబట్టి – ఆయన ఉద్దేశ్యాన్ని చెడుగా అర్థం చేసుకోరాదు.

కాంగ్రెస్ పార్టీ ప్రవేశ పెట్టిన తీర్మానం గురించి నేను ముఖ్య మంత్రితో ఏకీభవిస్తున్నాను; అంటే ప్రవేశపెట్టిన సవరణపై వారిని సత్కరించాలి. నేను ఈ తీర్మానం ముఖ్యప్రాతిపదికతో సమ్మతిస్తున్నాను. నేను ఎలాంటి సపోర్టు ఇవ్వలేని ఒక సవరణ వుంది; దాని ఫలితం ఏమంటే – రాజీనామా చేసే మంత్రి వర్గ ఉద్దేశాన్ని ఈ సభ ఆమోదిస్తోంది. లేక అలాంటిది. అయ్యా, ఇపుడు, నేచెప్పదలచింది. ఇది : ఇతర రాజకీయ వేత్తలాగ మంచి రాజకీయ వేత్త ఈ ముఖ్యమంత్రి. అది నిజానికి పార్టీనిర్మాణానికి సంబంధించిన స్థానిక మండలిని నా గౌరవనీయ మిత్రులు ముఖ్యమంత్రి అంగీకరిస్తారు. అదీ సభ నిర్ణయించ వలసిన విషయంకాదు.

ఇది సభవారు నిర్ణయించవలసిందికాదు. మంత్రి వర్గం ఉండాలా, ఊడాలా అనేది పార్టీ నిర్ణయించుకోవలసిన విషయం. మంత్రి వర్గం నుండి ఆయన వైతొలగడానికి నా మంజూరు దేనికి?

**గౌ శ్రీ బి.జి. ఖేర్ :** నాకు అక్కరలేదు.

***డా॥ అంబేద్కర్ :*** ఆయనకు ఆ అవసరమెందుకు? నేను వారికి మరో చిక్కు ప్రశ్న లేస్తాను. నేను ఆహ్వానిస్తే తప్ప, మంత్రి వర్గం తిరిగి రాదు అని నేను ఒక సవరణ తెచ్చే ననుకోండి, దానికి ఆయన సమ్మతిస్తారా? ఆ విధంగా ఆయన ఏమాత్రం కట్టుబడడు అనేది ఖాయం. వైదొలగడానికి నా అనుమతి కావలసివస్తే, నా అనుమతి మీదే ఆధారపడి మళ్లీ మీరు పునఃప్రవేశం చేసేటట్లయితే, అది నాకు కొంత గౌరవం కాగలదు. కాని మీరు అది చేయరు. నేను నా అంతరాత్మలో ఆ సవరణను వ్యతిరేకించే భావనకు కట్టుబడి ఉన్నాను.

అయ్యా, మీరు ప్రదర్శించిన ఓర్పునకు నా ధన్యవాదాలు (చప్పట్లు).

***గౌ సభావతి :*** ప్రసంగ వ్యవధి తగ్గించమని నా అభ్యర్ధన మళ్లీ తెలియ పరుస్తున్నాను. గౌరవ నీయ సభ్యుడు డా॥ అంబేద్కర్ గంటన్నర తీసుకున్నారు. మిగతా గౌరవనీయ సభ్యులు వాళ్ల సమయం తగ్గించుకుంటారని ఆశిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, క్షమించండి.

**అనువాదం :**

**డా॥ వి. చంద్రశేఖర్ రెడ్డి**



# 47

# యుద్ధంలో పాల్గొనడం – 3*

గౌరవనీయులైన శ్రీ బి.జి.ఖేర్ : మీరు ఎప్పుడంటే అప్పుడు నేను ప్రసంగం ముగించడానికి ప్రయత్నిస్తాను.

అయ్యా! గౌరవనీయులైన డాక్టరు ప్రస్తావించిన విషయాలన్నింటి జోలికి నేను వెళ్లను. నేను ఆయనతో ఏకీభవిస్తున్నాను. ఆయన హరిజనులకు జరిగిన అన్యాయాల విషయంలో చెప్పిన వాస్తవాలను నేను ఒప్పుకొంటున్నాను. ఎందుకంటే ఈ దేశంలో ఆయన కులానికి సంబంధించిన వాళ్ల విషయంలో జరిగిన అవమాన కరమైన సంఘటనలన్నింటినీ తిరస్కరించడం నాకు అవసరమైనపని కాదు. అది చాలా కాలం నుంచి పరిష్కారమార్గం చూడాలని మనం ప్రయత్నిస్తున్న విషయమే.

గౌరవనీయులైన సభ్యులు వాటికి పరిష్కార మార్గాలు ఏమిటో చెప్పలేదు. ఆయన సుదీర్ఘమైన ఉపన్యాసంలో ఆ లోపమే ఉంది. ఇతర సభ్యుల చేత గుర్తు చేయబడినట్లుగానే; సంగమ్నేర్ కేసు విషయంలో కానీ లేదా ఆయన ఇక్కడ చదివి వినిపించినట్లు నూటొక్క కేసుల విషయంలో గానీ మనకు ఒకే ఒక్క పరిష్కార మార్గం ఉంది. అది మనకు సరైన ప్రభుత్వం ఉండడం. ఈ దేశంలోని ప్రభుత్వం ప్రజాస్వామిక ప్రభుత్వమే. అది అల్పసంఖ్యాక వర్గాలకు తగినంతగా రక్షణ కల్పిస్తూ ఉండాలి. ఈ అంశాన్ని మనం అంగీకరించి తీరాల్సిందే. అయ్యా! మనం గౌరవనీయులైన సభ్యులకు (ఆయనకు) కృతజ్ఞులమై ఉండాలి. ఎందుకంటే ఆయన అల్స్టర్‌మెన్‌లాగా "మీ పరిరక్షణను నేను లెక్క చేయను. మీచేత నేను పరిరక్షించబడడానికి నేను ఒప్పుకోను" అని అననందుకు ఆయనిప్పుడు ఆమాట చెప్పబోవడం లేదు. అందుకు నేను ఆయన పద్ధతిని అభినందిస్తున్నాను. అయితే ఆయన ఇచ్చిన వాజ్ఞ్మూలాన్ని, ఆయన విశ్వాసాన్ని నేను అభినందించలేను. "నేను, నాదేశం అనే సమస్య వచ్చినప్పుడు నా దేశానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తానని" ఆయన అన్నారు. ఈ విషయంలో నేను ఆయన్ను బలపరుస్తున్నాను. ఆయన చెప్పిన ప్రతి అంశాన్ని నేను ఉదహరిస్తాను. గౌరవనీయులైన సభ్యుని జీవితాన్ని గురించి, ఉద్యోగాన్ని గురించి నాకు చాలా దగ్గరగా తెలుసు. అందువల్ల ఇది నేను చాలా ఖచ్చితమైన విషయం అని చెప్పగలను. ఆయన దేశం కోసం తన వ్యక్తిగత భవిష్యత్తును తక్కువ చేసుకోవడాన్నే ఎప్పుడూ కోరుకొంటారు. "అణగద్రొక్కబడ్డ

---

* బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 7, 2138, అక్టోబర్ 27, 1939)

వర్గాల విషయంలో, దేశం విషయంలో ఆయన అణగద్రొక్కబడ్డ వర్గాలకే ముందుగా సన్నిహితుల"నే విషయాన్నే ఆయన చెబుతుంటారు.

***డా॥ అంబేద్కర్ః*** ఖచ్చితంగా.

***గౌరవనీయులైన శ్రీ బి.జి. ఖేర్ః*** ఆయన ఆ విషయాన్నే చెప్పారు; దాన్నెప్పుడూ కాదనడు. నా వాదన ఆయన చెప్పిన ఆయన అభిప్రాయాన్ని గురించే. ఎందుకంటే సమస్యకంటే దానిలోని భాగం ఎప్పుడూ ఎక్కువ కాలేదు. కాబట్టి, ఇతివృత్తం భాగాలను కలిగి ఉండాలి.

***డా॥ అంబేద్కర్ః*** నేను మొత్తంలో ఒక భాగాన్ని కాను. నేను దూరంగా ఉన్న ఒక భాగాన్ని.



## అనుబంధం – I

# జనన నియంత్రణ చర్యల గురించి*

**శ్రీ పి.జె. రోహమ్ (దక్షిణ అహ్మద్‌నగరం) :** అయ్యా! "కుటుంబ సభ్యుల్ని పరిమితం చేసే అత్యవసరాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం కుటుంబ నియంత్రణ గురించి దేశ ప్రజల్లో విస్తృత ప్రచారం చేయాలి. కుటుంబ నియంత్రణను ఆచరణలో పెట్టడానికి తగినన్ని సౌకర్యాలు కూడా కల్పించాలని ఈ అసెంబ్లీ ప్రభుత్వానికి సిఫార్సు చేస్తున్నది" అనే అంశాన్ని ప్రతిపాదించడానికి అనుమతి కోరుతున్నాను.

ప్రతిపాదింపబడిన ప్రశ్న.

**శ్రీ పి.జె. రోహమ్ ( మరాఠిలో ప్రసంగం ) :** విద్యావంతులైన వర్గం ఇప్పటికే కుటుంబ నియంత్రణ అవసరాన్ని గుర్తించింది. అదృష్టవశాత్తూ ఈ దేశంలోని నాయకులంతా ఈ విషయంలో ఏకాభిప్రాయాన్నే కలిగిఉన్నారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ, రవీంద్రనాద్ ఠాగూర్, శ్రీమతి సరోజినీ నాయుడు వంటి వాళ్లకు కుటుంబ నియంత్రణ ఉద్యమ ప్రాముఖ్యాన్ని గూర్చి దాని ఆవశ్యకత గూర్చి బాగా తెలుసు. వాళ్లంతా ఈ విషయంలో సుముఖంగా ఉన్నారు. భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులైన బాబు సుభాసుచంద్రబోసు తన అధ్యక్షోపన్యాసంలో –

"ఇటీవలి కాలంలో లాగా జనాభా కుప్పలు తెప్పలుగా పెరిగిపోతే మన ప్రణాళికలన్నీ కుప్పకూలిపోతాయి" అని పేర్కొన్నారు.

మహాత్మా గాంధీ కూడా చాలా కాలం క్రిందటే ఇలా వ్రాశారు –

"నేను ఈ దేశంలో జననాల్ని గూర్చి విన్నప్పు డల్లా నేను పొందే దుఃఖాన్ని పాఠకుడికి తెలీకుండా దాచి ఉంచలేను."

శారీరకంగా వికలాంగులైన, లేదా మానసికంగా దెబ్బతిన్న, లేదా ఆర్థిక దుస్థితిలో పుట్టిన పిల్లల వల్ల ఎంత నష్టం వాటిల్లుతుందనే విషయంలో చాలా కొద్ది మందికి మాత్రమే తగినంత అవగాహన ఉంది. వీళ్ల వల్ల తల్లి దండ్రులు, సమాజం చాలా బాధపడాల్సి వస్తుంది. అటువంటి పిల్లలు పుట్టకుండా

---

* శ్రీ పి.జె. రోహమ్ చేసిన ఉపన్యాసం డా॥ అంబేద్కర్ ఆలోచనా విధానం దీనికి మాతృక. 1938 నవంబరు 10వ తేదీన డా॥ అంబేద్కర్ అసెంబ్లీకి హాజరవలేకపోయారు. కాని, శ్రీ రోహమ్ చేసిన ఉపన్యాస విని డా॥ అంబేద్కర్ చాల ప్రశంసించారు.

బి.ఎల్.ఎ. చర్చలు, సంపుటి 4 (3వ భాగం) పేజీలు 4024–38, నవంబర్ 10, 1938

ఆపుచేయడం పిల్లల్ని కనడంలో బలై పోతూ ఉన్న తల్లుల మరణాల సంఖ్యను కూడా ఖచ్చితంగా తగ్గిస్తుంది. పిల్లల్ని కనడంలో వచ్చే జబ్బుల్ని కూడా తగ్గిస్తుంది. ప్రజల ఆరోగ్యాన్ని, వాళ్ల ప్రాథమిక అవసరాల లేమివల్ల కలిగే చాలా జబ్బుల్ని నివారించడం ద్వారా మెరుగుపరుస్తుంది. తీవ్రమైన బీదరికంలో బాధపడుతున్న వ్యక్తులు చేసే తప్పిదాన్ని అదుపులో ఉంచుతుంది. సంఘంలో సంపూర్ణ అభివృద్ధిని సాధిస్తుంది.

ప్రస్తుత జీవన పోరాటం సకాలంలో పెళ్లి చేసుకోవడం అనేది చాలామందికి అసంభవంగా ఉంది. అందువల్ల అది వారిని రకరకాలైన వ్యాధులకు, అలవాట్లకు గురిచేస్తూ ఉంది. చాలామంది స్త్రీలు జీవించడానికి కూడా పనికి రాకుండా పోతున్నారు. కొంతమంది వాళ్ల ప్రాణాల్నే పోగొట్టుకొంటున్నారు. చాలా మంది ఎక్కువ మంది పిల్లల్ని కనడం లేదా వెంట వెంటనే పిల్లల్ని కనడం మూలంగానూ లేదా చనిపోయిన పిల్లల్ని కనడం మూలంగానూ తమ ప్రాణాల్ని పోగొట్టుకొంటున్నారు. గర్భస్రావం చేసుకొనే ప్రయత్నంలోను, గర్భవిచ్ఛిత్తి విషయంలోనూ చాలా మంది స్త్రీలు తమప్రాణాల్ని పోగొట్టుకొంటున్నారు. కోరుకోబడని పిల్లలు వాళ్ల తల్లులచేత తరచూ నిర్లక్ష్యం చేయబడుతుంటారు. అందువల్ల వాళ్లు సంఘానికి బరువై పోతుంటారు. ఈ విపత్తులన్నింటినీ తొలగించడానికి మార్గం పిల్లలు పుట్టకుండా చేసుకోవడం మాత్రమే. ఏ కారణం చేతనైనా కనకుండా ఉండేందుకు, తిరిగి ఆమె ఇష్టం మేరకు పిల్లలు కావాలనుకొంటే గర్భం ధరించేందుకు వీలుండాలి. అనవసరమైన గర్భ ధారణల నుంచి సంఘం ఏ విధంగానూ లాభం పొందదు. ఏ పిల్లలైతే వాళ్ల తల్లిదండ్రుల ద్వారా ఆహ్వానించబడతారో వాళ్ళు మాత్రమే సాంఘిక లాభాల్ని పొందేవాళ్లుగా ఉంటారు. అందువల్ల ప్రతి స్త్రీ కూడా చాలా సులభంగా పిల్లల్ని కనకుండా ఉండే పద్ధతుల్ని నేర్చుకోవాలి.

అవినీతికి మూలకారణం బీదరికం. 1933లో వియన్నాలో కాంగ్రెస్ సమక్షంలో ఆచార్య డా॥ టాండ్లెర్ చదివిన వ్యాసంలోని ఈ క్రింది పేరా జీవించడానికి తగినంతగా లేని వసతులవల్ల కలిగే భయంకరమైన చెడు పరిణామాల్ని చూపేదిగా ఉంది – "సగటున జర్మనీలో ప్రతికుంటుబానికి ఒక గది, ఫ్రాన్సులో రెండున్నర గదులు, ఇంగ్లాండ్‌లో మూడు గదులు ఉన్నాయి. 1925లో బెర్లిన్‌లో డెబ్బై అయిదు వేల కుటుంబాలకు సొంత ఇళ్లు లేవు. దీని ఫలితంగా పిల్లలు వాళ్ల తల్లిదండ్రుల గదుల్లోనే అందునా వాళ్ల పడకల్లోనే నిదురపోతున్నారు. చాలామంది పిల్లలు క్రిక్కిరిసిన, అపరిశుభ్రమైన నివాసాల్లో ఉంటున్నందువల్ల వాళ్ల ప్రాణాల్ని పోగొట్టుకొంటున్నారు. అన్ని కుటుంబాల వాళ్లు సుఖరోగాలకు గురౌతున్నారు. ఆడపిల్లలు పెద్దవాళ్లు కాకమునుపే లైంగిక కార్యకలాపాల్లో పాల్గొంటున్నారు. తరచుగా తల్లిదండ్రులకు వాళ్ల పిల్లలకు మధ్య; అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్ళకు మధ్య లైంగిక సంబంధాలు ఏర్పడుతున్నాయి. మగపిల్లలు దొంగతనాలు చేయడం నేర్చుకొంటున్నారు. ఆడపిల్లలు వేశ్యలౌతున్నారు. వియన్నాలో కూడా ఇలాంటి స్థితే కొనసాగుతూ ఉంది. 1919లో అద్దెకు ఇవ్వబడిన 10 నివాస గృహాలు ఒకే ఒక్క గదిని, 37 ఇళ్ళు ఒక పెద్ద గదిని,

23 ఒక పెద్ద గదిని ఒక చిన్నగదిని కలిగి ఉండేవి. పద్నాలుగు, పద్దెనిమిదేళ్ల మధ్య వయస్సు ఉండి వాళ్లను వాళ్ళే పోషించుకొంటున్న పిల్లల్లో 20 మందికి సొంత పడకలు లేవు. పట్టణాలు, పల్లెలు అధ్వాన్నంగా ఉండేవి."

మనదేశంలో బొంబాయి లాంటి పట్టణాల్లో ఇలాంటి స్థితే ఉంది. కొన్ని అపవాదాల్ని మినహాయిస్తే పేదరికం ఎక్కడైతే ఉందో అక్కడ సత్ప్రవర్తనకి పక్షపాతం వస్తుంది. జననినియంత్రణ లేకపోతే బీదరికాన్ని ఎలా రూపుమాపలేమో ఇంకా ముందు ముందు నిరూపితం అవుతుంది. ఆకలితో ఉన్నవాడు ఏ పాపం చేయడానికైనా వెనుదీయడు బుభుక్షితః కిమ్ న కరోతి పాపమ్ అన్న సూక్తి మనందరికీ తెలిసిందే.

పిల్లలు లేకుండా చేసుకోవడం అనేది అన్ని అభివృద్ధులకు మూలం అని తెలుసుకున్నపుడు ఆ గమ్యాన్ని చేరడానికి ఆ పద్ధతినే పాటించాలి. పిల్లలు కావాలనుకొన్నపుడు మాత్రమే లైంగిక వాంఛల్ని తీర్చుకొని పిల్లలు వద్దనుకొన్నపుడు లైంగిక సంపర్కానికి దూరంగా ఉండడమనేది ఒక పద్ధతి. ఆధునిక గర్భనిరోధక సాధనాలు వాడడం ఇంకొక పద్ధతి. మొదటి పద్ధతిలోని ఇంద్రియ నిగ్రహం అనేది బ్రహ్మచర్యంలో మాత్రమే వీలౌతుంది. ఇది కొత్తగా పెళ్ళై, యవ్వనంలో ఉండి, ఒకరిపై మరొకరికి ఆసక్తి ఉన్న జంటను వాళ్ల సహజమైన మానవ ప్రవృత్తుల్ని సంవత్సరాల తరబడి అణచి వేయడం మాత్రమే అవుతుంది. జీవితాన్ని అనుభవించడానికి- అనువైన పరిస్థితులచేత బాధింపబడని ఆత్మబలం కలిగిన వ్యక్తుల మాట అటుంచితే సామాన్య మానవులు ఆకర్షణ ప్రభావానికి బలై పోతారు. అందువల్ల ఈ వాస్తవం, పగటి వెలుతురు. ఈ సత్యాన్ని కూడ గుర్తించడానికి నిరాకరిస్తారనేది వింతేమీ కాదు.

చాలా కాలంగా చాలా దేశాల అనుభవాల మేరకు స్వయం నియంత్రణ అనేది పిల్లలు లేకుండా ఉండడానికి ఖచ్చితంగా పనికిరాదని రూఢయ్యింది. ఇంద్రియ నిగ్రహాన్ని బోధించే వాళ్ళు సైతం సాధారణ వ్యక్తులు జీవిత కాలమంతా లైంగిక కార్యకలాపాలకు దూరంగా ఉండ గలరనే విషయాన్ని ప్రతిపాదించడం లేదు. ఇంద్రియ నిగ్రహాన్ని ప్రక్కనపెడితే సంవత్సరంలోని ఏ ఒక్క లైంగిక సంపర్కమైనా గర్భధారణకు దారితీస్తుంది. స్వయం నియంత్రణ కొంతమంది విషయంలో గర్భ నిరోధానికి అనువైందని మనం అనుకొన్నా ఇదే విధానాన్ని ఇతరులు పాటిస్తారని అనుకోడానికి వీలులేదు. వివిధ రకాల వ్యక్తుల మధ్య ఆకలి ఎలా భిన్నంగా ఉంటుందో అలాగే లైంగిక వాంఛ విషయంలో కూడా వ్యక్తికి వ్యక్తికి మధ్య చాలా తేడా ఉంటుందనే విషయాన్ని మనం గుర్తించడం అవసరం.

హిందూ ధర్మ శాస్త్రంలో చెప్పబడిన కొన్ని సూత్రాల విషయంలో ఖచ్చితమైన పాటింపు కుటుంబ నియంత్రణ సిద్ధాంతాన్ని నిర్లక్ష్యం చేయడానికి అవకాశాన్ని కలిగిస్తుంది. ఉదాహరణకు "విష్ణుస్మృతి" లోని 54వ ప్రకరణంలో ఉన్న 8వ శ్లోకం లైంగిక సంపర్కాన్ని కొన్ని ప్రత్యేకమైన రోజుల్లో ఆదేశిస్తుంది.

అయ్యా! గౌరవనీయులైన సభ్యులకు శ్రీమతి సరోజినీ మెహతా రాసిన కరపత్రాలు అందాయి. నేను ఆ పూర్తి కరపత్రాన్ని చదవడం లేదు. అందులోని కొన్ని పంక్తుల్ని మాత్రం పేర్కొంటున్నాను :

"గర్భనిరోధం అనే విషయం ఎప్పుడైతే ప్రస్తావించ బడుతుందో అప్పుడు మన దేశానికి అనుకూలించే ఒకే ఒక పద్ధతి ఇంద్రియ నిగ్రహం (బ్రహ్మచర్యం). పాశ్చాత్యులను వారి కృత్రిమమైన పరిష్కార మార్గాలకు వదిలి పెట్టడం మంచిది. మన వ్యతిరేక వర్గం వారు పాడుకొనే పాతపాట మనకు భారమైంది. వాళ్ళు ఏ అంశాల్ని ఆధారం చేసుకొని ఈ దృక్ప థాన్ని కలిగి ఉన్నారో తెలపమని ఈ గౌరవనీయులైన సభ్యుల్ని నేను అభ్యర్థిస్తున్నాను. మన ప్రజలు ఆధ్యాత్మిక వాదులని, పాశ్యాత్యులు భౌతిక వాదులనీ పేర్కోబడింది. ఈ చిలక పలుకులు పునరావృత్తం అవుతూ ఉండడం దాదాపు చీదరింపుగానే ఉంది. మన ప్రజలు ఏ విధంగా ఆధ్యాత్మిక వాదులవుతారు? మన ప్రజలేమైనా ఈ ప్రపంచాన్ని త్యజించి సన్యాసుల య్యారా? 'ఇదంతా భ్రాంతి', 'ప్రాపంచిక జీవితాన్నుంచి మనమంతా దూరంగా ఉండాలి' అనే నినాదాలు మనుషుల్ని ఆధ్యాత్మికులను చేస్తాయా? మన ప్రతి పల్లెటూరులోనూ బాకీ పడ్డ బీదలైన, అమాయకులైన వాళ్లనుంచి వాళ్ల రక్తమాంసాల్ని లాక్కునే షైలాక్‌లాంటి సిగ్గులేని వాళ్ళు లేరా? వాళ్ళు వితంతువులు కూడబెట్టుకున్న డబ్బుల్ని స్వాహా చేసే వాళ్ళు కారా? తప్పుదోవ పట్టిన నిస్సహాయులైన విధవల్ని గట్టుతట్టేటట్లు చేసే మనం పనికి మాలిన వాళ్లం కాదా? పవిత్రమైన, అంకితులైన తమ భార్యల్ని విస్మరించి వాళ్ళను వ్యభిచారంలోకి నడిపించిన వ్యక్తులు మన సంఘంలో లేరని మనం అనగలమా? ఒక సమాజంలో - వివాహ సంబంధమైన లావాదేవీల్లో వధూవరులను అమ్మడంతో చెడిపోతూ ఉంటే, తన కులం వాళ్ళకు దశదిన కర్మల విందు ఇవ్వడానికి నిరాకరించిన వాణ్ణి వెలివేస్తుంటే, తమ మొదటి భార్య చితి మంటలు ఆరక మునుపే రెండో పెళ్ళికి సమాయత్తం అవుతుంటే, డబ్బుల్ని లంచంగా ఇచ్చే బలంతో అర్వై ఏళ్ళ వయసు మీరిన చాదస్తులు పన్నెండేళ్ళ బాలికల్ని పెళ్ళి చేసుకొంటుంటే, విధవల్ని మృగాలకన్నా హీనంగా చూస్తుంటే ఆ సమాజాన్ని ఆధ్యాత్మిక సమాజం అని ఎలా పిలవాలో నాకు అర్థం కావడంలేదు. పైన వివరించినట్లుగా కుళ్ళిపోయిన మన సమాజ స్థితికి పాశ్చాత్యుల భౌతిక వాదం బాధ్యత వహించదు. పాశ్యాత్యుల భౌతిక వాదంతో ప్రభావితమైన వారు ఈ దురన్యాయాలకు విరుగుడు కోసం శాయశక్తుల ప్రయత్నంచేస్తున్నా, వారి ప్రయత్నాలు అరణ్యరోదనలు మాత్రమే అవుతున్నాయి".

ఇంకా వేరొక పేరాలో ఆమె ఇలా చెబుతారు:

"అహల్య పట్ల దేవేంద్రుడి ప్రవర్తన, సత్యవతి పట్ల పరాశరుడి ప్రవర్తన, కుంతి పట్ల సూర్యదేవుడి ప్రవర్తనల వంటి అత్యాచారాలు ఈ కలికాలంలో అయితే తీవ్రమైన కారాగార శిక్షలకు గురిచేస్తాయి. ఇటువంటి అపచారాల్ని మనం ఉపేక్షించడమే కాకుండా, అటువంటి వాటిని పవిత్రమైన గ్రంథాల స్థాయికి చేర్చుతూ ఉన్నాం. అటువంటి గ్రంథాల్ని పిల్లల పాఠ్యపుస్తకాలుగా

ప్రవేశపెడుతూ వచ్చాం. మహాభారతంలోనూ, భాగవతంలోనూ, పురాణాల్లోనూ ఇంద్రియ నిగ్రహాన్ని గూర్చిన పాఠ్యాంశాల్ని ఎన్నింటిని పిల్లలు చూడగలుగుతున్నారు? ఇంద్రియ నిగ్రహం అంటే ఏమిటో తెలియని వయసులో మనల్ని ఆ వింత ఎలా ప్రభావితం చేస్తుంది? ఒక ఋషి ఆశ్రమంలో ఉన్న అమాయకురాలు, కపటమెరుగని బాలికను వంచనతో మోసగించి ఆమెను గర్భవతిని చేసి నిర్లక్ష్యం చేసిన దుష్యంత మహారాజు కథ వంటి కథలున్న ఆ కాలం ఇంద్రియ నిగ్రహాన్ని పాటించిందని అనుకోడానికి ఎలా వీలౌతుంది? చాలా ప్రాచీన కాలంలో చెప్పబడిన కథల్లో ఒక వ్యక్తికి చాలా మంది పిల్లలున్నారనే విషయం తెలిసిన తరువాత ఆ కాలంలో ఇంద్రియ నిగ్రహాన్ని గూర్చి కలలుకూడా కనలేదనే అనుమానం మనకు కలుగదా? సముద్రుడికి అరవై వేల మంది పుత్రులున్నారని, కౌరవులు నూరుమందున్నారని, దక్షప్రజాపతికి ఇరవై ఏడుమంది కూతుళ్ళున్నారని– ఇంకా ఇటువంటి ఇతర సన్నివేశాల్ని గూర్చి తెలిసిన వాళ్ళు ఆ కాలంలో ఇంద్రియనిగ్రహం పాటించబడిందని ఎలా నమ్మగలరు? గతించిన కాలంలో ఇంద్రియ నిగ్రహానికి పరిమితమైన గౌరవం ఉండేది. ఆ కాలంలో ఇంద్రియ నిగ్రహం చాలా దూరంగా ఉంచబడిందనే విషయాన్ని మనం నిజంగా గమనించగలం. మన దేశంలో జననాల సంఖ్య ఏ ఇతర భౌతిక వాద దేశంలో కంటే తక్కువ లేదు. అప్పటికే గంపెడు పిల్లలకి తల్లైనా వేరొక ప్రసవం చేత మోసగింపబడుతున్న స్త్రీ విషయంలో కూడా ఇంద్రియ నిగ్రహాన్ని పాటించడం జరగడంలేదు. నిరుద్యోగ సమస్య ఎక్కువగా ఉన్న ఈ కాలంలో తమ మగపిల్లలకు జీవన భృతిని సమకూర్చలేకపోతున్న మధ్యతరగతి కుటుంబాల్లో సైతం ప్రతి సంవత్సరానికి లేదా ప్రతి ఒకటిన్నర సంవత్సరానికి అదనంగా పిల్లలు పుడుతూనే ఉన్నారు. వరకట్నం అమలులో ఉన్న కులాలలో ఆడపిల్ల పుట్టడం పట్ల తల్లిదండ్రులు దుఃఖాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఆడపిల్ల పుట్టగానే చంపేస్తున్నారు లేదా ఆమైకై ఆమె నిదానపు చావు చచ్చేట్లు చాలా నిర్లక్ష్యంగా పెంచుతున్నారు. ఏది ఏమైనా ఆడపిల్లలు పుట్టే అవకాశం లేకుండా ఉండేందుకు ఇంద్రియ నిగ్రహాన్ని ఆశ్రయించడం లేదు. ఈ సంఘటనలన్నింటినీ మనం ప్రక్కన పెట్టి ఇంద్రియ నిగ్రహం ఒక్కటే మనదేశానికి సరైందని ఘోషిస్తూనే ఉన్నాం కదా? ఇటువంటి ప్రవర్తన ఏ విధమైన లాభాన్నిస్తుంది? మనం మన కళ్ళముందు ఉన్న అంశాల్ని పరిగణనలోకి తీసుకోవాలి. మన పరిస్థితుల్ని కేవలం నీతుల్ని చెప్పడం ద్వారానే మార్పుచేసి అభివృద్ధిని సాధించలేం."

**డా॥ కె. బి. ఆంత్రోలికర్ :** అయ్యా! ప్రతి సభ్యుడికి అందింది కాబట్టి ఆ కరపత్రం చదవబడిందని భావిద్దాం.

**శ్రీ పి.జె. రోషమ్ :** ఆయ్యా! నేను కరపత్రం లోని విషయాన్నంతా చదవనని ముందే స్పష్టం చేశాను. నేను గౌరవనీయులైన సభ్యులు డా॥ ఆంత్రోలికర్‌ను ఓపిక పట్టమని అభ్యర్థిస్తున్నాను.

**శ్రీ పి.జె. రోషమ్ :** ఆమె ఇంకా ఇలా చెబుతున్నారు.

"దేశ భవిష్యత్తును గూర్చిన ఆలోచన వాళ్ళ హృదయాల్లో ఉంటే; కుటుంబ-నియంత్రణ పద్ధతుల్ని గూర్చి ప్రచారం చేస్తున్నట్లే, వాళ్ళు శాయశక్తులా ఇంద్రియ నిగ్రహాన్ని గూర్చి తగిన రీతుల్లో ప్రచారం చేసేందుకు సంఘాల్ని స్థాపించుకొని ప్రయత్నాలు సాగించి ఉండాలి. అయితే ఏది ఏమైనప్పటికీ వాళ్ళు ఈ విషయంలో ఏమీ చేయలేకుండా ఉన్నారు. దీనివల్ల కుటుంబ నియంత్రణ పద్ధతుల్ని ఉపయోగించే ధీశాలు శక్తి విహీనమవుతున్నది.

ప్రసవ సమయంలో స్త్రీలకొచ్చే నొప్పుల్ని పురుషులు అనుభవించేటట్లైతే ఏ ఒక్కరు ఒక్క బిడ్డ కంటే ఎక్కువ మంది బిడ్డల్ని కనాలని అనుకోరని తెలివిగా ఒక డాక్టరు అన్నాడు.

ఇంతవరకూ ఏ ఒక్కరూ తన కుటుంబాన్ని పరిమితం చేసుకోవాలనుకోవడం లేదు. అందువల్లే పెద్ద కుంటుబాల ఆదర్శం సంఘం ముందు ఉందనే అభిప్రాయాన్ని కలిగి ఉండడం తప్పు. పెద్దకుటుంబాలను తమ అధికారం క్రింద ఉంచుకోవాలని అనుకొనే వ్యక్తులు చాలా అరుదుగా ఉంటారు. సాధారణ కుటుంబీకులు కూడా వాళ్ళ కుటుంబాల్ని పరిమితం చేసుకోవాలనుకొంటారు. గర్భ స్రావం, శిశు హత్యల వంటి భయంకరమైన పద్ధతుల్ని తిరిగి వినియోగించడానికి జంకి వెనుకంజ వేస్తారు. ఇటువంటి ప్రయత్నాలు ఎక్కడైనా కనిపిస్తాయి. 1934 లో 'పీపుల్స్‌ట్రిబ్యూన్'లో ప్రచురితమైన ఒక నివేదిక ప్రకారం 1933లో 24,000 చిన్న పిల్లల శవాలు ఒక్క షాంగై వీధుల నిండా పరచబడ్డాయనే విషయం తెలుస్తుంది. చైనా అంతటా ఇదే పరిస్థితి నెలకొని ఉండేదనే విషయం తెలుస్తూ ఉంది. చిన్న పిల్లల్ని వాళ్ళ తల్లిదండ్రులు భయంకరమైన బీదరికం కారణంగా బలిపెట్టారు. ఇటువంటి సంఘటనల వెలుగులో సామాన్య మానవులు కేవలం స్వయం నియంత్రణ ద్వారానే గర్భాన్ని నిరోధించ గలుగుతారని విశ్వసించడం నిష్ప్రయోజనం. దీన్ని బట్టి ఆధునిక కుటుంబనియంత్రణ పద్ధతుల్ని తిరిగి ఉపయోగించడం కంటే వేరే మార్గం లేదనే విషయం నిరూపితమవుతూ ఉంది. ఇటువంటి చికిత్సల అవసరాన్ని నిరాకరించడం గర్భస్రావం, శిశు హత్యల వంటి వాటి పట్ల సుముఖత్వం చూపడమే అవుతుంది.

కొంత మంది వాళ్ల జాతి, మతం లేదా ప్రాంతంలో వాళ్ళ సంఖ్య తగ్గడం వల్ల వారికి నష్టం జరుగుతుందని భావిస్తారు. దీనివల్ల వాళ్ళ విరోధులు వాళ్ళను అధిగమిస్తారని భయపడతారు. ఈ సందర్భంలో జననాల రేటు తగ్గడంవల్ల వాళ్ళ సగటు జనాభా తగ్గదు అని మనం మొట్టమొదటగా గుర్తుంచుకోవాలి. జననాల రేటు జనాభా రేటు పైనే కాకుండా సజీవంగా ఉండగలిగే వారి సంఖ్య పైన కూడా ఆధారపడి ఉంటుంది. వివిధ ప్రాంతాలకు చెందిన వివిధ శాస్త్రజ్ఞుల అనుభవాలు జననాలరేటు ఎంత ఎక్కువగా ఉంటే మరణాల రేటు కూడా అంత ఎక్కువగా ఉంటుందనే విషయాన్ని నిరూపిస్తున్నాయి. జననాల రేటు తగ్గిపోనంత వరకు మరణాల రేటు కూడా తగ్గిపోకుండా ఉంటుంది. ఫలితమేమంటే బ్రతికే రేటు దారుణంగా క్షీణించకుండా ఉండడమే కాకుండా చాలా తరచుగా అది అధికమౌతూ ఉంటుంది. 'ది మదర్స్ క్లినిక్'లో డా॥ మేరియా స్టోప్స్ వైద్యశాస్త్ర అనుభవం మేరకు గర్భ ధారణలు ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా మాతా, శిశు

మరణాలు ఉంటాయి. ఇతర శాస్త్రవేత్తల అనుభవాలు కూడా ఇలాగే ఉన్నాయి. డా॥ జె.ఎమ్.మన్రో, ఎమ్.డి., ఎఫ్. ఆర్. ఎఫ్.సి.యస్. 'మెటర్నల్ మొరాలిటీ అండ్ మార్బిడిటీ' అనే అతని గ్రంథంలో ఇలా పేర్కొన్నారు –

"కుటుంబాన్ని పరిమితం చేసుకోడానికి అనువైన బలీయమైన వాదం ఏమిటంటే నాల్గవ జననంతో మరణాల రేటు మొదటి పుట్టుకకు చాలా దగ్గరవుతుంది. ఇది సర్వసాధారణంగా చాలా తీవ్రమైందిగానూ, అపాయకరమైందిగానూ చూడబడుతుంది. నాల్గవ జననం తర్వాత శిశుమరణాల రేటు ప్రతి తరువాతి గర్భం తోనూ ప్రతి తరువాతి ప్రసవం తోనూ పెరుగుతూ ఉంటుంది. ఇదే సిద్ధాంతం గర్భంలోనే శిశు మరణాలకు, పుట్టుకతోనే శిశుమరణాలకు కూడా వర్తిస్తుంది".

అధికమైన శిశుమరణాల కారణంగా భారతదేశంలాంటి దేశాల జనాభా పెరుగుదల రేటు ఇంగ్లాండు లాంటి దేశాల్తో సమానంగా ఉండడంలేదు. మొదటికోవకు చెందిన దేశాల్లో జననాలరేటు రెండవ కోవకు చెందిన దేశాల కంటే అధికంగా ఉంటున్నప్పటికీ ఇలా జరుగుతూనే ఉంది. ఇంగ్లండు లోని జననాలరేటు భారతదేశంలోని జననాలరేటులో దరిదాపు సగం ఉంటుంది. అయినప్పటికీ ఇంగ్లండులోని జనాభా 1901 – 1931 మధ్యకాలంలో దాదాపు 23 శాతం పెరిగింది. అయితే ఇదే కాలంలో దాదాపు భారతదేశంలోని జనాభా 17 శాతం మాత్రమే పెరిగింది. జనాభా సంఖ్య పెరిగినప్పటికీ కుటుంబనియంత్రణ సరైన మార్గం అని, అది శిశుమరణాల్ని తగ్గించడానికి ఉపయోగపడుతుందని తేలుతున్నది.

ఆధునిక యుద్ధాలకు కొద్ది మంది మనుషులు ఉంటే చాలనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. మంచి ఆధునాతనమైన యుద్ధసామగ్రి ఉన్న ఒక సైన్యం దానికంటే ఎక్కువ సంఖ్యలో ఉన్న మంచి యుద్ధ సామగ్రి లేని సైన్యాన్ని సమూలంగా పెకలించి వేస్తుంది. మునుపటి ప్రపంచయుద్ధంలో తక్కువ జననాల రేటున్న దేశాల సైన్యాలు ఎక్కువ జననాల రేటున్న దేశాల సైన్యాల్ని రూపుమాపాయి.

ప్రపంచంలో మనం చిన్న సంఖ్యలో ఉన్న చాలా సమాజాల్ని చూడగలం. అయితే ఆ చూడ్డం డబ్బు, సంప్రదాయం వంటి వాటిపరంగా వాటిని గుర్తిస్తాం. మన దేశంలో పార్శీ సమాజం ఈ విషయంలో ఒక ఉదాహరణ. అందువల్ల రాశి విషయంలో ఆశపడ్డం లాభదాయకమైన విషయం కాదు. 'వరమేకోగుణీ పుత్రో నచ మూర్ఖ శతాన్యపి' అనే సూక్తి అందరికీ బాగా తెలిసిందే.

దీని తరువాత వివిధ జాతుల, సంఘాల, దేశాల మధ్య ఉన్న ద్వేషాలకి మూల కారణం బీదరికం అనే విషయాన్ని మనసులో ఉంచుకోవడం చాలా అవసరం. బీదరికం ఎప్పుడైతే రూపుమాపబడుతుందో అపుడు అటువంటి ఒడుదుడుకుల మూలకారణం కూడా తొలగించ బడుతుంది. అటు తరువాత ఎవరూ ఇతరుల నుంచి అత్యాచారాల గురించి భయపడాల్సిన అవసరం ఉండదు.

అధునాతనమైన గర్భ నిరోధక సాధనాలు అన్ని జాతుల, మతాల, దేశాలకు చెందిన వ్యక్తుల చేత ఉపయోగింపబడుతున్నాయనే విషయానికి పాశ్చాత్యదేశాలు ఉదహరణగా నిలుస్తున్నాయి. ఉదాహరణకు రోమన్ కేథలిక్‌లు గర్భనిరోధానికి వ్యతిరేకులు అనే వాదం వినిపించక పోవడమే. ఫ్రాన్స్ రోమన్ కాథలిక్ దేశం. ఆ దేశంలో జననాల రేటు చాలా తక్కువగా ఉందనే విషయం గమనించదగింది. 1932 నాటికి ఈ క్రింది పది దేశాలు చాలా తక్కువ జననాల రేటును కలిగి ఉన్నాయి –

| | | | |
|---|---|---|---|
| స్వీడన్ | ... | ... | 14.5 |
| జర్మనీ | ... | ... | 15.1 |
| ఆస్ట్రియా | ... | ... | 15.2 |
| ఇంగ్లండ్, వేల్సు | ... | ... | 15.3 |
| నార్వే | ... | ... | 16.3 |
| ఆస్ట్రేలియా | ... | ... | 16.4 |
| స్విట్జర్‌లాండ్ | ... | ... | 16.7 |
| న్యూజిలాండ్ | ... | ... | 17.1 |
| అమెరికా | ... | ... | 17.3 |
| ఫ్రాన్స్ | ... | ... | 17.3 |

వీటిల్లో చాలా తక్కువ జననాల రేటు ఉన్న మొత్తం కాథలిక్ జనాభా ఉన్న ఆస్ట్రియా, 1/3 వ వంతు కాథలిక్‌లు ఉన్న జర్మనీలు.

ఈ కింది అంకెలు ప్రముఖమైన పట్టణాల జననాల రేట్ల వివరాలను చాలా చక్కగా చూపుతాయి. ఇవన్నీ 1927 లేదా 1928 సంవత్సరాలకు సంబంధించినవి :

| | | | |
|---|---|---|---|
| లండన్ | ... | ... | 16.1 |
| కొలోన్ | ... | ... | 16.0 |
| జెనీవా | ... | ... | 14.6 |
| మిలాన్ | ... | ... | 14.5 |
| తురిన్ | ... | ... | 13.2 |
| ప్రేగ్ | ... | ... | 12.5 |
| మ్యూనిచ్ | ... | ... | 12.0 |
| వియన్నా | ... | ... | 10.6 |

లండన్‌ను మినహాయిస్తే పై నగరాలన్నీ కూడా ఖచ్చితంగా రోమన్ కాథలిక్‌లకు చెందినవే. అయినప్పటికీ అవన్నీ లండన్ కంటే తక్కువ జననాల రేటును కలిగి ఉన్నాయి. వాటిల్లో మూడు ముస్సోలినీ యొక్క ఇటలీలో ఉన్నాయి.

ఇతర దేశాలు గర్భనిరోధాన్ని నిర్లక్ష్యం చేసి సంఖ్యాపరంగా పటిష్టమైనవి అవుతాయనే భయం పూర్తిగా నిరాధారమైందనే విషయం గమనించాలి.

రాజనీతిజ్ఞుల ఉపన్యాసాలు జనాభా ఒత్తిడివల్ల కలిగిన ఆర్థిక ఒడిదుడుకులు ఆధునికమైన యుద్ధాలకు మూలకారణాలయ్యాయి. బెర్న్ హార్డ్, కైజర్, హిట్లర్, ముస్సోలిని, గూరింగ్ ఈ అంశాన్నే నిస్సంకోచంగా తరచూ ఒత్తిపలికారు. ఉదాహరణకు అడాల్ఫ్ హిట్లర్ 'మైన్ కాంఫ్' అనే గ్రంథంలో:

"యుద్ధానికి ముందు జర్మన్ ప్రజల తామరతంపర పెంపుదల వల్ల రోజువారీ భత్యాన్ని పంపిణీ చేసే సమస్య అంతుకుముందెన్నడూ లేనంత తీవ్రంగా అన్ని రాజకీయ, ఆర్థిక కార్యకలాపాల ముంగిట్లోకి వచ్చింది."

ఆయనింకా ఏం చెబుతారంటే :

"ఈ భూమ్మీద తగినంత స్థలం మాత్రమే ఒక దేశం ఉనికిని, స్వేచ్ఛను సమకూర్చుతుంది. ఈ జాతీయ సోషలిస్ట్ ఉద్యమం జనాభా సంఖ్యకు భూభాగానికి మధ్యనున్న సమతుల్యాన్ని తొలగించే ప్రయత్నం చేస్తుంది..... నేల, భూభాగం మన విదేశీ రాజకీయ గమ్యం కావాలి." (పుటలు 728-35).

హిట్లర్ 12 సెప్టెంబర్ 1938లో ఇచ్చిన తన అధునాతనమైన, చారిత్రాత్మకమైన ఉపన్యాసంలో ఇలా అంటాడు :

"ఒక్క చదరపు కిలోమీటరుకి 140 మంది మనుషులు క్రిక్కిరిసి ఉన్న జర్మనీలో వాళ్ళు యూదుల్ని ఉంచాలని ఆశించారు. అయితే కిలోమీటరు విస్తీరంలో ఉన్న కొద్దిమంది అధికారులు వాళ్ళను అక్కడ ఉండనీయలేదు.

ముస్సోలిని కూడా ఇలాగే చెప్పాడు :

"మనం భూమి కోసం ఆకలితో ఉన్నాం మనం సంఖ్యలో ఎక్కువగా ఉన్నాం. ఆ ఆకలి తీరదికో". (ఫారెన్ అఫైర్స్ నుంచి అక్టోబర్ 1926).

తగాదా లేనటువంటి ఆకాశం భూమి అవసరాన్ని అన్ని దేశాలు గుర్తించాలని ఇటలీ డిమాండు చేసింది. ఆయా దేశాలు దీన్ని గుర్తించక పోతే ఇటలీ అధికారాన్ని తన చేతుల్లోకి బలవంతంగా తీసేసుకొంటుంది" (సన్‌డే టైమ్స్ నుంచి 14 నవంబర్ 1926).

**ఉప సభాపతి :** గౌరవనీయులైన సభ్యులు కాల వ్యవధిని దాటిపోయారు.

**శ్రీ బి.కె. గైక్వాడ్ :** ఆర్యా! కాలవ్యవధి ఎంతో నేను తెలుసుకోవచ్చా?

**ఉప సభాపతి :** అర్ధ గంట.

**శ్రీ బి.కె.గైక్వాడ్ :** అయ్యా! మీ దృష్టికి తీసుకురావడం కోసం ఇంతకు మునుపటి తీర్మానం తీసుకవచ్చిన గౌరవనీయ సభ్యుడు (శ్రీ శ్రీకాంత్) అర్ధ గంట కంటే ఎక్కువే మాట్లాడారని నేను విశ్వసిస్తున్నాను.

**ఉప సభాపతి :** కాలాన్ని పొడిగించడమనేది అధ్యక్షుని చేతిలో పని.

**శ్రీ బి.కె.గైక్వాడ్ :** ఆ అనుగ్రహం ఇతర తీర్మానాలకు ఇవ్వకూడదా?

**శ్రీ పి.జె. రోషమ్ :** అయ్యా! సభ సమయాన్ని ఎక్కువ తీసుకోవాలనుకోవడం లేదు. అయితే ఇంకా నేను చెప్పాలను కొంటున్న మరికొన్ని విషయాలు మిమ్మల్ని మరికొన్ని నిముషాలు పొడిగించమని అర్థించేటట్లు చేస్తున్నాయి.

అందువల్ల ఎవరైతే శాశ్వతమైన ప్రపంచ సోదరభావం కోసం నిలబడుతున్నారో వాళ్ళంతా జనాభా పెరుగుదలకు దోహదం చేసే ప్రతి ప్రయత్నాన్ని అడ్డుకొని, వాళ్ళు శాయశక్తులా జనాభాని కుటుంబనియంత్రణ ద్వారా అదుపులో ఉంచాల్సి ఉంటుంది.

గర్భనిరోధాన్ని గూర్చిన ప్రచారం జనానికి చేరటంలో విఫలమౌతున్నదని, దాని ఫలితం వంశాభివృద్ధి కంటే వంశనాశనకారిగా ఉంటుందనే భయం కూడా నిరాధారమైందే. పాశ్చాత్య దేశాల్లోని అనుభవం క్రింది వర్గం వాళ్ళు అధునాతనమైన గర్భ నిరోధకాలను తెలుసుకోగానే వాటి వల్ల కలిగే ప్రయోజనాలు పొందుతారనే వాస్తవాన్ని రుజువు చేసింది. వాళ్ళ విషయంలో అవసరం ఎక్కువగానే ఉంటుందనే విషయాన్ని కూడా స్పష్టం చేసింది. మన దేశంలోని ప్రజలు నిరక్షరాస్యులైనప్పటికీ వాళ్ళ స్వంత లాభం ఎక్కడుందో తెలుసుకొనగలిగిన తెలివైన వాళ్ళు. అందువల్ల కొత్త పరికరాల ఉనికి వాళ్ళకు తెలియగానే సంపూర్తిగా వాటిని వాళ్ళు వినియోగిస్తారనే విషయంలో అనుమానం లేదు. అటువంటి వాళ్ళ విషయంలో వేసెక్టమీ బాగా ఉపకరిస్తుంది. అందువల్ల ప్రభుత్వం మునిసిపాలిటీలు ఆసుపత్రుల్లో ఈ విధమైన సౌకర్యాలను సమకూర్చాలి.

ఒకప్పటి ప్రిన్సిపాల్ అయిన గోలే అతని 'హిందూ ధర్మ్ ఆణి సుధారణా' అనే గ్రంధంలో చాలా స్పష్టంగా గ్రామీణ ప్రజలకు కూడా చాలా విలువలుంటాయని, మంచి పౌరుల్ని అందించే పనిని వాళ్ళు చేస్తూ ఉంటారని పేర్కొన్నారు.

ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించే వాళ్ళు ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ వంటి దేశాల్ని ఉదాహరణలుగా పేర్కొంటూ దాని నిష్ప్రయోజనాన్ని ఎత్తి చూపుతుంటారు. అయితే వాళ్ళు వాళ్ళ జనాభా పెరుగుదల సమర్థించబడినట్లు రుజువైతేనే తప్ప మనం ఆ దేశాల్ని అనుసరించం అనే విషయాన్ని వాళ్ళు మరిచిపోతుంటారు. ఈ విషయంలో మనం ముందు ఈ దేశాల జననాల రేటు మన దేశం

జననాల రేటు కంటే చాలా తక్కువగా ఉన్నదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. మన దేశం జననాల రేటు 35, అయితే 1936 లో ఇటలీ, ఫ్రాన్సు, జర్మనీ దేశాల జననాలరేటు వరుసగా 22.2, 15, 19. 1900లో జర్మనీ దేశం జననాలరేటు 35.6. అయితే 1933లో అది 14.7కు తగ్గింది. ఆ సమయానికి ఇటలీ, ఫ్రాన్సు దేశాల జననాలరేట్లు చాలా తగ్గాయి. ఇంగ్లండులో 1851-55 సంవత్సరాల మధ్య జననాలరేటు 33.9 అయితే 1931కి అది 15.3కు తగ్గింది. మన దేశం జననాలరేటు ఆచరణలో గత యాభై సంవత్సరాలుగా నిలకడగా ఉంది. అందువల్ల ఇతర దేశాలు వాటి జననాల రేటును పెంచేందుకు ప్రయత్నాలు చేయడం తెలివైన పని కాదు.

సామ్రాజ్య వాదులకు వాళ్ళ జాతికి సంబంధించిన ప్రజల పెరుగుదల రేటును సడలించడం దుఃఖదాయకమైనదనే విషయం సర్వసాధారణమైన సంగతే. "పెంచు లేదా తుంచు" వంటి నినాదాల్ని వాళ్ళు ఇవ్వడంలో ఆశ్చర్య పడాల్సిన పనిలేదు. ఏది ఏమైనా అటువంటి నినాదాలు కొంత మంది విద్యావంతుల్ని కుటుంబనియంత్రణ ఫలితాలను గూర్చి అనుమానించేట్లు చేయడం విచిత్రం. 1938 ఫిబ్రవరి నాటి "ది నైన్‌టీన్త్ సెంచరీ అండ్ ఆఫ్టర్" లోని సర్‌లియో ఛియోజా మనీ "రెన్యూ ఆర్ డై" అనే వ్యాసం ఈ విషయాన్నే ఎత్తి చూపుతుంది. ఈ రచయిత శ్వేతనాయకత్వం మానవజాతి మంచికి అవసరమైందిగా భావించారు. అందువల్ల శ్వేత జాతీయుల సంఖ్యాపతనాన్ని అరికట్టవద్దని రోదించారు. ఈ విషయంలో – మొదటిగా ఈ ప్రపంచాన్ని శ్వేతనాయకత్వం ఆదుకుంటుందనే ప్రతిపాదనను స్వీకరించడానికి తిరస్కరించారు. రెండవదిగా కొద్ది మంది విద్యావంతులు మాత్రమే శ్వేతజాతీయుల పతనం మానవత్వానికేమైనా ముప్పు తీసుకొస్తుందా అని చూస్తూ పోయారు. దీనికి భిన్నంగా ఆ వ్యక్తి యొక్క సిద్ధాంతాలు తప్పులని తేలాయి. ఇంగ్లండులోని జననాల రేటు తగ్గుతూ తగ్గుతూ 2035వ సంవత్సరానికి ఆ దేశపు జనాభా 4,400,000 (44 లక్షలు) కు తగ్గుతుందని భావించారు. అయితే వాస్తవాలు దీనికి భిన్నంగా ఉన్నాయి. ఇంగ్లండులో జననాల రేట్లు తగ్గడం కంటే పెరిగింది. 1933లో జననాల రేటు 14.4 అయితే జూలై 1938కి అది 15.3 అయ్యింది. ఇదే విధంగా ఇంగ్లండు, వేల్స్ దేశాల్లో జనాభా 1940 నాటికి 40,700,000 ఉంటుందని రచయిత అంచనా వేశారు. అయితే 1937 నాటికే ఆ సంఖ్య 41,031,000గా ఉంది. జనాభా పెరుగుదల సంవత్సరానికి 190,000 మందిగా ఉంది. ఈ వాస్తవాలు అటువంటి వ్యాసాలు చదివి తప్పు త్రోవ తొక్కకుండా జాగ్రత్తపడాలని చెపుతున్నాయి.

అధిక జనాభా సమస్యకు పరిష్కార మార్గంగా వలస వెళ్ళడాన్ని కొన్ని సమయాల్లో ప్రతిపాదింపబడింది. అయితే పరిష్కార మార్గం కూడా అంత మేలయిందిగా లేదు. చాలా కొద్ది మందికి మాత్రమే ధైర్యం తమ స్వదేశం వదలి వెళ్ళడానికి అవసరమైన మొగ్గుచూపే నైజం ఉంటాయి. బాల్యం నాటి స్మృతులు, బంధుమిత్రులుండటం, ఇష్టమైన వాతావరణం, పరిసరాలు, ఇంకా ఇతర అంశాలు, దూరప్రాంతాల వాతావరణ హాని, అక్కడి ప్రజల భిన్నమైన భాష, ఆచార వ్యవహారాలు వంటివి కొద్దిమంది మాత్రమే వెళ్ళగలరు. సర్వసాధారణగా శక్తి సామర్థ్యాలు కలిగిన

వాళ్ళు మాత్రమే వలసపోవడానికి ఇష్టపడతారు. అటువంటి పౌరులు వలస వెళ్ళడం మాతృదేశానికి నిజంగా ఎంతో నష్టం. వాళ్ళు తమ సొంత దేశంలో తమను తాము సులభంగా పోషించుకోగలరు. అయితే దూర ప్రాంతాలకు వలసవెళ్ళి జీవితాలను మెరుగుపర్చుకోవాలని వాళ్ళను అత్యాశ ప్రేరేపిస్తుంది. వలస వెళ్ళడం అనేది శారీరక, మానసిక వికలాంగుల విషయంలో నిరుపయోగమైంది.

దీనికి తోడుగా పరిమిత జనాభా కలిగినదేశాలు తమ పెరుగుతున్న జనాభాకు కావలిసిన వసతి సౌకర్యాల కోసం ఇతరుల్ని తమ దేశంలోకి అనుమతించడానికి ఒప్పుకోవు. బ్రిటీష్ పరిపాలనా కాలంలో కెనడా ఎక్కువగా ఆంగ్లేయులతో నిండిపోయిన దేశం. అయితే కెనడా దేశస్థులు పనుల కోసం వెళ్ళి అక్కడ స్థిరపడిన ఆంగ్లేయ పనివారిని అనుమతించడానికి నిరాకరించడం గమనించదగిన అంశం. అధిక జనాభా కలిగిన దేశాలు బలవంతంగా పరిమిత జనాభా కలిగిన దేశాల్లో ప్రవేశించడానికి ప్రయత్నించడం యుద్ధాలకు దారి తీశాయి. ఈ విషయం ఇటీవల కాలంలోనే మనకు చాలా దగ్గరగానే ఉన్న బర్మా విషయంలో రుజువయింది. అక్కడ జరిగిన అధునాతనమైన వర్గపోరాటాలకు కారణం భారతీయులు. వాళ్ళ ఆర్థికమైన అభివృద్ధిని సాధించారన్న అనుమానం బర్మా దేశీయుల మనసుల్లో కలిగింది. అధిక జనాభా కలిగిన దేశాల సంఖ్యతో పోల్చి చూస్తే పరిమిత జనాభా కలిగిన దేశాల సంఖ్య చాలా తక్కువే. జపాన్, ఇటలీ, జర్మనీ, చైనా, భారత దేశం ఇంకా చాలా దేశాలు అధిక జనాభా కలిగినవే. ఈ ప్రాంతాల నుంచి వలస వచ్చే వాళ్ళకు తగిన వసతిని కల్పించడానికి వీలు ఉండదు.

ఈ సందర్భంలో ఇంకో విషయం గమనించాలి. వలస వెళ్ళడం అనేది దేశం యొక్క జనాభా సమస్యను శాశ్వతంగా పరిష్కరించదు. గాలి లాగా పెరుగుతున్న జనాభా ఖాళీని వెంటనే పూర్తిచేసే లక్ష్యాన్ని కలిగి ఉంటుంది. దీనివల్ల అంతకుమునుపున్న పరిస్థితే నెలకొంటుంది. అందువల్ల గర్భ నిరోధక మార్గం తప్ప జనాభా పెరుగుదలకు వేరే పరిష్కారమార్గం లేదు.

కొంత మంది బాల్య వివాహాల్ని అదుపుచేసి ఆలస్య వివాహాలను ప్రవేశ పెట్టడం ద్వారా జనాభా పెరుగదలను అరికట్ట వచ్చనుకుంటారు. అయితే ఈ నమ్మకం కూడా అనుమానాస్పదమే. మొట్టమొదటగా మన దేశంలో పెళ్ళికావాల్సిన ఆడపిల్లలు వయసు వచ్చేంత వరకు కొన్ని సంవత్సరాల్ని వృధాచేయాలి. ఆడపిల్లల విషయంలో 18,22 సంవత్సరాల మధ్యకాలం అధిక సంతానోత్పత్తికి అనువైనదిగా ఉంటుంది. పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు ఈ వయసు తరువాతే పెళ్లి చేసుకొంటారు. అంటే వాళ్ళు వాళ్ళ అధిక సంతానోత్పత్తి కాలం తరువాత పెళ్ళి చేసుకొంటారన్న మాట. శారదా చట్టాన్ని అమలు చేయడంలో ఉన్న కష్టనష్టాలను గమనించినట్లైతే 14 ఏళ్ళు ఆడపిల్లకు పెళ్ళిచేసుకోతగిన కనిష్ఠ వయసుగా నిర్ణయించడం దాదాపు నిరుపయోగం. సమీప భవిష్యత్తులో మనదేశంలోని స్త్రీలు వాళ్ళ వివాహాల్ని 22 వ సంవత్సరం వరకూ వాయిదా వేస్తారనీ, అప్పుడు అధిక జనాభా అరికట్టబడుతుందనీ ఆశిద్దాం. శ్రీ వి.కె. విఠల్ 1931 నాటి జనాభా లెక్కలను ఆధారంగా నిర్వహించిన ఫలదీకరణ సర్వేలో ఈ క్రింది అంశాల్ని నిర్ధారించారు.

1. ఇరవై సంవత్సరాలకంటే తక్కువ వయసులో పెళ్ళి చేసుకొన్న ఆడపిల్లలు ఇరవై సంవత్సరాలకంటే ఎక్కువ వయసులో పెళ్ళి చేసుకొన్న ఆడపిల్లలకంటే తక్కువ మంది పిల్లల్ని కన్నారు.

2. ఇరవై సంవత్సరాల కంటే తక్కువ వయసులో పెళ్ళి చేసుకొన్న ఆడపిల్లలకు పుట్టిన బిడ్డలు బ్రతికే సంఖ్య ఇరవై సంవత్సరాలకంటే ఎక్కువ వయసులో పెళ్ళి చేసుకొన్న ఆడపిల్లలకు పుట్టిన బిడ్డలు బ్రతికే రేటు కంటే చాలా తక్కువగా ఉంది.

ఈ నిర్ధారణలు ఆలస్య వివాహాలు అమలులోకి వచ్చినా అనుకున్నంతగా జనాభా అరికట్టబడదనే విషయాన్ని చూపిస్తున్నాయి. ఈడొచ్చే వయసు వరకు ఎక్కువ మంది పిల్లలు బ్రతకడం వల్ల మన జనాభాలో పెరుగదలకే అవకాశం ఉంటుందికాని, తరుగుదలకు కాదు.

బొంబాయి విశ్వవిద్యాలయం సోషియాలజీ ప్రొఫెసర్ అయిన డాక్టర్ జి.యస్.గుర్యే, ఫలదీకరణకు, స్త్రీల వయసుకు మధ్య ఉన్న పరస్పర సంబంధానికి సంబంధించిన "ఫెర్టిలిటీ డేటా ఆఫ్ ది ఇండియన్ సెన్సస్ ఆఫ్ 1931" అనే తన వ్యాసంలో (జర్నల్ ఆఫ్ యూనివర్సిటీ ఆఫ్ బొంబే", (సంపుటం III ; మే 1934) "పై తాత్కాలికమైన నిర్ధారణ నిజమని తేలితే పెళ్ళి సమయానికి స్త్రీకి ఉన్న వయసుకి, సంతానానికి మధ్య సంబంధం ఉన్నదనేది రుజువయినట్టే. దాంతో పెళ్లి సమయానికి స్త్రీ వయసు ఎక్కువగా ఉండటం వల్ల ఉపయోగం ఉంటుంది. మన జనాభా చాలా అధికం అని అనుకుంటున్నాను. అందువల్ల మన జనాభా పెరుగుదల అవాంఛనీయమైంది. జనాభా పెరుగుదలకు దోహదం చేయడం ఆత్మహత్యా సదృశం. స్త్రీల వయసు పెళ్ళి నాటికి ఎక్కువగా ఉండాలనే మన ప్రచారంతోపాటు గర్భ నిరోధాన్ని గూర్చిన ప్రచారం చేయడం కూడా అవసరం" అని చెప్పారు.

సరైన వయసులో పెళ్ళి చేసుకోలేని వారి కారణంగా వ్యభిచారం ప్రోత్సహింపబడుతూ ఇతర దుష్ఫలితాలు కూడా వెన్నంటి వుంటాయనే విషయాన్ని మరిచిపోకూడదు. సరైన వయసులో పెళ్ళిళ్ళు చేయాలనే విషయాన్ని పట్టించుకున్నా, గర్భ నిరోధాల్ని మనం పాటించేటట్లు చేయాలి.

స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యం జనాభా పెరుగుదలను తగ్గిస్తుందనే దృక్పథం కూడా ఉంది. అయితే ఇది కూడా సరైన దృక్పథం కాదు. ఆర్థిక స్వాతంత్ర్యం ఒక వ్యక్తిని కామం గుప్పిట్లోంచి విముక్తుణ్ణి చేయలేదు. కొద్ది మంది స్త్రీలు మాత్రమే వాళ్ళ జీవిత కాలమంతా ఇంద్రియ నిగ్రహాన్ని పాటించగలుగుతారు. అందువల్ల ఈ పరిష్కార మార్గం నిష్ప్రయోజనమైందని రుజువైంది. ఇప్పటికి కూడా క్రింది తరగతుల స్త్రీలు వాళ్ళ సొంత సంపాదనలతో వాళ్ళ కుటుంబాలను ఆదుకొంటున్నారు. అయితే ఈ సహాయం కుటుంబ నియంత్రణ పాటించడానికి ఏ మాత్రం సాయపడడంలేదు.

వైద్య, ఆరోగ్య విషయాల కారణంగా కుటుంబ నియంత్రణ అవసరమని కొంతమంది

అభిప్రాయపడుతున్నప్పటికీ, ఆర్థిక సమస్యల పరిష్కారానికి అది అవసరం లేదని అంటున్నారు. మన దేశంలో ఆర్థిక, వ్యవసాయభివృద్ధులకు ఎక్కువ అవకాశం ఉందనే విశ్వసిస్తుంటారు. ఇందుకు సంబంధించిన ప్రయత్నాలు మన ప్రజల జీవిత ప్రమాణాల్ని మెచ్చుకోతగినంతగా పెంచుతాయని వాళ్ళనుకుంటారు. ఏది ఏమైనా చాలా దగ్గరగా పరిశీలిస్తే ఈ అభిప్రాయం కూడా తప్పే అని తేలుతుంది. ధనవంతులైన వినియోగదారులు, తగినంత పెట్టుబడి కొరత ఉండడం వల్ల పరిశ్రమల అభివృద్ధి కుంటుపడుతున్నది. ఇదే విధంగా తగినంతగా సాగు భూములు, వర్షపాతం, ఎరువులు లేకపోవడం మన వ్యవసాయ ఉత్పత్తుల విషయంలో అవరోధాలుగా ఉంటున్నాయి. అస్సాం లో తప్ప తక్కిన ప్రాంతాల్లో మాత్రమే సాగులో లేని భూమి చాలా తక్కువగా ఉంది. బర్మాలో ఇప్పటికీ తగినంత అనువైన భూమి సాగులోకి రావాల్సి ఉంది. బర్మాలోని ఇటువంటి కొద్ది పాటి భూములే భారత దేశంలో వ్యవసాయ భూముల గురించి కొన్ని అపోహలు కలిగిస్తున్నాయి. మన దేశంలో 86.4 శాతం సాగుచేయతగిన భూమి సేద్యం క్రిందికి తేబడింది. మిగిలిన భూమిలో కొద్ది పాటి భూమి మాత్రమే సాగుచేయతగిందో కాదో అని అనుమానించేదిగా ఉంది. భారతదేశ వ్యవసాయంపై రాయల్ కమిషన్ నివేదిక ప్రకా రం చాలా మటుకు అటువంటి భూమికి విలువలేదు. మన వ్యవసాయిక భూమిలో చాలా వరకు నిరంతరం పంటలు పండించడం వల్ల తగిన ఎరువులు వాడక పోవడం వల్ల, బీడు పడిపోయింది.

జనాభా అధికంగా పెరగడం మూలంగా అడవులు, పశుగ్రాసం భూములు చాలక మనదేశం ఇబ్బందులు పడుతుంది. కెనడాలో 34.3 శాతం సారవంతమైన భూమి పశుగ్రాసం కోసం కేటాయించారు. ఫ్రాన్సులో ఈ కోవకు చెందిన భూ భాగం 21.5 శాతం, ఇటలీలో 18.3 శాతం, జర్మనీలో 14.3 శాతం. అయితే మనదేశంలో అదికేవలం 1.6 శాతం ఉంది. ఈ లెక్కలు మన పశువులు ఎన్ని ఇబ్బందులు ఎదుర్కొంటున్నాయో సూచిస్తున్నాయి. ఏ దిక్కుల్లో చూసినా మన కళ్ళకు బక్క చిక్కిన పశువులే కన్పిస్తున్నాయి. మన ప్రజలు తమ మానవతావాదాన్ని గూర్చి ఎంత గర్వపడుతున్నా వాళ్ళు భూమికోసం పోరాడుతూనే ఉన్నారు. పశుగ్రాసం భూమిని అమాయకమైన మూగజీవాలను మోసం చేసి సాగులోకి తెస్తున్నారు. అందువల్ల మన వ్యవసాయం తగ్గినంతగా పశువుల లేమివల్ల, ఆవుపేడ వంటి ఎరువుల లేమివల్ల నష్టపోతున్నది. అందువల్ల అందులో గణనీయమైన అభివృద్ధి సాధించడం కష్టంగా ఉంది. జపాన్, చైనా వంటి దేశాల్లో లెక్కకు వస్తున్న అధిక వరిపంటల రాబడులను బట్టి మన దేశంలో కూడా అటువంటి రాబడిని ఆశించవచ్చని కొందరనుకుంటున్నారు. ఆయా దేశాల్లో వరిపంట విషయంలో అధిక రాబడుల సంఖ్యల్ని అనుమానించడానికి ఆధారాలున్నాయి. ఇటలీ మాజీ విదేశ వ్యవహారాల మంత్రి అయిన కౌంట్ కార్లో స్ఫోర్రా న్యూయార్క్ నుంచి ప్రచురింపబడే "ఇంటర్ నేషనల్ కన్సిల్యేషన్" అనే మాసపత్రికలో ఇటీవల "ది కాన్ఫ్లిక్ట్ బిట్వీన్ చైనా అండ్ జపాన్" అనే వ్యాసాన్ని ప్రచురించారు. 1900 నుంచి జపాన్‌లో వరి ఉత్పత్తి గణనీయంగా తగ్గిందని ఆయన అందులో ప్రస్తావించారు. జపాన్ దేశంలో

వ్యవసాయానికి సంబంధించిన అంకెలు నమ్మతగినవిగా లేవనడానికి సాక్ష్యాధారాలున్నాయి. దీనితో పాటే జపాన్ దేశంలో సంవత్సరం పొడుగునా వర్షాలు కురుస్తాయని దాని విస్తృతమైన అడవులు ఉండటం వల్ల లెక్క లేనంతగా ఎరువు ఉన్నదని ఆ దేశంలో వరిపంట కనువైన వాతావరణం కూడా ఉందన్న వాస్తవాలను కూడా గమనించాలి. ఎక్కడైనా ఇటువంటి అవకాశాలు అరుదుగా మాత్రమే ఉంటాయన్న విషయాన్ని కూడా మనం గమనించాలి. స్వతంత్ర పరిపాలన మన ప్రజలకు కొంత మంచిని చేకూర్తుస్తుంది అనే విషయాన్ని మనం ఆమోదించినా జనాభా పెరుగుదలను అరికట్టక పోతే మన ప్రజల ఆర్థిక పరిస్థితుల్లో పేర్కొనతగినంతగా అభివృద్ధిని ఆశించలేం. ఇదివరకే వివరించిన విధంగా అభివృద్ధిని సాధించడానికి ఉన్న ప్రతి అవకాశాన్ని వినియోగించినా కూడా జనాభా పెరగడంతో మనం సాధించిన ప్రతి ప్రయోజనం నిష్ప్రయోజనం అవుతుంది. ప్రజల ఆర్థిక స్థితిగతుల్ని మెరుగుపరచడానికి తీసుకొనే అన్ని చర్యలతో పాటే జనాభా పెరుగుదల నరికట్టే జాగ్రత్తల్ని తీసుకోకపోతే ప్రజల జీవన ప్రమాణాలు ఏ మాత్రం పెరగవు.

చాలా దేశాల్లో కేవలం ఒక్క స్వతంత్ర పరిపాలన అనేదే అన్ని రకాలైన అభివృద్ధుల్ని సాధించలేదనేందుకు చాలా సాక్ష్యాధారాలున్నాయి. ఏది ఏమైనా చాలా కారణాల వల్ల ఇంగ్లండు, అమెరికా వంటి దేశాల ప్రజల ఆర్థిక స్థితిగతులు మన దేశంలో వారికంటే మెరుగ్గా ఉన్నాయి. మన దేశంలో చాలా మందికి పోషకాహారం పొందడంలో బీదరికం అడ్డు తగులుతున్నది. అయినప్పటికీ అక్కడ మంచి ఆరోగ్యానికి కావలసిన జీవన ప్రమాణాలను నెలకొల్పడం కష్టంగా ఉంది. ప్రెసిడెంట్ రూస్‌వెల్ట్ అభిప్రాయం మేరకు ఆఫ్రికాలో 1/3 వ వంతు ప్రజలు కూడా తగినంత పోషకాహారాన్ని పొందడం లేదు. దానికి ఒకానొక కారణం అక్కడ కూడా అవసరమైనంత మేరకు కుటుంబ నియంత్రణ పాటించకపోవటమే. కొత్తగా ఆవిర్భవించిన దేశాల్లో సారవంతమైన భూమి సగటు మనిషికి చాలా ఉంది. ఆ దేశాల్లోని ప్రజలకు ఎక్కువ జనాభా ఉన్న దేశాలకంటే ఎక్కువ పోషకాహారం లభిస్తుంది. ఆస్ట్రేలియాలోనూ, ఇటలీలోనూ సంవత్సరానికి తలసరి వినియోగపు వివరాలు ఇలా ఉన్నాయి:

| | ఆస్ట్రేలియా | ఇటలీ |
|---|---|---|
| పాలు–పాల ఉత్పత్తులు (గ్యాలన్లలో) | 102 | 23 |
| మాంసం (ఎల్‌బీల్లో) | 202 | 35 |
| పండ్లు ( ,, ) | 104 | 40 |
| చక్కెర ( ,, ) | 107 | 18 |
| గోధుమలు ( ,, ) | 297 | 351 |

గోధుమ తప్ప తక్కిన ప్రతి ఆహార పదార్థం ఇటలీ కంటే ఆస్ట్రేలియాలోనే ఎక్కువ మోతాదుల్లో వినియోగింపబడుతున్నది. ప్రపంచంలోని దేశాల్లో కెల్లా హాలెండ్‌వంటి దేశాలు జనాభా

చాలా తగి చాలా సంతోషంగా ఉన్నాయి.

బొంబాయి ప్రెసిడెన్సీలో రోజుకు తలసరి లభించే పాలు 1 1/4 'తొలాలు' మాత్రమే. పౌష్టికాహార ప్రామాణికుల అభిప్రాయం ప్రకారం సగటున ప్రతి ఒక్క వ్యక్తికీ రోజుకు ఒక 'పై' (దాదాపు అరలీటరు) పాలు లభించాలి.

కుటుంబ నియంత్రణ ఉద్యమం వెనుక ఉన్న మూల సూత్రం ఏమిటంటే ప్రతి దేశమూ తగినంతగా జననాల రేటును తగ్గించుకొని దాని ఫలితంగా దాని జనాభాను చక్కగా సవ్యంగా తన సొంత ఉత్పత్తుల సాయం తోనే పెంచి పోషించుకొనే స్థాయిని పొందేట్లు చూడటం.

ఆధునిక శాస్త్ర పరిశోధన మానవాళి ఆహార సమస్యను తీర్చుతాయని, ఆ పరిశోధన ఫలితాలు సక్రమంగా పంపిణీ కాకపోవడమే నేటి ఆర్థిక ఇబ్బందులకు కారణమనే భావనలో కొందరు ఉన్నారు. సంపద సక్రమ పంపిణీ యే అభివృద్ధిని తెస్తుందని వారు అంటారు. చాలా ప్రాంతాల్లో సంపద పంపిణీ విషయంలో అన్యాయమే జరిగిందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఈ విషయంలో పక్షపాతం లేని ప్రతి ప్రజాసేవకుడూ ప్రజలందరికి న్యాయం చేకూర్చడానికి దోహదం చేయాలి. ఏది ఏమైనా జనాభా పెరుగుదల కుటుంబ నియంత్రణ ద్వారా అదుపు చేయబడకుండా కేవలం సవ్యమైన పంపిణీయే ఇప్పటి స్థితికి శాశ్వతమైన, మెరుగైన పరిష్కారాన్ని తీసుకురాలేదని గుర్తుంచుకోవడం అవసరం.

అన్ని సంపదలకు మూలం భూమి. ప్రతి వ్యక్తి భాగానికీ భూమి రాదు. అందరికీ సంపద వుండదు. సర్ డానియల్ హాల్, ప్రొఫెసర్ ఈస్ట్ వంటి వ్యవసాయ నిపుణులు పాశ్చాత్య యూరోపియన్ ప్రమాణాల ప్రకారం ఒక వ్యక్తి జీవనానికి రెండున్నర ఎకరాల సాగు యోగ్యమైన భూమి అవసరం అవుతుందని పేర్కొన్నారు. అయితే అన్ని పాత దేశాల్లోనూ దీనికంటే తక్కువ భూమితో ప్రజలు జీవనాన్ని సాగిస్తున్నారు. భారత దేశంలో అయితే 3/4 వ ఎకరం మాత్రమే సాగుయోగ్యమైన భూమి ప్రతి వ్యక్తికీ ఉంది. వ్యవసాయంపై రాయల్ కమిషన్ అభిప్రాయం ప్రకారం ఇదివరకే పేర్కొనబడినట్లుగా ఈ దేశంలోని సాగులోలేని భూమి నిరుపయోగంగా ఉంది.

రసాయనిక ఎరువుల సృష్టితో ఎరువుల సమస్యను పరిష్కరిస్తామనే దృక్పథం కూడా మెరుగైందిగా లేదు. అన్ని ప్రాంతాలలోనూ కృత్రిమమైన ఎరువుల్ని వాడలేం.

పదవీ విరమణ చేసిన బొంబాయి ప్రభుత్వ వ్యవసాయిక రసాయిన శాస్త్రవేత్త అయిన రావు బహదూర్ డి.ఎల్.సహస్ర భూదే అక్టోబర్ 1936 నాటి 'సహ్యాద్రి' పత్రికకు రాసిన తన వ్యాసంలో ఇలా పేర్కొన్నారు –

'కృత్రిమమైన ఎరువుల్ని ఎక్కడపడితే అక్కడ వాడడటానికి వీలుపడదని అనుభవం చూపింది. రసాయినిక ఎరువులతో పాటే ఆవు పేడ వంటి సేంద్రియ ఎరువు వాడాలి. లేకుంటే కృత్రిమమైన ఎరువులు పంటలకు అనుకూలించవు. ఇదే విధంగా కృత్రిమ మైన రసాయనిక ఎరువుల వాడకం పంటలకు నష్టం కాకుండా ఉండేందుకు సమృద్ధిగా నీటిని సరఫరా చేయాలి.

దీనికి తోడు ముఖ్యమైన నైట్రేట్లు, ఫాస్ఫేటు వంటి ఎరువులు ఒకటి లేకుండా మరొకటి ఉపయోగపడదు. అయితే ఫాస్ఫేట్ ఎరువులు సరఫరా చాలా తక్కువే. సర్ ఫ్రెడరిక్ కీబెక్ ఇలా అంటాడు : "దాదాపు ఈ ప్రపంచంలోని భూమ్మీద ఫాస్ఫేట్లు కరువై పోయాయి." (ఫెర్టిలైజర్స్ అండ్ ఫుడ్ ప్రొడక్షన్స్, 1932, పేజీ. 221)

దాదాపు అన్ని ప్రదేశాలూ తగినంతగా అడవులు లేని కారణంగా బీడు వారిపోతున్నాయి. దాని ఫలితంగా నీళ్ళు, ఎరువులు కూడా తక్కువయ్యాయి.

ప్రస్తుత కాంగ్రెసు ప్రభుత్వం బొంబాయి పరగణాలోని ప్రజల్ని ఉద్ధరించ ప్రయత్నిస్తుంది. (వినండి. వినండి) అయితే వాళ్ళ అన్ని ప్రయత్నాలూ కుటుంబ నియంత్రణ ద్వారా జనాభా సమస్యను పరిష్కరించక పోతే వృధాగా పోతాయి.

**ఉప సభాపతి :** గౌరవనీయులైన సభ్యులు ఇప్పుడు తన ప్రతిపాదన ముగిస్తారు.

**శ్రీ పి.జె. రోషమ్ :** అవును అయ్యా! డా॥ రాధాకమల్ ముఖర్జీ తన పుస్తకమైన "ఫుడ్ ప్లానింగ్ ఫర్ 400 మిలియన్స్" అనే గ్రంధంలో ఇలా పేర్కొంటారు.

"జనాభా పెరుగుదలకు ఏదో ఒక అడ్డు కట్ట వేయక పోతే ఏ పరిష్కార మార్గమైనా సరే పొరుగు దేశంలోలాగా (చైనా) తాత్కాలికం అవుతుంది. ఎందుకంటే జనాభా ఆ దేశ భూ భాగం పరిమితికి మించి అతి వేగంగా తిరిగి పెరుగుతున్నది. జనాభా ఎక్కువైతే కల్పించాల్సిన విద్యాసౌకర్యాలను వేగవంతం చేయవలసి ఉంటుంది. దీనివల్ల పన్ను వేయాల్సిన అవసరాలు ఎక్కువవుతాయి. జనాభా వత్తిడి కేవలం ఆహార సరఫరాతో మాత్రమే పోల్చిచూడలేం కదా! అనే విషయం స్పష్టం అవుతుంది. సహేతుకమైన కుంటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదల గురించి ప్రజలను చైతన్య వంతులను చేయడం జనాభా పెరుగుదలను ఎదుర్కొవడానికి సమర్ధవంతమైన మార్గాలుగా అంగీకరించాల్సి ఉంది."

బొంబాయి భారతదేశపు ముఖద్వారం. ఈ ఉద్యమం కూడా ఈ దేశంలోకి ఆ మార్గం ద్వారానే ప్రవేశించింది. అది సమస్యల్ని చక్కబెడుతుంది. కొంత మందికి మాత్రమే వాళ్ళ పేర్లు శాశ్వతంగా ఉండేలా చట్టాల్ని రూపొందించడానికి అవకాశం లభిస్తుంది. అటువంటి అవకాశాల్ని కుటుంబ నియంత్రణ ఉద్యమం మన పరిగణనలోని ప్రభుత్వానికి కల్పించింది. ఆ అవకాశాన్ని జారి పోనీకుండా జాగ్రత్త పడతారని ఆశిద్దాం. ప్రజల శ్రేయస్సు కోసం దాన్ని ఉపయోగిస్తారని ఆశిద్దాం.

☆ ☆ ☆

# అనుబంధం – II

# అంబేద్కర్ అడిగిన ప్రశ్నలు – ప్రభుత్వం ఇచ్చిన జవాబులు

## ప్రభుత్వ సర్వీసు : ఎంపిక సంఘం

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది అంశాల గురించి వివరిస్తుందా!

ఎ) బొంబాయి ప్రభుత్వ ప్రావిన్షియల్, సబార్డినేట్ సర్వీసులకు దరఖాస్తు చేసుకునే వాళ్ళ ఎంపిక కోసం ఏదైనా ఎంపిక సంఘం నియమితమైందా?

బి) అలా నియమితమై ఉన్నట్లైతే సంఘంలో ఉన్న సభ్యుల పేర్లేమిటి?

***గౌరవనీయులైన శ్రీ చునీలాల్ మెహతా :*** బొంబాయి ప్రభుత్వ ప్రావిన్షియల్ సబార్డినేట్ సర్వీసుల కోసం కొన్ని కమిటీలు ఏర్పాటు అయ్యాయి. సబార్డినేట్ సర్వీసులో నియామకాలు స్థానిక ప్రభుత్వంగాని, ముఖ్య కార్యాలయాలుకానీ వాటి కివ్వబడిన అధికారాల మేరకు చేస్తాయి

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** ప్రావిన్షియల్ సర్వీసుల కోసం ఏర్పాటు చేసిన కమిటీల్లోని సభ్యుల పేర్లేమైనా గౌరవనీయులైన సభ్యుడు తెలుపగలరా? ఆయన కొన్ని కమిటీలు ఏర్పడ్డాయని అన్నారు.

***గౌరవనీయులైన శ్రీ చునీలాల్ మెహతా :*** సరిగ్గా చెప్పలేను. ఎందుకంటే నేను నా మనసులో వాళ్ళ పేర్లన్నిటిని మోసుకురాలేను కాబట్టి. గౌరవనీయులైన సభ్యులు తాఖీదు ఇస్తే నేను వాళ్ల పేర్లు ఇవ్వగలను. కమిటీల్లో నిర్ణీతమైన పేర్లు ఏవీ లేవని నేననుకొంటున్నాను. అవి ప్రతిసంవత్సరం లేదా అప్పుడప్పుడూ మారుతుంటాయని నేననుకొంటాను. (బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట. 325 తేదీ 28 ఫిబ్రవరి 1927)

## గ్రామాల కోసం భూసేకరణ, అభివృద్ధి

***డా॥ అంబేద్కర్ :*** ఆర్యా! నేనొక విషయానికి సంబంధించిన సమాచారం కోసం లేచాను. ప్రస్తుత బడ్జెటులో ఈ డబ్బు దేనికోసం ఉద్దేశించాలో నేను ఖచ్చితంగా అర్థం చేసుకోలేక పోతున్నాను. తమ అభివృద్ధి పట్ల అసంతృప్తి చెందిన గ్రామాలకు, కొత్త గ్రామాలు నిర్మించడానికి ఖర్చు చేశారేమో

సంబంధిత సభ్యుడి నుండి తెలుసుకోవాలనుకుంటున్నాను. లేదా ఆ డబ్బు గ్రామ సౌకర్యాలకోసం ఏమైనా ఖర్చుచేశారా? లేదా ఇంక దేనికోసం ఖర్చుచేశారో తెలుసుకోవాలనుకుంటున్నాను. నా లాంటి కొత్త సభ్యులు ఆ డబ్బు దేనికోసం ఖర్చు చేశారో ఖచ్చితంగా తెలుసుకోడానికి వీలుగా గజెట్‌లో గానీ, "బ్లూ బుక్" కానీ దానికి సంబంధించిన వివరాలేవీ లేవు. అందువల్ల ఈ అంశంపైన మీరు కొంత అవగాహన కలగ చేయాలని నేను ఆశపడుతున్నాను. (బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 421, తేదీ 1 మార్చి 1927)

## భూ దస్తావేజుల సూపరింటెండెంట్లు

***డా॥ అంబేద్కర్ :*** అయ్యా! ఈ తీర్మానంపై ఎక్కువ చర్చ అవసరం లేదని నేననుకొంటాను. బడ్జెట్‌లో 35 వేల 8 వందల రూపాయలు కేటాయించి నియమించిన ఈ సూపరింటెండెంట్లు సాధారణంగా డెప్యూటీ కలెక్టర్లు చేసే పనులే చేస్తారనే ప్రాతిపదికపై ఈ తీర్మానం రూపొందించబడింది. ఈ చర్చకు ఒకే ఒక సమాధానం ఏమిటంటే డిప్యూటీ కలెక్టర్లు ఈ పనుల్ని చేయలేని స్థితిలో ఉన్నారు అనేది. గౌరవనీయులైన సభ్యులు, సెటిల్‌మెంటు కమీషనర్ ఇచ్చిన సమాధానం ప్రశ్నకు సంబంధించిన అంశాన్ని స్పృశించలేదని నాకనిపిస్తున్నది.. వాళ్ళు చేస్తున్న పని సంఘం దృష్టిలో అవసరమైంది అనే విషయానికి ఈ సభలో ఎవరూ విభేదించరనుకుంటాను. అయితే అయ్యా! ఇక్కడ ముఖ్యమైన అంశం ఏమిటంటే డిప్యూటీ కలెక్టర్లు ఆ పనిచేయలేరా? అనేది. ఈ ప్రశ్నకు సమాధానం అవుననేదే అయితే ప్రభుత్వం ఈ పని చేయాల్సిన అవసరమే ఉండదు. ఈ విషయంలో నా లాంటి కొత్త సభ్యులు కూడా ఒక నిర్ణయం తీసుకోవడానికి ప్రభుత్వం ఈ అంశాన్ని స్పష్టం చేయాలని కోరుతున్నాను. (బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 453, తేదీ 3, మార్చి 1927)

## డిప్యూటీ కలెక్టర్ పదవి : శ్రీ ఎమ్.కె. జాదవ్ దరఖాస్తు

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం ఈక్రింది అంశాల్ని గూర్చి వివరణ ఇస్తుందా ?

(i) బొంబాయికి చెందిని శ్రీ ఎమ్.కె. జాదవ్ బొంబాయి ప్రభుత్వం రెవెన్యూ శాఖ ఇటీవల భర్తీ చేసిన మూడు ఉద్యోగాల్లో ఒకదానికి దరఖాస్తు చేశాడా?

(ii) ఆయన దళిత వర్గాలకు చెందని వాడనే విషయం వాళ్ళకు తెలుసా?

(iii) అతని దరఖాస్తు ఎందుకు తిరస్కరించబడింది?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్. ర్యూ :*** (i) అవును.

(ii) అవును.

(iii) శ్రీ జాదవ్ లేదా ఇతర ఏ వ్యక్తి అయినా సరే ఎందుకు ఎంపిక కాలేదనే విషయానికి

సంబంధించిన కారణాలను చెప్పడానికి సిద్ధం కానందుకు ప్రభుత్వం విచారిస్తున్నది.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** ప్రభుత్వ ఉద్యోగాలను భర్తీ చేస్తున్నప్పుడు దళిత వర్గాల కోసం 50 శాతం ఉద్యోగాలు కేటాయించాలనే నిబంధనను ప్రభుత్వం పాటించిందా?

**గౌరవనీయ జె.ఎల్. ర్యూ :** ఈ నిబంధన ఇక్కడ ఏ మాత్రం వర్తించదు. ఈ నిబంధన క్లరికల్ ఉద్యోగాలకే వర్తిస్తుంది.

**శ్రీ డబ్ల్యు. యస్. ముకదమ్ :** ప్రభుత్వం దయచేసి ఎంపికైన అభ్యర్థుల పేర్ల నిస్తుందా?

**గౌరవనీయులైన శ్రీ జె.యల్ ర్యూ :** గౌరవనీయులైన సభ్యులు దాన్ని రికార్డుల్లో చూడవచ్చు.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** శ్రీ జాదవ్‌ను తొలగించడం ప్రభుత్వం దళిత వర్గాలను ప్రోత్సహించే విధానంగా ఉన్నదా?

**గౌరవనీయులైన శ్రీ జె.యల్. ర్యూ :** ఇది అసంబద్ధం కాదు.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 545, తేదీ 5, మార్చి 1927)

## బహిరంగ ప్రదేశాలకు బడుగు వర్గాలను అనుమతించడం

**డా॥ అంబేద్కర్ :** ఈ రాష్ట్రంలో అన్ని బహిరంగ స్థలాల్లోకి బడుగు వర్గాలను అనుమతించడానికి సంబంధించి శ్రీ బోల్సె తీర్మానాన్ని ఆచరణలో పెట్టడానికి తీసుకున్న చర్యల గూర్చి ప్రభుత్వం వివరిస్తుందా?

**గౌరవనీయులైన శ్రీ గులామ్ హుస్సేన్ :** సమాచార శాఖ డైరెక్టర్ ఇచ్చిన 117 నెంబరు పత్రికా ప్రకటనను గమనించ కోరుతున్నాం. (ఆ ప్రకటన నకలు ఇక్కడ ఇస్తున్నాము).

*పత్రికా ప్రకటన నంబరు పి 117, సెప్టెంబర్ 29, 1923 (బొంబాయి సమాచార శాఖ డైరెక్టర్ సౌజన్యంతో )*

# అస్పృశ్య వర్గాలు

## ప్రభుత్వం, మంత్రిమండలి తీర్మానాలు

బొంబాయి శాసన మండలి చివరి సమావేశంలో శ్రీ ఎస్.కె. బోలె ప్రతిపాదన మీద "అస్పృశ్యులైన వర్గాలు ప్రజాధనంతో నిర్మింపబడి పాలింపబడుతున్న లేదా సంఘం చేత పరిపాలింపబడుతున్న లేదా ప్రభుత్వం చేత నియమించబడిన లేదా చట్టాల చేత, బహిరంగ పాఠశాలల చేత, కోర్టుల చేత, కార్యాలయాల చేత, లేదా డిస్పెన్సరీల చేత స్థాపించబడిన అన్ని బహిరంగ నీటిసౌకర్యాలను, బావులను, ధర్మశాలలను ఉపయోగించుకోడానికి అనుమతించాలని సిఫార్సు చేస్తూ ఒక తీర్మానం ఆమోదింపబడింది."

ఈ తీర్మానాన్ని అనుసరించి ప్రభుత్వ ఆధీనంలోని అన్ని బహిరంగ ప్రదేశాలకు, సంస్థలకు వర్తించే విధంగా చర్యలు తీసుకునేట్లు ప్రభుత్వం అధికారుల్ని ఆదేశించింది. ఈ తీర్మానంలో సిఫార్సు చేసిన అంశాల్ని అంగీకరించడంలోని అవసరాన్ని పరిశీలించమని స్థానిక సంస్థలకు సూచించవలసిందిగా కోరడం జరిగింది. బొంబాయి, కరాచి పోర్టు ట్రస్టులు, బొంబాయి పట్టణాభివృద్ధి ట్రస్టు, మునిసిపల్ కార్పోరేషన్‌లు కూడా వాళ్ళ ఆధీనంలో ఉన్న స్థలాలకు సంబధించి ఈ తీర్మానానికి విలువ ఇవ్వమని కోరడమైనది.

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వ సంస్థలు, గ్రామాలతో సాధారణ ప్రజలు సమకూర్చిన చాలా ప్రదేశాలలోని అణగారిన వర్గాలకు ప్రవేశం కల్పించడం లేదని గౌరవనీయులైన సభ్యునికి తెలుసా?

***గౌరవనీయులైన శ్రీ గులామ్ హుస్సేన్ :*** నా దృష్టికి రాలేదు.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 546, తేదీ 5, మార్చి 1927)

## బడుగు వర్గాల సహాయ విద్యాధికారి

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది అంశాలకు సంబంధించి వివరణ ఇస్తుందా?

(i) అణగారిన వర్గాల అదనపు సహాయ విద్యాధికారి ఉద్యోగం నుంచి జి.జి. కాంబ్లే తొలగించబడ్డారు ఎందువల్ల?

(ii) పైన పేర్కొన్న ఉద్యోగం రద్దు చేయబడిందా?

(iii) రద్దు చేయబడినట్లైతే ఎందుకని?

***గౌరవనీయులైన దివాన్ బహదూర్ హరిలాల్ డి. దేశాయ్ :*** (i) శ్రీ కాంబ్లే తన సామర్థ్యాన్ని నిరూపించుకోవడంలో విఫలమయ్యారు. కాబట్టి వెనుకకు పంపబడ్డాడు. అతని ఆధీనంలో ఉన్న పాఠశాలల్లో నిజమైన అభివృద్ధి జరుగలేదు.

(ii) అవును.

(iii) ఉద్యోగం రద్దయింది. ఎందుకంటే బొంబాయి ప్రాథమిక విద్యాచట్టం 1923 క్రింద ప్రాంతీయ అధికారులకు ప్రాథమిక పాఠశాలల నియంత్రణ బాధ్యత బదిలీ చేయబడింది కాబట్టి. ఆ పోస్టును కొనసాగించాల్సిన అవసరం ప్రభుత్వానికి లేదు కాబట్టి.

***డా॥ అంబేద్కర్ :*** బడుగు వర్గాల పాఠశాలలకు ప్రత్యేక సహాయ విద్యాధికారి ఉండటం వల్ల ప్రయోజనాల్ని అందించాల్సిన అవసరం ఉందని ప్రభుత్వం అనుకోవడం లేదా?

***గౌరవనీయులైన దివాన్ బహదూర్ హరిలాల్ డి. దేశాయ్ :*** మొదట ప్రభుత్వం ప్రత్యేక ఉద్యోగాల్ని కల్పించింది. ప్రస్తుతం పాఠశాలలు స్థానిక సంస్థలకు బదిలీ చేయబడ్డాయి. ప్రభుత్వం అటువంటి

ఉద్యోగాల్ని కల్పించాల్సిన అవసరం ఉందనుకుంటే ఆ విషయాన్ని పరిశీలిస్తుంది.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 604, తేదీ 7, మార్చి 1927)

## నగర మేజిస్ట్రేట్ శ్రీ ఫ్లెమింగ్ తీర్పులు

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది అంశాలకు సంబంధించిన వివరణ ఇస్తుందా?

ఎ) (1) ఎంపరర్‌కూ బాబూరావు పూలే కూ మధ్య (2) ఎంపరర్ కూ జవాల్కర్‌కు, ఇతరులకు ఇటీవలి జరిగిన రెండు క్రిమినల్ కేసుల విషయంలో పూనా నగర మేజిస్ట్రేట్ శ్రీ ఫ్లెమింగ్ ఇచ్చిన తీర్పులపై వాళ్ళ దృష్టి సారింపబడిందా? ఈ రెండు కేసులలో భారత శిక్షాస్మృతి 500 సెక్షన్ కింద నేరారోపణ చేయబడిందా?

బి) ఈ రెండు కేసుల్లోనూ ఉన్న ఒకే విషయంలో శ్రీ ఫ్లెమింగ్ రెండు భిన్నమైన తీర్పులిచ్చాడనే విషయం వాళ్లకు తెలుసా? ఉదాహరణకు ఫిర్యాదు దారుడు క్రిమినల్ సెక్షన్ ప్రొసీజర్ కోడ్ 198 అర్థానికి లోబడి నష్టపడిన వ్యక్తి అవునా? కాదా?

సి) శ్రీ ఫ్లెమింగ్ అటువంటి భిన్నమైన తీర్పు ఇచ్చినందుకు వారు వివరణ కోరారా?

డి) ఈ విషయంలో శ్రీ ఫ్లెమింగ్ పైన ఏమైనా చర్య తీసుకోడానికి వాళ్ళు ప్రతి పాదనలు చేశారా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఇ.బి. హట్‌సన్ :*** మేజిస్ట్రేట్ తీర్పువల్ల ఎవరైనా సరే తాను నష్టపడిన వ్యక్తిగా భావిస్తే అందుకు చట్టం కల్పించిన పరిష్కారాలు అందరికి తెలిసినవే. ఈ సభలో ఈ ప్రశ్నకు సంబంధించిన మొత్తం ధర్మపీఠాన్ని తక్కువ అంచనా వేసే అభిప్రాయాన్ని ప్రభుత్వం వ్యక్తం చేయలేదు.

***శ్రీ ఎస్.కె. బోలె :*** (బి) కి మాత్రమే జవాబు ఇవ్వబడింది. కానీ (బి) కి గానీ (సి) కి గానీ లేదా (డి) కి గానీ ఇవ్వలేదు.

***గౌరవనీయులైన శ్రీ జె.ఇ.బి.హట్‌సన్ :*** ఈ జవాబు అన్ని (4) ప్రశ్నలకు సంబంధించినది.

***శ్రీ ఎస్.కె.బోలె :*** (సి) లోని ప్రశ్న "శ్రీ ఫ్లెమింగ్ ఇచ్చిన తీర్పుపై వాళ్ళ దృష్టి సారించబడిందా" అనేది. అయితే దానికి జవాబు రాలేదు.

***గౌరవనీయులైన శ్రీ జె.ఇ.బి.హట్‌సన్ :*** దానికి అంతర్లీనంగా జవాబు ఉన్నదనే అనుకుంటాను. ప్రభుత్వం దృష్టి వాటి పైకి తీసుకురాబడింధి.

***శ్రీ ఎస్.కె. బోలె :*** మళ్ళీ (ఎ) లోని ప్రశ్న 'శ్రీ ఫ్లెమింగ్ విరుద్ధమైన తీర్పు ఇచ్చారనే విషయం వాళ్ళకు తెలుసా?" అనేది. అయితే దానికి సమాధానం రాలేదు.

గౌరవనీయులైన శ్రీ జె.ఇ.బి.హాసన్ : అవును. జవాబు ఉంది. 'ప్రభుత్వం మర్యాద విస్మరించి అభిప్రాయాన్ని ఈ సభలో వ్యక్తం చేయలేదు'

శ్రీ ఎస్.కె. బోలె : వాళ్ళకు వాళ్ళ గురించి తెలుసా అనేది అడుగుతున్నాం.

గౌరవనీయులైన అధ్యక్షులు : 'పరస్పర విరుద్ధం' అనే పదం ఆ అర్థాన్నిస్తుంది. అది అభిప్రాయాన్ని ఆశిస్తుంది. అందువల్ల అదే సమాధానం.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 1147, తేదీ 16, మార్చి 1927)

## ఒక మహర్ (ఛిఖార్డి)పై ముల్కీ పాటిల్ దాడి

**డా॥ అంబేద్కర్ :** ప్రభుత్వం దయచేసి ఈ ప్రశ్నలకు సమాధానాలు చెబుతుందా?

(a) షోలాపూర్ జిల్లాకు చెందిన ఛిఖార్డి పల్లెలోని ముల్కీ పాటిల్ తన వ్యక్తిగతమైన పనిచేసి పెట్టడానికి నిరాకరించినందుకు అర్జునలాల్ మహర్‌పైన దౌర్జన్యం చేసి అతని తల పగల కొట్టాడనడం వాస్తవమా?

(బి) బార్సీలోని సివిల్ హాస్పిటల్‌లో అర్జున్ వైద్య సేవల్ని పొందడం వాస్తవమేనా?

(సి) అది వాస్తవమే అయితే పటేల్‌పై ఏ చర్య తీసుకున్నారు?

గౌరవనీయులైన శ్రీ జె.ఎల్.ర్యూ : సమాచారం సేకరిస్తున్నాం.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 1147, తేదీ 16, మార్చి 1927)

## మహర్లను (షోలాపూర్) వేధించడం

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది వాటికి జవాబులు చెబుతుందా?

(ఎ) షోలాపూర్ జిల్లాలోని (i) రాలెరాస్ (ii) పాంగవ్ (iii) పంగ్రి (iv) ఉప్లేదుమాల (v) ఆంబె గావ్ (vi) సుర్డీ పల్లెల్లో గావోంకారీల దాడుల్ని ఆపేందుకు కుట్ర పన్నుతున్నారా? ఆ గ్రామాలలో దుకాణాల యజమానులు మహర్లతో సంబంధాలు పెట్టుకోకుండా అడ్డుకొంటున్నారా? పల్లెల్లోని మహర్లను బాధిస్తున్నారా? కొన్ని సందర్భాల్లో మహర్ స్త్రీల శీలాన్ని దోచుకుంటున్నారా? మహర్లు ఉపయోగించే నీటి వనరుల్లో చెత్త వేసే దాక వెళ్ళారా? ఈ పల్లెల్లోని మహర్లు చనిపోయిన పశువుల కళేబరాన్ని మోసుకపోవడం వదిలేసి స్వయం అభివృద్ధి పనుల్లో ఉన్నందు వల్లనేనా ఈ పనిచేసింది?

(బి) అటువంటి నిరంకుశత్వం నుంచి మహర్లను రక్షించడానికి ఏ చర్యలు తీసుకోతలపెట్టారు?

గౌరవనీయులైన శ్రీ జె.ఇ.బి. హాట్సన్ : సమాచారం అందాల్సి ఉంది.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19, పుట 1298, తేదీ 17, మార్చి 1927)

## ఉలాస్ నదిపై ప్రమాదం

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** ప్రభుత్వం కింది అంశాలకు సమాధానం చెబుతుందా?

(ఎ) 13, ఫిబ్రవరి 1926 లో 'ప్రతియోగి'లో ప్రచురింపబడిన ప్రముఖమైన వ్యాసంపై 12, జూన్ 1926లో 'ప్రతియోగి'లో ప్రచురింపబడిన బాదల్‌పూర్ ప్రజల అభిప్రాయాల పై దృష్టి సారింపబడిందా?

(బి) అది నిజమైతే, విచారణ జరపడానికి ఇంకా అనుమతిని ఆపి ఉంచారా?

***గౌరవనీయులైన శ్రీ కవాస్ జహంగీర్ :*** (ఎ) 13, ఫిబ్రవరి 1926 నాటి 'ప్రతియోగి'లో ప్రచురితమైన సంక్షిప్త వ్యాసాన్ని ప్రభుత్వం పరిశీలించింది. అయితే 12, జూన్ 1926 నాటి ప్రతియోగిలో ప్రచురితమైన బాదల్ పూర్ ప్రజల అభిప్రాయాలను పరిశీలించలేదు.

(బి) అవును.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 19,పుట 759, తేదీ 27, మార్చి 1927)

## ప్రభుత్వ సర్వీసు : బడుగు వర్గాలు

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** ప్రభుత్వ సర్వీసుల్లో బడుగు వర్గాల వారి సంఖ్యకు సంబంధించిన ఈ క్రింది సమాచారాన్ని ప్రభుత్వం దయచేసి ఇవ్వగలదా?

| జిల్లా | శాఖ | ఉద్యోగంలో ఉన్న బడుగు వర్గాల సంఖ్య | |
|---|---|---|---|
| | | బంట్రోతులుగా | సిబ్బందిగా |

***గౌరవనీయులైన శ్రీ బస్సీలాల్ మెహతా :*** సమాచారం కోరబడింది.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 20, పుట 847, తేదీ 27, జూలై 1927)

## వంతందార్ మహర్లు : ప్రతిఫలం

***డా॥ అంబేద్కర్ :*** బొంబాయి ప్రెసిడెన్సీలోని ప్రతిగ్రామానికి సంబంధించిన ఈ క్రింది వివరాల్ని దయచేసి ప్రభుత్వం ఇస్తుందా !

| గ్రామం | మొత్తం జనాభా | ఉద్యోగం చేస్తున్న మహర్లు | అన్ని ఆకారాల నుంచీ ఉద్యోగం చేస్తున్న మహర్లకు అంచనా వేసిన ప్రతిఫలం - రూపాయిల్లో | | | ప్రతిఫలం మొత్తం. |
|---|---|---|---|---|---|---|
| | | | ఇనాం నుంచి | బాలుటా నుంచి | ప్రభుత్వ జీతం | |

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్ ర్యూ :*** ఈ సమాచారాన్ని పొందడంలో సమయం ఎక్కువ పట్టి కొన్ని ఇబ్బందులు ఉండడంవల్ల ప్రజాదృష్టితో చూసినట్లైతే అది ఉపయోగించే అవకాశాల్లో అన్నిపాళ్ళనుంచీ ఉంటుంది. దానిని సేకరించడానికి సిద్ధంగా లేనందుకు ప్రభుత్వం చింతిస్తున్నది. ఈ విచారణకోసం గౌరవనీయులైన సభ్యులు కొన్ని పల్లెల్ని మాత్రం ఎంపిక చేసినట్లైతే వాటికి సంబంధించిన సమాచారాన్ని అందచేయడం ఆచరణలో సాధ్యమవుతుందా అనే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తుంది.

***డా॥ బి.ఆర్. అంబేద్కర్ :*** ఈ ప్రశ్నలో అడిగిన సమాచారం ప్రకారం ప్రతి పల్లెకు సంబంధించిన 'వతన్ ప్రొసీడింగ్స్ నుంచి పొందవచ్చు అనేది వాస్తవం కాదా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్ .ర్యూ :*** బొంబాయి ప్రెసిడెన్సీ లోని ప్రతిపల్లెకు ఈ ప్రశ్నను పంపించాల్సి ఉంటుందనే విషయాన్ని నేను గౌరవనీయులైన సభ్యుల దృష్టికి తీసుకు వస్తున్నాను ఈ సమాచారాన్ని సేకరించడానికి అవసరమయ్యే శ్రమ, కాలం అపారమైనవి.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 20, పుట 1065, తేదీ 27, జూలై 1927)

## ఉద్యోగం చేస్తున్న వతందార్ మహర్లు

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి ఈ కిందివాటికి సమాధానాలు చెపుతుందా?

(ఎ) ప్రెసిడెన్సీలోని వివిధ ప్రాంతాల్లోని పల్లెల్లో ఉద్యోగం చేస్తున్న వతన్‌దార్ మహర్ల సంఖ్యను నియంత్రించే ఏమైనా నిబంధనలున్నాయా?

(బి) ఉన్నట్లయితే వాటిని వాళ్ళు ప్రచురిస్తారా? వాటి గురించి సంప్రదిస్తున్నారా?

***గౌరవనీయులైన జె.ఎల్.ర్యూ :*** ఈ విషయం పై ఏ నిబంధనలు లేవు. బొంబాయి వంశపారంపర్య ఉద్యోగాల చట్టం 45 వ సెక్షన్ ప్రకారం వతన్‌దార్ మహర్లను ఉద్యోగంలో నియమించడం జరుగుతున్నది.

***డా॥ అంబేద్కర్ :*** 64 వ సెక్షన్ కింద ఉద్యోగం చేస్తున్న వతన్‌దార్ మహర్లకు సంబంధించి నియమ నిబంధనల్ని పొందుపరచే విషయంలో కలెక్టర్లకు అధికారం ఇవ్వబడిందనే విషయం గౌరవనీయులైన సభ్యులకు తెలుసా ?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్. ర్యూ :*** అది నాకు తెలుసు.

***డా॥ అంబేద్కర్ :*** ఒక పల్లెలో 16 మంది మహర్లు వతన్ దార్లుగా పనిచేస్తున్నారనే విషయం గౌరవనీయులైన సభ్యులకు తెలుసా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్. ర్యూ :*** గౌరవనీయులైన సభ్యులు తాఖీదు ఇస్తే నేను విచారిస్తాను.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 20, పుట 1207, తేదీ 27, జూలై 1927)

## బాద్లాపూర్ దగ్గర ఉల్హాస్ నదిపై వంతెన

**డా॥ అంబేద్కర్ :** ప్రభుత్వం దయచేసి ఈ కింది వాటిని వివరిస్తుందా?

(ఏ) ఠానా జిల్లాలోని బాద్లాపూర్‌లో ఉలాస్ నదిపై చిన్న వంతెన నిర్మించడాన్ని ఇంకా పూర్తి చేయలేదనే ప్రశ్నను పరిగణనలోకి తీసుకోడానికి సంబంధించి :

(బి) దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటినీ కమిషన్, కలెక్టర్‌ల ఉత్తర నివేదికలతో సహా కౌన్సిల్ ముందు ఉంచుతారా? లేదా ?

(సి) చిన్న వంతెన కంటే కూడా పెద్ద వంతెనే అక్కడ ఖచ్చితంగా అవసరం అనే విషయం వాళ్ళకు తెలుసా?

**గౌరవనీయులైన శ్రీ జె.ఎల్. ర్యూ :** (ఏ) లేదు. దీనికి సంబంధించి త్వరలో ఒక పరిష్కారం కుదురుతుందను కుంటాను

(బి) ప్రభుత్వం ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ కౌన్సిల్ ముందు ఉంచేందుకు సిద్ధంగా లేదు.

(సి) లేదు.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 20, పుట 1472, తేదీ 27, జూలై 1927)

## అటవీ భూముల సాగుకు : దళిత వర్గాలకు పంపిణీ

**డా॥ అంబేద్కర్ :** ప్రభుత్వం దయచేసి వీటి గురించి చెపుతుందా?

(ఏ) 1923, 1924, 1925, 1926 సంవత్సరాల్లో ఈ ప్రెసిడెన్సీలోని ప్రతి జిల్లాలోనూ వ్యవసాయం కోసం ఇవ్వబడిన మొత్తం అటవీ భూమి.

(బి) పై సంవత్సరాల్లో ప్రతి జిల్లాలోనూ ఇందులో ఏ మేరకు బడుగు వర్గాలకు ఇచ్చారు?

**గౌరవనీయులైన శ్రీ జి.బి.ప్రధాన్ :** ఇందుకు కావాల్సిన సమాచారాన్ని తెలిపే ఒక నివేదిక కౌన్సిల్ ముందు ఉంచబడింది. నివేదికలో చూపబడిన ప్రాంతం ప్రెసిడెన్సీలోని ప్రతి అటవీ విభాగానికి సంబంధించినది.

1923, 1924, 1925, 1926 సంవత్సరాల్లో సాగు కోసం ఇవ్వబడిన అటవీ భూమి నివేదిక :

| అటవీ విభాగం | వ్యవసాయం కోసం ఇవ్వబడిన మొత్తం భూమి | | | |
|---|---|---|---|---|
| | 1923 | 1924 | 1925 | 1926 |
| **ఉత్తర ప్రాంతం** | ఎకరాలు | ఎకరాలు | ఎకరాలు | ఎకరాలు |
| పంచ్ మహాళ్ళు | 660 | 7,536 | ... | 9 |
| సూరత్ | 1,175 | 1,152 | 3,558 | ... |
| ఉత్తర ఠానా | 191 | 171 | ... | 5 |
| దక్షిణ ఠానా | 339 | 330 | 295 | ... |
| తూర్పు ఠానా | 21,463 | 2,237 | 2,810 | 3,733 |
| పశ్చిమ నాసిక్ | 3,080 | 432 | 1,817 | 256 |
| తూర్పు నాసిక్ | 8,493 | 2,714 | 2,100 | 2,482 |
| **కేంద్ర ప్రాంతం** | | | | |
| తూర్పు ఖండేష్ | 186 | 401 | 1,756 | 1,872 |
| ఉత్తర ఖండేష్ | ... | 1,325 | 1,660 | 1,815 |
| పశ్చిమ ఖండేష్ | 90 | 51 | 235 | 560 |
| పూనా | 1 | 1 | 70 | 36 |
| అహ్మద్‌నగర్ | 4,254 | 55 | 86 | 88 |
| సతారా | 3,516 | 252 | 473 | 285 |
| **దక్షిణ ప్రాంతం** | | | | |
| ఉత్తర విభాగం కనరా | 22 | . | ... | 7 |
| తూర్పు విభాగం కనరా | 105 | 137 | 33 | 7 |
| దక్షిణ విభాగం కనరా | 26 | 40 | 31 | 37 |
| పశ్చిమ విభాగం కనరా | 133 | 70 | 59 | 5 |
| మధ్య విభాగం కనరా | 13 | 6 | 1 | ... |
| బెల్గాం | 668 | 719 | 2006 | 2717 |
| ధార్వాడ్ | 346 | 25 | 154 | 132 |
| **సింధ్ ప్రాంతం** | | | | |
| సుక్కూర్ | 1,841 | 2,577 | 1,330 | 1,888 |
| షికాపూర్ | 1,399 | 1,256 | 1,066 | 928 |
| లర్కానా | 4,321 | 3,143 | 4,838 | 5,300 |
| హైదరాబాద్ | 549 | 1,782 | 2,071 | 2,396 |
| కరాచి | 92 | 1,093 | 1,789 | 3,084 |

**1923, 1924, 1925, 1926లలో సాగు కోసం ఇచ్చిన అటవీ భూమి వివరాల పట్టిక**

| అటవీ విభాగం | దళిత వర్గాల కివ్వబడిన భూమి (ఎకరాలలో) | | | | రిమార్కులు |
|---|---|---|---|---|---|
| | 1923 | 1924 | 1925 | 1926 | |
| ఉత్తర ప్రాంతం | ఎకరాలు | ఎకరాలు | ఎకరాలు | ఎకరాలు | |
| పంచ్ మహాళ్ళు | 227 | 1,446 | ... | 9 | |
| సూరత్ | 1,175 | 1,152 | 3,558 | ... | |
| ఉత్తర ఠానా | 191 | 171 | ... | 5 | |
| దక్షిణ ఠానా | 339 | 330 | 295 | ... | |
| తూర్పు ఠానా | 21,463 | 2,237 | 2,810 | 3,733 | |
| పశ్చిమ నాసిక్ | 2,927 | 411 | 1,727 | 243 | |
| తూర్పు నాసిక్ | 8,493 | 2,714 | 2,100 | 2,482 | |
| కేంద్ర ప్రాంతం | | | | | |
| తూర్పు ఖండేష్ | ... | 30 | 91 | 101 | |
| ఉత్తర ఖండేష్ | ... | 1,325 | 1,660 | 1,815 | |
| పశ్చిమ ఖండేష్ | 40 | 37 | 90 | 340 | |
| పూనా | ... | ... | ... | ... | |
| అహ్మద్‌నగర్ | 55 | ... | ... | ... | |
| సతారా | ... | ... | ... | ... | |
| దక్షిణ ప్రాంతం | | | | | ఈ సంవత్సరాల్లో బడుగువర్గాల నుంచి దరఖాస్తులు లేవు. |
| ఉత్తర విభాగం కనరా | ... | .. | ... | ... | |
| తూర్పు విభాగం కనరా | ... | ... | ... | ... | |
| దక్షిణ విభాగం కనరా | 20 | 38 | 28 | 36 | |
| పశ్చిమ విభాగం కనరా | ... | ... | ... | ... | |
| మధ్య విభాగం కనరా | ... | ... | ... | ... | ఈ సంవత్సరాల్లో బడుగువర్గాల నుంచి దరఖాస్తులు లేవు. |
| బెల్గాం | 45 | 104 | 23 | 664 | |
| ధార్వాడ్ | ... | ... | ... | ... | |
| సింధ్ ప్రాంతం | | | | | |
| సుక్కూర్ | .. | ... | ... | ... | సింధ్‌లో వ్యవసాయం చేసే బడుగు వర్గాల వారు లేరు. |
| షికాపూర్ | ... | ... | ... | ... | |
| లర్కానా | ... | ... | ... | ... | |
| హైదరాబాద్ | ... | ... | ... | ... | |
| కరాచి | ... | ... | ... | ... | |

(బిఎల్‌సీ చర్చలు, సంపుటి 20, పేజీలు 9172-74, జూలై 27, 1927

## పొగాకు లైసెన్సు

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి కింది వాటి గురించి చెపుతుందా –

(ఎ) పొగాకు అమ్మడానికి లైసెన్సుకోసం పొగాకు శాఖకు ఎక్సైజు సూపరింటెండెంట్ నారాయణ్ సఖరామ్ అనే అతను దరఖాస్తు ఏమైనా చేశాడా?

(బి) దరఖాస్తుదారుడు మిలటరీ పెన్షన్ దారుడై ఉండి 117వ రాజపుత్రుల కమాండింగ్ అధికారి లేదా లైసెన్సు కోసం సిఫార్సు చేసి ఉన్నప్పటికీ ఆ దరఖాస్తును తిరస్కరించారా లేదా?

(సి) అతని దరఖాస్తు ఎందుకు తిరస్కరించబడింది?

(డి) దరఖాస్తుదారుడు బడుగు వర్గాలకు చెందిన వాడనే కారణం చేతనే తిరస్కరించ బడిందా?

(ఇ)లైసెన్సులు జారీ చేయడంలో కులపరమైన తేడాల్ని పాటించారా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్.ర్యూ :*** (ఎ) అవును; (బి) అవును (సి) పేదరికంలో ఉండి జీవనోపాధికి వేరే మార్గం లేని వారికి మాత్రమే పొగాకు లైసెన్సులు ఇవ్వడమైంది. గౌరవనీయులైన సభ్యుల చేత అడగబడిన వ్యక్తి అతని జీవిత భత్యాన్ని ఇతర మార్గాల ద్వారా సంపాదించుకోదగిన వ్యక్తి అని తేలింది. (డి) లేదు; (ఇ) లేదు.

***డా॥ అంబేద్కర్ :*** పొగాకు లైసెన్సుల విషయంలో ఆ శాఖ రూపొందించిన నియమావళికి అనుగుణంగానే ఇది ఉందా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్.ర్యూ :*** అటువంటి నియమావళి ఒకటి ఉందని నేననుకోవడం లేదు.

***డా॥ అంబేద్కర్ :*** ఈ ప్రశ్న గౌరవనీయులైన సభ్యుల శాఖకు చెందిందో లేక ఎక్సైజు శాఖ కు చెందిందో నేను తెలుసుకోవచ్చా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్.ర్యూ :*** ఇది రెవిన్యూ శాఖకు సంబంధించినది. పొగాకు లైసెన్సులు బొంబాయి కలెక్టర్ ఇస్తారు.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 21, పుట 57, తేదీ 29, సెప్టెంబర్ 1927)

## నాసిక్ అటవీ భూములు : మహర్ల దరఖాస్తులు

***డా॥ అంబేద్కర్ :*** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది వాటి గురించి చెపుతుందా –

(ఎ) నాసిక్ తాలూకా లోని పంప్లాడ్ గ్రామ మహర్లు అటవీ భూమికోసం కలెక్టర్‌కు దరఖాస్తు చేశారనే సంగతి తెలుసా?

(బి) పింప్లాడ్ గ్రామానికి చెందిన సర్వే నెంబరు 220 భూమికోసం వాళ్ళేమైనా అడిగారా?

(సి) అది తిరస్కరించబడగా రాజూర్ బాబులా గ్రామాల మధ్య సర్వే నెంబరు 202 భూమి కోసం ఏమైనా అడిగారా?

(డి) అది తిరస్కరించబడగా వాళ్ళు రాజూర్ – బాబులా గ్రామాల మధ్య సర్వేనెంబర్ 71 భూమి కోసం అడిగారా?

(ఇ) చివరి దరఖాస్తు కూడా తిరస్కరించబడిందనేది వాస్తవమూ

(ఎఫ్.) ఈ మహర్ల దరఖాస్తుల్ని అనుకూలంగా పరిగణించకుండా తిరస్కరించడానికి గల కారణాలు ఏమిటి?

*గౌరవనీయులైన శ్రీ జి.బి.ప్రధన్ :* అవును. ఆ భూమి వేరొక వ్యక్తికి ఇదివరకే మంజూరు చేయబడింది.

(2) రాజూర్‌కు చెందిన సర్వేనెంబర్ 202 రెవెన్యూశాఖ ఆధీనంలో ఉన్న పశుగ్రాసం భూమి. అది ప్రతి సంవత్సరం పల్లీయులకు పశువుల మేత కోసం అమ్మబడుతూ ఉంటుంది. అది ఇతరత్రా ఏ అవసరాల కోసమూ మంజూరు చేయబడదు. పల్లెలోని మిగిలిన పశుగ్రాసభూమి వాళ్ళ అవసరాలకు సరిపడాలేదు.

(3) రాజూర్-బాబులా మధ్య సర్వే నెంబర్ 71 పశుగ్రాస భూమిగా గుర్తించబడిన కారణంగానే మహర్లకు దానిని మంజూరు చేయలేదు.

నేను దీనికి తోడుగా పింప్లాడ్, రాజూర్ – బాబులా కు చెందని 11 సర్వే నెంబరులో దాదాపు 200 ఎకరాలు కలిగిన భూమి మాత్రమే వ్యవసాయం నిమిత్తం ఇవ్వడానికి అందుబాటులో ఉందని చెబుతున్నాను. ఆ భూమి నిర్ధారించబడిన పన్ను కంటే ఎక్కువ ధరకు అమ్మకానికి ఉంచబడింది. అది కేవలం మహర్లు, భిల్లులు, కోలీలు తప్ప తక్కిన వాళ్ళు కొనకూడదనే ఉత్తర్వులు జారీ చేయబడ్డాయి. ఈ నియమం డబ్బున్న వాళ్ళ పోటీని తొలగించడానికి విధించారు. అమ్మకానికి సంబంధించిన పత్రాలు ఫింప్‌లడ్‌కు చెందిన ఇద్దరు కోలీలు, ముగ్గురు మహర్లు, రాజూర్ – బాబులాకు చెందిన ఒక కోలీ, ముగ్గురు మహర్లను కొనుగోలు దారుగా చూపుతున్నాయి.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 21, పుట 219, తేదీ 1, అక్టోబర్ 1927)

***డా౹ అంబేద్కర్ తరఫున డా౹ పి.జి.సోలంకి :*** ప్రభుత్వం దయచేసి క్రింది వాటి గురించి చెబుతుందా--

(ఎ) 1926వ సంవత్సరానికి చెందిన "వివిధ జ్ఞాన విస్తార్‌లో 372, 417 పుటల్లో ప్రచురితమైన సమాచారం మీదకు దృష్టి ఏమైనా కేంద్రీకరించబడిందా?

(బి) కేంద్రీకరించబడినట్లైతే అటువంటి పశుగ్రాసం భూములు శిస్తు నుంచి మినహా

యించేట్లు ఏమైనా చర్యలు తీసుకోవాలనుకుంటున్నారా?

**గౌరవనీయులైన జె.ఎల్. ర్యూ :** (ఎ) థానా జిల్లాలోని బాద్లాపూర్ గ్రామానికి చెందిన అటవీ భూములు ఇతర భూముల ఆదాయాలతో పోలిస్తే చాలా తక్కువగా ఉంటున్నందువల్ల వాటిని వ్యవసాయం కోసం, లేదా పశుగ్రాసం కోసం వదలి పెట్టాలని అనుకుంటున్నారా?

(ఎ) గౌరవనీయులైన జె.ఎల్.ర్యూ గౌరవనీయులైన సభ్యుడు. ఈ ప్రశ్నను నోటీసుగా ఇచ్చినప్పుడే – (బి) లేదు;

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 21, పుట 269-70, తేదీ 1, అక్టోబర్ 1927)

## బడుగు వర్గాలకు అటవీ భూములు

**డా॥ అంబేద్కర్ తరపున డా॥ పి.జి. సోలంకి :** ప్రభుత్వం దయచేసి ఈ క్రింది వాటిని వివరిస్తుందా–

(ఎ) బడుగు వర్గాల్లో నిరుద్యోగ సమస్య పెరగడం గురించి తెలుసా?

(బి) అస్పృశ్యత కారణంగా చాలామటుకు ఉద్యోగాలు బడుగు వర్గాల వారికి అందు బాటులో లేవనే వాస్తవం దృష్ట్యా మైసూరు ప్రభుత్వం చేసినట్లుగా ఎక్కడైతే అటవీ భూములు ఉన్నాయో అక్కడ బడుగువర్గాల వారికి సెటిల్మెంటులను ఏర్పాటు చేయాలని అనుకుంటున్నారా?

(సి) అటవీ భూముల కోసం దరఖాస్తు చేసిన వర్గాల వారికి ప్రాధాన్యత నీయాలని అనుకుంటున్నారా?

**గౌరవనీయులైన శ్రీ జి.బి.ప్రధాన్ :** (ఎ) లేదు

(బి) అటువంటి సెటిల్మెంట్లు ఇదివరకే మూడు ఖండేష్ డివిజన్లలో ఏర్పాటు చేయబడ్డాయి. దరఖాస్తులు పెట్టబడినప్పుడు అడవుల్లో తగిన భూములు లభించినపుడు ముందు ముందు సెటిల్మెంట్లను ఏర్పాటు చేసే అవకాశాల్ని పరిశీలిస్తాం.

(సి) బడుగు వర్గాల వారినుంచి అటవీ భూముల కోసం వచ్చిన దరఖాస్తుల్ని తప్పక అనుకూలంగానే పరిశీలిస్తాం. అయితే బడుగువర్గాల వారికే ప్రాధాన్యత ఇచ్చే విధానానికి హామీ ఇవ్వలేను.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 21, పుట 269-70, తేదీ 1, అక్టోబర్ 1927)

## దక్కన్ వ్యవసాయదారుల సహాయ చట్టం : రద్దు

**డా॥ అంబేద్కర్ :** ప్రభుత్వం దయచేసి క్రింది వాటి గురించి చెబుతుందా –

(ఎ) దక్కన్ వ్యవసాయ దారుల సహాయ చట్టానికి సంబంధించి ఒక బిల్లును ప్రవేశ పెట్టాలని

అనుకుంటుండటం వాస్తవమా?

(బి) అది వాస్తవమే అయితే, అటువంటి నిర్ణయం వల్ల తమ ప్రయోజనాలు దెబ్బతినే వ్యవసాయ దారుల అభిప్రాయాలను సేకరించారా?

(సి) వ్యవసాయం పై నియమించిన రాయల్ కమిషన్ 1918 నాటి అధిక వడ్డీ రుణాల చట్టం విజయవంతం కాలేదని పేర్కొన్న విషయం తెలుసా?

***గౌరవనీయులైన శ్రీ జె. ఆర్. మార్టిన్ :*** (ఎ), (బి) రాయల్ అగ్రికల్చరల్ కమీషన్ సిఫార్సు చేయబడిన వ్యవసాయిక రుణగ్రస్తత చట్టం రూపొందించడం దక్కన్ వ్యవసాయదారుల సహాయ చట్ట సవరణ కానీ, రద్దుకు కానీ సంబంధించిన ప్రశ్న వాయిదా వేయబడింది.

(సి) అవును.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 24, పుట 287, తేదీ 29, సెప్టెంబర్ 1928)

## ప్రభుత్వ ఉద్యోగస్తులు జీతాలు, పెన్షన్లు

***డా॥ అంబేద్కర్ :*** 1927-28 సంవత్సరానికి గాను ప్రభుత్వం చెల్లించిన మొత్తం డబ్బును గూర్చి దయచేసి ప్రభుత్వం చెబుతుందా? (లేదా దానికంటే ముందు ఏ సంవత్సరానికి సంబంధించిన వైనా గానీ లెక్కలున్నాయా?) (1) సబార్డినేట్ క్లరికల్ ఉద్యోగాల్లో ఉన్న శాశ్వత ఉద్యోగులకు జీతాలు; (2) సబార్డినేట్ క్లరికల్ ఉద్యోగులకు పెన్షన్లుగా –

***గౌరవనీయులైన శ్రీ జి.బి. ప్రధాన్:*** (1) శాశ్వత, తాత్కాలిక ఉద్యోగుల ఖర్చుకు సంబంధించిన లెక్కలు వేరువేరుగా అందుబాటులో లేవు. 1925-26 వ సంవత్సరానికి గాను ప్రావిన్షియల్ ప్రభుత్వం సబార్డినేట్ ఉద్యోగుల జీతాలకు గాను ఖర్చుచేసిన మొత్తం సొమ్ము చిన్న ఉద్యోగుల కోసం చేసిన ఖర్చు (25 లక్షల రూపాయల మేరకు) మినహాయించి 296 లక్షల రూపాయిలు.

(2) వివిధ వర్గాలకు సంబంధించిన ఉద్యోగుల ఖర్చుల వివరాలు విడివిడిగా అందుబాటులో లేనందువల్ల సమాచారాన్ని ఇవ్వలేక పోతున్నందుకు ప్రభుత్వం విచారిస్తున్నది.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 24, పుట 287, తేదీ 29, సెప్టెంబర్ 1927)

## ప్రభుత్వ ఉద్యోగులు : గ్రాడ్యుయేట్ల ప్రారంభ జీతం

***డా॥ ంబేద్కర్ తరఫున డా॥ పి.జి. సోలంకి :*** దయచేసి ప్రభుత్వం ఈ క్రింది వాటిని వివరిస్తుందా–

(ఎ) బొంబాయి నగరంలో గ్రాడ్యుయేట్ ఉద్యోగుల ప్రారంభపు జీతం గురించి సమాచారానికి సంబంధించిన ప్రశ్నను శ్రీ ఎస్.కె. బోలే వేశారన్నది వాస్తవమేనా?

(బి) ఉద్యోగులు 'అప్పర్‌గ్రేడ్, లోయర్ గ్రేడ్'లు అని విభజించిన కార్యాలయాల్లో లోయర్ గ్రేడులుగా పనిచేస్తున్న వాళ్ళు మినహా మిగిలిన గ్రాడ్యుయేట్ ఉద్యోగులకు ప్రభుత్వం ప్రారంభ జీతంగా రూ 90/- ఉందన్న సమాధానం వాస్తవమేనా? పై విధంగా శాఖాధిపతుల్ని ఆజ్ఞాపిస్తూ ప్రభుత్వం ఆర్థిక శాఖకు సంబంధించిన ప్రభుత్వ తీర్మానం నంబర్ 1140, 1925 మార్చి 25వ తేదీన విడుదల చేసిందా?

(సి) బొంబాయి నగరంలో శాఖాధిపతుల్ని గ్రాడ్యుయేట్ ఉద్యోగులకు రూ 90/- ప్రారంభ జీతాన్ని ఇవ్వమని ఆదేశిస్తూ పైన పేర్కొన్న ప్రభుత్వ తీర్మానానికి వ్యతిరేకంగా బొంబాయి కలక్టర్ తన క్రింది శాఖల్లో అప్పర్, లోయర్ గ్రేడ్లు లేకున్నా 60 రూపాయిలు మాత్రమే గ్రాడ్యుయేట్లకు ప్రారంభ జీతంగా ఉంచారనడం వాస్తవమేనా?

(డి) నగరేతర ప్రాంతాల్లో గ్రాడ్యుయేట్ల ప్రారంభ జీతం రూ 70/- అని ప్రభుత్వానికి తెలుసా?

**గౌరవనీయులైన శ్రీ జి.బి. ప్రధాన్:** (ఎ) అవును. (బి) ఏ కార్యాలయాల్లో అయితే ప్రభుత్వోద్యోగులు అప్పర్, లోయర్ డివిజన్లుగా విభజింపబడి వున్నారో ఆ కార్యాలయాల్లోని లోయర్ డివిజన్ లోని గ్రాడ్యుయేట్లని మినహాయించి మిగిలిన వాళ్ళ కంతా ప్రారంభ జీతంగా రూ 90/- చెల్లించమని అన్ని కార్యాలయాల శాఖాధిపతులకు అధికారం ఇవ్వబడిందని ప్రభుత్వం సమాధానం చెప్పింది. దీని మేరకు ఆర్థిక శాఖ 1140 వ నంబర్ 25 మార్చి 1925 ప్రభుత్వ తీర్మానంలో ఉత్తర్వులు జారీ చేయబడ్డాయి.

(సి) గౌరవనీయులైన సభ్యులు తెలియచేసిన ఉత్తర్వుమేరకు ఏ కార్యాలయాల్లో అయితే ప్రభుత్వో ద్యోగులు అప్పర్, లోయర్ గ్రేడ్లుగా విభజింపబడి ఉన్నారో ఆ కార్యాలయాల్లోని లోయర్ డివిజన్ లోని గ్రాడ్యుయేట్లని మినహాయించి మిగిలిన వాళ్ళకంతా ప్రారంభ జీతంగా నెలకు రూ 90/- చెల్లించమని ప్రభుత్వం వాళ్ళ కార్యాలయాల శాఖాధిపతులకు అధికారాన్నిచ్చింది. పై ఉత్తర్వుల మేరకు బొంబాయి కలెక్టరు ఎక్కడ ఒక గ్రాడ్యుయేట్ క్లర్కు అవసరమని అనుకుంటాడో అక్కడ ప్రారంభ జీతంగా నెలకు రూ 90/- ఇస్తున్నారు. ఇతరత్రా గ్రాడ్యుయేట్లకు వాళ్ళకు అప్పచెప్పబడిన పని ప్రాముఖ్యాన్ని బట్టి ప్రారంభ జీతంగా రూ 60 నుంచి రూ 90 వరకు ఇస్తున్నారు.

(డి) అవును.

(బి.ఎల్.సి. చర్చలు,సంపుటం 25, పుట 685, తేదీ 28, ఫిబ్రవరి 1929)

## భూ సేకరణ – ముల్షీ ఆనకట్ట

***డా॥ అంబేద్కర్ తరపున డా॥ పి.జి. సోలంకి :*** ప్రభుత్వం దయచేసి ఈ క్రిందివాటి గురించి చెబుతుందా –

(ఎ) పూనా జిల్లాలోని హవేలీ తాలూకాకు చెందిన మొహరీ, వాజ్‌గాన్ గ్రామాల మహర్ల భూములను ప్రభుత్వం ముల్షీ ఆనకట్ట కోసం సేకరించిందా?

(బి) ఏ ధరకు భూములు స్వాధీనం చేసుకోబడ్డాయి?

(సి) ఆ పల్లెలకు సంబంధించిన మహర్లకు ఆ భూముల నిమిత్తం డబ్బు చెల్లించబడిందా?

***గౌరవనీయులైన శ్రీ జె.ఎల్. ర్యూ :*** (ఎ) అవును.

(బి) జిరాయిత్ భూములకు ఎకరానికి రూ 50 వంతున, గడి (వరి) భూములకు ఎకరానికి రూ 550 వంతున –

(సి) ఈ భూములు ఇనాం భూములైనందున ఆ మొత్తాలను ప్రభుత్వఖాతాలో జమ చేయబడ్డాయి. సంవత్సరానికి లెక్కకట్టబడిన నష్టపరిహారం మొత్తం సొమ్ములోని ఐదుశాతం సొమ్ము వతన్‌దార్ మహర్లకు మంజూరు చేయబడింది.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 25, పుట 767, తేదీ 1, మార్చ్ 1927)

## స్థానిక సంస్థలకు గ్రాంట్ ఇన్ ఎయిడ్‌లు

***డా॥ అంబేద్కర్ తరపున డా॥ పి.జి. సోలంకి :*** ప్రభుత్వం దయచేసి వీటిని వివరిస్తుందా?

(ఎ) డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వద్ద దాదాపు మూడు ఏళ్ళుగా స్థానిక బోర్డులకు నిధులు మంజూరు చేసే విషయం పెండింగ్‌లో ఉంచబడిందనే విషయం వాస్తవమా?

(బి) అది వాస్తవమే అయితే జాప్యానికి కారకులెవరు?

(సి) ఈ విషయంలో ప్రభుత్వం ఏ చర్యల్ని చేబడుతుంది?

***గౌరవనీయులైన మౌల్వీ రఫుద్దీన్ అహమ్మద్ :*** గౌరవనీయులైన సభ్యులు ప్రతిపాదించిన విషయం ప్రాథమిక విద్యకు నిధులు మంజూరు చేయడానికి సంబంధించినదే అయితే సంవత్సరానికి స్థానిక సంస్థలకు లేదా స్థానిక అధికారులకు ఇచ్చే తాత్కాలిక నిధులు వాస్తవానికి ఆడిట్ అనంతరం చూపించే మొత్తం కంటే ఎక్కువగానే ఉంటున్నాయి. ఈ సాంవత్సరిక నిధులకు సంబంధించిన చివరి సవరింపులు ఆడిట్ అభ్యంతరాలు సరిజేయబడిన తరవాతే చేయబడతాయి.

(బి) ఈ ప్రశ్న ఉద్భవించదు.

(సి) ప్రస్తుతం ఉన్న విధానాన్ని సవరించాలని అనుకోవడం లేదు.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 25, పుట 1092, తేదీ 7, మార్చి 1929)

## బొంబాయి మున్సిపల్ కార్పోరేషన్ – మార్లండ్ రోడ్డు

***డా॥ అంబేద్కర్ :*** దయచేసి ప్రభుత్వం క్రింది వాటి గురించి చెబుతుందా?

(ఎ) బొంబాయి మునిసిపల్ కార్పోరేషన్ మార్లండ్ రోడ్డును గత 15 ఏళ్ళ కొకసారైనా పునర్నిర్మించలేదు అనేది వాస్తవమా? అది వాస్తవమే అయితే దానికి గల కారణాలు?

(బి) ఈ విషయంలో ప్రభుత్వమేమైనా చర్యలు తీసుకోవాలనుకొంటున్నదా?

(సి) ఈ అంశం పోలీసు అధికారులకు, మునిసిపల్ కార్పోరేషన్‌కు నివేదనల ద్వారా, పత్రికల ద్వారా తెలియ జేయబడిందనే విషయం వాస్తవమేనా?

***గౌరవనీయులైన దివాన్ బహదూర్ హరిలాల్ డి. దేశాయ్ :*** (ఎ) గత 15 సంవత్సరాలుగా ఆ రోడ్డు మరమ్మత్తు చేయబడలేదనేది వాస్తవం కాదు. 1914 నుంచి 1921 వరకు మధ్యకాలంలో రోడ్డు క్రమం తప్పకుండా మరమ్మత్తు చేయబడింది. తారు పూత పూయబడింది. 1922 నుంచి తగినంతగా మరమ్మత్తులు జరగలేదు. అయితే రోడ్డు పై తరచుగా గుంటలు పూడ్చడం జరిగింది. కార్పోరేషన్ రోడ్డును తిరిగి సిమెంట్ కాంక్రీటు పునాది మీద డాంబర్‌తో పునర్మిం చేందుకు తన అంగీకారాన్ని తెలిపింది. కొద్ది కాలంలో ఆ పని పూర్తవుతుంది.

(బి) లేదు.

(సి) కార్పోరేషన్‌కు ఫిర్యాదులు చేయబడ్డాయి.

(బి.ఎల్.సి. చర్చలు, సంపుటం 25, పుట 1092, తేదీ 7, మార్చి 1929)

## ఉన్నత పాఠశాలలు : గ్రాంట్ ఇన్ ఎయిడ్

***డా॥ అంబేద్కర్ తరువాత డా॥ పి.జి. సోలంకి :*** ప్రభుత్వం దయచేసి క్రింది వాటి గురించి చెబుతుందా–

(ఎ) ఉన్నత పాఠశాలలకు సాంవత్సరిక నిధులను నిర్ధారించే విధానాన్ని పునః పరిశీలించే ప్రశ్నను గత సంవత్సరం పరిశీలించక పోవడానికి గల కారణాలు –

(బి) ప్రభుత్వం శాశ్వతంగా నిధులు మంజూరు చేయడానికి గాను తగిన ఉన్నత పాఠశాలలు ఈ ప్రెసిడెన్సీలో ఏవైనా ఉన్నాయా?

(సి) ఉన్నత పాఠశాలలకు నిధులు నిర్ధారించే విషయంలో విద్యాధికారుల తనిఖీ నివేదికల

మీద డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారు ఆధార పడ్డారా? అలా కాని పక్షంలో ఉన్నత పాఠశాలలకు ప్రతి సంవత్సరం గ్రాంట్ ఇన్ ఎయిడ్‌ను పంపిణీ చేయడంలో మరేమైనా ప్రమాణాలు ఉన్నాయా?

(డి) ఎన్ని సంవత్సరాల తర్వాత రిజిస్ట్రేషన్ ఉన్న పాఠశాలకు విద్యాశాఖ నమోదు ఇస్తున్నది?

(ఇ) 5 సంవత్సరాలు గడిచినా గ్రాంట్ - ఇన్ - ఎయిడ్ కోసం రిజిస్టర్ కాని ఉన్నత పాఠశాలల సంఖ్య ఎంత?

**గౌరవనీయులైన మౌల్వీ రఫుద్దీన్ అహ్మద్ :** (ఎ) ఉన్నత పాఠశాలలకు ఇచ్చే గ్రాంట్ ఇన్ ఎయిడ్ విషయానికి సంబంధించిన ప్రాతిపదికలు సరిగ్గా ఉన్నాయని ప్రభుత్వం సర్వసాధారణంగా సంతృప్తి చెందుతుంది.

(బి) అవును.

(సి) గ్రాంట్ ఇన్ ఎయిడ్ నిబంధనావళిలో పొందుపరచిన నియమాలననుసరించి నిధులు నిర్ణయించబడుతుంటాయి. డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారు గ్రాంట్స్ ఇన్ ఎయిడ్ నియమాల్ని ఆయా పాఠశాలలు ఎంత మేరకు పాటించాయో నిర్ధారణ చేసుకోడానికి తనిఖీ అధికారుల నివేదికల మీద ఆధారపడతారు. అందువల్ల ప్రశ్నలో తరువాతి భాగం ఇక్కడ అప్రస్తుతం.

(డి) నిధులకు సంబంధించిన ఖర్చుల్ని అంచనా వేయడంలో ఖచ్చితమైన, నిర్ణీతమైన తలసరి ఖర్చు అంటూ ఏదీ పాటింపబడటం లేదు. ఈ గ్రాంట్స్ ఇన్ ఎయిడ్ నిబంధనల్ని సంతృప్తి పరిచే అన్ని పాఠశాలలకు పరిమితులకు లోబడి నిధులు సమకూరుస్తుంది.

(ఇ) కనీస సంవత్సరాలు ఎన్ని అనేది పేర్కొనలేదు. నిధుల కొరత వల్ల కొత్త పాఠశాలలకు రిజిస్ట్రేషన్‌లు ఇవ్వడం లేదు.

(ఎఫ్) 110 పాఠశాలల వరకూ ఉన్నాయి.

**అనువాదం :**

**డా॥ ఎస్.జి.డి. చంద్రశేఖర్**

☆ ☆ ☆

# అనుబంధం – III

# విశ్వవిద్యాలయ సంస్కరణల సంఘం

(చూడుడి : అధ్యాయం 7, పుట 43)

* ప్రశ్నావళి

## బొంబాయి ప్రెసిడెన్సీ లోని విశ్వవిద్యాలయ సంస్కరణల పై

(బొంబాయి ప్రభుత్వం బొంబాయి విశ్వవిద్యాలయ సంస్కరణ సమస్యను పరిశీలించ డానికి ఒక సంఘాన్ని నియమించింది. సర్ చిమన్‌లాల్ హెచ్. సెతల్‌వాద్ కేటి అధ్యక్షుడుగా ఉన్న ఈ సంఘంలో 13 మంది సభ్యులున్నారు. డా॥ అంబేద్కర్ ఈ సంఘంలో సభ్యుడు కాదు. ఈ సంఘం 54 ప్రశ్నలతో కూడిన ప్రశ్నావళిని 321 మంది వ్యక్తులకు పంపింది. వారిలో అంబేద్కర్ ఒకరు. డా॥ అంబేద్కర్ ఆ ప్రశ్నలలో కొన్నిటిని జవాబివ్వదగిన ప్రశ్నలుగా పరిగణించారు. ఆయన జవాబిచ్చిన ప్రశ్నలకే అతని దృష్టాంతాలు కలిపి ఇక్కడ పొందుపరచ బడ్డాయి. – సంపాదకుడు)

1. మీ అభిప్రాయం ప్రకారం బొంబాయి ప్రెసిడెన్సీలోని విశ్వవిద్యాలయ విద్య యొక్క ఉద్దేశం, ఆవశ్యకత ఏమిటి? ప్రస్తుతం అమలులో ఉన్న విశ్వవిద్యాలయ ప్రణాళిక ప్రెసిడెన్సీలోని భారతీయ యువతీ యువకులకు ఆ ఉద్దేశ సాఫల్యానికి కావలసిన లేక తగినన్ని అవకాశాలు కల్పిస్తుందా? కల్పించని పక్షంలో ప్రస్తుత విద్యా విధానంలో ఏ విషయాలలో లోపముందని మీరు భావిస్తున్నారు.

2. మీరు సూచించిన లోపాలు ముఖ్యంగా వీటితో లేక వీటి నుండి ఉద్భవించిన వనుకుంటున్నారా? (అ) బోధకుని లేక విద్యార్థి పద్ధతులు (ఆ) విద్యార్థి విశ్వవిద్యాలయంలో ప్రవేశించడానికి ముందున్న విద్యాపరిస్థితులు (ఇ) విశ్వవిద్యాలయ విద్య లేక పరిపాలనకు సంబంధించిన సిబ్బంది.

3. మీ అభిప్రాయం ప్రకారం విశ్వవిద్యాలయం ప్రెసిడెన్సీలోని వివిధ వర్ణాల చరిత్ర – సంస్కృతులకు సంబంధించిన జ్ఞానం పరస్పర అవగాహనకు ఎంత వరకు దోహదం చేసింది. ఈ విషయంలో మరింత దోహదం చేయడానికి మీరేమైనా పద్ధతులను సూచించగలరా?

---

* ప్రభుత్వం నియమించిన విశ్వవిద్యాలయ సంస్కరణల సంఘనివేదిక 1925–26 పుటలు : 226 – 31.

## II. సెకండరీ మరియు ఇంటర్ మీడియట్ విద్య
### (ప్రశ్నలు 4–7)

4. విద్యార్థులు ఉన్నత పాఠశాలలో పొందిన శిక్షణ, విద్యా ప్రగతి వారు ఉన్నత విద్యకోసం విశ్వవిద్యాలయంలో చేరడానికి సరిపోతుందని మీ అభిప్రాయమా? సరిపోదని మీ అభిప్రాయమైతే, ఆ విద్యా పరిస్థితులను వృద్ధి చేయడానికి మీరేమైనా సూచనలిస్తారా!

5. ఈ ప్రెసిడెన్సీలో (అ) ఉన్నత పాఠశాలలకు విశ్వవిద్యాలయానికి మధ్య ఇంటర్ మీడియట్ విద్యకు సంబంధించిన కొత్త తరహా సంస్థలను ఏర్పాటు చేయాలను కొంటున్నారా? (ఆ) కలకత్తా విశ్వవిద్యాలయం సూచించినట్టు ఉన్నత మరియు ఇంటర్ మీడియట్ విద్యకు సంబంధించిన ఒక కొత్త విద్యా బోర్డు అవసరమా! ఇవి అవసరమనుకుంటే ఈ సంస్థలను ఏ రకంగా ఏర్పాటు చేసి ఆర్థిక వనరులను సమకూర్చాలి?

6. ఇంటర్ మీడియట్ విద్యా సంస్థలు విద్యా బోర్డుతో కలిసి గాని లేకుండా గాని అవసరమని, అభిలషణీయమని మీరు భావిస్తే ఈ విద్యా సంస్థలు లేకుండా ఉన్నత పాఠశాల విద్య ప్రమాణాలను మెరుగు పరచడం ఎలా?

7. విశ్వవిద్యాలయాలకు ప్రవేశం నిమిత్తం పంపబడిన విద్యార్థుల ప్రతిభను విశ్వవిద్యాలయం ఏ రకంగా మెరుగుపరుస్తుంది?

## III. బొంబాయి విశ్వవిద్యాలయం విధులు
### (ప్రశ్నలు 8–24)

ఎ) బోధన (ప్రశ్నలు 8–13)

8. బొంబాయి విశ్వవిద్యాలయం ప్రధాన విధి బోధనగా మార్చడం మీ అభిప్రాయం ప్రకారం ఎంత వరకు సబబు?

9. స్నాతకోత్తర స్థాయి బోధనే కాకుండా విశ్వవిద్యాలయం డిగ్రీ కింది తరగతుల బోధనలో కూడా క్రియాశీలక పాత్ర ఉండాలని మీరనుకుంటున్నారా? అలా అయితే విశ్వ విద్యాలయ బోధనా విధులను ప్రస్తుతమున్న బోధన సంస్థలన్నిటిలో ఎలా సమన్వయ పరుస్తారు.

10. విశ్వవిద్యాలయం డిగ్రీ క్రింది తరగతుల బోధన విషయంలో పాలు పంచుకోనక్కర లేదని మీరు భావిస్తే ఇప్పుడున్న విద్యా సౌకర్యాలతో ఏ రకంగా మంచి ప్రయోజనాన్ని సాధించగలరు?

## IV. బొంబాయి ప్రెసిడెన్సీలో అదనపు విశ్వవిద్యాలయం

(ప్రశ్నలు 25–30)

25. బొంబాయి ప్రెసిడెన్సీలో అదనపు విశ్వవిద్యాలయాలను స్థాపించడం అభిలషణీయమేనా? ప్రెసిడెన్సీలోని ఇందుకు ఉన్నత విద్యా కేంద్రాలలో దేనిని సిఫారసు చేస్తారు.

(అ) విశ్వవిద్యాలయాలుగా వెంటనే విస్తరింపజేయడానికి అనుకూలంగా ఉన్న

(ఆ) భవిష్యత్తులో విస్తరింపజేయడానికి తగినవి?ఏ కారణాల వల్ల

28. అదనపు విశ్వవిద్యాలయాలు ఇప్పుడున్న బొంబాయి విశ్వవిద్యాలయాల కన్నా ఏ రకంగా ప్రభావితం చేస్తాయి? కొత్త విశ్వవిద్యాలయానికి బొంబాయి విశ్వవిద్యాలయానికి మధ్య పరస్పర సహకారం, సమన్వయం ఎలా సాధిస్తారు? రెండు విశ్వవిద్యాలయాల మధ్య ఏర్పడే సంధి కాలాన్ని ఎలా నిర్వహిస్తారు?

## VII. రాజ్యాంగం

(ప్రశ్నలు 36–40)

36. బొంబాయి విశ్వవిద్యాలయ రాజ్యాంగ నిర్మాణంలో మీకు ఎలాంటి లోపాలు కనిపిస్తున్నాయి.

37. విశ్వవిద్యాలయ సెనేట్‌ను ఏ రకంగా ఏర్పాటు చేసుకోవాలి? సెనేట్ సభ్యుల సంఖ్య, పాలనా కాలం, విధులు ఏమిటి? ఒకవేళ గౌరవ సభ్యులు, నియమింపబడిన సభ్యులు ఉండవలసివస్తే వారు ఏ వర్గాల నుండి ఉండాలి? అన్ని వర్గాలకు, వర్ణాలకు ప్రాతినిధ్యం ఉండే రకంగా మీ సెనేట్ ఏర్పాటు ఎలా ఉంటుంది?

38. ఇప్పటి వరకు బొంబాయి విశ్వవిద్యాలయ సిండికేట్‌కు ఉన్న అధికారం, అది నిర్వహించిన పనులను వికేంద్రీకరించడం అవసరమంటారా? అలా అయితే ఏ అధికారాలను, పనులను బొంబాయి సిండికేట్‌నుండి తొలగించి ఏ కొత్త లేక ఇప్పటికే ఉన్న విశ్వవిద్యాలయ సంస్థలకు అప్పగిస్తారు? మీరు పునర్నిర్మించబోయే సిండికేట్ ఇతర నూతన సంస్థలను ఎలా ఏర్పాటు చేస్తారు?

39. బోధన శాఖలకు, పాఠ్య ప్రణాళికలను నిర్ణయించే బోర్డులకు మీ రెలాంటి విధులను అప్పగిస్తారు? ఈ శాఖలు, సంస్థలు ఎలా తయారవుతాయి? ఎలా ఎన్నిక చేయబడతాయి?

## III. బొంబాయి విశ్వవిద్యాలయ విధులు
## (ప్రశ్నలు 8–24)

**సి) కోర్సుల నిర్ణయం, పరీక్షల నిర్వహణ (ప్రశ్నలు 16–19)**

16. మీ అభిప్రాయం ప్రకారం బొంబాయి విశ్వవిద్యాలయం (అ) పరీక్షలు నిర్వహించడం లోనూ, (ఆ) కోర్సులను నిర్ణయించడం లోను, (ఇ) పాఠ్య పుస్తకాలు ఎంపిక చేయడంలోను సక్రమంగా వ్యవహరిస్తున్నదా? ఈ పనులు నిర్వహించడంలో మీరేమైనా మార్పులు సూచిస్తారా?

17. విశ్వవిద్యాలయ పరీక్షలు ఎంతవరకు నేర్పు, తెలివి, అర్హతలకు లాభసాటియైన ప్రత్యామ్నాయాలవుతాయి?

18. బొంబాయి విశ్వవిద్యాలయం అధ్యయనానికి సంబంధించిన ఏయే శాఖలలో వెంటనే గాని భవిష్యత్తులో గాని బోధనను నిర్వహించగలదు?

19. బొంబాయి విశ్వవిద్యాలయంలో బోధన పనుల దృష్టితోను, బొంబాయి పౌరుల ప్రత్యేక అవసరాల దృష్టితోను విశ్వవిద్యాలయ పరిధిని మరింత విస్తృతం చేయడానికి లలిత కళలు, సాంకేతిక శాస్త్రం మొదలైన ఇతర బోధన శాఖలను ఈ విద్యా సంస్థల్నే నిర్వహించమని మీరు సూచిస్తారా?

**డి) స్నాతకోత్తర, డిగ్రీ కోర్సులు (ప్రశ్నలు 20 – 21)**

20. బొంబాయి విశ్వవిద్యాలయం తన బోధన పనులను ఎక్కువగా వృద్ధి చేసు కున్నపుడు స్నాతకోత్తర డిగ్రీలకు అధ్యయన కాలపరిమితి ఎలా ఉండాలి? డిగ్రీలు ఎలా ప్రధానం చేస్తారు? పరీక్షలు నిర్వహించడం ద్వారా, సిద్ధాంత వ్యాసం సమర్పించడం ద్వారా మౌలికమైన పరిశోధన నిర్వహించడం ద్వారా డిగ్రీ ఇస్తారా? లేక వీటిలో ఒకదానిని బట్టిగాని, లేక అన్నిటిని బట్టిగాని ఇస్తారా?

21. మీరేమైనా, కొత్త గౌరవ డిగ్రీలను ప్రవేశ పెడతారా! అలా అయితే ఆ డిగ్రీలను ఏ విధంగా ప్రధానం చేస్తారు.

**ఇ) పరిశోధనను ప్రోత్సహించడం (ప్రశ్నలు 22–23)**

22. భారతదేశ, ప్రత్యేకించి బొంబాయికి సంబంధించిన సమస్యలైన చారిత్రక, ఆర్థిక, సామాజిక, పారిశ్రామిక తదితర విషయాలలో సొంతంగా పరిశోధన సాగించడానికి విశ్వవిద్యాలయం ఎలా ప్రోత్సహిస్తుంది? ఎలా నిర్దేశిస్తుంది?

23. విశ్వవిద్యాలయ ముద్రణాలయం, ప్రచురణ శాఖలను యూనివర్శిటీలో స్థాపించే అవసరముందా? అలాంటి శాఖలు ఏ రకంగా నిర్వహించబడాలి? ఏ రకంగా ఆర్థిక వనరులు కూరు్కోవాలి?

## VIII. పాఠ్య ప్రణాళికలు
### (ప్రశ్నలు 41–44)

41. విశ్వవిద్యాలయానికి సంబంధించిన పరీక్షల కన్నింటికి ఇప్పుడున్న పాఠ్య ప్రణాళికలు మీకు తృప్తి కలిగిస్తున్నాయా? తృప్తి కలిగించని యెడల మీరు చేయాలనుకొన్న మార్పులేమిటి?

42. ఒక సర్వసత్తాకమైన లేక ఎంతో తేడా కలిగిన పాసు, ఆనర్సు కోర్సులను ప్రవేశ పెట్టడం మీకిష్టమా? కోర్సులలో ఈ రకమైన తేడాలు కళాశాలలను, విద్యార్థులను ఏ రకంగా ప్రభావితం చేస్తాయి?

43. విజ్ఞాన శాస్త్రాలను సామాజిక శాస్త్రాల నుండి పూర్తిగా విడదీయడానికి మీరు అంగీకరిస్తారా? ఇప్పుడున్నట్లు విజ్ఞాన శాస్త్రాల నుండి సాహిత్యం, సామాజిక శాస్త్రాలను వేరుచేయడాన్ని మీరు సమర్థిస్తారా?

44. ఇప్పుడున్న స్నాతక, స్నాతకోత్తర తరగతులకు సంబంధించి కావలసినన్ని ఐచ్ఛికాంశాలు, సబ్జెక్టుల పొందిక, వాటి మధ్య సరియైన సమన్వయం ఉందని మీకు అనిపిస్తున్నదా?

## IX. ప్రాంతీయ భాషల వాడకం
### (ప్రశ్నలు 45–46)

45. బొంబాయి విశ్వవిద్యాలయంలో గాని, కొత్తగా స్థాపించబోయే ఏ ఇతర విశ్వ విద్యాలయంలోగాని, ఆంగ్ల భాషను తొలగించడానికి, ఏ పరిమితి వరకు ప్రాంతీయ భాషమాధ్యమిక భాషగాను, పరీక్షల నిర్వహించే భాషగాను వాడటానికి తగి ఉంటుందని మీ అభిప్రాయం? ఆంగ్లభాషను తీసి వేయడం వల్ల విద్యా ప్రమాణాన్ని నిలపడానికి మీరే జాగ్రత్తలు తీసుకొంటారు?

46. ఈ ప్రెసిడెన్సీలో ప్రాంతీయభాషల శాస్త్రీయ అధ్యయనాన్ని కొనసాగించడానికి భాషలో మంచి సాహిత్య సృష్టిని ప్రోత్సహించడానికి మీరు ఏ అనువైన పద్ధతిని సూచిస్తారు?

## XIII. ప్రత్యేక వర్ణాలు
### (ప్రశ్న – 52).

52. ఏదైనా ఒక ప్రత్యేక వర్ణ ప్రజలలో విశ్వవిద్యాలయ విద్యను పెంపొందించడానికి అవసరమైన ప్రత్యేక పద్ధతులేమిటి?

## * డా॥ బి.ఆర్. అంబేద్కర్ లిఖిత పూర్వక ఆధారం

ప్రశ్న – 1. విశ్వవిద్యాలయ విద్య లక్ష్యం, విధులు ప్రయోజనములకు అనువుగా ఉండాలనే, ఇంగ్లాండులోని

* విశ్వవిద్యాలయ సంస్కరణల పంఘం, లిఖిత ఆధారం 103, పుటలు 1–17, తేది ఆగష్టు 15, 1924.

విద్యా బోర్డు తనిఖీ అధికారుల అభిప్రాయాన్ని నేనుకూడా అంగీకరిస్తాను. వాళ్ళ అభిప్రాయం శాస్త్రీయమైంది. పక్షపాత రహిత మైంది. విశ్వవిద్యాలయ విద్య వాస్తవాలతో, సిద్ధాంతాలతో, విద్యార్థి బుర్రను నింపడం కాకుండా అతని మానసిక శక్తులను వెలికి తీసేదిగా ఉండాలి. ప్రామాణిక గ్రంధాలను విమర్శనాత్మకంగా చదవడానికి అలవాటు పడేటట్లుచేయాలి; ఈ రకమైన శిక్షణ పొందిన విద్యార్థి ఒక విషయానికి సంబంధించిన వాస్తవానికి, దానికి సంబంధించిన సాధారణ అభిప్రాయానికి మధ్యగల భేదాన్ని తప్పక తెలుసుకోగలుగుతాడు. విషయ వైవిధ్యాలను తెలుసుకోవడానికి, ఒక విషయంపై అప్పటికి ప్రచారంలో ఉన్న సిద్ధాంతంతో సంబంధం లేకుండా వివిధ ప్రశ్నలద్వారా దాని మంచి చెడులను నిర్ణయించుకోవడానికి అలవాటు పడాలి. పూర్తిగా విభేదించే సిద్ధాంతాల గురించి సానుభూతి పూర్వకంగా వివరించడం తెలిసి ఉండాలి. ఒకరు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఒప్పుకోవడానికి లేక ఒప్పుకోక పోవడానికి ముందు దానిని పరీక్షించి దాని పర్యవసాన మేమిటో చూడాలి. మౌలికమైన పరిశోధనాంశ అధ్యయనంలో విద్యార్థి కావడానికి ముందు ఏ పరిస్థితుల ప్రాతిపదిక మీద ఆ పరిశోధన జరుగుతున్నదో తప్పని సరిగా తెలుసుకోవాలి. అధికారికమైన విషయాలకు విలువ ఇవ్వడానికి ముందు దానికి సంబంధించిన లక్ష్యాలను విమర్శనాత్మకంగా బేరీజు వేసుకోవాలి.

బొంబాయి ప్రెసిడెన్సీలోని విశ్వ విద్యాలయ విద్య యొక్క లక్ష్యం విధులు ఎందుకు వేరుగా ఉండాలో నాకు తెలియదు. విద్యార్థుల తరహాను దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే ఈ ప్రెసిడెన్సీలోని విశ్వవిద్యాలయ విద్య తన లక్ష్యాలను, విధులను నెరవేర్చడంలో పూర్తిగా విఫలమయిందని చెప్పవలసి ఉంది.

**ప్రశ్న – 2.** ఈ రకమైన వైఫల్యానికి బోధకుని ప్రవృత్తి, బోధన విధానాలు కొంత వరకు కారణం కావచ్చు. కొంత వరకు విద్యార్థులు కారణం కావచ్చు. విద్యార్థులు విశ్వవిద్యాలయంలో ప్రవేశించక మునుపు అక్కడున్న విద్యా పద్ధతులు కూడా కొంత వరకు కారణం కావచ్చు. ఏమైనా ఈ వైఫల్యం ప్రధానంగా విశ్వవిద్యాలయ పరిపాలనా పద్ధతుల వల్ల, విద్యా పద్ధతుల వల్ల జరిగిందని నా అభిప్రాయం. ఒక విశ్వవిద్యాలయం విశ్వవిద్యాల విద్యయొక్క లక్ష్యాలను; విధులను నెరవేర్చడానికి ముందు అది ఎందరో పండితుల విద్యా కేంద్రంగా రూపుదిద్దుకోవాలి. పండితులు పరస్పర సహకారంతో ఇతరులకు శిక్షణ ఇస్తూ జ్ఞానోపదేశం చేయడానికి అక్కడి పరిస్థితులు ఉండాలి. ఈ కారణాలవల్ల బొంబాయి విశ్వవిద్యాలయాన్ని ఒక నిజమైన విశ్వ విద్యాలయంగా పేర్కొనడానికి వీలుకాదు. ఇది ఒక విద్యావేత్తల మండలికాదు. ఇది మనుషు లకు తగిన శిక్షణ ఇవ్వలేదు. ఉన్నత విద్యను సాధించడం లోను, జ్ఞానాన్ని పంచడంలోను దీనికి సరియైన శ్రద్ధ లేదు. మరొక విషయయేమిటంటే పరిపాలనా విషయంలోను, విద్యా విషయంలోను బొంబాయి విశ్వవిద్యాలయానికి ఉండవలసిన లక్షణాలు లేవు. ఇది ఒక పరిపాలకుల మండలి మాత్రమే. విద్యార్థులకు పరీక్షలు నిర్వహించడమే దీని పని. ఉన్నత విద్యను సాధించడం, జ్ఞానాన్ని అందరికి అందుబాటులోకి తీసికొని

రావడం దీని పరిధిలో లేవు.

**ప్రశ్న – 3.** ఈ ప్రెసిడెన్సీలో బొంబాయి విశ్వవిద్యాలయం పరస్పర ప్రయోజనాలతో కూడిన జ్ఞాన సముపార్జన కొనసాగించడం లేదు. వివిధ వర్ణాలకు సంబంధించిన చరిత్ర సంస్కృతుల మీద సానుభూతిని చూపడం లేదు. జ్ఞాన తృష్ణను కలిగించకుండా పూర్తిగా పరీక్షలు నిర్వహించడమే పనిగా పెట్టుకున్న విశ్వవిద్యాలయం ఈ లక్ష్యాన్ని నెరవేర్చలేదు. ఆ రకమైన విజయాన్ని సాధించాలంటే మొదట దీనిని బోధనావిశ్వవిద్యాలయంగా మార్చాలని నా కనిపిస్తుంది.

**ప్రశ్నలు 4–7.** ఈ ప్రశ్నలకు సంతృప్తికరంగా సమాధానాలివ్వడానికి నేను అశక్తుడనను కొంటాను. ఈ విషయం చాలావరకు ఉన్నత పాఠశాలల నుండి విశ్వవిద్యాలయానికి వచ్చే విద్యార్థుల స్థాయి పైన ఆధారపడి ఉంటుందని నేనొప్పుకుంటాను. మంచి విద్యార్థులు రావడమన్నది ప్రతి విశ్వవిద్యాలయంలోనూ సమస్యే. ఇలాంటి పరిస్థితులలో ఉన్నత పాఠశాలలపై కూడా అజమాయిషి ఉంచి మంచి విద్యార్థులు విశ్వవిద్యాలయానికి వచ్చేటట్లు చేయడానికి విశ్వవిద్యాలయం ఎందుకు పూనుకోకూడదో నాకర్థం కాదు. నాకు తెలిసి ఏ విశ్వవిద్యాలయమూ ఈ బాధ్యత తీసుకోలేదు. విశ్వవిద్యాలయాలు చేసే పని ఏమిటంటే వారికి కావలసిన విద్యార్థులను ప్రవేశ పరీక్షల ద్వారా ఎన్నిక చేసుకోవడమే. ఈ విషయంలో బొంబాయి విశ్వవిద్యాలయం అంతకుమించి ఎక్కువ చేయాలని కూడా నేననుకోను.

**ప్రశ్నలు 8–10.** నా అభిప్రాయం ప్రకారం బొంబాయి విశ్వవిద్యాలయాన్ని బోధన విశ్వవిద్యాలయంగా మార్చే ప్రయత్నంలో రెండు నిర్దుష్టమైన సమస్యలున్నాయి. అవి. 1. దీనిని బోధన విశ్వవిద్యాలయంగా ఎలా మార్చడం; 2. ఇందులో బోధనను ఎలా నిర్వహించడం? ఈ విషయాన్ని 36–40 ప్రశ్నలలో విశదపరుస్తాను. ఇక్కడ రెండో విషయాన్ని చర్చిస్తాను. 1857 లోచేసిన 'ఇన్ కార్పొరేషన్ చట్టంలో విశ్వవిద్యాలయం బోధన పనిని చేపట్టే అంశాన్ని చేర్చలేదు. 1904 లో చేసిన చట్టం లోని అంశాలతో పాటు 'విద్యార్థుల బోధనకు అవకాశాన్ని కూడా' విశ్వవిద్యాలయ విధులలో చేర్చాలి. ఈ చట్టంలో సూచించిన ఈ సూత్రం స్నాతక స్థాయి విద్యార్థులను ఉద్దేశించి రూపొందింది. విశ్వవిద్యాలయ సంఘం సూచించినట్లు, బోధనా సంస్థలుగా తమ అస్తిత్వాన్ని నిలుపుకోడానికి అప్పటికే ఏర్పడిన విశ్వవిద్యాలయాలన్నీ ఈ సూత్రాల్ని పాటించడమే కాక, వివిధ కోర్సుల అధ్యయానానికి కావలసిన సౌకర్యాలను కూడా కల్పించాయి. తత్ఫలితంగా, విశ్వవిద్యాలయం స్నాతక స్థాయి బోధనను, కళాశాలలు స్నాతకోత్తర స్థాయి బోధనను నిర్వహించే ఏర్పాటుతో స్నాతక స్థాయి బోధన స్నాతకోత్తర స్థాయి బోధన నుండి వేరు చేయబడింది. స్నాతక, స్నాతకోత్తర స్థాయి శిక్షణలో ఇలాంటి ఖచ్చితమైన విభజనను నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను. అందుకు నేను చూపే కారణాలివి. (1) స్నాతకోత్తర స్థాయిపని నుండి స్నాతకస్థాయి పనిని వేరు చేయడమంటే పరిశోధన నుండి బోధనను వేరుచేయడమే. పరిశోధన నుండి బోధన వేరుచేయబడినపుడు పరిశోధన కుంటుపడటం తెలిసిన సంగతే. ఈ విషయాన్ని 1911లో లండన్‌లో విశ్వవిద్యాలయ విద్యకు

సంబంధించిన కమిషనర్లు గమనించారు.

69. నిజానికి బోధన అనేది అప్పటికే జరిగిన అధ్యయనాన్ని ప్రభావితం చేస్తే పరిశోధన అనేది కొత్తగా జరిగిన అధ్యయనాన్ని ప్రభావితం చేయాలి. విశ్వవిద్యాలయాభివృద్ధిని దృష్టిలో ఉంచుకుని ప్రముఖ విశ్వవిద్యాలయ ఆచార్యులందరూ స్నాతకస్థాయిక బోధనను తప్పనిసరిగా చేపట్టాలి. జూనియర్ విద్యార్థులతో ఇలాంటి బోధనా సంబంధం ఉన్నప్పుడు మాత్రమే ఉపాధ్యాయుడు తన సబ్జక్టుకు సంబంధించిన మూలసూత్రాలను వారి మనసులో ప్రవేశ పెట్టగలగడమే గాకుండా తనదైన పద్ధతులలో వారికి శిక్షణ ఇవ్వగలుగుతాడు. దీనివల్ల పరిశోధనకు మంచి విద్యార్థులను ఎన్నుకోవడం, వారి పరిశోధనా ప్రణాళికలలో మంచి దానిని ఎన్నుకోవడం అనే రెండు ప్రయోజనాలు కూడా సిద్ధిస్థాయి. మౌలికమైన పరిశోధన చేసే వ్యక్తి తన వ్యక్తిగత ప్రాబల్యంతో పనిలో నమ్మకాన్ని ఉత్సాహాన్ని కలిగించడమే గాక, విద్యార్థులను కూడా సంపాదించుకుంటాడు. ప్రత్యేకమైన అతని పరిశోధన పనిని అనియంత్రితంగా చేయడానికి కావలసిన అర్హులను పొందడంలో అతని వ్యక్తిత్వమే ఒక ఎంపిక శక్తి అవుతుంది. అతడు కలిగించిన ఉత్తేజంతో అతని పరిశోధకుల బృందం పరిశోధనలో అతని ఆత్మీయాంశను పునరుజ్జీవింప చేయడమే కాక దానిని కొనసాగిస్తారు. దీని వలన లాభ పడేది కొద్ది మంది విద్యార్థులు మాత్రమే కాదు. ఉపాధ్యాయులతో సంబంధం కలిగి, మౌలికమైన పనిని స్వతంత్రంగా, నిర్వహించే నేర్పు సంపాదించిన విద్యార్థులంతా అపరిమితంగా లాభపడతారు. 'హెల్మ్ హెల్జ్ చెప్పినట్లు 'ఎవరైనా ఒక వ్యక్తి ఒకరితోగాని అంతకు మించిగాని ప్రథమ శ్రేణి వ్యక్తులతో సంబంధ మేర్పడిన తరువాత అతని ఆలోచనా విధానం మారిపోయి అది జీవితమంతా కొన సాగుతుంది'. ఉపన్యాసాల ప్రయోజనం ఎప్పటికీ ఉంటుంది. పుస్తకాలు ఎప్పటికీ ప్రాణవంతమైన వాచికపు మాటకు సాటిరావు. అయినా ప్రయోగశాలల్లో, సదస్సుల్లో పుస్తకాలు కొంతవరకు బోధన స్థానాన్ని ఆక్రమించుకుంటాయి. అయినా అది విశ్వవిద్యాలయ విద్యకు సంబంధించిన సామాన్య అధ్యయనానికి మించిపోదు. విశ్వవిద్యాలయంలో విద్యార్థి జ్ఞాన సముపార్జన చేస్తాడు. పుస్తకాల ద్వారా అతడు సూచ్యాంశాలను వాటికి ఆధారమైన కారణాలను పొందడం మాత్రమే గాక, మౌలికమైన అతని ఆలోచనా విధానం సుశిక్షితం కూడా అవుతుంది.

70. "విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులు తప్పని సరిగా కావలసినంత శ్రద్ధతో స్నాతక స్థాయి బోధనలో పాల్గొంటే ఆ తరువాత వారి ఉన్నతశ్రేణి విద్యార్థులు స్నాతకోత్తర తరగతులకు వచ్చినపుడు వారిని వదలివేయకుండా తీసుకోవడానికి వీలుపడుతుంది. వేరువేరు విద్యాసంస్థలలో వేరు వేరు ఉపాధ్యాయులచే నిర్వహింపబడే బోధనా పని విశ్వవిద్యాలయంలోని ఇతర పనులకంటే భిన్నమైంది కాదు. ప్రతి ఉపాధ్యాయుడికి స్నాతకోత్తర స్థాయి విద్యార్థులుండటం అవసరం. ఉపాధ్యాయుడు స్వయంగా మౌలిక మైన పనిచేసుకొంటూ ఉండాలి. భౌతికమైన సహాయం విద్యార్థుల నుండి పొందాలి. వారిలో నమ్మకం ఉత్సాహం వారిని తాజాగానూ, శక్తివంతులుగానూ ఉంచుతాయి. అటువంటి ఉపాధ్యాయునికి ఒంటరితనపు నిరుత్సాహం, పనిలో మందకొడితనం

ఉండవు. అప్పుడు విశ్వవిద్యాలయ ఆచార్యులను మించిన ఉన్నత తరగతి ఉపాధ్యాయులుండరు. లేకుంటే విశ్వవిద్యాలయ పరిస్థితే అధమంగా మారిపోతుంది. మరొక విషయమేమిటంటే ఉన్నత పదవిలోని విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుడు సాధారణంగా ప్రయోగశాలల్లో, సదస్సుల్లో తన పద్ధతుల ప్రకారం శిక్షణ ఇచ్చిన విద్యార్థులను స్నాతకోత్తర స్థాయిలో కూడా విద్యార్థులుగా పొందాలనుకుంటాడు. నిజానికి ఈ ఉపాధ్యాయుడిచ్చే అవకాశం ఇతర విశ్వవిద్యాలయాల నుండి వచ్చేవారికి, విశ్వ విద్యాలయాలతో సంబంధం లేకుండా వచ్చేవారికి ఇంకా చెప్పాలంటే లండన్ విశ్వవిద్యాలయంలో ఇతర ఉపాధ్యాయుల దగ్గర శిక్షణ పొంది వచ్చే వారికీ కూడా ఉంటుంది. ఒక ఉపాధ్యాయుని దగ్గర శిక్షణ పొందిన విద్యార్థులను మరొక ఉపాధ్యాయుడు చేర్చుకొనే అవకాశం ఉండాలి. దీనివల్ల విద్యార్థులు ఒకే సబ్జక్టును అనేకమంది ఉపాధ్యాయుల దగ్గర చదివి లాభపడతారు. ఉన్నతమైన బోధన పరిశోధన పనులలో ఆటంకం కలిగించినా, లేక జ్ఞానాన్ని విస్తృత పరచి మంచి విద్యార్థులను గ్రహించక పోయినా విశ్వవిద్యాలయ ఆచార్య పీఠాలకు మంచి వ్యక్తులను సంపాదించడం సాధ్యంకాదు."

71. "స్నాతకోత్తర స్థాయి విద్యార్థులను వేరుచేసి వేరే సంస్థలకు పంపినపుడు కూడా విశ్వవిద్యాలయంలోని స్నాతకస్థాయి విద్యార్థులకు పెద్ద నష్టం జరుగుతుంది. స్నాతకస్థాయి విద్యార్థులకు వారి కంటె ఎక్కువ పాఠ్యప్రణాళిక గలవారితో సంబంధం తప్పనిసరిగా ఉండాలి. స్నాతకోత్తర స్థాయి విద్యార్థులు వారికి అందుబాటులో ఉంటూ తమ సాధనతో వారిని ఉత్తేజ పరుస్తూ ప్రోత్సహిస్తూ ఉండాలి."

బోధనను ఉన్నత పరిశోధన నుండి వేరు చేయడం వల్ల కలిగిన దుష్ప్రయోజనాలు నన్ను మాత్రం చాల కలవరపరుస్తున్నాయి. లండన్ విశ్వవిద్యాలయం నుండి ఇతర విశ్వ విద్యాలయాల నుండి స్నాతకోత్తర డిగ్రీలతో తిరిగి వచ్చిన భారతీయ విద్యార్థులలో కొందరు విద్యాశాఖలో ఉన్నత పదవులు పొందినప్పటికీ, వారి సబ్జక్టులలో సంపూర్ణత్వం పొందలేకపోవడం నగ్నసత్యం. ఉన్నత పరిశోధనను చేపట్టడానికి, కావలసిన శిక్షణను వారు స్నాతక స్థాయిలో పొందక పోవడమే దీనికి నిజమైన కారణం. పుట్టుక రీత్యా సిద్ధాంతరీత్యా స్నాతకోత్తర విద్య అనేది చాలా ఆధునికమైనదని విద్యామండలి గుర్తుంచుకుంటుంది. కేంబ్రిడ్జి, ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయాలలో స్నాతకోత్తర స్థాయి శాఖలు లేనప్పటికీ అక్కడ గణనీయమైన కృషి చేసిన వాళ్ళున్నారు. ఇప్పుడు కూడా ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి, లండన్ విశ్వవిద్యాలయాలలో స్నాతకోత్తర శాఖల అధిపతులుగా ఉన్నవాళ్ళు స్నాతకస్థాయి డిగ్రీ కలిగిన వాళ్ళే. అయితేనేమి? స్నాతకోత్తర స్థాయి పరిశోధనను సమర్థవంతంగా నిర్వహిస్తూ వారు ప్రపంచంలోని అన్ని ప్రాంతాల విద్యార్థులను ఆకర్షిస్తున్నారు. స్నాతకస్థాయిలో వారు పొందిన ఉన్నత ప్రమాణాలు గలిగిన శిక్షణే దీనికి కారణం. అందువల్ల స్నాతకోత్తర స్థాయి అధ్యయనాన్ని నిర్మాణాత్మకంగా వృద్ధిచేసే స్నాతకస్థాయి విద్యార్థుల కిచ్చే శిక్షణను విశ్వవిద్యాలయం తప్పనిసరిగా చేపట్టాలని నేను గట్టిగా అభిప్రాయ పడుతున్నాను.

**2.** రెండవ విషయం : విశ్వవిద్యాలయం తన ప్రధాన బాధ్యతగా అధ్యాపకులు స్నాతకోత్తర

స్థాయి బోధనను చేపట్టాలని ఒక వేళ నిర్ణయిం తీసుకొంటే అది పెద్ద సంస్కరణ అయినప్పటికి విశ్వవిద్యాలయ అధ్యాపకులలో సంతోషాన్ని దూరం చేయడమే కాకుండా కళాశాలల అధ్యాపకులను కూడా వ్యతిరేకులను చేస్తుంది. కళాశాలల అధ్యాపకులు తమ హోదాను కారణ రహితంగా తగ్గించినట్లుగాను కళాశాలలు ఎప్పటికి అధమస్థాయి పనులు చేసేవిగాను మార్చబడినట్లుగా భావిస్తారు.

3. మూడవ విషయం : స్నాతకోత్తర స్థాయి బోధనకే ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పితే, దానికి సంబంధించిన వనరులన్నీ పూర్తిగా వృధా అయినట్లే. కళాశాలల వనరులను సక్రమంగా వినియోగించడం ద్వారా, ఈ వృధాను అరికట్టవచ్చు. మన విశ్వవిద్యాలయ విద్యా విధానంలో కళాశాలలే బోధన కేంద్రాలు. ఆ కళాశాలలు ఇప్పుడు వేర్వేరు సంస్థల ఆస్తులుగా ఉన్నాయి. ప్రతి కళాశాల నిర్వహణ ఒక్కొక్క పాలక సంస్థ స్వాధీనంలో ఉంది. కళాశాల ఆదాయం దాని నిధిలో జమ అవుతుంది. అవసరమైన ఖర్చు పోను మిగిలిన ధనం ఈ నిధిని పెంచుతుంది. ఒక కళాశాలలో బోధించే సబ్జక్టులే ఇతర కళాశాలల్లో కూడా బోధింపబడతాయి. ఒక చిన్న విశ్వవిద్యాలయంగా రూపొందిన ప్రతి కళాశాల అన్ని సబ్జక్టులను బోధించడానికి కావలసిన అర్హులైన అధ్యాపకులను నియమించుకోవడమేగాక వాటికంటూ ప్రత్యేక గ్రంథాలయా లను, ప్రయోగ శాలలను సమకూర్చుకుంటాయి. ఈ కళాశాలలు పేరుకు మాత్రమే స్వాధికారిక సంస్థలు. వీటిలో ఏ కళాశాల కావలసినంత మంది ఉత్తమ ఉపాధ్యాయులను నియమించు కోవడానికి, కావలసిన గ్రంథాలయాలు, ప్రయోగ శాలల వంటి వాటిని సమకూర్చుకోవడానికి కావలసినన్ని వనరులున్న సంస్థలు కావు. చాలినన్ని ఆర్థిక వనరులు లేకపోవడం వల్ల కళాశాల అధ్యాపకులు మితి మీరిన భారాన్ని మోయవలసి వస్తున్నది. అనేక సబ్జక్టులను బోధించవలసి ఉండటం చేత కళాశాల ఆచార్యునికి ఒకే విషయాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేయడం అసాధ్యమవుతున్నది. ఈ పరిస్థితులలో ఒక పెద్ద సబ్జక్టుకు సంబంధించిన ప్రత్యేక విభాగంలో కూడా నిష్ణాతుడు కావడానికి అతనికి ప్రోత్సాహంగాని, అవకాశంగాని కలగడం లేదు. అనివార్యమైన వ్యయం సమృద్ధి ప్రాతిపదికగా గల స్వాధికారిక పద్ధతి ఫలితంగా మనకు అక్కడక్కడ అధమ స్థాయి బోధకులు, గ్రంథాలయాలు, ప్రయోగశాలలు కనిపిస్తాయి. వివిధ కళాశాలలకు ఆర్థిక వనరులు తగినన్ని లేనపుడు అవి బొంబాయి విశ్వవిద్యాలయ స్నాతక, స్నాతకోత్తర స్థాయి బోధనను సరిగా నిర్వహించలేవు. బొంబాయి నగరంలో ఉన్న కళాశాలలు ఆర్థిక శాస్త్ర బోధనకు గల ఆర్థిక వనరులను ఉదాహరణగా తీసికోవచ్చు.

బొంబాయి విశ్వవిద్యాలయానికి సంబంధించిన బి.ఏ., కోర్సుకు ఆర్థిక శాస్త్రంలో శిక్షణ ఇచ్చే క్రింద కళాశాలలు బొంబాయి నగరంలో ఉన్నాయి.

1. ఎల్ఫిన్‌స్టోన్ కళాశాల ; 2. విల్సన్ కళాశాల; 3. సెయింట్ క్జేవియర్ కళాశాల 4. సిడెన్‌హామ్ కళాశాల. ఆర్థికశాస్త్ర బోధకులు ఎల్ఫిన్ స్టోన్ కళాశాలలో ఇద్దరు, విల్సన్ కళాశాలలో ఇద్దరు, సెయింట్ క్జేవియర్ కళాశాలలో ఇద్దరు, సిడెన్ హామ్ కళాశాలలో సుమారు ఆరుగురు ఉన్నారు. వీరితో పాటు బొంబాయి నగరంలో ఆర్థిక శాస్త్ర బోధనలో నిమగ్నమైనవారు సుమారు పన్నెండు మంది ఉన్నారు.

నాకు తెలిసి ప్రపంచంలోని ఏ విశ్వవిద్యాలయంలోను ఒక సబ్జక్టును బోధించడానికి ఇంత మంది లేరు. అయినప్పటికి ఒక మంచి వ్యవస్థ లేకపోవడం వల్ల ఈ ఆచార్యుల నైపుణ్యం వృధా అవుతున్నది. ఈ వృధాను అరికట్టడానికి విశ్వవిద్యాలయం వీరితో పాటు అదనంగా మరో ఇద్దరు ఆచార్యులను నియమించి పరిస్థితిని మరింత బలహీనం చేసింది. ఈ కళాశాలల బోధన గ్రంధాలయ వనరులను ఒక చోట చేరిస్తే ఒక ప్రత్యేక తరహా బోధనను సమకూర్చడమే కాక, స్నాతక స్నాతకోత్తర స్థాయికి సరిపోయే బోధనను కూడా అందించవచ్చు. ఈ విషయం దృష్ట్యా విశ్వవిద్యాలయంలోని రెండు ఆర్థిక శాస్త్ర బోధన పదవులలో విశ్వవిద్యాలయ వనరుల దుబారా స్పష్టంగా తెలుస్తుంది. ఈ దుబారాను తగ్గించాలంటే ఒక పనిచేయాలి. కళాశాలలలో, విశ్వవిద్యాలయంలో ఉన్న పన్నెండు మంది ఆర్థిక శాస్త్ర బోధకులు కలిసి తమలో తాము బోధన పనిని పంచుకోవాలి. అన్ని కళాశాలలలో చేరిన విద్యార్థులకు విశ్వవిద్యాలయం నిర్ణయించిన ఆర్థిక శాస్త్ర పాఠ్య ప్రణాళికను బోధించడానికి ఒప్పుకోవాలి. బొంబాయి నగరంలోని కళాశాలల్లో ఇతర సబ్జక్టుల బోధనను కూడా ఇదే రకంగా నిర్వహించవచ్చు. ఈ పద్ధతిలో ఒకే ఒక చిక్కు ఉంది. విద్యార్థులు తరగతులకు హాజరు కావటానికి ఒక కళాశాల నుండి మరొక కళాశాలకు పరిగెత్తుతుండాలి. ఈ చిక్కు లెక్కింపదగింది కాదు. ఈ విషయంలో నేను చెప్పేదేమిటంటే రాజకీయ శాస్త్రానికి సంబంధించిన పాఠాలను సిడెన్‌హామ్ కళాశాలలో బోధించవచ్చు. అలాగే తత్వశాస్త్రం మనస్తత్వ శాస్త్రాలకు సంబంధించిన పాఠాలను విల్సన్ కళాశాలలోను, భాషా సాహిత్యాలకు సంబంధించిన వాటిని ఎల్ఫిన్ స్టోన్ కళాశాలలోను నిర్వహించవచ్చు. ఈ పద్ధతి వల్ల విద్యార్థులు తరచుగా వేరు వేరు కళాశాలలకు పరుగెత్తే అవసరాన్ని పూర్తిగా తగ్గించవచ్చు. ఒక ప్రత్యేక సబ్జక్టును బోధించే కళాశాలలు ఆ సబ్జక్టులకు వేదికలుగా రూపొందవచ్చు. అన్ని కళాశాలల్లోను బోధించే ఇతర విషయాలకు ఉమ్మడిగా ఒక్కొక్క కళాశాలలో కొన్ని గదులను కేటాయించవచ్చు. ఆ కళాశాలలో గల గ్రంధాలయంలో ఆయా సబ్జక్టులకు సంబంధించిన గ్రంధాలతో ప్రత్యేక విభాగాలు ఏర్పాటు చేయవచ్చు.

విశ్వవిద్యాలయం ఒక కేంద్రీకృత సంస్థగా ఉండటానికి నేను ఒప్పుకొంటాను. ఒక వేళ ఒక కొత్త విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేసే ఉద్దేశ్యం ఉంటే అందులో అనుబంధ కళాశాలల పద్ధతి ఉండకూడదు. ఈ పద్ధతిలో విశ్వవిద్యాలయ విద్యా ప్రమాణాన్ని గాని, కళాశాలల స్వాతంత్ర్యాన్ని గాని నేను పోగొట్టడం లేదు. సంక్షిప్తంగా చెప్పాలంటే ఈ స్థితి ఒక రకంగా ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల స్థితిని పోలి ఉంటుంది. అక్కడ విశ్వవిద్యాలయమే కళాశాలలు. కొన్ని కళాశాలలు కలిసి విశ్వవిద్యాలయమవుతుంది. ఈ పద్ధతి ఇప్పటి కళాశాలల నిర్వహణను మెరుగు పరచి, వృధాను అరికడుతుంది.

**ప్రశ్న – 25.** విశ్వవిద్యాలయ విద్య నిర్వహణకు సంబంధించిన నా పథకం ఒకచోట దగ్గర దగ్గరగాఉన్న విద్యా కేంద్రాలకు మాత్రమే వర్తింపచేయడం సాధ్యంపడుతుంది. ఈ పద్ధతిని విరివిగా ఉపయోగించుకోవాలంటే కళాశాలలు దగ్గర దగ్గరగా నిర్మించబడేటట్లు చూడాలి. చిన్న చిన్న లేక

అభివృద్ధి పథంలోలేని పట్టణాల్లో ఔత్సాహిక విద్యా వంతులు సొంత కళాశాలలను స్థాపించ బూనినపుడు నిరోధించవలసిన అవసరముంది. వేరువేరుగా అక్కడక్కడ స్థాపించబడిన కళాశాలల్లో జరిగే దుబారా గురించి ఆలోచించినపుడు ఆశ్చర్యం కలుగుతుంది. ఇతర కళాశాలల పెరుగుదల బెంగాల్‌లో వలె ఎక్కువ గా లేకపోవడం బొంబాయి ప్రెసిడెన్సీకి ఉన్న అదృష్టంగా భావిస్తున్నాను. అయినా విశ్వవిద్యాలయ విద్యా ప్రమాణాలను సక్రమంగా నిర్వహించాలంటే, ఒక పద్ధతి ప్రకారం కాకుండా ఎక్కడ బడితే అక్కడ స్థాపించే కళాశాలలను అదుపు చేయడానికి జాగ్రత్తలు తీసుకోవాలి. ఈ ప్రయోజనాన్ని సాధించడానికి ఈ ప్రెసిడెన్సీలో విశ్వవిద్యాలయ విద్యా కేంద్రాలను నేను సూచించవలసి ఉంది. సూచించబోయే ఈ కేంద్రాలలో తప్ప మరెక్కడా కళాశాలలను స్థాపించడానికి అనుమతించకూడదు. నా అభిప్రాయం ప్రకారం ఈ క్రింది ప్రదేశాలు విశ్వవిద్యాలయ విద్యకు సంబంధించిన నిజమైన కేంద్రాలుగా గుర్తించవలసి ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1. | బొంబాయి | 2. | పూనా |
| 3. | అహమ్మదాబాదు | 4. | సూరత్ (పొటెన్షియల్) |
| 5. | కరాచి | 6. | హైదరాబాదు (పొటెన్షియల్) |
| 7. | ధార్వార్ (పొటెన్షియల్) | 8. | సాంగ్లి (పొటెన్షియల్) |
| 9. | నాసిక్ (పొటెన్షియల్) | 10. | అమల్‌నర్ (పొటెన్షియల్) |

విశ్వవిద్యాలయ కేంద్రాలను నిర్ణయించుకొన్న తరువాత ఆయా కేంద్రాలలో బోధనను నిర్వహించడం మరొక పని. పైన చూపిన విశ్వవిద్యాలయ కేంద్రాలలోని ఎక్కువ కేంద్రాలలో సామాజిక శాస్త్రాలకు సంబంధించిన విద్యను మాత్రమే అందజేస్తున్న ఒకే ఒక కళాశాల ఉంది. అతి సమీప ప్రాంతంలో ఉన్న కళాశాలల సముదాయం, బొంబాయి పూనాలలో మాత్రం ఉన్నాయి. ఈ రెండు కేంద్రాలలోని అధ్యాపకులను వివిధ శాఖలలోకి అటూఇటూ మార్చుకొంటూ ఇక్కడి విశ్వవిద్యాలయ బోధన సమస్యను సులభంగా పరిష్కరించవచ్చు. ఒక కేంద్రంలో ఒకే కళాశాల ఉన్నపుడు అటువంటి కేంద్రాలలో విశ్వవిద్యాలయ విద్యా బోధన సమస్యను రెండు రకాలుగా పరిష్కరించవచ్చు.

1. ఒక ప్రత్యేక సబ్జెక్టును బోధించడానికి ఒక కేంద్రంలోని కళాశాలకు అతిదగ్గరలో కొత్త కళాశాల నిర్మించడానికి అనుమతించడం లేదా

2. ఉన్న కళాశాలను విశ్వవిద్యాలయంగా గుర్తించి అధ్యయనానికి సంబంధించిన కొత్త శాఖలను ప్రారంభించడానికి అనుమతించడం.

మొదటి పద్ధతి ద్వారా విజయం సాధించడం సులభం. సమర్ధత లేక, నైపుణ్యం దృష్టితో చూస్తే రెండవ పద్ధతి మంచిది. ఈ పద్ధతి ననుసరించి ప్రెసిడెన్సీలోని భిన్న ప్రాంతాల విద్యా

వసరాలను తీర్చడానికి ప్రెసిడెన్సీలోని పలు ప్రాంతాలలో అక్కడక్కడ కళాశాలలను నెలకొల్పడానికి బదులు ప్రెసిడెన్సీలోని ఇతర ప్రాంతాలలో వేరువేరు విశ్వవిద్యాలయాలను నెలకొల్పుకోగలగడం మంచిది. దీనివల్ల మనం 'కేంద్రీకృత విశ్వవిద్యాలయం' అనే ఆదర్శాన్ని సాధించ లేకపోవచ్చు. ఒక పట్టణంలో విశ్వవిద్యాలయం స్థాపించి దానికి దగ్గర దగ్గరగా కళాశాలలను నిర్మించి దానికి అనుబంధం చేయడం ద్వారా కూడా మంచి ఫలితాన్ని సాధించవచ్చు. అతి సమీపంలో చుట్టు ప్రక్కల గల కళాశాలల ఉమ్మడి సహకారంతో విశ్వవిద్యాలయాన్ని చైతన్య పూరితం చేయవచ్చు.

**ప్రశ్న 28.** బొంబాయి, పూనా వెంటనే విశ్వవిద్యాలయాలుగా విస్తరించడానికి తగిన కేంద్రాలు. కాబట్టి అవి వెంటనే వేర్వేరు విశ్వవిద్యాలయాలుగా మార్చబడాలని నా సలహా. అహమ్మదాబాదు సమీప భవిష్యత్తులో విశ్వవిద్యాలయ విస్తరణకు తగిన ప్రాంతమవుతుంది. ఇక్కడ ఇప్పటికే ఒక ఆర్ట్సు కళాశాల ఒక సైన్స్ కళాశాల ఉన్నాయి. కాబట్టి ఇది విశ్వవిద్యాలయంగా మార్చబడవచ్చు. పైన సూచించిన కేంద్రాలలో విశ్వవిద్యాలయాల స్థాపన విషయాన్ని అటుంచితే బొంబాయి, పూనా, అహమ్మదాబాదు విశ్వవిద్యాలయాలు లండన్ విశ్వవిద్యాలయం లాగా విశ్వవిద్యాలయ పరీక్షలకు హాజరయ్యే ఇతర కళాశాలల విద్యార్థులకు డిగ్రీలు ప్రదానం చేసే పనిని చేపట్టవచ్చు.

ఈ ప్రెసిడెన్సీలో భవిష్యత్తులో విశ్వవిద్యాలయాలు స్థాపించబడి అవి కేంద్రీకృత సంస్థలుగా రూపు దిద్దుకొంటే ఈ ప్రశ్నలలో కనిపించే సమస్యలే సమస్యలు కావు. ఎందుకంటే అప్పుడు విశ్వవిద్యాలయం తన సిబ్బందిపైన బోధన ఏర్పాట్లపైన పూర్తి అదుపును కలిగి ఉంటుంది. అయితే భవిష్యత్తులో రాబోయే విశ్వవిద్యాలయాలు నిర్వహణా స్వాతంత్ర్యం కలిగిన కళాశాలల సముదాయంగా నేను ఊహిస్తాను. ఏమైనప్పటికి బొంబాయి, పూనాలలోని కొత్త విశ్వవిద్యాలయాలైనా ఈ రకంగా ఉండాలి.

కళాశాలల సముదాయ పద్ధతిలో విశ్వవిద్యాలయ విద్యను అందించడానికి కళాశాలలు దగ్గర దగ్గరగా ఉన్నపుడు అందరి కళాశాలల బోధన వనరులు వృథా కావడాన్ని ఆపుతుంది. అయితే ఈ ఏర్పాట్లు విశ్వవిద్యాలయ ఉన్నతస్థాయి విద్యా ప్రమాణాలను నిలబెట్ట గలుగుతాయా? అది విద్యను బోధించే ఉపాధ్యాయులపైన ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతం ఉపాధ్యాయులు కళాశాలలకు అనుబంధంగా ఉన్నారు. కళాశాలల యాజమాన్యాలు వారి వేతనాన్ని, హోదాని క్రమబద్ధం చేస్తున్నాయి. అయితే కళాశాలలు ఉపాధ్యాయులను నియమిస్తూ వారి తరగతులను, పదవీ కాలాన్ని, వేతనాన్ని, పదోన్నతిని క్రమబద్ధం చేస్తూ అర్హతలు గలిగిన మంచి ఉపాధ్యాయులను తయారుచేసినట్లు కనపడదు. ప్రభుత్వ విద్యా వ్యాసంగం పూర్తిగా మూడు తరగతుల విద్యా సర్వీసులకు అప్పగించబడింది. ఈ మూడు సర్వీసులలో పరిపాలక, తనిఖీ అధికారులు, ప్రభుత్వ పాఠశాలలు లేక, కళాశాలల్లోని ఉపాధ్యాయులు ఉన్నారు. అన్ని రకాల ఉద్యోగాలలో పదోన్నతికి సంబంధించిన సిద్ధాంతం ఒక పవిత్రమైన ఆచారంగా స్థిరపడి ఉంది. దీని ప్రకారం పదోన్నతికి ఉద్యోగ కాలాన్ని బట్టి ఉంటుంది. విశ్వవిద్యాలయ విద్యకు సంబంధించి ఈ పద్ధతిలోని ప్రధాన లోపమేమిటంటే ఉపాధ్యాయులకిచ్చే

బహుమతులు వారి పాండిత్యం మీద ఆధారపడక వారి ఉద్యోగ కాలం మీద ఆధారపడి ఉండటం. ప్రభుత్వ సర్వీసు ఉద్యోగుల వలె ఉద్యోగ బదిలీలను ఎదుర్కొనే కళాశాలల అధ్యాపకులు పదవుల యెడ వారి భక్తిని విధేయతను కోరేది కళాశాలలు కాదని, వారి సేవే నని అనుకుంటారు. వారి పేర్లను ఉపయోగించుకొని విద్యా కేంద్రాన్ని ఏర్పాటు చేయడం జరుగుతున్నది. కాని పదోన్నతిలోగల ఉద్దేశం నెరవేరడం లేదు.

ఐ.ఇ.యస్., పి.ఇ.యస్. ల మధ్య చూడబడే ద్వేషపూరితమైన తేడా ఈ పద్ధతిలో కనిపించే మరొక బలహీనత. ఈ తేడా ఐ.ఇ.యస్.కు చెందిన చాలా కింది (జూనియర్) ఉద్యోగులు కూడా తాము పి.ఇ.యస్.కు చెందిన వారి కంటె ఉత్తమ శ్రేణికి చెందిన పెద్ద ఉద్యోగులమని భావిస్తారు. ఏ విద్యా సంస్థలోనైనా ఉద్యోగులు పరస్పర సహకారంతో తమ మేధా జీవితాన్ని పదును పెట్టుకోవలసి ఉంటుంది. అయితే ఇటువంటి భేదం అందుకు పెద్ద ఆటంకంగా ఉంటుంది. చివరి విషయమైనా సత్యమేమిటంటే ప్రస్తుత పరిస్థితులలో ప్రభుత్వ కళాశాలల్లోని ఆచార్యులు తాము ప్రభుత్వ ఉద్యోగులమని భావించి ప్రభుత్వానికి విధేయులుగా ఉండాలన్న ఉద్దేశంతో ప్రవర్తించి విద్యార్థుల విశ్వాసాన్ని పొందలేక పోయారు. విద్యార్థులు ఆచార్యులను విజ్ఞాన నేతలుగా భావించక ప్రభుత్వ ప్రతినిధులుగా భావిస్తున్నారు. అలాగే ఆచార్యులు కూడ విద్యార్థులలో అభిరుచిని కలిగించి వారి విశ్వాసాన్ని పొందలేకపోతున్నారు. క్రైస్తవ మిషనరీలు నిర్వహించే కళాశాలల్లోని ఉపాధ్యాయులలో ఎక్కువ మంది ఐరోపా క్రైస్తవ మిషనరీలకు చెందినవారే. మిగిలిన వారు భారతీయులు. పైకి కనిపించేటంత వైషమ్యాలు లేనప్పటికి ఈ కళాశాలల్లో కూడా ఐ.ఇ.యస్., పి.ఇ.యస్ లకు గల భేదం కొంత వరకు కనిపిస్తుంది. 'దక్కను విద్యా సంఘం' వంటి సంస్థలు నిర్వహించే ప్రభుత్వేతర కళాశాలల్లో ఉపాధ్యాయులంతా ఒకే రకంగా కలసి మెలసి విభేదాలకు తావు లేకుండా ఉంటారు. ఈ సంస్థలలో సభ్యులుగా ఉంటూ సంస్థ పాలన కింద ఉండే ఇటువంటి కళాశాలల్లో ఉపాధ్యాయులుగా నియమింపబడతారు. అది ఆ కళాశాలల పద్ధతి. ఇటువంటి స్వకీయమైన కళాశాలలు సాధించే ప్రగతిని గురించి ఖచ్చితంగా నేనేమీ చెప్పలేను కాని అవి ప్రభుత్వ అధమ స్థాయి కళాశాలల కంటె కూడా తక్కువ స్థాయి లోనే ఉంటాయి. అవి కొంతవరకైనా ప్రగతి సాధకులను ఆకర్షించలేక పోతున్నాయి. అయితే అధ్యాపక పదవులలో ఏర్పడిన ఖాళీలను భర్తీ చేయడానికి మంచి వ్యక్తులను పొందలేకపోవడం స్వకీయ కళాశాలల్లోనే గాదు, ప్రభుత్వ కళాశాలల్లోనూ ఉంది. మంచి సౌకర్యాలు ఉన్న ప్రభుత్వ కళాశాలలుకూడా మంచి వ్యక్తులను ఉపాధ్యాయులుగా పొందడం అరుదుగా జరుగుతోంది. ఉపాధ్యాయులను న్యాయసమ్మతమైన పద్ధతిలో ఎంపిక చేసే యంత్రాంగం లేకపోవడమే దీనికి కారణం. ప్రభుత్వ కళాశాలల విషయంలో ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరు గాని లేక ప్రభుత్వ కార్యదర్శి గాని ఈ ఎంపికను నిర్వహిస్తారు. నిజానికి వీళ్ళిద్దరు కూడా ఈ ఎంపికను నిర్వహించడానికి కళాశాలలు అధిపతుల చేతులలో ఉంటాయి. వీరు కూడా ఎంపికను సరిగా నిర్వహించడానికి అనర్హులే. ఒక వ్యక్తి యోగ్యతను మదింపు చేసే వ్యక్తి గూడా ఆ వ్యక్తి అధ్యయన

విషయాలకు సంబంధించిన వాడుగా ఉండక పోవడం వల్ల ఎంపికలో ఇటువంటి లోపాలుంటాయి. అర్థ శాస్త్ర వేత్తను మదింపు చేయడానికి అర్థిక శాస్త్ర వేత్తే కావాలి.

ఇటువంటి కష్టాలను లోపాలను ప్రక్కన బెట్టినప్పటికి వివిధ కళాశాలలకు ఉపాధ్యాయులను ఎంపిక చేసుకొనే మరొక సుసాధ్యమైన పద్ధతి లేదు. విశ్వవిద్యాలయ అవసరాల మేరకు ఉపాధ్యాయులను వివిధ రకాలుగా విభజించడానికి కూడా సుసాధ్యమైన పద్ధతి లేదు. ఒక అధ్యయన విషయానికి సంబంధించిన ఆచార్యులను అరడజను మందిని నియమించడం, అంతగా ప్రాముఖ్యం కలిగిన మరొక అధ్యయన విషయానికి సంబంధించి ఒకరిని కూడా నియమించకపోవడం కాకుండా, విశ్వవిద్యాలయంలో ప్రాధాన్యతగల అన్ని అధ్యయన శాఖలలోను ఆచార్యులు ఉండేటట్లు చూడాలి. విశ్వవిద్యాలయ నిర్వహణ ఈ రకంగా సాగడం లేదు. అధ్యాపకుల ఎంపికలో ఎదురయ్యే సమస్యలను నిర్మూలించాలంటే విశ్వవిద్యాలయ అధ్యాపక నియామకాలను విశ్వవిద్యాలయ విద్యామండలికి అప్పగించాలి. (కొత్త విశ్వవిద్యాలయ నిబంధనలను చూడండి) లేదా అధ్యాపక నియామకాలలో విశ్వవిద్యాలయానికి ఐచ్ఛికమైన అధికారముండాలి.

అందువల్ల కళాశాలల్లో బోధనాశాఖను పరిపాలన శాఖ నుండి విడదీసి విశ్వవిద్యాలయ ఆధీనంలో ఉంచాలని నేను ప్రతిపాదిస్తున్నాను. మరొక రకంగా చెప్పాలంటే వివిధ కళాశాలల్లోని ఉపాధ్యాయ పదవులు కొన్ని సంస్థలచే పోషింపబడే పీఠాలుగా మార్చబడాలి. స్వకీయ, ప్రభుత్వ కళాశాలల్లో కూడా అధ్యాపక పదవులు ఈ రకంగానే ఉండాలి. అయితే ఈ పీఠాలకు జరిగే నియామకాల విషయంలోవిశ్వవిద్యాలయం అధికారం కలిగి ఉండాలి.

బోధన సిబ్బంది నియామకం విషయంలో విశ్వవిద్యాలయానికి అధికారముండాలని, ఇది ముఖ్యమని నా అభిప్రాయం. సంకుచితమైన పరీక్షాధికారంతో బొంబాయి విశ్వవిద్యాలయం ఇప్పటివరకు విశ్వవిద్యాలయ విద్యా ప్రమాణాన్ని నిలబెట్టే ప్రయత్నం చేసింది. దీని ఫలితంగా క్రమంగా 'గ్రాడ్యుయేట్ల' సామర్థ్యం తగ్గిపోతూ ఉంది. సైద్ధాంతికంగా దీనికి కారణం విశ్వవిద్యాలయ యాజమాన్యం అవలంబించే దోషపూరితమైన పద్ధతియే. విశ్వవిద్యాలయ విద్యాప్రమాణాల్ని నిలబెట్టాలంటే విశ్వవిద్యాలయ అధ్యయనానికి పనికిరాని విద్యార్థులను తప్పని సరిగా పరిహరించాలి. అర్హతలు కలిగిన ఉపాధ్యాయులను, అన్ని హంగులతో అమరిన అధ్యయన శాఖలను కలిగి ఉండాలి. ఈ విషయాలను విశ్వవిద్యాలయ యాజమాన్యం సరిగా గుర్తించడం లేదు. మరొక రకంగా చెప్పాలంటే వారు ఉపాధ్యాయుల, విద్యార్థుల విద్యా ప్రమాణాలను మెరుగు పరిచే ప్రయత్నం చేయకుండా విశ్వవిద్యాలయ డిగ్రీల ప్రమాణాన్ని నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఈ సంఘటనలన్నీ బొంబాయి విశ్వవిద్యాలయాన్ని బోధన విశ్వవిద్యాలయంగా మార్చడానికి దోహద పడుతున్నాయి. ఈ సమయంలో గుర్తించవలసిన విషయమొకటుంది. "డిగ్రీలు ఇవ్వడంలో తీసికొనే శ్రద్ధ కంటే బోధనను పటిష్టం చేయడంలో తీసుకోవలసిన శ్రద్ధ ఎక్కువగా ఉండాలి". విశ్వవిద్యాలయ విద్యావిషయాలు అంటే బోధన మరియు పరీక్షల నిర్వహణను ఎలాంటి అదుపు విధించకుండా,

అందులో నిమగ్నమైన వారి విచక్షణకు వదల కుంటే ఒక విశ్వవిద్యాలయం ఒక బోధన విశ్వవిద్యాలయం కాలేదు. శక్తి చాలని ఉపాధ్యాయుల మీద ఎక్కువ బాధ్యతను మోపడం వల్ల విశ్వవిద్యాలయ డిగ్రీ ప్రమాణం పడి పోతుంది. అందువల్ల కళాశాలల పరిస్థితిని పరీక్షించే హక్కు విశ్వవిద్యాలయానికి ఉండాలని ప్రతిపాదిస్తాను. కళాశాలలకు ప్రభుత్వమిచ్చే అన్ని రకాల విరాళాలను విశ్వవిద్యాలయం ద్వారా బట్వాడా చేయవలసి ఉంది. అపుడు ఉపాధ్యాయుల నియామకాలలోను, గ్రంధాలయాలకు, ప్రయోగశాలలకు పరికారలను సమకూర్చడంలోను విశ్వవిద్యాలయానికి పరిశీలించే అవకాశ ముంటుంది.

**ప్రశ్నలు 36–39.** ఒక విశ్వవిద్యాలయం ఒక విద్యా సంస్థగా ఒక సంఘ విద్యావసరాలు తీర్చా లంటే దాని రాజ్యాంగం ఈ కింది విషయాలకు అనుకూలంగా ఉండాలి(ఎ) అది సంఘానికి సంబంధించిన బహుముఖ అవసరాలను దృష్టిలో పెట్టుకోవాలి. (బి) అది విశ్వవిద్యాలయానికి అన్ని రకాల సలహాలిస్తూ అన్ని రకాల ఆదాయ వ్యయాలకు అవకాశాలనిస్తూ విద్యావిషయాలకు సంబంధించిన అధికారం బోధనా సిబ్బంది చేతుల్లో ఉన్నప్పుడే అది బోధన విశ్వవిద్యాలయం అవుతుంది. (సి) బోధనలో నిమగ్నమైన పండితులకు విశ్వవిద్యాలయం విద్యా విషయానికి సంబంధించిన అధికారికమైన సలహాలివ్వాలి.

ఒక విశ్వవిద్యాలయం తన అధ్యాపకుల ద్వారా బోధన పనిని నిర్వహించినంత మాత్రాన అది బోధన విశ్వవిద్యాలయం కాదని విశ్వవిద్యాలయ సంఘం గుర్తించాలి. ఇదొక్కటే బోధన విశ్వవిద్యాలయ లక్షణం కాదు. ఒక విశ్వవిద్యాలయం బోధనను చేపట్టవచ్చు. అయినా అది బోధనా విశ్వవిద్యాలయం కాక పోవచ్చు. ఒక విశ్వవిద్యాలయం బోధన విశ్వవిద్యాలయం కావడమన్నది బోధనలో నిమగ్నమైన పండితుల అధికారిక విద్యాబోధనపైన ఆధారపడదు. అది వాళ్ళ చేతులలో లేకపోతే అది బోధన విశ్వవిద్యాలయం కాలేదు. ఉపాధ్యాయుల విశ్వ విద్యాలయమే బోధన విశ్వవిద్యాలయం. బొంబాయి విశ్వవిద్యాలయాన్ని బోధన విశ్వ విద్యాలయంగా రూపొందించడంలో అవసరమైన నిర్మాణాత్మక సలహాలను పొందటానికి విశ్వవిద్యాలయ సంఘం తన ప్రశ్నలకు జవాబులను రాబడుతున్నందువల్ల నేను దానికి ఉపక్రమంగా ఈ అభిప్రాయాలు వెలిబుచ్చ వలసి వచ్చింది. ఇప్పుడు అమలులో ఉన్న బొంబాయి విశ్వవిద్యాలయ రాజ్యాంగ నిర్మాణం పైన నేను పేర్కొన్న మూడు విషయాలకు సంబంధించి ఎటువంటి అవగాహన కలిగి ఉన్నట్లు కనిపించదు. విశ్వవిద్యాలయ పాలక సంస్థ (సెనేటు) బొంబాయి నగర ప్రయోజనాన్ని కాపాడటానికి సరిగా ప్రాతిధ్యం వహించడం లేదు. ఒక పెద్ద విశ్వవిద్యాలయ కార్యనిర్వాహక సంఘం నిర్వర్తించవలసిన పనులను నిర్వహించడానికి అధికారుల సభ(సిండికేట్)కు బాధ్యతగాని, అధికారంగాని లేదు. అయినా తరచుగా అధికారుల సభ కార్యనిర్వాహక సంఘం మీద పెత్తనం చెలాయిస్తుంది.

బొంబాయి విశ్వవిద్యాలయాన్ని బోధనా విశ్వవిద్యాలయంగా రూపొందించే విషయంలో యిందు నేను బోధన శాఖల – నిర్మాణాల గురించి చర్చిస్తాను. దీని కోసం బొంబాయి నగరంలోని

కళాశాలల్లో నేను ముందు ప్రతిపాదించిన అంతర కళాశాలల బోధన పద్ధతిని అవలంబించవలసి ఉంటుంది. ఈ పద్ధతి ప్రకారం కళాశాలలోని వివిధ సబ్జెక్ట్‌లతో వివిధ శాఖలను ఏర్పాటు చేయాలి. ఆర్థికశాస్త్రం చరిత్ర, రాజనీతిశాస్త్రం సాహిత్యం, భాషలు, రసాయన శాస్త్రం, భౌతికశాస్త్రం మొదలైనవి. అటువంటి శాఖల విద్యార్థులు జీవితంలో పనికి వచ్చే వివిధ వృత్తులకు సంబంధించిన అధ్యయన విషయాలను విశ్వవిద్యాలయం నుండి గ్రహిస్తారనేది అంగీకరించవలసిన విషయం.

ఈ దశలో విజయం సాధించేందుకు విద్యార్థులకు అవసరమైన వివిధ శాస్త్రాలను క్రోడీకరించవలసిన అవసరముంది. ఈ రకమైన విభజన విద్యార్థులకేకాక ఉపాధ్యాయులకు కూడా అవసరమే ఎందుకంటే కొన్ని శాస్త్రాల మధ్య సన్నిహిత సంబంధం ఉండటమేగాక సారూప్యత కూడా ఉండడంవల్ల వాటిని అర్థంచేసికోవడం సులభమవుతుంది. ఉపాధ్యాయులలోనూ విద్యార్థులలోనూ ఉత్పన్నమవుతున్న ఈ అవసరాలు అన్ని కళాశాలల్లోను వివిధ శాఖలను వివిధ 'ఫ్యాకల్టీలు'గా మార్చే అవసరాన్ని కలిగిస్తున్నాయి. అందువల్ల బొంబాయిలో నెలకొల్పే కొత్త విశ్వవిద్యాలయంలో అధ్యయన శాఖలను 'ఫ్యాకల్టీలు'గా మార్చమని సూచిస్తున్నాను. 'ఫ్యాకల్టీలు' బోధన విశ్వవిద్యాలయ ఏర్పాటుకు పునాదిగా ఉండాలి. ఫ్యాకల్టీలో చేర్చబడిన అధ్యయన విషయాలకు సంబంధించిన ఆచార్యులు, ఉపాచార్యులు, అందరూ గాని లేక అవసరమైనంత మందిగాని అందులో ఉంటారు. విశ్వవిద్యాలయం నియమించిన ఇతర అధ్యాపకులను అధికారులను 'ఫ్యాకల్టీ' తనలో చేర్చుకోవచ్చు. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు ప్రతి ఫ్యాకల్టీలోను ఉద్యోగరీత్యా సభ్యుడుగా ఉంటాడు. ఫ్యాకల్టీకి నిబంధనలను రూపొందించే అధికారం ఉంటుంది.

1. బోర్డ్ ఆఫ్ స్టడీస్ పనులను ఇతర పనులను నిర్వర్తించడానికి, ఫ్యాకల్టీ లోని వారిని, ఇతరులను కలిపి కమిటీలుగా నియమించడం.

2. సాధారణంగా ఫ్యాకల్టీ పరిధికి లోబడి డిగ్రీలను, డిప్లమోలను ఇతర గుర్తింపులను ఇవ్వడానికి కావలసిన విషయాలను నిర్ణయించడం.

3. ఫ్యాకల్టీ పరిధికి లోబడి విశ్వవిద్యాలయ విద్యార్థులకు కోర్సులను నిర్ణయించడం.

4. ఫ్యాకల్టీ పరిధికి లోబడి కోర్సులకు సంబంధించిన బోధనా పద్ధతిని, పరీక్షా పద్ధతిని నిర్ణయించడం.

మరొక విషయం చెప్పవలసి ఉంది. పైన పేర్కొన్న అధికారాలన్నిటిని ఫ్యాకల్టీకి కలిగించినప్పు ఉపాధ్యాయులపైన సాధారణ పాఠ్య ప్రణాళికను బోధించే విషయంలోగాని, ఎక్స్‌టర్నల్ పరీక్షలను నిర్వహించే విషయంలోగాని ఆంక్షలు ఉండకూడదు. అయితే ఉపాధ్యాయులు కూడా వారిపై ఉంచిన విశ్వాసాన్ని వాళ్ళు తప్పక నిలుపుకోవలసి ఉంది.

ఫ్యాకల్టీలు విశ్వవిద్యాలయానికి చెందిన సంస్థలు. విశ్వవిద్యాలయ విద్యా విషయాలను చూడటానికి ఫ్యాకల్టీలను ఏర్పరచుకొన్నట్లే విశ్వవిద్యాలయ పరిపాలన పనిని చూడటానికి ఒక

కేంద్రీయ పరిపాలన సంస్థను రూపొందించుకోవాలి. ఈ పరిపాలన సంస్థ ఇపుడున్న పాలక సంస్థ (సెనేటు) వలె ఉన్నప్పటికి నిర్మాణంలోను, పని తీరులోను పూర్తి భిన్నంగా ఉండాలి. నా అభిప్రాయం ప్రకారం విశ్వవిద్యాలయ అత్యున్నత పాలక సంస్థయైన 'సెనేటు' బోధనేతర వృత్తుల వారితోను, పట్టభద్రుల సెనెట్‌ల ఉపాధ్యాయుల ప్రతినిధులతోను కూడిన పెద్ద సభగా ఉండాలి. ఈరకంగా నిర్మితమైన పరిపాలనా సంస్థల వల్ల ప్రయోజనాలు స్పష్టమే. సెనెట్ పరిధి విస్తృతం కావడం వల్ల ప్రాబల్యం గల పౌరులను వారి వ్యక్తిగత హోదాలలో ఈ సెనెట్ సభ్యులుగా ఎన్నుకొనే అవకాశం ఉంటుంది. పట్టణ, పురపాలక, వాణిజ్య చట్ట శాస్త్రాది విషయాల ప్రయోజనాలను కాపాడే సభ్యులను, విధాన సభ, విధాన పరిషత్తులకు చెందిన సభ్యులను సెనేటులో చేర్చడం వల్ల విశ్వవిద్యాలయానికి ప్రజలకు మధ్య అనుసంధానం సాధించడం వీలవుతుంది. ఇన్ని రకాల సభ్యులు గల 'సెనేటు' అధికారికంగా విశ్వవిద్యాలయానికి కావలసిన సహాయం అడగ గలుగుతుంది. విశ్వవిద్యాలయాల ప్రయోజనాల విజయానికి నగరం శ్రద్ధ తీసుకొంటుంది.

అయితే 1902 నాటి విశ్వవిద్యాలయాల సంఘం సెనేట్ నిర్మాణ పద్ధతినే లోపభూయిష్టంగా ఉందని, విశ్వవిద్యాలయాల 'సెనేట్లు' ఎక్కువ మంది సభ్యులతో కూడి పెద్ద సభలుగా ఉండడం వల్ల (1900 లో బొంబాయి విశ్వవిద్యాలయ సెనెట్‌లో 305 మంది సభ్యులు ఉండేవారు) విద్యా విషయాల మీద సరియైన అదుపు లేకుండా పోయిందని అభిప్రాయపడింది. సెనెట్ చేయవలసిన పని విద్యను అదుపు చేయడమే గాక, సంఘానికి సంబంధించిన అన్ని రకాల అవసరాలకు విశ్వవిద్యాలయం బాధ్యత తీసుకొనేటట్లు చేయడం అనే విషయాన్ని ఈ సంఘం అర్థం చేసుకోలేదు. అదే సెనెట్ పనయినపుడు అది తప్పని సరిగా ఆ రకంగా పెద్దదిగానే ఉండాలి. బొంబాయి విశ్వవిద్యాలయం సెనెట్ 150 మంది సభ్యులతో ఉండాలని నేను ప్రతిపాదిస్తాను. 1904 నాటి విశ్వవిద్యాలయాల చట్టంలో అతి ముఖ్యమైన మార్పు ఒకటి జరిగింది. సాధారణ సభ్యులలో 2/5 వంతు సభ్యులు బోధన వృత్తికి చెందని వాళ్ళు కావడం. ఈ దృష్టితో ఫ్యాకల్టీలకు చట్ట బద్ధమైన ఎక్కువ అధికారాలు ఇవ్వవలసిందని ప్రతిపాదిస్తాను. విశ్వవిద్యాలయ సెనెట్‌లో అధ్యాపకులకు ఇంతకు మించిన ప్రాతినిధ్యం అవసరం లేదనుకొంటాను. ప్రస్తుతమున్న సెనెట్‌లో ఒక్కొక్క ఫ్యాకల్టీకి ఒక్కొక్క ప్రతినిధి ఉంటేచాలు. అందువల్ల ఉపాధ్యాయుల ప్రాతినిధ్యాన్ని ఆయా ఫ్యాకల్టీల పీఠాధిపతి ప్రతిపాదిస్తే సరిపోతుందని నా ప్రతిపాదన. సెనెట్‌కు సంబంధించిన మిగిలిన సభ్యులను రాజకీయ-లేక వాణిజ్య రంగాల నుండి తీసుకోవచ్చు. విద్యపట్ల వారికిగల శ్రద్ధ విశ్వవిద్యాలయానికి నిజమైన సేవను అందించగలదు.

సెనెట్ ప్రధాన విధులు

1. విశ్వవిద్యాలయ పరిపాలనకు, సంబంధించిన చట్టాలను రూపొందించి తీర్మానాలను ప్రతిపాదించడం.

2. గౌరవ పట్టాలను ప్రధానం చేయడం.

3. అనుబంధ కళాశాలలను లేదా విశ్వవిద్యాలయ శాఖలను చట్టబద్ధంగా అంగీకరించడం.

4. కొత్త డిగ్రీలను, డిప్లమాలను, సర్టిఫికెట్‌లను ప్రవేశపెట్టడం.

5. ఫ్యాకల్టీల మధ్య ఉత్పన్నమయ్యే తగాదాలను పరిష్కరించడం.

విశ్వవిద్యాలయ పరిపాలనను, విద్యా వ్యాసంగాన్ని పర్యవేక్షించే రెండు ముఖ్య భాగాలను సమకూర్చుకున్న తరువాత విశ్వవిద్యాలయ ఆదాయ వ్యయాలను పర్యవేక్షించే మూడవ విభాగాన్ని ఏర్పాటు చేసుకోవలసి ఉంది. ఇది విశ్వవిద్యాలయానికి సంబంధించిన కేంద్రీయ కార్యనిర్వాహక సభ్యుల సంఘం. ఈ సంఘం బొంబాయి విశ్వవిద్యాలయంలో ఇప్పుడున్న సిండికేట్ కు సరిపోయినా విధులకు, నిర్మాణానికి సంబంధించి పూర్తిగా విభేదిస్తుంది. ఈ సిండికేట్ నిర్మాణంలోను పనితీరులోను విశ్వవిద్యాలయంలోని సంస్థలన్నిటిని కనీసంగానైనా తృప్తిపరచేదిగా ఉండాలి. ఒక ఉన్నత కార్యనిర్వాహక సంఘంగా ఈ అధికారుల సభ విశ్వ విద్యాలయానికి సంబంధించిన చిహ్నాన్ని వాడడంలోను , విశ్వవిద్యాలయ ఆస్థిని ,ఆదాయాన్ని కాపడడంలోనూ తగిన జాగ్రత్తలు తీసుకోవడంలోను అధికారాలు కలిగి ఉంటుంది. అయితే దీనికి మారు ఈ సిండికేట్‌కు గల అధికారం విస్తృతమైన మరెన్నో పనులకు విస్తరించబడింది. అధికార విస్తృతి కలిగిన ఈ పనులను విశ్వవిద్యాలయంలోని అర్హమైన ఇతర సంస్థలకు అప్పగించవచ్చు. ఇప్పుడున్న పద్ధతి ప్రకారం సిండికేట్‌లో ఎక్కువగా చర్చలకు అవకాశమున్నదే గాని, కావలసి నిర్ణయాలు తీసికోవడానికి అవకాశం తక్కువ. అందువల్ల 'బోర్డ్ ఆఫ్ అకౌంట్స్' ను రద్దు చేసి దాని పనులను సిండికేట్‌కు అప్పగించమని నా ప్రతిపాదన. సిండికేట్‌కు ఈ క్రింది విషయాలను నిర్ణయించే అధికారముంటుంది.

1. విశ్వవిద్యాలయ ఆర్థిక వ్యవహారం, పెట్టుబడి, లెక్కలు.

2. విశ్వవిద్యాలయంలో ఫీజు రూపంలో వసూలైన మొత్తంలోనుంచి ఖర్చు పెట్టే అధికార

3. విశ్వవిద్యాలయ ఆచార్యులు, ఉపాధ్యాయులు, రిజిస్ట్రార్లు, గ్రంథాలయాధికారు శాశ్వత ప్రాతిపదికపై నియమించబడిన ఉద్యోగులు మొదలైన విశ్వవిద్యాలయాధికారుల నియామ విధానం, పదవీకాలం, విధులు, జీతభత్యాలు, పదవీ విరమణ భత్యం మొదలగునవి.

4. మదింపు దారులు పరీక్షల నిర్వాహకులు, పరీక్షల బోర్డులకు సంబంధించిన పదవీకాలం నియామక పద్ధతి, నిబంధనలు, విధులు.

5. విద్యార్థుల స్కాలర్‌షిప్‌లు, బహుమతులు ఇతర ఆర్థిక సహాయాలు వాటి కాలపరిమితి.

6. విద్యార్థుల వసతి గృహాల ఏర్పాటు, నిర్వహణ, పర్యవేక్షణ.

7. విశ్వవిద్యాలయ స్నాతక స్థాయి విద్యార్థులకు ప్రవేశం.

8. విశ్వవిద్యాలయ సొంత ఆస్తి మీద లావాదేవీలు.

9. విశ్వవిద్యాలయ పనుల సాధనకు అవసరమైన భవనాలు, స్థలాలు, కుర్చీలు, బల్లలు మొదలైన సామాన్లు, ఇతర ఉపకరణాలు మొదలైన వాటిని సమకూర్చడం.

10. విశ్వవిద్యాలయ నిర్వహణ కోసం ధనాన్ని అప్పుగా తేవడం, అవసరమైతే విశ్వ విద్యాలయపు ఆస్తిని తనఖా పెట్టడం.

11. విశ్వవిద్యాలయం తరపున ఇతర సంస్థలతో సంబంధం పెట్టుకోవడం , సంబంధాన్ని మార్చడం, కొనసాగించడం, రద్దు చేసుకోవడం.

12. విశ్వవిద్యాలయాధికారుల పనితీరును మదింపుచేయడం, న్యాయబద్ధమైన వారి సమస్యలను తొలగించడం, సెనేట్ రూపొందించిన చట్టాల వల్ల ఆచార్యులు అధ్యాపకులు, పట్టభద్రులు, విశ్వవిద్యాలయ దిగువ తరగతి ఉద్యోగులకు సమస్యలు వచ్చినప్పుడు వాటిని పరిష్కరించడం.

13. అనుబంధ కళాశాలలకు ప్రభుత్వమిచ్చే నిధులపై అజమాయిషీచేయడం.

"ఇన్ కార్పోరేషన్ చట్టం ద్వారా అనుబంధింపబడిన సెనేట్, సిండికేటు, ఫ్యాకల్టీలు అనే ఈ మూడు ఒక పెద్ద బోధన విశ్వవిద్యాలయానికి కావలసిన అంగాలన్నిటిని సమకూరుస్తాయి. అయితే బొంబాయిలో ఏర్పడబోయే కొత్త విశ్వవిద్యాలయానికి మరొక విషయంలో కొరత ఉంది. ఈ ప్రెసిడెన్సీలో విశ్వవిద్యాలయ కేంద్రంలోని కళాశాలలు విశ్వవిద్యాలయాలుగా మారడానికి, ఆ కళాశాలలు కొత్తగా ఏర్పడబోయే బోధన విశ్వవిద్యాలయాలకు అనుబంధం కావడానికి చాలకాలం పడుతుంది. ఈ సంధి కాలంలో విశ్వవిద్యాలయ విద్యా బోధనకు సంబంధించి కొంత అనిశ్చిత స్థితి ంటుంది. ఒకవేళ ఈ సంధికాలం లేకపోయినప్పటికీ ఒక మంచి బోధన విశ్వవిద్యాలయ హజమాన్యంలో ఈ నాలుగవ రంగం అవసరం పడుతూనే ఉంటుంది.

విశ్వవిద్యాలయ నిర్వాహణ వ్యవస్థ రూపం నేను ప్రతిపాదించిన ఒక విధంగా అధికార విభజన యూత్రంపైన ఆధారపడి ఉంది. సెనేట్ చట్టబద్ధమైన అధికారానికి కేంద్రం. కార్యనిర్వాహక అధికారానికి కేంద్రం సిండికేట్. విద్యకు సంబంధించిన అధికారానికి కేంద్రం 'ఫ్యాకల్టీ'. ఈ మూడు తమ అధికారాలను వేరువేరుగా సమన్వయం లేకుండా స్వతంత్రంగా అమలు చేయడం వలన కలిగే ఫలితం విశ్వవిద్యాలయ ప్రయోజనాలకి నష్టం చేకూరుస్తుంది. విశ్వవిద్యాలయ నిర్వహణకు 'ఫ్యాకల్టీ' పునాది. అందువల్ల దీనికి అధ్యయన కోర్సులను నిర్ణయించడం, బోధనను ఏర్పాటు చేయడం, పరీక్షా విధానాన్ని నిర్ణయించడం వంటి పూర్తి స్వాధికారం ఇవ్వబడింది. అయితే ప్రత్యేకంగా 'ఫ్యాకల్టీ'ల విచక్షణకే వదలబడిన విషయాలలో కాక మిగిలిన అన్ని విషయాలలోను అదుపుచేసే అవకాశం వాటికి ఉండాలి. 'ఫ్యాకల్టీ'లను సమస్యల పాలు చేసే విషయాలను

పరిష్కరించడం, రెండు 'ఫ్యాకల్టీ'ల మధ్య భేదాలేర్పడినపుడు తుది నిర్ణయం తీసుకోవడం వంటి అవకాశాలు కూడ ఉండాలి. 'ఫ్యాకల్టీ'ల మధ్య సమన్వయం సాధించడానికే కాకుండా, ఫ్యాకల్టీలకు, సిండికేట్‌కు మధ్య సమన్వయం సాధించడానికి కూడా మరొక అంగం ఉండాలి. లేకుంటే సిండికేట్ తనకున్న అధికారాలతో విద్యావిషయాలలో ఫ్యాకల్టీలకు గల స్వేచ్ఛలో జోక్యం చేసుకోవచ్చు. సిండికేట్‌కు ఆర్థిక అధికారం ఉంది కాబట్టి అది ఆర్థిక విషయాలను అదుపు చేసినపుడు అన్నిటినీ అదుపు చేసినట్లే అవుతుంది. అందువల్ల బోధన సిబ్బంది ప్రతినిధులను సంప్రదించకుండా విశ్వవిద్యాలయ విద్యకు సంబంధించిన విషయాలలో సిండికేట్ ఏ రకమైన చర్య తీసుకోకూడదు. పైన చెప్పిన సంధి కాలపు లక్షణంగా కాని లేక విశ్వవిద్యాలయ నిర్వహణకు సంబంధించిన శాశ్వత లక్షణంగా కాని 'ఇన్ కార్పోరేషన్' చట్ట పరిధిలో నాల్గవ అంగాన్ని తప్పక రూపొందించుకోవలసిన అవసరముంది. ఆ నాల్గవ అంగానికి 'విద్యామండలి' (అకడమిక్ కౌన్సిల్) అని పేరుపెట్టవచ్చు. ఈ విద్యామండలి విధులు కొంతవరకు సలహాల రూపంలోను, కొంతవరకు కార్యనిర్వాహక విధుల రూపంలోను ఉంటాయి.

కార్యనిర్వాహక విధులలో కింది విషయాలకు సంబంధించిన నిర్ణయాలు ఉంటాయి.

1. ఫ్యాకల్టీ సమావేశాలలో లేక ఫ్యాకల్టీలు నియమించిన సంఘ సమావేశాలలో నిర్ణయాలు తీసుకోవడానికి అధమ పక్షాన హాజరు కావలసిన సభ్యుల సంఖ్య (కోరమ్);

2. సలహా సంఘాలు లేక ఇతర సంఘాల అధికారాలు, విధులు; విద్యావిషయ సంబంధంగా విశ్వవిద్యాలయం ఇతర విశ్వవిద్యాలయాలు లేక సంఘాల సభ్యులతో కలిపి నియమించిన సంఘాలు;

3. విశ్వవిద్యాలయం ప్రధానం చేసే గౌరవ పట్టాలు పొందేవారి అర్హతలు, గౌరవ పట్టాలను ప్రధానం చేయడానికి అనుసరించ వలసిన పద్ధతులు;

4. అనుబంధ కళాశాలలను తనిఖీ చేయడం;

5. కళాశాలలను అనుబంధించడం; తొలిగించడం;

6. ఫెలోషిప్‌లు, స్కాలర్‌షిప్‌లు, ప్రదర్శనలు, ఇతర ఆర్థిక సహాయాల కాల పరిమితి;

7. విశ్వవిద్యాలయ పరిధిలోగల పట్టభద్రులకు, కాబోయే పట్టభద్రులకు సంబంధించిన క్రమశిక్షణను అమలుచేయడం;

8. పట్టభద్రుల, కాబోయే పట్టభద్రుల విశ్వవిద్యాలయ సభ్యత్వాన్ని రద్దుచేయడం, పట్టాలను ఇతర అర్హతలను సెనేటు విజ్ఞప్తికి లోబడి వెనుకకు తీసుకోవడం; విద్యామండలి ఇచ్చే సలహాలు ఈ రకంగా ఉంటాయి.

(1) విశ్వవిద్యాలయ స్నాతక, స్నాతకోత్తర తరగతులకు సంబంధించిన నిర్వహణ అభివృద్ధి, విస్తరణల విషయాలలో మొదట విద్యామండలి అభిప్రాయాలను తెలుసుకోకుండా సిండికేట్ ఎలాంటి నిర్ణయం తీసుకోకూడదు.

(2) విద్యామండలి అభిప్రాయాలను తెలుసుకోకుండా 'ఫ్యాకల్టీ'లకు సాధారణ సూచనలివ్వడం కాని, 'ఫ్యాకల్టీ'గాని ఇతర సంఘాలు గాని తయారుచేసిన చట్టాలను సమీక్షించడంగాని చేయరాదు. అయితే 'ఫ్యాకల్టీ' విజ్ఞప్తి చేసినపుడు అందులోగాని లేక ఇతర సంఘాలలోగాని ప్రతినిధులను ఎన్నుకోవడానికి జరిగిన ఎన్నిక విషయంలో సలహాలివ్వవచ్చు. భవిష్యత్తులో వాటికవసరమైన సూచనలివ్వవచ్చు.

(3) విద్యామండలి అభిప్రాయాలను తెలుసుకోకుండా సిండికేట్ బోధన సిబ్బందిని నియమించకూడదు.

సెనెట్, సిండికేట్ విద్యామండలుల నిర్మాణం, సభ్యుల సంఖ్య విషయాలలో కొత్త కలకత్తా విశ్వవిద్యాలయానికి కలకత్తా విశ్వవిద్యాలయ సంఘం ప్రతిపాదించిన నిబంధనలే వర్తిస్తాయి. కొత్త విశ్వవిద్యాలయ పరిపాలన సభకు న్యాయస్థానం (కోర్టు) అని, అధికారుల సభకు రాష్ట్రం (స్టేట్) అని పేర్లు మారిస్తే బాగుంటుందనుకుంటాను. విశ్వవిద్యాలయానికి వైస్రాయ్ సందర్శకుడుగా ఉండాలి.

ప్రశ్న 16 : బొంబాయి విశ్వవిద్యాలయం (ఎ) పరీక్షలు నిర్వహించడం (బి) అధ్యయన కోర్సులు నిర్ణయించడం (సి) పాఠ్యగ్రంథాలను నిర్ణయించడం వంటి పనులను సమర్థవంతంగా చేస్తుండవచ్చు. అయితే అధ్యాపకుల, విద్యార్థుల మీద ఇది కలిగించే దుష్ఫలితాన్ని విశ్వవిద్యాలయం ఎప్పుడూ గమనించినట్లు కనపడదు. పాఠ్యప్రణాళికను తూచ తప్పకుండా బోధించమని ఒత్తిడి లేకుండా తనకు మంచిదని తోచిన దానిని పాఠ్యప్రణాళికతోపాటు బోధించగల స్వేచ్ఛ విశ్వవిద్యాలయ అధ్యాపకునికి ఎలా కలిగించాలన్నది సమస్య. ఈ మండలిచేత పరిష్కరింపబడే సమస్యలన్నిటిలో ది మొదటి సమస్య. అధ్యాపకుడు ఈ రకమైన స్వేచ్ఛను పొందాలను కుంటాడు. అందువల్ల శ్వవిద్యాలయ అధ్యాపకులకు విద్యను, పరీక్షను పూర్తిగా అదుపుచేయడానికి కావలసిన రక్షణ ండాలి. విశ్వవిద్యాలయం ఈ రక్షణ కల్పించాలి.

ప్రశ్న 17 : పరీక్షలతోపాటు కళాశాలలోని విద్యార్థుల కార్యకలాపాలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ఉన్నత పట్టాలకు సిద్ధాంత వ్యాస సమర్పణ, మౌఖిక పరీక్షలు ఉండాలి.

ప్రశ్నలు 18–19 : సంపూర్ణ విశ్వవిద్యాలయంగా రూపొందించడానికి బొంబాయి విశ్వవిద్యాలయం సాంకేతిక శాస్త్రం, వ్యవసాయం, లలిత కళలు సంగీతానికి చెందిన 'ఫ్యాకల్టీ'లను కలిగి ఉండాలి.

ప్రశ్న 20 : స్నాతకోత్తర స్థాయి పట్టాలకు అధ్యయన కాలం నాలుగు సంవత్సరాలుండాలి. (సాంఘిక శాస్త్ర కోర్సులకు మాత్రమే). ఈ నాలుగు సంవత్సరాల కాలం రెండు దశలుగా, ఒక్కొక్కదశ రెండు

సంవత్సరాలుగా ఉండాలి. మొదటి దశ అంతంలో అభ్యర్థి ఎం.ఏ., పట్టాకు అర్హుడవుతాడు. ఎక్కువ అభిరుచిగల ఒక సబ్జక్ట్‌లో అతడు ప్రత్యేక పరిశ్రమ చేయాలి. లిఖిత పూర్వకమైన పరీక్షతో పాటు 75 పేజీలతో కూడిన ఒక అధ్యయన వ్యాసం కూడా రాయించాలి. అదనంగా కలిగిన లిఖిత పరీక్షగా ఉండాలి. పైపులో 75 పుటలు గల వ్యాసం (థీసిస్) మూలాధారాలను గ్రహించడంలో అతని మౌలిక శక్తిని, వ్యాఖ్యాన పటిమను వెలికి తెచ్చేదిగా ఉండాలి. రెండవ దశ చివరలో అభ్యర్థి పి. హెచ్.డి. పట్టాకు అర్హుడవుతాడు. ఈ దశలో అతడు ఒక మౌఖిక పరీక్షనుఎదుర్కోవాలి. ప్రచురణకు యోగ్యమైన, విషయగౌరవానికి తగినన్ని పుటలతో ఒక సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించాలి. సిద్ధాంతవ్యాస మూల విమర్శ అతడు ఎం.ఏ., లో తన అభిరుచికి అనుగుణంగా తీసుకున్న సబ్జక్టుకు సంబంధించినదై ఉండాలి. సిద్ధాంత వ్యాస సమర్పణతో పాటు అతడు రెండు సబ్జక్ట్‌లలో మౌఖిక పరీక్ష రాయవలసి సబ్జక్టులుగా ఉండాలి. ఈ పద్ధతి ప్రత్యేక అధ్యయనానికి విశాలమైన పరిధిని సమకూరుస్తుంది.

**ప్రశ్న 21 :** అలాంటి కొన్ని పట్టాలు ఉండడం వల్ల ప్రయోజనం ఉండాలి.

**ప్రశ్న 22 :** విద్యార్థులకు, పరిశోధక విద్యార్థులకు ఇచ్చే ప్రభుత్వ ఆర్థిక సహాయం, ఉపకార వేతనాలు.

**ప్రశ్న 23 :** విశ్వవిద్యాలయానికి ముద్రణాలయం, ప్రచురణల విభాగం ఉండడం ఎంతో అవసరం. ఇవి లేకుండా స్నాతకోత్తర స్థాయికి చెందిన పని జరగదు.

**ప్రశ్న 24 :** 11–13 ప్రశ్నల సమాధానం చూడండి.

**ప్రశ్న 30 :** బొంబాయి విశ్వవిద్యాలయం బొంబాయికి మాత్రమే పరిమితం కావాలి. కొత్త విశ్వవిద్యాలయాలు వాటి సొంత శాఖలను తెరవాలి. అయితే కొత్త విశ్వవిద్యాలయం కళాశాలలను కలుపుకొని ఏర్పడితే, అప్పుడు ప్రతి కళాశాల ఒక సబ్జక్ట్ బోధనకే పరిమితం కావాలి.

**ప్రశ్నలు 31–33 :** 36–39 ప్రశ్నల సమాధానం చూడండి..

**ప్రశ్న 34 :** ఇప్పటి పరిస్థితులలో దేశ భాషలో విద్యాబోధన చేయడం అరుదైన విషయమే అయినా విశ్వవిద్యాలయం దేశ భాషను బోధన మాధ్యమంగా గ్రహించకపోతే దాని ఉద్దేశం నెరవేరదు.

**ప్రశ్న 35 :** విద్యకు సంబంధించిన విషయాలన్నిటిని 'ఫ్యాకల్టీ'లకు అప్పగించాలి. ఇందులో ప్రభుత్వ జోక్యం ఉండకూడదు. విశ్వవిద్యాలయ చట్టాలపైన, పరిపాలనకు సంబంధించిన విషయాల పైన ప్రభుత్వానికి కొంత అదుపు ఉంటుంది. విశ్వవిద్యాలయ సెనేట్‌లో కొంత మందిని నియమించడం ద్వారా ప్రభుత్వం ఈ అదుపును కలిగి ఉంటుంది.

**ప్రశ్నలు 41–44 :** కొత్తగా ఏర్పడిన 'ఫ్యాకల్టీ'లు ఈ ప్రశ్నల గురించి ఆలోచించాలి. 'ఆనర్స్ కోర్సు'కు సంబంధించిన పాఠ్య ప్రణాళిక కూడా విద్యార్థులకు సరియైన అవకాశం కలిగించడం లేదని నా అభిప్రాయం.

**ప్రశ్నలు 45–46 :** బోధన మాధ్యమంగా దేశభాషను వాడాలన్నది నాకున్న ఖచ్చితమైన అభిప్రాయం. అయితే దేశ ప్రజల అభిప్రాయం ప్రకారం అన్నిసబ్జక్టులు బోధించడానికి వీలుపడే దేశభాషను ఎంపికచేస్తే తప్ప ఈ సమస్య పరిష్కరింపబడదనుకుంటాను.

**ప్రశ్న 52 :** వెనుకబడిన తరగతుల వారిలోను, ముఖ్యంగా దళితుల లోను విశ్వవిద్యాలయ విద్యను పెంపొందించడానికి ప్రత్యేక జాగ్రత్తలు అవసరమనుకుంటాను.

ప్రశ్నావళికి జవాబులిచ్చి ముగించడానికి ముందు నా ఆశ్చర్యాన్ని ప్రకటించనీయండి. ఒక మంచి గ్రంథాలయాన్ని నిర్వహించే విషయంలో విశ్వవిద్యాలయ సంఘం చూపిన పూర్తి నిరాదరణే నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఏ విశ్వవిద్యాలయమైనా అనుబంధంగా ఒక ఉన్నత శ్రేణి గ్రంథాలయం లేకుండా తన కార్యక్రమం నిర్వహిస్తుందనుకోను.

ఆగష్టు 15, 1924,

అనువాదం :
**డా॥ జి.చలపతి**



ఎ

# బొంబాయి ప్రెసిడెన్సీ ప్రభుత్వ రాజ్యాంగం పై నివేదిక

## ఉపోద్ఘాతం

రాజ్యాంగ నిర్మాణ సంఘంలో ఉన్న నా సహోదరులు తయారుచేసిన నివేదికలోని అంశాల్ని అంగీకరించలేకపోతున్నందుకు పశ్చాత్తాప పడుతున్నాను. విచారణ పరిధిలోకి వచ్చే విషయాలకు సంబంధించి వారి నిర్ణయాలను ఒప్పుకోలేక పోతున్నాను. అందువల్ల నేను నా అభిప్రాయాలను, సిఫారసులను పొందుపరిచిన ఈ నివేదికను సమర్పించాను. నా సహోదరుల నివేదిక కంటే నా నివేదిక పరిమాణంలో పెద్దది. తలెత్తిన ప్రశ్నలకు పద్ధతి ప్రకారం సమాధానాలు మాత్రం చేర్చి ఉంటే నా నివేదిక పరిమాణం బహుశ పెరిగి ఉండేది కాదు. ఒక ప్రశ్నకు జవాబు చెప్పే విషయంలో ఆ జవాబుకు ఆధారమైన మూల సిద్ధాంతాలను వివరించకుండా కూడా జవాబు చెప్పవచ్చు. అలాంటప్పుడు ఆ నివేదికలోని విషయం కూడా సరిగా అర్థంకాదు. అందువల్ల సంక్షిప్తంగా చెప్పడానికి ప్రయత్నించలేదు. ఒకవేళ సంక్షిప్తపరచి ఉంటే నివేదికలోని నా సిఫారసులను కావలసినన్ని ఆధారాలతో, వాదనలతో వివరించలేదనే విమర్శను ఎదుర్కోవలసి వచ్చేది. కాబట్టి నివేదిక ఇంత పెద్దది అయినా ఫరవాలేదనుకున్నాను.

ఒకటవ విభాగం

# రాజ్యవిస్తీర్ణ పునః విభజన

1. 1,223,541 చదరపు మైళ్ళకు పైగా విస్తరించిన బొంబాయి రాజ్యాన్ని నాలుగు స్పష్టమైన ప్రాంతాలుగా విభజించవచ్చు. (1) మహారాష్ట్ర (2) గుజరాత్ (3) కర్ణాటక (4) సింధ్. ఈ ప్రజలు చాలాకాలం వరకు ఒక పరిపాలనలో కలిసి మెలిసి ఉన్నారు. గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలు గత 110 సంవత్సరాలుగా బొంబాయి రాజ్య ప్రాంతాలుగానే ఉన్నాయి. సింధ్ ప్రాంతం మాత్రం 85 సంత్సరాల క్రితం బొంబాయి రాజ్యంలో చేర్చబడింది. వీటిలో కర్ణాటక, సింధ్ ప్రాంతాలు బొంబాయి రాజ్యం నుండి వేరుకావాలని అడుగుతున్నాయి. రాజ్యం తనలోని భాగాలైన ఈ రాష్ట్రాల మధ్య ఏకత్వాన్ని సాధించలేకపోవడం రాష్ట్రాలు వేరువేరు కావడానికి దారితీస్తుంది. ఇది వాటిలో జాతిపరమైన, భాషాపరమైన ఐక్యతను సాధించలేకపోవడమే గాక, సజాతీయమైన జన సమూహాలను ఆలోచనాపూర్వకంగా ముక్కలుగా ఉన్నవాటితో కలుపుతున్నది. ఇది మంచిది కాదు. ఇలా ముక్కలుగా విడగొట్టడం వల్ల చిన్నప్రాంతాల సంస్కృతులు అణగి పోతున్నాయి. పెద్ద ప్రాంతాలలో కలపడం వల్ల అవి రాజకీయంగా బలహీనపడుతున్నాయి.

2. కర్ణాటక విషయంలో ఈ వాదానికి కొంత బలముంది. కర్ణాటక ప్రాంతం చిన్నచిన్న భాగాలుగా విభజింపబడి పరిపాలన నిమిత్తం కర్ణాటకేతర ప్రాంతాలతో కలప బడింది. ఇది నిజంగా బాధ కలగజేస్తుంది. బొంబాయి రాజ్యంలో కలపబడిన కర్ణాటక ప్రాంతాలు బొంబాయి విధాన పరిషత్తులో తగిన ప్రాతినిధ్యం లేక రాజకీయ ఇబ్బందులను ఎదుర్కొంటుందనడాన్ని కాదనలేము. ఈ రకమైన ఇబ్బందులను ఎదుర్కోలేక పోవడం వల్లనే బొంబాయి రాజ్యం నుండి కర్ణాటక ప్రాంతాలను విడదీయ మంటున్నారు. ఒకభాష – ఒక రాజ్యం అన్నది ఆచరణకు సాధ్యం కానంత పెద్దదవుతుంది. హేతుబద్ధమైన నిర్ణయాలతో ఒకభాష – ఒక రాష్ట్రం అనే సిద్ధాంత ప్రాతిపదిక మీద వేరువేరు రాష్ట్రాలను ఏర్పాటుచేయడం కూడా కష్టసాధ్యమేనని నా అభిప్రాయం. ఒక ప్రాంతంలో ప్రాచీన సంస్కృతిని, ఆధునిక సంస్కృతిని ప్రతిబింబించే పటిష్టమైన భాష ఉన్నప్పుడు కూడా ఈ సిద్ధాంతాన్ని అమలు చేయడం కష్టమే. ప్రాచీన సంస్కృతిని ప్రతిబింబించే ప్రతి భాషకు అవకాశం కల్పించినపుడు మంచి భవిష్యత్తే ఉంటుంది. ఆ ప్రాంతపు ప్రజలకు రాజకీయ బలమున్నపుడు భాషాచైతన్యం కూడా పొందగలుగుతారు. ఇప్పటి పద్ధతి చాలాకాలం కొనసాగదు. దీని ఫలితంగా ఎప్పటికైనా కర్ణాటక వేరుకాక తప్పదు. అయినా ఈ పద్ధతిలో కర్ణాటక సంస్కృతికి నష్టం జరుగుతుందని నాకు తెలుసు. ఒకవేళ భిన్న భాషా ప్రాంతాలు వేరుకాకుండా పాత పద్ధతి కొనసాగినా ఎక్కువగా బాధ పడవలసిన అవసరం లేదనుకుంటాను. ఎందుకంటే నేనిలా అనుకుంటాను. 'నా

అభిప్రాయం ప్రకారం ప్రజలలో జాతి మత భాషా భేదాలకు అతీతమైన జాతీయతా భావాన్ని కలిగించడం నేటి ప్రధాన అవసరం. ప్రజలు మొదట భారతీయులమని తరువాత హిందువులం, మహమ్మదీయులం, సింధులం, కర్ణాటకులం అని భావించకుండా మొదట తరువాత కూడా భారతీయులమని భావించేటట్లు చేయాలి'. ఈ రకమైన ఆదర్శ భావాన్ని సాధించగలిగితే ప్రాంతాభిమానం తగ్గుతుంది. సంకర లక్షణాలుగల ఇప్పటి 'రాజ్యం'లో ఈ రకమైన భావం అభిలషణీయం. ఈ భావం బహుభాషల బహు సంస్కృతుల ప్రజలలో ఒకే రకమైన అభిప్రాయాలను కలిగించి వారిలోని వేర్పాటువాద ధోరణులను చాల వరకు నివారిస్తుంది. ఇలాంటి ప్రయోజనాలను కలిగించే పద్ధతిని కాపాడాలి. ఈ కారణాల వల్ల నేను కర్ణాటక ప్రాంతం వేరు కావాలని కోరను.

3. వేరుపడడానికి అవసరమైన కారణాలు చూపే వారెవరూ సభలో సభ్యుల ముందుకు రాకపోవడం చేత నా సహోదరులు వేరుకావాలన్న కర్ణాటక ప్రాంతపు హక్కును పూర్తిగా కొట్టివేశారు. నేను, నా సహోదరులు గూడా ఈ విషయానికి సంబంధించి చేసిన సిఫారసుల వాస్తవాన్ని అంగీకరిస్తున్నాము. అందువల్ల ఈ విషయంలో నేను బాధ పడడంలేదు. అయితే నా సహోదరులు సింధ్ విషయంలో మరొక అభిప్రాయానికి రావడరీ ఆశ్చర్యకరం. కర్ణాటకతో పోల్చి చూసినపుడు 'సింధ్' విషయం మరొక విధంగా ఉండదు. బొంబాయి రాజ్యంలో కలిసి ఉండడం వల్ల సింధ్ కావలసినంతగా లాభపడిందన్న విషయంలో రెండు అభిప్రాయాలు ఉండడానికి వీలులేదు. చాలకాలం క్రిందట వేరుచేయబడిన సింధ్‌కు బొంబాయి రాజ్యంలో అప్రధానమైన సభ్యప్రాంతంగా కాక, పొరుగుప్రాంతంగా ఉన్నత స్థితి ఇవ్వబడింది. బొంబాయి రాజ్యంతో దానికి గౌరవప్రదమైన ఒడంబడికలే ఉన్నాయి. గవర్నరు అధికారంలో తరువాతవాడైన 'కమీషనరు' చేత పరిపాలింపబడుతూ సింధ్ తన స్వతంత్రపు ఠీవిని నిలుపుకున్నట్లు చెప్పవలసి ఉంది. అది తన ప్రాచీన ఆచారాలను, చట్టాలను నిలుపుకోవడానికి అంగీకరించబడింది. బొంబాయి రాజ్య నిమిత్తం తయారుచేసిన చట్టానికి సింధ్ ఎప్పటికీ లోబడవలసిన అవసరం లేదు. ఒకవేళ ఆ చట్టం తన అభివృద్ధికి ప్రత్యేకించి సహాయకారి అయినప్పుడు సింధ్ ఆ చట్టాన్ని పాటించవచ్చు. బొంబాయి రాజ్య ధర్మాసనాలవలె సింధ్ ప్రజాసేవ విభాగాలు బొంబాయి రాజ్య ప్రజాసేవ విభాగాల నుండి వేరుగా ఉండి తన ఉద్యోగుల ద్వారానే నిర్వహింప బడుతున్నాయి. బొంబాయి రాజ్యంతో కలిసి ఉండి సింధ్‌ను ఆర్థిక కష్టాన్ని తెచ్చుకోమని చెప్పగలమా? తద్విరుద్ధంగా సింధ్ తన శక్తికి మించిన వేగంతో రాజ్యం మీద పరుగు తీసింది. రాజ్యంలో కలిసి ఉండడం వల్లనే అధికంగా లబ్ధి పొందడానికి సింధ్‌కు సాధ్యమైంది. తనయెడల ప్రభుత్వం చూపవలసిన శ్రద్ధ, ఆదరణను పొందడంలో కూడా సింధ్ విఫలమైందని చెప్పలేము. నిజానికి సంస్కరణలు అమలు జరిపినప్పటి నుండి బొంబాయి ప్రభుత్వాన్ని సింధ్ తన శక్తికి మించి ప్రభావితం చేసింది. ఈ నిజాలను తెలుసుకున్న తరువాత వేరుపడడం ద్వారా సింధ్ ఇంకా ఏ ప్రయోజనాలను ఎక్కువ పొందుతుందో, పొందవలసి ఉందో అర్థం చేసుకోవడం కష్టం. సింధ్ వేరుపడకుండానే వేరుపడటం వల్ల కలిగే ప్రయోజనాలన్నీ పొందింది. కలిసి ఉండి నందువల్ల నష్టాలేమీలేవు.

4. వేర్పాటును కోరడంలో సింధ్‌కు చెందిన అన్నివర్గాలు కలవలేదని కూడా స్పష్టమవుతున్నది. కావలసిన దృష్టాంతం 'కమీషను' ముందు ఉంచబడింది. దీనికి నియమింపబడిన సంఘం సింధ్‌లోని మహ్మమ్మదీయులకు హిందువులకు మధ్య సూక్ష్మమైన చీలిక తెచ్చింది. మహమ్మదీయులు వేర్పాటుకు అనుకూలంగా మారారు. హిందువులు వేర్పాటుకు వ్యతిరేకంగా తయారయ్యారు. ఈ విషయంలో చారిత్రకంగా ప్రజాభిప్రాయాన్ని పరిశీలిస్తే రాజకీయవాదులు 1917 లో సింధ్ ప్రతిపత్తి సమస్యను లేవనెత్తారు. 1917వ సంవత్సరం ఆగస్టు నెలలో ప్రకటన వెలువడిన తరువాత రాబోయే సంస్కరణలలో సింధ్ స్థానాన్ని ఆలోచించడానికి అదే సంవత్సరం నవంబరులో ఒక ప్రత్యేక సభను నిర్వహించారు. ఆ సభకు మహమ్మదీయులలో ప్రముఖుడైన శ్రీ జి.ఎం. భూర్గ్రి ఆహ్వాన సంఘాధ్యక్షుడు. హిందువైన శ్రీ హరచంద్రాయ్ విపిన్‌దాస్ ఆ సభకు అధ్యక్షుడు. ఈ సభ 1917లో సమావేశం కావడానికి ముందు దీనికి నాలుగు ప్రతిపాదనలుండేవి (1) సింధ్ ప్రత్యేక రాష్ట్రంగా రూపొందడం (2) సింధ్, బెలుచిస్థాన్ కలసి ఒక రాష్ట్రంగా ఏర్పడడం (3) సింధ్ పంజాబ్‌తో కలిసి ఉండడం (4)సింధ్ బొంబాయి రాజ్యంలోనే ఉండడం. ఈ నాలుగింటిలో సింధ్ ప్రత్యేక రాష్ట్రంగా రూపొందడమన్న అంశంతో కలిపి మూడు ప్రతిపాదనలను ఈ ప్రత్యేక సభ కొట్టిపారవేయడం గమనించాలి. సింధ్ ప్రత్యేక రాష్ట్రంగా రూపొందే అంశాన్ని నిరాకరించడమేగాక సింధ్ బొంబాయి రాజ్యంగా ఇంకా సన్నిహితంగా ఉండాలని తీర్మానం కూడా చేసింది. ఈ తీర్మానాన్ని హిందువులు, మహమ్మదీయులు బలపరిచారు. సింధ్ కమీషనరు పదవిని ప్రెసిడెన్సీలోని 'డివిజన్ కమీషనరు' పదవికి తగ్గించాలని కూడా తీర్మానించబడింది. ఈ పనిలో నియుక్తులైన హిందువులు, మహమ్మదీయులు 'సెక్రటరీ ఆఫ్ స్టేట్' అయిన మాంటేగ్‌ను 'వైస్‌రాయ్' అయిన లార్డ్ రెడింగ్ ను కలిసి వేరే రాష్ట్రంగా ఉండాలన్న కోరిక సింధ్‌కు లేదని ఖచ్చితంగా తెలియజేశారు. ఈ విషయంలో 1918, 1919, 1920 లలో జరిగిన సభలలో కూడా హిందూ, మహమ్మదీయ సభ్యులు ఏకంగా ఇలాంటి నిర్ణయాన్నే తీసుకొన్నారు. సహాయ నిరాకరణోద్యమం రావడంతో 1920 నుంచి సభ సింధ్ సమస్యను పట్టించుకోలేదు. ఈ విషయాలను బట్టి అభిప్రాయాలను మార్చిన వాళ్లు మహమ్మదీయులని, అంగీకరింపబడిన విషయాన్ని విస్మరించినవాళ్లు కూడా వాళ్లేనని తెలుస్తున్నది. ఈ 'డిమాండ్'కూడా అందరిదీ కాదు; మహమ్మదీయుల నుండి మాత్రమే వచ్చిన పాక్షిక డిమాండే ఇది.

5. ఇటువంటి పాక్షిక డిమాండ్‌ను సానుభూతితో పరిశీలించే ముందు వేర్పాటును కోరడంలోగల ఉద్దేశం సక్రమమైనదేనన్న అభిప్రాయం కలగాలి. మహమ్మదీయ ప్రతినిధులు బొంబాయి రాజ్యం నుండి సింధ్ వేరుకావాలని కోరారు. హిందూ ప్రతినిధులు దీన్ని వ్యతిరేకించారు. అయితే వాళ్లు వేర్పాటును కోరడానికిగాని, వీళ్లు వద్దనడానికి గాని కారణాలు చూపలేదు. వీళ్ల లక్ష్యాలను స్పష్టంచేయలేదు. ఈ విషయంలో సాధ్యాసాధ్యాలు, నిజానిజాలు తెలిసిన వారికి పోటీ పడుతున్న ఇరువర్గాల వారు వారివారి అభిప్రాయాలను సరిగా వ్యక్తపరచలేదని అనిపిస్తుంది. ఈ కోరికలో గల ఉద్దేశాన్ని ముందు స్పష్టంచేస్తే, తరువాత దాని యోగ్యతలను బట్టి నిర్ణయాలు

తీసుకోవడానికి వీలవుతుంది. మహమ్మదీయ వర్గానికి చెందిన ప్రముఖ సభ్యులు 1927 వ సంవత్సరం మార్చి 20 వ తారీఖున కొన్ని ప్రతిపాదనలు చేశారు. హిందువులకు, మహమ్మదీయులకు మధ్య సుహృద్భావ షరతులతో కూడిన ఈ ప్రతిపాదనలను 'అఖిల మహమ్మదీయ ప్రతిపాదనలు' అని పిలిచారు. ఈ ప్రతిపాదనల ననుసరించి కింది విధంగా కోరడం జరిగింది. (1) సింధ్‌ను ఒక ప్రత్యేక రాష్ట్రంగా చేయడం (2) ఈశాన్య సరిహద్దు రాష్ట్రానికి ఇతర రాష్ట్రాలలాగా సమప్రాధాన్యత ఇవ్వడం (3) పంజాబ్, బెంగాల్‌లలో మహమ్మదీయుల జనాభా ననుసరించి యథోచితంగా మహమ్మదీయ ప్రాతినిధ్యాన్ని కలిగించడం.

పై ప్రతిపాదనలను పరిశీలించినపుడు మహమ్మదీయ జనాభా ఎక్కువగా ఉన్న ప్రాంతా లలో ఇప్పుడున్న పద్ధతిలోనే వీలైనన్ని ఎక్కువ మహమ్మదీయ రాష్ట్రాలను ఏర్పాటుచేయాలన్న తలంపు కనిపిస్తుంది. ప్రస్తుతం పంజాబ్, బెంగాల్ ప్రాంతాలలోనే మహమ్మదీయుల ఆధిక్యత స్పష్టంగా ఉంది. ఈ రెండు ప్రాంతాలలో జనాభా ననుసరించి మహమ్మదీయులకు ప్రాతినిధ్యం కావాలని కోరడం మహమ్మదీయ ఆధిక్యతను రాజకీయ ఆధిక్యతగా మార్చుకోవడం కోసమే. తరువాత తరువాత ఆ ప్రాంతాలలో మహమ్మదీయ ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకోవడం దీని అంతరార్థం. బెలూచిస్థాన్‌లోను, ఈశాన్య సరిహద్దు ప్రాంతంలోను మహమ్మదీయ ఆధిక్యత ఎంతో ఎక్కువ. అయినా వీరికి బాధ్యత వహించే ప్రభుత్వ పరిధిలో వీరు లేరు. దీనివల్ల మహమ్మదీయులు అధికంగా ఉన్నప్పటికీ వీరికి పరిపాలనా హక్కు సంక్రమించలేదు. దీనిని సరిచేసుకోవడమే వీళ్ల ప్రతిపాదనల లక్ష్యం. నాలుగు రాష్ట్రాలలో మహమ్మదీయులు ఆధిక్యతను చూపి మహమ్మదీయ ప్రభుత్వం ఏర్పాటు చేసుకొనే అవకాశాలను మెరుగు పరుచుకోవడం కూడా ఈ ప్రతిపాదన లక్ష్యం. సంఖ్యలో మహమ్మదీయులు ఎక్కువగా ఉన్న సింధ్‌ను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని కోరడం ఈ పద్ధతి ద్వారా మహమ్మదీయ రాష్ట్రాలుగా మార్చాలని ఆలోచిస్తున్న నాలుగు రాష్ట్రాలలో ఐదవదిగా చేర్చడం కోసమే.

మహమ్మదీయ రాష్ట్రాలను ఏర్పాటు చేయాలనుకోవడంలో గల ప్రయోజనం ఏమిటి? కుల ప్రాతిపదికపై నియోజక వర్గాలను ఏర్పాటుచేయడాన్ని కూడా ఈ ప్రతిపాదనల ద్వారా మహమ్మదీయ ప్రజలు ఆశించారు. మహమ్మదీయ రాష్ట్రాల ప్రతిపాదనను అంగీకరిస్తే తాము రాష్ట్ర శాసన సభలోను, కేంద్ర శాసనసభలోను కుల నియోజకవర్గ విధానాన్ని విడనాడి సంయు! నియోజకవర్గ విధానాన్ని అంగీకరిస్తామని ఈ ప్రతిపాదనల రచయితలు చెప్పారు. తార్కిక సామ్యం దృష్టిలో మహమ్మదీయ రాష్ట్రాలను ఏర్పాటు చేయడంలో ఉద్దేశం అల్పసంఖ్యాకవర్గమైన మహమ్మదీయులకు రక్షణ కల్పించడం. అల్పసంఖ్యాక వర్గాలను రక్షించడమే కుల నియోజక వర్గాల లక్ష్యం. మహమ్మదీయ రాష్ట్రాల సృష్టిహిందువులు అధికంగా ఉన్న రాష్ట్రాలలో హిందువుల ఆధిక్యత నుండి అల్ప సంఖ్యాకులైన మహమ్మదీయులను ఎలా రక్షిస్తాయో చూపలేదు. కుల నియోజకవర్గాల నుండి రక్షణ పొందాలనుకున్న ఈ పద్ధతి నిజానికి అల్పసంఖ్యాకులైన మహమ్మదీయుల స్థితిని

బలహీన పరచవచ్చు. అయితే ఈ విషయాన్ని లోతుగా పరిశీలిస్తే ఈ ప్రణాళిక అంత క్రియాశూన్యమైనదని, నిరర్థకమైనదని అనిపించదు. ఇది పూర్తిగా అల్ప సంఖ్యాక మహమ్మదీయుల రక్షణకు సరియైన సాధనం. ఒకవేళ అధిక సంఖ్యాక హిందువులు తమ రాష్ట్రాలలోని అల్పసంఖ్యాక మహమ్మదీయులు యెడల నిరంకుశంగా ప్రవర్తించినపుడు ఈ ప్రణాళిక ఐదు మహమ్మదీయ రాష్ట్రాలలోని అల్ప సంఖ్యాక హిందువుల యెడల కూడా అదేరకంగా ప్రవర్తించే ఉపాయాన్ని కలిగిస్తుంది. భంగం కలిగించినపుడు ప్రతిభంగం కలిగించడం, భయాన్ని కలిగించినపుడు తిరిగి భయాన్ని కలిగించడం, నిరంకుశత్వానికి ప్రతిగా నిరంకుశత్వాన్ని చూపడం వంటివి ఈ పద్ధతిలో ఉన్నాయి. సింధ్‌ను వేరుచేయమనడం లోను, ఈ పద్ధతిని ప్రతిపాదించడంలోను గల ఉద్దేశం ఇదే. మహమ్మదీయులకు ఈ విషయం లో ఆపద కలుగుతుందన్న అనుమానముంది. నెహ్రూ కమిటీ నివేదికను చూపి వారి అనుమానం పోగొడతాను. ఆ నివేదికలో వాళ్లిలా చెప్పారు. "సింధ్ వేరు కావాలన్న మహమ్మదీయుల కోరిక అంత సంతోషంగా ప్రతిపాదింపబడలేదని మేము ఒప్పుకుంటాం. ఇది కులతత్వంపైన, వారికి ఏమాత్రం సంబంధం లేని మరికొన్ని విషయాలపైన ఆధారపడింది". వేర్పాటుకు నిజమైన కారణాలను చూపడంలో నెహ్రూ కమిటీ మొహమాటపడి ఉంటుంది. మనం దీనిని అంగీకరించినట్లైతే దీని దుష్ఫలితాల్ని కూడా తెలుసు కోవడం మంచిది. అందువల్ల నేనీ విషయాన్ని స్పృశిస్తున్నాను. మౌలానా అబుల్ కలామ్ అజాద్ కూడా దీనినే చెపుతారు.

ఇటీవల కలకత్తాలో జరిగిన 'ముస్లిం లీగ్' సమావేశంలో మౌలానా అబుల్ కలామ్ అజాద్ ఇచ్చిన ఉపన్యాసం సంక్షిప్తంగాను స్పష్టంగాను మెచ్చుకోదగిందిగా ఉంది. ఆయన ఇలా చెప్పారు. "లక్నో ఒడంబడిక ప్రకారం మహమ్మదీయులు వాళ్ల ప్రయోజనాలను వదులుకొన్నారు. గత మార్చిలో ప్రతిపాదింపబడిన 'ఢిల్లీ ప్రతిపాదనలు' భారతదేశంలోని మహమ్మదీయుల నిజమైన హక్కులను మొదటిసారిగా గుర్తించే ప్రయత్నం చేశాయి. 1917 నాటి ఒడంబడిక మహమ్మదీయుల ప్రాతినిధ్యానికి హామీ ఇచ్చింది. అయితే మహమ్మదీయ వర్గ అస్తిత్వానికి కారణం కాగల ముఖ్య విషయమేమిటంటే మహమ్మదీయుల సంఖ్యా బలాన్ని గుర్తించడం. ఈ రకమైన విషయాలకు ఢిల్లీ దారి చూపింది. ఇది భారతదేశ భవిష్యత్తులో వారికి తగిన వాటాను తప్పక ఏర్పరుస్తుంది. బెంగాల్, పంజాబ్‌లలో వారి జనాభా కొద్దిగా ఎక్కువగా ఉన్నప్పటికీ అది జనాభా లెక్కల వారు ఇచ్చిన సంఖ్య మాత్రమే. మొదటిసారిగా ఢిల్లీ ప్రతిపాదనలు మహమ్మదీయుల జనాభా అధికంగా గల ఐదు రాష్ట్రాలను, అందులో మరీ ముఖ్యమైన మూడు రాష్ట్రాలను (సింధ్, ఈశాన్య సరిహద్దు ప్రాంతం, బెలూచిస్థాన్) పేర్కొన్నాయి. మహమ్మదీయులు ఈ విషయాల్ని గుర్తించకపోతే మనుగడకే అనర్హులౌతారు. మహమ్మదీయ రాష్ట్రాలు ఐదు ఉంటే హిందూ రాష్ట్రాలు తొమ్మిదున్నాయి. తొమ్మిది రాష్ట్రాలలో హిందువులు ఇచ్చిన ఆదరణనే వారు మహమ్మదీయుల ఐదు రాష్ట్రాల నుండి పొందుతారు. ఇది ఒక పెద్ద లబ్ధికాదా? ఇది మహమ్మ దీయ హక్కుల నిశ్చితత్వానికి లభించిన కొత్త ఆయుధం కాదా?" (హిందూ స్థాన్ టైమ్స్, జనవరి 3, 1928). ఎవరైతే ఈవాక్యాల స్పష్టార్థాన్ని

అర్థంచేసుకోవడంలో శ్రద్ధచూపరో వాళ్లు సింధ్ వేరు కావాలని కోరడంలోని ఉద్దేశాన్ని అపార్థంచేసుకుంటారు. సింధ్ ప్రారబ్ధానికి నిజమైన ఈ ఉద్దేశంతో గల సంబంధం చాల తక్కువన్నది స్పష్టం. అల్ప సంఖ్యాక మహమ్మదీయుల రక్షణకు తయారుచేసిన పెద్ద ప్రణాళికలో ఇది ఒక భాగం. 'శాంతిని స్థాపించడానికి మంచి మార్గం యుద్ధానికి తయారు కావడం' అన్న సిద్ధాంతం మీద ఇది ఆధారపడి ఉంది.

6. వేర్పాటును అడగడంలో గల నిజమైన ఉద్దేశాన్ని గ్రహించిన తరువాత ఉద్భవించే ప్రశ్న 'ఇది సానుభూతి చూపదగిందేనా?' అని. ఒకందుకు నేనీ విషయం మీద సానుభూతి చూపలేను. మంచి పరిపాలన పట్ల ఆసక్తి గల మరెవ్వరైనా దీనిని ఒప్పుకోలేరని చెప్పడానికి సాహసిస్తాను. 'ఈ విషయాన్ని ముందుకు తీసుకొని రావడంలో ఆ ప్రతిపాదన యోగ్యతలను బలహీన పరచవలసిన అవసరంలేదు' అని నెహ్రూ కమిటీ వేర్పాటు ప్రతిపాదనకు అనుకూలంగా అభిప్రాయపడింది. దీనిని నేను ఆక్షేపిస్తాను. ఈ పద్ధతి దాని ఉద్దేశాన్ని బహిర్గతం చేస్తున్నది. ఇది చిన్న విషయం కాదు. ఈ ప్రణాళిక వెనుక గల ఉద్దేశం చాల ప్రమాదకరమైంది. అల్ప సంఖ్యాక వర్గానికి చెందిన అమాయకులను శిక్షించే అవకాశం, ప్రతీకారం తీర్చుకొనే పద్ధతిలో న్యాయాల్ని శాంతిని నిర్వహించడం ఇందులో అంతర్లీనంగా ఉన్నాయి. మహమ్మదీయ రాష్ట్రాలలో హిందువూ, హిందూ రాష్ట్రాలలో మహమ్మదీయులు వారివారి రాష్ట్రాలలోని సహమతస్తుల పొరబాట్ల వలన ఇలాంటి ఇబ్బందులకు ఎదురౌతారు. వాళ్ల స్వంత రాష్ట్రాలలోనే అల్పసంఖ్యాక వర్గం వారిని పౌరులుగా కాక బందీలుగా చూసే పద్ధతిని ద్వేషించాలి. ఇతర ప్రాంతాలలోని వారి సవర్ణుల దుష్ప్రవర్తనను క్రమబద్ధం చేయడానికి వీరి ముక్కులను కాలరాయడం తగనిపని. ఈ రకంగా ఎప్పుడూ హక్కులను రద్దుచేయడం న్యాయమని, మంచిదని ఎవరు చెపుతారు? ఎప్పుడూ కాకున్నా కొంతకాలమైనా ఒకరికి నిజంగా నష్టం కలిగించేది ఈ ఇబ్బందే. రాజ్యాల మధ్య జరిగే పోరుకు – పెద్దదిగానీ లేక చిన్నదిగానీ అల్ప సంఖ్యాకులకు వ్యతిరేకంగా జరిగే కుట్ర కారణం. ఇలాంటి పద్ధతి వల్ల కలిగే ఫలితం గురించి ఆలోచించడం కూడా భయంకరంగా ఉంటుంది. హిందూరాష్ట్రాలలో మహమ్మదీయులను బాధ పెట్టడానికి హిందువులకు దొరికే అదే అవకాశం ఈ పద్ధతిలోని స్థితిగతులను మెరుగు పరచలేదు. ఎందుకంటే ఈ వ్యవస్థలోనే మంచితనాన్ని చిన్నా భిన్నం చేసే బీజాలు ఉన్నాయి కాబట్టి. ఈ ప్రణాళికను అమలు చేయకుంటే తమకు భద్రత లేదని మహమ్మదీయులు అనడం నిజంగా కలవరపరచే విషయం. మహమ్మదీయులు ఈరకంగా భావించినపుడు వారికి, హిందువులకు పరస్పర నమ్మకం ఏర్పడి తద్వారా వాళ్ళు ఈ ప్రణాళిక లేకున్నా పరవాలేదనుకున్నంత వరకు స్వరాజ్య సాధనను వాయిదా వేసుకోవడం మంచిదని నేననుకుంటాను. "చరిత్రలో దీర్ఘకాల సంఘటన పరంపర భారతదేశంలో ఈనాడు జనాభాను పంచుకోవడానికి కారణం" అని నెహ్రూ కమిటీ వాదిస్తున్నది. ఈ కారణమే కుల ప్రాతిపదిక గల రాష్ట్రాలను ఏర్పాటు చేస్తున్నది. "ఉన్నదున్నట్లుగా మేము వాస్తవాలను గుర్తించవలసి ఉంది." నిస్సందేహంగా ఇది సత్యమే. అయితే కులతత్వ ఆలోచనలతో నిండిన, జాతీయ భావాలు

అడుగున పడిపోయిన ఈ కాలంలో కుల ప్రాతిపదికన రాష్ట్రాలను ఏర్పాటు చేయడం మంచిదేనా అన్నది మనం ఆలోచించవలసిన విషయం.

హిందువులు, మహమ్మదీయులు మత తత్వాన్ని విడనాడి మొదట చివర అందరూ భారతీయులే నన్న అభిప్రాయం ఏర్పరచుకొన్నపుడు అలాంటి రాష్ట్రాలను ఏర్పాటు చేసుకోవలసిన సమయం వస్తుంది.ఏమైనప్పటికీ వాళ్లు మొదట భారతీయులమని, తరువాతనే హిందువులం, మహమ్మదీయులమని భావించేటంత వరకు ఈ సమస్య ఆగాలి. ఈ కారణాల వల్ల సింధ్‌ను వేరుచేసే విషయంలో సానుభూతితో ఉన్న నా సహచరుల నుండి నేను విభేదిస్తాను.

7. బొంబాయి రాజ్యం నుండి సింధ్‌ను వేరుచేయడంలో గల ఆర్థిక సమస్యల గురించి నేనేమీ చెప్పక పోవడం గుర్తించదగిన విషయం. ఎందుకంటే వారి ప్రతిపాదనలకు నేనెలాంటి ప్రాధాన్యతను ఇవ్వను. నెహ్రూ కమిటీ సభ్యులే ఈ విషయంలో నిర్ణయం తీసుకోలేదు. ఆర్థిక సమస్యలను పరిష్కరించినా లేక వదిలి పెట్టినా సింధ్‌ను వేరుచేయడంలో నేను లేవదీసిన ఆక్షేపణలు అలాగే ఉంటాయి.



## రెండవ విభాగం

# రాజ్య కార్యనిర్వాహకవర్గం

### మొదటి అధ్యాయం

### ద్వంద్వ - ఏకరీతి ప్రభుత్వం

8. కొత్తప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత ఐదు సంవత్సరాలపాటు శాంతి భద్రతలను ఒక ప్రత్యేక విషయంగా కొనసాగించవలసిందిగా నా సహచరులు సిఫారసు చేశారు. నా సహచరులు ఈ విషయాన్ని పరిష్కరించే అవకాశాన్ని కౌన్సిల్‌కు ఇచ్చి కొంత కాలం వేచి చూడాలని నిర్ణయించి ఉంటే నేను వాళ్లతో విభేదించే వాడ్నికాదు. అయితే దురదృష్టవశాత్తు వాళ్ల సిఫారసులు దీనికి మించి ఒక ఒడంబడికతో కూడి ఉన్నాయి. "ఐదేళ్ళ తరువాత ఎగువ సభ, గవర్నరు సమ్మతితో ఈ విషయాన్ని మరొక శాఖకు అప్పగించే విషయమై విధాన పరిషత్తుకు అప్పగించాలి" అన్నది వాళ్ల ప్రతిపాదన. కాలపరిమితి లేకుండా ద్వంద్వ ప్రభుత్వం కొనసాగింపే దీని అర్థం. అందువల్ల దీనిని నేను ఒప్పుకోలేను. ఏదైనా ఆధారం ఉండకపోతే ఇటువంటి సిఫారసును సమర్థించడం సాధ్యం కాదు. ద్వంద్వ ప్రభుత్వం ఆచరణ యోగ్యమైందని, గతంలో ఇది సమర్థవంతంగా పని చేసిందని, భవిష్యత్తులో కూడా పనిచేయగలదని నమ్మకం ఉండాలి. నా అభిప్రాయంలో ఇటువంటి ఊహ అంగీకార యోగ్యం కాదు.

9. ఒక ప్రభుత్వ విధానంగా ద్వంద్వ విధానం సంతృప్తికరంగా పనిచేయలేక పోవడానికి ఎన్నో కారణాలు చూపబడ్డాయి. భద్రత కోసం చేసే కొన్ని తనిఖీలు ప్రభుత్వానికి సంబంధించిన బదలాయింపును ఆటంక పరుస్తున్నాయనడం వాస్తవం. ప్రజల అన్ని రకాల బాగుకోసం పరిపాలనా శాఖలను మంత్రుల అధికారులకు అప్పగించడానికి, శాంతి భద్రతల నిర్వహణకు సంబంధించిన విషయాలకు భేదముంది. నిజానికి వాటి స్వభావాన్ని అనుసరించి పరిపాలనా శాఖలు ఎక్కువగానే బదలాయింపబడ్డాయి. అందువల్ల ఆ పద్ధతి అనుసరించి రాజ్య ఆర్థిక వనరులు ఒక మంత్రి స్వాధీనంలో ఉండి ఉండాలి. ఏ ప్రణాళిక కూడా తనకు కావలసిన ధనాన్ని ఆర్థిక విభాగం సమకూర్చకుండా ఫలవంతం కాదనడం స్పష్టం. ఆర్థిక విభాగం ప్రభుత్వ మంత్రిత్వ శాఖకు సంబంధించి ఉన్నప్పుడే ఇటువంటి ప్రయోజనాలు ఆశించవచ్చు. కాని పరిస్థితి అలా లేదు. ఆర్థిక విభాగం విధానానికి సంబంధించిన, దాని విధుల అదుపునకు సంబంధించి 45 ఎ (3) వ సెక్షన్‌ను రూపొందించడం జరిగింది. ఈ రకంగా ఏర్పాటు చేసిన విభాగం బదలాయింప బడినదిగాని లేక

ప్రత్యేకించబడినదిగాని కాదు. రెండింటికి సంబంధించినది.

అధికార ప్రాతినిధ్య నిబంధనలలోని 36(1)వ నిబంధన ప్రకారం ఆర్థిక విభాగం కార్యనిర్వాహక మండలికి చెందిన ఒక సభ్యుని ఆధీనంలో ఉండాలని చెబుతుంది. నిజానికి ఆర్థిక విభాగం ఒక (రిజర్వుడు డిపార్ట్‌మెంట్) గా మార్చబడింది. విధాన సభకు బాధ్యుడు కాని కార్యనిర్వాహక మండలి సభ్యుని ఆధీనంలో ఉంచబడిన ఆర్థిక విభాగం సహజంగా ఆ పక్షంలోనే ఉండి పోయింది. ఈ విభాగం అధిపతి ఇంచుమించు మంత్రులకు అనుకూలంగా రిజర్వుడు విభాగాలకు సంబంధించిన పనినే గుర్తించారు. బదలాయించబడిన పరిపాలనా విషయాలకు సంబంధించి గవర్నరుకు ఇచ్చిన అధికారం కూడా ప్రభుత్వ బదలాయింపు పక్షంలో నష్టం జరగడానికి మరొక కారణం. సెక్షన్ 52 (3) ప్రకారం బదలాయించబడిన పరిపాలనా అంశాలకు సంబంధించి గవర్నరు మంత్రుల సలహాలను పాటించాలని నిర్దేశింపబడింది. తగిన కారణం ఉన్నపుడు వారి అభిప్రాయంతో విభేదించవచ్చు. అయితే ప్రాధమికంగా అభిప్రాయ భేదాలేర్పడిన ప్రత్యేక సందర్భాలలో గవర్నర్లు వాళ్ల జోక్యాన్ని తగ్గించుకోవడానికి బదులు చట్టబద్ధంగా మంత్రులు కేవలం సలహాదార్లని, వాళ్ల సలహాలను పాటించడం, పాటించకపోవడం తమ ఇష్టమని, తమకు మంచిదని తోచిన విషయాలలో వారి సలహాలను పాటించనక్కర లేదని ప్రకటించుకోవడం అనేది సాధారణంగా వారిపై ఉన్న అభియోగం. ఈ విపరీత వ్యాఖ్యానం కార్యనిర్వాహక సభ్యుల హెూదా కంటే మంత్రుల హెూదాను మరింత దిగజార్చింది. ఎందుకంటే అత్యధిక ఓట్లతో తప్ప సాధారణ పరిస్థితులలో కార్యనిర్వాహక సభ్యులను తొలగించడం సాధ్యంకాదు. పైన చూపిన 52 (3) వ సెక్షన్‌పై గవర్నర్లు వెలిబుచ్చిన అభిప్రాయం ప్రకారం మంత్రులు గవర్నర్ల దయపైన ఆధారపడవలసి వచ్చింది. కార్యనిర్వాహక సభ్యులకున్న రక్షణ కూడా మంత్రులకు లేకుండా పోయింది. మంత్రుల పనిని ఆటంకపరచడానికి వీలైన గవర్నర్ల అధికారాల పెంపునకు దోహదం చేసే మరొక విషయం ఉంది. రాజ్యంలో నియమింప బడిన అన్నిరకాల ఉద్యోగుల ప్రయోజనాలను కాపాడడానికి ఈ గవర్నర్లకు సూచనలనే ఆయుధం ఇవ్వబడింది. ఈ సూచనల ప్రకారం ఉద్యోగులు చట్టబద్ధంగా వారి విధులను నిర్వర్తించడానికి, తమ హక్కులను అనుభవించడానికి తగిన రక్షణను గవర్నరు కల్పించాలి. ఉద్యోగుల ప్రయోజనాలను కాపాడే సమస్య వరకే గవర్నర్ల విధి పరిమితమై ఉంటుంది. అయితే గవర్నర్లు ఈ సూచనలకు విస్తృత వ్యాఖ్యానం చేసుకొని ఉద్యోగులకు సంబంధించిన నియామకాలు,మంత్రిత్వ శాఖలలోని ఉద్యోగుల పదోన్నతి మొదలైన అన్ని విషయాలు తమ అధికార పరిధిలోకే రావాలని పట్టుబట్టారు. బొంబాయిలోని గవర్నరు ఈ హక్కు తనదేనని, కడకు కార్యనిర్వాహక సంఘ సభ్యుల కింద పనిచేసే ఉద్యోగులపై పెత్తనం కూడా తనదేనని, ఈ అధికారమంతా తనదేనని ప్రకటించుకున్నారు. "మండలిలో ఒకరైన గవర్నరు నియమిస్తున్న" అనే అసలు వాక్యానికి బదులు "గవర్నరు నియమిస్తున్న" అని మార్చబడింది. మంత్రిత్వ శాఖకు చెందిన కార్యదర్శికి కల్పించిన హెూదా కూడా మంత్రి అధికారాన్ని బలహీన పరచడానికి, గవర్నరు నిరంకుశత్వాన్ని పెంచడానికి సహాయ

పడింది. మంత్రుల నిర్ణయంతో కార్యదర్శి విభేదించిన అన్ని సందర్భాలలోను తన రాజకీయ అధినేతను కాదని గవర్నరును సంప్రదించడానికి, గవర్నరు అంగీకారంతో మంత్రుల నిర్ణయాన్ని మార్చుకోవ డానికి అనుమతించబడింది.

10. ద్వంద్వ పద్ధతి తృప్తికరంగా సాగడం మీద ఇదంతా నిస్సందేహంగా దుష్ఫలితాన్ని కలిగించింది. నేను ఈ పద్ధతి నుండి ద్వంద్వ పాలనను రక్షించాలని కోరుకుంటున్నాను. పైన పేర్కొన్న విషయాలన్నిటిని చక్కబరిస్తే లేక తొలగిస్తే ద్వంద్వ విధానం ఆచరణ యోగ్యమైన ప్రభుత్వ విధానంగా రాణించగలిగేదేమో. నిజానికి ద్వంద్వ విధానం స్వతహాగా ఆచరణ యోగ్యమైన ప్రభుత్వ విధానం కాదని నేననుకుంటాను. అదృష్టవశాత్తు ఈ అభిప్రాయం కలిగింది నాకొక్కడికే కాదు. బొంబాయి ప్రభుత్వ సభ్యులు కొందరు ద్వంద్వ విధానం కొనసాగింపునకు వ్యక్తిగతంగా మద్దతు ఇచ్చినా 1919లో వాళ్లే దీనిని నిరసించారు. ఈ పద్ధతి ఆచరణ యోగ్యం కాదన్న వారి మాటలు ఉదహరింపదగినవి. "ప్రభుత్వ రికార్డులను ఒకసారి తిరగేస్తే ప్రభుత్వానికి చెందిన ఏ శాఖలోనైనా చర్చింపదగిన లేక పరిష్కరింప దగిన ముఖ్య అంశాలు చాల తక్కువగానే ఉంటాయని తేలుతుంది. అటువంటి అంశం మరొక ప్రభుత్వ శాఖకు కూడా సంబంధించి ఉండవచ్చునన్న దానిని బట్టి దానిని అంత జాగ్రత్తగా వివేచించవలసిన అవసరం లేదు. శాంతి భద్రతలను కాపాడడం, బలవంతుల నుండి బలహీనులను రక్షించడం మొత్తంమీద ప్రభుత్వ ప్రాథమిక కర్తవ్యం. ప్రభావితులైన వివిధ వర్గ ప్రయోజనాల సంఘర్షణను ప్రభుత్వం పరిష్కరించాలి. ఏ శాఖకు ఆధిపత్యం వహించే మంత్రి అయినా ఆచరణ యోగ్యమైన ముఖ్యప్రతిపాదనలను తయారుచేసి వాటిని మరొక శాఖకు బదలాయించమని సలహా ఇస్తే.... రిజర్వుడు విభాగాల అధికారులతో సంప్రదించవలసిన అవసరముంటుంది. అటువంటి సందర్భాలు ఉన్నా ఒక విభాగం పనిని మరొక విభాగం నిర్వహించడం లాంటి సంఘటనలు చాల తక్కువ. దీని ఫలితంగా ఒక మంత్రి ఆధీనంలో ఉండి బదలాయింపదగిన పరిపాలనాంశం విషయంలో రిజర్వుడు అంశాలను అదుపు చేసే ప్రభుత్వ శాఖలతో సంప్రదించకుండానే పరిష్కరించే అవకాశం సాధ్యమైంది. అయితే దీనికి సైద్ధాంతిక పునాది లేకుండా పోయింది."

11. పరిపాలన అంశాల విభజన వల్ల ద్వంద్వ విధానం, ద్వంద్వ ప్రభుత్వం ఆచరణ యోగ్యం కాకపోవడానికి ఒక స్వాభావికమైన లోపంగా ఉంది. ఉమ్మడి కార్యనిర్వాహక విభాగానికి సాధారణ విధానం కింద ఒక ఏకీకృత సంస్థగా పనిచేయడం సాధ్యం కాదు. అటువంటి ఏకీకృతాధికారం ఉమ్మడి ఆదేశం నుండి పుట్టిన ఉమ్మడి విశ్వాసం ద్వారా కలుగుతుంది. శాసన మండలి నుండి మంత్రులుగా నియమింపబడిన వారు కార్యనిర్వాహక మండలి పట్ల తప్పనిసరిగా నిజమైన బాధ్యతతో ఉండాలి. వాళ్లను నియమించడంలో అసలు ఉద్దేశం ఇదే. ఆ రకమైన బాధ్యత లేనప్పుడు వారు వారికి నిర్దేశించిన లక్ష్యాన్ని నెరవేర్చ లేరు. అయితే వారిని శాసన మండలికి బద్ధులను చేసే చర్య వారిని సహోదరుల నుండి వేరుచేయడానికే పనిచేస్తున్నది. దీని ఫలితంగా ద్వంద్వ ప్రభుత్వంలోని ద్వంద్వ విధానం సహజంగానే బయట పడుతుంది. ద్వంద్వ విధానంలో ప్రభుత్వం ఒకసారి సందిగ్ధంలో

పడినా, చాల విషయాలలో మంత్రులు, కార్యనిర్వాహక మండలి సభ్యుల ఉపన్యాసాల వల్ల ఓటు ద్వారా బహిరంగంగా ఒకరినొకరు వ్యతిరేకించుకోవడం సాధ్యమని తేలినా ప్రభుత్వం ముందుకెళ్ళడం అసాధ్యమవుతుంది.

ఒక అవగాహన కుదుర్చుకోవడం ద్వారా ద్వంద్వ ప్రభుత్వంలోని ద్వంద్వ విధానాన్ని నిరోధించవచ్చు. అయితే ఇటువంటి అవగాహన పూర్తిగా భిన్నమైన అభిప్రాయాలు గల రెండు రాజకీయ పార్టీల మధ్య బలవంతంగాను, కృత్రిమంగాను ఏర్పడినదికావడం వల్ల సులభంగా క్లిష్ట పరిస్థితికి దారితీస్తుంది. ఇటువంటి క్లిష్టపరిస్థితి బొంబాయి రాజ్యంలో ఏర్పడనంత మాత్రాన ద్వంద్వ ప్రభుత్వంలోఉండే ఈ సహజ లోపం లేదని చెప్పడానికి వీలుగాదు. ఇది ఇచ్చే ఉపశమనం ఏమిటంటే ఈ సంకీర్ణతలో మంత్రులు తమంత తాము కార్యనిర్వాహక సభ్యులకు లొంగిపోవడం.

12. ఈ సహజ లోపాలకు ప్రతిస్పందించకుండానే కొందరు బొంబాయి రాజ్యంలో ద్వంద్వ ప్రభుత్వం విజయవంతంగా పని చేసిందని అభిప్రాయపడుతున్నారు. రాజ్యాంగాన్ని రద్దుచేయ గవర్నరుకు అధికారం లేనట్లయితే, భారత ప్రభుత్వ చట్టం అతనికి కల్పించిన అత్యవసర అధికారాలను వినియోగించుకోనట్లయితే పై అభిప్రాయాన్ని ఒప్పుకోవచ్చు. ఇది నిజమే. అంత మాత్రాన ద్వంద్వ ప్రభుత్వం బాగా పనిచేసినట్లు కాదు. బాధ్యతాయుతమైన ప్రభుత్వ విధానంగా ఇది పనిచేసిందా అన్నది ప్రశ్న. 1919లో ఎన్నో ఇతర ప్రత్యామ్నాయ పద్ధతులు ద్వంద్వ ప్రభుత్వంలో పోటీపడుతూ అంగీకారంకోసం ప్రయత్నించిన విషయం ఈ సందర్భంలో మరిచిపోకూడదు. కాంగ్రెస్ లీగ్ రూపొందించిన పథకాన్ని రాజ్యాధినేతలు రూపొందిన పథకాన్ని ఉదాహరణగా పేర్కొన వచ్చు. ఇవేవీ బాధ్యతాయుతమైన ప్రభుత్వ పరీక్షలలో నిలవలేకపోవడం వల్ల ద్వంద్వ ప్రభుత్వానికి అనుకూలంగా నిరాకరించబడ్డాయి. అందువల్ల ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని మదింపు చేయడానికి లేక అంచనా వేయడానికి అలాంటి సర్వోన్నతమైన పరిశీలనపైననే ఆధార పడాలి. ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొని ద్వంద్వ ప్రభుత్వ పనితీరును అంచనా వేస్తే వచ్చే నిశ్చితాభిప్రాయం ఏమిటంటే, ఈ రాజ్యంలో ద్వంద్వ ప్రభుత్వం విఫలమైందని చెప్పడం. ఇందులో ఆక్షేపణకు అవకాశం లేదు. బాధ్యతాయుతమైన ప్రభుత్వమంటే శాసన సభలో కార్యనిర్వాహక మండలి మెజారిటీ మద్దతు ఉన్నవాళ్ళు పదవిలో కొనసాగడం. మంత్రివర్గ బాధ్యతకు సంబంధించిన సిద్ధాంత సారాంశం ఇదే. బొంబాయి రాజ్యం లోని ద్వంద్వ ప్రభుత్వ పని తీరును ఈ రకమైన పరీక్షకు గురిచేసి, బదలాయింపబడే పాలనా విషయాల తీర్మానాలకు సంబంధించి మండలి ఎన్నిసార్లు విభేదించిందో లెక్కలోకి తీసుకుంటే ఈ విషయం స్పష్టమవుతుంది. మంత్రులు ప్రతిసారి శాసనసభలో పరాజితులు కావడం, అయినా ఏమీ జరగనట్లు పదవిలో కొనసాగడం మనకు కనిపిస్తుంది. శోచనీయమైన ఈ పరిస్థితి కింది పట్టికలో వెల్లడవుతుంది.

| సంవత్సరం | మొత్తం విభేదాల సంఖ్య | ప్రభుత్వం తటస్థంగా ఉండిన విభేదాల సంఖ్య | ప్రభుత్వ పరాజయాల సంఖ్య | అధికార పక్షాన్ని మినహాయిస్తే ప్రభుత్వ పరాజయాల సంఖ్య | ప్రభుత్వ విజయాల సంఖ్య | ఓటింగ్‌లో సమసంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1921 | 3 | – | 2 | 2 | 1 | – |
| 1922 | 17 | – | 4 | 8 | 9 | – |
| 1923 | 4 | 1 | 1 | 2 | 1 | – |
| 1924 | 19 | – | 10 | 14 | 5 | 1 |
| 1925 | 30 | 1 | – | 11 | 18 | – |
| 1926 | 3 | – | – | 1 | 2 | 1 |
| 1927 | 26 | – | 3 | 10 | 16 | – |
| 1928 | 2 | – | 1 | 1 | 1 | – |

1921లో మూడు విభేదాలకు గాను మంత్రులు రెండు సార్లు పరాజితులైనట్లు; 1922లో 17 విభేదాలకు ఎనిమిది సార్లు, 1924లో 19 విభేదాలకు 14 సార్లు, 1925లో 30 విభేదాలకు 11 సార్లు, 1926 లో మూడు విభేదాలకు ఒకసారి, 1927లో 26 విభేదాలకు 10 సార్లు, 1928లో రెండు విభేదాలకు ఒకసారి మంత్రులు పరాజితులైనట్లు పై పట్టిక చూపుతుంది. దీనికి ప్రతిస్పందించి బొంబాయి రాజ్యంలో ఒక మంత్రికూడా రాజీనామా చేసిన దాఖలా లేనేలేదు. ఈ వాస్తవాలను దృష్టిలో ఉంచుకుంటే ద్వంద్వ విధానం ఒక బాధ్యతాయుతమైన ప్రభుత్వ విధానంగా పనిచేసిందని ఒప్పుకోవడానికి వీలులేదు.

13. మంత్రులు రాజీనామా చేయక పోవడానికి ఈ విభేదాలు విశ్వాసరాహిత్యం వల్ల ఏర్పడినవి కావని శాసన మండలి భావించడమే కారణం. దీని గురించి తర్కించుకోవలసిఉంది. అలా కానప్పుడు శాసనమండలి తన ప్రతికూల ఓటుతో విశ్వాసరహితులుగా చేసిన మంత్రులకు మద్దతు నిరాకరించి ఉండేది. బొంబాయి శాసన మండలి మంత్రులకు తన అభిప్రాయాన్ని సమర్థవంతంగా చెప్పలేని స్థితిలో ఉందనే సత్యాన్ని ఇక్కడ చెప్పుకోవడం చాలా అవసరం. ముఠాలను తయారుచేయడం వల్ల, సిద్ధాంతాల జోలికి పోకుండా వ్యక్తులను కూడగట్టే దుర్నీతిని ఆశ్రయించడం వల్ల శాసన మండలి కార్యనిర్వాహక సంఘం చేతులలో ఆటబొమ్మగా మారింది. పైగా సాధారణంగా శాసనమండలి నిర్వర్తించవలసిన పనులే గాక కనీసం ఎంపిక చేయబడిన పనులను నిర్వర్తించడంలో కూడా పూర్తిగా అసమంగా మారింది. కార్యనిర్వాహక సంఘం చేత ఏ రకంగా ప్రభావితం చేయబడినప్పటికీ ప్రజాదరణ పొందిన ఏ శాసనసభ అయినా అసమర్థుడైన ఏ శాసన సభ్యుని అభ్యర్థిత్వాన్నీ సహించదు. వాక్చాతుర్యం, నిర్వహణ దక్షత, సమాధాన సంసిద్ధత – అన్నిటినీ మించి సాంఘిక, ఆర్థిక పురోగతిని

సాధించడంలో హేతువాద పునాది గల నిర్దిష్టమైన దృష్టిలేని సభ్యుని అభ్యర్థిత్వాన్ని శాసన సభ గుర్తించదు. ఇంగ్లండులో కూడా మంత్రి మండలికి కావలసినంత ప్రాధాన్యత ఉన్నప్పుడు ప్రభుత్వానికి సంబంధించిన కింది ఉద్యోగాల నియామక విషయంలో 'హౌస్ ఆఫ్ కామన్స్' కు ఇష్టంలేని వ్యక్తులను ఏ ప్రధానమంత్రి ఎన్నుకోరు. బొంబాయి శాసనమండలి ఈ విషయంలో కూడా అసమర్థంగా ఉంది. దీని ఫలితంగా రాజకీయ పదివికి ఉన్నవారిలో మంచివారిని ఎన్నుకోవడం జరగడంలేదు. అయితే శాసనమండలి బాగా నిర్వహింపబడుతున్నదన్న ఉద్దేశంతో తన ఇష్టాన్ని కార్యనిర్వాహక వర్గం మీద పూర్తిగా మోపింది. దీని ఫలితం ఏమైంది? ఇది ద్వంద్వ పద్ధతి ఒక బాధ్యతాయుత ప్రభుత్వ విధానంగా పనిచేయడానికి దోహదపడిందా? నా సమాధానం దీనికి పూర్తిగా వ్యతిరేకం. కార్యనిర్వాహక వర్గానికి వ్యతిరేకంగా శాసన సభ తీసుకొనే ఎలాంటి చర్య అయినా ఒకే ఒక ఫలితాన్ని ఇస్తుంది. అదేమిటంటే చట్టం తనకు కల్పించిన అత్యవసర అధికారాలను గవర్నరు వినియోగించుకోవడం, తాత్కాలికంగా నిలిపి ఉంచడం. రాజ్యాంగాన్ని నిలిపి ఉంచిన రాజ్యాలన్నిటిలో శాసన సభ తీసుకొనే కఠిన చర్యకు ఇలాంటి ఫలితమే ఉంటుంది. దీనిని ఒప్పు కోవడమంటే – ఏ క్షణంలో శాసనసభ తన అధికారాన్ని పూర్తిగా వినియోగించుకుంటుందో అదే క్షణంలో గవర్నరు అత్యవసర అధికారాలు అడ్డుకోకపోతే ద్వంద్వ ప్రభుత్వం పతనమవుతుంది అన్న విషయాన్ని కూడా ఒప్పుకోవలసి ఉంటుంది. ఈ రకంగా రెండు విధాలా ద్వంద్వ ప్రభుత్వం విజయవంతం కాదనేది స్పష్టం. ఒక అనుభవం ప్రకారం శాసనసభ బలహీనత కారణంగా కార్యనిర్వాహక వర్గం బాధ్యత నుండి తప్పుకొని స్వతంత్రంగా ఉంటుంది. మరొక అనుభవం ప్రకారం బాధ్యతాయుతం కాని కార్యనిర్వాహక వర్గాన్ని సక్రమమైన రీతిలో పెట్టమని గవర్నరును శాసన సభ బలవంతం చేస్తుంది.

14. గవర్నరు, తనకు రాజ్యాంగం 52 (3) వ సెక్షన్ కలిగించిన అధికారాలకు లోబడి, సంయుక్త పార్లమెంటరీ కమిటీ ఇచ్చిన సలహాలనుపాటిస్తూ రాజ్యాంగ అధినేతగా తన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తే ద్వంద్వ ప్రభుత్వం బాగా పనిచేసి ఉండేదని చాలమంది సూచించారు. ఈ అభిప్రాయాలతో నేను ఏకీభవించను. గవర్నరు తప్పనిసరిగా రాజ్యాంగ అధినేతగా పనిచేయాలన్న వాదనను బలపరిచే ఆధారమేదీలేదు. ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని ఒక బాధ్యతాయుతమైన ప్రభుత్వ విధానంగా ఎన్నుకోవడం, రాజ్యాంగ అధినేతగానే గవర్నరు మంత్రులతో సంబంధం కలిగి ఉండడం అనే విషయాలు చాలవరకు విస్మరింపబడ్డాయి. కాని గవర్నరు పదవిని ఆ స్థితికి తగ్గించ గాడదని సంయుక్త నివేదిక ( పార్లమెంటరీ సంఘం) స్పష్టం చేసింది. ఈ నివేదికలో సంఘ సభ్యులు లా పేర్కొన్నారు :

"మొదట గవర్నరు తన మంత్రుల నిర్ణయానికి కట్టుబడి నిజమైన రాజ్యాంగ గవర్నరు స్థితిలోనే ఉండాలని మేము ఆలోచించడం లేదు. సాధారణంగా అతని పరిపాలనకు అతడే బాధ్యుడు కావాలన్న ఉద్దేశంతో అతనికి కొన్ని నియంత్రణ అధికారాలను ప్రత్యేకంగా కల్పించాము." ఈ సంయుక్త పార్లమెంటరీ సంఘం నివేదిక అతనిని రాజ్యాంగ గవర్నరుగా ఉండాలని కూడా సిఫారసు

చేయలేదు. గవర్నరు మంత్రులకు సహాయపడుతూ, సలహాలిస్తూ, వారి సలహాలను పాటిస్తూ, సాధ్యమైనప్పుడల్లా వారి పద్ధతిని కొనసాగిస్తూ ఉండాలని ఈ సంఘం తన నివేదిక ఐదవ అనుచ్ఛేదంలో స్పష్టంగా తెలిపింది. ఈ సంఘం గవర్నరు రాజ్యాంగ అధినేతగా పనిచేయాలని ఉద్దేశించడం ఈ రకంగా దూరాన్వయం అవుతుంది. నిజానికి ఇటువంటి ఉద్దేశం గవర్నరుకు చట్టం కల్పించిన అవకాశాలకు పరస్పర విరుద్ధం. ఈ చట్టం గవర్నరు నిరంకుశాధికారాలను ప్రత్యేకంగా స్పష్టపరిచింది. దీనికి మించి సంయుక్త పార్లమెంటరీ సంఘం నివేదికలో మరేమీ పేర్కొనబడలేదు. ఆ అధికారాల వినియోగాన్ని పార్లమెంటరీ సంఘం నివేదికలో కూడా రద్దు చేయబడినట్లు కనబడదు. అందువల్ల గవర్నరు మంత్రుల ప్రమేయం లేకుండా తానే స్వయంగా పరిపాలించడం అతని తప్పు కాదనే అర్థం వస్తున్నది. గవర్నరు రాజ్యాంగ అధినేతగానే పనిచేయవలసి ఉంటుందని భావించినప్పుడు ఇది ద్వంద్వ పద్ధతిని బాధ్యతాయుత ప్రభుత్వ విధానంగా పనిచేయించి ఉంటుందా అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఈ ప్రశ్నకు కూడా నా సమాధానం వ్యతిరేకంగానే ఉంటుంది. ఎందుకంటే ఇప్పుడున్న పరిస్థితిని బట్టి ఒకవేళ మీరు గవర్నరుకు గల నిరంకుశాధికారాలను తొలిగించి అతనిని రాజ్యాంగ అధినేతగా మార్చితే, తత్ఫలితంగా మీరు జనసమ్మతంగా ఎన్నిక కాబడిన సభకు వ్యతిరేకంగా ప్రభుత్వ ప్రత్యేక (రిజర్వుడు) స్థితిని బహిరంగ పరచిన వారవుతారు. ఈ సంకట పరిస్థితి వల్ల ప్రభుత్వ ప్రత్యేక స్థితి గవర్నరును రక్షించలేక పోవడం, ఇదొక్కటే ఈ పరిస్థితి నుండి విముక్తిని కలిగించేది కావడం, దీనివల్ల శాసనసభ ఇష్టానికి అనుగుణంగా పరిపాలన సాగించే అవకాశం కలగడం గమనించవలసిన అంశాలు. గవర్నరు అదుపు నుండి వాళ్లను వేరుచేసినట్లయితే ప్రభుత్వ బదలాయింపు శాఖలతో సమాన ప్రతిపత్తి వాళ్ళకు కలిగించడం తప్ప మరొక ప్రత్యామ్నాయం లేదు. దీనిని మరొకరకంగా చెప్పవచ్చు. గవర్నరు హెూదాను ఒక రాజ్యాంగ అధినేతగా మాత్రమే తగ్గించాలనుకుంటే మాత్రం మొదట మీరు ద్వంద్వ ప్రభుత్వాన్ని రద్దు చేయాలి.

15. ఇప్పటి వరకు నేను ద్వంద్వ ప్రభుత్వం కొన్ని కారణాల వల్ల సరిగా పనిచేయలేక పోయిందన్న దృష్టితో వాదించాను. సహజంగా ఇందులో ఉన్న కొన్ని లోపాల కారణంగా ఇది సరిగా పనిచేయలేక పోవడమే గాక ఒక బాధ్యతాయుత ప్రభుత్వ విధానంగా అసమర్థమైనదని కూడా వాదించాను. నిజానికి ద్వంద్వ ప్రభుత్వం పూర్తి ద్వంద్వ పద్ధతిలో రెండు వేర్వేరు ప్రభుత్వాలతోను, రెండు వేర్వేరు శాసన సభలతోను పనిచేస్తున్నది. ఒక పద్ధతిలో శాసనసభ కార్యనిర్వాహక వర్గానికి లోబడి ఉంటే మరొక పద్ధతిలో కార్యనిర్వాహక వర్గం శాసన సభకు లోబడి ఉంటుంది. అయితే 1919లో భారత ప్రభుత్వం ద్వంద్వ ప్రభుత్వానికి గల ప్రత్యామ్నాయాల్ని తోసి పుచ్చింది. 'మార్లే-మింటో' సంస్కరణల ఫలితంగా ఏర్పడిన ప్రభుత్వ విధానం కూడా ఈ ఆక్షేపణకు గురి అయింది. 'మాంటేగు- ఛేమ్స్‌ఫర్డ్' నివేదికలో కూడా ఈ ఆక్షేపణలకు సంబంధించిన అంశాల ప్రస్తావన అంతగా కనిపించదు. భారత రాజకీయ జీవిత పరిణామ క్రమంలోని ఈ దశలో అటువంటి ఒక విధానాన్ని తీసుకోవడాన్ని ఊహించలేము. అందువల్ల అటువంటి పద్ధతికి అనువైన విషయాన్ని

నేను చెప్పదలచుకోలేదు. ద్వంద్వ ప్రభుత్వాన్ని రద్దుచేసి, పాలనా విషయాలనన్నిటిని మంత్రుల అధీనంలోకి మార్చడ మొక్కటే దీనికి ఇప్పటికి కనిపించే ప్రత్యామ్నాయం.

16. నా సహచరులు ద్వంద్వ ప్రభుత్వం కొనసాగాలని అనుమతిస్తూ చేసిన సిఫారసులకు ప్రతిగా నా అభిప్రాయాలను ప్రకటించడం ఇప్పటివరకు జరిగింది. ఇప్పుడు ప్రత్యేకంగా కొనసాగుతున్న పరిపాలనా విషయమైన శాంతి భద్రతల విభాగం గురించి నా ఆక్షేపణలకు ఆధారాలను చూపడానికి ప్రయత్నిస్తాను. ఒక మంత్రికి శాంతిభద్రతల విభాగాన్ని అప్పగించడంలో ఒక ప్రధానమైన సమస్య ఉంది. ఈ విభాగం ఓటర్ల ఇష్టానికి లోబడి ఉండడం వల్ల, శాసన మండలి ప్రతికూల ఓటుతో వీగి పోవడంవల్ల ఈ శాఖను ఒక మంత్రి నిష్పాక్షికంగా పరిపాలించలేడు. ఈ పరిస్థితి వల్ల కలిగే అపరిహార్యమైన ఫలితం ఈ విభాగంలో పనిచేసే ఉద్యోగులను అసత్యమైన లేక కృత్రిమమైన స్థితిలో ఉంచుతుందనే భయం కూడా ఉంది. ఈ విభాగంలోని ఉద్యోగులు ఎప్పుడు సమర్థింపబడతారో, ఎప్పుడు నిందింపబడతారో ఎప్పటికీ తెలియదు. ఈ అనిశ్చితస్థితి శాంతి భద్రతలను కుంటుపరుస్తుంది. హిందువులకు మహమ్మదీయులకు మధ్య కలహాలు సాధారణమై పోయిన దృష్ట్యా మనం శాంతి భద్రతల విభాగాన్ని ఒక మంత్రి ఆధీనంలోకి మార్చకూడదు. ఎందుకంటే మంత్రి తరచుగా మార్పులకు లోనయ్యే ప్రజాభిప్రాయాన్ని మన్నించవలసి ఉంటుంది. హిందూ మహమ్మదీయుల పరస్పర భిన్నమైన అభిప్రాయాల మధ్య తన విభాగాన్ని కొనసాగించవలసి ఉంటుంది.

17. ఈ వాదం నా సహచరులను ఎంతగానో ప్రభావితం చేసినప్పటికీ, నాపైన మాత్రం ఎలాంటి ప్రభావమూ చూపలేదు. ఇది దొరల పెత్తనానికి సంబంధించిన వాదనలో ఒకటి. దీనిని అనుమతించాలంటే నిరంకుశ ప్రభుత్వమే ఒక మంచి ప్రభుత్వ విధానంగా అంగీకరించాలి. దురదృష్టవశాత్తు ఇలాంటి నిరంకుశ ప్రభుత్వం చాల కాలంగా భారతదేశానికి తెలుసు. అందువల్ల ఈ వాదనతో ఎవరినీ మోసం చేయడం సాధ్యంకాదు. దీనిని ఒప్పుకొంటే అన్ని రకాల బాధ్యతలతో కూడిన ప్రభుత్వాన్ని నష్టపోతాము. గతం ఏదైనా కానీ, బాధ్యతాయుత ప్రభుత్వం భారతదేశంలో ఏర్పడబోతున్నది. కాలంలో వచ్చే ఏ మార్పైనా సిద్ధాంత విస్తృతి దిశలో ఉండాలి. ఈ సిద్ధాంతాన్ని విస్తృత పరచని ఏ ప్రణాళిక కూడా ప్రభుత్వానికి ప్రజలకు మధ్య తీవ్రమైన వైరుధ్యాన్ని సృష్టిస్తుంది. నా అభిప్రాయం ప్రకారం శాసన సభలో మంత్రులు వారి అనుయాయుల నినాదాలకు లోబడతారని, లేక వారి అనుయాయులు అపకారం చేసే స్వభావంతో ఉంటారని భయపడడానికి గతంలో సాక్ష్యాలు లేవు. ఒక వేళ అలా జరిగితే అది మంత్రులకు జరిగే పెద్ద అన్యాయమవుతుంది. 1922లో సహాయ నిరాకరణ ఉద్యమ కారులు వశం చేసుకోవడం వల్ల స్థానిక సంస్థలు, పురపాలక సంఘాలు రద్దు చేయబడ్డాయి. అదే సమయంలో గాంధీ గారి స్వాతంత్ర్యోద్యమం సంపూర్ణ స్థితిలో ఉంది. ఈ పరిస్థితి మంత్రులు ఓటర్ల కోరిక మేరకు స్వతంత్రంగా వ్యవహరించగలరనే నమ్మకం కలిగిస్తుంది. బొంబాయి శాసన మండలి అవసరమైన హద్దులను పాటిస్తూ తన కార్యకలాపాలను తగిన బాధ్యతతో నిర్వహిస్తున్నట్లు ప్రభుత్వ ప్రతినిధులు ప్రకటిస్తారనుకుంటాను. అయితే ఒకవేళ వర్గపోరాటం

జరిగినప్పుడు అలాంటి ఆలోచనలు ఉన్నప్పుడు శాసన సభ సంయమనంతో వ్యవహరిస్తుందని ఎవరైనా అనుకుంటే అది బదలాయింపునకు విరుద్ధమైన వాదమేమీ కాదు. ఏ వర్గమూ సాధారణాధికారాలు గల తన ప్రతినిధులను బాధ్యతా రహితులుగా, శాంతి సద్భావాలకు భిన్నంగా ప్రవర్తించే విధంగా చేయదని కొందరు నమ్ముతారు. అందువల్ల శాంతి భద్రతల విభాగాన్ని ప్రత్యేక (రిజర్వుడు) శాఖగా ఉంచడాన్ని సమర్థించే వారిలో కలిగే భయాందోళనలు ఆధారంలేనివి. ఈ శాఖను బదలాయించకూడదని సిఫారసు చేయడంలో నా సహోదరులు చాల జాగ్రత్త తీసుకొంటున్నారు. ఈ రకంగా వారు తెలివైన మార్గాన్ని అనుసరించినట్లు నేనను కోను. వారి అతిజాగ్రత్త భవిష్యత్తులో వారి ప్రతిపాదనలను ప్రయోగాత్మకంగా చేసుకోవడానికి, శాంతి భద్రతల శాఖకు సంబంధించిన భయాందోళనలు నిజమైనవో కావో తెలుసుకోవడానికి అవకాశం లేకుండా చేస్తున్నది. శాంతి భద్రతల బదలాయింపు విషయంలో కలిగిన అవ్యక్తమైన భయం 1919లో పరిపాలనా శాఖల బదలాయింపుల విషయంలో కూడా ఉండేది. ఆ శాఖలన్నీప్రస్తుతం మంత్రుల ఆధీనంలో ఉంచబడ్డాయి. రాజ్యాల కార్యదర్శి (సెక్రటరీ ఆఫ్ స్టేట్స్), భారత ప్రభుత్వం సాహసంతో వీటన్నిటినీ పక్కకు తోసిపారవేయడం జరిగింది. శాంతి భద్రతల విషయంలో నేను కూడా ఇదే మార్గం అనుసరిస్తాను.

18. మనమేదైనా ప్రయోగం చేయదలిస్తే తొందరగా చేయడం మంచిది. ఒకేసారి ఒక శాఖను బదలాయిస్తే దానికి సంబంధించిన ఉద్యోగాలలో ఎక్కువమంది భారతీయులను నియమించ వచ్చుననడం తెలిసిన విషయమే. ఆంగ్ల ఉద్యోగుల కంటె భారతీయ ఉద్యోగులు అసమర్థులు, అనుభవశూన్యులు కావచ్చు. ప్రతి సంధి కాలంలోను సహజంగా జరిగే నష్టాల శాంతి భద్రతల విభాగాన్ని బదలాయించడం వాయిదా వేస్తే ఇంకా ఎక్కువ అవుతాయి. అందు వల్ల వెంటనే చర్య తీసుకోవడం మంచిది. ఈ విషయంలో సహాయపడడానికి, పని ఆగకుండా కొత్త రాజ్యాంగాన్ని తయారుచేయడానికి విశ్వసనీయమైన, అనుభవ సిద్ధులైన శిక్షణ పొందిన పౌర ఉద్యోగులున్నారు. అదృష్టవశాత్తు ముఖ్యమైన అధికారే ఈ సలహా ఇచ్చారు. ఒక అనుభవ శాలియైన పౌర ఉద్యోగి ఈ సలహాకు సంబంధించిన ఊహలను చిన్న సవరణతో 'బార్కర్'కు పంపాడు. 'బార్కర్' ఈ ఊహలను 'భారత ప్రభుత్వ భవిష్యత్తు – ఐ.సి.యస్." అనే తన గ్రంథంలో పునర్ముద్రించారు.

బార్కర్ ఆ విషయాన్ని ఇలా ప్రస్తావిస్తారు. "అనుభవశాలియైన పౌర ఉద్యోగి ప్రకటించిన అలాంటి విమర్శ ధోరణి.... శాంతి భద్రతల నిర్వహణను, భూమి శిస్తుకు సంబంధించిన విషయాలను, కౌలు హక్కులను మొదట బదలాయించాలని ఆ వివరణ పత్రంలో అతను కోరారు. ఈ శాఖలన్నీ భారత పౌర సర్వీసులన్నిటిలో ఉన్న సమర్థమైన విభాగం ద్వారా పరిపాలింపబడాలని అతని అభిప్రాయం. ఆ శాఖల పరిపాలనకు సంబంధించిన సిద్ధాంతాలు చాలాకాలం కిందటే ఏర్పడి అందరికీ పరిచయమయ్యాయి. దీనికొక గొప్ప సంప్రదాయముంది.

ఈ సంప్రదాయం పరిపాలనకు అవసరమైన సహాయాన్ని, నిష్కపటమైన సలహాను సంపాదిస్తుంది. అప్పుడప్పుడు కుల, మత ఉద్రిక్తతలకు లోనైనా భారత ప్రజలు శాంతి కాముకులు.

వీరిని పాలించడం సులభం. అందువల్ల శాంతి భద్రతల నిర్వహణ కష్టం కాదు. భూమి శిస్తు, కౌలు దార్ల సమస్యలు పై వర్గపు ప్రజల కంటె సామాన్య ప్రజల ప్రయోజనాలనే ప్రభావితం చేస్తాయి. శాసన సభలో వీరి సమస్యలే ప్రస్తావింపబడతాయి. (అందువల్ల పైన చూపిన ఐదవ నియమం ప్రకారం బదలాయింపు తగదు.) ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకున్నపుడు రాజ్యాలకు నిర్ణయించిన ఓటు హక్కు విధానం, నియోజక వర్గ పద్ధతి పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. శాంతి భద్రతలకు, రెవిన్యూ పాలనకు సంబంధించిన శాఖలలో కొన్నిటినైనా బదలాయించడానికి భయపడే, వేర్వేరు శాఖల పరిపాలనా పద్ధతిని సమర్థించే వాడు తన ప్రణాళికకే తాను భయపడుతున్నట్లు ఒప్పుకుంటాడు. ద్వంద్వ ప్రభుత్వాన్ని నేను సమర్థించక పోయినప్పటికి ప్రయోగం చేయడంలో భయపడకూడదు. ఎందుకంటే ద్వంద్వ ప్రభుత్వ లేక మరి ఏ ఇతర పద్ధతి విజయానికైనా కావలసిన ముఖ్యమైన లోక జ్ఞానం, సద్భావం, సహనం మంత్రులలో ఉంటాయని నేను విశ్వశిస్తాను.

19. శాంతి భద్రతల బదలాయింపు విషయంలో అల్ప సంఖ్యాకుల ఆతురత నాకు బాగా తెలుసు. శాంతి భద్రతల శాఖను ప్రత్యేక (రిజర్వుడు) శాఖగా ఉంచడం ద్వారా వాళ్ళు ఎలాంటి ప్రయోజనం ఆశిస్తారో అర్థం చేసుకోవడం కొంచెం కష్టమే. శాంతి భద్రతలను నిర్వహించడంలో భారతీయుడైన ఉన్నతోద్యోగికి, పాక్షిక దృష్టి కలిగిన మంత్రికి తేడా ఉండదు. ఆ ఉన్నతోద్యోగి ఒకవేళ ఐరోపా వాడైతే తటస్థంగా ఉంటాడు. ఇది కూడా పెద్ద ప్రయోజనకారి కాదు. ఎందుకంటే తటస్థంగా ఉన్న వ్యక్తి కూడా పక్షపాతం లేకుండా ఉంటాడని చెప్పడానికి వీలులేదు. తటస్థంగా ఉన్న వ్యక్తికి కూడా స్వతంత్ర ప్రయోజనాలు, భిన్నమైన అభిప్రాయాలు ఉంటాయి. ఉండకపోతే అతడు అజ్ఞాని అయి ఉండాలి. శాంతి భద్రతలు ప్రత్యేక శాఖగా ఉండాలని ఆతురత పడే అల్ప సంఖ్యాకులకు ఐరోపాకు చెందిన అధికారి ఏ ప్రయోజనం చేకూరుస్తాడనేది సందేహమే. నిరంకుశ పరిపాలన కంటె యంత్రాంగ పద్ధతి పెద్ద ప్రయోజనాన్ని కలిగిస్తుందని అల్ప సంఖ్యాక ప్రతినిధులు గ్రహించకపోవడం నాకు భయాన్ని కలిగిస్తున్నది. వాళ్ల రక్షణకు పూచీ ఉండాలంటే కార్యనిర్వాహకవర్గ చర్యలను నియంత్రించే శక్తి వాళ్ల కుండాలి. ఈ నియంత్రణకు నిరంకుశ పద్ధతి అవకాశమివ్వదు. ఒక వేళ అల్ప సంఖ్యాకుల ప్రయోజనాలను నిరంకుశ పద్ధతి కాపాడడం అనేది ఒక సంకల్పంతోనే జరుగుతుంది. అయితే ఏ సందర్భంలోనైనా అది ఉపేక్షచేయబడితే అప్పుడు అల్ప సంఖ్యాకులు చేయగలిగిందేమీ ఉండదు. మరొక రకంగా చెప్పాలంటే మంత్రిని ఆదేశించవచ్చు; ఉన్నతోద్యోగికి సలహా కూడా ఇవ్వలేము. ఉద్యోగవర్గ పాలనకు మంత్రుల ప్రభుత్వానికి గల ప్రధాన భేదం ఇదేనని నాకనిపిస్తుంది. అల్ప సంఖ్యాకులు శాంతి భద్రతలను బదలాయించడం వల్ల ఎలా నష్టపోతారో వ్యక్తిగతంగా నాకర్థం కాదు. మానవుల కంటె హీనంగా చూడబడే సభ్యులుగల అల్ప సంఖ్యాక వర్గానికి చెందిన వాడినైనప్పటికి నేనీ విషయాన్ని చెపుతున్నాను. శాసన సభలో అల్ప సంఖ్యాకులకు కావలసినంత ప్రాతినిధ్యం ఉన్నపుడు శాంతి భద్రతలను బదలాయించడం వారికి లాభాన్నే కలిగిస్తుందని నా అభిప్రాయం. ఎందుకంటే అలాంటి బదలాయింపు ఇప్పటివరకు వారికి లేని నియంత్రణ శక్తిని

ఇప్పుడు వారికి కలిగిస్తుంది. ఒక నమ్మకమైన వ్యక్తి అదుపులేనపుడు చేసే పనికంటె యజమాని ఆధీనంలో ఉన్న దొంగ పని మెరుగుగా ఉంటుంది అనే వివరణలో సత్యం లేదేమో అల్ప సంఖ్యాకులు తీవ్రంగా ఆలోచించాలి. ఈ సత్యం వాళ్లు గ్రహించినా అధికారం చెలాయించడానికి వీలైన కింది తరగతి ఉద్యోగులనే ఎన్నుకుంటారు.

20. బదలాయింపును కాక ప్రత్యేకత (రిజర్వుడు)ను కోరడానికి అల్ప సంఖ్యాకులకు మరొక ముఖ్యమైన కారణం ఉంది. వాళ్ల విషయం పునారవృతం కాకుండా ఉండడానికి శాసన సభలో వాళ్ల ప్రాతినిధ్యం కూడా చాల తక్కువ. అల్ప సంఖ్యాకుల వాదం ప్రకారం శాంతి భద్రతలను ప్రత్యేక శాఖగా చేసి శాసన సభలో ప్రాతినిధ్యం ఉండక పోవడం, ఆ శాఖను బదలాయించి ప్రాతినిధ్యం కావలసినంత ఉండడం అనే రెండు విషయాల మధ్య ఉంటుంది. ఇక్కడ మళ్లీ మొదటి ప్రత్యామ్నాయం కంటే రెండవ దానినే ఎక్కువ ప్రయోజన కారిగా భావించవచ్చు. అందువల్ల శాంతి భద్రతల విభాగం బదలాయింపునకు వ్యతిరేకంగా ఒత్తిడి తేవడం కంటే కావలసినంత ప్రాతినిధ్యం కావాలని పట్టుబట్టడం అల్ప సంఖ్యాకులకు మరింత ప్రయోజనం కలిగిస్తుంది. కావలసినంత అల్పసంఖ్యాక ప్రాతినిధ్యం ఉన్నప్పటికి శాంతి భద్రతల విభాగంలో వారికి ప్రతికూలంగా ఏర్పడిన దుష్పరిపాలన తొలిగి పోయినపుడు నా సిఫారసుకు ఒక షరతును జోడిస్తాను. ఈ షరతు ప్రకారం శాసన మండలిలో సుమారు 40 శాతం మంది అల్ప సంఖ్యాకులు శాంతి భద్రతల విభాగాన్ని ప్రత్యేకంగానే ఉంచాలని ఓటు ద్వారా నిర్ణయిస్తే, అప్పుడు ఆ విభాగం బదలాయింపబడిన విభాగాల జాబితా నుండి తొలింపబడుతుంది. నేను ఈ ప్రతిపాదనను అధిక సంఖ్యాకులను దృష్టిలో పెట్టుకొని చేస్తున్నాను. ఆగస్టు 20, 1917 నాటి ప్రకటనలో సూచించి బాధ్యతాయుత ప్రభుత్వ సిద్ధాంతం అమలు జరిగితే ఏదో ఒకరోజు శాంతి భద్రతల విభాగం తప్పనిసరిగా బదలాయింపబడే తీరాలి అన్నది నా అభిప్రాయం. ఈ ప్రతిపాదన వెంటనే సరియైన ఫలితమివ్వకపోతే, ఆ విషయంలో అల్ప సంఖ్యాకుల భయం నిజమైతే శాంతి భద్రతల విభాగం బదలాయింపును రద్దు చేయడంలో ఆటంకం ఉండదు.

## రెండవ అధ్యాయం

## పనిలో కార్యనిర్వాహక వర్గం

21. మంత్రిత్వ బాధ్యతపై ప్రవేశ పెట్టబడిన ఏకస్వామ్య ప్రభుత్వం నాలుగు ప్రధాన ప్రశ్నలను లేవనెత్తుతుంది. మొదటి ప్రశ్న కార్యనిర్వాహక వర్గ స్థిరత్వానికి సంబంధించింది. కార్యనిర్వాహక వర్గంలో వర్గ ప్రాతినిధ్యానికి సంబంధించింది రెండవ ప్రశ్న. మూడవ ప్రశ్న కార్యనిర్వాహక వర్గ బాధ్యతను అమలు చేయడానికి సంబంధించినది. కార్యనిర్వాహక వర్గ సభ్యులలో పరస్పర సంబంధాన్ని చెప్పేది నాల్గవ ప్రశ్న.

22. శాసన సభ్యుల మత ద్వేషం కారణంగా శాసన సభలో ముఠాలు ఏర్పడతాయి. ఇది మొదటి ప్రశ్నకు సంబంధించిన విషయం. సిద్ధాంతాల పట్ల విశ్వాసం కలిగి ఉండటానికి బదులు మత ప్రాధాన్యం చూపినపుడు కొన్ని కుల ప్రయోజనాలకు అనుగుణమైన, మతాధీనత పైన మంత్రివర్గం ఆధారపడవచ్చు. సిద్ధాంతాలతో సంబంధం లేకుండా తమ విశ్వాసాన్ని తమకు ఇష్టం వచ్చిన రీతిలో మార్చుకోవడం వల్ల మంత్రివర్గం ఏర్పడిన వెంటనే పతనం కావచ్చు. దీనిని నివారించాలంటే మంత్రిమండలిలో వివిధ వర్గాల ప్రతినిధులు ఉండాలి. ఒకసారి మంత్రివర్గం ఏర్పాటైతే పదవీకాలం పూర్తయ్యే వరకు తొలిగింపబడకుండా ఉండాలి. కార్యనిర్వాహక వర్గం అస్థిర మవుతుందన్న భయం నిజం కావచ్చునని కూడా నాకు తెలుసు. అయినా దీని కొక నివారణ ఉందని లేదా ఒక నివారణను సూచించవచ్చునని నేననుకోను. శాసనసభలో ముఠాతత్వం ప్రదర్శించడం భారత దేశంలోనేగాక ఇతర దేశాలలో కూడా ఉంది. తరచుగా మంత్రి వర్గాన్ని ఛిన్నాభిన్నం చేసే ముఠాతత్వానికి 'ఫ్రెంచ్ ఛాంబర్ ఆఫ్ డిప్యూటీస్' చెప్పుకోదగిన ఒక ఉదాహరణ.ఇలాగే పరిస్థితి సహించలేనంతగా ఉన్నప్పటికీ ఫ్రెంచి ప్రజలు దీనికొక నివారణ కావాలనుకోరు.మనం ఊహించింది అది నిజమవుతుందని భావించి నప్పుడు, పరిస్థితి అసహనంగా మారినప్పుడు నివారణ ఒక్కటే సరియైనది కాదని నేను ఒప్పుకుంటాను. ఈ నివారణ మంత్రుల బాధ్యతను పూర్తిగా బలహీన పరుస్తుందన్నది పెద్ద వివాదం కాదు. ఏమైన ప్పటికి నివారణ పద్ధతి సభలోని ముఠాలను ఏకం చేయడానికి బదులు వాటి మధ్య ఎడం సృష్టిస్తుందని నా భయం. ఇదే జరిగితే నివారణ జబ్బును నయం చేయడముటుంచి దానినింకా తీవ్ర తరం చేస్తుంది. నియోజకవర్గాలను పునర్నిర్మించడమే దీనికి నిజమైన నివారణ అని నా కనిపిస్తుంది.

23. దేశ కార్యనిర్వాహక వర్గంలో కులప్రాతినిధ్యాన్ని గుర్తించడం నేను వ్యతిరేకిస్తాను. ఈ పద్ధతిలో ప్రభుత్వ యంత్రాంగానికి చెందని ఒక ప్రముఖమైన అంగం నివారణకు వీలులేనంతగా చెడిపోతుంది. మంత్రివర్గంలో అధికారికమైన ప్రాతినిధ్యంతో గుర్తింపు కలిగిన కులాల సంఖ్యను బట్టి ప్రభుత్వం ద్వంద్వ ప్రభుత్వం లేక త్రయ ప్రభుత్వం అవుతుంది. ఇప్పుడు మనకున్న రాజకీయ ద్వంద్వ విధానానికి కొంత భిన్నంగా, నిస్సందేహంగా ఇది కుల ప్రాతిపదిక మీద ఏర్పడిన ద్వంద్వ ప్రభుత్వమే అవుతుంది. రాజకీయ ద్వంద్వ విధానం కంటె ఈ పద్ధతి మెరుగైనదేమీ కాదు. రెండు పద్ధతులలోను సహజమైన లోపాలున్నాయి. రాజ్యాంగపునర్నిర్మాణ ధ్యేయం ఏకీకృత ప్రభుత్వమైతే రాజకీయ పద్ధతికి సంబంధించిన ద్వంద్వ ప్రభుత్వం లాగా కుల ప్రాతినిధ్య పద్ధతికి సంబంధించిన ద్వంద్వ ప్రభుత్వం కూడా పూర్తిగా రద్దు చేయబడాలి. నిజానికి రాజకీయ ద్వంద్వ ప్రభుత్వాన్ని రద్దు చేయడంలో గల కారణం పెద్దది. రాజకీయ ద్వంద్వ ప్రభుత్వ విధానంలో సూత్ర పునాదిమీద నిలబడ్డ ప్రభుత్వానికి అస్తిత్వముంటుంది. కుల ద్వంద్వ విధానంలో ప్రభుత్వం తప్పనిసరిగా భావజాలం మీద ఆధారపడుతుంది.

24. గ్రేట్ బ్రిటన్ మరియు స్వయంపాలక అధినివేశ రాజ్యాలకు రాజ్యాంగంలో ప్రధాన సూత్ర మేమిటంటే ప్రతి మంత్రి న్యాయస్థానానికి లోబడి ఉండడం. ఇంగ్లీషు రాజ్యంలోను అధినివేశ

రాజ్యాలలోను నిజానికి వివేకం గల ఈ సూత్రం కారణంగానే మంత్రుల తప్పిదాల నుండి ప్రజలు వ్యక్తిగతంగాను ఆస్తుల విషయంలోను సురక్షితంగా ఉన్నారు. చట్ట వ్యతిరేకమైన పనులు జరిగినపుడు కార్యనిర్వాహక వర్గపు చట్ట బద్ధమైన బాధ్యత విషయంలో భారతదేశానికి బ్రిటనుకు ఎంతో వ్యత్యాసముంది. సర్ ఇలియాజా ఇంపే నేతృత్వంలోని న్యాయవ్యవస్థకు వారన్‌హేస్టింగ్స్ సమర్థించిన కార్యనిర్వాహక వ్యవస్థకు మధ్య జరిగిన సౌహార్ద్ర పోరాట గమనంలో 1780 కి ముందే భారతదేశంలోని కార్యనిర్వాహక వర్గం న్యాయ స్థానాల అదుపు నుండి తనకు తానే రక్షణను సంపాదించుకొన్నది. అప్పటి నుండి ఆ రక్షణ కొనసాగుతూ ఇప్పటి భారత ప్రభుత్వ చట్టం 110, 111 సెక్షన్లలో చోటు చేసుకొంది. సాధారణమైనది కాకుండా స్థానికమైనది కావడం చేత ఆ రక్షణను సహించడం జరిగింది. భారతదేశంలో చేసిన చట్టపరమైన తప్పిదాలకు కార్యనిర్వాహక వర్గ సభ్యులు ఇక్కడ శిక్ష నుండి తప్పించుకున్నా ఇంగ్లాండులో వారికి శిక్ష పడే అవకాశముంది. పాత పరిపాలనలో యూరపుదేశస్థుడు కావడం వల్ల ప్రతికార్యనిర్వాహక వర్గ సభ్యుడు పదవీ విరమణ తరువాత ఇంగ్లాండుకే వెళ్లేవాడు. అందువల్ల దూరంలో ఉండడం చేత వాళ్ళు బాధ్యతను సరిగా నెరవేర్చేవారు కాదు. ప్రస్తుతం కార్యనిర్వాహక వర్గ ఏర్పాటు మార్పుకు లోనైంది. ఇందులోని ఉద్యోగులంతా ఎక్కువగా భారతీయులు. వీళ్లు ఇంగ్లాండుకు వెళ్ళే అవకాశం చాల తక్కువ కాబట్టి బాధ్యతలను గుర్తు చేసి ఖచ్చితంగా అమలుచేయమని బలవంతపెట్టలేము. అందువల్ల ఇప్పటి పరిస్థితి ననుసరించి ఇప్పట్లో గాని, భవిష్యత్తులో గాని మంత్రుల దుశ్చర్యలకు ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వ మనుగడకే ప్రమాదం ఏర్పడుతుంది. అందువల్ల భారత ప్రభుత్వ చట్టం 110, 111 సెక్షన్లను సవరించాలని సిఫారసు చేస్తున్నాను. మంత్రులు అసంబద్ధ ఉత్తర్వులు జారీ చేసినపుడు భారతీయులుగాని, యూరోపియనులుగాని మొత్తం మీద బ్రిటిషు పౌరులు న్యాయస్థానాలను ఆశ్రయించే అవకాశాన్ని ఈ సవరణ కలిగిస్తుంది. మంత్రుల విషయంలో ఈ రకపు చట్ట పరమైన మార్పును 1919లో కోరడం జరిగింది. మంత్రులకు కార్యనిర్వాహక వర్గ సభ్యులకు మధ్య విభేదం పుట్టిస్తుందనే కారణంతో అప్పట్లో ఈ మార్పు అంగీకరింపబడలేదు. రాజ్యాలలో పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పడినపుడు ఈ ఆక్షేపణ ఉండదు.

25. చట్ట విరుద్ధమైన చర్యలు జరిగినపుడు మంత్రులు చట్టానికి బద్ధులై ఉండాలి. భారత దేశంలో మంత్రివర్గ బాధ్యత ఇంకా సూత్ర ప్రాయంగానే ఉందనుకుంటాను. శాసన సభ, కార్యనిర్వాహక వర్గం మంత్రి వర్గ బాధ్యతకు సంబంధించిన అంతర్విషయాలను బాగా జీర్ణించుకొనే వరకు దాని ఉపయోగం తెలియని మత విశ్వాసం పట్ల అధిక విధేయతతో దానిని నిందించే వాళ్ల చేతులలోని అధికార దుబారాను అరికట్టడానికి ప్రయత్నించడం మంచిది.

26. కార్యనిర్వాహక వర్గ సభ్యుల మధ్య ఉండవలసిన సంబంధం – ప్రతిసభ్యుడు తన పనులకు మాత్రమే బాధ్యుడు అని కానీ – లేక సభ్యులందరి పనులకు బాధ్యుడు అని కానీ – అంటే బాధ్యత వ్యక్తిగతం కానీ లేక సంయుక్తం కానీ – అనేది ఒక సమస్య. ఈ విషయంలో ఎవరూ గిరిగీచి

కూర్చోవలసిన పనిలేదు. నేను సమిష్టి బాధ్యతనే ఒప్పుకుంటాను. ఈ పద్ధతి ప్రకారం తప్పుచేసిన మంత్రిని శిక్షించే విషయంలో శాసనసభ నిస్సహాయ అవుతుంది. సమిష్టిబాధ్యతతో ఆమోదయోగ్యం కాని పనులు చేసిన మంత్రిని శాసన సభ తొలిగించలేదు. శాసన సభ అతని సహచరుల నందరినీ తొలిగించడానికి సిద్ధపడితే తప్ప ఒక మంత్రిని నియమబద్ధంగా కూడా మందలించే పరిస్థితిలో ఉండ లేదు. పార్లమెంటుకు సంబంధించిన కార్యనిర్వాహక వర్గంతో కలిసి పనిచేసే ఏ శాసన సభా ధైర్యంగా ఈ పని చేయలేదు. ఎందుకంటే ఇలా చేసి కార్యనిర్వాహక వర్గాన్ని తొలిగిస్తే, కార్యనిర్వాహక వర్గం కూడా శాసనసభ రద్దును కోరి దానిని తొలగిస్తుంది. ఈ లోపం ఉన్నప్పటికీ రెండు కారణాల వల్ల నేను సమిష్టి బాధ్యతనే ఆమోదిస్తాను. ఆధునిక రాజ్యంలో చట్ట సమన్వయంతో పాలక సంస్థగా ఉండవలసిన కార్యనిర్వాహక వర్గానికి ఆ పని అప్రధానమై పోయింది. శాసన సభకు ప్రణాళిక ప్రతిపాదనలను పంపడం దీని ముఖ్యమైన పని. నిజానికి ఈ పని అవసరమైనదే. కార్యనిర్వాహక వర్గం ఈ పని చేయక పోయినట్లయితే శాసనసభల ప్రయోజనాలు చాల వరకు తగ్గిపోతాయి. అయితే ప్రణాళికలు తయారుచేసి పంపే పనిలో కార్యనిర్వాహక వర్గ సభ్యుల దృక్పథంలో ఐక్యత ఉండాలి. సభ్యుల మధ్య పూర్తి పొందిక లేనపుడు వారి ఆలోచనలలో ఐక్యత సాధ్యం కాదు. సమిష్టి బాధ్యత ఒక్కటే అలాంటి పొందికను కలిగిస్తుందని నాకనిపిస్తుంది.

మతాతీత, కులాతీత రాజకీయ వేదికను పెంపొందించడానికి వ్యక్తిగత బాధ్యత అనుమతించ దన్న భయం ఉంది. సమిష్టి బాధ్యతను సిఫారసు చేయడానికి ఇది రెండవ కారణం. వ్యష్టి బాధ్యత ముఠాలేర్పడడానికి దోహద పడుతుంది. వేరు వేరు ముఠాలుండటం వల్ల రాజ్యంలో ప్రభుత్వ పాలన మిశ్రితమై పోతుంది. ఇది మరెన్నో ముఠాలు ఏర్పడటానికి దారి తీస్తుంది. దీనివల్ల పరిపాలన కుంటుపడి అనిశ్చిత స్థితి ఏర్పడుతుంది. సరైన ఆలోచనా విధానానికి బదులు ఎత్తుకు పై ఎత్తులతో ప్రభుత్వ విధానంలోని సరళత దెబ్బతింటుంది. సమిష్టి బాధ్యత ఉన్నపుడు ఒక రాజకీయ పార్టీ భిన్నాభిప్రాయాలు గల చిన్న చిన్న విభాగాలతో కూడి ఉన్నా, ప్రతి విభాగం ఒకే విధానాన్ని రూపొందించే ప్రయత్నం చేయడమేగాక దానికి కట్టుబడి ఉంటుంది. ఒక విభాగపు ప్రణాళిక కంటె విశాలమైన పార్టీ ప్రణాళిక భారతదేశ పరిస్థితులు తెలిసిన అందరికీ అవసరమైన ఒక రకపు అవగాహనను కలిగిస్తుంది.

27. సమిష్టి బాధ్యతను ఎలా సాధించాలన్నది ఒక ముఖ్యమైన విషయం. చట్ట బద్ధంగా సాధించినపుడు అది పరిపాలనాధికారికి గాని, శాసనసభకుగాని పూర్తి కార్యనిర్వాహక వర్గాన్ని తొలిగించకుండా ఒక మంత్రిని తొలిగించే అధికారాన్నివ్వదు. అందువల్ల ఈ అంశాన్ని సభా మర్యాదకు వదలడం మంచిది. సభా మర్యాదను క్రియాశీలకంగా మార్చడం కష్టమే. గవర్నరు మంత్రులను ఎన్నుకోవడానికి బదులు ఒక మంత్రికి సహాయ మంత్రులను ఎన్నుకునే అధికారమివ్వడం మంచిదని నాకు తోస్తున్నది. ఇలా ఏర్పడిన మంత్రి వర్గం సమిష్టి బాధ్యత మీద పని చేస్తుంది. ప్రభుత్వ ఉద్యోగులందరిని మార్చకుండా ఒక మంత్రిని తొలగించే అవకాశం ఈ పద్ధతిలో

ఉంటుంది. అందువల్ల గవర్నరు మంత్రులందరిని కాకుండా ఒక ముఖ్యమంత్రిని మాత్రం నియమించి అతని ద్వారా ప్రభుత్వం ఏర్పాటయ్యేటట్లు చూడటం మంచిదని నా సలహా .

28. రాజ్య పరిపాలనా బాధ్యతను నిర్వహించడానికి ఏడుగురు మంత్రులు తప్పనిసరిగా ఉండాలని నా సహచరులు సిఫారసు చేశారు. మంత్రులు ఏడుగురే ఉండాలని చేసిన సిఫారసును నేను అంగీకరించలేను. భవిష్యత్తులో ప్రభుత్వం ఏడుగురు కంటే తక్కువ మంత్రులతో నిర్వహింపబడవచ్చు; ఇంకా ఎక్కువ మంది మంత్రులు ఉండవచ్చు. శాసన సభలోని సభ్యులు సహాయం లేకుండా ప్రభుత్వ యంత్రాంగం నడవడం కష్టం కాబట్టి వారి కోరిక తీర్చడానికి వారిలో కొందరిని శాఖలు లేని మంత్రులుగా నియమించవచ్చు. ఇలాంటి పరిస్థితులలో మంత్రులు ఎందరుండాలో నిర్ణయించే పనిని శాసన సభకు ఇవ్వడం తెలివైన పనిగా నాకనిపిస్తున్నది.

## మూడవ అధ్యాయం

## గవర్నరు హోదా, అధికారాలు

29. అమలులో ఉన్న రాజ్యాంగం ప్రకారం గవర్నర్‌కు ఒక నిర్ణీత హోదా లేదు. ప్రభుత్వానికి సంబంధించిన బాధ్యత లేకుండా అతనికి రాజ్యాధినేత బాధ్యత వహించే స్థితి రాజ్యాంగం కల్పించలేదు. రాజ్యానికి చెందిన విషయాలను నిర్దేశించే పూర్తి అధికారం కూడా అతనికి లేదు. అతని అధికారం ఈ రెంటికి సంబంధించి ఉంటుంది. గవర్నరుకున్న ఈ స్థితి నిరంకుశుడుగా, రాజ్యాధినేతగా ద్వంద్వ పాత్రలను పోషించేటట్లు చేస్తున్నది. గవర్నరు పక్షంగా గాని, ప్రభుత్వ యంత్రాంగ పనితీరు పక్షంగా గాని ఈ స్థితి అతనికి సంతోషకరమైంది కాదు. గవర్నరు పదవిలో గల ఈ క్లిష్టత 1919 లో ప్రవేశపెట్టిన రాజ్యాంగ నమూనా నుండి సంక్రమించిందే. రాజ్యాంగం పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని మంజూరు చేయలేదు కాబట్టి గవర్నరు హోదాను కూడా రాజ్యాంగాధినేత స్థితికి తగ్గించలేదు. పైగా కొన్ని రాజ్యాలలోని ప్రభుత్వ శాఖల పరిస్థితులెలా ఉన్నప్పటికీ, కొన్ని విభాగాలు మంత్రులకు బదలాయించబడ్డాయి. బాధ్యత లేని రాజ్యాంగాధినేతగా తన పూర్వపు స్థితిని నిలుపుకోవడానికి కూడా గవర్నరు అనుమతించబడలేదు. గవర్నరు పదవిలో కనిపించిన ఈ మార్పు ఒక తెలివైన సిద్ధాంతం మీద ఆధారపడింది. బాధ్యతాయుత ప్రభుత్వానికి అనుకూలంగా గవర్నరుకున్న కార్యనిర్వాహక అధికారాలను తగ్గించడమే ఈ తెలివైన వ్యూహం. 1919లో అమలులో ఉన్న రాజ్యాంగ స్థితి ననుసరించి గవర్నరు బాధ్యత బదలాయించబడింది. దీనిని దృష్టిలో పెట్టుకొని గవర్నరు హోదాను రాజ్యాంగాధినేతగా తగ్గించమని నేను సిఫారసు చేస్తున్నాను. పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వ పద్ధతికి తగినట్లుగా గవర్నరు పనిచేసే మరొక పద్ధతి కూడా లేదు.

30. రాజ్య కార్యనిర్వాహక వర్గంలో రాజ్యాధినేతకు ప్రాతినిధ్యం వహించే అర్హతగల గవర్నరుకు మంత్రి వర్గానికి చెందిన నియామకాలు చేసే అధికారముంటుంది. ఇదే హోదాలో పరిపాలనలో ఏ శాఖకు సంబంధించిన ఏ విషయంలోనైనా మంత్రి ప్రతిపాదనను అనుమతించడానికిగాని,

నిరాకరించడానికి గాని గవర్నరుకు తుది అధికారముంటుంది. శాసన సభలో రాజ్యాధినేత ప్రతినిధిగా మండలి ప్రతిపాదించిన బిల్లుల లావాదేవీలను పరిశీలిస్తూ వాటిని అనుమతించడం, నిరాకరించడం లేక భవిష్యన్నిర్ణయంకోసం ప్రత్యేకించి పెట్టుకోవడం వంటి అధికారాలు గవర్నరుకు ఉంటాయి.

31. గవర్నరుకున్న ఈ అధికారాలను శాసనసభకు బాధ్యత వహించే మంత్రుల సలహాకు లోబడి అతడు ఉపయోగించుకోవలసి ఉంటుంది. ఇలా చెప్పడంలో అతనికి మంత్రుల సలహాలను పాటించడంలో విచక్షణాధికారం ఉండదని కాదు. మంత్రులకు వాళ్ల ప్రతిపాదించిన విధానాన్ని సమ్మతించమని చెప్పడమేగాక తనకిష్టం లేని విధానాన్ని వాళ్ళు తప్పనిసరిగా పాటించాలనుకున్నప్పుడు వారిని తొలగించే అధికారం కూడా గవర్నరు కుంటుంది. శాసనసభకు బాధ్యత వహించే మంత్రి సలహాను తప్పనిసరిగా పాటించాలనే నిబంధన రాజ్యాంగాధినేతగా అతనికి ఉండనక్కరలేదు. అతని బాధ్యత ఓటర్ల సాధారణ కోరికలకు అనుగుణంగా ఉండాలి. ఒక మంత్రి ఓటర్ల ఇష్టాలను నెరవేర్చే వాడుగా ఉంటాడు కాబట్టి గవర్నరు కూడా ఆ మంత్రి సలహాను పాటించాలనుకుంటాడు. సాధారణ ఓటర్ల అభిరుచులకు మంత్రి సరిగా ప్రాధాన్యం ఇవ్వక కొన్ని పరిస్థితుల్లో గవర్నరు అతనిని అనుమానించే అవకాశం ఉంటుంది. ఈ కారణాల వల్ల బాధ్యతాయుత ప్రభుత్వాల రాజ్యాంగాలన్నీ ఇలాంటి అవసరాలను గుర్తించడమేగాక గవర్నరుకు ఓటర్ల అభీష్టమేమిటో ఖచ్చితంగా తెలుసుకొనే అవకాశమిచ్చాయి. ఈ ధ్యేయంతోనే ప్రతి బాధ్యతాయుత ప్రభుత్వ రాజ్యాంగం ప్రజాభిప్రాయాలను గుర్తించని మంత్రులను తొలగించడానికి, శాసనసభలో మద్దతు ఉండగలదన్న నమ్మకంతో తన కిష్టమైన వారిని మంత్రులుగా నియమించడానికి అనుమతి ఇచ్చింది. కొత్త మంత్రులకు శాసనసభ మద్దతు ఇవ్వకపోవచ్చు. అలాంటి స్థితిలో గవర్నరు కొత్త మంత్రుల నియామకంలో మద్దతు ఇవ్వవలసిందిగా ఓటర్లకు విజ్ఞప్తి చేసే అవకాశం కూడా రాజ్యాంగం అతనికి ఇచ్చింది. ఈ రకమైన అవకాశం అతనికుండాలి. అయితే ఏ రాజ్యాంగం కూడా అతనికి ఇంతకు మించిన అధికార మివ్వకూడదు. అతని నిర్ణయం ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా మారినపుడు ప్రతి బాధ్యతాయుత ప్రభుత్వ రాజ్యాంగం అతనికి మరొక అవకాశం కల్పించకుండా పరిస్థితికి లొంగేటట్లు, లేక పదవి నుండి తప్పుకొనేటట్లు చేయాలి. ఇలాంటి అవకాశాలతో గవర్నరు సంతృప్తి పడాలి. శాసన సభ ప్రతిపాదించని విషయాలు ప్రమాణీకరించడం, శాసనసభ నిరాకరించిన వ్యయాన్ని ఆమోదించడం లేక మంత్రులను తొలగించి శాసనసభను రద్దుచేసి అధికారం హస్తగతం చేసుకోవడం వంటి విషయాలలో గవర్నరుకు ఎలాంటి పరిస్థితి లోను స్వేచ్ఛ ఇవ్వకూడదు. ప్రమాణీకరించడం, రద్దుచేయడం వంటి అధికారాలను తొలగించడం ద్వారా, శాసనసభకు బాధ్యత వహించే మంత్రుల మీద స్వతంత్రంగా వ్యవహరించే అధికారాన్ని తొలగించడం ద్వారా గవర్నరును రాజ్యాంగాధినేతగా చేయవచ్చు.

32. మంత్రి సలహాను పాటించవలసిన బాధ్యత గవర్నరుకు ఉందని చెప్పే సెక్షన్‌లో వాడిన భాష పరిశీలించదగింది. గవర్నరు బాధ్యతను తెలిపే 52 (3) వ సెక్షన్‌లో వాడిన భాష అస్పష్టంగా

ఉంది. ఆశించిన ఫలితం సాధించడానికి ఈ సెక్షన్‌లో భాష అనిశ్చితంగా వాడబడింది. గవర్నరు మంత్రుల సలహాల మేరకు పనిచేయాలని చెప్పడానికి బదులు ఆ సెక్షన్ గవర్నరు ఉత్తర్వు మంత్రి మారు సంతకం లేకుండా చెల్లదని చెప్పి ఉంటే బాగుండేది. ఆ సెక్షన్‌లో వాడబడిన భాష ఇదే అర్థాన్నిస్తున్నది. ఆ సెక్షనులోని భాషను మార్చాలని నేను సిఫారసు చేస్తున్నాను.

33. గవర్నరు అధికారాలను నిర్వచించి చెప్పడంతోపాటు, కార్యనిర్వాహక వర్గంలో అతని స్థానమేమిటో కూడా నిర్దేశించవలసి ఉంది. పరిపాలనా వ్యవహారాలను నిర్దేశించే బాధ్యత గవర్నరుకు లేనపుడు అతని విధి కార్యనిర్వహణకు కాకుండా పర్యవేక్షణకే పరిమితమవుతుంది. పరిపాలనా బాధ్యత ఎవరి మీద ఉంటుందో వారు రాజ్యాంగంలో నిర్దేశించిన సిద్ధాంతాలు అతిక్రమించకుండా చూడడమే గవర్నరుకున్న ప్రధాన బాధ్యత. ఈ విధిని సక్రమంగా నిర్వహించాలంటే గవర్నరు స్థానిక రాజకీయాలకు అతీతుడుగా ఉండాలి. పక్షపాతం లేకుండా పరిపాలనను పర్యవేక్షించాలంటే అతడు అలా ఉండవలసిందే. స్థానిక రాజకీయాలకు గవర్నరును అతీతంగా ఉంచాలంటే అతనిని కార్యనిర్వహణకు దూరంగా ఉంచడమే మంచి పద్ధతి. రాజకీయ వివాదాలలో తలదూర్చడం కంటే పక్షపాత రహితంగా పరిపాలనా వ్యవహారాలను పర్యవేక్షించినపుడే అతడు ప్రజల విశ్వాసాన్ని పొందుతాడు. శాసనసభా కార్యకలాపాలకు, కార్యనిర్వహణకు మధ్య ఏర్పడే వివాదాలలో అతడు ఏ పక్షం వహించరాదు. గౌరవ ప్రదంగా గవర్నరు తన విధులను సక్రమంగా నిర్వహించాలనుకున్నప్పుడు అతడు తప్పకుండా రాజకీయ పార్టీలకు అతీతుడుగా ఉండాలి. ఈ ధ్యేయంతోనే అతనికి శాసనసభ నిర్మాణంతోను, కార్య నిర్వాహకత్వంతోను పూర్తిగా సంబంధం లేకుండా చేయాలి. అందువల్ల గవర్నరు కార్యనిర్వహణలో భాగస్వామిగా ఉండకూడదని, కార్యనిర్వాహక సంఘానికి అధ్యక్షత వహించకూడదని నేను సిఫారసు చేస్తున్నాను. కార్యనిర్వాహక వర్గ సమావేశాలను ఇతరుల ప్రమేయం లేకుండా ప్రధాన మంత్రే నిర్వహించాలి.

అనువాదం :

డా॥ జి.చలపతి

## మూడవ విభాగం

# రాష్ట్ర శాసనసభ

### ఒకటవ అధ్యాయం

### ఓటు హక్కు

34. పట్టణ ప్రాంతాల్లో ఓటుహక్కు యధాతధంగా ఉండాలని, గ్రామ ప్రాంతాల్లో భూమి శిస్తుగా నిర్ధారితమైన పన్నును సగానికి తగ్గించి ఓటు హక్కు ఇవ్వాలని నా సహచరులు సిఫారుసు చేశారు. దీనిని నేను అంగీకరించలేకపోతున్నాను. నా మిత్రులు ఓటు హక్కు సమస్యను అవతల వారి హక్కుగా గాక, వారికి చేసే ఒక ఉపకారంగా భావించారు. ఏ దేశ రాజకీయ వ్యవస్థకైనా ఒక ప్రాతిపదికగా ఇలాంటి అభిప్రాయన్ని అంగీకరించడం చాలా ప్రమాదకరమని నేను అనుకుంటున్నాను. ప్రాతినిధ్య హక్కు అనే సిద్ధాంతం అసంబద్ధం అని కొట్టి పారేసేటట్లయితే ప్రాతినిధ్యం నైతిక హక్కు అని భావించడం ఆధ్యాత్మికం లేదా ఉదారవాదంతో కూడిన ప్రతి బంధకం అని భావించేట్లయితే, తమ వర్గ ప్రయోజనాలకు తగ్గట్టు ఓటు హక్కు ఇవ్వడం, ఇవ్వక పోవడం తమ ప్రత్యేక హక్కుగా రాజకీయ వర్గం భావించేటట్లయితే అప్పుడు ఓటు హక్కు లేని వారికి కలిగించే రాజకీయ బంధ విముక్తి పూర్తిగా ఓటుహక్కు ఉన్న వర్గం దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసి ఉంటుందని స్పష్టం అవుతుంది. ఇలాంటి నిష్కర్ష అయిన అభిప్రాయాన్ని అంగీకరిచమంటే బానిసత్వం తప్పుకాదని అంగీకరిచడమే అవుతుంది. వ్యక్తులకు హక్కు అంటూ లేదని, అధికారం ఉన్నవాళ్ళు ఇవ్వడానికి నిర్ణయించుకుంటేనే హక్కు వస్తుందనే సిద్ధాంతం బానిసత్వ విధానంలో కూడా ఉంది. అలాటి అభిప్రాయానికి దారితీసే సిద్ధాంతం ఎలాంటి ప్రజాప్రభుత్వానికైనా ఖచ్చితంగా ప్రాణాంతకమైందే అవుతుంది. కాబట్టి దాన్ని నేను పూర్తిగా తిరస్కరిస్తున్నాను.

35. ఓటుహక్కు అంటే రకరకాల పేర్లు రాసి ఉండే ఒక కాగితం ముక్కను బ్యాలెట్ పెట్టెలో వేసే సమర్ధత కలిగి ఉండడమే అన్నట్లు నా సహచరులు భావిస్తున్నారు. అలాకాక పోతే ఓటు హక్కు ఇవ్వడానికి అక్షరాస్యత ఒక అర్హతగా ఉండాలని నా సహచరులు పట్టుబట్టి ఉండరు. ఓటు హక్కు మీద ఇలాంటి దృక్పథం ఖచ్చితంగా పసలేనిది. ఓటుహక్కు దేనిని సమర్ధించడానికి ఏర్పడిందో దానిని తప్పుగా అర్థం చేసుకోవడమే అవుతుంది. ఓటుహక్కు అంటే ఏమిటో తెలిసి ఉంటే బ్యాలట్ పేపర్ మీద ముద్ర వేయడమే కాదని "జీవనం సక్రమంగా సాగడానికి కావలసిన నిబంధనల్ని నియంత్రించి, జీవనంలో మంచి జరిగే అవకాశం కల్పించడానికి ప్రత్యక్ష కార్యశీల భాగస్వామ్యం కలిగి ఉండడమే" ఓటు హక్కు ధ్యేయం అని తెలుస్తుంది. ఒకసారి ఓటు హక్కు సిద్ధాంతాన్ని అంగీకరిస్తే పిచ్చివాడు

కాని ప్రతి వయోజనుడికీ ఓటుహక్కు ఇవ్వాలని బోధపడుతుంది. సహజీవనం అందరూ పంచుకొనేది. దాని పరిణామాలు ప్రతి వ్యక్తినీ ప్రభావితం చేస్తాయి. కాబట్టి, ప్రతివ్యక్తీ సహజీవన నిబంధనలు నిర్ణయించే హక్కు కలిగి ఉండాలి. ఈ ఆధారాంశాల నుండి ముందుకు సాగితే వ్యక్తి పేదవాడు అయ్యే కొద్దీ అతనికి ఓటుహక్కు ఇవ్వడం మరీ ఎక్కువ అవసరం అని తేలుతుంది. వ్యక్తిగత ఆస్తిమీద ఏర్పడిన ప్రతి సమాజంలోనూ పనివాళ్ళు యజమానుల మధ్య వైరుధ్యం ఉంటుంది. పనివాళ్ళ సంక్షేమం యజమానుల వల్ల దెబ్బతినకుండా ఉండాలంటే వారి మధ్య సహజీవన నిబంధనలు ఎప్పటికప్పుడు నిర్ణయించబడుతుండాలి. ఇలా జరగాలంటే ఆస్తితో ముడిపెట్టకుండా, ఆస్తి లేని వయోజనులు అందరికీ ఓటుహక్కు ఇస్తే తప్ప కుదరదు. అందువల్ల ఏ దృక్పథం నుంచి నిర్ణయించినా వయోజన ఓటు హక్కు మీదికే తుది అభిప్రాయం మొగ్గు తుందనడం తిరుగులేనిది. నేను ఆ తుది అభిప్రాయాన్ని అంగీకరించి (స్త్రీ కాని, పురుషుడు కానీ) 21 సం॥ దాటిన ప్రతి వయోజన వ్యక్తికి ఓటు హక్కు ఇవ్వాలని సిఫారసు చేస్తున్నాను.

36. వయోజన ఓటు హక్కు ప్రవేశ పెట్టడానికి రాజకీయ న్యాయం ఒక్కటే కారణం కారాదు. చివరికి రాజకీయ స్వార్థం కూడా ఓటుహక్కు ప్రవేశపెట్టడాన్ని సమర్థిస్తుంది. అల్ప సంఖ్యాక వర్గమైన మహమ్మదీయులు మత నియోజక వర్గాలు కావాలనడానికి ఒక కారణం- ఉమ్మడి నియోజక వర్గాలుండే వ్యవస్థలో తమ వర్గ ప్రయోజనాలకు విరుద్ధంగా ఉండే వ్యక్తులు-మెజారిటీ వర్గాల ఓటర్ల ద్వారా ఎన్నికలు బాగా ప్రభావితమై - ఎన్నుకోబడతారని భయపడడమే. ఈ నివేదిక అనంతర భాగంలో ఒకచోట ఈ అభ్యంతరాన్ని వయోజన ఓటు-హక్కుద్వారా తోసి పుచ్చవచ్చని నేను సూచించాను. మత నియోజక వర్గాలకు ప్రత్యామ్నాయంగా వయోజన ఓటు హక్కుగురించి మెజారిటీ వర్గం ఆలోచించడం లేదు. మెజారిటీ సభ్యులు మత నియోజక వర్గాల్ని అలాగే ఉంచితే బాగుంటుందని, వయోజన ఓటు హక్కును దూరంగా ఉంచాలని భావిస్తున్నట్లుంది. మెజారిటీ సభ్యుల అభిప్రాయానికి నా అభిప్రాయం విరుద్ధమైనది. మత నియోజక వర్గాలు సరైనవి కావని వయోజన ఓటుహక్కు సరియైనదని నా అభిప్రాయం. వయోజన ఓటు హక్కు స్వతహాగా మంచిదనే కాకుండా మత నియోజక వర్గాల వల్ల ఏర్పడే హానిని పోగొడుతుందని కూడా నాతో ఏకీభవించే వాళ్ళు ఒప్పుకుంటారు. వయోజన ఓటు హక్కు మీద నమ్మకం లేని రాజకీయ విశ్వాసాలున్న వాళ్ళకి కూడా ఈ దృక్పథాన్ని అంగీకరిం చడంలో అభ్యంతరం ఏమీ ఉండదు. కారణం పెద్ద హాని కన్నా చిన్నహాని మేలు అని అందరూ అంగీకరిస్తారు. ఎందుకంటే వయోజన ఓటుహక్కు ఒక వేళ చెడ్డదే అయితే దాని కన్నా మత నియోజక వర్గాలు ఇంకా చెడ్డవి. రాజకీయ న్యాయం ద్వారా బలపరచబడి, రాజకీయ స్వార్థం ద్వారా అంగీకరింపబడ్డ వయోజన ఓటుహక్కును ప్రజాభిప్రాయంలో ఎక్కువ భాగాన్ని గుర్తిస్తున్నది. బ్రాహ్మణేతరులు, దళిత జాతుల వర్గం తప్ప అన్ని రాజకీయ పార్టీలఅభిప్రాయాల్ని ప్రతిబింబించే నెహ్రూ కమిటీ నివేదిక వయోజన ఓటుహక్కు ప్రవేశపెట్టడాన్ని సమర్థిస్తున్నది. దళిత జాతులు కూడా వయోజన ఓటుహక్కు కోసం

పట్టుబడుతున్నాయి. సింద్ మహమ్మదీయ అసోషియేషన్, బొంబాయి ప్రభుత్వంలోని ఒక మహమ్మదీయ సభ్యుడు ఒక బ్రాహ్మణేతర సభ్యుడు కూడా వయోజన ఓటు హక్కును సమర్థిస్తున్నారు. అందువల్ల వయోజన ఓటుహక్కును ఎక్కువ భాగం ప్రజాభిప్రాయం సమర్థిస్తున్నది. ఇంత బలంగా ఉన్న ప్రజాభిప్రాయాన్ని నా సహచరులు ఎందుకు పట్టించుకోవడంలేదో కారణం చూపలేదు.

37. వయోజన ఓటుహక్కు ప్రవేశపెట్టడానికి వ్యతిరేకంగా నా సహచరుల పై రెండు విషయాలు పని చేసినట్లున్నాయి. మొదటిది : ఈ దేశంలో ఎక్కువగా వ్యాపించి ఉన్న నిరక్షరాస్యత. దేశంలోని సామాన్య ప్రజలలో ఎక్కువగా నిరక్షరాస్యత ఉందనడాన్ని ఎవరూ తిరస్కరించరు. అయితే నిరక్షరాస్యతకు ఓటు హక్కు సమస్యకు సంబంధం ఉందనే అభిప్రాయం సరైందని నేను అంగీకరించలేను. నిరక్షరాస్యులుగా ఉండడం అనేది నిరక్షరాస్యుల దోషం కాదని మొదట మనం గ్రహించాలి. బొంబాయి ప్రభుత్వం చాలా కాలం పాటు ప్రజల్ని విద్యావంతులు చేసే ముఖ్య విధిని స్వీకరించలేదు. స్వీకరించిన తర్వాత కూడా విద్యా ప్రయోజనాలను పై తరగతుల వారికి అందిస్తూ, సామాన్య ప్రజలకు అందకుండా చేశారు. ఈ సత్యాన్ని కల్పన అని భావించకుండా ఉండడానికి గాను బొంబాయి ప్రెసిడెన్సీలోని విద్యామండలి వారి 1850-51 సంవత్సర నివేదిక మీదికి దృష్టి సారించాలని కోరుకొంటున్నాను. (ఈ ఉటంకింపులు నివేదిక చివరి పేజీలలో ఇవ్వబడ్డాయి.

38. 1854 సం॥దాకా ప్రభుత్వం ఉన్నత తరగతుల విద్యను అంగీకరించిందేకాని సామూహిక విద్యను అంగీకరించలేదు. సామాన్య ప్రజల్లో విద్యను వ్యాప్తి చేసే విషయంలో ప్రభుత్వం తీసుకొన్న చొరవ కొన్ని తీర్మానాలు చేయడాన్ని దాటి ముందుకు సాగలేదు. విద్యా రంగానికి ఆర్థిక సహాయం చేసే విషయంలో ప్రభుత్వం చాలా పిసినిగొట్టు దృష్టి చూపింది. గౌరవనీయులు గోఖలే ప్రతిపాదించిన నిర్బంధ ప్రాథమిక విద్య విషయంలో అది కొంత వరకు పన్ను వేసే విధానం కలిగి ఉన్నా ప్రభుత్వం అంగీకరించక పోవడం దారుణం. ఆ సంస్కరణ కూడా పరిస్థితిని పెద్దగా మెరుగు పరచలేదు. నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టాన్ని చేయడం తప్ప సామూహిక విద్య విషయంలో చెప్పుకోదగ్గ పురోగతిని ప్రెసిడెన్సీ సాధించలేదు. పైపెచ్చు ఈ విషయంలో కొంత తిరోగతి సంభవించింది. కారణం విద్యను స్థానిక ప్రభుత్వాలకు బదలాయించినందువల్ల అక్కడ పనిచేసే ఉద్యోగులు అటు ఉపేక్ష చేసే వారుగానో లేదా అజ్ఞానులు గానో ఉండడం వల్ల విద్య పురోగతి విషయంలో వారు ఎప్పుడూ శ్రద్ధ చూపలేదు.

39. దళిత జాతుల విషయానికి వస్తే విద్య నేర్చుకొనే విషయంలో వారికి కూడా అవకాశం తిరస్కరించబడింది. వారి విద్యాభ్యాసంలో అస్పృశ్యత దాటరాని అడ్డు గోడగా నిలిచింది. చివరికి ప్రభుత్వం కూడా భారత సామాజిక వ్యవస్థలోని అవసరాలకు తలవంచి ప్రభుత్వ పబ్లిక్ పాఠశాలల్లో దళిత జాతుల ప్రవేశాన్ని నిషేధించింది. ధార్వార్‌లోని ఒక పాఠశాలలో ప్రవేశానికి ఒక మహర్ బాలుడు పెట్టుకొన్న దరఖాస్తును తిరస్కరిస్తూ బొంబాయి ప్రభుత్వం 1856లో చేసిన తీర్మానంలో ఇలా పేర్కొంది. "ఉత్తర ప్రత్యుత్తరాల్లో చర్చించబడి ఉన్న సమస్య ఆచరణలో కష్టంతో కూడుకొన్నది....."

1. "మహార్ దరఖాస్తు దారుని వైపే ఖచ్చితమైన న్యాయం ఉందనడంలో సందేహం లేదు. ధార్వార్‌లో ఉన్న విద్యాభ్యాస వసతుల్ని మహార్ వినియోగించుకోవడానికి ఉన్న ప్రతికులాభిప్రాయాన్ని తొలగించబడి ఉండవలసింది."

2. "ఒకరో, కొందరో వ్యక్తుల కోసం తరతరాలుగా సంఘంలో ఉన్న ప్రతి కూలాభిప్రాయాల్లో ప్రభుత్వం తొందరపాటుగా జోక్యం చేసుకుంటే అది విద్యా లక్ష్యానికే కీడు చేస్తుంది. దరఖాస్తు దారుకు ఎదురైన ప్రతికూలత ప్రభుత్వ పక్షం నుంచి వచ్చింది కాదు. అతడు కోరినట్లుగా ప్రభుత్వం తొందరపాటుగా అతని కోసం ఈ సందర్భంలో జోక్యం చేసుకోలేదు"

26 ఏళ్ళ అనంతరం ఏర్పరచిన హంటర్ కమిషన్ ప్రభుత్వ కళాశాలల్లోకి గాని, ప్రభుత్వ పాఠశాలల్లోకి గాని ప్రవేశం కుల ప్రాతిపదికన తిరస్కరించ కూడదన్న సిద్ధాంతాన్ని ప్రభుత్వం అంగీకరించాలని అభిప్రాయపడింది. అయితే ఈ సిద్ధాంతం "తగినంత జాగ్రత్తగా అమలు పరచాలి" అని కూడా కమిషన్ తన అభిప్రాయం తెలిపింది. ఈ హెచ్చరిక ఫలితంగా ఆ సిద్ధాంతమే అమలు కాలేదు. 1921లో డా॥ పరంజపే విద్యా మంత్రిగా ఉన్నపుడు ఒక సాహసప్రయత్నం చేశారు. కానీ ఆయన చర్యకు నేపథ్యంగా ఏ ఆదేశబలమూ లేనందువల్ల దళిత జాతులకు పాఠశాలల్లో ప్రవేశం ఇవ్వాలన్న అతని సర్క్యులర్ పాటించ బడలేదు. తత్ఫలితంగా దళిత జాతుల జీవితాల్లో శోచనీయమైన నిరక్షరాస్యత ఇంకా కొనసాగుతూనే ఉంది.

40. అలాంటి నిరక్షరాస్య ప్రజలకు ఓటుహక్కు ఎలా ఇచ్చేది? అన్నది తరచూ అడిగే ప్రశ్న. దానికి నా సమాధానం వారి నిరక్షరాస్యతకు బాధ్యులు ఎవరు అనేది. నిరక్షరాస్యత ఉంటే ప్రభుత్వానిదే అయితే, ఓటుహక్కు ఇవ్వడానికి పూర్వ అర్హతగా అక్షరాస్యతను పెడితే అప్పుడు అధిక సంఖ్యాకులైన ప్రజలకు నిరక్షరాస్యులుగా ఉండడం తమ తప్పు కాకపోయినా ఓటు హక్కు లేకుండా పోతుంది. నిరక్షరాస్యతను పోగొడుతూ ఓటుహక్కు వారికి విస్తరిస్తాం అని అంటే వారి నిరక్షరాస్యతను వీలైనంత తొందరలో పోగొడతారని నమ్మకం ఏమిటి? దేశ నిర్మాణంలోని ఇతర సమస్యల్లాగానే విద్యకూడ ఆర్థిక సంబంధమైన సమస్యే. ఎంత కాలం పాటు తగినంత ధనం సమకూరదో అంత కాలమూ విద్యారంగంలో పురోగతి ఉండదు. ఈ ధనాన్ని ఎలా సాధించాలి? అన్నదే పరిష్కరించవలసిన సమస్య. కారణం చాలా సాధారణ మయింది. ధనవంతుల మీద పన్ను వేసి విద్య కోసం ధనాన్ని సంపాదించాలి. అయితే ఇప్పటి కౌన్సిల్‌ను నియంత్రించేది ధనవంతులే. బలవంతం చేస్తే తప్ప ధనవంతులు బీదవారి సంక్షేమం కోసం తమమీద పన్ను వేసుకొనేందుకు అంగీకరించరన్నది సత్యం. అలాంటి నిర్బంధం ఎప్పుడు వస్తుందంటే కౌన్సిల్ నిర్మాణంలో తగినంత మంది నిరక్షరాస్యులకు, పేదవారికి తగినంత పలుకుబడి ఇచ్చేవిధంగా తీవ్రమైన మార్పు చేస్తే వస్తుంది. ఇది సంభవిస్తే తప్ప నిరక్షరాస్యత సమస్య ఎట్టి పరిస్థితుల్లోనూ పరిష్కరించబడదు. వారికి ఈ హక్కును తిరస్కరించడం పూర్తిగా అన్యాయం చేసినట్లే అవుతుంది. ప్రజల్ని నిరక్షరాస్యులుగానే ఉంచి, ఓటుహక్కు ఇవ్వక పోవడానికి నిరక్షరాస్యత కారణంగా చెప్పడం వారికి పుండు మీద కారం రాసినట్లే.

అయితే పరిస్థితి దీనికన్నా ఇంకా ఎక్కువ పరిధిలో ఉంది. ఇది వారి గాయాన్ని ఇంకా ఎక్కువ చేయడమే అవుతుంది. ఎలాగంటే, ప్రజల్ని నిరక్షరాస్యులుగా ఉంచడం – వారు సమర్థవంతంగా తమ నిరక్షరాస్యతను పోగొట్టు కొనగలిగే ఓటు హక్కును తిరస్కరించడం ద్వారా వారి నిరక్షరాస్యతను కొనసాగేట్లు చేసి వారికి ఓటు హక్కు ఇవ్వడాన్ని నిరవధికంగా వాయిదా వేయడమే అవుతుంది.

41. నిరక్షరాస్యతకు ఎవరు కారణం? అనేది ముఖ్యమైన ప్రశ్న కాదు. నిరక్షరాస్యులకు ఓటు హక్కు ఇవ్వాలా? అన్నదే ప్రశ్న. నా సమాధానంః సమస్య అక్షరాస్యతకు కాదు. సమస్య వివేకానికి సంబంధించింది మాత్రమే. ఎవరు అక్షరాస్యతను ఒక పరీక్షగా నొక్కి చెపుతున్నారో – ఓటు హక్కు ఇవ్వడానికి అర్హతగా చెపుతున్నారో వారు రెండు పొరపాట్లు చేస్తున్నారు. వారి మొదటి పొరపాటు నిరక్షరాస్యుడైన వ్యక్తి తప్పనిసరిగా వివేకహీనుడుగా ఉంటాడని నమ్మడమే. అయితే నిరక్షరాస్యుడు చాలా వివేకశాలిగా ఉండడం అనేది వైరుధ్యంతో కూడింది కాదని మనకందరికీ తెలిసిన విషయమే. అనుభవం నుండి పరిశీలించినపుడు భారతదేశంతో కలిపి ప్రపంచంలోని నిరక్షరాస్యులు తమ సొంత వ్యవహారాల్ని అర్థం చేసుకోవడానికి, వాటిని నిర్వహించుకోవడానికి తగినంత వివేకం కలిగి ఉన్నారని నిష్కర్షగా తేలింది. ఏ విధంగా చూసినా ఒక నిర్ణీత వయసు దాటిన ప్రతి వ్యక్తికీ అతని వ్యవహారాల్ని చూసుకొనే బాధ్యతను అప్పగించడానికి తగినంత వివేకం ఉంటుందని చట్టం భావిస్తున్నది. ఓటుహక్కును వినియోగించడంలో నిరక్షరాస్యుడు తొందరపడి తప్పుచేయవచ్చు. కాని బొంబాయి అభివృద్ధి శాఖ తీసుకున్న తప్పు నిర్ణయాలు అవి తోసి వేయబడ్డా, సహించబడ్డా చాలా దారుణమైనవే. నిరక్షరాస్యులు ఒక వేళ ఇంకా పెద్ద తప్పు చేసినా సరే వారికి ఓటుహక్కు ఉండ వలసిందే. స్వేచ్ఛాయుతమైన ప్రజా ప్రభుత్వంలో నమ్మకం ఉన్న వారందరూ ప్రజలకు స్వేచ్ఛ ఇచ్చినందువల్ల చేసే తప్పుల వల్ల జరిగే నష్టాలకన్నా, అనుభవం ద్వారా ప్రజలు లాభపడతారనే దృఢ విశ్వాసం మీద ఆధారపడుతున్నారు. రాజకీయేతర రంగంలో వ్యక్తులకు వర్తించే సత్యం రాజకీయ రంగంలో ఎందుకు వర్తించదనుకుంటున్నారో అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది. వారి రెండో పొరపాటుః విద్య తప్పని సరిగా నిరక్షరాస్యులకు ఉన్నత శ్రేణి వివేకాన్ని లేదా తెలివిని నేర్పుతుందని భావించడం. ఈ అంశం మీద బ్రైస్ చెప్పిన మాటల్ని ఉటకించవచ్చు. అతని "ఆధునిక ప్రజాస్వామ్యాలు" కు సంబంధించిన సర్వేలో చదివే, రాసే సామర్థ్యం పౌరుడుగా ఉండే యోగ్యతకు ఎంత వరకు తోడ్పడుతుందనే ప్రశ్న వేసుకొని ఇలా సమాధానం ఇచ్చాడు. "ఇప్పటికీ ఆచరణాత్మకమైన పరీక్ష అదొకటే కాబట్టి దాన్ని సముచిత పరీక్షగా భావిస్తున్నాం. ఇది సరైనదేనా? అరవై ఏళ్ళ కిందటి నేర్పరులైన ఇంగ్లీషు పల్లెటూరి మనుషులు చదువు రాక పోయినా తమ లోకజ్ఞానం, బలమైన వివేకం, దృఢమైన నిర్ణయం ద్వారా వార్తాపత్రికలు చదువుతూ, సినిమాలతో ఆనంద పడుతూ ఉండే తమ ముని మనమళ్ళకన్నా ఓటుహక్కు వినియోగించుకోడానికి సమర్థమైన వాళ్ళేనని మనలో కొందరికైనా గుర్తుండి ఉంటుంది... ఎథీనియన్ ఓటర్లు ఆధునిక ప్రజాస్వామ్య దేశాల్లోని చాలా మంది ఓటర్లకన్నా ఓటు హక్కుకు అర్హమైన వాళ్ళు. ఈ గ్రీకు ఓటర్లు అచ్చయిన కాదుగదా రాతలో ఉండే పుటల్ని

అయినా చదివి రాజకీయాలు నేర్చుకోలేదు. నిష్ణాతులైన వక్తల ఉపన్యాసాలు విని, ఒకరితో ఒకరు సంభాషించి నేర్చుకున్నారు. పఠనం కన్నా తక్కువ జాగరూకత కలది కాబట్టి సంభాషణకు అనుకూలత మిన్నగా ఉంటుంది. చదవడం ముఖ్యం కాదు. ఆలోచించడం ముఖ్యం. అంటే, ఆలోచించడం ద్వారా నిజాలు తెలుసుకొని, వాటి గురించి చర్చించే శక్తి పెరుగుతుంది. సంభాషణలో చతురోక్తుల సంఘర్షణ ఉంటుంది. దానికోసం కొంత మానసిక శ్రమ అవసరం అవుతుంది. అయితే మన కాలంలో ఆలోచించడానికి చదవడం ప్రత్యామ్నాయమై కూర్చుంది. తన పార్టీకి సంబంధించిన వార్తా పత్రిక మాత్రమే చదివే వ్యక్తి తన పార్టీకి సంబంధించిన విజ్ఞానాన్ని, నేరాల కథలు, ఫుట్‌బాల్ ఆటల విశ్లేషనలు లాంటి ఇతర విషయాలను కలగాపులగంగా చదువుతుంటాడు. సమస్యకు మరో కోణం కూడ ఉంటుందని భావించడు. పత్రిక చెప్పే విషయానికి సాక్ష్యం ఏమిటి అని అడగడు. ఏదో తెలియని శక్తికి అచ్చయిన పుట ప్రాతినిధ్యం వహిస్తున్నదని మాటల్లో విన్నదాని కంటే సులభంగా అంగీకరిస్తాడు. అతడు వార్తా పత్రిక ప్రకటనల నుండి గ్రహించే విషయాలు తన వర్క్‌షాపుల, అంగళ్ళలోని తన అనుచరుల నుండి గ్రహించడు. అంతేగాదు, విద్యావ్యాప్తం మంచితెలివిని నేర్పేది కావచ్చు లేదా చెడ్డతెలివిని నేర్పేదీ కావచ్చు. అచ్చయిన పుటను బాగా చదివి ఆలోచించే శక్తి వున్న వారికి (అసత్యానికంటె సత్యానికి మంచి అవకాశం లేదు) కొన్ని నిజాల్ని కప్పిపెడుతూ, కొన్నిటిని వక్రీకరిస్తుండే పార్టీ పత్రిక అన్నిటి కంటె చెడ్డదర్శని. ఎప్పుడూ అసత్యాన్ని చెప్పే ఏ వ్యక్తి కన్నా, సంస్థకన్నా ఇది ఎక్కువ ప్రభావం కల్గిస్తుంది. అచ్చు యంత్రం కనిపెట్టక ముందు ఆధ్యాత్మికత్వాన్ని వస్త్రాలుగా ధరించిన ధార్మిక మతాచార్యులు తప్ప మరెవరూ ఇంత ప్రభావితం చేసి ఉండలేదు. ఇలాంటి తన పార్టీ వార్తా పత్రికల ద్వారా నడపబడే నేటి ఓటరు 80 ఏళ్ళ కిందట తన భాగస్వామిగాని, యజమానిగాని, (ఐర్లండులో) పురోహితుడు గాని నిర్దేశిస్తే ఓటు వేసిన తన తాతకంటే మెరుగైన స్థితిలో ఏమీ లేడు. కనీసం ఆ తాతకు తాను ఎవర్ని అనుసరిస్తున్నాడో తెలుసు. పత్రికలో సమస్యను ఒక వైపు మాత్రమే చదివే ఈ మనుమడు పత్రికల యజమానులు ప్రజల అభిప్రాయాన్ని తెలుపుతున్నారని, ప్రజల మేలు కోరుతున్నారని అమాయకంగా నమ్మి పత్రికల యజమానుల స్వార్థప్రయోజనాలకు బలవుతున్నాడు. అందువల్ల చదవడం మాత్రమే నేర్పి, ప్రతిస్పదించి నిర్ణయం తీసుకోవడం నేర్పని ప్రజాస్వామ్యంలో చదివిన వారి అర్హత మీద ఆధారపడి ప్రయోజనం లేదు.

42. ఇండియాలోని సామాన్య ప్రజల నిరక్షరాస్యత మీద ఇప్పటికే చాలా ఎక్కువగా ఆలోచన చేసినట్లుంది. ఇంగ్లీషు ఓటరును దృష్టాంతంగా తీసుకొని ఓటరుగా అతని ప్రవర్తన గురించి విచారించండి. మనకేం తెలుస్తుంది? 1924 ఆగస్టు 21 నాటి 'టైమ్స్ లిటరరీ సప్లిమెంట్' అతణ్ణి గురించి ఇలా చెప్తున్నది :

"సామాన్య జనులకు గాఢమైన ఆసక్తి లేదు. వాళ్ళ ఓట్లు రాజకీయ సమస్యల్ని నిర్ణయిస్తాయి. కాని వారికి రాజకీయాలంటే బొత్తిగా ఏమీ తెలియదు. ఇది చాలా కలవరపరిచే విషయమైనా సరే

పన్నుల సంస్కరణ గురించి గానీ, పన్నుల విధింపును గురించి గానీ, విదేశాంగ విధానాల గురించి గానీ నిర్ణయాలు తీసుకున్నవారు డజన్ శీర్షికలను అయినా పటిష్టమైన రాజకీయాల్ని గురించి తమ జీవితంలో చదివి ఉండరు అనేది నిజం. 8 సం॥ల కిందట చిన్న ఓటర్ల సముదాయంలో మూడు వంతుల జనంలో రెండు వంతుల మంది ఆనాటి సమస్యల మీద వచ్చిన రాజకీయ ఉపన్యాసాలు చదివి ఉంటారు. ఈ నాడు ఓటర్లలో ఐదుశాతం మంది చర్చల్నిగానీ, సంపాదకీయాల్నిగానీ చదవరు. అవశిష్ట భాగం ఎంతటి ఉత్కృష్టమైనదైనా చాలా తక్కువ పరిమాణంలో ఉంది. ప్రజాస్వామ్యం మొత్తంమీద ఎలా వుందంటే అశ్లీలంతో వినోదం పొందే తాగుబోతు ఆటలా ఉంది. మునుపటి బాప్టిస్టు మినిస్టర్ వద్దగడిపిన ఆదివారాల కంటే అధోగతి పాలవుతున్న వ్యక్తిగా అతని మనసును ప్రజాస్వామ్యం వార్తాపత్రికలకు ధారాదత్తం చేసింది. ఇలాంటి విషవాయువుల్తో నిండిన వాతావరణంలో వారి నాగరికతకు కిరీటం పెట్టే పని పాఠశాలల్లో వృథా ప్రయాసగా మిగిలిపోతున్నది.

43. బ్రిటీష్ ప్రజాస్వామ్యం లేదా బ్రిటీష్ సామ్రాజ్యం ఇలాంటి ఓటర్లతో పాలించబడడంలో సంతృప్తి చెందేటపుడు వయోజన ఓటు హక్కును వ్యతిరేకించే భారత దేశస్థులకు అన్యాయం జరుగుతుంది. వారు లేని పోని వాటిని నమ్మే వాళ్ళే అవుతారు. అతిగా వ్యతిరేకించి సామాన్య ప్రజల నిరక్షరాస్యతను నెపంగా పెట్టుకొని ప్రజల రాజకీయ అధికారాన్ని తమ జేబుల్లో వేసుకొంటున్నారనే ఆరోపణకు గురి అవుతున్నారు. రాజకీయ సంప్రదాయాలను బాగా మదింపు చేసుకోవడం, వాటి మధ్య ఉన్న తారతమ్యాల్ని తెలుసుకొనే సామర్థ్యం కలిగి ఉండడం, రాజకీయ వివేకానికి పెట్టే పరీక్షలు అంటే అవి దురాక్షేపణలే అవుతాయి. ఏ దేశంలోనైనా చిన్న చిన్న రాజకీయ సమస్యల్ని గురించి, ప్రజలకు సరిగ్గా సమాచారం ఇవ్వరు. అంతేకాదు, అంత సూక్ష్మ సమాచారం అవసరం లేదు కూడా. ఓటర్ల నుంచి మనం ఆశించాల్సింది ఏమిటంటే వారు స్థూలమైన విషయాలు అర్థం చేసుకోగలిగి ఉండడమే. వారి అభిప్రాయంలో తమకు మేలు చేయగలిగే సమర్థుడైన అభ్యర్థిని ఎన్నుకోవడం. సాధారణ భారత పౌరుని సామర్థ్యానికి ఇది మించిందేమీ కాదని నేను ధైర్యంగా చెప్పగలను.

44. నా సహచరులు వయోజన ఓటు హక్కును అంగీకరించకపోవడానికి ఇంగ్లండు లాంటి దేశాలతో పోల్చడం మరో కారణం అనిపిస్తున్నది. పార్లమెంటు సభ్యుల్ని ఎన్నుకొనే ఓటర్లకు 1429లో వయోజన ఓటు హక్కు ఇవ్వడానికి 40 షిల్లింగుల స్థిర ఆస్తి ఉండడం అనే నిబంధన ప్రకారం 1832 సం॥ వరకు 500,000 మంది కంటే తక్కు ఓటర్లుగా ఉన్నారు. ఆ సంవత్సరంలో చేసిన సంస్కరణల చట్టం కింద ఓటర్ల సంఖ్య పది లక్షల మందికి పెరిగింది. 1867లో చట్టం చేసే వరకు ఓటు హక్కుకు కావలసిన సంపత్తి పరిమితిని తగ్గించలేదు. 18678లో వచ్చిన చట్టం వల్ల 2,500,000 మందికి ఓటర్ల సంఖ్య పెరిగింది. 17 సంవత్సరాల తర్వాత 1884లో వచ్చిని చట్టం వల్ల ఈ సంఖ్య 55 లక్షలమందికి పెరిగింది. 34 ఏళ్ళ తర్వాత 1918 సంవత్సరంలో చేసిన 'ప్రజా ప్రాతినిధ్య చట్టం' వల్ల వయోజన ఓటుహక్కు వచ్చింది. వివిధ వర్గాల ప్రజలు ఈ వాస్తవాల్ని వివిధ

ప్రయోజనాల దృష్ట్యా ఉటంకిస్తుంటారు. 'సోషల్ టోరీలు' గాను రాజకీయ తీవ్రవాదులు గాను ఉండే ఒక వర్గం రాజకీయ నాయకులు ఈ వాస్తవాల్ని బట్టి పూర్తి ప్రాతినిధ్యం కలిగింది కాకపోయినా సరే, చట్టసభకు పూర్తి అధికారాలు ఇవ్వాలంటారు. దీనికి సమాధానంగా వీరికి వ్యతిరేకులైన రాజకీయ వాదుల వర్గం ఇలా తక్కువ మంది ప్రాతినిధ్యం ఉండే చట్ట సభకు సర్వాధి కారాలు ఇస్తే అది "స్వల్ప జన పరిపాలన' గా పరిణమిస్తుందంటారు. మరికొందరు నెమ్మదిగా ఇతర దేశాలలాగా ఓటుహక్కు ఇద్దాం అంటారు. ఈ రెండవ వర్గం వ్యక్తులకు నా సమాధానం ఏమిటంటే ఇంగ్లీష్ రాజ్యం అడుగుజాడలలో మనం ఎందుకు నడవాలి అనేది. ఓటుహక్కు ఇవ్వడం అనే విషయంలో ఇంగ్లీషు వారు ప్రత్యేకంగా చర్య తీసుకొనే తత్వం అంటూ ఒకటి ఏర్పరచుకోలేదు అన్నది నిజం. పై పెచ్చు, ఓటుహక్కు విస్తరణ అక్కడ అంతటి దీర్ఘకాల విరామాలతో జరిగిందంటే ఇంగ్లీష్ పాలక వర్గాల స్వార్థ పరాయణత్వమే కారణం. అంతేగాక, ప్రతి దేశం అదే దశల్లో పయనించాలని అనుకోవడం హేతుబద్ధం కాదు. అలా చేయడం తమకంటే తర్వాత పుట్టేవారికి లాభం కలిగించి, ఇప్పటి వారికి ఆ లాభం ఇవ్వకపోవడమే అవుతుంది. సార్వభౌమాధికారం గల రాజ్యంలోని పార్లమెంటుకు, అది ప్రజల్లో చాలా స్వల్పశాతం ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాసరే సంపూర్ణ అధికారాలు ఇవ్వాలని రెండవ వర్గం వారి వాదన సర్వసమ్మతమే అయితే దేశానికి ఏం ఫలితాలు వస్తాయి? లార్డ్ షాఫ్ట్స్ బరీ చెప్పినట్లు సంస్కరించబడని పార్లమెంటు చేసిన సాంఘిక చట్టాల చరిత్ర తెలిసిన ఎవరైనా అలాంటి ప్రయోగం పునరుక్తం చేయాలని కోరుకోరు. పరిమితం చేయబడిన ఓటుహక్కు వల్ల ఇంగ్లండులో సంభవించిన ఫలితం ఇదే. ఈ సత్యాల మీద ఆధారపడిన విమర్శకులు నిస్సంశయంగా పరిమిత ఓటు హక్కువల్ల ఏర్పడే స్వల్ప జన పరిపాలనను అంగీకరిస్తారని నేను అనుకోను. సంయుక్త నివేదిక రచయితలు ఇలాంటి ఫలితాన్ని ఉద్దేశించలేదు. వారికి ఈ దుష్ఫలితం విషయం బాగా తెలుసుకాబట్టే వారి నివేదిక 262వ పేరాలో రాజ్యాంగ సంఘం తప్పని సరిగా పరిశీలించవలసిన అంశాల్లో ఓటుహక్కు పనిచేసే విధానం, మత నియోజక వర్గాలు అలాగే ఉంచడం – అన్న ముఖ్య అంశంతో పాటు నియోజక వర్గాల ఏర్పాటు అనే అంశాల్ని చేర్చారు. "స్వపరిపాలన అనే భవనం విశాలమైన ఓటు హక్కు అనే వికాస తోరణ ద్వారం మీద నిర్మించబడాలని మేం ఆశిస్తున్నాం. ప్రభుత్వ యంత్రాంగానికి ఉన్న అధికారాలు స్వల్ప జన పరిపాలకులకు బదిలీ కావడమే మా సంస్కరణల ఉద్దేశం కాదు".

45. అయితే స్వల్ప జన పాలనను నిరోధించే నివారణోపాయం ఏది? నేను ఆలోచించే నివారణోపాయం ఒకటే, వయోజనులకు ఓటు హక్కు ఇవ్వడమే. 1928 నాటి సిలోన్ కమీషన్ కూడా సంయుక్త నివేదిక రచయితలలాగా ఈ విషయంలో జాగ్రత్తగా ఉన్నదనడం ఈ సందర్భంలో సముచితంగా ఉంటుంది. "ఇంత స్వల్ప పరిమాణంలో ఉండే ఓటర్ల సమూహానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్నివ్వడం అంటే స్వల్పజన ప్రభుత్వాన్ని సింహాసనం ఎక్కించడమే. మిగతా ప్రజల సంక్షేమం విషయంలో వారితో అధికారపీఠం మీద ఉన్న వాళ్లు సంప్రదిస్తారనే గ్యారంటీ లేదు"

కమిషన్ ఇంకా "ప్రభుత్వం సిలోన్‌లోని ధనికుల, బాగా చదువుకున్న వాళ్ళ ప్రభుత్వమే కాదని, జనాభాలో చాలా భాగం ఉండే రైతుల, కూలీల, అన్ని బీద తరగతుల ప్రజలది కూడా" అని అభిప్రాయపడింది. ఇంకా "రెండవ రకం ప్రజల ప్రయోజనాన్ని మొదటి రకం ప్రజల నిరంకుశ అధీనంలో ఉంచడం రెండవ రకం వర్గం ఉంచిన విశ్వాసానికి ద్రోహం చేసినట్లే" అంటూ, సిలోన్ కమిషన్ చివరగా ఇలా అభిప్రాయపడింది. "అక్షరాస్యతను ఓటర్ల అర్హతగా (స్టేట్ కౌన్సిల్ ఎన్నికలో) పెట్టకూడదు". ఆ కమిషన్ సభ్యులు ఇంకా ఇలా చెప్పారు : "మా అభిప్రాయంలో బాధ్యతాయుత ప్రభుత్వం యొక్క పురోగతికి ప్రభుత్వాన్ని ప్రభావితం చేసే విధంగా సామాన్య ప్రజలకు ఎక్కువగా అవకాశాన్ని కల్పించడం అవసరం. ఓటుహక్కును విద్యావంతులైన ప్రజలకే పరిమితం చేయకూడదు". సిలోన్‌కు వయోజన ఓటుహక్కును నిర్ణయించేటపుడు దాన్ని ఇండియాకు ఎందుకు నిర్ణయించ కూడదు? అన్న ప్రశ్న సాధారణంగా తలెత్తుతుంది. రాజకీయ, సామాజిక, ఆర్థిక, విద్యా పరిస్థితులలో రెండు దేశాల మధ్య ఎంత సాదృశ్యం ఉన్నదంటే వాటిని ఓటుహక్కు విషయంలో వేర్వేరుగా పరిగణించడం నిజంగా భేదంలేని చోట్ల భేదాన్ని సృష్టించినట్లే అవుతుంది. సామ్యాన్ని పక్కకు నెట్టి పూర్తిగా యోగ్యతల్ని పట్టి చూస్తే కూడా ఇండియా ప్రజలు అందులోనూ వయోజన ఓటుహక్కును తమ గ్రామ పంచాయతీల్లో సక్రమంగా వినియోగిస్తున్న బొంబాయి ప్రెసిడెన్సీ ప్రజల కంటే వయోజన ఓటుహక్కుకు అర్హత కలిగిన వాళ్లు లేరు.

## రెండవ అధ్యాయం

## నియోజక వర్గాలు

46. ప్రస్తుతం ఉన్న శాసనమండలి 114 మంది సభ్యుల్తో ఏర్పడింది. అందులో 26 మంది నామినేటెడ్ సభ్యులు కాగా 86 మంది ఎన్నికైన సభ్యులు. నామినేటెడ్ సభ్యులు రెండు తరగతులు.

(ఎ) ప్రభుత్వానికి రిజర్వ్ అయిన సగ భాగానికి ప్రాతినిధ్యం వహించే అధికారులు.

(బి) 1. బడుగు వర్గాలు2. కార్మిక వర్గాలు 3. ఆంగ్లోఇండియన్లు 4. ఇండియన్ క్రిష్టియన్‌లు 5. పత్తి పరిశ్రమకు చెందినవారికి ప్రాతినిధ్యం వహించే అనధికార సభ్యులు. ఎన్నికయిన సభ్యులలో భూస్వాములు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలకు ప్రాతినిధ్యం వహించే ప్రతినిధులు 2. మరాటీలు తత్సంబంధ కులాల ప్రతినిధులు, ఇతర కులాల ప్రతినిధులు, 3. మహమ్మదీయ, యూరోపియన్‌లకు ప్రాతినిధ్యం వహించే వాళ్ళు ఉంటారు. నిర్మాణాన్ని ఏ మార్పూ లేకుండా అలాగే ఉంచాలా అన్నదే ప్రశ్న. ఏదైనా అంతిమ నిర్ణయానికి రాకముందు ఇప్పటి విధానాన్ని సిద్ధాంతపరంగాను, ఆచరణాత్మకంగాను పరీక్షించాల్సి ఉంటుంది.

### నామినేటెడ్ సభ్యులు

47. నామినేటెడ్ సభ్యులు కౌన్సిల్లో ఉండడం వల్ల దాని ప్రాతినిధ్య లక్షణాన్ని చాలా వరకు

తగ్గిస్తుంది. బాధ్యతాయుత ప్రభుత్వం సారాంశం ఏమిటంటే చట్టసభకు పాలక వర్గం బాధ్యతాయుతంగా ఉండడం. అలాగే ప్రాతినిధ్య ప్రభుత్వం సారాంశం ఏమిటంటే చట్టసభ ప్రజలకు బాధ్యతాయుతంగా ఉండడం. అలాంటి బాధ్యతను చట్టసభ ప్రజల చేత ఎన్నుకోబడి నపుడే నెరవేర్చవచ్చు. నామినేటెడ్ ప్రతినిధుల పద్ధతి సభను ప్రాతినిధ్యరహితంగా చేయడమే గాక పాలక వర్గాన్ని బాధ్యతారహితంగా చేస్తుంది. పాలక వర్గానికి ఉన్న నామినేషన్లు చేసే అధికారం కింద చట్టసభలోని దాదాపు 25 శాతం సభ్యులు నామినేట్ చేయబడతారు. సభలో ఇంత పెద్ద విభాగం పాలక వర్గానికి సేవక వర్గంలా పనిచేస్తుందే తప్ప విమర్శక వర్గంగా పనిచేయలేదు. నామినేటెడ్ అనధికార ప్రతినిధులు ప్రభుత్వ సేవకులు కారు గదా అన్న దృక్పథం ఇక్కడ పనిచేయదు. నామినేట్ చేయబడిన అనధికారిని సులభంగా పాలక వర్గం కొని వేయగలదు. ఎన్నికైన ప్రతినిధుల్ని ఎన్నోవిధాలుగా ప్రభావితంచేసి అతని స్వేచ్ఛను కొనివేయనూగలరు. బిరుదులు, పురస్కారాలు అతనికి ప్రదానం చేయడం, అతనికో, అతని స్నేహితులకో, బంధువులకో ప్రాపకం ఇవ్వడం మొదలైనవి చేయవచ్చు. కానీ నామినేటెడ్ అనధికార ప్రతినిధులు ఎంత దయనీయ పరిస్థితిలో ఉన్నారంటే వారికి అమ్ముడానికి స్వేచ్ఛ అనేది ఎప్పుడూ లేదు. వారు తమకు మిత్రుల్లా సహకరించాలి అన్న నిబంధన కాకపోయినా ఒక అవగాహనతో అనధికార ప్రతినిధులు నియమింపబడతారు. అంతేగాక అవగాహనను త్రోసిపుచ్చే సాహసం ఉన్న నామినేటెడ్ సభ్యుణ్ణి ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో పాలక వర్గం లేదు. మళ్ళీ నామినేట్ చేసే అధికారం వారి చేతిలో ఉన్నందువల్ల ఇలా సాహసం ప్రదర్శించిన నామినేటెడ్ సభ్యుల్ని మరోసారి నామినేట్ చేయకపోవడం అనే తీవ్రమైన శిక్ష వారికి విధించవచ్చు. అలాంటి సంఘటనలు, సన్నివేశాలు జరిగాయి కూడా. రాజుకి ఉన్న 'వీటో' అధికారం లాగా, మళ్లీ నామినేట్ చేసే అధికారం పాలక వర్గం చేతిలో ఉన్నందువల్ల దాని చెప్పుచేతుల్లో ప్రతి నామినేటెడ్ సభ్యుడూ ఉండవలసి వస్తుంది.

48. నామినేషన్ పద్ధతి వల్ల ఏర్పడే మరో కీడును గురించి కూడ చెప్పవలసి ఉంది. ప్రభుత్వ ప్రయోజనాల కోసం అధికార నామినేటెడ్ సభ్యులున్నట్లుగానే పలు వర్గాల ప్రజల సంక్షేమం చూడడం కోసం వారి ప్రతినిధులుగా నియమించబడ్డ నామినేటెడ్ అనధికార సభ్యుల సంఖ్య చాల తక్కువ. శోచనీయమైన విషయం ఏమిటంటే ప్రభుత్వం కోసం నామినేట్ చేయబడ్డ అధికార సభ్యులు ప్రభుత్వ సంక్షేమాన్ని చూడగలుగుతూ ఉంటే, ఆయా నియోజక వర్గాల సంక్షేమం చూడవలసి నామినేటెడ్ అనధికార సభ్యులు అలా చేయలేక పోతున్నారు. నిజానికి నామినేటెడ్ అనధికార సభ్యుడు తన వర్గ ప్రయోజనాన్ని కాపాడలేకుండా ఉన్నాడు. అనునిత్యం పాలకవర్గాన్ని ఒత్తిడి చేస్తూ తమ వర్గ ప్రయోజనం కాపాడకపోతే వ్యతిరేకంగా పడే ఓట్ల దుష్ప్రభావాన్ని గుర్తు చేస్తూ ఉంటేనే ప్రభుత్వం ద్వారా చాలా మట్టుకు ఆయా వర్గాలకు ప్రయోజనం చేకూరుతుంది. కానీ ఈ మార్గం నామినేటెడ్ సభ్యునికి మూసివేయబడింది. కారణం పాలక వర్గానికి తాను సహకరించాలని కాబట్టి తన వర్గ ప్రయోజనం పట్ల ఉపేక్ష వహిస్తాడు. అతనికి స్వేచ్ఛ లేనందువల్ల ఏ వర్గప్రయోజనం

కోసం నామినేట్ చేయబడ్డాడో ఆ వర్గ పరిస్థితిలో ఏ మార్పు తేలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. అందువల్ల నామినేషన్ ద్వారా ప్రాతినిధ్యం అంటే ప్రాతినిధ్యం లేకుండా ఉండడమే అవుతుంది. అది ఒక తమాషా మాత్రమే.

49. నామినేషన్ పద్ధతిలో మరొక తీవ్ర ప్రతిబంధకం ఏమంటే నామినేటెడ్ అనధికార సభ్యుల్ని మంత్రి పదవులకు అనర్హులుగా ప్రకటించడమే. ప్రభుత్వంలో మంత్రి పదవికి ఎంపిక కావడానికి చట్ట సభలోని ఏ సభ్యునికీ సిద్ధాంత పరంగా ఎలాంటి అవరోధం ఉండకూడదు. ఒకవేళ మంత్రి అవడానికి కావలసిన అర్హతను పరిమితం చేయవచ్చు అని భావించినా, అలా పరిమితం చేయడానికి మంచి, సమర్థమైన పరిపాలన అనేది ధ్యేయంగా ఉండాలి. ఈ పరిమితికి అది ధ్యేయం కాక పోగా వివిధ వర్గాల మీద అసమరీతిలో ఈ పరిమితి విధించబడింది. కారణం ఆయా వర్గాల ప్రాతినిధ్యం తీరులో భేదాలుండడమే. అందువల్ల ఈ పరిమితి విధించకూడని కొన్ని వర్గాలు దెబ్బతిన్నాయి. దళిత జాతులు లాంటి కొన్ని జాతుల సంక్షేమానికి ప్రభుత్వం ప్రత్యక్ష చర్య చాలా అవసరం. ఎంత ఎక్కువ ప్రభుత్వం చర్యలు చేపడితే అంత త్వరగానూ, పూర్తిగాను పరిస్థితుల్లో మార్పు వస్తుందని చెప్పలేము. నిజమే. ఒక మంచి చట్టం ద్వారా ప్రజలకు చేకూరే ప్రయోజనాల్ని కాదనలేము. ఈ వర్గాల ప్రజలు పారం పర్యంగా వచ్చిన దురలవాట్ల, సామాజిక ఇబ్బందుల భారం ప్రభావంలోంచే పుట్టి, జీవితం సాగించి మరణిస్తున్నారు. ఈ దురవాట్లకూ, సామాజిక ఇబ్బందులకూ సమాజానిదే బాధ్యత. వీటిని లేకుండా చేయడం చట్టం ద్వారానే వీలవుతుంది. చట్టం ప్రభావం వ్యక్తుల జీవితాల్లోని పరిస్థితుల్ని ఎంతగా మారుస్తుందో ప్రపంచమంతటా గుర్తించబడింది. కానీ ఇలాంటి బాధ్యత బడుగు జాతుల ప్రజలకు మంత్రి వర్గంలో స్థానం ఉంటే తప్ప గుర్తించబడదు. అందువల్ల నామినేషన్ పద్ధతిని నిరసించ వలసిందే. ఈ పద్ధతి వల్ల ప్రయోజనం ఒకటే. తమ వర్గాల ప్రయోజనం కంటే తమకు చట్ట సభలో ఒక స్థానం ఉండడం మాత్రమే.

## ఎన్నికైన సభ్యులు

*50.* **వర్గనియోజక వర్గాలు :** ఈ వర్గ నియోజక వర్గాలు, మార్లేమింటో సంస్కరణల వారసత్వంగా వచ్చినవి. మార్లే-మింటో పథకం నమ్మకం కలిగించే ఒక ప్రయత్నం మాత్రమే. ఈ పథకం క్రింద అధికార యంత్రాంగంతో పరిపాలించాలి అనే ఉద్దేశం విడనాడకుండానే ఓటు హక్కును, నియోజకవర్గాల్ని సిద్ధం చేసి చట్టసభల్ని ఏర్పాటు చేసే ప్రయత్నం చేస్తుంది. నిజానికి ప్రజాస్వామ్య పరిపాలన కాకపోయినా ప్రజాస్వామ్య పరిపాలన లాగా కనిపించేటట్లు చేస్తుంది. ఈ పథకంలో ఉద్దేశించిన అంశాలకు వర్గ నియోజక వర్గాలు బాగా సరిపోతాయి. కానీ మాంటెగు-ఛేమ్స్‌పర్డ్ విశ్వాసం కలిగించడానికి ఉద్దేశించింది కాదు. అది ప్రజా పరిపాలనకు ఉద్దేశించింది. కాల క్రమంలో వర్గ నియోజక వర్గాల్ని రద్దు చేయాలి అన్న ఉద్దేశం ఆ పథకంలో ఉంటుందని ఆశించారు. కానీ, ఈ వర్గాల శక్తివంతమైన ప్రభావం వల్ల నివేదిక రచయితలు వర్గ నియోజక వర్గాల కొనసాగింపునకు అంగీకరించవలసి వచ్చింది. ఆ సిఫారసు సౌత్‌బరో కమిటీ ద్వారా అమలులోకి

తేబడింది. ఈ వర్గ నియోజక వర్గాల్ని అలాగే ఉంచడం ఏ కారణం వల్ల జరిగినా, వాటి ఉనికి ప్రజాప్రభుత్వంలో నిహితమై ఉండే స్ఫూర్తికి అనురూపం అయింది కానే కాదు. వాటి వర్గతత్వమే వాటిని ఖండించడానికి తగినంత ఆధారంగా ఉంది. ప్రజోపయోగ సమస్యలు ప్రజాభిప్రాయం ప్రకారం చట్టసభలో నిర్ణయం తీసుకోవడంలో పాలుపంచుకునే కౌన్సిలు సభ్యులందరూ ఆ అభిప్రాయానికే కట్టుబడి ఉండాలి. చట్టసభలో చర్చించబడిన అంశాలమీద నిర్ణయాత్మకమైన ఓటు వేయడానికి ఆ సభాసభ్యులకంటే అర్హులు లేరన్నది సత్యం. వర్గ ప్రయోజనాల ప్రతినిధులు తమ వర్గాల అసూయల్ని, అభిప్రాయాల్ని అంగీకరించ వలసిన పనిలేదని కొందరు చెప్పవచ్చు. కానీ చట్ట సభ సభ్యుడుగా తమ వర్గాన్ని ప్రతిబింబిస్తున్నారన్న విషయం పక్కకు పెట్టి చూస్తే ఈ ప్రతినిధులు తమ వర్గానికి సంబంధించినా, సంబంధించకున్నా అన్ని అంశాల మీద ఓటు వేసేందుకు అర్హత సంపాదించుకొని ఉంటారు. ఇది నా అభిప్రాయంలో ప్రజాప్రభుత్వ సిద్ధాంతానికి వినాశకరమైనది. అలాంటి ప్రతినిధులు ఆ వర్గాలకు సంబంధించిన సమస్యల విషయంలో అనుభవపూర్వక సలహా యివ్వడానికి వర్గ సమస్యల స్వరూపం తెలియని వర్గ రహితమైన సభలో అవసరం అని కొందరు వాదించవచ్చు. ప్రజాస్వామ్యంలో చివరి సిద్ధాంతం స్వపరిపాలనలో అన్ని అంశాల మీద అంతిమ నిర్ణయం తీసుకోవాల్సింది ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులే కాని నిపుణులు కాదు అని గుర్తుంచుకోవాలని పై వాదానికి విరుద్ధంగా చెప్పుకోవాలి. పైగా అలాంటి సభ్యుల సలహాలు చట్ట సభకు ఎల్లప్పుడూ ప్రయోజన కరమైనవి కావు. వారి సలహా తప్పని సరిగా తమ వర్గ ఆదర్శాల వకృత్వ వ్యాఖ్యానాలే అవుతాయి కానీ వివాదానికి సంబంధించిన సూత్రాల వ్యాఖ్యానాలు కావు.

51. ఈ వర్గాల ప్రయోజనాల పరిరక్షణకు గానీ, ఆ వర్గాల తరుపున అనుభవపూర్వక సలహాల్ని చట్టసభకు ఇవ్వడానికిగానీ వర్గ నియోజక వర్గాలు అవసరం అన్న సిద్ధాంతం ఇంకా నిరూపించబడలేదు. కారణం సాధారణ నియోజక వర్గాల ద్వారా ఆ వర్గాల ప్రయోజనాలు సాధించబడవు అన్న అంశం ఇంకా రుజువు కాలేదు. ఆయా వర్గాల ప్రయోజనాలు సంరక్షించ బడతాయనే మనకు తెలిసిన వాస్తవాలు చెబుతున్నాయి. ఇనాందార్ల సంగతే తీసుకుంటే వారికి మూడు స్థానాలే ఇవ్వబడినా సాధారణ నియోజకవర్గాల ద్వారా 12 స్థానాలు సంపాదించుకోగలిగారు. భూస్వాములైన కౌన్సిల్ సభ్యుల్లో ఉండే ఐక్యత వల్ల తమకు సభలో సంఖ్యా బలం ఉందని భావించబట్టే తమ వర్గ నాయకునికి మంత్రి పదవి ఇవ్వాలని కొన్నాళ్ల క్రితం డిమాండు చేశారు. అంతేకాక వర్గ నియోజక వర్గాలు లేకపోతే కౌన్సిల్‌లో ఆ వర్గాల ప్రతినిధులు ఉండరు అనడం సత్యం కాదు. సాధారణ నియోజకవర్గం నుండి ఎన్నికైన ఆ వర్గానికి చెందిన సభ్యుడు తమ వర్గ ప్రయోజనాల్ని రక్షించుకొనే ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. చట్ట సభలోని సభ్యుడు ప్రత్యక్షంగా తన నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నా పరోక్షంగా తనకూ, తన వర్గానికీ కూడా ప్రాతినిధ్యం వహిస్తుంటాడు అన్న విషయం మనం గుర్తుంచుకోవాలి. నిజానికి, ఈ పరిస్థితిలో సభ్యుడు పరోక్షంగా తనకు ప్రాతినిధ్యం వహించుకొనే ప్రవృత్తి తప్పనిసరిగా బయట పడుతూనే ఉంటుంది. ఉదాహరణకు

ఛాంబర్ ఆఫ్ కామర్స్‌కు ప్రాతినిధ్యం వహిస్తున్న యూరోపియన్ పెద్ద మనిషి తాను ఛాంబర్ ఆఫ్ కామర్స్ ద్వారా ఎన్నికైనా వర్తకానికి సంబంధించిన ప్రయోజనాలే చూస్తాడని, యూరోపియన్ జాతి ప్రయోజనాలు చూడడని అంటే ఎవరూ నమ్మరు. ఈ సమయంలో అతని నియోజక వర్గం కన్నా అతని స్వార్థం అతనికి దగ్గరగా ఉంటుంది. ఒక సామెత ఉంది. చొక్కాకన్నా చర్మం వ్యక్తికి దగ్గరగా ఉంటుంది అన్నది. చట్ట సభ్యుల విశ్వసనీయత మీద ఎలాంటి ఆరోపణా లేకుండా ఈ సామెతను వారికి వర్తింపజేయవచ్చు. ఈ వాస్తవాన్ని అంగీకరించినందువల్లనే మొదట నౌకా వర్తకం, ఉన్ని వర్తకానికి సంబంధించిన ప్రతినిధులు కామన్స్‌సభలో ఉండాలనే అభిప్రాయంతో ఉన్న ఇంగ్లీష్ ప్రజలు అలాంటి వర్గ నియోజక వర్గాల ఊహనే రద్దుచేసుకున్నారు. ఇతర చోట్ల వదిలివేసిన పద్ధతి ఇండియాలో ఎందుకు కొనసాగాలో అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది. ఆయా వర్గాల ప్రయోజనాల దృష్ట్యా వర్గ నియోజక వర్గాల పద్ధతి అవసరం లేదు. పైపెచ్చు ఈ పద్ధతి సమష్టి పౌర వ్యవస్థకు హానికరం కూడా. అసలు ప్రశ్న ఏమంటే వర్తక సంబంధమైన ప్రత్యేక వర్గాల వ్యక్తులు సాధారణ నియోజక వర్గాల నుండి ఎన్నిక అవుతారా! లేదా అన్నదే. ఎన్నికల పరుగు పందెంలో ఈ వర్గాలకు ఆటంకం ఏదీ ఉండదని నా కనిపిస్తున్నది. సాధారణ ఎన్నికల్లో ఇనాందార్లు, సర్దార్లు గెలవడాన్ని బట్టి ఎలాంటి ఆటంకం లేదని రుజువయింది. ఎక్కడ ఇనాందార్లు, సర్దార్లు గెలిచారో అక్కడ వర్తక, పరిశ్రమల ప్రతినిధులు గెలవరనడానికి ఏ కారణం కనిపించడం లేదు.

*52. రిజర్వుడు నియోజక వర్గాలు :* రిజర్వుడు నియోజక వర్గాలకు వ్యతిరేకంగా మూడు ఆక్షేపణలు చేయవచ్చు. మొదటిది. ఈ పద్ధతి మెజారిటీగా ఉండేవారికి కూడ ఎన్నికల్లో అనుకూలత కల్పించడం. మరాఠీ భాష మాట్లాడే బొంబాయి ప్రెసిడెన్సీ ప్రాంతాల్లో మరాఠాలు తత్సంబంధ కులాల వారు మెజారిటీలో ఉన్నారనడం నిజం. వారు జనాభాలోను, ఓటర్ల సంఖ్యరీత్యాను మెజారిటీలో ఉన్నందువల్ల వారికి ఇలాంటి రాజకీయ రక్షణ అనవసరం. కానీ తమ బలం, అధికారం తెలుసుకొని దానిని వినియోగించడం తెలిసిన ప్రజలకు, తమకు బలం, అధికారం ఉన్నట్లే తెలియని ప్రజలకు ప్రపంచం అంతటా తారతమ్యం ఉంది. మరాఠాలకు, తత్సంబంధ కులాలకు తమ బలం తెలియదు అనడానికి వారి ఓటింగ్ బలాన్ని బట్టి చూస్తే తెలుస్తుంది. వారి కోసం రిజర్వు చేయబడిన నియోజక వర్గాల్లో వారి ప్రతినిధులతో పాటు ఇతరులు కూడా ఎన్నికల్లో నిలబడ్డారు. అలాంటి ప్రతి నియోజకవర్గంలోను మరాఠాలు, తత్సంబంధ కులాల ఓటర్లు తమ వారి కంటే ఇతర జాతుల వారికే ప్రాధాన్యత ఇచ్చారు. 1923, 1926 సంవత్సరాలలో జరిగిన ఎన్నికల్లో ఏడు స్థానాలు వారికి కేటాయించబడగా, వారికోసం కొన్ని స్థానాలు రిజర్వు చేయకుండా ఉన్నట్లయితే ఎన్నికైన ఆ మూడు స్థానాలు కూడా వచ్చి ఉండేవి కావు. ఓటర్ల జాబితాలో పైచేయిగా ఉన్న జాతి వారి అభ్యర్థులు అట్టడుగున, అందునా క్షీణ దశలో ఉన్నారంటే నిజానికి వింతైన విషయమే. ఈ వింత సత్యం ఈ బహుళ సంఖ్యగల జాతికి తనకున్న బలం గురించి తెలియదనడానికి, పై నుంచి వచ్చే ప్రభావానికి లోనవుతుందనడానికి ఒక సూచన మాత్రమే.

53. రెండవ ఆక్షేపణ రిజర్వుడు సీట్ల పద్ధతి వల్ల దెబ్బతిన్న ఉన్నత వర్గాల వారిది. ముఖాముఖి అన్నట్లు జరిగే ఎన్నికల పోరాటంలో తమ విజయానికి ఉండే అవకాశానికి ఈ పద్ధతి ద్వారా అన్యాయం జరుగుతున్నదని వారి అభియోగం. ఈ పద్ధతి వల్ల నిమ్న వర్గాల వారికి ప్రాతినిధ్యం వహించి ఉన్నత వర్గాల వారి హక్కుకు పరిమితి విధించినట్లౌతుందన్నది నిజమే. కానీ 'ప్రాతినిధ్యహక్కు'నుండి వేరైన ప్రాతినిధ్యం వహించే హక్కు' పరిమితి లేనిదిగా ఉండాలనటానికి కారణం ఏమిటి? ఆధునిక రాజకీయ వేత్తలు వారి చాతుర్యం అంతా ఓటు హక్కును పరిమితం చేసేందుకు కారణాలు వెదకడంలోనే ఖర్చు చేశారు. నా అభిప్రాయంలో ఇతరులకు ప్రాతినిధ్యం వహించే అభ్యర్థి హక్కును పరిమితం చేయడానికి మనం ఎందుకు ప్రయత్నించాలి? ఉదా॥ స్థానిక సంస్థలో ఇన్ని సంవత్సరాల అనుభవం ఉండాలి, లేక పోతే వీలుకాదు లాంటి నిబంధన చట్ట సభకు ఎన్నిక కావడానికి విధిస్తే ఆ వ్యక్తి ఎన్నికయ్యే హక్కుకు భంగం కలిగించినట్లుకాదు. శాసనసభలో సేవ చేయడం ఫలితాలు సాధించడానికి చాలా అవసరం. దీనికి నేపథ్యంగా చట్టసభలో సేవచేయడానికి అనుమతించడానికి అతనికి అభిరుచి అనుభవం ఉన్నట్లు ఆధారం ఉండడం సముచితం. నిమ్న వర్గాల వారికి ప్రాతినిధ్యం వహించే హక్కుల్ని ఉన్నత వర్గాల పై పరిమితి విధించడానికి ఈ పద్ధతినే చెప్పవచ్చు. ప్రాతినిధ్యం వహించే హక్కును గుర్తించడానికి పూర్వాధారంగా నిర్ణీతమైన సామాజిక దృక్పథం ఉండాలి అన్నది ఒక నిబంధనగా ఇది చేస్తున్నది. అలాంటి అర్హత అనవసరం అని చెప్పడంలేదు. తాను ఎవరికి ప్రాతినిధ్యం వహించాలని కోరుకుంటున్నాడో ఆ ప్రజల గురించి సామాజిక దృక్పథం కంటే అతని అభిరుచి, అనుభవం ముఖ్యం కాదు. నిజానికి సరైన సామాజిక దృక్పథం ఉండక పోతే కేవలం అభిరుచి, అనుభవం వినాశానికి కారణం అవుతాయి. నిమ్న వర్గాల పట్ల ఉన్నత వర్గాలకు ఉండేది సరైన సామాజిక దృక్పథం కాదన్నది నిస్సదేహం. వారు మేధాపరంగా చాలా శక్తివంతమైన వర్గాలుగా ఉండడం ఆ వర్గాల యోగ్యత అనడం కూడా నిస్సందేహమే. అయితే ఉన్నత వర్గాల వారు ఎప్పుడు కూడా నిమ్నవర్గాల వారికోసం తమ మేధాశక్తిని ఉపయోగించలేదన్నది కూడా అంతే సత్యం. పై పెచ్చు తమ జాతికి భిన్నం అయిన జాతి కాకపోయినా, విభిన్న స్థాయిల్లో ఉండే ప్రజల్ని వారు ఎప్పుడూ అలక్ష్యం చేశారు. అగౌరవించారు. తోసిపుచ్చారు. ఇండియాలో ఏ వర్గానికీ మరో వర్గాన్ని పాలించే అధికారం లేదు. అందులోనూ ఉన్నతవర్గం వారు – వారి ప్రవర్తనా నియమాల ద్వారా – తమదైన ప్రతికూలాభిప్రాయాలలో కూరుకుపోయి తమదొక ప్రత్యేక వర్గంగా ప్రవర్తించారు. తమ ప్రయోజనాలకు విరుద్ధంగా ఉండే, తమతో సంబంధం లేని సామాన్యజనుల అభిలాషల్ని ఎప్పుడూ పంచుకోలేదు. అందువల్ల అభ్యర్థి తాను ఎవరికి ప్రాతినిధ్యం వహించాలను కుంటాడో వారి ఉద్దేశాల్ని, లక్ష్యాల్ని, ప్రయోజనాల్ని పంచుకొనేటట్లు ఉండాలని డిమాండు చేయడం అన్యాయం కాదు.

54. రిజర్వుడు నియోజక వర్గాల పద్ధతికి వ్యతిరేకంగా చెప్పబడే మూడో ఆరోపణ ఇది: సమర్థుడైన అభ్యర్థిని తోసిపుచ్చి అంత సమర్థుడు కాని అభ్యర్థికి సీటు ఇవ్వబడుతుంది కాబట్టి ఇది

అసమర్థతకు దారి తీస్తుంది అనడం. అ విమర్శ నిజమైంది కూడా. అయితే ఇక్కడ కూడా మరికొన్ని విషయాలను లెక్కలోకి తీసుకోవాలి. వాటిలో మొదటిది: ప్రొఫెసర్ డైసీ ఇలా సరిగ్గా వాదిస్తునారు. "మేధాశక్తి గల ఉన్నతమైన పార్లమెంటును ఏర్పరచుకోవడం రాజ్యాంగ ఏర్పాటు ప్రధాన ధ్యేయం కానేకాదు. నిజానికి దేశంలోని సామాన్య జనుల మేధస్సు కంటే చాలా ఉన్నతమైన మేధస్సు ఉండే వారితో పార్లమెంటు ఏర్పాటు చేయాలని ప్రయత్నించడం ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పాటు అనే ఊహకే సరిపోనిది. ఒకవేళ మేధావి వర్గాల అభ్యర్థులకు బదులు మేధావులు కాని వర్గాల అభ్యర్థులు రావడం నష్టం అనుకుంటే ఆ నష్టం వెనుకబడిన తరగతుల ప్రజల సహజమైన ఆదర్శవాదంతో బ్రహ్మాండంగా పూరించబడుతుంది. ఉన్నత వర్గాల ప్రతినిధులు స్వల్పమైన కోరికల కోసం ఆరాట పడుతుంటారు. చాలా తరచుగా దేశ వ్యవహారాల కన్నా తమవర్గ వ్యవహారాల్ని పట్టించుకొంటుంటారు. వారి జీవితం చాలా సందడిగాను, చాలా వైభవంగాను ఉంటుంది. ఆ వర్గాలలోని వ్యక్తి మరీ ఎక్కువగా స్వయం పూర్ణుడుగా, స్వయం తృప్తుడుగా ఉంటాడు. అందువల్ల అతనిలో అరుదుగా ఏదో ఒక క్షణంలో సమాజ అభ్యున్నతికి సంబంధించిన భావన వచ్చిపోతుంటుంది. కానీ, బడుగు వర్గాలవారికి ప్రతిక్షణం సమాజంలో మార్పు ద్వారానే పరిష్కరించుకోవలసిన తమ అధోగతి గుర్తుకు వస్తుంటుంది. సమిష్టి అవసరాలకోసం ఒకరి మీద ఒకరు ఆధారపడి ఉండవలసిన స్థితి వారికి ఉదారత్వాన్ని నేర్పుతుంది. తమ అశిక్షితమైన శక్తులు, అభివృద్ధి చెందని సామర్థ్యాలు వారికి ఆకాంక్షల్ని రేకెత్తిస్తాయి. వారి అభివృద్ధి కోసం బడుగు వర్గాల వారికి ప్రేరేపక శక్తి ఉండడాన్ని మనం కాంక్షించాలి. వెనుకబడ్డ హిందూ కులాల వారికి సీట్ల రిజర్వేషన్ కల్పించాలి. అలాంటి శక్తి వంతమైన సామాజిక శక్తులు దేశసేవకు అవసరం. వారు లేకుంటే ఏ పార్లమెంటరీ ప్రభుత్వం అయినా నిస్సారమైందిగా భావించాల్సి ఉంటుంది.

***55. మత నియోజకవర్గాలు:*** ఇపుడు ఏ మతాల ప్రయోజనాల కోసం మత నియోజక వర్గాలు ఏర్పడ్డాయో ఆ మతానికి కొంత ప్రాతినిధ్యం ఉండడం అవసరం తప్పనిసరి అన్నది వివాదాస్పదం కాని విషయం. ఇంకా కొంత కాలం పాటు ప్రశ్నించదగిన విషయంగా ఉండేది ఏమంటే మత నియోజకవర్గాల ద్వారానే ఆ మతాలకు ప్రాతినిధ్యం ఉండాలా అన్నది. దేశం లోని వివిధ ప్రాంతాల్లో రేకెత్తిన మతపరమైన అల్లర్లకు మత నియోజక వర్గాలే కారణమని ఈ పద్ధతిని విరోధించే వారు ఆరోపిస్తున్నారు. మతనియోజక వర్గాలకు మతపరమైన అల్లర్లకు ఎలాంటి ప్రత్యక్ష సంబంధమూ మనకు స్పష్టంగా కనిపించదు. దీనికి విరుద్ధంగా మతనియోజక వర్గాలు మహమ్మదీయులను సంతృప్తి పరుస్తున్నందువల్ల వారిలోని అసంతృప్తి, శత్రుభావం తొలగిపోతాయని వాదించబడుతున్నది. అయితే మతపరమైన అల్లర్లను మతనియోజక వర్గాలు నివారించలేవు. నిజానికి వాటిని ఎక్కువ చేశాయి అన్నది కూడా సత్యమే. మత నియోజక వర్గాలు మతపరమైన భావాల్ని మరింత పెంచే అవకాశం ఉంది. అందువల్ల రెండు మతాల నాయకులు ఒకరి మతానికి సంబంధించి మరొకరు బాధ్యత వహించకుండా పోతారు. దీని వల్ల తమ మతస్థుల్ని శాంతివైపునకు నడిపే కంటే ఆయా

సమూహాల క్షణికమైన ఆవేశాలను బట్టి ప్రవర్తించవలసిన వారవుతారు.

56. మత నియోజక వర్గాల్ని కొనసాగించాలి అని పట్టుబట్టే మహమ్మదీయులు అందుకు మూడు ఆధారాలు చూపిస్తున్నారు.

57. మొదటగా – ఇతర మతాల ప్రయోజనాలకంటే మహమ్మదీయ మతస్థుల ప్రయోజనాలు వేరైనవి. ఆ ప్రయోజనాల్ని పరిరక్షించుకోవడానికి తమకు ప్రత్యేక నియోజక వర్గాలు తప్పకుండా కావాలి. ఆ ప్రత్యేక ప్రయోజనాల పరిరక్షణ కోసం ప్రత్యేక నియోజక వర్గాలు అవసరమా అన్న ప్రశ్న పక్కకు – పెడితే అవతల మత ప్రయోజనాలకంటే భిన్నమైన ప్రయోజనాలు ఇవతలి మతం వారికి ఉన్నాయి అని ఖచ్చితంగా నిరూపించబడాలి. మత పరమైన విషయాలకు అతీతంగా ఉన్న లౌకిక భావంతో చూసినపుడు ప్రతి విషయమూ అందరికీ సంబంధించిందే అయి ఉంటుంది. పన్నుల చెల్లించాలా? వద్దా? చెల్లిస్తే ఏ పన్నులు? ఏ రేటు? జాతీయ వ్యయాన్ని ఇతర మార్గాల ద్వారా కాక ఒక ప్రత్యేక పద్ధతిలో ఏమైనా ఖర్చు చేయాలా? విద్య నిర్బంధంగా, ఉచితంగా ఉండాలా? ప్రభుత్వ భూములు పరిమిత కాల పద్ధతిలో గుత్తకు ఇవ్వాలా? లేక అనువంశిక పద్ధతిలో గుత్తకు ఇవ్వాలా? పరిశ్రమలకు ప్రభుత్వ ధన సహాయం మంజూరు చేయాలా? గౌరవ మేజిస్ట్రేట్ల నియామకాల ద్వారా న్యాయ వ్యవస్థ మరింత సేవ చేయగలదా? మరింత సత్ఫలితాలసాధనకు నియమాలు, న్యాయ సంబంధ నిబంధనలు మార్చడం అవసరమా? ఇలాంటివి కౌన్సిల్ ముందు చర్చకు వచ్చే ప్రశ్నలు. ఈ ప్రశ్నల పట్టికలో ఏ ఒక్కటైనా మహ్మదీయులకు మాత్రమే సంబంధించినది అనగలమా? మహమ్మదీయ జాతి విద్యావిషయంలోను ప్రభుత్వ సర్వీసుల విషయంలోను ప్రత్యేక శ్రద్ధ చూపుతుండడం సత్యం. ఈ విషయంలో కూడా మహమ్మదీయ జాతి ఒక్కటే కాదు ఇతర జాతుల వారు కూడా వీటిపై శ్రద్ధ చూపుతున్నారు. బ్రాహ్మణేతర జాతుల వారు, నిమ్నజాతుల వారు కూడా మహమ్మదీయ జాతితో సమానంగా ఈ సమస్యలపై శ్రద్ధ చూపుతున్నారు. కాబట్టే ఈ మూడు జాతుల వారు విశ్వవిద్యాలయ సంస్కరణల బిల్లు విషయంలో బొంబాయి శాసనమండలిలో తమ ఉమ్మడి శక్తిని చూపించగలిగారు. మహమ్మదీయ జాతికి ప్రత్యేక ప్రయోజనాలున్నాయి అన్నది మిథ్య మాత్రమే. వాస్తవంగా ఉన్నదేమంటే ప్రత్యేక ప్రయోజనాలు కాదు, కొన్ని విషయాల్లో ప్రత్యేక శ్రద్ధ మాత్రమే.

58. ఒక వేళ ప్రత్యేక ప్రయోజనాలంటూ ఉన్నాయి అనే వాదం కోసం అంగీకరించినా సాధారణ నియోజక వర్గాలు, రిజర్వుడు స్థానాల కంటే ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా అవి నెరవేరతాయా అన్నదే ప్రశ్న. నేను నొక్కి చెప్పే సమాధానం ఏమంటే ఏ అల్ప సంఖ్యాక వర్గం యొక్క ప్రత్యేకమైన విభిన్నమైన ప్రయోజనాలు అయినా ప్రత్యేక నియోజక వర్గాల కంటే సాధారణ నియోజక వర్గాలు, రిజర్వుడు స్థానాల ద్వారానే బాగా నెరవేరతాయి అని. ఏ ప్రయోజనానికైనా భంగం వాటిల్లు తుందంటే అది బాధ్యతా రహితులైన అతివాదుల ఉనికి వల్లనే జరుగుతుంది. అందువల్ల అలాంటి అతివాదుల్ని దేశంలోని చట్టసభల్లోకి రానివ్వక పోవడం ధ్యేయంగా ఉండాలి.

రెండు మతాల వైపు నుండి బాధ్యతారహితులైన అతివాదుల్ని దేశంలోని చట్టసభల్లోకి రానివ్వకపోతే మహమ్మదీయ అభ్యర్థులు హిందువుల ఓట్ల ద్వారా హిందువులు మహమ్మదీయుల ఓట్లతో ఎన్నికయ్యే ఒక పద్ధతి మంచిది. మతనియోజక వర్గాల పద్ధతికి బదులు ఉమ్మడి నియోజక వర్గాల పద్ధతికి ప్రాధాన్యం ఇవ్వాలి. ఎందుకంటే ప్రత్యేక నియోజక వర్గాల కంటే ఉమ్మడి నియోజక వర్గాలు అనుకున్న ఫలితాల్ని సాధించగలవు అన్నది సరిగా అంచనా వేయబడిన విషయం. ఏవిధంగా చూసినా ప్రత్యేక నియోజక వర్గాల పద్ధతి ద్వారా కంటే ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా మైనారిటీలు గొప్ప సానుకూలతను పొందగలరు. ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా మైనారిటీ వర్గం తన కోటాకు వచ్చే ప్రాతినిధ్యాన్ని మాత్రమే సాధించుకోగలదు. అంతకంటే ఎక్కువ సాధించలేదు. ఇతర సభ్యులతో కూడిన చట్టసభ మైనారిటీల విషయంలో విశ్వాసం ఉంచదు. కాబట్టి మైనారిటీల కోరికల విషయంలో ప్రభావితం కాదు. ఇలా మైనారిటీలు తన సొంత బలంమీదనే ఆధారపడవలసి వస్తుంది. ఏ ప్రాతినిధ్య పద్ధతి అయినా మైనారిటీలను మెజారిటీలుగా మార్చలేదు. అపుడు మైనారిటీలు ఓడిపోవడం ఖాయం. మరోవైపు పరిశీలించి చూస్తే ఉమ్మడి నియోజక వర్గాల పద్ధతి, రిజర్వుడు స్థానాల పద్ధతిలో మైనారిటీలు తమ కోటా సంపాదించుకోవడమే గాక ఇంకా మరికొన్ని ఎక్కువ స్థానాలు సంపాదించుకోగలరు. మైనారిటీ వారి ఓట్ల మీద ప్రాక్టికంగా ఎన్నికైన ప్రతి మెజారిటీ వర్గ సభ్యుడూ మైనారిటీ వర్గ సభ్యుడు కాకపోయినా, మైనారిటీ వర్గం కోసం పనిచేసే సభ్యుడవుతాడు. నా అభిప్రాయంలో మైనారిటీల సంరక్షణ సాధనంగా ప్రత్యేక నియోజక వర్గాల కన్నా ఉమ్మడి నియోజక వర్గాలే సానుకూలంగా ఉన్నాయి. చట్ట సభ అంటే పోప్‌ను ఎన్నుకోవడానికి సమావేశం అయ్యే బిషప్పుల సమావేశం లాంటి, మత సంబంధ విషయాలను నిర్ణయించే ధార్మిక సభ లాంటిది అయి ఉండవచ్చని మహమ్మదీయ మైనారిటీలు భావిస్తున్నట్లుంది. అదే నిజం అయితే కొందరయినా బలవత్తరమైన సభ్యులుండాలి అనే మైనారిటీల వారి పట్టుదల తెలివైన ప్రవర్తనావళి అనిపిస్తుంది. అయితే మహమ్మదీయులు గుర్తుంచుకోవాల్సిన విషయం ఒకటుంది. చట్టసభ మత సభకాదు. అది మతాతీతమైన విషయాల్ని నిర్ణయించడానికి ఉద్దేశించిన మతాతీత సభ. అలాంటి విషయాలు నిర్ణయం జరిగేటప్పుడు ఎక్కువ మంది మాటే చెల్లుతుంది. అలా అయినపుడు మైనారిటీల సమస్యల విషయంలో తన సభ్యులతో పాటు ఇతర సభ్యుల్ని కూడా బలవంతం చేసే పద్ధతిని మైనారిటీల ప్రయోజనం అనే అంశమే సమర్థించడం లేదా?

59. ప్రత్యేక నియోజక వర్గాలు కావాలనడానికి రెండవ కారణం : మహమ్మదీయులు తాము ఒక ప్రత్యేక జాతి వారమని భావించడం. కేవలం మతపరంగా మాత్రమే వారు ఇతర జాతుల నుంచి భిన్నం కాదు. వారి చరిత్ర, ఆచారాలు సంస్కృతి వివాహ చట్టం, వారి సామాజిక అలవాట్లు, మహమ్మదీయ జాతికి చాలా విభిన్నమైన దృక్పథం ఇస్తున్నాయి. అవి సామాన్య సామాజిక బంధాలు, సానుభూతులు, సౌకర్యాలులాంటి వాటి వల్ల ఏ మాత్రం ప్రభావితం కాలేదు. శతాబ్దాల తరబడి ఇండియాలో ఉన్నవారు ఒక ప్రత్యేకమైన జాతి ప్రజలుగా ఉన్నారు. తమది ప్రత్యేకమైన

రాజకీయ చరిత్ర తెలిసిన ప్రతి విద్యార్థికీ తెలుసు ఆ దేశాల్లో ప్రత్యేక నియోజక వర్గాలు లేకుండానే మహమ్మదీయులు జీవించ గలుగుతున్నారని. అంతే కాకుండా నిర్దిష్ట శాతం ప్రాతినిధ్యం ఉంటుందని లేకున్నా జీవించగలుగుతున్నారు. కానీ, ఏదో విధంగా ఇండియాలోని మహమ్మదీయ జాతికి రాజకీయాల్లో తగినంత ప్రాతినిధ్యం హామీ ఇవ్వాలి. ఎందుకంటే ఇంకా లౌకికతత్వం ఇండియా రాజకీయాల్లో పూర్తిగా నెలకొనలేదు. అలా తగినంత ప్రాతినిధ్యం ఇవ్వకపోతే మెజారిటీ ప్రజల మతవైరం వల్ల మహమ్మదీయ జాతి రాజకీయ రంగంలో పూర్తిగా మరుగున పడవచ్చు. ప్రపంచంలోని ఇతర ప్రాంతాల్లో ఇలాంటి గ్యారంటీ కోటా అవకాశం లేకుండానే జీవిస్తున్నారు. అందువల్ల మహమ్మదీయుల విషయం ఇండియాలో ఆశయానికి దూరంగా పోయింది. కాబట్టి ఎవర్నీ ఒప్పించ లేకపోతున్నది అన్నది నా అభిప్రాయం.

61. మహమ్మదీయుల కోసం మత నియోజక వర్గాలుండాలి అనడానికి మూడో ఆధారం ఇలా చెప్పవచ్చు. మిశ్రమ నియోజకవర్గంలో మహమ్మదీయుల ఓటింగు బలం మహమ్మదీయేతరుల ఓటింగు బలం వల్ల నిస్సారం చేయబడుతుంది. దీని వల్ల మిశ్రమ నియోజక వర్గం ద్వారా ఎన్నికైన మహమ్మదీయ సభ్యుడు బలహీనుడుగా, మహమ్మదీయులకు నిజమైన ప్రతినిధిగా ఉండడానికి బదులు మహమ్మదీయేతర కీలుబొమ్మ అవుతాడనే ఒక అభియోగం ఉంది. ఈ భయం సత్యమైనదిగా కనిపించినా కొద్దిగా ఆలోచిస్తే ఈ భయానికి ఆధారం లేదని తెలుస్తుంది. మహమ్మదీయేతర ఓటర్లందరూ మొత్తంగా మహమ్మదీయ అభ్యర్థిని ఎన్నుకోవడంలో పాల్గొంటే మహమ్మదీయేతరులు అందరూ హానిచేస్తే – మహమ్మదీయులు ఇలా సంభవిస్తుందని ఊహించినట్లు జరుగుతుంది. అయితే సత్యం ఏమంటే సాధారణ ఎన్నికలలో చాలా మంది మహమ్మదీయేతర అభ్యర్థులు ఎన్నికలకు నిలబడతారు. అలాంటపుడు మహమ్మదీయేతరుల ఓట్లన్నీ మహమ్మదీయ అభ్యర్థులకు పడవు. అంతేగాక మహమ్మదీయేతర అభ్యర్థులు మహమ్మదీయేతర ఓట్లను మహమ్మదీయ అభ్యర్థులకు పడనీయరు. దీనికి విరుద్ధంగా మహమ్మదీయేతర ఓటర్లను అందరినీ కాకపోయినా చాలామంది ఓట్లను తమకు వేయించుకొంటారు. ఈ విశ్లేషణ నిజం అయితే మహమ్మదీయ అభ్యర్థుల ఎన్నికలో ఓట్లు వేయడానికి కొంతమంది మాత్రమే మహమ్మదీయేతర ఓటర్లు మిగులుతారు. ముస్లిం అభ్యర్థులకు వ్యతిరేకంగా ఓటర్లు సమూహంగా ఏదో చేస్తారనే భయం వట్టి భ్రమ మాత్రమే. మహమ్మదీయులు కూడా ఈ విషయాన్ని నమ్మరనడానికి 'ఢిల్లీ ప్రతిపాదనలు' సాక్ష్యంగా నిలుస్తాయి. ఈ రిపోర్టులో ఒక భాగంలో చెప్పబడిన ప్రకారం మతపరమైన రాష్ట్రాల్ని కల్పించడం; పంజాబ్, బెంగాల్‌లలో ముస్లింల ప్రాతినిధ్యం విషయంలో కొన్ని రాయితీలు గనుక ఇస్తే మతనియోజక వర్గాలు వద్దంటామని చెప్పడం జరిగింది. మతపరమైన రాష్ట్రాల ప్రభావం ఇతర చోట్ల ఉండదని భావిస్తే ఇతర రాష్ట్రాల్లో మిశ్రమ నియోజక వర్గాల ద్వారా కలిగే రక్షణలతో మాత్రమే ముస్లిం మైనారిటీలు సంతృప్తి పడవలసి ఉంటుంది. దీన్ని బట్టి మతపరమైన రాష్ట్రాలు లేకుండానే మిశ్రమ నియోజక వర్గాల ద్వారా ప్రయోజనం సాధించడం సరిపోతుంది గదా అన్నదే ప్రశ్న. ఈ పరిశీలనను

పక్కకు ఉంచితే, మిశ్రమ నియోజక వర్గాల ద్వారా ఓటింగు హక్కు నిస్సారం అవుతుందన్న ముస్లింల దృక్పథంలో ఏమైనా పస ఉంటే నా అభిప్రాయంలో నివారణోపాయం మతనియోజక వర్గాల కొనసాగింపులో లేదు. వయోజన ఓటింగు ప్రవేశపెట్టి మహమ్మదీయ ఓటర్ల సంఖ్యను పెంచడంలో నివారణోపాయం ఉంది. ఇలా చేస్తే ముస్లిమేతరుల ఓట్లతో కలిసి పోయి తమ ఓట్లు నిస్సారం అయిపోనంత ఎక్కువ ఓటర్ల సంఖ్యను మహమ్మదీయ జాతి పొందే అవకాశం ఉంది.

62. ఈ విషయం అంతా పరిశీలిస్తే నియోజక వర్గాల తరుపున వాదం ఏ ఆధారంగా చూసినా సకారణంగా కనిపించదు. ఆ వాదానికి బలంగా భావావేశం స్వకీయం మాత్రమే మిగులుతాయి. అయితే రాజకీయ సమస్యల పరిష్కారంలో భావావేశం, స్వకీయం సెంటిమెంట్ల పాత్ర ఏమీ ఉండదని నేను చెప్పడం లేదు. ప్రభుత్వానికి విధేయంగా ఉండటం అనేది నమ్మకం మీద, ఆ నమ్మకం సెంటిమెంటు మీద ఆధారపడి ఉందన్న అంశాన్ని నేను గుర్తిస్తున్నాను. ఈ విశ్వాసాన్ని రాజ్యాంగ వ్యవస్థకు భంగం కలగకుండానే సాధించగలగాలి. అయితే మత పరమైన ప్రాతినిధ్యం మౌలికంగానే తప్పు. ఎందుకంటే సెంటిమెంటుకు ప్రాధాన్యం ఇవ్వడం చెడ్డకు శాశ్వతత్వం ఆపాదించడమే అవుతుంది. ఈ వాదానికి ప్రతికూలంగా వాదించే వారి దృష్టిలోనుంచి ఈ మౌలికమైన తప్పు తప్పించుకుంది. ఈ మత నియోజక వర్గాలు పని చేసే తీరు గమనించి నపుడు ఈ మౌలికమైన తప్పు ఉనికి స్పష్టంగా తెలుస్తుంది. ముస్లిం ప్రతినిధులే ముస్లిమేతరుల కోసం చట్టం చేస్తారు అనేది స్పష్టం. ముస్లిమేతరుల నుండి రాబట్టిన రాబడిని ఖర్చు చేస్తారు. వారే ముస్లిమేతరుల విద్యావిధానాన్ని నిర్ణయిస్తారు. వారే ముస్లిమేతరులు ఏ పన్నులు కట్టాలి ఎంతెంత కట్టాలి అని నిర్ణయిస్తారు. ముస్లిమేతరుల సంక్షేమం దెబ్బతినే ఇలాంటి కొన్ని ముఖ్యమైన పనుల్ని శాసనసభ్యులుగా ఉండే ముస్లింలు చేయగలరు. ఇలా చేయడానికి వారికున్న హక్కేమిటి? అని ప్రశ్నించవచ్చు. ముస్లిమేతరులు ప్రతినిధులుగా ఎన్నిక కావడం అన్నది సమాధానం కాదు అని గుర్తుంచుకోవాలి. ముస్లింల ప్రతినిధులుగా ఎన్నికయ్యారన్నదే సమాధానం! ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా రాజకీయ జీవిత సూత్రం ఏమంటే పరిపాలితుల అంగీకారం మీద ప్రభుత్వం నడవాలి అన్నదే. నేను ఇంత వరకు చెప్పిన విషయాల్ని బట్టి చూస్తే మత నియోజక వర్గాలు పై రాజకీయ జీవిత సూత్రానికి విరుద్ధం అవుతాయి. కారణం అది పరిపాలితుల అనుమతి లేని ప్రభుత్వం అవుతుంది కాబట్టి. ఇతర జాతుల వారి ఓటు హక్కుకు లొంగకుండా మరొక జాతి సభ్యులు ఇతర జాతుల ప్రజల్ని పాలించడం అనే పద్ధతి రాజకీయ న్యాయ సూత్రాలకే విరుద్ధం. ఇతర జాతుల విధానానికి భిన్నంగా ఉండే విశిష్ట జాతి తమది అని మహమ్మదీయులు భావించారంటే ఈ పద్ధతి ఉపేక్షించరానంత మరీ భయంకరమయింది అవుతుంది.

ఈ ప్రకటన సెక్రటరీ ఆఫ్ స్టేట్‌ను ఉద్దేశించి పంపబడింది. దానిలో ఇలా ఉంది.

"రిపోర్టును (సౌత్ బరో కమిటీ రిపోర్టు) వివరంగా పరిశీలించడానికి ముందు ఒక ప్రాథమికమైన ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసి ఉంది. సిద్ధాంతం రూపొందించే దిశలో కమిటి పని ఎక్కువ పురోగతిని సాధించలేదు. కమిటీ దృష్టికి వచ్చిన వివిధ సమస్యల పరిష్కారం విషయంలో వారు ఏదో విధమైన ఒప్పందానికి రావడానికి ప్రయత్నించారు కానీ సహేతుకత మీద ఆధారపడలేదు."

64. ఇప్పటి నమూనా అసలు విలువను నా సహచరులు లెక్కచేయలేదు. వారు నామినేషన్ పద్ధతి తొలగించాలి అనడాన్ని నేను కూడా సమర్థిస్తున్నాను. ఆ అంశం మినహా మరే ఆక్షేపణ లేదన్నట్లు ఎన్నికల వ్యవస్థ మొత్తాన్ని స్పృశించకుండా నా సహచరులు వదిలేశారు. నేను ఈ విషయంలో వారితో విభేదిస్తున్నాను. నేను ఇంతకు ముందే చెప్పినట్లు ఎన్నికల వ్యవస్థ అంతా తప్పులతడకగాను తప్పనిసరిగా పునర్నిర్మించవలసిందిగాను ఉంది. 1917 ఆగస్టు ప్రకటనలో అప్పటి సంస్కరణల ధ్యేయం స్వయం పాలిత సంస్థల్ని ఏర్పాటు చేయడం అని నేను గుర్తు చేస్తున్నాను. ఆ ధ్యేయానికి అనుగుణంగా ఆనాడు ఏర్పాటు చేసిన ఎన్నికల వ్యవస్థ సరైన వ్యవస్థ స్థాపన ధ్యేయానికి సగంలోనే ఉండిపోయింది. అది ఆనాడు ఉద్యోగాధికార స్వామ్యం నుండి ప్రజాస్వామ్యానికి పరివర్తన చెందే సంధియుగానికి అవసరం అని ఆ కాలానికి అది సరిపోతుందని సమర్థించడం జరిగింది. ఇప్పటి ద్వంద్వ ప్రభుత్వ విధానం ఇంకా కొనసాగు తుందన్న అంచనా మీద అయితే ప్రస్తుతం ఉండే ఎన్నికల వ్యవస్థను కొనసాగించవచ్చు. ప్రస్తుతం ఆచరణలో ఉండే ప్రాతినిధ్య పద్ధతి సంపూర్ణ ప్రభుత్వ ఏర్పాటుకు అసంగతం అయింది. కాబట్టి పునర్నిర్మించాల్సి ఉంది. ఎక్కడైనా సరే ప్రాతినిధ్య ప్రభుత్వం అంటే పార్టీ ప్రభుత్వమే. నిజానికి పార్టీ ప్రభుత్వం ఎంత సర్వ సామాన్యంగా ప్రాతినిధ్య ప్రభుత్వంలో కలిసి పాయిందంటే ప్రాతినిధ్య ప్రభుత్వం పార్టీ ప్రభుత్వం ద్వారా గాక కలిసిపోయిందని చెప్పవచ్చు. పార్టీ ప్రభుత్వం యొక్క సర్వోత్తమ స్వరూపం ఏమంటే రెండు పార్టీల పద్ధతి ద్వారా ఏర్పడేది. అలా ఏర్పడిన ప్రభుత్వం అటు స్థిరమైనది గాను, ఇటు బాధ్యతా యుతమైందిగాను ఉంటుంది. చట్టం ద్వారా పరిపాలక వర్గాన్ని చట్టసభకు బాధ్యత వహించేటట్లు చేయవచ్చు. కానీ, చట్టసభ పాలకవర్గం మీద బలంగా తన అభీష్టాన్ని విధించలేకపోతే ెపాలకవర్గం చట్టసభకు వహించాల్సిన బాధ్యత నామమాత్రంగానే మిగిలిపోతుంది. ఏ ప్రభుత్వానికైనా ిశ్చితత్వం లేకుండా ఉండాలి. క్రమబద్ధమైన విధానాన్ని ప్రణాళికకు తగినట్లు నిరంతరాయంగా 'లక వర్గం తయారు చేసుకొనేటట్లు ఉండాలి. అయితే అది పూర్తి మెజారిటీ మద్దతిని ఆశిస్తుంది. న్ని రెండు పార్టీల పద్ధతి ద్వారానే సాధించవచ్చు. గ్రూప్ పద్ధతి ద్వారా దీన్ని ఎన్నటికీ సాధించలేము. గ్రూప్ పద్ధతిలో అభిప్రాయం యొక్క సంపూర్ణత్వాన్ని చూడలేము. అది అధికారం కోసం న్యాయ వర్తనలో రాజీపడడానికి అంగీకరించిన వివిధ గ్రూపుల నాయకుల సిద్ధాంతాల అతుకులమారి పని మాత్రమే అవుతుంది. ఈ పద్ధతి స్థిరమైన ప్రభుత్వానికి కావలసిన నిరంతరమైన మద్దతును ఎన్నటికీ హామీ ఇవ్వలేదు. ఎందుకంటే వైయుక్తిక లాభాల కోసం గ్రూపుల పునర్వ్యవస్థీకరణ

అనే దురాకర్షణ నిత్యమూ ఉండేదే కాబట్టి. ప్రాతినిధ్య పద్ధతిగా ప్రస్తుతం ఉండే కౌన్సిల్ ఎలా ఉందంటే బర్క్ మాటల్లో చెప్పాలంటే "చాలా మూర్ఖంగా అస్తవ్యస్తంగా చపల చిత్తంగా అతికించబడ్డ చెక్క పనిలాగా,నానా విధమైన నాపరాళ్ళ పరుపుల లాగా, నానా విధాలైన రాళ్ళతో చేసిన సిమెంటు వేయని పేవ్‌మెంట్ లాగా దేశభక్తులు, రాజ భృత్యులతో, ప్రభుత్వ మిత్రులు, ప్రభుత్వానికి బహిరంగా శత్రువులతో నిండి ఉంటుంది. అందువల్ల ఇప్పటి కౌన్సిల్ రెండు పార్టీల పద్ధతికి దాదాపు అవకాశం ఇవ్వదు. పార్టీ పద్ధతి లేకుండా అటు స్థిరమైన ప్రభుత్వమూ ఉండదు. ఇటు బాధ్యతాయుతమైన ప్రభుత్వమూ ఉండదు. గ్రూప్ పద్ధతి పుట్టుక నియోజక వర్గాల నిర్మాణంలోనే ఉంది. నియోజక వర్గాలు అనే మూసల్లోనే కౌన్సిల్ పోతపోయబడుతుంది. కౌన్సిల్ సమర్థవంతంగా పనిచేయడానికి 'రీమోడల్' చేయాలంటే మూసను 'రీకాస్ట్' చేయడం తప్పని సరి.

66. ఎన్నికల పద్ధతిని రీకాస్ట్ చేయడానికి మూడు అంశాల్ని మార్గదర్శకంగా పెట్టుకొని సూచనలు చేస్తాను. 1. ఇండియాలోని చాలా మంది ప్రమాదకరమైన, అమాయక రాజకీయ నాయకుల అభిప్రాయం ఆధారంగా చేసుకొని దేశంలోని సాంఘిక పరిస్థితుల్ని పట్టించుకోకుండా ప్రాంతాన్ని బట్టి మాత్రమే ఎన్నికల పద్ధతి ప్రవేశ పెట్టరాదు.

2. ప్రాంతీయ నియోజక వర్గాల ద్వారా ప్రాతినిధ్యం సంపాదించగలిగే చోట్ల ఏ ఇతర సామాజిక ప్రయోజనం లేదా ఆర్థిక ప్రయోజనం కోసం ప్రత్యేక ప్రాతినిధ్యం అంగీకరించకూడదు.

3. ఏ ప్రయోజనం అయినా ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడానికి యోగ్యం అని గుర్తించబడితే ఈ పద్ధతిలో ఎన్నికయిన ప్రతినిధులు ఒక ప్రత్యేకమైన గ్రూపుగా ఏర్పడకుండా ఉండే విధంగా ప్రాతినిధ్యం ఇవ్వాలి.

67. ఈ మూడింటిలో రెండోది ఓటు హక్కు పై ఆధారపడి ఉంది. నేను వయోజన ఓటింగు ప్రవేశ పెట్టడాన్ని సిఫారసు చేశాను. అది అంగీకరించబడుతుందని నాకు నమ్మకం ఉంది. అందువల్ల ఈ ఆధారం మీద నా సిఫారసులు చేస్తాను. పై విధంగా కాకపోతే ఒక వేళ పరిమిత ఓటుహక్కే కొనసాగితే, వేరే విధమైన సిఫారసులు కావాలి. వాటిని కూడా ప్రతిపాదిస్తాను. పై కారణాల దృష్ట్యా చివర చెప్పిన పరిశీలన ఆధారంగాను నేను సూచిస్తున్నాను.

1) వయోజన ఓటింగును మంజూరు చేసేట్లయితే మహమ్మదీయుల్ని, దళిత జాతుల్ని ఆంగ్లో - ఇండియన్లను మినహాయించి మిగతా ప్రాంతీయ ప్రాతినిధ్యం ఉండాలి. 2) పరిమిత ఓటుహక్కే కొనసాగేటట్లయితే మహమ్మదీయులను, దళిత జాతులను, ఆంగ్లో-ఇండియన్లను, మరాఠాలు తత్సంబంధ కులాలు, కార్మికుల్ని మినహాయించి మిగతా ప్రాంతీయ ప్రాతినిధ్యం ఉండాలి. 3) అలాంటి ప్రత్యేక ప్రాతినిధ్యం సాధారణ ఓటర్ల ద్వారా, రిజర్వుడు సీట్లు, కార్మికుల సీట్లు రిజిస్టరు చేయబడిన ట్రేడ్ యూనియన్ ఓటర్ల ద్వారా ఉండాలి.

68. ఈ సూచనల ద్వారా - నేను అన్నిరకాల నియోజక వర్గాల్ని - 1) ఇనాందార్లు, సర్దార్లు,

2) వర్తక వ్యాపారులు ఇండియా కానీ, యూరోపియన్ కానీ, 3) ఇండియన్ క్రిష్టియన్లు, 4) పరిశ్రమదారులు - రద్దు చేసి సాధారణ నియోజక వర్గాల్లో కలిపేయాలి అని సూచిస్తున్నాను. సాధారణ పద్ధతి ద్వారా కౌన్సిళ్లలో వారి అభిప్రాయం తెలపడానికి అభ్యంతరం లేదు. రెండవది, కొన్ని తరగతుల వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించడానికి నేను సుముఖంగా ఉన్నా వారి ప్రాతినిధ్యం ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా లభించడానికి నేను వ్యతిరేకం. ప్రాంతీయ నియోజక వర్గాలు, ప్రత్యేక నియోజక వర్గాలు రెండూ రెండు అతివాదాలు. ఈ అప్రజాస్వామ్య దేశంలో ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టే సమయంలో ఏ రకమైన ప్రాతినిధ్యం ప్రవేశ పెడుతున్నా పై అతి వాదాల్ని దూరంగా ఉంచాలి. మంచి మార్గం ఏదంటే రిజర్వుడు సీట్లతో సంయుక్త నియోజక వర్గాలు తప్ప మరేదైనా అసంపూర్ణమే. అంతేకాక మంచి ప్రభుత్వం ధ్యేయాల్ని విఫలం చేస్తాయి. స్పష్టం అయిన కారణాలవల్ల యూరోపియన్ జాతి విషయంలో నేను ఒక అపవాదం చూపిస్తున్నాను. వారు తమ ప్రత్యేక నియోజక వర్గాల్ని కొన సాగించుకొనే అవకాశం ఇవ్వాలి. అయితే అవి సాధారణ నియోజక వర్గాలు కాకూడదు.

## మూడవ అధ్యాయం
## సీట్ల పంపకం

### 1. మైనారిటీల మధ్య సీట్ల పంపకం

వివిధ రకాల మైనారిటీలకు నా సహచరులు కేటాయించిన సీట్ల వివరాలు ఈ విధంగా ఉన్నాయి :

| | మైనారిటీ | 140 సీట్లలో | |
|---|---|---|---|
| | | జనరల్ | ప్రత్యేకం |
| 1. | యూరోపియన్లు | 2 | 5 |
| 2. | ఆంగ్లో - ఇండియన్లు | 2 | లేవు |
| 3. | ఇండియన్ క్రిష్టయన్లు | 1 | లేవు |
| 4. | దళిత జాతులు | 10 | లేవు |
| 5. | మహమ్మదీయులు | 43 | 2 |

70 ఈ పట్టికను పరిశీలిస్తే వివిధ మైనారిటీల మధ్య సీట్ల పంపకంలో ఏ విధమైన సమాన సూత్రాన్ని పాటించ లేదని తెలుస్తుంది. అంతేగాక మైనారిటీలకు న్యాయం చేకూర్చాలనే ప్రయత్నం చేసినట్లు కూడా కనిపించదు. నా సహచరులు మహమ్మదీయులతో వ్యవహరించిన తీరును దళిత జాతుల్తో వ్యవహరించిన తీరుతో పోల్చి చూస్తే స్పష్టం అవుతుంది. ప్రెసిడెన్సీలో 19

శాతం మంది మహమ్మదీయులు శాసన మండలిలో మొత్తం ప్రాతినిధ్యంలో తమకు 31 శాతం పైగా ఇవ్వాలని ప్రతిపాదించారు. ప్రెసిడెన్సీలో తక్కువ అంచనా ప్రకారం చూసినా దళిత జాతుల శాతం 8 కాగా కౌన్సిలు మొత్తం స్థానాలలో వారికి 7 శాతం ప్రాతినిధ్యం మాత్రమే ప్రతిపాదించబడింది. ఈ పక్షపాతానికి కారణాలు తెలుసుకోవడం కష్టం. ఈ రెండు మైనారిటీల్లో మహమ్మదీయ మైనారిటీ జనాభాలో ఎక్కువ. ధనంలోగానీ, విద్యలోగానీ నిస్సందేహంగా వారు బలంగా ఉన్నారు. జనాభాలో అల్ప సంఖ్యలోనే గాక ధనంలోనూ, విద్యలోనూ బలహీనమైన వారే కాక దళిత జాతులు మహమ్మదీయులకు బొత్తిగా లేని అనర్హతల బరువును మోస్తున్నారు. ప్రభుత్వ బావుల నుండి దళిత జాతులు నీరు తెచ్చుకొనే వీలు లేదు. మహమ్మదీయులకు వీలుంది. పోలీసు, సైన్యం, నావికా బలాలలో దళితజాతులు ప్రవేశించలేదు. భారత ప్రభుత్వ చట్టం ప్రకారం ఏ వ్యక్తి అయినా కులం, మతం వర్ణం ఆధారంగా ఏ ప్రభుత్వ కార్యాలయంలో అయినా పని చేయడానికి తిరస్కరించ కూడదు అని ఉన్నా, దళిత జాతుల వారి అస్పృశ్యత కారణంగా పోలీసు, సైన్యం, నావికా బలాలలో వారు ప్రవేశం పొందలేకున్నారు. పబ్లిక్ సర్వీసులు మహమ్మదీయుల విషయంలో తెరిచి ఉంచిన వాకిళ్ళు కావడమే కాదు కొన్ని నిర్దిష్టమైన శాఖల్లో వారికి చాలా పెద్ద వాటా దక్కింది. ప్రజల సొమ్ముతో నడపబడుతున్న పాఠశాలల్లో దళితులకు ప్రవేశం లేదు. మహమ్మదీయుల విషయంలో అలాంటి అభ్యంతరం లేదు. దళితుని స్పర్శ మైల అవుతుంది. మహమ్మదీయుని స్పర్శతో మైల అంటదు. వర్తక రంగం, పారిశ్రామిక రంగాల్లో మహమ్మదీయునికి ప్రవేశం లభిస్తుండగా దళిత జాతి వ్యక్తికి ప్రవేశం లభించడం లేదు. మహమ్మదీయునికి నిమ్న కళంకం అంటలేదు. కాబట్టి ఆతనికి ఇష్టం వచ్చినట్లు బట్టలు ధరిస్తాడు. అతనికి ఇష్టం వచ్చినట్లు జీవిస్తాడు. అతని ఇష్టం అయిన పనిచేస్తాడు. ఇలాంటి స్వేచ్ఛ దళిత జాతి వ్యక్తికి లేదు. దళిత జాతి వ్యక్తి తనకు విలువైన బట్టలుకొనే ఆర్థిక శక్తి ఉన్నా గ్రామంలోని ప్రజల కంటే మంచి బట్టలు వేసుకోరాదు. అతడు గుడిసెలోనే జీవించాలి. దళిత జాతి వ్యక్తి తన ధనాన్ని, వైభవాన్ని పండగ సందర్భాల్లో కూడా ప్రదర్శించరాదు. పెళ్ళిళ్ళలో పెళ్ళికొడుకును గుర్రం మీద వీధుల గుండా ఊరేగింపుగా తీసుకొని పోరాదు. ఈ సాంప్రదాయ నియమావళికి, సంఘంలో తన హోదాకి విరుద్ధంగా ప్రవర్తించిన దళిత జాతి వ్యక్తి తాను కలిసి మెలిసి జీవించవలసిన మొత్తం గ్రామ ప్రజల కోపానికి గురికావలసి ఉంటుంది. దళిత జాతి వ్యక్తి మెజారిటీ ప్రజల క్రూరత్వానికి మహమ్మదీయుని కన్నా ఎక్కువ సార్లు గురువుతుంటాడు. ఏదైనా మత విషయంలో తప్ప మహమ్మదీయునికి మెజారిటీ జాతి వారితో కలహించవలసిన అవసరం రాదు. ఎందుకంటే మనుషులకు ఇవ్వవలసిన అన్ని ప్రాథమిక హక్కులు అతనికి ఇవ్వబడ్డాయి. కానీ దళిత జాతి వ్యక్తి స్థానం దీనికి పూర్తిగా భిన్నమైంది. అతనిది మనిషికి ఉండవలసిన ప్రాథమిక హక్కుల కోసం నిరంతరం పోరాటం. ఈ హక్కుల్ని మెజారిటీ ప్రజలు తిరస్కరిస్తూనే ఉంటారు. ఫలితం ఏమంటే మెజారిటీ ప్రజలతో అతనికి ఎప్పుడూ వైరమే. అంతే కాదు. మహమ్మదీయుడు ఒక వేళ ఎప్పుడైనా మెజారిటీ ప్రజల క్రూరత్వాన్ని అనుభవించాల్సి వస్తే అతనికి వెంటనే పోలీసుల, న్యాయవ్యవస్థ అండ ఉంటుంది. మెజారిటీ ప్రజల క్రూరత్వానికి దళిత జాతి వ్యక్తి గురి అయినపుడు

మాత్రం పోలీసులుగానీ, న్యాయవ్యవస్థగానీ అతనికి రక్షణకు ఎప్పుడూ రాలేదు. రక్షణ ఇవ్వడానికి బదులు మెజారిటీ వర్గంతో కుమ్మక్కవుతారు. కారణం రాష్ట్రంలోని న్యాయవ్యవస్థలోనూ పోలీసు శాఖలోనూ మహమ్మదీయుల చుట్ట పక్కాలు ఉంటారు. దళిత జాతుల వ్యక్తులు ఈ శాఖల్లో ఒక్కరు కూడా లేరు. ఇక్కడ మరో విషయం గమనించాలి. దళిత జాతులు సంప్రదాయ హిందూ శక్తి దాడి తీవ్రతనే కాదు భరించవలసింది మహమ్మదీయుల దాడిని కూడా భరించవలసి ఉంటుంది. దళిత జాతుల పట్ల హిందువులకుండే సామాజిక దురభిప్రాయాలు మహమ్మదీయులకు ఉండవలసిన పనిలేదు అనుకుంటాం. ఈ అభిప్రాయం కంటే మించిన తప్పు లేదు. పట్టణ ప్రాంతాల్ని మినహాయిస్తే పల్లె ప్రాంతంలో హిందువులు కక్కే విషం వల్ల మహ్మదీయులు చాలా ప్రభావితులయ్యారు. కోలారు జిల్లాలోని మన్‌గావ్ తాలుకాలోని హర్కుల్ అనే గ్రామంలో జరిగిన అల్లర్లను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. ఈ జిల్లాలో దళిత జాతులు న్యూనంగా చూపించే కొన్ని అపరిశుభ్ర అలవాట్లను వదిలేసి సంఘంలో ఉన్నత స్థాయికి ఎదగాలని ప్రచారం ప్రారంభించారు. ఆ జిల్లాలోని హిందువులు అంతకు ముందు దళిత జాతుల అభ్యున్నతి కోసం ఇలాంటి అపరిశుభ్ర అలవాట్లను మానుకోవలసి ఉందని బోధించినవారే. ఈ బీద ప్రజల్ని సామాజికంగా, ఆర్థికంగా వెలివేసి క్రూరంగా ప్రవర్తించారు. తమ ఇరుగు పొరుగు జిల్లాల్లోని హిందువుల్లాగా మహ్మదీయులు కూడా ప్రవర్తిస్తారని ఎవరూ అనుకోలేదు. దీనికి భిన్నంగా మహమ్మదీయులు ఈ విషయంలో సవర్ణ హిందువులతో తమకు జరిగే పోరాటంలో సహకరిస్తారని దళిత జాతి ప్రజలు ఆశించారు. వారి ఆశలు ముక్కలు చెక్కలు అయ్యాయి. తర్వాత అర్థమైంది ఏమిటంటే మహ్మదీయులు అస్పృశ్యత పాటించక పోయినా హిందువుల ప్రభావంతో విషపూరితులయ్యారు. దళిత జాతులు నిమ్నజాతి వర్గంగా జన్మించారని, తమ అపరిశుభ్ర అలవాట్లను మానుకొని సంఘంలో పైకి రావాలనుకోవడం ఇతరులకు అవమానం అని అలా వారిని పై స్థాయికి రానీకూడదన్న హిందువుల హానికరమైన అభిప్రాయాన్ని మహమ్మదీయులు కూడా అంగీకరించారు. తత్ఫలితంగా జిల్లాలో మహమ్మదీయులు – దళిత జాతి ప్రజల మధ్య చాలా చోట్ల కొట్లాటలు జరిగాయి. ఆ కొట్లాటల్లో హర్కుల్ అనే ఊళ్లో క దళిత జాతి వ్యక్తి ప్రాణాలు కోల్పోయాడు.

71. దీన్నిబట్టి మహమ్మదీయుల సమస్య కంటే దళిత జాతుల సమస్య చాలా ముఖ్యమైనది. మహమ్మదీయులు వెనుకబడిన వారు కావచ్చు. పురోభివృద్ధి చెందిన హిందువుల తర్వాత విద్యలో మహమ్మదీయులదే పై చేయి. ప్రయత్నంతోను, ప్రోత్సాహంతోను తాము పైకి రావడానికి మహమ్మదీయులకు ఏ అడ్డంకీ లేదు. దీనికి విరుద్ధంగా దళిత జాతులు కేవలం వెనుకబడిన వారు మాత్రమే కాదు, వారికి ప్రతిబంధకాలున్నాయి. ఆ ప్రతి బంధకాలు మొదట తొలగించబడకపోతే ఏ ప్రయత్నమూ, ప్రోత్సాహమూ వారిని పైకి తీసుకు రాలేదు. రెండు జాతుల మధ్య భేదం ఇది కాబట్టి మహమ్మదీయుల్ని వెనుక బడ్డ స్థితి నుండి పైకి తీసుకు రావడానికి ఎంతటి రాజకీయ అధికారం అవసరమో అంత కంటే మరీ ఎక్కువ కాకపోయినా రెండింతలు రాజకీయ అధికారం దళిత జాతుల్ని

ఉద్ధరించడానికి అవసరం అవుతుంది. ఇలా ఉన్నా నా సహచరులు ప్రాతినిధ్య నిష్పత్తిని తలకిందులు చేశారు. 19 శాతం జనాభా ఉంటూ బలిష్ఠమైన మైనారిటీగా ఉండే మహమ్మదీయులకు కౌన్సిల్ లో 31 శాతం సీట్లు, తక్కువ అంచనా వేసినా 8 శాతం జనాభా కలిగిన దళిత జాతుల వారికి 7 శాతం సీట్లు మాత్రమే ఇవ్వబడ్డాయి. ఇది నిజానికి వారి జనాభా నిష్పత్తి కంటే 1 శాతం తక్కువ.

72. దళిత జాతుల సమస్య సాంఘిక సమస్య కాబట్టి దాని పరిష్కారం కూడా సాంఘిక రంగం నుండే రావాలి అనే దృక్పథం ఒకటుంది. ఈ దృక్పథం ఉన్నత స్థాయిల్ని కూడా ప్రభావితం చేయడం నాకు ఆశ్చర్యం కల్గిస్తున్నది. ఈ దృక్పథం కలిగిన వారు మానవ సమాజంలోని ప్రతి సమస్యా సామాజిక సమస్య అవుతుందన్న సత్యాన్ని మరిచి పోయారని నా భయం. తాగు నీటి సమస్య, వేతనాల సమస్య, పని గంటలు, గృహ వసతి, నిరుద్యోగ భీమా – ఇవన్నీ సామాజిక సమస్యలే. ఈ ఉద్దేశంతో చూస్తే అస్పృశ్యత కూడా సమస్యే. అయితే ఈ సమస్య సామాజిక సమస్యా కాదా అన్నది ప్రశ్న కాదు. రాజకీయ అధికారాన్ని ఉపయోగించడం సమస్యను పరిష్కరిస్తుందా లేదా అన్నదే ప్రశ్న. ఆ ప్రశ్నకు నేను గట్టిగా చెప్పే సమాధానం 'ఔను' అనేది. భారత దేశంలోని ప్రభుత్వం సవర్ణ, అస్పృశ్య హిందువుల్ని – వారికి ఇష్టం ఉన్నా లేక పోయినా ఒకే కుటుంబ సభ్యులు లాగా కలిసి మెలిసి ఉండేట్లు బలవంతపెట్ట లేదన్నది నిజం. అంతేగాక ప్రభుత్వం ఈ రెండు వర్గాల మధ్య ప్రేమను చట్ట సభలో చేసే చట్టం ద్వారాగానీ, రెండు వర్గాల మధ్య కలగలుపుతనం కౌన్సిల్ ద్వారా గాని సాధించలేదు. కానీ పై ధ్యేయానికి కొంచెం తక్కువగా అస్పృశ్యుల్ని ఏ నీచమైన దశలో ఉన్నారో ఆ దశ నుండి తప్పించడానికి అన్ని అడ్డంకుల్ని ప్రభుత్వం తొలగించవచ్చు. ఈ దృక్పథం సత్యమే అయితే అప్పుడు తగినంత రాజకీయ ప్రాతినిధ్యం ఉండవలసిన తెగల్లో దళిత జాతుల కంటే మించిన మరో జాతి లేదు.

73. నా సహచరులు మహమ్మదీయ మైనారిటీకి దాని జనాభా శాతం కంటే 12 శాతం అధికంగా ప్రాతినిధ్యం ఎందుకు ఉండాలో, దళిత జాతులకు వారి జనాభా శాతం కంటే కూడా ఎందుకు తక్కువ ప్రాతినిధ్యం ఇవ్వాలో ఎక్కడా వివరించలేదు. మహమ్మదీయ సాక్షులు ప్రాతినిధ్యం ఎక్కువ కావాలని అర్థించినపుడు తమ అభ్యున్నతికి, సంక్షేమానికి ఇది అవసరం అనే ఆధారం మీద అర్థించక పోవడం గుర్తుంచుకోవలసిన అంశం. తాము ఒక పాలక జాతికి వారసులమని, ఎక్కువ ప్రాతినిధ్యం ఉండకపోతే తమ ప్రాముఖ్యం, ప్రభావం తగ్గిపోతాయన్న విషయం ఆధారంగా ఎక్కువ ప్రాతినిధ్యం అడిగారు. ఈ అంశం ఆధారంగా పరిశీలిస్తే మహమ్మదీయులు అడిగే ఎక్కువ ప్రాతినిధ్యం చాలక పోవడం అన్న కారణం వల్లకాదు. సర్వోత్కృష్టత కోసం అర్థించబడిందని తెలుస్తుంది. ఏ విధమైన ప్రజాస్వామ్య పద్ధతిలోనైనా అన్ని జాతులు సమానమైన రాజకీయ ప్రాధాన్యం కలిగి ఉండాలే కానీ ఏ ఒక్క జాతికీ తాము అందరి కంటె ఎక్కువ అనే అభిప్రాయం వచే అవకాశం ఇవ్వ కూడదు. తన జాతి గొప్పదని, తన జాతికి న్యాయమైన సముచిత ప్రాతినిధ్య ఇవ్వాలని ఎవరైనా అడిగితే అందరూ ఆ అభిప్రాయాన్ని సానుభూతిలో పరిశీలించవచ్చు. ఎవరై

తనజాతి ప్రత్యేకంగా ముఖ్యం అయిందని, కాబట్టి ఆ జాతికి న్యాయంగా రావలసిన భాగం కంటే ఎక్కువగా ప్రాతినిధ్యం ఇవ్వాలని అడిగితే, అది ఇతర జాతులు తక్కువైనవని, వాటికి న్యాయంగా రావలసిన భాగం కంటే తక్కువ ప్రాతినిధ్యం ఇస్తే చాలునని చెప్పడం అవుతుంది. అలాంటి స్థితిని ఇతర జాతులు సహజంగానే అంగీకరించవు. మొదట ఇలాంటి విపరీత భావాన్ని ఎంత త్వరగా సరిచేస్తే మహమ్మదీయ జాతి భవిష్యత్తుకు అంత మంచి జరుగుతుంది. ఇతర జాతులు ఇష్టంగా అంగీకరించని ప్రాధాన్యతలు ఉండి ప్రయోజనం లేదు. ఎందుకంటే ఆ ప్రాధాన్యతల కోసం ఎల్లప్పుడూ పోరాడుతూనే ఉండాల్సి ఉంటుంది. ఆ ప్రాధాన్యతలు వైముఖ్య బీజాలు చల్లడం ద్వారా మహమ్మదీయ జాతికి హాని చేస్తాయి. అంతేగాక మహమ్మదీయ జాతికి ఇతర జాతులకు మధ్య వైరాన్ని పెంచుతాయి.

74. పాలక జాతిగా ఉండి ఆ స్థితి నుండి దిగజారిన జాతుల్లో మహమ్మదీయ జాతి ఒక్కటే కాదు. కెనడాలో ఫ్రెంచి జాతి, దక్షిణాఫ్రికాలో డచ్ జాతి ఇలా పాలక జాతి నుండి పాలిత జాతిగా మారిన వాటికి దృష్టాంతాలు. కానీ అటు కెనడాలో ఫ్రెంచి జాతిగానీ, ఇటు దక్షిణాఫ్రికాలో డచ్ జాతి గానీ పాలకులుగా ఇంతకు ముందున్న స్థితిని కొనసాగించుకోడానికి అపరిమితమైన ప్రాతినిధ్యం కోసం అర్థించనూలేదు. ప్రపంచంలోని ఇతర దేశాల్లో ఇలాంటి ప్రత్యేకత ఎక్కడా లేదు కూడా. అల్బేనియా, రుమేనియా, గ్రీసు, బల్గేరియా దేశాల్లోని మహమ్మదీయ మైనారిటీలు ఒక నాటి పాలక జాతికి అవశేషాలు. కానీ ఈ దేశాల్లో ఎక్కడా మహమ్మదీయ జాతి తమకు ప్రాతినిధ్యంలో రాజ భాగం కావాలని కోరలేదు. ప్రాబల్యం ఆధారంగా ప్రాతినిధ్యం ఇవ్వాలని మహమ్మదీయ జాతి అడగడం ఎక్కడా వినిపించని మాట. అది ప్రాతినిధ్య ప్రభుత్వ పద్ధతికే అనురూపం అయింది కాదు. భూస్వాములు, పెట్టుబడిదార్లు, పురోహితులు ప్రతి సమాజంలోనూ అమిత ప్రాబల్యం ఉండే వాళ్ళే అయినా ఈ వర్గాలకు ప్రాతినిధ్యంలో ఎక్కువ భాగం ఇవ్వాలని ఎవరూ అంగీకరించలేదు. ఇలాంటి తరహా కోరికలు ఇతర ప్రాంతాల్లో అంగీకరించబడనపుడు ఇక్కడ మహమ్మదీయుల కోరిక అంగీకరించబడాలి అనడానికి కారణం కనిపించదు.

75. ఇండియాలో బ్రిటీష్ పరిపాలన రాకముందు వారి స్థితి ఏదైనా కానీ, ఇక్కడ కూడా మనం ఒక విషయాన్ని మరచిపోగూడదు. మహమ్మదీయులు ఇండియాను 5 శతాబ్దాలు పరిపాలిస్తే హిందువులు వారి కంటే ముందు లెక్కలేనన్ని శతాబ్దాలు పరిపాలించారు. తర్వాత కూడా పరిపాలిస్తారు. బ్రిటీష్ ఆక్రమణ వల్ల అన్ని జాతులు ఒక సమానమైన స్థితిలో ఉన్నాయి. ఇప్పుడు వాటి రాజకీయ గతాన్ని లెక్కలోకి తీసుకోలేకున్నాయని మనం గమనించాలి. అలాంటి దృక్పథం న్యాయానికి దగ్గరగానే ఉంది. సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు ఉద్దేశించి రాసిన లా కమిషనర్ల సెంటిమెంట్లకు ఈ మాటలు సమానంగా ఉన్నాయి.

"మేము ఈ న్యాయ నియమావళి అమలులో కంపెనీ ప్రాంతాల్లో నివసించే ప్రాచీన రాజ కుటుంబాలు వీరికెవరికీ మినహాయింపు ఇవ్వలేదని గుర్తించాలి. మినహాయింపులు ఇవ్వాల్సి ఉంటే ప్రస్తుతం ఉన్న ఒడంబడికలలో ఉండే విషయాల కన్నా ఇంకా ఎక్కువ ఖచ్చితమైన విషయాలు

తెలవాలి. ఆ ఒడంబడికలలోని అంతరార్థం ఏమిటో తెలియాలి. చర్చల చరిత్ర తెలియాలి. ఆ ప్రత్యేక కుటుంబాల స్వభావం, అధికారం తెలియాలి. ఇవన్నీ తెలియక పోతే మనం మినహాయింపులు ఇవ్వడానికి సాహసించలేము. అలాంటి ప్రతి మినహాయింపూ చెడ్డదని మేం మనవి చేసుకుంటున్నాం. చట్టం కన్నా పై స్థాయిలో ఏ వ్యక్తి ఉన్నా అది దోషమే. చట్టం కన్నా మించిన ఇతరులకు ఈర్ష్య కలిగేంత విశిష్టత కలిగిన విశేషాధికారాలున్నాయని, ప్రజలు వాటిని గుర్తించాలని చెప్పడం ఇంకా ఘోరమైన దోషం. అలాంటి విశేషాధికారాలు ఎన్నాళ్ళు ఎక్కువ ఉంటాయో, వాటిని తొలగించడం అంత కష్టం అవుతుంది. ప్రభుత్వం అన్ని జాతుల, మతాల వారికి అన్వయించేట్లు నూతన న్యాయ నియమావళి తయారు చేసే ప్రస్తుత సమయం కంటే సరైన సమయం మరెపుడూ ఉండదు. సమాన న్యాయానికి ఉండే లాభాల్లో విద్యుక్తంగా అంకితమైన ప్రజల నమ్మకం కంటే మించిన మరో అంశమేదైనా పరిశీలన చేయడానికి ఉందా అని మాకు సందేహం"

76. ఇవి చాలా విజ్ఞానదాయకమైన మాటలు. ఇంత గొప్పవిజ్ఞాన దాయకమైన మాటలు ఇండియా ప్రజల వ్యవహారాలు చక్కపెట్టే వారికి మార్గదర్శకాలుగా చెప్పబడ్డవి మాత్రం కాదు. ఏ సందర్భంలో ఏ ఉద్దేశ్యంలో వారు ఈ మాటలు చెప్పారో ఆ సందర్భానికీ, ఆ ఉద్దేశ్యానికీ మాత్రమే ఈ మాటలు పరిమితం అయ్యేవీ కాదు. ఆ మాటలు మరింత బలంగా కాక పోయినా ఈ సందర్భంలో తగినంతగా పనికి వస్తాయి. లా కమీషనర్ల భాషలోనే నేనూ చెప్పేందుకు ప్రయత్నిస్తున్నాను. రాజ్యాంగ చట్టం గమనించాల్సిన దోషం ఏమంటే ఏ జాతి అయినా ఇతర జాతుల కంటే ఉన్నత మయిందని భావించడం. అంతకంటే పెద్దదోషం ఏమంటే ఆయా తరగతుల ప్రజలు రాజకీయ ప్రాధాన్యతలు అనే ప్రమాణాలు ఆధారంగా తమని ఇతరుల కంటే ఉన్నతంగానో, తక్కువగానో చూసుకొనేట్టు చేయడం. ఇలాంటి భావాలు చాలా కాలం ఉండేకొద్దీ వాటిని తొలగించడం కష్టమై పోతుంది. అందువల్ల ఇలాంటి భావాలు తొలగించడానికి చట్టం ముందు అన్నిజాతులు, మతాల ప్రజలు సమానమే అని తెలపడానికి రాజ్యాంగ చట్టాన్ని పార్లమెంటు కొత్తగా రూపొందించే ప్రస్తుత సమయం కంటే సరైన సమయం రాబోదు.

77. మైనారిటీల ప్రాతినిధ్యం అనే సమస్యలో ప్రాతినిధ్య విషయంలో అన్ని మైనారిటీల్ని సమానంగా చూడడం అనేది ఒక భాగం మాత్రమే. సీట్ల పంపకం విషయంలో సంతృప్తి కరమైన పరిణామాత్మకమైన ప్రమాణం నిర్ణయించడమే ప్రధానమైనది. కానీ ఇది చాలా వివాదాత్మకమైన ప్రశ్న. విభిన్నమైన రెండు సిద్ధాంతాల్లో ఒకటి; మైనారిటీ ప్రాతినిధ్యం ఖచ్చితంగా వారి జనాభా నిష్పత్తిని బట్టి ఉండాలి. రెండోది; మైనారిటీలు అందరూ గట్టిగా కోరుకొనేది - ప్రాతినిధ్యం తగినంతగా తప్పక ఉండాలి. ప్రాతినిధ్య విషయంలో సంఖ్యాపరమైన సూత్రం అంగీకార యోగ్యమైంది కాదేమోనని నా సందేహం. జంతు ప్రదర్శనశాలలో కానీ పురావస్తు ప్రదర్శనశాలలో కానీ ఒక్కోరకం ఇంత సంఖ్యలో ఉండాలి అనే సిద్ధాంతం ప్రవర్తిస్తుంది. చట్టసభ కూడా జంతు ప్రదర్శనశాలలాంటిదో, వస్తు ప్రదర్శనలాంటిదో అయితే ఈ సిద్ధాంతం అన్వయించవచ్చు. అసెంబ్లీ హక్కుల సంపాదనకు,

విశేషాధికారాల విధ్వంసానికి, అన్యాయాన్ని ఆపడానికి యుద్ధరంగం లాంటిది. ఈ వెలుగులో నుంచి చూస్తే తన జనాభా నిష్పత్తిని బట్టి ప్రాతినిధ్యం ఇచ్చినా ఆ ప్రాతినిధ్యం ఏ మాత్రమూ చాలదు. మెజారిటీ వారి దాడికి విరుద్ధంగా తన స్థితిని రక్షించుకోవడానికి గానీ, తనస్థితిని మెరుగు పరుచుకోవడానికి గానీ చేసే ప్రతి ప్రయత్నంలో కూడా ప్రతికూలంగా ఉండే మెజారిటీ చేత మైనారిటీ చావుదెబ్బలు తింటూనే ఉంటుంది. రాజకీయ పరిహాసం కోసం కాక పోతే మైనారిటీలకు – వారి జనాభా నిష్పత్తిని బట్టి ప్రాతినిధ్యం ఇవ్వడాన్ని వదిలి వేయాల్సి ఉంటుంది. వారి జనాభా నిష్పత్తి కంటే కొంత ఎక్కువ పరిమాణంలో ప్రాధాన్యత రూపంలో ప్రాతినిధ్యం ఇవ్వాలి.

78. ప్రాధాన్యత ఆవశ్యకతను అంగీకరించడం చాలా ముఖ్యం అన్నది నిస్సంశయం. మైనారిటీలకు ఇచ్చే ఈ ప్రాధాన్యత ఏదైనా ఒక సిద్ధాంతం మీద ఆధారపడాలి. ఆ సిద్ధాంతం సహేతుకంగా ఉండేందుకు మరింత ప్రాముఖ్యం ఇవ్వాలి. కారణం తగినంత రక్షణ కావాలనే నెపంతో అసంగతం అనిపించే విధంగా మైనారిటీలు ప్రాధాన్యం కోరవచ్చు. దీన్ని అధిగమించడానికి సరిపోయేంత ప్రాతినిధ్యం అంతే ఏమిటో మనం నిర్వచించుకోవాలి. సరిపోవడం అన్నదానికి ఖచ్చితమైన నిర్వచనం ఇవ్వలేక పోవచ్చుగాని, దాని అనిశ్చితతత్వాన్ని కొన్ని స్థూల ఆలోచనల్ని మనసులో ఉంచుకోవడం ద్వారా తగ్గించవచ్చు. మైనారిటీ ప్రాతినిధ్యం విషయంలో సరిపోవడం అన్న అంశానికి ఆధిక్యం అన్న అంశానికి మధ్య భేదం మొట్టమొదటనే గుర్తించాలి. ఆధిక్యం అంటే మైనారిటీని నియంతగా మార్చేటంత ప్రాతినిధ్య ఆధిక్యత అన్నమాట. ప్రాతినిధ్యం సరిపోవడం అంటే మెజారిటీలో ఉండే పార్టీ కూడా మైనారిటీతో మైత్రి చేసుకోవాలి అని భావించేంత ప్రాతినిధ్య ఆధిక్యత కలిగి ఉండడం అని నా భావం. ఎక్కడ ఒక పార్టీ మైనారిటీతో మైత్రి కోరడానికి బలవంత పెట్టబడుతుందో అలాంటి చోట్ల మైనారిటీ నియంత స్థానంలో ఉంటుంది. దీనికి భిన్నంగా ఎక్కడ ఒక పార్టీ మైనారిటీతో మైత్రి కోరడానికి ఆకర్షించబడుతుందో అక్కడ మైనారిటీ తగినంత ప్రాతినిధ్యం కలిగి ఉందన్న మాట. అందువల్ల మైనారిటీలకు సీట్లు పంపకం చేసే ముందు గుర్తుంచుకోవాల్సిన అంశం ఏమంటే ఈ పంపకం రెండు రకాల విపరీతాల్ని – ఇటు చాలక పోవడం అటు ఆధిక్యం అన్న రెండు రకాల వైపరీత్యాల్ని పరిహరించాలి. ఈ అత్యంతాల్ని మనం ఎలా పరిహరించవచ్చునంటే – మైనారిటీ ప్రాతినిధ్యం ఇలా క్రమబద్ధం చేయాలి. మొత్తం సీట్ల సంఖ్యలో మైనారిటీ జనాభా నిష్పత్తికి తగినట్లు వచ్చిన సీట్ల సంఖ్యను ఒకటి కంటె ఎక్కువ రెండు కంటే తక్కువగా ఉండే ఏదైనా సంఖ్యతో హెచ్చిస్తే వచ్చే సంఖ్యను మైనారిటీకి సీట్లుగా ఇవ్వవచ్చు

79. ఈ సూత్రం నిజానికి మైనారిటీకి కేవలం ఏ పరిధుల్లో సీట్లు ప్రాతినిధ్యం నిర్ణయించవచ్చో తెలుపుతుంది. ఈ గుణజం ఎలా వేర్వేరుగా ఉండాలి అనే అంశం ఇంకా అస్పష్టంగా, అస్థిరంగా ఉంది. నా సలహా ఏమంటే ఆయా మైనారిటీల అవసరాల్ని బట్టి ఈ గుణజం వేర్వేరుగా ఉండాలి. ఈ పద్ధతి ద్వారా మైనారిటీల ప్రాతినిధ్యం విషయంలో స్పష్టమైన, సహేతుకమైన ప్రాధాన్యతను నిర్ణయించడంలో ఒక సిద్ధాంతాన్ని రూపొందించవచ్చు. కారణం మైనారిటీల అవసరాలకు

మించినట్లుండటం లేదా సరిపోవడం అనే అంశం ద్వారా నిశ్చయంగా కనుక్కోవచ్చు. రాజకీయ రక్షణకోసం మైనారిటీలకు కావలసిన అవసరాలు, వారికి సామాజిక పోరాటంలో తమను తాము రక్షించుకొనేందుకు చాలినంత శక్తి ఇవ్వడం అన్నది అందరూ అంగీకరించే విషయం. ఆ శక్తి సాధారణంగా మైనారిటీల విద్యా, ఆర్థిక స్థితుల మీద ఆధారపడి ఉంటుంది. విద్యా ఆర్థిక స్థితుల్లో ఉన్నత స్థానం ఉండే కొద్దీ ఆ మైనారిటీలకు రాజకీయ రక్షణ అవసరం తగ్గిపోతుంటుంది. దీనికి భిన్నంగా మైనారిటీ యొక్క విద్యా, ఆర్థిక స్థితి తక్కువగా ఉండే కొద్దీ రాజకీయ రక్షణ అవసరం ఎక్కువగా ఉంటుంది.

80. ఒకవైపు సమానత్వ సిద్ధాంతం, మరోవైపు చాలినంతన్న సిద్ధాంతం అనే పునాదులపై ఆలోచించే నా దృష్టి ప్రకారం నా సహచరులు వివిధ రకాల మైనారిటీలకు చేసిన సీట్ల పంపకం విషయాన్ని ఆక్షేపించవలసి ఉంటుంది. నా ప్రతిపాదన ఏమంటే 140 సీట్లలో మహమ్మదీయులకు 33, దళిత జాతులకు 15 ఉండాలి. దీన్ని బట్టి కౌన్సిల్ మొత్తం సీట్లలో మహమ్మదీయులకు 23 శాతం, దళిత జాతులకు 10.7 శాతం ఇచ్చినట్లువుతుంది. దీనివల్ల మహమ్మదీయులు దాదాపు 4 శాతం, దళిత జాతులు 2 శాతం తమ జనాభా నిష్పత్తి కంటే ఎక్కువ సీట్లు తెచ్చుకుంటారు. ఆయా మైనారిటీలకు ఈ మాత్రం ప్రాధాన్యం ఇవ్వడం సహేతుకం, అవసరం, అంగీకారయోగ్యం అని నా అభిప్రాయం. పైపెచ్చు నా ప్రతిపాదనలో మరో అనుకూలాంశం ఏమంటే మహమ్మదీయుల ప్రాతినిధ్యం నిష్పత్తిని మార్పు లేకుండా కొనసాగిస్తుంది. నా ప్రతిపాదన ఫలితంగా కొత్త కౌన్సిల్లో మహమ్మదీయుల ప్రాతినిధ్య నిష్పత్తి మునుపటిలాగానే ఉంటుంది.

81. కొంతమంది నేను దళిత జాతులకు ఇచ్చిన ప్రాతినిధ్య పరిమాణాన్ని వ్యతిరేకించరు కానీ అంగీకరించక పోవచ్చుననే ఉద్దేశంతో నేనింకా వివరణ ఇచ్చి ఆ అభిప్రాయాన్ని తొలగించాల్సి ఉందను కుంటాను. ఇంతకు ముందు దళిత జాతులకు ఇచ్చిన ప్రాతినిధ్యం పూర్తిగా అనుచితమనడంలో సందేహంలేదు. సంయుక్త నివేదిక రచయితలు స్పష్టంగా ఇలా తెలిపారు. "మేం చేయగలిగినంత శ్రేష్టమైన ఏర్పాట్లు ప్రాతినిధ్యం విషయంలో (దళిత జాతుల) చేయాలనే అభిలషిస్తున్నాం." కానీ తర్వాతి కాలంలో ఓటుహక్కును సూచించడానికి, నియోజక వర్గాల్ని నిర్ణయించడానికి ఇండియాలో నెలకొని ఉన్న విచిత్ర పరిస్థితులకు అనుగుణంగా ప్రతిపాదిస్తున్న ప్రజాస్వామ్య ప్రభుత్వ ఏర్పాటు విషయంలో ఎలాంటి మార్పులు సిఫారసు చేయాలి తదితర విషయాల్ని నిర్ణయించడానికి ఏర్పడిన సౌత్ బరో కమిటీ ఈ వాగ్దానాన్ని గాలికి విడిచి వేసింది. దళిత జాతుల ప్రయోజనాల రక్షణ విషయంలో తగినంత అవకాశం ఇవ్వడంలో సౌత్ బరో కమిటీ ఎంత నిర్లక్ష్యం వహించిందంటే ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపని భారత ప్రభుత్వమే ప్రతిస్పందించి తన ప్రతి స్పందనను సౌత్‌బరో కమిటీ నివేదిక మీద పంపిన ప్రకటన (పేరాగ్రాపు 13) లో ఇలా పేర్కొంది. "మేం ప్రతిపాదనల్ని (నాన్- అఫిషియల్ నామినేషన్) సాధారణంగానే అంగీకరిస్తున్నాం. కమిటీ మరింత ఎక్కువ శ్రద్ధ చూపించవలసిన జాతి ఒకటి ఉందని మాకు తోస్తున్నది. ఇండియా రాజ్యాంగ సవరణల నివేదిక

దళిత జాతుల సమస్యలను స్పష్టంగా గుర్తించి ఆ సమస్యల నివారణకు మాట ఇచ్చింది. 'హిందువులు - ఇతరులు' అని కమిటీ నివేదికలో వర్ణించిన కులాలు వేర్వేరు పేర్లతో చెప్పబడ్డా స్థూలంగా చెప్పాలంటే అవి ఒకేరకమైన ప్రజల గురించి చెప్పేవే. వారి బహిష్కరణలో ఉండే కఠినత్వంలో మార్పులు తప్ప అందరూ దాదాపు ఒకే స్థితిలో ఉండే ప్రజలే. మద్రాసులో ఉండే పంచములు హిందూ జాతికి వెలిగా ఉన్నా వారికి దేవాలయాల్లో ప్రవేశం ఉంది. వారు మొత్తం జనాభాలో ఐదో వంతు ఉన్నా మాంటేగ్ - చెమ్స్‌ఫర్డ్ కౌన్సిల్లో వారికి ప్రాతినిధ్యం లేనేలేదు. కమిటీ రిపోర్టులో దళిత జాతులు రెండు చోట్ల ప్రస్తావించబడ్డారు. సంతృప్తికరమైన నియోజక వర్గాలు లేని సమయంలో వాటిని ఏర్పాటు చేయాలని లేదా నామినేషన్ పద్ధతి ద్వారా నైనా ప్రాతినిధ్యం కల్పించాలని చెప్పబడింది. తమ బాగోగుల్ని తామే చూసుకొనే సామర్థ్యం వారికి ఎంతవరకు ఉందో రిపోర్టు చర్చించ లేదు. పైగా వారికి నామినేషన్ ఏ పరిమాణంలో ఇవ్వాలి అన్న అంశం కూడా సూచించలేదు. రిపోర్టు (ఓటుహక్కు కమిటీ) 24వ పేరా గ్రాఫులో నామినేటెడ్ సీట్లను ఎందుకు పరిమితం చేయాలి అన్న అంశం ప్రస్తావించబడింది. కానీ అక్కడ కూడా దళిత జాతుల్ని గుర్తించినట్లు లేదు. వారు దళితజాతులకు ప్రతిపాదించిన ప్రాతినిధ్య వివరాలు ఇలా ఉన్నాయి.

| రాష్ట్రం | మొత్తం జనాభా మిలియన్లలో | దళితజాతుల జనాభా మిలియన్లలో | మొత్తం సీట్లు | దళితజాతుల కోసం సీట్లు |
|---|---|---|---|---|
| మద్రాసు | 39.8 | 6.3 | 120 | 2 |
| బొంబాయి | 19.5 | .6 | 113 | 1 |
| బెంగాల్ | 45.0 | 9.9 | 127 | 1 |
| సంయుక్త పరగణాలు | 47.0 | 10.1 | 120 | 1 |
| పంజాబ్ | 19.5 | 1.7 | 85 | ... |
| బీహార్, ఒరిస్సా | 32.4 | 9.3 | 100 | 1 |
| మధ్యపరగణాలు | 12.0 | 3.7 | 72 | 1 |
| అస్సాం | 6.0 | .3 | 54 | ... |
| మొత్తం | 221.2 | 41.9 | 791 | 7 |

ఈ లెక్కలు 800 సీట్లు ఉండే బ్రిటిష్ ఇండియాలో ఐదో వంతు జనాభాకు ఏడు సీట్లు సూచించబడ్డాయి. అన్ని కౌన్సిళ్లలోనూ దళిత జాతుల ప్రయోజనాల్ని దృష్టిలో ఉంచుకోవలసిన అధికారులు ఆరో వంతు ఉండడం నిజమే. అయితే సంస్కరణల నివేదిక ఈ ఏర్పాటును ఉద్దేశించలేదన్నది మా అభిప్రాయం. దళిత జాతులు స్వయం రక్షణకు పూనుకోవాలని నివేదిక

రచయితలు అభిప్రాయ పడ్డారు. 60 నుండి 90 మంది దాకా సవర్ణ హిందూ సభ్యులు ఉండే అసెంబ్లీలో దళిత జాతుల సభ్యుడు ఒకనితో కలుపుకొని కూడా దళిత జాతులు స్వయం రక్షణను నేర్చుకొంటారని విశ్వసించడం పట్టి భ్రమ మాత్రమే. నివేదికలోని 151,152,155 పేరాల్లోని సూత్రాల్ని సంపూర్ణం చేయడానికి మనం వెలివేయబడ్డ కులాల వారిని మరింత ఉదారంగా చూడాలి. సంయుక్త ఎంపిక సంఘం కూడా ప్రాతినిధ్య విషయంలో దళిత జాతులకు సౌత్ బరో కమిటీలో అన్యాయం జరిగిందని గుర్తించింది. జాయింట్ కమిటీ తన రిపోర్టులో ఇలా అభిప్రాయ పడాల్సి వచ్చింది "దళిత జాతులకు సూచించిన ప్రాతినిధ్యం సరిపోదు. ఓటు హక్కు కమిటీ వారి నిర్వచనాన్ని అనుసరించి, ఇండియాలోని మొత్తం జనాభాలో దళిత జాతులు ఒక పెద్ద భాగం. కమిటీ నిర్దేశించినట్లుగా భారత ప్రభుత్వం ప్రతి రాష్ట్రంలోను చర్చల అనంతరం ప్రతి స్థానిక సంస్థలోను దళిత జాతులకు వారి జనాభా సంఖ్య నిష్పత్తి కంటే ఎక్కువ సీట్లను నామినేషన్ పద్ధతి ద్వారా ఇవ్వాలి. ఈ ప్రాతినిధ్యం అవసరం అయితే సాధారణ నియోజక వర్గాలకు అదనంగా ఇవ్వాలి కానీ వాటి కంటే తగ్గించి కాదు". అయితే ఈ వ్యవహారం అంతా వృధా అయింది. సౌత్ బరో కమిటీ దళిత జాతులకు చేసిన హాని సరిదిద్దబడలేదు. కానీ ప్రస్తుతం చేసే ప్రయత్నం దళిత జాతులకు అపరిమిత ప్రాతినిధ్యం ఇవ్వడానికి కాదు. ఇంతవరకు చేసిన తప్పును దిద్దుకొనే ప్రయత్నం మాత్రమే. ప్రాతినిధ్య పరిమాణం సూచించడంలో అది అపరిమితత్వానికి పాల్పడిందన్న ఆక్షేపణ లేవనెత్తే అవకాశం ఉన్నదని చెప్పకూడదు. ఎందుకంటే మడ్డిమాన్ కమిటీ కూడా " ఈ రెండు వర్గాలు (కార్మిక వర్గాలు, దళిత జాతులు) ఇంకా ఎక్కువ ప్రాతినిధ్యం కలిగి ఉండడం అభిలషణీయం అన్న సత్యాన్ని కమిటీ సామాన్యంగా గుర్తించడం జరిగింది". ఈ దృక్పథానికి అనుగుణంగా 113 సీట్లు ఉండే శాసన బండలిలో 11 సీట్లు ఇవ్వడానికి సూచించింది. 113 సీట్లలో 11 సీట్లు ఇవ్వడం అనేది సహేతుకమైన కేటాయింపు అయితే 140 సీట్లు ఇవ్వడం అన్నది చాలా మితం అయినదని అంగీకరించాలి. 15 సీట్లు కోటా ఎక్కువగా అనిపించడానికి కారణం అంతకు ముందు కోటా చాలా తక్కువ కావడమే. ఇప్పటి కోటాకు ప్రస్తుతం ఉండే కోటాకు సరిపోని నిష్పత్తిలో 15 సీట్లు కోటా ఉందని ఆక్షేపించే వారు తాము నిర్ణీత ప్రమాణంగా చెబుతున్న ప్రస్తుతం కోటా అటు న్యాయం అయింది కాదని, ఇటు సరైంది కాదనే సంగతిని మరచి పోతున్నారు.

83. ఇక్కడ మరో అంశాన్ని కూడా స్పష్టం చేయాల్సి ఉంది. నా సహచరులు వారి నివేదిక 16వ పేరాలో, మహమ్మదీయ జాతికి సీట్ల పంపిణీ గురించి చర్చిస్తూ మా సభ్యులు ఇద్దరు సర్దార్ మంజుదార్, డా.అంబేద్కర్ లక్నో ఒప్పందం కొనసాగినన్నాళ్ళూ అన్ని రాష్ట్రాలకు సంబంధించి ఈ ఒప్పందం కొనసాగుతుంది" అన్నారని చెప్పారు. నా సహచరులు నన్ను అపార్థం చేసుకొన్నారు కాబట్టి నా మాటల్ని పొరపాటుగా తెలియజేశారు. నేను చెప్పదలుచుకొన్నదేమంటే మతనియోజక వర్గాల్ని గానీ, మహమ్మదీయులకు ఇవ్వవలసిన సీట్ల సంఖ్య విషయంలో గానీ వారు సమర్థించుకోలేనపుడు తమ నివేదికలో ఇది లక్నో ఒప్పందం అనుసరించి ఇవ్వబడింది అని చెప్పి ఉంటే బాగుండేది. నా

సహచరులు నావని చెప్పిన మాటల్లో నేను లక్నో ఒప్పందాన్ని అంగీకరించాననే ధ్వని ఉంది. ఆ సూచన చాలా అన్యాయం అయిందని చెప్పడానికి ఈ సందర్భాన్ని ఉపయోగించుకొంటున్నాను.

## 2. ప్రాంతాల వారీగా సీట్ల పంపకం

84. నా సహచరులతో కేవలం వివిధ మైనారిటీలకు సీట్ల పంపకం విషయంలోనే నేను విభేదించడం లేదు. వివిధ నియోజక వర్గాల మధ్య సీట్ల పంపకం విషయంలో కూడా విభేదిస్తున్నాను. ప్రస్తుతం నిర్మిత కౌన్సిలు యొక్క శోచనీయమైన లక్షణం ఏమిటంటే అందులో కొంత ప్రాంతానికి ఎక్కువ ప్రాతినిధ్యం ఉంది. ఈ దోషం విస్తృతిని ఈ సంఖ్యల ద్వారా స్పష్టంగా తెలపవచ్చు. దీని వల్ల కటువైన భావనలు తగ్గిపోవడానికి బదులు మరింత ఎక్కువ అవుతూ ఉండే ప్రమాదం ఉందని భావించడానికి అవకాశం ఉంది.

| రాష్ట్రం | వైశాల్యం చదరపు మైళ్లలో | జనాభా | 1925-26కి భూమి శిస్తుడిమాండ్ | ప్రస్తుతం కౌన్సిల్లోని సీట్లు |
|---|---|---|---|---|
| మహారాష్ట్ర | 47,854 | 8,536,217 | 2,18,18,155 | 25 |
| గుజరాత్ | 10,118 | 2,958,848 | 99,41,264 | 16 |
| కర్నాటక | 18,870 | 3,188,523 | 82,91,229 | 8 |
| సింద్ | 46,506 | 3,279,377 | 1,03,85,031 | 19 |

85. అసమానతలు ఎంత కొట్టొచ్చినట్లు ఉన్నాయో పై పట్టిక ద్వారా స్పష్టం అవుతుంది. జనాభాను ఆధారంగా తీసుకొని చూస్తే మహారాష్ట్ర, కర్నాటక చాలా తక్కువ ప్రాతినిధ్యం కలిగి ఉన్నాయి. గుజరాత్ ప్రాతినిధ్యాన్ని ప్రమాణంగా తీసుకొని చూస్తే మహా రాష్ట్రకు 48 సీట్లు, కర్ణాటకకు 17 సీట్లు ఇవ్వాల్సి ఉంది. సీట్ల పంపకానికి రాబడిని ఆధారంగా చేసుకొని చూసినా మహారాష్ట్ర, కర్ణాటకలకు నిస్సందేహంగా అన్యాయం జరిగింది. దీని ఆధారంగా చూసినా మహారాష్ట్రకు 32 సీట్లు, కర్ణాటకకు 15 సీట్లు రావలసి ఉంది. సమాన ఓటు హక్కు అధికారం కావాలనడం సెంటిమెంటల్ డిమాండ్ కాదు. లేదా ఎన్నిక సంబంధమైన అనురూపత కోసమూ కాదు. ఈ డిమాండు వెనుక తగినంత సిద్ధాంతపరమైన సమర్ధన కూడా ఉంది. ఒక నియోజకవర్గంలో ఓటు విలువ ఎక్కువగాను మరో నియోజక వర్గంలో ఓటు విలువ తక్కువగాను ఉండే పద్ధతిలో పాలకుల్ని ఎన్నుకొనేటపుడు సంఘంలోని ప్రతివ్యక్తీ ఇతర ప్రజల్తో సమానంగా పాలుపంచుకొనే వీలుండదనే ఆక్షేపణ వస్తుంది. అన్ని ఓట్ల సమానత్వం అన్నది రాజకీయ న్యాయంలో ప్రాథమిక సిద్ధాంతం కాకపోయినా, ఇలాంటి భేదాలు దేశంలో ఒక ప్రాంతం యొక్క ప్రాతినిధ్యంలో ఆధిక్యత వల్ల వచ్చే చెడ్డల్ని, ఇతరమైన అభిప్రాయాల్ని, ప్రయోజనాల్ని కొట్టివేసి ఒక వైపు అభిప్రాయాలు, ప్రయోజనాలే మిగలడం లాంటివి కలిగిస్తాయి. శాసనాధికారంలోను, ప్రభుత్వ చర్యలలోను

ప్రెసిడెన్సీ లోని ఇతర ప్రాంతాలకు అన్యాయం జరిగేట్లు, ఒక ప్రాంతానికి అనుచిత అధికారాన్ని ప్రస్తుతం ఆచరణలో ఉన్న సీట్ల పంపకం కట్టబెట్టిందన్నది అనుభవం తెలుపుతున్నది. తత్ఫలితంగా ప్రెసిడెన్సీలోని రెండవ ప్రాంతంవారు అప్రయత్నంగానే తమ ప్రాంతానికి న్యాయంగా రావలసిన భాగాన్ని పోగొట్టుకుంటున్నారు. ఆచరణాత్మక దృష్టితో చూస్తే ప్రస్తుత సీట్ల పంపకం శోచనీయం అన్నది న్యాయసమ్మతమైన అంశం. ఈ ప్రెసిడెన్సీ లో కర్ణాటక గానీ, మహారాష్ట్ర గానీ ప్రభుత్వాన్ని తమ సంఖ్య ద్వారా ప్రభావితం చేయలేవు. ఇది నిజంగా దుఃఖదాయకమైన అంశమేనని కర్ణాటక స్థితి నిరూపిస్తుంది. శాసనమండలి బాధ్యతా లక్షణం పెరిగే కొద్దీ, ప్రజాకార్య నిర్వహణ మీద దాని ప్రభావం పెరిగే కొద్దీ ఈ సంకటం పెరుగుతూనే ఉంటుంది. ప్రభుత్వాన్ని ప్రాతినిధ్య ప్రభుత్వం గాను, బాధ్యతాయుత ప్రభుత్వంగాను మార్చడానికి ప్రభుత్వ యంత్రాంగాన్ని పునర్నిర్మించే ఈ సమయంలో ఈ సంకటాన్ని మనం తొలగించడం సమంజసంగా ఉంటుంది.

86. ప్రెసిడెన్సీలోని ఇతర ప్రాంతాలకు నష్టం కలిగించేటటువంటి కొన్ని ప్రాంతాల అధిక ప్రాతినిధ్యానికి సౌత్ బరో కమిటి చపలచిత్తంగా ప్రవర్తించడం – సీట్ల పంపకంలో ఏదైనా నిశ్చితమైన సిద్ధాంతాన్ని పాటించాలనుకోకపోవడమే – కారణం. నా సహచరులు సీట్ల పంపకంలో వీలైనంత మేరకు ఏదైనా ఒక ఏకరూపమైన సిద్ధాంతం పాటించడానికి ప్రయత్నించడం నాకు సంతోషాన్ని కల్గిస్తున్నది. నా ఆక్షేపణ ఏమంటే నా సహచరులు సీట్ల పంపకంలో చాలా పనికి రాని సిద్ధాంతాన్ని ఎన్నుకొన్నారన్నదే. ఖజానాకి వచ్చే ఆదాయం, ఎన్నికల పట్టీలో పేర్లుండే ఓటర్లు, నియోజక వర్గంలోని జనాభా – ఈ మూడూ సీట్లు పంపకానికి సంభవనీయ పరీక్షలుగా తీసుకోవచ్చు. ఈ మూడు పరీక్షల్లో ఓటర్లు అనే పరీక్ష చాలా అన్యాయం అయింది. అనిశ్చితం అయింది. ఓటుహక్కు ధనవంతులకే పరిమితం అయిన ఇప్పటి స్థితిలో ఇది మొదటగా ధనవంతుల పరిపాలన అవుతుంది. ఏ ప్రాంతమైనా నిర్హేతుకం అయిన ఆస్తి అర్హత పరీక్షలో తన కోటాగా ఓటర్లను పంపించ లేకపోతే ఆ ప్రాంతం ప్రాతినిధ్యం లేనే లేదు. ఇలాంటి అర్థంలేని ఫలితాన్ని ఇచ్చే సిద్ధాంతం సమర్థనీయం కాదు. కాబట్టి ఆ సిద్ధాంతాన్ని వదిలేయాలి. ఓటర్ల పరీక్ష కన్నా 'ఆదాయం' పరీక్ష మెరుగైనది. ప్రభుత్వాన్ని ప్రభావితం చేయడానికి ప్రభుత్వానికి చెల్లించే ఆదాయానికి అనురూపత ఉండాలని వాదించవచ్చు. మోస పూరితంగాను, తగినంత చాలనదిగాను చెప్పి ఈ పరీక్షను తృణీకరించవచ్చు. కారణం ఏమంటే ఆదాయంగా చెప్పబడిన ధనం అంతా ప్రభుత్వానికి చెల్లించబడకపోవచ్చు. అంతేకాదు, ఒక రాష్ట్రం రాబడి ఖచ్చితంగా ఎంతో చెప్పలేము కూడా. ఒక నియోజక వర్గం ఎక్కువ ఆదాయం ప్రభుత్వానికి ఇస్తున్నా దానికి సీట్ల పంపకంలో అన్యాయం జరగవచ్చు. కారణం ఆ రాబడి మరోచోట చెల్లించబడుతుండవచ్చు. ఈ రెండు పరీక్షలకు ప్రాణాంతకమైన అభ్యంతరం ఏమంటే ప్రభుత్వం ఓటర్ల కోసం గానీ, పన్ను చెల్లించే వారి కోసం గానీ ఏర్పడటం లేదన్నది. అంతేగాక ప్రభుత్వం తన దండనాధికారాన్ని ఈ రెండు వర్గాల మీద మాత్రమే చూపించదు. ప్రభుత్వ పరిధి. ఓటరు కానీ కాకపోనీ పన్ను కట్టే వాడు కానీ కాకపోనీ తన పరిధిలో ఉండే ప్రజలందరికీ వర్తిస్తుంది.

ఈ దృక్పథాన్ని బట్టి చూస్తే జనాభా పరీక్ష ఒకటే సీట్ల పంపకానికి న్యాయమైన, సరైన పరీక్షగా తేలుతుంది. ప్రాతినిధ్య ప్రభుత్వాలున్న ఇంగ్లాండులోను, ఇతరదేశాల్లోనూ ఈ పరీక్షే పాటింప బడుతున్నది. బొంబాయి లెజిస్లేటివ్‌కౌన్సిల్‌లోని సీట్లను ఈ పరీక్ష ఆధారంగానే పంపకం చేయాలని నేను సిఫారసు చేస్తున్నాను.

## 3. సీట్ల పంపకంలోని ఇతర అంశాలు

87. మైనారిటీలకు సీట్ల పంపకంలో నా సహచరులు చూపించిన సిద్ధాంత రాహిత్యం పెట్టుబడిదార్లు- కార్మిక వర్గాల మధ్య, భూస్వాములు- కౌలుదార్ల మధ్య సీట్ల పంపకం ప్రతిపాదనలో కూడ కన్పిస్తున్నది. వర్తకం , పరిశ్రమల ద్వారా ప్రాతినిధ్యం వహిస్తున్న పెట్టుబడి దారీ వర్గానికి 11 సీట్లు ఇవ్వగా, కార్మిక వర్గానికి 4 సీట్లే ఇచ్చారు. కౌలుదారులు జనరల్ ఎన్నికలలో సీట్లు తెచ్చుకోవలసిందే గానీ వారికి సీట్లు ప్రత్యేకంగా కేటాయించలేదు. భూస్వాములకు మాత్రం 5 సీట్లు కేటాయించబడ్డాయి. ఈ కేటాయింపు ఒక్కటే నిజాన్ని సూచించదు. ప్రెసిడెన్సీలోని సింద్ సభ్యుల్ని ఇతరుల్ని కలుపుకుంటే కౌన్సిల్‌లోని భూస్వాముల సీట్ల సంఖ్య సులభంగా 40 దాకా వస్తుంది. నా సహచరులు పట్టణ ప్రాంతాల, గ్రామీణ ప్రాంతాల మధ్య కూడా సీట్ల పంపకం సరిగా చేయలేదు. చట్ట సభ ప్రస్తుతం గ్రామీణ వర్గాల దయపై ఆధారపడి ఉంది. దీనివల్ల ప్రభుత్వ శక్తులు శాశ్వత నివాసం, చౌక నీటిపారుదల, స్వేచ్ఛా అడవులు లాంటి అపాయకరమైన వెర్రి మొర్రి పనుల్ని వ్యవసాయదార్ల కోసం అని చెప్పి న్యాయ బద్ధం చేయడానికి స్వార్థానికి వినియోగించే అపాయం ఉంది. అలాంటి వెర్రి మొర్రి పనుల్ని స్టాట్యూట్ బుక్కి దూరంగా ఉంచాలంటే పట్టణ ప్రాంతాల ప్రజల ప్రాతినిధ్యం ఎక్కువ చేయాలి. వారి సామర్థ్యానికి, వారి తోడ్పాటుకు అనురూపంగా వారి ప్రాతినిధ్యం లేదు. ప్రెసిడెన్సీలోని వివిధ ప్రాంతాలకు సరైన విధంగా సీట్ల పంపకాన్ని నిర్ణయించే అంశాన్ని నా సహచరులు ఒక ప్రత్యేక కమిటీకి వదిలిపెడితే మంచిది. అలాగే బలహీన వర్గాలకు నా సహచరులు న్యాయం చేయడంలో కృతార్థులయ్యారని చెప్పలేను. అందువల్ల వారి సమస్యను పరిష్కరించడానికి కూడా ప్రత్యే కమిటీ ఏర్పాటు చేయాలి.

## 4. సీట్లు – నివాస అర్హత

88. శాసనమండలిలో ఎన్నిక కావలసిన అభ్యర్థులకు బొంబాయి ఎన్నికల నిబంధనలు 6 (1) బి కింద నివాసార్హత ప్రతిపాదించబడింది. ఆ నిబంధన ఇలా చెపుతుంది. "జనరల్ నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహించే కౌన్సిల్ సభ్యుడు కావడానికి ఏ వ్యక్తి అయినా ఆ నియోజక వర్గంలో గానీ, ఆ నియోజక వర్గంలో చేరిన ఏ డివిజన్‌లోనైనాగానీ నామినేషన్ చివరి తేదీకంటే ముందుగా కనీసం ఆరునెలలైనా నివసించి ఉండక పోతే అర్హుడు కాడు." ప్రెసిడెన్సీలో ఈ నిబంధన ప్రకారం నియోజక వర్గంలో వాస్తవికమైన లేదా వాడుక పడిన నివాసం (ఊరికే ఇల్లు ఉండడంగానీ, అప్పుడప్పుడు వచ్చిపోవడం గానీ కాదు) ఉండడం ఆ నియోజక వర్గంలో ఎన్నిక కోసం నిలవడానికి అర్హతగా తేలుతుంది. ప్రెసిడెన్సీకి సంబంధించినంత మేరకు ఈ సమస్యపై నా అభిప్రాయం

చెప్పేముందు ఈ పరిమితి యొక్క చరిత్ర చెపుతాను. ఈ వాస్తవం మీద సంయుక్త నివేదిక 84వ పేరాలో వ్యాఖ్యానించబడింది. ఏమంటే ప్రస్తుత ఎన్నికల విధానం వల్ల న్యాయవాద వృత్తిలో ఉండేవారు చాలామంది ఎన్నికల్లో కృతకృత్యులయ్యారు. రాజకీయ రంగంలో ఒకే వర్గం వారు ఇంత ఎక్కువగా ఉండడం సాధారణ ప్రజలకు ప్రయోజనకారి కాదు. అందువల్ల సంయుక్త సంఘం ఏమని సూచించిందంటే నిబంధనల్ని నిర్ణయించే ముందు మనసులో గుర్తుంచుకోవలసిన ముఖ్యమైన అంశం ఏమంటే ఇతర వర్గాలు, వృత్తుల వాళ్ళు తగినంతగా కౌన్సిల్ సీట్లకు ఎన్నికయ్యేట్లు చూడాలి. గ్రామీణ వర్గాలకు కొన్ని నిశ్చితమైన అర్హతల్ని ప్రతిపాదిస్తేనే ఇది సాధ్యం అవుతుంది. ఈ సమస్యను సౌత్ బరో కమిటి క్షుణ్ణంగా పరిశీలించింది. ఈ వాస్తవాన్ని ఆ నివేదిక పేర్కొంటూ సంయుక్త పరగణాలు, బీహార్, ఒరిస్సా, అస్సాం రాష్ట్రాలలోని స్థానిక ప్రభుత్వాలు నివాసార్హతను ఎన్నికల నిబంధనల్లో చేర్చమని కోరగా బెంగాల్, బొంబాయి, మద్రాస్, పంజాబ్ ప్రభుత్వాలు ఈ నిబంధన ఉంటే ఆ నియోజక వర్గానికి సేవ చేయాలనే అభ్యర్థులు, వారు ఆ నియోజక వర్గంలో నివసించి ఉండని కొత్త ఓటర్లు అయితే, అలాంటి చాలా మందికి అన్యాయం జరుగుతుందని ఈ నిబంధనను వద్దన్నాయి. సౌత్ బరో కమిటి సిఫారసుల్ని అంగీకరిస్తూ భారత ప్రభుత్వం ఇలా సూచించింది. ఈ సమస్యపై కమిటి అభిప్రాయం ప్రభుత్వాన్ని కొంత ఇబ్బందిలో పెట్టిందని, నిబంధనకు అనుకూలంగా కొన్ని స్థానిక ప్రభుత్వాల దృక్పథాన్ని అంగీకరించడం, అంతే బలంగా ఈ నిబంధన కావాలని కోరిన కొన్ని ప్రాంతాలకు ఈ అవకాశం ఇవ్వలేదని కమిటి అభిప్రాయాన్ని గురించి ప్రభుత్వం వ్యాఖ్యానించింది. భారత ప్రభుత్వ బిల్లు మీద ఓటు హక్కు కమిటీ సూచించిన ఒప్పందాన్ని అంగీకరించమని సంయుక్త పార్లమెంటరీ కమిటీ సిఫారసు చేసింది. ఈ సిఫారసు అంగీకరించబడింది. నివాసార్హత మధ్య పరగణాలు, బొంబాయి, పంజాబుల్లో నిబంధనగా విధించబడింది. తర్వాత 1923 సాధారణ ఎన్నికల ముందు చేసిన నిబంధనల సవరింపులో ఈ నివాసార్హత నిబంధనను పంజాబ్ ప్రభుత్వం తొలగించి వేసిందన్న విషయాన్ని ఇక్కడ నేను తెలియజేస్తున్నాను. మడ్డిమాన్ కమిటి ముందు ఆ నివాసార్హత అంతకు ముందే తమ స్వాధీనంలో ఉన్న ప్రదేశాన్ని మాత్రమే కలిగించదని, అందువల్ల ఆ అర్హతను మొదట సాధారణ ఎన్నికలలో గ్రామీణ ప్రతినిధులకు మార్చకుండా ఉంచడానికి తగినంత కారణం లేదని పంజాబ్ ప్రభుత్వం తెలిపింది. అందువల్ల ప్రస్తుత పరిస్థితి ఏమంటే బొంబాయి, మధ్య పరగణాల్లో మాత్రమే నివాసార్హత ఇంకా ఆచరణలో ఉంది. ఈ ప్రెసిడెన్సీలోలాగా అంత ఖచ్చితంగా మధ్య పరిగణాల్లో ఈ నిబంధన పాటింపబడటం లేదు. నా అభిప్రాయంలో – చాలా వెనుక బడిన ప్రాంతాల్లో ఈ నిబంధన అవసరం లేదనుకున్నపుడు చాలా అభివృద్ధి చెందిన ఈ ప్రెసిడెన్సీలో ఆ నిబంధన అవసరం ఉందని సమర్థించలేము. నిబంధన తక్కువ అర్హతలు ఉండే అభ్యర్థులు కౌన్సిలుకు ఎన్నిక కావడానికి కొంత వరకు కారణం. పదవిలో ఉండే వాళ్ళు, సామర్థ్యం నిరూపితమైన రాజకీయ అర్హత కలిగిన వాళ్ళు ఎక్కువగా సాధారణంగా పట్టణ ప్రాంతాల్లోనే ఉంటారు. వారు తాము నివశించే ప్రాంతం నుండి ఎన్నికయ్యే అవకాశాన్ని లేకుండా చేసింది. ఈ ప్రెసిడెన్సీకి సంబంధించిన మేరకైనా ఈ నివాసార్హత నిబంధనను తీసి వేయాలని నేను సిఫారసు చేస్తున్నాను.

# నాలుగవ అధ్యాయం

# లక్నో ఒప్పందం

89. సంయుక్త నియోజక వర్గాల్ని, మత నియోజక వర్గాల్ని గురించిన సీట్ల పంపకంపై నా సిఫారసులు మహమ్మదీయ జాతి ప్రాతినిధ్యాన్ని దెబ్బ తీస్తూ లక్నో ఒప్పందం షరతులకు విరుద్ధంగా ఉన్నాయని నాకు తెలుసు. 1919లో చేసిన సూచనలు చాలా భాగం మహమ్మదీయ ప్రాతినిధ్యం కింద నిర్ణయింపబడ్డాయి. ఈ ఒప్పందాన్ని లక్నో ఒప్పందం అంటారు. 1917 సంవత్సరంలో లక్నోలో మహమ్మదీయుల తరుపున ముస్లింలీగ్, హిందువుల తరుపున కాంగ్రెసుల మధ్య జరిగిన ఒప్పంద ఫలితమే ఈ లక్నో ఒప్పందం. రాష్ట్ర కేంద్ర చట్టసభల్లో వివిధ నిష్పత్తుల్లో సీట్లు మహమ్మదీయులకు మత నియోజకవర్గాల ద్వారా ఇవ్వబడ్డాయి. మహమ్మదీయ ప్రాతినిధ్యానికి సంబంధించి నేను ప్రతిపాదించిన దృక్పథాలు ఆ ఒప్పందానికి విరుద్ధంగా ఉన్నాయి. అందువల్ల ఈ ఒప్పందం ఎందుకు రద్దు చేయబడాలో చెప్పవలసిన బాధ్యత నా మీద ఉంది.

90. లక్నో ఒప్పందంలో కుదుర్చుకున్న అంశాలు తప్పు అనేది నా మొదటి వాదన. ఈ నా వాదన సరైనదే అని అన్ని స్థానిక ప్రభుత్వాలు అంగీకరించాయి. ఓటు హక్కు కమిటీ సిఫారసుల్ని సమీక్షిస్తూ భారత ప్రభుత్వం సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు పంపిన లేఖలో ఇలా అభిప్రాయపడింది. "ఈ ఒప్పందాన్ని అంగీకరిచడంలో స్థానిక ప్రభుత్వాలు ఏకాభిప్రాయానికి రాలేక పోయాయి. దీనికి సంబంధం లేకుండా మద్రాసు ప్రభుత్వం మహమ్మదీయ ప్రాతినిధ్య విషయంలో తన సొంత నిర్ణయాలు తీసుకున్నది. బొంబాయి ప్రభుత్వం ఈ ఒప్పందాన్ని అంగీకరిస్తూ జనాభా ఆధారంగా ప్రాతినిధ్యం పద్ధతి గురించి చర్చించవలసి ఉందని చెప్పింది. మధ్య పరగణాల చీఫ్ కమీషనర్ ప్రత్యేక మహమ్మదీయ నియోజక వర్గాల్ని వ్యతిరేకిస్తూ ఆ ఒప్పందంలో ప్రతిపాదించిన నిష్పత్తి మహ్మదీయుల జనాభాకి గానీ, స్థాయికి గాని అనురూపం గా లేదని చెప్పారు. అస్సాం చీఫ్ కమీషనర్ ముస్లిం జాతి దృక్పథంలో చూసినా వారి జనాభా నిష్పత్తి కంటే అధిక నిష్పత్తిలో వారికి ప్రాతినిధ్యం ఇవ్వడం పొరపాటు" అని భావించారు. రాష్ట్ర ప్రభుత్వాలు వెలిబుచ్చిన ఈ అభిప్రాయాలతో చివరికి భారత ప్రభుత్వం కూడా విభేదించలేదు. వివిధ రాష్ట్రాలలో లక్నో ఒప్పందం ఫలితాలను సమీక్షిస్తూ, ప్రభుత్వం ఇలా అభిప్రాయపడింది. బెంగాలు మహమ్మదీయులు వారి జనాభా నిష్పత్తిలో నాలుగు వంతుల్లో మూడు వంతుల సీట్లు పంజాబ్ మహమ్మదీయులు పదివంతుల్లో తొమ్మిది వంతుల సీట్లు సంపాదించుకోగా ఇతర రాష్ట్రాలలోని మహమ్మదీయులు ఇంకా మంచి ఫలితాన్ని, కొందరు అంత కంటే మంచి ఫలితాన్ని సాధించుకోగలిగారు. ఈ ఫలితం వేర్వేరు రాష్ట్రాలలో మహమ్మదీయుల మధ్య ఉండే సంబంధాల్ని గాని లేదా మహ్మదీయులు మహమ్మదీయేతరుల మధ్య ఉండే సంబంధాల్ని గాని ప్రతిబింబిస్తున్నాయని భావించలేము." సర్ విలియమ్ విన్సెంట్ తన అసమ్మతి పత్రంలో "నా దృష్టిలో..... మనం మహమ్మదీయులకు చేసిన వాగ్దానాలు నెరవేర్చడానికి లక్నో ఒప్పందం వివరాల జోలికి పోకుండానే మరో మంచి మార్గం ఆలోచించాలి" అనేంత దూరం వెళ్ళారు.

91. లక్నో ఒప్పందంలోని దోషం అది మహమ్మదీయుల పట్ల కొన్ని రాష్ట్రాల్లో చాలా ఉదారంగాను, కొన్ని రాష్ట్రాల్లో పిసినారిగాను వ్యవహరించి వేర్వేరు రాష్ట్రాల్లో వేర్వేరు విధంగా చూడడం ఒకటే కాదు, తులనాత్మకంగా చూస్తే ఇది చాలా సున్నితమైన విషయం. లక్నో ఒప్పందం ప్రధాన దోషం ఏమంటే మహమ్మదీయులకు సీట్లు పంపిణీ చేసేటప్పుడు ఇతరుల ప్రయోజనాల మీద ఈ పంపిణీ ఎలాంటి ప్రభావం చూపిస్తుందో లెక్కలోకి తీసుకోలేదు. భారత ప్రభుత్వం చెప్పినట్లు ఒప్పందం రచయితలు మహమ్మదీయులకు చూపిన ప్రతి ప్రయోజనం ఇతర వర్గం లేదా వర్గాల ప్రజల నుండి లాక్కున్నదే. ఈ అంశాన్ని కూడా సర్ విలియం విన్సెంట్ జాగ్రత్తగా గమనించారు. తన అసమ్మతి పత్రం సూచనలో అతడు ఇలా అన్నాడు. "ప్రస్తుతం ఈ ఒప్పందం విమర్శ కంటే ఎక్కువగా అంగీకారాన్ని చూరగొంటుంది. కానీ రాబోయే కాలంలో ఓట్ల విలువ ప్రాతినిధ్యం ఆచరణ లోకి వచ్చినపుడు వీటివల్ల తమ ప్రయోజనాలు బాగా దెబ్బతినే వర్గాలు తమకు జరిగిన అన్యాయాన్ని పైకి చెబుతాయి. అప్పుడు భారత ప్రభుత్వం కూడా ఈ అంశాన్ని అంగీకరించక తప్పదు. ఎంతగా ఈ జోస్యం ఫలించిదంటే అది అద్భుతంగా వాస్తవం అయింది. లక్నో ఒప్పందం వల్ల సంభవించిన ఫలితం మీద సర్వే పై సర్వత్రా అసంతృప్తి వెల్లుబికి ఈ ఒప్పందం తప్పు ఒప్పందమని తేల్చి చెప్పింది. తప్పుగా చేసుకున్న ఒప్పందాన్ని ప్రస్తుతం మరో విధంగా మార్చుకోమనడం తప్పుకాదు. ఈ డిమాండు మహమ్మదీయ జాతి నుండి ప్రతికూలతను ఎదుర్కోక తప్పదు. అత్యధిక పరిమాణంలో ప్రాతినిధ్యం ఇంత వరకు కలిగి ఉండే వాళ్ళు మునుపటి ప్రాతినిధ్యం అలాగే ఉండాలని పట్టుబడతారు. కానీ థామస్ పైన్ చెప్పినట్లు "ప్రాచీన కాలం నుండి పూర్వ ప్రమాణాల్ని తమ హక్కులుగా చెప్పు కొనే వాళ్ళు స్వార్థ ప్రయోజనాలు లేని ప్రాచీన కాలం మొదటి దశను అంగీకరించరు. ఆ అంశాన్ని నిజంగా వాళ్లు తెలుసుకోకలిగితే హక్కులనేవి మార్పు చెందనివి కావని, అవి చారిత్రకంగా జరిగిన అనుకోని సంఘటనలని, అందువల్ల ప్రతి కాలంలోను మార్చడానికి వీలున్నవని తెలుసుకుంటారు." ఇది ఇలా ఉన్నపుడు తప్పుకు చట్టబద్ధమైన పారం పర్యం లేదని, సరిగ్గా పరిష్కరింప బడినది పరిష్కరింపబడనట్లే లెక్క అనే సూక్తి మీద అన్ని రకాల రాజకీయ, సాంఘిక ప్రగతి ఆధారపడి ఉందని చెప్పుకోవాలి.

లక్నో ఒప్పందం లాగా మార్పుకోరబడిన సందర్భం ఇది ఒకటే కాదు. ఐర్లండు ఇంగ్లండుల మధ్య కుదిరిన 'యాక్ట్ ఆఫ్ యూనియన్' ఇలాంటిదే. ఇది లక్నో ఒప్పందం కంటే బలీయంగా ఇరువర్గాల వారిని బద్ధుల్ని చేసే శక్తి కలిగిన ఒప్పందం. నిజానికి పార్లమెంటులో ఐర్లండుకు 100 సీట్లను ప్రతిపాదించే ఒప్పందం అది. అలా అయినా మిస్టర్ బాల్ఫార్ ప్రభుత్వం ఐర్లండుకు ఎక్కువగా ప్రాతినిధ్యం ఇవ్వడం తప్పు అని తెలుసుకొన్నపుడు, 1905లో బిల్లు తెచ్చి ఐరిష్ సీట్లను 30కి తగ్గించే దాకా ఊరుకోలేదు. మిస్టర్ బాల్ఫార్ ప్రభుత్వం రాజీనామా చేసినందువల్ల ఆ బిల్లు చట్టం కాక పోవడం వేరే సంగతి. అయినా ఇరు వర్గాల మధ్య కుదిరిన ఒప్పందం అయినా సరే ప్రాతినిధ్యం విషయంలో ఐరిష్ ఒప్పందంలో మార్పు తీసుకురాక తప్పలేదు. అలాంటి మార్పును ఐర్లండు అంగీకారంతోనే చేయాల్సి ఉంటుందనే దృక్పథాన్ని కూడా మిస్టర్ బాల్ఫార్ అంగీకరించలేదు.

నిజానికి ఐరిష్ ప్రాతి కూల్యపు కోరలలోనే బాల్ ఫోర్ సీట్ల పునర్విభజనను ప్రవేశ పెట్టక తప్పలేదు. కానీ ఈ సందర్భంలో అందుబాటులో ఉండే పూర్వోదాహరణను వదిలి ఎక్కడో దూరాన ఉండే ఉదాహరణ వద్దకు పోవలసిన పనిలేదు. మతప్రాతినిధ్యం ఆధారంగాను, మతపరం అయిన విభజన ఆధారంగాను సీట్ల పంపకానికి వివిధ సంస్థల మధ్య కుదిరిన అంగీకారాలు, ఒప్పందాలకు సిలోన్ రాజ్యాంగం గుర్తింపు కలిగించింది. కానీ 1928 నాటి సిలోన్ కమిషన్ తన దృక్పథాన్ని ఇలా నొక్కిచెప్పింది. "ఎలాగైనా కానీ మొత్తం ప్రాతినిధ్య సమస్యను కొత్తగా పరిశీలించేటపుడు జాతుల, గ్రూపుల మధ్య జరిగిన ప్రైవేట్ ఏర్పాట్లన్నీ గుర్తుంచుకోవడం మంచిదేకానీ, వాటినే పూర్వోదాహరణలుగా, పరిశీలనార్హతలుగా సిలోన్ ప్రజల ప్రయోజనాల దృష్ట్యా తీసుకోకూడదు." సిలోన్‌లో మొత్తం ప్రాతినిధ్య పద్ధతి పునర్నిర్మించేటపుడు పై ఒప్పందాన్ని లెక్కలోకి తీసుకోకుండా సిలోన్‌లో అంతకు ముందు విధానానికి పూర్తిగా భిన్నంగా మొత్తం ప్రాతినిధ్య ప్రణాళికను కూడా పునర్నిర్మించడానికి సందేహించలేదు. అందువల్ల ఇతర చోట్ల జరిగిన దాని కంటే ఇక్కడ కొత్తగా ఏమీ అడగడం లేదు.

92. ఇంకా మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే లక్నో ఒప్పందం అందులోని షరతుల వల్ల మాత్రమే విలువలేనిది కాదు. భారత ప్రభుత్వం మాటల్లోనే పేర్కోవాలంటే లక్నో ఒప్పందం "రాజకీయ చర్చల ఫలితమే కానీ చర్చించబడి హేతు బద్ధంగా ఏర్పడింది కాదు". అంతేకాదు తాము ఏ వర్గాలకు ప్రాతనిధ్యం వహిస్తున్నామని చెప్పారో ఆ వర్గాలకు, ఈ ఒప్పందం చేసుకున్న సంస్థలకు నిజమైన సాధికారత లేదు. ఆలిండియా ముస్లింలీగ్ మహమ్మదీయులందరి తరుపున మాట్లాడడానికి అధికారం లేదు. ఈ అంశం భారత ప్రభుత్వం సౌత్‌బరో కమిటీ నివేదిక మీద పంపిన లేఖలో చాలా స్పష్టంగా తేల్చబడింది. కాంగ్రెస్ విషయం తీసుకొంటే అది అధిక జనాభా ఉన్న బ్రాహ్మణేతరులకు, దళిత జాతులకు ప్రాతినిధ్యం వహించలేదు అన్న విషయం వివాద రహితం. జనసామాన్యం కోసం ఏర్పడని సంస్థలు ఏర్పరచుకొన్న ఒప్పందం ఆ సంస్థల్ని బద్ధులను చేయగలదే గానీ జన సామాన్యాన్ని బద్ధుల్ని చేయలేదు. లక్నో ఒప్పందానికి అధికారం ఇవ్వడం అంటే న్యాయ బద్ధంగా అధికారం ఇవ్వబడి వేర్వేరు దేశాల సంపూర్ణాధికారాలు గల రాయబారుల మధ్య జరిగిన ఒప్పందాలకిచ్చే ప్రామాణ్యాం లక్నో ఒప్పందం చేసుకొన్న ముస్లింలీగుకు, కాంగ్రెసుకు ఇవ్వడమే అవుతుంది. అంటే అధికారం లేని చోట అధికారం ఇవ్వడమే అవుతుంది. ఒప్పందం యొక్క బద్ధమైన అధికారాన్ని తిరిగి కట్టడం ఎందుకు జరుగుతున్నదంటే బొంబాయి ప్రభుత్వం తీసుకొన్నవైఖరి గురించి చెప్పడానికి జరుగుతున్నది. బొంబాయి ప్రభుత్వ దృక్పథంలో 'ప్రత్యే నియోజక వర్గాల రద్దు విషయంలో ఏమైనా మార్పు చేయాలనుకుంటే అది రెండు జాతుల మధ్య జరిగిన ఒప్పందం మీద ఆధారపడాలి. మహమ్మదీయులను వారి అభిమతానికి విరుద్ధంగా నిర్బంధించరాదు." ఈ సమస్య భారత దేశానికి అంతా సంబంధించింది. కాబట్టి ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం విభిన్న మార్గాల్ని అవలంబించరాదు. బొంబాయి ప్రభుత్వం దృష్టి ఏమంటే 1916 లోనే చెప్పినట్లు మత నియోజక వర్గాలు తమకు అంగీకారం కాదని, వాటి రద్దు అభిలషణీయమేనని,

అయితే అది లక్నో ఒప్పందం మాదిరి ఇరువర్గాల వారి ఆమోదం పొందితేనే రద్దు చేయాలని భావించింది. నా అభిప్రాయంలో ఈ వాదం బాధ్యతా రహితమే కాక అపాయకరమైంది కూడా. ఈ వాదం బాధ్యతారహితం అని ఎందుకన్నానంటే అది ఈ సమస్యను నిర్ణయించే పార్లమెంటు అధికారాన్ని ధారాదత్తం చేయడం జరిగింది గనుక భారత ప్రభుత్వం లక్నో ఒప్పందాన్ని ఉపేక్ష చేయరాదని భావించింది. ప్రభుత్వ అభిప్రాయంలో ఇది రెండు జాతుల మధ్య జరిగిన చాలా వివాదాస్పదమైన సమస్య మీద జరిగిన మనః పూర్వకమైన ప్రయత్నం అని, "మెజారిటీ జనాభాగల జాతి తన తక్షణ ప్రయోజనాల్ని వెనక్కి నెట్టి సమైక్యత కోసం, సంయుక్త రాజకీయ పురోగతి కోసం పాటుపడింది" అన్నంత వరకు వాస్తవమే. కానీ మహమ్మదీయుల ప్రాతినిధ్యం విషయంలో కాంగ్రెసు, ముస్లింలీగు మధ్య జరిగిన చర్చల్లో తీసుకొన్న నిర్ణయాన్ని శాసన బద్ధం చేయడం కోసం మాత్రమే భారత ప్రభుత్వం గానీ, మరే ఇతర అధికార సంస్థగానీ లేదు. నిజానికి సర్ విలియమ్ విన్సెంట్ ఈ విషయంలో జాగ్రత్త వహిస్తూ "ఈ విషయంలో (భారత ప్రభుత్వం) తన బాధ్యతను పార్లమెంటు నుంచి మరొకరికి అప్పగించలేదు"

93. బొంబాయి ప్రభుత్వం తీసుకున్న వైఖరి అపాయకరం ఎందుకంటే ఒకవైపు తప్పు జరిగిందని అంగీకరిస్తూనే, దాన్ని సరిచేసే అధికారాన్ని విస్మరిస్తుంది. ఈ తప్పు దేశ రాజ్యాంగ నిర్మాణంలో జరిగిన తప్పు అయితే పై వాదాన్ని క్షమార్హమైన నేరంగా అంగీకరించేవాణ్ణి. కానీ ఈ తప్పు రాజ్యాంగంలోనే అందునా చాలా ప్రధానమైన భాగంలో ఉంది. రాజ్యాంగ పని తీరుకే అది చాలా హానికరంగా పరిణమిస్తుంది. ఇలాంటి స్వభావం కలిగిన తప్పును సహించకూడదు. రాజ్యాంగ నవీకరణలో కూడ తప్పుదొర్లితే అది ప్రత్యక్షంగా మొత్తం జాతిని, అందులోని ప్రతి వర్గాన్నీ దెబ్బతీస్తుంది. అది వైయుక్తికం గానీ, సార్వజనికం గానీ పరిపూర్ణమైన విపత్తుకు దారితీస్తుంది. అలాంటప్పుడు దాన్ని సరిదిద్దడం వాస్తవికంగా సాధ్యం కాదు. బొంబాయి ప్రభుత్వం అన్ని రాజ్యాంగ మార్పుల్ని వాటి పరిణామాలు ఎలా ఉన్నా సరే అవే అంతిమమైనవిగా అంగీకరిస్తున్నది. వివశమైన ఈ పరిత్యాగం నుండి ఒక ఊహ పుడుతున్నది. మనం ఈ విషయంలో బాధ్యతా రహితమైన ఒక శక్తి ద్వారా ఒక నిర్ణీత మార్గం గుండా ముందుకు నెట్టబడి వినాశనం అనే తప్పించు కోను వీలుగాని ఫలితం అనుభవించబోతున్నామనే ఆ ఊహ. అయితే భారత ప్రభుత్వం లక్నో ఒప్పందాన్ని అంగీకరిస్తూ చట్టంలో ఉండే నిబంధనల్ని యధాతథంగా అంగీకరించకుండా మార్పులు అవసరం అని నొక్కి చెప్పడం నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది. ఈ విషయాన్ని ప్రభుత్వం సందిగ్ధంలో ఉంచకుండా మొదటి రాజ్యాంగ సంఘం తర్వాత ఈ ఒప్పందం నిలువదని స్పష్టంగా చెప్పింది. సౌత్ బరో కమిటీ నివేదిక మీద పంపిన ప్రకటనలో ప్రభుత్వం ఇలా పేర్కొంది. "మేం నివేదికను వివరంగా పరిశీలించక ముందే కొంత ప్రాముఖ్యం ఉండే ఒక ప్రశ్న ఎదురౌతున్నది. మీరు కనుగొన్నట్లు సిద్ధాంతాల నిర్ణయంలో కమిటీ పెద్దగా ముందుకు సాగలేదు. వారు తమ ముందుకు వచ్చిన వివిధ సమస్యల విషయాలలో ఏదైనా ఒక అంగీకారానికి రావడానికి ప్రయత్నించారేకానీ సాధారణమైన సహేతుకత ఆధారంగా వచ్చే పరిష్కారాల కోసం ప్రయత్నించలేదు. కాల పరిమితి వారిని మరో

మార్గం వైపు చూడనివ్వలేదేమో. వారి ప్రతి పాదనల్ని పరిశీలించేటపుడు మనకు మనం వేసుకోవాల్సిన ప్రశ్న ఏమంటే అలాంటి పద్ధతుల్లో నిర్ణయమైన ఫలితాలు శాశ్వతంగా ఉండడానికి ఉద్దేశించబడ్డవా? అని... మార్పుకు ఏ యంత్రాంగం అవసరం అయినా ఇండియాలో ప్రవేశపెట్టబడిన మొదటి ఎన్నికల పద్ధతిని ఇంకా ఎంతకాలం ఉండనివ్వాలనుకుంటున్నాం అనే ఆచరణాత్మక సమస్యను ఎదుర్కోవాల్సి వస్తుంది. రాష్ట్ర శాసన సభ కోరిక మేరకు వెంటనే పునర్నిర్మాణానికి పూనుకోవాలా? లేదా మొదటి రాజ్యాంగ సంఘం ఏర్పడే దాకా కనీసం కొనసాగాలా? రెండు పద్ధతులను సమర్థించడానికి కొన్ని కారణాలున్నాయి. బాధ్యత పెంపుదల ప్రయోజనం దృష్ట్యా వివిధ వర్గాల ప్రాతినిధ్యాన్ని నిర్ణీత పరిమాణంలో యథా పూర్వకంగా ఉంచడం అభిలషణీయం కాదు. ప్రత్యేక వర్గ, మత నియోజక వర్గాలు ఎంత ఎక్కువ కాలం మార్పుకు వీలుకాని విధంగా కొనసాగితే, అంత కాలం ప్రాతినిధ్యపు సాధారణ పద్ధతుల వైపు పురోగతి కష్టం అవుతుంది. పైపెచ్చు వాటి మార్పుకోసం నిరంతర పోరాటం కొనసాగడం మంచిది కాదు. ఈ తప్పు ఇంకా ఎన్నాళ్లు కొనసాగాలో కమిషనే చెప్ప వలసి ఉంది. కమిషన్ కేవలం "మంచిది మత పద్ధతి అనే సిద్ధాంతం మీద ఉన్న ఆక్షేపణల్లోని సారాన్ని మేము బాగా అర్థం చేసుకున్నాం. భారత దేశం స్వయంగా తనకుతానే ఈ మార్గాన్ని ఎన్నుకొన్నది కాబట్టి మేమేం చేయలేం" అన్నదని నేను నమ్ముతున్నాను. కమిషన్ విద్యుక్త ధర్మం సరైన మార్గం తెలపడం, ఆ సరైన మార్గం మీదికి భారతదేశాన్ని మళ్ళించడం న్యాయం. ఈ తప్పుదారిని 1909లో చూపడానికి ప్రాథమికంగా బాధ్యులైన అధికార వర్గాల మీద ఈ నైతిక పరమైన బాధ్యత ఉండడం కూడా కారణమే.

## ఐదవ అధ్యాయం

## ఎగువ సభ

94. బొంబాయి ప్రెసిడెన్సీ చట్ట సభలో ఒక భాగంగా ఎగువ సభ స్థాపనని సిఫారసు చేస్తూ దాని ఏర్పాటుకు ఒక చట్రాన్ని సూచించారు. దాని స్థాపనకు సంబంధించిన ఇబ్బందుల గురించి నా సహచరులు అంతగా ఆలోచించినట్లు లేదని నేను అనుమానిస్తున్నాను. ఎగువ సభ ఒకటి ఉండడం అవసరం అని భావిస్తే దాని ఏర్పాటులో అది దిగువసభ నిర్మాణం కంటే భిన్నంగా ఉండాలి. దాని అధికారాల విషయానికి వస్తే ఎగువ సభ దిగువ సభ అధికారాలకు అడ్డంకి కలిగించేదిగా ఉండకూడదు. ఈ రెండు షరతుల్ని సంతృప్తి పరిచే విధంగా ఎగువ సభ ఏర్పాటు చేయడం చాలా కష్టసాధ్యంగా నాకు అనిపిస్తున్నది. నామినేటెడ్ ఎగువ సభ ప్రస్తావనే లేదు. నామినేటెడ్ ఎగువ సభను ఏర్పాటు చేయడానికి కెనడాలోని సెనేట్ ఒక ప్రత్యక్ష హెచ్చరిక. ఎగువ సభ నిర్ణయాలకు, ప్రజల చేత ఎన్నుకోబడ్డ దిగువ సభ తీసుకొనే నిర్ణయాలకు ఉండే నైతిక అధికారం ఉండదు. అంతే గాక తాను ఏర్పరచే పాలక వర్గం నిర్ణయాలపై తీర్పు ఇవ్వడానికి, మార్చడానికి ప్రజలచేత ఎన్నుకోబడిన దిగువ సభకు ఉండే స్వేచ్ఛ పునర్విమర్శ సభగా ఉండే ఎగువ సభకు ఉండదు. ఒకవేళ ఎగువ సభ

ఎన్నుకోబడే సభ అయితే దిగువ సభతో సుగమంగా కలిసి పని చేసే విధానం ఆ రెండు సభల ఓటు హక్కు మీద, ఎన్నికల సమయం మీద, ఆ సభల అధికారాలమీద ఆధారపడి ఉంటుంది. ఒకవేళ ఎగువ సభ పరిమిత ఓటు హక్కు మీద ఎన్నిక అయ్యేటట్లయితే అప్పుడు సంపన్నులనుండి కొంతమందిని పాలక వర్గంలోకి వచ్చే విధంగా పైకి తీసుకొచ్చి జనసామాన్యం అదృష్టాన్ని వారి చేతిలో పెట్టినట్లవుతుంది. అలాంటి ఎగువ సభ దిగువ సభ తొందర పాటు తనానికి ప్రతిబంధకంగా ఉపయోగపడే పునర్విమర్శ సభగా ఉపయోగపడదు. మొత్తం మీద అభివృద్ధికి బహుమానంలా ఉపయోగపడే బదులు స్వార్థపర శక్తుల పోషణకు కానుక చెల్లించేదిగా ఉంటుంది. అది సంప్రదాయ తరహా పరిపాలనలో నిష్క్రియాపరత్వంగా ఉంటుంది. తీవ్రవాద పాలనలో మాత్రమే జాగరూకతతో ఉంటుంది. ఎప్పుడు తప్పుని సరిగా మార్పు చేయాలో అప్పుడు మార్పు చేస్తుంది. బహుశా ఆటంకపరుస్తుంది. ఒకవేళ రెండు సభలు ఒకే ఓటుహక్కుపైన ఎన్నికయితే అలాంటప్పుడు ఎగువ సభ దిగువ సభకు నకలు అవుతుంది. కాబట్టి పూర్తిగా అనవసరం అయినదౌతుంది. ఎగువ సభ దిగువ సభతో సమకాలంలో ఎన్నికైతే కూడా ఇదే ఫలితం సంభవిస్తుంది. అలా కాక ఎగువ సభ దిగువ సభ కంటే వేరే సమయంలో ఎన్నికైతే అప్పుడు అది పాలకవర్గాన్ని అనల్పంగా చేసి దిగువసభ సమర్థతను క్షీణింపచేయడం తప్పదు. కారణం అది సముచిత విధాన నిర్ణయం తీసుకోవడానికి ఆటంకంగా పని చేస్తుంది. పాలకవర్గం విధాన నిర్ణయంలో ఎంతటి దారుణమైన విరుపు తెస్తుందంటే అది నిరంతరం సాధారణ ఎన్నికలకు దారితీస్తూనే ఉంటుంది. రెండు సభలు అధికారంలో సరి సమానం అయితే ప్రతిష్టంభనలు ఏర్పడడం తప్పదు. అలాగాక ఎగువ సభ అధికారాలు దిగువ సభ కన్నా తక్కువ స్థాయిలో ఉంటే అప్పుడు దిగువ సభ తొందర పాటు తనంగా భావించే అంశాల్ని నియంత్రించలేదు. అప్పుడు తన ఏర్పాటు ఉద్దేశ్యం నెరవేర్చడంలోనే ఓడిపోతుంది.

95. ఎగువ సభ నిర్మాణాన్ని రూపొందించేటపుడు ఈ కష్టాలన్నింటినీ నా సహచరులు ఉపేక్షించారు. ఉపేక్ష చేసినందువల్ల వారు ఏర్పాటు చేసిన ఎగువ సభ అంతా తప్పుల మయంగా ఎగువ సభకు ఉండాల్సిన ఒక సుగుణం కూడా లేకుండా ఏర్పడిందనే నేను చెప్పాల్సి ఉంటుంది. ఎగువ సభ ఏర్పాటు అనే ఊహను బలపరిచిన నా సహచరులు దాదాపు గుంపు మనస్తత్వాన్ని పాటించారు. రాజకీయ శాస్త్రంలో ప్రజా ప్రభుత్వానికి ఎగువ సభ అవసరమైన తోడుగా భావించే అంధ విశ్వాసానికి దారి తీసింది. కానీ రెండు సభలుండే పద్ధతికి మూలమైన ఇంగ్లండులో అది ఒక చారిత్రక దుర్ఘటన మాత్రమే. ఇతర దేశాల రాజ్యాంగాల్లో దానికి చోటు లభించిందంటే కారణం ముందువాళ్ళను అనుసరించిన ఫలితం మాత్రమే. దిగువ సభ తొందరపాటుతనానికి బ్రేకులా ఎగువ సభ ఉపయోగపడుతుందన్న ఆపాదిత సుగుణం ఆ సంస్థ యొక్క సర్వే సర్వత్ర ఉనికిని సమర్థించడానికి తర్వాతి కాలంలో మనిషి మెదడులో పుట్టిన కొత్త కల్పన మాత్రమే. అయితే ఈ విశ్వాసం నానాటికీ సన్నగిల్లి పోతున్నదనడానికి యుద్ధానికి పూర్వం ఉన్న రాజ్యాంగాలైన కెనడా, దక్షిణాఫ్రికా దేశాల రాజ్యాంగాలు, యుద్ధానంతర రాజ్యాంగాలైన లాట్వియా, లిథూనియా, ఎస్టోనియా, యుగోస్లేవియా రాజ్యాంగాలు ఎగువ సభ నుండి విముక్తం అయ్యాయి. ఈ ప్రతిచర్యకు కారణం

ఏమంటే దాని నిర్మాణ స్వాష్టవం ఆధారంగా ప్రభుత్వం మీద తీర్పు చెప్పరాదని, దాని ఆచరణాత్మక కార్యసిద్ధిమీద, జాతికి ప్రభుత్వం చేసే వాస్తవ సేవలోని సారం మీద, అది దేశానికి మొత్తం మీద చేకూర్చే శ్రేయస్సు మీద ఆధారపడి తీర్పు చెప్పాలనే దృఢ విశ్వాసం పెరగడమే కారణం.

96. ప్రయోజన వాదం ప్రకారం ఎగువ సభ నిర్మాణం గురించి ఆలోచిస్తే, అది పునర్విమర్శన సభగా తన విధి నిర్వహిస్తుంది అనడాన్ని నేను అంగీకరించలేను. మార్పు చేయడం అనేది ఓటర్ల సంకల్పాన్ని బోధ పరచడమే అయితే దిగువ సభ కంటే ఎగువ సభ ఓటర్ల సంకల్పాన్ని బాగా ఎలా నిర్ణయించగలదో నేను అర్థం చేసుకోలేకుండా ఉన్నాను. అలాంటి ప్రశ్నే ఉత్పన్నం అయితే ఎగువ సభలో ఉండడం అనే గొప్ప ఉనికి ద్వారా దిగువ సభ సభ్యుల కన్నా ఎగువ సభ సభ్యులు ఉత్తమ న్యాయ నిర్ణేతలు అని మనం భావిస్తే తప్ప సర్వోత్తమ న్యాయమూర్తులు ఓటర్లేగానీ ఎగువ సభ సభ్యులు కాదన్నది స్పష్టం. ఎగువ సభ అలాంటి సుగుణాన్ని దేనైనా కలిగి ఉందంటే నేనంగీకరించను. నిజానికి ఎగువ సభ ప్రజల సంకల్పాన్ని ప్రమాణీకరించడంలో దిగువ సభలాగానే తప్పు చేయవచ్చు. అంతేగాక ఆ విషయంలో ఆ సభ సొంత ప్రయోజనాలు చొరబడడం వల్ల ఒక స్వతంత్రమైన, సహేతుకమైన తీర్పు ఇవ్వడానికి పూర్తిగా అసమర్థం కావచ్చు. అందువల్ల ఒకే సభ ఉండడం, నిర్ణయాల బాధ్యత ఆ సభకే వదిలేయడం, సందేహం వచ్చినపుడు ఆ సభను ఎన్నుకొనే ఓటర్లకే ఆ బాధ్యతను వదలడం మంచిది. దిగువ సభ నిర్ణయాన్ని ఆలస్యం చేయడానికే ఎగువ సభ ఉండాలి అనే ఊహ అంతర్గతంగా ఉంటే అప్పుడు ఇలాంటి చట్టసభ ఏదైనా తీర్మానాన్ని ఆమోదించి పంపినపుడు గవర్నరు పునః పరిశీలనకు చట్ట సభకు తిప్పి పంపడం ద్వారా ఎలాగూ సంభవిస్తూనే ఉంది. చట్ట సభ పునః పరిశీలించకుండా మళ్లీ యథాతథంగా గవర్నర్‌కు తిప్పి పంపితే అప్పుడు కూడా వీటో చేయడం ద్వారా గవర్నర్ దాన్ని ఆపవచ్చు. గవర్నర్ అభిప్రాయానికి చట్టసభ కట్టుపడక పోతే ఆ వివాదాస్పద విషయాన్ని ప్రజల ముందుంచడానికి చట్ట సభను రద్దు చేయమని చట్టసభ గవర్నరును ఒత్తిడి చేయవచ్చు. అందువల్ల ఎగువ సభ ఏ పనిచేయవలసి ఉందని అనుకుంటున్నామో ఆ పని తన వీటో అధికారం ద్వారా పునః పరిశీలన కోసం బిల్లు తిప్పి పంపడం ద్వారా, సభను రద్దు చేయడం ద్వారా గవర్నర్ నిర్వహిస్తున్నాడన్నది వాస్తవంగా తేలుతుంది. దీన్ని అంగీకరిస్తే, అప్పుడు ఎగువసభ దిగువ సభకు అవసరమైన అంగంగానే మిగిలిపోతుంది.

97. నా సహచరులు ఇతర దేశాల్లో ఎగువ సభ ఉందని ప్రయోజన వాదాన్ని అన్వయింప చేయకుండా ఒకే సభ ఉంటే అది తొందరపాటుగా, తప్పుగా ఊహించిన చట్టాల్ని చేస్తుందన్న భావాన్ని ఒక వేళ కలిగి ఉంటే అది సరైన పునాదులు కలిగి ఉంటే తప్ప ఆ వాదంతో అంగీకరిస్తారని నేననుకోవడం లేదు. ఆ ఊహ ఇంత వరకూ నిర్ధారితం కానిదని, ఆ ఊహ ప్రస్తుత రాజకీయాల పనితీరు విషయంలో పూర్తి అజ్ఞానంలో ఉందని నాకనిపిస్తుంది. ఏ చట్టం కూడా ఆధునిక కాలంలో చట్ట సభ ముందుకు విస్మయం కొలిపేట్లు బలవంతంగా తోయబడడం లేదు. నిజానికి ప్రతి చట్టసభకు సంబంధించిన ప్రతిపాదన అది చట్టం కాకముందు సంవత్సరాల తరబడి ప్రజల ముందు చర్చల ద్వారా, పరిశీలన ద్వారా దీర్ఘకాల ప్రక్రియకు లోనవుతున్నది. రాజ్యాంగంలో స్థానం

సంపాదించిన ఏ చట్టం పూర్వ చరిత్ర పరిశీలించినా ఊహ పుట్టుకకు అది చట్టం చేయబడడానికి మధ్య చాలా కాలవ్యవధి ఉందేగానీ తక్కువ కాల వ్యవధి లేదు. పరిస్థితి ఇలా ఉన్నపుడు దిగువ సభ తొందర పడి చట్టాలు చేస్తుందని, దాని గమనాన్ని ఆటంక పరచడానికి బ్రేకు అవసరమని, అందు కోసం ఎగువ సభ కావాలనడం లేని రోగానికి మందు రాసిచ్చినట్లే అవుతుంది.

98. ఎల్లాగైనా కానీ, నా సహచరులు పునర్విమర్శ సభ కంటే నియంత్రణ వర్గం కోసం ప్రయత్నిస్తున్నారు. ఎగువ సభకు అంటకట్టిన ఉద్దేశంలోను, ఏ నియోజక వర్గాల మీద ఆధారపడి ఎగువ సభను ఏర్పాటు చేయాలనుకుంటారో వాటిని బట్టి, ఎగువ సభకు ఏయే అధికారాలు ఇవ్వాలను కుంటున్నారు అన్న అంశాల్ని బట్టి ఈ విషయం స్పష్టం అవుతున్నది. దిగువ సభ అధికారాల సంక్రమణకు ఎగువసభ ద్వారా హద్దు నిర్ణయించాలనుకోవడం, ఒక నిర్ణీత జాతి లేదా నిర్ణీత ప్రయోజనానికి భంగకరంగా దిగువ సభ ఉపయోగించే అధికారాలకు బీమాగా ఎగువ సభ ఏర్పాటును కోరడం నాకు ఆశ్చర్యం కలిగించిందని అంగీకరిస్తాను. ఈ కోరిక నెరవేరడం కోసం కేంద్రం లేదా రాజకీయ అధికారం మార్పు పొందకుండా ఉండడం అనే సంస్కరణ కాదు చేయవలసింది. ఈ అధికారాన్ని రహస్యంగా సామాన్య ప్రజల దిశగా మార్చాలి. ఈ అధికార సంక్రమణ హద్దు నిర్ణయించడం కోసం ప్రయత్నించడం నా సహచరుల్ని - వివిధ జాతుల మధ్య అధికార సమతుల్యత్వాన్ని పరిరక్షించే సంస్కరణే బాగా కోరదగిన రాజకీయ సంస్కరణ అని భావించేటట్లు చేసింది. ఈ దృక్పథం కలిగిన వారికి రాజకీయ సంస్కరణ నిజమైన అర్థం అంటే ఏమిటో తెలియకపోవచ్చు లేదా తెలిసినా ప్రస్తుత స్థితిని మార్చే సంస్కరణ వారికి అభిలషణీయం కాకపోవచ్చు. నా మట్టుకు సంస్కరణల సారాంశం అంతా విభిన్న జాతుల మధ్య అధికార సమతుల్యాన్ని మార్చేదిగా ఉండాలి అన్న విషయంలో నేను పొరపాటు పడను. బడుగు వర్గాలు కొంత లాభపడాలంటే ఇతర వర్గాలు నష్టపడక తప్పదు. ప్రతివర్గం రాజకీయ అధికారంలో మార్పు రాకపోతే వాస్తవమైన సంస్కరణ అంటూ జరగనట్లే. బడుగు వర్గాలు కానీ ఆ మాటకు వస్తే ఏ వర్గం అయినా సరే ఏ కార్యమైనా అది రాజకీయ సంస్కరణ అని పిలవబడుతూనే అన్నిటిని మార్చాలని ప్రతిపాదించి యథాతథ స్థితిని ఉంచాలనుకుంటే సంతృప్తి పడతారని భావించడం వృథా. దీన్ని మామూలు మాటల్లో చెప్పాలంటే రాజకీయ అధికార సంక్రమణను పై తరగతుల వారికే పోనిస్తూ, సాధారణ ప్రజల వద్దకు పోనీయకుండా అదుపు చేయడం అవుతుంది. అలాంటి సంస్కరణల ప్రణాళికలో భాగస్వామిగా ఉండడానికి నేను అంగీకరించలేను.

99. ఒకవేళ ఎగువ సభ అవసరం అనుకున్నా దాని ఏర్పాటులో ఒక పెద్ద అవరోధం ఉంది. రాష్ట్రాల్లో ఎగువ సభల ఏర్పాటు సమస్య గురించి మాంటేగు చెమ్స్‌ఫర్డ్ నివేదిక 1917 లోనే జాగ్రత్తగా పరిశీలించింది. కానీ అన్ని అంశాల్ని పరిశీలనలోకి తీసుకొన్న తర్వాత ఆ ప్రతిపాదనకు విరుద్ధంగా నిర్ణయించిందని వారు ఇలా అన్నారు. "ఈ ఊహకు చాలా తీవ్రమైన ఆచరణాత్మక ప్రతిబంధకాలు ఉన్నాయి. చాలా రాష్ట్రాల్లో రెండు సభలకు తగినంత మంది యోగ్యులైన సభ్యులు లభించడం కష్టం. ప్రధానంగా వడ్డీ వ్యాపారుల ధనవంతుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే ఎగువ సభ ప్రజల

ప్రయోజనాలకు విరుద్ధంగా, చట్టానికి తీవ్ర ప్రతిబంధకంగా పనిచేస్తుందని మేము భావిస్తున్నాం. అంతే గాక ఎగువ సభలో చాలా మటుకు భూస్వాములు సభ్యులుగా ఉండడం వల్ల నియోజక వర్గాల ద్వారా ఎన్నిక కావడానికి ఆ వర్గంలోని ఇతరులకు అవకాశం లేకుండా పోతుంది. రెండు సభలుండే పద్ధతి వల్ల చట్టాల తయారీ చాలా భారమైందిగా అవడం, ఆలస్యం కావడం వల్ల రాష్ట్ర చట్ట సభల కార్యనిర్వహణకు ఇబ్బంది కలుగుతుంది. అందువల్ల రాష్ట్రాల్లో రెండు సభల పద్ధతిని ప్రస్తుతానికి మేం వ్యతిరేకిస్తున్నాం". 1917లో రెండు సభల పద్ధతికి వ్యతిరేకంగా వచ్చిన ఆక్షేపణలు ఇప్పటికే సరిపోతాయి. రెండు సభల్ని సమర్థవంతంగా నడపగల తగినంత మంది యోగ్యులైన సభ్యులు ఈ ప్రెసిడెన్సీలో లేరన్నది నేను ఖచ్చితంగా చెప్పగలను. ఎగువ సభ దిగువ సభ సారాన్ని నిస్సారం చేస్తుంది. లేదా దిగువ సభ ఎగువ సభ సారాన్ని నిస్సారం చేస్తుంది. రెండింటినీ ఏర్పాటు చేయడానికి తగినంత మూల సామగ్రిలేదు. ఈ పరిస్థితుల్లో సమర్థవంతమైన ఒకే సభ ఉండడం రెండు అసమర్థమైన సభలుండడం కంటే మెరుగు. ఈ కారణాల వల్ల ప్రెసిడెన్సీలో ఎగువ సభ ఏర్పాటును నేను వ్యతిరేకిస్తున్నాను.

## ఆరవ అధ్యాయం

## చట్టసభ అధికారాలు

***100. అధ్యక్షుని ఎన్నుకొనే, తీసివేసే అధికారం:*** 1919 సంవత్సరపు సంస్కరణలకు ముందు రాష్ట్ర ప్రధాన కార్యనిర్వాహకుడైన గవర్నరే రాష్ట్ర చట్ట సభకు అధ్యక్షుడుగా ఉండేవారు. 1919లో ప్రవేశ పెట్టిన సంస్కరణ మూలంగా తన సభ్యుల్లో ఒకణ్ణి అధ్యక్షుడుగా ఎన్నుకోవడానికి, అతణ్ణి ఆ పదవి నుండి తీసి వేయడానికి రాష్ట్ర చట్ట సభ అధికారం సంపాదించుకొంది. ఇది చాలా విలువైన విశేషాధికారం అయినా, ఈ విశేషాధికారాన్ని అధ్యక్షుణ్ణి తీసి వేయడానికి గవర్నరు అంగీకారం, గవర్నరు ఏకీభావం అవసరం అన్న పరిమితిలో ఉపయోగించాల్సి వచ్చేది. ఈ పరిమితులు చట్ట సభ కంటే కార్యనిర్వాహకుడు ఉన్నతంగా ఉన్న కాలంనాటి అవశేషాలు. అధినివేశ రాజ్యాల రాజ్యాంగాల్లో వాటికి ప్రవేశం లేదు. అవి చట్ట సభ స్వేచ్ఛకు అనురూపం అయినవి కాదు కాబట్టి వాటిని తీసివేయాలి. అధ్యక్షుడు పాలకవర్గం నుండి స్వతంత్రంగా ఉండాలి అంటే అతడు న్యాయ వ్యవస్థ నుండి కూడా స్వతంత్రంగా ఉండాలా అన్న ప్రశ్న తలెత్తుతుంది. భారత ప్రభుత్వం సెక్షన్ 110 చట్టం అధికారాల్ని గురించి, హైకోర్టు పరిధి నుండి వారు ఏయే విషయాల్లో స్వేచ్ఛ కలిగి ఉండాలో నిర్వచిస్తుంది. ఈ మినహాయింపు కలిగిన అధికారుల్లో చట్టసభ అధ్యక్షుడు లేడు. అది కేసు అయినప్పుడు అధ్యక్షుడుగా తాను చేసే పనుల విషయంలో అతడు కోర్టు పరిధిలో ఉంటాడు. అంటే అధ్యక్షుడుగా అతని నిర్వహణకు న్యాయస్థానంలో ప్రశ్నించబడడానికి బాధ్యుడుగా ఉంటాడు. ఈ అంశం విసిగించే వ్యాజ్యాలకు దారితీస్తుందని, తద్వారా చట్ట సభ కార్యనిర్వహణకు విపరీతమైన జాప్యం జరుగుతుందని సందేహం. కోర్టుల పరిధి నుండి చట్ట సభ అధ్యక్షుణ్ణి మినహాయించి ఈ అంశాన్ని అధిగమించ వలసి ఉంది. ఈ మార్పును నేను వ్యతిరేకిస్తూ యథాతథస్థితిలో విషయాల్ని

వదిలేయాలని సూచిస్తున్నాను.

**101. విశేషాధికారాల్ని నిర్వహించే అధికారం :** ఆ సంస్థ ఉనికికి అది ఏయే విధుల్ని నిర్వహించాలని నిర్ణయించబడిందో, ఆ విధుల నిర్వహణకు అవసరమైన సహేతుకమైన ఏయే అధికారాలు అవసరమో అవన్నీ చట్ట సభకు సమకూర్చాలి అన్న అంశాన్ని ఎవరూ కాదనరు. ఇప్పటి చట్టానికి లోబడి ఏర్పడిన రాష్ట్ర చట్టసభల స్థితి చాలా అసంతృప్తి కరంగా ఉంది. చట్ట సభ సభ్యులకు కొన్ని రక్షణలు కల్పించడం శాసనమండలి నిబంధనలలో 17వ నిబంధనను అనుసరించి నియమాల్ని అతిక్రమించిన సభ్యుని బహిష్కరించడం లాంటి అధ్యక్షునికి ఇవ్వబడిన కొన్ని స్వల్ప అధికారాల్ని మినహాయిస్తే చట్టసభకు దాని కార్య నిర్వహణను అభ్యంతర పరిచే తప్పుకుగానీ, దాని గౌరవాన్ని తగ్గించే తప్పుకు కాని వ్యతిరేకంగా ముందుకు సాగడానికి చట్టం అధికారం కల్పించలేదు. అందువల్ల అధినివేశ రాజ్యాలలోని చట్ట సభల లాగా రాష్ట్రాలలోని చట్టసభలు కూడా సభ ప్రయోజనం దృష్ట్యా ఏది అవసరం అని భావిస్తే దాన్ని సాధించడానికి కావలసిన విశేషాధికారాల్ని వ్యాఖ్యానించుకొనే అధికారాన్ని చట్ట సభకు ఇవ్వాలి.

***102. వ్యవస్థాబద్ధం చేసే కార్యనిర్వహణకు అధికారం :*** బొంబాయి శాసనమండలి కార్య నిర్వహణ- సెక్షన్ 72 డి(7) లోని స్టాండింగ్ ఆర్డర్స్ అనుబంధంతో కలుపుకొని భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 72 డి (6) అధీనంలో నిర్ణయించబడింది. ఈ కార్యనిర్వహణ నియమావళిని రచించే సందర్భంలో రాష్ట్ర చట్టసభ హస్తం లేదు. ఈ స్థాయీ ఆదేశాలు కౌన్సిల్‌లో చట్టసభకు మార్పులు చేర్పులు సూచించే స్వేచ్ఛ ఉన్నా గవర్నర్ జనరల్ చేత చేయబడ్డాయి. కానీ సెక్షన్ 129 ఎ కింద కౌన్సిల్లో గవర్నర్ జనరల్ చేత చేయబడిన నిబంధనల ద్వారా గవర్నర్ జనరల్ చేత చేయబడే చట్టాల్ని మార్చడాన్ని గానీ, రద్దు చేయడాన్ని గానీ స్పష్టంగా నిషేధించబడింది. రాష్ట్ర చట్ట సభకు తన కార్యనిర్వహణను తానే వ్యవస్థా బద్ధం చేసుకొనే అధికారం ఉండాలని నేను అభిప్రాయ పడుతున్నాను. రాష్ట్రచట్ట సభకు అలాంటి స్వేచ్ఛ ఇవ్వడానికి ప్రతిబంధకం ఎక్కడ ఏర్పడుతున్నదంటే ఇతర దేశాల్లో ఈ నిబంధనలు రాజ్యాంగ చట్టంలో పొందుపరచబడి ఉండడం వల్ల కావచ్చు. అందువల్ల నిబంధనల్ని మార్చే అధికారం ఇవ్వడమంటే వాస్తవానికి రాజ్యాంగ చట్టాన్ని మార్చడమే అవుతుంది. అయితే ఈ నిబంధనల్ని భారత ప్రభుత్వ చట్టంలో ఒక సెక్షన్‌గా చేర్చే ప్రయత్నం చేస్తే ఈ ప్రతిబంధకాన్ని సులభంగా తొలగించుకోవచ్చు. నేను చేసిన సిఫారసు మేరకు రాష్ట్ర చట్టసభలకు ఈ అధికారం కల్పించి ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, కెనడాల్లోని అధినివేశ రాజ్యాలతో సమాన ప్రతిపత్తిని సులభంగా కల్పించవచ్చు.

***103. చట్టాలు చేసే అధికారం :*** భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 80సి లో స్థానిక చట్టసభలోని ఏ సభ్యుడైనా రాష్ట్ర ఆదాయాన్ని దెబ్బతీసేదిగా ఉండే బిల్లుగానీ, ఆదాయం మీద అదనంగా పన్ను విధించడం కోసం గానీ గవర్నరు, లెఫ్టినెంట్ గవర్నర్ లేదా చీఫ్ కమీషనర్ పూర్వానుమతిలేనిదే చట్ట సభలో బిల్లు ప్రవేశ పెట్టడం చట్ట బద్ధం కాదు అని చెప్పబడింది. చట్ట సభ అధికారాలకు ఈ సెక్షన్

చాలా ప్రతిబంధకం. దేశ పరిపాలనా వ్యవహారాలమీద ప్రజల అభిప్రాయ ప్రకటనకు ఏ మాత్రం అవకాశంలేని కాలానికి సంబంధించిన అవశేషమే ఈ ప్రతిబంధకం. పాలక వర్గం మీద పై చేయిగా చట్టసభ ఉండేటప్పుడు ఈ అధికారాల్ని అలాగే ఉంచడం బలపడే అంశం కాదు. అందువల్ల ఈ సెక్షన్‌ని తీసి వేయాలి. కౌన్సిల్ ఆమోదించిన చట్టాన్ని ఇప్పటికే వీటో చేసే అధికారం గవర్నర్‌కి ఉంది. ఆ అధికారం చాలు. సంపూర్ణమైన మంత్రి వర్గ బాధ్యత ఉండే పద్ధతిలో ఇంత కంటే ఎక్కువ అధికారం ఉండడం అనువైనది కాదు.

*104.* **వినియోగాధికారం :** సెక్షన్ 72 డి కింద చట్టసభ ఏదైనా గ్రాంటుకు సంబంధించిన డిమాండుకు తన అంగీకారాన్ని తెలపవచ్చు. లేదా తిరస్కరించవచ్చు లేదా ఆ డిమాండులో తెలపబడిన మొత్తాన్ని మొత్తం గ్రాంటు మీద ఆధారపడిగానీ, డిమాండులోని కొన్ని అంశాల్లో తెలపబడిన ఖర్చును విడిచి పెట్టడం లేదా తగ్గించడం ద్వారా గానీ తగ్గించవచ్చు. ఈ అధికారం కొన్ని ముఖ్యమైన షరతులకు లోబడి ఉంటుంది. రిజర్వుడు సబ్జెక్టుకు సంబంధించిన తన విధి నిర్వహణ కోసం అవసరం అని అంగీకరించి గవర్నరు చట్ట సభ నిర్ణయాన్ని ఉపేక్ష చేయవచ్చు. చట్ట సభ వినియోగాధికారాన్ని పరిమితం చేసే మరో మినహాయింపు సెక్షన్ 72డి, క్లాజు (2) (బి) లో ఉంది. గవర్నరు పదవిలో ఉన్నందువల్ల అతనికి కలిగిన "అత్యవసర పరిస్థితిలో రాష్ట్రంలో శాంతి ప్రయోజనం కోసం లేదా ఏ ప్రభుత్వ శాఖనైనా నడపడం కోసం ఖర్చు చేయడానికి ఉత్తరువు ఇచ్చే అధికారం" అనేది ఆ మినహాయింపు. ఇవి కూడా శాసనమండలి అధికారాలకు తీవ్రమైన ప్రతిబంధకాలు కాబట్టి వాటిని ఆ చట్టం నుండి తీసేయాలి. సంపూర్ణ బాధ్యతాయుతమైన ప్రభుత్వం నిర్వహించే కార్యాలలో ఏ మాత్రం ప్రమేయం లేని గవర్నరు ఉండే ప్రభుత్వంలో పైన చెప్పిన షరతుల్లో మొదటి దానికి ఏ మాత్రం స్థానం లేదు. రాష్ట్రం శాంతి భద్రతలు బాధ్యతాయుతమైన పాలక వర్గాని కంటే గవర్నరుకే ఎక్కువగా సంబంధించిన ప్రత్యేక వ్యవహారం కాదు. అందువల్ల గవర్నరు చేతుల్లో ఉన్న రెండవ షరతు కూడా అనవసరం కాబట్టి తీసేయాలి.

105. చట్ట సభ ఆర్థిక అధికారాలకు మరో ప్రతిబంధకం సెక్షన్ 72 డి (3) లో ఉంది. ఆ సెక్షన్‌లో చెప్పబడ్డ కొన్ని నిర్ణీత శీర్షికల కింద జరిగే ఖర్చును పాలక వర్గం చట్ట సభ ఓటింగు కోసం సమర్పించవలసిన పనిలేదు. తత్ఫలితంగా శాసనమండలి జోక్యం చేసుకోవీలుగాని రాష్ట్ర బడ్జెట్‌లో చోటు చేసుకుంటున్నాయి. సిద్ధాంత పరంగా మాట్లాడితే ఖర్చులోని ప్రతి పద్దూ ప్రతి సంవత్సరం చట్ట సభ ద్వారా మంజూరు చేయబడవలసిందే. కానీ దాదాపు అన్ని దేశాలలోనూ వాటి బడ్జెట్‌ల్లో ప్రతి ఏటా చట్ట సభ ఓటు చేయాల్సిన అవసరం లేని శాశ్వత ఖర్చులున్నాయి. యుద్ధానికి పూర్వం ఇంగ్లండులో కూడా సంవత్సరం మొత్తం బడ్జెట్టు ఖర్చులో మూడవ వంతు ఖర్చుకు సరిపోయేంత ఎక్కువగా శాశ్వత వ్యయ పట్టిక పెరిగి పోయింది. ప్రభుత్వ వ్యయ విధానాన్ని వ్యయం మొత్తాన్ని నిర్ణయించడంలో పాలక వర్గాన్ని విశ్వసించడం, విశ్వసించకపోవడం అనేది రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వాన్ని గురించి ప్రజలు అంచనా వేసుకోగలిగే స్థితిని బట్టి ఉంటుంది. ప్రభుత్వం యొక్క

ప్రజలయొక్క రాజకీయాధికారాల విషయంలో సందిగ్ధత ఉండే స్థితి ఉంటే మాత్రం సెక్షన్ 72 డి(3)లో ఉద్దేశించబడిన చట్ట సభ అక్కరలేని ప్రజల ధనం యొక్క శాశ్విత ద్రవ్య వినియోగాన్ని అంగీకరించడం క్షేమం కాదు. రాష్ట్రాల్లో బాధ్యతాయుత ప్రభుత్వాలకు ఇప్పుడిప్పుడే పునాది పడడం వాస్తవమే. అప్పుడు పాలక వర్గం అన్యాయ అక్రమాల నుండి చట్ట సభలు అతి జాగ్రత్తగా రక్షిస్తుండాలి. అయినా ప్రభుత్వ వ్యవహారాల మీద ప్రజల అదుపు గుర్తించబడిందని కొత్త రాజ్యాంగంలో అది పూర్తిగా అంగీకరించబడుతుందని, అందువల్ల వివిధ రకాలైన నియంత్రణ కింద ప్రభుత్వ అధికారం ఉంటుంది కాబట్టి అప్పుడు ప్రభుత్వ ఖర్చులోని ప్రతి పద్దూ ఏటా చట్ట సభ అంగీకారం పొందాలని ఒత్తిడి చేయనక్కరలేదని నేను భావిస్తున్నాను. కాబట్టి నేను శాశ్విత వ్యయ ప్రణాళికని ఆక్షేపించడం లేదు. కానీ ఆ శాశ్వత వ్యయం చట్టం ద్వారా నిర్దేశించబడడాన్ని మాత్రం నేను ఆక్షేపిస్తాను. ఎందుకంటే చట్టసభ అధికారాలకు ఆటంకం కలుగుతున్నది. కాబట్టి అవి చట్ట సంబంధం అయినవిగా చేయడం వల్ల నాన్ ఓటబుల్ పద్దులకు సంబంధించిన పరిపాలనలో అంతర్గతంగా ఉన్న విధానాన్ని చర్చించడానికి కూడా శాసన సభ మీద ప్రభావం పడింది. నాన్ ఓటబుల్ పద్దుల్ని కల్పించడం అవసరం కోసం చేసే పనులుగానే ఉండాలి. చట్టం ద్వారా వీటి విషయంలో చట్ట సభ మీద నిర్బంధం ఉండరాదు.

*106. పాలక పక్షాన్ని నియంత్రించే అధికారం :* రాష్ట్ర చట్ట సభలు 1919 సంవత్సరపు సంస్కరించబడిన రాజ్యాంగం ప్రకారం మంత్రుల్ని మూడు విధాలుగా నియంత్రించే అవకాశం ఉంది.

1 చట్టం ద్వారా

2. సదుపాయాల్ని నిరాకరించడం ద్వారా

3. జీతాల్ని నిరాకరించడం లేదా తగ్గించడం ద్వారా. మంత్రుల పరిపాలనను పై చెప్పబడిన రెండవ, మూడవ విధానాల ద్వారానే చట్ట సభ నియంత్రించవచ్చు. ఈ నియంత్రణ సంవత్సరానికి ఒక సారి మాత్రమే చేయవచ్చు. కాబట్టి అది అల్పమైనది. తర్వాత 1926 సంవత్సరంలో మంత్రుల మీద విశ్వాసం కోరడానికి తీర్మానం ప్రవేశపెట్టే ఏర్పాటు చేయబడింది. మంత్రులు వారి చర్యలకు పై యుక్తికంగా బాధ్యులు అనే భావం తోచినపుడు మంత్రుల చర్యల్ని నియంత్రించడానికి చట్ట సభకు ఉండే ఈ అధికారాలు సరిపోతాయి. భవిష్యత్తులో ఏర్పడబోయే మంత్రివర్గం ఉమ్మడి బాధ్యత మీద ఆధారపడేది కాబట్టి ఆ పద్ధతిలో మంత్రులు ఉంటే అందరూ కలిసే ఉంటారు. లేకుంటే అందరూ పడిపోతారు. ప్రస్తుతం చట్ట సభకు ఉండే అధికారాల్లో అది మొత్తం మంత్రి వర్గాన్ని రద్దు చేయడానికి కోరుతున్నట్లు ఎక్కడా లేదు. దీనికి తగిన ఏర్పాటు చేయవలసి ఉంది. ఎలాగంటే 'అవిశ్వాస తీర్మానం' అనే ఒక తీర్మానాన్ని "నిర్ణీత అంశంపైన మినిస్టర్ పాలసీని ప్రశ్నించే తీర్మానం" అనే పేరుపెట్టి ఇప్పుడు ఉండేదానికి భిన్నంగా ఉండే ఆ తీర్మానాన్ని ప్రవేశపెట్టడం ద్వారా చేయవచ్చు. ఈ అంశాన్ని మద్దిమాన్ సూచించారు గానీ అమలు చేయలేదు.

*107. రాజ్యాంగాన్ని మార్చే అధికారం :* రాష్ట్ర శాసన సభలు ఏ రాజ్యాంగాన్నయితే తాము నిర్మించాయే దాని షరతులకే కట్టుబడాల్సి ఉంది. ఆ ఉపకరణం వల్ల రాష్ట్ర శాసన సభలు "సంపూర్ణాధికారాలు" కలిగిన సంస్థలుగా తమ ప్రాంతంలోని అందరు ప్రజలమీద ప్రత్యేకమైన, నిర్ణీతమైన ప్రభుత్వ అధికారాన్ని కలిగి ఉన్నాయి. ప్రభుత్వానికి ఉండే ఈ సంపూర్ణాధికారాలలో స్వయంగా రాజ్యాంగాన్ని మార్చే అధికారం ప్రభుత్వానికి లేదు. రాజ్యాంగ సభకు ఉన్నట్లు రాష్ట్ర చట్ట సభలకు కూడా తమ రాష్ట్ర రాజ్యాంగాన్ని మార్చే అధికారం ఉండాలని ఒక అభిలాష ఉంది. ఆ ప్రతిపాదనకు అనుకూలంగా చాలా చెప్పవచ్చు. పార్లమెంటు రాష్ట్ర ప్రజలకు స్వయం పాలన ఇవ్వడానికి ఆ రాష్ట్ర ప్రజలు తమకు ఎలాంటి ప్రభుత్వం ఉంటే బాగుంటుందో అలాంటి తరహా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనే అధికారాన్ని కల్పించింది. కానీ రాష్ట్ర శాసన సభలకు రాజ్యాంగాన్ని మార్చే అధికారం కల్పిస్తే మెజారిటీ ద్వారా తమ రాజ్యాంగ హక్కులు నిర్ణయింపబడ్డాయి కాబట్టి మైనారిటీల ద్వారా తమ రాజ్యాంగ హక్కులు నిర్ణయింపబడతాయి. కాబట్టి మైనారిటీలు అంగీకరించరని మనం గుర్తుంచుకోవాలి. కెనడా పార్లమెంటుకు రాజ్యాంగాన్ని మార్చే అధికారం కెనడా రాజ్యాంగం కల్పించకపోవడానికి ఇదే ప్రధాన కారణం. కానీ దక్షిణాఫ్రికాలో మైనారిటీల స్థితికి భంగం లేకుండా రాజ్యాంగాన్ని మార్చే హక్కు దక్షిణాఫ్రికా పార్లమెంటుకు కల్పించబడిన దృష్టాంతం ఉంది. అందువల్ల దక్షిణాఫ్రికా దృష్టాంతాన్ని మనం అనుసరించక పోవడానికి కారణం కనిపించదు. రాష్ట్ర రాజ్యాంగాన్ని మార్చే హక్కు రాష్ట్ర శాసన సభకు ఇవ్వవచ్చునని నేను సిఫారసు చేస్తున్నాను. అయితే ఆ శాసన సభకు చట్టసభలో మైనారిటీల ప్రాతినిధ్యానికి సంబంధించిన నిబంధనల్ని మాత్రం మార్చే అధికారం ఉండకూడదు.

108. అలాంటి చట్టం చేయడానికి ఏ ప్రత్యేక విధానం అనుసరించబడాలో నిర్ణయించడం చాలా కష్టం అయినా ఇలా చెప్పుకోవాలి. రాజ్యాంగాన్ని మార్చే పద్ధతి ఎలా ఉండాలంటే అది పౌరుల ప్రాథమిక హక్కుల్ని రక్షించడానికి తగినంత దృఢంగా ఉండాలి. అద్దే సమయంలో పురోగతి అనేది ఉనికి లాగానే లేక ఒక జీవన సూత్రం అవి గుర్తించగలిగినంతటి సున్నితమైనదిగా ఉండేట్లు రాజ్యాంగాన్ని వదిలేయాలి. ఇంకా, చర్యకు ముందు చర్చోప చర్చల్ని కలిగి ఉండాలి. అంతిమ నిర్ణయం మెజారిటీ పాలన సిద్ధాంతానికి అనురూపంగా ఉండాలి. చాలా నిరపాయకరమైన మార్గం ఏమంటే రాజ్యాంగానికి చేసే వివిధ రకాలైన సవరణలకు వివిధ రకాలైన విధానాలుండాలని నా కనిపిస్తుంది. అంత ప్రాథమికంగాని రాజ్యాంగ భాగాల సవరణకంటే చాలా ప్రాథమికమైన రాజ్యాంగ భాగాల సవరణకు కఠినమైన విధానం ఉండాలి.

అనువాదం :

డా॥ పి. నరసింహారెడ్డి

★ ★ ★

నాలుగవ విభాగం

# ప్రొవిన్షియల్ స్వయం ప్రతిపత్తి

ఒకటవ అధ్యాయం

## ప్రొవిన్షియల్ ప్రభుత్వం – భారత ప్రభుత్వం

109 : సంస్థాన కార్య నిర్వాహక వర్గం, సంస్థాన చట్టానికి కాకుండ, సంస్థానంలోని మరో సంస్థ కింద వుంటే అలాంటి కార్య నిర్వాహక వర్గం నిర్వహించే బాధ్యతలు ఏ విధమైన ఫలితాల్ని ఇవ్వలేదనే విషయం సులభంగా తెలుస్తుంది. ఒకవేళ ప్రొవిన్షియల్ శాసనసభ కూడ తన సర్వోన్నత స్థితిని కోల్పోయి తన అధికారాలనుపయోగించడంలో ఇంకొక విభాగానికి జవాబుదారిగా వున్నా పరిస్థితి ఇలాగే వుంటుంది. మరో విధంగా చెప్పాలంటే బాధ్యతాయుతమైన ప్రభుత్వాలు తప్పనిసరిగా స్వయం ప్రతిపత్తి కలిగి ఉండాలి. దీనికోసం ప్రొవిన్షియల్, కేంద్ర ప్రభుత్వాల పరిధుల మధ్య స్పష్టమైన విభజన వుండాలి.

110: 1915లోని భారత ప్రభుత్వ చట్టంలోని 45వ అధికరణం ప్రకారం 1919 వరకూ, ప్రొవిన్షియల్ ప్రభుత్వాలు గవర్నర్ జనరల్ ఆదేశాలకు లోబడి నడచుకోవలసి వుండేది. దీనివల్ల ప్రభుత్వ వ్యవహారాలు ఎప్పటికప్పుడు ఆయనకు తెలియపరుస్తూ ఆయన పర్యవేక్షణ, సూచన, నియంత్రణలో ప్రొవిన్షియల్ ప్రభుత్వానికి చెందిన విషయాలు నడపబడుతుండేవి. అంటే ప్రొవిన్షియల్ ప్రభుత్వాలకు తాము అందించే పాలనపట్ల తమదంటూ అధికారం ఏది వుండేది కాదు. కాగా, అవి చలాయించే అధికారాలన్నీ, దానికి కేంద్ర ప్రభుత్వం నుంచీ ధారాదత్తం కాబడ్డవే. ఇంకో విధంగా చెప్పాలంటే ఈ అధికారాలు ఒక ప్రధాన అధికారి తన ఏజంటుకిచ్చే అధికారాల వంటివే అనవచ్చు. 1919 చట్టం ప్రకారం ప్రొవిన్షియల్, కేంద్ర ప్రభుత్వాల మధ్య ఇటువంటి సంబంధాలు మాత్రమే నెలకొన్నాయి. ఈ చట్టం లోని 45 1 (బి) ప్రకరణం ప్రకారం స్థానిక ప్రభుత్వాలకు ప్రొవిన్షియల్ అంశాలకు గురించిన అధికారాలు, రెవిన్యూ కేటాయింపునకు చెందిన అధికారాలు ప్రాప్తించాయి. ఇలాగే ప్రకరణం 45 (బి) ప్రకారం, స్థానిక ప్రభుత్వాల పర్యవేక్షణ, సూచన, నియంత్రణకు సంబంధించి గవర్నరు జనరల్‌కు చెందిన అధికారాలు, కేవలం చట్టంలో నిర్దేశించబడ్డ విషయాలకు మాత్రమే అన్వయించవలసి వుంటుంది. కానీ ఇటువంటి అధికారాల వినియోగం విషయంలో గవర్నర్ జనరల్ మాత్రమే తుదినిర్ణయం తీసికొని, ప్రస్తావించిన విషయాలకు

మాత్రమే అధికారాలు వాడబడ్డాయా లేదా అని నిర్ణయిస్తాడు.

కాబట్టి 1919 చట్టం రెండు మార్పులు చేసింది. ఇవి (i) ప్రావిన్షియల్ ప్రభుత్వాలు భారత ప్రభుత్వ ఏజంట్ల వలె కాక స్వతంత్ర నిర్ణయాలు తీసుకొనే వీలుకల్పించడం (ii) మంత్రుల నియంత్రణ పరిధిలోని విషయాల పట్ల ప్రావిన్షియల్ ప్రభుత్వాలు భారత ప్రభుత్వానికి లోబడవలసిన నిబద్ధతను సడలించడం. అయితే కేంద్ర ప్రభుత్వానికి ఈ విషయంలో పర్యవేక్షణాధికారాలు మాత్రం వుంటాయి.

పై మార్పుల నుంచి తెలిసే విషయమేమిటంటే, ప్రావిన్షియల్ ప్రభుత్వాలలోని మంత్రులకు పాలనాంశాలన్నింటి గురించిన అధికారాలను ధారాదత్తం చేసినా, ఆచరణలో మాత్రం ఈ ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణాధికారాలకు లోబడి ఉండవలసి వస్తుంది. అయితే ఇటువంటి పర్యవేక్షణాధికారాలు అవసరమా అనే ప్రశ్నతో పాటు, కేంద్ర, ప్రావిన్షియల్ ప్రభుత్వాల మధ్య ప్రావిన్షియల్ స్వయం ప్రతిపత్తికి భంగం ఏర్పడినట్టి మరేదైనా సంబంధాలు నెలకొల్ప వచ్చునా అనే ప్రశ్నలు ఎదురవుతాయి.

111 : 1919 చట్టం వల్ల ప్రావిన్షియల్ పాలనాంశాలు కేంద్ర పాలనాంశాల నుంచే వేరుపరచబడ్డాయి. అయితే ఇందుకు బిన్నంగా ప్రావిన్షియల్ పాలనాంశాల విషయంలో చట్టాలను తయారుచేయడానికి తుది అధికారాలను ప్రావిన్షియల్ శాసనసభలకు చట్టం ఇవ్వలేదు. ప్రావిన్షియల్ శాసనసభ అధికారాలు రెండు విధాలుగా కుదించబడ్డాయి. 80 (ఎ) ప్రకరణం ప్రకారంగా కొన్ని విషయాలు ప్రావిన్షియల్ పరిధిలో వున్నా వాటి గురించిన శాసనాలను మాత్రం కేంద్ర ప్రభుత్వం నుంచి ముందస్తుగా అనుమతి పొందనిదే, నిర్ణయించే వీలు ప్రావిన్షియల్ ప్రభుత్వాలకు లేదు. మరికొన్ని విషయాలకు సంబంధించి ప్రావిన్షియల్ చట్టసభ ఒక చట్టాన్ని రూపొందించినా అది 81(ఎ) ప్రకరణం పరిధిలో వుంటే దాన్ని 'వీటో' చేసే అధికారం గవర్నర్ జనరల్‌కు వుంటుంది. ఈ రెండు నిబంధనల ప్రభావం సులభంగా అర్థమవుతుంది. కాబట్టి కేంద్ర ప్రభుత్వ అధికారాలు ప్రావిన్షియల్ ప్రభుత్వ స్వయంప్రతిపత్తికి భంగం కాని రీతిలో ఉండేట్టు కేంద్ర, ప్రావిన్షియల్ ప్రభుత్వాల మధ్య సంబంధాలను నెలకొల్పడమనేది ప్రస్తుత ప్రశ్న.

112 : ప్రావిన్షియల్ పాలనాంశాల విషయంలో కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణ, ప్రావిన్షియల్ విషయాల గురించిన చట్టాల విషయంలో కేంద్ర ప్రభుత్వ 'వీటో' అధికారం అనే రెండు అంశాలు ఏ ఇతర దేశంలోనూ కనిపించవు. కెనడా, ఆస్ట్రేలియా, అమెరికా సంయుక్త రాష్ట్రాల వంటి దేశాల్లో కూడా కేంద్ర మరియు ప్రావిన్షియల్ ప్రభుత్వాలున్నా ఇటువంటి పరిస్థితి కానరాదు. ప్రావిన్షియల్ ప్రభుత్వాలు కొన్ని అంశాల విషయంలో కేంద్రం నుంచి పూర్వానుమతి తీసుకోవడం అనే నిబంధన లోపభూయిష్టమైన రెండు ఊహల వల్ల ఏర్పడింది. వీటిలో మొదటి పాలనా కార్యకలాపాలను వేరుగా విభజించే వీలులేదనుకోవడం. ఇది సరైన ఊహ కాదు. ఎందుకంటే కెనడా రాజ్యాంగం, పాలనా

కార్యకలాపాలను రెండు విభిన్న తరగతులుగా విభజించింది. ఇవి (i) కేవలం కేంద్ర ప్రభుత్వానికి చెందినవి. (ii) ప్రావిన్షియల్ ప్రభుత్వాలకు వాటికి ఇకేటాయించిన పరిధులలో సంపూర్ణ స్వయంప్రతిపత్తి ఏర్పరిచే రీతిలో, ప్రావిన్షియల్ ప్రభుత్వానికి మాత్రమే చెందేవి.

ఇక లోపభూయిష్టమైన రెండవ ఊహ ఏమిటంటే కేవలం ప్రావిన్షియల్ కార్యకలాపాలు అనడానికి వీలు లేనపుడు కేంద్ర ప్రభుత్వం నుంచి పూర్వానుమతి పొందడం ఒకటే మార్గం అనుకోడం. ఇదికూడ లోపభరితమైన ఊహ. ఆస్ట్రేలియా, అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగాలు ఇందుకొక ఉదాహరణ. కెనడా రాజ్యాంగం వలె ఇక్కడ ప్రభుత్వ కార్యకలాపాలను స్పష్టమైన వివర్జిత భాగాలుగా విభజించలేదు. ఆస్ట్రేలియా రాజ్యాంగం పాటించిన అధికార, కార్యకలాపాల విభజన ప్రకారం, కొన్ని విషయాల్లో కేంద్ర ప్రభుత్వానికి ప్రత్యేక అధికారాలున్నాయి. మరికొన్ని విషయాల్లో కేంద్ర ప్రభుత్వం అధికారాలు రాష్ట్ర ప్రభుత్వ అధికారాలు ఒకే విధంగా ఉంటాయి. అయితే రెండు ప్రభుత్వాల మధ్య ఐక్యత ఉన్న చట్టాలకు సంబంధించిన విషయాలు మాత్రం రెండు తరగతులుగా విభజించ బడ్డాయి. ఇవి (i) రాష్ట్రప్రభుత్వం వినియోగించిన అధికారాలను త్రోసిరాజనే విధంగా కామన్‌వెల్తు పార్లమెంటు సంపూర్ణాధికార చట్టాన్ని విధించే విషయాలు (2) కామన్‌వెల్తు అద్వితీయ అధికారాలకు వర్తించని విషయాలు. అమెరికాలో కూడ ప్రభుత్వ అధికారాలు క్రింది విధంగా విభజింప బడ్డాయి.

(1) కేవలం కేంద్ర ప్రభుత్వానికి చెందిన అధికారాలు.

(2) కేవలం రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన అధికారాలు.

(3) కేంద్రం లేదా రాష్ట్ర ప్రభుత్వాల్లో ఏ ఒకటైనా వినియోగించ దగ్గ అధికారాలు.

(4) కేంద్ర ప్రభుత్వానికి వర్తించని అధికారాలు

(5) రాష్ట్ర ప్రభుత్వానికి వర్తించని అధికారాలు.

కాబట్టి కొన్ని కార్యకలాపాలను, కేవలం కేంద్ర ప్రభుత్వానికో లేక రాష్ట్ర ప్రభుత్వానికో చెందినవి అని చెప్పలేము అనే విషయాన్ని ఆస్ట్రేలియా, అమెరికా దేశాల రాజ్యాంగాలు గుర్తించాయి. అయితే వీటిలో ఏ ఒక్కటి కూడ ఆయా విధులకు ఏదో ఒక ప్రభుత్వానికి కేటాయిస్తూ, ఇంకో ప్రభుత్వానికి మంజూరు లేదా 'వీటో' అధికారాలను ఇచ్చే ప్రతిపాదన ఏది చేయలేదు. నేను మాత్రం కెనడాలోవలె విధులను విభజించడాన్ని, ఒకవేళ ఆ పద్ధతి విజయవంతం కాకపోతే ఆస్ట్రేలియా, అమెరికాల పద్ధతిని సిఫారసుచేస్తాను. ఏది ఏమయినా అధికార వినియోగానికి ముందస్తు అనుమతి ఆ తర్వాత వీటో అధికారాలు మాత్రం ఉండకూడదు.

113 : ప్రావిన్షియల్ నియంత్రణలోని అధికారాలపై కేంద్ర పర్యవేక్షణాధికారాలు నెలకొనడానికి రెండు కారణాలు కనిపిస్తాయి. మొదటిది కేంద్ర, ప్రావిన్షియళ్ళ పాలనాంశాల మధ్య స్పష్టమయిన

కేటాయింపు కోరబడడం. రెండోది ప్రావిన్షియల్ పాలనాంశాల గురించి కేంద్ర ప్రభుత్వం బాధ్యత తీసుకోవడం అనే లోపభూయిష్టమైన అభిప్రాయం. కొన్ని అంశాలు కేంద్ర ప్రభుత్వం దృష్ట్యా ప్రాముఖ్యమైనవి అనే కారణంగా, కేంద్రం తన పర్యవేక్షణాధికారాలను సమర్థించుకొంటుంది. అయితే ఈ సమర్థింపు కెనడా, ఆస్ట్రేలియా లేదా అమెరికాలు పాటించిన పద్ధతిలో పాలనాంశాల కేటాయింపునకు దోహదం కాలేదు. అధికారాల పర్యవేక్షణ గురించిన ఇంకో సమర్థింపు కూడా వుంది. ఇదేమిటంటే భారతదేశం మొత్తానికి శాంతి, సామరస్యం, మంచి పాలన గురించి కేంద్ర ప్రభుత్వానికి సంపూర్ణ బాధ్యత వుందనే అభిప్రాయం. ఇంతేగాక కేంద్రానికి తన విధుల నిర్వహణతో పాటు పర్యవేక్షణాధికారాలు కూడా ఉండాలి అనే అభిప్రాయం కూడా ఒకటి. విధుల విభజనతో పాటు బాధ్యతల విభజన కూడా ఉండాలని నాకనిపిస్తుంది. ఒకవేళ బాధ్యతల విభజన జరిగి కూడా ఉండాలని నాకనిపిస్తుంది. ఒకవేళ బాధ్యతల విభజన కేంద్ర ప్రభుత్వం తనకు కేటాయింపబడ్డ అంశాల గురించిన విషయాలకు మాత్రమే పరిమితమయితే, ప్రావిన్షియల్ ప్రభుత్వాలపై పర్యవేక్షణ అవసరం వుండదు. ఇందుకు దోహదం చేసేట్టు భారత ప్రభుత్వ చట్టాన్ని మార్పుచేస్తూ, కేంద్ర ప్రభుత్వానికి నిర్దిష్ట బాధ్యతలు నిర్వహించాల్సి వుంటుంది.

114 : ప్రావిన్షియల్ ప్రభుత్వాలకు సంపూర్ణ స్వయంప్రతిపత్తి గురించి నేను ఆశతో ఎదురు చూస్తున్నప్పటికీ, ప్రజల దృష్టిలో కేంద్ర ప్రభుత్వానికి గల జాతీయతా లక్షణానికి భంగం కలిగించేట్టుగానీ, కేంద్ర ప్రభుత్వాన్ని బలహీన పరిచేట్టుగానీ ఉండేమార్పు ఏదైనా నేను వ్యతిరేకిస్తాను. అందుకే కేంద్ర ప్రభుత్వాన్ని కొన్ని పనుల కోసం ఏర్పరచిన అనేక రాష్ట్ర ప్రభుత్వాల కూటమిగా నేను భావించలేను. ఒకవేళ అటువంటి ఏర్పాటే జరిగితే దాని ప్రభావం తెలుస్తూనే వుంది. ఆ కూటమి కేవలం కొన్ని ప్రభుత్వాల కలయికగా మాత్రమే ఉంటూ, ఆయా ప్రభుత్వాలు ఒకదాని నుంచి ఇంకొకటి విడివడిన మరుక్షణం అదృశ్యమవుతుంది. ఇలాంటి కూటమిగా ఏర్పడ్డ కేంద్ర ప్రభుత్వం కూడా, దాని భాగస్థులు కోరుకున్నంతకాలం మాత్రమే నిలబడుతుంది. ఈ కూటమి ప్రభుత్వాలు కేవలం ప్రభుత్వాలతో సంప్రదిస్తూ, ప్రభుత్వాల పైనే తగిన చర్యలు తీసుకోవలసి వుండడంతో, సామాన్య పౌరుడికి దీనివల్ల ఒరిగేది ఏమి ఉండదు. ఇటువంటి కూటమిగా ఏర్పడ్డ కేంద్ర ప్రభుత్వం నేరుగా వ్యక్తులకు పన్ను విధించే హక్కు గానీ, వారి వ్యాజ్యాలపై తీర్పునిచ్చే హక్కుగాని వారికి న్యాయాన్ని ప్రసాదించే హక్కుగాని ఉండవు. అటువంటి కేంద్ర ప్రభుత్వం అత్యంత బలహీన ప్రభుత్వం కాక తప్పదు. కేంద్ర ప్రభుత్వం గురించి నాకున్న ఆలోచనల దృష్ట్యా, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సంబంధాలు కనీసం అమెరికా రాజ్యాంగంలో వలే ఉండవచ్చని కూడా సమాధానపడలేను. అమెరికాలో కేంద్ర ప్రభుత్వం ఒకవైపు కామన్‌వెల్తుగానూ, ఇంకొకవైపు కామన్‌వెల్తుల కలయికగానూ వుంటుంది. ఈ విధానంలో కేంద్ర ప్రభుత్వం న్యాయస్థానాలు, అధికార్ల ద్వారా వ్యక్తులపై చర్యలు తీసుకోలుగుతుంది. అయితే అమెరికాలోని కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాల నిర్మితం అనేది వాస్తవం. అందుకే అవి కోరినంత కాలం అక్కడ కేంద్రం నిలబడాలి. వాటితోనే

కూలిపోవాలి. రాష్ట్రాలు బహిరంగంగా కూటమికి లోబరచని అధికారాలన్నీ తమ వద్దనే వుంచు కుంటాయి. ఇక కేంద్ర ప్రభుత్వానికి చట్ట ప్రకారం తనకు లభించిన అధికారాలు మినహా ఇంకేమీ ఉండవు. అటువంటి కేంద్ర ప్రభుత్వం కూటమి ద్వారా ఏర్పడ్డ కేంద్ర ప్రభుత్వానికన్నా ఎంతో బలిష్టంగా వున్నా, నా ఉద్దేశ్యంలో భారతదేశ అవసరాలకు మాత్రం ఆనదు. అంతేకాదు కేవలం ప్రావిన్షియల్ ప్రభుత్వాల ఆధారంగా నిలబడుతున్నట్టుగా కనిపించని రీతిలో జాతీయ ప్రభుత్వం ఎంత స్వతంత్రత కలిగి వుండాలంటే అన్ని ప్రావిన్షియల్ ప్రభుత్వాలు అదృశ్యమయినా, లేక ఇంకోరకమయిన సంస్థలుగా రూపొందినా ఇది మాత్రం నిలిచి వుండాలి. అంతేకాదు ప్రావిన్షియల్ ప్రభుత్వాలు పనిచేయలేని స్థితి ఏర్పడినపుడు ఈ జాతీయ ప్రభుత్వం వాటి పాలన కూడ నిర్వహించేట్టుండాలి. ఇందుకు నేను ఈ క్రింది సిఫారసులు చేస్తున్నాను.

(1) అవశిష్ట అధికారాలన్నీ కేంద్ర ప్రభుత్వం వద్ద వుండాలి.

(2) తిరుగుబాటు ధోరణితో ప్రవర్తిస్తూ దేశ ప్రయోజనాలకు భంగం కలిగించే రీతిలో ఉండే ప్రావిన్షియల్ ప్రభుత్వాలను నిషేధించే వీలు కల్పించే నిర్దిష్ట అధికారాలు కేంద్ర ప్రభుత్వానికి ఉండాలి.

(3) ప్రావిన్షియల్ ప్రభుత్వాలు పనిచేయలేని స్థితి ఏర్పడ్డపుడు వాటికున్న సర్వాధికారాలు, కేంద్ర ప్రభుత్వానికి చెందాలి. చివరగా

(4) కేంద్ర చట్ట సభకు నేరుగా ఎన్నికలు జరగాలి.

## రెండవ అధ్యాయం

## ప్రావిన్షియల్ ప్రభుత్వం – రాజ్యాధిపత్యం

115 : ప్రావిన్స్‌ల స్వతంత్రత పొందడానికి కేంద్ర, ప్రావిన్షియల్ ప్రభుత్వాల మధ్య సత్సంబంధాలు నెలకొనడం మాత్రమే చాలదు. నిజానికి ప్రావిన్షియల్ ప్రభుత్వం స్థితిగతులు పూర్తిగా నిర్వచించబడాలి. ప్రావిన్షియల్ ప్రభుత్వ విదేశ వ్యవహారాల దృష్ట్యా ఇది చాలా ముఖ్యమైన విషయం. అయితే స్వయంప్రతిపత్తి కలిగిన ఇలాంటి ప్రభుత్వాలకు అంతర్జాతీయ గుర్తింపు మాత్రం వుండే సంబంధాలు కొట్టి వేయడానికి వీలులేనివి. సత్సంబంధాల విషయం ఎలా వున్నా ప్రావిన్షియల్ ప్రభుత్వం ఏ దేశంలో వుందో ఆ దేశం చట్టానికి లోబడి వుండాలి. రాజకీయ పరంగా చూస్తే, ప్రావిన్షియల్ ప్రభుత్వాలు సంపూర్ణ రాజకీయ స్వతంత్రత, ఉనికి కలిగి వున్నాయా? వాటిని స్థానిక ప్రభుత్వాలతో పోల్చవచ్చునా అన్నది ప్రశ్న?

అలా కాని పక్షంలో "ఇంపీరియల్" ప్రభుత్వం కేవలం భారతదేశ కేంద్ర ప్రభుత్వాన్నే, అన్ని విషయాలలోనూ సంప్రదిస్తూ, సమాచారాన్ని పొందవలసి వుంటుంది. చట్టం దృష్ట్యా ప్రావిన్షియల్

ప్రభుత్వాలకు స్వతంత్ర రాజకీయ ఉనికి వుంటే, అపుడు 'ఇంపీరియల్' ప్రభుత్వం వాటిని తప్పనిసరిగా గుర్తించి వాటికి సంబంధించిన విషయాల్లో నేరుగా సంప్రదింపులు జరపాలి. పై రెండింటిలో రెండవ విధానమే సరైనదనటం నిస్సందేహం. ప్రావిన్షియల్ ప్రభుత్వాలకు స్వతంత్ర రాజకీయ వునికి ప్రస్తుతం ఏర్పడ్డట్టే. వాటికి నిర్దిష్ట అధికారాలు ఉన్నాయి. పైగా అనేక సంస్కరణల అమలుపై ప్రావిన్షియల్ ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వాలకు లోబడి వుండడాన్ని వ్యతిరేకించాయి. ఒక ప్రావిన్స్‌కు చెందిన ముఖ్య నిర్ణేత కేంద్ర ప్రభుత్వంచే నియమించబడ్డవాడు కాకూడదు. అతను సార్వభౌమునికి ప్రతినిధేకాని గవర్నర్ జనరల్ కాదు. ప్రావిన్షియల్ ప్రభుత్వాలున్న దేశాల రాజ్యాంగాలు మాత్రం బహుళ రాజ్యాంగాలవుతాయి. అయితే, భారత దేశానికి సంబంధించినంతవరకు బహుళ రాజ్యాంగమైనా, ఇంపీరియల్ ప్రభుత్వం దృష్ట్యా బాధ్యత కలిగిన ఒకే ప్రభుత్వం గల ఏకైక రాజ్యాంగంగా పరిగణించబడుతుంది.

116 : ఎలాంటి విషయాల్లో ప్రావిన్షియల్ ప్రభుత్వాలు నేరుగా దేశీయ ప్రభుత్వంతో సంప్రదించవచ్చునన్నది ప్రశ్న. ఆస్ట్రేలియా 'కామన్వెల్త్'కు చెందిన నిబంధనల దృష్ట్యా చూస్తే, రాజు నేరుగా రాష్ట్ర గరవ్నరుతో కలోనియల్ కార్యాలయాలతో నేరుగా సంప్రదించవచ్చు. వీటిలో గవర్నర్ జనరల్ జోక్యం వుండవలసిన పనిలేదు. ఈ దృష్ట్యా చూస్తే ప్రావిన్షియల్ ప్రభుత్వాలు, వారి దేశ ప్రభుత్వాలతో కేంద్ర ప్రభుత్వ జోక్యం లేకుండా వ్యవహారాలు నడపగలగాలి. ఇది ఎటువంటి విషయాల్లో అంటే ప్రావిన్షియల్ చట్టాల అనుమతి, తిరస్కృతి, ప్రావిన్షియల్ గవర్నర్ల నియామకం, తొలగింపు, వారి నిబంధనలు, ప్రావిన్షియల్ రాజ్యాంగాల సవరింపులు, కేవలం ప్రావిన్షియల్ ప్రభుత్వాలకు సంబంధించిన ఇతర విషయాలు. ఏ ప్రభుత్వానికి పూర్తిగా చెందని విషయాల్లో మాత్రం కేంద్ర, ప్రభుత్వానికి చట్టపరంగా అత్యున్నతాధికారాలు వున్నాయని నా ప్రతిపాదన. కానీ కేంద్ర, ప్రావిన్షియల్ ప్రభుత్వాల రెండింటి పరిధిలోకి వచ్చే విషయాల గురించి మాత్రం ప్రావిన్షియల్ ప్రభుత్వాలకి నేరుగా ప్రాతినిధ్యం పొందే హక్కు వుండాలి.

117 : ప్రావిన్స్‌ల రాజకీయ ఉనికి భారత ప్రభుత్వానికి భిన్నంగా వుండేటట్టు చేయాలంటే ప్రావిన్షియల్ కార్య నిర్వాహక వర్గం, ప్రావిన్షియల్ శాసన సభల్లోని సార్వభౌమ ప్రాతినిధ్యం ప్రస్తుతం వున్న దానికంటె మరింత స్పష్టంగా వుండాలి. ప్రస్తుతం వున్న చట్టం ప్రకారం ప్రభుత్వ కార్యదర్శి సార్వభౌమత్వాన్ని మరుగున పెట్టి దానికి ప్రత్యేక స్థానం లేకుండా చేస్తున్నాడు.

భారతదేశంలో ప్రభుత్వ కార్యదర్శి కార్యాలయం ఎలాంటిదో వలసలకు కూడా అటువంటిదే. కానీ వీరిరువురు వహించే పాత్రలు భిన్నమైనవి. వలసల కార్యదర్శులకు 'అధినివేశ రాజ్యాల' రాజ్యాంగ చట్టాలలో ఎలాంటి స్థానం లేదు. 'అధినివేశ రాజ్యాల' చట్టాలలో ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ వారి నిర్వహణ, ప్రభుత్వం పూర్తిగా సార్వభౌమాధికారం క్రిందనే వున్నట్టు నిర్దేశింపబడింది. భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 2 ప్రకారం ప్రభుత్వ కార్యదర్శికి స్పష్టమైన, న్యాయమైన స్థానముంది. కార్యదర్శి స్థానం చివరకు సార్వభౌమాధికారాన్ని కూడా మరుగుపరచేంత శక్తి వంతమైందిగా నిర్దేశింపబడింది. భారత ప్రభుత్వ చట్టంలో సెక్షన్1లో మినహాయిస్తే, మరెక్కడా సార్వభౌమాధికారాన్ని

గూర్చిన ప్రస్తావన లేదు. దీనికి కారణం 1773 లో ఈస్ట్ ఇండియా కంపెనీ ఆమోదించిన సవరణచట్టం. దీని ప్రకారం ఆనాడు ఈస్ట్ ఇండియా కంపెనీ తాను తూర్పు దేశాల్లో ఆక్రమించిన సర్వస్వాలపై న సార్వభౌమునికి గల అధికారాన్ని, వివాదంలోకి దించింది. చారిత్రక పరంగా తేడాలెన్ని వున్నా అధినివేశ రాజ్యాల చట్టాలు మాత్రం ప్రభుత్వ కార్యదర్శులను గుర్తించకపోయినా, భారతీయ చట్టం మాత్రం ఖచ్చితంగా గుర్తించింది. దీని ఫలితంగా ప్రభుత్వ కార్యదర్శులు అధినివేశ రాజ్యాలను పాలించరు. అతని బాధ్యత కేవలం సార్వభౌమునికే. అధినివేశ రాజ్యాల ప్రభుత్వాల చర్యల గురించి సలహా లివ్వడం మాత్రమే. భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ -2 ప్రకారం ప్రభుత్వ కార్యదర్శికి ప్రభుత్వంలో అత్యధిక అధికారాలున్నాయి.

ఏ పరిస్థితిలోను సెక్షన్ 2లోని అంశాలను పూర్తిగా సమర్థించలేం. నిజానికవి సార్వభౌమత్వ స్థానానికి భంగకరమైనవేకాక, ప్రభుత్వ కార్యదర్శి స్థానానికి ఒక ప్రతిబంధకంవంటివి. ఈ కార్యదర్శులు ప్రావిన్షియల్ ప్రభుత్వాల గూర్చి అవాస్తవికమైన వర్ణన చేసేవారు. 1919లో వచ్చిన మార్పుల ప్రకారం సెక్షన్ - 2 లోని అంశాలన్నీ తొలగింపబడ్డాయి. ప్రభుత్వ అధికారాలన్నీ ప్రజలకు అందజేయడంతో ప్రభుత్వ కార్యదర్శుల వద్ద ఈ అధికారాలన్నీ వుండడానికి వీలులేకపోయింది. అధికారాల్ని కార్యదర్శుల నుండి తొలగించాలంటే ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని ప్రవేశ పెట్ట వలసి వస్తుంది. అయితే, ఇది అనేక వివాదాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. అందువలన నేను భారతదేశ చట్టాల్లోని సెక్షన్ -2ను తొలగించి, రెండు కొత్త సెక్షన్లను ఈ క్రింది విధంగా ప్రతిపాదన చేస్తున్నాను.

(1) ఒక ప్రావిన్సు చట్ట పరమైన అధికారాలు ప్రావిన్షియల్ పార్లమెంటు వద్ద వుండాలి. ఈ పార్లమెంటులో రాజు, రాచరిక సభ్యులు, ప్రతినిధుల తరపు సభ్యులు వుంటారు. వీరిని ఇక 'ప్రావిన్షియల్ లెజిస్లేచర్' అనాలి.

(2) ఒక ప్రావిన్సు నిర్వహణాధికారాలు రాజు వద్ద వుంటాయి. వీటిని రాజ ప్రతినిధిగా గవర్నరు అమలుపరుస్తూ, ఆ ప్రాంతానికి చెందిన చట్టాన్ని, న్యాయాన్ని పరిరక్షిస్తాడు.

సార్వభౌమ స్థానానికి కూడ పై విధమైన మార్పులను 1919 నాటి భారత ప్రభుత్వ చట్టానికి చేర్చాలి. ఆ మార్పు వలన సార్వభౌమ్యం, ప్రభుత్వ కార్యదర్శుల వాస్తవ స్థితులు నిర్దిష్టంగా తెలియడమే కాకుండా వారు, అధినివేశ రాజ్యాల రాజ్యాంగ న్యాయాన్ని, భారత రాజ్యాంగ న్యాయంతో పాటు కాపాడగలుగుతారు.

ఐదవ విభాగం

# పబ్లిక్ సర్వీసులు

## సర్వీసుల పునర్వ్యవస్థీకరణ

*119. సర్వీసుల విభజన :* భారతదేశంలో 1986-87 లో అమలులో వుండిన పబ్లిక్ సర్వీసుల గురించి విచారణ జరిపిన 'అయిచేసన్ కమీషన్'చేసిన సూచనల ఫలితమే ఈనాటి భారత పబ్లిక్ సర్వీసుల వ్యవస్థ. ఈ కమీషన్‌కు ముందు భారతదేశంలోని ఉన్నత స్థాయి సివిల్ ఉద్యోగాలు ఐరోపా దేశం నుండి ఎంపిక చేయబడ్డ వ్యక్తులకే ఇవ్వబడేవి. ఈ విషయంలో భారతీయులకు పబ్లిక్ సర్వీసులలో సరైన స్థానాన్ని కల్పించడం గురించి, వారికి పూర్తి న్యాయం జరిగేట్టు చూడడానికి 'అయిచేసన్ కమీషన్' కంకణం కట్టుకుంది. ఈ కమీషను అభిప్రాయం ప్రకారం సివిల్ సర్వీసుల్లోకి ఇంగ్లండు నుండి వచ్చే అధికారులను క్రమంగా తగ్గించి తద్వారా ఏర్పడ్డ ఖాళీలను భారతీయులతో భర్తీచేయవలసి వుంటుంది. దీని వలన ఇంగ్లాండునుండి ఎంపికయినవారు ఇంపీరియల్ సర్వీసులకు, స్థానికంగా ఎంపికయినవారు ప్రావిన్షియల్ సర్వీసులకు పంపబడేవారు. వీరికి జీతాలు, సెలవులు, పెన్షన్ వగైరా విషయాల్లో ఎటువంటి సంబంధం లేకుండా, పోలికలేని స్వతంత్ర ప్రతిపత్తి ఉండేది. ముఖ్యమైన అంశమేమిటంటే ఈ సర్వీసుల విభజన వల్ల కేవలం ఇంగ్లండు నుండి నియమింపబడిన అధికారుల్ని, భారతదేశం నుండి నియమింపబడిన అధికారుల్ని స్పష్టంగా గుర్తించడం కోసమే. అంతేకానీ భారత ప్రభుత్వ పరిధిలోకి వచ్చే అధికారులు, దేశం మొత్తంలో ఎక్కడైనా పనిచేయాలని, స్థానిక ప్రభుత్వ పరిధిలోకి వచ్చేవారు నిర్దిష్ట ప్రావిన్స్‌లో మాత్రమే పనిచేయాలని కాదు. ఉదాహరణకు టెలిగ్రాఫ్ సర్వీసులు, సర్వే ఆఫ్ ఇండియాలలోని అధికారులు నేరుగా భారత ప్రభుత్వ ఆధీనంలో వుంటారే తప్ప, ఏ ఒక్క ప్రోవిన్స్‌కి మాత్రమే చెందరు. అలాగే, విద్య, పోలీసు విభాగాలలోని ఇంపీరియల్ సర్వీసుల్లోని అధికారులు, విభిన్న ప్రావిన్స్‌లకు కేటాయించబడతారు. నా ఉద్దేశ్యంలో ప్రతి ప్రావిన్సు కూడా తనదైన సివిల్ సర్వీసులను ఏర్పాటు చేసుకునే సమయం వచ్చింది. ఇందుకోసం అఖిల భారత సర్వీసుల విధానం ముగిసిపోయి, దాని స్థానంలో కేంద్ర సివిల్ సర్వీసులు నెలకొని వాటిలో ఖాళీలు భర్తీ చేయబడి, కేంద్ర ప్రభుత్వం ద్వారా అప్పగించబడ్డ వివిధ శాఖలకు సర్వీసులను అందజేయవలసి వుంటుంది. అయితే ఈ కేంద్ర సివిల్ సర్వీసుల సభ్యులపై ఏ ప్రావిన్షియల్ ప్రభుత్వానికైనా సేవలు అందించవలసిందనే నిబంధన మాత్రం ఉండకూడదు. ఇదే విధంగా ప్రావిన్షియల్ సివిల్ సర్వీసులు కూడా నెలకొల్పబడి ప్రావిన్షియల్ ప్రభుత్వాల అవసరాల్ని

తీర్చవలసి వుంటుంది. ఈ సూచన వలన పెద్ద మార్పు వచ్చే వీలుంది. ఎందుకంటే ఇంపీరియల్, ప్రావిన్షియల్ సర్వీసుల వారు దేశంలో ఎక్కడైనా సేవ చేయవలసి వుండగా వారి అఖిల భారత పాత్ర మాత్రం నామమాత్రం. ఎందుకంటే చాలా కొద్ది సందర్భాల్లో మాత్రమే సివిల్ సర్వీసులకు చెందిన సభ్యుడిని మొదట నియమించిన ప్రదేశంలో కాకుండా వేరొకచోట పనిచేయవలసిందిగా కోరడం జరిగింది. నిజానికి వారు మొదట నియమింపబడిన చోటనే చివరి వరకు పనిచేయడం జరుగుతుంది. ఇదే నిజమైనపుడు నా సలహా పెద్ద మార్పునేమీ తీసుకొనిరాదు. అది కేవలం వాస్తవాల్ని గుర్తిస్తుంది.

120 : సివిల్ సర్వీసుల వ్యవస్థీకరణలో ఈ సంస్కరణ గురించి నేను పట్టుదలతో వుండడానికి చాలా కారణాలున్నాయి. ముందుగా సర్వీసుల విభజన వలన, అంటే కేంద్ర, ప్రావిన్సు సర్వీసులుగా విభజించడం వలన బహుళ ప్రయోజనాలున్నాయి. ప్రస్తుతమున్న విధానంలో అనధికారుల బాధ్యత గుర్తించడానికే కష్టంగా వుంది. భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 96 (బి) ప్రకారం భారతదేశంలోని ప్రభుత్వోద్యోగులు సార్వభౌమత్వం వలన తమ స్థానాన్ని పదిలంగా వుంచుకొనేవారు. కాని మంత్రులకు చట్టం ప్రకారం ఒక అధికారిని తొలగించే అధికారం నిర్దిష్టంగా లేదు. ఒక అధికారిని ఎవరు నియమించారో వారికే అతడిని తొలగించే అధికారం కూడా వున్నప్పటికీ, ఆ అధికారికి, ఒకవేళ తొలగింపబడితే పై స్థాయిలోని కార్యదర్శికి 'ఫిర్యాదు' చేసుకునే హక్కు కూడ వుంది. అందువలన మంత్రులకు అధికారులను తొలగించే విషయానికి సంబంధించి ఎలాంటి హక్కూ లేనట్లే. నిజానికి తన మంత్రిత్వశాఖ క్రింద పనిచేసే అధికారుల పట్ల సమర్థవంతంగా వ్యవహరించే బాధ్యత కూడ మంత్రులకు తప్పని సరిగా వుండాలి. తన మంత్రిత్వ శాఖకు ఎంతమంది అధికారులు అవసరమో, ఏయే ఉద్యోగాలకు ఎవరు అవసరమో నిర్ణయించుకొనే అధికారం మంత్రులకుండాలి. ప్రస్తుత చట్ట పరిధిలో ఇవి లేవు. ఈ వైపరీత్యాన్ని కమీషను 'లీ' బాగా గుర్తించింది. ఈ కమీషను సిఫారసుల వల్ల ప్రావిన్షియల్ ప్రభుత్వాలు తమ అధికారులను తామే భర్తీ చేసుకొనే వసతి ఏర్పడింది. ఇపుడు నేను ప్రతిపాదిస్తున్న సంస్కరణ ఈ సిఫారసులకు కొంత పొడిగింపు మాత్రమే. భారత జాతీయ సర్వీసులలో దేనినైనా ఒకవేళ ప్రావిన్షియల్ సర్వీసులోకి మార్చబడితే అలాంటి సర్వీసులో కూడా నియామకాలు ప్రావిన్షియల్ ప్రభుత్వమే చేసుకునే వీలుండాలి.

121 : స్వతంత్రంగా పనిచేసే ప్రావిన్షియల్ సివిల్ సర్వీసుల వల్ల కలిగే రెండవ ప్రయోజనమేమిటంటే, దీనివల్ల ప్రావిన్షియల్ ప్రభుత్వాలు తమ సర్వీసులలోని స్థాయిలను అవసరమైతే సవరించుకోగలుగుతాయి. ప్రస్తుతమున్న జాతీయ విధానం ప్రకారం ఒక మంత్రి తన పరిధిలో జాతీయ సర్వీసులో పనిచేసే ఉద్యోగాలు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని భావిస్తే వాటిని రద్దు చేయడానికిగ్గాని లేక ప్రావిన్షియల్ సర్వీసులకు బదిలీ చేయడానిగ్గాని అధికారాలు లేవు. అతడు చేయగలిగిందల్లా అలాంటి ఉద్యోగాలను ఖాళీగా వుంచడం లేదా ప్రావిన్షియల్ సర్వీసులోని అధికారి చేత ఈ ఉద్యోగాన్ని తాత్కాలికంగా నడిపించడమే. కానీ ఇది కూడా చట్ట ప్రకారం కొన్ని నెలలకు మించి చేయకూడదు. దీనివల్ల దేశ ఆర్థిక పరిస్థితి దెబ్బతినే వీలుంది.

122 : నేను ప్రతిపాదించిన సంస్కరణల వల్ల మరికొన్ని ప్రయోజనాలున్నాయి. భారతజాతీయ సర్వీసుల చట్టం ప్రకారం ఉద్యోగస్తుల ఉద్యోగ నిబంధనలలో ఒక ప్రత్యేక అంశం వుంది. అదేమిటంటే జీతం, సెలవులు, ప్రమోషన్లు, పెన్షన్లకు సంబంధించిన అన్ని ప్రొవిన్సులకు నిబంధనలు ఒకటి గానే వుండడం వలన, ఈ నిబంధన సరియైనది కాదనిపిస్తుంది. ముఖ్యంగా గమనించవలసిన విషయమేమిటంటే స్థానిక పరిస్థితులలో తేడాల వల్ల వేరు వేరు జీతాలతో పనిచేస్తూ రెండు విభిన్న ప్రాంతాల్లో నివసించే అధికారులు ఒకే రకమైన జీవన ప్రమాణాన్ని, సౌకర్యాన్ని పొందగలరు. అంటే అధికారి పనిజేసే ప్రాంతాన్ని బట్టి వేతనాల్లోని తేడాలు ఆ ఉద్యోగి సౌకర్యాలకు అట్టే భంగం కలిగించడం లేదు. కాబట్టి వేతనాల్లో సమా నత్వం అన్న అంశాన్ని ఉద్యోగులపై ఒక నిబంధనగా వుంచడంలో నాకు ఔచిత్యం కనబడలేదు.

123 : ఉద్యోగుల సర్వీసు నిబంధనల్లో సమానత్వం అనే అంశం భారత జాతీయ సివిల్ సర్వీసుల నుండి నేరుగా సంక్రమించిన ఒక లక్షణం అనవచ్చు. సర్వీసుల నిబంధనల్లో సమానత్వం తొలగాలంటే (122వ అంశంలోని కారణాలవల్ల) జాతీయ సర్వీసుల్లోనే అది తొలగాలి. స్వతంత్ర ప్రొవిన్షియల్ సర్వీసులు అనే భావం వల్ల ఇది సాధ్యపడుతుంది. ఇలాంటి సర్వీసును అందరూ ఆమోదించవలసి వుంటుంది. ఇందుకోసం ప్రొవిన్షియల్ ప్రభుత్వాల్లో పబ్లిక్ సర్వీసుల నియామకాల విషయంలో, ప్రధాన కార్యదర్శి పాత్రను బాగా సవరించవలసి వుంటుంది. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి సార్వత్రిక భావంలో యజమానివంటి వాడు అయిన ప్పటికీ, ప్రొవిన్షియల్ ప్రభుత్వాలు తమకు అవసరమైన నియామకాల విషయంలో, కార్యదర్శిని తమ తరపున ఏజెంట్‌గా వుండవల్సిందే తప్ప అతను ఏర్పరచిన నియమాలకు అనుగుణంగా నియామకాలు చేయరాదు. ఇది ప్రత్యేక ప్రొవిన్షియల్ సర్వీసుల వల్ల మాత్రమే వీలౌతుంది.

124 : నేను ప్రతిపాదించిన సర్వీసు సంస్కరణలు అమలు జరిగితే ప్రొవిన్షియల్ సర్వీసులను క్రింది విధంగా వర్గీకరించవచ్చు.




125 : ప్రొవిన్షియల్ సివిల్ సర్వీసులకు నియామకాల ఏజెన్సీ : ఇప్పుడు ప్రొవిన్షియల్ సర్వీస్లు నియామకాలకు వుండవలసిన ఏజెన్సీ గూర్చి ప్రస్తావిద్దాం. ముందు అనుకున్నట్టుగా ప్రభుత్వ కార్యదర్శి నియామక అధికారి కానప్పుడు ఈ సివిల్ సర్వీసులన్నీ మంత్రులతో సంబంధం లేని ఒక స్వతంత్ర సంస్థ ద్వారా జరుగవలసి వుంటుంది. అయితే ఇందుకోసం ప్రొవిన్షియల్ సివిల్ సర్వీసుల

కమీషన్‌ను ఏర్పాటు చేయాలని నేను అనుకోవడం లేదు. ఖర్చు దృష్ట్యా ఇలాంటి కమీషన్ ఏర్పాటు చేయడం అతిపెద్ద ప్రతిపాదన అవుతుంది. అయితే నా దృష్టిలో ప్రతి ప్రావిన్షియల్ ప్రభుత్వం తన తరపున ఒక సంప్రదింపుల అధికారిని నియమించుకుంటే సరిపోతుంది. ఈ అధికారి జాతీయ సర్వీసు కమీషన్‌కు, ప్రాంతీయ ప్రభుత్వానికి మధ్యవర్తిగా వుంటాడు.

## II. సర్వీసుల భారతీయకరణ

*126 : (1)* **భారతీయుల నియామకం :** సర్వీసులలో భారతీయులను నియమించడాన్ని గురించిన అంశాన్ని 1915 లో కమీషన్ 'ఐలింగ్‌టన్' ఆమోదించింది. ఆ తరువాత కమీషన్ 'లీ' ఈ అంశానికి తగిన రూపాన్ని ఇచ్చి తద్వారా వివిధ సర్వీసుల్లో భారతీయుల, యూరోపియన్ల నియామకాల గురించిన నిష్పత్తులను నిర్వచించింది. స్థూలంగా చూస్తే, కమీషన్ 'లీ' ఈ అంశాన్ని పరిశీలించిన దృష్టిలో స్వల్పంగా తేడా కన్పిస్తుంది. ప్రభుత్వ సర్వీసుల్లోకి ఎంతమంది భారతీయులను అనుమతించాలన్నది కమీషన్ 'ఐలింగ్‌టన్' సమస్యకాగా, కమీషన్ 'లీ' అదే సమస్యను ఇంకో కోణంలో చూసింది. ఇదేమిటంటే 'ప్రభుత్వ సర్వీసుల్లో కనీసం ఇంకా ఎంతమంది బ్రిటిష్ వారిని నియమించాలి?" ఇది నిజంగా వక్రదృష్టి. పైగా, దీనికి కమీషన్ 'లీ' పూర్తి గుర్తింపు నిచ్చింది. ప్రస్తుత కర్తవ్యమేమిటంటే ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయుల, ఐరోపావాసుల నియామకాల గూర్చిన నిష్పత్తిని తగిన మార్పులతో (అవసరమైతే) నిర్ధారించి తద్వారా భారతీయత అనే దశను త్వరితం చేయాలి.

*127.(2)* **భారతీయుల వేతనాలు :** ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయతను గూర్చి నేను వత్తిడిచేయడానికి కారణం కేవలం దీనికున్న సుగుణాలే కాకుండా వివిధ ప్రావిన్సుల ఆర్థికస్థితిపైన కూడా దీని ప్రభావం ఉండడం. దీని వలన పాలనా వ్యవస్థలో పొదుపు చేయవచ్చు అని నేను నమ్ముతున్నాను. ప్రభుత్వం భారతీయులకు, యూరోపియన్లకు సమాన వేతనం ఎందుకు ఇవ్వాలో నా మట్టుకు నాకు తెలియడం లేదు. ఒక తరగతికి చెందిన ఉద్యోగులందరికీ ఒకే వేతనం అనే వాదన కూడా సమంజసంగా నాకు కన్పించడం లేదు. ఎందుకంటే ప్రభుత్వ సర్వీసుల్లో ఒకవర్గం తమ దేశాన్ని వదలి కొన్ని వేల మైళ్ళ దూరంలో నివసిస్తూ వారి పిల్లలకు సరియైన విద్య, ఆరోగ్యం అందించలేని స్థితిలో వున్నారు. పైగా ఈ ఉద్యోగస్తులను మినహాయిస్తే వీరి కుటుంబాల తాలూకు ఇతరులు వారి దేశంలో వుండటంవల్ల రెండు రకాల ఖర్చులు పెట్టవలసి వస్తుంది. అయితే ఈ సమస్య భారతదేశస్థులుగా వున్న సివిల్ సర్వీస్ ఉద్యోగులకు ఏర్పడదు. భారత దేశస్థులైతే వారి యూరోపియన్ సహచరులతో పోలిస్తే తక్కువ జీవనస్థాయి వుండడం వల్ల ఖర్చులు కూడా తక్కువగా వుంటాయి. యూరోపియన్ అయిన ఒక ప్రభుత్వోద్యోగి తాను ఉద్యోగ పరంగా పడే శ్రమ, చేసే త్యాగం పోల్చిచూస్తే, ఈ రెండు వర్గాల ఉద్యోగులకు ఒకే వేతనం ఇవ్వడం సరిగ్గా లేదనిపిస్తుంది. ఒకటి మాత్రం నిజం. ఏమిటంటే యూరోపియన్ అధికారులకు చాలినంత జీతం

ఇస్తున్నామంటే దాని అర్థం భారతీయ అధికారులకు ఎక్కువ ఇస్తున్నామనే. భారతీయులకు ఎక్కువ ఇవ్వడం లేదు అంటే యూరోపియన్లకు తక్కువ ఇస్తున్నామనే. ఏ విధంగా చూచినా అసంతృప్తికరమైన పరిస్థితి ఏర్పడుతుంది. యూరోపియన్లకు తగిన వేతనాన్ని ఇస్తున్నారా లేదా అనే విషయాన్ని వదిలివేస్తే, భారతీయులకు మాత్రం ఎక్కువ చెల్లిస్తున్నారనే మాట చెప్పడానికి నాకు సందేహం లేదు. దీంతో భారతీయులైన ప్రభుత్వోద్యోగులకు ఇచ్చే తక్కువ వేతన కొలమానాన్ని చూడాలని నేను ఆతురతతో వున్నాను. పైగా ప్రభుత్వోద్యోగులకు ఇచ్చే జీతాలవల్ల ఏర్పడే భారీ ఖర్చును తగ్గించాలనుకునే వివిధ ప్రావిన్షియల్ ప్రభుత్వాలు, వాటి పనితీరును గమనించే ప్రతి భారతీయుడు ఈ తక్కువ వేతన స్కేల్‌కు ఒప్పుకుంటాడని నా విశ్వాసం. వేతనాలలోని ఈ అసమానతను ఖండించే భారతీయులు కూడా వున్నారని నాకు తెలుసు. ఈ వ్యతిరేకత ముఖ్యంగా దేశానికి నాయకులమని చెప్పుకునేవారు, సివిల్ సర్వీసుల్లో భారీఎత్తున నియమింపబడ్డ ఒకే వర్గానికి చెందిన భారతీయుల నుండి వస్తున్నదని గమనించాలి. ఇది 'పస'లేని వాదం మాత్రమే. పైగా స్వార్థపూరితమైనది. నా వరకు నేను ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయతను సమర్థించడానికి ముఖ్యకారణం అది తెచ్చిపెట్టే పొదుపు మాత్రమే.

***128 : (3) భారతీయకరణ – వెనుకబడిన తరగతుల వాదన :*** ఇప్పుడొక అప్రతిష్ఠాకరమైన అంశాన్ని గమనిద్దాం. ఇది ఏమిటంటే ప్రస్తుతం ప్రభుత్వ సర్వీసులెలా వున్నాయంటే, కారణాలేవైనా బ్రాహ్మణ, తత్సంబంధ కులాలకు ఆలవాలమై ఉన్నాయి. బ్రాహ్మణేతరులు, బడుగువర్గాలు, మహమ్మదీయులు పూర్తిగా వెలివేయబడ్డారు. వీరు పబ్లిక్ సర్వీసులలో తమకు చెందవలసిన భాగం కోసం ఆందోళన చేస్తూనే వున్నారు. ఇందుకే వీరు పబ్లిక్ సర్వీసుల్లో నియామకాలను బహిరంగ పోటీ ద్వారా కాకుండా, 'ఎంపిక' ద్వారా చేయాలని కోరుతున్నారు. అయితే దీనిని బ్రాహ్మణులు, తదితర కులాలు గట్టిగా వ్యతిరేకిస్తున్నారు. వీరి వాదనేమిటంటే పబ్లిక్ ఆఫీసుల్లో సమర్థతను మాత్రమే పరిగణించాలి తప్ప కులప్రస్తావన రాకూడదని. పైగా విద్యాపరంగా ఉన్న అర్హతలు మాత్రమే సమర్థతకు సూచికగా తీసుకోవడం ద్వారా పబ్లిక్ సర్వీసుల్లోకి నియామకాలు జరిగితే వెనుక బడిన తరగతుల వారికి కూడా ప్రవేశానికి ఏ విధమైన అడ్డువుండదు. కావలసిందల్లా ప్రతి ఒక్కరూ అవసరమైన విద్యార్హతను పొందడమే!

129 : బ్రాహ్మణులు, తత్సంబంధీకుల వారివాదం బాగానే వున్నట్టు కన్పిస్తుంది. ఎందుకంటే పోటీ పరీక్షలనేవి అన్ని కులాలకు, వర్గాలకు ఆమోదయోగ్యమైన ఫలితాలను ఇస్తాయనేది కొన్ని పరిస్థితుల్లో మాత్రమే వీలౌతుంది. ఈ పరిస్థితులేమిటంటే ప్రస్తుతమున్న విద్యావిధానం పూర్తిగా ప్రజాస్వామికమైనదని అనుకోవడం. ఇది జరగనప్పుడు అనేక వర్గాల వారికి చదువుకునే వసతే ఏర్పడక తద్వారా, పోటీ పరీక్షల్లో కొన్ని వర్గాలవారికి నెగ్గే అవకాశ ముండదు. స్థూలంగా చూస్తే, వెనకబడిన తరగతుల వారిని కూడా ప్రభుత్వ సర్వీసుల్లోకి పోటీ పరీక్ష ద్వారా ఎంపిక చేయడమంటే వారి ప్రవేశానికి అడ్డు వేయడమే. ఈ విషయంలో వెనుకబడిన తరగతుల వారు మోసపోకుండా

వుండడంకోసం, ఆ విధానాన్ని తిరస్కరించడం సమంజమే.

130 : ఇక వెనుకబడిన తరగతుల వారిని బహిరంగ పోటీ ద్వారా కాకుండా ఇతర విధంగా సర్వీసులోకి తీసుకోవాలంటే వారిని ఏవిధంగా పరిగణించాలనేది ప్రశ్న. ఇందుకోసం వారు తమ సమస్యను తగిన విధంగా ప్రతిపాదించాలని నేను అనుకొంటున్నాను.

131 : ముందుగా పబ్లిక్ సర్వీసుల్లో ఉద్యోగుల సమర్ధత గూర్చి వాదించే వాళ్ళకు ఆ అంశాన్ని గూర్చి ఆధునిక కాలంలో తగిన అవగాహన లేదనిస్తుంది. పరిపాలన అంటే చట్టాన్ని, న్యాయాన్ని కేవలం అమలుపరచడమే అని వారు అనుకొంటున్నారు. అయితే ఆధునిక కాలంలో అనేక సందర్భాల్లో ప్రభుత్వ పాలనా విభాగాలు క్రొత్త చట్టాలను రూపొందించడం, న్యాయాన్ని ఒక నిర్దిష్ట పద్ధతిలో అమలు పర్చడం లాంటి విషయాలను కూడా పరిగణిస్తున్నాయి. కాబట్టి, 'పాలన' అంటే కేవలం చట్టాన్ని అమలు పర్చడం కాదు. కాలాన్ని బట్టి చట్టాల్లో మార్పులు తేవలసిన ప్రభుత్వాలు ప్రజాశ్రేయస్సు దృష్ట్యా పాలనా యంత్రాంగాన్ని కేవలం కొద్దిమందికి అప్పగించడం భావ్యం కాదు. పైగా పాలనా యంత్రాంగంలోని ఈ కొద్ది మంది తమ చుట్టూ వున్న ఇతర వర్గాల ప్రజల శ్రేయస్సుకు అవరోధకులే అని గ్రహించాలి.

132 : పరిపాలన అంటే కేవలం చట్టాన్ని అమలుచేసే ప్రక్రియ అనుకున్నా యధాతధంగా అది వెనుక బడిన తరగతుల్ల వారికి పెద్ద ప్రయోజకారి కాకపోవచ్చు. ఎందుకంటే - మన దురదృష్టవశాత్తు ఆ కమిటీలోని అధికారేతర సభ్యులు చాలా మంది బ్రాహ్మణులు కావడం వీరికి తమతోటి వర్గాలను గౌరవించడం తెలియకపోవడం.

133 : పై పరిస్థితి తప్పనిసరి అన్పిస్తుంది. చట్టమంటే అన్ని వర్గాల ప్రజలకు సంబంధించినది కావాలే తప్ప ఇతరత్రా కాకూడదు. మరి పైన చెప్పిన పరిస్థితులు చట్టాల పరిధిలోనే ఏర్పడుతుంటే ఉన్నత మనస్కుల మదిలో 'సమర్ధవంతమైన ప్రభుత్వం' అనే ప్రశ్న ఏర్పడుతుంది. నా దృష్టిలో బ్రాహ్మణులను, తత్సంబంధ కులాలకు చెందిన వారిని అధికారులుగా నియమించడం వలన ఏర్పడ్డ నష్టాలు వారి సమర్ధత మీద ఆధారపడ్డం వల్ల వచ్చే లాభాల కన్నా తక్కువ. మొత్తానికి వీరు చేసిన మంచి కన్నా చెడు ఎక్కువ. ఈ సమస్యకు పరిష్కారమేమిటంటే పబ్లిక్ సర్వీసుల్లోకి తగిన నిష్పత్తిలో అన్ని వర్గాల వారికి స్థానం కల్పించడమే. దీని వలన బహుశ కొంత మేరకు పాలనా అసమర్ధత ఏర్పడవచ్చు. కాని సాంఘిక పరంగా వర్గ వివక్షత దీనివలన తగ్గుతుంది కదా! బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు హిందువులు, ముస్లింలు, అంటరానివారు, ఇతరులు తమతమ వర్గాల మధ్య వచ్చే స్పర్ధలు, అసమానతలు, దావాలు లాంటి అనేక సందర్భాల్లో జడ్జీలు, ప్రభుత్వాధికారులు, పోలీసు అధికారులు తమ విధినిర్వహణలో తాము ఏ వర్గానికి చెందినవారో, ఆ వర్గాల చేత ప్రభావితం చేయబడుతూనే ఉన్నారు. దీంతో ప్రభుత్వోద్యోగుల పని తీరుపై ప్రజలకు నమ్మకం బాగా తగ్గిపోవచ్చు.

వుండడంకోసం, ఆ విధానాన్ని తిరస్కరించడం సమంజమే.

130 : ఇక వెనుకబడిన తరగతుల వారిని బహిరంగ పోటీ ద్వారా కాకుండా ఇతర విధంగా సర్వీసులోకి తీసుకోవాలంటే వారిని ఏవిధంగా పరిగణించాలనేది ప్రశ్న. ఇందుకోసం వారు తమ సమస్యను తగిన విధంగా ప్రతిపాదించాలని నేను అనుకొంటున్నాను.

131 : ముందుగా పబ్లిక్ సర్వీసుల్లో ఉద్యోగుల సమర్థత గూర్చి వాదించే వాళ్ళకు ఆ అంశాన్ని గూర్చి ఆధునిక కాలంలో తగిన అవగాహన లేదనిస్తుంది. పరిపాలన అంటే చట్టాన్ని, న్యాయాన్ని కేవలం అమలుపరచడమే అని వారు అనుకొంటున్నారు. అయితే ఆధునిక కాలంలో అనేక సందర్భాల్లో ప్రభుత్వ పాలనా విభాగాలు క్రొత్త చట్టాలను రూపొందించడం, న్యాయాన్ని ఒక నిర్దిష్ట పద్ధతిలో అమలు పర్చడం లాంటి విషయాలను కూడా పరిగణిస్తున్నాయి. కాబట్టి, 'పాలన' అంటే కేవలం చట్టాన్ని అమలు పర్చడం కాదు. కాలాన్ని బట్టి చట్టాల్లో మార్పులు తేవలసిన ప్రభుత్వాలు ప్రజాశ్రేయస్సు దృష్ట్యా పాలనా యంత్రాంగాన్ని కేవలం కొద్దిమందికి అప్పగించడం భావ్యం కాదు. పైగా పాలనా యంత్రాంగంలోని ఈ కొద్ది మంది తమ చుట్టూ వున్న ఇతర వర్గాల ప్రజల శ్రేయస్సుకు అవరోధకులే అని గ్రహించాలి.

132 : పరిపాలన అంటే కేవలం చట్టాన్ని అమలుచేసే ప్రక్రియ అనుకున్నా యధాతథంగా అది వెనుక బడిన తరగతుల్ల వారికి పెద్ద ప్రయోజకారి కాకపోవచ్చు. ఎందుకంటే - మన దురదృష్టవశాత్తు ఆ కమిటీలోని అధికారేతర సభ్యులు చాలా మంది బ్రాహ్మణులు కావడం వీరికి తమతోటి వర్గాలను గౌరవించడం తెలియకపోవడం.

133 : పై పరిస్థితి తప్పనిసరి అన్పిస్తుంది. చట్టమంటే అన్ని వర్గాల ప్రజలకు సంబంధించినది కావాలే తప్ప ఇతరత్రా కాకూడదు. మరి పైన చెప్పిన పరిస్థితులు చట్టాల పరిధిలోనే ఏర్పడుతుంటే ఉన్నత మనస్కుల మదిలో 'సమర్థవంతమైన ప్రభుత్వం' అనే ప్రశ్న ఏర్పడుతుంది. నా దృష్టిలో బ్రాహ్మణులను, తత్సంబంధ కులాలకు చెందిన వారిని అధికారులుగా నియమించడం వలన ఏర్పడ్డ నష్టాలు వారి సమర్థత మీద ఆధారపడ్డం వల్ల వచ్చే లాభాల కన్నా తక్కువ. మొత్తానికి వీరు చేసిన మంచి కన్నా చెడు ఎక్కువ. ఈ సమస్యకు పరిష్కారమేమిటంటే పబ్లిక్ సర్వీసుల్లోకి తగిన నిష్పత్తిలో అన్ని వర్గాల వారికి స్థానం కల్పించడమే. దీని వలన బహుశ కొంత మేరకు పాలనా అసమర్థత ఏర్పడవచ్చు. కాని సాంఘిక పరంగా వర్గ వివక్షత దీనివలన తగ్గుతుంది కదా! బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు హిందువులు, ముస్లింలు, అంటరానివారు, ఇతరులు తమతమ వర్గాల మధ్య వచ్చే స్పర్థలు, అసమానతలు, దావాలు లాంటి అనేక సందర్భాల్లో జడ్జీలు, ప్రభుత్వాధికారులు, పోలీసు అధికారులు తమ విధినిర్వహణలో తాము ఏ వర్గానికి చెందినవారో, ఆ వర్గాల చేత ప్రభావితం చేయబడుతూనే ఉన్నారు. దీంతో ప్రభుత్వోద్యోగుల పని తీరుపై ప్రజలకు నమ్మకం బాగా తగ్గిపోవచ్చు.

పరిరక్షణ కూడా భారతీయతను చాటుకోవడంలో భారతదేశ ఔన్నత్యానికి ఒక ప్రతీకగా అందరూ గమనించి మెలగాలి. అందువల్లనే నేను ప్రావిన్షియల్ కార్య నిర్వాహక వర్గానికి పూర్తి గౌరవహోదా కల్పించడం, లేదా ప్రావిన్షియల్ స్వయం ప్రతిపత్తిని సమర్థించడం వంటి అంశాలకు తగిన ప్రాధాన్యత ఇస్తాను. ఒకవర్గం చేతిలో కీలుబొమ్మలుగా వ్యవహరించే కొన్ని శక్తులను నేను అందరి వ్యవహారాలలోకి అనుమతించడాన్ని వ్యతిరేకిస్తాను. కనుకనే నా దృష్టిలో వున్న కొన్ని నిబంధనలను క్రింద పేర్కొంటున్నాను.

1. పరీక్షలో ఉత్తీర్ణత సాధించడం ద్వారా సూపర్‌వైజర్ సర్వీసులలో, క్లాస్ -II, దాని అనుబంధ సర్వీసులలోని ఖాళీలను ప్రతి సంవత్సరం భర్తీ చేయాలి. ఈ ఖాళీల భర్తీని సివిల్ సర్వీస్ అధికారి హోదాలో వున్న వ్యక్తి అధ్యక్షుడిగా ఒక కమిటీని నెలకొల్పి, ఆ కమిటీ ద్వారా కొనసాగించాలి. ఈ ఖాళీలు, వెనుకబడిన తరగతులు, మహమ్మదీయులు, బ్రాహ్మణేతరులకు వారి అర్హతల ప్రాతిపదికన వర్తించేటట్లు చూడాలి.

2. ఈ అధికారుల ఉద్యోగాలను పెంచడానికి ప్రధాన కార్యాలయాల్లో పైన తెలిపిన తరగతులకు వర్తించేటట్లు పథకాల్ని రూపొందించడానికి చర్యలు తీసుకోవాలి.

3. సమయానుకూలంగా కేంద్రీయ నియామక సంఘం సెంట్రల్ ఏజన్సీని నెలకొల్పి, తద్వారా దరఖాస్తుల్ని స్వీకరించి, ఖాళీలకనుగుణంగా అభ్యర్థుల్ని ఎంపికచేసి కార్యాలయాలతో సంబంధం కొనసాగించాలి. ప్రతివ్యక్తిని ఉద్యోగస్థుడిగా చేయడానికి ఇది చాలా ఆవశ్యకం. బొంబాయి ప్రభుత్వం దీనిని సాధించలేకపోవడానికి కారణం ఈ బోర్డ్‌ను నెలకొల్పకపోవడమే.

# ఆరవ విభాగం

# సిఫారసుల సారాంశం

## ఒకటవ విభాగం

బొంబాయి ప్రెసిడెన్సీ నుండిమంచి కర్ణాటక, సింధూ ప్రత్యేక రాష్ట్రాలుగా ఉండనవసరంలేదు.

## రెండవ విభాగం

**అధ్యాయం–1:** శాసనసభ్యులు ఏదైనా ప్రత్యేక అంశాన్ని తీర్మానానికి అనుకూలంగా ప్రతిపాదించదలచినపుడు ప్రావిన్షియల్ ప్రభుత్వం పట్ల పూర్తి గౌరవ మర్యాదల్ని పాటించవలసి వుంటుంది.

**అధ్యాయం – 2:** ఎటువంటి పరిస్థితుల్లోను ప్రభుత్వాన్ని నత్తనడకన నడపడానికి ప్రయత్నించకూడదు. అలాగే ప్రభుత్వం కుల, మత వర్గరహితంగా వ్యవహరించేటట్లు చూడాలి. మంత్రులంతా చట్టపరిధికి లోబడి వుండాలి. వారు అక్రమాలకు పాల్పడినపుడు వారి ఉద్వాసనకనుగుణంగా రాజ్యాంగం సృష్టించబడాలి. దీనికి రాజ్యాంగం బాధ్యత వహించాలి. అటువంటి ప్రభుత్వం గవర్నర్‌చే కాకుండా ప్రధానమంత్రి అధ్యక్షుడిగా స్థాపించబడాలి.

**అధ్యాయం– 3 :** గవర్నర్ రాజ్యాంగాధినేతగా వ్యవహరించబడాలి. కాని అతనికి ఎటువంటి అత్యవసరాధికారాలుండరాదు.

## మూడవ విభాగం

**అధ్యాయం–1:** ప్రభుత్వ ఎన్నికలో వయోజనులదే నిర్ణయం.

**అధ్యాయం–2:** లెజిస్లేచర్ పూర్తిగా ప్రజలచే ఎన్నుకోబడినదై వుండాలి. యూరోపియన్లుకాక మిగతా అన్ని కులాల, మతస్థులందరూ ఈ ఎన్నికల్లో భాగస్వామ్యులే. ప్రభుత్వ ఎంపిక పరిమితులకు లోబడి వున్నప్పుడు. మహమ్మదీయులు, వెనుకబడిన తరగతులు, బ్రాహ్మణేతరులు, ఆంగ్లో-ఇండియన్లు అందరికీ రిజర్వేషన్ విధానం వర్తించాలి.

**అధ్యాయం–3:** శాసనసభ140 మంది సభ్యులతో వ్యవస్థీకరించబడాలి. ఇందులో మహమ్మదీయులు 33 మంది, వెనుకబడిన తరగతులవారు 15 మంది వుండాలి. జనాభా ప్రాతిపదికన వివిధ జిల్లాలకు ఇతరులకు తగిన ప్రాతినిధ్యం కల్పించాలి. విభిన్నకులాలు, మతాల మధ్య సీట్ల సర్దుబాటుకై ఒక

కమిటీని ఏర్పాటు చేయాలి. స్థానిక అర్హతల ఆధారంగా చేసే ఎంపికను తొలగించాలి.

***అధ్యాయం–4 :*** లక్నో ఒడంబడిక శాశ్వత నిర్ణయం కాదు. కనుక దీనిపై తలెత్తే ప్రశ్నలు, వాటి అర్హతల గురించి చర్చ అనవసరం.

***అధ్యాయం–5 :*** రాజ్యాంగంలో రెండవ ఛాంబర్ వుండకూడదు.

***అధ్యాయం–6 :*** అధ్యక్షుని ఎన్నిక, తొలగింపులాంటి అంశాలలో శాసనసభకు సర్వహక్కులూ వుండాలి. ఇది సక్రమంగా నిర్వర్తించబడేలా చూడాలి. సెక్షన్లు 72 'డీ', 80 'సి' అను రాజ్యాంగ పరిధి నుంచి తొలగించాలి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించడానికి శాసనసభకు అధికారముండాలి. పరిస్థితుల కనుగుణంగా ప్రభుత్వాన్ని మార్చడానికి శాసనసభకు అధికారముండాలి.

## నాలుగవ విభాగం

***అధ్యాయం–1 :*** పూర్తి 'ప్రావిన్షియల్ స్వయం ప్రతిపత్తి' రాజ్యాంగంలో వుండాలి. కేంద్రం, ప్రావిన్షియల్‌ల మధ్య వున్న సంబంధాలు కేంద్ర ప్రభుత్వాధికారానికి లోబడి, గతంలో మంజూరైన 'వీటో' వంటి పద్ధతుల ననుసరించి సత్సంబంధాలు కొనసాగాలి.

***అధ్యాయం–2 :*** ప్రభుత్వం, దేశీయ ప్రభుత్వాల మధ్య సత్సంబంధాలు కొనసాగడానికి ప్రావిన్షియల్ ప్రభుత్వ పరిధికి లోబడ్డ కొన్ని అంశాలు దోహదం చేస్తాయి. ఇందులో కేంద్ర ప్రభుత్వాల ప్రమేయం అవసరంలేదు. భారత రాజ్యాంగానికి అపభ్రంశం తెచ్చే పక్షంలో భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ - 2 ను రాజ్యాంగ పరిధి నుంచి తొలగించాలి.

## ఐదవ విభాగం

ప్రతిపాదించబడ్డ ఏజెన్సీల సక్రమ పాలనకుగాను సమర్ధవంతమైన ప్రావిన్షియల్ సర్వీసు ప్రభుత్వ కార్యదర్శి ఒకరు అవసరం. ఆ వ్యక్తి విధులు ప్రావిన్షియల్ సర్వీసు కమీషన్ ద్వారానో, లేదా పబ్లిక్ సర్వీస్ కమీషన్‌కు చెందిన ఒక ఉన్నతాధికారి ద్వారానో నిర్దేశింపబడాలి. భారత ప్రభుత్వ సర్వీసుల్లో ఈ విధులు మరింత వేగవంతంగా జరగాలి. రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో ఇది ఆవశ్యకం. ప్రత్యేక జీతం, అలవెన్స్‌ల ద్వారా భారతీయత గుర్తించబడాలి. ఈ సర్వీసుల ద్వారా వెనుకబడిన తరగతుల హక్కులు పరిరక్షించబడాలి.

మే 17, 1929 **బి.ఆర్. అంబేద్కర్**

# అనుబంధం

## 1850–51 నాటి బొంబాయి ప్రభుత్వ విద్యామండలి నివేదికలోని భాగాలు

### డైరెక్టర్లబోర్డు అభిప్రాయాల ఆధారంగా విద్యామండలి ఎంచుకున్న పద్ధతి

*పేరాగ్రాఫ్–5 :* ఎర్ల్ ఆఫ్ ఆక్లండ్, మేజర్‌కాండీ తదితరుల వంటి వారిచే ప్రభుత్వ విద్యాబోర్డు విద్యకు ప్రత్యేకించి ఒక పథకం తయారుచేసింది. ఈ పథకం కోర్టు ద్వారా జరిగే లావాదేవీలను చూడడం, అత్యంత ప్రతిభాశాలురైన పౌరులకే ఈ బోర్డులో ప్రాతినిధ్యం కల్పించడం వంటి అంశాల్ని చేపట్టదలచింది.

★ ★ ★

### ఉన్నత వర్గాల విద్యా ప్రమాణాల్ని పెంపొందించేందుకు కోర్టు అభిప్రాయాలు

*పేరాగ్రాఫ్ –8 :* మన అభిప్రాయాల్ని తెలివిగా చెప్పదలిస్తే, అతి తక్కువ నిధులతో ఏర్పాటయ్యే ప్రభుత్వ విద్యను గౌరవనీయమైన కోర్టు మనకు అందించవలసివుంటుంది. 1830లో మద్రాసుకు కోర్టు తెలియజేసిన విషయాలీ విధంగా వున్నాయి :

తోటి భారతీయుల్లో అధిక విశ్రాంతినీ సంపదవల్ల వచ్చే పలుకుబడినీ ఇతరులపై ప్రభావితం చేసే వారు ఉన్నత వర్గీయులు. విద్యలో ముందడుగు వేయడం ద్వారా తమకంటే తక్కువ వర్గం వారి మానసిక స్థితిని బలహీనపర్చడం ద్వారా తాము లబ్ధి పొందేవారు. ఇటువంటి లోపాల్ని సవరించి విద్యాప్రమాణాల స్థాయిని పెంచి, వాటిపట్ల అందరికీ సదవగాహన కల్పించి, అందరికీ ఉపయుక్త కరంగా విద్యను తీర్చిదిద్దడం ద్వారా సరిచేయవచ్చు. దీనికి ఎలాంటి దురలవాట్లు లేని వ్యక్తుల్ని సివిల్ సర్వీసులలో వుంచడం ద్వారా ప్రభుత్వాన్ని విపత్కర పరిస్థితుల నుంచి రక్షించేలాగా చేయవచ్చు. అయినప్పటికీ, బడుగు వర్గాల్ని విద్యావంతుల్ని చేయాలని అభిలషించేవారు, సబ్జెక్టుల మీద పరిపూర్ణతను సాధించడాన్ని విశ్వసించేవారు విద్యాబోర్డుల నియంత్రణలో వున్న రాష్ట్ర విద్యా ప్రయోజనాల్ని సక్రమంగా ఇంగ్లండ్ లాంటి దేశాల్లోలాగా నిర్వర్తించవలసి వుంటుంది.

★ ★ ★

## అట్టడుగు వర్గాల్ని విద్యావంతుల్ని చేయడం

**పేరాగ్రాఫ్ 14 :** పై విషయాలన్నింటినీ పరిశీలిస్తే, 175 మాతృభాషల స్కూళ్ళకు చెందిన 10,730 విద్యార్థులకు విద్యనందించడానికి, సరైన నిధులు లేకపోవడంవలన, ఇక బొంబాయి ప్రభుత్వంలో వున్న 900,000 మంది విద్యార్థులకు విద్యను అందించడమనే మాట ఆచరణ సాధ్యం కాదని చెప్పవచ్చు. ఈ విషయాలు ప్రభుత్వం ద్వారానో లేక విద్యా బోర్డుల ద్వారానో అంచనాకు అందకపోవడం వల్ల ఆచరణలో అసాధ్యం అవడం వలన, విద్యావంతుల్ని చేయలేకపోవడానికి సమాచారలోపం ప్రధాన కారణంగా చెప్పవచ్చు.

## పరిమిత సదుపాయాలతో ఉత్తమ కార్య నిర్వహణ పద్ధతిపై డైరెక్టర్ల బోర్డు అభిప్రాయాలు

**పేరాగ్రాఫ్ –15 :** పై పేరాలో చెప్పబడిన విషయాల్ని ఉన్నత న్యాయస్థానం తన దృష్టిలో వుంచుకుంది. ఈ ఫలితాల్ని సాధించడానికి ప్రజల్ని చైతన్య వంతుల్ని చేయడం ద్వారా, అతి తక్కువ మోతాదులో విషయాల్ని పరిశీలించి అంతవరకే ఫలితాల్ని సాధించడం ద్వారా, తద్వారా మరింత ముందడుగు వేసి వివిధ రాష్ట్రాల ప్రభుత్వాలకు సత్ఫలితాల సాధన గురించి తెలియజేసి అంచెలంచెలుగా అభివృద్ధి సాధించడం ద్వారా సాధించవచ్చు. ఇది అత్యంతావశ్యకం కూడా. ఇవే విషయాల్ని ఇదివరకే మద్రాసు ప్రభుత్వానికి పేరాగ్రాఫ్ 7 లో చెప్పిన విధంగా, తెలియజేయుట జరిగింది. "నాగరీకులైన యూరప్ పౌరుల సాహిత్యాభిలాష లాగా మనదేశంలో కూడా సాహిత్య అధ్యయనం వేగవంతంగా జరగాలి."

## భారత దేశంలోని ఉన్నత వర్గాల ప్రాధాన్యత

**పేరాగ్రాఫ్ 16 :** దేశంలోని అధిక జనాభాలో కొంత మాత్రమే ప్రభుత్వ పరిధి క్రిందికి తెచ్చి, అది కూడా ఉన్నతవర్గాలకే అధిక ప్రాధాన్యమివ్వాలన్న ఉన్నత న్యాయస్థాన నిర్ణయం సమంజసంగా లేదు. యూరప్ దేశాల్లో ముఖ్యంగా ఇంగ్లండ్ ఒక నియంత్రణరేఖ ననుసరించి సంపద, ప్రవర్తన, రాజకీయ, సామాజిక పలుకుబడులకు తగిన ప్రాధాన్యతనిస్తూ; ఉన్నతవర్గాలు, బడుగువర్గాల పట్ల సమదృష్టి వంటివాటిని అనుసరించింది. ఈ విధానం ఇండియాలో లేదు. ఒక భిక్షగాడిని ఇంగ్లండ్ దేశదృష్టితో చూస్తే అతను కార్మికుడిగానో, శాశ్వత కూలీగానో వ్యవహరింపబడతాడు. అదే భారత దేశంలో అయితే బ్రాహ్మణత్వ సిద్ధాంతాల ప్రకారం ప్రాపంచిక సుఖాలను త్యజించి, ఆధ్యాత్మిక చింతనలో మునిగిన దైవభక్తుడుగా గౌరవింపబడతాడు..

## భారతదేశంలోని ఉన్నత వర్గాలు

**పేరా –17 :** పలుకుబడుల ఆధారంగా భారతదేశంలోని ఉన్నతవర్గాల వర్గీకరణలివి :

1. భూస్వాములు, జాగీర్దారులు, రైతు ప్రతినిధులు, సైనికులు.
2. ఆర్థికపరంగా సంపద గల వ్యక్తులు.
3. ప్రభుత్వంలోని ఉన్నత స్థాయి ఉద్యోగులు.
4. బ్రాహ్మణులు – వారిలోని రచయితలు. ఉదా: బొంబాయిలోని పార్సులు, షెన్విలు, బెంగాల్‌లోని కాయస్థులు.

## బ్రాహ్మణులు – అధిక పలుకుబడిగలవారు

**పేరాగ్రాఫ్ –18 :** పై నాలుగు తెగలలో ఎవ్వరితోను పోలిక లేనటు వంటివారు, అధిక పలుకుబడి కలవారు, ప్రభుత్వంలో ఉన్నతస్థాయిలోనున్న వారిలో అత్యధికులు బ్రాహ్మణులు. భారతదేశమంతటా పూర్వకాలంలోని జాగీర్దార్లు, సైనిక వర్గాలకు చెందినవారు ఈనాటి పాలనలో పతనావస్థకు చేరుకున్నారన్నది వాస్తవం. వారి పూర్వవృత్తి పోయినప్పటికీ, నూతన వృత్తిని స్వీకరించడంలో వారు వెనుకడుగు వేయకుండా శాంతి అనే కళను సాగుచేయడానికి సిద్ధమయ్యారు. రాజ్యాంగంలో ఎల్ఫిన్‌స్టన్, అతని అనుచరులు భూస్వామ్యవ్యవస్థపై చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. అత్యంత ప్రతిభావంతమైన విద్యనందించడానికి పౌర మర్యాదల్ని కాపాడడానికి విద్యను సులభతరం చేయడానికి మార్గాల్ని రూపొందించడంలో భారతదేశంలోని వ్యాపార తరగతుల్ని మినహాయించి కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రతిభగల విద్యను రూపొందించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. అన్ని దేశాలలో లాగా భారతదేశంలో కూడా వ్యాపార కుటుంబానికి చెందిన యువకులు స్కూళ్ళకు స్వస్తి చెప్పి, తమ వృత్తిపరమైన అంశాల్ని తెలుసుకోవడంలో, దానిని సమర్థంగా నిర్వహించడంలో ప్రత్యేక ఆసక్తి కనబరుస్తున్నారు. చివరగా, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వంతో సంబంధం కలిగివుండాలని భావించే వ్యక్తుల్లో మంచి పలుకుబడి సంపాదించాలని ఆరాటపడి, పలుకుబడి సాధించలేక, ప్రజలతో సంబంధాల్ని కోల్పోయివుంటారు.

## బ్రాహ్మణుల సంపద

**పేరాగ్రాఫ్ –19 :** పైన చెప్పిన విషయాల విశ్లేషణ చాలా ఎక్కువగా కనిపించినప్పటికీ, కొన్ని ముఖ్యమైన ముగింపులకు ప్రామాణికం కాదని చెప్పవచ్చు. తొలుత, ఇది విద్య అనే విత్తనాల్ని నాటి ప్రభుత్వాభివృద్ధికి తోడ్పడిన వర్గంగా బ్రాహ్మణులను చిత్రించింది. మిగతా కులాలు బ్రాహ్మణులపై ఆధారపడవలసిన అగత్యమున్నట్టు తెలిపింది. అయితే బ్రాహ్మణులు, ఉన్నత వర్గాలలో అధికభాగం పేదవారు. భారతదేశంలోని అన్ని ముఖ్య ప్రదేశాల్లో 'బ్రాహ్మణ' అన్న పదానికి 'భిక్షగాడు' అన్న అర్థం సరిపోతుంది.

## ఉన్నత విద్యకు చేయూత ఇవ్వడానికి ప్రస్తుత ధనిక వర్గాల విముఖత

**పేరాగ్రాఫ్ –20 :** కౌన్సిల్‌లో మీ సభ్యత్వం మాపై ఎంత బలవంతంగా రుద్దాలో అనే విషయం మీ లేఖ 24 ఏప్రిల్, 1850 నాటిది చూస్తే, అది ఎంత తెలివితక్కువో తెలుస్తుంది. ఈ విద్య

ధనికులకు, వారిలో అప్రయోజకులకు మాత్రమే వర్తించడం సమంజసంగా లేదు; దీనికి బోర్డు సమాధానాన్ని పరికిస్తే, ధనిక వర్గాలు ఉన్నత విద్య నభ్యసించడంలో పేదవర్గాల కంటే ఎక్కువ సౌకర్యాలను కలిగివుండేవారని, వీరి శిక్షణకు వున్న అవకాశాల్ని మెరుగు పరచుకోగలరన్న విషయం మీద బోర్డు మీమాంసంలో పడింది. ఈధనిక వర్గంలో కొద్దిమంది ఈ ఉన్నతవిద్య అధ్యయనాన్ని సక్రమంగా నిర్వహిస్తున్నారు. వారిలో ఎక్కువగా బెంగాల్‌కు చెందినవారు. వీరు బొంబాయి వారికన్నా అధికంగా ఉన్నతవిద్యను అభిలషిస్తున్నారు. యూరప్‌లోని ఆర్ట్స్, సైన్స్ విభాగాల్లో ధనిక వర్గాలవారు ఇచ్చే నిధుల వలన విద్య నిర్దేశింపబడడంలేదు. దీనిని మన దేశానికి కూడా అన్వయించుకోవాలి.

## బడుగువర్గాల్ని విద్యావంతుల్ని చేయడంలో తలెత్తే ప్రశ్న

***పేరాగ్రాఫ్–21 :*** పై సంఘటనల్ని పరిశీలిస్తే, బడుగువర్గాల పిల్లల విద్యాసముపార్జనకు విశాల దృక్పథంతో 'విద్య' అనే ద్వారాలు తెరిచివుంచాలని, అలాచేయడం మన చేతుల్లోనే వుందని నా విశ్వాసం. అయితే ఇక్కడొక ప్రశ్న పుడుతుంది. ఈ పిల్లలు ఉచితంగా చదువు నేర్చుకోవడానికి ప్రభుత్వ విద్యాలయాల్ని ఆశ్రయిస్తే దెడ్లు, మహర్ల వంటి చితికి పోయిన కులాల మాటేమిటి?

***పేరాగ్రాఫ్ –22 :*** బొంబాయిలో బోర్డులో పనిచేస్తున్న ప్రొఫెసర్లు, ఉపాధ్యాయుల ఆధ్వర్యంలో ప్రతి శాఖలోని తెలివైన విద్యార్థులకు శిక్షణనిచ్చి వారిని శాంతికి సంబంధించి మెజిస్ట్రేట్ కమీషన్, గ్రాండ్ జూరీ, జడ్జీలుమటి ఉన్నత హెూదా గల ఆఫీసుల్లో నియమిస్తే కొన్ని సందేహాలు కలుగుతున్నాయి. కేవలం తెలివి ప్రాతిపదికపైన్నే తీసుకుంటే, హిందూ వర్గాలలో ఘర్షణలు చెలరేగే ప్రమాదాలున్నాయి. కాబట్టి ఈ నిర్ణయం సరికాదు.

## మౌంట్ స్టూవర్ట్ ఎల్ఫిన్‌స్టన్ సూచించిన అంశాల సమగ్ర పరిశీలన

***పేరాగ్రాఫ్–23:*** అత్యంత స్వేచ్ఛావాది, విశాల దృక్పథం పాలనాధికారైన ఎల్ఫిన్‌స్టన్ సూచించిన విషయాల్ని పరిశీలిద్దాం :

'తెలివైన వారిలో తక్కువ కులం' అనే ప్రాతిపదికను పరిశీలిస్తే, ఇక్కడ మనం జాగ్రత్తగా గమనించాల్సింది మనం ఎలా వారికి ప్రత్యేక ప్రోత్సాహమివ్వగలం? క్రొత్త క్రొత్త అంశాల్ని వారికెలా తెలియజేయగలుగుతాం? వారిని మన నూతన విధానాల్ని ఎలా అవలంభించేటట్లు చేయగల' మన్నది నిర్ణయించుకోవాలి.

జనాభాప్రాతిపదిక మీదనో, లేక సైన్యానికి అధికారాలివ్వడం ద్వారానో, ఇంకా విపులమైన పద్ధతివల్లనో దీనిని కొంత వరకు సఫలీకృతం చేయవచ్చు.

☆ ☆ ☆

బి

# ప్రకటన

బొంబాయి ప్రెసిడెన్సీలో బడుగువర్గాల విద్య పరిస్థితికి సంబంధించి బహిష్కృత
**హితకారిణి** సభ (బడుగు వర్గాల సంస్థ, బొంబాయి) తరపున
భారత రాజ్యాంగ కమీషన్‌కు డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్
( బొంబాయి శాసనమండలి సభ్యుడు)
సమర్పించిన పత్రం.

మే 29, 1928,
దామోదర్ హాల్,
పరేల్, బొంబాయి - 12,
భారతదేశం

## 1813 నుంచి 1854 వరకు

1. బొంబాయి ప్రెసిడెన్సీ బ్రిటిషు పాలన కింద విద్యాబోధన "బొంబాయి విద్యాసంస్థ"ను 1805లో స్థాపించడతో మొదలైందని చెప్పవచ్చు. ఈ సంస్థ యూరోపియన్ల పిల్లలకే విద్యాబోధన చేసే ప్రయత్నాలను కొనసాగించలేదు. సూరత్, తానా పట్టణాల్లో పాఠశాలలో చేరమని స్థానిక బాలబాలికలను ప్రోత్సహించేవారు. 1820 మొదట్లో బొంబాయిలో దేశీయుల కోసం 4 పాఠశాలలను విడిగా నెలకొల్పారు. వీటితో 250 మంది పిల్లలు చదివేవారు. ఆ ఏడు ఆగస్టులో దేశీయులకు విద్యాబోధనను మరింత విస్తరింపజేసారు. ఈ సంస్థ ప్రాంతీయ భాషలో పాఠ్య పుస్తకాలు తయారు చేసేందుకు, ప్రాంతీయ భాషా పాఠశాలలు నెలకొల్పేందుకు అవసరమయిన సహాయం చేయడానికిగాను ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసింది. పేదలకు విద్యాబోధన చేయాలన్న లక్ష్యంతో ఏర్పడిన ఈ సంఘం ఆశయాల పరిధికి మించినదేమోనని భావించారు. 1822లో ఈ కమిటీ విడిగా ఒక కార్పొరేషన్‌ను రూపొందించింది. అప్పటి నుంచి 'బొంబాయి స్థానిక పాఠ్యపుస్తక, పాఠశాల సంఘం' పేరుతో వ్యవహరించసాగింది. 1827లో దీని పేరును 'బొంబాయి స్థానిక విద్యా సంస్థ'గా మార్చారు. ఈ కొత్త సంఘానికి గౌరవ మౌంట్ స్టూవర్ట్ ఎల్ఫిన్‌స్టోన్ తొలి అధ్యక్షుడు. ఉపాధ్యక్షులుగా ప్రధాన న్యాయమూర్తి, బొంబాయి ప్రభుత్వ కార్యనిర్వాహక మండలిలోని ఇద్దరు సభ్యులు పనిచేసేవారు. యాజమాన్య కమిటీలో 12 మంది యూరోపియన్ సభ్యులు, మరో 12 మంది స్థానిక ప్రముఖులు సభ్యులుగా ఉండేవారు. కెప్టెన్ జార్జ్ జెర్విస్ ఆర్.ఇ., శ్రీ సదాశివ కాశీనాథ్ ఛాత్ కార్యదర్శులుగా ఉండేవారు. ప్రభుత్వం నెలకు ఇచ్చే రూ. 600 గ్రాంట్‌తో సంస్థ పని ప్రారంభించింది. దీనికి తోడు జిల్లా పట్టణాల్లో 1825లో ప్రాథమిక పాఠశాలలను బొంబాయి ప్రభుత్వం సొంత ఖర్చుతో నెలకొల్పి జిల్లా కలెక్టర్ల అధ్వర్యంలో నిర్వహిస్తూ ఉండేది. ఈ రెండు స్వతంత్ర సంఘాల కార్యక్రమాలను సమన్వయ పరచడానికి 1840లో విద్యామండలి ఏర్పడింది. ఈ మండలిలోని ఆరుగురు సభ్యులలో ముగ్గురిని ప్రభుత్వం, మరో ముగ్గురిని స్థానిక విద్యాసంస్థ నియమించేది. 1855లో పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్ నియమితులయ్యే వరకు విద్యా విధానానికి ఈ బోర్డు బాధ్యత వహించేది.

2. 1855 మార్చి ఒకటో తేదీన మండలి రద్దయ్యేనాటికి బొంబాయి ప్రెసిడెన్సీలో ఈ మండలి మీద 15 ఇంగ్లీషు కళాశాలలు, పాఠశాలలు ఉండేవి. వీటిలో 2,850 మంది విద్యార్థులు

చదివేవారు. ప్రాంతీయ భాషా పాఠశాలలు 256 కాగా వాటిలో 18వేల 888 మంది విద్యార్థులున్నారు. మండలి నివేదికలో ఈ విధంగా పేర్కొన్నారు :

"ఆగస్టు 1855లో అహ్మద్‌నగర్ వాసులు నిమ్నకులాల వారి కోసం ఒక పాఠశాల నెలకొల్పాలని కోరారు. అప్పటి నియమాల ప్రకారం సగం జీతం భరిస్తూ ఉపాధ్యాయులను నియమించేందుకు ముందుకు రావడమేగాక ఒక గది కూడా నిర్మించారు. 30 మంది విద్యార్థులు హాజరయ్యారు. అగ్రకులాలు, సంపన్న వర్గాలు ఈ పాఠశాలను వ్యతిరేకించాయి. చివరికి మామూలు జీతంపై ఉపాధ్యాయుడిని నియమించడం కూడా కష్టమై పోయింది. అయినా నియమాల ప్రకారం దరఖాస్తు చేసుకున్నారు కనుక పాఠశాలకు అనుమతించాం. నవంబర్‌లో పాఠశాల తెరిచారు. నిమ్నకులాలవారి కోసం తొలి పాఠశాల ప్రారంభమైందని మేం పేర్కొన్నాం."

3. ఇదే బడుగువర్గాలకు తొలి పాఠశాల అయితే 1855కు ముందు అణగారిన తరగతుల విద్య పట్ల బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన విధానం ఏమిటి? 1813 నుంచి 1854 వరకు విద్యా విధానం ఏ విధంగా రూపొందిందో చరిత్ర చెప్తుంది. పీష్వా పాలనలో అణగారిన జాతులకు విద్యావకాశమే లేదు. మనుధర్మ శాస్త్రం ప్రకారం పాలించేది ప్రభువు కనుక పీష్వా పాలనలో వారికి చదువుకునే వీలులేదు. మనుశాస్త్రం ప్రకారం శూద్రులకు, అతి శూద్రులకు (వెనుకబడిన వర్గాలు) జీవించే హక్కు, స్వేచ్ఛ, ఆస్తి హక్కు ఉన్నా లేకున్నా విద్యాహక్కు మాత్రం లేదు. దైవశాసనాల పేర పాలించే ప్రభుత్వం పతనం కావడంతో ఈ వర్గాలు ఊపిరి పీల్చుకున్నాయి. బ్రిటిష్ పాలనలో వారికి ఆశలు చిగురించాయి. ఎందుకంటే ప్రజాస్వామ్యం కనుక పెద్ద చిన్నా తేడా లేకుండా ప్రతి మనిషికీ ఒకే విలువ లభిస్తుందన్న విశ్వాసం ఏర్పడింది. పీష్వా దైవిక శాసనాల కన్నా బ్రిటిష్ ప్రజాస్వామ్యంలో ఎంతో తేడా కనిపించింది. బ్రిటిషు వారు దేశాన్ని జయించి తమకు సాయం చేస్తారని వారు ఆశించారు.

4. బ్రిటిష్‌వారు చాలాకాలం పాటు స్థానికుల విద్యావికాసాల విషయంలో నిశ్శబ్దంగా ఉన్నారు. ఒకరిద్దరు ఉన్నతాధికారులు దేశీయులకు విజ్ఞానాన్ని పంచే నైతిక బాధ్యతను గుర్తించినప్పటికీ బహిరంగంగా విధాన ప్రకటనను 1813 వరకు చేయలేదు. చట్టం 53 జార్జ్ 4 అధ్యాయం 155, పార్లమెంట్, సెక్షన్ 43 ద్వారా భారతదేశంలో మిగులు ఆదాయం నుంచి ఏటా లక్ష రూపాయలు స్థానిక వాఙ్మయాన్ని పునరుద్ధరించి అభివృద్ధి చేయడానికి వినియోగించాలని పేర్కొన్నారు. ఇండియాలోని బ్రిటిష్ సరిహద్దుల్లో ప్రజలకు శాస్త్ర విజ్ఞానం నేర్పాలని పేర్కొన్నారు. 1823 వరకు ఈ చట్టపరమయిన అంశం వల్ల కూడా ప్రయోజనం లేకుండా పోయింది. హిందువుల్లో సంస్కృత భాషాధ్యయనం ప్రారంభింప చేయడం ద్వారా సెక్షన్ 43 అమలు చేయాలని గవర్నర్ జనరల్-ఇన్-కౌన్సిల్‌కు జనవరి 3, 1814న లేఖ రాసారు. అణగారిన తరగులకు ఎంతో నిరాశకరమయిన విషయం ఇది. బ్రిటిష్ ప్రభుత్వం కావాలని

విద్యను ఉన్నత వర్గాలకు పరిమితం చేసింది.

ఎనభై వేలమంది ప్రజలకు విద్యాబోధన చేసే ఆలోచనకన్నా లభ్యమయిన పరిమిత వనరుల ద్వారా ఉన్నత వర్గాలకు, తీరిక కలిగిన ఉన్నత తరగతుల ప్రజలకు విద్య నేర్పితే వారు తోటి దేశీయులను విస్తృతంగా ప్రభావితం చేయగల్గుతారని బాంబే ప్రెసిడెన్సీ విద్యా మండలి 1850-51 నివేదికలో పేరగ్రాఫ్ 5, పేరగ్రాఫ్ 8లో పేర్కొన్నారు. కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ ఉన్నత తరగతులకు విద్యాబోధన వల్ల లాభాలు వివరిస్తూ లేఖలు రాసింది. యూరప్ కళల విజ్ఞానాన్ని నూరు నుంచి 140 మిలియన్ల ప్రజలకు బోధన చేయడానికి అపారమయిన ఖర్చు అవుతుందని కూడా ఆ లేఖల్లో పేర్కొన్నారు.

తొమ్మిదవ, పదవ పేరాగ్రాఫ్‌లలో విద్యావిధానం నియమాల మీద విశ్లేషిస్తూ భారత ప్రజలకు వారి పరిస్థితులకు తగిన విద్యావ్యవస్థ దానంతట అదే రూపొందుతున్నదని, అంతకు ముందు తలెత్తిన అన్ని వివాదాలకు సమాధానాలు దొరుకుతున్నాయని పేర్కొన్నారు. 1840-1850 సంవత్సరాల మధ్యన విద్యా వనరులు విద్యార్థుల సంఖ్యను పోల్చుతూ పేరగ్రాఫ్ 11లో వివరాలు ఇచ్చారు. తర్వాతి కాలంలో 4 ఇంగ్లీషు పాఠశాలలు, 83 ప్రాంతీయ భాషా పాఠశాలలు నెలకొల్పారనీ, సాధారణంగా విద్యార్థుల సంఖ్య100 శాతం కన్నా ఎక్కువ పెరిగిందని, మొత్తం 12,712 మంది ప్రభుత్వ విద్య పొందుతున్నారని వివరించారు. 1699 మంది ఇంగ్లీషు విద్య, 10,730 మంది ప్రాంతీయ విద్య, 283 మంది సంస్కృత విద్య నేర్చుకున్నారు.

బొంబాయి ప్రెసిడెన్సీలో ప్రషన్ జనాభా లెక్కల ప్రకారం జనాభా కోటికి పెరిగింది. వీరిలో 90 లక్షల మంది 7-14 సంవత్సరాల మధ్య వయసుగల వారు. బడికి పంపగల విద్యార్థులైన వీరికి విద్యాబోధన చేసే సదుద్దేశం ప్రభుత్వానికి లేదు. 69 నుంచి బడికి వెళ్లతగిన పిల్లల్లో ఒక్కనికి మాత్రమే అవకాశం లభిస్తున్నదని పేరగ్రాఫ్ 12లో వివరించారు.

పేరగ్రాఫ్ 13లో ప్రాంతీయ భాషా పాఠశాలల్లో గరిపే విద్య మరీ నాసిరకంగా ఉందని అంగీకరించారు. విల్లోబీ పరిశీలన ప్రకారం లోపభూయిష్టమైన ఈ పాఠశాలల్లో ఫలితాలు కూడా అంతంత మాత్రమే. మండలి ఈ విషయాన్ని గుర్తించినప్పటికీ ప్రాంతీయ భాషా పాఠశాలలు అనవసరమనే ఒక అభిప్రాయాన్ని సృష్టించింది. ఈ లోపాలకు పరిష్కారం ఏమిటన్న ప్రశ్నకు విల్లోబీ సరైన సమాధానాలు సూచించారు. 'ఉన్నత వర్గాలకు చెందిన ఉపాధ్యాయులు, మామూలు పాఠశాలలు, అతి సమర్థవంతమయిన పర్యవేక్షణ ప్రాంతీయ భాషా సాహిత్యానికి అనుబంధాలు' కారణాలు. బోర్డు ఎన్నో సంవత్సరాలు ఈ అంశాలను పరిశీలిస్తూనే ఉన్నా ఈ విషయాలన్నీ సవరించాలంటే అదనపు ఖర్చులు ఎంతో భారీగా ఉంటాయి. కౌన్సిల్ నుంచి వచ్చిన లేఖను బట్టి ప్రభుత్వం రానున్న మరికొంత కాలం వరకు విద్యామండలికి విద్య కోసం అదనపు ఆర్థిక సహాయం అందించే అవకాశం లేదని అర్థమవుతున్నది.

పేరగ్రాఫ్ 14లో 175 ప్రాంతీయ భాషా పాఠశాలల ద్వారా 10730 బాలురకు సరైన విద్య అందించలేనపుడు 140 మిలియన్ల ప్రజలకు, అందులో 90 లక్షల మంది పిల్లలకు విద్యాబోధన అన్న ప్రశ్నే తలెత్తదు. తమకు తెలియని సత్కార్యాల ఆధారంగా సుదూరమయిన ఊహలు చేస్తూ బోర్డు తమకున్న పరిమితమయిన ఆచరణ క్షేత్రం నుంచి దూరం కావడం తగిన పని కాదు.

కోర్టు ఇంతకు ముందు పేరగ్రాఫ్‌లో పేర్కొన్న లక్ష్యాలను ప్రతిసారీ ఉటంకిస్తూ 15వ పేరగ్రాఫ్‌లో ప్రజలను అభివృద్ధి చేసే విద్యావిధానం అమలు ప్రయత్నాలను చాలా చిన్నస్థాయికే పరిమితం చేయాలని, తమకున్న పరిమిత వనరులతో అద్భుతమయిన ఫలితాలు సాధించే నిజమయిన మార్గాలను మండలి ప్రభుత్వాలకు సూచిస్తూ వచ్చింది. "భారతదేశంలోని ఉన్నత వర్గాల ప్రజలకు యూరప్ విజ్ఞానం, నాగరికతకు సంబంధించి బోధించడానికి మేమెంతో ఆత్రుతతో ఉన్నాం. మనం తీరిక, సహజమయిన పలుకుబడి ఉన్న ఉన్నతవర్గాలకు నేర్పించే లక్షణాలు గుణాలే అశేషమయిన ప్రజానీకం లక్షణాలు గుణాలను నిర్దేశిస్తాయ"ని మద్రాస్ ప్రభుత్వానికి ఆదేశాలు వచ్చాయి.

పేరగ్రాఫ్ 16లో ఉన్నతవర్గాలు అంటే ఎవరు? అని పరిశీలించారు. ప్రభుత్వం ప్రకారం ప్రజలను ప్రభావితం చేయగల వర్గానికి మాత్రమే ప్రభుత్వ విద్య లభిస్తుందని స్పష్టమయింది. ఈ వర్గంలో ఉన్న ప్రజలెవరు అని యూరోపియన్ ప్రశ్నకు అన్వేషణ మొదలయింది. యూరప్‌లో సంపన్న, రాజకీయ, సాంఘిక పలుకుబడులను బట్టి ఉన్నత, బడుగువర్గాల మధ్యన విభజన రేఖ గీయడం సాధ్యమయింది. భారతదేశంలో అటువంటి రేఖ లేదు. ఇక్కడ ఏ నిరంకుశ పాలనలోనైనా రాజు అభీష్టమే ముఖ్యం. ఎందుకూ కొరగాని అథమ స్థితి నుంచి అత్యుత్తమ స్థితికి ఒక వ్యక్తిని తీసుకు రావాలంటే రాజానుగ్రహం ఉంటే చాలు. ఇంగ్లీషు సంప్రదాయాల ప్రకారం బిచ్చగాడు నిర్బంధ కార్మికుడుగా తప్ప ఎందుకూ పనికిరాడు. కాని భారత్‌లో బ్రాహ్మణ సిద్ధాంతం ప్రకారం అతనొక గౌరవనీయమయిన వ్యక్తి. లౌకికమయిన ఆనందాలను కోరికలను త్యజించి అధ్యయనానికి, నిరంతర భగవత్ ధ్యానానికి కృషి చేసే వ్యక్తి.

పేరగ్రాఫ్ 17లో భారతదేశంలో ఇతర ప్రజలను ప్రభావితం చేయగల ఉన్నత వర్గాలను ఈ విధంగా వర్గీకరించారు. మొదటి వర్గం : భూస్వాములు, జాగీర్‌దార్లు, మాజీ రాచ కుటుంబీకులు, స్వదేశీ సంస్థానాల అధికారుల అధికారులు వీరిని సైనిక తరగతి అనవచ్చు.

రెండవ వర్గం : వర్తకం ద్వారా సంపదను ఆర్జించినవారు. లేదా వ్యాపార తరగతి.

మూడవ వర్గం : ఉన్నత ప్రభుత్వోద్యోగులు.

నాల్గవ వర్గం : బ్రాహ్మణులు, లేదా వారితో సమంగా కలం పట్టిన ఇతర ఉన్నత కులాల

సాహితీయులు. ఉదాహరణకు బొంబాయిలో పరేభవాలు, షెన్వీలు, బెంగాల్‌లో కాయస్థులు – ఒకవేళ వారికి విద్యార్జనలో స్థానికంగా మరో స్థాయి లభిస్తే.

పేరగ్రాఫ్ 18 : ఈ నాలుగు తరగతుల్లో కెల్లా ఎక్కువ ప్రభావితం చేయగల తరగతి బ్రాహ్మణ తరగతి. పాత జాగీర్దార్లు, సైనిక తరగతి బ్రిటిష్ పాలనలో నానాటికీ అంతరిస్తున్న తరగతి అని అందరికీ తెలుసు. వారి పాత వృత్తి పోయింది. కొత్త వృత్తి లేదు. గిరిజన తరగతిలో కూడా విద్యాబోధనలకు అవకాశాలు లేవు. ప్రభుత్వోద్యోగులు తమ వద్దకు వచ్చే ప్రజలపై ప్రభావం చూపగల వారే అయినా వారితో అనుబంధం లేని అశేష ప్రజానీకం పై ప్రభావం చూపగల సారుద్దానం వారికి లేదు. ఇంగ్లాండ్‌లో ప్రభుత్వం వల్ల ఉన్న విశ్వాస రాహిత్య ధోరణులనే వీరు ఇక్కడ వ్యాపింపజేసే అవకాశం ఉంది.

పేరగ్రాఫ్ 19 : దీన్నిబట్టి విద్యాబీజాలను వ్యాపింపచేయడానికి తగిన తరగతి బ్రాహ్మ తరగతి అని తేల్చుకోక తప్పదు. బ్రాహ్మణులు, వారికి సామ్రాజ్యంలో ఉన్న ఇతర ఉన్నత కులాల ద్వారా విద్యాబోధన సులువని భావించారు. కాని బ్రాహ్మణులు, తదితర ఉన్నత కులాలవారు పేదరికంలో ఉన్నారు. చాలాచోట్ల బ్రాహ్మణులకు పర్యాయపదం భిక్షగాళ్ళు.

పేరగ్రాఫ్ 10 : ఈ పరిశీలనల తర్వాత మండలి తమ 'సూపర్ ఎడ్యుకేషన్' విధానాన్ని 'భారీ ఫీజు' చెల్లించగల సంపన్నులకు, అసాధారణ తెలివితేటలున్న యువకులకు వర్తింపజేయాలని ప్రయత్నించింది. అయితే సంపన్న కుటుంబాలవారు ఈ విద్య పట్ల విముఖత చూపారు. పేదలలో అసాధారణ ప్రతిభావంతులను గుర్తించే మార్గమే లేదు. సంపన్న తరగతులలో కొందరు ఈ విద్య పట్ల ఉత్సాహం చూపారు. బొంబాయిలో కన్నా మండలి బెంగాల్‌లో ఉన్నత విద్యను మరింత విస్తరింపజేసారు. అయితే విద్యార్థుల ఫీజులు, సంపన్నుల విరాళాల ద్వారా యూరప్ కళలు విజ్ఞానాల విద్యాబోధన సాధ్యం కాదనే అభిప్రాయానికి వచ్చారు.

పేరగ్రాఫ్ 21 : సంవత్సరాల అనుభవం తర్వాత ఆచరణాత్మకమయిన నిర్ణయం ఏమిటంటే ఉన్నత కులాలకు చెందిన పౌర కుటుంబాలకు విద్యాబోధన అవకాశాలను విస్తృతం చేయవలసి ఉంది. అయితే ప్రభుత్వ సంస్థల్లో పేదపిల్లలను ఉచితంగా అనుమతిస్తే, ధేడ్, మహర్‌లనే దళితవర్గాల పిల్లలను రాకుండా ఎలా ఆపగలం అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

పేరగ్రాఫ్ 22 : ఈ విధంగా చివరి తరగతి ప్రజలకు బొంబాయిలో శిక్షణ ఇచ్చి ప్రోత్సహిస్తే వారికి జడ్జి పదవులు, గ్రాండ్ జూరీ, రాణీగారు నియమించిన శాంతి సంఘం పదవులు పొందేఅవకాశాలకు అడ్డు ఉండకుండా పోతుంది. హిందూ మతంలో ఇటువంటి నియామకాలు ద్వేషాలకు దారి తీస్తాయని బ్రిటిష్ ప్రభుత్వం భావించడం ఆ ప్రభుత్వ బలహీనతకు, స్వేచ్ఛా వ్యతిరేకతకు ప్రతీక అని విమర్శలు వచ్చాయి. కులాల అడ్డుగోడలపై దాడి జరగాలని విశాల

హృదయులు ఆలోచించారు.

పేరగ్రాఫ్ 23 : ఎల్ఫిన్‌స్టోన్ ఉదారమయిన, విశాల హృదయుడైన పాలకుడు. ఆయన అసలైన కార్యాచరణను ప్రతిపాదించారు. ఆయన మాటల్లో "నిమ్న తరగతుల పిల్లలు మంచి విద్యార్థులని మిషనరీలు కనుగొన్నారు. వారికి ప్రత్యేకమయిన ప్రోత్సాహం ఏ విధంగా ఇవ్వగలం అనేది పరిశీలించాలి. వారు విభజితమయిన అనేక కులాల్లో అట్టడుగున ఉన్నవారు. మన విద్య వ్యవస్థ వేళ్లు వారిలో నాటుకుంటే ఒక కొత్త తరగతి సృష్టించిన వారిమవుతాం. ఇందువల్ల ఇతర కులాల విద్వేషానికి వ్యతిరేకత పెరుగుతుంది. మన అధికారం పూర్తిగా సైనిక బలంపైన ఆధారపడిన రోజున లేదా జనాభాలో ఒక భాగాన్ని మనవైపు తిప్పుకున్న రోజున ఆ వ్యతిరేకత విద్వేషాలను ఎదుర్కొనే వీలవుతుంది. కాని మరింత విస్తృతమయిన ప్రాతిపదిక కోసం చేసే ప్రయత్నాలకు ఇది సరిపడదు.

5. 1855కు ముందు బొంబాయి ప్రెసిడెన్సీలో అణగారిన వర్గాలకు పాఠశాలలు తెరవకపోవడానికి కారణం బ్రిటిష్ ప్రభుత్వం విద్యా సౌకర్యాలను ఉన్నత కులాలకు ముఖ్యంగా బ్రాహ్మణులకు పరిమితం చేయాలని విధానం ఏర్పరచుకోవడమే. ఈ విధానం మంచిదా కాదా అన్నది వేరే విషయం. వాస్తవమేమిటంటే ఈ కాలంలోబడుగు వర్గాలకు విద్య నేర్చుకునే అవకాశాలు లేవు.

## 2. 1854 నుంచి 1882 వరకు

6. కోర్టు ఆఫ్ డైరెక్టర్స్ జులై 19, 1854న 49వ లేఖలో ఈ విధంగా పేర్కొన్నారు. "పూర్తిగా నిర్లక్ష్యానికి గురైన, స్వయంగా ఏ విధమయిన విద్యావకాశాలు సమకూర్చుకోలేని బడుగు వర్గాల పిల్లలవైపు మన దృష్టి మళ్లించాలి. వారికి ఉపయుక్తమయిన ఆచరణాత్మకమయిన విజ్ఞానాన్ని అందించాలి. భవిష్యతుతో ఈ లక్ష్యంతో ప్రభుత్వం చురుకయిన చర్యలు తీసుకోవాలి. అందుకోసం తగిన విధంగా ఖర్చులను భరించేందుకు మేం సిద్ధం". ప్రజల విద్యకు ఈ లేఖ ద్వారా మనదేశంలో పునాది పడింది. 1882లో ఈ విధానం ఫలితాలను మొదట హంటర్ కమిషన్ పరిశీలించింది. 28 ఏళ్లలో సాధించింది ఏమిటో ఈ ఫలితాలు తెలుపుతాయి.

ప్రాథమిక విద్య : 1881 – 82

| | పాఠశాలలో చదువుతున్న విద్యార్థులు | మొత్తం శాతం |
|---|---|---|
| క్రిష్టియన్లు | 1,521 | .49 |
| బ్రాహ్మణులు | 63,071 | 20.17 |

| | | |
|---|---|---|
| ఇతర హిందువులు | 2,02,345 | 64.69 |
| ముస్లింలు | 39,231 | 12.54 |
| పారశీకులు | 3,517 | 1.12 |
| కొండప్రాంతాలలో నివశించే గిరిజనులు | 2,713 | .87 |
| తక్కువ కులములకు చెందిన హిందువులు | 2,862 | .87 |
| యూదులు మరియు ఇతరులు | 373 | .12 |

సెకండరీ విద్య : 1881–82

| | మిడిల్‌స్కూల్ | | హైస్కూలు | |
|---|---|---|---|---|
| | పాఠశాలకు హాజరైన మొత్తం విద్యార్థులు | వారిమొత్తం శాతం | పాఠశాలకు హాజరైన మొత్తం విద్యార్థులు | వారి మొత్తం శాతం |
| క్రిష్టియన్స్ | 1429 | 12.06 | 111 | 2.26 |
| బ్రాహ్మణులు | 3639 | 30.70 | 1,978 | 40.29 |
| ఇతరులు | | | | |
| వ్యవసాయదారులు | 624 | 5.26 | 140 | 2.85 |
| తక్కువ కులజాలు | 17 | .14 | – | – |
| ఇతర కులాల వారు | 3,823 | 32.25 | 1,573 | 32.04 |
| ముస్లింలు | 687 | 5.80 | 100 | 2.04 |
| పారశీకులు | 1526 | 12.87 | 965 | 19.66 |
| కొండప్రాంతాల్లో నివశించే గిరిజనులు | 6 | .05 | – | – |
| యూదులు, ఇతరులు | 103 | .87 | 92 | .86 |

కళాశాల విద్య : 1881 – 82

| | మొత్తం విద్యార్థులు | వారి మొత్తంశాతం |
|---|---|---|
| క్రిష్టియన్స్ | 14 | 3 |
| బ్రాహ్మణులు | 241 | .50 |
| ఇతర హిందువులు | | |
| వ్యవసాయదారులు | 5 | 1 |
| తక్కువ కులస్థులు | 0 | 0 |
| ఇతర కులస్థులు | 103 | 21.3 |
| ముస్లింలు | 7 | 1.5 |
| పారశీకులు | 108 | 21.5 |
| కొండప్రాంతాల్లోని గిరిజనులు | 0 | 0 |
| యూదులు, ఇతరులు | 2 | 0.4 |

7. ఈ అంకెలు ఏం చెప్తున్నాయి? ప్రజలకు విద్య నేర్పడం ప్రభుత్వ విధానమే అయినా ఆ సామాన్య ప్రజలు విద్యావకాశాలకు దూరంగా ఉన్నారని, 1854కు ముందు నిమ్నజాతి, బడుగుజాతి హిందూ తెగలు ఏ స్థాయిలో ఉన్నారో, ఆ తర్వాత కూడా అదే స్థాయిలో ఉన్నారని రుజువు అయింది. 1881-82లో ఉన్నత పాఠశాలల్లో గానీ, కళాశాలల్లోగానీ ఈ కులాల నుంచి ఒక్క విద్యార్థి కూడా లేడు. బడుగు తరగతుల వారిని విద్యారంగంలో మిగతా తరగతుల ప్రజల స్థాయికి తేవడంలో ఈ వైఫల్యం పరిణామాలేమిటి? ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలంటే మళ్లీ ప్రెసిడెన్సీ ప్రభుత్వ విద్యావిధాన చరిత్రలోకి వెళ్లాల్సిందే.

8. 1854 సంవత్సరంలో కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ లేఖ ద్వారా విస్తారమయిన సామ్రాజ్య ప్రజానీకానికి విద్యాబోధన చేపట్టాలన్న వాటిని 60 సంవత్సరాల తర్వాత తొలిసారి గుర్తించారు. కాని కొందరు ఛాందసులు ఈ విధానాన్ని మార్చాలని ఆందోళన చెందడం మానలేదు. లార్డ్ ఎల్లెన్‌బరో, (బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడు) వంటి పెద్దలు వెనుకబడిన వర్గాలను విద్యావంతులను చేయడం వల్ల బ్రిటిష్ రాజ్యానికి వచ్చే తీవ్ర ప్రమాదాల గురించి ఆందోళన చెందసాగారు. ఆయన 28 ఏప్రిల్ 1858లో కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్‌కు రాసిన లేఖలో ఈ హెచ్చరిక చేసారు.

"నా ముందుకు వచ్చిన అనేక ఉత్తరాలు 1854లో మన విద్యావిధానాన్ని పునః పరిశీలించాలని సూచిస్తున్నాయి. ఈ విధానం వల్ల అనుకున్నంత మంచి జరగనేలేదని నా అభిప్రాయం."

★ ★ ★

పేరగ్రాఫ్ 11 : "బడుగువర్గాల పిల్లలను బడికి పంపేందుకు వారి తల్లిదండ్రులకు, కార్మికవర్గాలవారికి ఎంతో పై స్థాయిలో వారికి నచ్చచెప్పవలసి వస్తున్నది. మరోవైపు సంపన్నులను మనం పూర్తిగా విస్మరించాం."

పేరగ్రాఫ్ 12 : దీనివల్ల ఆరోగ్యకరమయిన సమాజం నిర్మాణం కాదు. బడుగు తరగతుల విద్యావంతులయిన పిల్లల ద్వారా మన ఆశయం నెరవేర్చేందుకు ప్రభుత్వం భారీ వనరులు సమకూర్చలేకపోతున్నది.

పేరగ్రాఫ్ 13 : పౌరులను విద్యావంతులను చేయడం ద్వారా వారిలో అసంతృప్తి వర్గాన్ని రూపొందించిన వారమవుతాం. ప్రజానీకం పైన అది ఒక భారీ అధికారం.

పేరగ్రాఫ్ 14 : విద్య నాగరికత ఉన్నత వర్గాల నుండి కింది తరగతులకు దిగివస్తేనే ప్రజలకు కొత్త శక్తిని ఇస్తాయి. కాని కింది తరగతుల నుంచి పై తరగతులకు ఈ విధానం ఎప్పుడూ ఎదగలేదు. బడుగువర్గాలకు మాత్రమే విద్య నేర్పితే అది ఎదురు తిరిగి విదేశీయులే మొదటి బాధితులు అవుతారు.

పేరగ్రాఫ్ 15 : విద్యా వ్యాప్తి చేయాలన్న లక్ష్యం విజయం సాధించాలంటే మొదలు ఉన్నత వర్గాలకే విద్య నేర్పాలి.

పేరగ్రాఫ్ 16 : దీనికి రెండు మార్గాలున్నాయి. ఉన్నతవర్గాలకు మాత్రమే పరిమితమయిన కళాశాలలు నెలకొల్పాలి. సైన్యం, కమీషన్లలో అటువంటి ప్రముఖ పౌరుల తనయులకు గుర్తింపు ఇవ్వడం.

9. యూరోపియన్ అధికారులు అస్పృశ్య వర్గాల వాళ్లు ప్రదర్శించిన ఈ వ్యతిరేక ధోరణిని 1859లో భారత సెక్రటరీ ఆఫ్ స్టేట్ సవరించారు. సామాన్య ప్రజానీకానికి విద్యావకాశాల ప్రయోజనాలను ఆయన మళ్లీ వివరించారు.

10. ప్రజానీకానికి విద్యావిధానం అనే ప్రభుత్వ ప్రకటనల ద్వారా అణగారిన ప్రజలకు దక్కింది కేవలం నామమాత్రమే అని ఒక్క మాటలో చెప్పవచ్చు. సామాన్యుల కోసం పాఠశాలలు తెరిచినా బడుగువర్గాల పిల్లల ప్రవేశం ప్రశ్నార్థకంగానే మిగిలింది. ఈ ప్రశ్నకు

1856లో ప్రభుత్వం ప్రతిస్పందించిన తీరు బడుగువర్గాలకు అనుకూలంగా లేదు. ఈ విషయం డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్ నివేదిక (1856-57)లో స్పష్టమయింది.

పేరగ్రాఫ్ 17 : బడుగువర్గాలకు, ఆదిమజాతి తెగలకు ప్రత్యేకమయిన పాఠశాలలు : బడుగువర్గాలకు పాఠశాలలు లేవు. ప్రభుత్వం ఇందుకు అనుమతి ఇవ్వలేదు. సాధారణ పాఠశాలల్లో అందరికీ ప్రవేశం అనేది కేవలం సిద్ధాంతాలకే పరిమితం. జూన్ 1856లో ఒక మహర్ బాలుడికి ప్రవేశం నిలిపి వేయడంపై వచ్చిన అభ్యర్థన తప్ప బడుగు తరగతులవారికి ప్రభుత్వ పాఠశాలల్లో ప్రవేశానికి సంబంధించి అడిగిన వారేలేరు. ఆ మహర్ విద్యార్థి ఫీజు చెల్లించడానికి సిద్ధపడినా ధార్వాడ్ ప్రభుత్వ పాఠశాలలో ప్రవేశం లభించలేదని లేఖ వచ్చింది అని 1855-56లో నేను ఒక నివేదికలో పేర్కొన్నాను.

ఈ సందర్భంలో ప్రభుత్వం తీవ్రమయిన ఇబ్బందికి లోనయింది. ఎవరి విజ్ఞాన వికాసాల కోసమయితే ప్రజా పాఠశాలలు నెలకొల్పారో ఆ దేశీయ ప్రజల మనోభావాలకు వ్యతిరేకంగా నిర్ణయించడమా? ఒక తీర్మానం ప్రకారం వారి నిర్ణయం ఏమిటంటే, ఒక్క ఒంటరి వ్యక్తి ఇతర కులాల విద్యార్థులు మాత్రమే చదివే పాఠశాలలో ప్రవేశానికి వచ్చినంత మాత్రాన ఆ అగ్రకులాల వారితో కలిసి చదవమని ఈ వ్యక్తిని పంపడం – దేశీయులైన ప్రజల ప్రయోజనాలకు ప్రమాదకరం అని అభిప్రాయపడ్డారు.

బొంబాయి ప్రభుత్వ ప్రొసీడింగ్స్‌ను భారత ప్రభుత్వ లేఖ నెం. 111 తేది 23 జనవరి 1857లో ఈ విధంగా ప్రస్తావించింది :

"బొంబాయి ప్రభుత్వం ఈ విషయంలో చాలా తెలివిగా వ్యవహరించిందని గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ భావిస్తున్నది. కాని నాకు (ప్రభుత్వ కార్యదర్శి) అనిపించేదేమిటంటే బెంగాల్ ప్రెసిడెన్సీలోని ఏ ప్రభుత్వ పాఠశాలలోనూ, ఆ అబ్బాయికి ప్రవేశం తిరస్కరించవలసింది కాదు."

ఈ లేఖ స్వీకరించిన తర్వాత ప్రభుత్వం పాఠశాలలను కొన్ని కులాలకే ప్రత్యేకించే చర్యలు తీసుకోవటానికి వ్యతిరేకం అని స్పష్టం చేసింది. ప్రభుత్వ పాఠశాలల ప్రతిష్టకు వారి సామర్థ్యాన్ని లక్ష్యాన్ని దెబ్బతీయకుండా ఉండాలి. బెంగాల్‌లో అమలవుతున్న సూత్రం సాధారణంగా దేశంలోని ఇతర ప్రభుత్వ పాఠశాలల ప్రయోజనాల పై ఏ విధంగా ప్రభావం చూపుతున్నదో పరిశీలించాలని నిర్ణయించారు.

11. బెంగాల్‌లో వ్యాపించిన వాస్తవ పరిస్థితులను బట్టి చూస్తే, భారత ప్రభుత్వ సూచనలకు భిన్నంగా బెంగాల్ ప్రభుత్వం బడుగువర్గాల పిల్లలకు పాఠశాలలో ప్రవేశాన్ని కల్పించడమా తిరస్కరించడమా అనే విషయాన్ని స్థానికుల మనోభావాలను బట్టి జిల్లా బోధనా

కమిటీలు నిర్ణయించాలని సూచించింది. అగ్రకులాలవారు అస్పృశ్యులతో సమానంగా ప్రభుత్వం అందరికోసం వెలిగించిన విద్యాజ్యోతి ముందు అస్పృశ్యులతో సమానంగా అగ్రకులాలవారు కూర్చోవడానికి నిరాకరిస్తున్నారనే నెపంతో బడుగువర్గాలు తిరస్కరింపబడ్డారు.

12. ఈ పరిస్థితుల్లో 1854 లేఖలో పేర్కొన్న విధానం ప్రకారం ప్రజలందరికీ విద్యాబోధన లభిస్తున్నది. ఒక బడుగువర్గాలకు తప్ప. 1854లో బడుగువర్గాల విద్య పై నిషేధాన్ని ఎత్తివేయడం ఒక నామమాత్రపు చర్య మాత్రమే. కొందరికే పాఠశాలలను ప్రత్యేకించడంపైన ప్రభుత్వం సూత్రప్రాయంగా వ్యతిరేకత చూపినా ఆచరణలో ఆ అంశాన్ని తప్పించింది. కనుక ఆచరణలో ఆ నిషేధం కొనసాగుతున్నదనే అనవచ్చు.

బడుగువర్గాల విద్య గురించి కృషి చేసిన ఏకైక సంస్థ క్రైస్తవ మిషినరీలు. మౌంట్ స్టూవర్ట్ ఎల్ఫిన్‌స్టోన్ మాటల్లో చెప్పాలంటే "వారు అణగారిన వర్గాల్లో ఉత్తమ ప్రజలను సంపాదించారు". కాని ప్రభుత్వం మతపరమయిన తటస్థ వైఖరిని అవలంబిస్తూ మిషినరీ పాఠశాలలకు సహాయం నిరాకరించింది. ప్రెసిడెన్సీలో ఏ మిషినరీ పాఠవాలకు ఆర్థిక సహాయం ఇవ్వలేదు. నిజానికి 1854 లేఖలో సహాయం చేయరాదన్న నిబంధన ఏదీ లేదు.

13. ఈ సందిగ్ధ పరిస్థితి నుంచి బయట పడడానికి ప్రభుత్వం రెండు మార్గాలను చేపట్టింది. 1 బడుగు జాతి పిల్లలకోసం ప్రత్యేక పాఠశాలలను నెలకొల్పడం, 2) గ్రాంట్-ఇన్-ఎయిడ్ నిబంధనలను సడలించి మిషినరీ సంస్థలకు ప్రత్యేక ప్రోత్సాహాన్నివ్వడం. ఈ చర్యలను చేపట్టి ఉండకపోతే బడుగువర్గాల విద్యకు సంబంధించి 1882లో హంటర్ కమిషన్ ప్రస్తావించిన ఫలితాలైనా వచ్చి ఉండేవి కావు.

## 3. 1882 నుండి 1828 వరకు

14. బొంబాయి ప్రెసిడెన్సీలో 1882 తర్వాత 1828 వరకు విద్యాబోధనకు సంబంధించి చాలా కీలకమయినది. ప్రాంతీయ ప్రభుత్వాల నుండి ప్రాథమిక పాఠశాలల నిర్వహణ బాధ్యత స్థానిక సంస్థలకు ఈ సంవత్సరంలోనే బదిలీ అయింది. 1923లో విద్యా విషయక ప్రగతికి సంబంధించిన వివరాలు ఈ పట్టికలో ఉన్నాయి.

| ప్రెసిడెన్సీలోని వివిధ కులాలవారు | జనాభాలోని తరగతి అంతరాలు | విద్యాభ్యాస పట్టిక | | |
|---|---|---|---|---|
| | | ప్రాథమిక | సెకండరీ | కాలేజీ |
| అగ్రకులాలకి చెందిన హిందువులు | 4th | 1st | 1st | 1st |
| మధ్యతరగతికి చెందిన హిందువులు | 1st | 3rd | 3rd | 3rd |
| వెనుకబడిన హిందువులు | 2nd | 4th | 4th | 4th |
| ముస్లింలు | 3rd | 2nd | 2nd | 2nd |

15. విద్యారంగంలో విభిన్న కులాల వారి ప్రగతి పరిశీలిస్తే విపరీతమయిన వ్యత్యాసాలు కనిపిస్తాయి. జనాభాలో ప్రథమ స్థానంలో ఉన్న మధ్యతరగతి హిందువులు కళాశాల విద్యలో మూడో స్థానంలోనూ, సెకండరీ విద్యలో చివరికి, ప్రాథమిక విద్యలో కూడా మూడోస్థానంలో ఉన్నారు. బడుగువర్గాలవారు జనాభాలో రెండో స్థానంలో ఉంటే కళాశాల, సెకండరీ, ప్రాథమిక విద్యలో చివరి స్థానానికి అంటే 4వ స్థానానికి చేరారు. జనాభాలో మూడో స్థానంలో ఉన్న మహమ్మదీయులు మూడు దశల విద్యల్లో రెండోస్థానంలో ఉండడం విశేషం. అగ్రశ్రేణి హిందువులు జనాభాలో చివరి స్థానంలో ఉన్నా మూడు దశల విద్యల్లో అగ్రభాగాన ఉండడం గమనించాలి. కనుక 1882తో పోల్చితే వారి స్థితిలో ఏ మాత్రం మార్పులేదని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

16. 1923-24 సంవత్సరంలో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్ బొంబాయి ప్రెసిడెన్సీకి ఇచ్చిన ఈ నివేదిక ప్రకారం విభిన్న కులాల మధ్యన విద్యాభివృద్ధిలో వ్యత్యాసాలు స్పష్టంగా కనిపిస్తాయి. ఈ వ్యత్యాసంలో తీవ్రత తెలుసుకోలేకపోతే సరైన నిర్ణయానికి రావడం కష్టం. ఆ వివరాల కోసం ఈ పట్టిక :

| జనాభాలోని వివిధ తరగతులు | ప్రాథమిక విద్యార్థులు ప్రతి 1000 మందికి జనాభాలోని వివిధ తరగతులు | సెకండరీ విద్యార్థులు ప్రతి 100,000మంది జనాభా | కాలేజీ విద్యార్థులు ప్రతి 200,000 మంది జనాభా |
|---|---|---|---|
| అగ్రకుల హిందువులు | 119 | 3,000 | 1,000 |
| ముస్లింలు | 92 | 500 | 52 |
| మధ్యతరగతికి చెందినవారు | 38 | 140 | 14 |
| వెనుకబడిన తరగతులవారు | 18 | 14 | –* |

17. కొన్ని కులాలవారి విద్య పరిస్థితి ఎంత దిగ్భ్రాంతికరంగా ఉందో ఈ పట్టిక తెలుపుతుంది. ఈ పట్టిక ద్వారా ఈ రెండు అంశాలను నిర్వివాదాంశంగా పేర్కొనవచ్చు. 1) ఈ ప్రెసిడెన్సీలో వెనుకబడిన వర్గాలవారి విద్య శోచనీయ స్థితిలో ఉంది. జనాభాలో వారి స్థానం రెండోదే అయినా, విద్యలో చివరిదే కాకుండా కనిష్టమయిన స్థానంలో ఉంది. 2) ప్రెసిడెన్సీలో మహ్మదీయులు విద్య విషయకంగా ఎంతో ముందంజ వేసారు. కేవలం 30 ఏళ్లలో మహమ్మదీయులు విద్యలో అందరికన్నా ముందు ఉండడమే కాక బ్రాహ్మణులకు దాదాపు సరిసమానం కాగలిగారు.

18. దీనికి కారణం ఏమిటి? ప్రభుత్వ అసమాన వైఖరి. విద్యపై చతుఃదశాబ్ద నివేదికల్లో ఈ సమాన వైఖరి స్పష్టంగా బయటపడింది. ఆ నివేదికలో మహ్మదీయుల గురించి ఈ వ్యాఖ్యలు గమనించతగినవి.

"బొంబాయిలో మహ్మదీయుల విద్య ప్రగతికి సంబంధించి... ఇంకా విస్తారంగా ఉండేది కాని ప్రతికూల పరిస్థితుల వల్ల అలా జరుగలేదు. ప్రజా విద్యావకాశాలను ఇతర కులాల కన్నా మహ్మదీయులు అత్యధికంగా వినియోగించుకుంటారని ఎప్పుడో తేలింది." మహ్మదీయుల విద్యకు ప్రోత్సాహకర పరిస్థితులపై డైరెక్టర్ ఈ విధంగా రాశారు.

".... మొట్టమొదటి కారణం... ప్రతి జిల్లాలో మహమ్మదీయ అధికారిని నియమించడం జరిగింది. కైరా, షోలాపూర్, హైదరాబాద్‌లలో మహ్మదీయ పట్టభద్రులు నియమితులైనారు. బొంబాయి, కరాచీ, జునాగఢ్‌లో మహ్మదీయులకు తక్కువ ఫీజుతో పాఠశాలలు నెలకొల్పారు. ఇవిగాక వారి సంస్థలు "అంజుమన్"లు అనేక పాఠశాలలు నెలకొల్పాయి. బరోడా దివాన్ ఖాన్ బహదూర్ కాపీ షాబుద్దీన్ ప్రత్యేక స్కాలర్‌షిప్‌లను ఇచ్చేవారు. సింధ్‌లో భోజన స్కాలర్‌షిప్‌లు కూడా ఇచ్చేవారు. హిందువుల కన్నా సులువైన పరీక్షలు నిర్వహించి ముస్లింలను శిక్షణలో చేర్చుకునేవారు. వారికి ప్రత్యేక నియమాలు రూపొందించి, అనేక మినహాయింపులు ఇచ్చేవారు. మహ్మదీయ డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ నియామకం ద్వారా వారిలో విద్యార్జనను బాగా ప్రోత్సహించేవారు."

19. ఆ నివేదిక (1902-07)లోనే అణగారిన వర్గాల విద్యాబోధనకు సంబంధించిన వివరాలతో పోల్చాలి.

"959. బొంబాయి – మధ్య బొంబాయి డివిజన్‌లో కింది కులాల పిల్లలకు పుస్తకాలు, పలకలు ఉచితంగా ఇచ్చి బడులకు రప్పించేవారు. అయినా కథియావార్‌లో ముగ్గురు పిల్లలు మాత్రమే చేరారు. దక్షిణ డివిజన్‌లో 72 ప్రత్యేక పాఠశాలలు, తరగతులు ఉన్నా అర్హతలు లేని వారి అధ్వర్యంలో నడిచేవి.

20. ఈ అసమాన వైఖరికి మూలం హంటర్ కమిషన్ సిఫార్సుల్లో ఉంది. బడుగువర్గాలతో

పోల్చితే ఈ కమిషన్ మహ్మదీయుల పట్ల విపరీతమయిన పక్షపాతం ప్రదర్శించింది. మహ్మదీయుల కోసం 17 సిఫార్సులు చేసింది. వాటిల్లో ఇవి ముఖ్యమయినవి.

1) స్థానిక, మున్సిపల్, ప్రాంతీయ నిధుల్లో మహ్మదీయుల విద్య ప్రోత్సాహానికి ప్రత్యేక మినహాయింపులు న్యాయమైనవి.

2) మహ్మదీయుల ఆంగ్లబోధనను స్వేచ్ఛగా ప్రోత్సహించాలి.

8) అవసరమైన చోట ప్రత్యేక స్కాలర్‌షిప్‌లు వారికి కల్పించాలి. 1) ప్రాథమిక పాఠశాలలు, మధ్య తరగతులు, 2) ఉన్నత తరగతులు 3) మెట్రిక్యులేషన్ ఫలితాల ఆధారంగా పై చదువుల్లోనూ... కాలేజీల్లోనూ... ఎ) ప్రజా నిధులతో నిర్వహించే అన్ని పాఠశాలల తరగతుల్లో కొంత వాటా మహ్మదీయ విద్యార్థులకు ఉచితంగా కేటాయించాలి.

10) మహ్మదీయులకు విద్య విషయకంగా లభించే ధార్మిక నిధులు మహ్మదీయుల విద్యాభివృద్ధికే ప్రత్యేకించాలి.

11) ప్రైవేట్ యాజమాన్యం నడిపే సంస్థల్లో మహ్మదీయులు ఉంటే ఇంగ్లీషు బోధనా పాఠశాలలు, కళాశాలలను గ్రాంట్-ఇన్-ఎయిడ్‌తో ఏర్పాటు చేసి మహ్మదీయులను ఆకర్షించాలి.

12) అవసరమయిన చోట మహ్మదీయుల కోసం ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పాలి.

13) మహ్మదీయ పాఠశాలలను తనిఖీ చేసేందుకు మహ్మదీయ ఇన్స్‌పెక్టర్లనే నియమించాలి.

14) విద్యావంతులయిన మహ్మదీయులకు, ఇతరులకు స్థానిక ప్రభుత్వాలు ఏ విధంగా సహాయం అందించాయో తెలపాలి.

21. బడుగు వర్గాల కోసం కూడా ఇలువంటి సిఫార్సులు చాలా అవసరం. ప్రభుత్వ నిధులకై బడుగువర్గాల విద్య ఖర్చులు న్యాయమయిన 'ఛార్జ్'గా ఉండాలన్న సిఫార్సు లేదు. స్కాలర్‌షిప్పులు నిధులు, వారికి ప్రత్యేకించలేదు. ప్రత్యేక తనిఖీ అధికారులను నియమించలేదు. ఒకే ఒక సిఫార్సు ఏమిటంటే "ప్రభుత్వ కళాశాల లేదా పాఠశాలలో ఏ విద్యార్థికి కులం పేర ప్రవేశాన్ని తిరస్కరించకూడదు" అని.

దీన్ని ఒక సూత్రంగా ధ్రువీకరించి ప్రతి ప్రభుత్వ సంస్థలోనూ అమలు చేస్తున్నారు. 2) బడుగు వర్గాల పిల్లలు అధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాల్లో వారికోసం ప్రత్యేక పాఠశాలలను నిర్వహించడాన్ని ప్రోత్సహించాలి. ప్రజల ధనంతో నడిపే పాఠశాలలు సరిపోని చోట కూడా ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పాలి. మహ్మదీయుల ప్రయోజనాల కన్నా అత్యవసరంగా బడుగువర్గాల ప్రయోజనాల రక్షణ అవసరం. మహ్మదీయుల కన్నా బడుగువర్గాలకే ఎక్కువ సిఫార్సులు

అవసరం. హంటర్ కమిషన్ మహ్మదీయుల విషయంలో ఒక నిజాన్ని అంగీకరించింది. "1871-73లో జరిగిన విచారణ ద్వారా ఉన్నత విద్యారంగంలో తప్ప మిగిలిన విద్యారంగాల్లో మహ్మదీయుల వెనుకబడిన తనాన్ని అనవసరంగా ఎక్కువ చేసి చూపారు. వెనుకబడినవారి కోసం చేసిన రెండు సిఫార్సులు కూడా అంతగా ఉపయోగపడేవి కావు. అణగారిన వర్గాలకు విడిగా పాఠశాలలు స్థాపించడం కూడా అసాధ్యంగా పరిణమించింది. అదనపు ఖర్చు పేరుతో కొత్త పాఠశాలలను నెలకొల్పేందుకు ప్రభుత్వం అంగీకరించడంలేదు. ఒకానొక ప్రాంతంలోనే వెనుకబడిన వర్గాలవారు ఎక్కువ సంఖ్యలో కనిపించరు కనుక, వారు అధికంగా ఉన్న ప్రాంతాల్లో పాఠశాలలు నెలకొల్పాలన్న నియమం కూడా వృధాయే.

22. హంటర్ కమిషన్ మహ్మదీయుల పట్ల అంత ఉదారంగా ఉండాలనుకున్నా బడుగువర్గాల వాళ్ళకు కనీస న్యాయం చేయాల్సింది. మహ్మదీయుల కన్నా బాగా వెనుకబడి ఉన్న బడుగు వర్గాల ఆర్థిక, సాంఘిక స్థితిగతులను పరిశీలించవలసింది. హంటర్ కమిషన్ ఎప్పుడైతే బడుగువర్గాలను వెనక్కు తోసిందో అప్పటి నుంచి ప్రభుత్వం వారిని అక్కడే ఉంచింది. నిర్లక్ష్యం చేసింది. ఫిబ్రవరి 21, 1913న భారత ప్రభుత్వం విద్యావిధానం, ఢిల్లీ చేసిన తీర్మానం నిర్లక్ష్యాన్ని స్పష్టం చేస్తుంది. ప్రాంతీయ రాజ్యాలలో సమస్త కార్య విధానాన్ని రూపొందించి అమలు చేసేందుకు రాజ్య నిధుల నుంచి స్థానిక ప్రభుత్వాలకు భారీ ఎత్తున నిధులు ఇవ్వాలని ఈ తీర్మానం చేసారు. ఆ తీర్మానంలో డొమిసైల్ కమ్యూనిటీ, మహ్మదన్ కమ్యూనిటీ అన్నారే కాని వెనుబడిన తరగతులు అని ఒక్కచోట కూడా పేర్కొనలేదు. బొంబాయి ప్రభుత్వం వెంటనే 1913లో ఒక మహ్మదీయుడిని విద్యా కమిటీలో నియమించింది. భారతదేశంలో విద్యావ్యాప్తి కోసం మహాఘనత వహించిన రారాజు చక్రవర్తి 1912 జనవరి 6న కలకత్తా యూనివర్శిటీలో ఆనందంతో ఇలా చెప్పారు. అయినా అందుకు భిన్నంగా ప్రభుత్వం ఒక వర్గాన్ని తీవ్రంగా నిర్లక్ష్యం చేయడం నేరమే.

"నా భారత పౌరుల ఇళ్లల్లో కూడా విద్యాకాంతులు విరజిమ్మాలనీ ఉన్నత భావాలు, సౌకర్యాలు, ఆరోగ్యం నిండాలని, భారత్‌లో విద్య నా ప్రాణప్రదమని ప్రకటిస్తున్నాను" అని చక్రవర్తి ప్రసంగించారు.

## 4. 1923 నుండి, ఆ తర్వాత

23. 1921లో సంస్కరణల చట్టం వచ్చింది. ఒక మంత్రి అధ్వర్యంలో నడిచే అంశంగా విద్యను బదిలీ చేసారు. కనుక విద్యారంగంలో ముమ్మరమయిన ప్రగతి సాధ్యమవుతుందని ఊహించారు. మంత్రుల అధీనంలోకి విద్యను మార్చినందువల్ల వెనుకబడిన వర్గాలకు లాభం కలిగే విషయంలో ఆ వర్గాలకు అనుమానాలున్నాయి. అధికార యంత్రాంగం చేతిలో వారు ఇది

వరకే బాధలు పడ్డారు. వారు విద్యా ఫలాలను అందుకోనివ్వలేదు. రెండో దశలో అధికార యంత్రాంగం విద్యార్జనకే అనుకూలంగా వ్యవహరించింది. వెనుకబడిన వర్గాలకు విద్యాహక్కు తిరస్కరించడంలో అధికార యంత్రాంగం కీలకపాత్ర వహించింది. ఆ యంత్రాంగం స్థానాన్ని ఆక్రమించాలని చూస్తున్న భారత మేధావి వర్గం కూడా అదే అనుభవాన్ని అందుకోవడానికి వెనుకబడిన వర్గాలు సిద్ధంగా లేవు. ఎందుకంటే భారత మేధావి వర్గం పుట్టిన చోట వెనుకబడిన వర్గాల హక్కులకు గుర్తింపు లేదు కనుక. మళ్లీ గతాన్నే కళ్ల ముందుకు తెస్తారని వారు భయపడ్డారు.

24. దురదృష్టవశాత్తు వారి భయాలు నిజాలని రుజువైనాయి. ఈ సంస్కరణల తర్వాత బొంబాయి ప్రెసిడెన్సీలో వెనుకబడిన తరగతుల స్థితి మంగలంలోని పొయ్యిలో పడ్డట్టయింది. ఇది ప్రస్తుత పరిస్థితిపై తీవ్రమయిన వ్యాఖ్యగా కనిపించవచ్చు. కాని బొంబాయి ప్రెసిడెన్సీలో నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టం 1923 ద్వారా వెనుకబడిన వర్గాలకు కలిగిన స్థితి చూస్తే అట్లా అనక తప్పదు. నిర్బంధ ప్రాథమిక విద్య అనేది ఒక మోసం. స్వచ్ఛంద లక్షణాన్ని నిర్బంధ లక్షణంగా మార్చడానికి ఈ చట్టం తెచ్చిందన్నారు. నిజానికి ఈ చట్టం అందుకు చేసిందేమీ లేదు. ఇదివరకు వలెనే ప్రాథమిక విద్య స్వచ్ఛందంగానే ఉంది. అట్లాగే ఉండిపోతుంది. నిర్బంధ విద్యగా మార్చే బాధ్యత గానీ, ఎప్పటిలాగా చేయాలన్న కాల పరిమితి కానీ లేదు. ఇదిగాక పాలనా పరమయిన మరో మార్పు కూడా ఈ చట్టం తెచ్చింది. ఇంతకు ముందు ప్రాథమిక విద్య ప్రాంతీయ ప్రభుత్వ అధ్వర్యంలో ఉండేది. ఈ శాఖ ఖర్చులు ఎక్కువ శాతం ప్రాంతీయ ప్రభుత్వాలు, మూడోవంతు స్థానిక ప్రభుత్వాలు భరించేవి. నిర్బంధ ప్రాథమిక విద్య చట్టం కింద పరిస్థితి తారుమారయింది.

ప్రాథమిక విద్యా నిర్వహణ అదుపు జిల్లా పాఠశాలల మండలులకు అప్పగించారు. ఇవి జిల్లాలో స్థానిక మండలుల కింద ఉండే కమిటీలు, ప్రాంతీయ ప్రభుత్వానికి స్థానిక మండలులు నిధులు ఇచ్చే బదులు, ప్రాంతీయ ప్రభుత్వాలు జిల్లా పాఠశాలల బోర్డులకు నిధులు ఇవ్వాలనే మార్చారు. ఆ చట్టం ప్రకారం పాఠశాలల బోర్డులో తమ ఎగ్జిక్యూటివ్ అధికారిని తామే నియమించుకోవచ్చు. బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్‌కు కూడా ఈ అధికారం లేదు.

23. బొంబాయి ప్రెసిడెన్సీకి, వెనుకబడిన వర్గాలకు ఈ మార్పులు నష్టదాయమవుతాయని 'సభ' భావిస్తున్నది. అందరు ప్రజలు విద్య విశిష్టతను గురించి నిజానిజాలను తెలుసుకోవడం లేదు. బ్రాహ్మణులకు తప్ప ఎవరికీ చదువు పట్టని విషయమని ఇంకా అత్యధికులు విశ్వసిస్తున్నారు. రాజకీయాల్లోకి వచ్చిన కొద్దిమంది మాత్రం విద్యావ్యాప్తిని సమర్థిస్తున్నారు. స్కూల్ బోర్డు సభ్యులుగా తీసుకువేవారు విద్య బ్రాహ్మణులకే పరిమితమనే సంప్రదాయం నుంచి వచ్చినవారే. వారంతా ప్రాథమిక విద్య నిర్బంధ బోధనను వ్యతిరేకిస్తారు. విద్యను సమర్థవంతంగా నిర్వహించా

అంటే అది ప్రాంతీయ ప్రభుత్వం అధ్వర్యంలో శాసనమండలి అదుపులో ఉండాలి కనుక విద్యా విభాగం నుంచి స్కూల్ బోర్డులకు బదిలీ చేయడం నమ్మకస్తుల చేతి నుంచి తీసి అనర్హులకు అప్పగించడమే. విద్యా ప్రగతికి కూడా ఈ బదిలీ హానికరమే. విద్యలో వారికి విశ్వాసముందో లేదోగాని, వెనుకబడిన తరగతుల విద్యకు మాత్రం సాధారణంగా వ్యతిరేకమే. ఉన్నత వర్గాలలో నిమ్నకులాల చదువుల పట్ల హంటర్ కమిషన్ ఈ విధంగా తెలిపింది. "ఎందరో సాక్షులు - అగ్రవర్ణాలవారు కింది కులం పిల్లవాడి ప్రవేశాన్ని వ్యతిరేకించేవారని సాక్ష్యం చెప్పారు. అనాదిగా బానిసల కులంగా భావిస్తున్న చెర్మన్ల కోసం స్కూల్ కాలికట్‌లో నెలకొల్పే విషయంలో మద్రాస్ సాక్షి ఒకరు - ఈ పాఠశాలకు వస్తున్న పిల్లలను దారికాచి నాయర్లు, తీయాలు దాడి చేసి పుస్తకాలు లాక్కునేవారని సాక్ష్యం చెప్పారు. తక్కువ కులాల వారికి విద్య నేర్పితే వారు తమ స్థితి నుంచి విముక్తం కావడానికి విద్య వినియోగిస్తారని గ్రామాల్లో ఫిర్యాదులు వచ్చేవని మధ్య ప్రాంతాలు, బొంబాయి నుంచి సాక్షులు చెప్పారు. 1896-97 వార్షిక నివేదికలో పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్ (బొంబాయి) కైరా జిల్లాలో ఒక సంఘటన గురించి పేర్కొన్నారు. తక్కువ కులాల పిల్లలను అధికారులు ప్రవేశింప జేసినందుకు జమిందారు పెద్ద పాఠశాలలు మూసి వేయించారనీ, తక్కువ కులాలకు చెందిన గుడిసెలను, పొలాలను తగులబెట్టారని తెలిపారు. రెండేళ్లపాటు ఒక గ్రామంపైన తీవ్రమయిన భారీ జరిమానా విధించారు.

26. గ్రామీణ వాతావరణం ఆ విధంగా ఉన్నపుడు అక్కడి నుంచి వచ్చిన సభ్యులతో రూపొందిన స్కూల్ బోర్డులు బడుగు వర్గాలవారికి విద్యాబోధనకు సంబంధించి విశ్వసనీయంగా ఏ విధంగా పని చేస్తారు. వెనుకబడిన వర్గాల విద్యను స్కూల్ బోర్డులకు అప్పగించడం ప్రాసిక్యూటర్లను మార్చడం వంటిది. వెనుకబడిన వర్గాలు ఈ మార్పును వ్యతిరేకిస్తూ తీర్మానించాయి. కనీసం స్కూల్ బోర్డులలో వెనుకబడిన వర్గాల ప్రతినిధులకు తగినంత ప్రాతినిధ్యం ఇచ్చినా బాగుండేది. కాని అట్లా చేయలేదు. కౌన్సిల్ నుంచి స్థానిక సంస్థల దాకా బడుగు వర్గాలకు ఇచ్చిన ప్రాతినిధ్యం ఏ విధంగా ఉందంటే మ్యూజియంలో ప్రతి జాతికి చెందిన ఒక జంతువును ఉంచిన క్యూరేటర్ వలె ఉంది.

జిల్లా లోకల్ బోర్డులోని 40 మంది సభ్యులలో ఒకరిని వెనుకబడిన కులాలకు చెందిన వ్యక్తిని సభ్యుడిగా ప్రభుత్వం నియమిస్తుంది. స్కూల్ బోర్డులో ఆ వర్గం వ్యక్తి ఒకరిని కో ఆప్ట్ చేసుకోవచ్చు. తప్పుడు వ్యక్తిని ఎంచుకుంటే అది ఇంకా ప్రమాదమే. తూర్పు ఖండేశ్‌లో అటువంటి ప్రమాదమే జరిగింది. సరైన వ్యక్తినే తీసుకున్నా స్కూల్ బోర్డులో 15 మంది వ్యతిరేకిస్తే ఆ ఒక్క వ్యక్తి ఏం చేయగలడు?

27. నిజంగా బడుగు వర్గాల విద్యావ్యాప్తికి చిత్తశుద్ధితో కట్టుబడి ఉంటే ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవాలి. 'సభ' కూడా ఈ విషయంలో ప్రభుత్వం ఏం చేయాలో సూచించింది.

1) నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టం వెంటనే రద్దు చేయాలి. స్కూల్ బోర్డులకు ప్రాథమిక విద్యను అప్పగించడాన్ని ఆపాలి. లేకపోతే వెనుకబడిన వారి విద్యకు తీవ్ర అవరోధం కలుగుతుంది.

2) ప్రాథమిక విద్యను నిర్బంధం చేసి, ప్రాథమిక పాఠశాలల్లో ప్రవేశాలను ఖచ్చితంగా అమలు చేస్తే తప్ప వెనుకబడిన తరగతుల విద్య విస్తరించదు.

3) హంటర్ కమిషన్ మహ్మదీయుల విషయంలో చేసిన సిఫార్సులు బడుగు తరగతుల విషయంలోనూ అవలంబిస్తే తప్ప వారి విద్యాప్రగతి అనుకున్న స్థాయికి పెరగదు.

4) బడుగు వర్గాలకు ప్రభుత్వ ఉద్యోగాలలో స్థానం కల్పించకపోతే చదువుకోవడానికి ప్రోత్సాహం ఉండదు.

28. బడుగు వర్గాలకు ప్రెసిడెన్సీలో విద్యా వ్యవహారాల గురించి 'సభ' ఈ వ్యాఖ్యానాలు చేసినంత మాత్రాన బడుగు వర్గాలకోసం ప్రత్యేక హాస్టళ్లు ఉన్నత విద్య విషయంలో కొన్ని స్కాలర్‌షిప్‌లను ఇచ్చిన అంశం తిరస్కరించడంలేదు. ఉన్నత విద్యలో బడుగువర్గాలవారికి ప్రత్యేక ఏర్పాట్లు చేసి ప్రయోజనం లేదని 'సభ' అభిప్రాయం. ఎందుకంటే ప్రాథమిక విద్యలో వారికి అవకాశాలు కల్పించకుండా ఉన్నత విద్యావకాశాలు ఇవ్వడం వృథా. ఇటువంటి మినహాయింపులు కొనసాగుతాయన్న హామీ కూడా లేదు. విద్యాశాఖ ఇన్‌ఛార్జిగా ఉన్న మంత్రిగారి విధానంపైన వారి భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. శాసనమండలిలో వారి కోచింగ్ బలం ఆధారపడి ఉంటుంది. ఇవి రెండూ అస్థిర అంశాలు కనుక ఆధారపడతగినవి కావు.

అనువాదం :

డాక్టర్ ఎం. శ్రీధర్,

డా॥ జి. దామోదర నాయుడు

☆ ☆ ☆

## సి

# ప్రకటన

రాష్ట్రాల స్వపరిపాలన కింద బొంబాయి ప్రెసిడెన్సీలో అల్పసంఖ్యాక వర్గంగా దళితుల ప్రయోజనాలను కాపాడడానికి అవసరమైన రక్షణ గురించి...., వాటిని సాధించడానికి బొంబాయి శాసన మండలి నుంచి పొందవలసిన హామీలు, శాసన మండలి నిర్మాణంలో చేయవలసిన మార్పుల గురించి బొంబాయి దళిత వర్గాల సంస్థ 'బహిష్కృత హితకారిణీ సభ' తరపున బొంబాయి శాసన మండలి సభ్యుడు డాక్టర్ భీమ్‌రావ్ ఆర్. అంబేద్కర్ కమీషన్‌కు సమర్పించిన ప్రకటన.

29 మే, 1928
దామోదర్ హాల్,
పరేల్, బొంబాయి -12
భారతదేశం.

# 1. సరిపడినంత ప్రాతినిధ్యం ద్వారా రక్షణ

*1. అవతారిక:* భారతీయ రాజ్యాంగ కమీషన్‌లో భారతీయుణ్ణి నియమించరాదని పార్లమెంట్ తీసుకున్న నిర్ణయం బహిష్కృత హితకారిణీ సభవారి ఆదుర్దాను ఉపశమింపజేసింది. భారతీయుల సమష్టి కోరిక అయిన స్వయం ప్రభుత్వ విషయాన్ని కమీషన్ పరిగణనలోకి తీసుకున్నట్లయితే భారతీయుడు ఒకరిని నియమించమని ఆందోళన చేయడం సముచితంగానే ఉండేది. కానీ, వాస్తవం ఏమంటే – కమీషన్ పరిశీలించవలసింది ఏదో ఒక కోర్కెను కాదు. దేశంలోని వివిధ వర్గాల విభిన్న విజ్ఞప్తులను పరిశీలించవలసి ఉంది. ఈ పరిస్థితి దృష్ట్యా, కమీషన్‌లో అలాంటి అన్ని వర్గాలకూ ప్రాతినిధ్యం ఉండాలని ఆందోళన చేయవలసి ఉంటుంది. రాజ్యాంగ కమీషన్‌లో దళితవర్గాల ప్రతినిధులతో సహా అన్నివర్గాల భారతీయ ప్రతినిధుల్ని నియమించాలని కోరడం కంటే దళితవర్గాలను సంతృప్తిపరిచే అంశం మరొకటి లేదని సభ స్పష్టం చేయాలనుకుంటున్నది. 'రాజ్యాంగ కమీషన్‌లో భారతీయుడు ఒకరికి ప్రాతినిధ్యం ఉండాలనే కోర్కె ఇటువంటిది కాదు కాబట్టి, ఈ కోర్కెను వ్యక్తం చేసే ఇతరులతో ఏకీభవించడం లేదు. అయితే, తన అభిప్రాయాలకు అనుగుణంగా కమీషన్‌లో దళిత వర్గాల ప్రాతనిధ్యం కోసం దళిత వర్గాల ప్రతినిధి అయిన సభ ఆందోళన చేసిఉండక పోవడం వాస్తవమే. కానీ సభ ఇలా ఎందుకు చేసింది? ఈ దేశంలో పై స్థాయి నుంచి కింది స్థాయివరకు ఈ వ్యవహారంలో కార్యనిర్వాహకులుగా ఉన్న వారందరూ గొంతు చించుకొనే కొందర్ని మాత్రమే గుర్తించడానికి అలవాటుపడిపోయినవారు. మౌనంగా ఉండే కోట్లాది మంది ప్రజలను మరచిపోవడానికి అలవాటు పడిపోయినవారు. కాబట్టి, ఏం అడిగినా వారి నుంచి ఎక్కువ ఆశించినట్లవుతుందని భావించబట్టే సభ ఇలా చేసింది. 'బర్క్' మాటల్లో చెప్పాలంటే, అరడజను మంది రాజకీయవేత్తలు దండయాత్ర లోని మిడతల్లాగా పొలాన్నంతా సందడిచేస్తూ ఉంటే, సిందూరవృక్షం కింద పడుకొని నెమరువేస్తూ మౌనంగా ఉండే వేలాది పశువుల్లాగా సామన్య ప్రజలుంటే, గొంతుచించుకునే కొద్ది మంది రాజకీయవేత్తలనే భారత ప్రభుత్వం నిజమైన ప్రజలనుకుంటున్నది. ఈ రాజకీయవేత్తలు ఎక్కువగానే ఉన్నారనుకోండి. అయితే, గెంతుతూ ఉండేవి, చిన్నవి, ముడుచుకొని పోయినవి, బలహీనం అయినవీ – ఇబ్బంది కలిగించే విధంగా గొడవ చేసేవి అయిన మిడతలకంటే భిన్నమైన వారు ఈ రాజకీయ వేత్తలు. అంతేగాక, సభవారు తమ అభిప్రాయాలను నొక్కిచెప్పక పోవడానికి మరో కారణం కూడా ఉంది. రాజ్యాంగ కమీషన్ నుంచి భారతీయులను మినహాయించడం వల్ల దళిత వర్గాలకు జరిగిన మేలు తక్కువ ఏమీ కాదని సభ

అభిప్రాయపడుతున్నది. కమీషన్ ముందు దళిత వర్గాల గురించి సభ ఉంచబోయే అంశాలను ప్రతి కూలాభిప్రాయం కలగకుండా దళిత వర్గాలు ఈ విధంగా రక్షించబడ్డారు.

***2. 1919 సంవత్సరంలో దళిత వర్గాలకు జరిగిన అన్యాయం:*** సామాజిక భేదాలు, విభజనలు ఉండడం భారతీయ సహజలక్షణం అని, ప్రపంచంలోని ఇతర ప్రతినిధి సంస్థలు ఏ భావాలపై అయితే ఆధారపడి ఉన్నాయో, ఆ భావాలకు ఈ లక్షణం వర్తించేదికాదని మాంటేగు–ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక (పేరా–151) పూర్తిగా గుర్తించింది. పై అంశాలన్నింటిని పరిగణనలోకి తీసుకొని, ఇతర ప్రాంతాల్లో ప్రజాదరణ పొందినటువంటి ప్రభుత్వాన్ని భారతీయ జనజీవనంలోని ప్రత్యేక పరిస్థితులకు అనువుగా భారతీయులకోసం తాము రూపొందించి ఇవ్వవలసి ఉంటుందని ఈ నివేదిక రచయితలు (పేరా 153) అభిప్రాయపడ్డారు. దీనికి అనుగుణంగా, సంస్కరణలు ,ప్రవేశపెట్టడాన్ని గట్టిగా వ్యతిరేకించిన దళితవర్గాలను శాంతింపజేయడానికి, వారి ప్రయోజనాలను రక్షించడానికి నివేదికలోకి 155 పేరాలో వారు ఇలా పేర్కొన్నారు. "రైతుల రాజకీయ విజ్ఞానం అంత త్వరగా పెరిగేది కాదు. అది చాలా కష్టసాధ్యం కూడా. ఆ విజ్ఞానాన్ని పొందే వరకు, బలమైన, తెలివైన ఇతరవర్గాల ప్రజల పీడనకు రైతులు గురి అయ్యే ప్రమాదం ఉంది. రైతు చేతుల్లోనే అతని ప్రయోజనాలు సురక్షితంగా ఉంటాయని తేలే వరకు లేదా శాసన మండలి రైతుల ప్రయోజనాలను పరిశీలించి, పరిరక్షించే వరకు రైతులను రక్షించే అధికారాన్ని మనమే ఉంచుకోవాలి. అలాగే దళిత వర్గాల వారు ఆత్మ రక్షణ పాఠాన్ని నేర్చుకొనేవరకు, వారి ప్రాతినిధ్యం కోసం మనమే సర్వోత్తమమైన ఏర్పాట్లు చేయాలని మేం అభిలషిస్తున్నాం. ఒకవేళ దళిత వర్గాల ప్రయోజనాలు దెబ్బతింటాయని రుజువైతే, వారికి అభివృద్ధి ఫలాలు దక్కక పోతే – వారికి సాయం చేయడానికి వీలయ్యే అధికార సాధనాలను మన చేతుల్లోనే ఉంచుకోవాలి.

3. భారతదేశంలో నెలకొని ఉన్న ప్రత్యేక సాంఘిక పరిస్థితుల పర్యవసానంగా ప్రతిపాదిస్తున్న ప్రజా ప్రభుత్వ నమూనాలో ఏయే సర్దుబాట్లు అవసరమో తెలుపడానికి, ఓటు హక్కు కల్పించడానికి, నియోజకవర్గాలను ఏర్పరచడానికి నియమించబడిన సౌత్‌బరో కమిటీ పై వాగ్దానాలన్నిటినీ గాలికి వదిలేసినందుకు సభ విచారం వ్యక్తపరుస్తుంది. దళిత వర్గాల ప్రయోజనాలను రక్షించడానికి కల్పించవలసిన సముచిత ఏర్పాట్ల విషయంలో సౌత్‌బరో కమిటీ ఎంత ఉదాసీనంగా ఉందంటే, చివరికి ఈ విషయంలో ఏమాత్రమూ పట్టించుకోని భారత ప్రభుత్వం కూడా సౌత్‌బరో కమిటీ నివేదిక పై విడుదల చేసిన ప్రకటనలోని 13వ పేరాలో ఇలా పేర్కొనవలసి వచ్చింది. "మేం అనధికార నామినేషన్ ప్రతిపాదనలను మొత్తం మీద అంగీకరిస్తున్నాం. కానీ, కమిటీ ఇంకా ఎక్కువగా పరిగణనలోకి తీసుకోవడానికి అర్హమైన వర్గం ఒకటి ఉందని మాకు తోస్తున్నది. దళిత వర్గాల సమస్యను స్పష్టంగా గుర్తించి, సమస్యా పరిష్కారానికి తగిన పద్ధతులను అన్వేషించి వాటిని గౌరవిస్తామని భారతీయ రాజ్యాంగ సవరణల నివేదిక వాగ్దానం చేసింది. కమిటీ నివేదికలో హిందువులు, ఇతరులు అన్న అంశం కింద పేర్కొన్న కులాలన్నీ వేర్వేరు పేర్లతో పేర్కొనబడినప్పటికీ,

స్థూలంగా చెప్పాలంటే అందరూ ఒకే జాతి ప్రజలే. సమాజం నుంచి వెలివేయబడటంలో తేడా లున్నప్పటికీ, హిందూ జాతికి దూరంగా ఉంటూ, హిందువుల దేవాలయాల్లో ప్రవేశార్హత కలిగిన మద్రాసు పంచములతో సమానమైన హీనస్థితిలోనే వారు కూడా ఉన్నారు. మొత్తం జనాభాలో 1/5 వంతు ఉన్నప్పటికీ మార్లే-మింటో కౌన్సిళ్ళలో వీరికి స్థానమే కల్పించలేదు. కమిటీ నివేదిక దళిత వర్గాల్ని గురించి రెండు సార్లు ప్రస్తావించింది. అయితే అది కూడా సంతృప్తికరమైన నియోజకవర్గాలు లేని సందర్భంలో నామినేషన్ ద్వారా వారికి స్థానం కల్పించాలని చెప్పడానికి మాత్రమే. దళిత వర్గాల పరిస్థితినిగాని, తమ బాగోగులను తామే చూచుకోగల వారి శక్తిని గురించి గాని కమిటీ చర్చించ లేదు. అంతేగాక కమిటీ సూచించిన 'నామినేషన్ వారికి ఏ ప్రమాణంలో ఉండాలో కూడా వివరించలేదు. ఓటు హక్కు కమిటీ వారి నివేదిక(పేరా 24) నామినేటెడ్ సీట్ల మీద విధించిన నియమాలను సమర్థించింది. అయితే దళిత వర్గాలకు మార్లే- మింటో ప్రతిపాదించిన ప్రాతినిధ్య పరిమాణం ఇలా ఉంది.

| రాష్ట్రం | మొత్తం జనాభా (మిలియన్లలో) | దళిత వర్గాల జనాభా (మిలియన్లలో) | మొత్తం స్థానాలు (సీట్లు) | దళిత వర్గాల స్థానాలు |
|---|---|---|---|---|
| మద్రాసు | 39.8 | 6.3 | 120 | 2 |
| బొంబాయి | 19.5 | 0.6 | 113 | 1 |
| బెంగాల్ | 45.0 | 9.9 | 127 | 1 |
| సంయుక్త పరగణాలు | 47.0 | 10.1 | 120 | 1 |
| పంజాబ్ | 19.5 | 1.7 | 85 | .... |
| బీహార్-ఒరిస్సా | 32.6 | 9.3 | 100 | 1 |
| మధ్య పరగణాలు | 12.0 | 3.7 | 72 | 1 |
| అస్సాం | 6.0 | 0.3 | 54 | .. |
| మొత్తం | 221.4 | 41.9 | 791 | 7 |

"ఈ సంఖ్యలు ఉన్న విషయాన్ని స్పష్టంచేస్తున్నాయి. బ్రిటిషు భారతదేశంలోని మొత్తం జనాభాలో 1/5వ వంతు ఉండే ప్రజలకు మొత్తం 800 స్థానాల్లో 7 స్థానాలు కేటాయించాలని సూచించారు. దళిత వర్గాల ప్రయోజనాలను మనసులో ఉంచుకోవడానికి అన్ని శాసన మండళ్లలో సుమారు ఆరింట ఒకవంతు మంది అధికారులు ఉండవచ్చు(?) లేని ఈ సర్దుబాటుని సంస్కరణల కమిటీ ఆశించిందని మేమాలోచించటం లేదు. కమిటీ రచయితలు దళిత వర్గాలు స్వయం రక్షణ నేర్చుకోవాలని కూడా అన్నారు. 60 నుంచి 90 మంది సవర్ణ హిందువులుండే శాసన సభలో ఒకే

ఒక దళిత వర్గ సభ్యుడు ఉండే పక్షంలో ఈ ఫలితం సాధిస్తాం అనుకోవడం వట్టి భ్రమ మాత్రమే. నివేదిక 151, 152, 154, 155 పేరాల్లోని ప్రయోజనాలను సాధించడానికి గాను, వెలివేయబడ్డ కులాల వారిని మనం మరింత ఉదారభావంతో ఆదరించాలి"

4. 1919 సంస్కరణల ప్రణాళిక రచయితలు దళిత వర్గాలకు అన్యాయం చేశారని అభిప్రాయ పడడంలో ఏకాకిగా మిగిలిపోనందుకు సభ సంతోషిస్తున్నది. రెండేళ్ల తర్వాత సంస్కరణల ప్రణాళికను మరింత అభివృద్ధి పరిచే విస్తృతంచేసే అవకాశాలను తెలపడానికి ఏర్పడిన మడ్డిమాన్ కమిటీ కూడా పై అభిప్రాయంతో సభలో ఏకీభవించింది. దళితవర్గాలకు పై ప్రణాళికలో ఇచ్చిన ప్రాతినిధ్యం సరిపోదని ఆ కమిటీ తన నివేదిక (పేరా 64)లో అంగీకరించింది.

5. దళిత వర్గాలకు తప్పనిసరిగా మంజూరు చేయవలసిన ప్రాతినిధ్య పరిధి అయితే, దళిత వర్గాలకు సరిపోతుందని భావించే ప్రాతినిధ్య పరిధి ఎంత ఉండాలి?

సింద్ బొంబాయి ప్రెసిడెన్సీ నుండి ఒకవేళ విడిపోతుందని భావించినపుడు, మిగిలిన బొంబాయి ప్రెసిడెన్సీలోని శాసనమండలిలో దళిత వర్గాలు కోరుకునే ప్రాతినిధ్య పరిధి కింద ఇవ్వబడిన ప్రణాళికలో లాగా ఉంటే దళిత వర్గాల వారిని సంతృప్తి పరుస్తుంది.

**I. సింద్‌లేని బొంబాయి ప్రెసిడెన్సీ బొంబాయి కోసం శాసనమండలి నిర్మాణం**

| | నియోజకవర్గాలు | మొత్తం స్థానాలు | దళితవర్గాలకు కేటాయించిన స్థానాలు | ముస్లింలకు కేటాయించిన స్థానాలు | మరాఠాలు సంబంధిత కులాలకు కేటాయించిన స్థానాలు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | I జనరల్ (ఎ) పట్టణ | | | | |
| 1. | బొంబాయి నగరం (ఉత్తరం) | 5 | 1 | 1 | |
| 2. | బొంబాయి నగరం (దక్షిణం) | 3 | .... | .... | |
| 3. | అహమ్మదాబాద్ నగరం | 3 | 1 | 1 | [illegible] |
| 4. | సూరత్ నగరం | 1 | .... | .... | |
| 5. | షోలాపూర్ నగరం | 3 | 1 | 1 | |
| 6. | పూనా | | | | |
| | (బి) గ్రామీణ–ఉత్తరవిభాగం | 1 | .... | .... | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 7. | అహ్మదాబాద్ జిల్లా | 5 | 1 | 1 | |
| 8. | బ్రోచ్ జిల్లా | 4 | 1 | 1 | |
| 9. | కైరా జిల్లా | 5 | 1 | 1 | |
| 10. | పంచమహల్స్ జిల్లా | 4 | 1 | 1 | |
| 11. | సూరత్ జిల్లా | 5 | 1 | 1 | |
| 12. | ఠాణా జిల్లా (మధ్యవిభాగం) | 5 | 1 | 1 | |
| 13. | అహమ్మద్ నగర్ జిల్లా | 5 | 1 | 1 | |
| 14. | ఖాందేశ్ (తూర్పు) జిల్లా | 6 | 1 | 1 | |
| 15. | ఖాందేశ్ (పశ్చిమ) జిల్లా | 5 | 1 | 1 | [illegible] |
| 16. | నాసిక్ జిల్లా | 5 | 1 | 1 | |
| 17. | పూనా జిల్లా | 6 | 1 | 1 | |
| 18. | సతారా జిల్లా | 6 | 1 | 1 | |
| 19. | షోలాపూర్ జిల్లా దక్షిణ విభాగం | 5 | 1 | 1 | |
| 20. | బెల్గాం జిల్లా | 5 | 1 | 1 | |
| 21. | బిజాపూర్ జిల్లా | 5 | 1 | 1 | |
| 22. | ధార్వార్ జిల్లా | 6 | 1 | 1 | |
| 23. | కనరా జిల్లా | 4 | 1 | 1 | |
| 24. | కొలాబా జిల్లా | 4 | 1 | 1 | |
| 25. | రత్నగిరి జిల్లా | 6 | 1 | 1 | |
| | జనరల్‌స్థానాలు మొత్తం | 112 | 22 | 22 | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | II. ప్రత్యేక స్థానాలు | | | | |
| 26. | కార్మిక సంఘాలు | 4 | | | |
| 27. | విశ్వవిద్యాలయం | 3 | | | |
| 28. | యూరోపియన్లు | 4 | | | వర్తించదు |
| 29. | మిల్లు యజమానులు | 2 | | | |
| 30. | వ్యాపారం | 2 | | | |
| 31. | వ్యవసాయం | 1 | | | |
| 32. | ఇనాందార్లు | 1 | | | |
| 33. | ప్రభుత్వోద్యోగులు | 9 | | | |
| | ప్రత్యేక స్థానాలు మొత్తం | 28 | | | |
| | మొత్తం వెరసి | 140 | | | |

ఇది బొంబాయి శాసనమండలి స్థానాల మొత్తం సంఖ్య.

6. ఒక వేళ బొంబాయి ప్రెసిడెన్సీలో భాగంగానే 'సింద్' ఉండడానికి నిర్ణయిస్తే సభ ఈకింది ప్రణాళికను బొంబాయి శాసన మండలి కోసం సూచిస్తున్నది.

**II. బొంబాయి ప్రెసిడెన్సీ (సింద్‌తో సహా) బొంబాయి శాసన మండలి నిర్మాణం**

| నియోజకవర్గాలు | | మొత్తం స్థానాలు | దళితవర్గాలకు కేటాయించిన స్థానాలు | మరాఠాలు సంబంధిత కులాలకు కేటాయించిన స్థానాలు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| I. మహమ్మదీయేతర (ఎ) నగర | | | | |
| 1. | బొంబాయి నగరం (ఉత్తరం) | 5 | 1 | |
| 2. | బొంబాయి నగరం (దక్షిణం) | 4 | ... | వర్తించదు |
| 3. | కరాచి నగరం | 1 | ... | |
| 4. | అహమ్మదాబాద్ నగరం | 3 | 1 | |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 5. | సూరత్ నగరం | 2 | ... | |
| 6. | షోలాపూర్ నగరం | 4 | 1 | |
| 7. | పూనా నగరం | 2 | ... | |
| (బి) | గ్రామీణ | | | |
| 8. | అహమ్మదాబాద్ జిల్లా | 5 | 1 | |
| 9. | బ్రోచ్ జిల్లా | 4 | 1 | |
| 10. | కైరాజిల్లా | 4 | 1 | |
| 11. | పంచమహల్స్ జిల్లా | 4 | 1 | |
| 12. | సూరత్ జిల్లా | 4 | 1 | |
| 13. | ఠాణా జిల్లా | 4 | 1 | |
| 14. | అహమ్మద్‌నగర్ జిల్లా | 4 | 1 | |
| 15. | ఖాండేష్ జిల్లా (తూర్పు) | 5 | 1 | [illegible] |
| 16. | నాసిక్ జిల్లా | 4 | 1 | |
| 17. | పూనాజిల్లా | 5 | 1 | |
| 18. | సతారాజిల్లా | 5 | 1 | |
| 19. | బెల్గాంజిల్లా | 4 | 1 | |
| 20. | బిజాపూర్ జిల్లా | 4 | 1 | |
| 21. | ధార్వార్ | 4 | 1 | |
| 22. | కనరా జిల్లా | 4 | 1 | |
| 23. | రత్నగిరి జిల్లా | 5 | 1 | |
| 24. | తూర్పుసింద్ జిల్లా | 2 | .. | |
| 25. | పశ్చిమ సింద్ జిల్లా | 2 | ... | |
| 26. | షోలాపూర్ జిల్లా | 4 | 1 | |
| 27. | కొలాబా జిల్లా | 4 | 1 | |
| 28. | ఖాండేష్ జిల్లా (పశ్చిమ) | 4 | 1 | -- |
| | మొత్తం | 86 | 22 | |

| 1. | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| II. | మహమ్మదీయ (ఎ) నగర | | | |
| 29. | బొంబాయి నగరం | 2 | | |
| 30. | కరాచీ నగరం | 2 | | |
| 31. | అహ్మదాబాద్ నగరం | 1 | | |
| 32. | సూరత్ గనరం | 1 | | |
| 33. | పూనా నగరం | 1 | | |
| 34. | షోలాపూర్ నగరం | 1 | | |
| | (బి) గ్రామీణ | | | |
| 35. | ఉత్తర విభాగం | 2 | | |
| 36. | మధ్యవిభాగం | 3 | | నేటి పరిస్థితి |
| 37. | దక్షిణ విభాగం | 3 | | |
| 38. | హైదరాబాద్ విభాగం | 2 | | |
| 39. | కరాచి జిల్లా | 2 | | |
| 40. | లార్కానా జిల్లా | 2 | | |
| 41. | సుక్కూర్ జిల్లా | 2 | | |
| 42. | థార్ అండ్ పర్కార్ జిల్లా | 2 | | |
| 43. | నవాబ్ షా జిల్లా | 2 | | |
| 44. | అప్పర్ సింద్ సరిహద్దు | 2 | | |
| | మొత్తం : | 30 | | |
| III. | ప్రత్యేక స్థానాలు | | | |
| 45. | కార్మికసంఘాలు | 4 | | |
| 46. | విశ్వవిద్యాలయాలు | 2 | | |
| 47. | యూరోపియన్లు | 4 | | |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 48. | మిల్లు యజమానులు | 1 | | |
| 49. | వ్యాపారం | 1 | | |
| 50. | వ్యవసాయం | 1 | | |
| 51. | ఇనాందార్లు – జాగీర్దార్లు | 2 | | * [illegible] |
| 52. | ప్రభుత్వ ఉద్యోగులు | 9 | | |
| | మొత్తం ప్రత్యేక స్థానాలు | 24 | | |
| | మొత్తం వెరసి | 140 | | |

ఇది మండలిలో మొత్తం స్థానాల సంఖ్య.

7. పై రెండు సందర్భాల్లో దేన్లోనైనా 140 మంది సభ్యులతో ఉండే మండలిలో దళిత వర్గాల ప్రతినిధులు 22 మంది ఉండి తీరాలని సభ కోరుతున్నది. 140 మంది సభ్యులుండే మండలిలో ఈ ప్రాతినిధ్యం మాత్రమే కనీస న్యాయం అని గట్టిగా చెప్పాలని సభ కోరుకుంటున్నది.కొంత మంది దీన్ని గొంతెమ్మ కోరిక అంటారని సభకు బాగా తెలుసు. కానీ దళితవర్గాల పట్ల ప్రతికూల అభిప్రాయం గల వారిదే ఇలాంటి అభిప్రాయంగా ఉంటుంది. ఏదో ఒక కచ్చితమైన హేతువు మీద మాత్రం ఆధారపడి ఉండదు. దళిత వర్గాల జనాభా సంఖ్యను గురించిన సరైన అవగాహన ఈ అభిప్రాయాన్ని మార్చగలదని సభ భావిస్తున్నది. ఎందుకంటే ఏ వర్గం ప్రాతినిధ్యాన్ని అంచనా వేయడానికి అయినా జనాభా ఒకటే ప్రమాణం అని ఎవరైనా అంగీకరించవలసిందే. అందువల్ల దళిత వర్గాల జనాభాను కచ్చితంగా లెక్కించడం అనేది అధిక ప్రాధాన్యం కలిగిన అంశం. బొంబాయి ప్రెసిడెన్సీలోకి దళిత వర్గాల వారు 1919 సంవత్సరం నాటి సౌత్‌బరో కమిటీ వల్ల ఇప్పటికే అన్యాయానికి గురయ్యారు. బొంబాయి ప్రెసిడెన్సీలోని దళిత వర్గాల కచ్చితమైన జనాభా సంఖ్యకు సంబంధించి కమిటీ తన నివేదికలో చాలా తప్పుడు సంఖ్యను పేర్కొన్నది.*1911 జనాభా లెక్కల్ని పరిశీలించిచూస్తే ఆ సంఖ్య ఏ మాత్రమూ సమర్థనీయం కాదు. సౌత్‌బరో కమిటీ చూపించిన సంఖ్య ఎంత తక్కువ అంటే భారత ప్రభుత్వం దళిత వర్గాలకు ఇవ్వదలచిన ఇద్దరు ప్రతినిధుల ఈషణ్మాత్ర ప్రాతినిధ్యాన్ని కూడా ఈ సంఖ్య సాధించలేదు. ఇప్పుడుకూడా దళిత వర్గాల జనాభా సంఖ్యను తగ్గించి చూపే ప్రయత్నం జరుగుతున్నది. ఉదాహరణకు ఫిబ్రవరి 23, 1928న శాసనసభలో భారత ప్రభుత్వం తరుపున శ్రీ బాజ్‌పాయ్ మాట్లాడుతూ ఇలా అన్నారు. "దళిత వర్గాల జనాభా సంఖ్య

* సౌత్‌బరో కమిటీ చేత పేర్కొనబడి, భారత ప్రభుత్వం అంగీకరించిన పట్టికలో ఇవ్వబడిన సంఖ్య 577, 516. సౌత్‌బరో కమిటీ ఆధారపడిన ప్రమాణం అనుసరించి 1911 సం॥లో బొంబాయి రాజ్యంలోని దళిత వర్గాల జనాభా 2,145,208.

చాలా పెంచి చెప్పారు. దళిత వర్గాల జనాభా సరైన సంఖ్య రెండు కోట్ల 85 లక్షలే కాని అంతకు ముందు చెప్పినట్లు ఆరుకోట్లు కాదు." సౌత్‌బరో కమిటీలాగా, తప్పుడు అంచనాను ఆధారం చేసుకొని ప్రస్తుత కమీషన్ కూడా తప్పుడు నిర్ణయాలు చేస్తుందేమోనని సభ భయపడుతున్నది. అందువల్ల భారత గణాంక శాఖ డైరెక్టర్ ఈ విషయంపై చెప్పిన అంశాలను కమీషన్ దృష్టికి సభ తెస్తున్నది. 1921 సెన్సస్ ఆఫ్ ఇండియా సంపుటం 1 అధ్యాయం 11లో డైరెక్టర్ ఇలా అన్నారు.

"పేరాగ్రాఫ్ 193 : ఈ మధ్య కాలంలో సమాజంలోని ఒక నిర్దిష్ట వర్గం ప్రజలను, 'దళిత వర్గాలు' అని పిలవడం సాధారణం అయిపోయింది. నాకు తెలిసిన మేరకు ఈ మాటకు అంతిమ నిర్వచనం లేదు. కచ్చితంగా 'దళిత వర్గాలు' అనే పదం ఎవరికి వర్తిస్తుందో తెలియదు. 1912 నుంచి 1917 వరకు జరిగిన విద్యాప్రగతిని తెలిపే ప్రతి పంచవర్షీయ సమీక్ష (అధ్యాయం XVIII పేరా 505లో) "దళిత వర్గాల విద్యాసహాయం, అభివృద్ధి అంశం' కింద ఈ దళిత వర్గాల వారి ప్రత్యేక ప్రస్తావన ఉంది. ఆ నివేదిక అనుబంధంలో దళిత వర్గాల కిందికి ఏయే కులాలు వస్తాయో ఒక పట్టికలో ఇవ్వబడింది. బ్రిటిష్ భారతదేశంలో మొత్తం హిందూ, గిరిజన జనాభాలో దళితవర్గాలు 19 శాతం కాని, మూడుకోట్ల 10 లక్షలు కాని ఉంటారని పేర్కొన్నారు. ఒక ప్రభుత్వ నివేదికలో బహిరంగంగా సామాజిక విలక్షణతల్ని ప్రకటించటం ఈర్ష్యా జనక హేతువు, ఇబ్బందికరం. కానీ, ఇంతకు ముందే ఆ పట్టికలు తయారుచేశారు. ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో దళితవర్గాలవారు వర్గచైతన్యాన్ని వర్గ సంస్థని ఇప్పటికే సాధించి ఉన్నారు. పరోపకార సంస్థలు ఆ వర్గాలకు ఇప్పటికే తమ ప్రత్యేక దళాల ద్వారా సేవచేశాయి. అదీగాక అసెంబ్లీలో అధికారికంగా స్థానాల్ని పొందారు. కాబట్టి, వాస్తవాల్ని ఎదుర్కోవడం ఉచితంగా భావించి దళితవర్గాల జనాభా సంఖ్యని సేకరించడమే సరైన పనిగా ఉంటుంది. అందువల్ల, సాధారణంగా దళిత వర్గాల కింద చేర్చబడే కులాల జనాభా అంచనాను జనాభా లెక్కల ఆధారంగా తెలపమని ప్రావిన్షియల్ సూపరింటెండెంట్‌లను నేను కోరాను. సంయుక్త పరగణాలు తప్ప భారతదేశంలోని తక్కిన అన్ని రాష్ట్రాల నుంచి కొన్ని జాతుల జనాభా పట్టికలు వచ్చాయి. సంయుక్త పరగణాల్లో దళిత వర్గాల జనాభా సంఖ్యను ఉజ్జాయింపుగా అంచనా వేయడానికి కూడా అధికారులకు వారి అధికారిక హోదాలోని హుందాతనం అడ్డుతగిలింది. ఇవ్వబడిన సంఖ్యలు కూడా ఏక రూపమైన ప్రమాణాలపై ఆధారపడి తయారు చేసినవి కావు. ఎందుకంటే, భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో ఒకే వర్గం యొక్క స్థితిని భిన్న దృక్పథాల నుంచి చూడడం జరిగింది. అందువల్ల, 1911 సంవత్సరం నివేదికలు, పట్టికలు విద్యానివేదికలోని సంఖ్యలను బట్టి మరికొంత సమాచారం పైన ఆధారపడి కొన్ని సందర్భాల్లో నేను అంచనాలను సవరించవలసి వచ్చింది. ఈ పట్టికలు కూడా ఇంతకు ముందు వివరించిన సాధారణ లోపానికి గురి అయినవే. ఎందుకంటే ఏ కులం జనాభా మొత్తాన్ని కూడా రికార్డు చేయలేదు. మొత్తానికి ఈ ఉజ్జాయింపు పట్టికను ఈ కింద యధాతథంగా ఇస్తున్నాను. ఈ సంఖ్యలు హిందూ సమాజంలోని దళితవర్గాల 'కనీస సంఖ్య'ల దరిదాపు అంచనాను తెలుపుతాయి. ఈ సంఖ్యలతో మొత్తం దళిత

వర్గాల జనాభా అయిదు కోట్ల 30 లక్షలకు పెరుగుతుంది. 1. అన్ని కులాల, గిరిజన జాతులు, ఇటీవలనే హిందూమతంలో కలిసిపోయిన అపవిత్రంగా భావించబడే ఆదిమజాతి తెగలతో సహా అనేక జాతుల గిరిజనుల సంఖ్యలను ఈ మొత్తం సంఖ్యలో కలపలేదు. కాబట్టి ఈ సంఖ్య కనీసం అయిందిగానూ, తక్కువ అంచనాగానూ మనం గమనించవలసి ఉంది. అపవిత్రంగా భావించబడే దళిత వర్గాలవారు భారతదేశంలో 5,6 కోట్ల వరకు ఉన్నారని మనం నమ్మకంగా చెప్పవచ్చు.

## భారతదేశంలో దళిత వర్గాల జనాభా

| రాష్ట్రాలు | 000'లు వదిలి వేయబడ్డాయి. |
|---|---|
| మొత్తం | 52,680 |
| అస్సాం | 2,000 |
| బెంగాల్ | 9,000 |
| బీహార్ అండ్ ఒరిస్సా | 8,000 |
| బొంబాయి | 2,800 |
| మధ్యపరగణాలు & బీరార్ | 3,300 |
| మద్రాస్ | 6,072 |
| పంజాబ్ | 2,893 |
| ఉత్తరప్రదేశ్ | 9,000 |
| బరోడా | 177 |
| మధ్యభారతదేశం | 1,140 |
| గ్వాలియర్ | 500 |
| హైదరాబాద్ | 2,339 |
| మైసూర్ | 932 |
| రాజపుటానా | 2,267 |
| తిరువాన్కూర్ | 1,260 |

8. గణాంక శాఖ డైరెక్టరు జాగురూకతతోను, నిశిత పరిశీలనతోను సిద్ధంచేసిన పై అంచనా భారత దేశంలో వివిధ రాష్ట్రాల్లో ఉండే దళిత వర్గాల జనాభాను గురించిన ఎన్నో అనుమానాలను

ఊహలను తప్పకుండా తోసిపుచ్చుతుంది. శ్రీ బాజ్‌పాయ్ అంచనాను కూడా ఇది తప్పని రుజువు చేస్తున్నది. రాష్ట్రాలలోని విద్యా నివేదికల మీద ఆధారపడే పై అంచనా వేయబడింది. ఈ నివేదికలనే తన ప్రకటనకు ఆధారంగా తీసుకున్నానని శ్రీ బాజ్‌పాయ్ చెప్పుకున్నారు. డైరెక్టరు అంచనా సరైనదేనని అంగీకరించాలి. ఎందుకంటే, సుదీర్ఘమైన విచారణతో కూడిన దర్యాప్తు తర్వాతనే ఈ అంచనా వేసినట్లు డైరెక్టరు చెప్పారు. ఏ ఇతర అంచనాలకంటే ఈ అంచనాకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలని రాజ్యాంగ కమీషన్‌కు సభనొక్కి చెప్తున్నది. ఈ అంచనా మేరకు బొంబాయి ప్రెసిడెన్సీలో దళితవర్గాలు మొత్తం జనాభాలో 10.8 శాతం ఉంది. వారి జనాభా సంఖ్యనుబట్టే దళిత వర్గాలు 140 స్థానాల్లో 15 స్థానాలకు హక్కు కలిగి ఉన్నారు.

9. ఏదైనా వర్గం జనాభా సంఖ్య మాత్రమే దానికి ప్రాతినిధ్యం ఇవ్వడానికి ఏకైక కారణమయితే, దళితవర్గాలకు అదనంగా అడిగే 7 స్థానాలు అనార్జిత పెంపుదల కిందికి వస్తాయి. అయితే ఈ విధమైన విషయాలను నిర్ణయించడంలో వర్గాల జనాభా మాత్రమే ఏకైక కారణంగా తీసుకోగూడదని అంగీకరించవలసి ఉంది. వర్గాల ప్రాతినిధ్యం కోటా నిర్ణయించడానికి పరిగణించవలసిన కారణాల్లో ఆ వర్గాల స్థాయి కూడా తక్కువ ప్రాముఖ్యంగల అంశం కాదు. వర్గాల స్థాయి అంటే, సంఘ పోరాటంలో అది తమను తాము రక్షించుకొనే సమర్థత అన్న అర్థంలో తీసుకోవాలి. విద్యా, ఆర్థిక స్థితులపై ప్రత్యక్షంగా ఆ వర్గాలస్థాయి ఆధారపడి ఉంటుంది. అందువల్ల వర్గాల స్థాయి ఎంత తక్కువైతే అంత ఎక్కువగా ఇతరులకంటే ఎన్నిక సంబంధమైన ప్రయోజనాలు కల్పించాలి అన్న సిద్ధాంతాన్ని ఇక్కడ అనుసరించాలి. బొంబాయి ప్రెసిడెన్సీలో దళిత వర్గాల స్థాయి అటు విద్యా సంబంధంగానూ, ఇటు ఆర్థిక సంబంధంగానూ చాలా తక్కువ ప్రమాణంలో ఉందనడంలో రెండు అభిప్రాయాలు లేవు. పర్యవసానంగా దళిత వర్గాలు వారి జనాభా సంఖ్యను బట్టే గాక అదనంగా కూడా ఎన్నికసంబంధమైన ప్రయోజనాలకు హక్కు పొందుతున్నారు. దళితవర్గాల స్థాయితో జనాభాలో సమానమైన ఇతర ఏ వర్గానికంటే గూడా ఎక్కువ ఎన్నిక సంబంధమైన ప్రయోజనాలను దళితవర్గాలకు కల్పించడం తప్పనిసరి. దళిత వర్గాలంత ఎక్కువగా ఏ వర్గమూ అణగారి లేదు. దళిత వర్గాలంత ఎక్కువగా భయంకర అనర్హతలను ఏ వర్గమూ మోయడం లేదు. దళిత వర్గాలు తమ హీన జీవన స్థాయినుంచి పైకి రాలేకపోవడానికి ఈ అనర్హతలే కారణం. దళిత వర్గాలకు ప్రాతినిధ్యం పెంపుదల అడగడానికి ఈ అంశాన్ని ఒక కారణంగా చూపడం న్యాయసమ్మతమేనని సభ భావిస్తున్నది. దళితవర్గాలకు అదనపు ప్రాతినిధ్యాన్ని సభ అడగడం న్యాయసమ్మతం అనడానికి మరో కారణం ఉంది. అల్ప సంఖ్యాక వర్గాలు తమను తాము రక్షించుకోవడానికైనా వారి ప్రాతినిధ్యం కార్యసాధకంగా ఉండాలి. అలా కాకపోతే అది ఒక బూటకం అవుతుంది. లేదంటే ఒక అల్పసంఖ్యాకవర్గం పూర్తిగా, అణగారి పోకుండా కాపాడడానికి ఆ అల్పసంఖ్యాకవర్గానికి తగినంత మంది ప్రతినిధులు ఉండాలనే అంశాన్ని గుర్తించాలి. ఈ అంశాన్ని ఒక ప్రతిపాదన రూపంలో ఉంచాలంటే తమ ప్రాతినిధ్య పరిమాణం ఇతర వర్గాల చేతుల్లో ఓడి పోకుండా ఉండేంత ఎక్కువగా ఉందనే భావాన్ని

అల్పసంఖ్యాక వర్గం కలిగి ఉన్నట్లయితే, ఆ ప్రాతినిధ్యం సరిపడినంత ఉన్నట్లు భావించవచ్చు. అదనపు ప్రాతినిధ్యం రావలసి ఉందని అడగడంలో, దళిత వర్గాలు ఈ సిద్ధాంతాన్ని తమకు అనుకూలంగా ప్రతిపాదించు కొంటున్నారని సభ భావిస్తున్నది. ఈ సిద్ధాంతం దేశంలోని ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకు కూడా దళిత వర్గాలకు మాదిరిగా వర్తించేదే.

**అన్ని అల్పసంఖ్యాక వర్గాలను నిష్పక్షపాతంగా ఆదరించవలసిన ఆవశ్యకత:** సౌత్‌బరో కమిటీ నివేదికను సమీక్షిస్తూ భారత ప్రభుత్వం చేసిన ప్రకటనలో ప్రాతినిధ్య పరిధిని నిర్ణయించే సిద్ధాంతాలను నిర్దేశించారు. భారతదేశం మొత్తంలో ఈ సిద్ధాంతాలను వర్తింపజేయడానికి మిగతా వర్గాలకన్నా దళితవర్గాలు మరింత అర్హమైనవని చెప్పాలని సభ కోరుకుంటున్నది. కానీ, ఆచరణలో, ఈ సిద్ధాంతాలవల్ల వచ్చే లాభాన్ని దళితవర్గాలకు భారతదేశం అంతటా నిర్దాక్షిణ్యంగా నిరాకరించారు. దళిత వర్గాలకు కల్పించవలసిన ఈ ప్రయోజనాన్ని ఒక బలమయిన, అభివృద్ధి చెందిన వర్గమైన మహమ్మదీయులకు ధారాళంగా కల్పించారు. ఇలాంటి అసమాన పరిగణకు దృష్టాంతంగా చూపడానికి సభ ఈ కింద నిదర్శనాలను సంఘం దృష్టికి తెస్తున్నది.

| రాష్ట్రాలు | ముస్లిం జనాభా | ముస్లింలకు ఇచ్చిన స్థానాలు | దళితవర్గాల జనాభా | దళితవర్గాలకు ఇచ్చిన స్థానాలు |
|---|---|---|---|---|
| సంయుక్త పరగణాలు | 5,74,276 | 11 | 3,060,232 | 2 |
| బొంబాయి ప్రెసిడెన్సీ | 1,207,443 | 7 | 1,627,980 | 1 |

దళిత వర్గాలకు ఈ విధంగా చేసిన అన్యాయం ఎవరికి ఎంత ఆగ్రహం కలిగించినా భారత ప్రభుత్వం మాత్రం ఈ విషయంలో ఏ మాత్రం సిగ్గుపడడంలేదు. కారణం, మహమ్మదీయులకు అన్వర్తింపజేయాలనే పరిమిత ఉద్దేశ్యంతోనే భారతప్రభుత్వం బాహాటంగా ఈ సిద్ధాంతాల్ని ప్రతిపాదించింది. భిన్న వర్గాల రాజకీయ ప్రాధాన్యాన్ని బట్టే భారత ప్రభుత్వం ఇలాంటి ప్రత్యేకతని చూపిస్తున్నదని అందరికీ తెలిసినదే. ఇలా రాజకీయ ప్రాధాన్యాన్ని బట్టి ఒక దేశంలోని పౌరులను వర్గీకరించడాన్ని సభ వ్యతిరేకిస్తున్నది. రాజకీయంగా అన్ని వర్గాలు సమ ప్రాధాన్యం కలవే అన్న సిద్ధాంతంకంటే సురక్షితమైన, సంక్షేమ సిద్ధాంతం మరొకటి లేదు. ఈ అన్యాయ జనకమైన విలక్షణత్వం అన్ని వర్గ కల్లోలాలకు మూలకారణం మాత్రమేగాక 'సమాన అవకాశ' సిద్ధాంతాన్ని నాశనం చేసేదికూడా. భారతదేశ పరిపాలనలో పార్లమెంటు ఆమోదించిన మొదటి విడత సంస్కరణలలో ప్రవేశపెట్టిన ఈ సిద్ధాంతం దళిత వర్గాల ప్రయోజనాలకు ఎంతో అనర్థాన్ని కల్గించింది. ఇప్పటి ప్రభుత్వ కార్యదర్శి దళితవర్గాల ఉనికిని గుర్తించి వారి సమస్యను తీవ్రంగా పరిశీలించవలసిన సమస్యగా భావించి ఇప్పటికే ప్రవేశపెట్టిన రాజకీయ సంస్కరణల పరిధిని మరింత విస్తృతం చేసే విషయంలో ఈ అంశాన్ని గూడా చేర్చినందుకు సభ సంతోషిస్తున్నది. అయితే, ఇప్పుడు ప్రవేశ పెట్టబోయే దేశ రాజ్యాంగ చట్టంలో చేయబోయే మార్పుల్లో ఈ సమస్యను చేర్చకపోతే

దళితవర్గాలపై ఇప్పుడు చూపుతున్న పరిగణన అంతా వృథా అని తెలియజేయాలని సభ ఆందోళన పడుతున్నది.

*11. ప్రాతినిధ్యం తీరు :* దళిత వర్గాలకు నామినేషన్ పద్ధతిని సభ వ్యతిరేకిస్తున్నది. ఎన్నికల సిద్ధాంతాన్ని దళిత వర్గాలకు కూడా విస్తరించాలని సభ గట్టిగా కోరుతున్నది. బాధ్యతగల ప్రభుత్వం దృష్టిలో చూసినపుడు ఎన్నికలు సిద్ధాంతపరంగా సరైనవి. రాజకీయ విజ్ఞాన దృక్కోణాన్నించి చూసినపుడు ఆచరణలో కూడా అవి అవసరమైనవే. ప్రతి వర్గానికీ రాజకీయ విజ్ఞానం సంపాదించే అవకాశం ఉండాలి. అది వోటు హక్కుద్వారా మాత్రమే వస్తుంది. ఏ ఇతర వర్గం కన్నా దళితవర్గాలకు రాజకీయ విజ్ఞానం ఎక్కువ అవసరం.. అలాంటి రాజకీయ విజ్ఞానాన్ని దళితవర్గాలకు నిరాకరించడం దురదృష్టంగా భావించవలసి ఉంది. భారతదేశంలో వేగంగా అభివృద్ధి చెందుతున్న రాజకీయ జీవితంలో పాలుపంచుకునే అవకాశాన్ని దళిత వర్గాలు కోల్పోయాయి. దళిత వర్గాలకు ఎన్నికలు అవసరం అని చెప్పడానికి మరొక కారణం కూడా ఉంది. మంత్రిపదవి చాలా ముఖ్యమైన విశేషాధికారం. దాన్ని దళిత వర్గాలు పోగొట్టుకోజాలవు. ప్రభుత్వవిధానాన్ని ప్రభావితం చేయగలిగే దేశ మంత్రి వర్గంలో స్థానం ఉంటే తప్ప కేవలం రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టడం ద్వారా దళిత వర్గాలకు పెద్ద ప్రయోజనం కలగదు. వారి సొంత ప్రతినిధుల్ని ఎన్నుకొనే ఈ అవకాశాన్ని నిరాకరించినంతవరకు దళితవర్గాలకు ఈ అవకాశాన్ని నిరాకరించనట్లే అవుతుంది. ఎందుకంటే, నామినేట్ చేయబడిన సభ్యులు బాధ్యతాయుత ప్రభుత్వంలో పదవులకు అనర్హులు. దళిత వర్గాలకు ఈ హక్కును లేకుండా చేసే నామినేషన్ పద్ధతి వంటి ప్రాతినిధ్య విధానం గర్హనీయమే గానీ ప్రశంసనీయం కాదు.

12. దళిత వర్గాలకు ఎన్నికల సిద్ధాంతాన్ని అన్వయించడానికి సాధారణంగా రెండు ఆక్షేపణలు తెలుపుతుంటారు.

**(ఎ) నియోజకవర్గాల ఏర్పాటు కష్టం :** ఈ ఆక్షేపణలో నిజాయితీ లేదు. కాబట్టి తీవ్రపరిశీలనకు అర్హమైనది కాదని కొట్టి వేయవలసిందిగా సభ భావిస్తున్నది. ఒక వేళ నియోజక వర్గాల ఏర్పాటు విషయంలో ఇబ్బంది అన్న భావనతో దళిత వర్గాలకు ఎన్నికల బదులు నామినేషన్ పద్ధతి అన్వయించి ఉంటే, మహమ్మదీయులు, యురోపియన్లకు ఎన్నికల సిద్ధాంతాన్ని అన్వయింపజేయడానికి ప్రభుత్వం ఎలా ముందుకు వచ్చిందో అర్థం కావడం లేదు. మహమ్మదీయులు, యురోపియన్‌లు దళిత వర్గాల ప్రజలకంటే తక్కువ చెదురు మదురుగా ఏమీ లేరు. వారికి ఇప్పుడు ఉండే నియోజక వర్గాలతో సహా నియోజకవర్గాల ఏర్పాటు వీలుకాదు. ఈ సంగతిని అసంగతం అని కొట్టి పారేయడానికి తర్క బద్ధ దృష్టితో చూస్తే వీలు కాదు. ఈ వర్గాల కోసం అనురూప నియోజక వర్గాలు ఏర్పరచడం సాధ్యపడదని తెలుసుకొని అననురూప నియోజక వర్గాలను బొంబాయి ప్రభుత్వం నిసిగ్గుగా ఏర్పరచింది. అయితే సభ సిద్ధం చేసిన ప్రాతినిధ్య ప్రణాళికలో దళిత వర్గాలకు నియోజక వర్గాలు ఏర్పరచడంలోని అన్ని ఇబ్బందులు తొలగించబడ్డాయి. సమస్య ఇలా సరళీకరించబడి

నందువల్ల ఇప్పుడు నామినేటెడ్ సిద్ధాంతానికి మారుగా ఎన్నికల సిద్ధాంతాన్ని చేపట్టడానికి ఆక్షేపణ తెలపవలసిన పనిలేదు.

*(బి) తగినంత ఎక్కువమంది వోటర్లను పొందడంలో కష్టం :* శాసనమండలికి దళిత వర్గాల ఎన్నికను నిజమైన ఎన్నికగా చేయడానికి ఏ నియోజక వర్గంలో అయినాసరే తగినంతమంది వోటర్లున్నారా? నామినేషన్ స్థానంలో ఎన్నికలను ప్రవేశపెట్టడం కష్టం అనడానికి ఈ అంశాన్ని చూపించి 'లేరు' అని వారే జవాబు చెబుతుంటారు. ఇప్పటి వోటుహక్కు స్థాయిని ఏ మాత్రం మార్చకుండా అలాగే కొనసాగిస్తే, పైన పేర్కొన్న ఇబ్బంది అలానే ఉంటుందని, దళిత వర్గాలలో చాలా తక్కువ మంది వోటర్లే ఉంటారని సభ అంగీకరిస్తున్నది. ప్రస్తుతం ఉండే వోటు హక్కుస్థాయి సమర్థనీయం కాదని సభ భావిస్తున్నది. అది బాధ్యతాయుత ప్రభుత్వాన్ని అపహాస్యం పాలు చేస్తున్నది. ఇప్పుడు అమల్లో ఉన్న విధానంలో వోటుహక్కు పొందిన కేవలం 7 లక్షల వోటర్ల చేత 2 కోట్ల మంది ఉండే మొత్తం బొంబాయి ప్రెసిడెన్సీ పరిపాలించబడుతున్నది. పేరుకి మాత్రంగా గాక నిజంగానే బాధ్యతాయుత ప్రభుత్వంగా ఉండాలనుకుంటే భవిష్యత్తులో ఇలాంటి దుష్టపరిస్థితులు కొనసాగకుండా చూడాలి. సంస్కరణలు కావాలని గట్టిగా కోరే వారున్న వర్గం కూడా వోటు హక్కు విషయంలో తగినంత ఒత్తిడి తీసుకురాకపోవడం శోచనీయం. ఆ వర్గం ఉద్దేశ్యం ప్రజాస్వామ్యంగా పేర్కొన్నప్పటికీ, నిజం చెప్పవలసి వస్తే, బర్మా ప్రభుత్వం మాటల్లో ఇలా చెప్పవచ్చు. "వారు ప్రజాస్వామ్య దేశం కోరుతున్నారు కాబట్టి ప్రజాస్వామ్య సంస్థలకు అనుకూలంగా ఉన్నారు. అయితే వారు ప్రజాస్వామ్యం కావాలనుకుంటూ ఉంటే 'జనసామాన్యాన్ని' వదిలి వేయలేరు. సంస్కరణలు కోరడంలో వారి ముఖ్య ప్రయోజనం ఏమిటంటే కార్యనిర్వాహక వర్గం నుంచి వారు సాధించుకుందాం అనుకొంటున్న అధికారాలే. సత్యార్థంలో గ్రామీణ వోటర్ల విస్తృతమైన వోటుహక్కు, బాధ్యతా యుతమైన వోటింగు వారి కోరికలో ముఖ్యోద్దేశ్యం కాదు. ఎంతకాలం తాము కోరిన అధికారం చెలాయించగల శాసనమండలి సభ్యుల్ని తమవర్గం సమకూరుస్తూ ఉంటుందో, అంతకాలం తాము కొద్దిమంది వోటర్లకు ప్రాతినిధ్యం వహిస్తున్నారా? లేక అత్యధిక వోటర్లకు ప్రాతినిధ్యం వహిస్తున్నారా అన్నది ఆ వర్గానికి అవసరం." ముఖ్య సమస్య అయినా వోటు హక్కు విషయంలో భారతీయ రాజకీయ వేత్తల ఉదాసీనతకు ఇది సరైన కారణమో, కాదో చెప్పలేము. కానీ, కాంగ్రెసు రాజకీయాల్లో అధికార బదిలీల అంశంతో పోల్చి చూస్తే వోటు హక్కు విషయం చాలా అప్రధాన అంశంగా ఉంది. అధికార బదిలీ సమస్య వోటుహక్కు సమస్యల మధ్య ఉండే నిజమైన సంబంధం విషయంలో కాంగ్రెసు రాజకీయ వేత్తలకు వ్యతిరేక వైఖరి ఉందని సభ అభిప్రాయపడుతున్నది. ఏ శక్తులు ప్రస్తుతం పరిపాలనను నిర్వహిస్తున్నాయో అవే శక్తులను వీటికి సంతృప్తికరమైన ప్రత్యామ్నాయ శక్తులు వాటి స్థానాన్ని ఆక్రమించే వరకు ఉపసంహరించకూడదు అన్న ప్రభుత్వ సిద్ధాంతం అంగీకరించవలసిందే. ఉన్న విషయాలను సరైన దృక్కోణం నుండి చూసే అన్ని వర్గాలూ అంగీకరించదగిందే. ఇప్పుడు ఈ ప్రత్యామ్నాయాలు వోటర్లే అన్నది స్పష్టం. అందువల్ల భారత

ప్రభుత్వంలో ప్రవేశ పెట్టబోయే బాధ్యత పరిధి, బాధ్యత తీరు వోటర్ల సంఖ్య మీదనే ఆధారపడి ఉంటుంది. వోటింగు హక్కు సమస్య ఎంత ఆయువుపట్టుగా ఉంటుందంటే దాన్ని గురించిన దృఢ నిశ్చయం మీదనే రాజకీయ అధికారం బదలాయింపు పరిమాణం ఆధారపడి ఉంది. కాబట్టి వోటింగు హక్కు సమస్య చాలా చాలా ప్రధానమైనదిగా ఉండాలి. ఇప్పుడు నిర్ణయించిన విధానం వల్ల, ప్రాతినిధ్య ప్రభుత్వం ముఖ్య ఉద్దేశ్యమే తుడిచి పెట్టుకుపోయింది. వోటుహక్కు అంటే సహ జీవనానికి నిబంధనలను నిర్ణయించే హక్కు. వోటుహక్కు ఇంతకంటే మరేమీ తెలపదు. వోటుహక్కు తాత్పర్యం ఇదైనపుడు సంఘంలో ఇతర వర్గాలతో బేరమాడడంలో అల్ప శక్తులైన వారికి తప్పనిసరిగా వోటుహక్కు ఇవ్వాలి. ఎందుకంటే, ఉన్నత వర్గాలు నిర్ణయించే సహజీవన నిబంధనలు తమకు అననుకూలంగా ఉన్నప్పటికీ వాటిని అంగీకరించవలసిన ప్రమాదం వీరికి ఉంటుంది. కాబట్టి, ఇదే నిజమైతే వోటుహక్కు అనే మాటను మనం సరిగా అర్థం చేసుకుంటే వోటుహక్కు వీలున్నంత దిగువ స్థాయివరకూ ఉండాలి. సంఘంలో పేదవారైన చాలామందిని, అణగత్రొక్కబడిన వర్గాలను కలుపుకునేంత చిట్టచివరి స్థాయిలో ఆ వోటుహక్కు ఉండాలి. ప్రాతినిధ్య ప్రభుత్వానికి ఇలాంటి వోటు హక్కు ప్రాతిపదిక. వోటుహక్కు అనే పదాన్ని సరైన అర్థంలో తెలుసుకొంటే 'పయోజన వోటింగు హక్కు' అనే అర్థం వస్తుంది. తాలూకా లోకల్ బోర్డులకు ఉండే ఇప్పటి వోటుహక్కు స్థా..ుని గ్రామీణులకు బొంబాయి ప్రెసిడెన్సీలోని నగరాల్లో నెలకు 3 రూపాయల అద్దె ఇచ్చే వారికి శాసనమండలిలో వోటింగు హక్కు ఇచ్చే పక్షంలో సభ సంతృప్తి పడుతుంది. మరీ, ఇంత తక్కువ స్థాయిలో వోటింగు హక్కు ఉంటే తెలివి హీనులైన ప్రజలలో చాలా మంది వోటర్లుగా వచ్చేస్తారేమో అని ప్రభుత్వం తరచూ భయపడుతుంటుంది. ఈ భయం ఆధారరహితం. ఎక్కువ ఆస్తి ఉండడం అజ్ఞానానికి అసంగతమైందేమీ కాదు. నిరుపేద తనం ఉన్నతశ్రేణి మేధావితనానికి అనురూపమైందేమీ కాదు. ఆస్తి ఒక్కొకసారి వివేకాన్ని మొద్దుపరుస్తుంది కూడా. పేదతనం వివేకాన్ని నేర్పుతుంది. కాబట్టి, అజ్ఞానానికి బీమాగా ఎక్కువ ఆస్తి అర్హతను ప్రభుత్వం భావించడం మూఢనమ్మకం మాత్రమే. జనసామాన్యానికి వారి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనే హక్కును నిరాకరించడం కోసమే ఉన్నత వర్గాలు అతి జాగ్రత్తగా ఈ మూఢనమ్మకాన్ని పెంచి పోషిస్తే ప్రభుత్వం దానిని ప్రోత్సహించింది.

*13. ఎన్నికల పద్ధతి :* దళిత వర్గాలకు సంబంధించినంతవరకు సాధారణ నియోజక వర్గాల్లో స్వేచ్ఛాయుత ఎన్నిక అసంభవమైనదని సభ అభిప్రాయం. అలాగని సభ కులనియోజక వర్గాలు కావాలని కోరుకోవడం లేదు. సాధారణ నియోజకవర్గాల్లో దళిత వర్గాలకు కొన్ని రిజర్వుడు స్థానాలు కల్పిస్తే సరిపోతుందని సభ అభిప్రాయం. ఎన్నికలకు దళిత వర్గాల అభ్యర్థులకు నివాససంబంధితమైన అర్హతను తొలగించాలని, డిపాజిట్ సంబంధిత నిబంధనలో ఎంతోకొంత సడలింపు ఇవ్వాలని సభ అభ్యర్థిస్తున్నది.

*14. అసెంబ్లీలో ప్రాతినిధ్యం :* 1919 సంవత్సరంలో శాసన సభలో దళిత వర్గాల హక్కును

గుర్తించకపోవడాన్ని సభ వినయ పూర్వకంగా వ్యతిరేకిస్తున్నది. ప్రత్యక్షంగా తన స్వాధీనంలో ఉండే ప్రాంతంలోగానీ లేదా రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన రిజర్వుడు సగభాగంలో గానీ ఉండే అన్ని ముఖ్య విషయాలను నిర్ణయించడంలో భారత ప్రభుత్వం ఇప్పటికీ సర్వోన్నతమైనదే. బదలాయించిన అంశాలమీద కూడా భారత దేశ ప్రభుత్వానికి అజమాయిషీ చేసే అధికారం ఇప్పటికీ ఉంది. అందువల్ల ఇంత విస్తృత అధికారాల దిశగా దళిత వర్గాలకు కొంతైనా అధికారం ఉండాలనడం సరైనదే. అందుచేత బొంబాయి ప్రెసిడెన్సీ స్థానిక శాసనమండలిలోని దళిత వర్గ సభ్యులు శాసన సభకు ముగ్గురు దళిత వర్గాల ప్రతినిధులను ఎన్నుకోవాలని సభ కోరుతున్నది.

## 2. హామీల ద్వారా రక్షణ

15. దళిత వర్గాలకు ప్రాతినిధ్యమేగాక కొన్ని నిబంధనలను దేశ రాజ్యాంగంలో పొందుపరచి, దానిల్లో మూలభాగంగా బొంబాయి ప్రెసిడెన్సీలో అల్ప సంఖ్యాకులుగా ఉన్న దళిత వర్గాలకు పౌరహక్కులకు హామీ ఇవ్వాలని కూడా సభ కోరుతున్నది. ఆ హామీ దళిత వర్గాల ప్రయోజనాలకు సంబంధించిన ఈ కింద ప్రతిపాదనలను గుర్తించవలసి ఉంటుంది.

1. దళిత వర్గాల విద్య అనే అంశాన్ని రాష్ట్ర ఆదాయంలో మొదటి ఖర్చుగా పరిగణించాలి. విద్యా వ్యయంలో నిష్పక్షపాతమైన, ఖచ్చితమైన భాగాన్ని దళిత వర్గాల విద్యకోసం కేటాయించాలి.
2. దళిత వర్గాలకు సైనిక, పోలీసు బలగాల్లో కులానికి పరిమితం చేసినట్లు కాకుండా నిర్నిబంధంగా ఉగ్యోగాలు ఇవ్వాలి.
3. అన్ని సివిల్ సర్వీసుల్లోని గెజిటెడ్, నాన్-గెజిటెడ్ ఉద్యోగాలన్నిటి నియామకాల్లో 30 సంవత్సరాల పాటు దళిత వర్గాలకు ప్రాధాన్యం ఇచ్చే హక్కును గుర్తించాలి.
4. ప్రతి జిల్లాలోని స్పెషల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీసు ఉద్యోగాన్ని పొందడం దళిత వర్గాల హక్కుగా గుర్తించాలి.
5. స్థానిక సంస్థలలో (పైన నిర్వచించినట్లు) కార్య సాధక ప్రాతినిధ్యాన్ని దళిత వర్గాల హక్కుగా రాష్ట్ర ప్రభుత్వం గుర్తించాలి.
6. రాష్ట్ర ప్రభుత్వం ఒకవేళ ఈ హక్కులను ఉల్లంఘించినట్లయితే భారత ప్రభుత్వానికి అప్పీలు చేసుకొనే హక్కుని దళిత వర్గాలకు ఇవ్వాలి. ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం కట్టుబడి ఉండేటట్లు ఆదేశించే అధికారం భారత ప్రభుత్వానికి ఇవ్వాలి.

*16. అటువంటి హామీల సమర్థన :* దళిత వర్గాలకు శాసన మండలిలో తగినంత ప్రాతినిధ్యం ఇవ్వబడింది. ప్రాతినిధ్యం లేని మైనారిటీల విషయంలో మాదిరిగా వారి హక్కులకు భంగం ఉండదు. అలాంటప్పుడు ఎందుకు ఈ హామీలు ఉండాలి? అని ఎవరైనా వాదించవచ్చు. అధిక సంఖ్యాక వర్గం

వారి నిరంకుశత్వం నుండి అల్పసంఖ్యాక వర్గాలను కట్టుదిట్టంగా రక్షించే సామర్థ్యం ప్రాతినిధ్య తరహా ప్రభుత్వానికి ఉంటుందనడాన్ని సభ శంకిస్తున్నది. ఈ సందర్భంలో జాన్ స్టూవర్ట్ మిల్ చెప్పిన అంశాలను కమీషన్ దృష్టికి సభ తెస్తున్నది."ప్రజలు తమమీద తమకున్న అధికారాన్ని హద్దుల్లో ఉంచుకోవలసిన అవసరం లేదన్న భావం స్వతస్సిద్ధాంశం. ప్రజాప్రభుత్వాన్ని కల గంటున్నప్పుడో లేదా భూత కాలంలో అలా ఉండి ఉంటుందిలే అనుకొన్నప్పుడో మాత్రమే ఈ అంశం చెల్లుతుంది. స్వపరిపాలన అనే పదం గానీ ప్రజలకు తమ మీద స్వీయ అధికారం అనే అంశం గానీ ఈ సమస్య నిజస్వరూపాన్ని సరిగా తెలపడం లేదని స్పష్టమై పోయింది. అధికారాన్ని చెలాయించే ప్రజలు, ఎవరిపైన అయితే అధికారం చెలాయించబడుతున్నదో ఆ ప్రజలు ఎన్నడూ ఒకటి కారు, అలాగే స్వయం పరిపాలన అనేది కూడా ఏ ఒక్క వ్యక్తిదీ కాదు. అది అందరికీ చెందిన ఒక వ్యక్తిది. అంతేగాక, ప్రజల ఇష్టం అంటే ఆచరణలో ఎక్కువ మంది ప్రజల ఇష్టం అని – లేదా ప్రజల్లో చాలా చురుకైన వారి పక్షానిదని. అధిక సంఖ్యాకులుగా ఇతరులచేత తమని అంగీకరింపజేసుకొన్న వారిదని అర్థం. తత్ఫలితంగా ఇలాంటి ప్రజలు తమలోనే కొందరిని పీడించాలని కోరుకునే అవకాశం ఉంది. అందువల్ల అధికార దుర్వినియోగం జరగకుండా ఆపడానికి జాగ్రత్తలు అవసరం. కాబట్టి ప్రభుత్వ అధికారం మీద ఇలాంటి అదుపు ఉన్నప్పటికీ అది ప్రభుత్వ ప్రాధాన్యాన్ని తగ్గించినట్లు కాదు. ప్రభుత్వంలో అతి బలమైన భాగం అయిన సమాజానికి అధికారులుగా ఉండేవాళ్ళు సక్రమంగా జవాబుదారులుగా ఉంటే చాలు. ఇలాంటి దృక్కోణాలు యూరప్ సమాజంలోని మేధావుల వివేకానికి, దాన్ని ఇష్టపడే ఆ ఇతర ముఖ్య వర్గాలవారికీ సమానంగా ప్రజా ప్రభుత్వాన్ని సిఫారసు చేస్తున్నాయి. వారి నిజమైన ప్రయోజనాలు లేదా ఆరోపిత ప్రయోజనాలకు ప్రజా ప్రభుత్వం విరుద్ధమైనా అది సునాయాసంగానే నిలదొక్కు కుంది. అధిక సంఖ్యాకుల నిరంకుశత్వం సంఘ విరుద్ధమైన అరిష్టాల్లో ఒకటని, దీనినుండి సంఘం తనను తాను రక్షించుకోవలసి ఉన్నదని రాజకీయ ఆలోచనల్లో భావించబడుతున్నది."

17. దీన్నిబట్టి తేలేదేమిటంటే, ప్రాతినిధ్య ప్రభుత్వం ఏ దేశంలోనైనా అల్పసంఖ్యాకుల ప్రయోజనాలను రక్షించవలసిన హామీల అవసరాన్ని కొట్టి పారేయలేదు. పైగా ప్రాతినిధ్య ప్రభుత్వం అల్ప సంఖ్యాకులకు రక్షణ కల్పించగలిగిన సాధనం కాదు. అల్ప సంఖ్యాకులకు భద్రత కలిగించే హామీ లేకుండా ప్రభుత్వం ఏర్పాటు చేస్తే అది చాలా అపాయకర ప్రయోగం అవుతుందని కచ్చితంగా చెప్పవచ్చు. యుద్ధానంతర యూరప్ చరిత్రలో ఈ అంశానికి బోలెడన్ని దృష్టాంతాలున్నాయి. మిత్ర రాజ్యాలగు చెకొస్లోవేకియా, ఆస్ట్రియా, హంగరీ, రుమేనియాల మధ్య కుదిరిన శాంతి ఒప్పందాలు, 'అప్పర్ సైలీషియా' విషయంలో కుదిరిన పోలిష్ జర్మన్ ఒప్పందం మొదలైన వాటిల్లో అల్పసంఖ్యాక వర్గాల సంక్షేమానికి హామీ ఇచ్చే నిబంధనలను చేర్చారు. అల్ప సంఖ్యాకుల భద్రతకోసం కేవలం ప్రాతినిధ్య ప్రభుత్వం మీద ఆధారపడడానికి వీలు లేదని, హక్కులకు హామీల రూపంలో భద్రత కల్పించుకోవడం తప్పనిసరి అని పై సంగతి తేటతెల్లం చేస్తున్నది.

18. ప్రాతినిధ్య ప్రభుత్వం – యూరోపియన్ ప్రజల్లోనే అందునా రాజకీయాలు మతానికి అతీతంగా ఉన్న చోటనే ఇంత బలహీనంగా ఉన్నపుడు రాజకీయాలు అంటే ఆచరణలో ఉన్న మతశాస్త్రంగా ఉన్న భారతదేశంలో మరెంత బలహీనంగా ఉంటుందో? ఈ మత శాస్త్రం నుండే దళిత వర్గాలు రక్షణ కోరవలసి ఉంది. నిజమైన పౌరసత్వానికి ఈ మత శాస్త్రం ఎంత హాని కరమైందో గౌరవనీయ సర్ అలెగ్జాండర్ కారడివ్ భారత ప్రభుత్వానికి డిసెంబర్ 1918 నాడు రాసిన లేఖలో చక్కగా సూచించారు. అందులోని కొన్ని భాగాలను కింద ఇస్తున్నాం. "2. ప్రజాస్వామ్య భావన నేటి భారత ప్రజల్లో ప్రచారంలో ఉండే తాత్విక ధోరణికి అనుగుణంగా ఉందా? అని మొదట ప్రశ్నించవచ్చు. ఆధునిక ప్రజాస్వామ్య రాజ్యం యొక్క మూల సిద్ధాంతం ఏమిటంటే వ్యక్తి విలువను గుర్తించాలి. ప్రతివ్యక్తికీ ఒకే ఒక జీవితం ఉంటుందని, ఆ జీవితంలోనే సాధ్యమైనంత అభివృద్ధి సాధించే అవకాశం అతనికి ఇవ్వాలి అని. ఈ రెండు ప్రతిపాదనల్లో దేనిని కూడా ప్రస్తుత భారతీయ తాత్విక ధోరణి అంగీకరించడం లేదు. ప్రస్తుత జన్మ ప్రతివ్యక్తి జీవిత పరంపరలో ఒకటిగా భావించబడుతున్నది. ఈ జన్మలోని ప్రతివ్యక్తి స్థితి పూర్వ జన్మల్లోని మంచి చెడ్డల్ని బట్టి నిర్ణయించబడింది. అందుచేత సాంఘిక వ్యవస్థలో అతని అంతస్థు మార్చడానికి వీలుగాకుండా నిర్ణయించబడింది. దాన్ని మార్చ కూడదు. అందువల్ల, వేల సంవత్సరాల తరబడి భారత దేశంలో ప్రజల విశ్వాసాల ఉమ్మడి సొత్తుగా రూపుదిద్దుకొని ఉండే భావనలు ప్రజాస్వామ్య మూల సూత్రాలకు విరుద్ధంగా ఉంటాయని కచ్చితంగా చెప్పవచ్చు."

"3. ఈ జీవితంలో ప్రతి వ్యక్తి స్థితి పూర్వ జన్మల్లోని అతని కర్మల మీద ఆధారపడి ఉందనే ఈ సిద్ధాంతంతో కుల వ్యవస్థ ముడిపడి ఉంది. ఈ కులవ్యవస్థ ఫలితం ఏమిటంటే, సాంఘిక స్థాయిలో ప్రతివ్యక్తి స్థానాన్ని ఈ కులవ్యవస్థ గతానుగతికంగా, మార్చడానికి వీలు గాకుండా చేయడమే. కాబట్టి బ్రాహ్మణుడుగా పుట్టిన వ్యక్తి బ్రాహ్మణేతరుడు కానేకాదు. 'పరయా'గా పుట్టిన వ్యక్తి 'పరయా' కాని మరొకడుగా కానేకాదు. ఇలాంటి పరిస్థితుల్లో అవకాశాల సమానత్వం అసంభవం. ఈ సమానత్వం భారతీయుల అభిప్రాయంలో అటు గుర్తించబడనూ లేదు, ఇటు కోరబడనూ లేదు."

"4. 'కులం' అనే ఒంటి స్తంభ శిఖర భాగంలో బ్రాహ్మణుడు ఉంటాడు. బ్రాహ్మణకులం అనేది కనీసం దక్షిణ భారతదేశంలో ఒక ప్రత్యేక జాతిగా ఉంటూ వచ్చింది. ఈ కులం దీర్ఘకాలంగా తన సంపూర్ణ ఆధిక్యాన్ని ఇతర కులాలన్నిటి మీదా స్థాపించుకొంది. జాతి ఆధారంగాను, బుద్ధి ఆధారంగానే గాక మతాచారాల నియమాల ద్వారా కూడా బ్రాహ్మణులు తమ ఆధిక్యాన్ని నొక్కి చెబుతారు, బ్రాహ్మణునికి భోజనం పెట్టి, అతని చదువుకు ధనం ఇచ్చి, అతని కూతుళ్ల పెళ్లిళ్లకు డబ్బు ఇచ్చి, అతనికి భూమి దానం ఇచ్చి, బ్రాహ్మణుడు ఇచ్చే పవిత్రతను, మత అర్హతల్ని ఇతరులు పొందాలి అన్నది భారతదేశంలో శతాబ్దాలుగా పాదుకొన్న నమ్మకం... బ్రాహ్మణులు అసంఖ్యాకమైన విశేషాధికారాలు కలిగి ఉన్నారు..."

6. వివిధ జీవిత రంగాల్లో ఇలాంటి ప్రాబల్యం కలిగిన బ్రాహ్మణుడు రాజకీయాలమీద సునాయాసంగానే పట్టు కలిగి ఉండడం ఆశ్చర్యమేమీకాదు... 'పరయా'. జాతి ప్రతినిధి కాని, క్రిష్టియన్ జాతి ప్రతినిధి గానీ ఈ నియోజక వర్గాలకు ఎన్నికకావడం గానీ, ఎన్నికయ్యే అవకాశం కానీ లేనేలేదు. ఇతర జాతులకు సరైన ప్రాతినిధ్యం సాధించడానికి ప్రత్యేకమైన శాసనాలు చేయకపోతే రాజకీయ యంత్రాంగం గతంలోలాగే వర్తమానంలో కూడా బ్రాహ్మణుల అధీనంలోనే ఉంటుందని ఈ అనుభవం నిర్ధారిస్తుంది.

8. బ్రాహ్మణుల తర్వాత అగ్రవర్ణ హిందువుల సమూహం. వాటిల్లో కొన్ని ఉన్నతం. కొన్ని తక్కువ. ఇవన్నీ బ్రాహ్మణేతురులు అనే సమూహంలోనే ఉంటాయి. ఈ కులాల వాళ్ళంతా ఎవరికి వారే ప్రత్యేకం. ఒక కులానికి మరో కులం వ్యతిరేకం. ఈ కులాల్లో ఎవరైనా పలుకుబడి ఉండే అధికారంలోకి వస్తే అతడు తన ఆధీనంలోని ఉద్యోగాలను తన కులం వాళ్ళకే ధారాదత్తం చేస్తాడనే అపఖ్యాతి ఉంది. ఈ ధోరణిని గుర్తించి దాన్ని నిరోధించడానికి ప్రభుత్వ స్థిరాజ్ఞల్లో ఆదేశాలున్నాయి. 'సంయుక్త నివేదిక' కూడా ఈ అంశాన్ని గుర్తించింది. ఆ నివేదిక ఇలా చెపుతుంది. 'భారతీయ సమాజంలో ఉండే మతం జాతి కులం అనే విభేదాల పరంపర ఆ సమాజ సమైక్యతను నిరంతరం భయపెడుతూనే ఉంటుంది.' ఈ కుల విభేదాలు భారత సమాజ సమైక్యతను బెదిరించడమే కాదు. అవి అలాంటి సమైక్యతను ఏనాడూ ఏర్పడకుండా నిరోధిస్తుంటాయి.

"9. బ్రాహ్మణ, బ్రాహ్మణేతర కులాల హిందువులకు దిగువన నిమ్న కులాల వారు లేదా ఇంకా సరిగా చెప్పాలంటే 'అవర్ణులు' (No Castes) ఉన్నారు. మద్రాసు ప్రెసిడెన్సీలో వీరు కోటిమంది ఉన్నారు. మనసౌకర్యం కోసం మనం వారిని 'పంచములు' లేదా 'పరయా' జాతి అని పిలవవచ్చు. వీరు నిమ్న వర్గానికి చెందడమే గాక వారి ఉనికే అసలైన అపవిత్రత అని, దాన్ని పోగొట్టుకోవడానికి మతపరమైన ఆచార కర్మలు చేయవలసి ఉందని తెలుస్తున్నది."

"13. నిరక్షరాస్యులైన, స్థిరమైన కులాలుగా విభజింపబడి, పైన బ్రాహ్మణులు మధ్యన బ్రాహ్మణేతర హిందూకులాలు, అట్టడుగున నిమ్న వర్గాలు పై రెండు వర్గాల చేత అణచి వేయబడుతూ ఉండే, ఇలాంటి సంఘంలో ప్రజాస్వామ్య సంస్థల్ని ప్రవేశపెట్టడం కష్టం. 'సంయుక్త నివేదిక' ఈ ఇబ్బందిని బాగానే గుర్తించింది. "మంచి ప్రభుత్వం చేసే ఏ సంస్కరణ ప్రణాళిక ఆవశ్యకత అయినా సమాజంలోని నోరులేని సామాన్య ప్రజలకు తగిన భద్రత కల్పించడమే"

19. ఇది ప్రస్తుత పరిస్థితులను తెలిపే సరైన వివరణ అయినట్లయితే మన దళిత వర్గాల కన్నా యూరప్ లోని అల్ప సంఖ్యాకులకు వారి హక్కుల భద్రతలను పొందడానికి ఎక్కువ అర్హత ఉండదు. ప్రపంచంలో చాలామంది పరిస్థితులవల్ల అధోగతి పాలయ్యారు. అధోగతి పాలయినా మళ్ళీ వారికి పైకి ఎదిగే స్వేచ్ఛ ఉంది. కాకపోతే, దళితవర్గాల వారు పైకి రావడం తమ దేశీయుల మతాభిప్రాయాలకు విరుద్ధం కాబట్టి ఎప్పటికీ అట్టడుగునే పడి ఉన్నారు. మడ్డిమాన్ కమిటీకి ముందే కొందరు వ్యక్తులు

దళిత వర్గాల వారిని బావులు వాడుకోనివ్వాలని, ఆస్పత్రులు, ధర్మశాలల్లో వారికి ప్రవేశం కల్పించాలని శాసన మండలులలో ప్రతిపాదనలు చేశారు. విద్యాశాఖ మంత్రులు దళిత వర్గాల పిల్లలను అన్ని పాఠశాలల్లోనూ ఇతర వర్గాల వారి పిల్లల్లాగే చేర్చుకోవాలని సర్క్యులర్లు జారీ చేశారు. ఆ ప్రతిపాదనలు, ఈ సర్క్యులర్లు ఎంత అపహాస్యం పాలయినవీ ఈ ప్రకటనలోని 'అనుబంధం - ఏ'ని పరిశీలిస్తే సంఘానికి తేటతెల్లం అవుతుంది.

దళిత వర్గాల పట్ల అధిక సంఖ్యాక వర్గాల దృష్టి ఎలాంటిదో పత్రికల్లో ఎప్పటికప్పుడు ప్రచురించే వార్తలు స్పష్టంగా వర్ణిస్తున్నాయి. ఈ వార్తలను పరిశీలిస్తే, అధిక సంఖ్యాక వర్గం వారి మత భావనలకు విరుద్ధం కాబట్టి, కాల్బలం సైన్యంలోను, పోలీసు బలగంలోను దళిత వర్గాల్ని నియమించారని తెలుస్తున్నది. అధిక సంఖ్యాకవర్గం వాని మతభావనలకు విరుద్ధం కాబట్టి దళిత వర్గాల వారి పిల్లల్ని పాఠశాలల్లో చేర్చుకోరు. డాక్టర్ల శరీరాలు, వారి ఆస్పత్రులు అపవిత్రం అవుతాయి కాబట్టి, దళిత వర్గాల ప్రజలు ఆస్పత్రులను ఉపయోగించు కోలేరు. వారు పరిశుభ్రమైన, ఉన్నతమైన జీవితం గడప కూడదు. ఎందుకంటే, వారికి సమాజంలో విధించిన స్థాయికంటే ఎక్కువ స్థాయి కోరడం అధిక సంఖ్యాక వర్గం వారి మత భావనలకు విరుద్ధం కాబట్టి దళిత వర్గాలకు వ్యతిరేకంగా సమాజ ధర్మ శాస్త్రం ఎంత ఖచ్చితంగా అమలు జరపబడుతుందంటే, దళిత వర్గాలు వారి ప్రాథమిక పౌరహక్కుల్ని ఏ మాత్రం వినియోగించుకోవాలనుకున్నా వెంటనే అది అధిక సంఖ్యాక వర్గాల్ని రెచ్చగొట్టినట్లుగా భావించబడి, చారిత్రకమైన, సాంఘిక నిరంకుశత్వంలోని అతిదుష్టమైన రూపాలకు చోటు కల్పిస్తుంది. సమాజమే ఒక నిరంకుశ పాలకుడైనపుడు, నిరంకుశ వర్తనం దాని అధికారుల చర్యలతోనే ఆగక, తప్పించుకొనే మార్గాల్ని చాలా వరకు మూసివేస్తుంది. జీవిత రంగాల్లోకి మరింత లోతుగా చొచ్చుకుపోయి ఆత్మనే బందీ చేస్తుంది. ఇలాంటి నిరంకుశత్వానికి రక్షణగా ప్రభుత్వంలోని పోలీసు శాఖ ఉంటుంది. కానీ, దురదృష్టవశాత్తూ దళిత వర్గాలకు ఉన్నత కులాల హిందువుల మధ్య జరిగే ఏ పోరాటంలోనైనా పోలీసు అధికారం ఎప్పుడూ నిరంకుశ అధిక సంఖ్యాక వర్గానికే మద్దతునిస్తుంది. దీనికి కారణం దళిత వర్గాలకు పోలీసు బలగంలోనూ, న్యాయ స్థానంలోనూ స్థానం లేకపోవడమే.

20. ఈ దృష్టిలో చూసినపుడు కొన్ని శాసనమండలులు తీర్మానాలు చేసాయనీ, కొందరు మంత్రులు సర్క్యులర్లు జారీ చేసారని చెప్పి దళిత వర్గాల ప్రయోజనాలు వారి దేశ ప్రజలచేతుల్లో భద్రంగా ఉంటా యంటూ దళిత వర్గాలను శాంతింప జేయాలనుకోవడం హిందూ అధిక సంఖ్యాక వర్గం వారి ఏవో కొన్ని ఉత్తమ దృష్టాంతాలు ఆధారంగా వారిపట్ల మంచి అభిప్రాయం ఏర్పరచుకునే మాయలో పడవద్దని కమిషన్‌కు సభ హెచ్చరించాలనుకుంటున్నది. కారుణ్య పూరిత అధికార వినియోగం అనే చిత్రం ఒకవైపు అధికారానికి ఇష్టంతో లొంగిపోవడం మరొకవైపు ఆశ్రితులైనే వారి అమిత సంక్షేమానికి తగిన అన్ని అంశాలను ఆదేశించే ఉన్నత వర్గ వివేకమూ - అవన్నీ చదవడానికి సంతృప్తి కరంగా ఉంటాయి. కానీ, హిందూ సమాజంలో ఉండే ఉత్తమ వ్యక్తుల ఉనికిని ఎవరైనా దళిత

వర్గవ్యక్తి శంకిస్తే అభిప్రాయాన్ని సరిజేసేందుకు మాత్రమే అటువంటి చిత్రాలు పనికి వస్తాయి. ఒక ఉత్తమ హిందువు నాయకత్వంలోని ప్రభుత్వంలో గొప్పదైన, సార్వజనీకమైన సంతోషం ఉంటుందంటే దళిత వర్గంలోని ఏ వ్యక్తీ శంకించడు. కానీ చట్టాలు, వ్యవస్థలు చెడ్డ వ్యక్తులకే ఉపయోగపడుతున్నాయి కాని మంచి వ్యక్తులకు కాదు. ఈ దృష్టితో చూస్తే అల్ప సంఖ్యాక వర్గానికి కావలసిన రక్షణలను రాజ్యాంగంలో చేర్చడమే క్షేమకరం. నిరంకుశ అధిక సంఖ్యాక వర్గంలో అల్పసంఖ్యాకులను సానుభూతితో చూసే కొందరు ఉత్తమ వ్యక్తులున్నారన్న కల్పిత కారణంపై అల్ప సంఖ్యాకుల్ని నిరాశ్రయులుగా వదిలేకంటే, అలా చేయడమే ఉత్తమం. ఇలాంటి హామీలను దళిత వర్గాలు కానివారు అనవసరం అని చిన్న చూపు చూసినా పర్వాలేదు. కానీ, దళిత వర్గాల దృష్టితో చూస్తే ఇది తప్పనిసరిగా కోరుకోవాల్సిన భద్రత. సంస్కరణలు అంటేనే దళిత వర్గాల్లో చెప్పలేనంత భయం నెలకొని ఉండబట్టే, వారు మొట్టమొదట నుండే సంస్కరణలను ప్రవేశ పెట్టడాన్ని వ్యతిరేకిస్తున్నారు. సంస్కరణలకు విరుద్ధంగా వారి భావన ఎంత బలంగా ఉందంటే మాంటేగుకు సమర్పించిన వినతి పత్రాలు ఒక దానిలో ఇలా హెచ్చరించారు. "ఈ దేశంలో బ్రిటిషువారి నుంచి అగ్రకులాల హిందువుల చేతుల్లోకి అధికారం బదలాయించే ఏ ప్రయత్నానికయినా విరుద్ధంగా మేం మా చివరి నెత్తుటి బొట్టు వరకూ పోరాడతాం." ఇలాంటి భయాలను 'హామీల పద్ధతి' తప్ప మరేదీ పోగొట్టలేదు. ప్రభుత్వం నమ్మకం మీద ఆధారపడి ఉంటుంది కానీ హేతువు మీద కాదు. దళిత వర్గాలకు కొత్త రాజ్యాంగం మీద నమ్మకం లేకుంటే ఇందులో పేర్కొన్న 'హామీల'ను రాయితీగా కల్పించి అయినా సరే నమ్మకాన్ని పొందడమే రాజకీయ కుశలత.

★ ★ ★

# అనుబంధం : ఎ

### ఒకటవ అంశం

### (టైమ్స్ ఆఫ్ ఇండియా, 8 ఫిబ్రవరి 1928 నుంచి)

## అంత్యజులకు ఉద్ధరణ లేదు

భారతీయ సాంఘిక సంస్కరణలో త్వరితగతిన జరిగే ప్రగతికి చిహ్నంగా కలకత్తా యూనివర్సిటీ ఆచార్యుడు మహామహోపాధ్యాయ పండిత అనంతకృష్ణశాస్త్రి, బొంబాయి సనాతన ధర్మవాదులయిన అగర్వాల్ మార్వాడీలను ఉద్దేశించి స్థానిక నరనారాయణ దేవాలయంలో ఒక ఉపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసాన్ని దానికి అనర్హమైన విస్మృతి నుంచి కాపాడవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆ ప్రసంగ విషయం "పతితుల ఉద్ధరణకు మార్గం (అంటే 'పతితు' 'అస్పృశ్యులు') అధ్యక్షులుగా ఆ సభను అలంకరించిన వారు బొంబాయి కొత్త వైష్ణవ దేవాలయానికి చెందిన శ్రీ జగద్గురు అనంతాచార్య మహరాజ్. కులాలు ఎప్పుడూ ఉండినవే. యుగాంతం వరకూ వాటి ఉనికి ఉండనే ఉంటుంది అని శాస్త్ర ప్రమాణాలు ఆధారంగా ఆ ఉపన్యాసం నిరూపించింది. ఎవరైతే "పతితుల" (అంత్యజుల) ఉద్ధరణ అని మాట్లాడుతున్నారో వారు ఉట్టిగానే అంటున్నారని, నిజానికి అంత్యజుల ఉద్ధరణకు దారేలేదని నాలుగు కులాల్లో ఏదో ఒకదానిలోకి తీసుకోవడం ద్వారా కానీ, ఇప్పుడు ఉండే సాంఘిక స్థితి నుంచి వారిని బయటికి తీసుకుని రావడం ద్వారా కాని అంత్యజుల ఉద్ధరణకు దారే లేద"ని ఆయన పేర్కొన్నారు.

## సనాతనుల ఉదారత్వం

పండితుడైన ఆ ఉపన్యాసకుడు "ఉద్ధరణకు వీలుగాని పతితుల" ఉద్ధరణ చేయడానికి సాధ్యమైన ఒకే మార్గాన్ని ఇలా సూచించారు. అదేమిటంటే, ప్రస్తుతం పూర్వాచార పరాయణులు కాని అవివేకులైన సవర్ణ కులస్థులు స్వీకరించిన అంత్యజుల మార్చుగూడని వృత్తులను ఉదారత్వంతో వారికి తిరిగి ఇవ్వడమే. మహామహోపాధ్యాయులు ఇంకా ఇలా అన్నారు. ఈ 20వ శతాబ్దంలో ప్రజలు ఉదయం లేస్తూనే తమకు నియతమైన సంధ్య వార్చడానికి బదులు తమ ఖరీదైన పాదరక్షల్ని తుడుచుకోడానికి కూర్చుంటున్నారు. ఆ తర్వాత క్షవరం చేసుకోడానికి కూర్చుంటున్నారు. స్వదేశీ పద్ధతిలో తమ పళ్లు తోముకోవడానికి బదులు (అంటే వేప పుల్లలు మొదలైన) పళ్ళపొడి వేసుకొని బ్రష్‌లతో తోముతున్నారు. ఈ పనులన్నీ చేస్తూ వారు చర్మకారులకు (మోచీలకు),

మంగళ్లకు వారి జీవన భృతిని హరించి వేస్తున్నారు. ప్రతి వాడూ తన 'ధర్మాన్ని' బట్టి తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తిస్తూ సంతృప్తి చెందాలి. అంత్యజుల్ని ఉద్ధరించడానికి ఇదొక్కటే దారి. ఈ పతితుల జీవన భృతి సాధనాలను హరించిన ఈ ప్రజలు వాటిని వారికి తిరిగి ఇవ్వనివ్వండి".

రెండవ అంశం

(టైమ్స్ ఆఫ్ ఇండియా – 2 మార్చి 1928)

## భారతదేశంలో అంత్యజులు

స్వదేశీ భారతదేశంలో కాకుండా ఇది బ్రిటిషు ఇండియాలో జరిగి ఉండినానరే దేశభక్తులు దీన్ని నిరసిస్తారు. దేశీయరాష్ట్రం అయిన మధ్యభారత రాష్ట్రంలో బలియాలు వెండి బంగారు నగలు ధరించడంతో, సవర్ణ హిందువుల్లాగా ప్రవర్తించడానికే అలా చేశారన్న ఊహతో కొన్ని రోజుల కిందట వారికి ఏం చేశారో మనందరికీ తెలుసు. బరోడా సంస్థానంలోని అంత్యజుల్ని గురించి 'సౌరాష్ట్ర' నివేదించిన అంశాలమీద మహారాజావారే స్వయంగా ఈ దురదృష్టవంతులపై తమ తీవ్రమైన సానుభూతి వెలిబుచ్చారు. "అంత్యజుల బాలురను గుజరాతీ పాఠశాలల్లో చేర్చుకోవాలన్న ఉత్తరువు కాగితాలకే పరిమితం అయింది. 95 శాతం పాఠశాలల్లో అంత్యజుల పిల్లలను చలిలో, ఎండలో, వానలో కూడా బయటనే కూర్చో పెట్టారు. ఆ పిల్లలను ఆవు పేడ, కట్టెలు, మట్టి, పేడకళ్ళు లాంటివి తేవడానికి నియమించారు.... 1927 ఏప్రిల్‌లో ఒక అంత్యజుడు దామ్‌నగర్ ఆస్పత్రికి మందుకోసం వెళ్ళాడు. వైద్యుడు అతణ్ణి 12 గంటలు వేచి ఉండేట్లు చేశాడు. దూరం నుంచే పరీక్షించి దూరం నుంచే మందు ఇచ్చాడు. ఇది బరోడా శాసన సభ్యుని కళ్ళ ఎదుటనే జరిగింది." సూరత్‌కు చెందిన 'ప్రతాప్' పత్రిక ఇలా తెలుపుతున్నది. "నవసారీ అంత్యజ ఆశ్రమంలోని ఒక ఉపాధ్యాయుడు స్థానిక ఆస్పత్రికి ఒక అస్వస్థుడైన బాలుణ్ణి తీసుకెళ్ళాడు. వైద్యుడు వాళ్ళిద్దర్నీ "వెళ్ళిపొండి! ఇది గాంధీ రాజ్యం కాదు. బరోడా సర్కారు వారి రాజ్యం" అంటూ తరిమేశారు."

మూడవ అంశం

(ఈవెనింగ్ న్యూస్ – 11 మే 1926 నుంచి)

## జంబుసార్ మున్సిపాలిటీలో అస్పృశ్యత : నలుగురు హిందువుల రాజీనామా

జంబుసార్ మున్సిపాలిటీకి ఒక అస్పృశ్యుడు ఎన్నిక కావడంతో జంబుసార్‌లో సంచలనం చెలరేగింది. నలుగురు హిందువులు రాజీనామా చేశారు. తక్కిన సభ్యులు ఆ సభ్యుణ్ణి తాకమని, ఒకవేళ తాకితే తాకిన ప్రతిసారీ స్నానం చేస్తామని వాగ్దానం చేశారు.

## నాలుగవ అంశం
## (బాంబే క్రానికల్ నుంచి)

# కొలాబా దళిత వర్గాల సదస్సు : ఉన్నత కుల హిందువుల రౌడీయిజం

టైమ్స్ ఆఫ్ ఇండియా 24వ తేదీ సంచిక మహద్ వద్ద జరిగిన దొమ్మీ గురించి ఒక కథనం ప్రకటించింది. అయితే, ఆ కథనం అసంపూర్ణం. ఏం జరిగిందో సరైన అంచనా ఇవ్వలేక పోయింది. కాబట్టి, ఆ దొమ్మీకి సంబంధించిన సంపూర్ణమైన, సరైన వృత్తాంతం తెలపడం అవసరం.

మార్చి 19,20 తేదీల్లో డా.బి.ఆర్. అంబేద్కర్ అధ్యక్షతన మహద్ వద్ద కొలాబా జిల్లా దళిత వర్గాల మహాసభ జరిగింది. 2500 మంది వరకు దళితులు హాజరయ్యారు. సభలో గొప్ప ఉత్సాహం నెలకొని ఉంది. అయితే, సభా కార్యక్రమానికి తీవ్ర విఘాతం కలిగింది. దీనికి పూర్తి బాధ్యత మహద్ పట్టణంలోని ఉన్నత కులాల హిందువులదే. మొదటి రోజు మహాసభలో అధ్యక్షుడు తన ప్రసంగాన్ని ముగించగానే చాలా మంది ఉన్నత కులాల హిందువులు మహాసభనుద్దేశించి ప్రసంగించారు. దళిత వర్గాలకు అన్ని విధాల సాయం చేయడానికి తాము ఇష్టపడుతున్నామని హామీ ఇస్తూ, ఉన్నత కులాల హిందువులపై దళిత వర్గాలు ద్వేషం పెంచుకోవద్దని వారు అభ్యర్థించారు. దీన్ని అనుసరిస్తూ "సబ్జెక్ట్స్ కమిటీ" చేసే ప్రతిపాదన ఒకదానిలో దళిత వర్గాల ఉద్ధరణకు ఉన్నత కులాల వారు ఏం చేయాలో తెలుపుతూ ముసాయిదాను రూపొందించింది. దళిత వర్గాలకు తాగేనీరు సంపాదించుకోవడం చాలా కష్టంగా ఉందని, వీరేగాక ఇతర గ్రామాల నుంచి ప్రభుత్వ పనుల మీద గానీ, సొంత పనుల మీద గానీ వచ్చే దళిత వర్గాల ప్రజలు కూడా ఈ కష్టానికి లోనవు తున్నారనే సత్యాన్ని కొందరు 'సబ్జెక్ట్స్ కమిటీ' దృష్టికి తెచ్చారు. నీటి కొరత ఎంత తీవ్రంగా ఉందంటే మహాసభ అవసరాల కోసం ప్రతి దినమూ 15 రూపాయలు పెట్టి నీళ్ళు కొనవలసి వచ్చింది. మహద్ మున్సిపాలిటీ కొంతకాలం కిందట ప్రజలందరూ పట్టణంలోని చెరువుల్ని ఉపయోగించుకోవచ్చని తీర్మానం చేసింది. అయితే, మున్సిపాలిటీ చెరువుల వద్ద బోర్డు పెట్టలేదు కాబట్టి దళిత ప్రజలు నీళ్ళ కోసం చెరువులకు వెళ్ళడానికి భయపడుతున్నారు. మహాసభకు వచ్చిన ఉన్నత కులాల వారి అభిప్రాయం గమనించిన తర్వాత దళిత మహాసభ సంయుక్తంగా చౌదార్ చెరువు వద్దకు వెళ్ళి దళిత వర్గాలు చెరువులో నీటిని తీసుకొనే హక్కును ఖాయం చేయడానికి సహాయపడాలని సబ్జెక్ట్స్ కమిటీ నిర్ణయించింది.

## ఒక తప్పుడు వదంతి

20 వతేదీ ఉదయం మహాసభ మళ్ళీ సమావేశం అయింది. దళిత వర్గాల ప్రజల కోసం ఉన్నత కులాల వాళ్లు ఏం చేయాలనుకొన్నారో తెలిపే ప్రతిపాదనను దళిత వర్గాల సభ్యులు మహాసభ ముందుంచారు. ఉన్నత వర్గాల ప్రతినిధులుగా ఉన్న శ్రీ పురుషోత్తం, ప్రభాకర్ జోషి

గోవింద నారాయణ్ ధర్యాలను ఈ ప్రతిపాదనపై ప్రసంగించాలని అధ్యక్షులు అభ్యర్థించారు. ఆ ప్రతిపాదనలోని వర్ణాంతర వివాహాలు అన్న అంశం తప్ప తక్కిన అన్ని అంశాలను వాళ్ళిద్దరూ అంగీకరించారు. అందరి మద్దతు ఉంది కదా అన్న భావంతో సభ అయిపోయిన తర్వాత దళిత మహాసభ కలిసి కట్టుగా చెరువు వద్దకి కదిలివెళ్ళింది. ఊరేగింపు ప్రశాంతంగానూ, శాంతియుతంగానూ జరిగింది. రెండు గంటల తర్వాత వీరేశ్వరస్వామి దేవాలయ ప్రవేశానికి దళిత వర్గాల ప్రజలు ప్రతిన పూనారని కొందరు దుర్బుద్ధి గల నాయకులు తప్పుడు వదంతి లేవదీశారు. దాంతో వెదురు కర్రలు ధరించి పెద్ద అల్లరిమూక గుమికూడింది. ఈ గుంపు కాస్సేపట్లోనే కలహాశీలంగా తయారైంది. మొత్తం పట్టణం అంతా దళిత వర్గాల రక్తం కళ్ళ చూడడానికి ముందుకు దూసుకొని వచ్చే రౌడీల గుంపుగా మారిపోయింది.

## 20 మంది గాయపడ్డారు

దళిత వర్గాల ప్రజలు తమ తమ ఊళ్లకు బయలుదేరడానికి హడావుడిగా భోజనాలు చేస్తున్నారు. దళిత వర్గాల ప్రజల్లో చాలా మంది అప్పటికే పట్టణం విడిచి వెళ్ళిపోయారు. ఇంతలోనే రౌడీలు దళితులు భోజనాలు చేస్తున్న వంటశాలలలో ప్రవేశించారు. ఈ రెండు వర్గాల మధ్య భయంకరమైన యుద్ధం జరిగి ఉండవలసిందే కాని దళిత వర్గాల ప్రజలను వారి నాయకులు వెనక్కి లాగారు. జరగవలసిన తీవ్రమైన దొమ్మీ ఆగిపోయింది. ఇక రెచ్చగొట్టే సంఘటనలు లేకపోయేటప్పటికి రౌడీలు వీథుల్లో గస్తీ తిరగడం ప్రారంభించి తమ తమ గ్రామాలకు చెదురు మదురు జట్లుగా వెళ్తున్న దళితులపై బడి కొట్టారు. దళిత వర్గాల వారి ఇళ్ళలో అక్రమంగా చొరబడి తీవ్రంగా కొట్టారు. దాదాపు 20 మంది దళిత వర్గ ప్రజలకు గాయాలయ్యాయి. ఈ సంఘటనలో దళిత వర్గాల ప్రజల వైఖరి ప్రశంసార్హంగా ఉండగా, ఉన్నత వర్గాల వైఖరి అయోగ్యంగా కనిపించింది. సమావేశమైన దళిత వర్గాల ప్రజల సంఖ్య ఉన్నత వర్గాలవారికన్నా చాలా ఎక్కువ కానీ ఏ పనైనా రాజ్యాంగ బద్ధంగా అహింసా యుతంగా చేయడమే దళిత వర్గాల నాయకుల ధ్యేయం. అందువల్లే దళిత వర్గాలు ఎదురు దాడి చేసేందుకు నాయకులు విముఖంగా ఉన్నారు. రెచ్చగొట్టడం జరిగినా దళితులు ఆత్మ సంయమనంతో వ్యవహరించిన ఈ సంఘటన వారి గొప్పతనం గురించి చెప్పడానికి చక్కగా సరిపోతుంది. అందరికీ చెందిన కాలువల నుంచి నీరు తీసుకోవడం అనే ప్రాథమిక పౌర హక్కును దళితులు అనుభవించడానికి ఉన్నత వర్గాలు అంగీకరించడంలేదని మహద్ మహాసభ నిరూపిస్తున్నది.

మహద్ పట్టణంలోని సవర్ణ హిందువుల ప్రవర్తనలో నిందార్హమైన అంశం ఏమిటంటే ఆయా ఊళ్ళ నుంచి మహాసభకు ప్రతినిధులుగా వచ్చిన దళితులు తమ తమ గ్రామాలకు తిరిగి చేరుకున్న వెంటనే వారిని శిక్షించాలని ఇతర గ్రామాల ఉన్నత వర్గాల ప్రజలకు వీరు సందేశం పంపారు. ఈ ఆదేశాన్ని పాటిస్తూ ఆయా గ్రామాల్లోని దళిత వర్గాల కంటే జనాభాలో మిన్నగా ఉన్న సవర్ణహిందువులు వారి గ్రామాలు చేరక ముందు, చేరిన తర్వాత మహార్లమీద దాడిచేశారు. దళిత వర్గాల నాయకులు దళితుల రక్షణ కోసం అధికారులను అభ్యర్థించారు. డి.యస్.పి.తో కూడా జిల్లా

అధికారులు అక్కడికక్కడే విచారణ జరుపుతున్నారు. ఏమైనా రెసిడెంట్ మేజిస్ట్రేట్ క్రియాశూన్యంగా రెండు విలువైన గంటలు వృథా చేయకుండా ఉండి ఉన్నట్లయితే ఈ దొమ్మీ జరిగిఉండేదికాదు.

## ఐదవ అంశం

## (యంగ్ ఇండియా 5, మే 1927)

# మనిషి పట్ల మనిషి చూపిన అమానుషత్వం

(యం.కె.గాంధీ)

కథియవాడ్‌లోని ఒక గ్రామంలో మరణశయ్యపై ఉన్న ఒక దళిత సభ్యుని భార్య విషయంలో ఒకడాక్టరు ఉద్దేశపూర్వకంగా చూపిన మరొక అమానుషసంఘటన 'నవజీవన్' పత్రికలో చూడవచ్చు. ఈ కేసువివరాలు తెలిసిన సార్జెంట్ అమృతలాల్ ఠక్కర్ ఊరి పేరు, వ్యక్తుల పేర్లు తెలపలేదు. ఆ పేద బిడియంతులు డాక్టరు చేతుల్లో మరింత అన్యాయానికి గురవుతాడేమో అన్న భయమే అలా తెలపకపోవడానికి కారణం. అయితే ఏమైనా సరే పేర్లు తెలపాలనే నేను కోరుకుంటున్నాను. ఇంతకన్నా ఎక్కువ నిరంకుశత్వాన్ని దళిత వర్గాల ప్రజలు ఎదుర్కొనడానికి ధైర్యంగా నిలబడాలని మనం ప్రోత్సహించవలసిన సమయం తప్పక వస్తుంది. ముందు ముందు వచ్చే బాధల కన్నా ఇప్పటి బాధలే వాళ్ళకు తలకుమించినవిగా ఉన్నాయి. కష్టాల మూలాలు వెదికి వాటిని ధ్రువపరచకపోతే వాటి ఆధారంగా ప్రజాభిప్రాయాన్ని ఉత్తేజింపలేం. బొంబాయి వైద్య మండలి నిబంధనలు ఎలా ఉన్నాయో నాకు తెలియదు గానీ ఇతర ప్రదేశాల్లో మాత్రం ఫీజు తీసుకోక ముందు రోగిని చూడడానికి డాక్టరు తిరస్కరిస్తే అతడు వైద్య మండలికి జవాబుదారీ అవుతాడు. అతని పేరును మండలి పట్టిక నుంచి తీసివేయవచ్చు. లేదా, అతని మీద క్రమ శిక్షణ చర్యలు చేపట్టవచ్చు. ఫీజు రాబట్టుకోదగినదే అయినా రోగులపట్ల సరైన శ్రద్ధ చూపడం డాక్టరు ప్రథమ బాధ్యత. తెలిసిన అంశాలు నిజమైతే వైద్యుని నిజమైన అమానుషత్వం ఏమిటంటే అతడు రోగి ఉండే ఇంట్లోకి ప్రవేశించకపోవడం రోగిని చూడడానికి నిరాకరించడం అతనే థర్మామీటర్‌ని ఉపయోగించడానికి ఒప్పుకోకపోవడం. ఏ పరిస్థితుల్లోనైనా అస్పృశ్యతా సిద్ధాంతం వర్తింపజేయాలనుకుంటే వృత్తినే అవమానించిన వాడికే ఈ సిద్ధాంతాన్ని వర్తింపచేయవచ్చు. సార్జెంట్ ఠక్కర్ విలేఖరి స్టేట్‌మెంటులో కొంత అతిశయోక్తి ఉండవచ్చునని నేను ఆశిస్తున్నాను. అలాకాకపోతే తన అమానుష ప్రవర్తనలో సమాజ మర్యాదకు భంగం కలిగించిన ఆ డాక్టరే తనంతకు తాను ముందుకు వచ్చి ఈ స్టేట్‌మెంటుకు విరుద్ధంగా తన తప్పుల్ని సరిదిద్దుకోవచ్చు.

## చదవండి - స్పందించండి - నినదించండి

కథియవాడ్‌లో ఒక ఊళ్లో దళిత వర్గాల పిల్లలకు ఒక పాఠశాల ఉంది. ఆ పాఠశాల ఉపాధ్యాయుడు సంస్కారి. దేశభక్తుడు. అతడు ధేడ్ లేదా నేత పనికులం వాడు (అస్పృశ్యులు). గైక్వాడ్

ప్రవేశపెట్టిన నిర్బంధ విద్యా విధానం వల్ల లబ్ధిపొందిన ఆ ఉపాధ్యాయుడు తన వాళ్ళ బాగుకోసం తన చేతనైనంత వరకు పాటుపడుతున్నాడు. అతను పరిశుభ్రమైన అలవాట్లు గలవాడు. నాగరిక ప్రవర్తన కలవాడు కావడం వల్ల అతడు అస్పృశ్యజాతికి చెందినవాడని ఎవరూ గుర్తించలేరు. అయితే కథియవాడ్‌లోని సంప్రదాయవాదులు గ్రామంలో తన కులం పిల్లలకు పాఠం చెప్పడం అనే అదృష్టం చేత ప్రతివాడూ అతడిని అస్పృశ్యుడుగా భావిస్తున్నారు. అయితే అతడు ఇవేవీ పట్టించుకోకుండా తనపని మౌనంగా చేసుకుపోతున్నాడు. అయినా ఎంత సహనం గల వ్యక్తి అయినా భరించలేని పరిస్థితుల్లో తన వేదనకు, ఆగ్రహానికి ఏవో కొన్ని క్షణాల్లో అక్షరరూపం కల్పిస్తాడు. ఈ సంగతి ఆ బడిపంతులు రాసిన లేఖల్లో తేటతెల్లం అవుతుంది. ఆ లేఖల్లోని ప్రతి చిన్న వాక్యంలోనూ వేదన నిండి ఉంది. నేను ఉద్దేశపూర్వకంగా లేఖలోని ఊరుపేరు, వ్యక్తులపేర్లు వదిలివేస్తున్నాను. లేకుంటే ఆ బడిపంతులు మరింత కష్టాల పాలవుతాడు.

నమస్కారం! 5వ తేదీ నా భార్య ఒక శిశువును ప్రసవించింది. ఆమె 7వ తేదీ వ్యాధి పీడితురాలయింది. విరోచనాలయ్యాయి. నోటిమాట పడిపోయింది. శ్వాస పీల్చుకోవడం కష్టం అయింది. ఛాతీ మీద వాపువచ్చింది. ఆమె పక్కటెముకులు బాగా నొప్పి పెడుతున్నాయి. నేను డాక్టర్‌గార్ని మా ఇంటికి పిలవాలనుకున్నాను. కానీ డాక్టర్ "నేను అస్పృశ్యుల ఇంటికి రాను. రోగిని చూడను" అన్నారు. తర్వాత నేను నగర్ శేఠ్ వద్దకు, గరీషియా దర్బార్ వద్దకు వెళ్ళి నా కోసం ఒక మంచి మాట చెప్పమని అభ్యర్థించాను. వారు నాతో పాటు వచ్చారు. డాక్టర్‌కు 2 రూపాయలు ఫీజు ఇవ్వడానికి నగర్‌శేఠ్ హామీ ఇవ్వగా, అస్పృశ్యుల ఇళ్ళకు దూరంగా రోగిని తీసుకువస్తాం అనే నిబంధనతో డాక్టర్ రావడానికి నిర్ణయించాడు. అతడు వచ్చాడు. మేము రెండు దినాల శిశువు తల్లి అయిన పచ్చి బాలింతను బయటకు తీసుకువచ్చాం. డాక్టరు థర్మామీటర్ ఒక మహమ్మదీయుని చేతికిచ్చి నా కివ్వమన్నాడు. థర్మామీటర్‌తో ఆమెని పరీక్షించి నేను తిరిగి మహమ్మదీయుని చేతికివ్వగా అతడు డాక్టరుకు అందించాడు. అప్పుడు సమయం రాత్రి 8 గంటలు. దీపం వెలుగులో థర్మామీటర్‌ని చూసి 'ఆమెకు న్యుమోనియోజ్వరం. గొంతు బిగుసుకుపోవడం, ఊపిరాడకపోవడం, రెండూ ఉన్నాయి' అన్నాడు. ఆ తర్వాత డాక్టర్ వెళ్ళిపోయి మందు పంపించాడు. నేను బజారు నుంచి అవిసె విత్తనాలు తెప్పించి వాటి పిండిని ఉడకపెట్టి ఆమెకు రాస్తూ మందు ఇస్తూ ఉన్నాను. డాక్టరు ఆమెను పరీక్షించడానికి అనుగ్రహించలేదు. ఊరికే ఆమెవైపు దూరంనుంచి అలా చూశాడు. అంతే. అతని ఫీజు రెండు రూపాయిలు చెల్లించాననుకోండి. అది తీవ్రమైన జబ్బు. అంతా దేవిడి చేతుల్లో ఉంది.

## II

నా జీవితంలో కాంతి తొలిగిపోయింది. ఆమె ఈ మధ్యాహ్నం రెండు గంటలకు మరణించింది.

వ్యాఖ్య అనవసరం. విద్యావంతుడైన ఒక డాక్టర్ థర్మామీటర్‌ను శుద్ధంగా ఉంచడానికి మహమ్మదీయుని చేతిగుండా తప్ప ఇవ్వలేనివాడు, రెండు రోజుల పాటు కుక్క కంటే, పిల్లి కంటే అధ్వాన్నంగా పడి ఉన్న స్త్రీని పరీక్షించనివాడు చూపిన అమానుషత్వాన్ని గురించి ఏం అనగలం? ఇంతటి అమానుషత్వాన్ని భరించే సంఘం గురించి ఏం చెప్పాలి? ఎవరైనా స్పందించి ఏడవవలసిందే తప్ప!

ఎ.వి. ఠక్కర్

## ఆరవ అంశం

### (టైమ్స్ ఆఫ్ ఇండియా 1–4–28 అండ్ 10–2–28)

## హిందువుల నిరంకుశత్వం

## బలాయీలకు నిబంధనలు

పోయిన మే నెలలో ఇండోర్ జిల్లాలోని కనీరియా, బిచోలీ హఫ్సీ, బిచోలీ మర్దానా, ఇంకా ఇతర 15 గ్రామాలలోని సవర్ణహిందువులు అంటే కలోటాలు, రాజ్‌పుట్‌లు, బ్రాహ్మణులు, పటేళ్ళు, పట్వారీలు తమతమ గ్రామాల్లోని బలాయీలు తమతోపాటు జీవించాలంటే ఈ క్రింద ఎనిమిది నిబంధనలకు కట్టుపడి ఉండాలని నిర్దేశించారు. 1. బలాయీలు బంగారు లేసు ఉండే 'పగ్రీలు' ధరించరాదు. 2. రంగుధోతీలుగానీ, తళుకు అంచులుండే ధోతీలుగానీ ధరించరాదు. 3. హిందువుల్లో ఎవరైనా మరణిస్తే వారి బంధువులకు వాళ్లు ఎంత దూరంలో ఉన్నా వెళ్ళి చావు వార్త చెప్పిరావాలి. 4. హిందువుల పెళ్ళిళ్లన్నింటికీ బలాయీలు వివాహ సమయంలోనూ, ఊరేగింపు సమయంలోనూ వాద్య సంగీతం సమకూర్చాలి. 5. బలాయీస్త్రీలు బంగారు వెండి నగల్ని ధరించరాదు. ఫ్యాన్సీగౌన్లు కానీ, జాకెట్లుకానీ ధరించరాదు. 6. బలాయీస్త్రీలు హిందూ స్త్రీల ప్రసవ సమయంలో తప్పనిసరిగా తోడుగా ఉండాలి. 7. ప్రతిఫలం ఏమీ కోరకుండా లేదా ఇచ్చినంత పుచ్చుకొని హిందువులకు బలాయీలు పనులు చేసిపెట్టాలి. 8. ఈ నిబంధనలకు బలాయీలు కట్టుపడి ఉండకపోతే, వాళ్ళు ఊళ్లు వదిలి వెళ్లిపోవాలి.

## నిరాకరించిన బలాయిలు

బలాయీలు ఈ నిబంధనలను తిరస్కరించారు. దాంతో హిందువులు వారికి వ్యతిరేకంగా ముందుకు సాగారు. బలాయీలు బావుల నుంచి నీళ్లు తెచ్చుకోవడానికి వారు ఒప్పుకోలేదు. తమ పశువులను మేపుకోడానికి వారిని అనుమతించలేదు. హిందువుల భూములగుండా నడవడానికి అంగీకరించలేదు. దాంతో బలాయీ వ్యక్తి పొలంచుట్టూ హిందువుల పొలాలుంటే, తన పొలంలోకి పోవడానికి అతనికి దారే లేకుండాపోయింది. బలాయీల పొలాల్లోకి హిందువులు తమ పశువులను మేతకు వదిలారు. ఈ అమానుషాన్ని తెలియజేస్తూ, దర్బారుకు బలాయీలు పిటిషన్లు సమర్పించారు.

సమయానికి సాయం అందనందువల్ల, అత్యాచారం అలాగే కొనసాగుతుండడం వల్ల వందలాది బలాయీలు తమ భార్యా పిల్లలతో సహా పరరాష్ట్రాలకు అంటే ధర్, దెవస్, బగ్లీ, భోపాల్, గ్వాలియర్ ఇంకా ఇతర రాష్ట్రాలలోని గ్రామాలకు తమ తాతముత్తాతలు తరతరాలుగా నివసించిన ఇళ్ళు వదిలి వలస వెళ్లారు.

## నిర్బంధ ఒప్పందం

కొద్ది రోజుల క్రితమే ఉత్తర ఇండోర్ నగరానికి 7 మైళ్ల దూరంలో ఉండే రియోటీ గ్రామంలోని హిందువులు, ఇతర గ్రామాల హిందువులు కూడా బలాయీలకు నిబంధనలు విధించారు. స్టాంపు వేసిన ఒప్పందం మీద ఆ నిబంధనలను అంగీకరిస్తున్నట్టు సంతకం చేయవలసిందిగా తమ గ్రామాలలోని బలాయీలను వారు ఆదేశించారు. సంతకం చేయడానికి బలాయీలు నిరాకరించారు. అందువల్ల దళితుల్లో కొంతమందిని హిందువులు కొట్టారని, ఒక బలాయీని స్తంభానికి కట్టి వేసి, ఒప్పందం మీద సంతకం చేస్తేనే విడుస్తాం అని నిర్బంధించినట్లు ఆరోపణ వచ్చింది. ఒప్పందం మీద సంతకం చేసిన తర్వాతనే అతన్ని వదిలి పెట్టారు. డిసెంబర్ 20వ తేదీన కొందరు బలాయీలు ప్రధానమంత్రి వద్దకు పరుగెత్తుకొని వెళ్ళి రియోటీ గ్రామాల్లోని హిందువుల నుంచి తాము పొందిన అవమానాన్ని గురించి ఫిర్యాదు చేశారు. వాళ్ళు జిల్లా సుభాకు పంపబడ్డారు. ఈ అధికారి పోలీసుల సాయంతో గ్రామంలో విచారణలు జరిపి 342, 147 సెక్షన్‌ల కింద హిందువుల మీద, 147 సెక్షన్ కింద బలాయీల మీద చర్య తీసుకోమని సిఫారసు చేశాడు.

## గ్రామాలు వదిలి వెళ్ళిన బలాయీలు

## కుల నిరంకుశత్వం

## చట్టం తెలియకపోవడం ఒక ప్రతిబంధకం

కొన్ని గ్రామాల హిందువులలో బలాయీల పట్ల చూపే ప్రవర్తనలో మార్పేమీ లేదు. ఇంతకు ముందే చెప్పినట్లు బలాయీలను ఉన్నత కులాల హిందువులు అవమానించారు. ఇండోర్ జిల్లాలోని దీపాల్‌పూర్ పరగణా ఒక్క దాన్లోనే బలాయీలు పెద్ద సంఖ్యలో ఇళ్లు వదిలి పొరుగు రాష్ట్రాలకు వలస వెళ్లవలసి వచ్చింది. బడోలీ, అహిర్‌ఖెరాల్, పిప్లోడా, మూర్ఖైరా, పామల్‌పూర్, కరోడా, ఛత్‌వాడా, నెవ్రిపాన్, సనౌడా, అజ్నోతి, ఖటేడీ, సనద్గా గ్రామాలను బలాయీలు వదిలి వెళ్లవలసి వచ్చింది. పామల్‌పూర్ గ్రామం పూర్తి నిర్మానుష్యంగా కనిపిస్తున్నది. బలాయీలకు చెందిన ఒక్క స్త్రీ కానీ, పురుషుడు కానీ, శిశువు కానీ అక్కడ కనిపించడంలేదు. పై వాటిల్లో ఒక గ్రామంలో నివసిస్తూ ఉండిన ...ంద అనే బలాయీ ఆ ఊరి హిందువుల చేత బాగా దెబ్బలు తిన్నాడని ఆరోపణ వచ్చింది. ఒకానొక గ్రామంలో హిందువులు బలాయీల ఇళ్ళన్నిటికీ నిప్పు పెట్టారని, అయినా ఇంకా నిందితులు పట్టుబడలేదని ఒక వార్త తెలుపుతున్నది.

బలాయీలు అమాయకులైన పల్లెప్రజలు. వారికి చట్టపరమైన పద్ధతులు తెలియవు. సర్కార్‌కు ఒక పిటిషన్ పంపితే చాలు తమకు కావలసింది అదే జరిగిపోతుందని వారు భావించారు. ఫిర్యాదును చివరివరకు ఎలా అనుసరించాలో, దానికి సంబంధించిన మార్గాలు గానీ, అనుభవం గానీ వారికి లేవు. వారి అభియోగానికి ఉపలంబకంగా వారు సాక్షులను కోర్టుల్లో ప్రవేశపెట్టలేదు. అందువల్ల మేజిస్ట్రేటు వారి అభియోగాన్ని కొట్టి వేయక తప్పలేదు.

## ఏడవ అంశం

## (బాంబే క్రానికల్ 25, ఫిబ్రవరి 1928)

# వెర్రిగా మారిన పూర్వాచార పరాయణత్వం మహర్లుగా పుట్టుట నేరం

బహిష్కృత హితకారిణీ సభ అధ్యక్షులు డా.బి.ఆర్. అంబేద్కర్‌కి అహమ్మదాబాద్ నుంచి కశవజీరాం, రంచోడ్‌జీ వఘేలా ఇలా తెలియజేశారు. ఆరేళ్ల నుంచి బాపురావ్ లక్ష్మణ్, అతని సోదరుడు కౌరావ్ ఇద్దరూ అహమ్మదాబాద్‌లో నివసిస్తున్నారు. దక్కన్ నుంచి వచ్చిన మరాఠా కులానికి చెందిన కొందరు ప్రజలతో వారు కలిసి మెలిసి ఉంటున్నారు. కౌరావ్ కొడుకులైన దామూ, లక్ష్మణ్‌లు ఇద్దరూ మరాఠాల భజన బృందాల్లో పాల్గొనేవారు. ఆ సోదరులు మహర్లు అని మరాఠాలకు ఈ మధ్యనే తెలిసింది. ఈ విషయాన్ని నిర్ధారించుకోవడానికి సూరత్ అహమ్మదాబాద్‌ల మధ్య తిరిగే పార్సెల్ రైలులో పనిచేసే ఇద్దరు మహర్లను పిలిపించారు. దామూ, లక్ష్మణ్‌లు మహర్లని నిశ్చయమైన తర్వాత కాలూపూర్, భండేరీ పొలెలోని ఒక భజన బృందానికి 11వ తేదీ అర్ధరాత్రి పిలిపించారు. 'మీదేకులం' అని వారిని అడగ్గా వారు తాము సోమవంశులం అని చెప్పారు. మరాఠాలకు ఈ జవాబు కోపం కలిగించింది. తమ దేవళాలను, తమ ఇళ్ళని మైలపరిచారని వారిద్దర్నీ ఇష్టం వచ్చినట్లు మరాఠాలు నిందించారు. మహర్ సోదరులు మరాఠాల చేత దెబ్బలు కూడా తిన్నారు. ఆ సోదరుల్లో ఒకని వేలినున్న బంగారు ఉంగరాన్ని బలవంతంగా లాక్కున్నారు. దాన్ని 11 రూపాయలకు అమ్మి వీరిని గుర్తు పట్టడానికి సూరత్ నుంచి పిలిపించిన మహర్లకు వాటిలోనుంచి ఆరు రూపాయలిచ్చారు. తమ ఇళ్ళకు పోవడానికి అనుమతించమని దామూ, లక్ష్మణ్‌లు అభ్యర్థించారు. వారు 500 రూపాయలు జరిమానా కట్టనిదే పంపించమని మరాఠాలు వారి అభ్యర్థనను నిరాకరించారు. అంత సొమ్ము తాము ఇచ్చుకోలేమని బ్రతిమిలాడితే, కనీసం 125 రూపాయల జరిమానా కట్టాలన్నారు. వారిని జరిమానాతోనే పోనివ్వగూడదని, తమకులాన్ని దాచిపెట్టిన నేరానికి తప్పక శిక్షించాలని ఒక మరాఠా అన్నాడు. ఇలా చేయాలనుకున్న తర్వాత మహర్లను వారు నిర్బంధంలోకి తీసుకొని ఉదయం 9 గంటల వరకు క్రూరంగా అవమానించారు. వారి ఎడమవైపు మీసాలు, కుడివైపు కనుబొమలు కత్తిరించి, వారి శరీరాలకు నూనె దుమ్ము కలిపిన 'సిపూసి', పాత చెప్పుల దండ వారి మెడల్లో వేసి ఒకరి చేతికి చీపురు ఇచ్చారు. మరొకరి చేతికి ఒక అట్ట ఇచ్చారు. ఆ అట్ట మీద "ఉన్నత

కులాల ప్రజలను తాకే సాహసం చేసినందుకు అపరాధులకు ఈ శిక్ష విధించబడింది" అని రాశారు. ఆ మహర్ సోదరులను 75 మంది ప్రజలు కలిసి డోలు మోగిస్తూ ఊరేగించారు. ఆ మహర్ సోదరులు పోలీసులకు ఫిర్యాదు చేశారు. నిందితులు తమ స్టేట్‌మెంటులో తాము దామూ లక్ష్మణ్‌లను ఫిర్యాదులో ఆరోపించినట్లు అవమానించింది నిజమేనని, అయితే వాళ్లు స్వయంగా శిక్ష అనుభవించడానికి అంగీకరించారని వాదించారు. దీన్ని బట్టి క్రూర అవమానాలకు గురైనప్పుడు, దెబ్బలు తిన్నప్పుడు, తీవ్రంగా శిక్షిస్తామనే బెదిరింపులను ఎదుర్కొన్నప్పుడు దామూ, లక్ష్మణ్‌లు నిస్సహాయులుగా ఉన్నారని స్పష్టం అవుతున్నది. అస్పృశ్యులు అని పిలవబడే వారిలో ఈ కేసు తీవ్ర సంచలనం సృష్టించింది. ఆ సోదరులకు సరైన న్యాయ సహాయం ఇవ్వడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## అంశం – 8

**(బొంబాయి శాసన మండలి వాదోపవాదాలు 1927 సంపుటి 20)**

## పోలీసు : మహర్ల నియామకం

***డా.బి.ఆర్. అంబేద్కర్ :*** ప్రెసిడెన్సీలోని పోలీసు శాఖలోకి దళిత వర్గాల నియామకాన్ని నిషేధించే నియమం ఏమైనా ఉందేమో ప్రభుత్వం వారు దయచేసి తెలపగలరా?

***గౌరవనీయ శ్రీ జె.ఇ.బి. హట్సన్ :*** అలాంటి నియమం ఏమీ లేదు.

***డా. బి.ఆర్. అంబేద్కర్:*** అలాంటి నిర్బంధం లేనపుడు దళిత వర్గ ప్రజలను పోలీసు రక్షకభటవర్గంలో బొంబాయి నగర పోలీసు కమీషనర్ ఎందుకు నియమాకం చేయలేదో గౌరవనీయ సభ్యులు దయచేసి తెలపగలరా?

***గౌరవనీయ శ్రీ జె. ఇ.బి. హట్సన్ :*** ఇది చాలా విస్తృతమైన విషయాన్ని లేవనెత్తుతుంది. ఆచరణలో ఇబ్బందులున్నాయి. ఇవి సభలోని సభ్యులందరికీ తెలిసినవే. దళిత వర్గాలను మరింతగా పోలీసు నియామకాల్లో చేర్చడానికి ఈ ఇబ్బందులే అడ్డుతగులుతున్నాయి. అంతేగానీ, నియామకానికి నిషేధం ఏమీలేదు అని మాత్రమే ఈ సందర్భంలో చెప్పగలను.

షరా మిస్టర్ హట్సన్ సూచించిన ఆచరణలో ఇబ్బందులు స్పష్టంగా అస్పృశ్యత వల్ల వచ్చే ఇబ్బందులే.

## తొమ్మిదవ అంశం

(బొంబాయి శాసన మండలి వాదోపవాదాలు 1928, సంపుటం 22)

(భాగం 2 పుటలు 96–97)

## ప్రభుత్వ సర్వీసుల్లో గుమస్తాలు

శ్రీ ఆర్.యస్. అసవాలె : (ప్రభుత్వం) శాఖల్లోని గుమస్తా స్థానాల మొత్తం సంఖ్యను ప్రభుత్వం దయచేసి చెప్పగలదా?

గౌరవనీయ చున్నీలాల్ మెహతా : కావలసిన సమాచారాన్ని తెలిపే ప్రకటనను కౌన్సిల్ టేబుల్ మీద ఉంచాం.

| | | మరాఠాలు సంబంధిత కులాలు | మహమ్మదీయులు | దళిత వర్గాలు | అభివృద్ధి చెందిన హిందువులు | పార్సీలు | క్రిస్టియన్లు యూదులు | ఇతరులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | సచివాలయం | 31 | 11 | ... | 268 | 38 | 81 | 11 | 440 |
| 2. | పి.డబ్ల్యు.డి. | 6 | ... | ... | 64 | 8 | 10 | 3 | 91 |
| 3. | బొంబాయి కలెక్టర్ | 3 | 8 | ... | 28 | ... | 4. | 1 | 44 |
| 4. | ఎక్సైజు కమీషనర్ | 1 | ... | ... | 12 | 5 | ... | ... | 18 |
| 5. | చిన్న వాజ్యాల కోర్టు | 9 | 7 | .. | 58 | 1 | 5 | 8 | 97 |
| 6. | హైకోర్టు | 4 | 15 | .. | 125 | 22 | 23 | 9 | 198 |
| 7. | బొంబాయి పోలీసు కోర్టులు | 7 | 4 | .. | 32 | | 4 | .. | 47 |
| 8. | బొంబాయి పోలీసు కమీషనరు | .. | 7 | | 59 | .. | 4 | .. | 87 |

పదవ అంశం

(టైమ్స్ ఆఫ్ ఇండియా 30 మే 1928)

## భారతీయుల దృష్టిలో "చమర్దాలు, మహర్దాలు"

మహారాష్ట్ర మహాసభలో అస్పృశ్యత తొలగించడం అన్న సమస్యను నేర్పుగా వాయిదా వేసిన సందర్భంలో అస్పృశ్యుల అశక్తతలు, కష్టాలను గురించి గర్జించే రాజకీయ సింహాలు ఎంత చిత్తశుద్ధి గలవో తేటతెల్లం అయింది. ఈ వంచనని వ్యతిరేకించిన ఐదారుగురు 'స్వరాజ్య'కు చెందినవారు. వారిలో ఒకరు ఒక పత్రికలో వ్యాసం రాస్తూ, కంటకమైన ఈ సమస్యపై సాధారణ హిందువుల దృష్టిని దాపరికం లేకుండా బట్టబయలు చేశారు. ఇది మహారాష్ట్ర మహాసభ చేసిన పనిని వెలుగులోకి తెస్తుంది. 'పూనా సమతా సంఘం' గురించి ఆ రచయిత స్నేహితుడు ఈ మధ్యనే ఇలా అన్నాడట, "నీ బోటివాళ్లు వాళ్ళల్లో చేరుతూ ఉంటే ఈ చంబర్దాలు, మహర్దాలు (చమర్లకు మహర్లకు ఎగతాళి పేర్లు) పొగరుబోతులు అవుతూ ఉంటారు". ఈ మాటలను బట్టి చూస్తే, అస్పృశ్య కులాలంటే ఉన్నత కులాల్లో ఎంత భయంకరమైన ద్వేషం ఉందో స్పష్టం అవుతుంది.

## తీర్మానాలు – చట్టాలు

వేదనా హృదయంలో ఆ సంస్కరణ వాది ఇలా ఇంకా రాశారు. "హిందూ ధర్మం మీద అస్పృశ్యత ఒక మచ్చ అని మహాత్మాజీ ప్రకటించారు. స్వామి శ్రద్ధానంద, లాలా లజపతి రాయ్ వంటివారు హిందూ సమాజం నుంచి మనం అస్పృశ్యతను తొలగించక పోతే స్వరాజ్యాన్నే సాధించలేం అని చెపుతూనే ఉన్నారు. ఏడు సంవత్సరాల నుంచి అస్పృశ్యతా నివారణకు కాంగ్రెసువారు తీర్మానాలు చేస్తూనే ఉన్నారు. కానీ నిజమైన ఫలితం ఏమిటి? పేర్కొన్నటువంటి మాటలు బాగా చదువుకున్న వాళ్ళ నోటివెంబడే వస్తున్నాయి! కాంగ్రెసులో మనం తీర్మానాలు చేస్తాం. హిందూ సభ అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశాన్ని సమర్థిస్తూ, సార్వజనికమైన చెరువులను, బావులను వారి వినియోగం కోసం కూడా వదలండి అని ప్రజల్ని అభ్యర్థిస్తున్నది. కానీ, ఈ అంశాలను ఆచరణలో పెట్టే వేళకు మనం అస్పృశ్యుల్ని చీదరించుకొంటున్నాం. అంతేకాదు, కొడుతున్నాం. తర్వాత న్యాయపరంగా వారికి వ్యతిరేకంగా వెళ్తున్నాం. వారిని జైళ్ళకు పంపుతున్నాం."

పదకొండవ అంశం

## దపోలీ (రత్నగిరి జిల్లా) దళిత వర్గాల మహాసభలో చేసిన తీర్మానాలు

(౧) రత్నగిరి జిల్లాలో చచ్చిన పశువుల మాంసం తినడానికి నిరాకరించినందుకు దళిత వర్గాల మీద ఉన్నత కులాల హిందువులని పిలవబడే వారు చేస్తున్న ద్రోహపూరిత ప్రచారంపై

ఈ మహాసభ ఆగ్రహం వెలిబుచ్చుతున్నది.

(బి) ఉన్నత కులాలని పిలవబడే హిందువులు దళిత వర్గాలవారి పశువులను బందెల దొడ్డిలో పెట్టడం ద్వారా, వారిని కొట్టడం ద్వారా, సాంఘిక బహిష్కరణ ద్వారా, నిత్యావసర వస్తువులను బజారులో కొనుక్కోనీయక పోవడం ద్వారా అన్యాయం, నిరంకుశత్వం సాగుతుంటే వాటి నుంచి దళిత వర్గాల్ని రక్షించడానికి బదులు ఈ జిల్లా పోలీసు అధికారులు, మేజిస్ట్రేట్లు ఒక పద్ధతి ప్రకారం దళిత వర్గాల వారినే నిందిస్తున్నారు. ఇలా చేయడం పట్ల మహాసభ విచారం వ్యక్తం చేస్తున్నది.

(సి) వతన్‌దార్ మహర్లు జంతుకళేబరాల మాంసాన్ని తినడానికి నిరాకరించినందుకు, చచ్చిన జంతువులను మోయనందుకు, బిచ్చం ఎత్తుకోనందుకు ఇతర అపరిశుభ్ర పనులు చేయ నిరాకరించినందుకు ఉన్నత కులాల హిందువులు ఆపివేసిన బలూటా వేతనాన్ని ఇంతకు ముందులాగానే వారికి ఇప్పించవలసిందిగా మహాసభ ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నది.

1. (ఎ) చాలా గ్రామాల్లో దళిత వర్గాల మీద దుష్కృత్యాలకు సహాయపడే వారు పటేళ్లేనని తెలుస్తున్నది. అలాంటి పోలీస్ పటేళ్లమీద ప్రభుత్వం తగిన చర్య తీసుకోవాలని మహాసభ అభ్యర్థిస్తున్నది.

(బి) ప్రతి జిల్లాలోనూ దళిత వర్గాల నుంచి ఒకరిని స్పెషల్ పోలీసు ఇన్‌స్పెక్టర్‌గా ఈ వర్గాల రక్షణ కోసం నియమించాలి. పోలీసు సర్వీసులో ఈ వర్గాల వారిని ఉద్యోగాల్లోకి తీసుకోవాలి అని మహాసభ ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నది.

(సి) దళితవర్గాలకు సంబంధించిన మిలటరీ పెన్షనర్ల ఆధిపత్యంలో వాడ్‌టేల్, మాట్వేన్, దేశ ఓన్, మందన్ గుడ్, సతురా మొదలైన జిల్లాల గ్రామాల్లో ఉన్నత కులాలని పిలవబడే హిందువుల ఖర్చు మీదే ఆయా గ్రామాల్లో వెంటనే శిక్షాత్మక పోలీసులను నియమించాలని సభ ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఈ గ్రామాల్లోని దళిత వర్గాల ప్రజలు ఉన్నత వర్గాల హిందువులు పెట్టే బాధలను, సాంఘిక బహిష్కారాన్ని, బహిరంగ దాడులను భరించలేకున్నారు.

3. దళిత వర్గాల ప్రయోజనాలకు భద్రతలేకుండా భారతదేశానికి మరో మెరుగైన స్వపరిపాలనావకాశం ఇవ్వవద్దని మహాసభ గట్టిగా అభిప్రాయపడుతున్నది.

## పన్నెండవ అంశం
## (బొంబే క్రానికల్ 20.10.27)

# మున్సిపల్ పాఠశాలలు (బొంబాయి నగరంలో)

బొంబాయి నగరంలోని మున్సిపల్ పాఠశాలల కమిటీ చాల స్వల్ప సమస్య అయిన తాగే 'లోటా'ల విషయంలో, విపరీతంగా భయపడి తనను తాను హాస్యాస్పదం చేసుకొంది. మున్సిపల్

పాఠశాలల్లో కులభేదాలుండరాదని కార్పొరేషన్ తీర్మానం ఉన్నా నీళ్లు తాగడానికి దళిత వర్గాల పిల్లలకు వేరే పాత్రలు ఇచ్చారని తెలుస్తున్నది. పాఠశాల యాజమాన్య సబ్ – కమిటీ అందరు పిల్లలకూ అవే లోటాలు ఇవ్వాలని సిఫార్సు చేసింది. అయితే పాఠశాల యాజమాన్య సభ్యులు ఈ సిఫార్సుల మీద ఆలోచించి ఎన్నో రకాల భయాలకు లోనయ్యారు. ఈ మార్పును సవర్ణహిందువులు నిరసిస్తారని కొందరన్నారు. దీన్ని బట్టి 'తక్కువ' కులాల హిందువుల నిరసన లెక్కలో కానిదని తెలుస్తున్నది. ప్రొఫెసర్ వి.జి.రావు. ఆ మార్పుని విప్లవాత్మకమైన మార్పు అన్నారు. ప్రసిద్ధ సంఘ సంస్కర్త మిస్టర్ డి.జి.దాల్వి ఈ భయాలకు తోడుగా న్యాయపరమైన పేచీని జోడించారు. కొంత మంది తల్లి దండ్రులు యాజమాన్యానికి వ్యతిరేకంగా దావా వేయవచ్చుననేది ఆ భయం. చివరికి పాఠశాల కమిటీ ఈ సమస్యను మళ్ళీ సబ్–కమిటీకి తిప్పిపంపింది. ఇలా పంపడం అంటే సబ్–కమిటీ సిఫార్సు తమకు అంగీకారం కాలేదని అర్థం.

## ఉద్దేశపూర్వకమైన అవమానం

పైన తెలిపిన సందేహాలు అర్థంలేనివి. ప్రతి వ్యక్తి పరిశుభ్రతకోసం పాత్ర ఉపయోగించే ముందు కడుగుకుంటాడు. ఒకవేళ కుల ప్రాతిపదిక మీద అయినా సరే పాత్ర కడుగుతాడు. అస్పృశ్య బాలుడు ఒక సారి తాకితే చాలు పాత్ర మైలపడి పోతుందనీ ఆ తర్వాత పై కులాల హిందువులకు ఉపయోగపడదనీ అనడం దురదృష్టవంతులైన దళితవర్గాలను ఉద్దేశపూర్వకంగా అవమానించడమే. ఇలాంటి ఆరోపణని పాఠశాలల కమిటీ లెక్కచేస్తుందని మహాసభ ఆశించలేదు. కొన్ని మార్పులతో నిర్బంధ విద్య అమలులో ఉన్న దృష్ట్యా, న్యాయసంబంధం కాని బాధ్యతను పాటించమన్నందుకు కమిటీకి వ్యతిరేకంగా ఆ వార్డుల్లోని తల్లిదండ్రులు కోర్టుకు వెళ్ళవచ్చునని శ్రీ దాల్వి అన్నారు. కానీ, పాఠశాలల్లో అందరూ వాడే పాత్రల్ని ఇష్టం లేనివాళ్ళు తప్పనిసరిగా ఉపయోగించాలని నియమమేమీ లేదు. మరీ అంత నిష్ఠగా ఉంటే తల్లిదండ్రులు తమ పిల్లలకు తమ పాత్రలే ఇచ్చి పంపి తమ మతాన్ని రక్షించుకోవచ్చు. దళిత వర్గాలకు సంబంధించినంత వరకు వారు విడిగా తమ పాత్రలు తెచ్చుకొన్నా, లేక ఉత్తమ భావాలు కలిగిన ఇతర పాఠశాలలకు తమ పిల్లలను తీసికెళ్ళిపోయినా వారికి జరిగిన అవమానం మాత్రం అలాగే మిగిలి ఉంటుంది.

డి

# భారత రాజ్యాంగ కమీషన్ ముందు 23 అక్టోబర్ 1928 తేదీన డాక్టర్ అంబేద్కర్ ఇచ్చిన సాక్ష్యం

ఇండియన్ రాజ్యాంగ కమీషన్, పూనా

23 అక్టోబర్, 1928

**హాజరు**

**కమీషన్ సభ్యులందరు, సెంట్రల్ కమిటీ (రాజానవాబ్ ఆలీఖాన్ తప్ప), సభ్యులు, బొంబాయి రాజ్య కమిటీ**

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ (బొంబాయి కమిటీలో సభ్యులు) డాక్టర్ పి.జి. సోలంకి (దళితవర్గాల ప్రతినిధి)లను ఆహ్వానించి, ప్రశ్నించారు.

***ఛైర్మన్ :*** నానసహా దోగ్యులకు గుర్తుచేయడం కోసం మన ముందు ఉండవలసిన పత్రాలు ఇవి : దళిత వర్గాల తరుపున, ఇన్స్టిట్యూట్ ఆఫ్ బాంబే తరుపున డాక్టర్ అంబేద్కర్ ప్రకటన, బొంబాయిలోని భారతీయుల అసోసియేషన్, సోమవంశి సొసైటీ సంయుక్త విజ్ఞాపన పత్రం మొదలైనవి. డాక్టర్ అంబేద్కర్ ప్రస్తుతానికి మన సాక్షుల్లో ఒకరు కాబట్టి ఆయన స్థానం మారంది. డాక్టర్ అంబేద్కర్ బొంబాయి కమిటీలో సభ్యుడని మనకు తెలిసిందే. డాక్టర్ సోలంకి! రెండో పత్రానికి మీరు కారకులనుకుంటాను.

***డా. సోలంకి :*** డాక్టర్ అంబేద్కర్ సమర్పించిన పత్రంతో నేను ఏకీభవిస్తున్నాను.

2. ***డా.అంబేద్కర్ :*** బొంబాయి ప్రెసిడెన్సీలో దళిత వర్గాల ప్రజల సంఖ్య మొత్తం ఎంత ఉందో చెప్పడం ద్వారా మాకు సహాయం చేయగలరా? ప్రభుత్వం వారి వినతిపత్రం, పుట 3 (సంపుటి

---

* భారత రాజ్యాంగ నిర్మాణ సంఘం, సంపుటి 16, 'వినతిపత్రం', 'మౌఖిక సాక్ష్యాల' నుంచి కొన్ని భాగాలు, ఒకటవ భాగం. ప్రచురణ : స్టేషనరీ ఆఫీసు, లండన్, 1930, పేజీలు 52-75. ఈ కమీషన్‌కు అధ్యక్షుడిగా ఉన్న జాన్ సైమన్ పేరుతో ఈ కమీషన్ ఎక్కువ ప్రాచుర్యం పొందింది.

7) నిబట్టి చూస్తే దళిత వర్గాల జనాభా సంఖ్యను 1,478,390గా అంచనా వేసినట్లు తెలుస్తున్నది.

3. చూద్దాం! ధేడ్, మాంగ్, మహర్, హాలియాలు చాలామట్టుకు దళిత వర్గాల్లో చేరతారు. 1921 జనాభా లెక్కల ప్రకారం వారి సంఖ్య 1,478, 390 అని వారు చెపుతారు. ఈ సంఖ్యను గురించి మీరేమంటారు?

**డాక్టర్ అంబేద్కర్:** నా పత్రం పుట 39లో ఈ సంఖ్యను 28 లక్షలుగా ఇచ్చాను. అది మీరు చూడవచ్చు.

4. ఈ సంఖ్య 2,800,000 ఉండాలని మీరు అనుకుంటున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

5. అంకెల్లో తేడా ఎందుకొచ్చింది?

**డాక్టర్ అంబేద్కర్ :** నేను మొదట చెప్పాలనుకునే అంశం ఇది : భారత గణాంక వివరాలు, 1921 సంపుటి 8, బొంబాయి ప్రెసిడెన్సీ, భాగం 2 పుట 176 నుంచి మొదలయ్యే పట్టికల ఆధారంగా బొంబాయి ప్రభుత్వం ఆ సంఖ్యలు ఇవ్వబడ్డాయి. నా వినతిపత్రంలో నేను ఇచ్చిన సంఖ్యలు గణాంక వివరాలు సంపుటి 1, అధ్యాయం 11లోనుంచి ఇచ్చినవి. ఈ సంఖ్యలు గణాంకశాఖ డైరెక్టరు వివిధ రాష్ట్రాల నుంచి సేకరించి అంచనా వేసినవి. నేను అతని అంకెలను యథాతథంగా తీసుకొన్నాను. నా వినతిపత్రం పుట 39లో 'భారత దేశంలో దళిత వర్గాల జనాభా' అనే శీర్షిక కింద ఇచ్చి, వివిధ రాష్ట్రాల్లో దళిత వర్గాల జనాభా సంఖ్యలను వేరువేరుగా సూచించాను. ఇప్పుడు ఈ రెండు సంఖ్యల మొత్తాల్లో మనకు భేదం కనిపిస్తున్నది. కాకపోతే రాష్ట్రీయ సంఖ్యలు కానీ, కేంద్రీయ సంఖ్యలు గానీ ఎప్పుడూ ఖచ్చితంగా ఉండవు. నిజానికి భారత గణాంక శాఖ డైరెక్టర్ వ్యాఖ్యలు నా వినతిపత్రంలోని 39వ పుటలో కన్పిస్తాయి. దళిత వర్గాల జనాభా అంచనా వేసిన తర్వాత డైరెక్టర్ ఇలా చెప్పారు (పుట 39, వినతిపత్రం) "అయినప్పటికీ దీనిని అతి తక్కువ అయిన, కనీసపు అంచనాగా తీసుకోవాలి. ఎందుకంటే, ఈ అంచనా (1) అన్ని కులాల, జాతుల పూర్తి సంఖ్యను తీసుకోలేదు. (2) అపవిత్రంగా భావించబడే చాలా ఆదిమజాతులు ఈ మధ్యనే హిందూమతంలో చేరిపోయాయి. వీటిని లెక్కలోకి తీసుకోలేదు కాబట్టి అపవిత్రంగా భావించబడే, అన్ని విధాల దళిత వర్గాల ప్రజలు భారతదేశంలో అయిదారు కోట్ల మంది ఉంటారని మనం నమ్మకంగా చెప్పవచ్చు". ఇలా చెప్పిన తర్వాత డైరెక్టర్ ప్రతి రాష్ట్రానికి వేర్వేరుగా సంఖ్యలు చూపారు.

6. ఖచ్చితమైన సంఖ్యల ద్వారా గాక, ఈ రెండు అభిప్రాయాలను పోల్చి చూడడం ద్వారా నా మనస్సును స్పష్టం చేసుకోవడానికి ప్రయత్నిస్తే మీ కేమైనా అభ్యంతరమా? కొందరు అధికారులు ఖచ్చితమైన జనాభా లెక్కలు అని 1,478,000 సంఖ్యను ఇచ్చారు. మరి కొందరు అధికారులు తాము కూడా కచ్చితమైన జనాభా లెక్కలు ఆధారంగా అంటూ 2,800,000 సంఖ్య

ఇచ్చారు. దీనిని బట్టి రెండో వర్గం అధికారులు మొదటి వర్గం అధికారులు చేర్చుకోని ప్రజల సంఖ్యను కలిపారు గదా!

***డాక్టర్ అంబేద్కర్*** : అంతే అయి ఉంటుంది. అందువల్లనే కొన్ని అస్పృశ్యకులాల ప్రజల సంఖ్యను రాష్ట్రాల సంఖ్యలు లెక్కలోకి తీసుకోలేదని సదస్సుకు తెలియ జేస్తున్నాను.

7. మనం దీన్ని ఇలా చెప్పుకోవచ్చా? నేను సరిగా చెపుతున్నానో లేదో చూడండి. లేకుంటే సరిదిద్దండి. నా శాయశక్తులా ఈ సమస్యను అధ్యయనం చేస్తున్నాను. అయినా మీ సహాయం, డాక్టర్ సోలంకి సహాయాల్ని ఆశిస్తున్నాను. 'దళితవర్గాలు' అంటే, ఒక అర్థంలో - హిందువులలో 'అస్పృశ్యులు'గా ఉండేవారు, హిందూ దేవాలయాల్లోకి ప్రవేశం లేని వారు అని చెప్పవచ్చా?

***డాక్టర్ అంబేద్కర్*** : అవును.

8. మరో అర్థంలో నేను వర్ణించిన ప్రజలే గాక సంఘంలో చాలా హీనస్థాయిలో ఉండే, హిందూ సమాజ శ్రేణిలో అస్పృశ్యులు అనే పరిమితార్థంలో చేరని నేరస్థ జాతులు, కొండ జాతులు, మరి కొంతమంది ప్రజలను కూడా 'దళితవర్గాలు'గా పరిగణించవచ్చని చెప్పవచ్చా?

***డాక్టర్ అంబేద్కర్*** : కచ్చితంగా,

9. అది సంభవమైన దృక్కోణమే గదా!

***డాక్టర్ అంబేద్కర్*** : అవును అది సంభవమైన దృక్కోణమే.

10. హిందూ దేవాలయాల్లోకి ప్రవేశంలేని అస్పృశ్యులు 'దళితవర్గాలు' అనే అర్థంలో ఒక సంఖ్య, నేరస్థజాతులు, కొండజాతులను వీరితో కలిపినపుడు మరో పెద్ద సంఖ్య రావడానికి ఇది సరైన వివరణే అంటారా?

***డాక్టర్ అంబేద్కర్*** : ఈ సందర్భంలో అలా కాకపోవచ్చు. నేను ఇచ్చిన అంకెలు కొండ జాతులు, నేరస్థజాతులకు భిన్నంగా ఉండే దళిత వర్గాలను సూచిస్తూ ఇచ్చినవే.

11. ఈ అంశాన్ని మీకు స్పష్టం చెయ్యనివ్వండి. నా ముందు మూడు రకాలైన అంకెలున్నాయి. 1921 జనాభా లెక్కల ప్రకారం మహర్లు, ధేడ్‌లు మొదలైన వారిని కలుపుకున్న అస్పృశ్యులకు సంబంధించిన సంఖ్య 1,478,000 మొదటిది. రెండో సంఖ్య - నేరస్థజాతుల సుదీర్ఘ పట్టికకు సంబంధించిన జనాభా 5,89,000. నాదగ్గర ఉండే మూడో పట్టిక ఆదిమజాతులు, కొండజాతులయిన భిల్లులు మొదలైన వారిది. వీరు దాదాపు 10 లక్షలమంది ఉన్నారు. ఆదిమజాతుల, నేరస్థ జాతుల సంఖ్యలను మొదటి సంఖ్యతో కలిపితే దాదాపు మీరు సూచించిన 2,800,000 సంఖ్య వస్తుంది గదా!

***డాక్టర్ అంబేద్కర్*** : నా వినతిపత్రంలోని 39వ పేజీలో నేను ఇచ్చిన ఉదాహరణ కచ్చితంగా దళిత వర్గాల నుద్దేశించి గణాంకశాఖ డైరెక్టర్లు ఇచ్చిన వివరాలుగానే నేను అభిప్రాయపడుతున్నాను.గణాంక

శాఖ డైరెక్టర్ లెక్కించినవి నేను నా వినతిపత్రంలోని 39వ పేజీలో ఉటంకించినవీ దళిత వర్గాలకు మాత్రమే అన్వయిస్తాయని నా భావం.

12. 1921 జనాభా లెక్కల డైరెక్టర్ ఇలా చెప్పడం నా దృష్టిలోకి వచ్చింది. "ఈ మధ్య సంవత్సరాల్లో సమాజంలో ఒక నియతమైన భాగాన్ని దళిత వర్గాలుగా చెప్పడం మామూలయింది. నాకు తెలిసిన మేరకు 'దళిత వర్గాలు' అనే పదానికి ఖచ్చితమైన నిర్వచనం లేదు. ఆ పదం ప్రత్యేకంగా ఎవరెవర్ని కలుపుకుంటుందో తెలియదు. అలా అన్న తర్వాత డైరెక్టర్ కొన్ని విద్యా విషయ విమర్శలను పేర్కొన్నారు. ఆ ప్రకరణాన్ని ఉద్దేశించేనా మీరు చెప్పేది?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును "బ్రిటిష్ ఇండియాలోని హిందువులు, గిరిజన జాతి ప్రజలలో మొత్తం దళిత వర్గాల వారు మూడు కోట్ల 10 లక్షల జనాభాగా లేదా, 19 శాతంగా ఉన్నట్లు ఈ పట్టికల ద్వారా తెలుస్తున్నది. దళిత వర్గాల నుంచి గిరిజన జాతులను ఇక్కడ మినహాయించినట్లు కన్పిస్తున్నది.

13. చెప్పలేను... బహుశా, అది ఒక సాధ్యమైన వివరణ. నేను నిర్వచించాలనుకున్న అర్థంలో కనీససంఖ్య అస్పృశ్యుల సంఖ్య అనడానికి పైన చెప్పిన వివరణ సరిపోతుందనుకుంటాను. బాగా దళితులైన వారి పురోగతికి, వివిధ రంగాల్లో వారికి సహాయ పడడానికి, వారి ఉద్ధరణకు ప్రయత్నించడానికి ముందుకు వచ్చేవారు వారి సర్వేలో ఇంకా ఎక్కువ వర్గాల ప్రజల్ని నేరస్థ, కొండ జాతుల్తో సహా చేరుస్తారని స్పష్టం అవుతున్నది. అది సంభవమేనా?

*డాక్టర్ అంబేద్కర్ :* అది సంభవమే.

14. నేను మరో సంభవమైన దృక్కోణాన్ని సూచించాలనుకొంటున్నాను. అయితే ఆ దృక్కోణం నిలబడుతుందో లేదో నేను చెప్పలేను. మీ వినతిపత్రంలోని 39వ పేజీలో రాష్ట్రాల అంకెలు కలిపితే మొత్తం భారతదేశంలో అయిదారు కోట్ల మంది దళితులుంటారని మీరు చాలా కచ్చితంగా పేర్కొన్నారని భావిస్తున్నాను.

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

15. 'ఇండియా ప్రాపర్' అంటే భారతదేశంలోని రాష్ట్రాలని కలిపి అని అర్థం – అనుకుంటాను.

డాక్టర్ అంబేద్కర్: అవును, నేను అలాగే భావించాను. అయితే ఒక సంగతి చెప్పాలి. భారతదేశంలోని రాష్ట్రాలను డైరెక్టర్ వేరు చేసినట్లున్నారు. ఎందుకంటే బరోడాకు ఆయన ఒక ప్రత్యేక సంఖ్యను ఇచ్చారు.

16. బహుశా ఆయన పెద్ద రాష్ట్రాలలో ఒకటి లేదా రెండింటిని ఉదాహరించారేమో?

*డాక్టర్ అంబేద్కర్ :* కావచ్చు. ఆ సంఖ్యలు అసమగ్రం అయి ఉండవచ్చు.

17. అయినప్పటికీ, మేము గణాంక అంశాల మీద ఎక్కువ కాలం వెచ్చించాలని కోరుకోవడం

లేదు. కచ్చితమైన సంఖ్య 15 లక్షలుకానీ, 25 లక్షలు కానీ ఉండవచ్చు. దళిత వర్గం అంటే అధిక సంఖ్యలో ఉన్న ప్రజలని, మన ప్రత్యేక గుర్తింపుకి తగిన వారనడం మాత్రం స్పష్టం.

**డ్యాక్టర్ అంబేద్కర్ :** నేను ఒక అంశాన్ని చెప్పాలనుకుంటున్నాను. ఏ అంకెల నుంచి రాష్ట్రాల సంఖ్యలను లెక్కగట్టారో అవి ప్రధానమైన భారతీయ కులాలకు సంబంధించినవి. అది సమగ్రమైన పట్టిక కాదు. వేర్వేరు కులాల గురించి నేను పరిశీలించేటప్పుడు ఈ పట్టికల్లో 10 కులాల ప్రజల సంఖ్యలే లేవు. అలీ తప్పిపోయినవి నిస్సందేహంగా కులాలే. అలా ప్రధాన భారతీయ కులాల్లో చేర్చబడలేదు.

18. మీకిద్దరికీ అంగీకారమైతే నేను ఒక సూచన చేయాలనుకుంటున్నాను. మీరు కచ్చితమైన సంఖ్యలు నిర్ణయించకుండా దళిత వర్గాలను గురించిన ప్రధాన పరిశీలనలను దృష్టిలోకి తీసుకోవలసిందిగా కోరారు. ఈ అంకెలను గురించిన అంశాన్ని మనం ఎంత త్వరగా వదిలించుకొంటే దళిత వర్గాల స్థితిని గురించి, సంఘంలో ఇతరులు వారి పట్ల ఎలా ప్రవర్తిస్తున్నారో అన్న సమస్యల గురించి అంత సమగ్రంగా మాట్లాడుకోవచ్చు. లేకపోతే మనం లెక్కల మీదనే చాలా సమయం వెచ్చించవలసి ఉంటుంది. నేను ఏమడగాలనుకున్నానో అది అడిగాను. కనీస సంఖ్యగా దళిత వర్గాల జనాభా 15 లక్షలు. విస్తృత సంఖ్యగా 20 నుంచి 30 లక్షల మధ్య ఉంటుందని చెపితే చాలు, అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాను.

**డ్యాక్టర్ అంబేద్కర్ :** బొంబాయి సంఖ్యలో 10 కులాల జనాభాను కలుపుకోలేదు అన్న సవరణతో అంగీకరిస్తాం.

**ఛైర్మన్ :** మనం అసలు పరిశీలనాంశం వద్దకు వచ్చాం. అది వారి ప్రాతినిధ్యం. ఈ లెక్కల మీద ఇంకా కాలం వెచ్చించాలనుకొంటున్నారా? మీరు సంతృప్తి చెందితే మనం ఏవో ఒక సంఖ్యలపై అంగీకారానికి వద్దాం.

**రావుబహదూర్ రాజా :** ఏ సంఖ్యలు ?

**ఛైర్మన్ :** మన ప్రధానమైన సమస్య అదే. దళిత వర్గాల ప్రాతినిధ్యం అనే సమస్యను గురించిన ఆలోచనలో ముందుకు సాగుదాం. ముందు జనాభా సంఖ్య విషయాన్ని ఇలా తేల్చుదాం. బొంబాయి ప్రెసిడెన్సీలో 1921 జనాభా లెక్కలలో దళిత వర్గాల సంఖ్యను 15 లక్షలుగా ఇచ్చారు. మతపరంగా ఆలోచించినపుడు అస్పృశ్యులు అనబడేవారి కనీస జనాభా సంఖ్యగా దీన్ని తీసుకొందాం. అయితే, అంబేద్కర్ చెప్పినదానికి అంగీకరిస్తే, విస్తృతమైన కచ్చితమైన, న్యాయ దృష్టితో ఆలోచిస్తే నిజమైన సంఖ్య 20 నుంచి 30 లక్షలు ఉంటుంది. ఇది సరైనదేనా?

**రావుబహదూర్ రాజా :** అవును అది సరైనదే.

**ఛైర్మన్ :** దీనికి సంబంధించి ఎవరైనా ఇంకా అదనంగా చెప్పాలనుకుంటున్నారా?

19. కల్నల్ లేన్ ఫాక్స్ : మనం స్వీకరించిన రెండు వినతిపత్రాలు ఏ అంకెపై ఆధారపడ్డాయి? రెండు వినతిపత్రాలలోను మీరు దళిత వర్గాలకోసం ప్రత్యేక ప్రాతినిధ్యం అడిగారు. ఒక వినతిపత్రంలో వయోజన వోటింగు అడిగారు. పదాతి దళం నావికాసైన్యం వంటి వాటిల్లో నియమకాలు, మొదలైన వాటిని అభ్యర్థించారు. నేరస్థ జాతులకు, ఆదిమ జాతులకు ఈ సదుపాయాలు అడిగితే అది మరీ ఎక్కువ ఆశించినట్లే అవుతుంది. ఈ అవకాశాలు పెద్ద సంఖ్యలో చెప్పిన జనాభా కోసమా? కనీస సంఖ్యలో చెప్పిన జనాభా కోసమా?

డాక్టర్ అంబేద్కర్ : నేను వాటిని దళిత వర్గాల కోసం అడిగాను.

20. ఆదిమజాతులు, నేరస్థజాతులకు కూడానా?

డాక్టర్ అంబేద్కర్ : లేదు. వారికి వయోజన వోటింగు హక్కు ఇవ్వడం సాధ్యం కాదు.

21. కానీ, మీరు పెద్ద సంఖ్యనే ఉదాహరిస్తున్నారే!

డాక్టర్ అంబేద్కర్ : నేను నా వినతిపత్రంలో ఇచ్చిన సంఖ్య ఆదిమ జాతులను కొండజాతులను కలుపుకొని ఉందని నేను అంగీకరించను. సరైన లెక్కింపు చేస్తే తప్పకుండా ఈ సంఖ్య దళిత ప్రజలదే. నేను ఇతర సంభావ్యాన్ని కూడా అంగీకరించాను. అంత మాత్రమే.

ఛైర్మన్: నేను ఒక విషయం చెబుతాను. సర్ ఆర్డర్ ఫ్రూమ్. దాన్ని రూఢి పరచగలడేమో! మడ్డిమాన్ కమిటీ వారి నివేదిక లోని 64 పేరాకు కలిపిన పట్టికలో ఈ సంఖ్యను 2,800,000గా ఇవ్వడం గమనించాను.

22. సర్ హరిసింఘ్ గౌర్ : డాక్టర్ అంబేద్కర్ ! మీరు 'దళిత వర్గాలు' 'అస్పృశ్యులు' అనే పదాలను సమానార్థకాలుగా భావిస్తున్నారా?

డాక్టర్ అంబేద్కర్ : అవును.

23. దళిత వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం అడిగే విషయంలో అస్పృశ్యులకే మీరు పరిమితం అయ్యారా?

డాక్టర్ అంబేద్కర్ : అవును

24. కొన్ని ఆదిమజాతుల ప్రజలు అస్పృశ్యులు కారని మీరు అంటారా?

డాక్టర్ అంబేద్కర్ : కొన్ని ప్రాంతాల్లో వారు అస్పృశ్యులు కావచ్చు. వారి తరఫున నేను మాట్లాడదలుచుకోలేదు.

25. ఆదిమ జాతులు అస్పృశ్యులు కారు. నేరస్థ జాతులూ అస్పృశ్యులు కారా?

డాక్టర్ అంబేద్కర్ : వారిలో కొందరు అస్పృశ్యులే.

26. కొందరు మాత్రమే! జాతి మొత్తంగా కాదు కదా!

**డాక్టర్ అంబేద్కర్ ::** నేరస్థ జాతుల ప్రజలు ఇతర హిందువులతో చాలా తక్కువగా సంబంధం కలిగి ఉంటారు. అందువల్ల ఒక నిశ్చితాభిప్రాయానికి ఆధారమంటూలేదు. అలాంటి సంబంధమే గనక ఉన్నట్లయితే వారూ అస్పృశ్యులుగానే పరిగణింపబడతారు.

27. అస్పృశ్యతకు, స్పృశ్యతకు మధ్యే మార్గంలో కొన్ని జాతులు ఉన్నాయా?

**డాక్టర్ అంబేద్కర్ ::** వారు అస్పృశ్యుల కంటే అడుగునే ఉన్నారని మనః పూర్వకంగా చెపుతాను.

28. సాంఘిక శ్రేణిలో ఎంతో కొంత ఉన్నతంగా అస్పృశ్య ప్రాయులుగా ఉండే జాతి ఒకటి ఉందా లేదా?

**డాక్టర్ అంబేద్కర్ :** నేను చెప్పలేను. నా అభిప్రాయం ఇది. గౌరవపూర్వకంగా నేరస్థ జాతులను గురించి నేను చెప్పేది ఇది. వారు అస్పృశ్యులా కాదా అని తేల్చడానికి తగినంత సమాచారం మన దగ్గర లేదు. కారణం నేరస్థ జాతులకు హిందువులకు మధ్య సాంఘిక సంబంధాలు చాలా తక్కువ కాబట్టి.

29. ఆదిమ జాతులు, నేరస్థజాతుల గురించిన విషయం వదిలిపెట్టండి. నేను ఇప్పుడు అస్పృశ్యుల్ని గురించి విచారణ చేస్తున్నాను. అస్పృశ్యులలో కూడా తారతమ్యాలున్నాయి. వాళ్ళలో కొందరు అస్పృశ్యప్రాయులుగా పరిగణింపబడతారు.

**డాక్టర్ అంబేద్కర్ :** (ఇద్దరు సాక్షులూ) లేదు.

30. నేను ఒక ఉదాహరణ ఇస్తాను. 'చంబర్'ల స్థితి ఏమిటి?

**డాక్టర్ అంబేద్కర్ :** వారు పూర్తిగా అస్పృశ్యులే.

31. 'మహర్'ల అంతగానా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

32. మీకు ఆ విషయమం నిశ్చయమేనా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును. సార్వజనికమైన నీరు అనే ప్రమాణం దేవాలయ ప్రవేశం అనే ప్రమాణం - ప్రాతిపదికగా అది నిశ్చయమే.

33. కాదు. అస్పృశ్యత అంటే నా అర్థంలో ఎవరి స్పర్శ ఉన్నత కులాల హిందువులను మైలపరుస్తుందో అది అని.

**డాక్టర్ అంబేద్కర్ :** అలా అయితే ఆలయ ప్రవేశం లేదా నీరు తెచ్చుకోవడం ఏదైనా ప్రమాణంగా తీసుకోండి.

**ఛైర్మన్ :** మనం ఇక్కడ రాజ్యాంగ, రాజకీయ పరిశీలనలో ఉన్నాం.

సాంఘికాచారాలు, లోతుగా వేళ్ళు పాతుకున్న మతాచారాలను రాత్రికి రాత్రి ఏ కమిషనూ తీసివేయలేదు. అది స్పష్టం. ఒక కోణంలో చూస్తే అస్పృశ్యులు హిందూ దేవాలయాల్లోకి ప్రవేశార్హత లేనివాళ్లు. చాలాసార్లు పాఠశాలలను, ధర్మ సత్రాలను ఇలాంటి వాటిని ఉపయోగించుకోలేని వాళ్ళు అని స్పష్టంగా తెలుస్తుంది. రాజకీయంగా, రాజ్యాంగ పరంగా మాట్లాడితే పైన చెప్పిన వారికి తోడు నాగరిక శ్రేణిలో అంతగా పైకి రానివాళ్లు సర్ హరిసింఘ్ గౌర్ చెప్పినట్లు భారతదేశంలో నివసించే నేరస్థ జాతులు, కొండ జాతుల పట్ల గూడా మనం శ్రద్ధ చూపవలసినదే.

**సర్ హరిసింఘ్ గౌర్ :** హిందువులు నాలుగు వర్గాలుగా విభజింపబడ్డారు. శూద్రులు దేవాలయాల్లో ప్రవేశించలేరు...

**ఛైర్మన్ :** మనం ఇదంతా గుర్తించిందే. అయినప్పటికీ, మనం హిందూ మతానికి చట్టాలు చేయడానికి పూనుకోవడంలేదు. ఈ అంశానికి భిన్నంగా బ్రిటిష్ ఇండియాకు రాజ్యాంగ నిర్మాణం ఎలా ఉండాలా అనే సంగతి గురించి ఆలోచిస్తున్నాం.

34. ఆ సంఖ్య ప్రకారం, భారత రాజ్యాంగం ప్రత్యేకంగా బొంబాయి ప్రెసిడెన్సీ రాజ్యాంగంఈ ప్రజల పట్ల ఎలా ఉంటే సరిగా ఉంటుందని మీరు సూచించాలనుకుంటున్నారు?

**డాక్టర్ అంబేద్కర్ :** మమ్ములను ఒక ప్రత్యేకమైన అల్ప సంఖ్యాక వర్గంగా, హిందూ సమాజానికి భిన్నంగా పరిగణించాలని మొదటి అంశంగా అభ్యర్థిస్తున్నాం. మా అల్ప సంఖ్యాక లక్షణం హిందూ మతంలో చేరి ఉన్నందువల్ల ఇన్నాళ్లూ మరుగున పడింది. అయితే, నిజానికి హిందూ సమాజానికి దళిత వర్గాలకు మధ్య ఏ సంబంధమూ లేదు. అందువల్ల ప్రప్రథమ అంశంగా నొక్కి చెప్పదలచుకొన్నదేమిటంటే మమ్ములను ఒక ప్రత్యేకమైన, స్వతంత్రమైన అల్ప సంఖ్యాక వర్గంగా పరిగణించాలి. రెండవ అంశంగా, బ్రిటిషు ఇండియాలో మరే అల్ప సంఖ్యాక వర్గం కంటే కూడా దళిత వర్గాలకు ఎక్కువ రాజకీయ రక్షణ అవసరం అని నివేదిస్తున్నాను. ఎందుకంటే, ఏ ఇతర వర్గాలకంటే కూడా దళిత వర్గాలు విద్యా విషయంగా ఎక్కువగా వెనుకబడినవారు, ఆర్థికంగా పేదవారు, సాంఘికంగా బానిసత్వంలో ఉండేవారు, అంతేగాక, కొన్ని తీవ్ర అనర్హతలతో బాధపడుతున్నవారు. మా రాజకీయ రక్షణకోసం అల్ప సంఖ్యాకులైన మహమ్మదీయజాతికి ఇచ్చినట్లే ప్రాతినిధ్యం ఇవ్వవలసిందిగా కోరుతున్నామని నివేదిస్తున్నాను. వయోజన వోటింగు హక్కు ఇచ్చే పక్షంలో రిజర్వుడు స్థానాలను మేం కోరుకుంటున్నాం.

35. వయోజన వోటింగు లేకపోతే?

**డాక్టర్ అంబేద్కర్ :** అప్పుడు మేం ప్రత్యేక నియోజక వర్గాలు అడుగుతాం. ఇంకా, సాధ్యమైతే రాజ్యాంగంలోనే కొన్ని నిశ్చితమైన భద్రతలను కోరుతాం. లేకపోతే దళిత వర్గాల విద్యా

విషయంగాను, ప్రభుత్వ సర్వీసులో ప్రవేశానికి గాను తగిన చర్యలు తీసుకొనేందుకు గవర్నర్‌కు సలహా రూపంలో అధికారం కల్పించమని కోరుతాం.

36. డాక్టర్ సోలంకి ! ఈ అంశాలను అంగీకరిస్తున్నారేమో మేం తెలుసుకోవచ్చా.

**డాక్టర్ సోలంకి :** అన్ని అంశాల్లోనూ నేను అంగీకరిస్తున్నాను.

37. అయితే ఈ అభిప్రాయం మీ ఇద్దరిదీ అని మేం అనుకోవచ్చా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

38. మనం మిగతా విషయాల్లోకి పోకముందు పై అంశాలమీద నేను ఒకటి రెండు ప్రశ్నలడిగితే మీకు ఇబ్బంది కాదుగదా? దళిత వర్గాలు ఒక విధంగా హిందూ మతంలో కలిసే ఉన్నప్పటికీ హిందూమతంలో ఉండే వారి కన్నా నిర్దిష్టమైన, ప్రత్యేకమైన జాతిగా ఉండాలని మీరు అడుగుతున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

39. దళితవర్గాల ప్రయోజనాలను హిందూ మతంలోకి ఉన్నత వర్గాల ప్రజలు నివేదించరన్నదేనా కారణం?

**డాక్టర్ అంబేద్కర్ :** అది కూడా ఒక కారణం. అయినా, నిజానికి మేం హిందూ జాతిలో ఒక భాగంగా ఉండడానికి నిర్ణయించుకోలేం.

40. మీరు ఈ ఉప ఖండంలో ఆది నుండి నివాసం ఏర్పరచుకొన్న జాతిలోని వ్యక్తి అనే నా విశ్వాసం!

**డాక్టర్ అంబేద్కర్ :** అది ఒక దృక్కోణం

41. వివరాల్లోకి మనం పోవలసిన పనిలేదు కానీ, మీరు ఆర్యులకంటే పూర్వులనే ఒక భావన ఉంది!

**డాక్టర్ అంబేద్కర్ :** చెప్పలేను. బహుశా అదొక దృక్కోణం.

43. పేర్లు చెప్పను గానీ కొందరు సుప్రసిద్ధ ప్రజాసేవకులైన హిందువులు దళిత వర్గాల విషయంలో నిస్సందేహంగా చాలా శ్రద్ధ చూపారు. అందుకే ఈ ప్రశ్న అడుగుతున్నాను. ఆ విషయం గురించి మీరు ఏమీ చెప్పరా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును దాన్ని గురించి ప్రజలు చాలా మాట్లాడుతున్నారు.

44. నాకు తెలుసు. అదీ మీ దృక్కోణమే. రాజ్యాంగ దృష్టిలో మీరు నిర్దిష్టమైన, ప్రత్యేకమైన జాతిగా పరిగణించబడాలని కోరుకుంటున్నామంటారు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

45. ప్రాతినిధ్యం విషయానికి వస్తే వయోజన వోటింగు ఉన్నా లేకపోయినా నామినేషన్ అనే ఊహనే కొట్టి వేస్తున్నారు మీరు. ఎన్నికలను కోరుకొంటున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

46. మీరిద్దరిదీ ఈ అభిప్రాయమేనా?

**డాక్టర్ సోలంకి :** ఔను.

47. అలా అంటే, మీరు వోటర్ల జాబితా తయారు చేయాలంటారు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

48. అలా అంటే వోటు వేయవచ్చిన వ్యక్తి వోటర్ల జాబితాలో ఉండేవాడే గానీ మరొక వ్యక్తి కాదని మీరు నిర్ధారణ చేయాలి.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

49. మీరు దళిత వర్గాలని పిలుస్తున్న జనాభాలో ఎంత శాతం ప్రజలకు చదువు వస్తుందో ఒక అంచనా ఏమైనా ఇవ్వగలరా అంబేద్కర్ గారూ?

**డాక్టర్ అంబేద్కర్ :** నేను సమర్పించిన మరో నివేదికలో బొంబాయి ప్రెసిడెన్సీలో విద్యను గురించిన వివరాలిచ్చాను.

50. అది చాలా తక్కువ నిష్పత్తి అయి ఉంటుందని నా అనుమానం!

**డాక్టర్ అంబేద్కర్ :** అలాగే కావచ్చు.

51. అదృష్టవంతులైన ప్రజలు చేరే పాఠశాలల్లో దళిత వర్గాలకు సులభ ప్రవేశం లేదు అన్నది ఒక ఫిర్యాదుగా ఉంది కదా!

**డాక్టర్ అంబేద్కర్ :** అవును అంతే.

52. ఎన్నికలంటూ జరిగితే బ్యాలట్ పత్రం అర్థం చేసుకోలేని వాళ్ల ద్వారానే జరుగుతుందన్న మాట? అంతేనా!

**డాక్టర్ అంబేద్కర్ :** అవును. ఈ నాటికి కూడా వోటర్లలో చాలా మంది విషయంలో ఇది సత్యమే.

53. నిజమే, దళిత వర్గాలకు బొంబాయి ప్రెసిడెన్సీలో ఎన్ని రిజర్వుడు స్థానాలు కావాలంటున్నారో చెప్పగలరా?

**డాక్టర్ అంబేద్కర్ :** నేను సిద్ధం చేసిన నివేదిక ద్వారా 140 సీట్లలో 22 సీట్లు కావాలని

కోరుతున్నాం.

54. బొంబాయి శాసనమండలికి మొత్తం 140 స్థానాలకు ఎన్నికల ద్వారా సభ్యుల్ని ఎన్నుకొంటే దళిత వర్గాలకు 22 ఎన్నుకోబడే స్థానాలు కావాలంటారు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

55. అంటే వోటు హక్కు లేకపోతే, మీరు ప్రత్యేక నియోజక వర్గాలు కోరడం మీరు చెప్పిన ప్రత్యామ్నాయం. అప్పుడు కూడా 22 స్థానాలే కోరతారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

56. మిమ్మల్ని అడగవలసిన మరోక విషయం ఇది. దళిత వర్గాల సామాజిక స్థితిని తెలుసుకోవడానికి ఇక రాజా గారు కొన్ని ప్రశ్నలు వేస్తారేమో! ప్రస్తుతం, బొంబాయి శాసన మండలిలో దళిత వర్గాలకు ప్రాతినిధ్యం వహించడానికి ఇద్దరు నామినేటెడ్ సభ్యులున్నారనుకుంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

57. ఇద్దరిలో మీరు ఒకరు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

58. డాక్టర్ సోలంకిగారు మరొకరు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

59. సౌత్‌బరో కమిటీ నివేదికపై ఆధారపడేనా?

**డాక్టర్ అంబేద్కర్ :** అలాగేనని నేను భావిస్తున్నాను.

60. ఆ కమిటీ ముందు మీరిచ్చిన సాక్ష్యాన్ని నేను అధ్యయనం చేస్తున్నాను. దళిత వర్గాల సంఖ్య ఎంతని మీరు చెప్పారు అనేది నేను పరిశీలిస్తున్నాను. మీ వినతిపత్రంలోని 39వ పేజీలోగల, ఒక 'నోట్'లో బొంబాయి ప్రెసిడెన్సీలో దళిత వర్గాల ప్రజల సంఖ్య సౌత్ బరో కమిటీ ప్రకారం 5,77,000 అని ఉంది.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

62. మీ ఉద్దేశంలో ఆ సంఖ్య తప్పనుకుంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును చాలా పెద్ద తప్పు.

63. వారు ఆ సంఖ్యను ఎలా తీసుకొన్నారు? మీరు చెప్పగలరా? ఆ విషయం మీ కు తెలుసా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఏ కులాలు అపవిత్రతను కలిగిస్తాయో వాటిని తెలపడానికి కేవలం ఒక చిన్న

పట్టికను తీసుకున్నారనుకుంటాను.

64. దళిత వర్గాలకు ఇది మరింత సంకుచితంగా ఇచ్చిన నిర్వచనం అనుకుంటాను.

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

65. *శ్రీ హార్ట్‌షార్న్ :* మీరు చెప్పిన ఈ పత్రంలో సౌత్ బరో కమిటీ చెప్పిన 5,77,000 సంఖ్యను చూపిన తర్వాత ఈ మాటలను గమనించాను." సౌత్‌బర్ కమిటీ ఆధారపడిన ప్రమాణం ప్రకారం 1911 సంవత్సరంలో బొంబాయి ప్రెసిడెన్సీలోని దళిత వర్గాల జనాభా 2,145,000"

*డాక్టర్ అంబేద్కర్ :* జనాభా లెక్కల్లో.

66. ఆ ప్రమాణం పైనేనా వారు ఆధారపడ్డారు? అదే నేను తెలుసుకోవాలనుకున్నది?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును. అధికారులు రెండు వేరు వేరు పేజీలలో రెండు వేరు వేరు అంకెలు ఇచ్చారు. ఒక పేజీలో వారు చిన్న సంఖ్యను ఇచ్చి దాన్ని లెక్కలోకి తీసుకున్నారు. సౌత్ బరో కమిటీ నివేదికను ప్రచురించగానే ఆ అంచనాకు విరుద్ధంగా నేను బొంబాయి ప్రభుత్వానికి నిరసన తెలిపాను.

67. *ఛైర్మన్ :* 2,100,000 దేని తాలుకు సంఖ్యో స్పష్టంగా చెప్పవచ్చుననుకుంటాను. 1921 జనాభా లెక్కల్లో అస్పృశ్యుల సంఖ్య నేను చెప్పినట్లుగా 1,477,000. వీటికి తోడుగా నేరస్థ జాతుల జనాభా సంఖ్య దాదాపు 623,000. ఈ రెండు సంఖ్యలు కలిపితే మీకు 2,100,000 సంఖ్య వస్తుంది.

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

68. ఆ సంఖ్య ఆదిమజాతుల్ని, కొండజాతుల్ని వదిలివేసిందా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

69. *శ్రీ మల్లర్ :* కొన్ని రాష్ట్రాల్లో దళిత వర్గాల స్థితిని గురించి నేను అడగాలనుకుంటున్నాను. బరోడా రాష్ట్రంలోనూ, మహారాష్ట్రలోనూ వారికి కొన్ని ప్రత్యేక సదుపాయాలు కల్పించారు. అవి విద్యా సదుపాయాలేనా? అంతకు మించినవి కూడా కల్పించబడ్డాయా?

*డాక్టర్ అంబేద్కర్ :* లేదు. అంతకంటే ఎక్కువేం లేదు.

70. ప్రభుత్వ సర్వీసులో చేరే అవకాశం మాకు ఉందా?

*డాక్టర్ అంబేద్కర్ :* అది చాలా కష్టం అనే నేను భావిస్తున్నాను.

71. ప్రభుత్వ సర్వీసులో నియమకాలు కావాలని మీరు ప్రత్యేకంగా పట్టుపడుతున్నారా?

*డాక్టర్ అంబేద్కర్ :*అవును కచ్చితంగా.

72. అది దేని కోసం?

డాక్టర్ అంబేద్కర్: ఆ అంశం పై నేను చెప్పాలనుకున్నది ఇది. న్యాయపరిపాలన విషయంలో మా అనుభవం చాలా చేదైనది. చాలా కేసుల్లో చట్టం దళిత వర్గాలకు హాని కలిగించే విధంగా అమలు చేయబడిందని నొక్కి చెప్పాలని కోరుకుంటున్నాను. ఒక జిల్లాలో జరిగిన సంఘటన గురించి పేర్లు చెప్పకుండా వాస్తవంగా ఏం జరిగిందో చెపుతాను. బొంబాయి ప్రభుత్వం ప్రతి ఏటా అటవీ భూముల్ని వ్యవసాయం కోసం గ్రామీణులకు కొన్ని షరతులపైన గుత్తకు ఇస్తుంది. ఈ అడవి భూముల కేటాయింపులో సాధారణంగా భూమిలేని కూలీలు, లేదా అతి తక్కువ భూమి ఉండి, ఏదో ఒకరకమైన ఆర్థిక స్థిరత్వం కోసం ప్రాకులాడే దళిత వర్గాల వారికి వాటా రావడంలేదు. ఈ భూములను పంపిణీ చేసే అధికారులలో ఉండే 'మామ్లత్‌దార్లు' దళిత వర్గాలకు విరుద్ధంగా సవర్ణ హిందువుల పట్ల పక్షపాతం చూపిస్తుంటారు. గత సంవత్సరం మేం సంఘంగా ఏర్పడి ఒక జిల్లాకు చెందిన అసిస్టెంటు డిప్యూటీ కలెక్టర్ వద్దకు ప్రతి నిధులను పంపి ఈ అడవుల భూములకు సంబంధించిన మా కష్టాలను నివేదించాం. ఆయన దళిత వర్గాల వారి దరఖాస్తును తప్పక లెక్కలోకి తీసుకోవాలని మామ్లత్‌దార్లకు ఒక సర్క్యులర్ పంపారు. తర్వాత కొంత మంది మామ్లత్ దారులు ఆ సర్క్యులర్ ప్రకారమే నడుచుకొంటున్నామని పైకి చూపడానికి కొన్ని భూములను దళిత వర్గాలకు కేటాయించారు. అయితే చివరికి తేలిందేమంటే, వాళ్ళు మమ్మల్ని వెర్రి వాళ్ళను చేశారనే నేను చెప్పవలసి వస్తుంది. వాళ్లేం చేశారంటే, కాగితం మీద దళిత వర్గాల వారికి చాలా ఎక్కువ పరిమాణంలో భూములను, సవర్ణ హిందువులకు చాలా తక్కువ పరిమాణంలో భూములను పంపిణీ చేశారు. అయితే మాకు పంపిణీ చేసిన అటవీ భూములన్నీ రాళ్ళతోనిండి, వ్యవసాయానికి అనువు కానివిగా, దేనికీ పనికిరానివిగా ఉండగా, సవర్ణ హిందువులకు పంపిణీ చేసిన భూములు తక్కువ అయినా అతి విలువైనవి, సారవంతమైనవి. అధికారులకు అప్పగించబడిన పరిపాలనాధికారం బాగా దుర్వినియోగం జరిగింది అనుకుంటున్నాను. సమర్థత కలిగిన న్యాయపరిపాలన కన్నా సత్పరిపాలనకు నేను ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాను.

73. అధ్యక్షుడు: మీరు తెలిపిన పరిపాలన నిర్వహణ చాలా ఆసక్తిదాయకంగా ఉన్నా, మన ప్రస్తుత విచారణకు సంబంధం లేనిది. ఎందుకంటే కమీషన్ విధి నిర్వహణ ఏ భాగంలో కూడా దైనందిన పరిపాలనలో జోక్యం కలిగించుకొనే వీలులేదు గదా!

డాక్టర్ అంబేద్కర్ : లేదు.

74. దళిత వర్గాలకు పూర్తి ప్రాతినిధ్యం ఉండాలన్న వాదనను బలపరచడానికి ఈ సంఘటనను ఉపయోగిస్తున్నారా?

డాక్టర్ అంబేద్కర్ : ప్రభుత్వ సేవలో ప్రాతినిధ్యం కోసం.

75. మీ అభిప్రాయం అదేనా?

డాక్టర్ అంబేద్కర్ : నా అభిప్రాయం అదే. బొంబాయి ప్రెసిడెన్సీలో న్యాయస్థానాల్లో ఏం

జరుగుతున్నదో కొన్ని ఉదాహరణలిస్తాను. నేను ఒక దళిత వర్గ వ్యక్తికి అనుకూలంగా ఒకానొక కోర్టులో వాదించవలసి వచ్చింది. ఆ వ్యక్తి కోర్టు బయట, కోర్టు గోడవెనుక చిన్నకిటికీ వద్ద నిలబడి ఉండడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ వ్యక్తి ఎందుకు లోపలికి రాలేదంటే అతడు ఇలా చెప్పాడు. "నేను కోర్టులో ప్రవేశిస్తే మీ వరకు ఫర్వాలేదు. మీరు వెళ్ళిపోయిన తర్వాత చాలా భయంకరమైన సాంఘిక బహిష్కరణ ఉంటుంది" అని.

76. క్లయింటే లోపలికి రాదలుచుకోలేదు గదా!

*డాక్టర్ అంబేద్కర్ :* లోపలికి రావడానికి సాహసించలేదు.

77. ఆ వ్యక్తి మనసులో ఏ రకమైన సాంఘిక బహిష్కరణ భయమున్నది?

*డాక్టర్ అంబేద్కర్ :* ఆ సాంఘిక బహిష్కరణ ఎలా ఉంటుందంటే అతడు గ్రామానికి వెళ్ళిన తరువాత దుకాణదారులు వెలివేస్తారు. అతనికి ఎవరూ తిండిగింజలు అమ్మరు. గ్రామ సేవకుడుగా అతనికి ఇవ్వవలసిన జీతాన్ని గ్రామస్థులు ఇవ్వడం మానేస్తారు. దళిత వర్గాల ప్రజలు ఎప్పుడూ గ్రామం చివరనే నివసిస్తారు గానీ గ్రామం మధ్యలో గానీ, గ్రామీణులతో కలిసిగానీ జీవించరు.

78. మీ ఆలోచన ఇదనుకుంటాను : ఆ వ్యక్తి ఈ సందర్భంలో కోర్టు లోపలికి రావడానికి భయపడ్డాడు. ఎందుకంటే తాను వెళ్ళ కూడని చోటుకు బలవంతంగా ప్రవేశించాడని తన గ్రామంలోని సవర్ణ హిందువులు భావిస్తారు కాబట్టి.

*డాక్టర్ అంబేద్కర్ :* నిజం. అతని సాంఘిక స్థాయికి మించి ప్రవర్తించాడని వారు భావిస్తారు.

79. అది ఒక ప్రత్యేక సందర్భం.

*డాక్టర్ అంబేద్కర్ :* నాకు దాన్ని గురించిన అనుభవం ఉంది. బొంబాయి హైకోర్టులో ఒక సర్క్యులర్ ఉన్నట్లుంది. హైకోర్టులోకి దళిత వర్గాల వ్యక్తులను తప్పక అనుమతించాలని. అంటే ఇలాంటి స్థితి చాలా చోట్ల ఉందని తెలుస్తుంది. ఆ సర్క్యులర్‌కు ఏదో కారణం తప్పక ఉండాలికదా?

*80. శ్రీ ముల్లర్ :* ఇంకో ప్రశ్న మాత్రమే అడుగుతాను. కౌన్సిల్‌లో 22 స్థానాలు ఇస్తే 22 మందీ యోగ్యులైన వారినే తీసుకురాగలరా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును తేగలననే భావిస్తున్నాను.

81. **ఖాన్ సాహిబ్ అబ్దుల్ లతీఫ్ :** కొన్ని కారణాల వల్ల అధికార వర్గం బొంబాయి కౌన్సిల్ నుంచి తొలగిన తర్వాత అల్ప సంఖ్యాక వర్గాల గతి ఏమైందో కమీషన్‌కు తెలియజేస్తారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అల్ప సంఖ్యాక వర్గాల గతి ఇంకా చాలా అస్థిరంగా ఉంటుందనే భావిస్తాను. అస్థిరంగా ఉంది కూడా.

82. ఉన్నత వర్గానికి చెందిన గౌరవనీయ మంత్రిగారు పథకానికి గానీ, మహమ్మదీయుల, బ్రాహ్మణేతురుల, దళిత వర్గాల స్పందనలకు గానీ, ఏ మాత్రమైనా సానుభూతి చూపించారా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. లేనేలేదు.

83. అల్ప సంఖ్యాక జాతులకు బొంబాయి శాసన మండలిలో ఏదైనా చట్టం పెట్టడానికయినా వారికి అవకాశం ఉంటుందా?

**డాక్టర్ అంబేద్కర్ :** వాళ్లకు ఆ అవకాశాలు దాదాపు శూన్యం.

★ ★ ★

98. **సర్దార్ మజుందార్ :** దళిత వర్గాలు అనిపిలవబడే వారిలో వేర్వేరు విధాల కులాలు లేవన్నది నిజం కాదు. అంటే, దళిత వర్గాల్లో కూడా వేర్వేరు కులాలున్నాయన్నమాట.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును ఉన్నాయను కోండి.

99. ఆ కులాలు దాదాపు ఎన్ని ఉండవచ్చో తెలపగలరా?

**డాక్టర్ అంబేద్కర్ :** అస్పృశ్యులు అనే విభాగం కింద ఇచ్చిన జనాభా లెక్కల వద్ద మీరు ఆ కులాల వివరాలు తెలుసుకో గలుగుతారనుకుంటాను.

100. వేరు వేరు కులాల సంఖ్యను గురించిన కనీస అంచనా అయినా ఇవ్వగలరా?

**డాక్టర్ అంబేద్కర్ :** డజను కులాలదాకా ఉండవచ్చు. ఈ విషయం జనాభా లెక్కలు చెబుతాయి.

101. బొంబాయి ప్రెసిడెన్సీలో పై వాటిల్లో ఎన్ని కులాలు దళిత వర్గాల కిందికి చేర్చబడ్డాయి?

**డాక్టర్ అంబేద్కర్ :** దాదాపు అన్ని కులాలూ.

102. మీ సంఘంలో ఆ వివిధ కులాల వారు సభ్యులన్నమాట?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును. అది దళిత వర్గాల సర్వ సభ్యుల్ని కలుపుకొని ఉండే సంఘం.

103. కాబట్టి వారందరూ దళిత వర్గాలలో కలిసి పోయి ఉన్నారు.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

104. మీరు భిల్లులు, వడియాలు ఇతర ప్రజల కోర్కెల్ని పట్టించుకొన్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు.

105. ఆ అల్ప సంఖ్యాక వర్గాల రక్షణ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

**డాక్టర్ అంబేద్కర్ :** ప్రాతినిధ్యం ద్వారా వారికి కొంత రక్షణ తప్పక ఇవ్వాలని నా అభిప్రాయం.

106. వెనుకబడిన తరగతుల్లో కూడా కొన్ని కులాల వారు అల్ప సంఖ్యాక వర్గంగా ఉంటారని మీరు భావిస్తున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** భావిస్తున్నాను.

106 ఎ . అలాంటప్పుడు ఇప్పటి రాజ్యాంగంలో వారి ప్రయోజనాన్ని రక్షించే నిబంధన ఏదైనా ఉందా?

**ఛైర్మన్:** మీరు ప్రస్తావిస్తున్న ఈ కులాల వారు హిందూ దేవాలయాల ప్రవేశానికి నిరాకరించబడ్డారా?

**సర్దార్ మజుందార్ :** లేదు. వారు దేవాలయాల్లో ప్రవేశించడానికి అనుమతించబడ్డారు.

**ఛైర్మన్ :** ఈ రోజు మనం నిజంగా అస్పృశ్యులు, హిందూ దేవాలయాల్లో ప్రవేశం నిరాకరించబడిన వారి గురించి ఆలోచిస్తున్నాం. వెనుకబడిన తరగతుల్లో హిందూ దేవాలయాల్లోకి ప్రవేశం కలిగిన వారి గురించి మనం ప్రస్తావించవలసిన పనిలేదు అనుకుంటాను.

**సర్దార్ మజుందార్:** నేను విజప్తి చేసేదేమిటంటే, వెనుకబడిన తరగతుల్లో కూడా చాలా అల్ప సంఖ్యాక వర్గాలున్నాయని. మనం అర్హత సంగతి గురించి ఆలోచించడం లేదు. అన్ని అల్ప సంఖ్యాక వర్గాల ప్రయోజనాల్ని రక్షించడానికే ఇక్కడ మనం ఉన్నది.

**ఛైర్మన్ :** కచ్చితంగా.

**సర్దార్ మజుందార్ :** నేను ఆ దృష్టితోనే ఈ ప్రశ్న అడిగాను.

**ఛైర్మన్:** ఇప్పుడు మీకు ఆ విషయాన్ని గురించి ఇంకా స్పష్టం చేస్తాను. భారత దేశం అల్ప సంఖ్యాక వర్గాలతో నిండి ఉంది. మీరు కొన్నిటి గురించి పేర్కొన్నారు. అయితే ఈ ఉదయం మనం 'దళిత వర్గాలు' అనే పేరుగల జనసమూహాన్ని గురించి మాట్లాడుకుంటున్నాం.

**సర్దార్ మజుందార్ :** చాలా బాగుంది సార్ !

107. **సయ్యద్ మీర్ మహమ్మద్‌షా:** మీరు మహమ్మదీయులకు లాగానే సముచిత నిష్పత్తిలో దళిత వర్గాలకు ప్రాతినిధ్యం కావాలని అడిగారు.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

108. మహమ్మదీయులు ప్రాతినిధ్యం సంపాదించారు. కాబట్టి మీరూ కోరుతున్నారా? అందులో ఏమైనా న్యాయం ఉందా?

**డాక్టర్ అంబేద్కర్ :** దాన్లో నేను న్యాయాన్నే చూస్తున్నాను. మ్యూజియంలో వీలైనన్ని నమూనాలు పెట్టినట్లుగా శాసన మండలిలో అల్ప సంఖ్యాక వర్గాలకు వాళ్ళ జనాభాను బట్టి ప్రాతినిధ్యం ఉండాలన్న సిద్ధాంతం నేనే మాత్రమూ అంగీకరించను. శాసన మండలి మ్యూజియం కంటే

ఉన్నతమయింది. సాంఘిక పోరాటాలు అక్కడ జరగాలి. ప్రత్యేక ప్రయోజనాల్ని నిర్మూలించాలి. హక్కులు గెలుచుకోవాలి. ఇలాంటివి జరగవలసిన స్థలం అది. అది శాసన మండలి ఆశయం అయినపుడు అల్ప సంఖ్యాక వర్గాలకు జనాభా నిష్పత్తి ప్రకారమే ప్రాతినిధ్యం కావాలన్నది ఏ విధంగానూ తగిన విషయం కాదు. ఎందుకంటే అధిక సంఖ్యాక వర్గాల చర్యల్ని ప్రభావితం చేసే అధికారం లేకపోతే, అల్ప సంఖ్యాక వర్గాన్ని ఎన్నటికీ అల్పసంఖ్యాక వర్గాంగానే నొక్కి వేసినట్లవుతుంది.

109. గ్రామీణ ప్రాంతాల్లో వోటు హక్కును స్థానిక సంస్థలకు పరిమితం చేస్తే మీరు సంతృప్తి చెందుతారా?

*డాక్టర్ అంబేద్కర్ :* వయోజన వోటింగు కావాలని నేను గట్టిగా పట్టుబడుతున్నాను. ఎంత కింది స్థాయికి పోతే వయోజన వోటింగు అంత మంచిదన్న సిద్ధాంతంపైన కింది స్థాయికి తీసుక వెళ్లడానికి అంగీకరిస్తాను. అయితే దీనిలో మాత్రమే నేను సంతృప్తి పడతాను అని మాత్రం చెప్పను.

110. అలాంటప్పుడు ఆదిమజాతులకు, నేరస్థ జాతులకు, కొండజాతులకు కూడా వయోజన వోటింగును వర్తింపజేస్తారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును. నేను అలాగే అనుకుంటాను.

111. మీరు కచ్చితంగా అనుకొంటున్నారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

112. వయోజన వోటింగు నుంచి వాళ్ళను మినహాయించి వారికి నామినేషన్ పద్ధతి, మీకు మాత్రం వయోజన వోటింగు హక్కు కావాలంటారా?

*డాక్టర్ అంబేద్కర్ :* నేను ఒక సంగతి విశ్లేషించి చెపుతాను. నేరస్థ జాతుల విషయం తీసుకుంటే వారికి వయోజన వోటింగు హక్కు ఇవ్వడం మంచిదికాదు. ఎందుకంటే వృత్తిరీత్యా వారికి తమ జాతి ప్రయోజనం మీదనే ఎక్కువ దృష్టి ఉంటుంది. బతుకు తెరువు సాంపాదించుకోవడంలో తాము ఎన్నుకొన్న మార్గం మంచిదా చెడ్డదా అన్నది వారు పట్టించుకోరు. అయితే ఆదిమ జాతులకు వయోజన వోటింగు హక్కు ఇచ్చినందువల్ల వచ్చే నష్టం ఏమీలేదు.

113. వారికి వోటు హక్కు ఇవ్వాలా? లేక వారి ప్రయోజనాలు నామినేషన్‌తో రక్షింపబడాలా?

*డా॥ అంబేద్కర్ :* వారు ఏదో విధంగా రక్షింపబడాలి. దానిమీద నేను ఎక్కువగా ఆలోచించలేదు. నా భావం ఏమిటంటే ప్రతివ్యక్తికీ కచ్చితంగా తనకేం కావాలో అర్థం చేసుకోగల తెలివి తేటలుంటాయి అనే అంశం పై అక్షరాస్యత ప్రభావం పెద్దగా ఉండదు. ఒక వ్యక్తి నిరక్షరాస్యుడైనా చాలా తెలివైనవాడు కావచ్చు.

114. ఈ ప్రత్యేక ప్రాతినిధ్యం జాతుల మధ్య ఉద్రిక్తతలకు దారి తీయదా? జాతుల మధ్య ఉద్రిక్తత

ప్రత్యేక ప్రాతినిధ్యం వల్ల, ప్రత్యేక నియోజక వర్గాల వల్ల వచ్చిందేనని చెప్పబడుతున్నది. ఇది మీ నమ్మకం కూడానా?

*డాక్టర్ అంబేద్కర్:* ఒక వేళ ఇది ఉద్రిక్తతకు దారి తీస్తుందని మనం భావించినా దాన్ని వదులుకోలేం. అది ఉద్రిక్తతకు దారి తీస్తుందా? అనేది ప్రశ్నార్థకం. అయితే ఏ సందర్భంలోనూ దాన్ని మీరు ఎలా వదులుకుంటారో నేను ఊహించుకోలేకుండా ఉన్నాను. కారణం సమాజం వర్గాలుగానూ, కులాలుగానూ విడిపోయి ఉంది కాబట్టి.

115. వివాదాలకు అది మూల కారణం అని మీరు భావించారా?

*డాక్టర్ అంబేద్కర్:* నేను అలా భావించడంలేదు. అయితే ఈ అంశం మాత్రం చెపుతాను. జాతి ప్రాతినిధ్యం ద్వారా వచ్చిన ఫలితం ఏమిటంటే ఆ జాతుల నాయకులు ప్రతిదానికీ రాజీపడే పరిస్థితి తగ్గింది. ప్రాతినిధ్యం లేకుంటే అలా జరిగేది కాదు. ఇది నా అభిప్రాయం. ఇది జాతుల మధ్య కొట్లాటలకు దారి తీస్తుందనుకోను. అవి వేరే కారణాల వల్ల వస్తుంటాయి.

116. సయ్యద్ మీరా మహమ్మద్‌షా: అధికార వర్గాన్ని పక్కకు తీసివేసి, అనధికార వర్గాన్ని నామినేట్ చేస్తే సరిపోతుందని మీరు సలహా ఇవ్వొచ్చుగదా?

*డాక్టర్ అంబేద్కర్:* నేను నామినేషన్‌ను కోరుకోను.

117. మేజర్ అట్లీ: ఈ దళిత వర్గాల ప్రజలు పరిశ్రమలు, నూలుమిల్లులు వంటి వాటిల్లో పని చేయడం లేదా?

*డాక్టర్ అంబేద్కర్:* అందరూ పనిచేస్తున్నారు. దళిత వర్గాల ప్రజలందరూ కార్మికులే.

118. మీరు నా అభిప్రాయాన్ని అర్థం చేసుకోలేదు. నేను పరిశ్రమల విషయం మాట్లాడుతున్నాను. దళిత వర్గాల ప్రజలు గ్రామాల్లోని వృత్తుల్లో కార్మికులుగా ఉన్నారు. కానీ, పరిశ్రమల్లో దళిత వర్గాల సభ్యులు పెద్ద సంఖ్యలో ఉన్నారా?

*డాక్టర్ అంబేద్కర్:* చాలా పెద్ద సంఖ్యలో ఉన్నారు.

119. బొంబాయి నగరం లాంటి ప్రదేశంలో చాలా ఎక్కువ మందే ఉంటారా?

*డాక్టర్ అంబేద్కర్:* అవును.

120. ఏ మాత్రం అయినా వారి అస్పృశ్యత తగ్గిందా?

*డాక్టర్ అంబేద్కర్:* లేదు. ఈ సంగతే నేను చెప్పాలనుకుంటున్నాను. దళిత వర్గాల ప్రజలు బాగా డబ్బులు వచ్చే చేనేత రంగానికి పూర్తిగా దూరం ఉంచబడ్డారు. దళిత వర్గ వ్యక్తులు నూలుతీసే రంగం వంటి వాటిల్లో మాత్రం పనిచేయవచ్చు.

121. ఎందువల్ల?

***డాక్టర్ అంబేద్కర్ :*** అస్పృశ్యత వల్ల,

122. ఎప్పుడైతే దళిత వ్యక్తి అక్కడ పనిచేస్తున్నాడో అప్పుడు అందరితో కలిసే కదా పనిచేస్తున్నాడు?

***డాక్టర్ అంబేద్కర్ :*** నిజంకాదు. ఆ రంగాలు కులాల ఆధారంగా ఏర్పడ్డాయి. ఒక రంగం పూర్తిగా దళిత వ్యక్తులతోనే పనిచేస్తున్నది. మరొకటి, అంటే చేనేత రంగం మహమ్మదీయులతోను, సవర్ణ హిందువులతోను నడపబడుతున్నది.

123. వాళ్లు కార్మిక సంఘాల్లో పాలు పంచుకొంటున్నారా?

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును. ఇప్పుడిప్పుడే అలా చేయడం ప్రారంభిస్తున్నారు.

124. తమకంటే పై స్థానంలో ఉన్న ఇతర కులాల వారితో దళిత వర్గ సభ్యులు కలుస్తారా?

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును.

125. ఈ తేడానే మీ నుంచి తెలుసుకోవాలి అనుకున్నాను. వారి సంఖ్యను బట్టి దళిత వర్గాలకు ప్రాతినిధ్యం కావాలని మీరు మనవి చేశారు. ఇప్పుడు మనం వేరే ఆధారాలు కూడా ముందుంచుతున్నాం. కార్మికత్వ ఆధారం మీరు ఈ విధంగా చేస్తే ప్రతికూల విభాగాలు వచ్చే అవకాశం ఉంది. ఒక వ్యక్తి దళిత వర్గ వ్యక్తిగా ఉండవచ్చు. అతడే కార్మికుడుగా కూడా ఉండవచ్చు.

***డాక్టర్ అంబేద్కర్ :*** అతడు ఎప్పుడూ కాకపోయినా, సాధారణంగా కార్మికుడే.

126. అది చాలా వరకు మాటల గారడీ. కాదంటారా? నేను పెట్టుబడి గురించి, కార్మికుల గురించి మాట్లాడుతున్నాను. అదీ కూడా పెద్ద పరిశ్రమల్లో ఉండే కార్మికుల గురించి. వ్యవస్థీకృతం కాని కార్మికులు కాదు. ఈ సమస్యను మీరు ఎలా అధిగమిస్తారు? సాంఘిక స్థాయిని ప్రాతినిధ్యం ఒకవైపు, పరిశ్రమ ఆధారంగా మరోవైపు ప్రాతినిధ్యం తెచ్చుకొంటే అపుడు మళ్లీ ప్రతికూల విభజన వస్తుంది. దాన్ని మీరు ఎలా అధిగమిస్తారు?

***డాక్టర్ అంబేద్కర్ :*** వ్యవస్థీకృతమైన కార్మికులకు ఏదో నిబంధన ఉంటుంది. దళిత వర్గాల్లో చాలా మంది కార్మికులే.

127. ***శ్రీ హార్ట్‌షాన్ :*** డాక్టర్ అంబేద్కర్! మీరు వయోజన వోటింగును సమర్థిస్తున్నామని చాలా స్పష్టంగానే చెప్పారనుకుంటాను. ఏమైనా మీ వినతిపత్రంలోని 41వ పేజీలో.... "అయినప్పటికీ ప్రెసిడెన్సీలోని గ్రామీణ ప్రాంతాలలో తాలూకు స్థానిక బోర్డులకిచ్చినట్లుగాను, పట్టణాల్లో ఉండేవారికి 3 రూపాయల అద్దె ఇస్తున్న అర్హతతో శాసన మండలిలో వోటింగు హక్కు కల్పిస్తే చాలు సభ సంతృప్తి చెందుతుంది" అని మీరు అన్నారు. ఆ అర్హత పై ఎంతవరకు వోటింగు హక్కు ఇవ్వవచ్చో లెక్క లేమైనా మీరు ఇవ్వగలరా?

డాక్టర్ అంబేద్కర్: ఈ విషయంపై నేను స్థిరంగా లేనని చెప్పగలను. అలా అంగీకరించడానికి నేనేమీ సంకోచించను. గ్రామీణ ప్రాంతాల్లోని దళితవర్గాల ప్రజల నుండి సేకరించిన సమాచారం ప్రకారం, ప్రస్తుతం తాలూకాలలో అమలులో ఉన్న స్థానిక వోటింగ్ హక్కును కల్పిస్తే దళిత వర్గాల నుంచి కొందరు వోటర్లు రాగలరని తెలిసింది.

128. ఇప్పుడు నేను దాని గురించి ఆలోచించడం లేదు. బొంబాయి ప్రెసిడెన్సీలో ఇప్పటి కుండే విధంగా గాకుండా ఈ అర్హత ప్రాతిపదికగా వోటర్లు ఎంతమంది పెరుగుతారో సంఖ్య చెప్పగలరా?

డాక్టర్ అంబేద్కర్: ఈ అంశానికి సంబంధించి మీకు కచ్చితమైన సమాచారం నేను ఇవ్వగలననుకోను.

129. మేజర్ అట్లీ వేసిన ప్రశ్న దగ్గరికి మళ్ళీ మిమ్మల్ని తీసుకువెళ్ళేదా? దళిత వర్గాలు ఫ్యాక్టరీల్లో ఒంటరిగా పనిచేస్తున్నారంటారా?

డాక్టర్ అంబేద్కర్: అవును విడిగానే పనిచేస్తున్నారు.

130. దళిత వర్గాలు తమకంటూ ఒక సొంతమైన పని, సొంతమైన షెడ్డు కలిగి ఉన్నారా?

డాక్టర్ అంబేద్కర్: వారికి సొంత పని ఉంది గానీ సొంత షెడ్లు లేవు.

131. ఏమైనా గానీ, ఫ్యాక్టరీలో దళిత వర్గాలు ఇతర కార్మికుల నుంచి వేరు చేయబడ్డారన్నమాట!

డాక్టర్ అంబేద్కర్: అదే అంశాన్ని నేనయితే చెబుతాను. కొన్ని నిర్దిష్టమైన పనులు ప్రత్యేకంగా దళిత వర్గాల కోసం కేటాయించబడ్డాయి. మరికొన్ని నిర్దిష్టమైన పనులలో వారికి ప్రవేశం నిరాకరించబడింది.

132. కొన్ని తరహా పనులు వారికి నిషిద్ధం అయ్యాయా?

డాక్టర్ అంబేద్కర్: అవును మిల్లుల్లో నిషిద్ధం అయ్యాయి.

133. చేనేత పనిలోకి వారికి ప్రవేశం లేదని మీరు అన్నట్లు నేను భావిస్తున్నాను.

డాక్టర్ అంబేద్కర్: అవును.

134. వాళ్ళు ఒకే కార్మిక సంఘంలో కార్మికులు అయినప్పుడు చేనేత శాఖలోని కార్మికులు దళితులను ప్రవేశించనీయరా?

డాక్టర్ అంబేద్కర్: దళితుల ప్రవేశానికి అంగీకరించరు. ఈ మధ్య జరిగిన బొంబాయి సమ్మెలో నేను ప్రసిద్ధంగా వెలుగులోకి తెచ్చిన అంశాన్ని చెపుతాను. దళిత వర్గాలకు అన్నిశాఖల్లో పనిచేసే హక్కు అంగీకరించకపోతే దళిత వర్గాలను సమ్మెలో పాల్గొన వద్దని చెప్తానని కార్మిక సంఘాల సభ్యులతో చెప్పాను. తమ కోరికల్లో ఈ అంశాన్ని ఒకటిగా చేర్చడానికి వారు అయిష్టంగా అంగీకరించారు. ఈ విషయాన్ని వారు మిల్లు యజమానులకు సమర్పించినపుడు, మిల్లు యజమానులు వారిని కేకలు వేస్తూ వారనుకొనే అన్యాయానికి తాము బాధ్యులం కాము అని అన్నారు.

135. యజమానులు చౌకగా కార్మికులను సంపాదించుకోవడానికి గాని, ఆర్థిక కారణాల వల్లగానీ, దళిత వర్గాలను కొన్ని రంగాలకే పరిమితం చేయడం జరిగిందనుకుంటాను. కాదంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** కాదు, అస్పృశ్యతే కారణం.

136. ఎక్కువ జీతం పొందే భారతీయుడు తన పనిలోకి అస్పృశ్యుణ్ణి రానివ్వడానికి నిరాకరిస్తున్నాడు. వారికి తక్కువ జీతం ఇస్తున్నాం అనే అంశం ఆధారంగా తమ పనిలో తమ జీతాలను కూడా తగ్గిస్తారేమోనని భయపడుతున్నారు. ఈ పరిస్థితిలో అలాంటిదేమైనా ఉందా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. జీతాల మూలంగా ఏమీ తేడాలేదు.

137. జీతాల సంగతి ఈ సందర్భంలో ప్రసక్తికి రానేరాదా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. రానేరాదు.

138. అది పూర్తిగా అస్పృశ్యత సమస్య మాత్రమే?

**డాక్టర్ అంబేద్కర్ :** అదంతే.

139. **శ్రీ కాడోగన్ :** వారు కార్మిక సంఘ సభ్యులు కావచ్చు?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

140. **శ్రీ ప్రేమచంద్ :** నియోజక వర్గ ప్రత్యేక రిజిష్టర్లలో దళిత వర్గాలు అని పిలవబడేవారికి సంబంధించిన కచ్చితమైన నిర్వచనం ఇవ్వగలరా?

**డాక్టర్ అంబేద్కర్ :** మైల కలిగించే కులాలు.

141. సమాజంలో ఎంత తక్కువ స్థితిలో ఉంటే అంత ఎక్కువ ఎన్నిక అవకాశం కలిగి ఉండాలి అనే సిద్ధాంతం న్యాయసమ్మతమేనా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును

142. అన్ని అల్పసంఖ్యాక వర్గాలకు అదనపు స్థానాలు ఇస్తే, అధిక సంఖ్యాక వర్గానికి కల్పించే స్థానం ఎలాంటిదయి ఉంటుంది?

**డాక్టర్ అంబేద్కర్ :** అల్ప సంఖ్యాకవర్గాలన్నీ కలిసి మెజారిటీ సాధిస్తే 'మెజారిటీ వర్గం' అనేది ఉండదు కాబట్టి పై సమస్య రానేరాదు. అల్ప సంఖ్యాక వర్గాల్లో వర్గ భేదాలు ఉండవచ్చు. బొంబాయి ప్రెసిడెన్సీలో మహమ్మదీయులను, పెట్టుబడిదారులను అభిమానించే ఒక వర్గం, కార్మికుల్ని అభిమానించే మరోవర్గం ఏర్పడతాయని నేను భావిస్తున్నాను.

143. రాజకీయ భావనలేని, రాజకీయ శిక్షణ పొందని ప్రజలు రాజకీయాలే వృత్తిగా చేబట్టిన

నాయకులు నడిపించడం వల్ల తప్పుదారులు తొక్కుతున్నారనడం నిజం కాదా?

**డాక్టర్ అంబేద్కర్ :** నాకు తెలియదు.

144. సంఘంలో నిరక్షరాస్యులైన వర్గంలోని చాలా మందికి వోటింగు హక్కు ఇస్తే అది అపాయకరంగా ఉండడమే కాక, దుర్వినియోగానికి గురికాదా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. అలా అవుతుందని నేను భావించడంలేదు.

145. ప్రభుత్వ రాబడిని వ్యయం చేయవలసిన అవసరం లేకుండా ప్రస్తుతం ఉండే పాఠశాలలు, కళాశాలల్లోనే దళిత వర్గాల పిల్లల్ని చేర్చుకొనే అవకాశం లేదా? చెప్పండి

**డాక్టర్ అంబేద్కర్ :** ప్రస్తుత విధానంలో దళిత వర్గాలు పూర్తిగా ఉపేక్షింపబడుతున్నారు కాబట్టి ఆ అవకాశం లేదు.

146. రాష్ట్ర రాబడిని ఖర్చు చేయకుండా ఇప్పుడున్న పాఠశాలలు, కళాశాలల్లో దళిత వర్గాల పిల్లలను ప్రవేశపెట్టే అవకాశం ఎందుకు లేదు?

**డాక్టర్ అంబేద్కర్ :** ఎవరు ప్రవేశాన్ని నిరాకరిస్తున్నారో, ఆ నిరాకరణకు కారణమేమిటో వారినే అడగండి.

147. దేనిని నిరాకరిస్తున్నారు?

**డాక్టర్ అంబేద్కర్ :** దళిత వర్గాల పిల్లల ప్రవేశాన్ని నిరాకరించడం.

148. పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

149. బొంబాయి మున్సిపాలిటీ ఇప్పుడు ఒక నిబంధన ఏర్పరిచింది. మీకు తెలుసా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఆ నిబంధనకు వ్యతిరేకతను తెలిపే సమావేశం కూడా బొంబాయిలోనే జరిగిందని మీకు తెలిసి ఉందనుకుంటాను.

150. ఒక వర్గం నుంచి వ్యతిరేకత వచ్చి ఉండవచ్చు.

**డాక్టర్ అంబేద్కర్ :** వచ్చే ఎన్నికల సమయానికి ఆ నిబంధనకు వాళ్లు కట్టుబడి ఉంటారో లేదో వేచి చూడవలసి ఉంది.

151. కానీ, ఇప్పుడు చేశారు కదా!

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

152. <u>ఛైర్మన్</u>**:** ఆయన సూచించిన 'నిరసన సమావేశం' దేనిని ఉద్దేశించిందో మనం తెలుసుకోవచ్చా?

*డాక్టర్ అంబేద్కర్ :* పరిస్థితి ఇది : బొంబాయి మున్సిపాలిటీ ఇంతకు ముందు దళిత వర్గాల పిల్లలకు ప్రత్యేకమైన పాఠశాలలు కల్పించింది. ఇప్పుడు ఆర్థిక కారణాలవల్ల బొంబాయి, మున్సిపాలిటీ పాఠశాలల సంఖ్య తగ్గించవలసి వచ్చింది. నిర్బంధ ప్రాథమిక విద్యాప్రణాళిక కింద చెట్టుకొకరు పుట్టకొకరుగా తిరిగే దళిత వర్గాల పిల్లల్ని ఒక చోటచేర్చి సవర్ణ హిందువుల పిల్లలు చదివే పాఠశాలల్లో చేర్చవలసి వచ్చింది. పాఠశాలలకు వచ్చే పిల్లలకు మంచి నీటి సౌకర్యం, మరికొన్ని సౌకర్యాలు కల్పించవలసి ఉంది కదా! మంచి నీటి సౌకర్యం విషయంలో భేదం ఏమైనా పాటించాలా? అస్పృశ్యుల పిల్లలకు సవర్ణ హిందువుల పిల్లలకు వేర్వేరుగా పాత్రలను పెట్టాలా? అనే సమస్య వచ్చిపడింది. "మా పాఠశాలలో మేం అస్పృశ్యతని గుర్తించం" అని మున్సిపాలిటీ ఒక తీర్మానం ఆమోదించింది. మంచి నీటి పాత్రల్లో ఏ విధమైన భేదం ఉండకూడదని తమ పాఠశాలలకు మున్సిపాలిటీ సర్క్యులర్ పంపింది. బొంబాయిలోని ఒక ప్రముఖ హిందూనాయకుని అధ్యక్షతన హిందూ మతానికి విరుద్ధంగా ఇలాంటి సమానమైన ఏర్పాటును మున్సిపాలిటీ చేసినందుకు నిరసన తెలియజేస్తూ జరిపిన సమావేశమే 'నిరసన సమావేశం' అనేది.

153. *శ్రీ ప్రేమచంద్ :* అహమ్మదాబాద్ మిల్లుల్లోని నేత పరిశ్రమల్లో దళిత వర్గాల ప్రజలు ఉద్యోగాల్లో ఉన్నారు తెలుసా?

*డాక్టర్ అంబేద్కర్ :* నాకు తెలియదు

154. వారున్నారని నేను చెప్పగలను.

*డాక్టర్ అంబేద్కర్ :* ఈ సందర్భంలోనూ నేనొక విషయం చెప్పవలసి ఉంది. బహుశా వాళ్ళు ప్రత్యేకంగా నియమింపబడి ఉండవచ్చు. దళిత వర్గాలకే ప్రత్యేకంగా ఎన్నో కొన్ని మగ్గాల్ని అప్పగించి ఉండే పరిస్థితిని నేను ఊహించగలను. కొన్ని మిల్లుల్లో నేత పని మొత్తం దళిత వర్గాల ఆధ్వర్యంలోనే ఉండాలని, మిల్లు యజమానులు ఈ పనిచేయాలని ఒక ప్రతిపాదన ఉంది. అయితే కొంత దళిత వర్గం, కొంత సవర్ణ హిందువుల ఆధ్వర్యం మాత్రం వీలుకాదు.

155. మిశ్రమం కష్టం అంటారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

156. *సర్ హరిసింఘ్ గౌర్ :* రాజ్యాంగ సవరణ అనే సామాన్య ప్రణాళికపై మీ సంస్థ అభిప్రాయం ఏమిటి? ఆ అంశం మీద మీరేమైనా అభిప్రాయాలు ఏర్పరచుకొన్నారా?

డాక్టర్ అంబేద్కర్ : నేను ఈ విషయం చెబుతాను. ప్రత్యేక రాజ్యాంగ సమస్యల మీద దళిత వర్గాలకు దృష్టి లేదు. ఏ రకమైన ప్రభుత్వం వచ్చినా దానిలో తాము కోరుకున్న హామీలు, రక్షణ అనే అంశాల మీదనే వారికి ఎక్కువ ఆసక్తి ఉంది. అందువల్ల కేంద్ర ప్రభుత్వం లేదా రాష్ట్ర ప్రభుత్వం తీరు ఇలా ఉండాలని దళిత వర్గాలు నిశ్చితమైన అభిప్రాయాలు ఏర్పరచుకోలేదని నేను భావిస్తున్నాను.

అయితే, దళిత వర్గాల సభ్యునిగా నాకు కొన్ని అభిప్రాయాలున్నాయి. కానీ, అవి దళిత వర్గాల సమిష్టి అభిప్రాయం మాత్రం గాదు. అందుకనే నేను నా వినతిపత్రంలో దీన్ని గురించి ఏమీ చెప్పలేదు.

157. అది నాకు తెలును. అందుకే నేను ఈ ప్రశ్న అడిగాను. మీ వ్యక్తిగత అభిప్రాయం ఏమిటి?

***డాక్టర్ అంబేద్కర్ :*** రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించి అయితే రాష్ట్రాల స్వయంపాలనకు నేను అనుకూలంగా ఉన్నాను.

158. సంపూర్ణ స్వయంపాలనా? పరిమిత స్వయం పాలనా?

***డాక్టర్ అంబేద్కర్ :*** శాంతి భద్రతల బదిలీ విషయంలో కొన్ని రక్షణలుండాలని నేను భావిస్తున్నాను. అయితే శాంతి భద్రతల అంశం బదిలీని నేను ఆక్షేపించడంలేదు. నేను బదలీకి అనుకూలంగా ఉన్నాను. అయినా ఏదో విధమైన భద్రతను సమర్థిస్తాను. అది ఎలాంటిది అంటే ఖచ్చితంగా చెప్పలేను. అయితే, ఆ భద్రత ఏదైనా సహాయకారిగా మాత్రం ఉండాలి. దీన్ని వదిలివేస్తే వ్యక్తిగతంగా మాట్లాడితే నేను సంపూర్ణ స్వయం పాలననే సమర్థిస్తాను.

159. కేంద్ర ప్రభుత్వం సంగతేమిటి?

***డాక్టర్ అంబేద్కర్ :*** అక్కడ ద్వంద్వ పరిపాలనతో మొదలు పెట్టాలి.

160. వయోజన వోటింగు అంటే వయోజన పురుష, వయోజన స్త్రీ వోటింగులకు అనుకూలంగా ఉన్నారని భావిస్తారా?"

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును.

161. అది ఆచరణాత్మక ప్రతిపాదనేనంటారా?

***డాక్టర్ అంబేద్కర్ :*** అది పూర్తిగా ఆచరణాత్మకమే.

162. రాజకీయ వోటింగ్‌ద్వారా తమ వర్గాల ప్రయోజనాలను సాధించుకోవడానికి సామాన్య ప్రజానీకం తగినంతగా రాజకీయ చైతన్యం పొంది ఉన్నారని మీరు భావిస్తున్నారా?

***డాక్టర్ అంబేద్కర్ :*** బొంబాయి ప్రెసిడెన్సీ విషయంలో దళిత వర్గాల ప్రజలు చాలా వివేకవంతంగా తమ వోటు వినియోగించుకుంటారని దళిత వర్గాల ప్రజల తరుపున నేను నొక్కి చెప్పగలను. తమ జీవితాల్లోని అస్పృశ్యత అన్న వేదన వారి మనసుల్లో ప్రతిక్షణం మెదులుతుంటుంది. ఈ కష్టానికి తరుణోపాయం రాజకీయ అధికారం అని వారికి తెలుసు. కాబట్టి దళిత వర్గాల వోటరు చాలా తెలివైన వోటరుగా ఉంటాడని నేను గట్టిగా చెప్పగలను.

163. పన్నులు కట్టనివారికి రాజకీయ జీవితం, రాజకీయ అధికారం ఉంటే ఇంతకు ముందే ఎక్కువ పన్నులతో నలిగిపోతున్న వారిపై మరిన్ని పన్నులు వేయరా? ఇతర దేశాల్లో ఇలాంటి దృష్టాంతాలున్నాయి కదా?

**డాక్టర్ అంబేద్కర్ :** అది అలాగే ఉండాలి. నా దృష్టిలో అందులో ఏమీ తప్పులేదు.

164. పన్నులు కట్టేవర్గాన్నే స్వార్థానికి ఇంకా ఉపయోగించడంలో మీకు తప్పు కనిపించలేదా?

**డాక్టర్ అంబేద్కర్ :** నా సొంత అభిప్రాయం ఇది. మా సంస్థ దీని గురించి ఏమీ చెప్పలేదు.

165. ఈ దృక్కోణం కమీషన్‌కు చెప్పడంలో మీ సంస్థ వారి సాధారణ అభిప్రాయాన్ని మీరు ప్రతిబింబిస్తున్నారని భావిస్తున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అది అన్ని పేద వర్గాల అభిప్రాయమేనని నేను భావిస్తున్నాను.

★ ★ ★

167. సర్ హరిసింఘ్ గౌర్ : మీరు అధ్యక్షునికి ప్రత్యుత్తరం ఇస్తూ దళిత వర్గాలను ఒక ప్రత్యేక వర్గంగా, హిందూ జాతికి విభిన్నంగా పరిగణించాలి అన్నారు. దీన్ని మీరు ఎన్నికల ప్రయోజనాలకే పరిమితంచేస్తారా? లేక అన్ని ప్రయోజనాలకూనా?

**డాక్టర్ అంబేద్కర్ :** నిజం చెప్పాలంటే దళిత వర్గాలు అన్ని విధాలా ప్రత్యేక వర్గమే.

168. మీరు దళిత వర్గాల్ని నిజమైన హిందువులుగా పరిగణిస్తారా?

**డాక్టర్ అంబేద్కర్ :** 'పరిభాష'ను నేను పట్టించుకోను. నేను హిందూ జాతి హద్దుకు దూరంగా ఉన్నంత సేపు నన్ను నేను హిందువుగా పిల్చుకొన్నా హిందూయేతరుడుగా పిల్చుకొన్నా భేదమేమీ లేదు.

170. అసలు సమస్య అంతా అదే. మీరు .... హిందూమతం హద్దుల వెలుపల ఉంటే మీరు హిందూ చట్టానికి అతీతంగా ఉంటారు. ఉదాహరణకు 1923 నాటి 'చట్టం 30' హిందువులు - మహర్లు, స్పృశ్యులు - అస్పృశ్యుల మధ్య వివాహవిషయంలో మాత్రం అన్ని కుల భేదాల్ని రద్దు చేసింది. మీరు హిందూ చట్టం హద్దుల వెలుపల ఉంటే ఆ చట్టాన్ని అనుసరించి వివాహ ఒడంబడికను చేసుకోలేరు. మీరు హిందూ జాతి నుంచి వైదొలిగితే, ఆ సాంఘిక వ్యవస్థ వెలుపలికి పోయి, హిందూయేతరులుగా పిలుచుకుంటే ఆ మేరకు మీరు హిందూ చట్టానికి వెలుపలగా ఉంటారు.

**డాక్టర్ అంబేద్కర్ :** అలాగే కావచ్చు.

171. అప్పుడు మీరు ఏ చట్టం పరిధిలో ఉంటారు?

**డాక్టర్ అంబేద్కర్ :** మేము కూడా హిందూ చట్టం ఆధీనంలోనే ఉంటాం. ఎలాగంటే 'కోజా'లు మహమ్మదీయులైనా ఆస్తి సంక్రమణ విషయంలో మాత్రం హిందూ చట్టం ఆధీనంలో ఉండడానికి ఇష్టపడతారు.

172. మీరు 1923 నాటి చట్టం 30 ఆధీనంలో ఉంటారన్న మాట. అంటే హిందూ చట్టం ఆధీనంలో...?

**డాక్టర్ అంబేద్కర్ :** దళిత వర్గాలు పెళ్ళి విషయంలో ఏం భావిస్తున్నారో నాకు తెలియదు.

173. మీరు మీ వినతిపత్రం వైపు ఒకసారి దృష్టి సారించండి. 39వ పేజీలో మిత్రులు కికాబాయ్‌కి సమాధానం చెప్పేటప్పుడు "సాంఘిక పోరాటంలో తనను తాను రక్షించుకొనే శక్తి అన్న అంశం మీద ఏదైనా ఒక జాతి స్థితి ఆధారపడి ఉంటుంది. ఆ శక్తి తప్పకుండా ఆ జాతి విద్యా, ఆర్థిక స్థాయిల్ని బట్టి ఉంటుంది" అన్నారు.

**డాక్టర్ అంబేద్కర్ :** అది నిజం.

174. జాతి స్థాయి తక్కువ అయ్యే కొద్దీ, ఎన్నికల ప్రయోజనాలు ఇతర జాతులకంటే ఎక్కువ ఉండాలి అన్న సిద్ధాంతం ప్రాతిపదికగానే పై అభిప్రాయం వచ్చింది. ఈ చివరి వాక్యం అంతకు ముందరి రెండు వాక్యాల ఫలితార్థంగా వచ్చిందని మీరు నివేదిస్తున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

175. మీరు దాన్ని తర్కబద్ధ ఫలితార్థంగా భావిస్తున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును, నిజంగా

176.... నేను మీరు చెప్పిన అంశం మీదికి మీ దృష్టి తేవాలనుకుంటున్నాను. "తగినంత ప్రాతినిధ్యం ఇవ్వాలి అనే కోరికతో పాటు, దేశ రాజ్యాంగంలో ఆ నిబంధనలను కలపాలి అని కూడా కోరాలని సభ భావిస్తున్నది" అన్నారు. ఆ నిబంధనల్లో "దళిత వర్గాల ప్రజలకు వారిలోనుండి స్పెషల్ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ పోలీస్ నియమించబడే హక్కు ఉండాలి" అలాంటి అంశాల్ని మీరు సూచించారు.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

177. భారతదేశంలోని దళిత వర్గాల నుండి ప్రతి జిల్లాకు ఒక స్పెషల్ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ పోలీసును నియమించాలని నిర్దేశించే నిబంధనలు పార్లమెంట్ చట్టంలో ఉండాలని మీరు ఆశిస్తున్నారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అందులో నాకు వింతేమీ కనిపించడం లేదు.

178. మీరు భావించినట్లుగా అన్ని జాతులకు ఇలాంటి అవకాశం కల్పిస్తే (ఎందుకంటే మీరు నిర్దిష్టమైన రాజ్యాంగ హామీలు పొందితే ఇతర జాతులు కూడా అవి పొందే అవకాశం ఉంది కాబట్టి) అపుడు మీరు అన్ని ప్రభుత్వ ఉద్యోగాలను, ఇతర ప్రయోజనాలను వేర్వేరు జాతులకు పంచిపెడతారు. భారత దేశానికి ఇలాంటి రాజ్యాంగం ఉండాలనా మీరు ఎదురు చూస్తున్నారు?

**డాక్టర్ అంబేద్కర్ :** అది నాకు తెలియదు. నేను దళిత వర్గాల కోసమే మాట్లాడుతున్నాను. నేను ఒక అంశాన్ని స్పష్టం చేసేదా?

179. నేను నా వాక్యాన్ని పూర్తి చేయనివ్వండి. అనుకోకుండా తలెత్తే ఈ సమస్య మీ మనసులో ఏ భయాన్నీ పుట్టించడం లేదా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఈ విషయంలో మీరు ఇంకా ముందుకు పోకుండానే నన్ను వివరించనివ్వండి. 'అల్పసంఖ్యాక వర్గం' అనే పదం వాడేటప్పుడు మనం చాలా జాగ్రత్తగా ఉండాలని నా అభిప్రాయం. ఒక జాతి జనాభా సంఖ్యలో తక్కువగా ఉంటూనే అది రాజకీయ ప్రయోజనాల కోసం అల్ప సంఖ్యాక వర్గం అయిపోదు. ఏ అల్ప సంఖ్యాకవర్గం అణచివేయబడి ఉంటుందో ఆ వర్గం మాత్రమే రాజకీయ ప్రయోజనాలకోసం అల్ప సంఖ్యాక వర్గంగా పిలవబడటానికి అర్హత కలిగి ఉంటుంది.

180. ఇతర దేశాల్లో ఎక్కడ అల్ప సంఖ్యాక వర్గాలు ఉంటాయో అక్కడ ఆ అవకాశం కల్పించబడింది. ఒక్కొకసారి అల్పసంఖ్యాక వర్గాల రక్షణ కోసం ఒక మంత్రి కూడా ఉంటాడు. అలాంటిదాన్ని మీరు ఆలోచించారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

181. మేము మీకు ఏదో ఒక రూపంలో రక్షణ ఇస్తామనుకోండి.

**డాక్టర్ అంబేద్కర్ :** మిమ్మల్ని ఆటంకపరుస్తున్నందుకు క్షమించండి. చాలా యూరోపియన్ దేశాలకు శాంతి తర్వాత ఏర్పడిన కొత్త రాజ్యాంగాల్లో చాలా వరకు ఇలాంటి నిబంధన ఉంది. ఈ విషయంపై మాట్లాడడానికి అనుమతిస్తే ఈ అంశం పై ఇప్పటికే కొంత ప్రత్యేక అధ్యయనం చేశాను.

182. **లార్డ్ బర్న్ హామ్ :** ఆ నిబంధనను అమలు చేశారా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఆ సిద్ధాంతాన్ని రాజ్యాంగంలో ఒక భాగంగా పొందుపరిచారు.

183. ఆచరణలో కూడా పెట్టారా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఆచరణలో పెట్టబడింది. నా ఉద్దేశ్యం ఇది. ఏ అల్పసంఖ్యాక వర్గమైనా హామీలు నెరవేరవని భావిస్తే నానాజాతి సమితికి అప్పీలు చేసుకొనే హక్కు దానికి ఉంది.

★ ★ ★

186. నేను సిద్ధాంతంలో తగాదా పడడం లేదు.

**డాక్టర్ అంబేద్కర్ :** భద్రత 'విధానం' విషయంలో నాకు పెద్దగా పట్టింపు లేదు.

187. మీరు రేఖామాత్రంగా ఇచ్చిన ప్రణాళిక అంశాలు భారత రాజ్యాంగంలో పొందుపరిస్తే, అది శాశ్వత వర్గ సంఘర్షణకు దారి తీయదా?

**డాక్టర్ అంబేద్కర్ :** దారి తీయవచ్చు. అయితే అది అధిక సంఖ్యాక వర్గం మీద ఆధారపడి ఉంటుంది.

188. కాబట్టి మీరు వివేకంగల రాజనీతిజ్ఞులు కాలేరన్నమాట.

**డాక్టర్ అంబేద్కర్ :** చెప్పడానికి నాకు అనుమతిస్తే, ఒక విషయం చెప్పదలచుకున్నాను. నేను పట్టుబట్టే ఇవన్నీ ఉండే కాలాన్ని నేను కోరుకుంటున్నాను. ఇవన్నీ అవసరం లేని కాలం వస్తుందని

నమ్ముతున్నాను. అయితే అధిక సంఖ్యాక వర్గానికి అల్ప సంఖ్యాక వర్గం మీద ఉండే దృష్టిని బట్టే ఇదంతా ఆధారపడి ఉంది.

★ ★ ★

198. మీరు ఒక దళిత వ్యక్తి తరపున కోర్టులో వాదించానని, అతడు సాంఘిక బహిష్కరణకు భయపడి కోర్టుబయట కిటికీ వద్ద నిలబడ్డాడని చెప్పారు. అది ఏ జిల్లా?

***డాక్టర్ అంబేద్కర్ :*** ఖాండేష్ జిల్లా.

199. సాధారణ మేజిస్ట్రేటు కోర్టా?

***డాక్టర్ అంబేద్కర్ :*** స్టైపెండరీ మేజిస్ట్రేటు కోర్టు.

200. మేజిస్ట్రేటుది ఏ కులం?

***డాక్టర్ అంబేద్కర్ :*** ఒక హిందువు.

201. వాది కోర్టులోకి రావడానికి అతడు అభ్యంతరపెట్టలేదు కదా?

***డాక్టర్ అంబేద్కర్ :*** లేదు. నిందితుడు తనంత తాను కోర్టు లోపలికి రాలేదు అని మాత్రమే నేను చెప్పాను.

202. హిందువుల గత చర్యలతో నిందితుడు భయపడ్డాడు?

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును.

203. సవర్ణ హిందువులు తనకు ఇచ్చిన పరిమిత హక్కులను ఉల్లంఘిస్తే, కోర్టు విచారణ తర్వాత సవర్ణ హిందువులు పీడిస్తారనే భయం మనసులో ఉండబట్టే ఆ దళిత వ్యక్తి అలా చేశాడా?

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును.

204.***సర్ హరిసింఘ్ గౌర్ :*** డాక్టర్ అంబేద్కర్ ! ఈ మధ్య కొన్ని సంవత్సరాల్లో అస్పృశ్యత పోగొట్టడంలో, దళిత వర్గాల దారిలో ఉండే అనర్హతలను తొలగించడంలో కొంత పురోగతి ఉందని నేను అనుకుంటున్నాను. మీరు అంగీకరిస్తారనుకుంటాను.

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును.

205. మీ కోరికలకు, మనసుకు అనుగుణంగా సంస్కరణలు రాలేదు కానీ అదే సమయంలో సవర్ణ, అవర్ణకులాల హిందువుల మధ్య ఉండే ఇలాంటి అన్ని రకాల అడ్డంకులను తొలగించి హిందువులందరినీ సంఘటితం చేయాలనే భావం పెరుగుతున్నదని మనం గుర్తించాలి. మీరు గుర్తించారా?

***డాక్టర్ అంబేద్కర్ :*** అవును వేదిక మీద నుండి ఉపన్యాసాలు వినవస్తున్నాయి.

206. క్రియాత్మక చర్యలూ ఉన్నాయి.

*డాక్టర్ అంబేద్కర్:* దేశంలోని నా ప్రాంతం అయిన బొంబాయి ప్రెసిడెన్సీ విషయంలో మాత్రం మీరు చెప్పేదాన్ని అంగీకరించడానికి నేను వెనుకాడుతున్నాను.

207. అందువల్ల మీకు కొన్ని దృష్టాంతాలు చెపుతాను. ఉదాహరణకు ఎక్కడ సవర్ణ, అవర్ణ హిందూ సమాజం ఉంటుందో అక్కడ హిందువులు 'సంవత్సర విందులు' ఏర్పాటు చేస్తున్నారు. ఒక తరగతి ప్రజలు మరో తరగతి ప్రజలతో అలవాటు పడడానికి ఈ విందులు.

*డాక్టర్ అంబేద్కర్:* ఈ ప్రెసిడెన్సీలో ఇలాంటిది జరిగిందని నాకు తెలియదు.

208. నేను చాలా వాటికి హాజరయ్యాను.

*డాక్టర్ అంబేద్కర్:* ఈ ప్రెసిడెన్సీలోనా?

*సర్ హరిసింఘ్ గౌర్:* కాదు. నాగపూర్‌లో.

209. అలాంటి ఉద్యమం ఇక్కడ లేదా?

*డాక్టర్ అంబేద్కర్:* లేదు.

210. దళిత వర్గాలపై పీడన, అస్పృశ్యత పోవాలన్న గుర్తింపు వచ్చిందని, ఆ మార్గంలో పయనించడానికి తగిన ప్రతి ప్రయత్నాన్ని సవర్ణ హిందువులు, అందునా ముఖ్యంగా సంస్కర్తలు – సానుభూతితో చూస్తున్నారని మీరు అంగీకరిస్తున్నారు కదూ!

*డాక్టర్ అంబేద్కర్:* ఈ అంశానికి సమాధానం చెప్పడానికి నేను సంకోచిస్తున్నాను.

*ఛైర్మన్:* వాస్తవాలపై ఈ సాక్షి అభిప్రాయం తెలుసుకోవడానికి మీ మార్గంలోనే నేను ఒకటి రెండు ప్రశ్నలు అడగవలసి ఉంది.

*సర్ హరిసింఘ్ గౌర్:* అవునండీ, తప్పకుండా!

211. *ఛైర్మన్:* ఈ పనిచేయడానికి శ్రీ రాజా చాలా విధాల సరైన వ్యక్తి. అయినా మీ అభిప్రాయం మీరు చెప్పండి. బొంబాయి ప్రెసిడెన్సీలో నేటి పరిస్థితిని, 20 ఏళ్లనాటి పరిస్థితితో పోల్చిచూడండి. మీరు ఎన్ని సంవత్సరాల నుంచి ఇక్కడ ఉన్నారు?

*డాక్టర్ అంబేద్కర్:* అయిదారు సంవత్సరాల నుంచి.

212. మీరు అంతకు ముందే చాలా కాలం నుంచి మీ జాతి విషయంలో శ్రద్ధ తీసుకొంటున్నారా?

*డాక్టర్ అంబేద్కర్:* అవును

213. మీరు 20 సంవత్సరాలు వెనక్కి చూసి మాకు ఏదైనా ఒక ఆదర్శాన్ని ప్రతిపాదించండి

**డాక్టర్ అంబేద్కర్ :** ప్రతిపాదిస్తాను.

214. రెండు మూడు సంగతులు తీసుకొంటాను. మొట్టమొదటగా – హిందూ దేవాలయాల్లోకి దళితుల ప్రవేశ విషయంలో ఏ మార్పులేదని గ్రహించాను. అది బహుశా, మత ఆచరణ, బోధనకు సంబంధించినదనుకోండి. దాన్ని నేను విమర్శించను. అయితే ఏమాత్రమైనా మార్పు లేదంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. ఈ విషయంలో ఏమీ మార్పు లేదు.

215. నేను తెలుసుకోవాలనుకునే అంశం ఇది. బొంబాయి ప్రెసిడెన్సీలో రెండు మూడు నిర్దిష్ట అంశాలు తీసుకొందాం. గ్రామ ప్రాంతాల్లోని జిల్లాల్లో అస్పృశ్యులనబడే దళిత వర్గాలు వేరేగా నివశించడం ఒక నిబంధనగా పాటిస్తున్నారని మీరు చెప్పారు. మనం అలాంటిది చాలా సార్లు చూశామనుకోండి. ఒక్కోసారి వారు హిందూ గ్రామంలో ఏ మారుమూలనో నివశిస్తూ ఉంటారు. ఒక్కోసారి ప్రత్యేకంగా ఒక శివారు గ్రామంలో నివసిస్తూ ఉంటారు. సాధారణ జాతుల దృష్టిలో జీవనంలో ఈ ఇరవై ఏళ్లల్లో ఏమైనా మార్పు వచ్చిందా?

**డాక్టర్ అంబేద్కర్ :** మార్పు రాలేదు

216. కొన్ని రోజుల కిందట కొన్ని గ్రామాలను చూశాం. ఆ గ్రామాల్లోని దళిత వర్గాలు నది నుంచి నీళ్లు తెచ్చుకోవచ్చు. అయితే కొన్ని గ్రామాల్లో బావులమీద ఆధారపడ్డారనుకుంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** నదుల్లో నీళ్లు తెచ్చుకొనే చోట కూడా నదిలో ఒక చోటునుండే వాళ్లు నీళ్లు తెచ్చుకోవాలి. నదిలో ఒక ప్రత్యేక స్థలం వాళ్ళకు కేటాయించబడి ఉంటుంది.

217. అది ఇలా చెప్పవచ్చు. దళిత వర్గాల ప్రజలు సవర్ణ హిందువులు నీళ్లు తీసుకొనేచోటుకన్నా దిగువ ఉండే చోటు నుంచి తెచ్చుకోవాలి ! అవునా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

218. ఇప్పుడు బావుల మీద ఆధారపడే గ్రామాల సంగతి తెలుసుకొందాం. అది అసామాన్యమైన సంగతి కాదు గదా!

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు. అసమాన్యమేం గాదు.

219. ఈ సందర్భంలో 20 సంవత్సరాల్లో ఏమైనా మార్పుందా? ఆ విషయం తెలుసుకోవడానికి నేను తొందర పడుతున్నాను. దయచేసి నిర్మొహమాటంగా చెప్పండి.

**డాక్టర్ అంబేద్కర్ :** లేదు.

220. ఈ అంశం మీద ప్రతిపాదనలు చేయబడ్డాయన్న సత్యాన్ని మీ దృష్టికి తెస్తున్నాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును ప్రతిపాదనలు మాత్రమే.

221. సాంఘికంగా ఉన్నత వర్గాలుగా ఉండే వాళ్లలో దళిత వ్యక్తుల స్పర్శ (కొన్ని సార్లు ఆ మనిషి నీడకూడా) సోకితే చాలు అంత మేరకు అపవిత్రత వస్తుందనే అభిప్రాయం ఉందట గదా!

డాక్టర్ అంబేద్కర్ ః అవును. ఈ అంశంలో కొంత మెరుగుదల ఉంది.

223. చాల సంతోషం. అదేమంటే, 20 ఏళ్ల కిందట ఒక సవర్ణ హిందువు అస్పృశ్యుని స్పర్శ సోకితే చాలు తనను తాను శుద్ధి పరచుకోవడమే మతపరమైన విధ్యుక్త ధర్మంగా భావించేవాడు. ప్రస్తుతం అంత కచ్చితంగా అనుకోవడం లేదు.

డాక్టర్ అంబేద్కర్ ః అవును.

224. అంతేకాక, 20 సంవత్సరాల కిందటితో పోల్చిచూస్తే దళిత వర్గ సభ్యులు కొంత మంది వృత్తి శ్రేణిలో చాలా పైకి వచ్చారనిపిస్తుంది. 20 సంవత్సరాల కింద ఎవరైనా బొంబాయిలో న్యాయవాద వృత్తిలో ఉన్నారా?

డాక్టర్ అంబేద్కర్ ః లేరు.

225. బొంబాయి న్యాయ స్థానంలో దళిత వర్గాల వారు ఇప్పుడు ఎంత మంది ఉన్నారు?

డాక్టర్ అంబేద్కర్ ః నేనొక్కణ్ణే,

226. సర్దార్లు - ఇనాందార్లకు సంబంధించిన వోటర్ల పట్టికలో ఇద్దరు దళిత వర్గ సభ్యులున్నట్లు నిన్న మనం అనుకొన్నట్లున్నాం?

డాక్టర్ అంబేద్కర్ః ఒక్కరు మాత్రమే. అతని స్థానం వేరు. యుద్ధ రంగంలో అతను చేసిన సేవకు పీష్వాలు మెచ్చి అతనికి జాగీరు ఇచ్చారు. అతనికి బ్రిటిషు ప్రభుత్వం బిరుదు ఇవ్వలేదు.

227. భారత దేశంలో నగరాలను, పల్లెలను కలుపుతూ రోడ్లమీద వెళ్లే బస్సులను ఈ మధ్య గమనిస్తున్నాం. ఈ ప్రజా వాహనాల్లో దళిత వర్గాల వారికి ప్రవేశం ఉందా?

డాక్టర్ అంబేద్కర్ః గ్రామాల్లో లేదు. చాలా గ్రామాలో బస్సుల్లో ప్రయాణించడానికి దళిత వర్గాలను అనుమతించడం లేదు.

228. వాళ్లని ఎవరు అడ్డుకుంటున్నారు?

డాక్టర్ అంబేద్కర్ ః డ్రైవర్ వాళ్ళని తీసుకెళ్లడు.

229. డబ్బులు ఇచ్చిన వాళ్లు ఎవరైనా సరే వారిని డ్రైవర్ తీసుకెళ్లాలని మనం అనుకుంటాం. అతను ఎందుకు తీసుకెళ్లడు?

డాక్టర్ అంబేద్కర్ః దళిత వ్యక్తిని బస్సులో తీసుకెళితే ఇతర వర్గాల ప్రజలు అతని బస్సు వద్దకి రారు. ఉదాహరణకు నాయీబ్రాహ్మణుడు నేను రూపాయి ఇస్తానన్నా నాకు క్షవరం చేయడు.

**230. రావు సాహెబ్ పాటిల్ :** ప్రయాణికుడు ఎవరైనా సరే అతణ్ణి తీసుకెళ్లడానికి నిరాకరిస్తే చట్ట ప్రకారం డ్రైవరు పై అభియోగం తేవచ్చు.

**డాక్టర్ అంబేద్కర్ :** అన్ని సీట్లు 'బుక్' అయిపోయాయని డ్రైవర్ అభియోగం నుంచి తప్పించుకోవచ్చు.

231. ఈ విషయంలో ఏమైనా మెరుగుదల ఉందా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఉంది. పరిస్థితులు కొంత మెరుగవుతున్నాయి. అయినా ఈ బస్సుల్లోకి ఎక్కడానికి దళిత వర్గాలకు ప్రవేశం నిరాకరించే సంఘటనలు ఇంకా అసంఖ్యాకంగానే ఉన్నాయి.

231. బొంబాయి మిల్లుల్లో ఉద్యోగం చేస్తున్న దళిత వర్గాల గురించి కొంచెం పరిశీలిద్దాం. వాళ్ళల్లో కొందరైనా ట్రాముల్లో ప్రయాణిస్తారని నేను అనుకుంటున్నాను. ట్రాముల్లో వాళ్ళని రానివ్వక పోవడంలాంటిదేమైనా ఉందా?

**డాక్టర్ అంబేద్కర్ :** రెండేళ్ల క్రితం ఒక 'భంగీ' వ్యక్తిని ట్రాము ఎక్కనీయని సంఘటన జరిగింది.

233 రెండు సంవత్సరాల క్రితం సంఘటనను మీరు చెపుతున్నారంటే ఇలా జరగడం అరుదని, ఇది నిత్యం జరిగే సంగతి కాదని అనిపిస్తున్నది.

**డాక్టర్ అంబేద్కర్ :** పాసింజర్లు దళిత వర్గాల వాళ్ళని పెట్టెల్లోకి ఎక్కనివ్వని సంఘటనలను నేను ప్రయాణం చేస్తూ ఎన్నో సార్లు గమనించాను.

234. 'భంగీ' వ్యక్తిని ట్రామ్ ఎక్కనివ్వని సందర్భం గురించి మీరు చెప్పారే అందులో 'భంగీ' వ్యక్తి సరైన బట్టలు వేసుకోలేదు కాబట్టి అతణ్ణి ట్రామ్‌లోకి ఎక్కనివ్వలేదా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఆ విషయం నాకు తెలియదు.

235. ట్రామ్‌లోకి ఎక్కేటప్పుడు అతను ఏ కులానికి చెందిన వాడు అని అడగరు. టికెట్టు తీసుకున్నాడా లేదా అని మాత్రమే అడుగుతారు. కాదంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** కానీ ప్రజలు దళిత వర్గ వ్యక్తిని సులభంగా గుర్తించగలరు.

236. అతని బట్టల ఆధారంగానా?

**డాక్టర్ అంబేద్కర్ :** అతడు దళిత వర్గ వ్యక్తి అని ఒకసారి తెలిసిందంటే అతణ్ణి చాలా నీచంగా చూస్తారు.

237. కులాన్ని బట్టే గాకుండా బట్టలను బట్టి గూడా ఈ సమస్య ఉండవచ్చుననుకుంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును. అయితే కొందరు దళిత వర్గ వ్యక్తులు చాలా మంచి బట్టలు వేసుకుంటారు.

238. బొంబాయి ప్రెసిడెన్సీలో దళిత వ్యక్తి నీడలో నడిస్తే మైల పడిపోవడం లాంటి విషయాలు పెద్ద పట్టింపు లేదనుకుంటాను.

*డాక్టర్ అంబేద్కర్ :* అవును. అలాంటిది కొంకణంలోని కొన్ని ప్రాంతాల్లోను, కథియవాడ్‌లోను ఉంది.

239. అటువంటి ధోరణి తగ్గుతున్నదా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

240. అహమ్మదాబాద్‌లోని అంబాలాల్ సర్లాల్ విషయంలో అతని సోదరి దళిత వర్గాల కోసం పాఠశాల తెరిచిందట కదూ!

*డాక్టర్ అంబేద్కర్ :* అది నూటికి కోటికి జరిగేది మాత్రమే.

241. అది ప్రజల నుంచి వచ్చిన నిధులతో నడిపే పాఠశాల కాదా?

*డాక్టర్ అంబేద్కర్ :* నాకు ఆ విషయం తెలియదు. కానీ, ఆ మహిళ దళిత వర్గాల అభ్యున్నతికోసం శ్రద్ధ తీసుకొంటున్నదని మాత్రం తెలుసు.

242. *ఛైర్మన్ :* అటువంటిది అరుదైనదని నాకు అనిపిస్తున్నది.

*డాక్టర్ అంబేద్కర్ :*అవును అది పూర్తిగా అరుదైన సంఘటనే

243. *డాక్టర్ సుహ్రావర్దీ:* సాంఘిక బహిష్కరణ, నిరంకుశత్వం సంఘటనలు అని మీరు ఇంతకు ముందు చెప్పారే అలాంటి వాటితో మీ జాతివాళ్ళు సాధారణ ఎన్నికల్లో పోలింగు కేంద్రాలలో భయపడతారని మీరు అనుకోవడం లేదా?

*డాక్టర్ అంబేద్కర్ :*అవును అలా జరగవచ్చు.

244. అంతేకాదు. ఉన్నత వర్గాల హిందువులు అస్పృశ్యులు ఓటు వేసే స్థలాల్లో తాము కూడా వచ్చి ఓటు వేయడానికి నిరాకరిస్తారేమో అన్న సందేహం కూడా ఉంది.

*డాక్టర్ అంబేద్కర్ :* వాళ్లు అలా చేయవచ్చు. ఏం జరుగుతుందో చెప్పడం చాలా కష్టం. ఉదాహరణకు దళిత వర్గాల సభ్యులు బల్ల వద్ద కూర్చున్నారని సవర్ణ హిందూ సభ్యులు జిల్లా బోర్డు మీటింగులు వదిలి వెళ్లిన సంఘటనలున్నాయి.

245. ఇలాంటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని చూస్తే మీకు ప్రత్యేక నియోజక వర్గం ఉండడం మంచిది. ఎందుకంటే సాధారణ నియోజకవర్గాల్లో మీ స్థానాలను రిజర్వు చేసినా ఆచరణలో అది ప్రత్యేక నియోజకవర్గమే అవుతుంది కదా!

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

246. **రావు బహదూర్ రాజా :** నా మిత్రుడు హరిసింగ్ గౌర్ అడిగిన దళిత వర్గాల వేషధారణను గురించే ఈ ప్రశ్నకూడా. మీ వేషధారణ బాగాలేకనా నాయీబ్రాహ్మణుడు మీకు క్షవరం చేయలేదు?

**డాక్టర్ అంబేద్కర్ :** కాదు నేను దళిత వర్గాలకు చెందిన వ్యక్తిని కాబట్టి.

247. మీరు వేసుకున్న బట్టల్ని బట్టి కాదంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** కాదంటున్నాను.

248. కమిటీలోని మరో సభ్యుడు అడిగిన ప్రశ్నకు సంబంధించి : ఒక గ్రామంలో నివసించే దళిత వర్గ వ్యక్తికి – బస్సులో ఎక్కనివ్వనందుకు ఆ బస్సు యజమాని మీద వ్యాజ్యం వేసే వీలుందా?

**డాక్టర్ అంబేద్కర్ :** అది సాధ్యం కాదు.

249. దళిత వర్గాల ఉద్ధరణలో మీకు ఎంతో శ్రద్ధ ఉందని నాకర్థం అయింది. మీ ప్రచారంలో ఉన్నత వర్గాల నుంచి ఎలాంటి సహాయం పొందారు? ఈ విషయంలో మీ అనుభవం ఏమిటి? పరిశుభ్రత, ఆరోగ్యరక్షణ విషయాల్లో దళిత వర్గాల ప్రజలు మరింత శ్రద్ధ తీసుకోవడం అవసరం అని వారికి నచ్చచెప్పే విషయంలో ఉన్నత వర్గాల ప్రజలు ఏమైనా సహాయం చేశారా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఈ విషయంలో, దురదృష్టవశాత్తు, నా అనుభవం చాలా చేదైనది. దళిత జాతులు వారి కొన్ని అపరిశుభ్ర అలవాట్ల వల్ల తమతో కలిసి ఉండడానికి అనర్హులు అని ఆరోపణ వచ్చింది. ఇది ఉన్నత జాతుల వారి ఆరోపణ. అంటే, వాళ్ళు చచ్చిన పశువుల మాంసం తింటారు. శుభ్రంగా ఉండరు మొదలైనవన్నమాట. నేను ఈ ప్రెసిడెన్సీలో గత రెండేళ్లుగా దళిత వర్గాలలో పరిశుభ్రతపై ప్రచారం చేస్తున్నాను. అంటే వాళ్ళకుండే కొన్ని అపరిశుభ్ర అలవాట్లను మానుకునే విధంగా వారిని ఒప్పించే ప్రయత్నం చేస్తున్నానన్నమాట. కానీ, దురదృష్టవశాత్తు, ఇలాంటి విషయంలో సవర్ణ హిందువుల నుంచి గొప్ప సహకారం ఉంటుందని ఆశించిన చోట సవర్ణ హిందువుల జనాభా మొత్తం నన్ను వ్యతిరేకించడం గమనించాను. ఈ వ్యతిరేకతకు కారణాలు ఏమిటి? అని నేను విశ్లేషించి చూసినపుడు నేను తెలుసుకొన్నదేమిటంటే, ఈ అపరిశుభ్ర అలవాట్లు దళిత వర్గ ప్రజలు మాని వేయడం అంటే వాళ్ళ తమ సాంఘిక స్థాయిని అతిక్రమిస్తున్నట్లు అని, అంతేగాక ఈ విషయంలో వారు తమతో పోటీపడడం అవుతుందని ఉన్నత వర్గాల వారు భావిస్తున్నట్లు తెలిసింది. ఉదాహరణకు కొలంబా-రత్నగిరి జిల్లాల్లో 'మహర్ ప్రజలు అందరూ చచ్చిన పశువుల మాంసం తినడం మానేశారు. కానీ వారి మీద జరిగే సాంఘిక పీడన, నిరంకుశత్వం చెప్పనలవికానివిగా ఉన్నాయి. పూర్తి ఆర్థిక, సాంఘిక బహిష్కరణకు వారు గురవుతున్నారు. గతంలో చాలా సంవత్సరాలనుంచి వారు వ్యవసాయం చేసే భూములను హిందూ భూస్వాములు తీసేసుకున్నారు. వారి అపరిశుభ్ర అలవాట్లను మళ్లీ కొనసాగించడానికి ఒత్తిడి తెచ్చే అన్ని రకాలైన సాంఘిక ఆర్థిక ఒత్తిడులను ప్రయోగించారు. సవర్ణ హిందువులైన అధికారులందరూ దయనీయ స్థితిలో ఉండే దళిత వర్గాలకు రక్షణ ఇవ్వలేదు.

ఎందుకంటే, వాళ్లు తమ అపరిశుభ్ర అలవాట్లను మానుకోవడానికి ప్రయత్నిస్తున్నారు కాబట్టి. ఉన్నత కులాల వ్యక్తులు నాకు సహకారం ఇవ్వడానికి బదులు వ్యతిరేకంగా నిలబడ్డారు. "ఈ అపరిశుభ్ర అలవాట్లు దళిత వర్గాల నిమ్నతకు చెరగని చిహ్నాలు కాబట్టి అవి అలాగే ఉండాలి" అని అన్నారు.

250. కొన్ని రోజుల క్రితం పారిశుధ్య విభాగాల్లో ఒక దళిత వర్గ సభ్యుడు కూడా లేడు అని ఒక సాక్షి చెప్పాడు. మీరు ఇంతవరకు ఉన్నత వర్గాల వారిని గురించి చెప్పింది నిజమే అయితే, దళిత వర్గాల వ్యక్తులు ఈ బోర్డుల్లో ఉన్నందువల్ల వారి పరిశుభ్రత విషయంలో ఏమైనా ప్రయోజనం ఉంటుందంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** దళిత వర్గాల ప్రజలు ప్రతిస్థానిక సంస్థలోనూ ఉండడం తప్పని సరి అని నేను భావిస్తాను.

251. ఈ ప్రెసిడెన్సీలోని కోర్టుల్లో దళిత వర్గాల వ్యక్తులకు ప్రవేశం లేదని ఇంతకుముందే చెప్పారు. నేను ఆ అంశం మీద స్పష్టంగా ఉండదల్చు కొన్నాను. కొన్ని కోర్టుల్లో దళిత వర్గాల వ్యక్తుల్ని ప్రవేశించనీయ లేదని మీరంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

252. ఒక కేసు విషయంలో దళిత వర్గ వ్యక్తి కోర్టులోకి రావడానికి ధైర్యం చేయలేదని మీరు అన్నట్లు నేను భావిస్తున్నాను. అవునంటారా?

**డాక్టర్ అంబేద్కర్ :** సవర్ణ హిందువులు దళితులను ఒక నిర్దిష్ట జీవితస్థాయిలో నియమించారు వారు కోర్టులో ప్రవేశిస్తే ఆ స్థాయిని అధిగమించిన వారవుతారు. అందువల్ల వారు ఆ జీవిత స్థాయి దాటితే వారిని పీడించడానికి ఉన్నత వర్గాల వ్యక్తులు ప్రయత్నిస్తారు. దళిత వ్యక్తి సాంఘిక హద్దులు దాటితే తర్వాత సవర్ణ హిందువుల చేతుల్లో బాధపడతాడు. నేనిచ్చే రక్షణ ఆ కేసు విషయంలో తాత్కాలిక రక్షణ అవుతుందేగానీ ఆ కేసు అయిపోయిన తర్వాత ఆ రక్షణ ఉండదు అని అతనికి తెలుసు.

253. మీరు అక్కడ లేకుండా ఉండి, అతడు కోర్టులో ప్రవేశించి ఉంటే అతనికి ఏమై ఉండేది?

**డాక్టర్ అంబేద్కర్ :** బొంబాయిలో నేను ఒక దేవాలయంలో ప్రవేశించబోయినపుడు నాకు ఏం జరిగిందో అదే అతనికీ జరిగేది.

254. వైద్య సహాయం విషయంలో దళిత వర్గాల ప్రజలు ఏరకమైన సహాయం పొందుతున్నారో తెలుపుతారా?

**డాక్టర్ అంబేద్కర్ :** పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంటే తప్ప వారు ఆస్పత్రిలో ప్రవేశించకూడదు. అలాంటపుడు డాక్టర్లు ప్రవేశం నిరాకరిస్తే, ఉన్నత అధికారులకు వారి ప్రవర్తన తెలుస్తుంది కాబట్టి. సామాన్యంగా దళిత వర్గాలకు మందులు ఇచ్చి పంపిస్తుంటారు.

255. ఛైర్మన్: మీరు గ్రామీణ ప్రాంతాల్లో ఉండే ఆస్పత్రుల్ని గురించి మాట్లాడుతున్నా రన్నమాట.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును. ప్రభుత్వ ఆస్పత్రుల గురించి.

256. అది వైద్య శాఖ ఆధ్వర్యంలో ఉన్నాయనుకుంటాను?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

257. ఆస్పత్రులు అందరికీ ప్రవేశార్హాలే అని మంత్రి నిబంధనల్లో ఉంటుందనుకొంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

258. కానీ, గ్రామీణ ప్రాంతాల్లో ఆ నిబంధనలు పని చేయవనుకుంటాను.

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

**డాక్టర్ సోలంకి :** హిందూ వైద్యుడు ఎప్పుడూ పూర్వాచార పరాయణుడే అయి ఉంటాడు. అతడు దళిత వ్యక్తిని పరీక్షించడానికి ఎప్పుడూ ఆక్షేపణ తెలుపుతాడు. సరైన వైద్య సహాయం లేక దళిత వర్గాల ప్రజలు గుజరాత్‌లో చనిపోయిన దృష్టాంతాలు కూడా ఉన్నాయి. న్యుమోనియా వ్యాధితో బాధపడే రోగిని కనీసం తాకడానికి కూడా డాక్టరు ఒప్పుకోని సంఘటనలు నాకు తెలుసు. డాక్టరు ధర్మామీటర్ మహమ్మదీయుని చేతికిస్తాడు. ఇది నిజంగా జరిగిన సంఘటనే

259. నేను ఈ విషయం ముఖ్యమని భావిస్తున్నాను. నేను ఇంతకు ముందు చెప్పినట్లు, అసలు నిజాన్ని నిరూపించడానికి దాన్నే మళ్లీ చెపుతున్నాను. ఇలాంటిది అప్పుడప్పుడు జరగవచ్చు. మీరు వివరించిన సంఘటన అరుదైనదా? ఒక డాక్టరు ఆక్షేపణా? లేకపోతే ప్రతిరోజూ ఇది జరుగుతున్నదని భావిస్తున్నారా?

**డాక్టర్ సోలంకి :** పూర్వాచార పరాయణులైన డాక్టర్లు అలాగే చేస్తారు.

260. ఆ వైద్యుడు వేసిన వెనుకంజ అతని మత దృక్కోణం బట్టి వచ్చింది. అదీ వచ్చిన ఇబ్బంది.

**డాక్టర్ సోలంకి :** అవును.

261. **రావు బహదూర్ రాజా :** సంబంధిత అధికారుల దృష్టికి ఈ సంగతులు తీసుకువెళ్లారా?

**డాక్టర్ అంబేద్కర్ :** తీసుకెళ్లాం.

262. వారు ఏమి చర్య తీసుకొన్నారు?

**డాక్టర్ అంబేద్కర్ :** మంత్రిగారు చెప్పిన ప్రత్యుత్తరం ఏమిటంటే, మీరు 'సయాన' సాధించడం మంచిది అని. ఆ పదాన్ని ఆయన ఉపయోగించారు.

263. ఛైర్మన్ : రావు బహదూర్ : ఓ పని చేసి పెడ్తారా? ఈ విషయాన్ని గురించి వివరాలు

తెలుసుకొన్నాం. నేను వాస్తవాలను తెలుసుకోవాలనుకుంటున్నాను. ఈ ప్రెసిడెన్సీలో ప్రభుత్వ పాఠశాలల్లో దళిత వర్గాల పిల్లల స్థితి ఏమిటి? సాక్షిని మా తరుపున అడుగుతారా?

263. రావు బహదూర్ రాజా : దళిత జాతుల పిల్లలపైన ఉపాధ్యాయులకు, విద్యా శాఖ లేదా పాఠశాల మేనేజర్లకు ఎలాంటి దృష్టి ఉందో కాస్త తెలపండి?

**డాక్టర్ అంబేద్కర్ :** డాక్టర్ పరంజపే ఈ ప్రెసిడెన్సీలో విద్యా శాఖ మంత్రిగా ఉన్నపుడు దళిత వర్గాల పిల్లలను అన్ని పాఠశాలల్లోను తప్పనిసరిగా చేర్చుకోవాలని ఒక సర్క్యులర్ పంపారు. కానీ మా అనుభవం ఏమిటంటే ఆ సర్క్యులర్ లోని అంశాలను ఎవరూ పాటించలేదు. డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్ వారి నివేదికలో ఈ సర్క్యులర్‌ను అమలుచేసినట్లు తెలిపారు. కానీ, దానితో నేను విభేదిస్తున్నాను. క్షమించండి. అది ప్రస్తుతం జరుగుతున్న సంగతుల్ని ప్రతిబింబించే సరైన ప్రకటన కాదు. పూనాలోని 'దేవూ' ప్రాంతంలో ఈ మధ్యనే జరిగిన సంఘటన ఇది. దళిత వర్గాల పిల్లలకు ప్రవేశం నిరాకరించబడింది. వారు ప్రవేశం కోసం పట్టు పట్టినపుడు గ్రామం అంతా దళిత వర్గాలను సాంఘికంగా బహిష్కరించింది.

264. ఛైర్మన్ : మీ వినతిపత్రంలో ఆ నివేదిక విషయాన్ని ప్రస్తావించారా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును, ఇంతకు ముందు నేను చెప్పినట్లు అది నిజాలను తెలిపే ప్రకటన కాదు. ఆ ప్రకటనతో నేను విభేదిస్తున్నాను.

265. రావుబహదూర్ రాజా : శ్రీ గ్రిప్పిత్ మాటల ద్వారా నేను తెలుసుకొన్న దేమిటంటే, పోలీసు శాఖలోకి దళిత వ్యక్తులను తీసుకోకపోవడానికి కారణం పోలీసుల బాధ్యతల్లో ఇళ్లు వెదకడం, అరెస్టులు చెయ్యడం లాంటివి ఉంటాయి. ఒక వేళ తర్కం కోసం ఆలోచిస్తే, పైన చెప్పిన కారణం నిజమే అయితే దళిత వర్గాల వ్యక్తులను సబార్డినేట్, ప్రావిన్షియల్ సర్వీసుల్లోకి తీసుకోవడానికి ఇదే విధమైన ఆక్షేపణ ఉంటుందా?

**డాక్టర్ అంబేద్కర్ :** ఎన్నో ఆక్షేపణలు వస్తాయని తెలుస్తున్నది.

266. మీరు స్థానిక శాసన మండలి సభ్యులా?

**డాక్టర్ అంబేద్కర్ :** అవును.

267. మీ జాతిపైన ఉన్నత వర్గాలకు చెందిన స్థానిక మండలి సభ్యుల దృష్టి ఏమిటి? దీనిలో మీ అనుభవం ఏమిటి?

**డాక్టర్ అంబేద్కర్ :** అది దళిత వర్గాలకు అనుకూలంగా ఉందని మాత్రం చెప్పలేను.

268. మీ రాష్ట్రంలో మీ జాతి వ్యక్తుల మీద ప్రభుత్వ దృష్టి ఎలా ఉంది?

**డాక్టర్ అంబేద్కర్ :** ఉదాసీనంగా ఉంది.

269. మీ రాష్ట్రానికి గౌరవ బెంచి మేజిస్ట్రేటు కోర్టులు వచ్చాయి అనుకొంటాను. దళిత వర్గాల వ్యక్తులు ఎవరైనా ఆ బోర్డుల్లో ఉన్నారా?

*డాక్టర్ అంబేద్కర్ :* ఎవరూ లేరు. ఇప్పుడిపుడే 'మేజిస్ట్రేటు బెంచి'లో కొంత మందినైనా తేవాలని ప్రయత్నిస్తున్నాం. కానీ ఇంకా ఫలితం కనిపించలేదు. ఈ సందర్భంలో ఖాందేష్ జిల్లా కలెక్టర్ బెంచిలో నియామకం కోరుతూ దరఖాస్తు పెట్టుకొన్న ఒక దళిత వ్యక్తికి ఇచ్చిన ప్రత్యుత్తరాన్ని వినిపిస్తే చాలా ఆసక్తికరంగా ఉంటుంది. అతణ్ణి ఎందుకు ఆ పదవికి నియామకం చేయలేదో ఆ కారణాలు కూడా లేఖలో ఉన్నాయి. ఆ లేఖ ఇలా ఉంది: "కలెక్టరుగారికి దళిత వర్గాల కోరికల మీద ఎంతో సానుభూతి ఉంది. వివిధ రంగాల్లోని ప్రజాహిత అంశాల్లో శ్రీ మేఢేగారు చూపిన ప్రతిభను కలెక్టరుగారు గుర్తించడానికి, అభినందించడానికి సంతోషిస్తున్నారు. అయితే అతని అభిప్రాయంలో దళిత వర్గాల వ్యక్తికి 'మేజిస్ట్రేటు బెంచి'లో స్థానమివ్వడానికి ఇంకా తగిన సమయం రాలేదని, ప్రభుత్వం బొంబాయి ప్రెసిడెన్సీలోని దళిత వర్గాల ఆకాంక్షలకు అనుకూలమైన తీర్మానం ఏదో ఒకటి ప్రకటించే వరకు, కలెక్టర్ ఆ నియమాకాన్ని ఆదేశించడానికి తన అశక్తతను వెలిబుచ్చుతున్నందుకు చింతిస్తున్నారు". ఈ లేఖ రాసిన తేదీ : 25 సెప్టెంబర్ 1928.

270. ఇలాంటి సంస్థల్లో నియామకానికి దళిత వర్గాల అభివృద్ధికి ఏమీ సంబంధం లేదని మీరు అంగీకరిస్తారనుకుంటాను.

*డాక్టర్ అంబేద్కర్ :* ఏమీ సంబంధం లేదు.

271. ఏ అభ్యర్థి అయినా తన బాధ్యతను గుర్తించి విధుల్ని నిర్వరిస్తున్నాడా? లేదా! అని చూడవలసి ఉంది. అంతేనంటారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును

272. *లార్డ్ బర్న్‌హమ్ :* దళిత వర్గాల ప్రయోజనాలను కాపాడే అన్ని పద్ధతుల్లో కెల్లా సార్వత్రిక వోటు హక్కు పట్ల మీరు మొగ్గు చూపుతున్నారు?

*డాక్టర్ అంబేద్కర్ :* శాసన మండలిలో తగినంత ప్రాతినిధ్యం కావాలని నేనంటున్నాను.

273. మీరు సార్వత్రిక వోటు హక్కు కావాలంటున్నారు కదూ?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

274. అది మీకు రాకపోతే మీరు ప్రత్యేక నియోజక వర్గాల పట్ల మొగ్గు చూపుతారా? ఒక వేళ ఇవి రెండూ రాలేదు. అప్పుడైనా మీరు నామినేషన్ పద్ధతి అంగీకరిస్తారా?

*డాక్టర్ అంబేద్కర్ :* లేదు. మా ప్రతినిధి ఎన్నిక కావాలనే నేను పట్టుబడతాను.

275. మీరు కోరిన పద్ధతుల్లో ఎన్నికలు జరగకపోయినా మీరు వయోజన వోటింగును అంగీకరిస్తారా?

డాక్టర్ అంబేద్కర్ : అవును.

276. ఛైర్మన్ : దళిత వర్గాల ప్రాతినిధ్యానికి మీరు చాలా ఎక్కువగా మొగ్గు చూపుతూ, అది ఎన్నికల పద్ధతిలో జరగాలని కోరుకుంటున్నారు. ఎన్నికల పద్ధతే ప్రతినిధులను ఎంచుకొనే పద్ధతి అయి, అలా ఎన్నికయ్యేవారు దళిత జాతులకు సరైన ప్రతినిధులుగా ఉంటారని మీరు సంతృప్తి పడుతున్నారా?

డాక్టర్ అంబేద్కర్ : అలాగేనని నమ్ముతున్నాను.

277. దళిత వర్గాల ప్రయోజనాలకు వ్యతిరేకంగా పని చేసే శక్తులు ఇక్కడ కూడా పనిచేస్తాయని ఏమీ ఆందోళన పడడం లేదా?

డాక్టర్ అంబేద్కర్ : దాన్ని నేను అంగీకరిస్తున్నాను కాబట్టే వయోజన వోటింగు కోరుతున్నాను.

278. వయోజన వోటింగు వల్ల ఇలాంటి ప్రాబల్యం తగ్గుతుందంటారా?

డాక్టర్ అంబేద్కర్ : అది సమతూకాన్ని తెస్తుంది.

279. ఒక వేళ దళిత వ్యక్తికి వోటు వేసే అర్హత ఉంటే అతడు సాధారణ నియోజక వర్గంలో వోటు వేస్తాడా?

డాక్టర్ అంబేద్కర్ : వేస్తాడు.

280. మీ విషయాన్నే తీసుకొందాం. మీరేదైనా సాధారణ నియోజక వర్గంలో వోటు వేసే అర్హత కలిగి ఉన్నారా?

డాక్టర్ అంబేద్కర్ : అవును నేను, మా స్నేహితుడు – విశ్వవిద్యాలయ నియోజక వర్గంలో వోటు వేస్తాం.

281. 'పన్నులు కట్టడం' అనే సంగతి ఎలా ఉంది? దళిత వర్గాలు పన్నులు కట్టవలసిన పనిలేదు అని ఒక సలహా ఉంది. ఈ అంశాన్ని మనం కొనసాగిస్తే కస్టమ్స్ సుంకాలు, ఇతర పరోక్షపన్నులు పెరిగి వస్తువుల ధరలను పెంచుతాయి. అప్పుడు ఇతరులతో పాటు దళిత వర్గాలు కూడా అధిక ధరలను చెల్లించవలసిందే గదా!

డాక్టర్ అంబేద్కర్ : దళిత వర్గాల వ్యక్తులు ముఖ్యంగా 'మహర్' జాతి వారు సాధారణ గుత్తకు లేదా వతన్‌దారీ గుత్తకు లోబడి వ్యవసాయం చేస్తుంటారు. వారు 'జూడీ' అనే నిర్ధారితమైన పన్నును ఇతరుల మాదిరిగానే చెల్లిస్తుంటారు.

డాక్టర్ అంబేద్కర్ : అవును చాలా కొద్ది మంది మాత్రమే. ఎక్కువమంది ప్రధానంగా నగరాల్లోని పరిశ్రమల్లో పనిచేస్తుంటారు.

283. ఉదాహరణకు తీసుకొండి. యూరోపియన్లు వారి స్వగృహాలలోను, క్లబ్బులలోను మహర్లని

నియమించుకుంటుంటారు.

*డాక్టర్ అంబేద్కర్ :* అవును.

284. పైన పేర్కొన్న వారికి సామాన్య నియోజక వర్గంలో వోటు వేసే హక్కు ఉందా?

*డాక్టర్ అంబేద్కర్ :* అది వోటింగు హక్కు స్థాయి నిర్ణయం మీద ఆధారపడి ఉంటుంది.

285. వెయిటర్లకు ఏ అర్హతా ఉండదనుకుంటాను?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును ప్రస్తుత పరిస్థితుల్లో –

286. *సర్దార్ మంజుందార్ :* సాధువులు దళిత వర్గాలనుంచి వచ్చినా అన్ని జాతుల వారి చేత గౌరవించబడతారు. ఉన్నత వర్గాల వ్యక్తులు వారి ముందు ఉన్నత జాతి సాధువుల వద్దలాగానే సాష్టాంగ పడతారు. ఇది మీకు తెలుసా?

*డాక్టర్ అంబేద్కర్ :* నాకు తెలిసిన మేరకు ఒకే ఒక సందర్భంలో మాత్రమే ఇలా జరిగింది.

287. అయితే వాళ్లు అలాచేస్తారా లేదా?

*డాక్టర్ అంబేద్కర్ :* మహమ్మదీయుల పేరు ముందు మోకరిల్లినట్లుగానే మోకరిల్లుతారు.

288. 'వర్కారీ పంథ్'కు చెందిన పండరీపుర దేవుడు విఠోబా భక్తులు అస్పృశ్యత పాటించరంటారు. మీకు తెలుసా?

*డాక్టర్ అంబేద్కర్ :* అది పూర్తిగా అసత్యం.

289. గత 25 ఏళ్లుగా దళిత వర్గాల పట్ల సవర్ణ హిందువులు ప్రవర్తించే విధానంలో చాలా మార్పు ఉందని, ఉన్నత వర్గాల్లో విద్యావంతులు అస్పృశ్యతను పోగొట్టి వాళ్లతో స్వేచ్ఛగా కలవడానికి కృషిచేస్తున్నారని, దళిత వర్గాల స్థితి క్రమంగా మారుతున్నదని, వారి మీద విద్యా వంతులైన ప్రజల ప్రవర్తనలో మార్పుందని మీరు అంగీకరిస్తారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అవును. అయితే ఈ సానుభూతి అంతా మాటల్లోనే. చేతల్లో కాదు.

290. దాదాపు అన్ని గ్రామాల్లోను దళిత వర్గాల ప్రజల కోసం ప్రత్యేకంగా బావులు తవ్వబడ్డాయని మీకు తెలుసా?

*డాక్టర్ అంబేద్కర్ :* లేదు.

291. అలాంటి బావులు లేవంటారా?

*డాక్టర్ అంబేద్కర్ :* అన్ని గ్రామాల్లోనూ లేవు.

292. దళిత వర్గాలు అంటే ఎవరు? వారి కులాలను చెపుతారా?

# 9

# బడుగు వర్గాల గురించి 'భారతీయ ఓటుహక్కు సంఘా'నికి (లోథియన్ సంఘం) డా|| బి.ఆర్. అంబేద్కర్ 1.5.1932న సమర్పించిన పత్రం*

## సాధారణాంశం

దళిత వర్గాలు అన్న పదాన్ని అస్పృశ్యులకు మాత్రమే పరిమితం చేయటానికి నేను అంగీకరించాను. వాస్తవానికి అస్పృశ్యతలో స్వతస్సిద్ధంగా ఉండే సామాజిక వివక్షతకు గురయి, అందువల్ల బాధలకు లోనయే వారి కష్టాల్ని గురించిన స్పృహ లేని వారిని అస్పృశ్యుల వర్గంలో నేను చేర్చటంలేదు. ఆ స్పృహలేని వారు తమ స్వంత ప్రయోజనాల కోసం అస్పృశ్యుల్ని దోపిడీ చేసే అవకాశం ఉండటమే ఇందుకు కారణం. అస్పృశ్య వర్గాలను నిర్ధారించటానికి కమిటీ నివేదికలో పేర్కొనబడిన 7,8 ప్రశ్నలకు కూడ నేను వ్యతిరేకతను వ్యక్తపరచలేదు. అయితే వేర్వేరు ఈ వ్యక్తులు ఈ అంచనాలను వేర్వేరు విధాలుగా అన్వయించటానికి పూనుకోవటం వల్ల ఆ అంచనాల గురించి నా అభిప్రాయాలను వివరించటం అవసరమని నేను భావిస్తున్నాను.

మొదటిది అస్పృశ్య వర్గాలను నిర్ధారించటానికి ఉద్దేశించిన ఎటువంటి ప్రశ్నలైనా భారత దేశమంతటా ఎటువంటి మార్పు లేకుండా ఒకే విధంగా ఉండాలని కొందరు కోరటం జరిగింది. అయితే అస్పృశ్య వర్గాలని గుర్తించటానికి ఉద్దేశించిన బేరీజుల్ని లేదా పరీక్షల్ని యావద్భారత దేశమంతటా ఒకే విధంగా ఉపయోగించటం ఎంత మాత్రం సరికాదన్న నా అభిప్రాయాన్ని నేను ఈ సందర్భంలో స్పష్టం చేయగోరుతున్నాను. భారత దేశం ఏక సాముదాయిక దేశం కాదు. ఇది

* భారతీయ ఓటు హక్కు సంఘం, 1వ సంపుటి, 2వ ముద్రణ, పేజీలు 202-11, డిసెంబర్, 1931. రౌండ్ టేబుల్ సమావేశం యొక్క ఓటు హక్కు కమిటి సలహా మేరకు భారతీయ ఓటు హక్కు సంఘం రూపొందించబడింది. ఈ సంఘంలోని 18 మంది సభ్యులలో డా॥ అంబేద్కర్ ఒకరు.

ఒక 'ఖండం'. భారత దేశంలోని వివిధ రాష్ట్రాల్లోని వైవిధ్యం విస్పష్టమైనది. అంతేకాదు, ఈ రాష్ట్రాల మధ్య జాతి లేదా భాష అనే బంధం ఏమీ లేదు. ఈ రాష్ట్రాల మధ్య పరస్పర సంబంధాలు లేకపోవటం వల్ల ప్రతి రాష్ట్రం తనదే అయిన విశిష్టమైన ఆచార వ్యవహారాన్ని, సామాజిక సరళినీ రూపొందించుకొన్నది. ఇటువంటి పరిస్థితుల్లో అస్పృశ్యతకు సంబంధించిన పరీక్షలు మొత్తం భారతదేశమంతటా ఏ స్థాయి వరకూ సమానంగా ఉండగలవు అనేది విచిత్రమైన విషయమే. ఉదాహరణకు అస్పృశ్యులకు దేవాలయాలలో ప్రవేశం నిషిద్ధమన్నది భారత దేశం అంతట ఉన్నదే. అలాగే అస్పృశ్యుల్ని ఇతరుల బావి నీటిని వాడుకోనీయక పోవడం, వారిని తాకితే మైల పడతామనుకునే భావన ఉండటం వంటివి అన్ని రాష్ట్రాల్లోను ఉన్నదే. అయితే ఇటువంటి విషయాల్లో కాఠిన్యపు స్థాయి అన్ని ప్రాంతాల్లోనూ ఒకే విధంగా ఉండక పోవచ్చు. ఈ విషయాలను పరీక్షల వలన నిర్ధారించవచ్చు. కాని, అస్పృశ్యత వంటి విషయాలు అన్ని ప్రాంతాల్లోనూ ఒకే విధంగా ఉండి తీరుతాయని భావించటం ఈ సమస్యను కేవలం ఒక స్వల్ప సమస్యగా తేల్చి వేయడమే అవుతుంది. ఎందుకంటే అస్పృశ్యత అనేది ఒక సామాజిక ప్రవర్తనకు సంబంధించిన విషయం. అందువల్లనే అది ఒక్కొక్క ప్రాంతపు పరిస్థితుల్ని అనుసరించి వైయక్తిక దృష్టి కోణాన్ని అనుసరించి తప్పనిసరిగా విభిన్న స్థాయిలో ఉంటుంది. రాజ్యాంగ బద్ధమైన సంఘం పై వాదనలని పరిగణనలోకి తీసుకుని చాలా జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత అస్పృశ్యతకు సంబంధించినంత వరకు పరీక్షలలోని వైవిధ్యాన్ని గుర్తించి పరీక్షలు ఒకే విధంగా ఉండాలన్న ప్రతిపాదనను తోసిపుచ్చింది. ఆ సంఘం తన సలహాలని ఈ విధంగా పేర్కొంది. "నూతన ప్రాతినిధ్య పద్ధతికి సంబంధించిన ప్రధాన సిద్ధాంతాలను నిర్ణయించిన తర్వాత, ఈ సిద్ధాంతాలు అమలు పరచటానికి అవసరమైన కొత్త ఎన్నికల నియమావళిని రూపొందించే బాధ్యతని అందుకొరకే ప్రత్యేకంగా నియమించబడిన ఒక సంఘానికి (ఇంతకుముందున్న 'ఓటుహక్కు సంఘం' వంటిది) అప్పగించవలసిన అవసరం ఉన్నదనేది స్పష్టమైన విషయం. ప్రతి రాష్ట్రంలోనూ 'దళిత వర్గాలను' నిర్ధారించటం, ఆ విధంగా నిర్ధారించబడిన 'దళిత వర్గాల' సంఖ్యను కూడ నిర్ణయించటం ఆ సంఘం యొక్క మరొక బాధ్యత. (దళితవర్గాల నిర్ధారణ ఒక్కొక్కసారి ఒక్క రాష్ట్రంలోనే విభిన్న ప్రాంతాల్లో విభిన్నంగా ఉండవచ్చు)." (భావసంపుటం 2, పుట 67) భారత దేశం అంతటా అస్పృశ్యతకు సంబంధించి ఒకే విధమైన పరీక్షలు ఉండాలని పట్టుపట్టడం వ్యర్థం అనే విషయాన్ని నేను నొక్కి చెప్పాలనుకొంటున్నాను. అస్పృశ్యతను నిర్ధారించటానికి ఉద్దేశింపబడిన పరీక్షలలోని వైవిధ్యం సూచిస్తుందనుకోవడం ప్రాథమికమైన తప్పు. అస్పృశ్యత అనేది భావనేకానీ అస్పృశ్యులు, ఇతరులు కూడ ఒక బావిని ఉపయోగించు కోవటానికి అంగీకరించక పోవటం కానీ ఈ రెండు విషయాల్లోనూ అంతర్లీనంగా ముద్రించబడి ఉన్న భావన ఒక్కటే. అదే మైల పడలేరనే దుర్వాసనవేసే భావన, నిరాదరణ, వ్యతిరేకత, అసహ్యత ఈ విషయాలు మనో భావాల్ని సరిగా విశ్లేషించటం వల్ల అవగత మౌతాయి. హిందువు అస్పృశ్యుడిని ఎందుకు తాకడు? హిందువు అస్పృశ్యుడిని దేవాలయంలోకి ఎందుకు రానీయడు? ఒకే బావినీటిని ఎందుకు వాడుకోనీయడు? హిందువు అస్పృశ్యుడిని సార్వత్రిక భోజనశాల లోకి ఎందుకు రానీయడు? ఈ ప్రతి ప్రశ్నకి

సమాధానం ఒక్కటే. 'అస్పృశ్యుడు సంఘంలో అందరితో కలిసి వ్యవహరించటానికి తగని అపరిశుభ్ర మైన వ్యక్తి అనేదే ఆ సమాధానం. అంతే కాదు, అస్పృశ్యుల మత కర్మకాండలలో బ్రాహ్మణ పురోహితుడు ఎందుకు పాత్ర వహించడు? నాయీ బ్రాహ్మణుడు అస్పృశ్యులకు ఎందుకు సహాయ పడడు? ఈ ప్రశ్నలకు సమాధానం ఇటువంటి పనులు తమ స్థాయికి తగనివని ఇతరులు భావించటమే. సాంఘిక తిరస్కారానికి గురి అవుతున్న వర్గాన్ని నిర్ధారించటమే ఉద్దేశం అయినప్పుడు ఇందుకుగాను ఏ పరీక్షను మనం ఉపయోగిస్తామనేది చాల స్వల్ప విషయం. ఎందుకంటే, ఇంతకు ముందు నేను చెప్పినట్లు ఏ పరీక్ష అయినా అస్పృంశ్యుల పట్ల ఇతరులకు వున్న ఒకే సామాజిక దృక్పథాన్ని సూచిస్తుంది.

3. రెండోది అస్పృశ్య వర్గాలని నిర్ధారించటానికి 'స్పర్శవల్ల మైలపడటం' అన్న దాన్ని పరీక్షగా ఉపయోగించేటప్పుడు దీనిని వాస్తవ దృష్టితో ఉపయోగించాలేకాని, ఊహాత్మక దృష్టితో చూడకూడదు. కొందరి స్పర్శ ఇతరుల్ని మైల పడవేస్తుంది. కనుక అటువంటి వారిని దూరంగా ఉంచాలి. ఒకవేళ స్పృశించబడితే ఆ దోషాన్ని పోగొట్టుకోవటానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. వాస్తవ దృష్టితో చూస్తే ఇటువంటి వారు అస్పృశ్యులు. ఇక ఊహాత్మక దృష్టితో చూస్తే ఎవరి స్పర్శ తగిలితే మైలపడలేదనుకుంటామో అటువంటి వారి వర్గానికి చెందిన వ్యక్తి అస్పృశ్యుడు. అయితే కొన్ని స్థానిక పరిస్థితుల దృష్ట్యా ఆ వ్యక్తి స్పర్శ తగలకుండా చూసుకోవడం కాని, ఒకవేళ తగిలితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకోవటం కాని ఉండకపోవచ్చు. వాస్తవ దృష్టితో చూడాలనే వారి ప్రకారం అస్పృశ్యుల్ని అంటరానివారుగా భావించక పోయినా లేదా వారిని స్పృశిస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవాలని తంటాలు పడక పోయినా అటువంటి అస్పృశ్యుల అస్పృశ్యతని పరిగణనలోకి తీసుకోకూడదు. అంటే అస్పృశ్యుల విషయంలో ఇటువంటి మార్పులు వస్తే వారి విషయంలో అస్పృశ్యతని జమలోకి తీసుకోకూడదన్నమాట. కాని, ఈ వాదాన్ని నేను అంగీకరించను. ఈ వాదం ఒక తప్పుడు అభిప్రాయం మీద ఆధారపడి ఉందని నా ఉద్దేశం. తప్పనిసరయిన అనేక పరిస్థితుల ప్రభావం వల్ల ఒక వ్యక్తి అక్షరాలా అంటరాని వాడుగా పరిగణించబడక పోవచ్చు. అటువంటి తప్పనిసరి పరిస్థితుల ప్రభావమే లేకుంటే తప్పకుండా ఆ వ్యక్తి అస్పృశ్యుడు గానే పరిగణించబడలేడు. ఇందుకు కారణం ఆ వ్యక్తి అస్పృశ్య వర్గంలోని వాడు కావటమే. బీహార్-ఒరిస్సా జనాభా లెక్కల సూపరింటెండెంట్ 1921వ సంవత్సరపు జనాభా నివేదిక ద్వారా ఈ విషయం స్పష్టం అవుతున్నది. కులానికి సంబంధించిన నియమావళిని సడలించాలనే విషయమై ఆ అధికారి తన నివేదికలో ఇలా పేర్కొన్నాడు. "అటువంటి సన్నివేశాన్ని మేము ఉన్నతహోదాలను ఆశిస్తున్న ఉన్నత లేదా విద్యాధికులైన కులాల్లోనే గమనించగలిగాం. అందువల్ల అటువంటి సన్నివేశాన్ని ఆధునిక పరిస్థితులకు అనుగుణంగా మారుతూ ఉండటానికి చిహ్నంగా గుర్తించాలే కాని కులవ్యవస్థ పూర్తిగా కూలిపోవటానికి గుర్తుగా భావించకూడదు. వైయక్తిక సంబంధాలు, లేదా అన్న పానీయాలు, స్పర్శ విషయంలో కూడా ఇంతే... ఆధునిక పరిస్థితుల్లో పనులు జరిగే జంషెడ్‌పూర్ వంటి స్థలాల్లో తమ పక్కవారి కులాన్ని

గురించి ఎట్టి అభ్యంతరాలు లేకుండా అన్ని కులాల, జాతుల వ్యక్తులు ఫ్యాక్టరీలో కలిసి మెలిసి పనిచేస్తారు. నూరేళ్ళ కింద నిత్యజీవితంలో ప్రతిరోజూ అనుసరించిన నియమావళినే ఇప్పుడూ అనుసరించగలగటం అసంభవం. కనుక ఆ మాత్రం చేత పవిత్రులు అపవిత్రులు, స్పృశ్యులు అనే తేడాలు ఇప్పుడు పూర్తిగా తొలగి పోయాయనుకోవటం పొరపాటు. ఒక ఉన్నత కులపు హిందువు అస్పృశ్యుడిని తనతో పాటు కూర్చొనీయుడు. తననీ, తను తినే ఆహారాన్నీ, తాగే నీటినీ ముట్టుకొనీయడు". ఈ నివేదికలో పేర్కొన్న జీవన సత్యాలని గురించిన ఈ గుర్తింపే సరైనదయితే అస్పృశ్యతను గురించి వాస్తవ దృష్టితోనూ, ఊహా దృష్టితోను ఉన్న తేడావల్ల అసలు పరిస్థితిలో ఎటువంటి మార్పు ఉండబోదు. నివేదికలోని పై భాగం వల్ల వాస్తవ దృష్టితో అస్పృశ్యత అనేది లేనట్లే కన్పిస్తున్నప్పటికీ, భావాత్మక దృష్టితో చూస్తే వాస్తవానికి అస్పృశ్యత ఉన్నట్లు స్పష్టం కావడమే ఇందుకు కారణం. అందుకనే అస్పృశ్యతని గురించిన పరీక్షల్ని భావాత్మక దృష్టిలో ఉపయోగించాలని నేను పట్టుపడుతున్నాను.

4. మూడోది అస్పృశ్యత అనేది త్వరితగతిన సమాజంలో నుండి తొలగి పోతున్నట్లు ప్రచారం అవుతున్నది. ఈ దృక్పథాన్ని అంగీకరించే విషయంలో నేను ఒక హెచ్చరిక చేయ గోరుతున్నాను. అంతేకాదు, ప్రచారానికి, వాస్తవాలకు ఉండే అంతరాన్ని గమనించ వలసిన అవసరాన్ని ఎత్తిచూపుతున్నాను. చెదురుమదురుగా బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, స్పృశ్యులు, అస్పృశ్యులు కలిసిమెలిసి ఉండటం జరిగిన సంఘటనల ఆధారంగా కొన్ని నిర్ణయాలకి వచ్చేటప్పుడు మనం ఒక ప్రధానమైన విషయాన్ని గమనించాలని నా అభిప్రాయం. కుల పద్ధతి, అస్పృశ్యత అనేవి వాస్తవానికి హిందూ సమాజంలో ఉక్కు చట్రంగా తయారయ్యాయనేదే ఈ ప్రధాన విషయం. ఈ పద్ధతులు సహేతుకతపై గాని, ఆర్థిక పరిస్థితులపై గాని జాతితత్వంపైనగాని, ఆధారపడి ఏర్పడినది కాకపోవటం వల్లనే ఈ భేదాల్ని సమూలంగా తొలగించి వేయటం అంత తేలికైన పనికాదు. అంతేకాదు. మత సిద్ధాంతాల పైన ఆధారపడి ఏర్పడినవి కావటం వల్ల ఈ భేదాలు ఎక్కువకాలం మనలేవని ఆశావాదులైన సంఘసంస్కర్తలు భావిస్తున్నా, అస్పృశ్యత అనేది భవిష్యత్తులో చాలాకాలం వరకు కొనసాగే అవకాశాలే ఎక్కువగా ఉన్నాయి. అస్పృశ్యతని నిర్మూలించటం చాలా కష్టం కావటానికి కారణం దానికి మతం యొక్క అంగీకారం ఉండటమే. ఏవిధంగా చూసినా సాధారణ హిందువు అస్పృశ్యతని మతంలోని ఒక భాగంగానే పరిగణిస్తాడు. అస్పృశ్యుల యెడల అతడు అవలంబించే అమానుష ప్రవర్తనకు కారణం తాను తన మత ధర్మాల్ని పాటిస్తున్నానని అతడు అనుకోవటమే గాని అస్పృశ్యుల యెడల కావాలని క్రూరత్వం చూపే ఉద్దేశం కాదు. సాధారణ హిందువు మత ధర్మాల ఆధారంగా పాటించటానికి తనకు సాధ్యం కానప్పుడు మాత్రమే అస్పృశ్యతకు సంబంధించిన నియమాన్ని సడలిస్తున్నాడు. అంతేకాని వాటిని పూర్తిగా ఏనాడూ వదిలేయటం లేదు. అతడికి అస్పృశ్యతను వదిలేయటం అంటే తానూ, తనవంటి అనేక హిందువులూ అర్థం చేసుకున్న హిందూ మతం తాలూకు ప్రాథమిక సూత్రాల్ని వదిలేయటమే.

మతాన్ని ఆధారం చేసుకున్న అనేక భావాలు కొనసాగుతున్నట్లే మతాన్ని ఆధారం చేసుకుని పుట్టిన అస్పృశ్యత కూడా చాలా కాలం కొనసాగుతుంది. భారత భూభాగం నుంచి అస్పృశ్యతను సమూలంగా పెకలించి వేయాలని ఒకరుకాదు ఎందరో మహాత్ములు ప్రయత్నించినట్లు భారతదేశ చరిత్ర మనకు తెల్పుతూంది. బుద్ధుడు, రామానుజుడు, ఆధునిక కాలంలోని వైష్ణవ ఆచార్యులు ఇటువంటి మహాత్ములలోని వారే. ఇన్ని తీవ్ర ఆఘాతాల్ని తట్టుకొని నిలిచిన ఈ అస్పృశ్యత అనేది తొలగి పోతుందని భావించటం ప్రమాదకరం. హిందువు అస్పృశ్యతని పాటించటం ధర్మంగానూ, పాటించక పోవటం పాపంగానూ పరగణిస్తాడు. కనుక ఇటువంటి భావన ఉన్నంత కాలం అస్పృశ్యత కొనసాగుతుందనే నా అభిప్రాయం.

అస్పృశ్యతకి సంబంధించిన సాధారణ ప్రశ్నల్ని గురించీ, అస్పృశ్యత పద్ధతిని గురించి నా ఉద్దేశాలను వివరించిన తరువాత ఇప్పుడు మూడు రాష్ట్రాలలోని దళిత వర్గాల జనాభా గురించిన అంశంపై నా అభిప్రాయాన్ని మీ ముందుంచుతాను. ఈ మూడు రాష్ట్రాలలోని దళిత వర్గాల జనాభా గురించిన విషయంలో ఏకాభిప్రాయమంటూ ఏదీ లేదు.

## 2. సంయుక్త పరగణాల వారి దళిత వర్గాలు

5. సంయుక్త పరగణాలలోని దళిత వర్గాల జనాభా గురించి అయిదు వేరు వేరు అంచనాలు సంఘానికి అందజేయబడినాయి.

1. సంయుక్త పరగణాల రాష్ట్రీయ ఓటుహక్కు సంఘం వారి అంచనా.

(2) బ్లంట్ తన పత్రంలో ఇచ్చిన అంచనా.

(3) జనాభా లెక్కల కమీషనర్ ఇచ్చిన అంచనా.

(4)(5) సంయుక్త పరిగణాల ప్రభుత్వం ఇచ్చిన రెండు అంచనాలు. ఈ అంచనాల గురించి నా అభిప్రాయాలు ఇవి.

(1) బ్లంట్ పత్రం సాధికారికమైనదని నేను ఒప్పుకుంటున్నాను. 1911లో అతడు సంయుక్త పరగణాల జనాభా లెక్కల అధ్యక్షుడుగా ఉన్నప్పుడు అతడికి అందిన వాస్తవాల ఆధారంగా ఈ పత్రం తయారైంది. మిస్టర్ బ్లంట్ తయారుచేసిన మొదటి పత్రంలోని అస్పృశ్య వర్గాల జాబితా సరిగ్గా ఉన్నదా అనే అంశాన్ని పరిశీలించటానికిగాను సంయుక్త ప్రభుత్వం నియమించిన అనధికారిక హిందువుల సాధారణ సభా సంఘం అభిప్రాయాలు ఈ పత్రంలో చోటు చేసుకోవటం వల్ల ఈ పత్రం విలువ మరింత పెరిగింది. అయినప్పటికీ, ఈ క్రింది అంశాల్లో నేను బ్లంట్‌తో ఏకీభవించటం లేదు.

(1) ఒకటి ఈ కింది మూడు కులాల్లోని ప్రతి ఒక్కదాన్ని బ్లంట్ స్పృశ్యులనీ, అస్పృశ్యులనీ

రెండు భిన్న భాగాలుగా విభజించారు.

| | | స్పృశ్యులు | అస్పృశ్యులు |
|---|---|---|---|
| 1. ఛోక్షాలు | - | 30,000 | 19,028 |
| 2. కోరీలు | - | 154,867 | 775,839 |
| 3. చమార్‌లు | - | 2,000,000 | 4,187,770. |

(2) బ్లంటీతో విభేదించే రెండో అంశం 110,032 జనాభా కలిగిన అరఖ్‌లను అతడు స్పృశ్యులుగా పరిగణించారు. వాస్తవానికి నిస్సందేహంగా అస్పృశ్యులైన పాసీకులం వారిలో అరఖ్‌లు ఒక భాగం మాత్రమే.

బ్లంటీ అవలంబించిన విధానం వాస్తవాలకు అనుగుణంగా కాని, హిందూ సామాజిక జీవన పద్ధతి యొక్క ప్రాథమిక సిద్ధాంతం మీద ఆధారపడి గాని లేదని నా అభిప్రాయం. తాను సూపరింటెండెంట్‌గా ఉన్న సంయుక్త పరగణాల 1911వ సంవత్సరపు జనాభా లెక్కల నివేదికలో తానే కోరీలు చమార్‌లలో కేవలం ఒక భాగం మాత్రమేననీ కనుక కోరీలు అందరూ కూడా అస్పృశ్యులేననీ అభిప్రాయం వ్యక్తపరచారు. కోరీలకు, చమార్‌లకు ఉన్న సంబంధం గురించి అతడు 1911 జనాభా లెక్కల నివేదికలోని 347వ పేరాలో చర్చించారు. నేను ఆ చర్చ మీదనే ఆధార పడుతున్నాను. ఆ నివేదికలోనే అతడు ఈ క్రింది అభిప్రాయాల్ని వెలిబుచ్చారు.

"కోరీలు చమార్‌లకు మధ్య గల సంబంధాన్ని ఇంతకుముందే పేర్కొనటం జరిగింది. ఈ సంబంధం గోరఖ్‌పూర్లో ఇంకా దగ్గర సంబంధంగా ఉన్నట్లు కన్పిస్తుంది. అక్కడ కోరీ చమార్లే గాని ప్రత్యేకంగా కోరీలు లేరని తెలుస్తున్నది. అయితే కోరీ - చమార్లు చమార్ అన్న పదాన్ని వదిలేసి కేవలం కోరీలుగానే చెలామణీ అవుతున్నారు. లేదా 'కోరీ-చమార్' అన్న పదాన్ని 'కోయిరీ'గా మాత్రమే వికృతంగా ధ్వనించేట్లుగానైనా పలుకుతున్నారు. గోరఖ్‌పూర్ జిల్లాలో ఒక ఖలాస్ ఇటువంటి ఉపాయంతో తోటి హిందూ పనివారిని తన ఇంట్లోని నీళ్ళు తీసుకునేట్లుగా చేసి వారి చేత తీవ్రంగా దెబ్బలు తిన్నాడు."

అరఖ్‌ల గురించి బ్లంటీ తన నివేదికలో తానే ఇలా అంగీకరించారు. "మొత్తం మీద ఈ కులాలన్నీ ముఖ్యమైన పాసీ జాతిలోని భాగాలే." ఈ పాసీ జాతిని అస్పృశ్య జాతిగా బ్లంటీ అంగీ కరించారు. ఇక చమార్‌ల విషయానికి వస్తే రెండు మిలియన్ల చమార్‌లను అస్పృశ్య వర్గం నుంచి విడదీయటానికి గల కారణాలను బ్లంటీ తన పత్రంలో 17వ పుటలో ఇలా పేర్కొన్నారు. "ఇక రెండో వైపు చాలా మంది చమార్లు గుర్రపు జీనులు తయారు చేసే పని చెప్పులు తయారు చేసేపని, పందెపు గుర్రాలను మాలిష్ చేసే పని వంటి పరిశుద్ధ మైన పనుల్ని చేపట్టారు. కాన్పూరు లోనూ మరికొన్ని చోట్ల తోళ్ళ పరిశ్రమ బాగా అభివృద్ధి పొందటం వల్ల చాలామంది చమార్లు ధనవంతులైనారు.

ఇందువల్ల గ్రామాల్లో ఉండే తమ తోటి చమార్ల కంటే సామాజికంగా ఉన్నతమైన హోదాని వారు ఆశిస్తున్నారు. అటువంటి చమార్లు సాధారణంగా స్పృశ్యులుగానే పరిగణింపబడుతున్నారు. వారు తమ కులపు పేరుని కోరిలా, అహర్వల్, జాతీయ, ధూసియాగానో ఎక్కువగా జైస్వార్ అనీ మార్చుకొంటున్నారు." నా అభిప్రాయంలో బ్లంట్ చేసినట్లు పరిశుభ్రమైన పనుల్ని చేపట్టిన లేదా ధనవంతులైన చమార్లని అస్పృశ్యవర్గం నుంచి విడదీయడం పూర్తిగా తప్పని నా అభిప్రాయం. అస్పృశ్యత, కులవ్యవస్థలలో ఒక ప్రత్యేకత ఉంది. అదేమంటే, ఒక వ్యక్తి యొక్క సామాజిక హోదా అతడి కులం యొక్క ఉన్నతి మీదనే ఆధారపడి ఉంటుంది. ఒకసారి అస్పృశ్యుడైతే ఎప్పుడూ అస్పృశుడే అనేది హిందూ సామాజిక జీవనం యొక్క నియమంగా ఉంది. ఇదే ఇందులోని ప్రత్యేకత. ఒక కులం యొక్క ఉన్నతి, అవగతిల మీద ఆ కులానికి చెందిన వ్యక్తి సామాజిక హోదా ఆధారపడే వర్ణవ్యవస్థ ఇది. అలాకాకుండా వర్గవ్యవస్థ ఉన్నతి, అవగతిల మీద ఆధారపడకుండా, ఆ వర్గానికే చెందిన వ్యక్తి వైయక్తిక సుగుణాలు లేదా దుర్గుణాల మీదనే వ్యక్తి సామాజిక హోదా ఆధారపడి ఉండే వ్యవస్థ కంటే ఇది భిన్నమైంది. హిందూ సామాజిక జీవనం లోని ఈ ప్రధానమైన మూల సిద్ధాంతాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పుడు ఒక అస్పృశ్య కులానికి చెందిన కొందరు వ్యక్తుల్ని స్పృశ్యులుగా పరిగణించే బ్లంట్ ప్రతిపాదనను తిరస్కరించవలసి ఉంటుంది. నిజానికి ఈ ప్రతిపాదనలోని మాటల్లోనే పరస్పర విరుద్ధత ఉంది. వాస్తవానికి అనుగుణంగా లేదు. చమార్ కులంలోని కొన్ని భాగాల వారు స్పృశ్యులుగా పరిగణించబడుతున్నారనీ, వారిని దేవాలయాల్లోకి ప్రవేశించనిస్తున్నారనీ, సార్వత్రిక బావులనుండి నీరు తోడుకోనిస్తున్నారనీ బ్లంట్ పేర్కొన్నది వాస్తవంకాదు. దీనికి విరుద్ధంగా బ్లంట్ మహాశయుడే పేర్కొన్నట్లు ఆ విభాగాలవారు తాము అస్పృశ్యులుగా పరిగణించ బడకుండా ఉండేటందుకు తమని కొత్త కుల నామాలతో వ్యవహరించుకుంటున్నారు. ఇటువంటి సంఘటల్ని బ్లంట్ తన 1911వ సంవత్సరపు సంయుక్త పరగణాల జనాభా లెక్కల నివేదికలో ఉదహరించారు. ఆ నివేదిక మొదటి భాగంలోనిది ఈ క్రింది అంశం :

"ఒక చైస్వార్-చమార్ తాను చమార్ అని ఎప్పుడూ అంగీకరించడు. తాను జైస్వార్‌గా పరిగణించబడటానికే ప్రయత్నిస్తాడు. ఈ జైస్వార్ అనేది రాజపుట్ కులంతో సహా అనేక కులాలలోని ఒకానొక ఉపకులం. ఆగ్రాజిల్లాలోని తుండ్లాలో ఒక కాలనీలో ఉంటున్న మనుషులు మొత్తం జైస్వార్లు అని నేను కనుగొన్నాను. అయితే, విచారణ మీద వారందరూ చమార్‌సైనిక గుర్రపు పనివారనీ వారు ఆ కాలనీలో స్థిరనివాసం ఏర్ప రచుకొన్నారనీ తేలింది." నా అభిప్రాయాలు సరైనవయితే బ్లంట్ అస్పృశ్య వర్గానికి చెందిన వారిలో స్పృశ్యులుగా పరిగణించిన వారిని కూడా అస్పృశ్యులుగానే పరిగణిస్తే అప్పుడు బ్లంట్ ఇచ్చిన అస్పృశ్యుల సంఖ్య సంయుక్త పరగణాలలో, 11,476,214కు చేరుకుంటుంది.

7. జనాభా లెక్కల కమీషనర్ అంచనా ప్రకారం దళిత వర్గాల జనాభా 12.6 మిలియన్లు. కవేళ అతి ఖచ్చితమైన గణన విధానాన్ని అనుసరించినా కూడా, అస్పృశ్యుల్ని మాత్రమే లెక్కలోకి

తీసుకున్న ఎ-పట్టికను మాత్రమే అంగీకరించినా దళిత వర్గాల జనాభా సంఖ్య 11 మిలియన్లకి మాత్రమైనా ఎక్కువగానే ఉంటుంది. ఈ సంఖ్య బ్లంటీ పేర్కొన్న సంఖ్యకు ఇంచు మించు సరిపోతుంది.

8. సంయుక్త పరగణాల ప్రభుత్వం రెండు జట్ల అంచనాలని అందించింది. మొదటి నివేదికలో అది ఇచ్చిన సంఖ్య 6,773,814. తన చివరి నివేదికలో రాష్ట్రీయ సంఘంతో ఏకీభవిస్తూ, స్పర్శ వలన మైల పడటం అనే నిర్వచనం లోకి వచ్చే కులాల జనాభా కేవలం 459,000 అని అంగీకరించింది. మొదటి నివేదికలోని 6,=773,814 అన్న అంచనా విషయంలో ఇది సంయుక్త పరగణాలలోని అస్పృశ్యుల జనాభాకి చెందే అంచనా కాదని చెప్పవలసి ఉంది. ఈ విషయానికి సంబంధించి నంతవరకూ సంయుక్త పరగణాల ప్రభుత్వం బ్లంటీ పత్రంలో ఇవ్వబడిన సంఖ్యలతో మౌనంగా ఏకీభవిస్తున్నట్లు కనపడుతున్నది. సంయుక్త పరగణాల ప్రభుత్వం ఇచ్చిన అంచనా 6,773,814. ఆ ప్రభుత్వం అభిప్రాయంతో రాజకీయ రక్షణకు అర్హులుగా గుర్తించబడవలసిన అవసరం ఉన్న వారి సంఖ్య. ఈ పద్ధతిలో ఉన్న గణాల్ని గురించి ఈ క్రింద నేను చర్చించాను. ఇక్కడ నేను చేయదలుచుకొన్న దల్లా సంయుక్త పరగణాల ప్రభుత్వం వారిచ్చిన ఈ అంచనా అస్పృశ్యుల మొత్తం జనాభాని గురించి అంచనా కాదని పునరుద్ఘాటించటమే. నేను ఇక్కడ వ్యాఖ్యానించదలచుకొన్నదల్లా ఒక్కటే – అది సంయుక్త పరగణాల ప్రభుత్వం వారి తుది నివేదిక పక్కన ఆ ప్రభుత్వం వారు సైమన్ కమీషన్‌కు ఇచ్చిన అంచనాను ఉంచటమే. రాజ్యాంగ బద్ధమైన సంఘానికి ఇచ్చిన పత్రం చివరి అనుబంధంగా ముద్రితమైన దళిత వర్గాల స్థితిని గురించి వారిలా అన్నారు. “ఈ రాష్ట్రం లోని మొత్తం హిందూ జనాభాలో దాదాపు మూడో వంతు అంటే దాదాపు 13 మిలియన్ల మంది, సంప్రదాయ వాదులైన హిందువులచే అస్పృశ్యులుగా పరిగణించబడే వారే ఉన్నారు. సంయుక్త పరగణాల జనాభా లెక్కల నుండి గ్రహించబడి అస్పృశ్యులుగా వర్గీకరించబడిన కులాల పట్టికను ఈ నోట్‌కు అనుబంధంగా ఇస్తున్నాను. ”.... అస్పృశ్య కులాలకు 1901వ సంవత్సరపు ఒక్కొక్క కులంలోని జనాభా సంఖ్యలతో సహా సంబంధించిన సామాజిక అపవిత్రత అనగా ఉన్నత కులానికి చెందిన ఒక వ్యక్తి అస్పృశ్యుడి చేతి నుండి ఆహారంగాని, నీరుగాని తీసుకోక పోవటమే. ఇంకా ఒకవేళ అతడు అస్పృశ్యులను తాకినా, దగ్గరకు వచ్చినా, ఆహారాన్ని తీసుకునే ముందుగాని, ఇతర ఉన్నత కులాల వ్యక్తులతో కలిసే ముందుగాని తప్పనిసరిగా స్నానం చేయవలసి ఉంటుంది.”

దీనినిబట్టి 16మే, 1928 నాటికి, అనగా వినతిపత్రం సమర్పించే నాటికి అస్పృశ్యులు అనగా స్పర్శ వల్ల అపవిత్రత కలుగ చేసే వారి సంఖ్య 13 మిలియన్లు అని స్పష్టం అవుతున్నది. మన సంఘం అధ్యక్షుడి నిర్వచనం సంయుక్త పరగణాల్లోని నిర్వచనం కంటె భిన్నమైనది కాదనేది. 1928లో వీరి సంఖ్య 13 మిలియన్లుగా తీసుకోవటానికి ప్రభుత్వం అనుసరించిన నిర్వచనం కంటె కూడా భిన్నమైనది కాదనేది స్పష్టమే. కనుక ఈ రెండు అంచనాల మధ్యగల విపరీతమైన భేదాన్ని గురించి

సంజాయిషీ ఇచ్చేపనిని సంయుక్త పరగణాల ప్రభుత్వానికే వదిలేస్తున్నాను. అయితే, అస్పృశ్యుల గురించి సంయుక్త పరగణాల ప్రభుత్వం వారి అంచనాల్లో మార్పులు ఉన్నాయని నేను వ్యాఖ్యానించక తప్పటంలేదు. అవి దళిత వర్గాల ప్రాతినిధ్యానికి సంబంధించిన పద్ధతి గురించి ఆ ప్రభుత్వం వారికి గల అభిప్రాయాలకు అనుగుణంగానే ఉన్నాయి. రాజ్యాంగ కమీషన్ నివేదికపై 23.8.1930న తాము పంపిన సందేశంలో సంయుక్త పరగణాల ప్రభుత్వం దళిత వర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాలు ఉండాలనటాన్ని గట్టిగా బలపరిచింది.మన సంఘానికి ప్రభుత్వం పంపిన ప్రాథమిక నివేదికలో ప్రభుత్వం ఒక పేర్ల పట్టిక నుండి నియమించటానికి దిగిరాగా తమ తుది నివేదికలో ప్రత్యేక స్థానాలను సిఫారసు చేసింది. దళిత వర్గాల జనాభా, వారి ప్రాతినిధ్యానికి సంబంధించిన అతి ముఖ్యమైన ఈ సమస్యల విషయంలో ప్రభుత్వం వారి అభిప్రాయాలు ఇంత విచిత్రమైన ఊగిసలాటకు లోనైతే దళిత వర్గాల వారికి వినాశకారియైన అన్యాయం జరుగుతుంది.

9. సంయుక్త పరగణాల ప్రభుత్వ ఓటు హక్కు సంఘం ఇచ్చిన అంచనాల విషయమై నేను ఈ క్రింది వాస్తవాలను తమ దృష్టికి తీసుకుని రాగోరుతున్నాను. (1) జనాభా లెక్కల కమీషనర్, బ్లంట్ ప్రభుత్వం వారు 1928లో ఇచ్చిన అస్పృశ్యుల అంటే, స్పర్శ వల్ల అపవిత్రత కలుగ చేసేవారి సంఖ్యలు ఒకేవిధంగా అంటే దాదాపు $1\frac{1}{2}$ నుండి 13 మిలియన్లుగా ఉన్నాయి. కనుక నమ్మలేనంత ఇంత తక్కువ అంచనాని ఎందుకు ఇచ్చిందో సంఘమే సమర్థించుకోవాలి.

(2) సంఘంలోని దళిత వర్గాలకు చెందిన ఇద్దరు సభ్యులు సంఘం అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నారనీ, సంఘంలోని అత్యధిక సభ్యులు ఒప్పందంలోని అన్ని అంశాలను అంగీకరిస్తు న్నారనీ సంఘం చెప్పేది నాకు ఏ మాత్రం నమ్మశక్యంగా లేదు. ఏమైనా ఈ విషయంలో బాబూరాం చరణ్ అభిప్రాయానికి విలువ లేదని నేను తప్పక ఎత్తిచూపవలసిందే. అతడు ఆర్థికంగా బడుగు వర్గానికి చెందినవాడు, విద్యావిషయంగా వెనుకబడిన వాడూ. ఆ దృష్ట్యా అతడు దళిత వర్గానికి చెందిన వాడే కాని ఖచ్చితమైన నిర్వచనం దృష్టితో చూస్తే అస్పృశ్య వర్గాలకి చెందిన వాడు మాత్రం కాదు.

(3) భారతీయ ఓటు హక్కు సంఘం అస్పృశ్య వర్గాలుగా పరిగణించబడటానికి దేవాలయ ప్రవేశం, స్పర్శ చేత అపవిత్రత అనే రెండు పరీక్షల్ని ఎన్నుకుంది. సంయుక్త పరగణాల ప్రభుత్వం మాత్రం స్పర్శ చేత అపవిత్రత కలగటం అన్న ఒక్క పరీక్షని మాత్రమే గ్రహించింది. అది కూడా యధాతథ దృష్టితోనే కాని భావనాత్మక దృష్టితో కాదు.

(4) రాష్ట్రీయ ఓటు హక్కు సంఘం, అస్పృశ్యతకు మన అధ్యక్షుడు ఇచ్చిన నిర్వచనాన్ని (ఆ నిర్వచనాన్ని ఆయన స్వంత బాధ్యత మీదనే ఇచ్చాడని నేను నొక్కి చెబుతున్నాను.) స్వీకరించేటప్పుడు "సంయుక్త పరగణాలలో అది ఉన్నట్లు" అన్న వాక్యాన్ని గమనించినట్లు లేదు.

10. దళిత వర్గాల జనాభాని అంచనా వేయటానికి బ్లంట్ సంయుక్త పరగణాల ప్రభుత్వం అనుసరించిన పద్ధతి సందర్భంగా మరొక అతిముఖ్యమైన ప్రశ్న తలెత్తుతున్నది. భారతీయ

ఓటుహక్కు సంఘం తనచే అంగీకరించబడిన రెండు పరీక్షలకు సరిపోయేవారిని అస్పృశ్యులుగా పరిగణించాలి. అలా అస్పృశ్యులుగా పరిగణించబడిన వారిని ప్రత్యేక ప్రాతినిధ్యానికి తగిన వారుగా గ్రహించాలి, అన్న ఊహ మీద ముందుకు సాగింది. విచారణ జరుపుతూ ఉండగా భారతీయ ఓటు హక్కు సంఘం భారతదేశంలో ఉన్న పరిస్థితుల ప్రకారం దళిత వర్గాలన్నీ అస్పృశ్యులు కావనీ,బ్లంటీ సంయుక్త పరగణాల ప్రభుత్వం వేరే పద్ధతిని అనుసరించటం ద్వారా వారి విద్య, ఆర్థిక పరిస్థితులను లెక్కలోకి తీసుకోకుండా అందరినీ అస్పృశ్యులుగా పరిగణించటానికి "అస్పృశ్యుల" "దళిత వర్గాల"ను భిన్నంగా చూస్తున్నట్లు కనిపిస్తున్నదనీ కనుగొన్నది. వారి అభిప్రాయంలో దళిత వర్గాల వారందరూ అస్పృశ్యులే. అయితే, అస్పృశ్యులు అందరూ దళిత వర్గాల తరగతికి చెందిన వారు కాదు. ఈ నిర్ధారణ అమలులో ఉన్న పరిస్థితికీ, భారతీయ ఓటు హక్కు సంఘం వారి నిష్కర్షలకూ పూర్తిగా విరుద్ధమైనది. ఏ పేరున పిలుస్తున్నామన్నది ముఖ్యం కాదు. ప్రాతినిధ్యపు స్థాయిని ప్రభావితం చేసే విషయంలో దీని ఫలితాలు తీవ్రస్థాయిలో ఉంటాయి. సంయుక్త పరగణాల ప్రభుత్వం, బ్లంటీ ప్రాతినిధ్య ప్రయోజనాల కోసం అస్పృశ్యుల నందరినీ తమ లెక్కలోకి తీసుకోవటం లేదు. దళిత వర్గాలుగా పిలువబడదగిన అస్పృశ్యులను మాత్రమే పరిగణనలోకి తీసుకొంటున్నారు. భారతీయ ఓటు హక్కు సంఘం తమ రెండు పరీక్షల ద్వారా అస్పృశ్యులు అని ఒకసారి తీర్మానించిన వారిని, వారి మధ్య ధనవంతులు, బీదవారు, అభివృద్ధి పొందినవారు, వెనుకబడిన వారు, చదువుకొన్నవారు, చదువు కోనివారు అనే భేదం లేకుండా అందర్నీ అస్పృశ్యులుగానే పరిగణించాలనే భావనతో ముందుకు సాగుతున్నది. నా అభిప్రాయంలో ఇదే సరైనది.

బ్లంటీ, సంయుక్త పరగణాల ప్రభుత్వం అనుసరించిన పద్ధతితో నేను ఏకీభవించనని వేరే చెప్పవలసిన అవసరం లేదు.

## 3. పంజాబ్‌లోని దళిత వర్గాలు

11. 1931 జనాభా లెక్కలలో ఇచ్చిన దళిత వర్గాల జనాభా లెక్కల సందర్భంగా రెండు వాస్తవాలను మీ దృష్టికి తేవాలనుకొంటున్నాను.

(1) 1911నాటి జనాభా లెక్కల ప్రకారం స్పర్శ వల్ల అపవిత్రత కలుగ జేసే వారి సంఖ్య 2.8 మిలియన్లుకాగా, 1931 నాటి జనాభా లెక్కల్లో అస్పృశ్యుల జనాభా 1.3 మిలియన్లు వరకూ తేలినట్లు ఇవ్వబడింది.

(2) 1911 నాటి జనాభా లెక్కల్లో స్పర్శ వల్ల అపవిత్రత కలుగ జేసేవిగా భావించబడే 23 కులాల జాబితా ఇవ్వబడింది. 1931 నాటి జనాభా లెక్కల్లో పంజాబ్‌లో అస్పృశ్యులు గల కులాలు మాత్రమే పేర్కొన బడినాయి.

12. అస్పృశ్యుల మొత్తం జనాభా, అస్పృశ్యుల కులాల్లో చేర్చబడిన కులాల సంఖ్య 1911–

1931 మధ్య అంతగా ఎందుకు తగ్గిపోయిందో నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. అయితే ఇక్కడ ఒక విషయం చెప్పవలసి ఉంది. గత కొన్ని సంవత్సరాలుగా పంజాబ్‌లోని అస్పృశ్యుల్లో ఆది ధర్మ అనే ఒక బలమైన ఉద్యమం సాగుతూ వస్తున్నది. అస్పృశ్యులు హిందువుల నుండి విడిపోయి తమను తాము ఆది ధర్మ అనే కొత్త పేరుగల ప్రత్యేకమైన వర్గంగా వ్యవహరించుకోవటమే ఈ ఉద్యమం ఆశయం. ఈ ఉద్యమం ఎంత బలంగా ఉండిందంటే 1931 జనాభా లెక్కల నాటికి అస్పృశ్యులు తమను తాము హిందువులుగా చెప్పుకునే బదులు ఆధి ధర్మలుగా వ్యవహరించుకోబడటానికే నిశ్చయించుకున్నారు. ప్రభుత్వం కూడా వారి మార్పుకి గుర్తింపు ఇచ్చి ఆది ధర్మలు అనే కొత్త వర్గాన్ని జనాభా లెక్కల్లో చేర్చడానికి పంజాబ్ జనాభా లెక్కల అధీక్షకుడికి అనుమతి ఇచ్చింది. ఇది పంజాబ్‌లోని కొన్ని భాగాల్లో హిందువులకు, అస్పృశ్యులకు మధ్య సంఘర్షణలకు దారితీసింది. దీని ఫలితంగా కొన్ని ప్రాంతాలో అస్పృశ్యులు తమ తమ కులాలను పేర్కొనకుండా కేవలం ఆది-ధర్మలు గానే నమోదు చేయించుకోగా, కొన్ని ప్రాంతాల్లో అస్పృశ్యులు తమను తాము అది-ధర్మలుగా నమోదు చేయించుకోవటానికి హిందువులు అడ్డుపడగా తిరిగి తమ తమ కులాల పేర్లతో హిందువులుగానే నమోదు చేయించుకున్నారు. పంజాబ్‌లో అస్పృశ్యుల జనాభా లెక్కల సేకరణలో ఏర్పడిన ఇబ్బందులే (ఇలా ఇబ్బందులు ఏర్పడ్డాయని పంజాబ్ ప్రభుత్వం అంగీకరించింది.) వారి జనాభా సంఖ్య, వారి కులాల సంఖ్య తగ్గిపోవటానికి కారణం కావచ్చునన్న విషయాన్ని స్పష్టం చేయడానికే నేను ఈ పై వాస్తవాలను పేర్కొంటున్నాను. కనుక ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

## బెంగాల్‌లో దళిత వర్గాలు

బెంగాల్‌లోని దళిత వర్గాలకు సంబంధించినంత వరకు బెంగాల్‌లో 1911 జనాభా లెక్కలలో ఇవ్వబడిన సాంప్రదాయకంగా అస్పృశ్యులుగా పరిగణించబడుతున్న కులాల పట్టిక సరైనదే అని నిరూపించటానికి తగిన ముఖ్యమైన సాక్ష్యాధారాలు ఉన్నాయన్న విషయాన్ని మీ దృష్టికి తెగోరుతున్నారు.

1809వ సంవత్సరపు 4వ రెగ్యులేషన్‌లోని మొదటి సెక్షన్ పూరీలోని జగన్నాథ దేవాలయం లోకి ప్రవేశించటానికి అర్హత లేని కులాలుగా ఈక్రింది కులాల పట్టికను అందిస్తున్నది.

(1) లోరీ లేక కాషీ (2) కలాల్ లేక సుని (3) మచ్చువా (4) నామసూద్ర లేక చండాల (5) ఘుస్కి (6) గజార్ (7) బక్షి (8) జోగి లేక సూకింబఫ్ (9) కహర్ – బేరీ, దులియా (10) రాజ్‌బంలే (11) పిరాలీ (12) చమార్ (13) డామ్ (14) సాన్ (15) లేయర్ (16) భుమిన్నలి (17) హరి పై గణన 1911 జనాభా లెక్కల పట్టికలో సరిపోవటం ద్వారా ఆ పట్టిక సరియైనదే అని నిరూపిస్తున్నది. అంతేకాక గత 100 సంవత్సరాలుగా బెంగాల్‌లోని అస్పృశ్యుల సామాజిక హోదాలో ఎట్టి మార్పు రాలేదని కూడా దాని వలన తెలుస్తున్నది.

2 సంయుక్త పరగణాలు, బెంగాల్, పంజాబ్ ఈ మూడు రాష్ట్రాల్లో దళిత వర్గాల జనాభా గురించి ఏకాభిప్రాయం లేదు. ఈ సందర్భంగా నేను ఈ క్రింది విషయాన్ని మీ దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. భారతీయ ఓటు హక్కు సంఘం అస్పృశ్యుల జనాభాని నిర్ణయించటానికి రెండు భిన్నమైన పరీక్షల్ని ఆధారంగా తీసుకున్నది. అయితే, రాష్ట్ర ప్రభుత్వాలు, రాష్ట్ర సంఘాలు, 'స్పర్శ వల్ల అపవిత్రత' అనే ఒక్క పరీక్షని మాత్రమే అనుసరిస్తున్నట్లు స్పష్టం అవుతున్నది.

## 5. పరిభాష

14. రాజ్యాంగంలో చేయనుద్దేశించిన మార్పుల ఫలితంగా ఓటర్ల జాబితాలను సవరించే తరుణంలో దళిత వర్గాలకు తగిన పరిభాషను నిర్ణయించే ప్రశ్నను చేపట్టటానికి సరైన సమయం కనుక ఈ విషయంలో నేను నా అభిప్రాయాల్ని ఈ క్రింద ఇస్తున్నాను. దళిత వర్గాలు అన్న పదాల్ని తమను ఉద్దేశించి వాడటానికి ఆ వర్గాల వారికీ అభ్యంతరం ఉంది. సాక్ష్యం ఇవ్వడానికి సంఘం ముందు హాజరైన చాలా మంది సాక్షులు తమ మనోభావనలను వ్యక్తపరచారు. అదీకాక, 'దళిత వర్గాలు' అన్న పరిభాష వల్ల అస్పృశ్యులు' అని ఖచ్చితంగా నిర్ణయించటానికి వీలులేని వారు కూడా ఈ వర్గంలోకి చేరటానికి వీలు కలిగి జనాభాలెక్కల్లో చాలా గందరగోళానికి దారి తీసింది. రెండోది దళిత వర్గాలు అంటే అట్టడుగు వర్గాల వారనీ, నిస్సహాయులనీ స్ఫురిస్తుంది. కాని, వాస్తవానికి ప్రతీరాష్ట్రంలోనూ ఈ వర్గాల వారుగా వ్యవహరించబడే వారిలో చాలా మంది ధనవంతులు, విద్యావంతుల వర్గం సామూహికంగా తమ అవసరాలను గురించిన అవగాహనను కలిగి ఉండి, భారతీయ సమాజంలో ఒక గౌరవప్రదమైన స్థానాన్ని పొందాలని ఆశిస్తూ దాన్ని సాధించటానికి బలవత్తరమైన కృషి చేస్తున్నది. అంశాల దృష్ట్యా దళిత వర్గాలు అన్న పరిభాష తగనిదీ, అనుచితమైనదనీ అస్సాం జనాభా లెక్కల సూపరింటెండెంట్ ముల్లిన్ అస్పృశ్యులకు వెలుపలి కులాలు అనే కొత్త పదాన్ని వాడుకలోకి తీసుకు వచ్చాడు. ఈ పరిభాష వల్ల చాలా ప్రయోజనాలు ఉన్నాయి. అది హిందూ మతంలో ఉన్నప్పటికీ హిందూ సమాజానికి బయటనే ఉన్న అస్పృశ్య స్థితిని సరిగ్గా నిర్వచిస్తున్నది. అంతేకాదు, ఈ పరిభాష వల్ల ఆర్థికంగానూ, విద్యా విషయకంగానూ వెనుకబడిన వారే అయినప్పటికీ, హిందూమతంలోనూ, హిందూ సమాజంలోనూ ఉన్నవారిని పైన పేర్కొన్న అస్పృశ్యుల నుండి విడదీయటానికి వీలౌతున్నది. ఈ పరిభాష వల్ల ఇంకా రెండు ప్రయోజనాలు ఉన్నాయి. ఇప్పుడు ఉపయోగించ బడుతున్న అస్పష్టపదం 'దళిత వర్గాలు' అన్నదాని వల్ల ఏర్పడుతున్న గందరగోళాన్ని నివారించటానికి వీలౌతున్నది. అదేసమయంలో ఈ పరిభాష నిందా పూర్వకమైనది కాదు. ఈ విషయంలో ఎటువంటి సిఫారసులు చేయటానికి తనకు అర్హత ఉన్నట్లుగా మన సంఘం భావించలేదు. కాని, దళిత వర్గాల ప్రతినిధిగా, ఇంతకంటే ఉత్తమమైన మరొక పరిభాషను కనుకొనే వరకు, అస్పృశ్యులను ఇక నుండి మరింత స్పష్టమైన 'వెలుపలి కులాలు' లేదా 'వదిలివేయబడిన కులాలు' అన్న పరిభాషలోనే వ్యవహరించాలని నేను నిస్సంకోచంగా చెపుతున్నాను.

## అభ్యంతరాలు

15. ఈ పత్రాన్ని ముగించే ముందు ఈ కమిటీలోని నా ముస్లిమ్ సహోద్యోగుల వలెనే నేను ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చ దలుచుకున్నాను. రౌండ్ టేబుల్ సమావేశానికి సమర్పించిన అల్ప సంఖ్యాక వర్గాల సమ్మతి పత్రంలో పేర్కొన్నట్లే శ్రామిక స్త్రీలకూ, ఇతరులకూ ప్రత్యేకించిన స్థానాల వలన దళిత వర్గాల వారికి కేటాయించబడవలసిన స్థానాల సంఖ్యకు ఏవిధంగానూ ఇబ్బంది కలుగ కూడదు.

అనువాదం :
ఆచార్య ఎస్. రామచంద్రమూర్తి





1922లో లార్డ్స్‌హౌస్‌లో జరిగిన మూడవ రౌండ్ టేబిల్ సమావేశంలో మహమ్మద్ జఫ్రుల్లాతో డా॥ అంబేద్కర్

# 1

# ప్లీనరీ సమావేశం

## 5వ సమావేశం – 20 నవంబరు 1930

### దళిత వర్గాలకు రాజకీయ అధికారాల అవసరం

*డా॥ అంబేద్కర్ :* అధ్యక్షా, రాజ్యాంగ సవరణల గురించి దళిత వర్గాల అభిప్రాయాలను ఈ సమావేశం ముందు ఉంచాలనే ముఖ్యమైన ఉద్దేశంతో నేను ఇప్పుడు మాట్లాడటానికి పూనుకొంటున్నాను. దళిత వర్గాలకు ప్రాతినిధ్యం వహించే గౌరవం నాకూ, నా సహోద్యోగి రావు బహదూర్ శ్రీనివాస్‌కి లభించింది. 43,000,000 ప్రజలు అంటే, బ్రిటిష్ ఇండియాలోని మొత్తం జనాభాలో 5వ వంతు వారి అభిప్రాయం ఇది. దళిత వర్గాలు మహమ్మదీయుల కంటె భిన్నమైన ఒక వర్గం. వారిని హిందువుల్లో భాగంగా పరిగణిస్తున్నప్పటికీ ఏ దృష్టితో పరిశీలించినా వారు హిందువుల్లో అంతర్భాగం కారు. వారికొక ప్రత్యేకమైన అస్తిత్వం ఉండటమే కాక, భారతదేశంలోని ఇతరవర్గం కంటె స్పష్టంగా భిన్నమైన స్థానం వారికి ఇవ్వబడింది. భారతదేశంలో నిమ్నస్థాయి సేవాస్థాయి వర్గాలు ఉన్నాయి. అయితే దళితవర్గాల స్థాయి వీటికంటే భిన్నమైనది. ఇది యాజమాన్యానికి సేవకుడికి గల సంబంధం వలె మధ్యే మార్గమైనది. దీనిని మన వీలుకోసం దాసత్వ సంబంధం అనవచ్చుకాని, ఆ సంబంధంలో యజమానికి, సేవకుడికి శారీరక స్పర్శకు అనుమతి ఉంటుంది. కాని, దళితవర్గాల విషయంలో ఈ శారీరక స్పర్శ నిషిద్ధం. అస్పృశ్యత కారణంగా బలవంతగా రుద్దబడిన దాసత్వమూ, మానవ సంబంధ నిషేధాల వల్ల బాహ్య జీవనంలో వ్యత్యాసాలు ఏర్పడే అవకాశం ఉండటమే కాక సమానావకాశాలు, మానవుడి అస్తిత్వానికి ఆధార భూతమైన అత్యంత ప్రాథమిక పౌర హక్కులు వారికి లేకుండా పోతాయి. ఇంగ్లాండ్ లేదా ఫ్రాన్స్‌ల లోని జనాభా అంత జనాభా ఉన్న ఈ వర్గం, తమ అస్తిత్వం కోసమై పోరాడటానికి ఎటువంటి హంగులు లేని ఈ వర్గం అభిప్రాయాలు రాజకీయ సమస్యలకు సరైన పరిష్కారం కనుగొనటానికి దోహదపడతాయని నేను నిశ్చయంగా చెప్పగలను. ఈ సమావేశం ప్రారంభ సమయం నుంచే ఈ అభిప్రాయాలను సమావేశం ముందు ఉంచాలని నేను ఎదురుచూస్తున్నాను.

నా అభిప్రాయాల్ని సాధ్యమైనంత సంక్షిప్తంగా మీ ముందుంచుతాను. భారతదేశంలో

---

* రౌండ్ టేబుల్ సమావేశం (మొదటి సమావేశం) భారత ప్రభుత్వం, కేంద్రప్రచురణల విభాగం, కలకత్తా, 1931, పుటలు 123–29

దయాగుణం లేని అధికార యంత్రాంగం స్థానంలో ప్రజల యొక్క, ప్రజల చేత, ప్రజల కొరకు పాలించబడే ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టాలి. దళిత వర్గాల ఈ అభిప్రాయం కొంతమందికి ఆశ్చర్యాన్ని కలిగిస్తుందని నాకు తెలుసు. దళితవర్గాలను బ్రిటిష్ వారికి దగ్గరచేసే సూత్రం ఒక విచిత్ర లక్షణం గలది. సాంప్రదాయవాదులైన హిందువుల వలన ఎంతో కాలంగా తాము అనుభవిస్తున్న నిరంకుశత్వం, అణచివేతల నుండి తమకు విముక్తి కలిగించే వారుగా బ్రిటిష్ వారికి దళిత వర్గాలు స్వాగతం పలికాయి. దళితవర్గాల వారు హిందువులకు, ముసల్మానులకు సిక్కులకు వ్యతిరేకంగా పోరాడి బ్రిటిష్ వారికి గొప్ప భారతీయ సామ్రాజ్యాన్ని జయించి పెట్టారు. వారు కూడ దళితవర్గాలకు ధర్మకర్తల పాత్ర స్వీకరించారు. ఈ విధంగా ఉభయ పక్షాలకు గల సాన్నిహిత్యం దృష్ట్యా భారత దేశంలో బ్రిటిష్ పాలన పట్ల దళిత వర్గంలో మారిన ఈ అభిప్రాయం నిస్సందేహంగా గొప్ప ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అయితే, ఈ విధమైన మార్పుకుగల కారణాలను వెతకటానికి ఎంతో దూరం పోనక్కరలేదు. కేవలం అధిక సంఖ్యాకులలో చేరిపోవాలనే ఉద్దేశంతో మేమీ నిర్ణయాన్ని తీసుకోలేదు. వాస్తవానికి, అధిక సంఖ్యాకులకూ నేను ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రత్యేక అల్పవర్గాలకూ మధ్య చెప్పుకోదగ్గ ప్రేమాను రాగాలు ఏమీ లేవు. మాది స్వతంత్ర నిర్ణయం. మేము కేవలం మా పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, ఇప్పుడున్న ప్రభుత్వాన్ని గురించి సవిమర్శకంగా పరిశీలించి, ఒక మంచి ప్రభుత్వానికి అవసరమైన కొన్ని ముఖ్య లక్షణాలు దీనికి లేవని కనుగొన్నాము. ఇప్పటి మా పరిస్థితిని బ్రిటిష్ వారు రాకముందు భారతీయ సమాజంలోని మా పరిస్థితితో పోల్చిచూసుకుంటే పురోగమనానికి బదులు కేవలం అంత్య సమయానికై నిరీక్షిస్తుండటంగా మాత్రమే ఉన్నట్లు అవగతమౌతున్నది. బ్రిటిష్ వారు రాకముందు అస్పృశ్యత కారణంగా మేము హీనస్థితిలో ఉండేవారం. దీనిని తొలగించుకోవటానికి బ్రిటిష్ ప్రభుత్వం ఏమైనా చేసిందా? బ్రిటిష్ వారు రాకముందు మాకు దేవాలయ ప్రవేశం లేదు. ఇప్పుడు మేము దేవాలయాలకు పోగలమా? బ్రిటిష్ వారు రాకముందు మాకు రక్షక దళాల్లో ఉద్యోగవకాశాలు లేవు. బ్రిటిష్ ప్రభుత్వం మమ్మల్ని పోలీసు దళాల్లో చేర్చు కుంటున్నదా? బ్రిటిష్ వారు రాకముందు మాకు సైన్యంలో చేరే అవకాశం లేదు. ఇప్పుడు మాకు సైనంలో చేరే అవకాశం ఉందా? ఈ ప్రశ్నల్లో ఏ ఒక్క ప్రశ్నకీ ఖచ్చితంగా అవునని సమాధానం చెప్పలేం. సుదీర్ఘకాలం మమ్ము పాలించిన బ్రిటిష్‌వారు చేసిన ఏ కొంత మంచినైనా సంతోషంగా స్మరించుకుంటాము. అయితే మా పరిస్థితిలో ప్రాథమికమైన మార్పు ఏమీ లేదని మేము నిశ్చయంగా చెప్పగలం. ఒక చైనా దర్జీవాడు, కొలత కోసం తనకిచ్చిన పాత కోటు, సరిగ్గా ఎలా ఉందో అలాగే, అంటే చిరుగులు, మాసికలతో సహా కొత్త కోటును సగర్వంగా తయారు చేసి ఇచ్చినట్లు వాస్తవానికి బ్రిటిష్ ప్రభుత్వం మాకు సంబంధించినంత వరకూ, ఎలా ఉన్న సాంఘిక ఏర్పాట్లను అలాగే అంగీకరించి వాటిని ఏ మార్పు లేకుండా కొనసాగనిచ్చింది. 150 సంవత్సరాల పాటు బ్రిటిష్ పాలన సాగినా మా విషయమైన అన్యాయాలు నోళ్లు తెరుచుకొన్న గాయాలవలె ఉన్నాయి కాని వాటిని సరిచేసే మాట అన్నది జరగనే లేదు.

బ్రిటిష్ వారిలో నిర్లక్ష్యం వుందని కాని, సానుభూతి కరువైందని కాని వారిని మేము

నిందించటం లేదు. మాకు అర్థమైన దేమంటే, ఈ సమస్యలను పరిష్కరించటానికి వారికి తగిన సామర్థ్యం లేదనేదే. ఒకవేళ వారిలో నిర్లక్ష్యమే ఉండి ఉంటే అది ఒక అల్ప విషయమై ఉండేదే కాని మా దృక్పథంలో ఇంత తీవ్రమైన మార్పును తేగలిగి ఉండేది కాదు. లోతుగా విశ్లేషిస్తే, సమస్యను పరిష్కరించటానికి అవసరమైన సమర్థత లోపించిందే గాని నిర్లక్ష్యం కారణం కాదని మాకు అర్థమైంది. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం రెండు అతి తీవ్రమైన పరిమితులకు లోబడి ఉందని దళితవర్గాలు కనుగొన్నాయి. మొదటిగా ప్రభుత్వంలో ఉన్నవారి గుణ గుణాలు, ఉద్దేశాలు, వారు ఆశిస్తున్న ప్రయోజనాల నుండి ఉద్భవించిన అంతర్గత పరిమితి. మా సమస్యల విషయంలో వారు మాకు సహాయం చేయలేని స్థితిలో ఉండటం వల్ల సహాయపడటం లేదని కాదు, అలా సహాయ పడటం వారి గుణగుణాలకి, ఉద్దేశాలకి, వారు ఆశిస్తున్న ప్రయోజనాలకి వ్యతిరేకం కావటం వల్లనే మాకు సహాయం చేయటం లేదు. ఇక రెండోది ఇతరుల నుండి ప్రతిఘటనని ఎదుర్కోవలసి వస్తుందనే తీవ్రమైన భయం వారి అధికారాన్ని సేవితం చేస్తున్నది. భారతీయ సమాజంలోని ఆయువు పట్టుల్ని తినేస్తున్న, ఎన్నో సంవత్సరాలుగా అణగతొక్కబడిన వర్గాల జీవితాన్ని దుర్భరం చేస్తున్న ఈ సాంఘిక దురాచారాన్ని నిర్మూలించవలసిన అవసరాన్ని భారత ప్రభుత్వం తప్పక గుర్తించింది. భూస్వాములు ప్రజల్ని ఆఖరిబొట్టు వరకు పిండేస్తున్నారనీ, పెట్టుబడి దార్లు కార్మికులకు బతకటానికి తగిన కూలి కూడ ఇవ్వటం లేదని, వారికి పనిచేసే చోట్ల తగిన వసతులు కల్పించటం లేదని భారత ప్రభుత్వం గుర్తించింది. కానీ, వీటిలో ఏ ఒక్క విషయంలోనూ ప్రభుత్వం కల్పించుకోవటానికి సాహసించలేదనేదే అత్యంత బాధాకరమైన విషయం ఎందుకు? ఈ దురాచారాల్ని నిర్మూలించ టానికి తగిన న్యాయబద్ధమైన అధికారాలు లేవా? కాదు. మరి ఎందుకు కల్పించుకోవటం లేదు. ఇప్పుడున్న సాంఘిక, ఆర్థిక జీవనాలతో సంబంధించిన నియమావళిని మార్చటానికి ప్రయత్నిస్తే అది ప్రతిఘటనకు దారి తీస్తుందని భయపడటమే ఈ విషయాల్లో కల్పించుకోక పోవటానికి కారణం. ఇటువంటి ప్రభుత్వం వల్ల ఎవరికి మాత్రం ఏమి ప్రయోజనం? రెండు పరిమితుల మధ్య కదలలేని స్థితిలో పడిపోయిన ప్రభుత్వం వల్ల జీవనం సుఖమయం కావటానికి అవసర మైనవన్నీ అలా నిలిచి పోవలసిందే. ఉత్తమ ప్రయోజనాలకు అవిభాజ్యమైన భక్తి విశ్వాసాలు మనకు కావాలి. ఎక్కడ విధేయత అంతమై ప్రతిఘటన ప్రారంభమవుతుందో తెలుసుకుని వెనువెంటనే అవసరమైన న్యాయబద్ధమైన, ప్రయోజనకరమైన విధంగా సాంఘిక, ఆర్థిక జీవన నియమావళిని మార్చటానికి భయపడని అధికారులుగల ప్రభుత్వం మాకు కావాలి. బ్రిటిష్ ప్రభుత్వం ఈ పాత్ర ఎప్పటికి నిర్వహించజాలదు. ప్రజలయొక్క, ప్రజలకొరకు, ప్రజలచేత ఏర్పాటు చేయబడిన ప్రభుత్వం వల్ల మాత్రమే ఇది సాధ్యం అవుతుంది.

ఇవి దళిత వర్గాలు లేవనెత్తిన కొన్ని ప్రశ్నలు, వారి ఉద్దేశంలో వాటికి వచ్చిన సమాధా నాలు. కనుక దళిత వర్గాలు తప్పనిసరిగా ఈ నిర్ధారణకు రావలసి వస్తున్నది. ఉద్దేశాలు మంచివే అయినప్పటికీ భారత ప్రభుత్వపు అధికార యంత్రాంగం మా కష్టనష్టాలకు ఎటువంటి సాయం

చేయటానికి శక్తి హీనంగానే ఉండి పోయింది. మేము తొలగించుకోగలిగినట్లుగా మరొకరెవరూ మా ఇబ్బందుల్ని తొలగించలేరు. రాజకీయాధికారం మా చేతుల్లోకి తెచ్చుకో గలిగితే తప్ప ఇది సాధ్యం కాదు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ విధంగా ఉన్నంతకాలం రాజకీయాధికారంలో మాకు భాగం లభించదనేది స్పష్టం. ఏ రాజకీయాధికారం మా చేతుల్లోకి వస్తే మా వారికి విముక్తి కలిగించగలమో ఆ అధికారం మాకు రావడానికి ఒక్క 'స్వతంత్ర' రాజ్యాంగంలోనే అవకాశం ఉంది.

అయ్యా, ఒక విషయాన్ని నేను ప్రత్యేకంగా మీ దృష్టికి తీసుకుని రావాలనుకొంటున్నాను. దళిత వర్గాల అభిప్రాయాన్ని మీ ముందుంచేటప్పుడు అధినివేశ ప్రతిపత్తి (Dominion Status)అన్న పదాన్ని నేను ఉపయోగించలేదు. ఈ పదాన్ని నేను ఉపయోగించపోవటానికి కారణం ఈ పదంలో గల అంతస్సూచనలు తెలియక గానీ, భారత దేశం అధినివేశ ప్రతిపత్తిని పొందటానికి దళిత వర్గాలకు అభ్యంతరం ఉందని గాని కాదు. దళిత వర్గాలు కోరుకొనే ప్రతిపత్తిని ఆ పదం అందించ జాలక పోవటమే ఆ పదాన్ని వాడక పోవటానికి గల ముఖ్య కారణం. దళిత వర్గాల వారు భద్రతతో కూడిన అధినివేశ ప్రతిపత్తిని సమర్థిస్తున్నప్పటికీ, వారు ఒక ప్రశ్నని, ఒకే ఒక ప్రశ్నని గట్టిగా అడగాలను కొంటున్నారు. "అధినివేశ ప్రతిపత్తి భారతం" ఏవిధంగా పని చేస్తుంద నేదే ఆ ప్రశ్న. రాజకీయాధికార కేంద్రం ఎక్కడ ఉంటుంది? ఎవరి చేతుల్లో ఆ అధికారం ఉంటుంది? దళిత వర్గాల వారు ఆ అధికారానికి వారసులు కాలేరా? ఇవి వారికి సంబంధించిన ప్రధాన ప్రశ్నలు. కొత్త రాజ్యాంగానికి రాజకీయ యంత్రాంగం ప్రత్యేకమైనదైతే తప్ప రాజకీయాధికారంలో నూలు పోగంత భాగం కూడా లభించదని దళిత వర్గాల వారు భావిస్తున్నారు. అటువంటి రాజకీయ యంత్రాంగాన్ని నిర్మించేటప్పుడు భారతీయ సామాజిక జీవనానికి సంబంధించిన కఠోర సత్యాలు మన దృష్టి నుండి తప్పించుకో కూడదు. భారతీయ సమాజం గౌరవ ప్రమాణంలో అనులోమ క్రమంతో కూడిన, ఏహ్య భావనా ప్రమాణంలో విలోమంతో కూడిన, తరతమ, భేదాలు గల కులాలతో కూడి ఉన్నదన్న విషయాన్ని గుర్తించాలి. ప్రజాస్వామిక ప్రభుత్వానికి ముఖ్యమైన సమానత, సౌహార్దత అనే భావాలు పెరగటానికి ఈ పద్ధతి అవకాశం ఇవ్వదు. అంతేకాదు. ఈక్రింది విషయాల్ని కూడ గుర్తించాలి. భారతీయ సమాజంలో మేధావి వర్గం ముఖ్యమైన భాగం. ఈ భాగం సమాజంలోని ఉన్నత వర్గాల నుండే ఏర్పడింది. భారతదేశం పేరిట వ్యవహరిస్తున్నా రాజకీయ ఆందోళనని కొనసాగిస్తున్నా ఈ వర్గం తాను ఉన్నత వర్గానికి చెందిన దాననే సంకుచిత ప్రత్యేక భావాన్ని వదల లేదు. మరొక విధంగా చెప్పాలంటే, రాజకీయ యంత్రాంగం సమాజ మనస్తత్వాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. మనస్తత్వంలో సంబంధం కలిగినదై ఉండాలి. రాజకీయ యంత్రాంగం ఇందుకొరకే ఏర్పడింది. ఈ విషయాన్ని రాజకీయ వర్గాలు నొక్కి చెప్పుతున్నాయి. అలాకాకపోయినట్లయితే మీరు ఎంత సుసంబద్ధమైన రాజ్యాంగాన్ని రూపొందించబోతున్నా అది ఏ సమాజం కొరకైతే తీర్చిదిద్దబడుతున్నదో ఆ సమాజానికి తగనిది గానూ, అసంపూర్ణం గానూ తయారౌతుంది.

ఈ విషయాన్ని ముగించే ముందు నేను మరొక అంశాన్ని చేపట్టాలను కుంటున్నాను. దళిత

వర్గ సమస్య సాంఘిక సమస్య అనీ, దాని పరిష్కారం రాజకీయంలో కాక మరొక చోట ఉన్నదనీ తరచు అంటూ ఉంటారు. ఈ అభిప్రాయానికి మేము తీవ్రమైన అభ్యంతరం తెలుపుతున్నాము. రాజకీయాధికారాన్ని తమ చేతుల్లోకి తెచ్చుకుంటే తప్ప దళిత వర్గాల వారు తమ సమస్యల్ని ఎప్పటికి పరిష్కరించుకోజాలరని మేము విశ్వసిస్తున్నాము. ఇదే వాస్తవమైతే వాస్తవం కాదని అనటం కుదరదని నేను భావిస్తున్నాను. దళిత సమస్య అన్ని విధాలా రాజకీయమైనదేననీ, ఆ సమస్యని ఆ విధంగానే పరిగణించాలనీ నా నిశ్చితాభిప్రాయం. రాజకీయాధికారం బ్రిటిష్ వారి చేతుల నుండి మా ఉనికి పైన ఆర్థిక, సాంఘిక, మతపరమైన మహాశక్తివంతమైన పెత్తనాన్ని చెలాయించగలవారి చేతులలోకి వెళుతున్నదన్న విషయం మాకు తెలుసు. 'స్వరాజ్' అనే భావన గతంలో మేమనుభవించిన నిరంకుశ పరిస్థితుల్ని, అణచివేతల్ని, అన్యాయాన్ని మాకు గుర్తు తెస్తున్న 'స్వరాజ్' వల్ల అది తిరిగి సంభవిస్తాయన్న భయం ఉన్నా 'స్వరాజ్' రావటానికి మేము ఇష్టపడుతున్నాము. తోటి దేశ ప్రజలతో బాటు, తగినంత నిష్పత్తిలో రాజకీయ సార్వభౌమాధికారులుగా మమ్మల్ని నిలుపుతారనే ఆశతో తప్పనిసరైన 'స్వరాజ్'కు సిద్ధపడుతున్నాము. అయితే, మా సమస్యల్ని కాలానికి వదిలేయకుండా ఉండాలనే ఒక్క షరతుతో మేమిందుకు అంగీకరిస్తున్నాం. కాలం ఏదో అద్భుతం చేస్తుందని దళిత వర్గాలు చాలా కాలం వేచి ఉన్నాయని నాకు అనిపిస్తున్నది. ప్రాతినిధ్య ప్రభుత్వం యొక్క పరిధిని విస్తృతం చేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం తీసుకున్న ప్రతి ఒక్క దశలోనూ, కావాలనే దళిత వర్గాల్ని వదిలివేయటం జరిగింది. రాజకీయాధికారాలను వాళ్ళకు గల హక్కును గురించి ఎవరూ ఆలోచించలేదు. ఈ పరిస్థితిని సహించమని నేను తీవ్రంగా తిరస్కార పూర్వకంగా హెచ్చరిస్తున్నాను. మా సమస్యల పరిష్కారం రాజకీయ పరిష్కారంలో తప్పనిసరిగా ఒక సాధారణ భాగం కావాలే గాని భవిష్యత్తులోని పరిపాలకుల, తరచూ కదిలిపోతు మారిపోతూ ఉండే సానుభూతి ఇసుక దిబ్బలకూ మంచి తనాల పవనాలకూ ఎంత మాత్రం వదిలి వేయబడకూడదు. దళిత వర్గాలు ఈ విషయమై ఎందుకు ఇంత పట్టు పడుతున్నాయనటానికి గల కారణాలు చాలా స్పష్టమైనవే. అధికారం గల వ్యక్తి అధికారం లేని వ్యక్తి కంటే బలవంతుడని మాలో ప్రతి ఒక్కడికి తెలుసు. అధికారంలో ఉన్న వ్యక్తులు అధికారం లేని వ్యక్తుల కోసం తమ అధికారాల్ని వదిలి పెట్టికోరని కూడ మాలో ప్రతి ఒక్కరికి తెలుసు. కనుక మా సాంఘిక సమస్య పరిష్కారం అవుతుందన్న ఆశ మాకు లేదు. మేము అధికారాల్ని, పరిష్కారం వల్ల నష్టపోయే వారి చేతుల్లోకి జారవిడుచుకుంటే ఇప్పుడు మేము అధికారం, ప్రతిష్ఠ అనే సింహాసనం మీదికి ఎక్కటానికి ఎవరికైతే సహాయపడుతున్నామో వారిని ఆ సింహాసనం మీద నుండి దించటానికి మరొక విప్లవం రావలసి ఉంటుంది. భద్రత ఉంటుందని నమ్మి నాశనమై పోవటం కంటె, ఆతురతో కూడిన సందేహాలు వెలిబుచ్చుతున్నామని త్రృణీకరించబడుటమే మేలుగా భావిస్తున్నాం. రాజకీయ యంత్రాంగాన్ని సవరించి దానిపై మాకు పట్టు ఇవ్వటం మా సమస్యా పరిష్కారానికి ఉత్తమమైన హామీ అని మేము పట్టుపట్టటమే తగినదనీ న్యాయబద్ధమైనదనీ నేను భావిస్తున్నాను. అంతేకాని ఈ పరిష్కారాన్ని ఇష్టారాజ్యంగా యంత్రాంగాన్ని తమ అదుపులో ఉంచుకొనే వారి దయాదాక్షిణ్యాలకు వదిలి వేయరాదు.

తమ రక్షణ, భద్రతలకు రాజకీయ యంత్రాంగానికి ఏవిధమైన సవరణల్ని దళిత వర్గాల వారు కోరుకుంటున్నారనే విషయాన్ని తగిన సమయంలో సంఘం ముందు ఉంచుతాను. ప్రాతినిధ్య ప్రభుత్వం కావాలని మేము కోరుకుంటున్నప్పటికీ, కేవలం యజమానులు మారే ప్రభుత్వాన్ని మేము కోరుకోవటం లేదని మాత్రమే ప్రస్తుతం చెపుతున్నాను. మా కార్యనిర్వాహక వర్గం పూర్తిగా బాధ్యతాయుతమైనది కావాలనుకొంటే శాసన సభను కూడా వాస్తవంగా, పూర్తిగా బాధ్యతాయుతమైన దానిగా రూపొందించండి.

అధ్యక్షా, నేను ఇంత నిర్మొహమాటంగా మాట్లాడవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను. కాని నేను నిస్సహాయుణ్ని. దళిత వర్గాల వారికి మిత్రులు ఎవరూ లేరు. ఇంత కాలం ప్రభుత్వం కూడా తమ మనుగడకు మాత్రమే ఉపయోగించుకున్నది. హిందువులు కూడా దళిత వర్గాల వారిని తమ వారని చెప్పుకోవడం వారి హక్కుల్ని నిరాకరించటం కోసం మాత్రమే. వారిని చేరనిస్తే పోటీ ఏర్పడి తమ ప్రయోజనాలు తగ్గి పోతాయనే భయంతోనే మహమ్మదీయులు వారి ప్రత్యేక అస్తిత్వాన్ని గుర్తించటానికి నిరాకరిస్తున్నారు. ప్రభుత్వం వల్ల నిరుత్సాహానికి గురై, హిందువుల చేత అణగదొక్కబడి, మహమ్మదీయుల చేత నిరాకరించబడి మేము సహించ శక్యంకాని నిస్సహాయ స్థితిలో పడిపోయాము. ఇటువంటి పరిస్థితి మరెక్కడా ఉండబోదు. ఈ స్థితిని నేను మీ దృష్టికి తప్పక తీసుకురావలసి ఉంది.

చర్చకు నిర్దేశించబడిన మరొక విషయం – దీనిని సాధారణ చర్చతో ముడి పెట్టడానికి నిశ్చయించబడింది. నిజమే. ఇది నాకు బాధ కలిగిస్తున్నది. ఈ విషయ ప్రాముఖ్యత దృష్ట్యా ఒక పూర్తి సమావేశమే దీనికి కేటాయించవలసి ఉంది. అన్నిటితో పాటు యధాలాపంగా దీన్ని ఒకటిగా చేయటం వలన తగిన న్యాయం ఈ విషయానికి జరగదు. ఈ విషయమై వారు చాలా ఆందోళనతో ఉన్నారు అంతేకాదు, దీన్ని చాలా ప్రముఖమైన ప్రశ్నగా వారు భావిస్తున్నారు. అల్ప సంఖ్యాక వర్గంలోని వారుగా మేము, అల్ప సంఖ్యాక వర్గాల వారిని అధిక సంఖ్యాకుల తప్పుడు పరిపాలన నుండి రక్షించటానికి కేంద్ర ప్రభుత్వం రాష్ట్రీయ అధిక సంఖ్యాకుల పైన బలీయమైన అదుపు ఉండే విధంగా ప్రవర్తిస్తుందని కేంద్రం వంక ఆశగా చూస్తున్నాం. ఏక కేంద్రక ప్రభుత్వ విధానాన్ని బలంగా నమ్మే వారిలో నేనొకడినని స్పష్టం చేస్తున్నాను. అంతేకాదు, ఆ విధానాన్ని భంగపరిచే ఆలోచన నాకు సంతోషదాయకమైన విషయం కాదని అంగీకరిస్తున్నాను. భారతదేశాన్ని నిర్మించటానికి ఏక కేంద్రక ప్రభుత్వం అత్యంత ప్రభావశాలిగా ఉంటుంది. ప్రభుత్వ ఏకీకృత పద్ధతి ఫలితమైన ఏకీకరణ ఇంకా పూర్తి కాలేదు. తన ఫలితాలను సాధించకముందే ప్రారంభదశలోనే అత్యంత శక్తి శాలియైన ఈ ఉత్తేజకాన్ని అడ్డుకోవటం అత్యంత గర్హనీయం.

అయితే, ఇప్పుడు ఈ రూపంలో మీ ముందుంచిన ప్రశ్న కేవలం బౌద్ధికమైనది మాత్రమే. స్థానిక స్వయం ప్రతిపత్తి విషయంలో సమాఖ్య పద్ధతి కేంద్రీయ ఏకతకు వ్యతిరేకంగా ఉండదని నిరూపించగలిగితే నేను సమాఖ్య పద్ధతి విషయమై ఆలోచించటానికి సిద్ధంగా ఉన్నాను.

అయ్యా, నేను దళిత వర్గాల వారి ప్రతినిధిగా, వారి పక్షాన చెప్పవలసినదంతా చెప్పాను. ఒక భారతీయుడిగా, మనం ఎదుర్కోవలసిన పరిస్థితి గురించి ఒకటీ రెండు సాధారణ మైన మాటలు చెప్పటానికి అనుమతించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను. ఈ ఉద్యమానికి నేనొక మూగసాక్షిని కానప్పటికీ, ఈ విషమ పరిస్థితిపై ఇదివరకే ఎంతగానో చెప్పబడి ఉండటం వల్ల ఇంక నేను మరొక్క మాట చేర్చటానికి కూడా సాహసించను. మన సమస్యను పరిష్కరించుకోవటానికి మనం సరైన మార్గాన్ని అనుసరిస్తున్నామా అని నేను ఆందోళన చెందుతున్నాను. ఆ పరిష్కారం పూర్తిగా బ్రిటిష్ ప్రతినిధుల అభిప్రాయం మీదనే ఆధారపడి ఉంటుంది. ఈ పరిస్థితిని రాజీ పద్ధతిని అనుసరించి ఎదుర్కొంటారా లేక ఇనుప పాదాలతో ఎదుర్కొంటారా అనేది మీ తీర్పుకే వదిలేస్తున్నాను. ఇందుకు పూర్తి బాధ్యత మీరే వహించాలని నేను వారికి చెప్పదలచాను. మీతో బల ప్రయోగం వైపు మొగ్గు చూపే వారికీ, 'లెటర్స్ డి కాబెట్', 'బాస్టిలీ' పరిపాలన వల్ల పరిస్థితి మెరుగౌతుందని నమ్మేవారికీ గొప్ప రాజనీతి తత్వవేత్త ఎడ్మండ్ బర్క్ చిరస్మరణీయమైన మాటల్ని నేను గుర్తు చేయాలను కొంటున్నాను. అమెరికా వలస రాజ్యాలలో వ్యవహరించవలసిన సమస్యను ఎదుర్కొంటున్న బ్రిటిష్ వారిని ఉద్దేశించి ఆయన అన్న మాటలు ఇవి.

"కేవలం బల ప్రయోగం తాత్కాలిక మైనది మాత్రమే. తాత్కాలికంగా అది ఫలించినట్లు అనిపించవచ్చును గాని మళ్ళీ వశపరచుకోవలసిన అవసరం రాకుండా చేయజాలదు. ఎప్పుడూ లొంగదీసుకుంటూనే ఉండవలసిన దేశాన్ని పరిపాలించటం సాధ్యపడదు. బలప్రయోగానికి మరొక అభ్యంతరం దానికి గల అనిశ్చితత్వం. బలప్రయోగం యొక్క ఫలితమైన భయం తాత్కాలికం. ఆయుధశక్తి విజయం కాజాలదు. మీరు విజయాన్ని పొందక పోయినట్లయితే మీకు తగిన ఆధారం లేనట్లే. ఎందుకంటే, రాజీపద్ధతి ఫలించినట్లయితే బలప్రయోగం మిగులుతుంది. కాని బలప్రయోగం ఫలించినట్లయితే ఇక తిరిగి ఏ రాజీ పద్ధతికి ఆశ లేకుండా పోతుంది. శక్తి, అధికారాల్ని ఒక్కొక్కసారి దయద్వారా కొనటం జరుగుతుంది. అంతేకాని హింసామార్గంలో అలసిపోయి, ఓడిపోయి అధికారాన్ని తిరిగి భిక్షగా పొందటం అసాధ్యం. బల ప్రయోగానికి మరొక అభ్యంతరం ఏమంటే, ఏ లక్ష్యాన్నయితే మీరు సంరక్షించటానికి ప్రయత్నిస్తున్నారో ఆ లక్ష్యాన్ని మీరు బలహీనం చేస్తున్నారు. మీరు ఎందుకొరకై పోరాడుతున్నారో (ప్రజావిశ్వాసం కొరకు అని) అది మీకు లభ్యం కాదు. మీకు లభ్యమయ్యేదల్లా ఆ పోటీలో తరిగిపోయిన, కృంగిపోయిన, వృధా చేయబడిన, క్షీణమైపోయిన ప్రజా విశ్వాసం మాత్రమే",.

ఈ సలహా విలువ, ప్రభావం మీకు తెలిసినవే. మీరు ఈ సలహాను పాటించలేదు గనుకనే అమెరికా ఖండాన్ని పోగొట్టుకొన్నారు. మీరు దాన్ని మీ మంచి కొరకే పాటించారు కనుకనే మిగిలిన అధినివేశ రాజ్యాలు మీకు దక్కాయి. మీలో రాజీపద్ధతిని అనుసరించదలుచుకొన్న వారికి నేను ఒక విషయం చెప్పాలనుకొంటున్నాను. అధినివేశ రాజ్య ప్రతిపత్తిని బలపరుస్తూ కాని, లేదా వ్యతిరేకిస్తూ గాని చర్చలు జరపటానికి ప్రతినిధులను ఆహ్వానించారనీ, మేధాశక్తితో కూడిన ఈ చర్చల్లో ఏ పక్షం

అయ్యా, నేను దళిత వర్గాల వారి ప్రతినిధిగా, వారి పక్షాన చెప్పవలసినదంతా చెప్పాను. ఒక భారతీయుడిగా, మనం ఎదుర్కోవలసిన పరిస్థితి గురించి ఒకటీ రెండు సాధారణ మైన మాటలు చెప్పటానికి అనుమతించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను. ఈ ఉద్యమానికి నేనొక మూగసాక్షిని కానప్పటికీ, ఈ విషమ పరిస్థితిపై ఇదివరకే ఎంతగానో చెప్పబడి ఉండటం వల్ల ఇంక నేను మరొక్క మాట చేర్చటానికి కూడా సాహసించను. మన సమస్యను పరిష్కరించుకోవటానికి మనం సరైన మార్గాన్ని అనుసరిస్తున్నామా అని నేను ఆందోళన చెందుతున్నాను. ఆ పరిష్కారం పూర్తిగా బ్రిటిష్ ప్రతినిధుల అభిప్రాయం మీదనే ఆధారపడి ఉంటుంది. ఈ పరిస్థితిని రాజీ పద్ధతిని అనుసరించి ఎదుర్కొంటారా లేక ఇనుప పాదాలతో ఎదుర్కొంటారా అనేది మీ తీర్పుకే వదిలేస్తున్నాను. ఇందుకు పూర్తి బాధ్యత మీరే వహించాలని నేను వారికి చెప్పదలచాను. మీతో బల ప్రయోగం వైపు మొగ్గు చూపే వారికీ, 'లెటర్స్ డి కాబెట్', 'బాస్టీలీ' పరిపాలన వల్ల పరిస్థితి మెరుగౌతుందని నమ్మేవారికీ గొప్ప రాజనీతి తత్వవేత్త ఎడ్మండ్ బర్క్ చిరస్మరణీయమైన మాటల్ని నేను గుర్తు చేయాలను కొంటున్నాను. అమెరికా వలస రాజ్యాలలో వ్యవహరించవలసిన సమస్యను ఎదుర్కొంటున్న బ్రిటిష్ వారిని ఉద్దేశించి ఆయన అన్న మాటలు ఇవి.

"కేవలం బల ప్రయోగం తాత్కాలిక మైనది మాత్రమే. తాత్కాలికంగా అది ఫలించినట్లు అనిపించవచ్చును గాని మళ్ళీ వశపరచుకోవలసిన అవసరం రాకుండా చేయజాలదు. ఎప్పుడూ లొంగదీసుకుంటూనే ఉండవలసిన దేశాన్ని పరిపాలించటం సాధ్యపడదు. బలప్రయోగానికి మరొక అభ్యంతరం దానికి గల అనిశ్చితత్వం. బలప్రయోగం యొక్క ఫలితమైన భయం తాత్కాలికం. ఆయుధశక్తి విజయం కాజాలదు. మీరు విజయాన్ని పొందక పోయినట్లయితే మీకు తగిన ఆధారం లేనట్లే. ఎందుకంటే, రాజీపద్ధతి ఫలించినట్లయితే బలప్రయోగం మిగులుతుంది. కాని బలప్రయోగం ఫలించినట్లయితే ఇక తిరిగి ఏ రాజీ పద్ధతికి ఆశ లేకుండా పోతుంది. శక్తి, అధికారాల్ని ఒక్కొక్కసారి దయద్వారా కొనటం జరుగుతుంది. అంతేకాని హింసామార్గంలో అలసిపోయి, ఓడిపోయి అధికారాన్ని తిరిగి భిక్షగా పొందటం అసాధ్యం. బల ప్రయోగానికి మరొక అభ్యంతరం ఏమంటే, ఏ లక్ష్యాన్నయితే మీరు సంరక్షించటానికి ప్రయత్నిస్తున్నారో ఆ లక్ష్యాన్ని మీరు బలహీనం చేస్తున్నారు. మీరు ఎందుకొరకై పోరాడుతున్నారో (ప్రజావిశ్వాసం కొరకు అని) అది మీకు లభ్యం కాదు. మీకు లభ్యమయ్యేదల్లా ఆ పోటీలో తరిగిపోయిన, కృంగిపోయిన, వృథా చేయబడిన, క్షీణమైపోయిన ప్రజా విశ్వాసం మాత్రమే",.

ఈ సలహా విలువ, ప్రభావం మీకు తెలిసినవే. మీరు ఈ సలహాను పాటించలేదు గనుకనే అమెరికా ఖండాన్ని పోగొట్టుకొన్నారు. మీరు దాన్ని మీ మంచి కొరకే పాటించారు కనుకనే మిగిలిన అధినివేశ రాజ్యాలు మీకు దక్కాయి. మీలో రాజీపద్ధతిని అనుసరించదలుచుకొన్న వారికి నేను ఒక విషయం చెప్పాలనుకొంటున్నాను. అధినివేశ రాజ్య ప్రతిపత్తిని బలపరుస్తూ కాని, లేదా వ్యతిరేకిస్తూ గాని చర్చలు జరపటానికి ప్రతినిధులను ఆహ్వానించారనీ, మేధాశక్తితో కూడిన ఈ చర్చల్లో ఏ పక్షం

# 2

# సర్వ సభ్య సంఘ సమావేశం

## *ఒకటవ ఉపసంఘం తాత్కాలిక నివేదికపై వ్యాఖ్యలు

## (ఫెడరల్ నిర్మాణం) 16 డిసెంబర్, 1930

+***డా॥ అంబేద్కర్ :*** ఈ సమావేశం వాయిదా పడటానికి ముందు నా మిత్రుడు మిస్టర్ జోషి పేర్కొన్న అంశాన్ని నేనిప్పుడు లేవనెత్తగోరుతున్నాను. ఈ ఉపసంఘం అధ్యక్షుడుగా లార్డ్ ఛాన్సలర్‌కి ఈ ప్రత్యేక విషయాన్ని గురించి తమ అభిప్రాయాలు ఏమైనా ఉంటే తెలియ జేయవలసిందిగా కొందరు ప్రతినిధుల్ని ఆహ్వానించారు. అందువల్ల నాతో సహా కొందరు ప్రతినిధులు ఉపసంఘం అధ్యక్షుడికి ఒక ఉత్తరాన్ని సమర్పించి, ఉపసంఘానికి ఆ ఉత్తరాన్ని అందజేయవలసిందిగా కోరటం జరిగింది. ఆ ఉత్తరాన్ని గురించిన ఎటువంటి సమాచారం ఆని వేదికలో లేదు. ఆ ఉత్తరం ఉపసంఘానికి సమర్పించబడలేదనీ, ప్రధాన మంత్రి అయిన తమకు పంపబడిందనీ లార్డ్ సాంకీ నాకు తెలియజేశారు. ఇది తగిన పద్ధతి అని నేను భావించటం లేదు. ఉత్తరం ఉప సంఘం అధ్యక్షుడికి సమర్పించటానికి గల కారణం అది ఆ ఉపసంఘానికి ఉపయుక్తం అవుతుందనేది. సమాఖ్యకు సంబంధించిన ప్రశ్నపైన మాకున్న ఖచ్చితమైన అభిప్రాయాల్ని ఆ ఉత్తరంలో పేర్కొనటం జరిగింది. నేను ఈ విషయంగా వ్యాఖ్యానించి తీరవలసి ఉంది. ఇందుకు కారణం తయారు చేయబడిన నివేదిక మేము సమర్పించిన ఉత్తరంలోని విషయాలకు ఎంతగా సంధానించి ఉన్నదంటే ఈ విషయమై ఏదో ఒక దశలో మేము చర్చను లేవనెత్తవలసి ఉంటుంది. మరి, ఈ విషయంగా లార్డ్ ఛాన్సలర్ ఏ చర్యలు తీసుకోవాలనుకొంటున్నారో నేను తెలుసుకోగోరుతున్నాను.

***లార్డ్ సాంకీ :*** ఈ అంశాల్ని డాక్టర్ అంబేద్కర్ లేవనెత్తినందుకు అతనికి నా ధన్యవాదాలు. ఎందుకంటే ఈ అంశాన్ని నేనే లేవనెత్తాలనుకొన్నాను. నేను ప్రారంభంలోనే చెప్పాలనుకొన్న కొన్ని విషయాలను ఇప్పుడు చెప్పటానికి నాకు అవకాశం లభించింది.... ఇది ఒక సంపూర్ణ చిత్రం కాదు... త్వరలోనే మీకు సమగ్ర చిత్రం సమర్పించబడుతుంది. డా.అంబేద్కర్! మీరు నాకు పంపిన ఉత్తరాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాను. మనం ఆరవ విషయానికి వచ్చినపుడు ఆ ఉత్తరంలోని

---

* రౌండ్ టేబుల్ సమావేశం చర్చలు, పుటలు 193-95

\+ ఈ ఉపసంఘంలో డా. అంబేద్కర్ సభ్యుడు కాదు, అయితే, ఫెడరల్ స్ట్రక్చర్ కమిటి 2వ ఆర్.టి.సి.లో ఆయన సభ్యుడుగా చేర్చుకోబడ్డారు.

విషయాలను చర్చించటం చాలా ముఖ్యం.*

**డాక్టర్ అంబేద్కర్ :** మీరు ఆ ఉత్తరాన్ని సంఘం ముందు ఉంచుతారా అనేదే నేను తెలుసుకోవాలను కొంటున్న విషయం. అలా ఉంచటం మీరు ఏ దశలో చేస్తారనేది మీకే వదిలేస్తున్నాను.

**లార్డ్ సాంకీ :** ఒక్క నిముషం, డా॥ అంబేద్కర్. నేను అంతకంటె ఇంకా చాలా ఎక్కువే చేయబోతున్నాను. దానిని సంఘం ముందు ఉంచటమే కాదు, నేనే దానిని సంఘం దృష్టికి తీసుకు రాబోతున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ధన్యవాదాలు, నాకు అది చాలు.

**లార్డ్ సాంకీ :** ఒక్క నిముషం. నేనింకా పూర్తి చేయలేదు. మీకూ నా అంత వయస్సు వస్తే అంత తొందర పడరు. ఆ పని నా అంతట నేనే చేయటానికి బదులు ఉత్తరాన్ని ఇచ్చిన పెద్ద మనుషులే ఆ పనిని చేయటానికి నేను ఇష్టపడలేను. ఒక వేళ నేనే ఆ పని చేయవలసి వస్తే మీ పెద్ద మనుష్యులు చేసినంత చక్కగా చేయలేను. అయితే నేనిది చేస్తాను. ఉత్తరం లోని ఒక్క అక్షరం కూడా వదిలేయ బడదు. మనం ఆరవ విషయాన్ని చర్చించే ముఖ్య సమయంలోనే దీనిని పరిశీలించాలి గనుక ఇది తగిన సమయం కాదు.

### గవర్నర్ జనరల్ ప్రత్యేకాధికారాలకు సంబంధించిన నివేదిక లోని 16వ పేరాపై వ్యాఖ్యలు

+**డా॥ అంబేద్కర్ :** అయ్యా, మీరు చర్చ కొనసాగించే ముందు ఈ విషయాన్ని నేను స్పష్టం చేయాలను కొంటున్నాను. ప్రజల్లో ఏ ఒక్క విభాగం వారి ప్రయోజనాలకయినా తీవ్రంగా భంగం కలిగే సందర్భాలల్లో జోక్యం కల్పించుకొనేటందుకు గవర్నర్ జనరల్‌కు అధికారం ఇవ్వబడాలి. కెనడా రాజ్యాంగంలో 93వ సెక్షన్‌లో వలెనే, ఈ అధికారం మన రాజ్యాంగంలో కూడా పొందుపరచబడాలి.

**లెఫ్టినెంట్ కల్నల్‌గిడ్నీ :** అయ్యా డా॥ అంబేద్కర్ పేర్కొన్న విషయాల్లో గవర్నర్ జనరల్‌కు ప్రత్యేకాధి కారాలు ఉండాలనటంతో నేను ఏకీభవిస్తున్నాను. బలపరుస్తున్నాను.

++**ఛైర్మన్ :** 34వ పేరాగ్రాఫ్ నేను కల్నల్ గిడ్నీని ఆహ్వానిస్తున్నాను.

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** ఈ పేరాగ్రాఫ్‌ను గురించి నేనొక విషయాన్ని చెప్పవలసి ఉంది. దానిని నేను 29వ పేరాలో చాటుగా చెపుతాను. ఎగువ సభలో అనేక వర్గాల ప్రాతినిధ్యాన్ని అంచనా వేసేటప్పుడు జనాభా నిష్పత్తిని గ్రహించవలసిందని 29వ పేరాలో ఉండగా ఈ 34వ పేరాలో

---

* ఫెడరల్ కార్య నిర్వాహక వర్గానికి సంబంధించిన స్వభావం, ఏర్పాటు, అధికారాలు, బాధ్యతలకు సంబంధించినది.

\+ ఆర్.టి.సి. చర్చలు, పుట 261

++ 2వ ఉపసంఘం (రాష్ట్రీయ రాజ్యాంగం), భారత ప్రభుత్వం, కేంద్ర ప్రచురణల శాఖ, కలకత్తా, 1931 పుటలు – 18–22 ఈ సంఘం పరిశీలించవలసిన విషయాలు – (1) రాష్ట్ర శాసన సభల అధికారాలు, (2) రాష్ట్ర కార్య నిర్వాహక వర్గం ఏర్పాటు, స్వభావం, అధికారాలు, బాధ్యతలు.

# 3

# రెండవ ఉపసంఘం
# (రాష్ట్రీయ రాజ్యాంగం)

## మొదటి సమావేశం : 4.12.1930

**డాక్టర్ అంబేద్కర్:** నా వ్యాఖ్యల్ని మూడు విభాగాలుగా విభజిస్తున్నాను. (1) రాష్ట్రస్వయం ప్రతిపత్తి (2) రాష్ట్రాలలో బాధ్యతలు (3) రాష్ట్రీయ సేవలు.

రాష్ట్రీయ స్వయం ప్రతిపత్తికీ, రాష్ట్రీయ సేవలకూ మధ్య ప్రత్యేక విభేదాన్ని నేను చూపుతున్నాను. రాష్ట్రీయ స్వయం ప్రతిపత్తి అనేది రాష్ట్రకార్యవర్గానికీ, శాసనసభకూ, కేంద్ర ప్రభుత్వానికీ కేంద్ర శాసనసభకూ గల సంబంధాన్ని గురించిన నిర్వచనాన్ని లేవనెత్తుతున్నట్లు నాకు కనిపిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రస్తుత పరిస్థితుల్లో సాధ్యమైనంత స్వయం ప్రతిపత్తిని ఇవ్వవలసిన తరుణం ఆసన్నమైనదనీ, ఇప్పుడు కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వాలపై ఉన్న అదుపును తొలగించాలనీ కొందరు అభిప్రాయపడుతున్నారు. నా మొదటి వ్యాఖ్య వారి అభిప్రాయాన్ని గురించి. కాని, అయ్యా! నేను ఈ క్రింది అభిప్రాయాన్ని వ్యక్తపరచకుండా ఉండలేను. నేను ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రత్యేక వర్గాల వారి దృష్ట్యా, భారతదేశ ప్రయోజనాలు ముఖ్యంగా శ్రామిక వర్గాల వారి దృష్ట్యా, రాష్ట్ర స్వయం ప్రతిపత్తి సమస్యను పరిశీలిస్తే, రాష్ట్రాలకు రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని ఇచ్చే విషయాన్ని భవిష్యత్తులో ఏ రాజ్యాంగంలో పొందుపరచాలన్నా, ఆ స్వయం ప్రతిపత్తిని తప్పక పరిమితం చేసే కొన్ని వాస్తవాలను మనం పరిశీలనలోకి తీసుకొని తీరాలి.

రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని సేవితం చేసే మొదటి వాస్తవం - రాష్ట్రానికి సంబంధించిన ప్రశ్నలే అయినా వాటిలో కొన్ని దేశమంతటికీ సంబంధించినవి. అటువంటి సందర్భాల్లో రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని సేవితం చేయవలసి ఉంటుంది. ఇటువంటి విషయాల్లో రాష్ట్ర ప్రభుత్వాలు తమ అభిప్రాయాలు వ్యక్తం చేయవచ్చు కాని అటువంటి విషయాలకు సంబంధించినంతవరకు కేంద్ర ప్రభుత్వం యొక్క పరిధిని మినహాయించకూడదు. శ్రామికులకు సంబంధించిన చట్టం, కౌలుదార్లకూ, వ్యవసాయానికీ సంబంధించిన చట్టాలనుండి నేను కొన్ని ఉదాహరణలు ఇస్తున్నాను. భారతదేశం వంటి దేశంలో ఇవి రాష్ట్రానికి సంబంధించిన విషయాలే అయినా వాటిని కేవలం అలా పరిమిత

దృష్టితో చూడకూడదని నేను భావిస్తున్నాను. పూర్తి భారతదేశానికి సంబంధించినవిగా , కేవలం రాష్ట్రాలకు మాత్రమే సంబంధించినదిగా వాటిని చూడకూడదు. రాష్ట్ర స్వయం ప్రతిపత్తిలో జోక్యం చేసుకోవటమే అయినా ఇటువంటి విషయాలలో కేంద్ర ప్రభుత్వానికి తప్పకుండా అధికారం ఉండితీరాలి.

రెండోది, భారతదేశపు భవిష్యత్ రాజ్యాంగంలో, రాష్ట్ర ప్రభుత్వాలకు సాధ్యమైనంత స్వయం ప్రతిపత్తి ఇవ్వాలనే ఉద్దేశంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాల విభజన జరిగేటప్పుడు నిర్వచించకుండా వదిలేసిన అధికారాలను కేంద్ర ప్రభుత్వం ఆధీనంలోనే ఉంచటం తప్పనిసరవుతుంది. ఈ విషయంలో మరొక అపవాదం ఉంటుందని నేననుకోను. కాని నేను ఇంత మాత్రం చెప్పవలసి ఉంది. ప్రస్తుతం భారత దేశంలో విభజనతత్వం స్పష్టంగా కనిపిస్తున్నది. జాతీయ భావం కంటె రాష్ట్ర, స్థానిక తత్వాలు బలంగా ఉన్నాయి. అందువల్ల సమాఖ్య రూపమైన భారతదేశానికి సమాఖ్యలోని ప్రతి భాగానికీ పూర్తి స్వయం ప్రతిపత్తి ఇస్తూ నిర్మిస్తున్న ఈ తరుణంలో భారత దేశాన్ని ఒక సంపూర్ణమైన, బలమైన, సమైక్యమైన దేశంగా రూపొందించటంలో ఇంకా సమస్యలను ఎదుర్కొంటూనే ఉన్నాం. ఈ సందర్భంలో నేను ఇంకొక విషయాన్ని కూడా తెలియజేయాలను కొంటున్నాను. కేంద్రప్రభుత్వానికి కొన్ని అధికారాలను ప్రత్యేకంగా కేటాయించటం వల్ల రాష్ట్రాల స్వయం ప్రతిపత్తి దెబ్బతినే అవకాశం ఉందని నేను భావించటం లేదు. కెనడా విషయంలో ప్రివీ కౌన్సిల్ యొక్క న్యాయ సంఘం ప్రత్యేక అధికారాలను నిర్వచించినప్పుడు దుష్ఫలితం కలుగలేదు. అంటే, అత్యవసర పరిస్థితుల్లో రాష్ట్రానికి కేటాయించబడిన కొన్ని ప్రత్యేక అధికారాలు కొన్ని రంగాల్లో అమలు లోకి వస్తాయి. రాష్ట్ర స్వయం ప్రతిపత్తి వాస్తవంగా దెబ్బతినాలని నేను అనుకోవటం లేదు.

రాష్ట్ర స్వయం ప్రతిపత్తి విషయంలో నేను మరొక విషయాన్ని ప్రస్తావించదలచుకొన్నాను. అల్ప సంఖ్యాక వర్గాల వారి, దళిత వర్గాల వారి ప్రయోజనాల పరిరక్షణకు రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని సేమితం చేయవలసి ఉంటుంది. కొత్త రాజ్యాంగం ఏర్పాటు ఫలితంగా భారతదేశంలో ఏర్పడే పరిస్థితి నా దృష్టిలో ఈ విధంగా ఉంటుంది. కొన్ని రాష్ట్రాల్లో కొన్ని వర్గాలు అధిక సంఖ్యాకంగా ఉన్నప్పటికీ అన్ని రాష్ట్రాల్లోనూ నేను ప్రాతినిధ్యం వహిస్తున్న దళిత వర్గాలు అల్పసంఖ్యాకంగానే ఉంటాయి. ప్రతి రాష్ట్రంలోనూ అవి అల్ప సంఖ్యాకంగానే ఉంటాయి. ఇటువంటి పరిస్థితుల్లో రాష్ట్ర అధిక సంఖ్యాకులకు బీద ప్రజానీకం మీద దుష్పరిపాలనకూ, తమ ప్రయోజనాలపై నిర్లక్ష్యానికీ పై, వారికి విజ్ఞప్తి చేసుకునే అవకాశం కూడా లేకుండా ఉండేటంతగా, సంపూర్ణాధికారాలు ఉండటానికి మనం ఎలా అనుమతించగలమో నాకు అర్థం కావటం లేదు. రాష్ట్ర అధిక సంఖ్యాకులు అటువంటి వారిని విపరీత పరిస్థితుల్లో పడవేస్తే వారిని రక్షించటానికి రాష్ట్ర ప్రభుత్వం పైన జోక్యం కలిగించుకొనే టందుకు వీలుగా ఎక్కడో ఒకచోట ఏదో ఒక అధికారం ఉండాలి.

నా అభిప్రాయంలో ఈ మూడు విషయాలే భవిష్యత్తులో భారతదేశంలోని రాష్ట్ర ప్రభుత్వాల

స్వయం ప్రతిపత్తిని సేమితం ఏదో ఒక విధంగా చేయవలసి ఉంటుంది.

ఇక రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత స్వభావాన్ని గురించిన ప్రశ్నకు సంబంధించిన నా అభిప్రాయం ఇది. రాష్ట్ర శాసన సభల బాధ్యతలకు సంబంధించిన ప్రశ్న రాష్ట్రాలలో ఎటువంటి శాసన సభలను రూపొందించ గలుగుతారన్న దాని మీదనే పూర్తిగా ఆధారపడి ఉంది. మీరు రాష్ట్రాల్లో పొందే శాసన సభలు ఆయా రాష్ట్రాల జనాభాకు తర్పణం పట్టేవిగా ఉండే, వస్తు ప్రదర్శన శాలల్లో దర్శకుల కోసం ప్రతీ అంశానికీ ఏవో కొన్ని నమూనాలను ఉంచే ప్రాతినిధ్యం వంటి ప్రాతినిధ్యం కాక పూర్తి ప్రాతినిధ్యాన్ని కలిగి ఉండే తమ అస్తిత్వాని భంగం కలుగుతుందేమోనని భయపడే ప్రతి అల్పసంఖ్యాక వర్గానికీ, ఇతరేతర వర్గాలకీ మాటనెగ్గే స్థానం ఉంటే శాసనసభకు రాష్ట్ర బాధ్యతను ఇవ్వటం వల్ల కీడు లేదని నా అభిప్రాయం. ఇది నా మొదటి అభిప్రాయం.

శాసనసభలు పూర్తిగా, తగినంతగా అన్ని వర్గాలకీ ప్రాతినిధ్యం కలిగి ఉండాలనే షరతు విధించినట్లయితే ఇప్పుడు ప్రత్యేకంగా కేటాయించబడిన శాఖల్ని ప్రజల అదుపులోకి మార్చడానికి నాకేమీ అభ్యంతరం ఉండదు.

రాష్ట్రాల్లో బాధ్యత సమిష్టిగా ఉండాలా, వ్యష్టిగా ఉండాలా అన్న ప్రశ్నకు వస్తే బాధ్యత సమిష్టిగా ఉండి తీరాలని నా నిశ్చితాభిప్రాయం. ఈ విషయాన్ని నేను నిస్సంకోచంగా స్పష్టం చేస్తున్నాను. నేను శాసన మండలిలో సభ్యుడిగా ఉన్నాను. రాష్ట్రాల్లో మంత్రిత్వ శాఖలు ఏ విధంగా పనిచేసిందీ చూచాను. ఇది నాకు చాలా బాధ కలిగించిన అనుభవం. ఇది నాకే కాదు, శాసన మండలి సభ్యులుగా ఉండే అదృష్టమో, దురదృష్టమో కలిగిన చాలామంది అనుభవం కూడా అని నేను నమ్ముతున్నాను ఏదైనా సిద్ధాంతాన్ని అంగీకరించేటప్పుడు మంత్రిత్వ శాఖలు సర్వసమ్మతమైన సంపూర్ణమైన అభిప్రాయంతో కాక ఒక రకంగా వదులొదులుగా ఉండే సమాఖ్య వలె పని చేయటం కన్పించేది. పరస్పర విరుద్ధమైన సలహాలు, మంత్రులు పరస్పరం బలపరుచుకోవటానికి ఇష్టపడకుండా వ్యవహరించిన ఎన్నో సందర్భాలు ఉన్నాయి.

ఫలితం ఏమైంది? మంత్రివర్గం అంతా సమిష్టిగా సాకల్యంగా చర్చించి శాసన మండలి ముందు పరిశీలనా పూర్వకంగా సిద్ధాంతాలను ఉంచిన సందర్భం ఒక్కటి కూడా లేకపోవటమే దీని ఫలితం. ఆవేశంతోనో, ఆరంభ శూరత్వంతోనో పనులు జరిగాయి. భవిష్యత్తులో ఇటువంటి గందరగోళాలకి మన బాధ్యత తావివ్వాలని భావిస్తున్నామని నేననుకోను.

మంత్రివర్గంలో వర్గాల ప్రాతినిధ్యానికి సంబంధించిన ప్రశ్నకు వస్తే మంత్రివర్గంలో వర్గాల ప్రాతినిధ్యం ఉండాలని తరచు చేయబడే సలహా నాకు అంతగా అంగీకారం కాదని నేను ఒప్పు కొంటున్నాను. వాస్తవం నాకు అవగతం కాక పోలేదు. నిజానికి మంత్రివర్గంలో వర్గాలకి ప్రాతినిధ్యం లేకపోతే పరిపాలనా విషయాల్లో వారి దైనందిన జీవితాలు, ప్రయోజనాలు, కులతత్వమే బలంగా గల మంత్రుల భావజాలం వల్ల అన్యాయంగా దెబ్బతినే అవకాశాలు బాగా ఉన్నాయని నాకు తెలుసు.

ఆ విషయాన్ని నేను ఒక్కక్షణం కూడా మరచిపోను. అయితే, అటువంటి దౌష్ట్యాన్ని మరొక విధంగా ఎదుర్కొనవచ్చని నా అభిప్రాయం. మంత్రివర్గం చేతల వల్లగాని, చేయవలసింది చేయకుండా వదిలి వేయటం వల్ల గాని అల్పసంఖ్యాకుల ప్రయోజనాలకు హాని కలిగే పక్షంలో, అందుకు వ్యతిరేకంగా అటువంటి పరిస్థితుల నుండి రక్షణ పొందటానికి రాజ్యాంగ చట్టంలోనే పొందుపరచబడిన, చట్టబద్ధమైన, రాజ్యాంగ బద్ధమైన పూచీని అల్పసంఖ్యాకులు పొందగలిగినట్లయితే కులతత్వం అధికంగా ఉండే మంత్రి వర్గం వల్ల కలిగే భయపడేటటువంటి అపాయం తొలగిపోతుంది. అప్పుడు మంత్రివర్గంలో వర్గ ప్రాతినిధ్యం ఉండాలని పట్టుపట్టటానికి అంతగా కారణమూ ఉండదు.

ముఖ్యమంత్రి, అతడు ఎవరైనా సరే, అతి ముఖ్యమైన అల్పసంఖ్యాకులకు తన మంత్రి వర్గంలో ప్రాతినిధ్యం ఇవ్వాలనే విషయాన్ని గుర్తించి తీరాలి. లేదా గుర్తించేట్లు చేయాలి అని నా ఆకాంక్ష. అయినా, మంత్రివర్గ కార్యాలయం అనేది ఎంతో బాధ్యతాయుతమైన కార్యాలయం అనే విషయాన్ని మనం ఒక్క క్షణం కూడా విస్మరించకూడదు. మంత్రివర్గంలోని మంత్రి కేవలం అల్పసంఖ్యాకుల ప్రయోజనాల్ని రక్షించటం మాత్రమే కాదు, మొత్తం రాష్ట్ర ప్రయోజనాన్నీ, భద్రతనీ పరిరక్షించవలసి ఉంటుంది. అందుకు తగిన శక్తి సామర్థ్యాలు అతన్లో ఉండటం అవసరం కనుక ఇటువంటి సందర్భంలో కావలసింది కులతత్వంతో కూడిన దృష్టి కాదు. అధిక సంఖ్యాక వర్గాలకు చెందిన మంత్రులు అల్పసంఖ్యాక వర్గాల వారికి అన్యాయం చేయటం, వారి ప్రయోజనాన్ని నిర్లక్ష్యం చేయటం అసాధ్యమయ్యే విధంగా, అల్పసంఖ్యాకుల, దళిత వర్గాల వారి ప్రయోజనాలకు రాజ్యాంగ బద్ధమైన రక్షణ కల్పించాలని నేను కోరుతున్నాను.

గవర్నర్, మంత్రివర్గం మధ్య ఉండవలసిన సంబంధాల విషయానికి వస్తే- ఏ రాజ్యాంగం కూడా, అది నిజంగా 'పూర్తి బాధ్యత గల ప్రభుత్వం, సమష్టి బాధ్యతగల ప్రభుత్వం' అన్న భావాలతో కూడి ఉన్నదైతే, దేశం యొక్క దైనందిన పరిపాలనలో జోక్యం కలిగించుకొనే అధికారాన్ని గవర్నర్‌కు అనుమతించదనేది స్పష్టమైన విషయం. బాధ్యత గల ప్రభుత్వం, సమిష్టి బాధ్యత గల ప్రభుత్వం అన్న విధానానికి ఇది పూర్తిగా వ్యతిరేకమైనది. సమష్టి బాధ్యత అధారంగా దైనందిన పరిపాలనను నిర్వహించటానికి మంత్రివర్గాన్ని అనుమతించాలి.

అత్యవసర అధికారాలను గవర్నర్‌కు వదిలివేయాలి అన్న విషయానికి వస్తే- దీని అర్థం నాకు స్పష్టంగా తెలియకపోవటం వల్ల నేను కొంత క్లిష్టపరిస్థితిలో ఉన్నాను. అత్యవసర పరిస్థితి ఏర్పడినపుడు గవర్నర్ మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసి, ఎప్పుడైనా మంత్రివర్గం వ్యతిరేకించినటువంటిది అయినా సరే, పరిస్థితికి తగినవని తాను భావించిన చట్టాలనీ, అత్యవర ఆజ్ఞల్నీ జారీ చేయటమో లేదా పరిస్థితికి తగినవని తాను భావించిన చర్యల్ని తీసుకోవటమో చేయాలనేను దీని అర్థం? దేనిని ఆశిస్తున్నారో నాకు తెలీదు. మంత్రివర్గం దేశ ఉత్తమ ప్రయోజనాలకు తగిన విధంగా పని చేయటం లేదని తాను భావించినప్పుడు దానిని బర్తరఫ్ చేయటానికి గవర్నర్‌కు ఖచ్చితమైన, సందేహానికి తావులేని, ప్రతిబంధకం లేని అధికారాలుండాలనేది నేను అర్థం చేసుకోగలను. కాని మంత్రివర్గంతో నిమిత్తం

లేకుండా ఏదైనా ఒక పని చేయటానికి గవర్నర్‌కు అనుమతి ఉన్నట్లయితే ఆ రాష్ట్రంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఎలా ఉండగలుగుతుందో నాకు అర్థం కావటంలేదు. ఒక అత్యవసర పరిస్థితిలో తాను ఏకీభవించగలిగే మంత్రివర్గాన్ని గవర్నర్ కలిగి ఉండాలనటం ఒక విషయం; కాని, అత్యవసర పరిస్థితి తల ఎత్తినప్పుడు గవర్నర్ మంత్రివర్గాన్ని పూర్తిగా తోసిపుచ్చాలనటం ఇందుకు పూర్తిగా విరుద్ధమైన విషయం. దీనిని నేను అర్థం చేసుకోలేకపోతున్నాను గనక ఈ అంశాన్ని ఏదో ఒక తీరులో పరిశీలించవలసి ఉంటుంది.

ఉద్యోగాల సమస్యకు వస్తే నేనొక విషయాన్ని తప్పనిసరిగా స్పష్టం చేయవలసి ఉంది. రాష్ట్ర స్వయం ప్రతిపత్తి దృష్ట్యా ఒక రాష్ట్రంలోని ఉద్యోగాల్ని క్రమబద్ధం చేసే అధికారం ఆ రాష్ట్రానికే ఉండాలి అనే దానితోనూ, ఆయా రాష్ట్రాలకు ఉండే వనరులకు అనుగుణంగానూ, వారికి తోచినట్లు గానూ ఉద్యోగాలను 'భారతీయం' చేయటంలో ఆయా రాష్ట్రాలకు పూర్తి స్వాతంత్ర్యం ఉండాలనటం లోనూ నేను సైద్ధాంతికంగా అంగీకరిస్తాను. అయితే ఈ విషయంలో నేను స్పష్టం చేయాలనుకొంటున్న అభిప్రాయం ఇది: భారతీయులు కులతత్వ మనస్తత్వం కలవారు అనేది నేను మరిచిపోలేను. భారతీయులందరూ వారికి అప్పగించిన పరిపాలనా వ్యవహారాల్ని నిర్వహించేటప్పుడు, సమస్యల్ని వారు కులతత్వ దృష్టితో చూడటం మానివేస్తారని ఆశిద్దాం. అయితే ఇది కేవలం ఆశ మాత్రమే గాని వాస్తవం కాదు. చట్టాలను అనుసరించి పాలించేటప్పుడు భారతీయులు తమ విచక్షణాధికారాల్ని ఉపయోగించవలసిన సందర్భాల్లో తప్పనిసరిగా వర్గానికీ వర్గానికీ మధ్య, కులానికీ కులానికీ మధ్య పక్షపాతాన్ని చూపలేరు. కాదని అనుకోలేని వాస్తవం ఇది; నేను స్వయంగా చాలా బాధలకు గురయిన వాస్తవం ఇది. దళిత వర్గాల ప్రస్తుత పరిస్థితి దృష్ట్యా వారిలో ఎక్కువమంది విద్యావంతులు కారన్న దృష్ట్యా, బొంబాయి రాష్ట్రంలో గజిటెడ్ హోదాలో ఉన్నవారు దాదాపు ఎవరూ లేరన్న వాస్తవం దృష్ట్యా భారతీయ భవిష్య ద్రాజ్యాంగం విషయంలో నా భయం ఏమంటే -

**ఒక సభ్యుడు :** ఒకరు ఉన్నారు.

**డా॥ అంబేద్కర్:** అవును ఒకరు ఉన్నారు. అది కేవలం నియమంలోని ఒక మినహాయింపు మాత్రమే. అతడిని ఆ హోదాలోకి రప్పించటానికి నేను ఎంత శ్రమపడ్డానో మీకు తెలుసు. 'భారతీయత నియంతృత్వంగా తయారవుతుందని నా భయం. కనుక నా అభిప్రాయంలో, ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే, కొంతకాలం వరకూ ఉద్యోగాల్లో కొంత ఆంగ్లేయత్వాన్ని కొనసాగించటం చాలా అవసరం. ఇది నేను నొక్కి చెపుతున్నాను. భారతీయత్వం ఉండకూడదని నేనటం లేదు. కాని మన ప్రయోజనాల దృష్ట్యా, కొందరు కోరినంత త్వరగా కాకుంటే ఇది నిదానంగా జరగాలని నేను నొక్కి చెపుతున్నాను. మా పక్షాన నేను చేయదలచుకున్న సాధారణ వ్యాఖ్యలు ఇవి.

## మూడవ సమావేశం : 8-12-1930

*డా। అంబేద్కర్ : నేనొక సలహా ఇవ్వవచ్చునా? రెండోసభకు సంబంధించిన ప్రశ్న చాలా ముఖ్యమైనది కనుక ఇప్పుడు మనం చర్చిస్తున్న అనేక విషయాలతో బాటుగా దీనిని తగినట్లుగానూ, సమగ్రంగానూ చర్చించలేమని నా ఉద్దేశం. ప్రత్యేకంగా ఒక రోజు దీనికోసం కేటాయించాలని నా అభిప్రాయం. రెండోసభకు సంబంధించిన విషయానికీ, అల్ప సంఖ్యాక వర్గాల భద్రతకూ, అలాగే 1,2 సంఖ్యల్లో పేర్కొనబడిన ఇతర విషయాలకీ గల సంబంధం అత్యల్పమని నాకు అనిపిస్తున్నది. ఇది నాకు చాలా ముఖ్యమైన విషయం అనిపిస్తున్నది. ఈ పట్టికలోని విషయాల్లో శాసనసభల కూర్పుకు సంబంధించింది ఏదీ నాకు కనబడలేదు. మీరు "శాసనసభల కూర్పు" అనే విషయాన్ని ఇందులో చేర్చేటట్లయితే ఈ విషయం అంతటినీ చర్చించటానికి తగిన అవకాశం మనకు ఉంటుంది.

ఛైర్మన్ : మొత్తం విషయాన్ని అంతటినీ విడదీసి ఎలా భాగాలుగా చేయగలరో నాకు తెలియటం లేదు.

డా। అంబేద్కర్ : రెండో సభ ప్రశ్నను అల్ప సంఖ్యాక వర్గాల ప్రశ్న నుండి తప్పకుండా విడదీయవచ్చును.

ఛైర్మన్ : పూర్తిగా కాదు. గవర్నర్ అధికారాలకూ, కార్య నిర్వాహక వర్గం శాసనసభల అధికారాలకూ ఉండే సంబంధం, శాసనసభల అధికారాలు మొదలైన అన్ని విషయాలతో సహా దాదాపు ప్రతీ ఒక్క విషయం కూడా రెండోసభ ఉండాలా, అక్కర్లేదా అన్న ప్రశ్న వల్ల ప్రభావితమై తీరుతుంది. మీరు చర్చని కొనసాగనిస్తే బాగుంటుందని నేను భావిస్తున్నాను. ఒకవేళ చివర్లో చర్చ సక్రమంగా లేదని అనిపిస్తే ఈ ఒక్క విషయం గురించి మరింతగా చర్చించటానికి ప్రయత్నం చేస్తాం.

## నాలుగవ సమావేశం : 9-12-1930

+డా। అంబేద్కర్ : ఈ రెండు వర్గాలు ముఖ్యమైనవి కనుక ప్రస్తుతానికి వీటి విషయమే ప్రస్తావిస్తాను. వాస్తవం మీద ఆధారపడిన ఏ చర్చ అయినా శాంతిభద్రతల విషయాన్ని మార్చటానికి వీలులేని నిష్కర్షకు దారితీస్తుంది. కనుక ఇటువంటి చర్చను స్వీకరించటానికి గాని, అంగీకరించటానికిగాని వీలులేదని నా అభిప్రాయం. ఒక మహమ్మదీయుడు గాని హిందువుగాని శాంతిభద్రతల శాఖకు అధిపతిగా ఉంటే అతడు తన వర్గం యొక్క భావాల వల్ల పూర్తిగా ప్రభావితుడవుతాడని ఘనత వహించిన జమీందారు (మార్క్వెస్) అభిప్రాయపడుతున్నట్లు కూడా నాకు అనిపిస్తున్నది. అలా భావించటం వల్ల భవిష్యత్తులో భారతదేశంలోని రాజకీయ పార్టీలు మతం ఆధారంగా విడిపోతాయేగాని, రాజకీయ లేదా ఆర్థిక భేదాల వల్ల విడిపోవని ఆయన భావిస్తున్నట్లు నాకు అనిపిస్తున్నది. కాని

* రెండవ సబ్ కమిటీ చర్చలు (ప్రావిన్షియల్ రాజ్యాంగం), పుటలు 56.
+ రెండో సబ్ కమిటీ చర్చలు (ప్రావిన్షియల్ రాజ్యాంగం), పుటలు 95-102.

పరిస్థితుల్ని చూస్తుంటే నాకు ఈ విధంగా తోస్తున్నది. భారతదేశంలోని భవిష్యత్ రాజ్యాంగంలో కార్య నిర్వాహకవర్గం విడిపోయే స్థితిలో మతం, జాతి అనే విభేదాలు పైకి రావు. హిందూ మంత్రికి చాలామంది మహమ్మదీయులు ఉండే పార్టీలోని అనుచర వర్గం ఉండవచ్చు. అలాగే ఒక మహమ్మదీయ మంత్రికి పెక్కుమంది హిందు అనుచరులు ఉండవచ్చు. అదే గనుక జరిగినట్లయితే – అలా జరుగుతుందనే నా విశ్వాసం- శాంతిభద్రతల శాఖకు అధిపతిగా ఉండే ఒక హిందూ మంత్రి తనని బలపరచే ఒక వర్గం వారి మనోభావాలను గాయపరిచే విధంగా ఎలా పరిపాలించగలడో నాకు అర్థం కావటంలేదు. కనుక ఈ విషయానికి సంబంధించినంత వరకు ఇటువంటి భయాలు నిరాధారమైనవని నాకు అనిపిస్తున్నది.

దాదాపుగా అంగీకారానికి వచ్చిన రెండో విషయం ఇది. కార్య నిర్వాహకవర్గం సమైక్యమైన కార్య నిర్వాహక వర్గంగా ఉండాలి : అంతేకాదు, సమైక్య కార్య నిర్వాహక వర్గం బాధ్యత కూడా సమిష్టిగా ఉండాలేగాని వ్యష్టిగా ఉండకూడదు. ఈ నిష్కర్షలతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే ఈ చర్చలో మనం గమనించి విభిన్న ఉద్దేశాలు కార్య నిర్వాహక వర్గం యొక్క కూర్పుకు సంబంధించినవి. ఈ కూర్పుకు సంబంధించి తలెత్తిన మూడు విభిన్న ప్రశ్నలను మనం పరిగణనలోకి తీసుకోవాలని నాకు అనిపిస్తున్నది. మొదటి ప్రశ్న కార్యవర్గం కూర్పు కేవలం శాసనసభ సభ్యులకు మాత్రమే పరిమితం కావాలా లేక శాసన సభ సభ్యులు కాని అధికారులు, అనధికారులకు కూడా అందులో ప్రవేశం ఉంటుందా? రెండవ ప్రశ్న అది అల్పసంఖ్యాక వర్గాల సభ్యులతో కూడి ఉండాలా? మూడవ ప్రశ్న మంత్రులను నియమించే అధికారం గవర్నర్‌కే ఉండాలా లేక అతడు ముఖ్యమంత్రిని నియమించి సహెూద్యోగులను ఎంపిక చేసుకునే విషయాన్ని ఆ ముఖ్యమంత్రికే వదిలేయాలా?

పై ప్రశ్నలన్నిటికీ ఈ సమాధానం అవుననే మంత్రివర్గ సభ్యత్వం శాసన సభ్యులకే ఎందుకు పరిమితమై తీరాలో నాకు అర్థం కావటం లేదు. శాసనసభలో ప్రాతినిధ్యం వహిస్తున్న సభ్యులలో అన్నివర్గాల వారికీ కార్య నిర్వాహకవర్గంలో సాధ్యమైనంత ప్రాతినిధ్యం ఉండేవిధంగా అవకాశాలు ఎందుకు ఉండకూడదో కూడా నాకు అర్థం కావటం లేదు. మూడోది, తన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకునేటందుకు గవర్నర్‌కు అధికారం ఉందనేది మనం అంగీకరించవలసిన విషయం కనుక తన మంత్రులను ఎన్నుకొనే వ్యవహారంలో విచక్షణను గవర్నర్‌కే వదిలేయాలని నేను భావిస్తున్నాను. అయితే, నేను ఈ మూడు ప్రశ్నలకు 'అవున'ని సమాధానం చెపుతున్నానంటే ఆ సమాధానాలు – కార్యవర్గం శాసన సభ్యులకే పరిమితం కానవసరం లేదు. మంత్రివర్గంలో వివిధ వర్గాలకి ప్రాతినిధ్యం ఉండే అవకాశాలు ఉండాలి. తన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకునే విచక్షణ అధికారం గవర్నర్‌కే ఉండాలి. ఆ సమాధానాలు ఒక అత్యంత ప్రధానమైన షరతుకి లోబడి ఉన్నాయి. కార్య నిర్వాహక వర్గాన్ని ఏ విధంగా కూర్చినా అది సమిష్టి బాధ్యత అనే సిద్ధాంతానికి కట్టుబడి ఉండాలి. ఈ సమిష్టి బాధ్యత అనే సిద్ధాంతాన్ని కార్యవర్గం అంగీకరించి తీరాలన్నప్పుడు మంత్రివర్గంలోకి బయటవారి ప్రవేశం ఆందోళన కలిగించే అంశంగా తయారవదు. శాసనసభకు చెందని ఒక కొత్త వ్యక్తి మంత్రి

వర్గంలో చేరటమూ, మంత్రివర్గంతో బాటు సమిష్టి బాధ్యతను అంగీకరించటం అనే పద్ధతిని ఎందుకు అంగీకరించకూడదో నాకు కారణం కనపడటం లేదు. ఈ సందర్భంలో ఈ క్రింది అంశాలను చూపుతున్నారు. అది మంత్రివర్గాన్ని అభిశంసించి దాన్ని తొలగించటం సంభవించినప్పుడు అధికారిగా ఉన్న వ్యక్తి లేదా శాసనసభకు చెందని వ్యక్తి మాత్రం మంత్రివర్గంలోని అందరూ తొలగి పోయినా, అలాగే మిగిలి పోలేడు, తిరిగి కొత్త మంత్రి వర్గాన్ని ఏర్పరచినప్పుడు అతడు తిరిగి మంత్రివర్గంలో సభ్యుడు కాలేడు, ఆ విధంగా అతడు సభలో శాశ్వతంగా ఉండిపోలేడు. కాని నాకు ఈ అభిప్రాయం భ్రాంతి జనితమైనదనిపిస్తున్నది. ఎందుకంటే, శాసన సభ సభ్యులుగా ఉండటం ద్వారా మంత్రివర్గ సభ్యులు అయినవారు తమతో అతడిని చేర్చుకోవటానికీ, అతడి చర్యలకు బాధ్యత వహించటానికీ సిద్ధపడితే తప్ప, వారి సలహాను అతడు అంగీకరించితేనే తప్ప అతడి సలహాను వారు ఒప్పుకుంటేనే తప్ప అతడితో కలిసి పనిచేయటానికి వారు అంగీకరించరు. ప్రధానమంత్రి ఇతరులను తన మంత్రివర్గంలో చేర్చుకొని అదే సమయంలో సభ విశ్వాసాన్ని పొందగలిగినప్పుడు ముఖ్యమంత్రికూడా అదే సౌకర్యం పొందటానికి ఎందుకు అడ్డపడాలో నాకు తెలియటం లేదు.

అలాగే, గవర్నర్‌కు తన మంత్రివర్గంలో వివిధ అల్పసంఖ్యాక వర్గాల వారికి ప్రాతినిధ్యం ఉండే విధంగా చూసుకోవటానికి అధికారాలు ఉండటం సాధ్యమైనప్పుడు, అదే సమయంలో మంత్రివర్గంలో చేరిన వారు ఎవరైనా సరే ఇతరులతో పాటు సమిష్టి బాధ్యతను అంగీకరించి తీరాలని స్పష్టం చేసినప్పుడు బయటివారిని మంత్రివర్గంలో చేర్చుకోవటానికి అనుమతించడం వల్ల హాని ఏమీ లేదని నా అభిప్రాయం. తన మంత్రివర్గాన్ని తనకు కావలసిన విధంగా ఏర్పాటు చేసుకోవటానికి అధికారం ఉన్నా అది మంత్రివర్గం సమిష్టి బాధ్యత అనే సిద్ధాంతానికి తప్పని సరిగా కట్టుబడి పని చేయాలనీ, ఈ సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఏ మాత్రమూ జరగకూడదనీ నొక్కి చెప్పవలసిన అవసరం ఉంది.

ఇక తరువాతి ప్రశ్న ఈ ఫలితాన్ని ఎంత ఉత్తమంగా సాధించవచ్చు, బాధ్యతాయుతమైన సమైక్యమైన కార్య నిర్వాహక వర్గాన్ని ఏ విధంగా ఏర్పరచవచ్చు అనేది. ఈ విషయంలో రెండు మార్గాలున్నాయని నాకు అనిపిస్తున్నది. కార్య నిర్వాహక వర్గం స్వభావాన్ని చట్టం ద్వారా రాజ్యాంగంలోనే నిర్వచించటం మొదటిది. రెండోది కార్య నిర్వాహక వర్గం ఏర్పాటును సంప్రదాయానికి వదిలేయటం. ఈ రెండు మార్గాలూ అనుసరించబడుతున్నాయనేది మీకందరకూ తెలిసిన విషయమే. కెనడా, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా అధినివేశ రాజ్యాలలో సమైక్యమైన బాధ్యతాయుత ప్రభుత్వం అనేది పూర్తిగా సంప్రదాయానికి సంబంధించిన విషయం అని మనందరికీ తెలుసు. కెనడా చట్టంలోగాని, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా చట్టాలలో గాని "బాధ్యతాయుత ప్రభుత్వం" అనే పదాలు ఉండవని మనలో ప్రతి ఒక్కరికీ తెలుసు. గవర్నర్‌కు సలహా ఇవ్వవలసిన మంత్రులు, వాస్తవానికి శాసన సభలో సభ్యులే అయినప్పటికీ, శాసన సభ్యులుగా ఉండాలని కెనడా చట్టంలో ఎక్కడా పేర్కొనబడకపోవటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఐర్లండ్, మాల్టా, రోడేషియా రాజ్యాంగాల్లో ఈ విషయం సంప్రదాయానికి వదిలి వేయబడలేదనీ, చట్టంలో పొందుపరచ బడిందనీ

మనందరకూ తెలుసు. ఐర్లండ్‌లో ప్రధాన మంత్రి అనే వ్యక్తి చట్టం ద్వారా సృష్టించబడిన వ్యక్తి అనీ సమిష్టి బాధ్యత కూడా చట్టం ద్వారా నిర్వహించబడిందనే మనందరకూ తెలుసు.

కనుక ఈ రెండింటిలో ఏదో ఒక దాన్ని ఎన్నుకోవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను. ఆ విధంగా ఎన్నుకునే టప్పుడు మనకు రెండు విషయాలు మార్గదర్శకంగా ఉండాలని నేను భావిస్తున్నాను. ఒక విషయాన్ని సంప్రదాయానికి వదిలేసినప్పుడు ఆ సంప్రదాయం తప్పుగా పని చేయవచ్చు, దుర్వినియోగం చేయబడవచ్చు, ఏ విధమైన దండనా లేని రీతిలో కూడ దుర్వినియోగం చేయబడవచ్చు. ఇటువంటి విషయాలని సంప్రదాయానికి వదిలివేయటం భారతదేశం వంటి దేశంలో మరింత అపాయకారి కావచ్చు. ఎందుకంటే భారతదేశంలో రాజ్యాంగం పనిచేసే విధానాన్ని గురించి శ్రద్ధతో కూడిన దృష్టి గల పార్టీలు లేవు, అలాగే మంత్రివర్గంలో తమ స్థానాన్ని పదిల పరచుకోవటానికి ఉండే శ్రద్ధ కంటే, రాజ్యాంగం సరైన తీరులో పనిచేయాలనుకోవటంలో తక్కువ శ్రద్ధ చూపే మంత్రులు ఉండవచ్చు. మరోదృష్టిలో చట్టం ప్రకారం విషయాలను నిర్వచించినప్పుడు విచక్షణను గాలికి వదిలేసి దానిని తప్పనిసరిగా గవర్నర్ విచక్షణనకే వదిలేయాలి. వర్గాలకూ, జాతులకూ సంబంధించిన అనేక చిక్కులతో కూడిన సరైన చిత్రపటమంటూ లేని ఎవరూ పయనించని ఒకానొక సముద్రం వంటి రాజకీయ రంగం గల భారత దేశం వంటి దేశంలో తగినంత విచక్షతను గవర్నర్‌కే వదిలేసే విధంగా మనం ఆలోచించాలి. కనుక, నా దృఢమైన సలహా ఇది. కార్య నిర్వాహక వర్గం యొక్క సమిష్టి బాధ్యతను చట్టం నిర్ణయించాలి. మిగిలిన దానినంతటినీ గవర్నర్ విచక్షణకు వదిలేయాలి. ఇందువల్ల మనం రెండు షరతులనూ పాటించిన వాళ్ళమవుతాము. ఏ బాధ్యత ఉన్నా అది సమిష్టి బాధ్యతగా రూపొందించుతాము. అదే సమయంలో మంత్రివర్గంలో ప్రాతినిధ్యం వహించబడవలసిన అవసరం లేని వర్గాలు ప్రాతినిధ్యం వహించటం, ప్రధానమంత్రి తాను అవసరమని భావిస్తే ఒక అధికారిని, అంటే బయటి వారిని తన మంత్రివర్గంలోకి తీసుకునే అవకాశం కల్పించటం అనే వాటి ద్వారా కార్య నిర్వాహక వర్గం యొక్క కూర్పుకు అపకారం కలిగించని వాళ్ళం అవుతాము. కార్య నిర్వాహక వర్గం సమిష్టి కార్య నిర్వాహక వర్గంగా, సమిష్టి బాధ్యతతో కూడి ఉండేట్లు చేసినట్లయితే, గవర్నర్ యొక్క విచక్షణకు వదిలేయకుండా చట్టం గురించే పట్టుపట్టినట్లయితే మిగిలే అన్ని విషయాలనీ గవర్నర్‌కే మనం నిర్భయంగా వదిలేయ వచ్చని నా అభిప్రాయం.

అయ్యా, తరువాత నేను పరిశీలనకు తీసుకునే మరొక విషయం గవర్నర్, కార్య నిర్వాహక వర్గం అధికారాల మధ్య సంబంధం. గవర్నర్‌కూ, మంత్రికీ ఇప్పుడున్న సంబంధాలు 52వ సెక్షన్, 3వ సబ్‌క్లాజ్‌లో నిర్వచింపబడి ఉన్నాయని మనకందరకూ తెలుసు. మార్చబడిన అన్ని విషయాల్లోనూ – ఇప్పుడు అన్ని విషయాలు మార్చబడతాయి. ఏదీ రిజర్వ్‌డ్‌గా ఉండదు. గవర్నర్ తన మంత్రుల సలహాను అనుసరిస్తాడని ఆ క్లాజ్ చెపుతున్నది. అయితే, అది మరొక అంశాన్ని కూడా చేరుస్తున్నది. మంత్రుల సలహాతో ఏకీభవించకపోవటానికి తగినంత కారణం ఉందని అతడు భావించినట్లయితే

మంత్రుల సలహా ప్రకారం కాకుండా అందుకు భిన్నంగా అతడు చర్య తీసుకోవచ్చు. ఆ క్లాజ్‌ను రూపొందించిన వారి పట్ల గౌరవంతోనో, వారు బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఇవ్వాలన్న మంచి ఉద్దేశంతోనో ఆ విధంగా రూపొందించారన్న విషయం గమనించి నేనే ఈ క్రింది మాట చెప్పక తప్పటం లేదు. ఇప్పుడున్న విధంగా ఈ క్లాజ్ బాధ్యతాయుత ప్రభుత్వానికి ఉన్నాదా రూపం. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఆ క్లాజ్ అవకాశవాదిగా చేస్తున్నది. గవర్నర్ తనకు ఇష్టమైన విషయాల్లో మాత్రమే అంగీకరించి, అనుసరించే వీలు కల్పిస్తున్నది. కాని వాస్తవానికి మనకు కావలసింది బాధ్యతాయుత ప్రభుత్వం తప్పని సరైన విషయం కావటం. బాధ్యతాయుతమైన ప్రభుత్వం అంటే ఏ రంగంలో అయినా సరే గవర్నర్ ఒక చర్య తీసుకొంటే అందుకు సభ విశ్వాసాన్ని పొంది ఉన్న మంత్రివర్గం మద్దతు తప్పకుండా ఉండటమే. ఇది నిర్లక్ష్యం చేయలేని ప్రాథమిక ప్రస్తావన. అయితే, గవర్నర్ ఎల్లప్పుడూ మంత్రివర్గం సలహాను అంగీకరించి తీరాలని దీని భావం కాదు. మంత్రివర్గం సలహాను అంగీకరించకపోవటానికి, మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేయటానికి గవర్నర్‌కు అవకాశం ఉంటుంది, కాని మంత్రివర్గం సలహాని అంగీకరించని గవర్నర్ తన చర్యకు మద్దతునిచ్చే మంత్రులను చూచుకోవాలే కాని తనంతట తానుగా చర్య తీసుకోకూడదు. కనుక నేను చేసే సూచన ఏమిటీ అంటే చర్య తీసుకునే ప్రతి సందర్భంలోనూ గవర్నర్ సభ విశ్వాసాన్ని పొందిన మంత్రుల అభిప్రాయాలకు అనుగుణంగా ఉండే చర్యలనే తీసుకోవాలి. అందువల్ల గవర్నర్, చట్టం ద్వారా తద్విరుద్ధంగా స్పష్టమైన అవకాశాన్ని కల్పించిన అంశాలలో తప్ప- ఇటువంటి అంశాల గురించి తరువాత చెపుతాను. మిగతా అన్ని రంగాల్లోనూ మంత్రుల సలహాను పాటించి తీరాలని స్పష్టం చేసే విధంగా 52వ సెక్షన్‌ను సవరించాలని నేను కోరుతున్నాను.

అయ్యా, గవర్నర్‌కు కొన్ని ప్రత్యేక తీవ్ర అధికారాలు ఇవ్వవలసిన అవసరం ఉండే సందర్భాలు కొన్ని ఉంటాయని నేను నిస్సంకోచంగా అంగీకరిస్తున్నాను. ఈ అధికారాల విషయంలో గవర్నర్‌కు స్వతంత్రంగా చర్య తీసుకునే అధికారం ఉంటుంది. ఇటువంటి విషయాలలో అతడు మంత్రుల సలహాలను పాటించి తీరవలసిన అవసరం ఉండదు. సైమన్ కమీషన్ నివేదిక 2వ సంపుటంలోని 36వ పేజీలో 50వ పేరాగ్రాఫ్‌లో ఇటువంటి సందర్భాలు పేర్కొనబడ్డాయి. ఇందులో మొదటిది రాష్ట్రంలో శాంతి భద్రతలను పరిరక్షించటానికి అతడికి ప్రత్యేకాధికారాలు ఉండాలి. రెండోది, అనేక వర్గాల్లో ఒకటో రెండో వర్గాల యెడల తీవ్రమైన ప్రతికూల భావన ఉండటాన్ని అరికట్టడానికి ప్రత్యేకాధికారాలు ఉండాలి. చివరగా, గవర్నర్, మొత్తం కార్య నిర్వాహక వర్గం అంతటి యొక్క బాధ్యత కాకుండా, తనకే స్పష్టమైన బాధ్యతలు పొంది ఉన్న సందర్భాల్లో కూడా అతడికి ప్రత్యేక విశిష్టాధికారాలు కలిగి ఉండాలి.

ఈ విషయాల గురించి నా మొదటి అభిప్రాయం శాంతి భద్రతలను రక్షించటానికి గవర్నర్‌కు తన మంత్రివర్గాన్ని అధిగమించే అధికారాలను మీరు ఇచ్చినట్లయితే రాష్ట్రాల్లో బాధ్యతాయుతమైన ప్రభుత్వం నుండి ఒక పెద్ద భాగాన్ని తీసి వేసినట్లవుతుందని నాకు అనిపిస్తున్నది. శాంతి భద్రతలతో

సహా అన్ని విషయాల్లోనూ రాష్ట్రాలు మంత్రుల సలహాలననుసరించే గవర్నర్ చేత పరిపాలించబడాలి అన్న విషయంలోనే మనం అందరం పాటుపడుతున్నాం. అటువంటప్పుడు మంత్రుల సలహాలకు వ్యతిరేకంగా చర్యతీసుకోవటానికి తగిన ప్రత్యేకాధికారాలను గవర్నర్‌కు ఇచ్చినట్లయితే బాధ్యతాయుత ప్రభుత్వ అధికారాలను చాలా వరకు నిరర్ధకం చేసినట్లే అని నాకు అనిపిస్తున్నది. కనుక ఇటువంటి విషయాల్లో ఇంత విస్తృతమైన సిద్ధాంతాన్ని – మొత్తం పరిస్థితినే తల్లకిందులు చేసే సిద్ధాంతాన్ని చాలా సంకుచితంగా నిర్వచిస్తే తప్ప అధిగమించే అధికారాలను గవర్నర్‌కు ఇవ్వకూడదు.

ఇతరులతో పోలిస్తే ఒక వర్గంలోని ఒక విభాగంపై ప్రతికూల భావన అన్న విషయానికి వస్తే ఇది చాలా ప్రముఖమైన విషయమే అయినా ఏ ఒక్క వర్గం యొక్క ప్రయోజనాలకైనా ప్రతికూలంగా ఉండవచ్చుననుకొనే విషయాలు రాజ్యాంగానికి లోబడి ఉండాలి అని నా అభిప్రాయం. ఇటువంటి వాటిని కేవలం గవర్నర్ ఇష్టారాజ్యానికే వదిలివేయకూడదు. ఇది నేను హేతుబద్ధంగానే చెపుతున్నాను. సహజంగా శాసన సభలో అధిక సంఖ్యాకుల మద్దతు ఉన్న మంత్రి వర్గంతో గవర్నర్ సంబంధం కలిగి ఉంటాడు. మంత్రి వర్గానికి వ్యతిరేకంగా అతడు పనిచేయడు. వారిరువురి మధ్య చాలా సయోధ్య ఉండాలి. తన దృష్టిలో అంతగా ముఖ్యం కాని అల్ప సంఖ్యాక వర్గాల వారిని రక్షించటానికి గవర్నర్, సభలోని అధిక సంఖ్యాకులకు ప్రాతినిధ్యం వహించే మంత్రివర్గంతో ఎప్పుడూ పోట్లాట పెట్టుకునే మనస్తత్వం కలిగి ఉంటాడని నేను నిశ్చయంగా అనుకోను. కనుక ఒక నిశ్చితమైన పద్ధతిలో అల్పసంఖ్యాక వర్గాల వారి ప్రయోజనాలు రక్షించబడాలి. అందువలన అంతర్లీనంగా ఉన్న అభిప్రాయాన్ని నేను అంగీకరిస్తున్నప్పటికీ, ఈ క్లాజ్‌ను తీసివేయటానికే నేను సిద్ధపడతాను.

3,4,5 అంశాల గురించి ఇటువంటి సందర్భాలలో గవర్నర్‌కు ప్రత్యేకాధికారాలు ఉండాలని నేను ఒప్పుకొంటాను. ఎందుకంటే, ఇటువంటి అంశాలలో గవర్నర్ వ్యక్తిగతంగా బాధ్యత వహిస్తాడు గనుక.

తరువాతి విషయం గవర్నర్ అధికారాలు, శాసన సభ అధికారాల గురించి. ఈ విషయమై నా వ్యాఖ్యల్ని మూడు విభాగాలుగా విభజిస్తున్నాను. మొట్టమొదటిది బడ్జెట్‌కు సంబంధించిన శాసనం. రెండోది సాధారణ శాసనం. మూడోది అత్యవసర పరిస్థితికి సంబంధించిన శాసనం. ప్రస్తుతం వర్నర్‌కు రిజర్వ్‌డ్ అంశాలకు సంబంధించిన అవకాశాన్ని గురించి ప్రమాణీకరణం చేసే అధికారాలు ఃన్నాయి. రెండోది, రాష్ట్ర శాంతిభద్రతల నిమిత్తమై ఖర్చు చేయటానికి అనుమతించే అధికారం. శాంతి భద్రతల రక్షణ విషయాలను నిర్ధారణ చేయటాన్ని బాధ్యతాయుతమైన మంత్రివర్గానికే వదిలేసేట్లయితే రాష్ట్రశాంతి భద్రతల నిమిత్తమైన ఖర్చును అనుమతించే అధికారం గవర్నర్‌కు ఉండకూడదని నాకు అనిపిస్తున్నది. తరువాత, బిల్లులను ప్రమాణీకరణం చేసే అధికారం. ఇది రెండు విధాలు. శాసన సభలో చర్చించబడుతున్న ఒక బిల్లును, రాష్ట్రశాంతి భద్రతలకు భంగం కలిగిస్తుందనే కారణంగా, ఆ బిల్లును చర్చించరాదని అతడు శాసించవచ్చు. శాసనసభ సాధారణ పద్ధతుల్లో ఆమోదించదలచుకోని బిల్లును రాష్ట్ర శాంతి భద్రతల ప్రయోజనాల దృష్ట్యా ప్రమాణీకరించటానికి

అతడికి అధికారం ఉంది. ఈ రెండు అధికారాలనూ తీసివేయాలని నాకు అనిపిస్తున్నది. భారతదేశపు భవిష్యద్రాజ్యాంగంలో వీటి అవసరం ఉండదు.

పూర్వానుమతి ఇచ్చే అధికారాలు కూడా అతడికి ఉంటాయి. కొన్ని అంశాలలో ఆ అంశాలు చర్చించబడక ముందే, ముందుగానే అనుమతించవలసిన అవసరం ఉంటుంది. అయితే నా అభిప్రాయంలో ఇటువంటి అధికారం ఉండకూడదు.

***సర్ అహమ్మద్ సయద్ ఖాన్ :*** విచక్షణాయుతమైన చట్టము?

***డా॥ అంబేద్కర్ :*** అది రాజ్యాంగం చూసుకోవలసిన విషయం. దానిని నేను గవర్నర్‌కు వదిలివేయను. గవర్నర్‌కు వీటో అధికారం ఉండి తీరాలి. అక్కర్లేదనుకొన్న రాష్ట్రాల్లో రెండో సభ ఉండదు గనుక గవర్నర్‌కు వీటో అధికారం ఉండటం అనేది చాలా అవసరం. ఒక బిల్లు పునః పరిశీలన నిమిత్తమై సభకు తిప్పిపంపే అధికారం ప్రస్తుతం గవర్నర్‌కు ఉన్నది. ఇది చాలా ఉపయోగకరమైన అధికారం. ఈ అధికారం చాలా అధినివేశ రాజ్యాలలో ఉన్నది. ఈ అధికారాన్ని ఉంచి తీరాలని నా అభిప్రాయం. ఒక బిల్లును గవర్నర్-జనరల్ పరిశీలనకు గాను ఉంచే అధికారం గవర్నర్‌కు ఉంది. ఎటువంటి సందర్భాల్లో అతడు ఆ విధంగా చేయవచ్చును అనేది రాజ్యాంగంలో నిర్వచించబడి ఉన్నది. ఈ విషయాన్ని మనం రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వానికీ మధ్య గల సంబంధాల గురించి చర్చించేటప్పుడు చర్చించటం ఇంకా వీలుగా ఉంటుందని నా అభిప్రాయం. అయితే ఈ విషయమై నేనొక మాట చెప్పవలసి ఉంది. రాష్ట్ర ప్రభుత్వాలు తమకు మార్చబడిన రంగాల్లో, కేంద్ర ప్రభుత్వపు జోక్యం సాధ్యమైనంత వరకు లేకుండా, స్వతంత్రంగా వ్యవహరించే విధంగా మనం కృషి చెయ్యాలి. బిల్లుల రిజర్వేషన్ ద్వారా, పరిపాలనా పరంగా గాని, శాసనపరంగా గాని, కేంద్రప్రభుత్వం సదా జోక్యం కలిగించుకునే అవకాశం లేని విధంగా మనం రాజ్యాంగాన్ని రూపొందించాలి.

అల్ప సంఖ్యాక వర్గాల, శాంతిభద్రతల సంరక్షణకు సంబంధించిన ప్రశ్న గురించి, శాంతి భద్రతల వ్యవస్థను బదిలీ చేయాలని నేను ఇంతకు ముందే చెప్పిఉన్నాను. అయినా నేను ఒక సలహా- దాని విలువ ఏమైనా, ఇవ్వగోరుతున్నాను. అత్యవసర పరిస్థితుల్లో శాంతి భద్రతల వ్యవస్థ అపాయకర స్థితిలో ఉన్నప్పుడు పోలీస్ అధికారుల నియామకం, బదిలీల విషయంలో, మంత్రుల సలహాలతో నిమిత్తం లేకుండానే, ఉత్తరువులు జారీ చేసే అధికారం గవర్నర్‌కు ఉండి తీరాలని నా అభిప్రాయం, ఇది చాలా ముఖ్యం.

***సర్ కవాస్జీ జహంగీర్ :*** అత్యవసర పరిస్థితుల్లో మాత్రమేనా?

***డా॥ అంబేద్కర్ :*** అవును, ఇతర సందర్భాల్లో కాదు.

మిన్హాపాల్ : సాధారణ పరిస్థితుల్లోకాదా?

***డా॥ అంబేద్కర్ :*** సాధారణ పరిస్థితుల్లో కాదు. అత్యవసర పరిస్థితుల్లో ఏదైనా ఒక దొమ్మీ వంటిది

సంభవించినప్పుడు కాని, గందరగోళ పరిస్థితి ఏర్పడినప్పుడు కాని, నిష్పక్షపాతి అయిన గవర్నర్ అవసరం తప్పక ఉంటుంది. అతడు మంత్రి వర్గం సలహాల వల్ల ప్రభావితుడు కాకుండా, దొమ్మీ వంటి పరిస్థితుల్లో ఏదో ఒక వర్గం ప్రయోజనాలకు అనుగుణంగా ప్రజల్ని ఒక చోటి నుండి మరొక చోటికి బదిలీ చేయకుండా చూడటానికి తగిన అధికారాలు కలిగి ఉండాలి. అందువల్ల శాంతి భద్రతలకు తగిన భద్రత కల్పించటానికి అతనికి తగిన అధికారం ఇందువల్ల లభిస్తుందని నాకు అనిపిస్తున్నది.

అల్ప సంఖ్యాక వర్గాల గురించి కొందరు వక్తలు రెండో సభ అల్పసంఖ్యాక వర్గాల వారికి రక్షణ ఇస్తుందని అభిప్రాయపడ్డారు. రెండో సభకు సంబంధించి దళిత వర్గాల స్థితిని నేను సరిగా పరిశీలించ లేదని నా మిత్రుడు ఉడ్ అభిప్రాయం వెలిబుచ్చారు. నేను ఈ విషయాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాననీ, రెండో సభలో అల్పసంఖ్యాక వర్గాలకు రక్షణగా ఉండక పోవటమే కాక వాస్తవానికి వారి మెడకు అవి గుదిబండలాగా తయారవుతాయన్న నా మిత్రుడు పాల్ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

ఇంతకు ముందు నేను ప్రస్తావించని విషయం ఒకటి ఉంది. 'గవర్నర్‌కు తన మంత్రి వర్గంతో సంబంధం' అన్న ఆ విషయాన్ని నేను క్లుప్తంగా ఇప్పుడు చెప్పాలను కొంటున్నాను. ఒక హక్కుగా అతడు తన మంత్రివర్గానికి అధ్యక్షత వహించాలా? వహించకూడదా! రాజా లేకుండానే మంత్రి వర్గం తన సమావేశాల్ని ఏర్పాటు చేసుకునే పద్ధతి ఉన్న ఈ దేశంలో ఆ పద్ధతే ఉండాలా? అలా అయితే మంత్రివర్గ సమావేశాల్లో తీసుకున్న నిర్ణయాలు, సమావేశ ఫలితాలు ఏ విధంగా గవర్నర్‌కు తెలియ జేయబడాలి? ఈ అంశంలోకి ఈ విషయం వస్తుందేమో నాకు తెలియదు. ఒకవేళ రాకపోతే దీనిని చర్చిస్తూ నా సమయం వృధా చేసుకోను.

ఛైర్మన్ : మనం ఈ మొత్తం ప్రశ్న అంతటినీ సాధారణంగా చర్చించాం. మీరు కోరినట్లయితే చర్చ కొనసాగించవచ్చును. నాకు అభ్యంతరం లేదు.

**డా॥ అంబేద్కర్ :** ఈ సందర్భంలో ఒక విషయాన్ని చెప్పాలను కొంటున్నాను. ఐ.సి.యస్. ధికారి హోదాలో ఉండి, గవర్నర్‌కు, మంత్రి వర్గానికీ మధ్య అనుబంధ అధికారిగా ఉండే ఒక ంత్రివర్గ కార్యదర్శిని నియమించాలని సైమన్ కమిషన్ సలహా ఇచ్చింది. ఈ విధమైన సలహా వ్వటంలో కమీషన్ మంత్రి వర్గానికి కార్యదర్శి ఇంతకు ముందు ఉండలేదనీ, ప్రస్తుతం ఈ సంప్ర దాయం మన దేశంలో ఉన్నదనీ, అంటే మంత్రి వర్గానికి ఎప్పుడూ ఒక కార్యదర్శి ఉండటం అనేది, ఆ సంప్రదాయాన్నే అనుసరించాననీ పేర్కొన్నది. అయితే నేనిక్కడ ఒక విషయం చెప్పాలను కొంటున్నాను. మంత్రివర్గానికి ఒక కార్యదర్శి ఉండాలనేది ఒక విషయం, కాని ఆ కార్యదర్శి మంత్రివర్గంతో నిమిత్తం లేకుండా గవర్నర్‌తో నేరుగా వ్యవహరించగలగటం అనేది పూర్తిగా భిన్నమైన విషయం. ఈ దేశంలో కార్యదర్శిని నియమించటం అనే సాంప్రదాయం ఉంది. అయితే ఈ దేశంలో ఏ మంత్రి వర్గమూ లేదా ప్రధానమంత్రీ, మంత్రులతోగానీ ప్రధానమంత్రితోగానీ

నిమిత్తం లేకుండా కార్యదర్శి చక్రవర్తితో నేరుగా వ్యవహరించటాన్ని అనుమతిస్తారని నేననుకోను. అటువంటి విషయం సహించరానిది. ఈ దేశంలో మంత్రి వర్గం తనపూర్తి చరిత్రలో ఎప్పుడు కూడా చక్రవర్తికి దగ్గరగా ఉండే వ్యక్తులు మంత్రి వర్గ విశిష్టతను కలిగి ఉండే వ్యక్తులే అయి ఉండాలనే వాస్తవాన్ని నొక్కి చెపుతూ వచ్చింది, అంతే కాదు, మహారాణా వద్ద 'లేడీస్ ఆఫ్‌ది ఛాంబర్' గా వ్యవహరించే స్త్రీలను కూడా ప్రధాన మంత్రీ, మంత్రి వర్గం నియమించవలసి ఉంటుందనేటంత దూరం వరకూ ఈ సంప్రదాయం వెళ్ళిందని మనకు తెలుసు. కనుక పైన సూచించబడిన పరిస్థితి దాదాపు అసంభవం అని నాకు అనిపిస్తున్నది. సమిష్టి బాధ్యత అనే సిద్ధాంతం మీద పనిచేసే ఏ మంత్రివర్గమైనా ఇటువంటి కార్యదర్శి ఉండటానికి అనుమతిస్తుందని నేననుకోను.

మంత్రివర్గం సిద్ధాంత విషయాలను చర్చిస్తున్నప్పుడు గవర్నర్‌కు ఆ సమావేశాలకు అధ్యక్షత వహించే అధికారాన్నిస్తే అటువంటి పద్ధతి పని చేస్తుందా అనేది నాకు సందేహమే. ఎందుకంటే మంత్రివర్గం తన నిర్ణయాలను గవర్నరకు తెలియజేయవలసి ఉన్నప్పటికీ అటువంటి నిర్ణయాలను ఎందుకు తీసుకోవలసి వచ్చిందో ఆ కారణాలను గవర్నర్‌కు విప్పిచెప్పటానికి మంత్రివర్గం ఇష్టపడక పోవచ్చు. ఈ కారణాలు ఒక్కొక్కసారి చాలా విశిష్టమైనవి గానూ, సున్నితమైనవిగాను ఉండవచ్చు. ఏదైనా ఒక నిర్ణయానికి వచ్చినప్పుడు ఆ నిర్ణయానికి రావటానికి గల కారణాలను గవర్నర్‌కు తెలియజేయటానికి మంత్రివర్గం మనసులో ఎంత మాత్రమూ ఇష్టపడక పోవచ్చుననేది మీ కందరకూ తెలిసిన విషయమే. దీనిని ఈ విధంగా వ్యాఖ్యానించవలసి ఉంటుంది. గవర్నర్‌కు మంత్రి వర్గాన్ని భంగం చేసే పరమాధికారం ఉంటుంది. ఎందుకంటే సభను భంగం చేయవలసిందని మంత్రి వర్గం చేసే సిఫారసును గవర్నర్ అంగీకరించకపోవచ్చు. కనుక అయితే రాజ్యాంగంలో పొందపరచే కంటె ఈ విషయాన్ని 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్స్'కు వదిలివేయాలి. అప్పుడు గవర్నర్ ఇష్టపడితే సమావేశానికి హాజరు కావచ్చుననీ, ఎంత మాత్రమూ తప్పని సరి కాదనీ పేర్కొనవచ్చును. అయితే, మంత్రివర్గం సమావేశాలలో నిర్ణయించిన అన్ని సిఫారసులనూ గవర్నర్‌కు తెలియజేసి తీరాలని నిష్కర్ష చేయవలసి ఉంటుంది. ఈ విషయమై నేను ఇంత మాత్రం చెప్పదలచు కొన్నాను.

*డాక్టర్ అంబేద్కర్ : అసలు రెండో సభను ఏర్పాటు చేయరాదు. చేస్తే ఆ సభను రద్దు చేసే విషయాన్ని నిర్ణీతమైన మెజారిటీ యొక్క రాజ్యాంగ బద్ధమైన తీర్మానానికి వదిలేయాలి అనే అంశంపై నేనొక విషయాన్ని చెప్పకోరుతున్నాను. కొన్ని కొన్ని రాష్ట్రాల విచక్షణకు వదిలి వేయవలసిన పరిస్థితులు ఏర్పడినట్లయితే ముందుగా ఆయా రాష్ట్రాల శాసన సభలు రెండో సభను ఏర్పాటు చేయవలసిందిగా కోరుతూ ఒక తీర్మానం చేయవలసి ఉంటుంది. అలా తీర్మానించిన తరువాతనే రెండో సభను ఏర్పాటు చేయాలి. రాజ్యాంగం ద్వారా మొదటే రెండో సభను రాష్ట్ర శాసన సభలపైన బలవంతంగా ఏర్పాటు చేయకూడదు.

* రెండవ ఉపసంఘం చర్చలు (ప్రావిన్షియల్ రాజ్యాంగం) పుట, 133

## ఐదవ సమావేశం : 15–12–1930

*డా॥ అంబేద్కర్ :* నోబుల్ మార్క్విజ్ ప్రవేశపెట్టిన సవరణపై నేను ఒకటి రెండు విషయాలు చెప్పదలచాను. అతడు తీసుకొన్న నిర్ణయం పూర్తిగా తార్కిక మైనదిగా నాకు అనిపిస్తున్నదని నేను వెంటనే చెప్పాలనుకొంటున్నాను. ఈ నివేదికలో శాసన మండలిలో అల్పసంఖ్యాక వర్గాలవారూ, మరికొన్ని ఇతర వర్గాలూ నియామకం ద్వారా ప్రాతినిధ్యం వహించే విధంగా అవకాశాన్ని పొందుపరచ బోతున్నాం. అదే సమయంలో, ఈ నివేదికలో తన మంత్రి వర్గం అల్ప సంఖ్యాక వర్గాల, ఇతర వర్గాల ప్రాతినిధ్యం కలిగి ఉండేదిగా ప్రయత్నించే బాధ్యతను గవర్నర్‌కు అప్పగించే అవకాశాన్ని కూడా పొందుపరుస్తున్నాం. ఈ మంత్రివర్గాన్ని ఏర్పరచేటప్పుడు కొన్ని ముఖ్యమైన వర్గాలకు ప్రాతినిధ్యం లభించే విధంగా సభ్యులను మంత్రివర్గంలో చేర్చుకునే హక్కు గవర్నర్‌కు ఉండాలనే అవకాశాన్ని కల్పిస్తే తప్ప మీరు తర్కబద్ధం కాని పరిస్థితిని సృష్టిస్తున్నారని నాకు అనిపిస్తున్నది. శాసన మండలికి నియామకాలు అనేవే ఉండకూడదని ఎంత చిన్న వర్గానికి సంబంధించిన వారైనా సరే ఏ వర్గం వారయినా శాసన మండలిలో ఎన్నిక ద్వారానే స్థానాన్ని పొందాలనైనా మీరు నిర్ధారించాలి. లేదా నియామకం పద్ధతి ఉండాలనేటట్లయితే, సమిష్టి బాధ్యత అనే సిద్ధాంతానికి కట్టుబడి అతడితో కలిసి పనిచేయటానికి ఇతర మంత్రులు అంగీకరించినట్లయితే నియామక పద్ధతి ద్వారా నియమించబడిన సభ్యుడికి మంత్రి వర్గంలో చేరటానికి హక్కు ఉండే విధంగా మీరు అవకాశం కల్పించాలి. ఈ రెండు పద్ధతుల్లో ఏదో ఒక పద్ధతి నుండి మీరు తప్పించుకోలేరు.

అయ్యా, నియమిత సభ్యుడికి మంత్రివర్గంలో చేరే హక్కు ఉండాలని, లేకపోతే కనీసం అతడు మంత్రివర్గంలో చేరకూడదనే నిషేధం ఉండకూడదని అనే సిద్ధాంతాన్ని మనం అంగీకరించినట్లయితే సమిష్టి బాధ్యత అన్న సిద్ధాంతానికి అది విరుద్ధం అవుతుందని ఇటు వైపు కూర్చొన్న నా మిత్రులు అన్నారు. అటువంటి స్థితిని నేను నిజంగా అర్థం చేసుకోలేక పోతున్నాను. ఇది బాధ్యతా సిద్ధాంతానికి విరుద్ధ మవుతుంది అంటున్న ఈ పెద్ద మనుష్యులు నియమిత సభ్యుల ఓట్లను తీసుకోవటానికి సిద్ధపడుతున్నారు. నేను నివేదికను యధాతథంగానే నిర్వహిస్తున్నాను. భవిష్యత్తులో ఏమి సవరణలు రాబోతాయో నాకు తెలియదు. శాసన మండలిలో నియమిత సభ్యులు కొందరు ఉంటారన్న ప్రతిపాదనలో నివేదిక ఇప్పుడున్న విధంగా అంగీకరింప బడుతుందని అనుకుందాం. అంటే ఇప్పుడు ఈ నియమిత సభ్యుల ఓట్లు న్యాయబద్ధమైనవి కావని ఈ పెద్ద మనుష్యుల అభిప్రాయమా? సభలో ఎన్నుకోబడిన సభ్యులలో ఏర్పాటు చేయబడిన మంత్రి వర్గం శాసన మండలికి నియమించబడిన ఓట్లకు చెల్లుబాటు అయ్యే విధంగా ఉపయోగించుకోగలిగినట్లయితే, ఆ వోట్లు తర్క బద్ధంగా ప్రభుత్వపు సిద్ధాంతానికి ఆధారం కాగలిగినట్లయితే, నియమిత సభ్యులలో ఒకరు మంత్రి వర్గంలో సభ్యుడుగా ఎందుకు కాకూడదో నాకు అర్థం కావటం లేదు. దానిని అర్థం

* రెండవ ఉపసంఘం చర్చలు (ప్రావిన్షియల్ రాజ్యాంగం), పుటలు 156–57.

చేసుకోవటంలో నేను పూర్తిగా విఫలుడనవుతున్నాను. నేనన్నట్లు వారు నియమిత సభ్యుల ఓట్లను గ్రహించి తమ స్వప్రయోజనాల కోసం ఉపయోగించుకోగలిగినప్పుడు నియమిత సభ్యులలో ఒకరిని మంత్రివర్గంలో చేర్చుకోవటానికి ఏ అభ్యంతరం ఉంటుందో నాకు అర్థం కావటం లేదు. కనుక నోబుల్ మార్క్వైజ్ అభిప్రాయం పూర్తిగా తార్కికమైనదని నేను భావిస్తున్నాను. నోబుల్ మార్క్వైజ్ తన సవరణలో సూచించిన అభిప్రాయానికి అనుగుణంగా ఒక అవకాశం వంటి దానిని కల్పించాలి, లేదా శాసన మండలిలో నియమిత సభ్యులకు అవకాశమే లేకుంటే తాము తర్వాతి దశలో ప్రస్తావన చేయబోతున్నామని నా మిత్రులు చెప్తున్న ఈ ప్రతిపాదనకైనా అంగీకరించాలి. ఈ రెండింటిలో మనం ఏదో ఒక దాన్ని ఎన్నుకోవలసి ఉంటుందని నాకు అనిపిస్తున్నది. శాసన మండలిలో నియామక పద్ధతి నామ మాత్రంగా కూడా లేకుంటే శాసనమండలి అంతా ఎన్నుకోబడినదిగా ఉండడాన్నే నేను వైయక్తికంగా అభిలషిస్తాను. ఆ దృష్ట్యా అయితే నోబుల్ మార్క్వైజ్ సూచించిన ప్రస్తావనకు నేను అంతగా సుముఖుణ్ణి కాను. కాని ఈ సంఘంలో గాని లేదా తర్వాత ఏ దశలో అయినా కానీ నియామక పద్ధతి ఉండే పక్షంలో నేను నోబుల్ మార్క్వైజ్‌తో ఏకీభవించి అతడు సూచించిన సవరణను ఆమోదించవలసి ఉంటుందని భావిస్తున్నాను.

**దివాన్ బహదూర్ రామచంద్ర రావు :** ఇప్పుడు నేను విన్న ఈ ఉపన్యాసం నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది.

**డా॥ అంబేద్కర్ :** అయి ఉండవచ్చు. కాని రెండు పద్ధతులూ కావాలంటే అది సాధ్యం కాదు.

**దివాన్ బహదూర్ రామచంద్రరావు :** ప్రస్తుతం ఉన్న పద్ధతి ప్రకారం కూడా నియమిత సభ్యులు మంత్రులుగా నియమింపబడటానికి అర్హులు కారని వారికి బాగా తెలుసు. స్థానిక శాసనసభకు ఎన్నుకోబడిన వ్యక్తి అయితే తప్ప ఏమంత్రి ఆరునెలలకి మించి మంత్రి పదవిలో ఉండటానికి వీలులేదని 52వ సెక్షన్‌లో స్పష్టంగా పేర్కొనబడి ఉంది.

**డా॥ అంబేద్కర్ :** ఆ విషయం ఇంకా తేలలేదు.

## శాసనసభలో ప్రత్యేక నియామకానికి వ్యతిరేకత

***డాక్టర్ ॥ అంబేద్కర్ :** ఈ సవరణను నేను వ్యతిరేకించవలసి ఉంటుందని భావిస్తున్నాను. మొట్టమొదటగా ప్రత్యేక నియామకం విషయమై బొంబాయిలో మనకు కలిగిన అనుభవం ఏమంత ప్రోత్సాహకరంగా లేదు. అది ఒక అధమ స్థాయికి చెందిన అపఖ్యాతిగా తయారయింది, అక్కడ పేరుకొని పోయిన అవినీతిని, లంచగొండితనాన్ని చూస్తుంటే బొంబాయి శాసన సభ రాజ్యాంగంలో ఈ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టటానికి నేనెంత మాత్రం ఇష్టపడను.

మరొక అభ్యంతరం ఎన్నికలలో ఎన్నుకోబడని అనేక వర్గాలకు నిజమైన ప్రాతినిధ్యం ఇతర

* రెండవ ఉపసంఘం చర్చలు (ప్రావిన్షియల్ రాజ్యాంగం), పుట 194.

వర్గాల పలుకుబడితో నిమిత్తం లేని ప్రాతినిధ్యం లభించాలంటే ప్రత్యేక నియామక పద్ధతి సహాయకారి కాజాలదని నా ఉద్దేశం. ఎందుకంటే. అనేక వర్గాల ప్రతినిధులను కేవలం ప్రత్యేక నియామక పద్ధతి ద్వారానే నియమించబడాలి అని తీర్మానించినప్పుడు అత్యధిక సంఖ్యాకుల అధికారానికి లోబడి, వారు ఆడించినట్లు, ఆడేవారినే నియమించటం జరుగుతుంది. ప్రాతినిధ్యం లేకపోవటం కంటె అదనంగా ఇది కన్పిస్తున్నది. కనుక నేను దీన్ని వ్యతిరేకిస్తున్నాను. కాని అసలు నియమిత సభ్యులే ఉండని విధంగా రాబోయే రాష్ట్రాల సభల రాజ్యాంగానికి ఈ ఉపసంఘం సిఫారసు చేయడలసిందిగా నేను కోరుతున్నాను.

**దివాన్ బహదూర్ రామచంద్రరావు :** అదే చాలా మంచిది.

**డా॥ అంబేద్కర్ :** ఈ విషయంలో ఇది నా స్వంత అభిప్రాయం. ప్రత్యేక నియామక పద్ధతిని నేను తప్పక వ్యతిరేకిస్తాను.

**దివాన్ బహదూర్ రామచంద్రరావు :** శాసన సభ తప్పనిసరిగా ఎన్నుకోబడిన సభ్యులతో కూడినదిగా ఉండాలని నివేదికలో చేర్చటాన్ని నేను అంగీకరిస్తున్నాను. అంతేకాదు, ఉపసంఘం ఈ అభిప్రాయాలను సూచించకపోయినట్లయితే, మనలో చాలామంది సభ్యులు నియమిత సభ్యుల పద్ధతి పోవాలని కోరుకుంటున్నప్పటికీ, ఆ పద్ధతి కొనసాగుతూనే ఉంటుంది. ఈ నివేదికలో అందుకు సంబంధించిన అంశాన్ని తప్పనిసరిగా చేర్చాలి. మనలో ప్రతి ఒక్కరికీ నియమిత పద్ధతిలో ఉంటే చెడును గురించి బాగా తెలుసుననీ సాధ్యమైనంత త్వరలో ఈ పద్ధతి పోవాలనీ మనందరం ఎంతో ఆందోళన పడుతున్నామనీ నేను నిస్సందేహంగా చెప్పగలను. ఈ పరిస్థితులలో నేను సవరణను బలపరచను. నా మిత్రుడు డా॥ అంబేద్కర్ ప్రస్తావననే బలపరుస్తాను.

**ఛైర్మన్ :** ఏమిటి ఆ ప్రస్తావన? ఇక్కడ అందుకు సంబంధించిన మాటలేమీ లేవు.

**డా॥ అంబేద్కర్ :** ఇకనుండి రాష్ట్రాల్లోని శాసన మండలులు పూర్తిగా ఎన్నుకోబడినవిగానే ఉండాలని ఉపసంఘం యొక్క అభిప్రాయమని మనం చెప్పాలి.

**అధ్యక్షుడు :** అది పూర్తిగా మరొక సవరణ. దీనిని ప్రతిపాదించాలంటే మీరు వ్రాతపూర్వకంగా పంప వలసి ఉంటుంది.

**రాజా నరేంద్ర నాథ్ :** సర్ ఎ.పి. పాత్రోను నేను బలపరుస్తున్నాను. ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యం లభించజాలని ప్రత్యేక వర్గాల వారికి మాత్రమే నియామక పద్ధతిని పరిమితం చేసే అధికారం ఉండాలని నేను భావిస్తున్నాను.

**డా॥ షఫాత్ అహ్మద్‌ఖాన్ :** అవును.

**రాజా నరేంద్ర నాథ్ :** డా॥ అంబేద్కర్ ప్రాతినిధ్యం వహిస్తున్నటువంటి కొన్ని వర్గాలు, కొన్ని రాష్ట్రాల్లో ఉండవచ్చు. ఇట్టి వారికి ఎన్నికలు నిర్వహించడం అసంభవం.

***డా॥ అంబేద్కర్ :*** నా వర్గానికి ఓటు హక్కు ఉండని రాజ్యాంగంతో నాకు ఏమీ సంబంధం లేదు.

***రాజా నరేంద్రనాథ్ :*** డా॥ అంబేద్కర్ యొక్క వర్గానికి ఓటుహక్కును పూర్తిగా భిన్నమైన ప్రాతిపదిక మీద ఏర్పాటు చెయ్యవలసి ఉంటుంది. కనుక పరిమితమైన నియామక అధికారం ఉండాలి.

***ఛైర్మన్ :*** నివేదికలో ఇప్పుడున్న 'సి' క్లాజ్ నే ఉపసంఘంలోని అధిక సంఖ్యాకులు అంగీకరిస్తున్నట్లు నాకు కనిపిస్తున్నది.

## సర్వ సభ్య సంఘ సమావేశం
## 2వ ఉపసంఘం నివేదికపై వ్యాఖ్యలు
## (ప్రావిన్షియల్ రాజ్యాంగం - 16-12-1930)

రాష్ట్రాల్లో రెండవసభ ఏర్పాటును చింతామణి వ్యతిరేకించారు. అది సార్వత్రిక ప్రయోజనాత్మకమైనది కాదనీ, ఖర్చుతో కూడిన విలాసం అనీ ఆయన పేర్కొన్నారు. యు.పి.లో ఒక వర్గంలోని కొద్ది మంది మాత్రమే రెండోసభ కావాలని కోరుతున్నారు. సైమన్ కమీషన్ ప్రకారం రాష్ట్ర శాసన సభలో వీరి ప్రాతినిధ్యం బాగా హెచ్చుగా ఉన్నది. అందువలన రెండో సభ కేవలం అవసరం అనీ, యు.పి.లో కాని భారతదేశంలో మరే రాష్ట్రంలో నైనాగాని, ఎంత కాలం వరకైనా, ఎట్టి పరిస్థితుల్లోనయినా కోరదగనిదనీ ఆయన అభిప్రాయపడ్డారు. డా॥ అంబేద్కర్ ఇలా అన్నారు "చింతామణి ఇప్పుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను నేను అంగీకరిస్తున్నాను."

***ఛైర్మన్ :*** ఇప్పుడు పేరా గ్రాఫ్ 5 (బి) పై చర్చజరుగుతుంది. (ఈ పేరాగ్రాఫ్ మంత్రుల నియామకపు పద్ధతికి సంబంధించింది)

***డా॥ అంబేద్కర్ :*** ఉపసంఘంలో "ఎన్నుకోబడిన" (రాష్ట్ర శాసన సభలో ఎన్నుకోబడిన సభ్యులు) అనే పదాన్ని తీసి వేయాలని ప్రస్తావించబడింది. ఇందుకు కారణం నివేదికలోని మరొక భాగంలో శాసనసభలో బహుశ కొంతమంది నియమిత సభ్యులు ఉండవచ్చునని సిఫారసు చేయటమే. శాసనసభ ఏర్పాటుకు సంబంధించి చర్చించటానికి నియమించబడే సంఘం నియమిత సభ్యుడు ఉండాలనే నిష్కర్షకు వచ్చేపక్షంలో 'ఎన్నుకోబడిన' అన్న పదాన్ని వదిలేయాలని అప్పుడు నిర్ణయించటం జరిగింది.

***ఛైర్మన్ :*** "సాధారణంగా" (మంత్రులు సాధారణంగా తీసుకోబడతారు) అన్న పదం వాడబడింది. అది ఆ భావాన్ని ఇముడ్చుకొని ఉంటుందని భావిస్తున్నాను. అసాధారణ చర్చ ఆవశ్యకతను అది సూచిస్తుంది.

★ ★ ★

# 4

# మూడవ ఉపసంఘం

# (అల్పసంఖ్యాకులు)

## రెండవ సమావేశం – 31.12.1930

*[*]**డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! దళిత వర్గాలకు ప్రాతినిధ్యం వహించవలసిందిగా నాపై ఉంచబడిన బాధ్యత చాలా బరువైనదని మీరు అంగీకరిస్తారని నేను నమ్ముతున్నాను. దళితుల విషయం రాజకీయ దృక్పథంతో పరిశీలనకు రావటం ఇదే మొట్టమొదటి సారి అని నేను అనుకొంటున్నాను. దేశ రాజకీయ అభివృద్ధి సందర్భంగా పంపబడి భారత ప్రభుత్వం చేత రికార్డు చేయబడిన ప్రతి ఒక్క పత్రం లోనూ దళిత వర్గాల అశక్తతలు పేర్కొన బడ్డాయి. ఈ పత్రాలలో వారి కష్టాల గురించి పేర్కొనటమే జరిగింది. కాని ఆ కష్టాల విముక్తికి ఏ ఉపాయం సూచించ బడలేదు. ఆ సమస్యను అలా వదిలేయటమే జరిగింది. ఈ దృష్ట్యా, ఇంకా ఈ క్రింద చెప్పబోయే విషయాల దృష్ట్యా దళిత వర్గాల సమస్యల్ని వివరించటానికి నాకు ఇంకా ఎక్కువ సమయాన్ని ఇచ్చి ఉండవలసింది. ఇంతమంది సభ్యులు ఉన్న ఈ సంఘంలో 43 మిలియన్ల ప్రజల కష్టాల గురించి చెప్పటానికి కేవలం ఇద్దరమే ఉన్నాం. భారతదేశంలోని వేరే వర్గం దృష్టిలో చూసినా ఈ కష్టాలు నిరుపమానమైనవని సంఘం అంగీకరిస్తుంది. ఈ దృష్టితో చూస్తే నా బాధ్యత నిజంగా అపరిమితమైనది. అయితే సర్వసభ్య సమావేశంలో బహుశా ఇప్పుడు జరుగుతున్నట్లే జరుగుతుందని నేను ముందుగా ఊహించాను. ఆ విధంగా ఊహించే నేను, నా సహసభ్యుడు రావు బహదూర్ శ్రీనివాసన్, దళిత వర్గాలవారు భవిష్య రాజ్యాంగంలో ఎట్టి రాజకీయ భద్రతలను కోరుతున్నారో ఆ వివరాలను స్పష్టమైన భాషలో వ్రాతపూర్వకంగా ఈ సమావేశానికి సమర్పించటం ఉచితంగా ఉంటుందని భావించాను.

[+]ఆ వినతిపత్రంను సమర్పించటం, ఈ సంఘం సభ్యులకు పంపటం జరిగింది. అది అందరికీ అందిందని నేను ఆశిస్తున్నాను. దళిత వర్గాల గురించిన ఆ పత్రం సభ్యులందరికీ అంద జేయబడిన

---

* మూడవ ఉపసంఘం (అల్పసంఖ్యాకులు) చర్చలు, భారత ప్రభుత్వం, కేంద్ర ప్రచురణల శాఖ, కలకత్తా 1931, పుటలు 73-80. ఉపసంఘానికి ఇచ్చిన చర్చాంశాలు ఇవి – "అల్పసంఖ్యాకుల, ఇతర ప్రత్యేక వర్గాల ఇష్ట పూర్వకమైన సహకారాన్ని సంపాదించటానికి అవకాశం కల్పించబడాలి."

\+ ఈ వినతిపత్రం ఈ అధ్యాయానికి చివర ఒకటవ అనుబంధంగా చేర్చబడింది.

దృష్ట్యా నా అభిప్రాయాలను సంఘం ముందు ఉంచటానికి ఎక్కువ సమయం ఇవ్వవలసిందిగా అధ్యక్షులను కోరటం లేదు. సభ్యులకు ఇచ్చి ఉన్న పత్రంలోని విషయాలను నొక్కి చెప్పే ఉద్దేశంతో నా అభిప్రాయాలను సంక్షిప్తంగా మీ ముందుంచుతాను.

అయ్యా! నేను మొదటగా చెప్పే విషయం ఇది - భారతదేశంలో రాజకీయ గుర్తింపు పొందవలసి ఉన్న అనేక అల్పసంఖ్యాక వర్గాలు ఉన్నా, ఈ అల్పసంఖ్యాక వర్గాలన్నీ ఒకే స్థాయిలో లేవనీ, ఒకదానికంటె మరొకటి భిన్నంగా ఉన్నాయనీ మనం గుర్తించవలసి ఉంది. ప్రతి అల్పసంఖ్యాక వర్గాన్ని అధిక సంఖ్యాక వర్గంతో పోల్చి చూస్తే సాంఘిక స్థాయిలో అవి భిన్నంగా ఉంటాయి. ఉదాహరణకు భారత దేశంలో అతిచిన్నదైన పార్సీ వర్గాన్ని, అది అతి చిన్నదే అయినా అధిక సంఖ్యాక వర్గాలతో పోల్చి చూస్తే సాంఘిక హోదాలో అత్యున్నతమైనదిగా ఉన్నది.

దళిత వర్గాలను తీసుకొంటే, భారతదేశంలో అతి పెద్ద అల్పసంఖ్యాక వర్గమైన ముస్లిముల తరువాతి స్థానం వీరిదే అయినా సాంఘిక హోదాలో సాధారణ మానవుల సాంఘిక హోదా కంటె చాలా తక్కువగా ఉన్నది.

అల్ప సంఖ్యాక వర్గాలను, అవి అనుభవిస్తున్న సాంఘిక, రాజకీయ హక్కుల దృష్ట్యా విభజించినట్లయితే కొన్ని అల్ప సంఖ్యాక వర్గాలు, ఆ హక్కులను అనుభవిస్తున్నాయి. వాటి అల్ప సంఖ్యాక వర్గతత్వం అవి ఈ హక్కులను పూర్తిగా స్వేచ్ఛగా అనుభవించటానికి ఆటంకం కావటం లేదు. కాని దళిత వర్గాల విషయం తీసుకుంటే వారి పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉంది. కొన్ని విషయాల్లో వారికి ఏ హక్కులూ లేవు. ఎక్కడైనా కొన్ని హక్కులు ఉంటే అధిక సంఖ్యాక వర్గం ఆ హక్కుల్ని అనుభవించనీయదు.

కనుక అల్పసంఖ్యాక వర్గాలన్నీ ఒకే నౌకలోనే పయనిస్తున్నా ఆ నౌకలోనే అవి అన్నీ ఒకే తరగతికి చెందినవిగా లేవు అన్న ప్రధాన వాస్తవాన్ని మనం గుర్తుంచకోవలసిందిగా నేను ఈ సంఘానికి మొదట విన్నవిస్తున్నాను. కాని 'ఎ' తరగతిలో ప్రయాణిస్తుంటే, కొన్ని 'బి' తరగతి లోనూ మరికొన్ని 'సి' తరగతిలోనూ ప్రయాణిస్తున్నాయి. అయితే దళిత వర్గాలు, అల్పసంఖ్యాక వర్గాల వారే అయినా, మిగతా అల్ప సంఖ్యాక వర్గాలతో బాటే ప్రయాణిస్తున్నా అవి కనీసం 'సి' తరగతిలో కాని 'డి' తరగతిలో కాని లేవు. పడవ లోతట్టు భాగంలో ఉన్నాయనటంలో నాకే మాత్రం సందేహం లేదు.

కొన్ని విషయాల్లో దళిత వర్గాల స్థానం భారత దేశంలోని ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వారి స్థానంతో సమానంగా ఉన్నదనే అభిప్రాయాన్ని నేను అంగీకరిస్తాను. మిగతా అల్ప సంఖ్యాక వర్గాలతోబాటు దళిత వర్గాల భయం ఇది - భారత దేశపు ఏ భవిష్యత్ రాజ్యాంగం ద్వారానైనా అధిక సంఖ్యాకుల పరిపాలనే స్థాపించబడుతుంది. అధిక సంఖ్యాకుల పరిపాలన సంప్రదాయవాదులైన హిందువుల పరిపాలనగా ఉంటుందనటంలో ఈషణ్మాత్రం కూడా సందేహం లేదు. ఈ అధిక

సంఖ్యాకుల నమ్మకాలూ, దురభిమానాలూ, న్యాయం, సమానత స్వచ్ఛమైన అంతఃకరణల నిర్దేశాలను అతిక్రమించేవిగా ఉండే అపాయం ఎంతగానో ఉంది. చట్టాల విషయంలో గాని, పరిపాలనా విషయంలోగాని, ఇతర సార్వజనిక పౌరహక్కుల విషయంలో గాని అల్ప సంఖ్యాకుల యెడ విచక్షణ చూపే అపాయం కూడా ఎంతగానో ఉంది. కనుక అల్ప సంఖ్యాక వర్గాలు భయ పడుతున్న విచక్షణ నుండి వారి స్థితికి రక్షణ కల్పించవలసిన అవసరం ఉంది.

ఆ ఉద్దేశంతో అడుగుతున్నది అల్ప సంఖ్యాకులకు శాసనసభల్లోనూ, కార్య నిర్వాహక వర్గంలోనూ ప్రాతినిధ్యం ఉండాలని. దేశంలోని సార్వజనిక సేవా రంగాల్లో ప్రాతినిధ్యం ఉండాలి. అధిక సంఖ్యాకులు చట్టాలు చేయటానికి తమకు గల అధికారాలను, ఒక పౌరుడికి మరొక పౌరుడికి మధ్య విచక్షణ చూపే చట్టాలను చేయటానికి ఉపయోగించుకోవటానికి వీలు లేకుండా ఉండే విధంగా భవిష్యత్తులో రాబోయే కేంద్ర, రాష్ట్ర రాజ్యాంగాల్లో కొన్ని పరిమితుల్ని విధించాలి. విచక్షణకు గురయ్యే ప్రమాదం అన్ని అల్ప సంఖ్యాక వర్గాలకూ సమానంగా ఉంది. దళిత వర్గాల ప్రతినిధిగా నేను ఈ విషయమై ఇతర అల్ప సంఖ్యాక వర్గాల కోరికతో చేతులు కలుపుతున్నాను.

అయ్యా, ఇప్పుడు నేను భారతదేశంలో అల్పసంఖ్యాక వర్గాలను, దళిత వర్గాలను గుర్తించే పరిస్థితుల విషయానికి వస్తాను. భారతదేశంలో దళిత వర్గాల స్థితి అల్ప సంఖ్యాక వర్గాల స్థితికంటె భిన్నంగా ఉండే విషయాలు ఇవి – మొదటగా, ఇప్పుడున్న పరిస్థితుల్లో ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకు న్యాయబద్ధంగా ఉండే కొన్ని పౌరహక్కులు దళిత వర్గాలకు లేవు. మరో మాటలో చెప్పాలంటే ఇప్పుడున్న స్థితిలో దళిత వర్గాలు 'పౌర అనర్హత'లకు గురయి ఉన్నాయి. సమయాభావం వల్ల నేను ఒకటి, రెండు ఉదాహరణల్ని మాత్రం ఇస్తాను.

పోలీసు శాఖలో గాని, సైన్యంలో గాని ఉద్యోగావకాశాలను తీసుకోండి. కులం, జాతి, రంగు కారణంగా చక్రవర్తి పరిపాలనలో ఏ పౌరుడికీ ఏ సార్వజనిక సేవారంగంలో అయినా నియమించబడటానికి గల హక్కును తీసేయటానికి వీలు లేదని భారత ప్రభుత్వ శాసనంలో అవకాశం కల్పించబడింది. దీని ప్రకారంగా సమర్థుడైన, ఏ సార్వజనీక శాఖలో ఉద్యోగానికైనా నిర్దేశించబడిన పరీక్షలో ఉత్తీర్ణుడైన ప్రతి ఒక్క దళిత వర్గ వ్యక్తికీ సార్వజనిక సేవారంగంలో ప్రవేశించటానికి హక్కు ఉండాలనేది స్పష్టం. కాని మనకిప్పుడు కనిపిస్తున్నదేమిటి? ఇదీ మనకు కన్పిస్తున్నది. పోలీసు శాఖలో ఉద్యోగానికి ఏ దళిత వర్గ వ్యక్తి అయినా దరఖాస్తు చేసుకొన్నట్లయితే, అస్పృశ్యుడయిన కారణంగా ఏ దళిత వర్గ వ్యక్తినీ పోలీసు శాఖలో నియమించటానికి వీలు లేదని ప్రభుత్వ కార్య నిర్వాహక వర్గం అధికారులు ముఖం మీద చెప్తున్నారు. సైన్యం విషయంలో కూడా పరిస్థితి ఇదే. 1892 వరకూ దాదాపు మొత్తం మద్రాసు సైన్యం, దాదాపు మొత్తం బొంబాయి సైన్యము కూడా దళిత వర్గాలకు చెందిన వ్యక్తులతోనే కూడి ఉండేది. మద్రాస్ రాష్ట్రంలోనూ, బొంబాయి రాష్ట్రంలోనూ భారతీయ చరిత్రలోని అన్ని గొప్ప యుద్ధాల్లోనూ దళిత వర్గాల్లోని వ్యక్తుల సహాయంతోనే పోరాడారు. కాని 1892లో చేయబడిన నియమం లేదా శాసనం ప్రకారం సైన్యంలో దళిత వర్గాల ప్రవేశం నిషేధించబడింది. ఈ రోజుకీ శాసన

మండలిలో ఇలా ఎందుకు జరిగిందని ప్రశ్నిస్తే అస్పృశ్యత కారణంగా ఈ వర్గాల వారిని చేర్చుకోవటానికి అధికమించ వీలులేని ఇబ్బందులు ఎదురవుతున్నాయని జవాబు వస్తున్నది.

ఈ అన్యర్థత చట్టప్రకారం నిర్దేశించబడిన అనర్హతంత ప్రభావశాలిగా ఉన్నదని నేను నిశ్చయంగా చెప్పగలను. భారత ప్రభుత్వ చట్టంలో చక్రవర్తి యొక్క పేరు అందరికీ వారు నిర్దేశించబడిన విధంగా అర్హులైతే, ఉద్యోగాల్లోకి స్వేచ్ఛగా ప్రవేశం ఉంటుందనే విభాగం పైన చెప్పిన కారణం వల్ల పూర్తిగా నిరర్థకం చేయబడింది.

ఇంకా అనేక ఉదాహరణల్ని నేను ఇవ్వగలను. దళిత వర్గాలవారు ప్రయాణాల్లో సార్వజనిక భోజనశాలల్లో ప్రవేశానికి ఇబ్బందులు పడుతున్నారు. ఒక చోటి నుండి మరొక చోటికి ప్రయాణం చేసేటప్పుడు బస్సుల్లో ప్రవేశానికి ఇబ్బంది పడుతున్నారు. నిర్మాణ కార్యక్రమంలో తామే సహాయాన్నందించిన సార్వజనిక పాఠశాలల్లో ప్రవేశానికి ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. తాము పన్నులు చెల్లిస్తున్న తమ ఇంటికి కావలసిన నీటిని బావినుండి తోడుకోవటంలోనూ, ఇలా ఎన్నో విషయాల్లో వారు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. కాని నేనీ విషయాలన్నిటినీ పేర్కొననక్కర్లేదు. దళిత వర్గాల వారిని ఇతర అల్ప సంఖ్యాక వర్గాల నుండి వేరే చేసే ఒక ప్రత్యేక పరిస్థితి ఇది. చట్టం ప్రకారం నిర్దేశించబడినట్లు ప్రభావశాలిగా ఉన్న పౌర అనర్హతలకు వారు గురయి ఉన్నారు.

రెండోది, నా ఉద్దేశంలో అత్యంత అసహ్యమైన, భేదం, ప్రపంచంలో మరెక్కడా లేని సాంఘిక హింసకు దళిత వర్గాల వారు గురి కావటం. ఈ సందర్భంగా దళిత వర్గాల వారి పరిస్థితిని గురించి పరిశీలించటానికి 1928లో బొంబాయి ప్రభుత్వం నియమించిన ఒక సంఘం యొక్క నివేదిక నుండి ఒక చిన్న భాగాన్ని ఈ ఉపసంఘం ముందు చదవా లనుకొంటున్నాను. రాష్ట్రంలోని ఇతర పేరులతో సమానంగా అనుభవించటానికి చట్టం ద్వారా ఇవ్వబడిన హక్కులను అనుభవించటంలో దళిత వర్గాల వారు ఏమైనా ఇబ్బందులను ఎదుర్కొంటున్నారన్న విషయాన్ని కనుగొనటానికి ఆ సంఘం ప్రయత్నించింది.

"దళిత వర్గాలకు సార్వజనిక సదుపాయాలన్నిటికీ హక్కులను అందించటానికి అనేక ఉపాయాలను మేము సిఫారసు చేసినప్పటికీ ఆ హక్కులను వారు వినియోగించుకోవటానికి వారు చాలా కాలం వరకు చాలా ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వస్తుందని సందేహిస్తున్నాం. సాంప్రదాయ వర్గాల వల్ల వారిపై జరిగే బహిరంగ హింసాకాండ మొదటి భయం. ఏ గ్రామంలో అయినా దళిత వర్గాలు అల్పసంఖ్యాకులు వీరికి వ్యతిరేకంగా ఉన్న సంప్రదాయ వాదులు అధిక సంఖ్యాకులు. వీరు ఎట్టి పరిస్థితుల్లో అయినా, దళిత వర్గాల వల్ల జరుగుతుందని భావించే దాడి నుండి తమ ప్రయోజనాలను, ఘనతనూ కాపాడు కోవటానికి కృతనిశ్చయంతో ఉన్నవారు. పోలీసు వారు అరెస్ట్ చేస్తారనే భయంతో సంప్రదాయవాదులు హింసను ఉపయోగించటం తగ్గటానికి కారణం అయింది. తత్ఫలితంగా అటువంటి నేరాలు అరుదైనాయి.

"దళిత వర్గాల ప్రస్తుత ఆర్థిక పరిస్థితి వల్ల రెండవ ఇబ్బంది కలుగుతున్నది. రాష్ట్రంలోని చాలా భాగాల్లో దళిత వర్గాలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. సంప్రదాయ వాదుల పొలాల్లో వారి ఇష్టాన్ననుసరించి కొందరు వ్యవసాయం చేస్తున్నారు. సంప్రదాయ వాదుల చేత వ్యవసాయ కూలీలుగా నియమించబడి, ఆ సంపాదన మీద కొందరు బతుకు తున్నారు. మిగిలిన వారు గ్రామసేవకులుగా పనిచేసినందుకు ప్రతిఫలంగా సంప్రదాయవాదులు డబ్బుకు బదులు ఇచ్చే ఆహారం మీద గాని, ధాన్యం మీద గాని బతుకుతున్నారు. దళిత వర్గాలవారు తమ హక్కులను వినియోగించుకోవటానికి సాహసించినప్పుడు సంప్రదాయవాదులు వారిపై తమ ఆర్థిక బలాన్ని ఒక ఆయుధంగా ఉపయోగించి వారిని తమ పొలాల్లో నుండి పంపివేసి గ్రామసేవకులుగా వారికి రావలసిన ప్రతిఫలాన్ని నిలిపివేసిన ఎన్నో సంఘటనల్ని విన్నాం. దళిత వర్గాల వారిని అందరూ ఉపయోగించుకొనే మార్గాల్ని ఉపయోగించుకోనీయక పోవటం, నిత్యావసర సామగ్రుల్ని ఇవ్వకుండా గ్రామం బనియాను కట్టడి చేయటం వరకూ పోయేటంత వస్తృతంగా ఉండేది ఈ వెలి. దళిత వర్గాల వారిని ఈ విధమైన సామాజిక బహిష్కరణకు గురిచేయటానికి ఒక్కొక్కసారి చిన్న కారణాలు కూడా సరిపోయేవనటానికి సాక్ష్యం ఉంది. తరుచుగా దళితవర్గాలు సార్వజనిక బావి నుండి నీరు వాడుకునే హక్కును ఉపయోగించుకున్నప్పుడు ఈ బహిష్కరణ అములు చేయటం జరిగేది. అయితే, దళిత వర్గ వ్యక్తి జంధ్యాన్ని ధరించటం, వ్యవసాయ భూమిని కొను క్కోవటం, మంచి దుస్తులు ధరించటం, ఆభరణాలు ధరించటం, పెళ్ళి కొడుకును గుర్రం మీద కూర్చొని చెట్టా సార్వజనిక రహదారిలో పెళ్ళి ఊరేగింపు తీసుకుని వెళ్ళటం వంటి అల్పమైన నేరాలను కూడా అతి కఠినమైన బహిష్కరణను అమలు చేసిన సంఘటనలు తక్కువేమీ కాదు.

"దళిత వర్గాలను అణగదొక్కడానికి సామాజిక వెలికంటె బలమైన ఆయుధం మాకు తెలియదు. దీనికి మరణ సమానమైన, చాలా విస్తృతమైన ప్రభావం ఉండటం వల్ల బహిరంగ హింసాకాండ పద్ధతి దీనిముందు వెలా వెలా పోతుంది. స్వర్శా స్వాతంత్ర్య సిద్ధాంతం వంటి శాసన బద్ధమైన పద్ధతిగా చెలామణి కావటం వల్ల ఇది ఇంకా అపాయకరమైనది. దళిత వర్గాలవారి అభ్యున్నతికి అవసరమైన వాక్స్వాతంత్రం, క్రియాస్వాతంత్ర్యాలకు హామీ ఇవ్వాలనుకుంటే అధిక సంఖ్యాకుల ఈ నియంతృత్వాన్ని దృఢ హస్తంతో అణచి వేయటం అవసరం అని అంగీకరిస్తున్నాం."

దళిత వర్గాలవారు ఏ ఇతర వర్గం కంటె భయపడే మూడో అంశం – కొత్త శాసనసభలో వారికి ఏ విధమైన ప్రాతినిధ్యాన్ని ఇచ్చినా ఎప్పుడూ వారు అల్ప సంఖ్యాకులు గానే ఉంటారు. తత్ఫలితంగా, దళిత వర్గాల యెడల సంప్రదాయవాదులకు ఉండే అసహనం దృష్ట్యా, దళిత వర్గాలవారి ప్రయోజనాలు నిర్లక్ష్యం చేయబడటమో లేక వారి ప్రయోజనాలకు భంగకరంగా ఉండే ఏ చర్యనైనా తీసుకొనటమో జరిగే అపాయం ఉంది.

దళిత వర్గాలను ప్రభావితం చేసే ఈ ప్రత్యేక పరిస్థితులకు వ్యతిరేకంగా ఈ క్రింది భద్రతలను మేము ప్రస్తావిస్తున్నాం. మొట్టమొదటిది, "అస్పృశ్యత" అనేది అన్ని సార్వజనిక ప్రయోజనాలకు

న్యాయవిరుద్ధమైనదిగా ప్రకటించే ప్రాథమిక హక్కు రాజ్యాంగంలో పొందుపరచబడాలని మేము కోరుతున్నాం. రాజ్యాంగానికి మా సమ్మతిని తెలిపే ముందు ఈ సాంఘిక శాపం నుండి మాకు విముక్తి కలిగించాలి. రెండోది, ఆ ప్రాథమిక హక్కువల్ల ఇంత వరకూ జరుగుతూ వచ్చిన అనేక రకాల అనర్థతలూ, పక్షపాతాలూ చెల్లనివిగానూ, రద్దు చేయబడినవిగానూ కావాలి.తరువాత పైన నేను పేర్కొన్న సాంఘిక హింసకు వ్యతిరేకంగా చట్టం చేయబడాలి. అందుకుగాను ఇప్పుడు బర్మాలో ఉన్న శాసనం ఆధారంగా కొన్ని అంశాలను మేము పత్రంలో పొందుపరిచాం. ప్రస్తుతం నేను ఆ వివరాల జోలికి పోనక్కరలేదు. నియంతృత్వం లేదా అణచివేత చర్యలకు ప్రభుత్వ కార్య నిర్వాహక వర్గ అధికారుల్ని బాధ్యులుగా చేయాలని మేము కోరుతున్నాం. ప్రస్తుతం భారతీయ ప్రభుత్వపు చట్టం 110, 111 విభాగాలలోని ఆ బాధ్యత వాస్తవమైనది కాదు. ఇక చివరగా, నిర్లక్ష్యం పక్షపాత చర్యలకు వ్యతిరేకంగా కేంద్రప్రభుత్వానికి దాన్ని దాటి 'ప్రభుత్వ కార్యదర్శి'కి అప్పీలు చేసుకునే హక్కును కోరుతున్నాం. అంతేకాదు. మా భద్రతను భారత ప్రభుత్వం లోని ఒక ప్రత్యేక శాఖకు అప్పగించాలి.

సాధారణ దృష్టితో చెప్పాలంటే దళిత వర్గాల విషయాలు, వారుకోరుతున్న భద్రతలు వాటిలో చాలా ముఖ్యమైన విషయమైన 'శాసనసభలో తగినంత ప్రాతినిధ్యానికి సంబంధించిన వారి హక్కు'ను గురించి ఒకటి, రెండు మాటలు దళిత వర్గాలకు ప్రాతినిధ్యం ఇచ్చే విషయంగా ఆ ప్రాతినిధ్యం ఎన్నికల ద్వారా ఉంటుందే గాని నియామకం ద్వారా కాదనటంలో మనం ఏకాభిప్రాయాన్ని కలిగి ఉన్నాం. దళిత వర్గాల విషయంలో నియామక పద్ధతి హేయమైన ఫలితాన్ని ఇచ్చింది. ఈ పద్ధతి ఊహించని విధంగా దురుపయోగం గావించబడింది, దీనివల్ల, భద్రత చేకూరవలసిన దళిత వర్గాలకు నిజమైన స్వతంత్రమైన ప్రాతినిధ్యం ఎప్పుడూ లభించలేదు. కనుక ఎట్టి పరిస్థితుల్లోనూ దళిత వర్గాలవారు 'నియామకం ద్వారా ప్రాతినిధ్యం' అన్న పద్ధతిని అంగీకరించరు.

సంయుక్త నియోజక వర్గం లేదా స్వతంత్ర నియోజక వర్గం అన్న విషయమై మా అభిప్రాయం ఇది. మీరు మాకు నియోజన సార్వత్రిక ఓటు హక్కును ఇచ్చేటట్లయితే సంయుక్త నియోజక వర్గాలకు, రిజర్వ్‌డ్ స్థానాలకు అంగీకరించేందుకు మేము సిద్ధంగా ఉన్నాం. అయితే మమ్మల్ని మేము సంఘటితం చేసుకోవటానికి కొంత వ్యవధిని అడుగుతున్నాం. కాని మీరు వయోజన హక్కు మాకు ఇవ్వకపోయినట్లయితే మాకు ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ప్రాతినిధ్యం కావాలని మేము కోరుతున్నాం. ఇదీ మా అభిప్రాయం.

ఒక స్థానాల సంఖ్య విషయమై – ఖచ్చితంగా ఇన్ని స్థానాలు కావాలని చెప్పటం మాకు సాధ్యం కాదు కాని, ద్వేషపూరితమైన పక్షపాతాన్ని సహించమని మాత్రం చెప్పగలను. అందర్నీ సమానంగా పరిగణించాలని మేము పట్టుపడుతున్నాం. కాని నా అభిప్రాయంలో మొత్తం ప్రశ్న అంతే పరస్పర సంబంధంగల ప్రశ్న : ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వారికి కేటాయించబడే స్థానాలకు సంబంధించి, వాటిని లెక్కలోకి తీసుకోవటం ద్వారా మాత్రమే ఈ ప్రశ్నను నిర్ధారించగలము. అయితే, ఈ

సందర్భంగా నేను రెండు అంశాల్ని చెపుతాను. మొదటి అంశం – దళిత వర్గాలమైన మేము హిందువుల నుండి పూర్తి విభజనను డిమాండ్ చేస్తున్నాం. అది మొదటి విషయం. రాజకీయ ప్రయోజనాల కోసం మమ్మల్ని హిందువులుగా పరిగణిస్తున్నారేగాని సాంఘికంగా మేము తమ సోదరులంగా హిందువులు ఎప్పుడూ గుర్తించలేదు. మా సంఖ్యతోనూ, మా ఓటు బలం తోనూ రాజకీయ ప్రయోజనాన్ని వారు పొందారే గాని దాని నుండి అందుకుగాను మేము పొందిన లబ్ధి ఏమీ లేదు. హిందువులుగా పరిగణించని వారితో కూడా ప్రవర్తించనంత చెడ్డగా వారు మాతో వ్యవహరించారు. కనుకనే మేము ఈ విధంగా కోరుతున్నాం.

రెండవ విషయం. 'వెయిటేజ్'కి సంబంధించినది. నా ఉద్దేశంలో ఇది దుర్వినియోగం గావించబడిందని నేను స్పష్టంగా చెపుతున్నాను. నేను ఈ వెయిటేజి సిద్ధాంతానికి వ్యతిరేకిని. నేను అన్ని పరిస్థితుల్లోనూ ప్రతి అల్ప సంఖ్యాక వర్గం ఆ వర్గం జనాభా యొక్క నిష్పత్తికి సేమితం కావాలన్న సిద్ధాంతాన్ని నేను అంగీకరించను. ఒకానొక అల్ప సంఖ్యాక వర్గం ఎంతో చాలా చిన్నది కావటం వల్ల ఆ వర్గం యొక్క జనాభా నిష్పత్తి వల్ల లభించే ప్రాతినిధ్యం ఆ వర్గం భద్రతకు తగినంతగా ఉండక పోవచ్చు. అది ఏ ఫలితమూ లేని ప్రాతినిధ్యమే అవుతుంది. కనుక మీరు అల్ప సంఖ్యాకులకు నిజంగా తగినంతగా రక్షణ కల్పించాలనుకొంటే కొన్ని సందర్భాల్లో వెయిటేజి సిద్ధాంతాన్ని అంగీకరించాలి కాని వెయిటేజి పంపిణీ ఒక సమాన పద్ధతిలోనూ, స్పష్టత తోనూ కూడినదిగా ఉండాలి. మా అభిప్రాయంలో వెయిటేజీని ఈ క్రింది పరిస్థితుల్లో అంగీకరించాలి. అల్ప సంఖ్యాక వర్గం సంఖ్యా విషయకంగా తక్కువగా ఉండటం లేదా సాంఘిక స్థాయి తక్కువగా ఉండటం లేదా ఇతరుల్తో పోల్చి చూస్తే విద్యాస్థాయిలో వెనకబడి ఉండటం లేదా ఇరు వర్గాలతో పోరాడటానికి అవసరమైన ఆర్థిక బలం లేకపోవటం.

***సభ్యుడు :*** ఇది చాలా సరైన అంశం.

***డా॥ అంబేద్కర్ :*** కాని రాజకీయ ప్రాముఖ్యాన్నిబట్టో, విశ్వాసపాత్రతను బట్టో సామ్రాజ్యానికి గాని, బ్రిటిష్ ప్రభుత్వానికి గాని చేసిన సేవల్ని ఆధారంగా తీసుకునో వెయిటేజిని అనుమతిస్తారేమో నాకు అర్థం కావటం లేదు మనం అటువంటి సిద్ధాంతాన్ని పాటిస్తే చాలా క్లిష్టమైన పరిస్థితుల్లో పడిపోతాం. ఇక ఆ పరిస్థితుల నుంచి బయట పడడటం చాలా కష్టమవుతుంది.

కేంద్ర శాసనసభలో దళిత వర్గాల ప్రాతినిధ్యాన్ని గురించిన విషయం. కేంద్ర శాసన సభ సభ్యుల్ని ఎన్నుకోవటానికి వయోజన ఓటు హక్కు ఇచ్చినట్లయితే దళిత వర్గాల వారు శాసన సభలో ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని కోరుకుంటారు. ఈ సందర్భంలో వారికి కేటాయించే స్థానాలు ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వారికి కేటాయించే స్థానాలవలె ఉండాలి. కాని ప్రాతినిధ్యానికి మీరు కల్పించే ఓటుహక్కు ఉన్నత లేక అత్యున్నతమైనది, ఆస్తి ఆధారంగా గలది అయి, దళిత వర్గాల వారిని పూర్తిగా మినహాయించేటంత ఉన్నతమైనదైతే, దళిత వర్గాల వారు తమ వర్గాలవారితో కూడిన,

రాష్ట్ర శాసన సభ, మునిసిపాలిటీలు, స్థానిక, జిల్లా బోర్డులలోని సభ్యులతో ఏర్పడిన నియోజక గణం ద్వారా పరోక్షంగా ఎన్నికయ్యే పద్ధతిని కోరుకుంటారు. దళిత వర్గాల వారికి సంబంధించినంత వరకు నేను చెప్పవలసింది ఇంతే.

నేను చెప్పవలసినదంతా చెప్పిన తర్వాత ఉపసంహారంగా ఒక విషయాన్ని చెప్పాలను కొంటున్నాను. ఈ పరిస్థితి అంతటికీ వాస్తవంగా కీలకమైనది అల్పసంఖ్యాక వర్గాల ప్రాతినిధ్య విషయం. భారతదేశానికి అధినివేశ స్థాయినిచ్చే, లేదా 'ప్రజలచేత, ప్రజలకొరకు, ప్రజల పేరుతో అని పిలవకోరుతున్న రాజ్యాంగాన్ని పొందటానికి అల్పసంఖ్యాక వర్గాల వారందరూ తమతో కలవాలని అధిక సంఖ్యాక వర్గాలవారు కోరుతున్నట్లయితే, అల్పసంఖ్యాకవర్గాల వారి భయాలను అధిక సంఖ్యాక వర్గాల వారు పోగొట్టాలని నేను అభిప్రాయపడుతున్నాను. లేక పోతే అధినివేశ రాజ్య ప్రతిపత్తిని కోరుకోవటంలో మనందరం తీసుకొంటున్న సాహసాన్ని తీసుకోవటం సాధ్యం కాదు.

## 5వ సమావేశం : 14.1.1931

**అధ్యక్షుడు :** ఇప్పుడు చేసిన ప్రస్తావన పరిస్థితులను పూర్తిగా మార్చి వేస్తుండటం వల్ల మన ముందున్న ముసాయిదా నివేదికకు అంగీకరించటం అసాధ్యం అవుతున్నది. మీరు అంగీకరించినట్లయితే ఈ ఉపసంఘాన్ని వాయిదా వేసి, నేను అధ్యక్షత వహించి మీలో ప్రత్యేక ఆసక్తి ఉన్నవారందరినీ కలిపాలనీ, డా॥ అంబేద్కర్‌ను చేర్చాలనీ అనుకొంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, ధన్యవాదాలు.

***ఛైర్మన్ :*** మనం ఆయనను చేర్చుకొని, మన అభిప్రాయాలను పరస్పరం వ్యక్తం చేయటం ద్వారా ఒక అంగీకారానికి మనం రాలేమా అనేది చూడవలసి ఉంది.

***సర్.డి.సి. మిత్తర్ :*** అయ్యా, నేను ఆ చర్చల్లో పాల్గొనాలనుకొంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అయినప్పటికీ పంజాబు, బెంగాల్ ఇంకా ఇతర చోట్ల ఉన్న చాలా ఇతర వర్గాల వారిని లెక్కలోకి తీసుకోలేదని నాకు అనిపిస్తున్నది. ఈ వర్గాల వారందరూ సిక్కులు, మహమ్మదీయులు, హిందువులు (40-20). ఈ విధంగా తీసుకున్నట్లయితే ఇతరులకు ఇక మిగిలేది ఏముంటుంది? వారిని పరిగణనలోకి తీసుకోవాలా అక్కర్లేదా? ప్రధానమంత్రిగారూ ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న.

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** ఈ వివాదంలో నాదొక విన్నపం. చాలా వినయపూర్వకమైన విన్నపం. డా॥ అంబేద్కర్ ఇప్పుడు చెప్పిన దానిని నేను బలపరుస్తున్నాను. మీరు రాజకీయ రూపాయను తీసుకుని 15 అణాలు 9 దమ్మిడీలను అధిక సంఖ్యాకులకిచ్చి, మిగిలిన 3 దమ్మిడీలను, ఆ 3 దమ్మిడీల కోసం పెనుగులాడే విధంగా అల్ప సంఖ్యాకులకు వదిలేయరని నిశ్చయంగా అనుకొంటున్నాను. చిన్న వర్గాల వారి పక్షాన ఈ పంపిణీలో మనకు కొంత అధికారం ఉండాలని నా ఉద్దేశం.

**ఛైర్మన్ :** అది సరైన అభిప్రాయం. ఈ విషయాన్ని మరొక చిన్న సంఘంతో మరి కొంత అనధికారికంగా కలుపుగోలుగా చర్చిస్తే బాగుంటుందని నా ఉద్దేశం.

**ఫుట్ :** మరి విషయాలను రాసుకోనక్కర్లేదా?

**ఛైర్మన్ :** మీరు ఒప్పుకొన్నట్లయితే నేను అధ్యక్షత వహించి సర్ మహమ్మద్ షఫీ చేసిన ఆశావహ సూచన వల్ల ఉద్భవించిన పరిస్థితిని చక్కదిద్దటానికి ఏమి చెయ్యగలమో చూద్దాం.

## ఆరవ సమావేశం : 16.1.1931

• **అధ్యక్షుడు :** "రాజ్యాంగంలో అనేక వర్గాల సాంస్కృతిక, మత జీవనానికి సంబంధించి భద్రత చేకూర్చే విధంగా ప్రాథమిక హక్కుల ప్రకటనను పొందు పరచుట, జాతి వివక్షత లేకుండా ప్రతి ఒక్క వ్యక్తికీ స్వతంత్రంగా హక్కుల్ని వినియోగించుకొనే....."వగైరా.

**రాజా నరేంద్రనాథ్ :** "స్వతంత్ర, సమాన హక్కుల వినియోగం " అని నేను అంటున్నాను.

**అధ్యక్షుడు :** "అతని లేదా ఆమె ఆర్థిక, సామాజిక, పౌరహక్కులు".

**రాజా నరేంద్రనాథ్ :** "అతని లేక ఆమె" అనేది అవసరం అని నేననుకోను. "పౌరులచేత ఆర్థిక, సామాజిక, పౌరహక్కుల స్వతంత్ర సమాన వినియోగం" అని అనకూడదా? అయితే ఈ విషయమై నేను పట్టుపట్టను.

**అధ్యక్షుడు :** "సమాన" అనేది ప్రధానం. మిగతా విషయాలు అంత ప్రధానమైనవని నేననుకోను.

**రాజా నరేంద్ర నాథ్ :** "స్వతంత్ర సమాన వినియోగం" అనాలని నా సలహా.

**అధ్యక్షుడు :** వాస్తవానికి అది డా॥ అంబేద్కర్ నుండి రావలసిన ప్రశ్న.

**రాజా నరేంద్రనాథ్ :** "సమాన" అన్న పదాన్ని డా॥ అంబేద్కర్ తమ ఉపన్యాసంలో వాడారు.

**సర్.ఎం.షఫీ :** "స్వతంత్ర" అన్న పదంతో ఆ భావం వస్తుందనుకొంటాను.

***డా॥ షఫాలీ అహ్మద్ ఖాన్ :*** అది ఇప్పుడున్న విధంగానే ఉండాలని నేననుకొంటున్నాను.

**అధ్యక్షుడు :** "స్వాతంత్ర్య వినియోగానికి ప్రతి ఒక్క వ్యక్తికీ.... అందజేయడానికి " అని ఉంది. సమాన వినియోగం అన్నదాన్ని అందజేయలేరు. ఎందుకంటే 'సమాన' అనేది హక్కులను ఉపయోగించుకొనే వ్యక్తికే సంబంధించినది.

**రాజా నరేంద్రనాథ్ :** హక్కులలో సమానత – సమాన హక్కులు అని నా ఉద్దేశం.

---

• మూడవ ఉపసంఘం (అల్పసంఖ్యాకులు) చర్చలు, పుటలు 129–31. పుటలు

**చింతామణి :** "సమాన" అన్న దానిలోని ప్రత్యేక ఔచిత్యం నాకు అర్థం కావటం లేదు.

**రాజా నరేంద్రనాథ్ :** డా॥ అంబేద్కర్ ప్రతిలో అది వాడబడింది.

**అధ్యక్షుడు :** ప్రతిఒక్క వ్యక్తికీ అతని హక్కుల వినియోగానికి అవకాశం కల్పించవచ్చు. సమానత అన్నదానికి అనుగుణంగా అతడు ఉపయోగించుకోకపోతే అది అతనికి సంబంధించింది. ప్రభుత్వానిది కాదు.

**రాజా నరేంద్రనాథ్ :** చాలా బాగున్నది.

**అధ్యక్షుడు :** "అతని లేదా ఆమె" అనేది ఉండవచ్చని నేననుకొంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** "హక్కులు" అన్న పదం తర్వాత పేరాగ్రాఫ్ చివర "వివక్షత లేకుండా" అన్న పదాన్ని చేర్చాలని భావిస్తున్నాను.

**అధ్యక్షుడు :** "జాతి, కుల, మత సంప్రదాయ, అంగవివక్షతలు లేకుండా" అని ఇప్పటికే ఉంది.

**డా॥ అంబేద్కర్ :** "అస్పృశ్యత" అన్న పదాన్ని మీరు అక్కడ చేర్చండి.

**అధ్యక్షుడు :** ....... "అస్పృశ్యత!" జాతి, కులం అన్న పదాలు ఉన్నాయి గదా.

**డా॥ వలాండీ :** అది సరిగ్గా ఉన్నదని నాకు అనిపిస్తున్నది.

**డా॥ అంబేద్కర్:** విషయాలను మరింత స్పష్టం చేయటానికి ఆ పదాన్ని చేర్చవచ్చని నా ఉద్దేశం.

**అధ్యక్షుడు :** రచనా పద్ధతిని చూసి ప్రజలు నవ్వేటటువంటి పత్రాన్ని మనం తయారు చేయ్యకూడదు.

**డా॥ అంబేద్కర్ :** కులం, అస్పృశ్యత అన్న వాటి మధ్య గల భేదాన్ని మనం గుర్తించి తీరాలని నా ఉద్దేశం. కులం ఉన్న చాలామంది వ్యక్తులు అస్పృశ్యత వలన వచ్చే కష్టాలు అనుభవించటం లేదు.

**రాజా నరేంద్రనాథ్ :** ముస్లిమ్‌లకు కూడా కులం ఉంది.

**దివాన్ బహదూర్ రామచంద్రరావు :** అస్పృశ్యులలో కులం ఉంది. "కులం" అనేది విస్తృతమైన భావం గల పదం.

**వుట్:** అతిప్రధానమైన మార్పును సూచిస్తే తప్ప మార్చటానికి ఈ దశ చాలా ఆలస్యమైనదని నాకు అనిపిస్తున్నది.

**డా॥అంబేద్కర్:** "అస్పృశ్యత వల్లగాని, మరో విధంగా గాని, సామాజిక, పౌరహక్కులు" అని ఉండాలని నా అభిప్రాయం.

**అధ్యక్షుడు :** అస్పృశ్యత అనేది సాంఘిక హక్కులను ఉల్లంఘించటం, సారభూతంగా ఉండేట్లుగాక

పదాల మీద పదాలను పేర్చుకుంటూ పోతే అది మినహాయింపు సిద్ధాంతానికి ప్రత్యేక అన్వయాన్ని ఇస్తే విషయాన్ని అది సంకుచితం చేస్తుంది. ఒక నిర్దిష్టమైన ఇబ్బందికి అన్వయించి నప్పటికంటె, సాధారణ సిద్ధాంతానికి బలాన్ని ఇచ్చినట్లయితే, అన్వయానికి సంబంధించినంత వరకూ మీరు భద్రంగా ఉంటారు.

***డా॥ అంబేద్కర్ :*** అది నిజమే. కాని అన్వయం చేయవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చు. ఈ నివేదికను ఎవరు ఉపయోగించినా ఉపసంఘం అస్పృశ్యత కారణంగా ఎట్టి అనర్హతనూ విధించటం లేదని అర్థం చేసుకోవాలి.

***అధ్యక్షుడు :*** అటువంటి సందర్భాల్లో, ఏదైనా సందేహం కలిగినట్లయితే సంఘం అభిప్రాయాన్ని తీసుకొని నిర్ణయిస్తాను. డా॥ అంబేద్కర్, మీరు ఇంకా పట్టుపట్టలేరా?

***డా॥ అంబేద్కర్ :*** పట్టు పట్టవలసి వస్తుందనే నేను అనుకొంటున్నాను. ఈ విషయాన్ని నేను స్పష్టం చేయాలని కోరుతున్నట్లు నా అనంగీకారాన్ని వ్రాత పూర్వకంగా ఉంచండి. 'భేదం' అన్న పదానికి బదులు 'వివక్షత' అన్న పదాన్ని వాడాలని ఒక సలహా ఇవ్వబడింది. అప్పుడు "జాతి, కుల వగైరా వివక్షతలు" లేకుంటే అని ఉంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** అది సరిపోతుంది..

***అధ్యక్షుడు :*** అది సరిపోతుందా?

***డా॥ అంబేద్కర్ :*** అది సరిపోతుంది. "ఏ వివక్షతా లేకుండా" అన్నది చివర చేర్చబడాలని నా అభిప్రాయం.

***అధ్యక్షుడు :*** అయితే దయచేసి మీరు ఆ మార్పు చేస్తారా? అప్పుడు "వివక్షత లేకుండా" అని ఉంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** అవును.

***అధ్యక్షుడు :*** అది చక్కని సవరణ. మరొకటి ఏదైనా సరిగా ఉండేది కాదు.

** ***డా॥ అంబేద్కర్ :*** అయ్యా, ఈ సంఘం ముందు విభిన్న వర్గాల వారుంచిన కోరికలను మూడవ పేరాగ్రాఫ్ సంక్షిప్తంగా తెలియజేస్తుందనుకొంటాను.

***అధ్యక్షుడు :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** అయితే, తమ పరిస్థితి ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి స్థితి కంటె భిన్నమైనది గనుక ప్రత్యేకంగా తమ ప్రయోజనాల కోసం దళిత వర్గాలు చేసిన ఇతర డిమాండ్లను చేర్చాలని నా

* మూడవ ఉపసంఘం చర్చలు (అల్ప సంఖ్యాకులు), పుటలు 133–35.

ఉద్దేశం. ఈ సంఘం అంగీకారాన్ని పొందిన ప్రస్తావనగా దానిని చేర్చాలని నా ఉద్దేశం కాదు. సంపూర్ణత కోసం ఆ కోరికలను చేర్చాలి. కనక ఈ పేరాగ్రాఫ్‌లో "హక్కులు" అన్న పదం తర్వాత ఇప్పుడు నేను చెప్పబోయే పేరాగ్రాఫ్‌ని చేర్చాలని నా అభిప్రాయం. "దళిత వర్గాల వారు అస్పృశ్యతను, దాని ఫలితంగా ఉండే అన్ని అర్హతలతో సహా, చట్ట బద్ధంగా రద్దు చెయ్యాలి. వారి హక్కులను వారు స్వతంత్రంగా ఏ బంధనాలూ లేకుండా అనుభవించటానికి హామీ ఇవ్వాలి: వారి ప్రయోజనాలకు సంబంధించిన వివక్షత లేదా నిర్లక్ష్యానికి వ్యతిరేకంగా గవర్నర్ జనరల్‌కు గాని, ప్రభుత్వ కార్యదర్శికి గాని అప్పీలు చేసుకొనే హక్కు వారికి ఉండాలి."

**అధ్యక్షుడు :** కాని చూడండి. వివరాలను రూపొందించేటప్పుడు ఈ సలహాలు కార్యరూపం ధరించే విధంగా చేయవచ్చును.

***డా॥ అంబేద్కర్ :*** అర్థమైంది. శాసన సంబంధంగా కొంత, పరిపాలనా సంబంధంగా కొంత కాని నేను చెప్పాలనుకొంటున్నది ఇది. వివిధ వర్గాలవారు తన ముందించిన విషయాల్ని సంఘం సంక్షిప్తం చేస్తున్న దృష్ట్యా, ఇతర వర్గాలకు అవసరమైన వాటి కంటె భిన్నమై ప్రత్యేకంగా తమ కొరకే దళిత వర్గాల వారు సమర్పించిన విషయాన్ని సంపూర్ణత కోసం తప్పకుండా తీసుకోవలసి ఉంటుంది.

**అధ్యక్షుడు :** కాని " వివక్షత లేకుండా" వగైరా అని ఉన్నది.

***డా॥ అంబేద్కర్ :*** ప్రధానిగారూ! క్షమించండి, ఏ వ్యక్తి విషయంలోనూ వివక్షత చూపటం జరగదనీ, ప్రతిమనిషీస్వతంత్రంగా అనుభవించేటందుకు హామీ ఇవ్వబడుతుందనీ రాజ్యాంగంలో పేర్కొనటం ఒక విషయం కాని నిజానికి మేము కఠినమైన వాస్తవాల్ని ఎదుర్కొన వలసి వస్తున్నది. మాకు రాజ్యాంగం ద్వారా లభించిన హక్కుల్ని ప్రజలు మమ్మల్ని అనుభవించనీయటం లేదు. నా అస్తిత్వం విషయంలో నేనెంత నిశ్చయంగా చెప్పగలనో ఈ విషయంలోనూ అంతే నిశ్చయంగా చెప్పగలను. కేవలం కాగితంపై హామీలు నాకు అక్కరలేదు. మొత్తం వర్గం అంతా మీకు వ్యతిరేకం అవుతుంది. మాకు ఇవ్వబడిన దానిలో పదోవంతును కూడా ఎప్పటికీ అనుభవించలేము. కనుక ప్రతి ఒక్క వర్గానికి ఉన్నట్లే మాకూ ప్రత్యేక హక్కులు ఉంటాయని రాజ్యాంగం ప్రకటించాలని నేను కోరుతున్నాను, అంతేకాదు ఆ హక్కుల్ని ఉపయోగించుకోవటానికి మార్గాలను కూడా కల్పించాలి.

**అధ్యక్షుడు : :** ఒక వేళ శాసన సభ మీకు అనుకూలంగా చట్టాన్ని చేయక పోతే రాజ్యాంగాన్ని భంగం చేయటం జరుగుతుంది. అదీ విషయం.

***డా॥ అంబేద్కర్ :*** నా అభిప్రాయం ఇది – తాను అందరికీ పంపిన పత్రంలో మా హక్కులను మేము ఉపయోగించుకోవటంలో మాకు రక్షణ కల్పిస్తాయి అనుకున్న కొన్ని మార్గాల్ని సూచించాను. ఇది సరైన పద్ధతి కాదని ఇక్కడున్న సంఘం భావించవచ్చు. ఇలా చేయటానికి ఇతర మార్గాలున్నాయని సంఘం భావించవచ్చు. ఈ ఇతర మార్గాల్ని పరిశీలించటానికి నేను సిద్ధంగా ఉన్నాను. తమకు ఇతర మార్గాల వారితో సమాన స్థాయి ఉన్నదని ఊరికే ప్రకటించే ఈ ప్రకటనలో దళిత వర్గాల వారు తృప్తి

పొందలేరని, వారు సూచించినట్లు ఈ పత్రంలో పేర్కొనబడాలని నేను కోరుతున్నాను. వారికి ఆ హక్కులు రాజ్యాంగం ద్వారా ఇవ్వబడాలని వారు బలంగా చెప్తున్నారు. ఇంతకు మించి నేనేమీ కోరటం లేదు. అది నివేదిక సమగ్రంగా ఉండాలని. మీకు సమర్పించిన పత్రంలో అందుకుగాను నేను ఒక మార్గాన్ని సూచించాను.

**ఫుట్:** డా॥ అంబేద్కర్‌పై సానుభూతి ఉన్నప్పటికీ ఈ విషయంలో నాకు ఒక ఇబ్బంది కనిపిస్తున్నది. మీ స్థితిని గురించి ఒక ప్రకటన ఇవ్వటం ప్రారంభిస్తే పూర్తి వివరణ ఇవ్వవలసి ఉంటుంది. ఇప్పటి వరకు కావాలనుకొన్నవాటిని నోట్స్‌లో చేర్చటం జరిగింది. తిరిగి 16వ పేరా గ్రాఫ్ చివరలో సాను భూతి పూర్వకంగా వాటిని గురించి సూచించటమూ జరిగింది. మీరు ఏ కోరికనైనా చేర్చినట్లయితే, ఆ విషయమై ఈ పత్రంలో పూర్తి వివరణతో చేర్చలేక పోయే ప్రమాదం ఉండవచ్చునని నాకు అనిపిస్తున్నది.

***డా॥ అంబేద్కర్ :*** 16వ పేరాగ్రాఫ్‌లోని చివరి రెండు వాక్యాలు దళిత వర్గాలకు కేటాయించబడవలసిన స్థానాన్ని గురించి మాత్రమే సూచిస్తున్నాయి. అది పూర్తిగా వేరే విషయం. నేను చెప్పదలచుకుంటున్నది ఇది. రాజ్యాంగం నాకు కొన్ని హక్కుల్ని ఇవ్వవచ్చు. కాని భారత దేశంలోని 99 శాతం మంది ప్రజలు ఆ హక్కులను అనుభవించనీయరు. నా హక్కులను భంగ పరచిన వారిని శిక్షార్హులుగా చేసే అవకాశాన్ని రాజ్యాంగం కల్పించకపోతే కాగితాలపైన మాత్రం ఉండే ఆ హక్కుల వలన నాకు ప్రయోజనం ఏమిటి? నేను చెప్పాలనుకొంటున్నది ఇది. ఈ సమావేశం నా ప్రస్తావనను అంగీకరించాలని నేను పట్టుపట్టటం లేదు. ఈ ఉపసంఘంలో దళిత వర్గాల వారి పక్షాన నేను చెప్పిన విషయాలు ఈ రాజ్యాంగంలో పూర్తిగా చేరే విధంగా చేయాలని మాత్రమే నేను కోరుతున్నాను.

**అధ్యక్షుడు :** మీ అభిప్రాయంపై మాకు పూర్తిగా సానుభూతి ఉంది. దానిని బలపరచటానికి కూడా మేము సిద్ధంగా ఉన్నాం. కాని ప్రాథమిక హక్కులను ప్రకటిస్తూ ఒక పేరాగ్రాఫ్‌ను రాజ్యాంగంలో ఉంచటానికి, ఆ ప్రాథమిక హక్కుల్ని ఉపయోగించుకునే శాసనాల్ని చేర్చటానికీ గల భేదం వాస్తవమైనది. రాజ్యాంగం అమలు జరపబోయే శాసనాల్ని గురించి వివరమైన ప్రకటనను అందులో చేర్చలేము. మీరు ఇటువంటి సందర్భంలో చేయవలసింది ఇది. మీకు ప్రాతినిధ్యం లభించినప్పుడు, మీ రాజ్యాంగంలో మీ హక్కులను గురించిన, సవివరం కాని ప్రకటనని చేర్చుకొన్నప్పుడు మీ ప్రజల ప్రతినిధిగా ఇతరులతో సహరిస్తూ శాసన సభలో మీరు ప్రకటనను అమలు చేస్తుంది అనుకునే విధంగా ఒక చట్టాన్ని చేయవలసి ఉంటుంది. ఎందుకంటే మీరు రాజ్యాంగంలో వివరాల రూపంలో ఇంకా అధికంగా చేర్చి, వాటిని అమలు జరపక పోతే రాజ్యాంగాన్నే అమలు చేయనట్లవుతుంది. కనుక ఆ పద్ధతి ఆచరణ సాధ్యం కాదు.

***డా॥ అంబేద్కర్ :*** నేను చెప్పదలచుకొన్నది ఇది. ప్రాథమిక హక్కుల ఈ ప్రకటన ఫలితం లేని దన్న విషయంలో నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. వ్యక్తిగతంగా నేను దానికి ఏ ప్రాధాన్యాన్నీ

ఇవ్వను. ఎందుకంటే ఏ వ్యక్తికైనా తన హక్కులను ఉపయోగించుకొనే అవకాశం కావాలి కాని తన హక్కుల్ని ప్రకటింప చేసుకోవటం కాదు. హక్కులకు ప్రకటనలో ఉండే ప్రభావశాలియైన హామీ అది కనుక నాకు అపకారం జరిగినప్పుడు నాకు రక్షణ కలగటానికి రాజ్యాంగంలో ఏదో ఒక మార్గం ఉండాలని నేను కోరుతున్నాను. ఊరికే "అస్పృశ్యత లేదు" వగైరా అనటం వల్ల ఏమీ ప్రయోజనం లేదు.

**అధ్యక్షుడు :** వాస్తవానికి ఈ విషయం స్పష్టంగా మన మనస్సుల్లో ఉన్నది గనుక దాన్ని తిరిగి చెప్పనవసరం లేదు. కాని చట్ట ప్రకారం అమలు చేయ గలిగితే తప్ప కేవలం రాజ్యాంగంలో ప్రకటన వల్ల ప్రయోజనం లేదని డా॥ అంబేద్కర్ అంటున్నారు. దానిని చట్టబద్ధంగా అమలు చేయటానికి జరిమానాలను, నేరాలను రూపిందిస్తూ శాసనాలు చెయ్యవలసి ఉంటుంది. నేరాలు ముందు, శిక్షలు తరువాత, ఈ విధమైన ఒక నేరాన్ని మీరు సృష్టించలేరు. రాజ్యాంగాన్ని రూపొందిస్తున్నప్పుడు మీ రాజ్యాంగానికి ఉపోద్ఘాత పూర్వకమైన అంశాన్ని, రాజ్యాంగ బద్ధంగా మీకు లభించే హక్కుల కంటె ఎక్కువ హక్కులు లభించే విధంగా నేరాన్ని సృష్టించే రీతిలో నేను, కాదు మీరు చెయ్యలేరు. లార్డ్ రెడింగ్ ఆధీనంలో ఉన్నాను. ఆయన న్యాయవాది. రాజ్యాంగ బద్ధంగా మీకు కొన్ని హక్కులు ఇవ్వబడినాయి. మరి పరిస్థితి ఏమిటి నాకు నిశ్చయంగా తెలియటం లేదు. ఒక వేళ దళిత వర్గానికి చెందిన వ్యక్తి ఈ ప్రకటనకు వ్యతిరేకంగా హింసించబడితే అతడు కోర్టు ద్వారా రక్షణ పొందలేడా?

**లార్డ్ రెడింగ్:** అతడికి ఏదైనా ఒక రక్షణ కల్పించాలి. దానినొక నేరంగా ప్రకటించాలి.

**అధ్యక్షుడు :** దానిని రాజ్యాంగంలో చేర్చటానికి వీలవుతుందా?

**లార్డ్ రెడింగ్ :** సాధ్యం అవుతుందని నేననుకోను. మీరు క్షమిస్తే డా॥ అంబేద్కర్ ఆ విషయమై పట్టుపడుతున్నారని నేననుకోను. తన కోరికను తెలియ జేశాననీ. "స్వతంత్ర వినియోగం" వగైరా లతో కూడిన కేవలం ప్రకటన వల్ల తాను తృప్తి చెందలేదనీ నిశ్చితమైన ప్రకటన మనం చేయాలని ఆయన కోరుతున్నారు. తన ఈ హక్కులకు భంగం కలిగినట్లయితే అది నిరుప యోగమైనదన్న వాస్తవాన్ని మనదృష్టికి తీసుకొని రావాలని ఆయన కోరుతున్నారు. అంతవరకే. ఇక తరువాత రక్షణ ఏమిటి అన్నది మీరు పరిశీలించవలసి ఉంటుంది. అదీ నేను ఆయనను అర్థం చేసుకొన్నది.

***డా॥ అంబేద్కర్ :*** నా ఉద్దేశం అదే.

## నివేదికలోని 4వ పేరా పై చర్చ

***డా॥ అంబేద్కర్ :*** 'దళిత వర్గాలు' అన్న పదం తరువాత "ప్రారంభంలో స్వల్ప కాలం తప్ప" అని చేర్చాలి. అప్పుడు వాక్య భాగం ఇలా ఉంటుంది. "ప్రారంభంలో స్వల్ప కాలం తప్ప దళిత వర్గాలకు ఆమోదయోగ్యంగా ఉంటుంది."

**అధ్యక్షుడు :** వయోజన ఓటింగు హక్కు ఉండే టట్లయితే మీరు దానిని అంగీకరించారనుకున్నాను.

**డా॥ అంబేద్కర్ :** వయోజన ఓటింగు హక్కు ఉన్నా లేకపోయినా పది సంవత్సరాల వరకూ మాకు ప్రత్యేక నియోజక వర్గం ఉండాలని నేను అన్నాను.

**అధ్యక్షుడు :** "పరివర్తన సమయం తర్వాత దళిత వర్గాలకు ఆమోదయోగ్యం అవుతుందా?"

**డా॥ అంబేద్కర్ :** అవును.

**అధ్యక్షుడు :** దానివల్ల మరింత నిర్దుష్టంగా ఉంటుందని మీరు అంగీకరిస్తారా?

**చింతామణి :** "ఓటింగు హక్కు వయోజన ఓటింగు హక్కుపై ఆధారపడినట్లయితే" అన్నదాన్ని తీసివేయాలి?

**అధ్యక్షుడు :** లేదు. ఇవ్వబడిన ఉపన్యాసాలను మనం మార్చరాదు. కాని డా॥ అంబేద్కర్ అన్నది ఒక వేళ నాది తప్పయితే ఆయన సరిచేస్తారు. వయోజన ఓటింగు హక్కు లేనట్లయితే, వారు ప్రత్యేక నియోజక వర్గాల్ని కోరుకుంటారు. వయోజన ఓటింగు హక్కు ఉన్నట్లయితే, పరివర్తన సమయం తర్వాత, వారు ప్రత్యేక నియోజక వర్గాల్ని వదులు కుంటారు. నిర్దుష్టతను మార్చటానికి నేను అంగీకరించను.

## నివేదికలోని 12వ పేరాగ్రాఫ్‌పై చర్చ

**డా॥ అంబేద్కర్ :** అయ్యా, 12వ పేరాగ్రాఫ్ ప్రారంభంలో ఈ క్రింది పదాన్ని చేర్చాలని నేను కోరుతున్నాను. "తమ డిమాండ్లను అంగీకరిస్తే తప్ప భారతదేశానికి స్వయం పరిపాలనా రాజ్యాంగానికి సమ్మతించరు అని అల్ప సంఖ్యాక వర్గాల వారు, దళిత వర్గాల వారు నిష్కర్షగా చెపుతున్నారు ఆ తర్వాత మీరు కొనసాగించవచ్చు. "సిఫారసులపై సాధారణ అంగీకారం లభించింది", వగైరా. కొత్త రాజ్యాంగం క్రింద మేము సురక్షితంగా ఉంటామని హామీ ఇస్తే తప్ప బాధ్యతాయుతమైన అన్న సిద్ధాంతానికి లోబడిన ఏ రాజ్యాంగానికీ అంగీకరించమని ఈ సంఘంలో నేను ఉపన్యసించినప్పుడే స్పష్టం చేశానని భావిస్తున్నాను. ఇది నా పరంగా చెప్పున్న విషయం. ఇతర వర్గాలు ఈ విషయంలో చేరకపోతే దళిత వర్గాల పక్షాన నేను వ్యక్తిగతంగా చేస్తున్న ప్రకటనగానే ఇది ఉంటుంది.

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** ఈ ప్రకటనను నేనూ అంగీకరిస్తున్నాను.

**అధ్యక్షుడు :** వాస్తవానికి ఆ ప్రకటన చేయటం జరిగింది. అయితే అది వ్యక్తిగత ప్రకటనగా కాక ఒక ప్రతినిధి ప్రకటనగా చేయబడింది. కాని ఆ ప్రకటనని ఈ నివేదికలో పొందు పరిస్తే దాని ఫలితం ఎలా ఉంటుందంటే మీలో ఒకరిద్దరు ఈ విధంగా అనగలుగుతారు. "మా కోరికల్ని సఫలం చేయలేదు." అని. అది సంఘం యొక్క నిర్ణయంగా కాదు. కాని చేస్తూ ఉన్న దానిలో తృప్తి చెందామని అంటే తప్పు చేస్తూ ఉన్నదానికి ఆటంకం కల్పించటం జరుగుతుంది. మీరు సంఘం ముందు చేసిన ప్రకటనను స్వీకరించి, సమావేశానికి పంపే విధంగా నివేదికలో పొందుపరచటం అనేది తెలివైన పనేనా అని మీరు చెప్పవలసి ఉంది. దీనిని రికార్డు చేయటానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు.

**లార్డ్ రెడింగ్ :** ఈ ప్రత్యేకమైన పేరాగ్రాఫ్‌లో దాని పాత్ర ఏమిటి అని చెప్పటం కొంచెం కష్టం. ఇది కార్య నిర్వాహక వర్గాన్ని గురించి తెలుపుతున్నది. కొత్త రాజ్యాంగానికి సంబంధించి ఈ కార్య వర్గం విజయవంతంగా పనిచేయటం గురించిన అంశాన్ని మాత్రమే తెలుపుతున్నది.

***డా॥ అంబేద్కర్ :*** నా ఉద్దేశం ఇది. వ్యక్తిగతంగా చెప్పాలంటే నేను కొన్ని డిమాండ్లను చేశానని ఊరికే ఒక ప్రకటన చేసి, రికార్డు చేయమని నా కోరిక కాదు. దీని వెనక ఉన్న నా భావన బలాన్ని కూడా నివేదికలో పొందుపరచాలనీ, ఇది అంగీకరించబడటానికి లేదా తిరస్కరించబడటానికి మాత్రమే చేసిన డిమాండ్ కాదనీ, దీనిని మేము అంగీకరించాలంటే మా డిమాండ్లను మీరంగీకరించాలనేది షరతుగా చెప్పాననీ రికార్డ్ చేయండి.

***లార్డ్ రెడింగ్ :*** ఇది ఈ పేరాగ్రాఫ్‌లోకి ఎలా వస్తుందో నాకసలు అర్థం కావటం లేదు.

***డా॥ అంబేద్కర్ :*** అది ఎక్కడైనా రావచ్చు. సాధారణ ఒప్పందాల గురించి అది తెలుపుతున్నది గనుక ఈ కొన్ని పంక్తులు పేరాగ్రాఫ్ ప్రారంభంలోనే రావాలనుకొంటున్నాను. అది సరిగా ఉండదని మీరనుకొంటే నాకు అభ్యంతరం లేదు.

**అధ్యక్షుడు :** అది అక్కడ రాగలుగుతుందని నేననుకోను. దానిని మీరు ఇక్కడ ఎలా చేర్చగలరో నాకు తెలియటం లేదు. దానిని మరొక సారి మీరు ప్రస్తావించవచ్చు. నిజానికి దానిని హౌస్ ఆఫ్ కామర్స్ ముందున్న బిల్లులోని కొత్త క్లాజ్‌గా పరిగణించాలేకాని 12వ క్లాజ్‌కు సవరణగా కాదు.

***డా॥ అంబేద్కర్ :*** 3వ పంక్తిలో ఈ విధంగా ఉంది. "రాష్ట్ర కార్య నిర్వాహక వర్గాలకు ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాల, అనగా, హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు - ప్రాతినిధ్యం ఆచరణ రూపంగా చాలా ముఖ్యమైనది......" నా సవరణ ఇది: "ముఖ్యమైన" అన్న పదాన్ని తీసేయాలి. ఎందుకంటే ఒక అల్పసంఖ్యాక వర్గానికీ, మరొక అల్పసంఖ్యాక వర్గానికీ మధ్య ఎటువంటి వివక్షతా ఉండరాదు. ఏ అల్ప సంఖ్యాక వర్గాన్ని పేరు పెట్టి సూచించరాదు. ఒక వేళ అలా చెయ్యదలచుకున్నట్లయితే అన్ని అల్పసంఖ్యాక వర్గాల్నీ పేర్కొనాలి.

***డా॥ మలాండే :*** సరిగ్గా నేనదే చెప్పబోతున్నాను.

**అధ్యక్షుడు :** వాస్తవానికి నివేదికలో ఈ పదాన్ని సూచించటం వల్లనే వాటిని ఇక్కడ ఉంచటం జరిగింది. సవరణ ఏమిటి? మీరు అంగీకరించని ఏ విషయాన్నీ మనం చేర్చబోవడం లేదు. "అల్పసంఖ్యాక వర్గాలకు రాష్ట్ర కార్యవర్గంలో ప్రాతినిధ్యం."?

***డా॥ అంబేద్కర్ :*** దానిని అక్కడితో వదిలేయండి. "హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు" అన్న దాన్ని తీసి వేయండి.

**అధ్యక్షుడు :** దాని అర్థం ఏమిటి అన్నది చూద్దాం. అది ఈ విధంగా ఉంటుంది. "రాష్ట్రకార్య నిర్వాహక వర్గాలు జయప్రదంగా ఆ పని చేయటానికి అల్పసంఖ్యాక వర్గాల ప్రాతినిధ్యం ఆచరణ రూపంగా చాలా

ముఖ్యమైనది" వగైరా.

**డా॥ అంబేద్కర్ :** అవును.

**అధ్యక్షుడు :** అంటే ప్రతి ఒక్క అల్ప సంఖ్యాక వర్గం, అది 8,9,10 లేదా 12 అయితే, కార్య నిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం ఉండాలి.

**డా॥ అంబేద్కర్ :** కాదు. అలా అయితే నేను ఈ విధంగా చేరుస్తాను " సాధ్యమైనంతవరకు విచక్షణను గవర్నర్‌కు వదిలి" ఏ ఒక్క వర్గం ప్రత్యేకంగా సూచించబడటాన్ని నేను అంగీకరించను.

**లార్డ్ రెడింగ్ :** తప్పకుండా ఇది ఏవిధంగా ఉంటుంది అనేది మనం చూడాలి. "రెండవ ఉపసంఘం (ప్రావిన్షియల్ రాజ్యాంగం) యొక్క సిఫారసులతో సాధారణ అంగీకారం ఉన్నది." ఆ తర్వాత దానిని ఉదహరించటం జరుగుతుంది.

**డా॥ అంబేద్కర్ :** ఇది అలా ఉండకూడదు.

**డా॥ మూంజే :** నాదొక చిన్న సలహా. బహుశ అది డా॥ అంబేద్కర్ అభిప్రాయానికి సరిపోతుంది. ఇది దానికి అనుగుణంగానే ఉంది. "ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాలు, అనగా మహమ్మదీయులు, సిక్కులు, దళిత వర్గాలు." ఇదీ నా చిన్న సవరణ.

**లార్డ్ రెడింగ్ :** అలా అయితే మిగతావారు కూడా ఇందులోకి రావలసి ఉంటుంది.

**సర్ ఎ.పి.పాత్రో :** దళిత వర్గాల వారు హిందువులు కాదా? దళిత వర్గాల వారిని విడదీసేస్తారా? తమను హిందువులు కాదు అని అంటే కొన్ని దళిత వర్గాలవారు ఎదురు తిరుగుతారని నేను సవినయంగా చెప్తున్నాను. దక్షిణ భారతానికి డా॥ అంబేద్కర్ వచ్చి వారిని హిందువులు కాదు అని అంటే దక్షిణ భారతంలో డా॥ అంబేద్కర్ స్థితి ఎలా ఉంటుందో నేను ఊహించలేను.

**డా॥ అంబేద్కర్ :** దానిని మనం ఇక్కడ చర్చించటం లేదు.

**సర్ ఎ.పి. పాత్రో:** కనుక ప్రాతినిధ్యం వాస్తవానికి, అనుభవాలకి అనుగుణంగా ఉండాలి.

**అధ్యక్షుడు :** ఈ సూచన ఉన్న నివేదిక నేను చూశాను. "హిందువులు, మహమ్మదీయులు, ఇతరులు" అని ఉదాహరణ ప్రాయంగా చెప్పటం జరిగిందే కాని నివేదికలో ఈ మాటలు లేవు.

**సర్ మహమ్మద్ షఫీ : :** అదే నేను చెప్పబోతున్నాను.

**అధ్యక్షుడు :** ఒక్క నిముషం. "ముఖ్యమైన" అన్నప్పుడు రాష్ట్ర కార్య నిర్వాహక వర్గాల్లో ముఖ్యమైన అనే పదం ఉండాలి.

**డా॥ అంబేద్కర్ :** అవును.

**అధ్యక్షుడు :** కాని "హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు" అనేది ఉండకూడదు. ఆ మాటలు

అక్కడ ఉండవలసిన పనిలేదు.

**డా॥ అంబేద్కర్ :** ఇక్కడ మరొక విషయాన్ని మీ గమనానికి తేవాలనుకొంటున్నాను. "కొత్త రాజ్యాంగం యొక్క పని, అదే ఆధారాలపై ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో మహమ్మదీయుల ప్రాతినిధ్యం ఉండాలని కూడా అంగీకరించడమైనది." ప్రారంభంలో మనం చెపుతున్న దానికి అనుగుణంగా "మహమ్మదీయులు" అన్న పదానికి బదులు "ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాలు" అని ఉండాలి.

**అధ్యక్షుడు:** అవును. అదే ఆధారాలపై అంగీకరించడమైనది"

**డా॥ అంబేద్కర్ :** "ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో కూడా వారి ప్రాతినిధ్యం ఉండాలి."

**అధ్యక్షుడు :** "ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాల వారి ప్రాతినిధ్యం ఉండాలి. తక్కువ అల్ప సంఖ్యాక వర్గాల వారి పక్షాన, వైయుక్తికంగా గాని, సామూహికంగా గాని రాష్ట్ర ఫెడరల్ కార్య నిర్వాహక వర్గాల్లో ప్రాతినిధ్యాన్ని కోరటమైనది. ఒక వేళ అలా జరగక పోతే ప్రతి మంత్రివర్గంలోనూ ప్రత్యేకంగా ఒక మంత్రి వగైరా."-అదే సరిగ్గా పేర్కొన బడింది.

**లార్డ్ రెడింగ్ :** అవును.

**అధ్యక్షుడు :** అధికారికంగా.

***అధ్యకుడు :** సరిగ్గా రికార్డు చేయటం విషయంగా అయితే "మహమ్మదీయులు" అన్న పదాన్న ఉపయోగించటం పూర్తిగా సరైనది.

**సర్ మహమ్మద్ షఫీ :** ఫెడరల్ అనేది ఒక ప్రత్యేకమైనది.

**అధ్యక్షుడు :** "మహమ్మదీయులు" అనేది ఉంటుంది.

**మిస్టర్ జోషీ :** నేను అందుకు అంగీకరిస్తున్నాను

**డా॥ అంబేద్కర్ :** అలా అయితే "మహమ్మదీయులు" అన్న పదానికి "ఇతర ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాల వారు" అని చేర్చాలి.

**అధ్యక్షుడు :** కాదు, వీలుకాదు. అది హక్కుతో కూడిన కోరిక.

**డా॥ అంబేద్కర్ :** నా కొరకు దాన్ని చెప్పకూడదా? వ్యక్తిగతంగా చెప్పాలంటే నేను దళిత వర్గాల పక్షాన కూడ మాట్లాడుతున్నాను.

**జోషీ :** దానిని ఒప్పుకోవటానికి వీలులేదు. మీరు హక్కుతో కూడిన కోరిక కోరలేదు.

---

* మూడవ ఉపసంఘం (అల్పసంఖ్యాకులు) చర్చలు, పుటలు 144-46.

**డా॥ అంబేద్కర్ :** నేను కోరానా లేదా అనేది ప్రశ్నకాదు.

**అధ్యక్షుడు :** మనం అధికారిక కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నాం. ఇప్పుడు రెండు నిముషాలు తక్కువగా పదకొండు అయింది.

**డా॥మూంజే:** "ఒప్పుకోనటమైనది" అన్న పదానికి బదులు "అదే ఆధారాలపై కోరటమైనది" వగైరా అనాలి.

**సర్ మహమ్మద్ షఫీ :** కాదు, కాదు అది ఒప్పుకోవటం జరిగింది. అది వాస్తవిక విషయం.

**డా॥ మూంజే :** ఫెడరల్ నిర్మాణ కమిటీలో ఏమి జరిగిందో నాకు తెలియదు.

**సర్ మహమ్మద్ షఫీ :** అది రికార్డులో ఉంది.

**డా॥ మూంజే :** కాని నేనిక్కడ ఈ విషయాన్ని అంగీకరించను.

**సర్ ఎ.పి. ప్యాట్రో :** దాన్ని అంగీకరించటమైంది. అది తరువాతి పేరాగ్రాఫ్‌కు చేరుతుంది.

**డా॥ మూంజే :** ఒక కోరిక కోరటం జరిగింది.

**అధ్యక్షుడు :** మహమ్మదీయులు గుర్తించబడాలి అని ప్రకటించ బడింది. అందుకు సమావేశ నిర్ణయ వివరాల ననుసరించి ఒప్పుకోవటం జరిగింది. అయితే అది రికార్డులలో నుంచి ఎత్తి వేయబడింది.

**జోషీ :** ఈ సంఘం రికార్డులా?

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** సర్వసభ్య సమావేశానికి ముందర ఈ విషయమై నేను స్పష్టమైన ప్రకటన చేశాను. ఆ ప్రకటన ఈ విధంగా ఉంది. అధిక సంఖ్యాక వర్గాల వారు కొన్ని డిమాండ్లను చేయటం సరే కాని అల్పసంఖ్యాక వర్గాలు కొంత ప్రాతినిధ్యం కావాలని కోరారు.

**అధ్యక్షుడు :** అది ఉంది.

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** అది ఒక మార్గాంతరం మాత్రమే.

**అధ్యక్షుడు :** కాదు, అదికాదు. ఆ వాక్యం మార్గాంతరాన్ని సూచిస్తుంది కాని మైనారిటీల యొక్క ప్రత్యక్ష ప్రాతినిధ్యం ఉండాలని కోరటమైనదని చెపుతున్నది.

**...నెంట్ కల్నల్ గిడ్నీ :** అదే మాకు కావలసింది.

**...బహదూర్ పీర్ సెల్వం :** "అలా కాకపోతే" "అది అసాధ్యంగా కనిపించినట్లయితే" అని ...ర్చవచ్చును.

**అధ్యక్షుడు :** అవును. "అలా కాకపోతే"కు బదులు "అది అసాధ్యంగా కనిపించి నట్లయితే" అని

* 3వ సబ్ కమిటీ (మైనారిటీస్) ప్రొసీడింగ్స్, పుటలు 144-46

మార్చకుండా ఉండటానికి కారణం లేదు.

**లార్డ్ రెడింగ్ :** ఏమిటి భేదం? ఒకదానిలో ఒకటి మార్చుకో దగిన పద సముదాయం మీద కాలం వ్యయం చేస్తున్నాం, అంతే.

**సర్దార్ ఉజ్జల్ సింగ్ :** ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో ఏ ఇతర వర్గాలకైనా అవకాశం కల్పించింది. అలా కల్పించి "ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాలు" అన్న పదాల్ని అక్కడ చేర్చండి. ఏదో ఒక రూపంలో తప్పనిసరిగా కాకపోయినా అవకాశం మాత్రం ఉండి తీరాలి.

**అధ్యక్షుడు :** కొన్ని కఠిన వాస్తవాల్ని మీ ముందు ఉంచుతున్నాను. ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో ప్రతి అల్ప సంఖ్యాక వర్గాన్నీ చేర్చలేరు.

**డా॥ అంబేద్కర్ :** నా అభిప్రాయాన్ని స్పష్టం చేస్తున్నాను. రాష్ట్ర కార్య నిర్వాహక వర్గంలో మనం చేసిందేమిటంటే గవర్నర్‌కు ఆ విధంగా చేయవలసిన బాధ్యత ఇచ్చాం. అతణ్ని ఆ విధంగా బద్ధుణ్ని చేయనప్పటికీ ఇతర ముఖ్య అల్పసంఖ్యాక వర్గాల నుంచి ఎన్నుకోవటానికి అతడికి తప్పక స్వాతంత్ర్యం ఉండాలి. రాజ్యాంగం రూపొందించటంలో అతడి కాళ్ళూ చేతులూ కట్టివేయటం లేదు. చేసిందల్లా ప్రయత్నించ వలసిన బాధ్యత అతడిపైన ఉంచటమే. అతణ్ని బంధించటం కచ్చితంగా కాదు. "మహమ్మదీయులు" అన్న పదం తర్వాత "ఇతర ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాలు" అని ఉండాలి.

**అధ్యక్షుడు :** వీల్లేదు.ఆ అంశాన్ని దాటిపోయాం. ఇప్పుడు మనం రెండో అంశాన్ని పరిశీలిస్తున్నాం.

**సర్ ఎ.డి. పాత్రో :** 13వ పేరాగ్రాఫ్‌ను చూద్దామా?

**డా॥ అంబేద్కర్ :** 12వ పేరాగ్రాఫ్ విషయంగా నా అనంగీకారాన్ని రికార్డు చేయవలసిందిగా

కోరుతున్నాను.

**సర్దార్ ఉజ్జల్ సింగ్ :** "మహమ్మదీయులు" అన్న పదం తర్వాత "ఇతర ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాలు" అన్నది చేర్చి తీరాలి.

**లెఫ్టినెంట్ కల్నల్ గిడ్నీ :** ఇతర అల్పసంఖ్యాక వర్గాలకు ఎందుకు మూసి వేయటం?

**అధ్యక్షుడు :** నేను నిజంగా రూలింగ్ ఇవ్వవలసి వస్తుంది. నేనింతకు ముందు చెప్పినట్లుగానే ఇతర అల్పసంఖ్యాక వర్గాలకు మూసివేయటం లేదు. ఆ పదాలపై సవరణల్ని గురించి చర్చించటానికి నేను తప్పకుండా అంగీకరిస్తున్నాను. కాని మీరు లేనిపోని విషయాల్ని ఎత్తకూడదు. దీనివల్ల ఇతర అల్పసంఖ్యాకులకు కూడా ప్రాతినిధ్యం అవసరమనే హక్కుతో కూడిన కోరికకు తావిస్తుంది. కాని ఇది అసాధ్యంగా కనిపించినట్లయితే మార్గాంతరాన్ని సూచించటం జరిగింది. అప్పుడు ఒక మంత్రి ఉంటాడు. అది కోరికలకు సంబంధించిన సరైన రికార్డు. 12వ పేరాగ్రాఫ్‌ను అంగీకరించటమైంది.

**డా॥ అంబేద్కర్ :** మా అనంగీకారాన్ని రికార్డు చేయాలని కోరుతున్నాం.

**అధ్యక్షుడు :** సరే.

(3వ ఉపసంఘం (మైనారిటీలు) 12వ పేరాగ్రాఫ్‌ను ఆమోదించింది)

ఈ క్రింది విషయాలతో నేను ఏకీభవించటం లేదు. కొత్త రాజ్యాంగం విజయవంతంగా పనిచేయటానికి రాష్ట్ర కార్య నిర్వాహక వర్గాల్లో ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాల ప్రాతినిధ్యం ఆచరణ రూపంగా చాలా ముఖ్యమైనది. అదే ఆధారాలుగా ఫెడరల్ కార్య నిర్వాహక వర్గంలో మహమ్మదీయులకు ప్రాతినిధ్యం ఉండాలని కూడా అంగీకరించటమైనది. తక్కువ అల్పసంఖ్యాక వర్గాల వారి పక్షాన, వైయుక్తికంగా గాని, సామూహికంగా గాని రాష్ట్ర, ఫెడరల్ కార్య నిర్వాహక వర్గాల్లో ప్రాతినిధ్యాన్ని కోరటమైనది. లేదా ఒక వేళ అది అసంభవంగా కనిపించినట్లయితే ప్రతి మంత్రి వర్గంలోనూ, అల్పసంఖ్యాక వర్గాల ప్రయోజనాల పరిరక్షణ కొరకు ఆ బాధ్యత అప్పగించబడిన ఒక మంత్రి ప్రత్యేకంగా ఉండాలి.

*(డా॥ అంబేద్కర్, సర్దార్ ఉజ్జల్ సింగ్ 6వ పంక్తిలో "మహమ్మదీయులకు" అన్న పదం తర్వాత "ఇంకా ఇతర ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాలవారు" అని చేర్చారు).

## నివేదికలోని 18వ పేరాగ్రాఫ్‌పై చర్చ

+**అధ్యక్షుడు :** 17 తీసివేయబడింది. 18 ఇప్పుడు 17గా మారుతుంది. ఈ నివేదికను మొత్తం సమావేశం యొక్క సంఘానికి సమర్పించాలి. దీనికి అంగీకరిస్తున్న వారు? వ్యతిరేకిస్తున్నవారు? అంగీకరించబడింది. ఇప్పుడు మొత్తం సమావేశం యొక్క సంఘానికి అది సమర్పించబడుతుంది.

**డా॥ అరేద్కర్ :** నాదొక సవరణ

**అధ్యక్షుడు:** క్షమించాలి.

**డా॥ అంబేద్కర్ :** ఈ సవరణ 16వ పేరాగ్రాఫ్ తర్వాత వేరే పేరాగ్రాఫ్‌గా రావాలి.

**అధ్యక్షుడు:** చివరి పేరాగా చేయాలా?

**డా॥ అంబేద్కర్ :** అవును.

**అధ్యక్షుడు :** అయితే అదిపై పేరాగ్రాఫ్‌గా అవుతుంది.

**డా॥ అంబేద్కర్ :** నా సవరణ ఇది: "తమ డిమాండ్లు అంగీకరించబడితే తప్ప ఏ విధమైన స్వయం పరిపాలనా రాజ్యాంగానికీ అంగీకరించబోరని దృఢ నిశ్చయంతో ఉన్నారు."

**అధ్యక్షుడు :** వాస్తవానికి ఈ విషయాన్ని చెప్పటం జరిగింది.ఒక బాధ్యతాయుతమైన విధంగా

* మూడవ ఉపసంఘం చర్చల తర్వాత ఆమోదించబడిన 12వ పేరాగ్రాఫ్.

\+ ఉపసంఘం (అల్ప సంఖ్యాకులు) చర్చలు, పుట 153.

చెప్పబడింది. ఇది కేవలం వైయుక్తిక అభిప్రాయ ప్రకటన కాదు.

***డా॥ అంబేద్కర్ :*** అది ఉండాలని నేను భావిస్తున్నాను.

**జోషీ:** ఆ ప్రకటనకు సంబంధించి శ్రామిక వర్గాన్ని అల్ప సంఖ్యాక వర్గంగా పరిగణించరాదని నేను భావిస్తున్నాను.

**అధ్యక్షుడు:** దానిని నేను కాదనలేను.

***డా॥ అంబేద్కర్ :*** ఈ పదాన్ని నేను అంగీకరిస్తున్నాను. "వారి డిమాండ్లను సముచితమైన పద్ధతిలో అంగీకరిస్తే తప్ప!

**అధ్యక్షుడు :** అలా అయితే అది అర్ధరహితమవుతుంది.

***డా॥ అంబేద్కర్ :*** లేకపోతే "వారి సముచితమైన డిమాండ్లను అంగీకరిస్తే".

**జఫ్రుల్లాఖాన్:** డిమాండ్లు సముచితమైన పద్ధతిలో అంగీకరించబడితే వారికి సంతోషం కలుగుతుందని ఎవరైనా అంటారా?

**ఫ్రుట్:** అది ఒక కోరిక యొక్క రికార్డు మాత్రమే.

**అధక్షుడు:** అది ఒక కోరిక యొక్క రికార్డు మాత్రమే. అది ఒక కొత్త పేరాగ్రాఫ్‌గా చేర్చబడాలి, ఒక కొత్త 18వ పేరాగ్రాఫ్.

**అనువాదం :**

ఆచార్య ఎస్. రామచంద్రమూర్తి

# అనుబంధం – 1

# భవిష్యత్ భారత స్వయంపాలక ప్రభుత్వ రాజ్యాంగంలో దళితవర్గాల రక్షణకు రాజకీయ భద్రతల పథకం

## ఉప కమిటీ నివేదిక అనుబంధం III (మైనారిటీలు)

స్వతంత్ర భారత ప్రభుత్వ మెజారిటీ పాలనలో దళిత వర్గాలకు భాగం కల్పించడానికి నియమాలు, ఒడంబడికలు ఈ క్రింద పేర్కొనబడ్డాయి.

### షరతు – 1 : సమాన పౌరసత్వం :

వంశ పారంపర్యంగా ఆర్జితమైన ప్రస్తుత బానిస వ్యవస్థలో దళిత (పీడిత) వర్గాలు మెజారిటీ పాలకుల్లో భాగంగా అనుకోలేరు. మెజారిటీ పాలన ఏర్పడక మునుపే అస్పృశ్యత వల్ల సిద్ధించిన దాస్యాన్నించి విముక్తి చెందాలనేది ఒక వాస్తవం. దీనిని మెజారిటీ పాలకుల ఇష్టానిష్టాలకు వదిలెయ్య లేము. దళిత వర్గాలు స్వేచ్ఛాయుత పౌరులుగా పౌరసత్వానికున్న సమస్త హక్కులూ మిగిలిన పౌరులతో సమానంగా అనుభవించగలిగే విధంగా వుండాలి.

ఎ) అస్పృశ్యతను నిర్మూలించి పౌరసత్వాన్ని ప్రతిపాదించాలంటే ఈ క్రింద పేర్కొన్న ప్రాథమిక హక్కు భారత రాజ్యాంగంలో భాగంగా పొందుపరచాలని ప్రతిపాదిస్తున్నాం.

### ప్రాథమిక హక్కు :

యు.ఎస్.ఏ. రాజ్యాంగ సవరణ , ఐర్లండ్ ప్రభుత్వ చట్టం 1920, 10, 11, అధ్యాయం 67, సెక్షన్ 5 (2).

భారతదేశంలోని ప్రజలంతా చట్టం ముందు సమానులు, అందరికీ సమాన పౌరహక్కు లుంటాయి. ఏదయినా ప్రస్తుత శాసనం, నిబంధన, ఉత్తర్వు, ఆచారం లేదా చట్టానికి వ్యాఖ్యానం వల్ల దేశంలోని ఎవరికైనా శిక్ష, హాని, ప్రతిబంధకం కలగడం కానీ అస్పృశ్యత పేరుతో వివక్షత చూపడం లాంటివి, ఏ రోజు నుంచి ఈ రాజ్యాంగం అమలులోకి వస్తుందో అప్పటి నుంచి నిషేధింపబడతాయి.

బి) అన్ని రాజ్యాంగాలలోను ఇదే విధానం ఉన్నది. ప్రాకీత్స్ వ్యాఖ్యానాలు పరిశీలించండి. కమాండ్ 207, పు 56.తమ కార్య నిర్వాహక చర్య వలన యూరోపియన్ బ్రిటిష్ పౌరులు అనుభవించే విధంగా విశాల ప్రాతిపదికన, 1919 భారత ప్రభుత్వ చట్టం అధికరణాలు 110, 111లలో పేర్కొన్న మినహాయింపులు, రాయితీలు అనుభవించే కార్య నిర్వాహక అధికారులకు వాటిని రద్దు చేయాల్సి వుంది.

**షరతు – 2 : సమాన హక్కులను స్వేచ్ఛగా అనుభవించగలగటం :**

దళిత వర్గాలకు సమాన హక్కులను ప్రకటించినందువల్ల ఉపయోగం లేదు. పౌరసత్వానికి సంబంధించిన సమాన హక్కులను ఉపయోగించుకొన్నందువల్ల సమాజంలోని యావత్ ఛాందసవాద శక్తుల ప్రతిఘటనను దళితవర్గాలు ఎదుర్కోవాల్సి వస్తుంది. పౌరసత్వానికి సంబంధించిన సమాన హక్కులను వుపయోగిస్తే యావత్ ఛాందసవాద శక్తుల ప్రతిఘటనను దళితవర్గాలు ఎదుర్కోవాల్సి వస్తుందని జంకుతారు. అందువల్లే ఈ ప్రకటితహక్కులు కేవలం ప్రకటనలకు పరిమితం కాకుండా నిత్య జీవితంలో ఆచరణాత్మకంగా రక్షింపబడాలని, తమ అనుభవంలోకి వచ్చే బాధలూ, ప్రాయశ్చిత్తాలూ వాటి ఆచరణలో సరైన శిక్షల వల్ల నిబంధనల వల్ల పరిరక్షింపబడాలని దళితవర్గాలు కోరుకుంటాయి.

ఎ) అందువలన దళిత వర్గాలు క్రింది XI భాగపు భారత ప్రభుత్వ చట్టానికి అనుసంధానించాలని కోరుతున్నారు. (నేరాలు, పద్ధతులు మరియు శిక్షలకు సంబంధించిన విభాగం).

**1) పౌరసత్వ ఉల్లంఘన నేరం :** (నల్లజాతివారి విముక్తికై 1886 ఏప్రిల్ 9న, 1975 మార్చి 1న ప్రకటించిన పౌరహక్కుల అమెరికన్ శాసనాలు)

ఎవరయినా ఏ వ్యక్తికయినా చట్టం అంగీకరించినట్లుగా అన్ని వర్గాలకు సమాన అవకాశాలుండాలి. అన్ని అవకాశాలు, ప్రయోజనాలు, సదుపాయాలు, భోజనశాలలో సౌకర్యాలు, విద్యా సంస్థలు, రహదార్లు, వీధులు, చెరువులు, బావులు మిగిలిన నీటి ప్రాంతాలు, ప్రజోపయోగానికి సంబంధించిన నేల, గాలి మరియు నీరు, థియేటర్లు లేదా యితర విహార ప్రాంతాలు లాంటివి ప్రజలందరి ఉపయోగం కోసం వుండినా లేక అనుమతి పత్రం ప్రకారం వుండినా అందరికీ సమాన ప్రాతిపదికన ఉండాలి. గతంలో మాదిరి అంటరానితనం, వాటికి సంబంధించిన అడ్డంకులు పాటింపబడితే, వారికి చట్ట ప్రకారం అయిదేళ్ళు జైలు శిక్ష, దానికితోడు జుల్మానా కూడా విధించబడవచ్చు.

బి) దళిత వర్గాలు తమ హక్కులను శాంతియుతంగా అనుభవించడానికి ఛాందసవాదుల బెదిరింపులు ఒక్కటే ప్రతిఘటన కాదు. సాధారణంగా అందరూ వీరి మీద ప్రతిబంధకంగా పాటించే సామాజిక బహిష్కరణ ముఖ్యమైంది. తమకు అనిష్టమైన కార్యక్రమాలను ఎదుర్కోవడానికి దళిత వర్గాలు ప్రయత్నించినా, ఛాందసవాదుల చేతిలోని సామాజిక బహిష్కరణ అనే బలమైన ఆయుధం వల్ల వారి ప్రయత్నాలను బలవంతంగా అణచివేయగలుగుతున్నారు. ఆ బహిష్కరణ అన్నది ఏ

విధంగా పనిచేస్తున్నదో, ఏ సందర్భాలలో ఎలా వుంటుందో వివరంగా 1928లో బొంబాయి ప్రభుత్వం నియమించిన కమిటీ నివేదికలో వివరించబడి ఉంది. దళితవర్గాల (అస్పృశ్యుల), ఆదివాసుల విద్యా ఆర్థిక సామాజిక స్థితిగతులు, వారి అభివృద్ధికి చేపట్టవలసిన కార్యక్రమాలు వగయిరాలు ఈ క్రింద ఉటంకించబడింది.

**దళితవర్గాలు – సామాజిక బహిష్కరణ**

"102. దళితవర్గాలు వారి అవసరాలకై మేము ఎన్నో సహాయ కార్యక్రమాలు, ప్రత్యామ్నాయాలు సూచించినా వారి హక్కులను వారు పొందడంలో ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవడం, వారి అవసరాలను తీర్చుకోవడంలో ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కోవడం జరుగుతున్నదని మేము గట్టిగా సందేహిస్తున్నాం. మొదటి సమస్య వీరిమీద ఛాందసవాదుల చేత జరుపబడే బహిరంగ హింస. గమనించాల్సింది ఏమిటంటే ప్రతి గ్రామంలో అత్యధికులుగా వుండే ఛాందసవాద వర్గాలు అత్యల్పంగా వుండే దళితవర్గాలను ఎదుర్కొని తమ అవసరాలు, దర్పం, స్థాయి ఏ విధంగానయినా కాపాడుకొని తీరుతారు. ఇలాంటి ఛాందసవాదుల హింసకు సంబంధించి పోలీసుల చేత న్యాయ విచారణ జరుపబడే కేసులు అతి తక్కువ.

రెండో సమస్యగా ఈనాడు దళితవర్గాలు తీవ్రంగా ఎదుర్కొంటున్న ఆర్థిక దుస్థితిని పేర్కొనవచ్చు. ప్రెసిడెన్సీలోని చాలా ప్రాంతాల్లో దళిత వర్గాలకు ఆర్థిక స్వాతంత్ర్యం ఏమాత్రం లేదు. ఛాందసవాదుల భూములను కొందరు దళితులు, వారి ఇష్టానుసారం ఏ కొందరో కమతగాళ్ళుగా సేద్యం చేస్తారు. కొందరు అదే ఛాందసవాదుల వద్ద కట్టు జీతగాళ్ళుగానో, కూలీలుగానో చాకిరీ చేస్తారు. మిగిలినవాళ్ళు ఛాందసవాదుల చేత గ్రామ సేవకులుగా నియమింపబడి బ్రతుకు వెళ్ళమారుస్తారు. ఛాందసవాదులు తమ చేతుల్లో వున్న ఆర్థికాధికారాన్ని పల్లెల్లో యథేచ్ఛగా దళితవర్గాల మీద ప్రయోగించడం, తమ హక్కులను గురించి ఏ మాత్రం తల ఎత్తి ప్రశ్నించినా తమ పొలాల నుంచో లేదా పనుల నుంచి, పల్లె పనుల నుంచి వాళ్ళని తొలగించి జీతభత్యాలను నిలిపివేయటం మేము ఎన్నో సంఘటనల్లో చూశాం. ఈ బహిష్కరణ పథకం ప్రకారం ఎంత దూరం వెళ్తుందంటే మామూలుగా అందరూ నడిచే కాలిబాటలో నడవడాన్ని నిషేధించడం, పల్లెలోని పచారీ కొట్లల్లో జీవితావసర వస్తువుల క్రయ విక్రయాలను నిరాకరించడం వరకు. చాలాసార్లు దొరికిన ఆధారాల ప్రకారం పరిశీలిస్తే అతి చిన్న కారణం కోసం దళిత వర్గాలు ఘోరమైన బహిష్కరణలకు గురవుతున్నారు. మామూలుగా దళిత వర్గాలు త్రాగేనీటిని బావుల్లోంచి తీసుకోకుండా బహిష్కరించడం ఎంత చిన్న కారణాలకోసం జరిగేవంటే, దళితవర్గానికి చెందినవాడు మెడలో జందెం వేసుకున్నా, చిన్నపాటి నేల ఖరీదు చేసినా, శుభ్రమైన దుస్తులు ధరించినా, లేక నగలేమయినా వేసుకున్నా లేదా పెళ్ళి కుమారుడిని గుర్రం మీద ఊరేగిస్తూ ఊరేగింపు వీధిలో వెళ్ళినా ఈ బహిష్కరణలు కొనసాగేవి.

మాకు తెలిసినంతవరకు దళిత వర్గాలను అణచివేతకు గురిచేసే సాంఘిక బహిష్కరణ

లాంటి గొప్ప ఆయుధాన్ని యింతవరకూ ఎవరూ కనిపెట్టలేదు. బహిరంగ హింస దీని ముందు దిగదిడుపు. భయంకరమైన పరిణామాలు దీనిలో అంతర్లీనంగా వున్నాయి. చట్టబద్ధమైన సామాజిక సంబంధాల స్వేచ్ఛకు గొడ్డలి పెట్టులాంటి ఈ బహిష్కరణ ఎంతో ప్రమాదకరమైంది. దళిత వర్గాలను భావ ఆచరణ స్వేచ్ఛ ద్వారా అభివృద్ధి చేయదలచుకొంటే, అత్యధికులు కొనసాగించే ఈ రకమైన దుశ్చర్యలను కచ్చితంగా కఠినంగా అణచివేయడం జరగాలి".

ఈ రకమైన బెదిరింపులను అధిగమించడానికి దళితవర్గాల అభిప్రాయం ప్రకారం సాంఘిక బహిష్కరణను పెద్ద నేరంగా పరిగణిస్తూ చట్టపరంగా శిక్షను అమలు చేయటమొక్కటే మార్గం. అందువల్లనే వారెంతో వత్తిడి చేసి నేరాలు, పద్ధతులు, శిక్షలు వ్యవహరించే 1919 భారత ప్రభుత్వ చట్టం భాగం XI లో దీనిని చేర్చాలని పట్టు బట్టినారు.

బర్మాలోని సాంఘిక బహిష్కరణ వ్యతిరేక చట్టం 1922 నుండి ఈ క్రింది షరతులు కొద్దికొద్ది మార్పులతో మాత్రం ఇక్కడి పరిస్థితులకు అనుకూలంగా ఎన్నుకోబడినవి.

## 1) బహిష్కరణ నేరాన్ని ఈ విధంగా నిర్వచించవచ్చు :

ఒక వ్యక్తి యింకో వ్యక్తిని బహిష్కరణకు గురి చేశాడని ఎంచడం (ఎ) ఏదయినా ఇంటిని, భూమిని కిరాయి కివ్వడానికి, ఉపయోగించడానికి, ఆక్రమించడానికి నిరాకరించడం ,లేదా పని చేయడాన్ని, కిరాయి తీసుకోవడం, వ్యాపార సంబంధమైన లావాదేవీలు జరపడాన్ని వ్యతిరేకించడం లేదా తన సేవలను తీసుకోవడాన్ని, చేయడాన్ని నిరాకరించడం - ఏవైతే దైనందిన వ్యవహారాల్లో జరుగుతాయో అవన్నీ. బి) సామాజిక, వృత్తిపరమైన లేదా వ్యాపార సంబంధాలు కలిగి వుండడాన్ని మానుకోవడం, సామూహికంగా వుండే ఆచారాల పట్ల గౌరవంతో కూడిన సంబంధాలు రాజ్యాంగంలోని పౌరహక్కులకు వ్యతిరేకం కాని ఆచారాలను మామూలుగా వ్యవహరించడాన్ని తిరస్కరించడం. సి) ఏ వ్యక్తయినా చట్టబద్ధమైన హక్కులకు వ్యతిరేకంగా గాయపరచినా, ఆటంకపరచినా, మధ్యలో తలదూర్చినా - పై చెప్పింది వర్తిస్తుంది.

## 2) బహిష్కరణకు శిక్ష :

చట్ట సమ్మతంగా ఏ వ్యక్తయినా ఏ పని చేయడానికయినా సమర్థుడు. చట్ట సమ్మతంగా చేయకూడని పనులు చేయకుండా వుండడానికి అర్హుడు. చట్ట సమ్మతంగా తను చేయకూడని పనులు చేయాలని ఏ వ్యక్తి అయినా బలవంతం చేసినా లేక చట్ట సమ్మతంగా చేయదలచుకొన్న ఏ పనినయినా చేయడానికి ఆటంకం కల్పించినా లేదా ఆ వ్యక్తికి శారీరకంగా, మానసికంగా, ఆస్తిపరంగా, వ్యాపారపరంగా, దైనందిన జీవితంలో ఏమయినా ఇబ్బందులు కల్పించినా లేదా ఆ వ్యక్తిని బహిష్క రించినా, ఆ వ్యక్తి బహిష్కరణ పట్ల కేవలం ఆసక్తి వున్న వ్యక్తి అయినా సరే నేరార్హుడే. అలా నేరార్హులుగా నిర్ధారించి ఏడేళ్ళ వరకు జైలుశిక్ష లేదా అపరాధ రుసుము లేదా రెండు శిక్షలు అమలు జరుపవచ్చును.

ఈ సెక్షను ప్రకారం నేరారోపణ చేయబడిన వ్యక్తి ఎవరి ప్రోద్బలం వలననో లేదా ఎవరితోనయినా కలిసిగానీ ఎవరినయినా కలుపుకొని కుట్ర చేసిగానీ సాంఘిక బహిష్కరణ అమలు చేయాలనుకోలేదని, అతను ఏ నేరమూ చేయలేదని న్యాయస్థానం సంతృప్తి చెందితే తప్ప, పై శిక్షలు విధించబడతాయి.

## 3) బహిష్కరణను ప్రోత్సహించినా, సమర్థించినా శిక్ష :

ఎవరయినా ఎ) బహిరంగంగా కానీ ప్రకటనల రూపంగా కానీ తమ ప్రయత్నాలను కొనసాగించినా, పంచినా లేదా బి) చేసినా, ప్రకటించినా, ప్రకటనలను బహిరంగంగా పంచినా, పుకార్లను ప్రచారం చేసినా, వాటిని గుడ్డిగా నమ్మి అనుకూలంగా స్పందించినా లేదా సి) ఏ రకంగానయినా వాటిని ప్రేరేపించినా లేక ఏ వ్యక్తినయినా, వ్యక్తులనయినా, వర్గాన్ని అయినా బహిష్కరణకు గురిచేసి పొడిగించినా వారు అయిదేళ్ళ వరకు జైలుశిక్షకు, అపరాధ రుసుముకు లేదా రెండు శిక్షలకు గురవుతారు.

వివరణ : ఏ వ్యక్తయినా బహిష్కరణకు గురయినా లేదా గురవుతున్నట్లు తెలిసినా పైన పేర్కొన్నట్లుగా ఆ వ్యక్తి లేదా అతని వర్గం పేర్కొనబడకపోయినా అతను లేదా అతని వర్గం చేసిన పనికి ఈ సెక్షను క్రింద నేరార్హుడవుతాడు.

## 4) బహిష్కరణ బెదిరింపునకు శిక్ష :

చట్ట సమ్మతంగా ఏ వ్యక్తి అయినా ఏ పని చేయడానికయినా వెనుదీయనక్కర లేదు, తన కిష్టం లేని పని తను చేయకుండా వుండడానికి కూడా చట్ట ప్రకారం రక్షణ వుంది. ఏ వ్యక్తికయినా అతను చట్ట సమ్మతంగా చేస్తున్న పనికి అడ్డుపడుతూండడంకానీ, చట్ట సమ్మతంగా చేయకూడని పనిని ప్రోత్సహించడంకానీ జరిగితే ఆ వ్యక్తి లేదా, బహిష్కరించడానికి అతనిని ప్రోత్సహించే వ్యక్తి లేదా వ్యక్తులు శిక్షార్హులు. బహిష్కరణకు సంబంధించిన నేరం క్రింద అయిదేళ్ళ వరకు జైలుశిక్షను పొడిగించవచ్చు, అపరాధ రుసుము వసూలు చేయవచ్చు లేదా రెండూ విధించవచ్చు.

మినహాయింపులు : బహిష్కరణ కానివి. 1) చట్ట సమ్మతమైన కార్మిక వివాదాలకు సంబంధించిన పనులు, 2) సామాన్యంగా జరిగే వ్యాపార పోటీలకు సంబంధించి చేసే వ్యవహారాలు.

షరా : ఈ అన్ని నేరాలు భేదభావం, పక్షపాతం క్రింద కేసు పెట్టదగినవి.

## షరతు – 3 : పక్షపాతం చూపకుండా రక్షణ :

భవిష్యత్తులో శాసనసభ వల్ల కానీ మరే యితర కార్య నిర్వాహక వర్గం వల్లకానీ తమకు తీవ్రమైన అన్యాయం జరిగే అవకాశముందని దళితవర్గాలు తీవ్ర భయాందోళనలు వెలిబుచ్చుతున్నాయి. అందువల్లే వారు మెజారిటీ పాలనలో పౌరులుగా న్యాయబద్ధంగా మనలేకపోతున్నారు. శాసనసభ

ఇతర చట్టాలు ద్వేషభావంకానీ, భేదభావం కానీ చూపవని హామీ వుంటే తప్ప వీరు మనలేరు.

కాబట్టి భారత రాజ్యాంగంలో ఈ క్రింది శాసనబద్ధ అవకాశాన్ని పొందుపరచాలని సూచించటం జరిగింది.

"భారతదేశంలోని అన్ని రాష్ట్రాల పరిధిలోను గతంలోని అస్పృశ్యతకు సంబంధించి కానీ, పౌరుల యితర హక్కులకు సంబంధించిన ఎలాంటి సవరణలు చట్టాలు, మార్పులు చేయడానికి శాసనసభ కానీ కార్య నిర్వాహక వర్గానికి తగిన అధికారం లేదు.

1) ఒప్పందాలు చేసుకోవడం, కొనసాగించడం, వ్యాజ్యం చేయడం, కక్షిదారులవటం, సాక్ష్యం చెప్పడం, బాధ్యతవల్ల పొందడం, కొనడం, కిరాయికి తీసుకోవడం, అమ్మడం, పొందడం మరియు వారసత్వమైన, వ్యక్తిగతమైన ఆస్తి కలిగి ఉండడం చేయవచ్చు.

2) రాజ్యంలోని ఏ వర్గాల పౌరులకూ ప్రాతినిధ్యానికి ఇబ్బంది లేకుండా పౌర, మిలిటరీ సంస్థల్లో ఉద్యోగం చేయడానికి, విద్యా సంస్థలన్నింటిలో ప్రవేశం పొందడానికి అర్హత కలిగి వుండవచ్చు.

3) జాతి, వర్గ, కుల, మత, వర్ణ భేదాల్లేకుండా యితర పౌరులకుండే సమాన హక్కులు, సమాన ఆంక్షలు వర్తింపబడుతూ, అవకాశాలు, లాభాలు, సదుపాయాలు, విద్యా సంస్థల్లో, ఇళ్ళలో వసతులు, నదులు, వాగులు, బావులు, చెరువులు, రోడ్లు, దారులు, వీధులు, ప్రజలందరికీ చెందిన భూభాగాలు, గాలి, నీరు, థియేటర్లు, ప్రజలందరికీ చెందిన యితర ప్రదేశాలు సంపూర్ణంగా సమానంగా అనుభవించవచ్చు.

4) ఒకే మత విశ్వాసాలు కల్గిన ప్రజలకోసం ఏర్పాటు చేసిన మత సంస్థల్లో కానీ, దాతృత్వ సంస్థల్లో కానీ ఏ భేదభావాలు లేకుండా ప్రవేశించడానికి సంపూర్ణ అర్హత కలిగి ఉంది.

5) మిగిలిన పౌరులందరితో సమానంగా చట్టాలతో బాటుగా వ్యక్తుల రక్షణకు సంబంధించిన వ్యవహారాలు, ఆస్తిపాస్తుల అనుభవంతోబాటు గతంలో వ్యవహరించిన అస్పృశ్యత రద్దు చేస్తూ శిక్షలు, బాధలు, అపరాధ రుసుములు అన్నీ అందరితో సమానంగా అనుభవించవచ్చు, పరిహారాలూ కోరవచ్చు. ఇతరేతర విషయాలు లెక్కలోకి రావు.

## షరతు – 4 : చట్టసభల్లో సముచిత ప్రాతినిధ్యం :

తమ సంక్షేమాన్ని సంరక్షించుకోవడానికి చట్ట సభల్లోనూ, కార్య నిర్వాహక వర్గంలోనూ దళితవర్గాలకు సరిపోయేంతటి రాజకీయాధికారం కచ్చితంగా యివ్వాలి. దీనిని దృష్టిలో వుంచుకొని క్రింది రాయితీలను యివ్వాలని ఎన్నికల శాసనాన్ని వారు డిమాండ్ చేసినారు.

1) దేశానికి, రాష్ట్రానికి, కేంద్రానికి సంబంధించిన చట్టసభల్లో సముచిత ప్రాతినిధ్య హక్కు.

2) తమ మనుషులను తమ ప్రతినిధులుగా ఎన్నిక చేసుకోవడానికి హక్కు. ఎ) వయస్సు అర్హతతో వచ్చే ఓటు హక్కు. బి) మొదటి పదేళ్ళు ప్రత్యేక నియోజకవర్గాలు, రిజర్వు చేసిన నియోజకవర్గాలు వుండాలి. దీనిని బట్టి అర్థమయ్యేదేమిటంటే ఓటు హక్కు తోడయితే తప్ప దళిత వర్గాల అభీష్టానికి వ్యతిరేకంగా ఉమ్మడి ఎంపిక కేంద్రాలు ఏర్పాటు చేయరాదు.

ష.రా. : ఇతర వర్గాలకిచ్చే ప్రాతినిధ్యం తెలిస్తే తప్ప దళిత వర్గాలకు పరిమాణ రీత్యా ఎంత ప్రాతినిధ్యం కల్పించాలన్నది నిర్వచించలేము. అన్ని రకాలుగా స్థిరపడి అభివృద్ధికరమైన పరిస్థితిలో వుండే యితర వర్గాల ప్రాతినిధ్యంతో దీటుగా వారికుండే రాయితీలు వుంటే తప్ప దళిత వర్గాలు తమ ప్రాతినిధ్యాన్ని అంగీకరించజాలరన్నది మాత్రం అర్థమవుతూంది. ఈ విషయంలో తమకు జరిగే నష్టాలను వారు ఏ మాత్రం ఒప్పుకోలేరు. ఇతర రాష్ట్రాలలోని మైనారిటీల ప్రాతినిధ్యంతో పని లేకుండా బొంబాయి, మద్రాసుల్లోని దళిత వర్గాలకు తమ జనాభా నిష్పత్తి రీత్యా ప్రాముఖ్యత నీయాలని కోరుతున్నారు.

## షరతు – 5 : ప్రభుత్వోద్యోగాలలో సముచిత ప్రాతినిధ్యం :

ప్రభుత్వోద్యోగాలను గుత్తాధికారంలాగా అనుభవిస్తూ వున్న అగ్రకులాధికారులు చట్టాన్ని తమ యిష్టానుసారం చెలాయిస్తూ దళిత వర్గాల పట్ల తీవ్ర వివక్షతను చూపుతూ, అగ్రకుల హిందువులకు మాత్రమే న్యాయం, సమానత, పాలనా సౌకర్యాలు ఒనగూరేట్లు చేయడం వల్ల దళిత వర్గాలు యిప్పటికే వారి చేతుల్లో విపరీతమైన కష్టనష్టాలు అనుభవించడం జరిగింది. ఈ రకమైన దురన్యాయం తొలగించాలంటే ప్రభుత్వోద్యోగాల్లో అగ్రకుల హిందువుల గుత్తాధికార పట్టును తొలగించి అన్ని వర్గాలతో సమానంగా ఉద్యోగాలలో దళిత వర్గాలకు సముచిత భాగాన్నిచ్చి న్యాయాన్ని కల్పించాలి. ఈ అవసరం కోసం దళిత వర్గాలకు రాజ్యాంగ చట్టంలో భాగం చట్ట భద్రతను కల్పించాలని ఈ క్రింది వాటిని తమ మనవిలో భాగంగా విన్నవిస్తున్నారు.

1) భారతదేశంలోనూ, అందులోని ప్రతి రాష్ట్రంలోనూ ప్రభుత్వోద్యోగాలు భర్తీ చేయడం, అదుపు చేయడం కోసం పబ్లిక్ సర్వీస్ కమీషన్లు ఏర్పాటు చేయాలి.

2) చట్టసభ తీర్మానం చేస్తే తప్ప పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యుణ్ని తొలగించరాదు – అతని ఉద్యోగ విరమణ తర్వాత రాచరికపు ఆఫీసులు తిరిగి అతన్ని పదవిలో నియమించరాదు.

3) ఉద్యోగ నైపుణ్యానికి సంబంధించిన పరీక్షలను అమలు పరచటం పబ్లిక్ సర్వీస్ కమీషన్ విధి – ఎ) అన్ని వర్గాల ప్రాతినిధ్యాన్ని తీసుకుంటూ అన్ని ప్రభుత్వోద్యోగాల్లో వారిని నియమించడం బి) ఉద్యోగాలకు సంబంధించి ఎప్పటికప్పుడు సమీక్షిస్తూ అన్ని వర్గాలకు సముచిత ప్రాతినిధ్యం కల్పిస్తూ, ఆయా వర్గాల ఉద్యోగాలను వర్గీకరిస్తూ ప్రాముఖ్యత కల్పించబడనటువంటి వర్గాలను తిరిగి భర్తీ చేస్తుండాలి.

## షరతు – 6 : అధికార దుర్వినియోగం, అవకాశాలను అలక్ష్యం చేయడంలాంటి వాటికి పరిహారం :

భవిష్యత్తులో మెజారిటీ పాలన సనాతనవాదులది గానే వుంటుందనీ, అందువల్ల మెజారిటీ పాలన తమపట్ల ఏ మాత్రం సానుభూతి చూపదనీ సరికదా అధికార దుర్వినియోగం చేయడం, తమ అవకాశాలను అలక్ష్యం చేసి జీవాధారమైన అవసరాలను ఏ మాత్రం పట్టించుకోదనే వాస్తవాన్ని దళిత వర్గాలు ప్రస్ఫుటంగా వ్యక్తం చేస్తున్నాయి. దీనికి ప్రత్యామ్నాయంగా ప్రాతినిధ్యం కల్పించబూనినా, దళితవర్గాలు అన్ని శాసనసభా స్థానాలలో మైనారిటీలుగా ఉంటూనే ఉంటాయి. అందువల్ల వారి ఇబ్బందుల్ని తొలగించడంలో రాజ్యాంగంలో ఈ క్రింది ప్రత్యేక అవకాశాలను ఇవ్వడం జరిగింది.

(1867 బ్రిటిష్ నార్త్ అమెరికా చట్టం సెక్షన్ 93) "భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలోని శాసనసభ, కార్య నిర్వాహక వర్గం లేదా మరే యితర చట్టం ద్వారా ఏర్పడిన అధికార వర్గం ఏ రకమైన వివక్షత లేకుండా దళిత వర్గాలకు విద్య, పారిశుధ్యం, ప్రభుత్వోద్యోగాల్లో భర్తీ, యితర సాంఘిక రాజకీయ అభివృద్ధికి చేపట్టాల్సిన చర్యలు చేపట్టడం వారి విధి మరియు తప్పనిసరి బాధ్యత".

2) భారతదేశంలోని ఏ రాష్ట్రంలోనయినా పైన పేర్కొనిన వాటిని ధిక్కరించి తమ యిష్టానుసారం దళితుల పట్ల ప్రవర్తించిన యెడల, గవర్నర్ జనరల్ ఉత్తర్వులను, రాష్ట్రాధికారాలను, కేంద్రాధికారంలోని సెక్రెటరీ ఆఫ్ స్టేట్ అధికారాలను ధిక్కరించడంతో సమానంగా వారు దీనిని పట్టించుకోవాల్సి వుంది.

3) గవర్నర్ జనరల్ లేదా రాష్ట్రాధికారంలో వచ్చే సెక్రటరీ ఆఫ్ స్టేట్ లేదా కేంద్రాధికారంలోని వారు యిలాంటి ప్రతికేసు విషయంలోనూ పట్టించుకొని తమ అధికారాలను వినియోగించడం సాధ్యపడదు. కాబట్టి ఆయా కేసుల పరిస్థితుల అవసరాన్ని బట్టి కౌన్సిల్‌లోని గవర్నరు జనరల్ కానీ సెక్రటరీ ఆఫ్ స్టేట్ కానీ, విచారణాధికారిగా ఎవరినైనా నియమించవచ్చు, లేదా కొంతకాలం విధిస్తూ ఆలోపల సంరక్షణా చర్యలు చేపట్టి, పై అధికరణంలోని విషయాలను పరిరక్షించడానికి తగిన చర్యలు తీసుకోవచ్చు."

## షరతు – 7 : ప్రత్యేక ప్రభుత్వ శాఖల బాధ్యత :

దిక్కులేని దౌర్భాగ్యమైన దీనస్థితిలో వుండే దళిత వర్గాలకు తమతో సమానస్థాయినిచ్చి, సమానంగా సమ్మానించే ధోరణి అటుంచి తీవ్రమైన వ్యతిరేకతతో దూరంగా నెట్టివేసే సనాతనవాదులైన ప్రజల ప్రతిఘటనలను ఎదుర్కోవాల్సి వుంది. వారు దరిద్రంతో మగ్గుతున్నారనీ, వారి వర్గమంతా భూమిలేని శ్రామికులనీ ఆర్థికంగా వారి స్థితి చాలా హీనంగా వున్నదనీ చేయబడే ప్రకటనలు సంపూర్ణ వాస్తవాలే. గమనించాల్సిన విషయమేమంటే దళిత వర్గాల ఆర్థిక దుస్థితికి అత్యధిక కారణం సాంఘిక వివక్షతేనన్నది. ఏ పని చేయాలన్నా, జీవనానికి ఏమి సంపాయించాలన్నా అంతులేని

సామాజిక అడ్డంకులు వారి ముందుంటున్నాయి. సామాన్యమైన యితర కులాల శ్రామికుడికీ, దళితవర్గాలవారికీ భేదాలు యిలాగే కొనసాగుతూ, కొన్నిసార్లు పెద్ద సమస్యగా రూపొందడం మనముందున్న వాస్తవం. దళితవర్గాల మీద జరుపబడే అణచివేత, దౌర్జన్యాలు ఎన్నోసార్లు విపరీతంగా జరిగినా, దళితులు తమను తాము రక్షించుకోవడం అతి అరుదుగా జరగడాన్ని దృష్టిలో వుంచుకోవాల్సి వుంది. యావత్ భారతదేశంలో సంభవించే ఈ 'సాధారణ' ఘటనలకు సంబంధించిన వాస్తవాలు మద్రాసు ప్రభుత్వ రెవిన్యూ బోర్డు ప్రతిపాదనలు తేదీ 5 నవంబరు 1882, సంఖ్య 723లో క్రింది విధంగా పేర్కొనబడినాయి. వాటిలో కొన్ని :

"134. అణచివేతలోని కొన్ని రూపాలు పైపైన కొన్ని మాత్రం క్రింద పేర్కొనబడినాయి. దళితుల పట్ల వారి యజమానులు జరిపే సాధారణ దౌర్జన్యాలు : ఎ) గ్రామ పంచాయితీల్లో, కోర్టులలో తప్పుడు కేసులు బనాయించి తీసుకురావడం, బి) దళితుల పశువులు ప్రభుత్వ భూముల్లో తిరగడం, దళితులు గుడికి వెళ్ళడానికి ఆటంక పరచడం, బంజరు భూములను తాము సాగు చేసుకోవడానికి అర్జీలు పెట్టుకోవడాన్ని నిరోధించడం, భయపెట్టడం, సి) వాస్తవంగా అనుభవిస్తున్నవారు కాకుండా తప్పుడు మిరాశీ పేర్లను ప్రభుత్వ రికార్డుల్లో నమోదు చేయించడం, డి) గుడిసెలను కూలద్రోయడం, పెరడు అభివృద్ధి చేసుకోవడాన్ని నిరోధించడం, ఇ) అనాదిగా అనుభవిస్తున్న బంజరు భూములు అనుభవించడాన్ని నిరోధించడం, ఎఫ్) బలవంతంగా దళితుల పంటలను కోయించడం, దానిని పరిరక్షించుకోబూనుకొన్నపుడు దొంగతనం, దొమ్మీ, దౌర్జన్యాల నేరాలను దళితుల మీద మోపడం, జి) తప్పుడు విజ్ఞాపనలు చేయడం, అందులో తప్పుడు సాక్ష్యాలను చూపించి పనితీరిన తర్వాత వారిని నాశనం చేయడం, హెచ్) దళితుల పొలాలకు పారుతున్న నీటిని అడ్డుకట్ట వేసి నిరోధించడం, ఐ) భూస్వాములు బాకీపడ్డ భూమి కిస్తుల కోసం ఆ పొలం కౌలుకు సాగుచేసే దళితుల ఆస్తులను కోర్టు నోటీసు యివ్వనిదే జప్తు పరచరాదు.

"135. పైన పేర్కొన్న యిబ్బందులకు పరిహారం కల్పించడానికి సివిల్, క్రిమినల్ కోర్టులున్నాయని అంటారు. అవును, కోర్టులున్నాయి, కానీ ఈ దేశంలోని పల్లెపట్టుల్లో ఇంగ్లండ్ లాంటి దేశంలోని హామ్డెన్ పోరాటవీరులు లేరు. వారికి న్యాయం కోసం కోర్టుకు పోవడం అలవాటూ లేదు, వారికి అవి అందుబాటులోనూ లేవు. కోర్టులకు పోవాలంటే ధైర్యస్థైర్యాలు కావాలి, న్యాయ పరిజ్ఞానం కోసం డబ్బు వెదజల్లాలి, కోర్టు ఫీజులను భరించాలి. ఈ కేసు నడిచిన కాలంలో పడే అప్పీళ్ళూ, వాయిదాలూ భరిస్తూ కోర్టు చుట్టూ తిరగాల్సి వుంటుంది. దానికి తోడు చాలా వ్యాజ్యాలలో తీర్పు మొదటికోర్టు ననుసరించే వుంటుంది. ఈ కోర్టులను నిర్వహించే అధికారులు చాలా సందర్భాల్లో, అవినీతిపరులుగానూ లేదా తమ వర్గానికే చెందిన ధనిక భూస్వామ్య వర్గాలకే సానుభూతి చూపిస్తుంటారు."

"136. అధికారుల మీద ధనిక వర్గపు పట్టు ఎంత ఎక్కువ చెప్పినా తక్కువే అవుతుంది. భారతీయుల్లోనూ అధికంగా వుంది. అలాగే యూరోపియన్ల మీద కూడా ఈ పట్టు మితిమీరి వుంది. కిందిస్థాయి నుంచి పై స్థాయివరకు ప్రతి ఆఫీసూ ఈ ధనిక వర్గాల ప్రతినిధుల చేత నింపబడి వుండటం వల్ల తమ ప్రయోజనాలను దెబ్బతీసే ఏ చిన్న ప్రయత్నమూ జరగదు. అంతేగాకుండా ఆ ప్రయత్నాలు మొదలుపెట్టినపుడే దానికి అంతమూ ఆలోచించే సామర్థ్యం ఆ వర్గానికి వుంది.

ఇలాంటి పరిస్థితులు దట్టంగా, సర్వత్రా వ్యాపించిన వున్నపుడు దళిత వర్గాలను అధోగతి నుంచి పైకి లాగాలనుకోవడం ఒక మంచి బూటకపు నాటకంలా మిగిలిపోగలదు. కాకపోతే సమస్త ప్రభుత్వ కార్యకలాపాల్లో ఈ దృష్టిని ప్రధాన వ్యవహారంగా ముందుంచి సమాన అవకాశాలను ఒక కచ్చితమైన పాలసీగా ప్రభుత్వ దృష్టిలో భాగంగా, ఆచరణలో వుంచాల్సి వుంది. దళిత వర్గాలకోసం ఈ రకమైన ఆచరణాత్మక యోచనను సాధించాలంటే భారత ప్రభుత్వం ఏర్పాటు చేసి దానికి చట్టపరమైన బాధ్యతలనుంచాలని రాజ్యాంగ చట్టంలో నిర్దేశించాలి.

1) రాజ్యాంగంలో భాగంగా భారత ప్రభుత్వం ప్రత్యేక సంఘాన్ని ఏర్పాటు చేసి దానికి ప్రత్యేకంగా ఒక మంత్రిని బాధ్యుడిగా నియమించాలి. ఆ ప్రత్యేక సంఘం దళిత వర్గాల ప్రయోజనాలను పరిరక్షిస్తూ వారి సంక్షేమానికి కృషి చేయాల్సి వుంది.

2) కేంద్ర శాసనసభ విశ్వాసం కోల్పోనంతవరకు ఆ మంత్రి ప్రత్యేక సంఘ బాధ్యతాధికారాలను నెరవేర్చవచ్చు.

3) భారతదేశమంతటా దళితవర్గాల మీద జరుపబడే అత్యాచారాలు, అణచివేత, అన్యాయాలు, హింసాత్మక చర్యలకు వ్యతిరేకంగా సమర్థవంతమైన చర్యలు చేపట్టి వాటి నిరోధానికి ఆచరణీయమైన చర్యలు తీసుకోవాలి. దీనికి సంబంధించి చట్టపరమైన అన్నిరకాల అధికారాలను అతను ఉపయోగించవచ్చు లేదా బదిలీ చేయవచ్చు.

4) గవర్నరు జనరల్ ఈ క్రింది చట్టపరమైన అధికారాలు ఉపయోగించవచ్చు.

ఎ) దళితవర్గాల సంక్షేమం కోసమై చేపట్టే విద్యా పారిశుద్ధ్యాది విషయాలకు సంబంధించి అధికారాలు, విధులు తత్సంబధిత మంత్రికి బదిలీ చేయవచ్చు. బి) ప్రతి రాష్ట్రంలోనూ ఒక దళిత వర్గాల సంక్షేమశాఖను నియమించి ఒక మంత్రి సహకారంతోనూ అధికార బద్ధతతోనూ దాన్ని పని చేయనివ్వాలి.

## షరతు – 8 : దళిత వర్గాలు – మంత్రివర్గం-

శాసనసభలో దళితవర్గాలకు కొన్ని స్థానాల ప్రాతినిధ్యం వుండడం వల్ల ప్రభుత్వ వ్యవహారాలను రూపొందించడంలో తమకు కనీస న్యాయం జరిగేటట్లు చేయవచ్చు, కనుక ప్రభుత్వ వ్యవహార సరళలో దళితవర్గాలకు తగు స్థానం వుండడం వాంఛనీయం. మంత్రివర్గంలో

వారికి స్థానం వుంటేనే ఇది సాధ్యపడుతుంది. ఇతర సాధారణ మైనారిటీలలో భాగంగానే దళితవర్గాలు కూడా తమ నైతిక హక్కులను మంత్రివర్గం గుర్తించాలని అందులో ప్రతిఫలించాలని కోరుతాయి. ఇది దృష్టిలో వుంచుకొని దళితవర్గాలు యిలా తీర్మానిస్తున్నాయి. దళితవర్గాలకు తన మంత్రివర్గంలో తగు ప్రాతినిధ్యం కల్పించేటట్లు గవర్నరు మరియు గవర్నరు జనరల్ ఒక సూత్రీకరణను ఆదేశించాల్సి వుంది.



# అనుబంధం – 2

# ఉప కమిటీ నివేదిక - III (మైనారిటీలు)

1931 జనవరి 19న జరిగిన సర్వసభ్య సమావేశంలో దళితవర్గాల సంక్షేమానికి సంబంధించిన కొన్ని విషయాలను కమిటీ ఆమోదించింది.

3) అందరికీ సంబంధించిన సాంస్కృతిక, మత జీవిత విధానాలను పరిరక్షిస్తూ జాతి, కుల, మత, లింగ భేదాలు లేకుండా ప్రతి ఒక్కరి అవకాశాలను రక్షిస్తూ తమ ఆర్థిక, సాంఘిక, పౌరహక్కులను ఉపయోగించే స్వేచ్ఛను ప్రాథమిక హక్కుల ప్రకటనలో జత పరచాలనే ముఖ్యమైన ప్రతిపాదన ఉప కమిటీ ముందుకు వచ్చింది.

ప్రాథమిక హక్కుల అమలుకై అధికారాన్ని, అవి అమలుకాకుండా నిరాకరించబడడాన్ని నివారించడానికి నష్టపరిహారపు హక్కును కూడా రాజ్యాంగంలో చేర్చాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుందని డా॥ అంబేద్కర్ అభిప్రాయపడినాడు.

4) సామాన్యంగా ప్రజాస్వామిక సూత్రాలనర్థం చేసుకొన్నట్లుగా స్వేచ్ఛాయుతమైన నియోజకవర్గాలు పరివర్తనా కాలంలో ఓటుహక్కు, వయోజన ఓటుహక్కుకు మూలంగా వుంటే అది దళితవర్గాలకు ఆమోదయోగ్యంగా వుంటుందనే అభిప్రాయం వ్యక్తపరచబడింది. భారతదేశంలో విస్తృతంగా వుండే జాతుల యొక్క అసమాన ఆర్థిక సామాజిక రాజకీయ కార్యసాధకతను గమనిస్తే, మైనారిటీలు సంపాదించుకొన్న ప్రాతినిధ్య పద్ధతి పూర్తిగా ప్రమాదంలో పడిపోవడమే కాకుండా అది ఏ మాత్రమూ సరిపోదు, అందువల్ల ఈ పద్ధతి కులతత్వాన్నించి ఏ మాత్రం రక్షణ యివ్వలేదు.

5) అందువల్ల శాసనసభల్లో పదవులు ప్రాతినిధ్యం కోసం వివిధ జాతులు తమకు రావాల్సిన భాగస్వామ్యాన్ని అడగడానికి ముందుకొస్తున్నాయి. మైనారిటీ జాతులకు కేటాయించిన పదవులు వారి జనాభా నిష్పత్తికి ఏ మాత్రం తగ్గకుండా వుండాలని వాదిస్తున్నాయి. ఇవి సాధించుకునే పద్ధతులు ప్రధానంగా మూడు 1) నియుక్తి ద్వారా 2) సంయుక్త ఎన్నికల నియోజకవర్గాలు వాటిలో కేటాయించిన పదవులు మరియు 3) ప్రత్యేక నియోజకవర్గాలు.

8) ఈ చర్చవల్ల స్పష్టమయినదేమంటే, ప్రత్యేక నియోజకవర్గాల డిమాండు ఒక్కటే అందరికీ ఆమోదయోగ్యమైనదని. దేశంలో దీనికి సంబంధించిన అడ్డంకుల గురించి చర్చ ఇంతకు ముందే కొనసాగింది. ఈ సమస్యకు పరిష్కారం కనుక్కోవడమేమంత సులభతరం కాదు.

రాష్ట్రాల్లోనూ, కేంద్రంలోనూ కుల ప్రాతినిధ్యం ఎంత వుందో అంత లేదా మొత్తం లేదా ఆచరణాత్మకంగా శాసనసభలో సీట్లను నియతీకరించడంతో; స్వతంత్రమైన రాజకీయ అభిప్రాయాలు లేదా వాస్తవమైన రాజకీయ పార్టీలు అభివృద్ధి చెందే అవకాశం తక్కువ. దానికితోడు ఈ సమస్య ఎంత జటిలంగా తయారవుతుందంటే, దళితవర్గాల ప్రతినిధులు ఎన్నికల ప్రయోజనాల రీత్యా తమను హిందూ జనాభా నుంచి మినహాయించి ప్రత్యేకజాతిగా గుర్తించమని కోరవచ్చు.

12) ఉపకమిటీ సిఫారసులను మామూలుగా ఒప్పుకొంటున్నారు. ముఖ్యమైన మైనారిటీలకు ప్రాతినిధ్యం వహించే రాష్ట్రాధికారులకు ఆచరణాత్మకంగా గణనీయమైన అధికారాలు నూతన రాజ్యాంగం ప్రకారం దత్తత చేయడమే కాకుండా, మహమ్మదీయులు ఫెడరల్ కార్య నిర్వాహకులుగా ప్రాతినిధ్యం వహించడానికి కూడా అంగీకరించబడింది ('మహమ్మదీయుల' వాక్యం తర్వాత 'మరియు యితర ముఖ్యమైన మైనారిటీలు' అని డా॥ అంబేద్కర్ చేర్చారు). చిన్న మైనారిటీల తరపున వ్యక్తిగతంగా కానీ, సామూహికంగా కానీ రాష్ట్రాధికారులుగా, ఫెడరల్ కార్య నిర్వాహకులుగా ప్రాతినిధ్యం వహించాలని ప్రతి మంత్రివర్గంలోనూ యిది సాధ్యం కాకపోయినట్లయితే మైనారిటీల పరిరక్షణకు ప్రత్యేకాధికారాలు కలిగిన మంత్రిని నియోగించాలని కోరబడింది.

13) పరిపాలనకు సంబంధించి ఉద్యోగాల భర్తీని రాష్ట్రాలలోనూ, కేంద్ర సర్వీసుల్లోనూ పబ్లిక్ సర్వీస్ కమీషన్లకు అప్పగించాలి. ప్రభుత్వ సర్వీసుల్లో అన్ని కులాలకు సరయిన ప్రాతినిధ్యం కల్పించాలి, దానితోబాటు సరిపోయే విధంగా నైపుణ్యాన్ని కూడా పాటించాల్సి వుంది.

16) స్పష్టమయిన విషయమేమంటే బ్రిటీషు ప్రభుత్వం తనకు తానుగా ఏ జాతుల, కులాల మీదా ఎన్నికల పద్ధతులు లేదా ప్రత్యేక లక్షణాలు రుద్దలేదు. అలా చేసినట్లయితే తనమీద మరింత వ్యతిరేకతను పెంచుకున్నట్లవుతుంది. అందువల్ల స్పష్టమయ్యేదేమం టే ఒప్పందం కుదరకపోయినా, లోపాలుండినా, సమస్యలుండినా నూతన రాజ్యాంగం ప్రకారం ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటు చేసుకోవడమే జరగాల్సింది. దీని తర్వాత తమకు వచ్చే భాగాల గురించిన ప్రశ్న తలెత్తుతుంది. ఈ పరిస్థితుల్లో దళితవర్గాలకు రావాల్సినంత, సరిపోయినంత అవకాశాలు యివ్వడాన్ని పరిశీలించడం మంచిది.

18) తమ డిమాండ్లను హేతుబద్ధంగా తీర్చకపోయినట్లయితే మైనారిటీలు, దళితవర్గాలు ఏ రకమైన స్వయం పాలక భారత రాజ్యాంగానికి తమ అంగీకారాన్ని నిశ్చయంగా తెలపరు.

☆ ☆ ☆

# 5

# ఆరవ ఉపసంఘం

# (ఓటుహక్కు)

## రెండవ సమావేశం – 22.12.1930

*డా॥ అంబేద్కర్ :* ఈ రౌండ్‌టేబుల్ సమావేశంలో రెండు ప్రధానమైన ప్రశ్నలను పరిశీలించాల్సి వుందని నాకనిపిస్తోంది. ఒకటో ప్రశ్న, భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం కావాలా? రెండో ప్రశ్న, ఆ ప్రభుత్వం ఏ ప్రజలకు బాధ్యత వహించాలి అనేవి. సర్వసభ్య సదస్సుల్లో మేమంతా కలిసి ఒకే గొంతుకతో భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని డిమాండ్ చేశాము. నేను ఒక్కడిని సర్వసభ్య సదస్సుల్లో నా మిత్రులతో ఎదురెదురుగా కూర్చుని దళితవర్గాల తరపున భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని డిమాండ్ చేశాను. నేనెందుకలా చేశానంటే, తమ దేశ ప్రతినిధులుగా ఈ రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరైన భారత ప్రజలు కేవలం తమ దేశానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచాలనిడిమాండ్ చేయడమే కాకుండా, ఆ ప్రభుత్వం ఎవరికి బాధ్యత వహించాలన్న విషయంలో కూడా ఒకే దృష్టిని కలిగి వున్నారని నేను అభిప్రాయపడడం వల్ల.

ఇలా అంటున్నందుకు నన్ను క్షమించాలి సర్, నేను భ్రమించాను. ఇప్పటికే కొంతమంది మనవాళ్ళు నాలాగా కోరి వుంటారు, మిగిలినవాళ్ళు అధినివేశ ప్రతిపత్తి డిమాండుకు మద్దతునిస్తారు. మొత్తం మీద అధినివేశ ప్రతిపత్తి క్రింద ఏర్పడే ప్రభుత్వం భారత ప్రజలకు బాధ్యతాయుతంగా వుండాలనే డిమాండును మొత్తం మీద వారు బలపరుస్తారని ఆశించాను. కాని ఇలా అభిప్రాయబేధం వస్తుందని నేనాలోచించలేదు, మేము తీసుకున్న స్థానాన్ని బలపరచడానికి నేను నిలుచోవాల్సి వుంది.

దళితవర్గాల తరపున మాట్లాడాలంటే, రాజ్యాంగంలో వారికి తప్పకుండా స్థానం వుంటే తప్ప వాస్తవానికి నేను బాధ్యతాయుత ప్రభుత్వానికి కానీ, అధినివేశ ప్రతిపత్తికి కానీ కట్టుబడి వుండలేను. నా మిత్రులందరికీ ఈ వాస్తవాన్ని స్పష్టపరిచాను. వయోజన ఓటు హక్కు ప్రస్తావనకు సంబంధించి నా మిత్రులు కొందరు అభ్యంతరం లేవదీశారు. ఆ ప్రస్తావనకు వ్యతిరేకంగా వచ్చే వాదనలను జాగ్రత్తగా వినాలని నేను ప్రతిపాదిస్తున్నాను.

ఆ చర్చల్లో ఒకటేమంటే, ఈ దేశంలో పూర్వం వస్తూన్న దానినే అనుసరించాలని, అంటే ఓటింగ్ హక్కు అంచెలవారీగా అమలు చేయడం. 1832 నుంచి 1918 వరకు అంచెలవారీగా ఈ దేశంలో అమలు చేయడాన్ని అనుసరించాలని సూచించడం జరిగింది. వీరి మార్గావలంబకులు ఈ

దేశ రాజకీయ చరిత్రలో ఓటుహక్కు నీయడంలో బ్రిటీషువారు ఓటుహక్కు నిచ్చే ధోరణిని అనుసరించాలని అనుకుంటున్నట్లుంది. 1832 నుంచి కొంతమంది ప్రజలకు మాత్రమే ఓటుహక్కు నివ్వాలని నిర్ణయించుకున్నారు. 1832 నుంచి అనడం తార్కికంగా అసంబద్ధమనాలి, ఎందుకంటే వారు తదుపరి చర్యను 1866లో కూడా కాదు, 1867లో తీసుకున్నారు. అలాగే వారు మళ్ళీ తదుపరి చర్యను 1867 లో కాకుండా, 1884లో తీసుకున్నారు. వారి చర్యలను అమలు చేయడానికి సంబంధించి వాదించేవారు ఏ తాత్విక భూమిక ఆధారంగా వాదిస్తున్నారో నాకు తెలియడంలేదు. అయితే నా మిత్రులను ఒకటి అడగదలిచాను, ఈ వాస్తవమాధారంగా ఎవరు వాదిస్తున్నారో వారు ఇంగ్లండు రాజకీయ చరిత్రను అధ్యయనం చేస్తే, మీకు అందులో బ్రిటీషు ప్రజలు అంచెలవారీగా తీసుకున్న చర్యలకు ఏ తాత్విక నమ్మకాలూ అగుపడవు. అయితే ఈ దేశంలో ఓటుహక్కుకు సంబంధించిన ప్రశ్న పార్టీ రాజకీయాలను బట్టి వ్యవహరిస్తున్నదే. ప్రతి పార్టీ ఓటుహక్కును పెంచుతుంది. ఎందుకంటే పార్టీ పెరగడానికి, ప్రభావితం చేయడానికి అది రాజకీయ ఊతపదంలాగా వుందని నమ్ముతుంది కనుక. బహుశా ఈ వాదన చేసే నా మిత్రునికి యిది వార్తే అనుకుంటాను, అంతే కాకుండా మా మార్గంలో దాటరాని అడ్డంకిగా ఈ వాదన వుండడం అతనికి బాగా తృప్తి నిసుతందని కూడా నేను చెప్పకుండా వుండలేకపోతున్నాను. ఇంగ్లండు ప్రజలకు రాజకీయ స్వేచ్ఛ ప్రసాదించింది ఈ దేశంలోని సంప్రదాయిక ప్రభుత్వమే కావడం, ఉదారవాదులు కానీ, రాడికల్స్ కానీ కాకపోవడం మనల్ని బహుశా సంతృప్తిపరచి వుండవచ్చు.

నా మిత్రునికి చెప్పదలచిన రెండో విషయమేమంటే, ఈ దేశంలో ఓటుహక్కు పరిమితం కాబట్టి దానితో ఏర్పడిన ప్రభుత్వం మంచి ప్రభుత్వంగా వుంటుందని ప్రజల సంక్షేమం, ప్రజానీకపు సౌభాగ్యతను లక్ష్యంగా ఎంచుతుందని నిజంగానే అతననుకుంటున్నారా? ఆ వాస్తవానికి సంబంధించి అతను ఊహిస్తున్న రేఖాచిత్రమే కదా యిది. ఓటుహక్కు పరిమితంగా వుంటుంది కాబట్టి సమస్యలుండవు - దానివల్ల దేశంలో అందరూ సంతుష్టిగా వుంటారన్నమాట! కచ్చితంగా అలా జరగదు. లార్డ్ షాటిస్‌బరీ జీవితచరిత్రను కానీ, ఇంగ్లండు సాంఘిక రాజకీయ చరిత్రను కానీ నా మిత్రుడు అధ్యయనం చేసే శ్రమ తీసుకుంటే సంస్కరణలు లేని పార్లమెంటు ఎవ్వరికీ ఉపయోగకారి కాదని అతనికి తప్పక అవగతమవుతుంది.

నా మిత్రుడికి చెప్పదలచిన మూడో విషయమేమంటే, అతను నిజంగానే నిజాయితీ కలిగి వుంటే తను చెప్పే విషయాలను నిజంగానే నమ్ముతుంటే భారతదేశ ప్రజలకు వయోజన ఓటుహక్కు ఇవ్వనక్కరలేదు, ఎందుకంటే వారికా అర్హత లేదు కాబట్టి - అతనికుండే ఏకైక ప్రత్యామ్నాయం భారతదేశానికి తిరిగి వెళ్ళటం. స్వతంత్ర ప్రతిపత్తిని కానీ, బాధ్యతాయుత ప్రభుత్వాన్నికానీ డిమాండు చేయడం కాదు. ఆ పెద్దమనిషి దృష్టి యిదే అయితే భారతదేశ ప్రజలు ఓటుహక్కుకే అనర్హులు. ప్రభుత్వ బాధ్యతలు తీసుకోవడానికి అనర్హులు. అలాంటపుడు ఎవరి పేరుతో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని డిమాండ్ చేస్తున్నారో నాకర్థం కావడంలేదు. ఈ

వర్గానికా? ఇది తనకోసమా? అయితే ఎవరికోసం? బాధ్యతాయుత ప్రభుత్వం కానీ స్వతంత్ర ప్రతిపత్తికి అనుకూలమైన చర్చకానీ జరుగుతున్నదంటే, నాకు అర్థమైనంతవరకు భారతప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వం చేపట్టడానికి అన్నివిధాలా అర్హతలు కలిగి వున్నవారు. కాకపోతే, భారత ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వం చేపట్టే యోగ్యత లేదని నా మిత్రుడు నమ్ముతుంటే – భారత ప్రజలకు స్వతంత్ర ప్రతిపత్తికానీ, బాధ్యతాయుత ప్రభుత్వం కానీ అక్కరలేదనే అనుకోవాల్సి వస్తుంది.

రెండవ వాదన ముందుకు తీసుకు వచ్చిందేమంటే వయోజన ఓటుహక్కు ఒక ఆదర్శంగానే వున్నందువలన ప్రస్తుత పరిస్థితులలో దానిని అమలు పరచలేము; ఎందుకంటే, దాన్ని అమలుపరచే యంత్రాంగం ప్రస్తుతం మనకులేవు కాబట్టి. ఈ వాదన మీద నాకు అమితమైన జాలి పుట్టుకొస్తోంది. అయినా ఆ వాదనని పూర్వపక్షం చేసే వాస్తవాలను ప్రతిపాదించాలనుకొంటున్నాను. నిజానికి ఓటుహక్కు అంటే ఏమిటో అర్థం చేసుకుందాం. ఓటుహక్కు అంటే నిజమైన అర్థం బ్యాలెట్ పెట్టెలు కాదు, అలాగే పోలింగు బూతులూ, అక్కడ నియోగించే పోలింగ్ అధికారులూ కాదు. ఓటుహక్కంటే అంతకు మించిన వేరే అర్థముంది. ఓటుహక్కంటే నేను అర్థం చేసుకున్న మేరకు ఓటు స్వేచ్ఛ, ఓటుహక్కు ఆత్మరక్షణా హక్కు. దాని అర్థం ప్రజల ఆస్తులు, స్వేచ్ఛ, జీవితాల మీద విపరీత ప్రభావం చూపే చట్టాలని చేసే విస్తృతాధికారాలున్న శాసనసభని సృష్టించే అధికారం. వాస్తవం యిలాగుంటే, మీ జీవితాలకు సంబంధించిన అతి ముఖ్యమైన విషయాలకు సంబంధించి శాసనసభ నిర్ణయాలను తీసుకుంటున్నపుడు, తమకు వ్యతిరేకంగా ఏవయినా శాసనాలు వెలువడినపుడు అవి తమ స్వేచ్ఛని, జీవితాలని, ఆస్తులనీ దురాక్రమిస్తున్నపుడు ప్రతి వ్యక్తీ తన హక్కులను రక్షించుకోక తప్పని స్థితి ఏర్పడుతుంది. ఇది బ్యాలెట్ పెట్టెకు సంబంధించిన ప్రశ్నే కాదు, పోలింగు బూత్‌లకు సంబంధించిన ప్రశ్న మాత్రమే కాదు.

ఇంకో కోణంలో ఈ విషయం వివరించేదా? నేనే కనుక ఓటు హక్కుని అర్థం చేసుకోవాలనుకుంటే, సమాజంలో జీవితానికి ముడిపడి వున్న అనేక విషయాలను క్రమబద్ధం చేసే హక్కుగా అర్థం చేసుకుంటాను. ఇదే ఓటుహక్కులోని సారం. ఇప్పుడు ఓటుహక్కును ఒక వ్యక్తికి వస్తున్నావంటే, సమాజంలోని యితర వ్యక్తులతోడి జీవన సంబంధాలను క్రమబద్ధం చేసే హక్కును అతనికిస్తున్నావన్నమాట. ఓటు స్వేచ్ఛకు అర్థం యిదే అయితే, అగ్రవర్గాలకు వాళ్ళ మేధావులకు ధనికవర్గాలకు అధికారమిచ్చి వారి దయాదాక్షిణ్యాలకు, వారి మీద ఆధారపడిన వాళ్ళకు నిమ్న వర్గాలను వదిలేయడమన్నమాట. ఎంత బానిస బ్రతుకులు వారు బ్రతుకుతున్నా వారికి తమ జీవితాలను క్రమబద్ధం చేసుకునే అధికారం వుంది. ఒక పెట్టుబడిదారుడు కార్మికులతో కలిసి జీవించడానికి రాజ్యాంగం ప్రకారం ఎన్ని షరతులు పెట్టడానికి అధికారం వుందో, అలాగే కార్మికులకు కూడా తమ యజమానయిన పెట్టుబడిదారుడితో కలిసి జీవించడానికి అన్ని షరతులు పెట్టడానికి అధికారం వుంది. ఇది ఏక పక్షపు బేరం కాదు, అసలు ఒకవైపు బేరం వుండరాదు. ఓటుహక్కు అనే

పదాన్ని సరయిన దృష్టిలో అర్థం చేసుకుంటే ఓటు స్వేచ్ఛ రాష్ట్రంలోని ప్రతి వ్యక్తి యొక్క జన్మహక్కుగా భావించాలని నాకు అనిపిస్తూంది. ఓటుహక్కును అర్థం చేసుకునే యోగ్యత వుండే ప్రతి పురుషుడి లేదా స్త్రీ యొక్క జన్మహక్కుగా నీవు అర్థం చేసుకొంటే అపుడు ప్రజల స్వతస్సిద్ధమైన హక్కును నీ పాలనా సౌకర్యం కోసం మార్చుకోలేవు.

మనకు పోలింగు బూత్‌లు, పోలింగు అధికారులు లేరు కాబట్టి వయోజన ఓటింగ్ హక్కు లేదని నా మిత్రుడు వాదించాడు. ఒకటి ఆయనకు గుర్తు చేస్తాను. ఒక వ్యక్తికి అతని తప్పుడు సలహావల్ల నష్టం జరిగింది. అతని ఫిర్యాదు మంచిదే. అతను న్యాయస్థానం కెళ్ళినట్లయితే న్యాయం జరిగేదే కానీ ఉన్నత న్యాయస్థానంలో చాలినంతమంది న్యాయమూర్తులు లేనందువల్ల అతనికి న్యాయం తిరిగి యివ్వలేము. ఇలాంటి పరిస్థితికి అతనెలా స్పందిస్తాడు? ఓటుహక్కు జన్మసిద్ధమైన హక్కయినపుడు ఆ ఓటుహక్కును ఆచరణీయం చేయడానికి పాలనాపరమైన ఇబ్బందులు ఎదురైనపుడు, దానికి ప్రతిక్రియ ఓటుహక్కును రద్దు చేయడం కాదు, దానికి ప్రతిక్రియ - ప్రతి పురుషుడూ, స్త్రీ ఓటుహక్కును అనుభవించే విధంగా యంత్రాంగాన్ని ఏర్పాటు చేయడం, దానిని అమలుచేసే పరిస్థితులను కల్పించడం జరగాల్సి వుంది.

సర్, నాకేమనిపిస్తుందంటే ఓటుహక్కును అమలు పరచడానికి పాలనాపరమైన యిబ్బందులు రెండు విభిన్నమైన మూలాల నుంచి ఉత్పన్నమౌతున్నవని తెలుస్తూంది. భారతదేశంలోని నియోజకవర్గాలు చాలా విశాలమైనవని మనకు చెప్పారు. మనం పరిశీలించిన సైమన్ కమీషన్ ప్రకటన ప్రకారం ఆ సమాచారం కట్టుకథలా వుంది. ఇపుడున్న వాటి ప్రకారం నియోజకవర్గాలలో ఓటర్ల సంఖ్య పెంపు చేసినట్లయితే మొత్తం యంత్రాంగం నాశనమవుతుందని అంటున్నారు. ఈ సమావేశంలో నా విన్నపమేమంటే, కచ్చితంగా ఈ క్లేశాన్ని సులభంగా అధిగమించవచ్చు. ఈ సమస్యను ఈ విధంగా పరిష్కరించవచ్చని నాకనిపిస్తూంది. విధానమండలిలో సభ్యుల సంఖ్య విపరీతంగా వుండడం వల్ల సమస్య తలెత్తూతూ వుంది. ఈనాడు పెద్ద నియోజకవర్గాలుగా వున్న వాటిల్లో తక్కువ సంఖ్య వుండడం కూడా ఒకరకమైన కారణమేననాలి. రాష్ట్రాల్లోని శాసనసభల్లో సంఖ్య యిప్పుడు చాలా హాస్యాస్పదంగా వుంటున్నట్లు తెలుస్తూంది. ఆ సంఖ్యలను ఒకసారి మననం చేసుకోవడం వల్ల పరిస్థితిని అంచనా వేయవచ్చు. మద్రాసు, బెంగాల్, సంయుక్త రాష్ట్రాల జనాభా రమారమి ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్, ఇటలీలతో సరిపోతుంది. మద్రాసు శాసనమండలిలో 132 మంది సభ్యులుండగా, బెంగాల్ శాసనమండలిలో 140 మంది, సంయుక్త రాష్ట్రాల శాసనమండలి సభ్యులు 123 మంది వున్నారు. ఒకవైపు చూస్తే ఫ్రాన్స్‌లోని దిగువసభ సభ్యుల సంఖ్య 626 మంది, గ్రేట్ బ్రిటన్ 600 మందిపైగా, ఇటలీలో 560 మంది సభ్యులు. ఇంకోవైపు చూడండి, బొంబాయికానీ, పంజాబ్‌కానీ జనాభారీత్యా రమారమి దగ్గరగా వుంటాయి. బొంబాయిలో 114మంది సభ్యులు, పంజాబ్‌లో 94మంది సభ్యులు. బొంబాయి, పంజాబ్‌ల జనాభా దాదాపు స్పెయిన్‌తో సరిపోలుతుంది. మీరిపుడు స్పెయిన్ దిగువసభ సభ్యుల సంఖ్య గమనించండి. 417మంది. ఇప్పుడీ సంఖ్యలు

అమలులో లేవని నాకు తెలుసు, అది వేరే విషయం. కానీ చూడాల్సిందేమంటే, యిది రాజ్యాంగ సూత్రంగా ఫ్రాన్సులో పెద్ద సంఖ్యలో యింకా అమలులో వుంది. తర్వాత, మధ్య రాష్ట్రాల శాసనమండలి సభ్యులు 73మంది. మధ్య రాష్ట్రాల జనాభా దాదాపు యుగోస్లేవియాతో సరిపోలుతుంది. యుగోస్లేవియా సభ్యులు 313మంది. అస్సాం సభ్యులు 53 మంది. జనాభా రీత్యా అది పోర్చుగల్‌తో సరిపోలుతుంది, అయితే పోర్చుగల్ సభ్యులు 146మంది అని గమనించాలి.

ఇప్పుడు మొత్తం ప్రజలను 140 మంది సభ్యులయినా మించిన శాసనసమండలుల్లోకి ఇరికించటం వల్ల వారికి సరైన న్యాయం చేకూర్చకపోవడమే కాక, ఫలితంగా సంఖ్య పెంపు చేయడానికి మీరెందుకు భయపడుతున్నారో నాకర్థం కావడంలేదు. మీరు భయపడకుండా వుండేట్లయితే, యితర దేశాల దామాషాలను పరిశీలించి అనుసరిస్తూ, నియోజకవర్గాల పరిమాణాన్ని సులభంగా తగ్గించుకుని తద్వారా వయోజన ఓటుహక్కుకు సంబంధించిన సమస్యలను క్రమంగా తగ్గించుకోవచ్చు.

సరిపోయినంతమంది ఎన్నికల అధికారులు లేరని యింకొక సమస్య లేవనెత్తబడింది. అది కూడా నా ఉద్దేశ్యంలో పెద్దగా యిబ్బంది పడాల్సినదేమీ లేదు. భారతదేశంలోని అన్ని కాలేజీల విద్యార్థులను ఎన్నికల ఆఫీసుల్లోకి, విభాగాల్లోకి తరలిస్తే ఈ సమస్య సులభతరమవుతుంది. అవతలి పక్షంలో కూర్చునివున్న నా మిత్రులు నా సూచనకు నవ్వుకుంటున్నారు, అయితే ఎందుకో నాకర్థం కావడంలేదు. నిజానికి జరిగేదేమంటే, జనాభా సేకరణ విభాగానికి కాలేజీ విద్యార్థులు, బడుల్లో చదివే విద్యార్థులు ఎంతగానో సహకరించడం నాకు తెలిసిన విషయమే. ఎన్నికల రోజుకూడా ఉదాహరణకు ఈ పద్ధతిని అనుసరించామనుకోండి, కాలేజీ విద్యార్థులందరిని సహకరించాలని కోరామనుకోండి ఏ మాత్రం అనుమానం లేకుండా మనకు వారు సహకరిస్తారు. అప్పుడు ఆ సందర్భంలో కావాల్సినంతమంది కంటే ఎక్కువమంది ఎన్నికల అధికారులు మనకు లభ్యమవుతారు.

కాబట్టి ఈ సమస్యలన్నీ అసాధ్యమైనవేమీ కాదని నాకనిపిస్తోంది. ఈ రకమైన సమస్యలకు నా ఎదురుగా వున్న మిత్రులు అభ్యంతరాలు లేవదీయడం చూస్తుంటే నాకొకటి అనిపిస్తోంది. ఈ విషయంలో వారిది వింతైన మనస్తత్వమే. బ్రిటీషు ప్రతినిధుల్లో ఒకరు ఒక సమస్యను గురించి మాట్లాడుతూ, భారతదేశానికి దారినిండా కుప్పలుగా కుప్పలుగా సమస్యలు, ఒడిదుడుకులున్నాయి కాబట్టి వారికి స్వతంత్ర ప్రతిపత్తికానీ, బాధ్యతాయుత ప్రభుత్వం కానీ అనవసరం అన్నారనుకోండి. ఎదురుగా కూర్చుని వున్న పెద్దమనిషి బ్రిటీషు ప్రతినిధిని, తిరిగి సమస్యల గురించి నోరెత్తకుండా ఒకే మాటలో 'మీరు యిబ్బందులను అత్యుక్తి చేసి మమ్మల్ని బాధపెట్టనక్కరలేదు, ఈ సమస్య లన్నిటిని తప్పకుండా పరిష్కరించుకోవాల్సిందే" అంటారు. మేము ఈ ప్రక్కగా కూర్చున్నవాళ్ళం, ఏదో సమస్యని లేవనెత్తి మీరు అసలు విషయాన్ని మభ్య పెట్టడాన్ని చూస్తూ వూరకుండలేము. మా చేతుల్లోకి అధికారం వచ్చే మార్గం మధ్యలో ఎన్ని సమస్యలున్నా ఆ సమస్యలన్నింటినీ తప్పక పరిష్కరించవలసిందే. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని మీరు తప్పించుకోవడాన్ని మేము సహించలేము.

సర్, యింతవరకు నేను చేసిన వాదనలన్నీ వయోజన ఓటుహక్కుకు వ్యతిరేకంగా వచ్చిన వాదనలను ఖండిస్తూ చేసినవి. ఇపుడు వయోజన ఓటుహక్కును సమర్థిస్తూ, అనుకూలంగా నా అభిప్రాయాలు ఒకటి, రెండు వివరిస్తాను. యివి నా ఉద్దేశ్యంలో దాదాపు నికరమైన వనవచ్చు. నా మొదటి వాదన ఏమిటంటే, భారతదేశంలో అన్ని కులాలు, జాతులు కలిసి వున్నపుడు వీటన్నింటికి ప్రాతినిధ్యం కల్పించే ఓటుహక్కు పద్ధతి ఏదీ లేదు, ఒక్క వయోజన ఓటింగు పద్ధతి తప్ప. భారతదేశంలో సత్ఫలితాలనిచ్చే పద్ధతి అది తప్ప వేరు పద్ధతిని ఆలోచించలేము. ఉదాహరణకు యిప్పుడున్న నియోజకవర్గాలను తీసుకోండి, బెంగాల్‌లోను పంజాబ్‌లోనూ మహమ్మదీయులు అధిక సంఖ్యాక ప్రజలుగా వున్నారు. బొంబాయి తప్ప సింధ్‌లో కూడా వారిదే అధిక సంఖ్య. ఇపుడు మహ్మదీయ జాతులకు సంబంధించిన రాష్ట్రం వీటిల్లో ఏది? అభిప్రాయసేకరణలో భాగంగా యిది చెప్పాను. నా మహమ్మదీయ మిత్రుల వైఖరి యింకొక రకంగా వుండవచ్చు, యిది ఒక దృష్టాంతంగా చెబుతున్నాను. ఈ రాష్ట్రాల్లో యిపుడు అమలులో వున్న ఓటింగు విధానంలో మహమ్మదీయ జాతుల స్థానం ఏమిటి? సింధ్‌లో మహ్మదీయులు మొత్తం జనాభాలో డెబ్బయి శాతం వుండవచ్చు. అయినా నా లెక్క తప్పుకాకుంటే వాళ్ళ ఓటింగు కేవలం 49 శాతం మాత్రమే. తిరిగి బెంగాల్, పంజాబ్‌లను తీసుకోండి, జనాభా దామాషాలో మహమ్మదీయులు అధికం అయినా ఓట్ల పట్టికలో మాత్రం వీరు మైనారిటీయే. ఇపుడు దళితవర్గాలను చూడండి, ప్రస్తుతం అమలులో వున్న ఓటింగు విధానంలో వారు నియోజకవర్గాలలో ఎక్కడా లేరు. ఇలాంటి ఓట్ల పద్ధతి అమలులో వుండడం గొప్ప అవమానకరమైన విషయంగా భావిస్తున్నాను. మీరు గుర్తుంచుకోండి! భారతీయ సమాజం ఎన్నో కులాల, మతాల సమ్మిశ్రితం. ఆ కులాలు మతాలు ఎవరో అన్నట్లు లంబరేఖలాగా ఒకదానికొకటి సంబంధం కలిగిలేవు, కనుక ఆ జన సమ్మిశ్రితాన్ని ఒక నిర్దిష్టమైన చోట విడదీసి ప్రక్కనబెడితే అది అన్ని కులాలనూ, మతాలనూ సమాన నిష్పత్తిలో ప్రతిబింబిస్తుంది. ఇంకోవైపు, నేను కనుక అదే రకంగా జన సమ్మిశ్రితాన్ని విడదీస్తే ఒకే ఒక వర్గం ప్రతిబింబించిందనో లేదా మరీ ఎక్కువంటే రెండు ప్రతిబింబించాయనో అంటారు. మిగిలినవి రంగంలోకి రానేరావు. కాబట్టి కొన్ని కులాలు, జాతులు ప్రధానంగా వుండే విధంగా రాజకీయ ప్రభుత్వాన్ని ఏర్పరచే విధానం జోలికి మీరు పోరనే ఆశిస్తాను. కొంతమంది ప్రజలకు మాత్రమే ఓటుహక్కు వుండి మిగిలిన వాళ్ళకు లేని దక్షిణాఫ్రికా లాగా భారతదేశాన్ని సృష్టించబూనరని కచ్చితంగా ఆశిస్తాను. ప్రతి మనిషికీ ఓటునివ్వాలని, ప్రతి మనిషికీ రాజకీయ స్వేచ్ఛ నివ్వాలని తద్వారా వారు వారి విధిని బట్టి వ్యవహరించగలరని మీరనుకొనేట్లయితే, భారత దేశంలో వయోజన ఓటింగు విధానం కంటే మించిన నిర్ణాయక హక్కు వేరొకటి లేదు.

ఇప్పుడు యింకొక దృష్టాంతాన్ని చూపిస్తున్నాను చూడండి. స్త్రీలకు ఓటుహక్కు నీయడానికి నేను వ్యతిరేకిని కాను. ఈ విషయంలో మద్దతునిచ్చిన మన సహచరురాలు శ్రీమతి సుబ్బరాయన్‌కు నేను కృతజ్ఞుడిని. ఆమె చెప్పినవాటిని సహృదయతో అర్థం చేసుకోగలను.

ఓటుస్వేచ్ఛ గురించిన ఒకటి రెండు చిత్రణలు మీ ముందుంచాలనుకుంటున్నాను. అక్షరజ్ఞానం వున్నవాళ్ళకి ఓటుహక్కు నివ్వాలని ఆలోచన యివ్వబడింది. దానిని కాల్పనిక ఓటుహక్కుగా నేనుకోవడం లేదుగానీ, దాని పర్యవసానం ఎలా వుంటుందో చెప్పనీయండి. ఎలా వుంటుందంటే, కొన్ని వర్గాల ఓటు హక్కు రెండింతలవుతుంది, మిగిలిన వర్గాలు అలాగే అణగారిపోతుంటాయి. భారతదేశంలో అక్షరాస్యత ఎంతగానో అసమానంగా అమలు జరిగిందనేది నిస్సందేహం. దానివల్ల కొన్ని వర్గాలు విపరీతంగా లబ్ధి పొంది ఓటుహక్కును తమ పాదాక్రాంతం చేసుకొంటాయి. అదే యితరవర్గాలు ఎక్కడున్న గొంగళి అక్కడే వున్నట్లుంటాయి. ఇలాంటి దుస్థితిని మీరు తప్పకుండా కల్పించబోరని ఆశిస్తున్నాను.

ఈ బల్ల చుట్టూ సమావేశమై వున్న ప్రతినిధులందరూ తమ విశ్వాసాల కనుగుణంగా భారత దేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం కావాలనుకుంటే, ఆ ప్రభుత్వం ప్రజలకు బాధ్యత వహించ గలదనుకుంటే నా విన్నపమేమంటే, వయోజన ఓటుహక్కు కంటే మరో ప్రత్యామ్నాయం లేదని.

ఇంకొక విషయాన్ని మీ పరిశీలన కోసం వుంచుతున్నాను. ఈ విషయంలో అది నిర్ణయాత్మక పరిశీలన అవుతుందని అనుకుంటున్నాను. సమిష్టి నియోజకవర్గాలు, ప్రత్యేక నియోజకవర్గాలు అనేది గొప్ప చిక్కు ప్రశ్నగా తయారవడమే కాకుండా, కీలకమైన ప్రశ్నగా తయారవుతుందని మాకందరికీ తెలిసిందే. ఈ సమావేశంలో నా అభిప్రాయం ఏమిటంటే, సమిష్టి మరియు ప్రత్యేక నియోజకవర్గాల గురించిన ప్రశ్న అనివార్యంగా ఓటుహక్కుతో కూడా ముడిపడి వుందని. మైనారిటీలకు వయోజన ఓటింగు విధానం వుంటే తప్ప మీరు భారతదేశంలోని మైనారిటీలను ప్రశ్నించలేరు, ఒప్పుకోమని బలవంతపెట్టలేరు, కనీసం మైనారిటీల సమ్మతిని కూడా పొందలేరు. నావరకు నేను ఏ మెజారిటీ ప్రభుత్వపు కాలి క్రింద, అధికారం క్రింద అణిగి పడి వుండలేను. ఎన్నికలలో నా ఎంపికాధికారానికి, నా సాంఘికాధికారానికి అనుగుణ్యంగా వుంటే తప్ప. దేశ ప్రజలందరి ప్రతినిధిగా వుండబోయే అభ్యర్థి ఎంపికను నిర్ణయించే ఓటుహక్కు దళిత వర్గాలకు చెందిన ప్రతి స్త్రీ పురుషుడూ వుపయోగించుకోగలుగు తున్నారా అంటే కచ్చితంగా లేదు. అందుకే నేను కచ్చితంగా సమిష్టి నియోజకవర్గాలను అంగీకరించను గాక అంగీకరించను. అంగీకరించి నన్ను నేను మైనారిటీ స్థితిలోకి నెట్టుకోలేను. నా అభ్యర్థిని ఎవరో మెజారిటీ వాళ్ళు ఎన్నుకోవడాన్ని నేను అంగీకరించను. ఎలాంటి పరిస్థితుల్లోనూ నేను దీనిని అంగీకరించలేను. నా మైనారిటీల్లో ఎంతటి వాస్తవముందో, మహమ్మదీయుల పరిస్థితుల్లో కూడా అంతే వాస్తవముంది. ఇంకొక కమిటీలో చెప్పిన దానిని యిక్కడ చెప్పడం నాకు యిష్టం లేదు. కానీ, యీ సందర్భంలో పేర్కొనడం ఎంతో సమంజసంగా వుంటుంది కాబట్టి పేర్కొనక తప్పడంలేదు. నియోజకవర్గంలో వాళ్ళని మెజారిటీగా చేస్తే తప్ప మీరు బెంగాల్, పంజాబ్‌లలోని మహమ్మదీయులను సమిష్టినియోజకవర్గాలను ఒప్పుకో మని చెప్పలేరు. ఎంపికశక్తిలో మహ్మదీయులని మైనారిటీలోకి నెట్టివేసి ఓటుహక్కును నిరాకరించి తర్వాత "రండి సమిష్టిఎన్నికల విధానంలో పాల్గొందాం" అనడంలో ఎలాంటి వుపయోగముంటుంది?

ఈ వాస్తవంలోని నిర్ణయాత్మకత నెహ్రూ కమిటీ మరియు భారతీయ కేంద్ర కమిటీలోని ముగ్గురు సభ్యులు గుర్తించారు.

ముగించబోయే ముందు మాకు వయోజన ఓటుహక్కు ఇవ్వ నిరాకరించే మిత్రుల గురించి ఒకటి రెండు విశేషాలు చెప్పనీయండి. భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వడం అనే ఈ ఒక్క ప్రశ్నలోనే అంతా యిమిడి లేదని నా ప్రసంగం మొదట్లోనే తేటతెల్లం చేశాను. నేను, నా మిత్రుడు యిద్దరమే 80 లేక 90 మంది ప్రతినిధులున్న ఈ సమావేశంలో దాదాపు 43 మిలియన్ల ప్రజలకు ప్రతినిధులం.

***దివాన్ బహదూర్ రామచంద్రరావు :*** లార్డ్ జెట్లాండ్ ప్రతిపాదనను డా॥ అంబేద్కర్ అంగీకరిస్తున్నారా?

***డా॥ అంబేద్కర్ :*** సూత్రప్రాయంగా అంగీకరించవచ్చు. కానీ నేను మీ ముందుంచిన విషయం మీద రోజూ వందలాది ఉత్తరాలూ, టెలిగ్రాంలూ వస్తున్నాయని చెప్పనా? ఇది చాలా కీలకమైన విషయం.

***సర్ పి.సి. మిట్టర్ :*** కేంద్ర శాసనసభ గురించి ఏమంటారు? వయోజన ఓటింగు కావాలంటారా, శాసనసభలో ఎంతమంది వుండాలంటారు?

***డా॥ అంబేద్కర్ :*** అది తర్వాత తేల్చవలసిన ప్రశ్న. కేంద్ర శాసనసభంటారా, నా ఉద్దేశ్యంలో 500 మంది సభ్యులుంటే మంచిది.

***సర్ పి.సి. మిట్టర్ :*** వయోజన ఓటింగు కూడానా?

***డా॥ అంబేద్కర్ :*** అవును.

* * *

***సర్ కౌవాస్జీ జహంగీర్ :*** నేను చేసిన ఈ సూచనలన్నీ బేగం మీద గౌరవంతో, ఓటుహక్కు పునాదుల మీదే విధానమండలి ప్రాతినిధ్యం వుంటుందనే భావంలోంచి పుట్టినవే. అన్ని దేశాల్లోనూ అంతే. కానీ జాతులకు ప్రాతినిధ్యం యిచ్చే సూత్రం మాత్రం అంత మంచిది కాదు.

***కల్నల్ గిడ్నీ :*** నేనిప్పుడొక నిర్దిష్టమైన సూచన చేయదలిచాను, లార్డ్ జెట్లాండు సూచించిన పథకం ప్రకారమైతే మనం ప్రత్యక్ష, పరోక్ష ఎన్నికల్లోకి వెళ్ళాల్సి వుంటుంది. ప్రత్యక్ష ఎన్నికలకు సంబంధించి అయితే ఓటుహక్కును యింతకు మించి విస్తృత పరచడం నా సూచనమేరకు అక్కరలేదు. యిపుడున్న ఓటింగు విధానం వున్నదున్నట్లుగా వుంటే చాలు.

***డా॥ అంబేద్కర్ :*** కాదు.

***కల్నల్ గిడ్నీ :*** బాగానే వుంది.

***సర్ కౌవాస్జీ జహంగీర్ :*** పట్టణాల గ్రామ నియోజకవర్గాల నుంచి శాసనసభకు వచ్చే సభ్యులకు

నిశ్చితమైన సంఖ్య వుంటుంది. అత్యధిక సంఖ్యాకులైన ప్రజలకు ప్రత్యక్ష ఓటుహక్కులేదు. అందువల్ల ఈ జనాభా కోసం ఓటింగు విధానం విస్తృత పరచాల్సి వుంది. అది వయోజనుల్లో 25 శాతం దామాషా ప్రకారం, పల్లెల్లో పట్టణాల్లో పరోక్ష ఓటింగు విధానం ద్వారా వారు తమ ప్రతినిధులను ఎన్నుకొంటారు. ఆ రెండింటిలో విలక్షణత నాకేమీ అగుపడడంలేదు. పారిశ్రామిక కార్మికుల్లోనూ వ్యవసాయ కార్మికుల్లోనూ ఇది తీసుకురావచ్చు.

***డా॥ అంబేద్కర్ :*** ఆ రకమైన మార్పేమీ రాదు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** సర్, ఈరోజు ఉదయం ఓటుహక్కును గురించి ఏ మాత్రం పక్షపాతం లేకుండా నా అభిప్రాయాలు వెలిబుచ్చాను. ఓటింగు విధానాన్ని విస్తృత పరచడానికి ఈ కమిటీ ముందుకొచ్చిన సూచనలను యిపుడు ఏ విధమైన వివక్ష లేకుండా పరీక్షించాలనుకుంటున్నాను. ఈ కమిటీ వయోజన ఓటింగును ఆదర్శంగా అంగీకరించడాన్ని గుర్తిస్తున్నాను. మాలో కొందరు దానిని యిప్పుడే గుర్తించాలని కోరుతున్నారు, మరికొందరు మిత్రులు దానిని అంచెలవారీగా పరిణామం చెందేలా చూడాలని కోరుతున్నారు. అందువల్ల రెండు నిర్దిష్టమైన సూచనలు మా ముందుకొస్తున్నాయి. ఒక సూచన ఏమిటంటే, ఓటుహక్కును అంచెలంచెలుగా అభివృద్ధి చేస్తూ యిపుడున్న ఓట్ల పట్టికలో 25 శాతం చేర్చి కొన్ని సంవత్సరాల విరామాన్ని పాటించాలనేది. మన గౌరవనీయ మిత్రుడు జెట్లాండ్ మార్క్విస్ సూచించినది రెండవది, వయోజన ఓటుహక్కును ఆదర్శంగా తీసుకొని కొంత వాస్తవం జోడించి అమలు పరచాలనేది.

ప్రస్తుతం రెండింటిని సరిపోల్చితే, మన గౌరవనీయ మిత్రుడి సూచనలపట్ల నేను మొగ్గు చూపకుండా వుండలేకపోతున్నాను. అయితే వయోజన ఓటుహక్కును యింకా మనం జీర్ణించుకోలేదని చెప్పినప్పటికీ రెండింటిలో ఏది కావాలని కోరినపుడు, ఒక వర్గపు ప్రజలకు ఓటు స్వేచ్ఛను ప్రసాదించి, అశేష ప్రజానీకం వాంఛించే స్వతంత్ర ప్రభుత్వాన్ని వాయిదా వేసే ఓటింగు విధానం కంటే వెంటనే వయోజన ఓటింగు విధానానికి పునాదులు వేసే పద్ధతినే కోరుకుంటాను. కానీ యిది చెప్పినంత మాత్రాన ఈ సూచనకు నా సంపూర్ణ మద్దతు వుంటుందనుకోనక్కరలేదు. ఎందుకంటే అందులోనూ కొన్ని సమస్యలు యిమిడి వున్నాయి. జెట్లాండ్ లార్డ్ మార్క్విస్ మా సాయానికి వచ్చి సమస్యలు యీడేరేట్లు చేస్తాడని మాలో కొందరు ఆశిస్తున్నారు కాబట్టి, నేను ఒకటి రెండు పరిశీలనలను ప్రతిపాదిస్తున్నాను. గుంపులుగా వుండి పరోక్ష ఎన్నికల విధానం అంగీకరిస్తే, దళిత వర్గాలు ఈ విధానంలో పెద్దగా లాభించరని నాకనిపిస్తుంది. దానికి కారణమేమంటే భారతదేశంలోని ప్రతి పల్లెలోనూ దళిత వర్గాలు చెల్లాచెదురుగా వెదజల్లబడి వున్నారు. వాళ్ళ జీవితాలని నిజానికి ఆర్థిక సామాజిక విషయాలలో శక్తివంతమైన పట్టు కలిగిన పల్లె ప్రజలు నియంత్రిస్తున్నారు. ఒకవేళ ఈ పరోక్ష ఎన్నికల విధానం వీరి పట్ల అమలు జరిగేటట్లయితే దళిత వర్గాల పట్ల ఎంత ఘోరమైన వత్తిడి

పెరుగుతుందంటే, వారు ఓటు చేయడంలోనే కానీ, ప్రాథమిక ఎంపికలో కానీ ప్రతినిధులను తమ యిష్టపూర్వకంగా ఎంపిక చేసుకోలేక, బలవంతాన మరెవరినో ఎంపిక చేసుకోవాల్సి రావడానికి అవకాశమెంతో వుంది. ఈ భయమే నన్ను పీడిస్తుంది.

***ఒక సభ్యుడు :*** అదన్న మాట మీ ఉద్దేశ్యం.

***డా॥ అంబేద్కర్ :*** మీరా మాటన్నందుకు నాకు సంతోషం. మీరు సూచించిన వాటిల్లో సమస్యలు ప్రత్యేక నియోజక వర్గాల విషయాన్ని మరింత జటిల పరుస్తాయి. అయితే అంత కచ్చితంగా చెప్పలేను కానీ పరోక్ష ఎన్నికల్లో మీరు ప్రత్యేక జాబితాను కొన్ని కులాలకు వారు కోరినట్లయితే ఏర్పాటు చేయవచ్చు. ఈ విషయంలో అది మరిన్ని సమస్యలను సృష్టిస్తుందని నేననుకోవడం లేదు.

అయితే నేను చెప్పినట్లుగా ఆ పద్ధతిని వెంటనే సమర్థించలేము, ఎందుకంటే ఆ పద్ధతి ఆచరణలో ఎలా వుంటుందో తెలుసుకోనిదే అన్ని వివరాలు తెలియనిదే ఎలా సమర్థించగలం? నా నిర్దిష్ట ప్రతిపాదన ఏమిటంటే ఈ కమిటీ ఒక ఉప కమిటీని నియమించి ఈ పద్ధతిని గురించి పూర్తి సమాచారం అందిస్తే పూర్తి జ్ఞానం, సమాచారం మనకి తెలుస్తుంది. తద్వారా మనం ఓటింగు కమిటీలో సమర్థవంతంగా ఆచరణలో జరిగేట్లు చేయవచ్చు. గౌరవనీయ ప్రభువు ఈ పదం వుపయోగిస్తున్నందుకు క్షమించాలి, అపక్వ పద్ధతిలో దీనిని అర్థం చేసుకోవడం కొంచెం కష్టతరమే, అదీగాక యింతటి సుదీర్ఘమైన ఆజ్ఞను అవలోకించడం ఏ స్థితిలోనూ సాధ్యం కాని పని, నావరకయితే ఈ పద్ధతికి మద్దతు నీయడం కూడా అనుమానాస్పదమే.

★ ★ ★

****శ్రీ బసు :*** అయితే దీనికి సంబంధించి గరిష్ట పరిమాణాన్ని చూపడం తప్పనిసరి, ఎందుకంటే ఓటింగు కమిటీ ఎలాగూ వుంది. దాని వివరాలలోకి వెళ్ళి పరిశీలించాల్సి వుంది. నేననుకోవడం, మనం అతి చిన్న రూపాన్ని చిత్రించాము. గరిష్టంగా అదెంత పరిమాణంలో వుండాలనేది వాళ్ళే నిర్ణయించాల్సి వుంది.

***డా॥ అంబేద్కర్ :*** మీ మొదటి పేరాలోని భావార్థాన్ని పరిశీలించాలని అనిపిస్తోంది. మీరు మీ పేరాలో యంత్రాంగం, పాలనా సౌకర్యాలను బట్టి ఓటుహక్కు పరిమితులను వ్యాప్తి చేయడాన్ని నిర్ణయించాలని తెలియజేశారు. ఆ ఒక్క పరిమితే మనం విధించగలిగింది.

***సర్ సి. సెతల్వాడ్ :*** పాలన ఒక్కటే కాదు, యింకా పరిశీలించాల్సినవి చాలా వున్నాయి.

***శ్రీ మణి సుబ్బరాయన్ :*** ఆచరణీయమైనవేవి?

* సబ్ కమిటీ సమావేశాలు –VI నం. (ఓటుహక్కు) పు. 74–75.

**డా॥ అంబేద్కర్ :** ఆచరణీయమైనవి అంటే యంత్రాంగమే. ఇపుడున్న యంత్రాంగంలో యాభయి శాతం ప్రజల ద్వారా ఓటుహక్కును అమలు చేయవచ్చునని కమిటీ గుర్తించడం లేదని నా అభిప్రాయం.

**జఫ్రుల్లాఖాన్ :** మొత్తం జనాభాలో యాభయి శాతమని మీ అభిప్రాయమా?

**డా॥ అంబేద్కర్ :** అవును.

**జఫ్రుల్లాఖాన్ :** సార్వత్రిక వయోజన ఓటుహక్కుకు అది కొంచెం ఎక్కువేమో!

**ఛైర్మన్ (సభాపతి) :** గరిష్ట పరిమాణం వదిలి వేయాలని సూచించారు. మొత్తం వ్యవహారమంతా షరతులతో కూడుకొని వుంది. నిపుణుల కమిటీ ఆచరణీయంగానూ, అభిలషణీయంగా కమిటీ గుర్తిస్తే కదా! కాబట్టి గరిష్ట పరిమాణాన్ని మనం సూచించనక్కరలేదు. దానిని వదిలేయండి. మళ్ళీ యిదంతా చదవాలని ఎవరైనా అనుకుంటున్నారా?

**కె.టి. పాల్ :** 25 శాతాన్ని వదిలేస్తే మన ప్రకటనను అది బలహీనం చేస్తుంది. దానికి నేనంగీకరించ లేను.

**ఛైర్మన్ :** అదేమీ బలహీనపరచదు.

**చింతామణి :** ఇలాంటి విషయాలలో అతి తక్కువ అనుకునేదేదైతే ఉందో అదే తీరా ఆచరణలో అత్యధికంగా వస్తుంది. మన ప్రకటనలో 10 శాతాన్ని సూచిస్తే, ఎన్నికల కమిటీ నియమించిన దానిలో 10 శాతం అధికంగా చూపబడుతుంది. మనలో కొందరు 25 శాతపు అంకె చూపినా అది వయోజన ఓటింగు విధానంలో ప్రస్తుతం అమలు జరుగుతున్న దానిలో అసంతృప్తికర ఒప్పందమే. దానిని మీరు పేర్కొన్నా నావరకయితే పెద్ద సంతోషంగా లేదు.

**ఫుట్ :** వయోజనుల్లో 25 శాతమని చింతామణి చెప్పారు కదా?

**చింతామణి :** మొత్తం జనాభాలో.

**ఫుట్ :** దయచేసి మళ్ళీ చెప్పండి.

**జోషి :** సర్, యిలా చెబుతున్నందుకు క్షమించండి, ఈ సూచనను ఏకాభిప్రాయంగా నివేదికలో మీరు సూచిస్తారేమో! నేను ఆ సూచనతో ఏకీభవించడంలేదు. వయోజన ఓటింగుకు సంబంధించి ఈ ప్రశ్నను సంపూర్ణ సమావేశంలో లేవనెత్తడానికి వాయిదా వేసుకొంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** నా పరిస్థితి కూడా అంతే.

**జోషి :** నివేదికలో ఈ విషయం పేర్కొనండి.

★ ★ ★

*డా॥ అంబేద్కర్ :* కనీసం ఇది కొంత మెరుగ్గా ఉంది. కాకపోతే యిది పని చేస్తుందని మనకు తెలియాల్సి వుంది (సార్వత్రిక వయోజన ఓట్ల పద్ధతి).

**ఛైర్మన్ :** అయితే యిది తప్ప మిగిలిన వాటిని కమిటీ ఒప్పుకున్నట్లేనా?

**సర్ సి. జహంగీర్ :** ఈ అంకెను నేను అంగీకరించలేను. సంపూర్ణమైన వాస్తవాలు మన ముందుంటే తప్ప 25 శాతాన్ని ఎలా అంగీకరించడం?

**ఛైర్మన్ :** ప్రత్యేక ఓటుహక్కుల కమిటీ ఏర్పడాలని సూచిస్తున్నాము.

**సర్ పి.సి. మిట్టర్ :** వాస్తవాలన్నీ మనకు ముందుగా తెలియనిదే వాగ్దానం చేయడం బాగుండదు.

**ఛైర్మన్ :** మన కర్తవ్యాన్ని నిపుణుల ఓటింగు కమిటీకి వదిలివేయడం బాగుండదు. మనమిపుడు కొన్ని సిఫార్సులు చేయవలసిన పరిస్థితిలో వున్నాం. మన పనిని వేరొకరికి అప్పగించే సిఫారసును మాత్రం చేయలేం కదా!

**సర్ పి.సి. మిట్టర్ :** నేను నా వ్యక్తిగత అభిప్రాయాన్ని మాత్రమే వ్యక్తపరుస్తున్నాను. ఓటింగు కమిటీకి నేను సూచించేదేమిటంటే, ఎంతో కొంత పెంచాలి. ఎంత అవకాశముంటే అంత. 10 కానీ, 20 కానీ, 50 శాతం కానీ ఎంతయినా నేను అభ్యంతరపెట్టను. ఒక అభిప్రాయానికి రావడానికి వాస్తవాలన్నీ ముందుగా నాకు తెలిస్తే కదా!

**ఛైర్మన్ :** సర్ ప్రోవాష్, మీ కిష్టమయితే ఓటింగు కమిటీ ముందు గరిష్ట, కనిష్ట పరిమితుల గురించి మీ సిఫారసును వుంచవచ్చు. అయితే దానిని అమలు పరచడం మాత్రం పూర్తిగా కమిటీ యిష్టం. కమిటీకి మనమంతా ఎంతో ఒకంత మార్గదర్శకత్వం వహించాలి కదా! మీతో మాట్లాడే అవకాశం తరువాత కలుగుతుందని ఆశిస్తాను.

**చింతామణి :** నేను సూచించేది మీరు అంగీకరిస్తారో లేదో చెప్పలేను. సర్, మనముందు ఒక ముఖ్యమైన ప్రతిపాదన వుంది, ఓటుహక్కుల గురించిన కమిటీ దీనికి ఆ అర్హతలున్నాయో లేదో అన్వేషించాలి. అయితే సాధ్యమైనంతవరకు జనాభాలో జాతుల నిష్పత్తులను బట్టి ఓటర్లను తీసుకోవాలి. దీనిని సైమన్ కమీషన్ ప్రతిపాదించగా స్థానిక ప్రభుత్వాలెన్నో సమర్థించాయి.ఇపుడు దీనిని కొత్తదానిగా పరిగణించాలా? ఒకవేళ ఓటింగు కమిటీకి యిది సాధ్యం కాదనుకుంటే తిరస్కరించవచ్చు.

**ఛైర్మన్ :** ఇది యింకొక అంశం క్రిందికి వస్తుందనుకుంటాను. దాని పేరు ఓటుహక్కుకు సామాన్యమైన ఆధారం ఓటుహక్కుకు సంబంధించిన అర్హతలు ఒకే ప్రాంతంలో అన్ని కులాలకు సమానంగా వుంటాయా? 'ఒకే ప్రాంతం' అనే పదాన్ని మాత్రం మరింత జాగ్రత్తగా గుర్తుంచుకోండి

* సబ్ కమిటి సమావేశాలు, సం. 4, (ఓటుహక్కు), పు. 76–78

ఇపుడు స్త్రీల ఓటుహక్కుకు సంబంధించిన విషయంలోకి కానీ, మరో విషయంలోకి కానీ మనం చొరబడవద్దు.

**సర్ పి.సి. మిట్టర్ :** మీరు తీసివేసిన ప్రత్యేక ప్రయోజనాలు, జాతుల ప్రయోజనాలు మైనారిటీల కమిటీ కిందికి వస్తాయనుకుంటాను.

**ఛైర్మన్ :** మనం దాని గురించి రేపు మరింత తెలుసుకోవచ్చు. ఇప్పటివరకు మనం ఓటుహక్కు గురించి సామాన్య విషయాలను చర్చించుకొంటున్నాం, అన్ని జాతులకు అర్హతలు మాత్రం ఒకే మాదిరిగా వుంటాయి.

**దివాన్ బహదూర్ రామచంద్రరావు :** ఈ విషయం మన కమిటీ పరిదిలోకి వస్తుందా లేక యింకొకదానికి సంబంధించినదా ప్రధానమంత్రిని కనుక్కొంటామని అన్నారు దాని గురించి తెలుసుకోవచ్చా?

**డా॥ అంబేద్కర్ :** నేనొక ప్రస్తావన మీముందుంచాలనుకుంటున్నాను. సార్వత్రిక ఓటుహక్కును గురించి నిర్ణీతమైన సభ్యులు ఈ కమిటీలో సూటిగా చెప్పినా ప్రస్తుతం అది సాధ్యం కాదని, ఆచరణీయం కాదని అంటున్నారు. అయినా వయోజన ఓటుహక్కు దళిత వర్గాలకు మాత్రం తప్పకుండా సాధ్యమౌతుందని నాకనిపిస్తుంది. కాదనడానికి ప్రత్యేక వివరణ లేదు. ఉదాహరణకి, అన్ని కులాలకూ ఒకే ఓటింగు విధానం వుంటే, జీవితంలోని వాస్తవ సంఘటనలకు సంబంధించిన ఎన్నో విషయాలు మన ముందుకు వస్తాయి. వాటినిబట్టి మనం అనుసంధానించుకోవచ్చు. అసమానతా పద్ధతుల గురించి మాట్లాడుకోవచ్చు. పేదవారికి వ్యతిరేకంగా ధనికులు వ్యవహరించే బదులు పేదలకు లాభం కలిగే విధంగా చట్టరూపంలో మనం కొన్ని ప్రత్యేక చర్యలు చేపట్టవచ్చు. ఉదాహరణకు పేదలకంటే అధికంగా ధనిక వర్గానికి పన్ను విధించవచ్చు. ఆచరణలో పన్ను చెల్లించడమనేది ఒక విధిగా గుర్తించడంగా చేయాల్సి వుంది. ఇదే రకమైన పరిశీలన దళిత వర్గాలకు కూడా వర్తింప చేయాలని నా అభిప్రాయం. నియోజక వర్గంలో అన్ని వర్గాలు, కులాలు సమాన పద్ధతిలో ప్రాతినిధ్యం వహించాలని కమిటీ ఉద్దేశ్యమైతే ఒక వర్గపు ప్రజలను యింకొక వర్గపు ప్రజలకు భిన్నంగా పరిగణించడంలో అర్థం ఏముంది? నాకు ఏమనిపిస్తుందంటే, ఒకవేళ వయోజన ఓటుహక్కు మిగిలిన వర్గాలకు లేకుండా దళిత వర్గాలకే అనువర్తిస్తే మిగిలిన వర్గాలకు లార్డ్ జెట్లాండ్ సూచించినట్లు యింకో పద్ధతి అనువర్తింప చేయవచ్చు. వాస్తవానికి ఏ విభేదమూ వుండదు. దానికి తోడు రాష్ట్రాలలో కావలసిన ఎన్నికల యంత్రాంగానికి పెద్ద ఒత్తిడి కూడా వుండదు. దళిత వర్గాలకు ప్రత్యేక పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని, ఏ ఎన్నికల విధానమూ వారికి ఓటుహక్కునీయలేదనే ఏకాభిప్రాయానికితోడు, ఓటు లేనిదే ఏ శాసనసభ్యునికీ వీరు తమ విన్నపాలను వెలిబుచ్చలేరనీ, వెలిబుచ్చినా ఓటుహక్కు లేని వారిని శాసనసభ్యులు ఏమాత్రం పట్టించుకోరనే విషయాన్ని మొత్తం దృష్టిలో వుంచుకోవాలి. నా ఉద్దేశ్యంలో దళిత వర్గాలకు ఈ విధానాన్ని కమిటీ కనుక గుర్తించినట్లయితే గొప్ప ఉపద్రవాలేమీ జరగవు.

## మూడవ సమావేశం – 30 డిసెంబరు 1930*

+ఛైర్మన్ : ప్రస్తుతం మనం విద్యార్హతలకు సంబంధించిన ప్రశ్నను చర్చిస్తున్నాం. మన రెండో నిశ్చయానికి వచ్చిన విషయాన్ని మీకు గుర్తు చేస్తాను", అన్ని కులాలకు ఓటింగు అర్హత సమానంగా వుండాలని మనం సిఫారసు చేశాం. కానీ నిపుణుల ఓటింగు కమిటీ తన ప్రతిపాదనలు పంపేటపుడు, ఒక్కో జాతికీ ఓట్లను దాని జనాభా ప్రాతిపదికన నిర్ణయిస్తూ వారి ఓటుహక్కు సాధ్యమైనంత ఆచరణీయ ఫలితాలు వచ్చేట్లు ఆదర్శప్రాయమైన పద్ధతిని దృష్టిలో పెట్టుకొని ఏర్పాటు చేయాలని మనం కోరుకున్నాం". దీనిని సర్వశ్రేష్టమైన సలహాగా భావిస్తారేమోనని భయంగా వుంది. కానీ అదే సమయంలో వారి వద్ద నుంచి ఒక నిర్దిష్టమైన ఉదారతను ఆశించవచ్చు, అది వ్యక్తమైతే చాలు. కాబట్టి విద్యార్హతలకు సంబంధించిన ఈ ప్రశ్నలన్నింటిని దృష్టిలో వుంచుకోవాలని అధికారమిస్తే తప్ప, విశాల ప్రాతిపదికన వుండే వారి ఆచరణ పరిధిని మీరు కుదించినట్లవుతుంది.

***డా॥ అంబేద్కర్ :*** చివరి అభిప్రాయాలకు ఉప-కమిటీ వచ్చిందని మీరు చదివిన విషయాలకు సంబంధించి ఒక ప్రశ్న వేస్తాను. వివిధ జాతులకు రకరకాల ఓటుహక్కులను పరిశీలించే స్వేచ్ఛ ఓటుహక్కు కమిటీకి వుందని, ఆయా జాతుల బలాబలాలను బట్టి ఓట్ల సంఖ్య ప్రాతినిధ్య దామాషాలో ఫలితాలకు రావచ్చని భావించవచ్చా?

ఛైర్మన్ : ఆ స్వేచ్ఛ వుందని నేను భావించడం లేదు. మనం ఓటుహక్కుల కమిటీకి మార్గ దర్శకత్వం వహించాలి. వారు వివరాలను నింపుతారు. మనం వాస్తు శిల్పులం వాళ్ళు తాపీ మేస్త్రీలు. అంటే భవనం కట్టే వారనుకోవచ్చు.

***డా॥ అంబేద్కర్ :*** దానినర్థం చేసుకోగలను, కానీ నేను తెలుసుకోవాలనుకునేదేమిటంటే, వివిధ జాతులకు రకరకాల ఓటుహక్కులను యివ్వడం ద్వారా సమానత్వం సాధించాలనే స్వేచ్ఛ ఓటుహక్కుల కమిటీకి మీరు చదివిన అభిప్రాయం యిస్తుందా?

ఛైర్మన్ : ఇవ్వదు. తొట్టతొలి వాక్యమే ఏం చెబుతుందంటే ఓటుహక్కు అర్హత యిచ్చిన ఏ ప్రాంతంలోనయినా అన్ని జాతులకు సమానంగా వుంటుందని మనం సిఫారసు చేశామని. ఇప్పుడు మనం విద్యార్హతలను గురించి చర్చను కొనసాగిద్దాం.

★ ★ ★

+***జాదవ్ :*** ఏ శాసనమండలి అయినా పదేళ్ళ తర్వాత ఓటుహక్కును అభ్యంతరం పెట్టే అధికార వుందా? ఆ రకంగా కొన్ని ప్రవర్తించాలనుకోవచ్చు కదా!

ఛైర్మన్ : వారి అధికారాలంతా కొనసాగించడం వరకే, తీసివేయడం కుదరదు.

* సబ్ కమిటి సమావేశాలు, నం. 4 (ఓటుహక్కు) పుట 94

\+ అదే, పుట 138-139

***డా॥ అంబేద్కర్ :*** ఈ విషయం గురించి యింతకు ముందు అభిప్రాయాలకు మనం తీసుకున్న నిర్ణయాలకు సంబంధం లేకుండా ఒక మాట చెప్పాలనుకుంటున్నాను. ఇంతకుముందు జోషి సరిపోల్చిన ప్రత్యామ్నాయ సూచనలు అంటే స్వయంచాలక పొడిగింపుల కోసం ఏదయినా చట్ట రూపముండాలనే యింకొక ముఖ్యమైన ప్రతిపాదనను బట్టి దీనికి సంబంధించి నా వుద్దేశ్యంలో దానిని ఆమోదించవచ్చు. కొంత నిర్ణీత కాలంపాటు ఓటుహక్కు పనితీరును పరిశీలించే అధికారం యిచ్చి ఫలితాలను బేరీజు వేస్తే పరిస్థితి ఇంకొంచెం మెరుగుగా వుంటుందనిపిస్తోంది. వివిధ రాష్ట్రాలలో వ్యత్యాసాలు ఏ రకంగా వున్నాయో గమనించడానికి ఆ కమీషన్‌కు అవకాశమొస్తుంది. పదేళ్ళ కాలంలో వున్న యంత్రాంగం ఎన్నికలు సరిగ్గా నిర్వహించటానికి ఓటుహక్కు తీరును మార్చితే ఎలా వుంటుందో! నిష్పాక్షికంగా హుందాగా వుంటూ - ఈనాడు మనం పరిచయం చేస్తున్న ఈ పరిమిత ఓటుహక్కు కలిగిన ప్రజలను వర్గ చైతన్యం కలిగినవారుగా తయారు చేయాలి. ఈ కారణాల వలన సైమన్ కమీషన్ ప్రతిపాదనలు ఎంతో యోగ్యమైన ప్రత్యామ్నాయాలుగా నాకనిపిస్తున్నవి.

***సర్ కొవాస్జీ జహంగీర్ :*** దానిని ఎవరు ఆచరణలో పెట్టాలి?

***డా॥ అంబేద్కర్ :*** చట్టంలో చెప్పినట్లుగా పార్లమెంటు పబ్లిక్ సర్వీస్ కమీషన్‌ను సూచించాలి, దానిని ఏర్పరచడానికి ఒక కమిటీ సూచించాల్సి వుంది.

***సర్ కొవాస్జీ జహంగీర్ :*** కేంద్ర ప్రభుత్వంలోనా?

***డా॥ అంబేద్కర్ :*** అవును.

***ఛైర్మన్ :*** ఈ విషయం మీద నివేదిక సమర్పించడానికి అవసరమైన సమాచారం తెలుసుకున్నాననే అనుకుంటున్నాను. మీ ఉద్దేశ్యం ఎలా వుందో యిపుడు తెలుసుకోవాలనుంది. నిపుణుల ఓటుహక్కు కమిటీకి సిఫారసు చేయాలని లేదా యింకేదయినా కమిటీకి 15 ఏళ్ళ తరువాత ఏర్పాటు చేయాలని కాదు. కానీ ఒక రాష్ట్రం కంటే యింకొకటి మరింత ఉదారంగా ఓటుహక్కును విస్తరింపజేసే అవకాశాన్ని దృష్టిలో వుంచుకోవాలి. దానివల్ల యివన్నీ- చేయి జారిపోవు కదా, అప్పుడు ఈ విషయాన్ని పరిశీలించడానికి ఎవరినయినా నియమించే అవకాశాన్ని గురించి మనం ఆలోచించాలి. విషయాలను చక్కదిద్దే ప్రయత్నం చేయడానికి లేదా రాష్ట్రాలకే ఆ విషయాలను వదిలి సంతృప్తి పడదామా లేదా డా॥ అంబేద్కర్ ఆలోచించినట్లు కమిటీ ఏర్పాటును అనుసరిద్దామా? అది అమలులోకి రావాలని మనం చెప్పనక్కరలేదు. అది అమలులోకి వస్తే మనం ఆనందించాలి.

***బాసు :*** ఏ సమయంలోనయినా కమిటీ ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వం అనుకొంటున్నదా?

***ఛైర్మన్ :*** అదే విధంగా నియుక్తమవుతుందో చెప్పలేము, కానీ ఆ కమిటీ ఏర్పడే విషయం మీద మీ అభిప్రాయం ఎలా వుంది?

**దివాన్ బహద్దూర్ రామచంద్రరావు :** అలాంటి కమిటీని పార్లమెంటు కాకుండా, భారత ప్రభుత్వం ఏర్పాటు చేస్తే బాగుంటుందని నాకనిపిస్తోంది.

**డా॥ అంబేద్కర్ :** అలా చేయడం వల్ల వచ్చే తేడా ఏమిటి?

**దివాన్ బహద్దూర్ రామచంద్రరావు :** ఈ విషయాలన్నింటిలో మనం స్వేచ్ఛనెంతో వదులుకుంటున్నాం. పార్లమెంటు అదుపును తొలగించాలని నా అభిలాష. అసలు ప్రతిపాదన ఏమిటో నేను తెలుసుకోవాలి. రాష్ట్రాలన్నిటిలో ఈ ప్రశ్నకు సంబంధించి కమిటీని భారత ప్రభుత్వం ఏర్పాటు చేయడంలో ఎన్ని సంవత్సరాలు పడుతుందన్నా నాకు అభ్యంతరం లేదు. కానీ పది సంవత్సరాల్లో పార్లమెంటు ఈ విషయంలో జోక్యం చేసుకుంటుందంటే నాకు కచ్చితంగా అభ్యతరముంటుంది. ఓటుహక్కును విస్తరింపజేయడానికి కమిటీని ఏర్పాటు చేయడంలో నాకేమీ అభ్యంతరం లేదు కానీ, కొన్ని సంవత్సరాల లోపల లేదా కొన్ని సంవత్సరాల పాటు దీనికి సంబంధించి ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఉపయోగించే అధికారాలు మాత్రం భారత ప్రభుత్వానికే వుండాలని నేనభిలషిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఈ ఉపకమిటీ విధులను సమర్థించడానికి అసలు ఈ కమిటీని ఎవరు నియమిస్తేనేమి? అది పార్లమెంటా లేక భారత ప్రభుత్వమా అనేది అంత ప్రత్యేకమా?

**దివాన్ బహద్దూర్ రామచంద్రరావు :** పార్లమెంటు నుంచి భారతదేశానికి అధికారం సంక్రమింపజేస్తున్నాం. ఎందుకంటే 1919లో ఈ ప్రశ్న పార్లమెంటరీ కమిటీ ముందుకు వచ్చినపుడు నేను, యితరులు చాలామంది భారతదేశానికి అధికారం సంక్రమించే ప్రశ్నకు సంబంధించి పోరాడాము. అయితే అలాంటి చర్య తీసుకోకపోతే ఓటుహక్కుకు సంబంధించి యిపుడు కూడబెట్టిన ఫిర్యాదులన్నీ పరిశోధించబడుతున్నాయి, అపుడు అవి పరిశోధించాలంటే పార్లమెంటు అనుమతి కావాలి. కాబట్టి నేను సూచించదలచిందేమంటే, ఈ విషయంలో తీసుకునే ఏ చర్య అయినా భారత ప్రభుత్వానికి సంపూర్ణంగా సంక్రమించేటట్లుండాలి, తద్వారా నిర్దిష్టంగా కొన్ని సంవత్సరాలపాటు ఓటుహక్కు ప్రశ్న గురించి నిర్ణయించే విచక్షణ వుంటుంది. ఈ అభిప్రాయాన్నే నేను నొక్కి చెప్పాలనుకుంటున్నాను.

★ ★ ★

**•డా॥ అంబేద్కర్ :** ఉపకమిటీకి ప్రతిపాదించబోయే కొన్ని ప్రతిపాదనల పట్ల మనలో కొందరికీ కనీసం నావరకైనా కొన్ని భిన్నాభిప్రాయాలున్నాయని వాటిని వ్రాతపూర్వకంగా పెట్టాలని స్పష్టమయింది. అనేక రకాల అంశాల మీద మా అందరి నిరసన వ్రాసి మీకు సమర్పించమంటారా? వాటినిబట్టి ప్రకటనకు మీరు జోడించవచ్చు. లేదా వేరే పద్ధతి ఏదయినా సూచిస్తారా?

**ఛైర్మన్ :** ఇప్పటివరకు మైనారిటీ ప్రకటనలకు ఉప కమిటీ జతపరిచింది నాకు తెలిసినంతవరకు

• సబ్ కమిటీ సమావేశాలు, నం. 4 (ఓటుహక్కు), పుట 147–48

ఏమీలేదు. అవి అలాగే వున్నాయి. అయితే ఉప కమిటీ ప్రకటన ఒకటుంది దానిలో ముందుగానే కొందరు సభ్యులకు భిన్నాభిప్రాయాలున్నట్లుగా, అవసరమైతే వారి పేర్లతో సహా పేర్కొనవచ్చు.

***డా॥ అంబేద్కర్ :*** మీరనుమతిస్తే ఈ పద్ధతిలో ఒక యిబ్బందిని చూపుతాను. మా భిన్నాభిప్రాయాలను మీరు లిఖితపూర్వకంగా వ్రాసి వుంచకపోతే, మా సూచనలకు సరయిన పద్ధతిలో మీరు అవకాశం యివ్వలేదని అనుకోవడమే కాకుండా మా అవకాశాలను మేము సరిగ్గా వుపయోగించుకోలేని వాళ్ళమవుతాము. మేము ఫలానా విషయాన్ని అంగీకరించడం లేదని స్పష్టంగా తెలియబరచే స్వేచ్ఛ మాకున్నదని గుర్తించాలి.

***ఛైర్మన్ :*** తిరిగి మనం కలుస్తామో లేదో కచ్చితంగా చెప్పలేను. అయినా మీ అభ్యంతరాన్ని స్పష్టంగా పేర్కొన్నారనే అనుకొంటున్నాను. నిజానికి మీకు కావాల్సింది వయోజన ఓటుహక్కు ఉప కమిటీలో కొందరు సభ్యులు – పేర్లను పేర్కొనడాన్ని అభ్యంతరపెట్టారు. ఎందుకంటే వయోజన ఓటుహక్కు పద్ధతి ఒక్కటే సంతృప్తికరమైన పద్ధతిగా వారంతా భావించారు. ఆ వాక్యం మన నివేదికలో పేర్కొన్నాం. అది ఆ విషయాన్ని తెలియజేస్తుందనుకుంటాను.

***డా॥ అంబేద్కర్ :*** మేమిక చేయాల్సిందల్లా ఆ నివేదిక మీద ఆధారపడడం.

***ఛైర్మన్ :*** ఆ సమస్య తలెత్తేంతవరకు అలా వుంచుదాం. మనం కలుసుకోగలమా అని చూడాలి. నాకేమో తిరిగి కలుస్తామనిపిస్తోంది.

## *నాలుగో సమావేశం – 1 జనవరి 1931

## చిత్తు ముసాయిదా 4వ అంశం

### 4. ఓటుహక్కు విస్తరణ :

వయోజన ఓటింగు హక్కును అంతిమ లక్ష్యంగా దాదాపు అందరూ అంగీకరించారు. దానిని సాధించాల్సి వుంది. ఓటుహక్కును విస్తరింపజేసి విశాల దృక్పథంతో దానిని అందరికీ అన్వయింప జేయాలని కోరడమైంది.

ఆచరణలో దీనిని విస్తరింపజేయడంలో కొన్ని అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి. ఇప్పటి పరిస్థితులలో దానిని నిర్ణయించడానికి ఉప కమిటీకి కచ్చితమైన అధికారాలు లేవని కూడా గుర్తించబడింది. ఎన్నిక కాబడే వారి సంఖ్య జనాభాలో 10 శాతం వరకు పెంచవచ్చని శాసనబద్ధ సంఘం సూచించింది. మన సభ్యులు కొందరు వయోజనుల్లో 25 శాతం వరకు వెంటనే పెంచాలని సూచించడం జరిగింది.

* సబ్ కమిటి సమావేశాలు, సం. 4 (ఓటుహక్కు), పుట 149-50

నిపుణుల ఎన్నికల సంఘానికి మనం సూచిస్తున్నదేమంటే, ఓటర్లను వెంటనే పెంపు చేసి మొత్తం జనాభాలో 10 శాతం తక్కువ కాకుండా సాధ్యమైనంతమేర ఎక్కువ మొత్తం జనాభాలో 25 శాతానికి లోపు ఏర్పాటు చేసే విధంగా సమాచారాన్ని దర్యాప్తు చేసి ఆచరణాత్మకంగా, మనమాశించే విధంగా నియమించాలని ఆదేశాలు జారీ చేయాలి.

ఈ అదనపు చేర్పుతోబాటు సంఘం ఒక పథకాన్ని అమలు చేయడం పరిశీలించాల్సి వుంది. ప్రత్యక్ష ఓటుకు అవకాశంలేని వయోజనులందరూ విభాగాలుగా ఏర్పడాలి. మొదట మొత్తం 20 భాగాయిగా ఏర్పడవచ్చు. ఒక్కో భాగాన్నుంచి ఒక ప్రతినిధిని ఎన్నుకొని రాష్ట్రాల ఎన్నికలలో అదే నియోజకవర్గాల నుంచి ప్రత్యక్ష ఓటర్లుగా అర్హత పొంది లేదా తమకై ఏర్పరచిన ప్రత్యేక నియోజకవర్గాలలో ఓటు చేయవచ్చని సిఫారసు చేస్తున్నాం.

(ఈ ప్రతిపాదనలకు సంబంధించి జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు 'రెండవ' దానిని సమర్థిస్తూ వెంటనే వయోజన ఓటుహక్కును ప్రవేశపెట్టడం ఆచరణీయం మరియు అభిలషణీయమని కోరారు.

మేము ప్రతిపాదించిన కనిష్ట, గరిష్ట పరిమితులను సర్ కొవాస్జీ జహంగీర్, సర్ పి.సి. మిట్టర్, బాసు అనుమతించలేదు. అయితే దీనికి సంబంధించి ఎన్నికల సంఘమే స్వతంత్ర నిర్ణయం తీసుకోవాలన్నారు).

## చిత్తు ముసాయిదాలో నాలుగవ అంశం గురించి చర్చ

***డా॥ అంబేద్కర్ :*** పేరా 4, రెండవ భాగం, రెండవ వాక్యంలో ఒక సవరణ సూచించాలనుకుంటున్నాను. 'ఆచరింపదగిన' అనే మాట తర్వాత ఈ క్రింది మాటలు చేర్చాలనుకుంటున్నాను. 'ప్రస్తుత పరిస్థితులలో ఉన్న ఎన్నికల యంత్రాంగంతో' తర్వాత యెలా కొనసాగించాలి, 'ప్రస్తుత పరిస్థితులలో ప్రాప్తమయ్యే ఎన్నికల యంత్రాంగం యొక్క ఆచరణ గురించి కొన్ని అభిప్రాయ భేదాలు వున్నాయి'.

**చాలామంది సభ్యులు :** అవి వేరే యితర విషయాల గురించి.

***డా॥ అంబేద్కర్ :*** అది నా సవరణ. కమిటీ చర్చల సారం సమీక్షించడానికి సరయిన కర్త చైర్మన్ కాబట్టి ఆయన దృష్టికే నా సవరణను వదిలిపెడుతున్నాను. అయితే నా మనసులో పడ్డ ముద్ర ఏమిటంటే, సార్వత్రిక వయోజన ఓటుహక్కును వ్యతిరేకించిన అధికులు ప్రత్యక్ష రాజకీయాలలో సమీప భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని, ప్రస్తుతం ఎన్నికల యంత్రాంగం భారతదేశంలో తగినంత లేదని అనుక ప్రతి ఒక్కరూ ఓటుచేసే అధికారం కూడా లేదని అన్యాపదేశంగా చెప్పినట్లయింది.

సబ్ కమిటి సమావేశాలు, నం. 4 (ఓటుహక్కు), పుట 152-54

**ఛైర్మన్ :** నావరకు నేనట్లా అనుకోవడంలేదు. ఆ విషయాలను విశదపరచడానికి కారకులు డా॥ అంబేద్కర్. కమిటీ అభిప్రాయాలను దృష్టిలో వుంచుకొంటే అది ఒక్కటే ప్రధాన కారణమని పరిధి విధించుకొని వుండలేమనుకుంటాను. ఉదాహరణకు వార్తా సౌకర్యాల యిబ్బంది, ప్రయాణ సౌకర్యాలు లేకపోవడం లాంటివన్నీ బాగా వత్తిడికి గురిచేస్తాయి.

**డా॥ అంబేద్కర్ :** నివేదికలో యివన్నీ స్పష్టంగా పేర్కొంటే బాగుంటుంది.

**జోషి :** ఆచరణలో ఎన్నికల నిర్వహణ సమస్యలు" లాంటి పదాలు చేర్చితే బాగుంటుందేమో.

**సర్ కౌవాస్జీ జహంగీర్ :** కానీ మిగిలిన యితర యిబ్బందులూ వున్నాయి.

**జోషి :** మనం మాట్లాడేది సాధారణంగా వుండే అత్యధిక సంఖ్యాకుల గురించి, సైద్ధాంతికంగా ఓటు హక్కును వినియోగించుకోని జనం గురించి కాదు.

**ఛైర్మన్ :** మనం చెప్పాలనుకున్నది స్పష్టపరిచామనే అనుకుంటాను. మీరూ, జోషీ చివరలో ప్రవేశించారు కాబట్టి తిరిగి మొదటికి వచ్చారు.

**డా॥ అంబేద్కర్ :** అదే గమనిస్తున్నాను. మనం ఉన్నత ఆదర్శాని కోసం నిలబడినా కనీసం రెండోదైనా చాలులెమ్మనుకుంటున్నాం. ఆ రెండోది సాధ్యమైనంతవరకు అమలుపరిస్తే కదా దాని మంచితనం మనమనుభవించేది! నా ఉద్దేశ్యం మీకు స్పష్టమయిందనే అనుకుంటాను. తద్వారా నిపుణుల ఎన్నికల కమిటీ పరిశీలించగలదని ఆశిస్తాను.

**ఛైర్మన్ :** కమిటీలోని అత్యధికులకు అది నచ్చిందనే అనుకుంటాను. కమిటీలోని మెజారిటీ వితర్కించాలి, కేవలం మాటలు మాత్రమే అర్హతను సంపాదించలేవుగదా. సరే మంచిదే.

తర్వాత రెండవ వాక్యం ఎలా ప్రారంభించాలి, "ఒక నిపుణుల ఎన్నికల సంఘం నియమించి తద్వారా వెంటనే ఓటర్ల సంఖ్య పెంచి మొత్తం జనాభాలో పదిశాతానికి తక్కువ కాకుండా వీలయితే అంతకంటే ఎక్కువ ప్రతినిధులు ఎంపిక కాబడాలి. అయితే మొత్తం జనాభాలో 25 శాతంకు లోపల వుండాలి. సమాచారాన్ని పూర్తిగా దర్యాప్తు చేసి ఆచరణాత్మకంగా, మనమాశించే విధంగా యిది వుండాలని సిఫారసు చేస్తున్నాం."

**డా॥ అంబేద్కర్ :** మూడవ పేజీలో చిన్న సవరణ సూచించాలనుకుంటున్నాను. 'మించకుండా' అనే దాని బదులు 'ప్రత్యామ్నాయంగా' అంటే సరిగా వుంటుందనుకుంటాను.

**ఛైర్మన్ :** వెంటనే 25 శాతం పెంచడం యిబ్బందిగా వుంటుందని అందరూ అంటున్నారు. నేను కూడా అలాగే అభిప్రాయపడుతున్నాను. యింకా పెంచడం మరింత బలవంతంగా సాగదీసేటట్లుంటుంది. మళ్ళీ మీ అనుమానాల్తో ముందుకొస్తే ఎలా డా॥ అంబేద్కర్?

**డా॥ అంబేద్కర్ :** నా రెండవ సవరణ 'ఆశించదగినది' అనే పదం తీసివేయాలని. ఈ విషయంలో

ఏది పెంచాలని ఆశించినా, ఆశించకపోయినా వారసత్వంగా నిర్ణయించేది కమిటీయే. నిపుణుల ఎన్నికల సంఘానికి నిర్ణయాధికారం ఏ మాత్రం లేదు. మనం తీసుకోబోయే నిర్ణయాల ప్రభావం ఎలా వుంటుందో ఆధారాలను ఆ సంఘం అన్వేషిస్తుంది. ఎంత పెంచాలని కోరుకుంటున్నామో నూతన ఎన్నికల సంఘపు యిష్టానికి పూర్తిగా వదలివేయలేము. ఈ దృష్ట్యా ఆలోచిస్తే ఆ పదాలను ఉపసంహరించడం అవసరమనిపిస్తుంది.

**ఛైర్మన్ :** ఆచరణీయాన్నీ, 'ఆశించదగిన'దాన్నీ విడదీయడం చాలా కష్టం. 'ఆచరణీయం' అనే పదం సాగే గుణం వుండేది. ఆ లక్ష్యం చేరాలంటే కష్టతరం లేదా దేనితోనైనా పోల్చితే ఆ లక్ష్యం సులభతరం కావచ్చు. కానీ లక్ష్యం చేరడం మాత్రం సంభవం కాబట్టి అది ఆచరణీయమే. ఆశించడం ద్వారా దానిని పరిశీలిస్తూ దానిని తార్కికత ద్వారా ఆచరణీయం అయ్యేటట్లు చూచుకోవాల్సి వుంది. అపుడు ఆ రెండూ విడదీయ రానంత దగ్గరగా చేరుతాయి.

***డా॥ అంబేద్కర్ :*** మన నిర్ణయంలో జనాభాలోని 25 శాతం వుండాలని ఆశిస్తూ తీర్మానించాం కదా!

**ఛైర్మన్ :** 'ఆచరణీయం' అనే స్థితిస్థాపకత్వం కలిగిన పదాన్ని మీరు వాడారు. కష్టమంతా అక్కడే వుంటుందనుకుంటున్నాను. రెండు పదాలను మీరు ఒకే చట్రంలో బిగించి వుంచరాదు. ఏదయితే ఆశిస్తారో అది ఆచరణీయంగా వుండాలి. మీరేమో గొప్ప స్థితిస్థాపకత కలిగిన పదాన్ని వుపయోగిస్తిరాయె. రెండింటినీ పక్కపక్కనే వుంచడం తెలివిగల పననుకుంటాను. వయోజన ఓటు హక్కు మన ఆదర్శమని, దానికోసం ఎదురు చూస్తున్నామని మనం స్పష్టంగా సూచించాము.

★ ★ ★

**ఛైర్మన్ :** వాక్యం వాక్యం పరిశీలించడం మంచిదనుకుంటాను. ఏదయినా సూచించదలచుకుంటే మధ్యలో చేర్చవచ్చు. "మా సిఫారసు ఏమిటంటే ఈ అదనపు చేర్పుతోబాటు సంఘం ఒక పథకాన్ని అమలు పరచడాన్ని పరిశీలించాల్సి వుంది. ప్రత్యక్ష ఓటుకు అవకాశం లేని వయోజనులందరూ భాగాలుగా ఏర్పడి, తొలుత మొత్తం 20 విభాగాలుగా ఏర్పడవచ్చు" తర్వాత "లేదా వేరే యితర పద్ధతుల ద్వారా" అవి కలపాలని సూచించబడింది.

ఒక్కో గుంపు నుంచి ఒక ప్రతినిధిని ఎన్నుకొని రాష్ట్రాల ఎన్నికలల్లో అదే నియోజక వర్గాల నుంచి ప్రత్యక్ష ఓటర్లుగా అర్హత పొంది లేదా తమకై ఏర్పరచిన ప్రత్యేక నియోజకవర్గాలలో ఓటు వేయవచ్చును".

("ఈ ప్రతిపాదనలకు సంబంధించి జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు 'రెండవ' దానిని సమర్థిస్తూ వెంటనే వయోజన ఓటుహక్కును ప్రవేశపెట్టడం ఆచరణీయం మరియు అభిలషణీయమని కోరారు").

• సబ్ కమిటి సమావేశాలు నం. 4 (ఓటుహక్కు), పుట 159.

**డా॥ అంబేద్కర్ :** కె.టి. పాల్ కూడా మాలాగే ఒకే అభిప్రాయాన్ని కలిగివున్నారు.

**ఛైర్మన్ :** దానిని గుర్తుంచుకుంటాం.

**జోషి :** 'ద్వితీయ ఉత్తమం' అనడానికి బదులు 'బొత్తిగా సరిపోని' అనే పదాన్నుంచాలని సూచించదలుచుకున్నాను.

**ఛైర్మన్ :** అదంతా మీకు సంబంధించిన విషయం. 'ద్వితీయ ఉత్తమం' అనడానికి బదులు 'బొత్తిగా సరిపోని' అనే మాట వుంచాలని మీరనుకుంటే అది మీ యిష్టం. అయితే యిప్పుడిలా చదవాల్సి వస్తుంది. 'ఈ ప్రతిపాదనలకు సంబంధించి జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు బొత్తిగా సరిపోవని, కాబట్టి వెంటనే వయోజన ఓటుహక్కును ప్రవేశపెట్టడం ఆచరణీయం మరియు అభిలషణీయమని కోరారు."

**జాదవ్ :** ఈ జాబితాలో నా పేరు కూడా చేర్చమని కోరుతున్నాను.

**ఛైర్మన్ :** దీనిని గుర్తు పెట్టుకుంటాం. అయితే అదిలా చదవాలనుకుంటాను, "మేము ప్రతిపాదించిన కనిష్ఠ, గరిష్ఠ పరిమితులను సర్ కొవాస్జీ జహంగీర్, పి.సి. మిట్టర్, బాసు అనుమతించలేదు. అయితే దీనికి సంబంధించి సంపూర్ణ స్వతంత్ర నిర్ణయం ఎన్నికల సంఘమే తీసుకోవాలన్నారు." వాళ్ళు అనుకున్న విషయం స్పష్టంగా వ్యక్తపరిచారనుకుంటాను.

★ ★ ★

**ఛైర్మన్* :** ఓటర్ల సంఖ్యను బట్టి కాకుండా వారికున్న ప్రతినిధుల సంఖ్యను బట్టి ప్రత్యేక నియోజకవర్గాలూ రిజర్వేషన్‌తోబాటు సమిష్టి నియోజకవర్గాలుంటే నిమ్న జాతులన్నీ నిజంగానే పరిరక్షింపబడతాయి. పరిరక్షణ అనేది ప్రధానాంశంగా వుంటుంది.

అయితే మనం ఒక అభిప్రాయానికి వచ్చే ముందు 'ప్రతి కులమూ' అనే పదానికి బదులు యింకొకటి వాడదాము. చింతామణి నాతో అన్నట్లుగా, 'ఓటుహక్కుల సంఘం తన ప్రతిపాదనలు ఏర్పరిచే ముందు ప్రధాన జాతుల ఓట్ల శక్తిని నిష్పత్తిప్రకారం సాధ్యమైనంతవరకు ఆదర్శవంతమైన పద్ధతిని ఏర్పరచాలని మేమాశిస్తున్నాం," అంటూ కొనసాగించారు, అది కూడా యిందులో భర్తీ అవుతుందనుకొంటాను.

**సర్ సి. జహంగీర్ :** "ఆ రెండు ప్రధాన కులాలు"

**ఛైర్మన్ :** అతని ఉద్దేశ్యమేమంటే, ప్రధాన కులాలకే అతను పరిమితం కాదలుచుకోలేదు, ప్రధాన కులాలపట్ల అతను కేవలం సిఫారసు మాత్రం చేయదలిచాడు. వెనుకబడిన కులాల విషయానికొస్తే వారికి సిఫారసే అనవసరం! మీరు ఈ విషయంలో యితనితో ఏకీభవిస్తారా?

* సబ్ కమిటి సమావేశాలు, సం. 4 (ఓటుహక్కు), పుట 171-72

**సర్ సి. జహంగీర్ :** అది చాలా ప్రమాదకరం. మీరు ప్రత్యేక నియోజకవర్గాల గురించి మాట్లాడితే, మాకు ప్రత్యేక నియోజకవర్గాలూ లేవు. అవి మాకు అక్కరాలేదు.

**డా॥ అంబేద్కర్ :** దానర్థమేమిటంటే, యిపుడున్నటువంటి అత్యధిక ఓటర్లను నిర్వహించడం కోసం ఓటుహక్కు అత్యధికంగా వుండే ప్రజలకు దానిని నిరాకరించాల్సి వుంటుంది. వాస్తవానికి దాని పరిస్థితి యిది. సర్ కొవాస్జీ జహంగీర్ యిపుడున్న తన జనాభాను ఎన్నికకు సంబంధించిన శక్తితో భాగస్వామ్య నిష్పత్తిని కోరుకుంటున్నారు కానీ దేశంలోని యితర వర్గాల జనాభాను ఎన్నికకు సంబంధించిన శక్తితో భాగస్వామ్యం కోరడంలేదు.

**సర్ సి. జహంగీర్ :** నా ఉద్దేశ్యమల్లా అల్ప సంఖ్యాక వర్గాలను సంకటంలో పడవేయరాదనే.

**డా॥ అంబెద్కర్ :** ఓటుహక్కును సంకటంలో పడవేయరాదనే దృష్టికి మీరు బద్ధులై వుండాలి కానీ, యితర ఓటర్లకు ప్రాతినిధ్య భాగస్వామ్యం వుండడం వల్ల మీ స్థానం తగ్గుతుందనుకుంటే, మెజారిటీ మీదనయినా మీ రక్షణ కోసం విశ్వాసం వుంచుకోవాలి లేదా ప్రత్యేక నియోజకవర్గాలను కోరడంగానీ జరగాలి.అ ంతేగాని "మమ్మల్నెటూ కిందికి నెట్టివేస్తున్నారు గనుక మేం మునిగిపోతాం – అంచేత ఇతర వర్గాలకు అవకాశాలివ్వకూడ"దనరాదు.

**సర్ సి. జహంగీర్ :** నేనలా అనలేదు.

**ఛైర్మన్ :** మనం నిర్ణీతమైన అభిప్రాయాలకు రావాల్సిన అవసరముందిక. మనమంతా వయోజన ఓటుహక్కును ఒక ఆదర్శంగా అంగీకరిస్తున్నాం. దానికి సంబంధించిన విషయం ప్రకటనలో పొందుపరిచాం కూడా. "సాధ్యమయినంతమేరకు మెజారిటీ కులాలకు అమలు చేయాల్సి వుందని" నేను సూచించాను.

మొదట కమిటీకి నేను సూచించినట్లు "సాధ్యమయితే ప్రతి కులానికి అమలు చేయండనే" మాటలు అలాగే వుంచుతాను. దీనిని ఎవరయినా వ్యతిరేకిస్తున్నారా?

తర్వాతి భాగాన్ని సర్ కొవాస్జీ జహంగీర్, కల్నల్ గిడ్నీ మరియు సర్దార్ ఉజ్జల్ సింగ్ విభేదిస్తున్నట్లుగా గుర్తిస్తున్నాం.

**డా॥ అంబేద్కర్ :** దానిని మీరు ఓటుహక్కుల కమిటీ ముందు పెట్టదలిస్తే, మేము యిప్పటికే వయోజన ఓటుహక్కు పద్ధతి దళితవర్గాలకు కూడా అమలు చేయాలనే మా వాదన వినిపించా లనుకుంటున్నాము.

**ఛైర్మన్ :** ఇంతకు ముందుగానే విన్నాం కదా.

**ఫుట్ :** లేకపోతే ప్రతిపేరా తర్వాత 'అనుబంధం'గా వుంచవచ్చు కదా.

**ఛైర్మన్ :** ప్రతిసారీ దాని నుంచ లేము.

**జాదవ్ :** బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, బొంబాయిలోని యితర కులాలు, దళితవర్గాలు అన్నీ యిందులో కలపాలి.

**ఛైర్మన్ :** దానిలోకి మనం వెళ్ళలేము.

(డా॥ అంబేద్కర్ 13వ పేరాకు సంబంధించి తన అభిప్రాయభేదాన్ని రికార్డు చేయమని వత్తిడి చేశారు).

* * *

***ఫుట్ :** ఇక్కడ ఒక పాయింటుంది. వయోజన ఓటుహక్కు అర్హతకు సంబంధించి మామూలు ఆక్షేపణ దృష్ట్యా, ప్రతి పేరాకు మీకు వివరణ అవసరమా? జోషి అతని సహచరుల ఆక్షేపణకు చివరలో సాధారణ వివరణను నోట్ చేయవచ్చు కదా!

**ఛైర్మన్ :** మీకు అది సమంజసంగా వుందనుకుంటూ, మీ స్థితిని అర్థం చేసుకున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** మీ ఇష్టం.

**ఛైర్మన్ :** చెప్పక తప్పటంలేదు... ఒకానొక అసంబద్ధ స్థితి మీవాదనల్లో వుంటున్నట్లనిపిస్తూంది. ఉదాహరణకు స్త్రీల ఓటుని మీరు అభ్యంతర పెడుతున్నట్లు తోస్తుంది.

***డా॥ అంబేద్కర్ :*** దానిని అమలు చేయాలనే మంచి ఉద్దేశం మాకు వుంది. ఎలా అమలు చేయాలో, దానిమీద వచ్చే అభ్యంతరాలకు ఎలా ప్రత్యుత్తరమీయాలో మానసికంగా మేము సిద్ధంగానే వున్నాం. స్త్రీలకు ఓటుహక్కు కల్పించడానికి మాకు ఎలాంటి సైద్ధాంతికాభ్యంతరం లేదు.

**జాదవ్ :** 25 శాతం వరకు స్త్రీ నుంచి తీసుకోవచ్చు, అంతకు మించి ఓటింగు విధానాన్ని తగ్గించడం అవసరంగా అనిపించదు.

## మొత్తం సమావేశ కమిటీ
## ఉప సంఘం సమర్పించిన ప్రకటన భావార్థం
## ఓటుహక్కు – 16 జనవరి 1931

(డా॥ అంబేద్కర్ సూచనలకు సంబంధించిన కొన్ని పేరాలు)

ఉప కమిటీ సిఫారసులిలా వున్నాయి.

**పేరా–4** (1) **:** నిపుణుల ఎన్నికల సంఘం నియమించి వారికిలా ఆదేశాలు యివ్వాలి. ఓటర్లను వెంటనే అధికం చేసి మొత్తం జనాభాలో 10 శాతం తక్కువ కాకుండా సాధ్యమైనంత మేర

* సబ్ కమిటి సమావేశాలు, నం. 4 (ఓటుహక్కు), పుట 175-76

పెంపుచేయాలి. మొత్తం జనాభాలో 25 శాతానికి లోపు ఏర్పాటు చేసే విధంగా సమాచారాన్ని ఆశించే విధంగా ఆచరణాత్మకంగా సంపూర్ణంగా దర్యాప్తు చేయాలి.

2. ఈ పెంపుదలకు అదనంగా కమీషన్ ఒక ప్రణాళికను ప్రవేశపెట్టాలి. ప్రత్యక్ష ఓటుకు అవకాశంలేని వయోజనులందరూ భాగాలుగా ఏర్పడి, తొలుత 20 వరకు విభాగాలుగా ఏర్పడవచ్చు. ఒక్కొక్క భాగాన్నుంచి ఒక ప్రతినిధిని ఎన్నుకొని రాష్ట్రాల ఎన్నికలలో అదే నియోజకవర్గాల నుంచి ప్రత్యక్ష ఓటర్లుగా అర్హత పొంది లేదా తమకై ఏర్పరచిన ప్రత్యేక నియోజక వర్గాలలో ఓటు చేయవచ్చు.

(ఈ ప్రతిపాదనలకు సంబంధించి జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్, కె.టి. పాల్ మరియు జాదవ్ "ఏ మాత్రం సరిపోవని" కనుక వెంటనే వయోజన ఓటుహక్కును ప్రవేశపెట్టడం ఆచరణీయం మరియు అభిలషణీయమని కోరారు).

**పేరా 7 :** ఓటుహక్కుల కమీషన్ ఓటుహక్కు కోసం సరిపోయే విద్యార్హతలను అదనపు అర్హతలుగా వుంచే అవకాశాలను పరిశీలించాలని ఉప కమిటీ అభిప్రాయపడుతోంది.

**పేరా 8 :** ఇపుడున్న మిలిటరీ ఉద్యోగాల అర్హతలు అలాగే వుంచాలని ఉప కమిటీ అంగీకరిస్తూ యిదే అర్హతలను సహాయక, ప్రాదేశిక సేనలకు ఓటు హక్కుల కమీషన్ వర్తింపచేయాలని సిఫారసు చేస్తూంది.

**పేరా 9 :** స్త్రీలకు ప్రత్యేక అర్హతలు నిర్వహించాలని ఉప కమిటీ అంగీకరిస్తూ, ఓటుహక్కుల కమీషన్‌కు ఈ విషయానికి సంబంధించి ప్రత్యేక శ్రద్ధ కనబరచి దొరికే అన్ని రుజువులు పరిశీలించడంతోబాటు శాసనబద్ధ కమీషన్ సిఫారసులను, ఉప కమిటీ సూచించిన వయో పరిమితి ప్రతిపాదన శాసనబద్ధ కమీషన్ 25 నుంచి 21కి తగ్గించిన విషయాన్ని పరిశీలించాలని సిఫారసు చేస్తోంది.

(పేరాలు 7, 8, 9లకు సంబంధించిన ప్రతిపాదనలను జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు విభేదించారు).

**పేరా 13 :** తనంతటతానుగా ఓటుహక్కును పొడిగించే పథకాన్ని వదులుకోవడం అనవసరమనే అంశాన్ని ఉప కమిటీ పరిశీలిస్తుంది. ప్రతి రాష్ట్ర శాసనసభ తనకు సంబంధించిన ఓటుహక్కులను తన యిష్టానుసారం పెంచవచ్చు. అయితే నూతన రాజ్యాంగం ప్రవేశపెట్టిన పదేళ్ళ తర్వాత దీనిని అమలు చేయాలని ఉప కమిటీ అభిప్రాయపడుతూంది.

(జోషి, శివరావు, డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు ఓటుహక్కు స్వయంచాలకంగా పెరగడాన్ని ఒప్పుకొనే విషయం పరిశీలించాలని కోరారు).

(చర్చలో డా॥ అంబేద్కర్ విమర్శలేమీ చేయలేదు. మొత్తం సమావేశంలో (16 జనవరి

1931) వ్యాఖ్యానాలన్నీ ఎన్.ఎం. జోషి చేసినవి. ఉపకమిటీ ప్రకటన సంఖ్య VI (ఓటుహక్కు) పొందుపరిచారు).

★ ★ ★

**జోషి :** తొమ్మిదవ పేరాకు సంబంధించి ఒక విషయం స్పష్టం చేయాలనుకుంటున్నాను. పేరా 7,8,9లకు సంబంధించిన ప్రతిపాదనలను జోషి, శివరావు,డా॥ అంబేద్కర్, శ్రీనివాసన్‌లు విభేదించారని చెప్పబడింది. స్త్రీలకు రావాల్సిన రాయితీల కోసం ఏదో ఒక అర్హత నిర్ణయించడానికి మేము వ్యతిరేకం కాదనే విషయం మీరు గుర్తుంచుకోవాలి. దురదృష్టవశాత్తూ కమిటీ నిర్ణయించిన మొత్తం ఓటర్ల హద్దును మేము దృష్టిలో వుంచుకోవాల్సినందువల్ల యిలాంటి పరిస్థితుల్లో ఓటుహక్కు లేనివారి హక్కులను తొలుత పరిరక్షించాల్సి వుంది. ఓటుహక్కులు ఉన్న వారి భార్యల కంటే ముందు ఓటుహక్కు లేని వారికి ఓటుహక్కు కావాలనడం జరిగింది. ప్రత్యేకమయిన కఠినతర పరిస్థితుల వల్ల యింతకు ముందుగా ఓటుహక్కు కలిగివున్న వారి భార్యలకు వారి ఓటుహక్కులు మోసపూరితంగా వుపయోగిస్తున్నారు కనుక ఓటుహక్కు నిరాకరించాలనే పద్ధతికి తల వొగ్గాల్సి వచ్చింది. లింగభేదాన్ని నిర్మూలించడానికి మేము వ్యతిరేకం కాదు.

**ఛైర్మన్ :** పేరా 9 నోట్ చేసుకున్నాం.

☆ ☆ ☆

# 6

# మొత్తం సమావేశపు కమిటీ

## ఏడవ ఉపసంఘం (రక్షణ) ప్రకటనపై వ్యాఖ్యలు

**16 జనవరి 1931**

***డా। అంబేద్కర్ :** ఈ ప్రకటనలోని పేరా 4, ఉపవాక్యం (2)లో ఒక సవరణ ప్రతిపాదించాలను కుంటున్నాను. సార్వభౌమత్వానికి సంబంధించిన అందరు పౌరులకు, దళిత వర్గాలతో సహా భారతీయ సైన్యంలో భర్తీ చేయడానికి సామర్థ్యం, అవసరమైన అర్హతను తగు రీతిలో పరిశీలించాలని యిది వెంటనే అమలు జరగడానికి తగు ఏర్పాట్లు చేయాలి. ఈ విషయాన్ని కేవలం నమోదు చేయాలని మాత్రమే నేను కోరుకోవడంలేదు. దీనిని ఖాయమైన ఒప్పందంగా చూడాలనుకుంటున్నాను. దాని వల్ల సభ దీని తీవ్రతను గ్రహిస్తుంది. నా సవరణ చాలా సహజమైంది, మిలిటరీలో ప్రవేశించడానికి సార్వభౌమత్వంలోని వివిధ వర్గాల పౌరులకు సంబంధించిన అన్నిరకాల అడ్డంకులను తొలగించాలి. తొలుత ఈ సవరణను దళిత వర్గాల నిశ్చితమైన హక్కుల పరిరక్షణ కోసం ప్రతిపాదిస్తున్నాను, అలాగని కమిటీని ప్రత్యేకంగా మాకేదో అనుగ్రహాన్ని చూపమని అడగడంలేదు. భారత ప్రభుత్వ చట్టంలో గుర్తించబడిన సిద్ధాంతానికి వారసత్వంలో జరుగుతున్న దానికి కలి తేడాను గుర్తించుమని అడుగుతున్నాను. తన కులం, జాతి, రంగు రీత్యా సార్వభౌమత్వానికి చెందిన ఏ పౌరుడయినా ప్రభుత్వ సర్వీసులో అర్హత పొందకుండా వుండరాదు. దీనిని అడగడంలో నేనేమీ ప్రత్యేక సదుపాయాలను కోరడంలేదనే అనుకుంటున్నాను.

ఈ సవరణ సూత్రాలన్నీ ఉద్యోగకమిటీ ప్రతిపాదించినవేనని మీ దృష్టికి తెస్తున్నాను సర్. ఈ కమిటీ నియమించిన ఉద్యోగ కమిటీ నివేదిక మీరు చూశారంటే- దేశంలోని పౌరులందరికీ సమానమైన ఉద్యోగ అవకాశాలు వుండాలని కమిటీ కచ్చితంగా పేర్కొంది, ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశార్హతలకు సంబంధించి నిశ్చితమైన పౌరుల ప్రాథమిక హక్కుల పరిరక్షణ గురించి పేర్కొనడమే కాకుండా ఆంగ్లో-ఇండియన్లు, దళితవర్గాలు లాంటి ప్రత్యేక వర్గాలకు ఉద్యోగాలకోసమై ప్రత్యేక సిఫారసులను కూడా పేర్కొంది.

కానీ, ఈ సవరణ కేవలం దళితవర్గాల ప్రయోజనాల కోసమే కాదు. ప్రభువుపాలనలోని

---

* ఆర్.టి.సి. (మొదటి సమావేశం) చర్చాంశాలు. పుట 379-80.

అన్ని వర్గాల, ప్రజల ప్రయోజనార్థమే నేను విన్నవించుకొంటున్నాను. భారతదేశంలో ఏ జాతికైనా ప్రభుత్వోద్యోగాలలో చేరడానికి సత్త్వాధికారం కల్పిస్తే అది గొప్ప ప్రజా ప్రమాదంగా మారగలదని నేను అనుకొంటున్నాను. ప్రజా ప్రమాదంగానే పేర్కొంటున్నాను. ఎందుకంటే ఆ ప్రత్యేకమైన జాతులు/కులాలు ఈ ప్రయోజనాలను అవకాశంగా తీసుకొని ఆధిక్యతాభావాన్ని పెంచుకొంటాయి. దానికితోడు తమమీద ఆధారపడిన ఇతరజాతులు/కులాల సంరక్షణ పట్ల విపక్షతాభావాన్ని పెంపొందించుకొంటాయి. మరింత ఆధిక్యతను ప్రదర్శిస్తాయి. కాబట్టి భారతదేశానికి మనం నూతన రాజ్యాంగం ప్రతిపాదిస్తున్న సందర్భంలో, దేశంలోని ప్రభుత్వోద్యోగాలకు సంబంధించి పౌరులకు అర్హతలను బట్టి అందరికీ సమాన అవకాశాలుండడంతో బాటు వారి సామర్థ్యాన్ని ఉపయోగించుకొనే నూతన విధానానికి మనం శ్రీకారం చుట్టాల్సి వుంది. నేను ప్రతిపాదిస్తున్న ఈ సవరణ ఈ పేరాలోని విధానానికి హేతుబద్ధమైన వివరణ మాత్రమే. మీరు ఉపవాక్యం 1 క్లాజు 4లో యిలా చూడవచ్చు.

"నూతన భారతీయ రాజకీయ నిర్మాణంలో భారతదేశ రక్షణ భారతదేశ పౌరుల నిరంతర జాగృతిగానే ఉండాలి గాని అది బ్రిటిష్ ప్రభుత్వపు బాధ్యతగా కాదనే విషయం ఉప కమిటీ దృష్టిలో ఉంచుకోవాలి."

కాబట్టి సర్, ఆ వాక్యానికున్న స్పష్టమైన అర్థం ఏమంటే పెరుగుతున్న భారతదేశ రక్షణకు భారత ప్రజల మీద ఆధారపడాలి. మరయితే అది భారత ప్రజలందరికీ సంబంధించినదేకానీ, ఒక జాతి/కులానికి సంబంధించినది కాదు కదా.

కాబట్టి నేను ప్రతిపాదించిన సవరణను సభ ఆమోదించాలని కోరుతున్నాను.

***డా॥ మూంజె :*** డా॥ అంబేద్కర్ ప్రతిపాదనకు సంబంధించి, ఆ భర్తీ అన్నివర్గాలకు బహిరంగంగా వుంచాలి. నిజమే సామర్థ్యం గీటురాయిగా వుంటే నేను దాన్ని సంపూర్ణంగా అంగీకరిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అది నా సవరణ, సామర్థ్యం గీటురాయిగా వుండాలనే అంటున్నాను.

***సర్ తేజ్ బహదూర్ సప్రూ :*** డా॥ అంబేద్కర్ చెప్పిన మాటలకు నా సహకారం కూడా వుంటుంది.

***జాను :*** అధ్యక్షా నేనొక అభ్యంతరం లేవదీస్తున్నాను. ఈ సవరణ ఉద్యోగభర్తీ కమిటీలోని ఒక భాగాన్ని అతివ్యాప్తం చేస్తుంది. ఉపవాక్యం 5 (4)లో ఏ కమిటీలోనైనా సభ్యత్వం గురించి చెబుతున్నపుడు, ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రమోషన్లకు, ఉన్నతోద్యోగాలలో నియమించడానికి కుల, మత జాతుల్లాంటివి పరిగణనలోకి తీసుకోకూడదు అంటున్నది.

***డా॥ అంబేద్కర్ :*** పై న్యాయాన్ని ఇందులోంచి మినహాయించడం జరిగింది.

***థామస్ :*** అధ్యక్షా, దీనిలో సవరణ చేయాల్సిన అవసరం నాకైతే ఏమీ అగుపడడంలేదు. ఈ పేరా ఉద్దేశ్యపూర్వకంగా చేర్చబడింది. "అభివృద్ధి చెందుతున్న నూతన భారత రాజకీయ వ్యవస్థకు సంబంధించిన ప్రభుత్వం పెరుగుతున్న దేశ రక్షణకు ఒక్క బ్రిటీషు ప్రభుత్వం మీదే కాకుండా భారత

ప్రజలందరి మీదా ఆధారపడాలని ఉపకమిటీ సూచిస్తున్నది." ఇందులో భారతదేశ రక్షణకు దేశంలోని ఏ విభాగం గురించి ప్రత్యేకంగా పేర్కొనలేదు. ఉద్దేశ్యపూర్వకంగానే దీనిని రూపొందించారు. భారతీయీకరణం ఇందులో కలగలసే వుంది.

డా॥ అంబేద్కర్ : అవును, కానీ నా వుద్దేశ్య, అన్ని కులాలు/జాతులకు చెందిన మనుషులకు ఉద్యోగాలలో అవకాశం 'ఇవ్వకుండా వుండే జాతీయకరణం' గురించే ఇప్పటికీ భారతీయీకరణం అంటే కొన్ని కులాల/జాతుల గుత్తాధికారంగానే మిగిలిపోయింది.

ఛైర్మన్ : పరిస్థితి అలాగే వుంది, ఇది నోటు చేసుకొంటాం.



# 7

# ఎనిమిదవ ఉపసంఘం (ఉద్యోగాలు)

## రెండో సమావేశం – 7 జనవరి 1931

°**డా॥ అంబేద్కర్:** ఉప కమిటీ తప్పక దృష్టిలో వుంచుకోవాల్సిన విషయం ఒకటుంది. భవిష్యతుతో సివిల్ సర్వీసుల్లో యూరోపియన్లకు వుండే జీతం, పెన్షను తదితర సౌకర్యాలు భారతీయులకు వర్తింపచేయాల్సి వుంది. భారతీయీకరణం పేరుతో కొన్ని విచక్షణలు చూపడం ఇక్కడ గమనించాలి. ఉప కమిటీ ఈ విషయాన్ని తప్పక తన దృష్టిలో వుంచుకోవాల్సి వుంది. అందువల్ల ఈ పేరాకు ఇది కలపాలనుకొంటున్నాను.

"జీతం, పెన్షన్ తదితర సౌకర్యాలలో భారతీయాంశానికీ, యూరోపియన్ అంశానికి సామ్యత వుండాలి".

**ఛైర్మన్:** దానిని దృష్టిలో వుంచుకొంటాం.

తర్వాత "(4) నూతన రాజ్యాంగంలో అఖిలభారత సర్వీసుల్లో భర్తీ చేసే అధికారం ఎవరికుండాలి?"

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్:** ఎవరు అదుపు చేస్తారు, ఎవరు భర్తీచేస్తారు అనేది కూడా అందులో చేర్చాల్సి వుంది.

**ఛైర్మన్:** కాస్సేపు దానిని ప్రక్కన పెడదాం.

తర్వాత "(5) భారతీయ వైద్య సర్వీసులో పౌర విభాగానికి సంబంధించి సిఫారసులు" ఈ విషయం ఇన్నాళ్ళు మన దృష్టిని తప్పించుకొంది. అక్కడ ఏ సిఫారసులు మనం చేయాలనుకొంటున్నామో చూద్దాం.

తర్వాత "(6) ఈ ప్రశ్నను సిఫారసు చేయడంలో వుద్దేశ్యమేమంటే, ఏ పరిస్థితుల్లో

---

° సబ్ కమిటీ సమావేశాలు – 8, (ఉద్యోగాలు) భారత ప్రభుత్వం, కేంద్ర ప్రచురణల విభాగం, కలకత్తా, 1931. పు. 44–46.
(ఈ కమిటీ నిర్మాణంలో ఉద్యోగాల సంబంధం "అంటే ఆల్ ఇండియా ఉద్యోగ నియామకాలలో బ్రిటిష్ ఉద్యోగాల నిష్పత్తి కూడా అని)

భర్తీలను కోరాలి, సరైన పద్ధతిలో భవిష్యత్ భర్తీని ఎలా నిలుపుకోవాలి. ఎలా ఆకర్షించాలి. అన్నది నిపుణుల కమిటీకి లేదా కమిటీలకు సూచించాలి". ఇలాంటి విషయాలు ఎన్నో కన్పిస్తున్నాయి. ఉదాహరణకు వేతన రేటు గురించి మనం పరిశీలించాలి. మీకు అవసరానికన్నా ఎక్కువ జీతం యివ్వడం అనవసరం. ఒకవేళ మీకు సరైన మనిషి దొరకనపుడు, సరిపోని జీతాలు చెల్లించడమూ చెడు ఆర్థికానికి దారితీస్తుంది. ఇదంతా స్పష్టంగా అగుపడుతూ ఉంటుంది.

అదుపు గురించిన ప్రశ్నకు సంబంధించిన పాయింటులో గొప్ప సాంకేతిక విషయాలు యిమిడి వున్నట్లుంది. నిపుణుల జ్ఞానానికి వదలాల్సి వుంటుందేమో, కాబట్టి అంతిమ నిర్ణయానికి రావడంలో ఉప కమిటీకి అర్హత వుందని నాకు అనుమానంగా వుంది - నేను మాత్రం దానికి తగనని నాకు తెలుసు. కాబట్టి కావాలనే నేను విషయపట్టికలో చిత్తుగా పేర్కొన్న విషయం (6)లో, ఈ ప్రశ్నను నిర్ణయించడానికి ఏదయినా సంఘాన్ని ఏర్పాటు చేసే అవకాశాన్ని పరిశీలించాలని పేర్కొన్నాను. సరిపోయే మనుషులకి ఎంత రేటు వేతనం యివ్వాలో మీరెవరైనా సూచించగలరా? నావల్ల మాత్రం కాదు. తమకు తెలిసిందయినా ఈ విషయంలో ఎవరైనా చెప్పడానికి సిద్ధంగా వున్నారా? లేదా అదుపుకు సంబంధించిన నిర్దిష్ట సూత్రాలు ఏర్పరచడానికి ఎవరైనా ముందుకు వస్తారా? ఎందుకంటే మనం ఈ విషయాన్ని పరిష్కరించే శక్తి కలిగి ఉండాలి కదా?

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్:** అదుపుకు సంబంధించి విశాలమైన ప్రాతిపదికని మనం రూపొందించవచ్చు. దానిని ప్రస్తుతం కార్యదర్శికి వదలవచ్చు లేదా భారత ప్రభుత్వానికి సంక్రమించేట్లు చేయవచ్చు.

**డా॥ అంబేద్కర్:** యూరోపియన్లకు, భారతీయులకు యిచ్చే ప్రతిఫలం యొక్క విశిష్టత ఒక పెద్ద ప్రశ్న. ఉప-కమిటీ నిర్ణయించాల్సి ఉంది. ఉద్యోగాలలో ఈ రెండు అంశాలూ నిశ్చిత సిద్ధాంతానికి కట్టుబడి వుంటూ ఒకే రకమైన దృష్టిలో చూడబడాలి. అది ఉపకమిటీ పని కూడా.

**సర్ ప్రవాష్ - చందర్ మిట్టర్:** అఖిల భారత సర్వీసు మీరు కావాలనుకొన్నపుడు అన్ని రాష్ట్రాల్లోనూ పరిస్థితులు ఒకేరకంగా వుండవన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. మీరు సాక్ష్యాధారాలు చూపిస్తే తప్ప మామూలుగా సాధారణీకరణం చేసి దేశమంతటా ఉద్యోగాలకు సమర్థులైన మనుషులు దొరుకుతారనే నమ్మకం నాకు లేదు.

**సర్ ఎ.పి. ప్యాట్రో:** సర్వీసులో తగ్గింపు విధానం వుందేమో పరిశోధించడానికి మనకు ఒక కమిటీ వుండాలి. అది స్వతంత్రంగా వుండాలి. అయితే అది ఫలితం చూపడానికి జీతపురేటు వాస్తవపు జీవనవిధానాల మీద ఆధారపడి పెరిగేట్లుండాలి. ఈ ప్రశ్నను సమర్థవంతంగా చూడడానికి ఒక స్వతంత్ర కమిటీ వుండడం సహజమేమో. మాలో కొందరు భారతీయీకరణాన్ని సమర్థించేవారు, దేశ ప్రయోజనాల దృష్ట్యా భారతీయ ఆఫీసర్లకు ఇచ్చే జీతాల విషయంలో మితవ్యయం పాటించాలనుకొంటున్నారు, కానీ అదే సమయంలో ఆఫీసర్లను తృప్తిపరచే ఆకర్షణలన్నీ వుండాలి, తద్వారా వారు తమ హెూదాకు, అర్హతకు తగిన హంగులన్నీ కలిగి దేశ గౌరవాన్ని పెంచగలిగేట్లు

తమలోని అంచాల వ్యామోహాల్ని తగ్గించుకోగలిగేట్లు వుండాలి. ఉద్యోగాలలో తగిన వాళ్ళని నియమించడం, వారికి తగిన జీతపురేటును నిర్ణయించడం అంత ఆషామాషీ పనికాదు. దానికి చాలా జాగ్రత్తతో కూడిన ఎంపిక విధానముండాలి. సర్వీసుకు సంబంధించిన సామర్ధ్యం గురించిన జీవాధారమైన ప్రశ్నలివి. నా వినయపూర్వక విన్నపమేమంటే ప్రస్తుతానికి వివరాలలోకి వెళ్ళి మనం బరువు మోయడమనవసరమని.

***సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :*** అదుపుకు సంబంధించి నా సూచన సరిగ్గా అర్థం కాలేదనుకొంటున్నాను, నేను కోరేదల్లా అదుపు. వైట్‌హాల్లో వుండినా ఇండియాలో వుండినా విశాల దృక్పథముండే సూత్రాన్ని స్థిరపరచాలి.

***డా॥ అంబేద్కర్ :*** సిలోన్ కమీషన్ ప్రకటనను ఒకసారి మీరు పరిశీలించాలని నా అభిప్రాయం. దానిలో సిలోన్ వాసులకు, ఇతరులకు జీతాలలో వివిధ రకాలుండే విశాలమైన సూత్రం సిఫారసు చేయబడింది.

***ఛైర్మన్ :*** కార్యక్రమంలోని (6) భాగం చివరలో యిది కలుపుదాం. "అయితే ఏదయినా కచ్చితమైన సిఫారసు ద్వారా అలాంటి కమిటీలకు మార్గదర్శకత్వం వహించారా?"

***లార్డ్ జెట్లాండ్ :*** సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ కోరిన ప్రశ్న గురించి భాగం (4)లో చర్చిద్దాం. భర్తీ అధికారికే అదుపు చేసే అధికారం వుంటుంది.

***ఛైర్మన్ :*** మనం భాగం (4)కు ఇలా జోడిద్దాం. "ఇంకా అదుపుకు సంబంధించి ఏ సాధారణ సిఫారసులు చేయబడాలి" నేను లార్డ్ జెట్లాండ్‌తో ఏకీభవిస్తున్నాను. ఒకదాని పర్యవసానమే ఇంకొకటి. అదుపుచేసే అధికారం భర్తీచేసే అధికారికి వుంటుంది. కాబట్టి మీరు డా॥ అంబేద్కర్ పాయింటు కలిసివచ్చేలా భాగం (6)లో యిది కలపాలి. "అయితే ఏదైనా కచ్చితమైన సిఫారసు ద్వారా అలాంటి కమిటీలకు మార్గదర్శకత్వం వహించాలా?"

***ఛైర్మన్ :*** ఇప్పుడు మనం భాగం (3)కి వచ్చాం. "ఈ క్రింది సర్వీసుల్లో భారతదేశమంతటా భర్తీ కొనసాగించవచ్చు. ఎ) ఐ.ఎ.ఎస్. బి) ఐ.పి.ఎస్. సి) ఐ.ఎఫ్.ఎస్. డి) ఇండియన్ సర్వీస్ ఆఫ్ ఇంజినీర్స్ వారి నీటిపారుదల శాఖ – ఇక్కడ కాసేపు ఆగుతాను. కమిటీ వీటి గురించి ఏ సూచన లిచ్చిందో సేకరించాను. ఎ) అంగీకరించారు. బి) అంగీకరించారు. సి) లేదు. ఎ, బికి అంగీకరించినట్లుగా జవాబును తీసుకోవచ్చా?

***శివరావు :*** నా ఉద్దేశంలో ఈ సర్వీసులన్నీ రాష్ట్రీకరణం చేయాలి. అఖిలభారత స్థాయిలో ఈ సర్వీసులు సంతృప్తికరంగా పనిచేస్తాయని నేననుకోవడంలేదు. అదే సమయంలో సర్వీసులకు, మంత్రివర్గానికి సరైన సంబంధాలుండేట్లు ధృవపరచుకోవాలి.

---

* సబ్ కమిటి సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 54-58.

**బాను :** భారతీయ సివిల్ సర్వీసు సాధారణ సర్వీసుగానే భర్తీ చేయబడుతుంది; దానిలో రెండు శాఖలు, మూడు శాఖలు వుండవచ్చు. సాధారణ సర్వీసులో కొంతకాలం వున్న తర్వాత, కొందరు సభ్యులు ఉదాహరణకు, పన్నుల విభాగానికి కొందరు న్యాయవాదపరములైన జడ్జీలుగా వెళ్ళవచ్చు. మిగిలిన వాళ్ళు కార్యనిర్వాహక, రెవిన్యూ పదవుల్లో కొనసాగవచ్చు. ప్రత్యేక సర్వీసు కాని దానిని మనం ప్రవేశపెట్టాలనుకుంటు దానిని తొట్టతొలిగానే ప్రవేశపెట్టి వుండాలి. సాధారణ మాటల్లో నేను ఎత్తి చూపినట్లుగా, ఒక్క సర్వీసు వుండేదాని బదులు, నూతన రాజ్యాంగంలో సర్వీసు శ్రేణులకు కొత్తరూపమివ్వడం తప్పనిసరికావచ్చు.

ఉదా॥కు ఐ.సి.ఎస్. గతంలో మంచి పనులు చేసింది. అయితే అది ఎంతోకొంత కాలదోషం పట్టినట్లుగానే భావించాల్సి వుంది. లేదూ అతి తక్కువ కాలంలోనే అలా అయ్యే ప్రమాదం ఉంది. అసలు ప్రశ్నేమిటంటే ఇటువంటి పరిభాష కొనసాగించడం. ఈ రకమైన పనులు శాశ్వతంగా వుండేట్లు చేయడం ఈనాటి అవసరాలకు సాధ్యమయ్యే పనికాదు.

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రశ్న వివిధ దృక్కోణాల నుంచి చూడాల్సి వుంటుంది. మొదటిదాని దృష్టిలో రాష్ట్రాల స్వయంపాలనం. మనం సాధ్యమైనంతవరకు రాష్ట్రాలకు స్వయం పాలనం వుండాలని రాజ్యాంగంలో ప్రతిపాదిస్తున్నాం. తన ప్రాంతంలో పనిచేసే సివిల్ సర్వీసును అజమాయిషీ చేసే హక్కు తనకు లేనప్పుడు రాష్ట్రాలకు స్వయంపాలనం ఎక్కడ వున్నట్లు? ఇంకొక ముఖ్యమైన దృష్టి ఏమంటే, ఆర్థిక వెసులుబాటు. మనకు అఖిల భారత సివిల్ సర్వీసు వున్నప్పుడు నిర్ణీతమైన వేతనశ్రేణి వుంటుంది. జీతం, ప్రతిఫలాలు, ఇతర ప్రయోజనాలు ఒక శ్రేణినిబట్టి వేర్వేరు రాష్ట్రాలలో సంపాదించవచ్చు. బొంబాయి, బెంగాల్ లాంటి చోట్ల పౌరసర్వీసు అదనపు భారంగా అనిపించకపోవచ్చు. కానీ చిన్న రాష్ట్రాలు, పేద ప్రాంతాలైన అస్సాం, సింధ్, వాయవ్య సరిహద్దు రాష్ట్రం, పంజాబ్ లాంటిచోట్ల భారమే. అఖిల భారతీయ సర్వీసులు ఇచ్చే పనికన్నా వారికి మరికొంత తక్కువగానైనా సమర్థవంతమైన పని విధానం లభిస్తే చాలు. తమకందుబాటులో వున్న ఆర్థిక వెసులుబాటుతో తమ అవసరానికి సరిపోయే రకమైన తెలివి, నైపుణ్యం వుండేవారిని నియమించుకోవచ్చు. చివరగా బానుగారు చెప్పిన విశేషనైపుణ్య విధానాన్ని నేను అంగీకరిస్తున్నాను. ఇండియన్ సివిల్ సర్వీసులాంటి పరీక్ష కృతార్థుడైన వ్యక్తి ఒక ప్రత్యేక విభాగానికి సేవచేసే నైపుణ్యాన్ని ఏ రకంగా కలిగి వుంటాడో నాకర్థం కావడంలేదు. లెక్కలు ప్రత్యేక విషయంగా ఒకతను ఐ.ఎ.ఎస్. కృతార్థుడౌతాడు. అతన్ని తీసికెళ్ళి వ్యవసాయ విభాగంలోనో లేదా భారతీయ కరెన్సీ విభాగంలోనో అధికారిగా వేస్తారు. మనం ఏ సర్వీసులోనైనా తే పనిచేస్తామో దాని గురించి మన విద్యా విధానంలో సరైన పరిజ్ఞానం కల్గించడం మాత్రమే కాకుండా, ఆ విషయంలో విశేష నైపుణ్యం కలిగించాలి. నా ఉద్దేశంలో ఈ అఖిల భారతస్థాయి కలిగిన సర్వీసులు ఇపుడు మానుకొని, రాష్ట్రాలు తమకనుగుణ్యామైన ఆర్థిక పరిస్థితుల కనుకూలంగా సర్వీసులు నియమించుకొనే స్వేచ్ఛనివ్వాలి.

**సర్ ఎ.పి. పాత్రో :** డా॥ అంబేద్కర్ లేవనెత్తిన అభ్యంతరం ఎంతో సమంజసమైంది.

ఛైర్మన్ : డా॥ అంబేద్కర్ ఎత్తిచూపిన విషయాల మీద బాను దృష్టికోణం స్పష్టంగా పరిశీలించాలి. ఐ.సి.ఎస్. భర్తీ చేయడంలో మనం స్పష్టంగా, జాగ్రత్తగా సిఫారసు చేయాల్సి వుంటుంది. ఐ.సి.ఎస్. పరిశుద్ధమైందని, సర్వశ్రేష్టమైందని మనమేమీ అనుకోనక్కరలేదు. లేదా అది వున్నరీతిలో అలాగే కొనసాగాలనీ చెప్పడంలేదు. ఎంతవరకు దానిని పునర్నిర్మించడానికి, కొత్తరూపం ఇవ్వడానికి అవసరమో అంత ఇవ్వాలి. డా॥ అంబేద్కర్ అభిప్రాయానుసారం అఖిలభారత సర్వీసులను వదిలి, చిన్నపాటి రాష్ట్ర సర్వీసులు వాటిస్థానే స్థిరపరచాలి.

*డా॥ అంబేద్కర్ :* నా ఉద్దేశ్యాన్ని స్పష్టపరిచాననే అనుకొంటున్నాను. కమిటీలోని ఇతర సభ్యుల అభిప్రాయాలనుబట్టి, సర్వీసులలో యూరోపియన్ తత్వం వుండడం అత్యవసరమే. కానీ సర్వీసులను రాష్ట్రీకరణం చేస్తే భర్తీ ఆధారం వట్టిపోతుందంటూన్న జెట్లాండ్ ప్రభువు అభిప్రాయంతో నేను ఏకీభవించలేకపోతున్నాను.

ఛైర్మన్ : సూచన ఏమంటే మనం 1939ను కానీ, మీరనుకొనే మరో తేదీని కానీ సూచించండి. తారీఖులో ఇంద్రజాలమేమీ లేదు. నేను చేసే సూచన ఏమంటే మనం ఒక తారీఖును నిర్ణయించడం వరకే. దానిని భారతప్రభుత్వం పరిశీలించడం తర్వాతి విషయం. ప్రతి ఒక్కరిని కలిపే ప్రయత్నంలో భాగంగానే నేను సూచిస్తూన్నదిది.

డా॥ అంబేద్కర్ : నా దృష్టేమిటంటే మీ సిఫార్సులు ఇండియన్ సివిల్ సర్వీసు, ఇండియన్ పోలీసు సర్వీసులకు మాత్రమే వర్తించాలి.

ఛైర్మన్ : నేను అంగీకరిస్తున్నాను. ఆ విషయం స్పష్టపరిచాను.

## మూడవ సమావేశం – 8 జనవరి 1931

*డా॥ అంబేద్కర్ :* సర్, భవిష్యత్ భారత ప్రభుత్వానికి మార్గదర్శకత్వం నెరపడానికి ఒక కమిటీని ఏర్పరచాలనే ప్రశ్న గురించి నిజం చెప్పాలంటే నిశ్చితాభిప్రాయం నాకు లేదు. కానీ రెండు విషయాల గురించి నాకు బలమైన అభిప్రాయముంది. మొదటిది అన్ని విభాగాలకూ ఒకే భారతీయ సివిల్ సర్వీసు వుంచే బదులు, మనం ఇక ముందు నుంచి సర్వీసుల్లో ప్రత్యేక విషయాధికారం, విశేష నైపుణ్యం వుండేట్లు చూడడం వల్ల వాటి నైపుణ్యం కాపాడినట్లవుతుంది, ఇది అమలు చేయడానికి ఇది సరైన అదను కూడా. భారతీయ సివిల్ సర్వీసు సమర్థత గురించి నేనేమీ మాట్లాడదలుచుకోలేదు. ఎందుకంటే సాధారణంగా సివిల్ సర్వీసు సమర్థవంతమైందనేది అందరూ అంగీకరించే విషయం, కానీ ఆ విషయం వదిలి ఇండియన్ సివిల్ సర్వీసులో పొందే శిక్షణ తమ ప్రత్యేక విశేష నైపుణ్యం అవసరమైన విధులు సమర్థవంతంగా నిర్వహించడానికి సరిపోదు కాబట్టి భారతీయ సివిల్ సర్వీసులో పొందే శిక్షణ తమ ప్రత్యేక విశేష నైపుణ్యం అవసరమైన విధులు సమర్థవంతంగా నిర్వహించడానికి

* సబ్ కమిటి సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 57–58

గుర్తించడానికి ఉప కమిటీ అంగీకరిస్తే ఈ సిఫారసుల అమలు విషయంలో భారత ప్రభుత్వానికి సలహా ఇవ్వడానికి ఒక ఉపసిద్ధాంతం చేయగలిగేవారు ఎవరైనా వుంటే మంచిదనుకుంటాను. నూతన రాజ్యాంగం అమలులో పెట్టిన తర్వాత, భారత ప్రభుత్వం ఆ కమిటీ సంఖ్య 6లో చేసిన సిఫారసులు అమలు చేయడానికి తగిన అధికారం కలిగి వుంటుంది. ఈ కారణాల వల్ల నేను ఈ సూచనను బలపరుస్తున్నాను.

ఛైర్మన్ : ఉప కమిటీ మార్గదర్శకత్వం కోసం నన్ను కొంచెం చెప్పమంటారా, నూతన రాజకీయ వ్యవస్థకు సంబంధించిన సర్వీసుల్లో మనకు సంబంధించినంతవరకు జీతాల ప్రశ్న గురించి మరీ అంతదూరం వెళ్ళడం సాధ్యపడకపోవచ్చు. ప్రస్తుతం అధికారుల జీతం విషయంలో కొంత తేడా వుంది, వారిని ఆసియావాసులు కానివారు అనవచ్చు. మీకందరికీ ఇది తెలిసే వుంటుందనుకొంటున్నాను. ఈ తేడా వుండడంవల్ల ఆసియావాసులు కానివారు విదేశీ భత్యం క్రింద అదనంగా దాదాపు 300 పౌండ్లు పొందుతారు.

***డా॥ అంబేద్కర్ :*** నేను చెప్పే విషయానికిది చాలా ఎడంగా వుంది. యూరోపియన్ జీతానికి మరింత కలిపి తేడాను మీరు సృష్టించుకోవచ్చు. భారతీయునికి అది ఉపశమనం కాదుకదా.

సర్ ఎ.పి. పాత్రో : డా॥ అంబేద్కర్ సంఖ్య 6లో సరైన అదనులో ప్రతిపాదించిన రెండు ప్రశ్నలకు జవాబు తప్పనిసరని నేను భావిస్తున్నాను. భారతీయీకరణం గురించి ఆయన చాలా శక్తివంతంగా పరిశోధించి ఈ వ్యవహారం మనముందుంచారని అనుకొంటున్నాను. సరైన భర్తీలను పొందడానికి ఏరకమైన పరిస్థితులు కావాల్సి వుందిలాంటి కీలకమైన ప్రశ్నలు వేశారు. అది చాలా ముఖ్యమైన విషయం. ప్రస్తుత పరిస్థితులను మార్పు చేసి తమకు అనుగుణమైన మనుషులను ఆకర్షించాలని కమిటీ అనుకొంటే, అపుడు కమిటీ ఈ విషయాన్ని పరిశీలించాలి. దీనికోసం ఒక కమిటీని తప్పకుండా ఏర్పాటు చేయాలి. ఇంకో లక్షణం ఏమంటే, ఈ విషయాన్ని భవిష్యత్ భారత ప్రభుత్వానికి చూచే అధికారం వుందని చెప్పబడింది. అప్పటికే పరిస్థితులు తలెత్తుతాయో వాటి కనుగుణ్యమైన కార్యక్రమాలు తీసుకోవాల్సి వుంది. నా భయం ఏమంటే భవిష్యత్ భారత ప్రభుత్వం మొత్తం సమూలంగా మార్పులకు లోనవుతూ, నేటి వ్యవస్థను మాత్రం పూర్తిగా విప్లవాత్మకంగా ప్రతి ఒక్కదాన్నీ మార్పుకు లోను చేయవచ్చు. ఎంత త్వరగా దానిని మరచిపోతే మనకంత మంచిది, సర్వీసుకు సంబంధించిన పరిస్థితుల భావనలో మరింత తార్కికంగా ఉండగలుగుతాము.

కేంద్రంలో పరిమితమైన బాధ్యత మాత్రమే వుందని మనకు తెలును. మంత్రులకు సంబంధించిన బాధ్యత పరిమితం చేయబడింది కాబట్టి, భవిష్యత్ భారత ప్రభుత్వానికి మార్గ దర్శకత్వం కోసం గత అనుభవాలను మనం పరిశీలించాలి. కేవలం సంతకం చేసిన పత్రంలాగా దాని మూవాన దానిని మొదలుపెట్టరాదు. ఇది పూర్తిగా వ్యవహారశైలికి సంబంధించింది. సంఖ్య 6కు సంబంధించి నా సమాధానం నిశ్చయాత్మకమైంది.

**డా॥ అంబేద్కర్ :** మీరు ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్న ప్రాథమిక హక్కుల ప్రశ్నకు సంబంధించి ఒక సమస్య లేవనెత్తాలనుకొంటున్నాను. విషయమేమిటంటే ప్రభుత్వ సర్వీసుకు మీరు ఉద్యోగాలకు తగిన ప్రాతినిధ్యమిచ్చి భర్తీ చేయాలని ఆదేశమిచ్చారు. మాటలెలా వున్నా, దాని అర్థం, వివిధ కులాల నుంచి ఎంపిక చేసుకొనే హక్కు కమీషన్‌కుంటుంది. అలా చేసినపుడు ఉద్యోగాలలో లేని కులాల కోటాను ఇందులో తగిన విధంగా చేర్చాల్సి వుంటుంది. దాని అర్థం, ఇతర కులాల సభ్యులను ఇందులో మినహాయించాల్సి వస్తుంది. సమర్థవంతమైన, అర్హులైన సభ్యుల ప్రాతినిధ్యం అన్ని కులాల నుంచి తీసుకోవాలి గదా, అలాంటపుడు తగిన విధంగా ప్రభుత్వోద్యోగాలలో వీటిని తీసుకోకపోతే ప్రతి ఒక్కరికీ మీరు ఈ ప్రాథమిక హక్కు నిచ్చినపుడు, అది పబ్లిక్ సర్వీస్ కమీషన్‌ను ఇబ్బందిలో పెట్టినట్లే అవుతుంది. ఎందుకంటే ఆరకమైన ప్రాథమిక హక్కున్న వ్యక్తి, ఇతర కులం నుంచి ఇతర సభ్యులను నియమిస్తూ నాపట్ల పక్షపాతం చూపుతున్నారని చెప్పవచ్చు. ఇలాంటపుడు సమస్య ఉంటుందనుకొంటున్నాను.

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :** ఒక విషయం గుర్తు తేవాలనుకొంటున్నాను, భారత ప్రభుత్వం రాజ్యాధికారం చేపట్టేముందు రాణీ విక్టోరియా ప్రకటన గమనిస్తే ప్రాథమిక హక్కుల ప్రతిపాదనలో వైకల్యం వల్లి, మత, కుల, జాతికారణాల వల్ల వివక్షత కూడదని ప్రకటించిందని తెలుస్తుంది. అప్పటి ప్రకటనలో ఇది చేర్చబడింది.

**రాజా నరేంద్రనాథ్ :** ఆచరణలో వున్న సమస్యను ఇది పట్టించుకోలేదు.

**ఛైర్మన్ :** ప్రాథమికహక్కు ఇంతకుముందుగానే వుంది, అలాంటపుడు ప్రాథమిక హక్కులను పునరుచ్చరించడం అవసరమా? సర్‌చిమన్‌లాల్ చదివిన మొదటి రెండు ప్రతిపాదనలను తన నివేదికలో చేర్చడానికి ఉపకమిటీ సంతృప్తి పడుతుందా, ప్రాథమికహక్కుల ప్రకటనలో మాత్రం ఇది చేర్చరాదంటుందా?

**డా॥ అంబేద్కర్ :** పబ్లిక్ సర్వీస్ కమీషన్ నియామకాలను స్థానిక ప్రభుత్వ ప్రభావం నుంచి కాపాడడమే కాకుండా, తన స్వంత అధికారాలను పబ్లిక్ సర్వీస్ కమీషన్ దుర్వినియోగం చేయకుండా జాగ్రత్త వహించాలనుకొంటున్నాను. ఈ విషయం చాలా ముఖ్యమైందని తలుస్తున్నాను. పబ్లిక్ సర్వీస్ కమీషన్ తన సిబ్బంది వ్యవహారాల్లో చాలా తక్కువ జోక్యం చేసుకోవడం మంచిది. అందువల్లే, దేశంలోని వివిధ కులాల నుంచి పబ్లిక్‌సర్వీస్ కమీషన్‌లో సిబ్బందిని మనం సమకూర్చలేకపోతున్నాము. పబ్లిక్ సర్వీస్ కమీషన్ కూడ కొందరి కులాలతో కూడుకొని వుంటుంది. అందువల్ల నా భయం ఏమిటంటే సహజ మానవనైజం ప్రకారం పబ్లిక్ సర్వీస్ కమీషన్ కూడ తన అధికారాలను దుర్వినియోగం చేసే అవకాశముందని.

**మోడీ :** దీనికి ప్రత్యామ్నాయ ఏమిటి?

**డా॥ అంబేద్కర్ :** ప్రత్యామ్నాయమంటే, శాసనమండలికి పబ్లిక్ సర్వీస్ కమీషన్‌పైన అవిశ్వాస

తీర్మానం చేసే అధికారం వుండాలి, ఎలానంటే-

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :** అదసలు లక్ష్యాన్నే దెబ్బతీస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** అది వాంఛనీయం కాకపోతే ఈ విషయానికి సంబంధించి మరేదైనా ప్రత్యామ్నాయాన్ని ఆహ్వానిస్తున్నాను, తన స్వంత కులాల ప్రయోజనాలనే కోరుకొని ఇతరులను నిర్లక్ష్యం చేసే పబ్లిక్ సర్వీస్ కమీషన్ వుండీ ఉపయోగంలేదని గట్టిగా భావిస్తున్నాను.

*సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :** అలాంటపుడు వేర్వేరు కులాల నుంచి సరైన ప్రాతినిధ్యం పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో ఉండేట్లు ఆ ప్రాతినిధ్యం సరిగ్గానే సాధించబడేట్లు పర్యవేక్షణాధికారాన్ని గవర్నర్‌కు ఇవ్వాలి.

**డా॥ అంబేద్కర్ :** 2 భాగంలో ఈ విషయం గురించి నిర్దేశకత్వం గవర్నర్‌చేత సమకూర్చబడాలి.

**సర్ చిమన్‌లాల్‌సెతల్వాడ్ :** ఇది గవర్నర్‌కు అదుపులేని అధికారాలను ధారాదత్తం చేయడమే. వివిధ కులాల సరైన ప్రాతినిధ్యం వుండడమే కదా మీకు కావాల్సింది. పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో ఈ ప్రాతినిధ్యం సరిగ్గా అమలు కావడం పర్యవేక్షించాల్సి వుంటుంది; అంతేకదా?

**జఫ్రుల్లాఖాన్ :** గవర్నర్ వాటినంతా ఎలా చూడగలడు?

**ఛైర్మన్ :** మధ్యేమార్గంగా మేజర్ స్టాన్లీ ఈ సూచనలు చేశారు. ఈ భావం రావడానికి ఆయన వాక్యాలు ఇందులో కలపాల్సి వచ్చింది. 2 భాగం చివర వాటిని ఇలా ప్రవేశపెట్టాం : "పబ్లిక్ సర్వీస్ కమీషన్లు కానీ, తాత్కాలిక పబ్లిక్ సర్వీసు కమీషన్లు కానీ నిర్ణీత సమయంలో గవర్నరు తన విధిలో భాగంగా సమీక్ష చేయాలి, అలాగే కేంద్ర పబ్లిక్‌సర్వీస్ కమీషన్‌వ్యవహారాలను గవర్నర్ జనరల్ పర్యవేక్షించాలి. ఆశించిన ఫలితాలను రాబట్టడానికి వీరికి అవసరమైన ఆదేశాలను జారీచేసే అధికారం వుంది."

**డా॥ అంబేద్కర్ :** అవును.

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :** బాగుంది, దీని నంగీకరించడానికి నేను సిద్ధం.

+**శివరావు :** పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లోని సభ్యులు తాము సత్ప్రవర్తన కలిగివున్నంతవరకు అధికారాలు కలిగి వుంటారు. చైర్మన్‌కానీ, సర్వీస్ కమీషన్‌లోని ఇతర సభ్యులుకానీ గవర్నర్ జనరల్‌చేత కేంద్ర శాసనసభకు ఉద్దేశిస్తూ ఆరోపణా పత్రం అందుకుంటే తప్ప తొలగించరాదు. అలాగే తాత్కాలిక పబ్లిక్ సర్వీస్ కమీషన్ వరకైతే ఆ రాష్ట్ర గవర్నరు తాత్కాలిక శాసనసభకు నిర్దేశిస్తూ ఆరోపణపత్రం వ్రాయాల్సి వుంటుంది.

**ఛైర్మన్ :** శివరావు నూతన భాగాన్ని సూచించారు. విషయాన్ని చాలా స్పష్టంగా వ్యక్తపరిచారు. భాషకు

* సబ్ కమిటి సమావేశాలు - 8 (ఉద్యోగాలు), పుట 121-22.

\+ సబ్ కమిటి సమావేశాలు - 8 (ఉద్యోగాలు), పుట 124.

మనం బందీలు కాకుండా దీని సారాంశాన్ని బట్టి నూతనభాగం అందాం. పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లలో సభ్యులుగా వున్నవారు మంచి నడవడిక కల్గి వుండాలి. ఛైర్మన్‌కానీ, ఇతర సాధారణ సభ్యుడుకానీ తొలగింపబడాలంటే శాసనసభకు ఉద్దేశిస్తూ తొలగింపు సిఫారసు గవర్నరు లేదా గవర్నరు జనరల్ వ్రాయాల్సి వుంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** నేను దానిని బలపరుస్తున్నాను.

*'**డా॥ అంబేద్కర్ :*** పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లలో సభ్యులను తొలగించే విషయం పూర్తిగా గవర్నరు లేదా గవర్నరు జనరల్‌ల మీద వదిలేసే స్థానాన్ని శివరావు చేపట్టారు. వాస్తవమేమంటే శాసనసభలోని మెజారిటీ తీర్మానం చేబట్టినంత మాత్రాననే వారిని తొలగించలేరు. కానీ గవర్నరు లేదా గవర్నరు జనరల్ వారిమీద చర్య తీసుకోవాలా వద్దా అన్నది పరిశీలించాలి.

***రాజా నరేంద్రనాథ్ :*** నియామకాలలో శాసనసభ జోక్యాన్ని నేనెంత మాత్రం సమర్థించను.

***డా॥ అంబేద్కర్ :*** మనుషుల్లో అవినీతిపరులున్నట్లుగానే జడ్జీలలో కూడా అవినీతిపరులుంటారు. దానికి పరిహారమే లేదా? అలాంటి వ్యక్తులను తొలగించే దారే లేదా? మంత్రులు అవినీతిపరులని తెలిసినపుడు వారినుంచి సంరక్షణని తొలగించి వేస్తున్నాం. కానీ పబ్లిక్ సర్వీస్ కమీషన్లు అవినీతి నిలయాలైతే, అందులోని సభ్యులను తొలగించ లేకపోతే ఆ స్థితి ఎలా వుంటుంది?

***డా॥ పాషాద్ అహ్మద్‌ఖాన్ :*** పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లోని ఒక సభ్యుడు గవర్నర్ ద్వారా తొలగింపబడగలడను కొంటే, అదే వాస్తవమనుకొంటే సభను ఉద్దేశిస్తూ లేఖ వ్రాయడంలో ఉపయోగమేమిటి? కార్య నిర్వాహక విధులతో శాసనసభ జోక్యం చాలా ప్రమాదకారి. కార్యనిర్వాహకవర్గం యొక్క విధులనుంచి, శాసనసభ విధులను ఉద్దేశపూర్వకంగానే దూరంగా వుంచాలి, ఈ రకంగా రెండు విధులను కలగాపులగం చేస్తే వేలాది నియమకాలు ఆగిపోవచ్చు. మనం సమస్యను కోరి తెచ్చుకొన్నట్లుగా అవుతూంది, మొత్తం పబ్లిక్ సర్వీస్ కమీషన్ గురించి ఏర్పరచిన నియమ నిబంధనలన్నీ నిరుపయోగమవడంతోపాటు నిష్ఫలమవుతాయి.

***ఛైర్మన్ :*** ఉపకమిటీ ఆశించినమేరకు ఏకీభావం జరిగిందా? విమర్శ కూడా బలంగానే వున్నది. దానిని మనం ఆ విభాగంలో చొప్పించాలి, పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో సభ్యుడిగా వుండినపుడు సత్ప్రవర్తన కలిగి ఉండి తీరాలి. లేకపోతే గవర్నరుకు లేదా గవర్నరు జనరలుకు తొలగించే అధికారం వుంటుందని. (అంగీకరించారు).

***ర్ ప్రవాష్ చందర్ మిట్టర్ :*** శాసనసభను ఉద్దేశపూర్వకంగా లొక్కు రానంత వరకు, నేను సంతృప్తిపడినట్లే.

***ర్మన్ :*** ఇంకా సవరణ ఉపకమిటీ కోరిన మేరకు అనుకూలత కుదిరినట్లేనా? (అంగీకరించారు).

' సబ్ కమిటి సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 125-126.

నివేదిక స్థాయిలో దానిని మనం పరిశీలిద్దాం, తాత్కాలికంగా ప్రస్తుతం మనమంగీకరిద్దాం.

ఇపుడిక కల్నల్ గిడ్నీ విషయానికొద్దాం.

***డా॥ అంబేద్కర్ ః*** కల్నల్ గిడ్నీగారి ప్రతిపాదనకు వెళ్ళేముందు, ముసాయిదా తొలుత చదవండి. అందులో ఒక భాగం పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లో సభ్యుడిగా తొలగింపబడితే, ఆ కమీషన్ సభ్యుడు సామ్రాజ్యాధికారం క్రింద ఇక ఏ ఉద్యోగం అయినా చేయడానికి అనర్హుడు అంటుంది.

***ఛైర్మన్ ః*** ప్రస్తుతం మీముందు ఆ సూచనను పెడుతున్నాను. అందువల్ల మీరు ఈ వాక్యాలను దయచేసి తొలగించండి. "తాత్కాలిక మేనేజిమెంటు క్రింద వుంచాలి". బదులుగా ఈ వాక్యాలను కలపండి. "అఖిలభారత స్థాయిల ఇకముందు భర్తీ చేయలేరు."

"ఈ రెండు సర్వీసులకు సంబంధించి ప్రత్యేక సిఫారసులు అవసరమని మేము భావించడం లేదు."

"అఖిలభారతస్థాయిలో ఇండియన్ సివిల్ సర్వీసు, ఇండియన్ పోలీసు సర్వీసుల భర్తీ కొనసాగించాలని మేం సిఫారసు చేస్తున్నాం. (శివరావు విభేదించాడు)." అతను ఒంటరిగా అభ్యంతరం లేవదీశాడో, అతనికి తోడెవరయినా వున్నారో నాకు తెలియదు.

***డా॥ అంబేద్కర్ ః*** నా స్థిరాభిప్రాయమేమంటే ఈ రెండు సర్వీసులలో యూరోపియన్ తత్వం తప్ప మిగిలినదంతా తాత్కాలికంగా వుంచాలి.

"(ఈ ముగింపు శివరావు విభేదించాడు. అన్ని సర్వీసులు తక్షణం రాష్ట్రీయం చెయ్యాలని ఆశించాడు)" దీనిని కలపాలని నేను సూచిస్తున్నా. "న్యాయస్థానాలకు సంబంధించిన ఆఫీసుల్లో భర్తీ ఇండియన్ సివిల్ సర్వీసు నుండి చేయడం ఇకముందు కుదరదని కొందరు సభ్యులు అభిప్రాయపడ్డారు."

***డా॥ అంబేద్కర్ ః*** రెండు సర్వీసులు రాష్ట్రీయ పద్ధతిలో వుంటే మంచిదని నేనూ అనుకొంటున్నాను. కానీ ఈ రెండు సర్వీసుల్లో యూరోపియన్ తత్వానికి అనుకూలంగా నేను సిద్ధపడుతున్నాను.

***జఫ్రుల్లాఖాన్ ః*** డా॥ అంబేద్కర్‌తో ఏకీభవిస్తున్నాను.

***సర్దార్ సంపూరన్ సింగ్ ః*** ఇదే దృష్టిని నేనూ బలపరుస్తున్నాను.

***ఛైర్మన్ ః*** కృతజ్ఞుడ్ని. అది తప్పక చేరుస్తాము.

***డా॥ అంబేద్కర్ ః*** రెండవ పేజీ పేరా మొదట్లో, "సంశయం లేదు. ఆ ప్రభుత్వం కోరుకొంటే" అలా కొనసాగుతుంది. ప్రభుత్వ సర్వీసుల విభాగాల్లో పునర్వ్యవస్థీకరణ, పునఃసర్దుబాటుల ప్రశ్న గురించి ఉల్లేఖించారు. జీతానికి సంబంధించిన ప్రశ్న గురించి ఈరోజు ఉదయం జరిగిన చర్చల దృష్ట్యా మీరు

* సబ్ కమిటీ సమావేశాలు - 8 (ఉద్యోగాలు), పుట 128.

ఏదైనా కలుపుతారా?

**ఛైర్మన్ :** ఆ మాటల్లోనే ఆ ప్రసక్తి వస్తుందనుకుంటున్నాను.

## నాలుగో సమావేశం – 9 జనవరి 1931

**లార్డ్ జెట్లాండ్ :** లేదు. స్థానిక ప్రభుత్వ అధికార పరిధిని ఉపసంహరించడానికి వీలులేదు. ఎందుకంటే తన అధికారులకన్నా స్థానిక ప్రభుత్వం ఉన్నతమైనదని అంగీకరించబడింది. కానీ ఆచరణలో ఇలాంటివన్నీ అనుసరించాల్సి వుంటుంది. ఉపకమిటీ ముందుంచాలనుకున్నది స్పష్టపరిచాననుకుంటాను. ముఖ్యమైన విషయం ఏమిటంటే 1861 చట్టం ప్రకారం ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు అధికారాలు పరిరక్షించాలి, ఇంకా అనేక ఇతర సూచనలు మీముందుంచాము. ఉదా॥ రాష్ట్రంలో పోలీస్ కౌన్సిల్‌ని ఏర్పాటు చేసే విషయం ఉపకమిటీ పరిశీలించాలి.

**డా॥ అంబేద్కర్ :** మీరంగీకరిస్తే సమాచారంకోసం ఒక ప్రశ్న వేయదలిచాను. చట్ట ప్రకారం ఇన్స్పెక్టర్ జనరల్ పదవి గుర్తించబడాలని మార్క్వెస్ ప్రభువు ఆశిస్తున్నారా? ఇపుడుండే పోలీసు శాసనం స్థితి ప్రకారమే పదవిని కొనసాగించాలని కోరుతున్నారా? లేక అధికారులకు చట్ట ప్రకారం అధికారాలు, బాధ్యతలు సంక్రమించినట్లు ఆ పదవి రాజశాసనం ద్వారా గుర్తింపబడాలని కోరుకొంటున్నారా?

**లా॥ జెట్లాండ్ :** అవును.

**కునర్ ప్రవాష్ చందర్ మిట్టర్ :** పార్లమెంటరీ శాసనం ప్రకారమా?

**లా॥ జెట్లాండ్ :** అవును అలాగే ప్రస్తుతం పోలీసు చట్టం ప్రకారం ఇన్స్పెక్టర్ జనరల్‌కు ఎలాగూ అధికారాలు సంక్రమించబడి వున్నాయి.

**డా॥ అంబేద్కర్ :** పోలీసు చట్టం అన్నది వేరే విషయమౌతుంది. ఎందుకంటే స్థానిక శాసనంతో దానిని సవరించవచ్చు. ప్రశ్న ఏమిటంటే, ఇన్స్పెక్టర్ జనరల్ పదవి, స్థానిక ప్రభుత్వంకానీ, మరే ఇతర మంత్రి జోక్యం కానీ లేని అధికారుల స్వేచ్ఛాయుత విధి నిర్వహణాధికారాలు మాదిరి గుర్తించబడాలనా?

**లార్డ్ జెట్లాండ్ :** దాని పరిణామమదే. అదీ నా ప్రతిపాదన. ఇపుడున్న ఇన్స్పెక్టర్ జనరల్ అధికారాలు అలాగే నిలిపి వుంచాలనుకొంటున్నాను.

**సర్ కోవాస్జీ జహంగీర్ :** ఏ అధికారం దృష్ట్యా వుంచాలనుకుంటున్నారు – పోలీసు చట్టం దృష్ట్యా లేక భారత ప్రభుత్వ చట్టం దృష్ట్యానా?

**సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ :** స్థానిక శాసన సభ ఓటునీ శాసనసభనీ మించిన పరిధిలో మాత్రమే పోలీసు చట్టపు విషయాలను మార్చవచ్చు.

**లార్డ్ జెట్లాండ్ :** అవును ఫెడరల్ ప్రభుత్వ చట్టం ప్రకారం అది సాధ్యమేననుకొంటాను.

**జ్రుల్లాఖాన్ :** గవర్నర్ జనరల్ అనుమతి లేకుండా రాష్ట్రీయ ప్రభుత్వం పోలీసు గవర్నరు జనరల్ అనుమతి లేకుండా రాష్ట్రాయ ప్రభుత్వం పోలీసు చట్టాన్ని రద్దు చేయడానికి గాని మార్చడానికి గానీ సవరించడానికి గానీ వీలులేకుండా ఒక ప్రత్యేక జాబితాలో వుంచాలి.

**డా॥ అంబేద్కర్ :** నేటి పరిస్థితి అలాగుంది. అదీగాక ఆ చట్టం కేంద్ర ప్రభుత్వం ముందుగా తీసుకున్న ఉత్తర్వుల ద్వారా కూడా మార్పు చేయడానికి వీల్లేకుండా వుండాలి.

***జ్రుల్లాఖాన్ :** దీనిని కలపాలని కోరుతున్నాను. కమిటీ సభ్యులకు తెలుసో తెలియదో కాని ఫెడరల్ వ్యవస్థ ఉప కమిటీ గురించి ఉపకమిటీ ఏర్పాటు చేసిన సంయుక్త ఉప కమిటీ I, II సూచించిన ఎన్నో విషయాలు చట్ట రూపంలో ఇవ్వబడింది. జాబితాలోని భాగం 80 (3) (హెచ్)లోని ఎన్నో అప్రధానమైన విషయాలు కూడా అందులో చేర్చబడ్డాయి. అలాంటపుడు పోలీసు చట్టాన్ని అందులో చేర్చడం జరిగితే ఏర్పరచిన సూత్రాలకు ఇబ్బంది కలుగదు.

**డా॥ అంబేద్కర్ :** జ్రుల్లాఖాన్‌తో సాధారణ అంగీకరానికి వస్తున్నాను. పోలీసు చట్టం అను సూచిలో ఈరోజు పెట్టకోవడానికి కారణమేమంటే అది పరిధిలోకి రాని విషయం, కాబట్టి వాస్తవంలో భారత ప్రభుత్వానికి శాంతిభద్రతల విభాగం మీద సంపూర్ణ అదుపు వుంటుంది. అలాంటపుడు శాంతిభద్రతల విభాగాన్ని బదిలీ చేయడం జరిగితే పరిస్థితి మొత్తం మారిపోతుంది. కనీసం ఈ పరివర్తన సమయంలోనైనా ఈ విషయం అలాగే వుంచి దానిని బదిలీ చేసే సమయానికి నిశ్చితమైన పరిరక్షణలు ఏర్పాటు చేయడం తప్పనిసరి అవుతుంది. ఈ అనుసూచిలో పోలీసు చట్టాన్ని చేర్చి గవర్నరు జనరలు లేదా భారత ప్రభుత్వం ఆదేశాలు చేయడం అవసరమని నేను వ్యక్తిగతంగా సూచిస్తున్నాను.

పోలీసులు మరియు భద్రతల విభాగానికి సంబంధించి రాష్ట్రీయ రాజ్యాంగ ఉపకమిటీలో నేను లేవనెత్తిన విషయం మీద దృష్టి నుంచాలని కోరుతున్నాను. భవిష్యత్ రాష్ట్రీయ ప్రభుత్వాల బాధ్యతలకు సంబంధించి ఈ ప్రశ్నను పరిశీలించాల్సి వుంటుంది. రాష్ట్రాలలోని వివిధ మైనారిటీలకు సంబంధించి, అత్యవసరస్థితిలో ఇలాంటి ప్రశ్నలకు తమ దృష్టికోణం విస్తరింజేయాల్సి వుంటుంది. ఏదైనా ప్రదేశంలో మతకల్లోలాలు జరిగినపుడు ఆ ప్రత్యేక ప్రాంతంలో శాంతిభద్రతలు పర్యవేక్షించే అధికారి ఏ కులంకి సంబంధించినవాడో తెలుసుకోవడం ద్వారా వివిధ రాష్ట్రాలలో మైనారిటీల పరిరక్షణకు అవకాశముంటుందను కొంటున్నాను. పోలీసు అధికారులు ఏదో ఒక కులం మీద వివక్షత చూపుతున్నట్లు ఎన్నో సందర్భాలలో ఆరోపణలు రావడం మనకు తెలుసు. ఆ ఆరోపణలు సంపూర్ణ వాస్తవాలు కాకపోవచ్చునేమోకానీ, ఆ ప్రత్యేక ప్రాంతాలలో శాంతిభద్రతలు నిర్వహించే అధికారులు చాలావరకు వివక్షత చూపుతున్నారనడానికి ఎన్నో దాఖలాలున్నాయి. కాబట్టి మైనారిటీల ప్రయోజనాలను పరిరక్షించాలంటే, కనీసం అత్యవసర సమయాల్లో మంత్రులద్వారా పోలీసు అధికారులను బదలీ చేయడం, నియమకాలు జరపడం ఆపివేయాల్సి వుంది. ఒక రాష్ట్రంలో

* సబ్ కమిటీ సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 186-88.

మెజారిటీ కులానికి సంబంధించిన మంత్రి ఒక నిర్ణీతమైన సందర్భంలో తమ ప్రయోజనాలు కాపాడని ఇంకో కులానికి చెందిన అధికారిని బదిలీచేసే అవకాశం ఎంతైనా వుంది.

*జఫ్రుల్లాఖాన్ :* మామూలుగా వీటిని ఇన్స్పెక్టర్ జనరల్ చేస్తుంటాడు.

*డా॥ అంబేద్కర్ :* బొంబాయి ప్రెసిడెన్సీలో పోలీసు అధికారుల బదిలీ తతంగం ఎంత అల్లరిని సృష్టించిందో నాకు తెలుసు. దీనిని పోలీస్ ఇన్స్పెక్టర్ లేదా ఛార్జీలో వున్న అధికారి చేస్తాడో నాకు తెలియదుకానీ, భవిష్యత్ భారత రాజ్యాంగంలో దీనికి సంబంధించి పెద్ద ఎత్తున పరిరక్షణలు సమకూర్చాల్సిన అవసరం మాత్రం ఎంతైనా వుంది.

నా స్పష్టమైన ప్రతిపాదన ఏమంటే, మతకల్లోలం కానీ కుల సమస్య తలెత్తిన అత్యవసర సమయంలో, వివిధ ప్రాంతాలలోని మంత్రులకన్నా, పోలీసులకు సంబంధించిన అధికారాలు గవర్నరుకు ఎక్కువ వుండాల్సి వుంది.

## అయిదో సమావేశం – 12 జనవరి 1931

*ఛైర్మన్ :* డా॥ అంబేద్కర్, జఫ్రుల్లాఖాన్, సర్దార్ సంపూరన్‌సింగ్‌లు నియామకాల్లో యూరోపియన్ తత్వాన్ని గౌరవించడానికి, అఖిలభారత స్థాయిలో ఇంకా జరిగే నియామకాలకు ప్రతికూలాన్ని చూపారు. ఇంతమంది సభ్యుల దృష్టిలో ఇండియన్ సివిల్ సర్వీసు నుంచి న్యాయస్థాన సంబంధిత ఆఫీసుల నియామకాలు ఇక నుంచి జరపరాదని అభిప్రాయం వ్యక్తం చేశారు.

*డా॥ అంబేద్కర్ :* భారతీయ పోలీసు సర్వీసు కూడా, సర్

*ఛైర్మన్ :* దానిలో కలపాలంటారు, అంతేకదా, "ఇండియన్ సివిల్, ఇండియన్ పోలీసు సర్వీస్"

*డా॥ అంబేద్కర్ :* అవును.

*ఛైర్మన్ :* జఫ్రుల్లాఖాన్ కూడా దీనికి సమ్మతిస్తున్నారా?

*జఫ్రుల్లాఖాన్ :* అవును

*ఛైర్మన్ :* సర్దార్ సంపూరన్‌సింగ్ కూడానా?

*సర్దార్ సంపూరన్ సింగ్ :* అంగీకరిస్తున్నాను.

*ఛైర్మన్ :* కేవలం మీ అభిప్రాయాలను నేను ఇందులో రికార్డు చేస్తున్నాను. కాబట్టి "మరియు ఇండియన్ పోలీసు సర్వీసు" అని పలుకుతున్నాను.

* సబ్ కమిటీ సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 198.

## ఆరవ సమావేశం – 13 జనవరి 1931

*డా॥ అంబేద్కర్ :* ఉప పేరా (4) తర్వాత, నూతన పేరాలో ఇది కలపాలని ఆశిస్తున్నాను. "దళిత వర్గాలకు ప్రభుత్వోద్యోగాలు కల్పించడానికి ఉదారమైన పథకాన్ని ఏర్పాటు చేయాలని ప్రస్తుతం వారిని మినహాయిస్తున్న పోలీసు, మిలిటరీ శాఖలలో వారి భర్తీని గురించి ప్రత్యేకంగా సిఫారసు చేయాలని, మినహాయింపును ఎత్తివేసి వారికోసం భర్తీని ప్రారంభించాలని ఉపకమిటీ ఆశిస్తోంది."

*చింతామణి :* వారు చట్ట ప్రకారం మినహాయించబడ్డారా, లేక కేవలం అలవాటుగానా.

*డా॥ అంబేద్కర్ :* చట్ట ప్రకారమే. దళితవర్గాలను పోలీసు సర్వీస్ కమీషన్ అణగద్రొక్కి స్పష్టంగానే పనికిరానివాళ్ళుగా ముద్రవేసింది.

*చింతామణి :* పోలీసు, మిలిటరీ వంటి ప్రత్యేక విభాగాలలో దళితవర్గాలను ఉద్యోగాలలో మినహాయించే చట్టాలుంటే, మొత్తం దేశానికి మంచిచేసే చట్టాలుగాని మనలేవు. అలాంటి చట్టాలుంటే కొన్ని రాష్ట్రాలలో వుండవచ్చునేమోగానీ, అన్నిచోట్లా లేవు.

*డా॥ అంబేద్కర్ :* అలా ఆశించగలిగితే, నా ప్రతిపాదనను ఇలా ముగిస్తాను, "ప్రత్యేకంగా సిఫారసు చేయడమంటే వారు (దళితవర్గాలు) ఇప్పటి నుంచి ప్రభుత్వ సర్వీసుల్లోని ఏ విభాగంలోనైనా అస్పృశ్యత కారణంగా మినహాయించరాదు."

*రాజా నరేంద్రనాథ్ :* తప్పకుండా విభాగం (5) (ఎ) దానిని కలుపుకుంటుంది.

*సర్ కొవాస్జీ జహంగీర్ :* పరిస్థితి ఏమంటే ఈ కులాన్ని మినహాయించడం వారిని ఉద్యోగంలో చేర్చుకోవడం ఆచరణీయం కాదు. కాబట్టి ప్రస్తుతం దాని వివరాల లోతుకు వెళ్లడమంత మంచిదికాదు. దళితవర్గాలకు ప్రత్యేకమైన పోలీసు విభాగం మనకు వుండినట్లయితే, అప్పుడు కూడా సమస్య అలాగే వుండేది, ఆ వర్గాలలోని పోలీసులుగా పనిచేసే సభ్యులు తమకు చెందిన ప్రజల్లోనే పనిచేసేవారు. ఈ గొప్ప అననుకూలతను ఎలా తొలగించాలో స్పష్టంగా లేదు. ఏ రకమైన అభిప్రాయాన్ని నేను వ్యక్తపరచలేను. విపరీతమైన అయిష్టతతో చేయాలనుకున్నది ఏదో చేసేసారు. డా॥ అంబేద్కర్ దీనిని ఒప్పుకుంటారనుకుంటాను, కానీ డా॥ అంబేద్కర్ కోరికకు ఏ అభ్యంతరమూ ఎవరూ చెప్పకపోయినా ఈ కోరిక మాత్రం కేవలం ఒక మంచి భావనగానే మిగిలి పోతుంది. ఇలాంటి అభిప్రాయమే మనం వందలాది సందర్భాలలో వ్యక్తపరిచాం. కానీ ఏమీ ఒరిగింది లేదు, నా భయమదే. ఏ ఆదేశాలు జారీ అయ్యాయో అవెలా అసత్యమైనవిగా తేలిపోయాయో డా॥ అంబేద్కర్‌కు బాగా తెలుసు. నిస్సందేహంగా ఆయన ప్రతిపాదించిన పేరాను అందులో చేర్చడాన్ని సమర్థిస్తున్నాను. మీరు ఒకానొక సందర్భంలో చెప్పినట్లు ఒక ఆదర్శాన్ని లక్ష్యంగా పెట్టుకొన్నప్పుడు ప్రతిసారీ తార్కికంగా వుండాల్సి రాకపోవచ్చు కాబట్టి, ఆచరణ సాధ్యం కాని ప్రతిపాదన అయినా కూడా మేము సాహసిస్తున్నాము.

---

* సబ్ కమిటీ సమావేశాలు – 8 (ఉద్యోగాలు), పుట 231–33.

# 8

# ప్లీనరీ సమావేశంలో (సాధారణ సమీక్ష)

## ఎనిమిదో సమావేశం – 19 జనవరి 1931

**భవిష్యత్ రాజ్యాంగంలో అణగారిన తరగతుల రక్షణల కోసం కచ్చితమైన నిర్దుష్టమైన అంశాల్ని పొందుపరచాలనే డిమాండ్ :**

***డా॥ అంబేద్కర్ :*** ప్రధానమంత్రిగారూ! ఒక వర్గ రాజకీయ జీవితాన్ని సంఘటితపరిచే ఏ ప్రయత్నంలోనైనా ఉత్పన్నమయ్యే రెండు అతిముఖ్య ప్రశ్నల్ని పరిష్కరించే ప్రయత్నంలో రౌండ్ టేబిల్ మహాసభ నిమగ్నం కావలసి ఉంది. వాటిలో బాధ్యతాయుత ప్రభుత్వ సమస్య ఒకటికాగా, ప్రాతినిధ్య ప్రభుత్వ సమస్య మరొకటి.

రాష్ట్రాల్లో బాధ్యతాయుత ప్రభుత్వ సమస్యపై నేను చెప్పవలసింది చాలా తక్కువే వుంది. (ఎందుకంటే) కమిటీ నివేదికను నేను ఆమోదిస్తున్నాను. నా అసమ్మతి వ్యక్తీకరణలకు లోబడి మాత్రమే దానికి కట్టుబడి ఉంటాను. అయితే, కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వ సమస్య విషయంలో మాత్రం నా వైఖరి భిన్నమైనదనే చెప్పకతప్పదు. ఈనాడు మనకు తెలిసిన ఉద్యోగస్వామ్య ప్రభుత్వ స్వరూపంలో మార్పును తీసుకువచ్చే ప్రయత్నమేమీ సమాఖ్య నిర్మాణ ఉపసంఘ నివేదికలో లేదనటం నిజాయితీ కాబోదు. అయితే, ఈ మార్పు కేవలం ఛాయామాత్రమే తప్ప ఏ మాత్రమూ చెప్పుకోవలసినది కాదనీ, బాధ్యత అనేది బూటకమేననీ, అది నిజం కాదనీ నేను భావిస్తున్న విషయాన్ని మీ నుంచి దాచటం కూడా అదే విధంగా ఋజువాక్యం కాబోదు.

తాను బీజాన్ని వేశాననీ, మొక్కను పెంచవలసిన బాధ్యతమాత్రం మాదేననీ లార్డ్ ఛాన్సలర్ మాతో అన్నారు. అయ్యో, అతి ముఖ్యమైన ఈ మహాసభలో ప్రముఖ పాత్ర నిర్వహించిన లార్డ్ ఛాన్సలర్‌కు నిజంగా మేమెంతా కృతజ్ఞులం. అయితే, ఆయనకు నేనెంత కృతజ్ఞుణ్ణయినా, ఆయన వాగ్దానం చేసిన మొక్క పెరుగుతుందనే ఆశ, విశ్వాసం మాత్రం నాలో లేవు. విత్తనంగా ఆయన ఎంపిక చేసిన గింజ పుచ్చిందనీ, ఆ గింజను వేయటం ఎంపిక చేసిన నేల దాని పెరుగుదలకు ఏ మాత్రమూ అనువైనది కాదనీ, నేను గట్టిగా అనుకుంటున్నాను.

---

* రౌండ్ టేబుల్ సమావేశ కార్యక్రమ వివరాలు (1930–31), మొదటి సమావేశం, పేజీలు 438–41.

భారత సమాఖ్యకు కావలసిన భవిష్యత్ రాజ్యాంగం పైన నా అభిప్రాయ ప్రకటనను నేను లార్డ్ ఛాన్సలర్‌కు సమర్పించాను. ఆయన అధ్యక్షత వహించిన కమిటీ దానిని పరిశీలించిందో లేదో నాకు తెలియదు. ఎందుకంటే, ఆయన అధ్యక్షత వహించిన కమిటీ నివేదికలోదానిని గురించిన ఎలాంటి ప్రస్తావన నాకు కనిపించలేదు. దానిలో నేను వ్యక్తం చేసిన భావాలకు నేను ఇప్పటికీ కట్టుబడే ఉన్నాను. ఆ భావాలకు విరుద్ధంగా ఎంతో ఉన్న రాజ్యాంగానికి నేను నా ఆమోదాన్ని తెల్పలేను.నిజానికి, ప్రస్తుతం అమలులో ఉన్న వ్యవస్థకూ, కమిటీ రూపొందించిన సంకరజాతి వ్యవస్థకూ మధ్య ఎంపిక చేసుకునే స్వేచ్ఛ నాకు ఉంటే, ప్రస్తుతం అమలులో ఉన్న దానినే నేను ఎంచుకుంటాను. కాని, అయ్యా! కమిటీ నివేదికలో పొందుపరచబడిన కేంద్ర ప్రభుత్వ రాజ్యాంగం ఈ మహాసభకు సచివుడు, మార్గదర్శి, తత్త్వవేత్త అయిన సర్ టి.బి. సప్రూని సంతృప్తి పరిస్తే, భారత యువతకు తానే ప్రతినిధినని ప్రకటించుకున్న శ్రీ జయకర్‌కు అంగీకారయోగ్యమైతే, భారతదేశంలో బ్రాహ్మణేతరుల తరపున మాట్లాడుతున్నానని చెప్పుకుంటున్న సర్ ఎ.పి. పాత్రోను అది తృప్తిపరిస్తే, దానిని వ్యతిరేకించవలసిన అగత్యం నాకు లేదు. కాబట్టి, నా వైఖరి ఏమిటంటే, అటు ఆమోదమూ ఇవ్వక, ఇటు అవరోధమూ చేయక, దానిని అమలు చేసేందుకు తమ ఆశీస్సుల్ని అందించేవారికే ఆ విషయాన్ని వదిలిపెట్టటం.

ఈ వైఖరే నాకు ఎక్కువగా సమ్మతికరమైనది. ఎందుకంటే ప్రభుత్వ స్వరూపం విషయంలో నేను ప్రాతినిధ్యం వహించే వారి నుండి అనుమతి నాకు లేదు. అయితే, నాకు నాదైన అనుమతి ఒకటి ఉంది. అదేమిటంటే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని వ్యతిరేకించకుండానే నిజమైన స్థాపన జరిగేలా చూడాల్సిందని. బాధ్యతాయుత ప్రభుత్వ ప్రాతినిధ్య ప్రభుత్వ సమస్య పట్ల ఈ మహాసభ అనుసరించిన వైఖరి ఏమిటో నేను పరిశీలించినప్పుడల్లా ఇది సాధించిన విజయం గురించి ఎంతో ఆశాభంగం చెందుతాను. శాసనసభల్లో వివిధ వర్గాల ఎన్నికహక్కు, ప్రాతినిధ్య అనేవి ప్రాతినిధ్యం ప్రభుత్వం నిలవటానికి అవసరమైన రెండు మూల స్తంభాలు. నెహ్రూ కమిటీ వయోజన ఎన్నిక హక్కును ఆమోదించినదనీ, రాజ్యాంగంలో రూపొందించిన ఆ భాగానికి భారతదేశంలోని అన్ని రాజకీయ పక్షాల మద్దతు ఉన్నదనీ ప్రతి వ్యక్తికీ తెలుసు. ఈ మహాసభకు నేను వచ్చినప్పుడు, ఎన్నిక హక్కు సమస్యకు సంబంధించినంతవరకు పోరాటం విజయవంతమైందనుకున్నాను. కాని, ఎన్నిక హక్కు సంఘంలో నేను పూర్తిగా నిరాశకు గురయ్యాను. నెహ్రూ నివేదికపై సంతకాలు పెట్టిన వారంతా మానసికమైన జంకుతోనే ఆ పని చేశారని గ్రహించి నేను ఆశ్చర్యం చెందాను. దీన్నిబట్టి, రాష్ట్ర శాసనసభలో 25 శాతం జనాభాకు ఎన్నిక హక్కు కలిగించే విషయంలో సైతం భారతీయ ఉదారవాదులను ఒప్పించటం కష్టమని తేలింది. కేంద్ర శాసనసభకు ఎన్నికహక్కు అనేది నిస్సందేహంగా ఊహాతీత ప్రమాణం. అయితే, రాష్ట్ర శాసనసభల కన్న కేంద్ర శాసనసభను ఎక్కువ ప్రాతినిధ్య

* డాక్టర్ అంబేద్కర్ సభ్యుడుగా లేని ఉపసంఘం నెం. 1 (సమాఖ్య నిర్మాణం)కు లార్డ్ ఛాన్సలర్ అధ్యక్షుడు. ఇక్కడ ప్రస్తావించబడిన ప్రకటన పరిశీలించబడినట్లు లేదు.

మొనర్చే విధంగా అది ఉంటుందని నేను ఆశించలేను. అంత పరిమితమైన ఎన్నిక హక్కు భావి భారత ప్రభుత్వాన్ని కొన్ని తరగతులు మాత్రమే పాలించే ప్రజా బాహుళ్య ప్రభుత్వంగా రూపొందించి తీరుతుంది.

ఇక, అధిక సంఖ్యాకుల మధ్య, వివిధ అల్ప సంఖ్యాక వర్గాల మధ్య, స్థానాల పంపిణీ విషయంలో, ప్రతిష్టంభన ఏర్పడిందని మనందరికీ తెలుసు. నా ఉద్దేశంలో, ఈ ప్రతిష్టంభన చాలావరకు గతంలో సంభవించిన కుట్ర కారణంగానే ఏర్పడింది. అందరికీ న్యాయం, ఎవరిపట్లా దురభిమానం లేకపోవటం అనే నియమంపైన గతంలో భారతదేశంలోని అధికారులు వ్యవహరించి ఉంటే, సమస్య ఇంతగా దుస్సాధ్యమై ఉండేది కాదని నేను కచ్చితంగా చెప్పగలను. తమ రాజకీయ ప్రయోజనాలకనుకూలంగా బ్రిటిష్ ప్రభుత్వం వివిధ వర్గాలకు వివిధ విలువలను ఇచ్చి అణగారిన వర్గాలకు న్యాయంగా చెందవలసిన రాజకీయాధికారంలో అసాధారణమైన పాలనను అనేక వర్గాలకు ఇచ్చింది. ఈ విధంగా ఎక్కువ నష్టపోయినవారు దళితవర్గాలకు చెందినవారుతప్పుగా పరిష్కృతమైనది అసలు పరిష్కృతం కానట్టే అనే నియమంపై ఈ మహాసభ ముందుకు సాగిపోతుందని, పాత విలువలను పునః పరిశీలించటం ద్వారా అణగారిన వర్గాలకు న్యాయంగా చెందవలసిన కోటా స్థానాల్ని ఇస్తుందనీ నేను ఆశిస్తూ ఉండేవాణ్ణి. కాని, ఇది జరగలేదు. ఇతర అల్ప సంఖ్యావర్గాల కోర్కెలను ఇప్పటికే అంగీకరించి, నిర్వహించటం జరిగింది. ఇక వారికి కావలసిందల్లా నూతన ప్రభుత్వ విస్తృత నిర్మాణం ద్విగుణీకృత పరిధి కనుగుణమైన రీతిలో మార్పులూ, సవరణలూ మాత్రమే! ఆ మార్పులూ, సవరణలూ ఏమైనా, ఇప్పటికే వేసిన పునాదుల్ని పెకలించే సాహసం ఎవరూ చేయలేరు. దళితవర్గాల విషయం పూర్తిగా భిన్నమైనది వారి కోర్కెల్ని ఇపుడిపుడే కేవలం వినటం వరకే జరిగింది. వాటి బాగోగుల్ని ఇంకా పరిశీలించలేదు. వాటిలో ఎన్నిటిని అంగీకరిస్తారో నాకు తెలియదు. వారి నిస్సహాయస్థితి దృష్ట్యా, దళితవర్గాల ప్రాతినిధ్య కోర్కెల్ని నీరుగార్చే అవకాశం లేకపోలేదని నా మనస్సుకు తోస్తున్నది ఎందుకంటే, రక్షణ కోసం గాక అధికారంకోసం ఇతర వర్గాలు నిరంతరం పడే తాపత్రాయాన్ని తృప్తిపరచేందుకు ఈ ప్రయత్నం జరగవచ్చు.

దీని దృష్ట్యా, నా వైఖరిని స్పష్టంగా వెల్లడి చేయవలసిన విధి నాకుంది. భవిష్యత్ రాజ్యాంగంలో దళితవర్గాల హక్కుల్ని నిర్వచించలేదు గనుక, కేంద్రంలో, రాష్ట్రాల్లో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టే విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం తరపున జరగ గల ఏ ప్రకటనైనా ఆ దిశలో జరిగే ఏ పురోగతైనా ఒక్క షరతుకు లోబడి స్పష్టంగా జరగాలి. దళితవర్గాల హక్కులకూ, ప్రయోజనాల రక్షణకూ అవసరమైన ఒప్పందానికి లోబడే జరగాలి. పరిస్థితి తీవ్రతను నేను నొక్కి చెప్పితీరాలి. ఈ విషయంలో పరిస్థితిని స్పష్టపరిచేవరకు ఏ ప్రకటనా మాకు ఆమోదయోగ్యం కాబోదు. ఒకవేళ ఈ విధంగా జరగకపోతే, నేనూ నా సహచరుడూ ఈ మహాసభ తదుపరి కార్య కలాపాల్లో పాల్గొనే బాధ్యతను స్వీకరించలేము. దాని నుంచి మేము నిష్క్రమించక తప్పదు. అయ్యా, ఈ విధంగా చేయమని మిమ్మల్ని అడగటంలో నేను మీరన్న మాటకు మీరే కట్టుపడి ఉండండి అని అనటం కన్నా మరేమీ అడగటం లేదు. బ్రిటిష్ పార్లమెంటూ, దాని తరపున మాట్లాడేవారూ దళితవర్గాలకు తాము ధర్మకర్తలమని ఎప్పుడూ అంటూ ఉంటారు. మానవ సంబంధాల్ని వీలైనంత

వరకు ఆనందమయంగా ఉంచటానికి సాంప్రదాయిక నాగరికతా సంబంధమైన అబద్ధాలు మనచేత పలికించే మాటలు అవి కావని నేను నమ్ముతున్నాను. కాబట్టి నా అభిప్రాయంలో ఆ నమ్మకాన్ని వమ్ము చేయకపోవటం ప్రభుత్వ విద్యుక్త ధర్మం. ప్రధానమంత్రిగారూ, మీకు ఒక్క విషయాన్ని నన్ను చెప్పనివ్వండి. మా శ్రేయస్సు పట్ల ఆసక్తి చూపనివారి అనుగ్రహానికి తమను వదిలివేస్తే, బ్రిటిష్ ప్రభుత్వం తమకు ఘోరమైన ద్రోహం చేసిందని దళితవర్గాలు భావిస్తాయి. ఎందుకంటే, మా నాశనం అధోగతి పైననే ఆ వర్గాల సౌభాగ్యం, ఔన్నత్యం ఆధారపడి ఉన్నాయి.

ఈ విధంగా అయినందుకు భారతదేశ జాతీయవాదులూ, దేశభక్తులూ నన్ను కులవాది అనో, మతవాది అనో పిలుస్తారు. అందుకు నేను భయపడటంలేదు. భారతదేశం ఒక విచిత్రదేశం. ఈ దేశ జాతీయవాదులూ, దేశభక్తులూ విచిత్రమైనవాళ్లు. భారతదేశంలోని దేశభక్తుడూ, జాతీయవాదీ ఎటువంటి వాడంటే, తనతోటి మానవులు నీచంగా పరిగణింపబడటాన్ని సొంత కళ్లతో చూస్తూనే ఉంటాడు. కాని, అందుకు వ్యతిరేకంగా అతని మానవత ప్రభవించదు. ఏ కారణమూ లేకుండానే స్త్రీ పురుషులకు మానవహక్కులు నిరాకరింపబడుతున్నట్లు అతనికి తెలుసు. కాని, ఉత్తేజకర చర్యకు అతని పేర స్పృహ అతన్ని పురిగొల్పదు. ప్రభుత్వోద్యోగాలలో ఒక వర్గానికి చెందిన యావత్ ప్రజలూ నియామకానికి నోచుకోలేదని అతడు గమనిస్తాడు. మనిషినీ, సమాజాన్నీ గాయపరిచే వందలాది దురాచారాల్ని అతడు గమనిస్తూనే ఉంటాడు. ఆ స్వభావంతో అవి అతనిలో చీదరను కలిగించవు. దేశభక్తుని ఒకే ఒక అరుపు అధికారం, తనకూ, తన వర్గానికీ మరింత అధికారం. అటువంటి దేశభక్తుల కోవకు చెందనందుకు నేను సంతోషిస్తున్నాను. ప్రజాస్వామ్యం పైన కచ్చితమైన వైఖరితో గుత్తస్వామ్యాన్ని, అది ఏ రూపంలో, ఏ ఆకారంలో ఉన్నా సరే, ధ్వంసం చేయాలనే వర్గానికి నేను చెందుతాను. రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవిత రంగాలన్నిటిలోనూ మన ఆదర్శమైన ఒకే మనిషి ఒకే విలువను ఆచరణలో అమలు పరచటమే మన లక్ష్యం. ఆ ధ్యేయానికి ప్రాతినిధ్య ప్రభుత్వం ఒక మార్గం కనుక దళితవర్గాలు దానికి గొప్ప విలువనిస్తారు. ఆ విలువ కారణంగానే, దాని అమలుకు అనుగుణమైన విధంగా మీరు ప్రకటన చేయవలసిన ఆవశ్యకతను గురించి నేను మీకు విజ్ఞప్తి చేశాను. దళితవర్గాలకు మీ సానుభూతి ఉన్నదని మీరు నాకు చెప్పవచ్చు. దానికి నా సమాధానం : పీడిత జనులకు కావలసినది అంతకన్న మరింత నిర్దిష్టమైనది, అంతకన్న మరింత స్పష్టంగా నిర్వచించబడినది. మితిమీరిన అనుమానపు మనిషిగా మీరు నన్ను గురించి విసుగుకోవచ్చు. నా సమాధానం : భద్రతను గురించిన మితిమీరిన విశ్వాసంతో సర్వనాశనం కావటం కన్న మితిమీరిన ఆందోళనా పూరిత భయాలతో విసుగుకు గురి కావటమే నయం.

☆ ☆ ☆

# 9
# ఫెడరల్ నిర్మాణ కమిటీ

## ఇరవైమూడో సమావేశం – 16 సెప్టెంబరు 1931

### శీర్షిక 2

(సమాఖ్య సభ్యుల ఎన్నికకు సంబంధించిన ప్రశ్నలు)

*డా| అంబేద్కర్ :* గౌరవనీయులు లార్డ్ ఛాన్సలర్‌గారూ! సమాఖ్య నిర్మాణ కమిటీ సభ్యునిగా నేను మొట్టమొదటిసారిగా మాట్లాడుతున్నాను. ఈ కమిటీ ఎదుర్కొనబోయే సమస్యలపట్ల తన వైఖరిని వివరించే ఒక సాధారణ ప్రకటన చేయటానికి మీరు దయతో ఇచ్చిన అవకాశాన్ని వినియోగించుకోవటంలో ప్రతి నూతన సభ్యుడు ఈ కమిటీకి మీరు చేసిన విశిష్ట సేవలను ప్రశంసించాడు; దానితోపాటు, కేంద్ర ప్రభుత్వంలో బాధ్యతను నెలకొల్పటానికి తాను ఇవ్వబోయే ఏ సమ్మతికైనా మున్ముందుగా తన వర్గ భద్రత లేక తాను ప్రాతినిధ్యం వహించే ప్రయోజనాలకు భద్రత అనేది ఒక షరతు అని అతడు సుస్పష్టం చేశాడు కూడా! లార్డ్ ఛాన్సలర్‌గారూ! ఈ విషయంలో నేను నాకన్న ముందు మాట్లాడిన వారిని అనుసరించకపోతే, దీనికి కారణం నాకు ఎలాంటి ఆవేదనాపూరిత భావాలు లేకపోవటం వల్ల కాదు. అలా కాకపోగా, నా భావాలు ఎంతో లోతైనవి, మరి, వాటిని నేను వ్యక్తం చేయకపోవటానికి కారణం, ఈ విషయాలన్నిటినీ అర్థం చేసుకున్నట్లుగా భావించమని మీరు ఈ ఉదయం మాకిచ్చిన ఆదేశాన్ని శిరసావహించటం మంచిదని నేను అనుకోవటమే! ఈ కొద్ది ఉపోద్ఘాత వ్యాఖ్యలతో నేను రెండో శీర్షిక క్రింద చేర్చిన వివిధ ఉపశీర్షికలపైన నా భావాల్ని నివేదించాలనుకుంటున్నాను. ఆ విధంగా చేయటంలో, మా అందరికీ సర్క్యులేట్ చేసిన మెమోరాండమ్‌లోని ఉప శీర్షికల క్రమాన్ని నేను అనుసరించదల్చుకోలేదు. అంతేగాక, ఆ మెమోరాండమ్‌లోని ప్రతి అంశంపైనా నా అభిప్రాయాల్ని వెలిబుచ్చటం కూడా నా అభిమతం కాదు. ఒక కచ్చితమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేయగల అంశాలు ఉన్నాయని నేను అనుకున్న వాటినే కచ్చితంగా నాకు దోహదం కావలసినవి అనుకున్న వాటినే ఎంచుకుంటాను.

నేను మొదట మాట్లాడదల్చుకున్న విషయం సమాఖ్య శాసనసభ స్వరూపం : ఈ

* సమాఖ్య నిర్మాణ కమిటీ, అల్ప సంఖ్యాకవర్గాల కమిటీల సమావేశ వివరాలు (ఆర్.టి.సి. రెండో సమావేశం), భారత ప్రభుత్వం, కేంద్ర ప్రచురణశాఖ, కలకత్తా, 1932. గ్రంథం I, పేజీలు 120–32.

విషయాన్ని గురించి చెప్పబోయే ముందు భావిభారత సమాఖ్య శాసనసభ ఏకసభా పద్ధతిలో ఉండాలా? ద్విసభా పద్ధతిలో ఉండాలా? అనే ప్రశ్నకు సంబంధించినంతవరకు నేనేమని అనుకుంటున్నానో స్పష్టం చేయవలసి ఉన్నది. నేను ముందుగానే ఒప్పుకుంటున్నాను. ద్విసభాపద్ధతిలో ఏనాడూ నమ్మకం కలిగినవాణ్ణి కానని. రెండో సభవల్ల ఏ మాత్రమైనా ఉపయోగం ఉంటుందని నేనేనాడూ అంగీకరించలేదు, అయితే; ఆ దృఢవిశ్వాసం నాకున్నప్పటికీ, నా వైఖరిని అంగీకరించని ఇతరులనేకమంది ఉన్నారనే విషయాన్ని కూడా నేను ఒప్పుకుంటాను. రెండో సభ అవసరం లేదని వారిని ఈ మహాసభలో ఒప్పించటం కూడా సాధ్యం కాదు అని కూడా నాకు తెలుసు. ఇక రెండో విషయం : రెండు సభల మధ్యగల సంబంధాల్ని క్రమబద్ధం చేస్తే – సరియైన రక్షణల ద్వారా రెండో సభ కోరల్ని కత్తిరించటానికి అవసరమైన మార్గాలు ఉన్నాయి! వాటిని పాటించినపుడు భారతదేశంలో ద్విసభా పద్ధతిని ప్రవేశపెట్టటానికి నేను ఎలాంటి అభ్యంతరాన్ని లేవదీయాలనుకోవటంలేదు.

ఆ విషయం చెప్పిన తర్వాత, భారత సమాఖ్య శాసనసభలో బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రాల ప్రాతినిధ్య సమస్యవైపు నా దృష్టిని మరలిస్తాను. ఆ విధంగా చేయటంలో, మనల్ని ఎదుర్కొనే ప్రథమ ప్రశ్న ఏమిటంటే ఆ ప్రాతినిధ్యం ప్రత్యక్షమైనదిగా ఉంటుందా? లేక, ఉంటుందా? అని. సమాఖ్య శాసనసభకు సంబంధించిన దిగువ సభకు సంబంధించినంతవరకు, రెండు అభిప్రాయాలంటూ ఏమీ ఉండవని నాకు తోస్తుంది. ప్రత్యక్ష ఎన్నిక ద్వారానే అది ఏర్పాటై తీరాలి. ఈ అంశంతో వ్యవహరించటంలో, ప్రత్యక్ష ఎన్నిక ద్వారా కాక, పరోక్ష ఎన్నిక ద్వారానే దిగువ సభ ఏర్పాటు కావాలని సైమన్ కమిషన్ సిఫారసు చేసిన విషయం నాకు బాగానే గుర్తుంది; తమ వాదనకు మద్దతుగా, వాస్తవంలో ప్రత్యక్ష ఎన్నికకూ, పరోక్ష ఎన్నికకూ మధ్య తేడా లేదనీ, ఒక్క అడ్డుని తొలగిస్తే పరోక్ష ఎన్నిక ప్రత్యక్ష ఎన్నిక కాగలదనీ, వారు భావించారు. ఇప్పుడు, తార్కికంగా చూస్తే, బహుశా, ఆ వాదన సరియైనదే! కాని, ప్రత్యక్ష ఎన్నికకూ, పరోక్ష ఎన్నికకూ మధ్య మనస్తత్వరీత్యా గొప్పతేడా వున్నదని నేను మనవి చేస్తున్నాను. నా అభిప్రాయంలో అత్యధిక ప్రాధాన్యత ఏమిటంటే – ఆఖరి ప్రయత్నంలోనయినా సరే తామే దేశంలో మంచి ప్రభుత్వానికి బాధ్యత వహించాల్సి వస్తుందనే భావనని భారతదేశపు ప్రజల్లో కలిగించాలి. ఇంకా నేనీ మాట జంకూగొంకూ లేకుండా చెప్పగలను. ప్రభుత్వాన్ని నిర్మించగల, కూల్చివేయగల శక్తి తనకు మాత్రమే ఉన్నదని భారత పౌరుడు భావించేలా చేయిస్తే తప్ప, భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వపునాదుల్ని నెలకొల్పటంలో మనమెన్నటికీ కృతకృత్యులం కాలేము. మరి, ఇప్పుడు నా సూచన సబబైనదైతే, ఈ దేశ ప్రభుత్వానికీ, పౌరులకూ మధ్య ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పాటు చేసే ఏదో ఒక ఎన్నిక పద్ధతి మనకు ఉండి తీరాలి. కాబట్టి నేను మనవి చేసేదేమిటంటే – ఒకర్నొకరు చూసుకోనీయకుండా వున్న పరోక్ష పద్ధతిలో ఎన్నిక అనే అడ్డుతెరని కేంద్ర ప్రభుత్వం పౌరుల మధ్య నుండి తొలగించి వేయాలి. తమ ఎన్నిక ప్రభావం దేశ ప్రభుత్వంపైన వారి సంక్షేమంపైన ఏ విధంగా వున్నదో వారిని చూడనీయాలి. సమాఖ్య సభలో దిగువ సభకు ప్రత్యక్ష ఎన్నికకు అవకాశమివ్వని ఏ పద్ధతినీ నేను ఎట్టి పరిస్థితుల్లోనూ సమ్మతించలేను.

ఇక ఎగువసభ ఏర్పాటు విషయంలో, సమాఖ్య నిర్మాణ ఉపసంఘం సూచించిన పద్ధతిని నేను ఆమోదిస్తాను – అదేమిటంటే, రాష్ట్ర శాసనమండలులు నియోజకవర్గాలుగా గల పరోక్ష ఎన్నిక పద్ధతి ద్వారా ఏర్పాటు కావాలి. ఈ పద్ధతిని నేను ఎందుకు ఆమోదిస్తున్నానంటే ప్రత్యేక లేక మత ప్రమేయం ఎన్నిక నియోజకవర్గాలు లాంటి సంకుచిత పద్ధతుల ద్వారా కాక, ఈ ఎన్నిక నైష్పత్తిక ప్రాతినిధ్య ప్రాతిపదికపైననే జరుగుతుంది. దురదృష్టవశాత్తు, భారతదేశంలోని వివిధ పరిస్థితుల కారణంగా, విభిన్నవర్గాల ప్రత్యేక నియోజకవర్గాలను మనం వదలి వేయలేము. వివిధ వర్గాల ప్రయోజనాలను సంరక్షించటాన్ని మనం నిర్లక్ష్యం చేయలేము. మతప్రసక్తి రహిత శాసనసభను, కేవలం ఒక ప్రత్యేక వర్గం నుండి మాత్రమే ఎంపిక చేయబడిన సభ్యులుగల శాసనసభను గాక విస్తృత ప్రాతిపదిక ఎన్నికైన శాసనసభను, ఏర్పాటు చేయటమే భారతదేశంలాంటి దేశానికి గొప్ప ప్రయోజనకారి అని నా ఉద్దేశం. ఏమైనా, ఈ ప్రతిపాదనపై నేను ఒకే ఒక వ్యాఖ్యను చేయదల్చుకున్నాను. నైష్పత్తిక ప్రాతినిధ్యమంటే నాకు అభ్యంతరమేమీ లేదు – నిజానికి, నేను ఇంతకుముందే చెప్పినట్లుగా ఆమోదించాను కూడా! అయితే నేను ప్రస్తావించవలసిన ఒక్క అంశం వుంది. వివిధ శాసనసభల్లో తమ ప్రయోజనాలకూ, తమ వర్గాలకూ ప్రాతినిధ్యం ఉండాలని భారతదేశంలోని అల్పసంఖ్యాకవర్గాలకు చెందినవారు కోరుకుంటున్నారనే కాక, తమకు కొంత కనీస ప్రాతినిధ్యం కూడా లభించాలని ఒత్తిడి చేస్తున్న విషయం కూడా కమిటీలోని సభ్యులందరికీ తెలుసు. ఇప్పుడు నాకున్న భయమేమిటంటే – ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం వారికి ఎగువసభలో కొంత ప్రాతినిధ్యం ఇచ్చినప్పటికీ, నైష్పత్తిక ప్రాతినిధ్య ఫలితాల్ని గురించి ఎల్లప్పుడూ నమ్మకంగా ఉండలేము కనుక, వివిధ వర్గాలు తాము కోరుకున్నంతగా ప్రాతినిధ్యాన్ని పొందటంలో విజయం సాధిస్తాయని చెప్పలేము. కాబట్టి ఆస్ట్రియన్ రాజ్యాంగంలోని 35వ అధికరణ అంశంవంటి దానినొకదానిని సమాఖ్య నిర్మాణ ఉపసంఘ సిఫారసుకు అదనంగా కలపాలని నేను సూచించగోరుతున్నాను. ఆ అంశం వివిధ వర్గాల ప్రాతినిధ్యాన్ని గురించి ప్రస్తావించదు; అది రాజకీయ పార్టీల ప్రాతినిధ్యం గురించి ప్రస్తావిస్తుంది. అయితే, వివిధ వర్గాల ప్రాతినిధ్యానికి దానిని సులభంగా వర్తింపజేయవచ్చు. ఆ అంశం ఈ విధంగా ఉన్నది:

"సమాఖ్య మండలి సభ్యుల్నీ, వారి ప్రత్యామ్నాయుల్నీ, రాష్ట్ర శాసనసభలు తమ స్వీయ పదవీ కాలానికి నైష్పత్తిక ప్రాతినిధ్య సూత్రాల ప్రకారం ఎన్నుకోవాలి. అయితే, రాష్ట్ర శాసనసభలో ద్వితీయ స్థానంలో అత్యధిక స్థానాల్ని పొందిన పార్టీకి కనీసం ఒక్క సీటునైనా కేటాయించి తీరాలి. లేదా, (అనేక పార్టీలకు సమాన సంఖ్యలో స్థానాలు లభించి వుంటే), రాష్ట్ర శాసనసభకు క్రిందటి సారి జరిగిన ఎన్నికల్లో ద్వితీయస్థానాన్ని ఆక్రమించటానికి అవసరమైన ఓట్లను సంపాదించగలిగిన పార్టీకి కేటాయించాలి. అనేక పార్టీల కోర్కెలు సమానంగా వుంటే లాటరీ పద్ధతితో సమస్యను పరిష్కరించాలి." దీనిని ఉన్నదున్నట్లుగా తీసుకొని భారత రాజ్యాంగంలో పొందుపరచాలని నేను అనటంలేదు, కాని, ఆ సూత్రాన్ని నిర్దేశించాలనీ, నైష్పత్తిక ప్రాతినిధ్యాన్ని ఏర్పాటు చేయటంతో పాటు కొంత కనీస ప్రాతినిధ్యాన్ని కల్పించి తీరే హామీని పొందుపరిచే అంశం కూడా రాజ్యాంగంలో ఉండాలనీ అంటాను.

సమాఖ్య శాసనసభలో బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలకు లభించవలసిన ప్రాతినిధ్యం గురించి సంబంధించినంతవరకు ప్రస్తుతానికి నేను చెప్పవలసిందల్లా ఇంతే! ఇప్పుడు నేను ఇతివృత్తంలో రెండో భాగానికి వస్తాను. అదేమిటంటే సమాఖ్య శాసనసభలో స్వదేశీ సంస్థానాల ప్రాతినిధ్యం విషయం. ఈ ఇతివృత్తం పరిశీలనార్థం రెండు అంశాల్ని లేవనెత్తుతుంది. మొదటిది : ప్రతి ఒక్క సంస్థానం విడివిడిగా ప్రాతినిధ్యం పొందాలా? లేక, ప్రాతినిధ్యం నిమిత్తం వాటిని సమష్టిగా రూపొందించాలా? ఇక రెండోది : పై దానిలో నుండి ఉద్భవించేది : వాటికి ఎటువంటి ప్రాతినిధ్యం ఉండాలి? ఎన్నిక ద్వారానా? లేక, నామినేషన్ ద్వారానా?

మొదటి అంశాన్ని గురించి ముందు చెప్తాను. సంస్థానాలకు వదిలి వేయదగిన అంశమిది అని సమాఖ్య నిర్మాణ ఉపసంఘం సిఫారసు చేసింది. ఉపసంఘం పట్ల పూర్తి గౌరవం తోనే నేను వారి అభిప్రాయంతో విభేదిస్తున్నానని మనవి చేస్తున్నాను. సంస్థానాలకు వదిలివేయదగిన అంశమిదని నేనెంతమాత్రం భావించటంలేదు. మనం రూపొందిస్తున్న సమాఖ్య రాజ్యాంగంలో భాగాలుగా ఏ భాగాలను గుర్తించాలో నిర్ణయించవలసింది సమాఖ్య నిర్మాణ సంఘమే నని నా అభిప్రాయం. స్వదేశీ సంస్థానాలకే యావత్ విషయాన్నీ వదిలివేస్తే ఫలితం ఏమై ఉంటుందో ఊరకనే చూడండి. అన్నిటికన్న ముందుగా, భారత సమాఖ్యలో ప్రతి సంస్థానం ప్రాతినిధ్యం పొందినట్లు నేను ఊహించి మాట్లాడుతాను. అదే జరిగితే, భారతదేశంలో ఉండబోయే సమాఖ్య ఒక బ్రహ్మాండమైన హద్దు ఆపులేని సమాఖ్య అవుతుంది. దీన్ని తులనాత్మకంగా చూద్దాం. జర్మన్ సామ్రాజ్యంలో ఒక సమాఖ్య రాజ్యభాగాలు మాత్రమే ఉండేది; ఆస్ట్రియాలో 8; కెనడాలో 4; స్విట్జర్‌లాండ్‌లో 22; ఎంతో పెద్ద సమాఖ్య రాజ్యమైన యునైటెడ్ స్టేట్స్‌లో 48. భారతదేశంలో, ప్రతి సంస్థానానికీ ప్రాతినిధ్యం ఉండాలనే నా ఊహ ప్రకారం దాదాపు 570 భాగాలవరకు గల సమాఖ్య ఉంటుంది. ఆ విధంగా కాక మరో విధమైన ఊహ ప్రకారం మనం యోచిస్తున్న సమాఖ్యలో సంస్థానాలన్నిటికీ ప్రాతినిధ్యం ఉండదనుకుంటే, అప్పుడు ఉదయించే ప్రశ్న ఇది: రాబోయే మన నూతన రాజ్యాంగంలో భారత భూభాగంలోని ప్రతి అంగుళానికీ ప్రాతినిధ్య ఉండాలని మనం పెట్టుకున్న ఆదర్శం ఏమి కావాలి? పట్టించుకోకుండా బయట వదిలివేసిన సంస్థానాలకేమి సంభవిస్తుంది? మనం పరిశీలించవలసిన ప్రశ్న ఇదే!

అయితే లార్డ్ ఛాన్సలర్ గారూ, భారత సమాఖ్యలో చేరబోయే సంస్థానాల సంఖ్యను గురించి ఆందోళన చెందుతున్న కారణంగా నేను ఈ ప్రశ్నను లేవనెత్తటం లేదు. నన్ను కలవర పరుస్తున్న విషయం ఇది: గుర్తింపు పొందిన భాగాలు ఆధునిక నాగరికతా భారాల్ని మోయగల శక్తి కలిగినవా లేదా అనే ప్రశ్నతో సంబంధం లేకుండా భవిష్యత్ భారత సమాఖ్యలో ఒక స్వతంత్ర భాగంగా ప్రతి భారత స్వదేశీ సంస్థానాన్నీ మనం గుర్తించబోతున్నామా? లేక, అత్యంత శక్తిహీనమైన భాగాలనే మనం మన సమాఖ్యలోనికి చేర్చుకోబోతున్నామా? భారత స్వదేశీ సంస్థానాలను గురించిన ఈ ప్రశ్నను మనం చర్చించేటప్పుడు, వివిధ సంస్థానాల్లో కానవచ్చే బహుళ భిన్న

పరిస్థితుల్ని గురించి మనకు ఏ మాత్రమూ అవగాహన లేదని నా గట్టి నమ్మకం, లార్డ్ ఛాన్సలర్‌గారూ! మీ అనుమతితో నేను వర్తమాన భారత స్వదేశీ సంస్థానాల పరిస్థితిని వర్ణించే ఒక చిన్న ఉదంతాన్ని చదవాలని అనుకుంటున్నాను. డి.వి. గుండప్ప వ్రాసిన "భారత రాజ్యాంగంలో సంస్థానాలు, వాటి ప్రజలు" అనే ఒక పుస్తకం నుండి నేను చదువుతున్నాను. నిజానికి ఇప్పటి స్థితి ఇది. ఆయన ఇచ్చిన ఒక టేబిల్‌తో నేను సంఘాన్ని బాధ పెట్టాలని కోరుకోవటం లేదు; ఆయన వ్యాఖ్యను చదువుతాను:

"పైన పేర్కొన్న టేబిల్స్ ద్వారా మనకు కన్పించేదేమిటంటే, 454 వరకు ఉన్న సంస్థానాల ఒక్కొక్కదాని వైశాల్యం 1,000 చదరపు మైళ్లు ఉన్నది. 452 సంస్థానాల ఒక్కొక్కదాని భూశిస్తు ఒక లక్ష రూపాయలకు తక్కువగా ఉన్నది. 10,94,300 చదరపు మైళ్ల వైశాల్యం, 222 మిలియన్‌ల జనాభా కలిగిన బ్రిటిష్ ఇండియా 273 జిల్లాలుగా విభజింపబడి ఉంది. కాబట్టి, ఒక బ్రిటిష్ ఇండియన్ జిల్లా సగటు వైశాల్యం 4,000 చదరపు మైళ్లు. దాని సగటు జనాభా సుమారు 8,00,000. బ్రిటిష్ ఇండియాలోని ప్రతి జిల్లానూ ఒక రాష్ట్రంగా (లేక, సంస్థానంగా) ఏర్పాటు చేయాలని సూచన చేస్తే ఎంత హాస్యాస్పదంగా పరిగణింపబడుతుంది? అయినప్పటికీ, 562 సంస్థానాల్లో కేవలం 30 మాత్రమే ఒక సగటు బ్రిటిష్ ఇండియన్ జిల్లాలకు ఉండే వైశాల్యం, జనాభా వనరులను కలిగి ఉంటాయి. కానీ సంస్థానాలు ఎంత ఘోరంగా చిన్నవై ఉన్నవంటే, వాటిపై రుద్దబడిన దురదృష్టకర మైందాన్ని చూసి జాలి చెందక తప్పదు. 15 సంస్థానాలలో ఒక్కొక్కదానికి కనీసం ఒక్క చదరపు మైలు వంతున కూడా లేదు. ఇక 27 సంస్థానాలలో కేవలం ఒకే ఒక చదరపు మైలు వంతున ఉన్నది. సూరత్ జిల్లాలో 14 సంస్థానాలు ఉన్నాయి. అయితే, 1925 జాబితా ప్రకారం, వీటిలో ఏ ఒక్కటైనా అంతకు ముందు జరిగిన ఆర్థిక సంవత్సరంలో రు. 3,000/-లు భూమి శిస్తును వసూలు చేసి ఎరుగదు. ఈ సంస్థానాలలో మూడు 100 మంది జనాభాగాని రు. 100 భూమిశిస్తుగల 5 గురుగాని తనకు ఉన్నట్లు సగర్వంగా చెప్పుకోలేవు." సంవత్సరానికి 20 రూపాయలు అతి స్వల్ప ఆదాయంగా ప్రస్తావించటం జరిగింది.

*గౌరవనీయ బికనీర్ మహారాజా :* మీరు చెప్పిన విషయం నేను నిన్న అన్నట్లుగా – భారత స్వదేశీ సంస్థానాల భూభాగాన్ని గురించి మాట్లాడేటప్పుడు, అవి రాజ్యాలా? లేక సార్వభౌమాధికారం కలిగిన రాజ్యాలా? అనే గందరగోళం ఆలోచన ఉంటుదని రుజువైనట్లుగా చెప్పవచ్చునా?

***డా॥ అంబేద్కర్ :*** లేదు. అలాంటిదేమీ లేదు.

***ఘనత చెందిన బికనీర్ మహారాజా :*** సర్ మీర్జా ఎవరిని గురించైతే ఎక్కువగా చెప్పగలరో, ఆ వ్యక్తి మరొక భారత స్వదేశీ సంస్థకు చెందినవాడై, అదే పొరపాటు చేశాడేమోననిపిస్తోంది.

***డా॥ అంబేద్కర్ :*** కావచ్చును. ఘనత చెందిన బికనీర్ మహారాజా వారి పట్ల ఉన్న యావత్ గౌరవంతో నేనొక ప్రశ్న అడుగుతాను : ఒక సంస్థానమంటేయేమిటో ఆయనకు ఒక ప్రత్యేక నిర్వచనం ఏదైనా అంటూ ఉంటే, భారత సమాఖ్యలో ప్రవేశించే సంస్థానాల పాలన విషయంలో ఆయన ఆ

నిర్వచనాన్ని పాటిస్తే, తన మనస్సులోది నిర్వచనానుసారం మినహాయింపుకు గురైన వాటికి ఏమి జరగనున్నదో మనం తెలుసుకోవాలి.

*గౌరవనీయ బికనీర్ మహారాజా :* ఆ విషయమంతా తర్వాత క్రమేపీ చక్కబడుతుంది.

***డా॥ అంబేద్కర్ :*** ఈ సమాఖ్య నిర్మాణ సంఘం గ్రుడ్డిగా సంస్థానాలు కోరుకున్న వాటినన్నిటిని ఇవ్వలేదు.

*గౌరవనీయ బికనీర్ మహారాజా :* సంస్థానాలూ ఇవ్వలేవు. ఒక ఖాళీ చెక్కుపై మేము సంతకాలు చేయలేము. మనం ఒకరి ఇబ్బందుల్ని మరొకరం అర్థం చేసుకోవాలి.

***అధ్యక్షుడు :*** డాక్టర్ అంబేద్కర్, బహుశా ఆ విషయంలో మీరు నాకు సహాయపడగలరు. అత్యంత ఆసక్తికరమైన ఉదంతాన్ని మీరు చదివారు. నేను దానిని ఎంతో శ్రద్ధగా విన్నాను. అయితే, ఆ భాగాన్నుండి మీరు రూపొందించుకొన్న తీర్మానాలు ఏమిటి అని నేను మిమ్మల్ని అడగాలను కుంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** నేను చెప్పేది ఇది – ఇది అత్యంత క్లిష్ట సందర్భమని. ఆ విధంగా నేను ఎందుకు అనంటున్నానంటే ప్రతి సంస్థానం ఆ సంస్థాన లక్షణాలు ఏవైనా సరే భారత సమాఖ్యలో సభ్యురాలు కావటానికి హక్కు కలిగి ఉన్నదనే వాదాన్ని ఒక్కసారి అంగీకరిస్తే, అప్పుడు మీరు ఆ సంస్థానానికి స్వతంత్రంగా మనగలగటానికి కలకాలం హక్కు ఇచ్చారన్నమాట!

***ఘనత చెందిన బికనీర్ మహారాజా :*** ఆ హక్కు దానికి ఇప్పుడూ ఉన్నది.

***డా॥ అంబేద్కర్ :*** బ్రిటిష్ ప్రభుత్వ దయతో ఆ విధంగా ఉన్నది; అయితే, నా మనవి ఏమిటంటే, ఈ పరిస్థితిని నేను ఊహించుకోలేను, అంగీకరించలేను కూడ. ఈ కారణం వల్ల. ఆధునిక నాగరికతా స్థాయికి తగిన చాలినన్ని వనరులు ఉంటే, తప్ప, ఈ ఆధునిక కాలంలో ఏ భాగమూ మనజాలదు; తన ప్రజలు అందువల్ల లాభిస్తారా లేదా అనే ప్రశ్న తో సంబంధం లేకుండా, తన సంస్థానాన్ని ఒక ప్రత్యేక రాజ్యంగా ఉండనీయటం ద్వారా తనవొక రాకుమారునిగా పిల్చుకొనటం ద్వారా ఆనందించే భారత సంస్థానాధీశ్వరుని కోర్కెను తీర్చినందువలన ఉపయోగమేమీ ఉండదు.

*గౌరవనీయ బికనీర్ మహారాజా :* వాళ్లను సంస్థానాధీశ్వరులని పిలవరు.

***డా॥ అంబేద్కర్ :*** ఏమైనా సరే, ఒక సంస్థానాన్ని భారత సమాఖ్యలోనికి చేర్చుకోవటానికి ముందు దానికి ఉండవలసిన అర్హతల్ని ఈ సంఘం నిర్దేశించవలసి ఉన్నది.

***అధ్యక్షుడు :*** ఇది చాలా ఆసక్తిదాయకమైనది. ఆ అర్హతలు ఏమై ఉండాలో అనే విషయంలో మీరు మాకు ఏమాత్రమైనా సహాయపడగలరా?

***డా॥ అంబేద్కర్ :*** వైశాల్యం, భూమిశిస్తులను ప్రాతిపదికలుగా నేను నిర్దేశిస్తాను. ఆ వైశాల్యం ఎంత

**డా। అంబేద్కర్ :** మరి ఇప్పుడు, ఈ దశలో, లార్డ్ ఛాన్సలర్‌గారూ, నేను ఒక మాట చెప్పదలుచుకున్నాను...

**సర్ మాణెక్‌జీ దాదాభాయ్ :** కాని, మీరు ఆ సమస్యకు పరిష్కారాన్నివ్వలేదు.

**డా। అంబేద్కర్ :** ఎన్నిక అని నేను చెప్తాను, నిర్ద్వంద్వంగా!

**కర్నల్ హస్కర్ :** డా। అంబేద్కర్, మీరు ఇప్పుడైనా మాకు బట్లర్ కమిటీ నివేదికకు సంబంధించిన రిఫరెన్స్‌ను ఇస్తారా?

**డా। అంబేద్కర్ :** ప్రయత్నిస్తాను.

**కర్నల్ హస్కర్ :** ఎందుకంటే, ముఖ్యమైన సంస్థానాలలో రాజకీయ విభాగం నియామకాలు చేస్తుందని గట్టిగా అన్నట్లు వారికి అంటగట్టారు.

**డా। అంబేద్కర్ :** సరే, కర్నల్ హస్కర్, మనం వివాదంలో సంచరించవద్దు. ఒకవేళ సర్వాధికారాన్ని అమలు పరచకపోతే, అనేక ఇతర ప్రభావాల వత్తిడి ఉండవచ్చును.

**కర్నల్ హస్కర్ :** మీరు చెప్పినదాన్నించి వెనక్కి తగ్గుతున్నారు.

**డా। అంబేద్కర్ :** లేదు, నేను ఆ విధంగా నిష్క్రమించటం లేదు. మీకు నేను ఆ రిఫరెన్స్‌ను ఇస్తాను.

లార్డ్ ఛాన్సలర్‌గారూ! నేను వెలిబుచ్చదలుచుకున్న అభిప్రాయం కేవలం ఇదొక్కటి ఉన్నది. దానిని ఇంతకు ముందే వ్యక్తం చేశాననటంలో సందేహమేమీ లేదు. అయితే, దానిని నొక్కి చెప్పదల్చుకున్నాను. యావత్తు భారతదేశానికీ కలిపి ఒక సమాఖ్య రాజ్యాంగాన్ని రూపొందించాలని ప్రయత్నిస్తున్నామనుకోండి. అయితే, ఇక్కడ మనం కేవలం ఒక ప్రభుత్వ స్వరూపాన్ని మార్చటం కోసమే ఇక్కడ లేము; ఏక కేంద్ర ప్రభుత్వం నుండి సమాఖ్య ప్రభుత్వానికి,

**అధ్యక్షుడు :** మాలో కొంతమంది అంటారు - ఏదైతే అత్యుత్తమంగా పరిపాలింపబడేదో అదే అత్యుత్తమమైన ప్రభుత్వమని!

**డా। అంబేద్కర్ :** అవును, అయితే, అత్యుత్తమంగా పరిపాలింపబడేది బాధ్యతాయుత ప్రభుత్వమని మనమంతా అంగీకరించామని నేను అనుకున్నాను. కాబట్టి, ఈ సమాఖ్యను అమ్మలులోనికి సర్దుబాటుకుగాని, రాజీకిగాని ఇష్టపడుతున్నప్పటికీ, కేవలం సమాఖ్య అస్థి పంజరాన్ని మాత్రమే ఇచ్చి బాధ్యతాయుత ప్రభుత్వమనే ఆత్మలేని ఏ సర్దుబాటుకూ, రాజీకీ నేను బాధ్యుణ్ణి కాలేను.

నిర్మొహమాటంగా చెప్పాలంటే, సంస్థానాధీశ్వరులు ఎన్నిక సూత్రాన్ని ఎందుకు వ్యతిరేకిస్తున్నారో నాకు నిజంగా అర్థం కావటంలేదు. తమ ప్రభుత్వాల ద్వారా జర్మన్ సామ్రాజ్యంలో సైతం సమాఖ్య భాగాలు ప్రాతినిధ్యం పొందే హక్కు ఇవ్వబడినప్పటికీ, దిగువసభ, రీచ్‌స్టాగ్, ఆయా రాష్ట్రాల ప్రజలచే ఎన్నికద్వారా నిర్మాణం కావాలనే సూత్రానికి రాష్ట్రాలు అంగీకరించాయి. వాటి

అభ్యంతరమేమిటో నేను చూడలేకపోతున్నాను. ఎందుకంటే, సమాఖ్య శాసనసభకు జరిగే ప్రజాభిమాన ఎన్నికవల్ల స్వదేశీ సంస్థానాల్లో జరిగేదల్లా వాటి భూభాగాన్ని ఎన్నో నియోజకవర్గాలుగా విభజించటమే. తమ సొంత పరిపాలనను నియంత్రించే శాసనసభలు తమ భూభాగాల్లో ఉండి తీరాలని మేమంటే వారి ప్రాతికూల్యాన్ని నేను బాగా అర్థం చేసుకోగలను. కాని, మేము అలాంటిదేమీ అనటంలేదు. మేము చెప్పేదల్లా ఇదే! మీ భూభాగాల్ని నియోజకవర్గాలుగా విభజించటానికి మీరు మమ్మల్ని అనుమతించండి. సమాఖ్య శాసనసభకు వచ్చి దానిలో ఓటు చేయటానికీ, మీ ప్రత్యేక విషయాల్ని నిర్ణయించటానికీ కాక, భారతదేశం మొత్తానికీ సంబంధించిన వ్యవహారాల్ని చర్చించటానికి తమ ప్రతినిధుల్ని మీ ప్రజలు ఎన్నుకోనివ్వండి. స్వదేశీ సంస్థానాల దృష్ట్యా ఏ అభ్యంతరం ఉంటుందో నాకు నిజంగానే అర్థం కావటంలేదు.

*సర్ మనెక్‌జీ దాదాభాయ్ :* చిన్న సంస్థానాలలో కూడానా?

***డా॥ అంబేద్కర్ :*** సమాఖ్య శాసనసభకు ఎన్నిక జరగటం వల్ల తమ సొంత పరిపాలనకు ఎలాంటి ఇబ్బందీ కలుగదనీ, తమ సొంత సంస్థానాలకు ఎలాంటి విఘాతం సంభవించదనీ నేను వెలిబుచ్చుతున్న అభిప్రాయాన్ని వారు అంగీకరిస్తే, దిగువ సభలో సంస్థానాల ప్రాతినిధ్య సమస్యకు సంబంధించినంతవరకు పరిష్కారం సులభసాధ్యమేనని మనవి చేస్తున్నాను. ఎగువ సభలో సంస్థానాల ప్రాతినిధ్య సమస్య ఇంత పరిష్కృతం కావలసే ఉన్నదనుకోండి. సంస్థానాల ప్రాతినిధ్య సమస్య నామినేషన్ కాని పద్ధతిలో పరిష్కరింపబడవలసి వుంటే, దానికి రెండు ప్రత్యామ్నాయాలను నేను సూచించ గోరుతున్నాను. నేను సూచించే మొదటి ప్రత్యామ్నాయం నార్వేలియన్ ప్రణాళికను ఆమోదించటం. దానిలో సామాన్య ప్రజలచే ఎన్నుకోబడే సభ ఒకటి ఏర్పాటవుతుంది. అంతేగాక, ఆ సభ తన సభ్యుల నుండే రెండో సభను ఎన్నుకుంటుంది. అందువల్ల ఎగువసభలో తమ ప్రతినిధుల్ని సంస్థానాలు నామినేట్ చేసే ఇబ్బంది లేకుండాపోతుంది. లేక, అదీ అంగీకారయోగ్యం కాకపోతే, మరొక పరిష్కారాన్ని సూచించవచ్చునని అనుకుంటున్నాను. అదేమిటంటే, సంస్థానాధీశ్వరులు సూచించే అభ్యర్థుల జాబితా నుండి సమాఖ్య శాసనసభకు ప్రతినిధుల్ని ఎన్నుకుంటారు.

*గౌరవనీయ బికనీర్ మహారాజా :* ఎవరివల్ల?

***డా॥ అంబేద్కర్ :*** దిగువసభవల్ల. అయితే, నావరకు నామినేషన్ ద్వారా రాష్ట్రాలకు ప్రాతినిధ్యం అనుమతించే ఏ పద్ధతికీ నా సమ్మతి ఉండదని నేను నిర్మొహమాటంగా చెప్పి తీరాలి.ఇప్పుడు లార్డ్ ఛాన్సలర్‌గానూ, నేను చర్చలోని మరొక అంశాన్ని – అంటే, ప్రత్యేక ప్రయోజనాల ప్రాతినిధ్యాన్ని – చర్చకోసం స్వీకరిస్తాను.

***అధ్యక్షుడు :*** ప్రత్యేక ప్రయోజనాల ప్రత్యేక నియోజకవర్గాల ప్రాతినిధ్యం కోసం ఉద్దేశింపబడిన అంశం నెంబరు ను మీరు తీసుకోవలసి ఉంటుందని.

***డా॥ అంబేద్కర్ :*** నేను స్పష్టం చేయదల్చుకున్న మొదటి విషయం ఇది : దళితులను ఒక ప్రత్యేక

ప్రయోజనం కల వర్గంగా పరిగణించటం నాకిష్టంలేదు. మహమ్మదీయులనూ, క్రైస్తవులనూ పరిగణించినట్టుగానే, దళితవర్గాలను కూడా రాజకీయ ప్రయోజనాల నిమిత్తం ప్రత్యేక వర్గంగా భావించాలని నేను కోరుతున్నాను. రాష్ట్ర శాసనసమండలులలోనే గాక, కేంద్ర శాసనసభలోని రెండు సభలలోనూ వారికి ఒకే విధమైన ప్రాతినిధ్యం ఉండాలి.

**అధ్యక్షుడు :** ఒకే విధమైన హక్కులని మీరు అంటున్నారంటే, ఇతరులకున్న సంఖ్యే వారికి కూడా ఉండాలనేనా మీ ఉద్దేశం!

***డా॥ అంబేద్కర్ :*** లేదు, అందరికీ సమష్టిగా వర్తించే సూత్ర ప్రాతిపదికపైన వారికి లభించే సంఖ్యలు.

**అధ్యక్షుడు :** అదే మీరన్నారు. ధన్యవాదాలు.

***డా॥ అంబేద్కర్ :*** ఇప్పుడు నేను ఇంతవరకు గుర్తింపబడిన ఇతర ప్రయోజనాలకు వస్తాను. అనగా, వ్యాపారం, వాణిజ్యం, భూస్వాములు, విశ్వవిద్యాలయాలు.

***డా॥ షఫాత్ అహ్మదాఖాన్ :*** విశ్వవిద్యాలయాల ప్రసక్తి ఎందుకు?

***డా॥ అంబేద్కర్ :*** లేదు, మాకు విశ్వవిద్యాలయాలు రాలేదు. ఈ ప్రత్యేక ప్రయోజనాల ప్రాతినిధ్యానికి నా సమ్మతిని ఇవ్వలేననిపిస్తోంది. అన్నిటికన్న ముందుగా, నాకు అర్థంకాని విషయం ఒకటుంది. ఉదాహరణకు, ఒక భూస్వామికి ప్రత్యేక ప్రాతినిధ్యం ఎందుకు అవసరమౌతుంది? తాను ఒక సాధారణ నియోజకవర్గంలో నిలబడి ప్రజలచే ఎన్నికను అర్థిస్తే అతనికి కలిగే ఇబ్బందులూ, కష్టాలూ ఏమిటో నాకు తెలియటంలేదు. అలా చేయదల్చుకుంటే అతన్ని ఆపేదేమీ ఉండదు. ఇతర దేశాలన్నిటిలో, – ఉదాహరణకు, ఇంగ్లాండ్‌లో, యూరోపా దేశాలన్నింటిలో – వ్యాపారం వాణిజ్యం, భూస్వాములువంటి వర్గాల వారిచే ప్రత్యేక ప్రయోజనాలకు ఎలాంటి అవకాశం లేదని నాకు గట్టిగా తెలుసు; సాధారణ నియోజకవర్గాల ద్వారానే వారు తమ స్థానాల్ని పొందటానికి అనుమతిస్తారు. భారతదేశంలో అదే పద్ధతిని ప్రవేశపెట్టాలని నేను అనుకుంటాను. ఈ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం కోసం ఎలాంటి ప్రత్యేక సదుపాయాన్ని కలిగించటానికైనా నేను చెప్పే మరొక అభ్యంతరం ఇది : అన్నిటికన్న ముఖ్యమైనది, ఈ ప్రయోజనాలు అత్యంత సంకుచిత నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. అది దాదాపు ఒక చిన్న ముఠాకు మాత్రమే ప్రాతినిధ్యమౌతుంది. వారి ఓటింగ్ శక్తి వారికి మాత్రమే సంబంధించిన విషయాలకు పరిమితమైతే అందువలన కలిగే కీడు తులనాత్మకంగా కొంచెం మాత్రమే అవుతుంది. అయితే, ఈ పరిమిత నియోజకవర్గాలు ప్రాతినిధ్య ప్రాతిపదికపైన శాసనసమండలికి రావటమే కాదు; శాసనమండలి ముందు వచ్చే నానా విషయాలపైనా వారు ఓటు చేస్తారు. బొంబాయి శాసనమండలిలో నేను గమనించిన ఒక విషయం ఇది : అక్కడ వ్యాపార వాణిజ్యాలకు నియోజకవర్గాలు ఉన్నాయి. ఇప్పుడు వ్యాపార వాణిజ్యాలు బొంబాయి రాష్ట్రంలో ఒక ప్రత్యేకవర్గ గుత్తస్వామ్యంగా ఉంటూ ఉన్నాయి. ఆ వర్గం నాకు తెలిసినంతవరకు అతి ఛాందసవర్గమని చెప్పటానికి విచారిస్తున్నాను.

మిస్టర్ జయకర్ : రాజకీయంగానా?

*డా॥ అంబేద్కర్ :* సామాజికంగా. ఇప్పుడు, శాసనసమండలిలో ప్రవేశించటానికి అలాంటి సభ్యులు ఈ సులభమైన నియోజకవర్గాల్ని సంపాదించుకుంటారు. అలాంటప్పుడు, ఏదైనా ఒక అభ్యుదయ ప్రతిపాదన ముందుకు వస్తే, వారు ఛాందసుల ప్రక్కన చేరి తద్వారా స్వేచ్ఛా ప్రగతి లక్ష్యాలను ఓడిస్తారు. కాబట్టి, నేను దానికి అభ్యంతరం చెప్తున్నాను. ఒకవేళ అలాంటి సదుపాయం అవసరమైతే, నేను ఈ రాయితీ ఇస్తున్నాను. ఉదాహరణకు, వ్యాపారం, వాణిజ్యం, భూస్వాములు లాంటి ఏ ప్రయోజనానికైనా శాసనసభలోగాని, ఎగువసభలోగాని, తమ వాదనను వినిపించుకునే హక్కు ఉండవచ్చు, తమ ప్రత్యేక ప్రయోజనాలను దెబ్బతీసే ఏ బిల్లునైనా చర్చిస్తున్నప్పుడు తమ వాదాన్ని వినాలని కోరే హక్కును మంజూరు చేయవచ్చు. కాని, శాసనసభ్యత్వాన్నిగాని, లేదా శాసనసభ ముందు వచ్చే ఏ బిల్లు పైనైనా ఓటుచేసే హక్కునుగాని, మంజూరు చేయవలసిన అగత్యం లేదు. కార్మికుల విషయంలో నేను చెప్పేది ఇది. నా మిత్రుడు మిస్టర్ జోషి నాతో ఏకీభవిస్తాడో లేదో తెలియదు. కాని, నా సొంత అభిప్రాయం ఏమిటంటే, వయోజన వోటింగ్ హక్కు ఆచరణలోనికి వస్తే – మహాత్మాగాంధీ మద్దతుతో, సహాయంతో, ఈ మహాసభలోనే దానిని ఆమోదిస్తామని నేను ఆశిస్తున్నాను. అలాంటప్పుడు కార్మికులకు ప్రత్యేక ప్రాతినిధ్యపు అవసరమేమీ ఉండకపోవచ్చు; అయితే, రాజ్యాంగం నుండి శ్రామికవర్గంలాంటి ఒక పెద్దవర్గాన్ని తొలగించే ప్రాతినిధ్య పద్ధతిని మనం ఆమోదిస్తే తద్వారా వారు ప్రభుత్వాన్ని నియంత్రించలేక, వారి శ్రేయస్సునూ, సౌభాగ్యాన్నీ సాధించేందుకు ప్రభావితం చేయలేకపోతారు. అలాంటప్పుడు కార్మికులకు ప్రాతినిధ్యం కలిపించే ప్రత్యేక సదుపాయం తప్పకుండా ఉండాలి. అలాంటి ప్రాతినిధ్య ప్రయోజన నిమిత్తం వివిధ సంఘాలను ఎలెక్టోరల్ కాలేజీలుగా గుర్తించవచ్చు.

నేను ప్రతిపాదించే తరువాతి అంశం నామినేటెడ్ సభ్యుల నియామక విషయం. నేను ఊహించేదేమిటంటే – నేను నమ్మకంగా అనటంలేదు – సమాఖ్య శాసనసభలో నామినేటెడ్ సభ్యుల బ్లాక్‌ను కలిగి ఉండటంలో లక్ష్యం ప్రధానంగా రాజరికం క్రిందనున్న ప్రజలకు, లేదా, ద్వంద్వ వ్యవస్థ క్రింద రాష్ట్రాలలో రిజర్వ్‌డ్ అంశాలుగా పిలవబడిన వాటికి మద్దతు ఇవ్వటం, అన్నిటికన్న మొదటిగా నేను నిర్మొహమాటంగా చెప్పదల్చుకున్నదేమిటంటే, ఈ నామినేటెడ్ బ్లాక్ అధికారుల మీద పెద్ద అనుమానం. నా అభిప్రాయంలో మాంటేగ్ – ఛెమ్స్ ఫోర్డ్‌సంస్కరణలు ప్రవేశపెట్టాలనుకున్న బాధ్యతాయుత పద్ధతిని పూర్తిగా నాశనం చేసిన వ్యవస్థ అంటూ ఏదైనా ఒకటుంటే అది ఈ నామినేటెడ్ అధికారవర్గ చట్రమే. యావత్ పద్ధతిని భ్రష్టు పట్టించింది ఇదే! అధిక సంఖ్యాకులకు వ్యతిరేకంగా అల్ప సంఖ్యాకుల ప్రభుత్వాన్ని సాధ్యపరిచింది ఈ వర్గమే! అన్నిరకాల చిల్లర ప్రజలతో మల్లర వర్గాలతో పొత్తులు పెట్టుకున్నది ఈ వర్గమే. తన సహాయ ఆవశ్యకత లేక మద్దతు అవసరం ఆ వర్గాలకు నిజంగా ఉన్నదని కాదు! అయితే, స్వల్ప ప్రయోజనాల కోసం తమను తాము అమ్ముకునే వర్గాలు అవి! నేను ఇంతకుముందే చెప్పినట్లు, నామినేటెడ్ అధికారవర్గం పట్ల నాకు అతి తీవ్ర అభ్యంతరం ఉన్నది.

తర్వాత నేను మనవి చేసేదేమిటంటే, రాజరికం క్రిందనున్న ప్రజలుగా పిలువబడే వారికి మద్దతు ఇచ్చే ప్రయోజనం కోసం ఈ నామినేటెడ్ అధికారవర్గం నిజంగా ఎంతమాత్రం అవసరమే లేదు. రాష్ట్ర రాజ్యాంగంలో రిజర్వ్‌డ్ అంశాల పద్ధతి ఉన్న చోట, ఈ రిజర్వ్‌డ్ విషయాల్ని బలపరిచి సంరక్షించటానికి అనేక పద్ధతులు ఉన్నాయి. అన్నిటికన్న మొదటిది : 72-డి సెక్షన్ క్రింద ఈ రిజర్వ్‌డ్ అంశాలకు ఇన్‌ఛార్జిగా ఒక వ్యక్తి ఉన్నాడు. అతణ్ణి ఎప్పుడైనా తీసి వేయటానికి వీలుంది. అతని జీతం వోటుపైన ఆధారపడింది కాదు. రెండో విషయం : రిజర్వ్‌డ్ అంశాల్ని సంరక్షించే ప్రయోజనం కోసం అనవసరమనుకొన్న వ్యయాన్ని సర్టిఫై చేసే అధికారాన్ని గవర్నర్‌కు ఇచ్చారు. మూడో విషయం : రిజర్వ్‌డ్ అంశాల సామర్థ్యాన్ని నిలబెట్టే ప్రయోజనం కోసం, అవసరమనుకున్న బిల్లులను సర్టిఫై చేసే అధికారం గవర్నర్‌కు ఉంది; ఇక ఆఖరి విషయం : తనకు అభ్యంతరమున్న ఏ బిల్లునైనా వీటో చేసే అధికారం గవర్నర్‌కు ఉంది. లార్డ్ ఛాన్సలర్‌గారూ, నా విన్నపం ఏమిటంటే, ఇప్పుడే నేను ప్రస్తావించిన పరిరక్షణలు - అనగా రిజర్వ్‌డ్ అంశాల ఇన్‌ఛార్జిగా ఉన్న వ్యక్తిని తొలగించటానికి వీలు లేకుండా చేయటం, అతని జీతాన్ని వోటుపైన ఆధారపడకుండా చేయటం. గవర్నర్‌కు వ్యయాన్ని సర్టిఫై చేసే అధికారం ఉండటం, రిజర్వ్‌డ్ అంశాల భద్రత కోసం బిల్లులను సర్టిఫై చేసే అధికారం ఒక బిల్లును వీటో చేసే అంతిమాధికారం గవర్నర్‌కు ఉండటం - ఇవన్నీ చాలు, నా ఉద్దేశంలో రాజరికం క్రిందనున్న ప్రజలుగా పిలువబడేవారి సమగ్రతను నిలబెట్టటానికి.

***సర్ తేజ్ బహదూర్ సప్రూ :*** ఈ దశలో మిమ్మల్ని ఒక్క ప్రశ్న అడగవచ్చునా? సర్టిఫికేషన్ అధికారం ఉండాలని మీరు సూచిస్తున్నారా?

***డా॥ అంబేద్కర్ :*** సర్టిఫికేషన్ అధికారం ఉండాలని నేను సూచించటంలేదు; తరువాతి మరొక దశలో నేను ఆ విషయం గురించి చెప్తాను. నేను చెప్పేదేమిటంటే, నామినేటెడ్ అధికార బ్లాక్‌తో పాటుగా రాజ్యాంగంలో పొందుపరచబడిన ఇతర ప్రత్యామ్నాయ పద్ధతులు ఇవి. అది నా వాదన. నా మనవి ఏమిటంటే, మీకు ప్రభుత్వంలో అంతటి విస్తారమైన శాసన నిర్మాణ కార్యనిర్వాహకాధికారాలు రాచరికం క్రిందనున్న అంశాలుగా పిలవబడుతున్న వాటి సంరక్షణ కోసం ఉన్నప్పుడు శాసనమండలిలో ఒక అధికార బ్లాక్ అనేది ఉండవలసిన అవసరం ఎంతమాత్రం లేనేలేదు.

రెండో విషయంలో నేను చెప్పేది ఇది : నామినేటెడ్ అధికార బ్లాక్‌ను ఏర్పాటు చేయటం ద్వారా మీరు జరుగుతున్న దాని నిజ స్వభావాన్ని గోప్యంగా దాచిపెడ్తున్నారు. నామినేటెడ్ అధికార బ్లాక్ లేకుండా వుంటే, గవర్నర్ తప్పనిసరిగా సర్టిఫై చేయటమో లేక తన ప్రత్యేక అధికారాల ద్వారా మరొక విధంగా నెగ్గుకు రావటమో జరిగితే, శాసనమండలి అనేక అంశాల్ని ఆమోదించేదికాదు. అయితే నామినేటెడ్ అధికార బ్లాక్ ఉన్న కారణాన శాసనమండలి అధిక సంఖ్యాక పాలనా ప్రాతిపదికపై పని చేస్తున్నదని లోకానికి చూపించే ప్రయత్నం చేస్తున్నా వాస్తవంలో అధికార బ్లాక్ సహాయంతో అల్ప సంఖ్యాక వర్గమే నిర్ణయాలు తీసుకుంటున్న విడ్డూర పరిస్థితిలో ఉండవలసి వచ్చింది. కాబట్టి, నేను మనవి చేసేదేమిటంటే, ఈ నామినేటెడ్ అధికార బ్లాక్ వలన భావి భారత రాజ్యాంగానికి

ప్రయోజనమేమీ లేదు.

నేను ప్రస్తావించదల్చుకున్న ఆఖరి విషయం ఒకటుంది. అదేమిటంటే, ప్రమాణ స్వీకార ప్రశ్న. నా అభిప్రాయంలో ఈ ప్రశ్న చాలా పెద్దది. అది మరో ప్రశ్నకు దారితీస్తుంది. అదేమిటంటే, భారతదేశ సమష్టి పౌరసత్వ ప్రశ్న అన్నమాట. ఉన్న కొద్ది వ్యవధిలో యావత్ విషయాన్నీ చర్చింటం సాధ్యమని అనుకోలేను. కాబట్టి, నేను కోరేదేమిటంటే, ఈ ప్రశ్నను కూలంకషంగా చర్చించేందుకు మరొక సందర్భాన్ని కల్పించాలి. ఎందుకంటే, సమష్టి పౌరసత్వం ఉంటే తప్ప, నిజమైన సమాఖ్య ఉండలేదని నేను అభిప్రాయపడుతున్నాను. సమష్టి పౌరసత్వానికి అవకాశం కల్పించని రాజ్యాంగాన్ని ఒక సమాఖ్య రాజ్యాంగమని పిలవటమే పొరపాటు. నేను చెప్పినట్లుగా, చాలినంత వ్యవధి లేనందువలన, వివరించటానికి వీలులేని పాయింట్ ఇది.

అనువాదం :
డా॥ ఎన్.హెచ్. సీతారామ శర్మ



# 25వ సమావేశం – 18 సెప్టెంబర్ 1931

## శీర్షిక – 2

### (ఫెడరల్ శాసనసభకు సభ్యుల ఎన్నికకు సంబంధించిన ప్రశ్నలు)

**డాక్టర్ అంబేద్కర్ :** గాంధీగారిని ఈ ప్రశ్న అడగాలనుకుంటున్నాను. ఫెడరల్ విధానసభను గురించి, ఫెడరల్ కార్య నిర్వాహక వర్గం స్వరూపం గురించి కాంగ్రెస్ ఇంతవరకు ఆలోచించనేలేదు. ఇది బ్రిటిష్ రాజ్యంలో భాగంగా ఉండాలా, స్వతంత్రంగా ఉండాలా అనే సమస్యను మాత్రమే ఇంతవరకు కాంగ్రెస్ పరిశీలించింది. కాబట్టి నిన్న గాంధీగారు చెప్పింది ఆయన వ్యక్తిగత అభిప్రాయం కావచ్చు. అయితే ఆయన తన వ్యక్తిగత అభిప్రాయాన్ని చెప్తున్నారా? లేదా కాంగ్రెసు ప్రతినిధిగా చెప్తున్నారా? అన్నది నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. తర్వాత నేను ఆయన్ని మరో ప్రశ్న అడగాలను కుంటున్నాను. మనకు తెలిసినంతవరకూ కాంగ్రెస్ చర్చించిన అంశాలు ప్రజలందరికీ తెలిసినవే. నాకు తెలిసిన మేరకు ఆ చర్చలలో ఈ సమస్య పరిశీలించబడలేదు. ఒకవేళ కాంగ్రెస్ దాన్ని రహస్యంగా చర్చించి ఉండవచ్చు. అందువల్ల ఈ ప్రశ్న అడుగుతున్నాను. నిన్న ఆయన బలపరచిన పరోక్ష ఎన్నిక విషయం అనిబిసెంటు సిద్ధం చేసిన హోంరూల్ బిల్లులో లేదు. ఫెడరల్ విధానసభను ఆ విధంగా ఏర్పాటు చేసే పద్ధతిని కాంగ్రెస్ ఖచ్చితంగా నిరాకరించిందా లేదా అని ప్రశ్నిస్తున్నాను.

★ ★ ★

II

+**లార్డ్ ఛాన్సలర్ :** డా॥ అంబేద్కర్ మరో దృక్పథాన్ని బలీయంగా చెప్పారు. ఈవైపు ఉండేవారిలో కొంతమందికి పై దృక్కోణంలో కొంత పస ఉన్నట్లు కనిపిస్తున్నదని అనుకుంటున్నాను. రాష్ట్ర జాబితాలకు సంబంధించి ఎన్నికల సూత్రం హామీ ఇవ్వకపోతే అధికారుల విభాగం ఎక్కువ భేదం ఉండని ఒక విభాగాన్ని ఏర్పాటు చేయవచ్చునని, రాజకీయ విభాగం ఆ విభాగాన్ని ఏర్పాటు చేయడంలో ఎక్కువ పాలు పంచుకోవాలని సూచించబడింది. రాజకీయ విభాగంలో ఉండే ప్రభుత్వ ఉద్యోగులు ఇండియాలోగానీ, ఇతర చోట్లగానీ ఉండే ఏ ఇతర ఉద్యోగులకీ తీసిపోని న్యాయబుద్ధి కలిగిన వారనడంలో నాకే మాత్రం సందేహం లేదు.

**డా॥ అంబేద్కర్ :** అలా అయేట్లయితే బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని మీరు అసలెందుకు కోరుతున్నారు?

★ ★ ★

• ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీ కమిటీవారి చర్చలు, సంపుటి I, పుట. 175.

\+ పైదే పుట 184-85.

IV

***డా॥ అంబేద్కర్ :** మీరు సర్ శామ్యూల్ హోర్‌గారికి కూడా ఇలాంటి అవకాశమే ఎందుకు ఇవ్వగూడదు! బ్రిటిష్ ఇండియాలో ప్రజాస్వామ్య సంస్థల్ని ప్రవేశపెట్టడానికి కావలసినంత సమయాన్ని తీసుకోనివ్వండి. ఆయన మీకు కృతజ్ఞుడుగా ఉంటాడని నేను నమ్మకంగా చెప్పగలను.

**ఛైర్మన్:** సర్‌శామ్యూల్ హోర్ కృతజ్ఞతల్ని గురించి మనం చర్చించాల్సిన ఆవశ్యకత లేదనుకుంటాను. ఆ అంశం కమిటీ ముందు లేదు.

**పండిట్ యం.యం. మాలవీయ :** నా స్నేహితుడు డా॥ అంబేద్కర్ నేను చెప్పిన విషయాన్ని మరిచిపోయారు. రాష్ట్రాల్లో ప్రాతినిధ్య సూత్రాన్ని వెంటనే ప్రవేశపెట్టాలని నేను రెండుసార్లు నొక్కి చెప్పాను. ఆ కోరికలో నేను అంబేద్కర్‌కు కూడా లొంగను. అయితే నా కోరికకు డా॥ అంబేద్కర్ కోరికకు నేను ఒక భేదాన్ని గుర్తించాను. ప్రాతినిధ్య సూత్రాన్ని ఎప్పుడు, ఎలా తమ సంస్థానాల్లో ప్రవేశపెట్టాలో పరిశీలించడానికి తగిన సమయం తీసుకోడానికి ఇప్పుడు సంస్థానాల్ని పాలించే రాజులకు అవకాశం ఇవ్వాలి. ప్రాతినిధ్య సంస్థల సిద్ధాంతం సంస్థానాల్లో తొందరగా ప్రవేశపెట్టాలనే విషయంలో మనలో నాకంటే ఎవరూ ఎక్కువ ఆతృతతో ఉండరని మళ్లీ చెప్తున్నాను. ఇది మీరు గుర్తుంచుకోవాలి...

**డా॥ అంబేద్కర్:** గౌరవనీయ ఛాన్సలర్, నేను ఒక విషయం చెపుతున్నాను. ఈ పక్షంలో ఉండే మేము సంస్థానాల్లో ప్రాతినిధ్య సంస్థల్ని ప్రవేశపెట్టాలని కోరడం లేదు. ఫెడరల్ అసెంబ్లీకి ప్రతినిధుల్ని ఎన్నుకోవడానికి బ్రిటిష్ ఇండియాలో లాగానే భారతదేశ సంస్థానాల్లో కూడా నియోజకవర్గాలుండాలి అని మాత్రమే చెప్తున్నాం. స్వదేశ సంస్థానాల్లో ఆ సంస్థానాల్ని నియంత్రించడానికి ప్రజాదరణగల శాసనసభలు ఉండాలని, భారత సమాఖ్యలో సంస్థానాధీశులు చేరడానికి ఇది పూర్వస్థితి నిబంధనగా ఉండాలని నేను ఎప్పుడూ చెప్పలేదు.

**పండిట్ యం.యం. మాలవీయ :** ఒకవేళ తాను ప్రాతినిధ్య సంస్థల్ని అడగ లేదనుకుంటే డా॥ అంబేద్కర్‌ను అలాగే అనుకోనీయండి. సంస్థానాల నుండి ఫెడరల్ అసెంబ్లీకి వచ్చే ప్రతినిధులు ఏదో రకమైన ప్రజాదరణ గల పద్ధతిలో రాకపోయినా సరే వారు ఉపయోగపడరు అనుకోకూడదు. స్వదేశ సంస్థానాల నుండి వచ్చే ప్రతినిధులు ప్రజాస్వామ్య ఎన్నికల ద్వారా రాకపోయినా సరే వారుండాలని; గానివల్ల మన కార్యనిర్వహణలో బాగా ఉపయోగించే ఉత్తమ ప్రతినిధులు రాగలరని నేను మరీ మరీ చెప్తున్నాను.

**ఛైర్మన్:** మీ మాటల్ని సంగ్రహంగా చెప్పాలంటే– "పనికిమాలిన ప్రజలు" పనికిమాలిన ప్రతినిధుల్నే ఎల్లప్పుడూ ఎన్నుకోరు అని.

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 192–95.

**పండిట్ యం.యం. మాలవీయ :** నేనూ అలానే అనుకుంటున్నాను. నేను కూడా మీరు చెప్పే చతురోక్తుల్లో చెప్పగలిగితే ఎంత బావుండును!

(పండిట్ మాలవీయ సంస్థానాధిపతుల దయకు - ప్రాతినిధ్య సూత్రం ప్రవేశపెట్టే విషయం వదిలేయాలని కూడా చెప్పారు. ఒకవేళ వారు తమకు తామై అలా చేస్తే ఆయన చాలా సంతోషపడతారట) 'అయితే' ఆయన తన మాటల్ని ఇలా పూర్తి చేశారు.

"అప్పుడు , నా బ్రిటిష్ ఇండియా స్నేహితులకు నేను సిఫారసు చేసేదేమంటే మనం కొంత సహనం, సౌహార్థం కలిగి ఉండాలి. అలాంటి సంస్థలు సరైన సమయంలో ఏర్పడతాయని ఆశిద్దాం. మన ఆశలు చాలా ఎక్కువ ఆధారపడి ఉండే ఆలిండియా ఫెడరేషన్ ఏర్పాటు మార్గంలో అనవసర అడ్డంకులు పెట్టువద్దు"

**డా॥ అంబేద్కర్ :** దళితజాతులకు కూడా నిదానంగా విముక్తి లభిస్తుందని ఇదే సలహా చెప్పబడింది.

**పండిట్ యం.యం. మాలవీయ :** నా స్నేహితుడు డా॥ అంబేద్కర్ పూర్తిగా నన్ను అపార్థం చేసుకున్నారు. ఆయన నేను ఆశించినంత బాగా అర్థం చేసుకోలేకపోయారనడానికి నేను చింతిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** నేను వివరంగా తెలుసుకునేటట్లు చెప్పండి.

**పండిట్ యం.యం. మాలవీయ :** దళిత వర్గాలు వేచి ఉండాలని నేను చెప్పడంలేదు. మాంటేగు-ఛెమ్స్ ఫర్డు సంస్కరణల్ని ప్రచురించే గౌరవం నాకు దక్కింది. ఆ ప్రతిపాదిత సంస్కరణలు 1918లో మొట్టమొదటగా ప్రకటించబడేటప్పుడు నేను విమర్శిస్తూ ఇలా మనవి చేశాను. దళిత జాతులకు సంబంధించినంత వరకు అది విద్యా సమస్య మాత్రమేనని - సార్వత్రిక ప్రాథమిక విద్య కోసం నేను అభ్యర్థించాను. ఇప్పుడు కూడా అభ్యర్థిస్తున్నాను. కాంగ్రెస్ కూడా అభ్యర్థించింది. దేశంలో ఉండే సర్వ ఆర్థిక వనరుల్ని తన స్వాధీనంలో ఉంచుకొన్న భారత ప్రభుత్వం ప్రాథమిక విద్యకోసం తగినంత డబ్బు ఖర్చు చేసి ఉంటే 'దళిత జాతులు' అనే మాట ఇప్పుడు కాదు చాలా కాలం కిందటే చరిత్రలో ఒక అంశంగా మారిపోయి ఉండేదని నా నమ్మకం. వారికి ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యల్ని నేర్పే అవకాశాలు ఇవ్వాలని మనం అందరం కోరుకుంటున్నాం. బెనారస్ హిందూ విశ్వ విద్యాలయానికి వైస్-ఛాన్సలర్‌గా ఉండే భాగ్యం నాకు కలిగింది. ఆ విశ్వ విద్యాలయంలో ఒక దళితజాతి విద్యార్థి ఇతర జాతుల విద్యార్థులకు వలే 'సీటు' సంపాదించు కొన్నాడు. ఏమీ భేదం లేదు. అలా విద్య నేర్చినవారు తమ ప్రతిభను చక్కగా ప్రదర్శిస్తున్నారు - చెప్పాలనుకుంటే నా గౌరవనీయ మిత్రుడు డా॥ అంబేద్కర్ లాగానే -

**డా॥ అంబేద్కర్ :** విద్యాధికుడైనా ఇప్పటికీ నేను సంఘంలో "అంటరానివాణ్ణే". దాన్నుండి విద్య నన్ను పైకి లాగలేదు.

**పండిట్ యం.యం. మాలవీయ :** నన్ను క్షమించండి. మీరు 'అస్పృశ్యులు' కాదు. మీరు మా ప్రియమైన స్నేహితులు, సహచరులు, సోదరులు. సనాతన వాదులైన చాలామంది స్నేహితులకు మిమ్మల్ని కలవడం, మీతో పని చేయడం సంతోషదాయకంగా ఉంది. వారు మీతోపాటు కలిసి పనిచేస్తున్న విషయం మీకు తెలిసిందే. ఏ ఇతర జాతి ప్రతినిధులకన్నా బ్రాహ్మణులే ఎక్కువ మంది దళితజాతుల సమస్య కోసం పనిచేస్తున్నారు. ఈ సత్యాన్ని నా మిత్రుడు అంగీకరిస్తారనుకుంటాను.

**పండిట్ యం.యం. మాలవీయ :** .... తప్పకుండా అంగీకరిస్తారు. ఇప్పుడు నేను చెప్పాలనుకున్న రెండో అంశం – ప్రత్యక్ష పరోక్ష ఎన్నికల సమస్య. నిన్న మహాత్మాగాంధీ చెప్పిన మాటలు కొంత అపార్థానికి గురయ్యాయని నేను భయపడుతున్నాను... లార్డ్ పీల్ సలహాను అంగీకరిస్తూ ఆయన మాట్లాడినప్పుడు అతని అభిప్రాయం – నేను అర్థం చేసుకొన్నట్లు – దేశంలో ఉండే వయోజనులందరికీ ఓటు హక్కు ఇవ్వడానికి ఆచరణలో కష్టాలు ఎదురవుతాయని భావించినట్లుంది.... సార్వత్రిక ఎన్నిక సిద్ధాంతం ప్రతిపాదించడానికే గాంధీ ఆ ప్రణాళికను సూచించారు. ఆయన పరోక్ష ఎన్నికల పద్ధతి ప్రతిపాదన అంగీకరించలేదు. ఎందుకంటే ప్రజలు తమల్ని ఓటుహక్కు నుండి దూరం చేస్తున్నారనుకుంటారు కాబట్టి.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** మహాత్మా గాంధీ చేసిన వయోజన ఓటింగు సిద్ధాంతం వివరణను చాలా జాగ్రత్తగా, ఉత్సుకతతో నేను విన్నాను. కానీ, నెహ్రూ ప్రణాళికలో సిఫారసు చేసినదానికంటే చాలా తక్కువస్థాయిలో ఉన్నట్లు నాకు అనిపిస్తున్నది. నా అభిప్రాయం తప్పయితే దయచేసి సరిదిద్దండి.

**సర్ శామ్యూల్ హోర్ :** పండిట్ మాలవీయ! ఇప్పటికీ అది ప్రత్యక్ష ఎన్నికే. మీరు ఇప్పుడు వయోజన ఓటింగు కోసం వాదిస్తున్నారు. నేను అర్థం చేసుకున్న మేరకు నిన్న కమిటీ చర్చిస్తున్న అంశం అదికాదు. ఆ అంశం ప్రత్యక్షపరోక్ష ఎన్నికలకు ప్రత్యామ్నాయాన్ని గుర్తించింది. నా కర్థమైన మేరకు మహాత్మా గాంధీ మాటల్లో ఆయన వయోజన ఓటింగును సమర్థించారు. అలాగే పరోక్ష ఎన్నికను కూడా సమర్థించారు.

★ ★ ★

*కలొనల్ హక్సర్ :* .... నేనింకా ముందుకు వెళ్ళాల్సిన పని లేదనుకుంటాను. మన గౌరవనీయ మిత్రులు పండిట్ మాలవీయ చెప్పిన మాటల్నే ప్రతిధ్వనిస్తాను. ఆ ఉపన్యాస భాగంలో ఆయన చెప్పిన విషయాన్ని సంక్షేపిస్తే అది ఇది : భారతదేశంలోని ఏ ప్రాంతం కూడా వెలిగా ఉండని ఒక రాజ్యం స్థాపించడమే పరమోన్నతమైన ఆలోచన. దేశాన్ని కలపడమే పరమాశయం. అదే పరమాశయం అయితే ఆ లక్ష్యం ఎన్ని కష్టాలు పడైనా సాధించాలి. దేనినీ అడ్డు రానీకూడదు.

**డా। అంబేద్కర్ :** ఎన్ని కష్టాలు పడైనా కాదు.... మనల్ని మనం పణం పెట్టుకొని!

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీ కమిటీ చర్చలు, సంపుటి I, పుట 205.

## 26వ సమావేశం - 21 సెప్టెంబర్ 1931

### శీర్షిక 3

### (ఫెడరల్ శాసన సభల మధ్య సంబంధాలు)

*డా॥ అంబేద్కర్ :* ఈ సందర్భంలో నేను జోక్యం చేసుకునేట్లయితే ఒక ప్రశ్న వేయాలను కుంటున్నాను. సాధారణంగా ఆర్థిక బిల్లుల విషయంలో ఎగువ సభ దిగువ సభకు సలహాలు, సూచనలు తప్పనిసరిగా ఇవ్వాలి అని సర్ తేజ్ చెప్పారు. కానీ దిగువ సభ ఆ సలహాల్ని పాటించకపోతే ఏమవుతుంది?

*సర్ తేజ్ బహదూర్ సప్రూ :* అపుడు ఎగువ సభ ఆ బిల్లును తిరస్కరించవచ్చు. అయితే అలా చేసినపుడు ప్రతిష్టంభన ఏర్పడితే దక్షిణ ఆఫ్రికాను దృష్టాంతంగా గ్రహించి ఆ పద్ధతిని అనుసరించవచ్చు.

*డా॥ అంబేద్కర్ :* ఎగువ సభకు సలహాలు, సూచనలు ఇచ్చే అధికారం మాత్రమే ఉన్నపుడు ప్రతిష్టంభన ఎలా ఎదురవుతుంది?

*సర్ తేజ్ బహదూర్ సప్రూ :* అది బిల్లును పూర్తిగా తిరస్కరించవచ్చు.

*సర్ మహమ్మద్ షఫీ :* తిరస్కరించడానికి అధికారం ఉన్న దిగువ సభకు - సవరణ కోరుతూ బిల్లు తిప్పి పంపినా, సూచన తెలుపుతూ దిగువ సభకు పంపినా ఈ రెండింటి మధ్య ఏం భేదం ఉంది? తుది నిర్ణయం రెండు సభల ఉమ్మడి సమావేశం తీసుకొంటుంది కదా!

*సర్ తేజ్ బహదూర్ సప్రూ :* అది ఆధునిక ఆచరణకు సన్నిహితంగా ఉందన్నది మొదటి అంశం.

*డా॥ అంబేద్కర్ :* మీ సూచన మేరకు ఆర్థిక బిల్లులకు, ఇతర బిల్లులకు ప్రధానభేదం అంటూ లేదు. దిగువ సభకు మాత్రమే ఆర్థిక బిల్లుల్ని ప్రవేశపెట్టే అధికారం ఉంటుంది. మిగతా విషయాల్లో రెండు సభలూ సమానంగా ఉంటాయి?

*సర్ తేజ్ బహదూర్ సప్రూ :* నేను చెప్పిందదే.

* * *

*జఫ్రుల్లా ఖాన్ :* అందువల్ల నా విన్నపం ఏమంటే - ప్రతిపాదించే సంఖ్య నాకు తెలియదు. కానీ కావలసిన మెజారిటీ సాధారణ మెజారిటీ కాదు. లేదా రెండు సభల సభ్యుల మొత్తం సంఖ్యలో పూర్తి మెజారిటీ కాదు. కానీ అంతకంటే ఎక్కువ మెజారిటీ. ఇంతవరకు వెలిబుచ్చిన అభిప్రాయాలకు ఇది పొంతనగా ఉండేది.

---

* ఫెడరల్ నిర్మాణ కమిటి, మైనారిటీల కమిటి చర్చలు, సంపుటి 1, పుట 207.

**డా॥ అంబేద్కర్ :** సాధారణ మెజారిటీ ద్వారా విషయాల్ని నిర్ణయించడానికి ఏ సభకు ఆ సభే ప్రత్యేకంగా కూర్చోవడానికి జఫ్రుల్లాఖాన్ అంగీకరిస్తారా? లేక సమావేశమైన సభ్యులలో మెజారిటీ ఉంటే చాలంటారా?

**జఫ్రుల్లా ఖాన్ :** సాధారణ మెజారిటీ చాలు.

**డా॥ అంబేద్కర్ :** ఆ పరిస్థితిలో రెండు సభలు కలిసి సమావేశమైనపుడు సాధారణ మెజారిటీ ద్వారా సమస్యల్ని పరిష్కరించుకోలేరా?

**సర్ మహ్మద్ షఫీ :** రెండు సభల మధ్య అభిప్రాయ భేదం ఉంది కాబట్టి.

**జఫ్రుల్లా ఖాన్ :** సాధారణంగా తోటి సభ్యుల దృష్టిలోని అంశాల్ని ఇతర సభ్యులు గుర్తించరు. ఒక కారణం ఏమంటే రెండు సభల లక్షణంలోనే భేదం ఉంది.

★ ★ ★

*సర్దార్ ఉజ్జల్ సింగ్ :** ఆర్థిక విషయాలకు సంబంధించి, ఈనాటి ఫెడరేషన్ల నుండి కొన్ని దృష్టాంతాలివ్వాలనుకుంటున్నాను. కెనడా అధినివేశ రాజ్యం సంగతి చూద్దాం. ఇతర వక్తలు ఇంతకుముందే చెప్పినట్లుగా 53 సెక్షన్ ఇలా చెపుతుంది.

"ప్రభుత్వ రాబడిలో ఏదైనా ఒక భాగాన్ని ఖర్చు చేసే సందర్భంలో కానీ, ఏదైనా పన్ను లేదా సుంకాన్ని విధించేటప్పుడుగానీ అది కామన్సు సభ ద్వారానే ప్రారంభించబడాలి."

కెనడాలో రెండు సభల అధికారాలు ఖచ్చితంగా నిర్వచించబడలేదు. దీనికి కారణం, 18 సెక్షన్ కింద కెనడా బ్రిటన్ నమూనాను సాధారణంగా అనుసరిస్తుంది. అది ఇలా చెపుతుంది.

"ప్రత్యేకాధికారాలు, మినహాయింపులు, అధికారాల్ని కలిగి ఉండే, అనుభవించే, ప్రయోగించే...."

**డా॥ అంబేద్కర్ :** దానితో దీనికి సంబంధం లేదు. అది సభలోని ప్రత్యేకాధికారం.

**సర్దార్ ఉజ్జల్ సింగ్ :** క్షమించండి!

"సెనేటు, కామన్సు సభ కలిగి ఉండే, అనుభవించే, ప్రయోగించే ప్రత్యేకాధికారాలు, మినహాయింపులు, అధికారాలు...." అంటే ఈ మాటలకు "కామన్సు సభ సభ్యులు" అని అర్థం కాదు.

**డా॥ అంబేద్కర్ :** కాదు. మీరు కెనడా రాజ్యాంగం పీఠికను పరిశీలిస్తే కెనడాలో కామన్సు సభ, లార్డ్సు సభల సంబంధం ముఖ్యమైన మాత్రంగా ఉంటుంది. అయితే ఇందులో కెనడా కామన్సు సభ ప్రత్యేకాధికారాలకు మాత్రం భంగంలేదు.

★ ★ ★

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి I, పుట పుట 249.

*డా। అంబేద్కర్ :* ఇంతవరకు విన్న అభిప్రాయాల్ని బట్టి చూస్తే ఒక విషయం మాత్రం అందరికీ సమానాంశంగా కనబడుతున్నది. రాబోయే భారత రాజ్యాంగంలో – ఆర్థిక బిల్లుల్ని ప్రవేశపెట్టడంలోను, ఓటింగు హక్కులోను కొన్ని చిన్న చిన్న అంశాల్లో తప్ప – రెండు సభల సంబంధాన్ని నియంత్రించడంలో రెండు సభలకు హోదాలో సమానత్వం, అధికారంలో సమానత్వం ఇవ్వబడాలి. అంటే రెండు సభలు సరిసమాన స్థితిలో ఉండాలనేది ఏకాభిప్రాయంగా ఉన్నట్లు నేను భావిస్తున్నాను.

నా కంటే ముందు ప్రసంగించిన పెద్ద మనుషులందరికీ వినయ పూర్వకమైన మర్యాద చూపుతూ నేను వారి అభిప్రాయంతో విభేదిస్తున్నానని చెప్తున్నాను. వారికీ నాకూ అభిప్రాయ భేదం రావడానికి కారణం ఒక సామాన్య సత్యం. ఎగువసభ విధులు, ఉద్దేశ్యాల విషయంలో వారు, నేను వేర్వేరు దృక్కోణాల నుంచి చూస్తున్నాం. రెండు సభలు సరిసమాన అధికారాల్ని కలిగి ఉండాలని నిన్న ప్రతిపాదించిన పెద్ద దృక్కోణాల్ని నేను ఇలా అర్థం చేసుకుంటున్నాను. మన లెజిస్లేచర్ అలా నిర్మించబడితే పాతమాటల్లో చెప్పినట్లు 'రెండు రాజ్యస్థితులు' ఉండాలన్నదే వారి అభిప్రాయం. ఎగువసభలో ప్రాతినిధ్యం లేని తరగతులకు దిగువ సభలోను, దిగువసభలో ప్రాతినిధ్యం లేని తరగతులకు ఎగువసభలోను ప్రాతినిధ్యం ఉండేటట్లయితే ఈ విభజన దృక్కోణానికి కొంతబలం ఉండేది. నేను ప్రత్యేకంగా 'రెండు రాజ్యస్థితులు' అని చెప్పానే అలాంటి విధంగా మన శాసనసభ నిర్మించబడితే అలాంటి రెండు సభలు ఉండే శాసనసభకు అంగీకారం తెలపని వాళ్లలో నేనూ ఒకణ్ణి. సాధారణ ప్రజల కోసం మాట్లాడే నేను ఈ విషయంలో మహాత్మాగాంధీకి విరోధిని. సాధారణ ప్రజలకోసం మాట్లాడే నేను అలాంటి శాసనసభను అంగీకరించలేను. దానివల్ల సామాన్య ప్రజానీకం అదృష్టాన్ని ఇలాంటి పద్ధతినలో నడిచే ప్రభుత్వానికి అప్పగించలేను. ఇది ఎలా ఉంటుందంటే "సమతుల్యత లేని, పక్షపాతానికి గురయ్యే విధంగా పని చేసినట్లు ఉంటుంది" లార్డ్ ఆస్క్విత్ చెప్పినట్లుంటుంది. (పాచికలు వేసే గారడీ వాళ్లకు అనుకూలంగా తయారు చేయబడి ఉంటాయి.)

నేను భావించేది సరి అయినదైతే, నిజానికి, మన శాసనసభలు వేర్వేరు ఎస్టేట్ల ప్రత్యేక ప్రాతినిధ్యం ఆధారంగా ఏర్పడవు. ఏర్పడబోయే శాసనసభ సమ్మేళనాన్ని సరిగ్గా నేను అర్థం చేసుకున్నట్లయితే అది ఎలా ఉంటుందంటే – దిగువ సభ జన సామాన్యంతో ఏర్పాటయిన సభగా ఉంటుంది. ఆ సభ అన్ని వర్గాల ప్రజల్తోనూ ఏర్పడి, ప్రజాభిప్రాయంలో అన్ని దృక్కోణాల్ని ప్రతిబింబిస్తుంటుంది. అలా అయినప్పుడు దానికి ప్రతిద్వంద్విగా ఉంటూ సమాన హోదా కలిగి ఉండే మరో సభను మనం ఏర్పాటు చేసుకోవాల్సిన అవసరం లేదు. శీర్షిక 3లోని ఉప శీర్షిక(ii)లో ప్రతిపాదించిన సమస్య గురించి నేను ఏం సమాధానం చెపుతానంటే, అంతిమ నిర్ణయం దిగువసభకే ఉండాలని నేను విన్నపం చేస్తున్నాను.

*ఛైర్మన్ :* డా। అంబేద్కర్! మీరు ఈ విషయాన్ని రాజ్యాగంలో పొందుపరుస్తారా?

---

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి I, పుట 266-70.

*డా। అంబేద్కర్ :* ఔను. అలాగే చేయవచ్చు.

*ఛైర్మన్ :* అలాగే చేయవచ్చు సరే! అలా ఉండడాన్ని మీరు ప్రోత్సహిస్తారా?

*డా। అంబేద్కర్ :* ఈ విషయాన్ని తర్వాత పరిశీలించ వచ్చునని బహుశా మీరు అంగీకరిస్తారను కుంటాను. ఇది ముఖ్యంగా ఆర్థిక బిల్లుల విషయంలో తప్పనిసరి. దిగువసభ పరిశీలన కోసం సూచనలు చేసే అధికారం ఎగువసభకు ఉందనేది నా అభిప్రాయం. అయితే తను ఇష్టపడితే దిగువసభ అంగీకరించవచ్చు. కానీ ఎగువసభకు – ఆర్థిక బిల్లుల్ని ప్రవేశపెట్టేందుకుగానీ, ఆర్థిక బిల్లుల్ని సవరించేందుకు గానీ అధికారం ఉండకూడదు. దిగువసభ ఆమోదిస్తే తప్పనిసరిగా ఆర్థిక బిల్లు చట్టం కావాలి – ఒకవేళ ఎగువసభ నిరాకరించినా సరే!

ఈ ప్రతిపాదన చాలా తీవ్రమైన ప్రతిపాదనగా ఉందని నేను గుర్తించాను. నిజానికి అది ఒక విప్లవాత్మక ప్రతిపాదనగా వర్ణించబడాలి. అయితే ఛాన్సలర్! నిన్న నా సహచరులు సర్ తేజ్ బహదూర్ సప్రూ, సర్ మహమ్మద్ షఫీగార్లు ఈ విషయాన్ని ప్రస్తావించేటపుడు అత్యాధునికమైన రాజ్యాంగాల్ని గూర్చి తెలపలేదు. తులనాత్మకంగా చూసినపుడు పాతవి అయిన కెనడా , ఆస్ట్రేలియా, ఆఫ్రికా రాజ్యాంగాల నుంచి మాత్రమే ఉదాహరణల్ని ప్రస్తావించడం నాకాశ్చర్యం కలిగించింది. కెనడా రాజ్యాంగం 1862లో, ఆస్ట్రేలియా రాజ్యాంగం 1901లో, దక్షిణాఫ్రికా రాజ్యాంగం 1909లో రచించబడ్డాయి. అక్కడ కామన్సు సభ, లార్డ్స్ సభల మధ్య ఉండే రాజ్యాంగ సంబంధాల్ని గురించి ఎందుకు పరిశీలించలేదో నాకర్థం కావడంలేదు. ఉదాహరణకు ఐర్లండ్‌లో రెండు సభల మధ్య సంబంధాల్ని ఎందుకు పరిశీలించలేదో, అంతేగాక వారు బ్రైస్ కమిటీలో ప్రతిపాదించిన అంశాల్ని పరిశీలించడం కూడా ఎలా మర్చిపోయారో నాకర్థం కావడంలేదు. వారు అలా చేసి ఉంటే నా ప్రతిపాదనకు కమిటీ సభ్యులు ఇంతగా ఆశ్చర్యపోయి ఉండరని నేను ఖచ్చితంగా చెప్పగలను. వాళ్లు అలా చేయలేదు కాబట్టి దృష్టాంతాల్ని చూపుతూ నా ప్రతిపాదనను బలపరుచుకుంటాను. నా ప్రతిపాదన సరిగా 1911 పార్లమెంటు చట్టంలో ఉండేదే. అందులో ఆర్థిక బిల్లులకు సంబంధించి నంతవరకు లార్డ్సు సభ పరిశీలించవచ్చు. అంతేగానీ ఆ విషయంలో కామన్సు సభదే పై చేయి అని ఉంది. లార్డ్సు సభ తిరస్కరించినా కామన్సు సభ ప్రతిపాదించిన ఆర్థిక బిల్లు చట్టమై తీరుతుంది. ఆర్థిక బిల్లులకు సంబంధించిన విషయంలో రెండు సభల సంబంధం ఇలా ఉండాలని ఐరిష్ రాజ్యాంగం 35వ సెక్షన్‌లో చెప్పబడింది.

"డైల్ ఏరెయన్(Dail Eireann - కామన్సు సభతో సమానం) ఆర్థిక బిల్లులకు సంబంధించిన విషయాల్లో సీనాడ్ ఏరెయన్‌కు (Seanad Eireann - ఎగువసభతో సమానం) లేని చట్టాలు చేసే అధికారం కలిగి ఉంటుంది"

38వ అధికరణ ఇలా చెప్తుంది.

"డైల్ ఏరెయన్ ప్రవేశపెట్టి ఆమోదించిన ప్రతి బిల్లు సీనాడ్ ఏరెయన్‌కు పంపబడుతుంది.

అది ఆర్థిక బిల్లు కాకుంటే సీనాడ్ ఏరెయన్ సవరణ చేయవచ్చు." ఇంకా అయితే డైల్ ఏరెయన్ ఆమోదించిన బిల్లు... అలా తర్వాతి విషయం ఆ అధికరణలో చెప్పబడుతుంది.

నా ప్రతిపాదనను బలపరచడానికి నేను చూపే మరో ప్రమాణం బ్రైన్ కమిటీ సిఫారసు. ఈ కమిటీలో అటు లార్డ్సు సభ నుండి, ఇటు కామన్సు సభ నుండి ప్రాతినిధ్యం ఉంది. కాబట్టి సరైన ప్రాతినిధ్య కమిటీగా చెప్పవచ్చు. 1911 పార్లమెంటు చట్టంలో ఆర్థిక బిల్లులకు సంబంధించినంతవరకు ఉన్న ఏర్పాట్లు సరైనవని, ఖచ్చితమైనవని ఏకగ్రీవంగా ఆ కమిటీ అంగీకరించింది.

తర్వాత, నా ప్రతిపాదనకు మూడో ప్రమాణం చూపిస్తాను. బ్రైస్ కమిటీ నివేదిక, దానిలోని సిఫారసులు పక్కకు పెట్టబడలేదు. వాటిని 1922 నాటి సంకీర్ణ ప్రభుత్వం పరిశీలించింది. నాటి ప్రభుత్వం బ్రైస్ కమిటీ నివేదికను చేపట్టడానికి ఏ చర్యలు తీసుకోవడానికి సిద్ధంగా ఉందో తెలుపుతూ తీర్మానాలు ప్రవేశపెట్టబడ్డాయి (లార్డ్ పీల్ ఇక్కడ ఉన్నందుకు నాకు సంతోషంగా ఉంది). 1922 జులై 11న పార్లమెంటులో తీర్మానాలు ఉంచబడ్డాయి. నాలుగో తీర్మానం ఇలా చెప్తుంది.

"లార్డ్సు సభ ఆర్థిక బిల్లుల్ని సవరించనూ లేదు, తిరస్కరించనూ లేదు. బిల్లు ఆర్థిక బిల్లాకాదా? పాక్షికంగా ఆర్థిక బిల్లు ఔనా కాదా అనే అంశాన్ని రెండు సభల జాయింట్ స్టాండింగ్ కమిటీ పరిశీలిస్తుంది. ఆ కమిటీ నిర్ణయమే తుది నిర్ణయం".

బ్రైస్ కమిటీ ఆర్థిక బిల్లు పూర్తిగా కామన్సుసభకే సంబంధించినదని సిఫారసు చేసిన సూత్రాన్ని పై తీర్మానాలు బలపరుస్తున్నాయి. ఆ తీర్మానాల మీద నాటి ఇండియాకు ప్రభుత్వ కార్యదర్శిగా ఉన్న వెకౌంట్ పీల్ ప్రసంగాన్ని ఈ సందర్భంలో ఉటంకిస్తాను. తీర్మానాలు ప్రవేశపెడుతూ ఆయన ఇలా అన్నారు – ఈ తీర్మానాలు సిద్ధాంతాల్ని విధించే రేఖాచిత్రాల లాంటివి. ఇంకా ఆయన ఏం చెప్పారంటే - లార్డ్సు సభ కామన్సు సభతో సమానమైన అధికారాలు కలిగి ఉండకూడదని, కామన్సు సభకు లార్డ్సు సభ ప్రతి ద్వంద్వి కారాదని, దానికి ప్రభుత్వాల్ని రద్దు చేసే అధికారం ఉండకూడదని, కార్య నిర్వాహక వర్గం రెండు సభలకు సమానంగా బాధ్యత వహించేట్లు చేయకూడదని కూడా చెప్పారు.

ఈ కమిటీ పరిశీలన కోసం పంపిన నా ప్రతిపాదనకు తగినంత ప్రమాణం చూపించాను అనుకుంటున్నాను.

***లార్డ్ పీల్ :*** అది సంకీర్ణ ప్రభుత్వం అని నేను సూచించవచ్చా!

***డా॥ అంబేద్కర్ :*** ఔను. అది సంకీర్ణ ప్రభుత్వమే.

***లార్డ్ పీల్ :*** సంకీర్ణ ప్రభుత్వంలో చెప్పాలనుకున్న అన్ని అంశాలు మీరు చెప్పలేదు.

***డా॥ అంబేద్కర్ :*** ఈ విషయంలో మీకు కొన్ని సంకోచాలు ఉన్నాయనుకుంటున్నాను.

సంకీర్ణ ప్రభుత్వంలో ఒక పార్టీ కంటే ఎక్కువ పార్టీలు ఉంటాయి. కాబట్టి సంకీర్ణ ప్రభుత్వ ప్రకటన అంటే ఒక పార్టీ కంటే ఎక్కువ పార్టీల ప్రకటన అని అర్థం. ఆ ప్రకటన లార్డ్ పీల్ అభిప్రాయాన్ని కూడా కలుపుకొని ఉంది. నేను కమిటీ ముందుంచిన ప్రతిపాదన విప్లవాత్మకమైన ప్రతిపాదన కాదని చెప్పడానికి తగినంత ప్రమాదం ఉందని మనవి చేసుకుంటున్నాను.

***సర్ తేజ్ బహదూర్ సప్రూ :*** తన దృక్కోణాన్ని బలపరచడానికి ఏ ఫెడరల్ రాజ్యాంగాన్నయినా డా. అంబేద్కర్ ఉటంకించగలరా అని నేను అడగవచ్చా! ఇంగ్లండుగానీ, ఐర్లండుగానీ ఫెడరేషన్లు కావు.

***డా॥ అంబేద్కర్ :*** అవును.

***సర్ తేజ్ బహదూర్ సప్రూ :*** ఫెడరేషన్ విషయంలో బ్రైస్ కమిటీకి సంబంధం లేదు.

***డా॥ అంబేద్కర్ :*** నా ప్రత్యుత్తరం ఇది. మీ ఫెడరల్ రాజ్యాంగం దిగువ సభ ప్రాతినిధ్యం వహించని ఇతర రంగాలకు ఎగువసభ ప్రాతినిధ్యం వహించేట్లు చేస్తే ఈ ప్రతిపాదన నిలుస్తుంది. ప్రభుత్వ నిర్మాణ స్వరూపంతో అది ఫెడరల్ ప్రభుత్వమా, సమైక్య ప్రభుత్వమా అనే అంశంతో దానికి సంబంధం లేదు.

***సర్ ప్రొవాష్ చందర్ మిత్తర్ :*** నేను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. లార్డ్సు సభ అనువంశిక సభ. ఐరిష్ ఎగువసభ ఆ స్థితిలోనే ఉంది కదా!

***డా॥ అంబేద్కర్ :*** చాలా ప్రాచీన కాలం నుండి ఉన్న ఎంతో ఉన్నత హోదాతోను, సంప్రదాయాలు, ప్రత్యేకాధికారాలతోను ఉండే లార్డ్సు సభ కూడా ఈ విప్లవాత్మక మార్పును అంగీకరించిందని నేను విన్నవిస్తున్నాను. లార్డ్సు సభతో ఇండియాలోని స్వదేశీ సంస్థానాల్ని పోలిస్తే వీటి స్థితి ఒక లెక్కా అని నేను సవినయంగా విన్నవించుకుంటున్నాను.

***హెచ్. హెచ్. బికనీర్ మహారాజా :*** బ్రిటిష్ రాజ్యంలోని ప్రభు పట్టం కలిగిన వ్యక్తులందరికీ తగిన గౌరవంతో – బ్రిటిష్ భూభాగం కాని భూభాగంపై ఇండియా స్వదేశీ సంస్థానాలు సార్వభౌమత్వాన్ని కలిగి ఉన్నాయి. బ్రిటిష్ రాజ్యంలోని ప్రభు పట్టంగల ప్రధాన వ్యక్తులు, వారి ఎస్టేట్ల స్థితి దీనికంటే భిన్నంగా ఉంటాయి.

***డా॥ అంబేద్కర్ :*** సార్వభౌమాధికారం అనేది లార్డ్సుసభ అధికారం ప్రభావానికి లొంగి ఉండేదే.

***సర్ మహమ్మద్ షఫీ :*** లార్డ్సు సభ ప్రత్యేకాధికారాలు ఏమిటని డా॥ అంబేద్కర్‌ని అడగవచ్చా!

***డా॥ అంబేద్కర్ :*** ఈ పక్షం వహిస్తూ – నేను మరో విషయం చెప్పాలనుకుంటున్నాను. రాజ్యాంగం ఆర్థిక బిల్లు నిర్వచనం కలిగి ఉండాలి. 1911 పార్లమెంటు చట్టంతో విభేదించని, ఐరిష్ రాజ్యాంగంలో సూచించబడిన విధంగా ఆర్థికబిల్లును నిర్వచించవచ్చు.

నేను మనవి చెయ్యాలనుకుంటున్న తర్వాతి అంశం – బిల్లుకు ఇన్‌చార్జి అయిన సభ్యుడు

తన బిల్లు ఆర్థిక బిల్లు అని మనవి చేయగల ప్రత్యేకాధికారం కలిగి ఉండాలి. ఏది ఆర్థిక బిల్లో ఏది కాదో అని తేల్చడంలో వివాదం వస్తే ఆ వివాదం రెండు సభల సంయుక్త కమిటీ ద్వారా తీర్చబడాలి. ఆ కమిటీలో రెండు సభల ప్రతినిధులు ఆయా సభల సంఖ్యకు తగిన నిష్పత్తిలో, వారి సంఖ్యను బట్టి అన్ని పార్టీల ప్రాతినిధ్యం ఉండేట్లు ఏర్పాటు చేయాలి.

*సర్ మానెక్‌జీ దాదాబాయి :* ప్రస్తుతం ఉన్న ఆచరణకు మీరు దూరంగా వెళ్లాలనుకుంటున్నారా?

*డా॥ అంబేద్కర్ :* ఔను, చాలా దూరంగా.

*జఫ్రుల్లాఖాన్ :* ప్రస్తుతం ఉండే ఆచరణ సంతృప్తికరంగా ఉంటే మనం ఇక్కడ ఉండేవాళ్లం కాదు.

*డా॥ అంబేద్కర్ :* నేను చెప్పాలనుకున్న తర్వాతి అంశం ఆర్థికేతర బిల్లుల్ని గురించిన అంశం. ఆర్థిక బిల్లులకు వర్తించే సూత్రాన్ని ఆర్థికేతర బిల్లుల విషయంలో మార్చడానికి రెండు ప్రయోజనాల దృష్ట్యా నేను సిద్ధంగా ఉన్నాను. మొదటిది : ఆర్థిక సంబంధం కాని దిగువ సభ ప్రతిపాదించిన ఆర్థికేతర బిల్లుల్ని సవరించడానికి, మార్చడానికి అధికారం ఎగువసభకు ఉంటుంది. రెండవది : తొందరపాటు చర్య నివారణకు అవసరం అయినప్పుడు లేదా ప్రజల అభిప్రాయం ఆ అంశం మీద వీలైనంత ఎక్కువగా తెలుసుకోవడానికి ఆర్థికేతర బిల్లును ఆమోదించకుండా ఆపడానికి లేదా అవసరమైనంతమేరకు ఆలస్యం చేయడానికి ఎగువ సభకు అధికారం ఉంటుంది. ఈ దృష్టితో చూసినపుడు ఆర్థికేతర బిల్లుల విషయాన్ని నిర్వహించే ఉప శీర్షికలో ప్రతిపాదించబడిన ప్రశ్నకు నా జవాబు ఏమంటే ఆర్థికేతర బిల్లుల్ని సవరించడానికి ఎగువ సభకు అధికారం ఉండాలనే. ఈ సవరణల్ని దిగువ సభ అంగీకరిస్తే మంచిదే. లేకుంటే వరుసగా జరిపే దిగువసభ మూడు సమావేశాల్లో ఒక ఆర్థికేతర బిల్లు ఆమోదం పొందితే – ఎగువ సభ వ్యతిరేకించినా – ఆ బిల్లు చట్టం అయ్యేట్లు రాజ్యాంగం అవకాశం కల్పించాలి. చివరగా నేను మనవి చేసేదేమంటే రెండు సభల మధ్య సంబంధాలు చట్టబద్ధంగా ఉండాలేగానీ సంప్రదాయానికి వదిలేయకూడదు. నేను మనవి చేయ దలచుకొన్నదింతే.

★ ★ ★

*•డా॥ అంబేద్కర్ :* గవిన్ జోన్స్! దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియాలు తాము ఫెడరల్ విధాన ప్రభుత్వం కోసం రాజ్యాంగం రచిస్తున్నట్లు తెలుసు కాబట్టే రెండు సభల మధ్య సంబంధాల్ని అలా నిర్వచించారని మీ అభిప్రాయమా?

*గవిన్ జోన్స్ :* ఔను, తప్పకుండా!

*డా॥ అంబేద్కర్ :* అలాటప్పుడు కెనడా రాజ్యాంగంలో రెండు సభల మధ్య ఉండవలసిన సంబంధాల్ని గురించి ఎందుకు నియమాలు తెలుపలేదు?

• ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, పుట 281–82.

అభిప్రాయంలో ఒక నిర్ణీత సంఖ్య అనేది మన ప్రారంభ అంశం కారాదు. సంబంధిత అన్ని విషయాల పరిశీలన ఫలితంగా ఆ సంఖ్య రావాలి. నేనీ సందర్భంలో మరో మాట చెప్పాలి. నా సానుభూతి పెద్ద సభ మీదనే ఉంది. సభ చర్చావేదిక కాబట్టి ప్రజల్లోని అన్ని రంగాలవారు అందులో ఉండాలి. ఏదైనా ఒక ప్రత్యేక రంగం వారే అందులో క్రిక్కిరిసి ఉండకూడదు.

పెద్ద సభ ఉండడానికి విరుద్ధంగా ఒక వాదం ఉంది. అదేమంటే మన సభల వ్యవహార సరళి నిర్దిష్టంగా ఉండాలని. ఆ వాదంలో కొంత బలం ఉన్నదనే నేను భావిస్తున్నాను. అయితే సభ వ్యవహార సరళికి దాని సంఖ్యతో ఏ ప్రమేయం ఉందో నాకర్థం కావడంలేదు. సభ వ్యవహార సరళి గానీ, దాని నిర్వహణగానీ సభ సభ్యుల సంఖ్య మీద కంటే - ఆ సభ ఏర్పాటు చేసుకున్న నియమాల మీద, వ్యవహార సూత్రాల మీద ఆధారపడి ఉంటుందని నేను భావించాను. అందువల్ల ఆ పరిశీలన ఆధారంగా సంఖ్యను నేను సంకుచిత పరచలేను.

ఇంకా తెరతీయని ప్రశ్న ఒకటి ఉంది. భావి భారత రాజ్యాంగం తప్పనిసరిగా ఫెడరల్ రాజ్యాంగం అయి ఉంటుందని మనకందరికీ చెప్పబడింది. ఫెడరల్ రూపమైన ప్రభుత్వం ఏర్పరచడానికి స్వదేశ సంస్థానాలు ముందుగానే చేరాలి అనే నియమం ఏమైనా ప్రతిపాదిస్తున్నారా తెలియవలసి ఉంది. ఈ ప్రతిపాదన చేసేవారి అభిప్రాయం నాకు పూర్తిగా తెలియందే ఈ విషయం మీద ఏదైనా చెప్పడానికి నాకు ఇబ్బందిగా ఉంటుంది. ఇంత నిర్ణీత సంఖ్యగల స్వదేశ సంస్థానాలు ఫెడరేషన్‌లో చేరేంత వరకు, మనం వేచి ఉండాల్సిన అవసరం లేదనేదే నా సమాధానం. బ్రిటిష్ ఇండియాలో ఉండే వారెవరైనా స్వదేశ సంస్థానాధిపతులు భారత దేశ ఫెడరల్ ప్రభుత్వంలో చేరడానికి నిర్ణయించుకొనే దాకా ఫెడరల్ ప్రభుత్వ ఏర్పాటు నిలిపి ఉంచాలని అనరనే నా నమ్మకం. అందువల్ల భారతదేశ ఫెడరల్ ప్రభుత్వం ప్రారంభించడానికి చేయవలసినదల్లా కౌన్సిల్లో ఉత్తర్వు ద్వారా రాజ్యాంగంలోని ఒక క్లాజులో ఫెడరేషన్‌లో చేరాలనుకునే నూతన సంస్థానాలకు అంగీకారం తెలపడమే. ఇదేమీ కొత్త అంశం కాదు. కెనడా రాజ్యాంగంలో 146, 147 సెక్షన్లలో, ఆస్ట్రేలియా రాజ్యాంగం 121 నుండి 124 దాకా ఉండే సెక్షన్లలో ఇలాంటి ఏర్పాటు ఉంది. కెనడా రాజ్యాంగంలోని 146వ సెక్షన్, 1867లో ఫెడరేషన్ ఏర్పడినపుడు చేరని దేశ భాగాలు తర్వాత చేరడానికి అంగీకరిస్తే కౌన్సిల్లో ఆర్డర్ ద్వారా ఫెడరేషన్‌లో యూనిట్లుగా చేర్చుకోవచ్చునని చెపుతుంది. ఇలాంటి క్లాజుతో మనం కూడా ఫెడరేషన్ రాజ్యాంగం ప్రవేశపెట్టడానికి ఈ దృష్టాంతం సరిపోతుందనుకుంటాను. ఇది ఫెడరేషన్‌లో చేరడానికి గానీ, చేరకపోవడానికి గానీ స్వదేశ సంస్థానాధీశుల స్వేచ్ఛకు అనురూపంగా ఉంటుంది.

ఉపశీర్షిక (v) లోని (ఎ) భాగానికి వస్తే - బికనీర్ మహారాజాగారు - ఫెడరేషన్లో ఒక సంస్థానం, కొన్ని సంస్థానాలు లేదా అన్ని సంస్థానాలు చేరినా - సంస్థానాలకు ఏర్పరచిన మొత్తం ఓటింగు బలాన్ని ప్రయోగించే హక్కు ఇవ్వాలన్నారు. నేను సవినయంగా మనవి చేసేదేమంటే ఈ ప్రతిపాదన చాలా దిగ్భ్రమ కలిగించే ప్రతిపాదన అని. ఈ ప్రతిపాదన అసందర్భంగా కూడా ఉందని

నేను సగౌరవంగా మనవి చేస్తున్నాను. అసాధారణ ప్రతిపాదనగా నేను పిలిచే ఈ ప్రతిపాదనకు ఎలాంటి సమర్థనా చూపలేదు. చివరికి దీని అర్థం ఏమిటి? దీని అర్థం ఇది : ఫెడరేషన్‌లో చేరే ఒక సంస్థానాధీశుడు అన్ని స్వదేశ సంస్థానాల మొత్తం అధికారం తన చేతుల్లోకి తీసుకొంటాడు. అంతేకాదు. ఫెడరేషన్లో చేరని సంస్థానాల ప్రజల అదృష్టాల్తో ఆడుకొనే అధికారం అతనికి లేదు. శాసనసభకు బయట ఉండాలనుకునే ఏ సంస్థానాధిపతి అయినా ఈ ప్రతిపాదన వల్ల ఓటు సంపాదించి ఆ ఓటును పొరుగు సంస్థానాధిపతికో, అతడి సహచరుడికో బ్రిటిష్ ఇండియా భవిష్యత్తుకు నష్టం కలిగించేట్లు ఓటుహక్కును బదిలీ చేస్తాడు. అది న్యాయం, నిష్పక్షపాతం, సమాన హక్కు లేనటువంటి ప్రతిపాదన అవుతుంది. అలాంటిదాన్ని నేను అంగీకరించలేను. సర్ ఇస్మాయిల్ మీర్జా ప్రతిపాదించిన ఏర్పాట్ల ప్రకారం ఫెడరేషన్లో చేరడానికి ఇష్టపడుతున్న సంస్థానాధీశుల ఓటింగు బలం వారికి నిర్ణయించే కోటాను బట్టి నిర్ణీత ఓట్లు కలిగి ఉండాలి. ఒక సంస్థానాధీశుడు ఫెడరేషన్‌లో చేరితే, అతడు ఒక ప్రతినిధిని కలిగి ఉంటే, అతడు ఒక ఓటు వేయడానికి హక్కు కలిగి ఉంటాడు. ఒక సంస్థానాధీశుల సమూహం ఫెడరేషన్‌లో చేరితే ఆ సమూహం ఒకటిగానే రావాలి. రెండు ఓట్ల కంటే ఎక్కువ ఓట్లు వేయడానికి ఆ సమూహానికి అధికారం లేదు. ఈ ప్రతిపాదన తప్ప మరో ప్రతిపాదనను నేను అంగీకరించలేను.

## 30వ సమావేశం – 25 సెప్టెంబర్ 1931

## శీర్షిక 4

## (ఫెడరేషన్, దాని రాష్ట్రాల మధ్య ఆర్థిక వనరుల పంపిణీ)

***డా॥ అంబేద్కర్ :** సర్ మహమ్మద్ షఫీ లేవనెత్తిన అంశానికి నేను చాలా ప్రాధాన్యత ఇస్తున్నాను. ఫెడరల్ నిర్మాణ ఉపసంఘం చేసిన సిఫారసును రాజ్యాంగంలో చేర్చాలా వద్దా అని చర్చించడానికి ఇప్పుడు కాకపోయినా తర్వాత అయినా సరే తగినంత సమయం కేటాయిస్తారని ఆశిస్తున్నాను. మొదట ఇక్కడ పరిశీలించిన తర్వాత ఆర్థిక ఉప సంఘం నిర్దేశానికి పంపడం సరైనది కాదని, మొదట ఆర్థిక ఉప సంఘం పరిశీలించిన తర్వాత ఫెడరల్ నిర్మాణ ఉప సంఘం పరిశీలించాలి అనే అంశాన్ని మీరు ఆలోచించాలి. నేను సూచించే మరో అంశం : రెండు పరస్పర విరుద్ధాలయిన రెండు విభాగాల విభజనను రాజ్యాంగంలో ఉంచుదామా లేదా? ఈ విషయాల్ని ఉప సంఘం పరిశీలనకు వదులుదామా అనే విషయంలో మనం ఏదో ఒక నిర్ణయానికి రావడం మంచిదని నేను అభిప్రాయ పడుతున్నాను.

---

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 418.

# 34వ సమావేశం – 14 అక్టోబర్ 1931

## శీర్షిక – 4

(ఫెడరేషన్ దాని రాష్ట్రాల మధ్య ఆర్థిక వనరుల పంపిణీ)

ఫెడరల్ ఆర్థిక ఉప సంఘం నివేదిక మీద చర్చ

*డా॥ అంబేద్కర్ :* ఛాన్సలర్! ఆర్థిక ఉప సంఘం నివేదిక మీద రెండు రోజులుగా వాదోపవాదాలు విన్నాం. ఈ చర్చ కాస్త విసిగించేదీ అలసట కలిగించేదిగా అయిందేమోనని నేను భయపడుతున్నాను. ఉప సంఘం సిఫారసుల్లో చాలా వాటి మీద నాకు అభిప్రాయభేదం లేకపోతే నేనీ చర్చల్లో కలుగజేసుకొనే వాణ్ణే కాదు.

ఉప సంఘం పరిశీలించిన మొదటి సమస్య – ఫెడరల్ ప్రభుత్వం దాని విభాగాల మధ్య ఆదాయ వనరుల పంపిణీని ఉపసంఘం సిఫారసు చేసేటపుడు ఫెడరల్ ప్రభుత్వం, దాని విభాగాల మధ్య కొన్ని సూత్రాల్ని అనువర్తిస్తూ సిఫారసు చేసింది. నివేదికలోని 8వ పేరాలో ఆ సూత్రాలు పొందుపరచబడ్డాయి. అందులో ఫెడరల్ ప్రభుత్వానికి పరోక్ష పన్నులు, ఫెడరేషన్‌లోని యూనిట్లకు ప్రత్యక్ష పన్నుల ఆదాయం వెళ్లడం ఫెడరల్ ప్రభుత్వం దాని విభాగాల మధ్య రాబడుల పంపిణీలో సరైన పద్ధతి అని చెప్పబడింది. ఆ సిద్ధాంతాన్ని నేను ఆక్షేపించడానికి సాహసిస్తున్నాను. ఈ సిద్ధాంతానికి ఎక్కడా పూర్వోదాహరణ పునాదిగా లేదు. నేను ఎంతో జాగ్రత్తగా చాలా ఫెడరల్ ప్రభుత్వాల రాజ్యాంగాల్ని పరీక్షించాను. ఎక్కడా ఆర్థిక ఉప సంఘం నివేదికలోని 8వ పేరాలో తెలపబడిన ఈ అంశంలోని సిద్ధాంతానికి ప్రమాణం నాకు కనిపించలేదు. కెనడా రాజ్యాంగం 91, 92 సెక్షన్లను ఉదాహరణకు తీసుకొందాం. కెనడాలో రాష్ట్ర ప్రభుత్వాలకు 'ప్రత్యక్ష' పన్నులు పరిమితం అయినా, కేంద్ర ప్రభుత్వం మాత్రం పరోక్ష పన్నులకే పరిమితం కాలేదు. కెనడాలో కేంద్ర ప్రభుత్వానికి ప్రత్యక్ష పన్నులు కానీ, పరోక్ష పన్నులు కానీ వేయడానికి స్వాతంత్ర్య ఉంది. మీరు ఆస్ట్రేలియా రాజ్యాంగం తీసుకొంటే 86, 69, 90 సెక్షన్లలో మరో పద్ధతి ద్వారా కావచ్చుకానీ ఇదే ఫలితం రాబట్టబడింది. రాష్ట్రాలు కస్టమ్స్, ఎక్సైజు సుంకాల్ని విధించరాదని ఈ సెక్షన్లు చెపుతాయి. దీన్ని బట్టి ఆస్ట్రేలియా కేంద్ర ప్రభుత్వానికి 'ప్రత్యక్ష పన్నులు' వేసే అధికారం అలాగే ఉంది. తాము 8వ పేరాలో ప్రతిపాదించిన పద్ధతి 1913లో 16వ సవరణ చేసే వరకు అమెరికాలో ఉండినదని ఉప సంఘం ఉటంకించింది. కానీ అది అపసవ్యం అని నేను సవినయంగా మనవి చేస్తున్నాను. అమెరికా – అది ప్రవేశపెట్టబడిన నాటి నుంచి కూడా – ప్రత్యక్ష పన్నులు వేసే కేంద్ర ప్రభుత్వ అధికారానికి ప్రతిబంధకం లేనేలేదు. మీరు అమెరికా రాజ్యాంగం ఆర్టికల్ 1, సెక్షన్ 2ని పరిశీలించి చూస్తే – అమెరికా కేంద్ర ప్రభుత్వానికి 'ప్రత్యక్ష పన్నులు' వసూలు చేసే అధికారానికి స్పష్టమైన ఏర్పాట్లు

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 529–34.

ఉన్నాయి. ఆ అధికారానికి పరిమితి ఒక్కటే – యునైటెడ్ స్టేట్సు కేంద్ర ప్రభుత్వం 'ప్రత్యక్ష పన్నులు వసూలు చేస్తే ఆయా రాష్ట్రాల జనాభా ప్రాతిపదికగా పంచాలి అనేదే ఆ పరిమితి.1913 నాటి సవరణలో చేసిన ఏర్పాటు ఏమిటంటే కేంద్ర ప్రభుత్వం ప్రత్యక్ష పన్నులు వేసినపుడు ఆయా రాష్ట్రాల జనాభా ప్రాతిపదికగా పంచాలి అనే ఏర్పాటు రద్దు చేయబడింది. అయితే ప్రత్యక్ష పన్నులు వేసే అధికారం మాత్రం మొదటి నుంచే ఉంది. అధికారం ఉండడమే కాదు. ఆ హక్కు 1864, 1894 సంవత్సరాల్లో వినియోగించబడింది. కమిటీ ప్రతిపాదించిన పద్ధతి కొంత కాలం కలిగి ఉండిన దేశం స్విట్జర్లాండ్ ఒక్కటే. అక్కడ కేంద్ర ప్రభుత్వం పూర్తిగా 'పరోక్ష పన్నుల' మీద ఆధారపడి ఉండగా, రాష్ట్రాలు ప్రత్యక్ష పన్నులు వసూలు చేసే అధికారాన్ని భారతదేశ ఫెడరేషన్ ప్రయోజనం కోసం ప్రమాణంగా గ్రహించే ధైర్యం చేస్తారనుకోను. ఉప్పునీ కర్పూరాన్ని పోల్చి ప్రయోజనం లేదని నేను చెప్పగలను. అప్పటికీ ఈ పద్ధతిని స్విస్ రాజ్యాంగం 1915లో వదిలేసి రాష్ట్రాల ప్రజల నుంచి కేంద్ర ప్రభుత్వం 'ప్రత్యక్షపన్నులు' వసూలు చేసే అధికారాన్నిచ్చింది. ఈ ప్రతిపాదన నియమించబోయే 'నిపుణుల కమిటీ'కి ఒక నిర్దేశంలా ఉండడానికి చూపుతున్నానే కానీ, దానికి నా సమ్మతి ఇవ్వలేను.

కమిటీ నివేదిక పేరా 10లో ప్రతిపాదించిన ఆర్థిక వనరుల అసలు పంపకానికి వస్తే – చివరకు – సరిపోవడం అనేదే అసలు పరీక్షగా ఉంటుంది. పేరా 10లో కేంద్ర ప్రభుత్వానికి దాని యూనిట్లకు కేటాయించిన రాబడి సరిపోవడం అనే పరీక్షకు నిలుస్తుందా? ఆ పరీక్ష ద్వారా ఇప్పుడు ఈ ప్రణాళికను పరీక్షించడం సాధ్యం కాదు. ఎందుకంటే సబ్ కమిటీ నివేదికకు కావలసిన బడ్జెట్ అంచనాలు లేవు. కేటాయింపులు సరిపోతాయా లేదా అని తేల్చడానికి అవి తప్పనిసరి. ఈ విభజన ప్రజా సంక్షేమ కార్యాలు రాష్ట్ర జాబితాలోనివని, అందుకోసం విస్తరణ అవకాశం ఉన్న ఆదాయ వనరులు రాష్ట్రాలు కలిగి ఉండాలనే ఊహపైన ఆధారపడి ఉన్నట్లు తోస్తున్నది. సబ్ కమిటీ 10వ పేరాలో ఉండే ప్రతిపాదనలలోని ప్రభుత్వాదాయం వైపు చూద్దాం. అన్నిటికంటే మొదటి ఆర్థిక వనరుగా 'కస్టమ్స్' ఉంది. అయితే ఇప్పుడు 'కస్టమ్స్' ఆదాయం వివిధ అంశాల మీద ఆధారపడి ఉంది. ఆర్థిక మాంద్యం సమయాలలో ఎగుమతులు తగ్గుతాయి. ప్రజల కొనుగోలు శక్తి తగ్గి దిగుమతులు కూడా తగ్గుతాయి. అంటే దీని వల్ల కస్టమ్స్ ఆదాయంలో ప్రత్యక్షంగా తగ్గుదల ఉంటుంది. రెండవదిగా ఈ ఆర్థికవనరు ముఖ్యంగా, రాబోయే కాలంలో అనుసరించే నిర్ణీత విధమైన పన్నుల విధానం మీద ఆధారపడి ఉంటుంది. దేశంలోని పరిశ్రమలకు, ఉత్పత్తులకు పోటీపడతాయని వాటిని పూర్తిగా రక్షించాలనే నమ్మకంతో ఉండే పార్టీ భారతదేశంలో అధికారంలోకి వస్తే అది దిగుమతులన్నిటికీ అడ్డుగోడ పెడుతుంది. అదే జరిగితే 'అత్యంత ఆర్థిక రక్షణ విధానం'తో దిగుమతుల్ని ఆపేస్తే అది కస్టమ్స్ ఆదాయానికి మూలం దగ్గరే గండి కొడుతుంది. అలా కాకుండా స్వేచ్ఛా వ్యాపారాన్ని నమ్మి దేశీయ పరిశ్రమలు, ఉత్పత్తుల విషయంలో రక్షణ కల్పించని పార్టీ అధికారంలోకి వస్తే ఫెడరల్ ప్రభుత్వం రక్షణలేని, స్వల్పమైన, కనీసమైన ఆదాయ వనరుల మీద ఆధారపడినట్లవుతుంది.

ఇప్పుడు ఫెడరల్ ప్రభుత్వం రెండవ ఆదాయవనరైన 'నల్లమందు' నే తీసుకొందాం.

భారత ప్రభుత్వ వార్త ప్రకారం, మనకు నల్లమందు ఎగుమతుల మీద వచ్చే మొత్తం 2 కోట్ల ఆదాయం పోతుందని, అయితే వైద్యం కోసం అమ్మే నల్లమందు ద్వారా 10 లేక 15 లక్షలు నిలుపుకోగలం అని భారత ప్రభుత్వం చెపుతున్నది. ఇది ఫెడరల్ ప్రభుత్వానికి ఎంత స్వల్ప ఆదాయ వనర దాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

సబ్ కమిటీ ఫెడరల్ ప్రభుత్వానికి కేటాయించిన మూడో ఆదాయ వనరు ఉప్పు పన్ను. ఈ ఆదాయ వనరు ఇప్పుడు వివాదాస్పదమైనది. భారతదేశ రాజకీయాల సుడిగుండంలోకి లాగబడింది. కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వస్తే ఈ పన్ను పూర్తిగా మాయమై పోతుంది. కాంగ్రెసు పార్టీ ఈ పన్నును పూర్తిగా తీసివేయడంలో కృతకృత్యత పొందుతుందా అన్న ప్రశ్న వదిలేసినా సామాన్య ప్రజలకు చాలా సన్నిహితంగా ముడిపడిన ఉప్పుకు సంబంధించిన పన్ను అధికాదాయం ఇస్తుందని ఫెడరల్ ప్రభుత్వం దాని మీద ఆధారపడలేదు.

చివరగా, సబ్ కమిటీ ఫెడరల్ ప్రభుత్వానికి మరొక ఆదాయ వనరుగా సూచించినది కార్పొరేషన్ పన్ను. ఈ ఆదాయం దాదాపు 3 కోట్ల రూపాయలని నాకు తెలిసింది. దీన్నిబట్టి ఇది ప్రస్తుతం చాలా స్వల్ప పరిమాణం కలిగిన ఆదాయ వనరుగా చెప్పవచ్చు. భారత దేశ అభ్యున్నతికి పారిశ్రామికీకరణ చాలా అవసరం అయిన అంశంగా నాకు తోస్తున్నది. పారిశ్రామికీకరణకు అధీకృత మూలధనం ఏర్పాటు అవసరం. అలాంటపుడు ఈ పన్నుల ఏర్పాటును దెబ్బతీసే విధంగా కార్పొరేటు పన్ను ఎక్కువ చేయలేమని నా భయం. బడ్జెటులోని ప్రభుత్వాదాయ పరంగా నేను ఆలోచించింది ఇది. వ్యయంవైపు పరిశీలిస్తే రక్షణకు తప్ప ఎక్కువగా కేంద్ర ప్రభుత్వం ఖర్చు చేయవలసిన పని లేదనే దృక్పథంపై సబ్ కమిటీ ఆధారపడి ముందుకు సాగింది. ఆధునిక కాలాల్లో ఏ ప్రభుత్వ కార్య నిర్వాహణ దృక్పథం అయినా ఇలా ఉంటుందని నేను అంగీకరించను. ఏ ప్రభుత్వ కార్యం అయినా పట్టించుకోవాల్సినవి రెండే రెండు : అరాజక రక్షకభటుడు అని ప్రజలు భావించే కాలం చరిత్రలో ఉండేది. కానీ మనం మారాం అనుకుంటున్నాను. ప్రభుత్వం ఒక్క ఆధిపత్యాన్నే కాదు. ప్రజల సంక్షేమాన్ని కూడా పట్టించుకోవాలని నమ్ముతున్నాం. ఇది నా దృక్పథం. ఇతరుల దృక్పథం వేరేగా ఉండవచ్చు. కొన్ని ప్రజా సంక్షేమ కార్యక్రమాల్ని కొన్నాళ్లపాటు కేంద్ర ప్రభుత్వం ఎల్లాగైనా నిర్వహించాల్సి ఉంటుంది. ఈ అంశం భారతదేశానికే ప్రత్యేకం అని నా భావన. మనం ఎల్లాగైనా – దళిత జాతులు అని పిలిచే ప్రజల సంక్షేమం, రక్షణ సహాయం చేసే భారాన్ని కేంద్రంలో ఉండే ప్రభుత్వం తన మీద తప్పకుండా వేసుకోవాలని నేను భావిస్తున్నాను. ఈ అంశాన్ని మరోచోట ప్రతిపాదించ బోతున్నాను. దళిత జాతుల సమస్య, అస్పృశ్యతా నివారణ ఇక మీదట స్థానిక లేదా రాష్ట్ర సమస్యగా తీసుకొనకూడదు. భారతదేశం అంతటా ఆసక్తి చూపే జాతీయ సమస్యగా దాన్ని పరిగణించాలి.

దళిత జాతుల జనాభాలో దాదాపు సమానమైన ఆటవిక జాతుల్ని ఒకటిగా చేసి నాగరికతా పరిధిలోకి తీసుకు వచ్చే పనిని కేంద్రంలో ఉండే ప్రభుత్వమే చేపట్టాలని నేను కోరుతున్నాను. ఆ

ప్రభుత్వమే 2వెనకబడిన ప్రాంతాల కోసం' కొన్ని కార్యాలు తానే నిర్వహించాలి. ఇంకో రకంగా చెప్పాలంటే కేంద్రంలో ఉండే ప్రభుత్వం ప్రతి పౌరునికి, ప్రతి జాతికీ నాగరిక జీవనం ఇవ్వగలిగే కనీస సంక్షేమ కార్యాలయినా చేపట్టాలని నా మనవి. అంతేకాదు, మొత్తం భారతదేశం మీదగానీ, ఒక ప్రత్యేక రాష్ట్రం మీదగానీ ప్రభావం చూపే విపత్తులు కొన్ని ఉంటాయి. అలాంటి విపత్తులు ఏ రాష్ట్రంలోనైనా ఉన్నప్పుడు దానిని ఎదుర్కొనే శక్తి ఆ రాష్ట్రానికి ఉండకపోవచ్చు. ఉదాహరణకు మలేరియా విపత్తును తీసుకొందాం. కొన్ని రాష్ట్రాల్లో అది చిన్న జబ్బు. కొన్ని రాష్ట్రాల్లో మలేరియా ప్రజల ప్రాణాలను హరించి వేస్తున్నది. మలేరియా నిర్మూలనకు తగిన ఆర్థిక వనరులు ఆ రాష్ట్రానికి లేకపోవచ్చు. అందువల్ల అలాంటి సమస్యను జాతీయ సమస్యగా తీసుకొని, జాతీయ ప్రభుత్వం ప్రజా సంక్షేమ కార్యక్రమాన్ని తానే చేపట్టాలి.

ఇంకా – అన్ని రాష్ట్రాలకు ఉండే సమాన కారణాలు కాక, కొన్ని ప్రత్యేక కారణాల వల్ల ఫెడరల్ ప్రభుత్వం కొన్ని రాష్ట్రాలకు ఆర్థిక సాయం చేయవలసి ఉంటుంది. ఉదా॥ వాయవ్య సరిహద్దు రాష్ట్రం సామ్రాజ్యవాద సంబంధిత సమస్యలతో ప్రత్యేక అనుబంధం కలిగి ఉన్నందువల్ల దానికి ప్రత్యేక భారాలున్నాయి. అదే విధంగా కొన్ని కొత్త రాష్ట్రాలు ఏర్పడవచ్చు. వాటి నిర్వహణకు గాను ఫెడరల్ ప్రభుత్వం ఆర్థిక సహాయం అందించవలసి ఉంటుంది.

నేను వివరించడానికి ప్రయత్నించిన విధంగా చూస్తే ఫెడరల్ ప్రభుత్వం వ్యయ పక్షంగా చూస్తే – సబ్ కమిటీ నివేదికలో ప్రతిపాదించిన దాని ఆదాయ పక్షంతో పోల్చి చూస్తే – ఫెడరల్ ప్రభుత్వం ఉపయోగాల కోసం రేఖా మాత్రంగా చెప్పిన ఆర్థిక విధానం సాధారణ సమయంలో తల మాత్రం కనిపించేంతగా నీళ్లలో మునిగిన పడవలా అరకొరగా సరిపోవచ్చు. సరిపోకపోవచ్చు కూడా. ఎదురుగాలి వస్తే పడవ మునిగిపోవడం ఖాయం.

అత్యవసర పరిస్థితి సందర్భంలో అసాధారణ అత్యవసర స్థితి అని నేను చెప్పాలి. సబ్ కమిటీ 21 పేరాలో సూచించిన ఏర్పాట్ల సంగతి ఇప్పుడు తీసుకొందాం. తన విభాగాలన్నిటినీ ఆర్థిక సహాయం ఇవ్వమని కోరే అధికారం ఫెడరల్ ప్రభుత్వానికి ఉండాలని సబ్ కమిటీ సిఫారసు చేసింది. ఇది సురక్షితం అయిన, ఖచ్చితమైన పద్ధతేనా అనే ప్రశ్న నా మనసులో ఉత్పన్నం అవుతున్నది. అన్ని పరిస్థితుల్లోనూ ఇది ఆధారపడతగ్గ పద్ధతేనా?

నా గౌరవనీయుడైన సహచరుడొకరు ఫెడరల్ ప్రభుత్వానికి అసాధారణ, అత్యవసర పరిస్థితిలో ఆర్థిక సాయం చేయడానికి రాష్ట్రాలు ఇష్టం చూపడం గురించి ఒక మాట అన్నారు. అసాధారణ అత్యవసర పరిస్థితిలో ఫెడరల్ ప్రభుత్వానికి ఆర్థిక సాయం రాష్ట్రాలు చేయవలసి వస్తే అప్పుడు అత్యవసర పరిస్థితి తలెత్తిందా లేదా అని నిర్ణయించడంలో కూడా వాటికి విచక్షణాధికారం ఉండాలని ఆయన చెప్పారు. అది అందరూ అంగీకరించే దృక్పథః కాదని నేను భావిస్తున్నాను. ఈ దృక్పథం ఒక అంశాన్ని తెలియజేస్తుంది. అదేమంటే అత్యవసర పరిస్థితిలో ఫెడరల్ ప్రభుత్వం ఆర్థిక

లోటును రాష్ట్రాలు ఇష్టపూర్వకంగా తీర్చడానికి ముందుకు రావనేదే ఆ అంశం. అత్యవసర పరిస్థితిలో తమ వాటా ఆర్థిక సహాయాన్ని ఇవ్వడానికి రాష్ట్రాలు ఆధారపడ్డ తగ్గవేనా? నేనీ ప్రశ్నను లేవనెత్తాను. కానీ దీనికి సమాధానం నేనే ఇవ్వాలనేమో తెలియదు. ఏమైనా సరే! ఇది ఆధారపడ తగ్గ పద్ధతిగా నాకనిపించడంలేదు. రాష్ట్రాలు రుణాలు చెల్లించే శక్తి కలిగి ఉండడం సంగతి వరకు విశ్వసనీయత ఉందని నాకు తెలుసు.కానీ, అత్యవసర పరిస్థితిలో ఈ అప్పులు చెల్లించే శక్తి ఉంటుందనడం సందేహాస్పదం. ఆ విషయంలో నేను నమ్మకంగా చెప్పలేను. ఛాన్సలర్! అందువల్ల నా అభిప్రాయం ఏమంటే – చాలినంత అనే స్థితి సాగే గుణం, అత్యవసర పరిస్థితి అనే ఉద్దేశాల కోసం ఫెడరల్ ప్రభుత్వ ఆర్థిక విధానం విస్తృత పరచడం మంచి మార్గం. అందువల్ల ఆదాయపు పన్ను అటు ఫెడరల్ ప్రభుత్వానికి, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలకు ఉమ్మడి ఆదాయ వనరుగా ఉండాలని నేను ప్రతిపాదిస్తున్నాను. అందువల్ల ప్రతి ప్రభుత్వం అవసరమైనపుడు ఆ ఆదాయవనరును ఉపయోగించుకొనే స్వతస్సిద్ధ హక్కు కలిగి ఉంటుంది. అప్పుడు 2 వ పేరాలో ఉద్దేశించిన ఆర్థిక సాయాలమీద ఆధారపడవలసిన పని ఉండదు.

ఈ విషయాన్ని నేను ప్రస్తావిస్తున్నప్పుడు ఆదాయ పన్ను పంపిణీ విధానాన్ని గురించి కూడా కొన్ని నిర్ణీత సూచనలు ఇవ్వాలనుకుంటున్నాను. అలా చెప్పబోయే ముందు రెండు ప్రతిపాదనలు సూచించాలనుకుంటున్నాను. మొదటిది – ఫెడరల్ ప్రభుత్వం – దాని విభాగాల – నేను మాట్లాడేది ముఖ్యంగా బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాల గురించి – మధ్య ఆదాయ వనరులు పంపిణీ చేసేటప్పుడు ఆయా రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి స్వయం సంపూర్ణంగా ఉండే స్థితి కల్పించాలి తప్ప ఆర్థిక సహాయం మీద ఆధారపడి ఉండేట్లు చేయకూడదు. రెండవది రాష్ట్రాల ఆర్థిక విధానం శాసనసభ పట్ల పాలకులు బాధ్యతగా మెలిగే విధానంగా కల్పించాలే తప్ప ఆ బాధ్యతను నాశనం చేసేదిగా ఉండకూడదు.

**ఛైర్మన్:** నేను మీ అభిప్రాయాలను సరిగ్గా వ్యాఖ్యానించగలిగితే – రాష్ట్రాల సమస్యలను ఎంత వీలైతే అంత తొందరగా సరైన దారిలో పెట్టడం చాలా ప్రధానం అంటారు. రాష్ట్రాల ఆర్థిక స్థితి గురించి ఏదైనా సూత్రం విధించాలి అనే మీ మాటల్తో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. దీన్నిబట్టి రాష్ట్రాల సమస్యల్ని వీలైనంత త్వరగా పరిష్కరించాలి అన్నది మీ అభిప్రాయంగా అనుకుంటాను.

***డా॥ అంబేద్కర్ :*** ఔను. అవి అలాగే ఉండాలి. నా మనవి ఏమంటే ఈ రెండు ప్రతిపాదనల్ని అనుసరించి – ఫెడరల్ ప్రభుత్వం ఆదాయపు పన్ను విషయంలో పన్నురేటును నిర్ణయించి, వచ్చిన రాబడిని రాష్ట్రాలకూ తనకూ మధ్య పంపిణీ చేయడం అనే పద్ధతి సరైంది కాదు. పన్ను వసూళ్ళను రెండు విధాలుగా – ఒకటి ఫెడరల్ ప్రభుత్వానికి, మరొకటి రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయిస్తాను. పన్నుల విచారణ కమిటీ ఆదాయపు పన్ను పంపిణీ విషయంలో ప్రతిపాదించిన పద్ధతిలో నేను 'వ్యక్తిగత ఆదాయాన్ని' రాష్ట్రాలకు, మిగతా ఆదాయాన్ని ఫెడరల్ ప్రభుత్వానికి కేటాయిస్తాను. వ్యక్తిగత ఆదాయంపై పన్నురేటును ఆయా రాష్ట్రాలు తమ అవసరాల్ని బట్టి విధించాలి గానీ ఫెడరల్ ప్రభుత్వం విధించకూడదు.

# 35వ సమావేశం - 15 అక్టోబర్ 1931

## శీర్షిక - 4

### (ఫెడరేషన్, దాని యూనిట్ల మధ్య ఆర్థిక వనరుల పంపిణీ)

### ఫెడరల్ ఆర్థిక ఉప సంఘం నివేదిక మీద చర్చ

***డా॥ అంబేద్కర్ :** ఛాన్సలర్! ఫెడరల్ ప్రభుత్వం కోసం సబ్ కమిటీ యోచించిన ఆర్థిక విధానం చాలినంతది కాదని, సాగే గుణం లేనిదని నాకు తోస్తున్నట్లు మీకు నిన్న చెప్పాను. ఆ ఆర్థిక విధానం ఏదైనా అత్యవసర పరిస్థితివల్ల వచ్చే ఒత్తిడిని తట్టుకొనే శక్తిని కలిగింది కాదు. ఫెడరేషన్‌కు, దాని విభాగాలకు ఆదాయపు పన్నును ప్రధాన ఆర్థిక వనరుగా చేసి కమిటీ రూపొందించిన ఆర్థిక పంపిణీలో మార్పు చేయవలసిన అవసరం ఉంది. ఒక ఆర్థిక వనరు పంపిణీ ప్రణాళికను ఆలోచించేటపుడు రెండు ప్రతిపాదనలు మనసులో ఉంచుకోవాలని నిన్ననే చెప్పాను. ఫెడరేషన్‌దిగానీ, రాష్ట్రాలదిగానీ ఆర్థిక విధానం స్వయం ప్రతిపత్తిని, స్వయం సమృద్ధిని కలిగి ఉండాలనేది మొదటి ప్రతిపాదన. కార్య నిర్వాహక వర్గానికి విధానసభ పట్ల తప్పనిసరిగా ఉండవలసిన బాధ్యతా భావాన్ని ఇది బలహీనపరిచే విధంగా ఉండకూడదనేది రెండో ప్రతిపాదన. ప్రభుత్వ ఆర్థిక సహాయాలు, విరాళాలు - అలాంటి స్వయం ప్రతిపత్తి, స్వయం సంపూర్ణత కలిగిన ఆర్థిక విధానం - పరస్పర విరుద్ధాలన్నది స్పష్టం. అవి కార్య నిర్వాహక వర్గానికి, విధాన సభ పట్ల ఉండే బాధ్యతా భావాన్ని బలహీనపరుస్తాయి. అలాగే విధాన సభకు కార్య నిర్వాహక వర్గం మీద ఉదాసీన భావాన్ని పెంపొందిస్తాయి. సరఫరాలను కార్య నిర్వాహక వర్గానికి నిరాకరించే అధికారం బయటినుంచి సంపాదించిన వనరులను కార్య నిర్వాహక వర్గం వినియోగం చేయనివ్వని అధికారం విధానసభ కలిగి ఉండడం విధానసభ ఆలోచనలకు అనుకూలంగా పరిపాలకుల్ని నియంత్రించే సమర్థమైన పద్ధతులు కావు. ఈ దృక్కోణం నుంచి పరిశీలించినపుడు, ఆదాయపు వనరుల్ని విభజించడం చాలా ముఖ్యమైన అంశం అవుతుంది. ఫెడరేషన్‌ను, రాష్ట్రాలను స్వయం ప్రతిపత్తి, స్వయం సంపూర్ణత కలిగి ఉండేట్లు చేసేదిగా ఈ ఆర్థిక వనరుల పంపిణీ ఉండాలి. లేదా ప్రభుత్వ ఆర్థిక సహాయాల, విరాళాల సర్దుబాటు లేకపోతే స్వయం ప్రతిపత్తిని, స్వయం సమృద్ధిని పొందలేని ఆర్థిక విధానంగానైనా ఈ ఆర్థిక వనరుల పంపిణీ ఉండాలి.

ఫెడరేషన్, రాష్ట్రాల ప్రధాన ఉమ్మడి రాబడిగా ఉన్న ఆదాయపు పన్ను లావాదేవీల్లో ఒక ప్రత్యేక పద్ధతిని నేను సూచించే ముందు ఇలాంటి పరిశీలనలే నాకు దారి చూపాయి. ఉమ్మడి రాబడి వనరుగా ఆదాయపు పన్నుకు సంబంధించిన లావాదేవీలు జరపడానికి రెండు విధాలైన సంభవనీయ మార్గాలున్నాయి. మొదటిది : ఆదాయ వనరును వేరుచేసి, ఆదాయాన్ని విభజించడం. రెండవది: నియామక పద్ధతి లేదా ఆదాయ వనరుల్ని విభజించడం ద్వారా ఆదాయాన్ని పంచడం. మొదటి

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ, సంపుటి 1, పుట 534-40

పద్ధతిలో ఆదాయపు పన్నురేటును నిర్ణయించే అధికారం పూర్తిగా ఒకే పరిధిలోనే ఉంటుంది - సహజంగా అది ఫెడరల్ ప్రభుత్వ పరిధిలోనే ఉంటుంది. అలాంటప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ఆదాయపు పన్ను రాబడిలో కొంత భాగం పుచ్చుకొనే నిష్క్రియా భాగస్వామిగా మాత్రమే ఉంటుంది. రెండో పద్ధతిలో రెండు ప్రభుత్వాలు తమ తమ ఆదాయపు పన్నురేట్లను నిర్ణయించే సమాన పరిధిని కలిగి ఉంటాయి. ఒక రాష్ట్రం ఆ రాష్ట్ర పరిధిలో అమల్లో ఉండే విధంగా తన ఆదాయపు పన్నురేటును నిర్ణయిస్తుంది. ఫెడరేషన్‌లోని అన్ని విభాగాల్లోనూ అమల్లో ఉండే విధంగా ఫెడరేషన్ తన ఆదాయపు పన్నురేటును నిర్ణయిస్తుంది. ఆదాయపు పన్నుకు సంబంధించిన పరిపాలనా వ్యవహారాలు, ఆదాయపు పన్ను వసూలు ఫెడరేషన్ పరిపాలన అంశాల్లో ఒక భాగంగా ఉంటాయనే దృక్కోణం నుంచి ఆదాయ పంపిణీ వ్యవస్థలో రెండో పద్ధతిని అంగీకరించడం మంచిదని నా భావం. ఫ్రాన్సు, బెల్జియం, ఇతర ఐరోపాదేశాల్లో ఉండే పద్ధతికీ దీనికీ పెద్ద తేడా లేదు. ఈ ప్రణాళిక కింద రెండు రకాలైన ఆదాయపు పన్నురేట్లు ఉంటాయి. 1) ఫెడరల్ రేటు: ఫెడరల్ ప్రభుత్వం తన అవసరాలకు తగినట్లు ఎప్పటికప్పుడు నిర్ణయించే రేటు 2) రాష్ట్రాల రేటు : తమ తమ అవసరాలకు తగినట్లు ఆయా రాష్ట్రాలు ఎప్పటికప్పుడు నిర్ణయించే రేటు. ఇప్పటిలాగానే ఫెడరల్ ప్రభుత్వం ఆదాయపు పన్ను మొత్తానికి సంబంధించిన పరిపాలన వ్యవహారాలు చూస్తూ, పన్ను రాబట్టడం చేస్తూ ఉంటుంది.

ఈ ప్రణాళిక లాభాలు స్పష్టంగా ఉన్నాయి. మొదటిది : ఇప్పుడుండే ఆర్థిక సహాయాల, విరాళాల పద్ధతి పోతుంది. దానివల్ల ఫెడరేషన్‌లోని ప్రతి రాష్ట్రం యొక్క ఆర్థిక వ్యవస్థ స్వయం ప్రతిపత్తి, స్వయం సంపూర్ణత కలిగి ఉండడానికి అవకాశం ఏర్పడుతుంది. రెండవది : ఆదాయ వనరుల్ని సమీకరించుకోవడానికి విధానసభ అంగీకారం పొందాలనే బాధ్యతా భావాన్ని కార్య నిర్వాహక వర్గంలో కలిగిస్తుంది. మూడవది : ఇది చాలా ప్రధానమైన అంశం. ఒక రాష్ట్రం తన క్షేమం కోసం మరో రాష్ట్రం మీద భారం పడదు. మరో పద్ధతి అయిన ఆదాయపు వనరును విభజించడం వల్ల - ఒకే ఫెడరల్ రేటు అన్ని రాష్ట్రాల్లోనూ ఉండి, వచ్చిన ఆదాయాన్ని పంపిణీ చేయడం వల్ల ఒక రాష్ట్రంలో వచ్చిన రాబడీ, పంపిణీలో ఆ రాష్ట్రానికి వచ్చిన రాబడీ రెండూ సమానంగా ఉండవలసిన అవసరం లేకుండా పోతుంది. కొన్ని రాష్ట్రాలు ఎక్కువ ఆదాయాన్ని ఇచ్చి తక్కువ రాబడిని పొందుతాయి. ఇలాంటి రాష్ట్రాలకు పైన చెప్పిన పద్ధతి - ఒక రాష్ట్రం మేలుకోసం మరో రాష్ట్రం మీద భారం వేయడానికి అనుసరించే రహస్య పద్ధతి అవుతుంది.

ప్రస్తుతం నేను సూచించిన పద్ధతికి వ్యాపారం, పరిశ్రమల ఆదాయపు పన్నుల్లో ఒకే మాదిరిరేటు కావాలని ఒత్తిడి చేసే వారి నుండి ఒక ఆక్షేపణ ఉంటుంది. రేటులో ఏకరూపత కోరదగిందేకానీ దాని ప్రాధాన్యాన్ని ఇక్కడ అతిశయోక్తిగా చెప్పడం సులభంగా జరుగుతున్నది. భారతదేశం ఐరోపా అంత పెద్ద దేశం. ఐరోపాలో వ్యాపారం, పరిశ్రమల్లో ఆదాయపు పన్నురేటు ఒకేలాగా లేదు. అయినా వ్యాపారం, పరిశ్రమలు ఇతర దేశాల్లో లాగానే బాగా సాగుతున్నాయి.

అలాంటపుడు భారతదేశంలో మాత్రం దీనికి భిన్నంగా ఎందుకుండాలి? ఆదాయపుపన్ను రేటులో ఏకరూపత కావాలని కోరేవారు భూమి శిస్తు రేటును గురించిన వాస్తవాలు పరిశీలించిన తర్వాత ఏం సమాధానం చెప్పగలరు? భూమి శిస్తు రేటులో ఏకరూపత లేనేలేదు. అంతేకాదు, ఏకరూపతకు విరుద్ధంగా ఆశ్చర్యం గొలిపేంత నానావిధాలైన రేట్లు ఉన్నాయి. ఏ రెండు రాష్ట్రాల్లోనూ భూమి శిస్తు రేటు సమానంగా లేదు. భూమి శిస్తు వేసే పద్ధతుల్లో కూడా ఏ రెండు రాష్ట్రాలూ సమానంగా లేవు. అందువల్ల ఈ ఆక్షేపణ ఆదాయపు పన్ను విషయంలో వ్యాఖ్యానించిన పద్ధతిని కొట్టి పారేయలేదు. సబ్ కమిటీలోని సభ్యులకు సముచిత గౌరవం ఇస్తూ – కేటాయింపుల్లో వారు చేసిన ప్రతిపాదనల్ని మెరుగుపరచడానికే నేనీ పద్ధతి సూచించాను. ఈ పద్ధతి సాధారణ పరిస్థితుల్లో గానీ అసాధారణ పరిస్థితుల్లో కానీ అన్ని వ్యవస్థల అవసరాల్ని తీరుస్తుంది.

నిన్న నేను ఇచ్చిన వివరణల్లో ఒకదాన్ని ఉపసంహరించుకోవాలనుకుంటున్నాను. నా ప్రణాళిక పన్నుల విచారణ సంఘం సిఫారసు చేసిన ప్రణాళిక అని చెప్పాను. ఈ చర్చలకోసం నేను తయారు చేసుకున్న నోట్సులో తప్పుగా చేరిన అంశం వల్ల ఈ పొరపాటు జరిగింది. ఆ ప్రణాళికను పన్నుల సంఘంవారు పరిశీలించారని చెప్పవలసింది. పెద్ద అవరోధం లేకపోయినా కమిటీ ఆ ప్రణాళికను సిఫారసు చేయలేదు.

నేను చెప్పబోయే మరో అంశం సబ్ కమిటీ నివేదికలోని 12వ పేరాకు సంబంధించినది. అవశిష్ట అధికారాలను గురించిన వ్యవహారం. ఈ అవశిష్ట అధికారాలు ఫెడరేషన్ విభాగాల అధీనం చేయబడతాయని సబ్ కమిటీ ముందే ఊహించుకొంది. దాని ఆధారంగా షెడ్యూల్‌లో లేని పన్నుల్ని వసూలు చేసే అధికారం ఫెడరేషన్‌లోని విభాగాల అధీనంలో ఉండాలని సిఫారసు చేసింది. ఈ అభిప్రాయానికి సబ్ కమిటీ ఎలా వచ్చిందో తెలియడంలేదు. కానీ 12వ పేరాలో ఒక వాక్యం ఉంది. ఈ సిఫారసు కాకుండా మరే సిఫారసు చేయడానికయినా రాజ్యాంగ ఆక్షేపణ ఉన్నట్లుగా సబ్ కమిటీ అభిప్రాయపడింది. దీన్నిబట్టి సబ్ కమిటీ దృక్కోణంలో ఏ ఫెడరేషన్లో అయినా పన్నులకు సంబంధించిన 'అవశిష్ట అధికారాలు' ఫెడరేషన్లోని రాష్ట్రాలకు ఉండాలని బోధపడుతున్నది. అంటే ఈ అంశం ఫెడరేషన్‌కు సంబంధించిన తప్పనిసరి పరిణామమేమీ కాదు. ఫెడరల్ రాజ్యాంగం అయినా కెనడా దేశ రాజ్యాంగంలో సెక్షన్ 91, 3వ పేరాలో పరిశీలిస్తే పన్నులు విధించే అధికారం కెనడా దేశ కేంద్ర ప్రభుత్వానికే ఉంది. సబ్ కమిటీలో సూచించినట్లుగా కెనడ దేశ కేంద్ర ప్రభుత్వానికి పన్నులు వేసే అధికారంలో కుదింపు షరతు లేదు. మనం చాలా దూరంగా ఊహించుకొనే సందర్భానికి తగినట్లేపై పేరా ఉదహరించబడింది. పన్నులు వేసే విషయంలో కేంద్ర ప్రభుత్వానికి అపరిమిత సర్వాధికారాలు కెనడా రాజ్యాంగం ప్రసాదించింది. అయితే నేను కెనడాను తప్పుగా ఉదాహరించానని ఆక్షేపించవచ్చు – ఎందుకంటే 'అవశిష్ట అధికారాలు' కూడా కెనడా రాజ్యాంగాన్ననుసరించి కేంద్ర ప్రభుత్వం అధీనంలో ఉంటాయి కానీ దాని రాష్ట్రాల అధీనంలో ఉండవు కాబట్టి. విభాగాల అధీనంలో 'అవశిష్ట అధికారాలు' ఉండే ఉదాహరణ – ఆస్ట్రేలియాను

తీసుకొంటాను. అక్కడ కూడా పన్నువేసే 'అవశిష్ట అధికారాలు' రాష్ట్రాల అధీనంలో లేవు. ఫెడరల్ ప్రభుత్వం అధీనంలో ఉన్నాయి. ఆస్ట్రేలియా రాజ్యాంగం 51వ సెక్షన్, 2 పేరా ఇలా చెప్తుంది. పన్నువేసే అధికారం కేంద్రప్రభుత్వం చేతిలో ఉంటుంది కానీ - రాష్ట్రాలలో కానీ, రాష్ట్ర భాగాలలో కానీ పన్నువేసేటప్పుడు విచక్షణ చూపకూడదు. ఈ విషయాన్ని పరిశీలిస్తే ఆస్ట్రేలియా ఫెడరల్ ప్రభుత్వం రాష్ట్రాలలో పన్నులు వేసే పద్ధతుల్ని కూడా నియంత్రించేంత విస్తృతమైన అధికారం కలిగి ఉన్నట్లు బోధపడుతుంది. 'కామన్వెల్తు ఆఫ్ ఆస్ట్రేలియా' మొదటి ప్రచురణపైన మూర్ చేసిన వ్యాఖ్యలో పై అంశం తడవబడింది. ఆస్ట్రేలియా ఫెడరేషన్‌కు పన్నులు వేసే అధికారంలో ఉండే విస్తృతిని గురించి మూర్ ఇలా చెప్పారు.

"కామన్వెల్తు ఏర్పాటు అయిన తర్వాత రాష్ట్రాల పరిధిలోని ఆస్తుల మీద రాష్ట్రాలు పన్ను వేసే అధికారం కట్టుబాటు చేయబడింది. ఇది కామన్వెల్తు 'సహకారితలకు' వ్యాపిస్తుంది. దానివల్ల కస్టమ్స్‌లో ఏకరూప సుంకాలు ఏర్పడతాయి. రాష్ట్రాలు కస్టమ్స్ మీద, ఎక్సైజు మీద, అంతర్రాష్ట్రవర్తక వ్యాపారాల మీద పన్నులు విధించలేవు. ఇతర రాష్ట్రాల్లో ఉండే బ్రిటిష్ పౌరులమీద చూపే పక్షపాతం ఇప్పుడు ఆచరణాత్మకం కాదు."

నేనిప్పుడు చెప్పబోయేది చాలా ముఖ్యమైన అంశం.

"చివరగా, కామన్వెల్తు అధికారంలో ఉండే పన్నులు వేసే విధానం కోసం చేసే చట్టాలు రాష్ట్రాల పన్ను వేసే విధానాన్ని క్రమబద్ధం చేయగలిగే విస్తృతిని కలిగి ఉన్నాయి."

రాష్ట్రాల అధీనంలో 'అవశిష్ట అధికారాలు' ఉండే రాజ్యాంగాల్లో ఆస్ట్రేలియా రాజ్యాంగం ఒకటి. ఆర్థిక విషయాల్లో మాత్రం 'అవశిష్ట అధికారాలు' రాష్ట్రాల చేతుల్లో గాక ఫెడరల్ ప్రభుత్వం చేతిలో ఉన్నాయి. అమెరికా రాజ్యాంగాన్నే తీసుకుందాం. ఇక్కడ కూడా చట్టాలు చేసే అవశిష్ట అధికారాలు ఫెడరల్ ప్రభుత్వం చేతిలో ఉన్నా వారి రాజ్యాంగం ఆర్టికల్ 1లోని 8వ సెక్షన్‌లో ఇలా ఉంది.

"పన్నులు, సుంకాలు, ఎక్సైజు పన్నులు మొదలైనవి విధించడానికి, వసూలు చేయడానికి కాంగ్రెసుకు అధికారం ఉంది. ఈ ఆదాయం రుణాలు తీర్చడానికి, రక్షణకు దేశ సంక్షేమానికి ఉపయోగపడుతుంది. అయితే అమెరికాలోని అన్ని రాష్ట్రాల్లో కూడా ఈ పన్నులు, సుంకాలు, ఎక్సైజు మొదలైనవి అన్ని సమానంగా ఉండాలి". ఇక్కడ కూడా అమెరికా కేంద్ర ప్రభుత్వం మీద పన్నుల వసూలు విషయంలో ఎలాంటి నియంత్రణా లేదు. రాజ్యాంగ శాసనం దృక్కోణంలో చూస్తే సబ్ కమిటీ చేసిన సిఫార్సుకు గట్టి కారణం కనిపించదు.

నేను మరోసారి విన్నవించేదేమంటే, పన్నులు వసూలు చేసే 'అవశిష్ట అధికారాలు' రాష్ట్రాలకు ఉండాలా? ఫెడరల్ ప్రభుత్వం అధీనంలో ఉండాలా అనేది మరే ఇతర దేశంలోనూ తలెత్తని కృత్రిమ ప్రశ్న. ఇది మరే దేశంలోనూ లేదు. ఏ ప్రభుత్వం చేతగానీ, ఫెడరల్ రాజ్యాంగ

రచయితల చేతగానీ విధించబడలేదు. కానీ, మనం పన్నులు విధించే రంగాల్ని విభజించడమేగాక ఫలానా పద్ధతిలో ఫలానా రూపంలో పన్నులు వేసే అధికారం ఉండాలని నిర్దేశిస్తున్నాం. ఇది అవసరం అని నేను భావించడంలేదు. మొదటగా – పన్నులు వేసే విధానంలో అది గతానుగతికమైన మార్పులేని తనాన్ని కలిగిస్తుంది. భవిష్యత్కాలంలో రాబోయే ఆర్థికమంత్రుల చాతుర్యాన్ని ఇది పరిమితం చేస్తుంది. పన్నులు వేసే అధికారాల్లోగానీ, కొత్తగా పన్నులు విధించే నిర్ణయాల్లో గానీ తన అధికారానికి పరిమితి ఉండే ఆర్థిక విధానాన్ని నడపడానికి బాధ్యతను ఏ ఆర్థికమంత్రీ స్వీకరిస్తాడని నేననుకోను.

అందువల్ల – నా అభిప్రాయం ఏమంటే, మన రాజ్యాంగంలో ఈ షెడ్యూళ్లని పూర్తిగా తీసేయాలి. ఇతర ఫెడరల్ దేశాల్లోలాగా ఫెడరల్ ప్రభుత్వం విధించాలనుకునే కస్టమ్స్ కానీ, ఎక్సైజుగానీ రాష్ట్ర ప్రభుత్వాలు విధించకూడదు. మిగతా రంగాల్లో రెండు ప్రభుత్వాలు వాటి ఇష్టం వచ్చిన రీతిలో పన్నులు విధించే క్షేత్రాన్ని విభజించుకోవాలి. నేను చెప్పే ఈ అంశమే ఇతర ఫెడరల్ దేశాల్లో ఖచ్చితంగా పాటించబడుతున్నది. అందువల్ల మన రాజ్యాంగంలో పన్నుల విధింపులో అవశిష్ట అధికారాలకు సంబంధించిన సూత్రాన్ని ప్రవేశపెట్టాల్సిన పనిలేదని నా అభిప్రాయం.

ఫెడరల్ ఆర్థిక విధానంలో రాష్ట్రాల పాత్రను గురించి నా తర్వాతి అంశంగా ప్రతిపాదిస్తున్నాను. సబ్ కమిటీ నివేదికలోని ఈ భాగాన్ని నేను పరిశీలించినపుడు ఫెడరల్ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాల నుండి ఆదాయంలో ఏ శీర్షిక కింద అదనంగా లాభం పొందిందో తెలుసుకోవాలని చూశాను. ఫెడరల్ ప్రభుత్వం అదనంగా ఏ ఆర్థిక వనరును కూడా రాష్ట్రాల నుండి పొందలేదు. కస్టమ్స్ విషయంలో ఆ ఆదాయం ఎప్పుడూ రాష్ట్రాల ఆదాయ పరిధి కిందికి రాదు. రాష్ట్రాలు కొంటాయి కాబట్టి ఉప్పుమీద వచ్చే ఆదాయం మొదటి నుండీ భారత ప్రభుత్వానిదే. నగదు బహుమతులు, దత్త మండలాల మీద వచ్చే ఆదాయం ఫెడరేషన్ ఏర్పడకున్నా కేంద్ర ప్రభుత్వానికి వచ్చే ఆదాయ వనరులే. తమకు అంతకు ముందుండే ఏ ఆర్థిక హక్కుల్ని కూడా ఫెడరేషన్లో చేరేటపుడు రాష్ట్రాలు ఫెడరేషన్‌కు దాఖలు పరచడంలేదు. అయితే వారు ఫెడరేషన్‌కు సమకూర్చే ఆదాయం ఒకటే కనిపిస్తుంది. అది – ఇండియా రక్షణ కోసం సైన్యం మీద రాష్ట్రాలు పెట్టే ఖర్చు మాత్రమే. కమిటీ నివేదికలో చూస్తే సైన్యం మీద అయ్యే ఖర్చు చాలా స్వల్పం – 2 కోట్ల 38 లక్షల రూపాయలు అని తేలుతుంది. నివేదికలో నేను గమనించిన మరో అంశం. ఫెడరేషన్‌కు సంబంధించిన ఆర్థిక భారాల్లో రాష్ట్రాలకూ, స్వదేశ సంస్థానాలకు చూపిన తులనాత్మక వ్యవహారం. ఈ అంశాన్ని నేను పరిశీలించినపుడు తేలిందేమంటే సబ్ కమిటీ బరువును సమానంగా మోయడం అనే సూత్రాన్ని గాలికి వదిలేసింది అని. నివేదిక అంతటా ఈ అసమానత్వం ఎలా వ్యాపించిందో చూడండి. రాష్ట్రాలు ఫెడరల్ ప్రభుత్వ 'ప్రత్యక్ష, 'పరోక్ష పన్నుల భారాన్ని వహించాలి. సంస్థానాలు ఫెడరల్ ప్రభుత్వ 'పరోక్షపన్నుల భారాన్ని వహించాలి. సంస్థానాలు ఫెడరల్ ప్రభుత్వ 'పరోక్ష పన్నుల భారాన్ని వహిస్తే చాలు. కనీసం కార్పొరేషన్ పన్నును కూడా సంస్థానాలు భరించాలని కమిటీ నిర్దేశించలేదు. సంస్థానాలు ప్రత్యక్ష

పన్నుల భారం నుంచే గాక ఇపుడు సమర్పించే విరాళాల్ని నగదు బహుమతుల భారం నుండి కూడా తప్పించబడ్డాయి. రెండవది : రాష్ట్రాలు వాటి పరిధిలో 'కస్టమ్స్' వసూలు చేయకూడదు. కానీ సంస్థానాలు మాత్రం వసూలు చేసుకోవచ్చు. ఫెడరేషన్ ఆశయాల్లో ఒకటి - ఫెడరేషన్‌లో 'వ్యాపార స్వేచ్ఛ' కలిగి ఉండడం. ఈ ఆశయానికి సంస్థానాలు 'కస్టమ్స్' వసులు చేయడం విరుద్ధం. అది ఫెడరేషన్ ఆదాయానికి గండి కొడుతుందని తెలిసినా సబ్ కమిటీ పై అంశాన్ని ఒప్పుకొంది. మూడవది : రాష్ట్రాలు వాటి ఆదాయాల్ని ఫెడరల్ రుణాలకు సెక్యూరిటీగా పెట్టాలి. సంస్థానాలు ఈ బాధ్యత నుంచి తప్పించబడ్డాయి. సంస్థానాలకు వాటి పరిధిలో 'కస్టమ్స్' వసూలు చేసే అధికారాన్ని ఇవ్వడంలోని ఆంతర్యాన్ని సులభంగా అర్థం చేసుకోవచ్చు. వాటి 'కస్టమ్స్'ను ఫెడరేషన్ తీసుకొంటే వాటి ఆర్థిక విధానం అస్తవ్యస్తం అయిపోతుందనేది ఆ అభిప్రాయం. అయితే అర్థం కానిదల్లా ఒకే విషయం. ఫెడరల్ ప్రభుత్వ ప్రత్యక్ష భారాల నుండి సంస్థానాలను మినహాయించడం, సంస్థానాలు వాటి ఆదాయాల్ని ఫెడరేషన్ రుణాలకు సెక్యూరిటీగా పెట్టకపోవడాన్ని సబ్ కమిటీ ఏ కారణాల వల్ల సిఫారసు చేసిందో తెలియడంలేదు.

ఛాన్సలర్! ప్రస్తుతం లాంచనపూర్వక ఉత్సవాల విషయంలో సంస్థానాలు - రాష్ట్రాల మధ్య ఈ విచక్షణ చూపబడడం అంగీకరించవచ్చు. సంస్థానాల విషయంలో వారు కోరిన వాటిని అంగీకరించవచ్చు. అయితే ఆర్థిక విషయాలు వచ్చినపుడు మనం 'వ్యాపారం వ్యాపారమే' అనే సూక్తిని అనుసరించాలి. బ్రిటిష్ ఇండియా ఫెడరేషన్ ప్రయోజనం కోసం త్యాగం చేసేటపుడు ఫెడరేషన్ ప్రయోజనాల కోసం అన్ని రాష్ట్రాలు కూడా ఎందుకు త్యాగాలు చేయకూడదు? అందువల్ల కమిటీ నివేదికలోని ఈ భాగానికి నేను సవరణలు కొన్ని ప్రతిపాదిస్తాను.

1. ఫెడరల్ ప్రభుత్వం 'ప్రత్యక్ష పన్నులు' తమ సంస్థానాల్లో వేసే అధికారాన్ని సంస్థానాలు తప్పకుండా సమ్మతించాలి. ఇలా అంగీకరించేంత వరకు నగదు బహుమతులు, దత్త ప్రాంతాల విషయంలో ఎట్టి సడలింపూ ఇవ్వకూడదు.
2. ఫెడరల్ ప్రభుత్వ ఆర్థిక విధానానికి హాని కలిగించే తమ ఆర్థిక విధానంలో సరైన మార్పు చేసి నిర్ణీత సమయంలో తమ అంతర్గత పరిధిలో వసూలు చేసే 'కస్టమ్స్'ను రద్దు చేయాలి.
3. సంస్థానాలు తమ ఆదాయాల్ని ఫెడరల్ రుణాలకు సెక్యూరిటీగా తాకట్టు పెట్టాలి.

గౌరవనీయ ఛాన్సలర్! ఈ అంశం మీద నేను చెప్పవలసింది ఇంతే.

## 38వ సమావేశం – 22 అక్టోబర్ 1931

### శీర్షిక – 4

### (ఫెడరేషన్ – దాని రాష్ట్రాల మధ్య ఆర్థిక వనరుల పంపిణీ)

### ఫెడరల్ ఆర్థిక ఉప సంఘం నివేదిక పైన చర్చ

***డా॥ అంబేద్కర్ :** నేను ఒక అంశం చెప్పాలనుకుంటున్నాను. ఫెడరల్ ఆర్థిక సబ్ కమిటీ నివేదికలో ప్రతిపాదించబడిన సిద్ధాంతాల మీద ఒక సాధారణ అంగీకారం కుదిరిందని ఇప్పుడే లార్డ్ పీల్ చెప్పారు. ఫెడరల్ నిర్మాణ కమిటీలోని ఇతర సభ్యుల అభిప్రాయాలు ఎలా ఉన్నా ఫెడరల్ ఆర్థిక సబ్ కమిటీ ప్రతిపాదించిన సిద్ధాంతల్ని నేను అంగీకరించలేను. నేనీ విషయంలో సంకోచపడుతున్నాను. ఫెడరల్ ప్రభుత్వ భవిష్యత్తు ఆర్థిక విధానం ఒక పటుత్వంగల విధానంగా ఉండడానికి దోహదపడే మార్పులు, సవరణల్ని ఆర్థిక సిద్ధాంతాల్లో ప్రతిపాదించే హక్కు కమిటీకి ఉన్నట్లు ఆ కమిటీ అర్థం చేసుకున్నట్లయితే ఈ కమిటీ నియామకాన్ని నేను వ్యతిరేకించను.

### శీర్షిక – 8

### (ఫెడరల్ కోర్టు)

+**డా॥ అంబేద్కర్ :** గౌరవనీయ ఛాన్సలర్! భారతదేశంలో ఫెడరల్ కోర్టు స్థాపన గురించి యోచించేటప్పుడు దానికి సంబంధించి ముఖ్యంగా మూడు ప్రశ్నల్ని మనం గమనించాలి. మొదటి ప్రశ్న : ఈ ఫెడరల్ కోర్టు అధికార పరిధి. రెండు : ఫెడరల్ కోర్టు తీర్పుల్ని, నిర్ణయాల్ని అమలు చేసే అధికారం. మూడు : ఫెడరల్ కోర్టు వ్యవస్థ. ప్రతి శీర్షిక మీద నేను కొన్ని విశేషాంశాల్ని చెపుతాను. మొదటి శీర్షిక అయిన ఫెడరల్ కోర్టు అధికార పరిధికి సంబంధించిన పరిశీలన గురించి మాట్లాడతాను. ఫెడరల్ రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించడం, వివరించడం ఫెడరల్ కోర్టు విధుల్లో ఒకటి అనేది అందరూ అంగీకరించిన ప్రతిపాదన. ఏక కేంద్ర ప్రభుత్వ విధానంతో భేదం చూపడం ఫెడరల్ ప్రభుత్వం ప్రత్యేక లక్షణం. కర్తవ్యాల విభజన ఫెడరల్ ప్రభుత్వంలో ప్రధానంగా ఉంటుంది. రెండు ప్రత్యేక రంగాలు ఉంటాయి. ఒక రంగం ఫెడరల్ ప్రభుత్వానికి, మరొక రంగం సంస్థానాల లేదా రాష్ట్ర ప్రభుత్వాలకు శాసనబద్ధంగా కేటాయించబడతాయి. ఫెడరేషన్లో ముఖ్యాంశం ఏమంటే ఒకరి రంగంతో మరొకరు జోక్యం చేసుకోకపోవడం. ఇది సక్రమంగా జరగడానికి, రెండురకాల ప్రభుత్వాల్ని వాటివాటి రంగాలకు అంటిపెట్టుకొనేట్లు చేయడానికి ఫెడరల్ న్యాయవ్యవస్థ అవసరం అని తేలుతునది. ఫెడరల్ కోర్టు ప్రయోజనాల్లో ఇది ఒకటి. అయితే ఫెడరల్ కోర్టు ఏర్పాటుకు మరో

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 685.

\+ పైదే. పుట 689–702.

ప్రయోజనం కూడా ఉందని నాకు తోస్తున్నది. ఫెడరల్ కోర్టు న్యాయవ్యవస్థ అంతర్జాతీయ న్యాయస్థానంగా కూడా చెప్పుకోవాలి. చాలా జాతీయ ప్రభుత్వాలు ఫెడరేషన్‌గా ఎందుకు రూపొందాయంటే వివిధ రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఉన్న తగాదాలు – ఫెడరేషన్ ఏర్పడక ముందు రాజనీతి ద్వారానో, రాజనీతి తప్పిపోతే యుద్ధం ద్వారానో తేల్చుకొనే వాటిని – ఫెడరల్ కోర్టు న్యాయ నిర్ణయాల ద్వారా తేల్చుకోవాలనుకున్నారు. ఎందుకంటే – అన్ని రాష్ట్రాల ప్రజలు ఫెడరల్ కోర్టు పరిధిలోకే వస్తారు కాబట్టి. ఈ దృక్కోణం అమెరికా సుప్రీంకోర్టు తీసుకొంది. లూసియానా – టెక్సాస్ మధ్య వివాదంలో అమెరికా సుప్రీంకోర్టు వారి తీర్పునుంచి ఒక చిన్న పేరాను చదువుతాను.

***ఛైర్మన్ :*** దాని తారీఖు ఏమిటి?

***డా॥ అంబేద్కర్ :*** 1900. సుప్రీంకోర్టు విధిని గురించి జస్టిస్ బ్రౌన్ చెప్పిన మాటలివి.

"ప్రాచీన కాలం నుండి రాజ్యాలు తమ పౌరుల ప్రయోజనాల కోసం అని చెప్తూ, తమ వైయక్తిక హక్కుల్ని నిలుపుకొనేందుకు యుద్ధాలు చేశాయి. మొన్నటి స్వాతంత్ర్య యుద్ధం, 1840లో గ్రేట్ బ్రిటన్ చైనాల మధ్య జరిగిన 'నల్లమందు యుద్ధం' ప్రసిద్ధమైన ఉదాహరణలు. ఇంకా వాస్తవం ఏమిటంటే – ఇప్పటికీ వైయక్తిక హక్కుల కోసం ఒప్పందాలు జరుగుతూనే ఉన్నాయి. ప్రైవేట్ పార్టీల హక్కుల పరిరక్షణ విషయంలో అంతర్జాతీయ ట్రిబ్యునళ్లు నిరంతరాయంగా ఏర్పాటు చేయబడుతూనే ఉన్నాయి. రాజ్యాంగం ద్వారా మరో రాష్ట్రం మీద యుద్ధం ప్రకటించేందుకు నిషేధింపబడిన ఈ యూనియన్‌లోని ఏ రాష్ట్రం అయినా – ఆ ఇతర రాష్ట్రంలో తన పౌరుల మీద ఆ రాష్ట్రం విధించిన వ్యాపార నిరోధాన్ని ఎత్తి వేయించమని సుప్రీంకోర్టును వేడుకునే వీలు లేకపోతే అది వింతైన అసంగతం అవుతుంది. వ్యాపార నిషేధం యుద్ధ చర్యకాక పోయినా, యుద్ధం ప్రకటించడానికి ముందు జరపబోయే ప్రాథమిక చర్య అవుతుంది. కొన్ని సందర్భాల్లో అది యుద్ధాన్ని సమర్థించడానికి చేసే చర్య కూడా అవుతుంది. ఫెడరేషన్ లేనపుడు రాజనీతి ద్వారానో, యుద్ధం ద్వారానో తేల్చుకొనే చాలా సందర్భాల్ని ఫెడరేషన్‌లో రేకెత్తే సందర్భాల్ని జస్టిస్ బ్రౌన్ ఉటంకించారు. అందువల్ల ఫెడరల్ న్యాయవ్యవస్థ అలాంటి విపత్తుల్ని నివారించడానికి అన్ని కేసుల్లో న్యాయాన్ని అందివ్వడానికి గాను ఫెడరల్ కోర్టుకు విస్తృత పరిధిని కల్పించాలి. ఛాన్సలర్! ఆ దృక్కోణం నుంచి పరిశీలించినపుడు మీరు నిన్న దయతో కమిటీని ఉద్దేశించి చెప్పిన మాటల్లో అస్పష్టంగా కనిపించే ఫెడరల్ కోర్టు అధికార పరిధికి సంబంధించిన ప్రణాళిక ఒక విధంగా చూస్తే చాలనిదని చెపుతున్నందుకు క్షమించండి.

మీరు ఆనాడు చెప్పిన మాటల్లో ఫెడరల్ కోర్టు న్యాయాధికార పరిధి ఫెడరేషన్‌లోని రాష్ట్రాలకు, రాష్ట్రానికి మరో రాష్ట్రానికి, సంస్థానానికీ రాష్ట్రానికీ, ఇండియా కామన్వెల్తుకూ, రాష్ట్రం లేదా సంస్థానానికీ మధ్య సంభవించే విషయాలకు వర్తించాలని తెలుస్తున్నది. మీరు వాడిన 'స్టేట్

అనే పదం చట్టబద్ధ సంఘంగా ఏర్పడిన సంస్థకా, స్టేట్ అధికారంలో ఉండే ట్రస్టీ, గార్డియన్ లేదా పౌర ప్రతినిధికా – వేటికి వర్తిస్తున్నదో నాకు తెలియదు. పై అంశాలకే గాక – ఒక రాష్ట్రానికి మరో రాష్ట్రంలోని పౌరునికీ మధ్య తలెత్తే వివాదాల్ని కూడా విచారణ చేసే విధంగా ఫెడరల్ న్యాయవ్యవస్థ ఉండాలని నాకు తోస్తున్నది. ఈ కేసును ఊహించండి: భారతదేశంలోని ఒక సంస్థానం ఫెడరేషన్‌లో ఒక యూనిట్. బహిరంగ మార్కెట్‌లో రుణ మండలి ద్వారా రుణాలు సేకరించిందనుకోండి. బొంబాయి రాష్ట్రంలోని ఒక వ్యక్తి ఆ రుణానికి ధనం చెల్లించాడనుకొందాం. ఒకవేళ ఆ సంస్థానం చందాను తిరిగి ఇవ్వలేక పోయిందనుకొందాం. ఇలాంటి వాటికి ప్రతిక్రియ ఏమిటి? ఇలాంటి అంశాలకు ఫెడరల్ న్యాయవ్యవస్థలో ఎలాంటి గుర్తింపూ ఉన్నట్లు నాకు కనిపించడంలేదు. మరో దృష్టాంతం చూద్దాం. బ్రిటిష్ ప్రభుత్వం చేతిలో ప్రస్తుతం కొన్ని దత్త ప్రాంతాలు ఉన్నాయి. ఈ దత్త ప్రాంతాల్ని తమకు తిరిగి ఇవ్వమని సంస్థానాలు కోరుతున్నాయి. అలాంటి దత్త ప్రాంతంలో ప్రస్తుతం బ్రిటిష్ ప్రభుత్వం ఎవరైనా ఒక వ్యక్తికి కొంత భూమి ఇనాంగా ఇచ్చిందనుకొందాం. బ్రిటిష్ ప్రభుత్వం ఆ దత్త ప్రాంతాన్ని దానికి సంబంధించిన భారతదేశ సంస్థానానికి తిరిగి ఇచ్చి వేసిన తర్వాత ఆ సంస్థాన ప్రభుత్వం అదే భూమిని మరో వ్యక్తికి దానంగా ఇచ్చిందనుకొందాం. ఇక్కడ వేర్వేరు వ్యక్తులకు రెండు వేర్వేరు ప్రభుత్వాలు ఒకే భూమిని ఇనాంగా ఇచ్చిన సందర్భం ఏర్పడుతుంది. ఇలాంటి వ్యాజ్యానికి న్యాయ నిర్ణయం చేయడానికి ఉపాయం ఏమిటి? ఇలాంటి కేసుల్ని ఫెడరల్ కోర్టు పరిగణనలోకి తీసుకుంటుందా? లేదా? మరో కేసు తీసుకొందాం. ఈ ఫెడరేషన్‌లోని రెండు వేర్వేరు రాష్ట్రాల్లో నివసించే ఇద్దరు పౌరుల మధ్య ఏదో తగాదా వచ్చింది. ఇలాంటి కేసుని ఏ కోర్టు పరిగణనలోకి తీసుకుంటుంది? మీరు మొన్న చెప్పిన మాటల్లో ఇలాంటి మరికొన్ని విషయాలకు సంబంధించిన ప్రస్తావన కనిపించదు.

మీ ప్రణాళికలో సూచించిన ఫెడరల్ కోర్టు వ్యవస్థాపనను ఆస్ట్రేలియా, అమెరికాలోని ఫెడరల్ కోర్టుల న్యాయ అధికార పరిధితో పోల్చి చూస్తే ఫెడరల్ ప్రభుత్వ అవసరాలకు ఏ మాత్రం చాలదని తేల్తున్నది. ఆస్ట్రేలియాలో ఆస్ట్రేలియా హైకోర్టు సెక్షన్75 కింద ఈ కింది విషయాలన్నిటిలో న్యాయాధికార పరిధి కలిగి ఉంది. 1) ఏ ఒడంబడిక కిందైనా వచ్చే విషయాలు 2) ఇతర దేశాల రాయబారులు లేదా ఇతర ప్రతినిధుల విషయాలు 3) కామన్వెల్తు గానీ, కామన్వెల్తు తరఫున ఒక వ్యక్తిగానీ దావా వేసినా, దావా వేయబడినా 4) వివిధ రాష్ట్రాల మధ్య లేదా వివిధ రాష్ట్రాల్లోని ప్రజల మధ్య లేదా ఒక రాష్ట్రానికి మరో రాష్ట్రంలోని పౌరునికి మధ్య 5) కామన్వెల్తు అధికారికి విరుద్ధంగా మాండమస్ (ఫలానా పనిని అమలు చేయమని ఒక వ్యక్తిని లేదా సంస్థను కోర్టు ఆదేశించడం – మాండమస్), ప్రొహిబిషన్ (దిగువకోర్టులు తమ విచారణ పరిధిని లేదా సహజ న్యాయ పరిధిని దాటినట్లు భావించినపుడు హైకోర్టు లేదా సుప్రీంకోర్టు 'ప్రొహిబిషన్' జారీ చేసి విచారణ ఆపేయడం), ఇంజక్షన్(నిషేధాజ్ఞ) కోరుతూ 'రిట్' వేసినపుడు హైకోర్టు వ్యాజ్యాలు స్వీకరిస్తుంది. సెక్షన్76 కింద హైకోర్టు కింది విషయాల్లో కూడా న్యాయాధికార పరిధి కలిగి ఉంది. 1) రాజ్యాంగానికి సంబంధించిన

లేదా రాజ్యాంగ వ్యాఖ్యానానికి సంబంధించిన విషయాల్లో 2) పార్లమెంటు చేసిన చట్టాల విషయంలో 3) సముద్రయాన సంబంధి, నౌకా సంబంధి పరిధి విషయంలో 4) ఒకే అంశంపైన వివిధ రాష్ట్రాలు తమ శాసనాల ఆధారంగా పరిష్కారం కోరినపుడు హైకోర్టు వ్యాజ్యాలు స్వీకరిస్తుంది. అమెరికా రాజ్యాంగాన్ని పరిశీలిస్తే ఆర్టికల్ 3 (2), అమెరికా న్యాయాధికారం ఈ అంశాలపై ఉంటుంది. 1) రాజ్యాంగం, అమెరికా శాసనాలు, ఒడంబడికలు కానీ వాటి అధికారం కింద చేయబడే వాటిల్లోకానీ, సమావత్వ విషయంలోకానీ, శిక్షాస్మృతికి సంబంధించిన అన్ని కేసుల్లో కానీ 2) రాయబారులు, ఇతర మంత్రులను ఇబ్బంది పెట్టే కారణాల్ని విచారించడంలో 3) సముద్రయాన, నౌకా సంబంధి కేసులన్నిటిలో 4) అమెరికా ఒక పార్టీగా ఉండే అన్ని తగాదాల్లోనూ 5) రెండు లేదా అంతకంటే ఎక్కువ రాష్ట్రాల మధ్య వచ్చే అన్ని తగాదాల్లో 6) ఒక రాష్ట్రానికి, మరో రాష్ట్ర పౌరునికి వచ్చే అన్ని తగాదాల్లో (ఇది తర్వాతి కాలంలో రాజ్యాంగం 11వ సవరణ ద్వారా రద్దు చేయబడింది) 7) వివిధ రాష్ట్రాల పౌరుల మధ్య వచ్చే అన్ని తగాదాల్లో 8) వివిధ రాష్ట్రాలు ఇచ్చిన ఇనాం భూముల విషయంలో ఒకే రాష్ట్రంలోని పౌరుల మధ్య వచ్చే తగాదాల్లో 9) ఒక రాష్ట్రం లేదా ఒక రాష్ట్రంలోని పౌరులకు ఇతర దేశాల పౌరులకు మధ్య వచ్చే తగాదాల్ని – అమెరికా సుప్రీంకోర్టు స్వీకరిస్తుంది.

అందువల్ల నా విన్నపం ఏమంటే – ఫెడరల్ కోర్టు నిజమైన మాటల్లో ఫెడరల్‌గా ఉండాలంటే – అది ఫెడరేషన్‌లోని రాష్ట్రాల మధ్య వివిధ రాష్ట్రాలలోని ప్రజల మధ్య వచ్చే అన్ని తగాదాల్ని తీర్చేట్లుగా ఉండాలి. అలా చేయాలంటే 'జాబితా' సవరించాలి. ఆస్ట్రేలియా, అమెరికా మొదలైన దేశాల్లోని ఫెడరల్ న్యాయాధికార పరిధికి సమానంగా ఉండేట్లు తప్పనిసరిగా 'జాబితా'ను సవరించాలి.

గౌరనీయ ఛాన్సలర్! నేను మీకు ఇక విన్నవించబోయే అంశం ఇది : ఇండియా ఫెడరల్ దేశంగా అవతరించబోతున్నా ఆస్ట్రేలియా అమెరికాల్లోని ఫెడరల్ కోర్టుల న్యాయాధికార పరిధితో సమానంగా ఉన్నంతమాత్రాన సరిపోదు. ఆ దేశాల్లో లేని కొన్ని వింత పరిస్థితులు ఇండియాలో ఉన్నాయి. కాబట్టి నా విజ్ఞప్తి ఏమంటే ఆస్ట్రేలియా, అమెరికాల్లోని ఫెడరల్ కోర్టుల న్యాయాధికార పరిధిని కలిగి ఉండడంతోపాటు, ప్రాథమిక హక్కులు, అల్ప సంఖ్యాక వర్గాల భద్రతల విషయాల్లో కూడా న్యాయాధికార పరిధిని కలిగి ఉండాలి.

**ఛైర్మన్ :** అమెరికా రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుల క్లాజును సూచిస్తారా?

***డా॥ అంబేద్కర్ :*** ఔను. సూచిస్తాను.

**ఛైర్మన్ :** మీరు మరోలా భావించకుంటే ఆ సందర్భం ఎక్కడ ఉందో చెప్పండి. ఆ సందర్భం నాకు బాగా తెలిసినా ఇప్పటికిప్పుడు నా దృష్టి సారించలేను.

***డా॥ అంబేద్కర్ :*** క్షమించండి! నా వద్ద ఆ అంశం తెలిపే సమాచారం లేదు.

**ఛైర్మన్ :** నేను వివిధ రాష్ట్రాలలో నివసించే ప్రజల కుండే విశేషాధికారాలు, మినహాయింపుల్ని గురించి చెప్పిన 'క్లాజు' గురించి ఆలోచిస్తున్నాను. ప్రతి రాష్ట్ర ప్రజల ప్రవేశ అధికారం, నిష్క్రమణ అధికారం, అలాంటి అంశాలు – ఇప్పుడు ఆ విషయం మీద నేను శ్రద్ధ చూపడం కుదరదు కాబట్టి మన కాలం వృధా చేసుకోవద్దు. నేనాలోచించే అంశం ఆర్టికల్ 4లోని సెక్షన్ 2 లోనిది కావచ్చు.

**డా॥ అంబేద్కర్ :** నా విజ్ఞప్తి ఇది. మనం ఎలా ప్రాథమిక హక్కుల్ని నిర్వచించినా వాటిని భద్రంగా రక్షించడమన్నది ముఖ్యమైన సమస్య. అలా అనడానికి కారణాలు ఇవి : మనలో కొందరం అవునన్నా కాదన్నా ఫెడరల్ రాజ్యాంగం మనకిప్పుడు సిద్ధమయ్యే ఉత్తమ ఫెడరేషన్ కాబోదు. ఆ ఫెడరేషన్‌లో ప్రజాదరణ కలిగిన, ప్రతినిధులు కలిగిన సంస్థలుండే బ్రిటిష్ ఇండియాకు, ప్రజాదరణ, ప్రతినిధులు లేని 'ఇండియా, స్వదేశ సంస్థానాలకు' మధ్య ఫెడరేషన్ బహుశా ఏర్పడవచ్చునని నేను ఊహిస్తున్నాను. ఒకవేళ ఫలితాలు దానికి విరుద్ధంగా ఉండవచ్చు. అలా ఉంటే సంతోషించేవాళ్లలో నేను మొదటివాణ్ణి. అప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందంటే ఒక ప్రజాస్వామ్యానికి మరో అధి రాజ్యానికి మధ్య ఫెడరేషన్ ఏర్పడినట్లవుతుంది. అప్పుడేం జరుగుతుందంటే– బ్రిటిష్ ఇండియాలోనే రాజకీయ మెజారిటీ మీద కాకుండా – జాతుల మెజారిటీ మీద ఆధారపడే ప్రభుత్వం ఏర్పడుతుంది. అందువల్ల ఇతర దేశాల్లో కంటే భారతదేశంలో ప్రాథమిక హక్కుల్ని, అల్ప సంఖ్యాక వర్గాల భద్రతల్ని రక్షించే అవసరం ఎక్కువ ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటుంది.

ప్రాథమిక హక్కులు – అవేవైనా కానీయండి – అల్పసంఖ్యాకుల భద్రతలు – అవేవైనా కానీయండి – వాటిని రక్షించే కర్తవ్యం అన్నిటికంటే ప్రధానమైన విధి అవుతుంది. ఇది ఎలా నిర్వర్తించగలం అంటే – ఫెడరల్ కోర్టుకు వీటికి సంబంధించిన విషయాల్ని విచారించే న్యాయాధికారాన్ని దత్తం చేయడం ద్వారానే చేయగలమని నా విన్నపం. ప్రాథమిక హక్కుల విషయంలోగానీ, అల్ప సంఖ్యాకుల భద్రత విషయంలో గానీ ఏ సమస్య తలెత్తినా – అది బ్రిటిష్ ఇండియాలో కానీయండి – స్వదేశీ సంస్థానంలో కానీయండి – వాటిని విచారించే న్యాయాధికార పరిధి ఫెడరల్ కోర్టుకే ఉండాలి.

**ఛైర్మన్ :** వాణిజ్య వివక్షకు సంబంధించిన కేసులు కూడా పై అంశాలకు కలుపుతారా?

**డా॥ అంబేద్కర్ :** అది ఒక ప్రాథమిక హక్కుగా మనం అంగీకరించాలి.

వాణిజ్య వివక్ష అమలు చేసే అంశం గురించి – గౌరవనీయ ఛాన్సలర్! మీరు దయతో అందజేసిన 'నోట్‌'లో ఫెడరల్ కోర్టు తీర్మానాల్ని అమలు చేసే న్యాయపరమైన చర్యల్ని గురించి మీరేమీ సూచించలేదు. వివిధ రాష్ట్రాలకు, సంస్థానాలకు అమలు చేసే పని వదిలిపెట్టినట్లు భావిస్తున్నాను. మనం రాష్ట్రాల, సంస్థానాల నిజాయితీని శంకించకూడదని మమ్మల్ని మందలిస్తారు కూడా. ఫెడరల్ కోర్టు చేసిన తీర్మానాల్ని నమ్మకంగా అంగీకరించి రాష్ట్రాలు, సంస్థానాలు అమలు చేస్తాయని మనం భావించాలి. గౌరవనీయ ఛాన్సలర్! జాన్ స్టూవర్ట్ మిల్ చెప్పిన సూక్తిని మనం

గుర్తుంచుకోవాలి. మనుషులందరూ మంచి వాళ్లయితే చట్టాలు చేసే అవసర మేముంది? అయితే మనం చట్టాలు చేయవలసి వస్తున్నది ఎందుకంటే, కొందరు చెడ్డవాళ్లు ఉన్నారు కాబట్టి. ఈ విషయాన్ని అనిశ్చితంగా వదలకూడదన్నది నా దృక్కోణం. ఇది సరైన దృక్కోణం అనడానికి అమెరికా సుప్రీంకోర్టు అనుభవమే సాక్ష్యం. మీరు క్షమిస్తే - సుప్రీంకోర్టు తీర్పుల విషయంలో కొంత చరిత్రను కమిటీ దృష్టికి తెస్తాను. క్రిస్‌లోమ్ - జార్జియా కేసు 1793లో నిర్ణయింపబడిందనే విషయం మీకు గుర్తు చేస్తున్నాను. సుప్రీంకోర్టు తనకున్న ఫెడరల్ న్యాయాధికార పరిధిలో క్రిస్‌లోమ్ పక్షంగా జార్జియా రాష్ట్రం నుండి రుణం మొత్తం తిరిగి ఇప్పించుకోడానికి డిక్రీ జారీ చేసింది. అయితే జార్జియా రాష్ట్రం సుప్రీంకోర్టు మీద కత్తి దూసింది. ఒక స్వతంత్ర రాష్ట్రానికి డిక్రీ జారీ చేయడం దాన్ని అవమాన పరిచినట్లే అన్న కారణం చూపుతూ ఆ డిక్రీ అమలు చేయడానికి నిరాకరించిందని చరిత్ర తెలుపుతున్నది. అలా అమెరికా సుప్రీంకోర్టు తీర్పు అమలు కాకుండా అనిశ్చిత స్థితిలో ఉంచబడింది. ఈ జార్జియా రాష్ట్రవైఖరే ఒక రాష్ట్రానికి మరో రాష్ట్రంలోని పౌరునికి మధ్య వచ్చే కేసుల విషయంలో ఫెడరల్ కోర్టు న్యాయాధికార పరిధి లేకుండా 11వ సవరణ చేయడానికి కారణం అయింది. మరో ఉదాహరణ : వర్జీనియా - పడమటి వర్జీనియా కేసు. అంతర్యుద్ధం తర్వాత మునుపటి వర్జీనియా రాష్ట్రం వర్జీనియా, పడమటి వర్జీనియా రాష్ట్రాలుగా విభజించబడింది. ఇది 1861లో జరిగింది. ఈ ఒప్పందంలో భాగంగా పడమటి వర్జీనియా రుణాల్లో సముచితమైన కొంత భాగం తీర్చడానికి అంగీకరించింది. ఈ బాధ్యత పడమటి వర్జీనియా రాష్ట్రం రాజ్యాంగం 8వ ఆర్టికల్‌లో పునః ధ్రువీకరించబడింది. నలభై సంవత్సరాలపాటు వర్జీనియా పడమటి వర్జీనియా ఆ రుణాలు చెల్లించడాన్ని ఒప్పించడానికి స్నేహపూర్వకమైన సంప్రదింపుల ద్వారా ప్రయత్నించింది. అవేవీ ఫలప్రదం కాలేదు. 1906లో వర్జీనియా ఈ విషయం మీద తీర్పు చెప్పమని సుప్రీంకోర్టును ఆశ్రయించింది. సుప్రీంకోర్టు న్యాయాధికారానికి పడమటి వర్జీనియా విఘ్నకారిగా తయారై అంగీకరించకుండా తిరగబడింది. 1906 నుండి 1911 వరకు సుప్రీంకోర్టు న్యాయాధికార పరిధికి వ్యతిరేకించి పడమటి వర్జీనియా ఏ మాత్రమూ దిగిరాలేదు. సుప్రీంకోర్టు తనకు న్యాయాధికార పరిధి ఉందని నిర్ణయించి పడమటి వర్జీనియా లెక్కలు పరిశీలించి ఒక నివేదిక తయారు చేయడానికి ఒక అధికారిని నియమించింది. నివేదిక తయారు చేయబడింది. మళ్లీ ఆ నివేదికను వ్యతిరేకిస్తూ పడమటి వర్జీనియా మరో మూడేళ్లు గడిపింది. ఆ తర్వాత ఈ రుణం తీర్చే బాధ్యతను స్వీకరించాలా లేదా తేల్చడానికి తన శాసనసభను సంప్రదిస్తానని చెప్పింది. ఆ విషయం అలా 1913 దాకా కొనసాగింది. ఆ తర్వాత ఆ నివేదికకు ఒక 'సప్లిమెంటరీ రిటర్న్ స్టేట్‌మెంటు'ను కోర్టులో సమర్పించడానికి అడగడం, ఆ తర్వాత అన్ని ఆక్షేపణలు సుప్రీంకోర్టు కొట్టి వేయడం జరిగింది. అన్ని రకాలైన ఆక్షేపణలు తేలిపోయి కోర్టు 1915లో తీర్పు ఇచ్చింది. నాలుగేళ్లపాటు పడమటి వర్జీనియా ఆ తీర్పును పరిశీలించడానికే అంగీకరించలేదు. కానీ 1919లో రుణాన్ని తీర్చడానికి ఎట్టకేలకు ఒప్పించబడింది.

**జిన్నా :** అలాంటి కష్టం వస్తుందని ముందే ఊహించి మీరు ఏం సలహా ఇస్తారు?

**డా॥ అంబేద్కర్ :** నా సలహా ఇది : ఈ అంశం మీద నా అభిప్రాయాలు చాలా ఉన్నతంగా ఉన్నాయని చెప్పాలి. రాబోయే కాలంలో చాలావాళ్లు తప్పనిసరిగా 'కులతత్వం', 'ప్రాంతీయతత్వం' కొనసాగుతాయి. అలాంటి కులతత్వ గందరగోళంలో సుప్రీంకోర్టు లేదా ఫెడరల్ కోర్టు – ఏ పేరైనా పెట్టండి – తీర్పులు తిరస్కరించబడవని నమ్మకంగా చెప్పలేము. ఒక అల్ప సంఖ్యాక వర్గం తరపున మాట్లాడే వ్యక్తిగా, ఏ వర్గమైతే తన హక్కుల్ని కోరుతూ అన్నివైపుల నుండి వ్యతిరేకతను ఎదుర్కొంటుందో – కౌన్సిల్లో కులపరమైన మెజారిటీ ఉండే రాష్ట్రప్రభుత్వం తన ప్రయోజనాలకు విరుద్ధంగా ఇవ్వబడిన ఫెడరల్ కోర్టు తీర్పుల్ని, డిక్రీల్ని వెంటనే అంగీకరిస్తుందని నేను నమ్మలేను. నేను దీన్ని చాలా తీవ్రమైన విషయంగా పరిగణిస్తున్నాను. అదే విషయం చెప్తున్నాను. అందువల్ల సుప్రీంకోర్టు తీర్పులు, నిర్ణయాలు ఖచ్చితంగా అమలు జరిపే వీలు రాజ్యాంగంలో కల్పించాలి. దీనికోసం ఆస్ట్రేలియా రాజ్యాంగంలో పొందుపరచిన ఏర్పాట్లను మనం అనుసరించాలి. ఆస్ట్రేలియా రాజ్యాంగంలోని 118, 51 సెక్షన్లలో పేరాగ్రాపు 25 అన్ని చట్టాలను, తీర్పులను విశ్వసించాలి, గౌరవించాలి అని చెపుతుంది. అది మామూలే. అమెరికా రాజ్యాంగంలో కూడా ఈ అంశం ఇలానే ఉంది. డిక్రీల్ని అమలుచేసే విషయంలో ఆస్ట్రేలియా రాజ్యాంగం పేరా 34 కింద ఫెడరల్ శాసనసభకు ఇతర అధికారాలకు సంబంధించి ఆనుషంగిక చట్టాలు చేసే అవకాశం ఇవ్వబడింది. ఆస్ట్రేలియా రాజ్యాంగంలో కేంద్ర ప్రభుత్వానికి – డిక్రీలు, తీర్మానాలు అమలు పరచడానికి – కొన్ని ప్రత్యేక అధికారాలు ఇవ్వబడ్డాయి. 51వ సెక్షన్, 24వ పేరా కింద అంతర్రాష్ట్ర సర్వీసుకు, రాష్ట్రాల మధ్య తీర్పుల్ని అమలు చేయడానికి, సివిల్, క్రిమినల్ వ్యవహారాలు, రాష్ట్రాల కోర్టుల తీర్పుల అమలుకు కామన్వెల్తు అంతటా అమలు పరిచే అవకాశం ఇవ్వబడింది. అది ఒక అంశం. తర్వాత, ఆస్ట్రేలియా రాజ్యాంగం 78వ సెక్షన్‌లో –

**ఛైర్మన్ :** "పార్లమెంటు న్యాయాధికార పరిధిలో కామన్వెల్తుకు వ్యతిరేకంగా కానీ, రాష్ట్రాలకు వ్యతిరేకంగా గానీ తీర్మానాల్ని అమలు చేసే అధికారాలిస్తూ చట్టాలు చేయవచ్చు."

**డా॥ అంబేద్కర్ :** ఔను, అదొకటి. మీకు తెలుసుగదా! న్యాయవ్యవస్థ చట్టం1903, 9వ విభాగం కింద ఆస్ట్రేలియా ఫెడరల్ శాసనసభ రాష్ట్రాలకు విరుద్ధంగా డిక్రీలు, తీర్మానాలు అమలు చేయించే నిర్ణీత వ్యవస్థ ఏర్పాటు చేయబడింది. ఆస్ట్రేలియా రాజ్యాంగం 12వ సెక్షన్ కింద –

"కామన్వెల్తు చట్టాలకు విరుద్ధంగా ఉండే నేరాల్లో శిక్షలు వేయబడిన లేదా నిందారోపణ వేయబడిన వారిని తమ జైళ్లలో నిర్బంధం కోసం ప్రతి రాష్ట్రం వ్యవస్థను ఏర్పాటు చేయాలి. అలాంటి నేరాల్లో శిక్షలు వేయబడినవారికి శిక్షలు అమలు పరిచే విషయంలో కామన్వెల్తు పార్లమెంటు చట్టాలు చేస్తుంది."

అందువల్ల ఫెడరల్ కోర్టు తీర్మానాల్ని అమలుపరిచే ప్రత్యేక అధికారాన్ని ఫెడరల్

విధానసభకు ఇవ్వాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

**ఛైర్మన్ :** ఎలాంటి అధికారం గురించి మీరు ఆలోచిస్తున్నారు ?

**డా॥ అంబేద్కర్ :** వాళ్లు ఏం చేస్తారో నాకు తెలియదు. అయితే నా విజ్ఞప్తి ఏమంటే - విషయం ఇలా గాలిలో ఊగిసలాడుతూ ఉండకూడదనేదే. నేను చూపిన అమెరికా సుప్రీంకోర్టు తీర్మానాలు కొన్ని ఎందుకూ కొరగానివిగాను, అమలు చేయబడడానికి బదులు తిరస్కరించడానికి వీలు ఉండేట్లుగాను ఎలా చేయబడ్డాయో కొన్ని ఉదాహరణల ద్వారా మీకు తెలియజేస్తాను. ఒహాయో రాష్ట్ర గవర్నర్‌కు ఒక సుప్రీంకోర్టు ఉత్తర్వు అందింది. ఆ రాష్ట్రంలో ఉండే ఒక పలాయిత నేరస్థుణ్ణి రాష్ట్రం నుండి బయటికి పంపమని ఆ ఉత్తర్వు. గవర్నర్ అలా చేయడానికి నిరాకరించారు. కెంటకీ 'మాండమస్' ఇవ్వమని కోర్టును కోరింది. మాకు తీర్పును అమలు పరిచే అధికారం రాజ్యాంగం ఇవ్వలేదు, కాబట్టి 'మాండమస్ రిట్' ఇవ్వలేము అని కోర్టు చెప్పింది. గవర్నర్ పలాయిత నేరస్థుణ్ణి బయటికి పంపవలసి ఉందని తీర్పు ఇచ్చినా ఇలా జరిగింది. అమెరికా సుప్రీంకోర్టు వందలాది కేసుల్లో ఉపశమనం ఇవ్వకపోవడానికి కారణం - తన తీర్పుల్ని అమలు చేసే అధికారం తనకు లేదని భావించడమే. ఇలాంటి చోట్ల ఏదో రకమైన ఏర్పాటు లేకపోతే పరిస్థితి సరిగా ఉంటుందని నేను భావించలేను.

**ఛైర్మన్ :** ఎలాంటి చట్టం? ఉదా॥ బెంగాల్‌కు విరుద్ధంగా తీర్పు చెపితే ఏదో విధంగా బెంగాల్‌లో ప్రాంతీయ కోర్టు ఉద్యోగిని ఉంచాలంటారా?.

**డా॥ అంబేద్కర్ :** నేను ఏది చెప్పాలనుకుంటున్నానో అది 78వ సెక్షన్లో ఉంది. సివిల్ డిక్రీలు అమలు పరచడానికి 'ట్రెజరర్' గానీ, 'ట్రెజరీ'కి ఇన్‌ఛార్జిగా ఉండే వ్యక్తిగాని తప్పనిసరిగా మూల్యం చెల్లించాల్సి ఉంటుంది.

**ఛైర్మన్ :** ఒకవేళ అతడు చెల్లించలేదనుకోండి; ఏమవుతుంది?

**డా॥ అంబేద్కర్ :** న్యాయధిక్కరణ నేరం కింద అతనిపై చర్య తీసుకోవచ్చు.

**సర్ మానెక్‌జీ దాదాబాయి :** అతడు ఎక్కడ విచారించబడతాడు?

**డా॥ అంబేద్కర్ :** అతడు ఎక్కడున్నా సరే! ఫెడరల్ కోర్టులో విచారించబడతాడు.

**అయ్యంగార్ :** న్యాయధిక్కరణ వారంటును ఎవరు అమలు చేయాలి?

**డా॥ అంబేద్కర్ :** తన ఉద్యోగుల ద్వారా ఫెడరల్ ప్రభుత్వం చేయాలి. ఫెడరల్ ప్రభుత్వానికి ఆ అధికారం ఉండాలని నేను కోరుతున్నాను. ఈ అధికారం అమెరికా 'సూచిత' అధికారాల్లో, ఒకటి. ఆస్ట్రేలియా రాజ్యాంగంలో 120 సెక్షన్ కింద ఫెడరల్ ప్రభుత్వానికి ఫెడరల్ చట్టాలకు విరుద్ధంగా ప్రవర్తించిన వాళ్లని నిర్బంధించే అధికారం ఉంది. ఫెడరల్ చట్టాన్ని ఒక పౌరుడు నిరాకరించినపుడు సుప్రీంకోర్టు అతనికి వ్యతిరేకంగా తీర్పు ఇస్తే, ఒకవేళ ఆ రాష్ట్రానికి అతణ్ణి జైలులో ఉంచడానికి ఇష్టం

లేకపోతే సెక్షన్ 120 కింద ఫెడరల్ ప్రభుత్వానికి అతణ్ణి తన జైళ్లలో నిర్బంధించే అధికారం ఉంది. అన్ని అంశాల్లో న్యాయం సరిగ్గా జరగాలని ఫెడరల్ ప్రభుత్వం భావిస్తే – ఆ తీర్పుల్ని అమలు పరిచే అధికారం కూడా దానికి తప్పనిసరిగా ఉండాలి. ఈ విషయం ఎలా నిర్వహించబడాలో నేను ఇప్పుడు ఏమీ చెప్పలేను. ఇండియా అంతటా ఫెరడల్ కోర్టు తీర్పులు, తీర్మానాలు తప్పనిసరిగా అమలు జరిగేట్లు చూడాలనేదే ఇప్పుడు నేను చెప్పాలనుకున్నది. ప్రతిక్రియ చెల్లకపోతే అధికారం కూడా చెల్లదనేది నేను మళ్ళీ మళ్ళీ చెప్పవలసిన పనిలేదు.

***జయకర్ :*** **జాతి,** మతపరమైన యుద్ధ జీవన స్థితి నెలకొనినప్పుడు నిరర్థకం కాని పరిష్కారం దేనినీ సూచించలేము.

***డా॥ అంబేద్కర్ :*** దానికి నేను జవాబు చెప్పవలసిన పనిలేదు. నేను నా కేసునే తీసుకొంటాను. బొంబాయి ప్రెసిడెన్సీలో మాకు 'నాసిక్ సత్యాగ్రహం' ఉంది. ఒకవేళ నేను సమర్పించిన వినతిపత్రం మొదటిభాగంలో చెప్పినట్లు మాకు ప్రాథమిక హక్కు అంటే దేవాలయ ప్రవేశ హక్కు ఉందనుకొందాం. మేం శాంతిని భంగం చేస్తున్నామని, అలా చేయడం మానకపోతే జైళ్లో నిర్బంధించ వలసి వస్తుందని మేజిస్ట్రేటు ఉత్తర్వు జారీ చేశారనుకోండి. ఇలాంటి విషయాల్లో న్యాయాధికార పరిధి ఉండాలని నేను భావించే ఫెడరల్ కోర్టుకు మేం వెళ్తే మేజిస్ట్రేటుది తప్పు అని కోర్టు చెప్పిందనుకోండి. మేం దేశీయాంగమంత్రి వద్దకు వెళ్లి కోర్టు ఉత్తర్వులు అమలు పరచమని అడుగుతాం. సాంప్రదాయ ప్రజల మెజారిటీ మీద ఆధారపడిన దేశీయాంగ మంత్రి 'నేను అలా చేయను' అంటాడు. ఇలాంటి పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వానికి తన చట్టాల్ని కార్యసాధకాలుగా చేసే అధికారం ఉండాలని నేను కోరుతున్నాను.

***జిన్నా :*** మీరు చెప్పేదాంట్లో చాలా బలం ఉంది. ఏదైనా ఒక డిక్రీని లేదా వారంటును అమలు పరచడానికి దానికి మొదటి అధికారంగా పోలీసు, తర్వాతిది, చివరిదిగా మిలిటరీ ఉండాలి. ఫెడరల్ ప్రభుత్వానికి ఇన్‌ఛార్జిగా ఉండే వ్యక్తి 'మిలిటరీ' ద్వారా గాక డిక్రీని గానీ వారంటును గానీ ఎలా అమలు చేయగలడు?

***డా॥ అంబేద్కర్ :*** అతడు అలాగే చేయవచ్చు.అతనికి నేను ఏ హద్దూ విధించలేదు. ఆ లక్ష్యం నెరవేరడానికి ఏది అవసరం అయితే అతనికి ఆ అధికారం ఇస్తాను. అలా అయితే సరిపోతుంది. నేను కాదనడంలేదు. అయితే నేను చెప్పేదేమంటే ప్రజల ప్రాథమిక హక్కుల కిందగానీ, అల్ప సంఖ్యాక వర్గాల భద్రత కింద – అలాంటివేవైనా వాటికింద ప్రజలకు రక్షణ తప్పనిసరిగా ఉండాలంటే అన్ని ప్రయోజనాలకు ఫెడరల్ ప్రభుత్వానికి ఫెడరల్ కోర్టు తీర్పులు అమలు పరిచే అధికారం ఇవ్వాలని నేను చెపుతున్నాను.

***జిన్నా :*** అధికారం ఇవ్వడమే కాదు; ఆ అధికారాన్ని అమలుపరిచేందుకు వారి చేతుల్లో సాధనం కూడా ఉండాలి.

**డా॥ అంబేద్కర్ :** ఈ అధికారం కిందనే సాధనం కూడా ఉంటుంది.

**మిస్టర్ జిన్నా :** ఇది పూర్తిగా సరైనదే. అందువల్ల ఛాన్సలర్ ఏం సలహా ఇస్తున్నారంటే - ఆ విషయం మీరు గమనించలేదు - ఫెడరల్ కోర్టు డిక్రీలు, ఆర్డర్లను అమలు చేసే బాధ్యత అంతిమంగా రాణి చేతిలో ఉంటుంది. ఇంతవరకూ ఉండే స్థితి ఇలాంటిది కాబట్టి రాణిదే బాధ్యత అని చెప్పాను. రక్షణ రాణికి సంబంధించిన విషయం. నేను చెప్పింది నిజమేనా? ఛాన్సలర్‌గారూ!

**ఛైర్మన్ :** ఔను. అది సరైన అంశమే.

**డా॥ అంబేద్కర్ :** అయితే నేను చెప్పదలచిన అంశం ఇది. ఫెడరల్ ప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వాలకు విధుల్ని పంచేటప్పుడు సుప్రీంకోర్టు తీర్పుల్ని అమలు పరచడానికి చట్టపరమైనది గానీ, మరోలాంటిది గానీ అధికారం ఫెడరల్ ప్రభుత్వానికి ఇవ్వకపోతే అదేమీ చేయలేదు. ఇది నా విన్నపం.

**జయకర్ :** అయితే - అదే సమయంలో ఇబ్బంది అంతటితో ఆగదు, మీరూహించే మతతత్వం ఉండేచోట ఈ సంకటం ఇంతటితో ఆగదు.

**డా॥ అంబేద్కర్ :** నేను చాలా తీవ్రమైన చర్యలు తీసుకోవాల్సి ఉంటుందని అనుకుంటున్నాను. స్విస్ కాన్ఫెడరేషన్‌లో చివరికి మిలిటరీ కూడా ఉపయోగించబడింది. స్విట్జర్లాండ్ ఫెడరల్ కోర్టు తీర్పుల్ని అమలుపరచడానికి ఆ స్విస్ ఫెడరల్ ప్రభుత్వానికి ఈ అధికారం ఇవ్వబడింది. నేను ఇందుకోసం ఎలాంటి చర్యలు చేపట్టాలో చెప్పడంలేదు గానీ ఒక విషయం మాత్రం గట్టిగా చెపుతాను. అమెరికాలో ఫెడరల్ ప్రభుత్వానికి ఈ ఇబ్బంది రావడానికి కారణం దానికి ఈ అధికారం లేకపోవడమే.

**ఛైర్మన్ :** నేను అర్థం చేసుకోగలను. అందువల్లే వారు బాధ్యత తీసుకోరు.

**డా॥ అంబేద్కర్ :** ఔను. ఇండియాలో అలాంటి స్థితి రాకూడదు.

**లార్డ్ లోథియన్ :** అమెరికాలో ఒక తేడా ఉంది. ఫెడరల్ ప్రభుత్వం ఎవరైనా వ్యక్తికి సంబంధించిన విషయం అయితే ముందుకు సాగుతుంది. అదే సంప్రదాయం వద్దకు వచ్చేటప్పటికి ఫెడరల్ ప్రభుత్వం రాష్ట్రం మీద చర్య తీసుకోలేదు. ఎందుకంటే ఒక రాష్ట్రం మరో రాష్ట్రం మీద యుద్ధం ద్వారా తప్ప చర్య తీసుకోలేదు. అందువల్ల ఆ రాష్ట్రం మీద ఒత్తిడి తెచ్చి దాని బాధ్యతలు నెరవేర్చే పని ఆ రాష్ట్ర ప్రజల సౌజన్యానికి వదిలి వేస్తున్నారు. వ్యక్తుల మీద చర్య తీసుకోవడానికి అధికారం ఇవ్వగలం గానీ ఫెడరేషన్‌కు రాష్ట్రం మీద చర్య తీసుకోడానికి రాజ్యాంగ చర్యగా యుద్ధం ద్వారా తప్ప చర్య తీసుకోలేం. ఇది ఎవరూ చేయలేరు. అదీ ఇబ్బంది.

**డా॥ అంబేద్కర్ :** ఏమో! నాకు తెలియదు. అమెరికాలో కూడా తిరుగుబాటును అణచడానికి అధ్యక్షుడు సైన్యాన్ని ఉపయోగిస్తాడు.

**లార్డ్ లోథియన్ :** అది యుద్ధ చర్య అనిపించుకొంటుంది. అలాంటిది గతంలో జరిగింది.

**డా॥ అంబేద్కర్ :** అమెరికా రాజ్యాంగంలో ఆ ఏర్పాటుంది.

**జయకర్ :** అయితే ఖచ్చితంగా అంతర్యుద్ధం లేదా ఫెడరల్ ప్రభుత్వ విధేయతల మధ్యనే నిర్ణయం ఉంటుందికదా!

**డా॥ అంబేద్కర్ :** అది నేను సరిగా అర్థం చేసుకున్నాను. మీరు చెప్పే అంశాన్ని నేను కాదనడంలేదు. నేను చెప్పేదేమంటే – అమెరికాలో ఉండే స్థితి లాంటిది మనకు ఉండకూడదు అని. అక్కడ తగాదాలు తీర్చే ఫెడరల్ న్యాయాధికార పరిధి ఫెడరల్ కోర్టుకు ఉన్నా ఆ తీర్మానాల్ని అమలు పరచడానికి ఫెడరల్ ప్రభుత్వానికి అధికారం లేదు. నేను చెప్పేదేమంటే – మన ఫెడరల్ ప్రభుత్వం లేదా ఫెడరల్ విధానసభ ఆస్ట్రేలియాలో ఉన్నట్లు అధికారం కలిగి ఉండాలి.

**జిన్నా :** భేదం ఇది. అమెరికాలో సైన్య నియంత్రణ ఫెడరల్ ప్రభుత్వం చేతిలో ఉంటుంది. మీరు ప్రతిపాదించే ఇండియా ఫెడరల్ ప్రభుత్వం కూడా సైన్యానికి సంబంధించిన బాధ్యతను, నియంత్రణను వెంటనే తీసుకోవాలంటారు.

**డా॥ అంబేద్కర్ :** ఔను; ఇప్పుడు కాకపోతే తర్వాతనైనా.

**జిన్నా :** ఈమధ్య కాలంలో ఏమవుతుంది?

**డా॥ అంబేద్కర్ :** అది వేరే సంగతి. ఈమధ్య సైన్యాన్ని ఉపయోగించే పరిస్థితి రాకపోవచ్చు.

**జయకర్ :** సైన్య సహాయాన్ని అర్థించడానికి రాణి గారి వద్దకు వెళ్ళాలి.

**డా॥ అంబేద్కర్ :** ఔను.

**జయకర్ :** సర్వోత్కృష్ట సైన్య అధికారం రాణి గారిదే.

**డా॥ అంబేద్కర్ :** ఈ అంశం నేను చెప్పే అంశంతో విభేదించదు. ఆ అధికారం తప్పనిసరిగా విధాన సభకే ఇవ్వాలి. అమెరికాలోని రాష్ట్రాల్లో వాటి నిర్ణయాల తప్పుల్ని సరిదిద్దే అధికారం సుప్రీంకోర్టు ఇచ్చినా ఉరి తీస్తూనే ఉన్నారు.

**ఛైర్మన్ :** ఆ విషయం నేనూ విన్నాను. ఇంగ్లీష్ కామన్‌లా ననుసరించి చెట్టు పెరుగుతున్నదా లేదా తెలుసుకోవడానికి ప్రతిసారీ చెట్టును పైకి పీకి వేర్ల వైపు చూడవలసిన పనిలేదు. ఇంగ్లీష్ కామన్‌లా ఇలాంటి విషయాల్లో స్థిరంగా ఉండలేదు. ఏ న్యాయశాస్త్రం అయినా అంతే. మీరు చాలా ఆసక్తిదాయకమైన న్యాయ సంబంధమైన క్లిష్టశ్లేషల్ని ముందుంచుతున్నారు. అయితే నా సంగ్రహ సమాధానం ఏమంటే ఏ విషయాన్నయినా ఆచరణయోగ్యం కాకుండా చేయవచ్చు. పునాదులు సరిగా ఉన్నాయా లేదా అని చూడడానికి మాటిమాటికీ పునాదుల దాకా వెళ్లి చూడడం అంత మంచిపని కాదు. ప్రజల సౌజన్యం మీద మీరు నమ్మకం ఉంచాలి. వర్జీనియా కేసు విషయంలో ప్రజలు ఒక సరైన దృష్టికి రావడానికి 19 సంవత్సరాలు పట్టింది. ఇది మీ కేసులో కూడా జరగవచ్చు.

మొదట ఇలాంటి కష్టాలు చాలానే ఉంటాయి. కలిసి పనిచేయడం మొదలయిన తర్వాత వాటిలో చాలా కష్టాలు అదృశ్యం అయిపోతాయి. ప్రతి మూడువారాలకు ఒకసారి మీ ఇల్లు పునాదులు సరిగా ఉన్నాయో లేదో తవ్వి చూడలేరు గదా! మీరు ప్రజల్ని కొంచెం నమ్మాలి.

***డా॥ అంబేద్కర్ :*** మన పునాదుల్ని ఇసుక పైన నిర్మించకుండా చూసుకోవాలనే నేను చెప్పేది.

మూడో అంశం అయిన ఫెడరల్ కోర్టు గురించి – ఇంతకు ముందే చెప్పిన అంశాల్తో నేను అంగీకరిస్తున్నాను కాబట్టి పెద్దగా చెప్పాలనుకోవడం లేదు. అయినా ఒక మాట చెపుతాను. ఆస్ట్రేలియాలో లాగా మనకు ఫెడరల్ అంశాల్ని నిర్ణయించడానికి ఫెడరల్ కోర్టు మొత్తం భారతదేశం కోసం సుప్రీంకోర్టుగా ఉండాలి. ఆస్ట్రేలియాలో ఫెడరల్ కోర్టు ఫెడరల్ న్యాయాధికార పరిధి గలిగిన కోర్టుల నుండి అప్పీళ్లను స్వీకరించడమే గాక ఫెడరల్ న్యాయాధికార పరిధికి బయట ఉండే అప్పీళ్లను కూడా స్వీకరిస్తుంది. ఆయా రాష్ట్రాల న్యాయవ్యవస్థ కోసం ఇండియా స్వదేశ సంస్థానాల్లో న్యాయాధికార పరిధి కలిగిన సంస్థాన కోర్టుల్ని స్థాపించడానికి ఫెడరల్ విధానసభకు అవకాశం ఇవ్వాలి. ఫెడరల్ న్యాయాధికార పరిధి ఉండే కొన్ని అంశాల్ని అమలు చేసే వీలు 'సంస్థానాల' కోర్టులకే గాక, సమర్థవంతంగా పనిచేస్తాయని తెలుసుకొన్న కొన్ని స్వదేశ సంస్థానాలకు కూడా కల్పించాలి. దాని ఫలితం చాలా ప్రధానమైనది. అది మొదటగా 'సంస్థాన కోర్టుల' గౌరవాన్ని పెంచుతుంది. రెండోది : సంస్థాన కోర్టుల్ని భారతదేశంలో ఉండే సంపూర్ణ న్యాయవ్యవస్థతో కలిపి మన ఫెడరేషన్‌ని నిజమైన ఫెడరేషన్‌గా చేస్తుంది.

***జయకర్ :*** అప్పీలు ఫెడరల్ కోర్టుతో ఉండాలా? సుప్రీంకోర్టుతో ఉండాలా?

***డా॥ అంబేద్కర్ :*** నేను ఆ అంశానికే వస్తున్నాను. ఆ విషయంలో నా సలహా ఏమంటే – రాష్ట్రాల కోర్టులు తమ అప్పీళ్లను ఫెడరల్ న్యాయాధికార పరిధికి సంబంధించకపోయినా సరే – ఫెడరల్ సుప్రీంకోర్టుకు పంపడానికి అంగీకరించాలి. అలా చేయకపోతే ఆస్ట్రేలియాలోలాగా 'ఓపెన్ డోర్ పాలసీ'ని పాటించాలని నా సలహా. ఆస్ట్రేలియా రాజ్యాంగంలో ఆస్ట్రేలియా ఫెడరల్ కోర్టు లేదా హైకోర్టు రాష్ట్ర కోర్టుల నుండి అప్పీళ్ళు వినడానికి అభ్యంతర పెట్టకూడదు అన్న ఏర్పాటు చేయబడింది. అలాంటి సదుపాయం మన రాజ్యాంగంలో చేయబడాలని నేను కోరుతున్నాను. రాష్ట్రకోర్టులు తమ అప్పీళ్లను ఫెడరల్ హైకోర్టుకు తప్పనిసరిగా పంపాలని నిర్బంధం చేయకపోయినా, ఆ కోర్టులు తమ తీర్మానాల ద్వారా తర్వాతి కాలంలో అప్పీలు అధికార పరిధినిచ్చే అప్పీళ్లను విచారించడానికి ఫెడరల్ హైకోర్టును నిరాకరించేలా చేయాలి.

నేను చెప్పినట్లు సంస్థానాలకు తమ కోర్టుల నుండి ఫెడరల్ కోర్టుకు పంపే అప్పీళ్లను నియంత్రించే అధికారం మాత్రం ఇవ్వాలి. ఇలాంటి అప్పీలు చేసే అధికారాలు బ్రిటిష్ పాలిత ప్రాంతంలో ఇవ్వబడవు. వాటికి ఇష్టం వస్తే నియంత్రిస్తాయి.

నేను మరో అంశం చెప్పాలనుకుంటున్నాను. అది హైకోర్టుకు ఫెడరల్ ప్రభుత్వానికి

ఉండే సంబంధం సంగతి. ప్రస్తుతం కలకత్తా హైకోర్టు తప్ప తక్కిన భారతదేశ హైకోర్టులు ఆర్థిక విషయాలకు సంబంధించి పరిపాలనకు సంబంధించి రాష్ట్ర పరిధిలో ఉన్నాయి. కలకత్తా హైకోర్టు మాత్రం ఆర్థిక సంబంధంగా రాష్ట్రీయమైనా, పరిపాలనా పరంగా కేంద్రానికి సంబంధించిందిగా ఉంది. భారతదేశ హైకోర్టులన్నీ పరిపాలనా పరంగా కేంద్రానికి సంబంధించి, ఆర్థికపరంగా ఆయా రాష్ట్రాలకు సంబంధించినవిగా ఉండాలని నిన్న సర్ తేజ్ బహదూర్ సప్రూ సలహా ఇచ్చారు. ఆయన సలహాను - భారత దేశ హైకోర్టులు పరిపాలనా పరంగా కేంద్ర సంబంధులుగా ఉండడానికి - నేను కూడా - సంపూర్ణంగా అంగీకరిస్తున్నాను. అయితే - అలా అంగీకరించడానికి నాకు వేరే కారణాలున్నాయి. అవి చెప్పాలనుకుంటున్నాను. హైకోర్టులో ఉండే న్యాయమూర్తులకు ఒక భయం ఉంది. ఏమంటే - పరిపాలనా పరంగా తమ రాష్ట్రాల రాజకీయాల ఒత్తిడి తమ మీద ఉంటుందని. అదే పరిపాలనా పరంగా ఫెడరల్ కేంద్ర ప్రభుత్వం పరిధిలో ఉంటే - అలాంటి ఒత్తిళ్లు తప్పుతాయని అనుకుంటున్నట్లు సప్రూ చెప్పారు. ప్రతినిధుల ప్రజాస్వామ్యం, బాధ్యతాయుత ప్రభుత్వం ఉండే ఏ దేశంలో అయినా సరే హైకోర్టులు రాజకీయాల ఒత్తిడి నుంచి తప్పించుకోలేవు.

***సర్ తేజ్ బహదూర్ సప్రూ :*** న్యాయశాస్త్ర సిద్ధాంతం ప్రకారం పార్టీ రాజకీయాలకు ఇంగ్లీషు కోర్టులు బైట ఉన్నాయని నా అభిప్రాయం.

***డా॥ అంబేద్కర్ :*** ఈ దేశంలో న్యాయ వ్యవస్థలోని కొన్ని ఉద్యోగాలు రాజకీయ, నియామకాలుగా ఉన్నాయి. అయితే అది వేరే విషయం. కమిటీ ముందు ఈ విషయాన్ని ఇప్పుడు ఉంచాలనుకుంటున్నాను. మనం ఈ ఫెడరేషన్‌కు 562 భారతదేశ సంస్థానాల్ని కలుపుతున్నాం.

***జిన్నా :*** కలుపుతున్నారా?

***డా॥ అంబేద్కర్ :*** అదీ ప్రణాళిక అని నేను భావిస్తున్నాను. ఫెడరేషన్‌లో అన్ని స్వదేశీ సంస్థానాలు విలీనం అవుతాయని మనం భావించడం కనీస ఆదర్శంగా సన్నా ఉంటుంది. ఇండియన్ ఫెడరేషన్‌లో చేరబోయే చాలా స్వదేశీ సంస్థానాలు సమర్థమైన న్యాయాధికార వ్యవస్థను నిర్వహించగల సామర్థ్యం కలిగినవి కావనే అంశంలో మనకెవరికీ భేదాభిప్రాయంలేదు. బొంబాయి ప్రెసిడెన్సీలో ఒక కేసు ఇలాంటిది ఉంది. ఆ కేసు పూర్వాపరాలు నాకు బాగా తెలుసు. బొంబాయి ప్రెసిడెన్సీలోని ఒక చిన్న స్వదేశీ సంస్థానం అది. దాని పరిపాలన ఒక మహిళ చేతిలో ఉంది. ఆ సంస్థానంలో నాకు తెలిసిన మేరకు ఒకే ఒక్క అధికారి ఉన్నాడు. ఆ అధికారే సివిల్ జడ్జిగా వ్యవహరిస్తాడు.ఆ తడే మేజిస్ట్రేటుగా వ్యవహరిస్తాడు. అతడే సెషన్సు జడ్జిగా కూడా వ్యవహరిస్తాడు. అతని నుండి అప్పీళ్లు సంస్థాన అధినేతవద్దకు వెళతాయి. ఆమె ఒక దివాను సహాయంతో వాటిని నిర్వహిస్తుంది. నాకు తెలిసిన మేరకు ఆ దివాను ఒక రెవిన్యూ ఉద్యోగి. ఆ సంస్థానానికి ప్రీవీ కౌన్సిలు అయిన ఆ కోర్టు ముందుకు చాలా జటిలమైన కేసులు వస్తుంటాయి. అలా ఏర్పడిన ఆ సంస్థానం కోర్టు ఆ కేసులపై తీర్పులు ఇస్తూ ఉంది. ఈ విషయంలో నేను ఎవర్నీ తప్పు పట్టలేను. సమర్థమైన న్యాయస్థానాన్ని నిర్వహించడానికి తగినంత ఆర్థిక స్తోమత లేనంత చిన్నది ఆ సంస్థానం అని చెప్పడమే నా ఉద్దేశ్యం.

మరో పరిశీలన ఉంది. అదేమంటే, బ్రిటిషు ఇండియాలో కూడా మనం ఇలాంటి హైకోర్టును నిర్వహించుకొనే ఆర్థిక స్థితిలో లేని కొత్త చిన్న రాష్ట్రాల్ని ఏర్పాటు చేయడం చూశాం. ఇది ఇప్పుడు కూడా జరుగుతున్నది. అస్సాం రాష్ట్రం హైకోర్టును నిర్వహించలేదు. అది బెంగాల్ ప్రెసిడెన్సీ హైకోర్టుతో భాగం పంచుకుంటోంది. నా విజ్ఞప్తి ఏమంటే – చిన్నది, హైకోర్టుల్ని ఆర్థికంగా నిర్వహించుకోలేని స్వదేశీ సంస్థానాలు బ్రిటిష్ ఇండియాలోని హైకోర్టుల్ని తమ సివిల్, క్రిమినల్ కేసుల పరిష్కారానికి ఉపయోగించుకోనిస్తే అలాంటి ఆలోచనకు స్వాగతం చెప్పవలసిందే. ప్రావిన్షియల్ హైకోర్టులు ఎంతకాలం ప్రావిన్షియల్ ప్రభుత్వం చేత నడపబడుతుంటాయో ఆ ప్రావిన్సు వ్యవహారాల్ని అదుపు చేసే హక్కులేని స్వదేశీ సంస్థానాలు ఆ ప్రావిన్షియల్ హైకోర్టు సేవల్ని ఉపయోగించుకోవడానికి ప్రయత్నం చేయవు. అలా కాకుండా ప్రావిన్షియల్ హైకోర్టుల్ని కేంద్ర విషయంగా చేస్తే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆ సంస్థానాలు కేంద్రంలో ప్రాతినిధ్యం వహిస్తాయి కాబట్టి అది ప్రోత్సాహకంగా ఉంటుంది. కాబట్టి – తమ సివిల్ క్రిమినల్ కేసుల్ని నిర్ణయించడానికి ప్రావిన్షియల్ హైకోర్టుల్ని ఆశ్రయించడానికి సంస్థానాలకు పెద్దగా అభ్యంతరం ఉండదు. దాని ఫలితం ఏమంటే భవిష్యత్తు భారతదేశ ప్రభుత్వంలో చేరుబోయే ఈ స్వదేశీ సంస్థానాల్లో న్యాయపరిపాలనా వ్యవస్థను చాలామట్టుకు మెరుగు పరచవచ్చు. దీని వల్ల ప్రావిన్షియల్ హైకోర్టుల సామర్థ్యానికి ఏమీ భంగం కలగబోదు. ఈ కారణంగా ప్రావిన్షియల్ హైకోర్టుల ఆర్థిక, పరిపాలన విషయాలను కేంద్ర జాబితాలో చేరిస్తే బాగుంటుందని నా సలహా. పరిపాలనా పరంగా కలకత్తా హైకోర్టు కేంద్రపరంగా ఉంటుంది అంటే అది బెంగాల్ ప్రెసిడెన్సీకే కోర్టుగాదు, అది బెంగాల్ అస్సాం ప్రావిన్సులకు రెండిటికీ సంబంధించిన 'ఉమ్మడి కోర్టు.' అందువల్లనే సైమన్ కమిషన్ ఈ వ్యవస్థను కొనసాగించడమే కాదు చాలా ప్రావిన్సులలో కూడా ఈ వ్యవస్థను పొడిగించాలని సిఫారసు చేసింది. అందువల్ల ఈ సలహా ఆహ్వానించదగిందేనని నేను భావిస్తున్నాను.

ఫెడరల్ కోర్టు విషయానికి సంబంధించినది ఇంతమాత్రమే నేను చెప్పవలసింది.

## 44వ సమావేశం – 2 నవంబర్, 1931

### మూడవ నివేదిక ముసాయిదా పై చర్చ

***డా॥ అంబేద్కర్ :** ఆ పేరాగ్రాఫ్‌లోని చివరి నాలుగు పంక్తుల వైపు దృష్టి సారించమని మిమ్మల్ని కోరుతున్నాను. సబ్ కమిటీ రెండవ నివేదిక 34 పేరాలో మీరు ఇలా చెప్పారు.

మొదటి నాలుగు సిఫారసులకు సంబంధించి మేం ఏమీ చెప్పలేం. ఎందుకంటే – ఈ అంశాల మీద నిర్ణయ తీసుకోవాల్సింది మైనారిటీల సబ్ కమిటీ కాబట్టి. ఆ ప్రయోజనాల ప్రాతినిధ్యం విషయంలో కమిటీ ఉదాసీనంగా ఉందని మీరంటున్నారని నేను భావించడం లేదు. అలాగే రెండవ

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 882–83.

నివేదిక లో 34 పేరాలో ఉన్న మాటలు ఆ అర్థం ఇస్తాయని కూడా భావించడంలేదు. మీ మాటల్లో అంతరార్థం ప్రాతినిధ్యం విషయానికి సంబంధించిన పద్ధతినిగానీ పరిధినిగానీ మీరు సిఫారసు చేయలేరని. అందువల్ల 'సిఫారసు' అన్నమాట తర్వాత "వారి ప్రాతినిధ్యాల పరిధి, పద్ధతుల విషయంలో" అనే పదాలు వాక్యంలో కలిపి సవరిస్తే నేను కృతజ్ఞునిగా ఉంటాను.

**మిసెస్ సుబ్బరాయన్ :** నేను ఈ నాలుగు సమావేశాల్లో ఒకదానిలో శాసనసభలో స్త్రీల ప్రాతినిధ్య విషయంలో ప్రత్యేక ఏర్పాటును గురించి మాట్లాడాను. ఈ అంశం మీద చర్చా ప్రతిపాదన మైనారిటీల కమిటీ తమ నివేదికను ప్రచురించే వరకు ఆపి ఉంచమని కూడా కోరాను. అయితే ఆ అంశం ఉపేక్షకు గురవుతుందేమోనని ఇక్కడ కొంత గుర్తు చేస్తున్నాను. 28వ పేరా 9వ పంక్తిలో "ప్రయోజనాలు" అనే పదం తర్వాత "లేదా శాసనసభలో మహిళల ప్రాతినిధ్యం కోసం" అని కలపమని సవినయంగా సలహా ఇస్తున్నాను.

**ఛైర్మన్ :** నేను చాలా కృతజ్ఞుణ్ణి. దాన్ని మనం వదిలేసినందుకు చింతిస్తున్నాను. నేను అంబేద్కర్‌కు కూడా చాలా కృతజ్ఞుణ్ణి. ఆ రెండు సవరణలు మనం కలుపుదాం. అది ఒక పొరపాటు మాత్రమే.

**మిసెస్ సుబ్బరాయన్ :** నేను ఒక సందర్భంలో – నామినేటెడ్ ప్రతినిధులు పూర్వ శాసనసభలకు అందించిన విలువైన సేవల్ని గౌరవిస్తూనే – కొత్త రాజ్యాంగంలో 'నామినేషన్'ను అధిక్షేపించాను. రెండు శాసనసభలు 'సరిసమానమైన అధికారాలు' కలిగి ఉంటాయని తెలిసిన తర్వాత నా ఆక్షేపణలను మరింత బలంగా చెప్పున్నాను. నివేదికలో చెప్పినట్లు అనుభవజ్ఞులైన రాజ నీతిజ్ఞుల సేవలు చాలా విలువైనవని నేను సంపూర్ణంగా అంగీకరిస్తున్నాను. అయితే నామినేషన్ పద్ధతి తెలివిలేనిదని, అప్రజాస్వామికమని కూడా నేను నమ్ముతాను. ఏదో రకమైన ఎన్నికల పద్ధతి ద్వారా అలాంటి పెద్దల్ని ఎన్నుకొని వారి సేవల్ని అందుకొంటే చాలా బాగుంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** మిసెస్ సుబ్బరాయన్ మాటల్ని నేను బలపరుస్తున్నాను. నామినేషన్ పద్ధతి అంటూ ఉంటే ఆ క్లాజు ఉద్దేశమే విఫలం అవుతుందని నేను నమ్ముతున్నాను. ఎగువసభలో తన పార్టీ బలాన్ని పెంచుకునేందుకే మంత్రివర్గం ఆలోచిస్తుంది. ఈ సామాన్య ఆక్షేపణతో పాటు 32వ పేరాలోని 7, 10, 19, 22 పంక్తుల్లో 'వ్యక్తులు' అనే పదాన్ని 'పురుషులు' అనే పదానికి బదులుగా ఉంచితే బాగుంటుంది.

**ఛైర్మన్ :** మిసెస్ సుబ్బరాయన్! నేను పూర్తిగా అంగీకరిస్తున్నాను. ఇంగ్లండ్‌లో 5 ఏళ్ళ కిందటి వరకు మహిళ 'వ్యక్తి' కాదు.

**మిసెస్ సుబ్బరాయన్ :** బహుశా మహిళ అంతకంటే మెరుగని అనుకున్నారేమో!

**జఫ్రుల్లాఖాన్ :** మన 'జనరల్ క్లాజ్ యాక్టు'లో ఎక్కడ 'పురుషుడు' అని ఉంటుందో అక్కడ ఆ పదం 'మహిళ' అనే అర్థాన్ని కూడా కలుపుకొని ఉంటుంది.

**అయ్యంగార్ :** నామినేషన్ ప్రతినిధుల విషయంలో మిత్రులు మిసెస్ సుబ్బరాయన్‌గారు చెప్పిన మాటల్ని నేను అంగీకరిస్తాను. ఎగువసభలో అనుభవజ్ఞులైన రాజనీతివేత్తలు ఉండడం చాలా అవసరం అని నేను కూడా అంగీకరిస్తాను. ఇలాంటి అనుభవజ్ఞ రాజనీతివేత్తల అవసరం తప్పనిసరి అయితే వారు ఏదో ఒక నియోజకవర్గం ద్వారా రావడం తప్పకుండా సంభవం అయినపనే! నామినేషన్ సిద్ధాంతం దుష్టమైంది. దాన్నుండి మనం పూర్తిగా విముక్తం కావాలి.

**ఛైర్మన్ :** మనం ఇలా అందాం. "ఎగువసభకు శాసనసభ్యులుగా తీసుకోడానికి అనువుగా మహిళలకు కల్పించని ప్రత్యేకమైన సదుపాయాల్ని నమూనాగా అంగీకరించాలి.

**డా॥ అంబేద్కర్ :** 34వ పేరాలో ఈ భాగాన్ని స్వీకరించడానికి చెప్పుకోదగ్గ ఇబ్బంది ఉంది. స్టేట్ కౌన్సిల్ అర్హతలు నమూనాగా తీసుకోవాలి. ఇది దళితజాతుల ప్రాతినిధ్యాన్ని పూర్తిగా అడ్డగిస్తుందని నాకు అనిపిస్తున్నది.

**ఛైర్మన్ :** మనం అలా చేయగూడదు.

**డా॥ అంబేద్కర్ :** ఓటుహక్కు కమిటీకి తమ నమూనా సూత్రాల్ని ప్రతిపాదించడానికి తగినంత స్వేచ్ఛ ఇవ్వాలి.

★ ★ ★

**•డా॥ అంబేద్కర్ :** కేంద్ర ప్రభుత్వానికి అత్యవసర పరిస్థితుల్లో ప్రత్యక్షంగానూ, స్వతంత్రంగానూ తనకు సహాయం చేసుకొనే హక్కుల్ని కమిటీ ఇవ్వాలని నేను చెప్పాలనుకుంటున్నాను. అత్యవసర సందర్భాల్లో కేవలం రాష్ట్రాలు సంస్థానాల నుండి వచ్చే ఆర్థిక సాయం కోసం కేంద్రం ఉండకుండా ఉండగలగటం కోసం పై హక్కులు అవసరం.

**లార్డ్ పీల్ :** ఈ అంశాలన్నీ అన్ని దృక్కోణాల నుంచి పరిశీలించబడ్డాయి. ఇది అన్ని దృక్కోణాల ఒప్పందాల ఫలితం. ప్రస్తుతానికి నేను చెప్పదలచుకొన్న సంగతి ఇదే!

**జోషీ :** గౌరవనీయ ఛాన్సలర్! నేను డా॥ అంబేద్కర్ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** గౌరవనీయ ఛాన్సలర్! నేను మరోమాట చెప్పాలనుకుంటున్నాను. నిజ నిర్ధారణ సంఘం ఫెడరల్ శాసనసభను బ్రిటిష్ రాష్ట్రాలు, స్వదేశీ సంస్థానాల మధ్య విభజించేటప్పుడు రెండింటి మధ్య వాటి 'సహాయపు సమాన హక్కు సిద్ధాంతాన్ని' పరిగణనలోకి తీసుకోవాలి.

**ఛైర్మన్ :** లార్డ్ పీల్ ఆ విషయాన్ని తప్పనిసరిగా పరిశీలిస్తారు. మీరు మరోలా అనుకోకపోతే మనం సర్వ సభ్య సమావేశానికి వచ్చినపుడు మీరు మళ్లీ ఆ విషయం గుర్తు చేయండి.

• ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీ కమిటీ చర్చలు, సంపుటి 1, పుట 899-900.

## 45వ సమావేశం – 4 నవంబర్ 1931

*ఛైర్మన్ :* ఆ నివేదిక మీద మీ వ్యాఖ్యలు కావాలి. *పేరా52కి సంబంధించి మళ్ళీ వెనక్కి వద్దాం.

**డా॥ అంబేద్కర్ :** పేరా 52కి సంబంధించి ఇప్పుడే చెప్పమంటారా? మీకు గుర్తుండే ఉంటుంది. మనం ఫెడరల్ కోర్టు న్యాయాధికార పరిధి గురించి చర్చించేటప్పుడు – నేను కోర్టు రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించడం, రాష్ట్ర ప్రభుత్వాలు, ఫెడరల్ ప్రభుత్వం పరస్పరం కలగజేసుకోకుండా చేయడం – అనే విధుల్తోపాటు ప్రాథమిక హక్కులకు సంబంధించి మైనారిటీల హక్కులకు సంబంధించిన విషయాల్లో కూడా ఫెడరల్ కోర్టుకు న్యాయాధికార పరిధి ఉండాలనే అంశాన్ని లేవనెత్తాను. ఈ విషయంలో గౌరవనీయ జయకర్ నన్ను బలపరిచారు. నేననుకొన్నది సరి అయిందయితే శాస్త్రిగారు కూడా బలపరిచారు. ఆ పరిణామానికి తగ్గట్లు ఒక 'నోట్' మాత్రం ఈ పేరాలో కలపాల్సి ఉంది.

**జయకర్ :** ఆ అంశం 'రాజ్యాంగ బద్ధం అయిన' అనే పదంలోనే కలిసి ఉంది.

**ఛైర్మన్ :** ఇప్పుడు **పేరా 62కి సంబంధించి.

**డా॥ అంబేద్కర్ :** ఫెడరల్ కోర్టు స్థలంగా ఢిల్లీ ఉండాలి అనే అంశంలో ఏకాభిప్రాయం ఉందని నేను భావించడంలేదు. ఈ విషయాన్ని ఏదైనా ఒక కమిటీ పరిశీలించాలని నేను కోరుకుంటున్నాను.

**జయకర్ :** ఢిల్లీలో కాకుండా దేశం మధ్యలో ఉండే ఎక్కడైనా అయితే బాగుంటుందని నా సలహా. సంవత్సరం పొడుగునా కార్య నిర్వహణకు సరిపోయే వాతావరణం ఉండే ప్రాంతం అయితే బాగుంటుంది.

**జఫ్రుల్లా ఖాన్ :** వివిధ రంగాల నుంచి అన్నిరకాల సూచనలు అందాయి. అయితే వాటిలో ఏ ఒక్క ప్రాంతానికి ఢిల్లీకి వచ్చినంత మద్దతు రాలేదు.

**ఛైర్మన్ :** ఇప్పుడు 63, 64 పేరాగ్రాఫుల గురించి చర్చ.

## 46వ సమావేశం – 16 నవంబర్ 1931

### భవిష్యత్తు కార్యక్రమం గురించిన చర్చ

+**డా॥ అంబేద్కర్ :** రక్షణమంత్రి, 'ఆర్మీ–కమాండర్ ఇన్ చీఫ్'ల మధ్య సంబంధం ఎలా ఉండాలని సర్ తేజ్ బహదూర్ సప్రూ అనుకుంటున్నారో నేను తెలుసుకోవాలనుకుంటున్నాను.

---

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి 1, 908.

** పైదే, పుట 922.

\+ పైదే, పుట 979.

'ఆర్మీ మెంబర్' లేదా 'ఆర్మీ మినిస్టర్' ఆధ్వర్యంలో కమాండర్-ఇన్-చీఫ్ ఉంటూ సైన్యాధిపతిగా ఉండాలా? లేదా ఆర్మీ మెంబర్ జోక్యం చేసుకోకుండా ఉండే నిర్దిష్ట అధికారాలు కొన్ని ఆర్మీ కమాండర్ ఇన్ చీఫ్‌కి ఉండాలా?

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** నేను వివరాలలోకి వెళ్లటానికి సిద్ధంగాలేను. అయితే 'ఆర్మీ మెంబర్' స్థానాన్ని – అతడు సైన్యానికి సంబంధించిన సామాన్య సమస్యలు, ఆర్థిక వ్యవహారాలు ఇంకా ఇతర వ్యవహారాలు చూస్తారు. అతనికి సైన్యానికి సంబంధించిన సాంకేతిక లేదా పరిపాలనా వ్యవహారాల్లో లావాదేవీలు జరిపే అధికారం ఉండదు. నిజానికి అతడు తెలివైన వాడే అయితే తనకు అలాంటి అధికారం ఉన్నా సరే దాన్ని ఆచరణలోకి తీసుకురాడు. ఈ అంశం గురించి వ్యక్తిగతంగా నాకు ఏమీ తెలియదు. అయితే నేను సైన్యం విషయంలో ఇంగ్లండులో సరిగ్గా ఏ పరిస్థితి ఉందో తెలపమని నా బ్రిటిష్ సహచరులను అభ్యర్థిస్తున్నాను. రక్షణమంత్రికి సైన్యానికి సంబంధించిన అంతర్గత క్రమశిక్షణ విషయంలో జోక్యం చేసుకునే అధికారం బహుశాలేదు. అయితే, అంతకంటే పెద్ద సమస్యలైన విధాన విషయాల్ని చూసుకొంటాడు.

అనువాదం :
డా॥ పి. నరసింహా రెడ్డి



* పైదే. పుట 899 – 900.
\+ పైదే. పుట 908.

# 10

# అల్పసంఖ్యాకుల కమిటీ

## ఏడవ సమావేశం – 28 సెప్టెంబర్, 1931

**ఛైర్మన్** ॰ప్రాతినిధ్యం ఉన్న ఇతర అల్పసంఖ్యాక వర్గాలవారు కూడా ఉన్నారు. మనం ఇప్పుడు సమావేశాన్ని వాయిదా వేసుకుంటే, తమ అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి వారు సిద్ధం కావలసి ఉంటుంది. వచ్చే సమావేశంలో చర్చల్లో పాల్గొనబోయే వారి జాబితాను ఇతర వర్గాల ప్రతినిధులు సిద్ధంచేసి నాకు అందజేయవలసి ఉంది. సమావేశం వాయిదా పడిన కాలాన్ని వారు అందుకు ఉపయోగించుకునేటట్లయితేనే, వాయిదా ప్రయోజనకరంగా ఉంటుంది. చర్చల్లో పాల్గొంటానంటూ ఈ ఉదయం ఒకరు కూడా పేరు ఇవ్వనందున నేను నిస్సహాయపరిస్థితిలో ఉన్నాను. మీకు ఇష్టమైన పక్షంలో....రెండు మూడు సమావేశాలు జరిగేటప్పటికి మీరు చీలిపోయే విధంగా నేను ఈ చర్చా కార్యక్రమాన్ని నడిపించగలను. అయితే, ఆ విధంగా జరగకూడదనే కృతనిశ్చయంతో నేనున్నాను. ఎవరు మాట్లాడుతారో, ఏ విషయాలు మాట్లాడుతారో నాకు తెలియజేస్తే, చర్చలను స్నేహపూర్వకంగా, ప్రయోజనకరంగా నిర్వహించడానికి వీలవుతుంది. అలా జరిగిన పక్షంలో..... తగిన సమయంలో వక్తలను వేదికపైకి పిలిపించగలను. అయితే, అభిప్రాయాలను అణచివేయాలనేది నా ఉద్దేశం కాదు. ఈ చర్చల ద్వారా వీలయినంత ప్రయోజనాన్ని సాధించాలన్నదే నా అభిమతం. మీరు ఇప్పుడు వాయిదా కోరుతున్నట్లయితే, ఒక విషయాన్ని గుర్తుంచుకోండి. సంగ్రహంగా, సూటిగా, సమగ్రంగా ఉండే విధంగా ప్రకటన చేసేందుకు తగిన సన్నాహాలు చేసుకోవడానికే ఈ కాలాన్ని ఉపయోగించుకుంటామని మీరు నాతో అంగీకారానికి వచ్చినట్లేనని నేను భావిస్తాను. ఇదే అవగాహనపై మీరు వాయిదాను కోరుతున్నారా?

***డా॥ అంబేద్కర్ :*** సమావేశాన్ని వాయిదా వేసే ముందు ఒక మాట చెప్పాలని అనుకుంటున్నాను.ఈ చర్చలు ఇలా జరుగుతున్న కాలంలో, ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారు తమ వాదనను సిద్ధం చేసుకోవాల్సిందిగా మీరు సూచించారు. అయితే, దళిత వర్గాలకు సంబంధించి గత సమావేశంలోనే మేము మా వాదనను అల్పసంఖ్యాకుల సబ్-కమిటీకి నివేదించుకున్నాం.

వివిధ శాసన సభలలో మాకు ఎంత ప్రాతినిధ్యంకావాలో సూచించే ఒక చిన్న ప్రకటన

---

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి : 1, పేజీలు 1337–38.

మాత్రమే ఈ కమిటీ సమావేశంలో మేము చేయవలసి ఉన్నది. అది తప్ప, చెప్పవలసినది మాకు మరేమీ లేదు. మతపరమైన సమస్యల పరిష్కారానికి ఇంకా సంప్రదింపులు జరుగుతాయనే విషయం తెలిసి నేను ఎంతో సంతోషించాను. అయితే, ముందుగానే ఒక అంశాన్ని స్పష్టం చేయాలను కుంటున్నాను. ఈ అంశంపై ఎటువంటి సందేహం మిగిలి ఉండటం నాకు ఇష్టం లేదు. తాము సర్వాధికారాలు కలిగిన ప్రతినిధులం ఎంత మాత్రం కాదని సంప్రదింపులు జరుపుతున్న వ్యక్తులు గుర్తుంచుకోవాలి. శ్రీ గాంధీ లేదా కాంగ్రెస్ వారి ప్రాతినిధ్య స్వభావం ఏదైనప్పటికీ మమ్మలను కట్టిపడవేసే స్థితిలో తాము ఎంత మాత్రం లేమని కూడా వారు గుర్తుపెట్టుకోవాలి. ఈ సమావేశంలో నేను ఇదే విషయాన్ని స్పష్టం చేస్తున్నాను.

మరొక విషయం కూడా నేను చెప్పాలనుకుంటున్నాను. వివిధ అల్పసంఖ్యాక వర్గాలవారు తమ తమ కోర్కెలను నివేదించుకున్నారు. ఈ కోర్కెలు ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి కోర్కెలకు అనుగుణంగా ఉన్నాయా లేదా అనే పరిగణనతో నిమిత్తం లేకుండా నివేదించినవే. అందువల్ల, ఏదైనా అల్పసంఖ్యాక వర్గానికి, కాంగ్రెస్ లేదా మరో సంబంధిత పక్షానికి మధ్య జరిగే చర్చలలో ఇతర అల్పసంఖ్యాక వర్గాల కోర్కెలను పరిగణనలోకి తీసుకోకపోవచ్చు. అలా జరిగిన పక్షంలో, చర్చలు విజయవంతమయ్యే అవకాశం ఉంటుందని నా మటుకి నేను అనుకోవటం లేదు. ఈ విషయాన్ని నేను ముందే స్పష్టం చేస్తున్నాను. ఏదైనా ఒక వర్గం అధిక ప్రతిపత్తి పొందాలా, వద్దా అనే విషయంతో నాకు పేచీ లేదు. అయితే, అధిక ప్రతిపత్తిని ఎవరు కోరుకుంటున్నా....., ఆ ప్రతిపత్తిని ఇవ్వడానికి ఎవరు ఇష్టపడుతున్నా....., దానిని నా భాగం నుంచి ఇవ్వకూడదు, ఇవ్వలేరు అని నేను కచ్చితంగా చెప్తున్నాను. ఇదే విషయాన్ని మరోసారి స్పష్టం చేస్తున్నాను.

**సర్‌హెన్రీ గిడ్నీ :** నేను రెండు మాటలు చెప్పాలనుకుంటున్నాను. నా మిత్రుడు డాక్టర్ అంబేద్కర్‌తో నేను మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఒక చిన్నవర్గానికి ప్రాతినిధ్యం వహించే నాకు ఈ లావాదేవీల్లో ఎటువంటి స్థానం ఉంటుందో తెలియటం లేదు. మహమ్మదీయులతో కాంగ్రెస్ ఒప్పందానికి వస్తే, మిగిలిన అల్పసంఖ్యాక వర్గాలవారు ఏమైపోతారు? మాలో ఉన్న విభేదాలను మా మధ్యనే పరిష్కరించుకుని, మా ప్రతిపాదనలను విడివిడిగా మీ ముందు ఉంచాలని మీరు అడుగుతున్నారు. ఆ పని మేము ఇదివరకే చేశాం. నేను ప్రాతినిధ్యం వహిస్తున్న చిన్నవర్గం కనీస కోర్కెలను గత సమావేశంలోనే సమర్పించాను. నూతన భారతదేశ పటాన్ని రూపొందించేటప్పుడు తమదైన చిన్న గుర్తును ఆ పటంపై పెట్టేహక్కు అన్ని అల్పసంఖ్యాక వర్గాలకూ ఉండాలని నేను స్పష్టం చేస్తున్నాను. ఇప్పుడు కుదిరే ఒప్పందం పూర్తిగా హిందూ–ముస్లిం ఒప్పందంగానే ఉండేటట్లు అయితే, మా స్థానం ఏమిటో నాకు అర్థం కావటం లేదు.

★ ★ ★

*ఛైర్మన్:* ఎటువంటి అపార్థానికీ ఆస్కారం ఇవ్వవద్దు. తుది ఒప్పందం ఈ కమిటీ ముందుకే వస్తుంది. తమ మధ్య విభేదాలు ఉన్న అల్పసంఖ్యాక వర్గాలవారు విభేదాలను పరిష్కరించుకోవటానికి కొద్దిపాటి కాలాన్ని ఉపయోగించుకోవాలన్నదే నా సూచన. సమష్టి ఒప్పందం కుదుర్చుకునే దిశలో అది అత్యంత ముఖ్యమైన, ఆవశ్యకమైన ముందడుగు కాగలదు. అయితే, కుదుర్చుకోబోయే ఒప్పందం సమష్టిగానే ఉంటుంది.

*డా॥ అంబేద్కర్:* నా వైఖరిని నేను ఇప్పటికే స్పష్టం చేశాను.

*ఛైర్మన్:* డాక్టర్ అంబేద్కర్ తన వైఖరిని స్పష్టం చేశారు. ఆ విషయంపై ఆయన ఎటువంటి సందేహానికి తావు ఇవ్వలేదు. అద్భుతమైన ఆయన వైఖరి అలాగే ఉంటుంది. ఈ కమిటీ తిరిగి చర్చలను ప్రారంభించినప్పుడు ఆ విషయం ప్రస్తావనకు వస్తుంది. సమష్టి ఒప్పందం కోసం మనం సహకరించుకుంటున్నామని మీరంతా భావించేలా చేయటమే నా ఉద్దేశం. ఈ ఒప్పందం ఏ ఇద్దరు, ముగ్గురి మధ్య మాత్రమే కాదు, అది ఒక సంపూర్ణ ఒప్పందంగా ఉంటుంది.

★ ★ ★

*డా॥ అంబేద్కర్:* కాంగ్రెస్ ప్రతినిధులతో పాటు, వివిధ అల్పసంఖ్యాక వర్గాల సభ్యులతో ఒక చిన్న కమిటీని నియమించటం మీకు వీలవుతుందేమో ఆలోచించవలసిందిగా సూచిస్తున్నాను. సమావేశం వాయిదా పడిన కాలంలో ఈ కమిటీ ఇష్టాగోష్ఠిగా సమావేశమై ఈ సమస్యపై చర్చించవచ్చని భావిస్తున్నాను.

*ఛైర్మన్:* ఇదే సూచన నేను కూడా చేద్దామనుకున్నాను. అయితే, కమిటీని నియమించవలసిందిగా నన్ను కోరవద్దు. ఆ పని మీరే చూసుకోండి. మీ అందరినీ ఒక చోటుకు ఆహ్వానించాను. మీలో మీరు ఇష్టాగోష్ఠి సమావేశం జరిపి, ఆ సమస్యపై చర్చించలేరా? ఆ విధంగా అయితేనే మీరు ఈ కమిటీ సమావేశంలో కొంత విషయ పరిజ్ఞానంతో మాట్లాడగలరు. ఏమిటి, అలా చేద్దామా?

*డాక్టర్ అంబేద్కర్:* మీ ఇష్ట ప్రకారమే చేద్దాం.

*అధ్యక్షుడు:* అదే చాలా బాగుంటుంది.

## ఎనిమిదవ సమావేశం—అక్టోబర్ 1, 1931

*శ్రీ గాంధీ:* ప్రధానీ! గత రాత్రి గౌరవనీయులైన ఆగాఖాన్‌గారితోను, ఇతర ముస్లిం స్నేహితులతోను చర్చలు జరిపిన తరువాత మేము ఒక నిర్ణయానికి వచ్చాం. సమావేశాన్ని ఒక వారం రోజుల పాటు వాయిదా వేస్తేనే మన లక్ష్యం నెరవేరుతుందని మా భావన. ఈ విషయంపై ఇతర సహచరులను

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ, సంపుటి : 1, పేజీలు 1338-39.
** పైదే., పేజీలు 1340.
+ పైదే, పేజీలు 1340-45.

సంప్రదించే అవకాశం నాకు దొరకలేదు. అయితే, నేను ఇప్పుడు చేస్తున్న ప్రతిపాదనకు వాళ్ళు కూడా అంగీకరిస్తారని నిస్సందేహంగా చెప్పగలను. నా ముస్లిం స్నేహితులతో చర్చలు జరుపుతూనే ఉన్నాను. ఇతర వర్గాలకు చెందిన స్నేహితులతో కూడా సంప్రదింపులు జరిపే భాగ్యం నిన్న మధ్యాహ్నం నాకు లభించింది. సంప్రదింపుల్లో పెద్దగా పురోగతి సాధించలేదు. అయితే, అభిప్రాయాలను పరస్పరం తెలుసుకోవడానికి కూడా మనకు లభించిన సమయం సరిపోదని వారు కూడా భావించారు. సమావేశాన్ని ఇప్పుడు వారంపాటు వాయిదా వేస్తే, ఆ తరువాత మళ్లీ నేను ఎటువంటి వాయిదాను కోరను. అంతేకాదు. ఈ వారంలో నేను చేసిన కృషి ఫలితం ఏదైనా ఉంటే కమిటీకి నివేదించుకుంటాను.

ఒక తుది ఒప్పందానికి రావడానికి వివిధ వర్గాల ప్రతినిధులను ఒక చోట చేర్చి, సంప్రదింపులు జరిపే బాధ్యతను గౌరవనీయులైన ఆగాఖాన్‌గారు, ఇతర స్నేహితులు నిన్న రాత్రి నా భుజాల పైనే మోపారు. కమిటీకి ఈ విషయాన్ని తెలియజేయటంలో నేను దాస్తున్నది ఏమీలేదు. ప్రధానీ! నా ఈ ప్రతిపాదన మీకూ, కమిటీలోని ఇతర సభ్యులకు నచ్చినట్లయితే సంతోషం. ఈ ప్రతిపాదనను గౌరవనీయులైన ఆగాఖాన్ బలపరుస్తారని నాకు తెలుసు. ఈ వారాంతానికి ఏదో ఒక ఒప్పందాన్ని నివేదించడానికి వీలవుతుందని మనమంతా ఆశిద్దాం.

ఇటువంటి ఆశాభావాన్ని నేను వ్యక్తం చేస్తున్నానంటే, నాకేదో తెలుసని, ఆ ఆధారంతోనే నేను ఈ ఆశాభావాన్ని వ్యక్తం చేస్తున్నానని భావించవద్దు. నేను నిరంతర ఆశావాదిని. నా జీవితంలో ఎన్నో సార్లు కారుమబ్బులను చూశాను. అయితే, ఆశలను చిగురింపచేసేలా ఏదో ఒక మలుపు సంభవించింది. సరే, ఏది ఏమైనప్పటికీ, సాధ్యమైనంత మేరకు మానవ కృషి చేస్తాం. కమిటీలోని అనేకమంది సభ్యులు ఒక ఒప్పందానికి రాగలుగుతారనే విషయంలో నాకు ఎటువంటి సందేహం లేదు.

ఈ రోజుతో మన సమావేశాన్ని వాయిదా వేయవలసిందిగా ప్రతిపాదిస్తూ, ఆ ప్రతిపాదనను మీ నిర్ణయానికి వదిలివేస్తున్నాను.

***గౌ॥ ఆగాఖాన్ :*** ఈ ప్రతిపాదనను నేను సంతోషంగా బలపరుస్తున్నాను.

***సర్దార్ ఉజ్జల్ సింగ్ :*** ఈ ప్రతిపాదనకు నేను హృదయపూర్వకంగా మద్దతు ఇస్తున్నాను. ఇరుపక్షాలు సద్భావనతో వ్యవహరించినట్లయితే, ఏదో ఒక అవగాహనకు రావడానికి ఈ ప్రతిపాదన వీలు కల్పిస్తుందనే ఆశాభావం నాకు కూడా ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** ఈ కమిటీ ముందు ఉన్న సమస్యకు ఏదో ఒక పరిష్కారాన్ని కనుగొనడానికి మనం సాధ్యమైన ప్రతిప్రయత్నాన్నీ చేస్తున్నాం. ఆ ప్రయత్నాలకు ఎటువంటి ఆటంకం కలిగించడం నాకు ఇష్టం లేదు. మహాత్మాగాంధీ సూచించిన విధంగా ఏదైనా పరిష్కారం సాధ్యమయ్యే పక్షంలో ఈ ప్రతిపాదనకు నాకు ఎటువంటి అభ్యంతరం లేదు.

అయితే, బడుగువర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న నేను ఎదుర్కొనే కష్టం ఒకటి ఉంది. సమావేశం వాయిదా పడిన కాలంలో సమస్య పరిష్కారానికి గాంధీ నియమించాలనుకుంటున్న కమిటీ ఏ విధంగా ఉంటుందో నాకు తెలియదు. అయితే, బడుగువర్గాలకు ఈకమిటీలో ప్రానిధ్యం లభిస్తుందని అనుకుంటున్నాను.

***శ్రీ గాంధీ :*** అందులో సందేహం ఏమీ లేదు.

***డా॥ అంబేద్కర్:*** కృతజ్ఞతలు. అయితే, ఈ రోజు నేను ఉన్న పరిస్థితిలో ఆ కమిటీలో పనిచేయటం వల్ల నాకుగాని, నా సహచరునికి గాని ఏదైనా ప్రయోజనం ఉంటుందో, లేదోననే విషయం నాకు తెలియదు. ఈ కారణంగానే.... మహమ్మదీయులు, సిక్కులు మినహా ఇతర ఏ వర్గానికి రాజకీయ గుర్తింపు ఇవ్వడానికి భారత జాతీయ కాంగ్రెస్ ప్రతినిధిగా తాను సిద్ధంగా లేనని ఫెడరల్ నిర్మాణ కమిటీ సమావేశంలో మాట్లాడిన మొదటి రోజునే మహాత్మాగాంధీ మాకు చెప్పారు. ఆంగ్లో-ఇండియన్లకు, బడుగువర్గాలకు, భారతీయ క్రిస్టియన్లకు గుర్తింపు ఇవ్వడానికి ఆయన సిద్ధంగా లేరు. ఫెడరల్ నిర్మాణ కమిటీలో తాను అవలంబించిన వైఖరి పూర్తిగా తనదేనని, బాగా ఆలోచించిన మీదట అవలంబించినదేనని మహాత్మాగాంధీ ఇదివరకే మాకు స్పష్టం చేసినట్లు ఈ కమిటీ సమావేశంలో ఇప్పుడు నేను చెప్తే మర్యాదా భంగమని అనుకోను. బడుగు వర్గాల సమస్య గురించి వారం క్రితం నేను మహాత్మాగాంధీని కలిశాను. నిన్న కూడా మేము, ఇతర అల్పసంఖ్యాక వర్గాల సభ్యులు గాంధీని ఆయన కార్యాలయంలో కలుసుకుని చర్చించాం. ఈ రెండు సందర్భాలలో ఆయన తన వైఖరి స్పష్టం చేశారు. భావి భారత రాజ్యాంగంలో బడుగు వర్గాలకు రాజకీయ గుర్తింపు లభిస్తుందని ముందుగానే నాకు తెలియవలసి ఉన్నదని చెప్పదలచుకున్నాను. అలా కాని పక్షంలో.... ఈ విషయంపై మహాత్మాగాంధీ ఏర్పాటు చేయబోతున్న కమిటీలో నేను చేరినందువల్ల ఎటువంటి ప్రయోజనమైనా కలుగుతుందో లేదో నాకు తెలియదు. అందువల్ల... రాజకీయ గుర్తింపునకు గత ఏడాది అల్పసంఖ్యాకవర్గాల ఉప సంఘం సిఫార్సు చేసిన అన్ని వర్గాలకు కమిటీలో ప్రాతినిధ్యం లభిస్తుందనే భరోసా నాకు లభించకపోతే, సమావేశం వాయిదా ప్రతిపాదనకు నేను మనస్ఫూర్తిగా మద్దతు ఇచ్చే విషయం సందేహాస్పదమే. అంతేకాక, త్వరలో ఏర్పడే కమిటీతో మనస్ఫూర్తిగా సహకరించగలనో లేదో కూడా నాకు తెలియదు. నేను ఇప్పుడు స్పష్టం చేయదలచుకున్నదంతా ఇదే.

***సర్ హెన్రీ గిడ్నీ (ఆంగ్లో-ఇండియన్) :*** నేను ప్రాతినిధ్యం వహిస్తున్న వర్గం తరపున నా మిత్రుడు డాక్టర్ అంబేద్కర్‌తో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మా వర్గానికి రాజకీయ గుర్తింపు ఇవ్వడానికి మహాత్మాగాంధీ నిరాకరించినందున నేను కూడా దుస్థితిలో ఉన్నాను. నా అభిప్రాయం తప్పు కావచ్చు. అయితే, అలా అయిన పక్షంలో ఆ అభిప్రాయాన్ని మహాత్మాగాంధీ సరిదిద్దుతారని నాకు తెలుసు. ఇదే విషయంపై నిన్న మేము మహాత్మాగాంధీని కలుసుకున్నాము. మా వర్గానికి రాజకీయ గుర్తింపు ఇవ్వడానికి ఆయన, కాంగ్రెస్ సిద్ధంగా లేరనే విషయం ఆయన మాటల ద్వారా మాకు

స్పష్టమైంది. సాంప్రదాయిక, చారిత్రక కారణాలపై మహమ్మదీయులకు, సిక్కులకు మాత్రమే రాజకీయ గుర్తింపు ఇవ్వడానికి సాధ్యం అవుతోందని కాంగ్రెస్ లాహోర్ తీర్మానం పేర్కొనడం వెనుక మహాత్మాగాంధీ ప్రోద్బలం ఉందని కూడా స్పష్టమైంది. అవే కారణాలపై నా వర్గానికి గుర్తింపు కోరితే అది అసంగతంగా ఉండవచ్చు. అయితే, ఈ కమిటీలో ఇదివరకే గుర్తింపు లభించిన వర్గాల ప్రతినిధులకు రానున్న కమిటీలో కూడా స్థానం కల్పిస్తామని ఈ సమావేశంలోనే స్పష్టం చేయవలసిందిగా మహాత్మాగాంధీని కోరుతున్నాను. ఆ కమిటీ నియామకం జరగక ముందే, సమావేశాన్ని వాయిదా వేయాలని మీరు అడగకముందే ఆయన ఈ విషయాన్ని స్పష్టంచేయాలి.

***రావు బహదూర్ పన్నీర్ సెల్వమ్ (భారతీయ క్రిస్టియన్లు) :*** డాక్టర్ అంబేద్కర్ చేసిన ప్రకటన నాకు ఒక వార్త అయింది. మా వర్గానికి మహాత్మాగాంధీ ఎటువంటి గుర్తింపు ఇవ్వటం లేదని నాకు ఇప్పటి వరకు తెలియదు. మాకు గుర్తింపు ఇవ్వని పక్షంలో..... ఈ సమావేశంలో మేము పాల్గొనడం పూర్తిగా అనవసరమని స్పష్టం చేస్తున్నాను. ఒక వర్గంగా మాకు రాజకీయ గుర్తింపు ఇవ్వని పక్షంలో, ఏ కమిటీలోనైనా మేం స్థానం సంపాదించుకున్నప్పటికీ ఏం ప్రయోజనం కలుగుతుందో నాకు నిజంగా అర్థం కావటం లేదు. డాక్టర్ అంబేద్కర్, సర్ హెన్రీ గిడ్నీ తమ వాదనలను విన్పించినంత స్పష్టంగా నేను కూడా నా వాదనను విన్పించాల్సి ఉన్నదని భావిస్తున్నాను.

***డాక్టర్ మూంజీ :*** అల్పసంఖ్యాక వర్గాల కమిటీలోని రెండు వర్గాలకు మాత్రమే మహాత్మాగాంధీ గుర్తింపు ఇవ్వబోతున్నారని వార్తాపత్రికల్లో చదివినప్పుడు ఆ విషయానికి నేను పెద్దగా ప్రాధాన్యం ఇవ్వలేదు. దాన్ని అంతగా పట్టించుకోనూ లేదు. రాజీని, అవగాహనను పెంపొందించుకోవడానికి, చిక్కులను సరిచేయడానికి ఇటువంటి నిర్ణయం తీసుకున్నారని నేను యోచించాను. అయితే, ఈ విషయాన్ని డాక్టర్ అంబేద్కర్, సర్ హెన్రీ గిడ్నీ తీవ్రంగా తీసుకున్నారని వారి ప్రసంగాల ద్వారా నాకు తెలిసింది. అందువల్ల ఈ కమిటీ దృష్టికి నేను ఒక విషయాన్ని తీసుకురాదలచుకున్నాను. పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలలో హిందువులు కూడా అల్పసంఖ్యాకులుగానే ఉన్నారు. ఆ కారణంగా, వారు తమ ప్రయోజనాలను తామే పరిరక్షించుకోవలసి ఉంటుంది. ఈ సమస్యను పరిశీలించడానికి సమావేశాన్ని వాయిదా వేసుకోవాలనే ప్రతిపాదనకు నాకు అభ్యంతరం లేదని ఈ చిన్న వివరణ ద్వారా నేను స్పష్టం చేస్తున్నాను.

***సర్ మహమ్మద్ షఫీ :*** మహాత్మా గాంధీ చేసిన ప్రతిపాదన గురించి నా స్నేహితులు కొందరిలో నిరాధారమైన భయాలు నెలకొని ఉన్నట్లు నాకు సందేహంగా వున్నది. ఈ ప్రతిపాదన ద్వారా నాకు అర్థమైంది ఏమిటంటే, ఈ కమిటీలో ఒక ఉపసంఘాన్ని నియమించాలని కాని, లేదా ఏదో కమిటీని నియమించాలని కానీ ఆయన అడగడం లేదు. బడుగువర్గాలు, ఆంగ్లో-ఇండియన్లతో సహా ఈ కమిటీలో ప్రాతినిధ్యం ఉన్న ప్రతివర్గం తమ నుంచి ఒకరో, ఇద్దరో, ముగ్గురినో ఎంపిక చేసుకుంటే, వారు కలిసి కూర్చొని చర్చించి అందరికీ సంతృప్తికరంగా ఉండే ఏదైనా ఒప్పందాన్ని కుదుర్చుకోవటం వీలవుతుందేమో పరిశీలించ గలుగుతారని మహాత్మాగాంధీ ఉద్దేశించారు. దీనివల్ల , అల్ప సంఖ్యాక

వర్గాల కమిటీపై ఉన్న భారాన్ని కొంత తగ్గించడానికి వీలవుతుందని ఆయన ఉద్దేశం. అటువంటి ఏకాభిప్రాయాన్ని కనుక సాధించగలిగేటట్లయితే, భారతదేశ శాంతియుత ప్రగతిని కోరుకునే ప్రతిఒక్కరూ ఆ ఏకాభిప్రాయా సాధనకు సంతోషంగా సహకరించగలరని నేను విశ్వసిస్తున్నాను. మహాత్మాగాంధీ చేసిన ప్రతిపాదనను గౌరవనీయులైన ఆగాఖాన్ బలపరిచారు. ఆ ప్రతిపాదన స్వభావం గురించి నా స్నేహితుడు డాక్టర్ అంబేద్కర్ నిరాధారమైన భయాలు పెట్టుకోవటం వల్లనే ఆయన అటువంటి అభ్యంతరం వ్యక్తం చేసి ఉంటారని నేను సందేహిస్తున్నాను. నేను నా ఈ వివరణను సమావేశానికి నివేదించుకున్నాను. మనందరి మాతృదేశం శాంతియుత ప్రగతిని సాధించాలని నిబాయితీగా కోరుకునే వ్యక్తులంగా మనం స్నేహపూర్వకంగా, సహకార ధోరణిలో కలిసి చర్చించు కోవడానికి....., ఈ కమిటీ సమావేశాన్ని వారం రోజుల పాటు వాయిదా వేయాలని అందరూ ఏకాభిప్రాయానికి వస్తే నేను సంతోషిస్తాను.

శ్రీమతి నాయుడు : ప్రధానిగారూ! ఒక అల్పసంఖ్యాక వర్గానికిగాని, ఏదైనా ప్రత్యేక ప్రయోజనానికి గాని నేను ప్రాతినిధ్యం వహించడం లేదు. అందువల్ల, ఇబ్బందులను సృష్టించవద్దని, అల్పసంఖ్యాక వర్గాలకు, ప్రత్యేక వర్గాలకు నేను చేస్తున్న విజ్ఞప్తి పూర్తిగా నిష్పాక్షికమైనది. బయటివారి మధ్యవర్తిత్వం, జోక్యం లేకుండా మా సొంత సమస్యలను మేమే పరిష్కరించుకుని, తద్వారా సాధించిన సర్దుబాటు విషయాన్ని మేము మీకు నివేదించవలసి ఉన్నదని విజ్ఞప్తి చేస్తున్నాను. మీరు ఇదివరకు ఒకరోజు చేసిన విజ్ఞప్తికి అనుగుణంగానే నేను ఈ విజ్ఞప్తి చేశాను. మన సొంత సమస్యలను పరిష్కరించుకోవటంలో ఆత్మగౌరవాన్ని, కర్తవ్యాన్ని పాటించాలనే అభిప్రాయానికి మీ విజ్ఞప్తి తగినట్లుగానే ఉన్నది. ఈ కారణంతోనే మహాత్మాగాంధీ సమావేశం వాయిదాను కోరుతూ తీర్మానాన్ని ప్రవేశపెట్టారని నేను భావిస్తున్నాను. ఎంత చిన్న అల్పసంఖ్యాక వర్గమైనా ఈ విషయంలో భయాందోళనకు గురికావలసిన అవసరం ఉందని నేను అనుకోవటం లేదు. ప్రతి అధిక సంఖ్యాక వర్గం మాదిరిగానే ప్రతి అల్ప సంఖ్యాక వర్గమూ ఈ దేశంలో ఒక భాగమే. సైన్యమూ, డబ్బూ లేకుండానే ఒక స్వతంత్ర దేశాన్ని నిర్మించానని యూరప్‌లోని ఒక గొప్ప రాజనీతివేత్త నాకు చెప్పారు. ఆయన ఇచ్చిన సలహాను అనుసరిస్తానని నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. రెండు సంవత్సరాల క్రితం ఆయన నాతో ఇలా అన్నారు: "అమ్మా! మీ అల్పసంఖ్యాకవర్గాలను సంతోషంగా ఉంచండి. వారిలో భద్రతాభావాన్ని కలిగించకుండా మీరు దేశాన్ని నిర్మించలేరు". అల్పసంఖ్యాక వర్గాలలో భద్రతా భావాన్ని కలిగించి, దేశంలో తాము కూడా అంతర్భాగమని వారు భావించేలా చేయాలని మేము ఆకాంక్షిస్తున్నాము. అధిక సంఖ్యాక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న మహాత్మాగాంధీ, అల్పసంఖ్యాకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న గౌరవ నీయులైన ఆగాఖాన్ అన్నట్లు.... మన సమస్యలతో సంబంధం లేని వారి దృష్టికి మన చిన్న చిన్న సమస్యలను తీసుకురావద్దనీ; సమానత్వం, దయ, సానుభూతి మొదలైన భావాలతో ఆ సమస్యలను మనలో మనమే పరిష్కరించుకోవాలనీ; మన సొంత ఇంటిలోని విభేదాల గురించి తెలుసుకునేందుకు బయటి వారిని అనుమతించకుండా మన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

ప్రధాని గారూ! నేను చేస్తున్న విజ్ఞప్తి అదే. అన్ని అల్పసంఖ్యాక వర్గాలవారూ, అధిక సంఖ్యాక వర్గాలవారూ దీనిని అంగీకరిస్తారని నేను ఆశిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** నా అభిప్రాయం మరింత స్పష్టం చేయాలని అనుకుంటున్నాను. నేను చెప్పిన విషయాలకు సంబంధించి కొంత అపోహ ఏర్పడినట్లు నాకు అనిపిస్తున్నది. సమావేశాన్ని వాయిదా వేసే ప్రతిపాదనకు నేను అభ్యంతరం చెప్పలేదు. అలాగే సమస్య పరిశీలనకు నియమించబోయే కమిటీలో పనిచేయటానికి కూడా నేను అభ్యంతరం చెప్పలేదు. ఈ కమిటీలో పనిచేసే భాగ్యం నాకు కలిగించేటట్లయితే, కమిటీలో చేరబోయే ముందు నేను తెలుసుకోవాలనుకుంటున్న విషయాలు ఇవి : ఏ విషయాలను ఈ కమిటీ పరిశీలిస్తుంది? మహమ్మదీయులు – హిందువులకు మధ్య ఉన్న సమస్యను మాత్రమే ఇది పరిశీలిస్తుందా? మహమ్మదీయులకు, పంజాబ్‌లోని సిక్కులకు మధ్యనున్న సమస్యను కమిటీ పరిశీలిస్తుందా? లేక సిక్కులు, హిందువులకు మధ్యనున్న సమస్యను పరిశీలిస్తుందా? క్రిస్టియన్లు, ఆంగ్లో–ఇండియన్లు, బడుగువర్గాల సమస్యలను పరిశీలిస్తుందా?

హిందువులకు, మహమ్మదీయులకు మధ్యనున్న సమస్యకు, హిందువులకు, సిక్కులకు మధ్యనున్న సమస్యకు మాత్రమే కమిటీ పరిమితం కాదని; బడుగువర్గాలు, ఆంగ్లో–ఇండియన్లు, క్రిస్టియన్ల సమస్యలను కూడా పరిశీలించే బాధ్యతను తీసుకుంటుందని ముందుగా మాకు స్పష్టం అయితేనే, ఎటువంటి నిరసన లేకుండా సమావేశం వాయిదా తీర్మానాన్ని నేను అనుమతిస్తాను. మరొక విషయాన్ని నేను చెప్పాలనుకుంటున్నాను. విషయాలను నాకు తెలియనీయకుండా చేయాలని అనుకుంటున్నా, సమావేశం వాయిదా పడినప్పుడు లభించే వ్యవధిని హిందూ–ముస్లిం సమస్యను, హిందూ–సిక్కు సమస్యను పరిష్కరించడానికి వాడుకోదలచినా...., కమిటీ ఈ సమస్యను తీవ్రంగా పరిగణించాలని నేను గట్టిగా కోరుతున్నాను.

**శ్రీ గాంధీ :** ప్రధాని గారూ! మిత్రులారా!! మనలో కొంతమంది నిర్దేశించుకున్న పని పరిధిక సంబంధించి కొంత అపార్థం నెలకొన్నట్లు నాకు తోస్తున్నది. ఏం జరగబోతున్నదనే విషయంపై డాక్టర్ అంబేద్కర్, కల్నల్ గిడ్నీ, తదితర స్నేహితులు అనవసరంగా ఆందోళన చెందుతున్నట్లు భావిస్తున్నాను. భారత దేశంలో ఏ వర్గానికైనా లేక చివరికి ఏ వ్యక్తికైనా రాజకీయ స్థాయి తిరస్కరించడానికి నేనెవరిని? ఏ జాతీయ ప్రయోజనాన్ని అయినా నేను బలిచేసేటట్లయితే, కాంగ్రెస్ నాపై ఉంచిన విశ్వాసానికి కాంగ్రెస్ ప్రతినిధిగా నేను అనర్హుడిని అవుతాను. ఈ విషయాలపై నా సొంత అభిప్రాయాలను ఇదివరకే స్పష్టం చేశాను. ఆ అభిప్రాయాలకు కట్టుబడే ఉంటానని కూడా ఒప్పుకుంటున్నాను. అయితే, ప్రతి ప్రత్యేక ప్రయోజనాన్ని కాపాడడానికి అనేక మార్గాలుంటాయి. ఒక పథకాన్ని రూపొందించడానికి కలిసి చర్చించబోతున్న మనమే వాటిని నిర్ణయించవలసి ఉంది. ఈ ఇష్టాగోష్టి సమావేశంలోని సభ్యులపై ఎవరైనా తమ సొంత అభిప్రాయాలు చెప్పాలనుకుంటే ఎటువంటి ఆటంకమూ ఉండదు. దీనిని మనం కమిటీ అని పిలవనక్కరలేదు. ఏ కమిటీనైనా సమావేశపరిచే అధికారం నాకు లేదు. నేను ఒక సామాన్య శాంతి దూతగా మాత్రమే వ్యవహరించగలను.

వివిధ ప్రయోజనాలకు, వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న వారిని ఒకచోట సమావేశపరచడానికి ప్రయత్నించగలను. ఏకాంత ప్రదేశంలో మనస్సు విప్పిమాట్లాడు కోవటం ద్వారా మన అపార్థాలను తొలగించుటకు నేడు మన ముందు అగమ్యగోచరంగా ఉన్న గమ్యాన్ని చేరుకోగలమేమో ప్రయత్నించగలను.

అందువల్ల, ఎవరైనా ఒక అభిప్రాయాన్ని కలిగి ఉండడానికి, వ్యక్తం చేయడానికి సందేహించ వలసిన అవసరం లేదని భావిస్తున్నాను. మనలో ప్రతి ఒక్కరి అభిప్రాయానికి ఎంత విలువ ఉన్నదో నా అభిప్రాయానికి కూడా అంతే విలువ ఉన్నది. మిగిలిన వారి అభిప్రాయాలకంటే నా అభిప్రాయానికి ఎక్కువ విలువ ఏమీ లేదు. ఏ ఒక్కరి అభిప్రాయానికి విరుద్ధంగా నా అభిప్రాయాన్ని అమలుచేయడానికి నాకు ఎటువంటి అధికారం లేదు. జాతీయ ప్రయోజనాల దృష్ట్యా నా అభిప్రాయాలను సాదాసీదాగా వ్యక్తం చేశాను. సమయోచితంగా ఉన్నప్పుడల్లా వాటిని నేను వ్యక్త పరుస్తాను. ఈ అభిప్రాయాలను తిరస్కరించినా, అంగీకరించినా.... అంతా మీ ఇష్టమే. అందువల్ల, ఈ సమావేశంలోను, ఇతర ఇష్టాగోష్టి చర్చలలోను నేను చేసిన సూచనలను బలవంతంగా రుద్దుతారనే అపోహను ప్రతిఒక్కరూ మీ మనస్సులనుంచి దయచేసి తొలగించుకోండి. ఈ సమా వేశంలో బిగదీసుకుని కూర్చునేకంటే, సన్నిహితం కావటానికి ఇది ఒక మార్గమని మీరు అనుకుంటు న్నట్లయితే, ఈ వాయిదా తీర్మానాన్ని బలపరచటమే కాకుండా, ఈ ఇష్టాగోష్టి సమావేశాలకు సంబంధించి నేను చేసిన ప్రతిపాదనకు కూడా మీ హృదయ పూర్వక సహకారాన్ని అందజేస్తారు.

సర్ హ్యూబర్ట్ కార్: ప్రధాని గారూ! నా వర్గం గురించి ఇక్కడ ప్రస్తావించలేదు. నా వర్గం చాలా చిన్నది. అయితే, సమావేశం వాయిదాకు గాని, సమస్యకు పరిష్కారం కనుగొనడంలో సహాయపడే ఇతర ప్రయత్నాలకు గాని మేం మద్దతు ఇస్తామని నేను చెప్పదలచుకున్నాను. మనందరికీ అమితాసక్తి ఉన్న ఇతర సమస్యలకు తుది పరిష్కారాన్ని కనుగొనే ముందు ఈ సమస్యను పరిష్కరించుకోవటం అవసరమని మనం భావిస్తూనే ఉన్నాం.

డాక్టర్ దత్తా : ఈ వాయిదాకు నేను మద్దతు ఇస్తున్నానని చెప్పవచ్చా?

ఛైర్మన్ : సరే అయితే, నేను తీర్మానాన్ని ప్రవేశపెడుతున్నాను. స్నేహితులారా? సమయాన్ని వృధాచేయబోమని నేను స్పష్టం చేస్తున్నాను. శ్రీ గాంధీ చెప్పినట్లు ఇవి ఇష్టాగోష్టి చర్చలు. అయితే, ఎంతో విలువైన, ఫలప్రదమైన చర్చలుగా ఉంటాయని నేను ఆశిస్తున్నాను. ఈ సమావేశానికి, తదుపరి సమావేశానికి మధ్యగల వ్యవధిలో ఈ చర్చలు జరుగుతాయి. ఈ సమయాన్ని ఆ మార్గం లో ఉపయోగించుకుంటామని మీ అంతట మీరే ప్రతిజ్ఞ చేస్తారని నేను ఆశిస్తున్నాను.

## తొమ్మిదవ సమావేశం – అక్టోబర్ 8, 1931

*ఛైర్మన్*: గత గురువారంనాడు సమావేశం అయినప్పుడు అందరి అంగీకారంతో సమావేశాన్ని వారం రోజుల పాటు వాయిదా వేసుకున్నాం. ఒక అవగాహనకు రావడానికి ఈ వ్యవధిలో ఇష్టాగోష్ఠిగా అనధికార సంప్రదింపులు జరపాలని నిర్ణయించుకున్నాం. ఆ సంప్రదింపులు జరిపిన వారి నుంచి నివేదికను అందుకోవటం ఇప్పుడు మన మొదటి పని అని భావిస్తున్నాను. మొదట శ్రీ గాంధీ మాట్లాడతారా?

*శ్రీ గాంధీ*: ప్రధాని గారూ! మిత్రులారా!! వివిధ వర్గాల ప్రతినిధులతో జరిపిన ఇష్టాగోష్ఠి సంప్రదింపులలో మతపరమైన సమస్య పరిష్కారానికి ఒక అంగీకారాన్ని సాధించడంలో నేను పూర్తిగా విఫలమయ్యానని ఎంతో విచారంతోను, అవమానంతోనూ ప్రకటిస్తున్నాను. ప్రధానిగారూ! విలువైన వారంరోజుల కాలాన్ని వృధాచేసినందుకు మీకూ ఇతర సహచరులకు క్షమాపణ చెప్తున్నాను. ఇప్పుడు నాకు ఉన్న ఓదార్పు ఒకటే. అదేమిటంటే, ఈ సంప్రదింపులను నిర్వహించే బాధ్యత తీసుకున్నప్పుడే నాకు తెలుసు–ఇందులో పెద్దగా విజయావకాశాలు లేవని. అంతేకాదు, పరిష్కారాన్ని సాధించడానికి ఏ ప్రయత్నాన్నీ వదలకుండా చేయడం కూడా నాకు ఊరట కల్గిస్తున్నది.

అయితే, మాకు పూర్తిగా తలవంపులు తెచ్చేవిధంగా సంప్రదింపులు విఫలమయ్యాయని చెప్పడం పూర్తి నిజాన్ని వెల్లడి చేయడం కాదు. వైఫల్య కారణాలు భారత ప్రతినిధివర్గ నిర్మాణంలోనే అంతర్గతంగా ఉన్నాయి. మనం ప్రాతినిధ్యం వహిస్తున్నామనుకుంటున్న వర్గాలకు, పార్టీలకు మనలో ఎవరమూ ఎన్నికైన ప్రతినిధులం కాము. ప్రభుత్వం నామినేట్ చేయడం వలన మనం ఇక్కడ ఉన్నాం. ఒక అంగీకారయోగ్య పరిష్కారాన్ని సాధించడానికి ఎవరి సమక్షమైతే ఎంతో అవసరమో వారు మాత్రం ఇక్కడ కనపడటం లేదు. అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సమావేశాన్ని నిర్వహించడానికి ఇది అంత అనువైన సమయం కాదని చెప్పడానికి మీరు నన్ను అనుమతించాలి. మనం ఏం పొందబోతున్నామో మనకు తెలియదు. మనం కోరుకున్నవి పొందబోతున్నామని మనకు కచ్చితంగా తెలిసినప్పటికీ, మతపరమైన సమస్యకు పరిష్కారాన్ని సాధించడం ప్రస్తుత ప్రతినిధివర్గం సామర్థ్యంపై ఆధారపడి ఉందనే భావనతో ఏదయినా నిర్ణయం తీసుకోబోయే ముందు మనం వందల సార్లు యోచించవలసి ఉంటుంది. విదేశీ అధిపత్యం కారణంగా మన విభేదాలు తీవ్రతరం అయినందువల్ల ఆ పరిష్కారం స్వరాజ్య రాజ్యాంగానికి కిరీటంగా ఉంటుందే తప్ప, పునాది మాత్రం కాజాలదు. స్వాతంత్ర్య సూర్యుడి వెచ్చదనానికి మత పరమైన విభేదాల మంచు కరిగిపోతుందనే విషయంలో నాకు ఎంతమాత్రం సందేహం లేదు.

అందువలన, అల్పసంఖ్యాక వర్గాల కమిటీని నిరవధికంగా వాయిదా వేసి, సాధ్యమైనంత

• ఫెడరల్ నిర్మాణ కిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, సంపుటి : 1, పేజీలు 1356-58.

త్వరగా రాజ్యాంగం మౌలికాంశాలకు స్పష్టమైన రూపం ఇవ్వాలని సలహాఇచ్చే సాహసం చేస్తున్నాను. ఈ లోపు మతపరమైన సమస్యకు నిజమైన పరిష్కారాన్ని కనుగొనడానికి ఇష్టాగోష్ఠి సంప్రదింపుల కార్యక్రమం కొనసాగుతుంది; కొనసాగితీరాలి. రాజ్యాంగ నిర్మాణం కార్యక్రమానికి అది అడ్డురాకూడదు; అడ్డురాకుండా చూసుకోవాలి. దానినుంచి దృష్టి మళ్ళించి, ప్రధాన భాగమైన నిర్మాణంపైనే కేంద్రీకరించాలి.

* * *

చివరగా ఒకమాట. భారత జాతీయ కాంగ్రెస్‌కు ప్రాతినిధ్యం వహిస్తున్నందువల్లనే ఈ సమావేశంలో నేను పాల్గొంటున్నాను. అందువల్ల కాంగ్రెస్ వైఖరిని నేను స్పష్టం చేయవలసి ఉన్నది. మొత్తం దేశానికి కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహిస్తున్నది. అయితే, పరిస్థితి ఇందుకు విరుద్ధంగా ఉన్నట్లు కనపడుతోంది. – ప్రత్యేకించి ఇంగ్లాండ్‌లో. కానీ, నిశ్శబ్దంగా ఉండే లక్షలాది మందికి కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహిస్తున్నది. వీరిలో అణచివేతకు గురైన లెక్కలేనంతమంది అస్పృశ్యులు ఉన్నారు. 'వెనుకబడిన జాతులుగా' వ్యవహరించబడే అత్యంత దురదృష్టకరమైన, ఉపేక్షిత వర్గాల వారూ ఉన్నారు.

* * *

శాసనసభల్లో అస్పృశ్యులకు ప్రాతినిధ్యం ఇవ్వడానికి నేను వ్యతిరేకమని, పలువురు చెప్పుకుంటున్నట్లు అనిపిస్తున్నది. అది సత్యదూరం మాత్రమే. వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వాలనే విషయాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. ఇదే విషయం ఇది వరకు చెప్పాను. ఇప్పుడు మళ్లీ చెప్తున్నాను. ప్రత్యేక ప్రాతినిధ్యం వారికి ఎటువంటి మేలు చేయదని,పైగా హాని కలిగిస్తుందని నేను నమ్ముతున్నాను. అయితే, వయోజన వోటు హక్కుకు కాంగ్రెస్ కట్టుబడి ఉంది. అందువల్ల, లక్షలాది మంది అస్పృశ్యులకు వోటర్ల జాబితాలో స్థానం కల్పించవచ్చు. అస్పృశ్యత వేగంగా రూపుమాసి పోతున్నందువల్ల, ఈ వోటర్లను ఇతరులు బహిష్కరిస్తారని భావించలేం. ఈ ప్రజలకు శాసనసభలకు ఎన్నిక కావటం కంటే, సామాజిక, మతపరమైన వేధింపుల నుంచి రక్షణ లభించటం ఎక్కువ అవసరం. చాలా సందర్భాలలో చట్టం కంటే ఆచారాలు శక్తివంతంగా ఉంటాయి. ఈ ఆచారాలే వారిని అధోగతికి తెచ్చాయి. వారి అధోగతి పట్ల ఆలోచనాపరుడైన ప్రతి హిందువు సిగ్గుపడి, ప్రాయశ్చితం చేసుకోవలసిన అవసరం ఉంది. అందువల్ల, అగ్రవర్ణాల మనుకునే వారు నా సహదేశీయులను ఈ విధంగా పీడించడాన్ని నేరంగా పరిగణించే అత్యంత కఠినమైన చట్టం నాకు కావాలి. హిందువుల అంతరాత్మను మేల్కొలిపినందుకు ఆ భగవంతుడికి కృతజ్ఞతలు. త్వరలో అస్పృశ్యత రూపుమాసి పోతుంది. పాపపంకిలమైన మన గతానికి సంబంధించి అదొక జ్ఞాపకంగా మాత్రమే ఉండిపోతుంది.

***డా॥ అంబేద్కర్ :*** ప్రధానిగారూ! గత రాత్రి అనధికార కమిటీ సమావేశం ముగిసినప్పుడు

విఫలురయ్యామనే భావం ఉన్నప్పటికీ, ఒక కనీస అవగాహనతో విడిపోయాం. ఈ రోజు మేము ఇక్కడ సమావేశం అయినప్పుడు మాలో ఎవరూ ఉద్రేకం కలిగించే ప్రసంగం కాని, వ్యాఖ్య కాని చేయకూడదనేదే ఆ అవగాహన. అయితే, ఆ అవగాహనను శ్రీగాంధీ ఉల్లంఘించటం చూసి నేను విచార పడుతున్నాను. క్షమించండి. ప్రసంగించడానికి నాకు అవకాశం కావాలి. అనధికార కమిటీ వైఫల్యం చెందడానికి గల కారణాలను తన ఆలోచన మేరకు వివరిస్తూ ఆయన ప్రసంగం మొదలు పెట్టారు. ఒక ఒప్పందానికి రావడంలో అనధికార కమిటీ వైఫల్యం చెందడానికి గల కారణాలు వేరే ఉన్నాయని నేను భావిస్తున్నాను. అయితే, వాటి గురించి ఇప్పుడు చర్చించాలని నేను అనుకోవటంలేదు. శ్రీ గాంధీ ప్రసంగం విన్న తరువాత నన్ను కలత పరిచిన విషయం ఏమిటంటే, అల్పసంఖ్యాక వర్గాల కమిటీ నిరవధికంగా వాయిదా పడాలని ప్రతిపాదించిన ఆయన తన ప్రతిపాదనకు మాత్రమే పరిమితం కాకుండా, ఈ బల్ల చుట్టూ కూర్చున్న వివిధ వర్గాల ప్రతినిధులపై కొన్ని నిందలు వేయటం ప్రారంభించారు. ఈ కమిటీ ప్రతినిధులను ప్రభుత్వం నియమించిందని, వారి వారి వర్గాల అభిప్రాయాలకు ఆ ప్రతినిధులు ప్రాతినిధ్యం వహించరని ఆయన అన్నారు. మేము ప్రభుత్వం నియమించిన ప్రతినిధులమనే ఆరోపణను మేము ఖండించలేము. అయితే, నా మటుకు నేను చెప్పేదేమిటంటే, ఈ కమిటీకి తమ ప్రతినిధులను తామే ఎన్నుకునే అవకాశాన్ని భారతదేశంలోని బడుగువర్గాలకు ఇచ్చి ఉన్నట్లయితే, అప్పుడు కూడా నాకు ఇక్కడ స్థానం దక్కి ఉండేది. అందువల్ల, నేను ప్రభుత్వం నియమించిన ప్రతినిధిని అయినా, కాకపోయినా నా వర్గం ప్రజల అభిప్రాయాలకు నేను పూర్తిగా ప్రాతినిధ్యం వహిస్తున్నాని చెప్పదలచుకున్నాను. ఈ విషయానికి సంబంధించి ఎవరూ ఎటువంటి తప్పుడు అభిప్రాయానికి లోనుకావద్దు.

బడుగువర్గాల అభ్యున్నతికి కాంగ్రెస్ కట్టుబడి ఉన్నదని, నాకంటే, లేదా నా సహచరులకంటే మిన్నగా బడుగు వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నదని మహాత్మాగాంధీ ఎప్పుడూ చెప్పుకుంటూనే ఉన్నారు. ఈ ప్రకటనకు సంబంధించి నేను ఒకటి మాత్రం చెప్పగలను. అటువంటి ప్రకటనలను సంబంధిత వ్యక్తులు ఎప్పటికప్పుడు ఖండిస్తూనే ఉన్నా, బాధ్యతారహితమైన వ్యక్తులు ఎప్పుడూ చేస్తూ ఉండే అనేక తప్పుడు ప్రకటనల్లో ఇది కూడా ఒకటని మాత్రం నేను చెప్పగలను.

ఒక చోట నుంచి నాకు ఇప్పుడే టెలిగ్రాం అందింది. ఆ ప్రదేశానికి నేను ఎప్పుడూ వెళ్లలేదు. ఆ టెలిగ్రాం పంపిన వ్యక్తిని కూడా నేను ఎప్పుడూ కలవలేదు. ఆల్మోరాలోని కుమౌన్ బడుగువర్గాల సంఘం అధ్యక్షుడు ఆ టెలిగ్రాం పంపారు. ఆల్మోరా సంయుక్త రాష్ట్రాలలో ఉందని భావిస్తున్నాను. టెలిగ్రాంలో ఈ కింది తీర్మానం ఉన్నది. "దేశం లోపల, వెలుపల సాగుతున్న కాంగ్రెస్ ఉద్యమం పట్ల ఈ సమావేశం తన అవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నది. కాంగ్రెస్ కార్యకర్తలు అవలంబిస్తున్న పద్ధతులను కూడా ఖండిస్తున్నది."

ఇంతకు మించి చదవాలని నేను అనుకోవటం లేదు. అయితే, బడుగువర్గాల పట్ల సానుభూతి కనబరుస్తున్నవారు కాంగ్రెస్‌లో ఉన్నప్పటికీ, బడుగువర్గాల ప్రజలు మాత్రం కాంగ్రెస్‌లో లేరని నేను

చెప్పగలను. ( శ్రీ గాంధీ తన వైఖరిని పరిశీలిస్తే, ఆయనకే వాస్తవం అవగతం అవుతుంది). ఆ విషయాన్ని నేను నిరూపించగలను. అయితే, ఈ వివాదంలోని వివరాలలోకి వెళ్లాలని నేను భావించటంలేదు. ఇవన్నీ ప్రధాన విషయానికి దూరంగా ఉన్నవే. ప్రధాన విషయం ఏమిటంటే, ఈ కమిటీని నిరవధికంగా వాయిదా వేయాలని శ్రీ గాంధీ చేసిన ప్రతిపాదన. ఈ ప్రతిపాదనకు సంబంధించి సర్ మహమ్మద్ షఫీ అవలంబించిన వైఖరితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. నా మటుకు నేను ఈ ప్రతిపాదనను అంగీకరించలేను. దీనికి రెండు ప్రత్యామ్నాయాలు ఉన్నట్లు నాకు తోస్తున్నది. అల్పసంఖ్యాక వర్గాల కమిటీ తన ముందున్న సమస్యపై చర్చించి, ఏదో ఒక సంతృప్తికరమైన పరిష్కారాన్ని సాధించడం సాధ్యమయ్యే పక్షంలో ఆ దిశలో ముందుకు పోవటం ఒక మార్గం. అది సాధ్యం కాని పక్షంలో, సమస్యకు పరిష్కారం కనుగొనడానికి బ్రిటిష్ ప్రభుత్వమే గంగంలోకి దిగడం రెండవ మార్గం. బ్రిటిష్ ప్రభుత్వానికి ఉన్నటువంటి బాధ్యతా పూరిత భావన లేని మూడవ పక్షం మధ్యవర్తిత్వానికి ఈ సమస్యను వదిలిపెట్టడానికి మేము అంగీకరించలేం.

ప్రధానిగారూ! నన్ను ఒక విషయం స్పష్టం చేయనివ్వండి. ఆంగ్లేయుల నుంచి భారతీయులకు తక్షణమే అధికార బదలీ జరిగి తీరాలంటూ బడుగు వర్గాలవారు ఎటువంటి ఉద్యమాన్ని చేపట్టలేదు; గొడవ చేయటం లేదు; అందుకోసం ఆదుర్దాగానూ లేరు. బ్రిటిష్ వారి వల్ల వారు విడిగా కొన్ని బాధలను ఎదుర్కొంటున్నారు. ఆ బాధలను మేము యదార్థంగానే ఎదుర్కొంటున్నామని స్పష్టం చేయడానికి వాటి గురించి చెప్పవలసినదంతా చెప్పానని నేను అనుకుంటున్నాను. వాస్తవం చెప్పాలంటే, రాజకీయ అధికారం బదలీకోసం బడుగువర్గాలవారు అర్రులు చాచటం లేదు. ఇంకా సూటిగా చెప్పాలంటే, అధికారం బదలీకోసం వారు ఆదుర్దాపడిపోవటం లేదు. రాజకీయ అధికారం బదలీకావాలని గొడవ చేస్తున్న శక్తులు దేశంలో కొన్ని బయలుదేరాయి. ప్రస్తుత పరిస్థితుల్లో బడుగువర్గాలవారు వాటిని ప్రతిఘటించలేరని మాకు తెలుసు. అయితే, బ్రిటిష్ ప్రభుత్వం కూడా వాటిని ప్రతి ఘటించలేకపోయినట్లయితే, అధికారం బదలీకి సంబంధించి మేము ఒకటి కోరుకుంటున్నాం. అధికారం ఒక ముఠా చేతుల్లోకి కాని, కొద్దిమంది వ్యక్తుల చేతుల్లోకి కాని, వారు మహమ్మదీయులైనా, హిందువులైనా ఒక వర్గం చేతుల్లోకి కాని వెళ్లకుండా ఉండేలా కొన్ని షరతులు, కొన్ని నిబంధనలతో అధికారం బదలీ జరగాలి. అన్ని వర్గాలవారు తమ తమ వాటా ప్రకారం అధికారాన్ని పంచుకోవటమే సమస్యకు పరిష్కారంగా ఉండాలి. అందువల్ల, నేను, నా వర్గం ఏ స్థానంలో ఉన్నామో తెలియకుండా ఫెడరల్ నిర్మాణ కమిటీ చర్చల్లో నేను ఎలా పాల్గొనాలో నాకు అర్థం కావటం లేదు.

**శ్రీ** *గాంధీ:* అస్పృశ్యులని పిలుస్తున్న వారి గురించి ఒక మాట చెప్తాను. ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారు వ్యక్తం చేసిన కోర్కెలను నేను అర్థం చేసుకోగలను. అయితే, అస్పృశ్యుల తరపున పేర్కొన్న కోర్కెలు మాత్రం నాకు "అన్నింటికన్నా అతి పెద్దగాయం" లా కన్పిస్తున్నాయి. వాటికి అర్థం పాపపూర్వకమైన అస్పృశ్యతను శాశ్వతం చేయడమే. భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికైనా సరే...., అస్పృశ్యుల కీలకమైన ప్రయోజనాలను నేను వదులుకోలేను. అసంఖ్యాకంగా ఉన్న అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తిగా నన్ను నేను పరిగణించుకుంటున్నాను. ఇక్కడ కేవలం

కాంగ్రెస్ తరపున మాత్రమే నేను మాట్లాడటం లేదు. నా తరపున నేను మాట్లాడుతున్నాను. అస్పృశ్యుల నుంచి అభిప్రాయ సేకరణ జరిపితే, వారి వోట్లను నేనే పొందగలనని, అందరికన్నా అత్యధిక వోట్లను నేనే తెచ్చుకోగలనని చెప్తున్నాను. పాపపూర్వకమైన అస్పృశ్యతను తొలగించడానికి ప్రత్యేక వోటర్లు, ప్రత్యేక రిజర్వేషన్లు మార్గం కాదని అస్పృశ్యులకు చెప్పడానికి భారతదేశం ఈ మూల నుంచి ఆ మూలకు నేను పర్యటిస్తాను. అస్పృశ్యత అనేది వారు సిగ్గుపడవలసిన అంశం కాదని, సనాతన హిందూమతం సిగ్గుపడవలసిన అంశమని చెప్తాను.

అంటరానితనం అనే మచ్చను తొలగించడానికి కంకణం కట్టుకున్న కొంతమంది హిందూ సంస్కర్తలు ఉన్నారని ఈ కమిటీ, యావత్ప్రపంచమూ నేడు తెలుసుకోవాలి. మా రిజిస్టర్‌లోనూ, మా జనాభా లెక్కలలోను అస్పృశ్యులను ప్రత్యేక తరగతిగా వర్గీకరించాలని మేము కోరుకోవటంలేదు. ఒక ప్రత్యేక తరగతిగా సిక్కులు శాశ్వతంగా ఉండిపోవచ్చు. అలాగే మహమ్మదీయులు, యూరోపియన్లు కూడా ఉండవచ్చు. కాని, అస్పృశ్యులు శాశ్వతంగా అస్పృశ్యులుగానే ఉండాలా? అస్పృశ్యత ఇంకా నిలిచి ఉండేదాని కంటే, హిందూమతం అంతమైతేనే మంచిది. అందువల్ల, డాక్టర్ అంబేద్కర్ పట్ల, అస్పృశ్యులను ఉద్ధరించాలనే ఆయన కోరికపట్ల, ఆయన సామర్థ్యం పట్ల పూర్తి గౌరవంతో సవినయంగా నేను ఒకటి చెప్పదలచుకున్నాను. ఎటువంటి ఘోర పరిస్థితులలో ఆయన కష్ట పడ్డారో, ఎటువంటి చేదు అనుభవాలను ఆయన పొందారో అవి ప్రస్తుతం ఆయన నిర్ణయాన్ని పక్కతోవ పట్టించి ఉంటాయని భావిస్తున్నాను. ఇది చెప్పవలసి వచ్చినందుకు బాధపడుతున్నాను. అయితే, ఈ విషయం చెప్పకపోతే అస్పృశ్యుల ప్రయోజనాలకు అన్యాయం చేసినవాడిని అవుతాను. నా ప్రాణం నాకు ఎంత ప్రియమైనదో, అస్పృశ్యుల అభ్యున్నతి కూడా అంత ప్రియమైనదే. సమస్త ప్రపంచాన్ని రాజ్యంగా నాకు ఇస్తానన్నా, వారి హక్కులను నేను పణంగా పెట్టబోను. పూర్తి బాధ్యతాయుత భావనతో నేను మాట్లాడుతున్నాను. భారతదేశంలోని మొత్తం అస్పృశ్యుల తరపున మాట్లాడుతూ డాక్టర్ అంబేద్కర్ వ్యక్తం చేసిన కోరిక సరియైనది కాదని చెప్తున్నాను. ఇది హిందూమతంలో చీలికను సృష్టిస్తుంది. ఆ పరిణామం నాకు ఎటువంటి సంతృప్తి కలిగించదు. ఇస్లాం మతం లోకి కాని, క్రైస్తవ మతంలోకి కాని మారాలని అస్పృశ్యులు కోరుకుంటున్నట్లయితే, నేను పట్టించుకోను. ఆ విషయాన్ని సహించగలను. అయితే, గ్రామాల్లో రెండు గ్రూపులు ఏర్పడితే హిందూమతానికి జరగబోయే హానిని మాత్రం నేను సహించలేను. అస్పృశ్యుల రాజకీయ హక్కుల గురించి మాట్లాడే వారికి తమ భారతదేశం గురించి తెలియదు; భారతీయ సమాజ నిర్మాణం నేడు ఎలా ఉన్నదో తెలియదు. అందువల్ల, నాకు ఉన్న సర్వశక్తితో ఒకటి చెప్తున్నాను. ఇటువంటి చీలికను నివారించడానికి నేను ఒక్కడినే ఉన్నట్లయితే, నా ప్రాణాన్ని పణంగా పెట్టి నివారిస్తాను.

☆ ☆ ☆

## *అనుబంధం -1

# మతపరమైన సమస్య పరిష్కారానికి ముస్లింలు, బడుగువర్గాలవారు, భారత క్రైస్తవులు, ఆంగ్లో-ఇండియన్లు, యూరోపియన్లు ఉమ్మడిగా సమర్పించిన ప్రతిపాదనలు

### అల్పసంఖ్యాక వర్గాలవారి కోర్కెలు

1. ప్రభుత్వ ఉద్యోగం, అధికారం, గౌరవం, పౌరహక్కులు, వ్యాపారం, వృత్తి వంటి ఏ విషయంలోనూ పుట్టుక, మతం, కులం, విశ్వాసం మొదలైన వాటి కారణంగా ఏ వ్యక్తినీ ఏ రకంగానూ వివక్షకు గురిచేయకూడదు.

2. ఏ వర్గం వారికైనా హాని కలిగించే వివక్షాపూరితమైన చట్టాలను శాసనసభలు చేయకుండా రాజ్యాంగంలో చట్టపరమైన రక్షణలు పొందుపరచాలి.

3. క్రమబద్ధమైన ప్రజాజీవనం, నీతి మొదలైన వాటికి భంగం కలిగించని రీతిలో అన్నివర్గాల వారికి పూర్తి మత స్వాతంత్ర్యం ఇవ్వాలి. మత స్వాతంత్ర్యంలో భాగాలైన విశ్వాసం, పూజా విధానాలు, ప్రచారం,సంఘాలు, విద్య మొదలైన విషయాల్లో పూర్తి స్వాతంత్ర్యం ఉండాలి.

మతం మార్చుకున్న కారణంగా ఏ వ్యక్తీ తన పౌరహక్కులను లేదా ప్రయోజనాలను కోల్పోకూడదు. ఎటువంటి జరిమానా చెల్లించవలసిన అవసరం ఉండకూడదు.

4. సొంత ఖర్చుతో ధార్మిక, మత, సామాజిక సంస్థలను, పాఠశాలలను, ఇతర విద్యా సంస్థలను స్థాపించుకోవడానికి, నిర్వహించుకోవడానికి, వాటిద్వారా తమ మత స్వాతంత్ర్యాన్ని పొందడానికి హక్కు ఉండాలి.

---

* ఫెడరల్ నిర్మాణ కమిటీ, మైనారిటీల కమిటీ చర్చలు, దీనిని అనుబంధం -3 గా ముద్రించారు. పేజీలు 1394-99.

5. అల్పసంఖ్యాక వర్గాల మతం, సంస్కృతి, పర్సనల్ లా, విద్య, భాష, ధార్మిక సంస్థలు మొదలైన వాటి పరిరక్షణకు, అభివృద్ధికి రాజ్యాంగంలో తగిన రక్షణలు కల్పించాలి. ప్రభుత్వం, స్వపరిపాలనా సంస్థలు ఇచ్చే సహాయక నిధులలో అల్పసంఖ్యాక వర్గాలవారు తమకు రావలసిన వాటా పొందడానికి వీలుగా కూడా రాజ్యాంగంలో తగిన రక్షణలు పొందుపరిచాలి.

6. ప్రజలు తమకు ఉన్న పౌరహక్కులను పూర్తిగా పొందడాన్ని నిరోధించే ఏ చట్టాన్ని కాని, ఎటువంటి లోపాన్ని కాని చట్టప్రకారం శిక్షార్హమైనదిగా పరిగణించడం ద్వారా పౌరహక్కులకు హామీ ఇవ్వాలి.

7. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాల మంత్రివర్గాలను వ్యవస్థీకరించేటప్పుడు ముస్లిం వర్గాల సభ్యులకు, గణనీయమైన సంఖ్యలో ఉన్న ఇతర అల్పసంఖ్యాక వర్గాల సభ్యులకు సాధ్యమైనంతమేరకు ఆయా మంత్రివర్గాలలో స్థానం కల్పించాలి.

8. అల్పసంఖ్యాకవర్గాల ప్రజలను పరిరక్షించడానికి, వారి సంక్షేమాన్ని పెంపొందించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో చట్టబద్ధమైన విభాగాలు ఉండాలి.

9. నియామకం ద్వారా, లేదా ఎన్నిక ద్వారా ఏ శాసన సభలోనైనా ప్రస్తుతం ప్రాతినిధ్యం ఉన్న అన్ని వర్గాల ప్రజలకు ప్రత్యేక ఓటర్ల జాబితాల ద్వారా అన్ని శాసన సభల్లో ప్రాతినిధ్యం ఉండాలి. అనుబంధంలో పొందు పరిచిన దానికంటే తక్కువ కాకుండా అల్పసంఖ్యాక వర్గాలకు స్థానాలు ఉండాలి. ఏ అధిక సంఖ్యాక వర్గాన్నీ అల్పసంఖ్యాక వర్గం చేయడం కాని, సమానం చేయడం కాని జరగకూడదు. 10 సంవత్సరాల తరువాత సంయుక్త ఓటర్ల జాబితాలను లేక స్థానాల రిజర్వేషన్‌తో కూడిన సంయుక్త ఓటర్ల జాబితాలను అంగీకరించడం పంజాబ్, బెంగాల్‌లలోని ముస్లింలు, ఇతర రాష్ట్రాల్లోని అల్పసంఖ్యాక వర్గాల ఇష్టప్రకారమే ఉంటుంది. 10 సంవత్సరాలు గడిచిన తరువాత కేంద్ర శాసన సభకు సంబంధించి కూడా ఇటువంటి ఏర్పాటే ఉంటుంది.

బడుగువర్గాలకు సంబంధించి మాత్రం ప్రత్యేక ఓటర్ల జాబితాలు అమలులోకి వచ్చిన 20 సంవత్సరాల వరకు, వారికి ప్రత్యక్ష వయోజన ఓటు హక్కు కల్పించే వరకు సంయుక్త ఓటర్ల జాబితాలు, రిజర్వుడ్ స్థానాల విషయంలో ఎటువంటి మార్పు జరగకూడదు.

10. ప్రతి రాష్ట్రంలోను, కేంద్ర ప్రభుత్వంలోను పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లను నియమించాలి. గవర్నర్-జనరల్ లేదా గవర్నర్ల నియామకం ద్వారా భర్తీ చేయడానికి కేటాయించిన పదవులు తప్ప పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లోని మిగిలిన ఉద్యోగాలను కమిషన్ భర్తీ చేయాలి. ప్రతిభ, అవసరమైన అర్హతల ప్రాతిపదికన వివిధ వర్గాల ప్రజలకు న్యాయమైన ప్రాతినిధ్యం లభించేలా ఈ ఉద్యోగాల భర్తీ జరగాలి. ఈ సూత్రాన్ని అమలులో పెట్టడానికి 'ఆదేశాల పత్రం'లో గవర్నర్-జనరల్‌కు, గవర్నర్లకు తగిన ఆదేశాలను పొందుపరచాలి.

అంతేకాకుండా పబ్లిక్ సర్వీసులలోని ఉద్యోగాలను తరచూ సమీక్షిస్తుండాలి.

11. ఏదైనా బిల్లును ఏ శాసనసభ అయినా ఆమోదించినప్పుడు ఆ బిల్లు తమ మతాన్ని, లేదా ఆచారాన్ని లేక తమ ప్రాథమిక హక్కులను దెబ్బతీస్తుందని ఆ శాసనసభ సభ్యులలో మూడింట రెండు వంతుల మంది అభిప్రాయ పడినట్లయితే, మూడింట ఒకవంతు మందికి ఆ బిల్లు పట్ల అభ్యంతరం ఉన్నట్లయితే, ఆ సభ్యులు తమ అభ్యంతరాన్ని వ్యక్తం చేయడానికి బిల్లు ఆమోదం పొందిన నెలరోజుల వరకు అవకాశం ఉండాలి. ఈ విషయాన్ని సభాధ్యక్షుడు గవర్నర్-జనరల్‌కు కాని, గవర్నర్‌కు కాని తెలియజేసి, బిల్లు అమలును ఏడాదిపాటు నిలిపివేయాలి. ఏడాది గడిచిన తరువాత, శాసనసభ పరిగణన కోసం ఆయన ఆ బిల్లును పంపాలి. సభ్యులు వ్యక్తం చేసిన అభ్యంతరాల మేరకు ఆ బిల్లును సవరించడానికి శాసన సభ అప్పుడు నిరాకరించినట్లయితే, గవర్నర్-జనరల్ లేదా గవర్నర్ తన విచక్షణాధికారాన్ని ఉపయోగించి బిల్లును ఆమోదించవచ్చు; లేదా ఆమోదించకపోవచ్చు. అంతేగాక, బిల్లు వల్ల దెబ్బతిన్న వర్గానికి చెందిన ఏ ఇద్దరు సభ్యులైనా ఆ బిల్లు తమ ప్రాథమిక హక్కులకు భంగం కలిగిస్తున్నదనే ప్రాతిపదికన దాన్ని సుప్రీంకోర్టులో సవాలు చేయవచ్చు.

## ముస్లింల ప్రత్యేక కోర్కెలు

ఎ. సరిహద్దుల భద్రతావసరాలకు తగిన ప్రాధాన్యం ఇచ్చి, మిగిలిన రాష్ట్రాల మాదిరిగానే వాయవ్య సరిహద్దు రాష్ట్రాన్ని కూడా గవర్నర్ పాలిత ప్రాంతంగా చేయాలి.

రాష్ట్ర శాసనసభను వ్యవస్థీకరించేటప్పుడు నామినేట్ చేసే సభ్యుల సంఖ్య మొత్తం సభ్యుల్లో 10 శాతానికి మించకూడదు.

బి. సింధ్‌ను బొంబాయి ప్రెసిడెన్సీ నుంచి వేరు చేసి, బ్రిటిష్ ఇండియాలోని మిగిలిన రాష్ట్రాల మాదిరిగా అదే ప్రతిపత్తిపై గవర్నర్ పాలిత ప్రాంతంగా రూపొందించాలి.

సి. కేంద్ర శాసన సభలోని మొత్తం సభ్యుల సంఖ్యలో ముస్లింలకు మూడింట ఒక వంతు ప్రాతినిధ్యం ఉండాలి. 'అనుబంధం' లో నిర్దేశించిన సంఖ్య కంటే వారి ప్రాతినిధ్యం తగ్గరాదు.

## బడుగు వర్గాల వారి ప్రత్యేక కోర్కెలు

ఎ. పౌరహక్కులను పొందడంలో అస్పృశ్యత కారణంగా దేశంలోని ఏ ఒక్కరైనా వివక్షకు గురికావడానికి లేదా ఏదైనా జరిమానా చెల్లించడానికి లేదా ఏదైనా అనుకూల పరిస్థితిని ఎదుర్కోవడానికి దారితీసే ఏ ఆచారం అయినా చెల్లదని రాజ్యాంగంలో ప్రకటించాలి.

బి. పబ్లిక్ సర్వీసుల్లో నియామకాల విషయంలో బడుగువర్గాల పట్ల ఉదారత్వంతో కూడిన ఆదరణను ప్రదర్శించాలి. పోలీసు, సైనిక సర్వీసుల్లో కూడా వారి నియామకాలకు అవకాశం ఉండాలి.

సి. పంజాబ్ ల్యాండ్ ఎలినేషన్ చట్టం ప్రయోజనాలను పంజాబ్‌లోని బడుగువర్గాల ప్రజలకు కూడా వర్తింపచేయాలి.

డి. కార్యనిర్వహణాధికారి ఎవరైనా బడుగువర్గాల పట్ల వివక్ష ప్రదర్శించినా, వారి ప్రయోజనాలను విస్మరించినా ఆ చర్యను సరిచేయడానికి గవర్నర్‌కు కాని, గవర్నర్-జనరల్‌కు కాని ఫిర్యాదు చేసుకునే హక్కు ఉండాలి.

ఇ. 'అనుబంధం'లో నిర్దేశించిన దానికి తగ్గకుండా బడుగువర్గాలకు ప్రాతినిధ్యం ఉండాలి.

## ఆంగ్లో-ఇండియన్ ప్రజల ప్రత్యేక కోర్కెలు

ఎ. ఆంగ్లో-ఇండియన్ ప్రజల అసమాన స్థితి దృష్ట్యా తగిన జీవన ప్రమాణాలను వారికి అందుబాటులోకి తేవడానికి ప్రభుత్వ ఉద్యోగాలలో వారికి ప్రత్యేక పరిగణన ఇవ్వాలి. ఈ విషయంలో ఎనిమిదవ ఉపసంఘం (సర్వీసులు) ఆమోదించిన కోర్కెలను విశ్లేషించాలి.

బి. సొంతంగా యూరోపియన్ విద్యా సంస్థలను నిర్వహించుకోవడానికి మంత్రి నియంత్రణ పరిధిలో ఆంగ్లో-ఇండియన్‌లకు హక్కు ఉండాలి. ప్రస్తుతం ఇస్తున్న గ్రాంట్ల ప్రాతిపదికన ఆ విద్యా సంస్థలకు ఉదారంగా తగినంత గ్రాంట్లను, స్కాలర్‌షిప్‌లను అందించాలి.

సి. వారసత్వము, వంశక్రమాల ఆధారాలు ఉండాలనే షరతులు లేకుండా భారతదేశంలోని ఇతర వర్గాల ప్రజలు పొందుతున్న వాటితో సమానంగా న్యాయపరమైన హక్కులు ఉండాలి. యూరోపియన్ న్యాయమూర్తులతో కాని, భారతీయ న్యాయమూర్తులతో కాని విచారణ జరిపించుకునే హక్కు నిందితులకు ఉండాలి.

## యూరోపియన్ ప్రజల ప్రత్యేక హక్కులు

ఎ. అన్ని పారిశ్రామిక, వాణిజ్య కార్యకలాపాలలో భారతదేశంలో జన్మించిన ప్రజలు పొందుతున్న హక్కులు, ప్రయోజనాలతో సమానమైన హక్కులు, ప్రయోజనాలు యూరోపియన్ ప్రజలకు కూడా ఉండాలి.

బి. నేర విచారణలకు సంబంధించిన విధానాల్లో సమాన హక్కులు ఉండాలి. ఏ విధానాన్ని అయినా సవరించడానికి లేదా మార్చడానికి ఉద్దేశించిన బిల్లును గవర్నర్-జనరల్ అనుమతి లేనిదే ప్రవేశపెట్టకూడదు.

**సమ్మతించిన వారు :**

గౌరవనీయులైన ఆగాఖాన్ (ముస్లింలు), డాక్టర్ అంబేద్కర్ (బడుగువర్గాలు), రావ్ బహదూర్ పన్నీర్ సెల్వమ్ (భారతీయ క్రిస్టియన్లు), సర్ హెన్రీ గిడ్నీ (ఆంగ్లో-ఇండియన్లు), సర్ హ్యూబర్ట్ కార్ (యూరోపియన్లు).

## అనుబంధం : 1 (తరువాయి భాగం)

### చేర్పు – శాసనసభలలో ప్రాతినిధ్యం

బ్రాకెట్లలోని అంకెలు : 1931 జనాభా ఆధారిత అంకెలు : సైమన్ నివేదిక ప్రకారం కుదింపబడిన శాతాలు

| | సభలోని బలం | హిందువులు | | | ముస్లింలు | క్రిస్టియన్లు | సిక్కులు | ఆంగ్లోఇండియన్లు | గిరిజనులు మొదలైనవారు | యూరోపియన్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఉన్నత | బడుగు | మొత్తం | | | | | | |
| కేంద్రం | | | | | | | | | | |
| మొత్తం భారత దేశం(1931) | | | | | | | | | | |
| ఎగువ | 200 | (47.5) | (19)* | (66.5) | (21.5) | | | | | |
| | | 101 | 20 | 121 | 61 | 1 | 6 | 1 | - | 4 |
| దిగువ | 300 | 123 | 45 | 168 | 100 | 7 | 10 | 3 | - | 12 |
| అస్సాం | | (48.9) | (13.4) | (62.3) | (34.8) | | | | | |
| | 100◆ | 38 | 13 | 51 | 35 | 3 | - | 1 | - | 10 |
| బెంగాల్ | | (18.3) | (24.7) | (43) | (54.9) | | | | | |
| | 200 | 38 | 35 | 73 | 102 | 2 | - | 3 | - | 20 |
| బీహార్,ఒరిస్సా | | (67.8) | (14.5) | (82.3) | (11.3) | | | | | |
| | 100 | 51 | 14 | 65 | 25 | 1 | - | 1 | 3 | 5 |

*బ్రిటిష్ ఇండియాలోని గవర్నర్ పాలిత ప్రాంతాలలోని శాతం

◆గిరిజన ప్రాంతాలను మినహాయించినవి.

# అనుబంధం : 1 (తరువాయి భాగం)

## చేర్పు – శాసనసభలలో ప్రాతినిధ్యం

బ్రాకెట్లలోని అంకెలు : 1931 జనాభా ఆధారిత అంకెలు : సైమన్ నివేదిక ప్రకారం కుదింపబడిన శాతాలు

| | సభలోని బలం | హిందువులు | | | ముస్లింలు | క్రిస్టియన్లు | సిక్కులు | ఆంగ్లో ఇండియన్లు | గిరిజనులు మొదలైనవారు | యూరోపియన్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఉన్నత | బడుగు | మొత్తం | | | | | | |
| బొంబాయి | 200 | (68) | (8) | (76) | (20) | | | | | |
| | | 88 | 28 | 116 | 66 | 2 | – | 3 | – | 13 |
| | సింధ్‌ను వేరుచేసినందువలన వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని హిందువుల మాదిరిగానే, బొంబాయిలోని ముస్లింలకు ప్రాధాన్యం ఇవ్వవలసిఉన్నది. | | | | | | | | | |
| మధ్యప్రాంతం | | (63) | (23.7) | (86.8) | (44) | | | | | |
| | 100 | 58 | 20 | 78 | 15 | 1 | – | – | 2 | 2 |
| మద్రాసు | | (71.3) | (15.4) | (86.7) | (7.17) | (3.7) | | | | |
| | 200 | 102 | 40 | 142 | 30 | 14 | – | 4 | 2 | 8 |
| పంజాబ్ | | (15.1) | (13.5) | (28.6) | (56.5) | | (13) | | | |
| | 100 | 14 | 10 | 24 | 51 | 1.5 | 20 | 1.5 | – | 2 |
| ఉత్తర ప్రదేశ్ | | (58.1) | (26.4) | (84.5) | (14.8) | | | | | |
| | 100 | 44 | 20 | 64 | 30 | 1 | – | 2 | – | 3 |

*బ్రిటిష్ ఇండియాలోని గవర్నర్ పాలిత ప్రాంతాలలోని శాతం

♦గిరిజన ప్రాంతాలను మినహాయించినవి.

## ఒకటవ అనుబంధానికి వివరణాత్మక పత్రం

1. ఆయావర్గాల ప్రాతినిధ్యానికి సంబంధించి ఇచ్చిన వివరాలను హిందువులు, సిక్కులు అంగీకరించలేదు. అయితే, కేంద్ర శాసనసభలో సిక్కులు కోరిన పూర్తి ప్రాతినిధ్యం ఇవ్వాలి.

2. వివిధ అల్పసంఖ్యాక వర్గాలకు ఉద్దేశించిన స్థానాలు ఒక సమగ్ర పథకంలో భాగం. సవివరంగా ఇచ్చిన ప్రతిపాదనలను ఒకదాని నుంచి మరొకదాన్ని వేరు చేయకూడదు.

3. అధిక సంఖ్యాక వర్గం ఎట్టి పరిస్థితులలోనూ అల్ప సంఖ్యాక వర్గ స్థాయికి లేదా అల్పసంఖ్యాక వర్గంతో సమాన స్థాయికి తగ్గిపోకూడదనే సూత్రం ఆధారంగా స్థానాల పంపిణీ జరుగుతోంది.

4. వ్యాపారులు, భూస్వాములు, పారిశ్రామికవేత్తలు, శ్రామికులకు ఎటువంటి ప్రాతినిధ్యం ఉండదు. ఈ స్థానాలన్నీ చిరకుల వర్గపరమైనవే అయి ఉంటాయి కాబట్టి, తమతమ ప్రయోజనాలకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని కోరుకునే ఈ వర్గాలవారు తమ వర్గాల తరఫున ప్రాతినిధ్యం పొందవచ్చు.

5. బ్రిటిష్ ఇండియానుంచి 26 శాతం, భారతీయ రాష్ట్రాలకు కేటాయించిన కోటా నుంచి కనీసం 7 శాతం ఉంటాయన్న ఊహ ఆధారంగా కేంద్ర శాసనసభలో ముస్లింలకు 33 1/2 శాతం ప్రాతినిధ్యం కల్పించబడింది.

6. పంజాబ్ శాసన సభలో 54 శాతం స్థానాలను సిక్కులకు కేటాయించటం ద్వారా వారికి ప్రాధాన్యం ఇవ్వాలని, 20 శాతం స్థానాలు తాము తీసుకోవాలని ముస్లింలు, ఉన్నత కులాల హిందువులు, బడుగు వర్గాలవారు త్యాగబుద్ధితో ఉమ్మడిగా అంగీకరించారు.

7. భారతదేశ ప్రజలలో 11.5 కోట్ల మందికి లేదా జనాభాలో 46 శాతానికి ఈ ప్రతిపాదనలు అంగీకారయోగ్యమైనవని భావించవచ్చు.

  

# అనుబంధం – 2

# ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం బడుగువర్గాలవారి కోర్కెలపై అనుబంధ విజ్ఞాపన పత్రం

## డా॥ అంబేద్కర్, రావు బహదూర్ ఆర్. శ్రీనివాసన్ సమర్పించిన పత్రం

గత ఏడాది మేం ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించాం. స్వపరిపాలిత భారత రాజ్యాంగంలో బడుగువర్గాల పరిరక్షణకు కల్పించవలసిన రాజకీయ రక్షణల గురించి ఆ పత్రంలో ప్రస్తావించాం. 'అల్ప సంఖ్యాక వర్గాల ఉపసంఘం చర్చలు' గ్రంథంలో ఈ పత్రం 'అనుబంధం–3' గా ముద్రితమైంది. బడుగువర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలని, రాజకీయ రక్షణల్లో అది కూడా భాగంగా ఉండాలని ఆ విజ్ఞాపన పత్రంలో మేం కోరాం. ఇటువంటి ప్రాతినిధ్యం బడుగువర్గాల వారికి ఎంతో అవసరమని కూడా మేం పేర్కొన్నాం. అయితే, ఆ ప్రత్యేక ప్రాతినిధ్యం ఏ విధంగా వుండాలో మేం నిర్వచించలేదు. అందుకు కారణం ఏమిటంటే, ఈ అంశం ప్రస్తావనకు వచ్చేలోపుగానే అల్పసంఖ్యాక వర్గాల ఉపసంఘం సమావేశాలు ముగిశాయి. అప్పుడు వదిలివేసిన విషయాన్ని ఈ అనుబంధ విజ్ఞాపన పత్రం ద్వారా ప్రస్తావించాలని అనుకుంటున్నాం. అందువల్ల, ఈ ఏడాది అల్పసంఖ్యాకవర్గాల ఉపసంఘం ఈ విషయాన్ని పరిశీలించినట్లయితే, అవసరమైన అంశాలు అందుబాటులో ఉండగలవు.

### 1. ప్రత్యేక ప్రాతినిధ్యం పరిధి

### ఎ. రాష్ట్ర శాసనసభల్లో ప్రత్యేక ప్రాతినిధ్యం

1. బెంగాల్, మధ్య ప్రాంత రాష్ట్రాలు, అస్సాం, బీహార్, ఒరిస్సా, పంజాబ్, సంయుక్త రాష్ట్రాలలో బడుగువర్గాలవారి జనాభాకు తగినట్లుగా వారికి ప్రాతినిధ్యం ఉండాలి. సైమన్ కమిషన్, భారతీయ కేంద్ర సంఘం అంచనా వేసిన బడుగువర్గాల జనాభా సంఖ్యను ఇందుకు తీసుకోవచ్చు.

2. మద్రాసులో బడుగువర్గాల వారికి 22 శాతం ప్రాతినిధ్యం ఉండాలి.

3. బొంబాయిలో –

ఎ. బొంబాయి ప్రెసిడెన్సీలో సింధ్ ఒక భాగంగా కొనసాగిన పక్షంలో బడుగువర్గాలవారికి 16శాతం ప్రాతినిధ్యం ఉండాలి.

బి. బొంబాయి ప్రెసిడెన్సీ నుంచి సింధ్‌ను వేరుచేసిన పక్షంలో, ప్రెసిడెన్సీలోని ముస్లిం జనాభాతో సమానంగా ఉన్న బడుగువర్గాల వారికి కూడా ముస్లింలకు ఇచ్చినంత ప్రాతినిధ్యాన్ని కల్పించాలి.

## బి. ఫెడరల్ శాసన సభలో ప్రత్యేక ప్రాతినిధ్యం

ఫెడరల్ శాసన సభలోని రెండు సభల్లో బడుగువర్గాల వారికి భారతదేశంలో వారి జనాభాకు తగిన విధంగా ప్రాతినిధ్యం ఉండాలి.

### పరిమితులు

ఈ కింద వివరించిన ఊహాత్మక అంచనాల ఆధారంగా శాసనసభల్లో ప్రాతినిధ్య పరిమాణాన్ని నిర్ణయించాం :

1. బడుగు వర్గాల వారి జనాభా విషయంలో సైమన్ కమీషన్ (సంపుటి : 1, పేజీ. 40), భారతీయ కేంద్ర సంఘం (నివేదిక, పేజీ. 44) ఇచ్చిన సంఖ్యలు అంగీకారయోగ్యమైనవని, స్థానాల పంపిణీకి అవి సరియైన ప్రాతిపదికగా ఉంటాయని మేం భావించాం.

2. ఫెడరల్ శాసనసభ మొత్తం భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తుందని మేం తలచాం. అలాగే జరిగిన పక్షంలో, ఆ శాసన సభలో బడుగువర్గాల వారికి ఉండవలసిన ప్రాతినిధ్యాన్ని నిర్ణయించడానికి గవర్నర్ పాలిత రాష్ట్రాలే కాక, భారత సంస్థానాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు, మినహాయించబడిన భూభాగాలు మొదలైన వాటిల్లో బడుగువర్గాల వారి జనాభా ఒక అదనపు అంశంగా ఉపయోగపడుతుందని భావించాం.

3. బ్రిటిష్ ఇండియా రాష్ట్రాల పరిపాలనా విస్తీర్ణం ప్రస్తుతం ఉన్న విధంగానే కొనసాగుతుందని కూడా మేం భావించాం.

అయితే, జనాభా వివరాలకు సంబంధించి వేసిన ఈ అంచనాలను సవాలు చేయనున్నట్లు కొన్ని పక్షాలు బెదిరిస్తున్నాయి. అలా జరిగి, బడుగువర్గాల వారి అజమాయిషీలేని విధంగా జనాభా లెక్కలను నూతనంగా సేకరించినట్లయితే, ఆ జనాభా లెక్కల్లో బడుగువర్గాలవారి జనాభాను ఇప్పటి కంటే తక్కువగా చూపినా, లేదా రాష్ట్రాల పరిపాలనా విస్తీర్ణాన్ని మార్చినట్లయితే తద్వారా జనాభా ప్రస్తుత స్థితి మారినా, తమ ప్రాతినిధ్య పరిమాణాన్ని మార్చుకునే హక్కు బడుగువర్గాలకు ఉంటుంది. ఆఖరికి ప్రాధాన్యం కోరడానికి కూడా వారికి హక్కు ఉంటుంది. అదే విధంగా..., అఖిల భారత సమాఖ్య రూపుదిద్దుకోని పక్షంలో, ఫెడరల్ శాసనసభ ఆ ప్రాతిపదికపై నిర్ణయించిన ప్రాతినిధ్యం పరిమాణంతో సర్దుబాటు చేసుకోవడానికి బడుగువర్గాలవారు సుముఖతతోనే ఉంటారు.

## 2. ప్రాతినిధ్య పద్ధతి

1. తమ తమ వోటర్ల ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా రాష్ట్ర శాసనసభలకు, కేంద్ర శాసనసభకు ప్రతినిధులను ఎన్నుకునే హక్కు బడుగువర్గాలవారికి ఉంటుంది.

ఫెడరల్ లేదా కేంద్ర శాసన సభలోని ఎగువసభకు రాష్ట్ర శాసన సభలు పరోక్షపద్ధతి ద్వారా సభ్యులను ఎన్నుకోవాలని నిర్ణయించినట్లయితే, ఎగువ సభలో ప్రాతినిధ్యానికి సంబంధించి మాత్రం తమకున్న ప్రత్యేక నియోజకవర్గాల హక్కును వదులుకోవడానికి బడుగువర్గాలవారు అంగీకరిస్తారు. అయితే, ఈ కింది షరతుకు లోబడి మాత్రమే అలా జరుగుతుంది; బడుగు వర్గాలవారికి కేటాయించిన స్థానాలను వారికి కచ్చితంగా ఇవ్వడానికిగాను ఎటువంటి ప్రాతినిధ్య పద్ధతిలోనైనా సరే తగిన ఏర్పాట్లు చేయాలి.

2. ఈ కింద వివరించిన పరిస్థితులలో మినహాయించి, బడుగువర్గాలవారి ప్రత్యేక నియోజక వర్గాల స్థానంలో సమిష్టి నియోజక వర్గాలు, స్థానాల కేటాయింపు పద్ధతులను ప్రవేశపెట్టకూడదు.

ఎ. శాసన సభలో అధిక సంఖ్యాక సభ్యుల కోరిక మేరకు వోటర్ల అభిప్రాయసేకరణ జరిపినప్పుడు, వోటు హక్కు ఉన్న బడుగువర్గాల వారి సభ్యులకు పూర్తి ఆధిక్యత రావటం;

బి. 20 సంవత్సరాలు గడిచేవరకూ, వయోజన వోటు హక్కు కల్పించే వరకు అలాంటి అభిప్రాయ సేకరణకు పూనుకోకూడదు.

## 3. బడుగువర్గాలను నిర్వచించవలసిన అవసరం

గతంలో బడుగువర్గాల వారి ప్రాతినిధ్యాన్ని ఎంతగానో దుర్వినియోగం చేశారు. రాష్ట్ర శాసన సభలలో బడుగువర్గాలకు ప్రాతినిధ్యం వహించడానికి ఆ వర్గాలకు చెందిన వ్యక్తులను కాకుండా ఇతర వర్గాలకు చెందిన వారిని నియమించారు. బడుగువర్గాలకు చెందని వ్యక్తులు కూడా బడుగు వర్గాలకు ప్రతినిధులుగా తమను నియమింప చేసుకున్న సందర్భాలకు కూడా కొదువలేదు. ఇందుకు కారణం ఏమిటంటే, బడుగువర్గాలకు ప్రాతినిధ్యం వహించేలా వ్యక్తులను నియమించే అధికారాన్ని గవర్నర్‌కు ఇచ్చారు. అయితే, బడుగువర్గాలకు చెందిన వ్యక్తులను మాత్రమే ఆయన నియమించవలసి ఉంటుందనే నిబంధన లేనందున ఇలాంటి దుర్వినియోగం జరుగుతున్నది. అయితే, నూతన రాజ్యాంగం కింద గవర్నర్ నియామకాల స్థానంలో ఎన్నిక పద్ధతిని ప్రవేశ పెడుతున్నందున ఇటువంటి దుర్వినియోగానికి అవకాశం లేదు. కాని, బడుగువర్గాల వారి ప్రత్యేక ప్రాతినిధ్యం ఉద్దేశం చెడకుండా చూసేందుకు మేం కొన్ని విషయాలను ప్రతిపాదిస్తున్నాం.

1. సొంతంగా ప్రత్యేక నియోజకవర్గాలను కలిగి ఉండే హక్కు మాత్రమే కాక, తమ సొంత వ్యక్తుల ద్వారా ప్రాతినిధ్యాన్ని పొందే హక్కు కూడా బడుగువర్గాల వారికి ఉంటుంది.

2. ప్రతి రాష్ట్రంలోను బడుగు వర్గాల వారిని కచ్చితంగా నిర్వచించాలి. ఆయా రాష్ట్రాలలో పాటిస్తున్న అస్పృశ్యతా పద్ధతికి గురిఅయిన వర్గాలకు చెందిన వ్యక్తులు, ఎన్నికల కోసం తయారు చేసిన షెడ్యూల్‌లో నమోదుచేసిన వర్గాలకు చెందిన వ్యక్తులను బడుగువర్గాల వారిగా నిర్వచించాలి.

## 4. పేర్లు

బడుగువర్గాలను ఉద్దేశించి ప్రస్తుతం వ్యవహరిస్తున్న పేర్లపట్ల బడుగువర్గాల వారు అభ్యంతరం తెలుపుతున్నారని ఇక్కడ మేం చెప్పదలచుకున్నాం. బడుగువర్గాలపై శ్రద్ధచూపించే ఇతరులు కూడా అదేవిధంగా ఆ పేర్ల పట్ల అభ్యంతరం తెలియ జేస్తున్నారు. ఈ పేర్లు అవమానకరంగా, తృణీకారంగా ఉన్నాయి. నూతన రాజ్యాంగాన్ని లిఖించేటప్పుడు అధికార వ్యవహారానికి ప్రస్తుత పేర్లను మార్చేందుకు ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకోవాలి. 'బడుగువర్గాలు' అనే పేరుకు బదులుగా 'కులరహిత హిందువులు', 'తిరుగుబాటు హిందువులు' లేదా 'ఆచార రహిత హిందువులు' అనిగాని లేదా మరొక పేరుతో కాని పిలవడం మంచిది. ఫలానా పేరునే వాడాలని చెప్పడానికి మీకు అధికారం లేదు. పేర్లను సూచించటం మాత్రమే మేం చేయగలం. బడుగువర్గాలవారికి తగిన విధంగా వివరించి చెప్తే, ఈ పేర్లలో ఏదైనా ఒక మంచి పేరును అంగీకరించడానికి వారు సందేహించరు.

ఈ విజ్ఞాపన పత్రంలో పేర్కొన్న కోర్కెలను సమర్థిస్తూ భారతదేశం నలుమూలల నుంచి బడుగువర్గాల వారు పెద్దసంఖ్యలో పంపిన టెలిగ్రామ్‌లు మాకు అందాయి.

☆ ☆ ☆

# 11

# భారత రాజ్యాంగ సంస్కరణపై సంయుక్త సంఘం ముందు తీసుకున్న సాక్ష్యం

## డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ప్రశ్నించిన సాక్ష్యులు

**సర్ పాట్రిక్ జేమ్స్, ఫాగన్, కె.సి.ఐ.ఇ., సి.ఎస్.ఐ., ఎఫ్.ఆర్.ఎ.ఎస్., శ్రీ ఇ.బి.లవ్‌లక్, శ్రీ విల్‌ఫ్రెడ్ హెరాల్ట్ షూబర్ట్, శ్రీ యూస్టేస్ ఆర్థర్ సెసిల్ కింగ్, శ్రీ హెన్రీ రాబర్ట్ హరావ్, శ్రీ ఫ్రెడరిక్ వైన్ రాబర్ట్ సన్, సర్ ఇవాన్స్ కాటన్, శ్రీ హెరాల్ట్ లాన్స్‌లాట్ న్యూమాన్, శ్రీ పేల్, యూరోపియన్ ప్రభుత్వ ఉద్యోగులు, భారత పోలీసు సంఘం, సివిల్ ఇంజనీర్ల సంఘాల తరఫున.**

* ***382, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:*** భారత ప్రభుత్వ ఉద్యోగాల పట్ల భారతీయ పత్రికలు, భారతదేశంలోని రాజకీయ నాయకులు ఎంతో ద్వేష భావం కనబరుస్తున్నారని కొద్ది సేపటి క్రితం మీరు అన్నారు కదూ?

***సర్ పి.జి.ఫాగన్ :*** అవును.

***383. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** సర్ రెజినాల్డ్ క్రాడక్ రాసిన మినిట్ నుంచి ఒక చిన్న భాగాన్ని మీకు చదివి విన్పించాలనుకుంటున్నాను. లా కమీషన్ నివేదికలో 132 వ పేజీ 10వ పేరాలో ఈ భాగాన్ని చేర్చారు. మీ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్న పేరా ఇది :

> "అఖిలభారత సర్వీసులలోని ఉద్యోగులను బలవంతంగా తమపై రుద్దారనే భావమే వారిపట్ల శాసనసభలు వ్యక్తంచేస్తున్న ద్వేష భావానికి కారణమని మా ముందు సాక్ష్యం చెప్పిన వారిలో అనేకులు విశ్వసిస్తున్నారు. ఈ సర్వీసులలోకి తాజా నియామకాలు జరిపితే స్వార్థప్రయోజనాలు ఎప్పటికి నెరవేరుతూనే ఉంటాయని వారు భావిస్తున్నారు. అయితే, నియామకాల అధికారం సెక్రటరీ ఆఫ్ స్టేట్ నుంచి భారత ప్రభుత్వానికి కాని, స్థానిక ప్రభుత్వానికి కాని బదలీ అయిన దంటే, అన్నిరకాల ద్వేషభావాలు అదృశ్యమై పోతాయని వారు విశ్వసిస్తున్నారు." ఈ ప్రకటనతో మీరు ఏకీభవిస్తున్నారేమో నేను తెలుసుకోవాలను కుంటున్నాను.

***సర్ పి.జి. ఫాగన్ :*** లేదు. ఆ ప్రకటనతో ఏకీభవించడానికి తగిన ఆధారాలు ఉన్నాయని నేను

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి -II ఎ, జూన్ 13, 1933, పేజీలు : 69-70.

అనుకోవడంలేదు. అయితే, పరిస్థితి ఆ రకంగా మారడం మంచిదే. కాని, వైఖరులు అంత అకస్మాత్తుగా మారిపోతాయని అనుకోవడానికి తగినంత ఆధారాలు లేవని అనుకుంటున్నాను.

*384. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* భారతీయ శాసన సభ, నూతన ప్రభుత్వ నియంత్రణలకు అతీతంగా ఉండాలని మీరు కోరుకోవటమే మీకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని రెచ్చగొడుతుందని మీరు భావించడం లేదా!

*శ్రీ డబ్ల్యు. హెచ్. షూబర్ట్ :* అయ్యా! నియంత్రణకు అతీతంగా ఉండాలని మేం కోరుకోవడం లేదు. ప్రస్తుతం మాకు లభిస్తున్న హక్కులు, పెన్షన్లు, మా కుటుంబ పెన్షన్లు భద్రంగా ఉండాలని మాత్రమే మేం కోరుకుంటున్నాం. నియంత్రణకు అతీతంగా ఉండాలని మేం ఎంత మాత్రం కోరుకోవటం లేదు.

*385. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* భారతీయ సివిల్ ఉద్యోగుల న్యాయబద్ధమైన హక్కులని ఈ సమావేశాలలో అంగీకరించిన అన్ని హక్కులకు భారతీయ కేంద్ర శాసన సభ, రాష్ట్ర శాసన సభలు చట్టాలద్వారా రక్షణ కల్పించాయని అనుకోండి. అప్పుడు మీకు తగిన భద్రత లభిస్తుందా?

*సర్ పి.జె. ఫాగన్ :* ఆర్థిక పరిస్థితి గురించి మేం భయపడుతున్నాం.

**386, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** అది వేరే విషయం. మీ సేవలకు, ఇతర విషయాలకు భారత శాసన సభ తగిన డబ్బును సమకూర్చగలదా, లేదా అనేది వేరే విషయమేనా?

*సర్ పి.జె. ఫాగన్ :* అవును.

*387. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* నేను చెప్పాలనుకున్నది ఏమిటంటే, మీ సర్వీసు నిబంధనలను భారతీయ శాసన సభలు క్రమబద్ధం చేశాయనుకోండి. అప్పుడు తగిన భద్రత లభిస్తుందని మీరు భావిస్తారా? లేదా?

*సర్ పి.జె. ఫాగన్ :* లేదు.

*డబ్ల్యు. హెచ్.షూబర్ట్ :* భవిష్యత్తులో ఏర్పడే అతివాద ప్రభుత్వాలు ఆ చట్టాలను రద్దు చేయవచ్చు కదా!

*388. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* ఏ చట్టాన్ని అయినా అకస్మాత్తుగా రద్దు చేయకూడదని నిబంధన పెట్టామనుకోండి. అప్పుడు?

*సర్ పి.జె. ఫాగన్ :* అది తగినంత భద్రత కల్పించగలదని మా సంఘాలు భావిస్తాయని నేను అనుకోవటం లేదు.

*389. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* భారతదేశంలోని పత్రికలు, రాజకీయ నాయకులు మీ పట్ల ఎంతగానో ద్వేష భావంతో ఉన్నాయని మీరు పదేపదే చెప్పారు. ఈ విషయానికి సంబంధించి నేను

ఒకటి చెప్పాలనుకుంటున్నాను. పత్రికల్లోను, శాసన సభల్లోను వ్యక్తం అయ్యే న్యాయబద్ధమైన ప్రజాభిప్రాయం పరిధి నుంచి మిమ్మలను పూర్తిగా దూరంగా ఉంచే రక్షణలను మీరు కోరుకోవటమే ఆ ద్వేష భావానికి కారణం కాదా?

***సర్ పి.జె. ఫాగన్:*** లేదు. అవి మమ్మలను ప్రజాభిప్రాయం పరిధికి దూరంగా ఉంచుతాయని నేను అనుకోవటంలేదు. ఆ విషయాన్ని నేను కచ్చితంగా చెప్పగలను. ఆరోగ్యకరమైన ప్రజాభిప్రాయం పరిధి నుంచి అవి మమ్మలను దూరంగా ఉంచుతాయని నేను ఎంత మాత్రం భావించటం లేదు.

***390. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:*** ఈ ప్రశ్న మరొకసారి అడగాలనుకుంటున్నాను. భారతీయ మంత్రుల అంగీకారంతో భారతీయ శాసనసభ చేసిన చట్టాల నియంత్రణ కింద మీరు ఉన్నట్లయితే, పత్రికలు, లేదా ప్రజలు మిమ్మలను నిందించినప్పుడు మంత్రుల నుండి మరింత ఎక్కువ రక్షణ లభించగలదని మీరు అనుకోవటం లేదా? చట్టాల నియంత్రణకు మీరు దూరంగా ఉన్నప్పటికంటే అప్పుడు మీకు ఎక్కువ రక్షణ లభించదా?

***సర్ పి. జె. ఫాగన్:*** లేదు. మా సంఘాలు కూడా ఆ విధంగా అభిప్రాయపడతాయని నేను అనుకోను.

***391. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** అటువంటి అభిప్రాయానికి మద్ధతుగా సైమన్ కమీషన్ నివేదికలోని కొన్ని భాగాలను మీరు ఇప్పుడే విన్నారు. శాంతి భద్రతల విభాగాన్ని నియంత్రణకు దూరంగా ఉంచడం వల్ల తీవ్రమైన విమర్శలు వస్తాయనే నిర్ధారణకు సర్ జాన్ సైమన్ వచ్చినందువల్లనే తనకు ఇష్టం లేకపోయినా ఆయన ఆ విభాగాన్ని శాసన సభల అధికారం పరిధిలోకి బదలీ చేయాలని సిఫార్సు చేశారు. ఇది నిజం కాదా?

***సర్ పి.జె. ఫాగన్ :*** ఈ విషయాన్ని ఇక వదిలివేస్తేనే మంచిదని అనుకుంటున్నాను. ఇది చాలా చర్చనీయాంశం. ఈ అంశంపై చాలా విభిన్నాభిప్రాయాలు ఉన్నాయి. సర్ జాన్ సైమన్ ఆలోచించిన విషయాలకు నేను బాధ్యత వహించలేను.

***391. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** సైమన్ కమిషన్ నివేదిక ప్రభావితం కావడానికి దారితీసిన కారణం అదేనని మీరు అంగీకరిస్తారా?

***సర్ ఆస్టిన్ చాంబర్లెయిన్ :*** ఆ ప్రశ్నకు జవాబు ఇవ్వాలని బలవంతం చేయవద్దని సాక్షి ఇదివరకే అడిగారు.

***డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** సమాధానం చెప్పడం ఆయనకు ఇష్టం లేకపోతే, నేను బలవంతపెట్టను.

***సర్ ఆస్టిన్ చాంబర్లెయిన్:*** తమ సొంత పరిస్థితుల గురించి, కోర్కెల గురించి మాట్లాడడానికి వచ్చిన సివిల్ సర్వీస్ ప్రతినిధులను అడగవలసిన ప్రశ్న అది ఎంతమాత్రం కాదు. భారత దేశంలో చేపట్టవలసిన మొత్తం సంస్కరణల గురించి మాట్లాడడానికి వారు ఇక్కడకు రాలేదు.

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* శాంతి భద్రతల విభాగాన్ని శాసనసభలు, ప్రభుత్వాల అధికార పరిధికి బదలీ చేయాలని సిఫార్సు చేయడానికి సర్ జాన్ సైమన్ పేర్కొన్న కారణం ఇది. శాసన సభలు, ప్రభుత్వాల నియంత్రణకు దూరంగా ఉంచడం వల్ల పత్రికలు, ప్రజల నుంచి ఆ విభాగం మరింత తీవ్రమైన విమర్శలను ఎదుర్కోవలసి వస్తుందని ఆయన పేర్కొన్నారు.

*వైకౌంట్ బర్నామ్ :* చట్టబద్ధమైన సంఘం సభ్యుడిగా డాక్టర్ అంబేద్కర్ చెప్పిన విషయం చాలా తప్పుదోవ పట్టించేదిగా ఉన్నది.

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* బహుశ నేను పొరపాటుగా దాన్ని చదివానేమో!

## (2)

## శ్రీ సచ్చిదానంద సిన్హా, బారిస్టర్.ఎట్.లా., ఎం.ఐ.సి.,

*1985 డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* మొట్ట మొదట గవర్నర్ ప్రత్యేక అధికారాల గురించి మిమ్మలను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. ప్రత్యేకించి శాంతి, ప్రశాంతతలకు ముప్పు వాటిల్లకుండా నిరోధించడానికి చర్యతీసుకునే విషయంలో ఆయనకు ఉన్న అధికారాల గురించి అడగాలనుకుంటున్నాను. బదలీ అంశాల పరిపాలనకు సంబంధించి నేడు ఉన్న పరిస్థితిని కూడా మీ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్నాను. భారత ప్రభుత్వ చట్టం మీ దగ్గర ఉన్నదా?

*సచ్చిదానంద సిన్హా :* ఉన్నది.

*1986. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* భారతప్రభుత్వ చట్టంలోని 52 వ సెక్షన్‌ను ఒకసారి చూస్తారా?

*శ్రీ సచ్చిదానంద సిన్హా :* అలాగే.

*1987. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* బదలీ అంశాలు, రిజర్వ్‌డ్ అంశాల విభజనను ప్రస్తావిస్తున్న 45వ సెక్షన్‌ను మీ దృష్టికి తీసుకుని రావాలని అనుకోవటం లేదు. అది మనకు తెలును. అజమాయిషీ అంశాన్ని మాత్రమే నేను ఇప్పుడు ప్రస్తావిస్తున్నాను. 52వ సెక్షన్ చూడండి. అందులోని ఒకటవ సబ్–సెక్షన్‌లో ఇలా ఉంటుంది : "గవర్నర్ పాలిత ప్రాంత గవర్నర్ తన కార్యనిర్వాహక మండలిలో సభ్యులు కాని వారిని నోటిఫికేషన్ ద్వారా మంత్రులుగా నియమించవచ్చు." ఇంకా ఇలాంటివి ఉన్నాయి కదూ?

*శ్రీ సచ్చిదానంద సిన్హా :* అవును.

*1988. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఇప్పుడు మనం మూడవ సబ్–సెక్షన్‌ను చూద్దాం. అందులో ఇలా ఉంటుంది : "బదలీ అంశాలకు సంబంధించి మంత్రుల సలహా ప్రకారం గవర్నర్ వ్యవహరించాలి–

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి, II–ఎ, జూన్ 22, 1933, పేజీలు – 256–58.

అయితే, మంత్రుల అభిప్రాయంతో గవర్నర్ విభేదిస్తున్నట్లయితే, మంత్రుల సలహా ప్రకారం కాకుండా మరొక చర్యను ఆయన తీసుకోవచ్చు." అవునా?

**శ్రీ సచ్చిదానంద సిన్హా :** అవును.

***1989. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** శాంతి, ప్రశాంతతలకు ముప్పు ఏర్పడిందని గవర్నర్ భావిస్తే, ఆయన తన మంత్రుల సలహాలను త్రోసిరాజనవచ్చని ఈ సెక్షన్ చెప్పదనే విషయాన్ని మీ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్నాను. ఈ సెక్షన్ ఆ విధంగా చెప్తుందా?

**శ్రీ సచ్చిదానంద సిన్హా :** లేదు.

***1990. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** ప్రస్తుత శ్వేత పత్రంలో ఉన్నట్లుగా ఈ సెక్షన్‌లో ప్రత్యేక ఏర్పాటు ఏదీ లేదు కదా?

**శ్రీ సచ్చిదానంద మూర్తి :** లేదు. దానిలో అలా లేదు.

***1991. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** ఏయే సందర్భాలలో గవర్నర్ తన మంత్రుల సలహా ప్రకారం వ్యవహరించకూడదో పేర్కొన్న ఆదేశాల పుస్తకాన్ని గవర్నర్‌కి జారీచేశారు. మీరు దాన్ని చూడగలరా?

**శ్రీ సచ్చిదానంద సిన్హా :** దాని నకలు ప్రతి ప్రస్తుతం నా దగ్గరలేదు.

***1992. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** ఆ పుస్తకంలోని 269 వ పేజీలో అది మీకు కన్పిస్తుంది. చూస్తారా?

**శ్రీ సచ్చిదానంద సిన్హా :** చూస్తాను. ఆ పుస్తకం నా దగ్గర లేదు.

***1993. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** ఆదేశాల పుస్తకం లోని 270 వ పేజీలో ఆరవ క్లాజు ఇలా చెప్తుంది : "ఎవరైనా ఒక మంత్రి సలహా ఇస్తే, దానిపై నిర్ణయం తీసుకోవలసి వచ్చినప్పుడు ఆయన అభిప్రాయంతో విభేదించడానికి తగిన కారణం ఉన్నదని మీరు భావించిన పక్షంలో.... శాసన మండలితో ఆ మంత్రికి ఉన్న సంబంధాలను, అందులోని ప్రతినిధులు వ్యక్తం చేసిన ప్రెసిడెన్సీ ప్రజల ఆకాంక్షలను మీరు పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది." మరొక విధమైన మాటల్లో చెప్పాలంటే, ప్రస్తుత పరిస్థితుల్లో శాసన మండలి లేదా నియోజకవర్గాల మద్దతు మంత్రికి లేదనే నిర్ధారణకు వచ్చినప్పుడు మాత్రమే. అది కూడా బదలీ విభాగాల విషయంలో మాత్రమే గవర్నర్ ఆ మంత్రి సలహాను త్రోసిపుచ్చవచ్చు. అవునా?

**శ్రీ సచ్చిదానంద సిన్హా :** అవును! నేనూ అలాగే భావిస్తున్నాను.

***1994. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** విషయాన్ని స్పష్టం చేయడానికి నేను ఒకమాట చెప్పాలనుకుంటున్నాను. బదలీ విభాగాల పరిపాలనకు సంబంధించి ప్రస్తుతం అమలులో ఉన్న పద్ధతి కింద గవర్నర్‌కు ప్రత్యేక వీటో అధికారం లేదు. అయితే, శాంతి, ప్రశాంతతలను కాపాడడానికి

(ఎ) క్లాజు కింద ప్రస్తుతం గవర్నర్‌కు ఇచ్చిన అధికారాలలో వీటో అధికారం కూడా ఉంది. అవునా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

1995. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ : శాంతి, భద్రతల విభాగం రిజర్వ్‌డ్ అంశం. ఆ విషయాన్ని గౌరవిస్తూనే ఆయన ఇప్పుడు ఆ విభాగం పరిధిలో తనకు తోచిన చర్య తీసుకోవచ్చు. నిజమేనా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : నిజమే.

*1996. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అయితే, ఆయన మంత్రి దగ్గరకు వచ్చి, "బదలీ విభాగానికి సంబంధించిన సలహాలను మీరు ఇచ్చినప్పటికీ, మీ సలహా వల్ల శాంతి, ప్రశాంతతలకు ముప్పు ఏర్పడుతుంది కాబట్టి దాన్ని నేను అంగీకరించలేను", అని చెప్పలేదు కదూ?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

*1997. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అయితే, అది ఒక తిరోగమన నిబంధనే కదూ?

శ్రీ సచ్చిదానంద సిన్హా : నిస్సందేహంగా.

*1998. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఈ రోజు మంత్రి తన విభాగంలో తాను ఇష్టపడిన ఏ చర్యనైనా తీసుకోవచ్చు. శ్వేతపత్రం లోని కొత్త పథకం (ఆ శ్వేత పత్రం చెల్లుతుందనుకుంటే) కింద ప్రతి విభాగం ఒక బదలీ విభాగమే. శాంతి, ప్రశాంతతలను కాపాడటానికి గవర్నర్‌కు ఉన్న ప్రత్యేక అధికారాల కొంత వీటో అధికారం కూడా ఉంది. అయితే, ఈ వీటో అధికారం శాంతి భద్రతల విభాగానికి మాత్రమే పరిమితం అయ్యే బదులు ప్రతి విభాగానికి విస్తరిస్తుంది. అవునా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును. నిజమే.

*1999. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అలాంటప్పుడు... ప్రతి విభాగం బదలీ విభాగమే అయినప్పటికీ, ప్రతివిభాగం బాధ్యత ఆ మేరకు తగ్గిపోతుంది కదూ!

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఇప్పుడు నన్ను సర్వీసుల విషయాన్ని ప్రస్తావించనీయండి. అనుబంధం -7 ఏం చెప్తుందంటే –

*కౌంట్ బర్నామ్ :* గౌరవనీయులైన అధ్యక్షా! రాష్ట్ర గవర్నర్ల ప్రస్తుత అధికారాల గురించి ఈ వివరణ అంతా ఇదివరకు వినే ఉన్నాము. అయితే, వాటిని ఎక్కడ పొందుపరిచారో మాత్రం మాకు చెప్పలేదు.

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* భారత ప్రభుత్వ చట్టం లోని 51(1) వ సెక్షన్‌ను మీ దృష్టికి తీసుకుని వచ్చాను.

*వైకౌంట్ బర్న్హామ్* : ఎవరి అధికారంపై ఈ వివరణ ఇచ్చారు?

*డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : నాకు తెలియదు.

*వైకౌంట్ బర్న్హామ్* : మీరు ఎవరి అనుమతితో ఈ వివరణ ఇచ్చారు?

*2000. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : చట్టానికి నేను స్వయంగా ఇచ్చిన వ్యాఖ్యానం ఇది. సాక్షి కూడా దీనితో ఏకీభవించారు. 52వ సెక్షన్ గురించి, భారత ప్రభుత్వ చట్టంలో భాగంగా ఉన్న ఆదేశాల పుస్తకం గురించి నేను మాట్లాడుతున్నాను. ఇప్పుడు సర్వీసుల విషయానికి వస్తే, అనుబంధం -7 ను చూడవలసివున్నది. అందులోని ప్రతి అంశాన్నీ ప్రస్తావించాలని నేను అనుకోవటం లేదు. విభజనకు, సర్వీసు నిబంధనల క్రమ బద్ధీకరణకు సంబంధించిన అన్ని అధికారాలు కౌన్సిల్‌లోని ప్రభుత్వ కార్యదర్శికి ఉంటాయని అందులో ఉన్నది కదూ?

*శ్రీ సచ్చిదానంద సిన్హా* : అవును.

*2001. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : నేను ఇప్పుడు 96 బి సెక్షన్‌లోని సబ్-సెక్షన్(2)ను మీ దృష్టికి తీసుకుని రానా? అందులో ఇలా ఉంటుంది "భారతదేశంలోని సివిల్ సర్వీసుల విభజన, నియామక పద్ధతులు, సర్వీసు నిబంధనలు, వేతన భత్యాలు, క్రమశిక్షణ, ప్రవర్తన మొదలైన అంశాలను క్రమబద్ధీకరించడానికి కౌన్సిల్‌లోని ప్రభుత్వ కార్యదర్శి నిబంధనలను రూపొందించవచ్చు." అందులో ఇంకా ఇలా ఉంటుంది! "నిర్దేశించిన మేరకు, నిర్దేశించిన విషయాలకు సంబంధించినంత వరకు అటువంటి నిబంధనలను చేసే అధికారాన్ని కౌన్సిల్‌లోని గవర్నర్-జనరల్‌కు లేదా స్థానిక ప్రభుత్వాలకు ఇవ్వవచ్చు. లేదా పబ్లిక్ సర్వీసులను క్రమబద్ధీకరించడానికి చట్టాలను చేసే అధికారాన్ని భారతీయ శాసనసభకు లేక స్థానిక శాసనసభలకు కూడా ఇవ్వవచ్చు."

*శ్రీ సచ్చిదానంద సిన్హా* : అవును.

*2002. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : కాబట్టి, భారత ప్రభుత్వ చట్టం ప్రకారం.., సర్వీసు నిబంధనలు, జీతభత్యాలకు సంబంధించి నిబంధనలు చేసే అధికారాన్ని గవర్నర్-జనరల్‌కు కాని, భారతీయశాసన సభలకు కాని ఇవ్వటమే ఉద్దేశం కదూ?

*శ్రీ సచ్చిదానంద సిన్హా* : స్థానిక శాసనసభలకు కూడా.

*2003. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : భారత దేశంలో ప్రవేశపెట్టబోయే నూతన ప్రభుత్వ వ్యవస్థలో కలిసిపోయేందుకు వీలుగా సర్వీసు నిబంధనలు ఉండాలనే ఉద్దేశం కూడా ఉంది కదూ?

*శ్రీ సచ్చిదానంద సిన్హా* : అందులో ఉన్న అర్థం అదేనని అనిపిస్తున్నది.

*2004. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : ఉదాహరణకు, అనుబంధం -7 లో పేర్కొన్న ఈ నిబంధనలను చట్టబద్ధం చేసినట్లయితే, భారతీయ అధికారులపై ఆజమాయిషీకి అవకాశం ఇస్తున్న భారత

ప్రభుత్వచట్టం లోని మొత్తం ధోరణులను అదుపు చేయవచ్చా?

శ్రీ సచ్చిదానంద సిన్హా: అందువల్లనే, పబ్లిక్ సర్వీసులకు సంబంధించిన ప్రతిపాదనలు భారతదేశానికి సంతృప్తి కలిగించవని నేను నా విజ్ఞాపన పత్రంలో పేర్కొంటున్నాను.

*2005. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అది చాలా అవసరం. అంతేకాక, కౌన్సిల్‌లోని ప్రభుత్వ కార్యదర్శికి ఉన్న ఈ అధికారాలను తగిన పరిస్థితులలో భారతీయ శాసనసభకు బదలీ చేయవచ్చునని భారత ప్రభుత్వ చట్టంలోనే పేర్కొనడం జరిగింది కదా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

*2006. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* శ్వేతపత్రంలోని ప్రతిపాదనలను చట్టబద్ధం చేసినట్లయితే, ఈ అధికారాల బదలీని అరికట్టవచ్చా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : నిస్సందేహంగా.

*2007. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* సర్వీసుల హక్కుల్లోని కొన్ని అంశాలను చూడండి. ఉదాహరణకు 121 వ పేజీలోని 14ను చూడండి." గవర్నర్ వ్యక్తిగత అంగీకారం, పద్ధతి ప్రకారం మందలింపు." అంతేకాక, 15ను చూడండి "నియామకానికి సంబంధించి గవర్నర్ వ్యక్తిగత అంగీకారం"; 16 చూడండి "ఉన్నతాధికారి ఇచ్చిన ఏ ఆదేశానికైనా వ్యతిరేకంగా గవర్నర్‌కు ఫిర్యాదు చేసే అధికారం". ఇంకా ఇలాంటివే ఉన్నాయి. సర్వీసు నిబంధనల మాదిరిగా ఈ హక్కులు తుదిరూపం దాల్చలేదు. అవి ఇంకా రూపకల్పన దశలోనే ఉన్నాయి. మంత్రి ఏరకంగా ప్రతిస్పందిస్తారో ఎవరికి కచ్చితంగా తెలియదు కాబట్టి వీటిని చట్టబద్ధం చేశారు కదూ?

శ్రీ సచ్చిదానంద సిన్హా : డాక్టర్ అంబేద్కర్! అసలు మీ ప్రశ్న ఏమిటి?

*2008. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* నా ప్రశ్న ఇది : మంత్రికి, సివిల్ సర్వీస్‌కు మధ్య జరిగే ఈ ప్రయోగం చివరకు ఎటువంటి పరిణామానికి దారితీస్తుందోతెలుసుకోవడానికి ఈ సర్వీసు నిబంధనలలో కొన్నిటిని చట్టబద్ధం చేయడం జరిగిందా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

*2009. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అవే తుదిరూపం అనే ఉద్దేశం ఉందా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : లేదు. నేను అలా అనుకోవటం లేదు.

*2010. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఇప్పుడు ఉన్న రూపంలోనే వాటిని చట్టబద్ధం చేసినట్లయితే, ప్రభుత్వ బాధ్యతాయుత వ్యవస్థలో సివిల్ సర్వీస్ నిబంధనలను సమ్మిళితం చేసే క్రమానికి అడ్డు ఏర్పడుతుందా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును

*2011. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* కేంద్ర బాధ్యత గురించి ఒకే ఒక ప్రశ్న మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను. సర్ హెన్రీ గిడ్నీ ప్రశ్నకు మీరు జవాబు ఇస్తూ, సమాఖ్య ప్రారంభోత్సవానికి తేదీ నిర్ణయించాలని చాలా ఆసక్తితో ఉన్నామని చెప్పారు కదా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : అవును.

*2012. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* అయితే, కచ్చితమైన తేదీని నిర్ణయించడం అసాధ్యం అని అంటున్నారని మీకూ తెలుసు. ఎందుకంటే, చాలా అనిశ్చిత పరిస్థితులు ఉన్నాయి. అవి ఏమిటంటే, నిర్దేశించిన సమయానికి రాకుమారులు రాకపోవచ్చు. అంతేకాక, దాన్ని తప్పించుకోవడానికి వీలు కలుగజేసే విధంగా శ్వేతపత్రంలో కొన్ని తాత్కాలిక నిబంధనలకు స్థానం కల్పించారని కూడా మీకు తెలుసు. నేను ఇప్పుడు మీకు ఒక సూచన చేయాలనుకుంటున్నాను. ఎందుకంటే, ఈ విషయంపై మీ అభిప్రాయం తెలుసుకోవాలనే ఆత్రతతో ఉన్నాను. తగినంత సంఖ్యలో రాకుమారులు వచ్చే వరకు సమాఖ్యను అనిశ్చిత స్థితిలో ఉంచేకంటే, వారు వచ్చేలోపు కొంతమంది అధికారులు, మరికొంతమంది అనధికారులతో కేంద్ర శాసనసభలో నియమించిన గ్రూపుతో సమాఖ్యను వెంటనే ప్రారంభించినట్లయితే, అటువంటి ఏర్పాటు పట్ల మీకు ఏదయినా అభ్యంతరం ఉంటుందా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : ఇప్పటికిప్పుడు నేను ఏ అభిప్రాయం చెప్పలేను. అయితే, ఈ విషయాన్ని పరిగణనలోకి తీసుకుని పరిశీలించవచ్చు. ఇది పరిశీలించదగిన విషయమే.

*2013. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఈ అంశాన్ని నేను స్పష్టం చేయాలనుకుంటున్నాను. కేంద్రంలో బాధ్యత స్వీకరించడానికి ముందు భారతీయ రాకుమారులతో బ్రిటీష్ ఇండియా సమాఖ్య ఏర్పడాలనే షరతును మీరు అంగీకరిస్తారా? అంగీకరించరనే నేను అనుకుంటున్నాను.

శ్రీ సచ్చిధానంద సిన్హా : ఏ అభిప్రాయాన్ని వ్యక్తం చేయాలని నేను అనుకోవటం లేదు. ఎందుకంటే, శ్వేతపత్రంలో పేర్కొన్న ప్రతిపాదనలపై రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో అంగీకారం వ్యక్తమైందని నాకు తెలుసు.

*2014 డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* నేను చెప్పున్నది ఇది : శ్వేత పత్రాన్ని పక్కన బెడితే, సమాఖ్య ఏర్పడితీరాలనే ఒకే ఒక షరతుపై బ్రిటిష్ ఇండియాకు కేంద్ర బాధ్యత ఉండాలనే విషయాన్ని మీరు అంగీకరించరా?

శ్రీ సచ్చిదానంద సిన్హా : లేదు. శ్వేతపత్రాన్ని పక్కన బెట్టే ప్రసక్తి లేదు.

శ్రీ బట్లర్ : గౌరవనీయులైన అధ్యక్షా! ఈ కార్యక్రమం ఇంకా ముందుకు సాగేముందు నేనొకటి చెప్పనా? ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టంపై ఈ ప్రశ్నలు, జవాబులు మేం అంగీకరించలేము.

ప్రత్యేకించి, ప్రస్తుత ప్రభుత్వ ఆదేశాలు, ఆరవ క్లాజు, ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టంలోని 52వ సెక్షన్ ప్రకారం ఉన్నాయనుకుంటున్న పరిధులను అసలే అంగీకరించలేము.

## (3)

## మీర్ మక్బూల్ మహమూద్ డాక్టర్ పి.కె. సేన్, శ్రీ కె. ఎం. పణిక్కర్, శ్రీ బి.కక్.... రాకుమారుల చాంబర్ తరఫున

*3000. *డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్* : ఈ ప్రశ్నలనుంచి ఉత్పన్నమైన విషయాన్ని నాకు కన్పిస్తున్నవిధంగా చెప్పాలనుకుంటున్నాను. సమాఖ్యను ప్రారంభించడానికి సంబంధించి శ్వేతపత్రంలో ఒక షరతు ఉన్నదని మీకు తెలుసు. అదేమిటంటే, కొంత నిర్దుష్ట సంఖ్యలో భారత సంస్థానాలు సమాఖ్యలో చేరడానికి సంబంధించినది. తరువాత ఆర్థికశాఖ బదలీ విషయంలో మరొక ముఖ్యమైన షరతు ఉంది. అదేమిటంటే, బ్యాంక్‌ను ప్రారంభించడానికి సంబంధించనది. నేను మిమ్మల్ని ఈ కింది విషయం అడగాలనుకుంటున్నాను :

ఆర్థిక శాఖ బదలీ అంశం కానట్లయితే, సమాఖ్యలో చేరడానికి రాకుమారులు సిద్ధమేనా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఆ విషయంపై నాకు కచ్చితమైన సూచనలు ఇవ్వలేదు. అయితే, వారి చర్చల ధోరణిని పరిశీలించినప్పుడు వారు సమాఖ్యలో చేరడానికి సిద్ధమవుతారని నాకు అన్పించలేదు.

*3001. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఆర్థిక శాఖ బదలీ అంశం కానట్లయితే, సమాఖ్యలో చేరడానికి వారు సిద్ధపడరా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** నేను ఆ విధంగా అనుకోవటం లేదు.

*3002. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* ఇక ఇతర విషయాలకు వద్దాం. మీర్ మక్బూల్! క్రితం సారి సాక్ష్యం ఇస్తున్న సమయంలో మీరు ఒక విషయం చెప్పారు. సమాఖ్యలో చేరడానికి రాకుమారులందరూ ఇప్పటికిప్పుడు సిద్ధంగా లేకపోయినట్లయితే, సమాఖ్యలో చేరని వారి వోట్లనుంచి పరోక్షంగా ప్రయోజనం పొందే వీలును సమాఖ్యలో చేరే రాకుమారులకు కల్పించేందుకు దోహదం చేసే పద్ధతిని ప్రవేశపెట్టాలని మీరు అన్నారు. నేను సరిగానే చెప్పానా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అసలు ధోరణికి సంబంధించిన ఒకే ఒక అంశాన్ని అది ప్రతిఫలిస్తుంది.

*3003. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* మీరు అవలంబించే ధోరణి అదేనా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అది సగం నిజం మాత్రమే పూర్తి నిజం కాదు. ఆ ధోరణికి సంబంధించిన రెండు అంశాల గురించి ఆలోచిస్తున్నాం.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి – 2 ఎ, జూన్ 27, 1933. పేజీలు 372-76.

*3004. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* మీ కాన్ఫెడరేషన్ నాకు తెలుసా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అది కాదు. ఒక అంశం ఏమిటంటే, సభలో చేరే సంస్థానాలకు సంబంధించినది. సమాఖ్యలోని ఎగువ సభలో 40 శాతం, దిగువ సభలో మూడింట ఒక వంతు స్థానాలు సంస్థానాలకు ఉంటాయనే భావంతో అవి సమాఖ్యలో చేరుతాయి. మరొక అంశం సమాఖ్యకు వెలుపల ఉన్న సంస్థానాలకు సంబంధించినది. ఎందుకంటే, సమాఖ్య నిర్ణయాల ప్రభావం వాటిపై కూడా ఉంటుంది. ఆ రెండు అంశాలు ఇవే : మీ ప్రశ్న రెండవ అంశానికి సంబంధించినదని నేను అనుకుంటున్నాను.

*3005. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* మీరు సుముఖంగా ఉన్నట్లయితే, ఈ విషయంపై నే మీ దృష్టిని కేంద్రీకరించాలని కోరుకుంటున్నాను. క్రితం సారి సాక్ష్యం ఇచ్చినప్పుడు మీ మాటల ద్వారా నేను అర్థం చేసుకున్నది ఏమిటంటే, మొదటనే అన్ని సంస్థానాలు ఒకేసారి సమాఖ్యలో చేరకుండా ఉన్నట్లయితే, కొన్ని సంస్థానాలు చేరి, మరికొన్ని చేరకుండా వెలుపలనే ఉండేటట్లయితే, సమాఖ్యలో చేరిన రాకుమారులకు అదనపు వోట్లను కలిగిఉండే సౌకర్యం ఉండాలని మీరు షరతు విధించారు. అంటే, సమాఖ్యలో చేరని రాకుమారుల వోట్లుకూడా వీరికే రావాలని మీరు అన్నారని నేను అర్థం చేసుకున్నాను. మీ వైఖరి అదే కదూ?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అవును.

*3006. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :* దీనికి సంబంధించి నేను ఇప్పుడు మిమ్ములను ఈ ప్రశ్న అడగాలనుకుంటున్నాను మొదట్లో సమాఖ్యలో చేరని సంస్థానాల వోట్లను సమాఖ్యలో చేరిన సంస్థానాలు ఉపయోగించుకుంటాయి. కదా! మరి సమాఖ్యలో చేరని సంస్థానాలకు పన్నుల చెల్లింపు ఫెడరల్ శాసనాలకు సంబంధించి సమాఖ్యతో ఎటువంటి సంబంధం ఉంటుంది? ఈ సంస్థానాలలో కూడా ఫెడరల్ శాసనాలు అమలు అవుతాయా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అప్పుడు కూడా చాలా వరకు ప్రస్తుత పరిస్థితే ఉంటుంది.

*3007. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* అది కాదు. నేను అడిగినది ఈ విషయం. సమాఖ్యలో చేరని సంస్థానాల వోటింగ్ బలాన్ని సమాఖ్యలో చేరిన సంస్థానాలు ఉపయోగించుకుంటాయి కదా! మరి సమాఖ్యలో చేరని సంస్థానాలలో ఫెడరల్ చట్టాలు అమలు అవుతాయా ?

**మీర్ మక్బూల్ మహమూద్:** పన్నుల చెల్లింపునకు సంబంధించిన కొన్ని అంశాలలో ఫెడరల్ చట్టాలు అమలు అవుతాయి. ఇతర విషయాలలో సంప్రదింపుల తరువాత ఫెడరల్ చట్టం వర్తిస్తుంది.

*3008. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మరి ఆ సంస్థానాలను సమాఖ్యలో సభ్యులుగా పరిగణిస్తారా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** లేదు.

***3009. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** అయితే, వాటిని ఆ విధంగా పరిగణించరా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** లేదు.

***3010. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** అయినా, ఆ సంస్థానాల ఓట్లను ఇతర సంస్థానాలు ఉపయోగించుకుంటాయా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అవును. కెనడా రాజ్యాంగంలోని 147వ అధికరణ మాదిరిగానే ఇది కూడా ఉంటుంది. సెనెట్‌లో ఎడ్వర్ట్ ఐలాండ్ ఓట్లను నోవా స్కాటియా, న్యూ బ్రూన్స్‌విక్, ఉపయోగించుకున్నాయి.

***3011. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఇప్పుడు జాతీయతకు సంబంధించి కొన్ని ప్రశ్నలను అడగాలనుకుంటున్నాను. ఆ అంశాన్ని మీలో ఎవరు పట్టించుకుంటారో నాకు తెలియదు. చట్టపరంగా బ్రిటిష్ ఇండియాకు సంబంధించినంతవరకు భారత సంస్థానాల ప్రజలు విదేశీయులని సాధారణంగా భావిస్తారు కదూ?

**శ్రీ కె.ఎం. పణిక్కర్ :** వారు బ్రిటిష్ రక్షిత ప్రజలు అయితే, చట్టపరంగా వారు విదేశీయులు.

***3012. సర్ హరి సింగ్ గౌర్ :*** వారు బ్రిటిష్ ప్రజలు కాదా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** వారు బ్రిటిష్ ప్రజలు కాదు.

***3013. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** బ్రిటిష్ ఇండియాలో విదేశీయుల చట్టంగా వ్యవహరించబడుతున్న చట్టం పరిధి కిందకు వారు వస్తారు.

**మీర్ మక్బూల్ మహమూద్ :** నేను ఆ విధంగా అనుకోను.

***3014. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** వారు ఆ పరిధి కిందకు వస్తారని నేను చెప్పున్నాను. సర్. ఏది ఏమైనప్పటికీ, వారు బ్రిటిష్ ప్రజలు కారన్న విషయం అందరూ అనుకుంటున్నదే. ఉమ్మడి అయిన భారత జాతీయత ఉండాలనే వైఖరి అఖిలభారత సమాఖ్యకు తగిన విధంగా, అమరికగా ఉంటుంది. ఆ వైఖరిని అదుపుచేసే ప్రతిపాదనను మీరు చేయరని నేను భావిస్తున్నాను.

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఆ విషయాన్ని ఆలోచించలేదు.

***3015. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ప్రస్తుతం ఉన్న పరిస్థితి ఇలాగే కొనసాగినట్లయితే, విదేశీయులు (అదే.....భారత సంస్థానాల ప్రజలు) ఓటు హక్కుకు అర్హులై ఉంటారు. సమాఖ్య, రాష్ట్ర శాసన సభల్లో సభ్యులు కావడానికి అర్హులై ఉంటారు. బ్రిటిష్ రాజ్యంలో పౌరులు కాకుండానే ఆ రాచరిక వ్యవస్థలో ఉన్నతాధికారాలను పొందడానికి అర్హులై ఉంటారు. అవునా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఇప్పుడైనా అది సాధ్యమే.

*3016. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* అది సాధ్యమవుతుందని నాకు తెలుసు.

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఇప్పటికే అది జరిగింది.

*3017. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* అయితే, నేను అడగాలనుకుంటున్నది ఇది. మీరు దానిని ఒక అసాధారణమైన విషయంగా పరిగణించరా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** మేం ఆ విధంగా అనుకోవటం లేదు.

*3018. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* విదేశీయులకు వోటు హక్కుకు అర్హత ఉండటమూ శాసన సభలో సభ్యులయ్యే అర్హత ఉండటమూ, అంతేకాక, ఉన్నత స్థానాలను అధిరోహించే అర్హత ఉండటమూ.... ఏ రాజ్యాంగంలో ఉన్నదో మీరు నాకు చెప్పగలరా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఇక్కడే ఉన్న మన ప్రముఖ ప్రతినిధి సర్ పి. పట్టాని ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సభ్యుడిగా ఉన్నారు కదా!

*3019. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* ఆ సంగతి నాకు తెలుసు. అయితే, నేను మీకు స్పష్టం చేయాలనుకున్నది ఏమిటంటే, అది అసాధారణమైన విషయమని; ఏ ఇతర సమాఖ్యలోను అటువంటిది కనపడదని. అంతేనా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఇప్పటికిప్పుడు నేను ఒక ఉదాహరణ కూడా చూపలేను.

*3020. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* భారతీయ సంస్థానంలో పౌరుడైన వ్యక్తి బ్రిటిష్ రాచరిక వ్యవస్థలో ఉన్నత స్థానాన్ని అధిరోహించటం, అయినప్పటికీ, విదేశీయుల చట్టంగా వ్యవహరించ బడుతున్న చట్టానికి లోబడి ఉండటం వంటివి సాధ్యమయ్యే వ్యవస్థ చాలా చోట్ల ఉందని మీరు భావిస్తున్నారు కదూ?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అవును. రాజ్యాంగానికి విధేయులై ఉంటామని ఆ వ్యక్తి ప్రమాణం చేసినంత కాలం.

*3021. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* విదేశీయుల చట్టం పరిధి నుంచి ఇది ఆ వ్యక్తిని తప్పిస్తుందని మీరు అనుకుంటున్నారా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఆ చట్టాన్ని పునఃపరిశీలించడం మీకు అవసరమైనట్లయితే, మీరు ఆ విధంగా చేసుకోవచ్చు.

*3022. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* నేను మీ ముందు ఉంచుతున్నది ఆ అంశమే. అందువల్ల, ఉమ్మడి భారత జాతీయతను కలిగిఉండటం వాంఛనీయం కాదంటారా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అలాంటి స్థితిలో వచ్చే చట్టపరమైన చిక్కులగురించి మేం

ఆలోచించలేదనుకుంటాను.

*3023. శ్రీ జయకర్ :* అసలు ఉమ్మడి జాతీయత విషయాన్ని రాకుమారులు చర్చించారా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** అవును.

*3024. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మరి వారు ఆ విషయాన్ని అంగీకరించరా?

**డాక్టర్ పి.కె. సిన్హా :** సంస్థానాధీశులకు విధేయత చూపినంతకాలం బ్రిటిష్ రాచరికానికి తమ ప్రజలు విధేయబద్ధులై ఉంటే రాకుమారులు కాదనలేదు. ఆ రకంగా అదనపు విధేయతను ఎప్పుడూ పరిగణిస్తూనే ఉన్నారు. అందువల్ల, భారత సంస్థానాలలో బ్రిటిష్ ఇండియన్లకు ఉన్న ప్రత్యేక ప్రయోజనాలను వారికి కూడా ఎప్పుడూ కల్పిస్తూనే ఉన్నారు.

*3025. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* చట్టపరంగా పరిస్థితి ఎలా ఉంటుందనే విషయం గురించి నేను మాట్లాడుతున్నాను.

**మీర్ మక్బూల్ మహమూద్ :** గౌరవ భావంతో చెప్పాలంటే, ఈ రకమైన విషయంలో అటువంటి పోలిక మనకు అంతగా ఉపయోగపడుతుందని నేను భావించడం లేదు. ఎందుకంటే, భారతదేశంలోని సంస్థానాల పరిస్థితి, బ్రిటిష్ రాచరిక పాలనతో వాటికి ఉన్న సంబంధాలు నిస్సందేహంగా అరుదైనవి. అందువల్ల, వాటికి పోలిక తేవటం ద్వారా మీరు పెద్దగా ఏమీ సాధించ లేరు. అయితే, వాస్తవం చెప్పాలంటే, జాతీయత అత్యంత ముఖ్యమైన అంశం. సంప్రదింపుల తరువాత ఏదో తగిన పరిష్కారాన్ని సాధించవచ్చని నేను చెప్పగలను. అయితే, చట్టపరమైన స్థితికి, దానినుంచి ఉత్పన్నమయ్యే అన్నిరకాల చిక్కులకు కచ్చితమైన సమాధానం ఇవ్వటం అంతగా సాధ్యపడదు. ఇటువంటి విషయంలో పోలిక ద్వారా ఏదయినా సాధించగలగటం చాలా కష్టమని నేను చెప్పాను. ప్రపంచంలోని మిగిలిన ప్రాంతాల్లో ఏ పరిస్థితి ఉన్నా, ఏ పరిస్థితి లేక పోయినా మనకుపెద్దగా సహాయపడేదేమి ఉండదు. ఎందుకంటే, బ్రిటిష్ రాచరిక వ్యవస్థతో భారత సంస్థానాలకు ఉన్న సంబంధం అత్యంత అరుదైనది. సంస్థాన పౌరుడు తన పాలకుని పట్ల విధేయత కలిగి ఉంటూనే, బ్రిటిష్ రాచరిక వ్యవస్థ పట్లకూడా విధేయత కలిగి ఉండవలసిన అరుదైన పరిస్థితి మన దగ్గర ఉన్నది. దాని చట్టపరమైన స్థితిని, అందులో నుంచి ఉత్పన్నమయ్యే చిక్కులన్నిటినీ, సర్దుబాటు చేసుకోవలసిన దృష్ట్యా ఈ అంశాన్ని అన్ని కోణాలనుంచి చర్చించాలి. అటువంటి పరిస్థితి నుంచి చట్టపరంగా వచ్చే చిక్కులు ఎలా ఉంటాయో చెప్పటం ఇలాంటి సాక్ష్యాల సందర్భంగా అంత సాధ్యంకాదు.

*026. శ్రీ జయకర్ :* అందువల్ల, ఈ విషయంపై సంస్థానాలు ఒక తుది నిర్ణయం తీసుకోలేదని ను భావించవచ్చునా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** లేదు.

*3027. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* ఈ పరిస్థితి అసాధారణమైనదని, పరిగణలోకి తీసుకోవలసిన

యోగ్యత కలదని మీరు గుర్తించటం నాకు సంతృప్తి కలిగిస్తున్నది.

మీర్ మక్బూల్ మహమూద్ : నిస్సందేహంగా, ఇది పరిగణనలోకి తీసుకోవలసిన అంశమే.

*3028. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* ఇప్పుడు ఫెడరల్ న్యాయస్థానం గురించి మిమ్మలను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. శ్వేత పత్రంలోని 155వ పేరాను చూస్తారా? ఏదైనా భారత సంస్థానంలోని పౌరుడికి, బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రానికి మధ్య వచ్చే వివాదంపై కాని, లేక బ్రిటిష్ ఇండియన్ రాష్ట్ర పౌరుడికి, భారత సంస్థానానికి మధ్య వచ్చే వివాదంపై కాని ఫెడరల్ న్యాయస్థానానికి అధికారం కల్పించే నిబంధన ఏదీ లేదని మీరూ గమనిస్తారు. ఏదయినా ఫెడరల్ చట్టం కారణంగా భారత సంస్థానంపై చర్యకోరవలసిన పరిస్థితి బ్రిటిష్ పౌరుడికి ఏర్పడితే అందుకు ఉపయోగపడే ఫోరమ్‌ను ఏర్పాటు చేయటం అవసరమనే విషయాన్ని మీరు కాదంటారా?

మీర్ మక్బూల్ మహమూద్ : శ్వేత పత్రాన్ని నేను అర్థం చేసుకున్నది ఏమిటంటే, కొన్ని ప్రత్యేక కేసులకు మాత్రమే 155వ సెక్షన్ వర్తిస్తుంది. సంస్థానానికీ, సంస్థానానికీ మధ్య, లేదా సంస్థానానికీ, రాష్ట్రానికీ మధ్య, లేదా సంస్థానానికీ, సమాఖ్యకూ మధ్య, లేదా రాష్ట్రానికీ, సమాఖ్యకు మధ్య వివాదం ఏర్పడిన ప్రత్యేక కేసులకే ఇది వర్తిసుంది. ఏదైనా బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రానికి కాని, ఏదైనా సంస్థానానికి కాని వ్యతిరేకంగా చర్య కోరవలసిన పరిస్థితి ఎవరైనా వ్యక్తికి ఏర్పడితే, ఆ వివాదం ఫెడరల్ న్యాయస్థానం, పరిధి కిందకు తెచ్చే నిబంధన ఏమీ లేదు. కోరవలసిన చర్య స్వభావం, ప్రతివాద నివాసస్థానం ఆ వ్యాజ్యం జరిగే ఫోరమ్‌ను నిర్ణయిస్తామని అందులోని అంతరార్థం. సివిల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం కూడా అనుసరించే పద్ధతి ఇదే.

*3029. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* అది కాదు ప్రశ్న. ఫెడరల్ న్యాయస్థానం అధికారాన్ని కలిగిఉంటుందా? అనేది ప్రశ్న.

మీర్ మక్బూల్ మహమూద్ : లేదు. ఫెడరల్ న్యాయస్థానానికి అధికారం ఉంటుందనే అభిప్రాయం లేదు.

*3030. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* సమాఖ్య శాసనాల కారణంగా ఏదయినా వివాదం తలెత్తిందనుకోండి. అసలు దావా ఎక్కడ వేసినప్పటికీ, చిట్టచివరి వేదిక ఫెడరల్ న్యాయస్థానమే తప్పనిసరిగా అయి ఉండాలా? మొదట మనం అసలు వ్యాజ్యాన్ని, ఆ దావానే పరిగణించ వద్దా?

మీర్ మక్బూల్ మహమూద్: సందర్భాన్ని బట్టి దావా బ్రిటిష్ ఇండియాలో కాని, సంస్థానంలో కాని జరగాలనే శ్వేతపత్రం స్పష్టంగా ఉద్దేశించింది. తరువాత మనం అప్పీలు చేసుకునే ప్రశ్నకు వద్దాం.

*3031. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* కాని, ఫెడరల్ న్యాయస్థానం అధికార పరిధిలోకి వచ్చేంత తీవ్రమైన స్వభావం దావాకు ఉండవచ్చుకదా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** నేను అలా అనుకోను.

***3032. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** 155వ పేరాలోని విషయాలను మీ దృష్టికి తీసుకుని రావాలనుకుంటున్నాను. భారత దేశ సంస్థానానికి విరుద్ధంగా సమాఖ్య శాసనాల ద్వారా సంక్రమించే హక్కులను పౌరుడు వినియోగించుకోవడానికి, లేదా భారతరాష్ట్రానికి విరుద్ధంగా భారతదేశ సంస్థాన పౌరుడు వినియోగించుకోవడానికి వీలుకల్పించే నిబంధన అందులో ఏమీ లేదుకదా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** ఆ విషయం స్పష్టమే.

★ ★ ★

***3036. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** మీ విజ్ఞాపన పత్రం (21) లోని 'జి' పేరాను, ఉప పేరా 'సి' ను ఒకసారి చూస్తారా?

**మీర్ మక్బూల్ మహమూద్ :** సరే.

***3037. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఫెడరల్ న్యాయస్థానం ఆదేశాలను అమలుచేయటంలో ఏదైనా సంస్థానం విఫలమైన పక్షంలో, ఆ ఆదేశాలను అమలు చేయడానికి వైస్రాయికి అధికారం ఇవ్వాలని ఆ పేరా చివరలో మీరు సూచించారు కదా?

**డాక్టర్ పి.కె. సేన్ :** అవును.

***3038. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఈ అధికారాన్ని గవర్నర్–జనరల్‌కు కాని, ఫెడరల్ మంత్రివర్గానికి కాని ఇవ్వాలనుకోకుండా, వైస్రాయికి మాత్రమే ఇవ్వాలని మీరు ఎందుకు భావించారు? ఫెడరల్ రాజ్యాంగంలో ఫెడరల్ న్యాయస్థానం భాగం కదా?

**డాక్టర్ పి.కె. సేన్ :** ఫెడరల్ న్యాయస్థానం ఇచ్చిన ఏదైనా ఆదేశాన్ని సంస్థానం అమలుచేయాలని పక్షంలో, దాన్ని అమలుచేయడానికి తగిన వ్యక్తి వైస్రాయి అని అన్పిస్తున్నది.

***3039. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** వైస్రాయే ఎందుకవ్వాలి? గవర్నర్ – జనరల్ కాని, ఫెడరల్ మంత్రిత్వశాఖ కాని ఎందుకు కారాదు? వైస్రాయే ఎందుకు?

**డాక్టర్ పి.కె.సేన్ :** ఎందుకంటే, సార్వభౌమాధికార వ్యవస్థ ప్రతినిధిగా సంస్థానంతో సంబంధం ఉన్న వైస్రాయి ఆ సంస్థానం విధిగా నిర్వర్తించవలసిన పనిని నిర్వర్తించేలా చూడగలరు కాబట్టి.

***3040. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** లేదు. నాకు వేరే అభిప్రాయం ఉంది. ఆభిప్రాయాన్ని మీ ముందు ఉంచాలని కూడా అనుకుంటున్నాను. ఫెడరల్ ప్రభుత్వ యంత్రాంగంలో ఫెడరల్ న్యాయస్థానం ఒక భాగం. శ్వేతపత్రం ప్రతిపాదనల ప్రకారం, సమాఖ్యకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తి గవర్నర్–జనరల్ మాత్రమే; వైస్రాయి కాదు. ఈ అధికారం ఎవరికైనా ఉండాలి అని అనుకుంటే, అందుకు తగిన వ్యక్తి గవర్నర్–జనరల్ మాత్రమే. వైస్రాయి కాదు. అవునా?

**డాక్టర్ పి.కె. సేన్ :** గవర్నర్-జనరల్‌గా; సమాఖ్య కార్యనిర్వాహక వర్గ అధిపతిగా..., సంస్థానంలో ఏదైనా ఆదేశం అమలు జరిగేలా గవర్నర్-జనరల్ చూడగలుగుతారా అనేది ప్రశ్న.

***3041. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** నా ఉద్దేశం ప్రకారం ఆ పని ఆయనే చేయగలుగుతారు గాని, వైస్రాయి మాత్రం కాదు. ఇటువంటి విషయాలలో బ్రిటిష్ రాచరిక వ్యవస్థకు వైస్రాయి ప్రతినిధ్యం వహిస్తాడు. అవునా?

**డాక్టర్ పి.కె. సేన్ :** గవర్నర్-జనరల్‌కు ఉన్న అధికారం ఏమిటి? బ్రిటిష్ సార్వభౌమాధికార ప్రతినిధిగా ఆదేశాన్ని అమలు చేయించగలిగే ప్రత్యేక నియంత్రణాధికారం వైస్రాయికే ఉంటుందని మా అభిప్రాయం.

***3042. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** నేను నా అభిప్రాయాన్ని స్పష్టీకరించానా లేదా అన్నది నాకు తెలియదు. ఫెడరల్ రాజ్యాంగంలో ఫెడరల్ న్యాయస్థానం భాగం అనేది నా అభిప్రాయం. అవునా?

**డాక్టర్ పి.కె.సేన్ :** నిస్సందేహంగా అంతే.

***3043. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఫెడరల్ రాజ్యాంగానికి అధిపతి గవర్నర్-జనరల్ మాత్రమేకాని, వైస్రాయికాదు. అవునా?

**డాక్టర్ పి.కె. సేన్ :** అవును.

***3044. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** అందువల్ల, ఫెడరల్ రాజ్యాంగంలో భాగంగా ఉన్న ఫెడరల్ న్యాయస్థానం ఆదేశాలను అమలుచేయించే అధికారం గవర్నర్-జనరల్‌కే సంక్రమిస్తుందికాని, వైస్రాయికికాదు. మరి ఆదేశాలను అమలు చేయించే అధికారం గవర్నర్-జనరల్‌కే ఉండవలసి ఉన్నది. అవునా?

**డాక్టర్ పి.కె. సేన్ :** ఈ ఆదేశాలను వైస్రాయి ద్వారా గవర్నర్-జనరల్ అమలు చేయించటమే తగిన పద్ధతిగా ఉంటుందని మాత్రం నేను చెప్పగలను.

***3045. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** ఈ విషయాన్ని ఇక పొడిగించాలని నేను అనుకోవటం లేదు. కేంద్రానికి కేటాయించబోయే అంశాలను ప్రత్యేకించి ఆర్మీని బదలీ చేయాలంటే ముందుగా భారత సంస్థానాల అనుమతి తీసుకోవటం అవసరమని శ్రీ జయకర్ ప్రశ్నకు జవాబు ఇస్తూ మీరు చెప్పారు పణిక్కర్! మీరు అన్న మాటలను నేను సరిగానే చెప్పానా?

**శ్రీ కె. ఎం. పణిక్కర్ :** అంతా సరిగానే చెప్పారు.

***3046. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** సంస్థానాలు ఒప్పుకున్నట్లయితే, ఆర్మీ బదలీ అంశంగా ఉండదని, బదలీ కాబడదని తదుపరి చర్చాసమయంలో మీరు చెప్తారని నేను అనుకోవచ్చా?

**శ్రీ కె. ఎం. పణిక్కర్ :** బహుశా అనుకోవచ్చు.

## (4)

# సర్ మైఖేల్ ఓ' డయ్యర్

*3356. *డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మేధావులుగా వ్యవహరించబడేవారికి, సాధారణ ప్రజానీకానికి మధ్య చాలా తీవ్రమైన తేడాను మీరు చూపిస్తున్నట్లు మీ సాక్ష్యంలో నేను గమనించాను. నేను మిమ్ములను ఈ ప్రశ్న అడగాలనుకుంటున్నాను; సమాజంలోని ఒక వర్గం నుంచి వచ్చిన మేధావులకు, సమాజంలోని మరొక వర్గం నుంచి వచ్చిన మేధావులకు మధ్య మీరు తేడా చూపిస్తారా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* చూపిస్తాను. వారు వివిధ వర్గాల నుంచి వచ్చిన వారయితే, వారికి విశాల దృక్పథం ఉంటుంది.

*3357. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* భారత దేశంలోని ప్రస్తుత పరిస్థితులలో మేధావివర్గం కేవలం బ్రాహ్మణులను వచ్చినదే కాక, బ్రాహ్మణేతరులు, ముస్లింలు, బడుగువర్గాల నుంచి కూడా వచ్చిన వారితో కూడుకుని ఉన్నదని భావించటం లేదా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో మేధావి వర్గం చాలా మారుతూ ఉంటుంది. పంజాబ్ మినహా, భారతదేశ ఉత్తర భాగంలోని మేధావులు చాలావరకు హిందువులే. వారు హిందువులలోని అగ్రకులాలకు చెందినవారు. విద్యావ్యాప్తి బాగా జరిగిన మద్రాసులో పరిస్థితి వేరుగా ఉంటుంది. పరిస్థితిని అంతటికీ వర్తింపచేయడం చాలా కష్టం.

*3358. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* నేను మీకు చెప్పాలనుకుంటున్న విషయం ఇది : మేధావివర్గం సమాజంలోని ఒకే వర్గం నుంచి వచ్చిన వారు అయినప్పుడు వారికి, సాధారణ ప్రజానీకానికి మధ్య ఉన్నంత తేడా, సమాజంలోని వివిధ వర్గాలనుంచి వచ్చిన మేధావులకు, సాధారణ ప్రజానీకానికి మధ్య కూడా ఉంటుందని మీరు చెప్పరని నేను విశ్వసిస్తున్నాను. అవునా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* అవును. వారి మధ్య అంత తేడా ఉండదు. మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

*3359. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* అందువల్ల, సాధారణ ప్రజానీకం నుంచి వచ్చిన అటువంటి మేధావివర్గాన్ని నమ్మి ఆ సాధారణ ప్రజల బాధ్యత అప్పజెప్పవచ్చా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* అలా చేయవచ్చు. సాధారణ ప్రజల సంక్షేమాన్ని అటువంటి మేధావివర్గం బాగా పట్టించుకోగలదు.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-ఎ, జూన్ 29, 1933. పేజీలు. 406-07.

**3360. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** నేను మిమ్మల్ని మరొక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. సంఘసంస్కరణకు సంబంధించి శాసనాలను చేయటం పట్ల ప్రస్తుత ప్రభుత్వం అయిష్టత కనబరుస్తున్న విషయం నిజంకాదా?

**సర్ మైఖేల్ ఓ' డయ్యర్:** అవును. మతాచారాలలో జోక్యం చేసుకుంటున్నట్లు అనుకోవడానికి లేదా అపోహపడడానికి అవకాశం ఇచ్చే ఏ పనిని చేయడంలోనైనా మొత్తం మీద సంకోచం కన్పిస్తున్నదని నేను అనుకుంటున్నాను.

**3361. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:** భారతీయుల అసమర్థతలో అధికభాగం ఈ సాంఘిక దురాచారాల కారణంగా వచ్చినదేనని మీరు అంగీకరించడం లేదా?

**సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :** అవును. చాలా వరకు ఆ కారణమేనని నేనూ అనుకుంటున్నాను.

**3362. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:** భారతీయుల సామాజిక అసమర్థతకు కారణాలుగా ఉన్న వాటిని శాసనపరమైన సంస్కరణల ద్వారా తొలగించడానికి సంకోచించే ప్రభుత్వం బలహీనమైన ప్రభుత్వం. అవునా?

**సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :** ప్రభుత్వం వెనుకాడుతున్నదని నేను చెప్పను. ప్రజల్లో గణనీయమైన భాగం మద్దతు లభించేవరకు ప్రబుత్వం సంకోచిస్తుంది. ఇదే ప్రాతిపదికన ప్రభుత్వం సర్దే చట్టాన్ని బలపరచిందని నేను భావిస్తున్నాను.

**3363. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** అవును. అయితే, ప్రధానంగా శాసనపరమైన కార్యక్రమంలో ప్రభుత్వ పనితీరు చాలా అధ్వాన్నంగా ఉంది కదూ?

**సర్ మైఖేల్ ఓ' డయ్యర్:** అవును. ఎందుకంటే, భారతదేశం వంటి దేశంలో శాసనాలు ప్రజాభిప్రాయాన్ని దాటి మరీముందుగా వెళ్లలేవు. ప్రభుత్వం మొదటసారి అటువంటి శాసనాన్ని ప్రవేశపెట్టగానే, శ్రీ తిలక్ ఒక్కసారిగా విరుచుకుపడ్డారు. మత విషయాల్లో ప్రభుత్వం జోక్యం చేసుకుంటున్నదని ఆయన విమర్శించారు. దాని ఫలితంగా దక్కన్ ప్రాంతంలో ఆందోళన, ఊచకోత సంభవించాయి.

**3364. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** శ్రీ తిలక్ వంటి ఒక్కవ్యక్తికి ప్రభుత్వం భయపడిందా?

**సర్ మైఖేల్ ఓ ' డయ్యర్:** శ్రీ తిలక్ ఒకరే కాదు. ప్రజలను తన వెంట తీసుకుని వెళ్ళే అమోఘమైన శక్తిసామర్థ్యాలు ఆయనకు ఉన్నాయి.

**3365. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :** శ్రీ తిలక్ అంటే భారతీయులు భయపడరు. అవునా?

**సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :** వారు భయపడతారనే నేను అనుకుంటున్నాను. శ్రీ తిలక్‌ను చాలా కొద్దిమంది మాత్రమే వ్యతిరేకించగలరని నేను భావిస్తున్నాను. లార్డ్ సైడెన్‌హామ్ అటువంటివారిలో ఒకరు.

*3366. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* ప్రస్తుతానికి శాంతి భద్రతల అంశాన్ని బదలీ చేయమని మీరు చెప్పారు. శాంతి భద్రతల అంశాన్ని బదలీ చేయటానికి ముందు మిగిలిన అన్ని అంశాలను బదలీ చేస్తామని, కేంద్రంలో ఎటువంటి మార్పు చేయబోమని చెప్పారు. శాంతి భద్రతల అంశం బదలీ చేయటానికి ముందు ఎంత వ్యవధి ఉండాలని మీరు కోరుకుంటున్నారో ఏమైనా చెప్పగలరా?

*సర్ మైఖేల్ డయ్యర్ :* ఆ విషయాన్ని వదిలివేస్తున్నాను. ముందు మత విద్వేషాలు అంతం కానివ్వండి. విస్తృత అధికారాలు పొందిన మంత్రుల వాటిని భూమి శిస్తు, నీటిపారుదల, తదితర రంగాలలో ఉపయోగించి, మరికొన్ని అధికారాలను కూడా నిర్వహించగల సమర్థత తమకు ఉన్నదని నిరూపించుకున్నప్పుడు, బ్రిటిష్ వ్యతిరేక ఆందోళనలను, కొన్ని రాష్ట్రాల్లో ఉన్న టెర్రరిస్టు ముఠాలను అణచి వేయగలినప్పుడు; ఇతరత్రా పరిస్థితులు కూడా అనుకూలంగా మారినప్పుడు శాంతిభద్రతల అంశం బదలీ జరగడానికి నేను సమ్మతిస్తాను.

*3367. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మీరు ప్రతిపాదిస్తున్న పథకానికి భారత ప్రజల్లో ఏ వర్గమైనా అనుకూలంగా ఉంటుందా అని మిమ్ములను అడగటం జరిగింది. ఆ పథకాన్ని అంగీకరించే వర్గాలు కొన్ని ఉన్నాయని మీరు చెప్పారు. అవునా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* అవును.

*3368. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* ఒక విషయాన్ని మీ ముందు ఉంచాలని అనుకుంటున్నాను. మీ ప్రతిపాదనను అంగీకరించే వర్గం భారతదేశంలో ఒక్కటి కూడా లేదని అనుకోండి. అలా అనుకోవలసిందిగా నేను మిమ్ములను అడగవచ్చునా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* సరే.

*3369. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మీ ప్రతి పాదనను అంగీకరించడానికి భారతదేశంలోని ఒక వర్గం కూడా సిద్ధంగా లేదని మీకు తెలిసిందనుకోండి! అప్పుడు మీ తదుపరి చర్య ఏమిటో చెప్పగలరా? అటువంటి సందర్భంలో పార్లమెంట్‌కు మీరు సమర్పించబోయే సలహా ఏమిటి?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* భారత ప్రజల ప్రయోజనాలకు అత్యంత అనుకూలమైన నేను భావించిన ప్రతిపాదనతో ముందుకెళతాను.

*3370. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మీరు మంచిది అని అనుకున్నది చేయటం, దాన్ని అంగీకరిస్తే, అంగీకరించండి! లేదంటే, లేదు! అని భారతీయులకు చెప్పటం.... ఇదేనా మీ వైఖరి?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* అవును. కాలంపై విశ్వాసం ఉంచి వారు ఈ నిబంధనలను...

*3371. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* వాదనకోసం ఒక విషయాన్ని అనుకుందాం. ఎంతో కాలం వేచిచూసినా భారత దేశంలోని ఏ వర్గమూ మీ ప్రతిపాదనను అంగీకరించలేదని చివరికి మీకు తెలిసిందనుకోండి. అప్పుడు మీరు పార్లమెంట్‌కు సమర్పించబోయే సలహా ఏమిటి?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* కొంతకాలం గడిచేసరికి మీ వైఖరి సహజమైనదని ప్రజలు భావిస్తారని, సముచితమైన వైఖరిని అవలంబిస్తారనే ఆశతో మీకు మంచిదని, ఆచరణాత్మకమైనదని అన్పించిన పథకాన్ని అమలుచేయవలసిందిగా పార్లమెంటుకు సలహా ఇస్తాను.

*3372. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* నా ప్రశ్నను మీరు సరిగా అర్థంచేసుకోనందుకు విచారపడుతున్నాను. నేను అడిగినది చాలా కచ్చితమైన ప్రశ్న. అవునా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* నా జవాబును ఇలా క్లుప్తంగా చెప్తాను. ప్రజలు ఎంతో కాలం పాటు అనుచితమైన ధోరణిని అవలంబిస్తారని నేను అనుకోను.

*3373. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* శ్వేత పత్రంలో ప్రతిపాదించిన పథకం కాని, మీ పథకం కాని స్పృశించరానంత చెడ్డవని వారు భావించారనుకోండి. అప్పుడు?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* చేతనైనంత మంచి పద్ధతులతో బ్రిటిష్ రాజ ప్రభుత్వాన్ని నడపాలి.

**3564. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* గౌరవనీయులైన అధ్యక్షా! సర్ మైఖేల్ ఓ' డయ్యర్ వెళ్లబోయే లోపు నేను ఒక వాస్తవాన్ని చెప్పనా? శ్రీ బట్లర్ అడిగిన ప్రశ్నకు శ్రీ మైఖేల్ సమాధానం చెప్తూ, శాంతి, భద్రతల అంశం బదలీకి సంబంధించి సైమన్ కమిషన్ సిఫార్సు చేసిందని అన్నారు. అది సైమన్ కమిషన్ నివేదిక రెండవ వాల్యూమ్‌లోని 369వ పేరా. "గత కొద్ది నెలలుగా భారతదేశంలో జరిగిన సంఘటనలను ఈ నివేదికలో మేం ఏ రకంగానూ ప్రస్తావించలేదు" అని ఆ పేరాలో ఉంది. మీరు చెప్పినది కూడా ఇదే పేరా గురించి. అవునా?

*సర్ మైఖేల్ ఓ' డయ్యర్ :* అవును. దానిగురించే.

★ ★ ★

*3564ఎ. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:* అయితే, నేను మీకు ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను. భారతదేశంలో జరిగిన సంఘటనలుగా ఇంతకుముందు ఇక్కడ చెప్పిన సంఘటనలను మనలో చాలా మంది గాంధీ చేపట్టిన సహాయ నిరాకరణ ఉద్యమానికి సంబంధించిన సంఘటనలుగా అర్థం చేసుకున్నాంగాని, కాన్పూర్ వంటి చోట్ల జరిగిన మత ఘర్షణలుగా అర్థంచేసుకోలేదని కచ్చితంగా చెప్పగలను.

*వైకౌంట్ బర్నామ్ :* అవి మత ఘర్షణలను ఉద్దేశిస్తున్నాయని నేను చెప్పాను. వాటిని నేను అర్థంచేసుకున్నదేమిటంటే, పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని కాని, దాని ఫలితంగా వచ్చిన మత ఘర్షణలను కాని అవి ఉద్దేశించటం లేదని.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ . II-ఎ, జూన్ 29, 1933. పేజీ 424.ం

## (5)

## శ్రీ యఫ్. ఇ. జేమ్స్, శ్రీ డబ్ల్యు. డబ్ల్యు.కె. పేజ్, శ్రీ టి.గోవిన్–జోన్స్, శ్రీ జి.ఇ.కఫ్, శ్రీ ఎల్.ఎ.రాఫీ, సర్ విలియం మెక్ కెర్చర్, శ్రీ ఎఫ్. డబ్ల్యు. హోకెన్‌హల్.

*3882. *డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* కేవలం ఒకటి రెండు ప్రశ్నలు మాత్రం అడుగుతాను. మొదటగా శ్రీ జేమ్స్‌ను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. లార్డ్ ఇర్విన్ వైస్రాయిగా ఉన్న కాలంలో 1929, అక్టోబర్ 29వ తేదీన ఆయన జారీచేసిన ప్రకటనను మీ సంఘం అంగీకరిస్తుందా? భారత రాజకీయ రాజ్యాంగ సహజమైన అభివృద్ధి డొమినియన్ ప్రతిపత్తి అని అప్పుడు అధికారంలో ఉన్న ఆయన ప్రభుత్వం భావిస్తున్నట్లు ఆ ప్రకటనలో పేర్కొన్నారు. ఆ ప్రకటనను మీ సంఘం అంగీకరిస్తుందా?

**శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :** లార్డ్ ఇర్విన్ చేసిన ఆ ప్రకటన శ్వేత పత్రంలో ఉన్నదని నేను అనుకోవటం లేదు.

*3883. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* లేదా? అందులో లేదా?

**శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :** అంతేకాదు. శ్వేత పత్రంలోని ప్రతిపాదనతోనే నా విజ్ఞాపన పత్రానికి సంబంధం ఉన్నది. వైస్రాయి ఆ ప్రకటన జారీ చేసినప్పుడు మా సంఘం బహిరంగంగా ఒక ప్రకటన చేసిందని నాకు గుర్తుంది. ఈ ప్రకటన వార్తా పత్రికల్లో వచ్చింది. వార్తాపత్రికల ఫైళ్లు చూస్తే అది కన్పిస్తుంది.

*3884. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* మీ సంఘం చేసిన ప్రకటన సారాంశం చెప్పగలరా?

**శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :** ఇప్పటికిప్పుడు ఆ విషయం చెప్పగలిగేంత జ్ఞాపకశక్తి నాకు ఉన్నదని నేను అనుకోను.

*3885. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :* నేను చెప్పదలచుకున్న విషయాన్ని మరో విధంగా చెప్తాను. శ్వేత పత్రంలోని ప్రతిపాదనలను భారతరాజ్యాంగం రూపొందవలసిన తుదిరూపంగా మీరు అంగీకరిస్తున్నారా? లేక వాటిని మరికొంత అభివృద్ధిచేయటానికి అవకాశం ఉన్నదని భావిస్తున్నారా?

**శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్:** ఆ ప్రశ్నకు జవాబు విజ్ఞాపన పత్రంలోని మొదటిపేరాలోఉంటుందనుకుంటున్నాను.

**3886. డా॥ బి.ఆర్.అంబేద్కర్ :** అందులో ఉందా?

**శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :** అవును. అందులో ఇలా ఉన్నదని అనుకుంటున్నాను :

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ II-ఎ, జులై 4, 1933, పేజీలు. 476–77.

"శ్వేత పత్రం ప్రతిపాదించిన విషయాలు మొత్తం మీద సంతృప్తికరంగా ఉన్నాయని, భారత దేశ భవిష్యత్తు రాజ్యాంగ రూపకల్పనకు శ్వేత పత్రం సరైన ప్రాతిపదికగా ఉంటుందని మేం భావిస్తున్నాం?

***3887. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** నేను అడిగినదివేరే ప్రశ్న. భారత రాజకీయ రాజ్యాంగానికి ఈ ప్రతిపాదనలు తుదిరూపంగా ఉండగలవని మీరు భావిస్తున్నారా? అనేది నా ప్రశ్న.

విజ్ఞాపన పత్రం మొదటి పేరాలోని మూడవ ఉపపేరాను మీ దృష్టికి తీసుకుని రమ్మంటారా? అందులో మీకు ఈ వాక్యాలు కన్పిస్తాయి. "జాయింట్ సెలక్ట్ కమిటీ నివేదికను ప్రచురించినప్పుడు, ఆ నివేదిక ఆధారంగా భారతదేశ భవిష్యత్తు ప్రభుత్వంపై బిల్లును పార్లమెంట్‌కు సమర్పించి నప్పుడు రాజ్యాంగ పథకం పట్ల అనుసరించవలసిన తుదివైఖరి నిర్ణయించుకునే హక్కు సంఘానికి ఉన్నదని మండలి స్పష్టం చేస్తున్నది."

***3888. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** నా ప్రశ్నకు అది సమాధానం కాదని చెప్తున్నందుకు నన్ను మరొకసారి క్షమించండి. నేను అడిగిన ప్రశ్న మరొకటి. నా ప్రశ్న ఇది : శ్వేత పత్రంలో పేర్కొన్న ప్రతిపాదనలకు మించి భారతదేశ రాజకీయ స్థాయిని అభవృద్ధిపరచడానికి ఏమైనా అవకాశం ఉన్నదని మీరు భావిస్తున్నారా? నా భావాన్ని సరిగా వ్యక్తీకరించానా?

***శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :*** సరిగానే వ్యక్తీకరించారు. భవిష్యత్తులో మార్పులు లేదా సవరణలు చేయడానికి శ్వేతపత్రం వీలుకల్పిస్తున్నది.

***3889. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** నేను "అభివృద్ధిచేయడానికి" అనే పదాలు వాడాను.

***శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :*** మీరు దాన్ని "అభివృద్ధిచేయడం" అని వ్యవహరిస్తే, అలాగే,

***3890. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** నేను ఆ విషయాన్ని ఇక పొడిగించవద్దా?

***శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :*** కాని, మనం ఇప్పుడు శ్వేత పత్రంలోని ప్రతిపాదనలపై మాట్లాడుతున్నాం.

***3891. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ :*** ఆంగ్లేయుల జాతీయతకు సంబంధించి చట్టం చేసే అధికారం భారతీయ శాసనసభలకు ఉండరాదని 52వ పేరాలో మీరు ప్రతిపాదించారు. ఆ విషయాన్ని నేను బాగా అర్థం చేసుకున్నాను. అంతేకాక, దేనిని భారత జాతీయతగా పిలువవచ్చునో నిర్ధారించే అధికారం కూడా భారతీయ శాసనసభలకు ఉండరాదని మీరు పేర్కొన్నారు. మీరు పేర్కొన్న విషయాలను నేను అర్థం చేసుకున్నాను. నేను తెలుసుకోవాలనుకుంటున్న విషయం ఇది. ఏదైనా ఒక ప్రయోజనం కోసమో, మరి దేనికోసమో ఒకరికి భారతజాతీయత ప్రతిపత్తిని కల్పించనీయకుండా భారతీయ శాసనసభలను పూర్తిగా నిరోధించాలని మీరు ఆ ప్రతిపాదన ద్వారా ఉద్దేశించారు కదూ?

***శ్రీ ఎఫ్.ఇ.జేమ్స్ :*** లేదు. ఆ పేరా పూర్తిగా స్పష్టంగా ఉన్నదని భావిస్తున్నాను. ఆ విధంగా శాసనాలు చేయాలని భారతదేశం కోరుకుంటున్నట్లయితే, భారతదేశంలోని యూరోపియన్ బ్రిటిష్ ప్రజలను మినహాయించి అలా చేసేందుకు భారతదేశాన్ని అనుమతించరాదని మాత్రమే మేం పేర్కొన్నాం.

***3992. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్:*** ఆవిషయాన్ని నేను ఈ విధంగా చెప్తాను. ఉదాహరణకు, కెనడా చట్టం ఆవిర్భావానికి దారితీసినటువంటి సందర్భం ఉత్పన్నమైనదనుకోండి. ఏదైనా అంతర్జాతీయ ట్రిబ్యునల్‌లో భారతీయ ప్రాతినిధ్యం ఉండవలసిన అవసరం ఏర్పడిందనుకోండి. ఇండియన్ బ్రిటిష్ ప్రజలకు కాని, భారతీయ ప్రజలకు కాని ఆ ప్రాతినిధ్యాన్ని కేటాయించాలని భారతదేశం కోరుకున్నదనుకోండి. అలాంటి పరిస్థితిలో అటువంటి హోదాకు అవకాశం కల్పిస్తూ కెనడా చట్టం వంటి లేదా దక్షిణాఫ్రికా చట్టంవంటి చట్టాన్ని చేయడానికి శాసనసభలను మీరు అనుమతించరా?

***శ్రీ ఎఫ్.ఇ. జేమ్స్:*** ఆ ప్రశ్నకు మా పేరాలోని ఆఖరి వాక్యమే నిజంగా ఒక సమాధానం. బహుశా శ్రీ పేజ్ ఈ విషయాన్ని వివరంగా విపులీకరిస్తారు.

***శ్రీ పేజ్:*** అయ్యా! అందులో ఏదో నిగూఢార్థం ఉన్నదని మీరు అనవసరంగా ఆందోళన చెందనక్కర్లేదని నేను భావిస్తున్నాను. ఆ పేరాను సంబంధించి మా మొత్తం లక్ష్యం ఏమిటంటే, భారతీయ పౌరసత్వ కల్పనవల్ల బ్రిటిష్‌పై రునిగా బ్రిటిష్ జాతీయులకు ఉన్న హక్కులకు ఆటంకం కలగకూడదని మాత్రమే. మేం నిజంగా చెప్పాలనుకుంటున్నది ఏమిటంటే..., భారతదేశంలో తాత్కాలికంగా కాని, మరొకరకంగా కాని నివసిస్తున్న బ్రిటిష్ జాతీయులందరికీ భారతీయ ప్రజలకు ఉన్న హక్కులన్నిటినీ కల్పించాలని మేం కోరుకుంటున్నామని. ఈ హక్కులను పరిమితం చేయటానికి లేదా తొలగించడానికి ఉద్దేశించిన చట్టాలను కాని, నిబంధనలను కాని ఆమోదించనీయకుండా నిరోధించాలని కూడా మేం కోరుకుంటున్నాం. ఆ పేరాలో ఉన్న మొత్తం లక్ష్యం అదే. భారతీయ పౌరసత్వకల్పన పట్ల మాకు ఎంతమాత్రం అభ్యంతరం లేదు.

***డా। బి.ఆర్. అంబేద్కర్:*** గౌరవనీయులైన అధ్యక్షా! శ్రీ గవిన్ చేసిన సూచనలపై ఆయనకు కూడా అటువంటి ప్రశ్న వేయటానికి అవకాశం ఉందా? ఒకవేళలేనట్లయితే, నేను ఆ విషయాన్ని పొడిగించకూడదా?

**అధ్యక్షుడు:** ఈ దశలో విషయప్రస్తావనకు తీసుకునే సమయాన్ని సమర్థించుకోవడానికి తగినంత ముఖ్యమైన విషయం అది కాదనందువల్లనే డాక్టర్ అంబేద్కర్ బహుశా వ్యక్తిగత అభిప్రాయం కోరారు.

## (6)

## సర్‌జాన్ పెరొనెట్ థాంప్సన్, సర్ అల్‌ఫ్రెడ్ వాట్సన్, శ్రీ ఎడ్వర్డ్ విలియర్స్

***4659. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్:*** కేవలం ఒకే ఒక ప్రశ్న సర్ జాన్ థాంప్సన్! రాష్ట్రాల ఆర్థిక పరిస్థితిని పరిరక్షించేందుకు కొన్ని ఏర్పాట్లు చేయడానికి సంబంధించిన విషయాన్ని నిన్న మీరు

[1] మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ 2-ఎ, జూలై 6, 1933, పేజీ 540.

ప్రస్తావించారు. రాష్ట్రాల ఆదాయంలో అధిక భాగాన్ని సమకూర్చే నీటి పన్నును ప్రస్తుత పరిస్థితుల్లో కార్యనిర్వాహక ఉత్తర్వుల ద్వారా మార్చే అవకాశం ఉన్నదని కూడా పేర్కొన్నారు. మీరు నిన్న చెప్పినది ఇదేనని భావిస్తున్నాను. అవునా?

***సర్ జాన్ పి. థాంప్సన్ :*** అవును.

***4660 డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ :*** కేవలం కార్యనిర్వాహక ఉత్తర్వుల ద్వారా పన్నులను ఈ విధంగా పెంచడానికి వ్యతిరేకంగా భారతీయులు చాలాకాలంగా ఆందోళనలు చేస్తున్నది వాస్తవం కాదా? భూమి శిస్తును కూడా కార్య నిర్వాహక ఉత్తర్వుల ద్వారానే పెంచుతున్నారు. ఇప్పటి నుంచి పన్నులను కార్య నిర్వాహక ఉత్తర్వుల ద్వారా ఎంతమాత్రం పెంచరాదని, శాసనాల ద్వారానే పెంచాలని ప్రజలు ఆందోళనలు చేయడం నిజం కాదా?

***సర్ జాన్ పి. థాంప్సన్ :*** భూమిశిస్తుకు సంబంధించి ఆ మేరకు ఆందోళన జరిగిన మాట నిజమే. అయితే, నీటిపన్నుకు సంబంధించి కూడా ఆందోళన జరిగిందనే విషయాన్ని నేను కచ్చితంగా చెప్పలేను.

***సర్ తేజ్ బహదూర్ సప్రు :*** ఒక వాస్తవాన్ని నేను చెప్పనా? భూమిశిస్తును కార్య నిర్వాహక ఉత్తర్వుల ద్వారా పెంచలేదు తెలుసో? బహుశ ఆయన అనుకుంటున్నది భూమి శిస్తు ఒప్పందాలు కార్య నిర్వాహక ఉత్తర్వుల ద్వారా వచ్చాయనా?

***సర్ జాన్ పి. థాంప్సన్ :*** అవును.

***డా। అంబేద్కర్ :*** అవును. కార్య నిర్వాహక ఉత్తర్వుల ద్వారా పెంచుతున్న ఈ ఆదాయాలను ఇంక ఎతమ్మాత్ర అలా చేయరాదని, శాసనాల ద్వారా మాత్రమే పెచాలని ఒక సిఫార్సు చేయడం జరిగింది. అవునా?

***సర్ జాన్ పి. థాంప్సన్ :*** ఆ సంగతి నాకు తెలియదు.

***డా। అంబేద్కర్ :*** అది అమలులోకి రాలేదు.

## (7)

## సర్ చార్లెస్ ఇన్స్

****డా। అంబేద్కర్ :*** సర్ చార్లెస్! రెండవ సభకు మీరు గణనీయమైన ప్రాధాన్యం ఇచ్చారు కదూ?

***సర్ చార్లెస్ ఇన్స్ :*** అవును.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ 2-ఎ, జూలై 6, 1933, పేజీ 573-74

**డా॥ అంబేద్కర్ :** ప్రత్యేక అధికారాలను ఎప్పుడూ ఉపయోగించవలసిన అవసరాన్ని రెండవ సభ తగ్గిస్తుందని అందుకు మీరు కారణం చెప్పారు. అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** లేదు. అటువంటి అవసరాన్ని అది తగ్గిస్తుందని నేను చెప్పినట్లు నాకు గుర్తులేదు. ప్రత్యేక అధికారాలను అది మరింత పెంచుతుందని నేను చెప్పాను. ప్రత్యేక అధికారాలను ఉపయోగించడాన్ని ఎవరూ కోరుకోవటం లేదు. రెండవ సభ ఉండడం వల్ల ప్రత్యేక అధికారాలను ఉపయోగించే అవసరం రాదని, ఒకవేళ వచ్చినా చాలా అరుదుగా మాత్రమే వస్తుందని నేను ఆశించాను.

**డా॥ అంబేద్కర్ :** ప్రత్యేక అధికారాలకు బదులుగా రెండవ సభ ఉండగలదని మీ ఉద్దేశమా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** కాదు.

**డా॥ అంబేద్కర్ :** నేను మిమ్మల్ని అడగాలనుకుంటున్న రెండవ ప్రశ్న ఇది : ఈ ప్రత్యేక బాధ్యతలలో అసాధారణమైనది ఏదీ లేదని, కొన్ని డొమినియన్ల రాజ్యాంగాలలో అవి మీకు కన్పించాయని ఈ ఉదయం మీరు చెప్పినట్లున్నారు. అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** రక్షణలలో కొత్త విషయం ఏమీ లేదని చెప్పాను. ఇవే నేను అన్న మాటలని కచ్చితంగా అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఈ విషయం మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను. డొమినియన్ల రాజ్యాంగాలలో ఎటువంటి రక్షణలు ఉన్నాయో వాటికీ, శ్వేతపత్రంలోని విషయాలకు మధ్య తేడా ఏమీలేదా? ఈ ప్రశ్నను క్లుప్తంగా చెప్పలేనందుకు విచారపడుతున్నాను. ఎందుకంటే, ఈ ప్రశ్న అడిగేముందు దాన్ని నేను ఎలా అర్థం చేసుకున్నానో చెప్పవలసి ఉంది. బాధ్యతాయుత ప్రభుత్వంలో మంత్రివర్గం సలహాలకు గవర్నర్ పూర్తిగా కట్టుబడి ఉండవలసిందేనని ఎవరూ అనుకోరని నేను భావిస్తున్నాను. (కనీసం, నేను ఆ విధంగా అనుకోను). ఆ సలహాలను పాటించనక్కర్లేదని ఆయన అనుకుంటే, ఆయన వాటిని తిరస్కరించవచ్చు. అయితే, తన వైఖరిని సమర్థిస్తుందనుకునే మరో మంత్రివర్గాన్ని ఆయన ఏర్పాటు చేయవచ్చు. ఆ మంత్రివర్గం కూడా ఆయన వైఖరిని అవలంబించకపోతే, ఆయన శాసనమండలిని రద్దు చేసి, నూతన శాసనసభకు ఎన్నికలు జరిపించవచ్చు. అప్పుడు నూతన శాసనసభ నుంచి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయలేనని గ్రహించినప్పుడు ఆయన తలవంచాలి. అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** అవును. ఆ విధంగా చేయకపోవడమే ముఖ్యమని ఆయన అనుకోకపోతే మాత్రం సాధారణంగా జరిగేది అదే.

**డా॥ అంబేద్కర్ :** శ్వేతపత్రంలోని ప్రతిపాదనల్లో కీలకమైన ఈ తేడా లేదూ? శ్వేతపత్రం ప్రతిపాదనల ప్రకారం ఏ మంత్రివర్గాన్ని అయినా, ప్రతి మంత్రివర్గాన్ని అయినా తోసిపుచ్చే హోదా గవర్నర్‌కు ఉంటుంది. అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** ఆయన తన ప్రత్యేక బాధ్యతను నిర్వహిస్తున్నప్పుడు మాత్రమే.

***డా|| అంబేద్కర్ :*** ఎప్పుడూ ఏ మంత్రివర్గం సలహాకు ఆయన కట్టుబడి ఉండరు. అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** సముచితమైన సహకార స్ఫూర్తితో భారతీయులు రాజ్యాంగాన్ని రూపొందించ బోతున్నారని మావైపు మేం అనుకుంటున్నట్లే, ఆశించిన ధోరణిలోనే రాజ్యాంగాన్ని రూపొందించడానికి గవర్నర్ తన శాయశక్తులా ప్రయత్నిస్తారని మీవైపు మీరు కూడా అనుకోవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను.

***డా|| అంబేద్కర్ :*** అవునా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** ఈ అధికారాలను చెలాయించడానికే గవర్నర్ ప్రయత్నిస్తారని మీరు ఎందుకు అనుకోవాలో నాకు అర్థం కావటంలేదు. సాధ్యమైనంతవరకు వాటిని చెలాయించకుండా ఉండడానికే ప్రతి గవర్నర్ ప్రయత్నిస్తారని నేను అనుకుంటున్నాను.

***డా|| అంబేద్కర్ :*** ఆ రెండు పరిస్థితుల మధ్య నాకు కన్పించిన తేడాను చూపించడానికి నేను ప్రయత్నిస్తున్నాను. తాను విభేదించే మంత్రివర్గాన్ని తోసిపుచ్చే అధికారాన్ని ప్రత్యేక అధికారాలు గవర్నర్‌కు ఇవ్వవు.

**సర్ చార్లెస్ ఇన్స్ :** మీరు తేల్చి చెప్తున్నది ఏమిటో నాకు నిజంగా అర్థం కావటంలేదు.

***డా|| అంబేద్కర్ :*** నేను మీకు చెప్పాలనుకుంటున్నది ఇది : ఏ మంత్రివర్గం ఇచ్చిన సలహాను తాను అంగీకరించరో ఆ మంత్రివర్గాన్ని తోసి పుచ్చడానికి గవర్నర్‌కు ప్రత్యేక అధికారాలను ఇవ్వటంలేదు. ఏ మంత్రివర్గాన్ని అయినా ఆయన తోసిపుచ్చేందుకే ఈ అధికారాలను ఆయనకు ఇవ్వాలా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** సరిగ్గా అంతే. ఎందుకంటే, ఆయన కొన్ని ప్రత్యేక బాధ్యతలను నెరవేర్చవలసి ఉంది. ఒక మంత్రివర్గాన్ని తోసి పుచ్చడమా, లేదా అనే విషయానికి సంబంధించిన ప్రశ్న కాదు ఇది. ప్రత్యేక బాధ్యతను ఆయన పరిరక్షించవలసి ఉన్నదా, లేదా అనే విషయానికి సంబంధించిన ప్రశ్న ఇది.

***డా|| అంబేద్కర్ :*** రక్షణల మధ్య ఉన్న ప్రధానమైన తేడా అదే కదా?

**సర్ చార్లెస్ ఇన్స్ :** నేను చెప్పినది కూడా కచ్చితంగా అదే. కొన్ని వారసత్వ పరిస్థితుల కారణంగా భారతదేశంలో రక్షణలు మరింత స్పష్టంగా, మరింత వివరంగా ఉండవలసిన అవసరం ఉన్నది. ఉదాహరణకు మత సమస్య వల్ల రక్షణలు అవసరమవుతాయి.

***డా|| అంబేద్కర్ :*** వాటి వెనుక ఏవైనా కారణాలు ఉన్నాయా. అని నేను అడగటంలేదు. ఏదైనా తేడా ఉన్నదా అని అడుగుతున్నాను.

**సర్ చార్లెస్ ఇన్స్ :** ఉంది.

(8)

# సర్ ఎడ్వర్డ్ బెంథాల్, సర్ థామస్ కాటో, శ్రీ జి.ఎల్. వింటర్ బోథమ్ - భారత వాణిజ్య మండలుల సమాఖ్య తరఫున

*డా॥ అంబేద్కర్:* సర్ ఎడ్వర్డ్! మీరు చేసిన ప్రకటనలో ఫెడరల్ ఆర్థిక విషయాలపై ఉన్న భాగానికి సంబంధించి మొదట మిమ్మలను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. నేను స్పష్టంగా చెపున్నానో, లేదో నాకు అర్థం కావటంలేదు. భారతదేశంలో ఏకీకృత పన్నుల విధానానికి మీరు అధిక ప్రాధాన్యం ఇస్తున్నారని నేను అనుకుంటున్నాను. అవునా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** కేంద్రం, రాష్ట్రాలకు ఉన్న అన్ని ఆదాయవనరులను కేంద్రం వద్ద ఉంచాలని, వాటికి కేంద్రం పంపకం చేయాలని మీరు సూచన చేశారు. అవునా, కాదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** మేం ఆ సలహా ఇస్తామా?

**డా॥ అంబేద్కర్:** ఏకీకృత పన్నుల విధానం ఉండడానికి గాను ఏదేమైనా సరే అన్ని ప్రధాన పన్నులను కేంద్రమే విధించాలని మీరు కోరుకుంటున్నారు కదూ?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్:** ఆ విషయం చెప్పేంతవరకు మేం వెళ్లలేదు. ఏకీకృత పన్నుల విధానాన్ని మేం కోరుకుంటున్నాం. అయితే, అన్ని పన్నులను కేంద్రమే విధించాలని చెప్పేంతవరకు మేం వెళ్లలేదు.

**డా॥ అంబేద్కర్:** మొత్తం భారతదేశంలో పన్నులు విధించే ఏకవ్యవస్థ లేనప్పుడు ఏకీకృత పన్నుల విధానం ఎలా ఉంటుంది?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** కొన్ని సమన్వయ పద్ధతులను రూపొందించుకోవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** ఉదాహరణకు, ఏదైనా రాష్ట్రం తన సొంత అవసరాలకోసం ఆదాయం పన్నుపై సర్‌చార్జి విధించవచ్చుననే సూత్రాన్ని మనం అంగీకరించామనుకోండి. అప్పుడు ఏకీకృత పన్నుల విధానం అనే సూత్రానికి వ్యతిరేకమవుతుందా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** అవును, అటువంటి విషయాన్ని మేం పూర్తిగా వ్యతిరేకిస్తున్నాం.

**డా॥ అంబేద్కర్ :** అంటే, చివరి స్థాయిలో విధించే పన్నులను మీరు వ్యతిరేకిస్తున్నారా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్:** సూత్రపరంగా వాటిని మేం వ్యతిరేకిస్తున్నాం. అంతర్ రాష్ట్ర కస్టమ్స్ సుంకాలకు, అంతర్ రాష్ట్ర ఆటంకాలకు దారితీసే ఏ పన్నులకైనా సమాఖ్య అంగీకారం కావలసి ఉంటుందని మేం

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ II-ఎ, జూలై 13, 1933, పుటలు 640-42.

సూచించాం. మా సాక్ష్యం ఉద్దేశం అదే.

***డా॥ అంబేద్కర్ :*** అంటే ఆ సూచన అసలు అర్థం పన్నుల వనరులను వేరు చేయడమే అవుతుంది. రాష్ట్రాలు పన్ను విధించలేవు. ఒకవేళ విధించదలచుకున్నా కేంద్రం నుంచి ముందుగా అనుమతి తీసుకొని మాత్రమే విధించవలసి ఉంటుంది అవునా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** ఏదైనా సమన్వయ పథకాన్ని రూపొందించడానికి మూడవ పద్ధతి ఉంటుందని అనుకుంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** నాకు తెలియదు. ఈ సమన్వయాన్ని సాధించగలిగే పద్ధతి ఏదైనా మీరు చెప్తారా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** ప్రస్తుతం వాటికి సంబంధించిన నిబంధనలు ఉన్నాయని నేను అనుకుంటున్నాను. అయితే, నిబంధనలను రూపొందించే కేంద్రీకృత ప్రభుత్వం గురించి మనం ఇప్పుడు మాట్లాడుకుంటున్నాం.

***డా॥ అంబేద్కర్ :*** మనం ఆలోచిస్తున్న రాష్ట్రాల స్వయం ప్రతిపత్తి దృక్కోణం నుంచి, మనం రాష్ట్రాలలో ప్రవేశపెట్టాలనుకుంటున్న బాధ్యతాయుత ప్రభుత్వాల దృక్కోణం నుంచి ఈ విషయాన్ని పరిశీలించాలనుకుంటున్నామా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఇప్పుడు నేను ఈ విషయం చెప్పాలనుకుంటున్నాను. రాష్ట్రాలకు తమ సొంత పన్నుల విధానాన్ని రూపొందించుకునే స్వేచ్ఛ లేనప్పుడు, ప్రతిసారీ కేంద్రం వద్దకు అవి వెళ్లవలసి వస్తున్నప్పుడు రాష్ట్రాల స్వయం ప్రతిపత్తి దృక్కోణం నుచి ఈ స్వయం ప్రతిపత్తిని ఆచరణలోకి తీసుకుని రావటం చాలా కష్టమవుతుంది. నిజమేనా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** రాష్ట్రాలు ప్రతిసారీ కేంద్రం వద్దకు వెళ్లనవసరంలేదు. అయితే, భారతీయ వాణిజ్యాభివృద్ధి స్థంభించిపోవడానికి దారితీసే కొన్ని పన్నుల విషయంలో మాత్రం వెళ్లవలసి ఉంటుంది. ఈ అంశాలను చెప్పడంలో మా ఉద్దేశం ఎటువంటి నిబంధనలను విధించడం కాదని, వాటిని జాయింట్ సెలక్ట్ కమిటీ దృష్టికి తీసుకుని రావటమేనని చెప్తున్నాను. అప్పుడు ఈ అంశాలను సెలక్ట్ కమిటీ పరిగణనలోకి తీసుకోగలదు.

***డా॥ అంబేద్కర్ :*** కేంద్రం, రాష్ట్రాల మధ్య సంబంధాల విషయంలో ఏ ఆర్థిక విధానాలను రూపొందించడంలోనయినా మీరు గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే, రాష్ట్రాల స్వయం ప్రతిపత్తికి, రాష్ట్రాలలో బాధ్యతాయుతమైన ప్రభుత్వాలకు ఆ విధానాలు విరుద్ధంగా ఉండనక్కరలేదని గుర్తించడం అవసరం. అవునా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అవును, అవసరానికి మించి ఎక్కువ ఉమ్మడి అధికారాలు ఉండకూడదని,

అందుకు మేం అంగీకరిస్తున్నామని ఇదివరకటి ప్రశ్నకు జవాబుగా నేను చెప్పాను. వాణిజ్య దృక్కోణం నుంచి అంశాలు, పన్నుల పంపకం సాధ్యమైనంత స్పష్టంగా ఉండాలి. ఈ ఏర్పాట్లు అంతర్ రాష్ట్ర కస్టమ్స్ అవరోధాలకు ఏ విధంగా దారితీస్తాయో చెప్పాలనుకుంటున్నాము.

***డా॥ అంబేద్కర్ :*** మూడవ పేరాలో పేర్కొన్న రిజర్వు బ్యాంక్ గురికి ఇప్పుడు మిమ్మలను ఒక ప్రశ్న అడగాలని అనుకుంటున్నాను. రాజకీయ జోక్యానికి బ్యాంక్ దూరంగా ఉండవలసి ఉన్నదని మీరు భావిస్తున్నారా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** సంక్షోభ సమయాలలో బ్యాంక్‌కు రాజకీయ సహాయం అవసరమని మీరు అంగీకరిస్తారని అనుకుంటున్నాను.

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అవసరం కావచ్చు.

***డా॥ అంబేద్కర్ :*** సంక్షోభ సమయంలో చెల్లింపుల నిలిపివేతను ప్రకటించడం ద్వారా ప్రభుత్వం బ్యాంక్‌కు సహాయం చేయవలసిన అవసరం ఏర్పడవచ్చు.

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అవును, ఆర్థిక సక్షోభ సమయాలలో ప్రభుత్వ జోక్యానికి అన్ని రిజర్వు బ్యాంకుల నిబంధనావళులు అవకాశం ఇవ్వటం మామూలేనని నేను భావిస్తున్నాను. రిజర్వు బ్యాంక్‌లో అటువంటి పరిస్థితికి నేను అభ్యంతరం చెప్పను.

***డా॥ అంబేద్కర్ :*** సంక్షోభ సమయాలలో చెల్లింపుల నిలిపివేతను ప్రకటించడం ద్వారాకాని, బ్యాంకు నిల్వలు పెంచి కార్యకలాపాలు సక్రమంగా నడిచేలా చేసేందుకు ధన సహాయాన్ని చేయడం ద్వారాగాని బ్యాంక్‌కు ప్రభుత్వం సహాయం చేసేటట్లయితే, బ్యాంక్‌పై దాని కార్యకలాపాలపై ప్రభుత్వానికి కొంత పట్టు ఉండడానికి మీరు మరి అంగీకరిస్తారా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** ప్రభుత్వం ఏదో ఒక రూపంలో బ్యాంక్‌కు కొంతమంది అధికారులను, కొంతమంది డైరెక్టర్లను నియమిస్తుంది. అయితే, డైరెక్టర్లలో అధిక సంఖ్యాకులను ప్రభుత్వం నియమించకూడదు.

***డా॥ అంబేద్కర్ :*** నేను ఈ విషయం స్పష్టం చేయాలనుకుంటున్నాను. రాజకీయ మధ్యవర్తిత్వం, జోక్యం, ప్రాబల్యం... ఈ మూడింటి మధ్య తేడా ఉన్నదని నేను చెప్తున్నాను. వాటిలో ప్రభుత్వానికి ఏది ఉంటే మీరు అనుమతిస్తారు? ప్రభుత్వానికి వాటిలో ఏది ఉండరాదని మీరు అనుకుంటున్నారు?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** దానిని నిర్వచించడం అంటే, రిజర్వు బ్యాంకు నిబంధనావళిని రూపొందించటమే.

***డా॥ అంబేద్కర్ :*** నేను ఇక ఆ విషయాన్ని పొడిగించను. డైరెక్టర్లకు సంబంధించి రాజకీయ జోక్యాన్ని దూరంగా ఉంచడానికి ఎటువంటి ఏర్పాటు చేయాలని మీరు భావిస్తారు? ఉదాహరణకు, భారతదేశంలోకి

ఏదైనా రాజకీయ పార్టీకి చెందిన వ్యక్తికి డైరెక్టర్ అయ్యే అర్హత లేదని మీరు చెప్తారా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** లేదు. అసలు చెప్పాలంటే, భాగస్వాముల బ్యాంక్ కావాలని అంటాను. డైరెక్టర్లలో అధిక సంఖ్యాకులను భాగస్వాములే నియమిస్తారు.

**డా॥ అంబేద్కర్ :** వారు రాజకీయ నాయకులై ఉండవచ్చు కదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** శాసనసభలలో కూర్చుని ఉండే రాజకీయ నాయకులు కాదు.

**డా॥ అంబేద్కర్ :** కాని వారు పార్టీ నిధులకు చాలా చురుకుగా చేయూత ఇస్తుంటారు కదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** వారు చురుకుగా పార్టీ రాజకీయాలకు మద్దతు ఇస్తున్నట్లయితే, దేశ ఆర్థిక విశ్వాసాన్ని వారు పొందలేరు.

**డా॥ అంబేద్కర్ :** కాని, అటువంటి వ్యక్తులను డైరెక్టర్ల పదవిలో నియామకానికి అనర్హులుగా ప్రకటించడం ఉండదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్:** ఒకేసారి ఈ రెండు కార్యకలాపాలను నిర్వహించడానికి వారు ప్రయత్నిస్తే వారు చాలా మూర్ఖులని అనుకోవలసి వస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** శ్వేతపత్రంలోని 122 పేరాపై మీరు చేసిన వ్యాఖ్యలకు సంబంధించి ఇప్పుడు ఒక ప్రశ్న వేస్తాను. 122వ ప్రతిపాదనలో చేర్చడానికి మీ విజ్ఞాపన పత్రంలోని 5వ పేరాలో మీరు కొన్ని సూచనలు చేశారు కదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఆ పేరాలోని ఆఖరి నాలుగైదు పంక్తులను మాత్రం చదవాలనుకుంటున్నాను. "ఏదైనా ప్రాంతంలోని వ్యవసాయ భూమిని, 'ఆ ప్రాంతంలోని వ్యవసాయంతో సంబంధం ఉన్న లేదా చేయిస్తున్న వర్గం'గా గుర్తింపు పొందని వర్గానికి చెందిన ఏ వ్యక్తికైనా, అమ్మడాన్ని లేదా తాకట్టు పెట్టడాన్ని, పూర్తిగా లేదా కొన్ని మినహాయింపులతో నిషేధిస్తుందన్న కారణంపై ఏ చట్టాన్నీ వివక్షాపూరితమైనదిగా భావించరాదు." నేను చెప్పాలనుకుంటున్నది ఏమిటంటే, "కులం, జాతి, మత భేదాలు లేకుండా", అనే పదాలను ఆ పంక్తుల చివరలో చేర్చకపోతే, కులం, జాతి, లేదా మతంపై ఆధారపడి ఏర్పడిన వర్గానికి చెందిన వ్యక్తుల మధ్య వివక్ష చూపించడానికి అవకాశం ఉంటుంది. వ్యవసాయవర్గం ఉందనుకోండి. ఆ వర్గం వ్యక్తుల మధ్య కులం, జాతి, లేదా మతం వంటి భేదాలు ఉండవచ్చు కదా?

**సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :** అవును. ఆ విషయాన్ని న్యాయవాదులు పరిగణనలోకి తీసుకుంటే బాగుంటుందని అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** "ఈ ప్రతిపాదన సమర్థవంతంగా ఉండాలంటే, బ్రిటిష్ ఇండియాలో 'దేశంలోపల

నివాసం' స్థిరనివాసం, అనే పదాలు చేర్చటం అవసరం అవుతుంది", అని చెప్పడం ద్వారా ఈ క్లాజును మెరుగుపరచడానికి మీరు కొన్ని సూచనలు చేశారు కాబట్టి, నేను మిమ్మలను ఈ విషయం అడగాలనుకుంటున్నాను.

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** సరే.

***డా॥ అంబేద్కర్:*** కులం, జాతి, లేదా మతం ప్రాతిపదికన ఎటువంటి వివక్షనైనా అది ప్రదర్శించరాదని మీరు చెప్పలేదు కదూ? ఈ పేరా ఎటువంటి వివక్ష లేకుండా సమర్థవంతంగా ఉండాలంటే ఆ విధంగా చేర్చనక్కరలేదా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** ఆ పేరా చివరి సగ భాగానికి సంబంధించి మనం చెప్పుకుంటున్న విషయం 'జి' సెక్షన్‌లోని ఆరవ పేరాలో ఉంది. భూములను తీసుకోవాలనుకునే యూరోపియన్లను, తదితరులను నిరోధించడానికి ఆ విషయాన్ని వర్తింపచేయాలని మేం అనుకోవటంలేదు.

***డా॥ అంబేద్కర్ :*** మీ ఉద్దేశం నెరవేరడం అవసరమనుకుంటే, కులం, జాతి, లేదా మతం ప్రాతిపదికన ఎటువంటి వివక్ష ఉండరాదని మీరు అంటారా?

***సర్ ఎడ్వర్డ్ బెంథాల్ :*** అలాగే, అది చట్టరచనాపరమైన నైపుణ్యం.

## (9)

## భారత మహిళల ఓటుహక్కుపై ఏర్పడిన బ్రిటిష్ కమిటి తరఫున లేడీ లేటన్, శ్రీమతి ఓ. స్ట్రేసీ, సర్ ఫిలిప్ హర్టోగ్...

*•**డా॥ అంబేద్కర్ :*** ఒక ప్రశ్న అడగాలని అనుకుంటున్నాను. నా అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారో లేదో నాకు తెలియదు. అయితే, మహిళలకు ఓటుహక్కు ఇవ్వాలని మీరు ఒత్తిడి తెస్తున్నప్పుడు భారతీయ సమాజంలోని అన్ని వర్గాలకు చెందిన మహిళలకు ఓటుహక్కు లభించే విధంగా వోటు పద్ధతిని రూపొందించాలని మీరూ కోరుకుంటున్నట్లు నేను భావిస్తాను. కేవలం ఉన్నత వర్గాలు లేదా మధ్య తరగతి వర్గాలు లేదా అట్టడుగు వర్గాలకు చెందిన మహిళలకు మాత్రమే ఓటుహక్కు ఇవ్వనక్కరలేదని, ఓటర్ల జాబితాలో చేర్చిన మహిళల సంఖ్య వారివారి వర్గాల జనాభాకు తగినట్లుగా ఉండాలని మీరు కూడా కోరుకుంటున్నారని నేను అనుకుంటున్నాను. అవునా?

***లేడీ లేటన్ :*** అవును. ఆచరణ సాధ్యమైనంత మేరకు అలాగే.

***డా॥ అంబేద్కర్ :*** నలుగురికి ఒకరు లేక అయిదుగురికి ఒకరు వంతున గణిత శాస్త్ర నిష్పత్తిని మీరు కోరుకుంటున్నారని నా ఉద్దేశం కాదు. అయితే, ఆ నిష్పత్తిని పక్కనబెడితే, అన్నివర్గాలకు చెందిన అందరు మహిళలను ఓటర్ల జాబితాలో చేర్చాలని మీరు కూడా కోరుకుంటున్నారా?

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ II–సి, జూలై 26, 1933, పుట 2276.

**లేడీ లేటన్ :** సాధ్యమైనంతవరకు అలాగే జరగాలని కోరుకుంటున్నాం. పట్టణ, గ్రామీణ ఓటర్లకు, వివిధవర్గాలవారికి తగినవిధంగా ప్రాతినిధ్యం లభించాలని కోరుకుంటున్నాం.

**డా॥ అంబేద్కర్ :** విద్యార్హతను కాని, ఆస్తి అర్హతను కాని అధికస్థాయిలో నిర్ణయించినట్లయితే, భారతీయ సమాజంలోని ఒకే ఒక వర్గం మహిళలకు మాత్రమే ఓటర్ల జాబితాలో స్థానం లభిస్తుందని మీరూ అంగీకరిస్తారని అనుకుంటున్నాను. ఏమంటారు?

**లేడీ లేటన్ :** అవును. ఎక్కువ ఆస్తి కలిగిన వర్గానికి చెందిన మహిళలకే కాక, తక్కువ ఆస్తి కలిగిన వర్గం మహిళలకు కూడా ఓటుహక్కు కల్పించాలని మా వినతిపత్రంలో మేం గట్టిగా కోరాం. పరిపాలనాపరంగా అది సాధ్యమైతే అందుకు మాకూ ఇష్టమే.

**డా॥ అంబేద్కర్ :** ఒక విషయం తెలుసుకోవాలని నేను ఆదుర్దాగా ఉన్నాను. జనాభాలోని అన్ని వర్గాలకు చెంది సమ నిష్పత్తిలో ఉన్న మహిళా ఓటర్లకు ప్రాధాన్యం ఇస్తారా?

**లేడీ లేటన్ :** ఈ రెండు రకాలకు ప్రాధాన్యం ఇస్తున్నాము. అయితే, ప్రస్తుతానికి మహిళల ప్రయోజనాలకు ఈ విధంగా తగిన రక్షణ లభిస్తుందని మేం భావిస్తున్నాం. అన్ని జిల్లాలలోను తగినంతమంది మహిళలకు ఓటుహక్కు ఇచ్చి, ఓటుహక్కులేని మిగిలిన మహిళలకు వారే ప్రాతినిధ్యం వహించేటట్లయితే, ఓటుహక్కులేని మహిళల సంఖ్య వీలైనంత తక్కువగా ఉండేటట్లు చూడాలని మేం భావిస్తున్నాం. ఆచరణ సాధ్యమయ్యేటట్లు అయితే వయోజన ఓటుహక్కును అడగడానికి మేం సిద్ధంగానే ఉన్నాం. అయితే, పరిపాలనాపరంగా అది సాధ్యం కాదని మాకు తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** ఇదే విషయాన్ని నేను మరొక విధంగా చెప్పనా? సామాజిక సంక్షేమ విషయాలలో మహిళలందరికీ ఆసక్తి ఉంటుందనే విషయం పూర్తి వాస్తవమే. అయితే, సామాజిక సంక్షేమ పథకాలను అమలు చేయాలంటే, ధనం ఖర్చవుతుందని, పన్ను విధింపు కూడా అవసరమవుతుందని మీరు కూడా గుర్తిస్తారు.

**లేడీ లేటన్ :** అవును. నాకు ఆ విషయం పూర్తిగా తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** అయితే, అందరు మహిళలు అదే వైఖరి అవలంబిస్తారని చెప్పలేం. తమతమ వర్గాల ప్రాతిపదికను వారు విభేదించవచ్చు.

**లేడీ లేటన్ :** అవును. అందుకు నేను మీకు రెండు సమాధానాలు ఇవ్వగలను. అన్నిటికంటే ముందు విద్యకు సంబంధించిన అంశాన్ని తీసుకోండి. విద్యపై ఖర్చు చేయడానికి మీ దగ్గర కొంత డబ్బు ఉందనుకోండి. ఆ డబ్బును పురుషులపై, స్త్రీలపై సమానంగా ఖర్చు చేయాలని ప్రతి వర్గానికి చెందిన మహిళలు అంగీకరిస్తారు. తగినంత ఒత్తిడి తేగల మహిళలు లేనట్లయితే, మీరు బాలికల విద్యపై ఎక్కువ మొత్తం డబ్బును ఖర్చు పెట్టుకుంటూ వెళ్తారు. మొదటగా పరిశీలించవలసిన విషయాలలో అది ఒకటి. మరొక విషయం కూడా నేను చెప్తున్నాను. విద్యపై అధికమొత్తం డబ్బును ఖర్చు

చేయాలని సంక్షేమ విషయాల్లో చురుకైన పాత్ర వహిస్తున్న అన్నివర్గాల మహిళలు పట్టుబడుతున్నారు. ప్రస్తుత సమయంలో అత్యధిక వర్గాలకు చెందిన మహిళలు అదే వైఖరిని అవలంబిస్తారని మీరు నిర్భయంగా నమ్మవచ్చని నేను అనుకుంటున్నాను. అయితే, ఓటుహక్కును వీలైనంతమందికి కల్పిస్తే నేను ఎంతో సంతోషిస్తాను. అందువల్లనే విద్యార్హతకు నేను ప్రత్యేక ప్రాధాన్యం ఇస్తున్నాను. ఒత్తిడి తేగలినంత తెలివితేటలు ఉన్న ఏ మహిళ అయినా సముచితమైన కాల పరిమితిలోపల తనను తాను విద్యావంతురాలిగా మలచుకోగలదు. ఓటుహక్కున్న వర్గ మహిళలు ఓటు చేయటంలేదని ఏ వర్గానికి చెందిన మహిళలు అయినా గట్టిగా విశ్వసిస్తే వారి చేతుల్లో ఆయుధం ఉన్నట్లే, ఈ కారణంతోనే నేను అక్షరాస్యతకు ఎప్పుడూ చాలా సుముఖంగా ఉంటాను. ఈ కారణంతోనే భారతదేశంలోకి సంఘటితమైన మహిళలు అందరూ అక్షరాస్యతను కోరుకుంటూ ఉంటారు.

***డా॥ అంబేద్కర్ :*** నా అభిప్రాయాన్ని మీరు అర్థం చేసుకున్నంత మేరకు నేను సంతృప్తి చెందాను. సర్ ఫిలిప్ హర్టోగ్! అక్షరాస్యత గురించి మిమ్మలను ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. మహిళలకు ఓటుహక్కు కల్పించే విషయంలో అక్షరాస్యతను ఒక పరీక్షగా అవలంబించడంలో ఏవో పరిపాలనాపరమైన ఇబ్బందులు ఉన్నాయని అంటున్నారు. వాటి గురించి మా దగ్గర ఎటువంటి సమాచారం లేదు. అయితే, నేను అర్థం చేసుకున్న ఆ ఇబ్బందులు ఇవి : అన్నిటికంటే మొదటిది ఏమిటంటే, అవసరమైన విద్యార్హత ఒక మహిళకు ఉందో లేదో రిజిస్ట్రేషన్ అధికారి తెలుసుకోవడానికి ఉపకరించే సర్టిఫికెట్లు ఏమీ లేవని అంటున్నారు. అందువల్ల, ఆ అధికారి తనకు తోచిన విధంగా వ్యవహరించి ఆ మహిళను ఓటర్ల జాబితాలో చేర్చవచ్చు, చేర్చకపోవచ్చు. పరిస్థితి అలా ఉన్నప్పుడు ప్రతిపాదనలో సూచించిన విధానాన్ని మనం అనుసరించవలసి ఉంటుంది. ఆ మహిళ అక్షరాస్యతాస్థాయిని గ్రామాధికారి పరిశీలించాలని, ఆయన ఇచ్చే సర్టిఫికెట్పై తాసిల్దారు సంతకం చేయాలని సూచించారు. ఇందులో ఉండే పరిపాలనాపరమైన ఇబ్బందిని ఈ విధంగా సూచించారని నేను భావిస్తున్నాను. ఒక గ్రామంలోని మహిళ అక్షరాస్యురాలో, కాదో తెలుసుకోవడానికి గ్రామాధికారి ఆమె వద్దకు ఎలా వెళ్లాలి? ఓటు కావాలనుకునే మహిళే తనంతట తాను గ్రామాధికారి వద్దకు వెళ్లి, దరఖాస్తు పెట్టుకోవాల్సి ఉంటుందని మీరు అంటారా?

***సర్ ఫిలిప్ హర్టోగ్ :*** సాధ్యమయ్యే విధానం అది ఒక్కటేనని నేను భావిస్తున్నాను. "ఓటర్ల జాబితాలో నా పేరును చేర్చాలని నేను కోరుకుంటున్నాను. నేను అక్షరాస్యురాలిని. అక్షరాస్యతా పరీక్షకు నేను సిద్ధం", అని స్వయంగా కాని, తన భర్త ద్వారా కాని చెప్పగలిగేంత ఆసక్తి మహిళకు ఉండాలి.

***శ్రీ బట్లర్ :*** దానికి, దరఖాస్తుకి తేడా ఏమిటి?

***లేడీ లేటన్ :*** అక్షరాస్యతకు సంబంధించి దరఖాస్తుకు మా విజ్ఞాపన పత్రంలో అభ్యంతరం చెప్పామని నేను అనుకోవటంలేదు. మేం అభ్యంతరం చెప్పము. ఏ విద్యార్హత అయినా కలిగి ఉండి, అక్షరాస్యులుగా అప్పటికే గుర్తింపు తెచ్చుకున్న ప్రజలను ఏ పేచీ లేకుండా ఓటర్ల జాబితాలో చేర్చాలని మేం భావిస్తున్నాం. దానికి భిన్నమైన పరిస్థితిలో దరఖాస్తు చేసుకోవాలి.

**డా॥ అంబేద్కర్ :** అభ్యంతరకరంగా ఉండడానికి అవకాశం ఉన్న కుటుంబాలలో జరిపిన విచారణల ప్రాతిపదికన ప్రస్తావించిన ఈ అభ్యంతరం నిజంగా మళ్లీ తలెత్తదా?

**సర్ ఫిలిప్ హర్టోగ్ :** సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఇచ్చిన రెండు సమాధానాలను ఇక్కడ ప్రస్తావించటం సముచితమని నాకు తోస్తున్నది. ఎందుకంటే, డా॥ అంబేద్కర్ లేవనెత్తిన అంశంతో వీటికి ప్రత్యక్ష సంబంధం ఉంది. 7437వ ప్రశ్నకు సెక్రటరీ ఆఫ్ స్టేట్ సమాధానం ఇస్తూ ఇలా చెప్పారు : "భవిష్యత్తులో ముందు తరాల బాలికలు లేదా మహిళల విషయంలో ఎన్నికల కోసం విద్యా సంబంధమైన రిజిస్టర్లను ఉపయోగించుకోవటం ఇప్పటికంటే చాలా తేలికయిపోతుంది. అయితే, ఇప్పటికి ఒక్కసారి కూడా ఈ పద్ధతిని అమలు చేయని రాష్ట్రాలలో మాత్రం మొదటిసారిగా అటువంటి రిజిస్టర్లను ఉపయోగించుకోవటంలో చాలా ఇబ్బందులు ఎందురు కావచ్చు" 7214వ ప్రశ్నకు సెక్రటరీ ఆఫ్ చెప్పిన సమాధానాన్ని ఈ సమాధానంతో కలిపి చదువుకోవాలని మిమ్మల్ని కోరుతున్నాను. 7214వ ప్రశ్నకు సెక్రటరీ ఆఫ్ స్టేట్ సమాధానం ఇస్తూ, పార్లమెంట్ చట్టంలో ఓట్ల పద్ధతికి సంబంధించి 10 సంవత్సరాలపాటు ఎటువంటి మార్పూ చేయవద్దని తాను సూచిస్తున్నట్లు చెప్పారు. అందువల్ల, రెండవ, మూడవ, లేదా నాలుగవ ఎన్నికలు 10 సంవత్సరాల లోపే వచ్చినపక్షంలో రెండవ, మూడవ, లేదా నాలుగవ ఎన్నికలకు రిజిస్టర్ ఉపయోగించడంలో పెద్దగా ఉపయోగం ఉడదు. ఇప్పుడు మహిళ సంఖ్య గురించి ప్రస్తావిస్తాను. అక్షరాస్యులైన మొత్తం మహిళల సంఖ్యను లోథియన్ నివేదికలో పన్నెండున్నర లక్షలుగా అంచనా వేశారు. ఆ నివేదిక లోని 86 పేజీలో ఈ అంశం ఉన్నది. వారిలో 3,45,000 మంది మహిళలు మద్రాసులో ఉన్నారు. ఈ మహిళలకు సబంధించి ఎటువంటి ఇబ్బందీ లేదు. ఇక మిగిలిన భారతదేశం అంతటా చూస్తే, 8,75,000 మంది మాత్రమే ఉన్నారు. ఒక ఎన్నికకు మద్రాసులోని 3,45,000 మంది మహిళలను ఓటర్ల జాబితాలో చేర్చడం సాధ్యమవుతున్నప్పుడు, మిగిలిన భారతదేశం అంతటికీ 8,75,000 మంది మహిళలను ఓటర్ల జాబితాలో చేర్చడం అసాధ్యం ఎందుకవుతుంది?

## (10)

## అఖిల భారత మహిళా సమాఖ్య మరో రెండు మహిళా సంస్థల తరఫున రాజ్‌కుమారి అమృత్‌కౌర్, శ్రీమతి హమీద్ అలీ

***డా॥ అంబేద్కర్ :** మహమ్మదీయుల ఇళ్లకు సంబంధించి ఎటువంటి ఇబ్బంది ఉండదని మీరు చెప్పారా?

**శ్రీమతి హమీద్ అలీ :** తన భార్య పేరు చెప్పడానికి మహమ్మదీయుడు ఎప్పుడూ అభ్యంతరం చెప్పడు. అయితే, సర్ హరి చెప్పినట్లు, కొంత సున్నితత్వం ఉంది. తమ భార్యల పేర్లు

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, వాల్యూమ్ 2-సి, జూలై 6, 1933, పేజీ 2314-21.

చెప్పుకోవడానికి ముస్లింలకు ఎటువంటి ఇబ్బంది ఉన్నట్లు నేను ఎరుగను. మహిళలు తరచుగా తమ భర్తల పేరు చెప్పకపోవడం వారసత్వమే. అయితే అప్పుడప్పుడు వారు చెప్తుంటారు.

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** భార్య పేరు వెల్లడించడానికి భర్త అభ్యంతరం చెప్పడం అనేది హిందూ కుటుంబాల్లో ఉంది.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :*** తన భార్య పేరు చెప్పడానికి హిందూ భర్త మానసికంగా అభ్యంతరం కనబరుస్తాడా? లేక ముస్లిం భర్త అనే అంశాన్ని సర్ హరిసింగ్ గౌర్ ప్రస్తావించలేదని నేను అనుకుంటున్నాను. ఆయన చెప్పినదేమిటంటే, రిజిస్ట్రేషన్ అధికారి సేకరించవలసి ఉన్న సమాచారానికి వీరిలో ఎవరు లేదా ఏ ఒక్కరు అభ్యంతరం చెప్తారు?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** రిజిస్ట్రేషన్ అధికారి ఏ రకమైన సమాచారాన్ని సేకరిస్తారో నాకు అర్థం కావటంలేదు.

***డా॥ అంబేద్కర్ :*** అది ఇలా ఉంటుంది : "మీకు భార్య ఉందా? ఉన్నట్లయితే ఆమె పేరేమిటి?"

***సర్ హరిసింగ్ గౌర్ :*** అంతేకాక, "మీకు ఎంతమంది భార్యలున్నారు?"

***డా॥ అంబేద్కర్ :*** రిజిస్ట్రేషన్ అధికారి సేకరించవలసిన సమాచారానికి ఎవరు అభ్యంతరం చెప్తారనేది ఇక్కడ ప్రశ్న.

***పూర్‌క్వీన్ ఆఫ లోథియన్ :*** "ఆమెకు 21 సంవత్సరాలు దాటాయా?"

***డా॥ అంబేద్కర్ :*** ఆయన అడిగే ప్రశ్నల్లో అది కూడా ఉంటుంది.

**అధ్యక్షుడు :** ఒక సమాధానం ఇవ్వడం ద్వారా సాక్షి ఇప్పుడు కల్పించుకోవచ్చు. మీకు ఏమైనా అభిప్రాయాలు ఉంటే, డాక్టర్ అంబేద్కర్ సూచనకు సమాధానం ఇస్తారా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** ఇస్తాను. అటువంటి ప్రశ్నకు ఎవరికైనా అభ్యంతరం ఉంటుందని నేను అనుకోవటంలేదని మాత్రమే చెప్పగలను. అసలు ఇటువంటి ప్రశ్న వేసే మనస్తత్వాన్ని కూడా నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. ఈ ప్రశ్న నాకు పూర్తిగా అర్థరహితమైనదిగా కన్పిస్తున్నది.

**అధ్యక్షుడు :** శ్రీమతి హమీద్ అలీ! మీకు ఆ సమాధానంతో ఏకీభవిస్తారా? భార్య పేరు వెల్లడించడంలో ఏమీ ఇబ్బది ఉండదని మీరూ భావిస్తున్నారా?

***శ్రీమతి హమీద్ అలీ :*** ఇటువంటి ప్రశ్న అడిగే తీరుపైన, ధోరణిపైన అంతా ఆధారపడి ఉంటుందని నేను అనుకుంటున్నాను. దురుద్దేశం లేకుండా సదుద్దేశంతో అటువంటి ప్రశ్న అడిగితే సాధారణంగా ఎవరూ దాన్ని తప్పుగా అర్థం చేసుకోరు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** శ్రీమతి హమీద్ అలీని మరొక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. మీరు బొంబాయి నుంచి వచ్చారు. ముస్లింలు మాత్రమే ఉన్న కొన్ని వార్డులు అక్కడ ఉన్నట్లు మీకు తెలుసు. ఒక రిజిస్ట్రేషన్ అధికారి ఈ వార్డుల్లో ప్రవేశించి, ఈ వివరాలు సేకరించడం సాధ్యమవుతుందేమో మీ అనుభవం ద్వారా చెప్పగలరా?

**శ్రీమతి హమీద్ అలీ :** బొంబాయికి సంబంధించినంతవరకు సాధ్యమవుతుంది. బొంబాయిలో ఎవరైనా అభ్యంతరం చెప్తారని నేను అనుకోను. ఎందుకంటే, బొంబాయిలో తరచూ మున్సిపల్ ఎన్నికలు జరుగుతుంటాయి కాబట్టి, ప్రజలు ఈ తరహా విషయాలకు అలవాటుపడి ఉంటారు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** ఫెడరల్ శాసనసభలో మహిళల ప్రాతినిధ్యానికి సంబంధించి చేసిన 56వ నెంబర్ అనుబంధ ప్రకటనలో ఏం చెప్పారో నాకు పూర్తిగా అర్థం కాలేదు. అందులో ఇలా ఉంది:

"మా సమైక్య దళంలోకి మతతత్వ జాడ్యం ప్రవేశించడాన్ని మేం కోరుకోవడం లేదని మేం పదేపదే కోరాం." దిగువ సభలో మహిళల ప్రాతినిధ్యానికి సంబంధించి శ్వేతపత్రంలో ప్రతిపాదన ఉంది. మత ప్రాతిపదికపై ఏర్పాటైన నియోజకవర్గాల ద్వారా ఈ ఎన్నిక జరగరాదని, 'ఏక బదలీ ఓటు తో సాధారణ నియోజకవర్గాల ద్వారా జరగాలని అదులో ఉందా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్:** ఆ దృక్కోణం నుంచి చూస్తే, మత ప్రాతిపదిక ఉన్న నియోజకవర్గాలనే కారణంపై అభ్యంతరం వచ్చి ఉండదని నాకు అన్పించింది. అవునా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** ఫెడరల్ శాసనసభలోని దిగువ సభలో మహిళల స్థానాలు మతప్రాతిపదిక పైనే ఉండాలి. మొన్ననో, మూడురోజుల క్రితమో సెక్రటరీ ఆఫ్ స్టేట్ సాక్ష్యం ఇచ్చినప్పుడు ఈ అంశంపై స్పష్టమైన ఆదేశం ఇచ్చారు. ఫెడరల్ శాసనసభలోని దిగువ సభలో ఈ పరోక్ష ఎన్నిక పద్ధతి వర్తించే రిజర్వ్‌డ్ స్థానాలకు మత ప్రాతిపదికపైనే ఎన్నిక జరగాలని ఆయన అన్నారు.

**శ్రీ ఎం.ఆర్. జయకర్ :** మత ప్రాతిపదికపై రిజర్వ్‌డ్ స్థానాలకు ఎన్నిక జరగడం పట్ల నేనా మీకు అభ్యంతరం?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును. అంతేకాక, ఆ స్థానాలకు శాసనసభల ద్వారా జరిగే పరోక్ష ఎన్నిక పద్ధతి మత ప్రాతిపదికపై ఉండాలని నేడు ప్రతిపాదించిన రాజ్యాంగ స్వభావమే చెప్తున్నది.

**మిస్ మేరీ పిక్‌ఫోర్డ్ :** నేను ఇప్పుడు జోక్యం చేసుకోనా? సెక్రటరీ ఆఫ్ స్టేట్ సమాధానం ఇస్తూ, మత ప్రాతిపదిక విషయాన్ని ప్రస్తావించారు. బెంగాల్ రాష్ట్ర శాసనమండలిలోని మహిళల స్థానాలను ఉద్దేశించి ఆయన దాన్ని ప్రస్తావించారు కాని. శాసనసభలోని స్థానాలను ఉద్దేశించి కాదు.

**డా॥ అంబేద్కర్ :** నేనూ అలాగే అనుకున్నాను. అనుబంధం –2లో ఉన్న శ్వేతపత్రం 89వ పేజీని సాక్షి దృష్టికి తీసుకుని వచ్చినట్లయితే, సమస్యను శాశ్వతంగా పరిష్కరించినట్లేనని నేను అనుకునేవాడిని. మీరు కూడా ఆ పేజీని చూడండి. అందులో ఇలా ఉంది : "ప్రతి రాష్ట్రానికి కేటాయించిన మహిళా స్థానాలకు ఏక బదిలీ ఓటుతో రాష్ట్ర శాసనసభ్యుల ఓటింగ్ ద్వారా ఎన్నిక జరుగుతుంది" అవునా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును. మిస్ పిక్‌ఫోర్డ్ ప్రశ్నకు సెక్రటరీ ఆఫ్ స్టేట్ సమాధానం ఇస్తూ, బెంగాల్‌లోని రాష్ట్ర శాసన మండలిలో మత ప్రాతిపదికపై కల్పించిన రిజర్వ్‌డ్ స్థానాలను ఉద్దేశించారని తెలుసుకున్నాను. దిగువసభలో మహిళలకు కేటాయించిన స్థానాల విషయంలో మత ప్రాతిపదిక సమస్య చొరబడదని నేను అనుకోవచ్చా? మత రహిత ప్రాతిపదికపై ఈ స్థానాలను కేటాయిస్తారా? ఈ విషయంపై స్పష్టంగా ఉండాలని కోరుకుంటున్నాను. ఏ ప్రాతిపదికపై ఈ స్థానాలను కేటాయిస్తారో తెలుసుకోవాలనుకుంటున్నాను.

* * *

**డా॥ అంబేద్కర్ :** ఈ అంశంపై నన్ను మరికొంత తెలుసుకోనివ్వండి. ఎందుకంటే, నా మనసులో కొంత గందరగోళంగా ఉంది. దాన్ని స్పష్టం చేసుకోవాలని అనుకుంటున్నాను. మొదట, అటువంటి పరోక్ష ఎన్నికకు మీరు అభ్యంతరం చెప్తారా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** అవునా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** అది ఒక అభ్యంతరమా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఫెడరల్ దిగువ సభలోని మహిళా ప్రతినిధులు రాష్ట్ర శాసనమండలి ద్వారా పరోక్ష పద్ధతిలో ఎన్నిక కావాలని మీరు కోరుకోవడం లేదా?

**డా॥ అంబేద్కర్ :** ఒక విధమైన ప్రత్యక్ష నియోజకవర్గ పద్ధతిని మీరు కోరుకుంటున్నారా?.

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** మత ప్రాతిపదికపైన స్థానాలను కేటాయిస్తే, అటువంటి వాటికి మేం వ్యతిరేకం కాబట్టి, మీకు సంబంధించినంతవరకు ఈ ప్రశ్న తలెత్తదు. అయితే, మహిళలు శాసనసభలో ప్రవేశించాలని మేం కోరుతాము.

**డా॥ అంబేద్కర్ :** విషయాన్ని స్పష్టం చేయడానికి నన్ను ఒక ప్రశ్న వేయనీయండి. దిగువసభలో మహిళలకు స్థానాలు కేటాయించాలని మీరు అసలు కోరుకుంటున్నారా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** మా సంస్థల ద్వారా వయోజన ఓటుహక్కు సంపాదించేంత వరకు ప్రస్తుతానికి రిజర్వ్‌డ్ స్థానాలను అంగీకరించాలని సిఫార్సు చేస్తామని నేను ఇదివరకే చెప్పాను. అయితే, మహిళల స్థానాలకు మతరహిత ప్రాతిపదికపై ఎన్నిక జరగాలని, సంయుక్త నియోజకవర్గాల ద్వారా జరగాలని స్పష్టంగా నిర్దేశించాలని కూడా చెప్పాను. ఈ షరతు మీద మాత్రమే మేం అంగీకరిస్తాం.

***డా॥ అంబేద్కర్ :*** రెండు విషయాలను నేను పూర్తిగా అర్థం చేసుకున్నాను. ప్రస్తుతానికి కొన్ని స్థానాలను మహిళలకు కేటాయించాలని మీరు కోరుతున్నారు. అవునా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** రిజర్వేషన్ పద్ధతిని మేం ఎప్పుడూ వ్యతిరేకిస్తూనే ఉన్నాం.

***డా॥ అంబేద్కర్ :*** నేను అర్థం చేసుకున్న రెండవ విషయం ఏమిటంటే, ఫెడరల్ దిగువసభలో మహిళల ప్రాతినిధ్యం పరోక్ష ఎన్నిక ద్వారా ఉండకూడదని మీరు కోరుకుంటున్నారు. నేను పొరపాటు చెప్తే, సరిదిద్దండి. మీరు చెప్పిన రెండవ విషయం ఇదేనా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** అవును.

***డా॥ అంబేద్కర్ :*** నేను మిమ్మల్ని అడగాలనుకుంటున్నది ఏమిటంటే..... ?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** రిజర్వేషన్ పద్ధతిని మేం కోరుకుంటున్నామా అని అడుగుతున్నారా? ఆ పద్ధతిని మేం ఎప్పుడూ వ్యతిరేకిస్తూనే ఉన్నామని మీకు ఇదివరకే చెప్పాను కదా!

***డా॥ అంబేద్కర్ :*** రిజర్వేషన్‌ను మీరు ఎంతమాత్రం కోరుకోవడం లేదా?

**రాజ్‌కుమారి అమృత్‌కౌర్ :** రిజర్వేషన్ వద్దని మేం ఎప్పుడూ చెప్తూనే ఉన్నాం. అయితే, మా అభిప్రాయాలకు విరుద్ధంగా ఎన్నో విషయాలను మాపై రుద్దినట్లు రిజర్వేషన్ పద్ధతిని కూడా మాపై రుద్దినట్లయితే, అప్పుడు ఒక షరతుపై దాన్ని అంగీకరించాలని మేం సిఫార్సు చేస్తాం. సంయుక్త నియోజకవర్గాలు, ప్రత్యక్ష పద్ధతుల ద్వారా మాత్రమే ఎన్నిక జరగాలనేది మా షరతు. అంతేకాక, మతరహిత ప్రాతిపదికపైనే స్థానాలను కేటాయించినట్లయితే, మా ఇష్ట ప్రకారం ఎంపిక చేసుకున్న మహిళలను నిలబెట్టడానికి మాకు హక్కు ఉండాలి.

**అనువాదం :**

**డా॥ పి. యానాదిరాజు**

☆ ☆ ☆

***డా॥ అంబేద్కర్ :*** విషయం మీ ఇష్టానికి వదిలితే, ఫెడరల్ లోయరు హౌసులో స్త్రీలకు స్థానాలు కేటాయించడమనేది ఎలా మీరు కోరరా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** కానేకాదు.

***డా॥ అంబేద్కర్ :*** అలా అయ్యేటట్లయితే, ఒక సంయుక్త నియోజకవర్గం పద్ధతి మీదా, ప్రత్యక్ష ఎన్నిక మీదా మీరు ఆధారపడి కోరతారన్నమాట!

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును, ప్రత్యక్ష ఎన్నిక, కులమత పరంకాని ప్రాతిపదిక.

***డా॥ అంబేద్కర్ :*** కులమతపరంకాని ప్రాతిపదిక తీసుకుందాం. ఆ ప్రత్యేక నియోజకవర్గం ఆడవాళ్లతోనే నిర్మాణమై ఉంటుంది, ప్రత్యక్ష ఎన్నికగానే ఉంటుందనా?

రాజకుమారి అమృత్‌కౌర్: లేదు; స్త్రీ పురుషులను కూడా కోరుతున్నాం.

***డా॥ అంబేద్కర్ :*** అంటే మీరు కోరేది స్త్రీ పురుషులు ఓటర్లుగా ఉండేటటువంటి మిశ్రమ నియోజకవర్గమా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఈ నిబంధనతో ఆ నియోజకవర్గం నుండి చివరికి ఎన్నికయ్యేది స్త్రీ మాత్రమే అనే కదా!

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును! అంటే ఒక రిజర్వుడు సీటుకి ఒక స్త్రీ ఎన్నిక కావలసి ఉంటే దానిని బట్టి ఎన్నికయ్యేటువంటి వ్యక్తి స్త్రీ అయి ఉంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** ఇలాంటి నియోజకవర్గాలు శాసనసభకు సరాసరి ఎలా నియామకం చేయగలరు?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** నేను చెబుతున్నట్లుగా మా వద్ద నిర్మాణాత్మకమైన ప్రతిపాదనలేం లేవు. ఎందుకంటే, అసలు మొదటి నుండి మేం రిజర్వేషనుకి వ్యతిరేకగా ఉన్నాం. మేం అది కమిటీ విచక్షణకే వదిలేస్తాం. కేవలం మేం అంగీకరించేటువంటి నియమనిబంధనలతో ప్రత్యేక నియోజకవర్గాలు ఇచ్చేటట్లైతే అలాంటి ఉత్తమ ప్రాతినిధ్యం కలిగినటువంటి నియోజకవర్గాలను ఏర్పాటు చేయడం కమిటీ విచక్షణకే వదలాలని ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** ఒక ప్రశ్నకి మీ సమాధానంగా ఒక అభ్యంతరం చెప్పారని అనుకుంటున్నాను. ఫెడరల్ అసెంబ్లీలో దిగువ సభలో స్త్రీల ప్రాతినిధ్యానికి శ్వేతపత్రంలో చూపబడిన ప్రత్యక్ష ఎన్నిక విధానానికి వ్యతిరేకత చూపించారు. ఎందుకంటే ఒక విధంగా అది కులమత పరమైన మనస్తత్వమని అనుకుంటున్నారని భావిస్తున్నాను.

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ప్రాంతీయ మండలులలో ఉండేటువంటి వివిధ ప్రతినిధులు ఓట్లు వేసే సందర్భంలో కులమత భావనలతో ప్రవర్తిస్తారనే గదా మీ అభ్యంతరానికి భూమిక?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** ఈ ప్రశ్నకి నేనిప్పటికీ సమాధానం చెప్పాను, చెప్పలేదా?

**డా॥ అంబేద్కర్ :** అవును; ఇంకో ప్రశ్న వెయ్యాలనుకుంటున్నాను. ఈ విషయం ఇంకా స్పష్టం చేయాలని నాకుంది. శ్వేతపత్రంలో ప్రతిపాదించిన రీతిలో పరోక్ష ఎన్నికకు మీరు అభ్యంతర పెడుతున్నారు. ఎందుకంటే రాష్ట్రమండలిలో వివిధ కులమతాల ప్రతినిధులు కులమతపరమైనటువంటి పరిగణనలు ప్రవేశిస్తాయి?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** మళ్ళీ నేను సమాధానం చెప్పనా? ప్రాథమికంగా మేం పరోక్ష ఎన్నికనే అడ్డు పెడుతున్నాం. ఎందుకంట సహజంగా మేం ప్రత్యక్ష ఎన్నికలు కోరుతున్నాం.

**డా॥ అంబేద్కర్ :** అవును, నాకర్థమైంది.

**రాజకుమారి అమృత్‌కౌర్:** ఇది మొదటి అభ్యంతరం. రెండో అభ్యంతరం ఏమంటే, రాష్ట్రమండలుల ద్వారా మాకు పరోక్ష ఎన్నిక ప్రతిపాదించినపుడు రాష్ట్రమండలిలో కులమత పరిమితమైనటువంటి విధానాలతో వ్యవహరిస్తుంది కాబట్టి ఎన్నికైన ఆడవాళ్ళకు కూడా మళ్లీ కులమతపరమైన సమస్యే ప్రవేశిస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** అది నిజమే, ఇంకో ప్రశ్న వేయాలనుంది. మీ అభ్యంతరం పూర్తిగా అర్థం చేసుకుంటున్నాను. రాష్ట్ర శాసనమండలిలో వివిధ కులమతాల వారి వివిధ ప్రాతినిధ్యాలు స్త్రీల ఎన్నికలలో చాలా విషయ ప్రాధాన్యతను తీసుకొస్తుంది.

**శ్రీ ఎమ్.ఆర్. జయకర్ :** పరోక్ష ఎన్నికకు ఉన్న అభ్యంతరాలలో అది ఒకటి మాత్రమే. ఆ ఎన్నిక యొక్క భూమిక పరోక్షం కావడం కూడా ఒక అభ్యంతరమని నేనర్థం చేసుకుంటున్నాను.

**రాజకుమారి అమృత్‌కౌర్ :** నేను అలా అనేకసార్లు చెప్పాను.

**డా॥ అంబేద్కర్ :** అసలు సమస్య యిది. మీ ప్రత్యక్ష నియోజకవర్గాన్నే ఉదాహరణకు తీసుకోండి. ఉదాహరణకు బొంబాయి నగరంలో మీకు నచ్చిన ఏ నియోజకవర్గాన్నయినా తీసుకోండి. దిగువ సభలో స్త్రీల ప్రాతినిధ్యపు ఎన్నికకు ప్రత్యేకంగా రూపొందించబడాలనేటువంటి ఆ నియోజక వర్గంలో ఉన్నటువంటి ఓటర్లు స్త్రీ పురుషులు వివిధ కులమత వర్గాలవారు ఉంటారు?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును.

**డా॥ అంబేద్కర్:** పరోక్షంగా స్త్రీ అభ్యర్థిని ఎన్నుకోవడంలో రాష్ట్రశాసనమండలిలో పాల్గొనేటువంటి అధిక సంఖ్యాక కులమత వర్గ ప్రతినిధుల కన్నా స్త్రీ అభ్యర్థిత్వాన్ని ఎన్నుకోవడంలో పాల్గొనే ఓటర్లకు తక్కువ కులమత మనస్తత్వం ఉంటుందని మీరు సూచిస్తున్నారా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** నిస్సందేహంగా జన సమూహంలో ఉన్న కుల మనస్తత్వం కన్నా శాసనసభలకు వెళ్ళేవాళ్లలో ఉండే కుల సమస్య చాలా పెద్దది.

***డా! అంబేద్కర్:*** ఈ వాస్తవం వైపుకి మీ దృష్టిమరల్చాలనుకుంటున్నాను. పరోక్ష ఎన్నికకు ఓటర్లుగా నమోదయ్యేవారిని నియోజకవర్గం వారే ఎన్నుకుంటారు.

**రాజకుమారి అమృత్‌కౌర్ :** కావచ్చు, సంయుక్త నియోజకవర్గంవారి విషయం వచ్చినప్పుడు వాళ్ల నుండి మనం ఓట్లు పొందాలనుకునేటప్పుడు అక్కడ కులమత సమస్య ఉండదు. ఉండజాలదు. ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా ఎన్నుకోబడిన రాష్ట్ర మండలిలో ఉన్నంతమేరకు అది ఉండదు. ఎందుకంటే అక్కడ కమ్యూనల్ సమస్య సజీవంగా ఉంటుంది. చైతన్యంగా ఉంటుంది. అదలా అక్కడ చాలా చైతన్యంగా ఉండాలి కూడా.

***డా! అంబేద్కర్ :*** ఇండియాలో ఉండే స్త్రీ పురుష సాధారణ ఓటర్లు కమ్యూనల్ మనస్తత్వంతో ప్రవర్తించరని మీరనుకుంటున్నారా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** సామాన్య జనసమూహంలో మాత్రం కాదు.

***డా! అంబేద్కర్ :*** ఎలెక్షను జరుగుతూ వుండగా మీరెప్పుడైనా చూశారా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** చూశాను. ఈమధ్యనే ఒక ఎలెక్షన్ జరిగింది. మా సంఘంలో స్త్రీ సభ్యులు బొంబాయిలో సంయుక్త నియోజకవర్గం ద్వారా జరిగిన ఎన్నికల్లో అత్యధిక సంఖ్యా బలంతో వచ్చారు. అందులో ఇంచుమించు స్త్రీలే లేరు. అందరూ పురుషులే, నిమ్నజాతులూ, ప్రతివాళ్లూ ఓటువేయడంతో ఆమె ప్రప్రథమంగా వచ్చేసింది. అది మునిసిపల్ ఎన్నికల్లో ఆమె ఒక్కరే కాదు, మరొక మహిళ కూడా ఉంది. పాట్నాలో యూనివర్శిటీలో ఎన్నికల ఉదాహరణలు కూడా ఉన్నాయి. అక్కడ పురుషులు స్త్రీలను ఎన్నుకున్నారు. కుల సమస్యలో ఇబ్బంది ఏమీ రాలేదు.

***డా! అంబేద్కర్:*** ఒక స్త్రీని ఎన్నుకోవడం అనే అంశంలో పరోక్ష ఎన్నికలో కన్నా, ప్రత్యక్ష ఎన్నికల్లో కమ్యూనల్ భావం తక్కువ. అందుకు సందేహంలేదు!

**రాజకుమారి అమృత్‌కౌర్:** ఖాయంగా, కౌన్సిల్ ద్వారా పరోక్షంగా ఎన్నిక జరిగేటప్పుడల్లా, అది కుల-మత- తత్వంతో చొచ్చుకుపోతుంది.

★ ★ ★

****డా! అంబేద్కర్:*** ఈ మండలంలో వాళ్లు సభ్యులుగా ఉన్నారంటే, అది నామినేషన్ ద్వారా అని నాకు అర్థమవుతోంది.

**రాజకుమారి అమృత్‌కౌర్ :** అవును. అక్కడ ఎలెక్షన్‌లాంటిదేమీ లేదు.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి -2-సి, 29 జూలై 1933, పే. 2327.

**సర్ హరిసింగ్ గౌర్ :** శాసనసభకు ఇంతవరకూ వాళ్లు ఎప్పుడూ నామినేట్ కాలేదా?

**డా॥ అంబేద్కర్ :** ఎప్పుడూ కాలేదు.

**డా॥ అంబేద్కర్ :** అనర్హత ఏమైనా వుందా?

**రాజకుమారి అమృత్‌కౌర్ :** లేదనుకుంటా.

**శ్రీమతి హమిద్ అలీ :** రాష్ట్రాలు అనర్హత గొడవ ఈమధ్యనే వదిలించుకొన్నాయని ఈ సందర్భంలో నేను స్పష్టం చేయొచ్చా?

**డా॥ అంబేద్కర్ :** చాలా ఇటీవలే అది జరిగింది. కొన్ని రాష్ట్రాల్లో ఎంత ఇటీవల అంటే అనర్హత వదిలించిన తర్వాత, మరో ఎన్నికకు సమయం కూడా లేనంత వ్యవధిలో జరిగిపోయింది.

## (11)

## శ్రీమతి పి.కె. సేన్, శ్రీమతి యల్. ముఖర్జీ

***డా॥ అంబేద్కర్ :** స్త్రీలు వృత్తులలో ప్రవేశించవలసి వస్తే ఈ కుల వ్యత్యాసాలు స్త్రీలలో చాలా వ్యాప్తి చెందొచ్చని ఈ కారణాన భావించవచ్చా?

**శ్రీమతి యల్. ముఖర్జీ :** నేనలా అనుకోవడంలేదు. సహజంగా స్త్రీ కులభావనలకు దూరంగా ఉంటుందని నేను తలుస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఉదాహరణకు, ఈ రోజున ఉద్యోగాలకూ, వృత్తిపరమైన నియామకాలకూ పోరాటం లేక పెనుగులాట నిజంగా పురుషులకే పరిమితమైందా?

**శ్రీమతి యల్. ముఖర్జీ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ప్రధానంగా భారతదేశంలో స్త్రీలు కుటుంబంలో సంపాదించే సభ్యులు కారు గనకనా.

**శ్రీమతి యల్. ముఖర్జీ :** మీరు చెప్పే అంశం స్పష్టంగా ఉంది.

**డా॥ అంబేద్కర్ :** కాబట్టి విద్యా విషయం తీసుకుందాం. విద్య ఫలితంగా, లేక మీ విశ్లేషణ బట్టి స్త్రీలలో అధికభాగం పురుషులతోపాటు విధానవృత్తిలో లేక ఇతర వృత్తుల్లో ప్రవేశించారనుకోండి.. బహుశ అది స్త్రీలలో కూడా వ్యాపిస్తోంది.

**శ్రీమతి యల్. ముఖర్జీ :** బహుశా సాధ్యమే. ఫలితం చూస్తే కాని ఆ విషయానికి సమాధానం చెప్పలేను.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-సి, జూలై 29, 1933

**డా॥ అంబేద్కర్:** మీరన్నది మెచ్చుకోదగిందే. కాని ఈ అంశం మీ దృష్టికి తీసుకురావాలనుకొన్నాను.

**శ్రీమతి యల్. ముఖర్జీ:** ఒకానొక భవిష్యత్ కాలంలో మన స్త్రీలు వృత్తుల్లోకి వెళ్లగలిగిన స్థితిలో కుల వ్యవహారమంతా అంతమవుతుందని భావిస్తున్నాను. దానికై ఎదురు చూస్తున్నాను.

**డా॥ అంబేద్కర్:** నేనూ అలా ఆకాంక్షిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్:** ఒక్క ప్రశ్న మిమ్మలను అడగాలనుకొంటున్నాను శ్రీమతి సేన్‌గానూ. ఫెడరల్ (దిగువ సంయుక్త సభ)లో స్త్రీల ప్రాతినిధ్యం గురించి మీ అభిప్రాయాలు వివరించారు. శ్వేత పత్రంలో పరోక్ష ఎన్నికకు పొందుపరచిన సామయికాంశంపై మీ అభ్యంతరం చెప్పారు.

**శ్రీమతి పి.కె. సేన్:** అవును.

**డా॥ అంబేద్కర్:** కులతత్వాన్ని రెచ్చగొట్టే ఏ అంశానికి ఇష్టపడనని మీరు సాధారణంగా అన్నారేతప్ప రాష్ట్ర అసెంబ్లీలో స్త్రీల ప్రాతినిధ్యం నిమిత్తం పొందుపరచిన అంశాల గూర్చి మీ అభిప్రాయాలు నేనేక్కడా గమనించలేదు.

**శ్రీమతి పి.కె. సేన్:** అవును.

**డా॥ అంబేద్కర్:** దానిపై మీ సలహా ఏమైనా వుందా?

**శ్రీమతి పి.కె. సేన్:** మీ ప్రశ్న సరిగా అర్థం కాలేదు.

**డా॥ అంబేద్కర్:** రాష్ట్రశాసనసభల్లో స్త్రీలను నియమించడానికి గాను చాలా స్థానాలు కల్పింపబడ్డాయి.

**శ్రీమతి పి.కె. సేన్:** అవును.

**డా॥ అంబేద్కర్:** ఆ స్థానాలు భర్తీ చేయడానికి సవివరమైన షరతులేవీ శ్వేతపత్రంలో చూపబడలేదు. 'సాధారణ', మద్రాసు, అనేదాని క్రింద, శ్వేతపత్రం 93వ పేజీలో అనుబంధం – 3 152లో స్త్రీలు 6గురు, మహమ్మదీయులు 29, ఒక స్త్రీతో సహా, ఇప్పటిదాకా, శ్వేతపత్రంలో ముందుగా చూపబడినవి ఇంతమాత్రమే.

**శ్రీమతి పి.కె. సేన్:** ప్రతి రాష్ట్రంలోనూ మాకు ఆరు స్థానాలు ఇస్తే ఈ కులాల గొడవ వదిలేయడం మాకు ఇష్టం. అదే మాకు చాలా మేలు. ఉన్నవాళ్లనలో ఉత్తమమైన స్త్రీలతో భర్తీ చేయగలం

**డా॥ అంబేద్కర్:** ఈ ఆరుస్థానాలు నింపడానికి మీకు మరే పద్ధతైనా వుందా?

**శ్రీమతి పి.కె. సేన్:** అవును, ఫెడరల్ అసెంబ్లీ (కి) రాజధాని నగరం (ద్వారా). ఆ ప్రశ్నకు సమాధానం ముందే చెప్పి వున్నాను. రాష్ట్ర అసెంబ్లీకి కూడా అదే సరిపోతుంది. ముఖ్య పట్టణం నియోజకవర్గపు ప్రాంతంగా ఉంటుంది. కొద్దిమందే ఓటర్లు ఉంటారు. ఎంతో ఖర్చు అర్థం కాదు.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–డి, 29-7-1933, పుట 2355.5.

రాష్ట్రాలంతటి నుండీ స్త్రీలు ఆ స్థానాలకు నిలబడడానికి సమర్థులు కాగలరు.

**డా॥ అంబేద్కర్ :** మద్రాసులో ఆరుగురు స్త్రీలు ఎన్నిక కావడానికి ఒక ముఖ్యపట్టణం కావాలా?

**శ్రీమతి పి.కె. సేన్ :** కాదు. రాష్ట్రంలో వివిధ ముఖ్య కేంద్రాలకు వాళ్లకు వేరుగా నియోజక వర్గాలుంటాయి.

**డా॥ అంబేద్కర్ :** మీరెంతవరకు అంగీకరిస్తారనేది నేను అడగదలచిన ప్రశ్న. ఉదాహరణకు మహమ్మదీయ స్త్రీలకు స్థానాలే తీసుకుందాం. మొత్తం సంఖ్య అలాగే వుంచి, కొన్ని స్థానాలకు ప్రత్యేక నియామకం చేయడానికి అనుమతి తీసుకోవాలి. అందుకు శాసనసభల్లో (లెజిస్లేటివ్ అసెంబ్లీలో) స్త్రీలు రావడానికి సంయుక్త నియోజకవర్గ ప్రాతిపదికపై ఏర్పాట్లు చేస్తున్నారనుకోండి. అలా చేసేటప్పుడు వివిధ కులాలవారికి కులభావన సదుపాయాల రీత్యా కొన్ని స్థానాలు రిజర్వు చేయడానికి మీరు సిద్ధమేనా?

**శ్రీమతి పి.కె. సేన్ :** కుల ప్రాతిపదికపై రిజర్వేషనుకు మేము వ్యతిరేకం.

**డా॥ అంబేద్కర్ :** అయిదుగురు హిందూ స్త్రీల ఎన్నికకై హిందూ స్త్రీల ప్రత్యేక నియోజకాలకూ, ఒక ముస్లిం స్త్రీ ఎన్నికకై ముస్లిం స్త్రీల ప్రత్యేక నియోజకాలకూ మీకున్న అభ్యంతరం నేను బాగా అర్థం చేసుకోగలను. నేను తెలిసికోవాలనుకునేదేమంటే: హిందూ ముస్లిం స్త్రీలు కలిసి సంయుక్త నియోజకవర్గంలోనే ఓటు చేసే విధానానికి అంటే కనీసం ఒక స్థానమైనా ముస్లిం స్త్రీకి రిజర్వు చేసే ప్రత్యేక నియోజకవర్గానికి కూడ మీకు అదే విధమైన అభ్యంతరం వుందా?

**శ్రీమతి పి.కె. సేన్ :** వాళ్లంతా ముస్లిం స్త్రీకి ఓటు చేస్తారు.

**డా॥ అంబేద్కర్ :** బహుశ మీరు ఉదారంగా ఇంకా ఎక్కువే ఇస్తారని నాకు తెలుసు. ఒక ముస్లిం స్త్రీకి చట్టం ద్వారా ఒక స్థానం రిజర్వు చేయడాన్ని మంజూరు చేయడానికి మీరు సిద్ధమేనా?

**శ్రీమతి పి.కె. సేన్ :** వాళ్లంతా ముస్లిం స్త్రీకి వోటు చేస్తారు.

**డా॥ అంబేద్కర్ :** బహుశా మీరు ఉదారంగా ఇంకా ఎక్కువే ఇస్తారని నాకు తెలుసు. ఒక ముస్లిం స్త్రీకి చట్టం ద్వారా ఒక స్థానం రిజర్వు చేయడాన్ని మంజూరు చేయడానికి మీరు సిద్ధమేనా?

**శ్రీమతి పి.కె. సేన్ :** అవును, అలా వుండనే వుంది, మనం దాన్ని అంగీకరించాల్సి వుంది.

**డా॥ అంబేద్కర్ :** అది ప్రత్యేక నియోజకాన్ని బట్టి వుండొచ్చు, అది ఎలా ఉంటుందో అందులో లేదు. కాబట్టి దానిపై మీ అభిప్రాయం తెలిసుకోవాలనుకొన్నాను. మద్రాసులో ఈ ఆరుస్థానాలు ఎలా నింపాలో అనేదానికి వివరణాంశాలు శ్వేతపత్రంలో లేవు.

**శ్రీమతి పి.కె. సేన్ :** అది స్త్రీ పురుషుల సంయుక్త నియోజకమై వుంటుంది.

**డా॥ అంబేద్కర్ :** నాకు తెలియదు. ఈ ఆరుస్థానాలూ ఎలా నింపబోతున్నాయో కనీసం మిస్టర్ బట్లర్ అయినా విశదపరచవచ్చు.

**శ్రీమతి యల్. ముఖర్జీ :** తప్పించడానికి వీలయితే మేం కులవ్యత్యాసం కోరుకోవడం లేదు.

**డా॥ అంబేద్కర్ :** మీ ఉద్దేశం నాకు అర్థమౌతోంది. కూలంతూకం చెడకుండడానికిగాను, ఒక స్థానం రిజర్వు చేస్తూ సంయుక్త నియోజకవర్గం కల్గించేటంత మేరకు మీ అభ్యంతరాన్ని తగుమాత్రం తగ్గించడానికి సిద్ధంగా వున్నారా అని అడుగుతున్నాను.

**మిస్టర్ బట్లర్ :** డా॥ అంబేద్కర్ ఇలా అర్థం చేసుకొంటరనుకుంటా. ఏమంటే "ప్రత్యేక స్త్రీల స్థానాలలో నియామకం చేయాలనుకొన్న నికరమైన నియోజక యంత్రాగం ఇంకా సమాలోచనలో వుంది."

**డా॥ అంబేద్కర్ :** కాబట్టి సాధారణ నియోజకవర్గంలో స్త్రీల ప్రత్యేక నియోజకాల ద్వారా ఈ స్థానాలు భర్తీ చేస్తారా అని అడుగుతున్నాను. ఇక్కడ అది స్పష్టం చేయలేదు. అదెలా జరిగిందో తెలియదు. ఎందుకంటే వేరువేరు స్థానాలు కేటాయించిన శీర్షికల పట్టీలో 'సాధారణ' క్రింద ఆరు స్త్రీ స్థానాలూ, 'మహమ్మదీయుల' క్రింద ఒకటి చూపబడ్డాయి. ముస్లిం స్త్రీలకు మాత్రం ప్రత్యేక నియోజకవర్గం వుంటుందనే అభిప్రాయం కల్గిస్తోంది. పర్యవసానం 28మంది పురుషులు ఒకరు స్త్రీ. నాకు తెలియదు, ఈ అంశంపై సమాచారం కోరుతున్నాను.

**ఛైర్మన్ :** సాక్ష్యాలతో సమాచారం సేకరించడానికి ఈ అపరాహ్నం ఉపయోగించుకోవటం బావుంటుంది. విషయానికి వస్తారా?

**శ్రీమతి పి.కె. సేన్ :** అది స్త్రీల ప్రత్యేక నియోజకం మాత్రం కాకూడదు.

**డా॥ అంబేద్కర్ :** మీ స్వేచ్ఛకు వదిలిపెడితే, వాళ్లకు మీరు ఆరూ ఇవ్వవచ్చు, అంతకన్న ఎక్కువా ఇవ్వొచ్చు కదూ!

**శ్రీమతి పి.కె. సేన్ :** ఖచ్చితంగా.

**డా॥ అంబేద్కర్ :** ఏమీ ఉండవేమో అన్న భయం దృష్టిలోనేనా?

**శ్రీమతి పి.కె. సేన్ :** అవును.

## (12)

## పూనా ఒడంబడిక మీద సంయుక్త కమిటీలో చర్చ

***సర్ యన్.యన్. సర్కార్ :** నేనొక చిన్న ప్రకటన చేయవచ్చా? దాని వల్ల విషయాలు సంక్షిప్తమవుతాయి.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–సి, 31–7–1933, పుట 1356–61

ప్రశ్నించే హక్కును కోరుకొంటున్నాను. కుల ప్రాతిపదిక నిర్ణయం గూర్చి ప్రశ్నించడానికి కమిటీ సమ్మతించాలి గదా! కాని, వారసత్వంగా హిందూ ముస్లిం వివాదం గూర్చి నాకు ఒక్క ప్రశ్న కూడా వెయ్యాలని లేదు. ఎందుకంటే సాక్ష్యాలతో ఋజువు పరచగలిగినా ఆ వాస్తవాలపై అది ఆధారపడదు. పూనా పాక్టుకు సంబంధించిన వాస్తవాలందించడానికి మాత్రం ప్రశ్నలు అడగాలని ఉంది. సర్ అన్నెపు పాత్రోగారి ప్రకటన గురించి రెండు పరిశీలనలున్నాయి. వాటికి అనుమతి యివ్వాల్సిందని కోరుతున్నాను. ఎందుకంటే అది కలగాపులగమయిపోతోంది. ఎలాగంటే, ఒక రాష్ట్రంలో ఫలితం మిగతా ఏ రాష్ట్రంతోనూ సంబంధం లేదని ఆ నిర్ణయమే స్పష్టపరుస్తోంది. మిగతా ఏ రాష్ట్రం కన్నా పూర్తిగా వేరుగా మరో రాష్ట్రంలో మార్పు చేసుకోవచ్చని ఆ నిర్ణయమే చెప్తోంది. నా మిత్రుడు, మిస్టర్ జఫ్రుల్లా ఖాన్ గురించి ఇంతమాత్రం చెప్పటానికి సాహసిస్తున్నాను. సమ్మతించడానికి అత్యున్నతమైన కొలమానం ఏమిటా అని రౌండ్ టేబిల్ సమావేశంలో మనం ప్రయత్నం చేస్తూ పోయాం. మనకిదీ చెప్పటానికివీలయింది. నూరుశాతం స్థానాలు హిందువులకు దక్కితే తప్ప ఇక ముందు దేనిలోనూ పాల్గొనటం. ఆ వైఖరి అవలంబించడం మంచిది కాదు. ఈ విషయంలో మంచి చెడులు చూడమని కమిటీని వేడుతున్నాను.

***డా॥ అంబేద్కర్:*** నేనొక మాట చెప్పొచ్చా? ఈ జగడం, ఆ మాట వాడవచ్చంటే – పూనా పాక్టుకు మాత్రమే ఈ పక్షానికి పరిమితం కానున్నదని నాకు సంతోషంగా వుంది. హిందూ ముస్లింల మధ్య స్థానాల పంపకం విషయం సర్ నృపేంద్ర సర్కార్ పునః పరిశీలనకు ప్రతిపాదించారు. అయితే చౌదరి జఫ్రుల్లా ఖాన్ ముస్లింల వైఖరి గురించి వ్యక్తపరచిన భావాలు సరిగ్గా నేను మొదటి నుంచీ వ్యక్తపరుస్తున్నట్టివే. రౌండు టేబిల్ సమావేశాల్లో పాల్గొనేటప్పటి నుంచీ నేనలాగే భావిస్తున్నాను. పూనా ఒడంబడిక ఒక అంగీకారమైన ప్రతిపాదన అనే అవగాహనతో చర్చల్లో పాల్గొనడానికి నేనూ సమ్మతించాను. శ్రీ నృపేంద్ర సర్కార్ కమిటీ ముందు వాస్తవాలు చెప్పడానికి నేను అభ్యంతరపెట్టను. ఎందుకంటే పొరపాట్లు సరిచేసుకోడానికి నాకు కూడ అవకాశం వుంటుందని నాకు తెలుసు. కాని నా స్థానానికి సంబంధించినంతవరకు, కమిటీ ప్రొసీడింగ్స్‌లో పాలు పంచుకోవడం సాధ్యమవుతుందని నేను అనుకోవడంలేదు, ఉదాహరణకు నిమ్నజాతుల ప్రాతినిధ్యం గురించి మొత్తం సమస్య తిరగదోడితే?

***సర్ యన్.యన్. సర్కార్:*** ఈ సందర్భంలో నేను ప్రధానమంత్రికి రాసిన ఈ ఉత్తరాన్నీ, సర్ రవీంద్రనాథ్ టాగూర్ 27 జూలై 1933న ఇచ్చిన విదేశీ టెలిగ్రాంనూ ముందుంచడానికి చైర్మన్ అనుమతి కోరుతున్నాను.

సర్ యన్.యన్. సర్కార్ ప్రధానమంత్రికి వ్రాసిన లేఖ :

సెయింట్ జేమ్స్ కోర్టు,
బకింగ్‌హామ్ గేట్,
లండన్, యస్.డబ్లు.
14 డిసెంబరు, 1932.

ప్రియమైన ప్రధానమంత్రీ,

మీరడిగినట్లే నేను కొన్ని టెలిగ్రాములు పంపిస్తున్నాను. మొదటి టెలిగ్రాం 25మంది బెంగాల్ శాసనసభ సభ్యులు పంపింది. అందులో ఇలా వుంది :

"25 మంది బెంగాల్ శాసనసభ్యుల విజ్ఞాపన పత్రం బెంగాల్ హిందువులను సంప్రదించకుండా పూనా డిప్రెస్డ్ క్లాసెస్ పాక్టు చేశారు. ఇండియాలో ఇతరత్రా ఎక్కడా లేనట్లుగా లోథియన్ కమిటీవారు అతి జాగ్రత్తతో బెంగాల్‌లో డిప్రెస్డ్ క్లాసెస్ సమస్య పరిశీలించి, కనుగొన్నారు. అంబేద్కరుకూ, ఇతరులకూ బెంగాల్ పరిస్థితుల గూర్చి వ్యక్తిగత పరిజ్ఞానం లేదు. అక్కడ డిప్రెస్డ్ క్లాసెస్ అనబడ్డవారు రాజకీయ అనర్హతకు గురి కాలేదు. పూనా పాక్టు విపలాత్మక మార్పు ప్రవేశపెడుతోంది. బెంగాల్‌లో హైందవ సమాజపు సాధారణ అభివృద్ధి మూలాన్ని ఛేదిస్తోంది. బెంగాల్‌లో దాని ప్రభావానికి సంబంధించిన వరకు పూనా పాక్టును మార్పు చేయవలసిన అవసరాన్ని అభ్యర్థిస్తున్నాం. ఎందుకంటే లోథియన్ కమిటీ స్కీము బెంగాల్ పరిస్థితిని చక్కగా తీరుస్తోంది. ప్రధానికి చూపించండి.

"బి.సి. చటర్జీ, యస్.యం. బోస్, మహరాజ దినజ్‌పూర్, మహరాజ కోసింబజార్, రాజబహదూర్ నషిపూర్, నరేంద్రకుమార్ బాసీల, శ్యామప్రసాద్ ముఖర్జీ, రాయ్ బహద్దూర్ కమిని కుమారదాస్, సత్యేంద్రకుమార్ దాస్, కేశవ్‌చంద్ర బెనర్జీ, హరిధన్‌దత్, సతీష్‌చంద్ర ముఖర్జీ, శరత్‌చంద్ర మిత్ర, ఆనందమోహన్ పోద్దార్, సతీశ్చంద్ర, రాయ్ చైదరీ, హనుమాన్ ప్రసాద్ పొద్దార్, కిషోరి మోహన్ చౌదరీ, సత్యకింకర్ సహన, క్షేత్రమోహన్‌రాయ్, దేబి మోహిషి శాంతి శేఖరేశ్వర్‌రాయ్, శరత్‌కుమార్ రాయ్, పి. బెనర్జీ, సురేంద్రనాథ్‌లా, శైలేశ్వర్ సింగ్‌రాయ్."

2. పై టెలిగ్రాం డా॥ అంబేద్కర్‌కు చూపించాను. ఆయన మరో తంతి అందుకున్నాడు. దాని నకలు ఈ విధంగా వుంది :

"బెంగాల్ గురించి బెంగాల్‌కు సంబంధించి పూనా పాక్ట్‌ను తిరిగి సరి చేయమని హిందూ మిత్రులు తంతినిచ్చారు. వాళ్లు రెండుమార్లు తప్పు చేశారు. లోథియన్ కమిటీ ముందు డిప్రెస్డ్ వర్గాల పట్టిక యివ్వకపోవడంలో ఒకసారీ, బొంబే సెప్టెంబర్ సమావేశానికి పిలిచినపుడు ఎవరూ రాకపోవడంతో రెండోసారి. ఇప్పుడు వాళ్లు అసంబద్ధంగా అరుస్తున్నారు. పైగా నామశూద్రులు సీట్లన్నీ కైంకర్యం చేసుకుంటారని వాళ్ల భయం. ఇంకా, లోథియన్ రెండవ సంపుటి ప్రకారం బెంగాల్

ప్రభుత్వపు డిప్రెస్డ్ క్లాసెస్ జనాభా సంఖ్య 103 లక్షలు, సీట్లు లెక్కించడానికిగాను లోథియన్ ప్రకారం మేము పరిగణించింది 75 లక్షలు. ఇంచుమించు లోథియన్ సిఫార్సులకు సన్నిహితంగా పూనా పాక్టు అనుసరిస్తున్నది. ముల్లిక్ నోటు చూడండి. – లోథియన్ సంపుటి II. కలకత్తాలో సాధారణ హిందువుల భావం పాక్టుకు అనుకూలంగా ఉందని తక్కర్ అంచనా. కాబట్టి కాబినెట్ ఆమోదించిన ఒడంబడికను మార్పు చేయడానికి వీల్లేదు.

– బిర్లా, థక్కర్

3. నాకింకా రెండు తంతులు వచ్చాయి, ఉదా :

"అంబేద్కర్‌కు బిర్లా తంతి. బిర్లాకు బెంగాల్ పరిస్థితులతో పరిచయం లేదు. ఏ మాత్రం ప్రాతినిధ్య లక్షణమూ లేదు. బెంగాల్‌లో డిప్రెస్డ్ క్లాసెస్ వారికి 30 సీట్లు అంగీకరించటం మద్రాసులో అంగీకరించిన స్థానాలకు సమానంగా వుంది. అది సమర్థనీయం కాదు. బెంగాల్‌లో డిప్రెస్డ్ క్లాసెస్ సమస్య తీవ్రమైంది కానేకాదు. ఇతర రాష్ట్రాలకు పూర్తిగా వేరైంది. ఈ సమస్యపై ప్రధాని నిర్ణయం చాలా అత్యవసరం. బెంగాలులో దీన్ని అంగీకరించడానికి వీల్లేదు."

"సతీస్ చంద్రసేన్, విజయ్‌కుమార్ బాసు, సత్యేంద్రచంద్రఘోష్ మౌలిక్, అమర్‌నాథ్ దత్, సత్యేంద్రచంద్ర మిత్ర, సత్యచరణ్ ముఖర్జీ, సత్యేంద్రనాథ్ సేన్, జగదీశ్‌చంద్ర బెనర్జీ, నవ కుమార్ సింగ్ దుధోరియా, సెంట్రల్ లెజిస్లేచరీనలో వున్న బెంగాల్ ముస్లిమేతర ప్రతినిధులు."

– అమర్‌నాథ్ దత్.

"బెంగాల్ బిర్లా, తక్కర్‌లు తప్పుడు సమాచారపు తంతి ఇచ్చారని ఇంతకు ముందు తంతి ఇచ్చిన యం.యల్.సీలు చెప్పారు. పూనా పాక్టుకు దారితీసిన సమావేశానికి బెంగాల్ ప్రతినిధులను పిలవలేదు. దాని షరతులు బెంగాల్‌ను ఆశ్చర్యపరిచాయి. ప్రధాని సూత్రం ప్రకారం అంగీకారం లేదు గనుక సెటిల్‌మెంట్ ఆ నిశ్చితం బెంగాల్‌ను కొట్టివేయలేదు. బెం గాల్‌లో ఏ కులాలు అంటరానివో, చేరరానివో లోథియన్ కమిటీ విచారణలు చేసంది. హిందూ ముస్లిములతో కూడిన ప్రావిన్సియల్ ఎన్నికల కమిటీ సరిగ్గా సమాధానం చెపుతుంది. రెండవ సంపుటి రిపోర్టు, ముల్లిక్‌నోట్ కమిటీ ముందు పెట్టలేదు. రహస్యంగా తయారుచేశారు. సుబర్లో బనికుల్ని సహస్ మహిష్యుల్ని డిప్రెస్డ్ కాటగిరీకి బయటనున్నవాళ్లను కూడ కలుపుకోవటంతో ముల్లిక్ చేసిన బెంగాల్ డిప్రెస్డ్ క్లాసెస్ విభజన ఇతర రాష్ట్రాలకు భిన్నంగా ఉంది. ఇంగ్లండ్ నుంచి వచ్చిన భారతీయులు, బ్రహ్మ సమాజం మనుష్యులు ఆఖరికి బైద్యాలు, కాయస్థులు కూడా బ్రాహ్మణులకు వ్యతిరేకంగా చూపించబడ్డారు. బెంగాల్ ప్రజా జీవితం కుల పరిగణాలకు దూరంగా వుంది. మదరిపూర్ వద్ద 1923లో ఉన్నత కుల హిందువులు చటర్జీకి వ్యతిరేకంగా నామశూద్రుని ఎన్నుకున్నారు. సాంప్రదాయిక ఆచారంతో పెనుగులాడేవాళ్ల బ్రాహ్మణ కుమార్తెను పెళ్లాడడాన్ని దేశబంధు తిరస్కరించాడు. అయినా అతని అనుచరులలో చాలా మంది ఉన్నత కుల ప్రజలు. 14 జూలై కలకత్తా గజిట్ ప్రకారం నామశూద్రుల

వంపకం 20 రిజర్వుడు స్థానాలు సాధించడాన్ని నికరం చేస్తోంది. నామ శూద్రేతరులు భవిష్యత్ గూర్చి హడలిపోతున్నారు. సాంఘిక సహవాసం నుండి నామశూద్రులు రాజబన్సీలు ఇతర నిమ్న కులాలవారిని గట్టిగా దూరం చేస్తారు. వాళ్లకు ఇతర కులాలకు ప్రాతినిధ్యం వహించే హక్కు ఉన్నత కులస్థుల కన్నా తక్కువ. ఎందుకంటే ఉన్నత కులస్థులు తరతరాల నుండి నిమ్న కులస్థుల ఉద్ధరణకు పాటుపడ్డారు. హిందూ బెంగాల్ అనే రాజకీయ విభజన పూనా పాక్టు ప్రవేశపెడుతుంది. అలాంటిది పూర్వం లేదు. ప్రధానికి చూపండి."

– చటర్జీ – ఇతరులు

4. గత సంవత్సరం ఆగస్టులో ఇండియా నుండి వచ్చేశాను. పూనా పాక్టు సంబంధంగా నాకు ఎలాంటి సమాచారం స్వయంగా తెలియదు.

5. మీ 'కమ్యూనల్ నిర్ణయం"లో ఈ విధంగా చెప్పారు. "ఒక విషయం అతి స్పష్టంగా అర్థం చేసుకోవాలని ప్రభుత్వం వారు ఆశిస్తున్నారు. వాళ్ల నిర్ణయాన్ని మార్పు చేయాలనే దృష్టితో ప్రారంభించే ఎలాంటి సంభాషణలకూ వారు భాగస్వాములు కారు. దానివల్ల ప్రభావితమయ్యే పక్షాలన్నీ బలపరచని మార్పును సాధించాలనే ఎలాంటి ప్రతిపాదననూ పరిగణనలోకి తీసుకోవడానికి సిద్ధంగా వుండరు."

6. మీ నిర్ణయం ప్రకారం హిందువులు (డిప్రెస్డ్ క్లాసెస్ అనబడ్డ వారందరితో సహా) 80 స్థానాలు పొందగా, మహమ్మదీయులు 119 సీట్లు పొందారు. అంటే హిందువులకన్న 50 శాతం ఎక్కువ. ఐరోపా సంబంధీకులకు 25 స్థానాలు వచ్చాయి. మొత్తం మీద 10 శాతం. కాని మొత్తం జనాభాలో వాళ్ల జనసంఖ్య కనీసం ఒక్క శాతం కూడాలేదు. స్థానం, ప్రభావం, విద్య మున్నగు అంశాలు లెక్కలోకి తీసుకున్నట్లున్నారు. ఐరోపావారిపట్ల న్యాయ సమ్మతంగా పరిగణించారు. కాని హిందువుల, ముస్లింల విషయంలో తలలు మాత్రమే లెక్కలోకి తీసుకున్నారు. మహమ్మదీయులు 21 సంవత్సరాల లోపున పిల్లల్ని కూడా కలుపుకొని 54 శాతం ఉన్నట్లు స్వతః ప్రతిపాదన చేస్తున్నారు. వయోజనుల్ని లెక్కలోకి తీసుకొంటే మహమ్మదీయులకు చెప్పుకోదగ్గ మెజారిటీ లేదు.

7. మహమ్మదీయుల జనాభా 54 శాతం ఉన్నా కూడా, హిందువుల కన్నా 50 శాతం ఎక్కువ స్థానాలు సంపాదించడం ప్రత్యేక స్థానాల రూపకల్పన ద్వారా లభించినట్లు వివరించడం జరిగింది. 51 స్థానాలు హిందువుల నిష్పత్తితో సంబంధం లేని పెద్దభాగం.

8. ఐరోపావారికి 25, ఆంగ్లో ఇండియన్లకు 4, కార్మికులకు 8 కలిపి ప్రత్యేక స్థానాల స్వభావాన్ని బట్టి హిందువులు మొత్తం మీద ఈ స్థానాల నుండి తమ నిష్పత్తిని భర్తీ చేయగలరన్న సూచనకు దారి తీయదు.

9. వాదనలెంత శక్తివంతంగా ఉన్నా మీరు వినలేరనేది నాకు పూర్తిగా తెలుసు. మీరిచ్చిన నిర్ణయంలో వాడిన పదజాలం పట్ల ఉన్న గౌరవాన్ని బట్టి చెప్తున్నాను. కాని మంచి ఉద్దేశంతోనే ఉన్నా ఆ నిర్ణయం హిందువుల పట్ల చాలా అపసవ్యంగా పనిచేస్తుంది. ఆ కారణం చేతనే డిప్రెస్డ్ క్లాసెస్ కాకుండా మిగతా బెంగాల్ హిందువులు మారిచ్చిన నీరుగార్చే నిర్ణయం వల్ల అభ్యంతర పెడుతున్నారు. వాదం కొరకు, కొంత చెప్పడానికి అనుమతిస్తే, ఒక కమ్యూనిటీ తన భాగం కన్నా ఇంచుమించు 50 శాతం ఎక్కువ పొందిందని భావింపబడుతోంది. న్యాయ సమ్మతంకాని ఈ లాభాన్ని ఎలాంటి ఊహాత్మక న్యాయ విచారణల వల్లా వదులుకుంటారని అనుకోవటం అనాలోచితం.

10. ఇందులో ఉన్న విషయం కేవలం యదార్థానికి సంబంధించింది. ఉదా: ఇప్పుడు దోషారోపణ చేస్తున్న జనం మీ నిర్ణయాన్ని మార్పు చేయడానికి అంగీకరించారా? ఆరోపిత 'దోషాల' అంగీకారాన్ని గురించి కష్టపడి చేసిన వాదనకు శక్తి లేదని మనవి చేస్తున్నాను. ఎలా అయినాసరే, అలాంటి దోషం వుండి వుందా అనేది ఇక నిశ్చయించవలసే వుంది. దాన్నిబట్టి డిప్రెస్డ్ క్లాసెస్ కాని వంగదేశీయులు మీ అవార్డును మార్చడానికి అంగీకరించారని తేల్చవచ్చు.

11. బిర్లా, తక్కర్ టెలిగ్రాం వాస్తవాలు సరిగ్గా అందజేస్తున్నదన్న ప్రాతిపదిక మీద ఈ విషయం ప్రాధాన్యత సంతరించుకొందని మనవి చేస్తున్నాను. అయితే ఆ వాస్తవాలు కూడ వివాదాస్పదంగా వున్నాయి. ఈ వాస్తవాలు విషయపరంగా సరియైనవని గ్రహించినా, ఏ అంగీకారమూ కుదరాలని లేదు.

12. నష్టపోయిన వర్గం పట్ల ఒక విచారణ చెయ్యాలి. అంటే పూనా పాక్టుతో భాగస్థులయిన లేక కట్టుబడ్డ బెంగాలో డిప్రెస్డ్ క్లాసెస్ కానివారి వాస్తవాల విషయంలో జరగాలి. ఆ విచారణ భారత ప్రభుత్వం కానీ, బెంగాల్ ప్రభుత్వంకానీ లేక ఇతర బాధ్యతలగల తటస్థ ఏజన్సీ చెయ్యాలో - వివరాల్లోకి వెళ్ళాల్సిన విషయం.

ఈ లేఖ నకలు సమాచారం నిమిత్తం డా॥ అంబేద్కర్‌కు పంపుతున్నాను.

నేను ఇంగ్లండు నుండి త్వరలో వెళ్లవలసి ఉన్నందున ఇది అందిన సమాచారంగానీ, దీనికి సమాధానం గానీ ఈ క్రింది చిరునామాకు పంపేటట్లు దయచేసి ఆదేశమివ్వవచ్చును.

శ్రీ నరేంద్రకుమార్ బాసు, యం.యల్.సి.,
బార్ అసోసియేషన్, హైకోర్టు, కలకత్తా.

నిజాయితీతో
మీ
(సం) యన్.యన్. సర్కార్
ఇండియన్ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు సభ్యుడు

**రవీంద్రనాథ్ ఠాగూర్ టెలిగ్రాం :**

ది. 27-7-1933

సర్ యన్.యన్. సర్కార్‌కు

కమ్యూనల్ అవార్డును గురించి మహాత్మాజీ సమర్పించిన ప్రతిపాదనను ఆమోదించడంలో ఆలస్యం చేయొద్దని ప్రార్థిస్తూ ప్రధానమంత్రికి తంతి యిచ్చిన జ్ఞాపకం. ఆ క్షణంలో ఒక పరిస్థితి ఏర్పడింది. అది చాలా బాధాకరంగా వుంది. పూనా పాక్టు నుండి తలెత్తే పర్యవసానాలు గూర్చి నెమ్మదిగా యోచించడానికి తగిన సమయంగానీ, మనశ్శాంతిగానీ, లేకపోవటం మిక్కిలి బాధాకరంగా ఉంది, నేను చేరకముందే పూనా పాక్టు జరిగింది; అప్పటికే సప్రూ, జయకర్, సభ్యుల సహాయంతో అక్కడి నుండి వెళ్ళిపోయారు. వాళ్లలో బెంగాల్‌కు బాధ్యతగా ప్రాతినిధ్యం వహించేవారు ఒక్కరూ లేరు. మహాత్ముని జీవితం ఈ సమస్యను తక్షణం తీర్చే దానిమీద ఆధారపడి ఉంది. ఆ సంక్షోభం కలగజేసిన సహించరాని తొందరపాటు ఒక ఒప్పందంలో పడిపోయేటట్లు తరిమింది. అలా జరగడం మన దేశం యొక్క శాశ్వత ప్రయోజనానికి విరుద్ధంగా దోషం చేసినట్లు నేనిప్పుడు గ్రహిస్తున్నాను. రాజకీయ వ్యవహారాలలో నాకు అనుభవం లేదు. మహాత్మాజీ పట్ల గొప్ప అభిమానం పెంచుకున్నాను. భారతీయ రాజకీయాల్లో మహాత్మునికి ఉన్న విజ్ఞానంలో నేను పూర్తిగా విశ్వాసముంచుకున్నాను. అంచేత నేనింకా యోచించడానికై వేచి ఉండలేకపోయాను. బెంగాల్ విషయంలో నన్ను బలి చేయడమైందని తెలుసుకోలేకపోయాను. సంబంధిత పక్షాలన్నిటికీ ఈ అన్యాయం చెరుపు చేయడం కొనసాగిస్తుందనడంలో నాకిపుడు కించిత్తు సంశయమూలేదు. మా రాష్ట్రంలో కులఘర్షణ భావాన్ని సజీవంగా ఉంచుతోంది తీవ్రరూపంలో. దానివల్ల శాంతంగా వున్న ప్రభుత్వం కూడ నిరవధికంగా చిక్కుల్లో ఇరుక్కుంటుంది.

– రవీంద్రనాథ్ ఠాగూర్

**ప్రధానమంత్రికి డా॥ అంబేద్కర్ లేఖ దానికి జతపరచినవి :**

ఇంపీరియల్ హోటల్
రస్సెల్ స్క్వేర్,
లండన్, డబ్ల్యు.సి.,
5 జనవరి 1933

ప్రియమైన ప్రధానమంత్రీ,

సర్ యన్.యన్. సర్కార్ మీకు 198 డిసెంబర్ 1932న వ్రాసిన లేఖ నకలు నాకు సుహృద్భావంతో పంపారు. మీ యొక్క సమాలోచన నిమిత్తం వారికిచ్చిన కొన్ని టెలిగ్రాములను ఆయన ఇండియాకు బయలుదేరేముందు మీకు పంపారు. అవి బెంగాల్‌లో సవర్ణ హిందువుల నుండి

వచ్చాయి. బెంగాల్ సవర్ణ హిందువులకూ డిప్రెస్డ్ వర్గాలకూ మధ్య జరిగిన పూనా తీర్మానం నిబంధనలు అమలు జరపడంలో విరుద్ధాభిప్రాయం వ్యక్తపరుస్తూ ఇచ్చారు; ఆ తీర్మానంలో బెంగాల్ సవర్ణ హిందువుల ప్రాతినిధ్యం లేదనేదే దానికి కారణం.

ఇతర పక్షం నుండి కూడ నాకు టెలిగ్రాములు వచ్చాయి. వాటిలో ఒకటి, శ్రీయుతులు తక్కర్, బిర్లాల నుండి వచ్చిందాన్ని సర్ యన్.యన్. సర్కార్‌కు చూపించాను. సంప్రదింపుల సందర్భంలో వాళ్లిద్దరూ మిస్టర్ గాంధీ తరపున వ్యవహరించారు. దాని పర్యవసానమే పూనా ఒడంబడిక. దాని పాఠం కూడ తన లేఖలో పేర్కొన్నారు. వాటితో మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని నాకేమీ లేదు. మొదటి కారణమేమంటే, తమ రాజ ప్రభుత్వం పూనా ఒప్పందం ఆమోదించిన మీదట, నా దృష్టిలో ఆ విషయం సమాప్తం చేసినట్లే. రెండో కారణం, ఆ టెలిగ్రాములను మీ సమాచారం నిమిత్తం పంపడం తప్ప తానింకేమీ చేయనని సర్ యన్.యన్. సర్కారు హామీ ఇచ్చారు. కాని సర్ యన్.యన్. సర్కార్ కేవలం టెలిగ్రాములు దాఖలు చేయడంతో సంతృప్తి చెందలేదు. శ్రీయుతులు తక్కర్, బిర్లా తమ టెలిగ్రాంలో వాడినట్లు బలవంతపు వాద దోష ద్వారా వచ్చిన ఒప్పందం గురించి నష్టపడి చేసిన వాదం" బలంలేనిదనీ, విన్నవించారు. చివరికి మరో కారణం చెప్పి ముగించారు. "నిమ్న జాతీయేతర బెంగాలీలు పూనా సాక్టులో భాగస్వాములుగానో, దానికి కట్టుబడిన వారుగానో ఉన్న వాస్తవాన్ని గూర్చిన విచారణ.... భారత ప్రభుత్వం లేక బెంగాల్ ప్రభుత్వం లేక బాధ్యత తటస్థమైన ఏ ఇతర ఏజెన్సీ ద్వారానైనా జరపాలి." కాబట్టి వారు లేవనెత్తిన ఈ సమస్యపై నా అభిప్రాయాలివ్వడానికి ప్రేరేపితుడనైనానని భావిస్తున్నాను.

నా మొదటి విన్నపమేమంటే : పూనా ఒప్పందంలో బెంగాల్ హిందువుల ప్రాతినిధ్యం లేదని అనుకున్నా ఆ కారణమాత్రంతోనే అది బెంగాల్‌కు అనువర్తించనిది కారాదు. బ్రిటిషు ప్రభుత్వం వారి కమ్యూనల్ నిర్ణయం 4వ పేరా కింద అవార్డు నిబంధనలు అధిగమించడానికి అంగీకార ఒప్పం దానికి షరతు వుంది. మొత్తం బ్రిటిష్ ఇండియా – సవర్ణ, నిమ్న – రాష్ట్రానికి రాష్ట్రానికి వర్తిస్తుందనే ఒప్పందం పొందుపరచలేదని గుర్తుంచుకోవాలి; ఎందుకంటే రాష్ట్రమనేది, దాని అంగీకారానికి, అవసరమైన నిబంధన. వాస్తవానికి ఇంకాస్త ముందుకు వెళ్లినేచెప్పేదేమంటే – అలాంటి ఒప్పందం ఏ ఒక్క రాష్ట్ర విషయంలో తీర్మానం చేయడానికైనా కమ్యూనల్ నిర్ణయంలో ముందుగా పొందుపరచబడలేదు. నే చదివి అర్థం చేసుకున్న దాని ప్రకారం 4వ పేరాలో పొందుపరచిందంతా ఏమంటే – ఆచరణీయమైన ప్రత్యామ్నాయ పథకం సంబంధిత కులాలన్నీ పరస్పరం సమ్మతించాయని బ్రిటిష్ ప్రభుత్వం వారు సంతృప్తి చెందాలి అనే. 4వ పేరాపై నా వ్యాఖ్యానాధారం చేసుకొని, బెంగాల్ సవర్ణ హిందువుల ప్రాతినిధ్యం లేకపోవడం ఒక్కటే పూనా ఒప్పందం బెంగాల్‌కు అనువర్తింప చేయడానికి అడ్డు తగలదని చెప్పడానికి సాహసిస్తున్నాను. తద్వ్యతిరేకమైన వ్యాఖ్యానం యదార్థమైతే పంజాబ్, ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సా నిమ్నజాతులు పూనా ఒడంబడికను వ్యతిరేకించడానికి అవకాశమివ్వడమవుతుంది; ఎందుకంటే దానిలో వాళ్ల ప్రాతినిధ్యం అసలు లేనేలేదు.

నా రెండవ విన్నపమేమంటే, సర్ యన్.యన్. సర్కార్ మీకు పంపిన టెలిగ్రాంలో సంతకాలు చేసిన వారు ఆరోపించినట్లు బెంగాల్ సవర్ణ హిందువుల ప్రాతినిధ్యం లేదని అనుకోవడంపై వాస్తవంగా ముందుకు వెళ్లనవసరం లేదు. నిజానికి వాళ్లు ప్రాతినిధ్యం వహించారని నాకు తెలుసు. బెంగాల్ హిందువులు వాళ్లకు పంపిన ఆహ్వానంపై ప్రతిస్పందించలేదని శ్రీయుతులు థక్కర్, బిర్లాలు తమ తంతిలో పేర్కొన్నది సరికాదు. ఆ ప్రకటన బట్టే సర్ యన్.యన్. సర్కార్ విచారణకు నెపం నిలబెట్టారు. మనసులో ఉంచుకోవాల్సిన ముఖ్యాంశమేమంటే, ఈ బెంగాల్ ప్రతినిధులు కేవలం మౌన ప్రేక్షకులుగా ఉండకపోవడమేగాక, సంప్రదింపులలో చురుగ్గా పాల్గొన్నారు. నాకు బాగా గుర్తుంది, రాజా పార్టీకి చెందిన బెంగాల్ నిమ్నజాతి యువకుని వెంటబెట్టుకొని బొంబాయిలో వాళ్లలో ఒకరు నన్ను కలిశారు. నాతో గంటన్నరసేపు వ్యక్తిగతంగా సమావేశమయ్యారు. ఆ సమావేశంలో సంయుక్త నియోజకవర్గాల ప్రాతిపదికపై నన్ను సవర్ణ హిందువులతో అంగీకారానికి రమ్మని అర్థించారు. కాబట్టి బెంగాల్ సవర్ణ హిందువులు ప్రాతినిధ్యం వహించలేదనడం పూర్తిగా అబద్ధం. శ్రీయుతులు థక్కర్, బిర్లాల ప్రకటనలో నిక్కచ్చితనం లోపించడానికి కారణం సంప్రదింపుల వివరాలన్నిటితో సన్నిహితంగా ఉండడం అసాధ్యం కావడమే; ఇందులో కలిసి ఉన్న సమస్యల మహోన్నత స్వభావాన్ని మన్నిస్తే అది పూర్తిగా క్షమార్హం. నాతో సమావేశమైన బెంగాల్ సవర్ణ హిందూ పెద్దమనిషి పేరు మీకిప్పుడు చెప్పలేకున్నందుకు విచారపడుతున్నాను. కాని నేను ఇండియాకు తిరిగి వెళ్లిన వెంటనే అతని పేరు మీకు అందేలాగ చేయగలను.

కాబట్టి బెంగాల్ సవర్ణ హిందువుల తరపున పూనా ఒప్పందాన్ని తిరగదోడే సావకాశమే లేదు. నిమ్నజాతులకు సంబంధించిన వరకూ, వాళ్ల తరపు మనిషి, శ్రీ యం.బి. మల్లిక్, వాళ్లు పూనా పాక్టు అంగీకరించినట్లు, నాకు తంతి పంపినాడు. అతని తంతి, శ్రీయుతులు థక్కర్ బార్లాల తంతి అసలువి మీ సమాచారం నిమిత్తం దీంతో జత పరుస్తున్నాను. వచ్చేవారం నేను ఇండియాకు బయలుదేరుతున్నాను. ఈ సంబంధంగా ఈ విషయంలో నాకు మీరేదైనా సమాచారం అందించాలని వుంటే, నా బొంబాయి చిరునామాకు పంపవచ్చు. దాన్ని సిద్ధంగా ఈ కింద పొందుపరుస్తున్నాను.

ఇట్లు
విశ్వాసపాత్రుడు
(సం) బి.ఆర్.అంబేద్కర్

చిరునామా :
దామోదర్ హాల్, పారెల్,
బొంబాయి – 12 (ఇండియా)

## డిశంబరు 1, 1932 నాటి తంతి నకలు

1774 ఢిల్లీ 118.29.2020
డి.యల్.టి. డాక్టర్ అంబేద్కర్
ఇండియా ఆఫీస్, లండన్.

బెంగాల్ నిమిత్తం పూనా పాక్టు పునః పరిశీలన విషయంలో బెంగాల్ హైందవ మిత్రుల తంతి గురించి, వాళ్లు రెండుమార్లు పొరపాట్లు చేశారు. లోథియన్ కమిటీ ముందు నిమ్నజాతుల జాబితా ఇవ్వకపోవడం ఒకసారి, బొంబాయిలో సెప్టెంబరు సమావేశానికి పిలిచినపుడు ఎవ్వరూ రాకపోవడం రెండోసారి. ఇప్పుడు అసంబద్ధంగా గొంతు చించుకుంటున్నారు. దాంతోపాటు, నామశూద్రులు స్థానాలన్నీ వాడుకుంటారని న్యాయవిరుద్ధంగా భయపడుతున్నారు. పైగా లోథియన్ సంపుటి 2, పేజి 263 ప్రకారం బెంగాల్ ప్రభుత్వ నిమ్నజాతి జనాభా 103 లక్షలు, స్థానాలు లెక్కగట్టడానికిగాను మేము 75 లక్షలని తీసుకున్నాము. లోథియన్ ప్రకారం పూనా పాక్టు లోథియన్ సిఫార్సులకు సన్నిహితంగా వుంది, లోథియన్ సంపుటి 2, పేజి 251 మల్లిక్ నోట్ చూడండి. కలకత్తాలో సామాన్య హైందవ భావన పూనా పాక్టుకు అనుకూలంగా ఉన్నట్లు థక్కర్ తెలుసుకున్నారు. కాబట్టి కాబినెట్ మంజూరు చేసిన పాక్టు పునః పరిశీలించవలసిన పనిలేదు.

– బిర్లా, థక్కర్

## టెలిగ్రాం నకలు 26 డిసెంబరు, 1932

డబ్లు. యల్.టి. అంబేద్కర్,
ఇండియా సమావేశం, లండన్

బెంగాల్ నిమ్నజాతులు పూనా ఒప్పందం అంగీకరిస్తున్నారు. అలాగే హిందువులు హిందువుల ప్రాతినిధ్యం దురుద్దేశపు వక్రబుద్ధి – మల్లిక్.

## (13)

## డా॥ బి.యస్. మూంజే, శ్రీ బి.సి. ఛటర్జీ, శ్రీ జె. బెనర్జీ, శ్రీ జి.ఎ. గవాయ్, రాయ్ సాహెబ్ మెహెర్ చంద్‌ఖన్నా, శ్రీ ఆర్.యం. దేశ్‌ముఖ్, శ్రీ భాయ్ పరమానంద్, ఇంకా పండిట్ నానక్‌చంద్, హిందూ మహాసభ తరఫున

***డా॥ అంబేద్కర్ :** డా॥ మూజేను ఒకటి రెండు ప్రశ్నలు అడగాలని వుంది. మొదటిగా, డా॥ మూంజే సర్ నృపేంద్ర సర్కార్ మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడిగారు. మహాత్మగాంధి ఉపవాసం వల్ల ఉత్పన్నమయిన

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2 – సి, 31 జూలై 1933, పేజి 1425-34.

సమస్య విషయంలో చేయవలసిందేమిటో చర్చించడానికి పండిట్ మదనమోహన్ మాలవ్యా బొంబాయిలో జరిపిన సభను గూర్చి అడిగారు. వివరాలు రాబట్టడానికిగాను ఒకటి రెండు ప్రశ్నలడగాలనుకుంటున్నాను. 1932 సెప్టెంబరు 19న బొంబాయిలో పండిట్ మాలవ్యా అధ్యక్షతన జరిగిన మొదటి సమావేశంలో మీరున్నారు కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** మీకు తెలుసుకదా, ఆ సమావేశంలో ఒక చిన్న సబ్ కమిటీ ఏర్పడింది.

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** అందులో నిమ్నజాతుల ప్రతినిధులూ, సవర్ణ హిందువుల ప్రతినిధులూ, శ్రీ జయకర్, సర్ తేజ్ బహదూర్ సప్రు తదితరులతో సహా ఉన్నారు కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఆ సబ్ కమిటీ ఆ సమస్య చర్చించడానికి పూనా వెళ్లింది కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఎందుకంటే ఆ విషయం చర్చించేటప్పుడు మహాత్మాగాంధీకి దగ్గరలో వుండడం వాంఛనీయమని వాళ్లనుకున్నారు. మహాత్మాగాంధీ అంగీకారంతో సబ్‌కమిటీ సమీక్షణల పర్యవసానంగా పూనాపాక్టు పూనాలో కుదిరింది కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** తర్వాత సబ్ కమిటీ నియామకం చేసిన ప్రధాన హిందూ కమిటీ సెప్టెంబరు 25న బొంబాయిలో మళ్లీ కలిశారు కదా!

***డా॥ మూంజె :*** కావచ్చు. నేను హాజరు కాలేదు.

***డా॥ అంబేద్కర్ :*** ఆ మీటింగ్‌లో ఆ పాక్టు ఓటుకు పెట్టి పాస్ చేశారు. అలాగే కాదా?

***డా॥ మూంజె :*** వివరాలన్నీ తెలియబరచడానికి డా॥ అంబేద్కర్ అవకాశం ఇచ్చినందుకు నాకు సంతోషంగా ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** మీ అంతటకి మీకే అది తెలుసా?

***డా॥ మూంజె :*** వ్యక్తిగతంగా తెలిసిన వివరాలు నేను ఇవ్వగలను.

***డా॥ అంబేద్కర్ :*** ఈ ప్రశ్న అడగాలనుకుంటున్నాను. పూనాలో తన పని పూర్తి చేసుకొని సబ్ కమిటీ బొంబాయికి వచ్చి, తానేం చేసిందీ, సబ్ కమిటీ నియామకం చేసిన ప్రధాన హిందూ సమావేశానికి రిపోర్టు సమర్పించిందన్న సంగతి మీకు ఎరుకేనా అని నాకు తెలుసుకోవాలని వుంది.

***డా॥ మూంజె :*** అవును. అలా చేసి వుంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** ఈ ప్రశ్న శ్రీ గవాయిని అడుగుతాను. ఆయన అక్కడున్నాడనుకొంటా. శ్రీ గవాయ్, పూనాపాక్టుకు కారణమైన సంప్రదింపులలో మీరు పాల్గొన్నారు కదరనా!

***శ్రీ గవాయ్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** నేను తప్పు పట్టటానికని మాట్లాడడంలేదు. కాని మీరు ఆ సమయంలో రాజా-మూంజె పాక్టు పార్టీ అనబడ్డదానికి చెంది వున్నారు!

***శ్రీ గవాయ్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** మీరు పూనాలో హాజరయ్యారా?

***శ్రీ గవాయ్ :*** అయ్యాను.

***డా॥ అంబేద్కర్ :*** పాక్టుపై సంతకాలు చేయగానే సబ్ కమిటీ బొంబాయి తిరిగి వచ్చింది, పండిట్ మాలవ్యా అధ్యక్షతన సభ జరిపింది. పూనాపాక్టు ఆమోదిస్తూ ఆ కమిటీ మొత్తం తీర్మానం చేసింది?

***శ్రీ గవాయ్ :*** అవును.

***డా॥ మూంజె :*** ఈ అంశాల మీద డా॥ అంబేద్కర్ నన్ను అడిగారు. నేను వివరించవచ్చునా?

***అధ్యక్షులు :*** డా॥ అంబేద్కర్ పరిశీలనపై తుది అభిప్రాయాలు వినాలని కమిటీకి వుందనుకుంటా. మీ వివరాలు తర్వాత వింటాము, డా॥ మూంజె.

***డా॥ అంబేద్కర్ :*** సబ్ కమిటీ నియామకం అయిన తర్వాత అది మహాత్మాగాంధీతో చర్చించడానికి పూనా వెళ్లిన తర్వాత ఢిల్లీలో 1932 సెప్టెంబరు 24, 26 మధ్యలో హిందూ మహాసభ సమావేశమయ్యింది కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** అది మాలవ్యా అధ్యక్షతన క్రిందేనా?

***డా॥ మూంజె :*** కాదు, శ్రీ యన్.సి. కేల్కార్ అధ్యక్షతన.

***డా॥ అంబేద్కర్ :*** ఢిల్లీలో ఆ సమావేశానికిలో శ్రీ రామానంద ఛటర్జీ హాజరయ్యారు కదా?

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఢిల్లీలో ఆ హిందూ మహాసభ మీటింగ్‌లో రాజా నరేంద్రనాథ్ కూడా హాజరయ్యారు కదా!

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఈ పాక్టును ఢిల్లీ మీటింగ్‌లో హిందూ మహాసభ స్థిరపరిచింది వాస్తవమే కదా?

***డా॥ మూంజె :*** అవును, దాన్ని గూర్చి ప్రశ్న లేదు.

***డా॥ అంబేద్కర్ :*** బెంగాల్ సవర్ణ హిందువులలో శ్రీ రామానంద్ ఛటర్జీ నాయకత్వంగల సభ్యుడు గదా?

***డా॥ మూంజె :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** హిందూ మహాసభలో చాలా ప్రముఖమైన సభ్యుడు కదా!

***డా॥ మూంజె :*** అవును.

***శ్రీ జె. బెనర్జీ :*** అతడు సవర్ణ హిందువు కాదని నేను వివరించవచ్చా; అతడు అసవర్ణ హిందువు; అతడు బ్రహ్మ (బ్రహ్మ సమాజికుడు).

***జెట్‌లాండ్ మార్క్వెస్ :*** పూర్వపు సాక్ష్యంలో అచ్చు తప్పు చూశాను. అది సహజమైన తప్పు. సర్ రవీంద్రనాథ్ ఠాగూరు "బ్రహ్మ" అని వుంది. అది సవర్ణ హిందువుకు పూర్తిగా వేరైంది. సాక్ష్యంలో 'బ్రహ్మ' అనే పదం 'బ్రాహ్మిన్' అయింది. బ్రాహ్మిన్ అంటే అక్కడ ఒకానొక అత్యున్నత కులం. శ్రీ రామానంద్ ఛటర్జీకి అదే చెల్లుతుంది. అతడు బ్రహ్మ, బ్రాహ్మిన్ కాదు. అలా కాదా?

***శ్రీ జె. బెనర్జీ :*** అవును.

***శ్రీ జఫ్రుల్లాఖాన్ :*** ఈ పక్షం నుండి వివరాలు నిజంగా తెలియని మేము దీన్ని అర్థం చేసుకోవాలని వుంది. బ్రాహ్మిన్ లేక నాన్ బ్రాహ్మిన్ అనేది పుట్టుకకు సంబంధించిన ప్రశ్న కదా! బ్రాహ్మణుడుగా ఎవరు పుట్టారు? కులరీత్యా డా॥ మూంజె బ్రాహ్మణుడు. కులానికి సంబంధించిన వరకూ అతని నమ్మకాలు – నిశ్చయాలు చూపినప్పటికీ!

***శ్రీ జె. బెనర్జీ :*** వేరేమతం అనుసరిస్తే ఇక అతను హిందువు కాదు.

***శ్రీ యం.ఆర్. జయకర్ :*** ఈ అంశంపై నేనొక ప్రశ్న వేయొచ్చా? ఒక మనిషి బ్రహ్మ కాబట్టి అతడు ఇక హిందువు కాదని సలహా ఇవ్వడం మీ ఉద్దేశం కాదుకదా!

***శ్రీ జె. బెనర్జీ :*** మతరీత్యా ఇక అతను హిందువు కానేకాదు. అతడు హైందవేతరుడు. పెళ్లి చేసుకున్నపుడు హైందవేతరుడుగా చెప్పుకోవలసి వస్తుంది.

***శ్రీ యం.ఆర్. జయకర్ :*** వివాహ చట్టం గురించి లేక అలాంటి దేన్ని గురించీ ఈ సందర్భంగా నేను మాట్లాడడంలేదు. మతంలో ఒక బ్రాహ్మణుడు బ్రహ్మ అయితే, అతడు ఇక హిందువు కాడని లేక బ్రాహ్మణుడు కాడని మీరొక హిందువుగా చెపుతారా?

***శ్రీ ఓ. బెనర్జీ :*** ఖాయంగా అతడొక బ్రాహ్మణుడు కాదు.

**డా॥ అంబేద్కర్ :** డా॥ మూంజే, శ్రీ రామానంద చటర్జీ బ్రహ్మ లేక హిందువా అనే ప్రశ్న అటుంచి, హిందూ మహాసభ ఉద్యమంలో చాలా క్రియాత్మక పాత్ర వహిస్తున్నారు కదా!

**డా॥ మూంజె :** అవును.

**డా॥ అంబేద్కర్ :** హిందువుల స్వప్రయోజనంలో ముఖ్యపాత్రధారి కదా!

**డా॥ మూంజె :** అవును.

**డా॥ అంబేద్కర్ :** రాజా నరేంద్రనాథ్‌ది పంజాబ్ కదా!

**డా॥ మూంజె :** అవును.

**డా॥ అంబేద్కర్ :** స్థానిక హిందూ మహాసభ అధ్యక్షులు!

**డా॥ మూంజె :** హిందూ మహాసభకు కూడ అధ్యక్షులు. అధ్యక్ష ప్రభూ! నేను వివరించవచ్చా?

**ఛైర్మన్ :** మీకు ఇష్టమైతే !

**డా॥ మూంజె :** పండిట్ మాలవ్యా బాంబే మీటింగుకు నన్ను పిలిచారు. అక్కడ మీటింగు జరిగింది, చర్చలు కొనసాగుతున్నాయి. నేను లేచి,డ డా॥ అంబేద్కర్‌కు గుర్తుండి ఉంటుంది, ఇలా అన్నాను. నిమ్న జాతులకు సంయుక్త నియోజకవర్గాలలో స్థానాలు ప్రత్యేకించడానికి కూడ మహాత్మాగాంధీ సిద్ధంగా లేనపుడు వారు ఉపవాస విరమణ నిమిత్తం, ఈ సమస్యపై ఎలాంటి రాజీ సాధ్యం కాదు. అయినా రెండోరోజున మహాత్మాగాంధి సంయుక్త నియోజకవర్గాల్లో రిజర్వేషన్ గుర్తించడానికి సిద్ధమయ్యారని వార్తలు వచ్చాయి, గొప్ప ఉపశమనమయింది. నేను ఊపిరి పీల్చుకున్నాను. పూనా పాక్టు సూత్రీకరణ చేసే ఒక సమావేశంలో, ఆ సమయంలో పండిట్ మాలవ్యాకు ఒక విషయం విస్పష్టంగా చెప్పాను: ఈ సూత్రీకరణ ప్రత్యేక నియోజకవర్గాలపై ఆధారపడి జరుగుతున్నదని చెప్పాను. ప్రత్యేక నియోజకవర్గాల పట్ల స్వయంగా నాకూ, హిందూ మహాసభ సంఘానికి మౌలికమైన అభ్యంతరం వుంది. స్వయంగా నేనున్నూ, హిందూ మహాసభ ఒక సంఘంగానూ ఈ పూనా పాక్టు సూత్రాన్ని అంగీకరించం. తర్వాత సంప్రదింపులు జరిపేటందుకు ఇతర సభ్యులతో పాటు నేను పూనా వెళ్లలేక పోయాను. స్థానాల ప్రత్యేకింపుకి మహాత్మాగాంధీ సిద్ధమయ్యారని తెలిసి నేనిలా సంతృప్తిగా అన్నాను. "గాంధీ జీవితానికి ప్రమాదం తొలిగింది." కాబట్టి నేను ఢిల్లీ వెళ్లాను. ఢిల్లీలో హిందూ మహాసభ సమావేశం జరుగుతుండగా గాంధీ, పూనా పాక్టు అంగీకరించారని మాకు తంతి వచ్చింది. ప్రతి ఒక్కరూ సహజంగా గాంధీ ప్రాణాన్ని రక్షించాలని ఆదుర్దాగా ఉన్నారు. అపుడు హిందూ మహాసభలో మేము తీర్మానం చేశాము.

**డా॥ అంబేద్కర్ :** పాక్టు అంగీకరిస్తూనా?

**డా॥ మూంజే :** అవును, పాక్టు అంగీకరిస్తూ. కాని ఒకటి అర్థం చేసుకోవాలి; అక్కడప్పుడు పంజాబు

తరపున రాజా నరేంద్రనాథ్ అభ్యంతరం చెప్పారు. నిరుపయోగంగానే అనుకోండి. కాని మొత్తం సభలో మెజారిటీ సభ్యులు భయంతోనూ భీతితోనూ ఉన్నారు.

**శ్రీ జఫ్రుల్లా ఖాన్ :** నిరాహారదీక్షనీడల క్రిందా?

**డా॥ మూంజె :** పాక్టు అంగీకరించకపోతే, మహాత్మాగాంధీ ప్రాణ సంరక్షణ జరిగేది కాదు. కాబట్టి పాక్టు అంగీకరించారు. అవీ వివరాలు. ఒక ప్రత్యేకాంశం ఏమంటే : మొదటి రౌండు టేబిల్ కాన్ఫరెన్సులోనూ, రెండో రౌండు టేబిల్ కాన్ఫరెన్సులోనూ నేను డా॥ అంబేద్కర్‌తో జరిపిన సంప్రదింపులలో డా॥ అంబేద్కర్ తాను ఒక పద్ధతికి పూర్తి సంతృప్తి చెందినట్లు అంగీకరించారు; అదేమంటే, సంయుక్త నియోజకవర్గాల విధానంలో జనాభా ప్రాతిపదికపై స్థానాలు నిలిపి ఉంచితే అలా హిందూ మహాసభతో కూడ ఒప్పందమయ్యాను. అంగీకారమని ఒక సందర్భంలో, రెండో రౌండు టేబిల్ సమావేశంలో, ఈ అంశంపై సందేహార్థం వుందని భావించారు. అపుడు నేనొక సలహా చెప్పాను. హిందువులతో కూడిన సంయుక్త నియోజకవర్గాలలో జనాభా ప్రాతిపదికపై స్థానాలు నిలిపి ఉండడం ద్వారా నిమ్న జాతులకూ హిందువులకూ మధ్య విభేదం సమసి పోయిందని ఒక సంయుక్త లేఖ ప్రధానమంత్రికి పంపాలన్నాను. దానిపై ఆయన, నేను సంతకాలు చేయాలన్నాను.

**డా॥ అంబేద్కర్ :** దానికి నేను అంగీకరించలేదు?

**డా॥ మూంజె :** ఆ సమయంలో, దానికి డా॥ అంబేద్కర్ అంగీకరించలేదు. కాని మొదటి రౌండు టేబిల్ సమావేశంలో డా॥ అంబేద్కర్ అంగీకరించారు. వారి అనుమతితో ఆ విషయం అమెరికా వార్తా పత్రికలకు ప్రకటించబడింది.

**డా॥ అంబేద్కర్ :** దాన్ని నేనొప్పుకోను.

**శ్రీ యం.ఆర్. జయకర్ :** శ్రీ మూంజే, నేనొక ప్రశ్న వేయొచ్చా? ఢిల్లీలో హిందూ మహాసభ ూనా పాక్టును సమ్మతించే విషయం మీరు ఇందాక మాట్లాడారు!

**। మూంజె :** అవును.

**ౣ యం.ఆర్. జయకర్ :** హిందూ మహాసభ పూనా పాక్టుకు సమ్మతించింది, దాని గుణగణాల మీద కుడా, మహాత్మాగాంధీ ప్రాణం కాపాడబడిందన్న సంతృప్తి వల్ల అని చెప్పడం మీ ఉద్దేశమా?

**డా॥ మూంజె :** నేను ముందే చెప్పాను, ప్రత్యేక నియోజకవర్గాలపై ఆధారపడింది గనుక పాక్టును రూపొందించే సూత్రం నాకూ, హిందూ మహాసభ మొత్తానికి సమ్మతమైందని పాక్టు రూపొందే సమయంలో చెప్పాను.

**శ్రీ భాయ్ పరమానంద్ :** నేనొక మాట చేర్చొచ్చా? బెంగాల్ హిందువుల్లాగానే పంజాబ్ హిందువులకు పూనా పాక్టు పట్ల అలాంటి భావం ఉంది. హిందూ మహాసభ హడావుడిగా దానికి సమ్మతిస్తూ తీర్మానం

చేసిన నాడే రాజ నరేంద్రనాథ్ వ్యతిరేకించాడు. బొంబాయిలో పూనా పాక్టు సమ్మతించిన 48 గంటల్లో, బహిరంగ సభలో హిందూ నిరసన వ్యక్తమయింది. పంజాబ్ హిందువుల కార్యదర్శి కూడ అభ్యంతరం తెల్పాడు, డా॥ గోకుల్ చంద్ పంజాబ్ హిందువులు వ్యతిరేకిస్తున్నారని ఇక్కడ ప్రధానికి కేబిల్ గ్రాం పంపారు. హిందువుల భావన ఇంకా వ్యతిరేకంగానే వుంది. పంజాబు హిందువులను పూనా పాక్టు బాగా బాధపెట్టిందని వార్తా పత్రికల్లో వ్యాసాలు వచ్చాయి; అవి ఇపుడు నా వద్దలేవు. మరొక్కటి కొందరు నిమ్నజాతులకు సంబంధించిన షెడ్యూల్డు ట్రైబ్సువారు, అనగా జనాభా రిపోర్టులో హిందువు, బట్‌వాలాస్, బారావాలాస్, కబీర్ పంథాస్, మరియు డోమ్స్‌వారుగా నమోదైనట్లు భావిస్తున్నవారు నిమ్నజాతీయుల షెడ్యూల్డ్ ట్రైబ్స్‌లో చేర్చబడలేదు. ఆ కారణంగా వారు ఆందోళన చేస్తున్నారు. ఆ ట్రైబ్సు పేర్లు బుట్వాలాస్, బారావాలాస్, కబీర్ పంథాస్, మరియు డోమ్స్. పంజాబ్‌లో వాళ్లు సుమారు 50,000 దాకా వున్నారు. ఎందుకంటే జనాభా రిపోర్టులో ఒరియాన్‌గా నమోదై ఉన్నారు. షెడ్యూల్డ్ ట్రైబ్స్‌లో వాళ్లను చేర్చలేదు. అందులో చేరడానికిగాను వాళ్లు ఆందోళన లేవదీస్తున్నారు. కాబట్టి హిందువులుగా వున్న వారిలో నిమ్నజాతులనబడినవారికి సంబంధించిన ట్రైబ్సు పట్ల ఒక రకమైన వివక్షత వుందని తెలుస్తోంది. కాబట్టి జాయింట్ సెలెక్ట్ కమిటీ ఈ విషయం పరిశీలించాలనీ, కొత్త ట్రైబ్స్‌లోనైనా సరియైన స్థానం కల్పించాలనీ నా మనవి.

**శ్రీ జఫ్రుల్లా ఖాన్ :** వారి చివరి అంశం స్పష్టంగా లేదు. మీరు ఉదహరించిన ఈ ప్రత్యేక ట్రైబ్సు జాబితాలో చేరాలనుకుంటున్నారా?

**శ్రీ భాయ్ పరమానంద్ :** అవును.

**శ్రీ జఫ్రుల్లా ఖాన్ :** వాళ్లు జాబితాకు ఎక్కలేదా?

**శ్రీ భాయ్ పరమానంద్ :** అది మరో విషయం.

**శ్రీ జఫ్రుల్లాఖాన్ :** ఈ అంశం స్పష్టం చేయాలని ఉంది. సరిగ్గా జాబితాలోకి ఎక్కిన వారంతా నిమ్నజాతులు కాదా?

**శ్రీ భాయ్ పరమానంద్ :** నేను చెప్పే పాయింటేమంటే, నిమ్నజాతుల్లో హిందువులుగా వర్ణించు కొన్నంత మాత్రాన ఈ హక్కు నుండి వాళ్లను తొలగించారు. అదే హక్కు ఇతర ట్రైబ్స్‌కి ఇచ్చారు.

**శ్రీ జఫ్రుల్లాఖాన్ :** జాబితాలో చేరే హక్కా?

**శ్రీ భాయ్ పరమానంద్ :** అవును.

***డా॥ మూంజె :*** ఈ అంశం నేను వివరించవచ్చా?

ప్రజలూ, లోథియన్ కమిటీ జాగ్రత్తగా పరిశీలించిన పిదప పంజాబ్‌లో నిమ్నజాతుల సమస్య లేదనీ, బెంగాల్‌లో నిమ్నజాతుల సమస్య అంతగా వత్తిడి చేయదగ్గది కాదనీ లేదా గొప్పగా విచారణ

కోరతగినంత పటిష్టంగా లేదనీ కనుగొనడమైంది. ఇదే పంజాబ్, బెంగాల్ సంబంధించినంతవరకూ హిందూ మహాసభ అభ్యంతరం.

ఇదే బాధల్ని చెప్పుకొనే అంశం అయింది. ఆర్య సమాజకులు అయిన కారణాన వాళ్లను నిమ్నజాతులలో చేర్చలేదని ఆ ప్రజలు నేరారోపణ చేస్తున్నట్లు మిత్రులు, శ్రీ పరమానంద్ తెల్పుతున్నారు. పంజాబులో నిమ్నజాతుల సమస్య, నిమ్నజాతుల జాబితాగా తయారౌతున్న సంయుక్త నియోజకవర్గాలలో, సంకుచిత పరులదిగా సృష్టించవలసి వస్తే, ఈ నిమ్నజాతులకు జాబితాలో చేరే హక్కు వుంది, అదే ఈ అంశం. ఆ సంకుచిత, స్వార్థపరత్వాన్ని సృష్టించనవసరం లేకపోతే, నిమ్నజాతులలో చేరే హక్కు వాళ్లకు లేదు.

**డా॥ అంబేద్కర్ :** నేను ఒక ప్రశ్న వేస్తాను నిమ్నజాతులు వేరు కాబట్టి పంజాబులో పూనా పాక్టు అమలు జరగడానికి మీరు అభ్యంతరం చెపుతున్నారు?

**శ్రీ భాయ్ పరమానంద్ :** చాలా రాష్ట్రాలన్నిటిలో వున్నారనే భావనలో కాదు.

**డా॥ అంబేద్కర్ :** ఒక అర్థంలో, అక్కడున్నారు, లేక అక్కడలేరు? పంజాబులో నిమ్నజాతులు వున్నారా లేరా?

**శ్రీ భాయ్ పరమానంద్ :** వాళ్లు అస్పృశ్యులు కారు, వాళ్లు చేరరానివారు కాదు. విభేదం లేదు; సైమన్ కమీషన్ రిపోర్టులోనూ, ఇండియా ప్రభుత్వ రిపోర్టులోనూ, పంజాబులో సవర్ణ హిందువులకూ నిమ్నజాతులకూ మధ్య విభేదం చూపలేదు.

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రశ్న వేయొచ్చు కదా! మీకు మీరెలా సమాధానం చెప్పుకుంటారు? నిమ్నజాతులు వేరు కాబట్టి వాళ్లకు స్థానం లేదనేది మీ మొదటి స్థితి; షెడ్యూల్డ్ జాబితాలో కొన్ని నిమ్నజాతులను చేర్చలేదని మీ రెండో ఆరోపణ.

**పండిట్ నానక్ చంద్ :** ఈ అంశంపై మాట్లాడను. వివరణ ఇస్తాను. చేరరానితనం, అంటరాని తనం సంబంధించినంత వరకూ అవిలేవు. ఒకవేళ వున్నా ఏ మాత్రం లెక్కలోనివి కావు; లేనట్లే. ఈ విషయం ప్రభుత్వోద్యోగులూ, శిక్కులూ, మహమ్మదీయులూ, హిందువులూ ఒప్పుకున్నారు. కాని కొన్ని వర్గాలు నిమ్నజాతులుగా జాబితాకు ఎక్కారు. ఇతరులు కొందరు అదే స్థానంలో వున్న వారు, ఆర్థికంగా వెనకబడ్డా లేకపోయినా, కొన్ని హక్కులు, భూమి కొనుగోలు, అలాంటివి లేనివాళ్లు ఇతరులతో పాటు జాబితాలో చేరాలనుకుంటున్నారు. ఎందుకంటే వాళ్లు అదే సామాజిక స్థితిలో ఉన్నారు.

**డా॥ అంబేద్కర్ :** వాళ్లు చేర్చబడాలని మీరు చాలా ఆత్రుతతో వున్నారు?

**పండిట్ నానక్ చంద్ :** నాకు ఆదుర్దాలేదు. వాళ్లకు ఆదుర్దా వుంది. ఎవర్నీ నిమ్నజాతి అని పిలవాలని నాకు లేదు.

**డా॥ అంబేద్కర్ :** బెంగాల్‌కు చెందిన శ్రీ ఛటర్జీని కొన్ని ప్రశ్నలడగాలని వుంది. పూనా పాక్టు రూపొందినపుడు బెంగాల్ హిందువుల ప్రాతినిధ్యం లేదనేది మీ ముఖ్యమైన ఫిర్యాదు అనుకుంటున్నా – అదే కదా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** ఫిర్యాదులలో అదొకటి. నా ముఖ్యమైన ఫిర్యాదేమంటే –

**డా॥ అంబేద్కర్ :** ప్రస్తుతానికి ఇది తీసుకుంటాను. ఎందుకంటే ఒక్కొక్క అంశం వరుసగా పూర్తిగా పరిశీలిద్దామనుకుంటున్నాను. బొంబాయిలోనూ పూనాలోనూ బెంగాల్ సవర్ణ హిందూ సభ్యులు హాజరయ్యారని మీ సహచరుడు ఒప్పుకున్నాడని తలుస్తున్నాను.

**శ్రీ బి.సి. ఛటర్జీ :** అవును.

**శ్రీ జె. బెనర్జీ :** పూనాలో ఒక సవర్ణ హిందువు హాజరయ్యారు, నేను చెప్పింది అది.

**డా॥ అంబేద్కర్ :** ఇతర రాష్ట్రాల నుండి డజన్లకొద్దీ లేరా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** కావచ్చు.

**మార్క్విస్ ఆఫ్ జెట్‌లాండ్ :** డా॥ అంబేద్కర్, అక్కడున్న బెంగాల్ సవర్ణ హిందువుల పేర్లు చెప్పి వుంటే, ఈ మొత్తం సమస్య మనం తీర్చగలిగే వాళ్లమేమో!

**డా॥ అంబేద్కర్ :** పేర్లు నేనిస్తున్నాను. 14 మార్చి 1933న బెంగాల్ లెజిస్లేచర్ కౌన్సిల్‌లో చర్చ జరుగుతుండగా ఈ పేర్లు ఇవ్వబడ్డాయి.

**శ్రీ బి.సి. చటర్జీ :** దయచేసి పేర్లు ఇస్తారా?

**డా॥ అంబేద్కర్ :** ఈ అంశంపై వైరుధ్యమేమీ లేదుకదా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** ఆ సమయంలో నేను ఇంగ్లాండులో వున్నాను.

**డా॥ అంబేద్కర్ :** బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో నిమ్నజాతులకు ప్రాతినిధ్యం వహించిన శ్రీ మల్లిక్ ప్రసంగం నుంచి ఉదహరిస్తున్నాను. వారు చెప్పింది ఇది!

**శ్రీ జె. బెనర్జీ :** వారు నామినేటెడ్ సభ్యులేగాని, ఎన్నికైన ప్రతినిధి కాదు. ఈ పాయింట్ స్పష్టం చేయదలచాను.

**డా॥ అంబేద్కర్ :** వారు నిమ్నజాతుల ప్రతినిధి?

**శ్రీ జె. బెనర్జీ :** ఒక నియోజకవర్గంలో ఓడిపోయారు ముందు – పూర్వం రెండుసార్లు.

**డా॥ అంబేద్కర్ :** నేను చెప్పే అంశానికి అది ఎలా విరుద్ధమవుతుంది? నా అంశం ఏమంటే కొందరు బెంగాల్ హిందువులు హాజరయ్యారా లేదా అని. బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ జరుగుతుండగా చేసిన

ప్రకటన; అదిన్నీ పూనా పాక్టు సమర్ధించిన బెంగాల్ నిమ్నజాతి సభ్యుడు ప్రసంగిస్తుండగా చెప్పింది. "హిందూ మిషన్‌కు సంబంధించిన స్వామి సత్యానంద, అద్భుత సమాజ్‌కి చెందిన బాబు హరిదాస్ మజుందార్, యం.ఎ., బి.యల్., మిడ్నాపూర్ యం.యల్.సి. అయిన బాబూ ప్రమాదనాథ్ బెనర్జీ, ఖాదీ ప్రతిష్టాన్‌కు సంబంధించిన బాబు యస్.సి. దాస్‌గుప్తా లాంటి మనుషులూ వున్నారని మాకు తెలుసు; వాళ్లు పండిట్ మాలవ్యా, సర్ తేజ్ బహదూర్ సప్రూ, శ్రీ యం.ఆర్. జయకర్, శ్రీ రాజగోపాలాచారితో వున్నారు."

**శ్రీ జె. బెనర్జీ :** ఒక్కరు తప్ప ఇంకెవ్వరూ పూనాలో హాజరు కాలేదు.

**డా॥ అంబేద్కర్ :** అది కౌన్సిల్లో ఇచ్చిన ప్రకటన.

**శ్రీ జె. బెనర్జీ :** నన్ను మాట్లాడనిస్తారా?

**డా॥ అంబేద్కర్ :** నేను ప్రశ్న అడిగినపుడు దయచేసి సమాధానం చెప్పండి.

**శ్రీ జె. బెనర్జీ :** ఆ ప్రకటన సరైంది కాదు.

**డా॥ అంబేద్కర్ :** బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో ఎవ్వరూ దాన్ని వ్యతిరేకించలేదని అంటున్నాను.

**శ్రీ జె. బెనర్జీ :** ఆరోజున నేను హాజరయ్యాను. ఉపన్యాసం ఏమీ జరగలేదు. పత్రిక నుండి ఏదో చదివారు. ఆ ముక్కలు మనుషుల దృష్టి నుండి తప్పిపోయే అవకాశం ఎంతో ఉంది. ఒక కాగితాన్నించి అస్పష్టంగా చదివారు.

**శ్రీ యం.ఆర్ జయకల్ :** కౌన్సిల్ ప్రొసీడింగ్స్ ప్రచురించారు; లేదా?

**శ్రీ బెనర్జీ :** అవును.

**శ్రీ యం. ఆర్. జయకర్ :** ఆ నిర్వహణలు ప్రచురితమైనప్పటి నుంచీ వ్యతిరేకతలు ఏమీ లేవా?

**శ్రీ జె. బెనర్జీ :** అవును; వాగ్వాదం అయిన వెంటనే కొన్ని పేర్లు తెలిపారని మేము విన్నవెంటనే, వార్తా పత్రికలలో అభ్యంతరాలు వచ్చాయి.

**ా.బి.ఆర్. అంబేద్కర్ :** నేను మీ ముందు ఉంచుతున్న ఈ మనుష్యులు బొంబాయిలో హాజరు ావడమే గాక...

**శ్రీ జె. బెనర్జీ :** నేను పూనా గురించి మాట్లాడుతున్నాను.

**డా.బి.ఆర్. అంబేద్కర్ :** నేను మొదటిగా మొత్తం బొంబాయి గురించి మాట్లాడుతున్నాను. సబ్-కమిటీ నియామకం అయినపుడు ఈ మనుషులు బొంబాయిలో హాజరు కావడమే గాక, వారు నా ఆఫీసులో వ్యక్తిగతంగా సంభాషణలు జరిపారు. ఒక ఒప్పందానికి రమ్మని కోరారు. ఇది వాస్తవం. బాంబే టైమ్స్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో కూడ వెల్లడించాను. లెజిస్లేటివ్ ప్రొసీడింగ్సు ప్రకటన

అయిన వెంటనే, నేనిచ్చిన ఇంటర్వ్యూ మార్చి 17న ప్రచురణ అయింది.

**శ్రీ జె. బెనర్జీ :** ఆమరునాడే మీ ప్రకటనను నేను వ్యతిరేకించాను అసలు విషయాన్ని స్పృశించలేదన్నాను. ఎందుకంటే ఇందులో ముగ్గురు, మీరు ఒప్పుకున్న దాన్ని బట్టి, పూనాకు వెళ్ళలేదు, పాక్టు సమయంలో వారక్కడ లేరు.

**శ్రీ బి.సి. చటర్జీ :** ఇది ఎవరి కేసూ కాదని చెప్పదలచాను. ఇది డా. అంబేద్కర్ కేసు అని కూడా అనుకోను ఈ పెద్దమనుషుల్ని బొంబాయి పంపారా లేక పూనాలో హాజరైన ఒక ఒంటరి పెద్దమనిషిని బెంగాల్ హిందువులు గానీ, బెంగాల్ హిందువుల మనిషి ఎవరైనా గానీ. అక్కడికి (బొంబాయి) పంపారా? వాళ్లు అక్కడ అనుకోకుండా ఉండవచ్చు లేదా అస్వస్థులుగా వున్న మహాత్మాగాంధీని చూడాలనుకోవడం వల్ల అక్కడున్నా.వాస్తవానికి కొందరు మహాత్ముని శవాన్ని ఊరేగింపులో మోసే గౌరవం కొరకు వెళ్ళివుంటాను!

**డా.బి.ఆర్ అంబేద్కర్** ఆ విషయానికొస్తే నేను చెప్పేదేమంటే ఈ మనుషులు కలకత్తానుండి వెళ్లడం అందరికీ తెలిసిన విషయమే, ప్రత్యేక ఉద్దేశమేమంటే మాలవ్యా సమావేశానికి హాజరు కావడానికి వెళ్ళారు.

**శ్రీ జె. బెనర్జీ :** బెంగాల్‌లో ఏ ప్రజాపక్షాన అధికారికంగా వాళ్లు వెళ్లలేదు. వాళ్ల సొంత పని నిమిత్తంగానీ, వేరే కారణాన గానీ వాళ్లు అక్కడికి వెళ్లి వుండవచ్చును. డా. అంబేద్కర్ ఒక సూచన చేయవచ్చా. నేను ఇలా అనవచ్చా? బెంగాల్‌లో నిమ్నజాతులున్నారు అనే సూచన వుండడం గొప్పమచ్చగా మేము, బెంగాల్‌లో, భావిస్తాము. కులహద్దులు, అలాంటివి తుడిచి పెట్టడానికి బెంగాలి హిందువులు శతాబ్దం పైగా సంఘసేవ చేస్తూ వున్నారు. ఈ విషయం అంగీకరించమని డా॥ అంబేద్కరును అడుగుతున్నాను. లోథియన్ కమిటీ రెండు లక్షణాలను చాలా బాగా స్పష్టం చేసింది; ఒక పరిధిలో నిమ్నజాతులెవరో, అంటరానితనం, చేర రానితనం ఏమిటో నిర్ణయించడానికి ఆ లక్షణాలు పొందుపరుచుకొన్నారు. అంటరాని వారూ చేరరానివారూ ఎవరో బెంగాల్ ప్రభుత్వం విచారణ చేయాలని సలహా ఇస్తున్నాను. వాళ్ల సంఖ్య ఖాయమైతే, వాళ్లకు సంయుక్త నియోజక వర్గాల ప్రాతిపదికపై బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో వాళ్ల దామాషా ప్రాతినిధ్యం ఇవ్వడానికి మనం సుముఖంగా వుండాలి.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** సంయుక్త నియోజక వర్గాల గురించి నేను చర్చించడం లేదు. నేను ముఖ్యమైన వాస్తవాంశం గురించి చర్చిస్తున్నాను. కొందరు బెంగాల్ సవర్ణహిందువులు మాలవ్యా సమావేశంలో పాల్గొనడానికి బొంబాయి వెళ్ళారనేది బాగా తెలిసిన విషయం. 1932 సెప్టెంబరు 17వ తేదీ "లిబర్టీ" నుండి ఉదహరిస్తున్నాను. అది కలకత్తా నుండి వెలువడే పత్రిక. ఆనాటి పత్రికలో 5 వ పేజీలో, 4వ కాలంలో పెద్ద శీర్షిక క్రింద ఈ రిపోర్టు వ్రాయబడి ఉండడం చూశాను : "స్వామి సత్యానంద ఇతరులూ బొంబాయికి బయలుదేరుతున్నారు. స్వామి సత్యానంద, అమృత సమాజ్‌కు

సంబంధించిన స్వామిజీలు హరిదాస్ మజుందార్, జగ్నేశ్వర్ మండల్ మాలవ్యా సమావేశానికి హాజరు కావడానికి గాను ఈ రాత్రికి బొంబాయి బయలు దేరుతున్నారు." ఎలాంటి స్వంత వ్యవహారం మీదా వాళ్లు వెళ్లడం లేదు?

**శ్రీ బి.సి.ఛటర్జీ :** నామట్టుకు ఆ పెద్ద మనుషుల గూర్చి వినలేదు. వాళ్ల గురించి వినడం ఇదే మొదటి సారి. బెంగాల్‌కు సంబంధించిన వరకు వారు తమ గొప్పతనాన్ని పొదలో దాస్తూ దాక్కున్నట్లున్నారు. ఈ పెద్దమనుషులు తమకు తామే వెళ్తున్నట్లు రిపోర్టు పంపి వుంటారు.

**డా.బి.ఆర్ అంబేద్కర్ :** బెంగాల్ నుండి సవర్ణ హిందూ సభ్యులు కొందరు మాలవ్యా సమావేశానికి హాజరు కావడానికి వెళ్తున్నారని బెంగాల్ ప్రజలకు తెలుసు అనేది నా వాదన. వారు ప్రతినిధులు కారని బెంగాల్ ప్రజలనుకుంటే, వీరిని నమ్మవద్దని మాలవ్యాకు వర్తమానం పంపడం పూర్తిగా సాధ్యమైన పనే కదా!

**శ్రీ బి.సి. ఛటర్జీ :** 'లిబర్టీ'లో ఏదో కాలంలో యధాలాపంగా వచ్చిన ఒక పేరాకు వాళ్లను కట్టుబడే టట్లు చేయడం బెంగాల్ ప్రజలపట్ల అనుచితంగా ఉండటమే.

**డా. బి.ఆర్ అంబేద్కర్:** బెంగాల్‌లో ప్రతి వారూ తెలుసుకోవలసిన వాస్తవమని మాత్రం అంటున్నాను.

**శ్రీ బి.సి. చటర్జీ :** ఆ విధంగా పేపరు క్షుణ్ణంగా ఎవ్వరూ చూడరు. ఆ విధంగా విషయాలు కనుగొనడానికి ఎవ్వరూ చూడరు. ఆ విధంగా విషయాలు కనుగొనడానికి ఎవ్వరూ ప్రత్యేక పంక్తులు వెతకరు. మా దృష్టి కెప్పుడు రాలేదు.

**డా! అంబేద్కర్ :** దీనిపై నేనింకా వత్తిడి చేయను.

**సర్ ఆస్టెన్ చాంబర్‌లియన్ :** బొంబాయిలో అలాంటి మీటింగు జరుగుతోందని శ్రీ ఛటర్జీ కి తెలియదని అర్థమా?

**శ్రీ బి.సి. ఛటర్జీ:** మీటింగు జరుగుతోందని మాకు తెలుసు. కాని బెంగాలు నుంచి ఆ మీటింగుకు వెళ్లే బాధ్యత ఎవ్వరైనా తమంతట తాము తీసుకుంటున్నారన్న సంగతి మాకు పూర్తిగా తెలియదు.

**సర్ ఆస్టెన్ చాంబర్లైన్:** ఈ విషయంపై మీకు అంత బలీయమైన భావాలు, ఉన్నట్లయితే, మీ భావాలే ఉన్న వాళ్ల తరుపున మీరు మాట్లాడ గలిగిన ప్రాతినిధ్యపు సంఘం మీరని, మీ ఉద్దేశంలో వుంటే, మీటింగును గురించి మీకు తెలిసినపుడు, ప్రతినిధులను మీ రెందుకు పంపలేదు?

**శ్రీ జె. బెనర్జీ :** దానికి మేము గొప్ప ప్రాముఖ్యత ఏమీ ఇవ్వలేదు. బెంగాలు సవర్ణ హిందువులు అదృష్టాన్ని మాలవ్యా సమావేశం నిర్ణయించేది కాదు. కాబట్టి ఏ సామర్థ్యంలోనూ ఎవ్వరూ వెళ్లలేదు. పూనా మీటింగ్ నిజంగా ముఖ్యమైంది.

**సర్ ఆస్టెన్ చాంబర్లైన్:** మీకు మీటింగ్ గురించి తెలుసు. అది హాజరు కావలసిన విలువ గలదని

భావించలేదు. అదీస్థితి?

**శ్రీ జె. బెనర్జీ :** బొంబాయిలోనూ, పూనాలోనూ జరిగిన రెండు మీటింగులను గడబిడ చేస్తున్నారని భయపడుతున్నాను. పాక్టు పూనాలో సంతకం చేశారు. అదీ ముఖ్యమైన మీటింగు. దానికి సవర్ణ హిందువులను పిలవలేదు. బొంబాయిలో సమావేశం ప్రారంభదశలో వున్న గుర్రపు నడక లాంటిది. దానికి అంతగా ప్రాముఖ్యత ఇవ్వకపోవడం సమర్థనీయం.

**శ్రీ జఫ్రుల్లాఖాన్ :** నేనిలా చెప్పవచ్చా? ఏ విధంగానూ మీకు కోపం తెప్పించాలని లేదు శ్రీ చటర్జీ; కాని ఏమనిపిస్తుందంటే, బహుశ బెంగాలు సవర్ణ హిందువుల ధోరణి " దీంతో మాకు సంబంధం లేదు. బహుశ ఇది నిష్ప్రయోజనం; మహాత్ముని ప్రాణం రక్షించడానికి సాయపడితే, మంచిదే. మీకేమైనా ఇబ్బంది కల్గిస్తే మాది కాదనవచ్చు"?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** గౌరవంతోనే అలాకాదు. రాష్ట్ర ఓటుహక్కుల సంఘం (ప్రావిన్షియల్ ఫ్రాంచైజ్ కమిటీ)లో ఉండే గౌరవం నాకు దక్కింది. లోథియన్ కమిటీతో సహకరించే గౌరవం కూడ నాకు కలిగింది. అస్పృశ్యులెవరనేది జాగ్రత్తగా పరిశోధించాము. పరిశోధనకు అదే మొత్తం అంశం.

**డా. బి.ఆర్ అంబేద్కర్ :** నా పాయింట్ నుండి దూరం వెళ్తున్నారు. బొంబాయిలోనూ, పూనాలోనూ జరుగుతున్నవాటి సమాచారం క్రమంతప్పకుండా, పూర్తిగా, ప్రతిరోజూ 'లిబర్టీ"లో ప్రచురణ అయ్యాయి. వాటిని వ్యతిరేకించడానికి సిద్ధంగా వున్నారా?

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** "లిబర్టీ" నేనెప్పుడూ చదవనని "స్టేట్స్‌మన్" కావాలనే తేలేదు. ఎందుకంటే అది ఆంగ్లో ఇండియన్ పత్రిక అని మీరంటారు.

**శ్రీ బి.సి. ఛటర్జీ:** ఎందుకంటాను? నేను అలా అంటానని ఊహించలేను.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** నేను దాన్ని ఉద్దేశ పూర్వకంగానే తెచ్చాను. ఎందుకంటే అది హిందూ పేపరని నాకు తెలుసు.

**శ్రీ బి.సిబెనర్జీ :** అది అవును. అది మా ఇంటికి వస్తుంది. అపుడపుడు చదువుతాను.

**డా.బి.ఆర్. అంబేద్కర్ :** 20న జరిగిన మాలవ్యా సమావేశపు నిర్వహణలన్నీ "లిబర్టీ"లో మొదటి పేజీలో పూర్తిగా వచ్చాయని మీ ముందుంచుతున్నాను.

**శ్రీ బి.సి. బెనర్జీ :** మీనుండి వింటున్నాను.

**డా॥ బి.ఆర్ అంబేద్కర్ :** మీ అంతటికి మీరే చూడొచ్చు. మీకు అందించనా?

**శ్రీ బి.సి బెనర్జీ :** మీ మాట మూధనమ్మకముండి

**డా॥బి.ఆర్. అంబేద్కర్ :** అలాగే, 21న ఏంజరిగిందీ 22 తారీకు ప్రతిలో మొదటి పేజీలో పూర్తిగా

ప్రచురించారు.

***శ్రీ బి.సి. బెనర్జీ :*** ప్రచురించే ఉంటారు.

***డా॥బి.ఆర్.అంబేద్కర్ :*** దాన్ని బట్టి బొంబాయిలోనూ, పూనాలోనూ ఏం జరుగుతున్నదీ బెంగాలులో ఎవరైనా సరిగ్గా తెలుసు కోవచ్చు. మరొక్క అంశం మీ ముందు ఉంచుతానా.

***శ్రీ బి.సి. బెనర్జీ :*** బెంగాలులో ప్రజాసంస్థలకు ఇంత కీలక సమస్య అయిన దాన్ని నిర్ణయం అమలుకు వచ్చే ముందు సంప్రదింపులో పాల్గొనడానికి తమ ప్రతినిధులను పంపమని ఆహ్వానిస్తారని అనుకున్నాను

***డా॥బి.ఆర్ అంబేద్కర్*** సబ్‌కమిటి ఆలోచనకు సబ్‌కమిటీ ఆలోచనకు వచ్చినపుడు, దాని నిర్మాణం గురించి అభ్యంతరం లేదూ?

***బి.సి. బెనర్జీ :*** వాళ్లకు ఆ హక్కు లేదు.

***డా॥బి.ఆర్. అంబేద్కర్ :*** 22 సెప్టెంబరు 1932 "లిబర్టీ" చూస్తే, దాంట్లో నేను ఈ సంబ్‌కమిటీకి చేసిన ప్రతిపాదనల రిపోర్టు ఉంది. దానిమీద ఆధారపడి సంధానం చేయడానికి సిద్ధంగా ఉన్నాను. నేను ప్రతిపాదించిన వాటిమీద ఆధారపడి నేను ఒప్పందానికి రావడానికి సిద్ధంగా వున్నాని శ్రీ జయకర్ నన్ను బలపరుస్తారు. నా ప్రతిపాదనలో బెంగాలుకు 50 స్థానాలు కోరాను.

***శ్రీ జె. బెనర్జీ :*** మీ వుద్దేశం నిమ్నజాతులు?

***డా॥బి.ఆర్. అంబేద్కర్ :*** నిమ్నజాతులనే నా ఉద్దేశ్యం. అయినా బెంగాలు సవర్ణ హిందువులు వ్యతిరేకిస్తూ ఒక్క ప్రకటన కూడా చేయలేదు. ఈ ప్రతిపాదన మీద పాక్టు ఒప్పందం చేయడానికి ఉన్న మాలవ్యాముందుగా చేయలేదు. లేక నేను ఈ ప్రతిపాదన చేసానని మీకు తెలిసి ఉండి కూడ ఎవర్నీ మీరు పూనాకు పంపలేదు; నా ప్రతిపాదన సెప్టెంబరు 22 నాటి పత్రికలో చాలా ఉపముఖమైన సాధనలో, అచ్చు వేశారు అని నే చెప్పుతున్నాను.

***శ్రీ జె. బెనర్జీ :*** మేము డా॥ అంబేద్కర్ ప్రతిపాదనలకు అంతగా ప్రాముఖ్యత ఇవ్వలేదని భీతి నా అనుమానం మేము ఇచ్చివుండవలసింది, అందుకు చింతిస్తున్నాను.

***డా.బి.ఆర్. అంబేద్కర్ :*** దానికి బాధపడేది మీరు, బాధపడేది మీరు అదీ నా విచారం. దీన్ని గూర్చి, మిమ్మల్ని ఒకటి రెండు ప్రశ్నలడగ దలిచాను. పూనా పాక్టు అంగీకరిస్తూ బ్రిటీష్ ప్రభుత్వం వారు సెంట్రల లెజిస్లేచర్ హౌసెస్ రెంటిలోనూ 26 సెప్టెంబరు 1932 ప్రకటన చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం వారి ఆ ప్రకటనకు సెంట్రల్ లెజిస్లేచర్ ప్రతి ఒక్కరూ తమ హర్షాతి రేకం పెద్దపెట్టున వెలిబుచ్చారు. అపుడు ఏ ఒక్కరూ విరుద్ధాభిప్రాయం తెల్పలేదు. పాక్టు అంగీకారానికి విరుద్ధంగా రాష్ట్రకౌన్సిల్‌లోగానీ, లెజిస్లేచర్‌లో దానీ, అది అంతే కాదా?

**శ్రీ జె. బెనర్జీ :** అంతేకావచ్చు.

**శ్రీ యం.ఆర్. జయకర్ :** సెంట్రల్ లెజిస్లేచర్ బెంగాలుకు ప్రాతినిధ్యం వుంది.

**సర్ హరిసింగ్ గౌర్ :** డా॥ అంబేద్కర్ చేసిన ఆరోపణ పురస్కరించుకొని, సర్ హ్యారేహేంగ్, హెూం మెంబరు శాసన సభలో ప్రకటించినపుడు, ఏ సభ్యుని నుండీ రాలేదు. జాయింటు కమిటీ దృష్టికి ఒక వాస్తవం తేవాలనుకుంటున్నాను. ఏ సంబంధంగానీ ఏ అభ్యంతరం మీదనైనా బ్రిటిష్ ప్రభుత్వం వారు శాసనసభలో ఒక నిర్ణయం ప్రకటించినపుడు ఏ సభ్యుడైనా మళ్లీ విరుద్ధాభిప్రాయం తెల్పడం అసెంబ్లీకి ఆనవాయితీ కాదు.

**లెఫ్టినెంట్ కల్నల్ సర్‌హెబ్. గిడ్నీ :** సర్ హ్యారీ హేంగ్ ప్రకటన చేసినపుడు నేను అసెంబ్లీలో వున్నాను. దానికి సర్వ హర్షాతిరేకం వెలువడింది.

**శ్రీ భాయ్ పరమానంద్ :** నేనూ అక్కడున్నాను. దాన్ని గూర్చి ఆనందపులరుపులేమీ లేవు.

**డా॥ బి.ఆర్ అంబేద్కర్ :** మెచ్చుకున్న చప్పట్లున్నాయి, అక్కడున్న పదానికి సరైన అర్థం గ్రహించగలిగితే,

**లెఫ్టినెంట్ కల్నల్ సర్ హెచ్ గిడ్నీ :** నా వుద్దేశం మెప్పు చప్పట్లు, అవునా?

**శ్రీ భాయి పరమానంద్ :** కొందరు చేసి వుండొచ్చు.

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ :** మొత్తం ప్రకటన ఈశాసనమండలి సమావేశాల్లో ఇవ్వబడింది. 26 సెప్టెంబరు 1932 సంపుటి 5, నెం.5లో ఆ ప్రకటన "అప్లాజ్" బ్రాకెట్లతో ముగిసింది. కౌన్సిల్ ఆఫ్‌స్టేట్‌లో అదే ప్రకటన చేయబడింది. నేను చెప్పదలచింది ఇది. శాసనసభలో ఈ క్రింది పెద్దమనుషులు సవర్ణ హిందువుల ప్రతినిధులనటం వాస్తవం కాదా! (పేర్లు చెపుతూ) రాష్ట్రకౌన్సిల్‌లో ఈ క్రింది వారున్నారు. (వారి పేర్లు చెపుతాం)

**శ్రీ బి.సి. ఛటర్జీ :** నా సమాధానమేమంటే పాక్టు యొక్క పర్యవసానం వాళ్లు గ్రహించలేదు. ఇప్పుడువాళ్లు ఏకగ్రీవంగా దీనితో విభేదిస్తున్నారు.

**శ్రీ భాయి పరమానంద్ :** ఈ అంశంనేను వివరించవచ్చా?

**డా॥ బి.ఆర్ అంబేద్కర్ :** వివరం అవసరమని నేననుకోవటం లేదు. వారంతా అసెంబ్లీ మెంబర్లు. వారు వ్యతిరేకించలేరు. బెంగాల్ రాష్ట్రంలో విరుద్ధాభిప్రాయం గురించి అంటే పాక్టు అయినతర్వాత సెప్టెంబరు 1932లో, బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ నవంబరు 1932లో సమావేశం జరిగింది.

**శ్రీ బి.సి. ఛటర్జీ :** అవును.

**డా॥ బి.ఆర్ అంబేద్కర్ :** బెంగాలుకు సంబంధించి పూనా పాక్టు అమలుకు వ్యతిరేకంగా కౌన్సిల్‌లో

లాంఛనప్రాయమైన తీర్మానం ప్రవేశపెట్టలేదుకదా!

**శ్రీ బి.సి. ఛటర్జీ :** లేదు.

**డా.బి.ఆర్ అంబేద్కర్** నేను రిపోర్టు గురించి అంటున్నా.

**శ్రీ బిసి. ఛటర్జీ :** నేను ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలి. కౌన్సిల్ మీటింగు అయిన కొద్ది సమయంలో ప్రముఖులైన కౌన్సిల్ సభ్యులను సమీకరించడం మేము చేసిన మొదటి పని. అపుడేమి నిర్ణయించామంటే మేమందరం కలిసి కట్టుగా...

**డా॥ బి.ఆర్ అంబేద్కర్ :** నా ప్రశ్నకు జవాబు పొందొచ్చా. తర్వాత వివరణ ఇవ్వొచ్చు. పూనా పాక్టు అంగీకరింపబడ్డాక, నవంబరులో జరిగిన బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్ సమావేశంలో దాన్ని వ్యతిరేకిస్తూ ఏదైనా లాంఛన ప్రాయమైన తీర్మానం ప్రవేశపెట్టేరా – నే తెలుసుకోవాలన్నది ఇది. తీర్మానం వుందా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** నవంబరు సెషన్‌లో పూనా పాక్టుకు విరుద్ధంగా నిస్సందేహంగా నేనొక తీర్మానం ముందుంచాను. దాన్ని రద్దుచేసుకోమని వత్తిడి చేశారు, నామ శూద్రులలో ఒక సభ్యుడూ, ప్రముఖ సభ్యుడూ అయిన శ్రీ రసిక్ విశ్వాస్ పండిట్ మాలవ్యాల సంయుక్త ప్రాతినిధ్యాలద్వారా రద్దు చేసుకోమని బలవంతం చేసారు. ఆ ఇద్దరూ నాకు ఒక హామీ కూడా ఇచ్చారు. మరో మీటింగు పెట్టి, వాళ్ల ముందుంచిన వాస్తవాల దృష్ట్యా పూనా పాక్టు సవరణ చేయడానికి డా॥ అంబేద్కరును ఒప్పిస్తామనీ హామీ ఇచ్చారు. వాళ్లకు ఈ అవకాశమివ్వకుండా కౌన్సిల్‌లో తేడాలు తెచ్చేట్లుగా వత్తిడి చేయొద్దని మళ్లీ మళ్లీ ప్రాధేయపడ్డారు.

**డా॥ అంబేద్కర్ :** తీర్మానం అయిందా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** వెనక్కి తీసుకొనేటట్లు ఒప్పించారు, ఆ ఆధారం మీద.

**డా॥ అంబేద్కర్ :** తీర్మానం సాగలేదు.

**శ్రీ బి.సి. ఛటర్జీ :** నే వెనక్కి తీసుకున్నాను.

**డా॥ అంబేద్కర్ :** తీర్మానం కాలేదు.

**శ్రీ బి.సి. ఛటర్జీ :** నేను విరమించుకున్నానంటుంటే.

**డా॥ అంబేద్కర్ :** అలా నోటీసు ఇచ్చారా?

**బి.సి. ఛటర్జీ :** నేను నోటీసు ఇచ్చాను. శ్రీ రసిక్ విశ్వాస్, పండిట్ మాలవ్యా రిప్రజెంటేషన్ మీద వెనక్కి తీసుకున్నాను. దాన్ని నేను ముందుకు సాగనివ్వలేదు.

**డా॥ అంబేద్కర్ :** 1933 మార్చి సమావేశంలో చర్చించిన అర్జీ ప్రత్యేకమైన అర్జీ. శ్రీ శాంతి

శేఖరేశ్వర్‌రాయ్ పేరుతో వున్న సాధారణ అర్జీ విషయం తీర్మానం కాలేదు.

**శ్రీ జె. బెనర్జీ :** చివరిదాకా పోలేదు.

**డా॥ అంబేద్కర్ :** దానికి ఎలాంటి ఆధిక్యత కోరలేదా?

**శ్రీ జె. బెనర్జీ :** ఆధిక్యత కోరడమైంది. కాని సాధించలేకపోయాము. చివరిదాకా పోవడానికి సమయం లేకపోయింది. ఆ తర్వాత నేనొక ప్రత్యేక తీర్మానం ప్రవేశపెట్టాను.

**డా॥ అంబేద్కర్ :** ఒక నెల అయిన తర్వాత ఆ తీర్మానం నెగ్గింది. బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో 1933 మార్చి సమావేశంలో. ఆల్‌బర్ట్‌హాల్ కలకత్తాలో 1933 ఏప్రిల్ 21న బహిరంగ సభ జరిగింది. శ్రీ సమాల్ అనేవారు అధ్యక్షత వహించారు. పూనా పాక్టుకు వ్యతిరేకంగా అభ్యంతరం తెల్పడంలో బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిల్ వైఖరిని నిందిస్తూ తీర్మానం చేయబడింది.

**శ్రీ జె. బెనర్జీ :** బహుశా అలాగే.

**డా॥ అంబేద్కర్ :** 22 ఏప్రిల్ 1933 తేదీ 'లిబర్టీ'లో ఆ కమిటీ ప్రొసీడింగ్స్ పూర్తిగా ప్రచురితమైనాయి. అది వాస్తవమా, కాదా?

**శ్రీ బి.సి. ఛటర్జీ :** నాకైతే తెలియదు. నేను ఇంగ్లాండ్‌లో వున్నాను.

**డా॥ అంబేద్కర్ :** పూనా పాక్టు ఒప్పందం అయినప్పుడు బెంగాల్ ప్రభుత్వం డార్జిలింగ్‌లో ఎక్కడో ఉందని మీరన్నారు. ప్రొహిందువున్నా సంప్రతించలేదని కూడ అన్నారు. అది సర్ నృపేంద్ర సర్కార్‌ను సాక్ష్యాధారంగా చెప్పారు.

**శ్రీ బి.సి. ఛటర్జీ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** సెప్టెంబరు 1932లో బెంగాల్ ఎగ్జిక్యూటివ్ ఎలా కూర్చబడిందో చెపుతారా? దాని సభ్యులెవరు? దానిలో కులపరమైన కూర్పు ఏమి?

**శ్రీ జె. బెనర్జీ :** ముగ్గురు బెంగాలీ సభ్యులున్నారు. కాదు, ఇద్దరు బెంగాలి హిందూ సభ్యులు బెంగాల్ గవర్నమెంటులో వున్నారు.

**డా॥ అంబేద్కర్ :** ఇద్దరు బెంగాల్ సవర్ణ హిందూ సభ్యులున్న బెంగాల్ ప్రభుత్వం పూనా పాక్టును అనుమతించలేదని మీ సూచనా?

**శ్రీ జె. బెనర్జీ :** ప్రభుత్వం గురించి నేననేదేమీ లేదు. కానీ ఆ ఇద్దరు ప్రభుత్వ సభ్యులూ దాన్ని అనుమతించలేదు, గాఢంగా వ్యతిరేకించారనేది నిశ్చయం.

**డా॥ అంబేద్కర్ :** కేంద్ర కార్య నిర్వాహక వర్గం విషయంలో ఒక బెంగాలీ హిందువు, సర్ బి.యల్. మిట్టల్ ఉన్నారని మీరన్నారు. అవునా?

**శ్రీ జె. బెనర్జీ :** అవును, సర్ బి.యల్. మిట్టల్ గురించి నేనేమీ చెప్పలేను. కాని ప్రస్తుత వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌ను సంప్రదించమని నేను చెప్పగలను.

**డా॥ అంబేద్కర్ :** మహాత్మాగాంధి నిరాహార దీక్ష వల్ల ఉత్పన్నమైన ఒక రకమైన ఆత్యయిక స్థితిలో బ్రిటిష్ ప్రభుత్వం వారు ఈ మొత్తం వ్యవహారాన్ని అంగీకరించారు అన్నట్లు తన పరిశీలన ద్వారా సర్ నృపేంద్ర సర్కార్ సూచించారు. మమ్మల్ని అడగదలచింది ఇది : మహాత్మాగాంధి ప్రభుత్వానికి రాసిన మొదటి లేఖ తేదీ ఆగస్టు 18 గాక, మార్చి 11, 1932 (ఆ ఉత్తరం శామ్యూల్ హోరేకి); ఇది వాసత్వం కాదా? సర్ నృపేంద్ర సర్కార్ ఉదహరించిన దానికి వ్యవహారరీత్యా అయిదు నెలల ముందు అదీ వారు చెప్పేది. అదీ నా పాయింటు. వారి మాట ఇది : "ప్రియమైన సర్ శామ్యూల్, అల్ప సంఖ్యాకుల కోరిక వెలిబుచ్చినపుడు రౌండు టేబిల్ సమావేశంలో నా ఉపన్యాసం చివరిలో నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గాలు సృష్టిస్తూ నిర్ణయించే సందర్భంలో నేను ఆమరణ నిరాహార దీక్ష పూనాలన్సిందే". కమ్యూనల్ నిర్ణయం ఇచ్చిన తర్వాత ఆగస్టు 18 తేదీ లేఖలో ఉపవాసపు బెదిరింపు ఇవ్వలేదు, 11 బార్చి 1932 లేఖలో ఇచ్చారు?

**శ్రీ జె. బెనర్జీ :** పూర్తిగా నిజం.

**డా॥ అంబేద్కర్ :** మార్చి 11 లేఖలోని బెదిరింపు లెక్క చేయకుండా బ్రిటిషు ప్రభుత్వం వారు నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఇచ్చారు.

**శ్రీ జె. బెనర్జీ :** ప్రత్యేక నియోజక వర్గాలలోపాలన్నిటినీ పాక్టు కొనసాగిస్తుందనేదే మా ఆరోపణ.

**డా॥ అంబేద్కర్ :** అది వేరే విషయం. అది మీరు మహాత్మాగాంధీకి చెప్పి వుండాల్సింది. నేను ఆచరించజాలను.

**శ్రీ జె. బెనర్జీ :** బ్రిటిషు ప్రభుత్వం వారి అవార్డు పూనా పాక్టు కన్నా మాకు ఎక్కువ అంగీకారం యోగ్యం.

**డా॥ అంబేద్కర్ :** దాన్ని గూర్చి ఒకటి రెండు ప్రశ్నలు అడుగుతాను. నిమ్నజాతులకు బ్రిటిషు ప్రభుత్వం వారి అవార్డులో ఇచ్చిన స్థానాల కన్నా పూనా పాక్టు ఎక్కువ స్థానాలు ఇచ్చిందనేది మీ ఫిర్యాదు. ప్రధానమంత్రి 8 సెప్టెంబరు 1932న శ్రీ గాంధీకి రాసిన ఉత్తరాన్ని మీ దృష్టికి తీసుకొస్తున్నాను. వారు చెప్పింది ఇది : "మహమ్మదీయులకిచ్చిన ప్రాదేశిక స్థానాల సంఖ్య సహజంగానే తక్కువ చేయబడిపోయాయి. ఎందుకంటే ఇక అంతకన్నా ఎక్కువ ప్రాదేశిక స్థానాలు వారు పొందడం అసాధ్యమనేది వాస్తవం. పైగా చాలా రాష్ట్రాలలో వాళ్ల జనాభా దామాషాకు మించిన తూకం వారు అనుభవిస్తున్నారు." మీ ప్రత్యేక దృష్టిని ఈ విషయం పైకి మళ్లించాలనుకుంటున్నా. "నిమ్నజాతుల నియోజకవర్గాలలో నింపవలసిన ప్రత్యేకస్థానాల సంఖ్య స్వల్పమని మీరు గుర్తిస్తారు. మొత్తం నిమ్నజాతి జనాభా ఆధారంగా ప్రాతినిధ్యానికి సంఖ్యానుకూలంగా వాళ్లకు కోటా ఇవ్వాలని

గాక, లెజిస్లేచర్‌లో నిమ్నజాతుల తరపున మాట్లాడడానికి కనీస సంఖ్య పొందే నిమిత్తం అలా స్థిరపరిచాము, వాళ్లని కేవలం నిమ్నజాతులు మాత్రమే ఎందుకుంటారు. నిమ్నజాతుల ప్రత్యేక స్థానాల నిష్పత్తి ప్రతి చోటా వాళ్ల జనాభా శాతానికి చాలా తగ్గిపోయే వుంటుంది?

**శ్రీ జె. బెనర్జీ :** పూర్తిగా అంతే, ఎందుకంటే నిమ్నజాతులలో చాలామంది, ప్రత్యేకించి బెంగాలులో, సాధారణ నియోజకవర్గాల ద్వారానే ఎన్నికవుతారు.

**డా॥ అంబేద్కర్ :** మీ సావధానత కోరేది దీనికొరకు. కమ్యూనల్ అవార్డు ఇవ్వడంలోనూ, నిమ్నజాతులకు సీట్లు కేటాయించడంలోనూ వాళ్ల స్థానాలు జనాభా నిష్పత్తికి సంబంధ సామ్యంలో లేవనీ, చాలా తక్కువగా వున్నాయనీ బ్రిటిషు ప్రభుత్వం వారూ, ప్రధానమంత్రీ నిక్కచ్చిగా ఒప్పుకున్నారు.

**శ్రీ జె. బెనర్జీ :** పూర్తిగా నిజమే. కాని మరొకటి వుంది. నిమ్నజాతులకు ఇచ్చిన స్థానాల సంఖ్య, వాళ్ల (జనాభా) సంఖ్యా సారూప్యానికంటే తక్కువగా వుందని ప్రధానమంత్రి స్ఫుటంగా స్పష్టం చేశారు. ఎందుకంటే ఆయన బెంగాల్ విషయం ప్రత్యేకంగా ఉదహరించారు. ఎందుకంటే బెంగాలులో నిమ్నజాతి సభ్యుల్లో చాలామంది సాధారణ నియోజకవర్గాల ద్వారానే రావడం ఖాయం.

**డా॥ అంబేద్కర్ :** వారు బెంగాల్ గురించి ఏమీ పేర్కొనలేదు. నేను హామీ ఇవ్వగలను.

**శ్రీ జె. బెనర్జీ :** ఖచ్చితంగా ఆయన అలా చేశారు. అవార్డు నేను చాలా జాగ్రత్తగా చదివాను.

**డా॥ అంబేద్కర్ :** దీన్ని గురించి ఒక సమావేశం ఏర్పరిచారు. 1932 సెప్టెంబరు 17, 19 తారీఖుల మధ్య మాల్దాలో బెంగాలు రాష్ట్ర హిందూ సమావేశపు ఏడవ సెషన్ పెట్టారు. శ్రీ రామానంద ఛటర్జీ అధ్యక్షత వహించారు. అవునా?

**శ్రీ జె. బెనర్జీ :** నిజమే.

**డా॥ అంబేద్కర్ :** మాల్దాలో బెంగాల్ రాష్ట్ర హిందూ సమావేశపు ఏడవ సెషన్‌లో?

**శ్రీ జె. బెనర్జీ :** బహుశా, కాని నాకు స్పష్టంగా తెలియదు. నాకు స్వయం జ్ఞానం లేదు.

**డా॥ అంబేద్కర్ :** బెంగాలు రాష్ట్ర హిందూ సమావేశంలో అంగీకరించిన తీర్మానం మీకు చదివి వినిపించాలనుకుంటున్నా. అది 19 సెప్టెంబర్ 1932 'లిబర్టీ'లో ప్రచురితం అయింది. రాబోయే రాజ్యాంగంలో ప్రత్యేక నియోజకవర్గాల ప్రాతిపదికపై ప్రాతినిధ్యం కోరవద్దని నిమ్నజాతులనబడిన వారికి ఈ సభ మనవి చేసుకొంటున్నది. రాజా మూంజే పాక్టుకు కట్టుబడి వుంటామనీ, సంయుక్త నియోజకవర్గాల ద్వారా వాళ్ల జనాభా బలాన్ననుసరించి నిమ్నజాతులకు ప్రాతినిధ్యం అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నామనీ, హిందువుల కిచ్చిన మెజారిటీ స్థానాలు వాళ్లకు తిరిగి ఇవ్వవలసి వచ్చినా సరేనని ఈ సభ రూఢి చేస్తున్నది?

***డా॥ మూంజే :*** ఆ ప్రశ్నకు నేను సమాధానం చెప్పవచ్చునా? తీర్మానం అయింది. దానికి కట్టుబడి వుంటాము. నా మిత్రుడు శ్రీ ఛటర్జీ, డా॥ అంబేద్కర్‌కు సరదాగా సవాలు విసిరారు. నిమ్నజాతులంటే అంటరానివారు దరి చేరరానివారు అనే వ్యుత్పత్తి అర్థంలో జనాభా ప్రాతిపదిక మీద ఆ సంఖ్య ఎంత వుంటుందో చూడడానికి ఆయన సిద్ధమేనా? ఈ సరదా సవాలుని డా॥ అంబేద్కర్‌కు చేయడానికి మేము సిద్ధంగా వున్నాము. నిమ్నజాతి సభ్యుడంటే అంటరానివాడు లేక చూడరానివాడు అనే వ్యుత్పత్తి అర్థంలో బెంగాలులోనూ పంజాబులోనూ నిమ్నజాతుల సంఖ్య ఎంతో – ఈ మొత్తం [illegible]య కానివ్వండి. ఈ సవాలు మేము సరదాగానే చేస్తున్నాము.

***డా॥ అంబేద్కర్ :*** నా ప్రజల అదృష్టాన్ని పార్టీ రాజకీయాల ఆటగా చేయదలచుకోలేదు. ఇలా మీరు చేసేదాన్ని నేను అంగీకరించను.

★ ★ ★

*డా॥ అంబేద్కర్ :* నేనొక అనుబంధ ప్రశ్న వేయొచ్చా? మీ హిందూ మహాసభలో నిమ్నజాతులను కూడ చేరుస్తారని నేనర్థం చేసుకోవచ్చా? వాళ్లకు మీరు ప్రతినిధులని అంటారా?

***డా॥ మూంజే :*** నేను నిమ్నజాతులకు కూడా ప్రాతినిధ్యం వహిస్తాననేది నా ఉద్దేశం. నా ప్రక్కనే కూర్చున్న నా స్నేహితులు శ్రీ గవాయి హిందూ మహాసభ తరపున నిమ్నజాతుల ప్రతినిధి. నిమ్నజాతుల్లో నేను మెజారిటీకి ప్రాతినిధ్యం వహిస్తానో, శ్రీ గవాయి మెజారిటీకి ప్రాతినిధ్యం వహిస్తారో ఎప్పుడూ రుజువు కాలేదు.

***డా॥ అంబేద్కర్ :*** అది వేరే విషయం. మీరు నిమ్నజాతులకు ప్రాతినిధ్యం వహిస్తారా అని నాకు తెలుసుకోవాలని వుంది.

***డా॥ మూంజే :*** నిమ్నజాతుల్లో మెజారిటీ భాగానికి కూడ నేను ప్రాతినిధ్యం వహిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** నా మట్టుకు నేను ఆ విషయంలో సంపూర్తిగా విభేదిస్తున్నాను. శ్రీ గవాయి ఏం చెప్పమన్నారో? డా॥ మూంజే మెమోరాండంకు సంబంధించినంతవరకు, ఆయన ప్రాతినిధ్యం వహించే సంఘానికి నిమ్నజాతులు చెంది లేరనే వాస్తవం నేను ఇంకా పునరుక్తం చేస్తున్నాను. వాస్తవానికి పంజాబు హిందువులు దాన్ని తిరస్కరించారని నాకు తెలుసు.

***డా॥ మూంజే :*** దేన్ని ?

***డా॥ అంబేద్కర్ :*** 57 నెం. మెమోరాండంలో ఆ భాగాన్ని పంజాబు నిమ్నజాతులవారు తిరస్కరించారు.

---

* ఎవిడెన్స్ మినిట్స్, సంపుటి 2-సి, 31 జూలై 1933, పేజి 1466.

## (14)

## అఖిలభారత వర్ణాశ్రమ స్వరాజ్య సంఘం తరఫున శ్రీ యం.కె. ఆచార్య, శ్రీ యల్.యం. దేశపాండే, శ్రీ జె.యల్. బెనర్జీ

**డా॥ అంబేద్కర్ :** మీరు పేర్కొనే మత మూల సిద్ధాంతాలని మార్పు చేసే శాసనాలను (లాస్) పాస్ చేసే అర్హత శాసనసభ (లెజిస్లేచర్)కు వుండగూడదని మీరు కోరుతున్నారు. అలా నేనన్నపుడు, శ్రీ ఆచార్యా, మమ్మల్ని సరిగ్గా అర్థం చేసుకొన్నట్లేనా?

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును.

**డా॥ అంబేద్కర్ :** అలాంటి శాసనం ఏదైనా చేసే ముందు మతాధిపతుల ముందు సమ్మతి తీసుకోవాలని మీ ఉద్దేశం.

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును.

**డా॥ అంబేద్కర్ :** మూడోది, దాన్ని ప్రవేశపెట్టినాక, మూడింట రెండువంతుల మెజారిటీతో నెగ్గేదాక శాసనం కాకూడదు.

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును.

**డా॥ అంబేద్కర్ :** నేనిది అడగాలనుకుంటున్నాను. మూడింట రెండువంతుల మెజారిటీ అనేది మూడింట రెండువంతులు శాసనసభలో హిందూ సభ్యులదా లేక మొత్తం శాసనసభలో మూడింట రెండువంతులా?

**శ్రీ యం.కె. ఆచార్య :** దేనిమీద శాసన ప్రభావం పడాల్సి వుంటుందో అలాంటి ప్రతిమతంలోనూ, హిందూ మతం అయితే హిందూ సభ్యుల్లోనే. అది ముస్లిం మతం అయితే, ముస్లిం సభ్యులు కూడ వుంటారు.

**డా॥ అంబేద్కర్ :** మీ మత మూల సిద్ధాంతాలని మీరు వేటిని గౌరవిస్తున్నారో, వాటిని ఖచ్చితమైన రూపంలో మాకు చెప్పగలరా? దాన్నిబట్టి ఏ మేరకు శాసనసభ జోక్యం చేసుకోగలదో, ఏ మేరకు చేసుకోలేదో ఈ కమిటీ తెలుసుకోవడానికి సాధ్యం అవుతుంది.

**శ్రీ య.కె. ఆచార్య :** కమిటీ మూడు గంటలపాటు వింటే నేను మతమూల సిద్ధాంతాలపైన చాలా సమతా పూర్వకమైన ఉపన్యాసం చేయడానికి సిద్ధంగా వున్నాను.

**సర్ ఆస్ చాంబర్లెన్ :** చట్టం నమిత్తం తగు మాత్ర పదాల సంఖ్యను చేపట్టడానికి మాకొక సూత్రం మీరు ఇవ్వలేకపోతారా?

* ఎవిడెన్స్ మినిట్స్, సంపుటి 2-సి, 2 ఆగస్టు 1933, పేజి 1605-08.

**శ్రీ యం.కె. ఆచార్య :** నేనదే చెప్పాను. మూడు పదాల్లో ఏదో ఒక సమాధానం ద్వారా నన్ను హేళన చెయ్యాలని డా॥ అంబేద్కర్ ఇప్పుడు ప్రయత్నిస్తున్నారు. నేను చెప్పలేను.

**డా॥ అంబేద్కర్ :** నేను మిమ్మల్ని హేళన చేయడానికి యత్నించడం లేదు. అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. శాసన నిర్మాణోద్దేశానికి గాను కమిటీకి ఒక సూత్రం ఇవ్వాలి; దాన్ని చట్టంలో పెట్టటానికి వీలు కలగాలి; దాన్ని బట్టి శాసనసభ ఆమోదించిన ఒకానొక శాసనం, ఆ శాసనసభకే అధికార అతిక్రమణగా వుందీ లేందీ సరిగ్గా తెలుసుకోడానికి ఇరువురికీ వీలవుతుంది; ఇరువురంటే సభాపతిగానీ లేక గవర్నరుగానీ లేక నిర్ణయాధికారి ఎవరైనాగానీ కోర్టులను, న్యాయస్థానాలకూ.

**శ్రీ యం.కె. ఆచార్య :** నేను సూచించాను. ఒక సూత్రం ఆలోచించాను. అది చేయసాధ్యం. వాస్తవం నేను దాన్ని తీసుకున్నాను, దేని నుండంటే –

**డా॥ అంబేద్కర్ :** ప్రాథమికాంశాలు మాత్రం చెప్పారు. మొత్తం విషయం నిర్ణయం చేయకుండా వదుల్తున్నారు. మూలాధారాలు ఏమిటి?

**శ్రీ యం.కె. ఆచార్య :** నేను సూచించిన సూత్రం ఇది. మతంలో మార్పు కలిగించే చర్య చేపట్టాక ముందు, దాన్ని గవర్నరుగానీ గవర్నరు జనరల్ గానీ ఆయా రాష్ట్రంలో ఉన్న గుర్తింపు పొందిన మత అధిపతుల అభిప్రాయానికి పంపాలి. వాళ్ల అభిప్రాయాలు సేకరించిన మీదట, వాళ్ల అభిప్రాయానుగుణంగా తీసుకొని రావడానికి వాటిని మార్పు చేసిన మీదట దాన్ని ప్రవేశపెట్టాలి. అదంతా గవర్నరుగానీ గవర్నరు జనరల్ గానీ నిర్ణయించాలి.

**డా॥ అంబేద్కర్ :** ఒక శాసన నిర్మాణ భాగం యొక్క ప్రభావం మీ మత మూలాధారాలపై పడుతుందో లేదో అనే విషయం మత అధిపతులు నిర్ణయించవలసి ఉందని మీ నుండి గ్రహించవచ్చా?

**శ్రీ యం.కె. ఆచార్య :** నికరంగా అంతే. నిర్ణయం చేయడానికి వాళ్లు అర్హులైన న్యాయాధిపతులు.

**డా॥ అంబేద్కర్ :** శ్రీ ఆచార్యా, కులరీత్యా మీరు బ్రాహ్మణులు?

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును.

**డా॥ అంబేద్కర్ :** శ్రీ దేశ్‌పాండే, మీరు కులరీత్యా బ్రాహ్మణులు.

**శ్రీ దేశ్‌పాండే :** అవును.

**డా॥ అంబేద్కర్ :** శ్రీ బెనర్జీ, మీరు కులరీత్యా బ్రాహ్మణులా?

**శ్రీ జె. బెనర్జీ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** శ్రీ ఆచార్యా, పుట్టుకతో బ్రాహ్మణులైతే తప్ప హిందూమతంలో ఎవరూ పూజారి కాలేరు. ఇది వాస్తవం కాదా?

**శ్రీ కె.యం. ఆచార్య :** కాదు.

**డా॥ అంబేద్కర్ :** మామూలుగా హిందూ ఉత్సవాల వద్ద ఏ హిందువైనా పురోహితుడిగా వ్యవహరించవచ్చని మీ ఉద్దేశమా?

**శ్రీ యం.కె. ఆచార్య :** కాదు, దానర్థం అది కాదు.

**డా॥ అంబేద్కర్ :** బ్రాహ్మణుడు కాని ఎవరైనా ఏ మత విధినైనా ఆధికారికంగా నిర్వర్తించవచ్చా?

**శ్రీ యం.కె. ఆచార్య :** చాలా చిన్న ప్రశ్న. ప్రతి కులానికీ, ఉప కులానికీ లేక వర్ణానికీ ఆ కులం నుండి లేక ఉప కులం నుండి పురోహితుడుంటాడు – బ్రాహ్మణుడు కొన్ని కులాల వద్దకు పోడు.

**డా॥ అంబేద్కర్ :** అది సరైన మాట కాదని నేను చాలా గౌరవపూర్వకంగా చెపుతున్నాను.

**శ్రీ యం.కె. ఆచార్య :** నాకు తెలిసినవరకు అది సత్యం.

**డా॥ అంబేద్కర్ :** శ్రీ దేశ్‌పాండేకి తెలుసా?

**శ్రీ దేశ్‌పాండే :** ఇపుడది అంతే.

**శ్రీ యం.కె. ఆచార్య :** కొన్నిటిని బ్రాహ్మణుడు నిర్వర్తించడు.

**డా॥ అంబేద్కర్ :** మత సంస్థలన్నిటికీ అధిపతులు బ్రాహ్మణులు కాదా?

**శ్రీ దేశ్‌పాండే :** కాదు. బొంబాయి రాష్ట్రంలో ఒక పెద్ద మఠం వుంది. దానికి ఆస్తులున్నాయి, అదంతా కేవలం అబ్రాహ్మణం.

**డా॥ అంబేద్కర్ :** ముఖ్యుల్లోనా?

**శ్రీ దేశ్‌పాండే :** కొందరు బ్రాహ్మణులూ, కొందరు అబ్రాహ్మణులూ.

**డా॥ అంబేద్కర్ :** బొంబాయి రాష్ట్రంలో అది వాస్తవం కాదా?

**శ్రీ దేశ్‌పాండే :** ఇతరులు కూడా వున్నారు, లింగాయతులు.

**డా॥ అంబేద్కర్ :** సమస్యను గడబిడ చేయదలచలేదు. నా ప్రశ్న ఇది. లింగాయతులు, జైనులు లేక బౌద్ధులు మినహా (నేను హిందువుల గురించి మాత్రమే మాట్లాడుతున్నాను) ఈ సంస్థలన్నీ బ్రాహ్మణుల అదుపులో ఉన్నాయనేది వాస్తవం కాదా?

**శ్రీ దేశ్‌పాండే :** బొంబాయి రాష్ట్రంలో కూడా అబ్రాహ్మణుల అదుపులో వున్న సంస్థలు కొన్ని ఉన్నాయి.

**డా॥ అంబేద్కర్ :** అతి తక్కువ కదూ?

శ్రీ దేశ్‌పాండే : అవును, అది అంగీకరిస్తాం. కాని మొత్తం అంతా బ్రాహ్మణులది కాదు.

డా॥ అంబేద్కర్ : ఇపుడు మీ ప్రతిపాదన అంగీకరిస్తే, అంటే ముందుగా మంజూరు చేసే హక్కు మత సంస్థాధిపతులకు వుండాలంటే, మొత్తం హిందూ కమ్యూనిటీ భవితవ్యం ఈ మతాలు నిర్వహిస్తున్న బ్రహ్మణుల చేతుల్లో వుందని దీని సరళార్థం.

శ్రీ యం.కె. ఆచార్య : అలా అని అర్థం కానేకాదు.

డా॥ అంబేద్కర్ : మీ ప్రాతినిధ్య స్వభావం గూర్చి ఒకటి, రెండు ప్రశ్నలడగనివ్వండి. శ్రీ దేశ్‌పాండే, సతారా జిల్లాలో బ్రాహ్మణేతర పార్టీ ఉంది, లేదా?

శ్రీ దేశ్‌పాండే : ఉంది.

డా॥ అంబేద్కర్ : సతారా జిల్లాలో బ్రాహ్మణేతరులు జనాభాలో 890 శాతం వుంటారు.

శ్రీ దేశ్‌పాండే : అవును.

డా॥ అంబేద్కర్ : సతారా జిల్లాలో బ్రాహ్మణులకూ బ్రాహ్మణేతరులకూ మధ్య చాలా బలమైన వైషమ్యం వుంది.

శ్రీ దేశ్‌పాండే : కొన్ని అంశాలమీద, అన్నిటిమీదా లేదు.

డా॥ అంబేద్కర్ : రాజకీయాంశాలమీదా, సంఘ సంస్కరణ మీద మాత్రం?

శ్రీ దేశ్‌పాండే : రాజకీయాంశాల మీద.

డా॥ అంబేద్కర్ : సంఘ సంస్కరణాంశం మీద?

శ్రీ దేశ్‌పాండే : అంతగాలేదు.

డా॥ అంబేద్కర్ : అధికారపూర్వక నిర్వహణకు సంబంధించినంతవరకు బ్రాహ్మణులూ, బ్రాహ్మణేతరులూ దేవాలయాల్లో సమానత గురించి పోరాడుకుంటున్నారు. అది నిజం కాదా?

శ్రీ దేశ్‌పాండే : కొన్ని జిల్లాలో వుండొచ్చు. అన్నిట్లో కాదు.

డా॥ అంబేద్కర్ : ఇరువురి మధ్యా ఒక బలమైన చీలిక ఉన్నది కదా?

శ్రీ దేశ్‌పాండే : నాకు తెలిసినంతవరకూ లేదు.

డా॥ అంబేద్కర్ : ఎలా అయినా వాళ్ల ప్రత్యేక సత్తాతో ప్రత్యేక రాజకీయ జీవితం సాగిస్తున్నారు.

శ్రీ దేశ్‌పాండే : అవును, ఎవడి శక్తి వాడిదే.

డా॥ అంబేద్కర్ : సతారా జల్లాలో కొద్దిమంది బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులకు ప్రాతినిధ్యం

వహిస్తారని మీరింకా అనుకుంటున్నారా?

**శ్రీ దేశ్‌పాండే :** నాకు సంబంధించినంతవరకు.

**డా॥ అంబేద్కర్ :** మీరూ, బ్రాహ్మణేతరుల నాయకుడైన శ్రీ జాదవ్ మెమోరాండకు సంబంధించి ఈ అంశాల మీద చాలామట్టుకు కలిసిపోతారని మీరనుకుంటున్నారా?

**శ్రీ దేశ్‌పాండే :** శ్రీ జాదవ్ గురించి నాకు తెలియదు. నాగురించి నాకు తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** మీరు కలిసి భోంచేస్తారా?

**శ్రీ దేశ్‌పాండే :** శ్రీ జాదవ్, నేనూ, లేదు.

**డా॥ అంబేద్కర్ :** మద్రాసు రాష్ట్రంలో బ్రాహ్మణేతరులతో కూడిన జస్టిస్ పార్టీ వుంది?

**శ్రీ యం.కె. ఆచార్య :** కొన్ని సంవత్సరాల క్రితం ఒక పార్టీ వుంది. ఇప్పుడది అంత చురుగ్గా వుందేమో నాకు తెలియదు.

**డా॥ అంబేద్కర్ :** ఒకటి రెండు సంవత్సరాలు వుంది కదా?

**శ్రీ యం.కె. ఆచార్య :** ఏడెనిమిది సంవత్సరాలుంది.

**డా॥ అంబేద్కర్ :** మద్రాసు రాష్ట్రంలో మళ్లీ బ్రాహ్మణులకూ బ్రాహ్మణేతరులకూ మధ్య చాలా పెద్ద ఎడం ఏర్పడింది.

**శ్రీ యం.కె. ఆచార్య :** మత సమస్యలని చెప్పుకోదగ్గ వాటిపై పెద్ద బలమైన చీలిక కాదు.

**డా॥ అంబేద్కర్ :** సొంతంగా వాళ్లకు ఒక ప్రత్యేక సంఘం ఉంది?

**శ్రీ య.కె. ఆచార్య :** జస్టిస్ పార్టీలో బ్రాహ్మణులు చేర్చుకోబడుతున్నారని విశ్వసిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఇప్పటిదాక చేర్చుకోబడలేదు కదూ?

**శ్రీ యం.కె. ఆచార్య :** అపుడపుడు బ్రాహ్మణులను కూడ చేర్చుకుంటున్నారు. వాళ్లు మారుతున్నారు.

**డా॥ అంబేద్కర్ :** బ్రాహ్మణుల అభిప్రాయాలకు మాత్రమే మీరు ప్రాతినిధ్యం వహిస్తున్నారనడం సరి అవుతుందా?

**శ్రీ యం.కె. ఆచార్య :** పూర్తిగా తప్పు.

**డా॥ అంబేద్కర్ :** ఇప్పుడు మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలనుకొంటున్నాను. శ్రీ దేశ్‌పాండే మీ మెమోరాండం నెం. 64లో పూనా పాక్టు మీద వ్యాఖ్యానం లేదు, నాకు కనపడదు; అవునా?

**శ్రీ దేశ్‌పాండే :** ఏమీ లేదు.

***డా॥ అంబేద్కర్ :*** అది నిజమేనా?

***శ్రీ దేశ్‌పాండే :*** అది నిజమే.

***డా॥ అంబేద్కర్ :*** శ్రీ ఆచార్యా మీ మెమోరాండం నెం. 65లో 3వ పేజీ ఈ ఒక్క పంక్తి తప్పి దాని నైజాన్ని బట్టి పూనా పాక్టును నిరసిస్తున్నాము" అది వేరే రిఫరెన్సు లేదు.

***శ్రీ యం.కె. ఆచార్య :*** అది చాలునని నేనుకున్నా.

***డా॥ అంబేద్కర్ :*** మీ ఈ సంయుక్త రచన ఇటీవలి ఆలోచన, కాదా?

***శ్రీ యం.కె. ఆచార్య :*** అవును, వాటి కన్నా తరువాత వచ్చింది.

***డా॥ అంబేద్కర్ :*** హిందూ మహాసభ సాక్ష్యమిచ్చిన తర్వాత కదూ!

***శ్రీ యం.కె. ఆచార్య :*** కాదు, దానికి చాలా ముందు.

***డా॥ అంబేద్కర్ :*** ఇందులో చెప్పినట్లుగా, తప్పు పట్టాలనే ఉద్దేశం మీ కక్షిదారులకుంటే శ్రీ దేశ్‌పాండే మీ మెమోరాండంలో దీన్ని ఎందుకు చేర్చలేదు?

***శ్రీ దేశ్‌పాండే :*** అది అవసరమని అనుకోలేదు.

***డా॥ అంబేద్కర్ :*** మరో ప్రశ్న అడగాలనుకొంటున్నాను. మీ సంయుక్త రచన నెం. 72లో సంపూర్ణ రాష్ట్ర స్వపరిపాలనా, కేంద్రం బాధ్యతనూ కోరుకొంటున్నారు?

***శ్రీ యం.కె. ఆచార్య :*** ఆ పేరాగ్రాపును ఇంకా జాగ్రత్తగా చదవమని గౌరవనీయులైన పెద్దమనిషిని కోరుతున్నాను. సమాధానం అందులోనే వుంది.

***డా॥ అంబేద్కర్ :*** సమాధానం ఏమిటి?

***శ్రీ యం.కె. ఆచార్య :*** సమాధానం అక్కడే వుంది, మీరు చదివితే.

***డా॥ అంబేద్కర్ :*** సమాధానం ఏమిటి?

***శ్రీ యం.కె. ఆచార్య :*** సమీప భవిష్యత్తులో వివేచన లేకుండా ఓటు హక్కును తగ్గించడానికి వ్యతిరేకంగా వున్నామని అంటున్నాము. వివేచన లేకుండా తగ్గించడాన్ని మేము తిరస్కరిస్తున్నాము. తగ్గించడాన్ని ఎక్కువ వివేకవంతం చేయడం, రాష్ట్రాల స్వపరిపాలన, కేంద్రం బాధ్యత అడగడానికి మేము తదుపరి చర్య వెంటనే తీసుకొంటున్నాము.

***డా॥ అంబేద్కర్ :*** వివేచన లేకుండా ఓటు హక్కును తగ్గించడం ద్వారా మీ దేశస్థులను ప్రాతినిధ్య సంస్థలలో పనిచేసే అలవాటులో శిక్షణ ఎలా ఇవ్వగలదు?

***శ్రీ యం.కె. ఆచార్య :*** అదేమేమనేది. వివేచన లేకుండా తగ్గించడం వాళ్లకు శిక్షణ ఇవ్వదు.

**డా॥ అంబేద్కర్ :** కాబట్టి, దాన్ని ఇంకా పైకి పెంచండి!

**శ్రీ యం. కె. ఆచార్య :** కాదు, వివేచన లేకుండా తగ్గించడానికి వ్యతిరేకమైన పదం వివేచనతో తగ్గించడం.

**డా॥ అంబేద్కర్ :** అది బ్రాహ్మణులకూ, ఉన్నత కులాలవారికీ మాత్రం పరిమితం చేస్తూనా?

**శ్రీ యం. కె. ఆచార్య :** వివేచనతో తగ్గించడం అంటే అర్థం అదికాదు. శ్వేతపత్రం 38,000,000 అంటుంది, నేను 20,000,000 లేక 28,000,000లతో తృప్తి చెందుతాను. అంటే వర్గానికో ఆ వర్గానికో పరిమితం చేయడం కాదు.

**డా॥ అంబేద్కర్ :** మలబార్‌లో నయ్యాదీలు అనే కులం ఉంది, మీకు తెలుసా?

**శ్రీ యం. కె. ఆచార్య :** తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** అక్కడున్న సాంఘికాచారాలను బట్టి, నయ్యాది రోడ్డు మీద నడవకూడదని నాకు తెలిసింది.

**శ్రీ యం. కె. ఆచార్య :** ప్రజా రహదారుల్లో ఇవ్వాళ నడవవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** అతడు ఏదైనా అమ్మాలన్నా, కొనాలన్నా తాను అమ్మదలచిన తన సామాగ్రి వీధికి ఆరు గజాల దూరాన పెట్టి, అక్కడ నుండి అరవాలి.

**శ్రీ యం. కె. ఆచార్య :** నాకు తెలిసినంత వరకు అది సరైన సమాచారం కాదు.

**డా॥ అంబేద్కర్ :** ఆ సమాచారం నేనిస్తున్నాను?

**శ్రీ యం. కె. ఆచార్య :** అది సరికాదు. నేను కాదనవచ్చుగదా. చాలా సంవత్సరాలు నేనూ మలబారులో వున్నాను. గౌరవనీయులైన నా మిత్రుని కన్నా నాకు మలబారు ఎక్కువగా తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** నేనుఅ డగబోయే ప్రశ్న ఇంకా ముందుకు వుంది. నా వాస్తవాలు సరైనవనుకోండి.

**శ్రీ యం. కె. ఆచార్య :** అవి సరైనవి కానపుడు, నేనెలా అనుకుంటాను?

**డా॥ అంబేద్కర్ :** ప్రశ్న ఇది : మలబారులో ప్రజావీధిలో ఒక నయ్యాదీ నడవడం ఏ హిందువైన అడ్డగించడం నేరమని ఒక శాసనం చేస్తే, అది మీ మత ప్రాథమిక సూత్రాలను ఉల్లంఘించడమని మీరటారా?

**శ్రీ యం. కె. ఆచార్య :** తప్పుడు ఊహల మీద గౌరవనీయులైన పెద్దమనిషి ఆధారపడుతున్నట్లు, అక్కడ అలాంటి ఆచారమూ, అలాంటి శాసనమూ లేదు. అలాంటి ఆచారమూ, అలాంటి శాసనానికి అవసరమూ ఉంటే, అపుడు ఆ శాసనం మత ప్రాథమికాలతో విరోధించదు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** ఒక విషయం స్పష్టం చేయాలని వుంది. శ్రీ ఆచార్యా! పూనా పాక్టులో గర్భితమైన వాటిని పండిట్ మాలవ్యా కాదన్నారని మీరన్నారు. దానిమీద మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలి. రాజకీయ సమస్యను పరిష్కరించడమేగాక పూనా ఒడంబడిక అస్పృశ్యతను తొలగించడం, అస్పృశ్యులకు హిందూ దేవాలయ ద్వారాలు తెరవడం అనే ఒక నిర్దుష్టమైన ధర్మాన్ని విధించిందని శ్రీ గాంధీ అనడం వాస్తవం కాదా?

**శ్రీ యం.కె. ఆచార్య :** శ్రీ గాంధీ చెప్పేది అదే అనుకుంటున్నా.

**డా॥ అంబేద్కర్ :** విషయం అది కాదంటున్నారు పండిట్ మాలవ్యా. హిందువులను చేయమని పూనా పాక్టు ఎలాంటి ఔపకారిక ధర్మం విధించడం లేదనీ, కాబట్టి పూనా ఒడంబడికతో అంతర్భూతమైన వాటితో తానంగీకరించననీ అంటున్నారు. అదేగదా ఆ విషయం.

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును, అది అంతే.

**డా॥ అంబేద్కర్ :** అది రాజకీయ పక్ష విషయాన్ని స్పృశించదు. దేవాలయ తలుపులు తెరవడమనే ఔపకారిక ధర్మం పూనా ఒడంబడిక హిందువులపై విధించిందని శ్రీ గాంధీ అంటున్నారు. అలాంటిదేమీ అందులో ఇమిడిలేదని పండిట్ మాలవ్యా అంటున్నారు?

**శ్రీ యం.కె. ఆచార్య :** అవును.

## (15)

## లెఫ్టినెంట్ కల్నల్ సి.యి. బ్రూస్, లెఫ్టినెంట్ జనరల్ సర్ జార్జిమాక్‌మన్, శ్రీ యఫ్ యఫ్. ల్యాల్, శ్రీ వారిన్ అమీర్ ఆలి, శ్రీ ఒ.సి.జి. హెయ్టర్, శ్రీ జస్టిస్ డబ్లు.ఎ. లీరొసిగ్నల్

**డా॥ అంబేద్కర్ :** మీరు జిల్లా జడ్జిగా ఉన్నపుడు ఇండియాలో మంత్రులున్నారా?

**లె.క. సి.యి. బ్రూస్ :** ఉన్నారు, వాళ్లకు నాతో సంబంధం లేదు. వాళ్లు ఎన్నుకున్న మంత్రులు కాదని చెప్పాలి. ఈ మెమోరాండంలో భవిష్యత్‌ను గురించి ఇపుడు సూచిస్తున్నానా, అంటే, నాకు అర్థమయిన వరకు, ప్రతిపాదిత రాజ్యాంగం –

**డా॥ అంబేద్కర్ :** మీరు మీ అనుభవం నుండి మాట్లాడుతున్నారని తలంచాను!

**లె.క. సి.యి. బ్రూస్ :** నేను వివరించవచ్చా? ఇది భవిష్యత్తుకు సంబంధించింది. అంటే మంత్రులను ఎన్నుకోబడిన శాసనసభ క్రింద పెట్టడానికీ, ఎన్నుకోబడిన శాసనసభలకు బాధ్యతగా వుండడానికీ,

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-సి, 2 ఆగస్టు 1933, పుట 1720.

\+ పైదే. సంపుటి 2-సి, 6 అక్టోబర్, 1933, పుట 1612.

వాళ్ల కాబినెట్‌తో పాటు నిలబడడానికి లేక దిగిపోడానికి బద్ధుల్ని చేయడానికి ప్రతిపాదన వున్నపుడు

***సర్ హరిసింగ్ గౌర్ :*** మీది భవిష్యద్వాణి

## (16)

## వింగ్ కమాండర్ ఏ. డబ్ల్యు. హెచ్. జేమ్స్, డా॥ జె. హెచ్. హటన్

*డా॥ అంబేద్కర్ :* గిరిజన శాసనం వాళ్ల ఆచార ధర్మంగా వాదించలేరా?

***వింగ్ కమాండర్ ఎ.డబ్లు.హెచ్. జేమ్స్ :*** లేదు; దానిని హైకోర్టు గుర్తించలేదు.

***డా॥ అంబేద్కర్ :*** హైకోర్టు ఏ ఆచారాన్నైనా గుర్తిస్తుంది కాదా?

***వింగ్ కమాండర్ ఎ.డబ్లు.హెచ్. జేమ్స్ :*** హిందూ ఆచారమనీ, మహమ్మదీయ ఆచారమనీ ప్రతిష్ఠాపన చేయనవసరంలేదు. ఆ భావంలో ఏ శాసనం అమలులో ఉండకపోతే, ఆచారమే పాలన చేస్తుంది. సాధారణంగా అదీ సంగతి. నేను స్వీయానుభవంతో మాట్లాడడంలేదు.

★ ★ ★

+***డా॥ అంబేద్కర్ :*** డా॥ హట్టన్, చేర్చుకోని ప్రాంతాల పరిపాలన రాష్ట్ర విషయం కాకుండా కేంద్ర విషయం కావడం మీకు ఇష్టమని చెప్పినారనుకుంటాను?

***డా॥ జె.హెచ్. హట్టన్ :*** అది నా సొంతభావన.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :*** మీ పేపరులో చర్చించిన ఇతర విషయాలకు మళ్లాలని కోరుతున్నాను. ఈ మనుషులు ఏ పరిస్థితులలోనూ కొత్త రాజ్యాంగ పరిధిలోకి రాకూడదన్న భూమికపై మీరు ముందుకు వెళ్లుతున్నారనుకుంటున్నాను.

***డా॥ జె.హెచ్. హట్టన్ :*** అది అలాగే.

***డా॥ అంబేద్కర్ :*** మీరు ముందుకు సాగడానికి అదీ ఊహ, ఆధారం.

***డా॥ హట్టన్ :*** చెల్లా చెదరయి, ఇతర జనాభాలో వాళ్లు కలిసిపోయి జీవిస్తున్నపుడు, అలాంటి పరిస్థితులలో అది వేరే విధంగా వుంటుందని నేను ఒప్పుకుంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** ప్రాథమికంగా మీరు ఆధారపడి కొనసాగే ఊహ అదే.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–డి, 16 అక్టోబర్, 1933, పుట 2376.

\+ పైదే. పేజీలు 2388–90.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును, ప్రధాన విషయంలో.

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రజల కొరకు మీ ముందున్న ఆదర్శం ఏమిటి? నా ప్రశ్నలను కుదిస్తాను, దానినిబట్టి మీరు ఇంకా మేలుగా జవాబులు చెప్పొచ్చు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ఎవరైనా చాలా తక్కువ ప్రమేయం పెట్టుకోవడం.

**డా॥ అంబేద్కర్ :** నా దృష్టిలో వున్నట్లు ప్రశ్న వేయనివ్వండి. ఇండియాలో మిగతావారి వ్యవహారాలతో ఎలాంటి సంబంధం లేకుండా ఆదిమ జనులు ఆదిమ జనులుగా ఉండిపోలనేది మీ ఆదర్శమా? లేక వాళ్ల భవితవ్యాలను క్రమపరిస్తే కాలక్రమేణా వాళ్లు మానవాళి నుండి దూరమైపోయినవారు కాకుండడం మానుకొని, మిగతా భారతీయులు ఇపుడు చేస్తున్నట్లు వాళ్ల దేశ ప్రజా వ్యవహారాలలో భాగం పంచుకుంటారని ప్రతిపాదిస్తున్నారా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** రెండోది నా ఆదర్శమని అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** వాళ్లు శాశ్వతంగా ఆదిమ జనులుగా కొనసాగరాదు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** సమస్య ఎలా వుండాలంటే, సాధ్యమైతే, చివరికి వాళ్ల దేశ జీవితంలో వాళ్లు భాగం పంచుకోవాలి.

**డా॥ అంబేద్కర్ :** నేననేదీ అదే.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** కొన్ని విషయాల్లో ఆ ఆదర్శాన్ని ఎన్నటికీ సాధించలేకపోవచ్చు. ఇదీ సాధ్యమే.

**డా॥ అంబేద్కర్ :** ముందు ఆదర్శాలేమిటో ఖాయపరచనివ్వండి.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** వాళ్లు ఇదో అదో కావాలని నేను మత సమస్య ప్రవేశపెట్టడంలేదు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** లేదు.

**డా॥ అంబేద్కర్ :** మీరు వేలెత్తి చూపింది ఇది : వాళ్లు పౌరసమాజంలో భాగస్థులు కావాలనేది మీ ఆదర్శం అనుకుంటా.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** పైగా వాళ్లీ గిరిజన స్థితి నుండి ఎదగాలి.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును, అది అవసరం అనుకుంటున్నా

**డా॥ అంబేద్కర్ :** కాబట్టి నన్నింకా ముందుకు వెళ్లనివ్వండి. అదే అభిప్రాయమైతే, భారతదేశ నాగరిక

జనానికీ, ఈ ఆదిమ జనానికీ – ఇరువురికీ – సామాన్య భాగగ్రహణ చక్రం ఉండడం కోరదగింది కదా!

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అప్పుడే కాదు.

**డా॥ అంబేద్కర్ :** అయినా భారతదేశంలో నాగరిక సమాజానికి చెందిన వారి మనసులను అలజడి పెడుతున్న అభిప్రాయాలు ఈ ఆదిమ ప్రజా వర్గాలలోకి మెలమెల్లగా దిగుతాయి కదా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ఏ ఇబ్బందీ లేకుండానే అభిప్రాయాలు దిగుతాయనే అనుకుంటున్నా.

**డా॥ అంబేద్కర్ :** ఎలా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** నన్ను బాధించేదేమంటే వాళ్లను ప్రత్యేకిస్తే తప్ప, మరీ హఠాత్తుగా చేర్చుకోవడం వల్ల వాళ్లు నశించి పోయే అవకాశముంది. ప్రపంచంలో ఇతర ప్రతిచోటా ఇంచుమించుగా జరిగింది అదే.

**డా॥ అంబేద్కర్ :** నాకు తెలియదు. కాని మీ పరిశీలనకు ఒక విషయం మనవి చేస్తున్నా. వాళ్లు ఏదో ఒక రోజున భారత సమాజంలో ఒక భాగం అవుతారనేది మీ ఆదర్శమని మీరు అంగీకరించారు. అలాంటప్పుడు మీరు ప్రతిపాదిస్తున్నట్లు వేరు చేయడం, అంతపూర్తిగాను, అంత కఠినంగానూ వేరు చేయడం – ఆదర్శం నెరవేరడానికి సరైన మార్గమంటారా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** నా మట్టుకు నాకు ఇది మాత్రమే సాధ్యమని అనుకొంటున్నాను.

**సర్ రెజినాల్డ్ క్రాడక్ :** నేనొక ప్రశ్న వేయొచ్చా? కొన్ని కొండజాతుల్లో అనేక విద్యాసంస్థలు కొనసాగుతున్నాయి. విషయం అంతేకాదా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును, నికరంగా...

**సర్ రెజినాల్డ్ క్రాడాక్ :** అవి ముఖ్యంగా (క్రైస్తవ) సేవా సంస్థలేనా లేక ప్రభుత్వం పాఠశాలలేమైనా వున్నాయా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ప్రభుత్వ పాఠశాలలు చాలా వున్నాయి.

**సర్ రెజినాల్డ్ క్రాడాక్ :** అది పాయింట్లలో ఒకటి, ఈ పాఠశాలల అభివృద్ధి సందర్భంలో వాటిని పేర్కొంటారు, అలా చేయరా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** నేను తప్పక

**డా॥ అంబేద్కర్ :** నేనింకా ముందుకు వెళ్లాలనుకుంటున్నా. రెండు విషయాలలో మీకు బాధగా వుందని మీ పేపరు నుండి తెలుస్తోంది (నేను పొరపాటైతే సరిచేయండి). ఒకే నియోజకవర్గంలో చదువుకున్న వాళ్ళకూ లేక అభివృద్ధి చెందిన వాళ్లకూ లేక నాగరీక భారతీయులకూ ఆదిమవాసులకు మధ్య స్పర్శ లేక ఏకత్వం ఆ పదం వాడితే – ఒక పర్యవసానం, మొదటిగా, వృద్ధి చెందిన వర్గాలవల్ల

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అది నేనంగీకరించను. వాళ్లకు చాలామంది మిత్రులుంటారనే విషయంలో ముందు నాకు నమ్మకం కుదరాలి. అలాంటి ఆసక్తులు వున్నవారు ఇతరులు వుండొచ్చు. కాని వ్యక్తిగతంగా వాళ్లలో సామాన్యమైన అంశం అత్యంత స్వల్పంగా వుండొచ్చు.

**డా॥ అంబేద్కర్ :** సర్, నా ఉద్దేశంలో అదే స్థితిలో వున్న ఒక వర్గానికి సంరక్షణ సమస్య సాధారణమైందిగా సంబంధించినపుడు?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** సిహత్‌లో వున్న ముసల్మాన్ వ్యవసాయదారుడు వీలయినంత ఎక్కువ భద్రత తనకూ, సాధ్యమైనంత తక్కువ భద్రత తన పొరుగువారికీ కోరతాడని నేను అనుకొంటాను.

**డా॥ అంబేద్కర్ :** భారతీయుల ప్రయోజనానికి అవసరమైన కొన్ని శాసనాలు ఇతరులకు పొడిగించకూడదనిన్నీ, ఆ శాసనాల క్రింద ఆదిమజాతులకు రక్షణ ఇవ్వకూడదనిన్నీ శాసనసభ అంత దూరం వెళ్లి చెపుతుందంటారా?

**డా॥ జె.హెచ్. హటన్ :** లేదు. అంతదూరం వెళ్తారని నేననుకోను.

**డా॥ అంబేద్కర్ :** మరి వివక్షత ఎలా వస్తుంది?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ఆదిమ జాతులకు అవసరమైన రక్షణ లభించడం అత్యంత కష్టమనుకుంటున్నాను. కొత్త రాజ్యాంగ చట్టం క్రింద వ్యవసాయదారుడు అవసరమైన రక్షణ పొందుతాడన్న హామీ నిమ్నజాతుల విషయంలో లేదు.

**డా॥ అంబేద్కర్ :** పూర్తిగా సత్యం. మీతో ఏకీభవిస్తున్నాను. బహుశ ఇతర వర్గాలవారు కలిసిపోరనీ, కొన్ని ఇతర అల్పసంఖ్యాక వర్గాలవారికి ఇచ్చే సంరక్షణను అడ్డగించరనీ ఏమీ లేదు. అందుకు రక్షణ ఏమీ వుండదు. ఈ భయం న్యాయసమ్మతమైంది. కాని అటువైపునా, ఇటువైపునా ఉన్న శక్తులన్నిటినీ లెక్కలోకి తీసుకొని నేను మీకు అందించదలచిన అంశం ఇది : రాష్ట్ర శాసన మండలిలో ఆదిమజాతులకు వుండే ఒకరిద్దరు ప్రతినిధులు తమను ఇతర పక్షాన వుండే శక్తులు వశం చేసుకుంటారని భావిస్తారనే భయం పూర్తిగా న్యాయబద్ధంగా లేదు. శ్వేతపత్ర ప్రతిపాదన క్రింద భవిష్యత్ శాసనసభ అనిర్మాణంపై నేను మీకు సమర్పిస్తున్న విశ్లేషణను బట్టి ఈ విషయం చెప్తున్నాను.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** జాతి భేదం దృష్టిలో అది సాధ్యమని నేననుకొనంటున్నాను. కనీసం కొన్ని ప్రాంతాలలోనైనా.

**డా॥ అంబేద్కర్ :** విద్య విషయం తీసుకోండి. బొంబాయి రాష్ట్రంలో ఈ ఆదిమవాసుల గూర్చి నాకు కొంతవరకు తెలియడం జరిగింది. మాలోనూ కొన్ని వెనుకబడ్డ వర్గాలున్నాయి?

**డా॥ జె.హెచ్ హట్టన్ :** అవును, నాకు తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** అయినా మేము వాళ్ల నుండి ఎక్కువగా చీలి వుండలేదు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** నాకు తెలుసు.

**డా॥ అంబేద్కర్ :** విద్యా విషయకంగా మాట్లాడితే ఆదిమవాసులు లేక వెనుకబడిన ప్రజల కన్నా ఇండియాలో చాలామందికి విద్యావసరం చాలా తక్కువ అని ఎవరూ నిజంగా చెప్పలేరు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** మీరు చెప్పలేందేది ఏమిటి?

**డా॥ అంబేద్కర్ :** మీరు ఏం చెప్పలేరంటే (ఉదా : నిమ్నజాతులు తీసుకోండి) కనీస విద్యావసరం వారికి తక్కువ అని అనలేము.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అది తక్కువని మీరు చెప్పలేరు.

**డా॥ అంబేద్కర్ :** ఎవరూ చెప్పలేరు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** కాదు.

**డా॥ అంబేద్కర్ :** నేను వెనుకబడిన వర్గాలబోర్డులో వున్నాను. అది నిమ్నజాతులు, ఈ ఆదిమజాతులతో కూడిన బోర్డు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును, కొందరి విషయంలో ఆదిమవాసులు ఎక్కువ విద్య గడించి వున్నారు.

**డా॥ అంబేద్కర్ :** కాబట్టి వాళ్ల విద్యావసరం పరిగణిస్తూ, శాసనమండలిలో వాళ్లు ఏకాకులు కారని నేను చెప్తున్నాను.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** వాళ్లు కావచ్చు.

**డా॥ అంబేద్కర్ :** వాళ్లందరూ విడిగా వుండాలని మీరు కోరుతున్నారు. వాళ్లకు ఉన్నత విద్యావసరం ఉందని నేను భావిస్తున్నాను. దానిని గవర్నరు తన ప్రత్యేక బాధ్యతల క్రింద సరఫరా చేసే నిధుల ద్వారా తీరాలని మీరు కోరుతున్నారు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రశ్న వేయాలని వుంది. ఆదిమవాసుల విద్యకు గవర్నరు ఎంతో ఒకంత డబ్బు కావాలని అంచనా వేసినపుడు, తన మంత్రులు తనను బలపరచకపోతే, అనుకున్నంతగా గవర్నరు సదుపాయం చేయడానికి అంతమేరకు వెళ్తారా?

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ఇది తీవ్రమైన ఇబ్బంది.

**డా॥ అంబేద్కర్ :** నేను మీకు చెప్పిన అంశంలో బలం ఏమైనా వుంటే, వీళ్ల ప్రతినిధులు కొందరు శాసనమమండలిలో ఉండడం వాంఛనీయం కదా! అందుచేత వాళ్ల ఓట్ల మీద ఒక మంత్రి ఆధారపడతాడు, వాళ్ల కోరికలకు సానుకూలంగా వుంటారు.

**డా॥ జె.హెచ్.హట్టన్ :** ఒకటి, రెండు చెదురు మదురు ఓట్లు ఒక మంత్రిపై ప్రభావం చూపకపోవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** ఒకటి, రెండు అనను. తక్కువ సంఖ్యే కావచ్చు. శాసనమండలిలో తగినంత ప్రాతినిధ్యం వాళ్లకు వుందనుకోండి. వాళ్ల ఓట్ల మీద మంత్రి ఆధారపడడా? కాబట్టి వాళ్ల కోరికలకు మరింత సానుకూలంగా వుండొచ్చు.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** సిద్ధాంతరీత్యా, కాని వ్యవహారరీత్యా కాదు. వాళ్ల సంఖ్య ఎంతో తక్కువ ఉంటుంది.

**డా॥ అంబేద్కర్ :** రాజకీయంలో కేవలం ఒక్క ఓటు త్రాసును తలకిందులు చేయొచ్చు.

**లార్డ్ యూస్టాస్ పెర్సీ :** రాష్ట్ర పరిధి నుండే గాక, గవర్నరు పరిధి నుండి కూడ వాళ్లను వేరుచేసి, కేంద్రపాలన క్రిందికి తీసుకురావాలని డా॥ హట్టన్ సిఫార్సు అని నేను అనుకొంటున్నాను.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** మొత్తం మీద నేను కోరేది అదే. గవర్నర్ జనరల్ క్రింద ఏజెంటుగా గవర్నరు వ్యవహరించే ప్రాంతాలుగా వేరు చేయాలనే శ్వేతపత్ర ప్రతిపాదనల విషయంలో, శ్వేతపత్ర ప్రతిపాదన సంతృప్తికరంగా వుందని నేను నా సిఫార్సులో ప్రకటించాను. దాన్నే నేను ఎంచుకొంటానని చెప్పను.

**లార్డ్ యూస్టాస్ పెర్సీ :** చిన్న రాష్ట్రాలు చేయాలన్న మీ ప్రతిపాదనల నుండి నేననుకున్నదేమంటే – వీలయినంతవరకూ కేంద్రపరమై వుండాలని మీరు వుద్దేశించినట్లు నేననుకున్నాను.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** ఖచ్చితంగా, సాధ్యమయినంత వరకూ అది కేంద్రపరమై వుండాలని నా ఉద్దేశం.

**డా॥ అంబేద్కర్ :** ఆ కేసులో కూడ నేను పూర్వం వ్యక్తపరచిన విమర్శ సరిగ్గా ఉపయుక్తమవుతుంది. అది కేంద్ర విషయమైనా, ఆ విషయానికి అవసరమైన నిధులు గవర్నరు ధ్రువపరచాలి కాబట్టి, కేంద్ర ప్రభుత్వంలో వున్న మంత్రులు అంతమొత్తం నిధులు ఖర్చు చేయడానికి అభ్యంతరపరిస్తే ఆ సంఘర్షణ వుండనే వుంటుంది. అది కేవలం రాష్ట్రస్థాయి నుండి కేంద్రస్థాయికి బదిలీ చేయడం మాత్రం అవుతుంది.

**డా॥ జె.హెచ్. హట్టన్ :** అందులో మంత్రికి ప్రమేయం వుండదని నేననుకొంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** మినిస్టర్ మాట అక్కడుంటుందని నే చెప్పే పాయింటు. ఎందుకంటే నిధుల నిమిత్తం వేరే పోటీ డిమాండ్లు వుంటాయి. శాసనసభలో భాగస్తులు కాని ఆదిమజాతుల పట్ల మంత్రి శ్రద్ధ కల్గి వుంటారని ఆశించలేము.

**డా॥ షఫాత్ అహమ్మద్ ఖాన్ :** శాసనసభలో వున్న ఆదిమజాతుల ప్రతినిధులు సాధారణంగా నిమ్నజాతులతో కలిసిపోయి వుండరా?

**డా॥ అంబేద్కర్ :** నే దృష్టి సారిస్తున్న విషయం అదే. కాబట్టి వాళ్లకు చాలామంది మిత్రులు

ఏర్పడతారు.

***డా॥ జె.హెచ్. హట్టన్ :*** ఆ ప్రాతినిధ్యం ప్రభావితమౌతుందని నేననుకోను.

***డా॥ అంబేద్కర్ :*** మీలాగా నేనూ నిరాశావాదినైతే నేను తక్షణమే ఇలా చెప్తా : "ఈ రాజ్యాంగం నాకసలు అక్కరలేదు."

***డా॥ జె.హెచ్. హట్టన్ :*** కాని నేనను, ఆదిమ తెగల నిమిత్తం.

★ ★ ★

***మేజర్ అట్లీ :*** మీ దృష్ట్యాంశం అనుసరించి సైమన్ కమిషన్ అరణ్యాల విషయంలో సిఫార్సు చేయలేదు. అరణ్యాలను బదిలీ చేయమని చెప్పింది.

***డా॥ జె.హెచ్. హటన్ :*** లేదు, వేరు చేయబడ్డ ప్రాంతాల సమర్థ ఆర్థిక పరిపాలన నిమిత్తం నేనది సూచనగా ముందుంచాను.

***లార్డ్ యూస్టాస్ పెర్సీ :*** ఈ ఇబ్బందితో డా॥ హట్టన్ బహుశ వ్యవహరిస్తారనుకుంటా; ఎందుకంటే రాష్ట్ర అటవీ విధానమూ చెల్లుబాటై వుండే పూర్తిగా వేరు చేయబడ్డ ప్రాంతం అంటే ఏమిటో నాకు అర్థం కావడంలేదు.

***డా॥ అంబేద్కర్ :*** నేను చెప్పాల్సి వస్తే, ప్రాంతాన్ని వేరు చేయలేదు. ప్రజలు మాత్రమే వేరు చేయబడ్డారు.

***డా॥ జె.హచ్. హటన్ :*** లేదు, ప్రాంతం వేరు చేయబడింది. శ్వేతపత్రం నే చదివిన దాన్నిబట్టి. పూర్తిగా వేరైన ప్రాంతానికి వ్యుత్పత్తి అర్థం ఏమిటో శ్వేతపత్రంలో వుందా?

## (17)

## సర్ విన్‌స్టన్ స్పెన్సర్ చర్చిల్, కామన్స్ సభ సభ్యులు

***డా॥ అంబేద్కర్ :*** శ్రీ చర్చిల్, అధినివేశ రాజ్యాంగాన్ని శ్వేతపత్రం ప్రతిపాదించడం లేదుకదూ!

***సర్ విన్స్టన్ చర్చిల్ :*** లేదు.

***డా॥ అంబేద్కర్ :*** కాబట్టి మిమ్మల్ని ప్రశ్నలతో ఇబ్బంది పెట్టను; అధినివేశ ప్రతిపత్తి అనేది పేరుకి మాత్రమేనో లేక అధినివేశ ప్రతిపత్తి అధినివేశ రాజ్యాంగమో అనే వ్యత్యాసం తెలుసుకొనే నిమిత్త తార్కికమైనట్టి, (అధిభౌతిక) స్థితి గురించి ప్రశ్నలు వేయదలచలేదు. శ్వేతపత్రాన్ని గురించే ఒకటి రెండు ప్రశ్నలు అడగాలని నా ప్రతిపాదన. మీరు చూపించాలనుకున్న తేడా గురించి ఏదో విషయం

* ఎవిడెన్స్ మినిట్స్, సంపుటి 2–సి, 24 అక్టోబరు 1933, పేజీలు 1807–08.

తీసుకువచ్చి మిమ్మల్ని గజిబిజి చేయను. కాబట్టి 1931 డిసెంబరు 1న పార్లమెంటులో జరిగిన చర్చ పట్ల మీ దృష్టిమళ్లిస్తున్నాను. అపుడు ప్రధానమంత్రి ఈ తీర్మానం చేశారు. అది ఈ వాక్యాలలో వుంది : "కమాండు పేపరు నెం. 3972లో పొందుపరచి ఇండియన్ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు – 19831 డిసెంబరు 1న పార్లమెంటులో ప్రవేశపెట్టిన ప్రకారం బ్రిటిషు ప్రభుత్వం వారి ఇండియా విధానాన్ని ఈ సభ ఆమోదిస్తోంది." అదీ మొదటి శ్వేతపత్రం – పత్రం పథకం కాదు.

**సర్ విన్స్టన్ చర్చిల్ :** ప్రధానమంత్రి ప్రసంగం అని మీ ఉద్దేశం?

**డా। అంబేద్కర్ :** ప్రధానమంత్రి ప్రసంగం.

**సర్ విన్స్టన్ చర్చిల్ :** పూర్తిగా.

**డా। అంబేద్కర్ :** శ్వేతపత్రంలో రాజ్యాంగసారం సంగ్రహంగా చెప్పబడింది. అది ప్రధాన ప్రతిపాదనలో చేరి వుంది. జాయింట్ సెలెక్ట్ కమిటీకి సమర్పించినట్లుగా సభకు అందించిన శ్వేతపత్రంలో ఇమిడి ఉంది. రాష్ట్రాలలో రాష్ట్ర బాధ్యత గల ప్రభుత్వం వుండాలి. దానికి లా అండ్ ఆర్డర్ బదలీ వుండాలి. కేంద్రంలో ఒక రకమైన ద్వంద్వ ప్రభుత్వం వుండాలి. అందులో సైన్యం, విదేశీ వ్యవహారాలు రిజర్వు విషయాలుగా వుంటాయి. అది సరైనమాటేనా?

**సర్ విన్స్టన్ చర్చిల్ :** ఈ అంశం వద్ద మిమ్ము అభ్యంతరపరచవలసిన అవసరం లేదు.

**డా। అంబేద్కర్ :** ఇక తరువాతి అంశం దీన్ని గురించి అడగాలనుకుంటున్నాను. కామన్స్ హౌస్‌లో ఈ తీర్మానం అంగీకరించేటప్పుడు ప్రధానమంత్రి తన ఉద్దేశం స్పష్టపరిచారు. ఆయన మాటలు నే చదువుతున్నాను. నేను రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు ఎన్ని చేసిన ప్రకటనకు కాబినెట్ యొక్క పూర్ణాధికారం వుంది. ఆ ప్రకటన సభకు ప్రసారం చేసిన మీదట, తన ఓటు ద్వారా ఆ విధానంతో తోడై వుండమని మనం ఇప్పుడు సభను అడగాలని ఉన్నాము. కామన్స్ సభలో ఈ తీర్మానాన్ని అంగీకరించడంలో ప్రధాని ఉద్దేశం అది. ఇపుడు ఆ తీర్మానానికి సవరణ పెట్టారు. అది మీకు తెలుసు. సవరణ ఈ పదజాలంతో వుంది. "మిస్టర్ చర్చిల్, 3వ లైనులో చివర ఈ పదాలు చేర్చాలని ముందుకొచ్చాను. అయితే ఈ విధానంలో ఏదీ కూడ వెస్ట్ మినిస్టర్ నియత శాసనం నిర్వచించినట్లు ఇండియా అధినివేశ రాజ్యాంగ ప్రతిష్ఠాపనకు కమిట్ చేయించరాదు. పైగా ప్రతికూలం కానట్టి లేక పక్షపాత వివక్షత లేకుండా ఇండియాలోనూ, ఇండియాతోనూ బ్రిటిష్ వ్యాపారం సుసాధ్యంగా సంరక్షించేటట్లు వుండాలి; అదీగాక ఇండియాలో స్వయం ప్రభుత్వ విస్తరణలు ఏవీ పార్లమెంటుకు ఇండియా సామ్రాజ్యపు శాంతి, క్రమత, మంచి ప్రభుత్వం పట్ల వున్న కడపటి బాధ్యతకు ఈ సందర్భంలో హాని కలిగించరాదు."

**డా। అంబేద్కర్ :** 1931 డిసెంబరు 3న కామన్స్ హౌస్‌లో జరిగిన చర్చ చదివిన తర్వాత నాకు కలిగిన అభిప్రాయం ఇది : మీ సవరణ ప్రధానమంత్రి అంగీకరించి ఉన్నట్లయితే, ప్రధానమంత్రి

ప్రవేశపెట్టిన తీర్మానాన్ని బలపరుస్తూ ప్రభుత్వానికి ఓటు వేయడానికి మీరు సమ్మతంగా వున్నారు. అది కరెక్టే గదా!

**సర్ విన్స్టన్ చర్చిల్ :** ఈ ఊహాత్మక పరిస్థితులలో ఏం జరిగి వుండేదో చెప్పడం చాలా కష్టమనుకుంటా. కాని, ఆ సవరణలో నన్ను బలపరచిన వారిని ముఖాముఖి చూసి వున్నట్లయితే కామన్స్ హౌసులో వున్న కన్సర్వేటివ్ సభ్యులలో ఎక్కువమందికి చాలా గొప్ప ఉపశమనం కలిగేది. అందులో సందేహంలేదు. అది ఎంతో గొప్ప ఉపశమనం, వెంటనే మరింత అంగీకారమైన వాతావరణం అనుసరించేది, సృష్టింపబడేది.

**డా॥ అంబేద్కర్ :** అదృష్టవశాత్తు నాకు అది ఊహతో కూడిన విషయం అనిపించటం లేదు. చర్చ జరుగుతుండగా సవరణ విషయంలో మీరు చాలా స్పష్టమైన వైఖరి అవలంబించారని నేను కనుగొన్నాను. మీరు చేసిన ఉపన్యాసంలో ఒకటి రెండు ప్రకటనలు మీ దృష్టికి తీసుకొస్తాను. అన్నిటికంటే ముందు నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేసిన ఒక్క వాస్తవం, ప్రభుత్వం నొక్కి చెపుతున్నదానికీ మీరు ప్రతిపాదించిన సవరణకూ, అప్పుడు సభలో వున్న ఎక్కువమంది సభ్యులలో కల్గిన మనోభిప్రాయాన్ని బట్టి, నిజంగా ఎలాంటి వ్యత్యాసమూలేదు; నేను దాన్ని అంగీకరించితీరాలి. అంతేకాదా? మీ మాటల్లో ఒక పేరా నన్ను చదవనీయండి. నే చెప్పదలచిన అంశం ఇది : నన్ను ఆశ్చర్యపరచిన విషయమిది. ప్రధానమంత్రి ప్రకటనా, ఆరోజున మీరు కామన్స్‌సభలో ప్రతిపాదించ నెంచిన సవరణను చదివిన మీదట నేను ఏ లెక్క ప్రకారమూ వాటిని తేడా చూడలేదు. మీ స్థితి కూడ అంతే అని చెప్తున్నా. ఎలాగంటే, దీన్ని స్పష్టపరిచే ఒక పేరా చదువుతాను. కాలం 234లో మీరిలా అన్నారు. "నా ప్రసంగం పూర్తి చేశాను. వాళ్ల సావధానతలో నేను ఇంతగా చొచ్చుకు పోవడానికి నాకు అనుమతి ఇచ్చినందుకు సభకు కృతజ్ఞుణ్ణి. మనం సవరణతో జాగ్రత్త పడడం తప్ప ఇంకేమి చేయగలం. ఇది బ్రిటిషు ప్రభుత్వం మీద విశ్వాస తీర్మానం కాదు. ఇదీ ముఖ్యమైన విషయం. పైగా ఇది కేవలం నియమాలు నొక్కి చెబుతుంది. వాటికవే ఖాయపరచుకొంటాయి. వాటిని ప్రధానమంత్రి, స్టేట్ సెక్రెటరీ ఖాయపరిచారు." కాబట్టి, ప్రధానమంత్రి ప్రకటనలో ఉన్న ప్రతిపాదనలకూ, మీ సవరణ సారాంశానికీ వ్యత్యాసం లేదని మీకు మీరే యదార్థంగా చూశారు.

**సర్ విన్స్టన్ చర్చిల్ :** అవునవును, ప్రతిపాదనల పై ప్రభుత్వం సరైన దృష్టి పెట్టుకోకపోవడం దురదృష్టకరమని నేను భావించాను. సవరణ అంగీకారం పొందడం నాకు చాలా సంతోషప్రదంగా వుండేది.

**డా॥ అంబేద్కర్ :** అదేరోజున మీరు చెప్పిందాన్నుండి మరో పేరా పేర్కొననివ్వండి. ఆరోజున మీరు ప్రభుత్వానికి రెండో ప్రత్యామ్నాయం చూపారు. కామన్స్ సభలో ఆరోజున ప్రధానమంత్రి ప్రకటనను స్టేట్ సెక్రెటరీ ప్రసంగం అనుసరించేటట్లయితే, మీ సవరణ అంగీకరింపబడకపోయినా

ప్రభుత్వంతో వోటు వేయడానికి సంతృప్తి పడతారని చెప్పారు.

**సర్ విన్స్టన్ చర్చిల్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** నా పాయింటు ఇది : అదేగనక మీ స్థితి అయితే, అంటే, కామన్సుసభలో ప్రధానమంత్రి ప్రకటనను స్టేట్ సెక్రెటరీ ప్రసంగం అనుసరించేటట్లయితే, ఆ విశేషచర్చలో మీరు ప్రభుత్వానికి ఓటు వేయడానికి తృప్తిపడడం అయితే, మీ నుండి అవగాహన చేసుకోదలచింది ఇది. ఈ కమిటీకి యధాతథంగా సమర్పించిన శ్వేతపత్రానికీ, స్టేట్ సెక్రెటరీ ఉపన్యాసంతో కలిసిన ప్రధానమంత్రి ప్రకటనకూ వ్యత్యాసం ఏమిటి? కమిటీకి సమర్పించిన ప్రధానమంత్రికీ, ప్రకటనకూ, కామన్సు సభలో ప్రధానమంత్రి ప్రకటనపై స్టేట్ సెక్రెటరీ చేసిన ప్రకటనకూ మధ్య మీరు చూసే విభేదం ఏమిటో మాకు తెలుపగలరా?

**సర్ విన్స్టన్ చర్చిల్ :** పార్లమెంటులో గానీ, కామన్స్ సభలో గాని ఇరుపక్షాల వాదంలో వచ్చే వ్యత్యాస విషయంలో, ఆ వ్యత్యాసమేమిటో గుణగ్రహణ చేయడం బయటివారికి కష్టం; మా వాదనలను ప్రభావితం చేసేటువంటి, మార్పు చేసేటువంటి పరిస్థితులన్నీ అర్థం చేసుకుంటే తప్ప ఇది సాధ్యం కాదు. కాని నేను పత్రం బయటి వ్యక్తి తీసుకొని రావాలని కోరిన సవరణకూ, మా నెత్తిపై ప్రభుత్వం రుద్దిన తీర్మానానికీ గొప్ప యదార్థమైన వ్యత్యాసం ఉంది, అది నిర్వివాదం. సూక్ష్మమైన ఈతేడా వుంది. ఏ పక్షానికా పక్షం తమకు సపోర్టు పోకుండా వుండే రీతిలో సహజంగా తమ వాదాన్ని ముందుంచుతారు. అయినా వ్యత్యాసం వుంది, బాగా స్పష్టంగా కన్పిస్తోంది. మాకు ఇంకా ద్వివిధ పార్లమెంటు పద్ధతి వుంది. లార్డ్సుహౌసులో వాదాలని కామన్సుహౌసులోని వాదాలతో సంయుక్తంగా చదవాలి. మా పార్లమెంటు సంస్థలకు న్యాయం కూర్చడానికి గాను డా॥ అంబేద్కర్ ఈ విషయాలు గుర్తుంచుకోవాలని నేను సలహా ఇవ్వడంలేదు.

**డా॥ అంబేద్కర్ :** మర్యాదాపూర్వకంగా నేను చెప్పాల్సి వస్తే, లార్డ్సుసభ, పార్టీ ఇతర సభ్యుల పొజిషను ఎలా వున్నా, మీ స్థితిని మాత్రం నేను అర్థం చేసుకోదలచాను. ప్రధానమంత్రి ప్రకటన గనక స్టేటు సెక్రెటరీ ఉపన్యాసంతో సంయుక్తంగా విడుదలయితే ప్రభుత్వంతో వోటు చేస్తారని మీరు నిక్కచ్చిగా చెప్పారు. మర్యాదా పూర్వకంగా మీకు సమర్పించకోరిన అంశం ఇది : జాయింటు పార్లమెంటు కమిటీకి సమర్పించిన శ్వేతపత్రానికీ, కామన్సుసభలో ఆరోజునస్టేటు కార్యదర్శి నిర్వచనంతో ప్రధానమంత్రి చేసే ప్రకటనకూ మధ్య ఏమైనా తేడా మీరు చూస్తున్నారా? ఉంటే, సరే, విభేదించడానికి ఎంతో ఆధారం వుంది.

**సర్ విన్స్టన్ చర్చిల్ :** డా॥ అంబేద్కర్, ఇండియా కేంద్రంలో ఈ సమయంలో ఫెడరల్ సిస్టం (సమాఖ్య విధానం) పెట్టడానికి నేనెప్పుడూ అనుకూలంగా లేను. లేదా శాంతి భద్రతల బాధ్యత రాష్ట్రాలకి బదిలీ చేయడానికి కూడ సానుకూలుణ్ణి కాదు. ఈ విప్రతిపత్తిలో నేనెప్పుడు చెప్పిందైనా దాంతో సంఘర్షణ పడలేదు.

**డా॥ అంబేద్కర్ :** అడగడానికి ఇంకేమీ ప్రశ్నలు లేవు.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** లార్డు ఛైర్మెన్, మీ అనుమతితో ఒక ప్రశ్న వేయవచ్చా?

**ఛైర్మన్ :** మీకు ఇష్టమైతే,

**డా॥ అంబేద్కర్ :** నేను ఒక్క ప్రశ్న అడగాలనుకుంటున్నా. మిస్టర్ చర్చిల్, బాధ్యతాయుత ప్రభుత్వానికి చాలా నిర్వచనాలున్నాయి. వ్యవహారంలో ఎన్నో వున్నాయి. ఎన్నో చూశాము. బాధ్యతాయుత ప్రభుత్వం అంటే తీవ్రమైంది, నిజమైంది, రాష్ట్ర వివేచనకు ముఖ్యమైన విధులు బదిలీ అయినది, లేక స్థానిక సంస్థ లేదా దాని అర్థః బాధ్యతాయుత ప్రభుత్వం యొక్క వివిధ స్థాయిలు అంటే వాటికి అధినివేశాలు వలసరాజ్య కార్యాలయాలతో వాటి పరిభాషలో వుండే సాంకేతిక అవగాహన కల్గి వుంటాయి. ఉదా : మంత్రులు అసెంబ్లీకి బాధ్యత కల్గి వుండడం, అలా కొన్ని కాని 'బాధ్యతాయుత ప్రభుత్వం' అనే పదం క్రింద వచ్చే సరైన సంస్థల రూపంలో మేము చారిత్రకంగా రూపకల్పన చేసిన అధినివేశాలు, సామ్రాజ్యాలలో చాలా పరిగణించాల్సిన మెట్లు, క్రమాలు వున్నాయి.

****డా॥ అంబేద్కర్ :** జనసామాన్యానికి వయోజన ఓటుహక్కు ఇవ్వడం మీకు అంగీకారమేనా?

**సర్ విన్స్టన్ చర్చిల్ :** లేదు.

**డా॥ అంబేద్కర్ :** ఎంచేత?

**సర్ విన్స్టన్ చర్చిల్ :** నేననుకొనేది, వాస్తవంగా అసాధ్య గనుక.

## (18)

## లెఫ్టినెంట్ కర్నల్ హెన్రీ గిడ్నీ, యం.యల్.ఎ., (రిటైర్డ్), ఆంగ్లో ఇండియన్, ఇండియాలో డొమిసైడ్ యూరోపియన్ అసోసియేషన్ తరపున

+**డా॥ అంబేద్కర్ :** కొత్త రాజ్యాంగం క్రింద మీ కమ్యూనిటీకి జరగబోయే దానిపట్ల మీకు చాలా ఆందోళన ఉన్నట్లు మీ మెమోరాండం బట్టి నేగ్రహిస్తున్నాను. మీ భయంతో చాలా ఇతర అల్ప సంఖ్యా వర్గాల వారు కూడ భాగం పంచుకుంటున్నట్లు నేను నమ్ముతున్నాను. కాబట్టి నేను మాకు వేసే ప్రశ్న ఇది : ఇండియాలో వివిధ కమ్యూనిటీల నైతిక భౌతిక పరిస్థితిపై ప్రతి సంవత్సరం

* ఎవిడెన్సు మినిట్స్ : సంపుటి 2–సి, 25 అక్టోబరు, 1933, పుట 1833.

** పైదే. పుట 1849.

\+ పైదే. సంపుటి 2–సి, 10 నవంబరు, 1933, పుట 1996.

పార్లమెంటుకు ఒక రిపోర్టు సమర్పించే చట్టసమ్మత విధిగల ఆఫీసరుగానీ డిపార్టుమెంటుగానీ భవిష్యత్ ఇండియా కేంద్ర ప్రభుత్వంలో ఉండేలా ఒక ప్రొవిజన్ పెడితే మీరనుకున్న దానికి ఏమైనా ప్రయోజనముంటుందా? మీ యొక్క భౌతిక ప్రయోజనాలను దెబ్బ తీసేటువంటిది ఏదైనా రాష్ట్ర పాలనతో మీకు జరిగినదేదైనా వుంటే దానిని పార్లమెంటు దృష్టికి తీసుకెళ్లే ప్రతిపాదన మీకేమైనా ఉపయోగపడుతుందంటారా?

**సర్ హెన్రీ గిడ్నీ :** ఆ ప్రతిపాదనకు నా పూర్తి ఆమోదం వుంది. అదే అల్పసంఖ్యాకుల సంరక్షణలో చిట్టచివరాంశం. దానికి తొలిచరక పార్లమెంటు సభలకు ఎవరో రిపోర్టు చేసే విధంగా రక్షణ కావాలని కోరడం గాక, ఆచరణాత్మక రక్షణ కావాలి.

***డా॥ అంబేద్కర్ :*** నాకు స్పష్టం కానివ్వండి. మీరు అడిగేదానికి నేను ప్రత్యామ్నాయం సూచించడం లేదు. మీరు అడిగేదానికి అది సంపూర్ణత చేకూర్చేది కావచ్చు కదా?

**సర్ హెన్రీ గిడ్నీ :** అవును.

***డా॥ అంబేద్కర్ :*** ఈ అవకాశం లేక బహుశా జరగబోయే అధికార దుర్వినియోగం బయటపెట్టే విధానం, సాధ్యపడే మరో అధికార దుర్వినియోగాన్ని అడ్డుకొనేదిగా పనిచేస్తుందని నాతో ఏకీభవిస్తారా?

**సర్ హెన్రీ గిడ్నీ :** కమ్యూనిటీల మీద పక్ష ప్రభావం చూపే మార్గంలో దేనినైనా పార్లమెంటు సభకు తీసుకెళ్లే మార్గమని తప్పక తలుస్తాను.

***డా॥ అంబేద్కర్ :*** మీవేగాకుండా ఇతర అనేకులవి.

**సర్ హెన్రీ గిడ్నీ :** అల్ప సంఖ్యాకులందరివీ.

**శ్రీ జఫ్రుల్లాఖాన్ :** దానిమీద పార్లమెంటు ఏం చెయ్యాలనుకుంటున్నారు.

***డా॥ అంబేద్కర్ :*** అది అక్కడ ఉంటుంది. అప్రభుత్వాల విషయం రికార్డులోకి తీసుకొంటుంది. వివిధ ప్రభుత్వాలు, తమ అధీనంలో ఉంచిన అల్ప సంఖ్యాకుల బాధ్యతలను ఎలా నిర్వహిస్తున్నదీ గవర్నరు – జనరల్ తెలుసుకోవడమేగాక, పార్లమెంటు కూడ తెలుసుకోవాలి.

**సర్ హరిసింగ్ కౌర్ :** దాన్ని మీరు రాష్ట్రాల స్వయం పరిపాలన అంటారా?

***డా॥ అంబేద్కర్ :*** అవును, తప్పకుండా అంటాను.

## (19)

## శ్రీ జె.సి. ఫ్రెంచ్, ఇండియా పోలీసు తరఫున శ్రీ యస్.హెచ్. మిల్స్

**డా॥ అంబేద్కర్ :** శ్రీ మిల్స్ మిమ్మల్ని అడగాలనుకున్న ఒక ప్రశ్న వుంది; ఎందుకంటే ఈ విషయంలో మీ అభిప్రాయం గ్రహించాలనే ఆసక్తి నాకుంది. బెంగాల్‌లో ప్రతిపాదించిన రాజ్యాంగం క్రింద, మహమ్మదీయులూ, వెనుకబడిన వర్గాల వారూ కాంగ్రెసు ప్రభావం క్రింద వుంటారని మీరు ఒకరకంగా చాలా దృఢంగా చెప్పారు.

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** అక్కడ కాంగ్రెస్ ప్రభావం క్రింద వుండడానికి చాలా అవకాశం వుందనుకొంటున్నాను. కొంత శాతం వరకు.

**డా॥ అంబేద్కర్ :** నిమ్నజాతులలో 20 శాతం మంది వరకూ అని చెప్పారు.

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఈరోజున ఉగ్రవాదోద్యమంతో సానుభూతిగల ఏ నిమ్నజాతివర్గాలు గానీ, ఏ మహమ్మదీయులుగాని ఈరోజు ఉన్నారనడం మీ సూచన కాదనుకుంటాను.

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** ఉగ్రవాదులుగా అరెస్టయిన వారిలో నిమ్నజాతులు పెద్ద సంఖ్యలో వున్నారు.

**డా॥ అంబేద్కర్ :** ఏ కమ్యూనిటీ నుండి ?

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** విచిత్రమైన కమ్యూనిటీల నుండి వుండి వున్నారు. షావాస్ చాలామంది వున్నారు. ఇక మిడ్నాపూర్ నుండి చాలామంది నిమ్నజాతులు అరెస్టయినవారు – ప్రత్యేకంగా మిడ్నాపూర్.

**డా॥ అంబేద్కర్ :** షాహ నిమ్నజాతులలో షెడ్యూల్డ్ కాస్ట్ కాదు?

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** కాదు. మిడ్నాపూరు జిల్లాలో నిమ్నజాతులు చాలామంది అరెస్టయినవారిలో వున్నారు.

**డా॥ అంబేద్కర్ :** మీ నుండి రాబట్టాలనుకున్న తరువాతి అంశం ఇది. బెంగాల్‌లో నామశూద్రులు వంటి పెద్ద కమ్యూనిటీ ఏదో విధంగా ఉగ్రవాద ఉద్యమంతో సంబంధించి వున్నారనేది మీ అనుభవమా?

**శ్రీ యస్.హెచ్. మిల్స్ :** అవును, ఉన్నారు.

**డా॥ అంబేద్కర్ :** నేను మిమ్మల్ని అడగదలచిన తరువాతి ప్రశ్న. శ్వేతపత్ర ప్రతిపాదనల క్రింద బెంగాల్‌లో అల్పసంఖ్యాకులకు ప్రత్యేక నియోజకవర్గాలున్నాయి, మీకు తెలుసా?

శ్రీ యస్.హెచ్. మిల్స్ : అవును.

డా॥ అంబేద్కర్ : ప్రత్యేక నియోజకవర్గాలు ఉన్నప్పటికీ, ఈ కమ్యూనిటీల నుండి సభ్యులను ఎన్నుకునేటప్పుడు కాంగ్రెసు ప్రభావం వుంటుందని మీరింకా అనుకుంటున్నారా?

శ్రీ యస్.హెచ్. మిల్స్ : బహుశ అది ఎక్కువగా ఉంటుందని అనుకుంటున్నా.

డా॥ అంబేద్కర్ : ఆ ప్రభావం ఎలా ఉంటుంది?

శ్రీ యస్.హెచ్. మిల్స్ : ఉగ్రవాదులు కాంగ్రెసు వెనుక వుండడంతో రాష్ట్రంలో చాలా పెద్దగా భయం ఉంది. ఆ భయం ప్రజల్ని ప్రభావితం చేస్తుంది.

అనువాదం :

జె. శ్రీ రఘుపతిరావు



## (20)

# భారత రాజ్యాంగ సవరణకోసం ఏర్పాటయిన సంయుక్త కమిటీ ముందు భారతదేశ కార్యదర్శి ఇచ్చిన సాక్ష్యం

## *శామ్యూల్ హెూర్, సర్ మాల్కోలాకు హైలీ, జి.సి.యస్.ఐ., జి.సి.ఐ.యి. సర్ ఫిండలాటర్ స్టీవార్ట్

°**డా॥ అంబేద్కర్ :** నేనా విషయాన్ని అంతగా తెలుసుకోలేదు. శాసనసభ సమావేశమై ఉన్నప్పటికీ, 92 మరియూ 95 ప్రతిపాదనల ప్రకారం, గవర్నర్ తాను అవసరం లేదని భావించినప్పుడు, తన శాసనాన్ని శాసనసభలో ప్రవేశపెట్టవలసిన అవసరం ఉండదు.

**సర్ శామ్యూల్ హెూర్ :** నిజమే! గవర్నర్‌కు ఆ హక్కు ఎప్పుడూ ఉంటుంది.

**డా॥ అంబేద్కర్ :** గవర్నర్‌కు ఆ హక్కు ఉంటుందా?

**సర్ శామ్యూల్ హెూర్ :** తాను ఉద్దేశించినప్పుడే, ఆదేశాల్ని అయినా, శాసనాల్ని అయినా ప్రవేశపెట్టవచ్చును.

★ ★ ★

+**డా॥ అంబేద్కర్ :** నేనీ విషయాన్ని మరికొంత పరిశీలించి చూడాలనుకుంటున్నాను. అది కేసు యొక్క పరిస్థితులపైన ఆధారపడి ఉంటుందని మీరే చెప్పారు. కానీ సర్ తేజ్ సప్రూ చెప్పేది కాదు. ఇంతకూ అసలు ప్రశ్న యేమిటంటే, క్లాజు మధ్యలో కలగజేసుకునే అవకాశాన్ని కలిగిస్తుందా? అని. అలా కలగజేసుకోవడం మాత్రమే గాకుండా, "లేదు. ఇది సుఖశాంతులకు భగ్నం కలిగిస్తుంది. దీన్ని మీరు ప్రవేశపెట్టదలచుకుంటే నేనందుకు అంగీకరించను" అని చెప్పగలిగే శక్తిని కలిగిస్తుందా?

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** ప్రావిన్స్ యొక్క శాంతి సుఖాలకు ఇది భగ్నం కలిగిస్తుందని భావించిన పక్షంలో, గవర్నర్‌కు తగిన నిర్ణయాన్ని తీసుకోగలిగే అవకాశాన్ని మాత్రమే ఈ క్లాజు కల్పిస్తుంది. అటువంటి శాసనం యేదైనా ఒక వర్గానికిగానీ, వేరొక వర్గానికిగానీ అపకారం కలిగిస్తోందని ఆయన భావించినప్పుడు అలా నిర్ణయాన్ని తీసుకోగలిగే హక్కు ఆయన కుంటుంది.

---

* సర్ శామ్యూల్ హెూర్ భారతదేశ ప్రభుత్వ కార్యదర్శిగా పనిచేశాడు. సర్ మాల్కోలాం హైలీ యునైటెడ్ ప్రావిన్స్ గవర్నర్‌గా వుండేవాడు. సర్ ఫిండ్‌లాటర్ స్టీవార్ట్ లండన్‌లోని ఇండియా ఆఫీసులో శాశ్వత ఉపకార్యదర్శి గా ఉండేవాడు.

° మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 14 జూలై, 1933, 729వ పేజీ.

+ పైదే. పుట 735.

**డా॥ అంబేద్కర్ :** "మిమ్మల్నీ విధమైన శాసనాన్ని అమలు జరపనివ్వను" అని చెప్పగలిగే శక్తి యీ క్లాజు ద్వారా లభిస్తోందని అతడు అనుకున్నప్పుడేమౌతుంది?

**సర్ శామ్యూల్ హెూర్ :** భూ స్థితులు, దాని అద్దె తాలూకూ సమస్యల నుంచి ఆవిర్భవించే విషమ సమస్యలు గత రెండేళ్లుగా యునైటెడ్ ప్రావిన్స్‌లో పేరుకుపోయి ఉన్నాయని మాత్రం నేనిప్పుడు చెప్పగలను. నా అభిప్రాయంలో ఈ క్లాజును అమలు పరచవలసిన సందర్భం ఇదివరకే ఒకసారి ఏర్పడింది. ప్రావిన్స్‌లోని కొన్ని ప్రాంతాలలో కౌలుదారుల సంఖ్య గణనీయంగా పెరగడంతో ఈ క్లాజును అనుసరించవలసిన అవసరం ఏర్పడింది. ఒక వర్గాన్నిగానీ లేక వేరొక వర్గాన్నిగానీ శాసనసభ పక్షపాత ధోరణిలో ఇబ్బంది పెడుతోందన్నప్పుడు మాత్రమే ఈ క్లాజును అనుసరించాలని నేననుకొని ఉండేవాణ్ని కాను.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** ఎగువసభ పైన నేనడగదలచుకున్న ప్రశ్నల్ని ఎప్పుడు అడగాలి? సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఈ విషయమై ఏమనుకొంటున్నారు?

**సర్ శామ్యూల్ హెూర్ :** రెండవ సభకు సంబంధించిన రాజ్యాంగానికి సంబంధించినంతవరకూ, ఓటింగుతో దానిని జత కలపడం బావుంటుందని సలహా యిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఈ ఓటింగ్ ప్రశ్న నిప్పుడు విడిచి పెట్టాల్సిందేనా?

**సర్ శామ్యూల్ హెూర్ :** కమిటీ ఏ విధంగా భావించినప్పటికీ, ఇది ఓటింగులోకి కలిసి ఉంటే బావుండునని నేను భావిస్తాను.

**డా॥ అంబేద్కర్ :** సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు సంబంధించిన ప్రశ్నలేవీ నేనడగను.

**అధ్యక్షుడు :** సెక్రటరీ ఆఫ్ స్టేట్ సలహా ఆచరణయోగ్యంగా వుందని నేనభిప్రాయపడుతున్నాను. ఈ సమయంలో మీరా ప్రశ్నలడగరని నేననుకొంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఎగువసభ కూర్పును గురించి నేనడగాలనుకొన్నాను. దానిని ఇప్పుడడగడం సబబుగాదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. సబబు అనే నాకనిపిస్తోంది.

**డా॥ అంబేద్కర్ :** ఎగువ సభ, దిగువసభలు రెండింటిలోని సభ్యుల నుంచీ ప్రావిన్స్ కోసం మంత్రులను ఎన్నిక చేసుకోవచ్చునని మీరనుకున్నారు. గతంలో నేనడిగిన ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ మీరావిధంగా చెప్పారు.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 14 జూలై 1933.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** శ్వేతపత్రంలో చెప్పినట్టుగా, ఎగువసభలో పదిమంది నామినేటెడ్ సభ్యులు ఉంటారన్న విషయం మీకు గుర్తుందిగదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఎగువ సభలో కూర్చునే యీ పదిమంది నామినేటెడ్ సభ్యులు కూడా మంత్రులుగావడానికి అర్హులేనని మీ ఉద్దేశమా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. వారికీ, మిగిలినవారికీ నా దృష్టిలో తేడా చూపను.

**డా॥ అంబేద్కర్ :** నామినేటెడ్ సభ్యులు మంత్రులు కావడానికి అర్హులేనా?

**సర్ శామ్యూల్ హెూర్ :** కచ్చితంగా అవును. నేనావిధంగా ఉండాలనే భావించాను.

**డా॥ అంబేద్కర్ :** ప్రావిన్షియల్ శాసనసభలోని నామినేటెడ్ సభ్యులెవరూ మంత్రిగా అర్హుడుగాడని ప్రస్తుత గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టులో స్పష్టంగా పేర్కొన్నారు గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్ చెప్పినట్టుగా, నిజమే!

**డా॥ అంబేద్కర్ :** నేను చెప్పినమాటలు తప్పయితే సవరించండి కానీ ఆక్టు ప్రకారం పరిస్థితి అదే అని నేను విశ్వసిస్తున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఎగువసభలోని నామినేటెడ్ సభ్యులను కొత్త ప్రభుత్వంలోకి మంత్రులుగా రానివ్వడమన్నది మీరు ప్రవేశపెడుతున్న ముఖ్యమైన మార్పుగా భావించవచ్చునా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. అలాగే భావించవచ్చు. ఇది ప్రత్యేకించి భిన్నమైన ప్రభుత్వం!

**డా॥ అంబేద్కర్ :** నేనిప్పుడు కారణాలను ఏకరువు పెట్టడంలేదు. కేవలం వాస్తవాలను మాత్రమే చెప్తున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** నిజమే! గవర్నరుకు స్వేచ్ఛగా ఎన్నిక చేసుకునే హక్కును ఇవ్వడాన్ని గురించి యింకా చాలా విశ్లేషించి చూడవలసిన అవసరముందని నేను అనుకుంటున్నాను. డా॥ అంబేద్కర్‌గారూ! కేబినెట్ మొత్తంగా దీనికి బాధ్యత వహిస్తుందని మనమెల్లప్పుడూ అనుకోవాలి. అంతేగాదు, కేబినెట్ అభిప్రాయాలకు విరుద్ధంగా మంత్రినెవరినీ తలపైన రుద్దాలనే అభిప్రాయం కూడా లేదని భావించాలి.

★ ★ ★

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** మంత్రుల నియామక సమయాల్లో ఎన్నికకాబడిన సభ్యులకూ, నామినేటెడ్ సభ్యులకూ మధ్య తేడాను గుర్తించాలని ప్రస్తుత గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టు భావించడం సబబేనని సర్ శామ్యూల్ అనుకుంటున్నారు. ఆయన భావన సరైనదేనా?

**సర్ మాల్కొలాం హైలీ :** ఇది నాకు క్రొత్త. కానీ డా॥ అంబేద్కర్ చెప్పినదాన్ని బట్టి సరేననుకొంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఎన్నికయిన సభ్యుడిని ఆరునెలలోపల మంత్రిగా నియమించాలి అని నా అభిప్రాయం.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** నాకు తెలిసినంతవరకూ, గవర్నమెంట్ ఆఫ్ ఇండియాకు మంత్రుల నియామక కాలంలో ఎన్నిక కాబడిన సభ్యులకూ నామినేటెడ్ సభ్యులకూ మధ్య తేడాను గుర్తించలేదు. సెక్షన్ 52లో యీ విషయాన్ని విశదీకరించారు.

**డా॥ అంబేద్కర్ :** అతను ఎన్నుకోబడాలి.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** డా॥ అంబేద్కర్ సర్ శామ్యూల్‌గారికి యీ విషయం చెప్పారని నేననుకున్నాను. మంత్రి కావడమన్న విషయంలో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు ఎన్నికకాబడిన సభ్యులకూ, నామినేటెడ్ సభ్యులకూ మధ్య తేడా ఉందని భావిస్తోందని కూడా ఆయన సలహా చెప్పారు.

**సర్ మాల్కొలాం హైలీ :** తాను మంత్రి అయిన ఆరునెలల లోపల ఎన్నిక కాబడిన సభ్యుడుగా రూపొందకపోతే అటువంటి మంత్రి తన మంత్రిత్వాన్ని కోల్పోతాడని మాత్రం యాక్టు పేర్కొంటోంది.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** కానీ అక్కడ అప్పటికొక నామినేటెడ్ సభ్యుడు ఉంటే, అతడిని మంత్రిగా నియమించడానికి అడ్డంకులేవీ లేవు.

**సర్ మాల్కొలాం హైలీ :** అలాగే ఉంది యాక్టులో.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** అలాగే జరిగింది కూడానా?

**సర్ మాల్కొలాం హైలీ :** అవును.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** నేనర్థం చేసుకున్నంతవరకూ ఆ చట్టం ఇలా ఉంది : గవర్నర్ బయటివాళ్లనెవరినైనా మంత్రిగా నియమించవచ్చు. అయితే అతడు ఆరునెలలోగా విధానమండలికి ఎన్నిక కావాలి. అదే విధంగా గవర్నరు నామినేటెడ్ సభ్యుడిని కూడా మంత్రిగా నియమించవచ్చు యాక్టు యే విధమైన తేడానీ గమనించదు.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్ : సంపుటి 2-బి, జూలై 14, 1933, పుట 748.

**శ్రీ జఫ్రుల్లా ఖాన్ :** ఎవరినైనా నామినేటెడ్ సభ్యుడిగా నియమించిన తరువాత, అతడు ఎల్లప్పటికీ నామినేటెడ్ సభ్యుడిగానే కొనసాగుతాడా? లేకపోతే అతడు ఎన్నికలలో నిల్చోవాలా?

**సర్ శామ్యూల్ హోర్ :** లేదు.... అది స్పష్టంగానే పేర్కొనబడింది. నామినేటెడ్ సభ్యుడిని ఇతరులతో సమానంగానే గుర్తిస్తారు.

**డా॥ అంబేద్కర్ :** ఆరునెలలలోగా ఎన్నిక కాబడకపోతే, అతడు మంత్రిగా కొనసాగడానికి వీలులేదు.

* * *

**•డా॥ అంబేద్కర్ :** ఆ సెక్షనును చదవమంటారా?

**సర్ శామ్యూల్ హోర్ :** అసలు పరిస్థితి యెలా వుందో తెలుసుకోవలసిన అవసరం ఉందంటారా?

**డా॥ అంబేద్కర్ :** అవసరం వుంది. ఎందుకంటే నేను కచ్చితమైన పరిస్థితి ఏమిటో తెలుసుకోవాలని అనుకుంటున్నాను. సెక్షన్ 52, సబ్ సెక్షన్ 2 ఏమిటంటే : "స్థానిక శాసనసభకు సభ్యుడుగా ఎన్నిక కాని పక్షంలో ఏ మంత్రిగానీ ఆరునెలలకంటే ఎక్కువగా మంత్రిగా కొనసాగలేడు" నేనింతకూ ఈ యాక్టు నామినేటెడ్ సభ్యుడు మంత్రిగా కొనసాగుతాడన్న ఉద్దేశాన్నెప్పుడూ వెల్లడించలేదని చెప్పదలచుకున్నాను. శ్వేతపత్రాన్ని యధావిధిగా అనుసరించినప్పుడు మాత్రం నామినేటెడ్ సభ్యుడు మంత్రిగా కొనసాగుతాడు. అంతేకాదు, దాని ప్రకారం ఎగువసభలోని నామినేటెడ్ సభ్యుడు మంత్రిగా అర్హుడు. మంత్రివర్గ నియామకం విషయంలో నేను మీ దృష్టిని ప్రాంతీయ రాజ్యాంగం కోసం యేర్పాటు చేయబడిన ఉపసంఘపు సిఫార్సుల వైపుకు మళ్లించవలసిందిగా కోరుతున్నాను. "ఆ కార్య నిర్వహణ కోసం, గవర్నరు శాసనసభలోని అత్యధిక అనుచరులు కలిగిన సభ్యుడిని పిలిచి 'ఇతర మంత్రుల పేర్లను పేర్కొనవలసిందిగా చెప్పాలి. అంతేగాదు, మంత్రుల పేర్లను ఆమోదముద్రకోసం సమర్పించాలని కూడా ఉపసంఘం భావిస్తోంది." అని వారన్నారు. 67వ పేరాగ్రాఫు ప్రకారం అతడు "ఈ క్రింది విధంగా మంత్రులను ఎంపిక చేసుకోవడంలో కృషి చేయాలి". ప్రాంతీయ రాజ్యాంగ సమితి సిఫార్సులకు ఇది విరుద్ధంగా ఉందని నా నమ్మకం.

**సర్ శామ్యూల్ హోర్ :** విరుద్ధంగా ఉందని నేననుకోను. 'సాధారణంగా' అని సమితి అంటోంది. కాబట్టి యిలా సాధారణంగా ఏర్పడుతుందని మాత్రం నేనూ వ్రాస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఉమ్మడి బాధ్యతను పెంపొందించడం కోసమూ, ప్రభుత్వాన్నొక కట్టడిలోకి తేవడంకోసమూ మంత్రివర్గ నిర్మాణంలో అతడొక ప్రత్యేక మార్గాన్ని అవలంబించవలసిన అవసరం ఉందని మీరనుకోవడంలేదా?

**సర్ శామ్యూల్ హోర్ :** డా॥ అంబేద్కర్ పేర్కొంటున్న రౌండ్ టేబుల్ కమిటీ అలా భావించడం లేదు.

---

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్ సంపుటి 2–బి, 14 జూలై 1933.

**డా॥ అంబేద్కర్ :** కమిటి అలా భావించదనే నేననుకున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** "సాధారణంగా" వారలా ఆలోచించారని మీరొక మాటను మాత్రం అందులోంచే చదివారు.

**డా॥ అంబేద్కర్ :** వారలాగే చేయాలి. 'సాధ్యమైనంత ప్రయత్నం' కాదుకదూ!

**సర్ శామ్యూల్ హోర్ :** ఇదంతా మాటలతో కూడింది మాత్రమే.

**డా॥ అంబేద్కర్ :** నేనడగబోయే తరువాతి ప్రశ్న 104వ ప్రతిపాదన కింద మంత్రులకుండే అధ్యాదేశం సమస్యకు సంబంధించినది. రాజ్యాంగంలో ఇటువంటి అవ కాశ్యాన్ని కలిగించాల్సిన అవసరమేమొచ్చిందో నేను తెలుసుకోవాలని అనుకుంటున్నాను. ఈ దేశంలో 1920లో మంత్రిమండలి ఒక అత్యవసర యాక్టును రూపకల్పనగావించి, శాసనసభ చేత పాస్ చేయించుకొన్నది. ప్రాంతీయ శాసనసభలోని మంత్రిమండలి నేడు కూడా అలాంటి యాక్టును పాస్ చేయించుకోవడం ద్వారా మరింత బలవత్తరంగా తయారు కావచ్చు కదా? నేను 104వ నెంబరు గురించి మాట్లాడడం లేదు. ప్రాంతీయ శాసనసభ ద్వారా ఒక యాక్టు పాస్ చేయించుకుని, ప్రత్యేక అత్యవసర పరిస్థితులలో కావలసిన శక్తిని సంపాదించుకోవడం సాధ్యం కాదా?

**సర్ శామ్యూల్ హోర్ :** ప్రతి ప్రభుత్వమూ ఇటువంటి శక్తిని కలిగి వుండాలనే నేను భావించాను. శాసనసభ సమావేశం కాని రోజుల్లో అత్యవసరమైన నిర్ణయాల్ని తీసుకునే అధికారం ప్రభుత్వానికుండాలి. ముఖ్యంగా భారతదేశం వంటి విశాలమైన దేశాల్లో, శాసనసభల్ని సమావేశ పరచడానికి చాలాకాలం అవసరమౌతుంది. కాబట్టి అటువంటి అధికారం చాలా అవసరం.

**డా॥ అంబేద్కర్ :** అలా నిర్ణయాలు తీసుకోవాల్సిన అత్యవసర పరిస్థితులు ఏవో నిర్వచించే యాక్టునొకదాన్ని తయారుచేసి, శాసనసభలో పాస్ చేయించవలసినదిగా ప్రాంతీయ మంత్రివర్గానికి సలహా ఇస్తున్నాను. రాజ్యాంగంలో ఇటువంటి అవకాశాన్ని పేర్కొనవలసిన అవసరమేమిటి?

**సర్ శామ్యూల్ హోర్ :** ప్రభుత్వానికటువంటి ముఖ్యమైన అధికారం తప్పకుండా ఉండాలని నేను అనుకున్నాను. రాజ్యాంగానికి సంబంధించిన విషయాలనన్నిటినీ పరిగణిస్తున్నప్పుడు, రాజ్యాంగ యాక్టులో ఇటువంటి అధికారాన్ని తప్పకుండా చేర్చాలి.

**డా॥ అంబేద్కర్ :** బాధ్యతాయుతమైన మంత్రివర్గానికి మాత్రమే ఇటువంటి అధికారం ఇవ్వాలి. అత్యవసర పరిస్థితులలోనయినా, కానప్పుడైనా, బాధ్యతాయుతమైన మంత్రివర్గం తాము బాధ్యత వహించి వున్న శాసనసభ నుంచే అధికారం పొందగలగాలి.

**లార్డ్ యూస్టేస్ పెర్సీ :** శాసనం గాకపోయినప్పటికీ మంత్రులు అప్పుడప్పుడూ వాడుకుంటున్న ఒక ప్రత్యేక అధికారాన్ని ఈ దేశంలోని 1920వ సంవత్సరపు యాక్టు స్థిరపరిచిందని డా॥ అంబేద్కర్ గారికి నేనిప్పుడు జ్ఞాపకం చేయదలచుకుంటున్నాను. మంత్రివర్గం అత్యవసర నిర్ణయాన్నిగై కొనడమన్నది

ఈ దేశంలో అలవాటు. కానీ అది తరువాత పార్లమెంటు హామీని పొందాలి.

**డా॥ అంబేద్కర్ :** నేనడగదలచుకున్నదంతే.

★ ★ ★

*సర్ హ్యూబర్ట్ కార్ : భారతదేశ శాంతిభద్రతలకు భగ్నం కలిగించే బిల్లునుగానీ, క్లాజును గానీ, సవరణను గానీ, అమలు జరపనివ్వకుండా అడ్డుకోవడానికి, తన ప్రత్యేక బాధ్యతను వహించనివ్వ కుండా చేసే అటువంటి బిల్లును ప్రవేశపెట్టినప్పుడూ, లేక ప్రవేశపెట్టదలచుకున్నప్పుడూ, లేక సవరణగానీ బిల్లునుగానీ ప్రవేశపెట్టదలచుకున్నప్పుడూ, నెంబర్ 44 ప్రకారం గవర్నరు జనరల్‌కు విచక్షణాధికారం వుంటుంది.

**సర్ శామ్యూల్ హెూర్ :** నేనలా అనుకోవడంలేదు.

**సర్ హ్యూబర్ట్ కార్ :** ఉదాహరణకు "సమాఖ్య ఆర్థిక స్థిరత్వాన్నీ, ఆమోద యోగ్యతనూ ఎలా కాపాడాలి?"

**సర్ శామ్యూల్ హెూర్ :** శాంతి భద్రతలకు తీవ్రమైన హాని కలగజేసే శక్తుల నుండి కాపాడే ప్రత్యేక బాధ్యతకు మాత్రమే ఇది పరిమితం చేయబడింది

**సర్ మాల్కొలాం హైలీ :** సర్ హ్యూబర్ట్‌గారికి అందుకు కారణమేమిటో నేను తెలియజేయగలను. ఇంతవరకూ నెలకొని వున్న సెక్షను 57 (2ఎ)కు ఇది పునరావృత మాత్రమే! అది బ్రిటీషు ఇండియా శాంతి భద్రతలకు సంబంధించినది. దాన్ని అదే విధంగా యిప్పుడు మళ్లీ షరతులుగా పేర్కొన్నారు.

**సర్ హ్యూబర్ట్ కార్ :** శాంతి భద్రతలను మినహాయించి, మిగిలిన బాధ్యతల విషయంలో గవర్నరు జనరల్‌కు అడ్డుకునే శక్తి వుండవలసిన అవసరం లేదంటారా?

**సర్ ఫిండ్‌లాంట్ స్టీవార్ట్ :** అవసరం లేదు. కానీ శాసనసభల చేత ఆమోదం పొందిన బిల్లుకు తాను వ్యతిరేకతను వెలిబుచ్చవచ్చును.

**సర్ హ్యూబర్ట్ కార్ :** కానీ అతడు చర్చలను ఆపలేడు కదా?

**సర్ ఫిండ్ లాంట్ స్టీవార్ట్ :** ఆపలేడు.

**డా॥ అంబేద్కర్ :** నేను సెక్రటరీ ఆఫ్ స్టేట్‌ను ప్రశ్నించదలచుకోవడంలేదు. ఆ ప్రశ్నలు విధానాలకు సంబంధించినవి గావడమే అందుకు కారణం.

★ ★ ★

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 18 జూలై, 1933, పేజీ 784.

•**డా॥ అంబేద్కర్ :** హామీలకు సంబంధించి శ్రీ మోరగాన్ జోన్స్ ప్రశ్నలడిగిన సందర్భంలో యీ దేశంలో బాధ్యతాయుతుడైన నాయకుడెవడూ సమయానికి వేగానికీ కట్టుబడి లేడని అన్నారు. నిజమే కదా?

**సర్ శామ్యూల్ హోర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** కానీ భారత రాజ్యాంగం సర్వసత్తాకాధికార స్థాయిలో వుండాలన్న ఉద్దేశంతో ఏకాభిప్రాయం కుదిరిందని నేను అనుకున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** ఎప్పుడూ అలాగే అనుకుంటూ వచ్చాము.

**డా॥ అంబేద్కర్ :** ఎందుకంటే ప్రధానోద్దేశం మేరకు నిజంగా వ్యతిరేకతన్నదే లేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** దానికి కూడా ఔననే సమాధానం.

**డా॥ అంబేద్కర్ :** కాలాన్నీ వేగాల్నీ చాలావరకూ పరిస్థితులే నిర్ణయిస్తాయి. ఆ విషయాన్ని అవతలికి పెట్టి, ఇండియాను సర్వసత్తాక రాజ్యంగా భారత ప్రభుత్వ రాజ్యాంగ ఉపోద్ఘాతంలో పేర్కొనడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? అని నేనడగదలచుకున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** పార్లమెంటు యాక్టు యొక్క ఉపోద్ఘాతంలో ఏది వుంచాలో యేది వుంచరాదో అన్న విషయమై నేనిప్పుడెలాంటి హామీనీ ఇవ్వలేను. మంచికో, చెడుకో, పార్లమెంటు యాక్టు ఉపోద్ఘాతమన్న విషయంపైనే నాకు కొన్ని సందేహాలున్నాయి. కాబట్టి నేనిప్పుడు డా॥ అంబేద్కర్‌గారికి అవుననిగానీ, కాదనిగానీ చెప్పలేను. అసలీ నిర్ణయాన్ని సమితి మాత్రమే తీసుకోగలదు. ఏ విధంగా చూసినా దీన్ని నేను పద్ధతికి సంబంధించిన ప్రశ్నగా భావించలేను. దీనిని అసలు చర్చించవలసిన అవసరం ఉంది. ముందుగా నేను ఉపోద్ఘాతాల్లో ప్రకటనల నివ్వడాన్ని వ్యతిరేకిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ప్రస్తుతం అది వివాదాస్పదమైన విషయం గాదని చెప్పదలచుకున్నాను. కా ఇలాంటి చర్య ప్రజలలో నమ్మకాన్ని పెంపొందిస్తుంది. కాబట్టే ఇండియా ప్రభుత్వ యాక్టు ఉపోద్ఘాతంలో దీన్ని చేర్చడం మంచిదని అనుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** డాక్టర్ అంబేద్కర్ మాటను తప్పకుండా గుర్తుంచుకుంటాము.

**డా॥ అంబేద్కర్ :** తరువాత, యిప్పుడు సమాఖ్య ఏర్పాటు యొక్క తేదీకి సంబంధించిన ప్రశ్నను అడగదలచుకున్నాను. సమాఖ్యలోకి కొందరు రాజవంశీకుల ప్రవేశం అనిశ్చితగా వుండడం చేత సమాఖ్య ప్రారంభోత్సవానికి తేదీని నిర్ణయించడం మంచిదిగాదు. నేనిప్పుడు మిమ్మల్ని అడగదలచుకున్న విషయమేమిటంటే – దీన్ని మీరు నా స్వంత అభిప్రాయంగా భావించండి : రాజవంశీయుల కోసం వేచి చూడకుండా సమాఖ్యను ప్రారంభించామనుకోండి; అధికారుల నుండో అనధికారుల నుండో,

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 18 జూలై, 1933, పేజీలు 797–805.

లేక అధికార అనధికారవర్గాల రెండింటి నుండో వైస్రాయ్ గానీ గవర్నరు జనరల్ గానీ కొందరు సభ్యులను నామినేట్ చేసి వారితో ఒక సంఘం తయారు చేశామనుకోండి – తర్వాత సమాఖ్యను ప్రారంభించి, రాజవంశీకులు వచ్చిన తర్వాత యీ నామినేటెడ్ సంఘాన్ని తొలగించవచ్చు గదా! తద్వారా రాజవంశీకులకు స్థానాన్ని కల్పించే వీలుంటుందిగదా! ఇలాంటి ప్రతిపాదనకు మీరేమైనా అభ్యంతరం తెలుపుతున్నారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. చాలా అభ్యంతరాలున్నాయి. ఇప్పటికప్పుడు స్ఫురిస్తున్న బలమైన అభ్యంతరమేమిటంటే, యిది పూర్తిగా కొత్తరకమైన ఆలోచన అని. ఇక్కడ మనం గత మూడేళ్లుగా తగినంతమంది రాజవంశీకులు ప్రతినిధులుగా వుండే సమస్త భారత సమాఖ్యను తప్పించి మరోదాన్ని పరిశీలించడం లేదు.

***డా॥ అంబేద్కర్ :*** నిజమే! కానీ యీ విషయాన్ని నేను పరిశీలించవచ్చు కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** నా సమాధానాన్ని పూర్తి చెయ్యనివ్వండి. నేనిందాకా చెప్పిన బలమైన అభ్యంతరమే గాకుండా, ఇంకో అభ్యంతరం కూడా వుంది. మన చర్చలను మళ్లీ మొదలు పెట్టవలసి రావడమే అది. అంతేగాకుండా ఇంకో అభ్యంతరం కూడా ఉంది. నామినేటెడ్ సంఘాన్ని ఏర్పాటు చేసిన తరువాత, రాజవంశీకులు సమాఖ్యలోకి చేరకపోతే, అప్పుడేం చేయాలి?

***డా॥ అంబేద్కర్ :*** తర్వాతి ప్రశ్న అడగనివ్వండి. మీరు రాజవంశీకుల ప్రాతినిధ్యం వల్ల స్థిరత్వం సమకూరుతుందని భావిస్తున్నారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** లేదు. అంతకంటే ఎక్కువ ప్రాముఖ్యత వుంది అంబేద్కర్‌గారూ! నేను కేవలం స్థిరత్వంతో తృప్తి పడను. రాజవంశీకులను అనుమతించడానికి చాలా కారణాలున్నాయి. వారు స్థిరత్వం మాత్రమేగాకుండా, భారత ప్రభుత్వంపై చాలా విలువైన ప్రభావాల్ని తీసుకొస్తారు.

***॥ అంబేద్కర్ :*** రాజ్యాంగంలో శాశ్వతంగా ఉండే భాగంగా దీనిని నేను ప్రతిపాదించడంలేదు. జవంశీకులు వచ్చేవరకూ, ఒక సంధికాలపు ఏర్పాటుగా మాత్రమే సలహా యిచ్చాను. నిర్ణీతకాలం ేపల రాజవంశీకులు వచ్చి చేరదలచుకోకపోతే ఏర్పడే పరిణామాలను గురించి ఆలోచిస్తున్నాను. ్రస్తుతానికి అలా సంభవించే సమస్యలని యెలా అధిగమించాలనే నా ఆలోచన కూడా!

**సర్ శామ్యూల్ హెూర్ :** మీ ప్రయత్నం నాకవగతమైంది. ఏది యేమైనా, సజావైన దృష్టితో చూసినప్పుడు, యిలాంటి సంధికాలపు ప్రతిపాదనలకు చాలా తీర్చలేని పెద్ద అభ్యంతరాలే వుంటాయని నా భావన.

***నవాబ్ సర్ లికత్ హయాత్ ఖాన్ :*** మధ్యలో అడ్డు తగులుతున్నానని మీరనుకోకపోతే నా మాట కూడా వినండి. అలాంటి ఊహించని పరిణామాలు సంభవించినప్పుడు, ఆ తరువాతి సమావేశంలో మీరు వాటిని గురించి చర్చించవచ్చునుగదా! అవసరమైనప్పుడు మనం సమావేశమవచ్చునన్న అవకాశం

వుందిగదా! సలహా లివ్వడానికి అటువంటి సమావేశాలే సరిపోతాయని నేననుకుంటున్నాను.

**సర్ ఏ.పి. పాత్రో :** ఆ అవసరం వచ్చినప్పుడు మీరుండకపోతే ?

**సర్ శామ్యూల్ హెూర్ :** దీన్ని నేను పెద్ద పొరబాటుగా భావిస్తున్నాను. అఖిల భారత సమాఖ్యను తయారు చేయ సంకల్పించుకునేవారికి, సమాఖ్య యేర్పడదని, గానీ, భవిష్యత్తులో ఎప్పుడో సమాఖ్య ఏర్పడబోతోందని గానీ భావిస్తూ ఏదో ఒకరకమైన తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమన్న చర్య భావ్యంగా వుండదు. కమిటీ సభ్యులు, భారతీయ ప్రతినిధులు తమ ప్రతిపాదనల పర్యవసానమలా వుండాలని భావించరు. అయినా వారి వల్లే సమాఖ్య అవతరణ మరింత వెనక్కు వెళ్ళుతోంది. నేను నా అభిప్రాయాలనే మళ్లీ మళ్లీ వెల్లడిస్తున్నాను. ఈ విషయాలకు వ్యాఖ్యలకు గురవకుండా కాపాడవలసిన బాధ్యత నా ఆంగ్లేయ, భారత మిత్రులపైన ఉంది.

**డా॥ అంబేద్కర్ :** ఈ విషయాన్ని మరికొంత సమగ్రంగా చర్చించే అవకాశాన్ని ఇప్పించ ప్రార్థన. మీరు సమాఖ్య చాలా ముఖ్యమైనదిగా భావిస్తున్నారా లేక బాధ్యత ముఖ్యమైనదిగా భావిస్తున్నారా?

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** లేక రెండూ ముఖ్యం గాదని భావిస్తున్నారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్‌గారి అభిప్రాయమేమిటో నాకవగతం కావడంలేదు.

**డా॥ అంబేద్కర్ :** నా అభిప్రాయమేమిటంటే సంధికాలానికి ఒక తరుణోపాయాన్ని మీరు ఆలోచించదలచుకోని పక్షంలో సమాఖ్య లేకపోతే బాధ్యత ఉండదన్న అభిప్రాయానికి రావలసి ఉంటుంది.

**సర్ శామ్యూల్ హెూర్ :** నిజంగా డా॥ అంబేద్కర్ గారు మనం మూడేళ్లుగా చర్చించుతున్న విషయాలనే లేవనెత్తుతున్నారు. మూడేళ్లుగా ప్రతి చర్చలోను అఖిల భారత సమాఖ్య పునాదిపైనే ఈ ప్రస్తావనలన్నీ ఆధారపడి వున్నాయని భావిస్తూ వచ్చాము. మూడేళ్ల చర్చల తర్వాత మళ్లీ ఈ ప్రశ్నల గురించే పునరాలోచించడం నా కిష్టం లేదు.

**డా॥ అంబేద్కర్ :** ఇది నిజమే! నేనూ ఈ విషయాన్ని కొనసాగించదలచుకోవడంలేదు. మీ ఆలోచనకు ఒక మార్గాంతరాన్ని మాత్రమే సూచించదలచుకున్నాను. నేనింకా రెండు ప్రశ్నలడగదలచుకున్నాను. అయితే అవి మనం చర్చిస్తున్న విషయపు పరిధిలోకి వస్తాయేరావో అని సందేహిస్తున్నాను. అందులో ఒక ప్రశ్న సమాఖ్య ఎగువ సభ సభ్యుల అర్హతలకు సంబంధించినది.

**ఆర్చ్ బిషప్ ఆఫ్ కాంటర్ బరీ :** ఆ విషయం మీటింగుకు సంబంధించినది. కాదా?

**డా॥ అంబేద్కర్ :** ఆర్థిక పరిరక్షణలకు సంబంధించి ఒకటి రెండు ప్రశ్నలు అడగదలచుకున్నాను.

**ఆర్చ్ బిషప్ ఆఫ్ కాంటర్ బరీ :** ఆ విషయం నిస్సందేహంగా ఆర్థిక సంబంధమైనది.

**డా॥ అంబేద్కర్ :** రక్షణకు సంబంధించి కూడా ఒకటి రెండు ప్రశ్నలడగాలని నాకుంది. రక్షణ ఉప

సంఘం తన నివేదికలో సైనిక సమాఖ్య ఉండాలని పేర్కొన్న విషయం మీకు జ్ఞాపకముండే ఉంటుంది. దాని సంబంధమైన శ్వేతపత్రంలో అలాంటి ప్రస్తావనే లేమీ నాకు కనిపించలేదు.

***ఆర్చ్ బిషప్ ఆఫ్ కాంటర్ బరీ :*** అది రాజ్యాంగ ప్రస్తావన కాదని మనం భావించినందువల్లనే అలా జరిగింది. అది కార్య నిర్వహణకు సంబంధించిన ప్రస్తావన.

***డా॥ అంబేద్కర్ :*** అది కావాలని మీరనుకుంటున్నారా?

***ఆర్చ్ బిషప్ ఆఫ్ కాంటర్ బరీ :*** రాజ్య రక్షణ సమాఖ్య లాంటిదొకటి భారతదేశాన కూడా ఉండాలని నా అభిలాష. నిజమైన కార్యాచరణలో దీని ఆవశ్యకత ఉండి తీరుతుందని నా నమ్మకం. రక్షణ సమస్య గురించి రక్షణ మంత్రులు, రక్షణ శాఖాధికారులకూ అవగాహన కలిగేలా చూడడం మాత్రమేగాక ఆయా మంత్రులు ఆయా చర్చలు సాగించగలిగే సమాఖ్య లాంటిదొకటి చాలా ఉపయోగకరంగా ఉంటుందని మనం గ్రహించాము. రక్షణ అన్నది దేశమంతటికీ సంబంధించినది గావడమే అందుకు కారణం. ఇలాంటి సమితి పెంపుదలను భారతదేశంలోని పౌర, సైనిక అభిప్రాయాలతో కూడిన బలమైన వర్గమొకటి ప్రోత్సహిస్తోంది. అయితే మొత్తానికి యిది కార్య నిర్వహణ సంబంధమైన సమస్య మాత్రమే! పార్లమెంటు యాక్టు కిందికి ఇది రాదు.

***డా॥ అంబేద్కర్ :*** రిజర్వుడు విషయాలకు సంబంధించినంతవరకూ, బడ్జెట్‌లోని ఆ భాగాన్ని ఓటుకు పెట్టే ప్రస్తావన మీరు చేయడంలేదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** చేస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** భారత ప్రభుత్వ చట్టానుసారంగా, అది రిజర్వుడు శాఖల సిద్ధాంతానికి వ్యతిరేకం గదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** ఇది ఇంతవరకూ మనం చర్చించిన వాటిపైన ఆధారపడి వుంది. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో రక్షణ లక్షణాలను కొన్నింటిని గురించి చాలా చర్చ జరిగినప్పటికీ, ధన మొత్తాలు ఓటుకి పెట్టరాదన్న విషయంలో మాత్రం సర్వత్రా అంగీకారం కుదిరిందని నేను అనుకుంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** శాసనసభ అందుకనుగుణంగా ఓటు చేసినప్పుడు అందంలో యేదైనా తీవ్రమైన నిధుల కుదింపును గమనించి వైస్రాయి ఆమోదముద్ర వేసినప్పుడు ప్రమాదం జరుగుతుందని మీరు భావిస్తున్నారా?

***సర్ శామ్యూల్ హోర్ :*** వైస్రాయి బాధ్యతలు స్పష్టంగా, నిర్దుష్టంగా పేర్కొన్న ఇటువంటి విషయాల్లో, చర్చలకు అవకాశాలు ఇచ్చినప్పుడు, అవసరమైన ఖర్చు అనేది ఓటుకి పెట్టరానిదిగానే ఉండాలని నేను అనుకుంటున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** సర్వ పైన్యాధిపతి నియామకానికి సంబంధించినది తరువాతి ప్రశ్న. శ్వేతపత్రంలో

దానికి సంబంధించిన ప్రత్యేక ప్రస్తావనలేమీ నాకు కనిపించలేదు. సర్వ సైన్యాధిపతిని రాజు రాజ్యముద్ర పుస్తకంలోని దస్తావేజు ద్వారా నియమిస్తాడని మాత్రం భారత ప్రభుత్వ చట్టంలోని 19వ సెక్షను తెలుపుతోంది.

**సర్‌తేజ్ బహదూర్ సప్రూ :** ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టంలో సర్వసైన్యాధిపతి నియామకాన్ని పేర్కొనకపోవడమన్నది చిత్రమైన విషయం. కార్య నిర్వహణ మండలిలో సర్వసైన్యాధిపతి కూడా సభ్యుడైనప్పుడు, అతడు మిగిలిన సభ్యులకంటే ప్రాధాన్యతను పొందుతాడని మాత్రం భారత ప్రభుత్వ చట్టం పేర్కొంటోంది. శ్వేతపత్రమవసరమౌనో కాదో. సర్వసైన్యాధిపతి నియామకాన్ని మాత్రం కొనసాగించాలని నిర్ణయించడమైంది.

**డా॥ అంబేద్కర్ :** "రాజ్యముద్ర పుస్తకంలోని దస్తావేజు ద్వారా రాజు సర్వసైన్యాధిపతిని నియమిస్తాడు" అని ప్రస్తుత ప్రభుత్వ చట్టంలోని 19 (1) సెక్షను తెలుపుతోంది గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. అది అలాగే జరగవచ్చునేమో!

**లార్డ్ ఇర్విన్ :** శ్వేతపత్రంలోని 39వ పేజీ ఆఖరి భాగంలోని 6వ ప్రస్తావనలో ఆ విషయం పేర్కొన బడలేదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** పేర్కొనబడింది. 39వ పేజీలోని 5వ పేరాగ్రాపులో

**డా॥ అంబేద్కర్ :** అతని నియామకమెలా జరుగుతుందన్న విషయం 5వ పేరాగ్రాపులో లేదు. ఎవరు సలహా యిస్తారో?

**సర్ శామ్యూల్ హెూర్ :** రాజు సలహా యిస్తాడు.

**డా॥ అంబేద్కర్ :** ఎవరి సలహా పైన?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇక్కడ ప్రభుత్వం నియమిస్తుంది.

**సర్ ఆస్టెన్ చాంబెర్‌లిన్ :** స్వదేశంలోని మంత్రుల సలహా పైన రాజు చేత నియామకం జరుగుతుంది.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** 1921వ సంవత్సరం ఫిబ్రవరి 17వ తేదీన శాసనసభలో జరిగిన వాద ప్రతివాదాలను క్రితం రోజున నేను చూశాను. సర్ గాడ్‌ఫ్రే ఫెల్ సర్వసైన్యాధిపతి నియమించబడే పరిస్థితులను యిలా వివరించాడు– "కాబినెట్ సలహాపైన రాజు సర్వసైన్యాధిపతిని నియమిస్తాడు. కాబినెట్ బ్రిటీషు ప్రభుత్వపు అత్యున్నత సైన్యాధిపత్య విషయంలో రాజ్య సామాన్య అధికారవర్గం యొక్క ప్రధానాధికారి సలహాను పొందుతుంది" కాబట్టి ప్రస్తుత పరిస్థితి యేమిటంటే– ప్రస్తుత చట్టం లేక ఆచారం ప్రకారం రాజ్య సామాన్య అధికార వర్గ ప్రధానాధికారి సలహాపైన కాబినెట్ సర్వసైన్యాధిపతిని నియమిస్తుంది. అవునా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అతను కాబినెట్ చేత నియమింపబడడు. రాజు అతడిని నియమిస్తాడు- ప్రధానమంత్రి సలహాపైన గానీ, మరేరకంగా గానీ భారతదేశంలో అయితే రాజ్య కార్యదర్శి సలహాపైన.

**డా॥ అంబేద్కర్ :** నేను మిమ్మల్ని అడగదలచుకున్న విషయం ఇది : రక్షణ అన్నది భారత ప్రజల యొక్క, భారత శాసనసభల యొక్క బాధ్యతగా పరిగణిస్తున్నప్పుడు, మనమిప్పుడు ఆలోచిస్తున్న నూతన ప్రభుత్వానికి, ఇటువంటి పద్ధతి అనుగుణంగా వుంటుందా?

**సర్ శామ్యూల్ హెూర్ :** రక్షణ లాంటి రిజర్వుడు శాఖల విషయంలో ఇది తప్పనిసరి అని నేను భావిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** కానీ ఇది భారత ప్రజల యొక్క భారత శాసనసభల యొక్క బాధ్యతకూడా! రాజ్య కార్యదర్శి సలహాపైన గాక, గవర్నరు జనరలు సలహాపైన కూడా కాక, కాబినెట్ సలహాతోబాటూ రాజ్య సామాన్య అధికారవర్గ ప్రధానాధికారి సలహాను మాత్రం లెక్కలోకి తీసుకుని చేసే నూతన ప్రభుత్వ ప్రధాన శాఖను నిర్వర్తించబోయే ప్రముఖ అధికారి నియామకం భారత ప్రజల బాధ్యత అయిన రక్షణను వహించే ప్రభుత్వానికి అనుగుణంగా వుంటుందా?

**సర్ శామ్యూల్ హెూర్ :** తప్పకుండా – రక్షణ అన్నది రిజర్వుడు శాఖ అయినప్పుడు, ఆ రిజర్వుడు శాఖలకు బాధ్యత వహించే ప్రభుత్వమే నియామకాన్ని గావిస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** వైస్రాయ్ యీ నియామకత్వం చేస్తాడంటే నేనర్థం చేసుకోగలను. నియామకత్వాన్ని రాజ్య కార్యదర్శి చేస్తే అర్థం చేసుకోగలను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అది అలాగే జరుగుతుంది.

* * *

*** శాలిస్‌బరీ మార్క్వెస్ :** శాసనసభలోని రాజవంశీకుల ప్రాతినిధ్యానికి మీరు అదే నిష్పత్తిలో మరికొంతమంది రాజవంశీకులను చేర్చాలని మీరు ఆలోచిస్తున్నట్టు నేను అర్థం చేసుకున్నాను- అంటే మూడురకాల నిర్ణయాల్లోంచీ ఈ నిర్ణయాన్ని మీరు ఎన్నిక చేసినట్టుగా భావిస్తున్నాను. నిజమేగదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** "అప్పటికే చేరిన నిష్పత్తిలోనే"- అని లార్డ్ శాలిస్‌బరీ అన్నమాటకు అర్థమేమిటో నాకు తెలియదు.

**శాలిస్‌బరీ మార్క్వెస్ :** రాబోయే రాష్ట్రాలలో ఒకదానికి బహుశా 10 సీట్లుంటాయని నా భావన.

**సర్ శామ్యూల్ హెూర్ :** లార్డ్ శాలిస్‌బరీ చెబుతున్నది నాకర్థమైంది. దాదాపు అదేవిధంగా ఏర్పడుతుందని నేను అనుకుంటున్నాను.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933వ సంవత్సరం జూలై 20, 813-15 పేజీల మధ్య.

**శాలిన్ బరీ మార్క్విస్ :** ప్రాంతీయ రాష్ట్ర పంపకంకు సంబంధించి నేనింకొక ప్రశ్నను మాత్రం అడగదలచుకున్నాను. అదేమిటంటే -ప్రాంతీయ రాష్ట్ర భాగాలలో సీట్ల విభజన. ఈ విషయమై చాలా విరుద్ధ అభిప్రాయాలు ఉన్నాయని అతనికి తెలుసు. పూనా చట్టం ప్రకారం బెంగాలులో కులాలు సక్రమంగా ప్రాతినిధ్యం వహించాయా- లాంటి విరుద్ధ అభిప్రాయాల జోలికి నేను వెళ్లడంలేదు. కానీ ఈ విషయంపైన మీరేమైనా ప్రకటన చేయదలచుకుంటున్నారా- అని రాజ్య కార్యదర్శిని నేను ప్రశ్నించదలచుకున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** మీరు ప్రభుత్వ కమ్యూనల్లో నిర్ణయాల గురించి ప్రశ్నిస్తున్నారా?

**శాలిన్‌బరీ మార్క్విస్ :** నేను బెంగాల్ కేసుకు సంబంధించి ప్రత్యేకంగా మాట్లాడుతున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** మే నెల 26వ తేదీన ప్రభుత్వ కమ్యూనల్ నిర్ణయం గురించి ప్రతినిధుల సమితికి విజ్ఞప్తిని యిచ్చాను. దానిపైన యింకా చెప్పవలసింది యేమీ లేదు. ప్రభుత్వం తమ నిర్ణయాన్ని చివరి నిర్ణయంగా భావిస్తున్నట్లు నిర్ద్వంద్వంగా ప్రకటించారు. వివిధ రకాల కులాలకు సంబంధించిన అధికారిక నాయకులు అంగీకరించిన పక్షంలో భిన్నమార్గాన్ని అనుసరించడానికి మాత్రం వాళ్లు ఒప్పుకున్నారు. ప్రభుత్వ విధాన నిర్ణయానికి ప్రభుత్వ సభ్యుడిగా యింకేమీ చేర్చడానికి నాకిష్టం లేదు.

**అధ్యక్షుడు :** రాజ్య కార్యదర్శిగారూ! మీరిప్పుడు పేర్కొన్న విజ్ఞప్తిని అందించగలరా?

**సర్ శామ్యూల్ హోర్ :** అలాగే! ఆ విజ్ఞప్తి యిలా వుంది :

## విజ్ఞప్తి – కమ్యూనల్ అవార్డు

శ్వేతపత్ర ప్రకటనకు దారితీసిన పరిస్థితులేవో తెలియని సంయుక్త నిర్ణయ సమితిలోని నా సహోద్యోగులకు "కమ్యూనల్ అవార్డు" దాని చరిత్ర, పుట్టుక, ఎందుకిలా ఏర్పడింది, శ్వేత పత్రంలోని యితర ప్రస్తావనలకు భిన్నంగా ఎందుకుంది - లాంటి వివరాలను తెలియజేస్తే ఉపయోగంగా వుంటుందని భావిస్తున్నాను.

2. భారతదేశంలోని వివిధ రకాలైన అనేక కులాలు శాసనసభలో ఎన్ని సీట్లు పొందాలి? ఆ సీట్లకు ఎలా ఎన్నికలు నిర్వహించాలి- అనే రెండు విషయాలపైన భారత ప్రతినిధులు ఏకాభిప్రాయానికి రాలేకపోవడంచేత రౌండు టేబుల్ కాన్ఫరెన్సు మొదటి రెండవ సమావేశాల్లో ప్రగతి బాగా దెబ్బతిన్నది. ఎన్నికలకు సంబంధించిన ముఖ్య సమస్యయేమిటంటే- ప్రత్యేక నియామకుల నియోజకవర్గంను తీసుకోవాలా? లేక రిజర్వుడు సీట్లతో కూడిన అనుబంధ నియామకుల నియోజకవర్గం తీసుకోవాలా, అని. (రాజ్యాంగకమీషను నివేదిక మొదటి సంపుటిలోని 149 మరియు 150 పేరాగ్రాఫులను చూడండి). యీ సమస్యల సాధన కోసం అనేకసార్లు చేసిన ప్రయత్నాలు విఫలం గావడంతో యింతవరకూ తయారైన రాజ్యాంగంలో ప్రముఖమైన లోపాలు

వచ్చాయి. శాసనసభల్లో తమ ప్రాతినిధ్యమేమిటో తెలిసేటంతవరకూ, ఇతర రాజ్యాంగ అంశాల చర్చల్లో – ముఖ్యంగా కులాలకు సంబంధించిన అంశాల్లో– మైనారిటీ కులాలు పాల్గొనలేకపోవడానికి కూడా యీ విఫలతే కారణం.

3. కాబట్టి, ప్రగతిని అడ్డుకునే యిటువంటి అడ్డంకులను తొలగించడంకోసం, ప్రభుత్వం దాదాపు స్వకీయమైన తీర్పులాంటి యీ తీర్పును అయిష్టంగానే ప్రసాదించింది. తమ పార్లమెంటు ప్రస్తావనల్లోకి యీ అవార్డు యొక్క అవకాశాలను ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. రాజ్య విభాగాల శాసనసభల ఏర్పాటు, వాటి ఎన్నికల పద్ధతీ యీ అవార్డు పరిశీలనలోకి వస్తాయి. ప్రత్యేక అభీష్టతల సీట్ల సంఖ్య, శాసనసభల పరిమాణంలాంటి విషయాలకు సంబంధించిన పరిపూర్ణ కుల సంబంధమైన ప్రశ్నల్ని దూరంగా ఉంచడం సాధ్యంగాదని తెలిసింది. అయితే అటువంటి విషయాలపై భారత ఓటింగు సమితి సలహా పొందే అవకాశం ప్రభుత్వానికుంది. 1932వ సంవత్సరం ఆగస్టు 16వ తేదీన యీ అవార్డు ప్రసాదించబడింది. పార్లమెంటులో కమాండ్ 4147గా యిది ప్రవేశపెట్టబడింది.

4. క్రింద వివరించిన అణచివేయబడ్డ తరగతులకు సంబంధించి మార్పు చేయడానికనుగుణంగా, అవార్డు అవకాశాలు శ్వేతపత్రంలోని 91, 93 పేజీలలో మళ్లీ పేర్కొనబడ్డాయి. (91వ పేజీలోని ఎన్నికలకు సంబంధించిన విషయాలు కొద్దిగా సంక్షిప్తీకరించ బడ్డాయి).

5. అవార్డుకు ప్రవేశికలాంటి ప్రకటనలో యీ క్రింది ప్రముఖమైన పేరా ఉంది :

4వ పేరా : తమ నిర్ణయాలని పునః పరిశీలన కోసం ప్రవేశపెట్టదలచుకునే ఏ సంప్రదింపులకుగానీ, తమంతటతాముగా ఏ వైపునకుగానీ అనుకూలంగా ఉండరాదని అర్థం చేసుకొమ్మని రాజ ప్రభుత్వం ఆశిస్తోంది. ప్రభావాన్ని పొందబోయే పక్షాల అంగీకారాన్ని పొందలేని మార్పుకోసం ప్రయత్నించే నివేదికను ప్రభుత్వ లెక్కలోకి తీసుకోరాదని అనుకుంటోంది. ఆశించ దగిన అంగీకారపు ఒడంబడికలకు ఆహ్వానం పలకాలనేవారు ఆకాంక్షిస్తున్నారు. కొత్త భారత ప్రభుత్వ చట్టం అమలులోకి రాకమునుపే, ఆయా కులాలవారు పరస్పర ఆమోదయోగ్యమయిన ఆచరణయోగ్యమైన మార్గాన్ని దేనినయినా ఎన్నుకుంటే వారు సంతృప్తి చెందుతారు. ఒకటి లేక అంతకంటే ఎక్కువ గవర్నరుల రాజ్య విభాగాలకు సంబంధించిగానీ మొత్తం బ్రిటీషు ఇండియాకు సంబంధించిగానీ, ఆ మార్గాంతరాన్ని ఇప్పుడున్న అవకాశాలకు బదులుగా ఎంచుకొమ్మని సిఫారసు చేయడానికి సంసిద్ధత తెలిపారు.

6. అవార్డు తరువాత, అణచివేయబడిన తరగతివారి ప్రాతినిధ్యానికి సంబంధించి ఒక గణనీయమైన మార్పు జరిగింది. దాని చరిత్ర యీ క్రింది విధంగా వుంది :

అణచివేయబడిన తరగతుల ప్రాతినిధ్యానికి సంబంధించిన విషయాలకు వ్యతిరేకంగా గాంధీగారు సత్యాగ్రహాన్ని ప్రారంభించదలచుకున్నారు. ఈ అవార్డు హిందువుల్లో కృత్రిమమైన

విభజనల్ని సృష్టిస్తుందని ఆయన భావించాడు. ప్రచురించబడిన ఉత్తర ప్రత్యుత్తరాల్లో ప్రధానమంత్రి ప్రభుత్వమెందుకీ అభిప్రాయానికి రాలేకపోతోందో వివరించారు. కానీ గాంధీకి అవి ఆమోదయోగ్యం అనిపించకపోవడంతో సత్యాగ్రహాన్ని ప్రారంభించాడు. గాంధీగారి ఆధ్వర్యంలో హిందూ కులస్థుల ప్రతినిధులతో, డా॥ అంబేద్కర్‌గారి నాయకత్వంలోని అణచివేయబడిన తరగతుల ప్రతినిధులు చర్చలని ప్రారభించారు. తత్ఫలితంగా ఒక అంగీకారం కుదిరింది. కమ్యూనల్ అవార్డు ప్రతిపాదించిన దానికంటే ఎక్కువగా అణచివేయబడిన తరగతుల సీట్లు పెంచడంతోబాటూ, మరొకరకమైన ఎన్నిక విధానాన్ని అమలు పరచాలన్న నిర్ణయానికొచ్చిన ఈ అంగీకారానికి, పూనా ఒడంబడిక అని పేరు.

7. రాజ్య భాగాల శాసనసభలు, వాటి ఎన్నికల విధానాలను గురించి కూడా తెలిపే శ్వేతపత్రాన్ని అనుసరించి ప్రభుత్వ పరిస్థితి ఏమిటంటే*– ఆయాకులాల పరస్పరాంగీకారం పొందిన వాటిని మినహాయించి మిగిలిన విషయాల్లో పార్లమెంటుకు ఎటువంటి సిఫారసునూ చేయరాదని వారు ప్రతినబూనారు. అటువంటి మార్పు కోసం జరిగే ఏ సంప్రదింపులలోగానీ ప్రభుత్వ రూపంలో తాము పాల్గొనరాదని వారు తీర్మానించుకొన్నారు. పైన పేర్కొన్న పరిస్థితులలో అంగీకరించబడిన పూనా ఒడంబడిక యొక్క అవకాశాలు అన్నీ యీ ప్రతిజ్ఞ పరిధిలోకే వస్తాయని ప్రభుత్వం వ్యాఖ్యానిస్తోంది.

8. సమాఖ్య శాసనసభల్లో బ్రిటీషు ఇండియాకూ, బ్రిటీషు ఇండియా రాష్ట్రాలకూ వేరువేరుగా ఎన్నెన్ని సీట్లు కేటాయించాలన్న విషయం తేలనంతవరకూ కేంద్రం యొక్క సదృశ అవకాశాలు (లేక సమాన ఏర్పాట్లు) నిర్ణయింపబడవు. అందుకే అసలైన కమ్యూనల్ అవార్డు రాజ్య భాగాల శాసనసభ్యుల గురించి మాత్రమే పట్టించుకుంటుంది. ఈ విషయం పైన ప్రభుత్వ ప్రతిపాదనలు యిప్పుడు శ్వేతపత్ర ఉపోద్ఘాతంలోని 18వ పేరాతో బాటు చదవవలసిన శ్వేతపత్ర 1, 2 అనుబంధాల్లో వున్నాయి. ఈ ప్రతిపాదనలు అసలు కమ్యూనల్ అవార్డుకు అనుబంధాలే! పైన పేర్కొన్న అసలు ప్రకటనలోని 4వ పేరాగ్రాపు లాంటి ప్రత్యేక ప్రతినలేవీ ప్రభుత్వం చేయలేదు. కేంద్రీయ శాసనసభల్లో వివిధ కులాలకు సీట్లు పంచడమన్న ప్రస్తావనలపై కొత్తగా మళ్లీ పరిశోధన చేసే కుతూహలం వారికి లేదు. ప్రాంతీయ కమ్యూనల్ అవార్డు పరిస్థితికి అనుగుణంగానూ తమ ఉద్దేశం ప్రకారంగానూ ఈ ప్రస్తావనలు లేవని కూడా వారు అనుకుంటున్నారు. బ్రిటీషు ఇండియా యొక్క సమాఖ్య శాసనసభల్లో మూడింట ఒకవంతు సీట్లు ముస్లిములకు కేటాయించడం, బ్రిటీషు ఇండియాకూ, రాష్ట్రాలకూ కేటాయించవలసిన సీట్ల నిష్పత్తి – ఈ రెండు విషయాల్లో మార్పు తేవాలంటే వారు తీవ్రంగా అభ్యంతరం తెలుపుతున్నారు.+

---

* ఓటింగ్ ఇందులో చేరదు.

\+ అపార్థాలను తొలగించాలంటే, దీన్ని ఇలా వివరించాలి– ఎగువ సభలోని గవర్నరు జనరల్ యొక్క పదిమంది ప్రతినిధులలో ఆరుగురు బ్రిటీషు ఇండియావారు, నలుగురు రాష్ట్రాలవారు.

9. సారాంశమేమిటంటే – పై విషయాల ద్వారా కమ్యూనల్ అవార్డు శాసనసభల నిర్మాణ విధానాన్ని మాత్రమే పేర్కొంటోంది. కులాలకు సంబంధించిన అంశాలను రాజ్యాంగంలోని మొత్తం బహువిధ అంశాలను అది పట్టించుకోదు. (ఉదాహరణకు – గవర్నరు, గవర్నరు జనరలుల ప్రత్యేక బాధ్యతలు, కేంద్రానికీ రాజ్య భాగాలకు మధ్యగల సంబంధాలు, ప్రాథమిక హక్కులు మొదలైనవి) అంతేకాకుండా, కమ్యూనల్ అవార్డులో పేర్కొనబడిన అంశాలకు సంబంధించిన విషయాల్లో తమ పరిస్థితినీ, దాని నుంచి విడిపడడానికి వీలయ్యే షరతులను ప్రభుత్వం స్పష్టంగా నిర్వచించింది.

* * *

**సర్ ఆస్టన్ చాంబర్లైన్ :** మన కార్యకలాపాల మధ్య ఏదో ఒక సమయంలో ఈ విధమైన ప్రస్తావనలు చేయాలని రాజ్య కార్యదర్శి అనుకొంటున్నారా?

**సర్ శామ్యూల్ హోర్ :** తప్పకుండా. ఏ రాజ్యాంగ చట్టంలో అయినా ఏదో ఒకచోట రాజ్యాంగాధికారాలకు అవకాశం (లేక ఏర్పాట్లు) ఉండాలని నేననుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టంలోని అలాంటి ఏర్పాట్లను మీ దృష్టికి తీసుకురాదలచుకుంటున్నాను. అనుబంధంలో కొన్ని భాగాలు పేర్కొనబడ్డాయి.

**సర్ శామ్యూల్ హోర్ :** ఇది ఏ రాజ్యాంగ చట్టపు విధానాలకైనా భారత ప్రభుత్వ చట్ట విధానాలకైనా అనుగుణంగానే వుందని నేను అనుకుంటున్నాను.

* * *

**లార్డ్ శాలిస్‌బరీ :** ఇప్పుడు నా శక్తికొద్దీ నేను దీన్ని చదివాను. కానీ దీన్ని పూర్తిగా సమర్థించటం చేతకాదు.

**సర్ శామ్యూల్ హోర్ :** ఈ సమస్యలను మనం గమనించకతప్పదనీ, రాజ్యాంగ చట్టంలో ఏదో రకమైన అవకాశమేర్పరచక తప్పదనీ గమనిస్తూ లార్డ్ శాలిస్‌బరీ దీన్ని మరోమారు పరిశీలిస్తే, ఆయన దీన్ని పూర్తిగా సమర్థించగలరని నేను భావిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** ఇది భారత ప్రభుత్వం చట్టంలోని అయిదవ షెడ్యూలు : "భారత శాసనసభల చేత కొట్టివేయగల లేక మార్పు చేయగల చట్టంలోని అవకాశాలు".

* * *

**కెట్‌లాండ్ మార్క్వెస్ :** నన్నొక అనుబంధ ప్రశ్న అడగనివ్వండి. అణచివేయబడిన తరగతుల ప్రతినిధులను పంపే ఆ నాలుగు నియోజకవర్గాలు ప్రాదేశికంగా వేరొకవాటిపై ఆధారపడతాయా?

---

మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, జూలై 23, 1933, పుట 828.

† మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, జూలై 21, 1933, పుట 832.

**సర్ శామ్యూల్ హోర్ :** దానినింకా ఆలోచించలేదని అనుకుంటున్నాను. కానీ వేరొకవాటిపై చొరబడనివ్వకుండా వాటిని ఏర్పరుస్తారు. మొత్తం మద్రాసు ప్రదేశమంతా 15 ప్రదేశాలుగా విభజించ బడుతుంది. అందులో పదకొండు సాధారణమైనవిగా వుంటాయని నేను అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** 15 సాధారణమైనవిగా వుంటాయా?

**సర్ శామ్యూల్ హోర్ :** నేను పదకొండింటిని సాధారణమైనవిగా చేస్తాను. మొత్తం 19 అవుతాయి. 11 ఏక సభ్యులు, 4 ద్విసభ్యులు.

**జఫ్రుల్లా ఖాన్ :** అందుగురించి ఒక అంశాన్ని విశదం చేయడంకోసం సర్ ఫిండ్‌లాటర్ స్టీవర్ట్‌నో ప్రశ్న అడగదలచుకున్నాను. నేను కేవలం దీన్ని అర్థం చేసుకోవాలని అనుకుంటున్నాను. నలుగురి జాబితాను ఎన్నిక చేసుకున్న తర్వాత వాళ్లు పోటీకి తయారవడం లేకపోతేఈ ప్రత్యేక నియోజకవర్గం వాళ్లల్లో వారే పోటీ పడ్డానికి కేటాయించడం- పోటీ అన్నది ఏర్పడితే, సాధారణ నియోజకవర్గం లోని అందరూ ఓటు చేస్తారు. కానీ అందులో ముగ్గురు "ఈ ఎన్నికల్లో మేము పోటీ చేయదలచుకోవడంలేదు" అని చెప్పారనుకోండి. ఎన్నికలకు మునుపు విరమించుకునే అవకాశం వారికి ఉంటుందా?

**సర్ ఫిండ్‌లాటర్ స్టీవార్ట్ :** పూనా ఒడంబడిక యొక్క వాఖ్యానం అది.

**సర్ శామ్యూల్ హోర్ :** డా॥ అంబేద్కర్ ఏమంటారు?

**డా॥ అంబేద్కర్ :** అదే అభిప్రాయం. పోటీ చేయడమనే ఆవశ్యకత ఆ నలుగురిపైనా వుండదు (నలుగురూ పోటీ చేయాలనే నిర్బంధం లేదు).

**సర్ యస్.యస్. సర్కార్ :** అభిప్రాయమదే! కానీ ఉపయోగించబడిన భాష అదికాదు.

**జఫ్రుల్లా ఖాన్ :** మరొక అంశం కూడా ఉంది- ఈ నియోజకవర్గాలలో దేనిలోగానీ అణచి వేయబడిన తరగతులవారు నలుగురు అభ్యర్థులను నిలబెట్టాలన్న నిర్బంధం వుందా? వాళ్లు ఒకే ఒకడిని నిలబెట్టారనుకోండి- అప్పుడు ఒడంబడిక యొక్క షరతులతో అనుసంధానం కుదురుతుందా? ఈ విషయంలో ఒడంబడిక ఏమని సూచిస్తోందని ప్రభుత్వం భావిస్తోంది?

**సర్ ఎ.పి. పాత్రో :** ప్రారంభించక ఎన్నికల ఉద్దేశం వీగిపోతుంది. ప్రారంభిక ఎన్నికల భావన ఏమిటంటే- ఒక సీటుకు నలుగురిని ఎన్నిక చేసుకోవడం.

**సర్ ఎస్.ఎస్. సర్కార్ :** పూనా ఒడంబడిక నెలకొన్న సమయంలో వ్యాఖ్యానాన్నే యిప్పుడు నేను తెలుపుతున్నానని డా॥ అంబేద్కర్ సాక్ష్యమిస్తారు. అణచివేయబడ్డ తరగతులవారికి నలుగురికి బదులుగా ఒకరినే ఎన్నిక చేసుకోగల స్వేచ్ఛ వుండాలని అనుకున్నాము. అటువంటప్పుడే ఆ ఒక్కడే ఎన్నికయిపోతాడు.

**డా॥ అంబేద్కర్ :** అది నిజం.

**డా॥ జఫ్రుల్లాఖాన్ :** వాళ్ల నలుగురిని నిలబెడితే అందులోని వారు ఎవరైనా విరమించుకోవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** అవును.

* * *

**•సర్ ఎన్.ఎన్. సర్కార్ :** సమితి దృష్టిలోకి కొన్ని వాస్తవాలని తీసుకురాదలచుకుంటున్నాను. నేనే విధమైన వాగ్వివాదం తీసుకురావడంలేదు. కేవలం చిన్నపరిధిలో సమితి కొన్ని వాస్తవాలని గమనించాలని మాత్రం నేను కోరుతున్నాను. కుల/మత నిర్ణయం 1932 ఆగస్టు 17వ తారీఖున చేయబడింది. అవునా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఆగస్టు 16న.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** నాకిచ్చిన ప్రతిలో 17న అని వుంది. ఒకరోజు పోయినంత మాత్రాన ఏమీ మునిగిపోదు. ఈ అవార్డు లేక నిర్ణయం ప్రకారం, అణచివేయబడిన తరగతులకు సంబంధించి ఏమున్నదంటే– వాళ్ల సాధారణ ఎన్నికల్లో ఓటు చేస్తారు. వారికి 10 సీట్లు ఉంటాయి. ఈ ఏర్పాటు 20 యేళ్ల తర్వాత ముగుస్తుంది క్లుప్తంగా చెప్పాలంటే ఆ నిర్ణయంలో వున్నదిదేగా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** మరోక తారీఖు యేమిటంటే– 1932 ఆగస్టు 18. మహాత్మా గాంధీ ఆ తారీఖునే ప్రధానమంత్రికి ఉత్తరం రాశారు. (ఆ వాక్యాలనే నేను ఉదహరిస్తున్నాను) – సత్యాగ్రహం చేస్తానని చెబుతూ యిలా అన్నాడు– "బ్రిటీషు ప్రభుత్వం తన నిర్ణయాన్ని మార్చుకుని, అణచివేయబడిన తరగతులకున్న ప్రాతినిధ్య పథకాన్ని విడిచిపెడితే యీ సత్యాగ్రహం ముగుస్తుంది" సత్యాగ్రహాన్ని చేస్తానని తెలుపుతూ, దాని పర్యవసానాల్ని వివరిస్తూ మహాత్మాగాంధీ ప్రధానమంత్రికి ఉత్తరం రాశారు. మీకందిన సమాచారాన్నిబట్టి ఈ తారీఖు ఖచ్చితమైనదేనా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఆ తారీఖులేవో నావద్ద లేవు. మీరు తెలిపిన తారీఖు ఖచ్చితమైనదేనని భావిస్తున్నాను.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** ఈ క్రమం రాజ్య కార్యదర్శిగారికి ఆమోదయోగ్యంగా ఉందా? నా ప్రశ్నలలో యీ తేదీలన్నింటినీ పేర్కొనవచ్చునా? ఇందులో పొరబాటులేవైనా ఉంటే, తర్వాత సందేశాల ద్వారాగానీ మరి ఏ ఇతర మార్గాలద్వారాగానీ ఎత్తి చూపవచ్చును గదా?

---

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, జూలై 21, 1933, పుట 858–63.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** నేను తారీఖులు పేర్కొంటున్నాను. ఆగస్టు 18వ తేదీన మహాత్మాగాంధీ ప్రధానమంత్రికి ఉత్తరం రాశారు. ఈ కమ్యూనల్ నిర్ణయం హిందువులను అణచివేయబడిన తరగతులవారినీ (దళితులను) వేరు చేయడంలేదని తన 'ప్రధానమంత్రి ఏర్పాటు'ను తెలుపుతూ మహాత్మాగాంధీకి ప్రధాని 1932 సెప్టెంబరు 8న ప్రత్యుత్తరం రాశారు. ఇక్కడ తారీఖు ముఖ్యమైనది. సెప్టెంబరు 8వ తేదీన ప్రధానమంత్రి పొరబాటేమీ జరగలేదని మహాత్మాగాంధీకి నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. సెప్టెంబరు 17, 18 తేదీలలో ఢిల్లీలో సదస్సొకటి నిర్వహించబడుతుందని పండిత మదనమోహన మాలవ్యా 1932 సెప్టెంబరు 15న పత్రికలలో ప్రకటనిచ్చారు. పత్రికల్లోని ఆహ్వానం "కొందరు స్నేహితులకు" అని పేర్కొంది. అది 1932 సెప్టెంబరు 18న. 1932 సెప్టెంబరు 16న అదే పండిత మదనమోహన మాలవ్యా పత్రికల్లో వేదిక ఢిల్లీ నుంచీ బొంబాయికి మార్చబడినదనీ, తేదీ 1932 సెప్టెంబరు 20 అనీ మరో ప్రకటన యిచ్చారు. ఆమరణ నిరాహారదీక్షగా తర్వాత వివరించ బడిన నిరాహారదీక్ష ప్రారంభమైపోయింది. సెప్టెంబరు 24న మహాత్మాగాంధీ ఆరోగ్య పరిస్థితి ప్రమాదకరంగా ఉందని ప్రకటన వచ్చింది. 1932 సెప్టెంబరు 25న ఒడంబడికలో సంతకాలు జరిగాయి. నేను మీకు యీ తేదీలన్నీ చెప్పదలచుకున్నాను. మీరు వీటిని అంగీకరించవచ్చు. లేక సరిదిద్దవచ్చు.

**సర్ శామ్యూల్ హెూర్ :** అలాగే!

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** తరువాతి ప్రశ్నలో నేను మరికొన్ని తేదీలు తెలుపుతాను. మీరు ఇప్పుడు సమాధానమివ్వగలిగే స్థితిలో లేకపోతే సమాధానాల కోసం బలవంతపెట్టదలచు కోవడంలేదు. ఈ వాస్తవాలను ఋజువు చేయడం కోసం నేను సాక్ష్యాల్ని ప్రవేశపెట్టవలసి ఉండడంచేత నేనిప్పుడు నా వాదాన్ని మాత్రమే సూచిస్తున్నాను. 1932 సెప్టెంబరు 25న పూనాలో ఒడంబడిక ధృవీకరించబడింది. ఈ ఒడంబడికలో చాలామంది సంతకదారులు (సాక్షులు) వున్నారు. అందరి పేర్లనూ నేను చదవదలచుకోవడంలేదు. బెంగాల్ హిందువులకు ప్రాతినిధ్యం వహించే సంతకదారుడు (సాక్షి) లేడు. ఆ మరునాడు, అంటే 1932 సెప్టెంబరు 26న ఢిల్లీలో 11 గంటలకు చక్రవర్తి ప్రభుత్వం యీ ఒడంబడికకు అంగీకారం తెలిపినట్లు దేశీయాంగ సభ్యుడు ప్రకటించాడు. అతనిలా అన్నాడు- "అణచివేయబడిన తరగతుల నాయకులకూ మిగిలిన హిందూ సమాజపు నాయకులకూ మధ్య అంగీకారం కుదిరినదని తెలిసి రాజ ప్రభుత్వం చాలా సంతృప్తి పడింది." శాసనసభలో ఆ మరునాడే ఇది ప్రకటించబడింది. మీరు దయతో పరీక్షించి చూస్తే యీ తారీఖుల్ని గమనించగలరు. నిన్న మీరు సంతోషంగా ఇచ్చిన సమాధానాల్నిబట్టి, అణచివేయబడ్డ తరగతుల నాయకులకూ, మిగిలిన సమాజపు నాయకులకూ మధ్య అంగీకారం కుదిరిందని ప్రభుత్వం భావిస్తున్నట్టు నన్ను అనుకోమంటారా? అది మీ అభిప్రాయం కూడానా?

**సర్ శామ్యూల్ హెూర్ :** మీరు చెప్పదలచుకున్నది ముగిశాక నేను సమాధానం చెబుతాను.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** నా ప్రశ్న ముగిసింది.

**సర్ శామ్యూల్ హెూర్ :** అసలైన కమ్యూనల్ వార్డులోని 4వ పేరాగ్రాపులోని షరతులమేరకు, పూనా ఒడంబడికను ఆయా వర్గాలమధ్య జరిగిన 'అఖిలభారత అంగీకారము'గా– అంటే హిందువులకు, అణచివేయబడ్డ తరగతులకు మధ్య జరిగిన అంగీకారంగా ప్రభుత్వం సక్రమంగానో,, అక్రమంగానో అంగీకరించింది. పూనా ఒడంబడికకు దారితీసిన సంప్రదింపులు జరుగుతున్నాయని భారతదేశంలోని పౌరులందరికీ తెలుసు. ఆసక్తి వున్న వర్గాలవారు తమ అభిప్రాయాల్ని నిర్లక్ష్యం చేయకుండా ఉండడానికి తగిన జాగ్రత్త తీసుకుంటారని భావించాం. బెంగాల్ నుంచి ఒడంబడికను ప్రకటించిన చాలాకాలం తర్వాతి వరకూ ఎటువంటి అభ్యంతరమూ రాకపోవడం గమనించవలసిన విషయం (సమితి దృష్టికి ఈ వాస్తవాన్ని తీసుకురావాలని నాకున్నది). చర్చలు జరుగుతున్న కాలంలో ఒడంబడికకు అనుకూలంగా చాలా టెలిగ్రాములు వచ్చాయి. ఒక్కటైనా వ్యతిరేకంగా రాలేదు. అలా వచ్చిన టెలిగ్రాములలో బెంగాల్ హిందువుల్లో ప్రఖ్యాతులైన సర్ రవీంద్రనాథ్ ఠాగూరు టెలిగ్రాము కూడా ఉందని నాకు జ్ఞాపకం వస్తోంది. బెంగాలులో అభ్యంతరాలు మొదటిసారిగా ఎప్పుడు తలెత్తాయో నాకు తెలియదు. పూనా ఒడంబడికకు అంగీకారం కుదిరిన దాదాపు మూడు నెలల వరకూ ప్రభుత్వానికెటువంటి నివేదికలూ అందలేదు. బెంగాల్‌కు సంబంధించినంతవరకూ, ఒడంబడిక యొక్క యోగ్యతలపైన ప్రభుత్వం అభిప్రాయాన్ని తెలపడంలేదు. ఆయా వర్గాలమధ్య జరిగిన పరస్పరాంగీకారంలో యెటువంటి మార్పులు చేయడానికైనా వారు సిద్ధంగా ఉన్నారు. అసలైన కమ్యూనల్ అవార్డు ప్రకారం ఈ సంప్రదింపులలో చివరివరకూ ప్రభుత్వం ప్రభుత్వంగా పాల్గొనలేదు.

**ఎమ్.ఆర్. జయకర్‌గారు :** సర్ రవీంద్రనాథ్ ఠాగూర్ పంపిన టెలిగ్రాము ఎలాంటిది? ఆయన ఒడంబడికను సమర్థించారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఒడంబడికకు ఒప్పుకోమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** సర్ శామ్యూల్ హెూర్‌గారూ! మీకూ, సమితికీ ఈ విషయమై ఒక మాట చెప్పనిస్తారా? సంప్రదింపులు జరుగుతున్న కాలంలో నాలుగైదు రోజుల పాటు నేనూ, జయకర్‌గారూ పూనాలో వుండడం సంభవించింది. బెంగాల్ హిందువుల నుంచీ టెలిగ్రాము లందాయని నాకు స్పష్టంగా జ్ఞాపకముంది. ఒకరిద్దరు ప్రముఖ బెంగాల్ హిందువుల నుంచి నాకు వ్యక్తిగతంగా టెలిగ్రాము లందాయి. ఆ టెలిగ్రాములు యిప్పుడు నా దగ్గర లేవు. ఆ సమయంలోనో లేక ఆయన సత్యాగ్రహాన్ని ప్రారంభించిన కొద్దిరోజుల తర్వాతనో, సర్ రవీంద్రనాథ్ ఠాగూరు జైల్లో వున్న గాంధీగారిని సందర్శించారని నేను చెప్పగలను. ఇది నా జ్ఞాపకం. నా మాటల్ని సరిదిద్దవచ్చు.

**సర్ హరిసింగ్ కౌర్ :** ఆయన సందర్శించారు.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** అప్పుడొక ఉత్సవంలాంటిది ఏర్పాటు చేశారు. పూనా ఒడంబడిక ధ్రువీకరణ తర్వాత నేను పూనా నుంచి వెళ్లిపోయాను. ఇదంతా నేను వెళ్లిపోయాక జరిగింది. అప్పుడక్కడ జయకర్‌గారున్నారేమో! ఆయన తన వివరణ నివ్వగలరని అనుకుంటాను.

**ఎమ్. జయకర్‌గారు :** సర్ రవీంద్రనాథ్ ఠాగూరు వచ్చినప్పుడు నేను లేను. నేనప్పుడు పూనాలో లేను.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** సర్ రవీంద్రనాథ్ ఠాగూర్ బ్రాహ్మణుడన్న విషయం సర్ శామ్యూల్ హోర్‌కు తెలుసా?

**సర్ శామ్యూల్ హోర్ :** సర్ నృపేంద్ర సర్కార్ చెప్పినట్లుగా దీన్ని గ్రహించగలను. ఒడంబడికను అంగీకరించమన్న విజ్ఞప్తి చేస్తూ వారాలతరబడీ లెక్కలేనన్ని టెలిగ్రాములు, ఉత్తరాలు ఇండియా నుంచి వచ్చాయన్నది ఒక్కటైనా అభ్యంతరం తెలుపుతూ రాలేదన్నదీ నిర్ద్వంద్వమైన సత్యం.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** ఈ విషయంపైనే సాక్ష్యాన్ని ప్రవేశపెట్టడంకోసం వేచి చూస్తున్నాను. కాబట్టి చిన్నచిన్న వివరాల్లోకి నేను వెళ్లడంలేదు. కానీ మీరు ఆ టెలిగ్రాముల్ని పరిశీలన చేశారా? అవన్నీ కాంగ్రెస్ ప్రజల నుంచే వచ్చాయేమో?

**సర్ శామ్యూల్ హోర్ :** అవన్నీ హిందువుల నుంచే వచ్చాయి. అవి కేవలం కాంగ్రెస్‌కు చెందిన హిందువుల నుంచే వచ్చాయన్న సూచనని మాత్రం నేను అంగీకరించలేను.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** ఆ సమయంలో తగినన్ని అభ్యంతరాలు లేవనెత్తబడకపోవడం, టెలిగ్రాములు రావడం దృష్ట్యా, ఈ విషయాన్ని ఇలా ఆలోచించి చూడండి. గాంధీ అలా బెదిరించినప్పుడు, అది హిందువులలో పెద్ద విభాగాన్ని అణచివేయడమన్న ప్రశ్న మాత్రమే గాదు. ప్రభుత్వ స్థితి కూడా అదేననడం నిజమేగదా?

**సర్ శామ్యూల్ హోర్ :** ఆ విషయం మా ఊహల్లోకి రాలేదు.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** ఇది మీకలా అనిపిస్తున్నట్టయితే, దాన్నిలా చెప్పనివ్వండి : "బ్రిటిష ప్రభుత్వం ఇది చేయకపోతే, అది చేయకపోతే నేను ఆమరణ నిరాహార దీక్ష చేస్తాను" అని అతనన్నప్పుడు, భారత నేరచట్టంలోని 508 సెక్షను చూపెట్టి "ఇది నేరం. కానీ మేము నిన్ను కారాగారం నుంచీ వెళ్లనిస్తున్నాము" అని మీరు చెప్పలేదు. తీసుకొంటున్న పరిణామాలవలన ఆ మనిషిని సత్యాగ్రహం చేయడానికి అనుమతించడంవలన పెద్ద పెద్ద పరిణామాలు యేర్పడుతాయిగదా? కాబట్టి మీరు భారత నేరచట్టంలో తప్పుగా పేర్కొన్నదానికి నిరాక్షేపణగా అంగీకారం తెలిపారు. అంతేగాక, ఇతరేతర కారణాల వల్ల కారాగారంలో ఉంచవలసిన వ్యక్తి, బయటిరాగలిగాడు. నేను మిమ్మల్ని యీ ప్రశ్న అడుగుతున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** ఏ భయంతో గానీ, అత్యయిక పరిస్థితి వాతావరణంలోగానీ మేము

పనిచేయలేదని సర్ నృపేంద్ర సర్కార్ గారికి నమ్మకంగా తెలుపుతున్నాం. మేము గమనించిన ఒకే ఒక ప్రశ్న యేమిటంటే అందుబాటులో ఉన్న సాక్ష్యాల మేరకు పరిశీలిస్తే కమ్యూనల్ మేరకు మనం ఉద్దేశించిన అంగీకారం వచ్చిందా? లేదా అనేదే తర్వాత, ఆ తర్వాత చాలా వారాల వరకూ, అది అటువంటి అంగీకారమేనన్న నిర్ణయానికి మేము వచ్చాము.

*సర్ ఎన్.ఎన్. సర్కార్ :* బెంగాల్ కౌన్సిల్ సభ్యుల నుంచీ నవంబరులో ఇక్కడికొచ్చిన కొన్ని టెలిగ్రాముల్ని జతపర్చుతూ 1932 డిసెంబరులో ప్రధానికొక ఉత్తరం రాయడం ద్వారా విజ్ఞప్తి చేయబడిందనే విషయం మీకు గుర్తుండే ఉంటుందని భావిస్తాను.

*సర్ శామ్యూల్ హోర్ :* ఈ సమస్యలో మొదటినుంచీ కడవరకూ సర్ నృపేంద్ర సర్కార్ చాలా ఆసక్తిని కనబరచారని నాకు గుర్తుంది.

*సర్ ఎన్.ఎన్. సర్కార్ :* కౌన్సిల్ సభ్యుల కోరిక ప్రకారం ఆ ఉత్తరాన్ని నేను ప్రధానమంత్రికి పంపాను. బెంగాలుకు తగిన ప్రాతినిధ్యం లేదని బెంగాల్ కౌన్సిల్‌లోని 25 మంది సభ్యుల అభ్యంతరాన్ని టెలిగ్రాము ద్వారా ప్రధానికి తెలియబరచక మునుపే ఇది డా॥ అంబేద్కర్‌కు చూపబడినదని మీరు గ్రహించగలరు. డా॥ అంబేద్కర్ వాళ్ల సమాధానం తెలుసుకోవడం కోసం బొంబాయికి టెలిగ్రాము ఇచ్చారు. దీన్ని ఆయనకు చూపెట్టి, బొంబాయి నుంచీ ఆయన కథనం ఏమిటో తెలుసుకోవడం భావ్యమని అనుకుంటున్నాను. ఆయన కొచ్చిన సమాధానం యిది.

***డా॥ అంబేద్కర్ :*** సర్ నృపేంద్ర సర్కార్ మన్నించాలి. నేనలాంటి పనేమీ చేయలేదని మీకు హామీ ఇవ్వగలను. సర్ నృపేంద్ర సర్కార్ నాకో టెలిగ్రాము చూపెట్టాననీ, దాని గురించి బొంబాయి నుంచీ సమాచారం సేకరించమని చెప్పాననీ అంటున్నారు. నేనలాంటి పనేమీ చేయలేదు

*సర్ ఎన్.ఎన్. సర్కార్ :* డా॥ అంబేద్కర్ నా చేతికిచ్చిన పత్రపు నకలు నా దగ్గరుంది. ఆయన కొచ్చిన సమాధానాన్ని చదువుతాను.

***డా॥ అంబేద్కర్ :*** ఇది సమాధానం కాదు. నాకు వచ్చిన ఒక స్వతంత్రమైన టెలిగ్రామది.

*సర్ ఎన్.ఎన్. సర్కార్ :* టెలిగ్రాంలో ఏమున్నదన్నదే యిక్కడ ముఖ్యం. బెంగాల్ హిందువు లందరూ బొంబాయిలో హాజరు కాకపోవడానికి కట్టుబడి ఉన్నారు. ఒడంబడికలో పాల్గొనకపోవడం చేతనే వారు కట్టుబడి వున్నామని తెలుపుతున్నారు. ప్రధానికి పంపిన టెలిగ్రాముల్లో ఈ విషయాన్ని మీరు గమనించే ఉంటారు.

*సర్ శామ్యూల్ హోర్ :* ఆ టెలిగ్రాములు డిసెంబరు మాసంలో పంపడం మాత్రం దురదృష్టం. సంప్రదింపులు జరుగుతున్న సమయంలో అవి పంపలేదు.

***డా॥ అంబేద్కర్ :*** టెలిగ్రాం నవంబరులో యిచ్చింది. కానీ డిసెంబరులో ఎందుకు పంపానంటే, నేను సమాధానాల కోసం ఎదురు చూస్తున్నాను. సంప్రదింపుల తర్వాత బెంగాల్ కౌన్సిల్

మొదటిసారిగా నవంబరులో సమావేశమయింది. వారు సమావేశమైన వెంటనే 25 మంది సభ్యులు టెలిగ్రాములు లేక నివేదికలు పంపారు. ఏది ఏమైనా బెంగాల్ బాధ్యతను నెరవేర్చుకొనలేకపోయిందని మీకు తెలియజేయాలని అనుకుంటున్నాను. బెంగాల్ అభీష్టాన్ని ఎప్పుడూ, టెలిగ్రాముల్లోనయినా తెలపలేదు. నేనిప్పుడు మీ దృష్టిని ఒక చిన్న విషయంపై మరల్చదలచుకుంటున్నాను. పూనా ఒడంబడిక, కమ్యూనల్ నిర్ణయాల ఫలితంగా బెంగాల్‌లో చాలా తీవ్రమైన పరిణామాలు ఏర్పడుతాయని సర్ శామ్యూల్ హెూర్ అభిప్రాయపడుతున్నారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** లేదు. నేను అలా అనుకోవడంలేదు

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** నేను అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** బాగా విపరీతంగా కనిపిస్తున్న మహమ్మదీయ సీట్లలో 119 సీట్లు - ఒక 10 లేక 12 సీట్లు తగ్గించితే బెంగాల్‌లో తీవ్ర పరిణామాలేర్పడతాయని మీరు అభిప్రాయపడుతున్నారా?

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** "బాగా విపరీతంగా కనిపిస్తున్న" అనే మాటను నేను వ్యతిరేకిస్తున్నాను ఫలితం ఘోరంగా ఉంటుందని కూడా నేను అనుకోవడంలేదు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** గౌరవనీయులైన అధ్యక్షులుగారూ! నావంతు వచ్చేసరికి సర్ నృపేంద్ర సర్కార్ ఇక్కడ ఉండరేమో కాబట్టి ఆయన అడిగిన ఒకటి రెండు ప్రశ్నల గురించి నేనొక వివరణ ఇవ్వదలచుకుంటున్నాను. మీరు గమనించండి. గత సంవత్సరం మూడవ రౌండు టేబుల్ సమావేశం జరిగినప్పుడు ఆయనకొక టెలిగ్రాం వచ్చిందనీ, దానిని నాకు ఆయన చూపెట్టాడనీ, నేనా టెలిగ్రాం గురించి విచారణలు గావించాననీ, దానికి సమాధానంగా నాకో టెలిగ్రాం అందిందనీ సర్ నృపేంద్ర సర్కార్ చెప్పారు. నేనేదైనా తప్పుగా చెబుతున్న పక్షంలో సర్ నృపేంద్ర సర్కార్‌కు సరిదిద్దే అవకాశం ఉండడంకోసమని నేనీ విషయాన్ని స్పష్టం చేయదలచుకుంటున్నాను. నాకందిన టెలిగ్రాం నా విచారణలకు సమాధానంగా వచ్చిన టెలిగ్రాం కాదు.

**సర్ ఎన్.ఎన్. సర్కార్ :** నేను విషయాన్నీ కుప్లీకరించానేమో!

**డా॥ అంబేద్కర్ :** నేనో మాట మాత్రం చెప్పదలచుకుంటున్నాను.

**అధ్యక్షుడు :** డా॥ అంబేద్కర్‌ను తన వివరణ ఇవ్వనీయండి.

**డా॥ అంబేద్కర్ :** సర్ నృపేంద్ర సర్కార్‌కు ఇచ్చిన టెలిగ్రాం భారతదేశ పత్రికల్లో ప్రచురించబడ్డది తన సత్యాగ్రహం ముగిసిన తర్వాత మహాత్మాగాంధీచే ఏర్పాటు చేయబడిన అస్పృశ్యతా వ్యతిరేక సంఘం సభ్యులకు పూనా ఒడంబడికను వ్యతిరేకిస్తూ సర్ నృపేంద్ర సర్కార్‌కు టెలిగ్రామును వాళ్లంతటవాళ్లే నాకు పంపారు. నేను విచారణ చేసినప్పుడు వచ్చిన టెలిగ్రాం కాదది. పూనా ఒడంబడికను వ్యతిరేకిస్తూ బెంగాల్ స్నేహితులిచ్చిన టెలిగ్రాంను చూపినప్పుడు ఆయన ఆ

టెలిగ్రాంను ప్రధానికి తాను ఏ వ్యాఖ్యానాన్నీ చెయ్యకుండా, యధాతథంగా, – కేవలం ఆయనకు సమాచారం అందించడంకోసం పంపబోతున్నానని చెప్పాడని సమితికి తెలియజేస్తున్నాను. ఆయన వెళ్లిపోవడానికి ఒకరోజు ముందుగా ప్రధానికి రాసిన ఉత్తరపు ప్రతినొకదాన్ని నాకాయన దయతో పంపాడు. ఆ ఉత్తరంలో సర్ నృపేంద్ర సర్కార్ వారి ఉత్తరాన్ని ఆయనకు పంపడమేగాక, పూనా ఒడంబడిక కుదుర్చుకున్న సమయంలో బెంగాల్ హిందువులు ఉన్నారో లేదో విచారణ జరపమని విజ్ఞప్తి కూడా చేశారు. ఆ దృష్ట్యా నేను కూడా వెంటనే ప్రధానికొక ఉత్తరం రాశాను. నా వంతు వచ్చినప్పుడు దాని ప్రతిని సమితికి అందజేయగలను. ఆ లేఖలో నాకందిన టెలిగ్రాములను ఆయనకు అందజేశాను. అంతేగాక పూనా ఒడంబడిక జరిగినప్పుడు బెంగాల్ సవర్ణ హిందువులు ప్రాతినిధ్యం వహించలేదని టెలిగ్రాములో తెలిపిన విషయం నాకు తెలిసినంతవరకూ నిజంగాదని నేను తెలిపాను. ఎందుకంటే ఒడబండిక జరిగినప్పుడు బెంగాల్ సవర్ణ హిందువులు చాలామంది హాజరయ్యారని నాకు తెలుసు. వాళ్లు నాతో సంప్రదింపులు జరిపారు. ఒడంబడికకు రమ్మని నన్ను కోరారు. ప్రస్తుతానికి నేను చెప్పదలచుకున్నదంతా యిదే!

★ ★ ★

**సర్ మీర్జా ఇస్మాయిల్ :** ప్రభుత్వాన్ని నియమించే శాసనసభలే ఉన్నత సభలోని సభ్యుల్ని కూడా నియమిస్తాయని లార్డ్ లోథియన్ అన్నారు. ఒక్కసారి ఈ సభ్యులు శాసనసభ్యులచేత ఎన్నుకోనబడిన తర్వాత వాళ్ల బాధ్యతలన్నీ తీరిపోతాయి. వాళ్ల అభిప్రాయాల్ని వారు తెల్పుకోవచ్చు. సమాఖ్య ప్రభుత్వం ముందుకొచ్చే ప్రతి విషయానికీ శాసనసభల దగ్గరకు వెళ్లి సంప్రదించాల్సిన అవసరం లేదు. ఎన్నికైన తర్వాత వారు స్వతంత్రులు. కానీ ప్రాంతీయ ప్రభుత్వాల అభిప్రాయమేమిటో సమాఖ్య ప్రభుత్వం తెలుసుకుంటూ ఉండాలి.

**డా॥ అంబేద్కర్ :** అప్పుడుండే ప్రాంతీయ ప్రభుత్వమన్నమాట!

**సర్ మీర్జా ఇస్మాయిల్ :** అప్పుడుండేదే.

**డా॥ అంబేద్కర్ :** ప్రాంతీయ ప్రభుత్వంలో మార్పు వస్తే కేంద్రంలోని దాని ప్రాతినిధ్యంలో కూడా మార్పు సంభవిస్తుందా?

**సర్ మీర్జా ఇస్మాయిల్ :** కేంద్రంలో ఇప్పటికే విజృంభించిన తీవ్రమైన ప్రాంతీయతత్వాన్ని అరికట్టాలని మీరు అనుకుంటే యిదొక మంచిమార్గంగా కనిపిస్తోంది. దిగువసభలో మీరు యిప్పటికే ఆదరణ చూరగొన్నారు. ప్రాంతీయ ప్రభుత్వాలలో ఉన్న ప్రజాస్వామ్య ప్రభుత్వాల వలన, ప్రజాస్వామ్య దృక్కోణం నుంచీ ఎటువంటి అభ్యంతరమూ ఉండదు.

**డా॥ అంబేద్కర్ :** ఒక ప్రత్యేకమైన విషయంపైన ఓటు చేయడం కోసం ఆదేశాలిచ్చి వారిని పంపండి.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 1933 జూలై 25, పేజీ 899.

**ఎమ్.ఆర్. జయకర్‌గారు :** మామూలుగా రాజ్యభాగ శాసనసభ కాలపరిమితి అయిదేండ్లలో ముగుస్తున్నప్పటికీ, – జఫ్రుల్లాఖాన్‌గారు చెప్పినట్టు– ఉన్నత సభ కాలపరిమితి ఏడేండ్లయినప్పటికీ– సిబ్బందిలో మార్పు తప్పకుండా ఉండాలి. యీ పద్ధతిని అవలంబిస్తే ఇలాగే జరుగుతుంది గదా!

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** సమాఖ్యలో చేరడం కోసం, వేర్వేరు రాష్ట్రాలచేత ఆమోదాన్ని పొందవలసిన పదవీ స్వీకార ప్రమాణాలు రాజ్యాంగ చట్టంలో చోటు చేసుకోగలుగుతాయో, లేవో, రాజ్య కార్యదర్శిని అడగదలచుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** సమాధామేమిటంటే– లేదు. అవి చోటు చేసుకోవు.

**డా॥ అంబేద్కర్ :** సమాఖ్య న్యాయస్థానంలో ఏదైనా వివాదం పుట్టుకొచ్చినదని అనుకుందాం; అప్పుడు ఏదయినా ఒక విషయం– అంటే తగదాకు సంబంధించిన విషయం సమాఖ్య సమర్థాధికారంలోకి వస్తుందా రాదా అని న్యాయస్థానమెలా నిర్ణయించగలదు?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇక్కడ నేను సామాన్యుడిలా మాట్లాడుతున్నాను– యిప్పుడెలా సంధులను పరిగణిస్తున్నామో, అలాగే వారు కూడా సంధిని పరిగణిస్తారు.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** కానీ ఇది రాజ్యాంగ చట్టంలో భాగంగా వుండదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఉండదు. ఇది రాజ్యాంగచట్టంలో ఉండదు. సంధులు (ఒడంబడికలు) యే పార్లమెంటు చట్టంలోనూ ఉండవు. కానీ (సర్ తేజ్ సప్రూగానీ మరే యితర భారతీయులుగానీ ఇది తప్పయితే సవరించవచ్చు). సంధులన్నిటినీ పరిగణనలోకి ఎప్పుడూ తీసుకుంటునే ఉన్నారు.

**సర్ తేజ్ బహదూర్ సప్రూ :** అవును. మున్సిపల్ చట్టంలో సంధులెప్పుడూ భాగాలే!

★ ★ ★

+**డా॥ అంబేద్కర్ :** శ్వేతపత్రంలో 70వ ప్రస్తావన మేరకు, గవర్నరు–జనరల్‌చే జారీ చేయబడిన ఉత్తర్వులను అమలులో ఉంచేలా జాగ్రత్త వహించడం గవర్నరు ప్రత్యేక బాధ్యతే కదా? ఈ విషయాన్ని రాజ్యా కార్యదర్శి దృష్టికి తేదలచుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ప్రాంతీయ ప్రభుత్వాలు అమలు చేయవలసిన ఆర్థిక సంబంధమైన ఉత్తర్వులను గవర్నరు జనరలు జారీ చేసినప్పుడు, గవర్నరు అవి అమలు జరిగేలా చూస్తారు గదా?

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి /2–బి, 1933 జూలై 25, పేజీ 899.

\+ పైదే. పుట 945.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. సమాఖ్య పన్నుల విధానక్షేత్రంలో అది అలాగే జరుగుతుంది.

**డా॥ అంబేద్కర్ :** ప్రాంతీయ ప్రభుత్వం అమలు జరపవలసిన ఉత్తర్వులను సమాఖ్య జారీ చేసినప్పుడు, ఆ ఉత్తర్వులను అమలులో వుంచేలా చూడవలసిన ప్రత్యేక బాధ్యత గవర్నరు పైన లేదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఉంటుంది. గవర్నరు జనరల్ జారీ చేసిన ఉత్తర్వులే గదా?

**సర్ హరిసింగ్ గౌర్ :** చట్ట ప్రకారంగా జారీ చేసినవి.

**డా॥ అంబేద్కర్ :** చట్ట ప్రకారంగా జారీ చేసినవే అన్నమాట! మరో ప్రశ్న. అనాలోచితంగా అడుగుతున్నాను. ప్రాంతీయ భాగాల కేంద్ర కార్య నిర్వహణ సంబంధాలకు సంబంధించిన విషయాలను పేర్కొనే శ్వేతపత్ర విభాగంలో కేంద్ర కార్య నిర్వహణను కొనసాగించడానికి కేంద్రం ప్రాంతీయ ఏజెన్సీని ఉపయోగించుకుంటుందా అన్న నిర్ణయం ప్రాంతీయ పరిధిలోని విషయం, అనే ఏర్పాటు జరిగిందనుకుంటాను. అది తన ఏజెన్సీనే నియమించుకోవచ్చా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. ఇతర సమాఖ్యల అనుభవాల నుంచీ గమనించి, మనం వీలయినంత తక్కువ కార్య నిర్వహణా నకళ్లను చేయడం మంచిదని నేననుకున్నాను. మామూలుగానయితే భారతదేశమంతా మీరు కార్య నిర్వహణలను ఒకదానిపై ఒకటి పేర్చటం కంటే సమాఖ్య సూచనలను ప్రాంతీయ విభాగాల్లో ఆయా ప్రాంతీయ కార్య నిర్వహణ విభాగాలు అమలులో ఉంచడం మంచిది.

**డా॥ అంబేద్కర్ :** నేను మీకు చెప్పదలచుకున్న విషయమేమిటంటే– ప్రాంతీయ ప్రభుత్వాలు అవిధేయులైనప్పుడు, కేంద్ర అధికారానికి ఎదురు తిరిగినపుడు, కేంద్రం ప్రాంతీయ ఏజెన్సీని నియమించడం జరుగుతుంది. అంతేగాక కేంద్రీయ సంబంధమైన విషయాల కార్య నిర్వహణ కోసం తన ఏజెన్సీని నియమించుకోవచ్చును. అవునా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అలాగే జరుగుతుంది.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** శాశ్వత ఒడంబడిక మేరకు బెంగాల్ కావలసినంత ఆదాయాన్ని పొందలేకపోతోంది కాబట్టి బెంగాల్‌లో కార్య నిర్వహణ ప్రమాణం తక్కువగా ఉన్నదని మీకు తెలపదలచుకుంటున్నాను. అదే విషయాన్ని మరో విధంగా తెలపడమే ఇది.

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇది ఒక కారణం. కానీ శాశ్వత పరిష్కారం అక్కడుందన్న వాస్తవాన్ని మనం అంగీకరించాలి

**డా॥ అంబేద్కర్ :** అలాగే వుంది.

★ ★ ★

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 1933 జూలై 27, పుట 990.

"**డా॥ అంబేద్కర్ :** శ్వేతపత్రం మేరకు మునుపటి ఉపకల్పన అవసరం లేని సమాఖ్య ప్రయోజనాలకు, మాటవరసకు, ఒక అణాను సమకూర్చకుండా, ప్రాంతీయ భాష ప్రయోజనాలకోసం, ఒక అణాను సమకూర్చుకోవడానికి మార్గాలు లేవు. మరో ఉపకల్పనమేమిటంటే, ప్రాంతీయ భాగాలకు ఆదాయపు పన్ను యొక్క అవసరం వుండదు. కానీ సమాఖ్యకు అవసరం ఉంటుంది. అప్పుడు మీరు రెండింతల సొమ్ము సమకూర్చుకోవాలి. (నిర్ణీత శాతం 50 : 50 అని అనుకున్నపుడు) మీరు సమాఖ్య ప్రభుత్వం ఒక అణా కావలెనని అనుకున్నప్పుడు రెండు అణాలు సమకూర్చుకోవాలి. తను ఒకటి పొందినప్పుడల్లా, ప్రాంతీయ భాగాలకు, వాటికి అవసరం లేకపోయినా, ఒకటి యివ్వాలి. అవునా?

**సర్ శామ్యూల్ హోర్ :** ఈ విషయాలన్నీ నేను పరిగణిస్తాను. క్రమంగా లేకపోవడమన్నది (ఎటువంటి ఏర్పాట్లు ఉండినప్పటికీ) తప్పనిసరిగా వుంటుందని సమితి సభ్యుల్ని గుర్తుంచుకొమ్మని కోరుతున్నాను. శ్వేతపత్రంలో ఉద్దేశించుకొన్న విధమేమిటో నేను ఖచ్చితంగా చెప్పలేను. కానీ కేంద్ర, రాజ్య భాగాల మధ్య ఆదాయపు పన్ను విభజనలో ఏదో రకమైన హెచ్చుతగ్గులుంటాయి.

**డా॥ అంబేద్కర్ :** రాజ్య కార్యదర్శినీ, సర్ ఆస్టెన్ చాంబర్‌లిన్‌నూ రెండు విషయాలను గమనించవలసినదిగా కోరుతున్నాను. తన ప్రయోజనాలకు కావాలని అనుకుంటే సమాఖ్య ఆదాయపు పన్నును సమకూర్చుకొనగల అవకాశం లేదని సర్ ఆస్టెన్ అన్నారు. 139 ప్రస్తావనలో, బ్రాకెట్లలో ఉన్నదేమిటో గమనించండి- "మార్జిన్‌లో చెప్పబడిన మార్గాల నుంచీ వసూలయిన మొత్తం రాబడులలో, 50 శాతానికి తగ్గకుండా, 75 శాతానికి మించకుండా, ఒక నిర్ణయించబడిన శాతం."

**సర్ శామ్యూల్ హోర్ :** అది ఆదాయపు పన్ను (ప్రాంతీయ విధించిన అదనపు పన్నులు ప్రత్యేకించి) తమ ప్రయోజనాలకోసం అదనపు పన్ను విధించే హక్కు సమాఖ్య కుంటుందని నేను దీనినుండే గ్రహిస్తున్నాను.

**సర్ ఎ.పి. పాత్రో :** అదనంగా

**డా॥ అంబేద్కర్ :** అది 139వ ప్రస్తావన గదా?

**సర్ శామ్యూల్ హోర్ :** అవును. ఉపోద్ఘాతంలోని 30 పేజి పై భాగంలో మనం దానిని సూచించామని సమితి తెలుసుకొనవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** సమాఖ్య ప్రయోజనాల కోసం ఆదాయం పైన అదనపు పన్ను విధించే విషయం గురించి, రాజ్య కార్యదర్శి ఇప్పటికిప్పుడు చేసిన ప్రకటనపై దృష్టిని కేంద్రీకరించ గోరుతున్నాను. ఈ స్థితికి కీలకం మునుపు గవర్నరు జనరలు ఇచ్చిన అనుమతి అని ఆయన చెప్పినట్లు నేను భావిస్తున్నాను. సమాఖ్య ప్రభుత్వం అదనపు పన్నులకోసం గవర్నరు జనరలు అనుమతి పొంది

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, జూలై 28, 1933, పేజీ 1002-3.

వుండాలని 141వ ప్రస్తావన స్పష్టంగా చెప్పడంలేదని ఆయన గమనించాలి. 138 మరియూ 139 ప్రస్తావనలలో గణించబడిన సమాఖ్య కేటాయింపు రాబడులను గవర్నరు జనరల్ మునుపటి అనుమతి పేర్కొంటోంది. గవర్నరు జనరలు మునుపటి అనుమతిపై న 141వ పేరా ఆధారపడలేదు.

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్ చెప్పినది నిజమేనని భావిస్తున్నాను. నేను పంచిపెట్టబోయే నోట్‌లోని జవాబును నేను చదవాలి.

**సర్ అక్బర్ హైదరి :** సమాఖ్య శీర్షికలలో 4వ శీర్షిక కూడా ఉంది. అందులో యిలా ఖచ్చితంగా చెప్పారు– "వ్యవసాయ ఆదాయం, కార్పొరేషన్ల ఆదాయం మినహాయించి, మిగిలిన ఆదాయాలపై న పన్ను విధించడం, కార్య నిర్వహణ, రాజ్య విభాగాలకు గల అదనపు పన్నులు విధించే అధికారానికి మినహాయించి" పూర్తిగా సమాఖ్య ఆధిపత్యంలో

**లార్డ్ యూస్టాన్ పెర్సీ :** మనకు అందిన సాక్ష్యాలు అన్నీ భారతదేశంలో నేను విన్న సాక్ష్యాలు అన్నీ ప్రాంతీయ భాగాల అదనపు పన్నులకు తీవ్ర వ్యతిరేకంగా ఉండటం చేత యింతటితో అది పూర్తి అవుతుందని నేను భావించడం లేదు.

**డా॥ అంబేద్కర్ :** అది వ్యాపారస్తుల ఉద్దేశమని నేను విశ్వసిస్తున్నాను.

**లార్డ్ యూస్టాన్ పెర్సీ :** నేను ప్రశ్నించే అవకాశం కల్గిన ప్రతి భారతీయుడూ ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చాడు.

**డా॥ అంబేద్కర్ :** కాదు. నిజంగా అవి వారి అభిప్రాయాలు కావు.

★ ★ ★

**లార్డ్ రాన్‌క్లైలర్ :** నేను డా॥ అంబేద్కర్ మాటల్లోంచీ పుట్టిన ప్రశ్న నొకదాన్ని అడుగుతాను. ఇది కొంతవరకూ ముఖ్యమైన ప్రశ్న అని భావిస్తున్నాను. గవర్నరు జనరలు ఆమోదానికి సంబంధించి నంతవరకూ, సమాఖ్య పన్నులంతా గవర్నరు జనరలు ఆమోదానికి లోబడే ఉంటాయి. ఆయన ప్రవేశీకరణ, ఇక్కడ మనకున్నటువంటి తీర్మానాల ఆధారంగానే పన్నులు పరిశీలించబడతాయి.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. కానీ లార్డ్ రాన్‌కైల్లర్ నిజంగా రెండు స్థితులను అయోమయ పరుస్తున్నట్టు నేననుకుంటున్నాను. సామాన్య రాజ్యాంగస్థితి ననుసరించి ప్రభువు ఉద్దీపనం చేత అధిక ఓట్లు సృష్టించబడతాయి. ఆ పరిస్థితి అలాగే ఉంటుంది. భారత రాజ్యాంగంలోని ఒక ప్రత్యేక విధిననుసరించి గవర్నరు జనరలు అడ్డుపడే పరిస్థితిని గురించి నేనాలోచిస్తున్నాను.

**లార్డ్ రాన్‌క్లైలర్ :** అర్థమదేనని నేను విశ్వసిస్తున్నాను. 41వ పేజీ ననుసరించి గవర్నరు జనరల్ మునుపటి సిఫారసులు లేకపోయినా సమాఖ్య శాసనసభలకు పనిచేసే శక్తి ఉంటుంది– అని డా అంబేద్కర్‌కు యిచ్చిన సమాధానం ద్వారా తెలుస్తోంది.

**ఎమ్.ఆర్. జయకర్‌గారు :** ఈ ప్రశ్నను గురించి తెలిపే 4వ ప్రస్తావనను గమనించవలసినదిగా లార్డ్ రాన్‌కైల్లర్‌గారిని కోరుతున్నాను. "సమాఖ్య శాసనసభలలో పన్నుల విధింపునకు ఎటువంటి ప్రస్తావన చేయాలన్నా గవర్నరు జనరల్ సిఫారసు అవసరం".

**లార్డ్ రాన్‌కైల్లర్ :** అవును. నేనలాగే అనుకున్నాను. ఒప్పుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అది గవర్నరు జనరలుకున్న ప్రత్యేకశక్తిని తెలుపుతోంది. 138వ పేరాగ్రాపులో ఉద్దేశించిన పన్నులన్నీ కేంద్ర ఖజానాకు వెళ్లవనీ, ప్రాంతీయ భాగాల మధ్య పంపిణీ చేయబడతాయనీ అనుకోవడంచేతే అలా నిర్ణయించవలసి వచ్చింది.

గౌరవనీయులైన అధ్యక్షులుగారూ! సమాచారం కోసం- వివాదాన్ని దేన్నీ రేకెత్తించడం కోసంగాదు- ఓ క్షణంపాటు మధ్యలో కలగజేసుకుంటున్నాను. "ఇప్పుడున్నటువంటి మరియూ పెరుగుతున్న హక్కులు"- అనే మాటకు సంబంధించి కొంత అభిప్రాయ వైరుధ్యముందని సమితికి తెలుసు. సివిల్ సర్వీసుకొక అభిప్రాయముంది. ప్రభువుగారి న్యాయాధికారులకు మరో అభిప్రాయముంది. ఈ క్లాజు రాయకపూర్వమే సమితి ఏదోరకమైన అభిప్రాయాన్ని యివ్వాలని నేననుకుంటున్నాను. 1909నాటి దక్షిణాఫ్రికా రాజ్యాంగంలో కూడా "యిప్పుడున్నటువంటి మరియూ పెరుగుతున్న హక్కులు" అనే మాట వాడబడింది. ఈ షరతుని ఎలా అమలులో వుంచారో, ఎలా వ్యాఖ్యానించారో తెలుసుకోవడం కోసం దక్షిణాఫ్రికా ప్రభుత్వం నుంచీ ప్రాంతీయ కార్యాలయాలకిచ్చిన విజ్ఞప్తిని సంపాదించడం మీకూ, రాజ్య కార్యదర్శిగారికీ సాధ్యమవుతుందా అని ఆలోచిస్తున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** మీ సలహాను తప్పకుండా పరిశీలిస్తాను. మొత్తానికి; మనం సర్వీసుల గురించి ఆలోచించబోయేటప్పుడు యీ ప్రశ్నను మనం పరిశీలించాలి. శ్రీ పురుషోత్తమదాస్ మనల్ని అడిగినప్పటికీ, యిది ఆ ప్రశ్న మాత్రం కాదు.

**డా॥ అంబేద్కర్ :** కాదు. అందుకే నేను వివాదాన్ని లేవనెత్తడం నాకిష్టంలేదని అన్నాను. ఓ రకమైన తులనాత్మక దృక్పథంకోసం యీ సమాచారం పొందగలిగే అవకాశం ఉన్నదా అని మాత్రం నేనడుగుతున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** అవును.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** 41వ పేరాగ్రాపు అమలు జరపడంపైన సర్ అక్బర్ హైదరీ యిచ్చిన ప్రకటన గురించి నేనో ప్రశ్న అడగదలచుకున్నాను. రాజ్య కార్యదర్శిగారూ! మీరు నిన్న ఆ ప్రకటన గురించి

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 జూలై 28, పేజీ 1010.

పరిశీలిస్తూ ఒకస్థాయిలో సమాఖ్య ప్రభుత్వపు బరువును వహించడానికి రాష్ట్రాలు ఒప్పుకున్నందుకు సంతోషిస్తున్నట్టు తెలిపారు.

**సర్ శామ్యూల్ హొర్ :** అవును.

**డా। అంబేద్కర్ :** నేనిప్పుడు తెలుసుకోవాలని అనుకుంటున్నదేమిటంటే– మీరిప్పుడు జవాబు చెప్పవచ్చు. లేకపోతే తర్వాత దీన్ని పేర్కొనదలచుకున్నా నాకభ్యంతరం లేదు. సర్ అక్బర్ హైదరీ వర్ణించిన దశలోనే సమాఖ్య బరువును రాష్ట్రాలు వహించడం మొదలు పెడతాయని మీరంగీకరిస్తున్నారా? ఆయన రాష్ట్రాలు తమ వంతును తీసుకోక మునుపు సమాఖ్య విత్తం యెలా మరుగవుతుందో, వివిధ దశలగా వర్ణించారని మీకూ తెలుసు గదా?

**సర్ శామ్యూల్ హొర్ :** అవును.

**సర్ అక్బర్ హైదరీ :** అదనపు బరువునా?

**సర్ శామ్యూల్ హొర్ :** నిజానికి మూడు బరువులున్నాయి. మొట్టమొదట వాళ్లు మొదటినుంచీ చేపట్టే పరోక్షపన్నుల భారం. రెండవది; సంవత్సరాల నిర్ణీత గడువులున్న తర్వాతవాళ్లు చేపట్టే కార్పొరేషను పన్ను భారవం లేక కార్పొరేషను పన్ను సమానమైనదాని భారం. చివరగా మూడవది, అత్యయిక పరిస్థితి సమయాల్లో వాళ్లు చేపట్టే అదనపు పన్ను.

**డా। అంబేద్కర్ :** ఆయన కొన్ని నిబంధనలు విధించారని అనుకుంటాను?

**సర్ శామ్యూల్ హొర్ :** ఆయన కొన్ని నిబంధనలు విధించాడు. ఈ మూడవ భారం విషయంలో నేను పొరబాటు పడి వుంటే– అంటే అదనపు పన్ను విషయంలో అన్నమాట!– సర్ అక్బర్ నన్ను సవరించవచ్చు.

**డా। అంబేద్కర్ :** అదనపు పన్నుకు విధించడానికి సమాఖ్య తీర్మానించుకునే సరియైన నిబంధనలు వేనని మీరు అంగీకరిస్తున్నారో లేదో నేను తెలుసుకొనగోరుతున్నాను.

**సర్ శామ్యూల్ హొర్ :** అవే అనుకుంటాను. ఆ మాటలకే బద్ధుడై వుండాలని నేను భావించడం లేదు. కానీ, మామూలుగా, ఏర్పాటుకు అది ఒక మంచి ప్రాతిపదికగా నాకనిపిస్తోంది.

**డా। అంబేద్కర్ :** అందులో తలెత్తే ప్రశ్ననే నేనిప్పుడు అడగబోతున్నాను. ఆ పరిస్థితిని కొనసాగించినప్పుడు లేక 141వ ప్రస్తావనలోని పరిస్థితినయినా కొనసాగించినప్పుడు, సమాఖ్య పరోక్ష పన్నుల పైనే పూర్తిగా తన రాబడిని సమకూర్చుకోవడమన్నది యదార్థమే గదా?

**సర్ శామ్యూల్ హొర్ :** పూర్తిగా పరోక్ష పన్నుల ఆధారంగా కాదు.

**డా। అంబేద్కర్ :** చాలావరకూ కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** స్పష్టంగా చాలావరకూనూ! ఇప్పటిలాగే తరువాత భారత రాబడులలో పరోక్ష పన్ను చాలా ప్రాముఖ్యతగల పాత్ర వహిస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** సర్ శామ్యూల్ హెూర్‌గారూ! నేను మిమ్మల్ని అడగదలచుకున్నదేమిటంటే- ఇప్పటికంటే సమాఖ్య పాలనలో యిది ఎక్కువగా వుంటుంది. బ్రిటీషు పాలన క్రిందనున్న భారతీయులు ప్రత్యక్ష పన్నులకు తమ అంగీకారాన్ని తెలపకపోవడమే దీనికి కారణం. ఎందుకంటే- రాష్ట్రాలు అంగీకారం తెలపవు. తత్కారణంగా రెండూ కలిపి పరోక్ష పన్నులనే ఎంచుకుంటాయి. రెండూ బాధ్యత వహిస్తాయి. బ్రిటీషు యిండియా మాత్రం బాధ్యత వహించే ప్రత్యక్ష పన్నులకు అంగీకరించవు. అలాంటప్పుడు యిప్పటికంటే అప్పుడే పరోక్ష పన్నుల్ని యెక్కువగా తలపై రుద్దుతారు గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** మరో దృక్కోణం నుంచీ గమనిస్తే, రాష్ట్రాలు చాలా తరచుగా తక్కువ పరోక్ష పన్నుల వైపే వుంటాయని నేనూహిస్తున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అది ఎందుకంటే వాళ్లకిప్పుడు చిన్నమొత్తు డబ్బును తాకే శక్తయినా వుండదు గాబట్టి. పరోక్ష పన్నులకు వ్యతిరేకిస్తున్నప్పుడు, పన్నుల దాడిని భరించవలసి వస్తున్నప్పుడు, అప్పుడు యిప్పటిలాగే భావించగలరా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఈ ముక్కోణశక్తులలో, వాళ్లకు భాగం వున్నందువల్ల, ప్రాంతీయ రాష్ట్రాల భాగాలు ప్రత్యక్ష పన్నులలోనే శ్రద్ధ వహిస్తుందన్న విషయాన్ని డా॥ అంబేద్కర్ గుర్తుంచుకుంటారా?

**డా॥ అంబేద్కర్ :** అవును. నిజమే కావచ్చు. బ్రిటీషు భారతదేశంలో సేకరించిన భారత రాబడిపైన సమాఖ్యకు పూర్తిగా ఆధీనత లేదన్న విషయాన్ని రాజ్య భాగాలు కూడా గ్రహిస్తాయి. ఇది కేవలం ఊహాత్మకమైన విషయమే! నేను సమాఖ్య క్రిందవున్న పన్నుల దాడి యెలా వుంటుందన్న విషయంపైన దృష్టిని సారించదలచుకుంటున్నాను. కొనసాగించడం కోసం సమాఖ్య తన చుట్టూ ధరల సూచికల పట్టీల గోడను కట్టుకోవాల్సిన అవసరం వుంది కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్ దీనిని ఊహాత్మక విషయంగా పేర్కొన్నారు. నాకూ ఆయనతో అంగీరించాలనే ఉంది. మరది ఊహాత్మక విషయమని అనుకొన్నప్పుడు, యేం జరగబోతోందో జోస్యం చెప్పడం నాకిష్టంలేదు.

**డా॥ అంబేద్కర్ :** ఇక్కడ యీ విషయాన్ని ఆపేస్తాను. 141వ ప్రస్తావన నుంచే ఉద్భవించే మరో ప్రశ్నని సర్ శామ్యూల్ హెూర్ నడగబోతున్నాను. ఒక నిర్దుష్ట ఆధారంపైన మదింపు చేయబడిన సొమ్ముపైన సమాఖ్య రాబడికి రాష్ట్రాలు సమానమైన సొమ్ము తన వంతుగా చెల్లిస్తుందని మీరు చెప్పారు. రోజు ఉదయమే 'నిర్దిష్టం' అనే పదాన్ని ఎలా ఉపయోగించారో మీరు వివరించారు కూడా! దాన్ని గురించి నేను ప్రశ్న అడగదలచుకోవడంలేదు. కానీ నేనడగదలచుకున్నది యిది : ఒక ప్రత్యేక

రాష్ట్రం చేత చెల్లించబడే యీ నిర్ణీత పద్ధతిలో మదింపు చేయబడిన సొమ్ము చివరకు సమాఖ్యకే చెల్లించబడేలా చూసే ప్రస్తావనేదీ శ్వేత పత్రంలో వుందా?

**సర్ శామ్యూల్ హోర్ :** అప్పుడది రాష్ట్రం యొక్క బాకీ అర్థమవుతుంది. అవునా కాదా?

**డా॥ అంబేద్కర్ :** అవును. ఒకవేళ రాష్ట్రం చెల్లించకపోతే అది బాకీయే. యిప్పుడు నేనొక పరిస్థితిని ఊహిస్తున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** అప్పుడు వైస్రాయి కలుగజేసుకోవచ్చుననుకుంటాను.

**డా॥ అంబేద్కర్ :** సమాఖ్య రాజ్యాంగంలోకి వైస్రాయి చేరడని మీకు తెలుసు.

**సర్ శామ్యూల్ హోర్ :** 129వ పేరాగ్రాపును చూస్తే డా॥ అంబేద్కర్ దీన్ని గమనించగలరు. "రాష్ట్రాల యొక్క సమాఖ్య బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించబడుతున్నాయన్న నమ్మకం కలగడం కోసం గవర్నరు జనరలుకు విచక్షణతో సమాఖ్యలోని రాష్ట్ర సభ్యులెవ్వరికైనా సామాన్యమైన సలహాలు యిచ్చే అధికారం ఉంది"

**డా॥ అంబేద్కర్ :** అవును. నేను చెప్పదలచుకున్నదేమిటంటే- 129వ పేరాగ్రాపు గవర్నర్ జనరల్‌కు మార్గాన్ని చూపెట్టే అధికారాన్ని మాత్రమే యిస్తోంది. ఆ మార్గాల్ని వారు అనుసరించకపోతే, పరిహారంగా చర్యలు తీసుకునే అధికారం గవర్నర్ జనరల్‌కివ్వలేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** చట్టం ఎక్కడగానీ.రాజ్యభాగాలకుగానీ, రాష్ట్రాలకుగానీ ఆ రకమైన పరిస్థితులలో స్పష్టమైన సమర్థనలేమీ కల్పించలేదు.

**డా॥ అంబేద్కర్ :** రాష్ట్రాలకు కల్పిస్తోంది. ఎందుకంటే, గవర్నరు జనరల్ యొక్క ఆదేశాలు ఆచరించబడేటట్టుగానూ గౌరవించబడేటట్టుగానూ గవర్నరుకొక ప్రత్యేక బాధ్యత ఉంది. అలా అతడు నేరుగా గవర్నరు జనరలు అదుపులోనే ఉంటాడు. రాష్ట్రాలకూ, కేంద్రానికీ మధ్య గల సంబంధాలకు సంబంధించినంతవరకూ, అతని ఆదేశాలు ఆచరించబడేటట్లుగా అక్కడ ఏర్పాటు జరిగింది.

**సర్ శామ్యూల్ హోర్ :** అక్కడ కేవలం ఆ అనుమతే ఉందని నేను భావిస్తున్నాను. గవర్నరు జనరల్ మరియూ రాష్ట్రాలలో అది లేదా?

**డా॥ అంబేద్కర్ :** లేదు. సూచనల ఒడంబడిక పత్రం మీరు వివరించినట్టుగా, గవర్నరు ఆజ్ఞోల్లంఘనం చేస్తే, అతడిని వెనక్కి పిలిపించవచ్చు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్యగల సంబంధాల్లో అటువంటి ఏర్పాటు లేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** ఆయా విషయాల్లో యీ బాధ్యత గవర్నరు జనరల్‌కున్న (విచక్షణతో కూడిన) బాధ్యత. అంటే, యిక్కడి నుంచీ అతడికిచ్చే సూచనలకు అనుగుణంగా....

**డా॥ అంబేద్కర్ :** సమాఖ్య కార్య నిర్వహణ విషయాల్లో గవర్నరెలా గవర్నర్ జనరల్‌కు లోబడి వుంటాడో, రాష్ట్ర పాలకుడు గవర్నరు జనరల్ సూచనలకు లోబడి వుండడు- సమాఖ్యకు సంబంధించిన అంశాల కార్య నిర్వహణకు మించి, అని అనుకుంటాను- అది వైస్రాయ్ అధీనంలో ఉంటుంది.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** కానీ, మీరు అన్నట్టుగా, సార్వభౌమాధికారం వైస్రాయి కివ్వబడుతుంది గానీ, గవర్నరు జనరల్ కివ్వబడదు కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. కానీ యేదీయేమైనా ఫలితం ఒకటే!

**జఫ్రుల్లాఖాన్‌గారు :** ఆనవాయితీ ప్రకారం గవర్నరు జనరల్ వైస్రాయికొక విన్నపాన్ని అందజేస్తాడు. ఆపైన దానిపై వైస్రాయి చర్య తీసుకుంటాడు.

**డా॥ అంబేద్కర్ :** ఇందులోంచే ఉద్భవించే మరో ప్రశ్నని అడగదలచుకుంటున్నాను. దీనికి మరో దృష్టికోణం కూడా ఉంది. తమవంతు సొమ్ము చెల్లించవలసివచ్చినప్పుడు ఆయా రాష్ట్రాలు చెల్లించగలిగే స్తోమతను కలిగి ఉంటాయని భావించాం. తన రాబడికోసం కొంతవరకూ భారతదేశంనలోని రాష్ట్రాలు చెల్లించే సొమ్ముపైన ఆధారపడి ఉండే గవర్నరు జనరల్‌కు చెల్లించవలసిన సమయం వచ్చినప్పుడు ఆయా రాష్ట్రాలకు చెల్లించగల స్తోమత ఉండేలా చూడ్డానికి శ్వేతపత్రంలో ఏమైనా యేర్పాటు చెయ్యబడ్డదా?

**రావు బహదూర్ శ్రీ కృష్ణమాచారి :** రాష్ట్రాలకు సంబంధించి ఏ యేర్పాటు చెయ్యబడ్డది? రాష్ట్రాలకు అలాంటి యేర్పాటు యేదైనా చేశారా?

**డా॥ అంబేద్కర్ :** చేశారు. ఒక నిర్ణయించబడిన మొత్తాన్ని సమాఖ్యకు చెల్లించాలని, తప్పకుండా చెల్లించాలనీ, చెల్లించక తప్పదనీ గవర్నరు ధృవీకరించి చెప్పవచ్చు, చేయవచ్చు.

**జఫ్రుల్లా ఖాన్ :** తనకు సమాచారం అందడంకోసం తనిఖీ చేయబడిన ఖాతాల జాబితాలను సమాఖ్యలోని భాగాలైన రాష్ట్రాలు తనకు సమర్పించాలని వైస్రాయి అడగవచ్చునని ప్రారంభిక చర్చలలో నేను సలహా యిచ్చాను. గమనించండి.

**డా॥ అంబేద్కర్ :** మరో విషయం వుంది. రాజ్య కార్యదర్శిగారు రెండూ కలిపి సమాధానం చెప్పవచ్చు. 14వ పేరాగ్రాఫులోని ఋణాలు తెచ్చుకునే శక్తులను మీరు మరోసారి గమనిస్తే, సమాఖ్య రాబడులపైన సమాఖ్య ఋణాలు తెచ్చుకోవచ్చునన్న యేర్పాటు ఉందని తెలుసుకోగలరు. 141వ పేరాగ్రాఫు క్రింద చెల్లించబడే మొత్తాలు సమాఖ్య రాబడిలోని భాగాలే! అవి సమాఖ్య సంపాదించుకునే ఋణాలకు పూచీగా ఉంటాయి. సమాఖ్య ఋణాలకు పూచీ యివ్వడంకోసం తెచ్చుకోదలచుకున్న సమాఖ్య రాబడులలో కొంత భాగాన్ని చెల్లించగలిగే సామర్థ్యంగానూ,

చెల్లించాలన్న ఆమోదంగానూ ఇలా అనిశ్చిత పరిస్థితిలో ఉంచితే, ఇది సమాఖ్యకు కావల్సినంతగా సమకూర్చగలుగుతుందా?

**సర్ శామ్యూల్ హోర్ :** డా॥ అంబేద్కర్ గారు ఊహిస్తున్న పరిస్థితి మరీ తరచుగా ఏర్పడేదిగాదని నేను భావించి ఉంటాను. ఒకవేళ సంభవించినా, సమాఖ్య రాబడులను గుర్తించగలిగినంతగా మార్చి పారేసే సంభవంగా అది ఉండదు. ఏమైనా యీ మొత్తాలన్నీ కలిపి చూసినా అవి చిన్న మొత్తాలే గదా?

**డా॥ అంబేద్కర్ :** అవి ఏవిటో నాకు తెలియదు.

**సర్ శామ్యూల్ హోర్ :** ఒక నిర్లక్ష్యం జరిగిందనుకోండి- అప్పుడు?

**డా॥ అంబేద్కర్ :** అవి అంత చిన్న మొత్తాలుగా ఉండవేమోనని నా భావన.

**సర్ శామ్యూల్ హోర్ :** అవి భారత రాబడులలో అంత మార్పుల్ని కలిగిస్తాయని నేననుకోలేను.

**సర్ అక్బర్ హైదరీ :** సార్వభౌమాధికారం ద్వారా రాష్ట్రాలకున్న ఆర్థిక పరిస్థితి గవర్నరుకున్న ప్రత్యేక అధికారాల ద్వారా రాజ్య భాగాలకున్న పరిస్థితి కంటే మెరుగ్గా ఉంటుంది కదా?

**డా॥ అంబేద్కర్ :** నిన్న సర్ మీర్జా ఇస్మాయిల్ చేసిన ప్రకటన ఒక విషాదకరమైన స్థితిలో ఉన్న పరిస్థితుల్ని ఆవిష్కరించిందని అనుకుంటున్నాను.

**సర్ అక్బర్ హైదరీ :** అయినా అది ఒక సంతులితమైన బడ్జెట్టే. దాని నుంచీ అతడు తన కష్టాన్ని చెల్లించగలడు.

★ ★ ★

*****డా॥ అంబేద్కర్ :** అధ్యక్షా! భారత ప్రభుత్వ చట్టంలోని "ఇప్పుడున్నటువంటి మరియూ పెరుగుతున్న హక్కులు" అనే మాటని దక్షిణాఫ్రికా రాజ్యాంగచట్టంలో కూడా చూడవచ్చునన్న విషయాన్ని రాజ్య కార్యదర్శి దృష్టికి తేవాలని అనుకుంటున్నాను. అధినివేశ రాజ్య కార్యాలయం నుంచీ దక్షిణాఫ్రికాలో ఆ మాట యెలా ఉపయోగించబడుతోందో తెలుసుకోవడం కోసం ప్రకటన తెప్పించుకోవడం సాధ్యంగదా అని ఆలోచిస్తున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** ఈ విషయం పైనే మనమొక విచారణ గావించాం. వేసవిలో డా॥ అంబేద్కర్ దీనిని పేర్కొన్నారు. నేను అధినివేశ రాజ్య కార్యాలయాన్ని సమాచారం కోసం అడిగాను. నాకింతవరకూ అందలేదు. కానీ విషయాలు రెండూ భిన్నమైనవనీ, వేర్వేరనీ మాత్రం తెలిసింది. దక్షిణాఫ్రికా విషయంలో నష్ట పరిహారపు హామీ లేనేలేదు.

**సర్ మనూభాయ్ ఎన్. మెహతా :** ఇది ఆస్ట్రేలియాలో కూడా ఉందని నేననుకుంటున్నాను.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబరు 3, 1032వ పేజీ.

**డా॥ అంబేద్కర్ :** 'పెరుగుతున్న హక్కులు' అనే మాట దక్షిణాఫ్రికాలో ప్రభుత్వంచేత యెల వ్యాఖ్యానించబడుతోందోనని మాత్రం నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. ఈమాట యథాతథంగ ఉంది గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఆ సమాచారాన్ని సేకరించగలనేమో చూస్తాను. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాల రెండింటినీ ఆ విషయమై అడిగాను.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** ఒక రాజ్య భాగానికిగానీ, రెండు రాజ్య భాగాలకుగానీ పబ్లిక్ సర్వీసు కమీషన్‌ను నియమించడాన్ని అడ్డుకొనేదేమీ ఉండదుగదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఉండదు. ఆ విషయమై మన్నమో ప్రస్తావన చేయబోతున్నాం.

★ ★ ★

****డా॥ అంబేద్కర్ :** మంత్రాంగ శాఖా సంబంధ అధీనంలోకి బదిలీ చేసిన వెంటనే ప్రాంతీయ అంశాల సర్వీసులను బట్టబయలు చేయటం యీ బదిలీ జీతపుస్కేలును తగ్గించడంతో బాటు జరుగుతుందన్న విషయం దృష్ట్యా జరుగుతోంది. సర్ మాల్కోలాం హైలీ పేర్కొన్న యీ ఫలితాన్ని పేర్కొనడం కోసం నన్ను కాస్త మాట్లాడనివ్వండి. ఒక సర్వీసును ప్రాంతీయాకరణ గావించినప్పుడు ఆ మంత్రి మునుపున్న జీతాన్నిగాక అంతకంటే తక్కువ స్కేలున్న జీతాన్ని అమలులో వుంచుతాడు. ఆ కారణం చేత తక్కువ స్కేలున్న జీతం యూరోపియను అభ్యర్థులకు ఆకర్షణగా ఉండదు.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. ఇంకోరకంగా చెప్పాలంటే, 'సామ్రాజ్య సంబంధమైన'కు బదులుగా 'ప్రాంతీయ' సర్వీసులను ఉపయోగించారు.

**డా॥ అంబేద్కర్ :** ఈ మార్పులు చేస్తున్నది జీతం మాత్రమే గానీ బదిలీ కాదు.

★ ★ ★

+**డా॥ అంబేద్కర్ :** ఈ విషయంపైన పరిశీలనకోసం నేనో సలహా యివ్వనా! కొత్తగా వచ్చిన వ్యక్తి వెంటనే హక్కు ఇవ్వడంకంటే రాజ్య కార్యదర్శి ఈ విచక్షణాధికారాన్ని వుంచుకుంటే బావుంటుంది గదా! ఓ వ్యక్తి తాను పదవీ విరమణ చేయాలని అనుకున్నప్పుడు ఆయన దానిని కనిష్ఠ విషయాల్లో ఉపయోగించవచ్చు. ఎందుకంటే యీ కొత్త నిబంధనలవలన అతడు నిజంగా బాధపడుతున్నాడు, అంతేగాక యీ నిబంధన మూలంగా లాభపడాలని అతడనుకోవడం లేదు.

---

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబరు 3, 1056 పేజీ.

** పైదే. పేజీ 1058.

+ పైదే. పేజీ 1072.

***సర్ శామ్యూల్ హోర్ :*** అలాంటి సలహాను మేము పరిశీలిస్తాము. డా॥ అంబేద్కర్ సలహా కొత్తగా వచ్చి చేరిన వ్యక్తికి సంబంధించినదని భావిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అవును. నేను కొత్తగా చేరిన వ్యక్తుల్ని గురించే మాట్లాడుతున్నాను. అలా అయితే రాజ్య కార్యదర్శి తన దగ్గరే ఒకంత విచక్షణాధికారాన్ని ఉంచుకోవచ్చు. రాజ్య కార్యదర్శికి ఆయన సలహాదారులకూ తన పదవీ విరమణ కొత్త నిబంధనలచేత అసంతృప్తిగానూ, అసౌకర్యంగానూ ఉన్నదని ఋజావు చేసినపుడు అతడికనుకూలంగా దానిని ఆయన ఉపయోగించుకోవచ్చు.

***సర్ శామ్యూల్ హోర్ :*** అలాంటి సలహాను వేము పరిశీలించదలచుకుంటున్నాను. ఈ విచక్షణ తల్లిదండ్రుల మనస్సు నించీగానీ, విశ్వవిద్యాలయం నుంచీగానీ, ఈ యువకుడు వస్తున్న బడి నుంచీ గానీ విశ్వాసాన్ని తొలగిస్తుందేమోనన్న సందేహం నాకుంది. కానీ దీన్ని పరిశీలిస్తాను.

★ ★ ★

*****డా॥ అంబేద్కర్ :*** సర్ శామ్యూల్‌గారూ! ఈ ఏర్పాట్ల గురించి ఒక ప్రశ్న అడగదలచుకుంటున్నాను. వీటో హక్కువల్ల- తరువాత వైస్రాయి, గవర్నర్లు పొందిన వీటో హక్కు అన్నమాట- మునుపటి మంజూరయిన నియమాల ముఖ్యమైన ఉద్దేశం ఆమోదించబడటమేమో జరుగుతుంది. కాబట్టి ఆ దృక్పథంలోంచీ చూస్తే, యీ చేర్పాట్ల వలన జరిగేదేమీ ఉండదు. వైస్రాయి తన మునుపటి మంజూర్లని యిచ్చినా, చివరకు బిల్లు పాసయినప్పుడు అతడు దానిని తప్పనిసరిగా అమలు జరపాలన్న నియమమేమీ లేదు. అతడికి వీటో శక్తి ఉంటుంది. కాబట్టి, ఆ దృక్పథం నుంచీ చూస్తే వీటో శక్తి వల్ల పొందజాలని గతంలో మంజూరయిన నియమాల వల్ల ఒరిగేదీమే లేదు.

***సర్ శామ్యూల్ హోర్ :*** డా॥ అంబేద్కర్‌తో అంగీకరిస్తున్నట్టు నేననుకోవడంలేదు. వీటో అన్నది కొంత వేరేరకమైన అనుమతి. వీటో అన్నది అంతకంటే పెద్దదయిన, గంభీరమైన అనుమతి. శాసనసభలు కొన్ని ప్రస్తావనలకు కట్టుబడిన తర్వాత ఇది వస్తుంది. అందువల్ల దీనిని గంభీరమైనదానినిగా భావిస్తున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** అది అంతా కాకుండా, వైస్రాయి ప్రత్యేక బాధ్యతల్ని ఇబ్బందిపెట్టే రకంగా వుండేవాటిని అడ్డుకోవడమన్న ప్రధానోద్దేశానికి సంబంధించినంతవరకూ, వీటో చాలా శక్తివంతమైన చర్య.

***సర్ శామ్యూల్ హోర్ :*** ఆ రెండవ పరిశీలన దగ్గరకే వస్తున్నాను. వీటోకు చాలా చరిత్ర ఉంది. బ్రిటీషు అనుభవాల దృష్ట్యా గమనిస్తే వీటో క్రమక్రమంగా రోజులు గడిచేకొద్దీ రాజ్యాంగ సంప్రదాయంలాగా తయారవుతుంది.

***డా॥ అంబేద్కర్ :*** కానీ నేనో సంగతి చెప్పదలచుకున్నాను. మునుపటి మంజూరయిన నియమాల

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబర్ 5, పుటలు 1118-19.

ప్రభావానికీ, తరువాతి వీటోకూ, నేను నిర్ణయించగలిగినంతవరకూ ఉన్న ఒకే ఒక తేడా ఏమిటంటే– మునుపటి మంజూరు చర్చని అడ్డుకొంటుంది. కానీ వీటో అడ్డుకోదు. అవునా?

**సర్ శామ్యూల్ హోర్ :** అది ఒక తేడానే!

**డా॥ అంబేద్కర్ :** అది ఒక తేడానే! ఇప్పుడు నేను మిమ్మల్ని అడగదలచుకున్నదేమిటంటే సర్ శామ్యూల్ హోర్‌గారూ! – నిజంగా చర్చ పై ప్రాయి ప్రత్యేక బాధ్యతల్ని అడ్డుకొంటున్నట్టయితే, పత్రికల్లో గానీ, శాసనసభలకవతల ప్రజల వేదికల్లోగానీ యీ మునుపటి అనుమతి నిర్ణయం ఖచ్చితంగా చర్చను అడ్డుకొనజాలదని మీరు మనస్సులో ఉంచుకోవాలి. మునుపటి అనుమతి నిర్ణయం అడ్డుకొనజాలదు కూడా. ఈ విషయం కింద జరగగల ఒకేఒక విషయమేమిటంటే– మునుపటి అనుమతి నిర్ణయం క్రింద వచ్చే ఏ విషయం గురించయినా ప్రజలుగానీ, పత్రికలుగానీ నిరసన తెలియజేయడానికిగానీ, ప్రదర్శనను ఏర్పాటు చేయడానికిగానీ స్వేచ్ఛ కలిగి వుండడంతో– నోరు నొక్కగల యేకైక సంస్థ శాసనసభలు మాత్రమే!

**సర్ శామ్యూల్ హోర్ :** అలా చెప్పడమొక పద్ధతి. అది డా॥ అంబేద్కర్ చెప్పే పద్ధతి అనవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** ఇలా చెప్పడం సబబైన పద్ధతికాదా? పత్రికల్లోగానీ, ప్రజా సమావేశాల్లోగానీ, యింకెక్కడైనా గానీ మునుపటి అనుమతికి వచ్చే చర్చల్ని ఆపేటంతగా పై ప్రాయి మునుపటి అనుమతి నిర్ణయాల్ని విస్తృతంగా అమలులో వుంచడం సాధ్యంగాదు. కదా?

**సర్ శామ్యూల్ హోర్ :** ఇవన్నీ అలాంటి చర్చేనని ననుకుంటున్నాను. అయినప్పటికీ శాసనసభల్లోని చర్చకూ, బయట జరిగే బాధ్యతారహితమైన చర్చకూ చాలా తేడా వుంటుందని నేను అనుకొంటాను. రెండవదేమిటంటే– మునుపటి అనుమతిని మంజూరు చెయ్యడం కొంతకాలంగా కొనసాగుతోంది. రౌండ్ టేబుల్ సమావేశాలు ప్రతిదానిలోనూ కొత్త రాజ్యాంగంలోని ఒక భాగంగా దీన్ని అనుమతించారు. మూడవ విషయం– 119వ పేరాగ్రాఫులోని వర్గాల్ని డా॥ అంబేద్కర్ ఓసారి గమనిస్తే, అందులోని ప్రతి ఒక్కదానికీ ప్రతి జాగ్రత్తలలాంటి వాటికి చెప్పదగినంత గిరాకీ ఉందని ఆయన తెలుసుకొనగలరు. ఉదాహరణకు– మతహక్కులు ఉపయోగాల సమస్యల్ని ఆయన తీసుకోవచ్చు. ఆ విషయమై కొందరు సనాతన హిందూ వర్గాలవారికున్న తీవ్ర భావాల్ని ఆయన గమనించే ఉంటారు. ఆయన వాటితో అంగీకరించరు. అవి తప్పని ఆయన అనుకుంటున్నారు. అదే సమయంలో, వాళ్లా అభిప్రాయాల్ని గాఢంగా కలిగి ఉన్నారు. భారత శాసనసభల్లోంచీ ఇలాంటి సమస్యల్ని పూర్తిగా తీసివేయాలని వాళ్లు భావిస్తున్నారు. ఇప్పుడు రెండు దృక్కోణాలకున్న మధ్యేమార్గాన్ని మనం ఎన్నుకున్నాం. ఈ దిశల్లో కొన్ని ప్రత్యేక జాగ్రత్తలని కోరుతున్న చెప్పుకోదగ్గ సంఖ్యగల వర్గం ఒకటుందని యీ రెండు వర్గాలనూ నేను ఒకేరకంగా సమర్థించడం సాధ్యమే!

**డా॥ అంబేద్కర్** నేను మీ ముందుకు తీసుకు రాదలచుకున్న విషయమేమిటంటే– శాసనసభ సభ్యుడుగానీ శాసనసమండలి సభలోని సభ్యుడుగానీ ప్రజలలో యీ విషయాన్ని చర్చించగలరు.

కానీ, శాసనసభవనాల్లోకి వచ్చిన తర్వాత వారు స్వేచ్ఛగా అవే విషయాల్ని చర్చించలేరు. మునుపటి అనుమతి నిర్ణయం ద్వారా మీరు పేర్కొంటున్న ఒకే తేడా యిదే!

**సర్ శామ్యూల్ హెూర్ :** వాళ్లు తీర్మానాలు చేసుకోవచ్చు. కానీ విషయం మాత్రం పూర్తిగా అంతే!

**డా॥ అంబేద్కర్ :** "మతం మరియు మత ఉపయోగాలు" అన్న మాటను ఉపయోగించడం గురించి జయకర్‌గారు లేవనెత్తిన విషయం సంబంధించి నేనొక సలహా మాత్రం ఇవ్వ దలచుకున్నాను. ఎందుకంటే ఆ విషయాన్ని నేను జాగ్రత్తగా గమనిస్తున్నాను. "మతం మరియు మత ఆచారాలు" అన్న మాటకు బదులుగా "విశ్వాసానికి సంబంధించిన నియమాలు" అన్నమాటను వాడితే సరిపోతుందనే సలహా మాత్రం ఇవ్వదలచుకున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** 'విశ్వాసానికి సంబంధించిన నిబంధనలు" కూడా అదేరకమైన వివాదానికి దారి తీస్తుందని నేను భావించి ఉంటాను.

**సర్ హరిసింగ్ గౌర్ :** ఇంకా ఎక్కువగానా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అలాంటి కొత్తమాటతో వచ్చే పేచీ యేమిటంటే– పాతమాటకంటే ఎక్కువ రకాలుగా వ్యాఖ్యానించడం జరుగుతుందని నేననుకుని ఉంటాను.

**డా॥ అంబేద్కర్ :** వీలయినంతవరకూ "ఆచారాలు" అన్నమాటను వాడకూడదని నా సలహా.

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్ మాటల్ని గుర్తుంచుకుంటాను.

★ ★ ★

**లార్డ్ రాన్‌క్లెల్లర్ :** రాజ్య కార్యదర్శిగారూ! ఆపైన సమాఖ్య శాసనసభల్లోంచి ఉద్భవించే ఆలోచించిన నిర్ణయాల్ని కొనసాగించడం కేంద్ర ప్రభుత్వానికి కుదురుతుందా? రాజ్య భాగాల్ని మూల్యం చెల్లించమనడం సాధ్యమవుతుందా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ధనాన్ని తెచ్చుకోవడానికి కావలసిన వ్యవస్థ లేదు.

**లార్డ్ రాన్‌క్లెల్లర్ :** కానీ ప్రాంతీయ భాగాలకు కావల్సిన ధనం కేంద్ర ఖజానా నుంచీ వస్తుంది. అంతేకదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఆదాయపు పన్ను వస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** సర్ ఆస్టెన్ చాంబర్‌లెన్ అడిగిన ప్రశ్నకు యిలాంటి సమాధానాన్ని యివ్వ వచ్చుననుకుంటున్నాను. ఉమ్మడి చట్టాల్ని యేర్పరచడానికి సంబంధించినంతవరకూ, ఉమ్మడి జాబితాలోని విషయమేదైనా సమాఖ్య శాసనసభల చేత ధ్రువీకరించబడినట్లయితే, అది ప్రాంతీయ భాగాల ప్రభుత్వాల చేత ధ్రువీకరించబడిన అలాంటి నిర్ణయం కంటే యెక్కువ ప్రాధాన్యతను కలిగి

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 1933 అక్టోబర్ 10, పేజీ 1130.

ఉంటుందని శ్వేతపత్రంలోని ఒక పేరాగ్రాఫులో చెప్పబడి ఉంది. తత్పరిణామంగా, ఉమ్మడి జాబితాలోని ఒకే విషయంపై కేంద్రం, ప్రాంతీయ భాగాలు చేసిన నిర్ణయాల మధ్య సంఘర్షణ యేర్పడితే, పైన చెప్పినట్టుగా, శ్వేతపత్రపు యేర్పాట్లు వలన సమాఖ్య నిర్ణయం ప్రాంతీయ భాగపు నిర్ణయం కంటే యెక్కువ ప్రాధాన్యత కలిగి ఉంటుంది:

***సర్ ఆస్టెన్ చాంబర్‌లిన్ :*** అది అంతే! రాజ్య కార్యదర్శికి ముందుగా నేను చెప్పిన విషయం అదే!

***డా॥ అంబేద్కర్ :*** చట్టాల యేర్పాటుకు సంబంధించినంతవరకూ అలాగే నిర్ణయం జరిగిందని నేను అనుకుంటున్నాను.

***సర్ ఆస్టెన్ చాంబర్‌లిన్ :*** అదే నేనర్థం చేసుకున్నాను.

***డా॥ అంబేద్కర్ :*** కార్య నిర్వహణకు సంబంధించినంతవరకూ, సమాఖ్య శాసనసభలచే ధ్రువీకరించబడిన ఉమ్మడి నిర్ణయపు కార్యనిర్వహణకు సంబంధించినంతవరకూ, రాజ్యభాగపు గవర్నర్ల ద్వారా ప్రాంతీయ ప్రభుత్వాలకు సూచనలు, సలహాలు యిచ్చే అధికారం సమాఖ్య కార్య నిర్వాహకుడికి ఉంటుందని నేననుకుంటున్నాను. గవర్నరులు తప్పనిసరిగా వాటిని పాటించాలి.

***రెడింగ్ మార్క్వెస్ :*** ఆ విషయంపై నిన్న రాజ్య కార్యదర్శి వ్యతిరేకంగా సమాధానం యిచ్చారు.

***సర్ హరిసింగ్ గౌర్ :*** అనధికార పత్రికను నడిపే వ్యక్తి శిక్షింపబడతాడనే శిక్షా సంబంధ షరతు ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** నాకు జ్ఞాపకం వస్తున్న మరొక ఉదాహరణను చెబుతాను. ఉదాహరణకు, అత్యవసర పరిస్థితిలో కొంతమొత్తాన్ని ధరావత్తుగా చెల్లించకపోతే పత్రికను దేన్నైనా ప్రారంభించరాదని తెలుపుతూ కేంద్ర ప్రభుత్వం సమాచారబిల్లు పాస్ చేసిందనుకోండి. అటువంటి శాసనం యెవరైనా ఒక ప్రయివేటు వ్యక్తిపైన ప్రభావాన్ని చూపదు. అప్పటి ప్రభుత్వానికి సహాయపడే పత్రిక- అంటే పార్టీ పత్రిక- ఒక ప్రత్యేక ప్రాంతంలో ఉందనుకోండి. కేంద్ర శాసనసభల చేత పాసయి సమాచార బిల్లును ఆ పత్రిక ప్రభావితం చేస్తోందనుకోండి. ప్రభుత్వానికీ, ఆ సమాచార పత్రికకు ఉన్న అనుబంధం వలన ప్రభుత్వం ఆ పత్రికపైన చర్య తీసుకోలేదనుకోండి. అప్పుడేం చెయ్యాలి? నిజంగా ఒక వ్యక్తి దానివల్ల యిబ్బంది పడలేదనుకోండి!

***సర్ హరిసింగ్ గౌర్ :*** అనధికార పత్రికను నడిపే వ్యక్తి శిక్షింపబడతాడనే శిక్షా సంబంధ షరతు ఉంది.

***డా॥ అంబేద్కర్ :*** అదే నిజమైన విషయం.

***సర్ ఆస్టెన్ చాంబర్‌లిన్ :*** ప్రభుత్వానికి చేరడానికి సమాచారం, వ్యవస్థా అంతా కావాలి.

***డా॥ అంబేద్కర్ :*** ఒక ప్రత్యేక అధికార రాజ్యభాగపు గవర్నరు విచారణను కొనసాగించమని ఆదేశించినప్పుడు, ఆ విచారణకు అయ్యే ఖర్చును ఆ ప్రాంతీయ ప్రభుత్వం చెల్లించినప్పుడు, బడ్జెట్‌లో అందుకు యేర్పాటు చెయ్యనప్పుడు, యేం జరుగుతుంది?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఆ యిబ్బందులన్నీ నేను గమనించాను. అదే సమయంలో మరోవైపున్న యిబ్బందుల్ని కూడా గమనించక తప్పడంలేదు. డా॥ అంబేద్కర్ పేర్కొన్న విషయం ఖచ్చితంగా న్యాయానికీ చట్టానికి సంబంధించినది. న్యాయచట్టాలు ప్రాంతీయ విభాగపు విషయం. సమాఖ్య ఆసక్తి ఐక్యతకు సంబంధించిన ఆసక్తి. కానీ అది ప్రాధమికంగా ప్రాంతీయ విషయం అన్న యదార్థంతో అది విభేదించదు. డా॥ అంబేద్కర్ ప్రశ్న సూచించే వాదననూ, సర్ ఆస్టెన్ చాంబర్‌లిన్ ప్రశ్న సూచించే వాదననూ న్యాయబద్ధమైన దృష్టితో పరికిస్తే, రాజ్యభాగాల న్యాయచట్టాల్ని సమాఖ్య అదుపులో పెడుతుందనే అర్థం వస్తుంది. అది శ్వేతపత్రంలో యిప్పుడు లిఖించబడ్డ నియమానికి ఖచ్చితంగా భిన్నంగా ఉంది.

**డా॥ అంబేద్కర్ :** క్షమించండి. నేనీవిధంగా చెప్పాలనుకుంటున్నాను. న్యాయచట్టాల్ని మీరు పూర్తిగా ప్రాంతీయ సంబంధమైన విషయంగానైనా చేయండి. కేంద్రం జోక్యం లేని ప్రాంతీయ విషయంగానైనా చేయండి. తర్వాత మీరు ఇప్పుడు కోరిన వాదాన్నే కొనసాగనివ్వండి. కానీ దీన్ని మీరు ఉమ్మడి శాసన సంబంధ విషయంగా చేస్తే, న్యాయాన్ని నవరించగలిగే స్థితిలో సమాఖ్య ఉండి తీరుతుంది.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** ప్రభుత్వకార్యదర్శిగారూ! మీదృష్టినోసారి భారత ప్రభుత్వ చట్టంలోని ఉమ్మడి విభాగపు ప్రస్తుత పరిస్థితివైపు మరల్చవలసిందిగా కోరుతున్నాను. ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టం క్రింద కొన్ని ప్రత్యేక విషయాలు లేక కొన్ని ప్రత్యేక విషయాల భాగాలు మాత్రమే కేంద్ర శాసన సభల క్రిందకు వస్తాయని మీకు సలహా యివ్వడం చేత నేను మిమ్మల్నోసారి దీన్ని గమనించగోరుతున్నాను. ముందుగా, సంక్రమణ నిర్ణయాలలోని 1వ షెడ్యూలులోని 2వ భాగంలో కొన్ని ప్రాంతీయ భాగాల విషయాలు ప్రత్యేకంగా ఉమ్మడివిగా చేర్చబడ్డాయి గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ప్రాంతీయంగా పేర్కొనబడినప్పటికీ, విషయాలు షరతుల ఒడంబడిక అధీనంలో ఉంటే, కేంద్ర శాసనసభల ఆధిపత్యంలోకి వస్తాయా?

**సర్ శామ్యూల్ హెూర్ :** వస్తాయి.

**డా॥ అంబేద్కర్ :** సంక్రమణ నిర్ణయాల్లోని షెడ్యూల్ యొక్క 2వభాగంలో చేర్చబడిన 51 విషయాల్లో 14 కేంద్ర శాసనసభలకు గానీ, కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన నిర్ణయాలకు గానీ; రాజ్య కార్యదర్శికిగానీ స్పష్టంగా అధీనం చేయబడ్డాయని నేనొక సమీకరణాన్ని తయారుచేశాను. అది ఒకటి. రెండవదేమిటంటే– భారత ప్రభుత్వ చట్టంలోని 67వ సెక్షను 2వ సబ్–క్లాజు క్రింద మునుపటి అనుమతి ద్వారా అన్ని ప్రాంతీయ విషయాలూ ఉమ్మడి అధికార పరిధిలోకి వస్తాయి.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్ : సంపుటి 2–బి, 1933 అక్టోబరు 13, 1178–81 పేజీల మధ్య.

2వ భాగం క్రింద యేదయినా విషయం ఒక ప్రాంతీయ విషయంగా పరిగణిస్తే, గవర్నరు జనరల్ నుంచీ మునుపటి అనుమతిని సంపాదించుకొన్న పక్షంలో, ఏది ఏమైనా ఆ పూర్తి కేంద్ర విషయ మంతా కేంద్ర ప్రభుత్వ శాసనాధికారానికి లోబడే ఉంటుంది. కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** సెక్షను 80 (ఎ) క్రింద, ప్రాంతీయ ప్రభుత్వం వైపు నుంచీ, ఉమ్మడి విభాగాల పైన కేంద్ర ప్రభుత్వం ఆధిపత్యాన్ని నెరవుతుంది. ఆపైన కేంద్ర విషయాన్ని నియంత్రీకరించడం కోసమూ, లేక ఒకంతకాలం వరకూ నియమాలవల్ల గవర్నరు జనరలు కోసం రిజర్వు చేయబడిన కేంద్ర అధీనపు విషయంగా నిర్ణయాలవల్ల, చట్టాలవల్ల ప్రకటన చేయబడిన ఏదయినా ప్రాంతీయ విషయాన్ని నియంత్రీకరించడానికిగానీ, ఏదయినా ప్రాంతీయ శాసనసభ గవర్నరు జనరల్ మునుపటి అనుమతి లేకుండా ఏదయినా నిర్ణయాన్ని పరిశీలించడంగానీ అమలు జరపడంగానీ జరుగుతుంది. ప్రస్తుత పరిస్థితి అదేగదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** గవర్నర్ జనరల్ అనుమతి సంపాదించిన పక్షంలో అది ఉమ్మడి విభాగంలాగే, ఆచరణాత్మకంగా మొత్తం ప్రాంతీయ విభాగమే!

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. అదంతే !

**డా॥ అంబేద్కర్ :** ప్రస్తుతం ఇప్పటి ప్రస్తావనల క్రింద ఆ మొత్తం విషయమంతా పూర్తిగా మార్చి వేయబడింది. కేంద్ర శాసనసభల ఉమ్మడి శక్తి అంతా చాలా విషయాల్లో తీసివేయాలన్న ప్రస్తావన వచ్చిందని నా భావన.

**సర్ శామ్యూల్ హెూర్ :** 3వ జాబితాలో తప్ప మిగిలినవన్నీను.

**డా॥ అంబేద్కర్ :** తరువాత మీరోసారి 3వ జాబితా వైపు దృష్టిని సారించండి. నేను పూర్తి చేసిన కాగితాన్ని పారవేసుకున్నాను. మన్నించండి. 3వ జాబితాలోకి చేర్చిన విషయాల్లో చాలా భాగం యివ్వాళ పూర్తిగా కేంద్రానివైనా లేక ఉమ్మడివైనా అయివున్నాయని మీకు సలహా యివ్వడం మాత్రం సబబని నా భావన.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. అందులోని చాలా విషయాలు అలాగే ఉన్నాయని చెప్పవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** ప్రస్తుత భారత ప్రభుత్వ చటం కింద మీ ఉమ్మడి జాబితా స్పష్టంగా పూర్తి భారతదేశానికి ముఖ్యమైనదిగా వ్యవహరిస్తున్నారని సలహా యివ్వడం సబబే. ఇవ్వాల్టికి భారత ప్రభుత్వ చట్టం కింద అది కేంద్ర జాబితాలోకి గానీ ఉమ్మడి జాబితాలోకిగానీ చేర్చబడతాయి. భారత ప్రభుత్వ చట్టం క్రింద యిప్పుడు ఉమ్మడిగా ఉన్న విభాగం భారత ప్రభుత్వ చట్టంలో పూర్తి భారతదేశానికి ముఖ్యమైనదిగా భావించబడినదనేదే నా సూచన.

**సర్ శామ్యూల్ హోర్ :** అవును. మామూలుగా అంతే అనుకుంటాను. ఏకకేంద్ర స్వరూప ప్రభుత్వాల్లో యిది తప్పదని అనుకుంటాను.

**డా॥ అంబేద్కర్ :** అంతే! కాబట్టి, ప్రభుత్వ కార్యదర్శిగారూ! నా సలహా ఏమిటంటే– భారత ప్రభుత్వ చట్టం కింద అఖిల భారత ప్రాధాన్యత గలదానిగా పరిగణించబడిన శాసన విధానపు విభాగం కార్య నిర్వహణాత్మకంగా పూర్తిగా ప్రాంతీయంగా పరిగణింపబడుతుందని అనడం నిజం కాదా చెప్పండి.

**సర్ శామ్యూల్ హోర్ :** కాదు, ఏకకేంద్ర స్వరూప ప్రభుత్వంలో నియమాలకు ప్రాంతీయ భాగాలు స్వతంత్రంగా వుండే సమాఖ్యలో నియమాలకూ మధ్య పెద్ద తేడాని నేను చూపెట్టగలను. బాగా కేంద్రీయమైన ప్రభుత్వం నుంచీ సమాఖ్య ప్రభుత్వంగా భారత ప్రభుత్వాన్ని మనం ఖచ్చితంగా మార్చుతున్నాము.

**డా॥ అంబేద్కర్ :** కానీ నేను ఆ విషయ ప్రాధాన్యత గురించి మాట్లాడుతున్నాను. ఈ విషయం 1901 వరకూ అఖిల భారత ప్రాధాన్యత ఉన్నదిగా పరిగణించబడ్డది. అటువంటిది ఒక్కసారిగా అఖిలభారత ప్రాధాన్యతను పోగొట్టుకొని, పూర్తిగా ప్రాంతీయ విషయంగా మారడం సాధ్యం కాదు. ప్రాంతీయ ప్రభుత్వాలకు చాలా రాయితీ లివ్వాలన్న విషయం నాకు తెలుసు. భారత ప్రభుత్వాన్ని యిప్పటివరకూ ప్రాంతీయ ప్రాముఖ్యత కంటే ఎక్కువగా పరిగణించడాన్ని గుర్తించక పత్వదు.

**సర్ శామ్యూల్ హోర్ :** మనం ప్రతిపాదించిన ప్రభుత్వం పూర్తిగా వేరే రకమైన ప్రభుత్వమని ఒప్పుకున్నప్పుడు అలాంటి పోలిక తేవడం చాలా కష్టం. స్వయంపాలిత ప్రాంతీయ భాగాలు గల సమాఖ్య ప్రభుత్వానికి, ఏకకేంద్ర స్వరూప ప్రభుత్వం నుంచీ వైదొలగుతూ వెళ్లినప్పుడు ఆ సమస్యలోకి కొత్త నిబంధనలు చేరుతాయనుకుంటాను.

**డా॥ అంబేద్కర్ :** ఈ విషయాన్ని కొనసాగించదలచుకోలేదు. ఈ విషయాలింతవరకూ పూర్తి ప్రాంతీయ విషయాలుగాకుండా ఎక్కువ ప్రాముఖ్యత వహించాయన్న యదార్థాన్ని మాత్రం మీ దృష్టికి తీసుకు రాదలచుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** ఏదియేమయినా, అందులోని చాలా విషయాలు బాగా కేంద్రీకరించబడిన ప్రభుత్వం క్రిందనయినా ప్రాంతీయమైనవేనని చెప్పడం సబబని నేను అనుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** అవును. కేంద్రపు అధీనతలో ఉన్నప్పుడు?

**సర్ శామ్యూల్ హోర్ :** అక్కడ కూడా నా సమాధానంపైన డా॥ అంబేద్కర్ చేసిన వ్యాఖ్యానం పూర్తి విషయాన్నంతా స్పర్శిస్తోందని అనుకోను. రాజ్యభాగాలలోని బదిలీ అయిన భాగాలు దానిలో చేరవు.

**డా॥ అంబేద్కర్ :** కాదు. అది అంతే! తరువాత 125వ ప్రస్తావన వైపునకు, భారత ప్రభుత్వంలోని 45వ సెక్షను వైపు తమ దృష్టిని మరల్చగోరుతున్నాను. భారత ప్రభుత్వ చట్టంలోని 45వ సెక్షనును విధేయతా నియమం అంటారు. ప్రభుత్వానికీ, దాని రాజ్య భాగానికీ సంబంధించిన అంశాల్లో

రాజ్యభాగాల ప్రభుత్వం అధీనంలోగానీ, పర్యవేక్షణలోగానీ ఉంటోందని ఆ క్లాజ్ చెబుతుంది. కావల్సిన సమాచారాన్ని అందించడంకోసం, - సమాచారాన్ని అందించవలసి ఉండటంచేత, జాగ్రత్తగా, సక్రమంగా భారత ప్రభుత్వానికి తన కార్యకలాపాల్ని తెలుపుతుంది. నేనిప్పుడు రాజ్య కార్యదర్శిగారూ, యీ 4వ సెక్షనులోని ప్రస్తావనలు, అవసరాల్లోంచీ మీరు ఏమి తీసివేయదలచుకున్నారని అడగదలచుకున్నాను. మీరు పర్యవేక్షణ కావాలనడం లేదని నేను తెలుసుకున్నాను. రాజ్య భాగాలు స్వతంత్రాలు అయినప్పుడు అలాగే జరుగుతుంది. ఉమ్మడివి కాని విషయాల్లో మాత్రం మీరు నిర్దేశకత్వాన్ని మీవద్దే ఉంచుకోవాలనుకుంటున్నారు.

**సర్ శామ్యూల్ హోర్ :** అవును.

**డా॥ అంబేద్కర్:** అంతేగాకుండా అదుపు ఉండదుగదా? నేనిప్పుడో ప్రశ్న అడగదలచు కుంటున్నాను. అదేమిటంటే- ప్రాంతీయ కార్య నిర్వహణలో యేం జరుగుతుందో కేంద్ర ప్రభుత్వానికి తెలియ జేయాలని మీరు వాంఛిస్తున్నారా? ఏం జరుగుతోందో తెలుసుకోవడం కోసం ప్రాంతీయ భాగాల కార్య నిర్వహణ విషయాల్లో సమాచారం సేకరించుకోగల అధికారం కేంద్రానికుండాలని మీరు అభిలషిస్తున్నారా?

**సర్ శామ్యూల్ హోర్:** లేదు. అలాంటి ఉద్దేశం మాకు లేదు. సమాఖ్య ప్రభుత్వాన్ని మీరు ఏర్పరచినంతనే మీకు నిర్ణీతమైన అధికార విభజన- సమాఖ్యకూ దాని భాగాలకు మధ్య జరుగుతుందనీ మేము భావిస్తున్నాం. చాలా విషయాల్లో యీ విభజనను యెంత స్పష్టంగా ఉంచుతారో, అంత తక్కువగా బాధ్యతల దురుపయోగం జరుగుతుంది. అప్పుడు రెండురకాల ప్రభుత్వాల మధ్య విభేదాలు తక్కువగా ఉంటాయి. మన ప్రణాళికనుబట్టి- యీ చెప్పబోయేది దాని ముఖ్య ఉద్దేశం కూడా- సమాఖ్య, ప్రాంతీయ భాగాలు, రాజ్య పార్లమెంటుల మధ్య యీ పనులనిప్పుడు మనం విభజిస్తున్నాం.

**ఎన్.ఎమ్. జోషీగారు :** నేనో ఉప ప్రశ్నను అడగనా? డా॥ అంబేద్కర్ లేవనెత్తిన సమాచారాన్ని గురించి నేనో విషయం అడగదలచుకుంటున్నాను. కొన్ని విషయాల్లో, అఖిలభారత గణాంక సంకలనం చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఉదాహరణకు విద్యావిషయకంగా అఖిల భారత గణాంక సమాచారం విద్య బదిలీ చేయబడిన విషయమే అయినా, యిప్పుడు భారత ప్రభుత్వం ఒక అఖిలభారత నివేదిక యిస్తుంది. బదిలీ అయిన విషయాల్లో సమాచారాన్ని సేకరించుకోడానికీ, అఖిల భారత నివేదిక తయారు చేయడం కోసం ధనాన్ని వెచ్చించడానికీ భారత ప్రభుత్వానికి భావి భారత ప్రభుత్వానికి అధికారం ఉంటుందా?

**సర్ శామ్యూల్ హోర్ :** నిర్ణయించబడిన సమాఖ్య పరిధిలో మాత్రం; సమాఖ్య పరిధికి వెలుపలి విషయాల్లో పరస్పరాంగీకారాన్ని బట్టి చేయాలి.

**ఎన్.ఎమ్. జోషీ :** విద్య సమాఖ్య పరిధిలో ఉండదా?

**లార్డ్ యూస్టాస్‌పెర్సీ :** రాజ్య కార్యదర్శిగారూ! ఏ సమాఖ్యలో అయినా ఉదాహరణకు అమెరికా-సమాఖ్య ప్రభుత్వపు పరిశోధక గణాంక విభాగాలు సమాఖ్య పరిధిని బాగా అతిక్రమించే ఉంటాయి.

**ఎమ్.ఎన్. జోషీ :** ఉదాహరణకు అమెరికాలో, వాళ్ళు మొత్తం అమెరికా సంయుక్త రాష్ట్రాలకంతా ఒక విద్యానివేదిక ప్రకటిస్తారు.

**సర్ శామ్యూల్ హోర్ :** అవును. అనుబంధం ఆర్టులోని 1వ జాబితాను లార్డ్ యూస్టాస్ గమనిస్తే, దానిలో జనాభా లెక్క మొదలైనవి సమాఖ్య పరిధిలోకి చేర్చాలన్న ఆయన అభిప్రాయాన్ని అమలులో వుంచడం చూడగలరు. అక్కడ మనం సాధారణంగా అఖిల భారత గణాంక సమాచారాన్ని పరిశీలిస్తున్నాం- సమాఖ్య అవసరం కోసం గణాంక సమాచారం అన్నమాట.

**లార్డ్ యూస్టాస్ పెర్సీ :** అలా ఎందుకు పరిమితినుంచాల్సి వచ్చిందో నాకర్థం గాలేదు. సమాఖ్య ప్రభుత్వమెందుకు సమాచారాన్ని ప్రకటించకపోవడానికి కారణమేమీ లేదు. దాని సమాచారం కేవలం సమాఖ్య పరిధిలోనే ఉండడమెందుకు? నేను విన్నంతవరకూ ఇలా యే సమాఖ్యలోనూ లేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** కానీ, సమాఖ్య అవసరాలకోసం సమాఖ్య ప్రభుత్వం మాత్రమే పని చేస్తుంది. సమాఖ్య పరిధిని దాటి కలగజేసుకునే అధికారం సమాఖ్య ప్రభుత్వానికుండదు.

**లార్డ్ యూస్టాస్ పెర్సీ :** రాజ్య భాగాల ప్రభుత్వాలు సమాచారాన్ని అందించకపోతే, భారత నైతిక, మేథశ్శక్తుల పెంపుదలలను గురించి నివేదికలను అది ప్రకటించజాలదని నేనొప్పుకుంటున్నాను. కానీ అలా జరుగుతుందని ఎదురు చూడనవసరంలేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** లార్డ్ యూస్టాస్‌కూ నాకూ మధ్య అభిప్రాయభేదమేదీ ఉందని నేననుకోవడంలేదు. ఇలాంటి క్రియని హేతుబద్ధమైన అవధిలో ఉంచడమేనా మాటల ఉద్దేశం. సమాఖ్య ప్రభుత్వాలకి అవసరంలేని అన్నిరకాల సమాచారాల కోసం రాజ్య భాగాల ప్రభుత్వాల్ని సమాఖ్య ప్రభుత్వం వేధించితే, అప్పుడు ఆ రెండింటి మధ్యా విభేదాల్ని మనం వూహించవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** నాకు జ్ఞాపకమొస్తున్న ఉదాహరణనివ్వనా మీకు. ఉదాహరణకు, ఒక ప్రత్యేక ప్రాంతీయ భాగంలో ఒక విదేశీయుడిపైన నేరపూరితమైన చర్య జరిగిందనుకోండి. రాజ్యభాగంలో విదేశీయుడిపైన జరిగిన అనుచిత చర్యను గురించి అతడి ప్రభుత్వం భారత ప్రభుత్వానికి ఫిర్యాదు చేసిందనుకోండి; ఆ విషయంపై చర్య తీసుకోవడానికి భారత ప్రభుత్వానికి సమాచారమవసరమైనదనుకోండి. ఆ విషయంపై ప్రాంతీయ భాగపు ప్రభుత్వాన్ని సమాచార మందివ్వమని అడిగే పరిస్థితిలో భారత ప్రభుత్వముంటుందా?

**సర్ శామ్యూల్ హోర్ :** ఉంటుంది. చర్య తీసుకోగలదు కూడా. అది విదేశీ వ్యవహారాల విభాగంలోకి వస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** న్యాయం చట్టాలు బదిలీ విషయమని మీకు తెలుపుతున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్:** కావచ్చు. కానీ విదేశీ విషయాలకు ప్రత్యేక రిజర్వేషను ఉంటుంది. మీరిప్పుడు చర్చించుతున్న 125వ క్లాజు దాన్ని పరిశీలిస్తుంది. విదేశీ వ్యవహారాలు సమాఖ్య విషయం. 125వ క్లాజులోని రెండవ పేరాగ్రాఫుననుసరించి ప్రాంతీయ భాగపు ప్రభుత్వానికి సమాఖ్య ప్రభుత్వం సూచనలివ్వవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** దాని అవసరంకోసం కేంద్ర ప్రభుత్వం సమాచారాన్ని పొందడం యొక్క అవసరాన్ని మీరు గుర్తించారనుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** ఖచ్చితంగా. ఆ అవసరాన్ని నేనొప్పుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** 125వ ప్రస్తావనలో సమాచారాన్ని నేను చూడలేకపోయినందుకే మీ దృష్టిని అటువైపుకు మళ్లించదలచుకున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అది ప్రాంతీయ భాగపు ప్రభుత్వాల నుంచీ కావలసిన సమాచారాన్ని సేకరించుకోవడాన్ని ముందుగానే ఆలోచిస్తుందనుకుంటున్నాడు. ఎలాగైనా అది అలాగే ఆశించబడ్డది.

**డా॥ అంబేద్కర్:** ఇప్పుడు, 114వ ప్రస్తావనకు సంబంధించి, ఆర్థిక భారాన్ని విధించేటట్టుగా సమ్మతి అధికారాన్ని విధించరాదనే షరతు కూడా దానితో కలపబడింది. కానీ నేనో సంగతి తెలుసుకో దలచుకున్నాను. అదేమిటంటే- ఒక ప్రస్తావన ఆర్థికభారాన్ని విధిస్తుందనే వివాదముంటే, ఆ యిద్దరిలో ఒకరు అలా జరగడంలేదంటే, వేరొకరు జరుగుతోందంటే, ఆ సమస్యను తీర్మానించవలసిన అవసరం లేదా? పెద్దగా, ప్రాముఖ్యంగా, ఉదాహరణకు, కొత్త ప్రాంతీయ భాగాలపైన కేంద్ర ప్రభుత్వం కొత్త విధులు కొనసాగించాలని తీర్మానిస్తే, అలాంటి విషయం ఆర్థికభారాన్ని విధిస్తుందన్న అభిప్రాయానికి యెవరైనా రావచ్చు. కానీ వివాదాలకు దారితీసే విషయాలు తీరరేఖ వద్ద ఉంటాయి.

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇప్పుడున్న ప్రస్తావనలబట్టి, సమాఖ్య కోర్టుకే మళ్లింపు జరుగుతుంది. అయినా అది అంత పరిపూర్ణమైన విధానం కాకపోవచ్చు. నేనప్పుడు చెప్పినట్టుగా, సమాఖ్య కోర్టులో తీర్మానాలకు సాధ్యం కాకపోయే కేసులకు ఒకరకమైన నిర్హేతుక విధానాన్ని అమలు జరపదలచుకున్నాము.

**ఎమ్.ఆర్. జయకర్ :** అది యిప్పుడు 155 (1)వ పేరాగ్రాఫులో కొస్తుంది.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. సమాఖ్య కోర్టులోకొస్తుంది.

**డా॥ అంబేద్కర్ :** రాజ్య కార్యదర్శిగారూ, నేను మరో ప్రశ్నను మాత్రం అడగదలచుకున్నాను. ఎందుకంటే నాకో సందేహం వుంది. ఈ కార్య నిర్వహణ సంబంధాలకు సంబంధించి, మొట్టమొదట, కేంద్ర ప్రభుత్వం ప్రాంతీయ భాగాల ప్రభుత్వాలను తన ప్రతినిధులుగా నియమించి తీరాలా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును. పరస్పర సమ్మతి పరిధిలోనివి అయితే.

**డా॥ అంబేద్కర్ :** తప్పనిసరా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** అది తన ప్రతినిధులను నియమించుకోజాలదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఉమ్మడి విషయాలు రాజ్యభాగాల అధీనంలో ఉండాలని మనం భావించాం.

**డా॥ అంబేద్కర్ :** తన సూచనలు యివ్వవచ్చునా, యివ్వరాదా అన్న ప్రశ్నకు లోబడి– అది వేరే విషయం గదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఆ తర్వాత రాజ్యభాగాల ప్రభుత్వాలను ఆహ్వానిస్తే, అవి ప్రాతినిధ్యపు పనులను తప్పకుండా చెయ్యాలన్న నిబద్ధత ఉన్నదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఉంటుంది. అది సమాఖ్య న్యాయంలో ఉంటుంది.

**డా॥ అంబేద్కర్ :** తమకు కేటాయించిన కొన్ని సీట్లద్వారా వెనుకబడిన తరగతులవారు కమ్యూనల్ అవార్డులోకి చేర్చబడ్డారు కూడా. అది వాళ్లని 'అల్పసంఖ్యాకులు' నిర్వచనంలోకి తేదా? నా అభిప్రాయం ఏమిటంటే, మీరిప్పుడు అన్నట్టుగా, కమ్యూనల్ అవార్డులోకి చేర్చబడిన, లేక పరిశీలించబడినవాళ్లే అల్ప సంఖ్యాకులు. వెనకబడ్డ తరగతులవాళ్లు కమ్యూనల్ అవార్డులోకి చేర్చబడ్డారని నేను భావించాలా?

**సర్ శామ్యూల్ హెూర్ :** ఈ చర్య తర్వాత మినహాయించే భాగాల వెలుపల చిందరవందరగా వున్న చిన్న చిన్న సంఘాలకు సంబంధించిన క్లిష్టమైన ప్రశ్నను మరోసారి పరిశీలించడం బావుంటుందని నేననుకుంటున్నాను. పైగా యీ సంఘ సభ్యులు, ప్రతినిధులు కూడా సాధారణ కోరికల గురించే ఆలోచిస్తారు.

**॥ అంబేద్కర్ :** నేరస్థ తెగలకున్న ప్రత్యేక పరిస్థితిని మీ దృష్టికి తేదలచుకుంటున్నాను. రాజ్య ర్యదర్శిగారూ! జనాభాలో నేరస్థ తెగలు అక్కడక్కడా చెల్లాచెదురుగా ఉన్నారు. బొంబాయి నుభవం దృష్ట్యా నేనిప్పుడు మాట్లాడుతున్నాను. ఇతర రాజ్య భాగాల్లో కూడా యిలాగే ఉంటుందని నేను భావిస్తున్నాను. ఈ తెగల్ని కాపాడ్డం కోసం– అవి జనాభాలో నేనిప్పుడే చెప్పినట్టుగా చెల్లాచెదురుగా ఉన్నాయి– నేరస్థ తెగల చట్టం అనే భారత ప్రభుత్వ చట్టం ఒకటుంది. వాళ్లని కాపాడ్డం కోసం ఓ సలహా యివ్వడం కోసం నేనో ఉదాహరణ యిస్తున్నాను. వీళ్ల క్షేమంకోసం, జీవన సరళిని నియంత్రించడంకోసం గవర్నరుకు యీ చట్టం కొంత అధికారాన్ని యిస్తుంది. వాళ్లు చెల్లాచెదురుగా ఉన్నప్పటికీ, 108వ పేరా కింద వాళ్ల జీవనసరళిని క్రమబద్ధం చేయడం కోసం, కాపాడ్డం కోసం అలాంటి నియంత్రీకరణ జారీ చేయడం గవర్నరుకు సాధ్యమవుతుందా?

**సర్ శామ్యూల్ హెూర్ :** మినహాయించిన మరియూ కొంతవరకూ మినహాయించిన నాపంతాల్లో- యీ నియంత్రీకరణ క్రింద- సాధ్యపడుతుంది.

**డా॥ అంబేద్కర్ :** నేను మీకు చెప్పదలచుకున్నదేమిటంటే- ఆటవిక ప్రాంతపు లేక ఆదిమ వాసి తెగలకు చెందిన వ్యక్తి అని యెవరినంటారో నిర్వచనం తెలిసిన తర్వాత, అతడు మినహాయించిన నాపంతం వాడయినా, నేరస్థ తరగతులవారి లాగా జనాభాలోనే నివసిస్తున్నా, 108వ పేరాగ్రాపు క్రింద గవర్నరుకు అతడిపై న ప్రభావాన్ని చూపేలా యేదయినా శాసనం చేయడానికి వీలుండదా? ఎక్కడ జీవిస్తున్నా, నేరస్థులై న తరగతులపై చేయబడ్డ శాసనం ఆ తరగతి తెగల వాళ్లనందరినీ ప్రభావితం చేస్తుంది గదా?

**సర్ మాల్‌కోలాం హైలీ :** నేరస్థ తెగల చట్టమిప్పుడు భారత ప్రభుత్వ చట్టంగాదు. అది ప్రాంతీయ భాగపు శాసనాల విషయమై పోయింది. ప్రాంతీయ ప్రభుత్వాల చేత నిర్ణయింపబడినట్లుగా నేరస్థ తెగల నిర్వచనంలోకి వచ్చే వ్యక్తులను వేర్వేరు రకాలుగా గుర్తించడానికి, అదుపులో వుంచడానికి- నేరస్థుల తెగ చట్టం ప్రాంతీయ ప్రభుత్వాలకు- ప్రత్యేకంగా గవర్నరుకు అని కాదు- అధికారాన్ని యిస్తుంది. కాబట్టి ఆ పోలికని వెనకబడ్డ తరగతులవారికి, ఆదిమవాసులకు ప్రత్యేక రక్షణ కల్పించ డానికై అనువర్తింపజేయడం చాలా కష్టం. ఏది ఏమైనా, ఆ విషయాల్లో ప్రాంతీయ శాసనసభలు తమంతట తామే చొరవ తీసుకొనవచ్చు. ప్రాంతీయ ప్రభుత్వానికి వేరుగా గవర్నరుకు ఇది ప్రత్యేక శక్తిని కల్పించదనడమే నా మాటల సారాంశం.

**డా॥ అంబేద్కర్ :** 108వ పేరాగ్రాపు క్రింద- ఉదాహరణకు- ఆదిమవాసులుగా, వెనకబడ్డ తరగతులవారిగా గవర్నరు ప్రకటన ద్వారా విభజించవచ్చు. వారెక్కడ జీవిస్తున్నా, తర్వాత వాళ్లని ప్రభావితం చేసేలా గవర్నరు శాసనాలు చెయ్యవచ్చు.

**సర్ శామ్యూల్ హెూర్ :** 108వ పేరా కింద అతడలా చేయగలడని నేననుకోను. 108వ పేరాగ్రాపు క్రింద షెడ్యూల్డ్ పరిధిలో జీవించే ప్రజలతో మాత్రం అతడు వ్యవహరించవచ్చు.

★ ★ ★

**డా॥ అంబేద్కర్ :** ఈ సమస్య యొక్క ఆర్థిక విషయాలకు సంబంధించిన ఒకటి రెండు ప్రశ్నలు మిమ్మల్ని అడగదలచుకున్నాను. మొదట అసంపూర్ణంగా మినహాయించిన ప్రాంతాలని అంటున్న ప్రాంతాలకు ఆర్థిక సహాయం చెయ్యడం గురించి అడగదలచుకున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అడగండి.

**డా॥ అంబేద్కర్ :** ఒక సామాన్య బడ్జెట్టు- అంటే ప్రాంతీయ బడ్జెట్టు ఉంటుందని నేనను కుంటున్నాను- అందులో అసంపూర్ణంగా మినహాయించబడ్డ ప్రాంతాలకు కేటాయించిన సొమ్మును

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబర్ 17, పుట 1218.

కూడా చేరుస్తారు గదా?

***డా॥ అంబేద్కర్ :*** అలాంటప్పుడు, మొత్తం బడ్జెట్టు గురించి చర్చ చేయడానికి శాసనసభలకు అవకాశం ఉంటుందిగదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** 109 పేరా క్రింద, ఉంటుంది.

***డా॥ అంబేద్కర్ :*** నేనా విషయంలోకే వస్తున్నాను. 70వ పేరా కింద ఎప్పుడు గవర్నరు తన ప్రత్యేక బాధ్యతల్ని వహిస్తాడో అప్పుడు అవి శాసనసభల పరిధిలోంచీ బయటకెళతాయి. అంతేగదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** అవును. 109వ పేరాగ్రాపు కూడా.

***డా॥ అంబేద్కర్ :*** కానీ సాధారణంగా అవి ప్రాంతీయ బడ్జెట్‌లో భాగాలే గదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** మొత్తం మినహాయించబడ్డ ప్రాంతాల గురించి కూడా నేను అలాంటి ప్రశ్నే అడగదలచుకున్నాను. 70 (ఎఫ్) పేరాగ్రాపు క్రింద గవర్నరుకున్న ప్రత్యేక బాధ్యతలోకి అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాలు మాత్రమే వస్తాయి గదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** అంటే సంపూర్ణ మినహాయింపు ప్రాంతాల కార్య నిర్వహణ కోసం గవర్నరు ప్రాంతీయ భాగాల నిధి నుంచీ తీసుకోలేడనే అర్థం గదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** అంబేద్కర్‌గారి చురుకైన మెదడు శ్వేతపత్రంలోని లోపాన్ని కనిపెట్టింది. అది నిజమే!

***డా॥ అంబేద్కర్ :*** అతను వాటిలోంచీ తీసుకోలేడా?

***సర్ శామ్యూల్ హోర్ :*** నిర్ణయించబడ్డ దానిని బట్టి ప్రాంతీయ భాగాల నిధిలోంచీ అతను తీసుకొనలేడు. చివరి ప్రతిలో ఈ పొరబాటును సరిదిద్దాలని మనమనుకుంటున్నాం.

***డా॥ అంబేద్కర్ :*** ఈ సమయంలో 49వ పేరాగ్రాపును కూడా మీ దృష్టికి తీసుకురాదలచుకున్నాను. 5వ సబ్ క్లాజ్ మిహాయించిన ప్రాంతాల ఖర్చులనేవి గవర్నరు జనరల్ ప్రత్యేక బాధ్యతలని చెప్తోంది కదా?

***సర్ శామ్యూల్ హోర్ :*** అవును.

***డా॥ అంబేద్కర్ :*** గవర్నరు జనరల్ యొక్క ప్రతినిధి అయిన గవర్నరు సంపూర్ణ మినహాయింపు ప్రాంతాల పరిపాలనలో గవర్నరు జనరల్ ప్రత్యేక బాధ్యతల ద్వారా జారీ చేసిన సొమ్ము పైన ఆధారపడి ఉంటాడని నేను అర్థం చేసుకొనవచ్చునా?

**సర్ శామ్యూల్ హెూర్ :** కాదు. గవర్నరు తనంతటతానే ప్రాంతీయ భాగాల నుంచీ సొమ్మును అడుగుతాడు.

**డా॥ అంబేద్కర్ :** సంపూర్ణ మినహాయింపు ప్రాంతాల పరిపాలన కోసం గవర్నరు ప్రాంతీయ భాగాల నిధుల నుంచీ తీసుకొనగలిగేటట్లు గవర్నరు ప్రత్యేక బాధ్యతల ప్రస్తావనను సవరించాలని మీరు భావిస్తున్నారా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**ఎమ్. ఆర్. జయకర్ :** "గవర్నరు లెక్కించబడిన రాబడుల వివరణకు పూనుకుంటాడు" అనే 96వ పేరాగ్రాపుయొక్క (బి) ఉప పేరాగ్రాపు క్రిందికి యిది వస్తుందా? తన 'ప్రత్యేక బాధ్యతలు' నిర్వహణ కోసం గవర్నరు అవసరమని అనుకుంటున్న అదనపు ప్రస్తావనలను అలాంటివేమైనా ఉంటే– అవి ఓటు చేయదగిన లేక ఓటు చేయదగని వర్గంలో ఉండినప్పటికీ అతనికి నిర్దేశించి చెప్పడానికి కావాల్సిన అధికారాన్ని యిచ్చారు. ప్రత్యేక బాధ్యతలు అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాలలో పెట్టే ఖర్చులోకే వస్తాయి.

**డా॥ అంబేద్కర్ :** నేను సంపూర్ణ మినహాయింపు ప్రాంతాల గురించి మాట్లాడుతున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** డా॥ అంబేద్కర్ లేవదీసిన విషయం సంపూర్ణ మినహాయింపు ప్రాంతాలకు సంబంధించినది. రాయడంలో జరిగిన తప్పువల్ల – అంతకంటే మరేమీ యెక్కువగాదు– అది ప్రాంతీయ భాగపు. గవర్నరు అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాల కోసం ప్రాంతీయ భాగాల నిధులనుంచే తీసుకొనగలిగినప్పుడు, సంపూర్ణ మినహాయింపు ప్రాంతాల కోసం ప్రాంతీయ భాగాల నిధుల నుంచీ తీసుకోలేడు. అది రాయడంలో జరిగిన పొరబాటు.

★ ★ ★

*డా॥ అంబేద్కర్ :** జోషీగారు అడిగిన ప్రశ్నల్లోంచీ ఉద్భవించే ప్రశ్న నొకదాన్ని అడుగుతాను. నేను చూసిన యిబ్బందివైపు రాజ్య కార్యదర్శిగారి దృష్టిని మళ్లించాలని అనుకుంటున్నాను. 109: పేరాగ్రాపు కింద, మినహాయింపు ప్రాంతాలకూ, అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాలకూ గల తేడాని అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాలలో చర్చలకు ఆస్కారం ఉండడం లేక గవర్నరుకు అనుమతిని నిరాకరించడం అన్న విషయంపూనా, మినహాయింపు ప్రాంతాలలో గవర్నరుకు చర్చలకు అనుమతినిచ్చే శక్తి లేకపోవడం అన్న విషయంపైనా ఆధారపడి ఉంటుంది. నా సమస్య యేమిటంటే– మేజర్ అట్లీకి సమాధానంగా, రాజ్య కార్యదర్శిగారూ, మీరు మినహాయింపు ప్రాంతాలలోంచీ వచ్చే లోటుని పూడ్చడంకోసం అస్సాంకు యివ్వవలసిన సొమ్ములో ప్రత్యేకించే సొమ్మేమీ ఉండదనీ, అస్సాం ప్రభుత్వ భాగం యొక్క సాధారణ రాబడిలో భాగంగానే ఉంటుందనీ

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్ సంపుటి 2–బి, 1933 అక్టోబర్ 18, పేజీలు 1223–26 మధ్య.

నిన్న మీరు చెప్పారు. మీరిలా అన్నారని నేననడం సబబేగదా?

**సర్ శామ్యూల్ హోర్ :** అది ప్రత్యేక గ్రాంటా లేక సాధారణ గ్రాంటులో కలపబడుతుందా– అన్న విషయంపై న నేనేమీ చివరి నిర్ణయం తీసుకోలేదు.

**డా॥ అంబేద్కర్ :** అది కేటాయించబడిన సొమ్ము అని మీరు అనుకోవడం లేదని మీరు అన్నట్లు నాకనిపించింది.

**సర్ శామ్యూల్ హోర్ :** లేదు. నేను చెప్పినదేమిటంటే, లేక నేను చెప్పదలచుకున్నదేమిటంటే, మనం చర్చిస్తున్న విషయాల్లో, యిది సాధారణ నిధిలో భాగంగానే ఉంటుందని భావించాం. దాన్ని ఎలా సాధించాలన్న విషయంలో నేను మంచిదేనిపించిన యే నిర్ణయాన్నైనా ఒప్పుకోవాలనే అనుకున్నాను.

**డా॥ అంబేద్కర్ :** మంచిది. ఆ విషయాన్ని గురించే మరోలా చూస్తాను. నేను మిమ్మల్ని అడిగిన ప్రశ్నకు సమాధానంగా మినహాయింపు ప్రాంతాలకు ఆర్థిక వనరుల కేటాయింపునకు సంబంధించి నంతవరకూ, శ్వేతపత్రంలో సరిదిద్దుతానని చెప్పారు. మినహాయింపు ప్రాంతాల క్రింద అతడు చేయవలసి వచ్చే ఖర్చు కోసం ప్రాంతీయ భాగపు గవర్నరుకు సాధారణ నిధి నుంచీ తీసుకోడానికి అనుమతి దొరుకుతుందని కూడా మీరు అన్నారు. అవునా?

**సర్ శామ్యూల్ హోర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** నేననుకుంటున్న యిబ్బంది యేమిటంటే– మినహాయింపు ప్రాంతాలలో పరిపాలనను కొనసాగించడం కోసం గవర్నరుకు ప్రాంతీయ భాగాల నిధి నుంచీ సొమ్ము తీసుకునే అధికారం ఉన్నట్టయితే, ధనాన్ని సమకూర్చే మినహాయింపు ప్రాంతాల వ్యవహారాలపై శాసనసభలకు చర్చించే అధికారం ఉండదు అనే 109వ పేరాగ్రాపునకు అది అనుగుణంగా ఉంటుందా?

**సర్ శామ్యూల్ హోర్ :** డా॥ అంబేద్కర్ చాలా క్లిష్టమైన విషయాన్ని లేవనెత్తారని అనుకుంటున్నాను. ఇది చాలా పెద్ద మొత్తాలకు సంబంధించిన విషయంగాదు. ఆ మాటకొస్తే అస్సాం యొక్క సంపూర్ణ మినహాయింపు ప్రాంతాలపై వెచ్చించే ఖర్చులో ఎక్కువ భాగం సమాఖ్య నిధుల నుంచే వస్తోంది. కానీ ఆ సొమ్ముతో బాటూ మరికొంత సొమ్ము కూడా కావలసి వుంటుందని మాత్రం అనుకోవచ్చు.

**డా॥ అంబేద్కర్ :** నిన్న మీరు చెప్పినట్టుగా, గవర్నరు కొంత అదనపు మొత్తాన్ని తన అదనపు బాధ్యత క్రింద ధ్రువీకరించపోతే– ధ్రువీకరించినప్పుడు మొత్తం బడ్జెట్టునూ చర్చల కోసం శాసనసభలలో వుంచుతారు– అసంపూర్ణ మినహాయింపు ప్రాంతాలున్న యీ ప్రాంతాలలోనంతా ఒకే సామాన్య బడ్జెట్టు వుంటుంది. ఈ ఇబ్బంది నుంచీ యెలా బయటపడతాడో నాకు తెలియడంలేదు.

**సర్ శామ్యూల్ హోర్ :** ఒక ఒప్పందం ద్వారా అలాంటి కార్యకలాపాల వల్ల కలిగే ఉపయోగాల్ని మేము గమనించాం. తరచుగా చర్చల్ని జరపడాన్ని మాత్రం మేము అడ్డుకోవాలని నిర్ణయించాం.

**డా॥ అంబేద్కర్ :** చర్చలని వదలిపెట్టడమూ, అవసరమనిపించినప్పుడు అనుమతించడానికీ, వ్యతిరేకించడానికీ గవర్నరుకు అధికారాన్ని యివ్వడం- ఈ రెండు విధానాలకూ ఒక రకమైన అవకాశాన్ని యిచ్చినప్పుడు మన ఉద్దేశం ఫలవంతం అవుతుందని అనుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** పూర్తిగా మినహాయించిన ప్రాంతాల విషయంలో చర్చలని వదలిపెట్టడం వల్ల చాలా లాభం వుంటుందని యీ మార్గంలో పని చేయిస్తున్న వాళ్లు మనపైన బలమైన ఒత్తిడిని తెచ్చారు. కానీ అస్సాంలో రాజ్య భాగాల నిధుల నుంచీ ఖర్చు పెట్టటంలోని ఇబ్బందిని నేనెల్లప్పుడూ గమనిస్తూనే ఉన్నాను. ఒడంబడికను పునరుద్ధరించినప్పుడు కొద్ది సంవత్సరాల కాలానికి ఒక కంట్రాక్టు బడ్జెట్టు ఉందని అనుకున్నప్పుడు కమిటీ మరియూ దాని ప్రతినిధులూ చర్చ వుండవచ్చునన్న విషయాన్ని పరిశీలించగలరని నేననుకుంటున్నాను. కానీ అది కూడా (కమిటీకి మొత్తం స్థితినంతా తెలపడంకోసం నేను చెబుతున్నాను) చాలామంది నిపుణుల అభిప్రాయాలకు వ్యతిరేకంగానే వుంది.

**డా॥ అంబేద్కర్ :** గవర్నరుకి తీర్మానాలను, చర్చలనూ అనుమతించే అధికారాన్ని యివ్వడం ద్వారా నిపుణుల ఉద్దేశమూ, మీ మనసులోని ఉద్దేశమూ సరిపడతాయని నేననుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇలాంటి చర్చలకు తరచుగా గవర్నరు అడ్డు పడడాన్నే మేము తొలగించదలచుకున్నాము. ఇది అతడినొక ఇబ్బందికరమైన స్థితిలోకి తోసివేస్తుంది. అంతేగాక పూర్తి మినహాయింపు ప్రాంతాల విషయంలో చర్చలు వుండాలని మేము అనుకోలేదు. ఈ ప్రాంతాలకు హానికరంగా ఉంటాయని మేము అనుకుంటున్న చర్చలకు అనుమతించే చర్యల్ని మేము చేయదలచుకోవడంలేదు.

**డా॥ అంబేద్కర్ :** గవర్నరుకున్న శక్తి దాన్ని అడ్డుకుని కాపాడగలుగుతుందని మాత్రం నేను సలహాయివ్వ దలచుకున్నాను. నేనడగదలచుకున్నదంతా అంతే!

★ ★ ★

•**డా॥ అంబేద్కర్ :** అదే విషయంపై నేనో ప్రశ్న అడగనా? నేనర్థం చేసుకున్న విధంగా, ఉమ్మడి విభాగంలో హైకోర్టు నిర్ణయాల నుంచీ ప్రీవీకౌన్సిలుకు ఒక విన్నపం వుంటుంది కదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** ఉమ్మడి విభాగంలోని ఉమ్మడి న్యాయానికున్న వ్యాఖ్యానంలోంచీ ఉద్భవించే వివాదాస్పద విషయంలో ప్రీవీ కౌన్సిలుకు విన్నపమున్నప్పుడు, ఫెడరల్ కోర్టుకు అలాంటి విన్నపాన్ని అనుమతివ్వడానికి ఎటువంటి యిబ్బంది ఉంటుంది? ఈ విషయం నాకర్థం గావడంలేదు.

---

• మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబర్ 19, పుట 1247.

**సర్ శామ్యూల్ హోర్ :** ఫెడరల్ కోర్టుకు పెద్ద మొత్తంలో వున్న పనిని వరద వెల్లువలా పంపడం, మొదటే చాలామంది న్యాయమూర్తులను నియమించవలసి రావడమూ మాకిష్టంలేకపోవడమన్నది ఇందుకున్న కారణాలలో ఒకటి.

★ ★ ★

***డా॥ అంబేద్కర్ :** రాజ్య కార్యదర్శిగారూ! 155వ పేరాగ్రాపుననుసరించి ఒక ప్రశ్నను మాత్రం నేనడగదలచుకుంటున్నాను. ఈ పేరా 155 ఫెడరల్ కోర్టుకున్న మినహాయించబడిన అసలైన న్యాయపరిధిని గురించినది. అక్కడ చేసినట్లుగా కనిపిస్తున్న తేడా నాకర్థం గావడంలేదు. 155వ పేరాగ్రాపును చదివినప్పుడు, ఎక్కువ వివాదానికి చెందిన యిరువర్గాలు (ఎ) మరియూ (బి) అనే సబ్ క్లాజులు పేర్కొనబడతారో, అక్కడ యీ మినహాయించబడ్డ అసలైన న్యాయ పరిపాలనాధికారం ఫెడరల్ కోర్టుకు యివ్వబడుతుందనే విషయాన్ని ఆధారంగా తీసుకుని మీరు ఫెడరల్ కోర్టుకున్న మినహాయించబడ్డ అసలైన న్యాయాధికార విషయంలో తేడాను పేర్కొంటారు. కానీ ఇరువర్గాల వారూ ప్రైవేటు వ్యక్తులైనప్పుడు ఫెడరల్ కోర్టుకు మినహాయించబడ్డ అసలైన న్యాయాధికారం ఉండదు. ఇప్పుడు నేనడగదలచుకున్న ప్రశ్న ఇది: రెండు విషయాల్లోని (లేక మార్గాలలోని సమస్య ఒకటే– అది యేమిటంటే, రాజ్యాంగచట్ట వ్యాఖ్యానాన్ని భాగంగా చేసుకునే రాజ్యాంగ సమస్య. నేను అర్థం చేసుకోలేకపోతున్న విషయం ఇది : సమస్య ఒకటే అయినప్పుడు, ఫెడరల్ కోర్టుకున్న మినహాయించబడ్డ అసలైన న్యాయాధికార సంబంధ విషయాల్లో ఇరువర్గాల వారినాధారంగా తేడా లెందుకు?

**సర్ శామ్యూల్ హోర్ :** ఫెడరల్ కోర్టుకు సంబంధించి మామూలుగా ఇలాగే, అసలైన న్యాయాధికారం వివిధ విభాగాల మధ్య న్యాయాధికారంగా ఉంటుంది. అప్పీలు చేసుకున్న న్యాయాధికార పరిధిలో మాత్రం హక్కుల కోసం వ్యక్తులు దీనిలోకి చేరుతారు.

**డా॥ అంబేద్కర్ :** అంటే యిలా జరిగిందనుకోండి– రాజ్యాంగచట్ట వ్యాఖ్యానానికి సంబంధించి, ఎప్పుడు విషయం ఫెడరల్ కోర్టుకు వెంటనే పోతుందో, అప్పుడు పార్టీలు సమాఖ్య భాగాల విభాగాలా లేక వ్యక్తులా అనే తేడా వుండదని నేననుకుంటున్నాను.

**సర్ శామ్యూల్ హోర్ :** ఫెడరల్ కోర్టుకున్న ఒకానొక అవసరమైన పనిచేసే పరిస్థితిగా నేను దీనిని భావించి ఉంటాను. వ్యక్తిగత కేసులలో దీనికి అసలైన న్యాయాధికారం వుంటే, అది కేసుల వెల్లువలో కొట్టుకుపోతుందని నేననుకుంటున్నాను.

**డా॥ అంబేద్కర్ :** కానీ, అప్పుడుకూడా, యీ రెండు విషయాల్లోని సమస్య ఒక్కటే– అదేమిటంటే– రాజ్యాంగ చట్టపు వ్యాఖ్యానం. వివిధ చర్యలకున్న కారణాల ఆధారంగా చేసే తేడాని నేను స్పష్టంగా

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2–బి, 1933 అక్టోబరు 20, పుట 1292.

అర్థం చేసుకోగలను. కానీ యెప్పుడు చర్యలకున్న కారణాలు ఒక్కటిగా వుంటాయో, లేక కోరిక యెప్పుడు ఒక్కటిగా వుంటుందో- అంటే రాజ్యాంగానికెప్పుడు కీడు కలుగుతుందో- అప్పుడు యిలా విభాగాలు, వ్యక్తులు ఆధారంగా తేడాల్ని ఏర్పరచడంలోని న్యాయమేమిటో నాకు కనిపించడంలేదు.

★ ★ ★

*డా॥ అంబేద్కర్ :* రాజ్య కార్యదర్శిగారిని మరో ప్రశ్న అడగదలచుకున్నాను. అదేమిటంటేః దాని కోసం శ్వేతపత్రంలో యెటువంటి అవకాశమూ యివ్వలేదు. ఏదో ఒక ప్రత్యేక సహాయాన్ని కోరకపోయినప్పటికీ, ప్రయివేటు వ్యక్తులకు, ఒక ప్రత్యేక చట్టం రాజ్యాంగానికి విరుద్ధమని చెబుతూ ప్రకటన కోసం కోర్టుకు వెళ్లే అవకాశాన్ని కల్పించడం భావ్యంగా ఉంటుందని మీరనుకోవడంలేదా? మీరు యేర్పాటు చేసిన కేసులన్నింటిలోనూ యేదో ఒక ప్రత్యేక సహాయాన్ని అడగటం జరిగిందని నేననుకుంటున్నాను. తన భవిష్యత్తును కాపాడుకోవడం కోసం, ఫెడరేషన్ చేసిన యే ప్రత్యేక ప్రస్తావన పైన గానీ, రాజ్య భాగం చేసిన ప్రస్తావన పైన గానీ రాజ్యాంగ విరుద్ధమని భావించి అనుమానించినప్పుడు ప్రయివేటు వాళ్లు పరీక్షించడం ఉచితమైనదే! కోర్టుకు అప్పీలు చేసుకుంటున్నప్పుడు, తనకు ప్రత్యేకమైన సహాయం ఏమిటో అడిగే కారణం లేకపోయినప్పటికీ అటువంటి ప్రస్తావనవల్ల అతడు భవిష్యత్తును కాపాడుకోగలుగుతాడు.

*సర్ శామ్యూల్ హోర్ :* నేను న్యాయవాదిని కానందువల్ల, యిలాంటి ప్రశ్నకు సమాధానమివ్వడానికి జంకుతున్నాను. కానీ సామాన్య వ్యక్తిగా సమాధానం చెప్పమంటే, వ్యక్తిని ప్రభావితం చేసేయే ప్రత్యేక సమస్యా లేనప్పుడు, అటువంటి ప్రత్యేక హక్కును అనుమతించడం చాలా దుర్లభమని చెబుతాను.

*రెడింగ్ మార్క్వెస్ :* మీరన్నది ఈ దేశంలో విధించబడుతున్నటువంటి చట్టమని నేను పేర్కొనవచ్చా? క్వియాటిమెట్ అని పిలవబడే యీ దరఖాస్తులను మేము ఒప్పుకోము. అంటే సరిపోయేటంత వివాదం లేనప్పుడు ప్రకటన పొందడం కోసం కేవలం యిబ్బంది కలిగించే విషయం అన్నమాట వివాదం ఉన్న వెంటనే అది తీర్చి వేయబడుతుంది. మేము దీనికెప్పుడూ అనుమతివ్వము. అంత గాదు. భారతదేశంలో సైతం ఇస్తారని నేననుకోను.

*సర్ హరిసింగ్ గౌర్ :* చర్యకున్న కారణము తెలియదు. కోర్టుకు వెళ్లగలిగే హక్కు ఉండదు.

*జఫ్రుల్లా ఖాన్‌గారు :* అలాంటి ప్రస్తావనను రాజ్యాంగంలోకి చేరనిస్తే నిజంగా పెద్ద సమస్యలు ఉత్పన్నమవుతాయి. అలాంటి చట్టం చేయబడిన మరుక్షణం భారతదేశంలో వేలకొద్ది దావాలు ప్రారంభించబడతాయి.

*డా॥ అంబేద్కర్ :* ప్రతి వ్యక్తి తన హక్కును వినియోగించుకుంటాడో లేదో నాకు తెలియదు.

* మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, సంపుటి 2-బి, 1933 అక్టోబర్ 20, పేజీ 1293.

**సర్ శామ్యూల్ హెూర్ :** న్యాయవాద వృత్తికి యిది చెప్పలేనంత విలువైన విషయమై పోతుంది.

★ ★ ★

*°**డా॥ అంబేద్కర్ :** కేవలం ఒక ప్రశ్న మాత్రమే! రాజ్య కార్యదర్శిగారూ, యిది "ప్రత్యేక శక్తులు"లో ఉన్న మినహాయింపునకు సంబంధించినది. నేనర్థం చేసుకున్నంతవరకూ పరిస్థితి ఇది : మామూలుగా మాట్లాడితే, శాసనసభలు తారతమ్య చట్టాన్ని మంజూరు చేయలేవు. నేను చాలా సాధారణంగా మాట్లాడుతున్నాను.

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** తారతమ్యమనేది నిజంగా లేదని గవర్నరును సంతృప్తి పరచకపోతే ప్రభుత్వం పరిపాలనకు సంబంధించి తారతమ్యాన్ని చేయజాలదు.

**సర్ శామ్యూల్ హెూర్ :** చేయలేదు.

**ఎమ్. ఆర్. జయకర్ :** గవర్నరు జనరల్ –

**డా॥ అంబేద్కర్ :** ఈ ప్రస్తావన ఇద్దరినీ పేర్కొంటోంది కాబట్టి గవర్నరు, గవర్నర్ జనరల్ కూడా! సిద్ధాంతపరంగానూ, సామాన్యంగానూ పరిస్థితి అదేగదా?

**సర్ శామ్యూల్ హెూర్ :** అవును.

**డా॥ అంబేద్కర్ :** (సి) అనే సబ్ క్లాజు క్రింద ప్రస్తావన కున్న విధానాలకు అనుగుణంగా వుండే తారతమ్యాన్ని చేస్తూ శాసన ప్రదర్శనకు ఆమోదం తెలిపే అధికారం గవర్నరు-జనరల్‌కుంటుంది. అంటే మీరు గవర్నరుకిచ్చే ఈ అధికారం కేవలం పరిపాలనా ఉపయోగాలకు మాత్రమే కాదనీ, శాసన నిర్వహణ పనులకు కూడా అని నా భావన.

**సర్ శామ్యూల్ హెూర్ :** ఇది శ్వేతపత్రపు 18వ ప్రస్తావన క్రింద వున్న సామాన్య అధికారం.

**డా॥ అంబేద్కర్ :** రెండింటినీ పాలిస్తూ ప్రభుత్వం చేయలేకపోయినా గవర్నరు తారతమ్యాన్ని చేయగలిగేట్టుగా.

**సర్ శామ్యూల్ హెూర్ :** శాంతి, సౌఖ్యాలకు జరిగే హానిని నిలపడం కోసం.

**డా॥ అంబేద్కర్ :** అవును. ఇప్పుడు దీని అర్థమేమిటో నేనడగదలచుకున్నాను. మీరు అనుకుంటోంది యిదేనేమోనని తెలుసుకోవడం కోసం నేను ఒకటి రెండు ఉదాహరణలిస్తాను. ఈ విధానం కింద ఎటువంటి ఉత్పాతాన్నయినా ఆపడంకోసం, గవర్నరు జనరల్‌కు కొందరు వ్యక్తులను సైన్యంలో ఉద్యోగాలు చేయగలిగే అవకాశం ఉంటుందని నేను భావిస్తున్నాను. ఈ విధానం కింద గవర్నరీ పని

° మినిట్స్ ఆఫ్ ఎవిడెన్స్, ៖ సంపుటం 2-బి, 1933 నవంబరు 7, పేజీ 1344.

చేయగలడా?

**సర్ శామ్యూల్ హోర్ :** సిద్ధాంత రీత్యా చేయగలడని అనుకుంటాను. కానీ శాంతి భద్రతలకోసమని ఉత్పాతాల్ని ఆపే విషయానికి సంబంధించి అలా కుదరటం కష్టంగా కనిపిస్తోంది. డా॥ అంబేద్కర్ మనస్సులో ఉన్నటువంటి నికరమైన పరిస్థితిని నేను ఊహించలేను.

**డా॥ అంబేద్కర్ :** ఈ మాట నాకు ఆనందాన్ని కలిగిస్తోంది. ఆ విషయం నన్ను కలిచివేసింది.

**సర్ శామ్యూల్ హోర్ :** సైన్య దృష్టిలోంచీ అదిమంచి ప్రణాళికో గాదో నేను చెప్పడంలేదు. కానీ యిది యీ రక్షణ పరిధిలోకి వస్తుందని మాత్రం నేను అనుకోవడంలేదు.

**డా॥ అంబేద్కర్ :** అణచబడ్డ తరగతులవారిని పోలీసు శాఖలో నియమించరాదని చెప్పే విధానం గవర్నరుకున్న ప్రత్యేక శక్తి క్రిందికి రాదుగదా?

**సర్ శామ్యూల్ హోర్ :** రాదు.

**అనువాదం :**

ఎం. నరేంద్ర

  